# భారతి – చతుర్దశ సంపుటము – భా. ౧

## వ్యాసముల అకారాది సూచి

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి

# విషయసూచిక

శ్రీ

# చిత్రములు

త్రివర్ణచిత్రములు—విచారము: పాములవాడు; శ్రావణ మంగళ వారము; శివభక్త మాహాత్మ్యమునందలి కళానాథాఖ్యానము.

సాధారణచిత్రములు—ఏబదవ అఖిలభారత జాతీయ మహాసభ; చిత్రములు, ఫైయిజ్‌పూరు; తారామంగల శిల్పచిత్రములు; మధురచిత్రములు; ప్రాచ్యతారలు; సార్వభౌమదంపతులు; చీరపసందు; మదరాసు క్రైస్తవకళాశాల చిత్రములు; వర్ధమాన ఆంగ్లతారలు; సౌందర్యపిపాస; సాయంసమయము; గానవినోదిని; చల్లనికడుపు; ఇతరచిత్రములును.



# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల (1937 సం. జనవరి)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వరకు చందాదారులుగ నుందురను నమ్మకముతో 1937 సం. ఫిబ్రవరి 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయందభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీపత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

C 4. D 3. H 28 59 60. J 3, 6. K 11, 26, 27, 29. L 3, 11. M 5. N 11, 33, 34, 36. P 51, 52, 53. R 18, 21, 51, 53, 54. S 56, 65, 66, 68, 70, 71, 72, 77, 78, 88, 90, 226, 236, 237, 238, 239, 240, 241, 242, 243, 245, 246, 247, 248, 250. V 2, 18, 19, 20, 21, 53, 55.






సంపు. ౧౪ ధాతి సంవత్సరము, పుష్యమాసము ( జనవరి ౧౯౩౭ ) సంఖ్య ౧

# స్వవిషయము

స్వవిషయము సమ్మోహ సమన్వితము, స్వాభిమానపూరితము. "స్వ" యందు విశ్వమంతయును ప్రతిబింబించుచున్నది. "స్వ" సంకల్ప వికల్పములకు మితిమేరలు లేవు. సంకల్పమునందు సంకల్పించిన ఫలముమాత్రము సామాన్యముగ పరిమితపరిణామమును పొందుచున్నది. మహాసంకల్పమున కనురూపమైన ఫలము, దుర్లభ మైనను నవీనసంకల్పము లెప్పటి కప్పు డుదయించుచు ప్రపంచపరిణామము సంభవ మగుచున్నది. ప్రపంచపరిణామమునకు పిపీలికాది బ్రహ్మపర్యంతమును గలసకల పదార్థములును పరిమిత మైన ప్రకృతి పరిసరములందు సంకల్ప సామర్థ్యమున కనురూపముగను వినియోగపడుచున్నవి. బ్రాహ్మణునివలెను పంచముడును, రాజువలెను రయితును, కేదారములవలెను కర్మాగారములును, కవులవలెను కార్మికులును, లలితకళలవలెను సామాన్యకళలును, మహాకావ్యములవలెను ఏలపాటలును, యోధులవలెను గురువులును, సాంఖ్యులవలెను యోగులును ప్రపంచ పరిణామమునకు కీలక మైన ఆత్మపరిణామమునకు వినియోగపడుచున్నవి. ప్రవృత్తియందు ఫలాఫల పరిణామములు సాపేక్షములు గాని నిరపేక్షములు గావు. పూర్ణఫలము ప్రవృత్తియందసంభవము. మానవులు పరిమిత పరిస్థితుల నెరిగియును మహాసంకల్పమును జేయుట ప్రకృతిధర్మము. సృష్టిస్థితులకు కీలకమైన సంకల్పము "స్వ"

ధర్మమునందు ప్రతిబింబించుచున్నది. స్వసంకల్పములు ధ్రువనారదసంకల్పములవలెను శాశ్వతప్రతిష్ఠను బడసి ప్రయోజనకరములగుటయు సామాన్య సంకల్పములవలెను రిక్తమనోరథములగుటయును ప్రవృత్తిధర్మము.

సంకల్పము వ్యవసాయమున కనురూపముగను సఫలమగుచున్నది. సకలప్రయత్నములును యోగసంసిద్ధములై పూర్ణఫలమును సమకూర్చకపోయినను నిరర్థకములు కాజాలవు. "స్వ" సంకల్ప ప్రయత్నములు పురుషార్థపరమైన ఆత్మపరిణామమునకు బీజములు. మహాసంకల్పము మహాఫలమును సమకూర్చకపోయినను మహాసంకల్పబీజములు దేశకాలపరిస్థితులందు భిన్నరూపములను పరిణామమును పొందుచున్నవి. సంకల్పములు కార్యసిద్ధికి నిమిత్తమాత్రములు. అనంతములైన దేశకాలపాత్రావరణములందు మహాసంకల్పము భిన్న నామరూపములను సార్థకమగుచున్న విధము గోచరమగుచున్నపుడు స్వవిషయ ప్రస్తావనావలోకనములు నిరుపయోగములగుచు స్వాభిమాన,స్వోత్కర్ష,సమ్మోహము లంతరించుచున్నవి.

భారతి రుధిరోద్గారి సంవత్సర పుష్య మాసమునందు జన్మించినది. మొదటి సంచిక యందలి స్వవిషయప్రస్తావనను ధాతృనామ సంవత్సర మార్గశీర్షమాసమునందు జదివినపుడు నిర్వాహకులకానందవిషాదములుగలుగుట సహజము. భారతికి ౧౩ ఏండ్లు నిర్విఘ్నముగను కొనసాగి యథాశక్తిని సాహిత్యసేవ చేయగలిగినందుల కానందము. గతించిన పదుమూడేండ్లయందును ప్రపంచము నావరించిన మహాపరివర్తనమున కనురూపముగను భారతీయ విజ్ఞానాభ్యుదయమునకు వినియోగపడజాలనందులకు విషాదము. వ్యక్తిగతమైన భారతీ విజ్ఞానసంకల్పవ్యాపనము వ్యక్తిపరముగను పరిమితమైనను భావగతముగను విశాలమైన విధమును దేశావృతమైన సాహిత్యకళాదిరంగములందు పర్యాప్తనగుచున్న వికాసము వ్యక్తము చేయుచున్నది.

విశ్వరూపిణియైన భారతి సరస్వతీదేవి, శ్రీదేవి, లలితాంబ. గతించిన ౧౩ ఏండ్లయందును భారతీనిర్వహణమునకు సహాయభూతులైన సాహిత్యోపాసకులకు, కళాభిజ్ఞులకు, పండితులకు పత్రికానిర్వాహకులు కృతజ్ఞులు. భారతి శ్రీసూక్తాత్మకమైన విజ్ఞానాంకురములను గతకాలమునందువలెను, భావికాలమునందును సఫలము చేయుటకు భారతీకటాక్షవీక్షణములను బడయుగాత!

శ్లో. శ్రేయో మే విదధాతు శారదశశిశ్రీభాసురా భాసురా, హారాసారనిరాసకారిమధురవ్యాహారిణీ హారిణీ,
ముక్తాభూషణపోషణస్మితలసచ్ఛ్రీసాధునా సాధునా, లావణ్యేన నిజేన నిర్జితవతీ రంభారతీ భారతీ.

శ్లో. లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం, దాసీభూతసమస్తదేవవనితాం లోకైకదీపాంకురామ్,
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవబ్రహ్మేంద్రగంగాధరాం, త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్.

---

# గ్రంథచౌర్యము *

**మానవల్లి రామకృష్ణకవి**

ఒకనాఁడు భోజరాజు సభలో - "త ఏవ పదవిన్యాసాస్తా ఏవార్థవిభూతయః" అని సమస్య యొసఁగఁగా, "పుంసి పుంసి విశేషేణ కాపి కాపి సరస్వతీ" అని కాళిదాసు పూరింపఁగా, "తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్" అని వేఱొకఁడు పూరించెనఁట. గ్రంథములు రెంటివ పూరణము ననుసరించి రచించువారు కొందఱు కలరు. అట్టివారి విషయమున పరశబ్దార్థాపహార మెంతవఱకు దోషము కాకుండునో యెప్పుడు కీర్తిలోపకరమో విశ్రాంతి చింతావినోదముగా విచారింతము. గ్రంథచౌర్యము దూషించుచు నంధ్రకవితాపితామహుఁడు చండకోపము వహించి రాజదండనము విధించుచున్నాఁడు.

"భరమై తోఁచుకుటుంబరక్షణకుఁగాఁ
బ్రాల్మాలి చింత న్నిరం
తరతాళీదళసంపుట ప్రకరకాం
తారంబునం దర్థపుం
జెఱువాటుల్ దెగఁ గొట్టి తద్జ్ఞపరిష
ద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱఁతం బడుం గుకవి పృ
థ్వీభృత్సమీపక్షితిన్"

దీనికి దృష్టాంతముగా మాడయమై రావణచరిత్రమున—

"ఘట్టించినాఁడవు తస్కరకవిరాజు
కోటసింగయమంత్రికోలువులోన"

అని ప్రభువు తన్ను సంబోధించినట్లు వర్ణించుకొనియె.

లోకసిద్ధ మగు శబ్దార్థజాలము వదలి నూతనసృష్టి యెట్లు సాధ్యమగు ? లోకసంభావ్యము కానివస్తువు వర్ణించినచో నతిశయోక్తి యందురు. పురాతనకవివాగ్గోచరముకాని పదార్థము కానరాదు. మాగతి యేమి?

"అగు ననఁ గొమ్మయతిక్కఁడు జగతి నపూర్వార్థశబ్దచారుకవితనై, నెగడిన బాణోచ్ఛిష్టం, జగత్త్రియం బనినపలుకు సఫలం బయ్యెన్" అని భారతరచనాప్రతిష్ఠాపితాంధ్రవాగ్దేవతామంగళవిగ్రహుం డగు తిక్కనను స్తుతించిరికదా! అనును. శబ్దమునకురాని వస్తుజ్ఞానమే లేదు. "న సోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే" అని భర్తృహరి చెప్పినట్లు సమస్తార్థజాలము శబ్దముతో నుచ్చరించినందున బాణునినోటఁబడి సర్వ మెంగిలి యయ్యె. ఆంధ్రపదము లతనినోటఁ బడవయ్యెఁగదా కావుననే తిక్కనశబ్దజాల మపూర్వమయ్యె. అట్లయినచో నతని సంస్కృతసమాసములగతి యేమి? ఇచ్చట గౌణార్థము గ్రహించి బాణుఁడు తలఁపని యభిప్రాయముల నూతనశక్తిగాఁ జెప్పె నన్నచోఁ గేతన పద్యమునకు సమన్వయము గాఁదనుఁ గాఁబోలు. లేక "జగత్త్రియ" మను పలుకు "యథోచితయథాశక్తి శిష్ట" మని గ్రహింపఁదగు. "సర్వశుక్లా సరస్వతీ" యన్నచో సర్వశబ్దమునకుఁ గించిదూన మని భోజాదులు శాసించిరికదా యట్లే. పూర్వపక్షానువాదఖండన ప్రయుక్తాచార్య ప్రబలతరయుక్తి నిర్యుక్త సిద్ధాంతముల ననువాదము సేయునప్పుడు దర్శన నిబంధకారులును, అవ్యాప్త్యతివ్యాప్తి దోషములరానీయక వస్తునిర్వచనము సేసిన ప్రాచీనమతముల విస్తరించునపుడు లక్షణకారులును, శబ్దార్థముల రెంటి గైకొనకున్న వారల వ్యాపార మెట్లు నడచును? మండనమిశ్రుల బ్రహ్మసిద్ధి చాలభాగము సురేశ్వరుల

---

* ఈవ్యాసభాగము సంస్కృతాంధ్రనరసభూపాలీయముల రచనాక్రమము విమర్శించుచు నవాంతరప్రసంగముగా మొదట వ్రాయఁబడి ప్రధానకథకం టెనుపకథ పెద్దగా బలిసినందున వేఱుగాఁ బ్రచురించుచున్నారము. ఇది తత్కారణమున విశీర్ణక్రమసంధి సంగతికమై న్యూనాధికపుష్టాంగకమై యుండుటకుఁ బాఠకులు క్షమింతురుకాక.

సంబంధవార్త్తికములో నెక్కినది. భావప్రకాశ మను నలంకారగ్రంథమున కావ్యాలంకారసంగ్రహ, కావ్యప్రకాశ, దశరూపక, సాహిత్యసారాది బహు గ్రంథపంక్తు లితియుక్తోక్తాది శబ్దములు లేకయే గ్రంథకర్త్రు రచితములవలెనే కూర్పఁబడియె. భోజుఁడు, హేమచంద్రుఁడు, గుణచంద్రుఁడు మొదలగువారు ప్రాచీన గ్రంథవాక్యములఁ దమ నిబంధములలోఁ జొనిపి యభేదముగా ప్రయోగించుకొందురు. ప్రాచీన గ్రంథకారులయందుఁ గల గౌరవముచేఁ దద్వాక్యములనే వారి మతముల పునః ప్రతిష్ఠాపనము చేసితిమని తదర్థగ్రాహు లందురేమో? సాహిత్యమీమాంసలో భోజుని యుదాహరణము లన్నియు నతని పేరైన నుచ్చరింపక తద్గ్రంథకారుఁడు గ్రహించుకొనియె. నవీనాలంకారికుల కిది దోషముగాఁ గన్పట్టదేమో.

దర్శనకారులతో మన కేమి? కావ్యములలో నిది యెంత సమన్వయమో విచారింతము.

గ్రంథచౌర్యము శబ్దాపహారము, అర్థాపహారము, ఉభయాపహారము, ఛాయాపహారము, ప్రతిచ్ఛాయా కరణము, రేఖాపహారము, ప్రతి నిర్మాణము, వర్ణనాగ్రహణము, సర్వగ్రంథచౌర్యము మొదలుగాఁ బెక్కుభంగుల విలసిల్లు.

"పూర్వకథావిచిత్ర సన్నివేశములలోఁ బాత్రముల సంరంభోద్దీపితవాక్య చేష్టా విశేషముల విన్నను జూచినను శ్రోతృప్రేక్షకుల కపూర్వావేశ జనిత సంస్కారవాసనా బలము మూలోచ్ఛేదము గాకుంటచే వారు గ్రంథములు రచించిరేని తత్తుల్యసన్నివేశ నిర్మాణముల శబ్దార్థములు రెండును దమ తమ విద్యాసంస్కార బలముల ననుసరించి వాసనాబలముచేఁ దత్తుల్యములు గానే స్ఫురించుననుట యేమి యాశ్చర్యము? అది భగవత్సృష్టిలోని సామాన్య మనోధర్మము గాని గ్రంథచౌర్య మనెదవా?"

ఆహా! ఏమి యీ సౌగతన్యాయము! మేము కొన్ని దృష్టాంతముల నుదాహరించెదము వానిలోని నీ మనోధర్మ సాదృశ్యమును విశదీకరించి మా గ్రంథాపహార సిద్ధాంతమునకుఁ దోడ్పడుము.

శబ్దాపహార మన శబ్దపంక్తులయు సమాసములయు పరిగ్రహణము. వానితోఁ బ్రాయశః తాత్పర్యము భిన్నమైనను గొంతయర్థము గృహీత మగు. సామెతలు గూడ నిందుఁ జేరునేమో. కేవలము శబ్దజాల మెల్లరకు సామాన్యమేకదా; అందుఁ జౌర్యము రానేరదు. హర్షచరిత్రావంతిసుందర్యాది కావ్యములలో నచ్చటచ్చట సమాసచ్ఛాయలు గలియుచుండును. శ్రీనాథుని పదవిన్యాసముల ననేకులు పోల్చి రచించిరి. "కుదురు మెఱుంగు నిబ్బరపు గుబ్బలపై నయనాంబుపూరముల్" అనుపాదము పెక్కుప్రబంధములలోఁ గానవచ్చు. ఇట్టి శబ్దవిన్యాస సంక్రాంతి కవులకు బహుగ్రంథపఠనము వలన నజ్ఞాతముగాఁ దటస్థించుచుండును.

"భద్రం పక్ష్మలయంతు వో నరహరే
రక్షుద్రశౌర్యా నఖాః
స్తోకోన్ముద్రిత పారిభద్రకలికా
పాండిత్యపాటచ్చరాః"

"ఆకాశాంచలవీథుల న్నిగిడె సం
ధ్యారాగరేఖావళుల్
పాకోన్ముద్రిత పారిభద్రకలికా
పాండిత్యనైతండికో
త్సేకస్ఫూర్జిత......
జపాశ్రేణికిన్."   (భీమఖండము.)

శ్లోకకర్త యగు లౌహిత్యభట్టగోపాలుఁడు శ్రీనాథునకంటెఁ బూర్వుఁడు కావున సంస్కృత సమాసచ్ఛాయయే తెనుఁగున నజ్ఞాతముగాఁ జొచ్చెఁ గాఁబోలు. ఇట్టివి ప్రయోగసహస్రములు చూపవచ్చు నిది దోషము కానేరదు.

అర్థాపహారము—పూర్వపద్యములోని భావ మంతయు యథావస్థితముగా గ్రహించి వేఱుపదజాలముతో దాని గూర్చుట.

కలిమిం గొందఱు శ్రోత్రియుల్ సతుల కాం
తుల్ దీర్పఁగా లేక యా
కలకంఠుల్ తమఁ బాసి చక్కఁదనముం
గాంభీర్యమున్ మన్మథో

తక్కలనారంభము వాగ్విజృంభణము స
త్కారుణ్యముం గల్గు వా
రలతోఁ బొందె తముం గణింప రసుచుం
గ్రంథంబులం దట్లు వ్యా
కులులై వ్రాసినమార్గముల్ దలఁతురే
కుంభిం (?) భుజంగాగ్రణుల్.
(సకలకథాసారసంగ్రహము.)

లోకములోనఁ గొంద ఱబ
లుల్ సతులం దనియింపలేక య
స్తోకమనీషు లన్యపురు
షుల్ తమకాంతల నంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి ప
రాంగనఁ గూడినఁ బాప మంచు న
య్యాకులపాటు చూచి యిటు
లాకులపా టెనయంగ నేటికిఁ?
(తారాశశాంకము)

ఇందుఁ బంచపాదియై శుద్ధతాళానుగామి గాక పొల్లుపదములతో నిండిన పుత్తేటిరామభద్రుని కవిత సంస్కరించి యర్థ మెట్లిమిడింపవచ్చునో యాశిల్పము నుపదేశింపఁగాఁబోలు శేషము వేంకటపతి యర్థవంత మైన యమకముతో గ్రంథచౌర్య మొనర్చె.

అళిగమిత్రల్ల మృణాళహస్తఁ గమనీ
యావర్తనాభిఁ మహో
త్పలగంధిం గలహంసయాన విలస
ద్బంధూకరక్తోష్ఠ ను
త్పలనేత్రిం గమలాస్య నంగజరసాం
భః పూరఁ దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చియాడక మనో
జాతానలం బాఱునే?
(నన్నెచోడుఁడు)

లలితాస్యాంబురుహంబు నీలకచరో
లంబంబు నేత్రాసితో
త్పల ముచ్చైః స్తనకోక మోష్ఠవిలస
ద్బంధూక మద్యత్కటీ

పులినం బుద్గతచిత్తజాతరసవాః
పూరంబు ప్రాణేశ్వరీ
జలజావాసము సొచ్చియాడక మనో
జాతానలం బాఱునే?
(తెన్నాలి రామకృష్ణకవి)

ఇందు రూపకమున విశేషణవిన్యాస క్రమమున దోషము సంఘటిల్లె ననియు దానిని దొలఁగింపఁ గాఁబోలుఁ జోడనిపద్యము సంస్కరించి భావనోద్బోధిత సంవిచ్చమత్కారశూన్యుఁ డగు తెనాలికవి యర్థచౌర్యము గావించె. రెండవపద్యమునఁ జతుర్థ పాదము మును మార్పుకుంటుట సమస్యాపూరణకౌశలప్రకాశనము కాఁబోలు.

"ఏమి పరకవి పద్యపాదముల గ్రహించి పూరించి వ్రాయు మర్యాదయుఁ గలదా? అది యర్థచౌర్యము కాదా?" పార్శ్వాభ్యుదయమున జినసేనుఁడును నేమినిర్వాణమునఁ దక్కర్తయు మేఘసందేశపద్యపాదముల గ్రహించి జైనతీర్థంకరచరిత్రముల కన్వయించునట్లు శేషపాదములఁ బూరించి యన్యమతగ్రంథపఠన మొల్లమియు మహాకవి ప్రతిభావైచిత్రి విడువఁజాలమియు హృదయమును వేధింప జైనకవిసార్వభౌము లీయుక్తి పన్నియుండుట లోకమెఱుఁగదా? అర్థమును రసభావములును హృదయోన్మీలితచిత్రసన్నివేశ కల్పనయు భిన్నము లగుచుండఁ జౌర్య మెట్లగు?

ఈ యర్థాపహారము కవిత్వశిక్షాభ్యాసకాలమునఁ గాని రాజసభలలో విద్యావినోద కాలములలోఁ జమత్కారముగాఁగాని సంఘటిల్లును. లేక భక్తిపారవశ్యముచేఁ గాళిదాసాదిమహాకవు లొసంగు వాక్పుష్పములఁ దమయశః శరీరము లగు కావ్యబంధముల శేఖరములుగా నునిచికొని తీర్థప్రసాదమువలె గ్రహించి వారి నర్చింతురు. అట్టివి కేవలము చాటువులుగా నిలిచినచో క్షణకాల విస్మయ మాపాదించుఁగాని కావ్య నివేశితములైనచోఁ దప్పక తత్కవుల కనుత్స్ఫాల్య శల్యభూతములై కీర్తిశరీరముల వేధించుచుండును.

జలజాక్షీమధ్యంబు సన్మార్గ మని రోయించి
తరుణిదుర్మార్గంబు తలఁచ మఱచి

యతివముఖాబ్జంబు నకలంక మని యెంచి
యింతికలంకంబు నెంచ మఱచి
సుందరిచిఱునవ్వు శుచి యని మది నెంచి
నలివేణియశుచి దా ఁ దెలియ మఱచి
శుభాంగిచనుఁగవ సువృత్త మని యెంచి (?)
భామదుర్వృత్తంబు పలుకమఱచి
కలికిశృంగారతతి యెంచి కాంత పరునిఁ
గలసి రమియించినట్టి సంగతులు మఱచి
గురునివంటి మహాత్ముండు గొనియె సతిని
అజ్ఞుఁ డనఁ బ్రాజ్ఞుఁ డన నెవ్వ రరసిచూడ.
(సకల కథాసంగ్రహము)

సకియకాను దలంచి సన్మార్గ మనుఁగాని
యింతిసుర్మార్గతే నెంచఁడయ్యె
చెలువచన్గవఁ దలంచి సువృత్త మనుఁగాని
తరుణిసువృత్తంబు తలఁపఁడయ్యె
అతివమోము దలంచి యకలంక మనుఁగాని
తెఱవకళంకంబు తెలియఁడయ్యె
సుదతినవ్వు దలంచి శుచి యనుఁగాని య
వ్వెలఁదుకయశుచి భావింపఁడయ్యె
గురువువంటి మహాత్ముఁ డిక్కరణి తరుణి
చక్కఁదనమె గుణంబుగ సంస్మరించుఁ
గాని వ్యభిచారదోషంబు గాంచఁడయ్యె
నజ్ఞుఁ డనఁ బ్రాజ్ఞుఁ డన నెవ్వఁ డవని నింక.
(కవిరాజ మనోరంజనము)

ఇం దబ్బయామాత్యుఁడు పుత్తేటిరామభద్రుని పద్యము లోనివర్థముల సంగ్రహించి నూతనపద్యము చేసి దానిఁ దన సుందరకావ్యముఖమునఁ బ్రసరణశీల మగు శ్వేతపద్మబిందువువలె నెక్కించుకొనియె.

రాజసభలో వినోదముగాఁ బూర్వకవితతుఁ బ్రతి కవనమెట్టె దన

క్షిప్తో హస్తావలగ్నః ప్రసభ మభిహతో
ప్యాదదానోంశుకాన్తం
గృహ్ణన్ కేశేష్వపాస్త శ్చరణనిపతితో
నేక్షితః సంభ్రమేణ,
ఆలిఙ్గన్ యో౽వధూత స్త్రిపురయువతిభిః
సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం
శాంభవో వః శరాగ్నిః.
(అమరుకము)

దీనికి మయూరునిపద్యము-

వస్త్రే గృహ్ణన్నిరస్తః సరభసవిగుతో
హస్తమాలమ్బమానః
క్షిప్తః కేశాన్తలగ్న శ్చరణనిపతితః
సంభ్రమో త్ప్రేక్ష్యమాణః,
ఆలిఙ్గన్ దైత్యనారీః పరవశముకుళా
ర్ధేక్షణాః సాపరాధః
కామీవోద్దామరాగో దిశతు పశుపతేః
సాయకాగ్నిః శ్రియం వః.

ఇందుఁ బ్రణయకుపిత యగు ప్రేయసి యెడ నన్యస్త్రీసంగ మాద్యపరాధనిగృహీతుఁ డగుకామి యనునయవిధు లెట్లు సేయునో శివునిపాశుపతాస్త్రము వలని యగ్నిభీత లగు త్రిపురస్త్రీల డాయునప్పు డట్టిభావవిశేషము చూప అకుఁ దోచుచుండె నని భావము. మొత్తముమీఁద భావములు రెంటనుసమానము లే. సాశ్రునేత్రోత్పలాభిః యని కోపశాంతిని మయూరుఁడు పరవశముకుళార్ధేక్షణాః యని యాలింగన సుఖపారవశ్యవర్ణనచే సూచించె. ఆర్ద్రాపరాధుఁ డనువిశేషణస్వారస్య మిం దుద్దామరాగుఁడగుకామి యని విశేషించి చెప్పుటచే నాయకునియను నయవిధిప్రయోగమున భేదాంతరము సూచించినట్లగు. ఎట్లయినను, రెండు శ్లోకములు చదువఁగా మయూరుఁ డమరుకునిభావము నతిచతురముగా గ్రహించె నని చెప్పఁదగు. కవితాభ్యాసకాలమునఁ బూర్వకవుల మనోహరపద్యముల మార్చి పుష్టిలేకున్న నట్లైయైన శబ్ద విన్యాసభేదమునఁ ద్రిప్పి రచించుట కవులకు శిక్షోపదము. రాజసభలలో వినోదము కిట్లు సేయుదు రంటిమి. ఇట్టివి కావ్యనిష్ఠితము లైనచో దూష్యము లే. సంస్కృతమునం దిట్టి యర్థాపహరణము దోషముగా గణింతురు.

ఊర్ధ్వాంశుపాశే దిననాథబిమ్బే
యాతోదయే౽స్తం వ్రజతీన్దుబిమ్బే,

ధత్తేయ మద్రి ప్రవిలమ్బమాన
ఘణ్టాద్వయాబద్ధగజేన్ద్రలీలామ్.
(జానకీహరణము)

ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా
అహిమకరే హిమధామ్ని యాతి చాస్తమ్.
వహతి గిరి రయం విలమ్బిఘణ్టా
ద్వయపరివారిత వారణేన్ద్రలీలామ్.
మాఘము (IV-20)

కుమారదాసుఁడు మాఘునికంటెఁ బూర్వుఁడు కావున మాఘుఁడే పూర్వులయర్థము గ్రహించియుండును. కొందఱు "ఘంటామాఘుఁ"డను బిరుదము సంపాదింపఁగల యీ శ్లోకము నపహరించియుండెననియు దానిఁ బోల్చి యెవ్వఁడో పద్యము రచించి కుమారదాసుని కావ్యమునఁ బ్రక్షేపించెననియు ననవచ్చును. ఈ పద్యమును స్మరించియె పెద్దన సూర్యచంద్ర బింబములు రెండు వ్యాయామ మొనర్చువారల సంతోలాలవలె నున్నదని వర్ణించె.

భాషాంతరమునుండి గ్రంథమంతయుఁ దెనిఁగించుట దోషమే కాదు. కొన్ని పద్యముల మాత్రము గ్రహించుకొనుట కవులకు న్యూనతయే.

శ్రీపర్వతిపురాణము రచించుచు నసంబద్ధముగా శేషనారాధ్యుఁడు మురారియనర్ఘరాఘవములోని శ్లోకమును దెనిఁగించి తన కృతిలోఁ జేర్చుకొనియె.

చేతఃశుక్తికయా నిపీయ శతశః
శాస్త్రామృతాని క్రమా
ద్వాన్తై రక్షరమూర్తిభిః సుకవినా
ముక్తాఫలై ర్గుమ్ఫితాః,
ఉన్మీలత్కమనీయనాయకగుణ
గ్రామోపసంవర్గణ
ప్రౌఢాలంకృతయో లుఠన్తి సుదృశాం
కణ్ఠేషు హారస్రజః. (మురారి.)

చేతశ్శుక్తికయందు నిల్పి కళలం
జేకూర శాస్త్రాదిక
వ్రాతం బక్షరమూర్తి మౌక్తికములై
వర్ధిల్లుచున్ సత్ప్రభా
ఖ్యాతోపేత గుణప్రయుక్తి సదనా
లంకారహారాళిగా
రీతిం సత్కవి కూర్చనేర్చును బుధ
శ్రేణీగళాగ్రంబునన్.

ఇందు "సుదృక్ఛ్రేణీగళాగ్రంబులన్" అని రచించియున్నచో మూలాపహారమంతయు పసారమై యుండును.
(శ్రీ పర్వతపురాణము)

శ్రీనాథాదులు కాళిదాస మయూరాదికవుల ప్రబంధములనుండి యతి విస్తరముగాఁ దెనిఁగించుకొనిరి. ఇది మహాకవులయెడఁ జూపిన భక్తివిశేష మందురు. అందు ననువాదమున ధ్వనితార్థము విశిష్టముగానున్నచో దోషముకాదని ధ్వనికారు లనుశాసించిరి. మేము దోషమని తలఁచినను బెద్దలయెదుట నోరు తెఱవ భీతిల్లెదము. క్రిందిజతె చూడుఁడు-

ఓంకారో మదనద్విజస్య
గగనక్రోడైక దంష్ట్రాంకురః
తారామౌక్తికశుక్తి రన్ధతమస
స్తంబేరమస్యాంకుశః,
శృఙ్గారార్గళకుఞ్చికా విరహిణీ
మర్మచ్ఛిదా కర్తరీ
సన్ధ్యావారవధూనఖక్షతిరియం
చాన్ద్రీ కలా జృమ్భతే.

మన్మథ దివ్యాగమమున కోంకారంబు
భూతేశునాదల పూవుదండ
అల్పశృంగారరేఖార్గళకుంచిక
యంధతమోదంతి కంకుశంబు
విరహిణీజనమర్మ విచ్ఛేదకర్తరి
యంబరక్రోడ దంష్ట్రాంకురంబు
తారకామౌక్తికతతికి నంచితశుక్తి
యమృతాంబునిధికి ముత్యాలజోసు
మారుపట్టాభిషేకాఖ్యవారికుంభి
చిత్తజుని కోటలగ్గదంచెనపుసుండు

నాఁగ నానాఁటి కభివృద్ధి నారుకొనిన
చంద్రుఁ డుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డనుచు.

ఇందు మూలమునఁ దోఁచని చంద్రకలాక్రమపరివృద్ధి తెనుఁగుపద్యమున ధ్వనిత మగుచున్నది. మూలమునకంటెఁ దెనుఁగున స్వారస్య మెక్కు డగుటచే మిక్కిలి దుష్టము కాదందురు.

వ్యంగ్యార్థవిశిష్టము గాని ప్రతికవన మెంతైనను దోషయుక్తమే. భోజుని శృంగారప్రకాశమున గ్రంథాంతమున-

యావన్మూర్ధ్ని హిమాంశుకన్దలవతీ
స్వర్వాహినీ ధూర్జటేః
యావద్వక్షసి కౌస్తుభ స్తబకితే
పద్మా మురద్వేషిణః,
యావచ్చిత్తభువ స్త్రిలోకవిజయ
ప్రౌఢం ధనుః కౌసుమం
భూయా త్తావ దయం కృతిః కృతధియాం
కర్ణావతంసోత్పలమ్.

ఈ పద్యముతో గంగవంశానుచరితమున మంగళాంతస్మరణమును బోల్పఁదగు.

యావజ్జాగర్తి శంభోః శిరసి శశికలా
చారుచూడామణిత్వే
లక్ష్మీర్వక్షోజకుమ్భే రచయతి మకరీం
యాదవేన్ద్రోఽపి యావత్
యావ త్త్రైక్ష్కర్యకార్యే ఘటయతి తరుణాన్
కామినీనా మనఙ్గః
తావ ద్వాగ్వల్లరీ మే ప్రసరతు పరితో
గఙ్గవంశావలమ్బా.

ఓఢ్రకవికృతపద్యమున విష్ణురచిత మగు మకరికాపత్రావళి శృంగార రసానుభవ రసికత్వము ప్రకాశించినను యాదవేంద్రశబ్ద మనేకకల్పములఁ జూచు విష్ణువును గ్రహింపక యేకయుగావతీర్ణుఁడగు కృష్ణుని లక్ష్మీశబ్దముతో సహచరింపఁ జేయుట రసాపకర్ష మగునేమో. తృతీయచరణమునందు మన్మథవ్యాపార మవిశేషముగాఁ గామిజనుల ప్రేయసీవిధేయత్వము సూచించును. మాళవేశ్వరుఁడు త్రిలోకవిజయప్రౌఢముగా దాని వర్ణించెను. ఇట్టి సరసతర వాక్యార్థసౌందర్యము లేని మఱియొకపోలికం జూతము.

వదనప్రభూతలావణ్యాంబుసంభూత
కమలంబు లన వీనికన్ను లమరు
నిక్క వీనులతోడ నెక్కసక్కము లాడు
కరణి నున్నవి వీనిఘనభుజములు
సంకల్పసంభవాస్థానశిలికవోలె
వెడఁదయై కనుపట్టు వీనియురము
ప్రతిఘటించి చిగుళ్లపై నెత్తివాటిన
రీతి నున్నవి వీనిమృదుపదములు
నేరెటేటియస త్తెచ్చి నీరజాప్త
సానఁబట్టిన రాపాడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ మేనికాంతి.

అని సుప్రసిద్ధమగు కవిపితామహుని పద్యమును బాలకవితావస్థలో రామభద్రకవి సకలకథాసంగ్రహమున ననువదించుచు,

వదనసౌందర్యవిస్ఫారాంబుసంజాత
కంజంబు లన వానికన్నుదోయి
మదనసామ్రాజ్యసమ్యక్ శిలిక యనంగ
సరసమౌ వానివక్షస్స్థలంబు
కర్ణకుండలరత్న కాంతులఁ గొననిక్కు
వగలు మీఱెను వానియొగుభుజములు
అతులప్రవాళసంతతిరుచిసంపద
నదలింపఁ జను వాని మృదుపదములు
సింగముల భంగములఁ జెందఁజేయు నడుము
చందురునియందమును నొందఁ జాలునుగురు
వాసి నువుపువ్వులను నవ్వు నాసికయును
గప్పకప్పవ నొప్పెవ గొప్పశిఖయు.

అని నలమహారాజు సౌందర్యమును వర్ణించె. తాతగారియెత్తుగీతిఁ బరిత్యజించి పురుషాంగవర్ణనోచితముగాఁ బరిహరించిన మధ్యఫాలాది వర్ణనములఁ బొందించి వృత్త్యనుప్రాసకౌశలము చూపినను రామభద్రుఁడు కావ్యశిల్పధర్మముఁ బాటింపఁడయ్యె.

కవితాపితామహునిపద్యమే మఱియొకఁడు ధ్వన్యర్థము కూర్చుటకు మాఱుగా మూలములోని ముఖ్యాంగమును ఛేదించి కాంచనోజ్జ్వల గ్రహమునకుఁ బ్రతిస్పర్ధిగా ముక్కుఁ జెవులు పెట్టనిమట్టిబొమ్మను సృష్టించెను.

అంకము చేరి శైలతన
యాస్తనదుగ్ధము లానుకేళి బా
ల్యాంకవిచేష్టఁ దొండమున
నవ్వలిచన్గబళింపఁబోయి యా
వంకఁ గుచంబు గాన
కహివల్లభహారము గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడుగ
జాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్.

(మనుచరిత్ర)

చెన్నూరు దేవాలయశిలాశాసనపద్యములలో నొకటి:

పాయాద్వో గణనాయకః పశుపతే
రంకే చిరం సంస్థితో
వామార్ధాగ్రవిరాజితాం గిరిసుతాం
జ్ఞాత్వా నిజాం మాతరమ్,
తుణ్డాగ్రం ప్రవిసార్య సంస్మితముఖః
పీత్వా స్తనం చాపరం
పాతుం ప్రీతమనాః స్తనం మృగయతే
విఘ్నాన్తకః సర్వదా.

ఈశాసనము కృష్ణరాయలరాజ్యకాలములో శా-శ- ౧౪౪౬ లో వ్రాయఁబడియె. అప్పటికి మనుచరిత్ర రచింపఁబడెనేని శాసనకవియే దాని గ్రహించియుండును. మనుచరిత్రలో నంకితాంకపద్యములలోఁ గటకపురిని గ్రహించినవృత్తాంత మున్నందున నది ౧౪౩౦ కిఁ దరువాత రచింపఁబడియుండవచ్చును. లేక పెద్దనయే శాసనకవియై యుండెనేమో. ఎట్లయినను శిశువులు తమ కభీష్టవస్తువు లభింపకున్నను సముజ్జ్వలమగు వస్త్వంతరము చూచిరేని నవత్వచాంచల్యముచే దానితోఁ గ్రీడించుచుఁ బూర్వవస్తువు మఱతు రను శైశవధర్మప్రతిపాదనము సంస్కృతకవి గాలికి విడిచివైచె.

ఇట్లె మూలమునకంటె రసలక్ష్మీయ మగు శివకవి పద్యముఁ జూతము.

దైతేయమదవతీధమ్మిల్లములతోడ
విరులనెత్తావికి పీడుకోలు
దనుజశుద్ధాంతకాంతాకటాక్షములతోఁ
గలికికాటుకలకుఁ గానివావి
దానవమానినీస్తనకుంభములతోడఁ
బసపుఁబయ్యెదలకుఁ బాయుతెరువు
దైత్యావరోధనదయితాధరములతో
సొబగుపిడెములకుఁ జుక్కకెదురు
నేసి సురసుందరీకరోశీరతాల
వృంతచలితాంతకుంతలవిలసదింద్ర
కులవధూటీలలాటికాకుంకుమంబు
పదిలపఱుపఁ జక్రంబ నీభరము కాదె.

అను సోమునిపద్యముతోఁ గొమ్మనరచన పోల్పఁదగు.

దైతేయకాంతలతలకుఁ గెమ్మోవుల
వీటికాశ్రీలకు పీడుకోలు
వేల్పుటిల్లండ్ర క్రొవ్విదపుఁజన్నులమీఁది
యభవుఁబయ్యెదలకు నిలుఁవునీడ
విశ్వజగత్త్రియీ విజయలక్ష్మీగాథ
బిరుదోత్సవములకుఁ బెండ్లివిందు
పరిపంథివాహినీపరిచితపరిభవ
ప్రాప్తిసంకథలకుఁ బాయుత్రోవ
నేసి యెయ్యది విలసిల్లుఁ జిత్రమహిమ
నది ప్రయోగింప నైత్తె నయ్యచ్యుతుండు
విలయసమయసముద్ధూతవిపులదహన
దారుణస్పర్శనంబు సుదర్శనంబు.

ఈ రెండు చక్రాయుధ ప్రక్షేపవర్ణనములలో సోముని కులవధూమంగల్య చిహ్నోల్లేఖము కొండఱు సుకుమారమతులకుఁ బునరుక్తిబంధురముగాఁ దోచునని కాఁబోలుఁ గొమ్మన నిపుణముగా నంశాంతరములఁ గూర్చినను నక్కవియుత్తరార్ధము నీరసబంధగంధిల మని స్ఫురింపక మానదు. రసభావలోపమును యమకానుప్రాసములు తీర్పఁగలవా?

* సోమునిలలాటికాశబ్దమును లాలాటిక మని కొందఱు పండితాగ్రేసరులు దిద్దుచున్నారు. "లలాటికారుచులు గ్రాలన్" అన్న సోమునిపద్యపాదము నేల దిద్దవలెను? లలాటికయన లలాటపత్రమను నాభరణవిశేషము. "కర్ణలలాటాత్కనలఙ్కారే" యను సూత్రముచే లలాటికాశబ్దము సిద్ధించును. మఱియు లాలాటికశబ్దమునకు రూఢ్యర్థము వేఱు గలదు. "లాలాటికః ప్రభుచ్ఛందదర్శికార్యాసమర్థయోః" అని కేశవుఁడు.

ప్రాలేయాంశుమరీచినిర్మలతనూ
భాగంబు కృష్ణాజిన
వ్యాలోలామలయజ్ఞసూత్రములు సం
సానక్తవీణాలతా
లాలిత్యంబు లలాటికారుచులు గ్రా
లన్ నారదుం డిచ్చలన్
గైలాసంబుననుండి వచ్చెఁ గలహై
కస్వాంతుఁ డచ్చోటికిన్.

అన్న సోమునిపద్యముతో
ప్రాలేయకిరణబింబస్ఫూర్తిఁ దలఁపించు
విశదంపుఁదనుకాంతి దిశలు ప్రాఁక
జిగి నిండఁ దొలఁకెడు చిగురుటాకుల సొంపు
పాటించు ఘనజటాభరము నెఱయఁ
గాంచనమౌంజీవికాసంబు గెడగూడి
చెలువు సూపుచు మృగాజినము దనరఁ
గమనీయకోమలకరపయోరుహమునఁ
బ్రకటితం బగు విపంచిక దలిర్ప
హరికథాలాపశోభిత మైనయట్టి
యాననంబు ప్రసన్నత నలరుచుండ
గగనముననుండి సమవర్తికడకు వచ్చె
నమరసంయమివరుఁడు విద్యాగురుండు.

అని చిక్కన రచించిన సీసమును బోల్చిచూడ నది పాత్తిక లఁజేచి చక్కఁగాఁ గుట్టిన చర్మపుత్రికవలె నున్నది. సోముని పద్యమునకు "కలహైకస్వాంత" పదము

---

* నేటికాలమునఁ బండిత శిరోమణులు విచ్చలవిడిగాఁ దాము ముద్రించు ప్రాచీనకావ్యములఁ బ్రాచీన పదముల పోఁబడి తెలుఁగఁజాలక స్వమతానుసారము దిద్ది పరిష్కరించితి మని తృప్తి నెల్లడించుచున్నారు. పెక్కుచోట్ల సవరణలు వారి యజ్ఞానమును గ్రంథాంతరపరిశ్రమాలసత్వము నుద్ఘోషించుచున్నవి. అప్రస్తుత మైన నొక్క యుదాహరణము చూపెదము.

త్రయకాలంబున సింధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాళరాత్రీకర
ద్వయతాళానుగతిప్రకారమున నవ్వారిన్ మహానృత్తమున్
బ్రియ మేపారఁగ నాడు భైరవుఁడు గల్పించున్ మహైశ్వర్యముల్.

అని కాశీఖండ పంచమాశ్వాసమున నొకపద్యము గలదు. మూఁడవచరణము తాళపత్రాదర్శములలో

"ద్వయతాళానుగతిప్రమోదమున మత్తల్లీ మహానృత్తముల్
ప్రియమొప్పారఁగఁ జేయు భైరవుఁడు" అను పాఠము కలదు.

ఇందులో మత్తల్లీశబ్దము నాంధ్రసంస్కృత మిశ్రసమాసముగా గ్రహించి "యవ్వారిన్" అని శ్రీనాథుని విశుద్ధకీర్తి యాంధ్ర సంస్కృత సమాసమువలె సకళంకము గాకుండునట్లు కరుణించి పరిష్కరించిరి. కాని మత్తల్లీనృత్తవిశేషము మధ్య పూర్ణమదావస్థలలో వర్ణనీయ మనియు భైరవుని సంహారతాండవమున సప్తసాగర రసాస్వాద మధుమత్త చిత్తమున మత్తల్లీనృత్తచారీ ప్రచారములు సారస్వతసంసారసారము లనియు దెలుఁగకుండుట శోచ్యముగా నున్నది. "అవ్వారిలో" జలక్రీడ నేసెనేని భైరవునకేని మధుమద మడఁగి చిత్తము సహజావస్థితి నెందును. ఇట్టి సంస్కరణములు కవిత్రయ సోమనాథాది మహాకవుల గ్రంథములలో లెక్కలేక పడి భాషాదేవికి నన్నియు స్ఫోటకపిటకములవలె నగపడుచున్నవి.



శ్రీ పి. హెచ్. పట్వర్ధను,
స్వచ్ఛంద సేవాదళ నాయకుడు.



శ్రీ శంకరరావు దేవు,
ఆహ్వానసంఘాధ్యక్షుడు.



శ్రీమతి ప్రేమకాంత
స్వచ్ఛంద సేవికాదళ నాయకురాలు.

జీవకళ యొసంగుచున్నది. నాసికేతకథలోఁ గలహమునకు స్థానము లేనందునఁ గవి దానిఁ దొలఁగించె.

3. ఉభయాపహారమునకు నింతదనుక నుదాహరించినపద్యములలోఁ గొన్ని లక్ష్యము లగుచున్నవి.

4. ఛాయాపహరము— ఛాయ యన సౌందర్యము- పరకృతపద్యమునుండి సౌందర్యము గ్రహించి దాని వేఱువిధముగాఁ బొందించుట.

తంత్రీవినోదంబు తడవు సైపని వ్రేళ్లు
    గొనయంబు తెగలపైఁ గోరి కనుట
యద్దంబుపిడి మట్టె నలయు పాణితలంబు
    లస్త్రకం బిరియించులావు కలిమి
చెలికత్తె నొత్తిలి పిలువలేని యెలుంగు
    సింహనాదంబుచేఁ జెవరకునికి
ప్రమదనర్తనకేళిఁ బలురమింపనిపదం
    బైరుశాణంబుల నలఁతపడమి
సోయగపుఁ జిత్రరూపంబు చూచుచోట
    వేసరువిలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపుఁదెంపు
    గైకొనియె సత్యభామ సంగ్రామసీమ.

అరిఁ జూచుఁ హరిఁ జూచుఁ జూచుకము (?)
    లందండమందారకే
సరమాలామకరందబిందుసలిల
    స్యందంబు లందంబులై
తొరుఁగన్ బయ్యెదకొంగు కొంత తొలఁగన్
    దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముల్ సురియుచుం
    దన్వంగి కేళీగతిన్.

సత్రాజిత్తనయాకరాంతరధను
    ర్జ్యారావ మైరావతీ
సూత్రానర్గళనిర్గతస్తనితమై
    సుత్రామచాపప్రభా
పాత్రభ్రూలతికావితానమున దో
    ప్పం గప్ప శార్ఙ్గాంబుము
క్షత్రక్రూరమహాశనుల్ దనుజరా
    డ్గాత్రంబు గోత్రం బగున్.

అను సోముని నరకసత్యాయుద్ధ వర్ణనములో బమ్మెరపోతరాజు తత్కథావర్ణనమునందే—

పరుఁజూడన్ వరుఁజూచు నొంప నలరిం
    పన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో
    వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపుసొంపు పరఁగం
    జండాస్త్రసందోహముల్
సరసాలోకసమూహముల్ నెఱపుచుం
    జంద్రాస్య హేలాగతిన్.

నీలఁ జక్కఁగఁ బట్టి వెర వెఱుంగనికొమ్మ
    బాణాసనం బెట్లు పట్టనేర్చె
వ్రాఁకునఁ దిగెఁ గూర్పంగ నేరనిలేమ
    గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరవి మత్స్యము గ్రువ్వఁజాలని యబల యే
    నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు చెప్పనేరనితన్వి
    యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ
బలుకు మనినఁ బెక్కు పలుకనిముగుద యే
గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ
చారుసత్యభామ సత్యభామ.

రచించినపద్యభావము వాక్యార్థమున భేదము చూపినను సోమునికవనసౌందర్యము ఛాయారూపముగా నిందు గ్రహింపఁబడియె నని తెలుపును. ఇదియుఁ బ్రతిభావంతు లగుకవుల కపయశఃప్రదమే. "భగవద్భక్తిరసావేశమున నంతరంగము ప్రాచీనకవిభావములతో నుపరంజితమై గాఢసంస్కారవశంబున శబ్దార్థములు పరస్పరము పాయలేక భంగ్యంతరముగాఁ బొంగిపొరలి నిరంతరనిరవధికధారాపరిస్యూతములుగా నవతరింప రసభావములతో నతిలోకసౌందర్యమును నిర్మించు పోతనాదుల గ్రంథచౌర్య మెట్లారోపింతుము?"

సప్తమస్కంధమున రసవత్తరపద్యములలో నొకటి యగు దీనిఁ జూతము:-

మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు
నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబు చేర నేర్చు
వినుతగుణశీల మాటలు వేయు నేల ||

మఱియొకచోట — "చాతకం బేగునే చవుటిపడెకు" అనియు వర్ణించె.

యస్మత్ప్రణమనాభ్యాస రసదుర్లలితం శిరః;
నాన్యప్రణమనే దేవ ధృతిం బధ్నాతి జాతు నః.
కిమమ్భోజరజఃపుఞ్జపిఞ్జరం వారి మానసే;
నిషేవ్య రాజహంసోఽయం రమతేఽన్యసరోజలే.
కిమప్సరఃశిరోజాన్తసమనోగన్ధలాలితః;
తుమ్బీవనాన్తమభ్యేతి ప్రాణాన్తేఽపి మధువ్రతః.
ముక్తాఫలాచ్ఛ మాపీయ గగనామ్బు నవామ్బుదాత్;
శుష్యత్సరోఽమ్బు కిం వాఞ్ఛే దుదస్య న్నపి చాతకః.
(ఆదిపురాణం ౩౮-౧౦)

ఇందు జినసేనపోతనల జీవితకాల మెఱుంగని వారు తెనుఁగుఁ జూచి సంస్కృతము విశేషణ పరిపుష్టముగా రచింపఁబడియె నందురు. దీనిలో రేఖామాత్ర సాదృశ్యమే కలదు.

'అలికంబున నక్షిని దాఁచి' యవతరించిన యోసర్వజ్ఞసోమనాథా నీకవితలోని మేలిరత్నములను వాని చెక్కడపుఁబనియు నెల్లరు గ్రహించి రూపము మార్చి వెల తక్కువగా నమ్ముకొనుచుండ నూరకుండెద వేల? బిల్హణుఁడు కవుల కేమి బోధించెనో స్మరించెదవా?

'సాహిత్యపాథోనిధిమన్థనోత్థం
కర్ణామృతం రక్షత హే కవీన్ద్రాః,
యదస్య దైత్యా ఇవ లుణ్ఠనాయ
కావ్యార్థ చోరాః ప్రగుణీభవన్తి.' అని.

"ఓరీ విమర్శకా, బిల్హణుని తదనంతరపద్యముఁ జదువుము."

గృహ్ణన్తు సర్వే యదివా యథేష్టం
నాస్తి క్షతిః క్వాపి కవీశ్వరాణామ్,
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యై
రద్యాపి రత్నాకర ఏవ సిన్ధుః.

"వింటివా, ఎవ్వనియర్థసంచయ మర్థులు స్వేచ్ఛగా దోసిళ్లఁ గొని యనుభవించి పరితృప్తు లగుదురో వానిజన్మజీవితములు ధన్యములు. ఎంతకాలము నాయల్పగ్రంథములోనివి యేవో కొన్ని పోకలు మహాకవులు పరిగ్రహింతురో యంతకాలము నాకు యశోలోకములోని కవిగోష్ఠిలో స్థిరాసన ముండును. ముక్కారు లగు తురుష్కులధాటీపరంపరచే దేశ మింగలాలసుండై క్షత్రలోకము శలభనిచయమువలెఁ గూలుచుండ సామాన్యలోకము తమ జీవధనం బగు దారపుత్త్రాదిబంధుజనంబునేని పరిత్యజించి పాఱిపోవుచుండ నిర్వికల్పక సమాధిస్థితునివలె బాహ్యప్రపంచము మఱచి పరమభాగవతులలో ౧౯వ వాఁడని గణనకు రాఁదగినట్లు భగవత్స్తుతి ధారాపాతమునఁ దన్నుఁ గడతేర్చుకొన్న పోతరాజు నేల పట్టి వేధించెదవు? ఆదిపురాణకర్త యగు జినసేనునిపరార్థచౌర్యధుర్యత నెఱుంగవా?"

ఓమహాకవీ, దృష్టాంత మిమ్ము.

"చోరసూత్రకారా, మూలదేవుని యశస్సు నపహరింపఁగోరెదవా? మేల్కొనియె నిద్ర నభినయించెదు. జినసేనుఁడు వాల్మీకి వ్యాసకాళిదాస భారవి మాఘ శ్రీహర్ష దండిప్రభృతుల యర్థవిశేషముల నెన్నెన్ని భంగులుగా గ్రహించి లలితమధురం బగు శబ్దవిన్యాస

మున వాని నెంత సుందరముగాఁ బొదిగించెనో యెఱుఁగవా?

దండికృతావంతిసుందరిలో గజవర్ణనమునఁ గల నానాపర్వతనదీ విహారసంపత్తి నెల్ల భరతుని సైన్యదిగ్విజయమున నెంతనిపుణముగా గ్రహించెనో చూచినాఁడవు కావా?

దీ్వపా దన్యస్మా దపి
మధ్యాదపి జలనిధే ర్దిశో ఽప్యన్తాత్,
ఆనీయ ఝటితి ఘటయతి
విధి రభిమత మభిముఖీభూతః.

అను రత్నావళి శ్లోకమును గ్రింపిదానితోఁ బోల్పుము.

ద్వీపాన్తరా ద్దిశా మన్తా
దన్తరీపా దపాంనిధేః,
విధి ర్ఘటయతీష్టార్థ
మానీయాన్వీపతాం గతః. ౮—౧౫౨

మఱియు

శరదమ్బుధరచ్ఛాయా
గత్వర్యో యౌవనశ్రియః,
ఆపాతరమ్యా విషయాః
పర్యన్తపరితాపినః. భారవి—౧౧-౧౨

అను భారవిశ్లోకముతో జినసేనుని ప్రయోగద్వయముఁ బోల్పుము.

కో నామ స్పృహయే ద్ధీమాన్
భోగాన్ పర్యన్తతాపినః,
ఆపాతమాత్రరమ్యాణాం
భోగానాం వశగః పుమాన్. ...౧౮-౧౧౧

అట్లే మఱియొకచోట,

లక్ష్మీ స్తటిద్విలోలేయ
మిత్వర్యో యౌవనశ్రియః
ఆపాతమాత్రరమ్యాశ్చ
భోగాః పర్యన్తతాపినః.

ఇట్టివి మహాకవులవలన గ్రహించినను జినసేనుని శబ్దలాలిత్యము నర్థసంఘటనాసామర్థ్యమును మిక్కిలి శ్లాఘనీయములు గావా? జినసేన పోతన లెన్ని స్వభావజాతీయవర్ణన లెంతమనోహరముగా వేలకొలఁది వర్ణించిరి. నూతనార్థ సహస్రములతో నొండు రెండు ప్రాచీనకవిభావములు కలిసెనేని వానిచేఁ గొఱంత ఏమి?"

ఓ మహాకవీ, నీ వచనము విచిత్రము. చోరుని స్వత్వ మపహరించినను, మహాదాత యత్యల్పముగాఁ బరద్రవ్యాపహరణము చేసినను దోషంబుగా గణింపరాదని నూతనధర్మసూత్రకణికలు మనుపరాశర యాజ్ఞవల్క్యుల మతమున కపవాదములుగా నున్నవి.

"ఓరి విమర్శకా, నీవు వ్యాసరచనాధికారవశమునఁ బలికెదు కాని సాదృశ్య మజ్ఞాతముగాఁ గూడఁ గలుగవచ్చును. గ్రంథచౌర్యదోషము కొన్ని యెడలఁ జాల మితముగాఁ బ్రసరించును. ఇఁక దీని సంక్షేపింపుము."

ఇంక నొండు రెండు చరణములు గలవు. వానిఁ జెప్పి మంగళము పాడి కాలక్షేపము సంక్షేపించెద.

ఛాయాపహారమునకే—నన్నచోడని వర్ణనము జక్కనయు కృష్ణకవియు నెట్లు గ్రహించిరో చూతము.

ఆకాశనది యని యనిమిషాంగన లెల్ల
వేడుకతో జలక్రీడ సలుపఁ
బాలమున్నీ రని పంకజనాభుండు
ఫణిశయ్య గావించి పవ్వళింపఁ
పాదరసం బని మోదించి సిద్ధులు
మించి ఘటంబుల నించుకొనఁగ
నమృతంపుసో నని యఖిలామరశ్రేణి
చెలఁగి పానంబులు సేయుచుండ

నెల్లి విరియుచు నుబ్బుచు విశదకాంతిఁ
బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమై పెచ్చుపెరిగె.

((కృష్ణకవి)

దుగ్ధాంబునిధి నిట్ట దోచెనో యని శేషుఁ
బాన్పుగా హరి నీటఁ బవ్వళింపఁ

నోదవి సుధారస మప్పాంగెనో యని
దేవతల్ జనివోకఁ ద్రావఁదలఁపఁ
దొలఁకాడు మిన్నేఱు వెలివిరిసెనో యని
లీలసురాంగన లోలలాడఁ
బాదరసం బుర్విఁ బరఁగెనో యని సిద్ధ
నికరంబు కలశముల్ నించికొనఁగఁ
బాండురాంగుండు విశ్వరూపంబు దాల్చె
రొలసెనో యని సద్భక్తు లెలమిఁ గొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమై యెఱి కాసె.
(నన్నెచోడుఁడు)

గంగాప్రవాహంబు గాఁబోలు నని వసి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబువెల్లువ యని నిలింపాదులు
మునుకొని దోసిళ్ల ముంచి గ్రోల
దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేష
పర్యంక మిడుకొని పవ్వళింపఁ
బరమేశువిశ్వరూపం బని బ్రహ్మాదు
లమర దండప్రణామములు సేయఁ
దలఁప భూనభోంతరములకొలఁది దెలిసి
తెరసి యెన్మిదిదిక్కులఁ బొరలిపొరలి
దట్టముగ నంతకంతకుఁ దనరితనరి
యిట్టలంబున వెన్నెల నిట్టవొడిచె"
జక్కనసాహసాంకము (V111—57)

రేఖాపహరణమునకుఁ బోతనపద్య ముదాహరణ మయ్యెఁగదా. మఱియును—

తమవాఁడిచూపు కందర్పున కేపసు
లైన సాధించుదివ్యాస్త్ర మనఁగ
తమతీయఁబలుకులు ప్రమదరాగాంబుధిఁ
దనరారుమవ్వంపుఁదరఁగ లనఁగ
తమవింతచెయ్వులు కమనీయకోమల
శృంగారతరువులేఁజిగురు లనఁగ
తమముద్దునగవులు తమకంపుఁజీకటి
నిగిడించునరిదివెన్నెల లనంగఁ
జొక్కమంను లనఁగ సోయగంబులగను
లనఁగ సుఖమునిక్క లనఁగఁ జాలి
యనుపమానమూర్తులై యుల్లసిల్లుదు
రంబుజాయతాక్షు లప్సరమున.

అనుతంభుదాసుని పద్యభావములోన రేఖామాత్ర గ్రహించినను క్రిందికొమ్మనపద్యము రమణీయతరముగా నున్నది. (ఇందుఁ జెయ్వులన హావభావాది శృంగార చేష్టలు)

తమవాఁడిచూపులు దర్పకుక్రొవ్వాఁడి
తూపుల కొసపరిప్రాపు లగుచుఁ
దమపల్కురీతులు దర్పకువిజయస
ద్గీతుల కలరుసజాతు లగుచుఁ
దమ మందహాసముల్ దర్పకుకీర్తివి
లాసంబులకు ననుప్రాసములుగ
దమహావభావముల్ దర్పకులీలాప్ర
భావములకు మూలజీవములుగఁ
వఱలుశృంగారమంత్రదేవతలకరణి
నతిమనోహరమోహనాకృతులు గలిగె
శాంభవీసర్వసత్పరిచారసరణి
నెసఁగుచుండుదు రంధుఁ బూర్ణేందుముఖులు.

ఇట్టిపాదృశ్యము ప్రాయశః ధ్వన్యర్థసహితమై కవుల ప్రతిభఁ జాటించి పరశ్శ్రోత్రమును దున్ని చక్కని యెరువువైచి దశగుణితముగా ఫలసంకతి ననుభవించు పురుషుని వ్యవహారకౌశలమునకుం బోలె వారికిఁ బ్రఖ్యాతిఁ దెచ్చును.

పదార్థహరణ మేరీతినైనఁ బూర్వుల యర్థము ఖండించుకొఱకనువదించినను బరిహసింప దాని మార్చి రచించినను దోషంబు కానేరదు. తిక్కనభారతమున నెచ్చటనో శ్రుతిశాస్త్రంబులఁ జదివి విప్రుఁడు యజ్ఞము లొనర్చి స్వర్గలోకమున దివ్యాంగనాసమాగమము పొందు నను భావమును హరిభట్టు వరాహపురాణమున నపహరించె. తిక్కనపద్యమును వేదవాక్యముగా నుదాహరించినశ్రోత్రియశిఖామణికి దానినే యించుక మార్చి శ్రీనాథుఁడు వాని నపహాసపత్త్రముగా నొనర్చె.

తిక్కనపద్యము లభింపనందున దానిఁ బోలినదాని నుదాహరించెద.

శ్రుతిపారంగతుఁడై సదక్షిణమఖ
స్తోమంబు వాటించి స
న్నుతపుణ్యుం డగు భూసురోత్తముఁడు నా
కంబందుఁ బ్రాపించు నూ
ర్జితకల్పద్రుమమంజరీమధురమై
రేయామృతాస్వాదగ
ర్వితగీర్వాణ వధూనితంబభరనీ
వీమోక్షసత్సౌఖ్యమున్.
(హరిభట్టు - వరాహపురాణము).

ఈ భావము నుపహసించిన శ్రీనాథుని కోలాహలము వినదము—

శ్రుతిశాస్త్రక్రియ లభ్యసించుకొని వి
ప్రుం డర్థి నానాధ్వర
వ్రతుఁడై పోయి కనుం బురందరపురా
రామద్రుమానల్పక
ల్పతరుప్రాంతలతాకుడుంగసుఖలీ
లాసుప్తరంభా.. ...
............కలా
పాండిత్య శౌండీర్యముల్.
అని చాటువు.

రేఖాపహారమునకే మఱియొక యుదాహరణము—

అమరులు త్రావుచో నమృత
మందురు దీని నహిస్రవజం బజ
స్రము గొని యానుచో నిది ర
సాయన మందురు భూసురాఘ మా
గమనిధి సోమపాన మని
చైకొని యానదు రధ్వరక్రియాం
గమునెడ వస్తు వందు రిది
కాళిక లీసుర పేర్మి వింతయే ?
అమృతంబులో లేని యనురాగగుణ మిందుఁ
గల దని విబుధ యుగ్మములు గ్రోలఁ
జంద్రోదకం బింత చవి యగునే యని
సిద్ధకన్యకలు చేనేతఁ ద్రావ
వెలిరసాయన మింత వృష్యమే మీ కని
యచ్చరల్ విటులకు నందియీయ
సోమలతాసిద్ధిఁ జొక్కనే లందిట్టి
మఱపు గల్గునె యని మఖులు సొక్క
వేడ్క లెలరార నొడళుల వీఁక దక్క
రతిపరిశ్రాంతమైన యావతము సెలఁగ
నిదియె సిద్ధౌషధము సద్య మిష్టదంబు
ననుచు సేవించి రోలి దివ్యాసవంబు.

(ఇందుఁ జంద్రోదకము సిద్ధతంత్రములఁ బ్రసిద్ధ మగు రసాయనవిశేషము.)

ఈ రెండుపద్యములలో సురామహిమ వర్ణింపఁ బడియె. క్షత్రియ కవిరాజశిఖామణి వర్ణించిన యుల్లేఖములోని జీవకళ గ్రహించి విప్రకవివర్యుఁడు వ్యతిరేకాలంకార చమత్కృతి బంధురముగా మధుగోష్ఠి రచించినను రేఖాపహార మను విమచ్ఛాయ దివ్యాసవంబునఁ జంద్రకోత్పల రేఖావ్యాజంబునఁ బ్రతిఫలించి తదాస్వాదమదముదిత మాళవీ కనీనికానికాయచ్ఛాయల విచ్ఛాయం బయ్యుఁ గీర్త్యంగనకు మూర్ఛాప్రమోహంబులఁ గలిగింపకుండఁ జాలదు.

ప్రతిచ్ఛాయాకల్పనము — ఇది రేఖాపహారము కంటె హీనతరదోష మగును.

పదబంధంబుల నగ్గలించి బుధశ
బ్దభ్రాజియై సద్గుణా
స్పదమై దుష్కవిహృత్సరోజవనముల్
భంజింపుచున్ భూరిస
మ్మదలీలన్ విలసిల్లి సత్కృతి జగ
న్మాన్యప్రభావంబునన్
మదనాగంబునుబోలెఁ గ్రాలవలదా
మా కెందు లే కున్నతిన్.
(నన్నెచోడుఁడు).

పదలాలిత్యము వర్ణశుద్ధియును శ
బ్దస్థైర్యముల్ మంగళా

స్పదభావంబును రాజయోగ్యతయు నో
మన్నూత్తిరాహిత్యముం
సదలంకారవిశేషముం గలిగి వి
శ్వప్రాణసౌభాగ్యసం
పదమై తేజియుఁబోలెఁ గ్రాలవలదా
పద్యంబు హృద్యస్థితిన్.
(పెద్దపాటి సోమనాథుఁడు)

ఈ రెంటిలోఁ దాత్పర్యము భేదించినను బూర్వ పద్యమును స్మరించి సోమనాథుఁడు నూతనకల్పన సేసె నని తోఁచును.

ఇంతదనుకఁ గొన్ని చౌర్యచ్ఛాయలఁ జేర్కొంటిమి. వానిలో నవాంతరభేదములును మఱికొన్ని విభాగములును సూక్ష్మబుద్ధులు స్వయముగా నన్వేషించుకొందురుగాక.

కథాశరీరసంవిధానమునను రసవత్ప్రకరణములను వర్ణనాగుంభనములను వైచిత్ర్యముల సంమిశ్రము చేసి విచిత్రగ్రథనమున నద్భుతప్రబంధమో ప్రకరణమో వర్ణనమో కల్పింపవచ్చు. అప్పుడును దూష్యములు కానిపోకలు గ్రహింపకున్నఁ గవి యవహేళనకు భాజనం బగు.

ఒకకావ్యములోవి ప్రకరణ మంతయు గ్రహించి స్వకల్పితముగాఁ బ్రకటించుట కొక యుదాహరణ మిత్తము. తంజాపురి రఘునాథుని దేవేరులలో నొకతె యగు రామభద్రాంబ తద్రాజవిజయచరిత్రమును వర్ణించుచుఁ బండ్రెండవ సర్గలోఁ జాలభాగము శైవతంత్రమున సామ్రాజ్యలక్ష్మీపీఠిక యను గ్రంథములోనుండి యర్థమును గ్రమముగా గ్రహించి సర్గముఁ బూరించె. ఇది గ్రంథచౌర్యమగునో కాదో పండితులు నిర్ధారింపఁదగు. మహారాజకరగ్రహణప్రభావముచే నవరోధకాంత యయ్యు సభలలో సమస్యాపూరణములు సేసి కనకాభిషేకము సేయించుకొనెఁ గావునఁ జౌర్యదోషమున కామె యవరోధ మవరోధము గానేరదు. లేక యవరోధమే యయ్యెనా!

మూలమును ఛాయయును సంస్కృతములో నున్నను దాని మన యంధ్రవనితాప్రాగల్భ్య విలసనం బగుటచే మనము విని యానందింప నర్హులము.

రఘునాథాభ్యుదయము.

అథ లాస్యకలావలోకనేచ్ఛో
రవనీనేతు రపాఙ్గసంజ్ఞయైవ;
చతురాః సముపేత్య నాట్యశాలాం
సహసాకుర్వత సజ్జితార్హకృత్యామ్.

మహార్హముక్తామణి క్లప్తమాలికా
వితానసంవీతవితానలక్షితామ్,
సమగ్రకాలాగురుధూపసంజనాం
మనోజ్ఞనానామణి జాల జాలికామ్.

దలత్ప్రసూనాఙ్కితదామసౌరభీ
మిలన్మిలిన్దారవమేదురోదరామ్,
సలీలలాస్యక్రమచఙ్క్రమోచిత
ప్రక్లృప్తకర్పూరపరాగభాసురామ్.

విరచితసమయానుకూలవేషాః
సవిధలసత్స్వవయాః సుధీసహస్రాః;
సరసిజనయనాశతైః సమేతో
నరపతిమౌళి రగాత్స నాట్యశాలామ్.

స తత్ర నానావిధసంవిధాన
మనోహరాయాం మదనావతారః,
అధ్యాస్త భద్రాసన మక్షిజాతం
విలోకనానాం సఫలం వితన్వన్.

కాశ్మీరకామ్భోజకరూశకాశ
గాన్ధారకర్ణాటకలిఙ్గవఙ్గాః,
అవన్తికున్త్యాన్ధ్రవిదర్భగౌళ
వఙ్గాలనేపాలకబాహ్లికాఙ్గాః.

మత్సిల్లమత్స్యమరహాట సురాష్ట్రలాట
తుండీరచేరకురు కేరళపాండ్యభోటాః,
సింధుత్రిగర్తశక సింహల పారసీక
సౌవీరమాలవ వరాటగరాధినాథాః.

కవికోవిదవన్దిగాయకాద్యైః
రసికాస్తే రఘునాథపార్థివేన్దోః;
అవలోకనసంజ్ఞయావనమ్రా
న్యవిశన్తాత్ర నిజోచితస్థలేషు.

అథ తాలధరాఙ్గనాదిభిః
సముపేతా వనసాలభఞ్జికాః.
సమమారచయన్ జనేశితుః
సవిధే వంశవిధానచాతురీమ్.

మదవతీవలయారవమాంసలా
ముఖరమర్దలమోహననిస్వనా,
అతనుతాగరుధూపపరమ్పరా
ఘనఘనాఘనగర్జితనాటికామ్.

అథ యథోచితహాటకకల్పనాం
ప్రభుమణేః పురతః ప్రతిసీరికామ్,
అవహతామరవిన్దవిలోచనే
కరవలన్మణికఙ్కణనిక్వణమ్.

ప్రథమం ప్రతిసీరికాన్తరాళే
నరనాథాయ నటీప్రవేశలీలామ్,
అవదన్ బిరుదాఙ్కవాద్యనాదై
ర్మణిపాదాఙ్గద మఞ్జుశిఞ్జితాని.

అథాహృతాయాం ప్రతిసీరికాయా
మాలక్ష్యమాణా హరిణాయతాక్షీ,
సాన్ద్రప్రభాసంశ్లథనేన సద్యః
సాక్షాత్కృతేవాజని చన్ద్రరేఖా.*

మనోజ్ఞముక్తామణికఙ్కణప్రభా
భరేణ సాకం ప్రసవాఞ్జలిం పురః,
అదాత్తదా నాట్యకలాధిదేవతాం
మనోహరా రూపవతీవ మానినీ.

విలోకనాదేవ విభోర్విశిష్య
విలాసినీ సంభృతవిభ్రమా హ్యభూత్,
వసన్తసాన్నిధ్యవశా దతీవ
మనోహరా మాధవికా లతేవ.

విభుమణే రథ వీక్షణసంజ్ఞయా
విధుముఖీ సమయోచితవిభ్రమాన్,
అభినయా నతివిస్మయనోచితా
బహువిధం ప్రకటీకురుతే స్మ సా.

అథ రమ్యతరై †ర్నిజాంగహారై
రపి నాట్యక్రమవేదితాత్మభావైః,
హృదయే రుచి మేధితా మతానీ
న్మదిరాక్షీ రఘునాథమన్మథస్య
కులేన రూపేణ గుణేన విద్యయా
పరస్పరం సామ్యయుజః పరశ్శతాః;
అనర్తిషుర్దృప్తిముఖై రణూపిరా
రయా దహంపూర్వికయా రసోత్తరమ్.

---

* రఘునాథుని యాస్థానమున చంద్రరేఖ, రూపవతి యను నాటకీయకన్యలు ప్రగల్భ లుండిరి.

"బిరుదుపాత్రలు విజృంభించి యారాజ వరుని ముందఱ నిల్వ వారిలోపలను
పదచాళి గొనియె రూపవతీవధూటి గొదలేక పేరణి గొనెఁ జంద్రరేఖ
మిక్కిలి కోపుల మెఱవడిఁ జూపి జక్కిణి వినిపించె శశిరేఖ యపుడు."

విజయరాఘవుని రఘునాథాభ్యుదయము.

ఇందు పదచాళి, పేరణి, కోపులు, జక్కిణిశబ్దములు నృత్యశాస్త్రమునఁ బారిభాషికపదములు. పెద్ద కోమటి వేమన గుఱించి వ్రాయునపుడు వీనిలక్షణము వివరించెదము.

మఱియు

వీరవేంకటరాయ పృథ్వీమహేంద్ర, దత్త బహువిధబిరుదముల్ దనరుచుండ
సముఖమున నిల్చి యా ముద్దుచంద్రరేఖ వివిధవిద్యలు వినిపించె నింత యనఁగ. (రఘునాథాభ్యుదయము,)

† అంగహారములు నృత్తవిశేషములు (అర్థాన్తరము)

అపాఙ్గశోభాతిశయే పయోదవ
ద్విజృమ్భమాణే సతి భూవిభోస్తదా,
విలోలసల్లాస్యవిలాసలక్షితా
మయూరికేవాజని మానినీతరా.

చచ్చత్పుటాద్యైః‡ర్నృపతేః సమీపే
భవాస్యజాతైర్నటన ప్రపఞ్చమ్,
ప్రాపఞ్చయత్పఞ్చవిధైః సలీలం
మృగేక్షణా కాచన మార్గతాలైః.

జయమఙ్గలసింహలీలలీలా
జయనిఃసారుకచర్చరీత్రిభిన్నైః,
రతిలీలతురఙ్గలీలరఙ్గా
భరణానఙ్గహరిక్రమాదితాలైః.

హరినన్దనవన్దినన్దనాద్యై
రపి నూలాన్దిభిరన్యకైశ్చ తాలైః.
నానామణీఘటితహాటకనాట్యశాలా
పర్యన్తయన్త్రితచలత్ప్రతిమాసహస్రైః
ఆపాదితేవ నివహైరమరాఙ్గనానాం
విద్యోతతే స్మ పురతో నవపుష్పవృష్టిః.

అభినయనరసానురూపమారా
న్మఖరముఖేషు ముదా సభాజనేషు,
అతులితకనకాభిషేకముఖ్యైః
సపది వధూః సమభావయన్మహీంద్రః.

బుధచారణవన్దిపూర్వకాణా
మభిషేకద్రవిణం యథార్హమేవ,
బహుధా రఘునాథపార్థివోఽదా
న్నిజవిశ్రాణననిర్జితేన్ద్రశాఖీ.

సామ్రాజ్యలక్ష్మీపీఠికా

సామ్రాజ్యలక్ష్మ్యాః స్థైర్యార్థం
సర్వసౌభాగ్యసిద్ధయే,
పశ్యేల్లాస్యకలాం రమ్యాం
నటీభిరభినుచితామ్.

ఆలోకకాశ్చర్యకరీం మనోనయననన్దినీమ్,
దివ్యమాల్యామ్బరధరో దివ్యాభరణభూషితః.

నాట్యశాలాం సమాసాద్య
విశాలాం స్వాయతాం శుభామ్,
అత్యున్నతాం సమతలాం
సువితానాం సుతోరణామ్.

కాలాగరురజః క్షిప్తధూపగన్ధమనోహరామ్,
సుమనోదామసౌరభ్యభ్రమద్భ్రమరసంకులామ్.

సింహాసనే సమారూఢః శ్వేతచ్ఛత్రేణ చారుణా,
అఙ్గవఙ్గకలిఙ్గాన్ధ్రచోళనేపాళమాళవాన్.
పాణ్డ్యసౌవీరసౌరాష్ట్రా
న్నృపానన్యాంశ్చ పార్థివాన్,
ఆహ్వాయయిత్వా పురుషై
ర్వేత్రహస్తైః ససమ్భ్రమమ్.

అపాఙ్గసంజ్ఞయా సర్వానాసనేషూపవేశ్య తాన్,
ఉపవిశ్యోచితస్థానేష్వవలోకనసంజ్ఞయా,
లాస్యావలోకనపరో భవేద్భూమిపురన్దరః.

అథ లాస్యావలోకనేచ్ఛోర్నృపస్యాపాఙ్గసంజ్ఞయా,
పురుషైర్నాట్యశాలాయాం సంజ్ఞితాయాం తు కైశ్చన.
సహతాళధరస్త్రీభిః కాశ్చిత్కమలలోచనాః,
వంశాదిధ్మానచాతుర్యం కలయన్తి నృపాగ్రతః,
పునః కాశ్చన కామిన్యః కఙ్కణస్వనమాంసలాన్,
రచయన్తి ప్రభోస్తస్య పురస్తాన్మర్దళస్వనాన్.
కాంచిద్యవనికాం బధ్వా ద్వేశు కాఞ్చనచిత్రితామ్,
పురస్తాద్రాజసింహస్య వహతోఽతిమనోహరే.
తతో బిరుదవాద్యానాం నిస్వనోఽతి మనోహరః,
ప్రథవేత్ప్రథమే పాత్రప్రాగల్భ్యం కథయన్నివ,
తత్పరం ప్రతిసీరాన్తర్మఞ్జుమఞ్జీరనిస్వనాః,
ప్రభవన్తి ప్రశంసన్త ఇవ పాత్రప్రవేశనమ్.
తత్పరం ప్రతిసీరాయామాహృతాయాం తు కాచన,
దృశ్యతే చన్ద్రలేఖేవ విశిష్టా సన్ధ్యయా నటీ.

‡ చచ్చత్పుటాది పంచతాళముల మార్గతాళములందురు.

## చిత్రములు: ఏబదవ అఖిలభారత జాతీయమహాసభ, ఫైయిజ్‌పూరు—1936.



తిలక్ నగర సింహద్వారము.



[illegible] సమాగమము



పతాకోత్సవము





మహాసభా ప్రేక్షకబృందమున నేకదేశము.

అథ సా నాట్యవిద్యాధిదేవతాయై పురో భువి,
కఙ్కణప్రభయా సాకం దదాతి కుసుమాఞ్జలిమ్.
తతోఽవలోకనార్తస్య సా భవేదతివిభ్రమా,
లతావసన్తసాన్నిధ్యా దతిరమ్యేవ మాధవీ.
తతస్తస్యాః సాఙ్గసంజ్ఞా ప్రేరితా సా నటీ ప్రభోః,
స్ఫుటీకరోత్యభినయా నతివిస్మయదాయినః.
అథ నాట్యోచితైరఙ్గహారైః సా నర్తకీ పునః,
తతః పరశ్శతా వధ్వః రూపవిద్యాగుణైః సమాః.
నటన్తి దేశీముఖ్యాద్యై రహంపూర్విక యాదరాత్,
మయూరీవ లసల్లాస్యా కాచిద్భవతి లాసికా.
కార్యం పఞ్చవిధైర్మార్గతాలైః కైశ్చిద్వధూజనైః,
జ కుమఙ్గలతాలేన సింహలీలాభిధేన చ.
లీలాజయాఖ్యతాలేన రతిలీలాహ్వయేన చ,
తురఙ్గలీలాభిఖ్యేన రఙ్గాభ ణకేన చ.
నన్దినన్దనతాలాద్యైః కర్తవ్యం నటనం ప్రియే,
తతస్తల్లాస్యశాలాయా ఊర్ధ్వభాగప్రకల్పితైః.
ప్రతిమానివహై ర్నాట్య కలాం ద్రష్టుమిహాగతైః,
త్రిదివాప్సరసాంసఙ్ఘై రివ మఞ్జులమూర్తిభిః.
ఆప్లావయేత్పుష్పవృష్టి మవనీపతి మాదరాత్,
నటీనాం కారయేద్రాజా కనకేనాభిషేచనమ్.
తతోఽభిషేచనద్రవ్యం కవిగాయకవన్దినామ్,
దత్త్వా గన్ధాదికం చాపి పునః ప్రస్థాప్య తాః ప్రియే.
నటీభిః సహ శుద్ధాన్తం ప్రవిశేమ్యాభ పురన్దరః,
ఇతి శ్రీ మచ్ఛైవతంత్రే సామ్రాజ్యపీఠికాయాం...
అశీతితమః పటలః

ఈ రెంటిలోను ప్రకరణ వర్ణనము సమాన మగుటయె కాక పెక్కు సమాస విశేషములు గలసి యున్నవి. ఒకటిఁ జూచి మఱొకటి గూర్పఁబడియె ననుటలో సంశయము లేదు. ఏది మొదటిది యేది రెండవ దన్న విషయములోనే సందియము. రఘునాథాభ్యుదయములోఁ దక్కిన సర్గములు మేము నిపుణముగాఁ బరీక్షింపమైతిమి. సామ్రాజ్యపీఠిక తంజాపుర గ్రంథ భండారమునను కలదుగాని బహుదేశముల వేలకొలఁది లిఖితగ్రంథములఁ బరీక్షించితిమిగానిమాకీ తంత్ర మన్యత్ర దృష్టిగోచరము గాదయ్యె. ఇతరత్రలభింప వచ్చునేమో? అది యేకాలమున రచింపఁబడెనో యెఱుంగుటకు లబ్ధ మాతృకలలోఁ ప్రమాణము గానరాదు. రాజచర్యల వర్ణించు నీ గ్రంథము రఘునాథుని కాలముననే యెవ్వఁడైన రచించియున్నచో నతఁడే రామభద్రాంబపేర రఘునాథాభ్యుదయము నైతము రచించియుండవచ్చును. లేకున్న రామభద్రాంబయే శుద్ధాంత స్త్రైణవ్యాపారము విడిచి తంత్రగ్రంథము కూర్చెనో యనియుఁ గొందఱు సందేహింపవచ్చు. రామభద్రకు విద్యాకవితల నేర్పిన కవికాళన యను నంధ్రబ్రాహ్మణుఁడు. రఘునాథుని పుత్రుఁడు విజయరాఘవభూపతి కాళనకవి గూర్చి,

ఘటికాశతగ్రంథఘటనోత్కట నటీన పాండిత్య గరిమలు భళియనంగ, నోష్ఠ్య నిరోష్ఠ్యాదికోద్దామ రసగర్భ సందర్భమూనని సన్నుతింప, మాకంద మంజరీ మధురఝరీమాధుర్య రచనావిశేష మారాయనంగఁ, బరిహృతేతర యుక్తిభాగ నూతన కథాచాతుర్య ధుర్యత పన్నుతింప, నయ్యె దినముల రామభద్రమ్మ వారు, నేఁడు కృష్ణాజికవితల నేర్పుమెఱసి, వినికి సేయుట లెల్ల మీ ఘనతగాదె, కవివినుతచర్య చెంగల్వ కాళనార్య.

రాజగోపాల విలాసము. ఆ-౧.

అని యామె విద్యాగురువుగాని లేక వేఱొక శైవ తంత్రజ్ఞుఁడుగాని రెండు గ్రంథములును రచించెనేమో. ఏల యనఁగా నింతవిస్తరముగా రామభద్రాంబ తక్కిన పదునొకొండు సర్గలు రచియింపఁగలిగి యిక్కడ నింత కక్కుఱితి పడునా? లేక నిరర్గళధారాప్రాతముగా సుందరపద పంక్తితోఁ బురాణశైలితో, శైవతంత్రము రచించిన కర్త సిగ్గులేక స్త్రీయగ్రథము హరించునా యను విస్మయము కలుగుచున్నది. ఈ యంశ మింకను బండిత పరిశోధ్యమే యగును.

"పండితపద్ది కృష్ణస్వామయ్యగారు సింగరార్యుని బిల్హణీయమును దనరచితముగాఁ బ్రచురించె. రంగాజీ కృతమగు నానంద సుందరీ చాతుర్య విలాసమును సుందరి తనకావ్యముగాఁ బేరుమాత్రము మార్చి వెల్లడించె. ఇవి గ్రంథచౌర్యవిభాగములలో నెందులఁ జేరును?"

కొంతశక్తిగలిగి స్వకల్పనములనఁదమ నితరుల పదార్థము గ్రహించువారి కృత్యమే యింతవఱకు లక్షణ లక్ష్యములతో వర్ణించితిమి కాని సర్వస్వహరణము చేయువారు కవు లనికాని వారు కవిగోష్ఠిలో సభ్యు లనికాని యెవ్వరుఁ దలఁపరు. వారి విమర్శించి లక్ష్య భూతులం జేయుట యధర్మము. ప్రాచీనకవిత్వమార్గము నుపేక్షించి నవనాగరకతానుసారము కేవలము భావములతో ననంతవర్త్మమగు కవితాకాశమున విహంగమార్గముల గంధర్వనగర నిర్మాణములు సేయువారల కెన్నఁడును గ్రంథచౌర్యదోషము రానేరదు.

---



సాయం సమయము —భీమరావు.

# కీలెరిగిన వాత

## శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

"నీ కేవలమైన ఆక్షేపణా లేనప్పుడిక యీ ఆలస్యం యెందుకూ?"

ఈమాట అడిగినప్పుడు కృష్ణవేణి మొగం ప్రసన్నంగా లేదు. పైగా ఆందోళన పుట్టించేటట్టుగా కూడా వుంది. అతనికి ఆందోళన పుట్టింది కూడానూ. కాని పక్కాలౌక్యుడు. క్షణంలో మనసు కుదుటపరుచుకుని యిదేమీ యెరగనట్టు సంభాషణ సాగించాడు.

"అవసరం లేదు. దేవుడిచ్చిన వరం అనుభవించడానికి జాప్యం చెయ్యడం తెలివితక్కువ."

"అదే యిప్పుడు జరుగుతూ వున్నది."

"ఒప్పుకున్నాను నిజమే. అయితే; నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. హృదయపీఠంమీద ప్రతిష్ఠించుకుని నిన్నెప్పుడూ ఆరాధిస్తున్నాను. నేను నీప్రేమకు పాత్రమయినందుకు బ్రహ్మానందం పొందుతున్నాను. లోకంకోసం ఆకాస్త తంతూ ముగించడానికిక ఆలస్యం చెయ్యడం బాగా లేదు."

"నెల్లాళ్ళ కిందటా యీ మాటే అన్నావు. వారం రోజులనాడూ యిదే అన్నావు. ఇప్పటికిప్పుడూ—"

"అబ్బా! కృష్ణా! నీకు కోపంవస్తే నేను తాళలేను. నువ్వు నన్ను సందేహించావంటే యిక నీమొగం చూడలేను"

"నీమొగం చూపించగలవు....కదూ?"

వూచలాగ తగిలింది అతని కీమాట. మొగం పక్కకి తిప్పుకున్నాడు.

"నువ్వు, ముందుముందు సంసారంలో చూపించబోయే చాతుర్యానికిది మచ్చు కాబోలు"

"ఎంత మాట అనేశావూ? నా తపన నీకు బోధపడలేదన్నమాట.......నిన్ను చూశాటప్పటికి నా కళ్లు జిగాల్ జిగాల్ మనిపోతూ వున్నాయి. హృదయం గజిబిజిపడిపోతూ వుంది. కృష్ణా! నీపరోక్షంలో నే నెన్నో కల్పనలు చేసుకుంటూ వుంటాను. నీ పాదాలదగ్గిర కూచుని యెన్నో మనవిచేసుకోవాలనుకుంటూ వుంటాను; కాని యెదటికి వచ్చాటప్పటికి—ముహూర్తం ఆలస్యం అవుతూ వున్నందుకు నువ్వు పొందే అసంతృప్తి—నీ బొమముడి చూశాటప్పటికి నా కల్పన అంతా యెగిరిపోతూ వుంది. మనస్సు బేజారయిపోతూవుంది"

"ఇదంతా యేమిటీ?"

"నే నిప్పుడేమన్నానూ?"

తడుముకోకుండా కమ్మాపరిచి- పైగా యెదురు తిరగడం ఆమెని భ్రాంతురాలిని చేసింది.

"బాగుంది."

ఇంతకంటే ఆమె మాటాడలేకపోయింది.

"కృష్ణా!"

"..............."

"నువ్వు మొగం అలా తిప్పకుంటే యిక నాపనిఏం కానూ?

"..............."

"నామాట———"

".........దూరంగా వుండు. పెళ్లి కాకుండా నువ్వు నన్ను తాకడానికి వల్లకాదు."

"నీ సెలవుచొప్పున నడుచుకుంటాను; కాని అప్పటిదాకా తాళలేను; కనక దయవుంచి—కనికరించి యిప్పటి కొక్క ముద్దు—"

"వల్లకాదు"

"అబ్బా!"

"..............."

నా కేమీ అర్థం కావడంలేదు. ఇంతటి రూపరాశి—ఇంతటి ప్రేమనిధానం యింత కాఠిన్యం యెలా

చూపించగలుగుతూ వుందో నా కింతమాత్రమూ బోధ పడడంలేదు.

"మొగవాడవు, నీకింత పేలతనం యేమిటి?"

"..............."

"నీకు భార్యకాని స్త్రీచెయ్యి పట్టుకోవాలనే హృదయదౌర్బల్యం నీ కెలా కలిగిందోయ్?"

"సెబాస్! నిన్ను మెచ్చుకుంటున్నాను. కృష్ణా! నీశీలం నన్ను ఆనందపరవశుణ్ణి చేసింది. నిన్ను భార్యగా పడసినవాడే పురుషుడు. ఆ బిరుదు నాకే తక్కపోతూ వున్నందుకు గర్విస్తున్నాను. వివాహానికి క్షణం ఆలస్యం అయినా యిక నేను తాళలేను. ఆ యేర్పాటు నువ్వెప్పుడు చేయిస్తే నే నాక్షణంలో సిద్ధం."

"అంటే?"

"ముహూర్తం స్థిరపరిపించి, మీ నాన్నగారు నన్నెప్పుడు రమ్మంటే ఆక్షణంలో—"

"నాన్నగారు అన్నీ క్షణంలో సిద్ధం చేయిస్తారు. మీ వాళ్లతో చెప్పి, వీలు చూసుకుని నువ్వే ముహూర్తం స్థిరపరిపించాలి."

అతనికి జవాబు తోచలేదు.

"మాట్లాడ వేం?"

"..........పోనీ, ముహూర్తం నేనే స్థిరపరిపిస్తాను; కాని యీ విషయంలో మీ నాన్నగారు నాతో యేమీ మాట్లాడకుండా—?"

"మీ సమ్మంధం నాన్నగారికి సర్వవిధాలా యిష్టమే నాన్నగారి మాట అమ్మ యేదీ కాదనదు. నిన్ను పెళ్లిచేసుకోడానికి వా రిద్దరూ నాకు సంబరపడుతూ సెలవిచ్చారు."

"అది సరే. మీ సమ్మంధం మానాన్న కూడా అంగీకరించాడు. మానాన్న చేసింది మా అమ్మ అంగీకరించక తప్పదు. కనుక వుభయత్రా కూడా పెద్దల అభ్యంతరం యేమీ కనపడదు"

"ఇం కేమిటి?"

"ఈస్థితిలో మీనాన్నగారు నాతో గాని, మా నాన్నతో గాని మాట్లాడవలసిన పని లేదంటావా నువ్వు."

"నా కేమీ కనపడ్డం లేదు"

"నువ్వు బాగా ఆలోచించలేదు. అసలు, ఆలోచించినట్టే కనపడదు. నిజానికి, నన్ను నువ్వూ, నిన్ను నేనూ పెళ్లిచేసుకోడానికి అంగీకరించవలసిన వాళ్లం మనం యిద్దరమే. అయితే: యితర యేర్పాట్ల విషయం."

"ఇతర యేర్పాట్లంటే?"

కృష్ణవేణికి, ఇందులో యేదో గొడవ వున్నట్టు తోచింది. ఏమిటో బోధపడలేదు. అన్నీ స్థిరపడ్డ తరవాత యీలాంటి ప్రస్తావన రావడం ఆమెకి విసుగు పుట్టించింది.

అత నిది గ్రహించాడు. కాని ముస్లద్దీ వకీలు కాగల ననే ధైర్యం వున్న ఘటం.

".........తెలవకే అడుగుతున్నావా నువ్వు?"

"తెలిస్తే అడగడం యెందుకూ?"

అతను వొక్కమాటు మొగం పక్కకి తిప్పుకున్నాడు. పక నైన కల్పన తోచింది.

"ఇవాళ నువ్వు విషమపరీక్ష మొదలుపెట్టావు. నాకు దీని కేమీ కారణం కనపడ్డంలేదు."

"..............."

"నీ హృదయంలో యెవరో సంశయబీజాలు వెదచల్లారు."

ఆమె పులుకూ పులుకూ చూసింది.

"నా సుఖంలో— నా ఆనందంలో నిగ్గంతా యెవరో విరిచేశారు."

"..............."

"పచ్చితంలేని హృదయం నాది. కల్మషంయెరగని ప్రేమ నాది. అగ్గికి చదలంటవు నాహృదయంచీల్చి చూపించిఅయినా నేను మళ్లీ నిన్ను ప్రసన్నురాలుగా చేసుకోగలను."

"..............."

"నీచదువు చూసి నేను ఆశపడలేదు. నీ సౌందర్యంకోసం నేను ప్రేమించలేదు. ఆవేళ నువ్వు గోదావరి గట్టున నిండుచూలా లయిన బిచ్చకత్తెకు, అప్పుడే కొనితెస్తూవున్న చీరా, చేసంచిలోనుంచి తీసి అయిదు రూపాయలూ సంతోషంతో యిచ్చావు. ఆ డబ్బుతో ఆమె నిర్విచారంగా పురుడుపోసుకుంటుందని నువ్వు పరమానందపడ్డావు. నేనదంతా కళ్లారా చూశాను. అదే నాకు నీ మొదటిదర్శనం. నా హృదయం ఆనందముగ్ధ మయిపోయింది. నా ఆత్మ నీపాదాలమీద ఆనంద బాష్పాలు రాల్చింది. చెప్పవచ్చిందేమిటంటే? ఆలాంటి గొప్ప ఔదార్యం చూడడంవల్ల కలిగిన ప్రేమ నాది. దీనికిక తిరుగులేదు. దీని కెవరూ, యెంతమాత్రమూ విఘాతం కలిగించలేరు. నాప్రేమ నీభావౌన్నత్యం తప్ప మరేమీ చూడదు, కోరదు."

ఆమెకి యేవగింపు కలిగింది. దాన్ని ఆమె దూరంగా తరిమివేసుకోలేకపోయింది.

"గొప్ప సినీమానటుడికి కావలసిన యోగ్యత అంతా నీదగ్గర వుంది."

గతుక్కు మన్నా డతను.

"నువ్వింత గొప్ప వక్తవని నే నెప్పుడూ అనుకోలేదు."

"కృష్ణా! నన్నేం చెయ్యమంటావూ? నావల్ల యేమి పొరపాటు జరిగిందీ?"

ఇది ఆమెకి యద్దేవాగా కనపడింది.

"నీవల్ల యేమీ జరగలేదు."

"వద్దు వద్దు. నీకు కోపం వద్దు. కాస్త లోకాచారం గమనిస్తే అంతా నీకే బోధపడివుండును."

"......................"

"ధోరణి చూడగా నా నోటనే చెప్పించాలని నీ అభిలాషగా కనబడుతూ వుంది. అలాగే కానిద్దాం. నీ ఆజ్ఞ నెరవేర్చడంకంటే నాకు సంతోషకర మయినది మరి లేదు."

"......................"

"........మనవి చేసుకుంటున్నాను"

"వింటున్నాను."

"నువ్వు ఇంటరు చదివేటప్పుడు, మీ నాన్నగారు, నిన్ను గొల్లకోట సదాశివయ్యగారి అబ్బాయికి యివ్వతలచి, కట్నం రెండువేలూ, లాంఛనాలు అయిదువందలూ యిస్తామని కబురు పంపించారు."

"అవును. అది వెనకటి మాట."

"మరి యిప్పటి మాట యేమిటీ?"

ఆమెపెదవులు రావిరేకుల్లాగ కదిలాయి.

"కట్నం మాటా?"

"....................."

"నీకు కట్నమూ, మీ అమ్మకీ, అక్కకీ లాంఛనాలూ యెంతెంత యిస్తారనా?"

"..............."

"నువ్వు నన్ను పెళ్లి చేసుకోవా లంటే, మా నాన్నగారు నీకు డబ్బివ్వా లంటావా?"

"ఇప్పుడు సంపన్నుల యిళ్లల్లో పెళ్లిళ్లెలా జరుగుతున్నాయో నీకు తెలకండా?"

"తెలిసింది. కట్నమూ, లాంఛనాలూ నిర్ణయం కాకపోవడంవల్లనే నువ్విలాగ కాలంగడుపుతున్నావు."

"..............."

"కదూ?"

"అవు నలాగే."

కిందిపెదవి కొరుక్కుంటూ ఆమె పెద్ద నిట్టూర్పు విడిచింది. వక్షస్థలం అదిరింది.

"మా నాన్నగారు దమ్మిడీ కట్నం యివ్వరు!"

"..............."

"వారిదగ్గర యీ మాట యెవ రెత్తినా మాట తక్కదు."

"..............."

"ఇంతే కాదు. ఆమాట నాచెవిని కూడా పడడానికి వల్లకాదు."

"నేనేం లేనివాణ్ణా కానివాణ్ణా? కురూపినా, చదువులేనివాణ్ణా? పాతిక సంవత్సరాలు మొన్ననే నిండాయి, నాకు పెళ్లికాదని బెంగా? నా వాటా భూములమీద సాలీనా వెయ్యి రూపాయలు వస్తాయి ఇల్లొకటి వస్తుంది పైగా, నేను, సొంతంగా ప్రాక్టీసు పెట్టుకున్నానంటే వెంటవెంటనే పెద్దపెద్ద కేసులు డజన్లకొద్దీ వచ్చే సూచనలెన్నో వున్నాయి. ఇలాంటి స్థితిలో కట్నం లేకుండా పెళ్లిచేసుకుని, నేను, సాటి వాళ్లలో తలయెత్తుకు తిరగ్గలనా?"

"ఏమి పౌరుషం?" అంటూ ఆమె వొక్క క్షణం నిర్విణ్ణ అయిపోయింది. ఉత్తర క్షణంలో "ఇలాంటి పౌరుషవంతులు నీ స్నేహితుల్లో చాలామంది వున్నారనుకుంటా—" అంది నిరసనభావం కనపరుస్తూనూ.

"అవును, ఉన్నారు. ఏంతక్కువా?"

"ఉన్న దేమిటీ? ఒక కన్యను పెళ్లిచేసకోవడానికి సిద్ధపడినందుకు మొగాడికి కట్నం యెందుకివ్వాలీ?"

"మొగాడు కనుక."

"ఛీ! అదీ మొగతనమే."

"..............."

"మొగాడికి కళ్లు ఎంత నెత్తికెక్కాయీ?"

అతను వెటకారంగా నవ్వాడు.

ఆమెకి రోషం వచ్చింది.

"స్త్రీధనంవల్ల జీవించతలుచుకునే నువ్వు స్త్రీని స్మరించడానికేనా తగవు."

"హు. హు. స్త్రీధనం. స్త్రీధనం అంటే మొగుడు స్త్రీకి ఇచ్చేది. కన్యావారి వరుడికిచ్చేది కాదు. స్త్రీధనం అంటే యేమిటో తెలియని స్త్రీని పెళ్లిచేసుకోవడం కంటే అవివేకం వుండదు. ఒప్పుకుంటున్నాను."

"నేను గోతిలో పడిపోకుండానే నీ నిజస్వరూపం బయటపెట్టినందుకు చాలా సంతోషం."

"నేనూ అందుకే సంతోషిస్తున్నాను."

"నువ్వు సుందరుడవంటే కనబడుతూనేవుంది; కాని నీకు ఆత్మసౌందర్యం లేదు. చదువుకున్నవాడవంటే అదీ కనబడుతూనే వుంది. నీ చదువు నీకు చిత్తసంస్కారం కలిగించలేదు. అడవిగాసిన వెన్నెల అయిపోయింది."

"నువ్వధికప్రసంగం చేస్తున్నావు. నీ తండ్రి జిల్లా జడ్జీపని చేసివుంటే యెవరికీ వొరగదు. నువ్వు బి. ఏ. వరకు గిర్వేస్తున్నావేమో నుడ్డికవ్వకు మారవు. తగినమొగుడు రావాలంటే ఒళ్లు బేరమనుకుంటున్నట్టున్నావు. అబ్బో! సుస్వరం దిగు."

"నువ్వు మాట్లాడతగ్గవాడవు కావు. నాయెదటినుంచి తక్షణం వెళ్లిపో."

"పొద్దున్నే లేచి—"

"ఛో! నుంచోకు."

అతను వాగ్వాదానికి జంకేవాడు కాడు. కాని, నమ్మించి నమ్మించి తన ద్రవ్యాశ యిప్పుడు బయటపడిపోయి—పైగా వ్యవహారం యెరిగి తిరిగినందుకు కతనికి కొంచెం సిగ్గు వచ్చింది. కట్నం మాట కృష్ణవేణి తండ్రిగాని, మరొక పురుషుడుగాని తిరస్కరించి వుంటే అందులో యీ తీవ్రతా లేకపోవును. అతనికి కోపమూ పుట్టకపోవును. సూటిగా వధువే నీకు మగతనం లేదనడం అతనికి కొట్టినంత పని అయింది.

పూచలాగ వెళ్లిపోయాడు.

కృష్ణవేణి పదినిమిషాల దాకా శాంతపడలేకపోయింది. విసురుగా వెడుతూ అతగాడు కనపడ్డంతసేపూ, ఆమె, తోకతొక్కిన ఆడతాచులాగ బుస్సలు కొట్టి తరవాత "నీచుడా" అంటూ గిరుక్కున తిరిగి యింటికి వెళ్లిపోయింది.

౨

కృష్ణవేణి వీథిలోనుంచీ, ఆమె తల్లి రాధమ్మ వంటింటి వసారాలోనుంచీ వచ్చి దక్షిణపు వసారా గదిలో వొక్కమాటే ప్రవేశించారు. కృష్ణవేణి అతివేగంగా వెళ్లి సోఫామీద చదికిలబడింది. రాధమ్మ ఆమె

వాలకంచూసి కంగారుపడి, టీపాయి మేజామీద పెట్టేసి "ఏం తల్లీ?" అంటూ దగ్గిరకూచుని వీపునిమురుతూ అడిగింది

"సమ్మంధం తిరిగిపోయింది."

"అయ్యో!"

కృష్ణవేణి ఆదైన్యానికి తిరగబడి తీవ్రంగా చూసింది.

"ఏం?"

"వాడికి కట్నం కావాలి."

"ఎంతట?"

"వాడి తలకాయంత .........ఎంతయితే మాత్రం యివ్వడాని కేవలం పడిగాపులు పడి కూచున్నారా యేమిటి?"

రాధమ్మ మాట్లాడ లేకపోయింది. ఇరవై యేళ్ల కూతురికి కుదరకకుదరక కుదిరిన సమ్మంధం తిరిగి పోయిం దనేటప్పటికి ఆయిల్లాలి తల తిరిగిపోయింది.

ఇ దేమీ గమనించకుండా వృత్తాంతం ముగిస్తూ వున్న రామచంద్రయాజులు, యీమాట విని వులిక్కిపడి, లేచివెళ్లి కూతురిదగ్గిర కూచుని "అతనే అడిగాడా తల్లీ?" అన్నాడు.

"అవును, వాడే అడిగాడు. లాంఛనాలు కూడా కావాలిట నాన్నారూ!"

"చీమూ నెత్తురూ లేని తుమ్మగుంగ ఎందుకు వచ్చిన చదువూ?"

యాజులుకూడా యిలా అనడం రాధమ్మకి వుద్ధారంగా కనపడింది. దీంతో యీ సమ్మంధాన్ని గురించి ఆమె పూర్తిగా నిరాశపడిపోయింది.

యాజులు రాధమ్మయింగితం కనిపెట్టాడు; కాని లెక్కచెయ్యతలుచుకోలేదు. ఈ విషయంలో ఆమె సలహా చెప్పతగ్గది కాదని అతను మొదలే నిశ్చయించుకున్నాడు.

"నువ్వే మన్నా వమ్మా?"

"'నీ మొగం చూడకూడదు, అవతలికిఫో' అన్నానండీ."

"మంచి పని చేశావు."

రాధమ్మ మొగుడికేసి పులకపులకా చూసింది; కాని మొగం పక్కకి తిప్పుకుని వుండడంవల్ల అత నది గమనించలేదు. అయితే, కృష్ణవేణి కనిపెట్టి "నువ్వేమంటావూ?" అన్నట్టు వురుముతూ చూసింది.

"కాలం......కాలం యిలా మండిపోతోంది. "మీ అబ్బాయికి మా అమ్మాయిని చేసుకోవలసిం దని చెప్పాటప్పటి కేమిస్తా వని—"

"ఆ అబ్బాయిగాడే అలా యేడిస్తే?"

కృష్ణవేణి యీ మాట చాలా దురుసుగా అడిగింది.

"నిజం చెప్పు. అతిగాడు కట్నం కావాలంటే నువ్వే మన్నావూ?"

"నాన్నారితో చెప్పిండే. నీ మొగం చూడ గూడదు పో పొమ్మన్నాను"

"నిజంగా యీ మాటే అన్నావా?"

"అనక యేం, భయమా? వెంటనే వా డవతలికి చల్లగా జారుకున్నాడు కనక సరిపోయింది; కాని లేకపోతే యేం జరుగునో?"

"........ఆడదాని కంత దురుసుతనం పనికి రాదమ్మా."

కృష్ణవేణి యాజులుకేసి చూసింది. యాజులు రాధమ్మ కేసి చూస్తూ "యేంచేతా?" అన్నాడు.

"ఏం చేసినా మొగాడికి చెల్లుతుంది."

"ఆడది చెల్లనిస్తేను......అంతే కాదూ?"

"ఎఫ్ఫే, బి. ఏలు చదువుకుంటేమాత్రం ఆడపిల్ల లంతా యిలా అంటున్నారా?"

"అననివా ళ్లనుభవిస్తారు.......ఆడగడాని కేం వుందీ?"

"ఇప్పుడు అమ్మాయి మాట?"

"గొప్ప ఆశయాలు గల పిల్ల—"

"మీ రుండండీ నాన్నారూ" అంటూ కృష్ణవేణి అడ్డువచ్చింది.

"అమ్మాయి కేం లోటు వచ్చిం దమ్మా యిప్పుడూ?"

"పెళ్లి లేకుండా యింటో కూచుంటావా?"

"పెళ్లాడితే యిలా టి దేబెలనా?"

"మొగపిల్ల లంతా యిప్పు డిదే మచ్చు."

"వాళ్ల మొగతనం అనుక్కున్నట్టే వుంది."

రాధమ్మ యాజులుకేసి చూసింది. యాజులు "అమ్మాయి సిసలుగా చెప్పింది. ఏం, అలా చూస్తావేం?" అన్నాడు.

"దాని చదు వింతపని చేసింది."

"నువ్వు సరిగా చెప్పావు. చదువుకుని, జ్ఞానం వచ్చిన ఆడపిల్ల యిలాగే చేస్తుంది."

"చదువుకుంటే మొగు డక్కర్లేమా?"

"మొగాడికి పెళ్లాం అక్కర్లేమా?"

"మొగాడికి పెళ్లికాకపోతే యేదీ అడ్డదు, ఎవరూ యేమీ అనరు. అనే లేరు."

"చివరి కిదీ ముక్తాయింపు. దీనిమీదే వొంటికాలి భరతం చెలావణీ అవుతూ వుంది.........సంఘం పూర్తిగా కుళ్లిపోయి వుంది. ఎదురు తిరిగినవాళ్లు కొన్ని యిబ్బందు లనుభవించక తప్పదు; కాని యింకెన్నాళ్లీ యీ దౌర్జన్యం?"

"మాట్లాడితే వుపన్యాసాలు. మీతో నేను వాదించలేను. చివరికి అమ్మాయికి పెళ్లి చేస్తారా చెయ్యరా?"

"మళ్లీ మొదటికి వచ్చావూ?.........అయితే నీ కలా తోస్తోందీ?"

"కట్నం యిస్తేగాని మంచి సమ్మంధం రాదు. మంచిదాకా యెందుకూ, మీతాహతుని బట్టి కట్నం యిస్తేగాని అసలు సమ్మంధమే రాదు."

"నేను దమ్మిడీ యివ్వను. ఆమాట కూడా విని పించుకోను."

రాధమ్మ విసిగిపోయి నుర్రాలక్కలాగ మొగం పక్కకి తిప్పుకుంది.

ఒక్కక్షణం యెవరూ యేమీ మాట్లాడలేదు.

మరోక్షణం చూసి, రాధమ్మ, కప్పుల్లో కాఫీ పోసి భర్తనీ, కూతుర్నీ మేజాదగ్గిరికి పిలుస్తూ తానొక కుర్చీమీద కూచుంది.

కాఫీ పుచ్చుకోని, తల్లి "నే నిస్తా నుండవమ్మా" అంటూవుండగా తల్లికీ తండ్రికీ తాంబూలా లిచ్చి తాను కూడా వేసుకొని కృష్ణవేణి పాఠశాలకి వెళ్లిపోయింది.

రాధమ్మ వొక్కక్షణం యేమిటో ఆలోచించి "నే నొక్కటి చెబుతాను వింటారా?" అంటూ తన కుర్చీ యాజులుకుర్చీదగ్గిరికి లాక్కుంది.

౩

కృష్ణవేణి బి. ఏ. పరీక్షలో నెగ్గి రెండేళ్లయింది. మద్రాసు క్వీన్ మేరీ కాలేజీలో ఆమె ప్రతిభా, చాకచక్యమూ చూసి ప్రిన్సిపాలు ఆమెని కన్నకూతురులాగ ప్రేమించింది. పట్టంపుచ్చుకుని ఆమె రాజమండ్రీ వచ్చేస్తూవుంటే "నేను నిన్ను విడిచిపెట్టలేను. నిన్ను ఎం. ఏ. ప్యాసు చేయించి యీ కాలేజీలో నాకు చేదోడువాదోడుగా వుంచుకొంటాను, వెళ్లిపోకు" అని చాలాచాలా నచ్చచెప్పింది. బతిమాలింది; కాని కృష్ణవేణి వినలేదు. "నేను ఎం. ఏ. ప్యాసయితే యేం వస్తుందీ? నే నీ కాలేజీలో ఉపాధ్యాయురాలుగా చేరితే నాదేశీయస్త్రీల కెంతమందికి జ్ఞానదానం చెయ్యగలనూ? మీకు కోపం వద్దు. ప్రస్తుత విద్యావిధానం బాగా లేదు. ప్రత్యేకజన్మ యెత్తినవాళ్లకే గాని కాలేజీలలో ప్రవేశం లేదు. ప్రవేశం దొరికిన వాళ్లేనా అందరూ వుద్యోగాలకోసం ఆశించి వచ్చేవాళ్లే. ఇది నాకు నచ్చలేదు. మావూళ్లో నేనొక పాఠశాల నడుపుతాను. ప్రారంభోత్సవం మీరే జరిగిస్తురుగాని. నా విద్యావిధానం అప్పుడు మీకు తెలుస్తుంది" అని ఆమె బదులు చెప్పింది.

చిత్రములు: ఏబదవ అఖిలభారత జాతీయమహాసభ, ఫెయిజ్‌పూరు—1936.



ఖద్దరు, గ్రామపరిశ్రమ ప్రదర్శనముల ప్రారంభము. ప్రారంభకుడు శ్రీ గాంధీమహాత్ముడు.





పరిశ్రమల ప్రదర్శనోత్సవ ప్రేక్షకబృందము.

ప్రిన్సిపాలు ఆమెని సంతోషంతో దీవించి పంపించింది.

ఆమె ఇంటర్మీడియేటు చదివేటప్పుడు యాజులు వివాహసంకల్పం చేశాడు; కాని ఆమె "చదువు పూర్తికానివ్వండి నాన్నారూ" అని కోరగా ఆ ప్రయత్నం ఆక్షణంలోనే కట్టిపెట్టేశాడు.

ఆమె బి. ఏ. అయి యింటికి వచ్చాక ఆమెను ఆశించి యేడెనమండుగురు యువకులు వచ్చారు; కాని ఆ సమ్మంధాలు చివరికి రాధమ్మకే నచ్చలేదు.

ఇది యిలా జరుగుతూవుండగా కృష్ణవేణి తన వుద్దేశాలు స్త్రీలోకంలో వ్యాపింపచెయ్యాలని వొక పాఠశాల నెలకొల్పింది.

యాజులు, తన పెన్షను ఎనిమిది వందలలోనూ "నీ యిష్టం వచ్చినట్టు చేసుకో" మని కూతురికి, నెలకి రెండు వందల రూపాయ లిస్తూవుండడానికి ఏర్పాటు చేశాడు.

ఆమె ఆ డబ్బుతో నెలకి యాభై, ముప్ఫయి, యిరవై రూపాయల జీతం చొప్పున ముగ్గురు వుపాధ్యాయురాళ్ల నేర్పరిచింది. ఆడ నౌకరుకి నెలకి పది రూపాయలు. చిల్లర సాదర్లు నలభై రూపాయలు. ఇలాగ తండ్రి తన కిచ్చే రెండు వందలలోనూ ఆమె పాఠశాలకోసం నూట యాభై ఖర్చు పెడుతుంది. తతిమ్మా యాభయ్యీ తాను పుష్కలంగా వాడుకుంటుంది.

కూతురు చేసిన యేర్పాటు చూసి, యాజులు "ధన్యుణ్ణి" అని వుప్పొంగిపోయాడు.

కొంచెం యింగ్లీషు, అంతకంటే యెక్కువ తెనుగు, ఇంతే పాఠశాలలో ఆమె ప్రవేశపెట్టిన భాషా పరిమితి. స్త్రీలు, అవసరమయితే పురుషులలాగ స్వతంత్రంగా బతకాలని ఆమెముఖ్యోద్దేశం.

"దయవుంచి నన్ను పెళ్లిచేసుకో. నన్నుద్ధరించు అంటూ స్త్రీ పురుషుణ్ణీ, పురుషుడు స్త్రీనీ బతిమాలుకో నక్కరలేదు. ఏమంటే? స్త్రీఅవసరం పురుషుడికి వుంది. పురుషుడి అవసరం స్త్రీకి వుంది. కనక స్త్రీ పురుషసంబంధమైన ఆకర్షణకి మనుష్య ప్రయత్నాలేమీ అక్కర్లేదు. ఇప్పటి తెనుగు స్త్రీలు పురుషుల కంటే నికృష్టంగా వున్నారు. వారికి దేశం అంటే తెలవదు. జాతి అంటే తెలవదు. భాష అంటే తెలవదు. మతం అంటే తెలవదు. ధైర్యంగా వీధిలోకే రాలేరు. ఇది మార్చాలి" ఇదీ ఆమెనిద్యాప్రణాళిక.

ఇందుకోసం ఆమె, ప్రపంచంలో గొప్పపనులు చేసిన స్త్రీల చరిత్రలన్నీ సంపాదించింది. స్త్రీల స్వత్వాలను చక్కగా నిర్వచించి వాటిని తమ జీవిత కాలంలో అమలుజరిపి ప్రపంచాని కాదర్శభూతురాళ్లయిన స్త్రీల జీవితాలు కూడా సంపాదించింది. అవన్నీ తాను స్వయంగా తెనుగులో రాసింది. కొన్ని ప్రకటించింది. కొన్ని అచ్చులో వున్నాయి. అవే ఆమె తరగతుల వారీగా తన పాఠశాలలో బాలికలకు పాఠ్యాలుగా నిర్ణయించింది. దానికి తగిన లెక్కలు, భూగోళం, చరిత్ర, భాష, ప్రకృతిశాస్త్రాలు, సంఘపు కట్టుబాట్లు, ముఖ్యంగా ఉదయమూ, సాయంత్రమూ వ్యాయామం.

ఆమె పాఠశాలకోసం వొక గుర్రాన్ని సంపాదించింది. నాలుగు సైకిళ్లు, ఒక (తన సొంత) మోటారు వున్నాయి. గుర్రపు స్వారి, సైకిలెక్కడం, మోటారు నడపడం—ఇవి ఆమె ప్రతీపిల్లకీ కచ్చితంగా నేర్పుతుంది.

ఆ పాఠశాలలో చదువుకునే బాలికలు చాలామంది దర్జాగా సొంత సైకిళ్లమీద వస్తారు. వారిని చూడగానే రాజమండ్రీ పోలీసులు జనసమ్మర్దాన్ని చక్కగా సద్దుతారు.

మున్సిపాలిటీతో పోరి, గవర్నమెంటుకి రాసి, ఆమె, గోదావరివొడ్డున నాళంవారి సత్రంరోడ్డుకి కిందుగా యాభై గజాల రేవు సంపాదించింది. మున్సిపాలిటీవారే దానికి దక్షిణానా, వుత్తరానా ముళ్ల తీగలతో దడ్లుకట్టించి హద్దులేర్పరిచారు. ఆమె ప్రతీ రోజూనా వుదయమూ సాయంత్రమూ ముత్తాముతాలుగా పిల్లలను తీసుకువచ్చి యీతకొట్టిస్తుంది. ఆ సమయంలో

అక్కడ ఒక పోలీసువుండి కాపలాకాస్తూ వుండేటట్టు జిల్లా మాజస్ట్రేటు ఆర్డరువేశాడు. అక్కడ పడవ లాగ కుండా చెయ్యడం, నీళ్లకోసం గాని స్నానాలకోసం గాని యెవర్నీ అక్కడికి రాకుండా చూడడం, పురుషులు చూడడానికి రాకుండా ఆపడం—ఇవీ ఆ పోలీసు పనులు.

పెద్దపెద్దలంతా ఆమెపాఠశాలను దీవించారు. గొప్ప పత్రికలు కొన్ని ఆమెయేర్పాట్లను ప్రశంసించాయి; కాని, చిత్రం. ఆ పాఠశాలలో బ్రాహ్మణ బాలికలు అయిదుగురు మాత్రమే వున్నారు. తతిమ్మా అందరూ—అంటే క్షత్రియబాలికలు పదిహేనుగురు. వైశ్యబాలికలు ఇరవైమంది. తెలగాలు, కమ్మవారు, గొప్ప వెలమలు—ఇత్యాదులు డెబ్భయ్యిద్దరు.

ఉదయం మూడుగంటలూ, మధ్యాహ్నం మూడు గంటలూ, ఆమె పాఠశాలలో చెమట వోడే లాగ పని చేస్తుంది. అక్కడి పనులన్నీ మార్షల్‌లా ప్రకారం నడుస్తాయి. ఎక్కడా చచ్చు పనికిరాదు.

పాఠశాలగంటల్లో స్త్రీలుమాత్రం వెళ్లి గాలరీలలో నిశ్శబ్దంగా కూచుని వినీ, కనీ బాగుపడవచ్చు.

చాలామంది వస్తూనూ వుంటారు.

అప్పుడప్పుడామె వీరేశలింగంగారి టవున్ హాల్లో వుపన్యాసా లిస్తూవుండడంకద్దు. అయితే, ఆమె నోరు విప్పిం దంటే ప్రకృతజీవచ్ఛవసంఘంమీద అగ్గిరాలుతూ వుంటుంది:

## ౪

మధ్యాహ్నం వొంటిగంటవేళ కృష్ణవేణి ఒక పుస్తకం తాలూకు ప్రూఫులు దిద్దుతూవుండగా యాజులు వచ్చి ఆమెకి వొక వుత్తరం యిచ్చాడు.

అందులో యిలా వుంది.

"బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ చేబోలు రామచంద్రయాజులు పంతులు రిటైర్డుజిల్లాజడ్జీగారి సన్నిధికి-
రాజమండ్రీ

అయ్యా! అనేకనమస్కారాలు.

తమ రెరిగివున్న మద్దూరి వేణుగోపాలశాస్త్రీ నేనూ స్నేహితులం.

తమ అమ్మాయి కృష్ణవేణిగారికీ తనకీ వివాహం స్థిరపడివుండినట్టూ; కాని ముహూర్తం వుంచడమే తరవాయిగా వుండగా కట్నంవిషయంలో పేచీవచ్చి సంబంధం తిరిగిపోయినట్టూ, తాను, ఆడవరకే రెండువేల కట్నమూ, అయిదు వందలు లాంఛనాలూ యిస్తామని తరిమి తరిమి చెబుతూ పట్టుకు పాకులాడుతూ వున్న మరొక సమ్మంధం వెంటనే స్థిరపరుచుకున్నట్టూ, ముహూర్త నిశ్చయం కూడా అయినట్టూ ఇప్పుడే చెప్పివెళ్లాడు.

నే నీవుత్తరం తమకి రాయడానికి ఈ విధంగా కారణమూ, అవకాశమూ కలిగాయి.

నేను మీ అమ్మాయిగారిని పెళ్లి చేసుకోవాలని అభిలషిస్తున్నాను.

నన్ను మీ రెరుగుదురు. మీ అమ్మాయిగారున్నూ యెరిగేవుంటారని నమ్ముతున్నాను.

నా పేరు సుసర్ల కోటేశ్వరశాస్త్రి. మా స్వస్థలం అమలాపురం తాలూకా మోడేకుర్రు గ్రామం. నేను బి. ఏ., ఎల్. టి. పరీక్షలలో నెగ్గివుండి, ప్రస్తుతం రాజమండ్రీ మునిసిపల్ హైస్కూల్లో ఆక్టింగుగా పనిచేస్తున్నాను. నెలకి అరవై రూపాయ లిస్తున్నారు.

ఇది యెప్పుడు ఖాయం అవుతుందో చెప్పలేను; కాని యీ ఆక్టింగుమాత్రం యింకా కొన్ని సంవత్సరాలు జరుగుతుంది.

నాకు భూములమీద సంవత్సరానికి రెండు వందల రూపాయలు మాత్రమే వస్తాయి. స్వగ్రామంలో చిన్న పెంకుటిల్లు వున్నది.

నావయస్సు: ముప్ఫయి రెండోయేడు మొన్ననే జులైలో ప్రవేశించింది.

రెండేళ్లకిందట నా మొదటిభార్య గతించింది. సంతానం యేమీ లేదు. కలగనేలేదు.

అరవైయేళ్ల అమ్మగారూ, నలభైయేళ్ల వితంతు సోదరీ, నేనూ—ఇంతే మాయింటో జనం.

నాకు కట్నం అక్కర్లేదు. లాంఛనాలు పనిలేదు. పెళ్లికి నేను ఖర్చుచెయ్యదలచిన—కలిగిన పెద్ద మొత్తం నూరు రూపాయలు.

నా యోగ్యత తమకి అందరికీ నచ్చి, నా స్థితి విషయంలో కూడా సంతృప్తి కలిగితే నేను తమ అమ్మాయిగారిని పెళ్లిచేసుకోవాలని ఆశతో వున్నాను.

నేను రేపు మధ్యాహ్నం రెండు గంటలవేళ తమ దర్శనానికి వస్తాను.

నావిషయంలో తమకి ఆలోచన కలుగుతుందా, లోపలికి రమ్మనండి. లేకపోతే దర్శనమే యివ్వవద్దు.

దర్శనం యిచ్చినీ, తమకి కావలసిన వివరాలన్నీ తెలుసుకోడానికీ, అప్పకు కూడా యిష్టం కలక్కపోతే తిరస్కరించడానికీ నా ఆక్షేపణ యేమీ లేదు.

రాజమండ్రి, ౨౩-౧౧-౧౯౩౫ } ఇట్లు విధేయుడు, సుసర్ల కోటీశ్వరశాస్త్రి."

ఉత్తరం పూర్తిచేసి, కృష్ణవేణి "వారిని మీ రెరుగుదురా నాన్నారూ ?" అని అడిగింది.

"ఎరుగుదును. టెన్నిస్ ఆటలో చాలా నిపుణుడు. నిరు డీవూళ్లో జరిగిన పోటీలో నెగ్గాడు. అతన్ని సత్కరించడానికి విద్యార్థులు చేసిన సభకి నేనే అధ్యక్షత వహించి, విద్యార్థుల కానుక నూరు రూపాయల టెన్నిస్‌బాటు నా చేత్తోటే యిచ్చాను."

"అమ్మ యేమంటుందో ?"

"ఈ వుత్తరం ఆమె కూడా చూసింది. ఆస్తి బొత్తిగా తక్కువ అంటుంది మీ అమ్మ. అయినా పూచీ మనయిద్దరిమీదా వుంచుతోంది."

కృష్ణవేణి మొగం వంచుకుంది.

"అతను వస్తానన్న వేళ కావచ్చింది. నీవుద్దేశం యేమిటి తల్లీ ?"

"ఎల్. టీ. అంటే అయి యెన్నాళ్లయి వుంటుందో వూహించారా ?"

"తెలుసు."

"అప్పణ్ణుంచీ స్థిరమైన వుద్యోగం దొరకలేదన్నమాట."

"అంతే."

"వారి రూపురేఖ లెరుగుదును. మరుక్కైనవారే. ప్రతిభావంతులనే అనుకున్నాను. మీ కేమీ ఆక్షేపణ లేకపోతే దర్శనం యివ్వవచ్చు."

"వారు కోనసీమస్వాములు. ఆలోచించావా ?"

"అయినా ! వారికి ముందు మనవరతులు నచ్చాలి కదా ?"

"సరే."

"దర్శనం యివ్వండి."

"ప్రస్తుతం అమలులో వున్న లాలో యెక్కడా లేని పాయింట్లు యెత్తుతారు వారు."

"జడ్జీ అనాధ అయితేనూ. అంతేనా నాన్నారూ ?"

యాజులు చిరునవ్వు నవ్వాడు.

"నా అభిప్రాయం అమ్మకి చెప్పి, ఆమె యిష్టపడితేనే దర్శనం యివ్వండి నాన్నారూ."

"అలాగే నమ్మా."

ఇలా అంటూ యాజులు లోపలికి వెళ్లాడు.

కృష్ణవేణి ఉత్తరాల పని ముగించి, టేబిలుమీద వున్న యేలకిపం డొకటి వొలిచి నోట వేసుకుంది.

ఇంతలో యాజులూ, రాధమ్మ అక్కడికి వచ్చారు. అప్పుడే నౌకరు వచ్చి అతని కొక చీటీ యిచ్చాడు.

అది కోటీశ్వరశాస్త్రి విజిటింగు కార్డు.

"రమ్మను" అని యాజులు నౌకరుతో చెప్పాడు.

"ఆస్తి బొత్తిగా తక్కువమ్మా" అంది రాధమ్మ.

"బుద్ధివుంటే అదీ అక్కర్లేదు" అంది కృష్ణవేణి.

ఇంతలో కోటీశ్వరశాస్త్రి వచ్చి నమస్కారం చేశాడు. అందరూ లేచారు. యాజులు స్వాగతం చెప్పి "అలా దయచెయ్యండి" అని కుర్చీ చూపించాడు.

అందరూ కూచున్నారు.

యాజులు ప్రారంభించాడు.

"కట్నంవిషయం మీరు పూర్తిగా తెలుసుకున్నారా?"

"అది తమ రందరూ ప్రిన్సిపలుగా స్థిరపరుచుకున్నట్టు నేను స్పష్టంగా తెలుసుకున్నాను. నాకున్నూ ఆ ప్రిన్సిపలు యిష్టమే."

"నాకు కృష్ణవేణి వొక్కర్తే సంతానం. నాఆస్తి కంతికీ ఆమే ఉత్తరవారసు. నేను దత్తత చేసుకో దలుచుకోలేదు."

"చిత్తం."

"నాది రెండు లక్షల రూపాయల ఆస్తి. బతికి వున్నంత కాలమూ నాకు పెద్ద పెన్షను వస్తుంది; కాని యిందులో మీ కేమీ స్వాధీనపడదు."

"ఇష్టపడ్డాను."

"మీ కిప్పటి కింకా స్థిరమైన వుద్యోగం లేదు. ఉద్యోగంకోసం మీరు మరోచోటికి వెళ్లవలసిన అవసరం కలగవచ్చు; కాని మా అమ్మాయి యీ వూరు విడిచి యెక్కడికీ రాదు."

"అది కొంచెం కఠినమైన షరతే. అయినా ఇష్టపడ్డాను."

యాజులు కృష్ణవేణమ్మకేసి చూడగా ఆమె అందుకుంది.

"నేనొక పాఠశాల నడుపుతున్నాను. స్త్రీల జీవితానికి విలువ కలిగించాలనే వుద్దేశంతో అది నడుపుతున్నాను. నా జీవితం దానికోసం ధారపొయ్యాలని నా వ్రతం."

"సంతోషం."

"ఒకటి, నాభర్త. రెండు, నా తల్లిదండ్రులు. మూడు నా పాఠశాల. నా ప్రేమా, శ్రద్ధా ఈ మూడు వస్తువులమీదా యథార్థంగా వినియోగపరుస్తాను."

"బోధపడింది. చాలా సంతోషం."

"భార్య అంటే బానిస కాదు. సమానభాగస్వామిని. నాహక్కులు నేను పూర్తిగా అమలు పరుచుకుంటాను."

"మీ ధోరణి బోధపడింది. అంగీకరించాను."

"భర్తవెంపువారిని నేను భక్తితో పూజిస్తాను. అయితే: వారు నన్ను ప్రేమిస్తేనే ఇది జరుగుతుంది."

"సరే."

"అవసరం వచ్చిం దని నాకు తోచినప్పుడు గృహిణికి వుండవలసిన అధికారా లన్నీ నేను దఖలు పరుచుకుంటాను."

"అలాగే చెయ్యవచ్చు."

"సభలకి వెళ్లడమూ, పురుషులతో కలిసికూడా కూచోడమూ నాకు అలవాటుంది."

"ఒప్పుకున్నాను."

"నేనొక్కర్తెనే పొరుగూళ్లు వెళ్లడం కూడా వుంది. ఇకముందున్నూ వెళ్లవలసిన అవసరం వుంటూనే వుంటుంది."

"వెళ్లవచ్చు."

కృష్ణవేణి తల్లికేసి చూసింది. రాధమ్మ అందుకుంది.

"మీ అమ్మా, మీ అక్కా రజస్వల అయిన పిల్లచేతి అన్నం తింటారా?"

"రెండు పూట్లా వారే వంట చేస్తారు. మీ అమ్మాయి పొయ్యిదగ్గిరికి వెళ్లవలసిన అవసరం కలగదు. అలాంటి అవసరమే వస్తే అప్పుడు సిద్ధపడుతామన్నారు."

"మరి తతిమ్మా సంగతులు?"

"అవును. మేము అనుకోని కొత్త సంగతులు కొన్ని యిప్పుడు వచ్చాయి. అవేవీ వారికి సంబంధించినవి కావు. అయినా వారితో చెబుతాను. అంగీకరిస్తారనే నా నమ్మకం"

కృష్ణవేణీ, రాధమ్మ యాజులుకేసి చూశారు. అతను "మీరు బాగా ఆలోచించుకుని కబురుచెయ్యండి" అన్నాడు.

"మా అమ్మ, మా అక్కా సాయంత్రం అయిదు గంటల కిక్కడికి వస్తారు. మూడు వంతులు వారు సమ్మంధం స్థిరపరచడానికే వస్తారు. నేను మాత్రం మన స్ఫూర్తిగా అంగీకరించాను."

అందరూ లేచారు.

కోటీశ్వరశాస్త్రి మళ్లీ నమస్కారం చేసి, సెలవు పుచ్చుకుని వెళ్లిపోయాడు.

※

సాయంత్రం సరిగా అయిదుగంటల వేళ కోటీశ్వరశాస్త్రి తల్లీ, సోదరి రాజమ్మ వచ్చారు. రాధమ్మ వారిని, రోడ్డుమీద బండిదగ్గిరికి వెళ్లి ప్రత్యుత్థానంచేసి యింటోకి తీసుకువెళ్లి చాలా మర్యాదలు చేసింది. ఆమె నిరాడంబరతా, కలుపుకోలుతనమూ వారికి చాలా ఆశ్చర్యం కలిగించాయి.

కొంచెంసేపు కూచున్న తరవాత రాధమ్మ వారికి కూతుర్ని చూపించింది. ఇల్లంతా చూపించింది. కాలింగుబెల్ వాయించి యాజుల్ని పిలిపించింది.

యాజులు రాగా అందరూ లేచారు.

మళ్లీ కూచున్నారు.

యాజులు రిస్టువాచీ చూసుకున్నాడు. అది కనిపెట్టి రాజమ్మ తల్లితోడ గిల్లింది.

"అన్నయ్యగారూ! మా అబ్బాయి ఇక్కడి సంగతులన్నీ చెప్పాడు. మా కేమీ ఆక్షేపణ లేదు. మా స్థితిగతులు మా అబ్బాయి చేప్పే వున్నాడు. తమకి అంగీకారం అయితే ముహూర్తం స్థిరపరిపించవచ్చు" అంది ముసలమ్మ.

యాజులూ, రాధమ్మా, కృష్ణవేణీ ఒకరి నొకరు చూసుకున్నారు. ఆహాలంతా వింత తేజస్సు ఆవరించింది.

"రేపు ఉదయం పురోహితులవారిని మీయింటికి పంపుతా" నన్నాడు యాజులు.

"అత్తయ్యగారూ! మీ అమ్మాయి చేతి అన్నం తినడంమాట తెచ్చారుట మీరు. మే మిద్దరం వుండగా మీ అమ్మాయి వంటచెయ్యవలసిన పనేమిటి? కాక పోయినా, ఆమెని మాతమ్ముడికి చేసుకుంటే వొకటీ, ఆమెచేతి అన్నం తింటే వొకటీనా? ఇంతకీ: పెళ్లి అయాక మేము మీ యింటికి వచ్చి మీరు వడ్డిస్తే భోజనం చెయ్యమూ? కనక ఆశంక మాకూ లేదు, ఆ సందేహం మీకూ వద్దు" అంది రాజమ్మ.

వియ్యపురాళ్లిద్దరూ "ఎప్పటి కెలాగో అలాగ సద్దుకోకపోతే యెలాగండీ?" అంటూ బుగ్గలు నొక్కుకున్నారు.

* * *

డిసెంబరు మూడో తేదీని కృష్ణవేణికీ, కోటీశ్వరశాస్త్రికీ వివాహం అయింది.

తంతు అంతా రెండు గంటలలో పూర్తి అయి పోయింది.

రాధమ్మ, యాజులుగార్లు తమ జీవితకాలంలో తాము చెయ్యవలసిన శుభకార్యం యిదొక్కటే అయినా చాలా నిరాడంబరంగా చేశారు.

ఆవేళ, మధ్యాహ్నం మూడు గంటల వేళ, యాజులు, తనకి పరిచితులయిన వూరిపెద్ద లందరికీ టీపార్టీ యిచ్చాడు.

సాయంత్రం అయిదుగంటలవేళ, రాధమ్మ తనకీ కృష్ణవేణికీ పరిచితురాళ్లయిన స్త్రీల కందరికీ టీపార్టీచేసి పసుపూ, కుంకుమా, పట్టు రైకల గుడ్డలూ యిచ్చి సత్కరించింది.

పాఠశాలలో వున్న వుపాధ్యాయురాళ్లకీ, విద్యార్థినులకూ మాత్రం వరసగా మూడురోజులు రెండు పూటలూ పిండివంటలతో భోజనాలు పెట్టారు.

అంతే.

అయిదో తేదీని పునస్సంధానం. అయిదు, ఆరు, ఏడు లేవు, ఎనిమిదో తేదీ సాయంత్రం కృష్ణవేణిని అత్తవారి యింటికి పంపారు.

౬

"తమ్ముడూ!"

అతనికి మెలుకువ రాలేదు.

"ఒరేయ్!"

పలక లేదు.

"శాస్త్రీ!"

ఎవర్నో!

గట్టిగా పిలిస్తే మరదలికి ఎక్కడ వినపడి పోతుందో అని ఆమె కంఠం నొక్కుకుని మళ్లీ పిలిచి కదిపింది. అతను గోడవేపుకి వొత్తిగిల్లాడు.

మళ్లీ కదుపుతూ, చెవిలో నోరుపెట్టి "వొరేయ్, అబ్బాయీ" అని పిలిచింది.

"అబ్బా!......ఎందుకే?" అన్నాడతను ముసముస లాడుతూనూ. అతని కళ్లు చింతనిప్పుల్లాగ వున్నాయి; కాని మసకచీకట్లో అది ఆమెకి తెలవ లేదు.

"ఏడు గంట లయిపోయిందిరా అప్పుడేనూ"

"ఏమంటావ్?

"నీ పెళ్లాం లేవడమే కాకుండా మొగం కడుక్కుని, స్నానం చేసి—"

"అయితే?"

కాఫీకి నీళ్లుకూడా కాస్తోందిరా?

"పాలూ, పంచదారా, డికాక్షనూ కలిపేటప్పటికి నేను సిద్ధంకాలేనంటావా యేమిటి?"

"బాగానే వుంది. అది స్నానం కూడా చేసి చక్కగా ముస్తీబై కాఫీ పుచ్చుకుంటూవుంటే నువ్వు పాచిమొగంతో—"

"అబ్బ! నువ్వు చంపుతావే"

"ఇలా అయితే నువ్వు లోకువఅయిపోవుట్రా?"

"సింగినాదం కాదూ?"

విసుక్కుంటూ యిలా అన్నాడు; కాని ధైర్యం చాలక లేచి కూచున్నాడు. కళ్లు మాత్రం తెరవలేదు.

"శే. తొరగా మొగం కడుక్కో. అది చన్నీళ్లే పోసుకుంది; కాని నీకు వేన్నీళ్లు కాచాను."

"తొరవు."

"అదెంతసేపు రా?"

"నువ్వు చన్నీళ్లు తోడాటప్పటికి నేను మొగం కడుక్కోలే నంటావా యేమిటి?"

"మరి మంచం దిగు."

"నువ్వు ముందు పదవే."

అతను లేచి బట్ట సవరించుకుంటాడేమో అని రాజమ్మ బయలుదేరింది; కాని గుమ్మందాకా వచ్చి యిట్టే వెనక్కి తిరిగిచూడగా అతను మంచం దిగక పోవడమే కాదు, పైగా మళ్లీ వొరుగుతు న్నాడు

అది చూసి, రాజమ్మ, వొళ్లు మండగా, వొక్క అంగలో మళ్లీ దగ్గిరికి వెళ్లి, సగం వొరిగినవాణ్ణి సగం లోనే పట్టుకుని "వొరేయ్! నీకు బుద్ధి వుందా లేదా? ఇందాకణ్ణుంచి చిలక్కి చెప్పినట్టు చెబుతూవుంటే అంతా అరణ్యరోదనమే?" అని కొంచెం గదిమింది.

"ఇంత పెందలాడే లేస్తే తరవాత నాకు తల నొప్పి వస్తుందే. రోజంతా మత్తుగా కూడా వుంటుంది వెధవది."

"ఏమయినా సరే, తొమ్మిది దయిందాకా పడుకుంటే యిక సాగదు. ఆడదానికి చులకన అయిపోయాడంటే మొగాడు మరి గుడ్డిగవ్వకి మారడు."

కళ్లు మూసుకునే వుండి, వొక్క జోగు జోగి, అంతలో వులిక్కిపడి, కళ్లు తెరుచుకుని "హు...... పద అయితే" అంటూ అతను మంచం దిగాడు. ఇక ఫరవా లేదనుకుని రాజమ్మ గబగబా వెళ్లిపోయింది.

వెడుతూ వెడుతూ ఆమె వంటింటి వసారాకేసి వోరకంటితో చూడగా, కృష్ణవేణి, ఫిల్టరులో వుడుకు నీళ్లు పోసి, పాలగిన్ని అప్పుడే కుంపటిమీద పెడుతోంది.

దీంతో మరీ కంగారెత్తగా, రాజమ్మ, వొక్క దూకున నూతిదొడ్లో అడుగు పెడుతూ వెనక్కి తిరిగి

చూసింది. గూట్లోవున్న గానుగపుల్ల తీసి నోట పెట్టుకుని, శాస్త్రి, కొంచెం తూలుతూ వస్తున్నాడు.

*          *          *

శాస్త్రి పొడిబట్ట కట్టుకునేటప్పటికి, తాను తెచ్చిన తలనూనె చేతులకి రాసుకుని సిద్ధంగావున్న కృష్ణవేణి, అతనికి, నిమిషంలో తల దువ్వేసింది. అతను పట్టు తొడుక్కునేటప్పటికి తుంగచాప పరిచి తానొక చివర కూచుని కాఫీ కలిపింది. అతను కూడా కూచునేటప్పటికి కప్పులో పోసి, కాఫీ చేతి కందించింది.

వీథిలో మోటారు హారన్.

శాస్త్రి వులిక్కిపడి చూశాడు.

"నా కోసం వచ్చింది కారు" అంది ఆమె.

మొదట అతనికి అర్థం కాలేదు; కాని ఒక్క స్పూను కాఫీ చప్పరించాటప్పటికి పాఠశాల సంగతి జ్ఞాపకం వచ్చి "ఊఁహూఁ" అంటూ తల వూపాడు.

"కాఫీ బాగుందా?" అంది కృష్ణవేణి

"చాలా బాగుంది. ఓ మాటు మద్రాసులో పుచ్చుకున్నా నిలాంటి కాఫీ. నాటికి నేడు మళ్లీ దొరికింది."

"చాలా సంతోషం.........రోజూ యిలాగ చెయ్యవచ్చు నన్నమాట........."

".........ఇంకా అడగాలా?.........కాని నీకు శ్రమ........."

"ఇది శ్రమ కాదు, పరిశ్రమ......మీ రుచికి అనుగుణంగా తయారుచెయ్యగలనో లేనో అని చాలా భయపడ్డాను.........నిజంగా బాగుందా?"

ఆమె నవ్వుస్తూ అడిగింది. ఈషదుచ్చలితాలైన ఆమె సీమకమలాల లోఁకులు అతని మనస్సుని వూచేశాయి.

"ముఖప్రీతికోసం చెప్పిన మాట కాదు నాది. అన్నమూ, కూరలూ బాగా లేకపోయినా సద్దుకోవచ్చు; కాని కాఫీ సరిగా కుదరకపోతే మతి పోతుంది...... ......నేను నిజమే చెప్పాను. కాఫీ.........చాలా చాలా బాగుంది."

కృష్ణవేణిమొగమ్మీద ఉత్సాహం లాస్యంచేసింది.

మళ్లీ వీథిలో మోటారు హారన్.

"అక్కా" అని పిలిచాడు అతను గుమ్మంకేసి చూస్తూనూ. రాజమ్మ గుమ్మంపక్కనే పొంచివుండి వింటోంది; అయితే, పిలుపు వినపడేటప్పటికి పిల్లిలాగ పడమటింటి దాకా మునిగాళ్లమీద పరుగెత్తుకు వెళ్లి, అక్కడ గభీమని వెనక్కి తిరిగి, యేదో పనిలో వుండగా పిలుపు వినపడ్డదానిలాగ "పిలిచావా తమ్ముడూ?" అని అడిగింది.

కృష్ణవేణి "ఎందుకూ?" అన్నట్టు చూసింది; కాని అతనని గమనించకుండా "కాఫీ పుచ్చుకుంటున్నారని చెప్పిరా డ్రైవరుతోనూ" అన్నాడు.

"అక్కర్లేదండీ. వదినా, మీరు వెళ్లనక్కర్లేదండీ! తాను వచ్చి హాజరుగా వున్నట్టు రెండుమాట్లు హారన్ వేస్తాడు డ్రైవరు. అంతే."

రాజమ్మ అప్పటికప్పుడే వారి యెదటికి వచ్చింది; కాని మరదలి మాట విని వెనక్కి చక్కా పోయింది.

ఈ మాటు ఆమె గుమ్మంపక్కని పొంచి వుండకుండా, పడమటింటి గుమ్మంలోకి వెళ్లి తలుపు నానుకుని నుంచుంది.

తాను ఆలస్యంగా లేచినందుకే కృష్ణవేణి కొంచెం యిదవుతూ వుంటుం దనుకుంటూ వున్నాడు కనక, శాస్త్రి, కొంచెం తొందరగా కాఫీ పుచ్చుకోసాగాడు.

అది చూసి కృష్ణవేణి "మీరు తొందరపడుతున్నారు. అలాంటి దేమీ అక్కర్లేదు" అంటూ అతని కప్పులో మళ్లీ కాఫీ పోసింది.

ఆమెకూడా మళ్లీపోసుకుంటుందో పోసుకోదో అని చూసి, సందేహం తీరగా, అతను మళ్లీ కాఫీ పుచ్చుకోసాగాడు.

"మధ్యాహ్నం మీకు కాఫీమాట యేమిటీ?"

"......కాఫీహోటల్లో పుచ్చుకుంటాను."

"రావడానికి వీలుండదూ ?........."

"......సైకిలున్నా రానూ పోనూ రెండు మైళ్లు.........వచ్చినా, పావకాలంగా కూచుని పుచ్చుకోడానికి వీలుండదు............పుకుకూ మనకూ గొంతుకలో పోసుకుని, వురుకులూ పరుగులూ—ఏమి సుఖమూ ?............"

"పోనీ సైకిలుమీద పాఠశాలనౌకరుచేత ఫ్లాస్కుతో పంపనా ;........."

".........అదికూడా సైకిలు తొక్కగలదా?"

".........తిరుచు నాకారు అదే డ్రైవుచేస్తూ వుంటుంది."

"భేష్షూ !......... కాని ముందుముందు చూసుకుందాం. ప్రస్తుతం వద్దు."

ఇలా అంటూ అతను కప్పు కింద పెట్టాడు.

"సరిపోయిందా?" అంది ఆమె కూడా కప్పు కింద పెడుతూ.

"ఎక్కువే అయింది" అన్నా డతను, చెయ్యీ, మూతీ తుడుచుకోవడానికి జేబురుమాలు తీసుకో పోతూనూ.

అది కనిపెట్టి ఆమె "నీళ్లివిగో" అంటూ అతని చేతిలో కప్పిన్ని పోసి తాను కూడా చెయ్యి కడుక్కుంది

అతను లేచి టేబిలుదగ్గిర నుంచుని సొరుగు లాగాడు

కృష్ణవేణి, నిమిషంలో కప్పులూ, సాసర్లూ, స్పూనులూ కడిగి తెచ్చి బీరువాలో వుంచి, వచ్చి అతని దగ్గిరగా నుంచుని "పాఠశాలకి వెళ్లవచ్చునా?" అని అడిగింది.

అప్పటికప్పుడే వొక యేలకిపండు వొలిచి తన నోట వుంచుకుని వున్న అతను, మరో పండు వొలిచి "సందేహం యెందుకూ ?" అంటూ ఆమె నోటికి అందించాడు.

అప్పుడామె రెండుచేతులతోనూ అతని కంఠం పైనవేసి "ఒక్క నిమిషమేనా వేళ తప్పడం నా నియమానికి ప్రతికూలంగా వుంటుంది. దయచేసి...రేపణ్ణుంచి ......మీరు......" అని సుతారంగా తల ఆడిస్తూ కోకిలకూజితం మందరంలో లీనం చేసింది.

దానికి అతని మనస్సు మొదట గుబగుబలాడి పోయింది; కాని అంతలో దిటవు తెచ్చుకుని, అతను, రెండు చేతులతోనూ ఆమెని పొదివి పట్టుకుని, ఆర్డరు కాగితంమీద ఆఫీసు మొహరు వేసినట్టు ఆమె పెదవుల మీద వొక కమ్మని ముద్దు వుంచాడు.

ఇద్దరూ బయలుదేరి వీధిలోకి వచ్చారు.

మొగుడు మద్రాసులో బి. ఏ. చదువుతూ వుండ గంగల్ల పుట్టింట వున్న యెదటింటివారి ఆడబడుచు, ఎడపిల్లను చంకను వేసుకుని కారు వచ్చినప్పణ్ణుంచీ వీధి గుమ్మంలో నుంచుని వుండి, వారిని చూడడంతోటే గిరుక్కున మళ్లీ తలుపుచాటున నక్కి తొంగిచూడ సాగింది.

కృష్ణవేణిని చూడడంతోటే డ్రైవరు కారు దిగి బయటికివచ్చి, తలుపుతీసి, ఆమె యెక్కి కూచున్న తరువాత మళ్లీ తలుపు వేసి, వెంటనే వెళ్లి తన స్థానంలో కూచుని, స్టార్టుచేసి హారన్ వేశాడు.

కృష్ణవేణి భ్రూవిలాసంతో మొగుడి సెలవు పుచ్చుకుంది.

భోంయిమంటూ కారు వెళ్లిపోయింది.

౨

ఆవేళ మధ్యాహ్నం రాఘమ్మ, యాజులూ, కృష్ణవేణీ యేకబంతిని భోజనాలకు కూచున్నారు. వంటలక్క వడ్డిస్తోంది.

"నిన్నరాత్రి అన్నం నోటికి పోలేదమ్మా" అన్నాడు యాజులు.

"అనుకుంటూనే వున్నాను నాన్నారూ! రాత్రి మా ఆడబడుచు వారికీ, నాకూ యేకబంతిని వడ్డించారు. కాని నాకు కూడా అమ్మా, మీరూ లేకుండా భోజనం చెయ్యడం యెలాగో అనిపించింది. రెండు ముద్దలు కొలకమారింది—"



అధ్యక్ష పీఠమునందుండి ఉపన్యసించుచున్న అధ్యక్షుడు.



పతాక కువందనము చేయుచున్న అధ్యక్షుడు.

మాట పూర్తి కాకుండా "చూశారా?" అంది రాధమ్మ. రాత్రి భోజనం దగ్గిర యాజులికి రెండు మూడుమాట్లు పొలమారింది అప్పుడు రాధమ్మ "అమ్మాయి తలుచుకుంటోం దండీ" అంది. అది కూతురు మాటతో రుజువుచేసిం దిప్పుడు.

"భోజనం చేసినంత సేపూ మీ మాటే అనుకు న్నాను. ఎంతసద్దుకున్నా "నీకులాగ మీ అమ్మ మీ నాన్నా యీపూట - ఈ పూటేమిటి యిక తరుచు సగంసగమే భోంచేసి లేచిపోతారు తెలుసునా?" అని యెవరో గుచ్చి గుచ్చి అన్నట్టే వుందండీ"

"నాకేమమ్మా? నేను కడుపునిండానే భోజనం చేశాను. మీ అమ్మ మీగడ పెరుగు మానేసి, చేసినమజ్జిగ పోయించుకుంది. సుభద్రమ్మ (వంటలక్క) ముందే నాకు పాలు పోసేసింది. లేకపోతే మీ అమ్మ పెరుగు మానేసినందుకు నేను కూడా పాలు మానేస్తును."

"అవునటే అమ్మా?" అంది కృష్ణవేణి చురుగ్గా చూస్తూనూ.

"అబ్బే లేదమ్మా! రాత్రి కొంచెం అజీర్తిగా వుండి పెరుగు మానేశాను. అంతే. మీనాన్న మరీనూ మాటమీదమాట యిట్టే అల్లేస్తారు."

"వొట్టిదమ్మా! మీ అమ్మ చెప్పిం దంతా అబద్ధం. ఆమెకి అజీర్తి సుతరామూ లేదు. నాకు బాగా తెలుసు. నువ్వు బంతిని లేకపోవడం-పైగా నువ్వు నీ యింటికి వెళ్లిపోవడం - రెండూ తప్ప మీ అమ్మకి అజీర్తీ లేదు, మరేమీ లేదు."

"అయితే మీకుమాత్రం లేదా యేమిటి రెండూ?" అంది రాధమ్మ చురచుర చూస్తూ.

"నాకూ వుంది. ఎక్కువగా కూడా వుంది; కాని నీది తల్లిప్రాణం"

రాధమ్మ యీ మాటతో మనస్సు కలికేసిన ట్టయింది.

"సమ్మంధాలు రానంతసేపూ "అయ్యో యెలాగమ్మా" అనిపించేది. గిరాకైన సమ్మంధం తిరిగిపోతే ప్రాణం పోయినట్టయింది. ఆస్తి తక్కువయినా మళ్లీ యేదో సమ్మంధం వచ్చి స్థిరపడగా కొండయెక్కిన ట్టనిపించిందిం. కార్యం నాలుగురోజులూ వుబలాటం వురకలు వేసింది. నిన్న సాయంత్రం దాని యింటికి అది వెళ్లాటప్పటికి — వొక అయ్య చేతిలో పెట్టాక —"

రాధమ్మ మరి మాట్లాడలేకపోయింది. కళ్లల్లో బాష్పజలం గిర్రున తిరిగిపోయింది. పెదవులు రాలేక కల్లాకల్లాడిపోయాయి.

ఆమెస్థితి చూశాటప్పటికి యాజులుకళ్లున్నూ చెమ్మగిల్లాయి.

ఆ యిద్దర్నీ చూసి కృష్ణవేణి —

ముగ్గురూ భోజనాలు మానేసి పీటలికి చేరబడ్డారు.

ఇదంతా చూస్తూవున్న సుభద్రమ్మ తటాలున ముందుకి వచ్చి "ఆడపిల్లని కన్నవాళ్లకి యిదే బాధండీ బాబుగారూ! నానాబాధలూపడి పెంచి వొకరి యింటికి పంపెయ్యడం — కానయితే యిది యెవరికీ తప్పందే. మంగళకరం కాని యిది మరోటి కాదు కూడానూ కాని చెయ్యిపెట్టి కలిచేసినట్టయిపోతుంది మనస్సు. మా అమ్మాయి కాపరానికి వెళ్లిన కొత్తలో నేనూ యిలాగే బాధపడ్డాను. తరవాత అలవాటయిపోయింది. అమ్మాయి ఆరేళ్లనుంచి చనువు కావడంవల్ల నిన్న రాత్రినుంచీ నాకూ యెలాగో వుంది కన్నకడుపు మీమాట చెప్పే దేమిటి? అవతలివారు వారిని నెత్తిమీద పెట్టుకున్నా మనకి కండలో కండ కోసినట్టు—అమ్మాయీ! మీరు భోంచేస్తే గాని మీ అమ్మ మీ నాన్నా మరి మెతుకు ముట్టరు. చారు తెమ్మంటారా, పులుసా?" అని అడిగింది.

దీంతో అందరూ ప్రకృతిలో పడ్డారు.

భోజనాలు సక్రమంగా అయినాయి.

*　　*　　*　　*

కారు దిగి కృష్ణవేణీ, యెదటింటినుంచి వస్తూ రాజమ్మ వొక్కమాటే గుమ్మం యెక్కాకు.

"ఎక్కణ్ణుంచి యిదినా?" అంది కృష్ణవేణి.

"ఎదటింటివారి అమ్మాయికి పెళ్లివారు వచ్చారు. చూద్దామని వెళ్లగా యిప్పటిదాకా కూచోపెట్టారు"

"పెళ్లికొడుకువయస్సెంత?"

"పదహారో యేడు మొన్ననే వెళ్లిందిట"

"పెళ్లికూతురికి వుండవలసిన యీడేనా లేదు కదా అప్పుడే యేం పెళ్లండీ ఆ పిల్లాడికి?"

"పూరికే, సమ్మంధాలు వచ్చి మీద పడిపోతూ వుంటే యేం చేస్తారూ? రెండు మాసాలలో యిది నాలుగో సమ్మంధం. కాకపోయినా, వారు శాస్త్ర ప్రకారం నడుచుకుంటారు. పిల్లా కితండ్రి వేదశాస్త్రాలు చదువుకున్నవారు; గాని వుద్యోగస్థులు కారు."

"అంత చిన్నతనంలో పెళ్లి చెయ్యడానికి శాస్త్రం వొప్పుకోదే? అయినా పెళ్లికూతురి వయస్సెంత?"

"మొన్ననే తొమ్మిదో యేడు-"

"ఛీ ఛీ!"

కృష్ణవేణి శాంతింగా మాట్లాడలేకపోయింది.

"అవతలివారు మనుష్యులా రాక్షసులా వదినా? కన్న కూతురి గొంతుకు కోసెయ్యడానికి చేతు లెలా వస్తాయండీ వాళ్లకి?"

రాజమ్మ మాట్లాడలేకపోయింది. అప్పటికప్పుడే వారు పడమటింటి దగ్గిరికి వచ్చారు.

తుంగచాప పరుచుకుని ముసలమ్మ అక్కడ కూచుని వుంది. ఆవిడ ఆదరంతో "రా అమ్మా" అని కోడలిని ఆహ్వానించి, కూచో మని చాప చూపించి "ఏమయిం"దని కూతురి నడిగింది.

"కట్నం ఆరువేలకి దమ్మిడీ తగ్గ మన్నారు అవధానులుగారు. ఆడబడుచులికి ఆరుగురికీ ఆరు వందలూ, వియ్యపురాలికి రెండు వందలూ, తాపితాలూ వెండి సామానూ-వీటి కోసం పెళ్లికొడుక్కి మూడువందలూ-మొత్తం లాంఛనాలు వెయ్యన్నాట పదహార్లడిగారు."

"బాగానే అడిగారు..........అవును. వారికేం లోటూ? పదివేలయినా అడగతగ్గవారే"

"కొడుకుని అమ్మకోడానికి ఏ శాస్త్రం అధికారం యిచ్చిందో అవధానులుగారికి? అంది కృష్ణవేణి.

"డబ్బు వచ్చేచోట శాస్త్రం పట్టుకు కూచుంటారా యేమిటి యెవరేనా? ఆయన ఆరుగురు అల్లుళ్లకీ ఆరువేలు కట్నం యిచ్చారు. అదంతా యీ వొక్క కొడుకు పెళ్లికి రాబట్టా లని నిరుపుచేసుకున్నారు. వస్తుంది కూడానూ. వారికేం, రాక, ముప్ఫయి నలభై వేలు వడ్డీమీద తిరుగుతూ వుండగానూ? పైగా వొక్కగా నొక్క కొడుకు. ఆరుగురు కూతుళ్ల వెనక గారాల కూచమ్మ"

"చివరకి యెలాగేనా కూచమ్మే అయిపోతాడు ఆ పిల్లాడు. అయితే, యీ ఆస్తి అంతా అవధానులుగా రిలాగే సంపాదించా రనుకుంటాను. ఎందుకు వచ్చిన చదువు? ఎందుకు వచ్చిన యేళ్లు? ఆరు వేలు కట్నమా? అవతలివారు దింకో యేట్లో కలిపోవలసిందేనా?"

"వారికేం? వారికీ యాభైవేల వడ్డీవ్యాపారం వుంది."

"అదే కృత్తా వారికి?"

"బెజవాడలో పెద్ద బరండు షాపు వుందిట వారికి"

"సెబాస్! చాలా బాగుంది వదినా! జపంచేసు కోడానికి అవధానులుగారి కిక సీసాలతోటే సప్లయి. బహుశా, మొగపెళ్లివారిలో ఆడాళ్లకీ మొగాళ్లకీ కూడా మనిషికి రోజుకి వొక సీసా చొప్పున దాహం యివ్వా లని కూడా అవధానులుగారు కోరే వుంటారు. ఛీ! ఎందుకు వచ్చిన బ్రాహ్మణ్యం వదినా? ఆపెళ్లి మాట చెప్పుకుంటే మన నోళ్లు కూడా చెడిపోతాయి పూరుకోండి."

నోరెత్తలేక రాజమ్మ వీధిగుమ్మం కేసి చూసింది. అదేమిటో అని కృష్ణవేణి అలా చూడగా, గుమ్మంలో

నుంచే కోటు తీసేసుకుంటూ కోటీశ్వరశాస్త్రి వస్తున్నాడు.

కృష్ణవేణి, వెంటనే లేచి, యెదురువెళ్లి, ఆ కోటు అందుకుని, మొగుడితో కూడా గదిలోకి వెళ్లింది.

"కట్నం అనేటప్పటి కెంత కోపం వచ్చిందో చూశావా?" అంది సన్నని గొంతుకతో రాజమ్మ, కళ్లు తిప్పుకుంటూనూ.

"పోనీలే. బి. ఏ. చదివినా అబ్బాయి కనపడేటప్పటికి యెదురువెళ్లి కోటు అందుకుంది. పాడు కట్నం పోనిస్తూ" అంది ముసలమ్మ.

"కట్నం విలువ నీకేం తెలుసునూ; ఎక్కడో జల్లిసీమలో పుట్టి యెగిరివచ్చి మాయింటో పడ్డావు."

"పోదూ నేర్చుకుపోయావూ"

"పోతా నోయ్! డబ్బు చేదా యేమి టమ్మా? ఎందుకూ, శమ్మొడు తొందరపడిపోయాడు. అయినా—"

మాటపగంలో సబ్బూ, తువ్వాలూ పట్టుకుని కృష్ణవేణి యివతలికి వచ్చింది. శాస్త్రి, మొగం కడుక్కోడానికి నూతిదగ్గిరికి వెళ్లాడు. ఒక్క అడుగు అక్కడే నుంచుని, తరవాత, కృష్ణవేణి వెనకాలే వెళ్లింది.

"మామ్మే, మాతల్లే! ఆలస్యం అయినా, నా కొడుక్కి చివరికి రత్నం దొరికింది" అని ముసలమ్మ బ్రహ్మానందపడింది.

"రత్నమే. సందేహం లేదు; కాని ఆరత్నం తాపడం చేసుకోడాని కివతల బంగారం వుండవద్దూ?" అని రుంజుమంటూ అడిగింది రాజమ్మ.

౨

రాజమ్మ సత్యాగ్రహం తలపెట్టింది; కాని మార్గం కనపడ్డం లేదు.

ముసలమ్మ కొడుకు అదృష్టానికి మురిసిపోతోంది. కాని "ఇంకో కడుపు వచ్చింది కాదు కోడలికి" అని మాత్రం కొంచెం యెడపుతోంది.

అతను స్కూలుకి వెళ్లాటప్పుడూ వచ్చాటప్పుడూ కారు సప్లయి చెయ్యనందుకు కృష్ణవేణిమీద శాస్త్రి మనస్సులో అసంతృప్తి పొటమరిస్తోంది.

సరిగా యీ సమయంలో మునిసిపల్ కౌన్సిలుకి కొత్త యెన్నికలు జరిగాయి.

పాతవారు కొందరు దేవిడీమన్నా పొందారు. కొత్తవారు కొందరు దిద్దుకు దిద్దుకు దివాణంయెక్కారు.

గుప్త విరమించగా, నాయుడు చెయిర్మన్ అయినాడు.

నిశ్చల మైన తటాకంలో రాయిపడ్డట్టయింది. ఒకప్పుడు, నాయుడు, డిస్ట్రిక్టు మున్సబీకోసం ప్రయత్నిస్తూ యాజులుసిఫార్సు కోరాడు. నిజానికి, యాజులికి, సర్కారులో మంచి పలుకుబడే వుంది; కాని అతను స్వయంకృషివల్ల పైకి వచ్చాడు. అత నెప్పుడూ యెవరిచేతా సిఫార్సు చేయించుకోలేదు, వొకరికి చెయ్యనూ లేదు. అతి నీ సంగతి చెప్పి నాయుణ్ణి పంపేశాడు.

నాటికీ, నేటికీ నాయుడు హైకోర్టువకీలుగానే వుండిపోయాడు.

కాని యిప్పుడు మునిసిపల్ చెయిర్మన్.

*　*　*　*

వేసవి సెలవులు పూర్తిఅయి ఆవేళే మునిసిపల్ హైస్కూలు తెరిచారు.

కృష్ణవేణీ, కోటీశ్వరశాస్త్రీ, రాధమ్మా, యాజులూ బెంగుళూరినుంచి సపరివారంగా మద్రాసు మెయిలు దిగారు.

ఆదరా బాదరా స్నానం చేసి, నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని, పెన్సిల్ బాటు హాండిల్ బారుకి తగిలించి శాస్త్రి దర్జాగా సైకి లెక్కాడు.

కాని స్కూలులో అడుగుపెట్టాటప్పటికి అతని నవనాడులూ కుంగిపోయాయి.

ఎవరి స్థానంలో అతను ఆక్టింగు చేస్తున్నాడో ఆపెద్దమనిషి, తనకి సెలవు అవసరం లేదని చెయిర్మ

నుకు విన్నవించుకుని, ఉత్తరువు పొంది, తన సీటులో తాను కూచుని వున్నాడు.

పైగా, గొప్ప పిల్లని పెళ్లిచేసుకుని తనకి బహుమతీ యివ్వనందుకు గుర్రుగా వున్న నూకాలు నౌకరు ఆస్థితిలో అతనికేసి చూచి వెటకారంగా నవ్వాడు.

*　　*　　*　　*

"కానయితే నువ్వు మహా పొంగిపోయావు; గాని నీ కోడలి పాదం మంచిది కాదు."

కొడుకువుద్యోగం పోయినందుకే విచారిస్తూ వున్న తల్లిదగ్గిరికి వచ్చి రాజమ్మ, యెత్తిపొడుస్తూ యిలా అంది.

కోడల్ని తన కూతురు యిలా అన్నందుకు కూడా ముసలమ్మ చాలా విచారించింది.

"దాన్నలా అనకే. ఎన్ని వేల సంవత్సరాలు తపస్సు చేస్తే మన కలాంటి పిల్ల దొరుకుతుందే?"

"తపస్సు కూడా చెయ్యాలి యినప్పగజ్జల తల్లి కోసం? ఇనప్పెట్టిలో రెండు లక్షల కరుకు లున్న తండ్రిచేత నిక్షేపంలాంటి మొగుడికి వొక్క దమ్మిడీ అయినా కట్నం యిప్పించలేకపోయింది. తన మొగుడికి కట్నం రావడమే తనకి గొప్పో, రాకపోవడమే గొప్పో గ్రహించలేకపోయింది. దాని మూలంగా యేదో చిక్కు వస్తుం దని నే నప్పుడే అనుకున్నాను. సరి, రానే వచ్చింది."

"ఆరు నెలల కిందట అది వస్తే —"

"ఆ రేమిటి, తొంభయ్యారేమిటి, నువ్వెన్ని చెప్పినా సరే, నీకోడలు వాతమ్ముడికి తలిగాదు గాని మరొకటి కాదు. పండుగులకి యేవో జామారు గుడ్డలు తప్ప అత్తవారివల్ల వొక్క దమ్మిడీ – గుడ్డిగవ్వ యెరుగునా తమ్ముడు? తమకి మూడు మేడలున్నాయి కదా, మన కొకటి కాపరంవుండమనేనా యివ్వకూడదూ? ఏ మిచ్చినా తమ కూతురికే వుంటుంది; గాని మన వొళ్లో పడదు గదా? ఆరాణీగారికోసమే గదా తొమ్మిది రూపాయల కొంప విడిచిపెట్టి యీ పదిహేనురూపాయల యిల్లు మనకి కట్టుకున్నాము? పైగా, అగరువత్తులు, సెంట్లు – తాంబూలానికి తుని ఆకులే గాని పనికి రాకపోయె —"

"తన సరదాకొద్దీ అవన్నీ అబ్బాయి తెస్తున్నాడు; కాని అది తెమ్మని నిర్బంధించిందా యేమిటే పాపం?"

"నువ్వేరుగుదువు పాపం"

"..................."

"నీమాటలు వింటే నాకు వొళ్లు మండుకు పోతోంది"

"..............."

"పోనీ, అదలా వుంచు. ఇప్పు డేమిటి దారి?" రాజమ్మ నిలకతీసి అడిగింది.

"నే నేం చెప్పగలనే?" అని ముసలమ్మ నెత్తీ నోరూ బాదుకుంది.

తల్లికేసి వురిమి చూస్తూ మరో నిమిషం బుస్సలు కొట్టి కొట్టి, రాజమ్మ, తమ్ముడి దగ్గిరికి వెళ్లిపోయింది.

ముసలమ్మకి దిక్కు తెలవలేదు. "దాన్నంటే పాపం వస్తుంది" అని వొకవేపున. "ఏమో: అమ్మాయి చెప్పినట్టు దాని పాదం మంచిదికా దేమో" అని మరో వేపున.

*　　*　　*　　*

"మనకి మెరుపుదీపం వద్దండీ" అంది కృష్ణవేణి.

"మరి నీ చదువూ, రాతా సాగవద్దూ?" అని అడిగాడు శాస్త్రి. రాత్రిళ్లు అత నేమీ చదవడు. రాయడు కూడాను.

"నాకు హరికేన్లాంతరు చాలు" అంది ఆమె.

"నీ యిష్టం"

"అగరువొత్తులూ, సెంట్లూ కూడా తేవద్దనుకొన్నాళ్లు"

"సరే"

"తునిఆకులు మానేసి, ద్రాక్షారం ఆకులు తెస్తూ వుండండి యిక"

" అలాగే "

" ............... "

" ఇంకా యేమిటి ? అన్నట్టు చూశాడతను.

" మా నాన్నారి నడిగి డబ్బు తెస్తా " నని ఆమె అనలేదు. " అనవేం? " అని వొళ్లు రవలబెట్టుకున్నాడతను.

*   *   *   *

శాస్త్రి హితకారిణీ హైస్కూలు కమిటీవారి దగ్గిరికి నాలుగు వారాలు తిరిగాడు. అయిదో వారంలో ఆరు వారాల ఆక్టింగుపని యిచ్చారు వారు.

జీతం నెలకి యాభై రూపాయలు.

ఒక నెల కడిచింది.

ఒకనాడు పొద్దున్న తొమ్మిదిన్నర గంటల వేళ మునిసిపల్ హైస్కూలులో పని చేస్తూ వున్న వొక స్నేహితుడు వచ్చి " నువ్వు ఆక్టింగు చేసిన పోస్టు మళ్లీ కాళీ అయిందోయ్ " అని చెప్పాడు.

శాస్త్రి స్తబ్ధుడై పోయాడు.

" నాకో, మళ్లీ సెలవుపెట్టనన్నాడు? "

" ఇక మళ్లీ యీపనిలో ప్రవేశించడు "

" ఏం? "

" ఇన్సూరెన్సు పనిలో నెలకి నూట యాభై కిడుతున్నాయట. తెలుగుజిల్లాలకి ఒక బ్రాంచి ఏర్పడుతుందనీ, అతను బ్రాంచి సెక్రెటరీ అయిపోతాడనీ అనుకుంటున్నారు "

"కావాలి. ముమ్మాటికీ కావాలి. చాలా సంతోషం"

"ఈమాటు నువ్వు గట్టిప్రయత్నం చెయ్యాలి. నీ మామగారిని పంపి మంత్రిదగ్గిరనుంచి ఘాటైన వుత్తరం తెప్పించవోయ్"

"తప్పకుండానూ " అన్నాడు శాస్త్రి.

యాజులునియామకం శాస్త్రి యిప్పటికీ మెరగడు.

" పోనీ నువ్వు కూడా యేదేనా యేజన్సీ చూసుకోరాదూ?" అన్నాడు స్నేహితుడు సైకిలెక్కబోతూనూ.

" వెధవ యేజన్సీలు పోనిస్తూ. తిండీ తిప్పలూ లేకుండా రాత్రీ పగలూ నానాఅపహాస్యం మనుష్యులనూ ఆశ్రయించి దేవుళ్లాడాలి అయినా పని జరుగుతుందని నిశ్చయం యేమిటి? జీతం తక్కువయినా, టీచరుపని అయితే కడుపులో చల్ల కదలకుండా—పరిగెత్తి పాలు తాగడం కంటే నుంచుని నీళ్లు తాగడం మంచిది. పైగా, టెన్నిస్ ఆడకపోతే నాకు నిద్రాహారాలు సయించవు. ఇన్సూరెన్సు ఏజన్సీ పుచ్చుకుంటే దర్జా అయిన టెన్నిస్ బాటు విడిచిపెట్టి వెధవకాగితాలు మొయ్యాలి గాడిదలాగ "

" గుడ్ బై " అంటే "గుడ్ బై" అనుకుని యెవరి స్కూలుకి వారు వెళ్లిపోయారు.

సాయంత్రం ఆరు గంటల వేళ " ఇందుకోసం వెడుతున్నా " నని రాజమ్మతో మాత్రం రహస్యంగా చెప్పి, శాస్త్రి, చెయిర్మన్ దర్శనానికి బయలుదేరాడు.

గుమ్మం దిగాటప్పటికి నీళ్లబిందె బుజాన పెట్టుకుని పదహారేళ్ల బంగారుబొమ్మ యెదురు వచ్చింది.

" మంచి శకునం. తొరగా అడుగు వెయ్యి" అని తొందర పెట్టింది రాజమ్మ.

నాళంవారి సత్రం దగ్గిరికి వెళ్లాటప్పటికి పొద్దుటి స్నేహితుడే యెదురుపడి, శాస్త్రిని చూసి సైకిల్ దిగాడు.

శాస్త్రి కూడా దిగాడు.

" ఎక్కడికోయ్ " అన్నాడు స్నేహితుడు.

"అక్కడికే" అన్నాడు శాస్త్రి.

" లాభం లేదు "

" ఏం ?"

శాస్త్రి యీ వొక్క అక్షరమూ సరిగా పలకలేకపోయాడు.

"ముందు మరొకడికి ఆర్డరు ఇచ్చే తరవాత సెలవు మంజూరు చేశాడు చెయిర్మను."

"ఏమిటీ?"

శాస్త్రి అప్రయత్నంగా సైకిలుకి చేరబడ్డాడు.

"తన మేనమామ అల్లుడికిచ్చాడు చెయిర్మను ఆపోస్టు. మరి పోతా, అవతల కనిపెట్టుకుని వుంటారు. ఇప్పటికే అరగంట ఆలస్యం అయిపోయింది."

గంట గణగణ లాడించి స్నేహితుడు తుర్రు మన్నాడు.

తన స్కూలులోనే స్కూలుఫైనల్ తరగతి చదువుతూవున్న వొక బాలికను అతను ట్యూషను.

౬

శాస్త్రి, పదిహేను రోజుల కిందట బియ్యపు బస్తా అరువుతెచ్చాడు. బజారులో వస్తూ వుంటే వర్తకుడు పిలిచి కొంచెం నిష్ఠూరంగా మాట్లాడాడు.

మరో పది అడుగులు ముందుకి వచ్చాటప్పటికి యింటియజమాని కనపడి "మా మాట మరిచేపోయారు. రెండు మాసాల అద్దె బకాయిపడిపోతే యివ్వడం కష్టం కాదూ? పైగా, యిప్పుడు మీకు ఉద్యోగం కూడా లేదుట కాదూ?" అని విసిగించి విడిచిపెట్టాడు.

దీనికి సాయం, క్లబ్బులో, ఆవేళ యెంత బాగా ఆడినా టెన్నిస్ ఆటలో అతను చాలా లీగా డయి పోయాడు.

అక్కడ అదీ. ఇక్కడ ఇదీ. అదివరకే కల్లోలంగా వున్న అతని మనస్సు దీంతో గజిబిజి అయి పోయింది.

లక్ష ఆలోచనలతో, కోటి విచారాలతో అతనింటికి వచ్చాడు.

లోపల అడుగుపెట్టాటప్పటికి "టెన్నిస్ బాటూ, కోటూ ఇవ్వండి"- అని అడుగుతూ కృష్ణవేణి యెదురువెళ్లింది; కాని అతను "అక్కర్లేదు" అని కొంచెం దురుసుగా జవాబుచెబుతూ గదిలోకి వెళ్లి పోయాడు.

కృష్ణవేణి తెల్లపోయింది. పది నిమిషాల పాటు ఆమెకి దిక్కులు తెలవలేదు.

తరవాత, ఆమె కాళ్లీడ్చుకుంటూ గదిలోకి వెళ్లింది.

ఏమో ఆలోచిస్తూ పడకకుర్చీలో కూచుని వున్న శాస్త్రి, ఆమెను చూడడం తోటే గభీమని లేచి యివతలికి బయలుదేరాడు.

"మాట" అని పిలిచింది ఆమె.

అక్కడే నుంచుని, మొగం మాత్రం వెనక్కి తిప్పి "ఎందుకూ?" అన్నా డతను.

"మీతో మాట్లాడవలసివుంది. పది నిమిషాలు మీ రింటో కూచోవాలి" అంది ఆమె ఆజ్ఞాద్యోతకమైన స్వరంతో.

కృష్ణవేణి మంచాని కొక చివర ఆనుకుని నుంచుని వుంది. శాస్త్రి, వెళ్లి రెండో చివర ఆనుకుని నుంచుని "కూచో నక్కర్లేదు. అదేమిటో చెప్పు" అన్నాడు.

"మీరు చిరాకుగా కనపడుతున్నారు"

"అవును. మన స్థితి బాగా లేదు. చాలా గందరగోళంగా వుంది"

"ఏం?"

"ఉద్యోగం పోయింది. మళ్లీ దొరికే సూచన లేమీ లేవు. దారి కనపడ్డం లేదు"

"నాతో యేమీ చెప్పడం లే దేమీ?"

"నువ్వేమేనా తీరుస్తావా ఆరుస్తావా?"

వెనకా ముందూ ఆలోచించకుండా అత నిలా అనేశాడు.

కృష్ణవేణికి మనస్సు చివుక్కు మంది. కొంచెం కోపం వచ్చింది.

"దాపరికాలు నా కిష్టం లేదు. మనస్సులోనే కుమిలిపోవడం నా పద్ధతి కాదు. నా సంగతి మీకు మొదటే స్పష్టంగా చెప్పాను"

"అయితే యిప్పుడేమంటావూ?"

"మీ కష్టాలు మీ అక్క తీరుస్తారా? నాతో మీ రేమీ చెప్పనక్కర్లేదూ? ఈ యింటి యాజమాన్యంతో ఆవిడ కేమి సమ్మంధం వుందీ?"

"ఈ యింటికి యజమానురాలవు నువ్వే; కాని సంసారం యిప్పుడు ఆవిడ పోషిస్తోంది. ఏ సంగతీ ఆవిడతో చెప్పక తప్పదు ఆవిడతో ఆలోచించక తప్పదు. ఆవిడ సలహా పుచ్చుకోక తప్పదు. ఆవిడ చెప్పినట్టు కూడా నడుచుకోక తప్పదు"

శాస్త్రి కొంచెం వుద్రేకంతో మాట్లాడాడు బుద్ధిపూర్వకంగా ఆమెయెడల తిరస్కారభావం కనపరిచాడు.

ఆమెకి చాలా కోపం వచ్చింది; కాని వోరిమి తెచ్చుకుని వూరుకుంది.

ఒక్క క్షణం రెప్ప వెయ్యకుండా చూసి శాస్త్రి యివతలికి వచ్చేశాడు.

కృష్ణవేణి మొదలునరికిన చెట్టులాగ మంచం మీదికి పడిపోయింది.

ఎప్పుడు పిలిచారో, ఎవరు పిలిచారో శాస్త్రి తాపితా కట్టుకుని వంటింటిలోకి వెళ్లాడు. అప్పటివాకా ముసలమ్మో, రాజమ్మో యెవరు మడి కట్టుకుంటే వారు ఆమెనీ, అతన్నీ యేకబంతికి పిలిచేవారు. వా రిద్దరూ వెళ్లి భోజనం చేసి వచ్చేవారు.

అలాంటిది, ఆవేళ శాస్త్రి వొకడే పెళ్లి పీట మీద కూచున్నాడు. తొంగిచూడగా పీటా, విస్తరీ శాస్త్రి కొక్కడికే పరిచివున్నాయి. వంట ముసలమ్మే చేసినా రాజమ్మ వడ్డిస్తోంది.

విస్తుపోయి, కృష్ణవేణి, చీకట్లో పడకటింటి అరుగుమీద కూచుంది.

లోపల ముసలమ్మ యేదో అడగడమూ, రాజమ్మ కసిరికొట్టడమూ వినపడ్డాయి. "కొన్నాళ్లదాకా నువ్వేమీ మాట్లాడకమ్మా" అని విసుక్కుంటూ శాస్త్రి అన్నమాట మాత్రం స్పష్టంగా వినిపించింది.

* * * *

"ఒరేయ్ శాస్త్రీ" అంటూ శాస్త్రి చిన్నమేనమామ వీధితలుపు తోసుకుని లోపలికి వచ్చాడు. "ఇలా రావయ్యా బుల్లి మామా" అని శాస్త్రి లోపలికి పిలిచాడు. "ఒక్క క్షణం దాటిపోయింది. అయితే, నీకు దేవతార్చన లేదు కాదూ? లేచి మడి కట్టుకో" అంటూ రాజమ్మ కాళ్లు కడుక్కోడానికి నీళ్లిచ్చింది.

"నీదయవల్ల నాకు దేవతార్చన లేదు; కాని నేను భోజనం చేసే వచ్చాను—"

మాటసగంలో అందుకుని రాజమ్మ తమ్ముడి కేసి చూస్తూ "చూశావా?" అంది; కాని శాస్త్రి కేమీ కనపడలేదు. ఏమీ బోధపడలేదు.

"నువ్వు కులాసాగా వున్నావా పెద్దక్కా?" అని ముసలమ్మని కుశలప్రశ్న.

"ఉన్నాను. పిల్లలూ మరదలూ కులాసాగా ఉన్నారా?" అని మారుప్రశ్న.

"ఏమిరా, ఎవర్నీ పిలవకుండానే పెళ్లి చేసుకున్నావూ?"

"తొందరయిపోయింది మామా"

"కాకపోయినా, యింతోటి పెళ్లికీ బంధువులు కూడా రావాలి. కట్నాలా కానుకలా?"

రాజమ్మ యీసడిస్తూ అడగడం చూసి ముసలమ్మ తహతహ లాడిపోయింది.

"ఏమిరా బొత్తిగా కట్నం లేకుండా చేసుకున్నావుటా?"

"అప్పటి కలా తోచిం దయ్యా"

"అదో తెలివితక్కువ మాట" రాజమ్మ దురుసుగా అందుకుంది.

"కట్నం యివ్వకూడ దని వారికి వ్రతంట. అంటే పీటలమీద చదివించ దనుకున్నాం గాని తర వాత యేదోవిధంగా ముట్టచెప్ప దనుకున్నాము. యే మిటి? ఎనిమిదో నెల వెళ్ళ వస్తోంది యీ క్షణానికి వొక్క దమ్మిడీ యెరగం; కాని రజస్వల అయిన పిల్లని చేసుకున్నందుకు శని మాత్రం చుట్టబెట్టుకుంది. కాక పోతే, నువ్వెప్పుడేనా అక్కడాఅక్కడా భోజనం చెయ్యడం వుందా యీ వూరు వచ్చి?"

"శని అంటే యేమిటి గానీ, నావంటి చావ స్తపువాళ్ల మాట కేం గాని వుద్యోగం ఖాయం అయిందా?"

"అసలు వుంటే గదా?" అన్నాడు శాస్త్రి.

"అదే" మన్నాడు మేనమామ.

"ఏముహూర్తాన మళ్లీ పెళ్లయిందో గాని మా వాడికి, అప్పణ్ణుంచీ మాకు కష్టాలే వస్తున్నాయి. తమ్ముడికి వుద్యోగం ఆఖ రయింది. మళ్లీ దొరకలేదు. దొరికే దారి కూడా లేదు. ఏదో వచ్చి పడిపోతుం దని తొమ్మిది రూపాయల యిల్లు విడిచిపెట్టి పదిహేను రూపాయల యింటో పడ్డాను రెండు మాసాల అద్దె బాకీ. చేతిలో దమ్మిడీ లేదు"

శాస్త్రి భోజనం అయింది. మేనల్లుడూ మేన మామా వీధిఅరుగుమీదికి వెళ్లి కూచున్నారు.

• • "మరి వడ్డిస్తున్నాను, నీకోడల్ని పిలుచుకో వమ్మా" అంది రాజమ్మ.

ముసలమ్మకి అప్పటికే నడుం విరిగిపోయి వుంది. కూతురు ధోరణి చూసి "యేదో మునుగుతుంది" అని ఆమె భయపడుతూనే వుంది.

కొడుకు రాజమ్మ చెప్పిన ట్లల్లా నడుచుకోవడం ఆమె కిష్టం లేదు; కాని ఆమెమాట ఎవరూ లక్ష్య పెట్టరు.

లక్ష్యపెట్టడందాకా యెందుకూ? ఇప్పుడు వెళ్లి కోడల్ని పిలుచుకు రాకపోతే కూతురు చీపురు తిరగ వేస్తుంది.

జడుస్తూ జడుస్తూ బయలుదేరింది.

"అమ్మా! కృష్ణవేణీ" అని పిలిచింది ఆమె వొణుకుతూను.

"అమ్మ బొమ్మనూ" అని లోపల రాజమ్మ సణుక్కుంది.

"ఎందుకండీ అత్తా?" అంటి కృష్ణవేణి లేచి నుంచుని.

"భోజనానికి రా తల్లీ"

"నేను భోజనం చెయ్యను. వెళ్లి మీరు ఫల హారం చెయ్యండి"

"ఏ మమ్మా?"

"మీకే తెలుసు. ఇక నన్ను మాట్లాడించకండి అత్తా"

"బతిమాలడానికి నీ అబ్బసొమ్మేమీ లే దిక్కడ" అంటూ రాజమ్మ పళ్లు కొరుక్కుంది.

కళ్లల్లో నీళ్లు కుక్కుకుంటూ, తూలిపోతూ లోపలికి వెళ్లి కంఠం గద్గద మయిపోగా మాట చెప్పలేక ముసలమ్మ కూతురుకేసి మిసుకూ మిడుకూ చూసింది.

"చెప్ప నక్కర్లేదు, నువ్వు కూడా" అని గదిమి, రాజమ్మ, తల్లి విస్తరిలోనూ, తన విస్తరిలోనూ వుప్పు పిండి వడ్డించి, తల్లి చెయ్యి ఆనక కుమిలిపోతూ వుండగా నిర్విచారంగా తాను ఫలహారం ప్రారంభించింది.

తొమ్మిదిన్నర అయాక మేనమామను సాగ నంపేసి శాస్త్రి వచ్చి, మంచంమీద గోడవేపుకి తిరిగి పడుకున్నాడు.

తరవాత పది నిమిషాలదాకా చూసి, దీపం తగ్గించి, తలుపులు అలా తెరిచే వుంచి, కృష్ణవేణి, తుంగచాప పరుచుకుని పడుకుంది.

ఆరాత్రి తెల్లవార్లూ ముసలమ్మకి నిద్ర లేదు. వూరు మాటుమణిగాక కూతుర్ని లేపి సంగతిసందర్భా లడగాలని మహా అనుకుంది; కాని గుండెలు తాళలేదు.

## ౧౦

ఆ వేళ పౌర్ణమి. పాఠశాలకి సెలవు. అయినా, కృష్ణవేణి స్నానం చేసి దుస్తులు ధరించాటప్పటికి కారు వచ్చింది. "కాఫీ చేసుకుని పుచ్చుకోకపోతుందా" అని రాజమ్మ వోరకంటితో చూస్తూనే వుంది; కాని కృష్ణవేణి ఆవిషయమే తలుచుకోలేదు.

ముసలమ్మ, రాజమ్మ దొడ్డికి వెళ్లడం చూసి, కోడలిదగ్గిరికి గబగబా వెళ్లి "ఏ మమ్మా, కాఫీ పెట్టుకున్నావు కావేం?" అని జాలిగా అడిగింది.

"పుచ్చుకోతలుచుకోలేదు అత్తా" అని బదులు చెప్పింది కృష్ణవేణి.

"ఏం తల్లీ?"

"నిన్న రాత్రి భోజనంకంటే యెక్కువా అత్తా యీపూట కాఫీ?"

"మా అమ్మవు కావూ, మా తల్లివి కాదూ? నీ సం చేస్తుం దమ్మా! నేను కుంపటి అంటిస్తాను నువ్వు తొందరగా కాఫీ చేసుకో అమ్మా! చేసుకోకపోతే నన్ను చంపుక తిన్నట్టే."

"నేను పుచ్చుకోను అత్తా!"

దంతధావనం చేసుకుని మొగం తుడుచుకుంటూ శాస్త్రి, సరిగా యీసమయంలో అక్కడికి వచ్చాడు. కృష్ణవేణి వీథిలోకి వెళ్లి కారెక్కింది.

కొడుకు పెడసరంగా మాట్లాడతాడని తెలుసు; కాని ముసలమ్మ వూరుకోలేకపోయింది.

"కాఫీ పుచ్చుకోకుండా వెడుతోందిరా" అంది ముసలమ్మ ఆత్రంగా.

"ప్రపంచం తల్లకిందులు కాదులే" అన్నాడు శాస్త్రి నిర్లక్ష్యంగా.

"అయ్యో! కొంప ముంచుకుంటావు ట్రా?"

"ఇంతమాత్రానికేనా?"

"నిన్నరాత్రి అన్నం కూడా తినలేదురా పాపం."

"ఏమిటో?"

శాస్త్రికి కంగారు ప్రారంభం అయింది. వీథికేసి చూశాడు. కారు అప్పుడే కదిలింది. అతనికి కాళ్లు వొణికాయి.

"నిక్షేపంవంటి పిల్లరా నాయనా! తగువులు పెంచుకోకురా. మాట పడే మనిషి కాదురా అదీ. భాగ్యవంతుల పిల్లకావడం అలా వుండగా నీతో సమానంగా చదువుకుందిరా, అయినా తెగనీలుగు లెరగదురా."

మాటకి అడ్డు వచ్చి "అక్క యేదీ" అన్నాడు శాస్త్రి.

ముసలమ్మ నూతిదొడ్డికేసి చూసింది. రాజమ్మ వస్తోంది.

"నిన్న రాత్రి కృష్ణవేణి భోజనం చేసిందిటే అక్కా?"

"లేదు."

"ఏం?"

"కోపం వచ్చింది కాబోలు...ఆకలే లేకపోయిందో?"

"అయ్యో!" అంటూ నోరు నొక్కుకుంది ముసలమ్మ.

తల తాటించుకుంటూ "ఏమిటా వేషం?" అంటూ రంజుకుంది రాజమ్మ.

"నాతో చెప్పావు కాదేమే అక్కా?"

"ఇప్పుడేం వచ్చిందీ?"

"కాఫీ అయినా పుచ్చుకోకుండా వెళ్లిపోయింది"

"మానుతుం దనుకున్నావా యేమిటి? అక్కడ యెన్ని నీళ్లు తాగుతుందో" మూతి బిగించుకుని అడిగింది ఆమె.

"అయ్యో, అయ్యో" అని లోపలే అనుకుంటూ ముసలమ్మ నింపాదిగా గుండెలమీద కొట్టుకుంది. రాజమ్మ అందుకు కూడా మళ్లీ చర్రు మంది.

"తెగేదాకా లాసతావే నువ్వు" అన్నాడు శాస్త్రి చేతకానితనం చూపిస్తూనూ.

"ఈ మాత్రం భాగ్యానికే కంగారు పడిపోతున్నావా యేమిట్రా నువ్వు? మంచి మొగాడవే? ఇలా అయితే అది నీకు లొంగుతుందా?"

"నువ్వు లొంగావా?" అని తనలో నే అనుకుంది ముసలమ్మ.

"చాలా దూరం వెడుతుంది వ్యవహారం" అన్నాడు అతికష్టంమీద శాస్త్రి.

"తెగతెంపులు చేసుకుని వెళ్లిపోతుం దంటావా?"

శాస్త్రి మాట్లాడలేకపోయాడు.

"ఒక్క నాటి కలా చెయ్యదు. నాలుగు రోజు లుంటుంది యీ బెట్టుసరీ. తరవాత అది వచ్చి నీకాళ్ల మీద పడకపోతే నన్ను ఛీ అను. నువ్విప్పుడు బింకంగా ఉండకపోతే యెర్రని యేగాని అయినా పూడి పడదు."

"నాయనా! ఎవరికి కోపం వచ్చినాసరే నే నొక్కటి చెబుతా విను" అని మొదలుపెట్టింది ముసలమ్మ. "నీ రోజులు బాగా లేవు. అందుచేతే నీ వుద్యోగం పోయింది. ఈ సమయంలో కుటుంబకల్లోలం కూడా తెచ్చిపెట్టుకొంటివా, నీకు మతిపోతుంది. పైగా కోడలిదగ్గిర నువ్వు తప్పు చూపించలేవు. వీథికి వెడితే నలుగురూ నిన్నే అంటారు. నీసంగతిసందర్భాలు తెలవకుండా అంత ఆస్తి వారు నీచేతిలో పెడతారట్రా? ఇంత వూళ్లో యేదో నౌకరీ సంపాదించుకోలేకపోతే అది నీచేతకానితనం అనిపించుకోదట్రా? లైటు మానుకుందా? సెంట్లూ అగరువత్తులూ వద్దందా? అది ఎక్కడికక్కడికే సర్దుకునే మనిషి కాని దేనికైనా నిన్ను యిబ్బందిపెట్టిందిట్రా పాపం? రోజూ నీబంతికి పిలుస్తూ హఠాత్తుగా నిన్న రాత్రి మానేస్తే దానికే చిన్నతనం గాదుట్రా? నువ్వు భోజనం చేశాటప్పుడు మామతో జరిగిన సంభాషణ అది విని వుంటే ఎంత తప్పూ కాదు?"

"ఏమీ మునిగిపోలేదు. ఈపాటికి కట్టిపెట్టు నీ వుపదేశం" అంటూ రాజమ్మ తల్లిమీద కళ్లెర్రజేసింది. "వారేయ్! తమ్ముడూ! నీకు వచ్చిన భయమేమీ లేదు. నాదీ పూచీ. కాస్సేపటికో కాస్సేపటికో నీ అత్తగారూ, నీమామగారూ వస్తారు. నువ్వు మాత్రం జేలపోకు. కచ్చితంగా మాట్లాడేసెయ్యి. కాపరం చెసిపోతే దానికే చిక్కు; గాని నీ కేమీ యిబ్బంది లేదు" అని ఝుంకారంగా చెప్పింది ఆమె.

శాస్త్రికి ధైర్యం కలగలేదు; కాని రాజమ్మని కాదనలేకపోయాడు.

ముసలమ్మ నూతిదొడ్డోకి వెళ్లి నెత్తీ, నోరూ బాదుకుని కుమిలికుమిలి యేడ్చింది.

తన మాటలు బి. ఏ. చదివినవాడే ఆక్షేపించలేకపోవడంవల్ల తాను సరిగా మాట్లాడా ననుకుని గర్వించింది రాజమ్మ.

* * *

తల్లినీ, తండ్రినీ చూశాటప్పటికి, కృష్ణవేణికి, దుఃఖం వుబ్బెత్తుగా పొంగింది; కాని మానవతి కనక అణిచేసుకుంది. అయినా మొగం డిల్లపోయి వుంది.

కూతుర్ని చూశాటప్పటికి, రాధమ్మకి, మనస్సు, చెయ్యిపెట్టి తిప్పేసిన ట్టయింది. వెంటనే దగ్గిరికి వెళ్లి "అలా వున్నావేం తల్లీ?" అంటూ ఆమె కూతుర్ని పొదివి పట్టుకుంది.

"ఏం యెలా వుందీ?" అని అడుగుతూ యాజులు దగ్గిరికి వచ్చాడు.

పొదివిపట్టుకునే సోఫాదగ్గిరికి తీసుకువెళ్లి కూతుర్ని వొడిలో కూచోపెట్టుకుని, మొగం నిమురుతూ "కళ్లు గుంటలు కట్టా యేమమ్మా?" అని రాధమ్మ అడగ్గా, "అవును, మాట్లాడ వేమమ్మా?" అన్నాడు యాజులు ఆత్రపడుతూనూ.

కృష్ణవేణి వేడినిట్టూర్పు ఆపుకోలేకపోయింది. ఆక్కడికీ ఆమె యింకా ఆవేగం అణుచుకునే ప్రయత్నంలోనే వుంది.

"ఏదో బాధపడుతున్నావు. ప్రయాణ పూర్వకంగా దాస్తున్నావు. మొగం దిగాలుపడిపోయింది. ఎంచేతో చెప్పవూ తల్లీ?" అంటూ పక్కని కూచుని యాజులు లాలిస్తూ అడిగాడు.

"తెల్లవారి లేచి కాఫీ పుచ్చుకోలేదు. నాన్నారూ?" అంది కృష్ణవేణి పెదవులు తడుపుకుంటూను

తల్లీ, తండ్రీ వొక్క మాటే "యెంచేతా?" అన్నారు.

"నిన్న రాత్రి భోజనం కూడా చెయ్యలేను."

ఆమె పెదవులు వొణికాయి. కళ్లుకూడా చెమ్మగిల్లాయి.

ఇక ఆపుకోలేక, ఆమె, కళ్లు మూసుకుని తల్లిని చేరపిలిచింది.

రాధమ్మా, యాజులూ గజగజ లాడిపోయారు.

సరిగా యీసమయంలో సుభద్రమ్మ అక్కడికి రాగా "కాఫీ చేసి తొరగా తీసుకురావమ్మా" అని తొందరపెట్టాడు యాజులు. సంగతి యేమిటో తెలియక కంగారుపడిపోయి వొక్క నిమిషం అలాగే వుండిపోయి తరవాత సుభద్రమ్మ వంటింటోకి పరుగెత్తింది.

తనమీద వొట్టు పెట్టుకుని రాధమ్మ అనేకవిధాల అడగ్గా, కృష్ణవేణి, వొక్కమాటు కళ్లు మూసుకుని తరవాత తెరిచి, తుడుచుకుని "చెబుతాను వుండు" అని మళ్లీ కళ్లు మూసుకుంది.

"చెబుతుంది వుండు. కాస్త కాఫీ పుచ్చుకోనియ్యి" అని రాధమ్మతో అని, యాజులు "ఏం సుభద్రమ్మా! ఇంకా కాలేదూ?" అంటూ వంటింటోకి పరిగెత్తాడు.

"ఒక్క కప్పు కాఫీ వుంది. ఇది పుచ్చుకునే టప్పటికి మళ్లీ చేస్తా" నని చెబుతూ సుభద్రమ్మ యెదురు వచ్చి, అది యాజులుచేతి కిచ్చి మళ్లీ వెనక్కి పరిగెత్తింది.

యాజులు, కప్పు, రాధమ్మచేతి కిచ్చాడు. రాధమ్మ కృష్ణవేణి నోటి కందించింది. కాస్తకాస్త కప్పు తానే పుచ్చుకుని ఆకాఫీ రెండు గుక్కల్లో తాగేసింది.

రాధమ్మ కప్పు పుచ్చుకుని, కింద పెట్టి, కృష్ణవేణి మూతి తుడిచి కంఠం రాసింది.

తరవాత సరిగా కూచుని కృష్ణవేణి జరిగిందంతా చెప్పింది.

రాధమ్మ కొయ్యయిపోయింది. యాజులు అగ్గయిపోయాడు

౧౧

యాజులు, గంటలకొద్దీ తీవ్రాలోచన చేశాడు; కాని కర్తవ్యం తేల్చుకోలేకపోయాడు.

ఎదటింటి పెద్దమనిషి పెద్ద వకీలు. అయితే, ప్రస్తుతం రిటైరై గ్రంథరచనతో కాలక్షేపం చేస్తున్నాడు.

యాజులికీ అతనికీ మంచి పరిచయం వుంది.

యాజులు న్యాయాన్ని పూజిస్తాడు. అక్కడ అతనికి స్వపర భేదం లేదు.

వకీలు ఎదటివారిని పాయింటుదగ్గిర ఆపేస్తాడు. మరి ముందుకి వెళ్లనివ్వడు. అతనికి డొంకతిరుగుళ్లు పనికిరావు. వకాల్తీ చేసే రోజుల్లో ఎదటి వకీలు రోజులకొద్దీ వాదన చేస్తే, అతను పాయింటు మాత్రం చూపించి కొన్ని నిమిషాల్లోనే కూచునేవాడు. యూరపియన్ ఆఫీసర్లందరూ అతన్ని చాలా మెచ్చుకునేవారు.

అంచేతే అతనికీ యాజులికీ కలిసింది.

భోజనాలు కాగానే కృష్ణవేణీ, వకీలూ బయలుదేరారు.

"అమ్మాయి ప్రవృత్తి మీకు బాగా తెలుసు. మనకి నలుగుళ్లు పనికిరావు. మీరు గొడవలు పెరగనివ్వరు. పర్యవసానం కచ్చితంగా తేల్చేస్తారు. అంచేతే మీ సాయం కోరాము. ఎటయినా సంతోషమే; కాని కాఫీ రెండు మాట్లు చప్పరించి, కృష్ణవేణి, త ౹ వ లౌక్యాలు సాగనివ్వకద్దు" వెళ్లాటప్పుడు, యాజులు

ఆపెద్దమనిషికి ఇలా చెప్పాడు. కృష్ణవేణీ వకీలూ కారులో కూచున్న తరవాత అతను స్వయంగా తలుపు వేస్తూ "కృష్ణవేణి మీఅమ్మాయి. మరి వెళ్లి రండి" అంటూ సాగనంపాడు.

అతను ఇంటోకి వచ్చాక రాధమ్మ "యేమవుతుం దంటారూ ?" అని అడిగింది.

"మన అమ్మాయి మన యింటికి వచ్చేస్తుంది."

"కాపరం లేనట్టే?"

"దానివల్ల లేళ మయినా తప్పిందా?"

"ఎక్కడో రాకాసిపీనుగు దొరికిం దండీ ఆశ బడుమా."

"అల్లుడికి బుద్ధి వుంటే ఆఁడ యేం చెయ్య గలమా?"

రాధమ్మ మాట్లాడలేకపోయింది.

* * *

వీరు వెళ్లాటప్పటికి, శాస్త్రీ, రాజమ్మా, మేన మామా వాకట్లో కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

రాజమ్మ గోడచాటుకి తప్పుకుంది.

శాస్త్రి తుంగచాప పరిచి "దయచెయ్యండి" అని వకీలుకి స్వాగతం చెప్పాడు.

కృష్ణవేణి పడకగది గుమ్మంలో నుంచుంది.

"ఏమి సెలవు? ఎప్పుడూ రానివారు దయ చేశారు" అన్నాడు శాస్త్రి వినయం కనపరుస్తూ.

"ఎప్పుడూ రానివాణ్ణే కాని రాకూడనివాణ్ణి కాను. వీ రెవరు?"

"మా బుల్లి మేనమామగారండి."

"నన్ను యాజులుగారు పంపారు. అమ్మాయి పనిమీద వచ్చాను. దాంపత్యధర్మాలు చర్చకి రానివ్వడం విద్యాధికు లైన మీ వంటి యువకులకు సరస మైన పని కాదు."

"ఇప్పు డలాంటి దేమీ రాలేదే?"

"పూర్తిగా వచ్చింది."

"తమకిన్నీ అలా తోచడం ఆశ్చర్యకరమే."

"కాదని మీ నిశ్చయ మైతే నా సందేహాలు తీరుస్తారా ?"

"తప్పకుండానూ."

"కాస్సేపటికో కాస్సేపటికో నీ అత్తగారూ, నీమామగారూ వస్తారు. నువ్వు మాత్రం బేలపోకు, కచ్చితంగా మాట్లాడేసెయ్యి" అని పొద్దున్న రాజమ్మ చెప్పిన మాట అత నిప్పుడు పూర్తిగా నెమరుకు తెచ్చుకుని "మరి అడగండి" అన్నట్టు స్థిరంగా కూచున్నాడు.

వకీలు కంఠం సద్దుకుని ప్రారంభించాడు.

"పెళ్లినాటికి అమ్మాయి కృష్ణవేణి రజస్వల అయి చాలా రోజు లయిం దని మీ కందరికీ బాగా తెలుసు."

"చిత్తం."

"చిత్తం అంటే నాకు చాలదు. సూటిగా చెప్పండి."

"తెలుసు. అంగీకరించాము."

"యాజులుగారు, కట్నం యివ్వ మనీ, లాంఛనాలు కూడా యేమీ యివ్వమనీ, తమ ఆస్తి యే విధంగానూ, యెంతమాత్రమూ మీకు దఖలుపరచ మనీ కచ్చితంగా చెప్పేశారు."

"అవునండి."

"నిన్న రాత్రి, భోజనాల వేళ మీ తోడబుట్టిన ఆమె, మీ మేనమామగారితో మీరెండో పెళ్లి మాట ప్రస్తావిస్తూ "కట్నం యేమీ యిచ్చారు కారనీ, తరవాత యేదో విధంగా ముట్టచెబుతా రనుకుంటే గుడ్డిగవ్వ కూడా రాల్చలే దనీ, పైగా వెలి మాత్రం చుట్టబెట్టుకుం దనీ చాలా దురుసుగా చెప్పారు కారూ ?"

"నే నేమీ అనలేదే ?"

"అది తగ దని ఆవిణ్ణి మందలించారా?"

"అయ్యో," అని మేనమామ అందుకున్నాడు. "అది చిన్నపిల్ల. వీడూ చిన్నవాడే ఏదో పొరపాటు వచ్చింది."

"అయితే, తమరు పూకలేశారా?"

"నా కెందుకు బాబూ వొకళ్ల గొడవలు?"

"నక మీరు వూరుకోండి. శాస్త్రిగారూ! ఏమంటారు?"

"మందలించలేదు."

"ఏమిది రూపాయల యిల్లు పనికిరా దనీ, పది హేను రూపాయ లైనా సరే యీ యింటో ప్రవేశించ వలసిం దనీ అమ్మాయి మిమ్మల్ని నిర్బంధించిందా?"

"లేదు. పెళ్లికి పూర్వమే మే మీ యింటో ప్రవేశించాము."

"పెళ్లి అయింది మొదలు ప్రతీరాత్రీ మీ యింటో, అమ్మాయీ మీరూ ఏకబంతిని భోజనం చేస్తున్నారు కాదూ?"

"నిజమే; కాని యెప్పుడైనా అలా జరక్క పోతే అది తగువా?"

"కారణం వుంటే కాను."

"నిన్న అలాంటి యేర్పాటు లేకపోవడమే కారణం."

"ఏకబంతిని భోజనాలు జరక్కపోవడానికి, నిన్న ఏర్పాటు లేకపోవడమే కారణం. బాగానే వుంది. అయితే అలాంటి యేర్పాటు లేకపోవడానికి కారణం?"

"....................."

"సెల వివ్వండి."

"చెబుతాను కానివ్వండి."

"ప్రతీరోజూ మీ అమ్మగారో, మీ అక్క గారో పిలిస్తేనే వస్తోందా, అమ్మాయి స్వయంగానే వచ్చి కూచుంటోందా?"

"పిలిస్తేనే............"

"అయితే, నిన్నరాత్రి పిలవకపోవడానికి కారణం?"

"నాయిష్టం. నన్ను ఆజ్ఞాపించడానికెవరి కధి కారం వుంది? అసలు నేను వడ్డించకపోతే మాత్రం యెవ రేం చెయ్యగలరూ?" అంది గోడచాటునుంచి రాజమ్మ.

"మా అక్క స్వతంత్రురాలు. ఆవిడ నామీద ఆధారపడివుండలేదు. ఆవిణ్ణి ఆజ్ఞాపించడానికి నాకేం హక్కుంది?" అని శుకానువాదం చేశాడు శాస్త్రి.

"మీ అమ్మగారు వంటింటోనే వున్నారు కాదూ అప్పుడూ?"

"వుంది; కాని ఇద్దకంవల్ల వొకచోట చదికిల పడిపోయింది."

"పోనీ మీరు పిలిచారా?"

"అయ్యో! ఆడదాన్ని మొగుడు భోజనానికి రమ్మని పిలవడం యేమిటండీ?" అన్నాడు మేన మామ.

"మీరు వూరుకోండి. ఒకరి గొడవలు మీ కక్క ర్లేదు........ఏ మంటారు శాస్త్రిగారూ?"

"నేనూ పిలవలేదు. అయితే బొట్టుపెట్టి పిలవ వలసిందేనా?"

"ఇక్కడికి యెనిమిది మాసాలనుంచి మామూలు తప్పకుండా వుండి హఠాత్తుగా నిన్ననే యెందుకు మానేశారూ?"

"సర్దుకోవాలి గాని ప్రతీదానికీ ఆరా తీస్తే యెలా గండీ?"

"అయితే, రాత్రి అమ్మాయి భోజనం చెయ్య లేదని మీకు తెలుసు కాదూ?"

"తెలవదు."

"ఇప్పటికీ తెలవదూ?"

"అది పుట్టింటికి వెళ్లాక తెలిసింది."

"పొద్దున్న కాఫీ కూడా పుచ్చుకోలే దని—"

"అదీ తెలిసింది."

"రాత్రి ఆమె తుంగచాప పరుచుకు పడుకుంది కాదూ?"

"అవును."

"ఏ మని మీరు అడిగారా?"

"నన్ను బతిమాలుకొమ్మంటారా?"

"అనలేదు. జరిగింది చెప్పండి."

"అడగలేదు. అయితే మీ రేంచేస్తారూ?"

"ఏమీ చెయ్యను.........మీ వుద్యోగం పోయిం దని అమ్మాయితో చెప్పారా?"

"చెప్పలేదు."

"మీ అక్కతో చెప్పారు కారూ?"

"చెప్పాను. ఏం, చెబితే?"

"ఏమీ లేదు.........అమ్మాయి మీ కష్ట సుఖాలు తెలుసుకోగూడదనిదా?"

"...................".

"సెల వివ్వండి."

"తెలుసుకో తగిందే."

"మరెందుకు చెప్పారు కారూ?"

"అది నాయిష్టం."

"చిత్తం.........అయితే యిప్పుడు మీ సంసారం మీ అక్క పోషిస్తున్నారు. అవునా?"

"అవును."

"సాయం చెయ్యవలసిం దని మీరు కోరారు. కద్దూ?"

"లేదు. ఆవిడే నాసంగతి తెలుసుకుని చేస్తోంది."

"మీ వుద్యోగం పోయిం దని మీరు చెప్పడం వల్ల తెలిసింది. అంతేనా?"

"అలాగే."

"మీ వుద్యోగం పోయిన సంగతి చెబితే తల్లి దండ్రులను కోరి అమ్మాయి యెంత డబ్బు తెచ్చునో యేమేనా ఆలోచించారా?"

"దేహీ అని యాచించనా?"

"మీరు మాట తప్పిస్తున్నారు. నేను యాచించ మన లేదు. ఉద్యోగం పోయినట్టు చెప్పారా? అన్నా నంతే."

"చెప్పే దేమిటీ? అది చూడ్డం లేదూ?"

"మీ అక్క మాత్రం చూడ్డం లేదూ? ఆవిడకు మాత్రం నోటితో యెందుకు చెప్పారూ?"

"ప్రాణాంతకంగా వున్నాయే యీ ప్రశ్నలు. వీటి కిక అంతం లేదా యేమిటి? బాగానే వుంది ధోరణి" అని విసుక్కున్నాడు మేనమామ.

"అడిగిన కొద్దీ వాజమ్మలాగ జవాబులు చెప్పడ మేనా? గిగ్గా ఖిడియవుగా వుండకద్దూ? కాస్తయినా బుద్ధి లేకపోతే యెలాగా?" అని చాటునుంచి రాజమ్మ కసిరింది.

శాస్త్రికి ఆధానం దొరికింది. "అయ్యా! మీరు పెద్దమనుష్యులే; కాని అనవసర ప్రస్తావన చేస్తున్నారు. నే నిక మీ కేమీ జవాబు చెప్పను" అని ముతి బిగించుకున్నాడు అతను.

"ఇక అక్కర్లేదు. నేను తెలుసుకోవలసినదాని కంటే అధికంగానే తెలిపించారు మీరు" అంటూ వకీలు కృష్ణవేణికేసి చూశాడు.

ఆమె అందుకుంది.

"బాబుగారూ! మీ రూరుకోండి. ఏమండీ! భార్య అంటే దాసి కా దనీ, సమాన భాగస్వామిని అనీ, నాహక్కులు నేను పూర్తిగా అమలు జరుపుకుంటా ననీ మొట్లో చెప్పాను కానూ?"

"అయితే?"

"అవసరం వచ్చిం దని నాకు తోచినప్పుడు గృహిణికి వుండవలసిన అధికారాలన్నీ నేను దఖలు పరుచుకుంటా ననిన్నీ అప్పుడు మీతో చెప్పాను కాదూ?"

"చెబితే?"

"ఇప్పుడు అలాంటి అవసరం వచ్చింది కనక చెబుతున్నాను. ఇది మొదలు మీరూ, నేనూ, మీ అమ్మా తప్ప మన యింటో మరొకరికి వుండడానికి వల్లకాదు."

"నన్ను పొమ్మనడానికి నువ్వెవత్తివే? నువ్వెక్కణ్ణుంచి వచ్చావే?" అని పళ్లు కొరికింది రాజమ్మ.

"మా అక్క అవతలికి వెళ్లిపోవా లంటావా నువ్వు?" అని అడిగాడు శాస్త్రి.

"నుంచున్నపాళంగా" అంది కృష్ణవేణి దృఢ స్వరంతో.

"వెళ్లదు" అన్నాడు అంతకంటే దృఢస్వరంతో శాస్త్రి

"సరే అయితే."

ఇలా అంటూ కృష్ణవేణి వీధికేసి చూసి "డ్రైవర్!" అని పిలిచింది. "వచ్చా నమ్మా" అంటూ అత నొక్క గంతులో అక్కడ ప్రత్యక్షమయినాడు.

మేనమామ వెల్లపోకూడదు. తనని కొట్టేస్తుందో, రాజమ్మని గెంటేస్తుందో అని శాస్త్రి కొంచెం భయపడ్డాడు.

రాజమ్మ కంగారుపడుతూ తొంగిచూసింది.

అప్పుడు కృష్ణవేణి గదిలోకి వెళ్లి తన సామానంతా తెచ్చి డ్రైవరు కందించి "కారులో పెట్టి రావోయ్" అంది.

"ఎత్తం" అని డ్రైవరు నిమిషంలో మళ్లీ వచ్చాడు. "బాబుగారూ, లేవండి" అంది ఆమె. వకీలు వేస్తూ "అబ్బాయీ! మీరు తొందరపడ్డారు. ఇంకా తొందరపడుతున్నారు. చదువుకున్నవారితో యెలా మసులుకోవాలో మీరు గమనించినట్టు లేదు" అన్నాడు.

శాస్త్రి కృష్ణవేణికేసి వురిమి చూస్తూ "ఎక్కడికి వెడతావ్?" అంటూ చొక్కాచేతులు పైకి తీస్తూ గభీ మని నుంచున్నాడు.

"ఓహో! నీకు ఆసరదా కూడా వుందా?" పళ్లు బిగించి తల వూపుతూ అందుకుంది ఆమె.

"అయితే రా. మరి ఆలస్యం యెందుకూ? నేను నేర్చుకున్న జపాన్ కుస్తీకి యిప్పటిదాకా విని యోగం లేకపోయింది."

ఇలా అని కృష్ణవేణి పంజా చాపింది. చొక్కా సర్దుకుంటూ డ్రైవరుకూడా ముందుకి వచ్చాడు.

శాస్త్రి బుస్సలు కొడుతూనే వున్నాడు; కాని కాళ్లు వొణుకుతున్నాయి

మేనమామకి కూచుని వుండగానే కళ్లు భైరవులు కమ్మాయి.

"వోరేయ్! ఇంట్లోకి పోరా, కదల వేమిరా?" అని రాజమ్మ మెల్లిగా కూకలేసింది; కాని శాస్త్రి అంతకి ముందే యేం జరుగుతోందో తెలవకుండానే చదికిలబడ్డాడు.

"నువ్వెంత అనాథవని మే మెవరమూ అనుకోలేదు, సాటి ఆడదాన్ని పెళ్లి చేసుకున్నందుకు నేను చాలా సిగ్గుపడుతున్నాను. ఇక నీ మొగం చూడను. చిక్కులు పెడితే కాపరం వొదులుకుంటుందా అనీ, డబ్బు కట్టుకురాకపోతుందా అనీ ఆలోచించావు; కాని నీవంటి వాజమ్మతోనా కాపరం? బి. ఏ. ప్యాసయి వుండిన్నీ గుడ్డిగవ్వకి మారని నీకా డబ్బిశ్వసం? హిందూలాలో విడాకుల సూత్రం లేనందుకు మురుస్తున్నావేమో; నాకు మొగుడే క్కావా లంటే లక్ష మార్గాలున్నాయి తెలుసా? ఖబడ్దార్! డబ్బుకోసం గడ్డి తింటావా? నమ్మిన భార్యని ద్రోహం చేస్తావా? నీమడా! అక్కా నీతో కాపరం చేసేది పెళ్లామా? ఛీ! పురుగా!" ఇలా అంటూ శాస్త్రిని విసిరి కొట్టి "రండి బాబుగారూ" అంటూ ముందు కృష్ణవేణి బయలుదేరింది.

తరవాత వకీలు బయలుదేరాడు.

డ్రైవరు వెనక్కి తిరిగి చూస్తూ తరవాత వెళ్లాడు.

కారుదగ్గిరికి వెళ్లాటప్పటికి, యెదటింటికి పెత్తనానికి వెళ్లి వుండి, యిదేమీ యెరక్కుండానే— మామూలుగానే యింటికి వస్తూ ముసలమ్మ యెదురుపడింది. వెంటనే కృష్ణవేణి స్లిప్పర్లు దూరంగా విడిచి "అమ్మా, ఇక మీ రెవరో, నే నెవరో" అంటూ ఆవిడపాదాలు ముట్టుకు కళ్ల కద్దుకుని, మళ్లీ జోడు తొడుక్కుని కారులో కూచుంది.

కంగారు అణుచుకుని, గద్గదకంఠంతో ముసలమ్మ యేదో అంది; కాని బదులు మాటూ కారు వెళ్లిపోయింది.

# నిగమశర్మ అక్క

భారతుల పున్నయ్యశాస్త్రి

యాదృచ్ఛికముగ లభించిన శ్రీముఖ సంవత్సర పుష్యమాసపు భారతినిఁ దిరుగవైచుచుండ శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారిచే రచింపఁబడిన 'నిగమశర్మఅక్క' అను వ్యాసమును జదువుట తటస్థించినది.

లక్ష్యభూతముగా కవి దిద్దితీర్చిన నిగమ శర్మఅక్కను లక్షణవాక్యములచే వ్యాఖ్యానమొనరించి పాఠకుల మనంబులకుఁ గవిసామర్థ్యము నిపుణముగ నాటునట్లు శ్రీ శర్మగారు సాహిత్యమాధుర్య ముట్టిపడ నీ వ్యాసమును వ్రాసిరి. ఏసమాటలతోఁ బ్రారంభించి, కసరి కొట్టి, కడుపోపక నిగమశర్మ అక్క కెరలి పల్కిన దనువిషయము వారి వ్యాఖ్యానమునఁ గాక స్వయముగ సామాన్యపాఠకుఁ డవగాహన మొనర్చుకొనలేఁడు. వ్యాఖ్యానములేక "పాపము చేయువారు తిట్లచే నెవ్వడును దమనడత మానరు. మీఁదుమిక్కిలి తిరుగఁబడుదురు" అనువిషయ మెఱిఁగియే నిగమశర్మఅక్క "అలుక మగిడించుకొని, స్వరము మార్చి, సామరస్యము వెలిఁబుచ్చె" నన్నవిషయము మనకుఁ దెలియదు. పౌరుషమున కన్వయించి పురికొల్పుటయు, సౌభ్రాత్రమును జూపి కన్నీరుపెట్టుకొనుటయు, తీవ్రమైన వ్యావహారికదృష్టితో వాదించుటయు, తనవారి తప్పులను క్షమించి సరిపుచ్చుకోఁగల స్త్రీహృదయ మార్దవమును వెలువఱచుటయు, అధర్మము చేసినను అవివేకముగ చేయరాదను సామాన్యన్యాయమును జాటుటయు, దీనముగా వేఁడుకొనుటయు మొదలగు విశేషాంశములు వ్యాఖ్యానము చేయఁబడకయున్న తెలిసికొనుట కష్టతరమేయగును. కావున వారు కవినైపుణ్యమును సులభావగాహన మగునట్లొనర్చిన సాహిత్యసేవకుఁ గృతజ్ఞతావందనములు.

ఇంతనిపుణముగ విశేషాంశముల గుర్తించి వ్రాసిన వీరే వ్యాసాంతమున "అక్క సద్బుద్ధిమాట లాదరించి నిగమశర్మ నాల్గునాళ్లింటిలో వివేకము దెచ్చుకొన్నవానివలె నుండి, యొకనాఁటిరాత్రి చేతికిదొరకిన యింటి సొమ్ముల నెల్ల హరించి మూటఁగట్టుకొని పండుకొన్న పడుకకును జెప్పక పాఱిపోయెను. అప్పు డింట నందరు నేడ్చిరి. వారితోఁ గూడ నక్కయు నేడ్చినది. ఎందు కనుకొన్నారు? తమ్ముడు చెడనేయని కాదు; ఇల్లు మునిఁగెనేయని కాదు; తనప్రయత్నము వ్యర్థమాయెనే యనికాదు; మఱి క్రొత్తగాఁ జేయించుకొన్న ముక్కెర పోయెనే యని దుర్వారమై యడలెనట! పరిహాసము పవిత్రవస్తువునుగూడ గమనింపదేమో!" అనికూడ వ్రాసిరి.

నిగమశర్మఅక్క ముక్కరకై దుర్వారమై యడలినట్లు కవివ్రాయుట ఆయపూర్వామృతమూర్తికి దృష్టిదోషము తగులకుండ ముక్కుపైఁ బెట్టిన మసిబొట్టునుగా శ్రీశర్మగారు భావించిరి. ఇయ్యది దృష్టిదోషము తగులకుండ నుండఁగలందులకై కవికల్పించిన మసిబొట్టుగాని, పవిత్రవస్తువును గమనింపని పరిహాసముగాని కాదనియు, మీదుమిక్కిలి పాత్రయొక్క సహజస్వభావనిరూపణనైపుణ్యమగుననియు నే నీవ్యాసమున నిరూపింపఁ దలఁచితిని.

కవికి నిగమశర్మఅక్కను ఆదర్శప్రాయమైన యొకానొకధీరోదాత్తస్వరూపురాలినిగా జేతపోయవలెనను సంకల్పము లేదు. యథాస్వభావముగ లోకములోని యొకానొక పాత్రను నిరూపించుటయందే యభిప్రాయము. పరానుకరణమే ప్రధానముగాఁ గల యీనాఁటి నాగరికప్రపంచమున నట్టిసర్వవిధసామర్థ్యములుగల యువతులు గాన్పించుట దుర్లభమగునేమోకాని, జాతీయజీవనముగల పల్లెటూళ్లయందలి సంప్రదాయ కుటుంబపు కలిమిగల యాడఁబడుచు లందఱును సామాన్యముగ నిట్టివారే మైయుందురు. నిగమశర్మఅక్క యట్టివారిలో నొక్కతెయే మైయున్నది. ఆమె తనతమ్ముని చెడునడవడిక నెఱిఁగి చక్కదిద్దవలెననుతలంపుతో వచ్చినమాట నిక్కువమేకాని, తాను చెప్పినట్లెల్ల విని తనతమ్ముఁడు తొల్లిటిరీతిని పవిత్రముగ కాఁపుర మొనర్చునని యామె తనయభిప్రాయమును నిశ్చిత మొనర్చుకొని యుండ లేదు. లోకజ్ఞానము మిక్కుటముగాఁ గల యామె యట్లే యనుకొనిన దని మన మనుకొనుట కవకాశ మున్నచో నామె యొకవెఱ్ఱిది యనుట స్పష్టము. ఆమె తననేర్పుకొలఁది తమ్ముని కాముకప్రవృత్తిని మార్పు చేయ ప్రయత్నించుటకుమాత్రమే సంకల్పించుకొనినది; కాదు, నిశ్చిత మొనర్చుకొన్నది. ఆమె కోరిక ననుసరించి యాతఁడు బాగుపడినచో నామెకష్టము సఫల మయ్యెడిది. కాకున్నచో నామెమఱఁదలకుఁ గష్టముగాని ఆమె కేమి? ఆమె యథాప్రకారముగ తనయింటి కేగి యుండెడిది గాని నష్ట మేమియు నుండియుండెడిదిగాదు. తమ్ముఁడు తాను చెప్పినట్లు నడచి యుండిన సంతోషముతో తనయింటికి వెళ్లి యుండెడిది. కానిచో వైమనస్యముతో వెళ్లియుండెడిది. అంతియకాని ముక్కర పోయినదను దుఃఖముతోమాత్రము పోయి యుండెడిదిగాదు. ఆఁడువారికి సహజముగనే సొమ్ములయం దాసక్తి మెండుగా నుండును. అందున నయ్యది యామెకు మిక్కిలి ప్రియమైనదై క్రొత్తగాఁ జేయించుకొనినదై యున్నది. అట్టి పోయినసొమ్మును తిరిగి పుట్టింటి నుండి సంపాదించుకొనుటకు ఆస్తినంతయు నిదివరకే పాడుచేసినైచెను- వర్తమానమునఁ జేయుచున్నాఁడుకూడను. అట్టియెడ తనకింక పుట్టింటినుండి వచ్చుననునాస లేదు గదా! కాన సొమ్ముపోయినందుకై యేడ్చుట స్త్రీసహజము. ఆపరిస్థితి యట్టిది. అది పవి

త్రతను గమనించని పరిహాసము గాదు—విశేషించి స్వభావముయొక్క యథార్థకథ నమే యగును.

తమ్ముఁడు పారిపోయినందులకుఁ గాక ముక్కరపోయినందులకే యేడ్చెననుటచే ఇది 'ముక్కుపైఁబెట్టిన మసిబొట్టు'. అనుకొనుట కవకాశ మేర్పడినది. అవును. తమ్మునిస్థితికై తా నెంతగా వగవవలెనో అంతగా నామె యిదివరకే వగచినది. వగచుటమాత్రమే కాదు- తగినంతగా తనశక్తిని వినియోగించి ప్రతిక్రియనుసైత మొనరించినది. కాని ఫలితము లేకపోయినది. ఇఁక నామె చేయవలసిన శేష మేమియు లేదు. ఆమెవంతు ప్రయత్నించుటవరకే. అది ఆమె చేసినది. "యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః" ఇదియే ఆమెసిద్ధాంతము. కాన తమ్మునిపరారికై యామె యిఁక వగవఁ బని లేదు. వృద్ధజనోపదిష్టులయ్యు కాముకు లెట్లు ప్రవర్తింతురో తుదకు నాతఁడు నట్లే ప్రవర్తించెను. ఈవిషయ మన్నివిధముల బోధ చేసిన యామెకుఁ దెలియ దనుకొనుట మన పొరపాటగును.

కావున నామె తమ్ముఁడు చెడినందుకుఁ గాని, ఇల్లు మునిఁగినందుకుఁగాని తనప్రయత్నము వ్యర్థ మైనందుకుఁగాని, వగవఁబని లేదు. ఇఁక నామె వగవవలసినదెల్ల పోయిన తనముక్కరకైమాత్రమే. ఇయ్యది పవిత్రతను గమనించని పరిహాసము కానేరదు. ఇయ్యది పాత్రల సహజస్వభావ నిరూపణ నైపుణ్య మగును.

పరిహాస మొకింత యిం దున్న దనుకొనిన ననుకొనవచ్చును గాని, యథార్థము మాత్రము లేకపోలేదు.

---

# విశ్వనాథశర్మ

నండూరి బంగారయ్య

"చతుః శ్లోకేన పండితః" యనినట్లు విశ్వనాథశర్మ మాషపంచకము చెప్పి మహాకవి యైనాడు. ఈ మాష పంచకము 'భారతి'లో నిదివరలో ప్రకటించియుండుటచే దీని నిటనుదాహరింపనక్కరలేదు మా శర్మ యిప్పుడు క్రొత్తగ 'పకోడీ పంచకము' ప్రారంభించినాడు. అయిదారు మాసములనుండి యతి ప్రాసలు కుదురక బాధపడుచున్నాడుగాని లేకున్న ఈసరికే ఆ బాంబు పంచకము లోకోపద్రవము కలుగజేసియుండవలసినది.

పక్షితీర్థమని దక్షిణదేశమున నొక మహాక్షేత్రమున్నదని వినుటయేగాని ప్రత్యక్షముగ చూచి యెఱుంగము. దీనికి ప్రత్యర్థిగా మా రాజమహేంద్రవరమున నొక పక్షితీర్థము బయలుదేరుచున్నది. [illegible]తిచంద్రికలోని బూరుగువృక్షమువలె హిందూసమాజ భవనము ఆవరణలో నొక గంగరావి చెట్టు ఉన్నది. ప్రతి సాయంత్రము ఈ చెట్టుపైని పక్షులుచేరి ధ్వని చేయుచుండును. చెట్టుపైకి పక్షులు చేరుట లోకములో నున్నదే. కాని యీ చెట్టు క్రిందకు కూడ ప్రతి సాయంత్రము పక్షులు చేరుచుండును. ఆ పక్షులు కుర్చీలపై కూర్చుండి కూర్చుండిన చోట నుండి కదలకుండగనే విమానయానములో విశ్వమునంతను చుట్టివచ్చును.



వేదూరి విశ్వనాథశర్మ, ఎం. ఏ,

వాస్కోడిగామాకు ప్రపంచయాత్ర చేయుటకు మూడు సంవత్సరములు పట్టినది. ఇటీవల నొక వైమానికుడు అట్లాంటిక్ మహాసముద్రమును పదునెండు గంటలలో దాటినాడని పత్రికలు పెద్ద విస్తారముగ వ్రాసినవి.

కాని మా పక్షులు మూడు నిముషములలో ముల్లోకములు చుట్టి వచ్చును. దీని నే పత్రికలు ప్రశంసింపకున్నవే!

ఈ చెట్టుక్రింద చేరు పక్షులలో నాంధ్ర భీష్ముడని పేరు వడసిన న్యాయపతి సుబ్బారావుపంతులు, కవిసార్వభౌమ బిరుదము స్వీకరించిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రీ, కవిచక్రవర్తిబిరుదమున కిచ్చగింపని చిలకమర్తి లక్ష్మీనరసింహము భూమి పుట్టకముందు పుట్టిన పక్షులు. విశ్వబ్రాహ్మణ మహామండలి కధ్యక్షపదవిని స్వయముగ దత్తముచేసికొనిన శివరాజు రామారావు, కాలయమునివలె గన వచ్చు పాలకోడేటి గురుమూర్తి, విశ్వనాటక కళాపరిషత్తు కధ్యక్షతవహించు సంకల్పముతోనున్న లంక బ్రహ్మన్న సోమయాజులు, సనాతనహిందూమత స్తంభ(Pillar of orthodoxy) బిరుదాంకితుడగు రాచంకొండసుబ్బారావు కొలదిగ వృద్ధాప్యమును సమీపించుచున్న పక్షులు. జయంతి రామయార్యుని పేరు చెప్పకొని మనీషికోటిలో బ్రవేశింప వలెనని చూచుచున్న సోమ శేఖర రావు, భాగవతుల హరిశాస్త్రిగారి వ్యాకరణము నచ్చు వేయించుటకు ప్రయత్నించుటయే మహాఘనతగ నెంచు అభినవపడయాజి సీసు బిరుదాంకితుడగు గాడేపల్లి కృష్ణమూర్తి, పండితులతో సంభాషించుటకు బ్రయత్నించు తాడూరి విజయరామయ్య, ప్రేక్షకమార్తాండ బిరుదాంకితుడగు నేటకంటి శేషగిరిరావు, ఆధునికాంధ్ర సారస్వతాభివృద్ధి యంతయు మా భుజస్తంభములమీద నే నిలచినట్లు ప్రవర్తించు నస్మదాదులు - ఇవన్నియు చిన్న పక్షులు. బి. యె. బి. యల్. పాసయి, పిల్లలను గని ప్రాక్టీసు చేయుచున్నను కొనికింకను చిన్నతనము నదలలేదు. అందుచే చిన్న పక్షు లనవలసివచ్చినది పక్షిలోకమునకు గరుత్మంతునివలె ఈ మాలోకమునకు విశ్వనాథ శర్మ నాయకుడు.

విశ్వనాథశర్మ లేనిదే క్లబ్బులో జీవమే యుండదు. విశ్వనాథశర్మ వచ్చువరకు ఎవరి తెన్నునవారు తలక్రిందుపక్షులవలె తపస్సు చేయుచుందురు. విశ్వనాథశర్మ ప్రవేశింపగనే ఈ పక్షులు చేయు కలకలమునకు మేరలేదు. పక్షితీర్థములోని పక్షులకు పిండప్రదానము చేసినచో పితృదేవతలు తరింతురో తరింపరో నిశ్చయము చెప్పజాలము కాని ఈ పక్షులకు పకోడీప్రదానము చేసినచో తప్పక తరింతురని శర్మ సిద్ధాంతము. అందుచే వారమున కొక్కసారియైన ఎవరినో ఒకరిని యిబ్బంది పెట్టి శర్మ చెట్టుక్రింద పకోడీప్రదానము చేయించుచుండును.

హరివంశమంతటి గ్రంథము రచించిననే గాని నాచన సోమునకు సర్వజ్ఞ బిరుదము లభించినదిగాదు. కాని ఎవ్వరో రచించిన పద్యములో రెండు పాదములు మాత్రము స్వనామాంకిత మొనర్చుకొని విశ్వనాథశర్మ సర్వజ్ఞుడైనాడు.

క॥ సర్వజ్ఞ నామధేయము
శర్వునకే విశ్వనాథశర్మకె తగురా.

అని తనకు తానే ప్రచారమొనర్చుకొనుచుండును.

హాస్యముమాట యటుండగ నిజముగ విశ్వనాథశర్మ సర్వజ్ఞుడే. సారస్వతములో గాదు సైన్సులోగాదు చరిత్రపరిశోధనములో గాదు ఆయుర్వేదములోకాదు షడ్దర్శనములలోకాదు చతుర్వేదములలోకాదు వేదాంతములోగాదు ఆతడు వ్రేలుపెట్టని విషయము లేదు. ఏవిషయమును గూర్చి యాతడు మాటాడుచున్నను ఆవిషయమునందు విశేష కృషి సలిపినాడా యనునంత దిగ్భ్రమము కలిగించుచుండును. వేదములో కొన్ని పనసలు ఏకరువు పెట్టగలడు. అటు తిక్కన మొదలుకొని ఇటు వేదము వేంకటరాయ శాస్త్రివరకు తెనుగుకవిత్వ మంతయు నెల్లూరినే ఆశ్రయించుకొనియున్నదను గట్టినమ్మకము గలవాడు. తంజావూరి పుస్తకభాండాగారమునుగూర్చి గంటలకొలది యుపన్యసింపగలడు. ఎక్కడను ఎవ్వరికిని దొరకని పుస్తకములు కొన్ని తనయొద్ద నున్నవని యాతని నమ్మకము. ఎవరైన పెద్దలువచ్చి సమాజములో నుపన్యసించినపుడు ఉపన్యాసము మధ్యనో చివరనో ఒకటి రెండు ప్రశ్నలువైచి వారితో పరిచయము గల్పించుకొనుచుండును. వారు ప్రత్యేకకృషి సలుపుచున్న శాస్త్రమునకు బనికివచ్చు గ్రంథము లేవో తనయొద్ద నున్నవని చెప్పుచు అవి వారి కిచ్చెదనని వాగ్దానముచేయుట నేను స్వయముగ నెఱుగుదును. ఇక సైన్సులో - బడిలో పిల్లలకు పాఠము లెట్లుచెప్పవలెనో నేను చెప్పజాలనుగాని - ఎప్పటి కప్పుడు నూతన విషయములను సేకరించుకొనుచుండును. హిందూదేశమునందు ఇండస్ట్రియల్ అభివృద్ధికి తోడ్పడవలెనని చాల కుతూహలము గలవాడు. చరిత్రపరిశోధనలో కీర్తిశేషులగు కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారికి కుడిభుజమై నిల్చినాడు. వారు విజ్ఞానసర్వస్వ సంపాదనోద్యమమునకు ఎంతశ్రమపడవలసి వచ్చెడిదో ఆతడు చెప్పుచుండగ వినవలయును. ఒక్కటేమిటి, పురాణములను గూర్చి, వేదములనుగూర్చి, వేదాంగములను గూర్చి, వేదాంతమునుగూర్చి. నవీనశాస్త్రములను గూర్చి సాధారణసంభాషణలో శర్మ చక్కగ నుపన్యసింపగలడు. గిరీశము చెప్పినట్లు "ఆతనితో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషను."

మాశర్మ రసాయనశాస్త్రములో పండితుడందురు. అగునో కాదో నిశ్చయము చెప్పలేముగాని ఇతరులను ప్రేమించుటయందును ఇతరులప్రేమను సంపాదించుటయందును ఈతనికున్న పాండిత్యము మరియొకరికడ సాధారణముగ గానము ఎంత ముఖమెరుగనివానితో నైనను ఒక్కనిముషములో "భాయిభాయి" స్నేహము చేయగలడు వృద్ధులతో గలసి భగవద్గీతాభాష్యము చదువగలడు. చిన్నలతో గలసి చీట్లాడగలడు. పక్షులతో గలసి పకోడీలు తిన

గాడు. గౌరవమునకు గౌరవము; లాఘవమునకు లాఘవము; హాస్యమునకు హాస్యము.

పై కెవ్వరి లక్ష్యములేని యహంభావస్వామివలె గానవచ్చినను లోపల నతి వినయపరుడు. పెద్దలను పూజించుటయందీతని కభిరుచి మెండు. శ్రీ చిలకమర్తిలక్ష్మీనరసింహముగారి షష్టిపూర్తి సంకల్పించి మహోత్సాహముతో జయప్రదముగ నిర్వహించిన దీతడే. అదివరలో శ్రీ పిఠాపురము మహారాజావా రెన్నోసారులు నరసింహముగారిని కర్పూరమంజరి రెండవభాగము వ్రాయవలసినదనియు ప్రహ్లాదచరిత్రము నాటకముగ వ్రాయవలసినదనియు వేడియు విఫలప్రయత్నులయిరి. కాని శర్మ మాత్రము "ఈ రెండును మీరు వ్రాయవలసిన"దని శాసించి వారవి ముగించిన వెనుకగాని షష్టిపూర్తికి సంకల్పము ప్రారంభింపడాయెను. అటుతరువాత వ.సు. రాయకవిసన్మానము జరపెను. ఇటీవల జాషువాకవిని గూడ సత్కరించి ప్రాచీనులయందేగాక ఆధునికులయందు గూడ తనకున్న యనురాగమును వెల్లడించెను. ఈ సన్మానోత్సవములలో పాలకోడేటి గురుమూర్తికికూడ వాటాయున్నది. కాని పంపకము దావా లేకున్నచో నావాటా తేలునని తోచదు.

శర్మహృదయము నవనీతమునంటిది. అయితే మొదటిసారి యాతనితో సంభాషించినవారికిమాత్ర మది గోచరింపదు. నేను విశ్వనాథశర్మను మొట్టమొదట ౧౯౩౨-వ సంవత్సరములో గలసికొంటిని. అప్పటిలో నేను యూనివర్సిటీలో నేదో యుద్యోగము నిమిత్తము ప్రయత్నించుచుంటిని.

విశ్వనాథశర్మ సెనేటులో నుండెను. నా మిత్రుడు మున్నంగిశర్మకు విశ్వనాథశర్మకు ప్రాణస్నేహము. అప్పటికి నేను విశ్వనాథశర్మ కపరిచితుడను. మున్నంగి శర్మ యొద్దనుండి యుత్తరము పుచ్చుకొని విశ్వనాథశర్మను చూచితిని. అప్పటిలో శర్మ సంభాషణవైఖరి యిప్పటికిని నాకు జ్ఞప్తి యున్నది. "నాకీ యుద్యోగముతో నేమి సంబంధము" అని కొట్టవచ్చినట్లుగ మాటాడినాడు. "సాయముచేసిన చేయవచ్చును. మానినమానవచ్చును. నీ పుణ్యమాయిరి. నన్నుమాత్రము కొట్టకు" అని లోపల ననుకొని యింటికి వచ్చితిని. కాని తరువాత నాతనితో పరిచయము స్థిరపడినకొలది నాయభిప్రాయము మారినది.

ఎందరో బీదవిద్యార్థులకు శర్మ గుప్తదాన మొనర్చుచుండును. ఎవరైన కష్టపడుచున్నచో చూచి సహింపలేడు. అనాథప్రేతసంస్కారమునకు శర్మది ముందంజ. కవులు భాషాసేవకులు కష్టపడుచున్నారని వినినప్పుడు వారి కేదయిన సాయము చేయవలయునని ఈతని హృదయము పడు తహతహకు మేర యుండదు. నెలకు అయిదువందల రూప్యములు జీతము వచ్చుచున్నను శర్మకు ఇంచు

మించుగ చాలవరకు వ్యయమయి పోవు చుండును.

శర్మసంభాషణము "టానిక్" వంటిది. బలహీనులకు రోగులకు డాక్టర్లు మందిచ్చుట మాని శర్మసహవాసము నిర్ణయించినచో బాగుండును. అన్నహితవులేనివారి కన్నము పయి రుచిపుట్టింపవలెనన్న శర్మతో నాలుగు నిముషములు మాటాడించినజాలును. భోజనవిద్యలో "పి హెచ్.డి." పుచ్చుకొన్న వానివలెగా రెలనుగూర్చి ఆవడలనుగూర్చికంది గుండనుగూర్చి గోగుకూరపచ్చడినిగూర్చిశర్మ యుపన్యసించుచుండును. కాని "ఉరిమే మేఘ మెన్నడును కురియ"దని సంస్కృతములో నొకసామెతయున్నది. ఆతీరుననే శర్మకు భోజన మునుగూర్చి పైయురుములేగాని నిజముగ పైయురుములకు తగిన భోజనపుష్టి యున్నట్లు కానరాదు. అయితే ఎక్కడనయిన విందు గాని, సంతర్పణగాని జరిగినచో అచ్చట శర్మ ప్రత్యక్షమయి యల్లరిచేసిననేగాని భోజనము సహింపదు. తనతో సంభాషించెడు వారికెల్ల మనోల్లాసము గలిగించు నిట్టి వ్యక్తులు నిజ మైన దేశోపకారమును చేయుచున్నవని నా తాత్పర్యము.

అభము శుభము చూడకుండ నన గూడదు కాని నాకు శర్మను చూచినపు డెల్ల ఒక్కయాలోచన పొడముచుండును. "శర్మ సహవాసముచే మా కింత యానంద ముదయించుచుండునుగదా" ఇది భావికాలము వారికి అలభ్యము గదా యని. సైన్సులో పండితుడు కాబట్టి తాను శాశ్వతముగానుండే మార్గ మేదయినను నవీనశాస్త్రము ననుస రించి శర్మయే కనిపెట్టవలెను.

---





తారామంగల శిల్పచిత్రములు

౧. అంతః ప్రాకార దృశ్యము

౨. కైలాస నాథస్వామి ఆలయ గోపురము (లోవైపు దృశ్యము)

౩. తొలి ప్రాకారము గోపుర ద్వారసోపానముల కిరు వైపులగల శిల్పము








౪. వీరభద్రుడు

రెండవప్రాకారమునకు ముందున్న మంటపస్తంభముమీది గుఱ్ఱపు రౌతుచిత్రము
౫. ఎడమనుండి    ౬. కుడినుండి.

౭. విలాసవతి



౮. మూలస్థానమునకు వెనుక

౯. అర్ధమంటపమునందలి స్తంభములు: మూలస్థానము నెదుట



౧౦. ఊర్ధ్వనటమూర్తి

మధుర మీనాక్షీదేవాలయ
వసంత మంటపమునందలి
స్తంభములమీద నున్న
శిల్పము



౧. అశ్వికవీరుడు



౨. రథికవీరుడు

# మూడు వలపులు

వెంపటి నాగభూషణం

మైడియర్ అన్నపూర్ణా!

ఏమిటి ఎన్నడూ లేని ఈవింత అని నీవు ఆశ్చర్యపడతావనుకుంటాను. ఎదురుగా కనబడుతూ ఉన్నంతసేపూ, ... "వదినా" అని ఎంతో ఆప్యాయంగా, ఖులాసాగా పిలిచి వరుసలాడే మా సంపూర్ణానికి ఊరుదాటేటప్పటికల్లా, గర్వం హెచ్చిపోయి, సీమరాణీదర్జా వచ్చిందికాబోలు,— ఎంత పొగరుబోతుతనం! —— అని నీవు అపోహపడటానికి కూడా ... వీలుఉన్నది. ఎన్నడూ లేనిది నిన్ను పేరుపెట్టి... ఇలా సంబోధించడంవల్ల...

కాని, తొందరపడక, ఉత్తరమంతా చదువు: నీకే తెలుస్తుంది...వదినా అని వ్రాయడానికి ఎందుకు మొగమాటపడ్డానో?

అసలు, ఈవిషయాలు తలచుకునేందుకే చాలా చాలాసిగ్గుగా ఉన్నది. ఇక్కడ, మామ్మ, అత్త, చివరకు అమ్మకూడా నన్ను ఆషామాషీలు ఆడుతున్నారు. నా నోటివెంట పలికించాలని ... ఎన్నోపన్నాగాలు పన్నుతున్నారు. తమాషాగా వెక్కిరిస్తున్నారు: కాని, నేను ఎక్కడా అంతు చిక్కనీయడం లేదు.

ఎందుకు...ఈ, ఉపోద్ఘాతము అంటాను అని నీవు విసుక్కుంటూ ఉంటావు: ఇంతవ్రాయడం నిన్ను అలయించడముకోసం కాదు:—నాస్థితి అర్థమయ్యేటట్టు ...విశదం చేయడానికి.

సిగ్గుతోపాటు తగని ఉడుకులుమోతుతనం కూడా నన్ను ముంచివేస్తూన్నది. అందరికీ, ఎద్దేవా చేయడానికి నేను ఒక్కరితెనే కనబడ్డానుకాబోలు.

మిగతావాళ్లందరి మాటాఎలా ఉన్నా, - నీవు కూడా, నన్నుతలచుకుని, - ఉత్తరం చదువుకుని, —హాస్యం చేస్తావేమోననే భయంతో,- "వదినా" అని వ్రాయడం మానివేశాను. అంతటితో నీవు ఆగేరకం అని కాదు,- (నీసంగతి నేను ఎరుగనిదికనుకనా)- అయినా, ముందుకాళ్లకు బంధం అనుకో.

మీకు పట్నంబదిలీ అయినసంగతి ... మా, మామయ్యవచ్చి చెప్పేదాకా తెలియనేకాదు అన్నప్రకారం ఇక్కడకు రాగానే ఉత్తరం వ్రాశాను నీపేర. ఒకరోజు, రెండురోజులు ఎదురుచూశాను, జవాబు వచ్చిందికాదు: ఏమిటా అనుకున్నాను నీకు నామీద ఎందుకన్నా కోపం వచ్చిందేమోనని దిగులు పడ్డాను.

నీకేమమ్మా ఇంజనీరుగారి భార్యవు: ఉత్తరాల మీద ఉత్తరాలు ఉరికిస్తావు: నాకు నీలాగా కవిత్వం చేతరాదాయెను-చిలవలూ పలవలూ కల్పించి అల్లడానికి.

ఇక్కడికి, నిన్నటినుంచీ మొదలుపెట్టి, ఇవాళకు పూర్తిచేశాను ఈ ఉత్తరాన్ని! నీదగ్గర ఏసంగతీ దాచకూడదాయెను: కనుక్కున్నావా అంటే, ఆతర్వాత నన్ను నిలవనిస్తావా? కాని, మనసువిడిచి వ్రాయడానికి, అబ్బ! ప్రాణంచచ్చిపోతూంది. అయినా మాట అన్నతరువాత తప్పుతా ననుకున్నావా, ఏం? నీతోకాక, మనసిచ్చి, ఈ సంగతులు మరి ఎవరితో చెపుతాను! ఏమో, నీతోనైనా ఎదటపడితే ఇంత బెదురు లేకుండా చెప్పలేకపోయేదాన్నేమో!- ఉత్తరం కనుక బెరుకుతీరింది. ఏమోనమ్మోయ్! నీవు చదువుకుంటూ నవ్వుతూన్నట్టు నామనసుకు తోచినా, ఊరుకునేదిలేదు: తెలిసిందా? —— మళ్లావేసవికి మీరు మీమామగారియింటికి రాక ఎక్కడికి పోతారు? నేను వచ్చి చెవులు పట్టుకుని... ఊఁ... జాగ్రత—

మా మామయ్య ఇక్కడకు వచ్చాడన్నాను కాదూ? ఊరికే వస్తారా మహాత్ములు! వాళ్లఊరు ... (సిగ్గుపడి, దాచేస్తున్నా ననుకోమాకు)... మా అత్తవారి ఊరు వెళ్లాడుట. అక్కడనుంచి శుభవర్తమానం పట్టుకువచ్చాడు:



1- 8

గుమ్మంలో అడుగుపెట్టేటప్పటికే ఆయన వాలకం చూసి ఏదో ఉందనుకున్నాను. పల్లెటిదిక్కు మర్యాద చేద్దామని బులపాటంతో కాళ్లు కడుక్కునే టందుకు నీళ్లు తీసుకుని ఎదురువెళ్లేటప్పటికి చెంబు అందుకుంటూ, నావంక కొంటెగా చూసి – 'ఓహో, పెళ్లికూతురుగారా!' అని ఎద్దేవా చేశాడు. ఇన్నేళ్లు వచ్చి, మనమల్ని ఎత్తినా ఆయనచిలిపితనం మనం ఎరుగున్నదేకామా? నేను ఏమీ అనుకోకుండా నవ్వి ఊరుకున్నాను.

అంతలోకే మానాన్న అవేపు వచ్చాడు. ఒకరి నొకరు వరుసలాడుకుంటూ కుశలప్రశ్నలు వేసుకున్నారు.

'మా అమ్మ ఏంచేస్తున్నదో, ఓమారు ఇలారమ్మ నమ్మ!' అని మామయ్య వారి రహస్యాలలో చనకు నేను అడ్డుపడకుండా నాకు పనికల్పించాడు. నేను లోపలకు వెళ్లిపోతూండగా 'శుభం అనిపించుకువచ్చానయ్యా బావా' అంటూ మామయ్య తన కార్యవిజయాన్ని గర్వంతో ప్రకటించడం నాకు వినిపించింది.

అమ్మతో మామయ్య వచ్చాడన్న కబురు చెప్పగానే ఆమె ఇంతై అంతై పసిపిల్లలాగు సంబరంతో గెంతుకుంటూ...సావట్లోకి ఒక్క పరుగుతీసింది. నేను ఆమెకనిపెట్టకుండా వెనకాలే వెళ్లి తలుపుచాటున నక్కి చెవులు దోరపెట్టుకుని...ఏమి మాట్లాడుకుంటారో విందామని నిలుచున్నాను.

'ఏమమ్మా!' అన్నాడు మామయ్య: నాన్నా ఆయనా ఒకరి సరసను ఒకరు కుర్చీలలో కూర్చుని ఉన్నారు:

"ఏం నాయనా, అంతా క్షేమమేనా? – పిల్లను పురిటికి ఎప్పుడు తీసుకువస్తావు?...అబ్బిగాడు కులాసాగా తిరుగుతున్నాడా?....చంటిది ఏమన్నా ఒళ్ళుచేసిందా?...ఎండలు మండిపోతున్నాయి: పోతపాలాయెను – మరి నూతిదగ్గర చెట్లకు...ఏమాత్రం కాయ దిగింది? మీకు సరిపోయిందా కూరగాయకు....అయితే తోట యీయేడు ఎంతకు యిజారాకు ఇచ్చారు?..."

ఇలా, శరపరంపరగా ప్రశ్నలు కురిపించింది అమ్మ. సంగతులు తెలియక అనుకున్నానా?......దిటికొచ్చేస్తే ఇక్కడ కాక అక్కడ వాలుతూంటుంది: వారానికి ఓ సారైనా అక్కడినారు ఎవరోఒకరు వస్తూనేఉంటారు. ఇంతకూ...ఎన్ని ఏళ్ళువచ్చినా, ఆడవాళ్లకు పుట్టింటి మీద మమత పోదు...అదేం మాయో మరి (ఈవేదాంతం...ఏలాఉంది!)

ఈ ప్రశ్నలన్నింటికీ...ఒక్క తలఊపుతో సమాధానం సరిపుచ్చేశాడు మామయ్య.

'అసలు విషయం చెపుమా? – మీచెల్లెలు చూడు...ఎంత ఆదుర్దాతో చూస్తున్నదో...' – అని మానాన్న...సంభావణ మళ్లేశాడు.

'ఏమిటి?...ఏం చేసుకొచ్చావు?...కాయా, పండా?'...అన్నది అమ్మ.

'పండుకాకపోతే...పండ్లు రాలవూ?...... బావా నీవేనోయ్' అంటూ మామయ్య మళ్లా కొంటెతనంలోకి దిగాడు:

'నీ వెటకారాలకు ... ఏం కాని, సంగతులు చెప్పరా' అని బ్రతిమాలింది సోదరుణ్ణి మా అమ్మ.

'ఏం ఉన్నదమ్మా! మనం. ఎప్పుడు అవునంటామా అని...వాళ్లు కాచుకుని ఉన్నారు!—కోడలు యింటికి వస్తుందంటే...చేదా యేమిటి?—మామయ్య ఆరిందాతనం సాసాయించాడు:

'పిల్లవాడు ఏమన్నాడు?'—అని అమ్మ మళ్లా అందుకుంది.

'ఏమంటాడు? తీ చెల్లిందాయేం? రొట్టె విరిగి హైయంగవీనంలో పడుతూంటే?– (మామయ్యకు ... ఎంతగీర్వాణ మనుకున్నావేమిటి!)–మొదట కొంచెం పెంకెతనం చేశాడులే. అంటే, ఏంలేదు: ఇదిగో ఈ మధ్యవచ్చినాయిచూడు – భావకవిత్వాలు, అర్థం బర్థం ఉండదే! అందులో మనవాడికి పరిపూర్ణ పాండిత్యం కుదిరింది. తాను యీమధ్య వ్రాసినవట, ఓమోపెడు కాగితాలు, ముందువేసుకు కూర్చొని, చదివి వినిపించి,-

ఆ పూటంతా, హతమార్చేశాడు: అదేమిటో...దోవా తెన్నూ లేకుండా ఉన్నాయి: ప్రియురాలా, ప్రియురాలా అని ఒకటే ఏకుప్రధోరణి!-చిలకలూ, వెన్నెల, కోవెలలు, చకోరాలూ,-అంతా కలగలపు కవితాపాకం తయారు చేశాడు. 'ఇదేమిటోయ్'-అని నేనంటే,-'అంతే లెండి, మీకు తెలియదు:' అని నాముఖంమీదనే అనేశాడు: ఆదోవాలకం.'-మామయ్య ఇంకెంతసేపు అలా లెక్చెరు దంచేవాడో కాని,...అమ్మ...వింటూన్నకొద్దీ కళ్లనీళ్ల పర్యంతమై:

'ఎవతె అన్నా మాయచేసిందేమోరా నాయనా! ఏమిటిదారి?'-అని బావురుమన బోయింది...అమాయికంగా. నాన్నా, మామయ్యా ఫక్కున నవ్వారు:

'వెర్రిపిల్లా! అదేమిటే? ... మునిగిపోయిందేమీ లేదు. ఇవన్నీ పైపెచ్చు వేషాలు కాని,...కార్యంమాట చెప్పేటప్పటికల్లా...ముసిముసి నవ్వులతో, - లాంఛనం కోసం కొంచెం బెట్టుచేసి, చివరకు,-మౌనం అర్ధాంగీకారం అనుకోమన్నాడు. వాడి మొగం కాదూ: మనపిల్ల దగ్గర జేరినతర్వాత, మూడునిమిషాలలో వంచకపోతే, బొమ్మను ఆడించినట్టు ఆడించకపోతే, అప్పుడు అను. నీ కూతురు ... సామాన్యురాలనుకున్నావా ఏం?...ఏ సినీమాలోకో పంపితే, ఈపాటికి...అదెవరూ...ఆ...గోహర్ అంతది అయ్యేది:'

మామయ్యమాటలకు, ...అందరూ...ఏదో ఘనకార్యం చేస్తూన్నవాళ్లలాగా విరగబడిపోయినారు. నేను, ఇక అక్కడ నిలవకుండా, వెళ్లిపోయి గదిలో మంచం మీద బోర్లపడుకున్నాను...

నాకు, మనసులో-కొంచెం కష్టంగా, భయంగా, సంతోషంగా, పెద్దదిగులుగా,-అదేమిటో సరిగా చెప్పలేకుండా ఉన్నాను- తమాషాగా అనిపించింది. ఏమీ ఆలోచన పోలేదు. ఒంటికి ఉష్ణంవచ్చినట్లు...కొంచెం పులకరింతగా తోచింది: కాని, బద్ధకం లేదు. ఎండావానా లాగా, ఉండుండి పెద్దభయం: అంతలో, అదంతాపోయి అగనిసంతోషం! ఏమిటో, ఏలాఉన్నానో అప్పుడు.... వ్రాయలేను...

...అప్పటికి యింకా మూడురోజులు ఉన్నది,- నాచేత జాంబూనదతోరణం దాటించడానికి గడువు. ఇంటిల్లిపాదీ, కోలాహలంగా, వైభవంగా ... ప్రయత్నాలు చేస్తున్నారు. నాకుమట్టుకు ... ఏమీతోచేది కాదు: బయటికి నలుగురిలోకీ రా మనస్కరించేదికాదు. పోనీ, నేను తలదాచుకు ఉంటున్నానని ... వాళ్లు ఏమన్నా నిలువనిస్తేనా? పనిలో పనికల్పించుకుని,- ఓమారు మామయ్యా, ఓమారు అత్తా...(సమయానికి ఆవిడె కూడా ఊడిపడ్డది, నాప్రాణానికి!)... ఏదో చిలిపిమాట అనో, చక్కలిగింతపెట్టో...పోనూ, రానూ....

చదువుకున్నదానవు, బుద్ధి తెలిసినదానవు.... అంతసిగ్గు ఎందుకని — నీవు ఆక్షేపిస్తావేమో? అది అంతా సిగ్గుకాదు: నాసంతోషం వాళ్లు చూసి.... మరీ పరిహాసంచేస్తారేమోనని,...సగం అభినయం అందులో! లేనిసిగ్గయినా తెప్పించుకుని ... పడకపోతే, ఇదెక్కడి చిత్రాంగి అని అమ్మలక్కలు అందరూ ముక్కున వ్రేలు వేసకుంటారుకదూ, మరి?...

ఆవేళ...

ఇంకా, కనుచీకటిఉండగానే,... నిదురమబ్బు వదలకముందే, బలవంతాన నన్ను మేల్కొలిపి,— తలంటిపోశారు. దేవకాంచనంచాయ పూనాసిల్కు చీరె-(మా నాన్న కొత్తగాకొన్నది)... కట్టుకుని, జరీలేసువేసి కుట్టుకున్న కరాచీపట్టురవిక...(అక్కడకు వచ్చినప్పుడు నీకు చూపించలా?— అదీ...)...తొడుక్కున్నాను. కుంకుమపెట్టుకుందామని అద్దంముందర నిల్చునేటప్పటికి... ఎంత ముద్దొస్తూన్నా ననుకున్నావు?...పెదవులూ, కళ్లు, మొగమంతాకూడా... కలకలానవ్వుతూన్నట్టు అనిపించింది! నాకే ఆశ్చర్యంవేసింది ... అలా మారిపోవడంచూసి!

తలచిక్కుతీసుకుని... వదులుగా ... అయిదుపాయలజడ అల్లుకుని,...ఎవరూ చూడకుండా ... మా చిన్నతమ్ముణ్ని బెల్లించి, వాడిచేత కాఫీ తెప్పించుకుని తాగాను. మొదట, అమ్మను అడిగితే ... పీటలమీద నుంచి లేచేదాకా పరగడుపుతో ఉండాలన్నది. రాత్రి

కూడా అన్నం సయించలేదేమో, ... కాఫీ త్రాగందీ ఉండలేకపోయినాను:

తొమ్మిదిగంటలైంది: అంతవరకూ నన్ను పలకరించినవారు ఎవరూ లేరు: అసలు, ఎవరికీ కనబడకుండా ఉండాలని,... నీలాంబరం చెట్లదగ్గిర పెకాక్ మీద, దాక్కుని కూర్చున్నాను. అప్పుడు—తలవనితలంపుగా ఏంజరిగిందో చెప్పనా?... మాఅమ్మ బిగ్గరగా గొంతు పెట్టుకుని, ఎవ మీదనో, దొడ్డివైపున కేకలువేస్తూంటే, ... ఏమిటో చూద్దామని అలా వెళ్లాను. ఆవిడ, రుంజుకుంటూ లోపలికి వెళ్లిపోయింది. నేను ఆమెవేపే చూస్తూ కొంచెంసేపు నిల్చుని,... చూపు మళ్లింకును గదా!... ఒట్టు! . అంతకుముందు నేను గమనించనే లేదంటే నమ్ముతావో లేదో?... తేరంటిపోసకుంటూ ఆయన ఉన్నారు, కొంచెందూరాన!

నేనుచూశాను: నన్ను ఆయన చూసేశుంటారని నమ్మకం వెంటనే, ఉలిక్కిపడి... పరుగెత్తుకువచ్చేసి, ఎవరికీ కనపడకుండా దాక్కున్నాను. అప్పుడుకనుక ఎవరన్నా చూసినట్లయితే, నవ్వుమొగంతో...దొంగను దొరికిపోయేదాన్నే!...

...తొమ్మిది...పది...పదకొండు...

బ్రాహ్మణులు మంత్రాలన్నీ చదివి వదిలేటప్పటికి పొద్దుపోయింది:... నాకు, హోమందగ్గర కూర్చున్నప్పుడు, పొగపోయి, చాలాసేపటివరకూ కళ్లు తెరపిడిపడనేలేదు. అందువల్లకాకపోయినా, ఏమో... అన్నం బొత్తుగా సయించలేదు: భక్ష్యాలన్నా తినమని అమ్మ బ్రతిమాలినా,... నేను వాటిని నోటపెట్టనేలేదు ...

—ఇక, మావాళ్లు అందరూ నన్ను సింగారించడానికి ... పంతంవేసుకుని...వంతులు తెగక...రావణాయుద్ధం చేశారు:

ముందు...జడవేయడం పూర్తి అయ్యేటప్పటికే-పగంపట్నం కొల్లబోయినట్లయింది: ప్రొద్దుగ్రుంకింది: తోటలోనుంచి, ఏకబారుమొగ్గగా పురమాయించి తెప్పించిన బుట్టెడు మల్లెపూలూ, జడమీద కుట్టించాలని—మాఅత్తపంతం. నేనువద్దంటే వద్దన్నాను: మెడలు పడిపోతాయి జడమోసేటప్పటికని: ఆవిడెకు తనమాట వెగ్గలేదని... కోపం, ఉక్రోషం... వచ్చినై!... "ఈ కాలంవాళ్లబుద్ధులిలాగంటే: చెపితేవినరు: వినసేర్పు ఉంటే కాదూ?... అయినా, తనుదునమ్మాయంటూ... నేను పట్టుకు ప్రాకులాడటం ఎందుకు? ... ఎవరియిష్టం వారిదీ!..."— అంటూ మాఅత్త రుసరుసలాడి, బుంగమూతిచేసుకుని, ఓమూలకుపోయి కూర్చున్నది....

వంకీజడవేయడానికి ... సభ్యులందరూ సమ్మతించారు: "పట్టుపని అయితే బోలెడుఆలస్యం: ఇప్పుడు తెమలదు: రేపుఎప్పుడన్నా పెందరాళే తలపెట్టవచ్చునలే...అంతగా నీకుచూడాలని మనసు అయితే:పైగా, కుట్టుజడఅయితే పక్కలోనుచ్చుకుంటుంది కూడాను: ఇవాళకు అమ్మాయిచెప్పినట్టే కందాము:" ... అని మా అమ్మ... అత్తను సమాధానపరచింది ఆ...బులబాటపు ఆమాయిక... ఇకఅంతటితో మకురుతనంమాని వేసి, సరదాగా...దగ్గరకువచ్చి కూర్చుని, పూలు బొత్తిగా అందుకుని జతచూసి అందీయడం ప్రారంభించింది. వాలుజడఅంతా అల్లేసి, పాయలచివర జరీరిబ్బన్ 'బో'కట్టి... సవరకట్టుక్రిందుగా జడబిళ్లతిప్పి, మధ్యల ఈసెపాయలలో సంపెగలూ, గులాబీలూ తురిమి, నన్నొక బొమ్మనులాగా, అందరూ తలొకవైపునా దూరదూరంగా నిలుచుని, ... తమ ప్రయోజకత్వం చూసుకుని, మురిసిపోయినారు.

అంతటితో, బ్రతికి బయటపడ్డానుకదా అని ...లేచి, మేజాముందర నిలుచుని...ఎదుటి అద్దంలో చేతిఅద్దంలో ... ప్రతిబింబం ఆధారాన గులాబీలు సవరించుకుంటూండగా, ఇంకోతవాయ్ వచ్చింది. ఇకిలించుకుంటూ, ఆ...రుద్రాక్షమాహాత్యం ... (పెద్దదైతే అయిందికాని, వళ్లుమండుతూంది...)-మామ్మ ప్రత్యక్షమైంది...

—కనుబొమలమీదుగా ... పతాకహస్తం బోర్లగిల అడ్డంపెట్టుకుని, నన్ను పరకాయించిచూసి.. "జడ సాంతం అయిందిరా?"—అని గంభీరంగా అడిగేసరికి,...అమ్మ సమాధానం చెప్పింది. — అవునని.

"అయితే"—అని, ఏదో అస్పష్టంగా తనలో తాను అనుకుని,... ధోవతి కొంగుచాటునుంచి తీసి గుప్పెడు తలసామాను పట్టిచూపింది:.. 'ఇవికూడా పెట్టండే! ... అంటూ, సమీపాన ఉన్న అత్తకు అందిచ్చింది.

అందుకున్నదే కాని, చొరవ చేయడానికి అత్త అనుమానించి,— అమ్మవంక చూసింది. ఆవిడె ఏమీ మాటాడలేదు. అంతలో నేను కల్పించుకుని, ... "భానువేషంలాగ ఉంటాను ... ఆపాపట చింద్రీలూ అవీ వేసుకుంటే: నాకు అక్కర్లేదు..."అన్నాను నిర్మొగమాటంగా: "వేసుకోవాలి: వద్దనకూడదు. మనకు అచ్చి వచ్చినవి: మాపుట్టింటివారి తాలూకు ఇవి: నేను వేసుకున్నాను. పంకంటికొడుకును ... బంగారు తండ్రిని మీనాన్నను... కన్నాను: మీఅమ్మకువేశాను: ఏం, నిక్షేపంలాగా కాపురం చెయ్యడంలేదూ! ... చెడిపోక, చెప్పినమాట విను: పెద్దదాన్ని ... ఇంతగా అంటున్నది ... నీమంచికే..." ఇలా నంత ఉపక్రమించింది. నాకుతిక్కవేసుకువచ్చి బంగారుతండ్రీ అక్కరలేదు, ...నీపాపటచింద్రీలూ వద్దు"—అని ధూకుడుగా, నిష్కర్షగా అనేసరికి, ఆవిడె:'ఆఁ...ఆఁ...ఎంతపోతరమే! మీబుద్ధులూమీరూను!... పిల్లాపీచూ లేకుండా., ఎల్లకాలం ముసుడితో కులుకుతు ...'ఇక మాతక పనస లోకి దిగి... వెనక్కి తిరిగింది. ఆమెను ఉడికిలించాలని,... "మక్కువ తీరకపోతే ... నీవు వేసుకో..." అని విసిరాను. అమ్మా వాళ్లంతకూ బిగ్గరగా, విరగబడి నవ్వారు...

వెళ్లిపోతూన్న వృద్ధావతారం రివ్వునమళ్లీ... 'ఏమన్నావూ?...నీమహావైభవంలో,పిన్నా పెద్దా తారతమ్యం తెలిసేటట్టుకుంటావా? ... నేను వేసుకోవాలీ... మీలాగా అనుకున్నావేం? — ఆమహారాజు ఉన్నన్నాళ్లూ...బ్రతిమాలి, ఎంతోముచ్చటపడి వేయించేవారు! నిర్భాగ్యురాలిని కాబట్టి, ఆయన వెళ్లిపోయినాహామ్మో...' ఇలా, వింతస్రుతిలో, మాఅత్త పుటకలకు పోయిన తాతను తలచుకుని,...నేడో రేపో, పూర్ణయాత్రా స్పెషల్‌లో ... స్వర్గానికి ప్రయాణం కట్టబోతూన్న... (వాళ్లమ్మ కడుపుచలువలు ... ఇంతటిలో అంతపని జరిగేటట్టు తోచడంలేదు కాని, మామ్మ వగలమారివిచారం అభినయించి, నిష్క్రమించింది.

ఆవిడకు ఇంకా నామీద కసిగానేఉన్నది ... చెప్పినట్టు అలంకరించుకోలేదని: అయినా, మించిపోయింది ఏమిలే?...బంగారు తండ్రిని ఎత్తాలని మనసు పుట్టినప్పుడు,...మామ్మను అడిగి, ఒకమారు అవన్నీ తలలో అలంకరించుకుంటాను!...ఏమో, వాటిలో ఎంత మహాత్యం ఉన్నదో?...ఏమంటావు?...

...నీళ్లుపోసుకున్నాను...(తప్పుగా అర్థంచేసుకోకేం)...వంటిమీద: ఉన్ననగలు తీసేసి, ముత్యాల లోలకులు, హారం, గాజులూ...అలంకరించుకుని, దంతంచాయ ఉల్లిచీరె కట్టుకుని, బాడీమీద గులాబీ సిల్కుగాజ్ జంపర్ వేసుకున్నాను. అద్దం ముందు నిలుచుందునుకదా,...కదలబుద్ధి పుట్టించికాదు. ఎంత,... ఎంత అందంగా ఉన్నాననుకున్నావు, అప్పుడు?

మేడమీద ... రణగొణధ్వనిగా ఉన్నది: ఏం చేస్తున్నారో తెలుసును. అలంకరణ శాఖాధ్యక్షురాలు-అత్త, మధ్యాహ్నంనుంచీ ఉమేజువారీ చలాయిస్తూ, ఎన్నివందలసార్లు మేడమెట్లు ఎక్కిదిగిందో...చెప్పలేను. ఆవిడ సంబరంచూస్తే ... (అనకూడదు కాని...)... బాలవైధవ్యంమూలాన, తీరనికోరికలనన్నీ... ఆనాడు మానసికంగా హాయితో అనుభవిస్తున్నదా...అనిపించింది!

—తొంగిచూడాలని బులబాటంవేసి, ఎవరూ చూడకుండా,...మేడమీదకు వెళ్లాను. గదితలుపులు అన్నీ వేసుకుని లోపల వాళ్లందరూ గూడుపుఠాణీ చేస్తున్నారు. లాభంలేక తిరిగివచ్చేశాను: మొదట, ఏకోతంక బెట్టి తలుపు పిలుద్దామనుకున్నాను కాని,... గుండె దడదడలాడింది...

చీకటిపడుతూండగా...భోజనంచేశాను: 'వ్యవధిలేదు...త్వరగా తేలాలి...'అంటూ, నాన్న అందరినీ తొందర చేస్తున్నాడు. అమ్మ నన్ను చెయ్యిపట్టుకు తీసుకువచ్చి...పావడిలో, ఆయనసరసను కూర్చొ

పెట్టింది. బ్రాహ్మణుల గొంతులన్నీ ... ఏకస్థాయిని మోగిపోయినవి.

లేచి...వెళ్లి...చుట్టుగోరంచు ఉప్పాడజరీ చీర కట్టుకుని, తిరిగివచ్చి కూర్చున్నాను...పౌరోహితుడు చెప్పిన ప్రకారం. ఈమారు...ఇంకో గంత్తయిదువ ఆసలాతో...పురోహితుడు నాచేతికి తాంబూలాలు పేర్చినపళ్లెం అందిచ్చాడు...

వారు,...మావారు...ఎకనుచేతితో నన్ను కౌగిలి లోకి తీసుకున్నారు! ఇది...సంప్రదాయమటకాదూ! ముందు జరగబోయేపని... దేనని ఈ ఖాండసగం ధర్వ్యల ఎదుట ప్రదర్శిస్తేనేకాని...శాస్త్రం ఒప్పు కోదేం?...విక్రం!

నీకు ఈకలాపమంతా...కొత్త అని కాదు— ఇంత విపులంగా వ్రాయడం. అప్పుడు నీవు ఏమను కున్నావో నాకు తెలియదు—నీవు ఎన్నడూ చెప్ప లేదు కాబట్టి. కాని మనపిల్లలన్నా...ఈశంచనన్నీ పడకుండా...!—పెద్ద కబుర్లుచెపుతున్నానని వెక్కి రించబోకు. బోనులో చిక్కినట్లు అసహాయనై...ఏం చేయలేకపోయినాను. ముందుగానే...ఇలాటి సంగతి అని తెలిసి ఉంటేనా,...?—సరి, విం నదానికి... ఏంచేస్తాములే...

పునస్సంధానాన్ని ....,చిన్నవీథినాటకం క్రింద తయారుచేయడం...అర్ధమర్యాద అయితే...ధిక్!... ఆశీర్వచనాక్షతలజడి వెలియగానే ముత్తైదువలమతా మమ్మల్ని కమ్మేసి...మేడమీదకు తీసుకువెళ్లింది. పాన్పుమీద అభిముఖంగా కూర్చోబెట్టి, గంధంపూ యించి, ఎంగిలి పరమాన్నం త్రావించి...(నేను త్రాగి నట్లు నటించాను కాని, నిజంగా త్రాగాననుకున్నావా ఏం?)...ఫలప్రదానాలు కాజేసి, మబ్బుపింజెలులాగా ఎక్కడివా రక్కడ మాయమైనారు...

మరి పదినిమిషా...పావుగంటకు...గదితలుపు బయట గొళ్లెం బిగించినట్లు శబ్దం –

...నేను తలవంచుకునే......అలా కొంచెం నేపు మంచంమీద కూర్చున్నాను: ఆయన నావంకచూస్తు న్నారేమోనని...సిగ్గు. ఆయనను చూడవలెనని మన సులో కోరిక:

నెమ్మదిగా తలఎత్తి...ఓరకంటచూసి....తల వంచుకుని, అలా రెండు మూడు సార్లుచూశాను: ఆయన కిటికీ ఊచలను పట్టుకుని..ఏదో ఆలోచిస్తున్నట్టున్నారు. నేను క్రిందకు దిగి నిలుచున్నాను – బొటనవ్రేలితో తివాసీ నెమ్మదిగా రాస్తూ. నావంక అయినా చూడ కుండా పరధ్యానంగావెళ్లి పోయి వెన్నెల మీద పడే టట్టు...కిటికీదగ్గర నిలుచున్నారు. నేను ఉన్నచోటనే కదలకుండా ఉన్నాను:

వెనక్కు తిరిగి వస్తారేమో ననుకున్నాను: కాని ఆయన కదలలేదు, మెదలలేదు...

బల్లమీద రకరకాల పళ్లాల్లో...అందంగా అమ ర్చబడ్డ ఫలహారాలు – (అదంతా......అత్తపని...) – నోరూరించినవి. అడుగులో అడుగు వేసుకుంటూ, సద్దు చేయకుండా...అక్కడకువెళ్లి, కావలసినంత తిని, మంచి నీళ్ళుత్రాగి...కొంచెం వక్కపొడి...ఒక చిలక దొం తరా వేసుకున్నాను...

కిటికీతలుపు మీద చేతులు బారచాచి...ఆలో చిస్తూన్నారో, లేక...ఏమన్నా చూస్తున్నారో కాని ఆపోజులోనే...నిలుచునే ఉన్నారు: ఏమిటో ఆవేశ పం అని...నేను పక్కకిటికీ దగ్గరకు వెళ్ళాను

వెన్నెల...బయట చాలా అందంగా ఉన్నది: చూస్తుండగా...నాకే చూపు మళ్లించుకోడానికి బుద్ధి పుట్టిందికాదు: అయితేమాత్రం...

ఆయన అక్కడనుంచి కదిలారు. ఏంచేస్తారో చూద్దామని...రెక్కకు మొగం చాటుచేసుకున్నాను. అనుకున్నాను...నాదగ్గిరకు వస్తారేమో ... బుజంమీద చేయివేసి పలుకరిస్తారేమో, ... ఇంకా...ఏమో ...

మళ్లినత్రోవనే, పంతము పట్టినట్టు నావంక అయినా చూడకుండా బల్లదగ్గరకు వెళ్లికూర్చుని, ఏదో తదేకదీక్షతో వ్రాసుకోవడం ఆరంభించారు;

చెప్పద్దూ;..నాకు కొంచెం చిరాకూ, కోపమూ వచ్చినవి. నేను...గదిలో ఉన్నానన్న స్పృహ అయినా

లేకపోయె! సుమంగలు లందరూ ఆశీర్వదించి..... ఒంటరిగా మమ్మల్ని వదిలి వెళ్లింది...ఇలా దాగుడు మూతలాడుకుంటూ...ఒకరికొకరు నైదొలగి పచార్లు చేయడానికా?...ఒకవేళ కాళిదాసు సోదరుడేమో అనుకుందామా అంటే? ఊహుఁ...

నేను మనసులో యింత సుంజాటనపడుతూన్నా ఆయనకు చీమకుట్టినట్లైనా తోచలేదు. వ్రాస్తూనే ఉన్నారు...బ్రహ్మవ్రాత! - పగలల్లా బారనేశాను... దీపం పెట్టరా దిగనేయాలి...అన్నట్టు! ఇప్పుడు ఏమంత ముంచుకు పోయిందని, ఏం మునిగిపోతుందని.... ఆవ్రాత?

బాగా కోపంవచ్చి ... క్రిందికి వెళ్లిపోదామను కున్నాను: కాని, బయట కిటికీకంతలగుండా చూసి పుణ్యం సంపాదించుకునేందుకు కాచుకున్న మూక ... తలుపుతీస్తారా? అయినా, వెళ్లి వాళ్లల్లో పడటంకన్న ... గదిచెఱసాలే మంచిది అనుకున్నాను...

ఉద్వేగంతో, పెన్సిలుతో కాగితం మీద గీతలు గీస్తున్నట్టు బరికి,... దాన్ని విసిరివేసి, ... ఈల వేస్తూ, — నాతపఃఫలము...కూర్చున్న చోటునుంచి కదిలి, మళ్లా కిటికీని ఆశ్రయించింది.

నేను తాపీగా...జల్లదగ్గరకువెళ్లి, కాగితంఅందు కున్నాను. ఆయన, ఆజంతాపద్ధతిలో — (ఇప్పుడు, అయినవాళ్లకూ ... కానివాళ్లకూ అదేకామా మోజు) ఒకచక్కని పిల్లబొమ్మ ... ఎంత అందంగా వేశా రనుకున్నావు? ఆకాగితం దాచేశాన్లే, ... ఈమారు ఎప్పుడన్నా వచ్చినప్పుడు చూద్దువు కానిలే.

...ఆ బొమ్మ సరసను... ముత్యాలలాటి అక్షరాలతో...సగం నడచిన...యీపాట:

'ఇది మరియాదా-
నీ...వంచనలకు ఇక
బదులు తీర్చలేనా...
ఎంతజాణవైనా...నీ—కిది
మరియాదా, మరి...కాదా-
కలలోనైనా...వలచిపిలచినంతనె
పలుకనైతినా...కలవరమందితినా-
నిలుకడమాటే ఎరుగని...నీమాయలు

—పూర్తిగా ఆలోచించడానికి కాబోలు... మళ్లావెన్నెలలోకివెళ్లింది! ఇన్ని అందాలవగలు తెలిసిన వారేనా, మరి...బయట వెన్నెల కాస్తూన్నా, పొక గదిని అడవిచేసేస్తున్నారు?...అనిపించింది.

ఒక్కమారుగా లైటు స్విచాఫ్ చేశాను ... ఇప్పుడన్నా వెన్నెలఎక్కడో, ... నేను ఎక్కడో తేలాలి ... అని.

కాని, తేలేందుకు...ఆయన కదిలితేనా, తెలివి తెచ్చుకుంటేనా?

కొంచెం మెసిలారు: నేనుధైర్యంచేసి, - (స్వయం దౌత్య మేననుకో,... మరి ఏంచేయను?— 'కాంతుడు సిబ్బెతికాడై కాంతయు నట్లైన ఎట్లుకాపురమింకన్?')- 'మంచినీళ్లు కావాలా?' ...అన్నాను నెమ్మదిగా, వినయంగా... ప్రాతఆచారాన్ని అనుసరించి: మరి, కొత్త పోకడలూ, అలంకరణములూ పనిచేయనప్పుడు... గత్యంతరం?

'కావాలి'... అన్నారు, నావంక చూడకుండానే:

అందిచ్చేటప్పుడు పరాకున—(నిజంగా చేయాలని చేయలేదుసుమా...)— ఆయనచేతివేళ్లు నాచేతికి తగిలి, ఒళ్లు ఝల్లుమన్నది...

ఆయన ఏమనుకున్నారో యేమో — నావంక ఏలా చూశారనుకున్నావు? పరవశనైపోయినాను! ఫరవాలేదు!... ఇక కౌగిలిలోకి తీసుకుంటారుగదా... అమ్మ! ..

ఊహుఁ...! అరాతిసుండె కరిగితేనా? ఎందుకో అంతనిగ్రహం... ఋషులనుగూడా మించిపోయి?

'కూర్చో...'

ఆయనకూర్చుని...పక్కకుర్చీ చూపించారు: నేను చొరవచేసి...ఆయనకుర్చీ చేతిమీదనే కూర్చున్నాను.

'వెన్నెల ఎంత అందంగా...ఉన్నదో...'

—ఏం సమాధానంచెప్పను?... నాకుమటుకు కనబడటంలేదూ?

... 'అలా, మైమరచిపోయి, వెన్నెలలోనిలుచుంటే ఎన్నిమనోహరభావాలు వస్తాయనుకున్నావు? జీవితంలో తీయదనమంతచవిచూడటానికి...' ...

—నామనసు అప్పుడెంతగా ఉవ్విళ్లూరిందో... ఏదేవరైనా తెలియజెప్పకూడదూ...

'...మానసిక అనుభవాలతో దోహదం చేసుకుని కాలం వ్యర్థపుచ్చకుండా...'

ఇప్పుడు...తాను చేస్తున్నది...ఏమిటో?

'...సామాన్య లౌకిక భోగాలకు ఏమిలే... ఆ రాదుపకారకములే కాని...'

ఈ ధోరణి వింటూన్నకొద్దీ నాకు మతిపోతూ న్నట్టుంది: అరసికుడికి ఇంతపెద్ద కబుర్లు ఎందుకూ —ఉట్టికెక్కలేనమ్మ సామెతగా?

లేకపోతే, అంతా గడుసుదనమా...నాచేత బ్రతిమాలించుకోవాలని? నేను లొంగుతానా?...నాకు మాత్రం చాతుర్యం, జాణతనం లోటా?

భావకవిత్వ సిద్ధాంతాలన్నీ...ఎంతసేపు చెప్పా రో,...నేను, అవును-కాదు అనకుండా, శిల్లంకొట్టిన రాయిలాగా...వింటూ, మధ్యమధ్య కొంకెతనానికి, మేజామీద పూలచెల్లుతుంచి, ఆయనమీద రేకలు చిమ్ము తూ,...ఎప్పుడో తెలియకుండానే, భుజంమీద వ్రాలి...నిద్రపోయినాను. ఆమానవుడు, పాపం!... వెంమపెళ్లికూతురులాగా...తెల్లవార్లూ నాకు ఆస లాగా, అలాకూర్చునే ఉన్నారనుకుంటాను...

-బయట ఎవరో దడదడమని తలుపు ఊగించే సరికి, ఉలికిపడి మేలుకుని, క్రిందకు జారి నిలుచుని, పైటసరిజేసుకుని, ... మబ్బుతీరేందుకు చెంగుతో కళ్లు తుడుచుకున్నాను.

మళ్లా...తలుపు చప్పుడైంది. తీయనా-వద్దా?... ఇట్టే, కిటికీవైపు చూతునుగదా...తూరుపు తెలవారు తూన్నది!

... వెళుతూన్నానని చెప్పదామని నోటిదాకా వచ్చి,...అంలో సిగ్గుపడి, తలవంచుకుని, ఆయన చూసేటట్టు...ప్రభావతిలాగా తలఊగించాను.

చెయిజాచి...నాచెయి పట్టుకోబోయినా రను కుంటాను...లేకపోతే, బద్ధకంతో ఒళ్లు రుచుకుంటే నేను అలా అర్థంచేసుకున్నానో?...ఏమైతేనేం, ఆ సుఖానుభూతి యథార్థ్యం తేల్చుకునేందుకు అగ కుండానే...ఒళ్లి, తలుపుతీసుకు బయటపడ్డాను...

... క్రిందకు పోతినిగదా,...అక్కడ ... ముసలి- పడుచు విచక్షణ లేకుండా,...స్త్రీ గణమంతా నన్ను కమ్మేసి, ఎన్ని లిఖితనాలు చేశారనుకుంటావు? ప్రత్యేక పరిశీలనం మొదలుపెట్టి, కనుగందని సౌకు మార్యవిలాసానికి ఆశ్చర్యపడతూ, అపార్థాలు తీసి, మీమాంసచేస్తూ...నన్ను రెట్టించారు-ఏంజరిగిందో?... ఏమీ జరుగకపోతే ఎందుచేత ...చెప్పమని? ఇంత కన్న అన్యాయం ఎక్కడన్నా ఉన్నదా అన్నపూర్ణా?

నోటిముత్యాలు రాలుతా యేమోనన్నంత జాగ్రత్తతో, పెదవికదల్పకుండా...ఊరుకున్నాను. కాని, కథలల్లేవారికి...విసుగూ విరామం ఉంటేనా? అందరూ మూలమూలలజేరి, అల్లుడు రాత్రి సరిగా ఉండలేదని...గుసగుసలు ప్రారంభించారు. అత్త... నావంక చాలా జాలితో, అనుతాపంతో చూసింది: బావురుమంటానేమో, దగ్గరకు తీసి సముదాయించి,... నాతోపాటు నామందృష్టానికి విచారపడి-మనశ్శాంతి చేసుకోవాలని...ఆమెకోరిక అనుకుంటాను. నేను తొణకలేను. ఎవ్వరికీ అవకాశం ఇవ్వలేదు...

* * * *

రెండో నాడు:

పగలంతా...ఏమీ విశేషము లేకుండా, మా మూలుగానే గడచిపోయింది. ఆయన నాకు...కంటికి కనబడనేలేదు. నేనసలు కూర్చున్నచోటునుంచి కద లనేలేదులే! పైగా రాత్రి నిద్ర చాలనందువల్ల, భోజనంకాగానే...సాయంకాలందాకా నిద్రపోయినా ఇంకా బద్ధకము వదలనేలేదు;

చీకటి పూర్తిగా పడకముందే,...క్రిందటిరోజు కన్నా...ఇంకా ఎక్కువ అందంగా అలంకరించు కున్నాను

జాజిపూలతో డైమన్ జడ వేసుకుని,...చంపక ముల కత్తెరదొంతర అర్ధచంద్రుడులా...అమర్చు కున్నాను. అన్నీ రవలసొమ్మలే... పెట్టుకున్నవి! ఏలా ఉన్నాననుకున్నావ్!...నీవు చూసినట్లయితే,...నిన్ను మగవాణ్ణిగా చేగనందుకు బ్రహ్మను చెరిగేసి,... కొరుక్కుతిందామని కలియబడకపోయినావూ?

ఏం లాభం? ... అన్నిలక్షణాలూ ఉన్నాయి కాని,... అల్లుడి నోట శని... వదలలేదు. ...

చీకటిపడి, దీపాలవెలుగున క్రమంగా ముదిరి పోయింది. ... ముత్తైదువ లందరూ ... ద్వితీయ విఘ్నంకాకుండా హాజరై ఫల ప్రదానాలు తన్నుకుని, జారిపోయినారు. వయసుకత్తెలు ... వర్షీయాంసినుల చాటు చూసుకుని,...మనసులో ... తీరనికోర్కె లన్నీ ... వరుసపాటలతో చిసరించుకొని... పులక రించి, ... మమ్మల్ని ఎలాగైతేనేం చివరకు...వయ తలచి ... ఒంటరిగా వదలిపెట్టారు. మాఘలేషు కదా చన...అని కృష్ణుడు మొరాయించినట్లు, గుర్రం గుడ్డి దైతే మాత్రం... దాణాచెల్లదా ఏకేం?

నాకు ఆనాడంతా మనసుసరిగా లేనేలేదు. పవలు కనుమూసినప్పుడుకూడా కలలూ కలవరింతలతో ...తేలిపోయినాను: అంతావింతగా ఉన్నది ... అను భవంలేని ఈనూతనానుభవం:

"ఎక్కడికోయ్... నాయనా"...అని గుమ్మా నికి అడ్డం తప్పుకుంటూ, అత్త ఆయన్ని అడిగింది ... తలుపులు దగ్గరగాలాగే ప్రయత్నం విధిలేక విరమిస్తూ..

ఆయన మూగనోముపట్టినవాడిలాగా జవాబు చెప్పకుండా,... చుట్టూనిలబడినవాళ్లను చూసుకుని... చక్కాబోయినారు. అంతకుముందు నవ్వుతూ తుళ్లుతూ రాచకార్యములు చేస్తూన్న మావాళ్లందరూ చోద్యపడి ...తెల్లబోయినారు.అందరూవచ్చి మాగదిగుమ్మం దగ్గిర మూగారు: కాని, నన్ను ఎవరూ పలుకరించరు: ఒక రితో ఒకరైనా మాటాడుకోరు. ఆనిశ్శబ్దం పది నిమి షాలు ... భరించలేకపోయినాను.

లేచి నెమ్మదిగా...తలవంచుకుని, సిగ్గుతో... కోపంతో...అమితవ్యసనతో....గుమ్మం దగ్గరకు వచ్చి మనసుకుదుటపరచుకుని నవ్వుతూ ఏదోవేళాకోళం విసు రుకతో...సంభావణ ప్రారంభంచేసి...నాస్థితి వాళ్లు మరచిపోయేటట్టు చేయాలని యత్నించాను.

కాని వేసిన ఎత్తు పారకపోగా...బెడిసికొట్టింది. మా అత్త పరిహాసపు నిష్ఠురంతో-'ఆఅమాయకుడికి ఈ చిత్రాంగి ఏదో మంత్రించిందమ్మా; బెదిరి, చూడగానే పరుగెత్తుకు పోతున్నాడు...'. అనేసింది. ఆవిడ... నవ్వులాటకుఅన్నా...వజ్రాఘాతంలా ఆరుంతుదమైంది. మంత్రించకలిగిన శక్తే కనుక నావద్ద ఉంటే...నాకను జాడల్లో మెలగకుండా...ఆయన్ను ఆలా తప్పించుకు పోనిచ్చేదాన్నా? నామనసులో కల్లోలం ... వాళ్లకు ఏలా అభివ్యక్తమాతుంది?

'నీకూడా కావాలా ఏం...అమంత్రం?' అని మాటకు మాటగా అనక తప్పిందికాదు. ఊరు కుంటే వాళ్లుకూడా నాతోపాటు దిగులుపడతారేమో ననిపించింది. నేను నవ్వుతెచ్చిపెట్టుకుని...వాళ్లందరినీ నవ్వించాను

నవ్వుకుంటూ నవ్విస్తూన్న వాళ్లమందరమూ గిప్న ఆగిపోయి ఒక్కసారిగాలేచి నిలుచున్నాము. నేను అమ్మచాటుకు తప్పుకున్నాను. మెట్లమీద పద ధ్వని...ఆయన వస్తున్నారు. వీళ్లందరూ......ఎంత ఆపోహపడి వృథాగా (మనసులోనే అనుకో) ఆడిపోసు కున్నారు! ఎందుకోసం క్రిందికి వెళ్లారో? - నన్ను వదిలి పోవడానికి...ఆయనకు మక్కువలేక నా? ఎంత బింకానికిపోయినా....ఉండగలరా విడిచి?...ఎవరికో సం వస్తారు?

వచ్చింది...ఆయనకాదు నాన్న!

వెనుకనుంచి వస్తున్నారేమోననుకున్నాను. లేక నాన్న పైకి వెళ్లాడుకదా అని, ధైర్యముకూడా అప్పుడే రావడానికి బిడియపడి...కొంచెం ఆగారేమో?

నాన్న మా అందరికంకా ఓమూగు చూసి తనలో తాను...ఎవరినీ ఉద్దేశించకుండా - 'వెర్రివేషాలు! ఊరుకుంటూన్న కొద్దీ మరీ హద్దుమీరి పోవడమేనా ' అని కొంచెం ధూకుడుగా...సణుగుకొన్నారు. ఎవరికీ విషయమేమిటో బోధపడకపోయినా ఏమోనని భయపడి...ప్రాణాలు బిగబట్టుకున్నట్టు తోచారు. నామటుకు మణుకు పుట్టుకొచ్చింది—అపరాధమేమి చేశానో అని

'అతను...ఏంచేస్తున్నాడు, - ఇంతకుముందు క్రిందికి వచ్చాడే..., అని అత్త ధైర్యంచేసి అడిగింది. నాన్న కోపాలూ-తాపాలూ...ఆవిడమీద పనిచేయవు లే అసలు...

నాన్న...గర్జన ధోరణిలో 'ఎవరో...సరస్వతీ అమ్మాళ్...భరతాభినయం చేస్తుందట...పిక్చర్ పాలెస్‌లో, అక్కడకు దయచేశాడు...'అన్నాడు.

అత్తా, అమ్మా...యావన్మందీ...నివ్వెరపోయినారు!

'అదేమిట్రా... ఇవ్వాళే వెళ్ళాలా? ... మాబాగుంది!...' — అని భావ్య - ఉపోద్ఘాతం మొదలు వేసింది...అత్త.

'అవునమ్మా: ఆయన, మరి, నీలాగా నాలాగా అనుకున్నావేం?— కవి,...అందులో బాగాముదిరిన భావకవి. ఇక, ఇల్లూవాకిలీ, పెళ్ళాన్నీ కనిపెట్టుకుకూర్చునేలంత అవసరంఏంవచ్చిందీ? అవన్నీ ... నాలాటి ప్రాకృతులకి! వాళ్లు మహానుభావులు!... మేఘాలరవాణాగినితప్ప ... కటికి నేలనునడవరు: చుక్కకన్నెలను తప్ప... ఇంకొకరిని కన్నెత్తిచూడరు:కోవెలను తప్ప... పలుకరించరు: అక్కడ, శుభమంటూ కళాజలసా జరుగుతూంటే,... మదరాస్‌నుంచి వాలిన నవమోహిని అభినయం చేయబోతూంటే... ఇంటిదగ్గర ఉండమంటావూ? బలేదానవు!...'

—నాన్నలోకూడా. గడుసుదనంతోపాటు... ఇంతకవిత్వం ఉన్నదని... ఇదివరకు ఎన్నడూ అనుకోలేదు నేను. విన్నకొద్దీ, ఆయనమాటలకు ఆశ్చర్యం, నాకు అనుగళం చేసుకొన్నప్పుడు దిగులూ... కలిగినవి:

'పోనీ, వెళ్ళేవాడు ఫలానా చోటికని చెప్పివెళ్ల వచ్చునుగా?... ఎందుకువెళ్లాడో తెలియదాయెను... ఏమైనాడో...'

—అమ్మమాటకు అడ్డువచ్చి... నాన్న:

'అవును: మీతోఎందుకు చెప్పాలీ? దర్జాకు లోపంకాదూ? మిమ్మల్ని అడిగి ... అనుమతి పుచ్చుకు వెళ్లడానికి... ఏమంతఅవసరం... ఆయనకి?... మీకు తెలియజెప్పడానికీ... అన్నింటికీ, కూతుర్ని యిచ్చుకున్న గులాపువాణ్ని ... నేనుఉన్నానుగా!'—అని అనేసి... గిరుక్కున తిరిగి క్రిందకువెళ్లిపోయినాడు...

నాకు... తల దిమ్మ ఎత్తిపోయింది:- ఒక్క దూకున, తూలుతూ వెళ్లి ... గదిలో మంచంమీద తలగడలు కముచుకుని బోర్లపడుకున్నాను. కదులుతూ ఉండటంచూచి— వెక్కివెక్కి ఏడుస్తున్నాననుకుంది కాబోలు — అత్త దగ్గరగావచ్చి... తలనిమురుతూ, సమాశ్వసించే హెచ్చరికతో... 'ఊరుకోతల్లీ!...'— అన్నది అనలేని ఆయాసంతో:

నవ్వుమొగం ఆమెకుచూపించి—' ఏంలేదు, అత్తా,... ప్రొద్దుపోతున్నదికాదూ, నిదుర జోగిపోతూంది...'— అని ప్రసన్నంగా చెప్పేసరికి, ఆమె సంకోచించకుండా వెళ్లిపోయింది:

అందులో అభినయంఏమీలేదు. అప్పుడు భావనాశూన్యమై, మెదడు ... ఖాళీ అద్దంలాగా ఉండిపోయింది. ద్వంద్వరహితుల సాక్షాత్సమాధియోగం... సంక్రమించినదనుకుంటాను... సమానప్రతిపత్తి మూలకంగా! ఆలోచనలు ఏమైనా ఉండటానికి... మనసు అనేదే ఒకటిఉన్నదని... మరచిపోయినానుకాదూ...

—ఎపుడు నిదురపట్టిందో తెలియదు. ఆయన నామంచందగ్గరకు వచ్చి, చెక్కిలిమీద చెయివేసి, వంగి ముద్దుకోబోయి...!—కలో...నిజమో...తెలియదు. చూచినంతవ్యక్తతతో ... అనుభవించినట్లు అయింది: కాని. మెలకువకాలేదు.

...ఎండఎక్కిన తర్వాత...కనులు తెరిపిలిపడ్డవి. ఎన్నడూలేనిది...ఎందుచేతనో అంతసేపు నిద్రపోయినాను...

ఎదురుగా...గుమ్మం, ఓరవాకిలిగా అగుపించింది. లోపల ఒకర్తైనా...ఎవరు బంధింపుతారు?

నిలువటద్దం వారను, సోఫామీద...ఒత్తిగిలి—ఆయన పడుకుని ఉన్నారు. పక్కన,...సగము క్రిందకు జారి, చిందరవందరగా పడివున్న ఉత్తరీయం...

ఇంకా కలయేనేమో?...అయితే, మరి...నిజం...ఏది?—అనిపించింది.

పడిపోయిన పర్సును, ఆయనకు కదలిక కలుగకుండా...దిండ్లచాటున పెట్టి, శుభ శకునముతో,...(రాత్రి ఆయనసాన్నిధ్యానికైనా నోచుకోలేదుకా మరి...) —నిద్రమేల్కొంచిన ఉత్సాహ విభ్రమంతో...క్రిందకు చెంగున వచ్చేశాను.

* * * *

—ఆ...మరునాడు:

పవలు...దాని అమ్మకడుపు చలువను...దానంతట అదే గడచిపోయింది...నా ప్రమేయమేమీ లేకుండానే.

భోజనంముందు నాన్న-ఆయనా...సరదాగా కబుర్లు చెప్పుకోవడం—లోపలి సావడిలోకి మాకు వినిపించింది. నాన్న ఆయనమాటలు వింటూ...ఆప్యాయనంగా నవ్వుతున్నాడు. అవును: ఈ మగవాళ్లందరూ...ఇదే మచ్చు!

"...నీవు ఎరుగవోయ్ ... నగరాజకుమారి అని అఖండురాలు: ఛత్రపురిజావళీలన్నీ ... సుబ్బారావు...దానిమీద చెప్పినవే! భరతవిద్యలో మాంచి నిధి. మనిషి ... అంతరూపసి కాదు కాని..."

...అంటూ, నాన్న తనచిన్నతనపు ముచ్చటలు అల్లుడితో చెపుతున్నాడు. ఆయన తందానా అంటూ తన స్వవిషయం...ప్రజ్ఞ ... నివేదించుకుంటున్నారు: మధ్యమధ్య...ఇద్దరూ ఏకశ్రుతిలో నవ్వుకుంటున్నారు. ఏం అన్యోన్యం!...ఎంత ఐకమత్యం! ... ఎంతచెడ్డా జామాత విష్ణుసముడాయెను...

...తరువాత, ఏముందీ-...మళ్లా ఎప్పటిసాటే:

...శయ్యాగృహంలో ... రాత్రివేళ ... సపీవహివరః... సాచైవాస్మి ... తథాపి...మామయ్య గీర్వాణం నాకుకూడా పట్టినట్లుంది—ఏమీ అనుకోమోకేం?

ఇకమీదటి కథమాత్రం ... కొత్తసొబగుతో, రమ్యవైఖరిని ... మొదలైంది:

"తధిగణతోం..."... అని పరమకొంటెగా... నేను మంగళాచరణం చేశాను... ఆయనకు అందుబాటుగా నిలుచుని...నవ్వుతూ... త్రిభంగిగా...

సోఫాలో, కాలుజాచుకుని ... వాలి, సిగరెట్ ముట్టించినవారల్లా ... రింగులురింగులుగా పొగవదులుతూ, కాంతులు మెరిసిపోయే చూపులతో నన్ను కరగించివేస్తూ ... మోచేయానుకుని...లేచి! ...'అభినయించబోతున్నావా ... ఏం?'...అన్నారు.

'...ఆనందించడానికి ... మీరు ఉన్నారు కాదూ...?'—నా జవాబులో...ఏమున్నా తోణికానను కున్నావా ఏం? ఈ విపరీతం ... మామ్మలాటిది వింటే, కులపాలికలకు తగదని గర్హిస్తుంది కాని,—చెలిమిటి దగ్గర సిగ్గుపడవలసిన అవసరం...నాకేమీ కనిపించలేదు...

'మరి...బహుమానం?'

...అమ్మయ్యో! ఈమాట ఎంతజాలిగా అన్నారనుకున్నావు. అమాయకుడని అనుకుని...ఎంత పొరబడ్డాను! నామీద ప్రేమలేదనుకుని... ఎంతపరితాపపడినాను...అంతకు ముందు?

బహుమానం...ఏదో, నాకన్న ముందుగానే గ్రహించిన మనస్సు,...నన్ను ముందరికి తోసేసింది: పెదవి...కంపించిపోయింది—ప్రప్రథమాన మర్యాద తనకు జరుగదేమోననే ఆతురతతో...

జాచినకాలితో వడివేసి...దగ్గరకు లాక్కున్నారు. తామరతూడులా...అవశనై ...పరవశించి... ఆయనసరసను...మీదకు వాలిపోయినాను!

కౌగలించుకోబోతున్నారు! ...అంతలో, అంతకుముందు నన్ను ఆవహించిన అలసత్వం...మంచు

లాగా విరిసిపోయింది. అప్పుడే, ఆయనకౌగలిలో... చిక్కడమే? అదీగాక, ఇన్నాళ్లనుంచీ నన్నుగికురించిన వెన్నెలకు...నావిజయ ప్రతాపం చూపించవద్దూ?... నిస్పందమైన సోఫాకు ఎందుకు...ఆ అనుభవసత్కారం?...వెన్నెలలో తప్ప వశమైతే ... ఓడిపోయినట్లు కాదూ...

మెలికలారి ... తప్పించుకొని, దీపంవేసేసి... కిటికీదగ్గర వెన్నెలలోకి...లేడిమాదిరి రివ్వుమన్నాను. అడుగులో అడుగుగా ... ఆయన నన్ను తరుముకొని వచ్చి... (ఆహడావిడిలో సిగరెట్ ... ఇక తన అధికారం సాగదని, తేజాన్ని ఉపసంహరించుకుని, ... అవజ్ఞను మోసుకుంటూ ఏమూలనో పడిఉండాలి:)... మెసలవీలులేకుండా ... భుజపంజరాన బంధించారు. కలసిమెలసి పోతూన్న మనసులులాగా, పరిష్వంగంలో ...నేను కరగి... ఆయన హృదయానికి హత్తుకు పోతున్నాను....

... ఉత్తర నిమేషాన ... భ్రమరకుమారుని తీయని విందు జరిగేదే!...కాని, బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా...

నేను, పెనగులాడి, మోటగా విడిలించుకుని, ఆహూలనుంచి ... ఎదుటిమూలకు వెళ్లిపడి ... దీపం స్విచ్ వేసి, హైరానుతో, లజ్జతో ... దూరంగా నిలుచున్నాను:

ఆయన ఇదంతా సరస విహారమే ననుకొని ... సమీపించబోయినారు: నేను తెంపుచేసుకుని "వద్దు... రావద్దు..."... అని వారించాను. ఆయనకు అర్థం కాలేదు...

భాగ్యదేవత ... వెన్నెలతీగెలతో ... నందనోద్యాన రహదారిగా నిర్మించిన సోపానపాళి.... ఒక్కమారుగా రూపరిపోయింది....

అని ఆయన అర్థంచేసుకోవాలికాని... ఎంతచనవైనా - ఎలా చెప్పడం ఆమాట?

రాత్రి అంతా ఏమనుకున్నారో...ఒంటరిగా ఎల్లా వేగించారో - ఎంతకష్టపడ్డారో...

...

నేను చీరచెరగు పెదవులకు చాటుచేసుకుని, కనులతో...జవాబుచెప్పాను - దగ్గిరకు రాకూడదని. ఇక ఆయనవంక చూడలేక, చూసి నిలువలేక...ఇవతలకు వచ్చేశాను...

జరీచీరచెరగు ప్రత్యేకం రసభంగం చేయడానికే కాకపోతే.....మాయడానికి ఏం వేరే సబబు ఉన్నదీ?

* * * *

చూశావా?...నీవు...ఇంత ఓపికతో చదివినందుకు కథ ఏలాగైతే నేం...కంచికివెళ్లిందే!

అర్థమయింది కాదూ?...నేను కాపురానికి వెళ్లానుకాని...ఇంకా కాపురం చేయలేదు అని: నాకు ఏమీకించలేదు: మూకురోజులూ....యుగములబరువు మోసినవే అనుకో...మరి ఆమరునాడు...మాకు అడ్డు ఏమి ఉన్నదీ?...

ఇదిగో ఇప్పుడే చెప్తున్నాను మళ్లా ఈమారు వ్రాసే ఉత్తరంలో మిగతా ముచ్చటలన్నీ...ఇలాగే భారతంలాగా...అల్లుతానని, చదివి పొంగిపోవచ్చునను కొని, ఆసపెట్టుకు కూర్చుంటావేమో?... ఇక ఎక్కడి దొంగలు...అక్కడే: గప్‌చిప్...

—మీచిట్టిబాబుకు... పూర్ణ - అత్తయ్యపంపిన బహుమతీ అని ... ఓచిన్ని జెల్లాఇవ్వు. లేకపోతే, అడపాదడపా కొంచెం చురుకుతగలకపోతే.... మీ మామ గారిలాగా వినాయకుడౌతాడు. మోయలేక... రేపు... రాబోయే ఎలుకపిల్ల... కీచ్‌కీచ్‌లాడుతుంది! ఏం... అంతేకాదూ?

ఉన్నవీ లేనివీ— కల్పించిఅయినా,— (మా అన్నగారిమీద నేరాలుచెప్పడమంటే నీకుఒళ్లుపోతుంది కాదూ...)— ఇంతఉత్తరమూ తిరుగుమెయిల్‌లో నీదగ్గరనుంచి రాకపోతే,— ఇక ఇంతే!—సావాసం కొట్టివేస్తాను: కాచుకో...

తప్పకవ్రాస్తావుకదూ?... ఉంటాను ఇక...

సంపూర్ణ మోహిని.

# విశ్వశిల్పము

విస్సా అప్పారావు

పాశ్చాత్య దేశములందు, భౌతికశాస్త్రజ్ఞానము శాఖోపశాఖలుగా విస్తరించి, అనేకరీతుల పెంపొందుచున్నది. అందు ముఖ్యముగా పోయిన ౨౫-30 సంవత్సరములలోను అద్భుతములును, ఆశ్చర్యములును అగు గొప్పవిశేషములు కనిపెట్టబడినవి. అట్టివిషయములు అనేకరీతులుగా ప్రజల కుపయోగకరము లగుచున్నవి. ఈనూతనోపయోగముల మూలకముగా ప్రపంచనాగరకతలో చిత్రమైనమార్పులు అతివేగముగా ఏర్పడుచున్నవి. సంఘముయొక్క జీవితపద్ధతి మార్పుచెందుచున్నది. జరగినమార్పులయొక్క తత్వమును సంఘములోనివారు తెలిసికొనజాలుటకు పూర్వమే క్రొత్తమార్పులు మీద పడిపోవుచున్నవి. ఇది యట్లుండ, అతిసులభముగాను, శీఘ్రముగాను శత్రువులను సంహరించుటకై ఈనూతన శాస్త్రవిజ్ఞానమును ప్రభుత్వములవారు ఎప్పటికప్పుడే ఉపయోగములోనికి తీసికొనివచ్చుచున్నారు. వీటినిబట్టి శాస్త్రజ్ఞానముకలన క్షేమముకంటె ఉపద్రవము హెచ్చుగా కన్పట్టుచున్నది. ఇట్టిదుస్థితి కొద్దిసంవత్సరములనుండి దినదినాభివృద్ధి పొందుచున్నది. శాస్త్రశోధన శక్తి మనకు వశ్యమై, మనము చెప్పినట్లు కట్టుబడియుండవలె కాని, పిశాచమై మనలనే మ్రింగుట కారంభించిన సర్వనాశనము తప్పదుకదా. ఇట్టి యుపద్రవమునుండి బైటబడుట కేమియుపాయ మనే గొప్పసమస్య మానవజాతిని వేధించుచున్నది. ఇట్టిపరిస్థితికి కారణమేమి, నివారించుటెట్లు అని బుద్ధిమంతులందరును గాఢాలోచనలు చేయుచు అనేక సాధనములను సూచించుచున్నారు. ఒకగొప్పశక్తిని దాని నెట్లుపయోగించవలెనో తెలియని వానిచేత నుంచినప్పుడు, వాడాశక్తిని దాని నష్టమువచ్చినట్లు పోనిచ్చును. దానివలన కీడు తప్పదు. ఇట్లే శాస్త్రవిజ్ఞానముయొక్క స్వరూపము జనసామాన్యమునకు బొత్తిగా తెలియనిస్థితి రానురాను హెచ్చగుట చేత బాధలకు కారణమగుచున్నదని చెప్పకతప్పదు. నేటి విద్యావిధానమువలన జనసామాన్యమునకు తగినంత లాభము కలుగుట లేదు. శాస్త్రవిజ్ఞానము జనులలో చాలినంతవరకు విస్తరించుట లేదు. ఎంతోనాగరకుల మనిపించుకొను పాశ్చాత్యదేశీయులకే ఇట్టిగతి పట్టియున్నది. దీనికి కారణ మేమనగా అచ్చటి విశ్వకళాపరిషత్తులలోనుండి గొప్పగొప్ప విశేషములను కనిపెట్టుచున్న శాస్త్రవేత్తలందరును ఆశాస్త్రములను కొందరికి మాత్రమే బోధచేయుచున్నారు కాని, సామాన్యజనులతో నెట్టిసంబంధమును కలిగించుకొనుట లేదు. ఇదియే సంఘముయొక్క దుస్థితికి మూలకారణము. అందుచేతనే కొందరు గొప్పశాస్త్రజ్ఞులు పాతపద్ధతులను వదలి, శాస్త్రవృద్ధికొఱకుమాత్రమే కృషిసల్పుటలు మాని, సులభమార్గమున శాస్త్రవిషయములను లోకులకు తెలుపుటకై బద్ధకంకణులైరి. అట్టివారిలో అగ్రగణ్యులు సర్ జేమ్సు జీన్సు, ఎడ్డింగ్టను, మిల్లికను, జూలియన్ హక్స్లే మొదలైనవారు.

విద్యుచ్ఛక్తి నిచ్చు యంత్రములు, విద్యుద్దీపములు, రైళ్లు, విమానములు, టాకీలు, గ్రామఫోనులు, రేడియోలు మొదలైనవి మనజీవితమునకు ఎంతో వన్నెను కల్పించి, మార్పు కలిగించి, అనేకసౌకర్యముల నిచ్చి, మన మనోభావములలోను, జీవితపద్ధతులలోను చిత్రవిచిత్రము లగు మార్పులను కల్పించి జీవితములను తారుమారు చేయుచున్నవి. క్రొత్తరుచులు, పనులు, ఊహలు అలవాటగుచున్నవి. పల్లెటూరికాపురములు బొత్తిగా వ్యత్యయమైపోవుచున్నవి. ఇట్టిమార్పుల వలన నష్టము లేకుండుటకు మనబుద్ధులుకూడ విశాలములై, జరుగుమార్పుల నిజస్థితిని తెలుసుకొనతగినవిగా

మారవలెను. అంతవరకు సంఘమున తొట్రుపాటు తప్పదు. కనుక జనసామాన్యమున కుపయోగపడునట్లుగా, అనేక విషయములను సులభశైలిలో ఉపన్యాసముల నిచ్చుటయును, పుస్తకముల వ్రాయుటయును జీన్సు మొదలైనవా రారంభించినారు. దీనివలన జనబాహుళ్య మునకు శాస్త్రవిషయములు అందుబాటు కాగలవు. దానిచేత లోకులకు మనోవికాసము కలిగి, లాభము కలుగునని అభిప్రాయము. ఇంకను, ప్రభుత్వములందు పాల్గొనువారికి శాస్త్రాభిలాష హెచ్చి, అందలివిషయ ములను సరియగుత్రోవల నుపయోగింపగలరనిన్ని, అనగా తెలివిగలిగి తమకును, లోకమునకును క్షేమము నిచ్చు మార్గములలో మాత్రమే, ఆజ్ఞానము నుపయోగింప గలరనిన్ని, ఆకారణముచేత లోకమునకు కల్యాణమగు ననిన్ని ఆశ.

౧౯౨౯ వ సం. లో సర్ జేమ్సుజీన్సుగారు The Universe around us అను పుస్తకమును వ్రాసిరి. అది ౧౯3౧ లో ఒకసారి, ౧౯3౪ లో ఇంకొకసారి ముద్రణమైనది. "తనకోటిదే లోకము" అనసామ్య మున, ఈవిశ్వమంతకును భూమియే ఆధారభూతమని కొన్ని వందల సంవత్సరములక్రిందటి వరకును అభిప్రాయ ముండెడిది. కోపర్నికసు అనుమహామేధావికాలమునుండి పాశ్చాత్యులలో ఈఅభిప్రాయము మారినది. సూర్యుని ఆధారముగా అనేకగోళములు- గ్రహములు- తిరుగుచున్న వనిన్ని, అందలి ఒకసాధారణగోళము మనమునివసించు భూమియనిన్ని నిశ్చయింపబడినది. రానురాను ఇట్టి సూర్యునివంటివే నక్షత్రము లన్నియు నని తేలినది. ఈ అసంఖ్యాకములగు నక్షత్రములకు ఆధార మేమి, సంబంధ మేమి, స్వరూపనిర్మాణము లేమి, ఒక్కొకదాని వేడి, వెలుగు, బరువు, విస్తీర్ణత ఏమి, ఒకదానినుండి ఇంకొక దానికి, లేక మనవద్దనుండి ఒక్కొక్కదానికి దూరము లెంతెంత అను అనేక విషయములగురించి గడచిన 30 సంవత్సరములనుండియు పరిశోధనములు జరుపబడినవి. అందు ముఖ్యముగా యునైటెడ్ స్టేట్సులోని కేలిఫోర్నియాయందలి విల్సనుపర్వతశిఖరమందున్న నక్షత్ర పరిశోధనాగారమున ఈపరిశోధనలు చాల జరుపబడినవి. అందు ౧౦౦అంగుళముల వ్యాసముగల దూరదర్శిని(౧౦౦ inch telescope) యంత్రము కలదు. నేటివరకు నిర్మింపబడిన యంత్రములలో ఇది అన్నింటికంటెను పెద్దది. దానిసహాయముచేత ఎన్నడును ఊహించుట కైనను వీలులేనట్టి వింతవిజ్ఞానము లభించినది. అందలి ముఖ్యవిషయము లేవనగా (౧) నక్షత్రవీథి, తారా పథము (Milky way) అని మనము వాడునట్టిది ఒక నక్షత్రలోకమనిన్ని (Galaxy) అందు అనేకములు సూర్యునికంటె పెద్దవి, ప్రకాశమానములైనవి నక్షత్ర ములు కలవనిన్ని, ఈతారాపథము గుండ్రని బిళ్ళ(disc) వలె నిలబెట్టినట్లుండు ననిన్ని ఈగేలక్సీ మధ్యభాగమున చేరిసూర్యుడున్నాడనిన్ని (౨)ఈనక్షత్రమండలమువంటివి ఇంకను అనేకములు గలవనిన్ని, ఒకదానికంటె ఒకటి దూరదూరమున ఉన్నవనిన్ని, (3) ఎంతదూరమువరకు ఈలోకములు వ్యాపించియున్నవో చెప్పుట కింకను సాధ్య మగుట లేదనిన్ని, దూరదర్శినీ యంత్రములను ఇంకను పెద్దవిగా నిర్మించినకొలదీ ఇంకను దూరముననున్న నక్షత్రమండలములను గుర్తించ గలుగుదుమనిన్ని-(ఇందు చేతనే ౨౦౦ అంగుళముల దూరదర్శిని (౨౦౦ inch telescope) నిర్మాణము జరుపబడుచున్నది. చాలవరకు సాగినది, విల్సనుశిఖరముననున్న నక్షత్ర పరిశోధనా లయమున) ఈ మొదలైన విషయములనుబట్టి యావద్విశ్వ మును, అనగా బ్రహ్మాండమంతయు నావరించియున్న ప్రదేశముయొక్క పరిమితి అనంతమా యన్నంత పెద్ద దనిన్ని, ఆప్రదేశ మహాసముద్రమందు గుర్తింపబడిన నక్షత్రలోకములన్నియును ద్వీపములవలె ఉన్నవనిన్ని, విశ్వనిర్మాణశిల్ప మిట్టిదనిన్ని గ్రహింపవలసి వచ్చినది. ఇంతియకాక ఇంక నెన్నియో విశేషాంశములు గలవు. వాటిని తెలిసికొనవలెనన్న నక్షత్రముల తత్వమును గురించి అనేక విషయములు తెలిసి కొనవలసి యున్నది. నక్షత్రముల పుట్టుక, పెరుగుట, పరిణామము, నక్షత్రములయందలి ద్రవ్యము (Matter) యొక్క స్థితిగతులు, ఆ ద్రవ్య మెట్టిద్రవ్య బీజముల చేత నిర్మింపబడినది అనునవి. వీటిని గురించి కూడ గడచిన 3౦ సంవత్సరములనుండియు పరిశోధనలు జరుగు

చునేయున్నవి. అట్టివి ఇంగ్లాండునందలి కేంబ్రిడ్జి విశ్వకళాపరిషత్తులో ముఖ్యముగా జరుపబడినవి. అవి యెట్టివనగా, (౧) ద్రవ్యము అనేకరూపములతో మనకు గోచరించుచున్నది. కాని వాటినన్నిటిని పరిశీలించి చూచిన, ౯౨ మూలద్రవ్యముల (elements)చేత ఈభేదము లన్నియును ఏర్పడుచున్నవని రసాయనశాస్త్రవేత్తలు నిర్ణయించియున్నారు. ఇంతటితో తృప్తిపొందక కేంబ్రిడ్జియందలి పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు ఈమూలద్రవ్యములను విద్యుచ్ఛక్తితో పరిశీలించి - ప్రతిమూలద్రవ్యమునందియు ప్రోటాను (Proton), ఎలక్ట్రాను (Electron) అను సూక్ష్మాణువులు (Corpuscles) పుట్టుచున్నవని కని పెట్టి ఈరెంటిమూలముగా మూలద్రవ్యములు చేయబడుచున్నవని నిశ్చయించినారు. (౨) ఈ రెండింటిచేతను ౯౨ మూలద్రవ్యములను - వాటి సూక్ష్మస్వరూపములగు అణువులను - నిర్మించుటలో ౯౨ వేరువేరు విధములు గలవని ప్రత్యక్ష, అనుమాన పద్ధతుల పరిశోధనలు చేసి నిర్ణయించినారు (౩) అట్టి ప్రతిఅణునిర్మాణ శిల్పమందు ఇమిడియున్న ఎలక్ట్రాను, ప్రోటానులయొక్క సంఖ్య సమానమే. మూలద్రవ్యములయొక్క సాంద్రత (Density) లు సమానములుగాక భేదములు. అట్టితారతమ్య భేదములే మూలద్రవ్యాణువులకు గూడ నారోపింపబడినవి. అందుచేత తేలికయైన మూలద్రవ్యాణువున తక్కువగాను బరువైనదానియందు ఎక్కువగాను ఆసంఖ్య ఉండును. (౪) ఆరెండు సూక్ష్మాణువులతోను నిర్మింపబడిన అణువుయొక్క శిల్పము గ్రహములచే చుట్టబడియున్న సూర్యకుటుంబశిల్పమును పోలియుండునని చెప్పవచ్చును. ఎట్లనగా? సూర్యకుటుంబములో సూర్యుడు మధ్యనుండును; గ్రహములు దూరదూరమున వాటివాటి కక్ష్యలలో తిరుగుచుండును. ఈకక్ష్యల కేంద్రస్థానమందే సూర్యుడున్నాడు అతడే గ్రహములనన్నిటిని తనశక్తిచేత ఆకర్షించి చుట్టును త్రిప్పుకొనుచున్నాడు. (౫) సూర్యునిబరువు గ్రహములబరువుల మొత్తముకంటె చాలా అధికము. అందుచేతసూర్యకుటుంబముయొక్క బరువంతయును సూర్యునిబరువుకంటె ఎంతో అధికముకాదు. ఇక మూలద్రవ్యాణువుగురించి ఆలోచింతము. అది ఎలక్ట్రానులతోను, ప్రోటానులతోను చేరిన ఒకపరమాణు (సూక్ష్మాణు) కుటుంబముగదా. ఈ అణువుయొక్క మధ్యభాగమున, కేంద్రస్థానమున, కేంద్రకము (Nucleus) ఉండును. దీనినిచుట్టియే ప్రత్యేకకక్ష్యలలో, దీర్ఘవృత్తముల (Ellipses) లో కొన్ని ఎలక్ట్రానులు తిరుగుచుండును. తక్కిన ఎలక్ట్రానులును, ప్రోటానులన్నియును చేరి కేంద్రకమునందిమిడి యుండును. ప్రోటాను ఎలక్ట్రానుకంటె ౧౮౪౫ రెట్లు బరువుకలిగియుండుటచేత, అణువుయొక్క భారమంతయును కేంద్రమందే యున్నట్టు భావింపవచ్చును ఆకేంద్రకము ధన (Positve) విద్యుచ్ఛక్తితో కూడుకొనియుండును. ఋణ (negatve) విద్యుచ్ఛక్తియుతములగు ఎలక్ట్రానులను ఈ కేంద్రకము ఆకర్షించి తనచుట్టును త్రిప్పుకొనుచుండును. ఇట్టి అణునిర్మాణశిల్పము (Atomic structure) లో ఇంక నెన్నియోవిశేషములు గలవు. వాటిని బట్టి మూలద్రవ్యాణువులయొక్క విశేషగుణములన్నియును బహుప్రయత్నమూలకముగా సాధింపబడినవి.

మరియును విల్సనుపర్వతమందలి పరిశోధనలకును కేంబ్రిడ్జియందలి పరిశోధనలకును గల పరస్పరసంబంధము విచారింతము. సూర్యుడొకనక్షత్రము. అతని భారము అనేకకోట్లటన్నులు. అట్టిసూర్యులు అనేకకోట్లు కలసిన ఒకనక్షత్రమండల మగును. అట్టిమండలము లెన్నియో కలిసి విశ్వమందున్నవి. అందుచేత ఈవిశ్వము విస్తీర్ణతయందేకాక, భారమునందుకూడ అనంతమా యని యోచింప దగియున్నది. అట్టి మహావిశ్వప్రపంచమున ఒక్కొక్క నక్షత్రమన్న అతిసూక్ష్మమగు ప్రదేశము నాక్రమించి అతిసూక్ష్మమగు బరువును గలిగి (విశ్వముయొక్క విస్తీర్ణతను, భారమును బట్టి చూచినప్పుడు) యున్నవనియు, విశ్వశిల్పమునందు నక్షత్రము ద్రవ్యమందలి అణువువంటిదనియు చెప్పుటకు సందేహపడ నవసరములేదు. నక్షత్రమును విశ్వాణువని చెప్పినచెప్పవచ్చును. కాని ఈనక్షత్ర శిల్ప మెట్టిదని విచారించినచో, అది అనేకవేలకోట్ల మూలద్రవ్యాణువులచేత కూర్పబడినదనియు, నక్షత్రముయొక్క పైభాగము వేలకొలదిడిగ్రీలవేడి కలిగియున్నదనియు, లోపలిభాగములలో లక్షలకొలదిడిగ్రీలవేడియున్న

దనిన్ని; ఆ అమితమగు వేడిచేత అందలి ద్రవ్యము పరమాణురూపమును దాల్చియుండుననియును, ఆపరమాణువుల సంఘర్షణ, త్రోశక్కుడు మొదలగు కార్యములచేత, నక్షత్రముయొక్క లావు, బరువు, వెలుగు, వేడి, వయస్సు మొదలగునవి కనిపెట్టవచ్చుననియున్న శాస్త్రమువలన గ్రహింప వీలగుచున్నది. ఇందు మూలమున నక్షత్రముల యొక్క గుణవిశేషములును, వాటివలన నక్షత్రలోకములయొక్కయు, అందుచేత విశ్వముయొక్కయు గుణములను గుర్తింప గలుగుచున్నాము. మహత్పదార్థమగు విశ్వముయొక్క స్వరూపవికారములు గుర్తించుటకై అతి సూక్ష్మములగు అణువులయొక్క స్వరూపగుణవిశేషములు కావలసివచ్చుచున్నవి. అతి సూక్ష్మములగు ద్రవ్యాణువులయొక్క శిల్పమెంత చిత్రమును, గూఢమును నైయున్నదో అట్లే ఈ యనంతవిస్తృతిమైన విశ్వశిల్పము కూడా అతి విచిత్రమును, అతినిగూఢమును నై కన్పట్టుచున్నది. అందుచేతనే విల్సను పర్వతశిఖరమున జరుపబడుచున్న పరిశోధనలున్ను, కేంబ్రిడ్జిలో జరుపబడుచున్న పరిశోధనలున్ను చేర్చి విమర్శించినగాని విశ్వరూపముయొక్క వైచిత్ర్యము తెలియరాదు.

మఱియును ఈ విశ్వముయొక్క విస్తీర్ణతను గురించిన విషయము చాలా అద్భుతమైనది. దేశము (Space) కాలము (Time) అను నీరెంటియందు విశ్వమెట్లు విస్తరించియున్నది అనునది పెద్ద సమస్య. "దేశము అనంతము, కాలమును అట్లే అనాది, అనంతమున్ను రెండింటికిని ఏవిధమైన సంబంధమున్ను లేదు. కాని ఈ విశ్వమందలి చైతన్యము, నటన అంతయును దేశకాలములయందు కలుగుచున్నది" అని ౨౦ సంవత్సరముల క్రిందటివరకును శాస్త్రజ్ఞులూహించియున్నారు. కాని ఐన్‌స్టయిను అను మహామేధావి ఈ దేశకాలములను గురించి చాలా తర్కించి సాపేక్ష (Relativity) వాదమును (Theory) కల్పించినాడు. అనేకసంవత్సరములనుండి నిజమని నమ్ముచున్న విషయములు ఈ వాదమువలన తారుమారు అయిపోయినవి. అది ఎట్లనగా ద్రవ్యము ద్రవ్యమును ఆకర్షించుననిన్ని, ఆగురుత్వాకర్షణ (Gravitaticn) శక్తిచేత సూర్యునిచుట్టు గ్రహములు తిరుగుచున్నవనిన్ని మొదలయిన జ్యోతిస్సిద్ధాంత విషయములు న్యూటనుకాలమునుండియు ఏర్పడియున్నవి. ఆ సిద్ధాంతానుసారముగా పంచాంగము (Almanac) ప్రతివర్షమున గుణింపబడి ప్రత్యక్షముగ దాఖలానిచ్చుచుండెను. కాని కొన్నివిషయములయందు దాఖలా యిచ్చుటలో అతిస్వల్పాంతర వ్యత్యాసములు కలిగియుండుటచేత, వాటిని ఆధారము చేసికొని, వాటికి సరియగు సమాధానముల నియ్యగల సాపేక్షవాదమును ఐన్‌స్టయిను కల్పించినాడు. ఆ వాదమున దేశకాలములకు పరస్పరసంబంధము చెప్పబడియున్నది. దేశకాలములు అనంతములుకావు, ఎంతో అధికమగు విస్తీర్ణతగలవి యైనను నిశ్చిత పరిమితిగలవికాని యపరిమితములు కావు అనిన్ని, దేశకాలములను వేర్వేరుగా భావించక రెండింటిని చేర్చి దేశ-కాలము (space-time) అని ఏకభావముతో ఊహించవలెననియును అతనిసిద్ధాంతము. దేశ-కాలమనగా ఈ రెండును దేనియొక్క వికారములో అది యని గ్రహింపవలసియున్నది. కాని దేశమును, కాలమును వేర్వేరుగా గ్రహించినరీతిగా ఈ దేశకాలైక్యమును మనము మనమున చిత్రించుకొని గ్రహింప వీలులేదు. ఇది గణితముచేత నిర్మింపబడిన యొకవింతవిషయము. దీనిగుణములను తెలిసికొనుటకు గణితమే శరణ్యము, గణితమే సర్వమున్ను. దీనిని మనయూహచేత గ్రహించుటకు, నిరూపించుటకు, ఇదమిత్థమని కొనుటకు వీలులేదు. ఈ విశ్వనిర్మాణ పద్ధతిలోను అణునిర్మాణపద్ధతిలోను ఇట్టి క్రొత్తవిషయములే కాన్పించుచున్నవి. అందుచేతనే సుబోధకములుకావు. రానురాను బ్రహ్మాండ తత్వమును విచారించుటలో ఉహాప్రపంచమున గణితమును కల్పించి దానిమూలమున ఒక్కొక విశేషమును గ్రహింపబడుచున్నది. కాని, ఇదివరకువలె భౌతికశాస్త్ర చర్చలలో నడచుపద్ధతుల ప్రకారము ప్రత్యక్షములను, ఇంద్రియములకును, బుద్ధికిని సుగ్రాహ్యములను అను విషయము దీనిపైన నధారపడించిన వాటియందు కనిపించుట తగ్గిపోవుచున్నది. Objective reality క్రమముగా నశించి subjectivity హెచ్చుచున్నది. సరే, తిరిగి దేశ-కాలముయొక్క గుణగ్రహ





శ్రీ ఎలిజబెత్ రాణిగారు

ణము అతిక్లిష్టమైనను కొంత విచారింతము. ఆ దేశ-కాలముయొక్క ఒకగుణవిశేషమే న్యూటను చెప్పిన గురుత్వాకర్షణసూత్రము (Law of Gravitation) అని 'సాపేక్షసిద్ధాంతమువలన ఏర్పడుచున్నది. బంతికి సుండ్రతన మెట్టిగుణమో, దేశ-కాలమునకు ద్రవ్యాకర్షణ యనునదియును అట్టిగుణమే. అందుచేతనే గ్రహములు సూర్యుని చుట్టు వంపుగలిగిన కక్ష్యలలో పోవుచున్నవట. ద్రవ్యసంపర్కముచేత దేశ-కాలమున గొగ్గి కలుగుచుండునట, వంపు చెందుచుండునట. ఇట్టి విపరీతగుణములు దేశ కాలమునకు గణితముచేత కలుగుచున్నవి. ఇవి మన కెట్లు అర్థములు కాగలవు? ఇదేదో గణితసంబంధమైన భాషయని చెప్పి విడిచిపెట్టుదము. మఱియును ఈ దేశ-కాలమందే విశ్వమంతయును ఇమిడియున్నది. ఈ దేశ-కాలముయొక్క స్వరూపనిరూపణమే విశ్వముయొక్క స్వరూప నిరూపణమునకును సాధనము. ఈ విశ్వము కొంతకాలము విస్తరిల్లుచు తరువాత సంకోచమును జెందుచు నుండు స్వభావము కలదని ఒక పర్యవసానము ఈ వాదమున కలుగుచున్నది. ప్రస్తుతకాలమున విశ్వము విస్తరిల్లుచున్నదని (Universe is now expanding) విల్సను పర్వతమందలి శోధనలవలన ఊహించవలసి వచ్చుచున్నది. కాని విశ్వనిర్మాణతత్త్వము (Cosmogony) ను ధీశాలులగు శాస్త్రజ్ఞులు ఐన్‌స్టైను, డిసిట్టర్, లిమాప్రేమిట్నె మొదలైనవారు పరి పరి విధముల పరిశీలించుచున్నారు. కాని నిశ్చయమను దారి యింకను గోచరించుటలేదు.

మఱియును, విశ్వనిర్మాణమును పూర్తిగా సర్తించుటలో చాల ముఖ్యము లగునవి ద్రవ్యమును, శక్తి (Energy) యును. ఇదివరలో ద్రవ్యనిర్మాణపద్ధతిని కొంత వ్రాసియుంటిని. ద్రవ్యము ప్రోటాను, ఎలక్ట్రానులవలన కూర్పబడినదిగా గ్రహించియుంటిమి. కాని యీ మధ్య ౩, ౪ సంవత్సరముల క్రిందట ద్రవ్యనిర్మాణమునకు మూలములగు పరమాణువు లింకను రెండు కనిపెట్టబడినవి. న్యూట్రాను (Neutron) పాజిట్రాను (Positron) అని వీటికి పేర్లు. ఇవి కనిపెట్టబడిననాటి నుండియును అణువులోని కేంద్రకమును గురించి పరిశీలనము హెచ్చుగా చేయబడినది. కేంద్రకమున న్యూట్రాను, ప్రోటానులు మాత్రమే యున్నవనియును, ఎలక్ట్రానుల కచ్చట తావు లేదనియును తేలినది. ఈ కేంద్రక నిర్మాణక్రమ మింకను స్పష్టపడలేదు. పడినచో యెన్నియో గొప్పవిశేషములు దానివలన వెలువడగలవని నమ్ముచున్నారు. ద్రవ్యమును గురించిన చర్చ ఇక చాలించి శక్తిని గురించి కొంతవిచారింతము. స్థావరముగా నున్నప్పటికంటె విసిరివేయబడినప్పుడు రాతిముక్కకు శక్తిహెచ్చుగానుండును. ఇది గమనముచేతకలిగిన ఒకవిధమైనశక్తి. ఇట్టిది ద్రవ్యమునకు చలనమువలన కలుగుచుండును. వాయుశక్తియు, శబ్దశక్తియు నిట్టివే. ఇవిగాక వేడి, వెలుతురు, విద్యుచ్ఛక్తి, ఎక్సు (x) కిరణములు మొదలయినవియును శక్తులే. ఇవి ఒకేవిధమైన శక్తియొక్క వికారములు. ఈ శక్తిని సామాన్యముగా తేజస్సు (Radiation) అను పేర వాడుదురు. ౩౦ ఏండ్లక్రితమువరకు ద్రవ్యమునకును, శక్తికిని సంబంధము లేదనియు, ప్రపంచమందలి ద్రవ్యముయొక్క మొత్తపుపరిమాణము గాని, శక్తియొక్క మొత్తపు పరిమాణము గాని ఎన్నటికి మారనేరదనియు, వాటిని పుట్టించుటకు గాని, నశింపచేయుటకుగాని సాధ్యముకాదనియు నిశ్చయింపబడినది. కాని యీ యభిప్రాయములందుకూడ ఐన్‌స్టైను మహాశయుడు గొప్పమార్పులను కల్పించి, సమర్థించినాడు. ద్రవ్యమును శక్తియును వేరువేరుకావనియు అవినాభావములనియు, ఒకదానినుండి ఒకటి పుట్టగలవనియు ఆతడు సూచించినాడు. ఇంతద్రవ్యము నశించినచో ఇంతశక్తి ఉద్భవించునని లెక్కగూడ కట్టి చూపినాడు. ద్రవ్య, శక్తుల సగటు మొత్తపు పరిమాణము మాత్రము ఎన్నటికిని మారనేరదనియు, ఒకదానినుండి మరియొకటి కలుగుచున్నను రెంటి మొత్తమునకును హెచ్చుతగ్గులు కలుగ వీలులేదనియు ఐన్‌స్టైను స్థిరపరచినాడు. ఈవిషయములు విశ్వరూపమును గ్రహించుటలో చాలాతోడ్పడుచున్నవి. ఎట్లన, విశ్వమందలి కోటానుకోట్ల సంఖ్యగల నక్షత్రము లెంతకాలము నుండియో సదా తమవెలుతురును వెదచల్లుచున్నవే,

ఆవెలుగంతయు నెచ్చటినుండి పుట్టుచున్నది? ఏమగుచున్నది? అనుప్రశ్నలకు సమంజసములగు ఉత్తరములను ఈవిషయములు కల్పింపగలిగినవి. సూర్యుడు మొదలగు నక్షత్రములు ప్రతిదినమునను వెలువరించు తేజస్సు ఆయాగోళములయందలి ద్రవ్యము నశించుటచేత కలుగుచున్నదని నిర్ధారణ చేయబడినది. సూర్యుని వెలుతురును బట్టి అతడు ప్రతిరోజున ౩౬౦౦౦ టన్నుల బరువుగల ద్రవ్యమును కోల్పోవుచున్నాడని లెక్క తేలుచున్నది. కాని ఈబరువు సూర్యునిబరువులో నూరువేలకోటవవంతుకూడా ఉండదు. కనుకనే, సూర్యగోళము కట్టి యాపద రానైయున్నది యను పైయాలోచనలతో నిప్పుడవసరము లేదు. ఇంతటిలో ఏప్రమాదమునకున్న అవకాశము లేదు. పర్యవసాన మేమనగా ఐన్‌స్టయిను వలన మనయభిప్రాయములలో కలిగిన గొప్పమార్పులు రెండు. అవి యేవనగా,

౧. దేశమును కాలమును వేరుకావు, అనంతములు కావు. దేశ-కాలమను ఏకవస్తువుయొక్క వికారములనియు.

౨. ద్రవ్యము, శక్తి వేరుకావు, అవినాభావములు, రెండును చేరి నిత్యముగా శక్తి-ద్రవ్యమను పేర నుండుననియు.

మఱియును, ద్రవ్యనాశనమున తేజస్సు పుట్టుచున్నటులే, తేజోనాశనమున ద్రవ్యముకూడ పుట్టనక్కరలేదా యనుప్రశ్న సమంజసమేకదా. తేజస్సు ద్రవ్యముగా ఘనీభవించుచున్నదని సూచనలు కనబడినవిగాని నిశ్చయించిచెప్పుటకు తగినసాక్ష్యమింకను దొరకలేదు.

ఐతే ఇన్నివిధములైన విమర్శనలవలన తేలిన ఫలితార్థ మేమి? ద్రవ్యాణువులయొక్కయు, నక్షత్రములయొక్కయు స్వరూపనిర్మాణ రహస్యములను శాస్త్రము పూర్తిగా కనుగొనగలిగినదా? లేదు. దేశ-కాలము, శక్తి-ద్రవ్యము అనురెండు మూలపదార్థముల కును సంబంధమేమి? ఈరెంటికలనను విశ్వసృష్టి ఎట్లగుచున్నదో తేలినదా, ద్రవ్యము - శక్తి ఎట్లు పుట్టినవి? ద్రవ్యమునకు పూర్వస్థితి తేజస్సని నిర్ణయింతముగాక! విశ్వమంతయును తేజఃపూరితమనియే యూహింతముగాక. తేజస్సునందు అనేకభేదములు - కంటికి గోచరించువెలుగు, వేడి, X-కిరణములు మొదలైనవి-ఎట్లు కలుగుచున్నవి? తేజస్సుకూడ పరమాణు (Photon) రూపమును దాల్చియున్నదని యొకసిద్ధాంతము కలదే. అందును భేదములు కలవే. ఆపరమాణువులయందు భేదమేల గలుగుచున్నది అనుప్రశ్నలు ప్రశ్నలుగానే యున్నవిగాని సమాధానములు కానరావు. ఒకవేళ, శాస్త్రము ఇంకొకఅడుగు ముందుకు వేయగలిగినను అవెనుక ఏమి ఆవెనుక ఏమి యని శాస్త్రమును తఱుముచునే పోవచ్చును. అందుచేత ఏదో ఒకమితివరకు మాత్రమే శాస్త్రము మనకు సహాయము చేయగలదని తోచుచున్నది. ఈసందర్భమున ఒకవిషయము తెలిసికొనదగియున్నది. ఐన్‌స్టయిను సాపేక్షసిద్ధాంతము వలన ఈ విశ్వసృష్టియొక్క ఆరంభము ఒకతీగన గ్రహింపవచ్చును. ఎట్లన? దేశ-కాలమనునది నిత్యమై, నిశ్చలమై (Stable) భేదరహితమై (uniform) ఉన్నదని అనుకొనవలెను. దానియం దేకారణముచేతనో గాని మార్పు పుట్టిన యెడల ఆదేశ-కాలమను విశ్వమందు ద్రవ్యము సిద్ధించుచున్నది. ఈరీతిగా ద్రవ్యసృష్టి యగుచున్నదని ఈసిద్ధాంతము తెలియజేయుచున్నది. ఇట్టిసమాధానములను శాస్త్రముచేత మన మెన్ని గ్రహించుచున్నను, దేశ-కాలమున మార్పు ఏల కలుగవలెను; ద్రవ్యమేల నశించవలె, నశించినశక్తి-తేజస్సు ఏల పుట్టవలె, అనుప్రశ్నల నారంభించిన శాస్త్రము సమాధానముల నియ్యనేరదు. అది దానిపని కాదు. ఏది ఎట్లు జరుగుచున్నదో ఆసందర్భవివరణ (Description) మాత్రమే దానిపనికాని ఏల అనుప్రశ్నకు శాస్త్రమునందు తావులేదు. వస్తుప్రవర్తన (behaviour) నేగాని వస్తుతత్త్వము (what things are) ను శాస్త్రముచెప్పజాలదు. కాని అంతటితో తృప్తిలేక ఏల యను పైప్రశ్నలు కలుగకమానవు. కలిగినతోడనే మనము వేదాంతోన్ముఖులము కాగలము. సర్ ఆర్థరుఎడ్డింగ్టను అంతటిశాస్త్రజ్ఞుడుకూడ శాస్త్రమును వదలి, అంతరంగోద్బోధకములగు విషయములను చర్చింప

దొడగినాడు. అటుగాక, ఆ మార్గమునకును, శాస్త్రమార్గమునకును ఏమియును సంబంధము లేదు కావున అనిర్వాచ్యమును, అనిర్దేశ్యమును, మానసేంద్రియములను దాటి అపరోక్షమును, ఆధ్యాత్మికమును అగు వేదములయందలివియు, ఉపనిషత్తులయందలివియు వాక్యములను ఈశాస్త్రచర్చలతో సమన్వయించుటకు ప్రయత్నించరాదు. వేదవాక్యములు "యోగాగ్నిదగ్ధకర్ములు, యోగీశ్వరులు" ఆత్మవిద్యచే నెరిగినవి గనుక, ఇంద్రియగోచరమును, ప్రత్యక్షమును అగు ప్రమాణములవలన నెరిగిన శాస్త్రవిషయములతో చేర్చి చర్చించిన సమన్వయము కానేరదు.

ఇట్టి విషయములను తెలిసికొనగలుగువారి మనస్సు వికాసమును జెందును, జ్ఞానము వృద్ధిజెందును. హృదయము విశాలమగును. అనేక కారణములచేత కృశించియున్న మానవజీవితమునకు ఇట్టి విషయజ్ఞానమువలన నిలుకడయును, నిర్మలత్వమును, ఉత్సాహశక్తియును ప్రాప్తము కాగలవు. బ్రహ్మాండముయొక్క విస్తీర్ణతను, మానవు డాక్రమించగలచోటును పోల్చి చూచినచో ఆత డాక్రమించునది శూన్యమనియే చెప్పవచ్చును. దీనినిబట్టి, మానవునిస్థితి చెప్పుటకువీలులేనంతటి హీనమైనదని, మిక్కిలి తక్కువదానికంటె తక్కువ దని తోచిన తోచవచ్చును. కాని, బ్రహ్మాండముయొక్క గొప్పదనమును, మహత్తును గ్రహింపగల తనమనస్సు ఎట్టిమహత్తరమైనదో, ఎట్టిశక్తివంతమైనదో ఊహించినప్పుడు మానవు డుత్సాహపూరితుడు కాకపోడు.



తులసిపూజ —M. R.

# సన్న్యాసము

వేలూరి శివరామశాస్త్రి

వామనస్తుతిచేసి వాగునకుంబోయి స్నానంబుగావించి సంధ్యవార్చి
పల్లెరంబుంబూని బాపనవాడలో నిల్లిల్లుదిరిగి పూ లేతెతెచ్చి
దేవతార్చన వైశ్వదేవంబు నొనరించి గోవింద యనుకొంచుఁ గూడుకుడిచి
అరఁటిపం డొలిచినయటులు శిష్యులకును ప్రస్థానములు మూఁడు దరఁగఁ జెప్పి
గ్రామమంతయు మూఁగఁ బురాణకథలు - శ్రావ్యముగవిన్పి పదిమంది భక్తజనులురాఁగ
హరిభజనసేయు చిట్టు లహస్సులెల్ల - గడపువాఁ డొక్క బ్రాహ్మణాగ్రణి కలండు.
'నేఁడు మఱిమెల్లి మెల్లయు - వీఁడుదు సన్న్యాసవిధిని వెసఁగొందు' నటం
చాడుకొనుచుండు నతఁడే-నాఁడు విరాగముగఁ దన మనంబునయందున్.

ఈమెయి సన్న్యాసంబుం - బ్రేమించుచు నున్నయట్టి ద్విజవర్యునితోన్
గ్రామాచారపు యోగ-క్షేమవిధులు భక్తులిటులు సెప్పిరి చెవిలోన్.

'వేదాలవారికోడలు - మాదలమల్లయ్యతోడ మరగినయది తా
నీదినమునఁ బతికులమున - బూదెను వెదఁజల్లి లేచిపోయినది చుఁడీ!

ధనమేమితక్కువా తా నింతదిని లేనియట్టివారికి నింత పెట్టవచ్చు
చనవేమి కొలఁదియా పెనిమిటితోఁగల్పి యింటిల్లిపాది తా నేలవచ్చు
వలపేమి వెలితియా భర్తయుండఁగనె వాఁ డనారతంబును మూతి నాకవచ్చు
ఒత్తిడి యెక్కువా యత్తమామలకుచు గన్నకూఁతురుమీఁదకన్నఁ బ్రేమ
వెలఁగావచ్చు నూరెల్ల సీలువున్నఁ - గాలుజాఱించె దీనమ్మ కడుపుకాల!
మల్లిగానిని వెలివేసి మట్టకున్న - బ్రాహ్మణత్వంబు తాఁ బాడుపడదె చెప్పుఁడ!'

అనవిని బ్రాహ్మణుఁ డిటులనె- 'వనితామణి కొక్కకోటి వందనములు నా
వనుఁ డబల యయ్యు నాకన్నను బలముం బొంది యెజ్జ నా కాయెంజూఁడీ!

అత్తకు మామకున్ వెఱవ కమ్మకుఁ దండ్రికిఁ గాక యింకఁ బై
మెత్తగు నమ్మలక్కలకు నించుక జంకక భర్త నెంత యా
పత్తుగ రోసెనో హృదయవర్తిని నెంతగఁ బ్రేముడించెనో
చిత్తములం దెఱుంగుదురె శిష్టులు శుష్కనయప్రచారకుల్.

వీసముగాని యొక్కయర్ధవీసముగాని తదీయ సాహసా
భ్యాసము నాకు నున్నెడ దశాబ్దికిఁ బూర్వమె యామె పెన్మిటిన్
రోసినయట్లు సంసృతిని రోయనె? మల్లయ నామె ప్రేమచే
డాసినయట్లు ప్రేమమున డాయనె నర్మిలి నామనఃప్రియున్?

ఎంచకుఁడు పైనినల్పును - గాంచుఁడు మస్నిట్ క్రిందఁ గల ముత్తెపుఁ దె
ల్పంచుఁ బుటుక్కన జందెము - త్రెంచి యుడుకుపోతుటీఁగవోలె ద్విజవరుఁ డేఁగెన్.

# పోలయ్య

విశలాపురాగ్రహారం వైదీకి బ్రాహ్మణ్యం పుట్ట. అనాది అగ్రహారం. ఆ అగ్రహారంలోగల రెండు వందల బ్రాహ్మణకుటుంబాలలోకీ వెంకటశాస్త్రి మకుటంవంటివాడు - గొప్ప తర్కశాస్త్ర పండితుడూ, వైయాకరణీ, నైష్ఠికుడూను. త్రికాలములా సంధ్యా వందనం చేసుకోనిదే గంగ తాకడు. సనాతనధర్మం అన్నా, వర్ణాశ్రమధర్మంఅన్నా చెవి తెగ్గోసుకొంటాడు. చిన్నతనంలో తల్లిదండ్రుల్ని విడిచి కాశీకి వెళ్ళి పదేళ్లుగా గురుకులవాసంచేసి శాస్త్రం పఠించిన పండితశ్రేష్ఠుడు.

ఆయనకు పంచములంటే సుతలావూ సరిపడక పోవడం అంతగా ఆశ్చర్యకరమైన విషయం కాదు. పంచములంటే పనికిరాని బ్రాహ్మణోత్తము లెంతమందో లేకపోలేదు. కాని వెంకటశాస్త్రిమట్టుకు వాండ్ల విషయమై ప్రత్యేకకృషి చేశాడు. గాంధీగారు అస్పృశ్యతా నివారణోద్యమం ఆరంభించింది లగాయతు పంచములను గురించి ఆయన అనేక గ్రంథాలు తిరగేసి, కూలంకషంగా గాలించి పంచముల పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి గొప్ప పరిశ్రమచేసిన పరిశోధకుడు. అసలు పంచములు హిందూ మతానికి సంబంధించినవారు కారని ఓంప్రథమంలో నూతనసిద్ధాంతాన్ని లేవదీసిం దీమహనీయుడే!

ఆ బ్రాహ్మడికి వయస్సుముదిరినకొద్దీ, చేసిన గాఢమైన పరిశోధనాఫలితంవల్ల, చిన్నతనంలో ఆయనకు పంచములవిషయమై ఉండిన అభిప్రాయాలన్నీ వయస్సుతోకూడా ముదిరి, స్థిరపడి, నఖశిఖపర్యంతమూ గాటంగా నాటుకొనిపోయినవి. రానురాను ఈకృషిలో ఆయన కత్యంతమైన విశ్వాసమూ, ఆనందమూ కలుగుతూ వచ్చింది. అందువల్ల ఆయన కాశీ విడిచి, ఇల్లు చేసుకొని వివాహంచేసుకొన్నదిలగాయతూ, ఈముప్ఫై ఏళ్లుగా స్వగ్రామంలోనే బ్రాహ్మణవిద్యార్థులకు విద్యాదానం చేసుకొంటూ కాలక్షేపంచేస్తూ వచ్చినప్పటికీ, అస్పృశ్యతను తొలగించవలెననీ, పంచములకు హరిజనులని నూతన నామకరణంచేసి వారికి దేవాలయ ప్రవేశం కూడా ప్రసాదించవలెననీ - ఇట్లాంటి బిల్లులూ, ఉద్యమాలూ, ఉపన్యాసాలూ బయల్దేరేవరకు, ఆయన కాపాదమస్తకమూ ఒళ్లు కంపించిపోయి తనకళ్లయెదుట సనాతనధర్మం చచ్చిపోతూఉండగా, తనవంటివారు చూస్తూ చేతులు ముడుచుకొని కూర్చోవడం భావ్యం కాదని, సనాతనధర్మోద్ధరణకోసం నడుంకట్టి రణరంగంలోకి దూకినాడు. ఆక్షణం లగాయతూ నూతనోద్యమాన్ని రూపుమాపి సనాతనధర్మం స్థాపించే పని మీద, ఆయన తిరగనన్ని దేశాలూ తిరిగి తిరిగి వేసరిపోతూ ఉన్నాడు.

ఇంటివద్ద సంసారం యావత్తూ చేతికెక్కివచ్చిన ఇరవై ఏళ్లకొడుక్కి వప్పగించి, మాలమాదిగలను పైకి రానియ్యకుండా చేసే కృషిమీద ఉత్తరహిందూ దేశంలో పర్యటనం నిమిత్తం ఇప్పటికి రమారమి రెండేళ్ల క్రిందట బయల్దేరి వెళ్లాడు. కాశీ, గయా, ప్రయాగా, బదరికావనం, ఢిల్లీ, పంజాబు, బరోడా వగైరా స్థలములలో అనేకమంది పండితులతో పంచములకు సంబంధించిన విషయాలన్నీ చర్చించి, కొత్తవిషయాలెన్నో సేకరిస్తూ, తన సిద్ధాంతాలను దృఢపర్చుకొంటున్నాడు. ఆఖరుకు పంచములు హిందూమతంవదలి అన్యమతాల్లో కలుస్తామని తీర్మానించుకొన్నట్టు వదంతి పుట్టేవరకు 'పీడ వదిలిం' దని వెంకటశాస్త్రి బ్రహ్మానందం పడుతున్నాడు.

ఇల్లువిడిచిన ఇరవై రెండు నెలలకు ఇంటిదగ్గర తనకొడుక్కి కొమారుడు కలిగాడనీ, ఆ సంవత్సరం మాఘశుద్ధ పంచమీ మంగళవారం ఉదయం ౯ గంటలకు మనుమడికి భారసాల జరపవలసి ఉందనీ, ఆ నాటికి పెద్దవాడయిన తాతగారు తప్పక రావలెనందనీ, ఉత్తరాలమీద ఉత్తరాలూ, టెలిగ్రాములమీద టెలిగ్రాములూ రాగా, ఇక ముహూర్తం నాలుగురోజులుం

దనగా వెంకటశాస్త్రి కాశీలో బయల్దేరి ఏకాయెకీని సోమవారం రాత్రి ౧౧ గంటలకు తనగ్రామానికి సమీపంలో ఉన్న పుంజూరుస్టేషన్‌లో రైలు దిగాడు.

పుంజూరు నెల్లూరికి దక్షిణంగా పోతే మూడో స్టేషన్. ఆస్టేషన్ కొంచెం పెద్దస్టేషన్‌లోనే, అనగా సెకండుక్లాసు స్టేషన్‌లోనే లెఖ్ఖ అయినప్పటికీ, ఆరాత్రిమట్టుకు వెంకటశాస్త్రితోకూడా ఏ అయిదారు గురోకంటె జాస్తిగా జనం దిగలేదు. వెంకటశాస్త్రి రైలు దిగీదిగడంతోనే గేటులో టిక్కట్టు ఇచ్చేసి, కాశీగంగచెంబులూ, తనగుడ్డలూ కలిపినమూట ఒక చేత్తోనూ, జారీరాగిచెంబు మరొకచేత్తోనూ పట్టుకొని గేటుదాటి బయటికి వచ్చాడు.

పుంజూరుస్టేషన్‌కీ వితలాపురానికీ పద్ధెనిమిది మైళ్లు బరువుగా ఉన్నది. పదహారుమైళ్లు కంకరరోడ్డుమీదా, రెండుమైళ్లు మట్టిరోడ్డుమీదా పోవాలె. ఆరోడ్డుమీద రాత్రి అనకుండా, పగలనకుండా ఎప్పుడూ ఎడతెరపిలేని రహదారీ ఉంటూ ఉండేది. ఆ రోడ్డు పుంజూరునుండి గంగపట్నంమీదుగా తూర్పు సోమేశ్వరం వరకూ ముప్ఫైమైళ్లు పోతుంది. ఏ పొద్దుల్లో ప్రయాణంచేసినా భయంలేని రస్తాకాబట్టి, రైలు దిగంగానే బండి కట్టుకుంటే కాకులు కూసేవేళకు అలాగ్గా ఇల్లు చేరుకోవచ్చుగదా అనుకొని సోమవారం రాత్రి బండికే వచ్చాడు వెంకటశాస్త్రి. కాని ఏ రైలుకు చూచినా కిలకిలమంటూ ఒంటెద్దుబళ్లవాళ్లు ప్రయాణీకుల కాళ్లకడ్డంతగిలి చేతిలో మూటలు పెరుక్కొని పొయ్యే సమ్మర్దంగల ఆస్టేషన్‌దగ్గర ఆ రాత్రి వెంకటశాస్త్రికి ఒక్క ఒంటెద్దుబండి అయినా కంటిలో కలికానికికూడా కనుపించలేదు.

రాత్రి పదకొండున్నరా, రమారమి పావుతక్కువ పన్నెండూ కావొచ్చింది. వెంకటశాస్త్రి దిగినరైలు కూతేసి వెళ్లిపోయి చాలాసేపయింది. తనతోకూడా దిగిన జనం ఎట్లా వెళ్లారో ఎవరిదారిన వారు వెళ్లారు. రాత్రిడ్యూటీచేసే రైలుఉద్యోగి గేటుతలుపు బిగించి, పోర్టరూ తనూ అప్పుడే చెరొక బెంచీమీదా నడుములు వాల్చారు. స్టేషన్ నిశ్శబ్దంగా ఉంది. పైన వ్రేలాడకట్టిన లాంతరుదీపం తగ్గింపబడి, మినుకు మినుకుమంటూ ఉంది. స్టేషన్‌మెట్లుదిగి పడమటగా ఉన్న మైదానంవైపు వెంకటశాస్త్రి పరకాయించి చూచాడు. ఆ ప్రదేశం అంతా నిరామయంగా ఉంది. తాను రెండేళ్లక్రిందట చూచినస్థలంతో పోల్చుకొంటే ఇప్పటి ప్రదేశం పాడుపెట్టిన ఇల్లువలె కళాహీనమై కన్పట్టింది. శుద్ధపంచమీనెల కాబట్టి చాలా లేతవయస్సులోనే దానికి కాలంగడిచిపోయింది. వెంటనే చీకటి విజృంభించి అలుముకొంది. మాఘమాసం. మంచుకురుస్తోంది. చలి దవడలు నొక్కేస్తూవుంది. బిగబట్టినచేతిపిడికిళ్లు విప్పితే శరీరం యావత్తూ పీక్కొని తినేటట్టుగా ఉంది చలి. వెంకటశాస్త్రిది అంత ముసలి వయస్సు కాకపోయినా, ఏభయిదాటి అరవైలో పడ్డఘటం. అందువల్ల అంత తీవ్రమైన చలికిగాని, ఎండకుగాని పూర్వంలాగా ఓర్చుకోలేకపోతున్నాడు. ఏమయినప్పటికీ, తెల్లవారకుండా ఆ పద్ధెనిమిదిమైళ్లు ప్రయాణం చేసితీరాలె, విధిలేదు. వెంటనే బయల్దేరితేనేగాని అనుకొన్న ప్రకారం ఇంటికి చేరుకోలేడు. ముహూర్తానికి ముందుగా అందకపోతే చేసినప్రయత్నం వృథా అయిపోవడమే కాకుండా తాను రానందుకు ఇంటిదగ్గర ఖంగారుపడతారేమో! బాడుగబండ్లను నమ్ముకొని ప్రయాణం చేశాడు. తాను ఇల్లువిడిచిన ఈ రెండేళ్లలో కాలపురుషుడు కలుగచేసినమార్పు లాయనకేం తెలియగలవు? "స్టేషన్‌కు ఇంటిదగ్గరనుంచి బండిని పంపవలసిందని అబ్బాయికి జాబువ్రాసినా బాగుండిపొయ్యేది. ఎంత పొరపాటు పడ్డాను" అని తనలో తానే పస్తాయించుకొన్నాడు. కొంతసేపటికి, అసలు ఆ స్టేషన్ పుంజూరు స్టేషనేనా అని ఆయనకనుమానం వేసింది. ప్లాటుఫారంమీదకి వెళ్లి చెక్కమీది అక్షరాలు చదువుకొన్నాడు. "పుంజూరు" అని ఆయనకళ్లకు కనిపించింది; మనిషికి అనుమానం తీరింది; కొంత ధైర్యం కలిగింది.

కాని ఏంలాభం! ప్రయాణం సాగేఎత్తు కనపడడం లేదు. ఒక్కబండి అయినా లేకుండా ఇంతశూన్యం

కావడానికి కారణ మాయనకు గోచరించడంలేదు. ఎవరి నైనా అడిగి తెలుసుకొందా మనుకొన్నాడు. కాని ఎక్కడా మనిషిసంచారం లేదు. సర్వమూ నిశ్శబ్దంగా ఉంది. కీచురాళ్ల కీచుకీచుకూతలూ, ఎక్కడనో దూరంగా మొరిగే కుక్కల అరుపులూ, కప్పల బెక బెకలూ తప్ప మరోకధ్వని శాస్త్రి చెవికి సోకడం లేదు. పోనీ, గ్రామంలోకి పోయి బండ్లకొరకు విచారిద్దామా అనుకొన్నాడు. కాని ఒక మైలుపోతేనేగాని ఊరు కనపడదు. ఆ అంధకారంలో, ఆ చలిలో, ఆ మూట భుజానవేసుకొని అంతదూరం పోలేక పోయాడు. ఆయన కేమీ పాలుపోకుండా ఉంది. ఏమీతోచక - మంచులో తిరిగితే రాత్రి నిద్రలేక జలుబు భారం చేస్తుందేమోనని - బయట మైదానంలో తిరిగే మనిషి, స్టేషన్ హాల్లోకి పోదామని వెనక్కి తిరిగి, నాలుగడుగులు వేశాడు. ఇంతలో పడమటితట్టునుండి ఏదో ఒకబండి వస్తున్నట్టు చప్పుడయింది. శాస్త్రి తటాలున వెనక్కి తిరిగి చూశాడు. ఒంటెద్దుబండి ఒకటి వచ్చి ఆతట్టు ఎడంగా ఉన్న ఒక వేపచెట్టుక్రిందికి పోయి నిలిచింది. వెంకటశాస్త్రికి కొంత ఆశ కలిగింది. పరవాలేదనుకొన్నాడు. వడివడిగ్గా పదిబారలదూరం అడుగువేసుకొంటూ పొయ్యేవరకు, బండివాడు ఎద్దులను విప్పి, కాడి క్రిందపెట్టి, చాపక్రిందిగడ్డితీసి అప్పుడే ఎద్దు ముందర వేశాడు. గడ్డి తినడానికిగాను, బయట నిలబడిన ఎద్దు నగలదొడ్డిలో ఒకకాలు ముందుకు వేసి, మెడకిందా పొట్టకిందా పుటుకుపుటుకున కుట్టే జోరీగలను మూతితోనూ, చెవులతోనూ, తోకతోనూ తోలుకుంటూ, ఇంకా గడ్డిలో మూతిపెట్టకుండానే నిలబడి ఉన్నది. పండుకొని నిద్రపోదామని బండివాడు ఈతాకులచాపను బయటికి తీయబోతూ ఉన్న సమయంలో వెంకట శాస్త్రి వెళ్లి

"అబ్బీ! విఠలాపురానికి బండికడతావా?" అని అడిగాడు.

"విఠలాపురమూలేదు, గిఠలాపురమూ లేదు. వెళ్లవయ్యా!" అన్నాడు బండివాడు.

"బాబుకదూ! నా తండ్రికదూ! నేను చాలా తొందరగా పోవాలె. ఇప్పుడు ఎకాఎకిని పోకుంటే నాకు చాలా తొందరపనులు చెడిపోతవి. నాకోసరం కాస్త కష్టపడుదూ నాయనా! పెద్దవాణ్ణి! బహుమంచి వాడివి" అని ప్రాధేయపడ్డాడు శాస్త్రి.

"నాకు నిద్రొస్తోంది తాళవయ్యా! పండుకోవాలె" అని బండివాడు చాప నేలమీద పరిచాడు. నిద్రబద్ధకం తోసుకురావడంచేత చాపమీద నడుంవాల్చాడు ఇక ఆ బ్రాహ్మణుడు బండి కట్టమని 'బాబుకాదూ, నాయనకాదూ' అని ఒకటే బ్రతిమాలడం మొదలుపెట్టాడు. బండివాడు కట్టలేనని విసుక్కోవడమూ, బ్రాహ్మణుడు బ్రతిమాలడమూను చివరకిది పని కాదని

"ఇదుగో చూడు. నువ్వుకోరినంత బాడుగిస్తాను. రూపాయిన్నర ఇస్తాను తీసుకో; లే! ఎక్కడా బండి చిక్కలేదు నాకు. గిరాకీగా ఉంది: పోగొట్టుకోబోకు" అని ఆశపెట్టాడు శాస్త్రి.

"ధనమూల మిదం జగత్" కదా! మామూలు బాడుగకంటె అర్ధరూపాయి అధికంగా వచ్చేసాగీ కనపడేవరకు బండివాడికి ఆశపుట్టింది. వెంటనే వాడు చాప చుట్టి బండిలోవేసి,

"ఎంతమంది మనుష్యు"లని అడిగాడు.

"నేనొక్కణ్ణే" అన్నాడు శాస్త్రి.

బండివాడు ఎద్దుముందరవేసిన గడ్డిని బండిలో చాపకింద తురిమి, నగఎత్తి, ఎద్దును అంకెకు తెచ్చుకొని, కాడి అగ్రుమీదపెట్టి, మెడపలుపు బిగించాడు. వెంకటశాస్త్రి జారీచెంబు చేత్తో తీసుకొని, కాలు ముడిచి అనుమానం తీర్చుకొని, ప్రక్షాళన అయినతర్వాత మూటతెచ్చి బండిలో పెట్టాడు. కాలిచెప్పులు చాపకింద భద్రపరచి, "పట్టుకో" అని బండివాణ్ణి హెచ్చరించి, "రామయ్యతండ్రీ" అంటూ బండిలో ఎక్కి కూర్చున్నాడు. పదిగజాలదూరం రోడ్డు ఎక్కేవరకూ బండివాడు నగ పట్టుకొనే నడిపించి, రోడ్డెక్కిన తర్వాత పగ్గం బండివెదురుదబ్బలకు కట్టి, నగలో ఎక్కి కూర్చు

న్నాడు. వాడు కొరడాకోసం ఇంకా తడువులాడుకొంటూ ఉండంగనే ఎద్దు మెల్లగా పరుగందుకొన్నది.

రాత్రి చాలా పొద్దుపోయింది. ఒంటిగంట కావచ్చింది. రెండురోజులుగా ప్రయాణం బడలికచేత పాపం బ్రాహ్మడు డస్సిపోయాడు. కాస్త కన్ను కూర్కుదామనుకొని, నడుమువాల్చి తలకిందికి మూట లాక్కున్నాడు. "వెనకబరువు సామీ" అని బండివాడు హెచ్చరించేవరకు మూటతోసహా తాను ముందుకు జరిగాడు. మూటా, మూటమీద పెట్టుకొన్న తనతలా, బండివాని పృష్ఠానికి వెళ్లి తగులుకున్నవి. "రవంత వెనక్కు అనండి. ముందు బరువయిం" దన్నాడు బండివాడు. బండివాని సహాయంతో మూట కొంచెం వెనక్కు లాక్కుని, బండివాడు "ఆ" అన్నతర్వాత, శాస్త్రి కాశ్మీరశాలువ కప్పుకొని, ముసుగుతన్ని, కాళ్లు ముడుచుకొని, ఒత్తిగిలి మూడో అంక వేసి పండుకొన్నాడు.

బండి రెండుమైళ్లు సాగిపోయింది. ఆ బండి వట్టి పాతతుక్కు; ఎప్పటిదో ఇక్ష్వాకులనాటిది. అందులో అడ్డబండి. శాడుగ బల్లవాళ్లకు కమానుబ ల్లెక్కణ్ణుంచి వస్తాయి? పైన గూడుకు వేసిన ఈ తాకులచాప చాలాభాగం శిథిలమై, బండిలో పండుకొని పైకిచూస్తే ఆకాశంలో నక్షత్రాలు అగుపడుతూ ఉన్నవి. బండి చక్రాలకు వేసిన సామాను కులంగలకొయ్య కానందువల్ల, చలికి బిరబిగిసి, ఆకులూ, పూటీలూ వంకలపోయి, ఎడుదిడుగా బండికి దొడ్డి ఏర్పడింది. కండల్లోని ఉలవాయిలూ, ఇరుసుకడలూ అరిగిపోయి, కుండతూముల్లో సందు ఏర్పడి, వదులుకల్ల కుండలు రెండూ ఆపక్కకీ, ఈపక్కకీ జరిగి కడసీలలకు టక్కుటక్కుమని తట్టుకొంటూ ఉన్నవి. ఆ తట్టుకోవడంలో అసలే దొడ్డిచక్రాలయినందువల్ల బండిచట్టం యాగత్తూ ఆపక్కనుంచి ఈపక్కకీ, ఈ పక్కనుంచి అపక్కకి ఊపు ఇస్తోంది. అందులో గతుకులున్నచోట, చక్రం పల్లానికి దిగి మిర్రుకెక్కడంలో, ఎద్దుమెడమీదఉన్న కాడితోసహా బండి అడ్డంగా ఉయ్యాలలూగుతోంది. ఈఎగుడు దిగుడు ఉయ్యాలలో వెంకటశాస్త్రి కళేబరంకూడా ఊగిసలాడుతూ, ఒకపక్కకి ఒత్తిగిలి పండుకొన్నందువల్ల, బండి వెనక్కు మీటినపుడు వెన్నెముకకూ, ముందుకి మీటినపుడు మోకాళ్లచిప్పలకీ బండి వాసికొయ్యలూ, పెండెందబ్బలూ కొట్టుకొని భౌమికమీద దెబ్బ తగిలేవరకు - పాపం - ఆ బ్రాహ్మడికి ప్రాణం జిల్లార్చుకొనిపోతోంది. కుడిచెయ్యి త కింద ఉండడం వల్ల, దెబ్బ తగిలినపుడల్లా "ఇస్సు: అబ్బా!" అని ఆయన ఎడంచేత్తో ఆ స్థలంలో రుద్దుకొంటున్నాడు. కంటిమీద కును కెటువంటిదో ఎరుగడు ఆ మానవుడు. ఇన్నాళ్లుగా ఇంతదేశం తిరిగాడుకాని, ఇట్లాంటి ఉతుకష్టపు ప్రయాణసౌఖ్యం ఆయన కెక్కడా లభ్యపడలేదు. ఇక నిద్ర ఎట్లాపట్టుతుం దాయనకు? నిద్రపట్టడం మాట ఎట్లాఉన్నా, మోకాళ్లచిప్పలు బద్దలయ్యేబాధ భరించలేక, కాళ్లు ముడుచుకొన్న మనిషి నెల్లికిలా పొర్లి "శంకరా, మహాదేవ" అంటూ కాళ్లురెండూ చక్కగా చాచుకొన్నాడు. అట్లాకూడా ఆయనకు ఉసి చిక్కలేదు. బండిచట్టం పొట్టిగు మట్టమైనందున, చాచిన రెండు కాళ్లూ మోకాలికింది పిక్కలలగాయతు పాదాలవరకూ చట్టానికి వెలుపలగా వచ్చినై. దానికితోడు బండిఇచ్చే ఒక్కొక్క ఊపుతో ఒక్కొక్క అడుగు కిందికి జారిపోతూ వచ్చింది ఘటం. ఆ జారిపోవడంలో, తలకింద మూటకీ మూటమీది తలకాయకీ సంబంధం విడిపోయి, రెండూ వేరయిపోతున్నవి. ఇంతలో కాడి పైకి లేచి ఎద్దుకి మెడపలుపు బిరుతగిలేవరకు "వెనక బరువు సామీ, వెనక బరువ"ని బండివాడు మళ్లా హెచ్చరించాడు. "నీ పో డేమిటిరా చచ్చిపోతుంటే" అని శాస్త్రి మూట విడిచి తలకాయ కిందికి జరగకుండా ఉండేటట్టు ఇరుపార్శ్వముల ఉన్న పెండెంకొయ్యల్ని చెరొకచేత్తోనూ గట్టిగా పట్టుకొని, బండిచట్టానికి చివర భాగంలో బిగించిన అడ్డకొయ్యకు కాలి మడిమెలు తన్నిపట్టి, మనిషి బిరబిగిసి పైకి ఎగతన్ని పండుకొన్నాడు. ఈ వాటంలో పండుకొనేవరకు మనిషి కిందకి జారిపోవడం నిలిచిపోయింది. కాని నిద్రపోవడానికి సావకాశం చిక్కలేదు. ఆయన చేతులూ,

కాళ్లూ, శరీరం యావత్తూ జారిపోకుండా బండిలో నిలబెట్టుకొనే ప్రయత్నంలోనే ఉండవలసివచ్చె! ఏమాత్రం పట్టువదిలినా వాటంచెడి మనిషి కింద పడి పొయ్యేటట్టుగా ఉంది! ఇక ఆయన నిద్రపొయ్యే దెప్పుడూ ?

ఎద్దుకూడా బండికి తగినట్టుగానే ఉంది. ఆబండివాడు, దాని మొఖాన్న ఎన్నడూ ఇంత పచ్చిగడ్డికాని, ఇంత నున్నపొట్టుకాని కొట్టిన పాపాన్ని పోలేదు. కొరడాకొయ్యతో కొట్టేవరకు, శరీరంలో చర్మంతప్ప కండ లేనందువల్ల, ఎముకలకు తగిలి, కొయ్యమీద కొయ్యతో కొట్టినట్లు చప్పుడవుతున్నది. కడుపులోకి తాగిననీళ్లుతప్ప మరొకబలమైన ఆహారం లేనందువల్ల ఎద్దు లసువృతీసినపుడల్లా, కడుపులో పేగులు అదిరి ఎద్దు పారుకొంటూ వచ్చింది. ఆ సమయంలో పేడచినుకులు మధ్యమధ్య వెంకటశాస్త్రి నెత్తిమీదా, మొఖంమీదా పడి ఆయనగారి ఉత్తమాంగము పవిత్ర మవుతూ వచ్చింది. వాసన భరించలేక గుడ్డతీసుకొని ముక్కు కడ్డు పెట్టుకొంటూ, మధ్యమధ్య మొఖం తుడుచుకొంటూ - ఒంకుకొన్న మనిషి లేచి కూర్చుని, ఆగ్రహపూరితుడై,

"అబ్బబ్బ! ఏంబండిరా, ఈబండీ! నాప్రాణాలు తీయడానికి వచ్చింది. ఛీ! ఛీ! దీన్ని అగ్గిపుల్ల వెలిగించి మంటపెట్టితే పీడ వదిలిపోను." అని పెద్దంగా అరిచాడు.

బండివాడికి నవ్వొచ్చింది.

"నా బండి కేంతక్కువ సామీ!" అని అడిగాడు.

"నా శ్రాద్ధం, నా పిండాకూడూను. శరీరం నఖశిఖ పర్యంతమూ హూనమైపోతోంది."

"బండి బాడుగలన్నీ పోయినవయ్యో. వాడడం లేక, బాడుగరాక పరమ్మత్తు లేకపోయె. ఏంచేయమంటారు సామీ!"

"ఇంతదేశం తిరిగాను కడుపులో నీళ్లు కదలకుండా. ఏ రోడ్డుబట్టినా మోటార్ల మయమై పోతుంటే, ఈ దిక్కుమాలిన రోడ్డుమీద మోటారే పడదు. ఛీ! ఛీ! వెధవప్రయాణం. ఎరక్కపోయి ఎక్కా నీ ముతనష్టపుబండి" అని శాస్త్రి విసుక్కొన్నాడు.

"లేకేమి సామీ! ఎదు రొకటీ, వా లొకటీ - రెండు మోటార్లుండై ఈరోడ్డుమీద."

"అయితే నా కాసంగతి మొదట్లోనే చెప్పావు కాదేం?"

"తెల్లవారి పదకొండుగంటలబండి చూచుకొని గాని తూర్పు కెళ్లేమోటారు బయల్దేరదు. తెల్లవారకుండనే ఇల్లు చేరుకోవా లన్నారుగా తమరు?"

"రాత్రికూడా ఒక మోటారు తగలబెట్టకూడదూ- ఆ మోటారువాళ్లు?"

"వాళ్లకేం మారాజులు. బాడుగబండివాడనే పురుగు లేకుండా - ఉన్నవాళ్ల నందర్నీ జైలు కేసిన తర్వాత - ఇక పగలూ తిప్పతాడు, రాత్రిళ్లూ తిప్పతాడు ఆమారాజు."

"బాడుగబళ్లవా ళ్లేమిటి ? జైల్లో వేయించడ మేమిటి?"

"ఆకథ అంతా శానా ఉండదిలెండి. చెప్పకొంటే తీరేమంటు కాదు" అని బండివాడు, టుర్రుమని ఎద్దును అదిలించాడు. ఎద్దు దవుడుతీసింది.

"ఎవరు వేయించారు ఈరోడ్డుమీద మోటార్లు?"

"ఉన్నాడులెండి ఒకపుణ్యాత్ముడు. మాప్రాణాలకు శనేశ్వరుడై పట్టి పీక్కొనితింటున్నాడు."

"ఆయన పేరు?"

"చెంచునాయుడంట."

"ఏ చెంచునాయుడు?"

"బోళ్ల చెంచునాయుడు."

"ఏవూరు?"

"గంగపట్నం ఆయనగారిది."

గంగపట్నానికీ విశలాపురానికీ ఒకమైలుదూరం. విశలాపురం గంగపట్నం మజరాగ్రామమే. చెందు

నాయుడుకీ, వెంకటశాస్త్రికీ ప్రాణస్నేహం. చెంచు నాయుడు, మోటారు, బళ్లవాళ్లు, జైలు - ఈమాటలు చెవినిపడేవరకు తన స్నేహితుడు చెంచునాయుడి కేదో ఆపద కలిగి ఉంటుందని శాస్త్రికి కొంత ఆందోళన కలిగింది. తాను కొత్తమనిషివలె నటించి, అచ్చటి విశేషాలేమో బండివానివల్ల తెలుసుకొందామని శాస్త్రి కొక ఆలోచన పుట్టి—

"అయితే ఎన్నాళ్లయిం దీరోడ్డుమీద మోటార్లు వచ్చి" అని బండివాణ్ణి అడిగాడు.

"అంతా ఒక సంవత్సరం అయింది. మీదేవూరు సామీ?" అని బండివాడు ప్రశ్నించాడు.

"మాది దక్షిణాది. విశలాపురంలో బంధువు లుంటే చూడడానికి పోతున్నా."

బండివాడు పలక్కుండా బండి తోలుతున్నాడు కాని వాడు ఊరుకోవడం శాస్త్రికి హితవుగా లేదు. వాణ్ణి కదిలించి ఇంకా విశేషాలు ఒక్కొక్కటే బయటికి తీయాలని ఆయనకు ఆత్రంగా ఉంది.

"బళ్లవాళ్లను జైల్లో ఎందుకు పెట్టార్రా అబ్బీ."

"ఈరోడ్డుకు మోటార్లు వచ్చినప్పటినుంచీ బళ్లవాళ్లకు కూడు పడిపోయింది. ఆ మారాజు, ఒం పెద్ద బళ్లవాళ్లతో పోటీచేసి, వీళ్లు అర్ధరూపాయికి తీసుకొని పోతామంటే, వాళ్లు అరణాలకే తీసుకొనిపోతామనీ, వీళ్లు అరణాలంటే వాళ్లు పావులాఅనీ, వీళ్లు పావులా అంటే, వాళ్లు బేడనీ- ఇట్లా పంతానికి పోటీచేసి ఒక్క పురుగయినా బళ్లవాళ్లకు చిక్కకుండా చేశారామోటారువాళ్లు"

"అందుకని ఇద్దరూ కలియబడి కొట్టుకొన్నారా ఏమిటి?"

"కొట్టుకోనూ లేదు, తిట్టుకోనూ లేదు: బలవంతులమీదికి కూటికిలేని కుంకలు పోగలరా? సంసారాలకు జీవనోపాధి పడిపోయి, బళ్లమీద చిన్నడబ్బు రాకుండా పొయ్యేవరకు, బళ్లవాళ్లకీ బళ్లను ఆధారంచేసుకొని బతికే అలగాజనానికీ కడుపు మండి, అంతా నూరు మంది తోడయి ఒకరోజు కుమ్మక్కుగా నాయుడి లోగిలిమీద పడి ఆయనగారి ధాన్యపుకొట్ల తాళాలు పగలకొట్టి, తలా పంచుం, ఏదుంగింజలు పట్టపగలు దోచుకొన్నారు."

"అయ్యో!"

"అయ్యో లేదు, కొయ్యో లేదు. మరి ఎన్నాళ్లని కడుపుమంట భరించగలరు చెప్పండి సామీ! ఇంట్లో గడవక బళ్లనీ ఎద్దుల్నీ కూడా అయినకాడికి తెగనమ్ముకోవలసివచ్చె. అందులో ఆగంగపట్నం బళ్లవాళ్లందరూ తురక సాహెబులు సంసారపోషణ యావత్తూ మొగవాడి రెక్కమీదనే జరగాలె. కూలిచేసుకొని బతుకుదామనుకొంటే, వాళ్లకులంలో ఆడది బయటికి రావడానికి వీల్లేకపోయె. చస్తారా! ఆఖరికి ఆ తురకలే ఇంత ప్రయత్నం చేసి, ఇతరకులాలవాళ్లనికూడా చేర్చుకొని, ఇంతపని చేశారు."

"ఇంకా ఇతరకులాలవాళ్లంటే ఎవరు?"

"అబ్బో. ఈ మోటారు వచ్చినతర్వాత ఎంతమందికి కూడు పడిపోయింది సామీ! బళ్లుచేసే వడ్రంగులకీ, ఎద్దుల బేరగాళ్లకీ, బండికొయ్యలు అమ్ముకొనే వాళ్లకి, బండిగూడు కొట్టేమేదరోళ్లకీ, ఆఖరికి ఎద్దుకి పచ్చిగడ్డి దోక్కొని రోజుకో అణాడబ్బులు తెచ్చుకొనే మాలమాదిగముండలకీ - ఇంతమందికి కూడు లేకుండాపోయింది సామీ! ఆ తురకసాహెబులే గంగపట్నంలో ఇంతమందినీ కలుపుకొన్నారంట: అబ్బ! వాళ్లు తలుచుకొంటే ఎంతపనైనా చేస్తారు సామీ!"

"మంచిపని చేశారు. తగినశాస్తి అయిందన్న మాట!"

"ఏమయిందో. ఏమయి ఏం ఉపయోగం చెప్పండీ! బలవంతుడిదే రాజ్యం ఈకాలంలో."

"అట్లాగే."

"ఈ వందమందిమీదా కేసుపెట్టి, ఆఖరికి తలా ఒకటీ, రెండూ, మూడేనేళ్లు శిక్షవేయించి, జైలుకు పంపే వరకూ ఆ నాయుడూ, ఆ పోలీసులూ నిద్రపోలేదు

గదా! కానియ్యండి భగవంతు డన్నీ కనిపిస్తాడు" అంటూ బుగ్గనఉన్న పొగాకు తుపుక్కున ఊసి ద్రుచ్చి అని ఎద్దును అదిలించాడు.

చివరికి చెంచునాయుడిదే పైచెయ్యి అయిందని వినేవరకు శాస్త్రి మనస్సుకు ఊరట కలిగింది. బల్లె వాళ్లకీ, నాయుడుకీ, ఏదో పెద్ద వ్యవహారమే జరిగి ఉంటుందని ఊహించాడు. నాయుడు పట్టుదలమనిషని శాస్త్రికి బాగాతెలుసు. ఇంకా విశేషాలు ఏమిటో విందామని -

"అబ్బా! ఎంతకథ జరిగిందిరా అబ్బీ! ఎన్నాళ్లయింది ఇదంతా జరిగి ?"

"కేసు జరిగి ఆరునెల్లయింది. ఈ ఆరునెలలు గా విచారణలో ఉండి, అంతా వారంరోజుల కింద టనే జడిజిగారు శిక్ష చెప్పారు."

"ఆ నాయుడు బాగున్నాడా?"

"బాగుండక ఆయన కేంరోగం? బీదవాళ్లని ఏడిపించడానికి ఇంకా నూరేళ్లు బతుకుతా డాపుణ్యాత్ముడు."

"ఆయన దేమైనా పెద్దస్థితేనా ఏమిటి?"

"ఆయనకేం సామీ జమీందారు: గంగపట్నం సగం వూరంతా కొన్నాడంట. ఇంకా ఎన్నెన్నో ఆయనకు వ్యాపారా లుండై. సాలుకు ఇరవై వేలు వస్తుందని - అంటారు"

"అబ్బా! ఇంతడబ్బుగలవారు మోటార్లు వేసి బీదవాళ్లని ఏడ్పించకపోతేనేం పాపం."

"ప్రజల సౌకర్యంకోసం వేయించాడంట ఈ మోటార్లు. ప్రజ లెవరో, సౌకర్యా లేమిటో ఆయన కసలు తెలుసా?"

"ఎంతసేపూ స్వలాభంకొరకే ఈ దొర్లాట - భాగ్యవంతులకు కూడా."

"పోనీ కేసుపెట్టితే పెట్టాడ దనుకోండి. పచ్చిగడ్డిగంప లమ్ముకొనే మాలముండల్ని కూడా ఇరికించాలా ఆదొర? అయినా మాకులం అంటే ప్రతీవాడికీ అలుసు సామీ" అని అన్నాడు బండివాడు.

బండివాడు "మాకులం" అనేవరకు శాస్త్రికి అర్థం కాలేదు. "మాలకులమనా లేక వాడికులమే మాలకులమనా దాని అర్థం అని సందేహం కలిగింది; శాస్త్రికి ఏదో ఆలోచనపడిందిమనస్సులో!

బండివాడు తనధోరణి తాను విడవలేదు. ఏదో పరధ్యానంగా ఉండి నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నాడు. తన బండిలోని మనిషి బ్రాహ్మడని వాడికి తెలియదు. తెలిసినప్పటికీ వాడు బ్రాహ్మలికికూడా ఇదివరలో చాలాసార్లు బండి కట్టాడు. మళ్లా అందిపుచ్చుకొని "మా మాలకులానికి కయ్యాలా, కొాలవలా చెప్పండి సామీ! ఆముండలు బల్లెవాళ్లకి గడ్డి అమ్ముకొని బతుకుతున్నారని, దోపిడీ సమయంలో వాళ్లుకూడా గంపలు చేతపట్టుకొని ఆజనంలో ఉన్నారని పదిమంది ఆడవాళ్లనుకూడా కేసులో ఇరికించాడు ఆనాయుడు. వాళ్లు పసిబిడ్డల తల్లులంట. ఇంటికాడ పిల్లలు అలో లక్షణా అని అల్లాడిపోతున్నారంట! తలుచుకొంటే, దుఃఖం వస్తుంది సామీ! అని బండివాడు ఆవుద్రేకం మీద ఏమేమో చెప్పబోతుండగా, వాడు మాలవాడని శాస్త్రికి స్పష్టమయింది. దానితో ఆయన ఒళ్లు జలదరించింది. బండిలో వక్కక్షణంకూడా నిలవలేక పోయాడు. దిగుతున్నానని చెప్పనైనా చెప్పకుండా, వెనక్కి జరిగి కిందికి గభాలున దూకాడు. చైతన్యం విడిచి రోడ్డుమీద కొయ్యబొమ్మవలె నిలబడ్డాడు. బండివాణ్ణి నమిలి మింగేయాలన్నంత ఆగ్రహం వచ్చిందాయనకు కాని కర్తవ్యం గోచరం కాలేదు. జీవితానికి పరమావధిగా పెట్టుకొని తాను ఇన్నేళ్లుగా చేసినకృషి అంతా గంగపా లయిపోయింది. కాశీగంగిచెంబులు బండిలో ఉన్నై. సర్వం జగన్నాథం అయింది. వెళ్లి బండివాడితల రెండు చెక్క లయ్యేటట్టు పగలకొట్టా లనుకొన్నాడు: కాని ధైర్యంచాల్లేదు: చీకటి, అంధకారం. తాను ఒంటరిగాడు: రెండోసహాయం లేదు: బండివాడు ఇరవై, ఇరవై అయిదేళ్లు వయస్సుగలిగి, మంచి జెబ్బ పుష్టిగల మనిషిలా ఉన్నాడు: తిరగబడితే తనవంటి పప్పు

బ్రాహ్మలను పదిమందిని కలిపికొట్టేవాడులా కనపడ్డాడు. ఆపరిస్థితులలో తొందరపడకూడ దనుకొన్నాడు. ఊరికి చేరినతర్వాత వాడిభరతం పట్టాలని తీర్మానించు కొన్నాడు. వెళ్లి మళ్లా బండెక్కి కూర్చున్నాడు. బండి వాడి కొనుకొని ఉన్న తనమాటను ఎడంగా లాక్కొన్నాడు. బండి సాగింది. ఇక బండివాడి పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవాలనని శాస్త్రి –

"ఒబ్బీ! నీ దేవూరురా?" అని అడిగాడు.

"నాది ఉత్తరాది- తెనాలండి."

"ఇక్కడ కెందు కొచ్చావు?"

"పుంజారులో నామేనమామకూతుర్ని పెళ్లి చేసుకొని ఇప్పటి కారునెలలుగా ఇక్కడే నిలిచి పోయాను. ఈబండి మామామదేనండి."

"నీపేరు?"

"పోలయ్య"

"గంగపట్నం బెల్లవాళ్లను నువ్వెరుగుదువా?"

"కొంతమంది గుర్తేనండి."

"నువ్వు మాలవాడివికదా ? నీబండికి జనం దొరుకుతున్నారా?"

"ఇప్పు డెవరూ అపట్టింపులు పెట్టుకోవడం లేదండి. అవసరంకొద్దీ అయ్యగార్లుకూడా నాబండి చాలాసార్లు కట్టించుకొన్నారు."

"ఇదివర కెప్పుడైనా విశలాపురం వెళ్లావా?"

"విశలాపురం పోలేదుకాని, గంగపట్నం వెళ్లాను."

"ఆవూళ్లో నీకు బంధువు లున్నారా?"

"లేరండి."

"సరే! తొందరగా పోనియ్యి! తెల్లవార వస్తోంది." అన్నాడు వెంకటశాస్త్రి.

తెల్లవారుజామున ఇంకా కనిచీకటి ఉంది. ఇంకా అయిదారుమైళ్లు పోవాలి బండి. వెంకట శాస్త్రికి స్థిమితం చెడింది. తనంతటిపండితుడు చివరికి మాలవాడిచేతిలో చిక్కుకొన్నందుకు ఆయనకు పట్ట రాని ఆగ్రహం కలుగుతూవుంది. అగ్రజన్మయెత్తిన తన యెడల అంత అపచారంచేసిన ఒక తక్కువకులం మాల వాణ్ణి ఆసమయంలో తా నేమీచేయలేని నిస్సహాయ స్థితికి ఉడుకుమోతుతనం ఉబికిఉబికి పొర్లివస్తోంది. హృదయం కుమిలి వేడినిట్టూర్పు లధికమైనవి. బండి వానిమీద కలిగిన ఆగ్రహాగ్నికి శరీరం యావత్తూ వేడెక్కి, మాఘమాసంచలి మందగించి, కప్పుకొన్న శాలువ వంటిమీద ఉంచుకోవడానికి ఆయనకు చీకా కనిపించింది. శాలువ విసరి బండిలో ఓపక్కన వేశాడు. ఎప్పుడెప్పుడు ఇంటికి చేరుదామాఅని ఆత్రపడు తున్నాడు ఆబ్రాహ్మడు.

ఉదయం అయిమూఅయిదున్న ర య్యే స రి కి బండి కంకరరోడ్డు దిగి మట్టిరోడ్డుకు మళ్లింది. బాగా తూర్పురేఖ లారినవి. బండివాడిముఖం శాస్త్రికి బాగా గోచరించింది. ఉదయాన్నే ఛండాలు నిముఖం చూడడాని కష్టహ్యం అనిపించింది. ఆసంధ్యవెలుతురులో శాస్త్రిముఖంకూడా పోలయ్యకు పొడకట్టింది. ఆయన బ్రాహ్మణుడుకాబో లనుకొన్నా డతడు; కాని ఆయన ముఖంలో వికాసం కనిపించలేదు. మరి షేదో దీర్ఘా లోచనలో ఉన్నట్టుగా అగుపడ్డాడు. మొఖం ఎర్రంగా జేవురించి, నరాలతోకూడా ఉబికిఉంది. కళ్లురెండూ చింతనిప్పులవలె కణకణ లాడుతూ ఉన్నై. రాత్రి నిద్ర లేక ఆయనముఖం అట్లా ఉం ద ను కొ న్నా డు బండివాడు.

ఆరుగంట లయ్యేవరకు బండి విశలాపురంచేరి వెంకటశాస్త్రి ఇంటిముందట నిలిచింది. ఆరోజు మను మడి భారసాల. వీథిసమ్మానికి మామిడాకులతోరణం కట్టారు. శాస్త్రి ఎప్పుడు వస్తాడా అని ఇంటిల్లిపాదీ కోడికూతతో లేచి ఎదురుతెన్నులు చూస్తున్నారు. వెంకటశాస్త్రి బండి దిగి మాట వీథిఅరుగుమీద పెట్టి బయటనే నిలబడ్డాడు. కాళ్లు కడుగుకోను భార్య నీళ్లు తెచ్చియిచ్చింది. మొఖం కడుక్కొను పుల్ల తెమ్మ న్నాడు శాస్త్రి. ముఖార్జనం అయింది. శాస్త్రి

ఇంట్లో అడుగుపెట్టలేదు. "లోపలకు రం" డని భార్యా, కొడుకూ పిలిచారు. "ప్రయాణపుగుడ్డలు లోపల పెట్టడానికి వీల్లేదు. స్నానం చేసిగాని లోపలకు రానన్నాడు" శాస్త్రి.

బండివాడు "బాడుగ స్వామీ" అని అడిగాడు. "ఇస్తాను ఉండరా" అని వాడికి జవాబు చెపుతూ, కొడుకును రహస్యంగా పిలిచి, అర్జంటుగా చెంచు నాయుణ్ణి పిలుచుకొనిరమ్మని పంపాడు.

చెంచునాయుడికి వెంకటశాస్త్రి గురుపదం. పండితుడన్న గౌరవంచేత, ఆయనకు నాయుడు ఇల్లు కట్టించి యిచ్చాడు. నాలుగెకరాలమాగాణి వ్రాసి యిచ్చాడు. ఆయనకొడుకు వివాహానికి ద్రవ్యసహాయం చేశాడు. శాస్త్రిగారికుటుంబంమీద నాయుడి కెంతో ప్రీతీ, అభిమానమూను. ఈసంబంధం అనాదిగా పెద్దల తాగాయతూ వస్తూఉన్నది. అందువల్ల తనకు పని ఉన్నా, శాస్త్రికి పని ఉన్నా, ఏ వేళ నై నా స రే నాయుడే శాస్త్రిగారి దగ్గరకు స్వయంగా వచ్చి మాట్లాడి పొయ్యే మామూలు. అందువల్ల ఆయనదగ్గరనుండి కబురు వచ్చేందనేవరకు, రెండేళ్ళుగా దేశాటనంచేసి వచ్చినందున ఏమి తొందరపనో అని నాయుడు నిద్రమంచంమీదనుంచి లేవడంతోనే తలకు ఫ్లానల్ గుడ్డ చుట్టుకొని, కాలికి చెప్పులు తొడుక్కొని, చేత కర్ర పట్టుకొని, ఏకాఎకీని విశాలాపురం బయల్దేరాడు.

అప్పటికప్పుడే సూర్యోదయం అయి బారెడుపొద్దెక్కింది. అగ్రహారీకులు "చాలాకాలానికి దయ చేశారు శాస్త్రిగారు" అని కొందరూ, "అగ్రహారంమీద శాస్త్రిగారు మరీశీతక న్నేశారు" అని మరికొందరూ, "మమ్మల్ని మరిచేపోయారు — శాస్త్రిగారు" అని ఇంకొకొందరూ, "బహుకాలదర్శనం — క్షేమమా?" అని మరికొంతమందీ—ఇట్లా అనేక రకాలుగా పలకరిస్తూ శాస్త్రిగారి ఇంటిముందర జనం మూగారు. ఇంతలో నాయుడు వచ్చి — "సాష్టాంగ దండాలు" అని శాస్త్రికి దణ్ణంపెట్టాడు.

"దీర్ఘాయుష్యమస్తు. వంశాభివృద్ధిరస్తు. ఐశ్వర్యాభివృద్ధిరస్తు" అని శాస్త్రి దీవించి, చాప తెప్పించి పీఠి అరుగుమీద వేయించి నాయుణ్ణి కూచోమన్నాడు.

"చాలా కాలానికి మామీద దయ వచ్చిందే శాస్త్రిగారికి—"అని నాయుడు కుశలప్రశ్న చేసి ఏదో అనబోతూఉండగా లోపల కుతకుతలాడే శాస్త్రి ఇక భరించుకోలేక, వెంటనే.

"విన్నాను. కథ యావత్తూ విన్నాను. ఈతాగుబోతు లంజకొడుకులు నీకు చేసిన అపకారం అంతా చెవికొచ్చింది. అబ్బా! ఎంత గండం తప్పింది నాయుడూ! నీకు. నిష్కారణంగా వీళ్ల చేతుల్లో నీప్రాణాలు పోయిఉండేవి. ఎంతపని జరిగిందీ! ఇట్లా జరిగిందని నాకు ఒకకార్డుముక్కైనా రాశావుకావు, మావాడూ రాశాడు కాడు—"అని శాస్త్రి నాయుడికి కలిగినఆపదకు తన సానుభూతి చూపిస్తూ ఆదరణ మొదలు పెట్టాడు.

"మీకు శ్రాద్ధా మనుకొంటూనే నుస్తీచేశాను. ఇంతకూ భగవంతుడు చల్లంగా చూడాలేకాని—వీళ్ల వల్ల ఏమవుతుందీ వెధవలు,"

"నిజమే! ఇంకా వీళ్లని ముక్కలుముక్కలుగా తరిగి ఉప్పుపాతర వేయకుండా ఊరుకొన్నావా నాయుడూ?"

"అయితే అంతపనీ చేయకుండా విడిచిపెట్టేనా ఏమిటి? ఒక్కొక్కడికి మూడేసేళ్లు వేయించి వంద సుందినీ వెల్లూరుజైలుకు పంపించాను. తమరు విన లేదూ?"

"ఎంతచేసి ఏంఉపయోగం? మళ్లా కథఅంతా మొదటికొచ్చింది. విన్నావో లేదో! జమీందారు వంటివాడివి నిన్నే లెఖ్ఖచేయని ఈ గాడిదకొడుకులు మాబోటివాళ్లనిలక్ష్యపెట్టుతారా?ఆసేతుహిమాచలపర్యం తమూ తిరిగివచ్చానుకాని ఇంతపరాభవం ఎక్కడా పొందలేదు."

"ఏంజరిగిందేమిటి?"

"అదుగో చూడు! ఆబండిదగ్గర నిలబడ్డాడు వాడు శుద్ధమాలాడు. నిన్నగాక మొన్న నూరుమందికి శిక్ష వేయించావుకదా నువ్వు, వీడు భయభక్తులు లేకుండా నన్ను పుంజూరునుంచి విశాలాపురానికి బండిలో ఎక్కించుకొనివస్తాడా ? వీణ్ణి ఏంచేస్తే పాపం ఉంది ?"

"మాలవాడావీడు?"

బండివాడు పలక లేదు.

శాస్త్రి వాడికేసి చూస్తూ "ఛీ ! జవాబు చెప్ప కుండా నిలబడతావు. ఆనోటి మీద వాతలు వేయిస్తా చూడు! రాత్రి తెల్లవార్లూ, ఈనాయుణ్ని నోటికి వచ్చినట్లు దూషిస్తూ మాట్లాడేవే ! ఇప్పు డేమైం దానోరు ?"

"దవనపల్లి రాలేబట్టు కొట్టక పోయినారా అట్లాంటిమాటలు కూసినప్పుడూ? ఈ వొంపెద్దుబల్ల వాళ్లని ఏంచేసినా పాపం లేదు" అన్నాడు నాయుడు.

బండివాడు గడగడ వణికిపోతున్నాడు.

"నే నెవరని నీబండిలో ఎక్కించుకువచ్చావురా నువ్వు ? మాదిగవా ణ్ణనుకొన్నావా? మాలవా ణ్ణను కొన్నావా? మనిషిని గమనించి మరీ బండికట్టపనిలే ?"

"నా కేంతెలుసు సామీ!తమరు బ్రాహ్మనలనీ?" అన్నాడు బండివాడు.

"అయితే బ్రాహ్మ డెవడో మాలవా డెవడో కూడా తెలియకుండా కళ్లకు కావరంఎక్కి ఉన్నా వన్నమాట" అన్నాడు నాయుడు.

"అర్ధరాత్రి నేను మనిషిని గుర్తించలేకపోయాను బాబుగారూ!" అన్నాడు బండివాడు.

"అసలు నిన్ను బాడుగబండి పెట్టుకోమని ఎవరు చెప్పారూ ? నీతాతనా డెరుగుదువా నీముత్తాతనా డెరు గుదువా నువ్వు బండెక్కి ? చెప్పరానివాడు తన కులవృత్తి మాని ఇంకో వృత్తి చేసుకోవచ్చునని ఏ శాస్త్రంలో ఉందో చెప్పరా? గాడిదకొడకా! తెలియక ఒకవేళ నాబోటివాడు బండికట్ట మంటేమాత్రం, ఆమైన ర్ణాశ్రమధర్మాలు నాశనంచేయడానికి సరేనని తయా రవుతావా? 'నేను చెప్పరానివాణ్ణి సామీ!' అని చెప్ప నక్కర్లే?" అని వెంకటశాస్త్రి పండ్లు పటపటకొరు కుతూ పరవళ్లు తొక్కుతున్నాడు.

"చెప్పుతో మాడు పగలకొట్టండి వెధవకు. మదం అణుగుతుంది" అన్నాడు నాయుడు.

"తెలియక చేశాను సామీ" అన్నాడు బండివాడు.

"ఛీ! మళ్లా ఆమాటే కూస్తావు. తెలియదంటే నే నమ్మతానా? పదేళ్లుగా రక్తమాంసాలు వొడ్చి చదువుకొన్నశాస్త్రం అంతా తగలడిపోయిందే. కాశీసమారాధన చేసుకొందామని కష్టపడి గంగ తెచ్చు కొన్నాను.అంతా నాశనం చేశాడు. ఈగాడిదకొడుకు."

"వీడి కన్నీ తెలుసు. — ఇట్లాంటిపని చేయవు కదా అని పండబెట్టి పట్టకారుతో రెండు గుడ్లూ ఒత్తిస్తే రోగం కుదురును. — అబ్బబ్బ ! నాకేసులో ఆకురకవాళ్లూ, వీళ్లూ చేరి నాగడ్డి నాకు పెట్టారు— శాస్త్రిగారూ! ఈవందమందిమీదా కేసు రుజువుచేయించి, జైలుకు వేయించేవరకు పన్నెండువే లయింది నాకు. ఎవరు తిన్నట్టు చెప్పండీ? మీబోటి బ్రాహ్మడి కిచ్చినా దీపంపెట్టుకొని తలుచుకొనేవారు. ఆజడ్జి ధర్మప్రభువు కాబట్టి వీళ్లెన్నికూతలు కూసినా మనవారనే నమ్మి శిక్ష వేశాడు" అన్నాడు నాయుడు.

ఇంతలో అక్కడచేరిన అగ్రహారీకు లందరూ తలాఒకబడితె చేతపట్టుకొని "అగ్రహారంలో అడుగు పెట్టి అపవిత్రంచేసినందుకు వీణ్ణి తల పగలకొట్టండి, చంపండి. ఆబండినీ, ఎద్దునూ కిరసనాయిలుపోసి నిప్పుపెట్టండి" అని తలాకమాటా అంటుకొన్నారు, నాయుడికి వేడెక్కింది: కేసు అయిందిలగాయతు ఒంపెద్దుబండివా డంటే అసలే మండిపడుతున్నాడు నాయుడు.

"అయితే వీడి కేంశిక్ష చెప్పారు వెంకట శాస్త్రిగారూ" అని ఆవేదిమీద అడిగాడు నాయుడు.

"ఛండాలుణ్ణి తాకితే, బ్రాహ్మడు ఒళ్లు తెగ్గాల్చుకొంటేనేగాని ఆపాపం పద్నాలుగుజన్మాల దాకా పోదని శాస్త్రం. నాకు కావలసిన ప్రాయ శ్చిత్తం వీడికి శిక్ష—" అన్నాడు శాస్త్రి.

నాయుడు వెంటనే ఇద్దరుమనుష్యుల్ని పిలిచి, బండివాణ్ణి పశువులదొడ్లో పగ్గాలతో గుంజకు కట్టించాడు. గంపెడుపిడకలు దాలిచేయించి, బొటనవేలు లావు ఇనపకఱ్ఱ అగ్నిహోత్రంలో పెట్టించి చేటతో విసిరిస్తున్నాడు.

బండివాడు ఒకవిపరీతమైన స్థితిలో పడ్డాడు. చినికి చినికి గాలివాన అయింది వ్యవహారం. ఇట్లా జరుగునని తాను కలలోకూడా అనుకోలేదు. వెయ్యిపెద్దపులుల్లో ఒక్కమేకపిల్ల! ఇంతమంది అగ్రహారీకుల్ని తానొక్కడూ ఎట్లా ఎదుర్కొ గలడు? ఎవరితో మొర పెట్టుకొంటాడు? తాను చేసిన తప్పేమిటో అర్థం గాకుండా ఉంది. బండివాడికి. ఇక తనచావు నిజమని స్థిరపర్చుకొన్నాడు వాడు. నోటివెంబడిమాట రావడం లేదు. గొంతుక ఎండి పోతున్నది. దాహ మవుతున్నది: ఒంటేలుకు పోవలసిన అవసరంగా ఉన్నది: కాని కాలూచెయ్యీ కదపడానికి వీల్లేనిస్థితిలో ఉన్నాడు. తనకళ్లఎదుట నల్లని ఇనపకఱ్ఱ ఎఱ్ఱబడుతోంది. ఉత్తరక్షణం తలచుకొంటే గుండె నీరయిపోతోంది "ఎంతపాపం చేసుకొన్నానోగదా భగవంతుడా! నాకు నిష్కారణంగా ఇంతశిక్ష ఏల విధిస్తున్నావో నారాయణమూర్తీ తండ్రీ" అని లోపల దుఃఖిస్తూ కళ్లుమూసుకొన్నాడు.

ఇంతలో వెంకటశాస్త్రి నాయుణ్ణి చాటుకు పిలిచి "నాయుడూ! మనం చేసేపని పైకి పొక్కితే, ఆపోలీసువాళ్లకల్ల తంటా రాదుగదా! కాస్త ఆలోచించు నువ్వుకూడా!" అన్నాడు.

"అంత పిచ్చిపని చేస్తాననుకొన్నావా శాస్తుర్లూ. పోలీసులు మనం కూర్చోమంటే కూర్చోవాలె, నుంచోమంటే నుంచోవాలె!" అని ధైర్యంచెప్పాడు నాయుడు.

"అయితే తొందరగా కానీ"అని వెంకటశాస్త్రి ఉత్తర్వు ఇచ్చాడు.

కఱ్ఱ ఎఱ్ఱబడిందో లేదో చూడమన్నాడు నాయుడు.

పోలయ్య కొంచెం వ్యక్తిగలమనిషి; కొంచెం చదువుకొన్నవాడుకూడాను. చిన్నతనంనుండీ పట్నవాసంలో పుట్టిపెరిగినమనిషి: మంచీ, శబ్బరా, దేశకాలపరిస్థితులూ కాస్త తెలుసుకొన్నవాడు. కళ్ళు మూసుకొన్న కొంతసేపటి కొక ఆలోచన తట్టింది అతగాడికి. "చచ్చేవాళ్లం ఎట్లాగా చస్తాం. అబద్ధమైతే అయింది, ఈదారి తొక్కి ఒకదొంగెత్తు వేదాం. నారాయణమూర్తి సాయపడకపోతాడా?" అని నిశ్చయపర్చుకొని, మొండిధైర్యం తెచ్చుకొని, నాయుణ్ణీ, శాస్త్రినీ ఉద్దేశించి,

"నన్ను మీ రీప్రకారం హింసిస్తున్నారు. నేను చచ్చినా, బ్రతికినా ఈ విషయం పైకి పొక్కక మానదు. మా పాదిరీదొరగారికి ఈ సంగతి తెలిస్తే, మీరు ఇంతకింతా అనుభవిస్తారు; మీరే బలవంతులని అనుకోకండి. మేము మీ మతం విడిచి క్రయిస్తవమతం తీసుకొన్నాకూడా మీ రీప్రకారం మమ్మల్ని ఏడిపించడం మా ఏసుప్రభువు గమనిస్తూనే ఉన్నాడు" అని పెద్దగా వెఱ్ఱిఅరుపు అరుస్తూ కేక పెట్టాడు.

బండివాడినోటినుండి ఈ మాటలు వినవచ్చేవరకు, శాస్త్రీ, నాయుడూ ఒకరి ముఖం ఒకరు చూసుకొన్నారు. "ఇదేమిటి మతం తీసుకొన్నా నంటున్నాడు" అని ఇద్దరూ కొంత తటపటాయించారు.

"నువ్వు క్రయిస్తవుడవా?" అని శాస్త్రి అడిగాడు.

"అవును: మా తాత తనహయాంలో మతం పుచ్చుకొన్నాడు" అని బింకంగా జవాబు చెప్పాడు.

"నీపేరు?"

"పోలయ్య."

"బండిలో చెప్పడంలో నీపేరు పోలయ్య అని చెప్పావే!"

"లేను; పాలయ్యనే చెప్పాను."

"నీతండ్రిపేరు"

"జకరయ్య"

వెంటనే కట్టినకట్లు విప్పమని నాయుడు ఉత్తర్వుచేసి, శాస్త్రీ, తనూ గడ్డివామిచాటుకు పోయారు.

వెం— రాత్రి చెప్పడంలో పోలయ్యఅని చెప్పాడయ్యా, దొంగవేషం వేస్తున్నాడేమో?

నా— మీరు పొరపాటుగా వినిఉంటారు: పాలయ్యకు బదులు పోలయ్యఅని మీకు వినిపించి ఉంటుంది. తల చూడండి, నాడికి క్రాపింగుకూడా ఉంది. సందేహంలేదు, వీడు క్రయిస్తవుడే!

వెం— క్రాపింగుకేం గాని క్రయిస్తవుడయితే కొంచెం ఆలోచించదగ్గదే.

నా—అమ్మా! ఇంకా నెమ్మదిగా అంటున్నారా? ఈ పాదరీలకీ, సర్కారువారికీ చాలాదోస్తి ఉంటుందండీ! వాళ్ళు పట్టుపట్టారంటే సీమదాకా కూడా వెళ్లి తగవులాడుతారు. అంతవరకు రాకపోయినా అంతవరకొచ్చేవరకు ఎంత డబ్బిచ్చినా ఈపోలీసులు మనముఖాజా ఏమీ ఉంచకుండా తోసిరాజంటారు మనల్ని; కాబట్టి తొందరపడగూడదు.

వెం— సరే! అట్లాగే నీ ఇష్టప్రకారమే కానీ! అతిసర్వత్రవర్జయేత్తన్నాడు శాస్త్రకారుడు. అదీగాక, నిజంగా వీడు క్రయిస్తవుడే అయితే మన కంతపట్టింపు లేనేలేదు. మనప్రభువుల మతం అదేఅయినపుడు, ఆమతాన్ని నిందిస్తే ప్రభువుని నిందించినట్లే! "నావిష్ణుః పృథ్వీపతిః"; కాబట్టి రాజు అవలంబించిన మతంలోకూడా విష్ణ్వంశ ఉండితీరుతుంది. — మన మతంలోనేకాని, వాళ్లమతంలో చండాలురంటూ లేనేలేరు. కాని ఎటువచ్చీ నాసందేహం ఏమంటే, వీడు నిజంగా క్రయిస్తవుడేనా అని?

నా— అయినా కాకపోయినా, ఈవిషయంలో మట్టుకు మనం తగ్గడమే శ్రేయం. ఏమో! ఏపుట్టలో ఏపాముందో! వాడు ఉత్తరాది తెనాలంటున్నాడు. అక్కడ వాడికేంప్రాపకముందో, ఎవడు చూడొచ్చాడు?

వెం— అవునవును. వాడింకా మంచివాడు కాబట్టే ఇంతదూరం ఊరుకొన్నాడు.

అని శాస్త్రీ తృప్తిపడి మళ్లా బండివాడి కంటబడకుండా సందుదారిన దొడ్లోకి దూరాడు. నాయుడు పాలయ్యకు కట్టినకట్లు విప్పించి, ఇంటికి తీసుకొనిపోయి రు 3-0-0 లు చేతిలోపెట్టి అన్నంపెట్టించి ఇంటికి పంపివేశాడు.

---

# ఏసి — చేసి

బులుసు వేంకటరమణయ్య

"ఏసి" అను నవ్యయము విభాగార్థమున వాడఁబడుచున్నది. ఇది చాల ప్రబంధములయందును కానఁబడును. తఱచుగ నిది పరిమాణార్థక మగు 'ఎడు' నకుఁ దరువాత అవ్యవధానముగ నుండును. ఉదా. మూరెఁడేసి, చేరెఁడేసి.

పరిమాణార్థకప్రత్యయ నిరపేక్షముగను 'ఏసి'కి ప్రయోగములు కలవు. పదేసి, ఏఁబదేసి.

నన్నయభారతపు తాళపత్ర ప్రతుల యందు పయి 'ఏసి'కి బదులుగ 'చేయు' ధాతువు క్త్వార్థమగు 'చేసి' అను రూపము కన్పించుచున్నది. చాల ముద్రితప్రతులలో 'చేసి' 'ఏసి'గా మార్చఁబడినది. ఆనందముద్రణా యపుఁబ్రతియందు మాత్రము మూలానుసారి యగు పాఠమే చాలచోట్ల గలదు. సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర విద్వత్ప్రకాండులును, కీర్తికాయులు నగు శ్రీతంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు తత్పరిశోధకు లగుటచే దానిని దిద్దివేయక 'ఏసి'కి 'సేసి' యని నన్నయప్రయోగము' అని అధస్సూచిక యందు వివరించియున్నారు. '...యందొక్కొక్క యమ్మేసినట్ల యేనూఱేసి.'

[ఆదిపర్వము, షష్ఠాశ్వాసము, ౨౭.]

ఉ. '...పాయసా,
హారము భుక్తిఁబెట్టి మఱి
యందఱకుం జెఱు వేయిసేసి.

[సభాపర్వము, ప్రథమాశ్వాసము, ౧౪.]

పయి ప్రయోగములందలి 'సేసి' చేసి'కి 'గసడదవాదేశరూపము.'

శ్రీ తేవప్పెరుమాళ్లయ్యగారు ఆదిపర్వము నష్టమాశ్వాసమునందలి యొక (౨౮) వచనమున 'నూఱేసి భద్రగజంబులను, నూఱేసి కాంచనరథంబులను, వేయేసి కాంభోజహయంబులను, ... ...' అను చోట. 'ఏసి'తో కూడిన రూపములనే ఇచ్చియున్నను, అధస్సూచికలో 'నూఱు సేసి భద్ర... నూఱు సేసి కాంచన... ...వేయు సేసి కాంభోజ... ...ది సేసి వేలు దాసీ'' యనియే ప్రాంతప్రతులు' అని స్పష్టీకరించియున్నారు.

ప్రాచీన శాసనములందుఁగూడ 'ఏసి' కి బదులు 'సేసి'యే కనఁబడుచున్నది. నన్నయకు రమారమి ౧౦౦ ఏండ్ల తరువాతి దగు 'అమరావతీస్తంభశాసనమున ఇట్లున్నది—

శాసనపుబంతులు.

౧౩౧. '...............స్వస్తి సమ

౧౩౨. స్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర కోవికేతరా

౧౩౩. జులు శకవర్షములు ౧౧౦౪ గు నేంటి మాఘశుద్ధ ౧౦

౧౩౪. గురువారమునం దమకు ధర్మా
ర్థముగా శ్రీమద్బు

౧౩౫. ద్ధదేవరకు నఖండవర్తిదీప
ములు రెంటికిని ఇచ్చిన ఇ

౧౩౬. వ్వెడ్లు ౧౧౦ వీ ని లోన
దామక అమరబోయండు ఎంభ దేను గొ

౧౩౭. జియలంజేకొని ఆచంద్రార్కా
ముగాం దన పుత్రానుపౌత్రికమున

౧౩౮. నిత్య మానెండు సేసి నేయి
వోయంగలవాండు. ఉటకురికే.

౧౩౯. యండు ఎంభ దేను గొజియలం
జేకొని ఆచంద్రార్కాము

౧౪౦. గాం దన పుత్రానుపౌత్రికమున
నితమానెండుసేసి నేయి వోయంగల
వాండు.........'

[హుల్ట్జుప్రకటితము : అమరావతీ స్తంభ శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యం. ౬. పుట. ౧౫౩.]

పయి శాసనములో 'నిత్యమానెండు సేసి' అని ఇంకను చాల ప్రయోగములు కలవు. పయి శాసనపుకాలముకూడ శాసనమననే ఈయఁబడియున్నది. శాసనము ఇంచుమించుగ నన్నయకు నూఱేండ్ల తరువాతిది.

ప్రాచీనవాఙ్మయమును, శాసనములను గమనింపకున్నంతవఱకును 'ఏసి'యే తగిన రూపమనియు, 'సేసి' అట్టిది కాదనియు తోఁచును. నిలుకడమీఁద నిజము తేటపడును.

ప్రాచీనకాలమున 'రెండుగా విభజించి, మూఁడుగ విభజించి—'మొ. అర్థములందు 'రెండుచేసి, మూఁడుచేసి' మొ. రీతిగ ప్రయోగము లుండెడివనియు, క్రమక్రమముగ 'చేసి' 'ఏసి'గ మాఱి తన ప్రత్యేకతను కోలుపోయి, పదాంతరసంయుక్తమగునపుడే అర్థవంతము కావలసి వచ్చినదని తెలుపుటయే ఈవ్యాసపు పరమప్రయోజనము.



# నన్నయభట్టారకుడు

ఒంగోలు వెంకటరంగయ్య

నన్నయభట్టును నన్నయభట్టారకుడనుటయు గలదు. ఈ మహానుభావునిపేరు తెలుగు భారతమునందలి ఆదిపర్వ ప్రథమాశ్వాసమున భారతాంధ్రీకరణప్రశంస యందు ఘట్టమున "నన్నయ్య" అని యున్నది ఆదిసభా వనపర్వ గద్యలలోనెల్ల "నన్నయభట్ట" అనియె యున్నది. విరాటపర్వ ప్రారంభమున తిక్కయజ్వయు నీతని "నన్నయభట్టు" అనియె స్మరించియున్నాడు. ఎఱ్ఱాప్రెగ్గడ చెప్పిన అరణ్యపర్వభాగమునందలి గద్యలలోను నృసింహపురాణమునందలి పూర్వకవిప్రశంసయందును "నన్నయభట్టు" అనియె యున్నది. కేతన, మారన, శ్రీనాథాదులును, "నన్నయభట్టు" అనియె వాడియున్నారు. అప్పకవీయమునను "నన్నయభట్టు" అనియు (౧ - ౮౨) "నన్నయభట్టీయము" అనియు (౧ - ౬౯) ప్రయోగించియున్నాడు. ఇవన్నియు నిటు లుండగ ఈ నన్నపార్యుడు ఆదిపర్వమున తన సహాధ్యాయి యగు నారాయణుని "నారాయణభట్టు" అనియె పలికియున్నాడు.

ఆంధ్రలోకములోని వాడు లోమాత్రము "నన్నయభట్టారకు"డు అనియె ఈయాది కవి ప్రసిద్ధుడైయున్నాడు. ఈ "భట్టారక" శబ్దము గౌరవవాచకమగు బిరుదమా లేక "భట్ట" సమానమేనా?

అమరుడు ప్రథమకాండమున "రాజా భట్టారకో దేవః"యని నాట్యవర్గమున పఠించియున్నాడు. దీనినిబట్టిజూడ ఈ నైఘంటికుని మతమున 'భట్టారక' శబ్దవ్యాప్తి నాట్యవర్గ పరిచ్ఛిన్నమైనటుల తోపగలదు. "అవిరళ జపహోమతత్పరు - సంహితాభ్యాసు - బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాన నిరతు - పాత్రు - సద్వినుతావదాతచరితు - సత్ప్రీతిభాభియోగ్య - నిత్యసత్యవచను - సుజను - నన్నపార్య" నర్తకగణములోని భట్టారకు జేయుట మహాపచార మగును. వైజయంతీకారుడు ద్వివిధభట్టారకుల జెప్పెను. శేషకాండ, లింగసంగ్రహాధ్యాయమున (శ్లో. ౮౬ "భట్టారకో భట్టరకో; భట్టస్తత్రభవాన్ భవాన్" అనిచెప్పి, భూమికాండ శ్లో. ౧౦౩ నందు "అథ" నాట్యోక్త యోరాజా; దేవో భట్టారకోఽపిచ" ఇత్యాదియు బలికియున్నాడు. దీనివలన భట్టారకశబ్దము నాట్యోక్తి యగుటయేకాక గౌరవవాచక మనియు దెలియుచున్నది. నానార్థరత్నమాలాకారుని కాలమునకు ఇంకొక మతభేదము కలిగి "భట్టారకో భూమిపాలే; దివాకరసి తపోధనే" అని నిర్వచనము లభించుచున్నది. ఇందు నాట్యప్రశంస లేదు.

కొంతమంది మహాకవులకు కొన్ని యల్పకారణములచే వినోదములగు ఎగతాళి పేర్లు పెట్టుట గలదు. రఘువంశమునందలి యారవసర్గాంతర్గతమగు "సంచారిణీదీప శిఖే

వరాత్రా" విత్యాదిశ్లోకమువలన కాళిదాసునకు "దీపకాళిదాసు" అనుపేరు వచ్చినదనియు భవభూతి ఎచటను "తపస్వీ కాంగతో౽వస్థామితి స్మేరాననావివ.

గిరిజాయాస్తనౌ వన్దే భవభూతిసితాననౌ" యనెననియు అందుచేత, శ్రీకంఠుడను నామముగల యా మహాకవిశ్లోకమువలన "భవభూతి" యాయెననియు అందురు పరమలాక్షణికుడగు దండి నిజనామమెద్ది యెవరెరుగరు. దశకుమారచరిత్రఘట్టమున "బ్రహ్మ దండ ఛత్రదండ-. కాలదండ ఇత్యాది దండ భూయిష్ఠ ప్రయోగముచే "దండి" యనబరగెనను వాడుకకలదు. "శిశుపాలవధ" పంచమసర్గయందలి "ఉదయతి వితతోర్ధ్వ; రశ్మిరజ్జావహిమకరేహిమ ధామ్ని యాత్యాదిశ్లోకమున కూర్పబడిన "ఘంటా" శబ్దముచే "ఘంటామాఘ" నామ ముద్ఘోషిత మగుచున్నది.

ఇత్యాది కారణములచే నన్నయకు భట్టారకోపపదము లభించియుండునా యని విచారించిన ఈ యూహకు కొలదిపాటి యాధార మనుమేయ మగుచున్నది. ఈ మహాకవికి భట్టారకశబ్దముపై యధికప్రీతి యుండినటుల తోచుచున్నది. ఆదిసభాపర్వములందును అరణ్యపర్వమునందలి నన్నయ ప్రణీత భాగమునందును భట్టారకశబ్దము పలుమారు ప్రయోగింపబడి యున్నది. అగ్నిభట్టారకశబ్దము ఆదిపర్వమున ఒకటిరెండుమూడు ఆరు ఆశ్వాసములందును సభాపర్వపు ప్రథమాశ్వాసమునను గలదు. బ్రహ్మ భట్టారకశబ్దము ఆదిపర్వమున నేడవయాశ్వాసమునను విష్ణుభట్టారకశబ్దము ఆదిపర్వమున ఎనిమిదవయాశ్వాసమునను, అరణ్యపర్వమునందలి మూడవయాశ్వాసమునను భర్గభట్టారకశబ్ద మరణ్యపర్వ ప్రథమాధ్యాయములోని పరమేశ్వరదండకమునను వాయుభట్టారకశబ్దము ఆరణ్యక ద్వితీయ తృతీయాశ్వాసములందును వ్యాసభట్టారకశబ్దము ఆదిపర్వగత తృతీయ చతుర్థ సప్తమాధ్యాయములందును గలవు. ఈశబ్దము నింతవిరివిగ యుపయోగించినవారింకొకరగపడరు. పైన ఉదాహరించిన కాళిదాస భవభూత్యాదిన్యాయమున విదేశము జేసే నన్నపార్యునకు నన్నయభట్టారకుడను ఖ్యాతి ఆంధ్రవైదుష్యము గల్పించి యుండునా? లేక ఇది కేవల పూజ్యవాచకముగ జేర్పబడినదియా?

నెల్లూరుపురమందిర ౧౯౯౯(సిద్ధార్థి)లో శాశ్వత కీర్తులు మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిల వారి నేతృత్వముక్రింద జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్తునందు ఆంధ్రగీర్వాణప్రవీణులొకరు (బహుశః అధ్యాపకచరులు బ్రహ్మశ్రీ దండిగుంట సూర్యనారాయణశాస్త్రిలువారుగ నుందురు) నన్నయభట్టును గూర్చి యుపన్యసించుచు నవీనమార్గ నిర్మాతకు భట్టారకబిరుదు గలదని సప్రమాణముగ వ్యాఖ్యానించి తెలుగున నజ్ఞాతపూర్వకమగు కావ్యరచన జేసినందున నతనికి భట్టారకత్వము సమర్పింపబడినదనియు జెప్పిరి. తెలుగున నాదికవియనియు ఆంధ్రభాషావాగనుశాసనుడనియు నన్నయ నెల్లరును యిప్పటివరకు కొనియాడుచున్నారు. తెలుగున నాదిమకవియై దేశకవిత్వమున నూత్నమార్గోపదేశికుడగుటచే భట్టారకబిరుదము ఒప్పియుండగలదను యూహయే సమంజసముగ నుండునా?

# నా మహారాష్ట్ర యాత్ర

## ౭

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

దేనిని పాటింపక నిద్రించి ఉదయమే లేచిన రొజుల భయసంకోచములు కొండొకవడి మనసును మారొక్కనకనే యుండెడివి! ఏజంతువుకన్నుల బడక కదలమెదలక అందుపడియుండిన నపాయమే లేదు. కాని ఆ భయంకరనిశీథమున నేదో యపూర్వశక్తి నా హృదయము నాకర్షింపసాగినది. అడలని ఆపదయని అందుండి మనసు కదలిపోవుట కిచ్ఛగించుట లేదు.

ఆహా! మనుష్యహృదయ మెట్టిదో! నూతన సంఘటనలపై, అపూర్వదృశ్యములపై విహంగపతివలె వ్రాలనది మిక్కిలి మక్కువపడుచున్నది. లక్షగ్రంథములను చదువుటకంటె అట్టి నిశియం దట్టిదృశ్య మొక్కపరి పరికించుట మేలు. భావభరితమై అది మనసున చిరవాసము చేయును! నిద్రించుచుండు శక్తులను చఱచిచఱచి లేపి యది కదనాంగణమున బురికొలుపును. అత్తటి నంత రంగమున నపూర్వోత్సాహ ముదయించును. ధమనిస్నాయువులందు విద్యుచ్ఛక్తివలె ధైర్యము కదువడిగ జాలువారు నని చెప్పదును! కావుననే క్రుంగిన అంగప్రత్యంగములు ప్రముక్కడి రక్కసులను మారొక్కనుటకు దలపడును! భయ సంశయములు కొండొకవడి హృదయమున పొడసూపిన నేమి? ఇవి యం దిల్లు గట్టుకొనియుండ నేరవు. దొంగవలె నందు అపుడపుడు పిశాచము చొరబడిననేమి? అందు విరాజిల్లువాడు జగదీశుడు కాడా? విజృంభించిన పిశాచమును చీల్చి చెండాడుట కాతని కెంతసేపుపట్టును? దేవదానవులకు మనుష్య హృదయము సమరాంగణమని నా యుద్దేశము! మనుష్య జీవనము సార్థకమగుట కీ దివ్య కురుక్షేత్రమున నీ భీషణాహవము అనివార్యమైనదని నొక్కి చెప్పగలను. పిశాచము లేచిన గాని ఈశ్వరున కంతగా పనియుండనే యుండదు. ఈతనిచేతినిండ పనియున్న గాని సృష్టి తేజోవంతమై యుండనేరదు. సృష్టివృద్ధియందలి కృషిమాత్ర మెంత యద్భుతమైనదో! కృషియందు మహాదాశయమునకై సలుపు పెనగులాటయందు ఎంత యర్థము, ఎట్టి యభ్యుదయ మున్నదో! పదుగురు దుష్టదానవులు విజృంభించిరి కావుననే జగతియందు పది యవతారములు పొడసూపినవి! ఎంతయో కావ్యసృష్టి, ఎంతయో విజ్ఞానవృద్ధి కలిగినది ప్రతిఘటించు శక్తులు లేకున్న మానవుడు శరీరమున క్రొవ్వు పెంచుకొనును! పంకిలమందలి పతంగమువలె సంతృప్తియందు పడియుండును! బ్రతికినను చచ్చినట్లుండువాడు కఱి శిలకంటె నధికుడని ఎవరందురు? పనిలేని యవయవములు, కోరగాని మనసు మానవజీవనమున మన్నుబోసి తీరును. కృషి నెఱుగని మనుష్యశక్తులకు త్రుప్పుపట్టుట తథ్యము. అసంతృప్తి నెఱుగని మానవుడు, నికృష్టశక్తులతో పోరని మానవుడు పుట్టిననేమి గిట్టిననేమి? నాలుగు గోడలం దడగి, కలమాన్నము నుడుచుచు, హంసతూలికలందు పొరలాడుచు, నిత్యభోగములందు మునిగి తేలువాడు గోరీకడుపున గ్రుళ్లుమాంసమున, దుర్గంధమున దృప్తిగ నివసించు పురుగు పోలువాడు. సృష్టియుద్దేశమున తనకుతోడుపడువాడని యేకదా జగదీశుడు మనుష్యుని సృష్టించినాడు ఇతడు క్రిమివలెనో, బండరాయివలెనో యుండుచో బ్రతికిననేమి చచ్చిననేమి? మనుజు డీ దుర్గతికి దిగకుండుటకై సృష్టినియమము సంతృప్తినుండి వానిని బరబర లాగి తఱుచుగ వాని మ్రోల ప్రతికూలశక్తులను నిలిపి, పోరుమని వానిని పురికొల్పును. ఈ నియమమే నా జీవనాంగణమున నెన్నో సిలుగులను నిలిపినది. ఇదియే నన్ను వివిధ భూధరములందు, వివిధారణ్యములందు, వివిధ దుష్టపరిస్థితులందు, కడలేని కడగండ్లయందును నిలుపుచున్నది. బాలకుడనై తొలుదొలుత "అమ్మో!" యంటిని. నిజమే!

కాని, ఈనీరసభావమును మనసుపై స్వారిచేయనిచ్చి తిరిగాను. కురుసేనల ట్లరిష్టములు మార్కొనుకొలది ధైర్యసాహసములు, సహనసామర్థ్యములు అధికమగుచు నన్ను రణోర్వియందు లంఘింప జేయుచున్నవి. దుఃఖ మును, నైరాశ్యమును దూరముగనిలిపి జెబ్బకొట్టి సవా లొనరించుచుంటిని.

శర్వరి నాహృదయమున నెంతో యానందమును ధారవోయును. నగరమందలి రేబవళ్లకు భేదమేలేదు. అచ్చటి నిశీథమందు Poetry ఉంటేనేయుంటదు. అదియుంటుట నిస్తబ్దమగు కేదారములందును, అడవు లందును, కొండలందును మాత్రమే! ఈయూ తావులకు పోవుతతి వెంట నెవ్వరినైన తోడ్కొనిపోవుట తప్ప. వీనియందొంటరులమై సమయము గడపినపుడు ఆత్మయం దు ఆనందము అనిర్వచనీయమైనది. శాంతశీతల వాతా వరణమందే, సచ్చిదానందములందే కదా ఆత్మ యుప్పు వించినది! పక్షి మూకలవలె తలపు లపుడే మనసుపై రివ్వు రివ్వున నెగయును! ఈయీ చోటులందు అపుడపుడు తోచు వింత దృశ్యములును, భీమశబ్దములును అనంత శాంతితో పోరజాలక (పోరినంతదనుక యాత్రీకునకు క్రొంగ్రొత్త యనుభవముల జేకూర్చుచు) అదృశ్యమగును. హిమగిరులందు పయనము సాగించుచు, ప్రొద్దుగ్రుంకి నంతనే ఏదేని కొండపల్లియ జేరుకొనువాడను. కాశ్మీ రమున సంచరించుచు నొక్కనాత్రి జీలమ్‌నది యొడ్డున గడపితిని. సంయుక్తరాష్ట్రములందు పరి హారము (సీతాదేవి పరిత్యజింపబడినచోటు)నుండి బ్రహ్మ వర్తమునకు మరలును రాత్రి సమయమున గంగ లోని లంకలందు ఎత్తయినదుబ్బులందు, శ్మశానములందు నక్కగుంపులపాంశ మార్గముదప్పి మసలితిని. * ఈ మహా

తన బసయందు తనసేర్పాటు చేయుదునని నాకుకదా ఆ నెయ్యరి! తన యింటికి దోకొనిపోవుటకు ము న్నాతడు మమ్ములను తెరువునను న్న సిక్కులకు ద్వారమందిరములోనికి తోడుకొనిపోయినాడు. ఇది జీలమ్‌నది యొడ్డుననున్నది అని యచ్చరిల విశ్రాంతిగృహ మనుకొంటిని. మందిరమున నొక సిక్కువృద్ధుడున్నాడు. వశిష్ఠుడేమో యనుకొన్నాను. మమ్ములను చూచి, ముం దులకువచ్చి ఆదరపూర్వకముగ నాతడాహ్వానించినాడు. సిక్కుల చూపు గౌరవము అద్వితీయమైనది. ప్రార్థన మునకు నిర్దిష్టమైన ప్రదేశమున నాతను కూరుచున్నాడు. మేమును సమీపమందే గూర్చుంటిమి. ఆతని కొక! వైపున పండ్రెండేండ్ల బాలికయును రెండవదిశ నామె కవలతమ్ముడనదగు బాలుడును గూర్చునియుండిరి. పిన్న వయసులోనే బాలుకు పాగాధరించినాడు. ఇరువురును జోడుగులాబుల ట్లుండిరి. నమమున్నతాత ఆవేళపూరి తుడై పాడుచు, నొక్కొక చరణమును పిల్లల కందించు వాడు. ఏకగ్రీవముగ వారు పాడదొడగిరి. గులాబుల గుండియలందు రెండు కోయిల లడగియుండి పాడు చున్నవేమో యనియు, ప్రసూనహృదయములందలి సుధా పూరము గీతికాసున్నయై కొండదొరమేన బులకలు లేపు

* ఈ సంఘటనములకు సంబంధించిన వృత్తాంత ములను చదువరులు ప్రత్యేకగ్రంథములందు, ప్రత్యేక సందర్భములందు గాంతురు.

మంచుకొండలో పయనము సాగించుచు, నొక రాత్రి కోహలోయను కొండపల్లెను చేరుకొనినపుడు నన్నెదుర్కొనిన క్రూరసంఘటనము నీకాహిని యందే కొండొక సందర్భమున నుల్లేఖించియుంటిని. గిరిపైనున్న బంగ్లాలో నాటిరాత్రి పరుండనిచ్చగించితి మనియు, అందున్న ఒక హిందూస్థానీయుడందులకు సమ్మతింపలేదనియు, అందుండి కదలుటకు నే నంగీ కరింపనైతిననియు, అత్తతి ఆతడు ప్రదర్శించిన కాఠిన్య మును మిగుల గర్హించితిననియు, కురుక్షేత్రమునుండి వచ్చి ఆ దినములలో కోహలోయందు వసించు చిరం జీవియను నధ్యాపకుడు నన్నూ, నాపొట్టిపెదికనూ, నానెచ్చెలిసీ అందుండి గొనిపోయెననియు చదువరు లెరుగుదురు. నాటిరాత్రి నే గడపిన విధమును వారెఱుగ గాంక్షింతురు. కావున నీ సందర్భమున నాయుదంతము నతి సంక్షేపముగ వివరింతును:

ప్రొఫెసరు చిరంజీవితో మెల్లగ మంచుకొండ నుండి కొంతదూరము దిగివచ్చితిమి. మేముపరుండుటకు

రాష్ట్రియాత్రిలో నేకృష్ణ, సావిత్రి, గాయత్రి, కొయనా, ఎన్నానదుల జన్మస్థలములుచూచి, పశ్చిమ పర్వతముల యందలి మహోన్నత శిఖరమైన Arthur point నెక్కి సూర్యాస్తమయము నవలోకించి మరలివచ్చుతటి క్రూర మృగసంకులమైన బ్రహ్మారణ్యమున జిక్కుకొంటిని. వీరాగ్రేసరుడు శివాజీనిర్మించిన ప్రతాపగడమహా దుర్గమున శివాజీప్రతిష్ఠిత భవానిని దర్శించి మరలు తటి వనమందొక గుడిసెయందు విడసి, ఒక ముసలికాపు సాయమునంది ఎన్నెన్నివింతలనో (వీనిని గుణించిన యుదంత మీ గ్రంథముయొక్క రెండవభాగమున గానం బడును) విలోకించితిని.

పకపక అత్తిచెట్టు నానుకొన్ని అట్లే చూచుచుంటిని. మరల మనునవ్వు వినబడినది. అనతిదూరమున నాకెన్క నేదో భయంకరనినదము వినవచ్చినది. ఉలికిపడితిని. దూర

చుండెననియు నూహించితిని. ఏకగ్రీవముగ నిఃసంగు లాలాపించు గీతికకు సమీపమందలి ఝరిల్లలామము తన యనంతశ్రుతిని సహకరించుచుండెను. పరమాత్మను మోదుకొనిపోవు విహంగపతివలె నంబరచుంబి హిమశిఖరమునుండి యున్నత్తుగ నాటిపాట నా యాత్మను గొంపోయి స్వర్గసౌధములందు జేర్చినది. కొండొకవడి నాత్మవిస్మృతుడనై అందు జతికిలపడి యుంటిని. అనంతరము వృద్ధుడు ప్రేమసంసిక్తమై కడుంగడు రుచ్యమైన ప్రసాదమును మాకు బెట్టినాడు. అందలి మధురభావముచే నాత్మను, తక్కుంగల పదార్థముచే నుదరమును దనిపితిని. పరుండుటకు తగు వ్యవస్థ సలుపుదునని తాత యనినాడు. ప్రొఫెసరు చిరంజీవికి శ్రమ గలిగించుట కిష్టపడక వృద్ధుడొనరించు వ్యవస్థకు సమ్మతించితిని. మందిరమున కంటియున్న గదిలో మాకై యాతడు మంచములు వేయించినాడు. హంస తూలికలతో నెకసక్కెములాడు పరుపులను వానిపై నమర్చినాడు. శీతకాలమున శీతశైలము మీది చలి దుస్సహమైనది. కప్పుకొనుటకు వృద్ధుడు దట్టమైన "సిరిక్" లిచ్చినాడు. నా యనుచరలు శ్రమానంతరము స్వర్గ సుఖము నంది నిముసములో స్వప్నావని బ్రవేశించిరి. నిదురించుటకు నాకు మనసొప్పలేదు. పూర్ణిమ కావున మంచు కరళ్లతో గూడి వెన్నెలకరళ్లు రాలుచుండెను. అంబరవీధినుండి యమరులు కడుంగడు చిక్కని పెరుగును దొడ దొడ, గిరిరాజుపై పారబోయుచున్న ట్లూహించితిని నాటి విభావరీ విభవమును వర్ణించుట కిందు చోటులేదు. శైలతలమున విహరించుటకు స్వర్గమే దిగివచ్చెననియు, కవిస్వప్నము మూర్తీభవించి ప్రత్యక్షమైనదనియు, అగోచరులై యంతరంగమున దివ్యబృందావనమును సృష్టించు గంభీరభావము రూపుదాలిచి ప్రణయప్రసంగము చేయ నుంకించుచున్నదనియు, వరూధినీ ప్రభృతులు పండుగజేసికొనుచు, వేడుకలం దూగాడుచు శర్వరీసీమంతిని నట్లలంకరించి తాము చిరుతరగలందు దాగి కిలకిల నగుచు నా నగుమోముపడతిని మ్రోల నిలిపిరనియు దలచితిని. దట్టముగ గప్పుకొని అల్లనల్లన నాగారము నుండి దిగి ఝురీపూరము దాపున గూర్చుని, రెప్పలు వాల్పక యామినీసుందరి నవలోకించుచుంటిని. నలువలకులందు దానే గోచరించుచు గగనతలము కూడ తన సామ్రాజ్యములోనిదే యని కాబోలు పూర్ణ స్వాతంత్ర్యముతో గిరీంద్రు డజాండము నంత నాక్రమించుకొనియుండెను. ప్రీతిమెయి దేశాటనమునకై చను జీలమ్‌నదీమతల్లిపైనుండియే పాటపాడుచు వచ్చుచున్నది. నీరవుడైయున్న పర్వతపతిని నిద్ర పుచ్చుటకయి నెల్లవయిల్లాలు మంజులగీతిక నాలాపించుచున్నదేమో యని యొకమారును, మధురయామినీ సమయమున నిజవాంఛను దీర్చుకొనుటకై గాఢనిద్ర నుండి శైలపతిని లేపనెంచి శైవలినీకామిని అల్లనల్లన నిజేశునకు గిలిగింతలు బెట్టుచు, నాతనియుల్లము చేరజాలు చల్లని పాటపాడుచున్నదేమో యని వేలొక పర్యాయమును దలచితిని. చోద్యముచూచుచు నెంతో నే పందే యనిపించులోచనుడనయి కూర్చునియుంటిని. ఇంతలో నా పొట్టిపిచికిగాడు ఏడ్చుచు, వెతకుకొనుచు నేనున్న యెడకు వచ్చినాడు. నే నెందో యంతర్ధానమైతినని ఆతడు డడలినాడు. ఈ విచిత్రోదంతమును పాఠకులు నా "కాశ్మీరమజిలీ"లందు గాంచగలరు.

మండలి యాపద రెక్కలు కట్టుకొని పులుగువలె నాపై వ్రాలనుంకించుచున్నదని యడలి వెనుదిరిగి చూచితిని. ఏబదిగజములదూరమున నేదో మృగము మరొకచిన్న జంతువుపై నురుకుచుండెను. చీకటిలో దానిపోలిక పట్టుట నాకు సాధ్యము కాలేదు. తలచుగ మనము తిట్టి పోయు చీకటియే నాకపుడు రక్షక మైనది. అంధకారము లేకున్న, నంత సమీపమందలి దుష్టమృగము నన్ను గాంచి, ఒక్క యురుకున పైబడి నన్నూ, నాభావ ములనూ నిముసములో మ్రింగివేసెడిది. సృష్టియందు మానవునకు తోడుపడని దెద్దియు లేదేమో! "మను ష్యులం దుత్తము డొక్కొకప్పుడు మిగుల దుచ్ఛమైన పనులనూ, నీచులందు నీచుడు మహోత్కృష్ట క్రియల నొక్కొకపుడు చేయు" నని ఒక తాత్వికుడు వచించి నాడు. చీకటికాక వెలుగే నాకపుడు ప్రాపైయు న్నచో బ్రహ్మగిరినుండి యద్దమరేయి నాపదలో నంత గ్రాహ్యుడ నయియుందును. ఆపద కన్నతల్లివంటిది, జ్ఞాన ప్రదాయిని అనుచుందును. తనను గుర్తించినవారి నదే మియు చేయదు. నిశికాంత నన్నా భయంకర మహూ ర్తమున దనయొడియందు జేర్చుకొనినది!

నన్ను జూచిసహింపక కాబోలు నన్నుగప్పియున్న తమోవసనమును చించివేయ గొంతదూరమున వెనుక దెలి కిన మంటతోచినది! చివాలున లేచి చెట్టువెనుకకు తప్పు కొంటిని. అగపడిన జ్వాల తోడనే అదృశ్యమైనది! కాని,అదియే నాపైదుముకునేమో యనుకొంటిని. మంట తక్కువ మిగుల నల్లనైన వన్యపశువు కానుపించినది! అది పెద్దపులిగాని, సింగముగాని యైయుండదని, అడవి పందియో, ఎలుగుబంటియో యైయుండుననని యూహిం చితిని. ఆహారమును వెతకుకొనుచు అర్ధరాత్రమున నది ఇందందు నడయాడుచున్నది! వెలుగులేకున్న నేమి, ఆ చిన్నజంతువును తలుముకొని నిముసములో నేనున్న యెడ నురికి, దానిని విడిచి నా పని పట్టునేమో యని యడలితిని. తాత్విక భావగర్భితమైన మహోపన్యాస మపుడు నన్ను గాపాడునా? బ్రతిమాలినయెడల నడవిమృగము కనికరించునా? తియ్యని పాట పాడినను దానిమనసు కలుగునా; కాని గుండెలను మాత్రము చిత్త మువచ్చినట్లు దడదడలాడ నిచ్చితినిగాను. దడనడంప కున్న, నది యార్తనాదమై కుత్తుకనుండి వెడలి అవలీ లగ న న్నాపద కప్పగించివేయునని ముందే గ్రహింప గలిగితిని. ముప్పనోట బడకుండ నేదేని యుపాయమును పన్ని తీరవలె ననుకొంటిని. చుట్టును జోదులట్లు నిలచిన నాలుగుచెట్లలో దేనిమీదనయిన నెక్కి కూర్చుండిన మేలని యూహించితిని.

చిన్ననాడు మాయూరి బడిపిల్లలకూడి చెట్లె క్కుట, ఈతకొట్టుట మన్నగు క్రియల నభ్యసించితిని. గోదావరిలోను, కాలువలోను ఈదియీది సంతరణమున కౌశలమును సంపాదించితిని. కొంతకాలమునకు మున్ను రాజమండ్రికడ గోదావరి నీవలియొడ్డునుండి యవ్వలి యొడ్డున కీదియుంటిని. కాళ్ళేతులు కదల్పక గంటల కొలది శవమట్లు నీటిపై తేలియుండుట నేర్చియుండు టచే, నాయాసమువచ్చినపుడు వెల్లువయే తల్పమగుటచే నెంతదూరమైన నవలీలగ నీదజాలుచుంటిని. ఈ తెపందె మున తప్పక నెగ్గగలనను ధైర్యము నాకు గలదు. చిన్న నాడునేర్చిన విద్య ఎన్నటికినిబోదు. ఎట్టిచెట్టునైన నవలీలగ నెక్కువాడను. శెట్టిపేట * మడుగు యొడ్డు

* నా స్వగ్రామము తూర్పుగోదావరిజిల్లాలోని పేరవరమైనను, నా పెదతల్లిగారి యూరైన శెట్టి పేటలోనే పుట్టితిని. నా పెదతల్లిగారి దొడ్డియందలి గొడ్లచావడి నా జన్మస్థలము. నేడు నా అమ్మలేదు నా పెద్దమ్మయును లేదు. కాని గొడ్లచావడి అట్లే యున్నది. ఈ చావడినుండియే నా యిహజీవనయాత్ర నారంభించితిని. అందుండి ఎన్నెన్ని యోజనముల దూరమునకో కదలిపోతిని. యువకుడనై, యుత్సాహ పూరితుడనై కట్టెదుట నింకను విశాలమైన యాత్రాం గణమును చూచుచుంటిని. జగదీశుడు నన్నేయేచోట్ల కు గొంపోవునో! నన్నేమిచేయునో! భావభరిత మైన యేయే తావులను దర్శించినను, నివియన్నియు గూడి యైన ద్రోలుత నన్ను దన యొడంద నందుకొనిన పశుల పాలకంటె నాకు ప్రీతికరములు కావు. ఈ పవిత్రస్థాన ము నుద్దేశించి ఎందున్నను జోహారనుచుందును. తలచుగ దీనిని చూడవలెనని యువ్విళ్లూరుచుందును.....శెట్టి





మీాద క్రింద

నివాస భవనములు

నడుమ నీటికుండు



నందలి నేరేడుచెట్టునుండి ఊరిబాలకులతో కలసి నీటి యం దుఱుకువాడను. నాటి దుండగములు పదంపడి నన్నెన్నో గండములనుండి కాపాడి వి.

చెట్టెక్కుట సులభమైన పనియైనను, చీకటిలో పైకెగ్రాకుట మంచిదికాదేమో యనియు, అందేదైన సర్పమున్నను ఉండవచ్చుననియు, ఎక్కనను తెలుసుకొనచు వచ్చు భల్లూకము వృక్షము నెక్కజాలినజంతు వగుటచే ముప్పు తప్పదనియు, ప్రస్తుతస్థితికంటె చెట్టు మీది దుస్థితి మఱింత దురంతమై యుండుననియు నదలితిని. భల్లూకము వృక్షమెక్కగలదని తెలుపు విక్రమార్క కథ జ్ఞప్తికి వచ్చినది. నది యుత్పన్నమైన తావలమున నొంతి పల్లమున్నది. పోయి ఆ పల్లమున నక్కియుండ వలెననుకొంటిని. కాని, నీరు త్రాగుటకై వన్యపశువు వచ్చి సరిగ నందే నన్ను కన్గొని, సలిలసమీపమున సమయమునకు సిద్ధమైయున్న ఆహారమని దెబ్బతో నన్ను 'సుబకాయస్వాహా' చేయునేమో యని యదలితిని. ఏమి చేయుటకు నాకపుడు పాలుపోలేదు. కాని, ఊగిసలాడుటకును, దీర్ఘయోచనము సలుపుటకును వ్యవధి లేదు. అనతిదూరములో మృగము గంతులు వేయుచున్నది! అది పులికాదని, సింగముకాదని రాయి గ్రుద్ది చెప్పలేను. ఉచ్ఛ్వాసనిశ్వాసములను కొంతవరకు బిగబట్టి చెట్టు మాటున నిలిచి, క్రూరమృగము యొక్క గతి నుపలక్షించుచు, దాని గమనము ననుసరించి తటాలున తరుశాఖను పట్టుకొని వ్రేలాడుటో, పల్లములోనికి లంఘించుటో, భయసంశయములను వదలి దాని ముఖగహ్వరమున ప్రవేశించుటో జరుప నిశ్చయించితిని. అదృష్టవశాత్తు అది తఱుముకొని వచ్చిన చిన్నిజంతువు ప్రక్క గల లోయలోనికి పరుగెత్తినది. పెద్దమృగము దానివెన్నంటి క్రిందికి లంఘించినది. "అమ్మయ్యా! జగదీశు డిప్పటికీ యాపదనుండి నన్ను కాపాడె"నను కొని ఆతని నుద్దేశించి సాగిలపడితిని. ఇక నికెట్టివన్యపశు వచటికి వచ్చునో యని తలపోసితిని. మరల పకపక మనునవ్వు చెవుల బడినది! ఈమా అది మఱింత వికృతముగా వినబడినది. ఎట్లెట్లూహించినను, ఈ నవ్వును గుఱించిన చోద్యమేమో నాకు బోధపడలేదు. క్రమక్రమముగ మంట అంతరించినవి. భయంకరశబ్దములును కడచినవి. దుండగపుజీవులను గన్నుమండిడికొనిన రక్కసి పడతివలె నైశని స్తబ్ధతతోచినది! ఇంకెట్టి చెడుగుల నదియీనునో గాని, మఱే చెడుగుజాడ కానరాలేదు. మఱెట్టి చెట్టులు పొడసూపవని మనసు కుదుటపరచుకొని మూల వృక్షములనడుమజేరి, కూర్చుండలేక నెలికిలబడి వియత్తలము నవలోకింప సాగితిని.

తిరుశాఖల తుది రొబ్బలనుండి చూడ్కులు చివాలున శూన్యములోనికి లంఘించినవి. చుక్కగుంపులు రెమ్మకొనలందు ప్రస్ఫుటించిన పూవులని భ్రమసితిని. వానిని చూచినంతన గుండెలందలి దిగులు అదృశ్య మయ్యెను. నిశాసమయమందలి యనంతశాంతి యపు డీశ్వరకరుణకరణిహృదయమును సోకినది. చెట్ల జొంపములందు, ఆకుమూకలనడుమ మలయసమీరుడు ప్రణయముగ్ధుడై మసలుచు మధురనిస్వనమున బూవునెలంతలను నిదురనుండి లేపుచు నగుమోమునవల నావేళపూరితుడై కౌగిలించి, వాని రొమ్ములందుజొచ్చి ప్రేమమరందమున నీదులాడి, వలసినంత ప్రణయ పరిమళమును మోచుకొని "అను

---

పేట నిడదవోలునకు రెండుమైళ్ల దిగువ నేలూరు కాల్వ యొడ్డుననున్నది. దీని కింకొకతట్టున నరసాపురపు కాలువయును, వేఱొకవైపున అత్తిలికాలువయును గలవు. తామరలతో నిండిన కాలువ యొకటి మడుగునుండి పల్లెపొంతకు పాఱుచుండును. మిగుల విశాలమైన కాసారము కవిభావములు పోలు ప్రస్ఫుటిత పద్మములతో, ముత్తియముల కెనయైన నీటితుంపురుల హృదయముల నిడికొనిన విశాలతామరపత్రములతో నలరారుచుండును. ఊరిచుట్టు తరుణరమణులపోలు చేలు నిలిచి కనులపండు వొనరించును. "సుజలాం, సుఫలాం, సస్యశ్యామలాం మలయజమారుతాం" అను గీతికకు నా జన్మస్థలము పర్యాయపదము.

*"Full many a flower is born to blush unseen" Vide: Gray's "Elegy."

రాగమందలి హాయి నెఱుంగుదువా?" యని గుసగుసలాడి దానిని నాయంతరంగమున గుమ్మరించెను. "అడవి గాచిన వెన్నెల" యనుచుందుము. "మానవదృష్టి నెఱుగక పుట్టి గిట్టు పూవు"* అని థామస్ గ్రే పలికినాడు. పూవుగాని, వెన్నెలవాకగాని నిరర్థక జీవికాదని నా తలఁపు. వీనినిగుర్తించి, వీనిహాయినందు భాగ్య మేకవికైనను, ఏ మునికైనను ఏ పథికునకైనను గలుగక పోదు. గుర్తుపట్టజాలని వేయిమందికంటె గుర్తుపట్టగల వాడొక్కఁడున్న మేలు. సౌందర్యమనుడు, సౌరభమనుడు సత్యమనుడు, మాధుర్యమనుడు, మఱేగుణమనుడు కన్నుగలవానివలన, గుండె గలవానివలన, ప్రశంసింపజాలువానివలన సార్థకమగును. ప్రజానీకమందుండియు, గుర్తింపబడక దిక్కులేనివారివలె మడియుచున్న ప్రతిభావంతులు లేరా? అడవి గాచిన వెన్నెలవలని హాయినందు ప్రకృతి లేకపోలేదు. ఎడారిపూవుతో సుఖక్రీడలదేలని సమీరుడును లేకపోలేదు. తనబిడ్డసోయగమునకు తానెంతో యలరి, ఏకవి కుమారునకో దాని నప్పనముగ, తన నిసుంగు యెడందలోని విభవ మాజామాతకతన విశ్వవిశ్రాంతము కాగలదని ప్రకృతి మురియుచుండును. కవి కంధరమున మాల్యమైయొప్పిన చంద్రిక కళాసామ్రాజ్యమును సుధాసంసిక్త మొనరించు టెఱుగమా? కవిహృది నానందవీచికలనూగాడించిన కుసుమసీమంతిని సాహితీజగతి నెన్నెన్ని ముద్దుగొలుపు తలపులకు కన్నతల్లి కాలేదు? ఈ తలపులే కావ్యకేదారమున నెందో సౌందర్యమును పండించుకాపులై ఎన్నియో మానసములను తనుపుచుంట నెఱుగమా?

నడిరేయి నెవ్వరుగాని దాపునలేని యదనున, నభోవధూటీగళమున మల్లెదండవలె వఱలు నక్షత్రమాలికపై కన్నువేసినపుడు మనసున నెన్నెన్ని మధురభావము లుత్పన్నముకావు? చుక్కలందలి చోద్యము వర్ణనాతీతముకాదా? స్థలకాలము లనంతములు. అనంతశూన్యమున మిణుకుమిణుకుమని కాంతిలు తారకలు దేవతలు చెరిగిపాఱబోసిన నూకలుకావు. ఇవి యసంఖ్యాకములైన భువనములు. ఒక్కొక్క యుడుభువిదూరమును గుణించి కన్గొనినపుడు మానస మద్భుతానందములతో నిండిపోవును. ఒక్క సెకండునకు వెలుతు రెన్నో మైళ్లదూరము సాగిపోవును. సమారు రెండు వేలేండ్లకు భూమినిజేరు వెలుంగును వెలారించు చుక్కలు కలవు! అనంతాకాశమున నివి యెందున్నవో యూహింపుడు. ఇన్నిలోకముల ననంత శూన్యమున సృష్టించిన శక్తి యెట్టిదో కదా! మనసును దూరమునకు గొంపోవు దివ్యదృశ్యములే సృష్టిలో నత్యద్భుతములైనవి. ఇవియే మనుష్యశక్తిని మహోన్నతస్థితి కెగయబురికొల్పును. గ్రహాదులు నక్షత్రములై, విన్నుకొన గాంతిలుచుంట లేదా? వియత్తలపత్రముపై గాంతిలు నక్షత్రాక్షరము లీశ్వరుని హస్తాక్షరములు. ఒక్కొక్క యక్షరమును విలోకించినపుడం దేమి మహత్త్వమున్నదో, నీలంపురంగున ననంతదూరమునుండి మిణుకుమనుచున్న భావమెట్టిదో యని యబ్బురపడమా? "ఎంతమహత్త్వమున్నదో?" అను ప్రశ్నను పురికొలుపురచనమే దివ్యరచనము! దివ్యరచనమునకు మాఱుపేరు కవిత్వమందుము. విశ్వపతియైన జగదీశుడు కవిసార్వభౌముడందుము. ఈశ్వర రచన మాదర్శకవిత యందును. నిక్కంపుగవి కానోరువాడీశ్వర లిఖితహస్తాక్షరములకు కను లప్పగించి తీఱవలెను. చుక్కలను కన్నులెదుటబెట్టునుగాని ఈశ్వరుడు వానియందలి భావభువనములను గుఱించి మహోపన్యాసమిచ్చునా? తన భావములకు భాష్యము చెప్పుకొనువాడు కవియేకాడు. ఊహకు చోటిచ్చి, అబ్బురపాటునకవకాశ మొసగు దృశ్యమే సృష్టిలో గణనీయమగునట్లు పఠితమనసునకు గొంతపని కల్పించు రచనమే కావ్యసృష్టియందు గణ్యతగాంచును. సృష్టికర్త బట్టబయలైన, ఊహకు పనికలుగకున్న, Suggestiveness కు తావు దొరకకున్న, కాంతిభావము స్ఫురింపకున్న, Sense of the beyond తోపకున్న, విశ్వరచనము చప్పిడికూడువలె నుండునని నాతలంపు. Suggestiveness రచనమందలి ప్రధానగుణమని తెలుపుట నాయాశయము. ఇది లేని కవిత్వము పఠితమనసునకు రెక్కలిచ్చి దానినూహావిహాయసమున రివ్వుమనిపింపజాలదు కావున కవిత్వమనిపించుకొనదు. సుదూరవియత్తలమందలి రచనమున కెనయైనకైతయే ఆదర్శకవిత యగును. చుక్క

లోని Suggestiveness ఎట్టిదో గ్రహింపజాలు కన్ను అందొక భువన మున్నదని సూర్యతేజమును మించిన Idealism కలదని యెఱుంగను. దీని దాపున Perception, Imagination, Beauty, Harmony లున్నవని తెలిసికొనను. కార్లయిల్ తెలిపిన Seeing eye ఈ కన్నే యందును. ఇట్టికన్నుగల పఠిత ప్రతిసృష్టిచిత్రమందును, ప్రతి ప్రకృతిచిత్రమందును కవిత్వమునకువలసిన లక్షణములను కన్గొనజాలును. కావుననే మహాకవు లీచిత్రములను పట్టుకొని ప్రాకులాడిరి! ఈకవుల నెఱిగినవారు, వారిజాడల గాంచినవారు వారి రచనలను పురికొల్పిన దృశ్యముల నెఱుగుదురు. నక్షత్ర ఖచితనభము, బాలార్కప్రభాకలిత దిగ్వలయము, కౌముదీస్నాతయామిని, "నందన చందనోత్కరము," "కన్నెమావిగుంపు" "లవలీ నికుంజము" "తీవముత్తయిదువచాలు" "రత్నకందరము" "ముత్తెపుమ్రుగ్గు లీను "మొగ్గ" ప్రత్యూష పవనాంకురము" "మల్లియలబూచిన కోన" "గాంగసైకతము" "వరుణాతరంగిణి" "అంబరచుంబి శిరస్సరజ్ఝరీ" "మిహికాహార్యము" "బహురత్నద్యుతి మేదురోదరదరీభాగము" "నభోవాహినీలహరీ శీతలగంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభగ్రహణేందిందిర తుందిల మైన కాంతార సంతానము" మున్నగు ననేకవా యిట్టి దృశ్యములు! ఈదృశ్యములును, ఆరచనములును మనుష్యాత్మను దుఃఖమునుండి, దౌష్ట్యమునుండి, జుగుప్సనుండి, యాతనమునుండి గొంపోయి, మూల నందనమున ప్రాతకాపుజేసి, దానిచేతి కానందకలశము నందించును. ప్రకృతియందును, ప్రకృతికవ్వలను జగదీశు డున్నాడని తత్త్వశాస్త్రము వాకొనుచున్నది. (God is immanent and transcendent) ప్రకృతికి ప్రతిచిత్రమైన రచనమందును ఆత డున్నాడనుట స్పష్టాంశము. ఈశ్వరశక్తికై తపించుచు, "విశ్వపతీ! విశ్వకవీ! విశ్వాత్మకా!" యని కవిభక్తుడు మానసాంజలి నొడ్డింతిన, దేవకిగర్భమున నిమిడిన కృష్ణపరమాత్మవలె, నీశ్వరప్రేరితమైన భావభువనములందు జేరుకొనును. ఈభువనరాసులనే మానసరాసులన ట్లాతడు తనపలుకులందు గురిపించును.

నాటినిశీథిని తప్పటడుగు లిడుచునే కడచుచుండెను. ఒకమాఱు దివిదిశకును, వేఱొకపర్యాయము విస్తృత శైలసామ్రాజ్యమందలి వివిధదిక్కులకును చూపుల బుత్తెంచుచు, కొండకొననుండి మేఘడోలికలోనికి లంఘించులాగున, పరిశీలనమునుండి భావనావీథులలోని కెగయుచు, కనులబడు వింతలకు అపూర్వమైన విడ్డూరములను జేర్చుకొనుచు, అంతరంగమున నాశ్చర్యానందములను నింపుకొన సాగితిని.

విశాలపర్వత ప్రదేశమున నిండందు కారుచీకటిలో తళ్ళుక్కత్తు నీటిగీతలు ఏయచ్చరచాన కుత్తుకనుండియో పుటుక్కున తెగిపడిన ముత్తెపుజేరులట్లు, కృష్ణపక్షమని ఈవలికి రాక నీకజారి నిభృతనభోభవనమున తానమాడుచుండ నీహారబిందువులనుండి నేల రాలిన కొలదిపాటి చంద్రికలచందమున, కామధేనువు పొదుగునుండి రాలి గిరిపార్శ్వములనుండి ధారధారలై జాలువారు దుగ్ధముభంగి, చదలునుండి కొండకొనపై చివాలున నుఱికి నేలదెస బఱతెంచు చుక్కచెవ్వాలలీల, మబ్బునుండి గొబ్బున జాలబడి తుక్కతుక్కలై పర్వతసానువులందు నొరలు మెఱపుదీవవలె, చిమ్మచీకటులందు చీకు నంది, అద్దమురేయి మొద్దునిద్దురనున్న తంద్రిమయంగ ప్రత్యంగములనుండి ప్రేలు శైలసంతానముకై వడి, సాంద్రసంతమసమున సానుమంతముపై దాగిలిమూతలాడుచు, మఱుగుచోటులనుండి కిలకిలనగుచు, చరచరబర్వెత్తు కిన్నరబాలికలపోలుపున, జ్యోత్స్నపక్షమున కుంభవృష్టిగ కురిసిన వెన్నెల దరీభాగముల నెందైన గొంతమిగిలెనే మోయని వెతుకబోవు చక్రవాకములచాడ్పున, ప్రణయకలహమున డీకొనిన దేవదంపతులచేతులనుండి జారిపడిన పూవుదండలసంబున, స్వర్గసౌధమునుండి వసుమతి నవలోకించు సురసుందరాంగుల చూపుతళుక్కులచొప్పున, సచ్చరిత్రని మహోన్నత హృదయకుహరమునుండి నలుదెసల స్రవించు సుహృద్భావధారలవడువున, "శైలశిఖరమున మీనెచ్చెలి యొక్కండు ఒంటరియై యున్నాడు పోయి చూడు" డని గజాసురాదులకు దెలుప బర్వెడు గిరికింకరులపగిది, కవిహృది దనుప నమృతసూతికరములనుండి ధారలై వెలారు సుధాసంసిక్త

సుమరజముకై వడి, నన్నుజూచి జాలిపడక పరిహసించు వనవధూటియొక్క నవ్వుబెళుకులట్లు, నాసవునెడల నేలకొరికినిశి, వజ్రపాణిరాణి గిరవాటువేసినంతన తునకతునకలైన వజ్రదామవ్రజమువడువున, జీమూతప్రాసాదమున నెవ్వరో యుంచిపోయినపిదప భూధరముపై ఖండఖండములై పడిన ప్రదీపముపగిది, విశ్వసంచారముచేయ సృష్టికర్త యంతరంగమునుండి కదువడి జను భాస్వదాశయములలీల గోచరించినవి.

స్వప్న ప్రపంచమునుండి కదలివచ్చి కాబోలు పిట్టయొకటి చెట్టుపై వ్రాలినది. తుదిరొబ్బకొన గల ఆకుతుద గూర్చుని నిద్రామగ్నమై యున్న విశ్వమును విలోకింప సాగినది. ఏచప్పుడు చేయక, కదలమెదలక నెలికిల బడుండియే రెండుకన్నులను పిట్టపడుచున కప్పగించితిని. అత్తటి ఆకుతుదనుండి బ్రహ్మాండము నవలోకించిన నెట్టిచిత్రవిచిత్రదృశ్యములగపడునో! వీని నప్పగిది జూచుటకై ముహూర్తమాత్రము పక్షిగాగలిగిన నెంత యదృష్టవంతుడ నగుదునో! గుప్పెట నిముడగల పిట్ట పిల్లగాలితాకుడున నల్లన నూగాడు చిన్నియాకుపైజేరి అనంతవిశ్వము నవలోకింప నెట్టిదో! అజాండమునంతను తన లేజూడ్కులనుండి యాప్రశాంతసమయమున నా చిన్నజీవి నిజహృదినికి లాగుకొనుచున్నది! కోటి కోటిబాహ్యశక్తులకైన లొంగని బ్రహ్మాండము పిట్ట యొక్క చూడ్కియుచ్చుల కెట్లులొంగిపోయినదో! ఆ చిరుమాడ్కులందలి యనంతాద్భుతశక్తి యెట్టిదో! పిట్ట జిజ్ఞాసువు! సర్వప్రపంచమును యాత్రాంగణము గావించుకొనిన ప్రాణము! తన్నొకరు ప్రశంసింపవలెనని యపేక్షింపని నిష్కామజీవి! భూమ్యాకాశములందు నెందును దాని కడ్డుకట్టులు లేవు! ఆహా! దానిభాగ్య మెట్టిదో! పూర్వభవమున నెట్టితప మొనరించినదో ప్రస్తుత జన్మమున ప్రకృతియింటి నాడుపడుచై పుట్టినది. వాల్మీకి ప్రభృతుల హృదంతరాళముల గరుణాతరంగిణుల నుప్పొంగించి సాహితీకేదారమున కవితాధారలకు బ్రోదిజేసి కావ్యజగతియందు ప్రాతఃకాపై యున్న పుణ్యజీవి! భావ సంసిక్తములై, తేనెతుంపురులబోలు గణయతుల నుగ్గజేసి కవిడింభకుల తత్తుకలబోయు చల్లనితల్లి.

కవికిని, ముముక్షువునకును పక్షిజీవనము మేలుబంతి కాజాలునదని నాయభిప్రాయము. ఒడలునిండ చిత్తమువచ్చిన తెలుగున కండలను నింపి, మహోదారువువలె దోచువాడే విశాలవిశ్వమును నిజబాహువులందు పెనవేసికొనజాలునని తలపరాదు. శరీర మెట్టిదైననేమి? ఏతీరు రూపైననేమి? అంతరంగమున నణుమాత్రమైన జిజ్ఞాస తేజరిల్లునేని, మహేశుని గొలుచు ప్రమథగణము వలె, జిజ్ఞాసువుచుట్టు బహుళభువనములు చేరుకొనును. తామరాకుమీది నీటితుంపురు ఎంతపరిమాణము కలది? శిశిరకణమట్లు జిజ్ఞాసువయై సహస్రమయూఖు నాత్మహృది నిడికొని కులుకుటలేదా? మంచిముత్తము పోలు బిందువునందు సూర్యమండలమును జొనిపి, బహుళ రత్నమరీచుల నీనించునది జిజ్ఞాసయే! స్థలకాల ప్రతిబంధకములు జిజ్ఞాసయున్నయెడ గోచరింపవు. పూవు కడుపున ననంతసౌరభమును, మరందపూరమును, భావమహోదధిని గలిపి కళావ్రతులకు, సౌందర్యపిపాసువులకు, భావోపాసకులకు వానిని ధారవోయుచున్నది సూనహృదయమందలి జిజ్ఞాసయే! జిజ్ఞాస తపసునకు కన్నతల్లి! తపసున కసాధ్యమైనదేది? జిజ్ఞాసగల యెద తపోభూమి యందును. దేవగణములుకూడ తపోభూమిని దర్శించి పోవుచుందురుగదా! పక్షిహృదయము కంటికి చిన్నదిగనే చూపట్టును. అది కడ నెఱుగని తపోభూమి! ఇందుండియే శాంతివీచికలు, ఆనందమరీచులు అవిరళముగ వెలువడును. వనస్థలియందు మత్తగజము నిద్రించుచుండ చిన్నిపిట్ట మేల్కాంచి నిస్తబ్దవిశ్వసామ్రాజ్యముపై కన్నువేసి, ఆదర్శతపస్వియై భావప్రపూర్ణయై, ఆనందమయియై, శాంతివీచికలందు దొప్పదోగుచున్నది! తమోగుణము నారాధించి, జిజ్ఞాసను తఱిమికొట్టిన మహాశయులెందఱో ఉదరములు పూరించి, గుండెలపై చేతులిడికొని, తమ గుఱ్ఱుచే రోదోంతరాళమును ప్రతిధ్వనింపజేయుచుండ, సగుణోపాసనమున నాటితేఱిన జిజ్ఞాసువు నిద్దురను దూరముగ తఱిమిగొట్టి, విశ్వపతికి రాయబారము లంపి, చుక్కచెల్వలతో గుసగుసలాడుచు, సుమసుందరీమణులకు ప్రేమసందేశము లంపుచు, భావాస్వాదనమున జొక్కుచు, నిజమానసమును కరువలి మూపునిలిపి విశ్వ

విహారము సలుపుచు "ఇది నాసామ్మ"ని అనంత బ్రహ్మాండమును నిజహృది జేర్చుకొనును!

పక్షిపై మనసునిలిపి అట్లే పరుండి యుంటిని, కులాయమునుండియో, లోయలోని చేలనుండియో మఱొక విహిర మేఁసివచ్చి తొంటిపిట్టదాపల జేరినది. ఈ శకుంతము లాలుమగలై యుండవోపు. విశ్వమునంతను తమ సామ్రాజ్యము గావించుకొని రాణియు, రాజునువలె దాని నేలుచున్నవి! సచ్చిదానందములకు పిట్టజంటయెడంద దివ్య త్రివేణీక్షేత్ర మగుటం దక్కజమే మున్నది? దైనిక జీవనమును పట్టి పల్లార్చు కఠోరారిష్టములను శకుంతదంపతులు పాటింపనే పాటింపవు. తమపై కన్నువేయుని వారిని చూచుటకు సిగ్గుపడి కాలు కొలది కడగండ్లు పాటిపోవునుగదా! కావుననే కాబోలు ఏసుసంయమి పక్షులట్లు చింతదక్కి ఈశ్వరునిపై మనసుంచి మసలుడని తనయం తేవాసుల కుద్బోధించినాఁ! ఆ రెండుపిట్టలు పార్వతీ పరమేశులబోలు దంపతులజట గాంచి, మఱిజన్మమున నాపుణ్యదంపతుల కడుపున బుట్టి, చిరసౌందర్యమును గ్రోలి, చిదానందమున మునిగి తేలి, చిరమాధుర్యమును వసుమతి కీయజాలిన ధన్యుడ గాజాలుదు ననుకొంటిని.

నిస్తబ్ధదృశ్యమునుండి తామందిన పరితోషమునవి వెలారింప దొడగినవి. వానికుత్తుకలనుండి మధుకణములు రాలసాగెను. ఎడబాటు నెఱుగని ద్వాపదపంక్తులట్లు, ఎఁమరిక నెఱుగక జీవనాంగణమున దోచు జోడు మల్లెలలీల, శకుంతదంపతుల మధురకూజితములు కలసిమెసి హిల్లోలతరంగములం దూగాడుచుండెను. సరిల్లలామ అందు పుట్టినదని జన్మోత్సవము నెఱపనెంచు భక్తద్వితయమని యాజంటగాంచిన ఏయొక్కరుండైన గ్రహింపకపోడు. కిన్నరకంఠమునుండి జారి తెగిపడిన రాగమాలికవలె శైలపార్శ్వములందు నిండుసందు జాలువారు వారిధారలు పక్షిగీతికలకు తమ మధురాలాపమును తోడుచేయుచున్నవి!

అల్లనల్లన మేనిపై చల్లగాలిసోకుచుండ, వీనులకు మధురగాన సుధాబిందువులు కురియుచుండ, అంతరంగమనంత శాంతిని దనివార గ్రోలుచుండ ఎనలేని హాయి హృదయమున జాలువారుచుండ, వృక్షతలమున నట్లె యాత్మవిస్మృతుడనై పవ్వళించియుండ జూచుచు జూచుచున్న నాకన్నులిట్టె మూతలుపడినవి. పాంచి పాంచి, యదనుజూచుచున్న నిద్రాదేవి చప్పన నిజాంకమునన్ను జేర్చుకొని జోకొట్టినది. వనమాలివంశీరవమునకు వీనులొగ్గి, రాసక్రీడల దేలి తేలి, ప్రణయసంశ్లేషమున పరవశలై, సుఖవీచికలం దూగాడు ననుమోము గోపికమానసమున దొలుకాడు మధుర భావములవలె, పుణ్యతీర్థమున జేరిన బహుళయాత్రికులకైవడి, పుష్పహృది నాశ్రయించిన తేంట్లగుంపులవలె, బాలకృష్ణుని తొట్టె చుట్టును జేరుకొనిన కోటికోటి సురనారీమణులకరణి, తీవయిల్లాలి రొమ్మువంటు మొగ్గనిసుంగులలీల నెన్నెన్నో సుఖస్వప్నములు నామనసు నాశ్రయించినవి. అట్టి నిద్దురయు, అట్టి మధుమయ స్వప్నములను అంతకుమున్నెన్నడు నెఱుగను. మునిమానసము చందమున చలనమెఱుగని శుభ్రకాసారమున దొరలిన పెద్దకొండవలె, తేఁగీలిపైబడిన బండమాటమాడ్కి, గీతముగ్ధ హరిణముపై నఁటికిన హర్యక్షమట్లు, తియ్యని వీణారవమును మార్కొనిన ఝంజవాయుద్యమువడువున, పూలకుప్పలపై బడిన పిడుగుదెబ్బభంగి, చంటిబిడ్డపైబడిన రక్కసిచఱుపు చాడ్పున నింతలో నేదో భీషణనిర్ఘోషము దివ్యడోలికయందు దుష్టూతలూగు నామానసముపై పడెను! త్రుటిలో కుసుమకేసరముల కెనయైన స్వప్నసూత్రములు తునకతునకలైనవి! స్వర్గద్వారమునుండి నిష్ఠురులైన నెవ్వరో యవ్వలికి ద్రోసినట్లయినది! చూచి కాబోలు మరల నెవ్వరో పకపకనవ్విరి! చచ్చిన దిగులున కెవ్వరో సంజీవి నిచ్చిరి! చివాలున నాకాళ్ల నేదో కరచినట్లయినది! తుదకేదో వన్యమృగము నన్ను బట్టి దిగువనుండి ఎగువకు నన్ను దిగమ్రింగ దొడగినదని యడలితిని. ఉలికిపడితినో, కెవ్వుమంటినో, ఉఱుకులెత్తితినో, పెనగులాడితినో, మరేమి చేసితినో యెఱుగను.

---

# రాష్ట్రీయ రాజ్యాంగము

## స్వరాజ్య సాధన కుపకరించునా?

మోచెర్ల కృష్ణమూర్తి

ఎంతయో వ్యవధి లేదు. నూతన రాష్ట్రీయ రాజ్యాంగము రాబోవు ఏప్రిలు ౧-వ తేదీనుండియు అమలులోనికి వచ్చుచున్నది. దేశమంతయు నూతన రాష్ట్రీయశాసనసభల ఎన్నికలహడావుడితో నిండియున్నది. ఇతరపక్షముల వారేకాక కాంగ్రెసుపక్షమువారుగూడ అభ్యర్థులను నిలిపి ఎన్నికలయందు పాల్గొనుచున్నారు. కాంగ్రెసు వారు రాజ్యాంగమును భగ్నమొనర్చువిషయ మెటులున్నను, అవసరమగుచో నీరాజ్యాంగము భారత జాతీయస్వాతంత్ర్యసాధన కుపయోగించుకొనవీలగునా? అగుచో నెంతవరకు? అను ప్రశ్నలీసమయమున ప్రజలలో చాలమందిమనములం దుద్భవించుట సహజము.

ఈప్రశ్నలకు సరియగు సమాధానముల దెలియవలెననినచో, ముందుగ భారత స్వాతంత్ర్యమునకు గల ప్రతిబంధకము లేవియో తెలిసికొనవలసియుండును. భారతీయులు తమ స్వాతంత్ర్యము నిదివర కేకారణములచే గోల్పోయిరో తెలిసికొనుట గూడ ఇందుకు సహాయపడవచ్చును. ఆంగ్లేయు లీదేశమును సంపాదించినది తమ ఖడ్గబలముచే కాదని వారి చరిత్రకారులే అంగీకరించిరి. భారతదేశపు రాజులు తమలోదాము కలహించుకొనుచు, ఆంగ్లేయుల సహాయము నపేక్షించి క్రమక్రమముగా తమదేశమును వారికి కట్టబెట్టిరి. కొన్ని ప్రాంతములందు బ్రిటిషువారు యుద్ధములు గావించినను, వారితరఫున పోరాడిన సైనికులలో అత్యధికభాగము భారతీయులే కాని ఇతరులు గాదు. బ్రిటిషువారేవిధముగ నీదేశమును సంపాదించిరో, ఆవిధముగనే ఇప్పటికిని తమ పరిపాలనను సాగించుకొనుచున్నటులు కన్పించును. ఇప్పటికిని భారతీయులు తమలోదాము కలహించుకొనుచు, బ్రిటిషుపరిపాలనయే యుండవలెనని కోరుచున్నటులు దోచును. వెనుకటి రాజుల కలహములుపోయి, ఇపుడు మతకలహములు, కులకలహములు బయలుదేరెను. సైమనుకమిషనువారు తమనివేదికలో సూచించినటుల ప్రజలు "తమతమ మత, కుల వివాదములను పెద్దచేసుకొని కలహించుకొనుచుండురే కాని సమష్టిశ్రేయస్సుకొరకు స్వార్థములను త్యాగమొనర్చుకొనుస్వభావ మింకను ఏర్పడలేదు." రౌండుటేబిలు సమావేశమందు, మహమ్మదీయ నాయకులు-తమ ౧౪ షరతుల నన్నిటిని పూర్తిగ మిగిలినవా రంగీకరింపలేదను కారణముచే స్వపరిపాలనాధికారము నెటుల ప్రతిఘటించిరో చూడుడు. అచటకు చనిన నిమ్నజాతుల ప్రముఖులు, క్రైస్తవప్రముఖులు తమతమ స్వలాభములకొరకు స్వపరిపాలనాధికారము నెట్లు భంగపరచి, రక్షణల పేర అధికారము నెట్లు గవర్నరుల చేతులందుంచుటకు కారకులైనదియు చెప్పలేదు. గాంధిమహాత్ముడా దృశ్యమును గాంచి భారతదేశము జీవరహితమై పడియుండ భారతీయులలో అల్పసంఖ్యాకులను సంఘములు ఆశవమును ముక్కలు ముక్కలుగ గోసికొని పంచుకొనుటకు చుట్టునుకూర్చునినటులున్నదని పల్కెను. నూతనరాజ్యాంగమందలి ప్రత్యేకప్రాతినిధ్యములు, రక్షణలు మొదలగు ఏర్పాటులన్నియు ప్రజలలో నీవిభేదములను తీవ్రతరమొనర్చి, జాతీయైక్యమును దుస్సాధ్య మొనర్చుచుండెను. ఏదేశమునకైనను సరే, స్వరాజ్యమునకు గాఢమగు జాతీయభావము ప్రాణతుల్యము. జాతీయభావము లేని ప్రజలు స్వరాజ్యమును కలిగియుండజాలరు. జాతీయభావ మనగా తామందర మొకేజాతివార మను మానసికపరిజ్ఞానము మాత్రమేకాదు, తనజాతికొర కెట్టి త్యాగమునైనను గావించుటకు సంసిద్ధతగూడ అవసరము. అపుడే వారి జాతీయభావము గాఢమైనదని చెప్పవచ్చును. సాంఘికాది వివాదములు పూర్తిగ పోవువరకు జాతీయభావము లేదని చెప్పుట గాదు స్వాతంత్ర్య మనుభవించు దేశములందు ప్రజలలో ఏవిధమగు వివాదములును లేవనిగాదు. ఇట్టివే కాకపోయినను, వారికి తగిన వివాదము లాదేశములం

దును గలవు. అయినను స్వపరిపాలిత దేశములలోని ప్రజలు తమలో తమ కొన్ని వివాదము లున్నను, జాతి కంతకును సంబంధించిన విషయములందంద రేకమై పోరాడెదరు. తమతమ స్వలాభములను జాతీయ క్షేమమునకు అడ్డుతగులనీయరు. ఇట్టి జాతీయ భావము మనయందింకను గాఢముగ నాటుకొనకపోవుట భారతస్వాతంత్ర్యమునకు ప్రబలమగు మొదటి ఆటంకముగ నున్నది. ఈభేదములు తొలగువరకును, ప్రజలలో పరస్పర విశ్వాస భావములు కలుగువరకును గవర్నరులకును, గవర్నరు జనరలుకును ప్రత్యేకాధికారము లుండక తప్పదని సైమను కమిషనువారును ప్రకటించిరి. కనుక నీలోపమును తొలగించుకొనువరకు స్వరాజ్యసిద్ధి అసంభవ మని వేరుగ చెప్పనక్కరలేదు.

మనదేశమున పైతరగతులలో నీవిధమగు కలహములు, ఈర్ష్యలు వ్యాపించియుండ, భారతిస్వాతంత్ర్య విషయమునందు ప్రజాసామాన్యములనం దధికభాగము, ఉదాసీనభావమును వహించియున్నది. వారికి విద్యాసౌకర్యములు లేవు. అందుచే అజ్ఞానాంధకారమున బడి తమస్థితినే తెలిసికొనజాలకున్నారు. అట్టిస్థితిలో వారియందు స్వరాజ్యతృష్ణ యెటులుండును? వారు జాతీయ భావమును ఎటు లర్థమొనర్చుకొనగలరు? కనుక భారత స్వాతంత్ర్యసాధనకు ప్రజల విద్యావిహీనతగూడ ప్రబలమగు నాటంకముగ నున్నది.

ప్రజలలో గాఢమగు జాతీయభావము, స్వరాజ్యతృష్ణ యున్నంతమాత్రమున స్వాతంత్ర్యమును స్థాపించుకొనవచ్చునని భావింపరాదు. వానివలన స్వాతంత్ర్యమును బడయుట కర్హత లభించును. అంతమాత్రమున స్వరాజ్యము లభింపదు. వీనికి దోడు, శత్రువులబారినుండి తమదేశమును రక్షించుకొనగల శక్తిగూడ ఉండవలెను. అట్టిశక్తిని సంపాదించుకొనినపుడు బ్రిటిషువారు తమంతదామే ఆధిపత్యమును వదలుకొనెదరు. అట్లు వదలుకొనక తప్పదు. అంతవరకును భారతదేశమునకు సంపూర్ణస్వపరిపాలన నొసగజాలమని బ్రిటిషురాజకీయనాయకు లనేక సమయములందు ప్రకటించియుండిరి. బ్రిటిషురాజకీయనాయకులందరచేతను "బైబిలు"గ పరిగణింపబడు సైమను కమిషను నివేదికయందలి ఈక్రిందివాక్యములువారిసైన్యమును స్పష్టపరచుచున్న వనుటకు సందియము లేదు.

"భారతదేశము స్వపరిపాలిత మగుటకు పూర్వ మొక్కమరతును సంతృప్తి పఱుపవలసియున్నది. బ్రిటిషు సైనికుల సహాయము లేకుండ సుపరిపాలనకు ప్రధాన లక్షణమగు ప్రజాశాంతిని, దేశశాంతిని భారతీయులు కాపాడుకొనగలిగి యుండవలెను."

పైవిషయ మీక్రిందివాక్యములందు మరింత విపులీకరింపబడెను. "భారతదేశము పూర్తిగ స్వపరిపాలనమును పొందవలె నగినయెడల ప్రస్తుతము భారతదేశమున నున్న సైనికపటాలములు నిర్వహించుచున్న కార్యములను తామే నిర్వహించుకొనుటకు సమగ్రములగు స్వాయత్తసైనికదళములను సిద్ధపరచుకొనగలిగి యుండవలెను. బ్రిటిషుదేశమునుండి పంపబడినట్టియు, బ్రిటిషు ఉద్యోగులక్రింద పనిచేయుచున్నట్టియు సైనికపటాలములు, భారతీయులచే ఎన్నుకొనబడిన శాసనసభకు బాధ్యులగు భారతీయమంత్రివర్గముక్రింద గాని, సైనికశాఖకు అధికారిగ నుండు భారతీయ సంగ్రామమంత్రిక్రిందగాని కూలివారివ పనిచేయవలసిన నీచస్థితి నంగీకరించెదరని యెన్నటికిని తలంపరాదు."

ఈ విధముగనే-భారతీయు లితరదేశదండయాత్రలనుండి తమ్ముదామ గాపాడుకొనగలుగువరకు పూర్తియగు స్వపరిపాలన నొసగజాలమని రౌండుటేబిలు సభయందు బ్రిటిషురాజకీయనాయకు లెన్నియోసారులు ప్రకటించిరి.

వారి ప్రకటనలతో నవసరము లేకయే, భారతీయులు, స్వదేశరక్షణశక్తిని సాధించువరకును నిజమగు స్వాతంత్ర్యమును బడయజాల మనువిషయమును దెలిసికొనవలసియున్నది. "ధరణీరాజ్యము వీరభోజ్య" మనువాక్యము ప్రాతకాలమునాటిదే కాదు. అది సర్వకాలములందును గూడ నిజమగుసత్యము. నేడు తిరిగి ముస్సోలినీ, హిట్లరు బహిరంగముగ ప్రకటించుచున్నారు. కార్యశూరులగు జపానీయులు ఆచరణయందు నిరూపించుచున్నారు, ఆంగ్ల దేశ మీ వాక్యము నెప్పుడును మరచియుండలేదు. కనుక భారతీయులు

ప్రబలులగు శత్రులనుండి తమ్ముఁదాము గాపాడుకొనగల శక్తిని సంపాదించువరకును బ్రిటిషువారు తమ అధికారమును వదలుకొనకుండుట సహజము. వారు వదలుకొనినను భారతీయుల కందువలన లాభము నుండదు. వారు వదలివెళ్లిన పరిపాలనాధికారమును నిలువబెట్టుకొనుటకు భారతీయులకు ఖడ్గబలము లేనిచో, అట్టి బలము గల ఏజపానో, ఇటలీయో, మరేజాతియో లాగుకొనును. నేటి ప్రపంచవ్యవహారములను గమనించువారెవ్వరును ఇది నిరాధారమగు భయమని పలుకజాలరు.

దేశరక్షణ కవసరమగు మరియొకటి ఆయుధసామగ్రి. అనగా సంగ్రామమునం దుపయోగింపబడు తుపాకులు, ఫిరంగులు, బాంబులు మొదలుగునవియే కాదు. నేటి యుద్ధములయం దీ యాయుధసంపత్తి యెంత అవసరమో, మోటారుబండ్లు, విమానములు, నౌకలు, రేడియో యంత్రములు మొదలగు యంత్రసామగ్రి గూడ అంత అవసరముగ నున్నది. ఆయుధములు సంగ్రామసమయమున మాత్రమే యుపయోగింపబడ దగియున్నను, మిగిలిన యంత్రసామగ్రి సంగ్రామమునం దెంత యుపయోగకరమో శాంతిసమయములందు గూడ అంతఉపయోగకరములు. అందుచే వీనిని తయారుచేయు పరిశ్రమలను ప్రారంభించి ప్రోత్సహించుట గూడ దేశస్వాతంత్ర్యమునకు పరోక్షముగనైనను చాల అవసరము.

కనుక పైనుదాహరింపబడినటుల ప్రజలను గాఢజాతీయభావసంపన్నులును, స్వరాజ్యాభిలాషులును, దేశరక్షణసమర్థులును అగు పౌరులుగ నొనర్చుటకును, దేశరక్షణ కవసరమగు పరిశ్రమల స్థాపించి ప్రోత్సహించుటకును, ప్రజాప్రతినిధులగు మంత్రుల కవకాశ మున్నచో నూతనరాజ్యాంగమును, స్వరాజ్యస్థాపన కవసరమగు పరిస్థితులను దేశమునందు కల్గించుటకు కొంతవర కుపయోగించుకొనవచ్చును. నూతనరాష్ట్రీయ రాజ్యాంగమున విద్యాపరిశ్రమశాఖలు పూర్తిగ మంత్రుల యధీనమున నుండును. ఆంగ్లోహైందవులకు విద్యాసౌకర్యములకుతగిన ధనమిప్పించుట గవర్నరుయొక్క ప్రత్యేకబాధ్యతగ విధింపబడినను, మిగిలినప్రజల కొసగబడిన విద్యాస్వభావమును, పద్ధతిని నిర్ణయించుటయందు మంత్రులకుగల అధికారమునందు గవర్నరు జోక్యము కలిగించుకొనజాలరు. ఆవిషయములందు గవర్నరునకు ప్రత్యేకబాధ్యతలు గాని, అధికారములుగాని లేవు కనుక ఇపుడున్న ప్రతిపాఠశాలయందును ఇపుడున్న దాస్యభావమును వ్యాపింజేయు విద్యాపద్ధతుల మార్చి, పైనుదాహరింపబడిన లక్షణములుగల సత్పౌరులుగ ప్రజలను తయారుచేయు జాతీయ విద్యావిధానము నవలంబింపవచ్చును. వయస్సువచ్చిన ప్రజలకు వయోజనవిద్యాసమాజముల నేర్పరుపవచ్చును. ప్రతిగ్రామములందును పాఠశాలల నెలకొల్పి పిన్నలందును, పెద్దలందును గూడ భారతస్వాతంత్ర్య సాధకములగు ప్రబోధమును కల్గింపవచ్చును. వయోజనసమాజములందును, పాఠశాలలయం దన్నిటియందును నిర్బంధసైనిక శిక్షణమును విద్యావిధానమునం దొకభాగముగ నేర్పరచి, ప్రజలను దేశరక్షణాబాధ్యతల నిర్వహించుటకు సమర్థులుగ నొనర్పవచ్చును. కృతనిశ్చయులయి మంత్రివర్గమువా రీవిధానమును చురుకుగ నమలుజరిపినయెడల ౫, ౬ వత్సరములలో, ౪ కోట్ల జనసంఖ్య గల చెన్నరాష్ట్రమునందే, అధమము ౪౦ లక్షలవరకైనను దేశరక్షణకు రణరంగమున నిలువగల వీరులను సిద్ధ మొనర్చవచ్చును. ప్రతిగ్రామమునందును, పట్టణమందును గల ప్రతిపాఠశాలనుండియు దేశమున వ్యాపించు జాతీయభావమారుతములు ప్రజలను మేల్కొలిపి, స్వార్థపరతను, వైమనస్యములను తొలగించి ప్రజల నందర నచిరకాలములోనే స్వాతంత్ర్య సంరంభోన్ముఖుల గావించును.

దేశరక్షణ కవసరమగు పరిశ్రమల ప్రోత్సహించుటయందు గవర్నరుగా రడ్డుదగలవచ్చునని కొందరు భయపడవచ్చును. యూరపియను వర్తకులకు ప్రతికూల మగు విచక్షణభావము గన్పరుపబడినపుడే గవర్నరుగారు గాని, మరెవరైనగాని ఆక్షేపింపగలరు. అట్టి విచక్షణ కవకాశములేకుండ ప్రభుత్వమువారు తమంత దామే ఈపరిశ్రమల స్థాపింపవచ్చును. లేనిచో, గవర్నరు అడ్డుదగులుట కవకాశము లేకుండ ఇతరపద్ధతుల నవలంబింపవచ్చును.

ఈవిషయములందు జోక్యము గలిగించుకొనుటకు తన కధికార మున్నదియు, లేనిదియు నిర్ణయించుకొను అధికారముగూడ గవర్నరుకే గలదు గనుక, తన కధికారము గలదని నిర్ణయించి, ఇట్టి విధానమునకు గవర్నరు అడ్డుదగులవచ్చునని కొందరు సంశయింపవచ్చును. గవర్నరటుల అడ్డు దగిలినచో, నూతన రాష్ట్రీయ రాజ్యాంగమున గల ఈ అల్పావకాశము గూడ అదృశ్య మగును. కాని గవర్నరుగారీప్రయత్నముల కడ్డుదగులునని భావించుటకు తగిన కారణములు గన్పింపవు. స్వపరిపాలన కాటంకము లుగనున్న పైలోపముల తొలగించుకొనుటకు అధికారులు తోడ్పడవలెనని పైమనుకమిషనువారుగూడ సూచించిరి. నేటి అంతర్జాతీయపరిస్థితులయందుగూడ అధికారవర్గమువా రట్టి అనుకూలవిధానము నవలంబించుటయే ఆంగ్ల దేశమునకును, సామ్రాజ్యమునకును లాభకరము. కనుక కృతనిశ్చయులయి యీలోపముల తొలగించుటకు కాంగ్రెసుపక్షమువంటి పక్షము మంత్రివర్గము నందుండి కృషి సలుపునెడల గవర్నరు అడ్డుతగులునని భయపడుట కంతగ నవసరము గనుపింపదు. కాని అట్టి నిశ్చయము లేని మరియొకపక్షము అధికారమునకు వచ్చుచో, ఈరాష్ట్రీయ రాజ్యాంగము స్వాతంత్ర్యస్థాపన కుపకరించుటకుమారు, ప్రజలలో జాతీయభావమును పూర్తిగ నిర్మూలనమొనర్చి స్వాతంత్ర్యస్థాపనకు ప్రబల శత్రు వగును.

---

# అఖిలభారత వ్యవసాయ పరిశోధనాలయము.

గూడూరు వెంకటాచలం.

౧౯౩౪ జనవరి భూకంపము బీహారునే గాక భారతదేశచరిత్రనే తారుమారు చేసినదని చెప్పవచ్చును. ఒకప్పుడు బంగారు భూమి అనుకొన్నదానిని కేవలం దోష భూయిష్ఠముగా కన్పరిచింది. ౧౯౦౫ లో హెన్రీఫిప్సు అను అమెరికా దేశస్థుడు మన దేశంలో ఒకవ్యవసాయపరిశోధనాలయమును స్థాపింపవలెనని ౩౦ వేల పౌనులు దానమిచ్చినప్పుడు. కలకత్తా భారతప్రభుత్వ కేంద్ర స్థానంగా ఉండుట, బీహారుభూములు చాలా ఫలవంతంగా ఉండుట ఆలోచించి పూసాలో పరిశోధనాలయం స్థాపించారు.

కాలంతోపాటు ప్రభుత్వకార్యస్థానం కూడ మారిపోయింది. అయినా పూసా పరిశోధనాలయం మాత్రము యథాస్థానాన్నే ఉంది. దేశసౌభాగ్యానికి, సుభిక్షానికి కారణమయిన వ్యవసాయపరిశోధన దేశంలో ఎక్కడో ఒకమూరుమూల జరుగుతుండేది. కాని ౧౯౩౪ సంవత్సరం మూలనున్నవానిని ముంగిట్లోకి తీసుకొనివచ్చింది. హెన్రీఫిప్సు పేరట నిర్మించిన పరిశోధనాలయము నామమాత్రావశిష్ట మయినది. భూమిపగుల్చుకొని ఉష్ణజలాశయాలని ప్రత్యక్షంచేసింది. అత్యంత ప్రశాంత ప్రదేశంలో విజ్ఞానవాతావరణలో జరుగవలసిన పరిశోధనకు "దినదినగండం వేయేళ్లు ఆయుష్యం" అయింది. అదీగాక లోగడ రాయల్ కమిషను, విశ్వవిద్యాలయాలకి, ఈ పరిశోధనాలయమునకు చాలా సన్నిహిత సంబంధ ముండవలెనని సూచించింది. అనేక విశ్వవిద్యాలయాలకు దరిదాపులో ఉండే కేంద్రప్రదేశము, భూకంపాలు మొదలగు అవాంతరాలు లేనిచోటు, అన్నిపంటలకు సారవంతమయిన భూమి-అన్నిసదుపాయాలు చూచుకొని, ప్రభుత్వంవారు ఈ పరిశోధనాలయాన్ని ఢిల్లీకి మార్చారు.



౩. పరిశోధనాలయ సాముదాయిక దృశ్యము

ప్రస్తుతం ఢిల్లీ పరిశోధనాలయం విస్తీర్ణం ఎనిమిదివందల ఎకరా లుంటుంది. ఇందులో ౨౭౫ ఎకరాలు భవనాల క్రింద, పచ్చిక బయళ్ల క్రింద ఉన్నాయి. మిగిలినభూమి అంతా వ్యవసాయ పరిశోధన క్రింద ఉపయోగపడుతోంది. పరిశోధనాలయ మంతటను ౧౫౭ అడుగుల వెడల్పున మొత్తము ౨౧౭౫౭ అడుగుల పొడుగుగల రోడ్లు ఇరు ప్రక్కల పచ్చికబయళ్లతో కన్నుల కింపుగా ఉంటుంది. నీటివసతి భోలిభత్యారిజలాశయమునుంచి ఏర్పరుపబడినది. విద్యార్థివసతిగృహము ౨౮ విద్యార్థులకు వసతి ఇస్తుంది. పూసాలోఉన్న పరిశోధనాలయములో అన్నిభాగములు ఒకే భవనములో ఉండుటచే ఎక్కువ అనుకూలముగా ఉండెడిదిగాదు. ఇప్పుడు వివిధశాఖలకు వేర్వేరు భవనాలు నిర్మించడముచేత ఏశాఖ కాశాఖ ప్రశాంతంగా పరిశోధన చేయడానికి వీలవుతోంది.



౧. గ్రంథాలయము

రెండుమూడుమైళ్ల దూరానికికూడ పరిశోధనాలయ గ్రంథాలయశిఖరం కన్పడుతూ ఉంటుంది. అన్నిభవనాలకీ అందుబాటులో ఉండుటకు మధ్యలో నిర్మింపబడింది ఇందులో షుమారు ఒకలక్ష గ్రంథములవరకు అవకాశం ఉంటుంది. ప్రస్తుతం ౭౦ వేల గ్రంథాలున్నవి. ప్రాచ్యదేశాలలో వ్యవసాయములో ఇన్ని గ్రంథములు గల గ్రంథాల



౨. గ్రంథాలయ ప్రారంభోత్సవ సమావేశము

యము ఎక్కడను లేదు. ప్రపంచము అన్ని దేశాలనుండి వ్యవసాయపరిశోధనలు ప్రకటింపబడే పత్రికలన్నీ వస్తవి. గ్రంథాలయము ఉదయం ౮ గం. మొ. రాత్రి ౮ గం. వరకు తెరవబడిఉంటుంది.

వ్యవసాయశాఖ:—దీనిని రెండు భాగములుగా విభజింపవచ్చును ఒకటి: పశువుల పోషకము. రెండు: పంటలు సాగుచేయు విధానము. అందులకు సరియైన పనిముట్లు మొదలగువానిని పరిశోధనచేయుదురు. ఈ శాఖక్రింద ౪౭౫ ఎకరాల భూమిఉంది. ఉత్తర దేశంలో పండేపంటలన్నీ ఇక్కడ కూడ పండింపవచ్చును. దేశములోనికి వచ్చే ఏవిధమయిన క్రొత్తరకము వ్యవసాయపు పనిముట్టు నయిన అందులోని కష్టసుఖములను శాస్త్రరీత్యా పరీక్షించి రైతాంగమునకు తెలియపర్చుటకు పరిశోధనచేయుచుందురు.

రసాయనవిభాగము:—ఇందులో మన పైరులకు పంటలకు ఎట్టిభూమికావలెను, ఏయే ఎరువులు వేయవలెను, ఏయేయెరువులు వేసినచో పంటలలో ఎట్టిమార్పులు వచ్చుచుండును అను విషయములను పరీక్షచేయుచుందురు. పైహానినిబట్టి ఈ భాగమును మూడుగా విభజింపవచ్చును. ఒకటి - భూమియొక్క భౌతిక రాసాయనిక తత్వపరిశోధన, రెండు - ఉద్భిజ్జ ఆహారనిర్ణయ విధానము, మూడు - వ్యవసాయసూక్ష్మ క్రిమిశాస్త్రము. పైరులస్వభావము ననుసరించి వానికి కావలసినధాతువులను నిర్ణయించుట, ఋతుపరివర్తనముచే వచ్చుఫలితములు మొదలగువానిని నిర్ణయించుటకు వీనిని అన్ని కాలములయందు పండించుటకుగాను భూమిమట్టమునకు లోపల సమశీతోష్ణమందిరము కలదు. దీనియందు నిర్ణీతశీతోష్ణములను అన్ని కాలములందును లభింపచేయవచ్చును. ఈశాఖకు ప్రధానాధికారి, ప్రస్తుతము పరిశోధనాలయమునకంతకును సంచాలకులు (Director) శ్రీయుత భాగవతుల విశ్వనాథ్‌గారు అయినందుకు



౪. రసాయన శాస్త్రశాఖ



ర. రా॥ బ॥ బి. విశ్వనాథ పంతులుగారు

[అఖిలభారత పరిశోధనాలయ సంచాలకపదవిని పొందిన ప్రథమ భారతీయులు. వీరు 1934 ఆగస్టువరకు మద్రాసు ప్రభుత్వము వారి వ్యవసాయ రసాయన శాస్త్రజ్ఞులుగా నుండిరి. అది మొదలుకొని 35 అక్టోబరు వరకు భారత ప్రభుత్వమువారి వ్యవసాయ రసాయన శాస్త్రజ్ఞులుగా నుండిరి. అప్పటినుండియు ఈ పదవియం దున్నారు.

ఆంధ్రులేకాక భారతజాతిఅంతయు గర్వింపదగిన విషయము. ఈ గౌరవాన్ని, పదవిని పొందడానికి భారతీయులలో వీరే మొదటివారు. జాతి, మత ప్రత్యేకతచే లభించిన గౌరవం కాదు. అది ఆప్రతిభాశాలికి అనాయాచితంగావచ్చిన సహజగౌరవం. మతము, కులతత్వాలకంటె విజ్ఞానం, పరిశోధన ప్రధానంగా గణించినందుకు ప్రభుత్వాన్ని ఈ విషయంలో అభినందించాలి. ప్రస్తుతము వీరు ఉద్భిజ్జాహార నిర్ణయవిధానంలో చేస్తున్న పరిశోధనలు ఆధునికవికాసవాద సిద్ధాంతాలలోనే అనేకమార్పులు తీసుకొనిరావచ్చును.

క్రిమికీటక పరిశోధనశాఖ:— ఈ విభాగములో పైరులను పాడుచేయు క్రిమికీటకములు షుమారు పదివేలవరకు సేకరింపబడి ఉన్నాయి. ఇవి ఏ యేజాతులకు చెందినవో, ముఖ్యముగా పైరులను పాడుచేయు విధానమును పరిశోధించి యున్నారు. వీరు పరిశోధన చేయుచున్న అత్యంత ఉపయోగకరమైన విషయము వేరొకటి యున్నది. కొన్ని పరాధీన క్రిములు ఈ కీటకములపై జీవించుచుండును. ఇవి పైరులకుగాని మానవులకుగాని ఏమాత్రమును హానిచేయవు. అయినను మనపైరులను బాధించు కీటకములనుమాత్రము నాశనముచేయుచుండును. అట్టివానిని ఇక్కడ సేకరించి మొట్టమొదట మనదేశవాతావరణ పరిస్థితులకనుగుణముగా ఉండునదియు లేనిదియు పరిశోధించి తరువాత రైతాంగమునకు ఉపయోగించుట కిచ్చెదరు. ప్రస్తుతము చెరకును పాడుచేయు కీటకములవిషయమై పరిశోధన చేయుచున్నారు.

తెగుళ్లశాఖ:—ఈ శాఖయందు పైరులకు వచ్చు క్రిమికీటకముల జాడ్యములగాక బూజుకుక్కగొడుగులు అను ఉద్భిజ్జజాతిచే గల్గు తెగుళ్లనుసైతము నివారించుటకు పరిశో

ధనచేయుచుందురు. మన దేశమందు పైరులకు ఇట్టితెగుళ్లను కలుగజేయు ఈజాతులు కొన్ని వేలున్నవి. వీనినన్నిటిని ఇక్కడ సేకరించి అవి పైరు మొక్కలందు ప్రవేశించువిధానము, తరువాత పొందు వ్యాపకము, అవిచేయు హాని దాని జీవితచరిత్ర నంతను పరిశోధించి తన్నివారణోపాయమును సూచించుచుందురు. ఉత్తర హిందుస్థానమునందు గోధుమకు త్రుప్పు పట్టినట్లుగా ఒక తెగులు వచ్చును. గోధు



౫. తెగుళ్ల శాఖ



౬. బీజోత్పత్తి శాఖ

మరియొక్క కొన్ని సహజస్వభావములను పరిశోధించి, ఈ త్రుప్పుతెగులుచే నష్టము పొందజాలని కొన్ని గోధుమరకములను తయారుచేయగల్గిరి.

బీజోత్పత్తిశాఖ:—రాయలు కమీషను భారతదేశమునందు పంటలయందు కేవలము ఎక్కువ పండించుటయందే లక్ష్యముంచుచున్నారు గాని శ్రేష్ఠమయిన రకములను పండించుటకు ప్రయత్నించుట లేదని సూచించినది. మనము రెండు మూడు కోట్ల రూపాయల గోధుమలు ఎగుమతి చేయుచుందుము. కాని ఇంగ్లండులో మనగోధుమయందు మంచిరొట్టె తయారుచేయుటకు కావలసిన లక్షణములు లేకపోవుటచేతను, మాంసకృత్తులు (ప్రోటీడులు)కూడ తక్కువగా ఉండుటచేతను ధర పడిపోయినది. ఈ పరిస్థితులలో మన దేశధాన్యములకు మంచి ధరలు రావలయు ననిన శ్రేష్ఠమయిన రకములు పండించి తీరవలెను. దీనికి రెండుక్రొత్త జాతులను కలిపినగాని మంచి జాతివిత్తనము తయారు కాదు. ఇట్టిశ్రేష్ఠమగు బీజోత్పత్తి ఈశాఖయందు చేయుచుందురు. వీరు తయారుచేసిన పూసాగోధుమజాతులు మిగులఖ్యాతిగడించినవి. ఈమధ్యనే ఈపూసాగోధుమరకములలో నొకదానికి అంతర్జాతీయప్రదర్శనమునందు బహుమతి లభించినది. ఇట్లు నూతనబీజోత్పత్తివలన మన ఎగుమతులు చాలా వృద్ధిపొందుచున్నవి. ఇట్లే సిగరెట్లకు కావలిసిన సరియైన పొగాకు పండించుటకుకూడ మిగుల కృషిచేయుచున్నారు. ఇప్పుడు వీరు తయారుచేసిన క్రొత్తరకము



౬. పరిశోధనాలయమున ఆంధ్రవిద్యార్థులు
(ఎడమ చివర నిలుచున్నవారు ఈ వ్యాసకర్త)

పొగాకువిత్తనము చాలాచోట్ల వాడబడుతోంది.

ఈ పరిశోధనాలయములో చేయు పరిశోధనలకు పెద్దబిరుదులను ఇవ్వడానికి దేశమందలి వివిధవిశ్వవిద్యాలయాలు అంగీకరించినవి. ప్రభుత్వమువారు ఈ పరిశోధనాలయములో రెండుసంవత్సరములు శిక్షణపొందిన వారికి Associate of Imperial Agricultural Research Institute అను బిరుదము నిచ్చెదరు. ప్రస్తుతము ఈ పరిశోధనాలయములో జరుగుచున్న పరిశోధనలు ప్రభుత్వమువారి సానుభూతి, సహాయము పరిశీలించిన మనదేశమందలి వ్యవసాయముయొక్క భవిష్యత్తు ఆశాజనకంగా ఉంది.

---

# హేమంతర్తువు

విశ్వనాథ సత్యనారాయణ

ఆగామి శిశిరభయంబుచే జమిలి దుప్పటికప్పుకొనె నేమొ ప్రకృతి కాంత,
వేకువసంబువిత్తై కుబుసంబూడ్చినదియేమొ మిన్ననుసల్లత్రాచు
గురుదారగమనాఘ కుటిలత లోఁబుచ్చి నుసిరాలునేమొ చందురునిబిల్ల
ఉత్తరాయణచారణోగ్రహరిఖురధూళిఁ జెడిరాలిపడునో తెలిమొగిల్లు
జిగిలిగాఁ గమ్మ, వెలుగులఁజీరులాడు-పొడిపొడిగరాలఁ దుప్పర వడిగఁ గురియఁ
దెలుఁగునేల నాల్గుచెఱంగు లలముకొన్న - దాత్తహేమంతవేళాదిమైనహిమము.

తట్టలోఁగూర్చుండఁ బెట్టినవధువునా గుమ్మడిపూవులోఁ గులికెనొకటి
ఖండితాపాంగ సక్షనవాంబుకణమునా ఘాస్రాగ్రమునయందుఁ గదలెనొకటి
తులసిమ్రుగ్గునదిడ్డ తొలుకాడుదివ్వెనా సాలీనిపటముపై సాగెనొకటి
ఘూర్జరీముఖలంబి కొసముత్తియంబునా నాదూడనొసటిపై నాడెనొకటి
మధువునాఁ బూవుపూవున మసలెనొకటి - జగ్గునా నాకునాకున జాఱెనొకటి
మంచుబిందులు నవసుకుమారమూర్తి - మంతములు ప్రాతరంత హేమంతవేళ.

తానమాడెహిమానఁ దరుపాళి యాకు రాల్చుటను ప్రాఁజీర యూడ్చుటకుమున్న
ఊగి ప్రాశించె బొడ్డూడనిదూడ ప్రాకుడుపైనిఁ గూడిన గుమ్మమంచు

కళ్యాణనిధిపంట కళ్లమ్ముతీర్చికొన్నది జిల్గుపచ్చిముత్యాలమ్రుగ్గు
జోగెఁబూరిల్లు ప్రాఁజూరుపుల్లనుజాజిఁ దగినంత లేని బొట్టగుహిమమ్ము
నిలచిసిలిగి చెవులూచి తలవిదిర్చెఁ - బాలములోఁ గట్టివేసిన ముసలియెద్దు
కొంతముదిరిన ఋతువౌనఁగూడి ప్రాత-రంత హేమంత కాంత ప్రశాంత వేళ.

నీలమండలలోతు సికతాప్రవాహమ్మునం దీదుచిఱుచేప చందమామ
మొగి నుదక్యాస్నానమునకయి నూరిన యోలగందపుటుండ బాలతరణి
చిఱుతజంపతిప్రదక్షిణము చేఁ జెరుగు హాసరినాకబలి మ్రుగ్గు జరఠసంధ్య
చెలువ వేన్నీళ్లాడి చెమరించు నుదుటిపైఁ దీర్చుపాపటబొట్టు దీపకళిక
ఔషధము వండుపుటముపై నావివెడలు - మూఁతచిల్లులమూఁకుడు ముంగినింగి
తేరుకొని దమ్ముకొని జీరువారి కురిసి - యుభయసంధ్యలుకాచు హిమోల్బణమున.

తమలపాకులతీవ నమలించుమాటాకు పువుకొనసల్ బాళిలీ ల్సవదరించె
పొడగొన్నచో వెన్నువదలిన చెఱకుపూ నిగ్గురత్నపు జిగినీ లమర్చె
కోరళ్లపైఁదీవ గుమ్మడిపూవులు పొనురాగిడీల చెల్వులమరించె
చిన్నారిపొన్నారి చేమంతిపూవులు తిరుగుడుపూవుల తీరుచేసె
అంటుకమ్మలు సౌరఫూవు లందగించె - చెంపలసరాలు గడ్డిపూ ల్చెలువుతెచ్చె
ముచ్చుఁగొండాడుపడుచు లేతెంచి యూస - కొలఁది కై సేసికొన్న భూషల వితాన.

పసపుతోటలకునై వదలినకాల్వలో నెఱుకులుమావులుంచిరి బిరాన
దిగువకాలువచెమ్మ యిగిరి బెరడుకట్టి మఱుప్రొద్దుప్రొద్దుట బురదవడియు
పడిరెండుజాముల మిడివేళవరిమ్రోళ్లు త్రోపంది మంచుబిందువులుచిలికె
వెలివడిబురదలో గిలగిలలాడు మత్స్యముఁచే బకతపశ్చర్య సడలె
మాడ్చి పగట నెండలు, రేల మంచు తడిపి - వెచ్చిపచ్చిగ వేగెఁబో విశ్వమెల్ల
భూత మాగామియగు ఋతువ్యూహమెల్లఁ - దనకడుపులోన దాచివచ్చినదొ
[ఋతువు.

గొబ్బిళ్లదేవత కొప్పులోఁ జెరివిన మగనిమక్కువపైడి మొగలికచ్చు
పాదఁలువెట్టిన పాటిదిబ్బకడుపు ప్రత్యక్షమైన గారాలకూచి
మదనేష్టికృతికిఁ దుమ్మెదసోమపీథికై యవనికి డిగివచ్చినట్టి రంభ
దానార్థవిని యోగతాపుణ్యజన్మహా గర్భమ్ము నోముల గారుదేవి

మొదలిస్త్రీజాతి కొప్పునముడుచుకొన్న-ప్రసవసంతానములలోని ప్రథమభావ
మదురుగుమ్మడిపూవు హేమంతలక్ష్మి - పసుపురాచిన మొగమునాఁ బరిఢవిల్లె.

నేఁబోక ముగ్గులు వెట్టెడు కన్నెముత్తైదువ మంచుఁగొండాడుబిడ్డ
దూరానఁ బశువులఁ దోలుకచను రైతు ప్రాలేయగిరిరాజు పాలికాపు
క్రొత్తగాఁ బంటపెళ్ళువవేయుపురికొప్పు హిమభూమిధరరాజ హేమచూడ
తడిపాటిగోడఁ గ్రుమ్మెడు కాడికలపని గిత్తయిల్లడమున్న గిరిశునంది
ప్రపతదాసారగురుతుషారచ్ఛలమున - సపరివారమ్ముగా హిమశైలరాజు
వలసవచ్చెనో దక్షిణాపథమనంగ - నిగిడెఁ బ్రాభాతికము లాంధ్రసీవృతమున.

పాతరలం దుంచఁబడిన విఘ్నేశ్వరుకోసమో యెలుకలు గుద్దలించె
ఒకకన్ను గ్రుడ్డియయ్యును గాక యెండబోసిన ధాన్యలక్ష్మి ముక్కునవిదిర్చె
కందియు జనుముము గాయలెండిన లోనిగింజలు గలగల గిలుకరించె
పచ్చిపసపుదుంప బాలెంతరాలునాఁ బసిమితో నందమ్ము పాదరించె
మింట మంచున కిలమీద మెట్టపంట - పసిమికొదుగక తప్పకవచ్చెఁ గాక
గండు టెండలు పట్టపగ్గాలుకలవె - మహిత హేమంత మెల్ల గ్రీష్మముగఁ జేయ.

యత్ర ధూమము వహ్ని తత్రయన్నట్లు నీహారధూమ మనుమితాంగజాగ్ని
స్థానివదాదేశశాస్త్రపద్ధతిఁ దుషారమ్ములు వర్షకార్యములు కలిమి
అలనన్వయంబుచే వ్యతిరేకమునఁ జేసి యుభయసంధ్యాసిద్ధి యూహ కలిమి
శుక్తిముక్తాఖ్యరజ్జు భుజంగమభ్రాంతి దూరస్థ సర్వవస్తువులయందు
దృష్టికిని నంతరితము బాధించువిధిగ - పరముపరమబాధ మ్మాతపములవలన
సూర్యమండలాంతర పురుషునిమయుండు-వఱలు ఋతురాజు శాస్త్రప్రవర్తకుండు.

---



౧. కృష్ణజిల్లాలో వెనుక ఇట్లు చెఱకును నాటేవారు - వారు ఇపుడు బోదెలలో పడవేయుదురు



౨. చెఱకుమడిని ఇట్లు గుంటకతో దున్నుదురు .. సీ. ప.

# 'సాహిత్యతత్త్వ విమర్శనము'

[శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి రచితము]

సమీక్ష.

సాహిత్యతత్త్వవిచారణ మపారము, అనాహతము, అగాధము. సాహిత్య మవ్యక్తమునకు సువ్యక్తమైన పురుషార్థము. సాహిత్యము నిత్యమైన సచ్చిదానందానుభవమునకు, దేశకాలపాత్రవిలాసకల్పితమైన రసానందానుభవమునకు సాధనము. సాహిత్యరసానందము విశ్వధర్మము, విశ్వాధారము, విశ్వేశ్వరవిలాసము. పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జీవజాలము లాత్మానందానుభవమున కనవరతము విశ్వసాహిత్యోపాసనమును జేయుచున్నవి. సాహిత్యోపాసనమునకు సాధకసాధనములు వేరైనను సాధ్యము సమానము. సాహిత్యోపాసనమునందు భావులు, భావములు, దేశములు, కాలములు, పాత్రలు, రసములు భిన్నములైనను ప్రయోజనముమాత్రము విశ్వాధారమైన రసానందము సమానము. సాహిత్యోపాసనమునకు సాధనములైన కర్మకళాయోగ శాస్త్రాదిద్యంగములందు సారస్వతము ప్రధానాంగము. అవ్యక్తమునకు ప్రథమవ్యక్తస్వరూపమైన శబ్దము సాహిత్యాంగములందు సారస్వతాంగమునకు ప్రధానస్థానమును గల్పించుచున్నది. అనంతమైన సాహిత్యతత్త్వవిచారము నొక చిన్న పుస్తకమునందు సంగ్రహించుటకు శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు చేసిన ప్రయత్నము సకలజనాదరణమునకు పాత్రముగ నున్నది.

భారతీయ సాహిత్యము వైదికయుగమునందువలెను వర్తమానకాలమునందును శాఖోపశాఖలుగను పరిణామమును బొందుచున్నవిధము సాహిత్యతత్త్వజ్ఞుల విచారాదరణములకు దగియున్నది. వైదికలౌకికసారస్వతములు భిన్నసాహిత్యరూపములను పురుషార్థమునకు వినియోగపడగల విధమును ప్రాచ్య పాశ్చాత్యసాహిత్య పరిశోధనలును, ప్రాచీనాధునాతనసాహిత్యపరిశోధనలును బోధించుచున్నవి. జగన్మోహనమునకు ప్రకృతిపురుషుల సమాశ్రయము బీజము. పరమాణుపరబ్రహ్మముల లీలావిలాసములం దాత్మానందమునకు సాధనములను సరసముగను కల్పించుటకు సాహిత్యాచార్యులు సమర్థులు. సాహిత్యాచార్యుల సంభావనాకల్పనలు ప్రతీచీసంస్కారసంజాతమైన ప్రవృత్తిపరమైనను, ప్రాచ్యసంస్కారసంభవమైన నివృత్తిపరమైనను పరమార్థ మాత్మానందానుభవము. అనిత్యములైన దేశకాలపాత్రావరణములందు నిత్యమైన సచ్చిదానందానుభవమును సాహిత్యము సాధ్యముచేయుచున్నది. యవన రోమక బ్రిటిషు భరతవర్షములు, వంగాంధ్రరాష్ట్రములు, త్రేతాద్వాపరకలియుగములు, సీతా సావిత్రి డెస్టిమోనాదులు, సీతారాములు, రాధామాధవులు, ఉమామహేశ్వరులు కాలమహాస్రవంతియందు రసతరంగములు. ప్రకృతిసంభవములైన దేశములు, యుగములు, భావులు, భావములు, పాత్రలు, సంప్రదాయాచారశీలములు సాహిత్యోపాసకుల హస్తములందు రసానందమును గలుగజేయుచు పురుషార్థమునకు సాధనము లగుచున్నవి.

సాహితీగోష్ఠి, శైలి:—సాహితీగోష్ఠి బ్రహ్మసంకల్పమువలెను బ్రహ్మాండవ్యాప్తము. మహాకవులు బ్రహ్మసంపన్నులు. బ్రహ్మసంపన్నులు సర్వత్ర కావ్యకళావిలాసములను సందర్శించుచు బ్రహ్మానందమును గలుగజేయగల విధమును కావ్యములు కవిత్వతత్త్వము వ్యక్తము చేయుచున్నవి. మానవసంకల్పమునకు బ్రహ్మత్వము వలెను సాహితీగోష్ఠికిని బ్రహ్మత్వము సాధ్యము. బ్రహ్మమయమైన ప్రకృతిరంగములందు సకలసాహిత్యకళావిలాసములందును బ్రహ్మానందము బ్రహ్మజ్ఞులకు సాధ్యము. బ్రహ్మానందమునకువలెను భావానందమునకును రసావరణనిర్ణయ మసాధ్యము. మహాకావ్యములవలెను భావకావ్యములును రసానందానుభవమునకు నియత

సాధనములు. రసానందానుభవమునకు ప్రతిబంధకము సంకల్పముకాని భావము కాదు. దేశావృతమైన విషాదావస్థయందు కావ్యహృదయమునకు భావార్థనిర్ణయము నిరర్థకము. భావార్థపరిణామమునందు శైలియును సహజపరిణామమును పొందుచున్నది. ఆంధ్రసాహిత్యపరిణామమునందు భావశైలిపరిణామవిమర్శనము సాహిత్యోపాసకుల యాదరణపాత్రము గావలసినవిధమును శ్రీ సత్యనారాయణమూర్తిగారి యీ భావములు విశదము చేయుచున్నవి :

"భావప్రకాశమునకు సముచితమైన భాషా సాధనముకదా! భాషాగమనికకు వ్యాకరణ సూత్రము లవసరములే. ఇవి కట్టుత్రాళ్లు కాక, పట్టుదారములట్లు మృదులములై, అనురాగసూత్రములట్లు అదృశ్యములై యుండవలెను. తెలుగక్కరములు ముత్తెములవంటివి. ముత్తెపుసరములోని దారము వెలుపలికి తోచనట్లు తెలుగులోని లక్షణసూత్రములు బట్టబయలుకానపుడే తెలుగుశైలి చక్కనిదై యుండును. పగ్గములను, ఉరిత్రాళ్లను తెలుగమ్మకంఠమునుండి పండితులు తొలగించుట పాడి. ఆంధ్రభాషా ప్రపంచమున ద్వంద్వయుద్ధమునకు తొడగియున్న ఇరుపక్షములవారును తమదోసములు గుర్తించి ఉత్తమసారస్వతోద్దేశములకు తోడుపడుసూత్రములను శాసింపపట్ల నిరువురు చేతులు కలుపుకొని, విశ్వవిద్యాలయముల సాహాయ్య మందవలెను. ఇట్లొనరించిరేని, ఎన్నేని బాధలు తొలగిపోవును. వాడుకమాట నంగీకరింపని విశ్వవిద్యాలయములును, వాడుకమాటలనే అంగీకరించు గ్రంథాలయములును, విలువడు మాటలను త్రుంపుడుమాటలను కాంక్షించు భాషాసమితులును, వాడుకమాటలని చెప్పి వంకరమాటలను దెచ్చి సింహాసనమునైగూర్చుండబెట్టి చుట్టును రామభజనము చేయు అపూర్వభాషాభక్తులును పెడమొగములను బెట్టుకొనక, ఒకరిమొగములనొకరు పరికించుకొని, వెక్కిరింతలకును, పండ్లపటపటలకును, కారుమాటలకును, కన్నెఱ్ఱలకును స్వస్తిచెప్పి, సొమ్మసిల్లియున్న భాషాసతికి శాంతియు, సానందమును ప్రసాదించిరేని, దారి తెన్ను లేక అల్లాడు పాఠకులును, విద్యార్థులును ధన్యు లగుదురు."

భావనావేశము:—సాహిత్యమునకు భావనాశక్తి కీలకము, హృదయము. పరమాణువునుండి పరబ్రహ్మము వరకును వ్యాప్తమైన విశ్వమునందు సాహిత్యోపాసకులకు దివ్యవిభూతులు సర్వకాలసర్వావస్థలందును ప్రసన్నములగుచున్నవి. శాంతశివసుందరవిలాసవిలసితమైన విశ్వమునందు సాహిత్యోపాసకులకు స్వీయభావనానురూపముగను దివ్యవిభూతులు గోచరంబగుచున్నవి. భావనాశక్తి ప్రకృతివిలాసములకు షోడశకళాన్యాసమును ప్రాణప్రతిష్ఠను కల్పించి విశ్వసాహిత్యస్వరూపమునను, ధర్మార్థకామమోక్షముల ననుగ్రహించుచున్నది. దైవాసురయుద్ధము, క్షీరసాగరమథనము, హాలాహలామృతోద్భవములు, లక్ష్మీసుదర్శనప్రభవములు, మోహినీవిలాసములు భావనాశక్తిఫలములైన సాహిత్యపరిణామములు. గౌరీశంకరకైలాసవిహారములు, రాధామాధవబృందావనవిహారములు, గోపాలకృష్ణలీలలు, గోపాలవిలాసములు, ఏసు, బుద్ధ త్యాగవిలాసములు పరమార్థప్రదములైన సాహిత్యేతిహాసముల పరిణామములు. సచ్చిదానందాత్మకమైన సాహిత్య పరిణామమున కాత్మపరిణామము ప్రమాణము. ఆత్మభావనాశక్తి విశ్వమునం దంతటను సత్యజ్ఞానానందమయమైన ఆత్మసందర్శనమును జేయుచు రసానందాత్మకములైన సాహిత్యకావ్యకళారూపమునను పురుషార్థపరిణామమును పొందుచున్నది. సాపేక్షమైన సాహిత్యరసానందానుభవము నిరపేక్షమైన ఆత్మానందానుభవమునం దైక్యమును పొందుచున్నది. సాహిత్యతత్త్వవిచార మీపరమార్థమును దృష్టాంత సిద్ధాంతరూపమునను విశదముచేయుచున్నది. సత్యనారాయణమూర్తిగారు 'భావనావేశము' 'భావనాపరిశీలనము' శీర్షికల క్రిందను జేసిన సాహిత్యతత్త్వమీమాంస విశాలమై సాహిత్యోపాసకులకు సమాదరణీయముగ నున్నది. గ్రంథమునందలి యుదారాశయముల నీక్రిందివాక్యములు తెలుపుచున్నవి :

"కన్నున్న గాని శిల్పము నెరవేరదు, జీవమున్న గాని శిల్పము సార్థకముగాదు. ఈజీవమును ఆకన్నును భావనాపరిశీలనముల మేలుగీములు. అద్భుత సృష్టికిని కళాపుష్టికిని, భాస్వదాశయతుష్టికిని సుధామయ, ఆనం

మయ, ఆలోకమయ అనంత జీవనమునకు తలిదండ్రు లైన భావనాపరిశీలనముల ప్రసన్నత చేకుఱుట ఎట్టి వారికి?"

మాతృభాష:— సాహిత్యమునకు సారస్వతము మకుటము. సాహిత్యాంగములైన లలితకళలు నృత్యగీత వాద్యాదులు సాహిత్యనిర్మాణవికాసములకు సాధనము లైనను భావప్రకాశమునకు మూలాధారమైన భాష సాహిత్యతత్త్వమునకును, తత్త్వవిచారమునకును సాధనము. అవ్యక్తమైన ప్రణవనాదముతో నారంభమైన సాహిత్యము భావార్థకళాపరిణామమునను సువ్యక్తమగుచున్నది. అవ్యక్తమైన బ్రహ్మమునకు శబ్దము సువ్యక్తస్వరూపము. సాహిత్యమునకు కీలకమైన భావమునకు శబ్దమక్షరసుందర స్వరూపము. భావశబ్దార్థకళల యోగానుభవము సాహిత్యము. సారస్వతాభ్యుదయమునకు సహజమైన భావములువలెను సహజమైన భాషయును మూలాధారము. ప్రపంచమునం దెచ్చటను సారస్వత తత్త్వవిచారమునందు హిందూస్థానమునందువలెను మాతృభాషాభిమానాక్రందనమును చేయవలసిన దురదృష్టము కనుపడదు. పారతంత్ర్యము ననుభవించెడి ప్రజలకు పరావలంబనము నందుగల యభిమానాదరణములు స్వావలంబనస్వయం సహాయములందు దుర్లభములు. శ్రీసత్యనారాయణ మూర్తిగారీవిషయమైచేసిన విమర్శనము నాంధ్రభాషాభిమాను లందరును గమనించుట వివేకము :

"వంగీయుల హృదయశక్తిని, ద్రవిడుల మేధాశక్తిని మనయం దిముడ్చుకొనియుండియు, మనలను మనము గుర్తించుకొనక స్వీయసముద్ధరణమును కాంక్షింపక, సాహిత్యవృద్ధినుండియే జాతీయవృద్ధి గోచరించునని యెఱుఁగక ఆత్మవిస్మృతులమై పడియుంటిమి. మన భాషయో? ప్రాచ్య ఇటాలియన్ అని ప్రసిద్ధినందిన భాష యయినది. అనేక శతాబ్దులకుమున్నే విజయనిశానముల నంబరవీథి నెగిరింపజాలిన భాష మనయది! సౌందర్యమాధుర్యములకు పెన్నిధానము కాఁజాలుదునని నిరూపించిన భాష మనయది! నేఁడు మూలఁబడియున్న భాషయు మనయదియే! ఏల? పగ్గములు చేతఁ బుచ్చుకొని, మూతులు బిగించుకొని, భాషాసతిని వితిచికట్టు పండిత ప్రకాండులే యుత్తర మీయవలెను. కాలానుసారమైన గమనికను జూపని భాష నుగుఱించి రవీంద్రుఁ డనిన వాక్కు ఎల్లెడల వర్తించు సిద్ధాంతమే కద! రాతి నగలందు నిలిచిన తెలుఁగు సర్వాంగసుందరియై ఎట్లు చూపట్టును? ఎట్లాంధ్రభాషయోష ముందులకు జరుగును? ఆంధ్రహృదయమందలి సహజశక్తి విజృంభింపవలెననిన, ఆంధ్రసాహిత్యము పునరుద్ధరణము నందవలెననిన ఆంధ్రభాష స్వాతంత్ర్య మందితీరవలెను. వంగసీమయందువలెనే మనసీమయందును భాషావిప్లవము తల చూపవలెను. శతాబ్దులకుముందు శిలాగ్రంథములందు చెక్కఁబడిన లక్షణసూత్రములును, వ్యాకరణనియమములును నేఁటి కాగితములందు పునర్ముద్రణమందినంతనే తమరాతిరూపును, తమకఠినమనసును మాపుచేసికొనునా? భాషాస్రోతమునకు ఆనకట్టయగుటకై వ్యాకరణము నిర్మింపఁబడదు. అట్లిది నిలిచెనేని, దీనిని దెగఁ గొట్టుటకు కాలవిలంబనము కారాదు."

మాతృభాష, వాడుకభాష, గ్రాంథికభాషల విషయమునను సాహిత్యగోష్ఠి, భావనావేశము, నాటక లలిత కళలవిషయమునను సత్యనారాయణమూర్తిగారు చేసిన విమర్శనలు సాహిత్య భాషా కళాభిమానుల యాదరణపాత్రములు. ఆంధ్ర వాఙ్మయాభ్యుదయాభిమాను లందరును శ్రీసత్యనారాయణమూర్తిగారు వారి సాహిత్యోపాసనానుభవపూర్వకముగను రచించిన సాహిత్యతత్త్వవిచారము నాదరించి సాహిత్యోపాసనమును జేయుదురుగాత!

శ్రీసత్యనారాయణమూర్తిగా రాంగ్లాంధ్రవంగ సారస్వతములందు పరిశ్రమచేసిన విద్యావంతులు, సాహిత్యోపాసకులు. సనాతనాధునాతనసారస్వతములును, ప్రాచ్యపాశ్చాత్య సారస్వతములును, సంస్కృతాంగ్లాంధ్ర సాహిత్యములును, ఆధ్యాత్మికాధిభౌతిక సాహిత్యములును ప్రకృతివిలసితములైన సత్య శివ సుందర విలాసములను మహాకవులు సంకల్పించి, సందర్శించి, వినిర్మించి రసానందమును గలుగజేయగల విధమును పరిస్ఫుటము చేయుచున్నవి. వ్యాస వాల్మీకి కాళిదాసాది

మహాకవుల కావ్యములవలెను, మిల్టన్, షేక్స్పియర్, హోమర్, డాంటె, గెటె, బైరన్ మొదలగు మహాకవుల కావ్యములును, సుఖాంత కావ్యములవలెను దుఃఖాంతకావ్యములును, మహాభారతములవలెను సామాన్యభావగీతములును, రసాత్మానందమునకు వినియోగపడిన వినియోగపడుచున్న విధమును శ్రీసత్యనారాయణమూర్తిగారు ఈగ్రంథమునందు బాగుగవిమర్శించిరి.

భారతీయసాహిత్యమునకు చతుర్విధపురుషార్థములందును నిత్యమైన మోక్షము పరమార్థమైన విధమునను, నిత్యసాహిత్యమునకును నిత్యమైన ఆత్మజ్ఞానానందము పరమార్థమైన విధమును నవగతము చేయుటకు శ్రీసత్యనారాయణమూర్తిగారు చేసిన ప్రయత్నము సాహిత్యమీమాంసకులకు విచారయోగ్యముగను నున్నది.

కా. నాగేశ్వరరావు.

---



ఆంధ్రమహాభారతరచనము - నన్నయు నారాయణభట్టులు—ఆమంచర్ల గోపాలరావు.




శివభక్త మాహాత్మ్యమునందలి కళానాథాఖ్యానము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)



# కలగూరగంప



## ఖర్జూరపు పంట

మనహిందూదేశమున ఖర్జూరము రుచిచూడనివారుండరు. ఐనను దానిని పండించువిధానముమాత్ర మొకరికిని దెలియదు. ఖర్జూరపుచెట్లు ఇతర వృక్షములేవియు మొలవనట్టి నిర్జనములగు వేడియిసుకయెడారులలో ఫలించుటవలన పూర్వీకు లిది యొక్క వరప్రసాదముగా భావించిరి. కాని నేను యునైటెడ్ స్టేట్సులో ఈవృక్షములు క్రీడోద్యానములవలె నాటబడి మిక్కిలి శ్రద్ధతో పెంచబడుచున్నవి.

ముప్పదియేండ్లక్రిందట ఖర్జూరపుతోట లమెరికాలో లేవనియే చెప్పవచ్చును. ఖర్జూరవృక్షములు తీక్ష్ణమైనవేడిమిగల అరేబియా, ఆఫ్రికా యెడారులలో తప్ప ఇతరస్థలములలో వర్ధిల్ల లేవు.

౧౯-వ శతాబ్దము తుదివరకును ఖర్జూరమును పండించుటలోని రహస్యము అమెరికాలోనివారికి తెలియు లేదు. అనాదినుండియు ఖర్జూరము పండించెడివాడుకయున్నట్లు పురాతనగ్రంథములు చాటుచున్నవి. యూఫ్రటీస్, మెసపటేమియాలోని శాసనములలో గూడ ౪౦౦౦ సంవత్సరములక్రింద పేర్కొనబడియున్నది. అట్టి ఉష్ణప్రదేశములనుండి అమెరికాదేశస్థులు మొక్కలను స్వదేశమునకు గొనిపోయి పెంచి పండించి ఆపండ్లతో వర్తకము సాగించుచున్నారనిన ఎట్టివారికైనను వింతగొల్పక మానదు.

అమెరికాదేశస్థు లీయసాధ్యకార్యమును ఏబది సంవత్సరములలో పున సాధింపగల్గిరి. బహుకాలము ఖర్జూరపు వృక్షముల తత్వమును పరీక్షించి కేవలము శాస్త్రజ్ఞానసహాయముననే దీనిని సాధింపగల్గిరి.

౧౯ వ శతాబ్దముమధ్య జనరల్ చార్లెస్ పి. స్టోన్ యీజిప్తులో ప్రయాణముచేయుచు, స్వదేశమగు కాలిఫోర్నియాకు కొన్ని ఖర్జూరము మొలకలను పంపెనట. కాని, వాటికి సరియైనసంరక్షణ జరుగకపోవుటచే శీఘ్రకాలములోనే అవి నశించిపోయినవి.

౧౮౯౦లో యునైటెడ్ స్టేట్సు వ్యవసాయశాఖాధికారులు ఖర్జూరవృక్షములను సాగుబడిచేయుటకై డాక్టర్ వాల్టర్ టి. స్వింగిల్‌ను ఆఫ్రికాకు పంపిరి. అతడు అల్జీరియాతీరముననున్న ఒక ఖర్జూరవనమునకు వెళ్లి అచటినుండి బాగుగయెదిగిన చిన్న ఖర్జూరపుచెట్లను తల్లివృక్షములనుండి వేళ్లవద్ద విడదీసి, వాటిని ఖర్జూరపు మట్టలలోని మెత్తటిపీచుతో చుట్టి సంచులలో నమర్చి ఒంటెలపైవేసి సమీపగ్రామమునకు జేర్చెను. అచటినుండి ౩౯౦ మైళ్లలోనున్న ఆల్జియర్సుకు మోటారు బస్సులపై తీసికొనివెళ్లెను. ఆల్జియర్సులో నాచుమొదలగు తడిపదార్థములతో నీమొక్కలను కప్పి సముద్రప్రయాణమున కనువగునట్లు కట్టలుకట్టించెను. ఇట్లు కట్టిన ఒక్కొకచెట్టు రమారమి మూడుటన్నుల బరువుండెను. ఈ విధముగ ౪౪౭ చిన్నవృక్షములు అమెరికాకు ఎగుమతి చేయబడినవి.

పైవిధముగ దీసికొని వెళ్లబడిన ఖర్జూరపు మొక్కలను తోటలలో నాటి, వాటిని ఆదేశపు వాతావరణస్థితికి అలవాటుపడునట్లు చేసిరి. ఇట్టి ప్రక్రియవలన అరేబియావారిచే పేర్కొనబడిన వేలకొలది జాతులనుండి ఆదేశమునకు అనువైనవి పది, పండ్రెండురకములేర్పడినవి. శాస్త్రజ్ఞు లీమొక్కలను కొంతకాలము పరిశ్రమాలయములలో చీకటిఆవరణలం దుంచియు, తీక్ష్ణము మెర్క్యురీదీపముల కాంతి ప్రయోగించియు, వాటిచుట్టును మంచువంటి వాతావరణము గల్పించియు, మరియు నిట్టిపెక్కు ప్రక్రియలవలన వాటి నాభూమికి సరిపడునట్లు చేసిరి. సూక్ష్మమైన యంత్రసామగ్రిచే వాటి ప్రవర్ధనశక్తిని కనిపెట్టగల్గిరి. ఇరువదినాల్గు ఘంటలలో ఒకవృక్షము తలవెండ్రుకలో నెన్నవభాగ మెదుగుచున్నదో తెలిసికొనగల్గిరి. ఈ వృక్షములు సూర్యకాంతిలోని కొన్ని హ్రస్వకిరణముల ప్రభావముచే పగటివేళ

ఎదుగకుండునట, రాత్రులందు ఎదుగునట. శీతోష్ణస్థితి ౪౬°F తగ్గినచో యీవృక్షములు యెలుగుబంట్లవలె నిదురించునట. మరల తీక్ష్ణమగు యెండ కాయగనే పెరుగుట కారంభించునట. అన్ని వేళలందును మొక్కలను పరీక్షించుటచే నిట్టి రహస్యములు బయలుపడినవి.

ఇనుపబద్దెల నిచ్చెనలపయినుండి
ఖర్జూరములను కోయుపద్ధతి



అమెరికాలో యీ ఖర్జూరపుసాగుబడి ప్రవేశించినపిదప యిసుకబయళ్లన్నియు ఉద్యానవనములైనవి. ఈచెట్టుఆకులే దానికాయలను యెండనుండి కాపాడును.

ఖర్జూరవృక్షములు బాగుగ ఫలింపవలయునన్న పైభాగము యెండలోనను, క్రిందివేళ్లు నీటిలోనను ఉండవలయునని సామెత అరేబియాలో వాడుకలో నున్నది. అట్లే యీ ఖర్జూరవనమునందును భూమిని వరిచేనులోవలె మళ్లుకట్టి పదిదినముల కొకసారి నీరు పారింతురు.

సామాన్యముగా నీవృక్షములు ముదిరినకొలదిని పొడుగెదుగుటయేగాని కాండము లావెక్కదు. వీటి ఫలములు కోయవలయునన్న సామాన్యపునిచ్చెనలు ఉపయోగపడవు. వృక్షములచొ దెలచుట్టును, గుండ్రముగా యినుపబద్దీలమర్చి, వాటిపై అనుగున చక్రములుగల నిచ్చెనలు వాడినచో చెట్టుచుట్టును సులభముగ నిచ్చెనలను కదుపుచు తిరుగవచ్చును. అట్టివృశ్యము చిత్రమునందు కాననగును. ఈనిచ్చెనలను చెట్టుఎత్తునుబట్టి తగినట్లు

మొగచెట్టు పుప్పొడిని ఆడుచెట్ల
పూవులపయి చల్లుట







మొగ పూవు

ఆడుపూవు

అమర్చుకొనుటకు వీలుండును. కొన్ని ఖర్జూరవృక్షములు ౧౦౦ అడుగులకు మించికూడ యెదుగుచున్నవి.

ఖర్జూరవృక్షములలో స్త్రీపురుష భేదము కలదు. తోటలను వేయుటలో యిరువదియొక్కటి స్త్రీవృక్షముల మధ్య నొక పురుషవృక్షమును నాటుదురు. అరువది ఆడు వృక్షములమధ్య రెండు పురుషవృక్షములున్నచో నన్ని వృక్షములును ఫలభరితములు కాగలవు. పురుషవృక్షములు పూవులు పూయునుగాని కాయలు కాయవు. పుష్పములనుండి బంగారుచాయ గల పుప్పొడి లభించును. వృక్షవర్గములలో స్త్రీపురుష సంపర్కము క్రిమికీటకాదుల సహాయమున గల్పింపబడుచున్నది. ఇట్టి సంపర్కము గల్గిననేగాని స్త్రీపుష్పములలో పిండోత్పత్తి కానేరదు. కావున ఈప్రక్రియను ఉద్యానపాలకులే గావించుచున్నారు. పురుషవృక్షములలోని పువ్వులగిలకలను కోసి, యెండబెట్టి కేసరములనుండి పుప్పొడిని విదిలించి ప్రోగుసేయుదురు. ఒక్కవృక్షమునుండి సేకరించిన రజము ఒక కాఫీకప్పులో సగమువరకు వచ్చును. ఈ పుప్పొడితో అరువది యాడువృక్షములను ఫలవంతములుగా జేయవచ్చును.

ఈఖర్జూరవృక్షములు వసంతఋతుప్రారంభమున పూయ మొదలిడును. పూవులు నిడివియైన కాడకొననుండి గుత్తులుగా వ్రేలాడుచుండును. అట్టి స్త్రీ పురుష పుష్పగుచ్ఛములు పటమునందు వేర్వేరుగా కనపరుపబడి యున్నవి. పూవులు వికసించుసరికి వాటి పైనున్న కాడ చీలికలుగా విడిపోవును. ఇట్టిసమయమున పురుష పుష్పములనుండి సేకరింపబడిన పుష్పరజమును ఆడపూవులపై జల్లెదరు. దీనికై నిచ్చెనలం వేసికొని చిన్నప్రత్తిపింజెలను పుప్పొడితో నింపి ఆప్రత్తితో ఆడపువ్వులపై పుప్పొడిని దులుపుదురు. ఆడపుష్పము మొక్కజొన్నవలె బారులుతీరి వ్రేలాడుచుండును. పూవులగుత్తులు ఒక్కొక వృక్షమున యెనిమిది మొదలు యిరువదివరకు నుండును. ఒక్కొకగుత్తిలో వేకొలది పుష్పము లుండును ఇట్లన్ని పుష్పములకు చేతితో రజస్సంయోగము గావింపవలయునని అనేకపర్యాయములు చెట్టుచుట్టును ప్రదక్షిణములు గావించినగాని నెరవేరజాలదు. ప్రతిగుత్తికిని ౹౹ లలోగూడ నంటునట్లు పుప్పొడి యొత్తవలెను, ఇంకను సందేహములేకుండుటకు మరికొంతరజము ప్రత్తిలో దీసికొని పూలగుత్తుల నడుమనుంచి త్రాటిచే గుత్తులను దగ్గరగా చేర్చి బంధింతురు.

అచటి ఉద్యానపాలకులలోని విశేషమేమన, చెట్లను మొత్తమువీద జూచుటయేగాక, ప్రతివృక్షమును ప్రత్యేకశ్రద్ధతో పరికించి కనిపెట్టుచుందురు. కాలిఫోర్నియాలో ఈ. యఫ్. షీల్డుస్ తనతోటలోని ౧౧౯ వృక్షములను చిన్నబిడ్డలవలె ౧౧౯ ప్రత్యేక స్వభావము కలవిగనున్నవని తెల్పుచున్నాడు. దీనినిబట్టి పైయంశము స్పష్టము కాగలదు.

అందుచే ఏవృక్ష మెన్ని పూలగుత్తులను పూయునో, గుత్తి కెన్నికాయ లుండునో లెక్కలు వేసియుంచుదురు. ఒకగుత్తికి ౯౦౦ ఫలము లుండును. ఒకవృక్షమునుండి సుమారు నూరుమొదలు నూటయేబదివందల పౌనుల రుజ్యము లగు ఫలములు లభింపగలవు

ఖర్జూరవృక్షములు నూరుఅడుగులకన్న యెత్తుగా ఎదుగుచుండును. ౩౦౦ సంవత్సరములు దాటినను అవి



పండిన ఖర్జూరముల గుత్తులు

ఫలించుచునేయుండును. ఈచెట్లు ఆగష్టునెలవచ్చుసరికి ఫలోన్ముఖములగును. ఈ వృక్షము లెంతటివేడిమినైనను భరింపగలవుగాని ఒక వర్షబిందువు పడినమాత్రమున కాయలచర్మము క్రుళ్లిపోవును. కావున ఫలగుచ్ఛములను అకాలవృష్టినుండియు, పిట్టలు, ధూళి, క్రిములు మొదలగువాటి బారినుండియు సంరక్షించుటకై నీరు చొరని పంచులతో కప్పియుంచెదరు. ఫలములు డిసెంబరుచివరికి సంపూర్ణముగ పక్వదశకు వచ్చును. ఒకగుత్తిలోని కాయలన్నియు యేకకాలమునకే ఫలింపవు. పండిన ప్రతిఫలము ఒకటొకటిగా చేతితో అరటిపండ్లనువలె కోయవలయును.

ఈ రీతిగా కాలిఫోర్నియాలో ఖర్జూరపుతోటలుగలవారందరును ఒక సంఘముగా నేర్పడియున్నారు. ఈ సంఘమువారు ఫలములను ఆకారము, రుచి, చక్కెరపరిమాణము మున్నగువాటిని పరిశీలించి నాల్గయిదు తెగలుగ విడదీయుదురు. ఈవిభజననుబట్టియే తోటవారికి ద్రవ్యమొసగబడును. అమెరికాఖర్జూరము యితరదేశపుదానికన్న పరిశుభ్రముగను,రుచ్యముగను ఉండును. వెడల్పగు తొట్టెలలో ఫలములనుంచి, పెద్దపంకాల గాలిచే ధూళిని తొలగించెదరు. ఇట్లు శుభ్రపరుపబడిన ఫలము లొకతొలుపట్టీపై ముందునకు సాగుచుండును. వాటిలో పదవవంతుఫలములను పరీక్షించి విభజింతురు. అపుడు అతి నిపుణలగు బాలికలు పైపేర్కొనబడిన గుణములను పరీక్షింతురు.

లోపలిభాగమున వంచెలుఅమర్చబడిన గుండ్రటి యినుపతొట్టెలలో ఫలములను వేయుదురు. అచ్చట అవి శుభ్రముగా తుడువబడును. అందువలన వానికి



మీద నీరుచొరని సంచులుగల ఖర్జూరపుగుత్తెలు. వానపడినపుడు సంచులను విప్పిగుత్తెలకు కప్పెదరు



ఖర్జూరములకు కావలసినపదనును నిలువచేయుగది. కఱ్ఱతొట్టెలలో టన్నులకొలది ఖర్జూరము లున్నవి

ఆకర్షకమైన నిగనిగయు నేర్పడును. ప్రమాదవశమున ఫలములను చట్టుముట్టిన క్రిమికీటకాదులను సంహరించుటకై యిథిలైన్ ఆక్సైడ్ గాలి వాటిపై ప్రసరింపజేయబడును. పిదప వాటి ఆకారమునుబట్టి శీఘ్రముగ విడదీసి పెట్టెలలో నింపుదురు. శుభ్రపరుచుటయేగాక ఫలములలోనీ రెక్కువగా నున్నయెడల యంత్రములసహాయమున యెండించి బరువుతగ్గింతురు. అతి తేలికగా నున్న వేడినీటి యావిరిని ఉపయోగించి మరల తడిచేయుదురు. ఇట్టి ప్రక్రియవలన ఫలము ఆకారమునకుగాని, రుచికిగాని భంగము వాటిల్లదు.

ఇట్లు నింపిన పెట్టెలను యంత్ర సహాయముననే పలుచని మెరుగుకాగితముతో చుట్టి సీళ్లువేయుదురు. ఇట్లు నిమిషమునకు ౩౭౮ పెట్టెలు ఎగుమతికి సిద్ధముగావింపబడును.

మిక్కిలి చిన్నవిగానున్న ఫలములను గింజలు తీసివేసి పలువిధములగు తినుబండములలో నుపయోగింతురు. నిరుటిసంవత్సరము అమెరికాలో ౨,౫౦౦,౦౦౦ పౌనుల ఖర్జూరము పండింపబడెను. కాని అమెరికాలోనే సంవత్సరమునకు ౫౪,౧౦౦,౦౦౦ పౌనుల ఖర్జూరము వాడుచున్నారు.

ఖర్జూరమువలన అమెరికాలో క్రొత్తరకము ఆహారపదార్థ మేర్పడినది. ఖర్జూరము నెండబెట్టి అడుగులవలె చూర్ణము చేయుచున్నారు. దీనిని వెన్నతో కలిపి ప్రాతః కాలభోజనమున కుపయోగించుచున్నారు. కొన్నిరకములు తడిగానుండి నోట వైచుకొనినంతమాత్రమున ద్రవీభవించును. కొన్ని యెండినవి పలుకుకట్టి కరకరలాడుచునుండును.

ఈ విధముగా యెడారులలో మొలిచి జనులకలభ్యమైన ఖర్జూరమును అమెరికాదేశస్థులు బుద్ధికుశలతచే సానుబడిచేసి నిత్యోపయోగములోనికి దీసికొని రాగల్గిరి.

---

### బ్రిటిషు గయానా

బ్రిటిషుగయానా అమెరికాలో పశ్చిమోత్తర భాగంలో ఉంది. అది కారడవులపుట్ట. మనుష్యసంచారానికి వీలుండదు. ఏళ్లు, కాలువలు విశేషంగా ఉండడంవల్ల వాటిగుండా ప్రయాణం సాగిస్తూవుంటారు ఇక్కడివారు. అడవుల్లో అక్కడక్కడ చాటిపట్టిలూ, పచ్చికపట్టులూ ఉన్నవి. చెట్లు చేమలూ దండిగా వృద్ధిపొందేచోటనే ఊళ్లూ పల్లెలూ ఏర్పడ్డవి. అక్కడ వింతవింత మృగాలున్నవి. చిఱుతలూ, కోతులూ, అడవిపందులూ విశేషం. వింతరంగుల చిలుకలూ, పక్షులూ చాలా ఉన్నవి. దోమలబాధ ఎక్కువ. సాలెపురుగులు, తేళ్లు, జెఱ్ఱులు విపరీతం. కొండచిలువలలాంటి పెనుబాములూ ఉన్నవి. కొన్ని ౨౦ అ. కంటె పొడుగ్గా ఉంటవి. మనుష్యులనుకూడ అవి మింగేస్తవి.



నిప్పును చిలుక్కుంటున్న గయానా ఇండియనులు. వీళ్లకు మార్పంటే ఏమాత్రమూ గిట్టదు. ఇంకా పాతకాలపు పద్ధతుల్లోనే పడివున్నారు

ఆదేశంవాళ్లు కుఱచగా ఉంటారు. రాగిరంగు వాళ్లది. వెంట్రుకలు నల్లగా పొడుగ్గా ఉంటవి. చమురు బాగా పూసుకోవడంవల్ల మిలమిలలాడుతూ ఉంటవి. వాళ్లు చాల పరిశుభ్రంగా ఉంటారు. ప్రతిదినము మంచినీటిలో చాలసారులు స్నానంచేస్తారు. అంచేత వాళ్లవొళ్లు నున్నగా, సొగసుగా ఉంటుంది. వాళ్ల అందచందాలు మాట చాల విచిత్రమయింది. కొందఱు క్రిందిపెదవులకు బొక్కలుపొడిచి సన్నని కఱ్ఱముక్కలు ఎక్కించుకుంటారు. నెత్తిని తప్ప ఒంటిమీద వెంట్రుకలనంతా ఊడదీసివేసుకుంటారు. కనుబొమ్మలమీది వెంట్రుకలను కూడ ఊడతీయడము కద్దు. చెవులకు కూడా రంధ్రాలుపొడిచి ఏవేవో సొమ్ములు తగిలించుకుంటారు. కొందఱు తమతమ జాతి చిహ్నాలను పచ్చపొడిపించుకుంటారు. సాధారణంగా ఎరుపు, పసుపు, నలుపురంగులు పాముకోవడం వాళ్లకు మామూలు. రంగురంగుల ఈకల



గయానా ఇండియనులు వేటలో మంచినేర్పున్నవారు. ఇప్పుడిప్పుడూ, విల్లమ్ములే కాకుండా తుపాకులనుకూడా వేటలో వాడుతారు

తోచేసిన కుళ్లాయిలను పెట్టుకుంటారు. అడవిపంది కోరలను దండగాగుచ్చి మెళ్లో వేసుకుంటారు మగవారు. అది అలంకారమేకాకుండా పౌరుషసూచకమూ అవుతుంది వాళ్లకు. తాము స్వయంగా చంపిన పందికోరలను మాత్రమే ఆదండలో కూర్చవలెను. ఆదండలో కోరలు ఎంత ఎక్కువగా, ఎంత సున్నితంగా, ఎంతపొడవుగా ఉంటే అంత గొప్పవేటకాడని వాళ్ల భావం. దీన్నిబట్టి వారి గూడెంలో వారికి గౌరవప్రపత్తులూ ఏర్పడుతవి.

వాళ్లు, ఆక్కడక్కడ నరికి నేల చదునుచేసి గుడిసెలు కట్టుకొని కాపురం ఉంటారు. రాత్రిళ్లు గోనెతో జైల్లో పండుకొంటారు. వెచ్చగా ఉండడానికనీ, అడవిమృగాలు రాకుండా ఉండడానికనీ క్రింద నెగళ్లు వేసుకుంటారు.

వేటాడడమూ, చేపలుపట్టడమూ వీరి ముఖ్యవృత్తులు. అడవిమృగాలకు భయపడి విల్లమ్ములు, ఇతర ఆయుధాలు తీసుకొని గుంపులు గుంపులుగా వేటకు బయలుదేరుతారు.

చేపలుపట్టడంలో వీరు చాల నేర్పుగలవారు. వీళ్లకు అందుకు ఉపాయాలు ఎన్నో తెలుసు. వాటిల్లో విషప్రయోగం ఒకటి. ప్రవాహానికి అడ్డుగా కట్టకట్టి, నిలిచిన నీటిలో విషపుమొక్కలను పడవేస్తారు. వాటిసారం నీటిలో కలినేటప్పటికి చేపలు స్మృతితప్పి నీటిమీదికి తేలిపోతవి. అప్పుడు వాటిని దేవితీసుకుంటారు. ఇంతకంటే నేర్పయిన ఉపాయం అమ్ముతో కొట్టడం. దీనికి లక్ష్యశుద్ధి బాగా ఉండాలి.

ఇల్లుదిద్దుకోవడము, వంట, తోటలు, పైర్లు సాగుచేయడము ఇవి ఆడవాళ్లు చేయవలసిన పనులు. అక్కడ 'కసావా' అనేదుంపను విస్తారంగా పైరుచేస్తారు. ఆ దుంపలపిండితో రొట్టె తయారుచేసుకుంటారు. చెఱకు, అరటి, గనుసు, కొన్ని పండ్లజాతులుకూడ పైరవుతవి.

బిడ్డలను చాలా గారాబంగా చూచుకుంటారు. జాగ్రత్తగా పెంచి తమ విద్యలను వాళ్లకు నేర్పుతారు. మగపిల్లలు చిన్నతనంలోనే బొమ్మవిండ్లతో, అమ్ములతో ఆడుకుంటారు. పెద్దపెరిగేటప్పటికి వాళ్లకు మంచి లక్ష్యశుద్ధి ఏర్పడుతుంది. ఆడపిల్లలు నీళ్లు తేవడము, కట్టెలు ఏరుకొని రావడం మొదలయిన గృహకృత్యాల్లో తల్లికి



ఎండలో తిండి తయారుచేసుకొంటూవున్న గయానా ఇండియను యువతులు

సాయపడుతూ ఉంటారు. చిన్నవయస్సులోనే పెండ్లికి ప్రధానం జరుగుతుంది కాని పెండ్లిజరిగేలోపల వరుడు తన శక్తిని, పౌరుషాన్ని ప్రకటించుకోవాలి. అందుకోసం వరుడికి చాలా కఠినపరీక్షలున్నవి. వాటిల్లో తేలవలె. వొళ్లంతా పెద్దపెద్దగాయాలు చేసుకోవాలి. కటికిచీమలతో నింపిన గోనెసంచులలో పండుకోవాలి. వాటి బాధకు ఓర్చుకోవాలి. పెద్దపెద్ద చెట్లను నరకాలి. చేపలను పట్టాలి. క్రూరజంతువులను వేటాడాలి. తన్ను, తన కుటుంబాన్ని పోషించుకోవడానికి కావలసిన ఇతర కార్యాలను అన్నిటిని చేయాలి. ఇదంతా కాకుండా అత్తవారి యింటికోసం పాటుపడాలి కొంతకాలం.

తీరికసమయాల్లో పండుగలూ పబ్బాలూ చేసుకుంటారు వాళ్లు. చుట్టాలు పక్కాలకందరికీ కబురు పంపుతారు. చదవడం వ్రాయడం తెలియకపోయినా పండుగలు తెలియడానికి ఒక ఉపాయం కనిపెట్టారు. ఒక దారంలో పండుగకు ముందుండే రోజులకన్నిటికీ రోజుకొక్క ముడి చొప్పున ముళ్లువేస్తారు. వాళ్లల్లో ఒకడు దినానికి ఒకముడిచొప్పున ఆ ముళ్లను విప్పివేస్తూ ఉంటాడు. చివరముడి విప్పవలసినదినం పండుగ అని తేలుతుంది. ఆనాడు అందరూ చేరుతారు. ఆడాళ్లూ మగాళ్లూ బాగా అలంకరించుకుంటారు. పెంపుడు కోతులనుకూడా అలంకరిస్తారు. విందులూ వినోదాలూ, ఆటలూ పాటలూ జరుగుతవి. తాళాలూ తప్పెట్లూ మ్రోగుతవి. ఈ ఉత్సవాలు వరసగా కొన్నాళ్లదాకా జరుగుతవి. పందేలూ పట్లూ కూడా జరుగుతవి.

మంచిసెబ్బరలకు కూడా మంత్రాలు తంత్రాలు నమ్ముతారు వాళ్లు. చిల్లంగివల్ల రోగాలూ, దౌర్భాగ్యమూ తుదకు చావూకూడా మూడుతుం దని వాళ్ల విశ్వాసం. భూతాలూ పిశాచాలూ మాంత్రికుల స్వాధీనంలో ఉంటాయని వారికి గట్టినమ్మకం. మంత్రాలూ తంత్రాలవల్ల మంచికూడా కలుగుతుందని వాళ్లు విశ్వసిస్తారు.

వాళ్లకు దేవుడొకడు లేడు. మృతులయినపెద్దల ఆత్మలను ఆరాధిస్తారు. పెద్దలు కలలో కనుపడతారట. దయ్యాలంటే మహా చెడ్డభయం వాళ్లకు. ఎవడయినా చనిపోతే, వాడు కాపురముండిన ఇంటిని వెంటనే విడిచిపెట్టి మరొకచోట కొత్తగా ఇల్లుకట్టుకుంటారు ఉండడానికి.

---

## చైనాలో ఆడు పోలీసులు



ఎడమప్రక్క: ఇన్‌స్పెక్టరు ఆన్ చాంగ్‌కాంగ్.
కుడిప్రక్క: కాన్‌స్టేబిల్ యాంగ్‌చెంగ్.

ప్రపంచ యుద్ధమునకు తరువాత చాలాదేశములలో ఆడ పోలీసులను ఏర్పాటు చేశారు. బ్రిటిషు సామ్రాజ్యము, అమెరికా, హాలెండు, జర్మనీ, రషియా మొదలయిన దేశాల్లో ఆడ పోలీసులకంటె చైనాలో ఆడ పోలీసులు చాలసమర్థులు. వారు మగపోలీసులవలెనే దుస్తులు తొడుగుకుంటారు. వారు మగవారో, ఆడువారో తెలుసుకొనుట చాలకష్టము.

—Modern Women.

---

1. సామ్రాజ్య పరిత్యాగము చేసిన ఎనిమిదవ ఎడ్వర్డు చక్రవర్తి



ఎడ్వర్డు సింప్సను దొరసానిని కామించి పెండ్లాడ గోరెను. ఈమెను పెండ్లాడినయెడల సామ్రాజ్యమును వదలుకొనవలె నను ఆంగ్ల రాజ్యాంగశాసనము దురతిక్రమ మయినది. అందుకని సామ్రాజ్యమునే ఎడ్వర్డు వదలుకొనె నని ప్రతీతి కలిగినది. సామ్రాజ్యపరిత్యాగానంతరము ఎడ్వర్డుకు విండ్సరు ప్రభువు (Duke of Windsor) అనుపేరు ఏర్పడినది. ప్రకృతము వీరికి ఆస్ట్రియాలో నివాసము.

---

2. సింప్సను దొరసాని



అమెరికా దేశపు స్త్రీ. ఇద్దఱు మగలను విడిచి పెట్టిన సతీమణి. ఈమె మీది మోహమును విడువజాలక ఎడ్వర్డు సామ్రాజ్యమును వదలుకొనెనని లోకమునకు తెలియుచున్నది.

3. సింప్సను దొర .



చక్ర: ర్తి కామించిన సింప్సనుదొరసాని రెండవ మగడు.

## మదరాసు క్రైస్తవ కళాశాల

ఈ కళాశాల ఇద్దరు స్కాట్లెండు మతబోధకుల ప్రయత్నంతో మదరాసు బ్లాక్‌టౌనులో సెయింటు ఆండ్రూసుకిర్కువద్ద ౧౮౩౫-వ సం॥ పాఠశాలగా మొదట మొలకెత్తింది. ఊరివారు ఇచ్చే చందాలతోను, ఈమతబోధకుల పెత్తనంతోను ఈ పాఠశాల నడుస్తూ వచ్చింది. ౧౮౩౭ లో ఆండర్‌సన్ అనే మతబోధకుడు స్కాట్లెండునుండి వచ్చి పాఠశాలకు పెత్తనం వహించాడు. క్రమంగా వృద్ధిలోకి రాగా దీనికి స్థలం మార్చ వలసివచ్చింది. ౧౮౩౮ లో ఎఱ్ఱబాలుశెట్టివీథిలోకి మారి అక్కడనే ౧౮౮౪ దాకా ఉండినది. అప్పటి పెత్తనదారులు చాలశ్రద్ధతో పాఠశాలను మిక్కిలి వృద్ధిలోకి తెచ్చారు. ౧౮౮౪ లో ప్రకృతం ఉండేచోట ౨౫౦౦ పౌనులు పెట్టి స్థలం కొని కట్టడములు కట్టించి అక్కడకు ఈ పాఠశాలను మార్చారు. ఈ పాఠశాలకు స్కాట్లెండు ఫ్రీచర్చిమిషన్ సంస్థ అని అసలుపేరు. కాని అందఱూ ఆండర్‌సన్ పాఠశాల అనే పిలిచేవారు. ప్రభుత్వ విద్యావిధానాన్ని అనుసరించుటవల్ల దీనికి ప్రభుత్వమువారు ౧౮౫౭లో గ్రాంటు ఇచ్చుటకు మొదలుపెట్టారు.

౧౮౬౩ లో విలియంమిల్లరుఅనే ౨౪ ఏండ్లవయస్సుగల యువకుడు స్కాట్లెండునుండి వచ్చి దీని యాజమాన్యమునకు పూనుకొన్నాడు. అప్పుడు పాఠశాల క్రమంగా క్షీణదశకు వస్తూవుండినది. మిల్లరు ఎంతోకష్టపడి పాఠశాలను పడిపోకుండ నిలువబెట్టినాడు. ౧౮౭౭ లో మిల్లరు దీనికి ప్రిన్సిపాలు అయినాడు. ఈ పాఠశాలను 'దక్షిణ యిండియాలో కేంద్రక్రైస్తవ కళాశాల'గా చేయవలెనని అతనికోరిక. అందుకోసము ఆతడు మిక్కిలిశ్రమపడినాడు. అతనికోరిక కొంతవరకు సఫలంఅయింది. ౧౮౭౭లో పాఠశాల కళాశాలగామారి 'మదరాసు క్రైస్తవ కళాశాల' అనేపేరును పొందింది. ఈ సంవత్సరంతో దీనికి వయస్సు నూరేండ్లు నిండుతుంది.

ఈ కళాశాల ౧౯౩౭ జూనులో మదరాసుకు దక్షిణం ౧౫ మైళ్లదూరంలో ఉండే తాంబరం అనే గ్రామానికి మారి నవీనరూపంతో నిలయనున్నది. ౪౦౦ ఎకరాలవిస్తీర్ణంకల స్థలాన్ని ఇండియాగవర్నమెంటువారు అక్కడ ఈ కళాశాలకు ఇచ్చినారు. మదరాసు గవర్నమెంటువారు ధనసహాయం చేశారు. క్రొత్తకట్టడము లన్నియు పూర్తిఅయినవి. (చూ. చి.) ఈ కళాశాలకు ౨౪ ఎకరముల క్రీడారంగము ఉన్నది.

ఈ క్రొత్తరూపంలో కళాశాల ఇంచుమించు గురుకులంపద్ధతిని ఉంటుంది. ప్రకృతము మూడుబోధన భవనములు, మూడు నివాసభవనములు ఉన్నవి. ఉపాధ్యాయులు విద్యార్థులు కలిసిఉండుటకు తగిన సౌకర్యములు ఉన్నవి. ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలకు కలలక్షణాలు ఈ కళాశాలకు చాలమట్టుకు అమరి ఉన్నవి. దక్షిణహిందూదేశమున ఇట్టికళాశాల ఇప్పటికి ఇదే.

కళాశాలభవనములు ఎత్తయిన ప్రదేశంలో ఉన్నవి. సమీపంలో ఒకటిరెండు గుట్టలు ఉన్నవి. చుట్టును గ్రామపరిసరములు చూడ సొంపుగ ఉండును. నీటివసతి, పరిశుభ్రము చేయుమార్గము ఆధునికపద్ధతుల ననుసరించి ఏర్పాటు చేయబడినవి.

కళాశాల రెండుశాఖలు: విజ్ఞానశాఖ, కళాశాఖ అని. రెండింటికిని ప్రత్యేకభవనములు ఉన్నవి. కళాశాల మందిరము, మిల్లరుమెమోరియల్ లైబ్రరి, గడియారపు గోపురము వీటివంటి కలవు.

నివాసభవనములు మూడు. భోజననివాసాదులకివి చాల అనుకూలముగా ఉండును. శారీరక మానసిక ఆనందములకు వలసిన సౌకర్యములు ఇందు సమకూర్పబడినవి. విద్యార్థుల నైతిక శారీరక మానసిక వైజ్ఞానికాభ్యుదయములకు ఆవశ్యకములయిన ఏర్పాటులుగల ఇట్టికళాశాల ఇప్పటి కిదియే కనుపడుచున్నది.

D.A.R.

---

## తారామంగలము

తారా మంగలము పుణ్యక్షేత్రము. అది సేలము జిల్లాలో నున్నది. అక్కడ కైలాసనాథస్వామి దేవాలయము కలదు. ఆలయము చాలచిన్నది. అంధకార

బంధురము; కాని శిల్పము చాల ప్రశస్తమయినది. అది ఎప్పటిదో సరిగా తెలియరాదు. కొంతభాగము మాత్రము క్రీ. శ. 1268 కి పూర్వపుది అయి ఉండవలెను. 17 వ శతాబ్దము పూర్వార్థమున కొంతభాగమును గట్టిమొదలియారు లనువారు కట్టించినారు. వారాకాలమున ఈ దేశమును పాలించుచుండిరి. అపుడు వేయిస్తంభాల మంటపము నొకదానిని నిర్మింప మొదలుపెట్టినారు వారు. చాలవఱకు పని పూర్తికావచ్చినది. అంతలో రాజకీయ విప్లవము తలపడినది. గట్టి మొదలియారుల పాలనము అంతరించినది; దానితో మంటప నిర్మాణమును అంతరించినది. ఆ మంటప స్తంభములన్నియు- అపూర్వ శిల్ప సుందరములయినవి- ఎక్కడనున్న వక్కడనే భూగర్భవాసమును వరించినవి.

దేవాలయము పడమటి మొగముగ నున్నది. గాలిగోపురము అంత ఎత్తయినది కాదు. (చి. ౨) దాని తలుపులు దారుమయములు; చాల పెద్దవి. వాని పనితనము చాల సొగసయినది. దశావతార చిత్రములు మొదలయినవి వానిపయి చెక్కబడియున్నవి. తొలిప్రాకారమునకు లోవైపున గోపురద్వార సోపానముల కిరువైపుల రథాకారమున నున్న గోపురమునంటి గుఱ్ఱములు, ఏనుగులు రథమును లాగుచున్నట్లు చెక్కబడియున్నవి. ఈ శిల్పము (చి. 3) సజీవముగ నున్నది.

గాలిగోపురమును దాటి లోపలిప్రాకారమును ప్రవేశించవలెను. ద్వారమున కిరువైపుల మంటపములున్నవి(చి. ౧) ఆ మంటపముల స్తంభములమీద గుఱ్ఱపు రౌతుల ప్రతిమలు అతినిపుణముగా చెక్కబడినవి. కుడివైపున చూచినను, ఎడమవైపున చూచినను, ప్రతిమ ప్రేక్షకునినే వీక్షించుచున్నట్లుండును. ఊర్ధ్వకాయము మాత్రము ఆకృతిద్వయముగ చెక్కబడినది. కాని, రెండింటిని ఏకకాలమున చూడ వలను కాదు. (చి. ౫, ౬) లోపలి అర్ధమంటపమునగల స్తంభములు దివ్యమానువ విగ్రహముల ప్రతిమలతో నిండియున్నది. రెండు మూడు స్తంభములను నిలిపి వానిపై సింహాదిమృగముల మొదలయినవాని ప్రతిమలుగల శిలాఫలకముల నుంచి వానిపయి కప్పువేయబడినది. (చి. ౭) సింహముల నోటిలో రాతిబంతులు కదలాడుచుండునట్లు నిపుణముగా చెక్కబడినవి. అవి వెలికి రానేరవు. సింహముఖమున కెదుట రాతిగొలుసు వ్రేలుచున్నది. మూలస్థానమున కెదుట కప్పున చక్కని శిల్పముగల శిలాఫలకము అమర్పబడియున్నది. అది అయిదడుగులు చదురమున నున్నది. దానిమీద పద్మము చిత్రింపబడినది. పద్మదళములు కడు సున్నితములు. వానిపయి చిలుకలు వ్రాలి ముక్కులతో వానిని పొడుచుచున్నట్లున్నవి. నడిమి మిద్దెచుట్టు నొక రాతివలయ మున్నది. అది తిరుగును. కాని పైని కూడిరాదు. చుట్టుగోడల నానుకొని స్తంభము లనేకములున్నవి. వానిమీదనుఅనేకములు,వివిధములు,అపూర్వములుఅయిన దివ్యమానువ వ్యక్తుల ప్రతిమలు, లతాది శిల్పము అనంతముగ గలవు. ప్రతిమలు కొన్ని మనుష్యప్రమాణమున నున్నవి. ఎడమప్రక్క మొదటి స్తంభముమీద ఒక విలాసవతి ప్రతిమ ఉన్నది. (చి. ౮) చేతనొక పూలచెండునో, లేక పండునో పట్టుకొని యున్నది. దానిని చిలుక ముక్కున రక్కుచున్నది. చేతివ్రేళ్లయొక్క గోళ్లు మనుష్యులగోళ్లవలె చాల సున్నితములుగ చెక్కబడినవి. మఱొక స్తంభమున శివుని ఊర్ధ్వనటమూర్తి (చి. ౧౦) కలదు. ఒకకాలు మీదికెత్తబడి యున్నది. రెండుకాళ్ల నడుమ డక్క నుంచుకొని ఎముకతో కొబోలు దానిని మ్రోగించు చున్నట్లున్నది. ఆ ప్రతిమ చుట్టును చిల్లరదేవతల విగ్రహము లున్నవి. దీని ప్రక్క స్తంభమున వీరభద్రుని విగ్రహమున్నది. (చి. ౯) చేత శూలమున్నది. దేవాలయమంతటను ఇట్లే మనోహరశిల్ప దృశ్యములతో నలరారుచున్నది. వానియందు రతీమన్మథుల విగ్రహము లత్యంతమును దర్శనీయములు. S.S.S.

---

## ప్రాచ్యతారలు

సుప్రసిద్ధాంగ్లకవి కిప్లింగు రచించిన "Toomai of the Elephants" అనేకథ చాల ప్రశస్తమయింది. అందులో అడవి ఏనుగులనుపట్టి మచ్చిక పరచుకోవడం ప్రధానకథాసూత్రం. దాంట్లో ఏనుగుపేరు 'కాలనాగం'. మావటివాడి పేరు 'తూమై'. ఆ కథను అనుసరించిన ఫిలింలో కాలనాగం పాత్ర 'ఐరావతం' చేత, 'తూమై' పాత్ర 'సాబు'చేత నటింపబడుతుంది. 'ఐరావతం' ప్రపంచంలో కెల్ల పెద్దదయిన మూడు భారతదేశపు ఏనుగుల్లో ఒకటి. 'సాబు' మైసూరుమహారాజావారి మావటివాండ్లలో ఒకానొకడి కుమారుడు.

(డిసంబరు జ్యాగ్రాఫికల్ మాగజిన్)




టైపుయంత్ర చిత్రము

—B. V. R.

---

# ఆంధ్ర వాఙ్మయ సూచిక

## (ముద్రితాముద్రితగ్రంథముల పట్టికలు)

ఈ పుస్తకమున ౧౯౨౭-వ సంవత్సరము చివరవరకు అచ్చయిన తెలుగుపుస్తకముల పట్టిక ఒకటి, ఆ పుస్తకములను వ్రాసినవారి పట్టిక ఒకటి, విషయమునుబట్టి విభాగించి ఆ యా విభాగములక్రింద వచ్చిన పుస్తకముల పట్టికలు, ఇంకా కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు లైబ్రరిలోను, తంజావూరు సరస్వతీ లైబ్రరిలోను, చెన్నపురమున ఓరియంటల్ లైబ్రరిలోను ఉండే వ్రాతపుస్తకములలో ఇప్పటికి అచ్చుకాకుండ ఉన్న తెలుగుపుస్తకముల పట్టికలును, ప్రత్యేకము అకారాదిగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయవిమర్శనరూపమయిన ప్రకాశికులపీఠిక ౧౦౮ పుటల పరిమితి గలది యీపుస్తకమున ఉన్నది.

తెలుగుభాషలో పుట్టిన పుస్తకములను, వానిలో, ఈపుస్తకము ముగియునప్పటికి అచ్చయినవానిని, కానివానిని తెలిసికొనుటకు ఈ సూచిక చాల ఉపయోగకరము.

భారతిసైజు పుస్తకము, పుటలు ౬౨౦, మంచికాగితములు. వెల రు. ౧-౦-౦ మాత్రమే.

మేనేజరు, **ఆంధ్ర గ్రంథమాల,** నెం. 7, తంబుసెట్టివీథి, మద్రాసు.













వర్తకరహాస్యము

—స్లైక్.

౧. 

 ౪.

౨. 

## వర్థమాన

౧. నోవా పిల్-బీమ్

౨. బిల్లి థామస్

౩. పోర్కి

౪. జువానిటా క్విగ్లీ

౫. ఫ్రెడ్డీ బార్థలోమియో

౩. 

 ౫.

౬. 

 ౮.

ఆంగ్ల తారలు

౬. జేన్ విదర్

౭. జాకీకూపర్

౮. డెస్మండ్ టెస్టర్

౯. స్పాంకీ

౧౦. షర్లీ టెంపిల్

 ౯.

౭. 

 ౧౦.



సౌందర్య పిపాస — శ్రీ. సుబ్రహ్మణ్య

# సిస్టర్ వేదావతి

డాక్టరు పిశిపాటి వెంకటరమణయ్య

వేదావతి భర్త రాసిన విల్లు ప్రకారం పది వేలొచ్చే చిన్న యెస్టేటుకలతా హక్కుదారాలయింది. "నా అన్నవా రెవరుకూడా లేక పోవచ్చును గాని, ఆప్తులన్నవారు కూడా యెవరూ కనిపించకపోవడమే ఆశ్చర్యం వేస్తుంది. పనిలేందీ యెవరినికూడా యింటికి చేరనివ్వదు. తనసలే యెవరింటికికూడా వెళ్లే టట్టేకనిపించదు. ఎవరితోనైనా మాట్లాడ వలసివచ్చినా అవసరాన్నిమించి ఒకపలుకైనా ఆడేదికాదు. ఇంట్లో రాజభోగోపచారాలకవసరమైన నౌకర్లెందరవసరమో అందరినీపెట్టింది. ఆనౌకర్లయినా యెవరిడ్యూటీ వారుచేసుక పోవలసిందే కాని అనవసర ప్రసంగాల కెడమిచ్చేదేకాదు. సాయంకాలం అయిదయ్యేసరికి షోఫరు కారు నద్దంలాతుడిచి వాకిటముందు తెచ్చిపెట్టేవాడు. ఏ కారణంచేతైనా యజమానురా లారోజున హావా కోరికివెళ్లడం మానేసిందంటే కారు నలాగే తనడ్యూటీప్రకారం ఏడుగంటలదాకాపెట్టి యెదురుచూస్తూ కూర్చోవలసిందేకాని, బయల్దేర్తారాలేదా అని అడగడంకాని, లేకుంటే కారణమేమైయుంటుందా కనుక్కోవాలని ఆదుర్దాపడ్డట్టుంటేకాని ఇంపీరియల్ సర్వీసులా నెలతిరిగేటప్పటికల్లా మొదటి తేదీకి బిళ్లకుడుముల్లా చేతిలోపడే ముప్పై రూపాయలకూ నీళ్లొదులుకోవలసిందన్నమాటే! ఎవరిడ్యూటీవాండ్లు చేసుకపోతుంటే అంతకన్నా సుఖమైన నౌకరీలేకపోవడంచేత, పైగా యింకోచోట దొరికే జీతానికన్నా నాలుగురాళ్లెక్కువగా దొరుకుతూవుండడంచేత, ఆ మెకొలువును మానుకోవడమంటే వాండ్లకు కష్టంగాతోచేది. అందుకనే, పేదవారనే దయాదాక్షిణ్యాలు హృదయంలోనే కాని, పైకి చంపివేస్తుందేమోననే భయముండడంచేత, యజమానురాలుసంగ తలావుంచి, వారిలోవారైనా అనవసరపుమాటలు పెట్టుకోకుండా ఒకఆఫీసులా గృహకృత్యాలు నిర్వహించుకొంటూ పొయ్యేవారు.

ఆ ఇల్లు అసలే దేవిడీలాంటి పెద్ద భవనము. అవసరమైనచోట పెంచి లేనిచోట పడగొట్టి యెప్పుడూ యేవో యింటిమరమ్మత్తులు తాను స్వయంగాదగ్గరనిలుచోని చేయిస్తూవుండడమో, కోటగోడలావుండేఆపెద్దకాంపౌండు ఆవరణలో రకరకాల పూలచెట్లు పెట్టించడమో, స్వహస్తాలతోటి తీగలు మలుపుతూ లతానికుంజాలను తయారుచేస్తూనో బంగళానంతా దేవేంద్రభవనంలా తయారుచేస్తూ కాలక్షేపంచేస్తూవుండేది. మానవమాత్రుడితో నవ్వుతూ వికాసంగా

మాట్లాడిమెరుగకపోయినా ఆ లతానికుంజాలతో ఆపూలమొక్కలతో ఆగులాబీ పూలతో తన సహజసౌందర్యమంతా వెల్లివిరిసేటట్టి ముఖవిలాసంతో మాట్లాడుతూ, ఆలింగనాలుచేస్తూ ప్రకృతిసౌందర్యంలో మునిగిపోతూవుండేది. బెంగుళూరు చిలకపట్టుచీరగట్టి, ముఖాన బొట్టు తల్లో పూలు పెట్టదన్న మాటే కాని, చేతికి బంగారుగొలుసుగాజులకుతోడు చిన్నబంగారురిస్టువాచీ, మెల్లో సన్నని గడియారపుగొలుసు, నడుముకు తనమేనికాంతిని మించి తళతళమెఱిసే బంగారపువడ్డాణం, పెట్టుకొని, ఆ సవితాదేవిలాంటికండ్లతో, తుమ్మెదరెక్కలాంటి ఆ జారు శిఖతో పంచవన్నెలచిల్కలా ఆ పూలమొక్కలమధ్య తిరుగుతూవుంటే వనలక్ష్మిలాగే వుండేది.



ఆ పూలమొక్కలమధ్య తిరుగుతూవుంటే వనలక్ష్మిలాగే వుండేది.

అయితే ఆమె జీవితాదర్శమేమిటో ఎవరికీ తెలేదు. ఆ బ్రహ్మాండమైన మహలు, ఆ మెఱిసిపొయ్యేదీపాలు, ఆ నిగనిగలాడే మఖమల్‌సోఫాలు కుర్చీలు, ఆ నిలువుటద్దాలు డ్రెస్సింగుటేబిల్సు, రాత్రిళ్లుకూడా పట్టపగలులా వెలుగుతూవుండే దీపపుకాంతులలో ఇరవై నాలుగ్గంటలూ తన సౌందర్యాన్ని చెక్కుచెదరకుండా దిద్దుకొని మురుస్తూ ఒక్కమానవ పురుషుడైనా దగ్గర నమ్మనీకుండా యెవరికోరకు నిరీక్షిస్తూవున్నట్టో? అలాంటిఅదృష్టశాలి యీ మానవప్రపంచంలో యేమూలైనా వున్నట్టి చిహ్నంగూడా కనిపించదు!

పురుషోత్తమరావుగారు కంచర్లపూడి సంస్థానానికి దివానుగావుండి మంచి పేరుకీర్తులు సంపాదించుకొన్నారు. సంస్థానాధీశుడు వీరిని గురువులా పూజించేవాడు. రైతులు వీరిని తండ్రిలా ప్రేమించేవారు. శాస్త్రపూర్వాచారపరాయణుడే అయినప్పటికీ సంఘసంస్కరణాలపట్ల సానుభూతి కలిగే వుండేవారు. అప్పు డేమనోదౌర్బల్యం కలిగిందో కాని జీవితానికంతా కళంకం తెచ్చే

పనొకటి చేశారు. పాతికనుపైఁబయేళ్లు ప్రథమ భార్యతో సర్వసంసారసుఖాలూ అనుభవించి, యాభైయేళ్లొచ్చినతరువాత మళ్లాయిప్పుడు పెళ్లేమిటని కొన్నాళ్లూరుకొనిగూడా కార్యాంతరాలచేత గ్రామాంతరం వెళ్లి అప్సరసలాంటి పదమూడేండ్లపిల్ల వేదావతిని వివాహమాడి రెండోమానవుడికి తెలియకుండాచక్కా వచ్చారు! కళంకభూయిష్ఠమయిన తన మలిన హస్తాలతో, ఆ అనాఘ్రాతపుష్పాన్నికూడా మలినంచేసే మహాపాతకాన్ని వడిగట్టుకోడమెందుకనో, తానుచేసిన మహాపరాధాన్ని భరింపలేకనో, అకస్మాత్తుగా గుండువంటి పురుషోత్తమరావుగారు గుండెజబ్బుచేత, నిషేకముహూర్తప్రయత్నాలలో వుండగానే కండ్లుమూశారు. కావలసినంత ఆస్తి సంపాదించిపెట్టి సంతానమేమీ లేకుండా స్వర్గస్థులయినవారి కింక వారసులకు కొఱవేముంది? అయిన వారూ కానివారూ అందరూ వంశవృక్షాలు చేతబట్టుకోని బయలుదేరేరు! అయితే అప్పటికి సంవత్సరంనాడే తన మనోదౌర్బల్యంచేత తన జీవితంలోచేసిన యీ మహాపరాధానికి తను క్షంతవ్యుడుకాడనీ, తన యావదాస్తికిని వేదావతి సర్వస్వతంత్రురాలుగా వుండగలదనిన్నీ ఇంతేగాక భగవంతుడనేవాడే వొకడున్నపక్షమునను, వేదావతి తననిరర్థకపు జీవితమును భోగవంతముగచేసికొనే ప్రయత్నాలలో, నిజంగా సంభవించే మహాపాతకాలేమైనా వున్నప్పటికీ, వాటి కన్నిటికినీ తననే బాధ్యుణ్ణిగాచేసి ఆమెను క్షమింపవలసివుంటుందనీ విల్లురాసి, రిజిష్టరు కూడా చేసిపెట్టారు. దీన్నిబట్టే యిప్పుడు వేదావతి సర్వసంఘపరిత్యాగం చేసి జీవితాన్నీవిధంగా నెట్టుకపోతూవుండడము.

తల్లిదండ్రులు తన్నుబలిచ్చి యీ మహదైశ్వర్యాన్నంతా అనుభవించాలనేదుర్మార్గప్రవృత్తికి తలపడ్డ కలుషాత్ములని కాబోలు వారి నెవరినీ గడపైనా త్రొక్కనివ్వకపోవడము. స్వశక్తిచే కష్టపడి సంపాదించుకొన్న ఆస్తిని, జీవిత సర్వస్వమును ధారబోసి తనే దైవమని నమ్ముకొన్న భార్యక్కూడా దక్కకుండా అపహరించాలనే దురాశాపూరితులనీ, వాండ్ల ముఖం చూడ్డం కూడా మహాపాతకమనీ కాబోలు భర్తవైపువారి నెవరినీ కూడా వాకిటిముందుక్కూడా రానివ్వకపోవడము. మానవుల నందరినీ సమానంగా సృష్టించి ప్రకృతివైభవాన్ని ప్రసాదించి సర్వసుఖాలను అనుభవించుకోవలసినదిగా భగవంతు డనుగ్రహిస్తే, సంఘ దురాచారాలనెన్నిటినో తెచ్చిపెట్టి స్వార్థపరులై, మానవస్వాతంత్ర్యాన్నరికడుతున్నారనేఆగ్రహంతో కాబోలు, దేవేంద్రభోగాలతో సమానమైన వైభవాలన్నీ అనుభవిస్తూ వుండడము.

మానవుల మనోనిశ్చయాలు దృఢసంకల్పాలు ప్రకృతివాహినికి యెదురీదకుండా వుండేఅంతవరకేగాని అదేపాటి యెదురు తిరిగినా నదీనాంసాగరోగతిగానే పరిణమిస్తుంది. వేదావతి తన సౌఖ్యంకొరకు

యెన్ని యేర్పాట్లో గావించుకొంది. ధనానికా లోపంలేదు. సాలు తిరిగేటప్పటికి పదివే లిం టికి తెచ్చి క్రుమ్మరించిపోతారు. ఒక్కమనిషి. ఏ సంసారజంజాటమూ లేదు. కాని ఆమె నేదో మనస్సు బాధిస్తూనే వున్నట్టు కని పిస్తుంది. హంసతూలికాతల్పంలాటి పందిరి పట్టెమంచంమీద కూర్చొని నిలువుటద్దంలో తన సౌందర్యవిలాసాలను చూచుకొంటూ, ముంగురులు పై కొత్తుకొంటూనో, అసలే దానిమ్మపువ్వులాంటి కాంతి గలిగిన తన పెదవి కంటిన తమ్మరసపుకాంతిచే ద్విగుణీ కరించిన సొబగును పదే పదే పెదవిసాచి చూచుకొంటూనో, హఠాత్తుగా, యేదో దీర్ఘాలోచనాపరురాలయి చెక్కిట చెయి చేర్చి బొమ్మలా అలాగే కూర్చొని గంటల తరుపడి ఉండిపొయ్యేది. ఏ హంసతూలికా తల్పము, ఏ ధనము తన మనోవ్యథను మాన్పేటందుకు తోడ్పడజాలనట్టు కనిపిం చేది.

క్రమేణా యీ కూర్చొని ఆలోచించ డాలు - పిలిస్తే వినిపించుకోలేక పోవడము, రెప్పవాల్చకుండా అలాగే చూడడం, వెర్రి వెర్రి నవ్వులు నవ్వడం, అంతలోనే యేడ వడం, స్పృహతప్పి పడిపోయి గంటలతరుపడి తన్నుకొంటూ కట్టెలా సీలుక్కుపోవడంలోకి దిగింది. దేవిడీలో యెన్నాళ్లనుంచో దయ్యా ల కావాసంగావుండే చీకటికొట్టులన్నిటినీ పడ గొట్టించడంచేత, వాటికి కోపంవచ్చి యిప్పు డీమెను ఆవహించా యని కొందరూ, పురు షోత్తంరావుగారి ప్రథమభార్య దయ్యమై పట్టిం దని మరికొందరూ, తలకొకమాట నొక ర్లనుకుంటూవచ్చారు! ఆరోజు నొక ర్లెన్ని ఉపచారాలు చేసినా వేదావతికి స్పృహ వచ్చిందికాదు. తరుచు యిలా వస్తూవుండ డం, ఆరోజుకారోజు శల్యగతం కావడం చూచి, యజమానురాలి అనుజ్ఞకు నిరీక్షించకే, డాక్టరును పిలిపించారు. డాక్టరు వచ్చి రెండు గంటలకాలం ఉపచా రాలు చేసినమీదట కాస్త కండ్లు తెరిచి చూచింది. తన నరుసు నారోజు అక్కడేవుంచి తిరిగి సాయంకాలమువచ్చి చూస్తానని చెప్పి వెళ్లారు. వేదావతి కంతా స్వప్నావస్థక్రింద కనిపించింది. తను చూచియుండిన ఆదివ్య సుందరవిగ్రహము కలలో కనిపించిందా, లేక మైకంలో కళ్లు తెరచి చూచినప్పుడు కనిపిం చిన డాక్టరు విగ్రహమా అని సందేహం కలిగింది.

సాయంకాలం నాలుగ్గంటలయింది. బం గళాముందు మోటారుచప్పుడయింది. నరుసు డాక్టరొస్తున్నాడని చెప్పగానే వేదా వతికి గుండె దడదడ కొట్టుకో నొదలు పెట్టింది ఎందుచేతనో. లేచికూర్చోబోతుంటే నరుసు నివారించి కదలకుండా ఆలాగేపడుకో బెట్టింది. ఇంతలోకే తన స్వప్న పురుషుడు ప్రత్యక్ష మయినట్లు డాక్టరుగా రొచ్చి ముందు నిలిచారు. ఆ బ్రహ్మ వర్చస్సు,

ఆబంగారు మేనికాంతి, విదేశాలనుండీ తిరిగి వచ్చిన ఆ క్రొత్త మాయని దుస్తుల వైఖరి, ఆ చలాకీతనం చూచి వేదావతి సమ్మోదిత అయిపోయింది. నాడి పరీక్షించి నవ్వుతూ



నాడి పరీక్షించి నవ్వుతూ భుజముపైని తడుతూ మరేంభయం

భుజముపైన తడుతూ 'మరేం భయం లేదు లెండి. యింక లేచి తిరగవచ్చు. రేపు వచ్చి మళ్లా చూచిపోతాను. ఈ మందుమాత్రం సరిగా పుచ్చుకొంటూ వుండం'డని నరుసును వెంటబెట్టుకోని వెళ్లిపోయినాడు. వేదావతికి ఆరాత్రంతా డాక్టరుగారు రావడము, ఆ ధైర్య మివ్వడము, ఆమాటా ఆపలుకుబడి వైఖరీ వీటి ఆలోచనలతోటే సరిపోయింది. క్రమేణా డాక్టరుగారి రాకపోకలు మాత్రం ఆబంగళాలో నిరభ్యంతరంగా జరిగిపోతూవచ్చాయి. సాయంకాలం తనమోటారులోనే వేదావతిని హవాకొరకి తీసికొని వెళ్లడం, ప్రొద్దుపోయిన రోజున వేదావతితోనే అక్కడ భోజనం చెయ్యడం, పగలు తన దవాఖానాకు తీసికొని వెళ్లి, తనుచేస్తూవుండే ఆపరేషన్లు చూపుతూ, నరుసులు రోగుల నెంతప్రేమతో చూస్తూ పోషిస్తూవుంటారో చూపి, పగలప్పుడప్పుడు తనబంగళాయందే భోజనానికి నిలుపుకోడం, యిలా కొంతకాలం గడచిపోయింది. వేదావతి కాజబ్బుమాత్రం తిరిగి యెన్నడూ పొడజూపలేదు! ఏరోజైనా డాక్టరుగారు కనిపించనిరోజున కాస్త సుస్తీగా వుండడము తప్ప! డాక్టరుగారితో యీమాటా ఆమాటా మాట్లాడుతూ మాటలమధ్య భర్త తనపేర వ్రాసినవిల్లులోని "తనసౌఖ్యంకొఱకు" అనిన వాక్యాలను నొక్కిచూపుతూ వుండేది. దానితత్త్వం గ్రహించి డాక్టరుగారు కూడా దానిమీాదేవో కులాసాకబుర్లు చెబుతూ, సంఘసంస్కారము, విదేశాలలో స్త్రీల కెట్టి స్వాతంత్ర్య ముండేది, తను విదేశాలలో యెలా కులాసాగా కాలక్షేపంచేస్తూవచ్చింది, ఏవేవో కబుర్లలోకి దింపి మనసు కానందం కలిగిస్తూవచ్చేవారు. పునర్వివాహాలు దోషం కావని, మనదేశంలోకూడా విడాకులచట్టం ప్రవేశపెడితేనేకాని యీపురుషుల దౌర్జన్యం

కొంతతగ్గదేమోనని, యేమేమో మాట్లా సుతూవచ్చేవారు. వేదావతికి యీకబుర్లన్నీ వింటంచేత డాక్టరుగారిమీద తిన్నగా మోహం మరలింది.

ఆరు సంవత్సరాలు విదేశాలలో కాలం గడిపి క్రొత్తగా వచ్చిన డాక్టరుగారికి ఆడ వారితో కరస్పర్శలు చేయడం, సరదాగా వెంట వేసికొని తిరగడం, కబుర్లు చెప్పడం నూతనంగా కనిపించేదేమీ లేదు. సనాతన ధర్మనిష్ఠాపరులగు హిందూ కుటుంబములో పుట్టి, పెరిగి, మగపురుగు నింటికి చేర్చకుండా తదేకనిష్ఠతో కాలం గడుపుతూ నిండు జవ్వనంలోనున్న వేదావతికి అన్యథా అపోహపడ డంలో ఆశ్చర్యమూలేదు! తనింతకాలము పట్టుదలలో దీక్షవహించివున్నందుకు భగ వంతుడుతగినసత్ఫలమందజేశాడని లోలోపల ఉప్పొంగిపోతూ వచ్చేది. కొంతకాల మిలా జరిగిపోయింది. ఒకరోజు కబుర్లమధ్య బ్రహ్మ సమాజమువారి యాజమాన్యమున తన వివా హము త్వరలోనే జరుగ నిశ్చయమయిందని చెప్పి వేశారు డాక్టరుగారు. వేదావతి అలాగే ఆ మాట వినేటప్పటికి, మాటా పలుకూ లేకుండా సోఫామీద,ప్రక్కనే కూర్చొనున్న డాక్టరుగారి వొడలిమీది కొరిగింది! అవి దుఃఖాశ్రువులో, ఆనందబాష్పాలో తెలి యవు. కళ్ల వెంట నీరు గిరుమని తిరిగాయి. డాక్టరుగారు వేదావతి హృదయాన్ని గ్రహిం చారు. ఆమె కట్టి హృదయవేదన కలగడం డాక్టరుగారి కేమీ వింతనిపించలేదు. వేదా వతిని నెమ్మదిగా లేవనెత్తి వోదార్చి అసలు విషయాన్నంతా చెప్పివేశారు.

"మీరు నన్ను అన్యథా తలంపకుడు. తా నొకటి తలిస్తే దైవ మొకటి తలచినట్ల యింది. మీ కారోగ్యాన్ని కలిగించడానికే నేను మీతో యింతచనువుతీసికొనితిరగడం, కులాసాకబుర్లు చెబుతూ మీ కానందం కలి గిస్తూరావడం! ఏ అడవినో కందమూలాలు తింటూ కాలక్షేపంచేస్తూవచ్చిన శకుంతల వంటి కన్యకకు దుష్యంతుణ్ణి చూడగానే మనోవైకల్యం కలిగిందంటే, రాజభోగాల ననుభవించి,చీకూచింతాలేని యౌవనవతులు జితేంద్రియత్వంకొఱకు తంటాలుపడటం వట్టి వెట్టిభ్రాంతి. ఇది ప్రకృతివిరుద్ధంకూడా. కను కనే అనుభవవేత్తలగు పంతులవారు తమ విల్లునందు ఆవాక్యాలను పొందుపరిచింది. మీరు తప్పక తగినవరుని చూచుకొని వివాహమాడుటసర్వోత్కృష్టమైన పని. ఇది దైవసమ్మతమనే తలంపుడు. లేకున్న మీ ఆరోగ్యమునకుకూడ భంగమువాటిల్లి తుదకు మీరథఃపతితు లగుదురు. మరొకవిషాద వార్తనుకూడ చెబుతాను వినండి. ఈ ప్రపం చమున మీకన్న నా కాప్తులయినవారెవరూ లేరు. శ్రీపంతులవారి పోషకవర్గమున వారి మఱది లోక. బాలవితంతు వుండేది. ఆమెకూ వారికినీ వుండేసంబంధము వారి యితరసద్గుణ సంపత్తిచే బహిర్లోకమునకు ప్రకాశితము

కాలేదు. కొంతకాలమునకు, మెవ రేవిధిని నంచరించినను ప్రకృతి తనవిధిని తాను



ఇదే మీపాదములకు నమస్కరించుచున్నాడను.

నెరవేర్చుకొనుచునే పోవుచుండును గనుక, ఆమె గర్భవతియైనది. రెండవమార్గ మవలంబించక యే తీర్థయాత్రలనెపముననో ఆమెను క్రైస్తవమిషను వారి కప్పగించి ప్రసవించిన తోడనే శిశువును వారివద్ద భద్రపరిపించి, యింటికి పిలిపించివేశారు. ఆశిశువుకు వలయు యేర్పాట్లన్నీ గావించి అవసరపుపట్ల చాలుకు పదివేలవంతునకూడ ఆశిశువుకొఱకు ఖర్చుపెడుతూ రెండవమానవునికి తెలియకుండా మానేజిచేశారంటే మీ కాశ్చర్యం వెయ్యవచ్చు. అప్పు డాభార్య మరదలూ మరణించినమీదటే మిమ్మ వివాహమాడి యుండినది. ఇప్పు డాతండ్రిని నే నెట్లు ద్రోహము చేయుట కొడిగట్టగలను? మీరు నాకు తల్లిసమానులు. ఇదే మీపాదములకు నమస్కరించుచున్నాడను. నన్నాశీర్వదించుడు."

కొద్దికాలమునకే, మహాత్ముని ఆదర్శ ప్రకారము సిస్టరువేదావతి చాలుకు పదివేలొచ్చే తనయెస్టేటును, యాభైవేలకు మించు తనస్వంతభవనమును హరిజనోద్ధరణముకొఱకును, అనాథబాలబాలికల పోషణముకొఱకును భూరిదాన మొసగినదని, ఏ పత్రిక చూచినా అదేవార్త!

# భారతీయ మహిళామండలి

శ్రీ కల్యాణసుందరిగారు



ఈమె ఢిల్లీలోని లేడి హార్డింజి వైద్యకళాశాల హాస్టలుకు వార్డనుగా నియమింపబడెను. ఇదివఱకు మదరాసునందలి స్త్రీల క్రైస్తవకళాశాలలో నీమె ఉపన్యాసకురాలుగ నుండెను.

శ్రీ నాగామణిగారు



ఈమె మదరాసులో గౌరవ మేజస్ట్రేటుగా నియమింపబడినది.




## చెట్ల పెంపకమునకు నేలతో పనిలేదు

మనలో చాలకాలమునుండి వృక్షములకు భూరుహములు, మహీజములు అను పేర్లు వాడుకలోనున్నవి. వృక్షములకు భూమియే ఆధారము గాలిలో గింజలుచల్లిన యెన్నటికిని మొక్కలు మొలవవు. గింజలకును, మొక్కలకును ప్రధానమైన స్థానము, నీరు, ఆహార పదార్థములు మొదలగునవన్నియు భూమివలననే లభ్యములగుచున్నవి. వృక్షనిర్మాణమునకు భూమియే మొదటి పునాదిరాయి. దీనినిబట్టి మొక్కలకును, భూమికిని గల అత్యంత సన్నిహిత సంబంధము గోచరింపగలదు.

కాలము మారుచున్నది. మానవునికి విజ్ఞానాన్వేషణయందు తృష్ణ అధికమగుచున్నది. మానవుడు తన పరిశీలన బుద్ధిచే పంచభూతములను సైతము జయింప బూనుచున్నాడు. ఇట్టి మానవునకసాధ్యమేమి యున్నది? ప్రపంచము తలక్రిందులు చేయుయంత్రములను గనిపెట్టవచ్చును. ఎన్ని చేయదలచినను పొట్ట నింపుకొనిన తరువాతి మాటయే గదా! అట్టి జీవనాధారమగు ఆహారమంతటిని మానవుడు వృక్షముల నుండియే పొందుచున్నాడు. పన్ను వసూలుచేసెడి సర్కారు బంట్రోతువలె మానవుడు మొక్కలను సైతము నిర్బంధించి, అధిక ఫలము నొందు సమకట్టుచున్నాడు. శాస్త్ర దృష్టితో జూడ నీ ప్రయత్నములన్నియు మొక్కలలోని జీవ నిర్మాణ రహస్యములను దెలిసికొని దాని సహాయమున వాటి నెక్కుడు ఫలవంతములుగ జేయుటయే మానవుని ముఖ్యాభిప్రాయమై యున్నది. మానవుడు జీవింపవలయునన్న యిట్టి చర్య అత్యావశ్యకమై యున్నది.

ప్రకృతి తన నిజస్థితిని ఒకరులకు దెలియనీయదు. కాలము మారుచుండును. వాతావరణమును కాలానుగుణముగ మార్పు జెందుచుండును. కావున నీరు, శీతోష్ణస్థితి, గాలి, చెమ్మదనము, భూమిలోని యాహారపదార్థములు ఎట్టి సమయములలో మొక్కలపై నెట్టి పరివర్తనముల గల్గించుచున్నవో తెలిసికొనుట బహు కష్టము. అయినను వృక్ష జీవ మీ పరిస్థితులమీదనే యాధారపడియున్నది. ఈ మార్పులను గుర్తింప గలిగినపుడే వృక్షముల ఆరోగ్య జీవనమును తెలిసికొన గలుగుదుము.

దీనిని దెలిసికొనుటకే కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమున వృక్ష శాస్త్రజ్ఞులు కొన్ని పరిశోధనలను సల్పుచున్నారు. ప్రకృతి మొక్కలపై నెట్టి మార్పుల గలిగించుచున్నదో తెలియనపుడు, మొక్కలపై మనకు దెలిసిన వాతావరణ పరిస్థితులను కల్పించి, దానివలన గలిగెడి మార్పులను దెలిసికొనవచ్చును. ఈవిధముగనే కాని ప్రకృతిరహస్యము బయటబడదు

కాలిఫోర్నియా విశ్వవిద్యాలయములో యిందు నిమిత్తమై చేయబడుచున్న పరిశోధనలలో మొట్టమొదటిది మొక్కలను భూమిపై మొలిపించక పోవుటయే. ఇట్టి చర్య యెచ్చటను జూచియుండము. ఈ చర్య ప్రేక్షకుల కద్భుతము గల్గించినను పరిశోధకుల దృష్టియందు సామాన్యముగానే భావింపబడియున్నది.

గింజలను మొలిపింప వలయునన్న రెండు జల్లెడలవలె తీగలతో నల్లిన వలలను నీటిలో ముంచి పైకి తీయుదురు. ఆ రెండు వలల మధ్య నుండెడి చెమ్మప్రదేశమున గింజల నుంచుదురు. ఈ గింజలను ముందుగా నొకదినమంతయు పై చర్మము మెత్తబడువరకును నీటిలో నానవేయుదురు. ఈ వలల క్రిందుగు భాగమున నీటితో నింపిన ఒక తొట్టెని పెట్టెదరు. గింజలు మొలకలగువరకును యీ



౧. రాసాయనిక పుగాజు పాత్రలో నాలుగేండ్ల నుండి పెరుగుచున్న 'ప్రూ౯' చెట్టు పండ్లకు తెగులు తగులని పద్ధతిని ఉంచబడినది.

ప్రక్రియ యంతయు కారు-చీకటిలోనే జరుగును. వేర్లు బయలుదేరగానే, జల్లెడ సందులలోనుండి దారి క్రింది నీటితొట్టిలో ప్రవేశించును. చిగుళ్లు బయలుదేరగానే మొక్కలకు ఆహార పదార్థములను తయారు చేసికొనగల శక్తి యేర్పడును గావున విద్యుద్దీపముల కాంతిని వాటిపై ప్రసరింపజేయుదురు.

మొక్కలు రెండంగుళములు పొడుగు పెరుగగానే వాటిని వలమీదనుండి తీసివేసి బెండు బిరడాలకు రంధ్రములు పొడిచి ఆరంధ్రములలో యీ మొక్కల నుంచి మొక్కలు కదలకుండ నుండుటకును, యెదుగునపుడు ప్రతిరోధము కలుగకుండుటకును మొక్కకాడ చుట్టును

3. వారము దినముల వయసుగల సూర్యకాంతపు మొక్కలు. మొక్కల ఆహారమునకును రోగమునకును గల సంబంధము పరీక్షింప బడుచున్నది. ప్రాణవాయువు రబ్బరుగొట్టములనుండి, గాజుగొట్టములనుండ లోనికి ప్రవేశపెట్టుదురు.





౨. రసాయనశాస్త్రవేత్త రాసాయనిక మిశ్రణమును పరిశోధించుచున్నాడు. తగ్గినరసాయనద్రవ్యములను అప్పుడప్పుడు కావలసినంత చేర్చుచుండవచ్చును.

ప్రత్తి నుంచుదురు. అడుగున వేళ్లు, ఆహారపదార్థములు గల నీటిపళ్లెములలో మునుగునట్లు బిరడాలు అమర్పబడి యుండును. భూమి ప్రధాన కర్తవ్యము మొక్కలకు అవలంబనయే కావున, ఆ పనిని యిచట బెండు సమకూర్చుచున్నది. ఈవిధముగ భూమి ఆధారము లేకయే నీటిపై తామరవలె తేలుచున్న గోధుమపంట పటమున జూడనగును.



౪. పళ్లెము కంతలలోనుండి వేరులు నీటి తొట్టెలోనికి దిగగా ఫలించిన టొమాటో మొక్కలు. ఇవి ఎక. 350 టం. దామా షాను ఫలించును.

మొక్కలపై గావింపబడెడి కొన్ని పరిశోధనలును, వాటివలన గల్గెడి ప్రయోజనములును యీ క్రింద గాననగును.

కాలిఫోర్నియా పరిశోధనాలయములందు మొక్కలపై గాజుఆవరణలు గావింపబడియున్నవి. అచటి మొక్కలకు వెలుతురు లోపములేదు. ఎట్టి వేళలందైనను యెట్టి తీక్ష్ణతగల వెలుతురైనను క్షణకాలములో విద్యుద్దీపములవలన నొసగబడుచున్నది. కావలయునన్న వేయి సూర్యులకు సమానమగు కాంతిని, వేడిమిని గల్గింతురు. లేనిచో హిమాలయ ప్రాంతమునందువలె నీటిని గడ్డకట్టించునంతటి చల్లదనమునైన గల్పింపగలరు.

సామాన్యముగా మొక్కలలో ఆకుభాగమును వేళ్ల భాగమును ఒకేవిధముగ శీతోష్ణతను భరింపలేవు



౫. గాజు ఆవరణలో కావలసినంత కృత్రిమ-ఉష్ణమును, విద్యుద్దీపములద్వారా పొందుచు పెరుగుచున్న గోధుమ. మొక్కలు.



౬. పైతీరున పెంచుటకు నాటిన మొక్కలు.

భూమిలోని వేళ్లు కొంచెము చల్లదనమును కోరును. ఇట్టి యేర్పాటులు వైజ్ఞానికుల కొకపని కాదు. ఇట్లు వేళ్లను ఆకుభాగముకన్న చల్లగా నుంచుటచే వేళ్లలో చక్కెరపదార్థము నిలిచి మొక్కకు బలము గలుగునని పరిశోధనల వలన తెలియుచున్నది. కొన్ని మొక్కల చుట్టును గాజుఆవరణలు కల్పింపబడియున్నవి. అచట ఒక పంకా పనిచేయుటవల యెల్లపుడును గాలి నీటి యావిరితో కూడుకొనియుండును. గాలి ఉష్ణత హెచ్చించుటకు విద్యుద్దీపము లెపుడును సిద్ధముగా నుండును. గాలిపరిమాణమును నియమించుటే గాక గాలిలోని ప్రాణవాయువు, బొగ్గుపులుసుగాలి, నత్రజని, మొదలగు పాళ్లనుకూడ కావలసినట్లు మార్చవచ్చును. ఎరుపు, నీలము దీపములు ఏకకాలమున గాని, ప్రత్యేకముగా గాని సమయానుకూలముగ ఉపయోగింపబడును. నీలపుకాంతి ఉపయోగింపబడని మొక్కలు సన్నవై పెనవేసికొనిపోవును. ఎరుపుకాంతి యెరుగనివి పొట్టిగా నుండి శీఘ్రకాలములోనే నశించును వెలుతురులోని రంగేగాక తీక్ష్ణతలో గూడ మార్పులు గల్గించుటవలన కొన్ని మొక్కలు శీఘ్రకాలములో నెదుగుచున్నవి.

ఇట్లు భూసహాయము లేకయే ఒక చిన్న ఆవరణయందు మొలిపెంచి పండింపబడిన టొమాటో కాయల పంటనుండి ఒక యెకరమునకు ౩౬౭౫ టన్నుల టొమాటోలదామాషాన పండింపవచ్చునని అంచనావేయబడినది. లాస్ ఆంజలీస్, సాంటాక్రజ్ మొదలగు ప్రదేశములలో వ్యవసాయదారు లీపద్ధతిని పెద్ద యెత్తుపై కృషి చేయుటకు ప్రయత్నించుచున్నారు. పువ్వులకై పెంచెడి ఈనాటి గ్రీన్ హౌసులలో మొక్కలపైనను యిట్టి పద్ధతిని ప్రవేశపెట్టుచున్నారు.

ఈవిధముగ గెహ్రిక్ గారు పరిశోధనాలయములలో బంగాళాదుంపలు, ముల్లంగి దుంపలను పండించి, అద్భుతములగు ఫలితములను గనపరిచియున్నారు. రెండు మూడేళ్లనుండి మొక్కలుకూడ బిరడాలలోనే అమర్చబడి భూమి నెరుగక వెడల్పుపళ్లెరములనుండి ఆహారపదార్థములను ద్రవరూపముగా ననుభవించుచున్నవి.

౧౫ అడుగుల వెడల్పు, ౧౦ అడుగులు పొడుగగు ప్రదేశమున ఒక నీటికుండీ నిర్మింపబడినది. దానిపై గెహ్రిక్ గారు తీగవలను వేసి దానిపై రంపపుపొట్టు, చిత్రికనుల్ల వీటిని రెంటిని కలిపి పరిచెను. దానిమీద టొమాటో మొక్కలను ఉంచెను. వాటి వేళ్లు వలలోనుండి క్రిందికిదిగి నీటినుండి ఆహారమును గ్రహించినవి ఈ మొక్కలు రెండునెలలు ముందుగా ఫలించినవి. బాగుగ రెండడుగుల యెత్తు ఎదిగినవి.

నీటిలో మొక్కలకు గావలసిన పొటాసియమ్ నైట్రేట్, కాల్షియమ్ నైట్రేట్, మెగ్నీషియమ్ ఫాస్ఫేట్; కాల్షియమ్ ఫాస్ఫేట్, ఫెర్రిక్ టార్ట్రేట్ మున్నగునవి లెక్క ప్రకారము చేర్చబడును. సామాన్యముగా నొక్కొక మొక్కయు తనకు గావలసిన లవణములన్నిటిని కావలసినంతవరకు భూమినుండి సంగ్రహింపలేవు. కొన్ని స్థలములందు ఆ లవణము లొకప్పుడు అలభ్యములుగా కూడ నుండును. ఇట్టి లోపములన్నియు నీటిలో మొక్కలను పెంచుటవలన నివారింపబడుచున్నవి. అట్లు నీటిలో లవణములు చేర్చు పరిశోధనయందు కొన్ని లవణములను చేర్పకపోవుటచే గలిగెడు మార్పులను గుర్తించి మొక్కలకే యేలవణములు ప్రధానములో కూడ తెలిసికొనవచ్చును. నైట్రేట్ లవణముల రుచి యెరుగని మొక్క వేళ్లు పొడుగుగా సాగి నత్రజనికై వెదుకుచుండును. మెగ్నీషియము లేని మొలకలు చిగుళ్లుపెట్టిన మరుక్షణముననే నశించినవి. ఇనుప లవణములు లేకున్న మొక్క పసుపురంగుగా మారి త్వరలో నశించును.

టొమాటో, సూర్యకాంతము మొదలగు మొక్కలపై పైతెగుళ్ల విషయమున పరిశోధనలు గావింపబడుచున్నవి. వాటిలో రోగములు యెట్లు మొక్కలకు వచ్చుచున్నవో పరీక్షించుటకై కొన్ని మొక్కలకు రోగములు సంక్రమింప జేయుచున్నారు. పిదప ఆహారములో మార్పులు గల్పించి ఆ రోగమును నివారింపగల్గిరి. దీనివలన మొక్కలను ఆరోగ్యవంతములుగ జేయుపద్ధతులు గూడ తెలిసికొనుచున్నారు.

కొందరు శాస్త్రజ్ఞులు భూసారముపై పరిశోధ, నలను, కొందరు వృక్షములోని అంతర్భాగముల పైనను; మరికొందరు వృక్షములపై క్రొత్త లోహముల గుణములను మొదలగువాటిని దెలిసికొనుటలో కార్యదీక్ష బూను చున్నారు. ఇట్టి వీరి అందరి ప్రయత్నములను కూడిన నాడే పశుపక్షి మృగాదుల కన్నిటికిని జీవనాధారమైన ఆహారమును మానవుడు వృక్ష సామ్రాజ్యము నుండి అవిచ్ఛిన్నముగ పొందగలడు. (పాపులర్ సైన్సు)

---

## గాజుపాత్రల గారడీ

గారడివాండ్రు వస్తువులను మాయము చేయుట చూచి యాశ్చర్యపడనివా రుండరు. వారు మంత్రముచే మాయముచేతురని చాలమంది అనుకొనెదురు కాని, వారివిద్యను చక్కగా పరిశీలించినయెడల అందు ఎట్టిమంత్రశక్తియు లేదనియు, యుక్తిగా కొన్ని కిటుకులతోనే వా రాపనులను చేయగలరనియు విశదమగును.

గాజుపదార్థముగుండా వస్తువులను చూచుటకు వీలగునుగాన గాజుపాత్రలోనుంచు వస్తువులను మాయము చేయుటకు శక్యముగాదనియు, ఇం దట్టితంత్రమును ప్రయోగించుటకు సాధ్యము గాదనియు అనుకొనవచ్చును. కాని ఇదికూడ సాధ్యమేయగును. ఇందుకు కొన్ని నిదర్శనములను పరిశీలింతము.

ఒక గాజుపాత్రను తీసికొని దానిలో సరిగా మధ్యను ఒక యద్దమును ఇమిడ్చి పెట్టుదము ఈ అద్దము రెండువైపులను ప్రతిఫలింపజేయునదిగ ఉండవలయును. అద్దమును సరిగా పాత్రమధ్య నుంచినయెడల పాత్ర యందు రెండు సమభాగములు ఏర్పడును. కాని అద్దము ప్రతిఫలనమువలన దూరమునుండి చూచువారికి ఏవైపు నుండి చూచినను పాత్రలో ఏమియు లేనట్లును, పాత్ర యంతయు ఉత్తదిగ నున్నట్లును గన్పడును. ఇట్టి పాత్రను బల్లపై నుంచి ప్రేక్షకుల కెదురుగ నుండుభాగమున నొక చేతిగుడ్డను పడవేయుదము. ఇప్పు డాచేతిగుడ్డను మాయముచేయుదుమని చెప్పి, పాత్రపై నొక గుడ్డను కప్పి, ప్రేక్షకుల కెరుక లేకుండగనే పాత్రను కొంచెము త్రిప్పివైచినచో చేతిగుడ్డ యున్నభాగము వెనుకకు మరలి ప్రేక్షకుల కెదురుగ రెండవభాగ ముండును. ఇప్పుడు పైనున్నగుడ్డను దీసి చూపినచో చేతిగుడ్డ అద్దమున కావలివైపున నుండుటచేత ప్రేక్షకులకు నిజముగ పాత్రలో సగముభాగముమాత్రమే కాన్పించుచున్నను శూన్యమైనదిగా నగుపడును. అద్దము ప్రతిఫలనమువలన పాత్రయంతయు పూర్తిగ కాన్పించుచున్నట్లు కనబడి చేతిగుడ్డ నిజముగ మాయమైనదనియు, గాజుపాత్రయం దేమియు లేదనియు దోచును.

ఇట్టిగాజుపాత్ర సహాయముచే ఒక వస్తువును ఇంకొకవస్తువుగాగూడ మార్చవచ్చును. పాత్రవెనుకభాగమున ముందే యొకజెండాగుడ్డనో, మరి ఇంకే వస్తువునో వేసియుంచినను ప్రేక్షకులకు పాత్రలో ఏమియు లేనట్లే తోచును. కాన వారికి ఎదుటనే ఒకచేతిగుడ్డనో, మరి ఇంకే వస్తువునో ముందుభాగమున వైచి పూర్వము వలెనే నేర్పుతో పాత్రను త్రిప్పి రెండవభాగమును కనుపరచవచ్చును. చేతిగుడ్డయే నిజముగ ఈక్రొత్త పదార్థముగ మారినదని ప్రేక్షకులు భ్రమింతురు.

ఇట్టిపాత్ర నుపయోగించునపుడు చాల మెలకువ గలిగియుండవలయును. దీనివద్ద నేలాటివస్తువునుంచినను, అద్దమునందు దానిప్రతిబింబము కాన్పించి ప్రేక్షకులకు పాత్రయందున్న మోసమంతయు విశదమగును. అందువలన ఈ గాజుపాత్రవద్దకు ఎట్టివస్తువును తీసికొని పోగూడదు.

ఇట్టిగాజుపాత్రను తయారుచేయుటగూడ అంత కష్టమైనపని గాదు. రెండువైపులను ప్రతిఫలించు అద్దము దొరకకపోయినయెడల ఒక సాధారణమైన యట్ట ముక్కతో ఇట్టి విచిత్రములను జేసిచూపవచ్చును. కాని అట్టిపాత్ర నుపయోగించునపుడు పాత్రకు వెనుకగూడనొక యట్ట నుంచవలయును. ఈ అట్టయును పాత్రమధ్యనున్న అట్టముక్కయు ఒకటేరంగు (చి. ౧) కలవైనయెడల ప్రేక్షకులకు అంతయు నొక్కటే యట్టగ గన్పడును. కాన పాత్రయం దొకఅట్టముక్క యున్నదని తోపక

పాత్రకు వెనుకనున్న అట్టయే పాత్రగుండా ఆకీతిగ కన పడుచున్నదని ప్రేక్షకులు భ్రమింతురు. ఇట్టిపాత్ర నుప యోగించునపుడు వేళ్ళను పాత్రకును అట్టకును మధ్య పోనిచ్చినయెడల తంత్రము బయటబడును.



చిత్రము ౧

ఇందున్న విశేషమంతయు పాత్రలో మధ్య సరిగా ఇముడ్పుటకు వీలగు అట్టముక్కను కోసి తయారు చేయుటయే. (చి. ౨) తడిఇసుకతో పాత్రనునింపి బోర్లించి యుంచినయెడల ఇసుకపాత్ర యాకారము గల ముద్దగ నేర్పడును. (చి. ౩) దీనిని సరిగా మధ్యన నొకకత్తితో కోసివైచి ఆభాగముకద్ద





చిత్రము ౨, ౩

నొక అట్టముక్క నుంచి అట్టమీద ఆభాగము చుట్టును సరిగా ఒకగీతను గీచుకొనవలెను. ఈ విస్తీర్ణ మునకు సరిగ అట్టముక్కను కత్తిరించినయెడల అది ఆ గాజుపాత్రకు సరిగా మధ్యను ఇముడగలదు. ఇట్టిపనుల కుపయోగించు గాజుపాత్రకు ప్రక్కపటమునందున్నట్లు ఒక పీఠముండవలయును. లేనిచో మధ్యనున్న భాగము ప్రేక్షకుల కగుపడుటకు అవకాశముండును.

ఇంతకన్న సులభముగ వస్తువులను మాయము చేయవచ్చును. కాని ఇందుకు మన ముపయోగించు గాజు పాత్రవంటి యాకారముగల మరియొక గాజుపాత్రయో, లేక గాజువలె ప్రకాశభేద్యమగు సెలిఫోన్ పాత్రయో ఉండవలయును. ఈపాత్రను మనపాత్రలో వైచిన యెడల సరిగా ఇమిడి ప్రేక్షకులకు ఒకటే పాత్రగ నున్నట్లుగన్పించును. (చి. ౪) ప్రేక్షకులఎదుట ఆపాత్రలో



చిత్రము ౪

ఒక చేరెడుబియ్యమును వేసి దాని నొక కాగితపు గొట్టముతో మరుగుపరచవలయును. ఈ స్థితిలోగూడ కొందరిని దగ్గరికి వచ్చి చూచిపొమ్మనవచ్చును. ఆ గొట్టమును తీసివేయునపుడు లోనున్న రెండవపాత్రనుగూడ తీసివేసి (చి. ౫) ప్రక్క నెచ్చటైనను దాచియుంచవలెను. బియ్యమునకు బదులు నూనెనో, నీళ్లనో, మరి ఇంకేద్రవపదార్థమునో కూడ వేసి ఈవిధముగనే మాయముచేయవచ్చును.

పైజెప్పిన పరిశోధనయందలి సెలిఫోన్ పాత్రను తయారుచేయుటగూడ సులభము. గాజుపాత్ర ఎంత ఎత్తుగలదో కొలచిచూచి దీనిరెండింతల వ్యాసముగల వలయమును ఒకకాగితముపై వ్రాసి కత్తిరించి ఒక గుండ్రని కాగితపుముక్కను తయారుచేయుదము. (చి. ౬) వలయమధ్యనుండి అంచునకు రెండునిలువుగీతలుగీచి మధ్య భాగమును కత్తిరించివైతము. ఇప్పుడు రెండు అంచులను చేర్చిపెట్టినయెడల మనపాత్ర యాకారమును దాల్చును. దీనిని పాత్రలోవేసి సరిగానున్నదాయని చూచి, అవశ్యకముండినయెడల ఇంకను కొంతభాగమును

త్తిరించివేసి సరిగా పాత్రలో ఇముడుటకు వీలగునట్లు చూడవలయును. దీని ననుసరించి ఒక సెలిఫోన్ ముక్కను



చిత్రము ౫

కత్తిరించి, అంచులను జిగురుతో నంటించి ఒక సెలిఫోన్ పాత్రను తయారుచేయవచ్చును.



చిత్రము ౬

అడుగు లేని గాజుపాత్ర (చి. ౭) సహాయముతో గూడ వస్తువులను మాయముచేయవచ్చును. ఒక —జు



చిత్రము ౭

పాత్ర యడుగుభాగమును తొలిచివేసి అక్కడ సరిగా ఒక గాజుమూతను జిగురుతో నతికించి పెట్టినయెడల చూచుటకు అది సరియైన పాత్రవలెనే కాన్పించును. (చి. ౮) జిగురు



చిత్రము ౮, ౯

సరిగా నతుకుకొనినయెడల పాత్రలో నీరుకూడపోసి పాత్ర సరిగానున్నదని ప్రేక్షకులకు ఋజువుచేయవచ్చును. పిమ్మట పాత్రలోనున్న తేమను తుడుచుచు పాత్రయడుగున నున్న మూతనుగూడ గుడ్డలో దాచివేసి, అడుగునుండి బంతులనో, లేక ఇతరవస్తువులనో చూపించియు మరల వెనుకకు తీసివైచికొనియు ప్రేక్షకులకు విస్మయము కలిగింపవచ్చును. కాని బంతులనుగాని, ఇతర వస్తువులనుగాని పాత్రలో (చి. ౯) చూపించినపుడు ఆ వస్తువులు క్రిందనుండి జారిపోకుండునట్లు అడుగున ఒక వ్రేళ్లతో జాగ్రత్తగ నదిమిపట్టుకొనవలయును.



చిత్రము ౧౦

ఒక చిన్న కట్టెను బట్టతో కప్పి ఒక గాజు పాత్రలో వేసి అదిమాయమగునట్లు చేయవచ్చును. (చి. ౧౦) మొదటనే కట్టెను ఒక పొడుగాటి గాజుగొట్టములో మార్చియుంచి దీనిపై బట్టను కప్పునపుడు గొట్టమునుండి



చిత్రము ౧౧

కట్టెను జారవిడిచి గాజుగొట్టమునుమాత్రము గాజు పాత్రలో బడవేయవలయును (చి. ౧౧) పాత్రపైని బట్టను తీసినైచినపుడు లోనున్న గాజు కనబడక మనముచేసిన యుక్తి బోధపడక కట్టె నిజముగ మాయమైనదని తోచును. కాని కట్టెను జారవిడుచునపుడు కడుజాగ్రత్తగనుండి దానిని ప్రేక్షకులకు తెలియకుండ క్రిందనుండు సంచిలోనో, పెట్టెలోనో, లేక మరి ఇంకెచ్చటనో దాచివేయవలెను. లేకున్న మనగుట్టు బయటపడును.

ఈ విధముగ ఒక్క గాజుతోనే ఇంకను ఎన్నో విచిత్రములను జూపవచ్చును. మనలోకూడ చాలమంది ఇట్టివానిని జూచి భ్రమించి గారడీవిద్య ఏదో కలదనియు, ఇందునకు భూతప్రేతపిశాచాది సహాయము కావలయుననియు తలచుచున్నారు. కాని జాగ్రత్తగ పరిశీలించినచో మనకు ఆశ్చర్యకరముగతోచిన యంశములెన్నియో కేవలము చమత్కారములైన తంత్రములే గాని యింకేమియు కాదని బోధపడును.

---



సాబు మీదికెక్కుటకు సాయపడుచున్న ఐరావతము




## నన్న పంచాంగ ౧౯౩౭ (కన్నడము)

బేసల్ క్రైస్తవ గ్రంథాలయము (British Mission Book Depot) మంగుళూరు, దక్షిణ కనరా. వెల అణాలు ౨.

ఈ కన్నడ పంచాంగము సాధారణముగ పంచాంగములన్నియు ఉండువిధమున లేదు. ఇది క్రైస్తవులచే రచింపబడినందున క్రైస్తవులకును, అందును ముఖ్యముగా పల్లెటూరి వారికిని చాలా ఉపయోగకరముగ నుండును. ఇందు ఇంగ్లీషు, మహమ్మదీయ తారీఖులును, చాంద్రమాన, సౌరమాన తిథులును, నక్షత్రములును, ఇంగ్లీషు నెలల క్రమమున పేర్కొనబడిన ౧. ముఖ్యములైన పండుగలను, హైందవ వ్రతములను గూడ ఇందు పేర్కొనియున్నందున, సాధారణ పంచాంగములను చదివి యర్థము చేసికొనలేని నేటి హిందూయువకులకు గూడ ఈ పంచాంగము కొంతవరకు ఉపయోగకరముగ నుండునేమో. ఈ ముఖ్య విషయములకు తోడు తపాలా ఛార్జీలు, స్టాంపు ఛార్జీలు, దక్షిణ కనరాజిల్లా మోటారుబస్సుల కాలనిర్ణాయక పట్టీలు మొదలగు వివిధ విషయములు గూడ ఇందు గలవు. కాని వీటియన్నిటికన్నను ముఖ్యమైనవి ఇందున్న విజ్ఞానవిషయములు. ఇంత చిన్న పుస్తకమునందు సుమారు ౭౫ పేజీల కధికముగ విజ్ఞానవిషయములను పామరులకు గూడ బోధపడునట్లు సులభశైలితో చర్చించియుండుట ఒక విశేషమే. అశ్విన్యాది నక్షత్రములు, గ్రహములు, పంచాంగ లక్షణములు, హిందూదేశపు జనసంఖ్య, హిందూదేశమునందలి మతములు, వృత్తులు, మలేరియా, ఏనుగుకాలు మొదలగు వ్యాధులు, వానిని తప్పించుకొను మార్గములు, మోటారుకారు, సైకిల్ నడుపువారు అనుసరించవలసిన నిబంధనలు మొదలగు విషయము లెన్నియో ఇందు సువిశదముగ తెల్పబడినవి. స్వల్ప మూల్యమునకు ఇన్ని అమూల్యవిషయములను తెలియజేయు ఈ చిన్న పుస్తకము తప్పక ప్రతి ఇంటను ఉండవలసినదే.

పు. శ్రీ.

---

## సీతాపహరణము

ఐదంకముల నాటకము. డబుల్ క్రౌను సైజు. ౧౧౦ పుటలు. గ్రంథకర్త డాక్టరు కోకా వేంకట సుబ్బారావు; ఎల్. యమ్. పి. ప్రకాశకులు మారుతీ గ్రంథమండలి, ఉరవకొండ, అనంతపురంజిల్లా.

ఇందలి కథ రావణప్రేరితుఁడై విరాధుఁడు శ్రీరాముని జంప దండకారణ్యమును ప్రవేశించుటతోఁ బ్రారంభమై, రావణుఁడు సీత నెత్తుకొనిపోవుటతో ముగిసినది.

"సులభశైలిని నాటకంబులను వ్రాయు కుతుకమున దీని వ్రాసితి"నని గ్రంథకర్త గ్రంథాదినున్న విన్నపమున నుడివినరీతి నిందు శైలి తేలికయే. కాని గ్రంథకర్త యక్కడక్కడ మూడునాలుగు పుటలు పట్టెడు విషయము నొకే పాత్రచే మాట్లాడించుచువచ్చెను. సంభాషణము క్లుప్తముగా నుండి వీలగునంతవరకు రంగస్థలమున నున్న పాత్రలన్నియు దానియందు పాల్గొనిన ప్రేక్షకులకు సంతోషోత్సాహములు హెచ్చును. కాని యొకేపాత్రచే చాలకాలము మాట్లాడించిన ప్రేక్షకుల కుత్సాహభంగము కలుగును.

"కథాభాగము చిన్నదయినను పెక్కునీతులు గలయది. శృంగారమే ప్రధానముగా గలయట్లు తోచినను, వీలయినంతవరకు నీరసమును తగ్గించి దుర్జాతయగు శూర్పణఖనోటనే పెక్కునీతులను బలికించినాడను." అని గ్రంథకర్త విన్నపమున దెలిపెను. ఇందు నీతులు కొన్ని కలవుకాని యవి సందర్భానుసారముగ పొందింపబడలేదు. ఏదో విధముగ నా నీతులను తెలియజేయ

వలెననెడి యుద్దేశముతో వానిని తెల్పినట్లున్నది. ఈనీతులు సందర్భానుసారముగ లేకపోవుటచే, విపరీతార్థమునుకూడ స్ఫురింపజేయుచున్నవేమో !

"శృంగారమే ప్రధానముగా గలయట్లు తోచినను వీలయినంతవరకు నీరసమును తగ్గించితి"నని గ్రంథకర్త విన్నపమున వ్రాసెను. ఇందు శృంగార మెక్కడ ప్రధానముగానున్నదో, అది యెచ్చట తగ్గింపబడినదో తెలియదు. శూర్పణఖ రాముని మోహించి యాతనితో ముచ్చటలాడి తన్ను వివాహమాడుమని కోరుట శృంగారమేమో! అది యాభాసశృంగారము కాని శృంగారము కాజాలదు. పోనీ శృంగార వీరములలో నేదైనను నంగిరసముగా నాటకమున నుండవలెనని వీరమును ప్రధానముగా జేసికొని సీతాపహరణోత్సాహ మను స్థాయిభావమును రావణునియందారోపించెదమనిన రావణుడు ధీర నాయకుడుకాడు. పైగ నతనియుత్సాహము పాపకార్యమునందు చౌర్యరూపముగ పరిణమించినది. శృంగారము నంగిరసముగ తీసికొనుటకు, స్థాయిభావమయిన రతి నాటకమునందు రెండుతావుల మాత్రము, అనగా ద్వితీయాంకము మొదటను, పంచమాంకము మొదటను నాయికా నాయకులయిన సీతారాముల సంభాషణమున సూచింపబడినది; కాని యది నాటకమునందంతట వెదజల్లబడి తక్కిన స్థాయిభావముల ననచి రసోత్పాదనమును కల్గింప సమర్థము కాకున్నది.

నాటకముయొక్క ప్రయోజనము రసానిష్కరణ మూలమున సభికుల నానందపారవశ్యులను జేయుటయే కాని యందుకు డాక్టరుగారు గ్రహించిన కథావస్తు వెంతయు తగియుండలేదు.

ఇందు పద్యములయందచ్చటచ్చట మధ్యమోత్తమపురుషక్రియలకు ప్రథమపురుషక్రియలు ప్రయోగింపబడినవి.

కాని గ్రంథకర్త యెప్పుడును తీఱికలేని వైద్యవృత్తి నవలంబించియున్నను తీఱికయైన కించిత్కాలమును మాతృభాషాభిమానమున భాషాసేవకయి యుపయోగింప బ్రయత్నించుట ప్రశంసనీయము. - న. సు.

---

## ఉద్యానకృషి

గ్రంథకర్త:— పెయ్యేటి వెంకటేశ్వరరావు, హార్టికల్చరల్ ఇన్‌స్ట్రక్టరు, మిషన్ హైస్కూలు, భీమవరము వెల రు. ౦-౧౨-౦.

వ్యవసాయమునం దందరికిని అభిలాష లేకపోవచ్చునుగాని ఉద్యానకృషి అందరికిని కావలసినదే. వ్యవసాయము, వృక్షశాస్త్రము మున్నగువాటిపై నాంగ్లేయగ్రంథములు పెక్కులు గలవుగాని ఆంధ్రభాషయందు కొలది గ్రంథములైనను గానరాకున్నవి. ఇక ఉద్యానకృషిపై ప్రత్యేక గ్రంథములమాట జెప్పనేల? లక్ష్మీపుత్రులు, ధనహీనులు, వీరువారననేల, అందరికిని యీ కృషియందుత్సాహము కలదు. జానెడు స్థలము లభించిన యేపూలమొక్కలో, ఫలవృక్షములో మొలిపింతురు. ఇట్టితఱి మిక్కిలి ఉత్సాహముతో తోటల బెంచువారికి సైతము వృక్షముల సంరక్షణ విధానము తెలియకున్నది. చక్కటి యావరణములో నతిరమణీయముగ యెదుగవలసినవాటిని జ్ఞానశూన్యులకు తోటమాలీల హస్తములందిడుచున్నారు. వారికి మొక్కలకు నీరుపోయుటతప్ప అన్యమేమియు దెలియదు. మొక్కలకు గూడ భూగర్భము, వాతావరణము మున్నగువాటియందు గల్గెడిమార్పులచే, మనుజులకువలెనే వ్యాధులేర్పడును. క్రిమికీటకాదులచేతను, బదనిక, బూజుతెగుళ్లు మొదలగువాటివలనను కష్టములు సంభవించుచుండును. వాటిని వెనువెంటనే కనిపెట్టి తగు ప్రతిక్రియ గావింపకున్నచో వాటిమూలమున కొన్నిసందర్భములందు ద్యానమంతయు నశించుటకూడ సంభవించును.

ఇట్టి సందర్భమున పెయ్యేటి వెంకటేశ్వరరావుగారెల్లరకును విశదమగునట్లు బహుసులభశైలిని 'ఉద్యానకృషి'యను గ్రంథమును వ్రాసియున్నారు. దీనిని పఠించినచో భూమిని సరిచేయుట; దానిలోని దోషములను గుర్తెరిగి వాటిని నివారించుట; మొక్కలను పెంచుట; అంట్లుకట్టుట, మొక్కల కుపయుక్తములగు యెరువులు, పురుగులు, చీడ, బూజు తెగుళ్లుమొదలగువాటిని నివారించు పద్ధతులు, కొన్ని ఉపయోగకరములైన తోటపనిముట్లు మున్నగు విషయములన్నియు సుగ్రహముగా

తెలియఁగలవు. ఈగ్రంథము విద్యాశాఖవారి 'సిలబస్' ననుసరించి వ్రాయబడినది గావున పాఠశాలలలోని బాలు రకుగూడ నుపకరించును. కావున ఉపాధ్యాయ కృషియం దభిమానము కలవారలెల్లరును విద్యాలయమువారును యిట్టి గ్రంథముల నాదరింపకున్న తెనుఁగుభాషలో యిట్టి గ్రంథములు వెలువడ నేరవు. K. S. B.

---

## గీతా భూమిక

అనువాదకుఁడు: గొట్టిపాటి వెంకటసుబ్బయ్య, ఘంటశాల, కృష్ణాజిల్లా. వెల ౦-౮-౦

"శ్రీ అరవిందులు జగద్విఖ్యాతులు. వీరి ప్రతిభ సర్వతోముఖమైనది. వారు భగవద్గీతపైఁగల ప్రాచీనుల సంకుచిత భావములను, ఆధునికుల సంశయ భావములను సహేతుకముగను, సప్రమాణముగను ఖండించుచు, గీతా హృదయము విస్పష్టము చేయదలచి యీ "గీతాభూమి క"ను ప్రప్రథమమున "శర్మ"యను వంగభాషాపత్రిక యందు ప్రకటించిరి." దాని కిది యనువాదము. ఇందు మూఁడు 'కల్పము'లున్నవి.

ప్రథమకల్పము: గీతాస్వరూపము, వక్త, పాత్ర సమయము, సాధనము, మొదలగువానిని విపులముగ విమర్శించు ప్రస్తావనాప్రాయమైనది.

ద్వితీయకల్పము: గీత ప్రథమాధ్యాయమునకు వివరణము, విమర్శ, సంజయుని దివ్యదృష్టి 'బూటకము' కాదు. 'వైజ్ఞానికసత్యము'. అర్జునుడు విషాద పడుటకు 'వైష్ణవమాయ హేతువు'. అది కృపామూలకము. కృప కాతరత, దయకాదు. శ్రీకృష్ణుని రాజకీయోద్దేశము. 'ధర్మరాజ్యసంస్థాపన' మొదలగువాని విశదవిమర్శకలదు.

తృతీయకల్పము: గీత ద్వితీయాధ్యాయ వివరణము, విమర్శ. 'మృత్యువు అసత్యము' 'సమత్వమే' గీతాజ్ఞానముపొందుట కాధారము. 'సమత్వ' 'శుద్ధభోగ' వాదములే పాశ్చాత్యుల 'Puritanism and Parganism'గా మారినవి. మొదలగు సంగతు లుపాత్తములు.

పై విషయములెల్ల విపులముగఁ బరామర్శింపఁ బడినవి. ఇందుతో 'గీతలను జదువు విధము' అను వ్యాసముగూడ, వారిదే, యనుబంధితము. అనువాదము గ్రాంథికభాష, సులువుగనున్నది. ఇందు వ్యాకరణ నియమము లంతగఁ బాటింపలేదు.

'దైత్యదానవ - పోరాటము' 'సార్వభౌమము' 'విరాటపురుషుడు' 'అధికృతి' మొదలగునవి చింత్యములు. ౨ అధ్యాయపు ౪ శ్లోకానువాదమున 'ఎటుల' రెండు మార్లు నావశ్యకము. 'ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప' ఇట 'పరంతప'యనునది ధృతరాష్ట్రసంబుద్ధి, అర్జునునకు విశేషణముకాదు.

బహుళప్రచారమై పరమప్రమాణముగనున్న గీతను గూర్చిన 'భూమిక' యనువాదార్హమనుట నిశ్చయము. ఇందున గీత కొక గొప్ప వికాసముగల్గి పాఠకుల 'గీతా' పఠనసుముఖులఁ జేయును. 'విశ్వం'

---

## లలితకథావళి

కర్త: రాయసం వెంకటశివుఁడు, యం. ఏ., యల్. టి., గుంటూరు. వెల ౮ అణాలు.

ఇందలికథలు భారతి మొదలగు పత్రికలలోఁ బ్రకటించియుండినవి. ఇందు ౧౧ కథ లున్నవి.

'డయమణిరాణి' ఆత్మాభిమానము మాననీయము. 'పిచ్చుకపిల్ల' ప్రేమ విమలము. 'రామస్వామి' గారి రంగని మంగలిబుద్ధి సహజము. 'భరతశాస్త్రి' పవిత్రహృదయుఁడు. 'జానకీబాయి' యతివలకాదర్శప్రాయ. 'నాగరత్నము' తలిదండ్రుల క్రమపరిణామము చక్కనిది. 'మీనాక్షి'హృదయ మూహాతీతము. 'రమణప్పరావి' 'వకుళ' 'మయూరశర్మ' కథలలోఁ జెప్పఁదగినంత యాదర్శము లేకున్నను ముచ్చట గూర్చుచున్నవి.

ఇందలి రచన ధారాళము. గ్రాంథికమైనను వ్యావహారికమా యనిపించును. పాత్రచిత్రణము బహు జాగ్రతతో చేయఁబడినది. ఇట్టివి విద్యార్థులకుఁ జదువ మనోహరముగనుండి, ప్రపంచజ్ఞానదోహదములగు నను టకు సందియములేదు. 'విశ్వం'

---

## గోవర్ధనాచార్య సప్తశతీసారము

(Scholars' edition) కర్త: సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి. దొరకుతావు: 'వెంకట్రామ్ అండ్ కో; 3993 మార్కెట్టువీథి, సికింద్రాబాద్ (దక్కన్).

గోవర్ధనాచార్యుల 'ఆర్యాసప్తశతి' కడు రసవంతములగు ముక్తకములకూర్పు. అకారాదిక్రమమున 'వ్రజ్య' లను విభాగములలోనున్నది. 'గాథాసప్తశతి' లోని పవిత్రప్రేమగాక కామమున కిందు నెడమున్నది.

ఆ గ్రంథమున కియ్యది తెలుఁగుసేత. లలితములగు పట్టులిం దనేకము లున్నవి. ఆ పద్యములలోని 'సుత్తమోత్తమ'ముల నిం దేరికూర్చినారు.

శయ్యాసౌభాగ్యముఁ దిలకింపుఁడు:

'వలపు గెలువదునీకుఁ జాపలము మెండు-కైతవము హెచ్చు, మాన మున్కొ_టము, కలవు-వికృతసేవభావలును; మాసకియుచేత-బడిలి విఁకసైనఁ దిన్నఁగా నడచుకొమ్మ!—ప. ౧౬.

'ధరణి ఢంకా బజాయించి తిరుగఁగలరు-మగున, మగవాండ్రు మదపుటేనుఁగులువోలెఁ - దెలివ లాడేన్గులట్లు మదింతురేని, నాత్మవంశక్షయముఁ జేయఁగలారు. —ప. ౧౮౩ మూలముతోఁ బరిశీలింపఁగొన్ని సరిపడనివి గలవు. వానిలో మచ్చున కుదాహరింతు.'

'పరుల ప్రాణంబుఁదీయుట పాడిగాదు - పామువలె సుందరీ? దవ్వుపరుగులిడుము, నిన్ను నాడింపనచటఁ గూర్చున్నవాఁడు-పట్టుచును నాగసర మొక్క పాము లాడు.—ప. ౧౦౯.

ఇందుకు మూలముఁ జిత్తగింపుఁడు.

'కిం పరజీవైర్దీవ్యసి
విస్మయమధురాక్షి! సఖిదూరం
అహి మధిచత్వర మురగి
గ్రాహఖేలయతు నిర్విఘ్నః.'

పాములవాఁడు బజారునఁ బాము లాడించుచున్నాఁడు. ఆటకొక చెలువ చేరవచ్చినది. అబ్బురపాటుతోఁ గను లింతఁ జేసుకొని కనుఁగొనుచున్నది. ఆమె సౌందర్యము నాక్షిప్తనేత్రులై చూపఱులెల్ల యామెనే చూడ మొదలిడిరి. పాముటాటయే చూడకున్న వానికి బత్తె మెవ్వ రిత్తురు. అపు డొకా మె యనుచున్నది.

'చెలీ, విస్మయమధురాక్షివై చూచుచు నోకరినోటికూ డేల పడఁగొట్టెదవు? దూరముగపో. వాఁడు బజారులో నిర్విఘ్నముగ తనపాము నాడింపనీ.'

ఈభావ మనువాదమున నేమైనది, నే చెప్ప నవసరము లేదు. ఇట్టి వింకను గలవు. విస్తరభయమున విడిచితిని.

మూలముననున్న మఱుసుల ననువాదమున స్పష్టపఱచిన స్వారస్యముండును.

'గ్రుచ్చుకొని నొప్పినేయు నీకుటిలఫణితి
త్వదపరాధంబుకన్న నెంతయును నన్ను
నూడిపోటుల నొదవించు వేదనంబు
కత్తివ్రేటునఁ గలుగదుగాదె! ప్రియుఁడ!'

ఇందు 'శస్త్రవైద్యము' (Operation) చేసినప్పటికంటె దానిని గుట్టునప్పు డెక్కువ బాధయనుట సూచితము గావలెను. రమణీయము: నెయ్యు డామె హృదయమును తప్పిదపుఁ గత్తిపోటునఁ బొడిచినాఁడు. మఱల నా గాయము కనఁబడకుండ నతుకువెట్ట గమకించినాఁడు. అప్పు డామె యనుచున్న దీమాట. ఇట మూలమున 'సూచీవ్యథవేదనా' అనుటకు వ్యాఖ్యాత 'సూచ్యావ్యథ స్సీవనం' అన్నాఁడు.

మూలముననున్న ప్రక్రమము నల్లెయనువదించినను ఆ భావము రాదు. ఒక టిందునకు.

'అంకే నివేశ్య కూణిత
దృశశ్శనైరకరుణేలిశంసంత్యాః
మోక్ష్యామి వేణిబంధం
కదా నఖై ర్గంధతైలాక్తైః. —మూలము,

ప్రియుఁడు లేమను దొడపయిఁగూర్చుండఁ బెట్టుకొని వాసననూనెరాచి గోళ్లతో చిక్కు తీయుచుండును అపు డామె-చాలనాళ్లనుండి జడలుగట్టినవిగాన- నొష

నేను 'అబ్బా, మెల్లగా! ఎంతకఠినులండీ?' అని బాధా సూచకముగఁ గనులఁగూనిశితములొనర్చును. ఈ చిక్కు దీయుచప్పు నొప్పినునకు దినము గనఁబడును నేయుంచును. ఈ దృశ్యమునే పై శ్లోకమునఁ జిత్రించును. అనువాదము చూడుఁడు:

'కురువుపయిఁ జేర్చి కంకోయి చురులనీరు- నిర్ద యుఁడవని నన్ను నిందించుచుండెఁ గన్ను నూనియు రాచి నాకలికి మిన్న.. కెపుసు వేనలి నెఱిఁదీర్చి యొలమిఁ గొందు'

—ప. ౨౧.

ఇందాభావము విశదపడలేదు. అన్వయ క్లిష్టత కొకనూచి:

"పశిశిరసు నేలఁబడి సూలునో ప్రియుం
డన్న భీతి మెయిఁ బదర్గగాత్ర
మునవసించు శైలపుత్రియు మోయుచు
నశని కేకదైవము యిన గంగ" —ప. ౨౩.

అవతారికలేకో కొన్నిటికిఁదప్ప నవావశ్య కములా యనిపించును. పద్యములోని భావమే యవ తారిక ముందుచెప్పి రసమును చెడగొట్టును. మాపుఁడు ౭౭ పద్యము, దాని యవతారిక. ఈ యవతారికలకన్న 'ధూళిపుటిక' 'కుబుపు' 'వీవనము' మొదలగువాని కర్థోజ్ఞాపెక లవసరములు; ప్రయోజనకారులు. ఇట్టి నైఘంటిక నీరసపదము లటనట నున్నను 'వెలిచవులు మరిగిన వగలాడి' 'డంకా బజాయించి' 'చరణప్రహార మాతని శిరసునఁబడ్డినఁ' వంటి లలితపదములు చాలగలవు.

'చికాకు' 'మెఱియించు (మెలినెట్టు,' 'మిన్మి క్కిలి' 'గ్రామకళ్లము' విచార్యములు. ఛందోభంగ మొకచోనున్నది కాని ముద్రణదోషమేమో! గీతపాద మిది.

'తెరువుమా! కన్నుతావరలజంట'

మఱొకమాటతో ముగించెదను. ప్రక్కనేయున్న నీతిపద్యముల వదలిపైని శృంగారపద్యములనే యెక్కు డుగ ననువదించిరి. ఈ (వెట్టి) శృంగారమునకన్న నా సుభాషితములెంతయు మనోహరములు; విజ్ఞానదాయక ములు. వానినే తెలిఁగించినను మఱింత మంచిదేమో? ఇది సలహామాత్రమే.

అటనట ప్రమాదములున్నను నీ కావ్యము లలిత రీతుల నలరారుచున్నదనుటకు సందియము లేదు. ఇట్టి రసవద్వ్యాహారముల రసికులు మిగుల నలరఁగలరు. ఇందుల కాంధ్రలోకము కృతజ్ఞము.

'విశ్వం'

---

## హిందూదేశ చరిత్ర కథలు

మొదటి భాగము (నాలుగవ తరగతి). సచిత్రము. గ్రంథకర్త: సి. ఎన్. ఏకాంబర మొదలియారు, ఎం. ఏ., ఎల్. టి. చరిత్రోపన్యాసకులు, ట్రెయినింగ్ కాలేజీ, సైదాపేట, చెన్నపురి. అనువాదకుడు: శ్రీ నన్నవరపు సుబ్బరామయ్య, భారతి సంపాదకుడు, చెన్నపురి. ప్రకాశకులు, బి. జి. పాల్ అండ్ కంపెని, ౧౨. ఫ్రాన్సిస్ జోసఫ్ వీథి, చెన్నపురి. చక్కని ఆకృతి. క్రౌను ౭౨ పుటలు. వెల ౦-౮-౬.

కఠినవిషయములు సర్వజన గ్రాహ్యములు కావలె నన్న కథలలో వానిని కూర్చి చెప్పుటయే మంచిది. మన పురాణేతిహాసముల యుత్పత్తికి నిదియే ప్రధానకారణ మని పరిశోధకుల నిశ్చయము. అట్టిచో ప్రాథమిక పాఠ శాలలలో చదువు బాలురకు కథామూలముననే గణి తము, దేశచరిత్రము మొదలగు దుర్గ్రాహ్యవిషయములను బోధించుట ఆవశ్యకము. బాలురకు కథాశ్రవణ, పఠనము లందే మక్కువ ఎక్కువ.

ఈ 'హిందూదేశ చరిత్ర కథల మొదటిభాగము'న ౧౬ కథలు కలవు. అన్నియును భారతదేశమునందలి వివిధప్రాంతములకు సంబంధించినవి; చాలవరకు హిందూ రాజుల చరిత్రమును తెలుపునవి.

'ఈ కథలయందు యుద్ధములు, ముట్టడులు మొద లగు రాజకీయ విషయములు ప్రధానములు కావు; సాంఘిక, ఆర్థిక విషయములే ప్రధానములు. విషయము లన్నియు మిక్కిలి శ్రమపడి పరిశీలించి గ్రహింపబడి నవి. అందును బాలురు సులువుగా తెలిసికొని ఆనం

దింపగల విషయములే ఏర్చి కూర్పఁబడినవి'. అను గ్రంథకర్తగారి 'ఉపోద్ఘాత' లేఖము సత్యదూర మేమాత్రము కాదు. అనువాదము మూలమునకు మెరుగు పెట్టజాలినది. అనువాదకుల రచనము సరళము; నాలుగవ తరగతి బాలురు స్వయముగ నయినను చదువుకొని అర్థము చేసికొనునంత సులభశైలి కలది. భావ సులక్షణము. పసిబాలుర పఠనసౌకర్యమునకయి ఔపవిభక్తికములు, సంధులు పాటింపబడలేదు. ప్రాథమికపాఠశాలలయందలి పఠనీయపుస్తకము లీ రీతినే ఉండవలెను.

అన్ని విషయముల బాలుర దేశచరిత్రజ్ఞానమున కనుకూలమగు నీ చిన్న గ్రంథమును పాఠ్యపుస్తకనిర్ణయ సభవారు ఆమోదించి, ఇట్టి గ్రంథముల యుత్పత్తికి ప్రోత్సాహము నొసగవలసియున్నది.

బు. వేం. ర.

---

## కవికోకిల గ్రంథావళి

### ౧. కా వ్య ము లు

(సచిత్రము) కర్త: శ్రీ దువ్వూరి రామిరెడ్డి. క్రౌను ౨౫౦ పుటలు. రేపరుబైండు. వెల రు. ౨-౦-౦.

'కవికోకిల' బిరుదాంచితు లగు శ్రీ రామిరెడ్డిగారి 'రచనము లన్నియు కావ్యములు, ఖండకావ్యములు, నాటకములు, సారస్వతవ్యాసములు అను నాలుగు సంపుటములుగ ప్రకటింపఁబడినవి' అందియ్యది తొలి సంపుటము. ఇందు ౧ నలజారమ్మ; ౨. వనకుమారి; ౩. కృషీవలుడు. ౪. జలదాంగన; ౫ యువకస్వప్నము; ౬. కడపటివీడుకోలు; ౭. పానశాల అను కావ్యసప్తకము కలదు. పయి 'కృతులు రచనాకాలక్రమానుసారముగ సమకూర్పఁబడినవి.'

శ్రీ రెడ్డిగారు నవకవులలో పేరెన్నిక గన్నవారు, సరసము, నిర్దుష్టము, భావగర్భితము నగు కవిత్వము చెప్పగలవారు. హృదయమున కంటని యంశములనుకూడ చక్కగ దిద్ది తీర్పగల నేర్పు కలవారు. ప్రబంధకవుల వలె ప్రఖ్యాతభూభుజులను గాక సామాన్యజనులను పాత్రలఁగల్పించి, వారి జీవితరహస్యములను ప్రదర్శించుటలో శ్రీ రెడ్డిగారిది ఆరి తేరిన చేయి. వీరి కవనమున వర్ణనములు స్వాభావికములు; శైలి సులభము; భావ అంగ్లము.

పయి యుత్తమగుణములు శ్రీ రెడ్డిగారి మొదటి కృతులం దు విశేషము లయినను క్రమక్రమముగ అనుభవముతోపాటు అభివృద్ధి పొంది విశిష్టతను గడించుకొన్నవి.

౧. ప్రొద్దులునిండిన నలజారమ్మ ఊచబియ్యము పయి మనసుపోగా, రాత్రి పొలముకాపునకు పోవుచున్న మగనితో తెల్లవారి తిరిగివచ్చునప్పుడు జొన్న కంకులను తేవలెనని కోరెను. కలతనిద్దురలో కాయ మెరుగని ఆమెభర్త తెలియక వేరొకని పొలములోని కంకులను కోసెను. క్షేత్రస్వామి అధికారియగు నలజారమ్మతండ్రియొద్ద ఫిర్యాదు చేసెను. అల్లునివలన వంశమునకు కళంకము కలిగెనని ఖేదము పొందెను. కీర్తికాముడగు అల్లుడు బలవంతముగ ఉరులబాసెను. పచ్చిబాలెంతరాలు నలజారమ్మ అగ్నిప్రవేశ మొనర్చెను. ఇది "నలజారమ్మ"లోని కథావస్తువు; యథార్థమైనది; విశేషించి శ్రీ రెడ్డిగారి వంశగౌరవమునకు సంబద్ధము.

శ్రీ రెడ్డిగారి 'కావ్యము'లలో 'నలజారమ్మ' ఒక్కటియే గద్యపద్యాత్మకము. (తక్కిన వన్నియును కేవలము పద్యాత్మకములు.) ఇందలి కథ యథార్థమయినను నాతిహృద్యము. 'ఇందు రెడ్డిగారి శైలి పరిపాకమునకు రాకపోయినను మనఃప్రవృత్తుల పరిశీలనము చేయు శక్తి పరిమితము.'

౨. వనకుమారి రాజ్యచ్యుతుడయి యడవులపాలబడిన యొక క్షత్రియవృద్ధుని ముద్దులపట్టి. ప్రతిదినము ఉదయముననే గొఱ్ఱెలమందను మేతకు దోలుకొనిపోయి సాయంకాలమున కింటికి వచ్చుట ఆమెకు నిత్యకృత్యము. ఒకనాడు గొఱ్ఱెలమంద చెదరిపోవుటచే ఆమె తిరిగి వచ్చుటకు ఆలస్యమయ్యెను దారితప్పిన ఆమెను వేటకు వచ్చిన రాజపుత్రుడొకడు ఇలుచేర్ప వచ్చుచుండెను. అంతకు మున్నే జీవితనిర్విశేషయగు పుత్రికను వెదకుటకు బయలుదేరిన వృద్ధుడు ముండ్లపందిచే పొడువబడి నేలగూలి ప్రాణావశిష్టుడై విలపించుచుండెను. ఆ ఆక్రో

శము విని క్షత్రియయువకుడు అతనిని కుటీరమును చేర్చెను. వృద్ధుడు యువకుడొంటరిగ నున్నపుడు తన వృత్తాంతమును తెల్పెను. యువకుడు వృద్ధుని రాజ్యచ్యుతికి, కష్టములకు తన తండ్రియే కారణమని తెలిసి మూర్ఛనొందెను. వనకుమారి చేసిన శిశిరోపచారములచే అతడు తెలివినొందెను; కాని వృద్ధుడు మృతినొందెను. యువకుడు వనకుమారి నూరడించి, ఆమెను నగరమునకు రమ్మని కోరెను. ఆమె అడవిని విడువ నిచ్ఛగింపక యువకునిగూడ నచటనే ఉండిపోగోరెను. అప్పటి కాతడట్లే అనెను.

అడవిలో విడిచిన తన పరివారముగతి ఏమయ్యెనో తెలిసికొని వత్తునని వనకుమారియనుజ్ఞ వడసి యువకుడు అడవులబడిపోయెను. అతడెంతకును తిరిగి రాకుండుటచే విరాళి చెంది ఆమె అడవులబడిపోయెను. యువకుడు ఆమెం గలిసికొని ఆమె తండ్రి చెప్పిన వృత్తాంతము తెల్పి పట్టమహిషియై తన రాజ్యమును పాలింప నగరమునకు రావలెనని ఆమెను ప్రార్థించి యంగీకరింపజేసెను.

'వనకుమారి'యందు కథాశిల్పము తక్కువ; కవితాశిల్పముమాత్రము వెనుకటి కృతులకంటె నిందు మెరుగుపెట్టబడినది. ఛందస్సిద్ధికయి నాతిప్రయోజనములగు పదము లిందును కూర్పబడినవి. 'చిత్రముల్ పుట్టునో' అనుటకు 'చిత్రముల్ జననమునందునో' అని, 'పేదకు పెన్నిధి లభించినట్లు' అనుటకు 'పేద కుద్దామ ధనంబునా' అనియు, నీరీతి ప్రయోగము లిందందు కానవచ్చు. కవి సామాన్యజనచరిత్రములను చిత్రింపనిచ్ఛకలవాడయినను, ప్రాచీన సంస్కారమును విడువజాలక ఇందు నాయికా, నాయకులను క్షత్రియులనుగ సృజించినాడు. 'వనకుమారి'ని సింహాసనము నెక్కించినాడు!!

3. 'కృషీవలుడు' కృషీవలుని నిత్యజీవనము తత్త్వము నెరుకపరచు కావ్యము; భావప్రధానకము. ఇందలి వర్ణనలు స్వాభావికములు; హృద్యములు. ఇందలి కవిత వెనుకవానికంటె మెరుగువారినది.

౪. 'జలదాంగన' అంగనారూపాధ్యవసితమగు నొక జలదము స్వీయవృత్తాంతము చెప్పునట్లు నిబద్ధమగు కావ్యము. జలదాంగన సూర్యునుద్వాహమగుట, సవతుల అసూయ, వలపుకానిమోసము మొదలగు నంశములు వర్ణితములు; ఇందలి శైలి పరిపక్వము. కవి వివరించిన యిందలి యంశములు కొన్ని అనుభవాతీతములు.

౫. 'యువకస్వప్నము'న ఒక యువకుని మధుర స్వప్నము వివరింపబడినది. అది భావప్రధానము; అందలి భావములు హృద్యములు.

౬. 'కడపటి వీడుకోలు'న ఒకచిన్నకథ చిత్రింపబడినది. పసితనమున ఒకరి నొకరెక్కువగ ప్రేమించుకొనిన ఒకమునికన్య, మునికుమారుడును చాలకాలము విభిన్నస్థలముల కాలము గడపిరి. ఒకనాడు బాలకుడు నీట మునిగిపోవుచున్న ఆ బాలికను రక్షించెను. ఆమె ఆతనిం గని ఎక్కువ యానందించి చిరకాలమునకు తన ప్రణయము ఫలించెనుగదా అని అనుకొనెను. ఒకనాడామె అతనితోగూడ ఒక చెట్టుకొమ్మపయి గూరుచుండి తన ఆశయమును స్పష్టపరచెను. యువకుడు మాత్రము అంగీకరింపక సోదరీప్రేమనుమాత్రము కనబరచెను. ఆమెకు జీవితము దుర్భరమయ్యెను. ఆమె తటాలున ఉన్నపాటుననే లేచి నిలిచెను; అతడును నిలిచెను. ఆమె ఆతనిని గాఢముగ గౌగిలించెను. ఇరువురును క్రింది వాగులో బడిపోయిరి. శ్రీ రెడ్డిగారి పద్యకథలలో నిది యుత్తమమైనది. కవితయు నిందు పరిపక్వమైనది.

౭. 'పానశాల' పారసీక భాషలో 'ఉమర్ ఖయ్యాము' వ్రాసిన 'రుబాయితు'లోని కొన్ని 'రుబాయీ'లకు తెనిగింపు. ప్రేమైకజీవనులగు ప్రణయినీ, ప్రణయుల ప్రణయగీతికలు, ప్రణయగాథలు, ప్రణయతత్త్వములు, మధురభావనలు ఇందు చక్కని పద్యములలో పొందుపఱపబడినవి. వీరి కావ్యములలో నిది యుత్తమమని పేరుపొందినది. ఆగౌరవమున కిది ఎంతయు తగినది.

ఆధునికాంధ్ర వాఙ్మయమునకు శ్రీ రెడ్డిగారి "కావ్యసంపుటి" తగిన అలంకారము. వీరి కవితను గౌర వించుట ఆంధ్రులకు విధి.

బు. వేం. ర.

---

## శ్రీశుకనాసోపదేశము, శ్రీగురుదక్షిణ

పద్యకావ్యములు. కర్త: విద్వాన్, దర్భా వెంకట కృష్ణమూర్తి, ఎం. ఏ. ఆంధ్రభాషోపన్యాసకుడు, మదనపల్లి కళాశాల. ఫెదర్ వైటు కాగితము. క్రౌను ౮౦ పుటలు. వెల ౧౨ అణాలు.

౧. శుకనాసోపదేశము: ఇది భట్టబాణుడు సంస్కృతమున రచించిన 'కాదంబరి'లోని 'శుక నాసోపదేశము'నకు తెనిగింపు.

తారాపీడుని మంత్రి శుకనాసుడు యువరాజగు చంద్రాపీడునికి ఇందు త్తమధర్మముల నుపదేశించును. యౌవన, లక్ష్మీవిచేష్టితములు, వానికి లోగక రాజులు ఎట్లప్రమత్తులయి మెలగునది మొ. ఇందు ప్రధానవిషయ ములు. కాదంబరిలోని దురవగాహఘట్టములలో నిది ప్రధానము. దీని ననువదించి, అనువాదమున మూలాభి ప్రాయములను సమగ్రముగ పొందుపరచుట దుర్ఘటము. అందును కుదురుపాటునకయి పదముల వెదుకవలసివచ్చు పద్యకావ్యములలో మూలాభిప్రాయములు సమముగ పొందుపరచుట దుర్ఘటతరము. అందుచే ఇందును భాషాం తరీకరణసాధారణములగు లోపములు కానవచ్చు చున్నవి. ఇంతకును గ్రంథకర్త 'వెలగట్టరాని కవిత వెలసినవాడ'నట!

శ్రీ వెంకటకృష్ణమూర్తిగారిది స్వేచ్ఛాంధ్రీకరణము. వీరిందు కొన్నియెడల మూలమును మార్చినారు; లేనివిశే షములను కూర్చినారు; పద్యముల నడకకయి పాదపూ రకములగు పదములను - అప్రసిద్ధార్థపదములను చేర్చినారు; మూలమును పెంచినారు; ఎడనెడ వ్యాకరణము నుల్లం ఘించినారు. మచ్చునకు కొన్ని ఉదాహృతులు—

౧. i. మూలము.

'గర్భేశ్వరత్వం, అభినవయౌవనత్వం, అప్రతిమ రూపత్వంచ, అమానుషశక్తిత్వం చేతి మహతీయం ఖ ల్వనర్థపరంపరా.........యౌవనారంభే చ ప్రాయః శాస్త్రజలప్రక్షాళననిర్మలాపి కాలుష్య ముపయాతిబుద్ధిః' దీని అనువాదము—

'గర్భేశ్వరత్వం, బఖండశక్తిత్వంబు
నసమానరూపంబు, యౌవనంబు.
* * * *
తలచు శాస్త్రాదిక ధౌతనిర్మల మయ్యు
నవయౌవనమున మనంబు గలుషు.'

[౩౫ ప.]

మూలమునందు ఉత్తరోత్తరము ఉపకారకములగు అనర్థములు సక్రమముగ కూర్పబడినవి. అనువాదమున నా క్రమము తారుమారయినది. మూలమునందలి 'బుద్ధి' అనువాదమున 'మనంబు'గా మారినది. మనో, బుద్ధులు విభిన్న పదార్థములు.

(ii) మూలమునందలి "గాంధర్వనగరలేఖేవ పశ్యత ఏవ నశ్యతి" అనుదానికి "సాక్షాద్వ్యయత్పురి చం దంబుగాను, ఈక్షించునంతలోనే మాయమగును" అను నది సరియగు తెనుగుకాదు.

(iii) మూలమున "ఉదారసత్త్వ మమంగలమివ న బహుమన్యతే" అనియుండగా ఆంధ్రీకృతిలో "గౌర వింపదు నమంగళ నట్లుదారుకి" అనికలదు. (ఉదారు డన దానశీలుడు; ఉదారసత్త్వుడు గొప్ప బలముకల వాడు.) మూలమునకు భిన్నముగ నిందుదారుడు ప్రశం సింపబడియు మరల ఆ వెంటనే "సంస్మరింపదు దాత దుస్స్వప్నమువలె" అని చెప్పబడుట పునరుక్తము గను.

(iV) మూలము—

"వివిధవిషయ గ్రాసలాలసైః పంచభిరప్యనేక సహస్రసంఖ్యైరివేంద్రియై రాయాస్యమానాః"

అనువాదము—

"...నైకగో, చరరసలాలసంబులయి, చాల ద్రబుత్తములైన యింద్రియా, లరయగ నైదెయయ్యును నయారె సహస్రములంబలెన్ బోరిం,బోరి :బరిపీడ్య మానులరయ' (ప ౬౭)

మూలాభిప్రాయము పయి యనువాదమున అస్ప ష్టము; అంతియగాక అనువాద మనన్వితముగ నున్నది.

(V) "ఆసన్నమృత్యవ ఇవ బంధుజనమపి నాభి జానంతి" అని మూలము. అనువాదమున మాత్రము పూర్వపుక్రమము మార్పబడి "మృత్యువు వాసన్నమైనట్టు లెదురనున్న, బాంధవుల నేని యానవాల్పట్టలేరు" అని మార్పబడినది. ఇచట "మృత్యు వాసన్నమైనట్లు బంధువులు చెంత చేరి"రను విపరీతార్థమును స్ఫురించును. ఇట్టి రచన దుష్టము. (ప. ౪౯.)

(Vi) "గురువచనావధీరణం అపరప్రణేయత్వమితి,......దేవావమాననం మహాసత్త్వతేతి" అని మూలము. అనువాదమున మాత్రము "గురు తిరస్కరణంబె పరవశీకరణంబు, దేవావమానంబె ధీరతయును" అనియున్నది. (ప. ౯౯.)

గురువచనావధీరణము వేఱు; గురుతిరస్కరణంబు వేరు. అవమానన మనగా అవమానించుట; అవమానము తద్వ్యతిరిక్తము

(Vii) "అవనమయ ద్విషతాం శిరాంసి; ఉన్నమయ బంధువర్గమ్; అభిషేకానన్తరం చ ప్రారబ్ధ విజయః పరిభ్రమన్ విజితామపి తవ పిత్రా సప్తద్వీప భూషణాం పునర్విజయస్వ వసుంధరామ్" అని మూలము. దీని అనువాద మిట్లున్నది:—

"క. చంపుము రిపుశిరములఁ బో
షింపుము బాంధవులను నభిషిక్తుండవై కా
వింపుము దిగ్విజయంబు జ
యింపుము తండ్రివలె వసుధ నెల్లను నీవున్."

ఇచట పాఠాంతరము

"ఉ. వంపుము శత్రుశీర్షముల
వారక బంధుజనంబు నెప్డు పో
షింపుము తండ్రిచేత నభి
షిక్తుఁడవైన యనంతరమ్ము గా
వింపుము దిగ్జయంబు నల
ద్వీపము లేడిటితోడ నెంతయే
గింపగు పృథ్వి నెల్లను జ
యింపుము నీవును దండ్రికైవడిన్.'

[ప. ౧౨౮.]

ఇచట మూలములోని 'అవనమనము, ఉన్నమనము అనువాదమున కూర్పబడలేదు. 'విజితామపి తవపిత్రా పునర్విజయస్వ వసుంధరాం' అనుదానికి 'జయింపుము తండ్రివలె వసుధ నెల్లను నీవున్' అనునది కాని, 'పృథ్వి నెల్లను జయింపుము నీవును దండ్రికైవడిన్' అనునదికాని తగిన తెనిగింపు కాజాలదు.

(Viii) మూలము - 'తాత! చంద్రాపీడ!'; అనువాదము - 'తాతా! చంద్రాపీడా!'

౨. I. 'ఆరూఢవినయమపి వినీతతరమిచ్ఛన్'అని మూలము. దీనికి 'వినీతుఁడైనను మఱిక వినీతతరునిగా...' అని తెనిగింపు. ఇచటి 'మఱిక' వ్యర్థము. [ప. ౨౫.]

ii. మూలమున లేని 'మణులకేనియు' విశేషము; అయినను వ్యర్థము. [ప. 3౦.]

iii, 'అల మద్యమునఁ గల్గు నా మదోత్కటత, అల కౌస్తుభములోని యా నిష్ఠురతయు,......బరఁగ గ్రహించి వహ్వా! వచ్చె లక్ష్మి' [ప. ౪౬.] లోని 'అల'లు,'ఆ',ను,'పరగ, వహ్వా!' లు వ్యర్థములు. ఇట్టివి చాల కలవు.

iV 'నీరు'అనుటకు 'కృపీటము' అని, ఇంద్రియము' అనుటకు 'అక్షము' అనియు ప్రయుక్తములు.

3. i. మూలము - 'అనుదివస మాపూర్యమాణాః పాపేనేవాధ్మాతమూర్తయో భవన్తి.' దీనిఅనువాదము—

క. ఘోరములగు పాపంబుల
చే రేయుంబవలుఁ బుష్టిఁజెందెదు నన నా
రారా! బఱియుచు నుండుం
గా రాజులకాయ మంతకంతకు వత్సా! ప.౯౫

(ii) మూలము— 'కులక్రమాగతా ముద్వహ పూర్వపురుషైరూఢాం ధురమ్'

అనువాదము—

గీ. ముందు మీవార లెల్లరు మోచినదియు, నల్లవంశక్రమాగతం బైనయదియు, నైన యీభూమిభారంబుఁ బూనుమింక, నీ భుజాస్కంధమందు బల్ నేర్పు మెఱయ. ఇట్టి పెంపులు చాలకలవు. (ప. ౧౨౩.)

౪. అపప్రయోగములు-

"సద్యః"కు "సద్యంబు" అని ప్రయోగింపబడినది. (ప. ౨౧)

"తను"ధాతువు ధాతుజవిశేషణము "తవు"గా వ్రాయబడినది. ఇచట "తను" అని దిద్దిన ప్రాస చెడిపోవును. (ప. ౪3.)

“ఈండ్లు......దుర్నయములను పట్టుచున్నారలు” అని కలదు. ఇచట “...ఉన్నారు' అనియుండవలెను. అంతాగమంబులగు “వృ,రు”లు ప్రథమాంతంబులగు యుష్మచ్ఛబ్ద విశేషణములకే యగును.

శారదా స్తోత్రరూపమగు చివరిపద్యమున సంబోధనలన్నియు “సరసిజ భవలోలా” మొ. రీతిగ తత్సమములయినను “పాహి మాం” అని సంస్కృతమున కుదు. కర్మ, క్రియలు సంస్కృతమున నుండవలసినచో పయి సంబుద్ధులను మార్చవలెను, లేదా క్రియను, కర్మను తెనుగున కూర్చవలెను.

కర్త కొన్నియెడల నిందు పాదాంతముల శిథిల ద్విత్వములను, విసంధులను కూర్చియు తిరిగి దిద్దినాడు. ‘జారలతి పూలమునన్, అనయము' (ప. ౧౨౦.) అను చోటమాత్రము దిద్దక విడిచినారు. పయియంశములను బట్టి గ్రంథముతత్త్వము తేటపడుచున్నది.

౨. గురుదక్షిణ

సత్యప్రాశస్త్యమును తెలుపు చిన్న కందపద్య కథ. ఇది ఆంధ్రపత్రిక ధాతృసంవత్సరాది సంచికలో ప్రకటింపబడినదే! అనువాదము కాకుండుటచే వెనుకటి దానికన్న నిందలికవిత కొంత మేలు.

బు. వేం. ర.

### కావ్యాలంకారచూడామణి

సైజు ౧/౮ డెమ్మి, పుటలు ౧౩౬, వెల ౧ రూపాయి. రచయిత: విన్నకోట పెద్దయమహాకవి. ప్రకాశకులు: వేదము వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్; ౪. మల్లికేశ్వర వీథి; జి. టి. మద్రాసు.

ఇది తొమ్మిది ఉల్లాసములు గల అలంకార సూత్రములు. దీనిని బ్రహ్మశ్రీ మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రులవారు సంస్కరించి వారి జీవితకాలమునందే మూడుసారులు ముద్రింపించినారు. మదరాసు యూనివర్సిటీవారు విద్వాన్ పరీక్షకు పఠనీయ గ్రంథముగా నంగీకరించినారు. ఇది నాలుగవ ముద్రణము.

---

# గ్రంథ స్వీకారము

### శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు ప్రథమసంపుటము

(అ-నుండి ఔ వరకు.) ‘పండితసాహాయ్యమున జయంతి రామయ్య పంతులు, బి. ఏ. బి. ఎల్ గారిచే రచింపబడి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిచే ప్రకటింపబడినది. మంచి కాగితము; చక్కని అచ్చు. క్యాలికోబయిండు. రాయలు ౧/౮ సైజు; ౯౯౨ పుటలు. వెల రు- ౫ లు. కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తులో దొరకును.

### శ్రీ వేంకట రమణకృతులు

సైజు; ౧/౮ డెమ్మి ౩౬ పుటలు రచయిత: పలుకూరి వెంకటరమణయ్య, విజయనగరము సిటి.

### దేశీయ రత్నాలు

సైజు ౧/౮ డెమ్మి. పుటలు ౩౦ రచయిత: కంచర్ల వెంకట హనుమయ్య, పెరుమాళ్లపల్లి, వినుకొండ తాలూకా.

### ఆంధ్రమేఘ ప్రతిసందేశము

సైజు ౧/౮ డెమ్మి పుటలు; ౬౮. వెల; ౦-౧౦-౦ రచయిత:, ప్రకాశకులు రావాడ వెంకటరామశాస్త్రి, తెనుగుపండితుడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

### బాలయోగి

సైజు ౧/౮ డెమ్మి, పుటలు ౨౨. వెల ౧ అణా. రచయిత: నందివాడ వెంకటరత్నము, కొవ్వూరుతాలూకా పశ్చిమ గోదావరిజిల్లా.

### శకుంతలా విజయము

సైజు ౧/౮ డెమ్మి; పుటలు ౯. రచయిత: రెండుచింతల లక్ష్మీనరసింహ శాస్త్రి, కైకలూరు.

### జవహరలాలు నెహ్రూ ఆత్మకథ (కన్నడము)

సైజు ౧/౮ డెమ్మి, పుటలు ౨౨౪. ప్రకాశకులు: సి. అశ్వత్థ నారాయణరావు, బి. ఏ. మక్కళ పుస్తక ప్రెస్, బళేపేట్, బెంగుళూరు (సిటీ).

### వాసిష్ఠ రామాయణము

సైజు ౧/౮ డెమ్మి, పుటలు ౨౩౪, వెల ౧-౮-౦ రచయిత: మడికి సింగనార్యులు. ప్రకాశకులు: వేదము వెంకటరాయ శాస్త్రి అండ్ బ్రదర్; ౪, మల్లికేశ్వర గుడిసందు, లింగశెట్టి వీధి, జి. టి. మద్రాసు.

# సాభిప్రాయ విశేషములు

విశ్వవ్యాప్తమైన మహాపరివర్తనయుగమునందు విశేషములును, అభిప్రాయములును వక్తలకును, వ్యాఖ్యాతలకును, లేఖకులకును తండోపతండములు. ప్రపంచవ్యాప్తములైన మహాసభలు, పత్రికలు పండిత పామరులకు ఖండన మండనములను సులభము చేసినవి. ప్రపంచవ్యాప్తములైన రాజకీయార్థిక సాంఘిక మత పరివర్తనములు ప్రజ్ఞావాదముల కపూర్వావకాశములను సమకూర్చినవి. ధన ధర్మములకు, బల ధర్మములకు, బల విజ్ఞానములకును అపూర్వమైన సంరంభము ప్రవర్ధమానం బగుచున్నది. బలవంతులు పూర్వము వలెను వర్తమానకాలమునందును బలహీనులను పీడించి సుఖసంపదల ననుభవించు పరిపాటిగ నున్నది. కడుపునిండిన రాజ్యములు, జాతులు ధర్మారాధనమును వదలి తంత్రారాధనమును జేయుచు కాలయాపనమును జేయుచున్నవి. చిన్నరాజ్యములు, దుర్బల రాజ్యములు, పారతంత్ర్య రాజ్యములు ప్రబల రాజ్యములకు బలియగుచున్నవి; మహాదుఃఖవేదన ననుభవించుచున్నవి. ప్రజాస్వామ్యము, ప్రజాస్వాతంత్ర్యము క్రియలందే గాకను, సిద్ధాంతములందును వెనుకకు నడుచుచున్నది.

గతించిన ౧౩ ఏండ్లయందును మానవస్వాతంత్ర్యధర్మము పురోగమనమునకు బదులు వక్రించినదనియె చెప్పవలయును. సకల రాజ్యములును ఆయుధధారణము నపూర్వముగను నభివృద్ధిచేయుచు రుద్రునకు ప్రళయతాండవమున కాయుధములను సమకూర్చుచున్నవి. కడుపునిండిన గ్రేటుబ్రిటను, ఫ్రాన్సులు పనలేకను భయ సంశయములకు లోనై, స్వీయగౌరవప్రతిష్ఠలకును, ప్రపంచశాంతికిని హానిని గలుగజేయుచున్నవి. ప్రపంచమునందంతటను చిరకాల సంవృతములైన ప్రజాస్వామ్య స్వాతంత్ర్య ధర్మములు శిథిలములగుచుండ నాయుధబలములు విజృంభణము నొందుచున్నవి. జాతీయారాధనమె కాకను కులారాధనమును ప్రబలుచున్నది. జపాను, జర్మని, ఇటలి ప్రయోగించుచున్న బలదౌర్జన్యములు వర్తమాన రాజనీతికి ప్రమాణములైనవి.

* * *

## బ్రిటీషు రాజనీతి

ఒకకాలమునందు ప్రపంచవ్యవహారములందు సింహగర్జనమునుచేసి నాయకత్వమును బూనిన గ్రేటుబ్రిటను వర్తమాన కాలమునందు మేకపోతు గాంభీర్యమును బూనినది. ఈడెనుగారి ప్రసంగప్రవర్తనము లీవిషయమును విశదము చేయుచున్నవి. అబిసీనియా పరిత్యాగము, ఇటలీసంధి, స్పెయినుపట్ల

నవలంబించుచున్న రాజనీతి బ్రిటీషు ప్రభుత్వ దౌర్బల్యత్వమును వెల్లడి చేయుచున్నవి. అబిసీనియాను భక్షించిన ముస్సోలిని, గ్రేటుబ్రిటనును రక్షించుట యసంభవము. మెడిటరేనియనుసంధి స్పెయినునందిటలీకి స్వేచ్ఛాచరణమున కవకాశముల నొసంగినదేమొ దేవున కెఱుక. స్పెయినునందు జరుగుచున్న దారుణసంగ్రామము, సంగ్రామముపట్ల ఇటలీప్రవర్తనమును ప్రపంచమునం దాసన్నముగ నున్న సంగ్రామ ప్రళయమునకు నిదర్శనముగ నున్నది. స్పెయినునందు వ్యాపించియున్న ప్రజాస్వామ్యమును, మూరుసైనికుల నుపయోగించి ధ్వంసము చేయుచున్న విధము సుందోపసుందోపాఖ్యానమును స్మరింపజేయుచున్నది. ఇటలీ, జర్మనీ స్వచ్ఛందసైనికులు మూరులకు స్పెయినుప్రజలనునాశనముచేయుటకుసహాయముచేయును. యూరపురాజ్యముల పతితస్థితిని విశదముచేయుచున్నది. యూరపు రాజ్యములకు కర్మానుభవ మచిరకాలముననే సంప్రాప్తము గానున్నది. ఈసందిగ్ధస్థితియందు సోవిటు రుష్యాప్రవర్తనము ప్రశంసనీయముగ నున్నది. మానవస్వాతంత్ర్యరక్షణ వికాసములు భావికాలమునందు రుష్యామీద నాధారపడియున్న విధమును, స్పెయినుప్రభుత్వ రక్షణవిషయమై రుష్యా యవలంబించుచున్న ధర్మమార్గము నిదర్శనముగ నున్నది. ప్రజాస్వాతంత్ర్య ప్రియములైన గ్రేటుబ్రిటను ఫ్రాన్సుదేశములు రుష్యాతో చేరి స్పెయినురక్షణమును, ప్రజాస్వాతంత్ర్యరక్షణమును, శాంతిరక్షణమును జేయుట ధర్మము. బ్రిటిషురాజనీతిజ్ఞులకు భేదోపాయమునందు గల విశ్వాసమిట్టి సాహసకార్యమునకు ప్రతిబంధమని తెలిసినవిషయము. ప్రపంచశాంతి దైవాధీనమునం దున్నవిధమును సకలదేశముల వ్యవహారములును విశదము చేయుచున్నవి. ప్రపంచావృతమైన మహోపద్రవస్థితియందు పరాధీన నిరాధారస్థితియందున్న భరతవర్షస్థితి సకలవిధములను దుర్భరముగ నున్నది.

* * *

## భారతీయ స్వాతంత్ర్యము

పరాధీన నిరాధార స్థితియం దున్న భరతవర్ష మాత్మరక్షణమునకును, శాంతి రక్షణమునకు వలెను బ్రిటీషుప్రయోజనములకును నిరుపయోగము. స్వయంతరణమె పరతరణమునకు సాధనము. భారతీయ స్వాతంత్ర్యసమస్య ప్రపంచసమస్య కాని కేవలము భరతఖండసమస్య కాదు. 35 కోట్ల ప్రజలుపరాధీనస్థితియందుకృశించుచున్నపుడు ప్రపంచమునందు మానవస్వాతంత్ర్య ధర్మాభ్యుదయము దుర్లభము. పండిత జవహరిలాలునెహ్రూగారు లక్నో కాంగ్రెసునందును, ఫైజుపూరు కాంగ్రెసునందును భారతస్వాతంత్ర్య ఘోషను దిగంతములందును వ్యాపింపజేసి ప్రజావిశ్వాసగౌరవములకు పాత్రులైరి.

జవహరిలాల్ నెహ్రూగారు మధ్యవయస్సునందే మూడవసారి కాంగ్రెసుమహాసభ కధ్యక్షపదవి నలంకరించుట ప్రజాహృదయము నావరించిన స్వాతంత్ర్యాభిలాషకును, ప్రజానాయకులకు నెహ్రూగారి నాయకత్వమునందు గల విశ్వాసమునకును నిదర్శనములు. నెహ్రూగారు నిరంతరము సంబోధించునటులు భారతీయులకు స్వాతంత్ర్యసంపాదనము ప్రాణరక్షణప్రదమైన ప్రథమకర్తవ్యము. సాంఘికార్థికాదిసమస్య లన్నియును స్వాతంత్ర్యముమీద నాధారపడియున్నవి. భారతస్వాతంత్ర్యసమస్య మానవధర్మసమస్య, అంతర్జాతీయసమస్య, ప్రపంచకల్యాణసమస్య. కాంగ్రెసు ఆదేశానుసారముగను భారతీయు లందరును సాంఘిక మత దశాభేదములను విసర్జించి స్వాతంత్ర్యసిద్ధికై దీక్షనుబూనుట వివేకము, ధర్మము. స్వాతంత్ర్యసిద్ధికి కాంగ్రెసు నిర్ణయించిన సాధనము సహాయనిరాకరణమైనను, శాసనసభాప్రవేశమైనను, ప్రతిష్టంభనమైనను, మంత్రిపదస్వీకారనిరాకరణమైనను శిరసావహించి యాచరించుటయె ప్రజానాయకులకు కర్తవ్యము. నెహ్రూగారీవిషయమును వేయినోళ్ల నుపన్యాసవేదికలనుండి చాటుచున్నారు. ప్రజానాయకులు సంశయములను విడిచి కాంగ్రెసు ఆదేశమును పాలించి కృతార్థు లగుదురుగాత!

* * *

## ఎన్నికలు – ఆంధ్రులకర్తవ్యము

కాంగ్రెసు ఆదేశానుసారముగను పార్లమెంటరీబోర్డు శాసనసభల కభ్యర్థులను నిర్ణయించినది. ఒకస్థానమున కనేకు లభ్యర్థులుగ నిలిచినపుడును, తగిన అభ్యర్థులు లేనపుడును సముచితనిర్ణయము సులభముగాకను లోపములు గలుగుట సహజము. అభ్యర్థులందు నిర్బంధదారిద్ర్యముల ననుభవించిన త్యాగపురుషుల కవకాశములు లేకపోవుటయును, సామాన్యుల కవకాశములుగలుగుటయును సంభవించియుండును. అయినను సర్దారుపటేలుగారు తెలిపినటులు బోర్డునిర్ణయములను ప్రజానాయకులు శిరసావహించి, కాంగ్రెసువిజయమునకు పాటుపడుట పుణ్యము, పురుషార్థము. శాసనసభాభ్యర్థిత్వమును త్యాగమునకు ప్రతిఫలముగను తలంచుట యనుచితము. అన్నిమండలములందును ననసంతృప్తిని జెందిన యభ్యర్థు లుండుట సహజము. మండలములోని ప్రజానాయకులు వ్యక్తులమాటను మరచి కాంగ్రెసువిజయమునె పరమార్థముగను గ్రహించి కాంగ్రెసు విజయమునకు పాటుపడి మాతృదేశాశీర్వాదములకు పాత్రు లగుదురుగాత! దేశభక్త వెంకటప్పయ్యపంతులుగారు ప్రజామిత్రుల ప్రార్థనల నాలకించి వారి కిష్టము లేకున్నను గుంటూరు తెనాలిపట్టణముల కభ్యర్థిగ నిలుచుట కంగీకరించి గుంటూరుమండలప్రతిష్ఠను,

కాంగ్రెసు గౌరవమును కాపాడుటకు చూపిన త్యాగము వారి నిష్కల్మష దేశభక్తి కను రూపముగ నున్నది. ప్రజానాయకులందరును స్వాతంత్ర్యవిజయమునకు మహాలాధారమైన కాంగ్రెసువిజయమునకు ఎన్నికలందు పాటు పడి మాతృదేశారాధనమును చేయుట సమంజసము. భిన్న పక్షములవారును, సంఘములవారును, మతము లవారును ఎన్నికలందు కాంగ్రెసు అభ్యర్థులకు ప్రతిపక్షులుగను నిలువకను కాంగ్రెసువిజయమునకు తోడ్పడి మాతృదేశారాధనపరాయణులై కృతార్థు లగుదురుగాత !

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

# విషయసూచిక



ఆర్షరసాయనశాల
ముక్త్యాల, కృష్ణా
స్థాపితము 1925
ప్రశస్తాయుర్వేదౌషధములకు నిలయము. ఏమందు కావలసినను మాకు వ్రాయుడు. నమ్మకమైనవి లభింపగలవు
ఆయుర్వేదభూషణ
వేటూరి శంకరశాస్త్రి
CONSULTING PHYSICIAN






PETROMOL
TROLEUM EMULSION
WITH
PHOSPHITES
PETROMOL
PETROLEUM EMULSION
BENGAL CHEMICAL
&
PHARMACEUTICAL WORKS LD
CALCUTTA




సంపు. ౧౪  ధాత సంవత్సరము, మాఘమాసము ( ఫిబ్రవరి ౧౯౩౭ )  సంఖ్య ౨

# రాయలనాటి తెలుగుసాహిత్యము

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

కర్ణాటకసామ్రాజ్యచరిత్రయందు శ్రీకృష్ణదేవరాయలకాలము — ౧౬-వ శతాబ్ది పూర్వభాగము-తెలుగువారి దృష్టిలో సువర్ణాక్షరముల వ్రాసియుంచదగినది. స్వభాషామాత్రాభిమానమున సంకుచిత దృష్టిగలవారికి కాకపోయినను సాహిత్యమునం దభిమానముగల ఆంధ్రేతరులకును అది యట్లు తోచుటలో సందేహములేదు.

తెలుగుసాహిత్యమే మొదటినుండియు రాజుల యాశ్రయమున పెరిగినది. ఉత్తమోత్తమ గ్రంథములు మొదలు అధమాధమ గ్రంథములవరకును చక్రవర్తులు, రాజులు, పాళెగాండ్రు, మంత్రులు, సేనాపతులు మొదలగువారి ప్రోత్సాహముతోను, ఔదార్యముతోను పుట్టినవి. స్వతంత్రముగను, స్వార్థముగను చేసిన రచనలు మిక్కిలి తక్కువ. ఇట్లగుటకు కారణ మిది:

దక్షిణదేశపు సుప్రసిద్ధ మతప్రవర్తకులందరును ఆంధ్రులు కాకపోవుటచే అరవము, కన్నడము మొదలగు భాషలందు స్వతంత్ర సాహిత్య మభివృద్ధిచెందుటకు మూలబలమైన మతావేశము తెలుగువారిలో శిథిలమైనది. దక్షిణదేశమున ప్రచారముననుండు మతము లన్నియు తెలుగుదేశమున నెలకొని యున్నను, అవి వానివాని మూలపురుషుల నుండి సాక్షాత్తుగా రాక, వారి శిష్యప్రశిష్య

పరంపరనుండి వచ్చినవగుటచే దుర్బలములై అద్దమునందు ప్రతిఫలించినమెండవలె నయినవి. ఇంక తెలుగువారి రచనకు మిగిలిన యుద్దేశములు రెండే: 'యశసే, అర్థకృతే.' పూర్వకాలమున ఈ యశస్సు, ఈ యర్థము రెండును రాజుల కృపాకటాక్షమునకు స్వాధీనమయియుండెను. కాని యా కటాక్షవీక్షణము మనవైపు పడు నను నమ్మక మేమి? కావున రాజులకు గ్రంథములను సొంతముగ రచించు పుణ్య మున్ననులేకున్నను మరియొకరిచే రచియింపించి, వారికి బహుమానము చేయవలెననెడి ధర్మమే తెలుగువారి రాజనీతి యందు ముఖ్యముగ నెలకొనిపోయినది. సప్తసంతానములలో కావ్యము నొకటి యను శాస్త్రము రచించినవానికి, రచియింపించినవానినికి సమానముగ నన్వయించినది. ఇందువలన 'కవినాచ విభు ర్విభునా చకవిః కవినావిభునాచ విభాతి సభా' అను సన్నివేశమును ఆనాటి తెలుగుదేశములం దెక్కడకావలసినను చూడవచ్చునుగానుండెను. ఇప్పటికిని తెలుగుదేశపు రాజులందును, ప్రభువులందును ఈ సంప్రదాయముయొక్క పరిశేషమును మనముచూడవచ్చును. మరియు నానాడు జనసామాన్యమున కాదర్శపురుషులు రాజులేయయియుండినందున, నందరును యథాశక్తిగ వారివలెనే నడచుచుండినందున, మంత్రులు మొదలగు రాజోద్యోగులును, ధనవంతులగు నితరులును కవులను ప్రోత్సహించి, కావ్యరచన చేయించుచుండిరి. ఇందువలన తెలుగుసాహిత్యమున చేయిచేసుకొన్న వారి కందరికిని కవులుకావలెననుసాసయు, శక్తిగల ఉదారులెల్లరకును కవులను పోషించుధర్మమును సహజముగ పరిణమించినవి. ఇట్లు తెలుగువారియందుందు నంత-ఉండినంత-కవితకు-అనగా పద్యరచనకు-వ్యాప్తి మరియేదేశమందయినను గలదా యనుశంక కవకాశము గలుగుచున్నది. అది యట్లుండుగాక.

రాజుల ఆశ్రయమున బెరుగసంకల్పించిన ఆంధ్రసాహిత్యమునకు ఆంధ్ర దేశమును పాలించిన రాజులందరును ప్రాయశః కానుక కప్పములను చెల్లించియున్నారు. వారు కర్ణాటకులయియుండవచ్చును; తమిళులయియుండవచ్చును; మలయాళమువారయియుండవచ్చును; చివరకు మహమ్మదీయులేమైయుండవచ్చును! తెలుగుదేశము నేలు సంబంధముండునంతవరకు, తెలుగు నేలనుండి కందాయమును వసూలుచేయునంతవరకు తెలుగుకవి-కావ్యములతో వారికి సంబంధము తప్పుటకష్టము. తెలుగుకవులు తమ తాంబూలమును అట్లు భద్రపరచుకొనియుండిరి! రాజమహేంద్రవరమున చాళుక్య సామ్రాజ్యము, వరంగల్లులో కాకతీయ సామ్రాజ్యము, అద్దంకి కొండవీడు మున్నగు స్థలములందుండిన రెడ్లరాజ్యము ఇవన్నియు మొదట మొదట తెలుగుసాహిత్యాభివృద్ధికి పెద్ద పెద్ద పాదులయియుండినవి. క్రీ. శ. ౧౫-వ శతాబ్దమున తక్కిన సర్కారులన్నియు లుప్తములుగనో, లుప్తప్రాయములుగనో ఉండి,

విజయనగరమున కర్ణాటకసామ్రాజ్యమునకు పునాది వేసిన అల్పకాలమునందే తెలుగుకవులకు అక్కడ గౌరవ, ప్రోత్సాహములు దొరకనారంభించెను. ప్రాచీనాంధ్రకవులలో నుద్దాముడయిన నాచనసోమనకు ౧౩౭౭ సంవత్సర ప్రాంతమున వీరబుక్కరాయలనుండి యగ్రహారము లభించెను. మొదలు మొదలు కర్ణాటకసామ్రాజ్యముయొక్కయునికి దృఢముగను, విస్తారముగను ఉండనికాలమున తెలుగుల కంతఉదారముగ ప్రోత్సాహము దొరకనట్లు తోచుచున్నది. ఏలన, సోమనకు కొంచె మిటీవలివాడగు బమ్మెర పోతన్న 'ఈ కర్ణాటకిరాటకీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్మ భారతీ' యని యాగ్రహమున పలికినాడు. కాని వెంటనే-అనగా ౧౫-వ శతాబ్దమున-శ్రీనాథునికి కవిసార్వభౌమబిరుదము, ముత్యాలమంటపమునకూర్చొనబెట్టి కనకాభిషేకమును కర్ణాటక సామ్రాజ్యముననే లభించినవి. 'కర్ణాటకటక పద్మవనహేళి' అనియు, 'కర్ణాటక్షితినాథ మౌక్తికసభాగారాంతరాకల్పిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్' అనియు నతడే తన్ను పొగడుకొనియున్నాడు. ఇట్లుపక్రమమైన యాంధ్రకవికావ్య ప్రోత్సాహము క్రమముగ కర్ణాటసామ్రాజ్యము నేలిన రాజులందరకును సంప్రదాయముగ పరిణమించిపోయినది.

కృష్ణదేవరాయలకాలమున సామ్రాజ్యవ్యాప్తి యెట్లో అట్లే పైసంప్రదాయమును పరమావధిని తాకినది. ఇతరభాషాకవులకును గౌరవ, బహుమానములు యథాయోగ్యముగ నడచియున్నను, తెలుగుకవులకు రాయలకాలమున నవి దొరకినంత మరి యెవరికాలమునను దొరకలేదని ధారాళముగ చెప్పవచ్చును. పితృపైతామహమైన ఆ పద్ధతిని ఇంకెంత విస్తరింపజేయుటకు కావలసిన జ్ఞానశక్తిబలైశ్వర్యములు ఆతనియందు నిండియుండినవి. సంస్కృతాంధ్రభాషలయందు దృఢమైనపాండిత్య మాతనికుండెను. సంస్కృతమున మదాలసాచరిత్ర మున్నగు కొన్నిగ్రంథముల నాతడు వ్రాసినాడట. తెలుగున ఆముక్తమాల్యద, లేకవిష్ణుచిత్తీయము అను అతిప్రౌఢకావ్యమును రచించియున్నాడు. *

ఆంధ్రపంచకావ్యములని ప్రసిద్ధములైన గ్రంథములలో నిది యొకటి. పైగా వానిలో నుత్తమమనియు నా మతము. ఇంక శక్తిబలైశ్వర్యములమాట చెప్పబనిలేదు. దక్షిణదేశమున నంతదొడ్డసామ్రాజ్యమును నిర్మించి, నిర్వహించినవారు వేరొకరెవరును లేరని చరిత్రకోవిదులందరును ఘంటాఘోషముగా చాటియున్నారు. జైత్రయాత్ర వెడలినప్పుడును రాయలు జతలో తనయాస్థానకవులను సైతము పిలుచుకొని పోవుచుండెనట. వారిలో

* దీని నతడే వ్రాసెనా, లేక ఆస్థానకవి యగు పెద్దన్న వ్రాసెనా యను విషయమున సంశయాత్ము లగు చరిత్రకారులకు జగడ ముండనేయున్నది. గ్రంథమందంతట రాయలు రచించినట్లే యుండుటవలన సద్యః మనపని కింత చాలును.

నగ్రగణ్యుడగు పెద్దన్నయందు రాయలు చూపుచుండెనని నాడుకయందుంచు భక్తి గౌరవములు 'నిజమా' యని శంకించవలసి నంత యసాధారణములైనవి. ఏనుగుమీద నెక్కి వీథిలో సవారి వెడలునపుడు పెద్దన్న యెదురైనచో, రాయలే దిగి చేతియూసరా యిచ్చి యాతని నేనుగుమీది కెక్కించు కొనుచుండెనట. నిండుసభలో తానాతనికి బహుమానముగ నిచ్చిన గండపెండేరమును తానేలేచివచ్చి యాతనికాలికి తొడిగినాడట! తనకంకితముగ నాకవి రచించిన మనుచరిత్రను స్వీకరించి, రాజధానియం దతనికి పల్లకిలో మెరవణి చేయునప్పుడు పల్లకిదండిని మొదట తానే యెత్తిపట్టెనట!! అడిగినచోట అగ్రహారముల నిచ్చెనట! వానిలో నొక దాని నాకవియే మరల తనగురువునకు దానమిచ్చి నాడు! 'ఇటువంటి ప్రభువును పోగొట్టుకొని చావక జీవచ్ఛవముగ నేనింకను బ్రతికి యున్నానే' యని దీనముగ నాకవి యేడ్చి చెప్పిన 'శ్లోకమయిన శోక' మొకటిగలదు.

కృష్ణదేవరాయల కాలమున తెలుగు కవుల కింత యున్నతపదవి దొరకుటకు మరి యొక ప్రబలకారణ మున్నది. 'దేశ భాష లందు తెలుగులెస్స' యను ప్రాచీనపు నానుడి యం దతనికి మిక్కిలినమ్మకము. కనుక నే యా వాక్యమును తన విష్ణుచిత్తీయమున నుదాహరించియున్నాడు. అన్నంతమాత్రము చేత నిజముగ నన్నిభాషలకంటెను తెలుగు స్వతస్సిద్ధముగ శ్రేష్ఠమయినదని నేను చెప్ప రాలేదు. అది నాయభిప్రాయమునుగాదు. కొందరు తెలుగువారట్లు అనుకొనినవారు గలరు. అటువంటివారిలో కృష్ణదేవరాయలు గూడ నొకడుగా నుండెనని చెప్పవచ్చునే కాని విచారశీలురగు తెలుగువారుగాని, ఇతరులుగాని పై వాక్యమును ప్రమాణముగ స్వీకరింపజాలరు. తన భాషయే యుత్తమమైనదని నమ్మని మానవవ్యక్తిని నేనింకను చూడలేదు. అట్లు నమ్ముట సహజమును అగును. తనభాషయొక్క సూక్ష్మమైన అందచందములును, శక్తిరక్తులును తనకు తెలియగలవేకాని యితరులకు తెలియవు. కాని రాయలకు తెలుగు తనభాషయనిన తాను చక్కగా నేర్చిన భాషయని నా భావము. అంతేకాని కృష్ణదేవరాయల మాతృభాష- ఇంటిలో మాటలాడుభాష- తెలుగో, కన్నడమో నాకు తెలియదు. ఈ రెండును కాక తుళుభాషను అత డింటిలోమాటలాడుచుండె నని చెప్పినను నేను కాదని చెప్పనట్లు లేదు. ఈవిషయము నాకు కాబట్టియులేదు. ఈ స్తనశల్యపరీక్షను చరిత్ర విమర్శకులకు విడచిపెట్టితిని. దాని నిర్ణయమువలన వారి కేమైనను ప్రయోజనము కలుగునేని సంతోషము. సాహిత్యశాస్త్రము మొదలగు ప్రతిభా ప్రపంచమున నిటువంటి యవాంతరములకు ఎంత అవకాశ మివ్వకపోయిన నంత మంచిది. కృష్ణదేవరాయలకు అనేక దేశభాషలందు మాటలాడుపరిచయ ముండియుండవచ్చును. కాని వ్యాసంగమూలకమయిన పాండిత్యము

మాత్రము తెలుగునం దెక్కువగ సంపాదించి యుండెను. కనుకనే యింత యభిమానము. రాయల యాజ్ఞమేరకు గదగు భారతపరిశేష మును కన్నడమున రచించిన తిమ్మనయొక్క మూడుపాళ్ల రచనయంతయు తిక్కనసోమ యాజి తెలుగుభారతపు భాషాంతరీకరణమే యై యుండుటకును ఇదియే ముఖ్యకారణ ముగ నుండవచ్చును.

రాయల ఆ స్థానమున అష్టదిగ్గజములని ప్రసిద్ధులయి యెనిమిదిమంది తెలుగుకవు లుండి రనునది పరంపరగ వచ్చిన సుద్ది. (౧) పెద్దన్న, (౨) తిమ్మన్న, (౩) ధూర్జటి, (౪) రామభద్రకవి, (౫) మల్లన్న, (౬) తెనాలి రామకృష్ణుడు, (౭) సూరన, (౮) రామ రాజభూషణుడు అని వారిపేర్లు. వీరు కాక తిరువేంగళనాథుడు, రుద్రయ్య, నృసింహ కవి, రాధామాధవుడు నున్నగువారు, రాయ లతో సాక్షాత్సంబంధముగలిగినవారు, కొం దరు గలరు. పరంపరాగత సంబంధముగల వారుపలువురుండిరి. అష్టదిగ్గజములలో ౬,౭,౮ సంఖ్యలుగలవారు ముగ్గురును రాయలకాల మునకు కొంచె మిటీవలివారు-అనగా ౧౬ వ శతాబ్దపు చివరనుండినవారని కొంతమంది చరిత్రకారుల మతము.

వీ రందరును వ్రాసిన గ్రంథముల వివ రముల నిచ్చుట కిక్కడ స్థలములేదు. స్థూల ముగ నింత చెప్పవచ్చును.

అది స్పర్ధలకాలము; స్పర్ధలలో జయము గాంచి యభిమానపడు కాలము. 'మేము బ్రాహ్మణులము, మేము రాజులము, కావున మాకు అగ్రతాంబూలము రావలయును. మేము కర్ణాటకులము, మేము తెలుగువా రము, కావున సభలో మొదటిపీఠము మాది' ఇత్యాదిగా కేవలము పశ్చాద్దృష్టితో జీవింప గోరు పేడి బదనికల కాలముగాదు. స్వశక్తి లేనివారి సడి, చప్పుడు వినబడనికాలము; పురుషసింహులకాలము.

ఈ కాలధర్మములు కవికావ్యములం దెట్లు ప్రతిఫలింపకుండగలవు? సామాన్య ముగ రాజ్యము, మతము, శాస్త్రము, శిల్పము మొదలగు నెల్లవిషయములందును మనుష్యశక్తియొక్క పరాకాష్ఠను చూప గోరు సమయమున, నన్నివేళమున కవులు మాత్రము ముద్దుగ, మృదువుగ, రసమయ ముగ, పూవులవలె, అక్కరవచ్చినప్పుడు ముడిచినను, అక్కరమాలినప్పుడు త్రోసి వేసినను సహించుకొని పేడులయి కేవలా ధ్యాత్మిక తృప్తితో కాలముగడపుట సాధ్య మా? కావున వారును పురుషసింహము లగుటకు ప్రయత్నించిరి.

అంతకుపూర్వ మయిదునూర్లసంవత్స రముల ఆంధ్రసాహిత్యముయొక్క జీవనమున సంస్కృతసాహిత్యమహిమతో స్వల్పస్వల్ప ముగ కనబడుచువచ్చిన చమత్కార ప్రధాన రచన రాయలకాలమున బాగుగా పెరిగి, వేరూని తరువాతికవులకు మార్గదర్శక మాయెను. చిత్రకవిత, బంధకవిత, గర్భ కవిత, ఆశుకవిత యని నాల్గురకములుగా పద్య

రచన ప్రసిద్ధమాయెను. రాయల ఆస్థానమున ప్రధానకవియైన పెద్దన్న తనకీ 'చతుర్విధ కవితామతల్లి' స్వాధీనమని చెప్పుకొని యున్నాడు. సంస్కృతాంధ్రములందు సమానముగ నాశుకవిత చెప్పగలిగినందుననే ముందుజెప్పిన గండపెండేరమును రాయలాతని కాలికి తొడిగినాడట. రాయల కంకితముచేసిన యాతని మనుచరిత్రలో నిటువంటి కుస్తీకవనపు ప్రసంగమే లేకపోయినను, దాని నభ్యాసముచేసియుండనిచో కవిపండిత సమాజమున నాతనికి మర్యాద దొరకియుండదని ధారాళముగ జెప్పవచ్చును. కఠిన సమస్యల నిచ్చుటయు, ఆకస్మికముగ జూచిన వస్తు సన్నివేశములను గురించి కవనము జెప్ప గోరుటయు, తృప్తికరముగ నట్లుచేసిన వారికి బాగుగా సమ్మానముచేయుటయు నప్పటి సామాన్య రాజసభాసంప్రదాయములుగ నుండెను. అందువలన కత్తిబట్టినశూరునకును, కలముబట్టిన ధీరునకును ఉత్సాహమున భేదముండలేదు. రసరంగములును, రణరంగములును నేకరీతిగ నుద్రేకదాయకములయియుండెను. అందుచే కవిశూరుల వీరాలాపములును, సింహనాదములును ప్రాయశః ఆ కాలపు ప్రతికావ్యమునందును వినరానారంభించినవి. ఒకకవి 'ఒకదినమున నొక వేయిపద్యములను విచిత్రవర్ణనలతో వ్రాయనేర్తు'నని గర్జించిన, మరియొకడు 'ఒకగడియలో నూరుపద్యముల రచింపగల'నని ఘోషించెను. 'నా కావ్యమందలి శృంగారవర్ణనను చదివినచో యతియు విటుడుకావలెను; అట్లే వైరాగ్యవర్ణనము పఠించినచో విటుడును యతికావలెను.' అని యింకొకని ప్రతిజ్ఞ. మరియొకడు ఆసేతుహిమాచలమను సంకుచితమైన ప్రాచీనప్రపంచపు జతకు ఉదయాస్తాద్రులను జేర్చి కొంచెము విస్తారము చేసి "వీనినడుమనుండు భూమిలో తెలుగున నావలె కావ్యము వ్రాయువా రెవరు" అని డంగోరా కొట్టినాడు

ఇట్లు కవిప్రపంచము స్పర్ధామయమై, గెలిచినవారికి నిష్పక్షపాతముగ మర్యాద గౌరవములు లభించుచుండినవి గనుకనే పలువురు శూద్రకవులును 'రంగము'నకు వచ్చుట కవకాశములుకలిగి, అనేక సందర్భములందు జయశీలురగు ననుకూలములును గలిగెను.* వారిలో నెల్ల రత్నప్రాయుడగు రామరాజభూషణకవి (అళియరామరాయలపోషణ యందుండినందున నీ బిరుదు. ఆతని నిజమైనపేరు భట్టుమూర్తి; భట్రాజులజాతివాడు) కృష్ణదేవరాయల యాస్థానములోని అష్టదిగ్గజములలో నొకడు. ఇంత స్పర్ధాళు

* ఈ బ్రాహ్మణాబ్రాహ్మణస్పర్థ యిప్పటివలెనే అప్పుడును తీవ్రముగనే యుండినదనుటకు అప్పటి రాజకీయ జీవనమునుండి యనేక దృష్టాంతములను జూడవచ్చును. కృష్ణదేవరాయలకు బ్రాహ్మణులయందును, రామరాజ తిరుమలరాజులకు బ్రాహ్మణేతరులయందును అభిమానవిశేష మండినట్లూహింపవచ్చును. విజయనగర సామ్రాజ్య నాశనమునకు ఈస్వయోగస్పర్థ, ఈ జాత్యభిమానమును ప్రధానకారణములయియుండవచ్చునుగూడ.

యమున సాహసిక వీరకవి ఆకాలమందే కాదు, తెలుగుసాహిత్యముయొక్క చరిత్రయందే మరియొకడు లేడని చెప్పవచ్చును. ఆకాలపు సాహిత్యమందుమాత్రమే కాక సంగీతము నందును ఈతనిమహిమ ప్రబలమై యుండినట్లు తోచుచున్నది. ఈతనికి 'సంగీతకళారహస్య నిధి' యను బిరుదుగలదు. ఇప్పుడు దక్షిణ దేశమున ప్రచారమునయుండు వీణకు స్థిరమైన మెట్లు వేయునేర్పాటు మొదలుపెట్టినవా డితడేయని వాడుక. ఈ కవి రాయలయాస్థా నకవులలో నిజముగ సమర్థులయిన పెద్దన్న, సూరకవి యను నిరువురను కావ్యగోష్ఠికి తగి నవారని- ధుర్యోధనుడు భీమార్జునుల నెన్ను కొన్నట్లు - నిర్ణయించుకొన్నట్లు తోచు చున్నది. పెద్దన వ్రాసిన ముఖ్య గ్రంథము మనుచరిత్ర. ఇది రసిక కావ్యము. చమత్కారమున కిందు ప్రవేశ ములేదు. దీనికి లభించిన గౌరవమునుగాంచి దీనికి ప్రతిగా వసుచరిత్రయను ప్రతిపద్య చమ త్కారమయమగు శ్లేషకావ్యమును వ్రాసి రామరాజభూషణుడు తిరుమల దేవరా యల కంకితముచేసి బహుళగౌరవమును పొందెను. ఇదియయినతర్వాత తెలుగున కావ్యములను వ్రాసినవారిలో దీనిమాదిరిగనే వ్రాయవలెనను వాసన లేనివారు పలువురు లేరు. పిల్లవసుచరిత్రలను బిరుదు సంపాదించు కొని యెన్నియో గ్రంథములు తృప్తిగాంచి నవి. ఆంధ్రమహాకావ్యపంచకమున దీనికి స్థిరమైనప్రతిష్ఠ లభించినది. అట్లే సూరకవి వ్రాసిన రెండుముఖ్యగ్రంథములలో నొకటగు కళాపూర్ణోదయము భట్టబాణుని కాదంబరివలె విచిత్రమై యనుస్యూతములయిన కథాసంద ర్భములతోను, వివిధ దేవ మనుష్య పాత్రల తోను కూడి తెలుగుసాహిత్యమున నదివ రకు, ఆతర్వాతను లేని నూతనరచన. రెండ వదగు రాఘవపాండవీయము గూడ నూత నమే. కాని దానిదారి వేరు. ఇది ద్వ్యర్థికా వ్యము. ఒకటేకావ్యమున శ్లేషమహిమవలన రెండుకథలనుకూర్చి జోడించు పని. సూరన రామాయణ భారతకథలు రెండిటిని దీనిలో కూర్చినాడు. ఈ రెంటిలో మూర్తికవికి మొదటిరచన అంతగణనకు రాలేదు. రెండవ దానిని మించి తన కలముపోటును జూపవలె నని రామాయణ భారతములవలెగాక పర స్పర భిన్నములగు కథలు రెండు జోడించి హరిశ్చంద్ర నలోపాఖ్యానము రచించెను. తరువాత ననేకు లీదారియందే 2, 3, 4 కథలనుగూర్చి క్లిష్టకావ్యములను వ్రాసిరి.

ఇట్లన్నంత నాకాలపుకావ్యములన్నియు వట్టి జగడదారుల రగడలుగ నుండినవని యెంచరాదు. కాలము పౌరుషప్రధానముగ నుండినందున కావ్యములందును పౌరుషమ హిమ తలసూపెనే కాని దీనికి దానిని శుష్క ముచేయుటకు సాధ్యముకాలేదు. తెలుగులది సహజముగ భావోద్రేకముగల జాతి. ఐహికప్రీతి వారికిహెచ్చు. ఇవిరెంటిని అణచి శుష్కింపజేయు మతావేశము దుర్బలముగ నుండినందున వారెన్నడును మానుష్యము

యొక్క హద్దుమేరలను పూర్తిగ దాటిన వారుకారు. ఐహిక జీవనపు లోతుపాతులను బాగుగచూచివిడువవలయుననుదృష్టి వారికి గలదు. అందలి స్థూలసూక్ష్మభావములను తీవ్రముగ గమనించు హృదయమును, దాని లోపముల నరకంటితోజూచు నుదాసీనమును వారికి సహజములయియున్నవి. ఆ కాలపు జనులలో నివి మరింతతీవ్రముగ నుండినవని నిస్సందేహముగ జెప్పవచ్చును. అది విజయ శీలుర, విజయమత్తుల కాలము. స్వాతంత్ర్య మును పోగొట్టుకొని, స్వాభిమానమును వదలి, స్వానుభవమును బడయక మూడవ వారి ముఖప్రీతికొరకు నడచి, పలికి, దుడిచి యుండు నిప్పటివంటి నిశ్చేతనకాలముకాదు. తమ ఒప్పుతప్పులకు తామే జవాబ్దారీగానుం డినకాలము. వలసినచో ప్రభువునాజ్ఞనైనను తిరస్కరించి అవిధేయు లగుటకు జంకని కాలము. ఏదో సందర్భమున తన్నింత గౌర వించిన రాయలు పెద్దన్నను కావ్యము వ్రాయవలసినదిగా కోరిరట. దానికి ప్రత్యు త్తరముగ నొకపద్యము. ఏమని—

"నిరుపహతిస్థలము, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము, ఆత్మకింపయిన భోజనము, ఉయ్యాలమంచము, ఒప్పుతప్పుల నరయజాలు రసజ్ఞులు, ఊహలను తెలియ గల వ్రాయసకాండ్రు-పాఠకులు—ఈసామగ్రి యంతయులేనిదే ఊరక 'కావ్యము ను రచింపు మనిన సాధ్యమా ?"

ఇది యవిధేయుని మాటయేకాని నిజ ముగ కవి కివన్నియు నగత్యమైనపక్షమున ప్రపంచమునందొక కావ్యముగూడ జన్మమెత్తు సంభవ ముండియుండదు. ఆ కాలమునం దింతటి సుఖలోలతను, అవిధేయతను గనబరచు ధైర్యము ప్రజలకును, దానినుదాసీనదృష్టితో జూచు నుదారత ప్రభువులకును గల సంస్కృతిసన్నివేశము లుండినవని చెప్పుటకు పైవిషయ ముదాహరించితిని.

ఇటువంటి సమయమున పుట్టినకావ్య ములు నిస్సారములుగ, నీరసములుగ నుండ సాధ్యములేదు. జీవనము నిండారి పొంగులు వారుచున్న సమయమున కేవలనిర్జీవరచన యెట్లు తలచూపనోపును ? ఆ దాక్షిణాత్య సామ్రాజ్య మంతర్ధానమై, సన్నసన్న పాళె ములుగా దేశము చీలి, పరదేశీయుల రావడి విద్యుచ్ఛక్తివలె నరమునరమునకును వ్యా పించి వేధించుచున్నందున పదునేడవ శతాబ్ద మునుండి యిటీవల నిప్పటివరకు వచ్చిన తెలుగుసాహిత్యము, కేవలము సంప్రదాయ మను గడ్డిపోచను పట్టుకొని స్వరూపమును, స్వధర్మమును మరచి, మనుగక తేలక జీవచ్ఛవముగనున్నదే కాని రాయలనాటి వాఙ్మయమువలె లేదు.

సర్వాంగసుందరమైన సాహిత్యమును దృష్టియం దిడికొని చూచువారికి రాయల నాటి రచనయందు కొన్ని లోటుపాట్లు కన పించవచ్చును. అందులో ప్రవాహియైన వస్తువులేదు. ప్రధానకథ ఉపకథలకు తోక

వలె నుండుటయే సామాన్యధర్మము. కథ యందు వైవిధ్యముగాని, వైచిత్ర్యముగాని చిక్కుట అపురూపము; అనావశ్యకముగ పెంచిన అవాంతరవర్ణనలు హెచ్చు; పాత్రలయొక్కయు, రసభావముల యొక్కయు స్వరూపమునకు సహజమైన మితిని దెలిసికొని వ్రాయుట విరళము; ఆకస్మికమైన సంకోచ, విస్తరములకు మితిలేదు. మాటల ఆనుకూల్యము, సందర్భశుద్ధి, గంభీరమైన వ్యంజనాప్రధానమైన రచన ఇత్యాదు లపూర్వము. వివేచనాపూర్ణమైన సాహిత్య మా కాలమున తక్కువయని ఒక్కమాటలో చెప్పవచ్చును. ఈ దోషము లన్నియు ౧, ౯ శతాబ్దముల కిటీవలి సంస్కృతసాహిత్యమునందే నిండియున్నందున, దానిసీడలో బెరుగుచు వచ్చిన తెలుగుసాహిత్యమునందు మొదటినుండియు జన్మసిద్ధముగ వచ్చియున్నను కృష్ణదేవరాయలకాలమున మిక్కిలి స్పష్టముగ గోచరించినవి.

ఇట్లున్నను నా కాలపు మనుష్యజీవన మందు నెలకొనియున్న ఆశ, అభిమానము, ఆగ్రహము, వివేకము, అవివేకము, రుచి, అసహ్యము మున్నగునవి అనేకవిధములుగ ఆనాటి కావ్యములందు ఏరాళముగ ప్రతిఫలించియున్నందున ఆసాహిత్యము అనేకశః తేజస్విగనున్నది. దానిని చదువునప్పుడు అక్కడి కథా-పాత్ర-సన్నివేశములు ఏస్వర్గమునకో పాతాళమునకోసంబంధించియున్నను మానుష్యముయొక్కమేరను పూర్తిగ విడువకయున్నందున, ఇది మన ప్రపంచమే యను నభిమానము మనకు ఎప్పటికిని చెదరక నిలిచియున్నది. రాయల ఆముక్తమాల్యద, పెద్దన్న మనుచరిత్ర, తిమ్మన్నపారిజాతాపహరణము, సూరనకళాపూర్ణోదయము, తిరువేంగళనాథుని పరమయోగివిలాసము, తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము మొదలగు గ్రంథములన్నియు సాక్షాత్తుగనో, పరంపరగనో ఆనాటి జనజీవనము యొక్క స్థూలసూక్ష్మరూపములను చిరస్థాయిగ జేసినవి. వీనిని చదువకపోయిన, చరిత్ర గ్రంథముల నెంతచదివినను ఆనాటి సమాజస్వరూపమును ఇంచుకైనను గ్రహింప సాధ్యములేదని ధారాళముగ జెప్పవచ్చును.

[‘జయకర్ణాటక’ విజయనగరాంకమునుండి యనువాదము]

---

# స్మృతి

పెమ్మరాజు లక్ష్మీపతి

నిన్న నవ్యయౌవని, రమణీయమూర్తి; - నేడు పిడికెడుబూడిద !; నిన్న నిండు
చంద్రికలుసోక విరిదోట సంచరించు - నేడు నడుకాట చితిలోన నిలిచియుండు !
అంతలో పండువెన్నెల లంతలోనె - కటికచీకటి మసిబూయు కారుమొయిలు !
శ్రావణనిశీథ సమయంబు చందమిదె - నెపుడును వసంతమనుకొన్న యీజగంబు !
మృత్యుదేవతకోరల మెఱుగు లేమొ ? - మేము వెన్నెలలనుకొను మింటికళలు —
చిఱుతకంకాళమాలిక లఱుతఁదాల్చు-టదియు నొక యందమేమొ? లోకాధిపతికి—

రేకులురాల్చి నిల్చిన శిరీషలతాంతసువృంతమట్లు నీ
యాకృతి భూమిపై శిథిలమయ్యెను; నన్గొనిపోవు భావనా
లోకపు జిల్గుతారకలలో సుధ లూరెడుచంద్రబింబమై
నీ కమనీయరూపము ఘనీభవమందిన కాంతి నీమమున్.

లలితములైన పూవులు వెలార్చిన జీవన సూర్యమండలో
జ్జ్వలరమణీయ దివ్యదివసంబులు గ్రుంకెను; నెడార్గ్రుడ్డి వె
న్నెలబయలన్ బికారికరణిన్ దిరుగాడుచు నేను, నిట్టె ము
క్కలయిన నీ సురూప చషకంబున నొల్కు త్రేనె లానగాన్.

మధురచైతన్య మధుమయమైనవ్యక్తి ! - పూర్ణముక్తాగుళుచ్ఛ సంపుల్లశుక్తి !
అపుడె వికసించె; నంతలో నబ్ధిఁగ్రుంకె- తేనెగొనరాక ముత్యముల్ దీయరాక !
ఏవినూతన సృష్టికై యీమనోజ్ఞ - యౌవనాకారరమ, బలియయ్యె నిపుడు ?
అగ్గిరాకాసి నాలుకలాడినట్టి - చితిపయి గులాబులే వికసింపకున్నె ?
నిత్యయౌవనవై నీవు నింగినడుమ - దేజరిలుచుండు కార్తిక దీపమటుల
నిండుచలినీట మంచులో నిలిచి; నిన్ను- గాంచి జపియింతు నొకకల్పకన్నెవోలె.—

---

# 'కవిసంశయవిచ్ఛేదము'

## విశ్వనాథ వెంకటేశ్వర్లు

ఈ గ్రంథము రచించినవాఁడడిదము సూరన్న. ఈతఁడు పదునెన్మిదవశతాబ్దాంతమునఁ బేరెన్నికగన్న యాంధ్రకవి. సర్వలక్షణసారసంగ్రహకర్త యైన కూచిమంచి తిమ్మకవియు, నీయనయు నించు మించుగ నొకకాలమునకుఁ జెందినవారు. తిమ్మకవి ౧౭౫౭ వఱకును జీవించియున్నట్లును, సూరన ౧౭౮౦ వఱకును జీవించియున్నట్లును గనఁబడుచున్నది. ఇట్లు సమకాలికులైన వీ రిరువురును లక్షణగ్రంథములను వ్రాసిరి. వీ రిరువు రొసంగిన లక్షణములలోఁ గొంత సాదృశ్యముగూడ గోచరించుచున్నది.

'ప్రవాహినీ దేశ్యా' యనుటనుబట్టి ప్రవాహ రూపమున నిత్యమును మార్పులను జెందుచు జీవవంతమైయుండు భాషకు లక్షణముచెప్పుట తేలికకాదు. కావుననే 'భాషేయ మమితా తత్ర దేశ్యా చిత్ర స్వభావయు' క్కని యథర్వణుఁడు చెప్పియున్నాఁడు. నన్నయగారిమొదలు నేఁటివఱకును దెలుఁగునకుఁ బుట్టిన వ్యాకృతులు పూర్ణములైనవి కావని విమర్శకులు చెప్పుచున్నారు. అనుశాసితములుగాని ప్రయోగములును, లోకడలును నెన్నో యింకను భాషయందు మిగిలి పోయియున్నవి. ఇది మది నెంచియేకాఁబోలు సూరన తిమ్మనలు కొన్నివిశేషప్రయోగములనుమాత్రము చూపించి విడిచిరి. లేదా, వీరు తమ వ్యాకృతులను నన్నయాదుల వ్యాకరణముల కనుబంధములుగా నుండునట్లు రచించి యుండవచ్చును. కాని వీరి రెండుకృతులును నన్నయాథర్వణుల వ్యాకృతుల కనుబంధములుగాఁ దోఁచుట లేదు.

ఆంధ్రవ్యాకరణములు విస్పష్టములైన రెండు సంప్రదాయములకుఁ జెందియున్నవి. ఒకటి నన్నయగారి సంప్రదాయము. నన్నయగారి చింతామణి కథర్వణుని కారిక లనుబంధములైనవి. అప్పకవి దానికిఁ దెలుఁగుపద్యములతో వ్యాఖ్యానము వ్రాసెను. రెండవ సంప్రదాయము కేతనది. ఈతఁ డాంధ్రభాషాభూషణమును రచించి, యందుఁ దానే తెలుఁగునకు మొదటి వ్యాసకర్త నని చెప్పుకొనెను. విన్నకోట పెద్దనయుఁ గేతనత్రోవనే త్రొక్కెను. కేతన పెద్దనల గ్రంథములను బరిశీలించినవారి కారెండును నేకసంప్రదాయమునకుఁ జెందిన వనువిషయము గోచరింపకపోదు. ఇందులకు రెండుదాహరణములను జేర్కొందును.

కేతన పెద్దన లాంధ్రభాషను విభజించుపట్టున నైదుభాషలుగా విభాగముచేసిరి. తత్సమ తద్భవ దేశ్య గ్రామ్యములు గాక యన్యదేశ్య మనుదానిని దేశ్య భాషయం దొకభాగముగాఁ జెప్పిరి. నన్నయగారి చింతామణియం దీవిభాగము గానరాదు. "తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి" ఇదిగాక వీరిసంప్రదాయములకు భేదము గలదనుటకు మఱియొక ప్రబలప్రమాణము కలదు. చింతామణియందు "తద్ధర్మ వర్తమానాతీతా గామ్యర్థకాః క్రియా జ్ఞేయా" యని నన్నయగారు సూత్రించిరి. కేతన యీతద్ధర్మక్రియల మాట యెత్తనేలేదు. "నానావచనంబులు కాలత్రితయంబున నలవడి యీక్రియలు చెల్లు నభినవదండీ" యని కేతన వాకొనెను. ఇట్లే వీరివి ప్రత్యేకసంప్రదాయములనుట కింకను గొన్నిప్రమాణములను జూపవచ్చును.

అడిదము సూరనయు, కూచిమంచి తిమ్మకవియు నీకేతనసంప్రదాయములోనివారు. వారు తమ గ్రంథములను రచించునప్పు డాంధ్రభాషాభూషణమును మనసులోఁ బెట్టుకొనియే రచించిరి. దీనికిఁ బ్రమాణములను గ్రమముగ నీయఁగలను. అనుబంధగ్రంథము లగుటవలననే వీరు కొన్నివిశేషప్రయోగములను జూపించుటతోఁ దృప్తిఁజెందిరి. 'ప్రయోగశరణం వ్యాకరణ' మ్మనుటకు వీరి గ్రంథములే ప్రమాణము.

ఈ వ్యాసమునఁ గవిసంశయవిచ్ఛేదమునందలి ప్రయోగవిశేషములను బాలకుల యుపయోగార్థమై విమర్శించెదను.

## ఏవకారార్థమైన అకారము

కొల్వరేని—కొల్వరయేని— ఇట్టి ప్రయోగమును జూపి "ఏవకారార్థసంప్రాప్తి హేత్వకార మెనసీ యంగుంబ" నీప్రయోగము చెల్లు నన్నాఁడు. కొల్వరయేని యనునప్పు డిందలి యకారమునకు హేత్వర్థమున్నదని యాకవియభిప్రాయము. కాని యీ హేత్వర్థము 'ఏని' యను నవ్యయముతో సమసించినతరువాత నేర్పడుచున్నదిగాని యంతకుమును దేర్పడుటలేదు. అథర్వణుఁడు 'ఏవావ్యయసమానార్థ షేత్వ మత్వంచ దృశ్యతే' యనుకారిక రచించియున్నాఁడు. 'ఏని' యను నవ్యయమునకు 'ఐనన్' అనునర్థము వచ్చునని సూరన్నయే చెప్పియున్నాఁడు. అట్టిచో నేవకారార్థము నిచ్చు నకారమునకు హేత్వర్థము చెప్పుట యుక్తముగాఁ గన్పట్టదు. ఇట్టిచోట భవిష్యదర్థము చెప్పవలయునని కూచిమంచి తిమ్మనగారి యభిప్రాయముగాఁ గన్పట్టుచున్నది. "ఇమ్మమీఁద భవిష్యదర్థమ్ము చెప్పపదమునూ మీదనేని య న్పదము నిలుపునపుడు సంధుల నగునేని యగునయేని యనఁగనొప్పు" అని యాయన వ్రాసెను. కాని యీలక్షణము సర్వతోముఖమైనది కాదు. 'పదమునూమీద'నని నిర్దేశించుటచేతఁ "జేసితిరయేని, నియతమయేని, నిల్వరయేని" మున్నగు ప్రయోగములకు లక్షణము లేకపోవుచున్నది.

## క్త్వార్థేకారసంధి

సూరనగారు 'ఇడఁగవచ్చును వ్యాప్యమై నిత్యసంధి' యని సూత్రించినారు. ఈతఁడు 'క్త్వార్థేతో నభవేత్సదా' యనునాథర్వణోక్తి గమనించియుండఁడు. ఈతఁడు చూపిన లక్ష్యములలో 'ఎఱిఁగించిపుడే' యనునది తిక్కనగారి ప్రయోగము. దానికి 'నెఱిఁగించితగఁ' అను పాఠాంతర మున్నది. 'అందిమ్ము' అను ప్రయోగమును శబ్దపల్లవముగా సమర్థించుకొనవచ్చును. "అల్కఁజూపి నకులుఁడు" అను పింగళిసూరన్నగారి ప్రయోగము లక్ష్యముగా నీయఁబడినది. ఇది శ్లేషస్థానము. ఈపద్యము రాఘవపాండవీయములోనిది. భారతార్థమునఁ 'జూపి + నకులుడు' అనియు, రామాయణార్థమునఁ జూపి + ఇనకులుఁడు, ననియుఁ బదచ్ఛేదము కావించుకొనవలయును. రామాయణార్థమునందుమాత్రమే యీ క్త్వార్థేకారసంధి విషయము వచ్చుచున్నది. కాని యిట నాంధ్రవ్యాకర్తల సంప్రదాయమునుబట్టి దీనికిఁ బ్రామాణ్యము ఘటింపవచ్చును. "శ్లేషే సఖండనిర్బింద్వో ర్మేళనం కుత్రచిన్మతమ్" అని యథర్వణుఁడు సూత్రించెను. "వెలుఁగులచేఁ గలధ్వనుల్ గలకలకంఠు"లని వసుచరిత్రకారుని ప్రయోగము. గలధ్వనులని సరళాదిగాఁ జేసి యర్థముచెప్పినప్పు డర్ధబిందువు రాదు. కలధ్వనులని పరుషాదియైనచో నర్ధబిందు వుండును. దీనినిఁ బ్రమాణముగా నొప్పుకొన్నప్పుడు సూరన్నగారి 'చూపినకులుఁ' డనునదియు శ్లేషస్థానముగావున నంగీకరింపవచ్చును. కాని యది యంతమాత్రమునఁ గ్త్వార్థేకారసంధినిఁ బ్రామాణికముసేయు ప్రయోగమమాత్రము కానేరదు. ఎట్లయినను నీక్త్వార్థేకారసంధిప్రయోగములు కవిత్రయేతర గ్రంథములందు లెక్కకుమిక్కిలిగా నున్నవి. ఆధునికవ్యాకర్తలు దీని నంగీకరించుటయే మేలగునుగాని యిది యొక్కొకప్పుడు శ్రుతికి మిక్కిలి కటువై యుండును.

ఈసందర్భమున సూరన్నగారు "ఎక్కడనుండిట వచ్చినా" రను నొకప్రయోగమును జూపినారు. ఎక్కడనుండి + ఇట—ఇందున్న యుండి శబ్దము ఉండు ధాతువుయొక్క క్త్వార్థరూపమనియు, దానిపై నికారనిత్యసంధి చేయబడినదనియు నీతని యభిప్రాయముగాఁ దోఁచుచున్నది. కాని యీ యుండిశబ్దము వర్ణకము (ప్రత్యయము) కాని పదము కానేరదు. ఇది 'వలన' ప్రత్యయస్థానమున వచ్చి యపాదానార్థమును దెలియఁజేయుచున్నది. ఎక్కడనుండి + ఇటకు- ఇకారసంధి వైకల్పికము గావున నిట నిత్యసంధియై 'ఎక్కడనుండిటు' యని యైనది. సూరన్నగారి యభిప్రాయము ప్రామాదిక మనుటకు సందియము లేదు. కాని యిక్కడ నొక విషయము విచార్యమగుచున్నది. ఎక్కడ నను శబ్దమునకు లోకములో నేస్థలమునందని సప్తమ్య

ర్థము కానవచ్చుచున్నది. అందుచేత నెక్కడనుండి యనుచో నర్థగతినిబట్టియైనను రెండు ప్రత్యయము లొక ప్రాతిపదికపైఁ బుట్టిన ట్లయినది. ఇట్లు జరుగుట భాషా సంప్రదాయము కాదనవచ్చును. కాని యీ 'ఎక్కడ' పదమున కీ పట్టున శక్తిమన్మాత్రత్వము నంగీకరింపవల యును. "అంద్వాదీనాం శక్తిమన్మాత్రతాపి క్వచి దిష్యతే" యని యథర్వణోక్తి కలదు. దీని నంద్వాదిగ ణమునందుఁ జేర్చినచో నీ సంశయము నివారింపఁబడును. అదియునుగాక, ఏ + కడ = ఎక్కడ. త్రికసంధివలనఁ గలిగిన రూపమిది. కడశబ్దమునకు స్థానమను నర్థముకూడ నున్నదని శబ్దరత్నాకరము చెప్పుచున్నది. 'ఎక్కడ యనఁగా నే స్థానము' అని యర్థము. అదియును గాక 'దేశ్యమునం దక్కడాదులు నిత్యైక వచనాం తములని' సూత్రించిన ప్రౌఢ వ్యాకరణకారుని యభి ప్రాయమునఁ గూడ నీ శబ్దమునకు శక్తిమన్మాత్రత్వ మున్నదని తేలుచున్నది. ఎక్కడనుండి యనుచో మధ్య గానున్న ద్రుత మెక్కడిదని ప్రశ్నించినచో నుండిశబ్దము పరంబగునప్పుడు వలనకు ద్వితీయా సప్తము లగునను చిన్న యసూరిగారి కారక పరిచ్ఛేదాంతర్గత సూత్రమే సమా ధానమగును. "పరేష్వాంద్యాదిశబ్దేషు సప్తమ్యర్థే విభక్తయః" అని యథర్వణకారిక. ఆద్యేయనఁగా బ్రథమ ద్వితీయా విభక్తులు. ప్రత్యయదశయందైనను నీ యుండి శబ్దమునకు 'స్థిత్వా' యను నర్థమే యగునను పట్టుదల యున్నను నిది క్త్వార్థేకారసంధికి సార్వత్రికమైన ప్రయోజకము కాఁజాలదని మనవిచేయుచున్నాఁడను.

### అకారేకారముల సంధి

"ఆంధ్రపదముమీద నచ్చుగూర్చిరయేని గలసి యుండు నొకెడ గలియకుండు"నని చెప్పి ఆనతిచ్చు, ఆనతియిచ్చు నను రూపముల నికారసంధికి లక్ష్యము లుగా నిచ్చియున్నాఁడు. ఇది సంపూర్ణమైన లక్షణము గాదని తోఁచెడిని. ఆనతిచ్చు, ఆనతియిచ్చునను రూపము లుండుఁగాక, ఆనతి నిచ్చు నను రూపముగూడ నుండ వచ్చును గదా! ఇచ్చుధాతువు సకర్మకము. అది పరమై నప్పు డానతిశబ్దము కర్మకారకము కావలయును. ఆన తిన్ + ఇచ్చు = ఆనతినిచ్చు; ద్రుతవైకల్పిక సంధి ప్రవ ర్తించి 'ఆనతిచ్చు' అని యగును. (హరికిన్ + ఇచ్చు = హరికి నిచ్చు, హరికిచ్చు—దీనివలె) ఈ ప్రక్రియా పద్ధతిలో నానతియిచ్చు ననురూపమమాత్రము రాదు. అప్పుడు దానిని సంధ్యభావముగాఁ గైకొని యడాగ మము చెప్పికొనవలయును. ఆనతియను శబ్దమన్నచో ద్వితీయార్థంబునన్నైన ప్రథమాంతముగాఁ బరిగణింపఁద గును. ఈ ప్రక్రియ శాస్త్రీయమైనదిగాని, సూరన్న గారి త్రోవ సమంజసమై యుండలేదు.

ఈ సందర్భమున వీరీ వైకల్పికసంధికిఁ 'గొమ్మ కల్లు హల్లొకడు దక్క'నని నిషేధముచెప్పి దానికి నిట్టార్పు, కట్టాకలి, యను లక్ష్యములను జూపించిరి. దీనినిబట్టి నిట్టు + ఊర్పు = నిట్టూర్పు, కట్టు + ఆకలి = కట్టాకలి యని పదచ్ఛేదము చేసికొనవలసియుండును. ఇది చిన్నయసూరిగారి మతమునకు విరుద్ధము. లోకము నందును నిట్టిది కానరాదు. నిడు + ఊర్పు = నిట్టూర్పు, కడు + ఆకలి = కట్టాకలి- ఇదియే సరియైన ప్రక్రియ యగును. 'నిట్టడవిఁ జిట్టి' యను సూత్రముచేఁ బ్రౌఢ వ్యాకరణకారుఁడు చిన్నయను దిద్దెనుగాని యది చిట్టి శబ్దమున కొక్కదానితోడనే పర్యాప్తమైనయది. ఇది యిట్లుండ నీ సంధి నుకారనిత్యసంధిగాఁ జెప్పవలసినది. సూరన్నగా రిందు హల్లులకుఁ బ్రాధాన్య మిచ్చుటయుఁ గ్రొత్తగానే యున్నది.

### మిశ్రకర్మధారయము

కర్మధారయ సమాసముచేయునప్పు డకారాంత మైన తెలుఁగుపదము మీఁది సంస్కృతపదముతో సమ సింప వచ్చునని సూరన్నగారు గ్రంథములయందలి చిఱుతశశి, అన్నువబ్రహ్మచారి, ఎంతసుమతులు, వలు దకుచకుంభములు మున్నగు నుదాహరణముల నిచ్చి యున్నారు. ఆంధ్రభాషాభూషణకర్తయైన కేతన వాఁడి మయూఖములు, వేఁడిపయోధారలు, లేనరుమనుష్యుఁడు, పేర్చు నశ్వము లని యికారోకారాంతములతో సమ సించు బ్రయోగములే చూపుటచేతఁ దాను అదంతము లైన తెలుఁగుపదములతో నైన సమాసములనుగూడఁ జూపింపలేదనెను. కాని యీ యుదాహరణములలో 'చంద్రికపూవన్నె జిలుగుసువ్వలువను తెడియొత్తె నొక్క

క్రాంతాలలామ'యని పారిజాతాపహరణములోని పద్యపాదము నుదాహరణముగా నిచ్చియున్నారు. చంద్రిక పూవన్నె జిలుగుదువ్వలువ యనునది సమాసకముగాని సమాసము కాదు. ఇది వీరి లక్షణమునకు లక్ష్యముగాఁ జెల్లదు. జిలుగుదువ్వలువ యనుచోట జిలుగుశబ్ద మకారాంతమగుటచే వీరు కావించిన ప్రతిజ్ఞయు వీగిపోయినది. చిలుతశశి మన్నగువానిని "సంస్కృత వైకృత శబ్దై ర్మిశ్రసమాస స్సఏవ విజ్ఞేయః" యని నన్నయ్యగారును నంగీకరించినారు. సిరివల్లభుఁడు మన్నగు కర్మధారయేతరములు లేకపోలేదుగాని దానిని శ్రీవల్లభుఁడను సమస్తపదమునకుఁ దద్భవముగా సమర్థించుకొనవచ్చును. తద్భవపిశలోనైనను మిశ్రసమాసత యున్నదనినచో సూరన్నగారి కర్మధారయమునందు మాత్రమే యీరూపము లగు ననుదానికి భంగము రాక తప్పదు.

## షష్ఠీవిభక్తి విశేషణమునకుఁ బ్రథమ

'అగునను క్రియతోఁ బాసియుఁ, దగుఁ జెక్కు విభక్తులం బ్రథమచెందు'నని సూరన్నగారు లక్షణము వ్రాసి షష్ఠీ విశేష్యములకేకాక, తృతీయా విశేష్యములకుఁ గూడ విశేషణములు ప్రథమలో నుండుటను జూపిరి. 'షష్ఠీ విశేషణానాం ప్రథమాస్యా'త్తను చింతామణి సూత్రము నథర్వణుఁడు "భ్వాద్యర్థ వ్యవధానేతు భేద్యస్య నిఖిలం భవే"త్తని విపులీకరించెను. దీని నాధారము చేసికొనియే యహోబలపండితుఁడు "ఆద్యుఁడు హిరణ్యగర్భునందంతకంబె నిత్యాది కవితాపితామహోక్త్యుక్తిస్తు నిర్మూలైవ" యని ఖండితముగ వ్రాసెను. సూరన్నగారు పైనిఁ జెప్పిన లక్షణ మహోబలపండితుని పోకడను దిద్దునదై యున్నది. కవులనుబట్టి వ్యాకరణము గాని, వ్యాకరణమునుబట్టి కవులుగా దనుట కీలక్షణము ప్రమాణమగుచు సహృదయజనాదరార్హ ముగ నున్నది.

## తొడిగి – తొడి

సూరన్నగారు తొడిగియని పల్కుచోటఁ దొడి యని చెప్పవచ్చు నన్నారు. చూడఁగాఁ దొడిగియను నసమాపక క్రియయందలి గివర్ణలోపముచేఁ దొడియను రూపాంతరము లభించుచున్నదని వీరి యభిప్రాయముగా నుండనోపును. కాని యీ ప్రక్రియ సరియైనట్లు తోఁపదు. తొడుగు ధాతువుయొక్క క్త్వార్థరూపము తొడిగియైనట్లే తొడు ధాతువుయొక్క క్త్వార్థరూపము తొడి యగునని శబ్దరత్నాకరకారుని యభిప్రాయము. ప్రయోగముల వైఖరినిబట్టి యీ పద్ధతియే సరియైనది. ఇదియునుగాక, సూరన్నగారు 'ఊటుడిలి-ఊటుడి, తెప్పిరిలి-తెప్పిరి' యను ప్రయోగములు గలవనిరి. ఇక్కడఁ గూడ నీశబ్దముల యంతమునను లివర్ణము లోపించి యూటుడి, తెప్పిరి రూపము లైనవని వీరి యభిప్రాయము. ఇది ప్రమాదజనితమైన యూహ. ఊటుడు, తెప్పిరు ననునవి స్వతంత్రములైన ధాతువులు. వానిమీఁది క్త్వార్థరూపములు ఊటుడి, తెప్పిరి యని యగును. ఇంక నూటుడిలి, తెప్పిరిలి యను రూపముల ప్రక్రియ యిట్లూహింపనై యున్నది. ఊటుడు, తెప్పిరు ధాతువులపై స్వార్థమునం దిల్లుప్రత్యయము వచ్చి యూటుడిల్లు, తెప్పిరిల్లు నని యైనవి. అప్పుడు 'తత్రోభయో ర్భవే దేకో లకార ఇతి కేచన'యను నాథర్వణోక్తినిబట్టి ఊటుడిలు, తెప్పిరిలు నను రూపములు రాఁగా, వానిపై నికారము (బాలవ్యా-క్రి-ప. ౩౮) పుట్టియూటుడిలి, తెప్పిరిలి యని యగును. శాస్త్రీయమైన ప్రక్రియ యిట్లుండఁగా సూరన్నగారి వచన మాదరార్హము కానేరదు.

## జగదాదులు

జగచ్ఛబ్దమునకు జగము, తేజోయశస్తపశ్శబ్దములకుఁ గూడ నట్లే మువర్ణము నగునని సూరకవిగారు చెప్పినారు. జగచ్ఛబ్దమునకు జగత్తను ద్విత్వోత్వములు గలిగిన రూపమును గలదు. ఇది యనఘవర్ధనములోనిది. తేజోయశస్తపశ్శబ్దముల నేకరాశిగాఁ జెప్పుట యుచితముకాదు. తేజస్సు - తేజము, యశస్సు- యశము-ఇట్టి రూపములు గలవు. తపశ్శబ్దము తపస్సు, తపసు, తపము నని మూఁడు రూపములను బొందును. ఇది మనః ప్రభృతులలోనిది. సుప్తార్థ ప్రకాశికాకారులు వక్షుసు, తేజసు, ఉరసు రూపములఁ గూడ నీగణములోఁ జేర్చినారు. దీనికిఁ గవుల ప్రయోగము లున్నవేమో, చింత్యము.

## కొనని-కోని

సూరకవి, కొనని-కోని, చావక-చాక, పోవక-పోక-ఇట్టి రూపము లగునని చూపినారు. వీరు చెప్పిన

లక్షణము పూర్ణమనుటకు వీలులేదు. 'కొనని' యను వ్యతిరేకార్థక ధాతుజవిశేషణము నుదాహరించి యీ ప్రక్రియ నంతవఱకే నిబంధించుటవలన ఇచ్చుకోలు, తెచ్చుకోలు మున్నగు కృదంతరూపములవు, ఊకో (కాకిఘుడము) మున్నగు విధ్యర్థక క్రియారూపములను నిషేధించిన ట్లయినది. (చూ. శా. వ్యా. ౬౦. క్రి. ప.)

చావక, పోవక-ఇవి కూడ వ్యతిరేక క్రియలే యుదాహరింపఁబడినవి. కాని చిన్నయసూరిగారి 'చచ్చు నొచ్చులకుఁ జావునోవు లగు'నను సూత్రమే సరియైన ప్రక్రియాపద్ధతిని సూచింపఁజాలునది. కాని చాక, చాని మున్నగు రూపములనుబట్టి యీయాదేశము చా యను ద్రుతాంతమైన యేకాక్షరమే యనిపించుచున్నను, చావక, చావక మున్నగు రూపములకుఁగూడఁ బ్రక్రియా సౌలభ్యము కలుగఁజేయుటకై సూరిగారు తమ క్రియా పరిచ్ఛేదములోని ౬౮, ౬౯ సూత్రములచేత విషయము సంగ్రహించిరి. చచ్చునొచ్చులకుఁ జావునోవులు కృదంతనామవాచకము లనుటయు, నిచ్చటి ప్రక్రియాపద్ధతిలో నవి యాదేశము లగు టయుఁ జూడ నీరెండు సందర్భములకు సమన్వయము కుదురుటలేదు. పోవక శబ్దవిషయములోఁ బోవుధాతు వునకుఁ బోయను నాదేశ మంగీకరింపవలసియుండును. సూరిగారు క్రియా ౬-౫౭ సూత్రములో 'వు' వర్ణలోపము చెప్పిరి కాని యీ 'వు' వర్ణలోపము దుజ్మత్తులు పరంబగునపుడే యని నిబంధనముచేసిరి. పింగళిసూరన్న గారు కళాపూర్ణోదయమునఁ బోచుక్ అని ప్రయోగించియున్నారు. వర్తమానార్థక చువర్ణము మత్తు క్రిందికి రాదు. సూరిగారి సూత్రమునుబట్టి యామహా కవిప్రయోగము నప్రామాణిక మనవలసివచ్చును. ఇట్లే సూరకవిగారు ఇయ్యనికి 'ఈని' యనురూప మగు ననిరి ప్రక్రియాదృష్టిలో నిదియును సంగతము కాదు. ఇచ్చు ధాతువు. ఈ యను సర్వాదేశము. దానికి వ్యతిరేకార్థమున నిజి యై ఈని యనురూప మేర్పడు చున్నది.

## మార్కొందు-మార్కొండు

ఉత్తమపురుషను జెప్పునప్పుడు మార్కొందు ననుట యందముగాదనియు, మార్కొండునని యుండఁ దగుననియు సూరకవిగారు చెప్పిరి. చిన్నయసూరిగా రీరూపమును తమ క్రియాపరిచ్ఛేదమునందలి ౫౭, ౫౮ సూత్రములయందు సమర్థించిరి. ఉందురు - ఉంద్రు, అందురు-అంద్రు ఇత్యాదిరూపము లున్నవనిరి. దీనిచే నథర్వణుని 'నా త్పరస్య భవే ద్దస్య డాదేశో వా రువర్ణకే' యను కారిక ననువదించినట్లయినది. అను కొను మున్నగు నన్వాదులు నాంతములు. ఈ కారికలో 'నా త్పరస్య' యని యుండుటవలన నిది యన్వాదు లకే చెందునుగాని యుండుధాతువునకుఁ జెందదేమో యను సంశయము పుట్టవచ్చును గాని సూరిగా రుండు ధాతువునుగూడ నన్వాదులయందే పరిగణించిరి. (చూ-శా-వ్యా-౫౭. క్రి-ప.) అదియును గాక "అనుస్వారస్య యయి పరసవర్ణః" అను సంస్కృత సంప్రదాయానుసారము ఉణ్డు అనురూపముచేసి, ణనల కభేదము చెప్పి, సత్వమును సాధింపవచ్చునని తోఁచెడిని. విజ్ఞులు విమర్శింతురుగాక.

## కొన్ని హలంతములు

కొన్ని హలంతశబ్దముల నూదిపలుకుచోటఁ దేల్చి పలుకవచ్చునని ఇంద్రజితుఁడు, పరీక్షితుక్, ఊర్ధ్వరేతసుమరుతులు, వాడునకు, గమికర్మీకృతనైకనీవృతుఁడు జలరుహంబులు, మనసు, ముదితచేతులు ననురూపముల నుదాహరణములుగా నిచ్చిరి.

ఇంద్రజిత్తు — ఇంద్రజితుఁడు ననురూపముల నహోబలపండితుఁ డుదాహరించెను. ఇది యగుణవద్గణములోనిదే. కాని యీగణములోని మహద్శబ్దములకుఁ బ్రథమాంతరూపములమీఁదనే యుత్వదుజ్ఞులు చేర్ప వలయునని యాతని యభిప్రాయము."ప్రశానుఁడు"రూప ముదాహరింపఁబడినది. సూరిగారు దీనిని గొంచెము వివరించి యింద్రజి యనురూపమునుగూడ సాధించిరి. ఇంద్రజిత్తుఁ డనురూపము గుప్తార్థ ప్రకాశికలో నుదాహరింపఁబడినదిగాని గుణాగుణవద్గణముల యుభయకార్యములును నేకరూపమునందే జరిగిన దగుటవలన దాని నంగీకరింపఁజాలరైరి.

పరీక్షిత్తు, పరీక్షితుఁడు — ఇదియును పైదాని వంటిదే. సూరిగా రీశబ్ద విషయము నెత్తలేదు.

మరుతు లను శబ్దమునుగూడ నిట్లే సాధింపవచ్చును. కాని యహోబలపండితుఁడును జిన్నయసూరి యుఁగూడ మరుత్తను ద్విత్వోత్వములు గల రూపమును మాత్రమే యిచ్చిరి. ఇది యమహద్రూపము. మహద్వివక్ష యందు మరుతులన్న రూప మగును. అగుణవర్ధనము నందలివానికిఁ బ్రథమైకవచనమును, గుణవర్ధనమునకు ద్వితీయైకవచనమును బ్రాతిపదికగాఁ దీసికొనుట ప్రాచీన సంప్రదాయము. చింతామణి హలంతపరిచ్ఛేదములోని మొదటి రెండు సూత్రములు చూడుఁడు. కాని సూరకవి గారు ద్వితీయతరంగములోని నాల్గవలక్షణమున

"కం॥ మహిత హలంత ప్రథమా
బహువచనాంతాక్షరములపై నిలుపఁదగున్
బహుళాకారాంత పదా
నిహిత ప్రథమావిభక్తిని యతిఁ దెలుఁగునన్"

అని వచించిరి. గోత్రభిదుఁడు, ఏతాదృశుఁడు మన్నగు రూపములను దీని కుదాహరణములుగాఁ జూపించిరి. మరుతు లన్న శబ్దరూపమునుగూడ నిట్లు సాధింపవచ్చునని వీరి యభిప్రాయమై యుండవచ్చును. మరుతః అను ప్రథమాబహువచనముపై విసర్గ లోపింపఁగా సుత్వడుజ్ఞులు, బహువచనమున లువర్ణమును గలిగి యీరూప మేర్పడుచున్నది. జలరుహంబు లను రూపముగూడ దీనిచే సంగ్రహింపఁబడును. అట్టిచో వీరు ప్రథమతరంగములోని యీ పదియవలక్షణమును జెప్ప నావశ్యకతయే కన్పట్టదు. ఈ ప్రక్రియాపద్ధతి విచారింపఁ దగియున్నది. ఎట్లయినను నిది సార్వపదీనమైన లక్షణ మనుటకు వీలులేదు. ద్విట్టు.ద్విషుడు మన్నగు శబ్దముల యుభయరూపములకు నీలక్షణము సాధకమైయుండదు.

ఊర్ధ్వరేతసులు—ఇది సమాసాంత విషయము. 'యథాప్రకృతి సర్వత్ర సమాసాంతవిధి ర్స్థితః, నిత్యతా క్వచి దిష్టా స్యా ద్రూపం గ్రాహ్యం సుధీహితమ్' అను నథర్వణోక్తిలోని క్వచిచ్ఛబ్దసారస్యమువలన నిట్టి రూపములు సాధువు లగుచున్నవి. ఆద్యప్రకృతియందే సమాసాంతవిధి వైకల్పికము. రేతశ్శబ్దమును బ్రత్యేకముగాఁ దీసికొన్నయెడల దానిని బయః ప్రభృతులయందుఁ జేర్పవలయునని తోఁచెడిని. రేతము అనురూపము ప్రసిద్ధము కాదు. వక్షుసు, ఉరసు అను రూపములను జూపిన సుప్తార్థప్రకాశికాకారుని మతమునందైనచో దీనిని మనః ప్రభృతులయందుఁ జేర్చుకొనవచ్చునని కన్పట్టెడిని.

వాకు - వాక్కు—అహోబలపండితుఁ డీ రెండు రూపముల నంగీకరించెను. 'ద్విత్వంతు దీర్ఘతో బహుళ' మ్మను సూత్రమునందలి బహుళశబ్దస్వారస్యమున 'వాకు' అను నద్విత్వరూపము లభించుచున్నది.

ముదితచేతులు - చేతశ్శబ్ద మపయః ప్రభృతిగణము లోనిది. 'చేతము' ఈరూపము సుప్రసిద్ధమే.

## దడల కభేదము

దక్కన్నుటకు డక్క నవచ్చునని సూరకవి గారు లక్షణముచెప్పి దక్కన్, దక్కనిత్తురె, దక్కము నను ప్రయోగములను జూపిరి. వీని కుపోద్బలకముగా దగ్గఱ-డగ్గఱ, డప్పి-దప్పి, డిగి-దిగి, డెప్పరము-దెప్పరము- ఇట్లుభయరూపము లుండు నన్నారు. సర్వలక్షణసారసంగ్రహములో శబ్దలక్షణ పరిచ్ఛేదమునందలి పదియవలక్షణమునఁ దిమ్మనగారుగూడ నీ విషయము ననువదించినారు. డక్కను మన్నగువానికి దక్కనఁగూడ దని మద్దరాజు రామనగారు చెప్పిరి. డకారము సంవారనాదఘోష ప్రయత్నములు గలది. (హ్రస్వ-లోనిది) దకార మల్పప్రాణము. కావున వీనిరెంటికి గిట్టదని రామనగారి యభిప్రాయమై యుండవచ్చును. వర్ణముల యభేదమును దెల్పుచు నహోబలుఁడు 'రలయో ర్లడయో స్తద్వ ల్లళయో శ్శసయోరపి, వబయోర్నణయో శ్చాంతే సవిసర్గావిసర్గయోః, సబిందుకాబిందుకయో స్స్యా దభేదేన కల్పన' మను త్రిభోజనశ్లోకము నుదాహరించెను. ఇందు దడల కభేదము చెప్పఁబడలేదు. అప్పకవిగారు గూడ డంభడిండీర డోలికాడాడిమాదిశబ్దములకు దంభాదిరూపము లగునని చెప్పినారు. కాని యభేదవిరతులందు దడలకు యతిఁ జెప్పలేదు. కవిజనాశ్రయకర్త దడలకు యతి చెల్లునన్నను నప్పకవి దాని నంగీకరింపలేదు. అభేదప్రాసమునందుఁగూడ వీని మైత్రికిఁ దావు లేదు.

కాని ప్రాకృత సంప్రదాయములో దడల కభేద మున్నట్లు కనఁబడుచున్నది (దీర్ఘిక-డిగ్గియ). సూరకవిగారు తృతీయ తరంగమునందుఁ దద్భవభాషావిచారములో 'లళనణలకు రేఫలకుఁ దథదధలకు టవల కాదేశంబు డత్వమగు' నని సూత్రించి శ్రద్ధ-సడ్డ, వృద్ధి-వడ్డి రూపముల నుదాహరణములుగాఁ జూపినారు. ఎట్లయినను డిగి, డిగ్గియ, డక్కు మున్నగు రూపములే ప్రాచీనాంధ్రభాషారూపము లనియు, దాదులైన శబ్దము లర్వాచీనములనియు దీనింబట్టి తేలుచున్నది. డక్కు మున్నగు కొన్ని యిప్పుడు వాడుకలోనుండి జారిపోయి, దక్కు మున్నగునవియే నిలచియున్నవి. భాష మాఱుట కిది ప్రబలప్రమాణము.

నాటఁగా - నాడఁగా

నాటఁగా ననుటకు నాడఁగా నని సూరకవి ద్రోణపర్వమునందలి తిక్కనప్రయోగమును జూపిరి. ఇదియుఁ బ్రాచీన భాషాస్వరూపమును దెలియఁజేయుచున్నది.

కొన్ని జాత్యేకవచనములు

సూరకవిగారు కొన్ని జాత్యేకవచనములు గలవని చెప్పి, 'అత్తెత్తి చూచిరి యాకాశమండలాస్థానరత్నంబు నౌత్తానపాది' 'కాము తూపులు వెంద్రుకఁ గట్టఁబడును' 'నృపుల్ తన యాజ్ఞఁ దలన్వహింపఁగన్' అను ప్రయోగములఁ జూపిరి. ఈవిశేషమును బూర్వవ్యాకర్త లెవ్వరును జెప్పినట్లు కన్పట్టదు. 'నృపుల్-తలన్ వహింపఁగన్' అనుచోటఁ దలల వహింపఁగనని యుండుటకు బదులు తలన్ వహింపఁగనని జాత్యేకవచనము వాడఁబడినది. ఇట్టి ప్రయోగములు భాషలో ననేకమున్నవి. అత్తెత్తిచూచిరి, వెంద్రుకఁగట్టఁబడు ననువానివిషయములో నొకమాట చెప్పవలసియున్నది. 'అత్తెత్తి' ఇత్యాది వాక్యమునందు బహువచనాంతమైన కర్త యధ్యాహార్యము. ఆ వాక్యమునందత్తెత్తుటయుఁ, జూచుటయు ననుక్రియాద్వయ మేకకర్తృకంబు. కావుననే యది యసమాపకక్రియ యైనది. చూచుక్రియతో నత్తెత్తు నను క్రియ సమన్వయించుచున్నది. ఇచ్చట 'నత్తెత్తు' అనునది ధాతుపల్లవము. అట్టి దానిని విడఁదీసి జాత్యేకవచనముగాఁ జెప్పవచ్చునా యనునది విచార్యము. చూచుటయందలి యేకాగ్రతావివక్షయు ధ్రువుని యౌన్నత్యవివక్షలయందే యాశబ్దము ప్రయోగింపఁబడిన దగుటవలన దానియందు జాత్యేకత్వము లేదని తోఁచెడిని.

'కాముతూపులు వెంద్రుకఁ గట్టఁబడును.' ఇది విజయవిలాసములోని పద్యపాదము. ఇచ్చట శ్లేషయున్నది. కాముతూపులైన పూవులు వెంద్రుకలయందు ధరింపఁబడునని యొక యర్థమును, నవి విరహోద్దీపకము లగుటచేఁ దృణీకరింపఁబడునని యొకయర్థమును గవి యుద్దేశించినాఁడు. ఇందు మొదటియర్థమునందు వెంద్రుకశబ్దమునకు జాత్యేకత్వము గలుగుననుట తెల్లమే. రెండవయర్థములోఁ దృణీకారమే విషయమగుటవలన జాత్యేకత్వము లేదనవలయును.

ఇట్లే లోకములో నున్న 'వారు కడుపునిండఁ దినిరి. కంటినిండ నిద్రపోయిరి.' యనువానిలోని కడుపు, కన్నులకు జాత్యేకత్వమును జెప్పుటకు వీలు లేదు. కడుపునిండఁ దినుటయు, కంటినిండ నిద్రపోవుటయు భోజననిద్రల తృప్తిగాఢత్వములను దెలియఁజేయు పలుకుబడివిశేషములగుటచే వానికి జాత్యేకత్వలక్షణము పట్టదని తోఁచెడిని. విజ్ఞులు విమర్శింతురుగాక!

క్రియాపదముల సంధి

"తెలియ భూతార్థగోచర దేవమానవ క్రియాపదములు బహువచనయుక్తిగలసి వర్తిల్లు నచ్చులు గలియకుండు"నని సూరకవిగారు లక్షణము చెప్పినారు. "కేలు మోడ్చిరి యమరులు," "చేసిరి యంత" "హర్షించిరి యొండొరుం గదిసి" మున్నగు ప్రయోగము లీయఁబడినవి. "ఇచ్చి రవనిసురులకు" ఇది నిత్యసంధికిఁ బ్రయోగము. ఇట్లు సూరకవిగారు ప్రథమపురుషక్రియలకే యీవైకల్పికత్వమును జూపించినను లక్షణములోఁ బురుష వివక్ష చేయక, దేవమానవక్రియాపదము లనుటవలన నీలక్షణమునకు మధ్యమపురుషక్రియలపైకిఁగూడ నతిచారము కలిగి దోషభూయిష్ఠ మగుచున్నది.

## లోకమునందు-లోకమునయందు

లోకమునం దనుటకు లోకమునయం దనవచ్చునని సూరకవిగారు లక్షణముచెప్పి (ప్రథమ తరంగము ౧౫ లక్షణము) యురమునయందు, దేశమునయందు నను ప్రయోగములు చూపిరి. మఱల ద్వితీయతరంగములో రెండవలక్షణమునందు మనమున, మనమందు, మనమునయందు నని సప్తమి మూడు విధముల నుండునని చూపిరి. ప్రథమతరంగమునందే ౨౬ వ లక్షణమునఁ బురమునందలివా రనుటకు బురమునవా రనఁదగు నని 'గర్భమునవాఁడు,' 'ఎలజవ్వనంబునవిలసనమును' 'వంశమునవాఁడు'నను ప్రయోగములఁ జూపిరి. ఈ లక్షణములఁబట్టిచూడఁగా సూరకవిగారి నకారమెుక్క సప్తమీ విభక్త్యర్థమునందే ప్రవర్తించుచున్నదని యభిప్రాయ పడినట్లు కన్పట్టెడిని. కాని యిది షష్ఠీసప్తమ్యర్థముల యం దుభయమునందును బ్రవర్తించునని ప్రౌఢవ్యాకరణకారుని మతము. (ప్రౌ. వ్యా-సమాసపరిచ్ఛేదము, ౧, ౩౭ సూత్రములు చూడఁదగును.) ఎలజవ్వనంబున విలసనము నుచోట సూరకవిగారి ప్రకారము సప్తమీతత్పురుషము నను జెప్పవలయును. కాని సీతారామాచార్యులవారు దీనిని షష్ఠీసమాసముగానే పరిగణించిరి. నిజమున కిదియే సమంజసమైయున్నది. జవ్వనంబునకు విలసంబునకు నాధారాధేయభావము చెప్పుటకంటె సంబంధమును జెప్పుటయే లోకసిద్ధమైన యర్థగతి యని చెప్పక తప్పదు. మఱియును నీనవర్ణము మతుబర్థమునఁగూడఁ బ్రవర్తించుచున్నదని ప్రౌఢవ్యాకరణములోని తద్ధితపరిచ్ఛేదము ౧౬ వ సూత్రము తెల్పుచున్నది. "ఇట్టి తేజంబునవాఁ డెధమాన్వయమునఁబుట్టునె చెపుమా!" తేజంబునవాఁ డనఁగాఁ దేజముకలవాఁడని యర్థము. చిన్నయసూరిగారు బాలవ్యాకరణములో నీనవర్ణ ప్రసక్తి చేయకపోయినను, "సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు" నను సంధిపరిచ్ఛేదమునందలి ౨౪-వ సూత్రముచే దీని సప్తమ్యర్థ సమన్వితత్వమును జ్ఞాపితమెునర్చి రనవలయును. మెుత్తముమీఁద నీనకారము తృతీయాది విభక్తులన్నిటఁ బ్రవర్తించునట్లు ప్రయోగములు గానవచ్చుచున్నవి. ఉదంతములైన జడవాచకముల తృతీయార్థమునం దీనవర్ణము కానఁబడుచున్నది. (బా. వ్యా. కా. ప. సూ ౨౩) బాణమున వాలిని గూలనేసెనని యుదాహరణము. అజడంబు తృతీయకును నవర్ణక మగునని ప్రౌఢవ్యాకరణ మీలక్షణమును దిద్ది "ఏనుగున నేనుగు వైచుచు" నను భారతప్రయోగము చూపించినది. రామునకై (నివర్ణము కాదు.) క్రతుశతంబునకైయను చతుర్థ్యంత ప్రయోగములు లాక్షణికసమ్మతములు గాకపోయినను లోకవ్యవహారమునందుఁ గానఁబడుచుఁ గొందఱు విమర్శకులకు రుచించుచున్నవి. ఇఁకఁ బంచమ్యర్థమున 'త్రిక్రతు శతంబునకంటె' నని భారతప్రయోగ మున్నదిగాని యహోబలపండితుఁడు 'త్రిక్రతుశతంబున కెన్న' ననుపాఠమే సరియైన దనియు, నిది పంచమ్యర్థమున వచ్చిన షష్ఠియనియుఁ జెరుసుడుత్రోవఁ దొక్కినాఁడు. బ్రహ్మలోకంబుననుండి యను నన్నయగారి ప్రయోగముకలదు. ఈ ప్రయోగమును 'పరే పూండ్వ్యాదిశబ్దేషు సప్తమ్యాద్యే విభక్తయః' అను నథర్వణకారిక రక్షించుచున్నది. ఇట్లపాదానపంచమియం దంగీకరింపఁబడిన యీనవర్ణము క్రతుశతంబునకంటె నను నిర్ధారణపంచమియం దేల నంగీకరింపఁబడఁగూడదో దుర్గ్రాహ్యముగా నున్నది. ఇఁక షష్ఠీసప్తములయం దీనవర్ణప్రయోగము సుప్రసిద్ధమే 'నః కొ' యను నన్నయగారి సూత్రముచే విధింపఁబడిన నకారముగూడ నిదియే యని తోఁచెడిని. ఈ నకారమే దుప్రతబులకు ద్వితీయా ద్యేకవచనంబు పరంబగునపుడు విధింపఁబడిన నిగాగమముగాఁ బరిణమించిన దని తోఁచెడిని. దుమంతంబులపై నిది నిగాగమరూపము దాల్చి పూర్వోదాహృతములైన జడంబులమీఁద నకారరూపము దాల్చుట యొకవిశేషము. ప్రాచీనాంధ్రభాషాలక్షణమైన యీ నకారమిట్లనేకవిధములుగాఁ బ్రవర్తించుచున్నది.

సూరకవిగారు ద్వితీయతరంగ ద్వితీయలక్షణమునందుఁ (పూర్వోక్తమైనది) జెప్పిన మనమునం దనురూపము 'నుమ్చాతః' అను సూత్రమునఁ బ్రవర్తించుచున్నది. మనమందు నను రూపమన్నచో నన్నయాథర్వణుల యనుశాసనమునుబట్టి సమర్థింపవీలుగాకున్నది.

నిజమున కిది మిక్కిలి సులభముగాఁ గాన్పించును. మనము + అందు. 'సంధిర్నా చోచ్యతే' అను సూత్రము ప్రవర్తించి, మనమందని యగు ననిపించును గని, దానికి 'సుమ్మో ప్రతః' అను నన్నయగారి సూత్రమును, 'సరశే పరుషేచైవ సమాసే నుమతో భవేత్, అద్రుతా త్స్వరసాద దుపట్టిహూర్చివిభక్తిషు' అను నథర్వణకారికయు నీప్రక్రియ కడ్డుతగిలి 'మనమునందు' నని నుమాగమమును దెచ్చిపెట్టును. ఈ యాగమము సమాసవిషయము. కాని దీనికిఁ బూర్వసూత్రమున నున్న 'సమాసేషు' అను బహువచనము ననువృత్తిచేసికొనుటవలన సంద్యాదిలాభము కలిగినదని యహోబలపండితుఁడు వ్రాసినాఁడు. ఇఁక నిందలి చకారబలమువలనఁ దప్పించుకొని 'మనమం' దనురూపమును సాధించుకొనిపోవలయును. ఈ పాట్లన్నియు నూహించియేకాఁబోలు, చిన్నయసూరిగారీ సూత్రమున కనువాదసూత్రము లనఁదగిన, బాలవ్యాకరణ సంధిపరిచ్ఛేదమునందలి ౨౫, ౩౫ సూత్రములయం దీయంద్వాదులమాట నెత్తక, తత్సమపరిచ్ఛేదములోని ౩౦ వ సూత్రమున 'ఆగమమువు వర్ణముల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాష న'నని సూత్రించి వనమునందు, వనమందు నను రెండురూపములను సాధించిరి.

కర్మధారయసమాసద్రుతము

కర్మధారయసమాసమునం దొకచోట నూఁది పలుకవచ్చునని 'పాల్వారుకోడరాముఁడు' అను కవుల పద్యమునందలి ప్రయోగమును జూపిరి. 'ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు' అను నన్నయగారి సూత్రమున కిది పూర్ణముగా విరుద్ధమైయున్నది. అదియునుగాక యిందు ద్రుతము స్వత్వముతోఁ గానఁబడుచున్నది. సమాసమునందలి ద్రుతమునకు స్వత్వ మథర్వణుఁడు మున్నగు ప్రాచీనులకుఁగాని, చిన్నయసూరి మున్నగు నర్వాచీనులకుఁగాని యంగీకారములేదు. అహోబలపండితుఁడుగూడ "ఏతచ్చ సమాసే నసంభవతి ప్రయోగాభావాత్', 'స్వత్వం ప్రశ్లేషతా బిందు స్సమాసే సప్రయోగతి' ఇత్యథర్వణవచనాచ్చ" అని వ్రాసెను. ('అలుకిచ సంశ్లేష స్స్యాత్' అను సూత్రవ్యాఖ్య).

కాని ద్రుతస్యేత్యాది చింతామణి సూత్రమునకు వ్యాఖ్య వ్రాయుచు నహోబలపండితుఁ డిట్లు వ్రాసెను: "మించుఁ గ్రొమ్మించు' ఇత్యాది క్రియాజన్య విశేషణసమాసే ద్రుతస్య క్రియాపదావయవత్వేన లుగ్విషయత్వం. తేన ద్రుతకార్యం సర్వమత్ర ప్రవర్తత ఏవ." అని. పాల్వారుకోడరాముఁడనుచోటఁ బొల్వారు ననునది తద్ధర్మక్రియావిశేషణమే. ఇందలి ద్రుతము క్రియాపదమున కవయవత్వమునే పొందియున్నది. అందువలన ద్రుతకార్యము సర్వమును జరుగవచ్చును. సర్వమనుటలో 'ద్రుతస్య హలి బిందు స్స్యాచ్ఛిష్టత్వంచ క్వచిత్స్వతా లోపశ్చ' అనియున్నది కావున నిక్కడ స్వత్వమును నంగీకరింపకతప్పదు. అయితే సమాసద్రుతస్వత్వము నహోబలుఁడే యొప్పకొనలేదుగదా! అహోబలపండితుఁడు చూపిన యథర్వణకారికకుఁ బాఠాంతర మున్నది. 'నిత్యం ప్రశ్లేషతా బిందు స్సమాసేతు ప్రయోగతః.' ఇందు సంశ్లేషబిందువుల ప్రయోగమే కనఁబడుచున్నది గాని స్వత్వనిషేధము లేదు. అహోబలపండితుని పాఠమువలన (స్వత్వం ప్రశ్లేషతా బిందు స్సమాసే నప్రయోగతః) బిందు స్వత్వ సంశ్లేషములు మూఁడును సమాసములయందుఁ బ్రయోగింపఁబడరాదనునర్థము వచ్చుచున్నది. కాని ప్రయోగములనుబట్టి బిందుసంశ్లేషములు విరివిగాఁ గనఁబడుచునే యున్నవి. చిన్నయసూరిగారుగూడ వీరినే యనుసరించి బాలవ్యాకరణసంధిపరిచ్ఛేదమునందలి ౨౬ వ సూత్రమును రచించిరి. కావుననే సం. ప. ౨౫ సూత్రముక్రింద 'వక్ష్యమాణలక్షణముచే దీనికి స్వత్వంబు లేదు' అని వ్రాసియుండిరి. సమాసద్రుతలోపసూత్రమునకు 'సుమ్మో ప్రతః' యను సూత్రమును, బా. వ్యా. లోని సం. ప. ౨౫, ౩౫ సూత్రములును నపవాదములు. ఈ సూత్రములకు లక్ష్యములైన సమాసములం దన్నింటను ద్రుతకార్యము లన్నియు జరుగుచునేయున్నవి. మఱియు 'అపరాన్తేచ సమాసేచ శబ్దే నో బిందు రిష్యతే' యని యథర్వణుఁడు ధూర్వహమతమును నిరూపించినాఁడు. కాని నిత్యమిత్యాది కారికవలన బిందుప్రయోగ మంగీకరింపఁబడినది. ఇట్లు విధినిషేధములు రెండును గానఁబడుచున్నందున బిందు

ప్రయోగ క్వాచిత్కతను గ్రహింపవలయును. అట్లే 'ఆద్యతృతీయౌతు న యుక్తౌ శబ్దవిన్మతే,' యని యుండుటవలన స్వత్వప్రయోగ క్వాచిత్కతనుగూడ గ్రహింపవలయు నని తోఁచెడిని.

### ప్రతిఘటించె-ప్రతిఘటియించె

ఈరెండు రూపములను జూపి సూరకవిగారు వీనికిఁ బ్రయోగముల నిచ్చిరి. ఆంధ్రభాషాభూషణకారుఁడు 'అసమస్తలఘుద్వ్యక్షర లసితములైన' తత్సమ క్రియలకే యిట్టి యియాదేశము వచ్చునని చెప్పినాఁడు. ఇందుఁ గేతనగారు నన్నయగారి సూత్రమునే పరిగణించినాఁడుగాని ప్రయోగబాహుళ్యమును వర్ణ్యణకారికను బరిగణింపనట్లున్నది. 'లఘ్వేకాక్షర పూర్వక్రియాంతిమస్యానయో భవే దిద్వా' యను నన్నయసూత్రము నథర్వణుఁడు 'న ప్రాద్యవ్యయ సంబంధ స్తన్నిషేధే ప్రయోజకః' అని విపులీకరించినాఁడు. ఈవిషయమును బట్టి కేతన నన్నయగారి వ్యాకరణమును జూచియే యుండవలె నను సంశయము కలుగుచున్నది. కవిసంశయ విచ్ఛేదము కేతనగ్రంథమున కనుబంధ మనుటకు నిది చాలియున్నది.

### సంతోసము-సంతసము

సంతోషశబ్దమును దద్భవమునేయుచో సంతోసము, సంతసము నని రెండురూపము లగునని సూరకవిగారు చెప్పినారు. సంతోసిల్లుచు నను ద్రోణపర్వ ప్రయోగ మీయఁబడినది. అహోబలపండితుఁడు గూడ ధాతుపాఠమునందు "సంతోషిం- సంతోసిల్లుచున్నాఁడు ఇతి ప్రాకృతసమం రూపం, షోస్స ఇతి సాదేశాత్. సంతసింపు ఇతి సంస్కృతభవం రూపం" అని నిర్దేశించియున్నాఁడు.

### కూడుకొని-కూడికొని

క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ బ్రయుక్తమగు కొనుధాతువునకుఁ బూర్వమునందున్న ధాత్వవయవమైన యుకారమున కికారము బహుళముగా నగు నని చిన్నయసూరి మున్నగువా రంగీకరించినదే. బహుళగ్రహణముచేత రెండు రూపములు నగును.

### జడపద విశేషణములు

జడపదముల బహువచనములకు విశేషణము లేకవచనమున నుండవచ్చునని సూరకవిగారి లక్షణము. ఇది సర్వలక్షణసారసంగ్రహకర్త యుఁ జెప్పినాఁడు. లాక్షణికు లెల్లరును సమ్మతించినదియే. నన్నయగారు 'ఏకత్వం భేదకగత బహువచనానాంచ దృశ్యతే వికృతౌ' అని సామాన్యముగా సూత్రించిరి. భేదకమన విశేషణము. 'వికృతౌ' అనుటచేత శుద్ధాంధ్రమునందే యిట్టిప్రయోగము లంగీకార్యములని యాచార్యుని యభిప్రాయము. అథర్వణుఁడీ సూత్రమునకు వివరణముగా 'నప్రాణిస్త్రీ విశేషణములకును, ప్రాణిస్త్రీ విశేష్యకములైన సిద్ధమ్యంతి స్త్రీ సమవిశేషణములకును నేకత్వము చెల్లు'నని కారిక వ్రాసెను. సొంపైన పలుకులు, మేలైన వెలయాఁడ్రు, అందమైన వేల్పుటింతులు మున్నగునవి. 'కులిశధారలు కుంఠితంబయ్యె, గేయౌఘములు సొగసై పాటిల్లె' అని సూరకవిగా రుదాహరణము లిచ్చిరి. అంతటను జడపదంబులకే యీ విశేషము చెల్లును. నన్నయగారు 'వికృతౌ' అని నిర్దేశించినను కులిశధారలిత్యాదితత్సమ ప్రయోగములుగూడఁ జిన్నయ సూర్యాదులచే నామోదింపఁబడినవి.

### నిలువుము - నిలుము

నిలువుము, పిలువుము, కొలువుము, గెలువుము, విడువుము మున్నగు క్రియలకుఁ దృతీయాక్షరములు లోపించు నని లక్షణము. ఈలక్షణమునుబట్టి కేవలము మధ్యమమువర్ణము పరమగునపుడే యీ లోపము కలుగు నని చెప్పిన ట్లగుచున్నది. ఇంతకంటె బాలవ్యాకరణము, క్రియాపరిచ్ఛేదము (సూ. ౧౦౧)లో "పిలుచు మొదలగు వానికి 'ముత్తు' పరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు" నను సూత్రమే శాస్త్ర, ప్రక్రియా, ప్రయోగబాహుళ్యముల దృష్టి నెంతయు సమంజసమై యున్న దనవలయును.

### ఏ - ఐనఁ

ఏ యనఁగా నైననని యర్థము నిరూపించి, శ్రీనాథుని శృంగారనైషధములోని 'ఎందఱే వేలుపు

లోలిమై నను భవించిన' (ఆ ౨. ప ౧౨౧) యను పద్య పాదము నుదాహరణముగా నిచ్చినాఁడు. నైషధమునం దెందులో వేలుపులను పాఠమున్నదికాని యెందఱే యని లేదు. ఒకవేళ నున్నదనుకొన్నను నది 'ఏని' శబ్దము యొక్క యాద్యక్షర శేష మగునుగాని 'ఏ' యను నేకాక్షరము కానేరదు. రాముఁడే సీతనేఁ గొల్తు నిత్యాది ప్రయోగము లున్నవి. ఇది చేదర్థకము. వచ్చెనేని, చేసెనేని యిత్యాదులు. వికల్పార్థమునందుఁగూడఁ బ్రవర్తించును. అట్టిచో సూరకవిగారే యను నేకాక్షరమును గ్రహించుట దోషమని తోఁచెడిని. ఏ యను నవ్యయ మేవకారార్థమునఁ బ్రవర్తించుట యంధ్రభాషా సంప్రదాయము. అచ్చతుసక్కములోని దైవచోఁ బ్రశ్నాను నయాదులయందుఁ బ్రవర్తించును.

ఐ–కలిగి

ఐ యనుచోఁ గలిగి యనునర్థము చెప్పి 'యప్ప రోగణములు నాటలు పాటలు నై వినోదింపంగ' నను ద్రోణపర్వప్రయోగమును జూపినారు. సర్వలక్షణసారసంగ్రహకర్తయుఁ గ్రియావిశేషణ ప్రకరణమునందు "కలిగి యనునట్టి యర్థంబు దెలుపుచోట నిలుపఁదగు నై యనుపదంబుఁ దెలుఁగునం" దని లక్షణము చెప్పి, "యొక్కర్తు నీరముఁ గృష్ణాజినముం గమండలువై రాగంబు వంచించి" యను నుత్తరరామాయణపద్యపాదమును, 'బంధురకంధరము వెడలుపుటురమును నై ద్రోణుఁ డొప్పె' 'తెల్లని గొడుగును వెల్లని సిడమునై యల్లవాఁడే పాండవాగ్రజుండు' నను భారతప్రయోగములను జూపియున్నాఁడు.

ఇట్లుండఁగా నహోబలపండితుఁడు "కించ క్వైశ్చిదైకార స్యాస్తితా వాచకత్వ మస్తీతి లక్షణముక్త్వా 'వెడలుపుటురమై యాచార్యుఁ డొప్పె నుత్తర కంఠే' ఇత్యాదికం కవివచన ముదాహృతం. తల్లక్షణం స్వకపోలకల్పిత మేవే త్యుపేక్షితం. ఉపచారక్రియా త్వేన తాదృశవచన స్యోభాభ్యా మాచార్యాభ్యా మంగీకృతత్వాత్" (భావే:వర్ణ కేత్యాది సూత్రవ్యాఖ్య). అని స్పష్టముగా వ్రాసియున్నాఁడు. క్వైశ్చిత్తనుటవలన నీయన సూరకవితిమ్మనలను బూర్తిగా నిరాకరించినాఁడని తెలియనైయున్నది. ఆధేయనిష్ఠమైన క్రియ నాధారమునం దారోపించుట యుపచారము. సీతక్ వివాహంబై, పెండ్లియై, మున్నగు క్రియలయం దైకారమున కుపచారత్వము పూర్తిగాఁ బట్టుచున్నది. పూర్వోక్తభారతవాక్యమునందు, బంధురకంధరమై, వెడలుపుటురమై యని భూతార్థాసమాపక క్రియాసమన్వితములైన యసంపూర్ణ వాక్యము లగ్గతిని బట్టి యేర్పడుచున్నవి. ఈ యసంపూర్ణ వాక్యములకు, బంధురకంధరముకలవాఁడై (ద్రోణుఁడు కర్త) వెడలుపుటురము కలవాఁడై యనునర్థము సులభముగా లభించుచున్నది. వీనికి సంబంధించినంతవఱకుఁ గర్త యధ్యాహృత మయ్యెనని తలంపవలయును. అగుచో నిది వాక్యవిషయము గాని క్రియావిషయము కాదని తేలుచున్నది. పోనీ యుపచారక్రియాత్వము నెట్లో యంగీకరించినను నీ 'ఐ' శబ్దమునకుఁ గలిగి యనునర్థము చెప్పుట కేమి యభ్యంతరముండునో చింత్యము. ఈ ఐ శబ్దమగుధాతువుయొక్క క్త్వార్థరూపము. అగుధాతువునకు శబ్దరత్నాకరకారుఁడు 'కల' యను నర్థమును గూడఁ జూపించి, యిట్టిదే ప్రయోగము నొసంగెను. సీతారామాచార్యులవారుగూడ తిమ్మన సూరనల ననుసరించి యీ యర్థము వ్రాసి రనుట తెల్లము.

అదియునుగాక భూతార్థకాసమాపక క్రియ యొక్కొకచో హేత్వర్థమునఁ బ్రవర్తించునని ప్రౌఢవ్యాకరణములో నాచార్యులవారు నుడివిరి. ప్రస్తుత వాక్యమునందు బంధురకంధరము, వెడలుపుటురము నున్న హేతువుచేత ద్రోణుఁడొప్పె నను నర్థమునుగూడ సాధింపవచ్చునని తోఁచెడిని. కాని యిది యిట్టి పట్టులన్నిట సమర్థింపనగునది కానేరదు. "తెల్లని గొడుగును వెల్లని సిడమునై యల్లవాఁడే పాండవాగ్రజుండు" అను చోటఁ గల యనునర్థము తక్కఁగత్యంతరము కానరాదు. గొడుగై సిడమై యనునవి యుపచారక్రియ లన్నచో నీ ల్యబంతముల కీవాక్యమునందు దేనితోడను నన్వయము కుదుర నేరదు. శబ్దపల్లవములు విలక్షణార్థాభిధాయకంబులు. వివాహంబై, పెండ్లియై యను ధాతుపల్లవంబులకు

విలక్షణమైన యర్థము గోచరించుచున్నది. గొడుసై సిడమై యనువానికి వాక్యనిరపేక్షముగా నెట్టి యర్థమును గానవచ్చుట లేదు. అందుచేతనే సూరన తిమ్మన లీ 'ఐ' శబ్దమునకు వాక్యాన్వయాపేక్షకముగాఁ 'గలిగి' యనునర్థము వచ్చుచున్నదని వ్రాసిరని పొడగట్టుచున్నది.

## ఏలతఁడు-ఏలునతఁడు

వర్తమానార్థఘటన గలిగిన కర్మధారయమునం దలి యుత్వమున కచ్చు పరమైనచో నత్వము వచ్చునని లక్షణము. ఏలతఁడు కాదనియు నేలునతఁ డనునని యు సూరకవిగారు వ్రాసిరి. ఇది క్రియాజన్య విశేషణ ఘటితమైన కర్మధారయము. 'నపాన్త్యతద్ధర్మోత్రతః' అను నిత్యసంధినిషేధకమైన చింతామణి సూత్రమునకిది విషయము. ఈ తద్ధర్మక్రియ ద్రుతప్రకృతిక పాఠములోఁ బఠింపఁబడినది. వేఱుగా నత్వవిధాన మవసరము లేదు. అప్పకవియుఁ దదనుయాయులైన చిన్నయసూర్యాదులును బడిన పొరపాటునే సూరకవిగారు గూడఁ బొందిరి. ఈ విషయమునుగూర్చి బ్రహ్మశ్రీ వఝుల చినసీతారామస్వామిశాస్త్రులవా రాంధ్రశబ్ద చింతామణి విషయపరిశోధనమున విపులముగాఁ జర్చించి యున్నారు. సూరకవి యిది వర్తమానార్థ మనినాఁడు. కాని యిది తద్ధర్మవిషయముగాఁ జింతామణిసంప్రదాయవ్యవహారము. 'ఉను' ప్రత్యయము భవిష్యదర్థకమని కేతన చెప్పెను. పలుకును, పలుకుదురు-భవిష్యదర్థము - ప్రథమపురుషైక బహువచనరూపములు. కేతన సంప్రదాయము నవలంబించినచో 'ఏలునతఁడు' భవిష్యదర్థము కావలయును. కాని యేలునతఁ డనఁగా నేలుచున్నవాఁ డని యర్థముచేసి సూరకవి దీనిని వర్తమానార్థక మనియెను. 'తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం త్రికాలవాచి యగు' నన్న ప్రౌఢవ్యాకరణసూత్రముచే దీనిని రక్షింపవచ్చును.

## తద్భవపదములలోని రేఫము

సూరకవిగారు 'తద్భవపదములఁ దవిలిన యారేఫ రేఫగాని శకటరేఫకాదని లక్షణముచెప్పినారు. కాని పాఱుఁడు, ఉక్కఱ, కఱసు, మొఱవు మున్నగు తద్భవములయందు శకటరేఫము కానవచ్చుచుండుటచేతను 'ఉచ్చారణస్య కల్ప్యత్వాన్నిదానం తత్ర సద్వచః' అను నథర్వణకారిక యుండుటచేతను నీలక్షణ మంగీకార్యము కాదని యహోబలపండితుఁడు వ్రాసినాఁడు. సూరకవిగారు రేఫప్రయోగములను విశేషముగాఁ జూపలేదు. ఏవోకొన్నిటినిమాత్రమే చూపినాఁడు.

## నాకునానతి-నాకానతి

షష్ఠిపై నచ్చు పరమైనయప్పు డిట్లు రెండు రూపము లగునని లక్షణము. ఇది 'అనాదిషు విభక్తిషూత్తో వా' యను చింతామణిసూత్రమునకు విషయము.

## నాంతక్రియాపదముల సంధి

నాంతక్రియాపదముల పొంత నచ్చున్నయెడల నత్వ మగుననియు, హల్లున్నచో వైకల్పికముగ నుండు ననియు లక్షణము. నాంతక్రియాపదము లనుటచేత ద్రుతప్రకృతికములుగాఁ బరిగణింపఁబడిన క్రియారూపము లన్నిటికిని గ్రహణము. వీని కచ్చులు పరంబగునపుడు 'లుక్సంశ్లేషా నాచి' యను నిషేధవిధి ప్రవర్తించి పట్టిసంహితమాత్రము కలుగును. హల్లులు పరమైనప్పుడు ద్రుతకార్యము లన్నియు యథావిధిగ జరుగును

## ఋకారమునకు రేఫాదేశము

ద్వంద్వసమాసమున ఋకారమునకు రేఫాదేశ మగునని సూరకవిగారు "క్షత్రియకంసుస్యలై......మాంధాత్రరఘుక్షితీశ" ఇత్యాది భారతపద్యము నుదాహరణముగా నిచ్చిరి. ఇది 'ఉర్ద్వంద్వే రః' అను చింతామణిసూత్రమునకు విషయమైనది. మాంధాతృరఘుక్షితీశేత్యాదిపాఠమును గ్రహించి యప్పకవిగారు దీనిని సంయుతాసంయుతప్రాసమున కుదాహరణముగా నిచ్చిరి. ఈ యీ విషయములు బా. వ్యా. సమాసపరిచ్ఛేదములోని యిరువదినాల్గవ సూత్రవ్యాఖ్యలో సుప్తార్థప్రకాశికాకారులు విపులముగాఁ జర్చించిరి.

## సేవింతురు-సేవింత్రు

సేవింతు రను క్రియాపదమునకు సేవింత్రనురూపమును గలదని లక్షణము. ఇది లాక్షణికులందఱు నంగీకరించినదే. 'దా చోర్లు క్తద్ధర్మే' యను సూత్రమున

దువర్ణము పరమైనప్పుడు చకారమునకు లోపము రాఁగా 'బిందుపరస్య తకారో దో స్యాన్నశత్' అను సూత్రముచే నేలింతు రనురూపము సిద్ధించును. ఆపైని గవిభల్లట సూత్రముచేఁ దకారముమీఁది యుత్వము లోపించి "నేలింత్రు" రూపము సిద్ధించును. చిన్నయసూరిగారి ననుసరించియు బా-వ్యా-క్రియా పరిచ్ఛేదములోని ౧౦౫, ౬౨ సూత్రములవలన నీరూపమును సాధింపవచ్చును. పూర్వవ్యాకర్త లిట్లు బిందుపూర్వమైన తదడలకే యుత్వలోపము నంగీకరించిరి కాని 'యిత్త్రి' మన్నసుప్రయోగములు క్వాచిత్కముగా లేకపోలేదు.

బల్లిదాదులు

కడల ముత్వంబు గలిగిన తెనుఁగునుడులు దేవమ్యపరంబులైనచో డుత్వము భజించునని లక్షణము. బల్లిదము-బల్లిదుఁడు నని యుదాహరణము. ఇది 'కేచిత్తు వైకృతా శ్శబ్దాః ఘంసి చాన్యత్ర సంగతా' యనునథర్వణకారికకు లక్ష్యమైయున్నది. నెయ్యుఁడై పూజించెనని నన్నయగారి ప్రయోగము. బల్లిదాదులు సంస్కృత తుల్యంబు లని చిన్నయసూరిగారు గూడ సూత్రించినాఁరు. స్త్రీత్వంబున వీని కాలుశబ్దము పరంబై నెయ్యురాలు, బల్లిదురాలు అను రూపము లేర్పడును.

కొన్ని విశేషములు

తినుచుండె- తినుచునుండెన్- ఇది శత్రర్థక చువర్ణముపై నున్న ద్రుతసంధివిషయము. తన కిచ్చె - తనకు నిచ్చెన్-ఇది 'అనాదిషు విభక్తి ష్వాతో వా' యను సూత్రమునకు లక్ష్యము. ధర్మువు - ధర్మము - ఇది 'భవేద్ధర్మాదిశబ్దానాం ముశ్చ వుశ్చాత్ర కుత్రచి' త్తను కారికకు లక్ష్యము. ఇట్లే కర్మువు-కర్మము మన్నసునవి గ్రాహ్యములు. ప్రౌఢిమంబు-ప్రోడిమ. ఇది తద్భవరూపము. దీనిని విశేషరూపముగా నిచ్చుటలో సూరకవిగారి యభిప్రాయ మేమిమో! ఒనరంగ-ఒనరఁగ - హ్రస్వపూర్వము కావున సాన్యబిందు వర్ధబిందువైనయది.

అనక - నాక - ఇది "క్వచి దంత్యస్య చాన్యస్య లోపో దీర్ఘశ్చ కుత్రచి" త్తను కారికకు లక్ష్య మనఁదగినది. దీని కహోబలపండితుఁడు చానేసె, నోనాడె మన్నసునవి లక్ష్యములుగా నిచ్చినాఁడు. ఈ 'నాక' యను ప్రయోగమునుగూడ వానితోఁ జేర్పవచ్చును. అను ధాతువునకు ముబ్బు పరమగునపుడు 'నా' ఆదేశ మగునని చిన్నయయుఁ జెప్పెను.

మీరు-ఈరు

'నీ మీ నే మే హల్లులకు లోపంబు విభాషనగు' నని ప్రౌఢవ్యాకరణకారుఁడుగూడ నీ ప్రక్రియనే బోధించినాఁడు. నీవు-ఈవు,- మీరు-ఈరు, నేను-ఏను-, మేము - ఏము. ఇట్లజాదు లైనవే ప్రాచీనము లైనట్లు తోఁపకమానదు. 'తదిదమోర్వ్యా'ట్టను వైకృతచంద్రికా సూత్రముచే ఆ ఈ శబ్దములకు వడాదేశము చేసి ప్రక్రియను జూపించుచున్నారు. యుష్మదస్మ దర్థకములకుఁ గూడ నట్టిప్రక్రియనే చూపించుట యుక్తమేమో యని తోఁచెడిని. కాని యిది యింకను బరిశీలింపఁదగినయంశము.

ఎల్లిదము-ఏలిదము

ఇది 'అద్విత్వం చ భవేద్ద్విత్వం దీర్ఘో హ్రస్వశ్చ కేషుచి' త్తను నథర్వణకారికకు విషయము. పువ్వు-పూవు, గయాళి-గయ్యాళి మన్నసునవి దీనిచే సమర్థింపఁబడినవి.

చనునె - చన్నె

ఇది 'క్వచి న్నవర్ణే డేర్లోపః క్వచి డ్డోశ్చ తథా భవేత్, క్వచి త్తదర్థే డయుగం క్వచి న్న స్యేచ్చ లోపవాన్' అను నథర్వణకారికకు లక్ష్యము. 'క్వచి న్న స్యేచ్చ లోపవాన్'అను వాక్యముచే 'చనిన' యను పదమునందలి నకారముమీఁది యికారమును లోపింపఁజేసి 'చన్న' యను రూపమును సాధించి, దానిపైఁ బ్రశ్నార్థైకారమును బరముచేసినచోఁ జన్నే యను రూపము లభించును. ప్రౌఢవ్యాకరణకారుఁ డింతకంటె సులభమైన మార్గము నుపదేశించినాఁడు. "ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు చను చేరుకొనులు ప్రశ్నార్థకైకారపరకంబు లగునపుడు వాని కడయచ్చులకు లోపంబు విభాషనగు" చను + ఏ=చన్నే. దీనికి మఱియొక మార్గమును గలదు. 'అన్నిష్టపథి' మన్నసు భారతప్రయోగముల బలమున 'చను' క్రియలోని యుత్వమును లోపింపఁజేసి, చన్ అను ద్రుతాంత హ్రస్వాత్తు

రమునకుఁ బ్రత్యాగమైకారమును బరమొనర్చినయెడల, 'నోవా ద్వితం క్వచి ద్దీర్ఘం పర ప్రాణేన సంగతేః' అను నథర్వణోక్తిచేఁ జన్నే యను రూపమును సాధింప నయ్యెడిని.

భయపడి - భయంపడి - భయముపడి. ఈరూపములు 'ప్రథమావైభక్తికమో ర్బిందుశ్చ మహాన్ పత్క్రియార్థేషు' అను చింతామణిసూత్రమునకు లక్ష్యము.

## ఉమ్మలిక - ఉమ్మలికము

'క్వచి చ్ఛబ్దభేదేషు భవే త్పర్యస్త లింగతా' యను నథర్వణోక్తియే దీనికిఁ బ్రమాణము. చుట్టములు, చుట్టాలు; మీసములు, మీసలు మున్నగునవియు దీనివలన గ్రహింపఁబడును.

## కలవారె - కలరె

సూరకవిగారీప్రయోగమును జూపి, యిట్లే యిట్టివారె - యిట్టిరె యనునని లక్షణముఁ జెప్పిరి. ఇది 'తచ్ఛబ్దవస్య లోప స్యా దధాతోః క్వచి దేకతా' యను నథర్వణోక్తికి లక్ష్యమైయున్నది. అట్టి డనురూపము గూడ దీనికి లక్ష్యము. చిన్నయసూరిగారుగూడ 'ఉన్న కలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' నని (బా-వ్యా-క్రి-ప - ౧౧౪ సూ) సూత్రించినారు. సూరిగారి సూత్రముచే నట్టేఁడు, అట్టిరు ననురూపములు సాధింపఁబడవు. సూరకవిగారీలక్షణమునకే 'సఖీజన మిట్టిదె రూపసంపదన్' అను విరాటపర్వ ప్రయోగమును లక్ష్యముగా నిచ్చిరి. ఇట్టి + అది=ఇట్టిది అథర్వణకారికావళికిఁ దెనుఁగువ్యాఖ్య వ్రాసిన ద్విత్రిణి సీతారామకవిగారుగూడఁ బూర్వోక్తమైన కారికకు 'కోమటిది, కాపుది, ఏకులమదిరా' యను లక్ష్యముల నొసంగి యీకార్య మమహదర్థంబులయందును గలదనిరి. కాని వీరి యీ లక్ష్యములఁగూడ నంగీకరించిన యెడల నిట లక్ష్యలక్షణ సమన్వయ మగుటలేదు. 'వాఁడు' అను మహదర్థక శబ్దమునకే 'అది' యనునది యమహదర్థకరూపమన్నను, అదిశబ్దాదియందు వకారము లేకపోవుటవలన నిది లక్ష్యము కానేరదు.

## చిగురుచు ధాతువు

సూరకవిగారు చిగురుచుధాతురూపములైన చిగిరిచెను, చిగిర్చెను, చిగిరించెను, చివిరించెను నను రూపముల నిచ్చిరి. చిగురుచు ధాతువుపై భూతార్థమునందు 'ఎను' వర్ణకము పరమగుచో దాని యెత్వము నపేక్షించి రేవర్ణము మీఁద నిత్వమును, దాని యపేక్ష చేతఁ గుకారముమీఁద నిత్వమును వచ్చి చిగిరిచె నను రూపమైనది. మఱల దానియందలి రికార్ణముపై నిత్వము లోపించి (చౌ శే రుపధాత్వంశశ్చ లు గ్వా స్యాత్) చిగిర్చె నను రూప మైనది. చిగిరించె ననునది యీధాతువునకే రూపాంతర మైనను నధాతువైన చిగురుశబ్దముపై ధాతుత్వవివక్షయందు వచ్చిన యించుగాగమముగాఁ బరిగణింపవలయును. చివిరిచె నను రూపమన్ననో 'క్వచి ద్గకారో వః' అను సూత్రముచే నైనది. ఇట్లే క్రమ్మరుచు, క్రమ్మరించు రూపములను సమర్థింప నగును.

మనిచె-మంచెను. 'నలడాదే రంతరుతశ్చ' యను సూత్రమునకు లక్ష్య మిది. మనుచు, మంచు, మంచెను,

చేకూరె-చేరు అె-చే + కూడు-చేకూరు

ఆడోడుకూడుల డకారమునకుఁ జుక్కు పరమగునపుడు మాత్రమే రవర్ణ మగునని చిన్నయసూరిగారి యభిప్రాయము. కాని శబ్దరత్నాకరకారుఁడు చేకూరను దానిని బ్రత్యేకక్రియగాఁ బరిగణించి దానిని 'చేకూడు' అనుదాని రూపాంతర మని వ్రాసినాఁడు. 'చేకూరు' లోని 'కూ' యను దీర్ఘము హ్రస్వమై 'చేకుఱు' అని యైనది. దీర్ఘాక్షరముపై నున్న లఘురేఫ మాదీర్ఘాక్షరము హ్రస్వమగుచో శకటరేఫ మగును. (శకటరేఫ నిర్ణయము)

## చైదము-చైది

సూరకవిగారు 'చైదమనం జైది యనఁగఁజెల్లు' నని వ్రాసినారు. ఐదంతములైన చజలు సమేతర శబ్దంబులందు లేవని చిన్నయసూరిగారు వ్రాసియుండిరి. చెయిదము,చెయ్దము, చెయిది యని దీని సుష్ఠురూపములు.

## అల్లువాండ్రు, పాఱువాండ్రు, తమ్ముగుజ్జులు

అల్లుఁడు, పాఱుఁడు, తమ్ముఁడను శబ్దములు సమాసఘటితంబులై డుత్వముఁ బాసి యీపైరూపము లొందు

నని సూరకవిగారు లక్షణము చెప్పిరి. ఈమూఁడు శబ్దములు నాస్తికములైనను వ్యాకరణ కార్యములకు మగాదులతోఁగాని, బల్లిదాదులతోఁగాని యదుకని శబ్దములు. బల్లిదాదులు 'పుంసిచాన్యత్ర సంగతా' యను నథర్వణోక్తినిబట్టి బలిదము మన్నగు శబ్దములకు 'ము' లోపము గావించి, బల్లిద యను ప్రాతిపదికపై నుత్వ దుక్కులు చేర్పఁగా వచ్చినవి. ఇంక మగాదులకు దుక్కు వచ్చునేకాని యుత్వము రాదు. పూర్వోక్తము లైన శబ్దత్రయమునకుఁ బ్రక్రియ యీరెండు విధములను జెల్లదని తోఁచెడిని.

అహోబలపండితుఁడు 'బల్లిదుఁడు, చెలువుఁడు, నెయ్యుఁడు, కుత్సితుఁడు, అల్లుఁడు, పాటుఁడు, మరుఁడు ఇత్యాది శబ్దానాం మహత స్సోర్డు జేత్యేవడుగ్" అని వ్రాసెను. ('ఏకాదే రమహతాంచ డా వున్న' సూత్ర వ్యాఖ్య) కాని యిందలి బల్లిదాదులకును నల్లుఁడు పాటుఁడు శబ్దములకును సాదృశ్యము లేదు. వీనికి బల్లిదాదులకువలె దుక్కు రావచ్చునుగాని యుత్వము వీని యందు సహజముగానే యున్నది. ద్వితింత్రిణి సీతారామకవిగా రథర్వణకారికావళి వ్యాఖ్యలో 'కేచిద్వైకృతాశ్శబ్దా డాదిత్వేనైవ సాధవః' అనుకారికకు పాటుఁడు మన్నగుశబ్దముల నుదాహరణముగా నిచ్చుచు, వీనిని పాటుఁడుశబ్దము, తమ్ముఁడుశబ్దమని యుచ్చరింపవలయు ననుటయే దీనికిఁ బ్రమాణము. (అహోబలపతి యీ కారికకు వేఱుగా నర్థముచేసి వేఱులక్ష్యముల నిచ్చెను.) అదియునుగాక 'వాతః' అను చింతామణిసూత్ర వ్యాఖ్యయందహోబలపండితుఁడు 'భవంతి కేచిచ్ఛబ్దాస్తు సాంగత్యేనైవ సాధవః' అను నథర్వణుని కారిక నుదాహరించి 'ఏతదాథర్వణవచన బలాదేవ 'తమ్ముఁగుఱ్ఱలు' ఇత్యాదౌ ఉత్వం సాధుత్వమస్నత ఇతి ధ్యేయమితి నృసింహః' అని వ్రాయుటయు నీశబ్దములయం దుత్వము సహజముగా నున్నదనుటకుఁ బ్రమాణమై యొప్పుచున్నది. ఇట్లుండ 'బల్లిదాదులు సంస్కృతతుల్యంబు' లను బా. వ్యా. సూత్రము క్రింద సుప్తార్థప్రకాశికాకారులు 'అల్లుఁడు' శబ్దమునకు గూడ బల్లిదాదులతోఁబాటు ప్రక్రియ నుపదేశించుట ప్రమాదము.

### తద్భవ భాషావిచారము

సూరకవిగారు తృతీయతరంగమునఁ దద్భవభాషావిచారము కావించినారు. సంస్కృత శబ్దములు వర్ణలోపాదులను బొంది తద్భవరూపములు గైకొనుపద్ధతిని బరిశీలించి, యా భాషాపరిణామమును గొంతవఱకు కొక క్రమములోఁ జెప్పుటకు సూత్రములను రచింపఁబ్రయత్నించినది వీరే యనుకొందును. తక్కినవా రెల్లరును గొన్నిశబ్దములను మచ్చుకుఁ జూపి విడచిరి. సూరకవిగారైనను దద్భవభాషనంతయును సాంగముగ సూత్రనిబద్ధము చేసిరని చెప్పుటకు వీలులేదుగాని వీ రవలంబించిన ఫక్కి ప్రశంసనీయమై యున్నది.

'ప్రాకృతభవ, సంస్కృతభవ, సంస్కృతవత్ప్రాకృతభవ వికృతభవా' యను చింతామణిసూత్రము చొప్పునఁ బ్రాకృతిదేశీయ, సంస్కృతభవ ప్రాకృత, సంస్కృతసమప్రాకృతములైన ముత్తెఱఁగుల భాషలు నాంధ్రమునఁ బ్రవేశించినవి. ప్రాకృతము లాఱువిధములు గావున నీ ప్రాకృతభాష లిట్లు పదునెన్మిదియు, సంస్కృత సమ తద్భవములు రెండును, దేశ్యగ్రామ్యములురెండును గలసి యిరువదిరెండువిధముల నాంధ్రభాష ప్రవర్తించుచున్నదని ప్రాచీనవ్యాకర్తల యభిప్రాయము. ఇట్టి ద్వావింశతిభేదములైన యీభాషను బరిశీలించి యిందుఁ బ్రాకృతసమ మేదియో, ప్రాకృతభవ మేదియో తెలిసికొనుటగాని, తెలిసికొనినను నది సంస్కృతభవమేల కాఁగూడదో వినిశ్చయించుటగాని దుస్తరమైన విషయముగాఁ దోఁచెడిని. కావుననే యాంధ్రవ్యాకర్తలెల్లరు నీ విషయమును దిఙ్మాత్రముగా నుపదేశించుచు వచ్చిరి. అహో - సంస్కృత సమప్రాకృతసమము, అంబరము - ప్రాకృతదేశ్యసమము, మూఁగ- సంస్కృతభవప్రాకృతభవము. చందురుఁడు, చందమామ, సంద్రము ఇత్యాదులు సంస్కృతభవము లగునని యహోబలపండితుఁ డుదాహరించినాఁడు. ఈయనయే 'నచైవం మూఁగేత్యాదీనామపి తత్సమత్వాపత్తిః. యత్ర వర్ణాంతరాగమ వర్ణలోపయోః శాస్త్రతో విశిష్య నప్రాప్తిస్తత్రైవ తద్భవత్వం, నాన్యత్రేతి నియమాంగీకారా' త్తని వ్రాసియున్నాఁడు. ప్రాకృతసమములుగాఁ బరిగణించు

శబ్దములన్నిటిని సంస్కృతభవము లనవచ్చునని చిన్నయ సూర్యాసు లంగీకరించినారు. మొత్తముమీఁద నేఁడు సంస్కృతసమమును మాత్రము విడచి, తక్కిన ప్రాకృత సమ, ప్రాకృతభవ, సంస్కృతభవ భాషలను దద్భవ భాష యని వ్యవహరించుచున్నారు. సూరకవిగారు జూదము, మూఁగ, కొలము మన్నగు వానిని సంస్కృతభవములుగాఁ జెప్పినాఁడు. కాని జూదము శూరసేనతద్భవ మనియు, మూఁగ యపభ్రంశతద్భవ మనియు, కొలము చూళికా భవ మనియు నహోబలుఁడు చెప్పెను. అయితే ప్రాకృతరీతియు నిదియే యని సూరకవి నిర్దేశించి, తానిచ్చిన శబ్దసముదాయమునకుఁ జివర 'యిటువలెనే పైశాచికరూపము' లని వ్రాసినాఁడు. ఆంధ్రభాష పైశాచిప్రాకృతమునుండి పుట్టిన భాష యని పూర్వవైయాకరణుల యభిప్రాయము. 'చోళ లాటక గాంధార సుధేష్ణ ద్రవిడాదయః, పిశాచదేశా స్తద్దేశ్యం పైశాచీద్వితయం భవేత్' ఆంధ్రమీ పిశాచభాషాపరిణామరూపము కావుననే నన్నయ 'ప్రాకృతభవవికృతిభవాః' అని పూర్వోక్త సూత్రమున నిర్దేశించెను. అందులకనియే 'ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః' యని నన్నయ గారు సూత్రించినారుగూడ. సూరకవిగారి గ్రంథములో బీజము = గింజ, కబరి = క్రొమ్ముడి, ధమ్మిల్లము = తురుము, బిడారము = పిల్లి, పాండురము = బొల్లి, హింతాలము = ఈదు, యావనాళము = జొన్న, ఆఖేటము = వేఁట, కిరీటి = కవ్వడి, తిలము = నువ్వు, తిక్తము = చేదు మన్నగు శబ్దములు తద్భవములుగాఁ జెప్పఁబడినవి. విచారింపఁగా నీ ప్రకృతి వికృతి శబ్దముల కెవ్విధముగను బొంతన కుదురక, వీనిని దద్భవము లనుటకంటె నవి వాని యర్థము లనుట మే లనిపించుచున్నది. రా॥ తిశబ్దభవము తేయి యనినచే భాషాశాస్త్రజ్ఞు లభ్యంతర పెట్టుచున్నారు. ఇట్టివాని నంగీకరింతురా ? కిరీటి శబ్దభవము క్రీడి యుండఁగాఁ గవ్వడియని వ్రాయఁబడినది. విజ్ఞులు విమర్శింతురుగాఁక.

అడిదము సూరకవి యొక వ్యాకరణగ్రంథము, నొక యలంకారగ్రంథము, నొక నిఘంటువును వ్రాసి కవియై ప్రఖ్యాతి గడించినవాఁడు. ఇతని కవిజన రంజనమున మృదువైన శైలిలో శ్లేష యద్భుతముగ దిద్దఁబడినది. ఈ కవిసంశయ విచ్ఛేదమునందుఁ గూడ నాయన చూపిన ప్రతిభ యల్పియసమైనది కాదు. ఇంతెందే నా మహాకవిని నిరాకరించిన ఛాయ యున్నచో నది నా యెఱిగినంతవట్టు సత్యనిర్ధారణమునకే కాని యనాదరముచేఁ గాదు.

---



౨. దరియాదౌలత్ ఉద్యానదృశ్యము (దక్షిణద్వారమునుండి)



3. జుమ్మామసీదు



. కోటయొక్క ప్రధానద్వారము (తూర్పుద)

శ్రీరంగపట్టణ
చిత్రములు

కోట, ఉత్తరద్వారము
(లోవైపు)




టిప్పు చివర ౧౫ దిన
ములు ఇక్కడఉండి
పోరాడి హతు
డయ్యెను



కోటగోడలో నున్న
బందీఖానా గదులు
విలో ఇంగ్లీషుఖైదీలు
బేడీలతో నుంచబడిరి



కోట ఉత్తరభాగమున
రుమూల ద్వారము
హస్యముగ శత్రువుల
మీదబడుట కుప
యోగించునది



౮. దరియాదౌలత్ ఉద్యానము. భవనము సమీప
మున ముందువైపు. రెండువైపులనున్న వృక్షపంక్తులు
నడుమనుగల జలాశయమున ప్రతిబింబించుచున్నవి



౯. కోటలోని రంగనాథస్వామి దేవాలయము
వేయేండ్లనాటిది; శిల్పము హొయిసలుల పద్ధతి
ననుసరించినది.



౧౦. దరియాదౌలత్
ఉద్యానములోపల
ముందుభాగము

# పూర్ణ

వాసిష్ఠ గణపతిముని

## పీఠిక

### మొదటి ప్రకరణము

"నీవుమాత్రము వీరపురుషుఁడవుగావు"

"ధరణిరవీందుల ధర్త యెవండు
పరశక్తిపై లోమిభర్త యెవండు
ఒజ్జలువర్ణించునుత్తముఁ డెవఁడు
ముజ్జగముల నేలుమొనకాఁ డెవండు
భూతంబులకు మూలభూత మెవఁడు
ధాతలధాతయా తాత యెవండు
జీవులు జీవించు జీవ మెవండు
దైవంబు లర్చించుదైవ మెవండు
యుద్ధేశుఁడగు నాదియోద్ధ యెవండు
బుద్ధీశుఁ డగు నాదిబోద్ధ యెవండు
అందఱిలోపల నాత్మ యెవండు
మాదులు గానని మర్మ మెవండు
జ్యోతులు వెలిఁగించు జ్యోతి యెవండు
జాతు లేకం బగు జాతి యెవండు
అఖిలము మించిన వ్యాపకుఁ డెవఁడు
నిఖిలము మించిన నిత్యుఁ డెవండు
ఆకాశతనువుచే నలరారు నెవఁడు
పాకారితనువుచేఁ బలించు నెవఁడు
ఆయాదిదేవుని నభవు ననంతు
మాయావి నింద్రుని మదిలోఁదలంతు."

అని స్వకృతి యగు నింద్రదశకమును పాడుకొనుచు కౌండిన్యసుచంద్రుని యిరువది మూఁడవ రాజ్యవర్షమున విజయసంవత్సర జ్యేష్ఠ శుద్ధ పంచమీ భానువారమునాఁడు రాత్రి పూర్వయామమునందు పూర్ణ గణపవరగ్రామమునుండి శ్రీకాకుళనగరమునకు మఱలివచ్చుచున్నది. ఇప్పటికి నగర మొక యరక్రోసుదూరములో నున్నది. ఆమె నడుచుచుండినస్థల మొక చిట్టడవి. దారి సంకుచితముగా నుండినను వెన్నెలలో చక్కఁగా తెలియుచున్నది.

పూర్ణ పందొమ్మిది సంవత్సరములు నిండిన యువతి. మహాసుందరి యైనను సుకుమారాంగిమాత్రముగాదు. వ్యాయామముచే సంస్కరింపఁబడి వజ్రదృఢములుగా నేర్పడిన యామెయంగములు వేఱుశోభను పోషించుచుండినవి. ఆమె మంచిబలవంతురాలుమాత్రమే కాదు; ఆయుధవిద్యలన్నింటియందుఁ గూడ నేర్పరి. ఆంధ్రగీర్వాణభాషలయందు వ్యుత్పన్నురాలు. అమృతమయ వచనములను సృజించు కవీశ్వరి.

ఆమెకట్టినవస్త్రము ముతకగానుండినను నిర్మలముగా నున్నది. రవిక దానికి తగినట్లుండెను. చెవులకు ముత్యాలపోఁగులు, చేతులకు గాజులు, కాళ్లకు వెండికడియములు, మెడలో చిన్నవరాలపేరు—ఇవిమాత్రమే యామెధరించిన యాభరణములు. ఇట్లామె

వేషము నిరాడంబర మైనను ప్రసన్నముగా నుండెను.

కీర్తిశేషుఁడగు రాష్ట్రీతరసత్యరథుని పెంపకపుకూఁతురు పూర్ణ. పదునేడు సంవత్సరములక్రిందట జరిగిన యాంధ్రకలింగుల ఘోర సంగ్రామములో సత్యరథుఁ డద్భుతముగా ననేకశత్రువుల నురుమాడి రణహతుఁడై వీరస్వర్గము పొందెను. పూర్ణను పెంచిన సత్యరథపత్ని పేరు చంపావతి. సత్యరథునకు పూర్ణ యీ చిట్టడవిలోనే దొరకినదియఁట. ఇట్టి సుందరాంగి శిశువు నేతల్లి విడిచివేసెనో? పూర్ణను గ్రహించినపిమ్మట చంపావతీసత్యరథులకు మణిమాలయను కొమారితె పుట్టినది. ఆ పిల్ల పూర్ణకంటె నొక సంవత్సరము చిన్నది. చంపావతియక్క జ్ఞానేశ్వరికుమారుఁడాంగిరనమల్లికార్జునుఁడు పూర్ణకు శస్త్రవిద్యాగురువు. పరివ్రాజిక శుభ్రాంగి పూర్ణామణిమాలలకు సాహిత్యాచార్యురాలు.

ప్రకృతము ననుసరించెదము. దారిలో వైపూప సోమదత్తుని యాశ్రమ మున్నది. అతని బిరుదనామ మక్షోభ్యముని. ముని నొకసారి దర్శించి వెళ్లవచ్చునని పూర్ణ తలంచినది. పూర్ణామణిమాలల కతఁడు మంత్రగురువు. అతని యాశ్రమము నతిక్రమించి వెళ్లుట పూర్ణకు సాధ్యముగాలేదు. ఆమె త్రోవనుండి యాశ్రమమువంకకు తిరిగినది. ఆశ్రమద్వారము తెరచియేయుండెను. ముని లోపలనున్నారని తలంచి యామె నిశ్శంకముగా ప్రవేశించినది.

ముని లోపల కన్పట్టుటలేదు. అచ్చట నింకొకఁడున్నాఁడు. ఆతఁడొక సుందరుఁడగు యువకుఁడు. ఉద్ధతుఁడగు వీరుఁడు. కులీనుఁడగు సంపన్నుఁడు. గర్వితుఁడగు సైనికాధికారి. అతని సంపూర్ణనామము హూద్గల్య వీరసింహుఁడు.

పూర్ణను చూడఁగానే వీరసింహుఁడు కూర్చుండినవాఁడు లేచెను. అతఁడు పూర్ణ ననేకపర్యాయములు చూచెనుగాని యింత దగ్గఱగా నెన్నఁడును చూచియుండలేదు. ఉజ్జ్వలమగు దీప మామెముఖము నతనికి చక్కగా ప్రదర్శించుచున్నది. అతఁ డామె చంపావతి పెద్దకూఁతురు పూర్ణయని పోల్చుకొనినాఁడు. పూర్ణగూడ నతఁ డెవఁడో తెలుసుకొనినదిగాని తనకతని పరిచయముండినట్లు సంభ్రమము చూపినదిగాదు. ఆ పరస్పర దర్శనములో వీరసింహుఁడు తనదృష్టులచే నామెరూపము నర్చింప నారంభించినాఁడు. పూర్ణ తటస్థమై నిలిచినది.

ఆ దర్శనోత్సవములో వీరసింహుని మనస్సు పూర్ణ నిట్లు స్తుతించినది:

"గౌతమహిరణ్యనాభుని కొమారితె కనకవల్లి గొప్పచక్కనిది యని యావాడవారందఱును గర్వించి చెప్పుచుందురు. ఆయుత్తమసుందరి యీయామెముందర సూర్యప్రభ కెదురుగా కరదీపికవలె శోభింపదు.

"భారద్వాజభవనందికూఁతురు భానుమతి పరమోత్కృష్టసుందరి యని శ్రోత్రియ

వర్గమువా రంవటును పొగడుచుందురు. ఆ పస న్నరమణీయముఖి నెన్నిసారులు చూచి నను మఱియొకసారి చూడవలె ననియే బుద్ధి పుట్టుచుండును. అట్టి మహాసుందరి యీ మె దగ్గఱ జ్వలించు వజ్రమణి సమీపములో కనకశలాకవలె ప్రకాశింపదు.

"తాకుకచంద్ర సేనునికూఁతురు పర్ణినిని నాగయువకులు జగదేకసుందరియని శ్లాఘింతురు. ఆమెశరీరము సౌందర్యప్రదర్శనశాల వలె నుండును. ఆ వరపర్ణినిగూడ నీమెకు సాటి గాదనియే నా యభిప్రాయము. అది తానుమాత్రము వెలుతురుతో కన్పట్టు నక్షత్రము. ఇది తనవెలుతురుచే చీఁకటిని దూరీకరింపఁజేయఁగల చంద్రకళ.

"సాలంకాయన సముద్రదత్తునికొమారితె మధువాణిని క్రొత్తగా వికసించిన పుష్పమని యువకులు స్తుతించుచుందురు. ఈమె సానపట్టిన మహారత్నము. పుష్పరత్నములకు వేలో నెంతయో తారతమ్యము గలదు.

"కీర్తిశేష కాశ్యపసుదర్శనుని కూఁతురు ధరణిని కండ్లుగల యువకులు వందిమాగధులవలె నుతించుచుందురు. నా దృష్టిలో నామెసౌందర్యములో నొకలోప మున్నది. ఆమె శ్యామాంగి. ఎంత బాగుండినను నలుపు నలుపే. ఈమె నిర్మలజ్యోతిస్సు కఠస్థాన దేవత.

"మహారాజపుత్రి రథినీకుమారి ప్రపంచములోని చక్కనికన్యలలో నగ్రగణ్యురాలని రూపమర్మజ్ఞుఁడగు గావల్గణిరూపచంద్రుఁడు తీర్పిచ్చియున్నాఁడు. అతఁ డీమెను నిదానించి చూచియుండునెడల తనతీర్పును గుఱించి పునరాలోచన సేయకమానఁడు.

"రథినీకుమారికంటె మామాతులపుత్రి ఫలినియే చక్కనిదియని నేను రూపచంద్రునితో వాదించుచుందును గాని యీమెకంటె నెక్కువయని చెప్పఁజాలను. ఆమె యెంతలావణ్యవతియైనను దయనీయతన్వంగి. ఈమె పరిపుష్టభోగక్షమాంగి. కండపుష్టి సౌందర్యములో నొకప్రధానాంశమని నాయాశయము.

"చంపావతికి రెండురత్నములు లభించినవి. ఆ రెంటిలో దీనివెలయే యెక్కువ. ఈమె మహావజ్రము. మణిమాల పుష్యరాగము."

(ప్రకాశముగా) "భద్రముఖి! మునీంద్రుని చూడవచ్చితివా?"

పూర్ణ—ఔను.

వీర— ఈ పుష్యార్క యోగమున నొకమూలిక గ్రహించుటకు వా రరణ్యమధ్యమునకు వెళ్లియున్నారు. వెళ్లి చాలసేపైనది. ఇప్పుడే వచ్చివేయుదురు. కూర్చుండుము

"ముని వచ్చువఱకుండి పోవుటయా? అప్పుడే వెళ్లిపోవుటయా?" అని యాలోచించుకొనుచు పూర్ణ యచ్చటనే యింకను నిలిచినది. కొన కామె వెళ్లిపోవుటయే మం

చిది యని నిర్ధారణ చేసుకొని యిట్లు పలికి నది:

"నే నింకొకసారి మునీంద్రుని చూచె దను. ఉత్తరు విండు."

పూర్ణ లోపలకు ప్రవేశించిన తత్క్ష ణమే తనను చూచి సిగ్గుపడి వెనుకకు తగ్గక తన కభిముఖియై నిలుచుటయు, వెళ్లిపోయెదనని చెప్పి తనయుత్తరువు నెదురుచూచుచుండు టయు వీరసింహుని కపోహ కలుగఁ జేసినవి. ఆమె యాభిముఖ్యవినయములు కామప్రే రితము లని యతఁడు భ్రమపడెను. మహావీర వనితయగు పూర్ణకు స్త్రీజాతిసహజ మగు లజ్జ తక్కువ. వీరపరీక్షలో వీరసింహుఁడు మొదటితరగతిలో నుత్తీర్ణుఁడయ్యెనని పూర్ణ కతనిపై గౌరవము. తనగురువగు నక్షోభ్య మునికి శిష్యుఁ డని ప్రీతి. ఈ రెండుభావము లామె నతని కభిముఖినిగా చేసినవి. వినయ ముతో మాటలాడించినవి. బంధుత్వములేని యువతి తనయొద్ద స్నేహము కొంచెమైనను చూపినఁ జాలును. సాధారణ యువకుఁడు దానిని కామ మనియే ప్రాయికముగా శంకిం చును. కామచ్ఛాయలేని స్నేహము బంధు వులుకాని స్త్రీ పురుషులమధ్య నుండు నని నమ్ముట కెంతయో విశాలబుద్ధి కావలసియు న్నది. వీరసింహుని కంత విశాలబుద్ధి లేదు. అందువలన నతఁడు పూర్ణ కామవతి యని శం కించుటలో నాశ్చర్యములేదు. ఈ భ్రమవలన నతని కొక క్రొత్తయుత్సాహము పుట్టినది. అతనిశిరస్సు మిన్నుముట్టెను. అతని భుజ స్కంధము లున్నతము లయినవి. అతని వక్షోదేశము విశాలమయ్యెను. అతని కను లలో భావతరంగములకు మితి లేకుండెను. అతఁడు సంపూర్ణముగా మన్మథునకు లొంగి పోయెను గాని యాసంగతిమాత్ర మతనికి వ్యక్తముకాలేదు. తనయెదుటనుండిన యుత్త మసుందరి తనను ప్రేమించుచున్నది యను భావముమాత్రమే యతనికి గోచరించుచు న్నది.

కామింపఁబడితినని భ్రమించి వీరసింహుఁ డిప్పుడు పూర్ణను కామించుచున్నాఁడు. అతని కామము స్థిరపడిన కొన్నిక్షణములలో భ్రమ కొంచెము శిథిలమైనది. ఆమె తనను ప్రేమిం చుచున్నదా, లేదా యనుసంశయ మిప్పు డతనిమనస్సు నాక్రమించినది. వెంటనే యామె వెళ్లిపోవునేమో యని సందేహ మతని కుదయించినది. తోడ్తో నామె వెళ్లుట నాఁపవలె నని యుద్దేశ మతనికి పుట్టినది. అం దువలన నతఁడు త్వరగా పూర్ణ నతిక్రమించి ముని వచ్చుచున్నారేమో చూచెదనను వ్యాజముచే ద్వారము నాక్రమించినవాఁ డయ్యెను. ద్వారము నాక్రమించిన యాపురు షునిదృష్టి యిప్పుడు బాహ్యప్రదేశమువంక లేదు. ముని వచ్చుచున్నారో లేదో యాఁగొ డనయే దాని కక్కఱలేకపోయెను. అది యున్మాదముతో పూర్ణమీఁదికే దుముకుచు న్నది. ఉత్సాహముతో పూర్ణయంగసంధు లలో నాడుచున్నది. పిపాసతో పూర్ణలావ ణ్యామృతమును గ్రోలుచున్నది.

పూర్ణ యావిషయమును కనిపెట్టినది. ఆమె కనుమానము కలిగెను. కొన్నిక్షణము లకు ముందు కొండగా నుండిన వీరసింహుఁ డ మెద్దృష్టిలో నిప్పుడు దూదిపింజమైనాఁడు.

వీర—నీవు రాఢీతరసత్యరఘునికొమా రితె పూర్ణ వని పోల్చుకొంటిని. నా పోలిక సరియేనా ?

పూర్ణ—ఔను.

వీర—నేనెవఁడనో పోల్చుకొంటివా?

పూర్ణ—(అజ్ఞాన మభినయించుచు) ఎవ రు మీరు ?

వీర— మహాసమాహ ర్త (రివిన్యూ మంత్రి) మౌద్గల్యహేమచంద్రుఁడు మా తండ్రి. దండనాయక కౌశికచండసేనుని చెల్లె లును, మహారాజ్ఞి లీలావతీదేవికి మేనవది నెయు, నంతఃపుర చేటీజనాధ్యక్షురాలును, మహావిదుషియు నగు భృంగాలక మాతల్లి. నాపేరు వీరసింహుఁడు. ఆచార్యభవనందిగురు కులములో శాస్త్రవిద్యలను, ఆచార్యవిషమ సిద్ధిగురుకులము లో శస్త్రవిద్యలను చక్కఁగా నభ్యసించినవాఁడను. రెండుమాసములనుండి రాజకీయసేనలో సహస్రపతిగా పనిచేయు చున్నాను.

పూర్ణ— మాసఖి విలాసవతియన్న గారా మీరు ?

వీర—ఔను. రాఢీతరీ నేను నీతో కొన్నిసంగతులు మాటలాడవలసియున్నది. అందులకు నాకు తగిన సమయప్రదేశములు లభించినందులకు సంతోషించుచున్నాను.

పూర్ణ—ఏవి యాసంగతులు ?

వీర— మా మామయ్య తనకొమా రితె ఫలినిని నా కీయ సంకల్పించుకొనియు న్నాఁడు. నా మనస్సుమాత్రము రాఢీతరిపై లగ్నమయ్యె నని సత్యము చెప్పుచున్నాను. రాఢీతరిముఖమునుండి యనుకూలవాక్యము వెలువడునెడల నాతల్లిదండ్రులతో చెప్పి గడి యలలో సంబంధము స్థిరపఱచెదను.

ఇప్పుడు వీరసింహుని భావము స్పష్టప డిపోయినది. అట్లడుగుట తప్పని పూర్ణ యను కొనలేదు గాని యట్టిప్రసంగమునకు తగిన దేశ, కాలములు మాత్ర మవి గావని యామె యనుకొనినది. తాత్కాలిక కామోద్రే కమే దేశకాలౌచిత్యముల నుల్లంఘించిన యట్టి ప్రసంగమునకు కారణ మని యామె నిర్ణయము. అందువలన వీరసింహుని విషయ ములో పడిపోయిన యామె గౌరవబుద్ధి తిరి గియు తలయెత్తలేదు. ఆమె భావశూన్యమై నను మృదువగు ప్రత్యుత్తర మిట్లిచ్చినది:

"మీ అమ్మగారు మా అమ్మ నీవిష యము నడుగునట్లేర్పాటుచేయుఁడు. మాతల్లి యంగీకరించిన నేను బద్ధురాలనయ్యెదను."

ప్రత్యుత్తరము ప్రతికూలముకానందున వీరసింహుని యాశకు భంగము కలుగలేదు. అయినను పూర్ణచెప్పిన సంవిధానము మాత్ర మతనికి నచ్చలేదు. అతని తాత్కాలికోద్రే

కము విఘ్నముల కవకాశమిచ్చు విలంబమును సహింపఁదయ్యెను. అతఁడు తిరిగియు నిట్లడిగినవాఁడయ్యెను.—

"మనము ముఖాముఖిగా సంభాషించుకొని పరస్పరాంగీకారమునకు వచ్చినపిమ్మట పెద్దల సమ్మతి కనుధావింపవచ్చును. నాయంగీకారమును నేను స్పష్టముగా చెప్పివేసితిని. నీయందు ప్రేమాతిశయముచే నే నెట్టి త్యాగము నేయుచున్నానో గమనింపుము. మా మాతులపుత్రిహస్త మెంతరమణీయమో యంతభాగ్యవంతము. సుమారు పదిలక్షల వరాల యాస్తిగల శ్రీమంతుని యేకపుత్రి యామె. నీవు లభించిన నాకామె యక్కఱ లేదు. నీ ముఖచంద్రునినుండి వచ్చు ప్రత్యుత్తరమును నేను వినఁగోరుచున్నాఁడను."

పూర్ణ— నాయభిప్రాయమును మీకు వినవలెనని యున్నదా ?

వీర—(ఆతురతతో) ఔను.

పూర్ణ— ఆలోచించుకొనుటకు రేపు సాయంకాలమువరకు నాకవకాశమిండు.

ఇప్పటికిఁగూడ పూర్ణ మృదువుగానే యతనినుండి తప్పించుకొనిపోవలెనని యట్లు బదులుచెప్పినది. ఎట్టి విలంబమునకుఁగూడ నవకాశ మీయఁగూడదనియే వీరసింహుని నిశ్చయము. అతఁడా బిగువుతోడనే యిట్లు తిరిగియు ప్రశ్నించినవాఁడయ్యెను.—

"ఇప్పటి నీభావమును నేను వినఁగోరుచున్నాను. నేను కపటములేక యడుగుచున్నాను గనుక నీవుగూడ కపటములేకయే బదులు చెప్పవలసినది."

వీరసింహుని స్పష్టప్రశ్నకు స్పష్టప్రత్యుత్తరమునే యీయవలెనని పూర్ణ నిర్ణయించుకొనినది. అనంతర మామె వీరసింహుని యాశ పటాపంచలగునట్లు దృఢస్వరముతో నిట్లు పలికెను:

"స్పష్టముగా నాభావమును మీరు తెలుసుకొనఁగోరితిరిగాన చెప్పుచున్నాను వినుఁడు. అధికపరిచయములేని యొకకన్యకను ప్రథమ దర్శనములోనే యింతవిరసముగా భావము చెప్ప బలాత్కరించు మీ స్వభావము నా కెంతమాత్రమును నచ్చినదిగాదు. అధికముగా నొకకన్యను ప్రేమించినవాఁ డిట్టి విరసచర్యనెన్నఁడు నవలంబింపఁడు. విలంబమును సహింపని యిట్టియుద్రేకము పశుస్వభావమేగాని మానవస్వభావముగాదు. నేనిప్పుడు మిమ్ములను ప్రేమింపలేకపోతిని. రేపటికిఁ గూడ ప్రేమింపఁజాలను. ఎన్నటికిఁగూడ ప్రేమింపఁజాలను. మీరు సహధర్మాచరణమునకు మఱియొకకన్యకను వెతకికొనుఁడు."

వీర—ముగ్ధురాలా! ఏమియు నాలోచింపక నన్ను నీ విట్లు తిరస్కరింపవలదు. కొలఁదిరోజులలో నేను దండనాయకపదవికి వచ్చితీరెదను. అప్పుడు నా సహస్రపతిపదవిని మీ పెత్తల్లిగారి మల్లికార్జునబాబు కిప్పించెదను. ప్రాసాదములో మాకుటుంబమునకుఁ గల పలుకుబడి యెంతయో నీకుఁదెలియనిది

గాదు. మాయాస్తి యఖండమైనది. పది లక్షలవరాల కెక్కువయేయుండును. వీరపరీక్షలో నేను మొదటితరగతిలో నుత్తీర్ణుఁడ నైతిని.

పూర్ణ—ఈ విషయమునం దాలోచన లెవ్వియును నాకిరావని మీరే ముందునిర్ణయించితిరి. అందువలన నేను మఱి యాలోచింపను. నాభావమును నేను స్పష్టముగా చెప్పివేసితిని. అది తిరుగనిమాట. దీనినిగురించి మీ రింకను మాట్లాడవలదు. మర్యాదగా దారియిండు. నేను పోవలసియున్నది.

ఇంతటితో వీరసింహుఁ డూరకుండిన బాగుండెడిది. అతఁడు తానవమానింపఁబడితినని తలంచి క్రుద్ధుఁడయ్యెను. అట్టిస్థితిలో నతని యుక్తాయుక్తవిచార మస్తమించినది. సాధ్యాసాధ్యవిచారము తలసూపనేలేదు. కార్యాకార్యవిచారము వెనుకఁబడిపోయినది. లాభాలాభవిచారము సన్నగిల్లినది. ధర్మాధర్మవిచార మసలే యతనికి లేదు. నాయంతటివాఁడు కోరి తిరస్కరింపఁబడుటయా యను పట్టుదల యతని నుత్తరప్రసంగమునకు పురికొల్పినది.

"నామనస్సును దొంగలించిన కన్యను నే నుపేక్షింపఁజాలను. సుందరియగుకన్య వీరపురుషునిసొత్తు.

పూర్ణ—ఔను. సుందరియగుకన్య వీరపురుషుని సొత్తేయగును. నీవుమాత్రము వీరపురుషుఁడవుగావు. వీరపురుషులు రణరంగమున నద్భుతకృత్యముల నాచరించి సుందరకన్యల మనంబుల నాకర్షింతురు. వివిక్తప్రదేశములందు స్త్రీలను భయపెట్టుట దస్యులక్షణముగాని వీరలక్షణముగాదు. ఇట్టి వివిక్తదేశవీరునినుండి రాధీతరి పూర్ణ భయపడదు.

## రెండవ ప్రకరణము

### కటారిచే జవాబు

పూర్ణమాటలు విని వీరసింహుఁడు దండతాడిత సర్పమువలె క్రుద్ధుఁడై యిట్లుపలికెను:

"నేను వివిక్తదేశ వీరుఁడనా? నాకు సహస్రపతిపదవినిచ్చిన యాంధ్రేశ్వరు నే నీ వధిక్షేపించుచున్నట్లున్నది. వీరసింహునకు క్రోధముగలిగిన కొన్నిక్షణములలో మీయన్నయ్య శతపతిపదవి యూడిపోవునని నీవు తెలుసుకొనఁజాలకున్నావు. బ్రహ్మకుల పతి పదధ్యక్షునియెదుట నికృష్టమగు నీజన్మను ఋజువుపఱచి నిన్ను బ్రాహ్మణజాతిలో నుండి బహిష్కరింపఁ జేయుటగూడ మాకసాధ్యమైన పనిగాదు. బాగుగా నాలోచించుకొనుము. నన్నుబెండ్లాడి కుటుంబమును మహోన్నతస్థితికి తెచ్చెదవా? తిరస్కరించి యధోగతిపాలుచేసెదవా?"

వీరసింహుని యీ వచనోపన్యాస మింతవఱకు శాంతముగానుండిన రంగస్థలమును భయంకరముగా మార్చినది. ప్రసన్నముగానుండిన రంగస్థలమును కలంచివైచినది. పిమ్మట వారి సంవాదములో మార్దవము పూర్ణముగా నంతరించిపోయెను.

పూర్ణ—నీతో విరోధము తటస్థించు నెడల నేనుగాని మా అన్నయ్య మల్లికార్జునబాబుగాని లేశమాత్రముగూడ భయపడు వారముగాము. నా జన్మనికృష్టమో నన్నన్నవారి జన్మలు నికృష్టములో కాలమే తెలుపఁగలదు. నన్నుకన్న తండ్రియొక్క క్షైప్యాలను మోయుటకుఁగూడ నీ కర్హత లేదని నేను స్పష్టముగా చెప్పఁగలను. ప్రాసాదములో మిక్కిలి పలుకుబడిగల నీ తల్లి మా అన్నయ్యను శతపతిఃదవినుండి తీసివేయింపఁగలదు గాని, యతని భుజబలములో నుండి లేశమునుగాని యతని రణకౌశలములోనుండి లవమునుగాని యపహరింపఁజాలదు. విశాలమగు భూమండలములో విక్రమనిధియగు మా అన్నయ్య మెచ్చటనైన బ్రతుకఁగలఁడు. అతని వీరత్వము తల్లి వచనప్రతాపముపై నాధారపడియుండిన నీ వీరత్వమువంటిదిగాదు.

ఈ మాటలు తీవ్ర బాణములువలె వీరసింహునిమర్మములను స్పృశించినవి. పూర్ణను వశపఱచుకొనుటకు వాఁడవలంబించిన యాశాప్రదర్శన నీతియు బిభీషికానీతియు వ్యర్థములైనవి. ఇంక తన యవిచారితప్రయత్నమునుండి విరమించుటయో బలాత్కరించుటయో మిగిలిన కర్తవ్యము. ఆ మదోద్ధతుఁడు తనప్రయత్నమునుండి విరమించుట తన ప్రతాపమునకు న్యూనతయని యెంచెను. అర్ధరాత్రమువఱకు కక్షోభ్యముని మరలి రారని యతనికి తెలుసును. అతఁడట్లు చెప్పియే మూలికకొఱకు చాలదూరమునకు వెళ్లియున్నాఁడు. ముందుగా వీరసింహుఁడాడినది యబద్ధమేయగును. ముని శీఘ్రము వచ్చి కోయుదురని చెప్పిన నామె వెళ్లకుండ నుండునని యతని యెత్తు. ఆవివిక్త ప్రదేశములో నొంటరిగా చిక్కిన యాసుందరాంగిని బలాత్కారణము సేయుటకే యతనిని తత్కాలసంకల్పము ప్రేరేపించినది. ఈదుశ్చర్యకు ప్రోత్సహించుటలో కామ మొక్కటియే బాధ్యముగాదు. క్రోధముగూడ నందులో పాల్గొనినది. అంతట నాయుచ్ఛృంఖల యువకుఁడు పూర్ణతో తుదిమాట నిట్లు పలికెను:

"వీరసింహుని భుజప్రతాపము తెలియక నీవిట్లు జల్పించుచున్నావు. మఱియొకసారి నిన్నడిగెదను. నన్నుపెండ్లాడి శ్రీకాకుల సంపన్న నారీమణులలో మిన్నయై జ్వలించెదవా? లేక నాబలమును పరీక్షించెదవా?"

పూర్ణ వీరసింహుని మాటలువిని తత్క్షణమే మొలనుండి కటారితీసి చేత ధరించినది. దీపప్రభలో నాపిల్లకత్తి సభామధ్యమునందు రాణివలె వెలుంగుచుండెను. పూర్ణ తన యెదుటనున్న మదోద్ధతవీరుని తృణీకరించి యిట్లుపలికినది.

"క్షుద్ర! ప్రాణములు నీకు కావలయునెడల పాఱిపొమ్ము. నాయొద్దనుండి జబాబే కావలయునెడల నీకతారియిచ్చును. ఇది నీబల మెంతగలదో పరీక్షింపఁగలదు."

ఇప్పుడు వీరసింహుని స్థితి మిక్కిలి చెడినది. పూర్ణచేతి యసిపుత్రికను జూడఁ

గానే యతని నింతటిస్థితికి తీసుకొని వచ్చిన కాముఁడు మెల్లగా నతనినివిడిచి జాఱిపోయి నవాఁడయ్యెను. చిరకాల మైత్రిగల క్రోధుఁడు మాత్రము సమయమునందు తన పోషకుని విడువలేదు. అతని బలాత్కారణోద్దేశముమాత్రము పూర్ణయొక్క భీషణ శత్రుజ్వాలలో భస్మీభూతమయ్యెను. ఇప్పుడతని భావికర్తవ్యము మిక్కిలి యసహ్యమై పోయినది. పాఱిపోయిన మహావమానము. యుద్ధము సేయునెడల చంపుటయో చచ్చుటయో యొకటి జరిగితీరవలెను. చంపిన స్త్రీహత్యాపాతకము. చచ్చిన సర్వనాశము. ఆమదోన్మత్త యువకునకు పాఱిపోఁజాలఁడయ్యెను. ఇఁకమిగిలినది యుద్ధమే. అందులకతఁడు తన మొలలోనుండి భీకర కరవాలము తీసినవాఁడయ్యెను.

పూర్ణ త్రుటికాలమైనను వ్యర్థము సేయక సింహికవలె వానిపైఁబడి సాయుధమగు వానిబాహువుపై కఠారిచే తీవ్రముగా పొడిచినది. వానిని చంపవలెనను నుద్దేశమామెకులేదు. అట్లుండునెడల నామె వాని హృదయముపైనే పొడిచియుండెడిది. కాని వానిమదము భగ్నము కావలెను. వాని ప్రాణములు పోఁగూడదు. ఇదియే యామె యుద్దేశము.

ఆ పోటువేగముతోడనే యామె యతనిని పడఁద్రోసివేసినది. ముందే గుప్తముగా పతితుఁడైన వీరసింహుఁడు భూమ్యాకాశములకు తెలియునట్లు సశబ్దముగా నిప్పుడు పతితుఁడైనాఁడు. పూర్ణ పడిపోయిన వీరసింహుని పరీక్షించినది. అతఁడు మూర్ఛితుఁడైనాఁడు. ఆమె ముందతనిచేతనుండు ఖడ్గము లాగుకొని పిమ్మట నతనిభుజమునకు గ్రుచ్చుకొనియుండిన తన కఠారిని మెల్లగా తీసివేసినది. అంతట నతని బాహువునుండి యపరిమితముగా రక్తము ప్రవహింప నారంభించెను. ఆ దృశ్యముచూడఁగానే పూర్ణను కరుణ యావేశించినది. అప్పుడామెయనుతాపము నకుమేరలేకపోయెను. పొడవకుండ త్రోసివేసి వెళ్లిపోయియుండిన బాగుండియుండెడిదియని యామెచింతిల్లినది. ఇంతలో నామెకు డొంకల సందులోనుండి కొన్నిపాటలు వినిపించినవి.

"పాఱిపోవఁగశక్తి పాదాలకుండ
మాఱుఁజేయుచువాని మదముగ్ధదృష్టి
త్రోసిపోవఁగశక్తి దోర్లతకుండ
గాసిఁబెట్టుచు ఘోరగర్జనవలన
కాలంబుపొడిగింప ఘనవాణియుండ
మూలంబు దాఁచుచు మునివచ్చునటకు
సాధుతమెఱుఁగని యోధముఖ్యునకు
క్రోధముకలిగించి రోధింపఁబడుచు
పటుశత్రుశోణిత పలలభోజనను
కటువౌకఠారిని గాలదూతికను
మండినరోషము మతినిగలంప
నిండుప్రాణిభుజాన నీవుగ్రుచ్చితివి
చొచ్చెనులోతుగాఁ జురకత్తిచూడ
చచ్చునో బ్రతుకునో చపలాక్షి! వాఁడు

గాయపుచెట్టాకు కల్కము వేసి
గాయముగట్టుము గతిగానఁగలవు."

ఆ పాట లున్మత్తసిద్ధాంగన రాజకాళివి యని పూర్ణ తెలుసుకొనినది. నలుదిక్కులు చూచినది. రాజకాళి కన్పట్టుటలేదుగాని యామె యుదహరించిన గాయపుచెట్టు కనిపించినది. ఆమె యానందభరితయై వెళ్లి యా చెట్టునుండి యొడినిండ నాకులుగోసి తెచ్చి వాటిపసరుచే వీరసింహునిగాయము నింపి మఱికొన్ని యాకుల కల్కమును గాయముపైఁబెట్టి యతని యుత్తరీయముచేతనే దానిని కట్టినది. ఇంతకుముందు ప్రాణములనే యపహరింప నెంచిన మారుతుఁ డిప్పుడు చామరగ్రాహివలె నతని నుపచరింప నారంభించినాఁడు. అనంతరము పూర్ణ యాశ్రమములోనుండి జలకుంభముదెచ్చి నీటి నతని ముఖముపైఁజల్లఁగా నతనికి తెలివివచ్చినది. కండ్లువిప్పకయే యతఁడు నోరుసాచినాఁడు. పూర్ణ పురిసెల్లతో నీరుపోయ నతఁడుత్రావినవాఁడయ్యెను. అక్షోభ్యమునియే వచ్చి తన్ను పరిచరించుచున్నాఁడని యతనిభ్రమ. నీరుత్రావినపిమ్మటనతనికి చక్కఁగా తెలివివచ్చినది. కండ్లువిప్పిచూచినవాఁడయ్యెను. పూర్ణ ముఖము కన్పట్టినది. కొన్నిక్షణముల క్రిందట నతని కది మహోన్మాదకముగానుండెను. ఇప్పు డత్యంత భీషకమయ్యెను. "హా! రాక్షసీ!" యని యా యువకుఁడొక కేకవేసినాఁడు.

"రాక్షసునకు గర్వభంగమైన పిమ్మట రాక్షసి వెళ్లిపోయినది. ఈమె నీసుఖజీవితమును కాంక్షించు నీచెల్లెలు. సమయమునకు గాయపుచెట్టాకు దొరకినది. దాని రస కల్కములు వేసి గాయముగట్టితిని. నీ కింక భయములేదు. బుద్ధిమంతుఁడవై చిరకాలము బ్రతుకుము. మహాముని వచ్చి భద్రముగా నిన్నింటికిపంపును."

అనిచెప్పి పూర్ణ యాచోటు విడిచి వెళ్లిపోయినది. వీరసింహుని ప్రాణముకంటె నెక్కువ వెలగల యతని కత్తి నామె తీసుకొనియే వెళ్లిపోయినది. ప్రియమగు కత్తితోఁబాటు ఘనమగు మానమును గూడ పోఁగొట్టుకొనిన యాయుద్ధత వీరపురుషుఁ డిప్పుడు నిస్సారములగు ప్రాణములతో శ్వసించుచున్నాఁడు. ఆప్రాణములు గూడ తన శత్రువే దయతలఁచి యుంచినవి యని జ్ఞప్తికి వచ్చినపు డితనిలో నావిర్భవించిన లజ్జాధూమము నిర్మలచంద్రికను కప్పివేసినది. అతనికి దిక్కులంధకారమయములై పోయినవి.

## మూఁడవ ప్రకరణము

"ముద్దు బాబయ్యకు ముసలి దేతనము."

ఎవరిదయవలన తానిప్పుడు శ్వసించుచున్నాఁడో యామె కెట్లు ప్రతీకారముసేయుటయని వీరసింహుఁ డాలోచించుచు నచ్చటనే కూర్చున్నాఁడు. అతని యాలోచన ముగియకముందే చంద్రుఁ డస్తమించెను. అతఁడాలోచించుచుండఁగనే మఱికొన్ని గడియలు గడచినవి. అప్పటికి పూర్ణజన్మను గుఱించి యపయశస్సును వ్యాపింపఁజేయుట

యెట్లో యావిధ మతని మనస్సునకు స్ఫురించి నది. కాత్యాయనియను విప్రవిధవాంగనకు కౌళికసులోచనుఁడను నాగునితో దుస్సంబంధముగలదని లోకాపవాద మొకటిగలదు. సులోచనుఁడు దుశ్శీలురలో మేటియని వాదు. ఆ కాత్యాయనీ సులోచనులను పూర్ణయొక్క తల్లిదండ్రులనుగా నొక కథ కల్పించి శ్రీకాకుళనారదుఁ డని బిరుదు వహించిన కాణ్వశుకనాసుని చెవిలోవేసినఁ జాలును. అచిరకాలములో నావార్త పట్టణ మంతయు నల్లుకొనును. ఇది మనవీరసింహు నకు తోఁచిన విధము.

ఇంతట నక్షోభ్యమునివచ్చి యతనియెదుట కన్పట్టెను. అతనిని చూడఁగానే సంభ్రమముతో వీరసింహుఁడు

"భగవన్! అదృష్టమువలన జీవించి తిని" అన్నాఁడు.

అక్షో—ఏమి యత్యాహితము?

వీర—అదియెట్లో నేనిచ్చట నున్నానని తెలుసుకొని శతపతి మల్లికార్జునుఁడు వచ్చి వినయముతో నన్ను పిలువఁగా నేను లోపలనుండి బయటికి వచ్చితిని. అతఁడు నాతో తన పినతల్లిగారి పూర్ణను నాకిప్పించెదనని పెండ్లిమాట లాడెను. పూర్ణజన్మ యధర్మ్యమైనందున నే నాపిల్లను పరిగ్రహింపఁజాల నంటిని. నాచెల్లెలి జన్మగురించి యవమానకరముగా మాట్లాడెదవాయని గర్జించుచు నతఁడు చురకత్తిచే నాభుజముపైఁ బొడిచి నన్ను త్రోసివేసి నాకత్తి లాగికొనిన వాఁడయ్యెను. అట్టి దుస్సంభవమును నే నెదురుచూడనివాఁడనగుటచే దెబ్బతినవలసిన వాఁడనైతిని. ఇంతలో నొక మహాపురుషుఁడు వచ్చి నన్నురక్షించినాఁడు. లేనియెడల మల్లికార్జునుఁడు మఱియొక పోటుపొడిచి నన్ను చంపియుండెడివాఁడే. వచ్చిన యా మహాపురుషుని చూడఁగానే మల్లికార్జునుఁడు పాఱిపోయినాఁడు. ఆ మహాపురుషుఁడే నాకు గాయములో నొక వనస్పతి పసరుపోసి కట్టు కట్టి వెళ్లిపోయెను. అతనిపేరు నేను తెలుపుకొనఁగోరితినిగాని యఁతడు చెప్పలేదు.

అక్షోభ్యముని యీకట్టుకథను నమ్మక యిట్లు పలికెను :

"మహాద్గల్య! మల్లికార్జునుఁడు క్రోధోద్రిక్తుఁడై యకార్య మాచరించునని గాని యొకరియొద్ద భయముచే పాఱిపోవునని గాని యతనిని దెలిసినవా రెవ్వరును నమ్మరు."

వీర—నే నబద్ధమాడుచున్నానని మీ యనుమానమా?

అక్షో—అనుమానము గాదు. నిశ్చయమే.

వీరసింహుఁ డేమియు మాటలాడక తల వంచుకొనెను. సద్గుణరాశియగు మల్లికార్జునునిపై వీరసింహుఁడుచేసిన యారోపణను లేశమాత్రముగూడ నమ్మక ముని దీపముతో నా రంగస్థలము నొకసారి శోధించినవాఁడయ్యెను. అతనికి ద్వారముచెంగట ద్రబ్బలైన

గాజుముక్కలు దొరకినవి. తత్క్షణమే వీరసింహుని పొడిచినది యొకస్త్రీ యని యతనికి తోఁచినది. అనంతర మతఁడు వీరసింహున కాకాచవలయశకలములను జూపి యిట్లనెను:

"వార్ధక్య! నీవు సత్యము కప్పిపుచ్చినను ఈగాజుముక్కలు నాకు జరిగిన విషయమును వెల్లడించుచున్నవి. నిన్ను పొడిచినది యొక స్త్రీ. ఎవతె యంత సాహసికురాలు? తాక్షికి సర్ణినియో, గాఢీశరిపూర్ణయో యైయుండ వలెను. పర్ణియేయగునెడల నీవు భూపతితుఁడ వైన పిమ్మట నిన్ను మఱియొక పోటు పొడిచి చంపివేయునే గాని గాయమునకు కట్టుకట్టి నీ కుపచారము సేయదు. ఆమెకు తనశత్రువుపై కనికరము సున్న. పూర్ణజయించిన పిమ్మట శత్రువునైన నుపచరించు స్వభావముగలది. ఆశ్రమమునకు వచ్చినయామెను నీవు బలాత్కరింప సమకట్టి యామెచే దెబ్బ తినియున్నావు. నిన్ను పడఁద్రోసినపిమ్మట నామెయే దయతో నీగాయమునకు కట్టుగట్టి వెళ్లి పోయినది."

అక్షోభ్యుని సత్యానుమానమునకు వీర సింహుఁడాశ్చర్యపడెను అతఁ డాయనుమానమును నోటిచే నంగీకరింపకపోయినను ఖండించి మాటలాడఁజాలఁడయ్యెను. అతని స్వరము సన్నగిల్లినది.

"ఏదియెట్లయినను గురువులతో వాదించుటకు నా కిష్టములేదు. క్రమపరిశోధనపై నా నిరపరాధత్వము తమకు స్పష్టమగును. ఆ ప్రసంగము నిప్పుడు విడిచిపెట్టుఁడు. నాతల్లి యదృష్టము బాగున్నది. నా ప్రాణములు నిలిచినవి."

కాలోచితజ్ఞుఁడగు ముని యాసంగతి గుఱించి మఱియెత్తలేదు. వీరసింహుని మాట లవలన నతఁడు తనయనుమానము నంగీకరించినట్లే మునికి తాత్పర్యమైనది.

వీర — (ప్రసంగాంతరమునకు వెళ్లుచు) భగవన్! మూలిక దొరకినదా?

అక్షో — దొరకినది. దాని నొక్కసారి ప్రయోగించినఁజాలును. మీ తండ్రిగారి శూలరోగము సంపూర్ణముగాఁ బోవును.

వీర — భగవన్, కన్యా వశీకరణమునకు మూలికగలదా?

అక్షో — అది నీకెందుఁకు?

వీర — మా మాతులపుత్రి ఫలినిని గుఱించి నేనడుగుచున్నాను.

అక్షో — మీమామయ్య యాపిల్లను నీకే యీయనున్నాఁడని వినికిరి. మఱి మూలికయెందులకు?

వీర — మామాతులపత్ని ధారావతి యామెను భవనందిగారి ఘనేంద్రున కీయ యత్నించుచున్నది. మామామయ్య తనకిష్టమున్నను భార్యకు ప్రతికూలముగా కార్యము సేయఁజాలకున్నాఁడు. కన్య తల్లిదండ్రులలో నెవరిని సమర్థించిన వారికి జయము వచ్చును. అందువలన నేను మిమ్ములను

మూలిక నడుగుచున్నాను. అట్టి మూలికను తమరు నా కొసంగునెడల తమరు నిర్మింపఁబోవు చికిత్సాశాలకు పదివేలు వరాలొసంగెదను.

అక్షో—నీయౌదార్యమునకు సంతోషించితినిగాని కన్యావశీకరణ మూలిక నెవరికి నీయఁగూడదని గుర్వాజ్ఞ.

వీర—ఎవరికిఁగూడ నీయనపుడు దానిని తెలుసుకొని ప్రయోజన మేమి?

అక్షో—పెండ్లాడిన భార్య తనకు ప్రతికూలురాలుగా నున్నపు డామెను వశపఱచుకొనుట కది యుపయోగించును. అది ధర్మవిరుద్ధముగాని పని. మూలికాబలముచే కన్యకల వరణస్వాతంత్ర్యము నపహరించుట ధర్మవిరుద్ధమని మాగురువుగారి తలంపు.

వీర—తమగురువులెవరో నేను వినవచ్చునా?

అక్షో—దక్షిణాపథమునందు సుప్రసిద్ధు లగు జటాముని మాగురువులు.

ఇట్లు వారు మాటలాడుకొనుచుండఁగా వడివడిగా పరిక్రమించివచ్చి వారియెదుట నొక స్త్రీ ప్రత్యక్షురాలయ్యెను. ఆమె కాలాంబుదశ్యామాంగి. జ్యోతిష్మద్విశాలలోచనురాలు. విస్తృతవినీలమగు నామె కేశపాశము వికీర్ణమై వెనుకప్రక్కకు వ్రేలాడుచున్నది. శీతవాతాతపములవలన నామెగాత్రములు వాడియుండినను యథాశాస్త్రలక్షణోపేతములై చూచువారి మనంబుల నాకర్షింపఁగలిగియుండినవి. ఆమెకట్టినది మలినాంబరము. తొడుగుకొనినది చెట్టిని కంచుకము. శంఖవలయములుతప్ప వేఱుభూషణము లామెకు లేవు. ఆమెపేరే రాజకాళి.

రాజకాళిని చూడఁగానే అక్షోభ్యముని "అక్కయ్యా! విశేషములేమి?" యని యడిగెను.

రాజ—తమ్ముఁడా! చాలమంది కన్యలు పెండ్లిలేక పడియున్నారు. వారికి వరులను సంపాదింపవలసియున్నది.

అక్షో—మీరు జోడీల నేర్పాటు సేయఁగూడదా?

రాజ—ఏర్పఱచియే యున్నాను.

వీర—(కుతూహలముతో) ఒకసారి సెలవిచ్చెదరా?

రాజ—మాభృంగాలకముద్దు కొమరుఁడా! చెప్పెదను, వినుఁడు.

నెయ్యిద్రావుచు నింటనిల్చెడు దొరకు
కయ్యంబు గలిగించు కలికియే తగును
జగమేలఁబుట్టిన జన్మశూరునకు
ధగధగలాడెడు తరుణియే తగును
నిత్యముతిరుగాడు నియమవంతునకు
సత్యానురాగయౌ సాధ్వియే తగును
మంత్రాధినాథుఁడౌ మహిమవంతునకు
తంత్రాధినాథయౌ తన్వియే తగును
రంగానశయనించు రాచసోమరికి

దొంగలతోఁ బాలు ధూర్తయే తగును.
నెత్తిపైఁ గన్నున్న మత్తచిత్తునకు
కత్తిచేత ధరించు కఠినయే తగును
బంగారుపురమేలు భాగ్యవంతునకు
శృంగారరసమేలు చిన్నదే తగును
అన్నింటఁ బొడువైన యడవిచెట్టునకు
తిన్నగాఁ బ్రాకిన తీవెయే తగును
కామునారాధించు క్రమకాయునకు
గ్రామసుందరి పుష్టగాత్రియేతగును
ముసలితనంబున మోహముగ్ధునకు
కసరుచు నేలెడు కాంతయే తగును
కల్లమాటలనాడు కంబుకంఠునకు
బొల్లిమాటల పువ్వుఁబోఁడియే తగును
మీసాలు పెంచిన మిండరాయునకు
మాసాలు గడచిన మహిళయే తగును
అతివైభవముతోడ నలరారువిటుల
పతికి మాఱుమనువుపడతియే తగును
పెద్దడాబులుగొట్టి పేరొందినట్టి
ముద్దుబాబయ్యకు ముసలిదే తగును."

పాటలు ముగించువఱకు నక్షోభ్య వీరసింహులు నిశ్శబ్దముగా వినిరి. అక్షోభ్యుఁడు వీరసింహుఁడే ముద్దు బాబయ్యయని పోల్చుకొనెనుగాని ముసలిదిమెవరో యతనికి తెలియలేదు. వీరసింహునకు రాజకాళిమాటలపై ప్రామాణ్య బుద్ధిలేనందున వాటి యంతరార్థము విచారించుట కంతగా నతఁడు ప్రయత్నింపలేదు.

అక్షో — అక్కయ్యా! ముసలిది యొకకన్యకయా? ఆమెయెవరు? ఆమెవయస్సెంత యుండును?

రాజ — మాయతిశాస్త్రము ననుసరించి ముప్పదియేండ్లది ముసలిది. ఆమె యొకయస్ఖలిత బ్రహ్మచారిణి. నాలుగుకాలములు గడపిన నాయికామణి. విధ్యుక్త వివాహమునకు తగిన వరుని వెదకుచున్నది.

అక్షో — ఇన్నియేండ్లవఱ కామెకు తగిన వరుఁడు దొరకలేదా?

రాజ — ఆమె గొప్ప విమృశ్యకారిణి. తొందరపడిసేయు మనిషిగాదు

వీర — ఆమెయందు వరుల నాకర్షింపఁగల యోగ్యతయేమిగలదు ?

రాజ — ఆమె తాటకను మించిన బలవంతురాలు. అజముఖినిమించిన సాహసికురాలు. శూర్పణఖను మించిన సుందరీమణి. వీనలగు వరుల నాకర్షించుటకీ గుణములు చాలవా ?

వీర — అట్టి మహోత్తమకన్యకకు తగిన వరుని సంపాదించుటకు నీవంటిదూతిక పని సేయవలసియున్నది.

* ధనంజయుఁడు + ధరణి, ఘనేంద్రుఁడు + పూర్ణ, కాలనాథుఁడు + మధువాణి, మల్లికార్జునుఁడు + రథిని, శక్తినరుఁడు + మణిమాల, నిశంభువు + పర్ణిని, విజయసేనుఁడు + పద్మాక్షి, భీమనాథుఁడు + ఫలిని, భోగనాథుఁడు + కుముదాక్షి, హిరణ్యనాభుఁడు + కామసేన, రణేశ్వరుఁడు + విలాసవతి, శివకీర్తి + కనకవల్లి, రుద్రసేనుఁడు + కాంతామణి, వీరసింహుఁడు + బింబాక్షి.

రాజ—నా దూతికాకృత్యము ముగించినది. ఇంక వివాహమే కావలసియున్నది.

వీరసింహుని భావి శిలయందు లిఖింపఁబడినది యనియే యత్కోభ్యము వివరించెను. రాజకాళి చేసిన వర్ణననుబట్టి యా స్త్రీ కాపాలికకన్య చించాక్షియని ముని పోల్చుకొనినాఁడు. పూర్ణయొక్క శస్త్రప్రహారముకంటెఁ గూడ రాజకాళియొక్క వాక్ప్రహారమే యెక్కువగా వీరసింహునకు బాధకమని యతఁడనుకొనినాఁడు. వీరసింహునకు మాత్రము దానివిలువ తెలియలేదు.

తనపని ముగించుకొని రాజకాళి వెళ్లిపోయినది.

## నాల్గవ ప్రకరణము

గతచరిత్రాంశములు

ఈ ప్రకరణమునందు మన మహాకథ నవగాహించుటకు కావలసిన కొన్ని గత చరిత్రాంశములనుదాహరించుచున్నారము. అవి పాఠకులు ముఖ్యముగా గమనింపఁదగినవి.

రాజవంశము

కౌండిన్య గోత్రసంభవుఁడగు కమలేశ్వరుఁడను బ్రాహ్మణునకు మువ్వురుపిల్లలు - పర్వతస్వామియు, మేఘస్వామియును, సౌదామినియును. కుత్సగోత్ర సంభవుఁడగు శివనాథుఁడు సౌదామిని భర్త.

పర్వతస్వామి తపోబలమువలన దివ్యశాస్త్ర తేజస్సునొంది జ్వలించెను. ఆంధ్రేశ్వరుఁడగు కాకుల నాగేంద్రుఁడును, చిత్రకూటేశ్వరుఁడగు మందనాథ నాగేంద్రుఁడును మగధేశ్వరుఁడగు మహాపద్మనందిచే నోడింపఁబడి రాజ్యభ్రష్టులైనపిమ్మట నాంధ్ర చిత్రకూట రాష్ట్రములను మగధులనుండి తిరిగియు లాగుకొని పర్వతస్వామి క్రొత్త రాజవంశమును స్థాపించెను. ఆమహాకార్యమునందతనికి మేఘస్వామి శివనాథులు సహాయులైరి. పర్వతస్వామి తానాంధ్రరాష్ట్ర సింహాసన మధిష్ఠించి తనతమ్ముఁడగు మేఘస్వామిని చిత్రకూట రాష్ట్రమునందు మాండలిక రాజునుగా నిలిపెను.

ఈ కాలపు పశ్చిమగోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరుజిల్లాలించుమించుగా నప్పుడు పర్వతస్వామి వశపఱచుకొనిన యాంధ్రరాష్ట్రము. దాని రాజధాని కృష్ణాతీరమునందలి శ్రీకాకులనగరము. దానిని కట్టించినవాఁడు కాకులుఁడు గనుక దానికా పేరువచ్చినది.

ఈ కాలపు బస్తరు జయపుర సంస్థానములే యించుమించుగా నప్పటి చిత్రకూట రాష్ట్రము. ఇంద్రావతీ నదీతీరమునందలి చిత్రకూటనగరము దాని రాజధాని. రాజధానీనామమువలననే యా రాష్ట్రము యొక్కనామము ప్రసిద్ధమైనది.

పర్వతస్వామికి తనమేలుబడియొక్క కడపటిరోజులలో కుంతలేశ్వరుఁడగు ననంతసేనునితో ఘోరయుద్ధమొకటి తటస్థించినది. ఆ సంగ్రామమునందనంతసేనుఁ డోడిపోయి తనరాజ్యములోని కొంతప్రదేశము పర్వత

స్వామి కిచ్చి సంధి చేసుకొనవలసినవాఁ డయ్యె ను. ఇంచుమించుగా నిప్పటి రాయలసీమయే యాప్రదేశము. దానియందు పర్వతస్వామి తన భగినీపతి శివనాథుని మాండలికరాజునుగా స్థాపించెను. మనకథారంభకాలమునందు శివనాథపుత్రుఁడు సత్యకర్మ యచ్చట మహామండలేశ్వరుఁడుగా నున్నాఁడు. అతని యేకపుత్రి రత్నప్రభ వీరవిప్రయువక ప్రార్థ్యమాన పాణియై మహానందిపుర ప్రాసాదమునందు వెలుంగుచున్నది.

పర్వతస్వామి యిరువది సంవత్సరములు ప్రజారంజకముగా రాజ్యమేలి కీర్తిశేషుఁడయ్యెను. అతని యనంతర మతని యేకపుత్రుఁడు సుచంద్రుఁ డాంధ్రసామ్రాజ్య సింహాసన మధిష్ఠించెను. అతనికి తండ్రి కూర్చినభార్య సేనాపతి వాహూలరణంధరుని కొమారితె చారుమతి. పట్టాభిషేకానంతరము తాను ప్రేమించి పెండ్లియాడిన రమణి గౌతమసుందుని కూఁతురు లీలావతి. శక్తిధరుఁడను కుమారుఁడును రథిని యను కుమారియును సుచంద్రునకు చారుమతియందు కలిగిరి. లీలావతి వడసినపుత్రుఁడు భోగనాథుఁడు. అతఁడు శక్తిధరునికంటె వారమురోజులు మాత్రము పెద్దవాఁడు. రథిని శక్తిధరుని కంటె రెండేండ్లు చిన్నది. మనకథారంభ కాలమునం దామె పదునెనిమిది సంవత్సరములు దాటిన ప్రౌఢయైయున్నది.

చారుమతీదేవి తనపిల్లవాండ్ర శైశవము లోనే గతించినది. పార్థివుని యనుమతమున చారుమతిపిల్లలను మాతామహ దంపతులు పెంచిరి. మనకథారంభకాలమునందు శక్తిధరుఁడు రాజ ప్రాసాదమునకు వచ్చివేసెను గాని రథినీకుమారిమాత్ర మింకను తాతగారి యింటనేయున్నది. ఆవిషయములో రణంధరుని యనురోధమే కారణముగాని సుచంద్రుని యుపేక్ష యేమియును లేదు.

మేఘస్వామి కిద్దఱుభార్యలు. పెద్దభార్య సూర్యప్రభ. చిన్నభార్య చంద్రప్రభ. సూర్యప్రభకన్నకూఁతురు శాంతిసేన. చంద్రప్రభ పెంచిన యపవిద్ధపుత్రుఁడు వీరేశ్వరుఁడు. లీలావతీదేవిచెల్లెలు పద్మావతి వీరేశ్వరుని భార్య. ఆంగిరసవిమలుఁడు శాంతిసేన భర్త. మన కథారంభకాలమునందు వీరేశ్వరుఁడు చిత్రకూట మహామండలేశ్వరుఁడుగా నున్నాఁడు. అతనికుమారుఁడు రణేశ్వరుఁడు శ్రీకాకుళములో రాజకీయ సేనయందు దండనాయకుఁడుగా పనిసేయుచున్నాఁడు.

మేఘస్వామి యనంతరము తన్నుల్లంఘించి యతని యపవిద్ధపుత్రునకు సుచంద్రుఁడు సింహాసన మిచ్చివేసినందున నలిగి శాంతిసేన తన భర్తతోఁగూడ రాజధాని విడిచి పరారియైనది. ఆమెకు విదేశములో సత్యప్రభ యను నొక కొమారితె కలిగెనని చారణులకథనము. శాంతిసేనావిమలులు రాజధానివిడిచినది మొదలుకొని యిదివఱకెచ్చట నుండినదియు, నేమి సేయునదియు ప్రాయికముగా నెవరికిని తెలియదు. వారి పిల్ల సత్యప్రభగుఱించి యంతకంటె తెలి

యదు. వారిమువ్వురిని గుఱించి కల్పితకథ లెన్నియో పుట్టుచుండినవి. వాటికిమాత్ర మంతుగానరాదు.

సుచంద్రుని గత రాజ్యవర్ష చరిత్ర

మహారాజ సుచంద్రునకు లీలావతి దేవిపై ననురాగ మెక్కువ. ఆయవకాశ మామెతీసుకొని సర్వరాజ కార్యములలోను హస్తక్షేపము సేయుచుండెడిది. ప్రేమ వశంవదుఁడగు నరపతి ప్రేయసి కెదురాడ లేక యామెమతము ననుసరించియే ప్రాముఖ్యముగా రాజకార్యములను జేయుచువచ్చుచుండెను. లీలావతీదేవి తండ్రి సునందుఁడే మహామంత్రియైనందున రాజకీయ నిబంధన మామెచర్యల కడ్డుపడఁజాలకుండెను. ఏది యారాజకీయ నిబంధనము? మహారాజును, మహామంత్రియు, నిర్ధారణీయ విషయశాఖా మంత్రియును జేరిన ముగ్వురిసభకు రాజకుల మని పేరు. రాజకులమే కార్యనిర్వాహకప్రభుత్వము. రాజకులమునం దిద్దఱుమంత్రులు నైకమత్యముతో చేసిన సూచనను మహారాజు తిరస్కరింపఁగూడదుగాని మంత్రులు భిన్నాభిప్రాయ లగునపుడు మహారాజు తనకు సమ్మతమైన మంత్రిమతముతో నేకీభవించి కార్యము నాచరింపఁగలఁడు. మహారాజ మహామంత్రులు తనకు వశవర్తులైనందున లీలావతి చెప్పినట్లు ప్రభుత్వ మాడుచుండెను.

సుచంద్రుని రెండవ రాజ్యవర్షమున మేఘస్వామి స్వర్గతుఁడైనందున చిత్రకూట రాష్ట్రి సింహాసనోత్తరాధికారి సమస్య ప్రభుత్వము నెదుటకువచ్చినది. శాఖామంత్రి మహాప్రాడ్వివాకహారీత సత్యవ్రతుఁడు శాంతిసేనయే యుత్తరాధికారిణి యని వాదించినను మహారాజు లీలావతీప్రేరితుఁడై మహామంత్రి మతముతో నేకీభవించి యపవిద్ధపుత్రుఁన కనుకూలముగా నిర్ణయ మొసంగెను. ఆయపవిద్ధ పుత్రునిభార్య లీలావతీదేవిచెల్లె లనువిషయము పాఠకులు గమనింపఁ దగినది.

సుచంద్రునకు తన మైదవ రాజ్య వర్షములో చారుమతీవియోగము తటస్థించినది. ఆదుఃఖ మతని కారకముందే కలింగేశ్వరుఁడు శ్రుతసేనుఁ డాంధ్రరాష్ట్రిముపై దండెత్తెను. సుచంద్రుఁడు నిర్భయముగా నాదండయాత్ర నెదుర్కొనినాఁడు. ఆ సంగ్రామమునందు సుచంద్రునకేజయముకలిగెను.ఆజయమువలన నాంధ్రచిత్రకూట రాష్ట్రిములసంధిలోనుండు కొన్ని వనప్రదేశములు సుచంద్రునకు వశమైనవి. అవి యాంధ్రరాష్ట్రిములో కలుపుకొనఁబడినవి. క్రొత్తగాఁజేరిన యాకొండల ప్రాంతమునకు పార్వతీయ ప్రాంతమని పేరుపెట్టఁబడెను.

పర్వతస్వామికాలమునాఁడు స్థాపింపఁబడిన శస్త్రశాస్త్ర విద్యాగురుకులములు రెండును సుచంద్రుని సాదరపోషణక్రింద మిక్కిలి యభివృద్ధి పొందినవి. కౌండిన్య విషమసిద్ధి శస్త్ర విద్యాగురుకులమునకును, భారద్వాజ భవనంది శాస్త్రవిద్యాగురుకులమునకు నాచార్యులుగా నుండిరి.

తక్కిన సుచంద్రుని రాజకీయ చరిత్రలో నేపుటచూచినను లీలావత్యారాధన

విశేషములే కన్పట్టుచుండును. శ్రీకాకుళన గరసంస్కరణము, ప్రాసాదసంస్కరణము, అంతఃపుర వైభవాతిశయము, అనేకరమణీ యోద్యానప్రతిష్ఠ, స్త్రీవిద్యాగురుకుల స్థాపన మును లీలావతిదేవిచే లేబడిలో ప్రశంసింపఁ దగిన కార్యములు. సుచంద్రుని కాలములో పర్వతస్వామి కాలమునాటికంటె ప్రజలపై నెక్కువపన్నులు వేయఁబడినవి. ఎక్కువ పన్నులవలన వచ్చినధనమువలననేనగరసంస్కరణాది కార్యములు చేయఁబడినవి. కార్యానంతర మతఁడు పన్నులను తగ్గింపవలసియుండెను. లీలావతీదేవి యందుల కడ్డుపడి యా కార్యము కానిచ్చినదిగాదు. అందువలన సాధారణప్రజలు సుచంద్రుని పరిపాలనము నంతగా కొనియాడఁజాలకుండిరి.

ప్రేమ పరతంత్రుఁడగు నారాజేంద్రుని రాజకీయచరిత్ర యెట్లుండినను వ్యక్తిచరిత్ర మాత్రము నిర్దుష్టము. నిర్దుష్టము మాత్రమే గాదు; ఉదారము.

రాజదంపతులు స్థాపించిన స్త్రీవిద్యా గురుకులమునకు పరివ్రాజికశుభాంగి యాచార్యరాలు. కీర్తిశేష కౌండిన్య సత్యపాలుని భార్య యామె. భర్తృవియోగానంతరము వైరాగ్యముచే పరివ్రాజికయైనది. మనకథారంభకాలమునందలి బ్రహ్మకుల పరిషత్పతి ధర్మపాలుఁ డామెకుమారుఁడు. ఆమె యాచార్యభవనంది పెద్దకూఁతురు.

**పరంతప సంఘము**

మనకథారంభకాలమున కొక సంవత్సరము క్రిందట నాంధ్రరాష్ట్రమునందు పరంతప సంఘ మను నొక విప్లవసంఘ ముదయించినది. నిశంభుఁడను నాగేంద్రుఁ డాసంఘమును నడిపించుచున్నాఁడని వినికిరి. అతఁడు గతచిత్రకూటేశ్వరుఁడగు మందనాథుని పౌత్రుఁడఁట. ఆసంఘ మిప్పుడు తన భయంకరచౌర్య కృత్యములచే రాష్ట్రమునందలి శ్రీమంతులకు నిత్యభయదాయకముగా నున్నది. సంఘసేనా సంఖ్య ప్రతిదినము వృద్ధిపొందుచున్నదియని వదంతి. ఆసంఘస్థులు ప్రాయికముగా నాగులు. రాజ్యాక్రమణమే వారి యుద్దేశమఁట.

**శివంకరసంఘము**

ఇంచుమించుగా పరంతప సంఘోత్పత్తి కాలమునందే శివంకరసంఘమను నొక దేశాభిమానిసంఘము రాష్ట్రమునం దావిర్భవించినది. అది విప్లవచేష్టలు సేయక పోయినను ప్రభుత్వ కృత్యములను విమర్శించుచు రాష్ట్రమునం దాందోలన సేయుచుండెను. దానియం దధికసంఖ్యులు బ్రాహ్మణులు వారిలో చాలమంది వీరులుగూడ నుండిరి. ఆకాలమునందు మన యాంధ్రరాష్ట్రమున నార్యక్షత్రియు లరుదు. బ్రాహ్మణులలో చాలమంది శస్త్రవిద్య లభ్యసించి వీరులై రాష్ట్రమునం దార్యుల పురాతన వీర కీర్తిని పోషించుచుండిరి. ప్రభుత్వమును సంస్కరించుటయే శివంకర సంఘముయొక్క లక్ష్యము. గజవీరుఁడను బ్రాహ్మణవీరుఁడు శివంకర సంఘమును నడిపించుచుండె నని వాడుక. అతనిని గుఱించి చక్కగా తెలిసిన వారుమాత్ర మరుదు. శివంకర సంఘము గూడ ప్రభుత్వమువారిచే విప్లవసంఘము గానే ప్రకటింపఁబడినది.

---

# శుష్కప్రియులు

వే. వి. శర్మ

"శుష్కప్రియాలు, శూన్యహస్తాలు" అని లోకోక్తి. తియ్యనిమాటలు చెప్పి క్రియాశూన్యము చేసెడివారు శూన్యహస్తాలు. శుష్కప్రియులు కానివారు లేరు. ఆమాటంటే కోపము రానివారూ లేరు. శబ్దముల సంకుచితార్థమే యిందుకు కారణము. 'శూన్యహస్తాల' సహవాస దోషమువలన 'శుష్కప్రియాల'కు నింద వాటిల్లినది.

క్రియారూపము చెందని సంభాషణములు శుష్కోక్తు లనవచ్చును. వినోదార్థము సలుపు వింత వాదములు, కాలయాపనమునకై చెప్పుకొనెడి కబుర్లు 'శుష్కప్రియా' లనిపించుకొనును. ఇందు గర్హించుకొనదగిన దేమున్నది? మన మనేకవిషయముల గూర్చి చర్చించుదుము. ఈ వాద ప్రతివాదము లన్నియు క్రియారూపము దాల్చుట దుర్లభము; అసంభవము. పగలంతయు పాటుపడి సాయంకాల మొకగంటసేపు విహారార్థము క్లబ్బుకుపోయి చెప్పుకొను కబుర్లు క్రియాశూన్యము లని యాక్షేపించుటయు, నిరర్థకములని పరిహసించుటయు మానవస్వభావమును మరచుటయే.

క్లబ్బుకబుర్లు నిరర్థకము లనుట పొరపాటు. శ్రుతపాండిత్యమువలన గలుగు జ్ఞాన మపారము; వివిధ విషయోపేతము. గురు శుశ్రూషచేసి యార్జించిన విద్య సాంప్రదాయ సిద్ధము కావచ్చును; కూలంకషము కావచ్చును. కాని అట్టి విద్యకు వన్నె తెచ్చుటకును, జనరంజకమై లౌకికమున నుపయోగించుటకు శ్రుతపాండిత్యము కూడ అవసరము.

ఇంతియ కాక అనేక క్లిష్టసమస్యలు క్లబ్బులలో చర్చింపబడును; పరిష్కరింపబడును. ఇట్టి చర్చలలో జరిగెడి తర్జనభర్జనలు మామూలు సభలలో జరుగనేరవని యనుభవమువలన చెప్పగలను. ఇందుకు తార్కాణముగ నొక యుదాహరణము నిచ్చెదను.

మా రాజమహేంద్రవర హిందూ సమాజము సుప్రసిద్ధమైన సంస్థ. శ్రీయుత న్యాపతి సుబ్బారావు పంతులుగారి భూరివిరాళముతోను, ఇతరదాతల సహాయముతోను మా సమాజమునకు దివ్యమైన స్వంతభవన మేర్పడినది. పంతులుగారి నాయకత్వమున మా సమాజములో హిందూసంఘ పురోవృద్ధికి కావలసిన పరిస్థితు లేర్పడినవి. వ్యాయామక్రీడలు, మతోపన్యాసములు, కాలక్షేపములు, భగవద్గీతా పఠనము మొదలగు మత సాంఘిక విషయములను గూర్చి వ్యాసంగము జరుగుచుండును. ఎన్ని యుపన్యాసములు విన్నను తదనంతరము సమాజావరణములో నున్న గంగరావి చెట్టుక్రింద మా 'శుష్కప్రియ బృందము' తర్కించిన గాని యే విషయమైనను సుబోధము కాదు.

'శుష్కప్రియ బృందము' (Huskers' Club) ఈమాట నూతనముగ ఆంగ్లేయ నిఘంటువులో చేరవలసి యున్నది) అను పేరు మేము పెట్టుకొన్నది కాదు. కూటికి గుడ్డకు గాని వృథా ప్రసంగములతో, కాలహరణము చేయుచున్నను భ్రమచేత మాలో చేరనివా రిచ్చిన బిరుదము. సార్థకమగుటచేత మా కందుకు కోపములేదు.

మా బృందము కలగూరగంపవంటిది. ఇందు వక్తలు, పండితులు, కవులు, గాయకులు, దేశనాయకులు, దేశసేవకులు, కార్యశూరులు, వాహ్వారులు, సంఘసంస్కర్తలు, సనాతన ధర్మపరాయణులు, భోజనప్రియులు, అన్నదాతలు—వీరు వారననేల, నిరశనవ్రతపరాయణులుదప్ప మిగిలిన విద్యలలో ప్రవీణులున్నారు. మేము చర్చించని విషయముండదు. పకోడీ పాకవిశేషములు మొదలుకొని భగవద్గీతా రహస్య విశేషములవరకు మా చర్చలోనికి రాకమానవు. విశేషించి మతసాంఘిక విషయములు మా సొమ్ము. డికెన్సువంటి మహాకవియే మాలో నుండెనేని మాచర్చ లిదివరకే రచ్చకెక్కి యుం

డేవి. మచ్చునకై యొక సాయంకాలము తిరువాంకూరు ఫర్మానాను గూర్చి మేము సలిపిన చర్చ నిందు సంక్షేపముగ దెలిపెదను. దీనినిబట్టి మే మే విషయమునైనను ఎంత నిపుణతతో కడతేర్చగలమో భారతీ పాఠకులకు తెలియగలదు.

అవర్ణుల దేవాలయ ప్రవేశవిషయములో తిరువాంకూరు మహారాజావారి ఫర్మానావలన దేశమంతయు అట్టుడికిన ట్లుడుకునని తలంచితిని. ఆసేతుహిమాచలము సనాతన ధర్మపరాయణులు సభలుచేసి మహారాజావారి చర్యను ఖండించెదరని యనుకొంటిని. కాని పూర్వాచార పరాయణులు కిక్కురుమనలేదు. మఠాధిపతుల గర్జనములు మాటుమణిగినవి. శారదా చట్టమునకు వ్యతిరేకముగ కంకణముకట్టుకొని దెబ్బలాడిన వాక్కూరు లెవరును నోరెత్తలేదు. గురువయ్యూరు సత్యాగ్రహ సమయమున జామొరినుకు కుడిభుజమై కథనడిపించిన తాతా సూర్యనారాయణ రావుగారు కూడ మిన్నకుండిరి. భారత ధర్మమహామండలి పట్టుదల వదలి పలుకలేదు. మీదుమిక్కిలి ఆచార్య సుందరరామయ్యగు వంటి శిష్టాచార పరాయణులు తిరువాంకూరు ఫర్మానాను సమర్థించిరి. దేశమంతటను గాంధీ శిష్యులు చంకలుతట్టుచు సంతోషించుట యాశ్చర్యమా?

ఇట్టి స్థితిలో నాకేమిచేయుటకు పాలుపోక మా నాయకులగు సుబ్బారావు పంతులుగారిని చేరి "ఏమండీ పంతులుగారూ! తిరువాన్కూరు ఫర్మానా విషయమై మన హిందూసమాజముతరపున సభచేసి యభిప్రాయమును తెలుపుట మన కర్తవ్యముకాదా?" యని ప్రశ్నించితిని. అందుకు వారొక చిరునవ్వు నవ్వి మిన్నకుండిరి. పంతులుగారి మందహాసము వారి చిరపరిచితులకుగాని బోధపడదు. వా రదివరకే మహారాజావారి నభినందించినారు. హిందూ సమాజము తరపున ఇదమిత్థమని అభిప్రాయము వెల్లడించుటలో కొన్నిచిక్కు లుండవచ్చునని వారూహించినట్లు నేను గ్రహించితిని.

ఇట్టి క్లిష్టపరిస్థితులలో మా శుష్కప్రియ బృందమైనను ఈ విషయము చర్చించవలెనని నిశ్చయించి యొకనాటి సాయంకాలము తర్జనభర్జనకు గడంగితిమి. ఆనాడు పంతులుగారు కార్యాంతరమువలన సమాజమునకు రాలేదు. నాటి సభలో జరిగిన వాద ప్రతివాదములు టూకీగా నిందు తెలిపెదను.

### సభా ప్రారంభము

"నేడు సుబ్బారావు పంతులుగారు రాలేదు గనుక యీ సభకు నేనే ప్రెసిడెంటు"నని అతి వినయముతో ఆంధ్రబ్రాహ్మణ మహామండలి యధ్యక్షుడగు మా ప్రెసిడెంటు రామారావు కుర్చీలో కూర్చుండెను.

నారాయణమూర్తి:— ఏమండీ రాచకొండ సుబ్బారావుగారూ! మనకర్మము! ఈ సభకు కూడా రామారావేనా ప్రెసిడెంటు? నిన్న శ్రద్ధానందఘాటులో జరిగిన సభకు ప్రెసిడెంటై తిరువాన్కూరు మహారాజావారిని అభినందించుచు పురజనుల కృతజ్ఞతను తెలపడమా? ఈవేళ యిక్కడ అధ్యక్షతవహించి దానినే ఖండించడమా? ఏమిటింతలండీ! బాగు! బాగు! మీరంతా యేమైనారు? సమాజానికి ట్రస్టీలు. భగవద్గీతా రహస్యముల నుపదేశము పొందినవారు. శక్తికొలది సనాతన ధర్మము ననుష్ఠించుచున్నవారు. మీ రుండకూడదా ప్రెసిడెంటుగా? మహా పండితులు కవులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగా రుండకూడదా? వేదాధ్యయనము సాంతముగ జేసిన సోమనాథంగారు తగరా? ఇందరుండగా నావలె సాగ్నిహోత్రి రామారావా మనకు దొరికాడు?

సోమనాథం:— వేదశాస్త్రములు చదివినవారుగాని యీ సభకు అధ్యక్షులుగా వుండకూడదు. విశేషించి దేవాలయప్రవేశ నిబంధనలు ఆగమశాస్త్రములు విధించును గనుక ఆగమశాస్త్రవేత్తలుగాని తదితరులు ఈ సభకు అధ్యక్షులుగా నుండతగరు. నాకు కృష్ణయజుర్వేదము అశీతిద్వయము నట్టులేకుండా వచ్చును. వేదాలకు ఆగమాలకు చాలా దగ్గిర.

కృష్ణమూర్తి:— మీకేనా? కృష్ణమూర్తిశాస్త్రిగారికి రావు ఆగమాలు? ఆయన ప్రెసిడెంటు గాతగడా?

శ్రీ. కృ. శాస్త్రి:— బాబోయి! నన్నీ గొడవలోకి లాగకండి. ఇప్పుడున్నవే వదుల్చుకోలేకచస్తు

న్నాను. స్మార్తము, శ్రౌతము చెప్పకొన్నట్లు నా గ్రం థములలో వ్రాసినందుకే నేను తద్దిన బ్రాహ్మణార్థాలకు తప్ప కవిత్వమః విమర్శనమునకు తగనని యాక్షేపిం చారు. ఇప్పడు ఆగమాలు వచ్చునంటే తంబళపనికీ గాని తద్దిన బ్రాహ్మణార్థాలకు గూడ కరక్కాయపడు తుంది.

శేషగిరిరావు:—మన లోకల్ జామెంరీను (సీతా రామశాస్త్రి) ఏమంటాడు ?

సీ. రా. శాస్త్రి:— ఆగమాల విషయము మీ కేమి తెలుసునయ్యా? మా తండ్రిగారు కట్టించిన రెండు దేవాలయాలు నడిపించే భారం నెత్తిమీద వేసుకొని యీదుచున్న నన్నడగండి! దేవాలయ ప్రవేశము అవర్ణు లకు నిషేధము. ఆగమాలు వప్పవు. ఒక మహారాజు ఫర్మానా జారీచేసినంతమాత్రాన అది శాస్త్రీయము కాదు. జార్జిచక్రవర్తి శాసించినప్పటికి మా దేవాలయాల లోనికి అవర్ణులను రానీయను.

వెంకటచలం:—మా కోరుకొండ క్షేత్రమేనా యేమిటి తీసిపోయింది? ప్రస్తుతము ధర్మకర్తను గదా యని రామారావు ఉర్రట్లూగుతున్నాడేమొ. మేమూ రానీయము. ఏమిచేస్తాడో చూస్తాము.

గురుమూర్తి:—అవర్ణులను మీరు రానీయకపోతే మీ దేవాలయాల్లోకి సవర్ణులు కూడా రారు. శుచి శీలము ప్రధానముగాని జన్మ ముఖ్యము కాదు. నీలోను నాలోను ఉన్న దేవుడు అవర్ణులలో లేకపోలేదు. దేవాలయాల కొరకు ఆగమాలు పుట్టినవి కాని ఆగమాలకొరకు దేవా లయాలు పుట్టలేదు. ధర్మశాస్త్రములవలె ఆగమ శాస్త్ర ములు కూడా కాలోచితముగ మార్పు చెందవచ్చును.

చయనులు:— ఏమండీ సుబ్బారావు గారూ? శాస్త్రాలు మార్చవచ్చునంటే మీ రూరుకుంటారేమి?

సుబ్బారావు:—ఈ రోజుల్లో మనమాట వినేవా రెవరయ్యా?

చయనులు:— వినకపోతే మాత్రం? మీవిధి మీరు నెరవేర్చుకోవద్దా?

చి. ల. న.- దేనికైనా గుణము ప్రధానముగాని కులము ప్రధానముకాదు. సిరికంటె శీలము శ్రేష్ఠము. కులముకంటె గుణము శ్రేష్ఠము. కాబట్టి శుచి, శీలము, నిశ్చలమైనభక్తి కలవారేజాతివారైనను దేవాలయములకు వెళ్లుటకర్హులు. ఇవి లేనివారగ్రజాతివారైనను గుళ్లలో మొక్కుట నిష్ప్రయోజనము. ఆగమాలకు ధర్మశాస్త్రా లకు వేదములే మూలాధారములు. వేదము సనాతన ధర్మ మును శాసించును. శాస్త్రములు యుగధర్మములను విధిం చును. యుగధర్మములు కాలానుగుణముగ మార్చవచ్చును.

సోమనాథం:— ఈ సిద్ధాంతా లెవరుచేశారండీ?

విజయరామయ్యా:— వేదాలు ముందు, తరువా తనే ధర్మశాస్త్రాలు, ఆగమాలు. వేదాలు అపౌరుషేయ ములు. శాస్త్రాలు పౌరుషేయములు. పౌరుషేయములు మారవచ్చును. ఈ సిద్ధాంతములు మన పండితులు కూడా వప్పకున్నారు.

సోమనాథం:—ఎవరా 'మనకి' 'తిమ్మన!' ఆ పండితులంతా మీబోటి హూణ విద్యాసంపర్కము గల వారే. శిష్టాచారపరాయణుల కా సిద్ధాంతాలు నచ్చవు. చతుర్వేదాలు, చతుర్వర్ణాలు, ధర్మశాస్త్రాలు, ఆగమాలు—ఇవన్నీ యేక కాలమున సృష్ట్యాదిని బ్రహ్మ సృజించాడు. ఋషులనోట మనకు లభించినవి. ఇవి యేవిన్ని మార్చుటకు శాస్త్ర మొప్పదు. ఇందుకు తిరుగు లేదు. మీకు దిక్కున్నచోట పోయి చెప్పకోండి.

వెంకటరావు:— భేష్! గట్టిగా చెప్పాడు. పిడి వాదాలకు పిడిగుద్దుల వాదాలకు అప్పీలెక్కడ?

బంగారయ్య:— ప్రస్తుతము చర్చనీయాంశము వదిలిపెట్టి యితర గొడవల్లో పడ్డాము. అవర్ణుల దేవా లయ ప్రవేశము మన మంగీకరించడమా నిరోధించడమా, అను విషయ మిప్పడు తేలాలి.

సీ. రా. శాస్త్రి:—ఆవిషయము తేల్చుటకు రామారావు ప్రెసిడెంటుగా పనికిరాడు. ఇతడేమి అవ తారపురుషుడా? ఈరోజు వకవేషము రేపు మరొక వేషము వేసే యాడుటకు?

రామారావు:—ఏమోయి నా సెక్రెటరీ! వీరి సందేహాలను తీర్పుము.

సోమశేఖరరావు:—ముందు నీ సందేహాలు తీర్చుకో. తరువాత మా సందేహాల మాట ఆలోచించవచ్చును.

రామారావు:—నాకు సందేహాలే లేవు. సందేహ ముంటే ప్రెసిడెంటుపదవిని ఆధిష్ఠించను.

శర్మ (సెక్రెటరి):—మన ప్రెసిడెంటు నన్ను మాట్లాడమని యాజ్ఞాపించుటలో అర్థమున్నది. తన పదవి విషయము మీకు సందేహము కలిగినప్పుడు తన్ను తాను సమర్థించుకొనుట స్వోత్కర్షగా నుండవచ్చును. నన్ను సమర్థించ మనుటలో అతని నమ్రత వెల్లడియగు చున్నది. ఈ సభ కతడు ప్రెసిడెంటుగా నుండతగునా లేదా యను సమస్యను గూర్చి నాకుతోచిన ధర్మ సూక్ష్మము చెపుతాను వినండి. ప్రెసిడెంటనగా తట స్థుడు; కామధేనువువంటివాడు. సభ్యుల యాజ్ఞను నెర వేర్పుటయే అతనివిధి. నిన్న శ్రద్ధానంద ఘాటుసభలో పురజనులు దేవాలయ ప్రవేశమున కానందించి తమ యంగీకారమును దెలిపిరి. గాంధీశిష్యు డగుటచేత రామా రావు నిన్నటిసభకు ప్రెసిడెంటై యా తీర్మానమును పంపవలసిన తావులకు బంపెను. బ్రాహ్మణ మహామం డలి యధ్యక్షుడగుటచేత నేటిసభకు కూడా అతడే ప్రెసి డెంటగుట ఉత్తమము. నేడు మనము దేవాలయ ప్రవేశ మునకు వ్యతిరేకులమై తిరువాన్కూరు ఫర్మానాను ఖండించుచు తీర్మానించినయెడల మనయాజ్ఞానుసారము ఆతీర్మానమును యథోచితముగ ప్రెసిడెంటు కడతేర్చ గలడు. ఇట్టిచర్యలో పరస్పర విరోధదోషములేదు. ఏల నంటే? ఏకవ్యక్తి అనేకరీతుల మసలుట యనుభవ వేద్యము. శ్రీకృష్ణుడు భక్తులకు కల్పవృక్షము, గోపి కలకు రసికుడు, గోగణముకు గానలోలుడు కాలేదా? గనుక దేవాలయప్రవేశసమస్యలో రామారావు పూర్వ పక్ష సిద్ధాంతముల భారముల రెంటెని నిర్వహింపబూను టలో ఆశ్చర్యములేదు. పరస్పరవిరోధమూ లేదు.

రామారావు—సభ్యులారా! ఇప్పుడు మీసందే హాలు తీరిపోయినవి గనుక అవర్ణులదేవాలయ ప్రవేశ మునుగూర్చి రాచకొండ సుబ్బారావుగారు మాట్లాడెద రని మనవి చేయుచున్నాను. సావధానముగ వినుడి.

సుబ్బారావు- ‘‘కలౌపంచ సహస్రాణి జాయతే వర్ణసంకరః” అని మనపూర్వులు వ్రాసుపోక చెప్పలేదు. వారు నిజమైన సర్వజ్ఞులు. మనశర్మవంటి బూటకపుసర్వ జ్ఞులుకారు. వోయ్! మరిన్ని—

శర్మ—నేను సర్వజ్ఞత్వము నారోపించుకొన్నట్లు భావించుటలో మన శుష్కప్రియుల తెలివితేటలు బయటపడుచున్నవి. ‘సర్వజ్ఞుడ’ని నన్ను నీవు దెప్పి నప్పుడు ‘‘సర్వజ్ఞ నామధేయము శర్వునకే, విశ్వనాధ శర్మకె! తగురా?” అని నేను ప్రశ్నించితిని. రెండవ చరణములోని మొదటి ఆశ్చర్యార్థకము, చివర ప్రశ్నార్థ కము లోపింపజేసి బంగారయ్యా భారతిలో యేమేమొ వ్రాసి తన కవితాచమత్కృతి చూపెను. అంతమాత్రము నేనూ తిరగేసికొట్టగలను. నిగర్వచూడామణినని గర్వించు వాళ్లలో నేనొకడిని.

సోమయాజులు—సుబ్బారావుగారు! ‘‘నైనం ఛిందంతిశస్త్రాణి, నైనందహతి పావకః” అని భగ వద్గీత. ఎవరేమిచేసినా మనసనాతనధర్మానికి చలనం లేదు.

సుబ్బారావు—అబ్బా! వుండవోయినీవు. ఆలాంటివి మనశాస్త్రాల్లో లక్షలున్నాయి—సత్యం వద; ధర్మంచర. ఏతావతా నేను చెప్పేదేమంటే? చెట్టుచచ్చేకాలానికి కుక్కమూతి పిందెలు పుడతాయని శాస్త్రం. శాస్త్రమెన్నటికి అబద్ధంకాదు. మమ్మాటి కిని నిశ్చయము.

ప్రకాశరావు శర్మతో:—మేస్టారూ! రేపు డిన్న రులో పి॥ వీ॥ లకు (పంక్తివంటలకు) పర్మిషనిస్తారా?

శర్మ:—రేపెవరింట్లో భోజనాలు?

ప్రకాశరావు:—చావలి సూర్యనారాయణగా రింట్లో.

సర్వన్నశాస్త్రి, బు॥ సు॥ రావు:—రేపు పిండి వంట లుండితీరాలి. రేపు పర్వదినం. గొడ్డుభోజనం పనికిరాదు.

శివరామకృష్ణయ్య:— ఉండండోయి! మీ కెప్పుడు భోజనాలగొడవే. ఇప్పుడు జరుగుచున్న చర్చ యేమిటి? మీగోలేమిటి? ఎప్పుడూ తిండిగొడవేనా?

ప్రకాశరావు:—నీకుమాత్రం తిండిగొడవ లేదా? లొట్టి స్నానాలు చేస్తున్నావా యేమిటి?

రామారావు:—ఎవరక్కడ? భోజనాలను తృణీకరించుచున్నారు? నా భక్తులారా వినుడు! కోటి విద్యలూ కూటికొరకే. 'అన్నంబ్రహ్మ' 'అన్నంననింద్యాత్' అని వేదము ఘోషించుచున్నది. కావున అన్నమును అన్నదాతలను తిరస్కరించకూడదు. 'భుక్తికుదిరితేనే ముక్తికుదురును' ని మన పెద్దలు చెప్పినమాట సత్యము. వారిదారి త్రొక్కుటయే మనకు సర్వథా శ్రేయస్కరము.

చా॥ సూ॥ నారాయణ, పాపయ్యశాస్త్రి, సర్వన్నశాస్త్రి, ప్రకాశరావు, శివరామకృష్ణయ్య, బు॥ సు॥ రావు ఏకకంఠ్యముగ:—ప్రెసిడెంటుకు జై! డిన్నర్లు నిరంతరము జరుగుచుండుగాక! ఇక లేవండి. ఇప్పటికే పొద్దయింది భోజనానికి.

రామారావు (నలుదిక్కులు పారచూచి):— I am a socialist. మీ సేవకుడను. మీ యిష్టానుసారము నడిచెదను. ఇప్పటికే కాలహరణ మయింది గనుక రేపు సాయంకాలము తిరిగి యీ విషయము చర్చించెదము. సభ నింకటితో సమాప్తిచేయుచున్నాను.

అధ్యక్షుని యాజ్ఞకు బద్ధులమై అందరము నాటి దినము ఇండ్లకు వెళ్లితిమి.

---

# చిన్నకథ

## బులుసు వేంకటరమణయ్య

దేశానికి అన్నివిధాలా అభివృద్ధిని కలగచేసే కారణ కలాపంలో సారస్వతం అనేది వకటి. ఇది యే విషయాల్లోనూ తదితరాలకు తీసిపోదు. ఆ వాఙ్మయం లోనూ యిప్పట్లో 'చిన్నకథ'కి వున్న ప్రాముఖ్యం మరి ఏవిభాగానికీ లేదు

ఇప్పుడు—

పురాణాంధ్రీకరణ యుగం పోయింది. ప్రబంధ యుగం పటాపంచలయింది. అవధానాలయుగం అంతరించింది. నవలాయుగం నామమాత్రావశిష్టం అయింది. నాటకాలయుగం నడిచిపోయింది. యిది చిన్నకథల యుగం. గ్రంథమాలలన్నీ మూల పడిపోవడానికీ, రోజురోజుకి కుక్కగొడుగులల్లే కొత్తపత్రికలు బయలుదేరడానికీ కారణం 'చిన్నకథే' ఏడేళ్ల కుర్రాడిదగ్గర్నుంచీ ఏడుపదులుదాటిన ముసలాడిదాకా చిన్నకథని చదవడానికీ, వినడానికీ తహతహపడనివాళ్లుండడం అరుదు.

యిప్పుడు దేశాన్ని బాగుచేసినా భ్రష్టుచేసినా చిన్నకథే చెయ్యాలి.

ఏమంటారా?

ఏదన్నా పత్రిక నష్టంలేకుండా నడుస్తున్నాదంటే—అందులో — ఎలాంటివన్నా సరే 'చిన్నకథ' లనిపించుకునేవి అనేకాలుఉండాలి. పత్రిక మంచి ప్రచారం కలిగివుండాలంటే చిన్నకథకి దాన్లో ప్రాముఖ్యం వుండాలి. చివరికి పత్రికను ఒకడేనా చదవాలి అనేవుద్దేశమన్నా వుంటే అందులో చిన్నకథ-లేక కథలాంటిది ఒకటైనా వుండితీరాలి. తదితర సాంఘిక, రాజకీయ, సారస్వతాది వ్యాసాలతో యేమీ పనిలేదు. చిన్నకథలున్న పత్రిక యెటాగున్నా సరే, అది గొప్పదానిలో జమ. చిన్నకథ లేని పత్రికవుండినీ్న లేనిదానిలో జమే. అంచేతే యిప్పుడు విజ్ఞానవిశేషాల్ని ప్రకటించే పత్రికలు ఏమారుమూల నున్నాయో యెవ్వరికీ తెలియదు. చిన్నకథల్ని ప్రకటించే పత్రికలు ఏమారుమూల పుట్టినా బాహాటంగా ప్రపంచమంతటా పచారు చేస్తూవున్నాయి.

ఎవరన్నా తగుమనుష్యులు 'ఈనెల ఫలానాపత్రిక యేమీ బాగులేదండీ!' అని అన్నారంటే అందులో చిన్నకథలు లేవనీ, ఒకవేళ కొంచెంవున్నా అవి ఆక్రమించిన పేజీలు అత్యల్పమనీ అర్థం! 'ఈనెల ఫలానా పత్రిక చాలా బాగుందండోయ్!' అని ఆనందంపట్టలేక చిందులుతొక్కుతూవుంటే అందులో మనస్సుల్ని ఆకర్షించే రకరకాల చిత్రాలతో చిన్నకథలు యెక్కువగా వున్నాయన్న మాట.

అయితే కథలకీ - చిన్నకథలకీ పరమప్రయోజనాలు లేకపోనూ లేవు; వాటిని మనవాళ్లు గమనించకపోనూ లేదు.

అల్లరిచేస్తున్న చిన్నపిల్లల్ని ఊరుకోబెట్టడానికి చిన్నకథ అసలైన నల్లమందు మాత్ర. పగలల్లా కష్టపడి పనిచేసి ఇల్లుచేరుకున్నవారికి భోజనానంతరం విశ్రాంతినీ, హాయినీ కలిగించేది చిన్నకథే! ఎంత బోధపరిచినా తలకి ఎక్కని ఎట్టి కఠినవిషయమైనా సరే చిన్నకథ అనే అవతారం యెత్తిందంటే బోధచేసుకోవడం అవలీల. అంచేతనే విష్ణుశర్మ శుద్ధబుద్ధావతారా లయిన రాజపుత్రులికి నీతిని బోధించడానికి కాకిమీదా, పిచ్చికమీదా, కుక్కమీదా, నక్కమీదా కథల్ని కల్పించి చెప్పాడు! యేట్సుదొరగారు యెలిమెంటరీస్కూలు పిల్లలికి లెక్కల్నికూడా కథలమీదే నేర్పాలని అనుశాసించారు. పూర్వీకులు కనిపెట్టిన అద్భుత భౌతికవిషయాలు కథలరూపంగా పురాణాలకీ, యితిహాసాలకీ యెక్కడానికికూడా యిదే కారణం.

కథలకి వుండుకున్న యీ ప్రయోజనాలన్నీ యిప్పటి చిన్నకథల్లో కనబడుతున్నాయా అంటే అది ఆలోచించతగ్గ విషయమే !

యిప్పుడు సర్వసాధారణంగా రాయబడుతూ వున్న కథలకి ఒక వెధవముండ పెళ్ళో, ఒక విడాకులివ్వడమో, ఓ మతాంతరస్వీకారమో, ఓ మతాంతర-స్వేచ్ఛావివాహమో, మరేమన్నా స్వేచ్ఛాప్రవృత్తో, మోసమో ప్రధానలక్ష్యంగా వుండితీరుతున్నాయి. అన్నిట్లోనూ అసభ్యవర్ణనలకి ప్రాముఖ్యం యెక్కువ. కేవలంగా అక్షరాస్యం అయివున్న సామాన్యజనానికి అందుబాటులో వుండే చిన్నకథలు పై విషయాలని ఢంకామీద దెబ్బకొట్టి మానవహృదయాల్లోకి యింజక్షను చేస్తూవుంటే దేశానికి కలిగే మార్పు యెల్లాంటిదో విచక్షణులు గమనింపవలసివుంటుంది.

వాళ్లవాళ్ల రుచుల్నిబట్టి కథానికారచయితలు కథల్ని రచిస్తున్నారనీ, వాట్లో నీతీ, జాతీ, సభ్యతా మొదలైనవి వుండనక్కరలేదనీ, నాచురాలిటీ, పెక్యూలియారిటీ వుంటే చాలుననీ, జనసామాన్యానికి యింటరెస్టు కలగచేయడమే కథకి ప్రధానలక్ష్యమనీ, కథకుడికి ఉద్దిష్టమైన లక్ష్యం వకటి వుండనక్కరలేదనీ, కుర్రకారులోవుండి స్వేచ్ఛావిహారంచేసే చాలా మందికథకుల అభిప్రాయం. యిదివరదాకా వున్న చిన్నకథల్లో యిప్పటికథల్లో వుండే నవీనగుణాలు లేవని కూడా వీరి సిద్ధాంతం!

మనదేశంలో జనసామాన్యంలో విద్యావాప్తి కలగకపోవడానికి కారణం-మన ప్రాచీన గ్రంథాలు కేవలం పద్యమయాలుగా వుండడమూ, పండితుల కూడా అర్థంకాని పాషాణశైలిలో వుండడమున్నూ. వాటిలో యెటువంటి అమూల్యవిషయాలు వున్నా సముద్రంఅడుగుని వున్న రత్నాల్లాగ నిరుపయోగాలయిపోయాయి! కాని, క్రమేపీ నాటకాలూ, నవలలూ తలెత్తి వచనవాఙ్మయానికి ప్రాభవం హెచ్చాక ఖిల్లీదుకాణదారూ, జట్కావాలా దగ్గర్నుంచీ ఏ 'అపనాతనామనా' పుస్తకమో చేతబట్టుకొని గ్రంథకాలక్షేపం చెయ్యడానికి అవకాశం కలిగింది మరి యిప్పుడో-ఈ 'చిన్నకథ' అమలులోకి వచ్చేసరికి ఆడవాళ్లలో చాలావరకూ నిరక్షరాస్యత నిర్మూలమయిపోయింది. ఏది చదివినా, ఏది చదవకపోయినా చదవు నేర్చిన ఆడది చిన్నకథని చదవకుండా వుండదు!

లోకాన్ని మరమ్మత్తు చేయడానికి నీతిప్రబోధంకంటె అవినీతిప్రదర్శనమే సులభమయిన మార్గమంటూ కొందరు రచయితల అభిప్రాయం. అవినీతిని బాగా ప్రదర్శిస్తే దానివల్లే ద్రావిడప్రాణాయామంపద్ధతిలా నీతి వ్యక్తమవుతూవుంటుందని వారి దృఢమైన నమ్మిక. ఆ సూత్రాన్నే చాలామంది పారాయణం చేస్తూ వున్నారు. కాని వాచ్యంగా వుండే సంగతులనే అర్థంచేసికోలేని స్థితిలో వున్న జనసామాన్యం వ్యంగ్యందాకా పరిగెత్తి దాన్ని గ్రహించగలదా అనేదే ఒక విషమసమస్య. ఇంతెందుకూ? సంఘసంస్కరణకోసం బయలుదేరిన 'చింతామణి'లో నాటకకర్త నాయిక చేతనే పసిబిడ్డలికికూడా అర్థమయేటట్టు గొప్ప వుపన్యాసం దబాయింపించి మంచిని బోధించాడుగదా ఆ నాటకాన్ని చూడవచ్చిన-సగానికి పైగా వున్న వేశ్యామణులలోనూ, వారి విటవర్గంలోనూ ఎంతమంది ఆ వుపన్యాసాన్ని క్రియారూపంగా ఆమోదిస్తున్నారూ? అందులో సుబ్బిసెట్టి-చింతామణి లాసీన్లులేకపోతే ఆ నాటకానికి అంత ప్రచారం వుండివుండకపోయేదేమో! చివరకి చింతామణి యోగిని అయిపోయిందంటే మనస్సు చివుక్కుమననివాళ్లు తక్కువేమో కూడాను. బాహాటంగా వుండే వాచ్యపద్ధతుల్నే అనుసరించలేని ప్రజలు వ్యంగ్యాన్ని వెతుక్కుంటూ తెలిసికొని దాన్ని అమలులోపెడతారనే ఆశ మన కెక్కడిదీ?

సాధారణవాఙ్మయానికి అది చిన్నది కానీండి పెద్దది కానీండి, ప్రధాన ప్రతిపాద్యం—మంచిచెడ్డ తారతమ్యాన్ని బోధించడం! దాన్ని విరసంగా కా! సరసంగా బోధించడానికే పద్యవాఙ్మయం గానీ, గద్యవాఙ్మయంగానీ పుట్టడం! ఇల్లాంటి సందర్భంలో అందరికీ అందుబడిగా వుండి నల్లేరులా నాల్గుమూలలూ వ్యాపించే 'చిన్నకథ' విరసంగా వుంటే దాని ఉత్పత్తికి ఏమభిప్రాయం వున్నట్టూ?

అనుభవమైనది అనుభవమైనట్టూ, వున్నది వున్నట్టూ వ్రాయడం అందరికీ యిష్టమే! అలాంటివాటివల్ల మనస్సుకి కొంత సంచలనం కలిగి చదివేవాళ్లు మంచిదారిలోకి రాగలిగే అవకాశంమాత్రం వుండాలి. అలా కాక ఆ అనుభవాలు అసభ్యాలూ, అసంభవాలూ అయి, అసత్యాన్నీ లజ్జనూ కలిగిస్తేమాత్రం యేమి ప్రయోజనం?

సంగతి సందర్భాలు యిలా వుండగా కథలకి ప్రధానలక్ష్యం నీతి కాదనీ, కళారాధనమే అనీ అనడంలో ఔచిత్యం తక్కువే అని తోచకమానదు ఇంతెందుకూ? తన విశాలహృదయాన్ని స్వేచ్ఛగా పోనిచ్చి కళారాధనంచేసి నీతిని దిగద్రోసి వ్రాసిన కథని అక్కథకుడయినా తన సతీమణికి చదవడానికి యిస్తాడనీ, లేదా ఆమె చదువుతూవుంటే సహించి వూరుకుంటాడనీ చెప్పడం కష్టం. అల్లాంటి చెడ్డకథలు తమవాళ్లు చదవడం తనకి యిష్టంకాదు కదూ. ఇంతకీ తనదాకా వస్తే తనువులేదు. వెనకటికి పోలిశెట్టి 'కన్యాశుల్కా'న్ని తెగపొగుడుతూ వుంటే ఒకాయన 'శెట్టిగారూ! ఏం బాగుందండీ ఆకన్యాశుల్కం? చూడండీ! 'పోలిశెట్టిమొగము పోలిరొట్టెను బోలు, పోలిశెట్టి ముక్కు పొడుగు డొక్కు' అని యిమ్మన్నట్లే ఆక్షేపించే పద్యాలు అందులో వున్నాయే!' అని హెచ్చరింపగా అప్పట్నుంచీ శెట్టిగారు ఆ నాటకాన్ని స్వరూపనాశనం చెయ్యడానికి ప్రచారం ప్రారంభించారట! తనదాకా వస్తే సరి! యిప్పటి కథకుల్లో చాలామంది ఆ రకంవారే! ఒకవేళ వీళ్లు రాసిన కథ అందరికీ అందుబాటులో వుంచారంటే అది యెవరికిన్నీ అర్థంకాని పద్ధతిలో అపూర్వభావాలతో నిండివుండాలి.

యీరీతిగా చిన్నకథలకి వుండవలసిన అవలక్షణాలు కలకథలు కొన్ని మచ్చుకి యివ్వబడతవి. వాటి పద్ధతి విచక్షణులు చిత్తగించాలి.

తన కడుపుమంటకీ, కష్టాలు గట్టెక్కడానికీ, ఒక స్త్రీవ్యక్తి తన నీతినీ జాతినీ చెరుచుకున్నట్లొక కథవుంది. ప్రపంచమంతా ఆమెమీద కత్తిగట్టి కాఠిన్యం వహించిందని అందులోని అంతరార్థం. అది రివెర్సుచేస్తే తెలిసేది. జనసామాన్యం తెలిసికొనే అర్థంమాత్రం తన సుఖంకోసరం ఎలాంటి పనినన్నా చేయవచ్చునని.

తన మతంలో వుండే నిర్బంధాలవల్ల ఒక డొక్క కథలో మతాంతరస్వీకారం చేసినట్టు వర్ణింపబడ్డాడనుకోండి! మొదటిమతంలో వుండే లోపాల్ని మరమ్మత్తు చేయాలని వ్యంగ్యార్థం. వాచ్యంమాత్రం మతమీమ్మీద సలుగురికీ అసహ్యత కలిగించడమూ, ఆ మొదటి మతమ్మీద కసితీర్చుకోవడానికి ఆ ఆసామీ మతాంతరాన్ని స్వీకరించేడని తెలపడమున్నూ.

ఒక కథలో ఒక మహిళామణి తను స్వేచ్ఛావిహారాలు జరిగిస్తూ మొగుడిని బుట్టలోవేసుకుని తిరుగు రంగా అని ధీరతను ప్రకటించేటట్టుంది! ఇల్లాంటి కథల్లో ఆ యా వ్యక్తుల మనోభావాలు కొన్ని వ్యక్తమవుతున్నా ఆడదాని చమత్కారాలూ, మగవాడి చేతగానితనమూ వ్యక్తమవడంచేత మూర్ఖత, అజ్ఞానము ప్రబలియున్న స్త్రీసామాన్యానికి మనస్సు చలించి అనేక అనర్థాలు కలగడానికి కారణం అవుతుంది.

తన భార్య స్వేచ్ఛావిహారం చేస్తూవున్న సంగతి యెరిగిన్నీ భర్త ఆమెని మనసారా ప్రేమిస్తూ, సానుభూతిని చూపిస్తూ తన ఉదారస్వభావాన్ని వ్యక్తం చేసినట్లొకథలో వుంది. దుర్బల హృదయభావాల్ని అణుచుకోలేక అణుచుకునేశక్తి అణుమాత్రమూ లేక తన జీవనంకోసం వంశాలకీ, మతాలకీ కళంకంతెస్తూ జాత్యంతర మతాంతరవివాహాల్ని చేసికోవడం కొన్ని కొన్ని సందర్భాల్లో అలాంటివాళ్లని తల్లితండ్రులే ప్రేరేపించి గౌరవించడం కొన్నికథలకి ప్రధానసూత్రం. మరోచిత్రం! పతివ్రత అయిన భార్యా తన స్నేహితుడిని సంతోష పెట్టలేదని ఆమెని విడిచిపెట్టడం యింకో విచిత్రకథాసన్నివేశం! యిల్లాంటి విం కొచాలా చాలా వున్నాయి—అంటే తాను స్వేచ్ఛావిహారంచేస్తూ, తన పవిత్రతని చాటుకునే రీతి వ్రాయబడ్డవీ, మొదలైనవి.-

అయితే—'యివన్నీ జరగడం లేదా? జరిగేవి ఎందుకు చెప్పకూడదూ?' అనే ప్రశ్న కలగవచ్చును. కాని యివన్నీ ప్రత్యేకవ్యక్తులికి సంబంధించేవి. ఇవి

పత్రికలకి ఎక్కితే తమతమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని విడిచిపెట్టి అవి జనసామాన్యానికి ఈ భావాల్ని ఇంజెక్టుచేస్తాయి. ఊరుకున్నవాళ్లందరికీ ఉబలాటమూ, వుద్రేకమూ కలుగజేస్తాయి. ఉన్నవి ఉన్నట్టుగానే చెప్పాలంటే యింకా జరిగేవి అనేక విషయాలున్నాయి గదా! అనన్నీ యీ యథార్థవాదులు బాహాటంగా వెల్లడిచేస్తారా? ఆఖరికి తమమామూలు సంసారపు భోగట్టాలేనా ఉన్న వున్నట్టుగా వీరు వ్రాయవద్దు సరికదా చెప్పనన్నా చెప్తారా అని అడుగుతా.

'ఈ కథలన్నీ మమ్మల్నిగురించికాదు రాసేది; లోకంకోసం' అని అంటారా? సరే! పదిమందిలోనూ రాయి పడేసి వాళ్లూ వాళ్లూ తన్నుకు చస్తూవుంటే దేమీ యెరగనట్టు చల్లచల్లగా తప్పుకుందికీ, లోకాల్ని తప్పదారులు పట్టించి, తాను నవ్వుతూ, కేరింతాలు కొట్టడానికా యీ రాతలు!

ఏతావతా తేలిన దేమిటంటే—

ఏదన్నా కథ చదివేసరికి పాఠకుడు యిదివరకున్నవాటికి తిలోదకా లిచ్చి, బుజాలు తెంపుకుని నిప్పుతొక్కిన కోతిలాగ చిందులుతొక్కుతూ యింకో ప్రపంచంలోకి ఉరికేటట్టు వుండకూడదు. మరేమిటంటే-మనస్సుకి సంచలనం కలిగించి, లోపాల్ని తగు రీతిని తెలియజెప్పి పాఠకులచేత సింహావలోకనం చేయించి తనలోనూ, తమ మతంలోనూ, తమ అలవాట్లలోనూ, సంఘంలోనూ వుండుకున్న తప్పులని దిద్దించి, అన్నింటినీ సరియైన రీతికి తెచ్చేమాదిరి కథల్నే కథకులు రచించాలి. జాతిమతాల్ని ధ్వంసంచేయడంకంటే వాటిని తగినదారిలో పెట్టి వుద్ధరించడానికి ప్రయత్నించాలి. కథలో వుండే యథార్థవిషయాలు ప్రజలకి వుపయోగించేఅంతమట్టుకు ఔచిత్యానికీ, సభ్యతకీ దూరంకాకుండే అంతమట్టుకూ గ్రహించాలి. కథను చదివే పఠకుడు పాత్రలతోపాటు ఏ గాలిదుమారంలోనో కొట్టుకుపోయి నడుసముద్రాన్ని ములిగిపోకుండా ఏకార్యమన్నా సాధించడానికి తగిన పట్టుదలనూ ధైర్యాన్నీ పొందేటట్టు కథ వుండాలి. గాని ప్రధానపాత్రల్ని పల్టీలు కొట్టించి పప్పులో కాలు వేయించడంవల్ల ఏమీ ప్రయోజనం లేదు. దేనినన్నా పాడుచెయ్యడం సులువే. బాగుచెయ్యడమే కష్టం. అలా బాగుచెయ్యగల-బాగుచెయ్య ప్రయత్నింపగల కథలే కథలు! వాటిని చెప్పే కథకులే కథకులు! కథ ఏదో కాలక్షేపానికి కాదు. సత్కాలక్షేపానికే ఉపయోగపడాలి! అలాంటిదాన్నే అందరూ ఆమోదిస్తారు. తక్కినవి కేవలం అసభ్యాదరం గల పామరులకే ఆమోదకరాలు!

మరోసంగతి—మనం చదివే కథ యే 'అసలు చంద్రరేఖావిలాపం' లాగో, కొక్కోకంలాగో, వుండి గదిలో కూచుని తలుపులు బిడాయించుకుని చదువుకునే రకంవారిలో వుండకూడదు. ఆడా, మొగా భేదం, అన్నదమ్ములూ, బావమరుదులూ అనే భేదం లేకుండా నలుగురూ ఒకచోట చేరివున్నప్పుడుకూడా యెటువంటి ఆక్షేపణా లేకుండా, అలాటప్పుడు యెవరికిన్నీ ఏవిధంగానూ అసహ్యాన్నీ, సిగ్గునీ కలిగించకుండా వుండాలి, కథలోని సంగతులన్నీని.

మన చిన్నకథల్లో చాలావరకూ ఏ ఇంగ్లీషుకో, బెంగాలీకో, ఫ్రెంచికో, రష్యన్‌కో, హిందీకో అనువాదాలో, లేక అనుకరణాలో అవుతూ వస్తున్నాయి. ఆంధ్రుడు అన్నివిధాలా పరతంత్రుడవడంచేత అతడు అనుకరణకళనే ఉపాసిస్తున్నాడు. భావదాస్యమే అతనికి ప్రాప్యం. స్వతంత్రరచనలు చాలా తక్కువ. స్వతంత్రరచయితలూ తక్కువే! చాలామంది కథకులు పైభాషల్లోని కథలని అనువదిస్తూ, పాత్రల్నీ వాటినీ కూడా మార్పుచేసి తెలుగువేషం వేయించి దిగుమతీ చేస్తున్నారు. కాని ఆ ఆ భావాలు తెలుగుపాత్రలకి అతుక్కోవడం లేదు. కథలు అనువాదాలయినా పాత్రలపేర్లు మార్చడం భావ్యంకాదు. అలాచేస్తే పయిదేశాల సంగతీ, భావాల సంగతీ తెలుసుకోవడం దుర్ఘటం. నిజానికి ఆలోచిస్తే దేశంలో అన్నివిధాలా నూతనాదర్శాలు పెంపొంది, భావదాస్యం అడుగంటి, దేశం బాగుపడాలంటే అనుకరణాలకన్న స్వతంత్రరచనలే ఎక్కువ ఉపయోగపడతాయి. భాషాంతరీకరణాలు పైవాళ్ల సంగతినే తెలుపుతాయి. ముందు తమసంగతి చూచుకొని గదా! తక్కినవాళ్ల మంచి చెడ్డలని ఆలోచించేది?

కథకులు మన కథల్లోని లోపాలని దిద్దుకొని అవి జనసామాన్యం చదవడానికీ, ఆంధ్రుల వ్యక్తిత్వాన్నీ, నీతినీ, జాతినీ ప్రకటించడానికీ ఉపయోగపడేటట్టు రాయడానికి ప్రయత్నించడం శ్రేయం.

---

# గాంగసామంతవర్మ నూతనశాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

ఇది కళింగదేశమును బరిపాలించిన గాంగవంశజుల యొక్క క్రొత్తశాసనము. ఇది నాకు లభించిన విధ మిది: ప్రస్తుతము విశాఖపట్టణము జిల్లాయందుచేరిన నర్సన్న పేటకు తూర్పున సుమారు రెండుమైళ్లదూరమున చీడివలసయను గ్రామము కలదు. ఆ గ్రామమునకు పడుమటగ సుమా రొక ఫర్లాంగుదూరమున ఒక 'మెట్టగుడ్డౌ' లోనిమంటిని తవ్వి ఇంకొక 'మెట్టగుడ్డౌ'లో పోయుచుండగా ఒకకుండయందు భద్రపరుపబడియుంచిన యీ శాసనము ఒకరైతుకు దొరకినది. ఈ విషయము తెలిసినవెంటనే బలగమఠపీఠాధికారులగు శ్రీశ్రీశ్రీ ఫలహారీమహంతు రాజారాంబావాజీగారు దానిని తీసికొని జాగ్రతపరిచిరి. శాసనముదొరకిన చీడివలసగ్రామము వారిదే. దేశచరిత్రమున అధికమయిన ఆదరాభిమానము లుంచి పరికరములను సంపాదించుటలో ఎక్కువ కృషి చేయుచున్న మన్మిత్రులు శ్రీ భైరి అప్పలస్వామి నాయడుగారి కీ విషయము తెలిసి శ్రీ మహంతుగారిని వారిగ్రామములలో నొకటియగు తాళ్లవలస అగ్రహారమున మకాముచేసియుండినకాలమున వెళ్లి, వారి దర్శనము చేసి దానిని పత్రికలో సవిమర్శముగ ప్రకటింపించి మరల ఇచ్చివేసెదనని తీసికొని దానిని దయతో నాకు పంపినారు.

శాసనముదొరకిన 'మెట్టగుడ్డౌ' పూర్వ మొకప్పుడు గ్రామ ముండెను స్థలమని స్థలజ్ఞులు చెప్పెదరట. ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రికలో[1] బ్రహ్మశ్రీ కర్రి సాంబమూర్తి శాస్త్రిగారును, ఆంధ్రేతిహాసమండలివారి పత్రికలో[2] శ్రీయుత రాళ్లభండి సుబ్బారావుగారును ప్రకటించిన దేవేంద్రవర్మ చీడివలస శాసనమన్నదికూడ ఈ శాసనము దొరకిన స్థలముననే తవ్వగా బయలుపడినదట. ఆ శాసనమున దానముచేయబడిన గ్రామము 'శివిడి' చీడివలసయే యనియు, దానికి శ్రీ మహంతుగారి పూర్వపురికార్డులలో 'శివుడి' (శివిడి) గ్రామమనియే వ్రాయబడియుండెననియు శ్రీ అప్పలస్వామినాయుడుగారు చెప్పుచున్నారు.

ఈ శాసనము నొక్కొకటి ౭ అంగుళముల పొడుగును, ౨.౨ అంగుళముల వెడల్పునుగలమూడురేకులున్నవి. ఈ శాసనము నా యొద్దకు వచ్చుటకుపూర్వమే ఈ రేకులు తగిలించియుంచు కడియము - ముద్రికతోగూడ - పోయినది.

శాసనలిపి క్రీస్తుశక మయిదవ, ఆరవశతాబ్దులలో కళింగదేశమున వాడుకయందుండిన వేంగీలిపి - కళింగమోడి. తమవంశమును దెలుపక కేవలము కళింగాధిపతులమని చెప్పుకొన్నవారి శాసనములయందును, గాంగశకము ౧౮౩-వ సంవత్సరమునాటి గుణార్ణవకుమారుడయిన దేవేంద్రవర్మ కాలమునాటివరకును గల కళింగగాంగ భూపతుల శాసనములయందును ఈ లిపియే కానవచ్చును. ఈ దేవేంద్రవర్మకాలమునాటినుండియే కళింగశాసనముల యందు లిపిస్వరూపము మార్పుపొందుటగమనింపగలము. కళింగాధిపతుల శాసనములయందును, మొదటి గాంగభూవరుల శాసనములయందును అక్షరములు 'గుండ్రకత్తు'లో నుండ తరువాతి గాంగశాసనములయందలివి 'పలకకత్తు' (rectangular script) లో నుండును. ఈ కత్తు గాంగశాసనములయందు గాంగశకము ౮౭, ౯౧ నాటి ఇంద్రవర్మ రాజసింహుని కాలముననుండి స్పష్టముగ గాన్పించును. దేవేంద్రవర్మకాలమువరకును గాంగశాసనములయం దీకత్తున మార్పు కనబడదు. అతని శాసనములలిపికూడ 'పలకకత్తు'లోనిదే. గాంగశాసనలిపి

1. సంపుటము. ౧౫, పుటలు. ౧౮-౩౧.

2. Vol. 2.

వికాసమున దేవేంద్రవర్మ రాజ్యకాల మొకముఖ్యమయిన ఘట్టము. మరల కత్తుమారినకాల మది.

మనశాసనమునందలి యక్షరములు సామంతవర్మ ధనంతరశాసనమున[1]వలెనే గుండ్రనగ నున్నవి. ఇక వానికిని వీనికినిగల భేద మేమన్న, మనశాసనమునందలివి పెద్దవిగను, లోతుగను, వెడల్పుగను చెక్కియుండ ధనంతరశాసనమునందలివి రేకులమీద సన్నముగ గీకిన ట్లున్నవి. ఈవిషయము లన్నియు జూడగా ఈశాసనము గాంగశకము ౧౨౮ నాటి ఇంద్రవర్మ[2], ౧౮3 నాటి దేవేంద్రవర్మ[3], ధనంతరశాసనపు సామంతవర్మలకాలమునాటిదని నిస్సంశయముగ జెప్పవచ్చును.

మొదటిరేకు మొదటిప్రక్క నేమియు చెక్కక వదలినారు. మూడవరేకు రెండవప్రక్క శాసనకాలమును దెలుపు నొకపంక్తిమాత్రము చెక్కబడినది.

అచ్చమైన వేంగీలిపియందు కనబడక ఈ శాసనమున మాత్రమే కానవచ్చు అక్షరరూపము 'ణ'. ఈ రూపము కళింగశాసనములకు విశిష్టమయినది. ఇది ఇంద్రవర్మ, దేవేంద్రవర్మలనాటినుంచి కానవచ్చును. ఇతర ప్రాచీనశాసనములయందువలెనే ఇందును వలపలిగిలకతోగూడిన క, గ, ణ, త, మ, య, వ వర్ణములకు ద్విత్వమువచ్చినది. వేంగీలిపిలోనుండు ప్రాథమికశాసనములలోవలెనే 'మ', 'త' వర్ణములించు కంతవత్యాసముతో నొక్కరీతినున్నవి. 'మ' వర్ణ మెడమవైపున కుచ్చుతిరిగియున్నది. 'త' వర్ణమువ్రాసి క్రింద నొక యడ్డుగీటువ్రాయుటవలన 'త' హల్లు చూపబడినది (పం. ౨౨). శాసనాంతశ్లోకములలో అనుస్వారమునకు బదులుగ 'మ' వర్ణపు పొల్లును వాడియున్నారు. కొన్నికొన్నిచోట్ల 'బ' వర్ణమునకు 'వ' వ్రాసినారు.

శాసనభాష సంస్కృతము. శాసనాంతమునగల వ్యాసగీతాశ్లోకము లయిదుతక్క మిగిలినశాసనమంతయు గద్యమున నున్నది. 'సరిన్మేఘావతీ' యనుటకు బదులుగ 'సరిత్మేఘావతీ' యని పొరపాటుగ వ్రాయబడినది. ఇది ప్రాయికముగ లేఖకదోషమై యుండవచ్చును. సీమావధులలో 'క్షోద్రవఖలి' యొకటి. 'క్షోద్రవ' మన్నదిధాన్యవిశేషమైన ఆళ్లకు పేరు. ధాన్యమును నూర్చెడు కళ్లమునకు 'ఖలి' యనియు పేరు. ఇట్టి కళ్లమును సీమావధిగ జెప్పట యొకవిశేషము. గ్రామసంఘమునకంతకు ధాన్యమునూర్చుకొనుటకు కొంతప్రదేశము—'గ్రామసమూహికళ్లము'గా— కేటాయింపబడి యుండవచ్చుననియు, ఆకారణముననే 'కళ్లము' కూడ ఒకసీమావధిగ జెప్పబడినదనియు నాయూహ.

ఈ శాసనము కళింగగాంగ వంశచారిత్రమునకు చాల ముఖ్యమయినది. దీనిని గాంగవంశజుడయిన సామంతవర్మమహారాజు 'శ్వేతకాధిష్ఠానము'నుండి యొసంగెను. ఇతరప్రాచీన గాంగశాసనములయందువలె నిందును మొదటియాఱుపంక్తులలో గాంగవంశప్రశస్తి కలదు. వాజసనేయచరణమునకు చెందిన భారద్వాజసగోత్రులగు కీర్తిశర్మ, అతనికొడుకులు దేవశర్మ, రవిశర్మ, దివాకరశర్మ అనునలువురు బ్రాహ్మణులకు సామంతవర్మమహారాజు తన తలిదండ్రులకును, దనకును పుణ్యాభివృద్ధిగ లోహశృంగారవిషయమునందలి ఘేరవ గ్రామమును అశ్వత్థచ్ఛేదసహితముగ అన్నివిధములయిన పన్నులను దొలగించి సూర్యచంద్రులు కలయంతకాలము నిలుచునట్లు అగ్రహారముచేసి యొసంగిన విషయము తరువాతి యారుపంక్తులలో చెప్పబడినది. ఈ దానమును దెలుపుటకే ఈ శాసనముపుట్టినది. తరువాతి మూడుపంక్తులలో దానమొసంగిన గ్రామము

1. Ep. Ind , Vol. XV, p. 275 ff.
2. Ep. Ind., Vol. XVIII p. 307 ff.
3. Ep. Ind., Vol. III, p. 130 ff.

హద్దులు తెలుపబడినవి శాసనమునందలి కడమభాగమున వ్యాసగీతాశ్లోకములు కలవు.

ఏనిమిత్తమున సామంతవర్మ యీదానమును కావించెనో శాసనమున దెలుపబడలేదు; కాని శాసనాంతమున "సంవత్ ౧౮౩ కార్తికదిన ౩౦" అని కలదు. ప్రాయికముగ నిది ప్రతిగ్రహీతలకు పట్టాయొసంగినతేది కావచ్చును. ఒకవేళ దానముకూడ ఆదినముననే జరగినను జరగియుండవచ్చును. శాసనములయందు సాధారణముగ 'సంవత్' పదమును విక్రమశక (విక్రమార్కశక) వత్సరములను దెలుపుట కుపయోగించుట వాడుక. అట్లయిన నీశాసనకాలము క్రీ.శ. ౧౨౬ నాటిది కావలెను; కాని శాసనలిపినిబట్టి చూచినను, ఆనాటి దక్షిణహిందూదేశచరిత్రమును బట్టి చూచినను ఇది యాకాలమునాటిది (మూడవశతాబ్దిది) కాదని తేలగలదు. కావున 'సంవత్' అనుదానిని విక్రమశకవర్షముగ పరిగణింపవీలులేదు. సింహపురమునుండి పరిపాలించిన కళింగాధిపతి ఉమవర్మమాత్రము తన శాసనమున 'సంవత్' అని శాసనకాలమును దెలుపుసందర్భమున ప్రయోగించినాడు[1]. అదికూడ విక్రమశకవత్సరమనుటకు వీలులేదు. మనశాసనమున 'సంవత్ ౧౮౩' అనియుండుటవలన అది యొకశకపరిగణనమువలె దోచుచున్నది. కాని దీనియారంభవత్సరము తెలియరాకపోవుటవలనను, సరిచూచి నిర్ణయించుటకు తగినన్ని వివరములు లేకపోవుటవలనను ఈ శాసనమున దెలుపబడిన కాలమునకు సరియైన ఇంగ్లీషుతేది నిర్ణయించుటకు వీలుకాకయున్నది.

శ్వేతక, ఫేరవ, లోహాళ్ళంగారము అనునవి శాసనమున నుదాహృతములయిన స్థలవిశేషములు. శ్వేతక గాంగసామంతవర్మమహారాజురాజధాని. ఫేరవ దానమొసంగిన గ్రామము. లోహాళ్ళంగారమన్నది కళింగదేశమందలి యొకవిభాగమునకు పేరు. మేఘావతియనునది ఫేరవగ్రామపు పడుమటి సరిహద్దు.

శ్వేతకయనునది గంజాముజిల్లా సోంపేటతాలూకాయందలి చీకటియేయని నా నిశ్చయము. శ్వేతకపదము వర్ణవ్యత్యయమును పొంది శ్చేకతయై, చేకటయై, తుదకు సామాన్యజన వ్యవహారమున చీకటియైనది. ఒక విభాగమునకు పేరొసంగిన లోహాళ్ళంగార మెచ్చటిదో గుర్తింప వీలుకాకయున్నది. కాని చీకటిప్రాంతము లోహాళ్ళంగారవిషయములోనిదని ఈ శాసనము వలననే తెలియుచున్నది. పైనిర్దేశముల ననుసరించి దానమొసంగిన ఫేరవగ్రామమును సోంపేట తాలూకాయందలి యిప్పటి బారువగ్రామమనియు, మహేంద్రగిరి పర్వతములలో పుట్టి బారువయొద్ద సముద్రమున గలయుచున్న యిప్పటిమహేంద్రతనయనది మేఘావతియనియు నానిశ్చయము.

శ్వేతకాధిష్ఠానమునుండి పరిపాలనము చేసిన గాంగభూపతులు కొందరు కలరు. సామంతవర్మ, ఇంద్రవర్మ, పృథివీవర్మలని వారిపేళ్లు. ఇంతవరకు వీరివి ఒక్కొకరివి ఒక్కొక్కశాసనమమాత్రమే దొరకినది[2]. ఈ మూడును ఇదివరకే ప్రకటితమైనవి. ఈ మూడు శాసనములను ప్రకటించినవారు రాజధానిపేరు 'స్వేతక'[3] యని తప్పగనే చదివియున్నారు. శ్వేతకాధిపతులు

1. Ep. Ind., Vol. XII, p. 4 ff.
2. Ep. Ind., Vol. XV, p. 275 ff.
   Ep. Ind., Vol. XIX, p 134 ff.
   Ep. Ind., Vol. IV, p. 198 ff.

3. శ్వేతకయని ఈ శాసనమున గానవచ్చిన వెంటనే ఇతరశాసనములయందు శ్వేతక కలదా, స్వేతక కలదా యని సందేహము కలిగినది. సామంతవర్మ ననంతరశాసనమును, పృథివీవర్మశాసనమును ఎగ్మూరు, గవర్నమెంటు మద్రాసు మ్యూజియములో నున్నవి. ఆర్కియలాజికల్ అసిస్టెంటుగారయిన శ్రీ సి. శివరామమూర్తిగారి నడిగి యా శాసనములను రెంటిని పరిశీలించితిని. ఈ సందర్భమున వారికి నా వందనములను దెలుపవలసియున్నది.

కూడ తాము కళింగాధిపతులమనియే చెప్పుకొని యున్నారు. కళింగనగరముననుండి పరిపాలనము కావించిన గాంగులకును, శ్వేతకాధిపతులకును ఎట్టిసంబంధము కలదో, వారును వీరును ఒక్క శాఖవారగుదురో కాదో ఇంతవరకు తేలలేదు. శ్వేతకాధిపతుల మూడుశాసనములయందును శాసనకాలము తెలుపబడనందున వీ రెప్పటివారో నిర్ణయించుటకును వీలుకాకపోయినది. ఆ మూడు శాసనములయందును పేర్కొనబడిన గ్రామము లెచ్చటివో గుర్తింపరానందున ఇంతవరకు వారు పాలించిన ప్రాంతముకూడ నిశ్చయించుట దుష్కరమైనది. మన ప్రకృతశాసనమువలన ఈ విషయములు కొంతవరకు తేలుచున్నవని చెప్పవచ్చును. పైనికావించిన స్థలనిర్దేశము ననుసరించి వీరు చీకటిరాజధానిగా తత్పరిసరసీమను పరిపాలించినట్లు స్పష్టమగుచున్నది.

మనశాసనమున దెలుపబడిన ౧౮౫ వీరికాలమును దెలిసికొనుట కొక కీలకముగ నున్నది. వీరుకూడ గాంగవంశజులేకావున ఈ ౧౮౫ గాంగశకకాలము కాదగునని యూహచేసినచో మనసామంతవర్మ కళింగనగరముననుండి రాజ్యముచేయుచుండిన గాంగశకము ౧౮౩, ౧౮౪ సంవత్సరములనాటి గుణార్ణవతనూభవుడయిన దేవేంద్రవర్మనాటివాడగును. ఈ నిర్ణయమున కిదివరలో తెలిపినట్లు లిపి సాధకమేకాని బాధకము కాదు. దీనిననుసరించి సామంతవర్మ, దేవేంద్రవర్మ లేకకాలమున రాజ్యముచేయుచుండినవారగుచుండుటవలన ఒక్క

పృథివీవర్మశాసనమునందలి లిపి నాగిరి. అందుకూడ అధిష్ఠానముపేరు "శ్వేతక" అనియే యున్నది కాని "స్వేతక" యని లేదు. మొదటి సంయుక్తాక్షరమునందలి ద్వితీయవర్ణము చాల స్పష్టముగ నున్నది. అది శాసనమునందలి ఇతర 'చ' వర్ణములవలెనే యున్నది. 'శ్చేతకాధిష్ఠానము'ను 'శ్వేతకాధిష్ఠాన'మని పొరబడుటకు వీలులేదు. ధనంతరశాసనమున వాడినది వేంగీలిపి. ఈ లిపిలో 'చ', 'వ' వర్ణములకు చాల వ్యత్యాసము కలదు. 'శ్చేతకాధిష్ఠానము' నందలి 'శ్చ' చాల స్పష్టముగ నున్నది. 'ఎపిగ్రాఫియా ఇండికా'లో ప్రకటితమయిన శాసన ప్రతిబింబములను జూచినను పై విషయము స్పష్టమగును.

'మిథిక్ సొసయిటీ'వారి పత్రికలో (Jour. My Soc., Vol. XIII, p. 266 ffi) 'తూర్పుగాంగుల నాటి కళింగచారిత్రక భూగోళము' అను వ్యాసమును వ్రాయుసందర్భమున శ్రీ జి. రామదాసుపంతులుగారు తప్పు పాఠమయిన 'స్వేతక'నుంచి నేటి 'చీకటి' ఎట్లు కలిగినదియు వ్యుత్పత్తి నిట్లు తెలిపియున్నారు:

"In old Dravidian as in modern Tamil there was only one sign to represent the two sounds of sa (శ) and ca (చ). Svetaka (శ్వేతక) or Cvetaka (చ్వేతక) easily becomes Cekata (చేకత) or Cekata (చేకట) which in rapid pronunciation becomes Cikata (చీకటి) or Cikati (చీకటి)."

కుండలీకరణమునందలి పదములు నేను వ్రాసినవి. సామంతవర్మాదుల యధిష్ఠానమును చీకటిగా గుర్తించుట సరిగానే యున్నది; కాని చీకటి వ్యుత్పత్తిని 'శ్వేతక' యను అపపాఠమునుండి చెప్పుటయే విచిత్రము. "శ్వేతక"నుండి "చీకటి"ని విడదీయుటకు పైని వారు చెప్పిన కారణముకాక ఆ రెండు పదములకు ఇంచుమించుగ గల పోలికయే వారి కెక్కువగ తోడ్పడియుండును. 'స్వేతక'యే 'చీకటి' కాదగుననుస్ఫురణ కలిగినపిదప వారు దానిని సమర్థించుటకు సూత్రముల నన్వేషించియుందురు. ఎట్లయినను చాలకాలమునకు పూర్వమే సామంతవర్మాదుల రాజధానిని చీకటిగా గుర్తించిన వారియూహజ్ఞ ప్రశంసనీయము. వారు చెప్పిన సూత్రములు సరియైనవయినను కళింగదేశభాషకు వర్తించుననుటకు ప్రమాణములు లేవు. సామంతవర్మనాటి, పృథివీవర్మనాటి శాసనములును, అంతకు పూర్వపు శాసనములునుకూడ కళింగమున దొరకినవి. వానియందలి భాష సంస్కృతమే. సరిహద్దులను దెలుపునపుడుమాత్రము దేశీయపదములు వచ్చుట కలదు. పరిశీలించినచో వాటిలో 'శ', 'చ' వర్ణములు వ్రాయవలసివచ్చినపు డిప్పటి తెలుగులోవలె భిన్నసంజ్ఞలనే వాడినారుకాని ఆ రెండువర్ణములకు నొకటే సంజ్ఞను వాడిరనుట కాధారములేదు.

వంశమువారైనప్పటికి వారు భిన్నశాఖలకు చెందినవారైన కావచ్చును. అయినను ఇప్పటికి దొరకిన యాధారములలో నింతకన్న గట్టిగ నిర్ధారించి చెప్పుట కవకాశము లేదు. ఇట్లు భిన్నశాఖలవారైయుండవచ్చునన్నది నిశ్చయమైనచో, మొదట కళింగమున వేరువేరు భాగములందు రాజ్యముచేయుచుండిన గాంగరాజు లయిదుగురుండిరనియు, మొదటివజ్రహస్తుడీ యైదురాజ్యములను దనభుజబలపరాక్రమములచేత జయించి ఏకముచేసి పాలించెననియు మూడవవజ్రహస్తుని శాసనములయందు[1] దెలిపిన విషయము సత్యమగును. ఈ యైదుగురిలో నొకరికి శ్వేతకయు, మఱియొకరికి కళింగనగరమును, వేరొకరికి దంతిపురమును రాజధానులైయుండవలెను. ఇట్లయినచో ఇక నిరువురి రాజధానులు మనకు తెలియవలసియుండును. ఈసందర్భమున, సంపూర్ణగాంగవంశావతారక్రమము నొసంగు అనంతవర్మ చోడగంగదేవు శాసనములలో గొన్నిట[2] వీరసింహుని కుమారుడయిన కామార్ణవుడు దానార్ణవ, మారసింహ, గుణార్ణవ, వజ్రహస్తులను తన నలువురి సోదరులతో కళింగములను (కళింగదేశములను)జయించి వశపరుచుకొని పాలించినట్లు తెలుపబడిన విషయము స్మరింపదగ్గది. మూడవ వజ్రహస్తుని శాసనములయందు చెప్పబడిన యైదుగురు రాజులును ఈ యైదుగురి సంతతివారైన నైయుండవచ్చును. అనంతవర్మ చోడగంగదేవుశాసనములయందే కామార్ణవుడు గుణార్ణవునికి కంబవాడివిషయమును, మారసింహునికి 'సేదామండలము'ను[3], వజ్రహస్తునికి కంటకవర్తనియు నొసంగినట్లు కలదు. ఇట్లు గాంగవంశజులు నాలుగుశాఖలవారు నాలుగుప్రదేశములను పాలించుచుండినట్లు స్పష్టమేయగుచున్నది. అయిదవశాఖవారు పాలించినవిషయముమాత్రము స్పష్టమగుటలేదు. కామార్ణవుడు దానార్ణవుని 'కంఠికాబంధురకంఠు' ని కావించినట్లేయున్నది. కాని అతనికి ప్రత్యేకదేశము నొసంగినట్లు చెప్పబడలేదు. దీనిననుసరించి కామార్ణవుడేలినరాజ్యమునే దానార్ణవుడేలియుండునని చరిత్రకారు లూహించుచున్నారు[4]. ఈవిషయ మెట్లున్నను పై సంగతులననుసరించి కళింగనగరమువారును, శ్వేతకవారును భిన్నశాఖలవారైన గావచ్చునని తేలుచున్నది. ఒకవేళ మారసింహుడేలిన 'సేదామండలము' 'శ్వేత' (చేత - సేద)మండలమే యగునేమో. అట్లయిన సామంతవర్మాదులు మారసింహసంతతివారగుదురు.

ఇంతవరకు ప్రకటితములైన మూడుశాసనములలో సామంతవర్మధనంతరశాసనమే ప్రాచీనపుది. ఆశాసనప్రశస్తియు, మన యీ శాసనప్రశస్తియు రెండు

1. భారతి., సం. ౨, పుట. ౧౫౦.

2. భారతి, సం. ౨, పుట. ౧౦౮.

3. అనంతవర్మ చోడగంగుశాసనములను బ్రకటించినవారందరు దీనిని 'సోదామండల' మని చదివినారు. మ్యూజియమునందున్న చోడగంగుశాసనములను బరిశీలింపగా నిది తప్పుపాఠమని తేలినది. 'సేదామండలము'కాని యది 'సోదామండలము' కాదు.

4. పర్లాకిమిడి శ్రీసత్యనారాయణ రాజుగారు ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారి పత్రికయందు (Jour. Andh. His. Res. soc., Vol. III p. 30 ff) కీర్తిరాజదేవుని పుల్సరతామ్రశాసనమును బ్రకటించుసందర్భమున కళింగగాంగులలో అయిదుశాఖలవారుండవలెనని—అనంతవర్మ చోడగంగుశాసనములననుసరించి—గట్టిగ చెప్పి, ఆ శాఖలవారి వంశానుక్రమమును గూడ పట్టికరూపమున (పుట ౩౮) నిచ్చియున్నారు. వీరు దానార్ణవుడేలిన దేశమును 'కండికబంధుర'మని వ్రాసినారు, ఇది దేశము పేరుకాదు. కామార్ణవుడు తన తమ్ముడయిన దానార్ణవుని యౌవరాజ్యమున కభిషేకించినందుకు సూచకముగ 'కంఠికబంధురకంఠు'ని కావించెనే కాని అతనికి మిగిలిన సోదరులకువలె పాలింప దేశమేదియు నియ్యలేదు. చోడగంగు శాసనమునందలి పాఠ మిది. : "అసౌ దానార్ణవ మనుజం కండి(ఠి)కాబంధురకంఠం విధాయ గుణార్ణవాయాంబవాడివిషయం మారసింహాయ సేదామండలం వజ్రహస్తాయ కంటకవర్తనీ మదాత్".

స్వల్పభేదములతో నొక్కటే; కావున ఈరెంటిశాసనములయందును దాతయైన సామంతవర్మ యొక్కడేయని నానిశ్చయము. అట్లయినచో ధనంతరశాసనమున “స్వభుజబలపరాక్రమాక్రాంత సకలశ్వేతకాధిరాజ్యః” అని వర్ణితుడయిన యీ సామంతవర్మ మనశాసనమున “స్వభుజబలపరాక్రమాక్రాంతకలింగాధిరాజ్యః” అని యేల వర్ణితుడయ్యెనో నిశ్చయింపవలసియున్నది. మనము గమనింపవలసిన మఱియొకవిషయ మిది. ధనంతరశాసనమున లేని ‘మహారాజ’, ‘సకలకలింగాధిపతి’ బిరుదము లితని కీశాసనమున గానవచ్చుచున్నవి. ఈవ్యత్యాసములననుసరించియే మనశాసనము ధనంకరశాసనమునకు దరువాతి దనియు, ధనంతరశాసనము నాటి కొకచిన్నసంస్థానమున కధీశుడుగనుండిన సామంతవర్మ మనశాసనముకాలము నాటికి ఏవోకొన్ని యుద్ధములయందు విజయమునొంది మరికొంతరాజ్యమును సంపాదించి పూర్వోక్తబిరుదములను ధరియించియుండవచ్చుననియు విదితమగుచున్నది.

ఈ సామంతవర్మ ఎవరినిజయించి క్రొత్తరాజ్యమును సంపాదించియుండును, “నిజనిస్త్రింశధారోపార్జితసకలకలింగాధిరాజ్యః” అని శాసనములయందు వర్ణితుడయిన ఈతని సమకాలీనుడు గుణార్ణవతనూజుడయిన దేవేంద్రవర్మ ఏమయ్యెను, ఇరువురకునుగూడ సమానార్థకములయిన ‘సకలకలింగాధిపతిః’, ‘సకలకలింగాధిరాజ్యః’ అను బిరుదము లుండుట ఎట్లుతటస్థించె నను విషయములు విచారణీయములు. కళింగనగరమునుండి పరిపాలనము నెరపిన గాంగనృపతులు హస్తివర్మ మొదలు దేవేంద్రవర్మవరకు—ఒక్క ౧౩౮ నాటి ఇంద్రవర్మ మినహా—తమ శాసనములయందు తాము ‘స్వాసిధారాపరిస్పందాధిగత సకలకలింగాధిరాజ్యః’ అనియే వర్ణించుకొనుచువచ్చినారు. ఇది “నిజనిస్త్రింశధారోపార్జిత సకలకలింగాధిరాజ్యః” అన్నరూపముతో గాంగశకము ౩౦౮, ౩౧౦, ౫౧ (?), ౫౨౬ నాటి శాసనములలోను[1], గాంగశకకాల ముదాహృతముకాని అర్జునవర్మకొడుకు దేవేంద్రవర్మ, రాజేంద్రవర్మకొడుకు దేవేంద్రవర్మ, దేవేంద్రవర్మకొడుకు అనంతవర్మ, మహారాజాధిరాజవజ్రహస్తదేవుల శాసనములలోను[2] తక్క గుణార్ణవుని కుమారుడయిన దేవేంద్రవర్మకాలమునుండి కళింగనగరమునుండి యొసంగబడిన మిగిలిన ౨౦౮, ౨౨౧, ౨౫౮, ౩౫౧, ౩౯౭, ౫౨౦ నాటి గాంగశాసనము లన్నిటిలోను[3] గాన్పించును.

మొదటిగాంగరాజు కళింగమును జయించినందువలనగావచ్చును ఆతనికాలమునుండి—ఏరూపమునైననేమి—యీ బిరుదువక్కణ కళింగనగరగాంగుల శాసనప్రశస్తియందు పొందుపరుపబడినది. అటుతరువాతివారు దానిని ఊరక తమప్రశస్తియందు వాడియుందురు. మన యీ శాసనమునందలి బిరుదములననుసరించి చూచినచో

1. Ep. Ind., Vol. III., p. 17 ff.
   Ibid, Vol. XVIII, p. 311 ff.
   Ind. Ant., Vol. XIII, p. 273 ff.
   Jour. Andh. Hist. Res. Soc., Vol. VIII p. 168 ff.
2. Jour. Andh. Hist. Res. Soc., Vol. VIII, p. 192.
   Ep. Carn., Vol. IX, Bn. p. 140.
   Jour. Andh. Hist. Res. Soc., Vol. VIII, p. 193.
   Ep. Ind. Vol. III, p. 220 ff.
3. Jour. Andh. Hist. Res. Soc., Vol. II, p. 272 ff.
   భారతి, సం. ౫, పుట. ౧౧౧.
   Ind. Ant., Vol. XVIII, p. 143 ff
   Ibid, Vol. XIV, p. 10 ff.
   Jour. Andh. Hist. Res. Soc., Vol. II, p. 146 ff.
   Ibid, Vol. II, p. 171 ff.

సామంతవర్మ ధనంతరశాసనమున కనంతరకాలమున కళింగనగరగాంగుల రాజ్యముపై దాడివెడలి వారిని జయించియుండునని యూహింపదగియున్నది. పిదప పూర్తిగ కాకపోయినను కొంత భాగమైనను వారిరాజ్యము నాక్రమించుకొని మహారాజనియు, సకలకళింగాధిపతియనియు బిరుదములను వహించి తనకు నూతనముగ లభించిన గొప్పదనమునకు సూచకముగ వానిని దనశాసనప్రశస్తియందు జేర్చుకొనియుండును. ఈ శాసనముప్రశస్తియందలి "స్వభుజబలపరాక్రమాక్రాంతకలింగాధిరాజ్యః" అన్నదానివిశేషమిదియే యని నాయూహ. సామంతవర్మయనంతరము శ్వేతకరాజ్యమును పరిపాలించినవారు సామంతవర్మననుసరించి తమశాసనప్రశస్తియందు ఆబిరుదుపక్కున నూరక పరంపరగ వాడుచు వచ్చిరి; అంతియకాని దీనికి వారిశాసనములయందు విశిష్టతయేదియు లేదు. మనశాసనమునందలి ౧౭౯ గాంగశకమని యంగీకరించినచో సామంతవర్మచేత నోటువడినవాడు అతనికి సమకాలీనుడయిన దేవేంద్రవర్మయే కావలెను. కళింగనగరమున దేవేంద్రవర్మశాసనములు ౧౭౮వరకు కాన్పించుటచేతను[1], మనశాసనకాలము ౧౭౯ అగుటచేతను సామంతవర్మకీవిజయము ౧౭౮ - ౧౭౯ సంవత్సరముల నడుమ లభించియుండును.

దేవేంద్రవర్మశాసనము కళింగనగరమున మరల ౧౯౨ లో కానవచ్చుటచేతను, అది యించుమించుగ ౧౭౮ నాటి యతనిశాసనమునకు నకలేయగుటచేతను దేవేంద్రవర్మ—నిజముగా ౧౭౮కు తరువాత కొంత రాజ్యమునే కోల్పోయినచో—దాని నంతయుగాని, తుదకు కొంతభాగమునుగాని ౧౯౨కు పూర్వమే మరల సంపాదించియుండవలెనని స్పష్టమగుచున్నది. అందువలన '......సకలకలింగాధిరాజ్యః' అన్నవిశేషము దేవేంద్రవర్మవిషయమున మరల సార్థక మనవచ్చును.

1. Jour Andh. Hist. Res. Scc., Vol. II, p. 275 ff.

2. Indian Historical Quarterly.

# మూ ల ము[1]

## మొదటిరేకు: రెండవపెడ



౧. ఓం [।*] స్వస్తి విజయశ్శ్వేతకాధిష్ఠానా ద్భగవత శ్చరాచరగురో రసక

౨. లశశాఙ్కశేఖరధరస్య స్థిత్యుత్పత్తిప్రలయహేతో ర్మ్మహేన్ద్రాచ

3. లశి [ఖ] రనివాసినః శ్రీగోకర్ణేశ్వరస్వామినశ్చరణకమలారా

౪. ధనాదవాప్తపుణ్యనిచయో గాఙ్గామలకులామ్బరన్దు[2] [:*] స్వభుజవ(బ)

౫. ల[3]పరాక్రమాక్రాన్తకలిఙ్గాధిరాజ్యః శక్తిత్రయప్రకర్షానురఞ్జితాశే

౬. షసామన్తః పరమమాహేశ్వరో మాతాపితృపాదానుధ్యాత స్స

---

1 నాదగ్గరనున్న రేకుల ననుసరించి.

2. 'కులామ్బరేన్దుః' అని చదువవలెను.

3. స్వభుజబల° అని.

రెండవ రేకు: మొదటిపెడ



౭. కలకలిఙ్గాధిపతి మ్మహారాజ(శ్రీ) సామన్తవర్మా కుశలీ [॥*] లోహశృ

౮. ఙ్గారవిషయసమ్బద్ధ ఫేరవ(గ్రా)మే యథానివాసిజనపదం సమాజ్ఞా

౯. పయతి విదితమస్తు భవతాం యథాయం(గ్రా)మోశ్వత్థచ్ఛేదసహి

౧౦ త స్సర్వ్వకరభరా నపఖ్నయ[4] భారద్వాజసగో(త్ర) వాజసనేయ కీర్త్తిశ

౧౧. శమ్మణే తత్పుత్ర దేవశమ్మ రవిశమ్మ దివాకరశమ్మభ్యశ్చ చతుర్భ్యో
(బ్రా) ((బ్రా)హ్మణే

౧౨. భ్య[5] స్సలిలధారాపూర్వ్వమాచన్ద్రార్క్క కాల(ప్ర)తిష్ఠ మ(గ్ర)హారంకృత్వా మా

---

4. 'నపహాయ' అని చదువవలెను.

5. ఈ 'భ్య'కు పూర్వమేదోయొక యక్షరము చెక్కియున్నది. అది ఫలానయని తెలియుటలేదు ఆ యక్షర మనవసరము. (బ్రా)హ్మణేభ్య° అని చదువవలెను.

రెండవ రేకు: రెండవ పెడ

౧౩. తాపిత్రో రాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే సమ్ప్ర [ద*] త్తోస్యచ గ్రామస్య సీమాలిఙ్గా

౧౪. ని భవన్తి [।*] పూర్వేణ శుష్కనదీ [।*] దక్షిణేన సమ్మైద్య [।*] పశ్చిమేన సరిత్మే (న్మే) ఘావ

౧౫. తీ [।*] ఉత్తరేణ కోద్రవఖలీ [।*] దక్షిణేన గర్త్తా [ర్*] పూర్వోత్తరేణ యావత్పర్వతః [।*]

౧౬. విది త్త్వైవం న కేనచి త్స్వల్పాప్యావా(బా)ధా కార్య్యా [।*] భవిష్యతశ్చ రాజ్ఞ [ః*] ప్రతి

౧౭. వో(బో)ధయతి [।*] ధర్మ్మాక్క్రమవిక్క్రమేణ నావాప్య[6]మహీం మనుశాసద్భి రయం

౧౮. దానధర్మ్మోనుపాలనీయః [।*] వ్యాసగీతా శ్చాత్ర శ్లోకా భవన్తి [।*] బహుభి ర్వ్వ

6. 'విక్రమేణావాప్య' అని.

మూడవరేకు: మొదటిపేడ



౧౯. సుధా దత్తా రాజభి స్సగరాదిభిః [।*] యస్య యస్య యదా భూమి స్తస్యతస్య

౨౦. తదా ఫలం ॥ [౧*] స్వదత్తాం పరదత్తాంవ్వా యత్నా ద్రక్ష యుధిష్ఠిర [।*] మహీ [ం*] మహీమతాం శ్రేష్ఠ

౨౧. దానా చ్ఛ్రేయోనుపాలనం ॥ [౨*] షష్ఠి[7] వర్షసహస్రాణి స్వర్గే మోదతి భూమిదః [।*] ఆక్షే

౨౨. ప్తా చానుమన్తాచ తాన్యేవ నరకే వసేత్ ।[।3*] మాభూ దఫలశఙ్కావః ప

౨3. రదత్తేతి పార్థివాః [।*] స్వదానా త్ఫల మానన్త్య [ం*] పరదానాను పాలనం ॥ [౪*]

౨౪. యశో స తోఽస్థిరా భోగా జీవిత [ం*] క్షణభఙ్గురం [।*] ఇతి సంచిన్త్య నృపతే కురు ధర్మ్మానుపాలన[మ్ ॥ ౫*]

7. "షష్టిర్వర్ష" అని.

మూడవరేకు: రెండవపెడ

౨౫ 

౨౫. సమ్వత్ ౧౮౫ కార్త్తికదిన 3(?)[॥*]

# నా మహారాష్ట్ర యాత్ర

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

అల్లనల్లన రెప్పతలుపులుమూసి, బాహ్యావని నుండి పోయిపోయి, అనంతాంతరంగమున నిదందు మసలి, ప్రభాకలిత స్వప్నఖచిత దివ్యనభమును విలోకించి, రెక్కలుకట్టుకొని సుకుమార రమ్య భావోద్యానమున నెగసియెగసి లలిత లవంగ లతికలందు, భ్రమర వ్యాధూత కుంజకుటీరములందు వ్రాలి, అవిరళపరిమళమున గ్రుంకులిడి, తేనెచినుకుల తనివారగ్రోలి, అసమూకలందు మసలి, మలయపవనాంకురములందు నృత్యమొనరించి, కొండొకవడి తడసి, చిన్నితుంపురుల గుసగుసలకు వీనుదోసిళ్లొగ్గి, పసిపాపలుపోలు పూలనోడి జేర్చుకొని భావోద్వేగమున వాని నసుమోముల జుంబించి, కెంపుకలపుల గైతకై సేతలల్లుచు నేమోయోచించుచు, పాడుచు, నాడుచు, కులుకుచు, మధుమాసమునమురియు కోయిలవలె మనుష్యాత్మ మాటలకందని హాయిలో నాత్మవిస్మృతినందియుండ, నాకస్మికముగ పెనుగొండను మూపున నిడికొనిన పెనుభూతమొకటి మీద లంఘించి, గుండియలను గట్టిగ పిడికిటబట్టినపుడు, స్మృతిద్వారమును చేరుకొనకమున్నే తలక్రిందులై మనసు మిగుల దొట్రుపడదా? అత్తరి ఎట్టియోచనమునకైన నది కిడంగగలదా? కొండవిఱిగి పైబడినట్లు భయంకరశబ్దమైనంతనే,-కాలు నేవో క్రూరదంష్ట్రిలుపట్టినట్లు తోచినతోడనే, ఆత్మరక్షణకై ఏమికావింతును? కొంతసేపటికించుకస్మృతి నందితిని. అపాయమునుండి సుభాలున లంఘింపవలెననుకొంటిని. కాని, ఎంత యత్నించినను కదలమెదల జాలనైతిని; కన్నులు తెరువజాలనైతిని. ఎవరో నన్ను గట్టిగ నేలమీద నదిమి పట్టినట్టులయ్యెను! నాగమనిస్నాయువులందు విద్యుత్ప్రవాహము కడువడిగ చలించుచున్నట్లయ్యెను! అంతరంగమున నేదో పెనగులాట జరుగుచుండెను! మఱల శబ్దమేమియు వినబడలేదు. క్రమక్రమముగ మనసు తెప్పిరిలసాగినది. రెప్పలమీది ఘనభార మించుక తొలగినది. వాని నించుక విప్పితిని. కన్నులనుండి నిప్పులురాల్చుచు, పులియో, సింగమో ప్రత్యక్షమగునని యడలితిని. కాని నాకేమియు నగుపడలేదు. గుండె కుదుటబడినది. కొంత ధైర్యముచిక్కినది. కన్దోయి పూర్తిగతెఱచి, తేఱిచూచితిని. అపుడును నాకందేమియు జూపట్టలేదు. కాళరాత్రి మఱింత భయదమైతోచినది! అడవిమృగ మందులేకుండుట నాయదృష్టమేయని యానందించితిని. కాలికడ చిన్నముండ్లకంప తోచినది. అంతకుమున్నది అందు కానరాలేదు. పైనున్న గూటినుండి అది రాలియుండును. నిద్దురలో నాకాలు వాడిముండ్లపై పడియుండును. అందుగానున్న నా సమీపమున నేసహాలోనో అడవిమృగము గర్జించియుండును. లేదా, ఆప్రాంతమున పిడుగు పడియుండును. గాలి మిగులతీవ్రముగ వీచుచుండెను. ఝంఝానిల ముత్పన్నమగుననుకొంటిని. నాటి దురంతానుభవమునకు చెట్లను పెళపెళమనిపించు పెనుగాలి, రాళ్లను గుండజేయు వానదెబ్బ కొఱకలు కావనుకొంటిని. తీవ్రానుభవముల నందవలెననియే మక్కువపడుచుందును. తొలుత నవి మనసు కునెగులుకల్పించుట నిక్కమే! భావికాలమునుండి వానిని పరికించినపుడు అవి యొసగు నానంద మింతింత కాదు. "ఘుమఘుమారావ సంకుల ఘోర జీమూతపటలము" చిఱుతప్రాయమున కృష్ణకుచేలులకు కష్టమే కలిగించినది. కాని పదంపడి ఆయనుభవమునుండి వా రెంతయానందమును తోడుకొనిరికారు? నిక్కముగ నత్తటి గాలివాన నన్ను మార్కొనినచో, నైశనిస్తబ్ధతయందింకను నేను నేర్వవలసినయంశములు దూరస్థములగును. కావున నించుకచింతిలితిని.

సమీపమున పరికించితినిగదా, అందు మర చెంబు లేదు. నీరుబుకుచున్న చోటున నది దొరలెనేమో అని యూహించి అందుజూచితిని. నా కది కానంబడలేదు. అందుండి అ చెట్లు మాయమయ్యెనో! ఎవ్వరైన దాని నపహరించియుందురా? ఈపాటివస్తువును దొంగిలించుట కచటికి నా వేళయం దెవ్వరు వచ్చియుందురు ? ఏదో యదృశ్యశక్తి తొలుతనుండి నన్ను పరికించుచు నాకు త్రొటుపాటు కలుగజేయుచున్నదని యూహించితిని. పకపకనవ్వేమి? చెంబు అదృశ్యమగు టేమి? పెద్దనోరు గల భీకరరాత్రి దానిని కరకర నమలివైచెనా? చెంబును నమలిమ్రింగినదాని నోటికి మానవుడు రుచింపడా? అం దాతిడు పట్టడా? కునుకుపట్టనపుడు అంతఆందో లనమెలుగను. దగ్గఅగాని దూరమందుగాని ఏ మేమి చలించుచుండెనో నాకు స్పష్టముగా గోచరించెడిది. నిముసము నిద్రబడితినోలేదో అంతయు దీవ్రప్రహే లికయై తోచినది! దానికతనసే, కొండొకవడి గుండెలం దడలుపాటును, సంశయమును జేరుకొని వానిని దడదడ లాడించినవి! చలి యెక్కునైనది. నిముసమునే పు తల్లి పుట్టిన నెలవున గూర్చుని, దోసిట నీళ్లుగొని ముఖముకడుగు కొని, శేషించిన కునికిపాటును కనులనుండి తొలగించి తిని. ఎప్పటట్లు చెట్టుమొదలునగూర్చుని రెప్పవాల్పక నలుదిక్కుల బరిశీలింపసాగితిని. గాలివడి పూర్తిగ తగ్గి పోయినది. కొంత సేపటికి మరల నెల్లకడలందు నిస్తబ్ధత విరాజిల్లినది. చలనమెఱుగక చచ్చినగొడ్డువలె పడి యున్నట్లు రాత్రితోచినది! మరల గర్జనలు వినపడవని పులి మ్రోలకురాదని ఎట్లూహింతును?-చీకటి పగసాధించు నట్లు తోచినది! యామినిమొగమున నేరక్కసియో దట్ట ముగా మసిపులిమియుండును. చెట్లజొంపమునందు గూర్చుని నిముసనిముసము వన్యపశువునుగుఱించిన బీతును గుండెయందు నింపుకొనుటకంటె మెల్లగ నుడుం బరవృక్ష మెక్కి దట్టమైనఆకులం దదృశ్యుడనై యుండి శేషించినరాత్రి గడపిన బాగనియు, చెట్టుపై నేదేని పాముండినచో అది ఇప్పటికే బయలుపడియుండెడి దనియు, నిక్కముగ కాలసర్ప తరుశాఖలందుండెనేని క్రిందనున్నను, చెట్టుపైనున్నను అపాయమతప్పదనియు, గావున భుజబాహువునుజేరుటే ఉచితమనియు నూహిం చితిని ఇక చెంబుజోక్యము లేనేలేదు. లేచి తువాలును నడుమునకు గట్టిగ బిగించి దగ్గఱనున్న చెట్టును తేఱిచూచి మెల్లగ పై కెగబ్రాకితిని.మరల నెవ్వరో పక్కునవ్విరి! నేజెట్టెక్కుట చూచికాబోలు కొంతయెత్తునకొమ్మలు కొన్ని అల్లుకొనియుండుటచే ఆకు లందు దట్టముగ నున్నవి. మెల్లగబోయి వానియందు జేరుకొంటిని.ఆవృక్ష తల్పమును ముందే చూడనైతినని వగచితిని. కొనరొబ్బ మీద నింకనుపిట్టజంటయుండెనేమోపరికించితిని అం దా మిథునము తోచలేదు. గడియక్రిందటి భయంకరశబ్దము వలన పక్షు లెందో ఎగసియుండును.అనంతవిశ్వమున స్వే చ్ఛ మెయి పయనము సాగింపజాలు జీవి, కొండొకయెడ పిడుగులు డుల్లిపడినసేమి, నిముసములో నందనమున కెగసి, భావాంబరమునందువలె, పూలగుంపులో నక్కి యుండగలదు. నే గూర్చున్నచోటి కనతిదూరమున చెట్టుపై నేదో తెల్లగాతోచినది. మానవుడో, దాన వుడో అనుకొంటిని. ఆసమయమున తోడిమానవుడు తోచినను గుండె నడలు పట్టుకొనును గదా! అ తెల్ల రూపు కదలుచున్నట్లుండెను! గాలితావడున గొమ్మయే ఇంచుక యూగుచుండెను. అదేదో తెల్లని వస్తువై యుండుననియు, దానివలన నేయపాయము కలుగదని యు మనసును సుదుటపఱచుకొంటిని. ఇపు డెత్తుచో టున జేరితినిగావున, మాడ్కులను మఱింతదూరము పుత్తెంపజాలితిని. దివినుండి అంధకారసముద్రమున నందంచు రాలిన నిత్యామల్లెలవలె, చిన్నిచిన్ని దీపికలు దూరస్థపల్లినుండి తోచినవి! చిరనిస్తబ్ధతయందు కాపుర ముండు కొండపల్లెవాసు లెంత యదృష్టవంతులో! పోయి, ఆ యూరున వసించిన నెంత హాయిగనుండునో యని యూహించితిని. చెట్టుకొన నించుక వెలుతురు మిణుకు మిణుకనదోచినది. మెఱుపు నిసుంగు ఓర్తుక మొయిలుకొననుండి జారి ఆకుగుంపులోపడి దానియంది ఱుకుకొనెనేమో యనుకొంటిని. కటికచీకటి నించుక చీల్చి పచ్చనిఆకుపైతోచిన తళుకు నాకన్నుదోయికి విందుజేసినది. నైకుంఠవాసి దీపకళికయై అపుడపు డందు వసించుచుండునేమో! వెలుగున నచ్చొచ్చ చక్కని కులాయ

మొకటికలదని తెలిసికొంటిని. శకుంతములు మిఃఖుం
గురుబుఖుగుల దమపర్ణశాల జేర్చుకొనెనని గ్రహించితిని.
మరల పకపకమనునవ్వు వినబడినది ! నా కనతిదూరమున
దిసుకనుండియే అది వినవచ్చుచుంట ఈ పర్యాయము
నాకు స్పష్టముగ బోధపడినది. ఆ వింతనవ్వేమో తెలిసి
కొనవలెనని దృష్టి నా దిక్కుగ బంధించియుంచితిని.
మనుష్యరూ మేపమియు కానుపించలేదుగాని మఱొక
భయంకరదృశ్యము నాకన్నులబడినది! కడుంగడు కాంతి
వంతిమైన నెత్తురు పొంగిపారలుచున్నట్లగపడినది! ఆ
ఘోరదృశ్య మట్లు దు ఏలతోచుచుండెనో ఊహించు
టకు నాకు సాధ్యముకాలేదు. ఎందుండియో రక్కసి
గుండెయొంకుతెగి అందు పడియుండెనేమో! కేనిబలు
లను నరాంతకులు సుదూరద్వీపములనుండి వచ్చి అందు
విడిసి రుధిరపానీయమును దియారగించుచుండిరేమో!
షేక్స్పియరాదులు *తెలిపిన మంత్రకత్తెలు కొండలు
మనుజుల నాల్కల నెన్నో త్రుంపుకొనివచ్చి పెద్దగూన
యందు వానినుడుకబెట్టి గంజి నచ్చోవార్చుచుండిరేమో!
పులిసంపొకటి అందుజేరి లెక్కలేనితేళ్ల కుత్తుకలుత్రుంపి
రక్తప్రవాహమును వెడలించుచుండెనేమో! రక్కసులు
కొలువుదీర్చి నిండుకుండలతో నెత్తురుతెచ్చి లోతులో
యను నింపుచుండిరేమో ! ఆహా ! అంధకారమున,
నరణ్యస్థలి నెట్టెట్టి ఘోరములు జరుగుచుండునో! చెట్టు
కొమ్మలందు చేరుకొనుటచే విపత్తునకు దూరమందే
యుంటినని ధైర్యమూనియుంటిని. అదేమో తెలిసికొన
వలెనను వాంఛ అంతకంత కధికమైనది. రెప్పలువాల్పక
అట్లే చూచుచుంటిని. రక్తపూరమున పిల్లకెరటాలు
తోచినవి! సరిగ దానిప్రక్కనుండియే మరల పకపక
మనునవ్వు వినబడినది!నవ్వునకును నెత్తురునకును సంబంధ
మెట్లు కలిగెను ? అది కులుకవలసిన సమయమా? అది
నవ్వుదెప్పించు దృశ్యమా? లేక నది పైశాచికహాసనమా?
అట్టి పవిత్రప్రదేశమున భూతములు చేరజాల వను దృఢ
విశ్వాసమును నాహృదయమునుండి తఱిమికొట్టజాల
నైతిని. నవ్వుతో మఱొకశబ్దమేదైన వినబడినయెడల,
ఆ భయదదృశ్యమును గుఱించిన ఉదంతమును కొంత
యూహించుటకు వీలుండెడిది. నిద్దురలో నన్ను అదల
గొట్టిన ఘోరధ్వని అందుండియే వెడలెనా? అట్టి దృశ్య
మునకును, ధ్వనికిని కారణకార్యసంబంధ ముండుట సహ
జమే! కాని అందు మానవుడుగాని, దానవుడు గాని,
ఘాతుకజంతువుగాని, మఱేభయంకరజీవిగాని కానం
బడకుండుటకు కారణమేమి? నవ్వే వినబడనేల? మీదు
మిక్కిలి ఇప్పు డది అధికమైనది! చెట్టుకొననుండి మరల
మధురకూజితము వినబడినది. నైశవిహారము ముగించి,
పక్షిదంపతులు తమ మనికిపట్టునకు మరలియుండును.
ఒకదానిశిరము నింకొకటి మూర్కొనునట్లు సమ్ముఖీన
మై నిలిచిన నాలుగు ఉదుంబర వృక్షములపై పలుచని
పిండివలె క్షీణనక్షత్రాలోకము పొడగట్టినది. మరల
బ్రహ్మాండమును పరికించుచు, కొమ్మతుద నూగుచు,
పిల్ల గాలిలో కూహుకూహూల రాల్చుచు విశ్వమున
కవ్వల విడిసిన తమనెచ్చెలులకో, పాలవెల్లిపై తేలియాడు
దేవదేవునకో చుక్కవెలుతురునుండి శకుంతములు ప్రేమ
సందేశ మంపుచున్నవి. ఈపర్యాయము వాని సమీపమున
జేరితినిగావున కన్నులార వానిని పరికించి, చెవులారవాని
గీతిక వినవలెనని ముచ్చటపడితిని. దృష్టిని పిట్టజంటపై
నిలిపి, అపుడపుడు మాత్రము అదూరమందలి వింతదృశ్య
ముదెస నొకటిరెండు చూడ్కులను ప్రవర్తించుచుంటిని.
నేనేకాక పక్షులును నెత్తురువెల్లువను పరికించుట గంటిని.
కాని అవి ఏయడలు నెఱుగవు. ప్రశాంత స్వభా
వులను భయంకరదృశ్యములు కూడ చలింపజాల
వుకదా! పక్షిహృదయము శాంతసముద్రమని యెఱి
గియేకాబోలు విహంగము నొండు శ్రీవిష్ణు వనవర
తము చెంతజేర్చుకొని, దానిమూపెక్కి తన విశ్వ
సామ్రాజ్యము నపుడపుడు తనిఖీచేయుచుండును. కూహు
కూహూ లెందెందుపోవునో యెఱుగగాంక్షించితిని. చెట్టు
తుదనుండి రెక్కలుకట్టుకొని యెగసి విస్తృతపర్వత
సామ్రాజ్యమున నెందుచెవియొగ్గినను అది శ్రుతిగోచర
మగుట నిక్కమనుకొంటిని. చిన్నదైన పిట్టగుండియ
నుండి వెడలు సన్ననిపల్కు లంతదూర మెట్లుపోజా
లునో! మాటలో మహత్త్వముండెనేని, అది సన్ననిదైన

* Vide : Shakespeare's Macbeth and D. L. Roy's Chandragupta.

నేమి చిన్నదైననేమి విశ్వవలయమందంతటను విహరించి భావపరంపరలను గురిపించును. మధురగీతిక నాలాపించు చినుకు ఏపాటిది ? ప్రణయసందేశము నదెందుండి గొని వచ్చుచున్నది ? నింగిలో నెందో మసలు మొగులు గుండియనుండికదా! అందుండి పయనమై సచ్చరిత్రుని తలపువలె కడుంగడు చల్లనై, ఆత్మహృదినుప్పొంగు పరితోషమును పట్టజాలక మధురాలాపనమున నాత్మప్రకాశము గావించుకొనుచు, ఆకులందును మొగ్గలందును, తీవలందును పూవులందును మజిలీలుసలుపుచు వసుమతి జేరి, కొండొక ప్రశాంతభావముయొక్క ప్రసన్నత నంది మహాగ్రంథమును రచించు కవీంద్రునివలె, విశాల స్రవంతీసామ్రాజ్యమును సృష్టించును. ఎంతో భావ పూరము లభించుననికదా మేధాసముద్రుని ప్రశాంత హితవాక్కును వినుటకై కోటికోటిజిజ్ఞాసువు లాతని చుట్టు మూగుదురు! పిశాచముయొక్క ఘోరాక్రందనము నుండి దూరముగపాటే ఇంద్రసభాంగణమున దేవనర్తకి మృదుమధురమంజులరాగమాలికపై నిజాత్మలదేలింప ననిమిషులాతురపడు టెఱుగమా? ఆత్మ కనంతమైనహాయి నొసగునది శబ్దాడంబరము కాదని, మహానినదముకాదని, 'పటాటోపము' కాదని ఘోరవిజృంభణముకాదని, మధుమయ భావబంధుర సౌందర్యసందీప్త శాంతివిలసిత లలిత పదమని ప్రకృతియును, దాని ప్రబోధమందిన జీవులును మనకుబోధపఱచుచుండుట లేదా? ఆహా! ఎల్లకడల జేరు శకుంతసంగీత మెంత మహత్తరమైనదో! భావించిన కొలది నాహృదయమున నానంద మహోదధు లుప్పొంగదొడగినవి. ఆకసమునకు వసుమతిని లగించు బంగారు తీవలవలె తోచు ప్రభాతమరీచులను, రేలందు స్వర్గమర్త్యములను గలుపు వెండిదారముల లీలగానంబడు జాబిలి వెలుగురేకలను విలోకించి దివ్యసంయోగమున నవికావించు కర్తవ్యమును ప్రస్తుతింతుముగదా ! వ్యక్తీకరణము వేఱువేఱుల జూపట్టిననేమి, కిరణాలును, పాట నుండి వెడలు రాగమాలికయును ఒకేయుద్దేశము నొకే హృదయమును గలవియే! స్వరమాలకును, మరీచికా గుచ్ఛమునకును పొరపొచ్చెము లుండవని తెలుపువారెవరు? మయూఖమునధిష్ఠించి అనంతావకాశమున పయనముచేసి, అనంతజ్ఞాన భాండారమైన భాస్కర హృది జేరుటెట్లో, మధురగీతికాసూత్రము నారోహించి రమ్య దివ్యోద్యానము జేరి, అందలి యానంద హృదమున గ్రుంకులిడుటయు నట్లే! ఈ యద్భుతశక్తులను జగదీశుడు మనుష్యమానసమున కొసగినాడు. వెలుగునకై 'గాయత్రి' జపించినపుడు, రసస్రవంతులందు గ్రుంకులిడదపించినపుడు పరిణతినంది చిత్తమీశక్తులను సార్థకము గావించుకొనును.

శాఖాతల్పమున శరీరమును వీడి పికగీతికతో చిత్తమును పుత్తెంచి విశ్వసంచారము చేయసాగితిని.

ఆత్మపరీక్షకు, మనన నిదిధ్యాసములకు, భావనావీథుల నెగయుటకు, అవి చలితపరిశీలనము నలవఱుచుకొనుటకు, ఏకాగ్రదృష్టి నభ్యసించుటకు, మౌనమందలి, యోచనమందలి, శాంతమందలి, ఆనందమందలి ఉదాత్తభావములను గ్రహించుటకు, భూమినుండియే యన్యగోళములను పరిశీలించి అన్యగోళవాసులతో ప్రసంగించుటకు, మనుష్యజీవన ముదరపోషణమును వ్యర్థాకాలక్షేపమును మాత్రమేకాక ఒకేరీతిగమనికతో నొకే తెఱగుక్రియతో నొకేచొప్పుచప్పుడుతో చలించు జంత్రముకాక ప్రాణప్రదీప్తమై, ఆత్మసందీప్తమై బహువిధానుభవముల పటుత్వమహత్త్వముల నంది ఈశ్వరప్రజ్ఞకు ప్రతిచిత్రము కాజాలునని గుర్తించుటకు యామినీశైలవన నిస్తబ్ధతల సమావేశమును, దీనిబోలు భావవిశిష్ట సంఘటనసమయ సమావేశములను జగదీశుడు సిర్దిష్టమొనరించుచుండును.

కొంతసమయము కడచినది. చెట్టుమొదలునుండి వికృతమైన కూతయొకటి వినవచ్చినది. మండూకమొకటి దురంతయాతనమున పొలుగుచున్న ట్లాకూతవలన గ్రహించితిని. పాప మది ఏదేనిపాము నోట బడినదేమో! అచ్చోటునుండి చెట్టుపైచేరుట మంచిపనియైన దనుకొంటిని. ఈశ్వరేచ్ఛ ఎంతయద్భుతమైనదో! కోటి రక్కసులవలె జుట్టును ఘోరారిష్టములు పొంచియున్నను, జగదీశునానసంపక నెద్దియు మీదలంఘింపదు కదా! కొండొకసమయమున, నొకానొకస్థలమున విపత్తు

విజృంభించునని ముందేయెఱిఁగి ఏదేనిమానసికప్రేరణమున నాతఁడు మానవుని దూరముగ దొలగించును.

చెంతనుండి చెవిఁజొచ్చి, హృదయకుంజమందలి ఆత్మను సోకిన కోకిలకూజిత మెట్టిదో, అంతరంగమున నది ధారవోయుహాయి యెట్టిదో ఎఱుంగజాలితిని. పిల్ల తెమ్మెరమూ పెక్కు దూరమునుండి అల్లనల్లన నరుదెంచు మనోమోహన మంజులనాద మేదేని చేరునేమో యని ఆశపడి వీనులొగ్గితిని. భావశక్తిమీఁది విశ్వాసము సడలకున్న, నెట్టి మనోరథమైన క్రియారూపమున సాక్షాత్కరించును. వాంఛ పూర్ణముకానియెడల, నందుండ వలయుశక్తికి కొఱఁత గలిగెనని రూఢిచేయవచ్చును. పుష్పించుట కిచ్ఛకు సమయము పట్టినబట్టవచ్చును. ఇచ్ఛాశక్తికి సహనశక్తి నెచ్చెలియైనపుడు, ఉత్తుంగశిఖరములుపోలు ఉద్దేశములు కూడ తలలొగ్గి మన పాలఁబడును. ఈయంశమిటులుండ నట్టి యీప్సితము ఫలించుట కనుకూలమైనది కదా ఆ వేళ! దిక్కులం జుంబించు వటవృక్షశాఖల నుండి, బుడుతల బుడిబుడినునువులట్టులు వెడలు లేతయాకులవలె నిస్తబ్ధనిశీథిని యంగప్రత్యంగములనుండి కలస్వనము లుదయించుటందు అక్కజమేమున్నది? హృదయమందలికాంక్ష సుదూరవనస్పతియందు వసించు గొండొక శకుంతహృదిని తట్టి దానిని మేల్కొలిపినదేమో! కోకిలకాకలీకలరవము తోడన జెవిసోకినవి. అందలి మధురభావకణములు మనసును నిండించునని ఆశపడితిని. కాని, ఇంచుకచవిజూపి, ధ్వనివలె ననంతభావమును సూచించు కావ్యకర్తవలె అది యూరకొనెను. హిల్లోలతరంగములం దామ్రమదగీతి మునుంగుచు దేలుచుండనోపు! అవ్యక్తమధురమైన కలకలస్వనమై యది కర్ణగోచరమగుటకు కారణము కరువలికెరటాల తాఁకుడుకాక మఱేది? అంతరంగమున నది వీడిచనిన భావమునుండి వెలసినంత ఆనందామృతమును పిండుకొని జుఱ్ఱుచుండ, దేవదేవు నూఁగాడించు పాలవెల్లి కెరటమట్లు పరమాత్మ నాత్మహృదినిడికొనిన వంశీరవమొండు కర్ణపుటముల బ్రవేశించినది. నలుదిశల బరిశీలించితిని. కారుచీకటితెర ఇంచుక తొలగినట్లు తోచినది. నా కెవ్వరును కానుపించలేదు.

నాటికి తనపని ముగియవచ్చినదని కాబోలు విభావరీభామిని అల్లననభమునుండి దిగజార నుంకించుచున్నది. తూరుపున గగనగళమున మిగులతేజోవంతమైన శమంతకమణి వ్రేలుచున్నట్లు పొడగట్టెను. శుక్రతార! ఆంగ్లసాహితీవియత్తలమున ప్రభాతనక్షత్ర (Morning star)మనిఛాసరు నుద్దేశించి టెన్నిసన్ పలికిన దీచుక్కను స్మరించిరే! ఈచుక్క వెలుఁగును కబళించిన చక్రవాకములు స్పెన్సరు, మార్లో, షేక్స్పియరు, బెన్ జాన్సన్ ప్రభృతులు. ప్రతిభకు జోహారను కళోపాసకు లాత్మప్రతిభను గుర్తించి భావభాస్వన్మరీచికలచే సాహితీవసుమతిని దనుపుదురు కదా! ఉదయశోభ సమీపమందే యున్నదని శుక్రతార తెలిపినంతన సంతసించితిని.

గడియ గడచెను. నొసలున కుంకుమ దిద్ది ఎవ్వరో దిగ్వలయభిత్తిక వెన్కనుండి తొంగిచూచుచున్నట్లు తోచినది. అనూరుడో అగ్నిహోత్రుడో! పిలుపునందుటచే కాబోలు నిక నాలసింప నిచ్చగింపక నిశి కడచుచున్నది. పులకించియు, నడలించియు నాడు నా కది కఱపిన పాఠములు నామనసున చిరాంకితములై యున్నవి. ఇట్టి పాఠముల నా కేవిశ్వవిద్యాలయమును బోధించియుండలేదు. నాటి యామినీకాంత కనవరతము కృతజ్ఞుఁడనై యుందును.

తోడనే తూరుపుదెస అంతయు కందిపోయినది. పూర్వదిక్కామిని చెక్కిలిపై నెవ్వరో చఱచిరి కాబోలు! అరుణచ్ఛవి అల్లనల్లన నధికమగుచుండెను. బొగ్గుపొడిపైబడిన అగ్గి నెరసులవలె, అజాండమునలముకొనిన అంధకారముపై తునకతునకలైన మంట రాలినది! మేఘములం దెవ్వరో చలికాగుచుండ మొయిలు అంచులనుండి నెరసులు రాలియుండును. కాటుకరంగు మోము గలదని ఎవ్వరో నిశికాంతమోమున పరిహాసమునకై జేగురుపులిమి యదృశ్యులైయుందురు. ఉదయపూజకై కాబోలు ఎవ్వరో నల్లకల్వలరాశిపై నిత్యమల్లెల రాల్చుచుండనోపు. కాలపురుషుడు చీకటిప్రదుకు నుండి తప్పుకొని, తేజఃపటలమున జొరబడు జడదారివలె కావిశాటువులుదాల్చి ముందుల కరుదెంచుచుండె గాబోలు. ఇక నెంత కాల ముండువని కినిసి ఎవ్వరో శర్వరీ

రమణిసుండియలో వాడిఛురికను గ్రుచ్చుటచే రుధిర ధారలు పెల్లుబ్బుచుండెనేమో! తమోయవనికను చింపి, తేజస్వినియోర్తు జలదకుట్టిమముపైనిలిచి బ్రహ్మ గిరిచిత్రములను విలోకించుచుండెనేమో! ఇక రానున్నది హోళీపండుగయని పొంచిపొంచి కులుకును నెవ్వరో విభావరీభామపై వసంతమును చల్లుచుండిరేమో! నిరాశను తెగటార్చు శుభాశీస్సువలె సమ్మోహనమైన కెంపు తళుక్కనకు తరుశాఖలనుండి కేలు మొగిచితిని.

తూరుపుదెసనుండియే వంశీరవము వినవచ్చుచున్నది. ఆ దిక్కునందే దృష్టినిలిపియుంచితిని. బహుదూరమున నొకగొల్ల చూపట్టినాడు. తలమీదిపాగాయును, కట్టుకొన్న చిన్నిచేలమునుదక్క, వానియొడలున (అది తీవ్రమైన శీతాసమయమైనను) నికేవలువయు లేదు. నిష్ఠురమైన చలి ఆతనియెడల ప్రసన్నయై యుండెనేమో! ఇక్కట్టులందేపుట్టి, ఇక్కట్టులందే పెరుగుటచే వాని కవి మిగులగూర్చు చుట్టము లయ్యెనేమో! లేక కఠినశిలలవంటి వాని యగిష్టను లాతని పాటకు కరగి ద్రవమై గోదావరీవారిపూరమున గలిసిపోయెనేమో! ఇంచుక వలయముగ నిలిచి గొల్ల పిల్లనగ్రోవి నూదుచున్నాడు. వానిమోమున నానందదీప్తి తళ్కొత్తుచున్నది! ఆతని సమీపమున గొన్నిగోవులును, కొంతదూరమున గొఱ్ఱెలును మేయుచున్నవి. కడుసనపున గోవులు గొల్లదాపున వాలములూపుచు పచ్చిక మేయుచున్నవి. తమయొడయని పాటకు చెవులొగ్గి అందలి మాధుర్యము నవి తనివార బడయుచున్నవి. ధేనువు శాంతగుణమునకు మాఱుపేరు. కవిమానసమువలె సుందరమై శాంతిప్లావితమైన కేదారమున నరుణోదయసమయమున తోచు ఆవుల జూచినపుడు నా ఆనందమునకు మేర లేకపోయెను. మురళీధరుడైన గోపాలుడును, గోవులును నాడు తొలుత నాకు గోచరించుట నాయదృష్ట మనుకొంటిని.

గోపాలురును, గొఱ్ఱెకాపరులును, చేలకాపులును తొల్లింటినుండియు ప్రాచీప్రతీచీవసుంధరలం దాదర్శజీవులై యుండిరి. సాహితి జీవనప్రతిబింబము కావున నీ రందు(See Pastoral poetry) ఉత్కృష్టస్థానముల నాక్రమించుట గాంతుము. వాల్మీకి, కాళిదాసు, మాఘభట్టి ప్రభృతుల రచన లిందులకు తార్కాణములు. పరార్థజీవులు కావున నాచార్యు లని ముఖ్యమతములు వీరిని ప్రస్తుతించినవి. అవతారములందు తలమానిక మని మనము గోపాలుని గొలుతుముకదా! క్రైస్తవమకకర్త గొఱ్ఱెకాపరియని బైబిలు తెలుపుచుంటలేదా ? (I am the good shepherd: the good shepherd giveth his life for the sheep" vide gospel of St. john, Chapter 10. verse 11.)

పర్వత రాజ్యమునంతను మధురమయ మొనరించునది పిల్లనగ్రోలా? దాని హృదయమునుండి వెడలు సన్నని యాలాపనగా ? మంజులనినదమును బహిర్గత మొనరించు భావోద్వేగమా ? దిశాంగనలను మేలుకొలుపుపాట,— క్రోవుల, గ్రేవల, బూవుందీవెల, కనువిందొనరించు లోయల బులకిత మొనరించు మధురవము పిల్లనగ్రోవియెడందలోని చిన్నిరంధ్రముల నుండి ఎట్లు వెల్వడుచుండెనో ! అణువునగూడ ననంతభావమును కన్గొనుదుము. ఉపాధి గోపాలుని చేయిదైవపు డండలి వెదురుగొట్టము మాధుర్య మహోదధిని గ్రక్కుటం దక్కజ మేమున్నది?

పిడికిలికంటె పెద్దదికాని సుండె భావవనధి కాకరమై కావ్యకర్తల కెట్టి దృష్టాంతము చూపుచున్నదో! గోపాలహృదయ మట్లు నిర్మలమై, ప్రతిభాసమన్వితమై, మహిమోపేతమైన సుండెగల రచయిత ఆత్మభావప్రకాశ మొనరించుకొనుతఱి సుధాసింధువును సృష్టించును. "అల్పాక్షరముల నసల్పార్థరచన కల్పించుయకాదె కవివివేకంబు" అనికదా పాల్కురికి సోమనాథకవి పలికినాడు! అల్పాక్షరములం దనంతార్థమును నిండించునది దండితెలిపిన నైసర్గికప్రతిభ. ఇట్టి ప్రతిభలేని గుండె అట్టి యక్కరములకు జనయిత్రి కాజాలదు. భావజలధిగల అక్కరము పఠిత హృదయమున మఱొక భావమహార్ణవమును బుట్టించును. అక్కరమువెన్కగల ప్రతిభ దివ్యశక్తికావుననే, దివ్యశక్తియొక్క ప్రధానగుణము సృష్టికావుననే రచయిత

హృదయమునందువలె పఠితహృదయమందును సృష్టి మహత్త్వము పొసగనూపును.

ఇత్తఱి మనదృష్టి నాకర్షించునది ఆంగ్లమందలి 'Talent' అనుపదము. దీనికి నాణెమను అర్థము కలదు. వేఱొక యర్థము ఆంతరంగికప్రతిభ యనవచ్చును. బైబిలులోను, మిల్టన్ మహాకవీంద్రుని రచనలందును ఇది భావగర్భితమైన శ్లేషకు తావొసగినది. నాణె మందలి ప్రయోజనమును కనగలుడు కాని బైబిలులోని అభాగుడు దానిని భూమిలో పూడ్చిపెట్టినాడు. వానియట్లుగాక ఈశ్వరదత్తమైన ప్రతిభను విని యోగించి తీఱవలెనని తన ఇరువదిమూడవ యేటినుండి మిల్టన్ కవీంద్రుడు పొగిలినాడు. ప్రతిభాప్రయోజనమును భారతీయులు నాణెపు ప్రయోజనమునకే ఉజ్జీ జేసిరికారు. దాని నంతకంటె మిన్నగ జూచిరి ప్రతిభ "నవనవోన్మేషశాలిని" అని మన ప్రాచీను లనిరి. ఈశక్తి అక్కఱములను నిమిత్తముల గావించుకొని రచయిత హృదినుండి పఠితహృదయమున ప్రవేశించి తానే అందు పనిచేసియో, పఠిత హృదయమందలి తోడి ప్రతిభను లేపియో అం దద్భుతభావసృష్టి గావించు నని పలుకుదును. ఈప్రతిభ దివ్యగీతిక కెనయైనదని తెలుపుట నాయాశయము. సంగీత సాహిత్యములు సరస్వతి స్తనద్వయమని భారతీయు లందు రేల? వానియం దాంతరంగిక వ్యత్యాసము లేకుండుటచే గదా! వీనికాధారమైన దివ్యశక్తి యొక్కడగుటచే గదా! ఇవి ప్రతిభాసముద్భవము లగుటచే గదా! పిట్టపాట్టయు, పిల్లనగ్రోలును, సారస్వతోపాసకుని హృదయమును ఈశ్వరునకు, వంశీధరునకు, సృష్టికర్తకు నిమిత్తములు మాత్రమే! మధుర గీతిక ఎట్లెట్లు మనుష్యహృదయమున, ప్రకృతిహృది నానందసృష్టి గావించునో ఆదర్శకావ్యరచన జిజ్ఞాసువునంతరంగమున నద్భుతభావసృష్టిని గావించుననుట స్పష్టమైనదికదా!

అరుణచ్ఛటకు ఇక నచిరములో పొడుపుగొండపై పొడనూపు స్వర్ణాభతోడై పచ్చలనీను కొండసింగారమున నవతరించి, వివిధ కుసుమవిలసిత లతావితానమునుండి వెలారి నిర్మలధునీహృదయమున తళుక్కలీనుట గనులార విలోకించి, బహురాగ సందీప్త పూత వారిపూరమున నుదయస్నానమాచరించి, అందలి యనంతభావముల నాపోశన మొనరింప నువ్విళ్లూరుచుంటిని. కొమ్మమీది పిట్టజంట ఇపుడు స్పష్టముగా గోచరించినది. ఈ శకుంత మిథునము నుపలక్షించినవారు అనురాగ సందీప్తదాంపత్యమందలి మహత్త్వమెట్టిదో గ్రహింపజాలుదురు.*

* క్రౌంచదాంపత్యము వసుమతిలోని ఆదికవి వామలూరుతనయున కెంతో ఆనందము గొలిపినది. వాల్మీకి పై కన్నెంచిన కాళిదాసు మధురమిథునానురాగమును వేర్వేఱు జీవులందును గాంచి తన కృతులందు దానిని కడుం గడు చక్కగ వర్ణించినాడు.

"అర్ధోపభుక్తేన బిసేన జాయాం సంభావయామాస రథాంగనామా"
"లతావధూభ్యస్తరవోప్యవాపుః వినమ్రశాఖాభుజబంధనాని."
"మధు ద్విరేఫః కుసుమైకపాత్రే పపౌ ప్రియాం స్వామనువర్తమానః."
"దదౌ రసాత్ పంకజరేణుగంధి గజాయ గండూషజలం కరేణుః."
"శృంగేణ సంస్పర్శనిమీలితాక్షీం మృగీ మకండూయత కృష్ణసారః"

మహాకవుల రచనలయం దిట్టి దృష్టాంతము లెన్నో యున్నవి సాధుతిర్యక్కులందలి యనురాగ మహత్త్వమును సుప్రసిద్ధవంగనాటకరచయిత ద్విజేంద్రుడు మానసిచే ("మీవారు పతనమును చూడుడు") గీర్తింపజేసినాడు. రవీంద్రుడు విహంగముతో భావనావీథులం దెగసినాడు. భారతిమహాకవుల రచనలకును, ప్రకృతి కనుంగు నెచ్చెలులై మసలిన ఆంగ్లకవుల(E G poets of the romantic movement) రచనలకును అందందు పోలికలు కలవు. షెల్లీ కీట్సు వర్డ్స్‌వర్తు ప్రభృతులు పికజీవనములను చిత్రించిరి. ప్రకృతిలో నెల్లకడలందు షెల్లీకవీంద్రుడు దాంపత్య ప్రణయమును విలోకించినాడు. అతని సుమవులను పరికింపుడు:

దొరతోచుటెఱిగి పంచబంగాళమౌ దొంగమూక వలె నినుఁ డేతెంచునని గ్రహించి, కడువడిగ నిరులు కొండబిలములలోనికి పఱతెంచినవి. నిశియంతయు నేగావించిన తపము ఫలించినదోయన ముగ్గినపండువలె పొడుపుకొండపై బాలభానుడు తోచెను. దుర్గ్రాహ్యమైనపద్యము స్పష్టమైనట్లు రమ్యశైలసామ్రాజ్య మెఱుట దేజరిల్లెను! జగద్బాంధవునకు గీతికార్ఘ్యమీయ పల్లి బిల్లిగొను కాంతారశాఖల నుండి శకుంతసంతానములు రివ్వురివ్వున నెగసివచ్చినవి! పాడుచుబాడుచు నేనున్న ఉదుంబరవృక్షముమీది పిట్టజంటకూడ తూరుపుకొండ మీది కెగసిపోయెను. బృందావనవిహారిని చూచినంతన ఆనందపరవశులగు గోపికలవలె, కట్టెదుట (మేలు కాంచిన మునిమానసమట్లు) కాంతిలు కమలాప్తుని కాంచినతోడనే కుట్మలములు నగుమోమునవలై, అనురాగ సౌరభసంభరితములైన తమ హృదయములను మయూఖ బాహువుల కప్పనమొనరించెను. సరిల్లలామము అమర గీతిక నాలాపించుచు వింతతళుక్కులీనుచు కొండకొన నుండి లోయలోనికి లంఘించుచున్నది. పిల్లనగ్రోవి పాట సన్నని సలిలధారవలె తెమ్మెరలందు జాలువారు చుండెను. "ఈ సౌందర్యము, ఈ సౌరభము, ఈ మాధుర్యము, ఈ స్వర్గసామగ్రి నావి"యని మురిసిపోతిని.

---

" The fountains mingle with the river
And the rivers with the ocean,
The winds of heaven mix for ever
With a sweet emotion;
Nothing in the world is single,
All things by a law divine
In one another's being mingle."

....................................

" See the mountains kiss high heaven
And the waves clasp one another;
No sister-flower would be forgiven
If it dis-dain'd its brother:
And the sunlight clasps the earth,
And the moonbeams kiss the sea—"

"Love's Philosophy"





పెనుగొండచిత్రములు ౧. 'గగనమహలు' విజయనగరరాజుల వేసవినివాసము. ఇక్కడనుండి కొండమీదనున్న కోటలోని కొక్కసారంగ ము



౨. ఔట్. పోస్టు



౩. నల్లమందుకొట్టు



౧. గగనమహాలు సోపానములు

# ఇంత సాహసమా!

టి. సీతమ్మ

రాజ్యలక్ష్మిమీద నాకు అమితమైన ప్రేమ. ఆవిడ నొక ప్రేమదేవతగా భావిస్తూన్నానంటే గొప్పగాచెప్పకోవడంకాదు. ఆప్రేమోపాసనలో ఆవిడలో పాలుగాని, ఆస్వార్థపరత పరార్థవిముఖతలుగాని, ఆ ముంగోపముగాని కనుపించేవేకావు. ఆవిడ నిజంగా రూపసి. విద్యావతికూడా. సుఖజీవితాని కల వాటుపడ్డది. ఆరుమూడైనా, మూడారైనా సుఖమే వాంఛనీయంగా, పరమార్థంగా పెట్టుకొన్నది. 'ఋణం కృత్వా ఘృతంపిబే' త్తన్న తత్వమదలోనది. వివాహమప్పుడూ, ఆతర్వాతా కూడా ఆవిడతృప్తికోసం బోలెడు, అంటే నా యోగ్యతకు మించిన్నీ ఖర్చుచేశాను. ఏవైనా నగలునాణేలుగాని, నాజూకువస్తువులుగాని తెచ్చానని పసిపట్టితేచాలు ఆవిడను పట్టడానికి పగ్గాలుండేవికావు. సంతోషం పొంగులువారిపోయేది.

తొలిరోజులు బాగానే సుఖంగా గడచిపోయినాయి. ఆవిడ చెప్పినట్లల్లా మొగ్గుతూండడంబట్టి ఏ ఒక్కసంఘర్షణకూ కారణం లేకపోయింది. నావాం ళ్లెవరన్నా రావడంగాని, వారితో నేను హితంగా వుండడంగాని ఆవిడకు నచ్చకపోతే అల్లే వదలేవాణ్ణి. ఆవిడ స్నేహితురాంద్రనుగురించి నాకు ఆస్కారము లేకపోయినాకూడా ఆస్కారము మున్నట్లే ప్రవర్తించేవాణ్ణి. నాఆదాయానికిమించే, దర్జాగా జీవనంచేస్తూ ఉండినాము. నా జీతమండబ్బులు ఏనెలా సరిపోయినపాపాన పోలేదు. ఎల్లయ్యదగ్గర చేసినబాకీ తీర్చడానికి పుల్లయ్యదగ్గరా, పుల్లయ్యదగ్గరచేసిన బాకీతీర్చడానికి మల్లయ్యదగ్గరా అప్పలుచేస్తూ ఏదోవిధంగా జరుపుకుంటూ వచ్చాను

హఠాత్తుగా ఒకనాడు నా ఉద్యోగమూడిపోయింది. నా రాజ్యం ఈసంగతి వినీకూడా అణుమాత్రమన్నా అలుకుచూపలేదు. పైగా "ఇదో చూడండి. జరిగిపోయినసంగతిని తడుముకొంటూఉండడంలో లాభమేం గాని ఎక్కడైనా వెళ్లి ఇంకొకఉద్యోగం సంపాదించండి త్వరగా. ఊరికేకూర్చుంటే ఎలాగ?" అంటూ తొందరపెట్టడం ఆరంభించింది.

త్వరగా! నెలలకొద్దీ ఆ ఆఫీసునుంచీ ఈ ఆఫీసుకూ, ఈ ఆఫీసునుంచి, ఆ ఆఫీసుకూ తీర్థయాత్రలుచేసినాను. ఎక్కడవిన్నా నేతినేతి వాక్యాలే. ప్రాణానికి విసుగుతోచింది. నిరాశ కమ్ముకొన్నది. కాని సాయంకాలం ఇంటికి వచ్చినప్పుడు మాత్రం ఆవిసుగును, నిరాశను నా రాజ్యానికి కనబడనిచ్చేవాణ్ణికాను. తగినంతజీతం ఇవ్వడానికి ఎవరూ సమ్మతించలేదని, ముందుముందు అవకాశం కలిగినప్పుడు మంచిజీతంగల నౌకరీ యిస్తామని చెప్పారనీ

యేవో కల్పించి చెపుతూవుండేవాణ్ణి. అన్నింటికీ ఆవిడ తల ఊచేది. కాని యీ నిరుద్యోగదినాల్లోఅంతా ఎక్కడనుంచి డబ్బుతెస్తున్నానో, ఏమి అవస్థపడుతున్నానో ఒక్కనాడూ అడిగిందిలేదు. జీవితంమట్టుకు మొదటిలాగానే, మార్పులేకుండా జరిగిపోతూవుంది క్రమభంగం లేకుండా.

ఎన్నాళ్లని దొరకుతూవుంటుంది అప్పు! ఇచ్చేవాండ్లయినా ఏమని యిస్తారు! ఆయిచ్చిన స్నేహితులుకూడా నా నిరుద్యోగావస్థ దినదినమూ చూస్తూ "ఎట్లరా సుబ్రహ్మణ్యం మనబాకీ తీరుస్తాడు. గతేమిటి మన"కని తమలోతాము యోచనలు సాగిస్తూ వచ్చారు. ఎట్లాగయితేనేమి, పైసా అప్పుపుట్టడం నాకు నానాటికీ బ్రహ్మప్రళయమైంది.

ఒకరోజు సాయంకాలం ఎక్కడెక్కడో తిరిగి నే నింటికి వచ్చేటప్పటికి రాజ్యం వెక్కివెక్కి యేడుస్తూవుంది. కారణ మేమిటా అని ఆలోచిస్తే, నేను రెణ్ణెల్లుగా ఇంటిబాడుగ ఇవ్వనందున ఇల్లుగలవాడు మధ్యాహ్నం వచ్చి నానామాటలూ అనిపోయినట్లు గ్రహించాను.

'ఇంత మాత్రానికేనా యింతవ్యసనం' అంటూ ఓదార్చబోయినాను గాని—

'మీకేమండీ, మాటలు చెపుతారు! మధ్యాహ్నం వాడు వచ్చి ఏదేదో వదురుతూవుంటే నాకు తలకొట్టేసినట్లయింది. మీరేదో తృణప్రాయంగా, సమాధానాలు చెప్పవస్తారు. ఆడుమనస్సు నెందుకండీ యిట్లా బాధపెడతారు?'

పరిస్థితులను తెలియజేయడానికిది మంచి సమయ మనుకొని— ఆరంభించాను.

'చూడు, రాజ్యం. ఇదేదో జరిగిపోయిందిలే. మనపరిస్థితులలో ఇలాంటివి ఎప్పుడో ఒకప్పుడు రాకతప్ప వనుకొన్నదే. ఏమిచేస్తాం. మనగతి యిట్లయింది....'

అనేటప్పటికి నే నేదో అనరానిమాట అన్నట్టు నన్ను తీవ్రం గాచూస్తూ 'ఏమి? ఏమంటిరి?' అని బొంగురుపోయిన గొంతుతో గర్జించింది.

ఏదో మహాపరాధం చేసినట్టు నేను తల వాల్చుకొని మౌనం ధరించాను.

* * * *

'మనగతి చాలా హీనస్థితికి వచ్చింది, రాజ్యం. మన మీ యిల్లు వదలవలసియుంటుంది. బాడుగ చాలామెక్కువ. ఉద్యోగం దొరికేంతవరకూ ఏదో ఎక్కడో డబ్బుతెస్తూవుంటా ననుకో. కాని, మనం కొంచెం మట్టసంగా, జాగ్రత్తగా ఉండవలె. దమ్మిడీలుకూడా లెక్కపెట్టవలసినరోజు లివి.'

మీద దెబ్బపడిన సర్పంవలె రేగిపోయింది రాజ్యం. బాణాహతికి నిద్రించుచున్న సింహమువలె మండిపడిపోయింది. కండ్లనిప్పులు గక్కుతుంటూ

'ఏమంటారు? నన్నింకా అధోగతికి యీడవడానికి చూస్తున్నారా? దరిద్రగొట్టు

సన్యాసులవలె మనం జీవనం చేయవలెనా? నా స్నేహితురాండ్రలో నేను తలమెత్తుకొని తిరగడానికి లేకుండా చేయవలెననా మీ యుద్దేశ్యం?'

'లేదు రాజ్యం, లేదు. చీకటి కాలమే యెల్లప్పుడూ ఉంటుందా? మనకు ఇక మంచి రోజులే రావా? ఇటువంటిపరిణామం లోక సహజం గనక—'

ఆవిడకు పెదవులు వణకినాయి.

'అయితే, నేను ముందు చస్తాను.' అంటూ గబగబా బార్ల తెరచియుంచిన కిటికీవైపు నడచింది. మే మొక ఆధునికమైన మేడలో మూడవఅంతస్తున నివసిస్తూన్నాము. కొంప మునిగిపోయిందిరా బాబూ అనుకొంటూ వెంటనే పరుగెత్తుకొని వెళ్లి చెయి పట్టుకొని యివతలికి లాక్కొన్నాను.

'పిచ్చిదానా, ఇంతసాహసానికి పూనుకోవచ్చునా? నీకు తెలియదూ, నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నానో! నిన్ను సుఖపెట్టడానికి నేనెంత పాటుపడుతున్నానో నీవెరగవూ? అన్నీ తెలిసివుండిన్నీ ఇలాచేయవచ్చునా?'

అని తలనిమురుతూ అన్నాను. ఎలాగో సర్ది అప్పుడే ఇంటిబాడుగ చెల్లించివేసివచ్చినాను.

అభిమానమనేది వదలుకొని, అక్షరశః యాచనకు మొదలు పెట్టాను సంసార నిర్వహణంకోసం. నా దైన్యానికి నేను సిగ్గుపడడానికి బదులుగా నా స్నేహితులు తమకు తామే సిగ్గుపడజొచ్చారు. అప్పులరాయణ్ణయిపోతున్నాను క్రమంగా. అయినా నారాజ్యం ఆనందంగా, సుఖంగా ఉంటే చాలుననుకొని తృప్తితో ఉండేవాణ్ణి.

కాని త్రాసు సమంగా తూగడం అసాధ్యమై పోయింది. నే నెన్ని కన్నకష్టాలుపడుతూండినాకూడా అప్పుడప్పుడు సంసారనిర్వహణానికీ, ఆవిడ భోగాలకూ లోపా లేర్పడుతూనే వచ్చినాయి. ఆ లాంటిసందర్భాలు కలిగినప్పుడల్లా నా చేతకానితనానికీ, తనకు సరిగా అమర్చనందుకూ రాజ్యం నన్ను దెప్పిపొడిచేది. సంజాయిషీలాగా నేనేదైనా చెప్పబూనుకునేటప్పటికి ఆత్మహత్యా ప్రయత్నాలకు దారిచూచేది. అవన్నీ నటనలే ననీ, నన్ను బెదరించడానికేననీ నాకు బాగా తెలుసు. కాని, ఏమో, అలా అని అలక్ష్యంగా ఉండలేకపోయేవాణ్ణి. ఎప్పుడన్నా కోపంవచ్చి గంటతట్టుగా వెళ్లిపోయిందంటే, వెంటబడి సమాధానపరచి వెనుకకు పిలుచుకొనివచ్చేవాణ్ణి. ఏదైనా విషద్రావకపు సీసా చేతికి తీసుకొన్నదంటే, వెంటనే గాబరాగా దాన్ని లాక్కొని అవతల కుమ్మరించేవాణ్ణి.

రాను రాను ఇలాంటి ఆగాయిత్యాలు లెక్కమీరిపోతూవచ్చాయి. అయినా కాని ఆవిడమీద నాకు ప్రేమ తగ్గలేదు. ఉద్యోగం దొరికి మళ్లా సంపాదనలో పడ్డానంటే అన్నీ సరిపోతాయని సమాళించుకొంటూవచ్చాను.

ఓవర కొక ఉద్యోగం దొరికింది. 'హిందూ'కు స్వకీయవిలేఖరిగా చిత్తూరులో ఉండవలె. రాబడేమో తక్కువగానే ఉంటుంది. కాని ఆమాత్రమైనా వస్తూవుంటే ఎంతమేలు! బ్రహ్మానందమైంది నాకు. భావి అదృష్టాని కిది ఒకమెట్టనీ, నిరాక్షేపంగా ఇందుకు రాజ్యలక్ష్మి సమ్మతిస్తుందనీ అభిప్రాయపడ్డాను.

ఈసంతోషవార్త ఆవిడచెవిలో వేసినాను. నా ఊహలు గాలిలోనే తేలిపోయినాయి. విన్నదే తడవుగ ఆవిడ మహాఅసహ్యంగా "ఏమిటండీ, మీా కంతకంతకు మతిపోతున్నట్లున్నదే! పోయిపోయి ఆ మహాపట్టణములో ఎలా ఉంటామండీ. చూచిచూచి అడవుల్లో కాపరంచేస్తామంటారేమిారు!" అని తన అసంతృప్తిని వెల్లడించింది.

"రాజ్యం, స్వకష్టార్జితంమిాద జీవించడమంటే యేమిటో బాగా యోచించు. అటువంటి ఊళ్లల్లో మాత్రం సుఖపడవలెనంటే సుఖపడలేమా? అవకాశాలకు అక్కడమాత్ర మేంకొదవ? చేతికబ్బిన యుద్యోగాన్ని విడిచిపెట్టడం భావ్యంగా ఉంటుందా?"

"అదంతా జరిగేదికాదు. ఆ కూపమండూకవాసానికి నేను సుతరామూ ఒప్పుకోను. ఈ ఊరిలో తప్ప మరెక్కడా నేనుండలేను. నా సంతోషమే, నా ఆనందమే మిారు కోరేటట్టయితే యిక్కడే ఎక్కడయినా ఉద్యోగం సంపాదించండి. నేను మట్టుకు కక్కడికి రాను."

"అయితే యిక నీయిష్టం. నేను వెళ్లక తీరదు. ఆ ఉద్యోగం వప్పుకోకతీరదు. మొండిపట్టుపట్టక ఇందుకు సమ్మతించు. నా కోరిక మన్నించు."

ఆవిడను దగ్గరకు తీసుకొన్నాను కాని మూతివిరుపులతో, గొణగొణలతో అవతలకు తొలగిపోయింది.

"దూరంగా ఉండండి, చాలు. ఈ వైభవం చాలు. ఇక బ్రతికివుండి లాభం లేదు. నేటితో సరి, యీప్రపంచం."

ఈ మాటలు నేనొక వందమాట్లయినా వినిఉంటాను. ఆత్మహత్యాప్రయత్నానికివి నాందీశ్లోకాలు.

"మళ్లా ఆమాట లెందుకు రాజ్యం?"

"నాహత్యకు మీారే కారకు లవుతారనుకొండి. అదిమాత్రం మీాజన్మలో మరవలేరు."

ఇవీ కొత్తమాటలు కావు. వెంటనే ఆవిడ వంటయింటిలోనికి సరసరా వెళ్లి తలుపు బిగించుకొంది. అదివరకు అనుభవాన్నిబట్టి గొంతుకురివేసుకొని చావడానికి ప్రయత్నం కాబోలునని ఊహించుకొన్నాను. వంటయింటి వాకిలివద్దకు వెళ్లాను. ఇక తరవాయి — తలుపులు పగలదీయడమూ, ఆవిడ హత్యాప్రయత్నాన్ని మాన్పడమూ, 'నీ

యాసతి మీరజాలగలనా - నీవు చెప్పినట్టు చేస్తాన'ని సమాధానపరచడమూ జరుగవలసింది యథాపూర్వముగా.

కాని నేనందుకు పూనుకోలేదు. అలా చేస్తూవస్తే నేనెంత తెలివితక్కువదద్దమ్మనై పోతానో ఆలోచించాను.

వెనుదిరిగాను. 'రాజ్యం, ఇక్కడ రా ఒకమాటు' అని పిలిచాను, బదులు పలక లేదు. నాలో నేను నవ్వుకొన్నాను. 'రాజ్యం' నేను లోపల రాబోయేది లేదు. నీయిష్టం. బాగా ఆలోచించుకో' అంటూ నాగదికి నేను వెళ్లిపోయి పడుకొన్నాను. పదినిమిషాల్లో తానే రాకపోతుందా అనే ధైర్యంతో మరి ఆపూసే ఎత్తుకోలేదు. పగలంతా తిరిగితిరిగి వేసరిఉండటంవల్ల వెంటనే, నాకు తెలియకుండానే నిద్రపూనింది.

వేకువజాము అయివుండవచ్చు. నాకు మెలకువ వచ్చింది. నా రాజ్యానికోసం ప్రక్కలో తడిమిచాను. లేదు. అభిమానపడి యేమైనా హాల్లో పడుకుందేమోనని లేచి వెళ్లి అక్కడ కలయజూచాను. అక్కడా లేదు. అంతతో గాబరాపట్టుకొన్నది. వంటయింటి దగ్గరికి వెళ్లి తలుపుతట్టాను. రెండు మూడుసార్లు పిలిచాను. బదులులేదు. తలుపులు పగిలదీశాను. ఇకనేముంది? దూలానికి వ్రేలాడుతూంది. గుడ్లు కంతలనుండి ఉబికివచ్చినాయి. నిశ్చవున నిర్విణ్ణుడనయిపోయినాను.

---



ఏనుగుతో ఆడుకొనుచున్న 'సాబు'

# సాహిణము—సాహిణి

## ర్యా. వెంకటరమణయ్య

ఈ శబ్దములకు శబ్దరత్నాకరమున 'సుఱ్ఱపుశాల', 'సుఱ్ఱపువాఁడు' అని బహుజనపల్లి సీతారామాచార్యుల వారు అర్థమును నిర్వచించియున్నారు. వీరి నిర్వచనమునకు ఆధారములు పెక్కు గలవు.

ఉ:—(1) సాహిణమునకు: "నలినసంభవు సాహిణము వారువంబులు కులముసాములు మాకుఁ గువలయాక్షి" —శృంగారనైషధము.

"ఎకరాలన్ మందువా సాహిణముఁ గలభద్రేభ వాహ ప్రకరంబులన్." —మనుచరిత్రము.

2 సాహిణికి:-"సాహిణియొకండు కర్తయెదుటికిఁ గొనివచ్చె గంధవాహబంధురంబగు నొక మహాసైంధవంబు." —మనుచరిత్రము.

"అప్పుడు సాహిణీలు గదియంజని రెండుకెలంకులన్ బ్రియంబొప్పఁ జెలంగ మాగధవృందూక్తినినాదమె సేనలో...జప్పుడు మాన్పగన్ జబుకుసాదులు సుఱ్ఱముఁ బ్రస్తరింపగాఁ..." —చిత్రభారతము.

ఇంకను నిట్టిప్రయోగముల నెన్నిఁటి నేనియుఁ జూపవచ్చును; కాని ఇందుకు విరోధప్రయోగములును గాన్పించుచున్నవి. నందిమల్లయ్య ఘంట సింగయ్యలు దమ వరాహపురాణమున,

"రక్షోభయంకరులై రాజసమదగంధనాగంబు దన సాహిణమున నుండ." —వరా. 3: ౬౫.

మఱియు: "అంచెలు డించి కదలికాకుధకంత రజ్జుఘంటిక ద్రచ్చి తోత్రాంకుశహస్తులై సాహిణంబులకుఁ దెచ్చి గంధసింధురంబుల నాలానంబుల బంధించు మావుతుల యితరేతరాలాపంబులు..." —వరా. ౪: ౧౨౦.

ఇట్లే 'సాహిణి' శబ్దమునకును నర్థాంతరమును సూచించుప్రయోగములు శాసనములయందుఁ గానవచ్చెడిని.

"శ్రీమన్మహామండలేశ్వర కాకతిగణపతిదేవ మహారాజుల గజసాహిణి భాస్కరదేవని అలుండు బొల్లయ..."*

ఈ యుదాహరణములవల్ల సాహిణము, సాహిణి యనుశబ్దములకు 'గజశాల', 'గజసాది' యను నర్థమున్నట్లు తెలియుచున్నది. కన్నడభాషయందుఁగూడ 'సాహిణ' 'సాహిణి' శబ్దములు గలవు. కిట్టెలు పండితుని కర్ణాటాంగ్ల నిఘంటువునందు The act of tending and training horses; 'a groom' అనఁగా 'అశ్వశిక్ష', 'అశ్వసేవకుఁడు' అను నర్థములు వ్రాసియున్నారు. కాని అగ్గళదేవుఁడు తన చంద్రప్రభపురాణమునందు 'సాహిణ' శబ్దమును గజశాల యనునర్థమునఁ బ్రయోగించియున్నాఁడు.

"ఎందువిచారిసువొడ మీ
యందదిభం బనదొళిల్ల సాహణదొళ మి
ల్లెందరసనానెయం తాం
నిందనసుం నోడి నోడి విస్మయముత్తం" †

కావున సాహిణమునకు 1. అశ్వశాల, 2. గజశాలయనియు- సాహిణికి 1.సుఱ్ఱపువాఁడు 2. మావటీఁడు అనియు అర్థము చెప్పవలసియున్నది. 'సాహిణి'శబ్దమునకు సుఱ్ఱపువాఁడు, లేక మావటీఁడు అనునర్థము సామాన్యమైనను, 'సుఱ్ఱపుదళము పైయధికారి' 'ఏనుగ దళము పైయధికారి' యనువిశేషార్థముగూడ గలదు. అచ్యుత దేవరాయల యశ్వదళమునకు సాహిణిచిన్నప్ప యనునతఁ డధి

* S. I. I. VI. No. 633.

† చం. పు. 9: 94. మిత్రులు హెచ్. శేషయ్యంగారీపద్యమును నాదృక్పథమునకుఁ దెచ్చిరి. వారికి కృతజ్ఞుఁడను.

కారిగ నుండె, అట్లే సాహిణిమారుఁడు ప్రతాపరుద్రుని గుఱ్ఱపుదండుపై అధికారము వహించియుండెను. పైఁజే ర్కొన్న గజసాహిణి భాస్కరదేవుఁడు గణపతిదేవమహా రాజుకడ గజదళమును పాలించు ప్రభువుగ నుండెను. కావున సాహిణియన్న అశ్వాధ్యక్షుఁడు లేక గజాధ్య క్షుఁడు అను నర్థముకూడ చెప్పవలసియున్నది.

ఇవిగాక 'పట్టసాహిణి' యనుమాట యొకటి శాసనములయం దగపడుచున్నది.

"స్వస్తి సమస్తప్రశస్తిసహితం శ్రీమతుసకల
సేనాధిపతిపట్టసహింణి బొప్పయదేవండు" *

ఈ బొప్పయదేవుడు రెండుపదవులకు అధికారి: (౧) సర్వసేనాధిపతి (౨) పట్టసాహిణి. ఇట్లే సాహిణి మారుఁడును.

"పాటింపందగు నీడుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ" అని మల్లికార్జునుడు. ఇందువల్ల 'పట్ట సాహిణి' యన్న రాజుయొక్క గుఱ్ఱపువానికాని, మావ టివాఁడనికాని అర్థము చెప్పుట యుక్తముకాదని తేలు చున్నది. ఏలన, సర్వసేనాధిపతియు, రథినీపాలాగ్ర ణియు కేవలము గుఱ్ఱపువాఁడుగఁగాని మావటివాఁడుగఁ గాని యుండుట యసంభవము. అట్లయిన పట్టసాహిణికి అర్థమేమి? పూర్వకాలమున రాజులు దేశరక్షకుగా నుంచుకొను సైన్యముగాక అంగరక్షకై కొంతదండును భరించువారు. అంగరక్షకై యుంచుకొన్న దండునకు సంబంధించిన ఏనుగులు, గుఱ్ఱములును రాజుగారి నగరి కడ నుండు తబేలాలలో నుండెడివి. అట్టి యేనుగులు, లేక గుఱ్ఱములపైయధికారులు రాజుతోఁగూడఁ బోవుచు యుద్ధరంగమున నతనికి బాసటగ నిలిచి యుద్ధముసేయు వారు. వారే పట్టసాహిణు లను బిరుదును ధరించుచుండి నట్లు తోఁచుచున్నది.

ఇఁక సాహిణ, సాహిణి శబ్దముల వ్యుత్పత్తిని గూర్చి కొంత విచారించవలసియున్నది. ఈ శబ్దముల యుత్పత్తి క్రమము కొంతవరకు శాసనములవల్లఁ దెలియు చున్నది. గణపేశ్వరపు శాసనమునందు జాయసేనాపతిని గూర్చి ఇట్లు వ్రాయఁబడియున్నది.

"తతః ప్రసన్న శ్చరిత్రై ర్మ దాస్మై
ప్రాదాత్తి తీక్ష్ణఖలు జాయనాయ,
ఆందోలికాచ్ఛత్రసనాథదిస్మై
స్సేనాధిపత్యం గజసాధనిత్వం" †

ఈ విషయము జాయసేనానిచే విరచితమైన నృత్తరత్నావళియందుఁ గూడ జెప్పఁబడియున్నది.

"ఇతి శ్రీమన్మహారాజాధిరాజగణపతిదేవ
గజసాధనిక జాయసేనాపతి విరచితాయాం
నృత్తరత్నావళ్యాం"

ఇందువల్ల జాయనయు బొల్లయ, మారులవలె సేనాధిపత్యమును గజసాధనికత్వమును వహించియుండె ననుట తెల్లము- 'సాధనిక' యను సంస్కృత పదము ప్రాకృతమున సాహణిక యని రూపాంతరముఁబొందెను. 'క' ప్రత్యయము లోపించఁగా సాహణి యాయెను. 'సాహణి'యే కన్నడ ప్రయోగములయందుఁ గానవచ్చు చున్నది. ఇది తెలుఁగునందు సాహిణియన్న రూపమును వహించెను.

సాహిణమనఁగా మొదట గజాశ్వాది జంతువులను సాధనికులు సాధించు,అనగా శిక్షించు స్థలము. కాలక్రమ మున నది యాజంతువులను గట్టియుండు స్థలమునకుఁ జేరయ్యెను.

---

* S. S. I. V. No 205.

† E. I. iii P. 88.

# గౌరీశంకర శిఖరారోహణము

చక్రవర్తి

అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః,
పూర్వాపరౌ వారిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదండః.

(కుమారసంభవము)

హిమాలయ పర్వతములు తూర్పుపడమటి సముద్రములను జొచ్చి, హిందూదేశమున కుత్తరమున నున్న వని ప్రాచీనులమతము. హిందూదేశమునకు పశ్చిమోత్తరపు దిక్కున కాస్పియన్ సముద్రమునుండి తూర్పున బంగాళాఖాతమువరకును ఒకే పర్వతపంక్తి, మధ్య మధ్య పల్లములతో వ్యాపించియున్నమాట నిజమే కాని, ఆపర్వతపంక్తి కంతకును హిమాలయము లని యిప్పుడు వ్యావహారిక నామము లేదు. సింధు, బ్రహ్మపుత్రానదుల మధ్యనున్నవానినే హిమాలయము లని యిప్పుడు వాడుచున్నారు. ఈ పర్వతపంక్తి పొడవు ౧౬౦౦ మైళ్లు; వెడల్పు ౨౦౦ మైళ్లకు మించి లేదు. ఇవి హిందూదేశమునకును మధ్య ఆసియాకును మధ్య నున్నవి. అరుణ, సట్లెజ్ నదులు హిమాలయపర్వతములలో కనుమలనేర్పరచుచు ప్రవహించుచున్నవి. అందువలన హిమాలయ పర్వతములు మూడుభాగములైనవి. ౨౯౧౪౧ అడుగులయెత్తు గలిగి ప్రపంచములోని పర్వతశిఖరము లన్నిటికన్న యెత్తయిన యెవరెస్టుశిఖరము మధ్యహిమాలయ పర్వతములలో మధ్యనున్నది.

ఎవరెస్టు శిఖరమునకు మొదట గౌరీశంకరశిఖరమని పేరు. శివుడు పార్వతితో యీ శిఖరమున వాసము చేయునని భారతీయులనమ్మిక. మొట్టమొదట గౌరీశంకరశిఖరపు ఎత్తును, గణితశాస్త్రప్రకారము నిర్ణయించినవాడు సర్ జార్జిఎవరెస్టు. ప్రపంచములోని పర్వతశిఖరము లన్నిటిలో ఇదియే ఉన్నతమైనదని అప్పుడు తేలినది. అప్పటినుండియు ఈ శిఖరమును అతనిపేరటనే ఎవరెస్టు శిఖరమని వాడుచున్నారు. ఎవరెస్టుశిఖరపు సరియగుస్థితియును, ఎత్తును నిర్ణయించుటకు ఉత్తరహిందూస్థానమందలి దేవగంజ్ అను ప్రదేశము అనుకూలముగా నుండును.

ఈ పర్వతము లన్నియు మంచు మయములు. వీనిపై కొన్నిప్రాంతములలో మంచుదిబ్బలు హఠాత్తుగ నెదురుగడల ప్రమాణము ఎదుగును. ఒక్కొకచోట ఉన్నట్లుండి పెద్దగుంటలు యేర్పడుచుండును. నూరేసి ఘనపుటడుగుల పరిమాణముకల మంచుగడ్డలు శిఖరములనుండి విరిగిపడుచుండును.

హిమానీనదములు అను పేరుగల మంచుగడ్డలనదులు (Glaciers) మెల్లగా ప్రవహించుచుండును. ఇవి



కబ్రూహిమానీ ప్రస్తరము మీదనుండి కనిపించు పాండిం శిఖరము

పర్వతాగ్రభాగములనుండి క్రిందకు మైళ్లకొలది పొడుగున నుండు మంచుగడ్డలు. పర్వతములమీది చిన్నచిన్న మంచు

ముక్కలన్నియు కలిసికొని ఒకే పెద్దమంచురాయివలె తయారగును. ఇది మెల్లగా క్రిందికి జరుగుచుండును. ఆ వేగము దినమునకు సుమారు ముప్పది అంగుళములు మాత్రమే. ఈ హిమానీనదపుమంచు ఒక్కఘనపుగజము సుమారు ౨౬౦ పౌనుల బరువుండును.

హిమాలయపర్వతముల కుత్తరపువైపున టిబెట్ పీఠభూమియును, దక్షిణపువైపున నేపాలు నున్నవి. ఈ దేశములలోనికి పాశ్చాత్యదేశములవారిని ఒక పట్టున రానివ్వరు. ఎవరెస్టుశిఖరమును ఎక్కుటకు అనుకూల మగుమార్గము టిబెట్ దేశమునుండి యున్నది. కాని పాశ్చాత్యులు మాటిమాటికి తమదేశములోనికి వచ్చుచు పోవుచునుండుటవలన వారిదేశపు గుట్టుమట్టు లన్నియు బయటపడు ననియు, వారి ఆచారములు మతము ధ్వంస మగుననియు టిబెట్ దేశీయులభయము. అందుచేత పాశ్చాత్యులు టిబెట్‌లోనికి వచ్చుటకు ఆదేశీయులు ఒప్పుకొనరు. వీ రందరును బౌద్ధమతస్థులు. టిబెట్ దేశములో ఎక్కడచూచినను బౌద్ధవిహారములు మెండు. ఇది ప్రపంచమున కంతకును యెత్తయిన పీఠభూమి. దీని ముఖ్యపట్టణము లాసా. చలియెక్కువగా నుండుటవలన యీదేశస్థులు యెన్నో దినముల కొకసారిగాని స్నానము చేయరు. వీరు నిదానస్థులు, నిష్కపటులు, బెట్టుసరిమనుష్యులు, సంగీతప్రియులు, స్వేచ్ఛావిహారులు, అతిథిపూజాతత్పరులు. వీరు వొకరినొకరు కలిసికొనినపుడు నాలుకను బయటపెట్టి కుడిచెవిని రెండుసార్లు గోకికొనెదరు. అది అన్యోన్య నమస్కారమునకు గుర్తు. వీరి పాలకుడు దలైలామా. టిబెట్ చైనాకు సామంతరాజ్యము.

పర్వతములలోని బండలక్రిందను, గనులయందును భూతపిశాచములు నివసించుచుండు ననియు, వానిని త్రవ్వినయెడల ఆభూతపిశాచములు బయట పడు ననియు వీరినమ్మకము. గనులను త్రవ్వు ఇంజనీర్లనిన వీరికి అమితద్వేషము. అందువలననే రాయల్ జ్యోగ్రాఫిక్ సొసైటీవారు ఎవరెస్టు శిఖరమును ఎక్కుటకు అనుమతి కోరగా వీరు ఒకపట్టున అనుమతించలేదు. అంతేకాక, యీపర్వతములయందు దేవతలు నివాస మున్నా రనియు, మనుష్యులు మాటిమాటికి అచ్చటికి వచ్చుచున్నయెడల వా రాగ్రహించి, అతివృష్టి, అనావృష్టి మొదలగు యీతిబాధలు కలిగించెద రనియును టిబెట్ దేశీయుల నమ్మకము. పాశ్చాత్య సభ్యత యనిన వీరి కసలే కిట్టదు. పాశ్చాత్యులు కాలుపెట్టినచోట వీరి నాగరికత ధ్వంస మైపోయిన దని టిబెట్ వెళ్లిన పాశ్చాత్యులే చెప్పుచున్నారు. ౧౯౨౨లో ఎవరెస్టుశిఖరమును ఎక్కుటకు వెళ్లిన సంఘములో సభ్యుడగు జి. ఇంగిల్ ఫించ్ ఇట్లు వ్రాసినాడు: "ఐరోపీయుని దృష్టిలో టిబెట్ దేశీయు లొక గొప్ప లోపమును కలిగియున్నారు. అది క్షమార్హము. అది వారు చాల అపరిశుభ్రముగా నుండుటయే. వారు స్నానముచేయరు. టిబెట్ దేశములోని ఒక గొప్ప కుటుంబమునకు చెందిన ఒక పెద్దమనుష్యుడు తన జన్మదినమునాడును, తన వివాహమునాడును మాత్రము, అనగా- తనజీవితములో రెండేమారులు స్నానముచేసితినని యెంతో గర్వముతో చెప్పినాడు. టిబెట్టులో మనుష్యులు స్నానముచేయుట నేను ఒక్కసారి చూచితిని. చెరువుగట్టున జనులు గుంపులుగా కూడి చూచుచుండిరి. చెరువులో నొకపిల్లవాడు స్నానముచేయుచుండెను. నే నడుగగా, వాడా వూరి అల్లరిపిల్లకాయ అనియు, అట్టివే వాడలు తెలియని చెడుపనులను యెప్పుడును చేయుచుండుననియు నా కచటివారు చెప్పిరి. ఒక టిబెట్‌గురువు మానాయకుడగు జనరల్ బ్రూస్‌ను ఇంతడబ్బు ఖర్చుపెట్టి అమితశ్రమపడి, మీరు కేవలము యీపర్వతాగ్రమున నిలుచుండగోరుట యెందుకు?' అని అడిగెను. అందుకు బ్రూస్ 'అవును. ఎవరెస్టుశిఖరము స్వర్గమునందున్న భగవంతునికి దగ్గరగా నున్నదికాదా? ఆశిఖరముమీద కెక్కినచో, భగవంతునికి చాలసమీపమునకు వెళ్లినవార మగుదుముకాదా?' అని జవాబుచెప్పెను. ఆమాటవినిన ఆబౌద్ధగురువు తనచేతనైనంత సహాయమును మాకు చేసినాడు."

టిబెట్ దేశమున చమరీమృగములు యెక్కువ. వీనిని మనము జడబర్రెలందుము. వీనిశరీరముపై దీర్ఘముగా పెరుగు జడలు కంబళ్లు, తివాసీలు మొదలగువానిని నేయుటకు ఉపయోగింతురు. విగ్రహములకు విసరుటకు

దేవాలయములయందుంచెడి చామరములు యీజడలతో చేసినవే. టిబెట్ దేశీయులకు యీ జడబఱ్ఱెలవలని ఉపయోగము యింతింతయని చెప్పవీలులేదు. ఇవి చాల ఓర్పుగల జంతువులు. కాని, విసువును పొంది నప్పుడుమాత్రము యివి యెవరికిని లొంగవు. ఎడారులలో ఒంటెవలన ఎంత ఉపయోగమో, జడబఱ్ఱెవలన టిబెట్ పీఠభూమియందంత ఉపయోగము కలదు. బరువులను మోయుటకు వీనిని యెక్కువగా ఉపయోగింతురు. నడిచినంతసేపును యివి ఓరిమితో నడచును కాని, తొందరపెట్టి కొట్టినచో సామానులను పారవేసి, మొండికి వేయును. దారిని పోవునప్పుడు తమనుతోలువాడు చక్కగా యీలవేయుచున్నచో యివి చాలసంతోషించును. ఒకేసారి పది,పన్నెండు గంటలవరకును యివి ప్రయాణమును నిలుపకుండ నడువగలవు. నదులను చక్కగా దాటగలశక్తి వీటి కున్నది.

ఈ ఎవరెస్టు పర్వతమును ఎక్కుటకు మానవుడు చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థమైనవి. అచ్చట నేమున్నదియు, అచ్చట నివసించుటకు మానవునకు యేయేపరికరములు కావలసినదియు తెలుసుకొనుటకు ఎంతోమంది సంఘములుగాకూడి ఎన్నిసార్లో ఎవరెస్టు శిఖరమునుయెక్క ప్రయత్నించిరి. కాని వారిప్రయత్నములన్నియును విఫలములైనవి. ఎంతోమంది ప్రాణములను కోల్పోయిరి. అయినను యింకను చాలమంది ప్రయత్నములను చేయుచున్నారు. ప్రపంచములోని పర్వతశిఖరములలోనెల్ల యెత్తయినదగు ఎవరెస్టు నెక్కిన కీర్తిని పొందుటకు పర్వతారోహణమునందు అభిరుచిగల వారందరును ప్రయత్నించుచున్నారు. అట్టి సాహసవంతునికి సంతోషముతో జేజేలుకొట్టుటకు ప్రపంచము ఎదురుచూచుచున్నది.

కాని, ఎవరెస్టు శిఖరమును ఎక్కుట యనిన సాధారణముగాదు. విమానమునెక్కి, సముద్రమట్టముపైన ౨౯౦౦౨ అడుగులయెత్తు యెగురుట గొప్పవిశేషము కాదు కాని, అదేఎత్తుగల భూప్రదేశమునకు ఎక్కుట చాలకష్టము. దానికి కారణములును చాలగలవు.

మొదటిది గాలితగ్గుదల. సముద్రమట్టముపైకి పోయినకొలది, గాలిసాంద్రత తగ్గుచుండును. ౧౨౦౦౦ అడుగులకు పైయెత్తునయున్నగాలిలో మానవుడు పీల్చుటకు తగినంత ప్రాణవాయువులేదు. సామాన్యమానవుడు పీల్చుటకే ఆగాలిసాంద్రత చాలదు. అనగా సముద్రమట్టమువిూద గాలిసాంద్రతలో అది మూడవవంతు ఉండును. ఎత్తునకు ఎక్కుటలో శరీరమునకు గల్గు శ్రమకు తగినంత ప్రాణవాయువును ఆగాలిలోనుండి పీల్చవలయు ననిన మానవుని ఊపిరితిత్తులలో తగిన సామర్థ్య మండవలెను. ౨౦౦౦౦ అడుగుల ఎత్తునకు పోవుసరికి ప్రతిసారియును ఆయాసపడుచు గట్టిగా ఊపిరి పీల్చినగాని మానవు డచ్చట నిముసమైనను నిలువలేడు. అందువలన ప్రాణవాయువును కృత్రిమోపాయములవలన కల్పించి అచ్చట ఉపయోగింపవలెను. ఈ పర్వతములను ఎక్కువారు ప్రాణవాయువును గొట్టముల (Cylinders)లోనింపి తీసికొనిపోవుదురు.

రెండవకష్టము కొండజబ్బు. ౧౫౦౦౦ అడుగులకు ఎక్కుసరికే సామాన్యముగ కొండజబ్బు ఆరంభించును. దానికి రెట్టింపు యెత్తుగల ఎవరెస్టు శిఖరమును ఎక్కునపుడు కొండజబ్బునుగూర్చి భయపడవలసిన ఆగత్యముకలదు. మంచి ఆరోగ్యవంతుడే ఈపనికి పూనుకొనవలయును.

మూడవబాధ మంచు. దట్టముగా మంచుపట్టి దారి సరిగా కనుపడకపోవుట, మంచుగడ్డలమీదవేసిన కాళ్లు జారిపడుట. మొదలగు అపాయములు ఎక్కువ. మానవుని శరీరములోనున్న వేడిమినంతను పరిసరశీతలత్వము హరించివేయును. అన్నివేళలయందును ఉన్నితోను, తోళ్లతోను చేసిన దుస్తులను శరీరమునకు బిగువుగాను, దట్టముగాను ధరింపవలయును. ఇదివరకు హిమాలయపర్వతమును యెక్కుటకు ప్రయత్నముచేసినవారు అచ్చటి మంచు ౩౫౦ డిగ్రీ లున్నదని కొలిచిరి. ఆ మంచులోనికి పోయి, నీలిగి, కొయ్యబారి ప్రాణాపాయముతో బయటపడిరి. కావున మంచుబాధనుండి తప్పించుకొనుటలో చాల జాగ్రత్త వహింపవలయును.

నాల్గవకష్టము భోజనము. సముద్రమట్టముకన్న ఎత్తునకు పోనుపోను గాలి తగ్గుటవలన, మనుష్యుడు జీర్ణించుకొనగల ఆహారపరిమాణము తగ్గును. సాధారణ పరిస్థితులలో మానవుడు భుజించు ఆహారమును అంత ఎత్తున తిననీలులేదు. అది జీర్ణ ముకాదు. అయితే,ఆహార పరిమాణము తగ్గినను, దానిలోని జీవశక్తిమాత్రము అంత కన్న ఎక్కువ కావలయును. అట్టి పరిమాణములో తక్కువై, పుష్టిని కలిగించుటలో శ్రేష్ఠమైన ఆహారమును సేకరించుకొనుటకు అమితధనము వ్యయమగును. ఆహార పదార్థములను తీసికొనిపోవునపుడు, అనుకొనిన కాలము నకు రెట్టింపుకాలమునకగు పదార్థములను తీసికొని పోవలెను. ఏవస్తువు అయిపోయినను ఆ దేశమున దొరకదు.

పొగుగూరికి పూట, ముల్లె లేకుండ పోవుటకే తెల్లనిరూపాయి సార్చవలసిన యీ రోజులలో హిమాలయపర్వతములపైకి యాత్రకు ఇంత అంత ధనము చాలదు. అనమము ౪౦౦౦౦ పౌను లైనను కావలెను.

జయించినను ఓడినను నిరుత్సాహమును పొందక దృఢసంకల్పముతో ముందడుగువేయువాడే హిమాలయ పర్వతము నెక్కుటకు అర్హుడు.

పైన జెప్పిన వన్నియు సమకూడిన తరువాత కష్టతరమగు ఆటంకము మరొకటిగలదు. అది టిబెట్ ప్రభుత్వమువారి అనుమతి అది దొరకుటతో ప్రయాణము నిష్కంటకము.

హిమాలయపర్వతమును యెక్కుటకు సభ్యులను యేరుకొనుటలో, ఆసంఘము చాలా జాగ్రత్తగాపని చేసి అన్నివిధములను తగినవారినే యేరుకొనవలయును.

మంచి కాయపుష్టి గలవాడును కష్టపరంపర నెదుర్కొనగలవాడును, గాలి పీల్చునపుడు ఎక్కువ సేపు ఎక్కువ గాలిని లోపలికి పీల్చుకొని, ఎక్కువ సేపటికి వదలిపెట్టగల పెద్ద వూపిరితిత్తులు గలవాడును, పొడవుగా సన్నముగా నుండువాడును తగినవాడని చాల పర్వతములను యెక్కినవారి అభిప్రాయము.

ఎవరెస్టు శిఖరమును యెక్కువారు తమ అనుచరులగు కొండజాతులవారితో కలమెలసియుండుట నేర్చుకొనవలయును. లేనియెడల వారు నిమిషములో ఎదురుతిరుగుదురు.

ఎవరెస్టును ఎక్కుటకు ప్రయత్నించువాడు అదివరకు యెన్నో పర్వతములను యెక్కి మంచిఅనుభవమును సంపాదించినవాడై యుండవలయును.

సుమారు ఎనుబదియైదు సంవత్సరములనుండియు పర్వతారోహకులు ఎవరెస్టును ఎక్కవలయు నని చూచుచున్నారు. వారిలో ప్రారంభదశలో కామెట్ శిఖరములలో నొకటగు ఈస్టరన్ ఇబిగామిన్ అను ౨౧౩౨౯ అడుగుల యెత్తుగల శిఖరమును యెక్కిన స్లాజిన్ వీట్ సోదరులును, ౨౨౦౪౦ అడుగులు ఎక్కిన ఐ. ఎస్. పోకాక్ అను హిందూదేశపు సర్వే అధికారియును ముఖ్యులు.

౧౮౪౯ సంవత్సరములో జోసెఫ్ హూకర్ కాంచనగంగ పర్వత ప్రదేశములను చొచ్చి, ౨౮౧౫౦ అ. ఎత్తుగల కాంగ్ చెంజాను, ౨౩౧౮౦ అ. ఎత్తుగల పహునేరిని ఎక్కుటకు ప్రయత్నించెను.

హిందూదేశపు సర్వేశాఖకు చెందిన శాస్త్రజ్ఞులు కూడ హిమాలయ పర్వతము నెక్కుటకు ప్రయత్నించిరి. వారిలో ౨౦౨౦౦ అ. ఎత్తునకు ఎక్కి, జాన్ సాంగ్ లానుదాటిన శరత్ చంద్రదాసు ముఖ్యుడు.

తరువాత, ౧౮౯౨ లో సర్ మార్టిన్ కాన్వే, కారకోరం పర్వతములలో, ముఖ్యముగా బోల్టోరో హిమానీనదప్రాంతములలో సంచరించి ౨౩౦౦౦ అడుగుల ఎత్తుగల శిఖరమును ఎక్కెను. ఈకారకోరం పర్వతములలోనే సంచరించి సర్ ఫ్రాన్సిసుయంగ్ హస్బెండు కారకోరంకనుమను కనిపెట్టెను. (డ్యూక్ ఆఫ్ అబ్రూజీ) బైడ్ శిఖరముమీద ౨౫౦౦౦ అడుగుల ఎత్తువరకును ఎక్కెను.

నంగపర్వతమును ఎక్కుటకు ఎ. ఎఫ్. మమ్మరీ ప్రొఫెసరు ఎన్. కాలీ, బ్రిగేడియర్ జనరల్, సి. జి. బ్రూస్ లు చాలప్రయత్నములను చేసిరి. కడపటిసారి మమ్మరీ, అతని గూర్ఖా అనుచరు లిద్దరు చనిపోయిరి.

౧౮౯౯ లో డి. డబ్లియు ఫ్రెష్‌ఫీల్డు కాంచన పర్వత ప్రదేశ మంతయును సంచరించి, ముఖ్యములగు ప్రాంతములను కనుగొనెను.

ఇరువదియవ శతాబ్దారంభముతో పర్వతారోహణమున నూతనశకారంభమైనది.

బ్రిగేడియర్ జనరల్ బ్రూస్, గూర్ఖాలను, షెర్పాలను, భోటియాలను, పర్వతము నెక్కుటయందును, సామానులను పర్వతములపైకి మోయుటయందును తగినశిక్షణ నిచ్చి సమర్థులను తయారుజేసెను.

డబ్లియు. డబ్లియు గ్రాహం, తనస్విస్ దేశపు అనుచరులతో ఎన్నో శిఖరములను ఎక్కెను. వానిలో కబ్రు అను ౨౪,౦౦౦ అ. ఎత్తుగల శిఖరమొకటి. నార్వే దేశీయులగు రూబిన్‌స్టన్, మాన్రాడ్ ఆస్ అనువారిరువురు కబ్రు పర్వతమును ఎక్కుటకు శిఖరమునకు కొద్ది అడుగులుమాత్రము తక్కువగా ఎక్కిరి.

౧౯౨౧ లో, హిమాలయ శిఖరమును ఎక్కు ప్రయత్నమున మరణించిన డాక్టరు ఏ. ఆర్. కెల్లాస్ అనుప్రసిద్ధుడు కాంగ్, బెంజా, పహునేరి భోమియోమో అనుపర్వతములను ఎక్కెను. అంతేకాక, మధ్యహిమాలయములలో చాలయాత్రలనుచేసి, ౧౯౨౦ లో కర్నల్ హెచ్ టి. మార్షెడ్‌తో కలసి కామెట్ శిఖరము మీద ౨౩,౫౦౦ అ. ఎత్తువకు ఎక్కెను.

౧౯౦౭ సంవత్సరములో బ్రిగేడియర్ జనరల్ బ్రూస్, డాక్టరు టి జి. లాంగ్‌స్టాఫ్ ఏ ఎల్. మం, ల సహాయంతో గార్వాల్ నుండి హిమాలయములలోని ప్రాంతములను బాగుగాకనుగొనిరి. ఆతరువాత ఎలెక్సిస్ అనునతడు హెన్రి బ్రోషెరల్ అను స్విస్ దేశీయుని సహాయముతో త్రిశూల్ అను ౨౩,౪౦౬ అ. ఎత్తుగల శిఖరమును ఎక్కెను. అప్పటినుండియు, ౧౯౩౦ లో ౨౪,౩౪౪ అడుగుల ఎత్తుగల జాన్ సాంగ్ శిఖరమును ఎక్కువరకును మానవుడు ఎక్కగలిగిన ఎత్తయిన శిఖరము త్రిశూల్ శిఖరమే.

౧౯౧౧, ౧౯౧౨ లలో సి. ఎఫ్. మీడ్ కొద్దిమంది అనుచరులతో కామెట్ శిఖరమును ఎక్కుటకు ప్రయత్నించి, ౨౩౫౦౦ ల అడుగులయెత్తువరకు ఎక్కెను. ఈ సమయములోనే, కబ్రెన్; మారిస్; స్లింగ్స్‌బీ కూడ కామెట్‌ను ఎక్కప్రయత్నించెను.

కాంచనగంగనుయెక్కుటకు మొదటిప్రయత్నము ౧౯౦౫ లో జరిగెను. మంచుగడ్డ (avalanche) క్రిందబడి, లెఫ్టినెంటుపాషే ముగ్గురు అనుచరులతోకూడ చచ్చిపోయెను. ౧౯౨౯ లో రెండవ ప్రయత్నమునుచేసి ఇ. ఎఫ్. ఫార్మర్ అను అమెరికాదేశీయుడు చనిపోయెను. అదే సంవత్సరమున పాల్‌బోయర్ అధ్యక్షతను బవేరియాదేశీయులు కొందరు స్థిరసంకల్పముతో పనిచేసి, యీశాన్యశిఖరముమీద ౨౫,౦౦౦ అడుగుల ఎత్తువరకు ఎక్కి గాలి ప్రతికూలముగా వీచుటచే వెనుకకు మరలిరి.

తరువాత జరిగిన నాల్గవ ప్రయత్నములో నొకడును, ఐదవ ప్రయత్నములో హెచ్. షాలర్, ఒక కూలివాడును మరణించిరి.



కామెట్ శిఖరమును ఎక్కిన స్మిత్

౧౯౩౧ సంవత్సరములో ఎఫ్. ఎస్. స్మిత్ నాయకత్వమున బ్రిటిషువారు వచ్చి కామెట్‌ను ఎక్కిరి. ఇప్పటివరకును మానవుడు ఎక్కగలిగిన ఎత్తయిన పర్వతశిఖరము ఇదే.

పై వన్నియును ఎవరెస్టుశిఖరమును ఎక్కుటకు చాలవరకు ఉత్సాహమును పుట్టించుటకు కారణములైనవని చెప్పవచ్చును.

౧౯౨౧ లో లెప్టినెంటు కర్నల్; సి. క. హోవర్డు బరీ సమర్థులగువారి సహాయమున ఎవరెస్టు శిఖరమునకు అన్నివైపులను ఉన్న దారులను పూర్తిగా కనిపెట్టెను. మరుసటి సంవత్సరముననే బ్రిగేడియర్ జనరల్ సి. జి. బ్రూస్ నాయకత్వమున సంఘమొకటి ఎవరెస్టును ఎక్కుటకు వచ్చెను. కెప్టెను జి. ఐ. ఫించ్, కెప్టెను జె. జి. బ్రూస్ అనువారిద్దరు ౨౭౩౦౦ అడుగుల ఎత్తునకు ఎక్కగలిగిరి. ఆ తరువాత ఎక్కుట సాధ్యముకాదని తోచెను. ఈ ప్రయత్నములో మంచుగడ్డ ౬౦ అడుగుల పైనుండి విరిగిపడినందున ౭ గురు చనిపోయిరి.



౧౯౨౧, ౨౨, ౨౪ సంవత్సరములలో ఎవరెస్టును ఎక్కుటకు ప్రయత్నించి మరణించినవారి స్మారకచిహ్నము

౧౯౨౪ సంవత్సరమున ఇంకొక సంఘమువారు మరల ప్రయత్నమును చేసిరి. వారికి నాయకుడు సి. జి. బ్రూస్. కాని, ఆయనకు ఆరోగ్యము సరిగాలేనందున లెఫ్టినెంటు కర్నలు ఇ. ఎఫ్. నార్టను నాయకత్వమును వహించెను, నార్టనును, డాక్టరు టి. హెచ్. సామర్‌వెల్‌ను కలసి ౨౮౨౦౦ అడుగుల ఎత్తునకు ఎక్కిరి.



౧౯౨౪ లో ౨౮,౨౦౦ అ. ఎత్తునకు ఎక్కిన నార్టను. అతడు పైకి ఎక్కుచుండుట కననగును

తరువాత జి. ఎల్. మెల్లోరీ, ఏ. సి. ఇర్వైన్ అనువారు కడపటి ప్రయత్నమును చేసిరి. ఎన్. ఇ. ఓడెల్, జె. డి. వి హజార్డులువున్న ఒక ప్రత్యేకపు జట్టు వారికి సహాయభూతముగా ఉండెను. జూన్ ౬ వ తేదీన ౨౫౦౦౦ అడుగుల యెత్తున యేర్పాటుచేసిన బసను వదలి వారు ముగ్గురు కూలీలతో ౨౬,౮౦౦ అడుగుల బసకు వెళ్లిరి. జూన్ ౮ తేదీన అచ్చటినుండి పైకెక్కుటకు వారు బసను విడిచి వెళ్లిరి. అంతే. ఇంక వారు తిరిగి రాలేదు. ఏమైరో ఎవరికిని తెలియదు. జూన్ ౧౦ తేదీన ఓడెల్ మూడవసారి ౨౭,౦౦౦ అడుగుల ఎత్తువరకును వెళ్లెనుగాని మెల్లోరీ ఇర్వైన్‌ల జాడ తెలియలేదు. నార్టనుతో సంప్రతించి అప్పటికా ప్రయత్నమునుండి విరమించెను. ఈ గొడవలన్నియును చూచి



౧౯౨౪ సం. లో గౌరీశంకరశిఖరారోహణమున మరణించిన ఇర్విన్

ఎవరెస్టు శిఖరమును యెక్కుటకు కొంతకాలము వరకును అనుమతిని యివ్వనని టిబెట్ ప్రభుత్వమువారు ప్రకటించిరి.

సిక్కింలో పొలిటికల్ ఆఫీసరుగానున్న లెఫ్టినెంటు కర్నల్ జె. ఎల్. ఆర్. వీర్ ౧౯౩౩ సంవత్సరములో ఎవరెస్టును యెక్కుటకు అనుమతిని టిబెట్ ప్రభుత్వమువారిపద్దనుండి బ్రహ్మప్రయత్నము చేసి సంపాదించెను. రాయల్ జాగ్రాఫిక్ సొసైటివారును, ఆల్‌పైన్ క్లబ్‌వారును కలసి, తమ ఆధిపత్యమున ఎవరెస్టు కమిటీ అను పేరుతో ఒక సంఘమును స్థాపించిరి. ఇండియన్ సివిలు సర్వీసులో పనిచేసిన హ్యూరటెడ్జ్ దీనికి నాయకత్వమును వహించెను. దీనిలో ౧౯౩౧లో కామెట్ శిఖరమును యెక్కిన స్మిత్‌ను, కెప్టెను ఇ. సెయింటు జె. బిర్నీ, డాక్టరు సి. ఆర్. గ్రీన్ అను వారు ముఖ్యులు. స్మిత్‌తో కామెట్ నెక్కినవారిలో గ్రీన్ వొకడు. ఈ సంఘమువారు ఫిబ్రవరిలో కలకత్తాకు వచ్చి వెంటనే పర్వతముపై దాడినారంభించిరి.

వీరు అను రాంగ్‌బక్‌లోయలో ఏప్రిల్ ౨౧న మొదట బసచేసిరి. అక్కడనుండి గాలి వీరిని బాధపెట్టసాగినది. అందుచేత ౨౩౦౦౦ అడుగుల యెత్తుననున్న నార్తుకాల్‌ను యెక్కుటకు చాల ఆలస్యమయినది. ౮౦ అడుగుల ఎత్తుగల మంచుగోడను ఎక్కి దాటినగాని, వీరు ౨౨,౮౦౦ అ. ఎత్తునకు ఎక్కజాలకపోయిరి. అక్కడ వారు బస (Camp iv) చేసిరి. వాతావరణమును గురించిన వార్తలు తెలిసికొనుటకు వీరు వైర్లెస్‌ను కలిగివుండిరి. మంచుతో కూడిన ప్రచండ వాయువులు వీచుచుండుటవలన వీరు మే ౨౨ తేదీ వరకు ౨౫౫౦౦ అ. ఎత్తునకు ఎక్కలేకపోయిరి. దీనికి వీరు ఐదవబస (Camp v) అని పేరిడిరి. వీరిలో విన్ హారిస్, ఎల్. వేగర్, జె. ఎల్. లాంగ్లాండులు ౨౭౪౦౦ అ. ఎత్తునకు ఎక్కి అచ్చట ఆరవబస (Camp vi) ను యేర్పాటుచేసిరి. ౧౯౨౪ లో ఆరవబస ౨౬౮౦౦ అ. ఎత్తుననే స్థాపింపబడుటచే, వీరికి యింకను ౬౦౦ అడుగుల ఎత్తునకు ఎక్కిన కీర్తి దక్కినది. వీరికి చాల సాయమును చేసిన టిబెటుదేశపు కూలీల సాహసము ప్రశంసనీయము. విన్ హారిస్ వేగరులు యిద్దరును ౨౮౧౦౦ అడుగుల ఎత్తునకు పోయిరి. ఆ పైన పోవుటకు గాలి వారికి చాల ప్రతికూలముగ నుండుటచే వెనుకకు తిరుగవలసివచ్చెను. అంతకుపైన పోవుటకు యీ జట్టులో యెవరికిని సాధ్యముకాలేదు. ఇంతలో వర్ష పవనములు వీచుటచే వారందరును ఇక ముందునకు పోవలేక డార్జిలింగుకు వచ్చివేసిరి. ఇంతటితో యీ ప్రయత్నము ముగిసెను.

అసాధారణమగు మరొక ప్రయత్నమును ౧౯౩౪ లో మారిస్ విల్సన్ అను వైమానికుడు చేసెను. ఇతడు మారువేషముతో టిబెట్టుగుండా వెళ్లి కొద్దిమంది కూలీలతో ౨౧౦౦౦ అ. ఎత్తునకు ఎక్కెను. ఆ తరువాత యింకను పైకి యెక్కుటకు ఆతడొక్కడే వెళ్లెను. అంతే. అతనిని గురించి చాలకాలమువరకును ఎవరికిని ఏమియు తెలియలేదు. ౧౯౩౫ లో ఎవరెస్టునుయెక్కుటకు వెళ్లిన ఇ. ఇ. షిప్టను సంఘమువారికి ౨౧౦౦౦ అ. ఎత్తున ఇతని శవము కనపడెను.

ఎవరెస్టు పర్వతమును పరిశీలించుటకు జరిగిన ప్రయత్నములలో ౧౯౩౩ సంవత్సరపు వైమానిక యాత్ర ముఖ్యమైనది. ఈ యాత్రకు గల ముఖ్యోద్దేశము ఆకాశమునుండి ఎవరెస్టుశిఖరము పైభాగము లన్నిటిని ఫోటోతీయుటయే. ఈ ప్రయత్నమునకైన ధనమును

హూస్టనుసతి యిచ్చెను. దీనికి నాయకుడును, సర్వేపని కంతకును బాధ్యుడును మేజర్ ఎల్. వి. ఎస్. బ్లాకర్. ప్రధానసైనికుడు క్లయిడ్స్‌డేల్ ప్రభువు. వాపిటి రకమునకు చెందిన రెండు విమానములను సంపూర్తిగా ఆధునిక పరికరములతో సమకూర్చి యీ యాత్రను చేసిరి. విమానములను తమ దేశముపైనుండి పోనిచ్చుటకుటిబెటు ప్రభుత్వమువారు ఒప్పుకొనలేదు. కావున హిమాలయములకు దక్షిణపు వైపునుండియే వీరు శిఖరముపై కెగిరి నేపాలులోని పూర్ణియా అను ప్రదేశమునుండి ఎవరెస్టు శిఖరమువరకును గల ఫోటోలను తీసికొనిరి. తమ దేశముమీదుగా ఎగురుటకును, ఫోటోలను తీసికొనుటకును నేపాలుప్రభుత్వమువారు వీరికి అనుమతి యిచ్చిరి.



పర్వతారోహకులు కూలీలకు మోయవలసిన సామానుల నప్పగించుట

ఇంతకు పూర్వమే (అక్టోబరు ౧౯౩౩ లో) రాయల్ ఏర్‌ఫోర్సువారి అయిదు విమానములతో లెఫ్టినెంటు ఇసాక్ నాయకత్వమున, ఒక సంఘమువారు రిసాల్పూర్‌నుండి గిల్గిట్‌వరకును, మరల వెనుకకును ఎగిరి, నంగపర్వతపు ఫోటోలను, రాకా పోషి ఫోటోలను తీసిరి.

నంగపర్వతమును యెక్కుటకు మ్యూనిచ్‌వాసుడైన డాక్టరు మెర్కిల్ ప్రయత్నించెనుగాని జయమును పొందలేదు.



కబ్రూ హిమానీ ప్రస్తరముపాలమున నున్న అయిదవ కాంపు (౨౧,౦౦౦ అ.) ఆరోహకుల డేరా

౧౯౩౪ లో ఎవరెస్టును ఎక్కుటకు, జర్మనీనుండియు, ఆస్ట్రియానుండియు ప్రసిద్ధులగు పర్వతారోహకులను వెంటబెట్టుకొని, హెర్ వెర్క అను నతడు హిందూదేశపు సైన్యమునకు చెందిన ఫ్రయర్ సాంగ్‌స్టనర్‌తో పెద్ద ప్రయత్నముచేసెను కాని, మొదటినుండియు దురదృష్టము వీరిని వెన్నాడినది. న్యూమోనియావచ్చి హెర్ డ్రెక్సెల్ అనునతడు చనిపోయెను. జూన్ నెలాఖరునకు వీరు ౨౫,౬౦౦ అ. ఎత్తునకు ఎక్కిరి. అక్కడ గాలి ప్రతికూలముగా వీచుటచే వెనుకకు తిరిగిరి. కాని తిరిగివచ్చునపుడు హెరన్ మెర్కిల్, వెల్జెన్‌బాక్, వీలాండు అనువారును, డార్జిలింగువారైన ఆరుగురు కూలీలును చనిపోయిరి యూరపియనులలో హెరన్ ష్నీడరు, ఎమన్ బ్రన్నరు అనువారిద్దరు మాత్రమే బ్రతికిరి. బ్రతికియున్న కూలీలందరును మంచు దెబ్బ తినిరి. నిద్రాహారములులేక నలుగురైదుగురు వారమురోజులు గడపవలసివచ్చెను. ఎవరెస్టు ఎక్క ప్రయ

త్నించినవారిలో యెవరికిని యింత ఘోరప్రమాదము సంభవించలేదు.

౧౯౩౪ లో షిప్టను, హెచ్. డబ్లియు. టిల్‌మన్‌లు యిద్దరును అద్భుతముగా ప్రయత్నించి, ఋషి గంగనుండి నందాదేవి హిమానీనదము వరకును గల దుర్గమము ప్రదేశమంతటను తిరిగి, ఎవరెస్టు శిఖరారోహకులు యెవరును తెలిసికొనలేక చిక్కులుపడుచున్న విషయముల నెన్నిటినో బహిరంగపరచిరి. బదరీనాథ్‌నుండి శక్సోపాంక్ కనుమగుండా గంగోత్రివరకును ప్రయాణమును చేసి, గంగోత్రి హిమానీనదమును కూడ కనుగొనిరి.

కాశ్మీరములో నిపాల్ గాస్ వద్దనున్న పంజతరణిని ఎక్కుటకు ప్రయత్నముచేసి లెఫ్టినెంటు కర్నల్ సి. ఎ. స్టాయర్, లెఫ్టినెంటు డి. ఎమ్. బరక్ అను వారు ప్రాణములను కోల్పోయిరి.



౧౯౩౫ లో ఎవరెస్టునకు సరియగు దారి కనుగొనుటకు ప్రయత్నము చేసినవారిలో నొకడగు డాక్టరు సి. బి. వారెన్

౧౯౩౫ లో కారకోరం పర్వతములను ఎక్కుటకు చాల ప్రయత్నములు జరిగినవి.

౧౯౩౬ లో ఫ్రెంచివారు షిప్టనుగారి నాయకత్వమున ఎవరెస్టును ఎక్కుటకు ప్రయత్నించి, జయమొందలేకపోయిరి.

౧౯౩౬ లో ఎవరెస్టును ఎక్కుటకు హ్యూరట్లెజ్ గారి నాయకత్వమున మరొక ప్రయత్నము జరిగినది. షిప్టన్, స్మిత్, విన్ హారిస్‌లుగూడ యిందు పాల్గొనిరి.



హ్యూరట్లెజ్—౧౯౩౩ లోను ౧౯౩౬ లోను హిమాలయపర్వతముల నెక్కుటకు ప్రయత్నించిన జట్టునాయకుడు

వీరు ఏప్రిలు ౨౮ తేదీన మొదటి బసవద్దకు యెక్కిరి. మే ౭ తేదీన స్మిత్, షిప్టనులు భారవాహకుల సహాయమున ౨౧౫౦౦ అ. ఎత్తున మూడవబసను స్థాపించిరి. మే ౧౫ న; నార్త్ కాల్‌ను ఎక్కిరి. మే ౧౭ న అచ్చటినుండి వెనుకకు తిరిగిరి. ఇంతలో వర్ష వాయువులు వీచుటచే ప్రయత్నమునుండి విరమించి యింటిదారి పట్టిరి.

లండనునకు చేరినతరువాత హ్యూరట్లెజ్ యిట్లు చెప్పెను: 'ఎవరెస్టుశిఖరమును మానవుడెక్కగలడని నాకు దృఢనమ్మకముగలదు. కాసుగా వృద్ధుడనగుటచే నేను మాత్రము ఆ ప్రయత్నములలో ఇంక పాల్గొనజాలను.'

రట్లెజ్ పలికినమాటలు సత్యములగువరకును ప్రపంచమున మానవాజేయమగు పర్వతశిఖరము గౌరీశంకర్ శిఖరమే అని చెప్పకతప్పదు.




ఏవరెస్టును ఎక్కుటకు ౧౯౩౬ సంవత్సరములో వేసుకొనిన త్రోవప్లాను

హిమాలయ పర్వతారోహణములనుగూర్చి చెప్పునపుడు హిమాలయన్ క్లబ్‌నుగూర్చి కొంత నుడువక తీరదు. ఈ క్లబ్ ౧౭ ఫిబ్రవరి, ౧౯౨౮ న, ఇండియా ప్రభుత్వమువారి వ్యాపారశాఖకు సెక్రటరీగానున్న సర్ జెఫ్రీ కార్బెట్ చేసిన ప్రయత్నమువలన ఢిల్లీలో స్థాపింపబడినది. ఈ విషయమున, ఇండియా ప్రభుత్వము వారి అసిస్టెంటు సర్వే జనరల్‌గానున్న, మేజర్ కెన్నెత్ మేసన్‌కూడ చాల కృషిసల్పెను. ఈ సంఘమునకు ఇప్పుడు ౩౫౦ మంది సభ్యులున్నారు. వారిలో ముగ్గురు స్త్రీలు. దీనికి అధ్యక్షుడు జనరల్ సర్ కెన్నెత్ వైగ్రామ్; గౌరవ కార్యదర్శి మేజర్ గూటర్‌బాక్.

ఈ క్లబ్‌ను స్థాపించుటలో ముఖ్యోద్దేశము హిమాలయపర్వతములను యెక్కువారికి హిమాలయములనుగురించిన విజ్ఞానవిషయములను సక్రమపద్ధతులతో తెలియపరచుటయే.

---

# జర్మనీ సమరసన్నాహము

## అవసరాల వెంకట నర్సు

చదువరీ, విమానారూఢులమై మన మొకసారి యూరపుఖండమున కేగివత్తము, రమ్ము. ఆ ఖండములో సమరాగ్నిజ్వాల శీఘ్రకాలములో రగుల్కొన నున్నదని రాజ్యతత్వజ్ఞులు పలువురు నొక్కివక్కాణించుచున్నారు. ఆ అగ్నిజ్వాల యూరపుఖండముతో నాగక ప్రపంచమంతయు చుట్టిముట్టవచ్చునని వారూహించుచున్నారు. జర్మనీవారు కోట్లకొలది ధనము వెచ్చించి యుద్ధప్రయత్నములు చేయుచున్నారని వినుచున్నాము. వారి సన్నాహముచూడగా తుపాకిమందు నిల్వయుంచిన గుహామధ్యమునుండి కాగడాలబారు గొంపోవునట్లున్నదని ఆమధ్య లాయిడ్ జార్జిగారు వ్రాసియున్నారు. జర్మనీవా రింతగా కయ్యమునకు కాలుదువ్వుటకు ప్రబలహేతువు లెట్టివో పరిశీలించివత్తము, రమ్ము.

తొల్తనే మనము గమనింపదగు విషయ మొకటి యున్నది. హిట్లరు జర్మనీదేశమునకు నియంత. దేశపరిపాలనమంతయు వాని హస్తగతమైయున్నది సైన్యాధిపతులు మొదలు విద్యార్థులవరకు దేశమందలి యావన్మంది ప్రజలున్ను వానియాజ్ఞ శిరసావహించి తీరవలసినదే. ఎవ్వరైనను వాని యాజ్ఞ నీషీరలేశమైన ధిక్కరించి సంచరించిరా, వారికి మానప్రాణములు దక్కవు. అంతటితో వారి బంధుమిత్రులు విదేశములకు పలాయితులైన కావలెను; లేదా కారాగారములలో జీవితయాత్ర పరిసమాప్తి నొందించుటకు సిద్ధపడియైన నుండవలెను. కొద్ది సంవత్సరములకు పూర్వము హిట్లరుగారికి "జ్యూ"లపై నాగ్రహము వచ్చినది. దేశమునందు పిట్టయైన లేకుండ ఆజాతివారి నెల్లరను హిట్లరు పరదేశములకు వెడలగొట్టెను. చరస్థిరరూపకమగు వారి యావదాస్తియు హిట్లరుఅనుచరుల వశమైనది. ఆదేశమందలి క్రైస్తవమతగురువులు సహితము హిట్లరు కనుసన్నల మెలగవలసినవారే కాని, ఎందైన ఆతని యాగ్రహమునకు గురియగుట తటస్థించెనా వారి యగచాట్లు పరమేశ్వరుని కెరుక. పాఠశాలలందు విద్యాబోధనమొనర్చు నధ్యాపకులు సహితము హిట్లరుమనోభావముల గుర్తెరిగి నడుచుకొనవలసినవారే. ఈ మాదిరి పరిస్థితులు యూరపుఖండములో మరికొన్ని దేశములం దుండిన నుండవచ్చును. ఆ కారణముచే జర్మనీపరిపాలనాక్రమమునుగూర్చి మనము గమనించిన విషయము లసత్యములు కానేరవు.

ఈతనియం దద్భుత సామర్థ్య మున్నదనియు, జర్మనీదేశమువారియెడల విదేశీయులకు భయము, భక్తి కల్గుటకు హిట్లరే హేతువనియు నీతని ప్రతికక్షులు సహిత మంగీకరింతురు. ఇతడు మంచి వక్త - బహుమేధావి. తన వాక్చాతుర్యముచే నధిక సంఖ్యాకులను తన మతమునకు మార్చుకొనగల్గిన నేర్పరి. సర్వాధికారసంపన్నుడయ్యు నీత డైశ్వర్యముచే ప్రమత్తుడు కాలేదు. సామాన్య మానవునివలె స్వల్పపాటి ధనము మాత్రమే వెచ్చించుచు కొద్ది సౌఖ్యములతో నీతడు కాలముగడుపుచుండును.

ఈతని మతము నాజీమతము. ప్రపంచములోని అన్నిజాతులలోను జర్మనీజాతి ఉత్తమోత్తమ మను సిద్ధాంత మీమతమునకు పునాది. మేదినీవలయమంతయు నేలుటకర్హులగు మానవోత్తముల సృజింపనెంచి విధాత జర్మనుల సృజించెనని హిట్లరు నమ్మిక. అట్టి మహోన్నతపదవి కర్హులగు జర్మనులకు సర్వదేశాధిపత్యమును చేకూరు సన్నివేశ మింకను రాలేదేయని హిట్లరు సర్వదా వగపోవుచుండును. వగపోతతోనే కాలమును వెళ్లపుచ్చు భీరువుకాడు హిట్లరు. సమరరంగమున కరికి జర్మనుల ప్రతాపాగ్ని చే పరదేశీయుల రూపుమాపుటకు సంసిద్ధుడగు కార్యశూరుడు. హిట్లరు రచించిన 'మీన్ కాంఫ్' అను గ్రంథరాజమున పై యభిప్రాయములన్నియు నాతడు విశదీకరించియేయున్నాడు.

హిట్లరునకు సమరమన్న బహుప్రీతి. తన జాతీయాధిక్యము సమరముఖముననే బయల్పడనున్నదని ఆతని విశ్వాసము. ఆ కారణముచే నతడు జర్మనుల నెల్లరను సమరసన్నాహములు కండని ప్రోత్సహించుచుండును. శాంతియనిన ఆతనికి లేశమును కిట్టదు. ప్రపంచమున శాంతిస్థాపనకై అహర్నిశలు కష్టించు ఓసిట్స్కీయను జర్మనుదేశీయు డొకడు కలడు. హిట్లరు కొన్ని వత్సరములనుండి ఆతనిని కారాగారబద్ధు నొనర్చినాడు. శాంతిస్థాపనకై ఆత డొనర్చు కృషికి మెచ్చి యీ నడుమ నార్వేగవర్నమెంటువారాతనికి నోబెలు బహుమానమిచ్చిరి. హిట్లరునకు పట్టరాని కోపమువచ్చినది. నార్వే గవర్నమెంటువారీదుర్ణయము మేల చేసిరో కనుగొమ్మని నార్వే దేశమందలి జర్మనుప్రతినిధికి హిట్లరు వర్తమానమంపెను.

జర్మనీగవర్నమెంటు సాలీనానికరాదాయములో ౧/3 వ వంతునకు పైగా సమరసామగ్రి సేకరించుటకై హిట్లరు వ్యయపర్చుచున్నాడు. ఇంతకంటె చాల నెక్కువ మొత్తమే ఖర్చగుచున్నదని పలువు రభిప్రాయపడుచున్నారు. హిట్ల రెంత వెచ్చించుచున్నదియు ప్రకటింపడు. విన్స్టన్ చర్చిల్ గారు పెక్కుకోట్ల పౌనుల ధనము వెచ్చింపబడుచున్నదని యభిప్రాయపడుచున్నారు. ఈ యుద్ధసామగ్రి అపూర్వమైనది: విమానములు, శత్రునౌకా విధ్వంసమొనర్చు సబ్ మెరైనులు, పదాతుల రూపుమాపు ఫిరంగిబండ్లు (టాంకులు), విషవాయువులు- వీనిలో ప్రధానమైనవి. ఏయేటకాయేట క్రొత్త సామగ్రి తయారగుచునేయున్నది. యూరపుఖండమున పెక్కుదేశములవారు యుద్ధసామగ్రి సమకూర్చుచున్నారు. కాని, హిట్లరు చేయునంతటి కృషి వారు సల్పుచున్నట్లు గోచరింపదు. ఇంతయుద్ధసామగ్రి నిల్వయుంచి యుద్ధముచేయక హిట్ల రేమిచేయుగలడు? జర్మనీదేశములో ధనికులు స్వల్పసంఖ్యాకులై యున్నారు. ఇంగ్లండుదేశమునందున్న సుభిక్ష మాదేశములో లేదు. హిట్లరు యుద్ధ మొనర్చి జర్మనీదేశవైశాల్యము వృద్ధిచేయనిచో, పౌరులు తిరుగుబాటొనర్చి ఆతని పదవికే భంగము తేవచ్చును. అట్టిచిక్కులు రాకుండ, కలహప్రాప్తికి తగునవకాశములకై హిట్ల రెదురుచూచుచునేయున్నాడు.

హిట్లరువీరావేశమునకు పుట్టుపూర్వోత్తరము లేవియో పరిశీలింతము. యూరపుసంగ్రామమున విజయులైనవారిలో ముఖ్యులు ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, యునైటెడ్ స్టేట్సువారు. విల్సన్ గారే యేసూత్రముల ననుసరించి సంధి జరుపవలెనో తెల్పియుండిరి కాని, ఆ సూత్రములు వార్సెల్సు సంధిలో నెంతవరకు గౌరవింపబడునో చూచుట కవకాశములేక, అమెరికాదేశమునకు వెళ్లిపోయిరి. సంధిషరతుల నిర్ణయించు భారము ముఖ్యముగా నాంగ్లేయులకును, ఫ్రెంచివారికిని నిల్చియుండెను. జర్మనీవారికి ఆఫ్రికా ఖండమునందున్న వలస రాజ్యములన్నియు నాంగ్లేయులు స్వాధీనపర్చుకొనిరి. వానిపై 'మాండేటు' పరిపాలన సాగించెదమనిరి. ఈ 'మాండేటు' పరిపాలనకును వలస రాజ్య పరిపాలనకును కలుగు వ్యత్యాసము మనబోటి సామాన్యబుద్ధులకు గ్రాహ్యమగునదికాదు. సార్, రైనీలెండు మున్నగు ప్రదేశములు జర్మనీవారి స్వాధీనమునుండి తొలగింపబడెను. పోలండువారికి జర్మనీదేశములోని డాంజిగ్ చీలికద్వారా సముద్రమునకు దారి చూపబడెను. కొంతకాలమువరకు సైలీషియా కూడ జర్మనువారి చేతులనుండి తప్పింపబడెను. దీనిలో డు కొన్ని కోట్లపౌన్లు జర్మనీయుద్ధనష్టము క్రింద నీయవలెనని నిర్ణయింపబడెను. జర్మనీకి రాజ్యభాగము పోయినది; పరిశ్రమలకు మూలాధారములగు ఖండములు తమ చేతులనుండి జారిపోయినవి; జాతికంతకును అవమానము సంభవించినది. దేశదారిద్ర్య మినుమడించినది. ఆనాడింగ్లీషువారును, ఫ్రెంచివారును జర్మనులపట్ల క్షమాభావము చూపియున్నచో, జర్మనీవారి కింతటి యుద్ధకాంక్ష లేకుండెడిది. ఈ నడుమ హిట్లరు రైనులెండులో తన సేనలను ప్రవేశపెట్టినప్పుడు అతడొనర్చు నక్రమమేమియు లేదనియు, సంధిషరతులకు భిన్నముగా నడిచినంత మాత్రమున అతడు దోషార్హుడు కాడనియు పలువు రభిప్రాయపడియున్నారు. అట్టివారిలో ఆంగ్లేయులును పెక్కుమంది కలరు.

ఇంగ్లీషువారు జర్మనీవద్ద గైకొనిన వలసరాజ్యములు తిరిగియిచ్చివేయుమని హిట్లరు పదేపదే కోరుచున్నాడు. లేకున్న యుద్ధము సంఘటిల్లునని సూచనగా బెదరించుచున్నాడు. ఇంగ్లీషువారు మొదట కొంచెము మెత్తపడినట్లు కనబడిననుకాని, చివరకు వల్లలేదని చెప్పుచున్నారు. కాని హిట్లరీవిషయమున తన పట్టింకను విడువలేదు. ఇంగ్లీషువారు బహునేర్పరులు. గత్యంతరములేదని వారికి తోచినచో వారు జర్మనీవారి వలసరాజ్యము లిచ్చివేయవచ్చును. వలసరాజ్యప్రాప్తిచే నధికలాభమున్నదనుట నిర్వివాదాంశము. పరిపాలకుల జాతి వర్తకులీవలసరాజ్యములున్న హేతువుచేతనే కుబేరులనుట తటస్థించుచున్నది. వలసరాజ్యములందు నివసించు ప్రజల క్షేమమును విషయ మెవ్వరును విచారింప యత్నించుటలేదు. ఈ విషయమున నా కొక యుదంతము జ్ఞప్తికి వచ్చుచున్నది. ఒకబాలికకు సింహములను చిత్రించియున్న పట మొకటి చూపిరట. ఆ పటమునం దొక సింహమునకు సజీవులను మానవులను లెచ్చి యెర పెట్టుచున్నట్లు వ్రాసియున్నదట. ఆ సింహము మానవకళేబరములను బహుప్రీతితో భుజించుచుండెనట. 'అయ్యో! తక్కిన సింహములకు మానవకళేబరములు వేయలేదే! వానిగతి ఏమి?' అని ఆబాలికారత్నము వగపోయుచుండెనట. ఆ బాలికతోపాటు 'అయ్యో! జర్మనీవారికి వలసరాజ్యములు లేవే! వారి గతి ఏమి?' అని మనము వగపోయనక్కరలేదు.

ఈ మధ్య హిట్లరుకును ముసోలినీకిని స్నేహమేర్పడినది. ముసోలినీ ఇటలీదేశపు నియంత. ముసోలినీ సామాన్యుడుకాడు. అబిసీనియాపై దాడివెడలి విషవాయుప్రయోగముచే శత్రుసేనల రూపుమాపిన శౌర్యశాలి. రోగులకు శస్త్రచికిత్సచేయు గుడారములపై బాంబుల వర్షింపచేసిన భూతదయాపరుడు. వీరి భాగ్యవశమున స్పెయినుదేశములో ఫ్రాంకోగారు కలహ మొకటి లేవతీసినారు. క్రైస్తవమతోద్ధరణమును, పాశ్చాత్యనాగరికతా సంరక్షణయు సల్పునిమిత్తమై ఫ్రాంకోగారు మూరులను సాహాయ్యపర్చుకొని, హిట్లరు ముసోలినీల ఆశీర్వాదమంది, స్పెయినుదేశపు గవర్నమెంటువారిపై దాడివెడలినారు. స్పెయినుగవర్నమెంటు ప్రజాప్రతినిధులచే నియమింపబడి, ప్రజాక్షేమమే పరమావధియని భావించు సంస్థ. హిట్లరు ముసోలినీలు ఫ్రాంకోగారికి వలయు సేనానులను యుద్ధసామగ్రియు సప్లయిచేయుచున్నారు. ఎదుటివారికి రష్యావారు యుద్ధసామగ్రి పంపుచున్నారు. జయాపజయము లింకను తేలలేదు. ఫ్రాంకోగారే విజయులగుట తటస్థించెనా, హిట్లరు ముసోలినీల ప్రతిభ ద్విగుణీకృతమగును. మహాసంగ్రామము చూపుమేరదూరమునకు వచ్చినదనియే భావింపవచ్చును.

మరియొక్క విషయమారసి మన మీ సింహావలోకన ముగింతము. నీవును అలసియుందువు. హిట్లరు ఇంగ్లాండు ఫ్రాన్సులతో కయ్యమునకు చొరవచేయుటలేదు. తమ దృష్టిరష్యావారిపై మరల్చుచున్నారు. రష్యాదేశమందలి పరిపాలనావిధానమును, వారి సోషలిజమును బహు దౌష్ట్య భూయిష్ఠము లనియు, యూరపువారందరును ఏకస్థులై, హిట్లరును నాయకునిచేసి రష్యావారిపై దాడివెడలి వారి దౌష్ట్యమడంచుట యూరపుఖండమునకు విశేషప్రతిభ నొసంగుననియు వీరు వచించుచుందురు. అదియుగాక రష్యాదేశమందలి యూక్రెయినుభాగము సస్యసమృద్ధికి పేరుపొందినది. అది స్వాధీనపర్చుకొనవలెనని హిట్లరుకు రెండు మూడేండ్లనుండియు కోర్కెయున్నది. కాని రష్యావారికిని మంచి యుద్ధసామగ్రి యున్నదే, వారిని జయించుట ఎట్లు? హిట్లరు మేధాశక్తికి లోపము లేదు కావున రష్యావారిని చైనా సమీపమున జపానువారితో యుద్ధమునకు దింపినచో, యూక్రెయినును తానీ నడుమ హరింపవచ్చునని ఆయన యీ మధ్య పన్నుగడ పన్నినాడు. జపానువారికిని భూవలయమంతయు నేలవలెనను కోర్కెయున్నది. ఈ మధ్య జరిగిన జర్మనీ-జపానుసంధి అంతరార్థ మిదియే యని పలువురు తలంచుచున్నారు. దీనికి ముందుగనే రష్యావారు మెలకువతో ఫ్రాన్సువారితో సంధి చేసికొనియున్నారు. హిట్లరు రష్యాను జయించుట సుకరముకాదు.

ఎటు చూచినను హిట్లరు రాజ్యకాంక్ష వీడుటకు సానుకూలత కానవచ్చుటలేదు. కాని పెక్కుకోట్ల పౌన్లు వెచ్చించి నిర్మించిన సమర సాధనములన్నియు హిట్లరెంతకాలము నిల్వచేసియుంచగలరు?

---

# కొండకోన

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

పూవ్రుటీరముఁలోనఁ బొంచుండి, ప్రియురాలు
బెదరుచూపులనదిగో పిలుచుచున్నదిచూడు,
జోహార్లు, పదివేల జోహార్లు, లోకమా,
నాకు నీకును జెల్లె ననువిడిచి పొమ్మింక-
అడియాసలను జూపి, పొడిపొడిగఁ జేసితివి
ఆవలీవలఁబాపి, యందిందుఁ ద్రోసితివి;
నీమాయఁకు భ్రమసి నీలోనఁ జిక్కితిని,
నీకల్లలను నమ్మి నిముసాన స్రుక్కితిని;
కపటమెఱుఁగని ప్రేమఁగనుచున్న ప్రియురాలి
నవలియొడ్డున విడిచి యరుగుదెంచితి నిట్లు
నట్టేట నను ముంచి నడుముపైఁ గొట్టితివి;
అరచచ్చి చెడి యెట్లొ తిరిగి రాఁగలిగితిని;
ప్రియురాలితోఁ గూడి విశ్రమించెద నింక;
పదివేలజోహార్లు వదలు నను లోకమా
ప్రియురాలిఁ జేరెదను

ననువిడిచి దవ్వుగాఁ జనియె నాప్రియురాలు;
ననుఁజూడ మఱలిరా ననియె నాప్రియురాలు;
పంతాలతో నేమిపని నాకుఁ బ్రియురాలు
కనరానిచో టెందుఁగలుగునా?
చదలలోఁ బాటమై మెదలదే ప్రియురాలు?
గాలిలోఁ దాకుడై ప్రాకలదే ప్రియురాలు?
అగ్గిలో వేడిమై యలరదే ప్రియురాలు?
నీటిలోఁ జలువమై నిలువదే ప్రియురాలు?
పుడమిలోఁ దావియై పొలయదే ప్రియురాలు?
కనుమూసిచూడంగఁ గనుపట్టుఁబ్రియురాలు;
కనుదెఱచిచూడంగఁ గనుపట్టుఁబ్రియురాలు;
దరిదరిగఁ జనుదెంచి,తరలిచనుఁబ్రియురాలు;
దవ్వుదవ్వుగఁ బారి దరిఁజేరుఁ బ్రియురాలు;
అయిదయిదుకనలేనియబ్బురపుఁబ్రియురాలు;
ఆరు కండఁగరాక,యవలఁజనుఁ బ్రియురాలు;
వెలిలోనఁ గౌఁగింటనిలుపుననుఁబ్రియురాలు.

మూఁడేళ్ల మొత్తాన, మూఁడుకొండలనడుమ,
ఐదు మట్టులచెంత నాకుటింటిని గట్టి,
ప్రియురాలితో నందు వేడ్కలందుచునుంటి;
ఒండొరులకౌఁగింట నొదిగి,యొండొరుఁగలసి,
నేను ప్రియురాలొక్కటై నిల్చియుంటి మట
ఒకనాటి యుదయాన నొకమాయలేడి తా
బిరబిరను మావద్ద కరుదెంచి నిలిచినది.
పట్టఁబోయితి దానిఁ బరుగెత్తసాగినది.
వెనువెంటఁ బరుగెత్తి, విసిగి, పట్టఁగలేక
మరలియింటికిరాఁగ మాయమయ్యెను గాంత;
వెదకుకొని, వెదకుకొని, విసిగి వేసారితిని.
వెనుకపాటునవచ్చి కనుమూసెఁబ్రియురాలు;
కనుమూతవెలుగులో గనుగొంటిఁబ్రియురాలి,
ప్రియురాలిఁ గలసికొని, ప్రియము చెందితిని.

పాలమున్నీటిలోఁ బరగు నొక పెనుగొండ;
మూడుకొమ్ములతోడ మొనయునా పెనుగొండ
వెండి బంగారు నిరుపు వెలయు ముక్కొమ్మద్ది—
ముక్కొమ్మనడుచక్కి ముద్దుముచ్చటలారఁ
బ్రియురాలితోఁ గూడి వేడ్కలందుచు నుంటి
ప్రియురాలి నొంటిగా విడిచి నే నొకనాఁడు
చలువతెమ్మెర గుడువ నిలువిడిచి పోయితిని;
మఱపించి యనిలుండు మఱిమఱిగ ననులాగి
కొలనియొడ్డుకుఁ దోడుకొనిపోయి నిలఁబెట్టి
కొలన దిగి, తమ్మిపైఁ గూర్చుండ, నను బట్టి
కొనిగ్రుంగగమకించెఁ బెనుమొసలితమకించె;
చెమరించి యేడ్చితిని; జేదోయి మోడ్చితిని;
వెసవచ్చిప్రియురాలు మొసలినవ్వలఁద్రోసె;
తమ్మిపైఁ బ్రియురాలిఁ దనిపి తనిసితిని.

పొన్నగున్నలక్రేవ, పొగడచెట్టులనీడ,
కొండకొండకు నడుమఁ గోనలోఁ గానలో,
ప్రియురాలితోఁ గూడి విశ్రమించుచునుంటి;
ప్రియురాలి కౌఁగింట వేడ్క లందుచునుంటి;

ఒకనాఁటి నడుసంజ నొప్పెలుంగఁగ లేక,
నట్టేట దిగి లోని కట్టిట్టు పోయితిని;
ఫెనువరద పరతెంచె; విడఁ గట్టుపుట్టంబు;
పారువెల్లువలోనఁ బడి కొట్టుకొనిపోయె;
గట్టుపైఁ బ్రియురాలు కని నవ్వుకొనుచుండె;
వెడలిరమ్మని నన్నుఁ బిలిచి నవ్వుచునుండె;
నీర్విడిచి పైకి రానేరకుంటిని నేను;
నను వడిగరమ్మనుచు నవ్వుచుండెను గాంత;
కనుమూసికొంటి; లోకము చీకటులు గ్రమ్మె;
చీకటిని బ్రియురాలిఁ జేరి తనిసితిని.

కనుమూసి వెలిఁజూడఁ గనుపట్టుఁ బ్రియురాలు;
కనువిచ్చి లోఁజూడఁ గనుపట్టుఁ బ్రియురాలు;
కనుమూయఁ, గనువిప్ప గనుపట్టుబ్రియురాలు;
ప్రియురాలిఁ జూడంగ వేయికన్నులు వలయు;
ప్రియురాలిఁ బట్టంగ వేయిచేతులు వలయు;
ప్రియురాలిఁ బలుకంగ వేయినాల్కలువలయు;
కౌఁగింటఁ బ్రియురాలిఁ గదిసి నేనున్నపుడు
చెయ్యొడిగి లోకంబు చిన్నచిన్నగ నుండు;
ప్రియురాలితో నాడి వేడి కూడినవేళ
ప్రియముతో లోకంబు పెద్దపెద్దగ నుండు;
ప్రియురాలు నేను వడి విడివిడిగ నున్నపుడు
చకచకని పరువులను సాగించులోకంబు
ప్రియురాలు నేనొకటి విడి కూడి లోకముల
విప్పుచును, గూర్చుచును, విహరించుచుండె
[దము

ఆకుజొంపాలకడ, నావుపైఁ జేరఁబడి,
అందాలక్రోవితో నాడి పాడెడువేళ
ఆనందమునఁ దేలియాడుచుండెదవోరి
యాలకాపరివాడ, మేలుమే ల్నీసొబగు;
నీయింతి నీచెంత నిలిచి నిను గొలిచినది;
కనుచునినుఁ గఱచినది, వినుచునినుమఱచినది;
మఱపించి, నినుమఱచి, మఱచి వలపించినది;
వలపించి వలచినది; వలచి తలపించినది;
తలపించి తలచినది; తలచి కలచినది;
తలపు వల పొకటిగాఁ గలిపి కులికినది;
మేలు నీసొబ గోరి యాలకాపరివాడ,
నీయింతి నీచెంత నిలిచి నిను నిలిచినది;
అందాలక్రోవితో నాడుమా, పాడుమా,
నీయింతి నేనౌదు; నీవు నాయింతివై
నిలుతు మొకతోటలో—

---




బావి చెంత　　—పి. కనకం.

# హేమచంద్ర సూరి

వేదము వేంకటరాయఁడు

౧

మనదేశమున మతములకును మత వివాదములకును ఎన్నఁడును కొఱఁత యుండినదిలేదు. జను లెందఱో మతములన్ని. పండ్రెండవ శతాబ్దమున నీవాదములు అతి తీవ్రముగా నుండినవి. హిందూ జైన బౌద్ధ మతములకు ఒకరయిక బలముగా నుండెను. దేశమున నెచట చూచినను నగరములలో పట్టణములలో గ్రామములలో పల్లెలలో ఎల్లమతముల వారును వాదములు చేయుచు వాదములలో ఓడినవారు గెలిచినవారి మతముల నవలంబించుచు దినమునకొక మతముగా నుండిరి. ఒకమూల బౌద్ధుల ప్రచారము, మఱియొకమూల జైనులబోధలు మధ్య సనాతనుల యార్భాటములు చెలరేగుచుండినవి. రాజులు మతబోధకుల చేతి కీలుబొమ్మలుగా నుండిరి. ఆస్థానములలో వాదబలముల మీఁదనే మతములు ఆధారపడియుండినవి. జైనాచార్యుఁడు గెలిచిన రాజు జైనుఁడగును; బౌద్ధ పరివ్రాజకుఁడు గెలిచిన రాజు బౌద్ధుఁడగును; బ్రాహ్మణుఁడు గెలిచిన రాజు హిందు వగును. మాటలమీఁదనే అంతయు నిలిచి యుండినది. రాజాశ్రయమే మతములకు పట్టుకొమ్మ.

గుజరాత్ దేశమున దుంధూక మను ప్రదేశమున మోదవణిక్కులజుఁడు శచీకుఁడని శ్రేష్ఠి యొకఁడు వసించుచుండెను. ఈతని భార్య పాహినీ యనునది జైనమత మవలంబించి యుండెను. ఈ దంపతులకు చంగదేవుఁడని కుమారుఁడు కలిగెను. చంగదేవునికి తృతీయకులోచిత విద్యలను నేర్పుచు తండ్రి హిందువు ఇతర మతములచేత పడనీకుండ రక్షించుచుండెను. బాలునికి ఎనిమిదవ సంవత్సరము వచ్చినది. ఒకదినము తండ్రి గ్రామాంతరము పోయి యుండెను. అపుడు అకస్మాత్తుగా దేవచంద్రుఁడని జైనాచార్యుఁడు వారి యింటికి అతిథిగా వచ్చెను. పాహినీదేవి ఆయనను ఆదరించెను. బాలుఁడు ఆయనకు సకలోపచారములను చేసెను. ఆ బాలుని సౌందర్యమునకును తేజమునకును బుద్ధి వికాసమునకును ఆయన సంతోషించి ఆ బాలుని తనవెంట పంపిన తాను విద్యనేర్పి జినదేవుని సూక్తులను బోధించి జైన మతావలంబకునిగా చేసెదననియు, బాలునికి గొప్ప పదవి రానున్నదనియు చెప్పెను. ఆమెయు ఒప్పుకొని తండ్రియనుమతి లేకయే బాలుని దేవచంద్రుని వెంట పంపివేసెను. ఆచార్యుఁడు చంగదేవుని కురునావతియను నగరమునకు తన మఠమునకు కొనిపోయెను.

చంగదేవునితండ్రి యింటికి వచ్చెను. బాలుఁడు ఇంట లేఁడు. భార్య చెప్పగా విని ఆగ్రహపడి బాలుని చూచువరకును భోజనముచేయనని ఒట్టుపెట్టుకొని బాలుని వెదకుకొని పోయెను. కురునావతికి పోయి దేవచంద్రుని చూచి, బాలుని వెదకుకొని, తనవెంట పంపివేయుమని దేవచంద్రు నడిగెను. కురునావతిలో ఉదయనమంత్రియని ప్రసిద్ధుఁడు రాజమంత్రి యుండెను. ఉదయనుఁడు ఎట్లో ఆ కోమటికి మాయోపాయములచే బోధించి బాలుని జైనాచార్యుని శిష్యుని చేయుటకు ఒప్పించెను. అతఁడు తన క్రోధమంతయు మఱచి ఒప్పుకొని బాలుని వదలి తన యూరికి పోయెను.

చంగదేవుఁడు జైనమత మవలంబించి హేమచంద్రుఁడని నామాంతరము గ్రహించెను. చక్కఁగా సకల విద్యలను సర్వమత రహస్యములను గ్రహించి సూరిబిరుదము వహించెను. క్రమముగా ప్రసిద్ధుఁ డాయెను. జినదేవుని మీఁద పెక్కుశ్లోకములను వ్రాసెను. అభిధాన చింతామణి, దేశీ నామమాల, అనేకార్థమాల, ఛందోనుశాసనము, ప్రాకృత శబ్దానుశాసనము, అలంకార చూడామణి యను గ్రంథములను రచించెను.

## ౨

పశ్చిమసముద్రతీరమున స్తంభతీర్థ మని ప్రసిద్ధ జైన క్షేత్రము కలదు. హేమచంద్రసూరి అచట ఆచార్యపీఠము నధిష్ఠించెను. ఆయనమాటకు అడ్డులేదు, ఆజ్ఞకు తిరుగులేదు. జైనమత రహస్యములను బోధించి ఆయన అనేకులను జైనమతస్థులనుగా చేయుచుండెను. జైనులకు ఆయనయందు భక్తిశ్రద్ధలు హెచ్చుగా నుండినవి; ఇంకను హెచ్చుచునే యుండినవి.

ఒకదినము ఆచార్యుడు ఉదయనమంత్రి యింట నుండెను. మధ్యాహ్నకాలమున నెవఁడో బాటసారి కడుదూరము నడచివచ్చుటచే అలసినవాఁడు ఉదయనుని భోజన మడిగెను. ఉదయనుఁడు అతనిని స్నానముచేసి రమ్మనెను. స్నానము చేసివచ్చి అతిథి ఆచార్యునికి నమస్కరించెను. ఆగంతుకుని చూచుచునే ఆచార్యుఁడు ఉదయనునితో "ఈతనియందు రాజలక్షణములు కనఁబడుచున్నవి. ఇతఁడు తప్పక రాజు కాగలఁడు." అని పలికెను.

అతిథి ఆశ్చర్యపడెను; ఆచార్యునిమాటలను నమ్మలేకయుండెను. వెంటనే ఆచార్యుఁడు రెండు తాళపత్రములను తీసికొని వానిమీఁద నొకే విషయమును రెండు ప్రతులు వ్రాసి ఒకటి అతిథి చేతికిని రెండవదానిని ఉదయనమంత్రిచేతికిని ఇచ్చి చదువుకొమ్మనెను. అం దిట్లుండెను—

"౧౧౯౯ (విక్రమ) సంవత్సరము కార్తికమాసమున కృష్ణపక్షమున చంద్రుఁడు హస్తయం దుండఁగా ఆదివారమునాఁడు నీకు మకుటాభిషేకము జరుగనిచో అదిమొదలు నేను నిమిత్తజ్యోతిషమును చెప్పుట మానుకొనెదను."

ఆచార్యుఁడు: దీనిని మీకడ నుంచుకొని పరీక్షచూచుకొనుఁడు.

అతిథియు మంత్రియు ఆచార్యుల జ్యోతిషఫలము నెదురుచూడ నిశ్చయించుకొనిరి. ఆచార్యుఁడు ఆగంతుకుని చూచి 'అబ్బాయీ, నీవు రాజవైన వెంటనే, నా వాక్కు సిద్ధింపగానే, నా మత మవలంబింపవలయును సుమా' అని హెచ్చరించెను. ఆగంతుకుఁడు నమస్కారపూర్వకముగా నొప్పుకొని తన చరిత్రమును ఆచార్యునకు ఇట్లు నివేదించెను.

## ౩

అణహిల్లపురమును భీమదేవుఁడు పాలించుచుండెను. అతనికి ఉదయమతి యని భార్యయు చౌలదేవి యని వేశ్యయు నుండిరి. ఉదయమతికి కర్ణుఁడును వానికి సిద్ధరాజును జనించిరి. చౌలదేవిమీఁది యనురాగముచే రాజు ఆమెను అంతఃపురములో చేర్చుకొనెను. ఆమెకు హరిపాలుఁడు, వానికి కుమారపాలుఁడు, వానికి త్రిభువనపాలుఁడును, వానికి కుమారపాలుఁడును జనించిరి. ఈ యాగంతుకుఁడే ఈకడపటికుమారపాలుఁడు. జ్యోతిషికులు కుమారపాలుని జాతకమును చూచి అప్పటి పాలకుఁడగు సిద్ధరాజువెనుక నీతఁడు రాజగునని చెప్పిరి. క్షత్రియాపుత్రుఁడును పాలకుఁడు నగు నారాజు అక్షత్రియాపుత్రుఁడని కుమారపాలుని గర్హించుచుండెను; వధించుటకు సయిత మొక సమయము వేచియుండెను. కుమారపాలుఁడు కొంతకాలము దాగియుండెను; సన్న్యాసులలో చేరి దేశములు తిరుగుచుండెను.

ఒకప్పుడు కుమారపాలుఁడు రాజధానికి చాటుగా వచ్చి సన్న్యాసుల మఠములలో నొకదానియందు దాగియుండెను. ఇట్లుండఁగా నొకదినము సిద్ధరాజు తండ్రి శ్రాద్ధదినము వచ్చినది. ఆ దినము రాజు అనేకులకు సన్న్యాసులకు పూజచేయ నెంచి ఆహ్వానించెను. కుమారపాలుఁడును తప్పనిసరిగా పోవలసివచ్చెను. సిద్ధరాజు సన్న్యాసుల పాదములు కడుగుచు, కుమారపాలుని పాదములను చూచి లక్షణములచే వెంటనే ఆనవాలు పట్టెను. కుమారపాలుఁడును అతని ముఖవికారముచే అభిప్రాయమును గ్రహించి సందుచూచుకొని పాఱిపోఁదొడఁగెను. సిద్ధరాజు భటులు తఱుమఁగా మొదట నొక కుమ్మరివాని యింటను, వెనుక నొక సేద్యగాని తోటలో పొదవెనుకను దాగియుండి వారిని తప్పించుకొని మకల పోసాఁగెను.

చేత దమ్మిడీ లేక, అరచేత ప్రాణ మెంచుకొని యాతఁడు పోవుచుండెను. మార్గమందొకచోట ఎలుక యొకటి తన కలుగునుండి ఇరువదియొక్క బంగారు నాణెములను ఒకటొకటిగా వెలికి దెచ్చుచుండఁగా చూచెను. వెనుక నా యెలుక వానియం దొకదానిని లోనికి కొనిపోయినది. వెంటనే కుమారపాలుఁడు ఆ మిగిలిన ఇరువది నాణెములను అపహరించెను. పాపము! ఆయెలుక ఆ నాణెములకై వెదకి అతఁడు చూచుచుండగా ప్రాణము వదలెను. కుమారపాలుఁడు తన పనికి చాల దుఃఖించి, దారిబత్తెము సంపాదించుకొన్నవాఁడై, మరల తన దారిని పోసాఁగెను.

మూఁడుదినములు అడవిమార్గమున అన్నపానములు లేక ప్రయాణము చేసినవెనుక అతనికి గొప్పపరివారములో తండ్రియింటికి పోవుచున్న స్త్రీ యొకతె కనఁబడినది. అతనియందు దయగొని యామె యన్నపానాదులచే నాతనిని సేదదేర్చి వెంట గొనిపోయినది. ఈ విధముగా ప్రయాణముచేసి ఆమెను వదలి యాతఁడు స్తంభతీర్థమునకు వచ్చినాఁడు; హేమచంద్రసూరిని దర్శించినాఁడు.

౪

ఉదయనమంత్రి కుమారపాలుని సత్కరించి కావలసిన పరికరములతో మాళవమునకు పంపించెను. కుమారపాలుఁడు ఆచార్యవర్యుని చీటిలోని ప్రతిజ్ఞను చూచుకొనుచు, ధ్యానించుచు, మాళవములో కుడంగేశ్వరస్వామి యాలయమును ప్రవేశించెను. అచట భగవంతుని దర్శించి గోడలలోని చిత్రములు చూచుచు వచ్చుచుండఁగా నొకగోడమీఁద శాసనములమధ్య నొకచోట తన పే రగుపడినది. వెంటనే అతఁడు చదువగా నా శాసన మం దిట్లుండెను:

"పుణ్యే వర్షసహస్రే శతే వర్షాణాం నవనవత్యధికే భవతి కుమారపాల నరేంద్ర స్తవ విక్రమరాజ సదృశః."

"వేయియు నూటతొంబది తొమ్మిది (విక్రమ) సంవత్సర పుణ్యకాలమున ఓ విక్రమమహారాజా! నీకు సదృశుఁడు కుమారపాలుఁడని నరేంద్రుఁడు కలుగును."

కుమారపాలుఁడు దీనిని చూచి ఆశ్చర్యపడెను. ఆచార్యుల ఆదేశమును ఈ శాసనమును ఒకేవిషయమును చెప్పుచున్నవి.

ఈ లోపల అణహిల్ల నగరమున సిద్ధరాజు మరణించెను. వెంటనే కుమారపాలుఁడు అణహిల్లనగరమునకు బయలుదేరెను. నగరమును రాత్రి ప్రవేశించెను. ఆకలిదప్పులచే కడు నలసియుండినందున అట నొక పూటకూటియింట భోజనముచేసి రాత్రి యటనే గడపి వేకువను అటనుండి తన యక్కయింటికి పోయెను. ఈతని బావ కంహడదేవుఁడు అణహిల్లపురమున ప్రధానమంత్రిగా నుండెను. సిద్ధరాజునకు సంతానము లేదు. తనవెనుక యోగ్యు నొకనిని రాజకులమునుండి నియమింపవలసినదని మంత్రి కేర్పాటుచేసి యాతఁడు గతించెను.

కంహడదేవుఁడు కుమారపాలుని చేరదీసి మరునాఁడు తన వెంట ఆస్థానికి కొనిపోయెను. ఇంకను కంహడదేవుఁడు రాజును నియమింపలేదు. నాఁడు ఆపని కావలసియుండెను. కొలువుకూటమున ఉద్యోగస్థులందఱును వచ్చియుండిరి. మంత్రి ఎల్లవారి యెదుటను తొలుత రాజబంధువు నొకనిని సింహాసనాసీనుని చేసెను. ఈ రాజబంధువు చేతగానివానివలె నుండెను. చక్కగా నిలువనైన లేదు; పడిపోవుచున్న తన యంగవస్త్రమును చక్కదిద్దుకొననైన లేదు. వికారముగా నుండెను. శకునజ్ఞులు వానిని మాని మఱియొకనిని కూర్చుండబెట్టు మనిరి. ఈరెండవవాఁడు పయికము పిటికివానివలె సింహాసనము మీఁద నొదిగి చేతులు జోడించుకొని కూర్చుండెను. సభలోని పెద్దలు అడిగిరి, "ఏలినవారు ఏవిధముగా నీ పదునెనిమిది రాష్ట్రములను పాలింప నెంచియున్నారు." అని. "మీవంటి పెద్దల యాజ్ఞలకును ఆలోచనలకును లోబడియే గదా" అని అతఁడు బదులుపలికెను. "ఇతఁడు కేవలము మృదువు; పనికిరాఁడు." అని వానిని మాని కుమారపాలుని రాజబంధువు కాన కూర్చుండు మనిరి. వెంటనే యాతఁడు ఠీవితో సింహాసనము నధిష్ఠించెను. అతని గాంభీర్యము నకును కత్తిని ధరించిన సౌరునకును ఎల్లవారును హర్షించిరి. మరల నీతనిని ఆ ప్రశ్నయే మంత్రులు వేసిరి,

తటాలున కుమారపాలుఁడు ఒరనుండి కత్తిమాసి సభ యంతయు ఉఱిమిచూచినాఁడు. సభయంతయు సంతోషించినది. వెంటనే కుమారపాలుని పట్టాభిషేకము జరిగినది; సూరివర్యుని జ్యౌతిషమును ఘటించినది.

కుమారపాలునికి ఏబదియైదు సంవత్సరములు. బాల్యమునుండియు కష్టముల ననుభవించి విదేశములు తిరిగియుండుటచే చక్కని యనుభవ మేర్పడియుండెను. రాజ్యము చేతికి వచ్చినంతనే యాతఁడు స్వతంత్రపాలన మారంభించెను. మంత్రులలో అసహన మారంభమాయెను. కొందఱు మంత్రులు కుమారపాలుని చంపనెంచి, ఆతఁడు అంతఃపురమున కొక చీకటిమార్గమున పోవుచుండఁగా చంపివేయుఁడని ఘాతుకులకు ఆజ్ఞయిచ్చిరి. ఎవరో తెలుపఁగా కుమారపాలుఁడు వారిని చంపివేసెను.

కుమారపాలుఁడు రాజ్యమందు చక్కఁగా కుదురుకొనెను. వెంటనే నాఁడు తాను పాఱిపోవుచుండగా తన్ను కాపాడిన యా కుమ్మరివానికి ఏడువందల గ్రామములనిచ్చి బహుమానించెను. ఆ సేద్యగానిని కూడ అట్లే సన్మానించెను. స్తంభతీర్థమున తనకు సాయముచేసిన ఉదయనమంత్రికుమారుని ప్రధానమంత్రిగా చేసికొనెను.

దిగ్విజయ మారంభించెను. మాళవము, కొంకణము, శ్రీనగరము, కంచి, త్రైలింగము మొదలగు దేశములను జయించెను. ఆర్యావర్తమందలి రాజులు తమంతనే అతనికి మ్రొక్కిరి. కాశీపతి స్వయముగానే వచ్చి కుమారపాలునికి పరిచర్య చేయసాఁగెను; మగధ రాజు గొప్ప మణులను కానుకపంపెను; గౌడుఁడు ఏనుగుల నిచ్చెను. దశార్ణకన్యాకుబ్జేశ్వరులు దేశములనే త్యజించి పాఱిపోయిరి. కుమారపాలమహారాజు చక్రవర్తి యాయెను.

కుమారపాలుఁడు మాళవములో నుండఁగా హేమచంద్రసూరి దర్శనమునకు వచ్చెను. ఆయనవెంట ఉదయనమంత్రియు వచ్చి సూరివర్యునినాటి పరిచితునిగా నెఱింగించెను. ఆచార్యుఁడు చక్రవర్తి తనకు నాఁడు చేసిన ప్రమాణమును చెల్లింపుమని యడుగలేదు; మఱి తనతల్లి మరణించినదనియు తా నామెకర్మలను చేయుచుండఁగా శైవులు హిందువులు బాధించిరనియు, తన మతమునకు రక్షణ వలయుననియు కోరెను. కుమారపాల చక్రవర్తి నాఁడు తనకు స్తంభతీర్థమున జ్యౌతిషము చెప్పిన గురువును, ఆయనకు తానుచేసిన వాగ్దానమును స్మరణకు తెచ్చుకొని వెంటనే సూరివర్యుని ఆదరించెను.

౫

ఆస్థానమందలి బ్రాహ్మణులు జైనాచార్యునికి కలుగుచున్న పేరుప్రతిష్ఠలకును, రాజానుగ్రహమునకును ఓర్వలేకపోయిరి. ఎట్లయినను అతనిపతనమునే కోరుచు నిందలను మోప మొదలిడిరి.

హేమచంద్రసూరి ఎంతపండితుఁడో అంతగొప్ప మతప్రవక్తయో అంతలౌకికుఁడు, మంచివక్త, సభారంజకుఁడు, ఉపాయముల నెఱిఁగినవాఁడు, సమయోచితముగా ప్రవర్తింపఁ గలిగినవాఁడు, కార్యసాధకుఁడు. రాజు అతని మాటజతీరునకే సగము ముగ్ధుఁడగుచుండెను. కొందఱు కవులు 'చంద్రుని ప్రకాశమును చూచి సముద్రుఁడు సంతోషముచే పొంగినట్లు కుమారపాలమహారాజు హేమచంద్రుని మాటలకు ఉప్పొంగుచున్నాఁడు' అని సయుక్తము వర్ణించిరి.

ఒకప్పుడు బ్రాహ్మణులు రాజుతో, హేమాచార్యుఁడు పరమపాషండుఁ డనియు, సూర్యోపాసన చేయఁ డనియు, ప్రత్యక్షదైవమునే ఒల్లఁ డనియు చెప్పిరి. రాజు ఆచార్యుని "ఇదేమి నిజమా!" అని యడిగెను.

ఆచార్యుఁడు 'ఎంతమాత్రముకాదు. ఈ తేజఃపుంజమును నేను నిరంతరము నా హృదయమున ధ్యానించుచున్నాను. ఇదికనఁబడనిచో నేను భోజనము చేయను. దీని యస్తమయకాలమున అన్నాహారములను వర్జించెదను గదా' అనెను.

సూరివర్యుఁడు సాధుమార్గమవలంబించి హిందూ బౌద్ధ ధర్మశాస్త్రములను సయుత ముదాహరించుచు తనకు హిందూ జైన బౌద్ధ మతములయందు సమాన గౌరవము కలదని చెప్పుచు 'అన్యులమనముల్ నొప్పింపక తానొవ్వక తప్పించుక' తిరుగుచుండెను. ఈతని

అండఁజూచుకొని జైనులు మరల తలయెత్తుకొని తిరుగ సాగిరి.

కుమారపాలుఁడొకప్పుడు ధర్మకార్య మేదైనను చేయ సంకల్పించి ఆచార్యుని అడిగెను, 'ఏధర్మకార్య మువీఁద ధనము వ్యయింపవచ్చును" అని. కుమార పాలుఁడు అప్పటి కింకను జైనుఁడు కాలేదు. ఆతఁడే స్వయముగా జైనుఁడగుట మంచిదని ఆచార్యుఁడును తగినట్లు వర్తించుచుండెను. "ప్రభాసపట్టణమున సోమనాథతీర్థమును శివక్షేత్రమును మ్లేచ్ఛులు పాడుచేసిరి గదా. దానిని మరల ప్రతిష్ఠింపుము." అని ఆచార్యుఁడు చెప్పెను. వెంటనే రాజు సోమనాథతీర్థమునకు ఉద్యోగస్థులను పంపి ఆలయనిర్మాణమును ప్రారంభించెను. కొంతకాలమునకు ఆలయమునకు పునాదులు లేచినవనియు, నిర్మాణము చక్కఁగా కొనసాగుచున్న దనియు వార్త వచ్చినది. రాజు ఆచార్యుని అడిగెను. "స్వామీ ఈ కార్యము అంతరాయములేక జరుగుట కేమి ఉపాయము?" ఆచార్యుఁడు "ఈ కార్యము ముగియువఱకు స్త్రీ స్పర్శచేయనని వ్రతము పూనుము లేదా మాంసాహారమును అంతవఱకును మానివేయుము" అనెను. వెంటనే రాజు శివలింగమునకు అభిషేకముచేసి అట్లే రెండవప్రమాణమును చేసికొనెను.

రెండు సంవత్సరములు గడచినవి. సోమేశ్వరాలయ గోపురము సయితము తయారైనది. కలశముల నుంచుటయే కొదువ. రాజు ఆచార్యునితో తాను వ్రతమును సమాప్తిచేసెద ననెను. ఆచార్యుఁడు వల దనెను. "ఈ వ్రతముతోనే నీవు మహాదేవుని దర్శనము చేయుట బాగు. గోపురదర్శనమైనవెంటనే నీవు వ్రతమును మానుకొనవచ్చును." అనెను.

బ్రాహ్మణులు, ఆచార్యుని పరీక్షించుటకు ఇదే సమయ మని తలంచి, "ఇతఁడు జైనుఁడు గదా, సోమనాథపురమునకు రాఁడు. ఆలయములో ప్రవేశింపనే ప్రవేశింపఁడు. పైగా ఈశ్వరలింగమునకు ఎంత మాత్రము మ్రొక్కఁడు. అంతయు నటన. లోకుపాటి మనుష్యుఁడు. వీనిని చక్కఁగా ఇప్పుడే పరీక్షింపవలసినది. మర్మము బయటపడును" అని రాజుతో కంట గొట్టిరి. రాజు ఆచార్యుని తమ వెంట రమ్మనెను. ఆచార్యుఁడు, "ఇది నాకు చెప్పవలెనా? మీకన్నముందే సోమనాథుని అర్ధేందుమౌళిని దర్శించుటకు నేను సిద్ధముగా నున్నాను." అనెను. ఆచార్యుఁడు ద్వారక, శత్రుంజయము మొదలైన క్షేత్రములను నడచిపోయియే దర్శించి దేవపట్టణమున కుమారపాలుని కలసికొనవలయునని రాజు ఏర్పాటుచేసెను. అన్నిటికిని హేమచంద్రుఁడు సరియే యనెను. ఏ యుపాయమునకైనను ఆతనిని పట్టుటకు శైవులకు సాధ్యము కాలేదు.

ప్రయాణము లారంభములైనవి. రాజు గొప్ప పరివారముతో ప్రభాసపట్టణమును ప్రవేశించెను. ఆలయ పూజాధికారి బృహస్పతియను బ్రాహ్మణుఁడు ఎదురు పోయి రాజును పిలుచుకొనిపోయెను. హేమచంద్ర సూరియు తీర్థములు తిరిగి రాజును అచట కలసికొనెను. ఎల్లవారును భజనతో ఆలయమును ప్రవేశించిరి. కుమారపాలుఁడు భగవంతుని లింగమునకు సాష్టాంగముగా మ్రొక్కెను.

హేమచంద్రసూరియు ఆలయములో ప్రవేశించుచు గర్భగృహముగడపకడ నిలిచి "దేవదేవుఁడు, కైలాసనాథుఁడు, ఇదుగో ఇచ్చట సాక్షాత్తుగా వెలసి యున్నాఁడు." అని లోపలికివచ్చి ఆగమోక్తప్రకారము శివలింగమును పూజించి ఎల్లవారియెదుటను భగవంతుని ఇట్లని: స్తుతించెను. "దేవా, భగవంతుఁడా, నీకొకస్థలము లేదు. నీకొక వేళ లేదు. నీకొక పేరులేదు. నీవు ఎల్లయెడలను కలవు. నీలో ఎట్టిదోషమును లేదు; నిన్ను ఎట్టి దోషమును చెందదు. నీవు-భగవంతుఁడవు-ఒక్కఁడవే. నీకు నమస్కారము. భవపాశములను ఆశలను త్రుంచిన వాఁడవు నీవు, బ్రహ్మవగుదువో, విష్ణువగుదువో, శివుఁడవగుదువో, ఎవరవైన నగుదువుగాక, ఎవరైననేమి,- భగవంతుఁడవు. నీకునమస్కారము." సూరివర్యుఁడు ఈ విధముగా చెప్పుచుండఁగా రాజు మంత్రులు ఇతరమతములవారు అందఱును ఆశ్చర్యపడి ఆతనిని చూచుచుండిరి. తటాలున ఆచార్య హేమచంద్రుఁడు లింగమునకు

సాష్టాంగముగా నమస్కరించెను. ఆచార్యుని మాటల ద్వంద్వార్థమును వారు పరికింపలేదు.

అనంతరము రాజు బృహస్పతి సాయముతో భగవంతుని అర్చించి తనఎత్తు బంగారమును ఎల్లవారికిని పంచిపెట్టెను; ఏనుఁగులను దానముచేసెను. వెనుక భగవంతునికి హారతియెత్తిరి. అంతయు ముగియగానే రాజు ఎల్లవారిని పంపివేసి తాను ఆచార్యునితో గర్భగృహమును ప్రవేశించెను. తలుపు గడియవైచికొనెను.

రాజడిగెను: ఇన్నిమతము లున్నవిగదా వీనిలో స్థిరమును సత్యము నైనదానిని స్థాపింప వలయునని నా యుద్దేశము. సోమేశ్వరునివంటి దైవము లేదు; నావంటి రాజులేఁడు. నీవంటి ఆచార్యుఁడు లేఁడు. నా యదృష్టముచేత అన్నియు సమకూడినవి. మహాత్మా, చెప్పుము ఈ దేవుని ఎదుట నీ సత్యవాక్కులచేత మోక్షమునొసగు సత్యమార్గమును.

సూరివర్యునికి సమయము దొరకినది. "పురాణోక్త విషయములు మనకు అప్రసక్తములు. ఈ సోమేశ్వరుఁడే మనకు ప్రత్యక్షము కాఁగలఁడు. ఆయనవాక్కు నీవు వినగలవు. నిస్సందేహముగా నీ ప్రదేశముననే దేవుఁడు నెలసియున్నాఁడు. నే నిట కూర్చుండి జప మారంభించెదను. రాజా! నీవు ధూపము వేయుచుండుము. త్రినేత్రుఁడు భగవంతుఁడు స్వయముగా వచ్చి నిన్ను నివారించును. కానీ చూడు:" అనెను.

ఇరువురును ఉపక్రమించిరి. హేమచంద్రుఁడు ధ్యానమున మునిఁగినాఁడు; కుమారపాలుఁడు ధూపముచే గది నింపినాఁడు. కొన్ని నిముషములు గడచినవి. తటాలున మూలస్థానమునుండి జ్యోతి యొకటి యావిర్భవించినది. రాజు తటాలున లేచి వెఱఁగుపడి చూడలేక కన్నులు మూసికొని కష్టముమీఁద తెఱచినాఁడు. మూలస్థానమున త్రినేత్రుఁడే సాక్షాత్తుగా కనఁబడుచున్నాఁడు. ఆప్రకాశమును కుమారపాలుఁడు చూడలేకపోయినాఁడు; పోయిన తెలివిని ఎట్లో తెచ్చుకొని సాగిలఁబడి భగవంతుని స్తుతింపసాగినాఁడు "లోకాలోకేశ్వరా, నిన్ను పూజించుటచే నాకన్నులు తనిసినవి. కాంక్షితమును గంటిని. ప్రభూ, నీయాజ్ఞకు బద్ధుఁడను. ఏదైనను అనుగ్రహింపుము. నానేత్రములను తనిపితివి. నాచెవులకు పండువుసేయుము." అనెను.

భగవంతునిమొగము మఱింత చక్కఁగా ప్రకాశించినది. వెంటనే ఈవాక్యములు గర్భగృహమునుండి వినఁబడినవి. "ఓయి, రాజా! ఈ హేమచంద్రుఁడు ఎల్లదేవతల యవతారముసుమా. ఈతనివాక్యములు సత్యములు. ఈతనియందు ఎంతమాత్రము కపటము లేదు. ఈతని నాశ్రయింపుము. ఇతఁడు నీకు మోక్షమార్గమును బోధించును. భూత భవిష్య ద్వర్తమానముల నెఱిఁగిన జ్ఞాని సుమా యితఁడు ఎల్లరహస్యములును ఈతనికి కరతలామలకములు. ఈతనిని చక్కఁగా ఉపాసింపుము. నీకు మేలు కలుగును." అని పలికి భగవంతుఁడు అంతర్ధానమాయెను.

౬

రాజును ఆచార్యుఁడును అణహిల్ల నగరమునకు వచ్చిరి. కుమారపాలుఁడు సూరివర్యునకు శిష్యుఁడాయెను. ఆచార్యుఁడు ఆతనికి జైనమత రహస్యములను బోధించెను. నాటినుండియు కుమారపాలుఁడు జైనుఁడు. ఆచార్యుని యుద్దేశము నెఱవేరినది. ఆచార్యుని యాజ్ఞమీఁద రాజు తన రాజ్యములో పదునాలుగేండ్లు పదునెనిమిది రాష్ట్రములలోను ప్రాణివధ జరుగకూడదని శాసించెను. జైనమత ధర్మములను పాటింపవలయునని అనుశాసించెను. యజ్ఞయాగాదులలో బ్రాహ్మణులు పశుబలికి బదులు పిండివంటకముల నుపయోగింపసాగిరి. పల్లెలలో సయితము రాజశాసనమును ఎల్లవారును పాటించుటచే కృష్ణాజినము దొరకదయ్యెను. విశేష మాంసభోజనులు పాంచాలురు రాజశాసనమునకు వెఱచి యూరకుండిరి. మాంసవిక్రేతల వ్యాపారములు సన్నగిల్లినవి. వారికై రాజు వారి పదునాలుగేండ్ల యాదాయముపాటి ధనమును ఉచితముగా నొసంగెను. కాని కాశీప్రాంత్యపు ప్రజలు మాత్రము యథాపూర్వము ప్రాణివధ చేయుచునే యుండిరి. సనాతనులు జైనుల యైశ్వర్యము చూడలేకయు, ఈబాధలు పడలేకయు,

ఏమి చేయుటకును సాధ్యము కాకపోవుటచే సమయము కొఱకు వేచియుండిరి.

హేమచంద్రుని అధికారమే ఇప్పుడు సాగుట. కుమారపాలునిది కాదు. సోమనాథ దేవాలయారాధకుఁడు బృహస్పతియను నా బ్రాహ్మణుఁడు ఒకనాఁడు ఏదో సందర్భమున తన్నెఱుఁగక జైనమతమును దూషించెను. వెంటనే ఆచార్యుఁడు అతనిని అధికారమునుండి తొలఁగించెను. ఆ బ్రాహ్మణుఁడు భయపడి వెంటనే అణహిలపురమునకు పోయి ఆచార్యుని దర్శించి ఆయన పాదములలోపడి రాజునకు సిఫారసు చేయించుకొని మరల తన యుద్యోగమును తెచ్చుకొనెను.

హేమచంద్రుని అధికారము విశృంఖలముగా నుండెను.

౨

కుమారపాలుని రాజ్యమున నిది ముప్పదియవ సంవత్సరము. రాజునకు కుష్ఠురోగము తగిలెను. ఆకాలముననే సూరీశ్వరుఁడు, ఎనుఁబదియేండ్ల వృద్ధుఁడు, తనకు మృత్యు వాసన్నమైనదని తెలిసికొని నిరశనవ్రతమవలంబించి ప్రాణము త్యజింపనెంచెను. కుమారపాలుని చూచి "రాజా! నాకు మృత్యువాసన్న మగుచున్నది. నావెనుక నీకు ఆఱునెలలకే ఆయువు ముగియును. నీ వేల నీకృత్యములను ముగించుకొనరాదు" అని హెచ్చరించెను.

కుమారపాలుఁడు జైనమతమును రాజ్యమందు బలపఱచుటకై సనాతనమతావలంబకులను బ్రాహ్మణుల నందఱును తనరాజ్యము వదలిపొమ్మనెను. వారు తనరాజ్యమును వదలుటకు దినము నియమించి ఎదురు చూచుచుండెను. ఏమిచేయుటకును తోచక బ్రాహ్మణులు జగద్గురువునకు శంకరాచార్యునకు విన్నవించుకొనిరి. ఆయనయు అకస్మాత్తుగా ఆసమీప ప్రదేశమునకు వచ్చియుండెను. ఎట్లయినను ఆర్యమతమును నిలుపుఁడని ఆయనను బ్రాహ్మణులు వేడుకొనిరి.

ఆ మఱునాఁడే బ్రాహ్మణులు రాజ్యమును వదల వలసియుండెను. రాజు వారిని పిలిపించి "మీకు నేనిచ్చిన కాలము ముగిసినది. ఇక కాలము ఈయను. నా రాజ్యమును వదలుఁడు, లేదా జైనుని ఉపాసింపుఁడు. వేరు మార్గము లేదు." అనెను. వెంటనే శంకరాచార్యుఁడు ముందడుగుంచి "రాజా! ఆవసరపడకు. మనమందఱమును కలసియే, మొత్తముగానే రాజ్యమునేకాదు లోకమునే వదలి పోవచ్చును."అనెను.

రాజు: అదేమి?

శంకరుఁడు: తొమ్మిది గంటలకు జలప్రళయము రానున్నది. సముద్రముపొంగి లోకమునంతయు మ్రింగనున్నది. సృష్టియంతయు నీటిలో మునిఁగిపోవుచుండఁగా వీరిని మాత్రము పొమ్మనెదవేమి? ఏమియు నెఱుఁగవు గదా!

రాజునకు ఆశ్చర్యమును దిగులును కలిగినవి. వెంటనే తనగురువునకు చెప్పిపంపెను. ఆచార్యుఁడు రాగానే "స్వామీ! ఇదేమి. యుగాంతకాలము నేఁడే అగునా? ప్రళయమువచ్చునా?" అనియడిగెను. హేమాచార్యుఁడు నవ్వి "ఎంతమాత్రము కానేరదు. ఈ ప్రపంచమునకు నిర్మాత లేఁడు. దీనికి అంతమును లేదు. ప్రకృతి అనాది సిద్ధము." అని జైనమతసారము నుపదేశించెను. శంకరాచార్యుఁడు "జలయంత్రమును పెట్టి కాలము నెదురుచూడుఁడు,తొమ్మిదిగంటల కేమి జరుగునో చూతము."అనెను. అంతట మువ్వురుమగడియారముకడకూర్చుండి ప్రళయము నెదురుచూడసాఁగిరి. తొమ్మిదవగంటకొట్టగానే మువ్వురును మేడమీఁదికిపోయి కిటికీలకడనుండి చూడఁగా దూరమున సముద్రము పొంగివచ్చుచున్నట్లుండెను. క్రమముగా తరంగములు లేచివచ్చి నగరమంతయు క్రమ్మివేసినవి. వీథులు, జనము, ఇండ్లు, చెట్లు అన్నియు నీటిక్రిందికి పోదొడఁగినవి. రాజును, ఆయిరువురు ఆచార్యులును పైయంతస్తులోనికి పోయిరి. నీరు హెచ్చదొడంగినది. ఆ అంతస్తుసైతము మునుఁగ నారంభించినది. వారు పైకిపోవుకొలఁదియు నీరును పైకిరా నారంభించినది. క్రమముగా వారు ఏడవయంతస్తులోనికిపోయిరి. నలువైపుల చూచిరిగదా! గొప్పసౌధములును మహావృక్షములును మునిగిపోయినవి. వాని శిఖరములుసయితము మగ

పడవు. ఎటుచూచినను నీరే; మఱేమియు కనఁబడదు. దిగులుపడి కుమారపాలుఁడు శంకరాచార్యులను "స్వామీ, మఱియేమిగతి? మార్గములేదా?" అని యడిగెను. "పడమటి దిక్కునుండి యొక చిన్నపడవ ఈవైపు రానున్నది. ముందుగా అందు దుముకువానికి ప్రాణము దక్కును." అని ఆచార్యుఁడు చెప్పెను. కొంతసేపటికి దూరమున పడమటనొక పడవ కనఁబడినది. అది క్రమముగా రాజమందిరమును సమీపించెను. మువ్వురును నడుములు బిగించుకొనిరి. పడవ రాజమందిరమునకు చేరువగావచ్చి నిలిచినది. కుమారపాలుని శంకరుఁడు పట్టుకొని "మన మొకరొకరి సాయముచేత సిందులోనికి దుముకవలెను." అని పలికెను. కుమారపాలుఁడు అందులోనికి దుముకపోగా శంకరాచార్యుఁడు వెనుకకు పట్టిలాగెను. హేమచంద్రుఁడు దుమికెను.

అయ్యో! ఇకనేమున్నది? పడవలేదు, జలములేదు, ఏమియులేదు. ఇండ్లు, వీథులు, చెట్లు, జనులు, సర్వమును మునుపటియట్లె చక్కగానున్నవి. సూరివర్యుఁడు అంతఎత్తునుండియు క్రింద రాతికట్టడము మీఁదపడి తలపగిలి మరణించెను.

---

# నిర్వ్యాపారత

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

మగవాడు పూట్లా కడుపు విచ్చేలాగ తింటూ, యేపనీ చెయ్యకుండా సోమరిపోతుగా కూచోడం, కాపురుషలక్షణం అని మన పూర్వులు నిర్వచించారు.

అది, కోపమూ గర్వమూ-ఇలాంటి దుర్గుణ మనీ, పురుషులకు తగని దనీ, విడిచిపెట్టెయ్యవలసిన దనీ వారు దాన్ని చాలా యేవగించుకున్నారు.

ఏపూట కాపూటే బియ్యపు నూకల కోసం తడుముకోవలసిన పాటకప్రజనమూ పని చెయ్యవలసిందే.

ప్రతీ వస్తువూ కాళ్ల దగ్గిరికి తెచ్చి దాఖలుచేసే రైతులు గల యినాందారూ పనిచెయ్యవలసిందే.

అన్నం కలిపి నోటి కందించడానిక్కూడా నౌకర్లు గల చక్రవర్తీ పనిచెయ్యవలసిందే.

ఈ విషయంలో వారు యేతరగతివారినీ మినహాయించ లేదు.

దీన్ని పట్టి చూస్తే అప్పుడు పని లేకపోవడం అనేది వుండినట్టు కనపడదు.

"నువ్వే చెయ్యవలసినవి, అన్ని పనులు అలా మురిగిపోతూవుండగా, ఏమి టబ్బాయీ, ముద్దులాగ అలా కూచుంటావూ?" అని మందలించడానికా అన్నట్టుంది యీ సూత్రం.

కాని,

"చేద్దా మంటే పని దొరక్కుండా వుం" దని యిప్పటి యువకులు గోలపెడుతున్నారు.

ఈ గోలపెట్టేవారిలో ప్రైమరీ మొదలు పట్ట పరీక్షల దాకా చదివి ఉత్తీర్ణు లైనవా రున్నారు.

అసలు, పరకాయించి చూస్తే, చదువుకున్నవారిలోనే యీగోల కనపడుతూ వుంది.

ఈ నిర్వ్యాపారుల సంఖ్య తక్కువగా కూడా లేదు.

ఏ రోజు కారోజు వృద్ధిపొందుతూ అయిపోతోంది

దీన్ని పట్టి చూడగా, దొరతనంవారి విద్యాశాఖా, అటు దొరతనమూ ఇటు ప్రజలూ కూడా పూచీ పెట్టుకోకుండా వున్న విశ్వకళాపరిషత్తులూ విద్యార్థులకు బదులు నిర్వ్యాపారులను తయారుచేస్తున్నాయా అని సందేహించవలసినట్టు కనపడుతూ వుంది.

ప్రస్తుతం యీ నిర్వ్యాపారత ఆంధ్రదేశంలో బాహాటంగానే-నడివీధిలోనే చిందులు తొక్కుతూ వుంది; కాని రహస్యంగా-అంతఃపురాల్లో కాదు.

అయితే,

యువకుల గోలకన్నకంటే, మన రాజకీయ పక్షాలవారి మానిఫెస్టోలవల్ల యిది యెక్కువగా వెల్లడి అవుతూ వుంది.

ఇప్పటికి పదహారుసంవత్సరాలనుంచి అవిచ్ఛిన్నంగా అధికారం చెలాయిస్తూ వున్న జస్టిసు పక్షంవారూ యీ నిర్వ్యాపారతను నిర్మూలించేస్తా మంటున్నారు.

సుమారు అంతకంటె యెక్కువ రోజులనుంచే నిర్మాణకార్యక్రమం అంటూ భేరీలు మోగిస్తూ వున్న కాంగ్రెస్సుపక్షంవారూ దీన్ని రూపుమాపుతా మంటున్నారు.

నిన్న కాక మొన్న బయలుదేరి యింకా చక్కగా గడికట్టని పీపిల్సుపక్షమువారూ దీన్ని వెళ్లగించివేస్తా మంటున్నారు.

తతిమ్మా విషయాల మాట యే మయిపోయినా, యీ నిర్వ్యాపారత విషయంలోనేనా యీ మూడు

పక్షాలవారూ యిలాగ యేకాభిప్రాయానికి రావడం బాగానే వుంది.

కాని,

ఒక పక్షంవారూ "ఇదిగో యీ విధంగా దీనికి ప్రతిక్రియ చేస్తా" మని చెప్ప రేం?

ఇదీ కాక:

నిజంగా వుద్దేశం వుండి, చెయ్యడానికి దీక్ష కూడా వుంటే యెప్పుడో చేస్తా మనడం యేమిటీ?

అసని యిప్పుడే యెందుకు మొదలు పెట్టకూడదూ?

పైగా,

జస్టిస్ కాంగ్రెస్ పక్షాలవారు ఇదివరకల్లా యేం చేశారూ?

దీనికి జవాబు కనపడదు.

ధోరణి చూడగా,

రేపు ఫిబ్రవరిలో జరిగే శాసనసభల యెన్నిక లలో, కళ్లు మూసుకుని ప్రజ లందరూ యేపక్షంవారికి వోటు చేస్తారో,

ఆవిధంగా మెజారిటీ కలిగించి యేపక్షంవారికి మంత్రిపదవులు దఖలు పరుస్తారో,

ఆపక్షంవారు ఈపని చేస్తా రన్న మాట.

లేకపోతే వారి పూచీ యేమీ లే దన్నమాట.

ఇదీ మర్మం.

అయితే,

శాసనసభలో మంత్రిపదవులు స్వాధీనపడితే గాని యీ నిర్వ్యాపారతను నివారించడాని కెవరికీ మార్గాలు లేవూ?

బయటనే వుండి యీ పని యెవరూ చెయ్య లేరూ?

హిందూదేశంలో-అందులోనూ ఆంధ్రదేశంలో కనక యీ ప్రకటనలు చెలామణీఅయిపోతున్నాయి.

నిజంగా యీరాజకీయపక్షాలవారు ప్రజలను మృగాలుగా భావించి నట్టుంది.

ప్రజలు అంధులు కారనీ, అవివేకులున్నూ కారనీ తెలుసుకుని వుంటే-అథవా, ప్రజలేనా తెలియ పరచగల స్థితిలో వుంటే వీరు ఇంత నిర్లక్ష్యంగా ప్రకటనలు చేసివుండకపోదురు.

అసలు ఈ మన రాజకీయపక్షాలవారికి ఆంధ్ర దేశపరిస్థితులు లేశమేనా అవగాహన అయివున్నట్టు తోచదు.

గ్రేటుబ్రిటనులో - ఫ్రాన్సులో - అమెరికాలో-ఇంకా అలాంటి దేశాలలో-అక్కడి రాజకీయపక్షాలవా రిలాంటి ప్రకటనలు చేస్తా రంటే అందులో గంభీర మయిన అర్థం వుంటుంది

ఏమి టంటే?

అక్కడి యువకులకు చాలామందికి పను లేవు. చెయ్యతగ్గ పను లన్నీ యిదివరకే భర్తీ అయి పోయివున్నాయి

జీవితానికి ఆవశ్యకా లైన వస్తువులు, ఏరోజు కారోజే కొత్తకొత్తవి కావలసివస్తూవున్న యీరోజు ల్లో, వారు, దేనికోసమూ-చివరకి గుండుసూదికోసం కూడా యితర దేశాలమీద ఆధారపడివుండరు. కనక, అసలు, అక్కడ, పనులే మన దేశంలోకంటే కొన్ని లక్షల రెట్లు ఎక్కువ.

పైపెచ్చు, నవనాగరికత పేరిట, ఆదేశాలలో, అనేకలక్షల యువకులు అనవసర మైన వస్తువులను సృష్టిస్తూ యిప్పటికే యెన్నో వింతపనులు కల్పించు కుని, అక్కడి యువయువతులకు బలవత్తరంగా వాటి మీద వ్యామోహం పుట్టించి, అపార మైన డబ్బు ఆర్జించుకుంటూ లక్షణంగా పొట్టపోసుకుంటున్నారు

ఇంతే కాక:

ఆదేశాల దొరతనాలవారు, తమ ఆధీనంలో వున్న అనేక యితర దేశాలలో సివిలుమిలిటరీశాఖలలో చెప్పకోతగ్గ పదవులు దఖలుపరిచిన్నీ, యితరవిధాల

కూడా యెన్నో పరిస్థితులు కల్పించిన్నీ తమతమ దేశీయయువకులలో అనేకలక్షలమందికి మంచిమంచి వరుమానాలు సమకూర్చి నిర్వ్యాపారత అంటే యేమిటో యెరక్కుండా చేసీ, చేస్తూనూ వున్నారు.

అయినా, యింకా అక్కడ పనిలేనివారు లక్షల కొద్దీ వున్నారు.

కడుపునిండా అన్నం పెడితే, వారు, కొండలు పిండికొట్టెయ్యగలరు.

అన్నందొరికే మార్గాలు చూపించకపోతే వారు సముద్రాలు కప్పెట్టెయ్యనూ గలరు.

జాతీయసంపద అంటే, ఆదేశాలలో యువకులే మొట్టమొదట లెక్క పెట్టబడుతున్నారు.

కనక, వారికందరికీ కొత్త పనులు కల్పించాలి.

కల్పించాలంటే దయాధర్మభిక్షంగా కాదు.

తమఔదార్యం ప్రకటించుకోడానికిన్నీ కాదు.

మన దేశంలోలాగ యెవరికో కాక, అక్కడి దొరతనాలు ఆయువకులకున్నూ జవాబ్దారీ వహించి వున్నాయి.

అంచేత, అవి, వారికి విధిగా పనులు కల్పించి తీరాలి.

అలా కల్పించడంలో, ఆపనులు, యువకులకు నిర్వ్యాపారత పోగొట్టగలిగేటట్టేకాక, జాతీయతకు పుష్టికలిగించేటట్టు-దేశానికి ఐశ్వర్యమూ బలమూ సమకూర్చగలిగే టట్టు ఉండాలి.

అధికారం స్వాధీనపరుచుకోడానికి ప్రయత్నాలు సాగించే రాజకీయపక్షాలవారికి ఆదేశాలలో యిది వొక పరీక్ష.

ఇది వారికి, అగ్నిపరీక్షకంటేనూ తీవ్రమైనది. కనక వారు ఈనిర్వ్యాపారతను తొలిగిస్తామనే ప్రతిన తమతమ మాని ఫెస్టోలలో వుదాహరించుకుతీరాలి.

తరవాత,

ఒకొక్కక్క రాజకీయపక్షంవారికి దేశస్థితి వొకొక్కక్కవిధంగా అర్థంఅవుతూవుంటుంది.

దాన్ని పట్టి వారు స్కీములు పన్ని కార్యక్రమాలు ఏర్పరుచుకుంటారు.

తహావ్వేలు వేసి చూసి ప్రజలు ఆకార్యక్రమాలను పరిశీలించుకుంటారు.

చివరికి ఏపక్షంవారి కార్యక్రమంలో పస కనపడుతుందో ఆపక్షంవారికి ప్రజలలో యెక్కువమంది వోటుచేసి రాజ్యాంగయంత్రం చేతి కందిస్తారు.

ఇక ఆపక్షంవారు తమ కార్యక్రమాన్ని ఆచరణలో పెడతారు.

ప్రతికూలపక్షమనే పేరున, మైనరుపక్షం వారు, అప్పుడు కూడా ప్రతిస్పర్ధ వహించి, యేమాత్రం సందు దొరికినా యెదురువాదం చేస్తూ, అనేగడుక్కీ ప్రతిష్టంభనాలు ప్రయోగిస్తూ తలప్రాణంతోకవు తెస్తూ వుంటారు.

ఈ ద్వంద్వయుద్ధంలో, అధికారంలో వుండే పక్షంవారికి, తమ లోటుపాట్లు చక్కగా విశదపడి, సవరణలు చేసుకోడానికి మంచి అవకాశాలు కలుగుతూ వుంటాయి.

వాటి నన్నిటినీ, వారు దేశోన్నతికోసం వినియోగపరచుకుంటారు.

ఈతొక్కిళ్లాటలో, వారు, మహోన్నత మైన విజయమో, అగాధ మైన అపజయమో పొందుతారు.

వ్యతిరేకమొగం వేస్తే, అక్కడి మంత్రులను ప్రజలు నిమిషాలమీద దిగలాగేస్తారు.

ఏదీ?

మన దేశంలో మన రాజకీయపక్షాలు అలాంటి కట్టుదిట్టాలతో-అంత శాస్త్రీయంగా ఏర్పడ్డ వేనా?

పోనీ,

కొత్తయిండియాశాసనంలో మంత్రులకు అలాంటి అధికారాలు ఏర్పరచబడ్డాయా?

మన మంత్రులు తమ మానిఫెస్టోల ప్రకారం రాజ్యాంగాన్ని దిద్ది చెయ్యగలుగుతారా?

మన దేశంలో పని చేస్తూవున్న గివర్నర్ల మంత్రుల స్వతంత్రనిర్ణయాలను అమలుజరుపడానికే ఏర్పరచ బడ్డారా?

అసలు, వారికేనా స్వతంత్రంగా వ్యవహరించ డానికి వీల్లు ఉన్నాయా?

ఇది యిలా వుండగా,

గత్వా గత్వా,

మనకు, ఈక్షణంలోనే సంపూర్ణ స్వాతంత్ర్యం-బ్రిటిషువారి కెలాంటి జోక్యమూ లేని పదహారుఅణాల స్వరాజ్యం వచ్చినా, చదువుకున్నవారి కందరికీ సర్కారుద్యోగాలే యివ్వడానికి సాధ్యంఅవుతుందా?

మన విద్యావిధానం జాతీయతకు అనుకూలంగా ఏర్పరచబడినా మన విశ్వకళాపరిషత్తులకు ఇప్పటికంటే యెక్కువ-అనగా వుండవలసినంత స్వాతంత్ర్యం వచ్చినా అవి తాము జయపత్రా లిచ్చి దేశంమీదకి విడిచిపెట్టిన యువకుల కందరికీ సర్కారునౌకరీలే వచ్చేటట్టు చెయ్యగలవా?

ఇంతకీ:

రాజ్యాంగవిధానం అన్నది, యేదేశంలోనేనా నిర్వ్యాపారత తొలగించడానికి యేదోవిధంగా అను కూల్యాలే చూపిస్తుంది; కాని అది ప్రబలిపోయే యేర్పాట్లు చెయ్యదు.

కనక,

ఏపక్షానికి మంత్రాంగం స్వాధీనం అవుతుందో ఆపక్షం, నిజంగా తనకి వుద్దేశమే వుంటే, ఈనిర్వ్యాపారత్వాన్ని రూపుమాపడానికి ఏవో కొన్ని ప్రయత్నాలు సాగించవచ్చు.

అయితే;

ప్రస్తుతం ఆంధ్రదేశంలో ప్రబలివున్న-ఇంకా ప్రబలుతూనేవున్న నిర్వ్యాపారత చాలావరకు ప్రజా నాయకులూ, సంఘసేవకులూ నివారించగలిగేదే; కాని రాజ్యాంగంవల్లమాత్రమే తీరేది కాదు.

అసలు, ఇవాళ, ఆంధ్రయువకులను పీడిస్తూవున్న నిర్వ్యాపారత పూర్తిగా అవివేకంవల్లనే యేర్పడింది.

ఇక్కడ ప్రజానాయకుల మనుకు సేవారుకూడా పరప్రత్యయనేయబుద్ధులు కావడంవల్లనే - ఆత్మవిశ్వాసమూ, ఆత్మగౌరవమూ పాటించుకోకా-అకారణంవల్ల స్వతంత్రాలోచనలూ, దేశస్థితికి అనుగుణా లైన కల్పనలూ చెయ్యలేకా, ప్రతీదానికీ ఉత్తరాదినుంచి తాఖీదులు రావా లనే యెదురుచూసేవారు అయిపోవడం వల్లనే అది పెరిగిపోయింది.

వంగదేశం చూడండి.

మహారాష్ట్రం చూడండి.

గుజరాతీదేశం చూడండి.

పంజాబు చూడండి.

చివరకి, పక్కనే-కలిసేవున్న అరవదేశం చూడండి.

ఆదేశాలలో విద్యావంతులైన యువకు లందరూ సర్కారునౌకరీలే చెయ్యడం లేదు.

వారిలో చాలామంది సర్కారునౌకరీలకోసం ప్రయత్నాలే చెయ్యడం లేదు.

అసలు ప్రజానాయకుల ప్రవృత్తే ఆదేశాలలో యువకులకు స్వతంత్రజీవనమాధుర్యం చవిచూపిస్తూ వుంది.

ఇంగ్లీషువారితో కలిసిన పరిచయంవల్ల వారు పరిశ్రమల విలువ బాగా తెలుసుకున్నారు.

సామాన్యులు పదిమంది కలిస్తే బ్రహ్మాండ మైన వొక నవశక్తి పుడుతుం దనే విషయం కూడా వారు చక్కగా తెలుసుకున్నారు.

ఇది అయినతరవాత, తాము నమ్మకంగా ప్రవర్తించడమూ, వొకరిని నమ్మడమూ నేర్చుకున్నారు.

ఇదంతా వారు ఆచరణలో పెట్టారు. చూస్తూ వుండగా లక్షలూ, కోట్లూ సంపాదించారు.

తమకు తమ దేశంలోవున్న మార్కెట్టు చాలక ఇతరరాష్ట్రాలకు ఎగబాకుతున్నారు.

ఇదంతా అక్కడి యువకులకు నూత్సాహలూ, నూత్నసంకల్పాలూ కలిగించింది.

దీంతో, స్వతంత్రకల్పన చెయ్యగల యువకు లనేకులు సర్కారు నౌకరీలను స్మరించడమే లేదు.

వారు, తమ సంతతపరిశ్రమవల్ల సర్కారు నౌక రీలోవున్న యువకులకంటే యెక్కువ డబ్బూ, పలుకు బడీ, గౌరవమూ సంపాదించుకుంటున్నారు.

మిద్దెలు, మేడలు, కార్లు-దర్జాగా కాలక్షేపం చేస్తున్నారు.

విద్యావంతు లైన మన ఆంధ్రయువకు లలా కాదు.

మనవారికి సర్కారునౌకరీలే కావాలి.

చివరికి, ఎలిమెంటరీ స్కూలు టీచరుపని అయినా కావాలి.

ఎక్కువ అయినా సరే, తక్కువ అయినా సరే నెలపూర్తి అయినప్పటికి జీతం అనే ముద్రతో యెంతో కొంత చేతిలో పడాలి.

మరోటి పనికిరాదు.

ఏం?

ఎంచేతా?

ఈదోషం అంతా, ప్రస్తుతం అమల్లో వున్న విద్యావిధానంమీదకి తోసెయ్యడం ధర్మం కాదు.

ఏమంటే?

ఆంధ్రదేశంలో వున్న విద్యావిధానమే యితర రాష్ట్రాలలో వుంది.

కాని,

అక్కడి ఫలితం వేరూ, యిక్కడి ఫలితం వేరూనూ.

ఏమీ?

ఆంధ్రపట్టభద్రులలో,

భవభూతి, మాఘుడు, విద్యానాథుడు, మల్లినాథుడు, పండితరాయడు, నారాయణతీర్థుడు-మొదలైన సంస్కృత గ్రంథకర్తల సంతతివా రున్నారు.

నన్నయ్య, తిక్కన్న, యెర్రన్న, శ్రీనాథుడు, పెద్దన్న, సూరన్న, తిమ్మన్న, సోమన్న, భాస్కరుడు, పోతన్న మొదలయిన ఆంధ్రకవుల సంతతివా రున్నారు.

కాని,

ఇంగ్లీషులో గ్రంథరచన చేసిన తెనుగువాడుకన పడడు.

ఇలాంటి పట్టభద్రులే యితరరాష్ట్రాలవారు వందలకొద్దీ గ్రంథాలు రాస్తున్నారు.

వారిలో చాలామంది ఖండాంతరాలలోకూడా ప్రశంసలు పొందుతున్నారు.

ఏం?

ఈతేడా యెందుకు వచ్చిందీ?

ఇతరరాష్ట్రాలలో మంత్రులే శాసనాలు సృష్టించి ఇంగ్లీషుగ్రంథకర్తలను పుట్టించారా?

మదరాసుహైకోర్టులో ఆంధ్రమండలాలకు సంబంధించిన వ్యవహారాలు సగానికి పైగా వుంటాయి;

కాని,

అక్కడ తెనుగువకీళ్లు చాలా తక్కువ.

వెలుగువచ్చాక ఆకాశంమీద నక్షత్రాలు చూడాలంటే యెంత కష్టమో, మద్రాసులో తెనుగు వకీళ్లను చూడాలంటే అంత కష్టం.

తెనుగుయువకులు లాపరీక్షకు మద్రాసులోనే చదవాలి.

కాని,

ఆపరీక్ష పూర్తిఅయినతరువాత వారు మద్రాసులో క్షణం వుండలేరు.

అరవయువకులలో చాలామంది అక్కడే వుండి పోతారు.

ఏం?

అరవవారికి అనుకూల మైన శాసనా లున్నాయా?

పోనీ,

తెనుగుజిల్లాలలో లీడింగువకీళ్లుగా వున్నవారేనా సాహసించి మద్రాసులో ప్రవేశిస్తే బొసుండిపోవును.

ఏమంటే?

అలా చేస్తే-

కొత్తవారికి జిల్లాలలో పైకిరావడానికి అవకాశాలూ వుంటాయి.

మద్రాసులో పెద్ద పెద్ద తెనుగువకీళ్లూ చాలా మంది వుంటారు.

తెనుగుకక్షిదారుల అవస్థలూ తప్పిపోతాయి.

అన్నిటికీ ముఖ్యం-

తెనుగుజిల్లాలలో, కక్షిదారులు బికారు లయిపోయినా, మదరాసులో తెనుగువకీళ్లేనా నవాబు లవుతారు.

కాని,

మనవాళ్లకి ఆసాహసం లేదు.

ఆధైర్యం లేదు.

అసలు ఆపురుషకారమే లేదు.

ఇంతెందుకూ?

తెనుగుజిల్లాలలో ప్రాక్టీసు చేసే వకీళ్లకు లాపుస్తకాలూ, పత్రికలూ కావాలంటే సాధారణంగా మద్రాసునుంచి రావాలి.

కాని,

ఇక్కడికి వచ్చి మనవాళ్లకు ఆపుస్తకాలూ అవీ అంటకట్టే యేజంట్లేనా తెనుగుయువకులు కారు.

మనకు కావలసిన వస్తువు లన్నీ సాధారణంగా ఖండాంతరాలనుంచి రావాలి.

అధమం-వాటిలో కొన్ని కలకత్తా, బొంబాయి పూనా, మద్రాసులనుంచేనా రావాలి.

ఆపట్టణాలలో సీమసరుకులు దిగుమతీచేసే వారిలో కాని, స్వదేశీవస్తువులు తయారుచేసేవారిలో కాని తెనుగువాళ్లు లేరు.

దీనికి సాయం,

నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, గుంటూరు, బందరు, ఏలూరు, రాజమండ్రీ, కాకినాడ, విశాఖపట్నం, విజయనగరం-ఇలాంటి తెనుగు పట్టణాల బజార్లలో ఒక్క గంట కూచుంటే బంగాళీలు, మహారాష్ట్రులు, గుజరాతీలు, పంజాబీలు-చివరికి అరవలు డజన్లకొద్దీ కనపడతారు.

వారి చేతుల్లో ఆర్డరుబుక్కు లుంటాయి.

శాంపిలుసరుకు నెత్తిమీద పెట్టుకుని వారికూడా కూలీ లుంటారు.

ఆ ఆంధ్రేతర్లంతరూ ఆసీమసరుకులకూ, స్వదేశీ వస్తువులకూ కేన్వాసింగుఏజంట్లు.

తెనుగుయువకులు ఆపని చెయ్యరు.

మన దేశంలో నిత్యవాడుకలో వున్న పత్తిబట్టలలో కొంతభాగం బంగాళీదేశంనుంచి వస్తాయి. కొంతభాగం, ముఖ్యంగా నాణె మైన సరుకంతా అచ్చ తెనుగునగరమే అయిన బరంపురంనుంచివస్తుంది.

బరంపురంలో తెనుగుదేవాంగులే ఆసరుకు తయారుచేస్తారు.

కాని,

వాటిని తెనుగుదేశానికి తెచ్చి విక్రయించేవారంతా వోఢ్ర బ్రాహ్మలు.

తెనుగుబ్రాహ్మడే కాదు మరేకులంమనిషీ ఆపని చెయ్యడు.

ఏం?

తెల్లవారాటప్పటికి తెనుగువాడికి ఇడ్లీ సాంబారూ కావాలి.

వేడివేడి కాఫీ కావాలి.

తెనుగుదేశంలోనే పొరుగూరు వెడితే హోటల్ భోజనం కావాలి.

కాని,

తెనుగుదేశంలో మారుమూలవూళ్లలోకూడా అవి అయ్యరుగారి దేవుడి ప్రసాదాలు.

తెనుగుదేశములో చెప్పుకోతగ్గ తెనుగుకాఫీ హోటలూ, తెనుగుహోటలూ లేవు.

అవి ప్రారంభించి తెనుగువాడు నిర్వహింపలేడు.

ఇంతేనా ?

ఆహోటళ్లలో ఘుమాఘీరా లందించే యువకులూ, వడ్డన చేసే యువకులూ ఆంధ్రులు కారు.

తెనుగుదేశం మొత్తంమీద వారి సంఖ్య యెన్నో వేలమీద వుంటుంది.

ఏటా యెన్నో లక్షల సొమ్ము తెనుగుదేశంనుంచి బయటికి వెళ్లిపోతోంది.

దీనివల్ల తెనుగుదేశంలో కొంపలు కూలిపోతున్నాయి.

బయటి దేశాలలో మిద్దెలూ, మేడలూ లేస్తున్నాయి.

ఏం?

ఇక్కడ, నిర్వ్యాపారతవల్ల బాధపడుతూ వున్న తెనుగుయువకు లందరూ, హోటళ్లూ, కాఫీ హోటళ్లూ నడపడానికీ, వాటిలో పనిచెయ్యడానికీ సాహసించలేనంతటి గొప్పకుటుంబాలవారా?

వా రందరూ రాజబంధువులా?

మన యువకులలో, తండ్రులు వంటలు చేసీ, నీళ్లు మోసీ, భిక్షం యెత్తీ సంపాదించిన డబ్బుతోటీ, తల్లులు రాత్రింబగళ్లు యింటింటా విస్తరాకులు తీసి సంపాదించిన డబ్బుతోటీ, సొంతంగా వారాలు చేసుకునీ ధనవంతుల బిడ్డలు కట్టివిడిచిన బట్టలూ, చదివిపారేసిన పుస్తకాలూ సంపాదించుకునీ- ఇంకా యిలాంటి అవస్థలతో విద్యావంతులైనవారు చాలామందేవున్నారు.

కాని,

వారికూడా సర్కారునౌకరీలే కావాలి.

వృత్తిచేసుకోడం నామోషీ.

తాలూకాబోర్డుల అమల్లోవున్న రోజుల్లో, ఏవో కష్టసుఖాలు విన్నవించుకోడం కోసం వచ్చి టీచరు కళ్లబడాటప్పటికి "నాన్సెన్సు, ఇడియెట్, స్టుపిడ్, రాస్కెల్, వెధవా, లచ్చిమీకే, బుద్ధి లేదూ, గడ్డితింటున్నావా?" అంటూ పెద్దాపిన్నా తారతమ్యం యెరక్కుండా ప్రవర్తించిన ప్రెసిడెంట్లను యెరుగుదుము.

కాజుయల్ లీవు కావాలంటే వారం రోజులు ముందుగా దరఖాస్తు పెట్టుకోవాలనీ, ఆర్డరు చేతికి వచ్చేదాకా స్కూలు విడిచివెళ్లకూడ దనీ కఠినంగా ఆజ్ఞలు జారీచేసిన ప్రెసిడెంట్లను యెరుగుదుము.

మన యువకులు అనేకులు, అలాంటివారి పాదాలు పట్టికూడా నౌకరీ సంపాదించుకోడానికే చూసేవారు గాని కాఫీహోటలు పెట్టుకోరాదూ? కుట్టుమిషను పెట్టుకోరాదూ? పోనీ కిల్లీదుకాణం పెట్టుకోరాదూ?" అంటే "పోవయ్యా" అని కసిరేవారు.

మనవాళ్లకి నౌకరీ అంటే అంత వ్యామోహం, వృత్తి అంటే అంత నిరసన.

మన పట్టభద్రులలో యెంతోమంది సరదాకోసం నాటకాలలో వేషాలు వేస్తారు.

మామూలు నటకులకంటే వారు చాలా బాగానే నటిస్తారు.

పైగా,

నటనకుతప్ప వారు మరొకందుకు పనికేరారు. కొంచెంశ్రద్ధపట్టి, కొంచెంపరిశ్రమచేసి కొంచెం దీక్షా కొంచెం యేకాగ్రతా వహిస్తే వారివల్ల ఆంధ్రనాట్యకళ యీపాటికి ఎంతో వున్నతికివచ్చివుండును.

వారికిన్నీ,

అసాధారణ మైన ప్రజాదరణ వచ్చివుండును.

పుష్కలంగా డబ్బూ దొరుకుతూవుండును.

అయినా,

వా రాపని చెయ్యరు.

వారికిన్నీ సర్కారునౌకరీలే కావాలి.

ఫిలింపరిశ్రమవిషయంలోనూన్నూ యిదే జబ్బు.

నిజంగా యిది విద్యావంతులే చేపట్టవలసినపరిశ్రమ.

ఈవృత్తి చేపడితే ఎన్నోవందల యువకులు కుబేరుడి బంధుకోటిలో చేరివుందురు.

కాని,

ఇవన్నీ వారికి పనికిరాదు.

ఎన్నో తెనుగుఫిలిములు ఆంధ్రేతర ధనవంతులు తయారుచేయిస్తున్నారు.

ఎన్నో తెనుగుఫిలిములు ఆంధ్రేతర ధనవంతులు తయారుచేస్తున్నారు. ఎన్నో తెనుగుఫిలిములు ఆంధ్రేతర యువకులు డైరక్టుచేసీ, కంపెనీలుగా చేరి తయారు చేయించీ తెనుగుడబ్బు కొట్టుకుపోతున్నారు.

దీనివల్ల కళా జీవచ్ఛవం అయిపోతోంది.

తెనుగుయువకుల నోళ్లలో మన్నూ పడుతోంది.

కాని,

ఎవరికీ విచారం లేదు.

ఇంతటితో తీరిపోతే వొక అందమే.

తెనుగువిద్యావంతుల దుస్థితి యింతతో ఆగలేదు.

చెప్పటంటే సిగ్గు.

తెనుగుదేశంలో మంగలిజాతి తక్కువగా లేదు.

ఆజాతివారు కులవృత్తి మానకోనూ లేదు.

అయినా,

తెనుగువాడికి తల అంటడానికీ, వొళ్లు పట్ట డానికీ వొడ్డిమంగలి కావాలి; తెనుగుమంగలి పనికిరాడు.

వొడ్డిమంగళ్లు వొక్క తెనుగువాళ్లకోసం మద్రాసుదాకా పాకి వున్నారు.

చెప్పవచ్చిం దేమి టంటే?

తెనుగువారి స్థితి యిలావుంది.

భారతదేశం మొత్తంమీద వున్న అవివేకం అంతా - దురభిమానం అంతా - భావదాస్యం అంతా తెనుగువాడి నెత్తెక్కి కూచునివుంది.

తెనుగుసంపాదకుడు ఇప్పటి విద్యావిధానానికి పునాదివేసిన మెకాలేను నిరసిస్తాడు.

ఇంగ్లీషు మన కొంప ముంచిం దంటాడు.

కాని,

హిందీని నెత్తికెక్కించుకుని మురిసిపోతాడు

ఒళ్లు తెలవని ఆవేశంతో, తెనుగువాడు, హిందూ స్థానీకి జయపెడతాడు.

గుజరాతీకి జయపెడతాడు.

బంగాళీకి జయపెడతాడు.

మారువాడీకి జయపెడతాడు.

అమెరికానుంచి నీగ్రో వస్తే కర్పూరదండ చేత పుచ్చుకొని హార్బరులో ముందు తెనుగువాడు ప్రత్యక్షం.

కాని,

తెనుగువాడు తెనుగువాణ్ణి లెక్కచెయ్యడు.

తెనుగువాడి అభ్యుదయం చూడలేడు.

తెనుగువాణ్ణి పైకి రానివ్వడు.

“తెనుగువాడూ వొక మనుషేటపోవోయ్” అంటాడు.

అసలు, తెనుగువాడికి తెనుగుతనమే పనికిరాదు.

తెనుగువాడు,

తురకల లుంగీ కడతాడు.

బంగాళీల లాల్చీ ధరిస్తాడు.

దానిమీద హిందూస్థానీల పొట్టికోటు వేస్తాడు

నెత్తిమీద గుజరాతీల టోపీ పెట్టుకుంటాడు.

ఆవల సాంబారు లక్షణంగా ఆస్వాదిస్తాడు.

సాటితెనుగువాడితో ఇంగ్లీషుతో మాట్లాడతాడు.

విద్యావంతులైన తెనుగుయువకుల స్థితి సాధారణంగా యిదీ.

ఇలాంటి తెనుగుయువకుడు నిర్వ్యాపారతవల్ల యిబ్బందిపడుతున్నాడంటే ఆశ్చర్యం యేమిటి?

ఇలాగ, తెనుగుయువకుడు సాంఘికంగా తీర్చుకోవలసిన నిర్వ్యాపారత యెంతో వుండగా మన శుష్కరాజకీయపక్షాలవారు, కొత్త రాజ్యాంగంలో తమకు మంత్రాంగం దఖలుపరిస్తే ఏదో పొడిచేస్తామనడంలో యేమి అర్థం వున్నదీ?

ఔచిత్యంమాత్రం యేమి వున్నదీ?

---

# నక్షత్రమండలము

## (ధాత్రు సంవత్సర మాఘ మాసము)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

ఉత్తరము




దక్షిణము

ఈపటము తలమీదుగా ఆయాదిక్కులు కన్పునట్లు సరిచూచి పట్టుకొని నక్షత్రాదులను పరిశోధింపవలెను.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఫిబ్రవరి | 8 | తేదీని | రాత్రి | గం. 8-49 | | మార్చి | 1 | తేదీని | రాత్రి | గం. 7-29 |
| ,, | 15 | ,, | ,, | ,, 8-11 | | ,, | 8 | ,, | ,, | ,, 7-0 |
| ,, | 22 | ,, | ,, | ,, 7-54 | | | కనబడును. | | | |

(శుక్రుడు నవంబరుమాసపు తుదిరోజులలో కనబడునట్లు చూపబడినది.)

Palace roof of cloudless heights,
Paradise of golden lights,
Deep, immeasurable vast
Which art now and which wert then!
Presence-chamber! Temple! Home!
Generations, as they pass,
Worship thee with bended knees! Shelly,

From above the starry sphere
Come secrets whispered nightly to our ears;
And the pure spirit of celestial light
Shines through our souls.

Burdick

మేఘశూన్యమైనినీలమైన ఆకాశరంగము మహోన్నతమైన విశ్వసౌధమునకుకూర్చి అమర్చిన మేలువితానము. స్వర్ణకాంతులతో ప్రజ్వరించు నాస్వర్గము సువిశాలము, గభీరము, అనంతమునై దిగ్భ్రమగొల్పుచున్నది. త్రికాలములయందును ఇట్లభద్భుతముగా తోచుచుండు నీ స్వర్లోకమే దివ్యులగృహము, ఆలయము, సమావేశ స్థానము. కావుననే మనుష్యమాత్రు లందఱును మోకరించి, భక్తితో నిన్నారాధించుచున్నారు.

— షెల్లీమహాకవి.

పై నక్షత్రలోకమునుండి రహస్యములు ప్రతిరాత్రియు మెల్లగా మన చెవులను పడుచున్నవి. ఆదివ్య తేజస్సారము మన ఆత్మలద్వారా స్వచ్ఛముగా ప్రకాశించు చున్నది.

—బర్డిక్.

ఈ సంవత్సర పుష్య బహుళ ద్వాదశి మొదలు మాఘ బహుళ ద్వాదశివఱకు (౭-౨-౩౭ మొదలు ౭-౩-౩౭ వఱకును) అగు మాసములో రాత్రి తొలిజామున మన కగపడు గ్రహనక్షత్రాదులతో కూడిన ఖగోళదృశ్యముల నారయుదము.

Milky way

## పాలవెల్లి

నభోవమకు అలంకారప్రాయముగా తోచు నీ ధవళదృశ్యము ఈమాసములో తొలిజామున ఆగ్నేయ దిగ్భాగమున నౌకామండలము (Argo Navis) కడ నుండి వాయువ్యమున ఊర్వశీ పురూరవసు మండలము వఱకు అడ్డముగా వ్యాపించియున్నది. అక్కడక్కడ కొంచెము సన్నగిలినట్లు తోచినను మొత్తముమీద వైశాల్యమున వృద్ధిగనుచు ఈ మిన్నేఱు మన కనుల కగపడు ఖగోళమును రెండు సమఖండములుగా విభాగించినట్లు స్ఫురించును. ఈ స్వర్వాహిని, ఆరంభమున నాగ్నేయ దిశయందు కంటె అంతమున వాయవ్యమునందు నాలుగు రెట్లు సుమారు అధికమైన వైశాల్యము కలిగి వెల్లివిరియుచున్నది. ఇట్లు సువిశాలమగు నీరమ్యప్రవాహము హాలాహల భక్షకుడైన మృగవ్యాధ రుద్రునిచేతి కంకణమన నొప్పు వాసుకిని, వాసుకి త్రాడైన మందరగిరిని గడిచి పునర్వసూ, ఆర్ద్రానక్షత్రముల మధ్యనుండి వెడలి, సారథి మండలముమీదుగా భృగుపరశు మండలము నతిక్రమించి ఇంద్రమును నంటుచు అప్సరసలను తాకి, ఊర్వశీ పురూరవసు నక్షత్రములకడ వాయవ్యమున మన దృష్టిపథమునకు తప్పుచున్నది.

## అగ్రగణ్యములైన నక్షత్రములు-గ్రహములు

First Magnitude Stars and Planets.

తేజోవిషయమున నగ్రగణ్యము లని చెప్పదగిన చుక్కలలో తొమ్మిదిమాత్రమే ఇప్పు డగపడుచున్నవి. అవి ఏవి అనగా:—

(1) తూర్పున ఇప్పుడే ఉదయమైన సింహరాశిలో-మఘ

Regulus in Leo.

(2) యామ్యోత్తరరేఖను సమీపించుచున్న

(3) పునర్వసులోనివి-సాంబ-పూర్వశ్వానములు

In Gemini Pollux and Procyon,

(4.) ఈ గగన మధ్యరేఖను గడిచి పడమటకు వ్రాలిన సారథిమండలములో బ్రహ్మహృదయము.

Capella in Auriga.

(5) ఈరేఖను చేరబోవుచు క్షీరవాహిని కావల నున్న మృగవ్యాధరుద్రుడు-(శ్వానమండలములో)

Sirius in Canis Major

(6) ఈరుద్రుని దిగువ దక్షిణమున నౌకామండలమున అగస్త్యుడు.

Canopus in Argo Navis.

(7) యామ్యోత్తర రేఖనుగడిచి పడమరకు వ్రాలిన

Betelgeaux and Rigel in Orion.

(9) వీటికి పడమట వృషభరాశిలో రోహిణి.

Aldebaran in Taurus.

ఇట్లు ఆకాశమునకు శోభకలిగించుచు మెఱయు నీతొమ్మిదింటి తేజమునకు పడమటనున్న శుక్రుని తేజ మెంతో వన్నె దెచ్చుచున్నది. శుక్రు డీమాసమున మీన మేషరాసులలో సంచరించును. ఫిబ్రవరిమాసాంతమున గానవచ్చునతని స్థానము పటములో చూపబడినది. శని గ్రహము ఇంచుమించు ఫిబ్రవరి మాసాంతమువఱకు సూర్యాస్తమాన మైనపిదప కొంచెమునేపు కానబడుచు పడమట అస్తమించుచున్నాడు. కావున మనపటమున చూపలేదు. కొదువగ్రహములు రాత్రి తొలిజామున కన బడవు. శుక్రుడుమాత్రము "వెలుగుతొడగిన వెన్నముద్ద" వలె పడమట మిక్కిలి ప్రకాశించుట గమనింపవలెను.

ఉత్తరమున

ధ్రువక్షితిలో చిన్నయెలుగు తోకచివరను ధ్రువుడు మెఱయుచున్నాడు. తోకలో వరుసగా అగ్ని మహేంద్ర, కశ్యపనక్షత్రములును, దేహమునందు ధాత, విధాతలును ప్రకాశించుట కాననగును. ఈ చుక్కలు ఉత్తరసమీపపు ఈశాన్యదిక్కు క్రమముకడ వ్రాలిన ట్లగ పడుచున్నవి. వాయవ్యదిశను ఊర్వశీపురూరవసులు, ధ్రువునినుండి అడ్డుగావిస్తరించినట్లు కనబడుచున్నారు. వారి కెగువను సువిశాలముగా నున్న దివిజగంగాప్రవాహమున సావకాశముగా జలక్రీడలందేలుచున్న అప్సరో గణము త్వరలో అస్తమించును.

ఈశాన్యమున సప్తఋషులు బాగుగాఉదయించి నారు. అందు పులహ, క్రతుఋషులు ధ్రువుని చూపుచు పరిభ్రమించుచున్నారు. వారికి తూర్పుగా వరుసగా పులస్త్య, అత్రిఋషు లున్నారు. అత్రికి తూర్పుగా ఆంగీరస, వశిష్ఠ, మరీచి, ఋషులు ప్రకాశించుచున్నారు. వశిష్ఠుని ప్రక్కనే సాధ్వి అరుంధతి మిణుకు మను చున్నది. పులహక్రతు ఋషులకును, యామ్యోత్తరరేఖ కును మధ్యగా లంబోదరముతో గజముఖుడు మూషికము నెక్కియున్నాడు. బృహదృక్షమనబడు పెద్ద యెలుగును తఱుముచు సారమేయ మండలములో వేటకుక్క ఒకటి కలదని (Caves Ven..tici) పాశ్చాత్య గాథ లున్నవి.

తూర్పున

పల్లకిబొంగువంటి ఆకారములో మఘానక్షత్ర మిపుడు బాగుగా ఉదయించినది. మఘ కెగువను కర్కటక రాశి గలదు. అందు సర్పదైవత్యమైన ఆశ్లేష యును, పొట్లపూవువంటి ధవళిమతో నస్పష్టమై దూర మున వెండి కంచములాగున పుష్యమి చూడవగును. ఆ కంచమున ఆహారము తినుచు దానికిరువంకలను రెండు గాడిదలు కలవని పడమటిగాథలు కలవు. వీటికిని పాల పెల్లికిని మధ్య మనోహరాకృతితో పునర్వసు చుక్కలు చక్కగా ప్రకాశించుచున్నవి. ఈ చుక్కలు నౌకాకారము, అనగా దోనెవంటి ఆకారముగా నున్నట్లు కొందరు తలంచినారు. ధనవు అనగా విల్లువంటి ఆకారము కలవని మఱికొందరు భావించినారు. వాల్మీకికి పునర్వసు మహామీనమని తోచినది; శ్రీనాథునకు ముత్యాలహారము, ఆ దున పోక కొమ్మకు తగిలిన ముత్యాలహారమని స్ఫురించినది. విశ్వవిహారార్థమై పార్వతీ పరమేశ్వరులెక్కి వెడలిన దివ్యవిమానము (Zeppelin) ఈపునర్వసు చుక్కలని నేటివారు భావించుచున్నారు.

దక్షిణమున

దక్షిణసమీపపు ఆగ్నేయదిగ్భాగ మంతయును నౌకామండలముచేతనే ఆక్రమింపబడినది. ఈ దైవ

నౌకకు చుక్కానికడ (దానినే అమర మందురు.) అగస్త్యు డున్నాడు. మన కాశీఖండము మొదలగు పురాణ గ్రంథములలో వర్ణింపబడినట్లు అగస్త్యుడు దక్షిణమునకు వెడలినను అతని శివభక్తి అచంచలమైనదనుటకు తార్కాణ మవసరమగునో మృగవ్యాధరుద్రుని దిగువ దక్షిణమున నగస్త్యుడు విడువక మన కగపడుచుండుటే గమనించి ఆనందింపతగిన విషయము. నైరృతిదిక్కంతయు శింశుమారాక్రాంతమయియున్నది. ఈ రెండిటికిని నడుమ పామువలె మెలికలు తిరుగుచు యమునానది రమ్యముగా చూపట్టుచున్నది. ఉపరిచరవసు వీర్యమును గ్రహించిన అద్రికయు, ఆచేప పడినవలయును మన కా ప్రక్క నగపడుచున్నవి.

## పశ్చిమదెసను

పశ్చిమమున నింతవఱకు చక్కగా నాలుగుమంచముకోళ్లవలె కనబడుచుండిన ఉత్తరాభాద్రా-పూర్వాభాద్రనక్షత్రములు (ఇవే వేదమునందు ప్రోష్ఠపదానక్షత్రములనబడుచున్నవి) ఇపు డించుమించుగా అస్తమించినవి. ఇంద్రమదతో చేరిన చుక్క ఒక్కటే మనకు కనబడుచున్నది. మనోజ్ఞముగా చూపట్టు నీప్రోష్ఠపదాతారలు నాలుగింటితో వాల్మీకి రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులను సోదరచతుష్టయమును పోల్చి వర్ణించినాడు. ఈ చతురస్రము మరికొంతకాలమువఱకు మనకు ఆకాశమున కనపడదు. ఈ నక్షత్రములకు దక్షిణమునన్నున్న మీనముకూడ కనబడుట లేదు. రెండుచేపలను కలుపుసూత్రమును, ఉత్తరాభాద్రచుక్కలకు తూర్పుననున్న చేపయు కనబడుచున్నవి. ఇపుడు ఈసమీపమునవే శుక్రగ్రహము సంచారముసాగించుచున్నది. ఈమీనముప్రక్కనే ఇంద్రమదయును, ఆమె గర్భచ్యుతుడైన చ్యవనుడును కలరు. ఇంద్రమదను బాధించిన పులోముడు క్రుద్ధుమికకరింపుకొనుచు కానవచ్చుచున్నాడు. చ్యవనునిసమీపమున అశ్వివు లున్నారు. వీరెక్కినరథమునకు ఒకప్రక్క వృషభమును, రెండవప్రక్క శింశుమారమను పూన్చబడియున్నవి. ప్రాయ్యపొక్కిళ్లవలెనున్న భరణిచుక్కలును, వెండి ఉత్తరీయమున చిక్కినమెరుగుటుపురుపులవలెనున్న కృత్తికలును, కృత్తికల నుండి ఉత్తరదిశకు వ్యాపించినట్లు కనబడు భృగుపరము మండలమును ఇపుడు చక్కగా చూడనగుచున్నవి.

## మ ధ్య ను

క్రాంతిచక్రమున కెగువ, ఉత్తరభాగమున, గగనమధ్యరేఖను గడిచి పడమటకు వ్రాలియున్నది సారథి మండలము. అందు తెల్లని తేజస్సుతో ప్రకాశించు బ్రహ్మహృదయమును పడమట మెఱయు శుక్రునితో పోల్చి చూడతగును. సారథిమండలము దిగువను, దివిజగంగకుపడమటను, ఒరయన్ (orion) చుక్క లున్నవి. ఆచతురస్రముయొక్క నాలుగు కోణములయందును నాలుగు చక్కని చుక్కలున్నవి. పడమట పరివృత్త, రిగెల్ చుక్కలును, తూర్పున నార్ద్రయు, మరొకచిన్న చుక్కయు చూడనగును. మధ్య మూడు గొల్లకావిడి చుక్కలున్నవి. ఆచుక్కలకు దిగువ వ్రేలు ఖడ్గమువంటి మరి మూడుచుక్కలు గలవు. ఆయోధుని పాదముల దిగువ శశకము పిఱికిచూపులు చూచుచున్నది. ఆదిగువను కపోత మున్నది.

## విశేషవిషయము

ఈ ఫిబ్రవరి నెల ౨౧ తేది భీష్మఏకాదశి - అనగా భీష్ముడస్తమించినదినము. భీష్ముడు వసువుల అంశమున జన్మించినాడు. మన నక్షత్రములలో ధనిష్ఠ వసుదేవతాత్మకమని వేదములు తెలుపుచున్నవి. ధనిష్ఠనక్షత్రము పడమట అస్తమించి, అటుపై కొన్నాళ్లవఱకు కానరాని దినములు ధనిష్ఠకార్తె అనబడును. ధనిష్ఠకార్తె ఆరంభమే భీష్మపకినము.

ఈ సందర్భమున ఋగ్వేద మహాభారతముల లోని కొన్ని విషయములు గమనింపవలసియున్నవి.

ఋగ్వేదము పదవమండలము, ౮౫ సూక్తములో ఈ క్రింది ఋక్కు గలదు.

"అఘాసు హన్యంతే గావోఽర్జున్యోః పర్యుహ్యతే"

దీనిని Griffith దొరవారు ఇంగ్లీషున నిట్లు భాషాంతరీకరించినారు.

"In Agha days are oxen slain, in Arjunis they wed their birdes."

అఘమాసము పిమ్మట మాఘమాసముగా వ్యవహరింపబడుచున్నది. అర్జునీనక్షత్రములకే ఇటీవల ఫల్గునీ నక్షత్రము లని వాడుచున్నాము. మాఘమాసమందు గోవులు చంపబడుటేమి? అను విషయము పండితులను, ఖగోళపరిశోధకులను చాల కలవరపెట్టుచున్నది. లోకమాన్య బాలగంగాధర తిలకుగారు తమ వేదాంగజ్యోతిషములో ఈ బుక్కునుగూర్చి ప్రత్యేకముగా నొక (Note) వ్యాఖ్యానము వ్రాసినారు. (చూ వేదాంగ జ్యోతిష. (Vedic Chronology & Vedanga Jyotisha Appendix II. pages 39-41 of Lok. B. G. Tilak) ఇక్కడ మఘనక్షత్రము సూర్యునితో నుండిన మఘకార్తెదినము లని అర్థమా? లేక మఘ నక్షత్రముతో చంద్రుడున్న మాఘమాసము దినములా? అర్థమేమి? అని చాల దూరము చర్చించినారు. సాధక బాధకముల నారసినారు; అసంపూర్తిగా విడిచినారు. వారు మహాభారతములోని మూడు శ్లోకములు ఈ చర్చలో ఎత్తి వ్రాసి వ్యాఖ్యానము సాగించినారు. ఆ మూడును ఇట మనము కూడ ముఖ్యముగా గమనింపవలయును.

(౧) అర్జునస్యఇమే బాణాః నేమేబాణాః శిఖండినః
కృతంతి మమగాత్రాణి మాఘమాసే గవామివ॥
భీష్మ. ౧౨౦-౬౪.

దీనిని తిక్కన సోమయాజి ఇట్లు తెనిగించెను:-

'అళనికల్పములివి అర్జునుబాణముల్ గాని శిఖండివిగావు సుమ్మ, జము దూతలట్లు ప్రాణముల వేధించెడి విట్టివి వానికి నెందుగలవు'? మూలములో లేని అళని కల్పములు అని ఒక వర్ణన చేర్చినాడు. 'కృతంతి'కి యమదూతలవలె ప్రాణములను వేధించుచున్నవని వ్యాఖ్యానము చేర్చినాడు. మాఘమాసమందు గోవులవలెనే అను ఉపమానమును జారవిడిచినాడు. మాఘమాసమున గోవులకు విశేషబాధ కలుగుట మిక్కిలి గమనింపవలసిన విషయము. ఈ ఉపమానము మరిరెండుచోట్ల కూడ మహాభారతమున కలదు. చూ. ద్రోణ. ౧౫౪-౬౭.)

"మన్యేహం పాండవాన్ సర్వాన్
భారద్వాజశరార్దితాన్,
శిశిరే కంపమానాన్వై
కృశాగావ ఇవ ప్రభో."

ద్రోణుని బాణములచే ప్రహరింపబడి రక్తముచే తడుపబడిన శరీరములుగల పాండవులందరును శిశిరఋతువునందు వణుకుచున్న, కృశించిపోవుచున్న గోవులవలె నుండిరని నేను తలంచుచున్నాను.

మూడవది శాంతిపర్వము ౧౩౯-౮౮.
"గృహాన్నేహావబద్ధానాం నరాణా మల్పమేధసాం ;
కుస్త్రీఖాదతిమాంసాని మాఘమాసే గవా ఇవ.

మందబుద్ధిగలిగి స్త్రీ వశుడైన నరుని చెడు మానిసి, కొఱికి మాంసము తినవేయును. ఎట్లనగా మాఘమాసమందు గోవులను వలెనే-

ఇట్లు మూడు సందర్భములలో మూడు వేర్వేరు శ్లోకములలో, మాఘమాసమందు గోవులు, కంపించుట కృశించుటయే గాక అవి హింసింపబడుట, వాటి మాంసము క్రూరముగా భక్షింపబడుట కూడ స్పష్టముగా వర్ణింపబడినది. కాబట్టి ప్రాచీనకాలములలో మాఘమాసమునందు గోహింస, గోమాంసభక్షణము జరుగుచుండెనని మనము నిశ్చయముగా తలంపవచ్చును. ఇందలి మాసము మఘకార్తె దినములా, లేక మఘ చంద్రునితో కలిసియున్న పున్నమ గల మాఘమాసము దినములా అని తిలకుగారివలె మనము శంకించుకోవలసిన అవసర మేమాత్రమును లేదు. కారణమేమనగా శ్రవణ ధనిష్ఠ నక్షత్రము లస్తమించు దినములు, ఆకార్తెరోజులు గల చంద్రమాసమే ఈ మాఘమాసము శ్రవణ ధనిష్ఠనక్షత్రప్రాంతముల కా ప్రాచీనదినములలో గోసంజ్ఞయుండెను. చీనాదేశస్థులు ఇప్పటికిని ఆ నక్షత్రములను Draught oxen అనియే వ్యవహరించుచున్నారు. Zor-confucius కన్‌ఫ్యూసియస్ అను చీనాదేశస్థుడను ప్రాచీనగ్రంథకర్తవాక్యము ఇంగ్లీషులో నిట్లు వ్రాయబడినది.

Briliant show the Draught oxen
But they do not serve to draw our carts

ఈ వృషభములు చూచుటకు చక్కగా మెఱసి పోవునుగాని మన బండ్లు లాగుటకు మాత్రము ఇవి పనికి రావు.

ఈ 'ఎడ్లు' అస్తమించు కాలము-మాఘమాసము.

As above, so below

The drama of the earth runs parallel to the drama of the sky.

"పైనెట్లో క్రిందను అట్లే"

ఆకాశనాటకము ననుసరించి భూమిమీద నాటకము జరుగుచున్నది ఆకాలమున ఆకాశమున ఎడ్లు అంతరించువేళకు, భూమిమీద ఎడ్లను చంపి, పండుగలు చేసుకొనుచుండిరి. పూర్వకాలములో రోమనులు అనురాధనక్షత్రము ఉదయించి వృషభరాశి అస్తమించురోజులలో పండుగలు చేసుకొనుచుండిరి. అనురాధ కధిదేవతయైన మిత్రుడను దేవుడు వృషభమును సంహరించినట్లు పెద్ద ఉత్సవముచేసి ఒకగొప్ప వృషభమును సంహరించుచుండెను. ఇట్లు ఏటేట జరుగుచుండెను. అంతవరకు పోనేల ? ఈనాడు క్రొత్తమావాస్య నాడు సూర్యుడు మేషరాశిలో ప్రవేశించుటకు సూచకముగా ఎన్నిగొఱ్ఱెలు వేటపోతులు అమ్మవారికి బలి అగుచున్నవి? ఆలాగే ఆనాడు మాఘమాసములో ఎడ్లను చంపి పండుగలు చేసికొనుచుండిరి. తిలకు మహాశయుని శంక కిదే ప్రత్యుత్తరము.

---

# మీగడతఱకలు

## భగవద్గీత

మన భారతీయవాఙ్మయంలో భగవద్గీతకు చాలా గౌరవం వుంది.

ఇది నిత్యపారాయణ చెయ్యడం, మనలో గొప్ప యోగ్యతగా చెలామణీ అవుతూవున్నది.

పెద్దలు కొందరు దీనిమీద పరీక్షలు ఏర్పాటు చేసి ధన్యవాదాలు చెప్పించుకొంటున్నారు.

బ్రాహ్మణేతరులు కూడా అనేకు లిప్పుడు దీన్ని నిరాటంకంగా పారాయణచేస్తున్నారు.

దీన్ని పఠనపాఠనాలలో వుపయోగపరుచుకొంటున్నారు.

దీనిని గురించి చర్చలు సాగిస్తున్నారు.

దీనికి సంబంధించిన రచనలు కురిపిస్తున్నారు.

"గ్రంథప్రకాశకు" లని చెప్పతగ్గవారిలో యొకరూ దీన్ని ప్రకటించకుండా వుండడంలేదు.

నిజంగా, మన భారతీయవాఙ్మయంలో యిది చూసినన్ని కూర్పులు మరేగ్రంథమూ చూడలేదు.

ఇకముందున్నూ చూడదు. చూడనూ లేదు.

ఒక్క యీ భగవద్గీతను చూపిస్తూ భారతీయ వాఙ్మయంయుత్కృష్టనూ, భారతీయవిజ్ఞానం విలక్షణతనూ ఘోషించేవారు లక్షలున్నారు.

ఇప్పుడిప్పుడు, పాశ్చాత్యులలో కొందరు ఈ సంగతి గుర్తించినట్టు మాట్లాడుతున్నారు.

ఇటీవల వొకరిద్దరు తురకలున్నూ "అవు" నన్నారు.

చాలారోజులకిందట, బిసెంటు దొరసాని, మతత్రయభాష్యాలతో తులతూగే వ్యాఖ్యానమే చేసింది,

దీనితో యిది శంఖానపోసిన తీర్థం అయిపోయింది.

ఇంత గ్రంథం పెరిగాక, గాంధిగారున్నూ దీనికొక భాష్యం తయారుచెయ్యడం విశేషంలోది కాదు.

కాని, వారిని చూసి, వారి 'దాసోహాలు' మరి కొందరుకూడా దీనికి భాష్యాలు సాయించారు.

ఇంకేమి?

సనాతనధర్మవాది కిది యెప్పుడూ ప్రమాణమే.

ఇక విశేషం యేమిటంటే?

ఇవాళ, సంఘసంస్కర్త కిది అథార్టీ.

తక్షణసంపూర్ణ స్వరాజ్యసాధకుడి కిది తిరుమంత్రం.

సామ్యవాది కిది అవలంబం.

విప్లవకారుల కిది వజ్రాయుధం

వెనకటికి, వందేమాతరంరోజుల్లో, బంగాళీ విప్లవకారులు కొందరు, వొక చేత్తో దీన్ని పట్టుకొనే వురికంబం యెక్కుతూవచ్చారట.

ఇందులో కొంతభాగం వేదనలో చేరినా, మొత్తంమీద యీ భగవద్గీత మనవారి హృదయాల మీద ఇంత మాయనిముద్ర వేసుకొని కూచునివుంది. కాని,

కాని, చరిత్ర పరిశీలించి చూస్తే, రక్తం విరిచేసి మన జాతిని పూర్తిగా నిర్వీర్యం చేసింది యీ భగవద్గీతే.

ఐహికజీవితానికి కొలికిపూస అయిన రాజసం అంటే తృణీకారభావం పుట్టించి "పాలకదర్జా" నుంచి కూలగొట్టి మనకు శాశ్వతదాస్యం సంఘటించింది యీ భగవద్గీతే.

ఒక్క విశేషంమాత్రం వున్నది.

నిజంగా వాఙ్మయానికి మానవసంఘంమీద యేలాంటి పలుకుబడి వుంటుందో అదంతా యీ భగవద్గీత పండువొలిచి చేతిలో పెట్టినట్టు స్పష్టపరిచింది.

వాఙ్మయానికి గల యీ అమోఘశక్తిని బాగా గుర్తించినవాడు కనకనే, వ్యాసుడు, అన్ని పురాణాలూ అంత భారతమూ, అందులో అసందర్భంగా యీ భగవద్గీతా కల్పించి దేశంమీద పడేశాడు.

బాగా పరకాయించి చూస్తే, బ్రాహ్మణధర్మానికి విజృంభణం కలిగించి, దేశాన్నీ, జాతినీ యీ నికృష్టస్థితికి తెచ్చింది యీ పురాణాలూ, యీ భారతమూ, యీ భగవద్గీతా - ఇవేకాని మరేమీ కావు.

ఏతావతా:

మహాభారతంలో, యీ భగవద్గీత, యెలాంటి ఘట్టంలో సనిసుచ్చబడి వున్నదో బాగా యోచనదునా.

అయితే: దీని పుట్టుకకు నూపించబడ్డ కారణం వదులువదులుగా వున్నది; కాని పొంకంగా కనపడడం లేదు.

అసలిది మహాభారతకథలో సరిగా అతకడమే లేదు.

ఏమంటే?

ఎవరికిది వుపదేశించబడ్డదో ఆ అర్జునుడు పూర్తిగా శస్త్రవ్యసని.

వ్యవహారపరిజ్ఞానంలోతప్ప ఆయుధవ్యాపారసరణిలో అర్జునుడు భీముడికంటెనూ ఎక్కువ దురుసుమనిషి.

ఆయుధం తీర్చవలసిన పని వచ్చినపుడు అతనికి జంకూ, ధర్మచింతా, దయాదాక్షిణ్యాలూ, యుక్తాయుక్తవిచారణా యెప్పుడూ, యేవిధంగానూ, యెంతమాత్రమూ కలగలేదు.

కాగా, మహాయుద్ధరంగంలో, యిరువాగుల మధ్యా నిలిచినప్పుడు, అర్జునుడికి కలిగిందన్న క్లైబ్యం పక్కా లౌక్యుడైన ధర్మనందనుడు నటించతగ్గది; గాని అర్జునుడికి ఆరోపించతగ్గది కానేకాదు.

ప్రతీదానికీ వోర్పూ, ధర్మనటనా కనబరిచే ధర్మనందనుడూ, యుద్ధరంగములో అపారమైన కౌరవసైన్యం చూసీ, ముఖ్యంగా అందులో భీష్ముని తాళధ్వజం చూసీ "మనం గెలవగలమా?" అని జంకాడు; కాని బంధువధ చెయ్యవలసివస్తుందని యెంతమాత్రమూ జంకలేదు.

అప్పుడేనా, అర్జును డేమిటేమిటో చెప్పి వుత్సాహం కలిగించగా క్షణంలో "తెలివోండ" "సెబాస్! నువ్వు చెప్పింది బాగుంది. కౌరవుల వ్యూహానికి తగినవ్యూహం పన్నించు" అంటూ కచ్చబిగించాడు; కాని ధర్మపన్నాలు విప్పలేదు.

పైగా, అతగాడు, నిరస్త్రుడై, పాదచారియై, తానేంచేసేదీ యెరక్క తనవారు కంగారుపడతూ వుండగా, భీష్మునిదగ్గిరికి వెళ్లి "యుద్ధంచేసి మనవాళ్లనందర్నీ వరసపెట్టి నరకడానికి సెలవి" మ్మని అడిగి, పైపెచ్చు "మా చేతిలో నువ్వెలా చస్తావో ఆ రహస్యం కూడా చెప్పు" అనిన్నీ అడిగాడు; కాని మనవ్యప్రవృత్తి యెంతమాత్రమూ చూపించలేదు.

కౌరవులు మాయజూదంలో రాజ్యం అంతా వులాక్కున్నప్పుడూ, పన్నెండేళ్లరణ్యావాసమూ, వొకయేడజ్ఞాతవాసమూ విధించినప్పుడూ, నిండుకొలువులో తన భార్యకోకలు వొలిచినప్పుడూ "తప్పు తప్పు, సమయం తప్పకూడదు" అంటూ ధర్మపన్నాలు ఏకరువుపెట్టి, "పొడిచేస్తా, నరికేస్తా" అంటూ యెగిసెగిసిపడే తమ్ముళ్లను అదిమిపెట్టిన ధర్మనందనుడు ఇలా చేశాడనడంలోనూ, మాట్టాడితే "అళ్ళరభళ్లరభా" అంటూ వీరాంగం తొక్కే అర్జునుడు "చేతులారా చుట్టాలను ఎలా చంపను బావా?" అని చదికిలబడ్డాడనడంలోనూ ఏమేనా పొందిక వున్నదా?

ఇదిలా వుండగా;

కృష్ణుడు పూర్తిగా స్వార్థపరుడు.

బాగా పరిశీలిస్తే అతని చరిత్రలో ప్రతీ అక్షరమూ ఇందుకు బలకరమే.

ఆత్మలాభంకోసం, అతను, అనేకసందర్భాల్లో, అనేకమాట్లు రాక్షసప్రవృత్తి కనపరిచాడు.

అనేకమంది బంధువులను నిష్కారణంగా సంహరించాడు. అనేకులను అవమానపరిచాడు.

అలాంటి కృష్ణునితో పాండవుల్లోకల్లా వొక్క అర్జునుడికే ప్రాణస్నేహం.

భిన్నప్రవృత్తులకు అలాంటి స్నేహం యెప్పుడూ కలగదు.

కాగా;

సమయంవస్తే అర్జునుడుకూడా "దేవూ నై, గురువూ నై" రకంలోవాడే.

ఇలాంటిసందర్భంలో, అర్జునుడికి ఆసమయంలో, యెక్కడలేని బంధుప్రీతీ పుట్టుకువచ్చి నరాలు కుంగతీసిందంటే యేమేనా అతికిందా ?

అసలు, భగవద్గీతలోవుండే అసందర్భాలలా వుండగా, దాని ఆవిర్భావకారణం కూడా యింత అవకతవకగా వుండడంవల్లనే, పదిహేను పర్వాల అతొకికాంధ్రీకరణం చేసిన తిక్కనసోమయాజి దాన్ని ప్రక్షిప్తంకింద కట్టేసి విడిచిపెట్టేశాడు; కాని తెలవకా! చేతకాకా కాదు.

ఇదీ కాక:

భారతయుద్ధం ద్వాపరాంతంలో కనక అది జరిగి యిప్పటికి అయిదువేల సంవత్సరాలకు పైగా అయింది.

అదిమొదలు యిప్పటిదాకా భగవద్గీతకు అనేకమంది మహామహా పండితులు వ్యాఖ్యానాలు చేశారు.

అనేకమంది మహామహోపాధ్యాయులు దీన్ని పఠనపాఠనాల్లో వినియోగించారు.

అయితే: వారిలో వొక్కరున్నూ దీన్ని ప్రవృత్తిపరంగా సమన్వయించలేదు.

పైగా, వారందరూ కర్మ అంటే యజ్ఞాలూ, యాగాలూ, శ్రాద్ధాలూ ఇంతే అర్థం చేశారు కాని ఐహికవ్యాపారంగా వొకరూ సమర్థించలేదు.

ఇది చూడరాదూ?

మనలో సన్యాసం అంటే ఐహికప్రవృత్తిని చంపేసుకోవడం-చివరికి జుట్టూ జంధ్యాలూ తెంపి పోగులుపెట్టడం అని తప్ప మరోభావనలేదు.

సన్యసించడం అంటే భౌతికవాసన తుచ్ఛమనీ, దాన్ని దూరంచేసుకుని మోక్షంపొందడం అనిన్నీ కాని మరోఅర్థం లేదు.

అలాంటి సన్యాసుల కందరికీ యీ భగవద్గీత ప్రధానం.

అసలు, గీతాభాష్యం పాఠంచెప్పకుంటేకాని అథవా, గురువు ఏకరువుపెట్టుకుంటూ వెడుతూ ఉండగా వొక్కమాట చెవులతో వినడమేనా జరిపితేగాని - విన్నట్టేనా నటిస్తేకాని వారు సన్యాసస్వీకారం చేసినట్టు అంగీకరించబడదు.

డొక్కశుద్ధి లేనివారు ఒక్క దుష్కార్యాలలో మాత్రమే ప్రవృత్తులై వుంటూవుండినా, ఈ సన్యాసులలో పండితులైఉన్నవారు గీతోపన్యాసాలద్వారా ప్రజలకు ఐహికనైముఖ్యం నూరిపోస్తూనే ఉన్నారు.

అంటే యేమన్నమాటా?

భగవద్గీత, జాతిని తప్పుదారిలో పెట్టి, భిన్నాభిన్నం చేసేసి, దాస్యకూపంలో పడగొట్టిం దనడానికిక అభ్యంతరం యేమిటీ?

తథాపి:

ఇన్నివేలసంవత్సరాలు కడిచాక, తిలకుపండితుడు దానికి ప్రవృత్తిపరంగా వ్యాఖ్యానం చెయ్యడం యెరుగుదుము.

కాని, అది మొన్న మొన్ననే పుట్టింది.

తెనుగుదేశంలో దానికి చాలినంత ప్రచారం ఉన్నట్టు కనబడదు.

ఉన్నంతవరకేనా అది నివృత్తిపరా లైన వ్యాఖ్యానాల వడి మళ్లించి, తెనుగువారిలో క్రొత్త భావన కలిగించగలిగిం దని చెప్పడానికి అవకాశాలు చాలవు.

కర్మ అనే మాటకి ధారావాహికంగా వస్తూవున్న నిర్వచనాన్ని మార్చడానికి దానికి తగిన శక్తి ఉన్నట్టు కూడా తోచడం లేదు.

కాక :

ఆభావ్యంవల్ల దేశంలో భగవద్గీతకు ఎక్కువ ప్రచారం ఏర్పడిందని కూడా చెప్పడానికి వీలులేదు.

పోనీ,

భగవద్గీత క్లైబ్యం పోగొట్టి అర్జునుణ్ణి ఉద్రిక్తుణ్ణి చేసిందే అని వొప్పుకుందాం.

అయితే : పుట్టింది మొదలు ఈ క్షణందాకా అది మనలో పఠనంలోనూ, పాఠనంలోనూ, శ్రవణం లోనూ, మననంలోనూ, ఆత్మావబోధలోనూ పూర్తిగా వుపయోగించబడుతూనేవుంది కదా. అర్జునుడి తరువాత దేశంలో పొడచూపిన అనేకలక్షల సందిగ్ధసమయాల్లో మరెవరికేనా అలాంటి వుద్రేకం కలిగించగలిగిందా? *

ఇక యీ వొక్క సందర్భమూ అవగాహన చేసుకోగలిగితే దీని సంగతి తేలిపోతుంది.

విషమసమయంలో అర్జునుడికి అనార్యజుష్టమూ, అకీర్తికరమూ అయిన కశ్మలం కలిగింది.

దాంతో అతను శోకసంవిగ్నమానసుడై ధను ర్బాణాలు విడిచిపెట్టి రథంమీద కూలబడ్డాడు.

అయితే: కృష్ణుడు వూరుకోడుకాదూ?

నిజానికి అతను యుద్ధంలో సాయం చెయ్య డానికి కాదు, యుద్ధం చేయించడానికి వచ్చాడు.

దీనికి కారణం శిష్టరక్షణకంటె ఆత్మరక్షణ ప్రధాన మయింది.

సరి, ఆవిషయం మరొకప్పుడుచర్చించుకుందాం. చెప్పవచ్చిం దేమి టంటే?

అర్జునుడికి పురెక్కించాలి.

దానికోసం కృష్ణుడు వేదాంతం మొదలుపెట్టాడు.

ప్రపంచంలో యీ రెక్కడనేనా చూడండి.

వేదాంతం అన్నది సరిగా బోధపడ్డచోట మనిషికి కాళ్లూ చేతులూ చల్లపరుస్తుంది; కాని ఆవేశం పుట్టించదు.

ఈచర్చ కూడా తరవాత చూచుకుందాం.

కృష్ణుడు ఏమిటేమిటో చెప్పుకు పోయాడు.

అర్జునుడు అది బాగా బోధపడుతూఉన్నట్టే ఏవేవో ప్రశ్నలు వేస్తూవచ్చాడు.

లెక్కచూడగా అక్కడికి పది అధ్యాయాల గ్రంథం అయింది.

కాని ఫలం బండిసున్నా.

కావలసిన పని కాలేదు.

అర్జునుడు ధనుర్బాణాలు మళ్లీ పుచ్చుకోలేదు.

అప్పుడు, ఇది కాదు తోవ అని కృష్ణుడు విశ్వ రూపం చూపించాడు.

దాంతో డంగయిపోయిఉన్న అర్జునుడికి మరికొన్ని సంగతులు చెప్పాడు.

అప్పటికి తగ్గింది అర్జునుడికి మోహం.

అంత పని జరిగాక అతనికి చెయ్యవలసిన పని స్మరణకు వచ్చింది.

అప్పుడు "నువ్వు చెప్పినట్టు చేస్తా"నంటూ నారి టంగుటంగున మోగించాడు.

అంటే ?

కృష్ణుడు విషయం చక్కగా బోధపరచగ వాడే.

అర్జునుడు చెప్పింది పూర్తిగా అవగాహన చేసుకో గలవాడే.

---

*ఇది ప్రొఫెసర్ రాయప్రోలు సుబ్బారావుగారి ప్రశ్న. వారు ఈవిషయం, కేవల జిజ్ఞాసతో అనేకమంది మహాపండితులనూ, గొప్పగొప్ప సన్యాసులనూ అడిగివున్నారు; కాని జవాబు పడయలేక పోయారు. —శాస్త్రి.

కాని, అర్జునుడి యెదట కృష్ణుడు చెప్పిం దంతా బధిరశంఖారావం అయిపోయింది.

అడవిలో కాసిన వెన్నెల అయిపోయింది.

ఉప్పగల్లుకి మారలేకపోయింది.

గారడీ చేసి విభ్రమ కలిగించవలసివచ్చింది.

ఇప్పుడు చెప్పండి.

మనవాళ్లు భగవద్గీత చదువుతున్నారు.

రోజూ రోజూ పుట్టుకువస్తూవున్న వ్యాఖ్యానాలు ముందు పెట్టుకుని, దైనందినభిక్షులతో బలిసివున్న స్వాములవార్ల గంభీరగీతోపన్యాసాలు వింటూ, విశేషార్థాలకోసం వెతుకుతున్నారు

మధ్య మధ్య శంకరాచార్యులూ, మధ్వాచార్యులూ, రామానుజాచార్యులూ వచ్చి తలో వేపుకీ గుంజిగుంజి విడిచిపెట్టడం అలా ఉంచుదాం.

కాని, నారాయణాంశసంభూతు డన్న కృష్ణుడు స్వయంగా వచ్చి మనవాళ్లకి ఉపదేశించడం లేదు.

మనవాళ్లు నరాంశసంభూతు లైన అరుములూ కారు.

అచ్చమైన ఆ అర్జునుడికి కూడా, ఆ సాక్షాత్కృష్ణుడు చివరి కేది చూపిస్తే కాని దిక్కు లేక పోయిందో ఆ విశ్వరూపసందర్శనం కలలోకూడా కావడానికి మార్గాలు లేవు.

ఇక మనవాళ్లకి భగవద్గీత బోధపడే దేమిటి?

వాళ్లకి కర్తవ్యజ్ఞానం కలగడం అంటే యేమిటి?

కటిబద్ధులై యేదో చేసెయ్యడం యెలాంటిది?

అన్నిటికీ మూలం, ఈ భగవద్గీత చదవడంవల్లనే జాతి మొత్తంమీద అలుముకుపోయిన నిర్లిప్తతా, వైరాగ్యమూ విరగడైపోవడం అంటూ యెక్కడ?

ఉలిక్కిపడితే లాభం లేదు.

మనకి సత్యమే ప్రియం అయ్యేయెడల, ఫలమే కావలసివున్నట్టయితే, ఒక్క భగవద్గీతవల్లనే కాదు, మన పూర్వవాఙ్మయం అంతటివల్లా కూడా మనకి చీమ తలకాయంతేనా వ్యక్తిత్వం యేర్పడదు.

పైగా, దానివల్ల భవిష్యత్తులోనేనా భారతీయతకు మహోన్నత సభ్యత చేకూర్చవలసిన ముందు తరాలవాళ్లు కూడా దద్దమ్మ లయిపోతారు.

కనక, ఇప్పుడేనా మనం మన జాతికి పునర్నిర్మాణం కావాలని అభిలషించేటట్టయితే, దురభిమానం చంపుకుని, ప్రపంచకం అంతా-అంగుళం అంగుళమూ పరిశీలించి చూడాలి.

ప్రపంచప్రవృత్తి తరిచితరిచి తీక్ష్ణంగా బోధపరుచుకోవాలి.

జాతి కంఠకీ జీర్ణించుకుపోయివున్న ఆధ్యాత్మికదృష్టిదోషం శస్త్రచికిత్సతో పూర్తిగా పోగొట్టుకుని, "నేనూ ప్రపంచకంతోపాటే" అంటూ గభీ మని ముందుకి ఉరకాలి.

శాస్త్రి




## బ్రహ్మాండమైన విద్యుచ్ఛక్తి జ్వాలలు

ఈ 'రాక్షస' విద్యుజ్జనని యంత్రమును రేపు ఎండకాలమున పారిస్ పట్టణమున ప్రదర్శింపబోవుచున్నారట. దీనికి సమానముగ విద్యుచ్ఛక్తిని పుట్టింపగల యంత్ర మిదివరకు కానము. నిర్ణీతపరిమితికి అందుకొన్నంతనే ఆ శక్తి జ్వాలారూపమున యంత్రమునుండి వెలిపడుచుండునట. అప్పుడు చెవులుబ్రద్దలగు శబ్దముకూడ కలుగునట. ప్రేక్షకులకు ఆ జ్వాలలనుండి కాని, ఆశబ్దమునుండి కాని అపాయము కలుగకుండ సర్వాభేద్యము లోహపంజరమున నాయంత్ర ముంచబడినది. పంజరము 80 అడుగుల కైవారముతో, దానికిఅనుకూలించు ఎత్తు గలిగి యుండును. అసలుయంత్రము గోళాగ్రస్థాణములం దమర్పబడియుండును. అవియు లోహముతోనే చేయబడి, విద్యుద్రోధకములుగ నిర్మింపబడియుండును. సంచాలకులు ఆకంబముల పైభాగమునందుండు బోలుగోళములందు సురక్షితముగనే కూర్చొనియుండి యీ విద్యుచ్ఛక్తి ప్రదర్శనమును గావింతురు. స్తంభములలో రబ్బరుపూతపూసిన బెల్టులు నిమిషమున కొకమైలువంతున చుట్టుచు పై గోళములకు స్థిర విద్యుచ్ఛక్తిని సరఫరాచేయుచుపోవుచుండును. చివరకు 5000000 వోల్టుల పరిమితికి రాగానే గోళములనుండి పదియడుగుల జ్వాలలు ఆవిర్భవించును. ఒకప్పుడా జ్వాలలనుండి మిణుగురులు బయలుదేరి నలుదెసలకు ప్రాకవచ్చును.




ఈ అద్భుతసృష్టి మరియొకరిదో కాదు; మదామ్ ఐరీన్ క్యూరీ జోలియట్ దంపతులది. మేరీక్యూరీ దంపతులు రేడియమును కనిపెట్టిన తరువాత వీరు, తాము కృత్రిమ రేడియమును తయారుచేయుదుమని బాహాటముగ ప్రకటించిరి. అందుకిట్టి మహాయంత్రము కావలసి వచ్చెను. కాని దాని నిర్మాణమునకు వలసినడబ్బు వారివద్ద లేకుండెను. అప్పుసప్పుచేసి దీనిని నిర్మించినారు. ప్యారిసులో దీనిని ప్రదర్శించి, టిక్కెట్లవలన వచ్చు రాబడితో ఆ అప్పును తీర్చదలచుకొన్నారు. ఆ తర్వాత నీయంత్రమును వారి పరిశోధనాలయమునకు గొనిపోయి తమ కార్యక్రమమునకు గడంగబోవుచున్నారు.

---

## పాత ఇటికలవలన వృక్షచరిత్రలను తెలిసి కొనుచున్నారు

ఆ పాతరోజులలో ఇటికలు పగలక, దృఢముగా నుండుటకై అందులో వృక్షసంబంధములగు ఆకు అల







౧　　　　　　　　౨　　　　　　　　3

౧. ఇటికలుకరగిన బురదనీటిని జల్లెడలో పోసి ఆకు లలములను వేరుపరచుట.
౨. అట్టి ఒకానొక ఇటిక : అందుండి బయటపడిన గింజలు, ఆకులు, కాడలు, రెమ్మలు మొదలైనవి.
3. ఆళకలములను ఒక పరిశోధకుడు మహాశక్తిగల యొక భూతద్దముతో పరీక్షించుట.

మలను చేర్చెడివారు కాబోలు ! ఈ నైనము వృక్షచరిత్రకారులకు తెలిసిపోయినది. ఆటువంటి యిటికల నాధారముచేసికొని వారు ఏయే చెట్లు దేశమునందు పూర్వమునుండి యుండిననో, యేవేవి కొత్తకొత్తగ విదేశములనుండి వచ్చిననో, అది. యెప్పడెప్పడో కనిపెట్టుటకు పూనుకొన్నారు. ఇటికలయొక్కయు, భవనములయొక్కయు కాలములనుబట్టి అప్పటప్పటి వృక్షముల తేదీలు నిర్ణయింపబడుచున్నవి. కాలానుక్రమణిక వరుసను ఇటికలను సేకరించి, వానిని ఒకటి రెండు రాత్రులు నీళ్లలో నానవైచియుంచిన నవి మెత్తబడి బురదయగును. దానికి మరింత జలమునుచేర్చి జల్లెడ పట్టినచో బురదనీరంతయుపోయి, అందులోని ఆకు లలములు మొదలగు వృక్షావయవములు జల్లెడలలో మిగిలిపోవును. అవి యేచెట్టువో ఆ చెట్లు ఆ ఇటికలు చేసిన నాటి కా దేశమున నుండినట్లు. ఇదే పంథాలో చరిత్రకారులు వృక్షముల కాలములను, దేశీయ విదేశీయతలను కనిపెట్టుచున్నారు. మానవప్రజ్ఞ కతీతమైనదేది ?

---

## ఆకాశచిత్రపటములకు ఉబ్బెత్తు ఆకారపటములను గీయు పరికరము

సమ వైశాల్యముగల రెండు ఆకాశచిత్రములను వేరువేరు కోణములందుండునట్లు అమర్చి, వాని బింబములను గాజుడ్రాయింగుబల్ల అడుగున పడునట్లు చేయవలయును. అందొక చిత్రము ఎర్రఫిల్టరుగుండాను, మరియొకటి నీలపు ఫిల్టరుగుండాను బల్లపై ప్రతిఫలించును.

చిత్రలేఖకుడు ఎరుపు, నీలపు లెన్సులుగల సులోచనములను తగిలించుకొని యా బింబమును చూచినచో నతనికక్కడ త్రిపరిమితిగల ప్రతిబింబము గోచరించును.



అప్పుడు దాని ననాయాసముగ నతడు బల్లమీద గీచుకొనగలడు. చిత్రములందలి వస్తువుల ఎత్తుతగ్గులను తెలిసికొనుటకు ఈ పటములు మిక్కిలి యనుకూలపడగలవు.

---

## దైవనిర్మితమైన గొప్ప బోను

కాలిఫోర్నియాలో లాస్ ఏంజలిస్ దగ్గరగానున్న దీబోను. చరిత్రకుగూడ అందని రోజులలో ఉత్తర అమెరికా ప్రాంతములందు తిరుగాడుచుండిన వింతవింత మృగముల యస్థికలను ఈ బోనునుండి బయటికి లాగుచున్నారు శాస్త్రవేత్తలు. "నల్ల ఊటలు" అని పిలువబడుచు నిది యిప్పటికిని ప్రమత్తముగానుండు పక్షులను, జంతువులను పొట్టబెట్టుకొని అవాకే జీర్ణమైన వానితో స్నేహము కుదుర్చుచున్నది.

ఇది యేర్పడి వేలకొలది యేండ్లు గడచినవి. విశాలమైన సరస్సురూపమున, జిగట ద్రవముతో నిండియున్న దీబోను. మానవులు దీనిని నిర్మించలేదు. దైవశిష్టసృష్టి కిది బందీఖానా. ఆ ద్రవమైనను ఎక్కడనుండి యట్లు సంతతముగా ఊరుచున్నదో అంతు దొరకలేదు. దీని చుట్టు అంచులు కొంచెము గట్టిపారియున్నను నడిమి ప్రాంతము మాత్రము స్వధర్మమును విడువక నిలిచియున్నది. మామూలురోజులలో దుమ్ము ధూళి రేగి యీ బురదగుంటను కప్పి దీని యునికినే దాచిపెట్టుచుండును. వానకాలములోను దీనియునికిని కనిపెట్టడము కష్టమే: నీరు దీనిమీద పారుచు ఏదో బురద నీటిగుంటయను భ్రాంతిని గలుగజేయుచుండును.

శతాబ్దములకు పూర్వము తమ పూర్వీకులు త్రొక్కిన దారినే త్రొక్కుచు ఇప్పటి కోళ్లు, పిల్లులు, కుక్కలు, ఉడుతలుకూడ ఎన్నో దీనివాత బడుచున్నవి. దీనిలో మరతలుపులు లేవు, లోపలవేసి బంధించుటకు. ఉక్కు 'దవడలు' లేవు, నొక్కి చంపివేయుటకు. కాని జంతువులు ఒక్కక్షణములో దీనిలో తగులుకొని చలనము చాలించును ఎంత తనుకులాడినను లాభములేదు. క్రమముగ నా బురదలో శివశివా యనకొనుచు నడుసునకు మునిగిపోవును. విరుగుడులేని జిగట మరి!

ఇప్పటికి త్రవ్వితీసినంతవరకు 3000000 కు పైగా ఈ గుంటనుండి యెముకలు బయటపడినవి. ఇది 30 ఏండ్ల ప్రయత్నము. ఎన్ని ప్రాణులను పొట్టబెట్టుకున్నదో యీ వింతబోను, ఈ ఎముకలే మూగసైగలతో చెప్పుచున్నవి. శాస్త్రకారుల కొక్క విషయములో సంతోషమైనది. ఈ గుంటలోని జిగటద్రవము ఎముకలను చెడనీయకుండ పదిలపరుచునట్టిదిగ ఏర్పడినది. అతి సూక్ష్మములైన యస్థికలుకూడ చెక్కుచెదరక చెడిపోక ఇందులో నిలిచియున్నవి.

చరిత్రకారులు-ఈ యెముకల నన్నిటిని జాగ్రత్తగ విడదీసి పరిశీలించి ఆయా జంతువుల యెముకలగూళ్లను మరల కట్టి పెట్టినారు. మానవుడింకను జన్మించకముందు అనేకశతాబ్దములకుపూర్వము ఆప్రాంతములందు నివసించుచుండిన జంతువుల స్థూలరూపములు తయారైనవి. నాలుగడుగుల యెత్తు పిల్లులు, బ్రహ్మాండమైన యెలుగులు, ఏనుగులను తలదన్ను రాకాసిమృగములు, ఈ నాడు నామరూపములు లేని తెగ తోడేళ్లు, పెద్దపెద్ద రెక్కలుగలిగి



'రాక్షస'రూపమునందు పక్షులు- ఈ విధముగా ఎన్నియో క్రొత్త ప్రాణులను ప్రదర్శించి నారు.

ఈ ఖనన ప్రయత్నములో ఆనాటి పెద్దపులిపుర్రెయొకటి వెలువడినది. కత్తులవంటి దానికోరలు- ఏదో తోడిజంతువుతో కలిగిన ఘోరమైన పోరాటములో కాబోలు విరిగిపోయినవి. విరిగిపోయిన పండ్ల మొదళ్లుకూడ అరిగి మొద్దుబారిపోయియుండుటవలన ఆ జంతువు కోరలు విరిగిపోయినతర్వాతకూడ చాలకాలము తన జాతి ధర్మమును నిర్వర్తించుట కుపయోగించుచుండినట్లు ఊహింపవలసి వచ్చుచున్నది.

యథాపూర్వముగ తన పనులు సాగించుటకు శక్తిచాలక ఈ పెద్దపులి తన వేటయులవాట్లను, ఆహార స్వరూపమును మార్చుకొనియుండనోపును. ఇందువలననే



కాబోలు, అది అన్నాళ్లనుదగ్గరచేరని యీ గుంటకు ఆహుతికావలసివచ్చినది. దీనిలో చిక్కుకొని యల్లాడుచుండిన యేదో ప్రాణినిచూచి, దానిని పట్టి కబళించివేయుదమన్న యూహతో నీపులి యీ మాయదారి గుంటచేరువకు పోవుటయు, ప్రమాదవశమున దానిలో పడుటయు సంభవించియుండును.

కొంచెమన్నమండల మగుటచే శరీరములందలి కండలు, కణసమితులు చెడిపోయి మంటిలో కలిసి



పోవుట జరిగినది. అదే ఉత్తరప్రాంతములందైయుండినచో శరీరములన్నియు- మంచుగడ్డలయందు భద్రపరుపబడినవానివలె- చెక్కుచెదరక యావత్తు శరీరభాగములతోను, పచ్చిపచ్చి కండలతోను నిలిచియుండెడివి.

ఆరోజులయందలి ప్రాణులను, ప్రాణుల జీవితములను చరిత్రరూపముగా వ్రాయుటకు ఈ 'రాగిరేకుల శాసనము' పూర్వపుణ్యావశమున దొరకినది. చరిత్రకారులందుకు నడుముకట్టి తమ కార్యక్రమణిక కుపక్రమించినారు.

---

## టూత్‌పేస్టు గొట్టాలకు కొత్త మూతలు

టూత్ పేస్టు, క్షౌరపుక్రీముల గొట్టాలకు మామూలు మరమూతలకు మారుగా కొత్తస్ప్రింగుమూతలు తయారయినవి. అవి స్ప్రింగుతో గొట్టాలకే అతుకబడి ఉంటవి. కొంచెము పక్కకు లాగితే ట్యూబులోనున్న



పేస్టు బయటికి వస్తుంది కావలసినంత రాగానే మందుకు తోస్తే దాని స్థానానికి అది చేరి ట్యూబును గట్టిగా బందుచేస్తుంది. దీనివల్ల పేస్టు నష్టం గాకుండా పోవడమూ, త్వరగా పని కావడమూ ప్రయోజనాలు.

---

## పత్తి ఏరడానికి కొత్తయంత్రము

ఇప్పటికి అమలులో ఉండే పత్తిఏరే యంత్రాల తాలూకూ, చేతిపనిముట్ల తాలూకూ అన్నీ సౌకర్యాలతో పత్తిఏరే కొత్తరకం యంత్రం ఒకటి మెంఫిస్ (ఉత్తర అమెరికా)లో తయారయింది. చేతిపనిముట్టులో గిర్రని తిరుగుతూ ఉండే కొక్కాలు పత్తిని చిక్కించుకొని





చేతిపనిముట్టు.

లాగేస్తవి. ఆపత్తి ఒకపొడుగాటిగొట్టంగుండా పక్కన ఉండే యంత్రంలో ఉండే సంచిలో పడిపోతుంది. గుంపెడుమంది మనుష్యులు చేసేపనిని ఈ కొత్తయంత్రంతో ఇద్దరుమనుష్యులు సులువుగా చేయవచ్చును. రెమ్మలకుగాని, పచ్చికాయలకుగాని ఏమీహాని కలగదు.

---

## నోట్లను పరీక్షించే యంత్రము

పక్కనుండే సందుగుండా నోట్లను లోపలికి ఎక్కించి, వాటిమీద దీపపువెలుగు బాగాపడేటట్లుచేసి లోపలికి అమర్చబడిఉండే భూతద్దంద్వారా వాటిని



పరీక్షిస్తే వాటిల్లో లోపాలు స్పష్టంగా తెలిసిపోతవి. బాంకిచెక్కుల్లో మార్పులు, దొంగసంతకాలు మొదలయినవాటినికూడ ఈయంత్రంతో పరీక్షించి కనుక్కోవచ్చును. నోటును పరీక్షించడం చిత్రంలో కనపడుతూఉంది.

---

## పదిగోళ్ళకును ఏకకాలంలో మెరుగు పెట్టుకోవచ్చు.

వేళ్లగోళ్లకు మెరుగు పెట్టడానికి ఒక కొత్త పనిముట్టు ఒకటి అమ్మ

కానికి వచ్చింది. యంత్రంలో రెండు సంద్రని భాగాలున్నాయి. వాటినడుమ తిరుగుతూ



ఉండే గుబ్బలు ఉన్నాయి. వాటిని వ్రేళ్లతో పట్టుకోవాలి. చిత్రంలో చూపిన మార్గాన అవి తిరుగుతూ ఉంటవి. వాటిల్లో ఉండే మెత్తని అస్తర్లు (Linings) ఏకకాలంలో అన్నీ గోళ్లకు మెరుగెక్కిస్తవి.

———

## క్రొత్త ఎలెక్ట్రిక్ రేజరు

ముఖానికి బాగా సబ్బు పట్టించి ఈ రేజరు అడ్డంగా ఉంచి తేలికగా లాగుతూఉంటే, తెగే అంచు క్రిందికీ, మీదికీ కదులుతూ నున్నగా చల్లగా తొందరగా వెండ్రుకలను అడుగంట తీసేస్తుంది.



ప్రసిద్ధంగా ఉండే బ్లేడ్లు అన్నీ దీనికి పనికివస్తవి. ఎలెక్ట్రిసిటీ లేనిచో మామూలు సేఫ్టీరేజరువలెనే దీన్ని ఉపయోగించుకోవచ్చు.

———

## మంటలతో చమురును చిమ్ము టాంకులు

మంటలు కక్కే చమురును అఖండధారగా



ముందుకుచిమ్మే టాంకు అమర్చినబండిని ఒకదాన్ని ఇటలీలో తయారుచేశారు. 'రోము' దగ్గర దాన్ని పరీక్షించారుకూడ. నూతనంగా తయారవుతూఉన్న యుద్ధపరికరాల్లో ఇది చాలభయంకరమయింది. నిప్పులు చిమ్ముతూ నడుస్తుంది. మొన్నటి ప్రపంచయుద్ధంలో మంటలుచిమ్మే యంత్రాలను చేతపుచ్చుకొని పదాతులు సేనకు ముందు నడిచిపోతూ ఉండేవారు. వారందరు శత్రువుల మరఫిరంగుల వాత పడిపోయేవారు. ఇకమీదట ఈ టాంకులబండ్లు మంటలు చిమ్ముతూ శత్రుమధ్యంలో నిరపాయంగా దారి తీయడానికి పనికివస్తాయి. ఈ బండ్లమీద సాయుధులగు సైనికులు ఉంటారు.

———

## అతిమాత్ర వేగంతోపోయే మోటారుసైకిలు

ఉడకబెట్టి చక్రాలమీద కెక్కించిన బ్రహ్మాండమయిన బంగాళాదుంపలాగుండే మోటారుసైకిలు ఒకటి కొత్తగా తయారయింది. అది గంటకు ౧౭౦



మైళ్లు నడుస్తుంది. ఈ వింతసైకిలును ఒక జర్మనివాడు తయారుచేశాడు. తేలికపదార్థంతో తయారుచేసిన గుల్ల సైకిలుచట్రంమీద అమర్చబడిఉంది. ఈ గుల్లవల్ల ఎదురుగాలి విసురు అడ్డకుండా ఉంటుంది. దుమ్ము కంట్లోపడకుండా దోవ కనబడడానికి వీలుగా ఉండేటట్లు ఎక్కినవాని ముఖానికి సరిగా గుల్లకు ఎగవభాగంలో, దానితో సమంగా ఇమిడేటట్లు బద్దలుకాని గాజు పలక అమర్చబడి ఉంటుంది.

సైకిలు నిలిచిఉండుటకు పనికివస్తవి రెండు పక్కలా ఉండే చిన్న చక్రాలు. నడచేటప్పుడు వానిని లోపలికెత్తివేయవచ్చు.

---

## మోటారుబండిమీద కామెరాస్టాండు

మోటారు బండిమీద ఎత్తుకు తగినట్లు హెచ్చించుటకు, తగ్గించుటకు వీలుగా అమర్చబడిన నిచ్చెనవంటి స్టాండ్ ఒకటి ఉంటుంది. దానిమీద నిలుచుని



ఫోటోగ్రాఫరు ఎత్తున ఉండే దృశ్యాలకు ఫోటోతీయవచ్చును. చిత్రంలో ఒక ఫోటోగ్రాఫరు ఆలాటినిచ్చెన మీద ఎక్కి ఫోటో తీయడం కానవస్తుంది.

---

## కంటిజోడుగాజుబిళ్లలను శుభ్రపరిచే చిన్న పనిముట్టు

ఈ పనిముట్టు కొత్తగా తయారయింది. జేబుకు తగిలించడానికి దీనికి ఒకక్లిప్పు ఉంటుంది. దీని ఉపయోగము చిత్రంలో చూపబడింది. ఇది కారులా గుంటుంది. తలచీలికలకొసలకు లోనైపున సుంద్రని మెత్తని కుదుళ్లుఉంటవి. మరొకకొసనుగొట్టంలోనిలవఉన్నద్రావ



కం కుదుళ్లలోకి వస్తుంది. కుదుళ్లను గాజుబిళ్లలమీద రుద్దితే అవి శుభ్రమవుతాయి.

---

## బట్టల మన్నికను కనిపెట్టే యంత్రము

కొత్తబట్టలు ఎన్నాళ్లు మన్నుతవో తెలుసుకోవడానికి చిత్రంలో చూపబడిన యంత్రాన్ని ఒకదాన్ని అమెరికాలో నిపుణులు కనిపెట్టారు. బట్టచిరగడానికి ఎంతరాపిడికావాలో ఈయంత్రం తెలుపుతుంది.



దీంతోను, ఇంకా ఇతర పరీక్షలతోను బట్టల మన్నిక తెలుసుకోవడానికి పరిశోధనలుచేస్తూఉన్నారు. సఫలం అయితే ప్రతి బట్టకును దాని మన్నికకాలం నిర్ణయింపబడుతుంది. ఆ నిర్ణయంవల్ల బట్టలు కొనేవాళ్లకు చాలా ఉపకారం అవుతుంది.

---

## ఏనుగు కొమ్ములతో పియానా మెట్లు

పియానాల దంతపుమెట్లకోసం ఏటా నూర్లతరబడి ఏనుగులు ప్రాణాలు కోలుపోతూ ఉంటవి. మెరుగులు చిమ్ముతూ ఉండే పియానా మెట్లకు ఏనుగుకొమ్ములు బహుశః కెన్యాకాలనీలోగాని, జాంజిబారు ద్వీపంలోగాని దొరికేవి కావచ్చును. అక్కడి కొమ్ములు చాల ప్రశస్తమని పియానాలు చేసేవాళ్లు అంటారు. ఇందలి చిత్రాలు పెద్ద పెద్ద ఏనుగుల కొమ్ములు ఏయే మార్పులుపొంది చివరకు మెట్ల కిందికి తయారవుతవో తెలుపుతవి.



౧.



౨.



౩.



౪.



౫.



౧. గోదాములలో నిపుణులు కొమ్ములను పరీక్షిస్తున్నారు.

౨. మెట్ల కొలతనుబట్టి కొమ్ములను రంపంతో కోస్తున్నాడు.

3. రంగునుబట్టి మెట్లను పరీక్ష చేస్తున్నారు పడుచుపిల్లలు. రంగులో రవ్వంత భేదమయినా వీరికంటికి చప్పున తెలిసిపోతుంది.

౪. మెట్లముక్కలను గాజుమూత పెట్టెల్లో పెట్టి ఎండిస్తారు. తర్వాత ఎండతగిలితే రంగు మాయకుండా ఉంటుంది.

౫. దంతపు మెట్లు తయారయిన తర్వాత, నల్ల కర్రమెట్లను జోడిస్తారు. ఇప్పుడు పియానామీద అమర్చడానికి సిద్ధమయింది.

౬. గట్టి కర్రపలకమీద దంతపు ముక్కలను ఇలాగా జిగురుతో అంటించి ఎండినతర్వాత ముక్కలుగా కోస్తారు. ఆముక్కలే మెట్లు.

---

## గడ్డం గంట

దూరప్రయాణాల్లో మోటారుకార్లవాళ్లు నిద్రమబ్బులో ఉంటే జరిగే ప్రమాదాలు నివారించడానికి ఒకకొత్త అలారం గంట తయారయింది. డ్రయివరు కాలరుకు దీన్ని తగిలించి పెట్టాలి. వాడితల ముందుకు వంగినపుడల్లా దీనిమీద ఉండే చిన్న మీటకు గడ్డం తగులుతుంది. అట్లా తగిలినప్పుడు మీటతో కూర్చిఉండే స్ప్రింగు సాయంతో గంట మోగుతుంది. విమానాలు మొదలయిన యంత్రాలను నడిపేవాళ్లందరూ దీనిని ఉపయోగించవచ్చు.



---

## రెక్కల సేఫ్టిపిన్నులు

పిల్లలకు చేతికిదొరికినదానినల్లా నోట్లో పెట్టుకోవడమూ, సాధ్యమయితే దాన్ని తిన్నగా మింగేయడమూ అలవాటు. వాళ్లు అలా మింగేవాటిల్లో సేఫ్టిపిన్ను ఒకటి. ఇకమీదట అలాటిభయం లేకుండా కొత్తగా రెక్కలతో సేఫ్టిపిన్నులు తయారయినవి. పిన్ను రెండు పక్కల ముళ్లకూ రెండు రెక్కలుంటవి. అవి బాగా వెడల్పుగా ఉండడంవల్ల పిన్నులు మింగుడుపడవు. అంచేత పిల్లలు పిన్నులను మింగిపోతారేమోఅన్న భయం తల్లులకు పనిలేదు.



---

# కలగూరగంప

## వాసిష్ఠ గణపతిముని

వాసిష్ఠ గణపతిముని అసలు పేరు అయ్యలసోమయాజుల గణపతిశాస్త్రిగారు. వీరు గొప్పపండితులు; బహుశ్రుతులు. సంస్కృతాంధ్రములయందు చక్కని




యశ్శశరీరులు బ్రహ్మశ్రీ కావ్యకంఠ అయ్యల సోమయాజుల గణపతిశాస్త్రిగారు 'పూర్ణ' రచయిత.

కవిత్వము చెప్పగలిగినవారు; సహజ ప్రతిభాసంపన్నులు. వీరి జ్ఞాపకశక్తి అపూర్వమయినది. వీరి జీవితము అద్భుత సన్నివేశములతో నిండినది. పదేండ్లప్రాయముననే వీరికి జ్యోతిశ్శాస్త్రమున పెద్ద పాండిత్యము కుదిరెను. కాని కొన్నాళ్ల కాశాస్త్రమునందలి ప్రామాణ్యము వారికి నిలువజాలకపోయినది. మంత్రశాస్త్రమునను వీరి సామర్థ్యము ప్రశస్తమయినది. వైదికమంత్ర ప్రభావ మమోఘమని వీరి విశ్వాసము.

ఒకానొకప్పుడు శాస్త్రిగారు నవద్వీపమునకు పోయి అచటి పండితులతో వాదించి, వారి నోడించి, వారిచే 'కావ్యకంఠ' బిరుదమును బహు సమానముగా పొందిరి.

శాస్త్రిగారు తరుచు ప్రశాంత వివిక్త ప్రదేశములందు నివసించుచు ఆత్మవిచారము చేయుచుండువారు. అట్టి యవసరములం దొకప్పుడు శ్రీరమణమహర్షి యెడ వీరికి భక్తి ఏర్పడినది. వెనువెంటనే రమణాశ్రమమునకు చని మహర్షి సాన్నిధ్యమున చిరకాలమునివసించియుండిరి. 'రమణ గీతలు'మున్నగు గ్రంథములను రచించి వారియెడ తమకుగల అపూర్వ గౌరవమును ప్రకటించిరి.

వైదికమతోద్ధరణాసక్తి వీరికి మిక్కలి కలదు. అందువలన వీరు ఇటీవల వైదికమతోద్ధరణమునకయి అనేక ప్రయత్నములను చేయుచుండిరి.

అమోఘము, అనర్గళము నయిన ప్రవచనశక్తి వీరికి కలదు.

వీరు దేశభక్తిపెల్లున కాంగ్రెసునందును కొంత కాలము హస్తక్షేపము గావించి, అభిప్రాయభేదము కారణముగా దూరమునకు తొలగిపోయిరి.

వీరి ప్రపంచజ్ఞానము అనన్యసామాన్యము. వీరనేక గ్రంథములను రచియించిరి. వానిలో కొన్ని అముద్రితములు; కొన్ని అసమగ్రములుకూడ. అట్టివానిలో నొకటి

'పూర్ణ' యను గద్యరచనము. ఇది విష్ణుకుండినుల కాలమునాటివృత్తమాధారముగాగలది. శాస్త్రిగారి ప్రతిభకు పాండిత్యమునకు, ప్రపంచజ్ఞానమునకు నిది పరమావధి అనదగినది. ఇది వారి తుది రచనము; ఎనుబది ప్రకరణముల గ్రంథము. దీనిని భారతియందు ప్రకటింప శాస్త్రిగారి కుమారులు శ్రీ అయ్యల సోమయాజుల మహాదేవశాస్త్రిగారొసగినారు. భారతి వీరియెడ కృతజ్ఞతను ప్రకటించుచు గ్రంథ ప్రకటనమును ప్రారంభించినది. 'గణపతి' యనునది గణపతిశాస్త్రిగారి నామాంతరము.

---

## ఆత్మరక్షణకు కుస్తీ మెళుకువలు



౧ చిత్రము

దెబ్బలాట ఒకపనిగా ఎవ్వరూ పెట్టుకోరు. మీదు మిక్కిలీ అదంటే ఎవ్వరికీ గిట్టదుకూడా. అయితే ప్రతీమనిషికీ జీవితంలో తన్నుకానీ, తన్ను ఆశ్రయించినవాళ్లను కానీ రక్షించుకోడంకోసం దెబ్బలాట అవసరం ఎప్పుడో ఒకప్పుడు వచ్చితీరుతుంది.

దవడమీద ఓగుద్దుగుద్ది మీదపడ్డవాణ్ణి పడతోయడం పద్ధతి ఒకటి ఉంది. అది చాలా పాతకాలంనాటిది. అది నవలల్లోకీ, నాటకాల్లోకీ సరిపోతుంది చాలా బాగా; అనుభవంలో మాత్రం ఏ మాత్రమూ సరిపోదు.

సాధారణంగా వీధుల్లో జరిగే దెబ్బలాటలు చూస్తూఉంటాము. అలిసి కింద పడిపోయేంతవరకూ ఒకర్నొకరు చావకొట్టుకుంటూ ఉంటారు. చివరకు ముక్కులగుండా నెత్తురుకారడమూ, కళ్లు చీకట్లు కమ్మడమూ, పడిపోవడమూనూ. ఇదే దానిఫలం.

కత్తితీసుకుని ఎవడయినా మీదపడడానికి వచ్చినప్పుడు కానీ, ఏ దొంగాడయినా వచ్చి తుపాకీని డొక్కలోకి గురిపెట్టి పేల్చడానికి సిద్ధంగా ఉన్నప్పుడు కానీ, నెమ్మదిగా ఓచోట కూర్చుని ఉన్నప్పుడు ఏ తాగుబోతో తూలుతూ తూలుతూ వచ్చి మీదబడి కొట్టవచ్చినప్పుడు కాని వెనుక ఎప్పుడో నేర్చుకున్న కుస్తీపనితనం చూపించి తప్పించుకోవడానికి అవకాశం ఉండదు. వెంటనే నెత్తిమీది అపాయాన్ని సులువుగా తప్పించుకునే ఉపాయం చూడాలి. అలాటప్పుడు తప్పించుకొనే మెళుకువలు కొన్ని తెలిసుండాలి ప్రతీ మనిషికీ.

ఒక దొంగాడు తుపాకి గురిపెట్టి మీదికివచ్చి సొమ్మంతా ఇచ్చేయమంటాడు. అప్పుడు రెండు చేతులూ మీదికెత్తేసి దగ్గరుండే సొమ్మంతా తీసేసుకొనేవరకూ ఏమాత్రమూ మెదలకుండా నిలబడాలి. అలాటప్పుడు వాడి చేతినుండి తుపాకిని లాగేయడం మంచిదని తోస్తే తప్పకుండా అలాచేయాలిసిందే. అయితే ఎలాచేయాలో మాత్రం బాగా తెలిసుండాలి.

ఇలాటి అవసరాలు తక్కిన వాళ్లకంటె పోలీసు వాళ్లకు ఎక్కువగా వస్తూఉంటాయి. అందుకోసమని వాళ్లకు ఆ మెళుకువలు నేర్పుతారు.



(చి. ౨, 3)

ఉన్నట్టుండి ఎవడయినా తుపాకి తీసుకొని మీద పడతాడు. వెంటనే వాడిదృష్టిని ఒకత్రుటికాలం మరో దానిమీదికి తప్పించాలి. అందుకని వాడి బుజంమీగి నుంచి అవతలికి మాడాలి, ఎవళ్లో వెనకవస్తూ ఉన్నట్టు. ఇట్లా కాకుంటే ఇంతకంటే మంచి ఉపాయం మరోటి ఉన్నాలి వాడి దృష్టిని తిప్పేయడానికి.

(చి. ౨,3) వాడి కుడిచేతులో తుపాకి ఉంటే చప్పున ఎడమవైపుకు ఒక అడుగు తప్పుకోవాలి. కూడా, ఎడంచేయి మీదికెత్తి వాడి మణికట్టుమీద గట్టిగా ఒక్క చరుపు చరిచి కదలకుండా పట్టుకోవాలి. అప్పుడు తుపాకీగురి నిన్నుండి తప్పిపోతుంది. ఆ పట్టిన పట్టు సళ్లించకుండా మణికట్టును వెనక్కు మెలిపెట్టాలి. కుడిచేత్తో వాడి పిడికిలిఅడుగున పట్టుకుని తుపాకి చేతిని మణికట్టుమీదినుండి వెనక్కి వంచాలి. ఇప్పుడు తుపాకి వాడివేపుకే గురిచూపుతుంది. వాడేమయి నా పొరపాటున మీట నొక్కాడా అంతటితో చెల్లు ఆయన పని. బాగా వెనక్కు విరిచేసరికి చెయ్యి విప రీతంగా నొప్పెడుతుంది. తుపాకిపట్టు సళ్లిపోతుంది. అప్పుడు కుడిచేత్తో తుపాకీని లాగేసేయవచ్చు.

మణికట్టును మెలిపెడుతూన్నప్పుడు నిలకడ చిక్కడానికని వాడు కుడికాలు ముందుకు వేస్తాడు. అప్పుడు వాడి బరువంతా ఆ కాలిమీదే ఆనిఉం టుంది. వాడలా ఉన్నప్పుడు వాడి ఆకాలికి ఎడం కాలితో కిందివేపునుంచీ ఒక తాపుతగిలించాలి. దాంతో వాడు కిందపడిపోతాడు. అప్పడయినా చెయ్యి మెలీ పెట్టడం మాత్రం మానేయకూడదు, తుపాకిన్నీ వాడివళం లోంచి పోతుంది. వాడింకేమీ చేయలేకుండా ఉండి పోతాడు. ఈ తంతంతా క్షణంలో మెరుపు మెరిసినట్లు జరిగిపోవాలి. ఏమాత్రం ఆలస్యమయినా ఉపద్రవం కలిగితీయతుంది.

ఎవడేనా కత్తెత్తి నీలిగి కడుపులో పొడవడానికి వస్తే పై పద్ధతితోటే తప్పించుకొని కత్తిని లాగి పారేయవచ్చు. కత్తిని పొడవడానికి మీదికెత్తినపుడు మణికట్టును తిన్నగా గట్టిగా నొక్కిపట్టి కత్తిని లాగేసి (చి. ౪) వాణ్ణి కిందతోసేయవచ్చు ఒక క్షణంలో.

చెయ్యి అలా మీదికెత్తి ఉండగానే వాడిమీదికి హఠాత్తుగా దూకాలి. వాడి కుడిచేతిలో కత్తి ఉంటే ఆ చేతి మణికట్టును ఎడంచేత్తో వడిసి పట్టుకొని అవత లికి లాగిపట్టి ఉంచాలి. కూడానే కుడి ముంజేతిని వాడి రెక్కకిందినుంచీ చొప్పించి వాడి మణికట్టును

పట్టుకోవాలి. మన కుడిముంజేతిని మీటలాగా ఉపయో గిస్తూ వాడి చేతిని కిందికి లాగాలి.

వాణ్ణి కిందికి నొక్కుతూ ఉండేటప్పుడు వాడి కేమాత్రమూ పైకి లేవడానికి అవకాశం ఇవ్వకూడదు. అప్పటికి వాడు నిలబడలేక, కల్లకిల పడిపోతాడు; కత్తినీ జారవిడిచేస్తాడు.

వాడు కిందపడినతర్వాత పట్టు వదలకుండానే వాడి భుజంమీద కూర్చుంటే సరి, నీ బరువంతా దాని పయినే నిలిచి నొప్పిపుట్టిస్తుంది ఎక్కువగా. తప్పుకోవ డానికిగానీ, ఏమీ చేయడానికిగానీ చేతకాకుండా అలాగే ఉండిపోతాడు వాడు.

ఈ పట్టును జపానుపట్టు అంటారు.

దుడ్డుకర్రను గాని, గాజుబుడ్డీని గాని తీసుకొని మీదికివచ్చేవాళ్లనుకూడా ఈఉపాయంతోనే పడ(చి. ౪,౫)గొట్టవచ్చు. వాడిచేతిని అవలకు తోసిపెట్టడంలో ఎప్పుడో వాడిచేతినుంచీ వాటిని లాగిపారేయవచ్చు. వాడు తనబలాన్ని ఉపయోగించేలోపల వాడిచేతిని వెనక్కు లాగి మీట తగిలించి నొక్కాలి.

అదునులో అయితే ఇది చాల సులువయినపట్టే పట్టు సరిగా చిక్కుండంటే- అంతే- ఇంక ఆశలేదు.

ఎవడయినా వెనుకనుంచీ తెలియకుండా వచ్చి మీదపడి తన ముంజేతిని గడ్డంక్రిందికి పోనిచ్చి గొంతుక నొక్కడానికి ప్రయత్నించవచ్చు. వెంటనే వాడిచేతిని ముందుకుతోసి పట్టి ముందుకువంగి వాణ్ణి తలమీదికి వంచుకొని లేవదీయాలి. అప్పుడు గిట్టిపట్టు దొరికిందంటే వీపుగానీ, తలగాని పెటపెటలాడిపోవలసిందే. దాంతో వాడిపని అయిపోతుంది. అప్పుడువాడికి డోలీకూడ అవసరం అయితే కావచ్చు.

సులువయింది- తెలుసుకోవలసిన పట్టు మరొటి ఉంది. ఎవడయినా ముఖాముఖిని ఎదుర్కొన్నప్పుడు రెండుచేతులతో వాడి మణికట్టును పట్టుకొని ఒక్క ఊపున ప్రక్కకు తిరిగేయాలి.

అప్పుడు వాడు వెనక్కి వస్తాడు. వాడిచెయ్యి మన భుజంమీదుగా ఉంటుంది. వెంటనే ముందుకు వంగేస్తేసరి వా డేమీచేయలేకుండా పోతాడు.

వెనుకనుంచి మీదపడినవాడి తలను, రెండు చేతులు బుజాలమీదుగా నక్కుపోనిచ్చి పట్టుకొని చప్పున వెనకటివలెనే ముందుకు వంగాలి. వాడితల వెనకవేపున పట్టుకొని చప్పున క్రిందికి వంచాలి.

ఎవడయినా మీదపడి గుద్దడానికి వస్తే కొంచెం ఒళ్లుముడుచుకొని కిందకి తగ్గాలి. సందుచూచి కుడిచేత్తో



(చి. ౪)



(చి. ౫)



(చి. ౬)

వాడి ఎడమమణికట్టు పట్టుకొని, ముందుకు ఉరికి భుజాన్ని వాడి కాళ్లసందున దూర్చాలి. వెంటనే లేచి రెండుమాట్లు గిర్రున తిరిగి వాడికి దిక్కుతోచకుండా చేసి, వాడి చేతిమీదినుంచే ముందుకు లాగి, ఇంకొక చేత్తోను, భుజంతోను వాణ్ణి మీదికెత్తి (చి. ౭) తల కిందటగిలేట్టుగా పడవేయాలి.

ఈ పట్టు ఎంత తమాషాగా ఉందో అంత అమోఘంగా పనిచేస్తుంది; చాల సులువయిందికూడ. సామాన్య బలంకలవాడయినా సరే ఎంత భారవాటి మనిషినిగాని సులువుగా మీదికెత్తేయవచ్చు, సరిగా వాణ్ణి తనమీద నిలుపుకోగలిగితే. గిర్రున తిరగాలిసిన అవసరంకూడ లేదు. కాని వాడికి తలదిమ్మెక్కేట్టుచేస్తే మన ప్రయత్నం అమోఘంగా ఫలించడానికి సాయపడుతుంది. వాణ్ణి కంకరనేలమీదనే పడవేయదలచుకుంటే తల దిమ్మెక్కించవలసిన అవసరంకూడ ఉండదు.

మేజాముందు కూర్చొని ఉన్నప్పుడు ఎవడయినా మీదపడితే వాణ్ణి లొంగదీయడం చాల తేలిక. కాని కాళ్లు మేజాకింద చిక్కుకోకుండా ఉండాలి.

తప్పతాగిన ఏజగడాలమారో రాత్రి క్లబ్బుల్లో గాని హోటళ్లలో కాని అలాగా మీద పడతాడు. వాడి మీదికి సిద్ధపడడానికి ఒకొక్కప్పుడు అవకాశం ఉండవచ్చు.

మొట్టమొదట మన కేమీ అడ్డు తగలకుండా కుర్చీని మేజాకు దూరంగా లాగేయాలి. వాడు మీద పడి కుద్దితే దాన్ని లెక్కపెట్టనట్టే కనపడాలి. వంగి నట్టే ముందుకుపోయి భుజంతో వాడి కాలిమీద మోకాలికెగవ ఒకతాపు తన్నాలి. ఆ కాలి వెనకవేపున రెండు చేతులు పెనవేసి చీలమండకేసి ముందుకు ఒక దెబ్బ తగిలించాలి. ఇట్లా చేస్తూ ముందుకు కూడా లాగుతూ ఉండాలి. (చి. ౯) వా డప్పుడు గభీమని వెల్లకల నేలమీద పడిపోతాడు. నిలుచున్నపుడు మీద పడ్డ వాణ్ణయినా ఇలాగే పడదోయవచ్చు.

తలవంచుకొని మీదికి వచ్చేవాణ్ణి లొంగదీయడం అతిసులభం. వాడు వచ్చే రావడంలోనే కుడిచేతిని



(చి. ౭, ౮, ౯)

వాడి మెడకు చుట్టి చంకవేపుకీడ్చి నడుముదగ్గరికి వంచాలి. ముంజేయి దవడమీదుగా వచ్చేలాగ ఎడంచేత్తో కూడ మెడను చుట్టబెట్టాలి. ఆ చేత్తోనే మన కుడి ముంజేతిని పట్టుకొని, ఒళ్లికి ఆనేట్టుగా లాక్కొని తలను మీదకి నొక్కాలి. కూడానే వాడి యెడంభుజాన్ని మన కుడిచేత్తో నెట్టుతూ ఉండాలి. వాడి కెంతబాధ కలిగించాలంటే అంత బలాన్ని చూపవలిసుంటుంది. ఇట్లా చేయడంవల్ల వాడికి విపరీతంగా నొప్పెట్టడమే కాకుండా, మెదడుకు నెత్తురు పారకుండా చేయడం వల్ల స్మృతికూడ తప్పిపోవచ్చు.

ఎవడయినా ఎదురుగావచ్చి రెండుచేతులతో చుట్టబెట్టుకొని నొక్కేస్తూ ఉంటే, మనరెండుచేతులూ

వాడిగడ్డం క్రిందికి పోనిచ్చి తలను కిందికీ మీదికీ ఊపాలి. దాంతో వాడిపట్టు సడలుతుంది కొంచెం. కూడా అందు బాటులో ఉండే వాడికాలిని మన కాలితో చుట్టబెట్టి. వాడి మరోకాలి చీలమండను గట్టిగా తన్నాలి. ఆతన్నుతో వాడు వెనక్కు పడిపోతాడు.

ఈ విధంగా పట్టు విడిపించుకొనే ప్రయత్నం సాధ్యం కాకపోతుంది. వాడు తనగడ్డాన్ని మనమూపు మీద పెట్టి తనబరువునంతా మనమీద మోపుతాడు, అప్పుడు తప్పించుకోవడం ఎలాగ? వాడిచేతుల మీదుగా మనచేతులు చుట్టబెట్టి పెనవేయాలి. చప్పున వెనక్కు ఒకఅడుగు తగ్గి మనచేతులను వాడి పొట్టకు చేర్చి మీదికి నొక్కాలి.

వెనకనుంచీవచ్చి మీదబడి చుట్టబెట్టినప్పుడు ఒళ్ళు ముడుచుకొని మోకాళ్ళు వంచి కిందికి తగ్గాలి. కూడనే వాడిచేతులను మన రెండుచేతులతో సంకల్లోకి ఎగదోయాలి. తర్వాత చప్పున మన మోచేతులను వెనక్కు పోనిచ్చి రొమ్ము విరుచుకోవాలి. పట్టు సడలిందే ముందుకు తిరిగి నిలబడాలి, మళ్ళా మీదబడితే వాణ్ణి సాధించడానికి.

నడుము వంచడానికి వీలయ్యేట్టుగా కిందభాగంలో వాడు చుట్టబెడితే, ముందుకు బాగా వంగి రెండుచేతులతో వాడికాలి చీలమండల్లో ఒకదాన్ని ఒడిసి గట్టిగా పట్టుకొని నిలువునలేచి వెనక్కు జరగాలి. అప్పుడు వాడు కిందకూలబడతాడు; వాడిమీద నీవున్నా. దాంతో వాడికి ఊపిరి ఊడిపోవచ్చు. తలకు గట్టిదెబ్బ తగిలితే స్మృతికూడ తప్పిపోవచ్చు.

వాణ్ణి పడిపోయిన తర్వాత బోర్లతోయగలిగితే, వాడిపాదం ఒకటి మనచేతికింద బిగించిపట్టాలి. ముంజేతని వాడిచీలమండకిందికి పోనిచ్చి వాడికాలి బొటనవేలిని నీవంకవేపుకు వెనక్కువంచి వాడిమీద ఎక్కి కూర్చోవాలి. తప్పించుకోవడానికి ప్రయత్నం చేసినప్పుడల్లా బొటనవేలిని గట్టిగా నొక్కుతూఉంటే ఎంతసేపయినా అలా పడిఉండిపోతాడు వాడు.

ఇంతకంటే మంచిపట్టు: వాడి రెండుమోకాళ్లను వంచి, నీ తొడలతో వాడిపాదాలని అదిమిపట్టాలి. దాంతోపాటు పట్టుకొని మీదికెత్తాలి. వాడు తప్పించుకోవడానికి ప్రయత్నించినప్పుడల్లా వాడిపాదాలను గట్టిగా నొక్కుతూఉండాలి; గడ్డాన్నీ గట్టిగా నొక్కి మీదికెత్తుతూ ఉండాలి. (చి. ౧) ఈపట్టు చాలబాధను కలిగించేది కాబట్టి ఒక్కమారుతోటే, ఎంత పట్టుదల మనిషయినా, వాడు ఇంక తప్పించుకోలేమని తెల్లమొగం వేశేస్తాడు

మరొక పట్టుంది: పడిఉన్నప్పుడు కాని, నిలుచున్నపుడు కాని ఈ పట్టుతో సాధించవచ్చు. వెనకనుంచి రెండుచేతులను వాడి రెండుచంకల క్రిందికి పోనిచ్చి, వాడితల వెనక్కు తెచ్చి జోడించాలి.

ఈ పట్టు, తల్లక్రిందులు చేస్తే ముందునుంచి కూడ పనికివస్తుంది.

వాడితలను మన రెండుమోకాళ్ల సందున చిక్కబట్టి నొక్కి వాడిచేతుల కిందనుంచి మనచేతులు చొప్పించి వెనకవేపుకు తెచ్చి వాడి మెడమీద జోడించాలి. వాడి చేతులమీదుగా విడిపోకుండా బిగిస్తే మన బలమంతా వాడి మెడమీద ఆనుకుంటుంది.



(చి. ౧౦)

దొంగను దొరికించుకున్న తర్వాత వాణ్ణి కూడా లాక్కుపోవాలంటే వాడి కుడి మణికట్టును మన కుడి చేత్తో పట్టుకొని వాడి అరిచేతిని పైకితిప్పి పట్టుకోవాలి. వాడి పక్కకువచ్చి మన ఎడం చెయ్యిని మనం పట్టుకున్న వాడిచేతిమీద ఉంచి తర్వాత మోచేతికి ఎగువ ఆ చేతికిందికిపోనిచ్చి మనకుడిచేతిని ఆఎడంచేత్తో పట్టుకోవాలి. (చి. ౧౧)

ఇప్పుడు మన ఎడమ ముంజేయి, వాడి చేతిమీద మీటగా పనిచేసే మన కుడిచేతికి దన్నుగా ఉంటుంది. వాడువిడిపించుకోడానికి పెనుగులాడినప్పటికల్లా, వాడిచేతిని క్రిందికి నొక్కుతూ ఉంటే చాలా నొప్పి పెడుతుంది దాంతో ఎక్కడికి తీసుకుపోతే అక్కడికి మెదల కుండా వస్తాడు వాడు.

దయా దాక్షిణ్యాలు చూపవలసిన అవసరం ఏమాత్రమూ లేని అసాధ్యపరిస్థితుల్లో సులువుగా, తప్ప కుండా వాడి పొగరు వంచడానికి సరిపోయే జుజుట్సు పద్ధతి దెబ్బ ఒకటి ఉంది.

ఏచేతి మణికట్టునుగాని వేళ్లతో సహా తిన్నగా చాపి కొనవేళ్లతో వాడి గొంతికలో పొడిచి కుతిక పూస రెండు వేపులా నొక్కాలి. (చి. ౧౦) ఈ దెబ్బ సరిగాపడిందంటే కుతికలో రక్తనాళాన్ని చిదిపేస్తుంది. అలా కాకపోయినా, తలమీదికి ఎగిరిపోతూ ఉందన్నట్టుగా నొప్పి ఎత్తుతుంది.



చిత్రము ౧౧

*　　*　　*　　*

దీన్నంతా చదివి అవతల పడవేయడంలో ప్రయోజన మేమీ లేదు. ఈ విషయంలో ఆసక్తి ఉండేవరో కణ్ణి దోస్తీ చేసుకొని అన్ని పట్లను వాడితో కలిసి పట్టి ఏదొకటి అవసరంలో నే అమోఘంగా ఫలించేటట్లు చక్కగా అభ్యాసం చేయాలి. నిజంగా శత్రువుదగ్గర రెండో అవకాశం దొరకడం చాలాఅరుదు. ఆదోస్తీతో పట్లు-ముఖ్యంగా అయిపుకలిగించేవి— పట్టేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. అంతా సాంతంగా నేర్చుకోవలసిందే కాని దోస్తీకిమాత్రం అపాయం కలగకుండా చూడాలి.

ఒకపట్టును చక్కగా నేర్చుకున్నతర్వాత ఇంకోదాన్ని నేర్చుకోవాలి. నిస్సంశయంగా సాధించడానికి చాలిన అభ్యాసం ఉండే ఒకటిరెండు పట్లు చాలు ఒకగంపెడు వచ్చీరానిపట్లకంటేను. 'చేతులు బంధించడం' 'మీదికి ఎగనెత్తడం' రెండూ బాగా తెలిసి ఉంటే తర్ఫీతు కాని ఎదిరిని క్షణంలో లోపరుచుకోవచ్చు- వాడెంత బలవంతుడయినా, ఎంత బలిసినవాడయినా సరే.

[జనవరి (1937) పాపులర్ సైన్సు]

---

## జనముద్దు బిడ్డ
### 'షర్లీ టెంపిల్'

ఈ జనముద్దుబిడ్డ ౧౯౨౯ వ ఏప్రిల్ ౨౩వ తేదీని సాంటామోనికాలో పుట్టినది. పుట్టిన నాల్గవయేటనే సినీమారంగములో ప్రవేశించినది. షెర్లీకి యిప్పుడు జరుగుచున్నది యెనిమిదవ యేడేగాని యింత స్వల్పకాలములో యిప్పటికి యిరువదిఫిలుములలో నటించిందన్న ఎట్టివారికైనను వింతగొల్పక మానదు. ఇటీవల నటించిన 'డింపిల్స్' అను ఫిలుములో షెర్లీటెంపిల్ విదేశభాషయగు చీనాభాషలో మాటలాడుచున్నది.

ఇట్టి అద్భుతప్రభావము కలది గావుననే యీ బిడ్డ ప్రపంచమందలి ప్రేక్షకులనెల్ల ముగ్ధులగావించి జగద్విఖ్యాతి వడసినది.

షెర్లీకి యిట్టి సుగుణము లెట్లబ్బినవో తలిదండ్రులుకూడ ఊహింపలేకున్నారు. వంశ పారంపర్యముగా వచ్చినదేమోయన్న నా వంశములో యెవరును నాటకములలో నైనా పాల్గొనియుండలేదు. ప్రపంచాభిప్రాయమెట్లున్నను, షెర్లీ తన గొప్పతనమును యించుకయైన లక్ష్యము చేయదు. పైగా యీ గొప్పతనమే ఆ చిన్ని బాలికకు ముప్పు తెచ్చిపెట్టినది. ఇతర బాలికలవలె

స్వేచ్ఛగా సంచరింప వీలులేదు. కంటికి గాన్పించిన మాత్రమున వేలకొలది జనులు చుట్టును గుమిగూడుదురు. కావున షెర్లీ తలిదండ్రులు, ఉత్సాహపూరితు లగు ప్రజలకు దర్శనభాగ్యము కూడ గలుగనీయకుండ యీ చిన్నిబిడ్డను గృహమున బంధింతురు. వీధిలో అడుగుపెట్టనీయనపుడు బడిమాట యెందులకు! ఎపు డైనను సినీమాప్రదర్శనము చూడవలయు నన్నచో, షెర్లీని తలిదండ్రులు, చీకటిలో నలుబది ముసుగులలో దాచి తీసికొని వెళ్లెదరు. ఇదియే గాబోలును కీర్తికి ప్రతిఫలము!

ప్రతిదినమును వివిధదేశములనుండి యీ బిడ్డ వృత్తాంతము తెలుపమని ౨౦౦౦, ఛాయాపటములు పంపమని 3౦౦౦ లేఖలు వచ్చుచుండును. సభలలోనికి వచ్చి పాల్గొనవలయునని మరికొన్ని. కాని యీ లేఖ లన్నియు కొన్ని కారణాంతరములచే నిరాకరింపబడు చున్నవి.

షెర్లీ టెంపిల్ ప్రప్రథమమున "బేబీ బర్లిస్క్స్" అనుఫిలుములో యితర బాలికలతోపాటు నటించినది. అప్పటి రూపలావణ్యమునకును, గాన మాధుర్యమున కును ప్రజలు షెర్లీని మిక్కిలి మెచ్చుకొనిరి. అదియే షెర్లీ పేరు పైకివచ్చుటకు మొదటిమెట్టు. పిదప పారమౌంటు కంపెనీలో ఒకఫిలుములో నటించినది. అటు పిమ్మట ఫాక్సుఫిలుమ్సులో "స్టాండ్ అప్ అండ్ ఛీర్"లో నటించునప్పటికి షెర్లీలోని ప్రజ్ఞావిశేషములు పూర్తిగా తెలిసిపోయినవి. వెంటనే వారమునకు 1౫0 డాలర్ల వేతనము నిర్ణయమయినది. ఈ అవకాశము గల్గినవెంటనే అచిరకాలములో సినీమామండలములో స్త్రీ పురుషుల కెవ్వరికిని లభ్యముగాని ఉన్నత స్థానమునకు చరచర ప్రాకిపోయినది. ఈ బాలిక కళానైపుణ్యమునకు ౧౯౩౪ లో అకేడమీ ఆఫ్ మోషన్‌పిక్చర్ ఆర్టుస్ అండ్ సైన్‌సెస్‌వారు ఒక బంగారువిగ్రహమును బహుమతిగా నొసగిరి.

షెర్లీ నటించిన ఫిలుములు అన్నిఖండములలోను పేరు వహించినవి.

ప్రపంచములోని ప్రజల కందరికిని యీ చిన్న బాలిక యిష్టురాలే. కావుననే దినదినమును వివిధదేశములనుండి షెర్లీకి ఆటవస్తువులు వేలకొలది వచ్చుచుండును. కాని షెర్లీ తలిదండ్రులు ఆ వస్తువులనన్నిం



షర్లీ టెంపిల్

టిని అనాధశరణాలయములకును, బిడ్డలవైద్యశాలలకును పంపివేయుచుందురు. షెర్లీ తనకు ప్రియమైనవాటిని మాత్రము తనకు నుంచుకొనును. అట్టివాటిలో వివిధదేశములకు చెందిన బొమ్మలు, ఆయా దేశపు దుస్తులతో అలంకరింపబడినవి కలవు.

షెర్లీకి వివిధదేశముల బొమ్మలమీద వలెనే, భాషలయందుకూడ అభిలాష మెండు. 'లిలియన్ శార్లీ' అనే ఉపాధ్యాయురాలు షెర్లీకి, ఫ్రెంచి, స్పానిష్, జర్మన్, ఇటాలియన్ భాషలు నేర్పింది. ఆ భాషలను ఆమెతో షెర్లీ చక్కగా మాటాడగలదు. పాటలు సైతము పాడగలదు.

దీని కంతెకిని ప్రధానమైనది అద్భుతమగు జ్ఞాపకశక్తి. ఇప్పటివరకు షెర్లీ తాను నటించేటప్పుడు ఎన్నడును ఒక తప్పైనను గావించియుండలేదట. కావున 'ఫాక్సు స్టూడియో'లో షెర్లీని "వన్ టేక్ టెంపిల్" అని ముద్దుపేరుతో పిలుచుచుందురు.

ఈ చిన్నిబాలికకుగల అభిరుచులలో చిత్రలేఖన మొకటి. అప్పుడప్పుడు 'ఫాక్సుఫిలుం కంపెనీ'లోని వారిని హాస్యచిత్రములక్రింద చిత్రించుచుండును. ఈ బిడ్డకు సంవత్సరమునకు ఆరువారములు సెలవొసగుదురు. ఆ సెలవుదినములలో రెండువారములు బొమ్మలపుస్తకములతో కాలక్షేపము చేయును.

షెర్లీ తల్లియగు గర్ట్రూడ్ టెంపిల్‌కు ప్రతిదినమును యీబిడ్డను పోషించెడువిధానము తెలుపవలసినదని లేఖలు వచ్చుచుండును. వాటి కన్నింటికిని ఆమె ఒకవిధముగా సమాధానము వ్రాయుచుండును. "దీనిలో రహస్య మేమియు లేదు. షెర్లీ సామాన్య బాలికవలెనే పోషింపబడుచున్నది. షెర్లీ ఖ్యాతిచే యెంతమాత్రమును గర్వింపదు. షెర్లీ తనసామర్థ్యమును తెలిసికొనినను, ప్రజాభిప్రాయమును లక్ష్యముచేయదు" అని.

షెర్లీ టెంపిల్ క్రొత్తగా నటించిన 'డింపిల్స్' అను ఫిల్ము బొంబాయిలో క్రిందటినెలలో ప్రదర్శింపబడినది. ఆ ఫిలుములో షెర్లీ నవ్వులతోడను, మనోహరములగు ఆటపాటలతోడను ప్రజల నైమరపించును. తను నటించిన సుఖమునందును, దుఃఖమునందును ప్రేక్షకులకు సానుభూతి గలుగునట్లు చేయుచున్నది. ఈ ఫిల్ము షెర్లీ యిదివరకు నటించిన ఫిలిము లన్నిటికంటెను శ్రేష్ఠమైనదిగా పరిగణింపబడుచున్నది.

ఇంత తెలివితేటలుగల బాలిక ఇంత లేతవయసుననే అఖండ విఖ్యాతి గడించినది. ఈమె భావి జీవనముగురించి తలిదండ్రులు విచారింప నక్కరలేదు. షెర్లీ సినిమారంగమును వీడినను, ప్రసిద్ధిగాంచిన నర్తకి అగుటకు సూచనలు కాన్పించుచున్నవి. ఎట్టి క్లిష్టమగు పదవిన్యాసము నైనను అతిసులభముగ అనుకరింపగలదు. కావున షెర్లీ టెంపిల్‌కు ముందుముందు వృద్ధిలోనికి వచ్చుటకు అనేకములగు అవకాశములు గలవు.

[మోషన్ పిక్చర్ మేగజిన్]

———

౧ రవీంద్ర కుమారుడు



ఇతడు యోగి; బ్రహ్మచారి. పదిగంటల కాలము గోతిలో పూడ్చియుంచబడినాడు హైదరాబాదులో.



౨ రవీంద్ర కుమారుని గోతిలోదించి పూడ్చుట

---

## బ్రిటనుయందు విద్యాపరిస్థితి

బ్రిటను దేశమునందలి గవర్నమెంటు విద్యావ్యాప్తినిగూర్చి ఆ దేశమునందలి గవర్నమెంటు విద్యాశాఖవారు తమ వార్షిక నివేదికయందు ఈ క్రిందివిధముగ వివరించియున్నారు. గడచిన ఇరువదియైదు సంవత్సరములలో, అనగా ౧౯౧౦ నుంచి ౧౯౩౫ వరకు, సుమారు ౫౦౦౦ నూతన పాఠశాలలలో దాదాపుగ నూటికి ఇరువదియైదు పాఠశాలలయందు చేతిపనులను నేర్పుచుండిరి. కాని ఇరువదిఅయిదు ఏండ్లలో అరువదియైదు పాఠశాలలయందు చేతిపనులు నేర్పబడుచున్నవి. ఇంకను ఈ పాఠశాలలయందు నూటికి అరువది ఎనిమిది గృహకృత్యములను, నూటికి ముప్పదిరెండు తోటపనులు గూడ పిల్లలకు నేర్పబడుచున్నవి. విద్యాభివృద్ధికై క్రీ. శ. ౧౯౧౦ యందు ౨౬౯,౦౦,౦౦౦ పౌనులు వ్యయమగుచుండెను. నేడు౪,౨౧,౦౦,౦౦౦ల పౌనులకు వచ్చినది. అనగా ప్రతివానికిని నాడు ౧౫ షి॥ ఖర్చు. నేడు పౌ ౨-౨ షి. కు మించినది

ఇంతేగాక బడిపిల్లల ఆరోగ్యస్థితిని అభివృద్ధి పరచుటకై ౪౦,౦౦౦ మంది పిల్లలకు ప్రభుత్వమువారే ఉచితముగా భోజనమును, పాలను ఇచ్చుచున్నారు. పైగా ౨౨,౫౦,౦౭౧ మంది పిల్లలకు పాలను చాల తక్కువవెలకు ఇచ్చుచున్నారు. పాఠశాలలయందు ఆరోగ్యపరిస్థితులను జాగ్రత్తగా చూచుకొనుటకు సుమారు ౧౪౧౩ మంది వైద్యులను నియమించియున్నారు. ౧౯౧౦ వ సంవత్సరములో ఈ వైద్యుల సంఖ్య ౯౯౫ ఇంతమంది వైద్యులేగాక ప్రత్యేకముగా దంతచికిత్సకులుగాను మాత్రమే నేడు ౪౫౨ మంది వైద్యులున్నారు నర్సులు ౩,౪౨౯ మందిని నియమించియున్నారు. నాడు దంతవైద్యులు ౨౭, నర్సులు ౪౩౬ మంది మాత్రమే యుండిరి. ఇవన్నియుగాక బ్రిటన్ దేశమందలి బడిపిల్లల ఆరోగ్యస్థితిని కాపాడుటకు ఇంకను ఎన్నియో సంస్థలు గలవు.

ఇట్టి పరిస్థితులను మన దేశమునందలి హీన పరిస్థితులతో పోల్చిచూచుటకు ఏమాత్రమును సాధ్యము గాదు. విద్యావిషయమునందుగాని, ఆరోగ్యవిషయమునందుగాని బ్రిటిష్ బాలురకుండు సౌకర్యములలో శతాంశమైనను మన కుండవలయునని తలంచుటగూడ గొంతెమ్మకోరికయే. అంత లేకున్నను కొంతవరకైనను హిందూదేశమున ఈమార్గమునందు వృద్ధి కలుగవలెనను ఉద్దేశ్యమే యుండినయెడల మన యిదివరకే ఎంతయో బాగుపడియుందుము. శాస్త్రాభివృద్ధివలనను, నాగరికతాభివృద్ధివలనను విద్యావ్యాప్తికై నేడు ప్రపంచమున ఎన్నియో అనుకూలపరిస్థితులు ఏర్పడినవి. ఇట్టి పరిస్థితులను కొంతమట్టుకైనను ఉపయోగపరచుకొని ఇండియా ప్రభుత్వమువారు మన హిందూదేశమును అభివృద్ధిపరచి శ్రీమంతములగు దేశములలో మన దేశమును గూడ నొక్కదానినిగా చేసెదరా?

[జనవరి మాడరన్ రివ్యూ పు. తి. రా.]

---

## హైదరాబాదునందు విద్యాపరిస్థితి

హిందూదేశమునందు నానాభాగముల నేలుచున్న రాజులు తమరాష్ట్రములయందలి ప్రజలను విద్యావంతులుగజేయుట తమధర్మమని తలపక విద్యాభివృద్ధికై ఎట్టి సౌకర్యములను సేయకపోవుటయే కాక ఇంతటి ముఖ్యవిషయమును తిన్నగా గాలికి వదలినందువలన హిందూదేశమునందలి విద్యావ్యాప్తి నానాటికి వెనుకంజవేయుచున్నదని చెప్పవలయును.

కావలసినంత ద్రవ్యమును మేడలకొరకో, మోటారులకొరకో, గుఱ్ఱపుపందెములకొరకో, విదేశయానముకొరకో మరి ఇంకే స్వకీయలాభములకో వ్యర్థపరచుచున్న ఈ రాజులు విద్యయనునది ప్రతి మానవునికిని ఉండవలసిన ఆవశ్యకవిషయము కాదనియు, ఎవరో కొందరు ఐశ్వర్యవంతులకును అదృష్టవంతులకును మాత్రమే ఉండవలసిన విషయమనియు వాదించి తమ ప్రజలందరికిని విద్యచెప్పించుట సాధ్యముకాని కార్యమని తమలో తాము సంతృప్తి నొందుచున్నారు.

బరోడా, తిరువాన్కూరు మొదలగు కొన్ని కొన్ని రాష్ట్రములందు తప్ప మిగిలినవానియందు చదువువచ్చువారి సంఖ్య ఏమాత్రమును వృద్ధిజెందలేదు. ఆరాష్ట్రపురాజులు ఈవిషయమై ఏమాత్రమును శ్రద్ధతీసికొనలేదని ఇందుండి స్పష్టమగుచున్నది.

హైదరాబాదు విద్యాసమావేశమునందు అగ్రాసనత వహించిన కాశీనాథవైద్యాగారు గడచిన పది, ఇరువది సంవత్సరములలో జరిగిన అల్పవిద్యావ్యాప్తిని గూర్చి వక్కాణించిరి. బ్రిటిష్ ఇండియాయందే నూటికి ఎనిమిదిమంది చదివినవారుండ హైదరాబాదునందు నూటికి ౪.౭ మంది మాత్రమే చదువెరిగినవారు. సర్ అక్బర్ హైదరీగారు, రాష్ట్రపు బొక్కసము వృద్ధియగుచున్నదనియు, తమ రాష్ట్రము ఉత్తమ మైనదనియు, అందన్నియు ఉత్తమస్థితిలో నున్నదనియు ప్రపంచమునకుసాటించుచున్నారుకాని విద్యావిషయమునందు మాత్రము తమ రాష్ట్రము ఇంతటి హీనస్థితియందుండుట తమకుగాని, తమ దేశమునకుగాని గారవమేనా? ఇక ఆ రాష్ట్రమునందలి స్త్రీ విద్యవిషయమై చెప్పనవసరమేలేదు. రాష్ట్రమునందలి స్త్రీలలో నూటికి ౧.౨ మంది మాత్రమే అక్షరజ్ఞులు. రాష్ట్రమునందలి స్త్రీలు పతితము అజ్ఞానాంధకారములో మునిగియున్నారు. పాపము ప్రభుత్వమువారు స్త్రీ విద్యాభివృద్ధి కొరకై ఎట్టి ప్రయత్నములను చేయకపోవుట మెచ్చుకొనవలసినదే.

ఇక ఆరాష్ట్ర ప్రజలకు రాజ్యాంగాదివిషయములందు ఎట్టి అభిప్రాయములును లేవో, వారి అభిప్రాయములనే ప్రభుత్వమువారు అణచిపెట్టుచున్నారో, లేక మరేమోగాని అవి ఎంతమాత్రమును వ్యక్తమగుట లేదు. ఈ విషయము అక్కడ ప్రచురింపబడుచున్న కొలది వార్తాపత్రికలనుండియే వ్యక్తమగును. ఈ రాష్ట్రమునందు సుమారు డెబ్బదిలక్షలమంది తెలుగువారున్నను వారందరికిని ఒక్క తెలుగుపత్రిక మాత్రమే గలదు. అదియు వారమునకు రెండుమారులే ప్రకటింపబడుచున్నది. ముప్పదియెనిమిది లక్షల మహారాష్ట్రులు ఈ రాష్ట్రమందున్నను వీరికందరికిని ఒకవారపత్రిక మాత్రము గలదు. పదునారు లక్షలకు మించిన కన్నడులకు ఒక పత్రికయు గూడ లేదు. ఇది చాల శోచనీయమైన విషయము. [బాంబే సెంటినల్] పు.తి.రా.

---

### సాబూ



(చూ. ప్రాచ్యతారలు. భారతి సంపు. ౧౩, సంచి. ౧)

'సాబూ' నటించిన 'ఎలిఫెంటు బాయి' అను ఫిలిములో ప్రధానపాత్రలు మూడు: ఒక ఏనుగు, మావటివాడు, ఒక కుర్రవాడు. ఈ కుర్రవాడి పాత్రనే 'సాబూ' నటించినది. దానివల్ల ఈ కుర్రవాడు జగత్ప్రఖ్యాతుడయినాడు.

తొండం తో తూకి మీద నంచుకుంటుంది. వాడికి క్రమంగా దాంతో పరిచయం ఏర్పడుతుంది.

ఒకనాడు కాంపౌండులోకి పెద్దపులి వస్తుంది. దాన్ని చూచి ఏనుగు కట్టు తెంపుకొని అడవికి పారిపోతుంది. వెంటనే దాని అడుగుజాడ పట్టుకొని దాన్ని



ఏనుగుకాపలాకింద నిద్రపోతూఉన్న సాబూ

ఫిలిము కథ: ఒక కుర్రవాడికి తాను మావటివాడు కావలెనన్న కోరిక కలుగుతుంది. అవకాశానికి ఎదురుచూస్తూ ఉంటాడు. ఒకనాడు ఊరు తగులబడుతుంది. కుర్రవాడు మంటలను ఆర్పడంలో చాలాసాయపడతాడు. దానికి మెచ్చుకొని ముసలి మావటివాడు ఏనుగులమీద ఎక్కనిస్తాడు ఆ కుర్రవాణ్ణి. అప్పుడే పట్టి తెచ్చిన భయంకరమయిన ఏనుగు ఒకటి కుర్రవాణ్ణి

వెతకడానికి కుర్రవాడు పోతాడు. రాత్రయిపోతుంది, ఏనుగుకనపడదు. క్రూరజంతువుల భయంకరధ్వనులతో దిక్కులు మారుమోగుతవి. కాని కుర్రవాడు తెగిపోయిన ఏనుగుకాలిగొలుసుజాడ నేపోయి దాన్ని కనుక్కుంటాడు. అది మళ్లా క్రూరజాతిగామారిపోయి పెద్దపోతుటేనుగుతో పోట్లాడుతూఉంటుంది. మొదట కుర్రవాణ్ణి అది గుర్తించదు. కొంతసేపటికి తెలుసుకొని పొంగిపోయి

పోట్లాట మాని తిరిగి పుర్రవాణ్ణి మీద నెక్కించుకొని తన స్థానానికి వచ్చేస్తుంది.

ఈ హిందూదేశపు మావటివాళ్ల పుర్రవాణ్ణి గొప్ప ఫిలిమునటకుణ్ణిగా తయారుచేశింది బాబ్ ఫ్లాహర్టి అనే అతను మంచి సామర్థ్యంగల ఫిలిండైరెక్టరు అతను. అతను తీయించినఇటీవలిగొప్ప ఫిలిము 'మాన్ ఆఫ్ ఆరన్' అనేది.

ఈ యేనుగుతోటే సాబూ మరికొన్ని ఫిలిములలో నటించవచ్చును.

[మోషన్ పిక్చర్ మేగజిన్.]

---

శ్రీమతి హాతిసింగు

నృత్యభంగిమము



ఈమె పండిత జవహర్ లాలుగారి సోదరి భర్తకుసోదరి.

---



2- 19 3౧౫



# విమర్శనము

## శ్రీ శుకనాసోపదేశము, శ్రీగురుదక్షిణ

(గ్రంథకర్త ప్రతివిమర్శ)

[ఈప్రతివిమర్శ చాలపెద్దదిగనుండెను. కావున బు. వేం. ర. గారు పేర్కొనిన దోషములను సప్రమాణముగ ఖండించి గుణములని గ్రంథకర్తగారునిర్ణయించిన పట్టులుమాత్రము ఇట ముద్రితములయినవి.

[సంపాదకుడు.—భారతి.]

ఏదే నొక కావ్యమును విమర్శించుపట్టున గుణదోషముల రెంటిని సమరసభావముతోఁ బరిశీలించిననేకాని యందలి తత్త్వము తేటపడఁజాలదు. అట్టియెడఁ బై కావ్యములను విమర్శించుచు(పుష్యమాస భారతి)బు.వేం.ర.గారు అందున్న గుణములలో నొక్కదానినేని పేర్కొనకుండుటయు, లేనిదోషములనే పెక్కింటి నారోపించుటయుఁ జూడఁ గడుంగడుఁ జిత్రముగ నున్నది. గుణముల మాట యెటులైనఁ బోనిండు. దోషములనేని వాస్తవముగ నున్నవానినే చూపియుండినచోఁ గొంచెము సమంజసముగ నుండియుండెడిది. "శంతనుని కవి 'వెల కట్టన్ రాని కవిత వెలసినవాఁ' డఁట" అను నసూయాసూచక ప్రాతిపదికముతోఁ గావ్యవిమర్శనమునకుఁ గడంగిరి. చూడుఁడు.

(౧) మూలమునందలి "గంధర్వనగరలేఖేవ" అనుదానికి "వియత్పురిచందంబుగాను" అనునది సరియగు తెనుఁగు కాదనిరి.

మయూరేశ్వరకృత బాలబోధినీవ్యాఖ్యలో "గంధర్వనగరం=ఖపురం, దృగ్భ్రమా దాకాశే ఉదితం నగరం" అని స్పష్టముగ వ్రాయఁబడియున్నది. మఱియుఁ దదుపబృంహితముగా "శ్లో. అనేక వర్ణాకృతి ఖే ప్రకాశతే పురం.........1" అని బృహత్సంహితనుండికూడఁ బేర్కొనఁబడియున్నది.

(౨) మూలమునందలి "ఉదారసత్త్వం" అనుదానికి "ఉదారుని" అను ననువాదము భిన్నమనియు, ఉదారుఁ డనఁగా దానశీలుఁడే యనియు, "ఉదారసత్త్వం" అనఁగా గొప్ప బలముకలవాఁ డనియు, మూలమునకు భిన్నముగా "ఉదారుఁడు" ప్రశంసింపఁబడియు మరల "సంస్మరింపదు దాతన్" అని చెప్పుట పునరుక్తమనియు వ్రాసిరి.

మయూరేశ్వరుని బాలబోధినీవ్యాఖ్యలోనే "ఉదారసత్త్వం=మహాశయః"అని కలదు. ఇది విమర్శకుఁడు గమనింపకుండుట మొదటి తప్పు. "ఉదార" పదమునకు అనేకార్థము లుండఁగా 'దానశీలుఁడే' అని యర్థము చెప్పుట రెండవ తప్పు. "ఉదారసత్త్వం"లోని "ఉదార" పదమునకు దానశీలుఁ డని యర్థము చెప్పుచు "ఉదారసత్త్వం" అనఁగా గొప్పబలము గలవాఁ డని చెప్పుట మూఁడవతప్పు. అందుచే "సంస్మరింపదు దాతన్" అన్నది పునరుక్తమనుట నాలవతప్పు.

(3) రాజుల మదాంధతనుగూర్చిన "తే.గీ. మృత్యువాసన్నమైనట్టు లెదురనున్న బాంధవులనేని యాన వాల్ పట్టలేరు" (89 వ|| పద్య) అను పద్యమునందు "మృత్యువాసన్నమైనట్లు బంధువులు చెంతఁజేరిరి"

అను విపరీతార్థము స్ఫురించుననియు, నిట్టి రచనము దుష్టమనియు వ్రాసిరి.

పై పద్యమున నలంకారము ఉత్ప్రేక్షయే కాని యుపమ కాదని సాధారణులకేనియుఁ దెలియఁగలదు. ఎంత శ్రమంపడినను విమర్శకుఁడు రాఁదీయఁజూచిన వక్రార్థ మించుక స్ఫురింపనేరదు. ఏలన "ఎదురనున్న" అని యున్నదే కాని "ఎదురఁజేరిన" అని లేదు. ఉండుట వేఱు, చేరుట వేఱు. వక్రరీతిగా నుపమనే చొప్పింపఁ బ్రయత్నించినచో మృత్యువునకు ఆసన్నత్వము చెప్పినట్లు బంధువులకును "చేరిన" అని చెప్పవలసియుండును. అదిగాక విమర్శకుని అపోహచొప్పున బంధువులే మృత్యుస్వరూపము లయినయెడల "ఆనవాల్ పట్టలేరు" అనుటలో నర్థమేమి? ఒకప్పుడు చూచినంగదా యానవాలుపట్టుట! ఒకమాఱు మృత్యువుఁ గాంచినచో మఱి యానవాలుపట్టుట కవకాశ మెక్కడిది?

(౪) (మూలమునందలి) "గురువచనావధీరణము వేఱు, (అనువాదమునందలి) "గురుతిరస్కరణము వేఱు" అని వ్రాసిరి.

గురుతిరస్కరణ మనఁగా గురువచనమును దిరస్కరించుటకాక మఱేమగును? ఇచ్చట "గురు"పదమునకు లక్షణచే "గురువచనము" అని యర్థము గాదా? గురువును బట్టికొట్టుట యని యర్థ మిచ్చునా?

(౫) "అవనమయ ద్విషతాం శిరాంసి" అను మూలమునకు "కం॥ వంపుము రిపుశిరముల" అనునది యనువాదమై యుండఁగా "మూలమునందలి 'అవనమనము' గూర్పఁబడలే" దని వ్రాసిరి. "అవనమయ" అను పదమునకు "వంపుము" అని యర్థము కాదా?

(౬) "తే. గీ మణులకేనియు నల నభోమణికి నేని" (30 వ పద్యము) అనుచో "మూలమునలేని 'మణులకేనియు' విశేషము, అయినను వ్యర్థము" అని వ్రాసిరి.

మాతృకలో "అరత్నాలోకసంహార్య" అని యుండఁగా విమర్శకుఁడు లేదని చెప్పనెట్లు సాహసించెనో తెలియకున్నది.

(౭) "నీరు" అనుటకు "కృపీటము" అని యప్రసిద్ధార్థపదమును బ్రయోగించితినఁట!

"చం. బిసరుహపత్రలోచన! కృపీటములందు మునింగి యాడవే! మొసళులు" అని కాశీఖండమున శ్రీనాథుఁడును, "తే. గీ. పెటిలి పడకున్కి భరమె కృపీటజన్మ॥" అని వసుచరిత్రమున రామరాజభూషణుఁడును ప్రయోగించియుండఁగా నిట్టి యాక్షేపమున కవకాశ మేమి?

(౮) "సద్యం"కు "సద్యంబు" అని ప్రయోగించుట కూడదఁట! అది అప్రయోగ మఁట. "కం..........చాయన్। సద్యంబ బ్రహ్మహత్యావద్యము........." అని స్వర్గారోహణపద్యమునఁ దిక్కనసోమయాజిగూడ నప్రయోగమునే చేసినాఁడ నవలయును గా!

(౯) "తగు" అను పదమునకు "తవు" అని యనుట అప్రయోగము. "తగు" అని దిద్దినచో ప్రాస చెడిపోవును—అని వ్రాసిరి.

"తవు"ను "తగు"గా నేల దిద్దవలయునో తెలియకున్నది. "క్వచిద్గకారోకః" అని చింతామణిలో సూత్రించిన నన్నపార్యునకు సైత మీపాటి వ్యాకరణజ్ఞానము లేకపోయెను గా! "తవు"—"తగు"యొక్క రూపాంతరము-అని శబ్దరత్నాకరము. మఱియు "కం. తవులంబడ దెందు; కం. భవదాజ్ఞానిగళంబునఁ దవిలి" మున్నగు భారతప్రయోగము లనేకములు కలవు కదా.

(౧౦) శారదాస్తోత్రరూపమగు చివరి (134 వ.) పద్యమున (పరమగుణకదంబా! పాహి మాం శారదాంబా!) సంబోధన లన్నియు తత్సమములయినను క్రియ సంస్కృతమున నుండుట అప్రయోగ మని వ్రాసిరి.

ఛందస్సంప్రదాయమును గమనించినచో నిట్టి శంక కవకాశమే యుండదు. ఏమనినఁ దెనుఁగున దండకములలోఁ జివర "నమస్తేనమస్తేనమః" అని యుండుట లేదా? ఒక్క దండకములలోనే కాక వచనమునందును

పద్యములందును గూడఁ గలదు. "వచనము॥......... పరమదయాకరా! జయజయ శ్రీభీమేశ్వరా! నమస్తే నమస్తేనమః"—భీమఖండము: "మ॥ జయ నారాయణ! పుండరీకనయనా!" ఉత్తరహరివంశము. "పాహిమాం" అనుటకు బదులు "పాతునః" యనలేకకాదు నే నట్లు రచించుట. మఱేమనిన ఛందస్సంప్రదాయ మనుమతించుచుండుటచేతను, "పాహిమాం" అన్నది చెవికెక్కువ హాయిగా నుండుటచేతను నట్లు వ్రాసితిని.

(౧౧) పాదాంతములందు శిథిలద్విత్వములను, విసంధులను గూర్చియు, దిరిగి దిద్దితి ననియు, "కం॥.........జారతతిమూలమునన్ అ న య ము" (120 వ. పద్యము) అనుచోటమాత్ర మేలాకో దిద్దక విడిచితి ననియు నాక్షేపించిరి.

కావ్యంబులఁ బాదాంతమందు సంధి విరహంబును, శిథిలద్విత్వంబును వైయాకరణసమ్మతంబును, మహాకవి ప్రయుక్తంబును గూడ. (i) "వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్యులంద్రు"— బా. వ్యా. (ii) "తే. గీ. ......... సరియుగావు ఎఱుఁగు............ "—భారతము. (iii) "మ.......చోట్లుంబలెన్ ఉరుశోభా......" కళాపూర్ణోదయము (iv) "చం..........కావ్యముల్ అరయఁగ.......... "— సకలకథాసారసంగ్రహము. (v) "ఉ.......నేఁగుచున్ ఓడ............"— వేదము, ప్రతాపరుద్రీయము. ఇట్లు పాదాంతములందు విసంధియు, శిథిల ద్విత్వం బు ను నిర్దోషంబులగుటచే నేనును గొండొకయెడఁ బాటించితిని. అంత యథేచ్ఛముగా నేల యని కొన్నిపట్టుల మార్చితినే కాని అది తప్పనిమాత్రము మార్పలేదు. నా కావ్యమునందు విమర్శకుఁడు పొరపడినట్లు శిథిలద్విత్వము ఒక్కచోటనే కాక రెండుచోట్లం గలదు. చూడుఁడు అవతారిక— "కం. వెలగట్టన్ రాని కవిత వెలసినవాఁడన్ అల బుధులకున్ విధేయుఁడ." మఱియు నేను శిథిలద్విత్వమునుగూర్చిన తావులందుఁ బాదాంతమగుటయేకాక భావపూర్తియు నాయెను అందులే విసంధియు. చూడుడు.—4వ., 49 వ. పద్యములు.

బులుసు వేంకటరమణయ్యగారి విమర్శనమును నే నింతగా ఖండించుట వారి విమర్శనమువలనఁ గలిగిన కోపమువలనఁగాని, నా కావ్యమునం దెచ్చటను దప్పులుండవను నహంకారమువలనఁగాని కాదు. "ప్రమాదో ధీమతామపి" అన్న పెద్దల వాక్యము నెఱుఁగనివాఁడను గాను. కాని మనస్సున నేమో కొండంత యీసుండి కావలెనని పనిపడి వ్రాసినట్లుండుటచేతను, ఉన్న గుణములలో నొక్కటియుఁ జేరొక్కనక కేవలము లేని దోషములఁ జెక్కించి నారోపించుటచేతను, గలిగిన విచారమే నాచే నింతగా వ్రాయించినది. సహృదయులు నా కావ్యమునందలి గుణదోషముల నెట్లును గ్రహింపఁగలరు. కాని సాధారణు లిట్టి వ్రాఁతలం జూచి గ్రంథము దోషభూయిష్ఠమేమో యని భ్రమంపడుదురనియు, నద్దాన నాయొనర్చిన పరిశ్రమము వ్యర్థమగుననియు నెంచి యీమాత్రమైనను వ్రాసితిని.

దర్భా వేంకట కృష్ణమూర్తి

— —

## గృహలక్ష్మీ కంఠాభరణం

గ్రంథకర్త: పసుమర్తి కృష్ణమూర్తి. ప్రకాశకులు: డాక్టరు కే. ఎన్. కేసరి. గృహలక్ష్మీపత్రిక సైజున పేజీలు ౨౨+౧౭౬. ఆంటిక్కు కాగితాలు. చక్కని అచ్చు. ముచ్చటయిన బైండు. త్రివర్ణచిత్రాలు ౪౫. ఏకవర్ణ చిత్రాలు 3. వెల ౨-౦-౦. అడ్రసు: గృహలక్ష్మీ ఆఫీసు; ఎగ్మూరు, మద్రాసు.

తెనుగుభాషలో యిది కొత్తరకం గ్రంథం; కాని విలువ చాలాతక్కువ. ఎంచేతం టే?-

౧. ఇందులో కూర్చబడ్డ చిత్రాలు చాలా మట్టుకు ముందు బంగాళీ మొదలయిన యితర భాషల పత్రికలలో ప్రకటించబడి, తరవాత వరసగా గృహలక్ష్మిలో ప్రకటించబడ్డవి. వాటికి సంబంధించిన రచనలు కూడా వాటితోపాటు ఒక్కొక్క నెలలో గృహలక్ష్మిలో ప్రకటించబడ్డవే. ఒక్కొక్క సంచికలో చెదిరిచెదిరివున్న వన్నీ యిలాగ వొకచోట గుదిగుచ్చారు. అంతే.

౨. శ్రీమతి జస్టిస్ సుబ్బారావు సతి, చందూరి రత్తమ్మ, ముత్తులక్ష్మిరెడ్డి, కుమారీ కమలాబాయి దుర్గాబాయమ్మగార్ల చిత్రాలూ, మరికొన్ని ఫోటోలకు ప్రతికృతులు. కనక వాటినిగురించి చిత్రశిల్పి ప్రస్తావన చెయ్య నక్కరలేదు. తక్కినవన్నీ శిల్పుల ఊహాసిద్ధాలు; అవి గృహలక్ష్మికి సచిత్ర మాసపత్రిక అని పేరు తేగలిగినవే; కాని మరొకరకం చిత్రాలలోకూడా చేర్చ తగ్గవి కావు

3. రచనను గురించి రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారూ, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారూ చాలా పొగడుతూ పీఠికా, మదింపు మాటలూ రాశారు. బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారి ప్రశంస కూడా చేర్చబడ్డది; కాని కృష్ణమూర్తిగారు వాడినభాష చాలా యెగుడుదిగుడుగా వుంది. చాలా కృతకంగా వుంది. చదవబోతే విసువు కలిగిస్తోంది. కృష్ణమూర్తిగారు "మా అమ్మా, మా అక్కయ్యా మొదలయిన వాళ్లు నన్నే భాషలో పెంచి పెద్దవాణ్ణిగా చేశారో అదేభాష-ప్రతికియున్న భాష" అంటూ వ్యావహారికానికి చాలా వున్నతమైన స్థానం యిచ్చారు; కాని వారీగ్రంథంలో వాడినభాష మాత్రం చాలా వికృతంగా వుంది. శిష్టులలోనే కాదు, సామాన్యులలో కూడా యిలాంటి భాష వాడుకలో వుండదు. ఇక వున్నదల్లా యేమిటంటే? కృష్ణమూర్తిగారు వ్యావహారికమే వాడాలనే సిద్ధాంతం పూర్తిగా అంగీకరించారు. వ్యావహారికంలో రాయడానికి పూనుకున్నారు. ప్రయత్నించారు; కాని వారికి వ్యావహారికభాష అందలేదు. దానితత్వం వారికి బోధపడలేదు. కృష్ణమూర్తిగారు ఈ గ్రంథంలో వాడిందే వ్యావహారికాంధ్ర మయితే యిక వ్యావహారికభాషావాదం వదులుకోవడం మంచిది.

"విదేశములందు నేయబడుచున్న లేసంచుకోకలు మన దేశమాత పీకకోసి చంపినవి" "నీవు చిన్నదానవు. కాబట్టి కష్టసుఖాలు నీకు తెలియవు." "ఇది విద్యాధికులనబడేవారే చేసిన పని" "వారి నుద్ధరించుటకు సమకట్టవేని నీవదు వెందుకు తల్లీ?" "ఆమెయందు దయతలచి భగవంతు డామెహృదయమందు గట్టువడి యున్నాడు" ఇలాంటి వాక్యాలు గ్రంథంనిండా వున్నాయి. "ఏతే నాకూ నీలాంటి యాడపిల్లలు - నీకంటే పెద్దవాళ్లు కూడాను-వున్నారులే; దానిక్కాదూ! ఏనా చెప్పడానికి నోరురాదు - తల్లీ నోరురాదూ. ఏంవని చెప్పేదీ?" "ఎంతమందిల్లా ఆత్మహత్య చేసుకున్నారో తెలుసునా నీకూ-యీలాటి మొగుళ్లను కట్టుకునీ? ఆవుసురూ మంటా యెవరికి తగుల్తుం దంటావు?" - ఇలాంటి వాక్యాలూ, పైని చూపిన వాక్యాలవంటివీ కలగాపులగం అయి గ్రంథానికి వికృతరూపం తెచ్చిపెట్టాయి. ఈవాక్యాలు చూడండి. "మనము కట్టుకొనుచుండిన గుడ్డలు పరదేశములలో నేయబడునవి. మనము దేశమునుండి యెన్నో కోట్ల రూపాయలిచ్చి ఆ విదేశపుగుడ్డలు కొనుక్కుంటున్నాం". వీటిలో 'కొనుక్కుంటున్నా' వొక్కటే వ్యావహారిక రూపం. తక్కినవన్నీ గ్రాంథిక రూపాలు. గ్రంథంలో యిలాంటి సంకర వాక్యాలు వందలున్నాయి మరిన్ని "మా అమ్మా మా అక్కయ్యా మొదలైనవాళ్లు నన్నే భాషలో పెంచి పెద్దవాణ్ణిగా చేశారో" అన్నారు కృష్ణమూర్తిగారు. "వాణ్ణిగా" ఇది వ్యావహారికమా? శిష్టులు కాదు, సామాన్యులైనా యిలా వాడతారా?" కదలవేమ్! మెదలవేమ్!! పొర్లిపోతున్నాం" ఏమిటీ యీరూపాలూ? "నాకువొళ్లు తెగమండింది" "చదువుసంధ్యలూ" "అశుద్ధపదార్థం"మూజాడకుండా వుండేటట్లు చేయగలా"ట "శిశుపాలుడు సపరివార బంధుమిత్ర బైసికల్ సమేతుడై వొచ్చాడు". ట "ఆదికవీశ్వరులు వ్రాసిన భారతభాగవత రామాయణాది మహోద్గ్రంథములను శ్రద్ధాభక్తులతో చదివి యేతత్సారమును బుద్ధికి బట్టించుకుంట" ట. ఇలాంటి శబ్దాలతోటీ, ఇలాంటి వాక్యాలతోటీ గ్రంథం అంతా చికాకుగావుండగా "వాడుకమాటలకు ఎట్టి శక్తి ఉంటుందో కృష్ణమూర్తిగారు కూర్చిన వాక్యాలలో కనబడుతుంది" అంటూ రామమూర్తి పంతులుగారు రాయడం చాలా ఆశ్చర్యకరంగావుంది. సంగతి చూడగా కృష్ణమూర్తిగారివంటి వృద్ధులు వ్యావహారిక భాషను అంగీకరించడమే ప్రధానమనుకున్నట్లు కనపడుతుంది

పంతులుగారు. "అన్ని వ్యాసాలలోను చైతన్యపూర్ణత గల వ్యావహారిక ఆంధ్రభాషను వాడినారు" అన్నారు ఆది నారాయణశాస్త్రి గారు. చాలా సాహసమైన మాట యిది. గృహలక్ష్మి కంఠాభరణాన్ని గురించి యింత మాట వాడడం చాలా అసందర్భం.

ఇది యిలా వుండగా;— "సంస్కరణం వనగానే" "మరేంవిఁటుందో" "వరం విచ్చింది" "భూంవిఁ దేవితో" "వొక్క సంగీతంవేకాఁదు" "అన్న సాంవెత నిజం వైంది" "పురాకృతకర్మం వని" "వేదాంతం కేఁగా" "నష్టం వెంతమాత్రం లేదు" "చదువుకి ఆడవా ళ్లేంవిటి మొగాళ్లేంవిటి?" "యిల్లు కట్టుకుని వున్నాం వంటే" ఇలాంటి అపభ్రంశరూపాలు యీ గ్రంథం అంతటా వున్నాయి.

"అంతేకాదు లోకమనోభిరాముడూ, కులమూ, విద్యా,రూపమూ, పడుచుదనమూ, మంచీ,ఐశ్వర్యమూ, బలమూ (బంధువర్గము) యీవి, దయా యీ మొదలైన విశేషాలన్నీ వొక్కడిలో వుండకపోవచ్చు" ఏమిటి యీ వాక్యానికి అర్థం? "ఆడవాళ్లపాట బాగుంటుందా మొగాళ్లపాట బాగుంటుందా అని వొక మీమాంసవుంది సుమా నీకు తెలుసునో తెలీదో; కొంద రదీ అంటారు; కొంద రిదీ అంటారు; మంచిమనస్సుతో పాడితే రెండూ బాగుంటాయంటారు మరికొందరు నాలాటివాళ్లు" ఇలా అన్న నోటితోనే గ్రంథకర్త "అదేది యేలాగున్నా ఆడదాని పాటే పాట అనిపించకమానదు సుమా... ...యెంతైనా ఆతీరూ, ఆ సొరూ ఆ సొంపూ, ఆ నేవళీకం, ఆ వొద్దికా. ఆ వొయ్యారం, పురుష ఘటాలకు రమ్మంటే వొస్తుందా? కంఠ మాధుర్యమో! తియ్యనిద్రాక్షకూ పులుపుద్రాక్షకూ వున్న భేదంవుంది" అన్నారు. ఒక్క పేరాలోనే ఇంత యెగుడుదిగుడా? "వాడు (పాకీవాడు) వీధిలోకే రాకూడదనీ, వాడిమీదపడిన యెండ మన కెంతమాత్రం పనికి రానే రాదనీ యిలాంటి లేనిపోని పద్ధతులు పెట్టడం విపరీతం!! వాళ్లని దేవాలయాలలోనికి రానిమ్మనడం— అదీ విపరీతంవేఁ!! కాదని తోసికూడదు. యెన్నివేల సంవత్సరాలైందో—నడుస్తూవున్న ఆచారాన్నిప్పుడొక్కమాటతో మార్చేస్తానంటే చెల్లుతుందా?" ఏమిటీ యీ స్వవచనవ్యాఘాతం?

ఇలాగ యెటు చూచినా యీ గ్రంథం నిస్సారంగానూ, నిరుపయోగంగానూ, పైగా బుద్ధిని తికమకలు పెట్టేదిగానూ వుంది. దీనివల్ల తెనుగుగృహలక్ష్ములకు ఉపకారం కలగడం అసంభవం.

శ్రీ. సు. శాస్త్రి.

---

## నవ్యకథానిధి

శ్రీ శివరామప్రసాద్ గ్రంథాలయ ప్రచురణము ౧ కర్త: ఉభయభాషాప్రవీణ శ్రీ అయినంపూడి గురునాథరావు: క్రౌను ౨౬ పుటలు. వెల ఐదణాలు. ప్రకాశకులు: శ్రీ శివరామప్రసాద్ గ్రంథాలయము, (రిజిష్టర్డు) పెదసనగల్లు (కృష్ణా.)

ప్రస్తుతము ప్రాథమికవిద్య చాల వెనుకబడి యున్నది. భాషయందును, జ్ఞానమునందును బాలురకు మంచి ప్రవేశమును గల్గించి దానిని దిద్దితీర్చుటకు ఈ చిన్న పుస్తకము వ్రాయబడినది. ఇందు యథార్థము లగు నిరువదికథలు, ప్రతి కథచివరను దానింబట్టి తెలియదగిన విశేషాంశములును కలవు.

శ్రీ గురునాథరావుగారు 'ప్రాథమిక విద్యాలయములయందు చిరకాలానుభవము గల బోధకులు.' 'ప్రాథమికపాఠశాల'యను విద్యాపత్రికకు ప్రధానసంపాదకులు. కావున విజ్ఞులైన యుపాధ్యాయు లనేకుల యభిరుచులను, అనుభవములను చవిచూచినవారు.

కథలచివర దేశభక్తిని, సద్గుణాపాదనమును గల్గించు విపులవిషయములు చెప్పబడుట, బాలుర కుత్సాహజనకమగు సమాసములు కూర్పబడుట, బాలుర మనోవ్యాయామము కల్గించి పుష్టిని చేకూర్చు కఠినపదముల నుపయోగించుట, కల్పితగాథల పొంతలకు పోక చరిత్రాత్మకములైన విషయములే సంగ్రహించికొనుట యు నిందలి విశేషాంశము లని, అని రమ్యముగా నున్నదనియు దీనికి 'భూమిక'ను రచించియిచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ. గారి ఆశయము.

ఇందలి కథలు ప్రమాణమున అల్పములు. బాలురకు వానివలన తెలుపు హితము లనల్పప్రమాణములు. కథలలో హిందూదేశమునకు సంబంధించినవి సగము కలవు. ఆంగ్రమున రచింపబడు కథలు ఆంధ్రదేశమునకు, ఆంధ్ర ప్రముఖులకు సంబంధించినవయి యుండుట ప్రశస్తము; ఆవశ్యకమును. ఆంగ్రేతరములు తిరువాతివిగా సైకొనదగినవి. ఇందు ఆంధ్రదేశమునకు చెందినది 'అచ్చమాంబ' అను ఒక్క కథయే. ఇందలి రచన, సమాసగంభీరము ప్రాథమిక పాఠశాలలయందలి విద్యార్థులకు కాక మాధ్యమిక పాఠశాలలలోని విద్యార్థులకే మనోవ్యాయామమునకును భాషాజ్ఞానమునకును అనుగుణములు.

మఱియు ప్రాథమిక పాఠశాలలలోని విద్యార్థులు కథామాత్రగ్రహీయులు. 'ఇది కల్పితమా? లేక యథార్థమైనదా?' అను నాలోచనము వారికి కలుగుట అరుదు. అట్టి విశేషజ్ఞానము మాధ్యమికపాఠశాలలలోని బాలురకు కలుగుటకు మాత్రి మవకాశ మున్నది.

ఇందు కొన్ని వర్ణనములు అనుభవ విరుద్ధములుగ నున్నవి. అందులకు 'అది నీలినాకాశము. దానికి సోయగము గూర్చు సహస్రకిరణుండాతడు. తన చల్లని వెలుగుచే జగమును ఆనందింపజేయు అమృతమరీచిని, ఆతనికి నలువైపుల విరజిమ్మిన ముత్యాలవితతివలె నున్న నక్షత్రముల ఎటుండుదువుగదా! అవి మేఘపఙ్క్తులు. వాని నడుమను దాగుచు పూతల నాడుకొనుచున్నయవి విద్యుల్లతలు అదిగో రత్నకాంతుల నీనుచున్న ఇంద్రధనుస్సు.' అను మొదటిపుటలోని రచన యుదాహరణము. పటుచిత్రము లేక కాలమున అసంభవములు.

ఈ పుస్తకమును మాధ్యమిక పాఠశాలలలో ఆప్రధాన పఠనీయముగ నంగీకరింపవచ్చును.

బు. వేం. రం.

# గ్రంథ స్వీకారము

## వండుగ కట్నము

సైజు, ౧/౮ ఫూల్సుక్యాప్; పుటలు ౨౮; రచయిత: బుద్ధి వెంకట సాంబశివరావు, అనకాపల్లి.

---

## శ్రీరామశతకము

సైజు, ౧/౮ డెమ్మి; పుటలు: ౧౭; వెల ౦-౨-౦; రచయిత: కోట నరసింహమూర్తి, పెనుగొండ, (ప. గో. జిల్లా.)

---

## a. శ్రీ బాలగోపాల శతకము
## b. శ్రీఘటికాంద్రి నృసింహశతకము
## c. ఆంజనేయ నక్షత్రమాలిక

సైజు, ౧/౮ డిమ్మి; పుటలు (a) ౧౬; (b) ౨౦; (c) ౧౬. ప్రతి శతకము ౦-౨-౦ లు. రచయిత: తుర్లపాటి గురుస్వామయ్య, చోళింగపురము (M. S. M Ry)

---

## గేయగుచ్ఛము

సైజు, ౧/౮ డెమ్మి; పుటలు ౬౦; వెల ౦-౮-౦; రచయిత: పచ్చిపీసు గురునాథరావు, పెరుమాళ్లపల్లి, వినుకొండ పోస్టు. గుంటూరు జిల్లా.

---

## మహత్తత్త్వ సారము

సైజు, ౧/౮ డెమ్మి; పుటలు ౩౮; వెల ౦ ౪-౦ రచయిత. మల్యాల వెంకట జనార్దనరావు, L. M. P., పిఠాపురము.

---

## వాసిష్ఠ రామాయణము అను
## శ్రీ యోగవాసిష్ఠము

సైజు, ౧/౮ రాయల్; పుటలు ౧౬౦; అనువాదకుడు: శ్రీ పూర్ణానంద; సంపాదకులు: శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు, చిత్తూరుజిల్లా.

---

## సందేశ తరంగిణి (రెండు భాగములు)

సైజు ౧/౮ క్రౌను; పుటలు ౨౪౪, ౨౦౭ వెల ౨ భాగాలు: ౨-౦-౦ లు. రచయిత, తత్త్వానంద స్వామి, రామకృష్ణమఠము, మైలాపూర్, మదరాసు.

---

14. 2- 20 ౩౨౦

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచపరిణామమునందు మహాసంధిస్థితి సంప్రాప్తమైనది. దైవాసుర బలములు దినదినప్రవర్ధమానంబు లగుచు మహాసంగ్రామమునకు, సంక్షోభమునకు సంసిద్ధముగ నున్నవి. దైవాసుర బలముల సంరంభము రణరంగములందువలెను సాహిత్య శాస్త్రకళా మతరంగములందును ప్రవర్ధమానంబగుచు భయోత్పాతములను గలుగజేయుచున్నది. ప్రపంచము నంతయును సంగ్రామ జ్వర మావరించినది; ఆవరించుచున్నది. స్వస్తివచనములు, సంగ్రామ కార్యములు సకలదేశములందును పరిపాటిమైనవి. జర్మనీయందు హిట్లరుగారి ప్రవచనములకు గ్రేటు బ్రిటనునందు ఈడెనుగారి ప్రసంగములు ప్రతిబింబములు. కాని ఉభయుల ప్రసంగములకును నంతరార్థములు భిన్నములై యుండినను ప్రయోజనము సమానము. ఆకలితో మాడుచున్నవానికిని కడుపునిండినవానికిని చిత్తప్రవృత్తియును కార్యకలాపమును సామాన్యములు గాజాలవు. కడుపునిండినవారు స్వస్థతగను కూర్చుండగోరుటయును అన్నాతుగులు భయంకర కార్యములను చేయగోరుటయును సామాన్యవిషయములు. ద్వంద్వమయమైన ప్రవృత్తియందు కలిమిలేములు, లాభనష్టములువలెను దైవాసురబల సంరంభమును సామాన్యము. ఆసురబలారాధనము లేనివారలకన్నను ఉన్నవారలకే విశేషము.

శ్రీమంతులు పరస్పరమిత్రులు; యాచకులన్యోన్యశత్రువులు. మహాసామ్రాజ్య భోగముల ననుభవించుచున్న ఫ్రాన్సు, బ్రిటీషు సామ్రాజ్యములకును నితర సంపన్న సామ్రాజ్యములకును, మిత్రత్వము సహజము. సంపన్నములు కాని రుష్యా, జర్మనీ రాజ్యములకు శత్రుత్వము సహజము. యూరపు రాజ్యముల కుల్లునకు హిట్లరుగారి డంబములు, రుష్యాయందలి క్రుట దండనములు, స్పెయినునందలి అంతఃకలహములు, అబిసీనియా దండయాత్ర, బ్రిటిషుమంత్రుల సామవాక్యములు నిదర్శనములు.

ఐరోపామహాసంగ్రామమునకు పూర్వమువలెనే యూరపురాజ్యములు రెండుశిబిరములుగ నేర్పడుచున్నవి. రుష్యా, గ్రేటు బ్రిటను, ఫ్రాన్సు ఒకపక్షమునందు చేరినను శాంతిరక్షణమున కవసరమైన పరస్పర విశ్వాసము లేకున్నది. స్పెయినునందు గతించిన 7 నెలలనుండియును జరుగుచున్న అంతస్సంగ్రామము ప్రజలయందే కలిగిన భేదమునకు ప్రమాణముగ నున్నది. బ్రిటీషు, ఫ్రెంచి రాజ్యాధికారులు మంచిమాటలను చెప్పినను క్రియాశూన్యమై రుష్యాకుగల పట్టుదల లేకున్నది. ఆసన్నమైన సంగ్రామమును నీమార్గమునె యవలంబించుట యూరపురాజ్యముల పరిస్థితుల కనురూపముగ నున్నది. ప్రజాస్వామ్యత్వమునకును, నిరంకుశత్వమునకును ప్రవర్ధమానంబగుచున్న సంరంభమునందు ప్రజాస్వాతంత్ర్య స్వామ్యములకు మూలస్థానములైన ఫ్రాన్సు గ్రేటు బ్రిటనులు సంశయములకు పాలగుట ప్రపంచము నావరించిన దురదృష్టము. బ్రిటీషు రాజ్యాధికారుల నావహించిన భయమును, మంత్రుల ప్రసంగములు వెల్లడి చేయుచున్నవి. ప్రపంచ

శాంతి కార్యము లవలనను సాధ్యపడవలయును కాని మాటలవలనను సాధ్యపడదు. ప్రపంచ మున కీ పని యెంతత్వరగా సంభవమైన అంత శ్రేయస్కరము. ప్రపంచమున కాసన్న మైన మహోపద్రవ దశయందు ముప్పది యారుకోట్ల భారతీయులు శాంతిప్రియులు మీనమేషములను లెక్కించుచు నిశ్చేష్ట తను వహించియుండవలసినదుర్దశ స్వాతంత్ర్య ధర్మాత్ములకు పరమ విషాదమును గలుగ జేయుచున్నది.

*　　　*　　　*

భారతీయ రాజ్యాంగములు

"భారతీయ రాజ్యాంగము లయోమయ ములు, దారుతుల్యములు, ప్రజాప్రయోజన ములకు నిరుపయోగములు, పురాణగాథలు" అని మోంటేగుగారు 20 ఏండ్లకు పూర్వము భారతీయ రాజ్యాంగముల విషయమై చేసిన యథార్థవ్యాఖ్యానము వర్తమాన కాలము నందు ద్విగుణీకృతముగను వర్తమాన రాజ్యాంగములకు సరిపోవుచున్నది. ఇండియా శాసనము, నిబంధనలు, కౌన్సిలు ఆర్డరులు, నిషే ధములు, గవర్నరుల నిరంకుశాధికారములు, సాంఘిక ప్రాతినిధ్యములు, ఫెడరేషను రాజ్యాం గవిధానము మొదలగు రాజ్యాంగవిధాన మామూలుగ్రమము ప్రజా స్వాతంత్ర్యా శయములను నిర్మూలము చేసినవి. హిందూ స్థానమునం దన్నిపక్షములవారును రాజ్యాం గములను నిరసించిన విధమును సైమను కమిషను బహిష్కారమునుండి నేటివరకును ప్రవర్ధమానంబైన ప్రజానాయకాభిప్రాయము విశదము చేసినది. అయినను బ్రిటీషురా జ్యాధికారులు వారి యిష్టానుసారముగను రాజ్యాంగముల నాచరణమునందు బెట్టుట యును, భారతీయులందు కొందరు సంస్కార ణముల నాచరింపబూనుటయును బ్రిటీషు ప్రజలను, భారతీయులను-నావహించిన పరమ దైన్యస్థితికి ప్రమాణము. భారతప్రజాభి ప్రాయమును వ్యక్తము చేయుటకు ప్రమాణ సంస్థమైన కాంగ్రెసు సంస్కారణములను నిరాకరించినవిధమును బొంబయి, లక్నో, ఫయిజుపూరు కాంగ్రెసులు చేసిన తీర్మాన ములు దిగంతములందు చాటుచున్నవి. కాంగ్రెసు అభిప్రాయములను క్రియారూప మునను ఋజువుచేయుటకు ఎన్నికలు సంప్రా ప్తములైనవి. ఎన్నికలందు గలుగనున్న యవకాశములను ప్రజాభిప్రాయమును విశ దము చేయుటకు వినియోగించుట ప్రజానాయకులకు పరమధర్మము. ఈ పరమధర్మమును సాధించుటకు కాంగ్రెసు దీక్షను వహించినపు డన్ని పక్షములవారును కాంగ్రెసుపక్షమును రక్షిం చుట పరమార్థము. ప్రజానాయకులు వా రేపక్షమునకు చెందినను కాంగ్రెసుఅభ్యర్థులకు సకలవిధములను సహాయముచేయుట ధర్మము కాని ప్రతిఘటించుట ధర్మము కాదు. ఇతర పక్షములవారు స్వార్థపరాయణులై ప్రతిఘట నమునకు బూనుకొనినను, కాంగ్రెసునాయ కులే ప్రతిఘటనమునకు బూనుకొనుట భర్తృ హరి వ్రాసినటులు వీరిని వర్ణింపను శక్యము గాకున్నది. ఇప్పుడైనను ప్రతిఘటించిన నాయ కులు పరమార్థదృష్టి యటులుంచి స్వార్థ దృష్టితోనే తమ యభ్యర్థిత్వమును విరమిం చుట పుణ్యము, పురుషార్థము.

*　　*　　*　　*

ఆంధ్రాభ్యర్థులు-వోటరులు

ఆంధ్రదేశమునందు ప్రజలకు కాంగ్రెసు పట్లగల అపారభక్తిని సత్యాగ్రహ చరి త్రము వేయినోళ్లను చాటుచున్నది. శ్రీయుత

వెలిదండ హనుమంతరావు, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారు మొదలగు మహానుభావు లెందరో దేశముక్తికై ప్రాణములను సమర్పించిరి. శాసనసభలను బహిష్కరించిన దేశభక్త వేంకటప్పయ్య పంతులుగారు, సి. రాజగోపాలాచార్యులుగారు దేశహితార్థమై శాసనసభ్యత్వము నంగీకరించినారు. త్యాగమూర్తులెందరో కష్టపరంపరల ననుభవించుచు కాంగ్రెసు నియామకమును శిరసావహించుచున్నారు. సర్దారుపటేలు, పండిత నెహ్రూ; రాజేంద్రబాబు, మహాత్మాగాంధి మొదలగు మహానుభావులు శాసనసభాప్రవేశమును, కాంగ్రెసు పూర్ణవిజయమును స్వాతంత్ర్యమునకు సాధనములు కాని, ప్రతిబంధకములు కావని ఘోషపెట్టుచున్నారు. కాంగ్రెసు నాయకులు, ప్రచారకులు, దేశారాధకులు వారి ధనావకాశములను కాంగ్రెసు విజయమునకై వినియోగించుచున్నారు. ఇట్టి కాంగ్రెసు మహోదయమునందు సకల జనులును జాతి కుల మతభేదములను విడిచి కాంగ్రెసు దేవతకు ధూపదీప నైవేద్యమంగళహారతులను సమర్పించి కృతకృత్యులగుట ధర్మము. రాగల యెన్నికలందు కాంగ్రెసు పక్షమున కాంధ్రదేశమునందును పూర్ణవిజయము గలుగునని ఉత్కళ, బీహారు, అస్సాము రాష్ట్రముల విజయములు శకునము చెప్పుచున్నవి. ఆంధ్రావనియందు జమీందారులు వారి ధనమును, పలుకుబడిని దుర్వినియోగముచేసి స్థానికసంస్థలందు అధికారాసమున నధిష్ఠించిన విధముననే శాసనసభలయందును వినియోగించుటకు చేయుచున్న విశ్వప్రయత్నములు పరమాసహ్యముగ నున్నవి. రయితుల స్థానములను జమీందారు లాక్రమింప జూచుట కేవల మన్యాయమని బాలిశులకును తెలిసిన విషయము. అధికారులు, జమీందారులు చతుర్విధోపాయములను కాంగ్రెసు అభ్యర్థులందు జాతికులాభిమానభేదములను గల్పించుటకును, వోట్లను కొనుటకును, ధనబలాధికారములను వినియోగించుటకును చేసెడి ప్రయత్నముల కాద్యంతము లుండవు. వోటరు లిదివరకు వలెను వర్తమానపు టెన్నికలం దీమాయోపాయములందు చిక్కుకొనకను వోటింగుశిబిరములకు తీర్థయాత్రలకువలెను భక్తిపూర్వకముగనుపోయి కాంగ్రెసుదేవతకు వోటుకానుకలను సమర్పించి కృతార్థులగుటకు భగవదనుగ్రహము గలుగుగాత! కాంగ్రెసువిజయము స్వాతంత్ర్యవిజయము, ధర్మవిజయము, శాంతివిజయము, ఆత్మవిజయము అని ప్రతివోటరును గ్రహించి కురుక్షేత్రమునందు విజయునివలెను ప్రతిజ్ఞనుజేసి కృతార్థులగుదురుగాత! స్వదేశమునందు స్వాతంత్ర్య ప్రతిపత్తి ప్రపంచమునందంతటను స్వాతంత్ర్య ప్రతిపత్తికి సాధనమగుచున్నది.

శ్లో. నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ.

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

# విషయసూచిక



త్రివర్ణచిత్రములు—శివుడు; శివభక్తమాహాత్మ్యమునందు రాజోపాఖ్యానమున నౌకానౌకరంగము.

సాధారణ చిత్రములు—హైదరాబాదు చిత్రములు; రెండవ అఖిల భారత ఛాయాచిత్రప్రదర్శన చిత్రములును, ఇతర చిత్రములును.

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈ నెల (1937 సం. మార్చి)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో 1937 సం. ఏప్రిల్ 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయందభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. నిగైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 3, 4, 8, 9. D 1. H 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 11, 12, 13, 14, 15, 16, 17, 18, 35, 37. J 16. K 2, 3, 12. L 5, 6, 7. M 1, 2. N 1, 2, 15. P 1, 2. R 2, 3, 5, 6, 60. S 5, 7, 8, 9, 10, 11, 12, 15, 16, 17, 19, 20, 2 , 27, 98, 100, 260, 267. V 1, 3, 4, 5, 6. W 1.

---



సంపు. ౧౪ ధాత సంవత్సరము, ఫాల్గునమాసము ( మార్చి ౧౯౩౭ ) సంఖ్య 3

# జీవిత కావ్యము

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

ఈ నిద్రాణతమోంధజీవికకు రా
నే రాదు లే, స్వప్నమున్
పోసి వచ్చినయేని, ఒక్క త్రుటి నీ
భూలోక బాంధవ్య ని
ర్యాణానంద మహోత్సవావశత, పో
రాదా ? కొత్తలోకాలకున్
లేనే లేదు, యెడారిబాటల ప్రయా
ణించున్, పిదాహమ్ముతో.

నావలె తీవ్రకాంక్షల పె
నంగిన దగ్ధులు, సత్కళాతృషా
జీవులునైన, ఈ యెడద
జీల్చి తొరంగు ననంతరాగ బా

ధావిలమైన పల్కు కుప
దన్ పచరింపుడు, సాను భూతితో
దావమువంటి యూహాలు హృ
దంతర మేర్చెడి, నెట్లు మ్రింగుదున్.
ఆమనిజాజిపూవుల యొ
య్యారము, పై పయి చైత్రమాస సా
ధామలచంద్రికారజత
యామినులున్, కలకంఠగీతముల్
కోమలినీలనేత్రముల
లోని విలోలత మాలమాధురుల్
ఏమియు నిల్వనీవు రగి
లించును, నాయెదకొత్తపాటకై.

ఒకపరి దీనమానవుల
నొత్తెడి జీవనభారతీవ్ర బా
ధకు, దరద్రుష్ట రాగబహు
ధాక్షతచిత్త విషాదగాథకు
సకలజగమ్మునంటినయ
శాంతికి, విప్లవరక్తకాంతికిన్
తుక తుక వేగిపోవు నెడ
దుఃఖమయమ్మయి పల్కునేదియో.
గతము, ప్రవర్తమానమును,
కాగలకాము కాంతిహీనమై
బ్రతుకున మ్రోగుచుండు నొక
పాటయె, కానన వేణుగీతమై
వెతల గరంగి, లోకములు
వీడి మనోరథ దివ్యమానసం
గతులకు నాత్మజీవితమె
కావ్యము, సద్ధృదమైక సేవ్యమున్.

---

# మాల్యవంతుఁడు

## మురారిభవభూతులు

## విశ్వనాథ సత్యనారాయణ

సంస్కృతవాఙ్మయమున రామాయణ నాటక కర్తలు ప్రత్యేకకక్ష్యలోనివారు. ఉదాత్తగుణ నిరూపణయందు ఒక్కొకవారికిని వీరికిని భేదము కలదు. ఉదాత్తేతరమైన విషయము సంస్కృత నాటకములయందు గోచరింపదు. రామాయణ నాటకకర్తలయం దీయుదాత్తత నిక్కమీయు నెక్కువ. భాసుని ప్రతిమ, భవభూతి యుత్తరరామచరితము వ్యంగ్యార్థము, సూచ్యార్థసూచనలకుఁ బుట్టినిండ్లు. ఉత్తర రామచరిత్రమునందలి యుదాత్తత సర్వజగదతిశాయిని.

మహావీరచరితానర్ఘరాఘవములు నాటకాంగము లైన యంకావతారాదుల ముఖమునఁగాక, కథామార్గమున సూచ్యార్థ సూచనయు, భావికథను వ్యంగ్యస్ఫూర్తితో నిక్షేపించుటయుఁ జేయవు. వానిరెంటియందును భావవర్ణనోదాత్తతమాత్రమే బహుధా గోచరించును.

మహావీరచరిత, గ్రంథము పృథక్పృథక్కుగా లభ్యము. పంచమాంకమున వాలిప్రవేశమువఱకు భవభూతి రచన. తక్కినభాగమునకు రెండుపూరణములు. ఒకటి సుబ్రహ్మణ్యకవి పూరించినది. రెండవది భవభూతి రచనయేమో తెలియదు. కొన్నిచోట్ల భవభూతిరచన యనిపించును. ప్రధానముగా వాలిపాత్రనిర్వహణము దివ్యముగా నున్నది. ఉదాత్తతయందు నాటకరచనాశక్తియందు మురారి మహావీరచరిత్ర కందఁడు. కాని సర్వమును మహావీరచరిత్రనుండియే గ్రహించెను.

ఈ నాటకములయందు పాత్రపోషణమునందే కవులు తమశక్తియంతయు వినియోగించిరి. భవభూతి సూచించి వదలిపెట్టినది, మురారి దానిని విస్తరించి మఱికొన్ని మెఱుఁగులు చేర్చినది మాల్యవత్పాత్రము.

రామాయణనాటకకర్తలు తమ నాటకములను రామాయణమునకు వ్యాఖ్యానములుగాఁ జేసిరి. రామాయణ మితిహాసము అందు ధర్మోపదేశమునకైన ప్రాధాన్యము మఱింకొకదాని కుండదు. పాత్రపోషణము నాయకునియందు దీర్చినటు ఋషి తక్కినవిషయములయందుఁ జూపఁడు. కథను జెప్పుకొనిపోవుచు వాల్మీకి, నాటి రాజకీయవృత్తాంతములు కథయందు నిగూఢములైన కొన్ని ధర్మశాస్త్రవిషయములు, నప్పటి దేశకాలపరిస్థితులు తనకథ కక్కరలేనివి వదలిపెట్టెను. వానినెల్ల భాసభవభూతిమురారులు విస్తరించిచెప్పిరి.

ప్రస్తుతమైన మాల్యవత్పాత్ర నిర్వహణము భవభూతి యీ యుద్దేశముతోఁ జేసెను. దానిని మురారి మాల్యవంతునియందు మహోదాత్తత కల్పించి లోకాతిశాయిగాఁ దీర్చి దిద్దెను. భవభూతిమాల్యవంతుఁడు ద్వితీయాంకారంభమున నొకపర్యాయమును, చతుర్థాంకాదినొకపర్యాయము వచ్చి రాముని నోడించుట, సీతను బరిగ్రహించుట మొదలైనవిషయములను విచారించుచు దన నీతిశాస్త్రమంతయు వెల్లడించి, తనపన్నగడ సాఁచినచో రావణుఁడు చచ్చెనని నిర్ణయించును. రావణవధ తన నీతిదృష్టిచేతఁ జతుర్థాంకారంభమందే మాల్యవంతుఁడు నిర్ణయించెను. తన నీతికల్పనలో ఖరదూషణ త్రిశిరులయు, విభీషణునియు నాశననిష్కాసనములు తొలుత నే చూచెను.

"హా! వత్సాః ఖరదూషణత్రిశిరసో వధ్యాః స్థ పాపస్య మే
హాహా వత్స విభీషణ! త్వమపి మే కార్యేణ హేయ స్థితః
హా మద్వత్సల వత్స రావణ మహ త్పశ్యామి తే సంకటం"

ఇది మహావీరచరితలోని మాల్యవంతుని బుద్ధివైశద్యము. ఇతఁ డెంతవఱకును నీతివేత్త. మురారిమాల్య

వంతుఁడు నీతివేత్తయే కాదు, సర్వశాస్త్రపండితుఁడు; మహోదాత్తపురుషుఁడు; రాజ్యాంగనిపుణుఁడు. భవభూతిమాల్యవంతుఁడు చాలవఱకు రాక్షసుఁడు. అతఁడు రాముని మోసముచేసి దండకారణ్యము ప్రవేశింపఁజేయును. మంథర మిథిలామార్గమునం దుండెను. శూర్పణఖ దానిశరీరమునం దావేశించి దశరథునికోరిన రెండు వరములచే రామభద్రుఁడు నిష్కాసితుఁడు కావలయును. ఈకల్పనను మురారి స్వీకరించి మార్చెను. ఆమార్పుటలో జాంబవచ్ఛ్రమణావృత్తాంతముకూడఁ గల్పించి మిథిలాపథమున మరణించిన మంథరాశరీరమునందు శ్రమణచేతఁ బరపురప్రవేశము చేయించి, తద్వారా సుగ్రీవసాహాయ్యమునకై రామఁ డరణ్యావాసగతుఁడౌటఁ జేసెను. ఈ మార్గమున మాల్యవంతుడు తన కార్యసాధనము సాధించుకొనెను. ఈ కల్పనలో నెక్కువయోగ్యతకలదు. బ్రతికియున్న మంథరాశరీరమును శూర్పణఖ యావేశించుటకంటెఁ జనిపోయిన మంథరాశరీరమునందు శ్రమణ పరకాయప్రవేశము చేయుట యర్థవంతముగ నున్నది. కైకేయియాజ్ఞలేనివరములు మంథర యెంతరాక్షసావిష్టయైనను నడుగుట యుచితముకాదు. దానికి మేలు కాదు. శ్రమణ యోగిని. పరపురప్రవేశముచేయుట, యదియు జాంబవన్మంత్రిప్రేరితయై చేయుట, ధర్మము కొఱకు జేయుట యుదాత్తముగానున్నది.

భవభూతిమాల్యవంతుఁడు శ్రీరామభద్రుని గుణగణ మెఱుఁగను. వరములు యాచించినమాత్రమున రాముఁడు వనమునకు వెడలునో, వెడలఁడో యన్న శూర్పణఖాప్రశ్నమునకు మాల్యవంతుఁ డిట్లనెను: 'భిద్యేత న సద్వృత్తి మిక్ష్వాకుగృహేషు, విశేషత స్తాదృశస్య విజిగీషోః" అని. 'తాదృశస్య విజిగీషోః' అనుటచేత రాముని యందతనికి వీరుఁడన్న భావమే కాని రామచంద్రుని యౌదార్యాదిగుణములయందు వానికి గుణపక్షపాతము లేదు. రాముని జయించుటయందు, సీతాపహరణమునందు వాని కల్పనయంతయు రాక్షసముగా నున్నది. "హతజాని రరాతిభి స్సలజ్జో యది మృత్యు శ్శరణం తతో న్యథాతు, ప్రమదేతో మృతఏవ నిర్వృతాపః" అనియతని యాశయము. హృతభార్యుఁడై సలజ్జుఁడై నిర్వృతాపుఁడై రాముఁడు మరణించునని వానియూహ. కాలయెత్తివచ్చినచో ఖరదూషణాదులను ప్రయోగించును.

మురారిమాల్యవంతుఁడు చూడుఁడు! శూర్పణఖ 'ఆర్యే! నఖలు బలాత్కారం పరిహృత్య త స్యాన ఉపాయ స్తర్క్యతే' యన్నది. మాల్యవంతుఁడు 'వత్సే! మామైవం. మహాన్ దోషోహి తాదృశేన ధర్మవిజయినా వీరపోతేన పరిగృహీతాయాః వైదేహ్యాః ప్రసహ్యాపహారః.

శ్లో. దోస్తంభద్వయదర్పడంబరమితి స్పష్టం నవిస్పందతే, వైదేహీకరబంధసూచన మితి ప్రస్తౌతి నవ్రీళయా; ఇత్యాలోచ్య కృతస్మితై ర్మునిభి రాదిష్టేన యేన క్షణా, దాత్తసజ్జిత మాచితంచ సహసా భగ్నం చ తాదృగ్ధనుః.

కథ మస్మదీయం నిశాచరనాథ మాతతాయిన మనుజానీమః' అన్నాడు. తాదృశుఁడైన ధర్మవిజయి భార్యను బలాత్కారముగ గ్రహింపఁడు. రావణుఁ డాతతాయియనుట కంగీకరింపఁడు. పరదారాపహర్తయాఱుగురైన యాతతాయులలో నొకఁడు. ఇంతియకాక తాదృశుడైన ధర్మవిజయి యనుటచేత మాల్యవంతునకు ధర్మపక్షపాతము కలదు. గుణపక్షపాతముకలదు. ఈశ్లోకమున ప్రథమపాదమున రాముని గర్వరాహిత్యమును ద్వితీయపాదమున నతనిలజ్జామాగ్ధ్యమును 'భగ్నంచ తాదృగ్ధనుః' అనుటచేత రాముని శౌర్యమును నతఁ డెంతగానో మెచ్చుకొనెను. 'భగ్నంచ తాదృగ్ధనుః' అనుటలో మఱియొక యందమున్నది. భవభూతిమాల్యవంతుఁడు పరశురాముని రామచంద్రునిమీదికి రెచ్చఁగొలిపెను. రాముని ధనుర్భంగ పరశురామ విజయములుకూడ భవభూతిమాల్యవంతునకు రామశౌర్యము తెలుపలేదు. శివధనుర్భంగముతోడనే మురారిమాల్యవంతునకు రామచంద్రునిప్రతాపాధిక్యము గోచరించెను. అందుకనియే పరశురాముఁడు రామునిమీదికిఁ బోయెనని తెలిసికూడ 'పర మనేనాపి సకలమూర్ధాభిషిక్తకంఠరుధిరావసేక పంకిలకుఠారేణ దురభిభవో దాశరథిః' అని నిశ్చయించినాడు. శూర్పణఖకుఁ బరశురాముఁడు గెలుచునని యూహ. అందుకని 'అహో!

దుర్గముఖేఽపి తస్మిన్ క్షత్రియవటుకే ఏవం సంభావయతి కనిష్ఠమాతామహః' అనఁగా మాల్యవంతుఁడు 'వత్సా నీకు తెలియదు. 'సర్వరాజః దుర్గ్రహం సర్వదేవమయం ధనుః, భంజతా రామభద్రేణ విజిగ్యే భువనత్రయమ్' అయినను 'ప్రాప్తః పరశురామో ఽసౌ నవిద్మః కిం భవిష్యతి' యని యద్భుతమైన కార్యమునందు దానన్మాత్రసంశయము మాత్రమే పొందెను.

మురారిమాల్యవంతుఁడు తానుగూడఁ బరమ మాహేశ్వరుఁడు; పరమ వీరవ్రతాచారుఁడు.

తక్కినగ్రంథముగూడ భవభూతివిరచించిన నాఁడనమాల్యవంతు నేమిచేసెడివాఁడో! అతనినీతియంతయుఁ జతుర్థాంకముతో నయిపోయినది. జరుగఁబోవుకథయంతయుఁ దన నీతిదృష్టితోఁ బర్యాలోచించి నిశ్చయించినాఁడు. ఒకవేళ భవభూతి తన్నాటకమును బూర్తిచేసినను నాయనమాల్యవంతుఁడింకేమియుఁ గాఁడు. అతనికుతంత్రము, రాక్షసత్వముఁ దననీతిలోని వక్రత్వము సర్వము నతఁడదివఱకే వ్యక్తీకరించెను. భవభూతి తనమాల్యవంతుని రామకథలోని రాజనీతినిఁ జెప్పుటకే ప్రవేశపెట్టెనుగాని వాని నొక సర్వాంగసుందరమైన పాత్రముగా నిర్వహించుటకుఁ గాదు. అతనికన్న శూర్పణఖయే యెక్కువ వివేకిని. రాముని దండకారణ్యమునకుఁ దీసికొనివచ్చుటలో నామె యిష్టపడలేదు. "మమతు ద్వయమే నైతన్నయుక్తం ప్రతిభాతి, యద్దూరస్థితస్య దాశరథేః సన్నిధానకరణం, యచ్చ అనవబద్ధవైరస్య అప్రతిసమాధేయం స్త్రీ వైరమితి." దూరముగానున్న రాముని దగ్గరకు దెచ్చుటయు నప్రతిసమాధేయమైన స్త్రీవైరమును గడించుకొనుటయు శూర్పణఖ కిష్టము కావు. దీనిని మాల్యవంతుఁడు తన యధికారముచేత రాజ్యాంగప్రస్తావముచేత ద్రోసిపుచ్చెనే కాని వేఱుకాదు.

ఇట్టి మాల్యవంతుఁడు మురారిభట్టుచేతిలో నొక మహాపురుషుఁడై మహామంత్రియు వీరవ్రతాచారుఁడునైనాఁడు. అతనికి రామునియందు కించిత్తయినను ద్వేషములేదు. రామభద్రుని గుణగ్రామ మతనికి హృదయదఘ్నప్రేమ మాపాదించునది. అతని కోపమంతయు విశ్వామిత్రునిమీద. రామభద్రునిమీదఁ గానేకాదు. రాముఁడొక మహాపురుషుఁడు. ధర్మబుద్ధియు, వీరుఁడు నగు నొక రాచపసికూన. రామునిచేత విశ్వామిత్రుఁడే ధనువు విఱిపించెను. "అహో దురాత్మనః క్షత్రియబ్రాహ్మణస్య కౌశికవంశజన్మనో దుర్నాటకమ్."

శ్లో. "యజ్ఞోపప్లవశాంతయే దశరథో రాజాసుతం యాచితః, తంచానీయ వినీయ చాయుధవిధౌ తే జఘ్నిరే రాక్షసాః, త్ర్యక్షం విదళయ్య కార్ముకమథస్వీకార్య సీతా మితో నో విద్మః కుహనావికేన వటునా కిం తేన కారిష్యతే."

తెలుఁగులోఁ దిక్కనరచన యెటువంటిదో సంస్కృతమున నీ శ్లోకరచన యటువంటిది. మాల్యవంతుఁడు తాను విశ్వామిత్రుఁడు నొక 'పాయా' కలవారు. 'తం చానీయ వినీయ చాయుధవిధౌ' యజ్ఞోపప్లవశాంతికొరకు రాముని దెచ్చినచో రాముని నాయుధవిధియం దేల వినీతునిఁ జేయవలయును? రాముఁడు స్వాంతముగాఁ దదుపప్లవశాంతి చేయలేఁడన్నమాట. అట్టివానిని విశ్వామిత్రు డేల తెచ్చెను? ఇదియంతయు అతని దుర్నాటకము. 'కిం తేనకారిష్యతే' అతనిచేత నింకేమి చేయించునో? రాముఁడు వట్టి నిమిత్తమాత్రము. కుత్సితత్వమంతయు విశ్వామిత్రునిలో నున్నది. విశ్వామిత్రుని పేరు చెప్పినచో నతని కోడలు మండిపోవును. కాని మాల్యవంతుఁడు మహాపండితుడు, రసజ్ఞుడు. కోపనియమనస్వభావము కలవాఁడు. చమత్కారి. అందు కనియే శూర్పణఖ 'సోఽపి తత్రైవ మాయాబ్రాహ్మణో వశిష్ఠమహర్షే రపి పురతః విస్ఫురన్ దృష్టః' అనఁగా మాల్యవంతుడు నవ్వి, 'వత్సే! తపోభి రస్యబ్రాహ్మణ్యాదేశోఽపి స్థానివద్భావేన క్షత్రకార్యం నజహాతి.' అనియెను. ఇది మాల్యవంతుని పాండిత్యము. ఇట్టి కొన్ని పట్టుల మూలమున మురారినాటకమునకు గ్లిష్టత్వము ప్రాప్తించిన దందురు. ఇందు స్థానివదాదేశ కార్యశబ్దములు చమత్కారపూరణము చేయుచున్నవి క్లిష్టమని మహాపురుషుఁ డుచితమును బరిత్యజింపఁడు. ఇంతియ కాక యట్టి త్రిజాతకుడయిన మునియొద్ద చదివి రాముఁడవరీణశీలుఁడగు నేమోయని యాయనభయము.

"శ్లో. అవినయభువా మజ్ఞానానాం శమాయ భవన్నపి
ప్రకృతికుటిలా ద్విద్యాభ్యాసః ఖలత్వ వివృద్ధయే."

ప్రకృతి కుటిలు డైనవానియొద్ద విద్యాభ్యాసము చేయుట తప్పని యాయనయుద్దేశ్యము. అంతటి సూక్ష్మవేత్త.విశ్వామిత్రుని సర్వమహిమలు ప్రకృతి కుటిలత్వముగా నిర్ణయించిన యాతని బుద్ధి యెంత దివ్యమో యార్ష మో!

ఈ మాల్యవంతునియొద్ద రాజనీతికంటె రాజ్యాంగవేత్తృత్వ మధికము. ఆయన నీతిజ్ఞుడు కాకపోలేదు. సీతను బలాత్కారముగ నపహరించినచో జరుగబోవు నాపద నిట్లు చెప్పెను: "అప్పుడు రాము డూరకొనడు. పౌరజానపదులు ప్రకృతులు నతని ననుసరింతురు. బాంధవులందఱు తోడనుదురు.' 'యథోక్తం,అరణ్యోగ్నిరివ దుస్సహదుఃఖామర్ష జం తేజో విక్రమయతి పురుషం. మండలస్య చానుగ్రాహ్యోభవతి.' అని నీతిశాస్త్రము నుదాహరించెను.

"హృతజాని రరాతిభి స్సలజ్జో యది మృత్యుశ్శరణం" అన్న భవభూతిమాల్యవంతునకు నీయన కింత భేదమున్నది. సీతాపహరణానంతరమున రాముని తేజోవిక్రమములయందు మురారిమాల్యవంతునకు సందేహము లేదు.

ఈయనరాజ్యాంగవేత్తృత్వము మఱియుఁ జిత్రమైనది. వానరాకృతితో సారణుఁ డను మాల్యవంతుని చారుఁడు కిష్కింధాస్కంధావారమునఁ జరించుచుండెను. విభీషణుఁ డతనిని గుర్తుపట్టి ఖైదుచేసి రాముని కప్పగించెను. రాముఁడు వానిని గౌరవించి వదలిపెట్టెను. ఈకథ వినినంతనే మాల్యవంతునకు మహానందము కలిగెను. "కిముచ్యతే; యావద్దివ్యభావీహి గుణో విజిగీషూణా ముదాత్తతా, విశేషేణపున రయం రామభద్రే." మాల్యవంతునకు రాముఁడు రామభద్రుడు. విజిగీషువులయం దుదాత్తత ద్రవ్యభావిదైన గుణమట; ఆశ్రయముండగా వినాశము లేనిది. అనఁగా స్వతస్సిద్ధమన్నమాట.

మాల్యవంతుఁడు తమకో, రామునకో యభియోగ సమయ మెవరికని విచారించి రామునకే యనుట చక్కగా నిరూపించెను. "వాలివధవిశుద్ధపార్ష్ణినా అనేక వానరానీకనాయకేన సాక్షా దుపకృతేన సఖ్యా సుగ్రీవేణ మహాపక్షస్య హనుమచ్చరితాస్మదీయప్రవృత్తేరయమేవ సువిదితసకలాభియాస్యత్కార్యణః తస్యాభియోగసమయః." దండెత్తివచ్చువాడు తనవెనుకను ప్రక్కలను శత్రువుల నుంచుకొనరాదు. ప్రక్కలను శత్రువు లెవ్వరును లేరు. వెనుకనున్నశత్రువు వాలి. వానిని జంపెను. అనేకసైన్యములు కలవు. సుగ్రీవుతో సఖ్యము చెలుపరానిది. అతఁడు సాక్షాదుపకృతుడు గనుక శత్రుప్రవృత్తియంతయు హనుమంతుఁడు కనుగొని వచ్చెను. రామునకు నిజముగా నిది యభియోగసమయమే. మాల్యవంతుఁడు తనవైపునుండి చారులలో దాను తన రాజ్యాంగవిషయమును ఒక్కజూచుకొనుచు రాముని రాజ్యాంగవేత్తృత్వము కూడ నిర్ణయించుచున్నాఁడు. రాముని శౌర్యాదికములేకాక, ధర్మదాక్షిణ్యమేకాక, యాయన రాజ్యాంగవేత్తృత్వముగూడ నతనికి భయంకరమైనది. రావణుని సర్వనాశన మతఁడని వఱకే నిర్ణయించెను.

కుకుము ప్రవేశించి ప్రహస్తధూమ్రాక్షాదులను రాముఁడు చంపి లంకను శాఖామృగార్ణవముగాఁ జేసెనని చెప్పినంతనే మాల్యవంతుఁడు 'పురస్తా దేవ దృష్టమస్మాభి రిదం' అన్నాఁడు. ఇదివఱకే మేమిది చూచినామని యర్థము. ఈవిషయమును మున్నే మాల్యవంతుఁడు తన నీతిచక్షుస్సులతోఁ జూచెను.అందుకనియే సారణుకు "దేశకాలవ్యవహితస్యాపి ప్రమేయగ్రామస్య యథామఖీన మాదర్శస్థలంహి స్థవిరబుద్ధిః." తెలిసికోదగినవిషయములను దెలిసికొనుటయందు వృద్ధులబుద్ధి యెదురుగా నిడికొన్న యద్దమువంటి దనెను. మాల్యవంతుని బుద్ధి నిజముగా నిట్టిదే. వెంటనే మాల్యవంతుఁడు రామచంద్రుని యదీర్ఘసూత్రతనుగూర్చి మెచ్చుకొనుచున్నాడు. "సాధు రామభద్ర సాధు విజిగీషో రదీర్ఘసూత్రతాహి కార్యసిద్ధే రవశ్యంభావః." అవిలంబకారిత్వము విజిగీషువునకవశ్యాచరణీయము.

రామాయణములోని యిన్ని రాజ్యాంగవిషయములు మాల్యవత్పాత్రద్వారా మురారి వ్యాఖ్యానము చేసెను. వీరు కథాకల్పన చేయనక్కరలేదు. నాటకమునకు రామాయణకథను యోగ్యముగా నతుకుట యొక శిల్పము. అంతకథను నైదారునాటకములుగా వ్రాయుదురు. సంస్కృతనాటకకవులు తమ కౌశల్యముచేత నాకథ నొక్కనాటకమునందుఁ గుదించుట, కుదించుట మాత్రముతోఁ దృప్తిపడక రామాయణకథాగుప్తములైన కొన్ని మహావిషయము లిట్లు పాత్రనిర్వహణముద్వారా, వ్యాఖ్యానముద్వారా విశేషప్రతిపత్తి కలుగఁజేయుట చేసిరి.

మాల్యవంతుఁడు విశ్వామిత్రాదులతో దానొక పాయలోఁ జేరునట్లూహించుటలోఁ దప్పులేదు. మాల్యవంతుఁడు మహర్షివంటివాఁడు ఆమునయన్న యొకమాట–

"లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే, ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి." అనునర్థమే యీవాక్యమునందు స్ఫురించుచున్నది. మేఘనాదకుంభకర్ణులు యుద్ధమునకు బయలుదేఱన్నంతనే మాల్యవంతు డూర్పుతీసికొని "స్వస్తి విజయేతాం రామలక్ష్మణౌ కుంభకర్ణ మేఘనాదౌ" అన్నాఁడు. ప్రథమాద్వితీయావిభక్తుల ద్వివచనరూపసామ్యముచేత నీవాక్య మిట్లు పర్యవసించినది. 'విజయేతాం' అన్న కర్తరి ప్రయోగమువలన నాద్యపేక్షితకర్తయై రామలక్ష్మణులే జయింతురుగాక యని యర్థము రావలయును. లేనిచో నవిమృష్టవిధేయాంశదోషము వచ్చును. మాల్యవంతుని యనభిప్రేతమైన యీ యర్థ మతని ముఖోద్గతమైన శారద సూచించినది. ఇట్టి శారద యతని జిహ్వఁ దాండవించుటయే యాయన ఋషిత్వవైలక్షణ్యము.

సీతను దొంగలించుట మాల్యవంతున కిష్టమైనపని కాదు. ఆ మహామంత్రి యాజ్ఞ దాటి యది రావణుఁడు చేసిన దుర్వినయము. కుంభకర్ణుడు చనిపోయినంతనే మాల్యవంతుడు "జీవతో రామస్య మైథిలీహరణాదేతదస్మాభి రాంతరేణ చక్షుషా విషయీకృతమేవ" అన్నాడు. రాముఁడు చనిపోయినతరువాత సీతను దొంగిలింపవలయునన్న యర్థ మిందు లేనేలేదు. అట్టియూహ యితనికిఁ గలుగుటకును వీలులేదు. ఈ షష్ఠీప్రయోగ మనాదరమునందు గనుక రాముడు నిరాకరింపదగినవాఁడు కాఁడని యర్థము. రామభద్రుని పరాక్రమాదులు మాల్యవంతున కంత చక్కఁగాఁ దెలియును. ఆంతరచక్షుస్సుచే నిర్ణయింపఁబడిన విషయములే జరిగి మాల్యవంతునకు విస్మయ మాపాదింపలేను.

అతఁడు పట్టి నీతివేత్తయు, మంత్రియుఁ గాఁడు–యుద్ధవీరుఁడు. విభీషణునివలె రాముని శరణుజొచ్చువాడు గాడు. తాను మంత్రియగుట నిటు రాజయుద్ధకార్యములు నడుపును. నీతిని మించివచ్చినచో యుద్ధము చేయును. ఇంద్రజిత్తుకూడఁ జనిపోయినంతనే 'సత్యోఽయ మతిదుఃఖో నిర్దుఃఖమితి లోకప్రవాదః' అని తాను కుంభకర్ణునిమృతికి మూర్ఛపడినట్లు మూర్ఛపోయిని సమర్థించుకొని రావణుఁడు యుద్ధమునకు బయలుదేరుచుండగా దానుగూడ "ఉత్థాయ తస్మాదస్మాభి రపి జరసా రజసా దూషితస్యాత్మనః ప్రక్షాళనాయ ప్రాప్తవ్యం శస్త్రధారాతీర్థమ్." అని నిష్క్రమించెను. ఇది మాల్యవంతుని చివరిమాట. జరచేత, పాపముచేతఁ దాను దూషితుఁడయ్యెనఁట. దానిని శస్త్రధారాతీర్థమునఁ గడిగివేయునట. జరచేతసరే, పాపముచేత నేమిటి? ఇది రావణమంత్రియై చేసిన దుష్కార్యము. పరమపురుషుఁడైన రాముని కెదురుగానుండక తప్పని రజోలేశము.

ఇంతటిమహాపురుషుని సృష్టి మురారి నాటకమునకు వన్నె తెచ్చినది. మురారిభట్టు తననాటకమున నింకనెన్నియో రచనావిశేషములు కనఁబఱచెను. అవి యన్నియు నీమాల్యవత్సృష్టిముం దాగుటలేదు. ఈనాటకమున చతుర్థాంకాదియందును షష్ఠాంకాదియందును రెండువిష్కంభములలో వచ్చినపాత్ర మాల్యవంతుఁడు. భూతభవిష్యద్వర్తమానకథాఘట్టములు తెలుపుట కేర్పడిన విష్కంభములయందే యిట్టిసృష్టి చేసినచో నా మహాకవి శిల్ప మేమని యభివర్ణింపవలయును? ఇంక ననేకవిషయములు వ్రాయబడలేదు. మాల్యవంతుడు శస్త్రధారాతీర్థ మవలంబించినట్లు క్లిష్టమని తలంపక మురారి వాక్తీర్థమును పాఠకులు సేవింపవలయును.

# నవయుగోదయము-తిక్కన*

నండూరి బంగారయ్య

ఒక నూత్నయుగోదయము గావింప వలెనన్న యుత్సాహము ప్రస్తుతాంధ్ర సారస్వతమున బహు సాంద్రముగ నున్నది. ఎవరికి వారే యుగకర్తల మను కొనుచున్న కవులుకూడ పెక్కండ్రు బయలుదేరు చున్నారు. ఆంగ్లవాఙ్మయమునుండియు, వంగసాహిత్య మునుండియు, హిందీభాషనుండియు అసంఖ్యాకము లగు గ్రంథములు ప్రత్యక్షముగనో, పరోక్షముగనో మన సారస్వతమునకు దిగుమతి యగుచున్నవి. ఇతరవాఙ్మయ ములలో సద్గ్రంథము లున్నప్పుడు వానిని స్వీకరించుట కెట్టియభ్యంతరము నుండరాదు. ఇతరసాహిత్యము లభి వృద్ధినందినమార్గముకూడ నిదియే. కాని కేవలము భాషాం తరీకరణమువలన నూత్నయుగోదయ మయినదనుకొనుట తప్పు. కొందరిగ్రంథములు పేరునకు స్వతంత్రములే యయ్యును భావదాస్యమునుబట్టి భాషాంతరీకరణముల కంటెను నధమము లగుచున్నవి. భాషాంతరీకరణము లలో విస్పష్టతయైనను ఉండును. ఈపరభావచోరులు స్వాతంత్ర్యధ్వజము నెగురవైచునాత్రతలో విస్పష్టతను గూడ విడాకులిచ్చుచున్నారు.

నూతనయుగోదయమునకు ముఖ్యలక్షణము స్వతంత్రప్రతిభ. సారస్వతమునకు నూతనచైతన్యము నొడగూర్పనేర్చినకవికే యుగకర్తృగౌరవము దక్కు చున్నది. యుగకర్తయగువానికి ఇదివరలో నెన్నడు నెవ్వరు నెరుగని నూతనసారస్వతశాఖను బయలుదేర దీయవలెనన్న బాధ్యత లేదు. ప్రాతశాఖలోనయినను క్రొత్తరుచులను గల్పింపనేర్చిన కవిరాజు లెల్ల యుగ కర్తలే యగుచున్నారు. కాళిదాసునకుపూర్వము సంస్కృతభాషలో దృశ్యకావ్యములు, శ్రవ్యకావ్యములు కూడ నున్నవి. కాని శాకుంతలము, రఘువంశము రచించి యాతడు కావ్యకలావైదగ్ధ్యమునకు నూతన చైతన్యము పోసినాడు. అందుచే యుగకర్త యైనాడు.

మనవాఙ్మయమున గనవచ్చు యుగకర్తలలో తిక్కన యగ్రస్థానము వహించునని కొందరి వాదము. ప్రస్తుత మీవాదముతో నందరు నేకీభవింపకపోవచ్చును. కాని మనవాఙ్మయమునందలి యుగకర్తలలో తిక్కన యొక్కడనుట కెవ్వరికి నెట్టియభ్యంతరము నుండదు. ఈతడు యుగకర్తయగుటకు తోడ్పడిన సుగుణములను గొన్నిటి నిట విమర్శించినచో దానిని బురస్కరించుకొని నూతనయుగోదయమొనరించుకొనుటకు నేకరింపవలయు సామగ్రి యెట్టిదో విశదము కాగలదు.

## స్వతంత్రప్రతిభ

కవిత్రయకృతాంధ్రమహాభారతము భాషాంతరీ కరణ మనునపవాద మొకటి ప్రచారములో నున్నది. భారతరచనము ముగిసి యిప్పటి కారుశతాబ్దములు గావచ్చుచున్నను దాని నీయపవాదునుండి తొలగించుట కెట్టిప్రయత్నములును జరిగియుండలేదు.

కావ్యదృష్టితో జూచినపు డాంధ్రమహాభార తము (కవిత్రయకృతము) స్వతంత్రకావ్య మేయని చెప్ప వలసియున్నది. దీనినిబట్టి సంస్కృతభారతముపట్ల మాకు నిరసనభావమని కాని, ఆంధ్రత్వాభిమానముచే వ్యాసుని గౌరవమును గొంచెపరుపజూచుచున్నామని కాని యూహింపరాదు. కవిత్రయకృతభారతము స్వతంత్రకావ్య మనుకొనువారికిని, భాషాంతరీకరణ మను కొనువారికిని దృక్పథమునందును కావ్యకలాదర్శము లందును భేదమున్నది.

ఇతరకవులయొద్దనుండి కథావస్తువును గాని, భావప్రపంచమునుగాని స్వీకరింపరా దను నియమము

* ౮-౨-౩౭ తేదీని రాజమహేంద్రవరమున జరిగిన తిక్కనజయంతి నుద్దేశించిన యుపన్యాసము. వ్యవధి లేనిచే జదువలేదు.

స్వతంత్రకవి కెన్నడును లేదు. కాని యితరుల యొద్ద నుండి స్వీకరించినవస్తువునకే స్వకీయప్రతిభాముద్రవైచి స్వతంత్రచైతన్యము గల్పింపనేర్చుటయే స్వతంత్రకవికి ముఖ్యలక్షణము.

శ్లో. దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్,
సర్వే నవా ఇవాభాన్తి మధుమాస ఇవ ద్రుమాః.

అను ధ్వన్యాలోకసూక్తినిబట్టికూడ యీరహస్యము విస్పష్టమగుచున్నది ఇతరకావ్యములనుండి యేమియు గ్రహించుట కవకాశము లేని యాదికవికూడ విశ్వకావ్య నిర్మాతయగు భగవంతునిసృష్టినుండి యేమియు గైకొన కుండ నున్నాడా? కథావస్తువు మొదలుకొని పాత్రీకరణ మాదిగాగలుగు కావ్యగుణములన్నియు ప్రకృతినుండి సంగ్రహింపబడినవేకదా. అంతమాత్రముచేత నాతని ప్రతిభకు భంగము వచ్చుచున్నదా?

భాషాంతరీకరణమునకు స్వతంత్రకావ్యమునకు తారతమ్యము నిరూపింపవలసినపుడు ఒక్కటేసూత్రము. ఎంతనిపుణుడయిన భాషాంతరీకర్తయయినను మాతృక యందలి స్థూలదేహమునమాత్రమే పరివర్తన మొనరింప గలడుకాని దాని యాత్మతేజము ననువదింపజాలడు. ప్రపంచమునందలి యెంతటిమనోహరములగు భాషాంతరీకరణములనుండియయినను యీసత్యమును స్థాపింపవచ్చును. దీని కొక్కటే యపవాదము. మూలగ్రంథరచనమున కవి కెట్టియావేశము తోడ్పడినదో అట్టియావేశమే భాషాంతరకారునకు లభించినపుడు భాషాంతరీకరణముకూడ స్వతంత్ర చైతన్యముతో నలరారును. అనగా నిరహం భావుడగు కవి నావహించి మూలగ్రంథమును రచింపజేసిన చిచ్ఛక్తియే భాషాంతరీకర్తనుగూడ నావహించి భాషాంతరీకరణమును నిర్వహించుచున్న దనినమాట. అయినచో దానిని స్వతంత్రగ్రంథమందుమా, భాషాంతరీకరణ మందు ?

మనకు దెలిసినంతవర కిట్టియపురూప స్వతంత్ర కావ్యము కవిత్రయకృతాంధ్ర మహాభారత మొక్కటియే. ప్రకృతము తిక్కననుగూర్చి ముచ్చటించుకొను చున్నాము గదా. వ్యాసునిపట్ల నీతని కఖండభక్తి యున్నది. అదియును క్రింద వివరింపబోవుచున్నాము. కాని యీతడు స్వతంత్రప్రతిభగల మహాకవి. ఈ యంశమును నిరూపించుటకు ఆంధ్రమహాభారతమును సంస్కృత మహాభారతముతో సాకల్యముగ సరిపోల్చి ననేకాని వలనుపడదని కొందరి యభిప్రాయము. మేము దీనితో నేకీభవింపము. తిక్కన స్వతంత్రప్రతిభను నిరూపించుట కాతని యాంధ్రమహాభారతమునందలి చైతన్యమే ప్రధానసాక్ష్యము. ఏపట్టు జూచినను దివ్యమగు స్వతంత్రతేజముతో నలరారుచున్నది. శివుని జటాజూటమున జాహ్నవి యవతరించినట్లు తిక్కనకృతాంధ్ర మహాభారతమున కవితాప్రతిభ మూర్తీభవించినది.

సంస్కృతమహాభారతముతో తిక్కన కృతాంధ్రమహాభారతమును పోల్చిచూచుటవలనగూడ సాహిత్యోపాసకులకు కొన్నియమూల్య రహస్యములు గోచరింపగలవు. కథ వ్యాసునిదే. రాజనీతి ఉత్తమనీతి వేదాంతము అన్నియు వ్యాసునివే కావ్యమునకు వలయు రసపోషణము పాత్రీకరణము మున్నగుగుణములలో కూడ వ్యాసుడే మార్గదర్శకుడు. కాని సంస్కృతాంధ్ర మహాభారతములను సరిపోల్చిచూచినచో తిక్కన మహాభారతమున కెట్టిమహత్తరమయిన సేవ యొనర్చినదియు విస్పష్టము కాగలదు. మూలములో నున్న కావ్యమాహాత్మ్యము నెక్కడను విడువకుండ తిక్కన తనమహాభారతమును మూలమునకు వ్యాఖ్యానప్రాయముగ నొనర్చుటయేగాక మానుషస్వతంత్రగుణములచే దానికి నవవికాసమును జేకూర్చియున్నాడు. అందు మొదటి గుణము అద్వితీయమగు శైలి. తిక్కనశైలిలో వ్యాసుని పోకడలును ఉన్నవి; నన్నయపోకడలును ఉన్నవి. తనకు పూర్వ ముండిన మహాకవుల మాహాత్మ్యమును గ్రహించి లాభముపొందకుండుట యెన్నడును స్వాతంత్ర్యమునకు లక్షణముకానేరదు మీదుమిక్కిలి అది యహంభావమునుమాత్రమే సూచించును. వ్యాసవాల్మీకులవలన కాళిదాసు లబ్ధిని పొందియుండలేదా? ఎట్టి మహోత్కృష్టప్రతిభాశాలియు తనకు పూర్వముండిన కవులను గౌరవించి (గౌరవించుటయనగ వాక్కులచేతనేకాదు, క్రియారూపముగ వారిగుణములను స్వీకరిం

చుటమూలమున గూడను) వారు పోయినదానికంటె ఇంకొక్కఅడుగు ముందుకు పోజాచుచుండెను. అందుచే శైలిలో నన్నయ్యవలన వ్యాసునివలన తిక్కన లబ్ధిపొందినను వారిశైలికి విభిన్నముగ ఆతని శైలియం దొకవిశిష్టత్వ మున్నది. యతిప్రాసలసహజగతులు, భావమును బట్టి విశ్రాంతి, పాత్రముల మానసికస్థితినిబట్టి, సన్నివేశమునుబట్టి శైలియొక్క ఆరోహణావరోహణగతులు, రసోచితసంస్కృతాంధ్రపదప్రయోగము, వాక్యనిర్మాణచాతుర్యము మున్నగు నాతని విశిష్టలక్షణములనెల్ల సంకుచితపరిమాణముగల యీ వ్యాసమున వివరించుట కవకాశము లేదు. తిక్కన చూపిన రెండవ స్వతంత్రగుణము అపురూపమగు స్వరూపసౌష్ఠవము. తారుమారయిన వేదములను విభాగించి వ్యాసుడు వేదములకెట్టి సేవ నొనర్చినాడో తిక్కనకాలమునకే ప్రక్షిప్తమయమయి స్వరూపసౌష్ఠవమును గోల్పోయిన మహాభారతమును తిక్కన సంస్కరించిదానికిఒకచక్కనిస్వరూపమును ప్రసాదించి యున్నాడు. తిక్కనకునుతిక్కనతెనుగుకవులకును కీగుణమునందుచాలతారతమ్యమున్నది. ఏకథనయినను, ఏయుపన్యాసమునయినను, ఏసంభాషణమునయినను పూసగ్రుచ్చినట్లు దిద్దితీర్చుట తిక్కనకు సంప్రదాయము. అసంబద్ధ విషయములను పరిహరించుటయు, సంబద్ధమగు విషయములనయిన ఒకదానితో నింకొకదానికి జత కలిపి ఒకదానినుండి వేరొకటి యుద్భవించునట్లు చేయుటయు, ఏభాగమున కెంతప్రాధాన్య మీయవలయునో గ్రహించి అంతమాత్రమే యిచ్చుటయు తిక్కనలో తక్క మరి యే యితరాంధ్రకవియందును గానరావు. అందుచేతనే తిక్కనకాలమునాటికే మహారణ్యమువలె పెరిగిపోయిన సంస్కృతమహాభారతమున తిక్కన నిరుపయోగములగు భాగములను ఛేదించి తిక్కనభాగములకయినను ఆకారవైభవమును గల్పించి యామహారణ్యమును తనచేతిలో మహోద్యానముక్రింద మార్చినాడు. ఈయభిప్రాయమునే కీర్తిశేషులగు శ్రీకొమర్రాజు వేంకటలక్ష్మణరావుగా రింకొకవిధముగ వ్రాయుచు సంస్కృతమహాభారతము బంగారపు ముద్దవంటిదనియు, తిక్కనకృతాంధ్రభారత మాబంగారపు ముద్దనుండి యిచ్చవచ్చినంత బంగారమును గైకొని స్వర్ణకారుని బుద్ధివైభవముచే జేయబడిన సువర్ణకమలమువంటిదనియు ఉభయభారతములను సాకల్యముగ జదివినచో నీతారతమ్యము గోచరించుననియు తమ హిందూమహాయుగమున వ్రాసియున్నారు.

తిక్కనభారతకావ్యమున కుపాయనముగ సమర్పించిన మూడవగుణము పాత్రీకరణము. ఈ పాత్రీకరణమున సంస్కృతమహాభారతకారుడు తిక్కన చేయి కాదు. తిక్కనకు మార్గదర్శకములయిన యమూల్యగుణము లెన్నియో మూలమునగూడ కానవచ్చును. కాని రానురాను సంస్కృత భారతము పట్ల స్వాతంత్ర్యము వహించిన మహామహులు ఈపాత్రీకరణమును పూర్ణముగ విస్మరించి తమ యిష్టమువచ్చిన యుదంతములను ఉపగాథలను పాత్రీకరణమునకు భంగకరముగ చొప్పించిరి. దానిచే మూలమున నున్న పాత్రీకరణ రహస్యములు పెంటకుప్పలో నడగిన రత్నములవలె శోభింపకపోయినవి. తిక్కన యీ రత్నములనన్నిటిని ఏర్చి స్వార్జితములగు నసంఖ్యాక రత్నముల జేర్చి అన్నిటిని ఒక రమణీయ మయిన హారముగ గూర్చెను.

ఇట్టి యమూల్య కావ్యగుణములున్న మహాకవి స్వతంత్రకావ్యమున కేల గడంగలేదను సందియము పెక్కురను బాధింపవచ్చును. కాని తిక్కన నిరహంభావుడు. ఆతడు తన కీర్తినే ప్రధానముగ జూచుకొని మహోద్యమమునకు భంగము తెచ్చువాడు కాడు. భారత మాహాత్మ్యము నాతడు గ్రహించినంత గాఢముగ నెవ్వరును గ్రహింపజాలరు. "ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు" గల్గిన యిట్టి వాఙ్మయ ప్రపంచమును ఆంధ్రజాతికి ప్రసాదించుటకంటె తాను చేయదగిన పవిత్రమయిన దేశసేవ యింకొకటి యుండదని యాతడు గ్రహించినాడు. అందుచే తన ప్రతిభనంతను భారతసేవకయి వినియోగించినాడు. ఇట్లొనరించుట కెంతటి మహోదారస్వభావ ముండవలెను? ఎంతటి అధ్యాత్మవిద్యాపరిణతి యుండవలెను?

14, 3- 2 33

భారతరచనము తిక్కనజీవితములో యాదృచ్ఛికోదంతము గానేరదు. తనకు జ్ఞానమువచ్చినదియాదిగ తిక్కనకు భారతముమీద నఖండగౌరవ ముండియుండవలెను. వేదములకంటెను నది యాతనికి ప్రామాణిక గ్రంథమయినది. ఇట్టిగ్రంథమును "తెనుగుబాస వినిర్మించుట" యనిన నెంతకష్టసాధ్యమో యాతడు గ్రహించినాడు. దానికయి యధికారమును సంపాదించుకొనుటకయి యాతడు తనజీవితమునెల్ల వినియోగించినాడు. స్వీయజీవిత మను క్షీరసాగరమును మథించిమథించి ఆతడీ భారతామృతమును సంపాదించి యాంధ్రులకందిచ్చినాడు. అందుచేతనే భారతరచనమును తనజీవితమునకు "భవ్యపురుషార్థతరుపక్వఫల"మని పేర్కొనుచున్నాడు.

భారతరచనమునకును తిక్కనజీవితమునకును సిద్ధించుచున్న సమన్వయమును బురస్కరించుకొనియే ఆతనిభారతము లోకోత్తరగ్రంథరాజ మయినది. మహాత్ముడేగాని మహాకావ్యమును వ్రాయజాలడని యుత్తమ విమర్శకుల సిద్ధాంతము. "నానృషిః కురుతే కావ్య" మనిగదా మన ప్రాచీనాలంకారికులమతము కూడను. తిక్కనకున్న యుత్కర్తృత్వగౌరవము చాలవరకు భారతరచనముచే సిద్ధించినదే. అందుచే భారతరచనమునకు తోడ్పడిన యాతని వ్యక్తిగతవిశేషముల నించుక సావకాశముగ సూచించుట యనుచితము గానేరదు.

భారతమునం దెంత సర్వతోముఖమాహాత్మ్య మున్నదో తిక్కనజీవితమునందును అంతటి సర్వతోముఖమాహాత్మ్య మున్నట్లు నిరూపించుట కాధారము లున్నవి. మనలో పూర్వము కవిజీవితములు వ్రాయునాచారము లేకుండుటచే కాళిదాసు, భవభూతి మున్నగుమహాకవులనుగూర్చి వారి కులగోత్రములు తెలిసికొనుటకయిన నవకాశము లేకుండనున్నవి. కాని మన యదృష్టవశమున తిక్కననుగూర్చి కొంతయెక్కువగనే ఆతని స్వరూపస్వభావాదులు తెలిసికొనుట కవకాశము గానవచ్చుచున్నది. దీనికి ముఖ్యాధారములు భారతావతారికయు, ఆశ్వాసాద్యంతపద్యములును, కేతనకృత దశకుమారచరిత్రమును. అన్నిటికంటెను దశకుమారచరిత్రము నుండి విపులాంశములు దెలియవచ్చుచున్నవి.

దశకుమారచరిత్రమున తిక్కనవంశము దీర్ఘముగ వర్ణితమైనది. దానినిబట్టి తిక్కన సద్వంశమున జన్మించినాడని నిశ్చయింపవచ్చును. తాత మంత్రిభాస్కరుడు. శాపానుగ్రహశక్తియుక్తుడు. తండ్రి కొమ్మనదండనాథుడు సాంగవేదవేది. పితృవ్యపుత్రుడు సిద్ధయతిక్కన. ఈతనికే ఖడ్గతిక్కనయని కూడ ప్రసిద్ధిగలదు. తన యేలికనిమిత్తము ప్రాణములర్పించిన త్యాగధనుడు, శూరాగ్రేసరుడు.

తిక్కన రూపసియైయుండవలెను. "అభిరూపభావభవు"డని కేతన వర్ణించినాడు. పెక్కుసారు లిట్టి విశేషణములచేతనే యాతనిరూపము వర్ణితమయినది. ఇందు కవిజనసహజమగు నతిశయోక్తి కవకాశ మున్న మున్నదన కొందమన్నను కవిబ్రహ్మ నంటి యుక్తాయుక్తవిచక్షణశీలున కంకిత మిచ్చునపుడు కేవలము కురూపిని మన్మథవిగ్రహుడని వర్ణించినచో ఆతని కనుగ్రహమునకుమా రాగ్రహము రావచ్చునను భయము కవి కుండును గదా. కులక్రమాగత మయిన మంత్రిపదవి తిక్కనకు లభించినది. ఆతడు సామాన్యసచివునివలె గానరాడు. ఈతని ప్రభువగు మనుమసిద్ధి కీతని యెడనున్న యభిమానము ననుగ్రహమని పేర్కొనుటకంటె భక్తియని పేర్కొనుట యెక్కుడుచితముగనుండునేమోయని ఈ క్రిందిపద్యమువలన నూహింపదగును.

క. ఏ నిన్ను మామ యనియెడు
దీనికి దగ నమ్మ భారతీకన్యక నా
కీనర్హుడవగు దనినను
భూనాయకుపలుకు చిత్తమున కింపగుడున్.

మామగారిపట్ల నల్లునికున్న భావ మనుగ్రహ మనుటకంటె భక్తియనుట సముచితము గదా. పైగా సాధారణముగా కవులపలుకులు భూనాయకున కింపుగనుండవలసినది పోయి భూనాయకునిపలుకు కవి కనుగ్రహపాత్రమైనదట! మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడుకాగా గణపతిదేవచక్రవర్తికడ కేగి దక్షిణహిందూదేశము నేలు నా సార్వభౌముని తనపాదాక్రాంతునొనర్చుకొని ఆతనిసాహాయ్యమున రాజునకు రాజ్యము సంపాదించియిచ్చె ననుకథ

యొకటి సోమదేవరాజీయమునందును, సిద్ధేశ్వరచరిత్రము నందును గనవచ్చుచున్నదిగదా. ఎన్నిరాయబారములు నడపకున్నచో సంజయరాయబారమును, కృష్ణరాయబారమును అంతసమర్థతతో వ్రాయగలడు ?

ఇన్ని రాజ్యాంగతంత్రములలో నిమగ్నుడయి యున్నను విద్వద్గోష్ఠి, సారస్వతగోష్ఠి యాతడు మానినవాడు గాడు.

క॥ కృతులు రచియింప సుకవుల
కృతు లొప్పుగ గొనగ నొరునికిం దీరునె వా
క్పతినిభుడు వితరణశ్రీ

యుతుడన్నమసుతుడు తిక్కడొకనికిదక్కన్.

అని కేతన వర్ణించియున్నాడు. తిక్కన వేదవేదాంగవేత్త యని నిరూపించుటకు "వేదాదిసమస్తవిద్యాభ్యాస విభాసి" (ఆ. ౧౫, ప. ౮) "సకలాగమార్థతత్త్వవిచారోదారుడు" (ఆ. ౨, ప. ౧౯౯) "నానావేదవేదాంగతత్త్వజ్ఞనకు" (ఆ. ౫, ప. ౧౩౬) అను దశకుమారచరిత్రమునందలి విశేషణములు సాక్ష్యములు. భారతమునందలి యాశ్వాసాంతపద్యములు సాక్ష్యములు. భారతములో తిక్కన రచించిన యుపన్యాసముల రామణీయకత ననుసంధించినవారి కాతడు మంచి వక్తయై యుండవలెనని పొడకట్టక మానదు. దశకుమార చరిత్రమున "వచస్సమగ్రతాచతురాస్యుక్" (ఆ. ౬, ప. ౧౯౫) "సరసమధురవాణీ సవ్యభవ్యప్రభావా" (ఆ. ౧౧, ప ౧౨౮) ఇత్యాదివర్ణనముచే పైయూహ స్థిరపడుచున్నది. "అనితరగద్య వాఙ్మయ మహార్ణవవర్తన కర్ణధార" యని యొకచోట కేతన తిక్కనను సంబోధించియున్నాడు. దీనినిబట్టి సామాన్యముగ గోచరముకాని వాఙ్మయసారస్యమును, వాఙ్మయ రహస్యములను తిక్కన గ్రహించి యితరులకు విపులీకరించుటలో నిపుణుడని తేలుచున్నది. దీనికి తార్కాణముగ మారనమహాకవి "తిక్కనసోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీపాత్రుడ"నని చెప్పుకొనుచున్నాడు.

కేవలము వేదవేదాంగవిదులు, కావ్యగోష్ఠీప్రియులు తరచు కడుపులోని చల్ల కదలకుండగ నింటగూర్చుండు స్వభావముగలవారయియుందురు. కాని తిక్కన యుద్ధవర్ణనలు చదివినవారికి రణరంగమున నాతనికి స్వానుభవము లేనిదే యిట్టి వర్ణనలు సాధ్యపడవని బోధపడును. కాని కావ్యవర్ణనలనుండి కవిగుణ మూహించుట ఒకప్పుడు ప్రమాదభూయిష్ఠము. తాము చూచినదానిని, భావించిన దానినికూడ అనుభవమున్నట్లుగ వ్రాయగల నేర్పు కవుల కుండును. అయినను తిక్కన తండ్రి తాతలందరును దండనాథులు, శూరాగ్రేసరులు నగుటచే నాతడుకూడ యోధాగ్రేసరుడని యూహించుట యనుచితము గానేరదు. ఊహలపొంత బోనేల? కేతన స్పష్టముగ "తిక్కదండాధీశా" యనియు, "తిక్కచమూపా" యనియు సంబోధించుచుండగ నింక సందేహమున కవకాశము లేదుగదా?

సాధారణముగా యుద్ధవీరులకు నైష్ఠికులకు చుక్కయెదురు. యుద్ధములకు బోవలయువారికి ఒకవిధముగు స్వైరవిహారము సాంప్రదాయికము. కాని తిక్కన పరమనైష్ఠికుడు "వైదికమార్గ నిష్ఠమగు వర్తనమెంతయు దగ నిర్వహించుచున్" అని భారతమున తిక్కన తన్ను గూర్చి వ్రాసికొనినాడు. ఇదిగాక "సోమయాజి" యను బిరుదమువలనగూడ నతడు నైష్ఠికుడయినట్లు పొడకట్టుచున్నది. దశకుమారచరిత్రముకూడ ఈతని నైష్ఠికత్వమును పదేపదే పొగడుచున్నది.

"మహితదక్షిణలైన బహువిధయాగంబు
లొనరించుననుట వర్ణనముదారి"

తిక్కన అష్టాంగయోగమనబడు రాజయోగము నభ్యసించియుండవచ్చుననుటకు కొన్ని యాధారములు గనవచ్చుచున్నవి. భారతమునందలి యాశ్వాసాద్యంత పద్యము లెక్కుడుగ జ్ఞాని జనహృద్యములుగ నున్నను నడుమనడుమనున్న "నాసాగ్రనివాసరసిక" "నాదామృతధారాసారరూప" "హంసనాదైకవేద్యా" "నిజతనువిభవతోద్వేల్లనిర్మలనాచ్ఛిన్ననాదా" ఇత్యాది సంబోధనలను బట్టి యాత డష్టాంగయోగము నభ్యసించె ననదగియున్నది. దీనికితోడు

మాలిని. అవగమితరహస్యాంగసమ్యక్ప్రకారో
త్సవ గురుకరుణావిస్తారగాఢ ప్రశాంతి
ప్రవణహృదయపద్మోద్భాసివిజ్ఞానసారా

అని యుద్యోగపర్వము చతుర్థాశ్వాసము (ప. ౪౨౫) న స్పష్టముగ నున్నది. రాజయోగమునుగూర్చిన యే గ్రంథమయిననుచదివికూడయిట్టివిశేషణము లుంచుట కవకాశ మున్నది కాని జీవితమునంతను బ్రహ్మానంద సంపాదనమునకు వినియోగించిన తిక్కన యీ యోగము ననుభవమునకు దెచ్చికొనుటకు యత్నించె ననుకొనుటయే ఎక్కుడు సమంజసముగా నుండును.

నైష్ఠికులలో పెక్కురకు ఒకవిధమగు ఛాందసము నహంభావము ప్రబలి "నాన్యదస్తీతి" వాదులగు చుందురు. యజ్ఞాదినిష్ఠలవలన సాధింపదగుగమ్యము నిరహంభావత్వము, ఉత్తమజ్ఞానమని వారు మరచిపోవుచుందురు. తిక్కన యట్టి వేదవాదరతుడు కాడు. కర్మముల మూలమున జ్ఞానము సాధింపవలెనని యాతని యాశయము. ఆతడు జ్ఞానయోగియైనట్టుల భారతాశ్వాసాంత పద్యములే చాటుచుండును. గద్యములో నాత డుపయోగించుకొనిన "బుధారాధనవిరాజి" అను బహుమనోహరమయిన విశేషణమే యాతని వినయసంపత్తిని జ్ఞానాసక్తిని వేనోళ్ల జాటుచున్నది. ఎట్టి వివేకవైభవునకు పెద్దలసేవ చేయనిదే వేదాంతరహస్యములు పట్టుబడవు. తిక్కన పెద్దలసేవవలనను, నిరంతరజ్ఞానయోగాభ్యాసము వలనను జీవన్ముక్తిబడసిన ట్లూహించుటకు భారతమున విరాటపర్వమునం దున్న కృత్యాదిపద్యములలోని స్వప్న వృత్తాంతమే సాక్ష్యము. దానివలన పరమేశ్వరానుగ్రహమున నాతడు "బ్రహ్మానందస్థితిని" బడసినట్లు ద్యోతమానమగుచున్నది. ఈస్వప్నవృత్తాంతము తరువాతికావ్యములలో గనవచ్చువానివలె పూర్వానుకరణము గాదు. పోనిండు. స్వప్నమునందు పూర్ణముగ విశ్వాస ముంచక పోయినను "బ్రహ్మానందస్థితిని" పొందుట తిక్కన జీవితాశయమైన ట్లూహించుటకయిన వీలిచ్చుచున్నది గదా. ఆతడు సిద్ధపురుషుడనుటకు మానసకృతమయిన యీక్రింది పద్యము అన్నిటికంటెను ప్రబలసాక్ష్యము.

చ. ఉభయకవిత్వ తత్త్వవిభ
వోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా
ప్రభు బుధబంధు భూరిగుణ
బంధుడు భారతసత్కథా
విభుపరతత్త్వకోవిదు
నవీనపరాశరసూను సంతత
త్రిభువనకీర్తనీయయశు
తిక్కకవీంద్రుని గొల్తు నర్థితోన్.

అని "పరతత్త్వకోవిదు"డనియు "నవీనపరాశరసూను"డనియు వాకొనుచున్నాడుగదా.

భారతావతారికలో తిక్కన తాను "పదస్థుడనై" భారతము వ్రాయుచున్నట్లుగ నుడివియున్నాడు "నీ కరుణ నిట్లు పదస్థుడనైతి" "ఇట్టి పదంబు గాంచి" ఇత్యాది ప్రదేశములలోని "పదము" అను శబ్దమున కర్థమేమో విచారింపకుండ మనము భారతమును తిరుగవైచుచుందుము. "పదము"నగా నధికారమని యర్థము. భారతము వ్రాయవలసినదిగ భగవంతుడు తిక్కనకు 'ఫర్మానా' యిచ్చినాడు. ఈశ్వరదత్తమగు నధికారముద్ర చేతబట్టుకొని యాతడు భారతము వ్రాసినాడు గావుననే తరువాత నెన్ని భారతములు వచ్చినను ఆతని భారతమును త్రోసిరాజనలేకపోవుచున్నవి.

ఆభిజాత్యసంపన్నుడు, రూపసి, అమాత్యశేఖరుడు, వేదవేదాంగవిదుడు, పరమనైష్ఠికుడు, దండనాథాగ్రణి, పరతత్త్వవేత్త, కవిబ్రహ్మ ఇక లోటేమి? ఇంత సర్వతోముఖమాహాత్మ్య మున్నది గావుననే ఆతడు భారతము నతిలోకసౌందర్యముచే నలంకరించి యాంధ్రావళి నెన్నటికి తీరని యప్పులో ముంచినాడు. ఆంధ్రసారస్వతమున అనన్యసాధ్యమగు యుగమునకు కర్తయైనాడు. నేడు యుగపురుషులు కాదలచినవారు ఈ మాహాత్మ్యములో గొంతయైనను సేకరించుకొనవలదా?

## ప్రాచీన కవిభక్తి

తిక్కనయొద్దనుండి నవయుగనిర్మాతలు ముఖ్యముగ నేర్చుకొనదగిన సుగుణము ప్రాచీనకవిభక్తి. మన యువకులలో గొందరు ప్రాచీనకావ్యములను చదివి వానిసుగుణముల గ్రహించుట తమప్రతిభకు భంగమనుకొనుచున్నారు. ఇది మిగులపొరపాటు. ముందుకు దూకదలచినవా డొకయడుగు వెనుకకువైచుట యెంతయావశ్యకమో సారస్వతమునకు నూతనవైభవము సంతరింపనెంచు

వారు దాని ప్రాచీనవైభవము నెల్ల గరతలామలకముగ దెలిసికొనుట అంతయావశ్యకము. నూతనరాజ్యాంగ నిర్మాణ మొనరింప నెంచునారు ప్రాచీనరాజ్యాంగపద్ధతులను బాగుగ బరిశీలింప నక్కరలేదా?

ప్రాచీనకవులపట్ల తిక్కనకుగల భక్తి భారతమున సువ్యక్తమగుచున్నది. నిర్వచనోత్తర రామాయణమున సంఘవాచకముగ "నాదికవీంద్రుల" స్తుతించినాడుగాని ప్రత్యేకించి యెవ్వరిని బేర్కొనియుండలేదు. కాని భారతమున గృష్ణద్వైపాయనుని, నన్నయభట్టును స్తుతించి ప్రాచీనకవిభక్తి బ్రకటించినాడు.

కృష్ణద్వైపాయనుని పూర్వకవిగ తిక్కన స్తుతించినాడనుకొనుటకంటె గురుదైవముగ గణించి స్తుతించినాడనుకొనుట యుక్తము. అవతారికలో "విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞానసంపద్విఖ్యాతుడు" ఇత్యాది విశేషణములచే స్తుతించుటయేకాక ఇంచుమించుగ ప్రత్యాశ్వాసాదిని ఆశ్వాసాంతమునగూడ వ్యాసస్తవమున్నది. తనయిష్టదైవమగు హరిహరనాథుని సంబోధించుచు "సాత్యవతేయ భారతీప్రోక్త" "వ్యాససమాసైకరూప" "వ్యాసాదిమనోనివాస" "సాత్యవతేయ వాఙ్మయ విశాలగృహస్ఫురిత ప్రదీపికా" "ప్రకట మహార్థ సౌరభ పరాశరనందన వాక్యమంజరీ ప్రకరసమర్చితా" అని పదేపదే వ్యాసుని బేర్కొనుచున్నాడు. నవీన విమర్శకులు కొందరు వ్యాసుడను నొకకవి యెన్నడును లేనేలేడనియు, వ్యాసుడనగ నొక పీఠాధికారియనియు నేమేమో వింత వింతవాదములు బయలుదేదీయుచున్నారు. ఈ వాదముల సత్యాసత్యము లెట్లున్నను తిక్కనమాత్రము వ్యాసుడను నొకవ్యక్తి యున్నట్లును, ఆతడు భారతమును రచించినట్లును నమ్మియున్నాడు. ఈవ్యాసుని ఎన్నడో నివసించి చన్నవ్యక్తి యనుకొని తిక్కన పూజించినాడనుటకంటె ననవరత ప్రత్యక్షమగు తేజముగ భావించి పూజించెననుట మరింత యుక్తమగనుండును. "వ్యాసో నారాయణో హరిః" యనినట్లు నారాయణునకు వ్యాసునకు నభేదమనియే కవిబ్రహ్మభావము ఇంతయఖండగౌరవ మాతడు చూపుటకు బ్రహ్మసూత్రములకూడ గొంతవరకు హేతువయి యుండనోపునుగాని ముఖ్యకారణము భారతమే. ఏలయన తత్త్వతః తిక్కన కవి. కవికి కవిపైనున్న గౌరవము ఇతరత్ర నుండదు. నిత్యము "కావ్యరసము నానియాడుచు" "కలితతత్త్వ నిరతిశయానుభావానందభరితాంతఃకరణు" డగు తిక్కనకు భారతకావ్యకర్తకంటె పూజనీయు డెవడుండును? అందుచేతనే "సాత్యవతేయ సంస్మృతిశ్రీవిభవాస్పదమయిన" చిత్తముతో భారతమును వ్రాయుచున్నానని వాకొనినాడు. ఒక్క కావ్యముగ మాత్రమేగాక తిక్కన జీవితమునకు భారతము ఏడుగడయైయుండవలెను. మంత్రియైన యాతని రాజకీయ జీవితమునకు, దండనాథుడయిన యాతని రణరంగ జీవితమునకు, సోమయాజియైన యాతని నైష్ఠిక జీవితమునకు, పరతత్త్వకోవిదుడైన యాతని యధ్యాత్మ జీవితమునకు భారతమే పట్టుగొమ్మయి యుండవలెను. నిర్వచనోత్తర రామాయణ రచనాకాలమునకు "మహేశ్వరాంఘ్రిక మలధ్యానైకశీలు" డయిన తిక్కన దశకుమారచరిత్రము నాటికి "చిత్తనిత్యస్థిత శివు"డైన తిక్కన భారతరచనాకాలమునకు "హరిహరనాథభక్తు డగుట" చూడగ శివకేశవులయందలి యభేదభావము సిద్ధించుటకు భారతమే కారణమేమో యని యూహింపదగియున్నది. శివకేశవుల యభేదత్వమును బ్రకటించు ఘట్టములెన్నో భారతములో నున్నవికదా!

తిక్కన వ్యాసునిపట్ల చూపిన భక్తికంటె నన్నయభట్టుపట్ల చూపిన భక్తి మిగుల ప్రశంసాపాత్రమగుచున్నది.

ఉ. ఆదరణీయ సారవివి
    ధార్థగతిస్ఫురణంబు గల్గి, య
ష్టాదశపర్వనిర్వహణ
    సంభృతమై పెనుపొందియుండు నం
దాది దొడంగి మూడు కృతు
    లాంధ్రకవిత్వవిశారదుండు, వి
ద్యాదయితుం డొనర్చె మహి
    తాత్ముడు నన్నయభట్టు దక్షతన్.

తుదిరెండుపాదములలోను నన్నయభట్టును స్తుతించి నాడు. ఈ స్తుతి నిజముగ నన్నయభట్టుపట్ల నెక్కుడు గౌరవమును చూపుట లేదనియు, ఇందుంచిన విశేషణము లనుబట్టి తిక్కనకు నన్నయపట్ల కొలదిగౌరవము మాత్రమేయున్నదని యూహించుచు కవకాశ మున్న దనియు కొందరు వాదింపజూచుచున్నారు. ఇంతకంటె విపరీతసిద్ధాంతము మరియొకటి యుండబోదు. "విద్యా దయితుండు" అనుటలో నన్నయపాండిత్యప్రశంస. "మహితాత్ముడు" అనుటలో పవిత్రజీవితమునకు జోహారులు. "ఆంధ్రకవిత్వవిశారదుండు" అనుటలో కవితాప్రశంస. "నకుతన్" అనుటలో తాను మరల నన్నయరచించినభాగమును స్పృశింపకుండుటకు హేతువు సూచితము. ఇంతతక్కువసంఖ్యగల మాట లలో నింతఎక్కువగ తెనుగున మరియేకవిని ఇంకొకకవి స్తుతించుట గానము. నన్నయకవిత్వము సంస్కృత సమాసభూయిష్ఠమనియు, "తుమువులు" తీసివైచినచో నది సంస్కృతమే యగుచున్నదనియు, ఆతనికి తెనుగు కవిత్వసంప్రదాయము తెలియదనియు వాదించు విమర్శ కాగ్రేసరుల వాదమునకు ఉభయకవిత్వతత్త్వవిదుడయిన తిక్కన యుపయోగించిన "ఆంధ్రకవిత్వ విశారదుండు" అనువిశేషణము ఈశ్వరవేదు. ఆంధ్రకవిత్వతత్త్వమును లెస్సగ నెఱిగినవాడను వాచ్యార్థమటులుండగ ఆంధ్ర కవిత్వమునకు శారదావిగ్రహ మను వ్యంగ్యార్థముకూడ ఇందున్నది. ఒక్కతిక్కన మాత్రమేగాక తిక్కన శిష్యుడగు మారనయు నాచనసోముడగు కేతనయు నన్నయ నెన్నోవిధముల స్తుతించియున్నారు. తిక్కనకు నన్నయభట్టుపట్ల నిజమగు గౌరవమే లేకయుండినచో నాతని కేమికోపమువచ్చునోయని ఆతని యనుగ్రహము నాశించిన మారనాదులు నన్నయను స్తుతింపక మూకీభావము వహించియుందురుగదా! మరియు నన్నయను స్తుతించుటలో మారన

ఉ॥ సారకథాసుధారస మ
 జస్రము నాగళపూరితంబుగా
నారగ గ్రోలుచున్ జనులు
 హర్షరసాంబుధి దేలనట్లుగా
భారతసంహితన్ మును ద్రి
 పర్వము లెవ్వ డొనర్చె నట్టి వి

ద్యారమణీయు నాంధ్రకవి
 తాగురు నన్నయభట్టు గొల్చెదన్.

అనుటలో తిక్కనవాడుపయోగించిన "విద్యా దయితుండు" అనుపదమునకే పర్యాయపదముగ "విద్యా రమణీయు" డనుపదమును వాడినాడు. "ఆంధ్రకవితా గురు"వనుటకంటె ఉత్తమప్రశంస యుండదుకదా. తిక్కన తనకడకు సాహిత్యరసపిపాసువులయి వచ్చినవారికెల్ల నన్నయభట్టుకవిత్వముపట్ల నఖండగౌరవము గలిగించుచు వచ్చినాడనుట కింతకంటె ప్రబలసాక్ష్య మేమి వలయును?

కేవలము వాక్యరూపముగనేగాక క్రియారూపముగ కూడ నన్నయను తిక్కన గౌరవించినాడు. తనకీర్తియే ప్రధానముగ చూచుకొనిన యహంభావశీలుడే యైనచో తిక్కన భారతమును మొదటిమూడుపర్వములుకూడ తానే వ్రాసి "భారతరచనమునకుమూడువందలయేండ్లు పట్టిన" దని ప్రస్తుతకాలమున వచ్చిన యపవాదున కవకాశము లేకుండజేసియుండును. కాని సమగ్రుడగు నొకమహాకవి తనకుపూర్వము నిష్కళంకముగను, మిదుమిక్కిలి బహు రమణీయముగను రచించిన గ్రంథమును- గ్రంథమును కాదు, గ్రంథభాగమును- మరల తాను రచియింపబూనుటలో నర్థములేదని యాతడు గ్రహించినాడు. గ్రంథమున కంతకు నైక్యత చేకూర్చుటకు నన్నయ రచించిన గ్రంథభాగమును తిక్కన మరల రచించినను తప్పు పట్టుట కవకాశ ముండెడిదికాదు. కాని నన్నయకవిత్వమునెడల నిజమయిన గౌరవము కలవాడగుటచే నాతడందుల కియ్యకొనలేదు.

అంతేకాదు. సారస్వతాభివృద్ధి నాశించిన కవీంద్రుడెవడయిన సుడుగుడుగుంచముగ -వ్రాసిన కావ్యమునే మరల వ్రాయుటలో నర్థములేదని యాత డెరుగును. తొమ్మిది శాకుంతలములు, పది మేఘసందేశములు పదునారు ఉత్తరరామచరిత్రములు బయలుదేరుచున్న యీ కాలమునందలి కవీశ్వరులు తిక్కనచరిత్రమును గుణపాఠముగ గ్రహింపదగును. నవీనకాలానుగుణముగ నవీనుల జీవితమును బరీక్షించి ఇప్పటి విశ్వవిశాలదృష్టి, ఇప్పటి మతవైవమ్యములు, సోషలిజమ్ క్యాపిటలిజమ్ మున్నగు నిప్పటియుద్యమములు, సైన్సులో నిప్పటియభివృద్ధి అన్నియు ప్రతిఫలించునట్లుగ నవీనకావ్యములు

వ్రాయుట యుక్తము అందుకు ప్రతిభ లేకపోయినపు డెంతసేపును ప్రాచీనకాలమునందే అరేబియా యెడారి లోని యుష్ట్రపక్షివలె తలదూర్చి సారస్వతమునకు నవ నవాభివృద్ధి లేకుండ జేయుచుందురు. తాము మహాకవు లమని తమకు దామగను తమకంటెను వివేక హీనులయి తమచుట్టును జేరిన మరికొందరును పుష్కాభినందనములతో సంతృప్తి వహించుట తప్ప ఈ చర్విత చర్వణ గ్రంథరచనకు సార్థక్యము గానరాదు. మనము ప్రాచీనకావ్యములను జదించుటయందలి మాహాత్మ్యమును గ్రహించి అందలి సారస్వత రహస్య ములను సేకరించుకొని తదనుసరణముగ గాని, లేక వాని కంటెను విశిష్టములగు మరికొన్ని పద్ధతుల ననుసరించి గాని నూతన గ్రంథరచన చేయుటకు మాత్రమే యయి యుండవలెను గాని పాడినదేపాటగ నవీనగ్రంథములను మరల వ్రాయుటకయియుండరాదనుట తిక్కననుండి గ్రహింపదగును.

## ఆత్మ విశ్వాసము

ప్రాచీనకాలమునందలి భక్తి ప్రస్తుతకాలముపట్ల నిరసనభావముక్రింద పరిణమించుచో నది యెంతశీఘ్ర ముగ నశించిన నంతమంచిది. మనపూర్వుల మాహాత్మ్య మును తలచుకొని పులకితగాత్రుల మయి ప్రస్తుతము మన మేమియు చేయ నగత్యము లేదనియు, అగత్యమున్నను చేయజాలమనియు నిశ్చయించుకొని ఇతర దేశములు, ఇతర సారస్వతములు విమానయానమున నభివృద్ధి నొందు చుండగ మనము ప్రాచీనుల మాహాత్మ్యముపయి నాధార పడియుండజూచుట వివేకహైన్యమునకు పరమావధి. ప్రస్తుతకాలమున నాంగ్లేయు లభివృద్ధి నొందుచుండుట కును హైందవులు "నానాటికి తీసికట్టు నాగంభట్టూ" యనిన ట్లుండుటకును ఆత్మవిశ్వాస రాహిత్యమే కారణ మని వివేకానందుడు నిరూపించుచున్నాడు. ఆంగ్లేయ యువకుడు "నేనాంగ్లేయుడను. ఈవిశ్వమున నాకసాధ్య మెద్ది"అనువిశ్వాసముతో నేయుద్యమమునకైన గడంగును. హైందవయువకుడు ప్రాచీనులమాహాత్మ్యము తలచు కొని గుటకలుమ్రింగుచు దిక్కులుచూచుచుండును. ఇంతతమోగుణము దేశము నావరించినదిగావుననే ప్రస్తు తము మన మిట్లున్నాము. ఎవరైన కావ్యము వ్రాసి తీసి కొనివచ్చినచో "కాళిదాసునితరువాత సిగ్గున్నవాడు కలముచేతబట్టవలసినపనిలే" దని నిరుత్సాహపరచు చుందుము. కాని "పురాణ మిత్యేవ నసాధు సర్వమ్" అను కాళిదాససూక్తిని మనము స్మరింపము.

తిక్కనయాత్మవిశ్వాసమునకు రెండు నిదర్శన ములు: మొదటిది, అతడు సమకాలికుల కిచ్చిన ప్రోత్సా హము. ఇతరయుగములు ఇతరకవులు ఎంతగొప్పవారయి నను అట్టివారు తనకాలమునగూడ లేకపోలేదని యాతనివిశ్వాసము. కాని ఒకవిశేషము. ఇప్పటికాల మన కొందరివలె నన్యోన్యముగ పొగడుకొనుటకు కంట్రాక్టు వ్రాసుకొని ఎంతనీరసకావ్యమునయినను సరే, భవభూతికృతులకంటెనుత్తమముగ నున్నదని పొగ డుచు "అభినవకాళిదాసు"లని వీరిని వారును, "అభినవ భవభూతు"లని వారిని వీరును స్తుతించుకొనునాచారము తిక్కనకాలమున నున్నట్లు గానము. ప్రోత్సాహముపేరు చెప్పి గుణమును పేక్షించుటకు తిక్కన యియ్యకొనడు.

> "కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
> నరిది బ్రహ్మకయిన"

ననుటలో నాతడే కావ్యమునయిన నెంతనిశిత మగు విమర్శనదృష్టితో బరికించువాడో విస్పష్టమగు చున్నది. కాని నిశితవిమర్శనముపేరుచెప్పి గుణమున్న చోటకూడ పెదవి విరువక సమర్థులయినవారిని సమ్మా నించువాడనుటకు కేతనయే నిదర్శనము. కేతన రచించిన దశకుమారచరిత్రమున

> సీ. సుకవీంద్రబృందరక్షకు డెవ్వడనిన పే
> డను నాలుకకు దొడవైనవాడు
>
> సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్ప
> గొనునను టధిక కీర్తనకు దెరువు

ఇత్యాదిపద్యములవలన ఒక్కకేతనను మాత్రమే కాక ఆతడు పెక్కురు కవుల నాదరించి వారిచే కావ్య ములు వ్రాయించి అగ్రహారము లిచ్చి సమ్మానించిన ట్లూహింపదగియున్నది. అయితే ఆకవుల నామములు గాని, వారురచించినగ్రంథనామములుగాని తెలిసికొనుట కవకాశము లేకపోవుచున్నది. కాలగర్భమున నన్నియు లీనమయిపోయినవి. భోజరాజీయకారుడు మాత్రము తన పూర్వుడను బయ్యనమంత్రినిగూర్చి వ్రాయుచు . . .

> చ. క్షితిగ్రతుకర్తృ తామహిమ
> చేకొని పంచమవేదమైన భా
> రతము తెనుంగుబాస నభి
> రామముగా రచియించినట్టి యు

న్నతిచరితుండు తిక్కకవి
నాయకు డాదటమెచ్చి "భవ్యభా
రతి" యనపేరుగొన్నకవి
రత్నము బయ్యనమంత్రి యల్పుడే!

యని యీ బయ్యనమంత్రికి తిక్కన "భవ్యభారతి" యనుబిరుదమిచ్చి సత్కరించినట్లు వ్రాసుకొనినాడు. ఈభవ్యభారతి రచించిన కావ్య మొక్కటియైన నేడు గానరాదు.

తిక్కన యాత్మవిశ్వాసమునకు రెండవనిదర్శనము స్వశక్తియందలి విశ్వాసము. తిక్కన భారతరచనమును తలపెట్టినప్పుడే "పదియేనింటి తెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునన్, తుదిముట్టన్ రచియించుటొప్పు బుధసంతోషంబు నిండారగన్" అని తుదిముట్ట రచియింపగల నను ధైర్యముతో నీమహోద్యమమున నడుగుపెట్టినాడు. నన్నయభట్టు ముగింపకుండ మధ్య విరమింపవలసినవా డాయెనేయనుశంక ఆతనికి లేదు. దానికితోడు హరిహరనాథు డిచ్చిన అధికారముద్రకూడ లభించినది.

ఉ. ఇట్టిప్రసాదముగాంచి పర
మేశ్వరులిం గృతినాథుచేసి యే
పట్టున పూజ్యమూర్తియగు
భారతసంహిత జెప్పగంటి నా
పుట్టు గృతార్థతం బొరసె
పుణ్యచరిత్రుడ నైతి నవ్విభున్
గట్టెద...మ్ప్రతిమ
కారుణికత్వమహావిభూతికిన్.

ఉ. కూర్చుట నూత్నరత్నమున
కున్ గనకంబునకున్ దగున్ జనా
భ్యర్చితమైన భారత మ
పార కృపాపరతంత్రవృత్తిమై
జేర్చిన దేవదేవునకు
శ్రీలిగ నిచ్చుట సర్వసిద్ధినా
నేర్చినభంగి జెప్పి వర
ణీయుడనయ్యెద భక్తకోటికిన్.

ఉ. కావున భారతామృతము
కర్ణపుటంబుల నారగ్రోలి యాం
ధ్రావలి మోదముంబొరయు
నటుగ సాత్త్వికతేయసంస్కృతి

శ్రీవిభవాస్పదంబుమున
చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది గద్యముల
పద్యములన్ రచియించెదన్ గృతుల్.

ఈపద్యములలో వినయసంపత్తియు, ఆత్మవిశ్వాసమును మూర్తీభవించినవి. తనకవిత్వమును హరిహరనాథుని "కారుణికత్వమహావిభూతి" యనుకొనుటలో నిరహంభావత్వము ద్యోతమాన మగుచున్నది. "నేర్చిన భంగి" అనుటలో వినయము వెల్లివిరియుచున్నది. "వరణీయుడనయ్యెద భక్తకోటికిన్" "మహాకవిత్వ దీక్షావిధి నొంది" ఇత్యాది తిక్కనభాగములలో నెల్ల ఆత్మవిశ్వాసము విజృంభించుచున్నది. ఇట్టియాత్మవిశ్వాసమున్నవానికే యుగకర్తృత్వము చెల్లును.

తిక్కన చరిత్రము "టాజ్ మహాల్" వలె సర్వాంగసుందరమైనది. దాని యతిలోక రామణీయకతను దిఃకించినకొలది తనువు పులకించును. కాని దాని తేజమునకు కనులు మిఱుమిట్లుగొన దిగ్భ్రమము చెంది నవయువకులు కార్యరంగమునుండి నిస్పృహతో విరమింతురేని మనము దానిని విలోకించి నిష్ప్రయోజనము. "తిక్కన గొప్పవాడే తిక్కన ఆదర్శపురుషుడే. తిక్కన యుగకర్తయే. కాని అంతకంటె గొప్పవారము మనము కావలయును. అంతకంటె ఆదర్శపురుషులము మనము కావలయును. అంతకంటె యుగకర్తలము మనము కావలయును." అను నుత్సాహము మన కది యీయజాలినపుడే తిక్కన చారిత్రపఠనమునకు సార్థక్యము లభించుచున్నది. అట్లగుటకు సాధ్యపడునా యని ప్రశ్నింతురా, పరబ్రహ్మస్వరూపుడగు జీవునికి సాధ్యము గాని దేమున్నది?

ఉరుములను మెఱుపులనుబట్టి వర్షోదయము నిశ్చయింపవచ్చును. అరుణోదయమును బట్టి సూర్యోదయము నిశ్చయింపవచ్చును. మన సారస్వతమున నేడు గనవచ్చు మహోత్సాహమును బట్టి తప్పక ఒక నూతన యుగోదయము కాగల్గు నను నమ్మకము నా కున్నది. ఉత్సాహముతో పరిపెట్టుకొనక ఆంధ్రయువకులు ఉపజ్ఞను కూడ సంపాదించుకొని ఈ మహోదయమును సాధింతురుగాక! అజరామరమయిన యాత్మతో నీమహోదయమున కెదురుచూచు కవిబ్రహ్మ యగు తిక్కన యాశీస్సులమోఘములు గదా!

---

# పూర్ణ

వాసిష్ఠ గణపతిముని

అనువృత్తము

## ఐదవ ప్రకరణము

### మూఁడు జాబులు

పూర్ణ వీరసింహుని పొడిచిననాటి రాత్రియే మహారాజసుచంద్రునిసన్నిధిలో సచివుఁడు (అంతరంగమంత్రి) రూపచంద్రుఁడు పార్థివునిపేర వచ్చిన మూఁడుజాబులు చదివిన వాఁడయ్యెను. మహామంత్రి సునందుఁడు గూడ నచ్చట సన్నిహితుఁడై యుండెను.

అది ప్రాసాదావరణములోని బహిర్గిపురము నందలి సప్తభూమికవిమానము యొక్క పంచమభూమిక. అది రాజకులము కూడు స్థలము. ఆభూమికలో పడమర పుస్తకాలయము గలదు. మధ్యశాలలో మధ్యప్రదేశము నందు పార్వతీస్వామి భట్టారకుని శిలావిగ్రహ మొకటి యున్నది. తక్కినభాగమంతయు వ్యాఘ్రచర్మాస్తరణములతో నిండి పవిత్రభీషణముగా కన్పట్టుచుండును. తూర్పుగది యాలోచనమందిరము. అచ్చట మూఁడు సమున్నతాసనములు గలవు. మహారాజుకూర్చుండు కనకాసన మొకటి. అది యుత్తరాభిముఖము. దానియెదుట నిరుప్రక్కల రెండురజతాసనము లుండినవి. దక్షిణపార్శ్వమున పశ్చిమాభిముఖమగు మహామంత్రియాసనమును వామపార్శ్వమున పూర్వాభిముఖ మగు శాఖామంత్రియాసనమును కన్పట్టును. ఆసనము లన్నియు పట్టుపరుపులతోడను పట్టుదిండ్లతోడనుగూడి సుఖోపవేశనార్హము లైయున్నవి. నేలయంతయు రత్నకంబళము పఱచియుండెను. రాజాసనమునకు దిగువ పాదపీఠమొకటి యుండెను.

మహారాజసుచంద్రుఁడు సుమారేఁబది సంవత్సరముల వయస్సు గలవాఁడైనను సర్వకృష్ణకేశుఁడై పటిష్ఠకాయుఁడై యువకుఁడువలె కన్పట్టుచున్నాఁడు. వ్యక్తిపక్షపాతముచేతవలె సౌందర్యకళ యతని నింకను విడువకున్నది. తన పేరుకు తగినట్లు ధవలప్రభతో నతఁడు విరాజిల్లుచున్నాఁడు. అతఁడు తండ్రికి సమానుఁడగు రాజనీత్యభిజ్ఞుఁడు గాకపోయినను తండ్రిని మించిన మహావీరుఁ డనిమాత్ర మందఱు నంగీకరింతురు. అతనికి పరమశత్రువులైన ద్రవిడకుంతలాశ్మక దక్షిణకోసల కలింగేశ్వరులు సీమోల్లంఘన సేయఁజాలకుండుట యతని పరాక్రమమునకు వెలిచియే యని చెప్పవచ్చును. కాంతాప్రీతి జీవకారుణ్యములే యానరపతియొద్ద నుండు లోపములని నయవేత్తలలో నగ్రగణ్యుఁడైన దూతసామంతుఁడు (విదేశాంగమంత్రి) భార్గవవిశాలాక్షుఁడు చెప్పుట గలదు. వృథారక్తపాతము గూడదనియే యతఁడు జైత్రయాత్రలకుఁ గడంగలేదు.

మహామంత్రి సునందుఁడు పంచషష్టివర్షవృద్ధుఁడు. సర్వపలితకేశుఁడు. సువర్ణచ్ఛాయుఁడు. అతఁడు తనకౌమారితె లీలా

వతీదేవిచేతి కీలుబొమ్మగానే యుండినను ఆమెమతమును రాజకులములో సాధించుటకు వలయు యుక్తి ప్రతియుక్తుల నల్లుటలో నసాధ్యుఁడే యగును. గొప్పవిద్వాంసుఁడు గాకపోయినను మిక్కిలి గడుసువాఁడు. పరోపకారగంధవర్జితుఁడైనను ప్రియవాది. మహోన్నతాధికారియైనను గర్వవర్జితుఁడు. మహాసంపన్నుఁడైనను నిరాడంబరుఁడు. శౌర్యమావంతయును లేని కార్యవాది. పేరువడసిన ద్రవ్యరక్షకుఁడు.

సచివుఁడు రూపచంద్రుఁడు రాజాంతఃకరణ మెఱింగి నడుచుటలో మహానిపుణుఁడు. అతని తండ్రి గవల్గణుఁడు పర్వతస్వామిభట్టారకునియొద్దయు, సుచంద్రభట్టారకునియొద్దయు ననేకసంవత్సరములు సచివుఁడుగా పనిచేసి మిక్కిలి పేరునడసిన రాజనీతిజ్ఞుఁడు. ఇతనినిగూడ తండ్రికి సదృశుఁడనియే జనులు చెప్పుకొనెదరు. కులమునందు వీరు సూతులు. సూతజాతీయుల నంతరంగమంత్రులనుగా నుంచుకొనుట ప్రాచీన నరపతుల యలవాటు కాఁబోలును? దశరథుని యంతరంగమంత్రి సుమంత్రుఁడును, ధృతరాష్ట్రుని యంతరంగమంత్రి సంజయుఁడును సూతజాతీయులేయగుదురు. మన రూపచంద్రుని వయస్సు ముప్పదియైదు. రూపమునం దితఁడన్వర్థనామధేయుఁడు.

మహారాజ మహామంత్రులు కూర్చుండి యున్నారు. సచివుఁడు లేచి జాబులు చదువుచున్నాఁడు.

మొదటి జాబు

"మహారాజకౌండిన్య సుచంద్రునకు—

పరంతపసంఘునాయకుఁడు కార్కోటకవిశంభుఁడు స్నేహపూర్వకముగా వ్రాయులేఖ. మాపితామహుఁడు మహారాజమందనాథుఁడును మామేనత్తభర్త మహారాజకారుఁడును శత్రువశీకృతులై యుండిన ఛిద్రములో మీ తండ్రి పర్వతస్వామి వారి రాష్ట్రముల నాక్రమించుకొనెను. ఆనష్టరాజ్యములను తిరిగియు సంపాదించుకొనుటకు నేనును కాకులమహారాజవంశములో పరిశిష్టయై కన్పట్టు నతని దాహిత్రి యిరావతియును కలిసి పరంతపసంఘమును స్థాపించినవార మైతిమి. ఆ నష్టరాజ్యములను సంపాదించుకొనుటకు తగిన బలము మాకుఁ గలదని ఋజువుపఱచుటకు మేము సంసిద్ధులముగానే యున్నారము. అయినను సర్వజాతులకు సమానపూజ్యుఁడగు భగవాఞ్జటామునిని "సుచంద్రునితో నీవు సంధి చేసుకొనుము." అని నన్నాజ్ఞాపించిన మేము మాలక్ష్యమునుండి చాలవఱకు తగ్గి యాచరణసాధ్యమగు సంధిమార్గము నొకటిని మీ ప్రభుత్వమునకు సూచించుచున్నారము. ఆ మార్గమునందు మేము మీ ప్రభుత్వమునకు - నివేదించు సంధిషరతులు మూఁడు—

౧. మా పితామహుని చిత్రకూటరాష్ట్రమును నాకు తిరిగిము స్వతంత్రముగా నిచ్చివేయవలెను.

౨. మీరు కలింగులయొద్దనుండి జయించిన పార్వతీయప్రాంతమును కాకులదౌహిత్రి

యిరావతీకుమారికి స్వతంత్రరాష్ట్రమునుగా నిచ్చివేయవలెను.

3. ఆంధ్రరాష్ట్రమునందు మీ తండ్రిగారి కాలమునాటికంటె మీ రధికముగా వేసినపన్నులను తీసివేయవలెను.

ఈసంధినియమములను మీ రంగీకరించి చెల్లించునెడల మేము మీతో సంపూర్ణముగా విరోధము విడిచి మిత్రులముగా నుండెదము. మాసంధిసూచనను మీరు తిరస్కరించునెడల భయంకరమగు మా శత్రుత్వమునకు కుండినుల (కౌండిన్యగోత్ర సంభవుల) ప్రభుత్వము గురియగును. శ్రీ జటామునిశిష్యురాలగు యోగీశ్వరి ధవలాక్షి యీసంధిరాయబారములో నుభయపక్షముల మధ్య దూతగా నుండుట కంగీకరించెనుగాన మీప్రత్యుత్తర మామె కందఁజేసిన మాకు మీయభిప్రాయ మగుదును. చిత్తగింపవలెను.

విజయ సంవత్సర జ్యేష్ఠశుద్ధ
పంచమీ భానువారము.
కార్కోటకనిశుంభువు వ్రాలు."

రెండవ జాబు

"మహారాజపరమేశ్వర శ్రీకౌండిన్య సుచంద్ర భట్టారకులవారి దివ్యసన్నిధికి —

శివంకరసంఘనాయకుఁ డాంగిరసగజవీరుఁడు వినయపూర్వకముగా వ్రాసుకొనిన విజ్ఞప్తి. శ్రీవారు స్వయముగా రాజకార్యములందు తగినంత శ్రద్ధ తీసుకొననందున మహామంత్రియే రాష్ట్రమును నిరంకుశముగా నేలుచున్నాఁడు. స్వార్థపరుఁడును, ప్రజాహితచింతలేనివాఁడును,లంచగొండియు నగు నతని యేలుబడిలో నెన్నియో యన్యాయములు జరుగుచున్నవి. వాటిని సహింపకయే శ్రీవారి దయగల శ్రోత్రముల కెక్కునట్లు సక్రమాందోళన సేయుటకు దేశమునందును, కుండినుల వంశాధికారమునందును భక్తిగల యాంధ్రయువకులచే మాశివంకరసంఘము స్థాపింపఁబడినది. ఆ సంఘము నడంచివేయుటకు మహామంత్రి దానిని విప్లవసంఘముగా ప్రకటింపఁజేసినాఁడు. ఇప్పుడు మాసంఘస్థులెట్టి నేరములుగూడఁ జేయకపోయినను మమ్ములను గనిపెట్టి మాప్రాణముల నురికంబముల కర్పించుటకు మహామంత్రి కుమారుఁడు రాష్ట్రియ (పోలీసుమంత్రి) వీరనందుఁడు సర్వవిధములచే ప్రయత్నించుచున్నాఁడు. ఆప్రయత్నములో నెప్పుడైన సంఘర్షణ మేర్పడవచ్చును. అప్పుడు మేమాత్మసంరక్షణకొఱకుమాత్ర మవలంబింపఁబోవు ప్రతిఘటనమువలన శ్రీవారి రక్షిజనులకుఁగాని, సైనికులకుఁగాని నష్టమేమైనఁ గలుగునెడల దానికి మేము బాధ్యులముగాము. మా మొరల నాలకించుటకు శ్రీవారి దయగలచిత్తమున కిష్టముండునెడల శ్రీవారిచే నాజ్ఞాపింపఁబడు స్థలమునకు మా ప్రతినిధిని సరాయుధునిగా పంపెదము. ఈ విషయములో మాపక్షమున దూతగా నుండుటకు కాణ్వాశుకనాసుఁ డంగీకరించెను గాన నతనికి శ్రీవారు మా ప్రతినిధితో మాట్లాడుట కంగీకారమున్నదియు, లేనిదియు తెలియఁజేయఁగోరుచున్నారము. చిత్తగింపవలెను.

విజయ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ
పంచమీ భానువారము.
ఆంగిరస గజవీరుఁడు వ్రాలు"

మూఁడవ జాబు

"మహారాజ పరమేశ్వర శ్రీ కౌండిన్య సుచంద్ర భట్టారకులవారి భ్రాతృచరణ సన్నిధికి—

చెల్లెలు కీర్తిశేష మహామండలేశ్వర శ్రీ కౌండిన్య మేఘస్వామి భట్టారకులవారి కొమారితె శాంతిసేన నమస్కారపూర్వకముగా వ్రాయువిజ్ఞాపనము. తమ ప్రభుత్వము నన్నుల్లంఘించి మా పినతల్లి చంద్రప్రభాదేవి పెంచిన యపవిద్ధ పుత్రునకు సింహాసన మిప్పించి వేసినది. అది యన్యాయ్యమనియే నా యంతరాత్మ చెప్పుచుండినను నా పూజ్య సోదరుని యాజ్ఞ నుల్లంఘింపనేరక వీరేశ్వరుని దారినుండి తొలఁగిపోతిని. గోతముల యింటి పిల్ల (సునందపుత్రి) చిత్రకూట ప్రాసాదమునందు తన యక్కయ్య విజయపతాకవలె నాడుచున్నది. కుంశికుల యింటిపిల్ల (తాను) తన యన్నయ్య చేతఁగానితనమునకు దృష్టాంతభూతురాలై యతని యపయశోంధకార మధ్యమునందు ప్రచ్ఛన్నమై కూలఁబడియున్నది. ఆ మరణాంత మెవరికిని తెలియక తన యాయుశ్శేషమును గడపవలెనని యామె యుద్దేశించెనుగాని యీ మధ్య నొక సమాచారము తెలిసినందున నుండఁబట్టఁజాలక తిరిగియు రాజకీయరంగమునకు దిగినది.

పరమభట్టారక! ఆ సమాచారమును మీ చరణసన్నిధిలో నివేదించుట యుక్తమని నేను తలంచుచున్నాను. మాపినతల్లి చంద్రప్రభాదేవి పెంచినకుమారుఁడు వాస్తవముగా దయాపాత్రుఁడగు నపవిద్ధుఁడు గాఁడఁట. చంద్రప్రభాదేవి ప్రేరణవలన నామెచెల్లెలు చంద్రముఖి సద్యోజాతుఁడగు తన పిల్లవానిని తన యక్క చెప్పిన స్థలమునందు పాఱవేసినదియఁట. చంద్రప్రభ వానిని తీసి తనకొక యనాథబాలకుఁడు దొరకెనని భర్తకుఁ జెప్పి కరుణాశాలియగు నతని యనుమతిపై పెంచినదియఁట. నాకుఁ దెలిసిన యీ సమాచారమే వాస్తవమగునెడల నా సింహాసనోత్తరాధికారము నపహరించుటకే యామె యీ మోసము చేసెనని స్పష్టమగును.

ఆంధ్రేశ్వర! ఆ మోసమును విచారించుటకు ఘనతచెందిన తమ రాజధర్మాసనము పూనుకొనఁగోరెదను. తమ చెల్లెలామోసమును ఋజువుసేయఁజాలనియెడల తన యన్నయొద్దనుండి యెట్టి యనుగ్రహమును గూడఁ గోరదు.

లీలావతీకాంత! తమ ప్రభుత్వము చెల్లెలి న్యాయభిక్షను తిరస్కరించునెడల పూర్వమువలె నిపుడు నేను శాంతివహించి యుండుటకు నిశ్చయించుకొనలేదు. మోసకర్త్రియగు నా సవతితల్లి రహస్యముగా తీసుకొనివచ్చిన చంద్రముఖి కుమారుని తన తల్లిదండ్రుల యింటికి గంటివేయుటకు నా భర్తతోడను, రాజభక్తులగు చిత్రకూట రాష్ట్ర వీరులతోడను గలిసి నేను ప్రయత్నించి తీరెదను. అనంతరము జయించిన మాకత్తులతో మేము మా సార్వభౌమునకు సేవసేయఁగలవారము.

అన్నయ్యా! శ్రీవారి కొక మేనగోడలు గలదు. ఆ పిల్లనమస్కారములు నాద్వారా తన మామయ్య కందఁజేయఁబడుచున్నవి.

అన్నయ్యా పంపవలసిన సందేశమును బ్రహ్మకుల పరిషత్పతి కౌండిన్య ధర్మపాలుని యొద్దకు పంపిన నా కందను. చిత్తగింప వలెను.

విజయసంవత్సర జ్యేష్ఠ శుద్ధ
పంచమీ భానువారము.
అంగిరస్సుల కులస్నుష శాంతిసేన వ్రాలు"

అఱువ ప్రకరణము

మంత్రనపు ప్రథమ ఘట్టము

గజవీరుని జాబు వినునపుడు సుచంద్రుని యంతఃకరణమునందు తాను రాజకార్యములందు తగినంత శ్రద్ధ తీసుకొనక పోవుట నిజమే యని తోఁచినది. మహామంత్రిచర్యనుగుఱించికూడ ననుమానము కలిగినది. అతఁడు లంచగొండియే కాని యెడల నతని కంత గొప్పసంపద పట్టుటకు హేతు వేమి యని మహారాజుమనస్సులో శంక వొడమినది. శివంకరసంఘమువారు మహామంత్రివిరోధులే గాని రాజవిరోధులు కారని యతనికి స్ఫురించినది. మహామంత్రి రాష్ట్రియులు తండ్రికొడుకు లిద్దఱును చేరి పట్టుపట్టి శివంకరసంఘమును విప్లవసంఘముగా ప్రకటింపఁజేసినది యన్యాయ్యమేమో యని యాప్రభు విప్పుడు తటపటాయించుచున్నాఁడు. శాంతిసేనజాబు ప్రభువును మఱింత కల్లోలపఱిచినది. చంద్రప్రభ మోసమే చేసియుండునెడల వీరేశ్వరుని పదభ్రష్టునిఁజేసి శాంతిసేనకు సింహాసన మిప్పించి వేయవలె నని యతనికి తత్కాల మొక భావము పుట్టినది.

పార్థివుని ముఖచ్ఛాయలోనుండి సచివుఁడు లోపలిభావమును కనిపెట్టఁగలిగెను. సుమా రిరువదిరెండు సంవత్సరములనుండి నిరంకుశముగా రాజకులమునందు విజృంభించు మహామంత్రిపతాక నాదినమున దింపివేయవచ్చు నని యతఁ డాశించినాఁడు. రాజుగారి ముఖము తన కనుకూలముగా లే దని మహామంత్రి కనిపెట్టకపోలేదు. మంత్రాలోచనకు మఱిరెండుదినములు వాయిదావేయించవలెన ని యతఁ డనుకొనెను. వాయిదాపడునెల నంతఃపురమునందలి తమ సమ్మోహనాస్త్రము రాజాంతఃకరణమును తమ కనుకూలముగా మార్చివేయఁగల దని యతని యాశ.

సచివుఁడు లేఖపఠనమును ముగించి యాసనముపైఁ గూర్చుండెను. కొన్నిక్షణము లా రంగస్థలము నిశ్శబ్దముగా నుండినది. స్వయముగా మహారాజే కొన్నిక్షణములకుఁ బిమ్మట ప్రసంగద్వారము తెఱచినవాఁడయ్యెను.

సుచం—చిన్న మామయ్యా! నిశంభునాగుని జాబుకు ప్రత్యుత్తర మేమి చెప్పవలెను?

సునం—ఈ విషయమును సంపూర్ణ మంత్రిసదస్సులో చర్చించిన బాగుండు నని నా మతము. మనము విప్లవసంఘమును సులభముగా నడంచివేయఁగలమా లేమా యను విషయమునందు రాష్ట్రియునితోడను, సేనాపతితోడను ఆలోచింపవలసియున్నది. నిశంభునకు పరరాజుల మద్దత్తు గలదేమో యను సంగతి నాలోచించుటకు దూతసామంతుని సాహాయ్యమాక మవసరము. పన్నులను తగ్గింప

నవకాశము గలదా యనుసమస్య మహా సమాహార్త తేల్చవలసియున్నది.

సుచం—విప్లవ సంఘము నడంచుటకు మనకు సామర్థ్య ముండునెడల నిశంభునితో సంధి చేసుకొనఁగూడదనిమా మీభావము?

సునం—మహాప్రభూ! అది రాజనీతి. సాధ్యశత్రువుతో సంధి యక్కఱలే దని నీతి వేత్త లనెదరు. నిశంభుఁడు ధర్మము నను సరించి చిత్రకూటరాష్ట్రమును తన కీయవలె నని కోరలేదు. వాఁడు కోరునది న్యాయభిక్ష గాదు. తన క్రౌర్యముచే రాష్ట్రమును గాసిఁ బెట్టియు, భయపెట్టియు నిప్పుడు వాఁడు తన క్రూరచర్యల నాఁపుటకు ప్రతిఫలముగా రెండు ప్రాంతములను కోరుచున్నాఁడు. అతని క్రూరచర్యల నాఁపుటకు మనకు శక్తియే యుండునెడల వానికి మన మెందుకు లొంగవలెను?

సుచం—వాని క్రూరచర్యల నాఁపు శక్తి మనకు కలదా? లేదా? మీ యభి ప్రాయ మేమి?"

సునం—"కల దనియే నాయభిప్రాయము. అయినను రాష్ట్రియసేనాపతులను గూడ నీ విషయములో నొకసారి సంప్రతించిన బాగుండును.

అన్నివిషయములకును వాయిదా వేయిం చుట కే మహామంత్రి యిట్టిధోరణి నవలం బించినాఁడు. ప్రథమవిషయము తత్క్షణమే యాలోచింపఁబడినను అతని కైష్టము లేదు. అయినను దానికి వాయిదా వేసినఁగాని తక్కిన రెండువిషయములలో వాయిదా వేయించుటకు హేతువు దొరకదు. ఈ గుట్టు మహారాజు కనిపెట్టలేకపోయినను సచివుఁడు కనిపెట్టఁగలిగెను. ఆ సమయము తప్పి పోయిన రాజుగారి వేఁడిని చతురురా లగు రాణి చల్లార్చివేయునని సచివుఁ డెఱుంగును. అందువలన నా పుణ్యకాలమును వృథాగా పోనిచ్చుట యతని కిష్టము లేపోయినది. మాట్లాడుటకు తనవం తెప్పుడు వచ్చునో యని యతఁడు చూచుచుండెను. ఇంతట రాజు సచివుని ముఖమును చూచినవాఁ డయ్యెను. ఆ చూపు మాట్లాడుమని యాజ్ఞ వలె నున్నది. పిమ్మట సచివుఁడు మొగ మోట మేమియు లేక మహామంత్రిసూచన నిట్లు ఖండించినవాఁ డయ్యెను.

రూప—మహాప్రభూ! నా శాఖలో నితరులు జోక్యము కలుగఁజేసుకొనుటకు నే నంగీకరింపఁజాలను. మన రక్షిదళమునకు శక్తి లేదని రాష్ట్రియుఁడు చెప్పుట కధికారి మెంతమాత్రమును గాఁడు. చోరులనుపట్టుట యతని పనిగాని చేతఁగాదని చెప్పుట యతని పనిగాదు అతనికి చేతఁగాదని తోఁచునెడల మర్యాదగా పని విడిచిపెట్టివేయుట విధి. మన రాష్ట్రియుఁ డింకను పనిలో నున్నందున తన రక్షిదళము విప్లవసంఘము నడంచివేయఁ గలదని నమ్ముచున్నట్లే మన మెంచవచ్చును. అట్లే సేనాపతిగూడ రాజాజ్ఞ ననుసరించి పోరవలసినవాఁడేకాని మన సేనకు చేతఁ గా దని చెప్పి యుద్ధము తప్పించుకొను నధి కార మతనికి లేదు. దూతసామంతునకు పర రాజుల మద్దత్తు నిశంభున కున్నది యని తెలిసి యుండునెడల నిదివఱకే శ్రీవారి యెదుట మనవిచేసియుండును. ఇప్పుడతని ని క్రొత్తగా నడుగ నక్కఱలేదు. సంధి యవ

సరమునకుఁగాను ఏపని రాష్ట్రములో చేయవలసియున్నను దాని నాలోచించు నధికారమిద్దఱిది. పరరాజులతో సంధిసూత్రముల నాలోచించునపుడు దూతసామంతుఁడును, దేశీయ విప్లవకారులతో సంధిసూత్రముల నాలోచించునపుడు సచివుఁడును రాజకులములో సలహా చెప్పుట కధికారులైయున్నారు. దీనిలో మహాసమాహర్త గాని, మఱియే యితర మంత్రిగాని జోక్యము కలుగఁజేసుకొనుట రాజకుల సంప్రదాయ విరుద్ధము. ఇప్పటి యాలోచనలో శాఖాంతరసంబద్ధ విషయము లంగభూతముగా చర్చకు వచ్చు నెడల వాటి లోటుపాటులను వివరించుటకు సర్వశాఖాధికారి మహామంత్రి యుండనే యున్నారు. అందువలన నీవిషయ మీ రాజకులములోనే చర్చింపఁబడవలెను. పూర్ణ మంత్రిసదస్సును కూర్చుట యనవసరము లేదు.

సుశం — (సచివు నుద్దేశించి) ఇంత గొప్పసమస్యలో మన మిరువురము మాత్రమే బాధ్యతవహించుట యంత మంచిదిగాదు.

రాజుగారి కింకను తన మహామంత్రి తత్త్వము బోధపడుటలేదు. వాస్తవముగా నిది క్లిష్టసమస్యగనుక పూర్ణమంత్రిసదస్సులో నాలోచనను మహామంత్రి సూచించుచున్నాఁడని యతని భ్రమ. సచివుని వాదము గూడ రాజుగారికి యుక్తముగా తోఁచినది. అందువలన నిద్దఱిని గౌరవించుచు నరపతి యిట్లు పలికెను :

"యథావిధిగా నీ రాజకులములోనే చర్చ జరిగిపోనిండు. కొసకు మన తీర్మానమును ఆచరణలోఁ బెట్టు సమయమున నా కేమియైన సంశయము కలుగు నెడల నా యసాధారణాధికారము నుపయోగించి పునరాలోచనకు సంపూర్ణ మంత్రి సదస్సును కూర్చెదను."

ఈ సూచన మహామంత్రికి ప్రియముగా నుండునని మహారాజు తలంచెను. మహామంత్రి రాజుగారి సూచనకు బదులేమియు చెప్పఁజాలకపోయినను పరాజితుఁడువలె క్రుంగిపోయినవాఁడయ్యెను. సచివుఁడు మిక్కిలి సంతోషించెను. ఆలోచనకాండ మారంభించినది. శాఖామంత్రియే ముందు మాట్లాడెను.

రూప — మహాప్రభూ! అట్లే కానిండు. నిశంభునాగుఁడు పంపిన మూఁడు షరతులలో నొకటిగూడ మన కాచరణసాధ్యము కాదని నా మతము. చిత్రకూటరాష్ట్రమును నాన్నగారు బాబయ్యగారి కిచ్చినారు. వారి వారసు ఇప్పుడు దాని ననుభవించుచున్నాఁడు. అతని వారసుత్వము సరియైనదా, వంచనాలబ్ధమా అనువిషయ మీ సమస్యలో ముఖ్యమైనది గాదు. ఆ వారసుత్వము వంచనాలబ్ధమే యని సర్కారువారు తలంచునెడల నందులకు తగిన చర్య తీసుకొనెదరు. ఆ విషయము వేఱు. ఎట్లయినను మేఘస్వామిభట్టారకుల వారి వారసు లనుభవింపవలసినదే యా రాష్ట్రము. దాని నింకొకరి కిచ్చివేయుట దత్తాపహార మగును. పార్వతీయప్రాంతము శ్రీవారి జయచిహ్నము. దానిని విడిచివేయుట యుక్తమైన పనిగాదు. అనేకాంధ్ర వీరుల రక్తమునకు ప్రతిఫలముగా వచ్చినది యా ప్రాంతము. నిశంభుని మాటపై పన్ను

లను తగ్గించుట మనకు కీర్తికరముగాదు: ఆ క్రూరుఁడైన దొంగ నేను సుచంద్రుని ప్రభుత్వముచే బాధపడు ప్రజల నుద్ధరించితి నని తాను డాబులు కొట్టుకొనుటకును, మన ప్రభుత్వమును కోశహీనముగాఁ జేసి దుర్బల పఱచుటకును వేసిన యెత్తది.

మహామంత్రికిఁ గూడ నిశంభునితో సంధి యిష్టములేదు. తాను రూపచంద్రుని సమర్థించిన నంతటితో నా విషయము ముగించి యితర విషయములు విచారణకు వచ్చును. అది యతని కిష్టములేదు ప్రథమ విషయ విచారణలో కాలము పొడిగించి చాలరాత్రి యయ్యెనను మిషచే ననంతర విషయ విచారణకు వాయిదా వేయించవలె నని యతఁడు మఱియొకయుపాయము నాలో చించి యిట్లు సచివుని సూచన కడ్డుపెట్టినవాఁ డయ్యెను:

"నిశంభుఁడు పంపిన షరతులు మన కంగీ కారయోగ్యములు గాకపోయినను అతని సంధి సూచనను మనము సంపూర్ణముగా తిర స్కరించుట మంచి పద్ధతిగాదు. వేఱు సంధి షరతులను మన మతనికి పంపవలెను. అవి యెట్లుండవలెనో మన మాలోచించి నిర్ణ యింపవలెను."

రూప—సుమారు కోటికార్షాపణము లకు (రూప్యములకు) తక్కువ లేకుండ సర్కారువారి సొత్తును నిశంభుఁ డపహరించి నాఁడు. వాఁ డపహరించిన ప్రజలసొత్తు దాని కంటె ద్విగుణముగా నుండును. నూఱుమందికి తక్కువలేకుండ రక్షకభటులు వాని యను చరులచేతను, వానిచేతను చంపఁబడిరి. సామాన్య ప్రజలలోఁ గూడ నెన్నియో హత్యలు వారిచేఁ గావింపఁబడినవి ఈ తప్పు లకు వాఁడును, వాని యనుచరులును దారుణ మగు రాజదండము పడయవలసియున్నారు. తా నిఁకమీఁద తన దుశ్చర్యలనుండి మఱలు టకు వాఁ డంగీకరించిన నతని సంఘమును క్షమించుటయే మనము సూచించు సంధిషర తుగా నుండవలెను. అంతియే చాలునని నా యుద్దేశము.

సునం—ఈ సూచన 'నీతో మాకు సంధి యక్కఱలే' దనుటకు పర్యాయపదము.

సుచం—మీ యుద్దేశమేమి?

సునం—మన రాష్ట్రములో నాగుల సంఖ్య మిక్కుటముగా నున్నది. వారి కింకను కాకులమందనాథవంశములపై భక్తిపోలేదు.

సుచం—నేనడుగునదిమీరు సూచించు సంధిషరతు.

ఈ పలుకు మహామంత్రియెత్తును పటా పంచలు చేసినది. మహామంత్రి కాలముపొడి గించు ప్రసంగమునకు దిగెనుగాని నరపతి యట్టి ప్రసంగములను కొనసాగనీయలేదు.

సునం—(దొరకిన దొంగవలె వివర్ణుఁడై) ఏదైన నొక చిన్నసంస్థానము సృజించి నిశంభునచ్చట సామంతునిగా స్థాపించినవారు సంధి కంగీకరింపవచ్చును. మన కంతనష్టము గూడ లేదు.

రూప — ఇద్ద ఱొక సంస్థానముతో తృప్తిపడుట యెట్లు?

సునం—వారిద్దఱును భార్యాభర్తలుగ నున్నా రని నా యూహ.

రూప—రాష్ట్రమధ్యమున వారికి సంస్థాన మిచ్చిన మిక్కిలి ప్రమాదము. రాష్ట్రమధ్యమున నాగు లధికసంఖ్యలుగా నున్నందున నతం డెప్పటికైన వారితోఁ గలిసి పునర్విప్లవప్రయత్నము సేయవచ్చును. పార్వతీయప్రాంతము నొక మహామండలముగా నేర్పఱచి వారికి సామంతరాజ్యముగా నిచ్చిన బాగుండునని నా మతము. పార్వతీయప్రాంతమునందు నాగులు మిక్కిలి యరుదు.

సునం — పార్వతీయ ప్రాంతమునందు భర్తృదారిక రథినీకుమారిని మహామండలేశ్వరినిగా నభిషేకించిన బాగుండు నని మేమిదివఱకు తలంచుచుంటిమి. వివాహానంతర మామె యొక మహామండలేశ్వరిగా నుండుట వాంఛనీయము.

సుచం—ఆ యడవులకు కుమారిని పంపుట నా కిష్టములేదు.

సునం — సర్కారువారి జయచిహ్నమగు పార్వతీయ ప్రాంతము నితరులకు స్వాధీనపఱచుట యుక్తము గాదని ముందు చెప్పిన సచివమహాశయుఁ డిప్పుడు దానిని విడిచివేయవచ్చునని చెప్పుట యాశ్చర్యకరముగా నున్నది.

రూప — స్వతంత్రముగా నిచ్చివేయఁ గూడదనియే నేను ముందు చెప్పితిని. సామంతరాజ్యముగా నిచ్చునెడల దానిపై మన యధికార ముండనేయుండును.

సుచం—సచివుఁడు చెప్పినది బాగుగానే యున్నది. ఇరావతీ సింహశంభువు లిద్దఱును సంధి కంగీకరించునెడల వారికి సామంతరాజ్యముగా పార్వతీయమహామండల మీయఁబడును. దంపతులై కలిసి రాజ్యము చేసుకొందురో, లేక రెండుమండలములను విభజించుకొనుటయో అది వారి యిష్టము. (మహామంత్రిని జూచి) ఈ సంగతిని రేపు ప్రాతఃకాలమునందు ధవలాక్షికి ప్రభుత్వపక్షమున మీరు తెలియఁజేయవలెను. దీనికి పునరాలోచన యక్కఱలేదు.

సునం—(హీనస్వరములో) ఆజ్ఞప్రకారమట్లే చేసెదను.

## ఏడవ ప్రకరణము

### ద్వితీయ ఘట్టము

కొన్నిక్షణముల వఱకు రాజసభ నిశ్శబ్దముగా నుండెను. అనంతరము మహారాజు నిశాతదృష్టితో మహామంత్రిని జూచి యిట్లనెను—

"చిన్న మామయ్యా! శివంకర సంఘనాయకుని జాబు గమనించినారా ?"

సునం—గమనించితిని. నన్ను దూషించుటయే యా జాబుయొక్క ముఖ్యోద్దేశమని తెలియుచున్నది.

సుచం—దాని కేమి ప్రత్యుత్తరమిచ్చుటయో యది మన మిప్పుడు విచారింపవలసి యున్నది. శివంకర సంఘముయొక్క ముఖ్యోద్దేశము లెవ్వియో కనుగొనుటకు వారి ప్రతినిధితో నేను మాట్లాడవచ్చునా, కూడదా? మీ యభిప్రాయ మేమి?

సునం—(రెండు క్షణము లాలోచించి) ఒక షరతు నంగీకరించునెడల మాట్లాడవచ్చును.

సుచం— క్రూరుఁడగు నిశంభునితో సంధి నా కిష్టములేదుగాని జటాముని సంధి నాశించుటవలనను చిన్నమామయ్య కొనకు సంధికి సలహా యిచ్చినందువలనను నే నొక విధమగు సంధిమార్గమును నిశంభునకు సూచించుట కంగీకరించితిని.

కడపటిమాట మహామంత్రికి పోయిన ప్రాణములను తెచ్చినట్లుండెను గాని యుత్తర విషయములలో చర్చ యెట్లు ముగించునో యతఁడు భయపడినవాఁడయ్యెను.

సుచం— ఏది యాషరతు?

సుచం— గజవీరుఁడు తనసంఘముతోఁ గూడ బయలుపడి యందఱును క్షమాపణ వేడుకొనినఁగాని యతనితో మాట్లాడుట భట్టారకులకు గౌరవహానికరము.

సుచంద్రుఁడు రూపచంద్రుని ముఖము చూచెను.

రూప — శివంకర సంఘము నుండి యెట్టి వాఙ్మూలమును పుచ్చుకొనకయే రాజకుల మా వీరయువకుల సంఘమును విప్లవసంఘమునుగా ప్రకటించినది.

అర్ధోక్తిలో సునందుఁ డడ్డుపడి — "రాజకులచర్యను విమర్శించుటకు సచివున కధికారము లేదు."

రూప—సచివునకు వ్యక్తిగతముగా నధికారములేదు. ఇప్పుడు సచివుఁడు రాజకులములో కూర్చున్నాఁడు. అతఁడు సేయు విమర్శనము రాజకులము చేసినట్లే యెంచవలెను. ఒక రాజకులముయొక్క నిర్ణయమును మఱియొక రాజకులము పందర్భాను సారముగా విమర్శింపవచ్చునని నిబంధన మభ్యనుజ్ఞ సిచ్చుచున్నది.

సుచం—ఔను. తప్పలేదు. నీవాద మేమియో సాగనిమ్ము.

ఇప్పుడు మహామంత్రి తనస్థితి మిక్కిలి చెడినది యని తెలుసుకొనినాఁడు తనమాట యిదివఱకు రాజకులము లో నెన్నడును ఖండింపఁబడియుండలేదు. ఈరాత్రి సచివునిచే నది తెలకపిండిముక్కకంటె నవ్యాయ్యముగా విఱిచివేయఁ బడినది. "ఈబట్టువానికి కండ్లు నెత్తికివచ్చినవి. వీనిని నే నీయుద్యోగములో వేయించినాను. ఛీ! రాజులను నమ్మఁ గూడదు. అనేకసంవత్సరములు తమ్మాడించిన వారిని గూడ పాములు కఱచుటగలదు. రాజులు గూడ నట్టివారలే" అని లోలోన నామహామంత్రి విలపించెను.

రూప — శివంకర సంఘము వాస్తవముగా సక్రమాందోళన సంఘమేగాని విప్లవ సంఘము గాదేమో? దాని స్వరూపము తెలిసికొనుటకు భట్టారకులవారేల ప్రయత్నింపఁగూడదు? తమ నిజస్థితిని వెల్లడించుటకు వారి కొక యవకాశమేల మనమీయఁ గూడదు? మన యాంధ్రరాష్ట్రములోని వేడి రక్తముగల వేలకొలఁది యువకులు శివంకర సంఘములో సభ్యులుగా నున్నారని వినికిరి. అపరాధము న్యాయస్థానమునందు నిర్ధారింపఁబడకముందే యొక రాజకులప్రకటనము నాధారముగా చేసికొని వారినందఱిని నిష్కరుణముగా వధింపవలసినదేనా? గజవీరుఁడు వ్రాసినట్లు వారు దేశముయొక్కయు, కుండి

నుల వంశప్రభుత్వముయొక్కయు భక్తులనియే నా తలంపు శ్రీరామచంద్రుండు ప్రజలు తన కృత్యమును విమర్శించినంతమాత్రమున కోపించి వారిని విప్లవకారులనుగా నెంచెనా? ప్రత్యుత వారి విమర్శను పాటించి తన ప్రియకాంత నడవులపాలు చేసినవాఁడయ్యెను. ప్రభుత్వ చర్యావిమర్శముగాని, రాజచర్యా విమర్శముగాని రాజద్రోహము గాదనియే నా మతము. రాజును వధింపలేక పదభ్రష్టునిగాఁ జేయ యత్నించుటయే రాజద్రోహమగును.

సుచం—(మహామంత్రినిజూచి) సచివుని వాదము నాకు నచ్చినది. ఏకాదశీ స్థిరవారమునాఁడు సాయంకాల కృత్యములు తీర్చుకొనిన పిమ్మట శివంకరసంఘ ప్రతినిధి మాతో నీ విమానముయొక్క షష్ఠభూమికలో సాధారణముగా విదేశదూతలతో మాట్లాడుగదిలో మాట్లాడవచ్చునని రేపు ప్రాతఃకాలమునందు కాణ్వాశుకనాసునకు తెలియఁబఱచవలెను."

సునం—(సన్నగిల్లిన స్వరముతో) ఆజ్ఞ ప్రకార మట్లే చేసెదను.

ఆ సన్నస్వరము సునందుని మనఃకష్టము నుచ్చస్వరముతో చాటినట్లుండినది. ఆ గదిలో నిరువది రెండు సంవత్సరములు విజృంభించిన రాజకులకేసరి యీ రాత్రి ఘోరపరాజయము పొంది పిల్లివలె నా సన్న మన క్రుంగిపోయెను. అనేకకాలమునుండి సమయమునకు వేచియుండిన సచివుఁడీరాత్రి మహామంత్రి పలుకుబడిని గొయ్యితీసి పాతిపెట్టివేయవలెనని నిశ్చయించుకొనెను. ఇప్పటికందులో సగము పని పూర్తియైనది.

## ఎనిమిదియవ ప్రకరణము

### తృతీయ ఘట్టము

సుచం—ఇంక శాంతిసేనా కుమార్తి జాబును గుఱించి చర్చింపవలసి యున్నది.

సునం— ఆవిషయమును రాజకులము లో చర్చింపవలసిన యవసరము లేదు. సావకాశముగా నాలోచించి ప్రభువువారే తగిన సందేశము నామెకు పంపవచ్చును.

రూప — రెండు కారణములచే నీసమస్య రాజకులములో చర్చింపఁబడియేతీరవలెను. రాజకులముయొక్క యుత్తరువు పొందనిదియే రాజకుమారులపైఁగాని, రాజకుమారికలపైఁగాని, రాజపత్నులపైఁగాని, సామంతరాజులపైఁగాని, సామంతరాజపత్నులపైఁగాని దండార్హమగు నేర మారోపించు నభియోగము తెచ్చుటకు వీలులేదని నిబంధనముగలదు. చంద్రప్రభాదేవి సామంతరాజపత్ని. రాజకులము యొక్క యుత్తరువు లేనిదియే మోసమునకుఁ గాను ఆమెపై నభియోగము తెచ్చుట సాధ్యముగాదు. ఇది మొదటికారణము. రెండవకారణ మేమనఁగా - అభిషిక్తుఁడగు సామంతరాజు సరియైన వారసు కాఁడని యువరైన రాజధర్మాసన సన్నిధిలో వ్యాజ్యము తెచ్చుటకు ముందుగా రాజకులముయొక్క యుత్తరువు పొందవలెను.

సుచం — (తనలో) ఇన్నాళ్లు మహామంత్రిగా పనిచేసిన చిన్నమామయ్యకు రాజకులముతో సంబంధించిన నిబంధనలు గూడ చక్కఁగా తెలియవు. ఏదియో మోరతో పున

కొట్టుకొనిపోవుచున్నాఁడు. (ప్రకాశముగా) సచివుఁడు చెప్పునది వాస్తవమే.

సునం—అది వాస్తవమే యగునెడల-

సుచం—మీరు నిబంధన చూడలేదా? 'అగునెడల' అని యనుచున్నారు.

సునం—ముసలివాఁడను. మఱచి పోతిని.

సుచం—ఇంక మీ వాక్యశేషమును ముగింపుఁడు.

సునం—ఈసమస్యను విచారించుటకు మహాప్రాడ్వివాక తృతీయమగు రాజకులమునకే యధికార ముండును. న్యాయసూత్రములతో సంబంధించియున్నది గదా యీ సమస్య.

రూప—ఇట్టి సమస్యలలో చర్చించునపుడు న్యాయసూత్రములతో పనిలేదు. ఔచిత్యముమాత్రమే చర్చింపఁబడును. అందువలన నీసమస్య యంతరంగశాఖకే సంబంధించును.

సుచం— ఔను. ఇంకచర్చసాగనిండు.

రూప — వృద్ధురాలును, పూజ్యురాలును, విధవయు నగు చంద్రప్రభాదేవిని న్యాయస్థానములో నిలువఁబెట్టి విచారించుట యనుచితమే యగును. అయినను విచారింప నుత్తరు వీయనిమెడల శాంతిసేనా కుమారికపారమగు నష్టము వాటిల్లును. ఆదియందు రాజకులములో నపవిద్ధ పుత్రుఁ డౌరసపుత్రికంటెఁ గూడ ముఖ్యువార సని నిర్ణయింపఁబడినది. ఆ విషయము తిరిగియు విచారింప నవకాశము లేకపోయినను వీరేశ్వరభట్టారకులు మేఘస్వాఁ భట్టారకుల యపవిద్ధపుత్రుఁడే కానిమెడల నా రాజకులపు తీర్పు శాంతిసేనాకుమారిని బంధింపదు గదా. అతఁ డపవిద్ధపుత్రుఁడు గాఁడని ఋజువుపఱుపఁగలనని భర్తృదారిక వ్రాయుచున్నారు. దానికి రాజకుల మవకాశ మీయనిమెడల న్యాయప్రకార మామెకు రావలసిన యొక గొప్ప మహామండలము నామెకు రానీయకుండ నడ్డగించినది యగును. అంతకంటె నామెకు నష్ట మేమిగలదు? ఒకరి గౌరవము రక్షించుటకు మఱియొకరి కపారనష్టము కలిగించుటయో, యొకరి న్యాయ్యమైన హక్కును గాపాడుటకు మఱియొకరి గౌరవమునకు హాని కలుగఁజేయుటయో రాజకుల మిప్పుడాచరింపవలసియున్నది. ఈ రెంటిలో నేది మేలు? ఇదియే మన కిప్పు డాలోచనీయాంశము.

సుచం—(మహామంత్రిని జూచి) చిన్నమామయ్యా! మీ యభిప్రాయ మేమి?

సునం — నా కాలోచించుకొనుటకు వ్యవధి కావలెను.

సుచం—ఏ తప్పు వేలో యని యాలోచించుటకా?

సునం—శాంతిసేనాకుమారి విన్నపమును త్రోసివేయుట యెల్లు తప్పగునో యది నా కింకను బోధపడలేదు.

సుచం— ఆమెవిన్నపమును త్రోసివేసినను ఆమెకు నష్ట ముండదనియా మీ తాత్పర్యము?

సునం—వీరేశ్వరభట్టారకుఁ డపవిద్ధుఁడు కాకపోయినకృత్రిమపుత్రుఁడు కావచ్చును ద్వాదశవిధ పుత్రులలో నెవఁడైనను కొమారితెకంటె ముఖ్యుఁ డని రాజకులము ముందు నిర్ణయించియుండినది. అట్లుండ శాంతిసేనా కుమారికి న్యాయ్యమైన నష్టము కలుగునని మన మెట్లు నిర్ధారణ సేయఁగలము?

రూప — మేఘస్వామి భట్టారకులు వారు పిల్లవాఁ డపవిద్ధుఁడని యెంచియే తన భార్యకు పెంచుట కనుజ్ఞ నిచ్చియున్నారు. తన చెల్లెలి కుమారుని తన భార్య గుప్తముగా తీసికొనివచ్చెనని తెలిసిన ననుజ్ఞ నిత్తురా? అందువలన నా పిల్లవాని కృత్రిమత్వవిషయములో తండ్రి కేమియును సంబంధము లేదు. ఆ పిల్లవాఁడు చంద్రప్రభాదేవికిమాత్రమే కృత్రిమపుత్రుఁడు కావచ్చును గాని మేఘస్వామిభట్టారకులవారికి కృత్రిమపుత్రుఁ డెట్లగును?

సునం— ఇది క్లిష్టమగు న్యాయ సమస్య. దీనిని మనము కొన్ని క్షణములలో నిర్ణయించుట సాధ్యముగాదు. ఆలోచించుటకు వ్యవధి కావలెను.

రూప— క్లిష్టమగు నీ న్యాయసమస్యనాలోచించుటకు రాజధర్మాసన మున్నది. అది దాసిపని. సాక్షికముగానైన శాంతిసేనా కుమారి సింహాసనము పొందునవకాశ మీఁడు నపు డాయవకాశము నామెకు మన మెందుల కీయఁగూడదు? చంద్రప్రభాదేవి గౌరవ భంగ మొక్కటియే దీని కడ్డుగా నున్నది. అందువలననే యే తప్పు మేలో యను విషయమే యిప్పుడు నిర్ధారింపవలసియున్నది.

సుచం—చిన్నమామయ్యా! క్లిష్టసమస్యలను విచారింపవలసిన యావశ్యకత రాజకులమునకు లేదుగాన మీరు వ్యవధితీసికొన నక్కఱలేదని నామతము. శాంతిసేనా కుమారి విన్నపము త్రోసివేయవలసినదా? లేక యంగీకరింపవలసినదా? ఆ విషయములో మీ మతమును ఖచితముగా చెప్పుఁడు.

సునం — (తనలో) ఈ రాత్రి మిక్కిలి పాపరాత్రి. ఇప్పుడు మహారాజుమనస్సు మన కనుకూలముగా లేదు. అయినను ఇట్లు చెప్పిచూచెదను. (ప్రకాశముగా) మహాప్రభో! శాంతిసేనా కుమారికిని వీరేశ్వర భట్టారకునకును ఇద్దఱికిఁగూడ నష్టములేనట్లేదియో సంధిమార్గ మాలోచించుటకే నేను వ్యవధి కోరితిని. సచివుఁడు చెప్పినట్లు వృద్ధురాలు, పూజ్యురాలు నగు చంద్రప్రభా దేవిని న్యాయస్థానమున కీడ్చుటగాని, సుమారిరువదిరెండు సంవత్సరములనుండి శ్రీవారి స్వహస్తముతో నిచ్చిన రాజ్యము ననుభవించుచున్న వీరేశ్వరభట్టారకుని రాజ్యభ్రష్టుని జేయుటగాని నాకు సమ్మతములుగాలేదు.

మహామంత్రి మాటలకు మిక్కిలి దాక్షిణ్యవంతుఁడగు మహారాజు లొంగిపోవునేమో యని సచివుఁడు భయపడెను. అతని కొక విచిత్ర తత్కాలయుక్తి స్ఫురించినది. దాని నతఁడు త్వరగా రాజసన్నిధి యందు పెట్టినవాఁ డయ్యెను.

రూప—మహాప్రభూ! చంద్రప్రభాదేవికి గౌరవహాని లేకుండ విచారణ సేయుట కొక యుపాయ మున్నది...

సుచం — (ఆతురతతో) అదియేది ?

రూప — చంద్రప్రభాదేవి చెల్లెలు చంద్రముఖియు, నామెభర్త ధనపతియు నిప్పటికి జీవించియున్నారు. వారు దేవిని తప్పు త్రోవకు ప్రోత్సహించి తమ పిల్లవానిని పాలివేసి యామె పెంచునట్లు చేసిరి యని నేరమంతయు వారిపై నారోపించిన దేవికి గౌరవహాని కలుగదు.

సుచం — ఈ సంవిధానము బాగున్నది. (మహామంత్రినిజూచి) చిన్నమామయ్యా! మీ రేమనియెదరు?

సునందునకు చంద్రప్రభాదేవికి గౌరవహాని యగునని చింత యెంతమాత్రము లేదు. అతని ఘోషయంతయు తన యల్లునకు రాజ్యభ్రంశము కాగూడదనియే. తన మాటకు మహారాజు బదులు చెప్పకనుండె సచివుఁడు మధ్యకలుగఁజేసికొని మాట్లాడి ప్రభువు నాగాలిలో నెగురఁగొట్టుట మహామంత్రికి మిక్కిలి క్రోధము కలిగించెను. అయినను ఆ వృద్ధమంత్రి తన కోరిన ప్రయత్నముచు విడువలేదు.

సునం — మహాప్రభూ! నేను సంధిని గురించి యాలోచించుచున్నాను.

సుచం — ఇప్పుడు మనము శాంతిసేనాకుమారి విన్నప మంగీకరించినంతమాత్రమున సంధి కవకాశము లేదు. అంగీకరింపవచ్చునా, లేదా? అదియే మీరిప్పుడు చెప్పవలయును.

సునం — అంగీకరించునెడల విచారణ తప్పకజరుగును. విచారణలో శాంతిసేనాకుమారికే జయము కలుగునెడల వీరేశ్వరభట్టారకుఁడు మేఘస్వామిభట్టారకుని పుత్రుఁడుగాఁడని స్థిరపడును. తనకొక కర్మ నడిపించు పుత్రుఁడున్నాఁడను తృప్తితోడనే వారు దివంగతులైరి. ధర్మాసనపులీర్పే యందులకు వ్యతిరేకముగా నుండునెడల వారి పుంసంతతిని మనము తుడిచివేసినట్లే యగును. అది మిక్కిలి యవాంఛనీయము. అందులకే నేను సంధికి ప్రయత్నించుచున్నాను. అందులకు తగినమార్గము ఇంకను స్ఫురింపకున్నది. కనుకనే నేను వ్యవధికోరితిని.

సుచంద్రున కిప్పటికి తన మహామంత్రి తత్త్వము బోధపడినది. అతఁడు తనకూఁతురు ద్వారా యేదియో యొకయెత్తు పన్ని తన్నంగీకరింపఁజేయుటకే వ్యవధి కోరుచున్నాఁడని సుచంద్రుఁడు తెలిసికొనినాఁడు. అది కపటమార్గమని నరపతికి స్ఫురించినది. అందువలన మహామంత్రికి వ్యవధి యీయఁదలఁచుటకే యతఁడు నిర్ణయించుకొని యిట్లుపలికెను:

"ఇప్పటి పని యిప్పుడు ముగింపవలెను. సంధికి మంచిమార్గము మీకు తోఁచినపుడు చెప్పుఁడు. నేను దాని కనుకూలముగా ప్రయత్నించెదను."

సునం — తండ్రి పుత్రుఁడని విశ్వసించిన యొక పిల్లవానిని నతని పరోక్షమునందతని పుత్రుఁడుగాఁడని నిర్ణయించుట కేన్యాయస్థానమునకుఁగూడ హక్కు లేదని నామతము. అందువలన శాంతిసేనాకుమారి విన్నపము త్రోసివేయఁదగినది యని నాయభిప్రాయము.

సుచంద్రుఁడు సచివుని ముఖము చూచెను.

రూప — మేఘస్వామి భట్టారకుల వారు వీరేశ్వరుని పెంపకమును ధర్మార్థ మంగీకరించిరో పుత్రార్థ మంగీకరించిరో మనకు తెలియదు. వారు వీరేశ్వరభట్టార కుని తనపుత్రుఁనిగా నెప్పుడును ప్రకటించి యుండలేదు. ఉపనయనము నాచార్యునిచే చేయించిరిగాని స్వయముఁగా తాను చేయ లేదు. అందువలన వారు తన జీవితకాలము లో నతనిని తనపుత్రునిగా విశ్వసించిరనుట సంశయగ్రస్తము. కనుక శాంతిసేనాకుమారి విన్నప మంగీకరింపఁబడవలెననియే నా యభి ప్రాయము.

సుచం—తండ్రి భ్రాంతిచే విశ్వసించినను దాసిని న్యాయస్థానము మన్నించి తీరవలెనా యను విషయమే ముందు సంశయగ్రస్తము. అందువలన నేను సచివునితో నేకీభవించి శాంతిసేనాకుమారి విన్నపము నంగీకరించి తిని. చిన్నమామయ్యా! శాంతిసేనాకుమారి విన్నపము రాజకులములో నంగీకరింపఁబడి నట్లును, ఆమె మోసమునకుఁగాను చంద్ర ప్రభాదేవిపైఁగాక చంద్రసుఖదంపతులపై నభియోగము తేవచ్చుననియు కౌండిన్యధర్మ పాలునకు తేపు ప్రాతఃకాలము సందేశము పంపుఁడు.

సుచంద్రుని నిర్ణయము వినినపిమ్మట సునందుని వెన్నెముక విఱిగిపోయినట్లయ్యెను. "అనాథ పద్మావతీ! ఇంక నిన్నెవరు రక్షిం తురు? వెఱ్ఱికుక్కవిషము వలె చిత్రకూట రాష్ట్ర సింహాసనోత్తరాధికారిసమస్య తిరి గియు బయలుదేఱినది. ఇప్పు డేమిసేయుట?" అని యతని మనస్సులో మాటలు ధ్వనించి నవి. ప్రకాశముగా నతఁడు— "ఆజ్ఞప్రకార మట్లే చేసెదను." అని విధిలేక యనినాఁడు.

"ఇన్నాళ్లకిఁతని దశ తిరిగినది." అని సచివుఁడు సంతోషించినాఁడు.

సుచం — చిన్న మామయ్యా! తేపు మహారాజ్ఞివర్ధంత్యుత్సవము గనుక నుత్సవ మంతయు ముగింపువఱకు కీరాత్రి రాజకుల చర్య నామెచెవిలో వేయవలదు.

సునం—చిత్తము.

సచివుఁ డనుకొనినట్లు మహామంత్రి పలుకుబడి యీ విధముగా భూస్థాపితము చేయఁబడిన దీరాత్రియందు. దానికి పునర్జీవి తము వచ్చు నాశగూడ నంతగా కన్పట్టుట లేదు.

## తొమ్మిదియవ ప్రకరణము

### సాక్షరనారీసభ

మఱునాఁడు లీలావతీదేవిగారి వర్ధంత్యు త్సవము జరిగినది. ప్రాతఃకాలమున మహా వైభవముతో నాయుష్యహోమము జరిగెను. హోమానంతర మామె కోటలో నుండు మైదానమునఁ గూర్చుండి పురస్త్రీల కందఱి కిని దర్శనమిచ్చినది. మధ్యాహ్నము బీద లయు, బ్రాహ్మణులయు సంతర్పణలు జరిగి నవి. భోజనానంతర మామె విశ్రాంతి తీసు కొనినపిమ్మట నంతఃపురమునందలి పెద్దకచ్చేరి సావడిలో సాక్షరనారీసభ జరిగినది. ఆ వర్షపు వర్ధంతిలో భగవతి శుభ్రాంగి గురు కులములో చదువుకొని కవిత్వము చెప్పఁగల కన్యకల కవిత్వపరీక్ష జరుగునని ముందే చేటీ జనాధ్యక్షురాలు భృంగాలక ప్రకటించి

యుండినది. రాజధానియందలి చదువుకొనిన స్త్రీలందఱును సభలో సన్నిహితలైరి.

నారీసభా ప్రేక్షణార్థము గూర్చిన పురుషుల యాసనపంక్తుల వరుస యొకప్రక్కనుండెను. పదునేడుగురు పెద్దమనుష్యులాభాగమున మొదటి పంక్తిలో నుపవిష్టులైరి. ఆ పంక్తిలో మధ్య మహారాజు సుచంద్ర భట్టారకుఁడు కనకసింహాసనమునఁ గూర్చుండెను. అతని దక్షిణ పార్శ్వమునందు కుమారభోగనాథుఁడును, వామపార్శ్వమునందు కుమార శక్తిధరుఁడును గూర్చుండిరి. భోగనాథునకు కుడివైపు వరుసగా చిత్రకూట మహామండలేశ్వరుని కుమారుఁడు దండనాయక రణేశ్వరుఁడును, మహామంత్రి సునందుఁడును, రాష్ట్రియుఁడు వీరనందుఁడును, మహాసమాహర్త హేమచంద్రుఁడును, కోశాధ్యక్షుఁడు గుణాకరుఁడును, దూతసామంతుఁడు విశాలాక్షుఁడును, రాజపద్ధతుఁడు దండనాయక చండసేనుఁడును గూర్చుండిరి. శక్తిధరుని కెడమవైపు వరుసగా సేనాపతి రణంధరుఁడును, పురోహితుఁడు వాణీశ్వరుఁడును, మహాప్రాడ్వివాకుఁడు సత్యవ్రతుఁడును, సచివుఁడు రూపచంద్రుఁడును, బ్రహ్మకుల పరిషత్పతి ధర్మపాలుఁడును, ఆచార్య విషమసిద్ధియు, ఆచార్య భవనందియును గూర్చుండిరి.

నారీసభలో ప్రత్యేకముగా నమర్పఁబడిన యెత్తయిన వేదికలో మధ్య నున్నత కనకాసనమున లీలావతీదేవి కూర్చుండెను ఆమె దక్షిణపార్శ్వమున భగవతి శుభ్రాంగియు, వామపార్శ్వమున యోగీశ్వరి ధవలాక్షియును గూర్చుండిరి. రత్నాంగీ హేమాంగులను నిరువురు చేటికలు చామరములతో రాణిగారికి విసురుచుండిరి.

సమప్రదేశమున వేయఁబడిన యాసనపంక్తులలో మొదటి పంక్తియందు పదుముప్పురు స్త్రీలు కూర్చున్నారు. మధ్య నన్నత కనకాసనమున రథినీకుమారి కూర్చుండినది. ఆమె కుడిపార్శ్వమున వరుసగా మన యున్మత్తసిద్ధేశ్వరి రాజకాళియు, పూర్ణయు, మణిమాలయు, మధువాణియు, ఆమె సవతి తల్లి కాంతామణియు, నాగకన్య పర్ణినియును గూర్చుండిరి. పూర్ణారథిను ప్రయత్నము వలన రాజకాళి యీసభకు వచ్చినది. ఆమె మాటిమాటికిని పోవనుంకించుచుండెను గాని యుభయ పార్శ్వములందు పూర్ణారథిను లామె నాఁపుచుండిరి. రథినీకుమారి కెడమ వైపు వరుసగా ఫలినియు, భానుమతియు, వీరసింహుని చెల్లెలు విలాసవతియు, కనకవల్లియు, విశాలాక్షుని కూఁతురు కుముదాక్షియు, ధరణియును గూర్చుండిరి. భృంగాలక, ధారావతి, జ్ఞానేశ్వరి, చంపావతి, పద్మాక్షి, కాత్యాయని, కామసేన మొదలగు పురనారీమణులు చాలమంది సాక్షులు వెనుకపంక్తులలో కూర్చుండిరి.

ఆంధ్ర సామ్రాజ్యము యొక్కయే గాక ప్రపంచమంతటియొక్క సౌందర్యమా నారీసభయందు కేంద్రీకృతమై యుండెనని చెప్పవచ్చును. సౌందర్యతత్త్వజ్ఞుఁడగు రాజసచివుఁడు రూపచంద్రుఁడు తన మనంబున నేమనుకొనుచున్నాఁడో గమనింతము.

"ఈ రథినీకుమారి శరీరప్రభను జ్యోతిర్మయామృతమని చెప్పవచ్చును. ఈమె ముఖమును శీతల దివాకరమండల మని



౪ వెనుకటి సంగతులు

—ఏ. యన్. రావు.

చెప్పిన సరిగా నుండును. ఈమె తనజ్యోతిస్సులో సభాశాల నంతటిని ముంచివేయుచున్నది. ఈమె సౌందర్యము మనుష్యజాతి దుర్లభము. ఈమె నొకసారి చూచునెడల మహేంద్రుఁడు తన వేయికనులు సార్థకములయ్యెనని తలంచును.

ఈ పూర్ణయొక్క చక్కదనము మాత్రాతీతము. వ్యాయామవిభక్తము లగు నీమె యంగములు సౌష్ఠవము నిరుపమానము. ఈమెకు స్వయంవరము చాటించు నెడల నింద్రాగ్నియమ వరుణులు మఱియొకసారి భూమికి దిగకమానరు. శ్రీ శైలమహామండలేశ్వరుని యేకపుత్రి రత్నప్రభను బెండ్లియాడి మహామండలేశ్వరపదవి పొందుటకంటె నీమెను బెండ్లియాడి సామాన్యగృహస్థుఁడుగా నుండుటయే భాగ్యమని నాతలంపు.

ఈ మణిమాల బ్రాహ్మణజాతికి కీర్తి తీసుకొనివచ్చిన సుందరి. మానవజాతికి కీర్తి తీసుకొనివచ్చిన దివ్యలావణ్యవతి. వికసించిన పద్మమునందువలె నీమెముఖమునందు మహాలక్ష్మి వాసము సేయుచున్నది. చతుర్ముఖుఁడీమెను చక్కగా నిదానించి విలోకించు నెడ నతనికి తిలోత్తమ స్మరణకు రాకమానదు.

ఈ ఫలిని పోతపోసిన శరచ్చంద్ర చంద్రిక. భూమికి దిగిన భారతీ తేజోంశము. మూర్తీభవించిన ప్రసన్నత. ఈమెను వీక్షించునెడల మహేశ్వరుఁడు చిరకాలమునుండి తాను తలపై మోయుచుండిన గంగాదేవిపై కొంచెమవజ్ఞ వహింపకుండ నుండఁజాలఁడు.

ఈ మధువాణి స్థిరమై భూమియందు సంచరించు విద్యుల్లత. ప్రాణములతో వెలసిన బంగారుబొమ్మ. బంగారమునందు కాంతి న్యమొక దుర్గుణమున్నది. ఈ క్రొత్త బంగార మత్యంత సుకుమారము. ఈమె నొకసారి యాలోకించు నెడల నారాయణుఁడు తాను వక్షఃప్రదేశమున ధరించు మహాలక్ష్మిని కొంచెము పరిహసింపకమానఁడు.

ఈ ధరణి యధికాలంకారములు లేనిదియయ్యు చక్కగా నలంకరించుకొనిన సంపన్న కన్యలను మించి శోభించుచున్నది. ఈమె జ్యోతిష్మద్విశాలనేత్రములే యీమె ముఖమున కలంకారము. ఈమె శ్యామలమైనను లావణ్యతరంగమాలినిగా నున్నది. కృష్ణద్వైపాయనముని యీమె నొకసారి విలోకించు నెడల తన జయేతిహాసనాయిక పాంచాలియే యింకొకసారి భూలోకమున నవతరించెనని వర్ణింపకమానఁడు.

ఈ పర్ణిని స్వర్గము మన లోకమునకు పంపిన యచ్చర. ఈమెను జూచినను ఈమెతో మాట్లాడినను, ఈమె సంగీతము వినినను మనుష్యుల పుణ్యఫలము కొంత వ్యయమగుచుండును. ఈమె నొకసారి దర్శించు నెడల నలకూబరుఁడు రంభపై నించుకయనాదరము చూపకమానఁడు.

ఈ భానుమతి వేదిగతాగ్ని జ్వాలవలె పవిత్రమూర్తియై వెలుంగుచున్నది. ఈమె పక్ష్మల విశాలనయనము లపరిచిత విలాసములైనను యువజనుల నాకర్షింపఁగలిగియున్నవి. ఈమె శాస్త్రవిజ్ఞానము ప్రసన్నముఖకళకు మఱింత మెఱుంగుపెట్టుచున్నది. ఈమెను వీక్షించు నెడల వైశ్వానరుఁడు తనప్రియకాంత స్వాహాదేవియే యని భ్రమపడక మానఁడు.

ఈ కనకవల్లి యభిమాని దేవతవలె సౌందర్యమును పోషించుచున్నది. అమూల్య


3- 5

వస్త్రాభరణము లాసౌందర్యమును ద్విగుణముగా ప్రదర్శింపుచున్నవి. ఈమె కోటీశ్వరుని యేకపుత్రియగుటచే నీమెకు చెందవలసిన మహాసంపద యీామె సౌందర్యపు వెలను హెచ్చించుచున్నది. కాత్యాయనికలన నీమె కామశాస్త్రము నభ్యసించినది యని వినికిరి. ఈమె నొకసారి చూచు నెడల మిత్రావరుణు లూర్వశిని స్మరింపకమానరు.

ఈ కన్యానవకము శ్రీకాకుల నగరి యందలి యమూల్యరత్న నవకము. పురము నందలి యువకులు వీరిలో నొకరినైన చూడని దినము దుర్దినమని తలంతురు. వీరి ప్రభావము వలననే శుభ్రాంగీగురుకులమునకు కీర్తి వచ్చినది. మహిమ హెచ్చినది. ఆనుల కది యొక యాత్రాస్థలమైనది. కృష్ణానదీ యాత్రకు వచ్చిన ప్రతివ్యక్తియు నీ తొమ్మిది దేవతా విగ్రహముల నొకసారి దర్శించిపోవలసినదే.

ఈ కుముదాక్షి నయవేత్తయగు విశాలాక్షునిచేతి జృంభకాస్త్రమై యున్నది. ఈమెచూపులు మదనజృంభకాస్త్రజ్వాలలేయగును. విశాలాక్షుఁడీ యస్త్రమును కుమారభోగనాథుని సాధించుటకు దాఁచి యున్నాఁడు. ఈమె తన తండ్రియొద్దనే సర్వవిద్యల నభ్యసించినది శుభ్రాంగీ గురుకులము నందలి తొమ్మిది రత్నములకు తీసిపోవని పదియవ రత్న మిది. ఈమె యంగములు కొంచెము మోటుగానుండినను పరిపుష్టములై లావణ్య వంతములై యొప్పారు చుండును. ఈమెతండ్రి విశాలాక్షుఁడు నగరవాసము నొల్లక గ్రామమునందు వసించుచుండుటచే నీమెకు నాగరికత యంతగా నలవడ లేదని కొందఱు తలంచెదరుగాని యది పొరపాటు. వెయినగరముల పెట్టంచు తండ్రి సహవాసమున్నది యీామెకు. దూతసామంతుఁడీ మహాస్త్రమును భోగనాథుని సాధించుటకు సమర్థమని నమ్మియున్నాఁడు. హిరణ్యనాభుని సువర్ణముల ధ్వని కుమారు నాకర్షించుచున్నది గాని యతనిని తన ప్రక్కకు త్రిప్పుకొనుట విశాలాక్షున కసాధ్యముగాదు. కనకవల్లి చక్కదనము సురారసము. కుముదాక్షి చక్కదనము సోమరసము.

ఈ విలాసవతి సార్థకనాముకరాలు. ఈమెసౌందర్యము బహు యువతి సాధారణమైనను మంజుల విలాసములచే నది యధికము సేయఁబడుచున్నది. ఈమె నవ్వినను చూచినను మాట్లాడినను నడిచినను ఏమి చేష్ట చేసినను మన్మథుఁ డాకర్ణాంతకృష్టబాణుఁడై యచ్చట సన్నిహితుఁడగుచుండును. ఈమెవిలాసములను జూచునెడల నందికేశ్వరుఁడు తన కామశాస్త్రములో నూతనాధ్యాయము నొకదానిని చేర్చియుండును.

ఈ కాంతామణి యోగులమనంబుల నైన చలింపఁజేయఁగల చారుగాత్రి. విలాసవతిని మించిన విలాసవతి. కనకవల్లిని మించిన కామతంత్రజ్ఞురాలు. ధనలుబ్ధుఁడగు తండ్రిచే ముసలివాని మెడకు కట్టఁబడినది. అదియును లోకోపకారముకొఱకే యగుచున్నది యని వీరసింహబాబుచెప్పుటగలదు. అతఁడు చెప్పినదివాస్తవమేయనుకొన్నను ఈమెనిరపరాధురాలనియే నా యభిప్రాయము.

ఈ రాజకాళిసౌందర్యము మలినవేషమువలన నివురుగప్పిన నిప్పువలె నున్నది. ఈమె నోరెత్తిన చెవులుగలవారందఱు నీమెచేతిలోఁబడిపోవలసినదే. ఈమెకంఠములో

సర్వేశ్వరుఁ డుంచిన మాధుర్య మపారము. ఈమెవిశాలనేత్రములలోనిజ్యోతిస్సుయొక్క యాకర్షణశక్తి యద్భుతము. ఈమె కవితయం దలి భావము లత్యంతరమణీయములు. ఈమె యున్మాదము లోకోపకారకముగా నున్నది.

ఉన్నతవేదికపై కూర్చుండిన ముప్పు రిలో నొకతె (లీలావతి) తన సౌందర్యప్రతా పముచే నాంధ్రేశ్వరుని వశపఱచుకొని యీ గొప్ప సామ్రాజ్యమునే యేలుచున్నది. మఱియొకతె (ధనలక్ష్మి) నిశ్చయముగా తన సుందర సుఖభాగ్యముచేతనే జనుల నాబాల గోపాలము వశపఱచుకొని దేవతవలె శాసిం చుచున్నది. కీర్తిమాత్ర మీయామె యోగమహి మకు వచ్చినది. ఇట్టి మహాద్భుతశక్తిగల నారీమణి యే యుత్తమపురుషునైన గ్రహింప కుండుట చింతాకరము. ఇంకొకతె(శుభ్రాంగి) జటావల్కలధారిణియై మూర్తీభవించిన విరక్త తవలె కన్పట్టుచున్నది. అట్లయ్యు నీమెసౌంద ర్యము నేత్రపారణ మొనరించుచునేయున్నది.

వెనుక పంక్తులలో నీ భృంగాలక మన్మ థుని మధుకశవలె నొప్పారుచున్నది. ఈ ధారావతి సౌందర్యామృతధారవలె కనులకు విందుసేయుచున్నది. ఈ కాత్యాయని విర క్తుల లోచనరోచకమును భాఙ్గద్రోలు రసాయన మనియే చెప్పవచ్చును. ఈమె విధవయయ్యును కౌలికవిటుల కారాధ్యదేవత యగు వీరకౌలికురాలు. కామశాస్త్రమున కీమె యాచార్యపీఠము.సరసోక్తు లీమెస్థిరాస్తి. హాస్యోక్తు లీమెచరాస్తి.

ఈ కాత్యాయని కూఁతురు కామసేన తల్లిని మించిన చతురురాలును, సుందరియు నగును. కామశాస్త్రములో నీమె కనకవల్లికి సహాధ్యాయిని యఁట.

ఈ వీరభద్రావధాని కూఁతురు పద్మా క్షి. మధువాణిని మించిన సుకుమారియు. తేజ స్వినియు నగును. విలాసవతివిలాసము లాహా ర్యములు. ఈమెవిలాసములు సహజములు. అక్షోభ్యముని ప్రసాదమువలన నీమె శ్రుత ధరురాలయ్యెను. ఛాందసునియింటఁ బుట్టి యీామె విశేషముగా రాణింపకున్నది. స్త్రీ విద్యాద్వేషియగు వీరభద్రావధాని యీ పిల్లను శుభ్రాంగీగురుకులమునకు పంపక పాడుచేసియున్నాఁడు. మొన్నమొన్ననే యీామె ఋతుమతియైనది. అప్పుడే దీని పెండ్లి కవధాని తొందరపడుచున్నాఁడు.

ఈ యక్కసెల్లెండ్రు జ్ఞానేశ్వరీ చంపా వతులు చిత్రాస్వాతీ నక్షత్రములువలె నారీ సభలో వెలుఁగుచున్నారు. వీరు కవల పిల్లల వలె మిక్కిలి రూపసామ్యము గలిగి యున్నారు. కొన్ని చిన్నభేదములు గలవు. జ్ఞానేశ్వరిముఖము గంభీరము. చంపావతి ముఖము ప్రసన్నము. జ్ఞానేశ్వరి పాటలవర్ణ ములో కొంచెము రక్తాంశమెక్కువ. చంపా వతిపాటలవర్ణములో కొంచెము ధవలాంశ మధికము. వీరిలో నొకతె ప్రోషితభర్తృక. ఇంకొకతె విధవ. అందువలన వీరి సౌందర్య మడవిఁ గాచిన వెన్నెలవలె నిరర్థకమై యున్నది వీరు కాత్యాయనివలెఁగాక యేక పత్నీత్వ వ్రతమును కాపాడుకొనుచు కఠోర ము లగు కంచుకవచములను వేసుకొని యున్నారు. సర్వత్ర దోషదర్శియగు కాణ్వ శుకనాసుఁడుగూడ వీరిని మహాపతివ్రత లని యంగీకరించియున్నాఁడు."

# పు నా ది రా యి

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

### మొదటి రంగం

[హస్తినాపురం రాజభవనాల్లో కుంతీదేవినగరు. మేడమీద వొక విశాలమైనగది. అది విలువగల వస్తువులతో చక్కగా అలంకరించబడివుంది. కుంతీదేవి, ఆగదిలో, ఎడమచేతిమీద ఆనుకుని, కొంచెం వొరిగి రత్నకంబళీమీద కూచునివుంది. వితంతువు కనక, ఆమె, అంచులులేని లేతగులాబీరంగుచీర కట్టుకుని, ఆలాంటిదే కంచుకం తొడుక్కుని వుంది. ముక్కున బులాకీ, మెడలో వొక రత్నహారం, చేతులకు కంకణాలూ పోచీలూ, ఎడమచేతి అనామికకు రత్నాలు పొదిగిన వుంగరం—ఇంతే ఆమె ధరించిన నగలు. నడివయస్సు. మొగమ్మీద మంచికళ వుంది. పైగా, అప్పుడు అపూర్వమైన వుత్సాహంతో వుంది.

ఎదుట, నూనూగుమీసాల వసుషేణుడు చేతులు కట్టుకుని వినయంగా నుంచుని వున్నాడు.

కుంతిఆజ్ఞవల్ల దాసీలందరూ తలోపనిమీదా కిందికి వెళ్లిపోయివున్నారు.

సమయం: మధ్యాహ్నం జాముపొద్దువేళ.]

కుంతీదేవి—అలాగా?

వసుషేణుడు— చిత్తం అమ్మా! మా నాయన వృత్తి దివాణంలో కొలువు. సారథ్యం చేస్తాడు. రాజపుత్రులకు అశ్వారోహణం, గజారోహణం, రథచోదనం—ఇలాంటివి నేర్పుతూకూడా వుంటాడు అమ్మగారూ!

కుంతీదేవి—మీ అమ్మపే రెవరు నాయనా?

వసుషేణుడు—మా అమ్మపేరు రాధ.

కుంతీదేవి—రాధా? నీకు బాగాతెలుసా?

వసుషేణుడు—మాఅమ్మపేరే నాకు తెలవకుండా వుంటుందా అమ్మా?

కుంతీదేవి—కొడుకులు తల్లిని పేరుపెట్టి పిలవరు కాదూ? అంచేత నీకు తెలవదేమో అనుకున్నానోయ్!

వసుషేణుడు—తమరు సెలవిప్పించింది నిజమే; కాని యితర్లు పిలిచినప్పుడేనా తల్లిపేరు కొడుక్కి వినపడకుండావుంటుందా అమ్మా? అదీకాక. ఎంత పనివుండినా, కొడుకు తల్లినీ, తల్లి కొడుకునీ విడిచివుండడం కష్టం గదా, యేదోవిధంగా కొడుక్కి తల్లిపేరు తెలవకుండా యెలావుంటుం దమ్మగారూ?

కుంతీదేవి—కన్నకొడుకుని శాశ్వతంగా విడిచిపెట్టేసివుండే తల్లిపీనుగులు లోకంలో వుండ రంటావా నాయనా? లేకపోతే, అలాంటి రాకాసులు తల్లులే కారంటావా?

వసుషేణుడు—అమ్మా! అంతటి దారుణప్పని చెయ్యవలసిన అవసరం, తల్లికి, యెలాంటి సందర్భంలో నేనా వస్తుందా? ఏమో, లోకంసంగతి నాకు బాగా తెలవ దమ్మగారూ! నే నెక్కడికేనా వెళ్లి ఇంటికి రావడం క్షణం ఆలస్యం చేసినా, మా అమ్మ, నాకోసం పరితపించిపోతూ వీథిగుమ్మంలో నుంచునివుంటుంది. ఒక్కొక్కప్పుడు వీథిచివరిదాకా వచ్చి యెదురు చూస్తూ వుంటుంది. మా అమ్మని విడిచి బయట చాలాసేపు మసలడం నాకూ కష్టంగానే వుంటుంది. మా అమ్మపేరు నాకు బాగా తెలుసు నమ్మగారూ! మా అమ్మపేరు రాధ. ఇరుగుపొరుగువారు మా అమ్మను రాధమ్మా అని పిలుస్తారు. మా అమ్మపేరు రాధ కావడంవల్ల నాకు అసలుపేరొకటి వుండినా మాకులంవారు నన్ను రాధేయుడని కూడా పిలుస్తూవుంటారమ్మా! నగరంలో కూడా యీపేరు చాలామందికి తెలుసు.

కుంతీదేవి—నీ అసలుపేరేమిటీ మరిచిపోయానూ?

వసుషేణుడు—వసుషేణుడు అమ్మగారూ!

కుంతీదేవి—వసుషేణుడా? ఎంచేతో గాని నా కా పేరు ఎలాగో—చాలా కొత్తగా కనపడుతోం దోయ్! అయితే, మరో పేరుకూడా యేదేనా వుందా నీకు?

వసుషేణుడు—లేదండి—(అర్ధోక్తి)

కుంతీదేవి—ముఖ్యం మూడుపేర్లుంటారులే పెద్దలు. అంచేత—(అర్ధోక్తి)

వసుషేణుడు—లేదమ్మగారూ! లేదు. నాకు మూడోపేరు లేదు, రెండే పేర్లున్నాయి. ఒకటి వసుషేణుడు. రెండోది రాధేయుడు.

కుంతీదేవి—నీపేర్లు చాలా బాగున్నాయి నాయనా! కాని నిజంచెప్పనద్దూ? రాధేయుడనే పేరి కంటే, నాకు, వసుషేణుడనే పేరే ముద్దుగా వుంది. అయితే, మధ్యవచ్చిన పేరయినా అది యిక పోదులే. పాపం నిన్ను చాలాసేపు నుంచోపెట్టాను. ఎన్నిమాట్లు కూచోమన్నా కూచున్నావే కాదోయ్! అయితే, కబురు పంపిస్తే మాటతీసెయ్యకుండా వచ్చి హృదయాని కుత్తేజనం కలిగేటట్టు యించక్కటి పాట పాడావు పాపం. అంతే చాలు. మీ అమ్మమాట తీసెయ్యవు నువ్వు. ఏమోయ్? అవునా? మీ అమ్మ మాట కూడా తీసెయ్యవు కాదూ నువ్వూ?

వసుషేణుడు— తల్లిమాట వేదవాక్యంకంటే గొప్పది కాదండీ అమ్మా? తల్లిమాట తిరస్కరిస్తే కొడుక్కి జయం కలుగుతుందా అమ్మగారూ?

కుంతీదేవి—కలగదు నాయనా కలగదు. నువ్వు సరిగా చెప్పావోయ్! నీకన్నీ బాగా తెలుసునోయ్! కాని నిన్ను చాలాసేపు నుంచోపెట్టాను పాపం. వస్తానుండేం?

(కళ్లు తిప్పుకుంటూ యిలా అడిగి, కుంతి దిగ్గున లేచి మరోగదిలోకి వెడుతుంది. ఆమె అలా వెళ్లిన వెంటనే "అమ్మగారూ!" అని పిలుస్తూ, అర్జునుడు వొక్కదూకున వచ్చి, వసుషేణుణ్ణి చూచి ఠకీమని ఆగిపోతాడు.)

అర్జునుడు—(దర్పంగానూ, ముంగోపంతోనూ) ఎవరు నువ్వు?

వసుషేణుడు—నేను సూతుణ్ణి. నా పేరు వసుషేణుడు. వీథిలో నా దారిని నేను వెడుతూ వుండగా నన్ను కుంతీదేవమ్మగారు పిలిపించారు.

అర్జునుడు—కుంతీదేవమ్మగారు నిన్ను పిలిపించారూ? సూతుడవై వుండికూడా మేడపైకి వచ్చి, పైగా నిర్భయంగా రత్నకంబళీమీద నుంచుంటావూ? ఏమి పొగరూ?

వసుషేణుడు—(కొంచెం చురుగ్గా చూస్తూ) అయ్యా! మాటలు మిగలవద్దు. కుంతీదేవమ్మగారు నన్ను పిలిపిస్తేనే వచ్చాను. నేనే యేమిటో వూరుకున్నాను; గాని కుంతీదేవమ్మగారు నన్ను యీరత్న కంబళీమీద కూచోమనే సెల విప్పించారు చాలామాట్లు. అయితే, కూచోడానికీ కాక, నుంచోడానికీ కాక రత్నకంబళీ మరెందుకూ?

అర్జునుడు—(తల పూపుకుంటూ) కుంతీదేవమ్మగారు నిన్ను కూచోమని ప్రార్థించారేం? (హేళనగా) గొప్ప రాజపుత్రుడవనీ పాపం! (తల పంకిస్తూ) ఓ-హో!

వసుషేణుడు—కూచోడం అనేది మనుష్యమాత్రు లందరికీ సామాన్యధర్మం. ఒక రాజపత్ని స్వయంగా కూచోమని సెలవిచ్చినప్పుడిక యెటివాళ్లేకులం వారయితే యేమి? కాక: రాజు కావడంలో వుంది; కాని రాజపుత్రుడు కావడంలో యేమీ విశేషం లేదు.

అర్జునుడు—అబ్బో! మాటలు నేర్చావు. పిట్ట కొంచెమయినా కూత ఘనంగానే వుంది. అయితే, మళ్లీ మాట్లాడావంటే చెవడా లెక్కతీసేస్తాను భద్రం!

వసుషేణుడు—(పిడికిళ్లు బిగించి, పళ్లు కొరుకుతూ) మాటలు మిగలవద్దన్నాను. (తల పంకిస్తూ) తెలిసిందా? ("హు హు" అంటూ వెటకారంగా నవ్వి) చాలామందిని చూశాను నేను.

అర్జునుడు—(మండిపడుతూ) అరే, తుచ్ఛుడా! (మీదకి వురకపోతాడు.)

(సరిగా అప్పుడు అతివేగంగా కుంతి వస్తుంది. ఆమెను చూసి కొంచెం జంకుతూ అర్జునుడు నిలిచిపోతాడు. కుంతిచేతిలో వొక ఫలం వుంటుంది.)

కుంతి—(కోపంగా) ఏమిటి అర్జునా, ఆదురుసుతనమూ? నీకేం, మతి వుందా, పోయిందా? (వసుషేణుడికేసి తిరిగి) నువ్వు తొందరపడకోయ్ నాయనా! (అర్జునుడికేసి తిరిగి) ఇతణ్ణి నేను రమ్మన్నాను. నీకీ తొందరేం? సంగతి యేమిటో తెలుసుకోకుండా దుడుగూ దుడుగూ మాటలనేస్తావా? తాతయ్యగారికీ, పెద్దబాబయ్యగారికీ కబురుచేస్తా నుండు. అన్నా, ఆగడమూ?

అర్జునుడు—(చేతులు జోడించుకుని సవినయంగా వంగుని) క్షమించండి అమ్మగారూ! ఒకానొక సూతపుత్రుడు రత్నకంబళీమీద నాతో సమానంగా నుంచుంటే చూసి సహించలేకపోయాను. ఇంకెప్పుడూ యిలా చెయ్యను.

కుంతీదేవి—అతను రత్నకంబళీమీద నుంచుంటేనే పోయిందా నీగౌరవం? పోనీ, నేను వచ్చేదాకా వుండకూడదూ? అంత తొందరేం నీకూ? ఇంకెప్పుడూ యిలా చెయ్యవు గదా?

అర్జునుడు—(అలాగ చేతులు జోడించుకునే వుండి) చెయ్యనండి అమ్మగారూ, చెయ్యనండి. తాతయ్యగారికీ, పెద్దబాబయ్యగారికీ కబురుచెయ్యకండి అమ్మగారూ! (మోకరిల్లి ప్రార్థిస్తాడు.)

కుంతీదేవి—సరేలే. ఇక లే.

అర్జునుడు—(లేచినుంచుని చేతులు కట్టుకునే వుంటాడు.)

కుంతీదేవి—కిన్నెరలుమోగినట్టు పాడుకుంటూ వీథిలో వెడుతూవుంటే ప్రాణాలు లేచివచ్చి యితణ్ణి నేను రమ్మని కబురుపంపాను. బుద్ధిమంతుడు కనక కూడదన్నాడు కాడు; గాని నేను కూడదోమనే అన్నాను పాపం! నా సెలవు లేకుండా యిక్కడికి కెవరు రాగలరూ? వచ్చి యేం చెయ్యగలరూ? ఈమాత్రం తోచవద్దూ నీకూ?

అర్జునుడు—(కుడికాలి బొటనవేలితో కింద రాస్తూ మొగం వంచుకుంటాడు.)

కుంతీదేవి—సరేలే. ఎందుకూ యిలావచ్చావూ?

అర్జునుడు—అన్నయ్యగార్లూ, తమ్ములూ, నేనూ తోటకి వెడదాం అనుకున్నాం. పెద్దన్నయ్యగారు, ఈసంగతి తమతో మనవిచేసుకుని సెలవు పొంది రమ్మని పంపారు నన్ను.

కుంతీదేవి—సరే వెళ్లండి. కావలసిన పళ్ళూ, అవీ ఆరగించండి. కాని అక్కడ అల్లరి చెయ్యకండేం?

అర్జునుడు—చిత్తం అమ్మగారూ!

కుంతీదేవి—చెట్లూ చేమలూ విరిచీ, తీగలూ ఆకులూ తెంపీ పోసులు పెట్టవద్దన్నానని భీమసేనుడితో గట్టిగా చెప్పు. చీకటి పడకుండా మళ్లీ యింటికి రండేం?

అర్జునుడు—చిత్తం అమ్మగారూ! (శిరస్సు వంచుకునీ, చేతులు జోడించుకొనీ వుండి వెనక్కి వెనక్కి నడిచి వెళ్లిపోతాడు.)

కుంతీదేవి—(వసుషేణుడితో) నాయనా! జరిగినదాని కేమీ అనుకోకమ్మా! ఇతను నా మూడో కొడుకు. నిన్నెప్పుడూ చూసివుండడు. అంచేత అలా చేశాడు; గాని మరేమీ లేదుసుమా! ఇదిగో యీ పండు పుచ్చుకుని యింటికివెళ్లి, పుత్రప్రీతితో కుంతీదేవమ్మగా రిచ్చారని రాధమ్మతో చెప్పి కమ్మగా ఆరగించు. (అందించపోతుంది.)

వసుషేణుడు—(అది అందుకోకుండా) అమ్మా! ఏలినవారికి చాలా చాలా నమస్కారాలు. పండు వుంచండి అమ్మా! తమకి అనుగ్రహం వుంది, అంతే చాలునండి. ఆపండు పట్టుకువెళ్లి ఆరగించడానికి తగినంత వుల్లాసం లేదు నాకిప్పుడు. నా మనస్సంతా చెడిపోయింది. నాకు జ్ఞానం వచ్చాక వొకరిచేత మాట అని

పించుకోడం యిదే మొదటిమాటు. ఇంతవరకూ నేను వొకరి ననకుండా, వొకరిచేత ననిపించుకోకుండా మెలకువగా కాలం గడుపుకువస్తున్నాను; కాని అదంతా యివాళ నిష్ఫలం అయిపోయింది. ఇక నా కీ ఫలం యెందు కమ్మా?

కుంతీదేవి — ఆదేమిటోయ్? ను వ్వీపండు పుచ్చుకుంటేగాని వల్లకా దోయ్! నేను కోరుతున్నాను, మనస్సు సరిచేసుకో నాయనా! నీకంటే చిన్నవాడు కాదూ అతనూ? కుర్రతనంకొద్దీ అలా చేశాడు; కాని మరేమీ లేదు. పోనీ, అతను చేసిన తప్పుకి నేను—అది నేనే చేశా ననుకో. నాతప్పు క్షమించి నన్ను మన్నించు. ఏం, సరా?

వసుషేణుడు—(చెవులు మూసుకుని) అమ్మా, అమ్మా! నేను వినలేను. ఏలినవారు నన్ను క్షమించ మనడమా? ఎంత మాటా? ఎంత దారుణమైన ఆఘాతమూ? తమ రన్నమాట నా పేసుకు తోడేస్తోంది. తమ సేవకుణ్ణి నేను. (వంగి నేల ముట్టుకుని కళ్ల కద్దుకుని) తమ రలా సెలవిస్తే నాకు జయం కలగదు. అనుగ్రహించండి అమ్మగారూ!

కుంతీదేవి—నీ మనస్సుకి అంత కష్టం కలిగించానా? నీహృదయాని కంత ఆరాటం కలిగించానా? మరిచిపో నాయనా! నీమనస్సు చెడిపోయిం దనే టప్పటికి నా మనస్సు కూడా చెడిపోయి, యేమంటున్నానో తెలవక — అయితే లే. ఈ కాస్త సేపటిలోనూ వంద మాట్లేనా అమ్మా అన్నావు నన్ను. నువ్వూ నాకొడుకుల్లోనే లెక్క. (పండు అందిస్తూ బతిమాలుతూ) అదంతా మరిచిపో తండ్రీ! ఇది పుచ్చుకుని ఆరగించు నాన్నా!

వసుషేణుడు—మహాప్రసాదం! (వంగి పుచ్చుకుని కళ్ల కద్దుకుని) నన్ను దీవించి సెలవిప్పించండి తల్లీ!

కుంతీదేవి— నాన్నా! ని న్నేకవిధాల కష్టపెట్టాను నేను. నామూలంగా, ఇవాళ, నీ వుల్లాసం అంతా చెడిపోయింది. నా కళ్ళయెదుట నీకు మర్మాఘాతం అయేటట్టు ప్రవర్తించాను నేను. నాన్నా! అసహాయురాలిని. ఏమి చేయగలనూ? నా బ్రతు కంతా ఇలాంటి ఆవేదనలతోటే బండబారిపోతోంది. అయితే లే. ఇంకే మనుకున్నా యేమీ లాభం లేదు. ఇక నీ క్షేమి లోటు కలగదు. నీఆభిజాత్యం దేవతాదుర్లభంగావుంది నీధవివ్యక్తి తేజోవంతంగా కనపడుతోంది. నువ్వు గొప్పగొప్పవా ళ్ళందరిలోనూ మహామహా గొప్పవాడివి అవుతావు. సందేహం లేదు.

వసుషేణుడు—అమ్మా! ధన్యుణ్ణి. హృదయపూర్వక మైన రాజమాతదీవన పడసిన యీదినం నాజీవితంఅంతటికీ మణిభూష. అమ్మా! చూసినకొద్దీ యీ లోకం యాతనాబంధురంగా కనపడుతోంది. అన్నీ దుర్లక్షణాలే; కాని యిలాంటి బంగారుసన్నివేశం వొక్కొక్కటి సంభవిస్తే వెనకా ముందూ సంభవించిన వన్నీ క్షణంలో మరిచిపోయి నిర్మలమైన ఆనందం పొందవచ్చు. మరి సెల విప్పించండి అమ్మా!

కుంతీదేవి—చాలా సంతోషం. నాన్నా! నువ్వీవీధి కెప్పుడు వచ్చినా నాకు కనపడకుండా వెళ్ళవద్దు. వూరకే వెళ్లక, యిందాకటిలాగే యేదో పాడుకుంటూ వెళ్లు. అది విని నేను నీకోసం మారామలక్ష్మిని పంపుతాను. నీకంఠం యెంతో ముద్దులు మూటకడుతోంది కళ్లుతిప్పుకుంటూ నువ్వు పాడినంతసేపూ నామనస్సు పొంగిపోయింది. ఎన్నివిధాల బతిమాలినా కూచునిమాత్రం నాకు సంతోషం కలిగించావు కా దోయ్!

వసుషేణుడు—తమ సన్నిధిని కూచోడానికి నా కెన్నివేల గుండెలున్నాయి అమ్మా? రోజూ తమరు దివాణంలో వింటూవుండే పాటలముందు నాపాట యేపాటి దమ్మగారూ?

కుంతీదేవి—ఎవరి పాట వారి కలాగే వుంటుంది లే. ఇంత చక్కని పాట నే నెప్పుడూ వినలేదు. చూడూ. మా అబ్బాయిలకు పాట అంటే యెంతో సరదా. నువ్వు పాడినంతబాగా పాడలేరు; గాని కాస్తో కూస్తో అందరూ పాడతారు. ంతవరకూ ఆ పాటలు వింటూనే నేను సంబరపడుతున్నాను. రేపు ఈ పాటివేళ నిన్ను మా అబ్బాయిల కందరికీ చూపిస్తాను. వాళ్లు

చాలా మంచివారు. అర్జునుడేనా యిప్పుడేదో చిరాకుగా వుండి అలాచేశాడు; గాని అతనుకూడా చాలామంచివాడు. ఎందుకూ? మా అబ్బాయిలకీ నీకూ క్షణంలో స్నేహం కలిపేస్తాను కాదూ? నిన్ను వారు చాలా ప్రేమతో చూసేటట్టు నేను చేస్తా కాదూ? నువ్వుమాత్రం రోజూ నాదగ్గిరకాస్సేపు కూచుని యేదో పిచ్చాపాటీ—వొకటో రెండో పాటలు పాడుతూ వుందువుగాని. ఏం? వస్తావా?

వసుషేణుడు—అమ్మా! (నసుకుతాడు.)

కుంతీదేవి—వల్లకాదు. వస్తా ననాలి. తప్పకుండా రావాలి కూడాను. ఏం? ఊ అను. చూడూ. అబ్బే! మా అర్జునుడు చాలా మంచివాడోయ్! వారందరిలోకీ అతనే నిన్ను బాగా ప్రేమిస్తాడు చూస్తూ వుండు. నామాట దాఖలాచూసుకో. ఏం? వస్తావు కాదూ?

వసుషేణుడు— మా పని దివాణంలో నౌకరీ చెయ్యడంతోటే సరిపోతుంది. ఎప్పుడేనా కసింత తీరుపడి అయితే, కాస్త విలువిద్య అభ్యాసం చేసుకోవాలి. నాకు తీరుపడి యెక్కడి దమ్మా?

కుంతీదేవి—పోనీ, యెప్పుడు తీరుపడి అయితే అప్పుడే వస్తూవుండు. రేపుమాత్రం వొకమాటు తప్పకుండా రా. సరిగా యీ పాటివేళ ఎక్కడికీ వెళ్లకుండా వారినందర్నీ నీకోసం యింటో వుంచుతాను. తెలిసిందా? నీపాట విన్నా రంటే వారు నిన్ను క్షణంఅయినా విడిచిపెడతారా? అసలు, భోజనానికేనా నిన్నింటికి వెళ్లనిస్తాడా మా అర్జునుడు? వస్తావు కాదూ నాన్నా?

వసుషేణుడు—తమ రింతగా సెల విప్పిస్తున్నారు కనక, రేపే అని కచ్చితంగా చెప్పలేను కాని, ఏమాత్రం వీలయినా వీలు కాగానే వస్తాను. తప్పకుండా వస్తా నమ్మా!

కుంతీదేవి—తరవాత కొంచెం ఆలస్యం అయినా సరే, రేపు మాత్రం తప్పకుండా వస్తూ. ఒక్క క్షణమే కామా? నువ్విక్కడ యెంతోసేపు వుండవద్దులే. తప్పకుండా రా అమ్మా! సరిగా యివాళ వచ్చిన వేళకే రా. మరిచిపోకేం?

వసుషేణుడు—చిత్తం. సెల విప్పించండి అమ్మగారూ!

కుంతీదేవి— పోనీ, యింకొక్క క్షణం వుండలేవూ? పాట పాడవద్దులే. వూరికే కబుర్లు చెబుతూ కూచుందువు గాని. ఏం? వుండు. వుండవూ?

వసుషేణుడు—వుండలేను అమ్మగారూ! ఏలినవారిఆజ్ఞ పాటించనందుకు నన్ను క్షమించాలి. మా అమ్మ నాకోసం కాలుకాలిన పిల్లిలాగ మతి పోగొట్టుకుని తిరుగుతూ వుంటుంది. రెండుజాము లయింది నేను బయటికివచ్చి. సెల విప్పించండి అమ్మగారూ!

కుంతీదేవి—అయితే వెళ్లి రా నాయనా! ఎంత లేదన్నా తల్లిప్రాణం యెంత కొట్టుకుంటూ వుంటుందో నేనూ యెరుగుదును. తొరగా వెళ్లు నాయనా!

(వసుషేణుడు మోడ్పుకేలితో వెనక్కి వెనక్కి నడుస్తూ వెళ్లిపోతాడు.)

కుంతీదేవి—ఎంత దుర్భాగ్యురాలినీ? ఎంత దురదృష్టవంతురాలినీ? ఎలాంటి కొడుక్కి యెలాంటి గతి పట్టించానూ? ఎలాగేనా స్నేహం కలిపి అనుచరుడుగా నేనా వుంచుకునేటట్టు చేద్దా మనుకుంటే అర్జును డెంత పని చేశాడూ? మాట అనేటప్పటికెంత శౌర్యం వచ్చిందీ నాయనకీ? అమ్మో! అసలైన సూర్యవంశక్షత్రియుడు, శౌర్యాని కేం తక్కువా? సూతకుల ప్రతీతివల్ల కొంచెం వెనకా ముందూ చూశాడుగాని గభీమని కలియబడితే? పిండిపిండి అయిపోడూ అర్జునుడూ? పిడికిళ్లు బిగించాడే! పళ్లు పటపటలాడిపోయాయే! ఎంత తేజస్సు మెరిసిపోయిందీ నాయన మొగమ్మీదా? నాబతు కెలా తెల్లవారుతుందో ముందుముందు? ఇతనికీ వారికీ స్నేహం కలపగలనో లేనో? దుర్యోధనాదులు చేరతీసిపోతారో యేమిటో నాయన్ని? ఆ తేజస్సూ, ఆ శౌర్యమూ అర్థం చేసుకోగలవాళ్లు యింకా వూరుకుంటారా? (దుఃఖిస్తూ) ఎందుకూ? గొడ్రాలు కూడా చెయ్యలేని పని చేశాను.

చేతులారా అప్పుడు కన్న కొడుకుని ఏట్లో పారేసుకున్నాను. నాకు నేనే తెచ్చిపెట్టుకున్నా నీచిచ్చు. ఇది యిక ఆరేది కాదు. తీరేదిన్నీ కాదు. ఇంకా యెంతెంత యాతనలు కలిగిస్తుందో? నాయన రేపు మళ్లీ వస్తాడో రాడో? అయ్యో! నా కొడకా!

(కుంతి కింద కూలపడి మూర్ఛిల్లుతుంది. సరిగా అప్పటి కిద్దరు పరిచారికలు పళ్లేలతో యేదో తెచ్చి కుంతిని చూసి తెల్లపోయి, పళ్లే లొకచోట వుంచేసి, కుంతిదగ్గర కూచుని "అమ్మా, అమ్మా" అంటూ పరిచర్యలు మొదలుపెడతారు.)

రెండో రంగము

[పురోపకంఠంలోని రాజోద్యానం. హస్తినాపురంలోకల్లా అదే గొప్పవనం. అలాంటిది మరోటి లేదు. కౌరవులు రోజూ యిక్కడికే వస్తారు. ఈ కారణంవల్ల, పాండవులు, సాధారణంగా యిక్కడి కెప్పుడూ రారు.

సాయంకాలం. అప్పటికి నాలుగ్గడియల పొద్దే వుంది. చల్లని గాలి కొడుతోంది. కమ్మని పూలవాసన తెరలు తెరలుగా వస్తోంది. అక్కడక్కడ పిట్టలు ముద్దు ముద్దుగా కిలకిలారావాలు చేస్తున్నాయి. దూరాన చెట్లకు దోహదం చేస్తూ తోటమాలీ వొకడు పారవశ్యంతో యేలపాటొకటి పాడుతున్నాడు. కొలనిలో గట్టుదగ్గిరిగా హంసమిథునం వొయ్యారంగా తేలియాడుతూ వుంది.

సరిగా ఆసమయంలో దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ అక్కడికి వచ్చారు. వారు సామాన్యమైన తెల్లని దుస్తులు వేసుకొని వున్నారు. మెడలో కైజార్లు కూడా లేవు. అప్పటిదాకా, పక్కని వున్న, యెడారి వంటి పెద్ద బయట తోడివారితో వ్యాయామక్రీడలతో కాలం గడిపి, వొక్కక్షణం విశ్రమిద్దాం అని తోటకి వచ్చారు.

అక్కడ నిలువెత్తు మాత్రమే యేపుగా పెరిగివున్న పొకబోదికి దగ్గిరిగా వొక చంద్రకాంతశిలావేదిక వుంది. ఇద్దరూ దానికేసి బయలుదేరారు.]

దుర్యోధనుడు—ఇక్కడ కూచుందాం కాస్సేపు. (వేదికమీద కూచుని) చాలా బాగుందోయ్! ఏం, తమ్ముడూ?

దుశ్శాసనుడు—(తాను కూడా కూచుని) చాలా బాగుం దండీ అన్నయ్యా! (స్పర్శసుఖం నిరూపిస్తూ) హాయ్ హాయ్! చొక్కా తీసేసుకోవా లన్నంత చల్లనిగాలి.

దుర్యోధనుడు — ఇంత చల్లనివేళకూడా ఇంత దాహంగా వుం దేం, తమ్ముడూ? చూడూ, సమీపంలో నౌకర్లెవరేనా వున్నా రేమోనూ.

దుశ్శాసనుడు — కొబ్బరిబొండాలు తీయించమని సెలవా?

దుర్యోధనుడు — కన్నుమూసి తెరిచాటప్పటికి తీయించాలి. అంత దాహంగా వుంది. (నాలుకతో పెదిమలు తడుపుకుంటూ ఎడమచేతిమీద వొరిగి కూచుంటాడు.)

దుశ్శాసనుడు—(లేచి, వొక్క అడుగు ముందుకు వేసి, నాలుగు వేపులా అతిగంభీరంగా చూస్తూ) ఏయ్! ఎవ రీ సమీపంలో ?

(అప్పుడు వసుషేణుడు వడిగా వస్తాడు.)

వసుషేణుడు—చిత్తం మహాప్రభూ! నేనున్నానిక్కడ.

దుశ్శాసనుడు—ఎవరు నువ్వు?

వసుషేణుడు—నా పేరు వసుషేణుడు. సూతపుత్రుణ్ణి దేవరా!

దుర్యోధనుడు—రాధేయుడవు కాదూ నువ్వూ?

వసుషేణుడు—ఏలినవారు సరిగా గుర్తించారు. అవును మహాప్రభూ!

దుర్యోధనుడు—తమ్ముడూ నువ్వెప్పుడూ చూడలే దేమో కాని చాలా చురుకైనవాడు. సిసింద్రీ అంటే చాలదు. (వసుషేణుడితో) రాజహంసకు ఈగ లకుండా, ఆవేళ, నువ్వే కాదూ అమ్మ మధ్యనే పట్టుకున్నావూ?

వసుషేణుడు—(వినయంగా) చిత్తం, చిత్తం.

దుర్యోధనుడు—నీతో చెబుదా మని యెన్నో మాట్లు అనుకుంటూనే మరిచిపోయాను, ఆవేళ యేం జరిగిం దనుకున్నావు తమ్ముడూ? తాతయ్యగారితో నువ్వు వేటకి వెళ్లావూ, ఆవేళ. సరిగా ఇదే వేళ. నే నీతోటలో విహరిస్తున్నాను. దూరాన దుస్సల కనపడగా పిలుద్దామా అనుకుంటూ నింపాదిగా అడుగు వేస్తున్నాను. యాదాలాథంగా పక్కకి చూస్తినిగదా కొలనికి వుత్తరాన, చూపుమేరదూరంలో, నల్లతా చొకటి నింపాదిగా పాకుతోంది. ఎందుకా అని చూడగా దానికి పది గజాల దూరంలో గోరువంకమిథునం ముక్కులతో అన్యోన్యమూ ముద్దుగా దువ్వుకుంటూ క్రీడిస్తూవుంది. వెంటనే నేను లాగి బాణం విడిచి పెట్టాను. కాని యింతలో వొక రాజహంస వొయ్యారి నడకలతో బాణ మార్గంలోకి వచ్చింది. క్షణంలో అది పైసలా అయిపోవును. చేసేది లేక, నేను, దిగ్భ్రాంతుణ్ణయి కళ్లుమూసుకున్నాను. కాని యింతలో యెక్కణ్ణుంచి వచ్చాడో యితను దేవుడులా వచ్చి గభీమని ఆబాణం పట్టుకుని రాజహంసనుకూడా పట్టుకువచ్చి నా కిచ్చాడు. నిజంగా ఆవేళ నన్ను ఘోరపాతకం చుట్టుకోకుండా యితను రక్షించాడు. నాకు చాలా సంతోషం కలిగి—ఏదీ, వసుషేణా! ఆవేళ మేమిచ్చిన వుంగరం తమ్ముడికి చూపించు.

వసుషేణుడు— (వంగి నమస్కారం చేస్తూ) ఏలినవారు కరుణించకోరుకుంటున్నాను. అలాంటి వుంగరం వేలికి పెట్టుకు తిరగడానికి తాహతు చాలక పెట్టిలో దాచి—(అర్థోక్తి)

దుశ్శాసనుడు—ఛా! ఛా! అదేమిటి వెర్రిబాగుల వాడా! ప్రభువు మెచ్చి బహుమతీచేస్తే సంబరపడుతూ ధరించాలి గాని - (అర్థోక్తి)

దుర్యోధనుడు—బాణవేగాన్ని కూడా తొక్కిసినవాడవు, నీకు తాహతు లేకపోవడం యేమిటోయ్? మహాబాగా చేశావే? ఇక నేనా తప్పకుండా ధరించాలి, తెలిసిందా!

వసుషేణుడు—తెలవక తప్పుచేశాను, యిక తప్పకుండా ధరించుకుంటూవుంటాను మహాప్రభూ!

దుర్యోధనుడు—ఆ! అదీ పద్ధతి!

దుశ్శాసనుడు—చూడూ, వసుషేణా! ప్రభువు వారికి చాలా దాహంగా వుంది. ఎవరినేనా తీసుకు వచ్చి కొబ్బరిబొండాలు తీయించుకు రా తొరగానూ.

వసుషేణుడు — ఎవరేనా యెందుకు మహాప్రభూ! సెల వయితే—(అర్థోక్తి)

దుర్యోధనుడు—నువ్వే చెట్టెక్కు తా నంటావా?

వసుషేణుడు—ఈమాత్రం భాగ్యానికే చెట్టెక్కాలా మహాప్రభూ?

దుశ్శాసనుడు—మరేం చేస్తా నంటావు?

వసుషేణుడు—ప్రభువువారికి చాలా దాహంగా వుం దని సెలవిచ్చారు తమరు. మాటలతో కాలక్షేపం—(అర్థోక్తి)

దుర్యోధనుడు—అతని యిష్టం వచ్చినట్టు చెయ్యనియ్య వోయ్!

దుశ్శాసనుడు—అయితే కానియ్యి తొరగా.

వసుషేణుడు—చిత్తం, చిత్తం. (కొబ్బరిచెట్ల కేసి చూస్తూ వెళ్లిపోతాడు)

దుర్యోధనుడు—ఏం చేస్తున్నాడు తమ్ముడూ?

దుశ్శాసనుడు—(అలా చూస్తూ) రాళ్లు పుచ్చుకుని, వొ-క-టి - రెం-డు,- మూ-డు- (అర్థోక్తి)

దుర్యోధనుడు—చాలు తెమ్మను.

దుశ్శాసనుడు—నా-లు-గు- చాలు, ఇక తీసుకు రా.

దుర్యోధనుడు—రాళ్లు విసిరి పడకొట్టాడా?

దుశ్శాసనుడు—అవు నన్నయ్యా!

(అప్పుడు వసుషేణుడు నాలుగు కొబ్బరి బొండాలు పట్టుకుని వస్తాడు)

దుశ్శాసనుడు—నీ దగ్గిర కత్తి వుందా?

దుర్యోధనుడు—కత్తి కూడా అక్కర్లే దనుకుంటాను. అవునా రాధేయా!

వసుషేణుడు—అక్కర్లేదు దేవరా!

దుశ్శాసనుడు— తొరగా కానియ్యాలి.

(వసుషేణుడు రాతిమీద కొట్టి, రెండు కాయలు వొలిచి రంధ్రాలు చేసి యిద్దరికీ చెరొకటీ యిస్తాడు. దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ సంతోషంతో పుచ్చుకుంటారు.)

వసుషేణుడు—మిగిలిన రెండు కాయలున్నూ కొడతాను మహాప్రభూ!

దుశ్శాసనుడు—ఇక నా కక్కర్లేదు, వొకటి కొట్టి అన్నయ్యగారికి పట్టుకురా. ఒకటి చాలా అన్నయ్యా?

దుర్యోధనుడు—చాల్చాలు.

(వసుషేణుడు మరోకాయ కొట్టి తెచ్చి అందిస్తాడు.)

దుర్యోధనుడు—(అది కూడా పుచ్చుకుని) చాలా బాసంది. (దుశ్శాసనుడితో)ను వ్వింకోటి పుచ్చుకోవు టోయ్?

వసుషేణుడు—(దుశ్శాసనుడితో) కొట్టితెస్తాను ప్రభూ!

దుశ్శాసనుడు—కొట్టకు కొట్టకు. నాకు చాలండీ అన్నయ్యా!

దుర్యోధనుడు— (వసుషేణుడితో) అది కొట్టి నువ్వు పుచ్చుకో వోయ్!

వసుషేణుడు—చిత్తం దేవా! (ఆకాయ పుచ్చుకుని చాటుకి వెళ్ళిపోతాడు.)

దుర్యోధనుడు—అలా కాదు. మా యెదట పుచ్చుకోవాలి.

వసుషేణుడు—చిత్తం, చిత్తం. (తాపీగా కూచుని పుచ్చుకుంటాడు.)

దుర్యోధనుడు—ఇంకోటి కావాలి. కదూ?

వసుషేణుడు— చాలు మహాప్రభూ! కానయితే యేలినవారి కేక వినపడాటప్పటికి నాకు చాలా దప్పికగా వుందండి. కొలనికి వెడదా మని బయలుదేరాను. ఇంతలో తమ దర్శనమూ, వొక కొబ్బరికాయలోని నీళ్లు పుచ్చుకోవడమూ, ఆపైని ఏలినవారి అపార కటాక్షమూ—నాకడుపు గ్రిరున నిండిపోయి దాహం అంతా తీరిపోయింది మహాప్రభూ!

దుర్యోధనుడు— (వసుషేణుడికేసి చూస్తానే దుశ్శాసనుడితో)ఎంత చక్కగా తేల్చాడో చూశావా? మన సూతులలో యింత పొందికగా మాట్లాడగలవా రెవరేనా వున్నారా? చాలా తెలివయినవాడోయ్! (తమ్ముడికేసి తిరిగి) ఏమంటావు తమ్ముడూ?

దుశ్శాసనుడు— ఆవునండీ అన్నయ్యా!

దుర్యోధనుడు— రాధేయుణ్ణి చూసినకొద్దీ నాకేదో అపూర్వమైన అనుబంధం వొకటి స్ఫురిస్తోంది; కాని ఆదేదో స్పష్టం కాకుండా వుంది. అతని కళ్లల్లో యేదో దివ్యకళ మెరుస్తోంది. చెప్పలేకుండా వున్నాను. (వసుషేణుడితో) ఇలా రావోయ్!

వసుషేణుడు—చిత్తం మహాప్రభూ! (కొంచెం ముందుకు వచ్చి చేతులు కట్టుకు నుంచుంటాడు.)

దుర్యోధనుడు—ఇంకా రావాలి.

వసుషేణుడు—(మరికొంచెం ముందుకి వస్తాడు)

దుర్యోధనుడు—ఇంకా.

వసుషేణుడు—( మరికాస్త ముందుకి వచ్చి) సెలవిప్పించండి ప్రభూ!

దుశ్శాసనుడు— ప్రభువువారి సెల వయింది యింకా దగ్గిరికి రావోయ్!

వసుషేణుడు—(ఇంకో అడుగు వేసి) ఆజ్ఞ దయ చేయించండి దేవరా!

దుర్యోధనుడు— ఏమిటో అనుకుంటున్నాడు పాపం. నువ్వువెళ్లి చెయ్యిపట్టుకు తీసుకురా తమ్ముడూ!

(దుశ్శాసనుడు అలా చేస్తాడు. అప్పటికీ వసుషేణుడు కొంచెం వెనక్కి జంకుతూనే వుంటాడు)

దుర్యోధనుడు—భయంలేదు రావోయ్! (జబ్బ పట్టుకుని వసుషేణుణ్ణి దగ్గిరగా తీసుకుని) మొగంమీద మంచి కళ లాస్యం చేస్తూవుంది. ఏమిటీ యీ తేజస్సు! తమ్ముడూ!

దుశ్శాసనుడు— (వసుషేణుడి కళ్లల్లోకి చూసి) అన్నయ్యా! తమరు సరిగా స్మరించారు. వాలకం

చూడగా యితనియందేదో అమోఘశక్తి నిగూఢంగా వున్నట్టు తోస్తూవుంది.

దుర్యోధనుడు — కనిపెట్టావు కదా? (వసుషేణుడి కుడిచెయ్యి అంతా తడిమి చూసి) చెయ్యా యిది, వజ్రదండమా? ఈ కవచం చూడూ, పూసినట్టూ, అతికేసినట్టూ లేదూ?

దుశ్శాసనుడు—అవునండీ అన్నయ్యా!

దుర్యోధనుడు—ఏపనివాడు చేశాడో సాక్షాత్తూ మొలిపించేశాడోయ్ కుండలాలూ! వీటి కాంతి నా కళ్లల్లో దివ్యజ్యోతిని ప్రతిష్ఠిస్తూ వున్నట్టుంది.

దుశ్శాసనుడు—అన్నయ్యా! నా మనవి యేమిటంటే: ఇతణ్ణి మనం భృత్యుడుగా కాక—(అర్ధోక్తి)

దుర్యోధనుడు—నీకూ అదే తోచిందీ?

వసుషేణుడు — నన్ను భృత్యుడుగానే వుండనివ్వండి మహాప్రభూ! అదే మాకు మన్నన దేవరా!

దుర్యోధనుడు—నువ్వుండవోయ్! ఏమి కంఠమూ యిదీ? ఏమి వక్షస్థలమూ! తమ్ముడూ! రాజ్యలక్ష్మి విజయపీఠం కదా యిది!

దుశ్శాసనుడు—ఇంకా సందేహమా అన్నయ్యా? సామాన్యులకు—అంటే సూతులకే కాదు, రాజపుత్రులకున్నూ యీవపుశ్రీ దుర్లభం అని చెప్పవచ్చు.

దుర్యోధనుడు—ఏమి చూపులోయ్! గుండెలు దూసుకుపోవడం లేదూ? ఏమంటావు తమ్ముడూ?

దుశ్శాసనుడు — ఆ చూపులకు గల నైశిత్యం తూపులకు వుంటేనా?

దుర్యోధనుడు—బాగా చెప్పావు. సరిగా చెప్పావు. కనక యితణ్ణి క్షణం కూడా విడిచిపెట్టకద్దు.

వసుషేణుడు—ప్రభూ! ప్రభూ!

దుర్యోధనుడు—వెర్రిబాగులవాడు. తనశక్తి తనకి తెలవని ఆంజనేయుడితను. తమ్ముడూ! ఈ తేజస్సు నా హృదయసముద్రాన్ని వుత్తుంగతరంగితం చేస్తూవుంది. (వినికి అభినయిస్తూ) "ఇతను నీకుడిభుజమోయ్" అని యెవరో సెల విస్తున్నారు. (వసుషేణుణ్ణి కౌగిలించుకుని) హాయ్! హాయ్! ఏమి సుఖమూ! ఎంత సంతర్పణంగా వున్నదీ యితని స్పర్శ! ఇందాకానే ఈ ఆలింగనభాగ్యం అనుభవించివుంటే కొజ్జరికాయలు పుచ్చుకోవలసిన అవసరమే లేకపోవును. వసుషేణా! నాప్రాణమా! నువ్వు మరోలాగ అనుకోకు. కౌరవకులానికీ నీకూ గాఢమైన అనుబంధంవున్నట్టు కనపడుతూ వుంది. సూతుణ్ణనుకుంటూ నువ్వేమీ కించపడవలసిన పనిలేదు. ఈకౌరవ యువరాజు నీకు ఏకోదరుడికంటేనూ సన్నిహితుడు. తెలిసిందా? నా సంపదలో - నావైభవంలో - నా సుఖంలో - నా ఆనందంలో మొదటి భాగం - యెక్కువభాగం నీదీ. నువ్వనుభవించగా మిగిలిందే తక్కిన మా నూర్గురిదీనీ. తమ్ముడూ!

దుశ్శాసనుడు—తమ సెలవుకి అడ్డేమిటీ? నాకు కూడా ఆలింగనసౌఖ్యం - (వసుషేణుణ్ణి కౌగిలించుకుని) అన్నయ్యా! తమరు సెలవిచ్చినదాల్లో యేమీ తేడా లేదు. ఇతని ఆలింగనంవల్ల నాకు రక్తంలో రక్తం, కండలో కండ, మనస్సులో మనస్సు, హృదయంలో హృదయం, జీవంలో జీవం మిళితమైనట్టుంది. నరాలకు అపూర్వమైన బింకమున్నూ సంక్రమించినట్టుంది.

దుర్యోధనుడు — కనక మరి పద. ఈసంగతి బాబయ్యగారికి విన్నవించుకుని—వసుషేణా!

వసుషేణుడు—మహాప్రభూ!—(అర్ధోక్తి)

దుర్యోధనుడు—ఇక ఆపద్ధతి తీసెయ్యి. ఆమార్గం విడిచిపెట్టెయ్యి. ఆధోరణి మరిచిపో. 'మిత్రమా' అను. తమ్ముడూ! రథం ఆయత్తంచేయించవోయ్.

దుశ్శాసనుడు—చిత్తం ఇదిగో వెళ్లాను. (వెళ్లిపోతాడు.)

దుర్యోధనుడు— (వసుషేణుడితో) అక్కడ మనవాళ్లందరూ వున్నారు. మా కవచాలూ, వుష్ణీషాలూ, వుత్తరీయాలూ- సర్వమూ అక్కడే వున్నాయి. ముందక్కడికి వెళ్లి అక్కణ్ణుంచి నగరికి వెడదాం పద. (చెయ్యిపట్టుకుని బయలుదేరతాడు)

వసుషేణుడు—మహాప్రభూ!— (అర్ధోక్తి)

దుర్యోధనుడు—ఆమాట వద్దన్నాను.

వసుషేణుడు—ప్రభూ !

దుర్యోధనుడు—అదీ పద్ధతి. ఇంకా తగ్గించు.

వసుషేణుడు—ముందు నా మనవి చిత్తగించాలి. తమ సెలవుకి నే నెప్పుడూ బద్ధుణ్ణే. తమరూ నేనూ - ఈ ప్రపంచకం అంతా మనం యిద్దరమే కాదు. జనుల సంఖ్య అనేక కోట్లు కావడం అలా వుండగా ప్రవృత్తులున్నూ అనేక కోట్ల విధంగా వున్నాయి. అవి నిరంకుశాలు. రాజశాసనం జనులను నిర్బంధించవచ్చు; కాని వారి ఆశలనూ, వూహలనూ, వుద్దేశాలనూ, సంకల్పాలనూ నిరోధించలేదు. తమ నిశ్చయం కౌరవచక్రవర్తి నిరాక్షేపంగా అంగీకరించనేవచ్చు. కౌరవచక్రవర్తిఆజ్ఞను ప్రజలున్ను ఆక్షేపించలేకపోవచ్చు. మనసారా అంగీకరించనూ వచ్చు; కాని సత్యానికి యెక్కడా విఘాతం లేదు. దా న్నెవరూ తల్లకిందులు చెయ్యలేరు—(అర్ధోక్తి)

దుర్యోధనుడు— ఈ వుపన్యాసానికి చివరికి ముక్తాయింపేమిటి?

వసుషేణుడు—అది యెవరికి తెలవనిదీ? తాము క్షత్రియులు. నేను సూతుణ్ణి. తాము ప్రభువులు. నేను భృత్యుణ్ణి. తమకీ నాకూ అనుబంధం వుందంటే వొప్పుకుంటాను. హృదయం వుంటే సేవ్యసేవకానుబంధం తప్పకవలోది కాదు. మన అనుబంధం ఆస్థితిలోనే వుండనియ్యవలసిందని నా ప్రార్థన. ఇదివరకే ఈశరీరమూ, ఈహృదయమూ తమ సొత్తయివున్నాయి. ఇది యికముందున్నూ అలాగే వుంటుంది. కాని దేశంలో వుద్ధారాలు పుట్టనివ్వకద్దు. ఈసేవకుడికి తమ హృదయంలో మంచి స్థానం దయచేశారు. అది చాలు. తాము అభిలషించినదాన్ని-తాము సంకల్పించినదాన్ని సిద్ధింపచెయ్యడానికి ఆసన్ని వేళం చాలు. కాని యీసూతుడికి ప్రత్యక్షంగా—(అర్ధోక్తి)

దుర్యోధనుడు— నీ ఆశయం బోధపడింది. ఇక చెప్పనక్కర్లేదు; కాని లోకం గతానుగతికం. దానికి విచక్షణ అనేది లేదు. ముందు ఏమాట పుడుతుందో దాన్ని పట్టుకుని అది పాకులాడుతుంది. అయితే,సత్యం దానికి భిన్నం కావచ్చు. సత్యమా లోకమా అంటే సత్యంముందు లోకం యేపాటిది? నువ్వు సూతుడవనే అందరూ అంటారు. నీనమ్మకంకూడా అంతే; కాని నే నది విశ్వసించను. ఏ కారణంవల్లనో యీ మణి మసిపాతను కట్టపడ్డది. మణి అని తెలిసినతరువాత దాన్ని యిక అంధకారంలో పాతివుంచడం ధర్మం కాదు. రాజు విష్ణ్వంశసంభూతు డనే మునీంద్రుల మాట నిశ్చయమే అయితే నానిర్ణయం చెడ్డది కానేరదు.

వసుషేణుడు—కాని-(అర్ధోక్తి)

దుర్యోధనుడు— మాట్లాడకద్దు. ఈ కౌరవయువరాజునిర్ణయం చెల్లిపోవలసిందే.

వసుషేణుడు—తమ హృదయం మహోదారం కావడంవల్ల తమకు న్యాయం నేదో ఆభాసజ్యోతి కనపడుతూవుంది; కాని నిశ్చయంగా నేను ఏ ట్టిముద్దను. నాలో ఘనీభవించిన అంధకారమే గాని—(అర్ధోక్తి)

దుర్యోధనుడు— ఉన్న ప్రతిబంధకం అంతా యిదీ. నీలో అప్రతిద్వంద్వమైన ప్రభావం నిహితమై వుంది; కాని నీకళ్లు పొరలు కమ్మి వున్నాయి. తెలిసిందా? ముందు దానికి అమోఘచికిత్స చేస్తాను పద.

వసుషేణుడు—(వణుకుతూ) నాకు గుండెలు తాళడం లేదు.

దుర్యోధనుడు— ముందుముందు నువ్వెన్నో గుండెలు తియ్యవలసి వున్నావు. దాని కిదిపూర్వరంగం. ఇక చాలించు. పద. (వసుషేణుణ్ణి తీసుకుని వెళ్ళిపోతాడు.)

---

# తెనాలి రామకృష్ణకవి నైపుణ్యము

## భారతుల పున్నయ్యశాస్త్రి

ధాత పుష్యమాసపు భారతియందు "నిగమశర్మ అక్క" అను పేరుతో తెనాలిరామకృష్ణకవి నైపుణ్యమును గొంతవరకు వ్రాసితిని. మరల పాండురంగ మాహాత్మ్యమునందలి యానిగమశర్మోపాఖ్యానమునే చదువుచుండ నిగమశర్మ అక్క యేడ్చుటకుం దగిన మరియొక యుపపత్తియు, కవి నైపుణ్యమును బ్రకటించగల మరియొకటి రెండు విశేషములును నాకు స్ఫురించినవి. వాటిని ఈవ్యాసమున వివరించెదను.

నిగమశర్మ అక్క మక్కరకై దుర్వారయై యడలుట పరిహాసమే కాని పరమార్థము గాదని కొందరనుచున్నారు. కాని యిందెంత నిజమున్నదో విచారింతము. లోకమున గౌరవ కుటుంబమునందలి యెవ్వడేని యొక్కరుండు కుటుంబగౌరవమును బాటించక స్వేచ్ఛమై వారకాంతాదిలంపటత్వమున గామకత జరించుచుండెనేని ప్రప్రథమమున నింటివారందరును, చెడిపోవుచున్న తమ వానివలన దమకుంగలుగుచున్న యపకీర్తికిని, తమపూర్వులఔన్నత్యమునకుభంగము వాటిల్లుచున్నదను వ్యపదేశముయొక్క యావిలతకును మాత్రమే వగతురు. అంతట వారు వానిచెడునడవడికవలన దమకుం గలుగుచున్న యపకీర్తిని బోధించినను వినక వాడింకను స్వచ్ఛందచారియై యింట గల ధనమునెల్ల వెచ్చపెట్టుటకారంభించెనేని గౌరవముమాట మఱచి వాడొనర్చు ధనవ్యయమునకు మాత్రమే వగతురు. ఇది లోకస్వభావము. గౌరవమనునది యాధ్యాత్మికమైనది. ధనము భౌతికమైనది. సంఘమున శరీరధారి ధనమున్ననే కాని యాధ్యాత్మికమైన గౌరవమును నిలబెట్టుకొనలేడు. కాన చెడ్డవాడు చెడెనేచెడెనని వానికై విలపింపరు. ఇకవాడొనర్చు ధనవ్యయమునకు మాత్రమే వగతురు. అటులనే నిగమశర్మ తండ్రి, తల్లి, బావగారు, అక్క, అందరును అతనిపరారికిగాక అతడెత్తుకొని పోయిన మణిమయంబులగు సొమ్ములకై మాత్రమే వగచిరి. ఇది నిజము గాదందురా? అట్లయిన కన్న తల్లియైన కాసంతకుందినట్లు కవి వ్రాసేనేమో చూచితిరా? ఈవిషయము కవికి బాసుగా దెలియును. ఇదివరకే చెడ్డవాడుగాన వానికై వారు వగవలేదు. ప్రప్రథమమున మాత్రము పితరులు పుత్రునికై వగచివగచి దైన్యమువహించియున్నటుల అక్కయొక్క మాటలవలన మనకు దెలియుచునేయున్నది. కావున లోకస్వభావమును బాసుగా గమనించియే కవి పాత్రల సృష్టించెనని స్పష్టమగుచున్నది.

ఇక నొక విశేషమును గమనింతము. నిగమశర్మ యెవ్వరెవరి సొమ్ముల నెత్తుకొనిపోయెనో చెప్పు సందర్భమున తల్లి, అక్క, భార్య, వీరిని మాత్రమే కవి పేర్కొనెను అవును. అసలు సొమ్ములన్నవి స్త్రీలకే కాని మగవారి కేమియుండును? అథవా ఏయుంగరమో, చెవిపోగులో ఉన్నవనుకొన్నను అవి యొకలెక్కలోనివి గావు గాన విశేషించిచెప్ప నక్కరలేదు. ఈవిషయమును గుర్తించియే కవి 'అన్నియుహరించి' అని యొక్క మాటతో మరికొన్ని వస్తువులు గూడ బోయినటుల సూచించెను. ఇచట సూచించలేదనుకొన్నను, తరువాత నేడ్చువారిలో, తండ్రిని, అల్లునింగూడ చేర్చుటచే వారివిగూడ కొన్ని నిగమశర్మ యీడువారి సొమ్ములతోపాటు ఎత్తుకొని పోయెనని మనమూహించుకొనగలము. ఈసందర్భమున గవి తననైపుణ్యమును సూక్ష్మముగ సూచించియున్నాడు. కావ్యమున వాచ్యమగు దానికన్న సూచితమగుదానికే యెక్కువ యాస్వాద్యముండునుగదా. మగవారి సొమ్ములను గూడ నెత్తుకొని పోయెనని, అప్రధానవిషయమును వాచ్యమొనర్చి కావ్యరసమును నీరసమొనర్పక, పిమ్మట సొమ్ము పోయినందు

లకై యేడ్చువారిలో మగవారినిగూడ జేర్చి యాడువారి సొమ్ములతోపాటు వారివిగూడ నొకటిరెండు పోయెనని సూచితమొనర్చి కావ్యరసమును సాంద్రమొనర్చి, యాస్వాద్యతర మగునటు లొనర్చి కవి తననైపుణ్యము ప్రదర్శించుకొనెను.

రెండవది: నిగమశర్మ భార్యసొమ్ములను గూడ నెత్తుకొని పోయినట్లు వ్రాసి యామె వగచినట్లు వ్రాయకుండుట. ఏల? ఆమె వగవలేదు. కాబట్టి ఇది సహజము. పతివ్రతయైన భార్యకు గావలసినది భర్తగాని సొమ్ములుగాదు. భార్యకు భర్తతనను సరిగా జూచుకొనుట లేదను దిగులేకాని ధనమును పాడు చేయుచున్నాడే యనుచింత యుండదు. తననుగూడ సరిగాజూచుకొని కాపురమొనర్చుచు, ధనమును కాముకప్రవృత్తికై దూబర చేయుచుండెనేని, భార్యకును గాపురమెట్లు సాగునను చింతచే ధనమునకై చింతయుండునేమో కాని యట్టిదేమియు నిపుడు లేదుగదా! దీనినిగూడ కవి గుర్తించియే భార్య యేడ్చినట్లు - కాదు - ఏమియు వ్రాయలేదు. ఇదియెంతయు సహజము. కవి నైపుణ్యము స్పష్టతరము. సొమ్ములనెత్తుకొని పోయినవారి పేర్లలో భార్యను జేర్చకుని పిమ్మట నామెనుగూర్చి విలపించినట్లు కాదు- ఏమియు నుడువకుండ వదలుటచే భర్తపరారికి దిగులుపడి దుఃఖాధిక్యమున గన్నీరు సైతము కార్చలేదని పాఠకుల మనంబుల నూహారేచన ట్లొనర్చెను తాను సృష్టించిన పాత్రలంగూర్చి పాఠకుల మనంబులు ఆలోచనా పరవశంబులగునట్లొనర్చుటయేకదా కవిత్వము. అట్లొనర్చుటచే భార్య పాతివ్రత్యము సూచితమై పోషితమైనది యగుచున్నది.

---

చెన్నపురి చిత్ర-శిల్పకళాశాల అధ్యక్షుడు: చిత్ర - శిల్పకళోపాసి

# దేవీప్రసాదరాయచౌదరి

## కళోపాసన విశేషములు

అ. న. కృష్ణరావు

Art is the presentation of Real in its mental aspect — జీవనసాదృశ్యము యొక్క మానసికరూపమును ప్రదర్శించుటయే కళ. జీవనముయొక్క స్పష్టానుకరణ ముత్తమకళ యెన్నటికిని కానేరదు. కళ యొక్క ఉద్దేశ్యము అనుకరణము కాదు; సృష్టి. కాని గహనమైన మానసికరూపమును - ఇంద్రియాతీతమైనదానిని ఇంద్రియములకు గోచరమగునట్లు చేయవలెననిన దానికి తగుమాత్రము జీవనసాదృశ్యమును కల్పించవలసి యున్నది. ఇంద్రియములకు గోచరమగునట్టి రూపుచట్టమునందు దానిని నిలుపవలసి యున్నది.

ఈ రెండు రీతులకును సమన్వయమగునట్టి సువర్ణమధ్యమార్గమునే కళ యని యనుచున్నారు. ఇది విమర్శకుని కార్యక్రమమునకు లోబడిన విచారము. కళావిదు డీనియమము నుల్లంఘించుచునే వచ్చుచున్నాడు. ఆదర్శసంప్రదాయమునకు ప్రబలవిరోధులుగనే మొఘల్ రాజపుత్రసంప్రదాయములు జన్మించినవి. రాజపుత్రసంప్రదాయముకూడ తగినంత నిసర్గమయముగా లేదని బయలుదేరినది రవివర్మ సంప్రదాయము. దాని సంస్కృతస్వరూపముగా పుట్టినది బొంబాయి కళాసంప్రదాయము. దాని కన్నివిధములను విరోధి యనుకొన్నది బంగాళ సంప్రదాయము. ఇవన్నియు ఈ ప్రతిరోధపు సంతతియే. బొంబాయి నిసర్గానుకరణ సంప్రదాయములో కూడ అహివాసివంటి చిత్రకారులు ప్రత్యాజ్మార్గమును బట్టిరి. బంగాళపు ప్రత్యక్సంప్రదాయమునందు హల్దార్, దేవీప్రసాదు మొదలైనవారు పరాజ్మార్గమును పట్టిరి. ఏ మార్గము ననుసరింప బూనుకొన్న చిత్రకారుడుగాని ఒకప్పుడుగాకపోయిన నొకప్పుడు తదితరమార్గమును రుచిచూచియే తన కళయొక్క అస్తిత్వమును నిరూపించుకొనుచున్నాడు. చివరకు పరంపరగ వచ్చిన సంప్రదాయ బంధములను త్రెంచివైచి తన సంప్రదాయమునే తా ననుసరించుచున్నాడు.

సంప్రదాయముల మానదండముతో కాదు కళాశిల్పిని కొలవవలసినది. అతనికళయొక్క అంతిమ లక్ష్యమును, దాని సాధన సాహసమును, తదనుకూలమైన జీవన శిక్షణ సంస్కారములను గమనించవలయును. కళాశిల్పియొక్కయు, అతని రచనలయొక్కయు శస్త్రచికిత్స చేయుటయే విమర్శకుల

యొక్కయు, ప్రేక్షకులయొక్కయు ఉద్దేశ్యము కాదు. మానవమనస్సు నుల్లాసపరచునది, మానవమనస్సును శుద్ధపరచి దాని నమర జ్యోతి పీఠముగా చేయజాలినది, మానవ మనస్సును దౌర్బల్యదశనుండి జాజ్వల్యమాన శక్తివంకకు కొనిపోవునదియే ఉత్తమకళ. కళయొక్క యీ యుద్దేశ్యము సార్థకమగుటకు మానవుడు కూడ అనుకూలమై దాని శ్రుతికి శ్రుతి, తాళమునకు తాళము వేయుచు కళారాగమునం దనురాగి కావలయును.

ఈదృష్టితోనే దేవీప్రసాదరాయచౌదరి రచనలనుకూడ చూడవలసియున్నది. ఇతనిది వంగకళాసంప్రదాయము. కాని యితడెక్కడు అందుకు దూరముగను ఉండును. శ్రీమంతుడైనను దారిద్ర్యఖేదముల నెరిగినవాడు. చిత్రకారుడు మాత్రమే కాదు, శిల్పి కూడ. వర్ణచిత్రములందెట్లో, అట్లే తైల, మృత్, దారుచిత్రములందును ఇతని కపారమైన ప్రీతి. ఇతని అనేకరచనలయందు ఆదర్శ సంప్రదాయలక్షణము లన్నియు నున్నవి. అట్లే అనేక రచనలయందు వాస్తవసంప్రదాయలక్షణము లన్నియు నున్నవి. కావుననే యీవిశ్వరూపిశిల్పిని ఒకకంటితో, ఒక కొలత పట్టికతో కొలచుట అలవికానిపని. ఇంత మాత్రముచేత ఇతని రచనలన్నియు నన్నిరకములై చెదరిపోలేదు. వింతవింత లగు రంగులు, భావములు, విలాసములు మొదలైన కళాసామగ్రి నిండియుండు ఇతని కృతి పుష్పముల నొకటిగ కూర్చియుండు తంతువు లేకపోలేదు.

వీరిది భారీ శ్రీమంతుల కుటుంబము. వంశపరంపరగ జమీందారులు. వీరి పూర్వులు గొప్ప సంస్కృతవిద్వాంసులు; వేదాంతులును. ఈవిధముగా ఐశ్వర్య, జ్ఞానములకు ఖ్యాతి వహించిన యింటియందు చౌదరి పుట్టుక. వీరితల్లి రంగపురము (బెంగాలు) మహారాజుతనయ. ఇట్లు ఇతడు బంగారు తొట్లలో శైశవమును గడపినవాడు. కాని యితని కామైశ్వర్యదృష్టియే లేదు తన జమీందారీకి చేరిన వేలారు రైతుకుటుంబముల కష్టసుఖములను కండ్లువిచ్చి చూచి జాలిగొనెడి స్వభావముగలవాడు.

పండిత కుటుంబమునందు పుట్టినాడన్న మాటయే కాని యితనికి సంప్రదాయ విద్యయందు లక్ష్యమే కుదురలేదు. మొదటినుండియు సితనికి కుస్తీసాములు చేయుటయందమితప్రీతి; ఆటలయందు మమత. తారుణ్యము ప్రాప్తించుసరికి యీ మమత సాహిత్యము వంకకు మరలినది. తాతగారి దగ్గర కాళిదాసు, భవభూతి, భారవి మొదలైన వారి కావ్యభాగములను శ్రవణముచేసినాడు. నిద్రాణమై యుండిన చైతన్య మంతతో జాగృతమైనది. సాహిత్యము, కళ-వీనికి సంబంధించిన గ్రంథముల వ్యాసంగము ప్రబలినది. ఆ విషయములకు సంబంధించి విచారపూర్ణములగు వ్యాసములను పత్రికలకు బంపుట

హెచ్చిపోయినది. వీనికి జత వ్యాయామము. గ్రీకుశిల్పమునందలి యంగ సౌష్ఠవమును సంపాదించవలెనని యితని యాశయము. శారీరకసౌందర్యమునెడ ఈయన పెట్టిన లక్ష్యము కొంతకు కొంత ఇతనికళలో నీనాటి కిని పరిణామమును గలుగజేసినదని చెప్ప వచ్చును. ఇతడు చెక్కు, చిత్రించు, నిర్మించు మూర్తుల దేహములం దేభాగమును చూచి నను నిసర్గదూర దోషము మచ్చునకయినను కానరాదు. ఏ భంగిలో, ఏ భావములో దేహ మేయే యాకారములను దాల్చునో దేవీప్రసాదువలె అంత నైసర్గికముగ చిత్రింప నేర్చిన కళావేత్త దేశమునందు మరిలేడు.

కళోపాసనలో పుట్టిన యీ యాశాం కూరమును దేవీప్రసాదు అంతతో వదలలేదు. అవనీంద్రనాథ ఠాకూరువద్ద చేరి భారతీయ చిత్రకళా సంప్రదాయముల నభ్యసించినాడు. ఠాకూరు ప్రథమ శిష్యవర్గములో నితడొకడు. నందలాలబోసు, ప్రమోదకుమార ఛటర్జీ, అసిత కుమార హాల్దార్, కె. వెంకటప్ప, గగనేంద్రనాథ ఠాకూరు మొదలయినవా రీయనసహాధ్యాయిబృందము. అక్కడ శిష్యరిక మైనతదుపరి యితడు ఇ. బోయిస్ అను ఇటాలియన్ చిత్రకారునివద్ద పాశ్చాత్య కళా సంప్రదాయముల నవగాహన మొనర్చు కొన్నాడు. ఇక మిగిలినది శిల్పవిద్య. దానిని హిరణ్మయిరాయి చౌదరి యను ప్రఖ్యాతశిల్పికడ కూర్చొని నేర్చినాడు. నేర్చుకొనవలె ననెడి యీయభిలాష యితని నన్నికళల మర్మములను నేర్వజేసినది.

ఇతడు మొట్టమొదట ప్రాచ్యపాశ్చాత్య సంప్రదాయములను ఒకటిగ మేళవింపక వేరు వేరుగనే రచనలను కూర్చుచుండినాడు. సామాన్యముగా తైలవర్ణచిత్రముల నన్నిటిని పాశ్చాత్య సంప్రదాయాను గుణముగానే రచించుచుండినాడు. సాంకేతిక చిత్రములను భారతీయచిత్రకళారీతితో నిర్వహించుచుండి నాడు. కాని క్రమేణ ఆ భేదాభిప్రాయమును వదలుకొని సమ్మిళితసంప్రదాయము నాశ్ర యించి దానినే యిప్పటికిని అనుసరించుచు వచ్చుచున్నాడు.

చిత్రకళయందు దేవీప్రసాదుకు గల నిజమైన కౌశలము ఇతని సుకోమలమైన లలితచిత్రములందు కాదు ఉండునది. జీవన సౌందర్యమును, మల్లె మొల్ల జాజి మొద లైన వస్తుసంతతిని ఇతడు లీలాజాలముగ చూపగలడు. సుఖముయొక్క మత్తవిలాసము గాని, లలితలావణ్యము గాని యితని కుంచె కొక లెక్కలోనిది కాదు. జీవనసౌందర్య మునే చిత్రించుచు కూర్చొనియుండినచో దేవీప్రసాదుప్రతిభయొక్క వైవిధ్యప్రసరణకు అవకాశమే యుండెడిదికాదు. జీవనసౌందర్య మును కళావేత్త మనతోకూడ వీక్షించు చున్నాడు. మనకు సఖుడై దాని నానం దించుచున్నాడు. కాని జీవనమందలి విప్ల వము, సంతాపము, వేదన మొదలైనవానివెను

కనుండు శక్తిని మనకతడు ప్రదర్శించుచున్నా డు. ఇక్కడ మన కతడు సఖుడుకాదు, గురువు. సఖుడైన కళావేత్తను మనము ప్రేమించె దము; గురువైన కళావేత్తను గౌరవించె దము. ఇటువంటి కార్యము నెవరు నిర్వ హించిననుసరియే, వారు మనకు మాన్యులు. ఇట్టి కార్యము నద్భుతముగ నిర్వహించిన దేవీప్రసాదు మనకు రెండువిధాల మాన్యుడు. స్వయము సుఖసంపదలలో పెరిగినను ఇతడు దుఃఖదారిద్ర్యముల మూకవేదన నెట్లు శక్త కంఠముతో ఘోషించుచున్నాడో ఆపరమ ప్రతిభయే యితని కళయొక్క యుత్క్రాం తిలో ఉత్తమస్థానము నాక్రమించుచున్నది.

ఈ ఉత్క్రాంతిస్థితిని మనము కొన్ని లక్షణములతో గుర్తించవచ్చును. ఒకటి, మొదట ఇతని కృతులలో ముఖ్యవస్తువున కెంత ప్రాముఖ్య ముండెనో చిత్రమునందు వచ్చు అల్పస్వల్ప వస్తువులకును అంతే ప్రాముఖ్య ముండెడిది. కాని యీ రెండవస్థితి నందుకొన్న తర్వాత లక్ష్యము తన ముఖ్యా భిప్రాయము, వస్తువు, భావన, వ్యక్తి మొద లగువానిమీదకు మాత్రము పోవుట కారం భించినది. అనేక సందర్భములం దితడు ఏ సూక్ష్మప్రక్రియలకును పోకుండగనే, కుం చెను బిరుసుగ ప్రయోగించియే తన ఉద్దేశ్యమును నెరవేర్చుకొన్నాడు. అల్పస్వల్ప విచారములను చూచుకొనుచు 'ఆహా! ఈ పుష్ప మెంత రమణీయముగా నున్నది! ఈపక్షి - ఈచెట్టు' అని మనస్సు పెక్కు కడలకు చెదరుట కవకాశ మివ్వక 'అబ్బబ్బ! ఈనరకయాతన! ఈదుఃఖము!' అని వెక్క సము, వెరగు జనించునట్లు రచించుచున్నా డు. మొదట చిత్రమును చూచి మరచి పోవచ్చునయియుండెను. ఇప్పుడది మనస్సు మీద ముద్రవేసి కూర్చొని యెన్నటికిని మరవకుండ చేయుచున్నది. రెండవది, ఇతడు నీటిరంగులకు బదులు తైలవర్ణములనే హెచ్చుగ నుపయోగింప నారంభించినాడు, తైలవర్ణములందు నయమును, మార్దవమును. సూక్ష్మవిలాసములను తీసుకొనివచ్చుట యెంత కష్టమో నీటిరంగులందు శక్తిని ప్రదర్శింప జేయుట అంతేకష్టము. తన రచనలందు లాలి త్యముకంటెను శక్తికి ఎక్కువ లక్ష్యము నిచ్చిన పిదప, అందుకు తైలవర్ణముల అను కూల్యమును తెలిసిన దేవీప్రసాదు వానినే యెక్కువగ వాడ నారంభించినాడు.

దీనిని అనుకూలతకోసము శక్తి సంప్ర దాయమని అందము. నైసర్గికముగనో, సాంకేతికముగనో శక్తినే సూచించు మరి కొన్ని చిత్రములను ఇతడు నీటిరంగులతోను చిత్రించియున్నాడు. జలవర్ణములతో మాత్రము గహన గంభీర విషయములను సశక్తికముగ ప్రదర్శించుటకు సాధ్యముకాదా యనియే యితని యుద్యమము. ఇతని దృష్టి యంతయు జీవనమందలి హాస్య, క్రౌర్యముల పైననే. వాని ననుసంధానించునప్పు డొక్కొ కప్పుడు ఇతనికి నవ్వు పుట్టుచుండును. కాని యానవ్వులో పరిహాసము లేదు, విడంబన లేదు.

అనుకంపతోకూడిన విచారమును కెరలించు తుంటరితనము అందులో నిండియుండును.

చిత్రకళయం దితని కెంత ప్రావీణ్యము గలదో శిల్పకళయందును అంత ప్రావీణ్యము గలదు. ఒకదాని కొకదానికి ప్రతిరోధము గలుగనీయక సమరసముగ రెంటిని కైవసము చేసుకొన్న నేర్పరి యితడు.

సంగీతము, కవిత్వము, చిత్రకళలవలె కాక శిల్పము హెచ్చుగ పార్థివ పదార్థము నాశ్రయించునదయినందున కళలలో దానికి వెలతక్కువని కొందరు పాశ్చాత్యదార్శనికుల మతము. కాని వారు వాస్తుశిల్పమునకును, ప్రతిమాశిల్పమునకును ఒక విభేదమును కల్పించుచున్నారు. పార్థివపదార్థమునకు మొదటలేని రూపమును రూపకారుడొసగుచుండుటవలన నతని కళ అంత నికృష్టమైనదికాదని సమాధానముకూడ చెప్పుచున్నారు. ఈ కారణము చేతనే వారు శిల్పమును దైహిక సౌందర్యము యొక్క శాంతిరూపము వస్తువుగాగల కళ యని వ్యవహరించుచున్నారు. *

ఉత్తమకళయొక్క ప్రభావము మనస్సు మీదనే కాని దేహముమీద కాదు. నైసర్గికమైన రూపమునకు కళావేత్తయొక్క మానసికప్రభ తగిలినప్పుడు ఏబంగారుముద్ద మూస నుండి బయటపడునో దానినే కళ యనవలయును. ఈ రససిద్ధిక్రియలో తక్కువ లోహములకంటెను వాని మారుపాటునకును, ఆ మారుపాటును కల్పించిన శక్తికిని ఎక్కువ విలువ నీవలసియున్నది. శిల్పము రాతి నుపయోగించుకొన్నదని దాని వెల తక్కువ కాదు; బంగారు నుపయోగించుకొన్నదని దాని వెల యెక్కువయు కాదు. నిష్పన్నమైన కళామూర్తియొక్క గుణమునుబట్టియు, అది చిత్తశుద్ధిని సాధించు క్రమమునుబట్టియు దాని విలువను మనము పరీక్షింపవలెను.

వ్యక్తుల మూర్తులను నిర్మించునప్పుడు దేవీప్రసాదులక్ష్యము ఆవ్యక్తుల స్థూలమైన, గౌణమైన, జడమైన దేహాంగలక్షణముల దెస పారుటలేదు. ఆబాహ్యావయవముల వెనుకనుండు మానవ గుణ, జీవన, ఆదర్శ, ఆశలవంక కది ప్రసరించును. ఆ ఆంతర-మానవ (Inner man) లక్షణములు బాహ్య మానవుని (Outer being) మీద పడి యుండినచో వానిని ప్రదర్శించుట కితడు యత్నించును. ఒకడు అతిచక్కనివాడుగా నుండవచ్చును; మంచిగుణవంతుడు, ధర్మాత్ముడును అనిపించుకొనియుండవచ్చును. కాని గుప్తముగ దూష్యకార్యములనే చేయుచుండవచ్చును. తెరలోపలి ఆ దూష్య మానవ స్వరూపము తనగురుతును ఏబాహ్య కారమునసో తప్పక ముద్రించియుండును. ఆ పతితజీవనపు ఘోరచ్ఛాయఆతనిచూపులలో వ్యక్తమగుచునేయుండును. సామాన్య నేత్రములకు గోచరముకాని యీ గుణసంకేతములు కళావేత్తకండ్లకు గోచరించుచుండును.

* Physical beauty in repose is therefore the special subject of the art of Sculpture.

తాను చెక్కిన మూర్తులను చూచినంతనే గుప్త, గోచర జీవనములు రెంటియొక్క జ్ఞానము నుగలుగునటులు కళావేత్త చేయగలడు. కావుననే శిల్పములమీద జనసామాన్యమునకు అసామాన్యమైన ప్రేమ. చిత్రకళను శ్లాఘించలేనివాడు కూడ శిలాబాలికల సంస్థానసౌందర్యమునకును, ముఖములందలి లేనవ్వునకును మరులుగొనుచుండును. ఆ చెలువమే అజంతాచిత్రములందు కనిపించిన అతడు మొగము త్రిప్పుకొనుచుండును; ఎక్కడలేని విమర్శలకును పూనుకొనుచుండును.

దేవీప్రసాదుశిల్పకళాప్రతిభ పూర్ణమగుచు వచ్చుచున్నదని యభిప్రాయపడుట కంటె పూర్ణతవంకకు తరలుచున్న దనుట న్యాయముగ నుండును. వ్యక్తిత్వ, సృష్టి నైపుణ్య, భావనావేశములకు రాయచౌదరిని సరిపోలువా రెవరును లేరు. అనుభావము దేవీప్రసాదు వైశిష్ట్యము. ఇతని రచనలందు కాఠిన్యమును, మార్దవమును రెంటిని చూడ వచ్చును. భావముద్రలందు జీవనాదము వినిపించుచుండును.

ఇతని ప్రధాన శిల్పమూర్తు లన్నియు వ్యక్తుల ప్రతిచ్ఛాయలే. ఇందులో ఈయన వైశిష్ట్య ముభయథా గోచరించుచున్నది. ఈయనప్రతిభకు పౌరస్త్య, పాశ్చాత్య వ్యత్యాసము లేదు. వ్యక్తులయొక్క వర్ణము, రూపరేఖలు, భూషణాంబరములు, దేశ-సంస్కారములు మొదలైనవానిమీద కంటెను మానవత్వముమీదనే యితనికి లక్ష్యము. ఇతని మూర్తులందు జీవకళ నిండియుండును. మూలప్రకృతియొక్క అంతరంగ ప్రసరనము కూడ వానిలో రూపుగొనియుండును. భావమేళ ( Composition ) సంప్రదాయము నితడంతగా పాటించలేదు.

ఇతడింకను ఎన్నెన్ని మార్గములు త్రొక్కి కళోత్క్రాంతిని అందుకొనునో మనము నిరీక్షింపవలసియున్నది.

"ఆచార్య"

(కన్నడమాసపత్రిక – 'విశ్వవాణి' నుండి)



# హైదరాబాదు - ఆంధ్రులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ

హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయంవారి ధర్మమా అని ఈనడుమనే హైదరాబాదును సందర్శించేభాగ్యం కలిగింది. ఈయవకాశాన్ని పురస్కరించుకొని హైదరాబాదు చూచాను; అక్కడ మనదేశం కోసమూ, భాషకోసమూ పనిచేస్తున్న మాననీయులనూ, మహాశయులనూ సందర్శించాను. సడీసవ్వడీ లేకుండా తమదారి తాము చూసుకొని, తమబాట తాము వేసుకొనిపోయే సెలయేళ్లలాగున్నారు వారు. పంచిపెట్టేదంతా అమృతమే; ఉజ్జీవింపజేసేదంతా జాతీయశక్తే. అపరిమితానందమయినది వారినందరినీ చూసేసరికి.



రాకపోకలు మణిగిపోయిన ఏనాటిపాత చుట్టాలనో కలసికొన్నట్లనిపించింది. వారిదీ కేవలం తెలుగుహృదయమే; ఉత్సాహమూ, ఆవేశమూ తొణికిసలాడే తెలుగుహృదయం. ప్రేమమధువుతో తీపులువారిన తెలుగుహృదయం. ఎక్కడికి వెళ్లినా, ఏకోస్తానున్నా తెలుగుమనస్సు తెలుగుమనస్సే. అది నవనీతకోమలమయినది; అది అనురాగరంజితమయినది. హిందూదేశం అంతటిలోనూ తెలుగువాడికి తెలుగువాడే సాటి. తెలుగువాని భావాలు అతిఉన్నతమయినవి; ఆశయాలు మహోదారమయినవి; ఆదరణ అతిమధురమయినది. ఒక్కమారు మైత్రికలసెనా తెలుగువాణ్ని హిందూదేశంలోని ఇతరజాతులవారే వదలలేరు: ఏ యితరజాతివారికైనా సరే ఉద్యోగంలోగాని, వ్యవహారంలోగాని స్వలాభాపేక్షా, స్వాభిమానమూ అడ్డురాకుండా ఉండాలి; అంతే— అవి అడ్డు నిలవకపోయెనా, వినండి మీరు, ఎక్కడ, హిందూదేశంలోని ఏ ప్రాంతంలో చెవియొగ్గి విన్నానసరే - మీరు తెలుగువాని ప్రశంస వినకుండాఉండరు.

తెలుగువాడు సామాన్యుడా, ఆగర్భశ్రీమంతుడయి పెరిగాడు; గొప్ప గొప్ప వారి

సహవాసాలు చేశాడు; పెద్ద పెద్ద రాజులతో చెలిమి చేశాడు; వారి మన్నన లందుకొన్నాడు; మనస్సులో గొప్ప ఊహాలు సంతరించాడు; మన దక్షిణదేశంలో రాజకీయ చరిత్ర కళ్లు నులుముకొని మేలుకొని చూచేటప్పటికే గొప్ప సామ్రాజ్యసౌధం నిర్మించుకొన్నాడు; అనేకులు మత గురువులకు ప్రణమిల్లి, అనేక మతాలను ఆదరించి తానూ, తన రాజ్యంలోని ప్రజలూ తరించేటందుకు ఇహానికీ పరానికీ రాచబాటలు వేయించాడు. తాను కట్టిన రాజకీయ సౌధాలు ఎన్నెన్ని తడవలో కూలిపోవుగాక! దిగ్భ్రాంతుడు కాలేదు; విషణ్ణత పొందలేదు. ఉత్సాహమే అతని శీలము; మంత్రశక్తే అతని బలము; ప్రభుతయే అతనిలక్ష్యము. చరిత్ర సాక్ష్యమిస్తుంది అతని శక్తిసామర్థ్యాలు చాలా గొప్పవని. ఉన్న తాశయాలతో కష్టించి పనిచేసి కట్టిన అతని రాజసౌధాల నెన్నింటిని కాలపురుషుడు పిల్ల బాటగొల్లని బొమ్మరింటిని తన్నినట్లు కాల దన్ని వేయలేదు? కాని తన్నడానికి కాలానికైనా విసువుపుట్టినదికాని తెలుగువానికి రాజ్యంకట్టడానికి విసువు రాలేదే! కాకపోతే, మన తెలుగుగడ్డ నెన్ని రాజ్యా లెన్ని రాజ్యాలు వెలసినవి! సామాన్యమా వీటిని కట్టడమంటేను. ఇల్లు కట్టి చూడు, పెళ్లి చేసిచూడు అన్నారు పెద్దలు. ఇల్లుకట్టడమంటే అంతటికష్టం. అటువంటిది వట్టి చిన్న ఇల్లు కాదు, మహాసౌధం కాదు, రాజప్రాసాదంకాదు—రాజ్యమూ, సామ్రాజ్యమూను తెలుగువాడు కట్టినవి! ఎంతటి కష్టము లనుభవించిఉండాలి ఆనిర్మాణంలో, ఎంతటి శక్త్యుత్సాహములు చూపిఉండాలి ఆ ప్రయత్నంలో, ఎన్నివిపర్యాసములు పొందుతూవచ్చినా ఎంతటి గుండెనిబ్బరం చూపించిఉండాలి, ఎంతటిత్యాగం చేసిఉండాలి! ఒకటా రెండా తెలుగునాట వర్ధిల్లిన రాజ్యాలు! అటు అఫ్ఘానిస్తానము మొదలు చేసుకొని ఇటు అస్సాముపరకూ ఉత్తరహిందూస్తానచరిత్ర అంతా తిరుగవేస్తే మౌర్యసామ్రాజ్యమూ, కుషాణసామ్రాజ్యమూ, గుప్తసామ్రాజ్యమూ, హర్షసామ్రాజ్యమూ —ఇవేగా హిందూరాజ్యాలు? అన్నీ పోగుచేస్తే వేళ్లమీాద లెక్కించగలిగినవే. ఆ తరువాత మహావిప్లవమే. మహమ్మదీయుల విజృంభణము - రాజపుత్రవీరుల అనుపమాన విక్రమధాటి —. ఎంతవిక్రమించినా రాజపుత్రులు, మహమ్మదీయుల చంద్రధ్వజం స్థిరంగా నాటుకుపోయింది ఉత్తర హిందూస్థానంలో, అక్కడక్కడ రాజపుత్రరాజ్యాలు కొన్ని ఉన్నా, కొంతకాలం నిలిచినా మినుకు మినుకుమన్నవేకాని గొప్పగా దీప్తిప్రకాశములతో వెలిగినవి కాకపోయినవి—అయితే ఇస్లాంశక్తి ఒక ప్రచండఝంఝు. ఆవాయు సంక్షోభానికి ఆకీపాలు రెపరెప కొట్టుకొన్నవి. రాజ్యా లెన్నయినా ఆ రాజపుత్రవీరుల దందరిదీ ఒక్కటే ఉద్యమం, ఒక్కటేప్రయత్నం అవడంవల్ల దేశచరిత్రలో వారిది ఒకటే అధ్యాయమయింది. ఈ విధంగా చూచినా

ఉత్తరహిందూస్థానం అంతటా హిందూరాజ్యాలు ఆ రెండింటికంటె ఎక్కువ లేవు. దక్షిణదేశం చూదామా అంటే అక్కడకూడా పూర్వకాలంలో వర్ధిల్లినరాజ్యాలు ఎన్నో లేవు. చోళులు, పాండ్యులు, హొయిసలులు- పల్లవ్రలనుకూడా చేరిస్తే అక్కడికి ప్రధానంగా విలసిల్లిన రాజ్యాలు నాలుగవుతవి; కాని పల్లవులు నా ఉద్దేశంలో తెలుగువారే; పల్లవుల ఆదిమదేశమే పల్లవనాడయింది—ఇప్పటి పలనాడు: గుంటూరుజిల్లాలోది. అందువల్ల ఇక దక్షిణాదిని వర్ధిల్లినవి ప్రధానంగా మూడేరాజ్యా లనాలి. ఇక నెత్తుకోండి మన తెలుగుదేశం సంగతి?

దక్కను పీఠభూమి తెలుగుజాతికాణాచి. దీనిని పంచుకొన్నారు తెలుగువారూ, మహారాష్ట్రులూను ఇపుడు. దీనిలో తూర్పువైపు సగం భాగం ఇపు డాంధ్రుల దయితే పడుమటివైపు సగభాగం మహారాష్ట్రులదయింది. అయినా శాతవాహను లనేపేర చరిత్రకు దెలిసిన ఆంధ్రులు పూర్వాపరసముద్రాలు—అటు అరాబియాసముద్రమూ, ఇటు బంగాళాఖాతమూ — అంటే మహా స్రామ్రాజ్యాన్ని మొట్టమొదటి పర్యాయం స్థాపించి అవిచ్ఛిన్నంగా రమారమి నాలుగువందల యేళ్లు పాలించినారు కాబట్టి ఆచారవ్యవహారములలో ఆంధ్రులకూ, మహారాష్ట్రులకూ ఎక్కువ సన్నిహితమే. ఆనాడు వీరిద్దరే కాదు; వీరితోపాటు కన్నడులుకూడా ఏకమయి ఏపని తలపెట్టినా కలసిచేసి ఒక సమష్టికుటుంబంలా వ్యవహరిస్తూ ఉండేవారు. మేము కన్నడులము, మేము ఆంధ్రులము, మేము మహారాష్ట్రులము అనేవిభేదమే ఉండేది కాదప్పుడు. అట్టి విభేదం లేకపోయినా మహారాష్ట్రులను వేరుగా నిరూపించి చూపడానికయినా అవకాశ ముండేదేమోకాని వీరు కన్నడులని కన్నడులను వేరుగా నిరూపించి చెప్పడాని కేమాత్రమూ అవకాశం ఉండేదికాదు. అసలు నిజ మేమకనబడుతుందంటే జాతిరీత్యా చూస్తే కన్నడులదీ, ఆంధ్రులదీ ఒకటేజాతి; ఒకటే కోవ. నిజంగా వీరిద్దరూ — ఈకన్నడులూ, ఆంధ్రులూ భిన్నజాతులవారూ, భిన్నతెగలవారూ అయితే అశోకుడు తన ధర్మానుశాసనాలలో — తనరాజ్యంలోనూ, తనరాజ్యంసరిహద్దులా ఉన్న తెగలవారినీ, జాతులవారినీ అంతమందిని పేర్కొన్నాడే, మరి కన్నడులను ఎందుకు చెప్పలేదు? చోళులను చెప్పినాడు, పాండ్యులను చెప్పినాడు, కేరళులను చెప్పినాడు, రట్టులను చెప్పినాడు, ఆంధ్రులను చెప్పినాడు, ఎవరెవరినో చెప్పినాడు; — చెప్పనిదల్లా ఒక్క కన్నడులను గురించే? వీరిని గురించి చెప్పకపోవడాని కేమికారణం? కన్నడుల దొక ప్రత్యేకతెగా, ప్రత్యేకజాతీ కాదుగనుక. అప్పటికి కన్నడజాతి లేదు; తరువాత పుట్టిందంటే సహ్యమయిన మాటాకా, దది సబబయినమాటా కాదు. జాతిజాతంతా ఒక్కసారిగా అశోకుడి తరువాతికాలంలో పుట్టు

కొచ్చిందనడం హేతువాదానికి కట్టువడే మాటకాదు. అందువల్ల అస లాంధ్రులూ, కన్నడులూ ఒక్కజాతివారే అని నాఅభిప్రాయం. కట్టు, బొట్టు, జుట్టు, వేషం, లిపి, భాష కూడానేమో చాలావరకు — ఇవన్నీ కన్నడులకూ, ఆంధ్రులకూ సామాన్యమే. ఎట్లయితేనేమి వీరు కన్నడులు, వీరు ఆంధ్రులు, వీరు మహారాష్ట్రులు అన్న విభేదాలువారు క్రమక్రమంగా రాజకీయంగా వేరుపడి వారి ప్రత్యేకవిజ్ఞానవివేకం ముదురుతూ వచ్చినందులకు ఫలితంగా ఏర్పడ్డవే కాని అంతకు వేరుకాదు. పోనీ, మహారాష్ట్రులనుకూడా కేటాయించి దక్కను పీఠభూమి పూర్వార్థం మాటే ఎత్తుకొందాము—అది కేవలం తెలుగునాడే గనుక. ఎన్ని రాజ్యాలు వెలసిన దిక్కడ? ఇక్ష్వాకులు, శాలంకాయనులు, విష్ణుకుండులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్లు, గాంగులు, వెలనాటివారు, కోనసీమ హైహయులు, తెలుగునాటిచోళులు, నతవాటివారు, పరిచ్ఛేదులు, కోటవారు, కొండపడుమటివారు, సాగివారు, కొనకండ్రవాటివారు, కొలనువారు, విజయనగరంవారు ఒకరా ఇద్దరా? ఇందరూ రాజ్యాలు కట్టినవారే! మండలిక వంశాలవికూడా రాజ్యాల క్రిందనే లెక్క— అని కొందరు ప్రశ్నింపవచ్చు. ఆహా! రాజ్యాలలోనే లెక్క— అని నాజవాబు; ఎందువల్లనంటే తెలుగు దేశచరిత్రలో ఈ వంశముల వారిచరిత్ర తీసివేస్తే కొన్ని పుటలే లోపిస్తవి; చరిత్ర సేతువున గండి యేర్పడుతుంది. రాజపుత్రవంశములవారి చరిత్రలాగ ఈ మండలికవంశముల చరిత్రమును ఒక్క ఉద్యమముగుదిని గుచ్చడాని కవకాశమూ లేదు; రాజపుత్రవంశములవారికిలాగ వీరిని ఐక్యముచేసే ఒక్క లక్ష్యమూ లేదు. అక్కడ రాజపుత్రవంశములవారి కొక్కటేప్రశ్న: హిందూధర్మమా, ఇస్లాముధర్మమా అని. ఈ విషయమును నిర్ణయించుటకే వారి రాజ్యము లుప్పతిల్లినవి; కూలినవి. అంతకంటె విశిష్టతయేదియు లేదు వాటికి. ఈ లక్ష్యమును, ఈ మహాశయమును కొంచెపరుచుటకుకాదు నేను చెప్పునది—అది చాలా గొప్పది. ఆయాశయసిద్ధి కోసం తమశౌర్యమూ, సంపదా ధారపోసిన ఆ రాజన్యవీరులు మనకు నిత్యమూ వంద్యులే; విశిష్టతనుగురించి చెప్పవలసివచ్చినది గనుక ఇంత తడవవలసివచ్చినది. మరొక లక్ష్యమేదయినా ఉంటే ఉండుగాక కాని మన మండలికవంశములవారిది రాజపుత్రులకున్న లక్ష్యమువంటిదిమాత్రము కాదు. అప్పటికి దక్షిణాదని మహమ్మదీయులస్పర్శ ఉంటేగా అట్టి సమస్య ఒకటి ఏర్పడడానికి? అందువలన దేశంలో వారివన్నీ ప్రత్యేక రాజ్యాలుగానూ, చరిత్రలో ప్రత్యేక ప్రకరణాలు గా నూ ఏ ర్ప డ వ ల సి నవే. అప్పటికికూడా మనం ఆలోచించవలసినది రాజ్యం చిన్నదా, పెద్దదాఅని కాదు; తన ఉత్సాహశక్తినీ, తన మంత్రశక్తినీ ఉపయోగించి తనబలాన్నీ, బుద్ధిబలాన్నీ విని

యోగించి, అవసరమయితే ఎంతత్యాగ మయినా చేసి తెలుగువాడు మొట్టమొదటి నుంచీ ప్రభుత నెరపడానికే పాటుపడుతూ వచ్చాడనేవిషయం తెలుపడమే నాఉద్దేశం. తెలుగుజాతిలో ప్రాభవమూ, తెలుగుబిడ్డలో ఆరాచకీవీ నిలిచిపోయినవి.

మన హిందూరాజ్యా లంతరించి విమత రాజ్యాలు మన తెలుగునాట విస్ఫారినప్పటికీ కూడా తెలుగువాడిదే పైచేయి. హిందూ రాజ్యప్రభ వెలిగిపోయినప్పుడు వేదపఠనం లోనూ, ధర్మశాస్త్రనిర్ణయంలోనూ, రాజ్య తంత్రంలోనూ తెలుగుబిడ్డదే మేలుమా టయితే,విమత రాజ్యం స్థాపనఅయినాకకూడా తెలుగువాడిమంత్రశక్తికే చురుకుదనమూ, ప్రాబల్యమూ ఎక్కువగా ఉండేవి. దక్కను ప్రాగ్భాగమంతా మహమ్మదీయప్రభుత నాద రించినపుడుకూడా తెలుగువానికీవికి కొదువ లేదు; శక్తికి పటుత్వం తగ్గలేదు. ఫార్సీ నేర్చి నాడు; గుర్రమెక్కి మొనగాడయినాడు; చివరకు మంత్రిత్వంకూడా చేశాడు తెలుగు బిడ్డడు. పొరపులులేని స్నేహం కలిసిందా తుదకు ప్రాణమేకాదు,తనసర్వస్వాన్నంతనూ ధారపోస్తాడతను. హైదరాబాదురాజమార్గా ంలో నిలబడండి ఆంధ్రుని యీత్యాగసంపద ప్రత్యక్షమవుతుంది. గోలకొండకోట పరి సరాల నిలవండి; రాజ్యము మహమ్మదీయ రాజ్యమయినా తురకప్రభువు ఉప్పు తిన్నం దుకు సంతోషపూర్వకంగా తమ తనువులు ధారవోసిన ఆంధ్ర వీరమూర్తుల శిథిలతేజమే మీ ముందు మెరుస్తూ ఉంటుంది; ఆకోట కొత్తశాల దీపిస్తూ ఉంటుంది. తెలుగువాడు రాజమూర్తి; తెలుగువాడు మంత్రమూర్తి; తెలుగువాడు శౌర్యమూర్తి; తెలుగువాడు విశ్వాసమూర్తి—ఏమికాడు తెలుగుబిడ్డడు?

తెలుగుదీపం ఇప్పుడు కొడికట్టి ఉంది. పదుగురు కూడి అభిమన్యుణ్ని పడదోసినట్లు అన్ని శక్తియుక్తులతోనూ గూడుపుఠాణీ చేసి కాలం తెలుగువాణ్ని ఇట్లా చేసింది. ఇది కేవలం పరీక్షకే. రాతినిబెట్టి రాస్తేనేకాని బంగారం మెరుస్తుందా మరి? కాకధాకల కాగగలవాడు తెలుగువాడే అని లోకానికీ తెలుసు;అంతకంటె బాగా కాలానికీ తెలుసు. తన శక్తీ, తన సత్తువా తాను తెలుసు కొన్నాడా, తెలుగువాడి కష్టేమిటి? తెలుగు ప్రతిభ అపూర్వమయినది; తెలుగుమంత్ర శక్తి అకుంఠితమయినది; తెలుగు ప్రజ్ఞ అను పమానమయినది.

దైవోపహతుడయి ఆంధ్రు డిప్పుడు పడిపోయిఉన్నమాట నిజమే. తుదకు ఆంధ్రుడూ ఆంధ్రుడూ కలసి మంచి చెడ్డలు మాటలాడుకోవడానికి కూడా అవ కాశాలు తగ్గినవి. ఆంధ్ర భూమినే ఆంధ్రులకూ ఆంధ్రులకూ మధ్య రాజకీయ ములైన గోడలు లేచినవి; దీనివల్ల కొన్ని ప్రాంతాలలో ఆంధ్రులకూ ఆంధ్రులకూ రాకపోకలే సన్నగిల్లినవి. ఆంధ్రులు ఆంధ్రు లకే కొత్తవుతున్నారు. అఖండాంధ్రజాతి, అఖండాంధ్రదేశము అనేలక్ష్యమే పోతున్నది.

ఇది చాలా శోచనీయమయినస్థితి. కావాలి అఖండాంధ్రజాతి కైకైకలత్యం! రాజకీయంగా ఎంతటిగోడలు బలిసినా ఆంధ్రులకూ ఆంధ్రులకూ అనుబంధం వదలుతుందా? ఆంధ్రసంస్కృతి అంతా ఒకటికాదూ? ఆంధ్రసభ్యత అంతా ఒకటికాదూ? మంథెన పౌరాణికులు భారత, భాగవతాలు చదివి వినిపిస్తూ ఉంటే బెజవాడ, రాజమహేంద్రవరాలలో ఉండే పండితులు తలలూపి రసాస్వాదనం చేస్తూవచ్చేవారు పూర్వం. హైదరాబాదు నవాబుల ఆస్థానంలోకూడా కోనసీమపండితులు వేదపరీక్ష లిచ్చేవారు నెల్లూరు, గుంటూరులనుంచి తెలుగుకవివతంసులు కుతుబుషాహితఖ్తును సమీపిస్తే ఇబ్రాహీం కుతుబుషావారి కవితా రసజ్ఞతకు పులకలువోడమి వారిచేయి కవిసత్కారమునకెప్పుడూ ముందుకే పరుగిడేది. ఎవ రెరుగని విషయా లివి? తురకాణ్యంలోకూడా తెలుగునాట ఆంధ్రసంస్కృతికే మేలిప్రూజ. రాకపోకలు తగ్గి ఎడమయిన తెలుగువారు మరల కలుసుకొన్నప్పుడు తెలుగుసంస్కృతికి దీప్తి వస్తుంది; తెలుగుభాష హృదయాలూ హృదయాలూ కలుపుతుంది. ఈ యనుబంధానికి ఏవో విధిలేక రాజకీయంగాలేచిన అంతరాయాలు అడ్డువస్తవా? ఒకవేళ రాజకీయమయిన కారణాలవల్ల దేశాలకు పంపుల్లు కలిగినా జాతీయహృదయానికీ, జాతీయభాషకూ పంపుల్లెక్కడ?

నేను మొన్న హైదరాబాదు వెల్లి ఆ యాంధ్రమహాశయులను సందర్శించినపుడు అనిర్వచనీయమయిన ఆనందం పొందినాను. నా జాతి జాతిఅంతా, అఖండాంధ్రదేశమంతా నాయెదుట సాక్షాత్కరించిన ట్లియింది. కుంపిణీరాజకీయాలు తారుమారు చేసినవి కాని దేశమంతా ఒకటేగా అసలు! ఓరుగంటి కాకతీయులు రాజ్యంచేసేటప్పు డిక వేరేచెప్పడ మెందుకీవిషయం? రాజ్యమంటే అదేరాజ్యమూ, ఆదరిదే గంగాను. కేతన్నగారుకూడా చెప్పనేచెప్పినారయ్యె గంగకు వెళ్లవలెనంటే "కంచి నెల్లూరు మరియోరుగల్లయోధ్య యనుపురంబులపై"నుంచే త్రోవని. నెల్లూరునుంచి ఓరుగల్లు వెళ్లినది తిక్కన్నగారు ఈత్రోవనెంటే. ఇప్పుడంటే ఆబాటంతా పాతపడి గడ్డిమొలిచిపోయింది మరి. పాతరాజ్యాలు చీకిపోయి అఖండాంధ్రదేశానికె తపంపుల్లు వచ్చినా సంస్కృతిభావానుబంధాలు పోగొట్టడం ఎవరితరము — జాతిలో చేవే ఉంటే? అటువంటి మనపురాణఖండిక తెలంగాణాన్ని చూస్తే ఎవరి కానందం కలగదు?

తెలంగాణం కాస్తాకూస్తాదేశమా? అఖండాంధ్రదేశమంతా దాదాపు లక్షా ఏడువేలమైళ్లుంటే నిజాంరాజ్యంలో పడిపోయినతెలుగుభాగం దాదాపు సగందాకా వుంది. నలభై రెండువేల చదరపుమైళ్లపై చిల్లర ఫక్తు శుద్ధ తెలుగుసీమ. జనాభానుబట్టి చూచినా తెలంగాణా న్నంత తేలికచేయడానకు వీలు లేదు. ఆంధ్రులు దాదాపు రెండుకోట్ల నలభై మూడులక్షలమంది ఉంటే ఈ సంఖ్యలో

రమారమి మూడోవంతు నిజాంరాజ్యంలో ఉన్న వారే. తెలంగాణంఅంటే అంతటి ప్రాముఖ్యంగలదేశం. మిగతావిషయాలన్నీ తడవడ మెందుకు? తెలుగువారు పారాయణంచేసి తనుభక్తిప్రపత్తుల కంచులుదిద్దుకోవడాని కాప్రాంత మిచ్చినదే మనతెలుగు భాగవతం. కావ్యాలంకారశక్తియుక్తి ఆంధ్ర జాతికి కుదిరేసమిత్తం ఉగ్గుబాలలో రంగరించిపోయుటకు ప్రతాపరుద్రీయం ఆప్రాంత మిచ్చినది కాదూ?

ప్రాముఖ్యంలో తెలుంగాణాని కెంత మాత్రమూ తీసిపోనిది రాజధానీనగరం హైదరాబాదు. మహాఘనత వహించిన నిజాంప్రభువువారి మనికిపట్టు. మన హిందూదేశంలో తప్పక చూడవలసిన పట్టణాల లో హైదరాబాదు ఒకటి. అది చాలా విచిత్రమయిన పట్టణం. ఆ పట్టణంలో ప్రాచీనత ఎంతో నవ్యత అంత ఉన్నది. కోటికి పడగలెత్తిన కుబేరులూ ఉన్నారు; తిండికి లేక నవసిపోయే నిరుపేదలూ ఉన్నారు. నూతనంగా అమలులోకి వస్తున్న నగర నిర్మాణపదకంమీద లేస్తున్న పేటలూ ఉన్న వక్కడ; విహరించడానికి కక్కసపడవలసిన ఇరుకుసందులూ గొందులూ కూడా ఉన్నవి. ఇప్పటికి నాలుగు శతాబ్దాలకు పూర్వం ఉండే నాగరకతకూ అది మనికిపట్టే; ఇరవైయో శతాబ్దానికి తీర్పులు దిద్దగల సభ్యతకూ అది ఉనికిపట్టే. ఈ యిరవైయోశతాబ్ది సభ్యతావికాసంచూచిన నవీనులకు అక్కడి పాత వింతగొలుపుతే అక్కడి ప్రాచీన శతాబ్దుల నాగరికతను పదిలముగా కాపాడే పాతకాలపువారి కక్కడి ఈనాటి సభ్యతావికాసమూ వింతగొలుపుతూనే ఉంటుంది. "మతములుసొచ్చినిల్లు జనమాన్యచరిత్రుల పుట్టినిల్లది. ఒక మతమువారు కాదు; ఒకజాతివారు కాదు; ఒక తెగవారు కా దక్కడ మనకు కనబడేది—అరబ్బులు, పఠానులు, అఫ్గానులు, బంగాళీలు, మద్రాసీలు, మార్వాడీలు, కోమట్లు, యూరోపియనులు, ఆంగ్లో ఇండియనులు, పార్సీలు, క్రైస్తవులు, మహారాష్ట్రులు, కన్నడులు, ఇరానీలు—ఒకరేమిటి? తూర్పూ, పడమరా అక్కడ కలుస్తవి. ప్రాక్సభ్యతకూ, ప్రతీచీసభ్యతకూ అది సంగమస్థానం. ఆయుధశాసనం అక్కడ లేదు. అరబ్బులూ మొదలైన ఆయుధజీవులు కొందరు కత్తులూ, కటారులూ ధరించిపోతారుకాని హత్యలేమీ యెరుగ రక్కడివారు. ఇతరప్రాంతాల పట్టణాలు ఎంత శాంతంగా ఉంటవో హైదరాబాదూ అంత శాంతంగానే ఉంటుంది.

అక్కడ భాగ్య మెక్కువ; అందుకనే భోగమూ ఎక్కువే. మహమ్మదీయులది దర్జా; పాలకజాతి అక్కడది. అక్కడిజనానికంతకూ మహాఘనతవహించిన నవాబు సర్ మీర్ ఉస్మానలీఖాన్ బహద్దరుగారే ఒరవడి—వేషానికీ, భావకూకూడాను. ఆ ప్రభువు దయామయుడుకాదూమరి—నలభైలక్షలపన్ను కొట్టివేసినాడట —

ఈ రజతోత్సవ సందర్భంలో. ఈ ప్రభువు సింహాసన మెక్కిన తరువాత పరిపాలనలోనూ, హైదరాబాదునగరంలోనూ వచ్చిన మార్పింతా అంతానా? హైదరాబాదునగరంలో వీథులన్నీ విశాలంచేసి వాటికి రాజకళ కలిగిస్తున్నారు. సందుగొందులన్నీ కూలదోయించి చక్కనియిళ్లు కట్టిస్తున్నారు. నగరం నాలుగువైపులా బీదలుండడానికి Rat proof ఇళ్లు కట్టించి కొద్ది పాటిఅద్దెలకు వారి కిస్తున్నారు. పట్టణం ఎన్నెన్నోవిధాల అభివృద్ధిపొందుతున్నది.

హైదరాబాదునగరం అసలు కట్టించినది సుల్తాను మహమ్మదుకూలికుతుబుషా; గోలకొండను పాలించిన కుతుబుషాహి వంశస్థులలో అయిదవవాడు. విజయనగర రాజ్యానికి సమకాలీనమైన బహ్మనీరాజ్యం కొంతకాలం ప్రబలమై క్షీణదశకువచ్చి తుదకు చరమదశలో విజాపురము, గోలకొండ, బేరారు, అహమ్మదునగరము, బీదరులని అయిదురాజ్యాలుగా చీలిపోయింది. వీటిలో విజాపురము, గోలకొండ, అహమ్మదు నగరాలు ప్రబలమైనవి. గోలకొండరాజ్యాన్ని పాలించిన కుతుబుషాహివంశస్థులు చాల సమర్థులు. క్రమంగా తెలుగుదేశంఅంతా వారిపాలనలోకి వచ్చినది. వీరిలో అయిదవ సుల్తాను మహమ్మదుకూలికుతుబుషా ప్రణయపత్నులలో భాగ్యమతిఅనే హిందూస్త్రీ ఒకతె ఆవిడపేర అతడు భాగ్యనగరాన్ని కట్టించాడట ౧౫౮౦ లో. ఆవిడ కాలధర్మం పొందినఅనంతరం నగరానికాపేరు మారింది ఎట్లయితేనేం, మధ్య ఎన్ని పేరులుమారితేనేమి అదే ఇప్పుడు హైదరాబాదనేపేరుతో వ్యవహరింపబడుతున్నది.

ఈ హైదరాబాదునగరం మధ్యగా వెడుతుంది మూసినది. ఈ మూసినదికి ౧౯౦౮ లో వచ్చినంతవరద ఎన్నడూ రాలేదు ఆయేడు ఈ వరదవల్ల వేలకొద్ది జనం నశించిపోయారు. కూలినయిళ్లకూ, పోయిన ఆస్తికీ అంతూపొంతూ లేకపోయింది. జంతుకోటి ఎంతనష్టమయినదో. అప్పటి నైజాముగారు మీర్ సర్ మహబూబు అలీఖాన్ బహద్దరువారు—ఇప్పటి నైజాముగారి తండ్రి — అదృశ్య మంతా చూస్తూ ఆపాడుపడ్డ ప్రదేశంలో శోకావేశంచేత పిచ్చియెత్తినట్టు సంచరించారంటారు. వెంటనే మళ్లీ నగరానికిట్టి ఉపద్రవం సంభవింపగూడదని పదకాలువేసి ఆలోచించారట. తుదకు ఇప్పటినైజాముగారికాలంలో ఆపదకాలన్నీ పండి ఫలితంలోకి వచ్చినవి.

అసలు మూసి, ఏసి అని నదులు రెండు. హైదరాబాదు సమీపించడానికి పూర్వం కొంతదూరాన ఈ రెండూ ఒకదానిలోనొకటి కలసిపోతవి. అవిరెండూ కలసినపిదప ఆనదికి కూడా మూసి అనే పేరు. పట్టణానికి కొద్దిమైళ్లదూరంలో ప్రధానంగా ఈమూసివరదల యుపద్రవం తగ్గించడానికి రెండుజలాశయాలు కట్టించారు. ఈ జలాశయ నిర్మాణానికి కారణభూతుడయినవాడు మన ఆం

ద్రుడే—సర్ ఎమ్. విశ్వేశ్వరయ్యగారు— అఖండమేధాసంపన్నుడు. ఆయనబుద్ధిబలమే హైదరాబాదునగరాని కీమూసియుపద్రవాన్ని శాశ్వతంగా తొలగించివేసింది. తెలుగువాడిప్రతిభ క్రాంత మెత్తియిచ్చిన నివ్వాళిపళ్లేలు ఆజలాశయాలు రెండూను. ఒకదాని పేరు ఉస్మాన్ సాగరు, రెండవదాని పేరు హిమాయతు సాగరు. మొదటిదానిని మూసి కడ్డంగాను, రెండవదానిని ఏసి కడ్డంగాను కట్టినారు; అనగా మూసి, ఏసినదులలోనుంచి వచ్చే నీటినినిలవచేసేజలాశయాలివి. వరదఉపద్రవం తగ్గించడానికిమాత్రమే కాకుండా ఉస్మాన్ సాగరు హైదరాబాదకు మంచినీళ్లచెరువుగా కూడా ఉపయోగపడుతున్నది. దీనిని నిర్మించడానకు ౫౮,౪౦,౦౦౦ ల రూపాయలయింది. హైదరాబాదునగరంలో మంచినీటికుళాయిలకు ఈ ఉస్మాన్ సాగరే ఆధారం. గండిపేట చెరు వంటారు దీనినే. ఏసినది మూసినదితో కలిసేతావుకు మూడున్నరమైళ్లఎగువను కట్టినారు ఏసికడ్డముగా హిమాయత్ సాగరనే జలాశయాన్ని. దీనిని కట్టడానికి రు. ౯౧,౭౫,౦౦౦ లు - దాదాపు కోటి రూపాయలయినవి. ఈజలాశయాలు మూసి వరదలఉపద్రవం తగ్గించడానికే కట్టినా హిమాయతుసాగరునీటినిబట్టి దాదాపు అయిదువందలఎకరాలభూమి సాగుబడికూడా అవుతూవున్నదట. మూసినది ఉత్తరపు, దక్షిణపుగట్టులు బాగా ఎత్తుచేసి రాతితో కట్టినారు. ఈనది కిటు, అటు ఉన్నరోడ్డులు వెడల్పుచేశారు. వీటి పక్కలనే ఉన్నవి హైదరాబాదులోని గొప్పగొప్పభవనాలు - అద్భుతమైనవి — ఉస్మానియాజనరలు ఆస్పత్రి, హైకోర్టు, సిటీకాలేజీని.

ఉస్మాన్ సాగరువద్దా, హిమాయతు సాగరువద్దా చక్కని విహారస్థలాలూ, ఉపవనాలూ నిర్మించారు గవర్నమెంటువారు. అందులో ఉస్మాన్ సాగరు విహారోపవన ప్రదేశం మరీ బాగుంటుంద. అందులో పొదరిల్లే కాదు, రాతితిన్నెలే కాదు, క్రీడారంగములే కాదు - ఎంత అందంగానైనా ఉన్నవి; ఎన్నయినా ఉన్నవి. ఆరబూసిన పుచ్చపాదు లాగ వెన్నెలకాసే చల్లని రాత్రులు ఆ ఉపవనాలలో విహరిస్తే తెలియవస్తుంది కొంత ఆసౌఖ్యము తరితీపుల సౌభాగ్యం! పగలూ రాత్రీ కూడా ఆ సాగరతటాన, ఆ యుపవనాలలో 'గానాబజానా'లతో 'జల్సా' సాగుతూనే ఉంటుంది తరచు.

గండిపేట చెరువుకు కూతవేటు దూరంలోనే ఉంది గోలకొండ ఖిల్లా. 'నేను నమ్మిన వాళ్లే నన్ను విద్రోహంచేయకపోతే నే నిట్లా ఉండి ఉండ'నని చూడవచ్చిన, హృదయమున్న ప్రతీవాళ్లతోను చెప్పుకొని బాగులు బాసులుమని దుఃఖం వెళ్లబోసుకొంటుంది ఆ కోటపడతి. — ఎవరు తీర్చగలిగిన దాదుఃఖం! హిందూదేశమునంతనూ గడగడలాడించిన ఢిల్లీ పాదుషా ఔరంగజేబును కూడా ఆరునెల్లపాటు ఖడేరావని నిలువరించి నిబ్బరించింది అది, ఉన్న సైన్యంలో

మెరికలవంటిదాని నేరి ఆ కోట ముట్టడికి పాదుషా నియోగించినాను. ఎన్ని తడవలు వచ్చి ముట్టడించాడు; ఆ పాదుషా ఎన్నితడవలు మరలిపోయినాడు! కడపటి మారు ఆ విద్రోహపుతంతే జరగకపోతే ఆపాదుషా భుజబలాటోపం మీద శాశ్వతమయిన అపకీర్తిమచ్చ నేరేడిపండంత నిలిచిపోయేదే. ఆ కోటలోని వీధులగుండా పోతున్నప్పుడూ, ప్రాకారాలు దాటుతున్నప్పుడూ మూర్తికట్టిన విశ్వాసమూ, రాజభక్తీ అయిన అబ్దుర్ రజాక్ - ప్రాణరక్తంతో తడిసిన ఈ నేల తొక్కుతున్నామే - ఎంత అపచారంచేస్తున్నామో అని గుండెలు దడదడలాడినవి. ఔరంగజేబుపాదుషా తంత్రంకాని, అతనుచూపిన ఎరకాని ఏమీపనిచేయలేకపోయినవి అబ్దుర్ రజాక్ మీద. కడపటి కుతుబుషాహి నవాబు అబ్దుల్ హసన్ తానషా దగ్గర ఇంకో అబ్దుర్ రజాక్ ఉండి ఉంటే ఆగోలకొండకోట కిప్పటిపాటు వచ్చేదికాదు. లెక్కలేనన్ని గాయములు తగిలినవి, కత్తులు పొడుస్తూనే ఉన్నవి; వ్రేటులు తింటూనే ఉన్నాడు; ఔరంగజేబు పాదుషాసైన్యాలు కోటలోకి చొరుచుకువస్తూ ఉంటే అడుగడుగుకూ ఎదురుకొని విక్రమిస్తూనే ఉన్నాడు రజాక్! తుదకు కనుబొమ్మల మీది చర్మంకూడా శత్రువుల కత్తివేటుకు తెగి కంటి కడ్డంగా వేలాడుతున్నది చూపు నిరోధిస్తూ; రక్తం శరీరం అన్నిభాగాల నుంచీ జలజల ప్రవహిస్తూనేఉన్నది. స్పృహ తప్పిపోయినది. ఆతనిశక్తీ, తెలివీ అన్నీ - ఇంతెందుకు ప్రాణమే ఆతనిచేతిలో గూడు కట్టుకొని దాని చేత పనిచేయిస్తూ ఉన్నది. మిగతాశరీరమంతా స్తబ్ధమయినది; ఒంటి మీద స్పృహ లేదు; స్థల మేదో, ఎక్కడున్నాడో కూడా తెలియదు రజాకుకు; కాని అతనికరవాలము శత్రుమార్గణము చేస్తూనే ఉన్నది; చేయి శత్రువులఉద్ధతిని ఆశంకపరుస్తూనేఉన్నది. ఎంతమంది కనబడతారు స్వామిభక్తిపరాయణులయిన అబ్దుర్ రజాక్ వంటి వీరులు చరిత్రలో? ఏజాతివారయినా, ఏమతంవారయినా వారు మనకు వంద్యులే. ఆగోలకొండకిల్లాలో ఉన్న రామదాసుబందిఖానా, హిందూదేవాలయమూ స్మరణకు తెస్తవి అక్కన్నమాదన్న గార్లను.

ఇన్నిటిని చెప్పి ఉస్మానియా విశ్వవిద్యాలయ భవనాలనుగురించి చెప్పకుండా ఉండలేను. విశ్వవిద్యాలయం కళాశాలలన్నీ ప్రస్తుతం తాత్కాలికంగా నిర్మించిన భవనాలలో ఉన్నవి. శాశ్వతభవనా లిప్పుడు నిర్మాణంలో ఉన్నవి. పని అతిచురుకుగా జరగుతున్నది. ఒక్క విశ్వవిద్యాలయకళాశాలానిర్మాణానికే కోటి రూపాయలుపైగా ఖర్చుపెడుతున్నారు. విశ్వవిద్యాలయం కళాశాలలలో చదువుకొనే విద్యార్థు లుండడానికి హాస్టెలుసు (భోజనవసతిగృహాలు) ఉన్నవి—అవి దేవేంద్రభవనాలే. ఇప్పటికి ఏ, బి హాస్టెలుసు—రెండు భవనాలే తయారయినవి. సిహాస్టెలు నిర్మాణంలో ఉంది. వేడినీటి కుళాయిలు, చన్నీటి కుళాయిలు, నమాజుకు ప్రత్యేక మందిరాలు, విద్యార్థులందరూ కూడి ఇష్టాగోష్ఠి జరపుకొనేటందుకు వేరే మందిరాలు - ఓం! అది రాజవైభవమే. వాటిని చూడవెళ్లినవాళ్ల చేత 'మనంకూడా





౪. కుతుబ్‌షాహీగోరి (గోలకొండ)

ఇక్కడ విద్యార్థులైతే ఎంత బాగుండు' ననిపించే భవనా లవి. అంత అందమయినవి; అంత ఆనందకరమయినవి.

నూతననిర్మాణాలకు డబ్బేమిటి, విర జిమ్మేస్తున్నారు — కోట్లలెక్కేగాని మరో లెక్కే లేదు - నవాబుగారు తలచుకొన్న కొదవా?

మొత్తంమీద హైదరాబాదలో చూడ వలసిన స్థలా లెన్నో ఉన్నా చూడడానికి వీలు పడిందే కాదు. అయినా చార్‌మినారు, మక్కామసీదు, ఫలక్‌నుమాలు మాత్రం చూడక మెట్లాగో పడింది.

చార్‌మినారన్నది నాలుగుశిఖర స్తంభా లతో అలంకృతమయిన గొప్పనిర్మాణం. హైదరాబాదుహాకలమీద ముద్ర ఇదే. దీనికి నలుగువైపులా నాలుగు తోరణములు (Arches) ఉన్నవి. హైదరాబాదులోని నిర్మా ణాలన్నిటిలో ఇది చాలాగొప్పది. దీనిని కూడా మహమ్మదుకూలీ కుతుబుషాసుల్తానే ౧౫౯౧ లో కట్టించాడు. నిర్మాణం శిరోభా గంమీదనుంచి ఈ శిఖర స్తంభాలు ఒక్కొ కటి రమారమి రెండువందల అడుగుల యెత్తుండవచ్చు. నగరమధ్యంలో ఉన్న దీకట్ట డం; కొంతకాలం విద్యాపీఠంగాకూడా ఉప యోగపడేదంటారు. ఇప్పు డక్కడ శిపా యీలు కాపు. ఈ చార్‌మినారు శిరోభా గాన ఒకవైపున మసీదూ, ఇంకోవైపు దేవాలయమూ చెక్కినారు. ఈ ప్రాంతాన తురకప్రభుత్వం ఆరంభమయినది మొదలు హిందూమహమ్మదీయులకు సఖ్యతయే కాని పొరపులు లేవనుటకు ఇట్టివే చూపుతారు.

హైదరాబాదులోని మసీదులన్నిటిలో ప్రధానమైనది మక్కామసీదు. ఏకకాలంలో పదివేలమంది వచ్చి నమాజుచేయడానికి తగి నంతవిశాలం కల దిది. హైదరాబాదునగ రాన్ని కట్టించిన మహమ్మదుకూలికుతుబు షాయే ౧౬౧౪ - ౧౬౧౭ లో ఈమసీదును కట్టించినాడట. చనిపోయిన నైజాములనంద రినీ ఇందులో నొకభాగాన పూడ్చిపెడుతారు.

ఫలక్నుమాసౌధము హైదరాబాదులో చూడవలసినవాటిలో ఒకటి. నగరానికి వెలుపట దక్షిణభాగాన ఒకమెట్టమీద ఉన్న దది. ముప్ఫయిఅయిదులక్షలరూపాయలుఖర్చు పెట్టివికారుల్‌ఉమ్రనవాబుగారు దీనిని కట్టించి నారట. దీనిని ౧౮౯౭ లో చనిపోయిన నైజాము మీర్ సర్ మహబూబ్ ఆలీఖాన్ బహద్దరుగారు కొన్నారట. వారు దీనిలోనే నివసించేవారట. చూడడానికిది చాలా అందమయినది. లోపలికి వెళ్లి చూడడం మాత్రం పడిందికాదు.

పీపిల్సుపార్కు, మ్యూజియమూ మొద లైన దర్శనీయస్థలాలెన్నో ఉన్నవి. మొత్తం మీద హైదరాబాదు చాలాగొప్పనగరం. ఇప్పటి ప్రభువు ఉస్మానలీఖాన్ బహద్దరువారు ప్రజల అభ్యుదయంకోసం ఎన్నో గొప్పకా ర్యాలు తలపెట్టి పనిచేస్తున్నారు.

———

# ఆంధ్రసంస్థాన పరిణామము

దువ్వూరి జగన్నాథశర్మ

బ్రిటీష్ ఈస్టిండియాకంపెనీవారు వర్తకసరళిలో తెనుగుమీఁటి సిరి మెండుకొనిరి. పిదప వారు తమ రాజ్యాంగ చాకచక్యమును ప్రదర్శించువారయి ఉత్తరమున నాగావళినది మొదలు దక్షిణమున గుండ్లగమ్మ వఱకు గల భూమిని మొదట స్వాధీనపఱచుకోఁగలిగిరి. ఇది తెలుఁగునాఁడు. ఓడలు నిర్మించుట, నడుపుట యిట్టిపనులందు నిపుణు లీ దేశమునఁ గలరు. ఉప్పు మొదలుగా నన్నిదినుసులు పండించుట కనువైన భూభాగము, వ్యవసాయవృత్తిగల ప్రజ యిందున్నారు. ఎగుమతి దినుసుల కనువైన జలవాహికలు, రస్తాలు సిద్ధముగా నున్నవి. సముద్రతీరము అతిగంభీరముగాక మంచి పేరుగల యోడరేవులుగలది. మఱి యిందలి జనులనుండి స్వల్పవేతనముమీఁద పాశ్చాత్యుల పద్ధతిలోఁ గూడ ౧౭౪౦ మొదలు ౧౭౬౦ వఱకు ఫ్రెంచివారివలన తరిబీయతువడి, రణరంగానుభూతిగల సిపాయీలు మెండుగా దొరకుచున్నారు పన్నుల వసూళ్లకై బుస్సీ సిద్ధపఱచిన పట్వారీ- కుల్కర్ణీ - దేశపాండ్యా- దేశముఖీ కార్యాలయములవారి అన్నిరకముల లెక్కలు సిద్ధముగ నున్నవి. అన్నిపనులందుఁ దోడ్పాటు చూపవలసిన సంస్థానకార్యాలయము లున్నవి. ఇట్టి యారంభివ్యవస్థలో ౧౭౬౯ నాఁడు బ్రిటీషుదొరతనమువారు హవుల్ బందోబస్తుపద్ధతి నారంభించిరి. ఇందుకు రాజమహేంద్రము సర్కారు అను పేరున నొక ఖిల్లాను మొదట తాము స్వయము పరిపాలింపవలెనని యాలోచించిరి. కశింకోట - శ్రీకాకోలుమహాల్లను పూసపాటి సీతారామరాజుగారికి - ఆయనకోరినంత తక్కువ సొమ్ము మీఁద కబూలియ్యతుపుట్టు నేర్పాటు చేసిరి. ఒకభూభాగమునకు - పదియేండ్లకు కవులు అను నర్థమున ౧౭౮౦ ప్రాంతమునుండి మనదేశమునందములోనున్న తోడరమల్లునిహవుల్ ఖరారీని సీతారామరాజుగారినుండి కంపెనీవారుపొంది, వారి పరిపాలన పద్ధతులం దిలకించుచుండిరి. ౧౭౮౭ లో శ్రీకాకోలుఖిల్లా వసూలు వారీని దామాషాచేయఁగా సీతారామరాజుగారికి ఏఁటేట రు. ౬,౪౫,౨౫౧ లు జమయగుచున్నట్లు కంపెనీవారు కనుఁగొనిరి. ఇంతలో సీతారామరాజుగారు కంపెనీకేఁటేటఁ గట్టవలసిన మొత్తము కబూలియ్యతు - జాహిరీ రు. ౨,౬౫,౨౦౬ లు మాత్రమే సాలేనా ఖిల్లా కటికి రు. ౩,౮౦,౦౪౫ లు రాజుగారికి మిగులుచుంట, ఇట్లు లాభముగల రెండు ఖిల్లాలు రాజుగారి కవులునందుంట చూచుకొని - ఇట్టి వసూలు చూపుటందు నిపుణులయి సీతారామరాజుగారి కార్యాలయానుభవముగల అనప్పిండి విస్సన్న - కాంద్రేగుల జోగిపంతులు అను వారిని-ఇట్టివారిని మఱికొంతమందిని రాజమహేంద్రపు ఖిల్లాకు వ్యవస్థాపకులనుగా కంపెనీవారు చేకొనిరి - దేశసంప్రదాయములను, గ్రామపరిపాలనానివేదికలను సమకూర్చుటకు ఫ్లాగ్ కమిటీ నేర్పఱచి, ఊరూర జరుగు జుమ్మావసూలువారీ లెక్కలను కంపెనీవా రందుకొన నారంభించిరి. ఇట్లు ౧౭౬౯ మొదలు ౧౮౦౨ వఱకు కంపెనీవారు ౩౨ సంవత్సరముల యనుభవముతో జమీదారీలు, ప్రొప్రయిటరీ ఎస్టేటులను ఆయాకుటుంబముల వారికి ఖాయపఱచిరి. వీనినే మనము నేఁడు ఆంధ్ర సంస్థానములని చెప్పుకొనుచున్నాము.

ఇట్టి సంస్థానముల యానుపూర్విక యెట్టిదో మనము తెలిసికొనఁదగియున్నాముకాదా! మనదేశస్థులకు భూస్వామ్యలబ్ధి పూర్వరాజ్యాధీశులవల్ల-మతాదిక ప్రపత్తివలన ఇనాములను పేర, కుల్కరిణీకమువలన మిరాశీలను పేర, ఇట్లు వేర్వేరుగా నాయాయావృత్తుల పరముగా మాలుక్‌నారీ, ముజుందారీ, జాఘీరుదారీ ఇటువంటి వేర్పడినవి. ఏతాదృశస్వత్వముగలవారై బ్రిటీషువారు స్థిరపడునప్పటికి వారికిఁ జేదోడువాఁదోడుగ

నుండి మెహనతు నేయుచుండిరేని వారు తమ స్వత్వములు - అందలిబలాబలములను బట్టి ఏస్థెంటు జమీందారీలనిగాని, ప్రొప్రయిటరీ యెస్టేటులనిగాని పరిగణన మున ఇస్తుందారీసనదు - కబూలియ్యతు లేర్పఱచుకోఁగల్గిరి. మహమ్మదీయరాజ్యాంతిమదశలో దేశముఖీలు - దేశపాండ్యాలుగా నున్న రాజకార్య ధురంధరులెల్లరు బ్రిటీషువారిచే ౧౮౦౦ ప్రాంతమునందు ఏస్థెంటు జమీందారీసన్నదు సంపాదించుకొన్నవారున్, తతిమా మాలక్‌దారీ, మిరాశీదారీ, ఇనాందారీ, ముజుందారీ, జాఘీరుదారీ మున్నగు స్వత్వములగలవారు ప్రొప్రయిటరీ యెస్టేటుదారులుగా సనదును సంపాదించుకొన్నవారును అయిరి. ఇందు ఏస్థెంటు జమీందారీ సనదుగల సంస్థానికులు:-తమ సంస్థానమును వంశానుక్రమణికగా జ్యేష్ఠాంశమున నిలిపియున్నవారై-పొందిరి. వీరు విభాగమునకుఁగాని, అన్యాక్రాంతమునకుఁగాని హక్కులేనివారు. కుటుంబము నిస్సంతయితే దొరతనమువారి హుకుము లేనిదే దత్తు తేఁజాలరు. సంస్థానపుబంజరులను యథేచ్ఛముగా రైతువారీ చేయఁగలరు. ఏ కారణము వలననైన సంస్థానమును పరిపాలించుటయందు ప్రభువు అసమర్థుఁడైతే గార్డియను అండువార్డ్సు ఆక్టును బట్టి సంస్థానపు టములునకు దొరతనమువారు జోక్యము పుచ్చుకొందురు. ఇఁక రెండవతరములోని ప్రొప్రయిటరీ యెస్టేటుదారు లన్ననో:-సంస్థానమును విభాజ్యము సేయఁగలరు, అన్యాక్రాంత పఱచఁగలరు. తమకుటుంబము నిస్సంతయితే స్వేచ్ఛగా దత్తు తీసుకోఁగలరు. సంస్థానములోని బంజరులను దొరతనపు సెలవు లేనిదే వీరు రైతువారీ చేయఁజాలరు. పరిపాలనకుఁ ప్రభువు అసమర్థుడైతే కోర్టు ఆఫ్ వార్డ్సు ఆక్టును బట్టి సంస్థానమును నిలుపఁబెట్టుటకు దొరతనము జోక్యము కల్గించుకొనును. ఇదియే సాముదాయికముగా ఏస్థెంటు జమీందారీలకును ప్రొప్రయిటరీ యస్టేటులకును నివృత్తి చెప్పుపట్ల నగుపడు తరతమభేదము. ఈ యిరుఁదెఱంగుల సంస్థానములు పూర్వ రాజ్యాధీశుల త్యాగకల్పితములు బ్రిటీషు ఈస్టిండియాకంపెనీ వారిచే నిలువఁబెట్టఁదగినవిగా ననుగృహీతములునై యున్నయవి.

ఈసంస్థానములకు సంబంధించి, నేటికి ౧౫౦ సంవత్సరములప్పటి ఉత్తరచరిత్ర మేవంవిధమైనదిగాఁ జెప్పినప్పుడు, వీనిపుట్టుకకు సంబంధించిన పూర్వ చరిత్రమునుగూడ కొంత చెప్పుట చారిత్రకుని ధర్మము. కావున నీసంస్థాన ప్రదాతలగు నాఁటిమరాజ్యాధీశుల వంశసంస్థల నిందులకై యనుస్మరించుట యవసరమై యున్నది. ముఖ్యముగా మనదేశమున మిక్కిలి పేర్గన్నది కాకతీయ సామ్రాజ్యము. కాకతిగణము వారు క్షత్రియులలోఁ గాశ్యపగోత్రాభివాదకు లయియున్నారు. స్వజాత్యభిమానముచే నీకాకికులు క్షత్రియులకింటివసతి గూర్చి నేఁటి క్షత్రియసంస్థానములుగా నున్న విజయనగరము, తుని, కోలాం మున్నగువానికి మూలస్తంభము నాటిరని కొందఱు తలంతురు కాని అది చారిత్రకునికి సమన్వయముకాని మాట. క్షత్రియ సంస్థానములుగానుండిన వేవియు మిక్కిలి ప్రాచీనములు కావు' అవి మహమ్మదీయరాజ్యయుగమున నారంభింపఁబడిన నిర్మాణముగలవియ యయియున్నవి. ఇట్టివానిం గూర్చి కొంత ప్రసంగింపవలయునన్నచో

౧. తెలికిచర్ల:-౧౫౮౪ ప్రాంతములలో నీప్రాంతమున మహమ్మదీయ రాజ్యమేర్పడిన తరువాత ౧౬౧౬ లో ఉప్పలపాటి మదరాజు గారి వలన సంపాదితమయినది. ఈసంస్థానికులు కాకితిగణములోనివారు.

౨. తెట్టు:—వేజెళ్ల వారిది వీరు కాకితిగణమునకు, అనఁగా మందపాటివారికి ముఖ్య బంధువులయినప్పటికి ఈసంస్థానముకూడ మహమ్మదీయ రాజ్యయుగమున నిర్మాణింపఁబడినదియ.

౩. కోరుకొండ:—ఇదియు కాకితిగణములోని మందపాటివారి సంస్థానము. తిర్పతిరాజువారిచే మహమ్మదీయ రాజ్యమునందు సంపాదితము.

౪. దోమహాలు:— కోట, దక్షారామములను రెండు సంస్థానములు, జాఫరల్లీఖానునినుండి కోట ౧౭౫౨ నందును, ఇటీవల ౧౭౫౮ లో దక్షారామమును కాకర్లపూడి వెంకటపతిరాజుగారు రామచంద్రరాజుగారు వీరిచే ఆర్జింపఁబడినవి. ౧౭౭౭ లో రామచంద్రపురపు జగన్నాథరాజుగారికి దఖలుపడినవి.

౫. మొగలితుర్రు:— ఘల్లిగడల గంగరాజుగారు కలిదిండి పరగణాను మహమ్మదీయ ప్రభుత్వమునందే సంపాదించిరి.

౬. సత్యవరం:— బాహుబలేంద్రునికి మహమ్మదీయులకుఁ గల్గినస్పర్థలలో మహమ్మదీయులకుఁ దోడ్పడై ౧౫౮౦ ప్రాంతమున కాకర్లపూడి అప్పలపాయక రాయణింగారార్జించినది.

౭. పెద్దాపురం:—రెడ్డి వెంకటప్ప, ఇతనిభార్య విస్సమ్మ అనువారికి అప్పలిచ్చి ఆలావాదేవీలలోనుండఁగా మహమ్మదీయులకుఁ దోడ్పడి, కాశ్యపగోత్రికులగు వత్సవాయివారు ఆర్జించినది.

౮. విజయనగరం:—పోట్రావు సీతారామరాజు అనువారికి శ్రీపూసపాటివారు బదులిచ్చి ఆలావాదేవీలో నుండఁగా మహమ్మదీయుల ప్రభుత్వ మేర్పడినంతట నార్జించుకొన్నది.

౯. తునికొతాం:—పెద్దాపుర సంస్థానమునుండి కాకర్లపూడి జగన్నాథ రాజుగారికి దఖలుపడి ౭-౧౧-౧౮౧౨ నాఁడు శ్రీవత్సవాయి జగన్నాథరాజుగారి వాశిష్ఠ కుటుంబస్థులకు మరల చెందఁజేయఁబడినది.

౧౦. గోపాలపురం:— కొచ్చర్లకోటవారి నుండి శ్రీ ఉప్పలపాటి రంగరాజు, వీరికుమారులు సూర్యనారాయణరాజు అనువరు గుండేపల్లి సంస్థానీకు లయియుండినప్పుడు దఖలుపడిన సంస్థానము.

ఇట్లు చూడఁగా నాంధ్రక్షత్రియసంస్థానముల కొక్కదానికేనియు కాకతీయసామ్రాజ్య ప్రాతిపదిక లేదు. ఇప్పుడున్నవానికైన పోయినవానికైన నట్టి సంబంధము స్మరింపఁ దరముకాదు. ఆరయఁగా ఇఁక కమ్మవారి సంస్థానములుకూడ మహమ్మదీయ యుగమున సంపాదింపఁబడినవియే.

౧. ముడిగామ, చింతపల్లి - శ్రీ వాసిరెడ్డిరామన్నగారార్జించినవి.

౨. దేవరకోట, లింగంగిరి - శ్రీ యార్లగడ్డ కోదండరాంగారార్జించినవి.

ఇఁకమీఁద వెలమవారి సంస్థానములను చేర్కొందము. ఈ పేర్కొనునవి ౧౭౭౪ సర్వ్యేటుకమిటీ నాటి కున్నవి.

౧. వెంకటగిరి - ప్రాచీనసంస్థ. శ్రీదామెరవారిది.
౨. రేపల్లి- రాచూరు శ్రీ మాణిక్యారావువారిది.
౩. వినుకొండ-బెల్లంకొండ శ్రీసుంద్రావువారిది.
౪. కొల్లేరు - చార్ మహల్ శ్రీ సింహాద్రప్పరాయణింగారిది.
౫. నైజాంపట్నం- శ్రీ వెల్లంకివారిది.
౬. నూజివీడు - శ్రీ మేకానారయప్పారావువారిది.
౭. బెజవాడ - శ్రీ కల్వకొల్లువారిగి.
౮. మైలవరం - శ్రీ సూరానేనివారిది.
౯. వరగొండ- శ్రీ వెల్లంకివారిగి.
౧౦. చింతలపూడి- శ్రీ జూపల్లివారిది.
౧౧. పిఠాపురం - శ్రీ చిట్నాడి వారిది.
౧౨. బొబ్బిలి - శ్రీ రావువారిది.
౧౩. పేయూరు- శ్రీ కోటగిరివారిది.
౧౪. తాటిపాక-కుతకోట- శ్రీ కురుమెళ్లవారిది.
౧౫. కశింకోట - శ్రీ చెలికానివారిది.

ఇట్టివన్నియు మహమ్మదీయులకాలమున దేశముఖీలుగా నుంటచే వెలయింపఁబడినవి. ఇన్నియు ౧౫౭౦-౧౭౭౦ మధ్య వెలసియున్న ప్రాచీన సంస్థానములు. ఇవిగాక వీరందఱితోఁబాటుగ దేశపాండ్యాలుగానున్న బ్రాహ్మణులకుఁ దక్కినసంస్థానములు కొన్నికలవు. అప్పటి దేశపాండ్యాలలోనివారు — ౧ అంగరవారు, ౨ జిల్లెళ్లవారు, ౩ సన్నివీసువారు, ౪ పటేల్ ఖానావారు, ౫ ఖరిడేహాల్ వారు, ౬ కందుకూరివారు, ౭ కృత్తివెంటివారు, ౮ వాడ్రేవువారు, ౯ కన్నేపల్లివారు, ౧౦ కానుకుర్తివారు, ౧౧ కొచ్చెర్లకోటవారు ఇత్యాదికుటుంబములు. వీరిపేర నిప్పటికి అక్కడక్కడ కొన్నిముఠా లున్నవి. జమీందారీలును జరుగుచున్నవి. అందు పేర్కొనఁదగినవి ఉర్లాం, వేగాయమ్మపేట మున్నగునవి. ఇవియు మహమ్మదీయ ప్రభుత్వమందేర్పడినవియే.

కాఁబట్టి ఆంధ్రరాజ్యమున ౧౫౬౬ - ౧౭౬౬ మధ్య వత్సరములను రెండువందలసంవత్సరముల కాలమందు ఏర్పడియున్న మహమ్మదీయప్రభుత్వప్రసంగమే తప్ప ఈ సంస్థానములకు మూలభూతమైనది - ప్రభుత్వమందు సముసన్నతిగన్న గాంగ - చాళుక్య-చోళ - కాకిత్యాది యే రాజవంశమును గాకపోయెను గనుక నాయీ వ్యాసమున గాథలు త్రవ్వుటకుఁ బనిలేకపోయినది.

# కొండకోన

ముడపాక-పార్వతీశ్వరశాస్త్రి

I love to dwell betwixt the hill and the dale. T. Nash.

More happy love, more happy happy love;
For ever warm and still to be enjoyed;
For ever panting, and for ever young;
All breathing heaven passion far above,
That leaves a heart high, sorrowful and cloyed,
A burning forehead, and a parching tongue. Keats.

పలుకు బంగరమా, కులుకు సింగారమా,
ఉలికి చూచెద వేల, కలికి బేలతనాన ?

సిగ్గెఱుంగనినీదు చిన్నతనమున నాదు
చేఁ బట్టి వడివడిగఁ జెంత నడచిన వేళ,
పలికితివి చకచకని, కులికితివి పకపకని;
పలుకులోఁ గులుకులోఁ బద నెఱుఁగవా

వలిపంపుఁజెంగావిపట్టుచీరను గట్టి [నాఁడు;
యలికానఁ గస్తూరితిలకంబు దిద్ది.
మేనికుంకుమపూతతో నింపు వెలయించి,
చిఱునవ్వుచూపులం జిలుకుబెలుకులతోడ
లలితరూపము చూపి, తలుకు లొలుకుచు
నిపుడు,

పలుకవైతి వాకింత, కులుకవైతి వాకింత,
నీయెదుటఁ జేమోడ్చి నిలిచితిని ప్రియురాల,
పలుకు బంగారమా, కులుకు సింగారమా,
దయచూప వేటికే——

నిను విడిచి యిన్నాళ్లు నిలిచి యెట్లుంటినో,
అరవీడినగులాబియందచందాలఁ గని,
నిన్నుఁ జూచినరీతి నిముస మానందింతు;
నెలవిరిసి, మఱిమఱియు తఱి యరయుమల్లెఁ
గని,

నిన్నుఁ జూచినరీతి నిముస మానందింతు,
క్రొత్తముస్తీబు క్రొంగొనబు రేరాణిఁ గని,
నిన్నుఁ జూచినరీతి నిముస మానందింతు;
మంచుమేల్ముసుఁగుతో మించుచేమంతిఁ గని
నిన్నుఁ జూచినరీతి నిముస మానందింతు,
గుజ్జుగుజ్జుగ ముద్దుగులుకు మేల్బంతిఁ గని,
నిన్నుఁ జూచినరీతి నిముస మానందింతు;
పూఁతలో నినుఁజూచి, తావిలో నినుఁజూచి,
పూవుదావులలోని పొలుపునను నినుఁజూచి
నిను విడిచి యెన్నాళ్లు నిలువఁగలఁ బ్రియు
రాల?

చేతిపై నిలుచుండఁ జేసి, చే దువ్వుచును,
జిలుకలకుఁ బద్దెముల్ సెప్పుచుండిన వేళ,
తనయీనుపనికత్తె తనచెంత నిలుచుండఁ

బనిపూని, పనిచెప్పి, పనులు చేసెడువేళ,
ఇరుగింటి పొరుగింటి యిల్లాండ్రు దరిఁజేరి,
యిచ్చకంబులు చెప్ప నెఱిగి పొగడెడు వేళ,
దూరంపుఁజెలికత్తె లూరకే కనవచ్చి
యూరిమాటలు చెప్ప నూకొట్టి వినువేళ,
రారాణిచందాన, రేరాణిచందాన,
విరిరాణిచందాన ప్రియముకొల్పినయింతి,
గద్దెపైఁ గూర్చుండి, కరుణతో ననుఁజూడఁ,
జేమోడ్చి, యెదురుగాఁ జేరి నిలుచుంటి;
చందమా మందాన నందించుచుంటి;
తేటి బిడ్డవితాన తిరిగి కనుచుంటి;
రాణి నాప్రియురాలు——

గద్దెపై నారాణి కనుచుండఁ గూర్చుండె
క్రొంబూలచామరాల్ గొని వీఁచె విరిచెట్లు;
సెలయేరు తకతకని చెలఁగి మద్దెల కొట్టె
గాలిపిల్లఁడు సగమ గసి పాటపాడె;
ఆ మద్దెలకుఁ బాట కానందమును జెంది,
తైతకని నేనాడి దానిలోఁ గలసితిని,
ఆమద్దెలకుఁ దగినయాటయ్యె నాయాట;
ఆపాటకును దగినయాటయ్యె నాయాట;
ఆ పాట, ఆమద్దె లాయాట తిలకించి,
పులకించి చిఱునవ్వు చిలికించె నారాణి,
నారాణి చిఱునవ్వునకు నాకుఁ బులకించె
పులకించి నీటిలోఁ గలసి మద్దెలనైతి;
పులకించి గాలిలోఁ గలసి సగముగనైతి;
గాలితో, నీటితోఁ గొంత సేవించితిని

ఆపదలు రాకుండఁ గాపాడుఁ జిఱుచెట్లు;
తనయాపదను బాపుకొనలేదు పెనుచెట్టు;
నా యాపదను బాప నారాణి గా కొరులు
నేర్తురే,-వెకలులై నిలిచి చూతురుగాని;
చలువచూపులఁ బరపి,నిలిచి యెదురుగనున్న
నారాణిఁ గనుఁగొన్న నామనసు చల్లఁబడు;
చలువచేతులఁ జాపి, నిలిచి యెదురుగనున్న
నారాణి చేఁబట్ట నామనసు చల్లఁబడు;
చలువపల్కులఁబల్కి నిలిచి యెదురుగనున్న
నారాణి ముద్దాడ, నా మనసు చల్లఁబడు;
నా యాపదను బాప నారాణి గా కొరులు
నేర్తురే. మతిలేక నిలిచి చూతురుగాని,

పరుల యాపదఁ బాపి బడలిపోయితి నేను,
నాయాపదను బాప నాకొకఁడు కనఁబడడు;
నారాణి గాకెవరు?——

ప్రొద్దుతేఁడా, యింతపొగరు నీకేలరా,
వడివడిగఁ బరుగెత్తి వచ్చి పైఁబడతావు?
కనుమూసి, ప్రియురాలిఁగని కౌఁగిటంబట్టి
ఆనందమున మునిఁగి యాడుకొను వేళలో
దరిదరిగ వస్తావు, తగిలి తగిలుంటావు;
నినుఁ జూచి సిగ్గుపడి ననువిడిచెఁ బ్రియురాలు;
ఆలస్య మొనరించి యరుదేరఁగా రాదె;

నీవు దవుదవ్వుగా నిలిచి కనఁబడకున్న
కనుమూసి ప్రియురాలిఁ గౌఁగిటం బట్టెదను;
నీవు దరిదరిఁజేరి నావద్ద కేతేర
కౌఁగింట విడఁదీసి కాంత దవ్వుగఁ బోవు;
వడివడిగ రాఁబోకు; పగపు కలిగెడు నాకు;
పొగరుబోతువు కాకు, బుద్ధి చెప్పెద నీకు;
ప్రియురాలితో నన్ను విశ్రమింపఁగనిమ్ము

ప్రియురాలు లేకున్న వెలితిజీవనమందు;
మనికి వెలుఁగయి నన్ను మనిచె నా ప్రియు
రాలు;
పోరొక్కటే కాక, వేఱేమి మనికిలో,
పోరుటయుఁ బోరుటయుఁ బోరి స్రుక్కుటయు;

చలికి నెండకుఁ బోరు, వెలుఁగు చీకటిపోరు,
కలిమిలేములపోరు, కలవారితోఁ బోరు;
పొగరుఁబోతుల పోరు, మొరకుఁ జేతలపోరు;
పోరుతో మఱిపోరు, పోరులోపలఁ బోరు;
పోరులన్నిటితోడఁ బోరితిని, విసిగితిని,
పోరెఱుంగనిమనికి చేరలేకుంటి:—
పోరి స్రుక్కిన వేళఁ గోరి చెంతకుఁ జేరి,
చిఱునవ్వు చూపులం జిలికి కౌఁగిటఁ బట్టి
కనలుడుపుఁ బ్రియురాలు, మనికి వెలుఁగయి
యొప్పు;
ప్రియురాలి దవ్వుగా విడిచి జీవింతునే?—

జీవనము నాటకము, సిగ్గోసఁగుబూటకము
పాటించి చెడరాదు; పట్టికాటకము;
కావుకావని యేడ్పుగద దానితొలిపలుకు,
వెనుకముందుల యొప్పు గనలేమి మలిపలికు
అడియాసలను జిక్కి, యటులిటులు పరుగెత్తి,
పడుచు లేచుచు, మరలఁబడుచు లేచుచును,
చివర కేమియులేక, చెడిపోయి యేడ్పుటయె,
నడిమిపలుకయి కలుపు నలుదెరంగుల తెరల;
అలయుటలు, కలయుటలు, సొలయుటలు,
మలయుటలు,
తెరతెరల సందులను దీమకలు, కలిగించి,
చావుతో ముట్టుతో, చాలించుచిట్టుతో,
జాలిజాలిగ ముగియుఁ జదురు గనుఁగొనలేక

నాటకములో వెలుఁగు నాకు నా ప్రియురాలు;
ప్రియురాలు నా చెంత వెలుఁగని దినాలలో
కటికిచీఁకటి నాటకము—

నిను విడిచి యొంటిగా నిలిచియుండఁగ లేను,
కనులు గప్పినవి చీకట్లు నలుగడలందు;
ఈ నాటకము నొంటి నే నాడఁగా లేను;
నీవు కనఁబడకున్న నిలిచి తాళఁగ లేను;
కను విందుగా నీవు కనుచుండుటే చాలు,
వీనువిందుగ నీవు వినుచుండుటే చాలు,
ఆడెదను, పాడెదను, ఆడి పాడెదను.
కౌఁగిటను నీవు నన్ గదియించుటే చాలు,
లోకంపునిండ లోలోన మ్రింగెదను

నీ మోము చిఱునవ్వ నెగడించుటే చాలు,
లోకంపుమెప్పు లోలో నడంచెదను.
ప్రియురాల, నీవు నన్ విడిచి పోఁబోకుమా,
నీపాదములవద్ద నిలిచి చేమోడ్చెదను.

నీ సేవయే నాకు నిత్యమని నమ్మితిని.

కొండకోనలలోన, గుబురుకానలలోన,
పూవుటేరాలలో, బుగులుతోరాలలో,
ఆడెదము, పాడెదము, వేడెదము, కూడెదము.
తేటవెన్నెలలోనఁ దిరిగెదము, కలసెదము.
విరులవానలలోన వెడలెదము, కలసెదము.
నురులు పుష్పాళ్లలో నరిగెదము, కలసెదము.

కలసెదము విడిపోయి, కలసి విడిపోయెదము.
కలసి విడుటలలోనిబలిమి మెఱెఁగెదము.
నిను వెదకుకొని వత్తు నీవు దవ్వగనున్న,
నిను విడిచి దవ్వగా నిలువనీకుము నన్ను;
విడిచియుండుట లోని విసము మెసవగ నెంతు,
విసము మెసవెడిబలిమి వితముఁ దెలియఁగ లేను.

విసమెఱుఁగ నమృతంపుఁబస యెఱుఁగఁ ప్రియురాల,
నీపాద సేవయే నిజమని యెఱింగితిని—




శివభక్తమాహాత్మ్యమునందు రాజ్యోపాఖ్యానమున నౌకానౌకరంగము
(శ్రీకాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్ర సంగ్రహమునుండి)

# మ ర మ్మ తు

భావరాజు నరసింహారావు

## ౧

శాసనోల్లంఘనమూ, సత్యాగ్రహమూ మాంచి ముమ్మరంగా ఉన్నరోజు లవి. మహాత్ముని శంఖారావమువిని, భరతమాత యొక్క హృదయవిదారమైనస్థితి గ్రాహ్యం చేసుకొని, సముద్రతరంగాల్లాగు పొంగిపోతూన్న హృదయాలతో ముందువెనుకలు ఆలోచించకుండా, మాతృదేశసేవయే కర్తవ్యతమమని మనస్ఫూర్తిగా నమ్మి, శాంతి సమరంలోనికి దూకిన అరువదివేలకుపైగా ఉన్న ఆ శాంతి సైనికదళంలో నే నొకడను. జైలుతిండి పడక ఆరోగ్యము పాడైపోయి కొన్నాళ్లదాకా యెందుకూ పనికిరాకుండా ఉన్న అభాగ్యులలోకూడా నేనొకణ్ణి.

*  *  *  *

...ఆరోజంతా నాతో 'శాంతిదళంలో కలియవద్దు- జైలులోకూర్చుని చిక్కి, శల్యమైపోవడమేకాని చేసేదేమీ ఉండదు- తరువాతనన్నా చెడిపోయిన ఆరోగ్యం బాగు చేసుకోవడమే సరిపోతుందిగాని దేశసేవచేయడనికి తగినదార్ఢ్యం ఉండదు- బైటనే ఉండి యింటికి, ఒంటికి బాధ లేకుండా పనిచేయా' లని చెవిని యిల్లుకట్టుకు పోరి పసివాణ్ణి- రాముణ్ణి- పక్కలోబెట్టుకుని నిద్రిస్తున్న నాగృహలక్ష్మిని- వాణిని- విడిచిపెట్టి, ఆరాత్రే శాంతిదళంలో చేరబోతూంటే గౌతమబుద్ధుడు, నలుడు యిత్యాదులంతా భార్యావియోగసమయంలో పడ్డ బాధంతా ఒక్కసారి నన్నావేశించి ఒళ్లంతా పులకితమైపోయింది. నేనే చిత్రకారుణ్ణయితే- కవినైతే- ఇప్పటికికూడా ఏకాంతంగాకూర్చుని ఒక్కసారి హృదయంలోకి చూసుకుంటే యింకా చెక్కుచెదరని ఆరమ్యచిత్రము ద్యోతకమవుతూంటుంది.

ఆ గుడ్డి 'బెడ్ రూమ్ లైటు' వెల్తుర్లో ఒక్కసారి నా రాముడి శిర స్సాఘ్రాణించి, అధరాలు తగలకుండా (నిద్రనుండి లేస్తాం దేమోనని)నాప్రియురాలిని ముద్దిడుకున్నాను.

"నేను జైలుకు వెళ్లాననే దిగులుతో నీ ఆరోగ్యం, పిల్లవాడి ఆరోగ్యం పాడు చేసుకోక, ఆత్మహత్య మొదలైన తెలివితక్కువపను లేవీ చెయ్యక......... భద్రంగాఉండ"మని ఏవో నాలుగుముక్కలు వ్రాసి ఆ చీటీని నా 'టేబిల్' మీద ఉంచాను. గదితలుపు తీసే ఉంచి, వీధిగుమ్మం మాత్రం చప్పుడు కాకుండా బైటనుంచే లోగడియవేసి ఆరాత్రే 'మెయిల్'ఎక్కాను. రైలు మా ఊరికి దూరమైపోతున్నకొద్దీ నాకు దుర్భరమైన ఆవేదన కలుగుతోంది. అందుకు సరియైన కారణం చెప్పలేను కాని

నా హృదయ భాగస్వాములు-నా భార్యా పుత్రులు-ఆ నిర్వికారావస్థలో, సుషుప్తిపొందుతూ అనుక్షణం నామనోవీథికిఅడ్డుతగుల్తూ ఉన్నారు. ఎవరికుండదూ ఆ దిగులు ?— నిక్షేపంలాంటి పాతికేళ్ల భార్యను, మరపు నకురాని ముద్దుమాటలతో మనస్సును నించిన రెండేళ్ల కొడుకును, మళ్లీ యీ జన్మకు కలసుకుంటానో లేదో అన్నంత సందిగ్ధావస్థలో విడచిపోతుంటే? హృదయమున్న వారికి అర్థమౌతుంది నా ఆ వేదన.

౨

రెండు నిండు సంవత్సరాలు గడచినవి బళ్లారిజైలులో. పైన జరిమానా చెల్లించనందుకు వేసిన ఆరువారాల ఖైదు జైలులో నా మంచి ప్రవర్తనకు బహుమానంగా రద్దు చేశారు ప్రభుత్వంవారు.

విడుదలై, ఆ ఊళ్లోనేఉన్న మాబావ-వెంకట్రావు-గారింటికి వెళ్లాను. అప్పటికి పది రోజులనుంచీ మావాణి అక్కడే ఉంది నా విడుదల కెదురుచూస్తూ. రెండు రోజులు అక్కడే ఉండి మూడవనాడు బయలుదేరాం మా ఊరికి.

* * * *

అప్పటికి మా రైలు గుంతకల్‌వచ్చి గంట దాటింది; తొమ్మిదిగంటలైనా యింకా రాలేదు మెయిలు మద్రాసునుంచి. ఏమీ తోచక యే స్నేహితుడైనా కనబడితే బాగుండునని చూస్తున్నాను. అలాగ కొంతకాలం గడచింది. పరిచితులెవరూ కనబడలేదు గాని, ఒక అపరిచిత వ్యక్తిమాత్రం మా పెట్టె ఎదుట బోనులో పులిలాగు ఇటూ అటూ తిరుగుతున్నాడు. పాతిక సంవత్సరాలుంటాయి; 'మాన్చెస్టరు ఖద్దరు' ధరించాడు. ఆ వైఖరీ అదీ చూచి కొంత సంపన్నకుటుంబానికి చెందిన రెడ్డికులస్థుడై యుంటాడని ఊహించాను. ఇన్నీ ఊహించాను గాని అలా ఎందుకు తిరుగుతున్నాడో, ఏమి చేయా లనుకుంటున్నాడో మాత్రం బుర్రకు తట్టలేదు. ఒకటి రెండుసార్లు నాతో మాట్లాడటానికి కుతూహలపడి కూడా అప్రయత్నంగా మానినట్లు నాకు తోచింది.

3

మెయిలు వచ్చింది; రకరకాలమనుష్యులూ దిగి తలొక రైలులోకి యెక్కుతూన్నారు. 'ఆంధ్రపత్రిక' తీసుకుని మాపెట్టె యెక్కబోతూండగా ఎవరో నన్నుపిల్చారు. చూస్తును గదా కొన్నాళ్లు నాతోబాటు జైల్లోఉండి వెల్లూరుకు మార్చబడిన మరొక శాంతిదళమిత్రుడు. పత్రిక వాణికిచ్చి ఆయనదగ్గరకుపోయి మాట్లాడుతూండగా 'గార్డు' యీలవేశాడు. ఆయనతో సంభాషణ ముగించి, నేను రైలెక్కి తలుపువేయబోతూంటే యింతవరకూ మా పెట్టెముందు తిరుగుతూన్న ఆవ్యక్తి 'ఉండండి, ఉండండి' అంటూ ఎక్కి నాప్రక్కనే కూర్చున్నాడు.

పత్రికచదివి నా కిచ్చింది వాణి; నేను చూస్తున్నాను. వెంటనే నా ప్రక్కనున్న

ఆమనిషి "నాకుకూడా ఒకకాగితం యిస్తా రా?" అన్నాడు. నాకు కొంచెం కోపం వచ్చింది. అణా యిచ్చి పత్రిక కొనుక్కున్న నేను, దాని నింకా విప్పకముందే ఆమాత్రం ఆలోచించకుండా అడిగాడని. ఆ కోపంలో ఒకకాగితం యిత్తామనుకున్నవాణ్ణి యీపా డు అలవాటు మాన్పకపోతే మన దేశంలో పత్రికలు బాగుపడవు; అందుకు తీవ్రప్రయ త్నం చేయాలని మనసులో ఆలోచిస్తూ పత్రికనంతా ఆ పెద్దమనిషి కిచ్చి మా రా ముణ్ణి దగ్గరకు తీసుకున్నాను. వాడి కింకా నాగడ్డంబెరుకు తీరలేదు కాబోలు, మళ్లీ, యేడుపు ప్రారంభించాడు. నేను సముదా యించడానికి ప్రయత్నించినకొద్దీ వాడిశ్రుతి హెచ్చింది. ఇక లాభంలేదని మా ఆవిడ నవ్వుతూ పిల్లవాణ్ణి తీసుకుని బుజ్జగించింది.

* * * *

పత్రిక తెరిచివుంచాడన్న మాటేగాని ఆ పెద్దమనిషి దృష్టంతా మావాణిమీా దే ఉంది. కాని దానికి తగిన కారణం లేకపో లేదు. ప్రబంధాల్లో వర్ణించినట్లు స్త్రీలు కూడా "మేముమగవాళ్లమై,- ఆవిడను..." అని లొట్టవేసేటంత అందకత్తె కాదేమో కాని మావాణి సామాన్యపు ఆడవాళ్లలో లెక్క వేయడానికిమాత్రం వీలులేదు.

నేను, మిగతాజనం తనసంగతంతా చూస్తున్నామనిగాని, తనలోని పశుప్రకృతి అందరికీ వ్యక్తమౌతోందని గాని గ్రహించ కుండా అలా అరగంటసేపు చూస్తూకూర్చు న్నాడు. కొంతసేపుండి "పత్రిక యిలాయి వ్వండి" అన్నాను. దానికి ప్రత్యుత్తరం మాట అలా ఉంచి, యీా అరగంటసేపు ఆలోచిస్తున్నాడు కాబోలు నాకూ మావా ణికీ గల సంబంధం...... "ఆవిడగారి దేవూరు?" అన్నాడు, మావాణికి వినబడే లాగు. నేను సాభిప్రాయంగా మావాణి వంక చూసి,

"బెజవాడలో ఉంటున్నారు ప్రస్తుతం."

"స్వగ్రామం?"

"వారిదేనా?"

ఆ విడసంగతి గాక నీ సంగ తెవడి క్కావాలన్నట్టు ముఖం చిట్లించి,

"వారిదే!"

"నంద్యాల."

ఆ వ్యక్తి మళ్లీ నన్నూ మా వాణినీ ఒక్కసారి 'కంపేరు' చేసి చూసి మాకిద్దరకూ ఏ విధమైన సంబంధం లేదని పూర్తిగా గ్రహించినట్టు తల ఊపి, ఏదో ముఖ్యమైన విషయం జ్ఞాపకానికొచ్చినట్లు ముఖభావం మార్చి,

"ఆఁ! అలా చెప్పు! అప్పుడే అను కున్నా!...... అన్నట్టు వారి పుట్టింటి పేరు........?"

"వల్లూరివారు."

"అదే, అదే! ఆఁ! ఆ పంతులుగారి... ఎవరంటే?......ఆయన కూతురు కాదూ?"

"మీా రెరుగున్నారా వారిని?"

"ఆఁ! ఎరక్కేం?...వీర్రాజు గారు కాదూ?"

మా వాణి ఏదో మాట్లాడబోయి నా ముఖభావం గ్రహించి ఊరుకుంది.

"ఎబ్బే! పొరబడ్డారు... పేర్రాజుగారు."

"ఆఁ! ఆఁ! మర్చిపోయాను, పేర్రాజు గారు కాదూ? ఏదో 'రాజు'గారు కాని, సరిగా గుర్తులేదు."

"..............."

"..............."

"ఛ! చ! పేర్రాజుకాదు, వీర్రాజు కాదు, ఆయన పేరు వెంకటరత్నంగారు!"

"............"

సూపంలో పాదం నిక్షిప్తం చేశామే అని లోపల కొంచెం విచారపడ్డా పైకి కప్పి పుచ్చి

"పేర్లెక్కడ జ్ఞాపకముంటాయి? కాని ఆశ్చర్యంగా ఉంది! చిన్నప్పుడు వీళ్లింటి పక్కనే ఉండేవాళ్లం! ఎట్టా ఆడుకునేవాళ్లం! ఎంత మార్పు! చిత్రంగా ఉంది! ఈ ఆడ వాళ్లను రెండేళ్లక్రితం చూసినవాళ్లను యిప్పుడు గుర్తుపట్టలేము మనం మనమేమిటి? వాళ్లను పుట్టించిన బ్రహ్మకూడా అంతే. నిజంగా వాళ్ల......"

ఈసారి మా ఆవిడకు చాలా కోపం వచ్చి నాతో మెల్లగా 'ఏమిటి అలాచూస్తూ ఊరుకుంటారు......?' అంది. 'నువ్వు ఏమీ మాట్లాడక చూస్తూఉండు, మరేం భయం లేదు' అని చెప్పాను.

"..............."

"ఏమిటి అంటున్నా రావిడ?"

"మీా సంగతే—ఎక్కడో చూచినట్టుం ది...అంటున్నారు."

ఈ మాట వినేసరికి అతనికి మహదా నందం కలిగింది. వెంటనే మా వాణి నుద్దే శించి

"నన్ను మీరు గుర్తుపట్టారని యిదా కనే గ్రహించాను..... ఎంతమంది పిల్లలు మీకు?"

".. ..............."

పిల్లవాణ్ణి దగ్గరకు తీసుకోబోయాడు. వాణ్ణి మా ఆవిడ దగ్గరకు తీసుకుంది.

"పరవాలేదు, పిల్లవాణ్ణివ్వండి. మీా బాల్యస్నేహితులేగా!" అన్నాను.

"........." (నాకు ఒక తీక్ష్ణమైన చూపే జవాబు.)

"పిల్లవాడికి కొత్తగా ఉన్నట్టుంది, పోనీ లెండి" అని ఊరుకున్నాడు.

* * * *

ఇహ నాక్షేమసమాచారాలు అడగ టం ప్రారంభించాడు.

"అయితే నువ్వు ఎన్నాళ్లనుంచీ వీరింట్లో ఉన్నావు?"

"అబ్బో! ఆవిడ కాపరానికొచ్చినప్పటినుంచీ ఉన్నాను."

"ఒక్కవంటపనేనా?..."

"అంతేగాని..."

"కాని...యింకా ఏం పనేమిటి?"

"ఏదో కొంచెం వ్రాత..."

"ఆఁ! వ్రాత? ఏం వ్రాత?"

"మరేవీలేదండీ, ఎప్పుడన్నా బజారునుంచేవన్నా తెస్తే ఏమీ తేడాలేకుండా 'లీస్టు' రాస్తాను."

(విరగబడినవ్వి, మా వాణివంక 'మీావంటవాడి తెలివితేటలు చూశారా?' అన్నట్టు ఒక్కసారి చూసి) నాతో (నా తెలివికి మెచ్చుకున్నట్టు)

"నీకు చదవటం, వ్రాయడం కూడా వచ్చునన్నమాట!"

పేపరల్లా పెట్టి కిటికీలోంచి ముందుకు చూసి ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

౪

ఇంతలో ద్రోణాచలం వచ్చింది. ఆవ్యక్తి రైలుదిగి, కొంచెంసేపు ఏదో ఆలోచించుకుని, మా పెట్టెదగ్గరకువచ్చి చిటికవేసి నన్ను పిల్చాడు.

"ఇక్కడ దిగుతారా?" అన్నాను. 'లేదు లేదం'టూ నన్ను కాఫీహోటలు దాకా తీసుకుపోయి తనతోబాటు తినమన్నాడు. నా కలవాటులేదు, జబ్బుచేస్తుందని చెప్పాను. వెంటనే నాలుగుచక్రకేళీపళ్లు తెచ్చి పుచ్చుకోమని బలవంతపెట్టాడు- విధిలేక పుచ్చుకున్నాను.

"..............."

"................."

"మరీ...ఆవిడసంగతేమిటి?"

"ఏముంది......?"

"................."

"................."

"మంచిదేనా?"

"చాలామంచిది."

"అంటే?"

"యోగ్యురాలు."

"................"

"................"

"ఇప్పుడెక్కడ దిగుతారు?"

"నంద్యాల."

"అలాగా!..."

వెంటనే వెళ్లి నంద్యాలకు టిక్కట్టుకొని తెచ్చుకున్నాడు.

"ఇదిగో- యీపదీ వాడుకో... పనిసానుకూలమైతే......యిల్లాంటివి లెక్కలేనన్నీ."

"..."(ముఖంవంక చూసిఊరుకున్నాను.)

"మరేం ఫరవాలేదు" అని యింకో నోటుకూడా తీశాడు.

"నే నటువంటివాణ్ణి కాదండోయ్. స్నేహం శాశ్వతంగాని, వెధవ డబ్బెందుకండీ...?

కాని బ్రహ్మకు కూడా అలివి కాని పని తల బెట్టాడు.

ఇంకా డబ్బు తక్కువని గునుస్తున్నా నని కాబోలు ఒక వందరూపాయల నోటు బలవంతాన నా తిలో పెట్టాడు.

ప్రపంచకంలో యిల్లాంటి మనుష్యు లున్నారనే నమ్మకం నా కప్పుడు కలిగి ఖిన్నుణ్ణయిపోయాను.

* * * *

మళ్లీ రైల్లో యథాస్థానా లాక్రమిం చాం. ఇహ తన కథ మొదలుపెట్టాడు.

వాళ్ల ఊళ్లోకల్లా తమ కుటుంబమే బాగా డబ్బు గలదనీ, తాను చాలా 'యిండి పెండెంటు స్పిరిట్' గల స్వేచ్ఛా విహారిననీ, ఒకరిదగ్గిర ఉద్యోగం చేయడం తనకు ఇష్టం లేదనీ, అంచేత ఒక పత్రిక లేవదీసి దాంతో ఆంధ్ర దేశాన్ని మరమ్మతుచేయబోతున్నా ననీ యింకా ఏమిటో స్వోత్కర్ష మొదలు పెట్టాడు.

అన్నిటికీ 'ఊ' అంటున్నానన్నమాటే గాని'యితణ్ణి యెలాగు మరమ్మతుచేద్దామా' అనే ఆలోచనలో మునిగిఉన్న నాకు అతడి మాటలు బుర్రకెక్కటంలేదు. నాస్థితి కొంచెం గ్రహించి కాబోలు,

"ఆవిడభర్తగారి కేం పని ?"

"ప్లీడరీ."

"మంచి రిఫార్మర్రా ?"

"...అంటే ?...'అందంగా ఉంటారా?' అనా...లేదు, నల్లగానే ఉంటారు."

"(వికటంగా నవ్వి) ఛా...అది కాదు. మంచి సంస్కర్తా? అంటా...పోనీ శారదా బిల్లు పెళ్లిళ్లంటే ఏమంటారు ?"

"ఏవంటారు...? మంచివంటారు!"

"ఫ్రీలవ్ సొసైటీలంటే ... అంటే స్వేచ్ఛా...!"

"అదా...ఆమధ్య బెజవాడలోపుట్టి..."

"ఆఁ! అదే. మీకు కూడా తెలిసిందే? దాని విషయ మేమంటారు?"

"నాతో ఏమీ అనలేదుగాని, స్నేహితులతో 'మరీ పోయేకాలం......' అంటూంటే విన్నాను.'

"ఆవిడేమంటుంది ?"

"...నేను చెప్పగలనా?...అసలు మీ ఉద్దేశ మేమిటి ఆ సొసయిటీలంటే ?"

"ఏమిటేమిటి ? ఇందాకే చెప్తినే, మన దేశాన్ని మరమ్మతు చేస్తానని. అందులో యీ సొసైటీలకోసం ప్రత్యేక కృషిచేస్తాను."

ఇహ నాకు లెక్చరివ్వడం మొదలు పెట్టాడు, ఆ సొసైటీల ఉద్దేశాన్ని గురించీ, ఉత్కృష్టతను గురించీ, వాటి లాభాలను గురించీని కాని తల తిరిగిపోతున్నట్లుంది నాకు, అతణ్ణి గురించి ఆలోచిస్తుంటే. కళ్లు మూసుకుని అల్లాగే కూర్చున్నాను.

* * * *

పన్నెండు గంటలు దాటింది కాబోలు ప్రతిఫ్యాక్టరీ కూత కూస్తోంది. రైలు ప్లాటు ఫారంమీద ఆగింది. నా యీ మిత్రుడు రైలుదిగి మా సామాను దింపిస్తూ 'నంద్యాల వచ్చింది దిగ'మని నన్ను లేపాడు నా విచిత్రావస్థలోంచి. రైలు దిగేసరికి (మా వెంకట్రావు ముందే తెలియబరిచాడు గావల్ను) మా మామగారు, స్నేహితులూ అంతా మా చుట్టూ చేరారు. కన్ను మూసి కన్ను తెరిచేలోపల నామెడనిండా పూలదండలున్నాయి.

మరుక్షణం విస్తుపోయిన వదనంతో మన 'స్వేచ్ఛావిహారి' నా రెండు చేతులూ పట్టుకుని "ఇవి పాదాలుగాని చేతులు కావు. నా తప్పు క్షమార్హంకాదని నాకు తెలుసు. కాని మీ యీ విశాలహృదయంలో, యీ దురదృష్టవంతుణ్ణి క్షమించి, చోటిస్తేనే యీ జీవి బ్రతుకుతాడు — లేకపోతే......" అంటూ దుఃఖంతో కుమిలిపోతూ మొదలు నరికిన వృక్షంలాగు కూలబడ్డాడు.

ద్రవించిన హృదయాన్ని పదిలపరచుకుని "నాయనా! క్షమించవలసింది నేను కాదు... నీలాటి యువకులంతా యీవిధంగా పోకుండా మీ ధనాన్నీ, శక్తినీ, బుద్ధినీ సరి అయిన మార్గాల్లో వినియోగిస్తే నిజంగా మన దేశము 'మరమ్మతు' అవుతుంది. అందుకు భగవంతు డనుగ్రహించుగాక..."



# ప్రబోధగీతి

బొడ్డు బాపిరాజు

నలు దెసలు నిద్రమబ్బుల తొలఁగ ద్రోసి
తెలివి గొన్నవి; అల్లదె తియ్యమావి
గున్నపై కోకిల మొయారికులుకు లొలుక
నాలపించుచునున్నది మేలుకొలుపు!

పిలిచి వేబోక తెమ్మెర బేరగాని
కమ్ముకొనుచున్నవి పరీమళమ్ము లవిగో
పూవులు గిరాకిగా, కనుమూత దెరచి
వలపుటంగడి తొలిబోణి సలుప లెమ్ము.

కేల ములుగర్ర నూది పొలాలకేగు
కాపుబిడ్డలపాటల కన్నువిచ్చి
చిన్నిపిట్టలు కిలకిలల్ సేయు, నిద్ర
తీర దేమి? నీయిల్లు బంగారుగాను!

నిండురేతిరి ఎడబాటు నెగులులోన
వేగిపోతివి చాల, వేవెలుగు జోదు
వచ్చునను వార్త లవి వినవచ్చె కడల,
తమ్మిజవరాల ; ముస్తాబు కమ్ము త్వరగ.

మదిని సిరి కాటపట్టను మాట తలచి
సంతసింతుముగాక, నైచ్యమ్ముతోడి
నీతెరగు విన్న రోత జనించు నోసి
కులమునకు లేనిమచ్చను విలిచినావు.

ప్రవిమల యశోధనుండగు రాజుతోడ
వైర మన మేలుగా దొక పదిదినాల
పాటి నీముచ్చటకును కల్పాంతముండు
వానికిని పోల్కి గలదొటు పంకజన్మ?

గగన మాణిక్యమగు పతికన్న బ్రామి
దుండగపు గండుతుమ్మెద మిండగాండ్ర
చాటు మాటు సేతల వెలిచవులు మరగి
నాథు నెత్తి కెత్తితిగదే నవ్వుబాటు.

సరిగ నిట్టూర్పుగొనుటకే తెరపిలేని
సంతతోద్యోగమగ్ను భాస్కరుని ద్రోసి
వట్టి సోమరిపోతుల గట్టికొంటి
తిరుగుబోతుతనమ్మన్న పరువుగలదె?

వయసు ముమ్మరమున నున్న వలపుతలపు
జిగియుబిగియును ఎందాక చెలువుసెడవు?
నిముసపు సుకమ్మునే గమనించి ఎడద
లొంగినది, వంగడము నెల్ల గంగగలిపి.

కవికులమ్ముతో గలదు సంగతమనుచు
సాధుగతికి వత్తువని యాసపడియుంటి
రుద్రెతోడన పుట్టిన బుద్ధియయ్యె
పదము త్రిప్పనీయదుగదే నుదుటివ్రాత.

ప్రకృతి సౌందర్యనిధి సమర్చకుడ నేను
అపయశము గొన్న నీబ్రదు కాత్మనెంచి
చిలుకకును చెప్పినట్టుల చెప్పినాడ
నున్నమాటిది, త్రోసిరాజన్న మేలె!

---

## హైదరాబాదు చిత్రములు



౫. (a) రబియాదౌరానీగోరీ (ఔరంగబాదు)



(b) దర్బారుహాలు

# భౌతికశాస్త్రము, తత్వజిజ్ఞాస

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

భౌతికశాస్త్రమున కున్న ప్రాముఖ్యము నేడు ఇతరశాస్త్రముల కెంతమాత్రమును గానరాదు. భౌతికశాస్త్రమును గూర్చిన చర్చలు, భౌతికశాస్త్రవేత్తల యభిప్రాయములు, వారిజీవితచరిత్రలు శాస్త్రపుస్తకములందేమి, సారస్వతమునందేమి, వార్తాపత్రికలందేమి, ఎటుజూచినను మారుమ్రోగుచున్నవి. నేడో రేపో రానున్న యుద్ధవృత్తాంతములకన్నను అధికముగ ఎన్నియోకోట్ల సంవత్సరములకో రానున్న భూప్రళయమునుగూర్చి జనసామాన్యము అత్యధికశ్రద్ధతో చదువుచున్నారు. చదువరులను భయకంపితులుగజేసి పట్టనెత్తి వారినిగూడ పార్కుపైనువలె (porcupine) గనుపింపజేయజాలిన ఎడ్గర్ వాలెస్ (Edgar Wallace) నవలలకన్న ఏ జీన్సుదొరయో (Sir James Jeans) ఏ ఎడ్డింగ్టన్ దొరయో (Sir Arthur Eddington) వ్రాసిన భౌతికశాస్త్ర గ్రంథములను అధికముగ చదువుచున్నారు. భౌతికశాస్త్ర సూత్రములే సర్వప్రాముఖ్యములనియు, పరమార్థము నెరుగుటకుగూడ భౌతికశాస్త్రమే చేయూతయొసగుననియు, తత్వజిజ్ఞాసువులుగూడ కొందరు వాదించుచున్నారు. భౌతికశాస్త్ర పరిశీలనా పద్ధతులును, భౌతికశాస్త్రవాదపద్ధతులును నానాశాస్త్రములకును వ్యాపించిపోవుచున్నవి. ఇప్పటికప్పుడే జ్యోతిశ్శాస్త్రమును, రసాయనశాస్త్రమును భౌతికశాస్త్రమునకు జోహారులర్పించి, దానియండజేరి భౌతికశాస్త్రమునకు భుజప్రాయములైనవి. గణితశాస్త్రమున కెన్నడో ప్రత్యేకవ్యక్తిత్వము నశించి, భౌతికశాస్త్రమున కది యొక ఉపాంగముగ నేర్పడిపోయినది. జీవశాస్త్రమును భౌతికశాస్త్రము క్రేగంట నిర్లక్ష్యముగ జూచుచున్నది. మనశ్శాస్త్రము దాసోస్మియనుచున్నది. భూగర్భశాస్త్రాది ఇతరశాస్త్రముల ప్రశంసయే లేదు. విజ్ఞానవిభాగములలో భౌతికశాస్త్రముతో కయ్యమున కియ్యకొనినది పరమార్థతత్వశాస్త్ర మొకటియే. ఈ రెండుశాస్త్రముల పోరాటము నేటిది కాదు. పరమార్థతత్వశాస్త్రము మతమున కూడిగముచేయుచు, మతాధికారుల సంపోషణమునందుండిన కాలమున భౌతికశాస్త్రమును వెక్కువెతలబెట్టి భౌతికశాస్త్ర వినాశనమున కెన్నియోపన్నాగముల బన్నెను. గాలిలియో (Galileo) వంటి తన ప్రియపుత్రుల ఇడుమలకు దుఃఖించి కొంతకాలము మూర్ఛిల్లినను భౌతికశాస్త్రము విగతప్రాణము కాలేదు. త్వరలో ద్విగుణీకృత శక్తిసంపన్నమై రంగమును జేరెను. ఇప్పటినుండి ఈ రెండు శాస్త్రములును పరస్పరసంబంధమును విడనాడి దేనిత్రోవ నది పోజొచ్చెను. ఈ ఏర్పాటు రెంటికిని అనుకూలముగనే యుండెను. భౌతికశాస్త్రము నానాటికి వృద్ధియగుచు కడకు ౧౯ వ శతాబ్దాంతిమున అధికబలయుతమై, కండలు మెలిదేరి, కన్నుమిన్నుగానక, తత్వశాస్త్రపు ఉనికినే మరచి కడకు ఈశ్వరాభావమునే చాటిచెప్పగడంగెను. తత్వశాస్త్రము వృద్ధియగుటకు బదులు కృశించుటకు ప్రారంభించెను. అంతఃకలహముల చేతనేమి, అనర్థప్రదాయక ప్రయత్నములచేతనేమి, తత్వశాస్త్రము దినదినము కృశించి వెనుకటి ప్రాధాన్యమును గోల్పోయి విజ్ఞాన విభాగములలో మరల నొక సామాన్య విభాగముగ నిలచిపోయెను. కాని ఈశిక్ష దీనికి శుభప్రదముగనే పరిణమించెను. ఏలయన ఈ శిక్ష వలన ఈ శాస్త్రము తన యహంభావమునంతయు గోల్పోయి నమ్రముగ వెనుకటికన్న నెంతయో చురుకుగను సావధానముగను నేడు సత్యాన్వేషణము చేయుచున్నది. దుర్గమ పథపర్యటనమున తనకు తోడునీడలై యనువర్తించుటకు ఏవిజ్ఞాన విభాగము లొప్పుకొనినను వానిని తనశిష్యులుగనో స్నేహితులుగనో గైకొన నంగీకరించి చేతులు సాచుచున్నది. ముఖ్యముగ భౌతికశాస్త్రస్నేహమునకై ఉవ్విళ్లూరుచున్నది. తన పూర్వవైరమునంతయు మరచి కార్యభారమును పంచుకొని కార్యనిర్వ

హణమునకు గడంగుచున్నది. కాని భౌతికశాస్త్రము నకింకను నమ్మకము కలుగలేదు. నిస్సహాయయై తానే సర్వమును నిర్వహించుకొనగలనేమో యను ఆశ కూడ భౌతికశాస్త్రమునకు కొంతమట్టు కున్నది. అందు వలననే అది అప్పుడప్పుడు తనమార్గమును వదలి తన కభేద్యమగు పరమార్థతత్వ శాస్త్రపథమున ప్రయాణింప సమకట్టుచున్నది.

తుదకు ఇదంతయు ఏ విధముగ పరిణమిల్లును? అసహాయమై, భౌతికశాస్త్రము తత్వమరయగల్గునా? భౌతిక, తత్వశాస్త్రములకు మరల పోరాటము గల్గునా? ఈశాస్త్రముల భావిపథము లెట్టివి? యన్నగు ప్రశ్న లెట్టివారికిని మనమునందు పొడమకమానవు.

* * *

తత్వమరయుటకు భౌతికశాస్త్ర మేమేమి ప్రయత్నముల జేసియున్నది? ఎట్టిమూలసూత్రము లిదివర కును ఈ శాస్త్రమునందు వ్యక్తములైనవి? పరమార్థతత్వ నిరూపణమునకు భౌతికశాస్త్ర సిద్ధాంతములలో వేనిని నేడు నిస్సంశయముగ ఆధారము లనవచ్చును? యను ముందు ఈప్రశ్నలకు సమాధానముల బడసినగాని మనకు అసలు భౌతికశాస్త్రప్రాముఖ్యమే విశదము గాదు.

ఇప్పటికిసుమారు ౪౦ లేక ౫౦ సంవత్సరములకు పూర్వము భౌతికశాస్త్రమునందలి సమస్యలన్నియు విశదీకృతములైనవని పామరులును పండితులునుగూడ దలచిరి. గతినియమము (dynamics) లను గూర్చియు, ఉష్ణగతి నియమ (Thermo-dynamics) ములను గూర్చియు, విద్యుత్ గతినియమ(Electro-dynamics) ములను గూర్చియు, వికీర్ణశక్తి (Radiant energy) ని గూర్చియు, వాయుసిద్ధాంతము (Kinetic theory of Gases) ను గూర్చియు, ఇంకా అప్పటికి తెలిసిన ఇతర సమస్యలన్నిటిని గూర్చియు, సర్వము నెరింగితి మని భౌతికశాస్త్రజ్ఞులు నాడు తలచిరి. ఇక తమపరి శోధనలకుగాని,తమయోచనాసామర్థ్యములకుగాని లక్ష్య భూతములుగనుండినది హర్జియన్ కెరటములు (Herzian waves) అను నొక్కవిషయముమాత్రమే. ఈ హర్జి యన్ కెరటములకు సంబంధించిన పరిశోధనలను సల్పుట తప్ప ఇక భౌతికశాస్త్రజ్ఞునికి కర్తవ్యమే లేనట్లు తో చెను. ఉన్న ఈ యొకటియుగూడ అంతప్రధాన విషయ ముగ దోపలేదు. భౌతికశాస్త్రజ్ఞులు ఆవులించుచు ఒడలు విరచుకొనుటకు ప్రారంభించిరి. కృతార్థోస్మి, ధన్యోస్మి యనుకొనుటకు ప్రారంభించిరి.

ఇట్టిస్థితిలో క్రీ. శ. ౧౮౯౫వ సంవత్సరమునందు రాంజన్ (Rontgen)అను భౌతికశాస్త్రజ్ఞుడు ఆకస్మిక ముగ ఎక్సుకిరణములను (X Rays) కనిపెట్టెను. ఈ కిరణములు ఇతరకాంతి కిరణములవలెగాక కాగితము గుండాగాని, కలపగుండాగాని, కడకు లోహపురేకు గుండాగాని దూరిపోగలవని విశదమాయెను. వీని విచిత్ర శక్తి ప్రకృతిభిన్నముగ నున్నట్లు దోచెను. ఫోటోచిత్ర మును దీయుట కుపయోగించు గాజుఫలకములను, ఫిల్ము (Films) లను కాగితముతో భద్రముగా చుట్టిపెట్టిన యెడల సామాన్యకాంతి కిరణములు చుట్టుసున్న ఈకాగి తమును భేదించుకొనిపోజాలక గాజుఫలకమునకు గాని, ఫిల్మునకుగాని ఎట్టిహానియు చేయజాలవు కాని ఈ ఎక్సుకిరణములుమాత్ర మట్టినిర్బంధమున కింత మాత్రమును లోనుగావు. కడకు ఫోటోఫిల్ముపైన నొక దళసరిపలకనో, లేక పలుచనిరేకునో ఉంచిననుగూడ ప్రయోజనము లేదు. ఈ కిరణములకు దుర్భేద్యమగు వస్తువే లేదేమో యని ప్రప్రథమమున దోచెను. ఇది ఏమి చిత్రము? అని ఒకరిద్దరు భౌతికశాస్త్రజ్ఞులు కునికి పాటునుండి మేల్కని చూడ నారంభించిరి.

ఇంతలో క్రీ. శ. ౧౮౯౬వ సంవత్సరమునందు బెకెరల్ (Becquerel) అను భౌతికశాస్త్రజ్ఞుడు యురేనియమ్ (Uranium) లవణములకుగూడ నిట్టిశక్తి కలదని కనుగొనెను. అతడు మరికొంతకాల మీలవణము లనుగూర్చియే పరిశోధన చేసి, జర్మనీదేశమునందలి జొఅఖిమ్‌స్థాల్ (Joachimsthal) నం దుత్పన్నమగు పిచ్‌బ్లెండ్ (Pitche-blende) ద్రవ్యమున కీగుణ మధి కముగ నున్నట్లు కనిపెట్టెను. అనన్యదృష్టితో ఇంకను జాగ్రత్తగ ఈ ద్రవ్యమునే పరిశోధించిన యెడల నూత నాంశము లేవైన వెలువడునేమో యని తలచి, తాను

అన్యపరిశోధనాసక్తుడై యుండినందున, తన చిరపరిచితు రాలైన మ్యారీదొరసానికి కార్యభార మప్పగించెను. ఆమెయు ప్రకృతిశాస్త్రమునందు అసమాన పాండిత్యము గడించి ప్రకృతిశాస్త్రాభివృద్ధికే తన జీవితమును ధారపోయ బద్ధకంకణయైయున్నందున ఈ పనికి బూనుకొనెను. ఈమె భర్తయు ప్రకృతిశాస్త్రపరిశోధన శీలుడే. కాన భార్యాభర్తలిరువురును గలిసి అహోరాత్రములు కష్టపడి కడకు క్రీ. శ. ౧౮౯౮ వ సంవత్సరమున రేడియమ్ (Radium) అను పదార్థమును పిచ్‌బ్లెండ్ నుండి విడదీసిరి. దీనికున్న వికీరణశక్తి (radiation) యురేనియమునకున్న శక్తికన్న ఎన్నియోరెట్లు అధికము. ఈశక్తి అత్యధికము. స్వతఃసిద్ధముగ శక్తిని వికీరణ చేయగల పదార్థమొకటి పృథివియం దున్నదనిగూడ అంతవరకును తెలియనేలేదు.

ఇది ఎట్టి పదార్థము? ఇంతశక్తి ఈ పదార్థమునందెట్లు అణగియున్నది? స్వతస్సిద్ధముగ కాంతికిరణములను వికీరణచేయగలశక్తి దీని కెట్లు కలిగినది? మొదలగు ప్రశ్నలు భౌతికశాస్త్రజ్ఞులను కలతపెట్ట నారంభించెను. తమ కంతవరకును తెలిసిన భౌతికశాస్త్రజ్ఞానమే సమగ్రమని తలచినయెడల ఈ వైచిత్ర్యమున కేమిసమాధానము చెప్పవగును? బహుశః తామే పొరబడితిమేమో! తమపూర్వజ్ఞాన మసమగ్రమేమో! అణువు అనునది నిజముగ మహద్వివరమేమో! రేడియమణువునందు ఏదో విధముగ ఇంతశక్తి దాగియున్నదన ఏమన వచ్చును? రేడియమణువునకును ఇతరాణువులకును చాలభేద ముండవలెను ఎట్లయినను అణువును పరిశోధించి ఇదమిత్థమని తేల్చినగాని నిజము బోధపడదు అను అంశము స్పష్టమాయెను. భౌతికశాస్త్రజ్ఞులు మరల ఉత్సాహపూరితులైరి. నడికట్లు బిగించి, కంటి యద్దములను తుడిచి శుభ్రముచేసి మరల పరిశోధన యోగదీక్ష బూనిరి. కేవలము కాగితముపై లెక్కలు వేయుట మాత్రమేగాక నడుములు వంచి నానాపరిశోధనలను చేయ నారంభించిరి. కొలదిసంవత్సరములలోననే వారి ప్రయత్నములకు కొంతయుత్కృష్టఫలముగూడ ప్రాప్తించెను. విద్యుదృణపరమాణువు (Electron) నం దెంత శక్తి యున్నదో మిల్లికన్ (Millikan)దొర కనిపెట్టెను. కాంతియు, తదనుగుణములైన ఇతరవిద్యుదయస్కాంత తరంగములును (Electro-magnetic waves) నిరర్గళ ధారవలె ప్రవహించవు. క్వాంటం (Quantum) అను చిన్నచిన్న మూటలవలె వచ్చుచుండును, అని ప్లాంక్ (Max Planck) దొర నిరూపించెను. ఐన్‌స్టయిన్ (Einstein) క్రీ. శ. ౧౯౦౫ వ సంవత్సరమునందు రిలెటివిటీ (Relativity) వాదమును ప్రతిపాదించెను.

భౌతికశాస్త్రజ్ఞులు ఒక్కతెరగున అణువుపై తమదృష్టిని కేంద్రీకరించిరి. అణువునందున్న మర్మమును గనిపెట్టుటకై తమజీవితమును ధారపోసెతిమని బద్ధకంకణులైరి. నాటినుండియు నేటివరకును భౌతికశాస్త్రజ్ఞులు అణువునకు సంబంధించిన పరిశోధనలయందే మునిగితేలుచున్నారు. నిజ మింతవరకును తేలలేదు. గతానుగతికముగ అనాదిగ వచ్చిన సిద్ధాంతములుగూడ రూపుమాసిపోయినవి. మూలసూత్రము లనుకొన్నవాటియందే చాలమార్పులు కలిగినవి. కాని అణుమహత్వము మాత్ర మింకను విశదముగాలేదు. విశదమైన భాగముగూడ అవాఙ్మానస గోచరముగ నున్నది. అణువు అనగా ఫలానిది యని భౌతికశాస్త్రజ్ఞుడు లక్షణ మేర్పరుపగల్గుచున్నాడు. కాని ఈలక్షణమునుండి అణుస్వరూపమును మానసికముగనైన ఎంతమాత్రమును ఊహించుకొనుటకు సాధ్యముగాదు. అణువు అవాఙ్మానస గోచరమని తోచుచున్నది. భౌతికశాస్త్ర పరిశోధనము పాంచభౌతికమైన ద్రవ్యమునే యతిక్రమించిపోవుచున్నది.

ఆకాశము (Space)తనపైకి తానే వంగిపోవును; గణనాతీతములైన బ్రహ్మాండములు విజృంభించి విజృంభించి అంతకంతకు అనంతముగ విస్తీర్ణములగుచునేయుండును. ఇట్టి సిద్ధాంతములు భౌతికశాస్త్ర పరిశోధనల నుండి బయలువెడలుచున్నవి. ఇట్టి యంశములను మానసికముగనైనను ప్రత్యక్షీకృతములను జేసికొనుట ఎట్లు? శక్తి (energy) కొన్నిసందర్భములందు ద్రవ్యమువలెనే ప్రవర్తించును. మరికొన్ని సందర్భములందు ద్రవ్యము శక్తివలెనే ప్రవర్తించును. ద్రవ్యము శక్తియే. ద్రవ్యము

నేవిధముగనైవనుధ్వంసముచేసినయెడల అఖండశక్తి ఉద్భవించును, అని భౌతికశాస్త్రజ్ఞుడు ఇప్పటికి నిర్ధరించియున్నాడు. కాని ద్రవ్యమును ధ్వంసముచేసి శక్తినుత్పత్తిజేయుట ఎట్లు? అట్లొనర్చితిమిపో, ఉత్పన్నమైన ఆ యఖండశక్తిని చేర్చి పెట్టి సద్వినియోగము చేసికొనుట ఎట్లు ?

అణువు మహత్తయినది. దుర్భేద్యము, అణోరణీయను అనుకొనినది మహతోమహీయమైనది. ఏకమేవాద్వితీయమని స్థిరమైయుండినది మారి నానాభాగసమన్వితమని తేలినది. అణువునందు మధ్య ఒక కేంద్రమును కేంద్రముచుట్టును భ్రమణముచేయుచు కొన్ని విద్యుదృణ పరమాణువులును కలవు; దీని రహస్యమింతే; యని ప్రప్రథమమున శాస్త్రజ్ఞులు తలచిరి. కాని అణుకేంద్రముగూడ విభజనాతీతమైన మూలాధారమని యనుకొనుటకు వీలులేదని నేడు స్పష్టమైనది. అణువునుగూర్చి నేడు సమగ్రముగ చర్చించవలెనన్న ఎలెక్ట్రాన్ (Electron), పాసిట్రాన్ (Positron), న్యూట్రాన్ (Neutron), ఫోటాన్ (Photon), ప్రోటాన్ (Proton), డ్యూట్రాన్ (Deutron), ఆల్ఫాముక్కలు (Alpha particles) అను సప్తవిభాగములనుగూర్చి ప్రత్యేకముగ చర్చించి విశదీకరింపవలెను. అట్లుచేసిననుగూడ అణువునందలి సత్యము బోధపడునని ఏమినమ్మకము?

ఇదమిత్థమని ఏదియు నిశ్చయముగ జెప్ప వీలులేదు. నిత్య (Unchanging) మనునది కలలోనివార్త. ఏ విషయమునుగూర్చియైనను 'బహుశః అది ఇట్లు జరుగునేమో, ఇట్లు జరుగవచ్చునేమో' యని చెప్పవచ్చునే కాని 'అది ఇట్లే'యని ప్రాచీన భౌతికశాస్త్రజ్ఞులవలె వాదింప సాధ్యముగాదు. అణుకేంద్రము (Nucleus of the atom) చుట్టును విద్యుదృణ పరమాణువులు పరిభ్రమణము చేయుచుండుట నిశ్చయమే. కాని వానిలో నొక్కొక్కటియు ఫలానాస్థలమునందే యుండునని కాని, ఒక ప్రత్యేకపంథనే యనుసరించునని కాని చెప్పసాధ్యముగాదు. ఉపరికక్ష్య (Outer orbit)నున్న విద్యుదృణపరమాణువు లోవైపునున్న కక్ష్యపైకి దుమికిపోవచ్చును. లోవైపుననున్న విద్యుదృణపరమాణువుగూడ ఉపరికక్ష్యలలోనే దేనిపైనికైనను రావచ్చును. సెకండులో పదిలక్షలభాగములలో నొకటియగు నొక త్రుటికాలములో విద్యుదృణపరమాణువులు అణువునందు సరిగా ఫలానా ప్రదేశమునకు రాగలవని లెక్కచేసి చెప్పవచ్చును. కాని యవి రావచ్చును, రాకనుపోవచ్చును. వచ్చియే తీరుననిమాత్ర మెవరును చెప్పజాలరు. కార్యకారణ సంబంధ మంతనిశ్చయముగ ఈ విషయమున ప్రవర్తించునని చెప్పటకు వీలులేదు.

* * * *

నీల్సుబోహారు (Niels-Bohr) మొదలగువారు ప్రతిపాదించిన విషయములే ఇంతదురవగాహములుగ నున్నప్పుడు ఇక ఇటీవల వచ్చిన తరంగనియమము (Wave mechanics) లనుగూర్చి చెప్ప నవసరమే లేదు. శాస్త్రజ్ఞులకే ఈ విషయములు తలతిక్క పుట్టించును. ఇక ఇతరుల విషయము చెప్ప నక్కరయేలేదు. ప్రత్యేక మీ శాస్త్రవిభాగమునందే కృషిచేసినవారు తప్ప ఇతరులు ఇందు ప్రవేశించుటకుగూడ సాధ్యముగాదు.

శాస్త్రవిజ్ఞానము రెండురకములు; కాన శాస్త్రజ్ఞులుగూడ రెండుతెగలకు జేరుదురు. తాత్కాలిక ప్రయోజనము నెంతమాత్రమును ఆశించక కేవలమొక్క శాస్త్రాభివృద్ధియందే లగ్నమనస్కులై ఫారడే (Faraday) వలె జీవితమును గడపినవారు ఒక వర్గమునకు జెందినవారు. శాస్త్రవిషయములను జనసామాన్యమునకు తాత్కాలికముగనో, మరియింకేవిధముగనో ఉపయోగపడునట్లు చేసి ఎడిసన్ (Edison) వలె జీవితమును గడిపినవారు రెండవవర్గమునకు జెందినవారు. ఫారడే విద్యుచ్ఛక్తికి సంబంధించిన మూలసూత్రములను కనిపెట్టి శాస్త్రాభివృద్ధికి తోడ్పడెను; ఎడిసన్ ఈమూలసూత్రములపై నాధారముచేసి విద్యుద్దీపము (electric lamps) మొదలగువానిని తయారుజేసి విద్యుచ్ఛక్తి మానవునికి అధికముగ నుపయోగపడునట్లు చేసెను. ఇందు ఒకరెక్కువ, మఱియొకరు తక్కువ యనివాదించుట కేవలము మూర్ఖతయే. ఎడిసన్ వంటివాడు పుట్ట

కుండినయెడల, విద్యుచ్ఛాస్త్రము నిరర్థకమని జనసామాన్యమునకు తోచి యుండునేమో. కాని ఫారడే తనపరిశోధనలను సల్పునపుడు తనప్రయత్నములు తుద కీవిధముగ పరిణమించునని ఎన్నటికిని తలచియుండడు. అతనియుద్దేశ్యమే వేరు.

ఆధునిక భౌతికశాస్త్రజ్ఞుల భగీరథ ప్రయత్నములకు ఎన్నడో ఒకనాడు పామరులకుగూడ అమూల్యములనిపించుఫలితములు సమకూరవచ్చును. ద్రవ్యమును శక్తిగ మార్చవచ్చు ననుమూలసూత్రముపై నాధారముచేసి ఎడిసన్‌వంటి మహానుభావుడు ఎవడోఒకడు ద్రవ్యవిధ్వంసమువలన శక్తి నుద్భవింపజేయగల యంత్రము నొకదానిని ముందెన్నడో తయారుచేయవచ్చును. శక్త్యాధారవస్తు (source of energy) వను నేలబొగ్గు నానాటికి తరగిపోవుచున్నది. ప్రపంచమునందున్న పెట్రోలియమునూనెయు, కిరోసిన్‌నూనెయు సంవత్సరములు గడచినకొలదిని అంతకంతకు తక్కువయగుచున్నవి. జలపాతములనుండి తయారుచేయనగు విద్యుచ్ఛక్తి ఏకొలది దేశములలోనో, అందునను ఏకొంతభాగమునకో కాని అంతయధికముగ నుపయోగపడుట లేదు. ఇతరత్ర విద్యుచ్ఛక్తి నుత్పత్తిచేయవలెనన్న కిరోసిన్ నూనె యధికముగ నుండవలసినదే. ఇట్టిస్థితిలో ద్రవ్యవిధ్వంసమువలన శక్తిని సులభముగ నుత్పత్తి చేయగలిగినచో ఇది మానవుని కెట్టి అమూల్యవిషయముగ నేర్పడునో సులభముగ నూహించుకొనవచ్చును. ద్రవ్యమునం దంతర్గతముగనున్న శక్తి ఇంతంతగాదు. ఒక రెండుసేర్ల తూకముగల ద్రవ్యమును (మట్టినో, మరియింకేదైన సామాన్యపదార్థమునో) కైకొని అందున్నశక్తిని సమగ్రముగ విడదీసినయెడల ఆశక్తితో ముప్పదివేలటన్నుల స్టీమరును ఇంగ్లండునుండి అమెరికా దేశమునకు రెండుమార్లు నడిపించవచ్చును.

భావిశాస్త్రజ్ఞుడు ఉపయోగకరములగు ఇట్టి విషయముల నెన్నిటినో కనిపెట్టి మానవజీవితమునకెన్నియోసౌకర్యముల నేర్పరుపవచ్చును. కాని తత్వజిజ్ఞాసకై ఇవి యెంతమాత్రమును ఉపయోగపడవు. కడకు "జడము"లని ప్రతీతిచెందిన పృథివ్యాదిద్రవ్యములందలి అంతరార్థమును అవగాహన చేసికొనవలెనన్న గూడ శాస్త్రజ్ఞులు తాత్కాలిక ప్రయోజనములను, యశోధనలాభాదికాంక్షలను వదలి కేవల మొక్క శాస్త్రాభివృద్ధికై మాత్రమే పాటుబడిన గాని సాధ్యము గాదు.

ఈ శాస్త్రపరిశోధనలు ఇకముందేవిధముగ పరిణమిల్లునో తెలియరాదు. కాని ఇప్పటికి పరిశోధన లేస్థితికి వచ్చినవో, ఎంతమట్టుకు తత్వనిరూపణమునకు సహాయపడగలవో కొంత పరిశీలింతము.

ఆధునిక భౌతికశాస్త్ర పరిశోధనలవలన నేడు మనకు తెలిసిన ముఖ్యాంశములేవి యని విచారించిన, వెంటనే ఆకాశ (Space) కాలము (Time) లను ఐక్యముగజేసిన రిలెటివిటీ వాదమో, (Relativity Theory) లేక, కార్యకారణసంబంధము భావమని తెలుపుచున్న క్వాంటం వాదమో (Quantum Theory) లేక ద్రవ్యమునుగూర్చి మనకున్న యభిప్రాయములను తారుమారుచేసిన అణువిభజనమో మనకు జ్ఞాపకమునకు వచ్చును. కాని ఇన్నిటికన్నను ముఖ్యమైనయంశ మొకటి నేడు వ్యక్తమైనది. "పరమార్థము నింకను మనము సమీపించనైనలేదు" అనునదే ఈ ముఖ్యాంశము.

భౌతికశాస్త్రమందలి ముఖ్యాంశములన్నియు గణితశాస్త్రవిభాగమునకు జెందినవే. అందునను ఇవి లౌకికగణితశాస్త్ర (Applied Mathematics)మను విభాగమునకుగాక, ప్రధానగణితశాస్త్రము (Pure Mathematics) అను ప్రత్యేకవిభాగమునకే చెందినవి. జీన్సు శాస్త్రజ్ఞుడు చెప్పినట్లు ఈ యంశములు మనోభిప్రాయములనుండి జన్మించినవైనను తద్భిన్నములుమాత్రము గావు. అనగా నిర్మాతయు, నిర్మితయు గూడ నొక్కటేవిధములైనవి. రెండును కేవలభావనాప్రపంచమునకు జెందినవే కాని పాంచభౌతికప్రపంచముతో నెట్టి సంబంధమునుగలవి గావు. మానవాభిప్రాయములు సాధారణముగ పాంచభౌతిక ప్రపంచమున నేదోయొక ద్రవ్యమునకు సంబంధించినవి. కాని ప్రధాన గణితశాస్త్రమునకు సంబంధించిన అనాది, అనంతము (Infinity) మొదలగు అభిప్రాయములు మానవాతీతములు, కేవల భావనారూపములు. ఆధునిక భౌతిక

శాస్త్రమునందలి ముఖ్యాంశము లెంతవరకు నిట్టివో ఈ క్రిందిపట్టికను జూచినచో బోధపడును. ఈ పట్టిక యందున్న పంచాంశములే ఆధునిక భౌతికశాస్త్ర సారమని వక్కాణింపవచ్చును.

౧. ఆకాశము (Space) అనంతముగాదు, సాంతము (Finite).

౨. ఆకాశము శూన్యము (Empty). కాని ఆకాశమునందు ఒకభాగమునకును మరొకభాగమునకును ద్రవ్యరూపముగ కొంతభేదము గాన్పించినయెడల అది యంతయు ఆకాశమునకున్న భిన్నభిన్నగుణముల (Properties) వలననే కలిగినదికాని ఆకాశమునిజముగ శూన్యమే.

3. ఆకాశము బహువిధము. చతుర్ధావిస్తృతాకాశము (Four- dimensional space), సప్తధా విస్తృతాకాశము (Seven - dimensional space) మొదలగు బహుధా విస్తృతాకాశములు (multidimensional space) గలవు.

౪. ఆకాశము (space) నకు అనంతవిస్తరణము గలదు (can expand for ever).

౫. ప్రపంచమునందలి వివిధాంశముల సమ్మేళనము (sequence of events) కార్యకారణసిద్ధాంతముపై (law of causation) నాధారపడదు; అనిర్దేశ్య సిద్ధాంతముపై (law of probability) నాధారపడుచున్నది. అనగా ఇదివరకును మనము రెండుఅంశములను కార్యకారణములని తలచినయెడల వాని కొకొ యవినాభూతసంబంధ మున్నదని తలచి, ఫలానాకారణమున ఫలానాకార్యము సంభవించినదనియు, అట్టికారణము వలన అట్టికార్యము సంభవించియే తీరుననియు తలచుచుంటిమి. కాని నేడట్లుతలచుటకు సాధ్యముగాదు. అందుకు బదులు కార్యకారణభావమునే బొత్తిగ వదలివైచి, ఫలానాయంశము లుండినయెడల తదనుగుణముగ ఫలానా ఇతరాంశములు బహుశః సంభవించునని మాత్రమే నేడు మనము చెప్పవచ్చును. ఇట్టియభిప్రాయములన్నియు కేవలము భావనాప్రపంచమునకే అనువర్తించు ఊహ్యావిషయములుగాని, ఐహికప్రపంచ సాదృశ్యమున అవగాహనచేసికొన సాధ్యమగు అంశములు గావు.

ఇట్టిభౌతికశాస్త్ర ముఖ్యాభిప్రాయములు విశ్వనిరూపణ కెంతవరకును తోడ్పడగలవు? అనునంశము చర్చనీయమైనదే కాని సామాన్యుల కిది అతిదుర్గ్రాహ్యమగునంశము. ఏలయన అందుకు భౌతికశాస్త్ర పాండిత్యమునకన్న న్యాయశాస్త్ర, పరమార్థ తత్వశాస్త్రపాండిత్య మధికముగ గావలెను. కాని భౌతికశాస్త్రవేత్తలు మునుముందు తమసిద్ధాంతములను స్పష్టముగ పరస్పర వైరుధ్య మెంతమాత్రమును లేకుండునట్లుగ విశదీకరించిన గాని ఇతరులేమియు చేయజాలరు. ఇంతవరకును భౌతికశాస్త్రవేత్తలు పరస్పరసిద్ధాంత ఖండనయందే యున్నందున ఏవిషయమును గూర్చియు ఇదమిత్థమని నిర్ధరించుట కెంతమాత్రమును సాధ్యముగాదు. ఒకవిషయమును గూర్చిమాత్రము శాస్త్రజ్ఞులందరి యభిప్రాయములును ఏకీభవించుచున్నవి. జీన్సుదొర వక్కాణించినట్లు భౌతికవిజ్ఞాన మధికమైనకొలదివి యాథార్థ్యము యంత్రమువంటిది కాదనిమాత్రము స్పష్టమగుచున్నది. విశ్వ మొకయంత్రమువంటిదని ప్రాచీనశాస్త్రజ్ఞులు తలచిరి. కాని అంతకన్న విశ్వ మొక మహదభిప్రాయమని తలచుటయే సమంజసమని నేడు శాస్త్రజ్ఞులు వక్కాణించుచున్నారు. ఇది నిజమేయైనచో మనస్సు అనునది ఈ విశ్వమునందు ఏదో కాకతాళీయముగ సంభవించినదిమాత్రము కాదని సిద్ధాంతమగును. ఇంతేకాక ద్రవ్యమయ మైన భౌతికప్రపంచమునకు మనస్సే సృష్టికర్తయనియు, అధికారియనియు, శాసకుడనియుగూడ జీన్సు మొదలగు శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇక్కడ మనస్సు అనగా మనయొక్కొక్కరిమనస్సు అని అర్థముగాదు. మనప్రత్యేకమనస్సులు కొన్నికొన్ని ప్రత్యేక అణువుల సమ్మేళనమున నేర్పడినవి. ప్రపంచమునందున్న సకలమానవుల మనముల నుండు అణువులన్నియు అభిప్రాయరూపముగ నేమనస్సునందున్నవో ఆమనస్సే విశ్వమునకు సృష్టికర్తయని జీన్సుదొర వాదించుచున్నాడు.

జీవితమనునది ఒకనియతసూత్రముపై నాధారపడి విశ్వమునం దుద్భవించినది కాదనియు, జీవితమునకును, విశ్వమునకును అంతసంబంధము లేదనియు, ఉన్నను బహుశః ఈ రెంటికిని వైషమ్యము గలదేమోయనియు మొన్న మొన్నటివరకును మన మనుకొనుచునే యుంటిమి. కాని భౌతికశాస్త్రమునం దీనూతనాంశములు విశదమైనపిమ్మట అట్టి యభిప్రాయముల కెంతమాత్రమును తావు లేదు. మనస్సు, ద్రవ్యము అనునవి రెండు ప్రత్యేక విషయములనియు, వస్తుతః పరస్పరభిన్నములనియు వాదించుటకు నేడు సాధ్యము గాదు. ఏలయన పై సిద్ధాంతముల నంగీకరించినయెడల ద్రవ్యమనునది మనస్సుయొక్క సృష్టియే, మనస్సుయొక్క వ్యక్తీకరణమే. అంతేకాదు, జీన్సు దొర ఇంకను ఏమనుచున్నాడో చూడుడు:

"We discover that the universe shews evidence of a designing controlling power that has something in common with our own individual minds—not, so far as we have discovesred, emotion, morality, or aesthetic appreciation, but the tendency to think in the way which, for want of a better word, we describe as mathematical. And while much in it may be hostile to the material appendages of life, much also is akin to the fundamental activities of life; we are not so much strangers or intruders in the universe as we at first thought"

ఒక ప్రత్యేకపద్ధతిపై నాధారముచేసి విశ్వమును నిర్మించి శాసించు అధికారి యొకడో లేక యొకటో యున్నట్లు మనకు తెలియుచున్నది. ఈ యధికారికిని మనప్రత్యేక మనస్సులకును కొంతసామ్య మున్నట్లుగూడ గాన్పించుచున్నది. ఈసామ్యము చిత్తవికారములందును, నీతివర్తనమునందును, శృంగారాద్యనుభవమునందును గానరాదుగాని భావనాప్రపంచమున గణితశాస్త్రవిధానము ననుసరించి యోచించుటయందు గానవచ్చుచున్నది. ఇదియే జీన్సువ్రాతయందలి ముఖ్యాంశము.

నేడు ఈవిధముగ తలచుటకు కొంతయాస్పద ముండుట నిజమే. కాని భౌతికశాస్త్రసూత్రము లెట్టి మార్పును జెందక ఇప్పటివలెనే ఇకమీద గూడ నుండునని ఎట్లు చెప్పనగును? ౨౦ సంవత్సరముల క్రితము నిత్యము లనుకొనిన మూలసూత్రము లెన్నియో నేడు పరిత్యక్తములైనవి. మరికొన్ని యధికమార్పులకు లోనైనవి. అట్టిచో నేటిసిద్ధాంతములుమాత్రము ఇట్లేయుండునని చెప్పసాధ్యమగునా? అసలు ఈసిద్ధాంతములను ప్రతిపాదించినశాస్త్రజ్ఞులే అంతనమ్మకముగ చెప్పుట లేదు. పైగా, భౌతికశాస్త్రజ్ఞులలో చాలమందికి తమశాస్త్రసిద్ధాంతములు తత్త్వనిరూపణ కెంతవరకును ఉపయోగపడునో, తత్త్వజిజ్ఞాసువుల కెంతవరకును సహాయకరములుగ నుండునో అనువిషయ మెంతమాత్రమును కాబట్టదు. వారిదృష్టి నిశ్చలముగ నొక్కయంశముపైననే కేంద్రీకృతమై యున్నది. వారికి కాబట్టినది తమపరిశోధన యొకటి మాత్రమే. ఎట్లయిననేమి, అదియును యాథార్థ్యనిరూపణకొరకే కదా!

* * * *

మొన్న మొన్ననే అమెరికాదేశమునందు చికాగో నగరవర్ధంతి జయప్రదముగా నెరవేరెను. ఆసందర్భమున "శతాబ్దాభివృద్ధి"యని పేరుగాంచిన లోకోత్తరవస్తుప్రదర్శనమొకటి ఆ నగరమున విరాజిల్లెను. ఇందు కానరానివస్తువే లేదు. నానావిధపదార్థములే కాక, ముదమునుగూర్చు ముచ్చటలుగూడ ఎన్నియో అందు గాన్పించుచుండెను. సుమారు నాల్గుకోట్లజనులు ఆప్రదర్శనమును గాంచి తృప్తిచెందిరి. ఒక నూరుసంవత్సరముల కాలములో ఎన్నినూతనాంశములు బయలుపడినవో, జీవిత మెంతమారినదో, ప్రపంచ మెంత యభివృద్ధి చెందినదో ఈ ప్రదర్శనమునుండి స్పష్టమాయెను.

కాని సూక్ష్మముగ పరిశీలించినచో ఇదివరకును మానవుడు చేయగలిగినదానికన్న చేయలేనిదే అత్యధికముగ నున్నట్లు బోధపడును. ఎన్నియోవిచిత్రవిషయము లీవస్తుప్రదర్శనమున గాన్పించెను. కాని పరిపూర్ణత్వము దేనియందును సిద్ధించినట్లు కనబడలేదు. ఒక్కప్రదేశమున మాట్లాడినచో ధ్వనివర్ధకయంత్ర (loudspeakers)

సహాయమున ఎన్నియోచోట్ల, ఎందరో మాట్లాడినట్లు వినవచ్చుచుండెను. కాని కొన్నియంత్రములు సరిగాపని చేసిన మరికొన్ని చేయుటలేదు. చక్షురతీతదృశ్యము (Television) ను సాధించితిమని శాస్త్రజ్ఞులెంతయో బడాయికొట్టిరిగాని చూచినవారికిగాని ఆ దృశ్యమెట్టి యథమస్థితియం దున్నదో తెలియదు. ఎన్నియోవాయు విమానములు ఆకాశమున ఈగలవలె చెలరేగి నానావిచిత్ర ములను జేసిచూపెను. కాని హఠాత్తుగా రెండువిమాన ములు నేలపైబడి ఏపాపమెరుగని ప్రేక్షకులలో కొంద రిని హతమార్చెను. తెలిసినరోగములను, తెలియనిరోగ ములనుగూడ కుదుర్చుటకు లక్షలకొలది ఔషధములు ప్రదర్శనశాలయందు గాన్పించుచుండెను. కాని సరిగా ఆరోజులలోనే నగరమునందలి రెండు ఉత్తమతరగతి వసతిగృహములలో (hotels) చాలమందికి గ్రహణి ప్రారం భమై ౮౦ మందికిపైగా మరణించిరి; ౨౦౦ మంది బాధపడిరి. లెక్కలేనన్ని మోటారుబండ్లు అమ్మకము నకు సిద్ధముగనుండెను. కాని వానిలోనేదియు ఉపయో గించిన పెట్రోలియమునూనెలో ఉన్న శక్తియంగు నూటికి ఎనిమిది పాళ్లకంటె నధికముగ నుపయోగపరచు కొనజాలదు. నానావర్ణముల విద్యుద్దీపముల జూచి ఎట్టి వాగను ముగ్ధులగుచుండిరి. కాని ఎట్టివిద్యుద్దీప మయి నను నూటికి రెండుపాళ్లకంటె నధికముగ విద్యుచ్ఛక్తిని కాంతిగ మార్పజాలదు. ఇంతయేల? జీవశాస్త్రమున ప్రపంచ విఖ్యాతిగాంచిన శాస్త్రజ్ఞులైనను వృక్షము లందలి ధాతువు (sap) ఎట్లు వృక్షాగ్రమువరకును వ్యాపించుచున్నదో చెప్పలేరు; క్యాన్సర్ (cancer) విస్రవణమున కేమికారణమో, పడిసె మేలపట్టునో చెప్పజాలరు. రసాయనశాస్త్రజ్ఞులలో ఉత్తములు గూడ మనము సాధారణముగ తినునాహార పదార్థము లెట్టి ద్రవ్యసంయోగమున వినిర్మితము లైనవో చెప్పజాలరు. ఎట్టిమేధావులైన మనశ్శాస్త్ర జ్ఞులైనను పిచ్చిపట్టడమునుగూర్చిగాని, బుద్ధిమాంద్యము నుగూర్చిగాని సమగ్రముగ విశదీకరింపజాలరు. ఇక భౌతికశాస్త్రజ్ఞులన్ననో, వీరు సతతము ద్రవ్యమునకున్న వికీర్ణకాంతికరగుణము (Radiant properties of matter) లను గూర్చియు, వికీర్ణకాంతికున్న ద్రావ్యక గుణములనుగూర్చియు (Material properties o radiation) భావించుచున్నారే కాని ఇంతవరకును సత్య మి౽యని బోధపడలేదు.

నూరేండ్ల యభివృద్ధికాదు; పదివేలయేండ్ల యభి వృద్ధికి అనంతరము మన మీస్థితియం దున్నాము. రెండుకట్టెలను రాచి అగ్నిని పుట్టింపనేర్చిననాడే మాన వునికి నాగరికతాయుగము ప్రారంభమాయెను. నాటి నుండియు నేటివరకును మానవుడు ప్రత్యేకముగ రెండు విధములతత్త్వచికీర్షతో పరిశోధనలు చేయుచునేయు న్నాడు. ఒకవైపు తనలోనుండి బహిర్గతమైనట్లు తన మనస్సునకు వ్యక్తమగుభావములు సత్యమిట్టిదని తెలియ జేయుచునేయున్నవి. ఇట్టిభావము లందరికిని ఒకటే తైక్ష్ణ్యముతోగాని, ప్రస్ఫుటతతోగాని విశదమగుటలేదు. ప్రపంచచరిత్రమున ఏ కొందరోకాని తత్త్వమరసితి మ నియు, విశ్వవిచిత్రము నర్థముచేసికొంటిమనియు చెప్ప సాహసింపలేదు అట్టి తత్త్వవేత్తలకు గూడ ఎప్పుడో ఒకప్పుడేకాని సతతము ఇట్టిభావములు మనమున నుద్భ వించుట లేదు. ఇక రెండవవైపు, యాథార్థ్యనిరూప ణకై మానవుడు చేయుచున్న పరిశోధనాదిప్రయత్న ములు గలవు. ఈ ప్రయత్నములు చాలవరకు భౌతిక శాస్త్రవిభాగమునకు జెందినవే. అభివృద్ధియనినను, నాగరికతయనినను సాధారణముగ మనకు స్ఫురించు సంశము లివియే.

ఇట్టి అమోఘప్రయత్నముల నతితీవ్రముగ జరిపి నను గూడ, ప్రకృతిపరిసరముల నర్థముచేసికొని తనయభి మతమార్గమున జీవితమును సుకరముగ జేసికొనుటకైనను మానవుని కింకను సాధ్యముగాకున్నది. తనకోర్కెల కను గుణముగ ప్రకృతియందు మార్పులు 7గావించుట యటుం డ ప్రకృతిధర్మముల నర్థముచేసికొని తదనుగుణముగ తానే నటించుటకుగూడ ఇంకను మానవునికి సాధ్యముగాకు న్నది. ఇక ప్రకృతియందలి గూఢార్థమును స్తైరుగ నెట్లు శక్యమగును?

* * * *

పరమార్థతత్వ నిరూపణమునకు నేడు జరుగుచున్నంత పరిశోధనయు, పరిశ్రమయు పాశ్చాత్యదేశములందు ముందెన్నడును జరుగలేదు. ప్రాచీనార్యులు తత్వమరయుటూని తమజీవితముల నందుకే ధారపోసిరి. వారు కనిపెట్టిన ముఖ్యాంశములే నేటికిని మానవాభ్యుదయ చిహ్నములుగ గనుపించుచున్నవి. కాని ప్రాచీనార్యులెంతమాత్రమును బాహ్యప్రపంచమును పరిశోధింపబూనుకొనలేదు. ఇంతమాత్రముననే వారు కనుగొనిన ముఖ్యవిషయములు అముఖ్యములనియు, దోషపూరితములనియు అనుకొనదగదు అజ్ఞానమనునది యొక దుర్గమారణ్యమని యనుకొందము. ఈ యరణ్యముగుండ మన గమ్యమునకు సులభముగ జేర్పగలమార్గ మొక్కటే యుండవచ్చును. కాని యదియు రాజమార్గమువలె గాన్పించదు పైగా ఈ యరణ్యమున ఎన్నెన్నియో మార్గము లున్నట్లు కాన్పించును. చూచుట కన్నియు నొక్కటేరకముగ నుండును. కాన సుగమమార్గము కంటి యెదుటనేయున్నను అదియే సుగమమార్గమని మన కెట్లు తెలియును ? కడకు ఒక మార్గముననే ఎన్నియో మార్లు నడచినను మన కావిషయము సైతము తెలియక పోవచ్చును. కాని జుగుప్సావిశ్రాంతులు లేక సతతము ఆ యరణ్యముననందే తిరుగుచున్నవాడు ప్రారంభమున నేమార్గము నవలంబించినను, తుదకు ఎప్పుడో ఒకప్పుడు తనగమ్యమును చేరుకొనియే తీరును. ప్రప్రథమముననే ఎట్లో ఒకవిధముగ సుగమమార్గమున బడి ఎట్టిచిక్కును లేక తనగమ్యమును చేరుకొన్నవానికన్న నానాకష్టముల ననుభవించి తుదకు తనగమ్యమును చేరిన ప్రయాణీకుడే ఒకవిధముగ మేలు. ఏలయన వీనికి అడవియంతయు తెలియును. అందున్నమార్గముల నన్నిటిని పరిశోధించి చూచియున్నందున వానిని కన్నులుగట్టి అడవియందేభాగమునకు గొనిపోయి వదలినను సుకరముగ గమ్యము చేరుకొనగలడు. రెండవవాడీవిధమున చేయజాలడు. వాని నేదోయొకతప్పుమార్గమున విడచినయెడల వానికది తప్పుమార్గమని తెలిసినను సుగమమార్గమున కెట్లు చేరుకొనవలెనో తెలియక నానాకష్టములకు పాలుగావచ్చును. అట్టివానిని మనము మార్గదర్శకునిగ గైకొనరాదు.

పరమార్థతత్వచికీర్షగూడ నిట్టిదేయని తలంపవచ్చును. భౌతికశాస్త్రపథము నవలంబించి తుదివరకు ప్రయాణముచేసినను మనము తత్వ మరయలేక పోవచ్చును. రసాయనాది ఇతర శాస్త్రములుగూడ ఈవిషయమున నింతకన్న ప్రయోజనకరములు గాకపోవచ్చును. కాని అన్నిమార్గములను తుదివరకును పరిశోధింపవలసినదే ఏమార్గము ననుసరించుచున్నను సరే, తుదివరకు దాని ననుసరించినగాని అది తప్పుదారియని దృఢముగ జెప్పసాధ్యముగాదు.

ఐనను ఈ సందర్భమున నొకవిషయమునుమాత్రము జ్ఞాపకముంచుకొనుట మేలు. తత్వమరయుటకు మనము ప్రథమమున ఏమార్గము నవలంబించినను అనుసరించవచ్చును. కాని అదియే సరియైన మార్గమని మనమున నిశ్చయము చేసికొనగూడదు. మార్గమధ్యమున ఒకటి రెండువిషయములు తెలిసి ఆ మార్గము తప్పుమార్గమని తోచినను, ఆ మార్గమును వదలక సాంతముగ దానిని పరిశోధించుట మంచిదే. అందువలన నొక్కతూరిగ ఆ మార్గము ఆమూలాగ్రము బోధపడును. ఇకముందెన్నటికిని దానినిగూర్చి ఎట్టియాశలును ఉంచజాలవు. కాని ఇట్లని మార్గమధ్యమున తెలియుచున్న విషయములను చూడనైనచూడక కన్నులు మూసికొని ప్రయాణముచేయుటయు, లేక చూచినను ఆ విషయములు తప్పిదములని మూర్ఖవాదము చేయుటయు మంచిదికాదు.

జ్ఞానార్జనమున మానవు డెట్టిప్రారంభదశయందున్నాడో అందరికిని తెలిసినవిషయమే. భౌతికశాస్త్రము నొక్కదానినిమాత్రమే తీసి పరీక్షించినను మనకు తెలిసినదానికన్న తెలియనిదే ఎన్నియోరెట్లు అధికముగ నున్నదని పైన జూచితిమి. ఎన్నియోమార్గముల నవలంబించి పరిశోధనలు సలుపుచున్నను మానవుడొక్కమార్గమునైనను ఇదివరకు సాంతముగ పరీక్షించియున్నాడని చెప్ప సాధ్యముగాదు. సాంతముగ పరీక్షించుట యటుండ సకారణముగ సంతృప్తిజెందుటకుగూడ వలయునంతదూరము నీమార్గమున ఇంకను ప్రయాణింపలేదు. అట్టిచో ఈమార్గమే శ్రేష్ఠము, ఇదియే సుమార్గము అని చెప్పుట కేవలము సాహసమే.

మన కిదివరకును తెలిసినంతవరకును భౌతికశాస్త్రమును మనము సాధారణముగ ప్రకృతిశాస్త్రమని, చెప్పు విజ్ఞానవిభాగములలో ఇంచుమించుగ అన్నియు కొన్ని కొన్ని మూలప్రమాణములపై నాధారపడియున్నవి. ఈ ప్రమాణముల నాధారముచేసుకొనియే శాస్త్రజ్ఞులు తమ పరిశోధనల ప్రారంభింతురుగాని, ఆధారప్రమాణముల నే పూర్వపక్షముచేయ సాహసింపరు. అందు కొక ముఖ్య కారణమును గలదు. ప్రకృతిశాస్త్రము విశ్వరచనాపద్ధతి నెరిగించునే కాని ప్రత్యేక మాపద్ధతిమాత్రమే ఏల విశ్వసృష్టియందు గానవచ్చుచున్నదో చెప్పజాలదు. అట్టిప్రశ్నలకు సమాధానము చెప్పుబాధ్యత బహుశః పరమార్థతత్వశాస్త్రమునకు సంబంధించినదేమో ? ఏదియెట్లున్నను ప్రకృతిశాస్త్రముమాత్రము సర్వమునుతానే నిర్వహింపగలదని చెప్పజాలదు. తనబాధ్యతానిర్వహణమునందే సదా ఆసక్తచిత్తుడైయుండక ప్రకృతిశాస్త్రజ్ఞుడు తనపరిశోధన లితరవిజ్ఞానవిభాగముల కెంతవరకును ప్రయోజనకరములుగ నుండునో పరిశీలింపబూనుకొనుట వ్యర్థముగ కాలహరణము జేయుటయే. ఈ విషయమునుగూర్చియే ఎడ్డింగ్టన్ దొర ఈ క్రిందివిధమున జెప్పియున్నాడు:

"The path of science must be pursued for its own sake, irrespective of the views it may afford of a wider landscape; in this spirit we must follow the path whether it leads to the hill of vision or the tunnel of obscurity."

# నామహారాష్ట్ర యాత్ర

## జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

చెట్టునుండి దిగి ఇంచుకసేపు కొండసింగారమున మసలి, ముఖప్రక్షాళన మొనరించుకొని దివ్యాపగా జన్మస్థలి జొచ్చితిని. వనలక్ష్మి హృదయలక్ష్మితోడై గిరిపై నొప్పులకుప్పనాడుచు, నలువలంకుల చిరునవ్వు తళ్కొత్తించుచునేయుండెను. వీని చెలికారమున నెంత చెలువమున్నదో!

సుదినములు పలుకరించినంతన మనసును బొదుచుకొని తిను చింతలు రివ్వున నెగసిపోవు పాలుపున ఈశ్వరకరుణాస్పర్శకతన జీవనలతనుండి దిగజారు నెవ్వగకైవడి, శైలహృది గిరణశాబకము లడుగులిడినంతన దాని బీడించుచుండిన కారుచీకటులు చిడిముడిపడి కాలుకొలది పరుగిడుటచే హృదంతరాళమందలి రాగసాగరపూర మిక నేయుంకిలి గనక ఉవ్వెత్తుగబొంగి దశదిశల రంగారు బంగారుకెరటాల మేలుకొలిపెను. కొండొకకవి మానసమీనిన తీపితలపులు కాబోలు రూపులంది లేదీగల ట్లగపడెను. ఆనందబిందువులు వీనిపై మంచుకుంపురులచాడ్పున తళ్కొత్తి అనంతావకాశమున భావభువనములను దొరలించుచుండెను. కలకంఠకంఠములనుండి జలజలరాలు సూక్తిసుధాకణములు అదృశ్యప్రేమబిందువులని గ్రహించి, "మాకీభిక్షపెట్టు" డని యెడందలొగ్గి ప్రాప్తమనోరథలై, మిగులనలరి దిశాంగనలు పులకితలయ్యెను. ప్రఫుల్ల హృదబ్జమునుండి గుప్పున నుప్పొంగు భావనావేశమట్లు నిండుకొండ నుండెనుండి వెడలు నిర్ఝరధార చిత్తమున నెయ్యమును, తియ్యమును చిల్కరించుచుండెను. శైవలినీ-గీతిక దివ్యవిహంగమ ట్లెగసియెగసి విష్ణుచరణములంటి దేవదేవుని మూపున గొని విశ్వవలయమున విహరించుచుండెను. కావుననే దిగ్వలయమున నమరజ్యోతి మినుకులీనుచుండెను! సరిత్తటమున హాసన్ముఖియై నిలిచిన సరోజిని యొసగిన ప్రణయసందేశమును వహించి అల్లన సమీరుడాత్మకందీయ నది సౌరభసందేశమందలి భావప్రకరమును గ్రహించి ప్రమోదసంభరితమాయెను. ఆటవిరితమ్ముల రొమ్ముల అల్లనల్లన పుడుకుచు కుంజశయ్యలందు తుమ్మెదలు, కవిహృదయము నాశ్రయించు భావరాజివలె గుసగుసలు సలుపుచుండెను. గుసగుసలందలి తేనెబొట్టులు కర్ణపుటములందు రాలుటచే మేను గరుపాటుచుండెను.

స్వర్ణకాంతులీను గోదావరీపయస్సున మాటిమాటికి మున్కవేసితిని. అందు చిందులాడు చిరుతరగలకు నాతలపులను సహకరించి కులుకుచుంటిని. చెప్పనేల? భావోద్వేగముచే నాయాత్మ దేవశైలూషివలె నృత్యమొనరించినది. మధుమయమైన ఇట్టి సన్నివేశము పొడసూపినపుడేకదా తన్ను దాను గుర్తించి ఆత్మ ఇట్లలరును! ఈ యానంద మెంత మహత్తరమైనది! ఈ యుద్వేగ మెంత యద్భుతమైనది! పూవున కాపురముండు కలపమువలె ఆనందమున సదాశ కాంతిలుచుండును. సృష్టికి-అది కావ్యసృష్టియనుడు, మఱేసృష్టియనుడు - కర్త యనునది సదాశయే! కావుననే, సృష్టికర్తలు కాగోరు కళోపాసకులు సదాశయ సందీప్తమైన ప్రకృతిపై (అది బాహ్యావనిగోచరించునదైనను, మనుష్యహృదిగోచునదైనను) కన్నుంచియే తమకలములను, తూలికలను చేబట్టుదురు. ఈ కన్నులకు వెనుకనున్నది మానసమహోదధి. నిండుచందురుని చూచి ఉప్పొంగు నుదధివలె, సదాశలో షోడశకళలనీను సృష్టిశక్తిని గాంచి మనుష్యమానస ముప్పొంగును! ఈ పొంగునే భావోద్వేగమని నేను పిలతును. జాబిల్లిని చూచినను, అమృతకలశమును గాంచినను మురికిగుంటలు చచ్చినట్లే పడియుండును. ఈగుంటలందు జీవకళగాని, సృష్టిశక్తిగాని ఎట్లుదయించును? సౌందర్యమును చూచినను, లఃగురేకల వెలార్చు సదాశయమును విలోకించినను చలింపని మనసు (చేరలంతకన్నులు దానిముందున్న నేమి) మురికితో నిండి పురుగులుపోలు తలపుల నీనున దని

నొక్కి చెప్పుదును. భావోద్వేగమెఱుగని స్వాంతము చచ్చినదానితో జమయనియు, జీవచ్ఛటల జిమ్ము సృష్టి ఇందుండి తలసూపలేదనియు స్పష్టముగ తెలుపవలెనా? అద్భుతాభ్యుదయగర్భితమైన యీయుద్వేగమును మానస మెట్లుండగలదు? అలవఱచుకొనవలెననిన నిది యబ్బునా? కడలి తనగభీరత నెందుండియైన దెచ్చి పెట్టుకొనినదా? అంబురాశిలోని తరగలను పరికింపుడు. ఒక్కొక్క కెరటమందు శమంతకద్యుతిబోలు తళుకు తోపదా? ఈ తెళుకు లేమి? కడలికన్నులనుండి వెడలు దీప్తులని వచింతును. దీప్తిమంతములయిన కోటి కన్నులను, సహజగభీరతను గలది కావున సంద్రము చంద్రుని గుర్తించి, ఉద్వేగపూరిత మగుచున్నది. నైసర్గిక గభీరతగల మనసును, సహజశక్తి సందీప్తదృష్టిని గల వ్యక్తియే నిజాంతరంగమున భావోద్వేగమునంది తనసృష్టికి గడంగును.

ఆనందిమున సదాశకలదనిన, సదాశనుండి సృష్టి పొడసూపుననిన ఆనందము కడుపుచలువగల తల్లివంటిదని గ్రహించుట కాలస్యము పట్టునా? ఈతల్లికరుణ నందుటకై కవులును, ఋషులును, వేలుపులును తపసు చేసిరి. గంగా గోదావరులను తల్లులని మనము పేర్కొనుటకు కారణము అవి యానందపూరము లగుటయే! అక్క సెల్లెండ్రయిన ఈ సురీమతల్లులను దివిజకల్లోలిను లనుచుందు మేల? ఆనందము దివ్యమై, ఆధ్యాత్మికమై విష్ణుపాదములనుండి, ఈశ్వరశిరమునుండి జాలువారునది కావుననే! భారతావని అమరులకు లీలాభూమియైనదని ఎవ్వరెఱుగరు? గంగా గోదావరులు దివినుండి దిగి మననేలయందు మసలుచుండుటచేతనే తమవెల్లువల మీది మక్కువపెంపున ననిమిషు లిందు విడిసిరి. వ్యవసాయమున నిలింపుల కెంతనేరిమికలదో ఎఱుగుదురా? నదీకూలములను, ధునీజన్మస్థలులను పరిశీలింపుడు. చావులేని పచ్చందనము నందు గాంతుముగదా! నందనము నుండి కొన్ని బదనికలను దెచ్చి తొలుత నీ తావులం దమరులు నాటి తమసేద్యమునకు దొడగిరి కావుననే జరామరణము లెరుగని పండుతలపులు నిండుపైరులట్లు తోచుచు కనువిందొనరించుచున్నవి. జిజ్ఞాస (కవిహృదిలోనిదైనను, మునిమానసమందలిదైనను) ధేనువువంటిది. ఈ ధేను వీనిండుపైరున జొచ్చి, ఇచ్చవచ్చిన తెఱగున మేత మేయును. "గౌతమీమాహాత్మ్యము"నకు (ఇందు గోవుకథ కలదు కావున) నేజెప్పు అర్థ మిది.

అనంత సౌందర్యమున నదీజన్మస్థలి బ్రాంజలినై నిలిచినపుడు నా యంతరంగ మెట్లుండెనో తెలుపుటకు నాకు మాటలు లభించుటలేదు. సముద్రములన్నియు నా గుండెలందు జేరుకొని పొంగుచున్నట్లూహించితిని. అనురాగమయి యైన హృదీశ్వరివలె కట్టెదుటనిలిచిన స్వర్గము "నేను మీదానను. నా లావణ్యమును, నా సౌందర్యమును, నా సర్వస్వమును మీ కర్పణమొనరించితిని. వీనిపై మీకు నిండుహక్కులున్నవి. మీ చిత్తమువచ్చిన తెఱగున నన్నేలుకొనుడు" అని స్మితముఖియై నన్నుద్దేశించి పలికినది. నాకన్నులనుండి ఆనందస్రవంతి వడివడిగ ప్రవహించినది. నదీనీరమున కానందబాష్పములు సహకరించి ఇట్టి యద్భుత సౌందర్య సామ్రాజ్యమును, ఇట్టి యనంత ప్రణయమహిమను నావశ మొనరించిన అదృశ్య ఆధ్యాత్మికశక్తికి అర్ఘ్య మొసగితిని. మనసువ గాయత్రిని దేలించి విజ్ఞానమరీచులు సారించు జగమున్నకును జోహా రంటిని. అచ్చటి నందనదృశ్యమును ఉల్లసల్లన నంతరంగమున జేర్చుకొనుచు కొండొకవడి నిమీలితనేత్రుడనై నిలిచి, ధ్యానమగ్నుడనై, ఆ పవిత్ర ముహూర్తమున నా కట్టిభాగ్య మొసగిన జగదీశునుద్దేశించి నొసలున చేతులుమొగిచి ప్రార్థనసలిపితిని. మఱి కొంతసేపటికి స్నానము ముగించితిని.

రాత్రి తోచిన వింతదృశ్యములేమో యెఱుగ నాతురపడితిని. అవి తోచినవంకకు కొండనుండి కొంత వఱకు దిగితిని. ఎడమచేతివైపున పండు ముత్తయిదువుల వలె వృద్ధసాలములు కొన్ని గోదావరీజనయిత్రికి నివాళి యిచ్చుటకో యన గుంపుగ నిలిచియుండెను. చిరునవ్వులు రాల్చుచు పరితోషమున నాహ్వానించు ముద్దుబిడ్డలవలె కుసుమ విలసితలతలు వానిదాపున తోచినవి. అచ్చోటికరిగి దోసిట బూలుకోసికొంటిని. చెట్లజొంపము వెనుక నొకకొండతెరువు కానుపించినది. అది ఏదేనిగుహ

లోని కరుగుటకై యేర్పడిన తెన్నోమో అని యూహించితిని. గుహలో వసించునది ఏదేని ముప్పో, మనిషిరూపమో ఎలుగునో. ఒకానొక చెట్టువెనుక నిలిచి, గుహనుండి ఎట్టిశబ్దము వినబడునో యని చెవులొగ్గియుంటిని. నా కేమియు వినబడలేదు. అపు డాకస్మికముగ పకపకమను నవ్వు వినబడినది! సింహగర్జనము కాదు, పెద్దపులి యఱపుకాదు, నవ్వునకు పగటివేళ నడలనేల? పోయి, ఆ వింతయేమో కనుగొనెదనుగాకని నిశ్చయించితిని. చిన్ని తెరువున బ్రవేశించి, కొన్ని యడుగులు వేసితిని. ఎదుట నొక చిన్ని కోనే రగపడినది. నెత్తురు నెల్లువ తోచినది అందే! చరచర కాసారతీరమునకు నడచిపోతిని. దరీద్వారము సరిగ సరస్సునై పున నున్నది. కొండబిలములో పాతాళహోమము జరుగుచున్న దేమో! గుహలోని యగ్నిజ్వాల సమ్ముఖస్థసరోవరమున బ్రతిఫలించుచున్నది. కావున నందలి సలిలము అర్ధరాత్రమున రక్తపూరమట్లగపడినది. బిలములోనికి తొంగిచూచితిని. అగ్నిహోత్రము జాజ్వల్యమానమైయున్నది. ఇంతదనుక తనువును దుస్సహమైన చలికి నప్పగించితినిగదా! నిప్పసెగ నా కిపుడు నిక్కముగ పుసెచ్చెలి కాగలదని యుబ్బితిని.

అగ్నిసమీపమున నిరువురు వ్యక్తు లున్నారు. ఒకడు మిగుల వృద్ధుడు, నూరేండ్లను దాటి వయసున నతడు చాలదూర మరిగియుండును. జడధారి. వెండిగడ్డిలో నక్కినవానివలె తోచినాడు. రెండవవాడు యువకుడు. వానికి ముప్పదేండ్ల వయసుమాత్ర ముండును. కైలాసమందలి బూడిదయంతయు నిర్వురయొడళ్లను జేరుకొని అందే కాపుర ముండెను! వృద్ధుడు నన్ను చూచినాడు. చేసన్నచే గుహలోని కాహ్వానించినాడు. పోయి, స్వాము లిరువుర మ్రోల బ్రణమిల్లి హోమాగ్నిదాపున గూర్చుంటిని. దీక్షాజీవి గుండెకాయవలెనున్న గుహాంతర్భాగమును పరికించితిని. స్వామిజీ కమండలువుకడ నా మరచెంబు కానుపించినది. నా యబ్బురపాటునకు మేర లేదు. గతినిశి నాకు ఇంచుక కునుకుపట్టినంతన, అది యదృశ్యమైనదికదా! అది ఇచ్చోటి కెట్లు ఎగసివచ్చి వ్రాలినది? వృద్ధస్వామి మునిమ్రుచ్చని, వెలకివెలకి చీకటిలో నా చెంబునుగాంచి, దాని నపహరించె నని ఎట్లూహింతును? కలశమును గుఱించిన చిత్రసంఘటనమును యోజించుచు నవాక్కైపోతిని. ఇంతలో గుహయంతయు బ్రతిధ్వనించులాగున పకపకమనునవ్వు వెడలి పరధ్యానమున నన్ను నన్ను ఉలికిపడజేసెను. నవ్వినవాడు యువకసన్యాసి. అచ్చెరుపాటున నాతని దేటిచూచితిని. వృద్ధుడు మొగమెత్తి నన్ను చూచి "మీ రెక్కడివారు?" అని హిందీలో ప్రశ్నించెను. ఉక్కిరిబిక్కిరియైన నేనించుక తెప్పిరిల్లి "మహాత్మా! నేను గోదావరీ తీరవాసినే! నాజన్మస్థలము సాగరసంగమమున కనతిదూరమందే యున్నది. అది నాకపురియొక్క ప్రస్తుతసంపుటము" అని యావేశముతో తెలిపితిని. నిక్కముగ నాకు కాపురస్థలములైనవి కలకత్తా మదరాసులైనను, నా యూరున నాది యని చెప్పుకొనవలసిన దేదియు లేకపోయినను, అందలి మన్నుమీది ప్రీతిపెంపున నెపుడైన నచటి కరిగినపుడు పెరిగి పెద్దనైన నన్నచటివారు పల్వురు గుర్తుపట్టక 'మీదేయూ'రని నన్ను బ్రశ్నించుచు నుండు బెటిగియు, "నా జన్మస్థలము, నాస్వగ్రామము పేరవరము"ని గర్వముతో తెలిపి దాని సొంపును నన్నట్లు పృచ్ఛచేసినవారి మ్రోల వర్ణించుట నా యలవాటు. నా కథన మింకను గొంత మిగిలియుండగనే ఒకమాఱు తలయెత్తి యువకసన్యాసి మరల పక్కున నవ్వినాడు! "ఈ చిత్రమేమ"ని స్వామిజీ నడుగ సంకించునంతలో నా యభిప్రాయమును గ్రహించి అతడు "ఈకని నుత్తరహిందూస్థానమున 'శండీలా' * యను తావున కొన్ని నెలలకు మున్ను మాత్రము చూచితిని. తఱచుగా నీత డిట్లు నవ్వుచుండును. ఇత డెవ్వరి-తోగాని ప్రసంగింపడు.

* కొన్నేండ్లకుమున్ను నేనీ చోటున కరిగితిని. అది సంయుక్తరాష్ట్రములలో 'బాలమా'నకు ననతిదూరమందే యున్నది. ఈ ప్రదేశమున నొకప్పుడు శాండిల్యమహర్షి వసించువాడట. నేడును అందొక చక్కనియాశ్రమము కలదు. శాండిల్యస్థానము కావున దాని కిపుడు 'శండీలా' యనుపేరు వచ్చెను. నా పొట్టిపిచికతో కలిసి మూడుదినము లిందు వసించితిని.

ఒకపర్యాయము ధ్యానించును. వేరొకమాఱు ఏమో గొణుగుకొనుచుండును. ఎవ్వరైన నేదేని యాహార మొసగిన మితముగ నారగించును. లేకున్న బస్తుం డును. ఈతడు పిచ్చివాడని అచటివా రూహించిరి. కొన్నాళ్లనుండి ఈతని బరిశీలించి ఈతడు మహా భక్తుడని గ్రహించి ఇచటికి గొనివచ్చితిని. నిరంత రము ఇతడు ధ్యానము చేయుచుండును. తఱచుగ రాత్రు లందుగూడ మేలుకొనియే యుండును." అని పలికెను.

"ప్రాతఃకాలమున నిచటి కెట్లు చేరగలిగితిరి ?" అని యోగీంద్రుడు నన్ను పదంపడి ప్రశ్నించెను. బొం బాయినుండి నేను బయలుదేరిన ముహూర్తము మొదలు నా ప్రయాణమును గుఱించిన ఉదంతమును పూసగ్రు చ్చినట్లు తెలిపి, కడచినరేయి జరిగిన సంఘటనములను మఱింత నొక్కిచెప్పి "మహాత్మా ! ఈ చెంబు నాది. నా పేరును, నా యర్ధాంగినామమును గూడ సూచించు జే. ఎస్. అను నక్కరములు దీనిపై చెక్కబడియున్నవి. ఈ కలశము మీ కెట్లులభించినది ?" అని యడిగితిని.

కడచిననాడు నే బడినపాట్లకు వృద్ధు డెంతో దుః ఖించినాడు. నాటిసాయంసమయమున నన్ను జూచి యుండినచో ఆనందపురస్సరముగ తనగుహలోని కాహ్వానించి సత్కరించియుండువాడననిఆత డనినాడు. "నీ విరువురము నడిరేయి నిట్లే ఈ యగ్నిచెంతగూర్చు నియుంటిమి. ఆకస్మికముగ నేదోచప్పుడయినది. అది జెబ్బులిబొబ్బకాదు. సింహగర్జనమునుకాదు. సమీప మందును ఆవ్వలనుగూడ రాత్రులందు తఱచుగ భీకరా రావములు వినవచ్చుచుండును. ఈ గుహాసమ్ముఖమున వన్యపశువులు సంచరించుచునే యుండును. అవి బిలము లోనికి రావు. గతనిశి నూతనశబ్దము చెవిబడినందున నించుక ఆశ్చర్యపడితిని. గుహనుండి అవ్వలికరిగి చూడ నైతిని. ఉదయమున చెట్లజొంపములలో మసలుచుండగా కలశము నా కన్నులబడినది. కొండకొననుండి ఎట్లో ఇది రాలియుండుననియు, దీనిధ్వనియే రాత్రి చెవిబడిన దనియు, నిదెవ్వరిదై యుండునో యనియు నూహిం చుచు, పదిలముగ దెచ్చి దీని నిందుంచితిని." అని పలికి యోగీంద్రుడు నా కలశమును నాకిచ్చివేసెను. చచ్చిన బిడ్డ బ్రతికి చేతులబడినట్లు సంతసించితిని.

ఈ చెంబుపై నాకు మిక్కిలి మక్కువయుండు టకు కారణము లేకపోలేదు. భారత పర్యటనమున పెక్కు చోటులందు నాతో నట్టాడిన ఈ కలశము నా వలెనే ఎన్నోఢక్కాలు తిన్నది. ఢిల్లీస్టేషను ప్లాటు ఫారముపై జారిపడినపుడును, కైబరు తెరువున కవ్వల పర్వతగర్భమున నేదో దేవాలయమున్నదనిన విని, అం దరిగినపుడు చివాలున దిగువనున్న ప్రాచీనభిత్తికపై పడినపుడును, శ్రీనగరమున మా బసలోని సిక్కు యజ మాని చేతినుండి జారినపుడును, హృషీకేశమున దటును బడిన దొంగచేతినుండి క్రిందబడినపుడును ఇది తీవ్రమైన దెబ్బలు తినినది. చెంబుమీది చొట్టలను బాగుచేయుచు టకు నా మన సొప్పలేదు. దీనివలె చరిత్ర ప్రాముఖ్య ముగల మఱికొన్ని సరకులు మాయింట గలవు పసితనమున నేనందిన గారాబము నానడతయందు కొంత 'సూర్యకారము'ను గలిపినది. ఇది విజృంభించినపుడు చెంబులను, గిన్నెలను నేలనిసరినైచువాడను. ఇవి వంకర టింకరలై కూర్చున్నవి. వీనిని బాగుచేయించవలెనని నా యక్క లూహించిరి. వీరిపూనికకు ప్రతిఘటించి తిని. బుడుతడనయియున్నపుడు నాదుడుకుతన మిట్టిదని తెలుపు తిలిదండ్రులు నేడు నాకు లేరు. అర్ధశిథిలము లయిన కలశములే నా సర్వస్వములో నావుమిగిలి, వికృ తరూపులందున్న ఈ పదార్థములే నాకు మిక్కిలిప్రియ ములయి నా శైశవమును నా మానసనయనముల మొల ప్రత్యక్షమొనరించుచున్నవి. నిలుచునవుకొనినవి కడతేఱి నవి. నాడు ధ్వంసమైనవే నేడు నిలిచి భావభరితములై నా కన్నులనుండి అశ్రుకణముల నాకర్షించుచున్నవి. వీని చొట్టలపై బడుదెబ్బలు వీనిపైగల భావములపైబడి తొట్రొందనే నా గుండెలను గుంజజేయును. భావభరిత మైన గతమును తునియలుచేయు నాఘాతములను నేను క్ష మింపను. "గతము" చచ్చినదని పల్వురు విద్యార్థులు దానిపై దుమ్మెత్తిపోయుచుండుట గాంచినపుడు నామ న సెంతేని వ్యథనందును. "గతము" కంటె భావికాలము మహత్తరమైయుండవలెనని యభిలషింతును. గతమహా

త్త్వమును నేటియున్నతికి, రేపటి మహోన్నతికి పునాది చేసికొనిన దప్పేమి? తాతల బుజములెక్కి కదా విశాలకాల దిగ్వలయమందలి క్రొంగ్రొత్తదృశ్యములను విలోకించి దానిపై నడుగులెత్త నువ్విళ్లూరుదుము! ఉత్తుంగ వీథుల కేర్పు బుజముల నెండుకట్టెగోలట్లు చూచి 'ఛీ!' యనవెల్లునా? గతమున చోట్టలేకాదు, గోతులును ఉండవచ్చును. ఇవి కన్నులు తెఱచు నాచార్యులయి పురోభాగమందలి కాలపథమున క్రమగతి జరించుటకై జ్ఞానప్రదీపకళికల నెత్తి చూపుచు. మహాత్ముల జీవనములను నెమకితిమేని, ఈ సత్యమును బుజువొనరించు దృష్టాంతము లెన్నో కనుల బడును. నా యింటగల కలశముమీది చొట్టలు నేడును నా కాచార్యులై యున్నవి. చిఱుతప్రాయమునాటి దుండగమును, ఆగ్రహ విజృంభణమును నా తలపునకు దెచ్చి ఆత్మసంవరణమునకై ఇవి నన్ను బురికొలుపు చుండును. ఆ కలశమువలెనే యాత్రసమయమున నాతో మసలిన మరచెంబుకూడ భావసమన్విత మైనదనుట స్పష్టాంశమే కదా! నా గుండెపై తగులుచువచ్చిన దెబ్బలు నాక్రమవిద్య యందు ప్రయోజనములని నాదృఢ విశ్వాసము. ఈ దెబ్బలందలి యర్థమును స్మరణకు దెచ్చు చెంబుచొట్టలు (వాని కివి ప్రతిరూపములగుడు) నా హితులు *. నా హితులను కాపాడుట నా పవిత్ర కర్తవ్యము

యాత్రను గుఱించిన కథనమును వ్రాయుతటి నా హితుల నాత్మహృదిగొనిన మరచెంబుపై నాతురంపు జూడ్కుల సారింతును. దీనిమీది కడపటి రెండు చొట్టలు తెలుపుచుండ బ్రహ్మగిరియాత్రనుగుఱించిన ఈ యుదంతమును వ్రాయుచుంటిని.

స్వామిజీ అనంతర మాప్రదేశమందలి మహత్త్వమును నా కెఱిగించి, ఇంతప్రసాదమును, విభూతిని నా కొసగెను. తన యాశ్రమమున కొన్నిదినము లుండుమని ఆతడు నన్నడిగినాడు.

జడదారినుడువులు నామనను నానందముతో నింపినవి. సద్భావ మెందున్నదో, సత్పురుషు డెందుండునో అందే తీర్థముండును. 'ఆత్మ' యొక్క శక్తి మహత్త్వములను హృదయంగమ మొనరించుకొనిన వ్యక్తి ఈయోగి యని గ్రహించితిని. సుఖదుఃఖములనే కాదు, భయసంశయములనేకాదు భీకరమృత్యువును కూడ ధిక్కరించి జయభేరి మ్రోగించునది 'ఆత్మ' కదా! ఇట్టియద్భుతశక్తి తనయందు కల దని విశ్వసించు మనుష్యు డందు స్వాతంత్ర్యమును, ఆనందమును అనిర్వచనీయములు. ఇట్టిమహనీయుని చెంత నిముసమునే పున్నను, మనలను మనము గుర్తింపజాలుదుము. అట్లు గుర్తించిన మహూర్తమందే అద్భుతసృష్టికై, అసాధ్యములను సాధించుటకై నడుము గట్టుదుము.

---

* ఈ హితులకంటె నాదృష్టిలో నగ్రస్థానము వహించిన పవిత్రవస్తు వొక్కటిమాత్రము నాకడనున్నది. అది స్వర్గీయ జతీంద్రదాసుని యస్థిక. కలకత్తాలో విద్యాసాగరకళాశాలయందుజతీంద్రదాసు కొంతకాలము నాకు సహపాఠియైయుండెను. అనంతర మాతడు వంగవాసి కళాశాలయందు జేరి, పిదప చదువుమానుకొని విప్లవభటసంఘమున బ్రవేశించెను. నాకు సహపాఠియైన జతీంద్రుడు భారతమేక్స్వినీ కాజాలు మహాపురుషుడని నాడు గుర్తింపజాలనైతిని. అరువదినాలుగు దినము లుపవాసముండి ఈతడు దివంగతుడైన మర్నాడు లాహోరునుండి వీనిశవము కలకత్తాకు గొనిరాబడెను. నాటి మహోత్సవమున గలిసి నాడుపవాస మొనరించి, సాయంసమయమున కాళీఘట్టముకడ జరిగిన అంత్యక్రియలందు పాల్గొని, దహనానంతరమున నా మిత్రుని యెముక నొండు గైకొని దాచియుంచితిని. నా హృదయమున దౌర్బల్యము పొడసూపిన మహూర్తమున నీయస్థిని ముందిడికొని అచ్యుతధృతి త్యాగములనుగుఱించి ఆదియొసగు నిస్తబ్ధ భావోద్వేగపూరిత మహోపన్యాసమునకు ఆంతరంగిక కర్ణము లొగ్గి ధైర్యస్థైర్యము లందుచుందును. మంచుకొండనుండి తెచ్చిన గంగోదక మింకను నాకడ నున్నది కావున, అపుడపు డీ సలిలమును మరచెంబున గైకొని, దానిచే యతీంద్రుని యస్థిక నభిషేకింతును. ఒరులకీ పూజ మిగుల వికృతమై చూపట్టిననేమి, నన్ను ధన్యునిజేయు పూజ ఇదియని మురియుచుందును.

అద్భుతసృష్టికై కడంగిన కవులును, అసాధ్యము లను సాధింపనెంచిన వీరులును ఆశ్రమములను జేరి, ఋషులను సేవించి, తాము ను ఋషులయి, ఉత్తమాశయ ములను కమండలువులందు జేర్చుకొని ప్రీతిమై వానిని పురిషిల్లలతో క్రోలిరి. కావున నమృతజీవులయిరి. ధనంజ యుడును,* ధ్రువుడును, దిలీపుడును ఆశ్రమవాసు లైన మహావీరులుకారా ? ఐశ్వర్యమందుగాక అసిధారావ్రత మందు, — నిరంకుశత్వమునందుగాక సేవయందు ఆత్మ ను తనుపు అమృతపుగ్రుక్కలు లభించునని వీరు గుర్తిం చిరి. మనుష్యసేవయేకాక సమస్తభూతములసేవయు మహత్తరమయినదని వీ రెఱిగిరి. రాజులందు రాజైవర లిన దిలీపుడు అరణ్యమున నావును కాచుకొనలేదా ? జానపదులను గలియలేదా ? వశిష్ఠాశ్రమమున నీత డెన్నె న్ని సదాశయములను బుడుకలేదు ? "రఘువంశము"ను చెలువుడు. మహదాదర్శములందు కోటివత్తులట్లు వెలు గొందుట గాంతురు. ఈ మహాకావ్యమును కనిన కవిసా ర్వభౌముడు, బృహదారణ్యక తైత్తిరీయారణ్యకాది ఉపనిషత్తుల సృష్టించిన . సంయమీంద్రు లట్లు అరణ్యము లందును, ఆశ్రమములందును నిజాత్మను చొ ప్పించి అక్కరైన దివ్యసామగ్రి నందినాడు. సరిత్తటమున, శ్యామలతరులక్ష్మి కాటపట్టయిన ఆశ్రమమున ఋషీంద్రుని మోల నాసీనుడనై యున్నతటి నామానసవీధియందు నెంద నెందఱు కావ్యకర్తలో, ఎంద ఱెందఱు మహా త్ములో, ఎంద ఱెందఱు వీరులో పొడసూపిరి.

* అర్జునుడు ప్రాచీనభారతమహాసంయమి యను నంశము నీవరలో నుల్లేఖించియుంటిని. గిరి నెక్కుట, నదియందు గ్రుంకు లిడుట, పితృతర్పణములు చేయుట మున్నగు విషయములు పాఠకులదృష్టియందు దున్నవి కదా! ధనంజయయాత్రికునిగురించి మహాభారత మే మనుచున్నదో చిత్తగింపుడు :

"అర్జునుండును గంగాస్నాన పవిత్రీకృతగాత్రుం డయి దేవఋషిపితృతర్పణంబులు జేసి మాతలిప్రయు క్తంబైన యా దివ్యరథం బెక్కి,

చ. అఘుతపస్సమాధినియ
తాత్ములకున్ బహుపుణ్యలోకకాం

ఆశ్రమమున మునినిగూడి కొన్నాళ్లుండవలెనని మక్కువపడితిని. కొంతికాల మందు విడియు మని న న్నాత డడిగియుండెనుగదా! కాని దురదృష్టవశమున అట్లొనరించుటకు నా కపుకు వలసినంత అవకాశము లేకపోయెను. ముం దింకను చేయవలసిన పయన మెంతో యున్నది. శారద చెన్నపురిలోనే యున్నది. ఆశ్రమము లందును, కొండలందును, వనములందును హిమాలయ యాత్రలోవలె నిపుకు విశేషకాలము వెచ్చింపజాలను. అయినను, వలసినంత పైక మంపుచు, ధైర్యము చెప్పుచు ఆమెకు జాబులు వ్రాయుచు, నాయాత్రను పొడిగించు చునే యుంటిని. స్వామీజీతో రెండుమూడు దినము లైనను ఉండవలె నను కొనినను, ఎట్లుందును ? నాడే కదా నాతల్లితద్దినము ? ఊరిలోని కరిగి దైవరాజు తోడ్పాటున నా పవిత్రక్రియ నెఱపవలసియున్నది. ఈ యంశమును యోగీశ్వరునకు తెలిపి ఆబ్దికము ను ముగించు కొని, నాసికకు మరలిపోవుటకు మున్న మరల బ్రహ్మ గిరిశిఖరము జేరి ఆశ్రమమున కొలది దినము లుండుటకు యత్నింతునని మాటయిచ్చితిని.

"కొండకోనయందు దుదయించిన గోదావరీధార ఆపాంత లంఘించి, ఇటుపాటి ఈపల్లమున నీ సరస్సును నిర్మించి ఇందుండి దిసవకరిగి కుశావర్తమున ప్రవేశించి అందుండి దేశాటనమునకయి నెడలును" అని యోగీంద్రు డనెను.

చెరువున కవ్వలిగట్టున చిన్నచిన్న కొండసారం గములందు గోదావరీ మహేశుల విగ్రహము లున్నవి.

: త్రులకు విశుద్ధమానసుల
కున్ సతతంబును సంశ్రయంబునై
లలిత నిలింపదంపతి వి
లాసవిహార మహోత్సవంబులం
గలిగి వెలుంగురత్నమయ
కందర సుందర మందరాచలా.

వ. నీ యందలి పుణ్యతీర్థంబులు సేవించుచు గం గాంబుధౌతస్థలీరుహ వనస్పతిఫలంబు లుపయోగించుచు సుఖంబుండితి......"

(అరణ్యపర్వము, ప్రథమాశ్వాసము)



కపటవేణుగోపాలుడు



ఇ ఖు శా లు

—యస్. శంకరసుబ్రహ్మణ్యం.

జలధార వీని నభిషేకించుచు సరస్సున ప్రవేశించును. స్వామీజీ కేదయిన పైక మిచ్చుట ఉచితమో, అనుచితమో ఎరుగను.

హృషీకేశమునుండి బదరీనారాయణమున కరుగు కటీ మార్గమున నందందు ఆశ్రమములను గాంతుము. నిక్కంపు జడదారులు, కపటసన్యాసులుకూడ గానంబడుదురు. కొందఱు సన్యాసులు యాత్రికులనుండి పైకము నంద గాంక్షింతురు. హిందీలో అచ్చువేయబడిక కొన్ని కరపత్రములను చేతి కిచ్చి తాము చేయదలచిన సత్కార్యములను గురించిన జాబితా నేకరువుపెట్టుచుందురు. వీరిలో కొందరు దిగంబరసన్యాసులు. "స్వర్గాశ్రమము", "రామాశ్రమము" అనుచోటులందు సామ్మువనూళ్లపద్ధతిజూచి అబ్బురపడితిని. 'కాలీకమలీవాలా' ధర్మశాలలందు పైకము గొనుటయు గొనకపోవుటయుగూడ కలదు. కొన్నిచోటులందు సత్కార్యములు జరుగుచుండును. కాని పైకముచేరు ప్రతిప్రదేశమందును ఇవి జరుగుట గాంచనయితిని.

స్వామీజీకి కొన్ని ఫలములిచ్చిన సర్వోత్కృష్టమైన పనియై యుండెడిది. నా కవుడ వెట్లులభించును? కూడ దోడ్కొని రావలసినది. ఆత్మప్రకాశముకొఱకును, భక్తిభావవ్యక్తీకరణముకొరకును బొలుత స్వామీజీకి బుష్పాంజలి నిచ్చితిని. సౌరభదానము భావభరితమయ్యు యోగివరుని ఆత్మ నించుక తనుపవచ్చును. ఉదరము మాటేమి? పవనపర్ణాంబువులనే ఈతడు భక్షించుచుండెనేమో! ఈ కాలమందును ఇట్టి భక్షణమున మనుచుండు మునులను గాంచి మరియు భాగ్యము నా కొదవెను. ఏ యాహారమును గొనక వీరు కొన్నినెల లుండజాలు టెఱుగుదును. ఏమైన నను కొనునుగాకని కొంతపైకము నచ్చో నిడితిని. యువకయోగితో ప్రసంగింపదలచి, అతనిని పలుకరించితిని. జవా బేమియు నీయక అతడు పక్కన నవ్వినాడు. ఇరువురకు జాగ్రమెక్కి వృద్ధుని యాశీస్సులగొని నిష్క్రమించుచు "క్రింది కరుగుటకు క్రమమైన తెరు వేదేని కలదా?" యని ఆతని నడిగితిని. "ఎడమకట్టునుండి కొంతదూర మరిగినపిదప గిరిపార్శ్వమున నొకతె న్నగపడు"నని స్వామీజీ తెలిపెను. ఆతనికి ధన్యవాదము లొసగితిని. అరుణకిరణ విభవమున గను విందొనరించు పర్వతదృశ్యములను జూడ్కి తీవలనుండి యంతరంగమున జేర్చుకొనుచు అల్లనల్లన నందుండి కదలిపోయి ముని తెలిపిన తెరువున ప్రవేశించితిని. దవ్వున నొకవ్యక్తి కానుపించినాడు. నన్నుచూచి వంగి దండమిడుచు సమీపించినాడు. వాలకమునుబట్టి అతడు నిరుపేదయైన మరాటీకాపని గుర్తించితిని. అత డెట్టనిపాగా ధరించినాడు. వానిచేతిలో బలమైన కట్టకలదు. "బా-అ-అ-బా! తో-తోవ-చూపే-దా?" అని నత్తితో సన్నని గొంతుకతో నాతడు ప్రశ్నించినాడు. మరాటీ మాటలో * తప్పులతో నిండిన కొన్ని హిందూస్థానీ శబ్దములను పొసపువకుగా నాతడు చేర్చినాడు.

---

* మహారాష్ట్రభాషలో విశేషపరిశ్రమ చేయక పోయినను,కలకత్తాలోనుండగనే ఆబాస కొంత నేర్చితిని. ధార్వాడకాపురస్థుడు కులకరణియను కన్నడవ్యక్తియొకడు ఆమహానగరమున నాకు పరిచితుడై యుండువాడు. ఈతడు మహారాష్ట్రభాషనుగూడ నెరుగును. ఆదినములలో నేను విద్యాసాగరకళాశాలలో చదువుకొనుచుండువాడను. కులకరణీ, నేనూ ఒకేహోటలులో (౨౫ Eden Hospital Road) భోజనము చేయువారము. హోటలు పంజాబీ ప్రొప్రైటరుది. వంటవారు భగల్పూరు బ్రాహ్మణులు. చపాటీ పుల్కా మన్నగు రొట్టెదినుసులకు ప్రసిద్ధికెక్కినది. కొంద రాంధ్రుల మందు ప్రవేశించితిమి. తెలుగుతిండి లేక నోరు చచ్చి ఊరకొన్నది. పప్పుచారు (కట్టాడాల్) కాచుపద్ధతిని 'లంబామహరాజ్' అను పొడలలొట్టియువంటి అచటి వంటవానికి చెప్పితిమి. ఆ రోజులలో మాకు "కట్టాడాల్" రక్షకు డైయుండెడిది. కులకరణి ఈ కట్టాడాలను సేర్లకొద్దీ పీల్చువాడు. అతగాడి పొట్ట రబ్బరుతో చేయబడిన దనుటకు ఎన్నో ప్రత్యక్షదృష్టాంతము లగపడినవి. ఒకప్పుడు నేను జ్వరపీడితుడనై కొన్నాళ్లు పస్తున్నాను. చారుమీదికి బుద్ధిపోయినది. చారుసముద్రము పెద్దపెద్ద కెరటాలతో పొంగిపొరలుచు ఒకనాడు నాకు కలలో కానుపించినది. పొగుపుసామానులు కాబోలు చిన్నచిన్న డింగీలవలె తరంగములలో కొట్టుకొనసాగినవి. మనసును పట్టియుంచుట నాతరము గాలేదు.

"Robinson Crusoe" లోని Friday అను కేనిబాలు-చిన్నవాని మాటల తీరును దలపించు వీని ప్రసంగధోరణి నాకు కొంత ముదము గూర్చినది.

"చూపుము, నీకేమైనా ఇస్తాను." అని నేనంటిని. ఆ నిరుపేదమొగము కొండంత దైనది. తెరువు చూపుచు నా ముందునుండి ఆతడు నడువసాగినాడు. విమలతర నిర్ఘ

పరుగుపరుగున బోయి కెరటాలలో లంఘించినాను. ఈత వచ్చునను ధైర్యముండెను. కాని ఉక్కిరిబిక్కిరియగుటచే మునిగి కొన్ని గుక్కలు మ్రింగితిని. చారుకెరటాలు గొంతుకలో ప్రవేశింపగనే ఏదో అపూర్వమైన శక్తి ఒకటి నా ఉదరగోళమున ప్రవేశించిన ట్లయినది తన్మయభావమున మునిగితిని. అట్లు మాటల కందని హాయి నందుచుండగా, దురదృష్టమేమని చెప్పుదును, నా నిద్రకు భంగమువచ్చినది. నా స్వప్నమునకు ముసలము వచ్చినది. నిమిషములో చారుమహాసముద్రము అదృశ్య మైనది. మిసుల ఖిన్నుడనయి నాగదిలో నన్నుచూడవచ్చినకులకరణికి స్వప్నోదంతము చెప్పితిని. నా భంగపాటున కాపెద్ద మనిషి కన్నీరోడ్చునను కొన్నాను. ఒకమారు పం డ్లిగిలించి "అయ్యో! పాపము" అనినాడు. "కరినాత్ముడ"వని చెడామడా వానిని తిట్టినాను. తనతప్పు గుర్తించి ముందుగ హోటలునకు పోయి, పాడలొట్టియచే చారుకాంతు నని నాకు మాటయిచ్చి నిష్క్రమించినాడు. లొట్టలువేసుకొంటూ వంగదేశములో ఇట్టి పథ్యము దొరక దని మురుస్తూ ఎంతో శక్తి తెచ్చుకొని హోటలులో ప్రవేశించాను. కులకరణి కూర్చుని చారు తెమ్మని హుకుం జారీచేశాడు. రెండు పట్టుకారులతో ఒక పెద్దగిన్నెను బట్టి తెచ్చి పాడలలొట్టియ నా ముందుంచినాడు. జలరూపము దాల్చిన అగ్నిహోత్రుడు గిన్నెలో ప్రత్యక్షమైనాడు! "అమ్మో!" అని ఒక మాటు కెవ్వుమన్నాను. జ్వరప్రకోప మని సోదరులు అపోహపడ్డారు. వేడినీళ్లలో రెండుమంచాల ప్రాప్తికి క్రొత్తకారము మిళాయించి చారు తయారుచేసినాడు పాడలలొట్టియ! వీడి Originality కి కులకరణియొక్క Cooking genius తోడుపడినది. చెప్పనేల, "నిమిషంలో నన్ను వైకుంఠమునకు పంపవలెనని ఈ యిద్దఱూ పెద్ద సీక్రెటువేశా"రని గ్రహించినాను. ఎంతఘోరము! పాప మెట్లు పెరుగుచున్నదో చూడండి! నాకు నోటి నుండి మాట రాలేదు, వడకు పుట్టినది! కొంతసేపటికి తేరుకొని నొసలుని చేతులు మొగిచి "మహనీయ గుణగరిష్ఠులారా! నేను వివాహితుడను. భూమిమీద మరికొంత కాలము నిలువవలెనని మక్కువపడుచున్నాను. అంతే కాదు. పెరిగి పెద్దవాడనయి పొడిచేసెయ్యా లనే సంకల్పంతో ఉన్నాను. కాబట్టి ఈ చారును ప్రస్తుతం నా ముందునుండి తొలగించండి. లేకున్న, నా కీదడ తగ్గదు. ఈ పదార్థం తప్పకుండా ప్రళయకాలంనాటికి పనికివస్తుం" దని డగ్గుత్తికతో చెప్పితిని. "ప్లీజియే! బుఖార్ నహి రహేగా" అన్నాడు పాడలలొట్టియ. "ఠాక్‌భీ నహి రహేగా" అన్నాను. ఆ యోధులధోరణిమాస్తే నన్ను గట్టిగ పట్టుకొని గిన్నెలోనున్న వేడి నెత్తురువంటి ద్రవమును నాగొంతుకలో పోయుదురేమో యని అనిపించి యడలితిని. కాని పరాత్పరుడు నా పక్షముందే యున్నాడు....కులకరణిని గురించినకథ లెన్నో ఉన్నవి. భోజనసమయమున వంగీయుల తిండిపద్ధతిని గురించిన చర్చలు జరిగేవి. వంగీయులలో బ్రాహ్మణులుకూడ మత్స్యమాంసాదులను భక్షింతురుగదా! "మాంసము తినుట కూడదు. చేపలను, కోడిగ్రుడ్లను తినచ్చును. తప్పలేదు."అని కులకరణి యనువాడు. ఈవింత వాదము నాకు నచ్చెడిదికాదు. అగ్గిబరాటమునయి కులకరణిని మార్కొనువాడను. కొంతకాలమునకు మా స్నేహం ముదిరింది. అతడు నా గదికి వచ్చి నాకడ Short Hand, బంగాళీ పాళీ హిందీలూ నేర్చుకొనేవాడు. నాకు కన్నడమహారాష్ట్రభాషలు నేర్పువాడు. కొంతకాలం జరిగినది. ఒకనాడు "అర్జంటైన అవసరమున్న"దని కొంతపైకము నాకడనుండి తీసికొని హోటలువానినోటిలో కరక్కాయకొట్టి నా పుస్తకాల సహితంగా కులకరణి కలకత్తానుండి అదృశ్యుడైనాడు. అందుచే కన్నడమహారాష్ట్రభాషలందలి నా కృషికి ధక్కా తగిలింది! ఈ భాషలలో వలసినంత పరిజ్ఞానము సంపాదించలేకపోయితిని. కాని అవి సుబోధకములు కావని చెప్పను. ఎదుటివారు పండితులు కానిచో, ఈ భాషలలో గంభీరోపన్యాసము లీయగలను.

రిణీజలపూరము మధురాలాపన మొనరించుచు నీశ్వరా శీస్సువలె న న్ననుగమించుచుండెను. శైలేంద్రముపై శోభిలు నిసురజొంపముల, నింపారువిరుల, పొలుపైన పొదల, అంటంపు మావిమ్రోకల, అలరుసెత్తమ్ముల, నెల దేటిగముల, శిశిరస్నాత ప్రసూనముల కాటపందిళ్లయిన యెలదీకల, మందసంచారితమారుతము నంటి మసలు గండుగోయిలతండముల దీర్ఘ బాహువులచే దిక్కామినుల గవుంగిలించు నుర్వీధరముల, కవిహృదయములు పోలు తమ్మికొలంకుల నాలోకించుచు దిగ్వలయమునుండి దినేంద్రుడు చర చర గదల నొల్లకుండెను. అరుణాంశుదృష్టి దవుల్కొనిన వనలక్ష్మి చెక్కిళులు సిగ్గుచే, ననురాగముచే, నానందముచే కెంపెక్కినవి. కెంజాయలీను పొడుపుకొండ పెద్ద పవడంపుదిబ్బవలె తోచినది. దివసనాథు నలరించుటకై కాబోలు దివిగలముత్తయిదువులు కొందరు దివాభామినికి కెంబట్టుపుట్టము గట్టి పలుతెఱగుల కైసేసిరి. సేవకుడు ముందు నడచుచుండుటచే, తెరువునకయి తడవులాడవలసినయక్కర లేకపోవుటచే, మెపడు కు పలి గల్పించు లాతియోచన లెవ్వియును మనసును మారొక్కనక పోవుచే నాదృక్కులు,తలపులును మఱెందును పరుగిడక ప్రాగ్దిశకును బ్రహ్మగిరికిని నడుమ నిష్టవిహారము సలుపుచు, నిత్యలక్ష్మీ లతికాలవాలమైన నాతావునుండి, బహుశతాబ్దులు ప్రాచీనుకుల తావయిన యా ప్రదేశము నుండి నిలింపులకు కర్మక్షేత్రమైన ఆ ధర్మక్షేత్రమునుండి తపస్వియైన బ్రహ్మను మనికిపట్టయిన ఆ పూతస్థానము నుండి, సురభిళ భావబంధురమై, జ్ఞానారుణచ్ఛవి ఉబుకొత్తిన దొల్లింటి ప్రాచీవిభవముదెస బఱలెంచినవి. భావికాలమున భారతమాత దిగ్విసరము నలరించు సభ్యతావిభవము నందవలె నని కాంక్షించుచు వక్ర నాగరకతవలన పాశ్చాత్యవిద్యకతన నాదరమందక పడియున్న భారత గతమును, నిత్యనవీనభావవిలసితభారతగతమును పునరుద్ధరింప నాతురపడుచు, కనుకొలుకులం దాశాద్యుతుల బూరించుచు మహోత్సాహమున ముందంజవేయు యువకులలో నే నొక్కండను. బెర్ట్రాండ్ రస్సెల్ మున్నగు నాధునికులు గతము నీసడించిన, నీసడింతురు గాక! "Passive awareness of dead facts" అని, "Regretful hankering after the extinct beauties of Greece and the Renaissance" అని మహామేధావి రస్సెల్ (Vide: Page 167 "Principles of Social Reconstruction" By Bertrand Russell) పలికిన నేమి, ప్రాచీగతము నిత్యసంజీవియైన దని, * వసుంధరపై నేడు చెలరేగు దౌష్ట్యమును మృత్యువును నిర్జించి పాశ్చాత్యజగతిమ్రోల పరంజ్యోతిని నిలిపి వసుమతీసీమంతిని నవనవోన్మేషశాలిని గావించునదని నాదృఢవిశ్వాసము కన్నతల్లి భారతాంబ ధూళ్యవలుంఠిత యైన దని ఎన్నోమారులు కన్నీరొత్తును. కాని కన్నీటిని నే నెన్నడు కన్నులందు కాపుర ముండనిచ్చువాడను కాను. సదాశ యను నమరజ్యోతికి హృదయమును బ్రమిద గావించుకొని నుల్లాసమందును. కొండకంగారముతోడను, విమలతరంగిణులతోడను, కన్నదోయికి విందునేయు తరుచయముతోను, వింతచెలువమున శోభిలు పూదీగలతోడను అరుణచ్ఛటలందు భారతజనయిత్రి భాసురభూషణాంబరాన్విత భామిని భంగి భాసమానయై గోచరించుతరి నాకన్నతల్లి మరల

* ప్రాచీనగతము నిత్యసంజీవియైనదనిన నన్నికాలము లందును నమృతజీవియై యుండు భావవిభవము మన సభ్యతయం దున్న దనియు, వెనుకటిదని దీనిని దునుమాడుట కెవ్వరికిని సాధ్యము కాదనియు, భారతావని ఎన్నెన్ని యాఘాతములు తినినను, సనాతన సభ్యతామహత్త్వము వ్యక్తమగుచునే యున్నదనియు జదువరులు గ్రహింతురు గాక! తన గుండెయందు విజ్ఞానామృతమును నిండించుకొని, దానితో నవయుగమును భారతాంబ తనిపి పెంపొందింపజేయవలె నని ("It is for India to keep her breast supplied with the Amrita of wisdom, with which to feed the new born age and nourish it into a mighty future" Vide: Tagore's "Letters to a friend" page 124) రవీంద్రు డనినపుడు ఆ కవిచంద్రుని దృష్టి సనాతనసభ్యతపై (ఇది విజ్ఞానసుధాపూరితము కావున) వ్రాలె నని తలచుట తప్పుకాదు.

వసుమతి ఉపాధ్యాయినియై, విశ్వజననియై, జగద్ధాత్రియై, దేవియై దిగంతముల జేజేల నందగల దని మురియుచుం దును. మహారాష్ట్రసేవకుని వెన్నంటి నాటిప్రభాతమున నిట్లు మురియుచునే శైలతలమున జరింపసాగితిని. "తొం దరపడక కొండనుండి దిగునపుడు యాత్రికులు దర్శింప వలయు స్థానములనన్నిటిని చూపుము." అని వానినుద్దే శించి పలికితిని. కొంతదూరము నడచి, చివాలున నిలువం బడి యాతడు "బాబయ్యా! ఇక్కడ చూడండి ఇదిగో శివుడిజట. ఇందులోనుండి గోదావరీదేవి ఎల్లావస్తోందో చూసితీరాలండి" అనినాడు. అచ్చటికొండనేల జడలు కట్టిన కేశభారమట్లున్నది. అందుండి నీ రుబుకుచు న్నది. "గంగకుమున్న గోదావరి ఈశ్వరశిఖనుండి వెడలి నది. ఈ యంశమును వ్యక్తపఱచు దృశ్యము బ్రహ్మగి రిపై కలదు." అని కొందరు మహారాష్ట్రవిప్రు లంతకు మున్నే నాపర్యటనమున దెలిపియుంట జ్ఞప్తికి వచ్చినది. కొండొకవడి నిలిచి ఆ ప్రదేశమును పరిశీలించితిని.





"తల్లిపాలులేక" వ్యాస్

# కడవెలుగు

## పూడిపెద్ది వెంకట రమణయ్య

ఇలువరం తలుపు ఉతకలోకత్తి మెల్లగా వడకుతూన్న చేతులతో ఒత్తిలిగించేడు. నడుముకు వంగింది నడుం రెండుగా వయోభారాన. తలుపుతీయగానే ఒక్కమారుగా మొగాన కొట్టిన ఆప్రొద్దుటి వెలుగులో వాని వెలుగుతక్కువకన్నులు తపాతపా రెప్పలు కొట్టుకున్నాయి. జంకుజంకుగా తలుపోరకు చేజాచి పొట్టిచేపాటికఱ్ఱ దొరకబుచ్చుకొని తడబడుతూన్న అడుగుల మీద ఊగులాడుతూన్న కుపక్క శరీరంతో తలుపీవల మంటివాకిట్లో నిలబడ్డాడు. పండి బట్టతలబడ్డ తల ఊత లేకుండా ఊగులాడుతూంది.

"అప్పుడే దెవరో కళ్లాపు చల్లి ముగ్గులు పెట్టేరు"అన్నాడు తేలీ మునిగిపోతూన్న హోలు తక్కువగొంతుకతో. మాటగా ముడుచుకొని సమ్మంలో కూర్చున్నాడు, ఇలువరం గోడకు చేరబడి. ఎనభైయేళ్లే ఉంటాయో ఆచుట్టుప్రక్కలే ఉంటాయో శరీరాన చర్మమూ, ఎముకా తప్ప తక్కినవన్నీ కర్పూరంలాగు హరించిపోయాయి వాడుబారిన ఆముసలికన్నులే కాస్త మిలమిలలాడేయి. ఆకమ్మని కళ్లాపుపసుపూ, దానిమీద రంగవల్లి కాచిత్రరచనా! కుంపాపు దేరిన ముసద్దీ కూడా అంత తీర్చినట్టు ఆముగ్గుతీవలు గీయలేడు అనుకున్నాడు ముత్యాలు. ఆముసలిచట్టంలో కాస్త యౌవనపుచాయలు కదలేయి.

"దీనో? నేనో?"అన్న మూల్గులాటి కేక గుడిసె గర్భంలోనుండి ఈవలకు ధ్వనించింది. తలకూడా అటు త్రిప్పకుండా విన్నాడు ముత్యాలు. "ఏమో, ఎంతకాల మిలాగు బాధపడాలో ఈముసలిది. దాని ధర్మమా అని దానమ్మ కాస్త కనిపెడుతూందికాబట్టి సరిపోయింది గాని లేకపోతే ఎవరి కెవరు?" అని పైకే మాట్లాడుతున్నాడు.

" అబ్బాయీ! రారా నాయనా? " అన్న కేక గుడిసెలోనుండి పైకి బలిమినీడ్చినట్టు ఈవలకు కొన సాగింది.

"అబ్బాయి! ఎక్కడి అబ్బాయి! ఇక్కడకు నూటయేబది, లేదా రెండు వందలమైళ్ల దూరంలో నున్నాడు. నీపిలుపు నాకే వినబడలేదు...వినిమాత్రం ఏంచేస్తాను? నాకైనా కాలూ చెయ్యీ స్వాధీనంలో నున్నాయి గనకనా?...కనకం! ఏం కావాలి?" వరమిచ్చే దేవుడులా గడిగేడు ఆచీకుముసలి భార్య కనకమ్మ నుద్దేశించి. పాక్కన మంటినేలా, కుక్కివడ్డ నులకమంచంలో గోనె పరచికొని పడుకొంది కనకమ్మ. శరీరమూ, ఆమెకట్టుకున్న పాతగుడ్డాకూడా ఒక్కలాగే శిథిలాలయి చితికిపోతున్నాయి. ఆమె కనుగొల్కులలో నున్నాయి. ప్రాణాలు, అంతా పట్టికట్టేను. కాలు చేయి కదపడానికి కూడా అవకాశం లేనంత బలహీనంగా ఉంది. ఆమె అనిన ఆ రెండు మాటలూకూడా వెనుకటి అలవాటున ఆమెగొంతు వెడలినవేగాని సార్థకాలు కావు.

వంగిననడుం మరింత వంచి "కనకం!" అన్నాడు ముత్యాలు. ఆ పిలుపులో నిరాశా, నిర్వేదం ధ్వనించేయి. వాని చూడ్కు లెటు ప్రసరించేయో చేతిలోని కఱ్ఱ ఎవరో ఊచినట్టటూ యిటూ ఊగింది. నిట్టూర్పు కూడా ముసలిదై ముడుచుకొనిపోయింది వాని బొక్కినోటిలో. "ఎందుకిస్తాడో భగవంతు డింత దీర్ఘాయువు? పోనీ నాలాగు ఈమాత్రం శరీరదార్ఢ్యమేనా లేదాయె".

"కనకం"-మరొకసారిపిల్చేడు మంచంపైపునుండి తలయీవలకు త్రిప్పి. పలుకలేదామె. నిద్దురలో పలవరించిందేమో ఇందాక.

"తాతా! చల్దికూడు" అంది వీథిలోనుండే కంచంతో కూడుపట్టుకొని దానమ్మ.

ముత్యాలు ఆత్రంగా యీవలకు వచ్చేడు. ఆమె తెచ్చిన చెంబులోని నీళ్లతో మొగమూ చేతులూ కడుక్కొని, యీవల మట్టివాకిట్లో ముగ్గు మీద కంచం పెట్టుకొని, దానిదగ్గర కూర్చున్నాడు. ఎడమ చేత నంజుడు పట్టుకొని నాకుతూ కుడి చేత చల్దిక బళాలు ఒక్కొక్కటీ దిగవేస్తున్నాడు. అంతవరకూ వాని నల్లాడించిన ఆకలికాస్తా మందగించింది. నంజుడునాకి లొట్టలువేస్తూ "దానమ్మ, కనక మెలాగుందో చూస్తూ. నేను పిలిస్తే పలుకలేదు. నిద్ర కాబోలు" తిరుగా అన్నం తింటున్నాడు. ఉదయపు ఎండలో వెన్న డప్పులాగు వేడెక్కుతూంది. మూడువంతులు కూడు . ముగించేడు. ఊపిరి సర్దుకుంది, ఆ పేడుతినడం. లోపల నుండి కంయిమని కేకేసింది. దానమ్మో! కనకమో! తాతా, తాతా అని ఆత్రంగా పిలుస్తూంది దానమ్మ!

ధీమాగా "ఏమట" న్నాడు ముత్యాలు.

"అవ్వకదలదు! మాటాడదు! చచ్చిపోయిందికాబోలు."



"చచ్చిపోతే బ్రతిగిందన్న మాటే. దాని కష్టాలు గట్టెక్కుతాయి." అంటూ మిగిలిన అన్నం మ్రింగేశాడు.

"చూడు తాతా! నామాటబద్ధం కాదు. కళ్లుగట్టేసింది. వాళ్ల పెంటమ్మను పిలుచుకొచ్చి చూడమంటానుండు." అంటూ దానమ్మ పొరుగింటికి వెళ్లింది.

"మేలే. ఆమెబాధా నా బాధాకూడా ముగుస్తాయి. ఇతరులకు భారమయిన తరువాత ఇక జీవించి ఏం సుఖం? ఇంతకూ జీవించి ఆమెగాని, నేనుగాని ఏం చెయ్యాలి?"

పండ్లసందులలో నాల్క చొనిపి మెతుకులు లాగికొని చప్పరిస్తూ నేలచూచేడు. తనలోతా నేమేమో అనుకుంటూ కట్టి సంధిస్తున్నాడు లేరడానికి. గుడిసె లోనుండి దానమ్మా, పెంటమ్మా కనకమ్మశరీరం మోసుకుంటూ ఈవలకు వచ్చేరు. ఆచేరువనున్న కానుగ చెట్టుక్రింద గోనెవేసి ఆమె నక్కడపడేసి తాతవద్దకు వచ్చి నిలబడ్డారు.

"అయిందీ? దాని యాతన ముగిసిందీ? బాగానే ఉంది. ఆమె ధన్యురాలు. ఆమె చచ్చిపోవడంకాదు, బ్రతికబోయింది. నాకేమీ విచారంలేదు. ఒకవేళ యీ పాడుకన్నులనుండి నీటిచినుకులు రాలినా ఆనందబాష్ప లనుకోండి." అంటున్నాడు ముత్యాలు ధీమాగా నవ్వు మొగంతో. ఏదో భారం తనమీదనుండి దిగబడ్డట్టు విశ్రాము సూచించే సుఖపునిట్టూర్పులు వెడలిస్తు న్నాడు. చాలకాలంనుండీ ఎదురుచూస్తూన్న ఆనంద సమయమాసన్నమయినట్టు నిండుగామాటాడుతూ పండు ముత్తయిదువు పచ్చని చిలుకలా ఎగిరిపోయిందన్నాడు. మంచిది. మంచులాగు నిష్కల్మషమయిన జీవం కరగిం చుకుం దన్నాడు. ఆమె అమాయికురాలు, శాశ్వత స్వర్గసుఖ మనుభవిస్తుం దన్నాడు.

ముసలివాడు ముగ్ధుడయి ప్రాణవాయువు స్తంభించుకుంటాడేమో అనుకున్నారు కొందరు. వలవలా విలపిస్తాడేమో అనుకున్నారు కొందరు. శరీరం నిలుపుకో గలడో లేడో అని శంకించేరు కొందరు.

ముత్యాలు మంచివాడు. వారి దాంపత్యం అనాది సిద్ధంగా అత్యనుకూలంగా సాగివస్తూంది. వాళ్లు అలా ఆగూటిలో గువ్వలజంటలాగు కూడిఉన్నారేనా డామో. ఆపల్లెఅంతా వారిని పార్వతీపరమేశ్వరు ను చూచినట్టు చూచేవారు. అప్పుడుమొదలు రాత్రి జాము వేళ దాటేదాకా ఆముసలి ముత్యాలును వచ్చిచూచి వెళుతున్నారు ఎందరో ప్రజ. ఒకటిరెండు చేరువగ్రా మాలనుండి కూడా వచ్చివెళ్లేరు ప్రజ. అందరితోటీ అతి ధైర్యంగా మాటలాడుతూ ఆమెకు ధన్యవాదాలు చదువుతున్నాడు. ఆమెనుగూర్చిన విచారము తన కిక లేదు, తాను హాయిగ నిద్రపోవచ్చు ననుకొని ఆ చీకటి గుడిసెలోకి వెళ్లేడు.

దానమ్మ వానిప్రక్క దులిపి పరచి ప్రమిదలో వత్తివేసి దీపంవెలిగించి, "తాతా, కూడు తింటావా?" అని అడిగింది.



"అప్పుడే యెవరో కళ్లాపు చల్లి ముగ్గులు పెట్టేరు" అన్నాడు.

“కనకం! కనకం!”

“కనక మెక్కడ?......”

“ఇక్కడకు రాలేదూ?”

“వీనికి మతి చలించింది.”

“మరి నేనొక్కడనూ ఆ గుడిసెలో పడుక్కో గలనా? అరవై యేళ్లయింది. కనకాన్ని గడియసేప



“లేదు తాతా! ఆమెవస్తుందిలే, ఇంటికిపోయి పడుక్కో.”

యినా విడిచియెరగను. ఎక్కడుంది, మీపసువుల సాలలో నుందా?"

"లేదుతాతా! ఆమేవస్తుందిలే. ఇంటికిపోయి పడుకో."

"నే నెలా వెళతాను, కనకం లేకుండా? కనకం దొరకాలి, నే నింటికి వెళ్లాలి. ఏదీ కనకం? ఇటు వచ్చిందా లేదా? ఆసంగతి మొదటచెప్పు. కనకం! కనకం!"అని గట్టిగా గొంతెత్తి పిలుచుకుంటూ కళ్లందాటి వెళిపోతున్నాడు. పాలికాపులు భయంగా జాలిగా వానివైపే చూచిచూచి పడుకున్నారు.

నిద్రపోవని రాత్రిపిట్టలలో పిట్టయటు ఆపొలాలంట "కనకంకనకం"అని ఆతడు వాపోతున్నాడు. ఒకప్పు డాపిలుపు ధీమాగా, ఒకప్పు డది వడకి అస్పష్టంగా, ఒకప్పు డది పట్టుదప్పి జాలిగా చడేలేని ఆచీకటివెల్లువను కదలించినట్టు వినబడుతూంది. గాలే బెదబెదలాడిపోతూంది. కళ్లాలలో ప్రతిచలనం లేకుతూంది.

తెల్లవారడం గుర్తించలేదు. తేలిపోతూన్న కాళ్లను లక్షించలేదు. ఆరిపోయిన లాంతరును విడువలేదు. గద్గదికనైనా సవరించుకోకుండా ఈపిలుపుతో పలికితీరుతుందన్న నిండునమ్మకంతో అన్నిపిలుపులూ అదేదూరానికి, అదేధ్వనితో, అదేశ్రద్ధతో శరపరంపరగా, గుర్తులేకుండా, గురిలేకుండా విసరుతున్నాడు ముత్యాలు.

కనకంవిగ్రహమే వాని కన్నులలో, కనకంపిలుపే వానికంఠంలో, కనకమే కనకమే-"శరీరాన్నయినా విడచి జీవిస్తానుగాని కనకాన్ని విడచి నిలబడతానా!" అన్నపరాకాష్ఠ వాని అడుగులపటిమలో తోస్తూంది. కనబడ్డ పసిబిడ్డనికూడా "కనకాన్ని" గూర్చి అడుగుతున్నాడు.

అసలే మందగించి అలవాటునజ్వలించే ఆజీవదీపశేషం ఆ టులో ఆరాపిడిలో ఆడీపికలో మరింత భగ్గుభగ్గుమని కడసారి గుప్పలపుమంట లెగస్తూంది.

ఏచెట్టుమూలనో, బహుళః తన యిుంవరము చేరుకనున్న కాగుద్రాకు మొదటనో పట్టువీడి దొరలిపోయిన చొక్కిలాంతరు, పట్టువిడువక ప్రక్కను సాగిపడ్డ చేతికఱ్ఱ, శబ్దించకుండా చలించకూడా వాపోయే బోసినోరూ, వెలుగులేక వీడశారిన గాజుకన్నులూ, కనకమయ మయినట్టు పాలిపోయి పచ్చబడిన ఒళ్లూ ముత్యాలు పడిఉండుట మొదటిసారి దానమ్మ చూచింది.

గ్రామంలో కళ్లాలలో కనక శబ్దప్రతిధ్వనిదం ఆతరువాత ఎన్నోసార్లు ఎందరకో వినిపించిందట.

---



కోడిసునుసుగా నిద్రపోతున్నాడు, త్రుళ్లిపడి మేల్కొంటున్నాడు. మెలకువరాగానే ఒకసారి వాని హృదయం తేలికగాను, ఇంకొకసారి భారం గానూ తోచేది. ఒకటి రెండుసార్లు మూల్గేడు. పొరుగువాళ్లు తెలిసిఉంటే వినేఉంటా రాధ్వని.

ఉదయాన్నే లేవగానే 'కనకం' అనేదే మొదటి పిలుపు. ఒక్కొక్కనాడు రాత్రిమీరేక నిద్ర తెలివివస్తే ఊతంగా 'కనకం' అని పిలిచేవాడు కీర్త్యాలు. ఆమె పలికేది. ఏవో కబురులనుకునేవారు.



"ఉఁ హుఁ! వద్దు. కడుపు నిండుగా ఉంది. నాకు ఆకలేకాదు. ఏబాధాకూడా లేదు. హాయిగా పడుకొని ఈరేయి నిద్రపోతాను. రాత్రి మించు తూంది. దానమ్మా, నీవు వెళ్లు. మాకోసం చాలా శ్రమ పడ్డావు. ఈ ముసలినోటిదీవన లూరకపోవులే. నీ వెంత దాన వవతావో చూడు" అంటూ ఆ నులక మక్కిలో పడుకున్నాడు.

పడుకోగానే మొదటితలపు – "ఈవార్త అబ్బాయికి చేరుతుందో చేరదో!" పైకే అన్నాడు.



కనకం [illegible] ఆత్రంగా యీవలకువచ్చేడు."

రెండు శబ్దాలతో ఒకే కంఠంతో. దానితో వారిరు పురకూ చిత్తశాంతి చేకూరేది కాబోలు, తిరుగా కోడి కూసేదాకా ఇద్దరూ కొట్టేసిన పాముల్లాగు పడుకున్నే వాళ్లు.

ముసిలాడి నోరు కనకాన్ని ధ్వనించింది. కన్నులు మూసికొనే ఉన్నాడు. కథ ఏకో చెప్తున్నాడుకాబోలు, గొణుగుబోయే మాటలతో కనకాన్ని ఉద్దేశించి త్రుళ్లిపడిలేచి మంచంనసుమ వంగికూర్చున్నాడు. కన్నులు నులుముకొని, కనకంమంచంకోసం ఆమె పూర్వం పండుకొనే మూలకు అపనమ్మకంగా చూచేడు. "కనకం! కనకం" అని గట్టిగాపిల్చేడు... "ఆఁ! నిద్రలేదు. మూల్గు వినబడుతూందే. కనకం! పిలుస్తే పలకవూ" అన్నాడు అతిజాలిగా. ఆ లేతవెలుగుదీపం ముడుచుకుపోయినట్టయింది. లేచి నేలతడవి కాళ్లూది నిలచేడు. మంచంక్రిందపడిఉన్న చేతికఱ్ఱ పుచ్చుకొని ఆమె ఉంటేమోనని అటువైపు వెళ్లేడు.

"లేదు! అయ్యో లేదు. అమావాస్యరాత్రి. ఆమెకు చీకటి లక్ష్యంలేదు, నాకు తెలుసును. అప్పుడు చీకటేకాకుండా పెద్దగాలివానకూడ. జంకుండా పొలానికి వెళ్లింది అర్ధరాత్రివేళ. ఇప్పుడు - పొలానికి వెళ్లిందా?...పొలంలేదే!...వెతగాలి. ఆమె చీకట్లో ఏమయిపోతుందో!...ఇక్కడెక్కడేనా ఉంటేమో. "కనకం!" నిలబడ్డాడు. ఆమెపలుకుకోసం ఆలకించేడు. "ఏమయి ఉంటుంది! ఒకనాడు ప్రొద్దున్నే లేచి పొరుగుపల్లె వెళ్లిందికాదూ, వాళ్ల మేనగోడలుంది చూచివస్తానను కుంటూను. ఆవేళ పగలుకాబట్టి నాకు ధైర్యంఉంది. రాత్రివేళ-అంధకారం-కుక్కే మోనక్కే మో-ఒంటికత్తె-అబ్బాయిఉంటే - ఉంటేమాత్రం నాకు కనకంమీద నున్న ప్రేమ వాడికుంటుందీ...ఏదీ? ఏనా డాయ వెళ్లిపోయాడు! కనకం...."గదిఅంతా అటూయిటూ చూచేడు. గోడను చిలుకకొయ్యనుండి వ్రేలాడుతూంది త్రాడుతో ఒక చిన్న పాతలాంతరు. అటే మెల్లగా అడుగులు పెట్టుకొనివెళ్లి ఆలాంతరు తీసేడు. దాని కొకవైపు అద్దంలేదు. అంతా త్రుప్పపట్టి మొరమొరలాడుతూంది. మసిబొడ్లూ, సాలెపట్లూతో నిండి ఉన్నాయి దాని తలా, మూలలూను. దానిలో ప్రమిదదీపం మెల్లగా చొనిపేడు. పక్కమీద పరచిన పాతగుడ్డ తీసి పైమీద కప్పుకున్నాడు. ఒకచేత లాంతరు, రెండవచేత చేపాటికఱ్ఱా పట్టుకొని ఇలువరం విడచి యీవలకు వచ్చేడు.

పదిపదిహేనే ళ్లవుతుంది. ముత్యాలు వీథిలో నడిచీ? ఏంవీథి! పల్లెబాట గోతులూ గోర్జాను. రంయిమని రావిచెట్టుకొమ్మస్తూంది గాలి. ఆచెట్టు తొఱ్ఱలో గుడ్లగూబ గూపెట్టింది. ఎట్రింత అవ్వలి కళ్లంకాపులకు మంషిజాడ గలగలశబ్దంతో తెలుపుతూంది. ఎక్కడా లేని సత్వం ఆ ఎండుకాళ్లలో ప్రవేశించింది. అక్కడా అక్కడా నిలచి "కనకం కనకం" అన్న ఆత్రపు బోసినోటిపిలుపు ఆనిశ్శబ్దహృదయాన్ని గుండులాగు దూసుకుంటూంది తల వ్రేలవేసికొని తలపులు నోటబెట్టుకొని తడవికొంటూ దాటుకుంటూ పోతున్నాడు ముత్యాలు.

"ఎవరది?" మెలకువవచ్చిన కళ్లపుకా పొకడు గద్దించి ఆవెలుగు నుద్దేశించి గట్టిగా అడిగేడు. ఏదో ఖదులాడిన ట్టాదీపకళిక చలించి చీకటిలో చలంతాలాడుతూంది.

ముసలి ముత్యాలు "కనకం! కనకం!" అని జాలిగా ధ్వనించి ప్రతిధ్వనించేడు.

తన తోటి పాలికాపును లేపేడు ఆకళ్లంకాపు. "ముసలాడు దేనికో దేవులాడుతూ వస్తున్నాడురా" అన్నాడు ఆశ్చర్యంగా. రెండవవాడు నిద్రలేచి ఆవులించి కళ్లునులుముకుంటూ తాత వెలుగువైపుచూచి "అఁ అఁ! ముత్యాలుతాత! ఇ దేమిటిచెప్మా, చీకట్లో ఇలా వస్తున్నాడు."

"ఎవరత్తా పాలికాపులూ! కనకంగానీ వచ్చిందా మీ కళ్లంకడకు?"

పాలికాపు లిద్దరూ ఒకరిమొగ మొకరు తెల్లబోయిచూచుకున్నారు. "తాతా, ఏమిటంటావు?"

"కనకం! కనకం!"

"కనక మెక్కడ?......"

"ఇక్కడకు రాలేదూ?"

"వీనికి మతి చలించింది."

"మరి నేనొక్కడనూ ఆ గుడిసెలో పడుకో గలనా? అరవై యేళ్లయింది. కనకాన్ని గడియసేప



"లేదు తాతా! ఆమె వస్తుందిలే, ఇంటికిపోయి పడుకో."

యినా విడిచియెరగను. ఎక్కడుంది, వీపాపుల సాలలో నుందా?"

"లేదుతాతా! ఆమేవస్తుందిలే. ఇంటికిపోయి పడుకో్క"

"నే నెలా వెళతాను, కనకం లేకుండా? కనకం దొరకాలి, నే నింటికి వెళ్లాలి. ఏదీ కనకం? ఇటు వచ్చిందా లేదా? ఆసంగతి మొదటచెప్పు. కనకం! కనకం!"అని గట్టిగా గొంతెత్తి పిలుచుకుంటూ కళ్లందాటి వెళిపోతున్నాడు. పాలికాపులు భయంగా జాలిగా వానివైపే చూచిచూచి పడుకున్నారు.

నిద్రపోవని రాత్రిపిట్టలలో పిట్టయటు ఆపొలాలంట "కనకంకనకం"అని అతడు వాపోతున్నాడు. ఒకప్పుడాపిలుపు ధీమాగా, ఒకప్పుడది వడకి అస్పష్టంగా, ఒకప్పుడది పట్టుదప్పి జాలిగా చడేలేని ఆచీకటివెల్లువను కదలించినట్టు వినబడుతూంది. గాలే బెదబెదలాడిపోతూంది. కళ్లాలలో ప్రతిచలనం లేకుతూంది.

తెల్లవారడం గుర్తించలేదు. తేలిపోతూన్న కాళ్లను లక్షించలేదు. ఆరిపోయిన లాంతరును విడువలేదు. గద్గదికనైనా సవరించుకోకుండా ఈపిలుపుతో పలికితీరుతుందన్న నిండునమ్మకంతో అన్నిపిలుపులూ అదేదూరానికి, అదేధ్వనితో, అదేశ్రద్ధతో శరపరంపరగా, గుర్తులేకుండా, గురిలేకుండా విసరుతున్నాడు ముత్యాలు.

కనకంవిగ్రహమే వాని కన్నులలో, కనకంపిలుపే వానికంఠంలో, కనకమే కనకమే—"శరీరాన్నయినా విడచి జీవిస్తానుగాని కనకాన్ని విడచి నిలబడతానా!" అన్నపరాకాష్ఠ వాని అడుగులపటిమలో తోస్తూంది. కనబడ్డ పసిబిడ్డనికూడా "కనకాన్ని" గూర్చి అడుగుతున్నాడు.

అసలే మందగించి అలవాటునజ్వలించే ఆజీవదీపశేశం ఆ టులో ఆరాపిడిలో ఆఓపికలో మరింత భగ్గభగ్గుమని కడసారి గుగ్గులపుమంట లెగస్తూంది.

ఏచెట్టుమూలనో, బహుశః తన యిజువరము చేరుకనున్న కొంగుమ్రాకు మొదటనో పట్టువీడి దొరలిపోయిన చొక్కాలాంతరు, పట్టువిడువక ప్రక్కను సాగిపడ్డ చేతికఱ్ఱ, శబ్దించకుండా చలించకూడా వాపోయే బోసినోరూ, వెలుగులేక వీడబారిన గాజుకన్నులూ, కనకమయ మయినట్టు పాలిపోయి పచ్చబడిన ఒళ్లూ ముత్యాలు పడిఉండుట మొదటిసారి దానమ్మ చూచింది.

గ్రామంలో కళ్లాలలో కనక శబ్దప్రతినినదం ఆతరువాత ఎన్నోసార్లు ఎందరకో వినిపించిందట.

—

# మేల్కొలుపు

జి. జాషువ

కాలవాహిని యుగతరంగముల నడుమ - నున్నదో లేదొ భవ్యభాగ్యోదయంబు
మెల్లదిశ లొప్పలొలుకఁ బ్రొద్దెక్కిపోయె - భరతజనయిత్రి! కన్నులు తెఱువవేమి?

తరముల్ పెక్కులు కాలచక్రమున నంతర్ధానముం జెందె, సో
దర దేశంబు లఖండవైభవ సముద్రస్నానముం జేసె, పే
దరికంపుం బొగదుమ్ము గుమ్మములపొంతన్ దాండవం బాడ, సో
మరి దానింబలె మిన్నకుండెదవు లెమ్మా! కచ్చ బంధింపుమా!

వలదమ్మా! యివి ప్రాతనాటకము లభ్యస్తంబుగావించి, నీ
తలఁపుల్ లాగక మొద్దువాఱెనవి, నూత్నజ్యోతి ముట్టించుకో
వలె, నుత్సాహసమేతులయ్యు సుతు లీబంధాలలోఁ జిక్కి దు
ర్బలులైనా రిఁక నారిపోసికొనవే స్వాతంత్ర్యభావౌషధుల్.

ఉన్నవి పిచ్చినమ్మకము లుప్పకురానివి నీ మెడందలో
నెన్నడు చొచ్చెనో, చరణమెత్తి శుభాశుభము ల్గణింతువో
యున్నతురాల! యీ పిటికి యూహల కాహుతివై ప్రయత్నముల్
చన్నవి రిత్తలై యవి తలంచి గడింపు మభీష్టసిద్ధులన్.

సకల శుభములు నీ సమక్షమునఁ జేపి - నిలిచియున్నవి వేల్పుటావుల విధాన
పిదుకుకొన వమ్మ బంగారుబిందియలకు - అలసించిన పరులపాలగును పాలు.

అట గనుగొమ్మ పశ్చిమమునందు తురుష్కుల సుందరాంగి, చీ
కటి పరదాలతోడ బురఖా దొలఁగించి, సమంచితాశయ
చ్ఛటలు చిగుర్పగాఁ జదువుసంధ్యలు నేర్చినదమ్మ! విద్యకై
గుటకలు మ్రింగు నీ యనుఁగుకూఁతుల కిమ్ము కలమ్ము, ఖడ్గమున్.

---

# పెట్టుబడి

## పండ్రంగి రాజేశ్వరరావు

ప్రస్తుతపు ఆర్థికదుస్థితి ప్రారంభమైనప్పటినుండి యు ప్రజలందరు పెట్టుబడిపేరు చెపితే బెదరిపోవుచున్నారు. ఇదివరకున్న పెట్టుబడులను సాధ్యమైనంతవరకు వసూలుచేసుకొని దగ్గరపెట్టుకొను టకు, లేక బ్యాంకులనం దుంచుకొనుటకు ప్రయత్నించు చున్నారు. ఇదివరలో బంగారమును విరివిగా కొనెడి వారు. అందుచేతనే బంగారమునకు భారతదేశము నుడి గుండమువంటి దనెడి అభిప్రాయము ఆర్థికశాస్త్రజ్ఞుల యందుకూడ ప్రబలినది. కాని ఇంగ్లండు స్వర్ణ ప్రమా ణము (Gold standard) వదలినపిమ్మట బంగారు యొక్క ధర విపరీతముగ పెరిగిపోయినది. అంతటితో కథ అడ్డముతిరిగినది. జి. డి. బిర్లాగారన్నట్లు బంగార మునకు రెక్కలు వచ్చినవి. మారుమూలలనున్న చిన్నము చిదర కూడ పెల్లగిలి వచ్చినవి. నేటికి రెండువందల కోట్లు రూపాయలకు పైగా విలువగల బంగారము ఇంగ్లాండు అమెరికాలకు ఎగుమతి అయినది. ఇందులకు జనసామాన్యమును నిందింపరాదు. బంగారమందు వారి కెంత మమకార మున్నప్పటికి ఆర్థికదుస్థితివలన గత్యం తరము లేక చివర కిందు కొనబడిరి. కొంతమంది శ్రీమం తులుకూడ ధనాశచే ఇట్లు చేయుచున్నారు. ఇది చాల శోచనీయము. బంగారము దేశము వదలిపోవుటవలన కలి గెడి నష్టములనుగురించి హైదరాబాదుర్థిక శాస్త్రవేత్తలంద రును యేకగ్రీవముగ చెవులో ఇల్లుకట్టుకుని పోరిరి. బ్రిటిషు వాణిజ్యాభివృద్ధికై రూపాయను పౌండుతోకకు తగిలించి (Linking the Rupee to the pound sterling) నేటిమారకపుమాయను (Exchange manipulation) నిలబెట్టి పైకిమాత్రము ఎగుమతులను దిగు మతులకంటె ఎక్కువగా నున్నట్లు (Favourable Balance of Trade) కనపరచి మభ్యపెట్టుటకై ప్రభు త్వమువారీ విషయమంతను పెడచెవిని పెట్టిరి. ఈ సమస్య విషయమై వివరముగ చర్చించుట కిది తావు కాదు. సర్వజన సమ్మతమగు బంగారమందు పెట్టుబడి లేకపోవుటయేకాక చివరకున్నది కూడ వూడ్చిపెట్టుకు పోవుచున్నది.

స్వతః మన దేశము గ్రామసముదాయము. కుటీర పరిశ్రమ (Cottage Industries) లడుగంటుట చేత వున్న కొద్దిపాటిమూలధనము వడ్డీవ్యాపారమందు తిరుగు చున్నది. ధాన్యపుదినుసులధరలు పడిపోవుటచే షావు కారు లిదివరకు పెట్టినపెట్టుబడులే సరిగ వచ్చుటలేదు. ఇందుకు సాయము హెచ్చువడ్డీరేట్లు. దేశమందలి గ్రామవాసుల ఋణముమొత్తము (Rural Debt) సుమారు పదకొండువందలకోట్ల రూపాయలని అంచనా వేయబడినది. ఈమధ్య ఋణపరిష్కారమునకై వివిధ రాష్ట్రీయ శాసనసభలందు చట్టములుకూడ చేయబడినవి. వీటివలన చాలనష్టము వచ్చినదని, ఋణదాతలవలన అవ సరమగునంత సహాయముకలుగలేదని ప్రజలు మొరపెట్టు చున్నారు. క్రొత్తగ పెట్టుబడి పెట్టుటకు జంకు చున్నారు. సాధారణముగ తణఖాలమీదను, తాకట్టుల మీదనుమాత్రమే అప్పు దొరుకుచున్నది. చివరకు వడ్డీ వ్యాపారముకూడ లాభకరముగ నుండుటలేదు.

పారిశ్రామికముగ మనదేశము చాల వెనుకబడి యున్నది. బట్టలపరిశ్రమ యిటీవల కొంతవరకు ఇనుము, ఉక్కు, పంచదారపరిశ్రమలు తప్ప మిగత వన్నియు విదేశీయులచేతులం దున్నవి. మనదేశమందున్న పెద్ద కంపెనీలన్నియు విదేశీయులవే. వీటివల్ల కొంతమంది కూలీలకు, గుమస్తాలకు మాత్రమే జీవనము జరుగు చున్నది. దూరదృష్టితో చూచిన ఈ స్థితి ముఖ్యముగ ఖనిజపరిశ్రమలందు చాలనష్టదాయకము. కొంతకాలము నకు మన బొగ్గు, బంగారు, చమురుగనులన్నియు ఉత్త వగును. రానున్న యీ నష్టమునుగురించి చాలకాలము క్రితమే కీ. శే. సర్ విఠల్ దాస్ ఠాకరసేగారు మొర పెట్టియుండిరి. దేశపరిశ్రమలు విదేశీయుల హస్తముల బడినపుడు ఆర్థికసౌష్ఠవమునకు ముప్పు తప్పదు. ఒకవేళ

దేశీయు లెవరయినను పరిశ్రమలను లేవదీయుచో ఇంత కాలమునుండి పాతుకొనియున్న విదేశీయసంస్థలు స్వలాభమునకై అణగద్రొక్కును. కలకత్తా, బొంబాయి నగరములందలి విదేశీయకర్మాగారములం దెచటను బాధ్యతగల పెద్దయుద్యోగములందు హైందవులు చాల తక్కువ. పారిశ్రామిక రహస్యములవిషయమైకూడ చాల మెలకువతో ప్రవర్తించెదరు. ఆర్థికనష్టముమాట అటుం చినను రాజకీయముగ జరిగిననష్టమునకు మేరలేదు. రౌండుటేబిలుసభయందు విదేశీయవర్తక ప్రముఖు లే కగ్రీవముగ భారతజాతీయాదర్శమును (National Demand) ఎదిరించిరి. భావిరాజ్యాంగమందు ఆర్థిక రాజకీయాభివృద్ధి నరికట్టుటకై లెక్కలేనన్ని రక్షణము లను, మినహాయింపులను (Safeguards and Reservations) కల్పించుటకై తోడ్పడిరి. వీరెల్లపుడును గవర్నమెంటుకు తోడునీడైయుందురు. ఇకముందయి నను వీరివైఖరి మారునని తోచదు.

ఇన్నిచిక్కులమధ్యకూడ జాతీయపరిశ్రమలు, వాణిజ్యము కొంత యభివృద్ధినందినవి. ఇరువదవశతా బ్దాదినుండియు బయలుదేరిన జాతీయభావ మొకింత ప్రోద్బలము నిచ్చినదని చెప్పకతప్పదు. యూరపుమహా సంగ్రామసమయమందు విదేశములనుండి దిగుమతు లాగి పోవుటచేతను, దేశీయపరిశ్రమలు బాల్యదశయందుండుట చేతను చాలచిక్కులపాలు కావలసివచ్చెను. అపుడే చాలపరిశ్రమలు, బ్యాంకులు లేచినవి; కాని యుద్ధానంత రము చాల దివాలాతీసినవి. అంతటితో జనసామాన్య మునకు వీటియందు నమ్మకము, అభిమానము తగ్గెను. ఈ దివాలాలకు కొన్నికారణములు కలవు. యుద్ధానంత రము అన్నివస్తువులకు గిరాకితగ్గెను. తిరిగి ప్రతిదేశము యథాప్రకారము వాణిజ్యపరిశ్రమలను చేపట్టెను. తత్రాపి పోటీహెచ్చాయెను. కావలసినంత మూలధనము మనకులేదు. ఉన్నధనమయినను వ్యాపారములోకి వచ్చు టకు జంకుచున్నది(Indian Capital is Shy). మన దేశీయులకీ విషయమందు అనుభవము తక్కువ. అందు చేతనే పునాదిలేని దేశీయసంస్థలన్నియు పేకముక్కల మేడలవలె కూలిపోయినవి.

హైందవవాణిజ్యమందు మేనేజింగు ఏజన్సీ పద్ధతికూడ ఉన్నది. ఇది మరియేదేశమందు లేనటువంటి అసాధారణపద్ధతి. ప్రస్తుతము న్యాయశాఖసభ్యులగు సర్ యన్. యన్. సర్కారుగారు చెప్పినట్లు మన దేశపు రాజకీయములందున్న ప్రత్యేకనియోజకవర్గములు వలె ఈ పద్ధతి వాణిజ్యమం దసమానమైనది. ఆర్థికము గను, పారిశ్రామికముగను దేశము వెనుకబడియుండుటచేత పట్టనములందలి ధనవంతులు కొందరు తమధనమును, ఇత రులధనమును వెచ్చించి వ్యాపారము సాగించుటచే ఈ పద్ధతి యేర్పడినది. ఈ హక్కు వంశపారంపర్యము సంక్రమించుటచేత పిమ్మట వచ్చువారీపద్ధతిని దుర్వి నియోగము చేయుటకూడ తరుచు సంభవించుచుండును.

ఈపద్ధతిక్రింద కంపెనీలు కొందరుభాగ్యవంతుల చేతులలోనికివచ్చును. నామకార్థము డైరక్టరు లున్నప్ప టికి చివరకు చక్రముత్రిప్పునది వీరే. కంపెనీల షేర్లు కూడ వీరు చాలవరకు కొనెదరు. కంపెనీయందుండు వారందరు వీరికాశ్రితులే. కంపెనీల శ్రేయోభివృద్ధి కని తమ దుబారాఖర్చులను కంపెనీలనెత్తిని రుద్దుట మామూలు. ఇందుకుతోడు పెద్దపెద్దజీతములను, విరివిగ బత్తెములను (Allowances) తీసుకొందురు. కొన్ని సమయములందు మేనేజింగు ఏజంట్లు వారిచేతియందలి పరిశ్రమల రక్షణకై చూపినత్యాగము గమనార్హమైనది. ౧౯౨౫ వ సంవత్సరమునుండి "తేయాకు" పరిశ్రమకు తీరనినష్టము కలగుచున్నది. ఇట్టిపరిస్థితులందుకూడ పరి శ్రమ రక్షణకై విశేషముగ ధనమును వెదచల్లిరి. మన దేశమందస లింతవరకు పరిశ్రమలను, వాణిజ్యమును వృద్ధికి తీసుకొనివచ్చినది వీరేకదా? ప్రస్తుత పరిస్థితు లందీ పద్ధతియొక్క అవసరము చాలవరకు తీరినట్లు కనపడుచున్నది. ఇటీవల కేంద్రశాసనసభయందు ప్యాస యిన క్రొత్తకంపెనీచట్టవిషయమై తర్జనభర్జనలుచేసి అనతికాలములోనే యీ పద్ధతియొక్క నిషేధమును నిర్ణయించినది. ఇంతటినుండి మేనేజింగు ఏజంట్ల యిష్టానుసారము రాజ్యము సాగదు. చాలకట్టుబాటులు చేయబడినవి. వీరి నిక అడకత్తెరలోని పోకవలె నుంచె దరు. విశాలదృష్టితో పరికించినయెడల యీ చట్టము

మన వాణిజ్యపరిశ్రమాభివృద్ధికి సహకారిగ నుండు నని తోచును.

ఈ విషయమందు గవర్నమెంటుకూడ అనేక విధముల తోడ్పడుచున్నది. వాణిజ్య, పరిశ్రమశాఖలు చురుకుగ పనిచేయుచున్నవి. లండను, హాంబర్గు, మిలానులయందు హైందవ వర్తకప్రతినిధుల నేర్పరచిరి. మనదేశపు సరకులుకూడ విదేశములందలి ప్రదర్శనములకు పంపబడుచున్నవి. వాణిజ్యాభివృద్ధికై ఇతరదేశపు ప్రతినిధులతో రాయబారములు గవర్నమెంటు ఆధ్వర్యముక్రింద జరుగుచున్నవి. శాసనసభలందు వాణిజ్య పరిశ్రమలకు ప్రాతినిధ్యమీయబడెను. కాని కొన్ని సమయములందు ఉపేక్షవలన గవర్నమెంటుకు బ్రిటిషు వారియెడలగల పక్షపాతముచేత తీరనినష్టము కల్గినది. సర్ యమ్. విశ్వేశ్వరయ్యగారు చెప్పినట్లు భారతదేశము బ్రిటిషువారి దృష్టియందు సరుకులు చలామణి చేసుకొనుట కేర్పడిన సంత. సామ్రాజ్య ప్రియత్వ తత్వమును (Imperial Preference) తెచ్చిరి. పిదప అట్టవా ఒడంబడికను జోడించిరి. పరోక్షముగ 'మోడీ-లీ' పాక్టుకు తోడ్పడిరి. హఠాత్తుగ ఇండో-బ్రిటిషు వర్తకపు టొడంబడిక నేర్పరచిరి. గవర్నమెంటుకు కావలసిన వస్తువులన్నిటిని (Store Purchases) విదేశములందు- ముఖ్యముగా ఇంగ్లండునందు- కొనుట మామూలయిపోయినది. చివరకు హౌరావంతెన కంట్రాక్టు కూడ బ్రిటిషుకంపెనీ కీయబడినది. రైల్వేరేట్లపద్ధతిని కోస్తా వర్తకవిషయమును వేరుగ విమర్శింప నవసరము లేదు.

వాణిజ్య పరిశ్రమాభివృద్ధి కాయువుపట్టులు బ్యాంకులు. ప్రధాననగరములందున్న పెద్దబ్యాంకు లన్నియు విదేశీయులవే. ఇంపీరియలు బ్యాంకునం దాధ్వర్యమంతయు ఇంగ్లీషువారిది. రిజర్వుబ్యాంకికూడ విదేశీయులపరము కాకుండుటకై భారతీయులు తప్ప మరెవ్వరికి షేరుల నీయరాదని దేశీయులు కోరిరి. ఇందుకుకూడ గవర్నమెంటు ఒప్పుకొనక చివరకు లాటరీమూలముగ దరఖాస్తుచేసినవారికి షేరుల నిచ్చిరి. ఇది ముందెటులు నడచునో చూడవలసియున్నది. అవసరమగునపుడు విదేశములనుండి మూలధనము తీసుకొనవచ్చును. కాని అధికారము మాత్రము వారిపరము చేయరాదు. ఎంతయెక్కువ వడ్డీయిచ్చినను ఇబ్బందిలేదు. జపాను ఇట్టిమెలకువతోనే ప్రవర్తించుటవలన త్వరలో అభివృద్ధి నందెను. మనదేశమందలి విదేశీయ మూలధనముయొక్క మొత్తము సుమారు ఎనిమిదివందలకోట్ల రూపాయలు. ఇచట పరిశ్రమలకు పనికివచ్చు పెద్ద మొత్తములను చాలకాలమువరకు బదులిచ్చు పారిశ్రామిక బ్యాంకులు (Industri 1 Banks) మచ్చునకైనను లేవు. ౧౯౧౭లో బయలుదేరిన టాటాఇండస్ట్రియల్ బ్యాంకు కొలదికాలములోనే సమసిపోయినది. సహకారసంస్థలు పేరునకున్నను ప్రస్తుత మధోగతి యందున్నవి. ఒకవిధముగ మంచిస్థితియందున్న మన భీమాసంస్థలు వాటి మూలధనమును, ఆదాయమును పరిశ్రమలమీద పెట్టుబడిపెట్టుటకు వీలులేదు. కరెన్సీ కంట్రోలరువద్ద పెద్దపెద్దమొత్తమును ధరావతుకట్టుటకు తోడు గవర్నమెంటున కొప్పదలయగురీతిని తక్కువ వడ్డీలపై పెట్టుబడి పెట్టవలసియున్నది. ఈ పద్ధతి భీమాకంపెనీల ఆర్థిక-కట్టుదిట్టముల కుపయోగకరమయినను ఇంతధనము కొద్దివడ్డీమీద ఊరక ఉండనిచ్చుట యం దర్థములేదు. ఇతరదేశములందు- ముఖ్యముగ కనడాలో-భీమాసంస్థ లచటివాణిజ్య పరిశ్రమల కండవలె నిలిచియున్నవి. మనదేశమందుకూడ ఈ ధనమును కట్టుదిట్టమగు కొన్ని షరతులమీద వాణిజ్య, పరిశ్రమలందు పెట్టుబడిపెట్టుట వాంఛనీయము. రష్యా, అమెరికా దేశములందువలె మనకు విదేశవాణిజ్యముకంటె దేశీయ వాణిజ్యమే ముఖ్యము. వర్తకము కొనసాగుటకు తగినన్ని బ్యాంకు లవసరము. ఇటీవల చాలబ్యాంకులు బయలుదేరి మొత్తముమీద తృప్తికరముగనే పనిచేయుచున్నవి. వీటిలో సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అత్యున్నతమైనస్థితికి వచ్చినది.

ప్రస్తుత మెల్లెడలను ఆర్థిక జాతీయత (Economic Nationalism) విజృంభించుచున్నది. ఫాసిజము, నాజిజము యిందుకు తోడ్పడినవి. కమ్యూనిష్టు రష్యాకూడ యీ భావమందు చిక్కుకొనినది. స్వేచ్ఛా వ్యాపారము (Free Trade) ఆదర్శముగాగల బ్రిటను

కూడ ఇందుకు దాసోహ మనినది. ప్రత్యక్షముగనో, లేక పరోక్షముగనో ప్రతిదేశము ఆర్థిక జాతీయతకు జోహారొనగుచున్నది ఆర్థికదుస్థితి పూర్తిగ తొలగనప్పటికి మనదేశమం దిటీవల చాలకంపెనీలు బయలుదేరినవి. చాలునంత మూలధనము, సరియగు పరిపాలన లేకపోవుటచే మూడవవంతుకుపైగా దిగజారిపోవుచున్నవని తెలియుచున్నది. ప్రస్తుతము పెట్టుబడిదారులు క్రొత్తకంపెనీల విషయమందు చాలజాగ్రత్తగ మెలగవలయునని బొంబాయి వర్తక ప్రముఖులగు మను సుబేదారుగారు హెచ్చరించుచున్నారు. ఎంత జాగ్రత్తగ మెలగినను వాణిజ్య, పరిశ్రమలం దపుడపుడు దివాళా తప్పదు. ఇంగ్లండు, అమెరికాదేశములందు కూడ ఒక ప్రక్క వందలకొలది కంపెనీలు దివాళాతీయుచున్నను, వేరొకప్రక్కనుండి క్రొత్తవి బయలుదేరుచుండును. ప్రకటనలను, డైరెక్టరుల పేర్లను చూచి మోసపోరాదు. ప్రకటనయందుచెప్పబడిన వన్నియు ఆచరణలోనికి రావు. కొందరు డైరెక్టరులు నామకార్థమే కాని శ్రద్ధతీసుకొని పనిచేయువారుగారు. కంపెనీలను లేవదీయువారు (Founders & Promoters) కూడ పెట్టుబడిదారుల సౌకర్యములకు, శ్రేయమునకు పాటుపడవలెను. కలకత్తా, బొంబాయిలలోని స్టాకు ఎక్స్చేంజీలయందు (Stock Exchanges) జరుగు సంగతులనుగూర్చి జనసామాన్యమున కేమియు తెలియదు. అదంతయు పెద్దజూదమని కొందరి అభిప్రాయమైయున్నది. అం దనేకలోపము లున్నమాట నిజము. వాటిని సవరించి జనసామాన్యమున కవగాహనమగురీతిని వ్యాపారము జరిగించుచో ప్రస్తుతమున్న అనుమానము, భయము పోవును. ఇది చాల కష్టతరమయినపని. ప్రభుత్వమువారు వివిధప్రాంతములందున్న వాణిజ్యసంఘము (Chambers of Commerce) ఈ పనికి పూనుకొనవలయును. కాలచక్రము గిర్రున తిరిగిపోవుచున్నది. మనము ప్రతివిషయమందును, ముఖ్యముగా వాణిజ్య పరిశ్రమలందు ఇతర దేశములతో సమానముగ నుండుటకై ప్రయత్నింపవలెను. ఉపేక్ష ఎంతమాత్రము పనికిరాదు. ఇట్టిపరిస్థితులయందు త్వరగ పనిజరుగుటకొక సాధనమున్నది. దేశమందలి జనసామాన్యమునకు పెట్టుబడియందలి సాధకబాధకములు తెలియవు కావున పెట్టుబడి సంస్థలు (Investment Trusts) బయలుదేరవలెను. వీటియం దనుభవశాలులగు నిపుణు లుందురు. కాన పెట్టుబడిదారుల కేమియు నష్టము కలుగదు. ఇటీవల యిట్టివి కొన్ని బయలుదేరినవి. ఈ సంస్థల వెనుక ప్రభుత్వముయొక్క గ్యారంటికూడ ఉన్నయెడల పెట్టుబడిదారుల నమ్మకము వృద్ధియగును. వాణిజ్యమునకు నమ్మకమే మూలముగాన దాని నభివృద్ధి నొందించుటకన్ని విధముల పాటుపడవలయును.



# కలగూరగంప

## పాములపోట్లాట

(ఒక క్రొత్త వినోదం)

ఉత్తర అమెరికాలో పాములు అధికం. వాటిల్లో విషంఎక్కువగా ఉండేది ఒకజాతి. దానివంటిమీదంతా



౧

పొడలుంటవి. తోకను ఉంగరాలు చేర్చినట్లు వరుసగా గట్టివలయా లుంటవి. అది పాకేటప్పుడు ఆ వలయాలు ఒకదానికొకటి వరుసుకొని గలగలశబ్దం చేస్తవి. దాని పేరు 'డైమండ్ బాక్ రాట్లర్'(Diamond back rattler). ఇది వలంగా అయిదడుగుల పొడుగున ఉంటుంది. విషం లేనిపాముల్లో నీలిరంగుజాతి ఒకటి. ఇది ఏడడుగుల పొడుగుదాకా ఉంటుంది. చాల వడిగా పాకుతుంది. రంగునుబట్టి దీనికి 'ఇండిగో స్నేక్' (Indigo snake) అనేపేరు వచ్చింది. దీనికి విషంఎక్కడు.

ఫ్లారిడారాష్ట్రంలో "సరసోట"కు సమీపంలో "టెక్సాస్ జిమ్" అనుచోట పాములను పట్టితెచ్చి ఒకయింట్లో పెట్టి 'మిచెల్' అనే ఆయన పెంచుతూ ఉంటాడు. ఆక్కడ పాములకు ఒకదానిమీద కింకోదాన్ని ఉసికొల్పి పోట్లాటపెడుతూ ఉంటారు.

అలాటిపోట్లాట ఒకటి జరుగుతూఉండగా తీసినఫోటోలే ఇక్కడిచిత్రాలు. ఇది పొడలపాముకూ, నీలిరంగు పాముకూ పోట్లాట. నీలిరంగుపాము పొడలపామును సులువుగా లొంగదీసి చంపేయగలదు.

౧. పోట్లాట ప్రారంభము. కుడివేపు మిచెలు నీలిరంగుపామును నేలమీదికి విడిచిపెడుతూ ఉన్నాడు. ఆతడి అనుచరుడు-ఎడమవేపు-పొడలపామును కొక్కెపు కర్రకొనకు తగిలించి పట్టుకొనిఉన్నాడు.

౨. నీలిపాము చుట్టచుట్టుకొనిఉండే పొడలపాముమీదికి దూకుతూ ఉంది.

3. నీలిపాము పొడలపాము మీదికి మాటిమాటికి దూకడము, తలవిసరడము, చుట్టబెట్టుకోవడమూను. పొడలపాముకు దిక్కుతోచకుండా పోతుంది.

౪. నీలిపాము పొడలపామును నోటికి అందకుండా ఉండేటట్లు చుట్టపెట్టుకుంటుంది. పొడలపాము ఏమీతోచకుండా తల మీదికెత్తి అల్లలాడిపోతుంది.



౪ 

౫ 

౫. నీలిపాము ఇప్పుడు పొడలపామును బాగా చుట్టపెట్టేసి ది. పొడలపాము నీలిపాముకు లోబడి

౬ 

పోయింది. నీలిపాము దానితలను పండ్లతో నొక్కడానికి సిద్ధంగా ఉంది.

౭. తల నోట్లోకి చిక్కిందంటే ఇలాగా మింగి వేయడమే పొడలపామును అది.

౮. జయించిన నీలిపాము. దీనివల్ల మనుష్యునికి ఏలాటి అపాయ మూ లేదు. పొడలపాములనూ, నీటిలో ఉండే (ఆరాష్ట్రిల్లో) 'మొకా



సిక్' అనేజాతి పాములను చంపి ఇది మనుష్యుడికి చాలా ఉపకారంచేస్తుంది.

(పాపులర్ సైన్సు)

---

## అమెరికాలో వెదురు సాగు

కొన్ని ఏండ్లకు పూర్వము అమెరికా దొరతనమువారు ధాన్య వ్యవసాయమును తగ్గించి, అడవులను పెంచి, లాభమును పొందవలెనని సంకల్పించినారు. కావున వెదురునుకూడ నాటి పెంచుటకు ప్రజలను ప్రోత్సహించుచున్నారు. అమెరికా దక్షిణరాష్ట్రములలో వెదురు పెరుగుట కుపయుక్తమగు బీటినేల ౫ కోట్ల యెకరముల కెక్కుడుగనున్నది. ఇప్పటికప్పుడే జార్జియా,



౧. పెద్ద వెదురు గుమి. 'సవనా' సమీపమున దొరతనపు వ్యవసాయశాఖవారు పైరుచేసినది. ఇక్కడ పలుదినుసుల వెదురుజాతులను గూర్చి పరిశోధనలు చేయబడుచున్నవి.

ఫ్లారిడా, కాలిఫోర్నియాలలో వెదురుతోటలు చాల వరకు వృద్ధినొందినవి. కుట్టుకారువారందరు సంఘము

లుగ చేరి యీ తోటలను వృద్ధిచేయుటకు పాటుపడు చున్నారు. అనేకులు వెదురునారు పోసి, మొక్కలను తోటలు వేసికొనువారికి విక్రయించుచున్నారు. ఇది వర్తకముగా సాగుచున్నది. వెదురు పైరగు పొలమును పరీక్షించుకొనువారికి దొరతనపు వ్యవసాయశాఖవారు నారును ఊరక పంచిపెట్టుచున్నారు. దక్షిణరాష్ట్రము లలో నీ వెదురుతోటలు అపరిమితముగ వృద్ధినొందు చున్నవి.

సంయుక్తరాష్ట్రములందు వెదురును చక్కగా పైరుచేసి వర్తకము సాగింపవలెనను తలంపుతో మంచి జాతులను సంపాదించుటకయి వాషింగ్టనునుండి పలువురు ప్రముఖులు బయలుదేరి దూరపు తూరుపుదేశములం (Far East)దన్నింటను తిరిగినారు. ఇంచుమించు ౨౫ వెదురుజాతులను తమదేశమునకు కొనిపోయినారు. అనేక విధముల పరీక్షలు చేసి చూచినారు. వానిలో అక్కడి భూసారమునకును, శీతోష్ణస్థితికిని సరిపోవు జాతి ఒకటి లభించినది. దానినే అచట ఎక్కువగా పైరు చేయుచున్నారు.

తృణజాతియగు వెదురు ౧౨౦ అడుగుల ఎత్తున కును ఎదుగుట కలదు. దాని మొదటిచుట్టుకొలత మూడడుగులకు మించుటయు గలదు. వానకాలమున నది దినమున కొకయడుగువంతున నెదుగును. వెదురుతోటలలో చేసిన బాటలను మాటిమాటికి పరీక్షించి తెరపి చేసుకొనుచుండవలెను. ఒకనెలదినములు ప్రాల్మాలిన యెడల గుబురుకుని బాటలు మాసిపోవును. ఒక నెదుటి కుదుట చక్కని, తిన్నని వెదురుమొక్కలు నూటి వరకు పుట్టి ఇంచుమించు ఎనిమిది అంతస్తుల ఎత్తునకు ఎదుగును.

వెదురు మిక్కిలి అరుదుగా పూచును. కొన్ని జాతులు ధాన్యమునుపండును. వెదురుధాన్యము వరిగింజల వలె నుండును. భరతఖండవాసులు కొందర కది యాహార ముగ నుపయోగపడును. మరికొన్ని జాతులు ఆపిలుపండును తలపునకు తెచ్చునట్టి పండ్లను పండును. వానిని కాల్చి తిందురు. మఱియు దూరపు తూరుపుదేశములవారికి లేత వెదురుమొక్కలు ముఖ్యమయిన శాకము. దానిని తోటకూరవలె వండుకొని తిందురు.



౨. (ఎ) ౨౨ దినములలో ఇరువదడుగుల ఎత్తున కెదిగిన గడ.

(బి) వెదురువేరు. పెన్సిలు ఊనినచోటున మొక్క మొలచుకన్ను కలదు.

ఆహారయోగ్యమయిన వెదురుజాతితోటలు జపానులో నూరేండ్లకుపూర్వపువి కలవు. జపానువారు వానకాలమున ఇంకను పైకిరాని మొక్కలకోసము నేలను కుల్లగించుచుందురు.

ఇటీవలనే ఒకానొకప్రముఖుడు వెదురుతో చేసిన ౧౦౪౨ వస్తువులను ప్రదర్శించినాడు. గొట్టములు, కొవ్వువత్తులు, కత్తులు, అల్లికవస్తువులు, కలములు, నీటి

గొట్టములు, స్ప్రూనులు, బుట్లు, పంజరములు, బెత్త ములు, పిల్లనగ్రోవులు, విండ్లు, అమ్ములు, విసనకర్రలు, మోకులు, పారకలు, సారాయము, పటికపంచదార - ఇంకను ఎన్నియోవిధములయిన వస్తువులు వెదురువలననే తయారు కావలసినవి. కొన్నిజాతుల వెదురుటాకులు చాలపెద్దవి. వానితో నిండ్లను కప్పుకొందురు గూడలు, గొడుగులు మొదలయినవానిని చేయుదురు. తిన్నని నిడుదగడలను, కనుపులను బోలుగ డొలిచి, నీటిగొట్ట ములుగను చేయుదురు. ఇట్టిగొట్టములను ఒండొంటితో కూర్చి మైళ్లకొలదిదూరము నీటిని కొనిపోవుదురు. భారత దేశమునందలి హిమాలయప్రాంతములవారు.

ఫిలిప్పైను ద్వీపములలో ఒకానొక వాద్యము కేవలము వెదురుతో తయారుచేయబడినది కలదు. ప్రపం చమున నట్టిది ఒక్కటియే నట. వెదురు పైభాగపు కట్టి పేడుతో వాడివాదరగల కత్తులు చేయుదురు. తూర్పు నాటివారు వెదురుబియ్యముతో సారాయమును వంతు దురు. మొక్కలను ద్రాక్షారసమున నానవయిచి ఊరు గాయ చేయుదురు. పంచదారపాకముతో వండి పటిక



(బి) వంటకు సిద్ధముచేసిన వెదురువేరు, మొక్కలు - వానిముక్కలు.

పంచదార చేయుదురు ఇటీవలనే అమెరికాలోనికి ప్రవే శముకనుచున్న ఈవెదురులేకున్నచో, ముప్పదికోట్లకు మిగిలినతూరుపుప్రపంచమువారికి జీవనము జరుగుట కష్ట సాధ్యమయిపోవును. ఒకానొక సుప్రసిద్ధ వ్యవసాయ శాఖోద్యోగి "పసిఫిక్ మహాసముద్రమునకు ఒకవైపున కోట్లకొలది జనులకు వెదురు కేవలము జీవనాధారమయి యుండ ఇంకొకవైపున ౧౨ కోట్లమంది చేపలుపట్టు చువ్వలుగ మాత్రము దాని నుపయోగించుకొను చుం డుట వింతవిషయమే" అన్నాడు.

భూమధ్యరేఖ ప్రాంతదేశముల కన్నింటికి చాలి నంత వెదురును న్యూయార్కువర్తకుడొక్కడే దిగుమతి చేయుచున్నాడు. వానిలో ఎక్కువపాలు చేపలుపట్టు చువ్వలకోసము వినియోగపడుచున్నది. క్రొత్త ఉపయో గములు కొంచెము కొంచెముగా ఇప్పుడిప్పుడే తెలియ నగుచున్నవి. ప్రతిదినము క్రొత్తవస్తువులను తయారు చేయ గోరువారు క్రొత్తజాతి వెదురుకోసము ఆ వర్తకు నొద్దకు పోవుదురట. అమెరికావారు వెదురుతో బొత్త ములను, ఆడువారి కాలిజోళ్ల మచ్చు దిమ్మలను, నార వస్త్రులను మాత్రము తయారు చేసిరి. బొంగులలో గచ్చు నింపి వాటితో గోడలు కట్టుదురు.



౩. (ఎ) శిథిలమయిపోవుచున్న కుదుటినుండి మొలిచినమొక్క.

ఏడాదికి పది లక్షల పౌనుల వెదురుబద్దలు తూరు పునాటినుండి ఈ దేశములోనికి దిగు మతి యగుచున్నవి. వ్యవసాయశాఖవారు వెదురుసా గును హెచ్చుచేసి దేశమునకు కావలసిన వెదురులోచాల పాలు సరపరా చేయగలమని తలంచుచున్నారు.

అమెరికాదొరతనమువారి ననుసరించి ఇతర పడు మటి దేశములవారుకూడ పెద్ద ఎత్తుననే వెదురును సాగు చేయుచున్నారు. ఫ్రాన్సు దక్షిణశాఖలలో వెదురు అధికముగ వృద్ధినొందుచున్నది. రష్యాలోకూడ పరిశోధ నాలయములు చాల ఏర్పడినవి. వెదురుపొదలు విరివిగ పెరుగుచున్నవి.

కాగితమునకు కరవువచ్చినపుడు వెదురు దానిని పోగొట్టుటకు చాల ఉపయోగపడును. ఈనెలు పొడవుగ నుండు వెదురు ఫ్రాన్సులో కాగితములుచేయుట కప్పుడే

ఉపయోగింపబడుచున్నది. కాని చౌకగా అమ్ముటకు చాలునంత అధికముగా కాగితమును తయారుచేయుటకు సాధ్యముకాకున్నది. తూర్పుప్రదేశములనుండి ఓడలకొలదిగా తెప్పించుకొను వెదురుజాతులలో ఏరెండుజాతులు కాని రాసాయనికవ్యావృత్తికి లొంగకపోవుటయే ఇందుకు కారణమందురు. ఆదేశములోనే ఒకేజాతి వెదురు దొరకునట్లయిన నీబాధ నివారణకాగలదు.

వెదురు ప్రత్యేకము ఉష్ణదేశములయందే పైరగునది అనేకులు తలతురు. కాని, వాస్తవమునకు శీతకాలమున కాండములు విరిగిపోవునంత బలువుగ మంచుపడునపుడు చక్కగా వృద్ధిపొందు జపానుజాతివెదురు ఒకటి కలదు. అమెరికాలో పైరగు గట్టి వెదురు జాతులు కొన్ని అయిదు డిగ్రీల శీతోష్ణస్థితియందును వృద్ధిపొందును. శూన్యాంక శీతోష్ణస్థితియు అంతకంటెను తక్కువ శీతోష్ణస్థితియు కల శీతకాలములందుకూడ అల్పాల్పముగనే హానికలిగినది. చివరకు శీతకాలమున అయిదు డిగ్రీలకు తక్కువకాని శీతోష్ణస్థితిగల ప్రదేశములు వెదురుసాగునకు చాల అనుకూలముగ నుండునని నిర్ణయింపబడెను.

ప్రత్తి చక్కగా పండెడు పొలముల నన్నింటను వెదురు బాగుగా పైరగును. అమెరికాలో ఇట్టి ప్రదేశములు చాలప్రాంతములయందు కలవు.

అమెరికాలో 'సవనా'కు కొన్ని మైళ్లదూరమున చాల పెద్ద వెదురుపొద ఒకటి కలదు. అది ఒక ఎకరా విస్తీర్ణముకల ప్రదేశమును ఆక్రమించుకొనియున్నది. దానియందు వెదుళ్లు గుంపులుగుంపులుగా పుట్టి నలుబది మొదలుకొని అరువది అడుగుల వరకు ఎదిగియున్నవి. ఆపొద ౨౫ ఏండ్ల కెక్కుడగుకాలమును డిపుడు ఆయా కాలముల శీతోష్ణస్థితులవలన కలుగు మార్పులకు చెక్కుచెదరకుండ నున్నది. కాలిఫోర్నియాలో బేకర్సుఫీల్డు సమీపమున పెద్దపొద ఇంకొకటి కలదు. పండ్రెండేండ్ల నాడునాటిన ఒక్కటేమొక్క అంత పొద అయినది. ఫ్లొరిడాలో క్రిజెంటునగరమునొద్ద పైరుచేసిన బంగాళదేశపు వెదురువలన, పదేండ్లకుమించినకాలమునుండియు ఆప్రాంతములవారికి చేపలగాలపుచువ్వలు లభించుచున్నవి. ఫ్లొరిడా శీతోష్ణస్థితి, భూసారము బంగాళపు వెదురు పైరగుటకు చాల అనుకూలముగ నుండునని పరీక్షించి నిర్ణయింపబడెను.

(బి) మొలకెత్తుచున్న వెదురు వేరు. కొన్ని అంగుళములు ఎదిగినమొక్కను చెరుసగముగా నిలువున చీల్చి చూతుమేని సిద్ధముకానున్న గడ కణుపులు సూక్ష్మముగా కానవచ్చును.





౪. (ఎ) జావాలో కేవలము వెదుళ్లతో కట్టిన ఊయాల వంతెన. తూర్పుదేశములవారికి వెదురువలన అన్నపానములు, ఆశ్రయము, వస్త్రములును లభించుచున్నవి.

వెదురుపంటము అది పైరగు భూమియొక్క సారమునుబట్టి మారుచుండును. భూసారమున భాస్వరామ్లము, యవక్షారము కలిసియుండినయెడల వెదురు దృఢముగనుండును. తినుటకుపయుక్తమగు వెదురునకు ఇసుకనేల ఎత్తినది.

కొన్నిజాతులు చెమ్మగల పొలమున పైరగును. అనేకజాతులు సత్తువగల చక్కని పొడినేలయందు బాగుగా వృద్ధినొందును. ఇంచుమించు నాలుగడుగుల లోతువరకు దిగు వెదురువేరులు కావలసిన చెమ్మను వర్షోదకమునుండియే గ్రహించుకొనును. గట్టి రేగడనేల, చట్టునేల పనికిరాదు. వెదురుపొదలు ఒకమారు చక్కగా పైరగునేని తరువాత వానివిషయమున వ్యయముగాని, శ్రద్ధగాని ఎంతో పనిలేదు. తూరుపుదేశమున చక్కగా పైరయిన ఒక్క వెదురుపొదవలన ఎకరమునకు 3౦ మొదలు ౪౦ డాలరుల (౭౫ రు – ౧౦౦ రు) వంతున ప్రతివత్సరమును ఆదాయము రావచ్చును.

వెదురును విత్తులువిత్తి పైరుచేయుట లేదు. వేళ్లనుండి మొలచిన మొక్కలనుగాని, వేరుముక్కలను గాని నాటెదరు. అవి చిగిరించి కొంచెమెదుగును. వేళ్లు నాటుటకు పూర్వమే, ఫిబ్రవరి మార్చి నెలలలో ఆ మొక్కలు నారుతోటలనుండి ఎగుమతిచేయబడుచున్నవి.

వానిని రెండుగంటలసేపు నీటిలో నానబెట్టి రెండడుగుల దూరమున కొక్కటిలెక్కను వరుసలుదీర్చి నాటుదురు. నాటిననాటినుండి కొన్నినెలలవరకు వానికి నీరు చాల ఆవశ్యకము. తరువాత అంతగా పనిలేదు చెమ్మచాలనియెడల మొక్కలు ఎండిపోవును కావున మాటిమాటికి వేళ్లమీద నీరు చల్లుచుండవలెను.

ఇదిగాక కలుపుమ త్రవ్వుచుండవలెను. వేరేమి చేయ పనిలేదు. మొదటి ఋతువు చివరకామొక్కలు రెండు మూడడుగుల ఎత్తున కెదుగును. రెండవయేటి వసంతమున మొదళ్లయందు మట్టియుండునట్లుగ ఆ మొక్కలను త్రవ్వితీసి తోటలలో నాటుదురు. పొలమును సత్తురచేసి, మొక్కకు మొక్కకు నడిమిచోటును కసవుగాదముతో కప్పిపెట్టవలెను. మెరకపొలమున వేరు నేలలోనికి దిగునట్లును, పల్లపుపొలమున మట్టి ప్రోగులుపోసి ఆ ప్రోగులమీదను మొక్కలు నాటవలెను. పెద్ద వెదురుజాతివేళ్లు ఒక ఋతువుననే అన్నివైపులను ౧౫ అడుగుల దూరమువరకు పాకును. ఆవేళ్లనుండి మొక్కలు లేచి అన్నియు పొదగా గుబురుకొనిపోవును. కావున మొక్కకు మొక్కకు నడుమ ౧౫ అడుగులు ఎడముండునట్లు నాటవలెను. చిట్టి వెదురుజాతికి ౮ అడుగులుండిన చాలును.

వేళ్లనుండి లేచిన మొక్కలనన్నిటిని మూడేండ్లకాల మట్లే ఎదుగనీయవలెను. ఆవల బాగుగాఎదిగి లావెక్కి గట్టిపడిన గడల నన్నింటిని నిలిపి సన్నగా దుర్బలముగా నున్నవానిని త్రుంచివేయవలెను. ఇట్లొనరించుట వలన పెద్దవి మఱింత ఏపుగా నెదుగును.

చక్కగా నాటి పెంచినయెడల మొక్కలు రెండవఋతువున, మొదటి ఏడాదిలో నున్న పరిమాణమునకంటె రెండింతలు కాగలవు.

తరువాత ఏయేటికాయేట అంకురించు వానిపొడవును, లావును క్రమముగ హెచ్చుచుండును గరిష్ఠపరిమాణము నందుకొనువరకు. పెద్దవెదురునకీ క్రమము ౧౫ ఏండ్లకు పూర్తియగును; చిట్టి వెదురుజాతులకు ౮ ఏండ్లలో తీరిపోవును.

గడలావు మొదటికారుచివర కెంత ఏర్పడునో అంతలావుననే నిలిచిపోవునుకాని మఱి లావెక్కదు. ఈ సంగతి కొందరికి మాత్రమే తెలియును. సామాన్యముగా చెట్లు ఏటికేడు పెరిగి పెద్దవగుచుండుట పరిపాటి. వెదురుమాత్ర మట్లుకాదు. అది పెరుగవలసినయంతయు ఒక్కమారుగనే – మొదటియేడాదిలో అది పెరుగుకాలముననే – పెరుగును. మఱియు వానిలావుకూడ, అది కొన్ని అంగుళములయెత్తున నున్నప్పుడెంతయుండునో పూర్తిగా ఎదిగినతరువాతను అంతయేయుండును.

వెదురుజీవితము ౫ మొదలుకొని ౧౦ ఏండ్లవరకునే. మూడేండ్లవరకు గడ కుండవలసిన యంత గట్టితనము ఏర్పడదు. అంతకుపూర్వము గడను నరకివేసినయెడల దానితరువాతి జీవితము తరిగిపోవును. నాలు

గేండ్ల కెక్కుడు కాలము నరకకయుండినయెడల గడ పెలుచెక్కి ఎందుకును పనికిరాకపోవును. వెదురుపై పేను ఖనిజద్రవ్యములలో నిండియుండుటవలన గొడ్డలితో గడను నరకునప్పుడు తరచు నిప్పురవలు ఎగురు చుండును.

వెదురు ఏటికేడు ఎదుగునది కాదు కావున దానివయస్సును సరిగా నిర్ణయింపవలనుపడదు. సావకాశముగ వెదురు ఇతర వృక్షములందు ఏర్పడు వలయము లనుబట్టి వానివయస్సునకు లెక్క కట్టవచ్చును.

అన్ని వెదుళ్లను సామాన్యముగా ఆగస్టునెలలో నరకవచ్చును. ఏడువదలి యేడు మోసులెత్తు వెదురు జాతులను రెండేండ్ల కొకమారు నరకవలెను. కాని రెండవ బుతువు గడచినతరువాత ఏటేట నరకుటవలన చెరుపుకలుగదు ఏజాతి వెదురునకు గని అని కొందరి మతము. కొన్నేండ్లకు పూర్వము వెదు రింకను పచ్చిగ నుండగనే నరకవలెనని తలంచెడివారు. ఇప్పు డట్లుకాదు; బాగుగా ఎండినతరువాత నరకుటయే శ్రేష్ఠమని పరీక్షించి నిర్ణయించినారు.

ప్రోదిగా ఎదిగిన వెదురు పొదనుండి ఏడాదికి ఇంచుమించు నూరుగడల లెక్కను ఏబదియేండ్లవరకు లభించుచుండును. మొదటి రెండేండ్లకు తరువాత వానికయి మనము పడవలసిన పాటు లేదనియే చెప్పవచ్చును. వేరు విచ్చుచునపుడు మాత్రమే వానికి నీరుపోయుట, కలుపుత్రవ్వుట మొదలయిన పను లొకకొన్ని యావశ్యకము లగుచున్నవి.

వెదురు పైరుచేయువారు దానితోపాటు కోళ్లను పెంచి అందువలనను లాభమును పొందవచ్చును. ఆకులు, రెమ్మలు అలుముకొనియుండు సన్నని లేతపొదలనీడను కోళ్లు చల్లగా సంచరించుచుండగలవు. వానికి ప్రత్యేకము గూళ్లు కట్టవలసిన పనిలేదు.

గుమ్మములముందు చలువకోసమని వేసికొను పందిళ్లనల్లుకొనుటకును, తోటలలో పొదరిండ్లకును, మరియు నలంకారార్థమును నితరనిర్మాణములకును పనికివచ్చు వెదురుజాతి విశేషముగా పైరుచేయబడుచున్నది. అమెరికా, ఇంగ్లాండులలో ఈజాతి వెదురు వాడుక చాల యేండ్లనుండియు కలదు.

ఇటీవల దొరతనపు వ్యవసాయశాఖవారు ఉష్ణ భూములలో సంచరించి క్రొత్త వెదురుజాతులను 'సవనా'కు కొనితెచ్చినారు. వానిని ప్రత్యేకముగా నాటి, గుర్తుంచుకొని ప్రత్యేకము వానిగుణవిశేషములను పరీక్షించుచున్నారు. ఈ పరీక్షవలన దక్షిణప్రాంతములందు బాగుగా పైరుకాదగిన వెదురుజాతిని కనుగొనవచ్చునని పరిశోధకుల విశ్వాసము.

దొరతనమువారు పైరుచేయుచున్న వెదురుగడల పొడవు ౧ మొదలు ౫౦ అడుగులవరకు నుండును.

ఆహారయోగ్యమగు వెదురు చాల అందముగ నుండును. గట్టివెదురు జాతులవలెనే అదియు పొడవుగ నెదుగును. నల్లమొక్కలుగల జాతి – నల్ల – వెదురుతప్ప తక్కినవన్నియు పచ్చిగానున్నప్పుడు పచ్చగానుండును. ఎండునప్పటికి పసుపురంగునకు మారిపోవును.

కొన్నియేండ్లకు పూర్వము దొరతనమువారు వెదురు మొక్కల దిగుమతిని నిషేధించినారు. మొక్కలతోపాటు తెగుళ్లుకూడ దేశములోనికి ప్రవేశించునను భయమే ఈ నిషేధమునకు కారణము. అప్పటినుండియు దొరతనమువారే వెదురుపైరుచేయువారి కెల్లరకును మొక్కలను సప్లయిచేయుచున్నారు. ప్రకృతము మరియు పలుచోటులనుకూడ మొక్కలు దొరకుచున్నవి.

వెదురును గురించి అనేకసంవత్సరముల కాలము నుండి గావించిన పరిశోధనల ఫలముల వివరములు దొరతనము *వారియొద్ద దొరకును.

ఇప్పటికి ప్రపంచమున ఐదువందల వెదురుజాతులను గూర్చి పరిశోధనలు జరిగినవి. ఆ జాతులలో మూడింట రెండుపాళ్లు ఏషియాలోను, ఆచేరువదీవుల

* చిరునామా:
The office of Foreign Plant Introduction of the Department of Agriculture in Washington D. C.

లోను ఉత్పత్తి చెందినవే. ఏటేట అమెరికాకు కావలసిన వెదురు ఆప్రదేశములనుండి ఎగుమతి యగుచుండును. అమెరికాలో పెద్దయెత్తున వ్యాపారమును సాగించుటకు చాలునంత వెదురును పైరుచేసి ఉత్పత్తి చేయుచుండుటవలన ఆదేశమునకు కావలసిన వెదురంతయు నక్కడనే లభించుచున్నది. మరియు నిందువలన బీటిపొలములు ఫలవంతము లగుచున్నవి. అమెరికా వ్యవసాయమున కొక నూతన పరిశ్రమయు సమకూరుచున్నది.

[పాపులరు సైన్సు, ఫిబ్రవరి '37]

---

## వజ్రము-దానిపోబడి-వజ్రకరూరు

[౧౯౩౭ ఫిబ్రవరి నెల "మాడర్న్ రివ్యూ"లో 'వజ్రము - దానిపోబడి' అనేవ్యాసం ఒకటి—పి. (పింగళి?) వెంకయ్యగారు వ్రాసింది ప్రకటింపబడిఉంది. వజ్రకరూరులో వజ్రాలగనిని కనుక్కోడానికి వెంకయ్యగారావ్యాసంలో కొన్నిసలహా లిచ్చారు. అసలుగని తెలిసినా, తెలీకపోయినా గని కనిపెట్టడానికి పనిచేసేవారికి వ్యక్తిగతంగానయినా లాభంకలగవచ్చు ఏ ఒకటో రెండో వజ్రాలు దొరికితే. అయితే, ఆవజ్రాలుదొరకడం అనేది అదృష్టంమీద ఆధారపడి ఉండడం తప్పదు. ఏమీ దొరక్కపోయినాకూడా శ్రమగానీ, వ్యయంగానీ ఏమంత ఎక్కువకాదు. కాబట్టి, చింతించడం అవసరంలేదు. అందుచేత భూగర్భశాస్త్ర జ్ఞానంగలవారు- ముఖ్యంగా పట్టభద్రులు - వెంకయ్యగారి సలహాలను అనుసరించి అందుకు పనిపూనుకోవచ్చు.

వేలకు వేలు సొమ్ము ఖర్చుచేసి పట్టభద్రులయిన యువకులు ఎందరో మనదేశంలో ఉన్నారు. ఒక దమ్మిడీ సంపాదన కయినా ఎక్కడా అవకాశం కనుపడడం లేదు; వాళ్లకు పాపము! ఉద్యోగసంపాదనకోసంకూడా ఎంతోసొమ్ము ఖర్చుపెడుతూఉన్నారు వాళ్లు. ఊరూరూ తిరుగుతూ నానాపాట్లు పడుతూ ఉన్నారు లాభం ఏమీ లేకపోయినా కూడ. అలాటివాళ్లు తమఅదృష్టాన్ని పరీక్షిద్దామన్న భావంతో నయినా వజ్రకరూరులో వజ్రాలగని కనుక్కోవడానికి ప్రయత్నం చేయడం మంచిది. వజ్రాలగని కనుపడిందా అదృష్టవశాత్తూ, తమ భాగ్యమే కాదు దేశభాగ్యమే పండినట్లవుతుంది.

పి(ంగళి?) వెంకయ్యగారు భూగర్భశాస్త్రంలో మంచిప్రవేశమూ, అనుభవమూ ఉన్నవారు. వారివి పొల్లుమాటలు కావు. వాటిని పాటించడంలో చెరుపు ఏమీ లేదు. లాభిస్తే వారుచెప్పినట్లు అనేకవిధాల లాభాలు కలగడం తప్పదు.—సం. భారతి.]

వజ్రకరూరు అనంతపురంజిల్లాలో ఒకగ్రామం. ఆగ్రామం చుట్టుపట్టు పొలాల్లో వజ్రాలు అప్పుడప్పుడూ దొరకుతూ ఉండడం మామూలు. కాని వాటి పుట్టుకచోటు మాత్రం ఎవ్వరికీ ఇంకా తెలిసిందికాదు. భూగర్భ శాస్త్రజ్ఞులు- దొరతనం ఇలాకావారు కాని, వర్తకుల ఇలాకావారు కాని- ఎవ్వరూ కూడా ఆ విషయం తెలుసుకోవడానికి ప్రయత్నించారు కారు. అసలుగని ఉండేచోటు తెలియందీ నమ్మకంతో పెట్టుబడిపెట్టి ఆ ప్రాంతాల్లో వజ్రాలను తీయించడానికి ఎవ్వరూ పూనుకోరు. మంచివజ్రం ఒకటి దొరికినచోట పదినిలువుల లోతు తవ్వి వెతికి పరిశోధించినా ఇంకొకవజ్రం కనపడదు. దొరకినవజ్రం అసలు అక్కడపుట్టిందయితే కదా మరి! అక్కడివజ్రాలు ఏ కొండరాతి గనిలోనో పుట్టి ఆకొండ కాలక్రమాన్ని శిథిలమయిపోగా ఆచుట్టుపట్లకు, పెద్దగాలీ వెల్లువా మూలాన కొట్టుకుపోయి అక్క డక్కడా నిలవతాకినవే కావాలి. అందుకనే దొరికే వజ్రాలన్నీ ఒకచోట దొరకడంలేదు. వజ్రాలు ఖనిజాలన్నింట్లో గట్టివి, బరువయినవీ కాబట్టి, అసలు గని అంతా రూపుమాసిపోయినా, వజ్రాలుమాత్రం దూరానికి చెదిరిపోకుండా చుట్టుపట్లనే నిలిచిపోయినవి,

అవి దొరకడంకూడా ఒక పాయనెంట కాకపోవడం చేత, వాటి పుట్టుకచోటును ఆ జాడనపోయి కనిపెట్టడానికి వీలుకాలేదు. దొరికేవజ్రాలయినా ఎప్పుడో ఏమూలనో ఏఒక్కటో మాత్రమే. అందుచేత అసలుగని తెలియనంతవరకూ వజ్రాలకోసం పెట్టుబడి పెట్టడం కేవలం నష్టదాయకమే. అదృష్టాన్నే నమ్మి కొన్నిచోట్ల ఎక్కడయినా సులకను బండ్లకొలదిగా గాలించి చూడవచ్చు. కాని అక్కడ ఏవజ్రమో, పటికమో కూడ దొరకక్కపోవచ్చు. దొరుకుతుందన్న నమ్మకం ఏమాత్రములేదు. అందువల్లనే పడమటిదేశాల వర్తకులు ఎవళ్లూకూడా ఇప్పటికింకా ఇక్కడ అట్లాగాలించి చూడడానికి సాహసించలేదు.

౧౯౩౬ జూనులో వజ్రకరూరికి అయిదుమైళ్ల దూరంలో ఉండే కడమలకుదురు అనే గ్రామంలో ఉండే బోయవాడు కూలికి వరిగపైరు కోస్తూఉంటె ఆ పొలంలో వాడికి పటికంవంటి రాయి ఒకటి దొరికింది. దాన్ని వాడు అలా పడవేశి పెట్టాడు. ఇంట్లో కొన్నాళ్లకు వాడి కయిదురూపాయలు కావలసి వచ్చింది. చూదామని వాడు ఆ పటికాన్ని తీసుకొని వజ్రకరూరికి వచ్చాడు. మొదట అందరూ అక్కడ దాన్ని పటికమే అన్నారు. అలా అంటూవుండగానే అది గంటలో ఎన్నో చేతులు మారింది. చివరకు ఒక్కడు అది వజ్రంకావచ్చు అన్నాడు. అంతే ఒకరిమీద ఒకరు తోసుకుంటూ వచ్చారు. కొందరు వర్తకులు వాణ్ణి ఒక ఇంట్లోకి తీసుకోపోయి, పైవాళ్లెవళ్లూవచ్చి సెలఎక్కించకుండా ఉండడానికి లోపల తలుపు గొళ్లెంపెట్టేశారు. పోలీసులు రావలసినట్లు ఏర్పడింది అక్కడికి. బేరంచేశి వర్తకులు ౫౦౦౦ వేల రూపాయలు బోయివాడికిచ్చారు. వాడి సంతోషం ఇంతా అంతాకాదు. సొమ్ముపట్టుకొని వెళ్లిపోయినాడు వాడు ఊరికి. మరి వారంరోజులకు చెన్నపట్టాన్నుంచి ఒక మార్వాడీ వర్తకుడు వజ్రకరూరికి వచ్చాడు. అవసరం వస్తుందేమో అని రివాల్వరుకూడా తెచ్చుకున్నాడు. ౩౦ వేలిస్తానన్నాడు. గ్రామంలో వర్తకులు ౪౦ వేలకు చిల్లిగవ్వయినా తగ్గకూడదన్నారు.

గడచిన ౧౨ ఏండ్లలో ఇలాగే ఇద్దరికి-ఒక మంగలవాడూ, ఒక పకీరు-వజ్రాలు దొరకడమూ, వాళ్లకు చెరీ పాతికవేల రూపాయలూ రావడమూ కద్దు.

నిరుడు వర్షాకాలంలో వజ్రకరూరికి ౫ వేలమంది వచ్చారు వజ్రాలు ఏరుకోపోదామని. ఒక్కళ్లకీ ఒక్కటికూడా దొరికిందికాదు. మనుష్య స్వభావం ప్రపంచం అంతటా ఒక్కటిగానే ఉండకతప్పదు. మొట్టమొదటి దినాల్లో దక్షిణ-ఆఫ్రికాలో దక్షిణపుకొసనుండే కింబర్లీకి అమేరికాలో అవతలి చివరినుండి కూడా వచ్చేవాళ్లట ఏదోఒక మంచివజ్రాన్ని వెంటనే తీసుకోపోవచ్చునన్న ఆశతో. రానూపోనూ ఏకంగా టిక్కట్టుకొనేశేవాళ్లు చాలమంది. ఏమీ దొరకక్కపోవడంచేత తిరుగుప్రయాణంలో తిండికిలేక, కప్పుకొనే కంబళ్లూ, దుస్తులూ అమ్ముకొని ఎంతో చిక్కుపడి, ఆశాభంగంతో ఇండ్లకు చేరుకునేవాళ్లట. వజ్రకరూరికి కూడ ఇలాటివాళ్లు ఏటా చాలమంది వస్తూఉంటారు. నిరుడు తంజావూరు-తిరుచినాపల్లి సగ్గరనుండీ ఆడవాళ్లు-పెద్దపట్టంచుచీరల కట్టుకున్న వాళ్లు-చాలమంది వచ్చారట మొగతోడు అనేది లేకుండానే. చాలా సాహసం చేశారు. ఆ పొలాల్లో వజ్రాలు ఏరి మూట కట్టుకోపోవచ్చునని వాళ్ల ఆశ. వజ్రకరూరులో తిండికూడ దొరకడం కష్టం. ఒకటే హోటలు అక్కడ ఉండేది. ఎక్కువమందికి భోజన సదుపాయం కలగడం కష్టం దాంట్లో. దానియజమాని కోయంబుత్తూరు బ్రాహ్మడు; ముసలివాడు. ఆయనకూడ వజ్రాలు మూటకట్టుకొని పోదామని వచ్చినవాడే మొదట. అయితే ఏమీదొరకలేదు ఆయనకు. వజ్రాలమీద ఆశవదలుకొని తిన్నగా ఆయన అక్కడనే ఒకహోటలు పెట్టుకుని ప్రజాసేవ చేసి పొట్టపోసుకుంటున్నాడు.

ఇప్పటివరకు ఎవళ్లువచ్చినా సరే తలవంచుకొని నేలకుచూస్తూ కంటికి తెల్లగా, మెరుస్తూ కనపడిన ప్రతీ రాయినీ ఏరుకోవడమూ, దాన్ని ఊళ్లోఉండే వర్తకులకు చూపించడమూనూ - అంతే. ఇంచుమించుగా ఈ రాళ్లన్నీ పటికాలే కావడంవల్ల పాపం వాటిని ఏరుకున్న వాళ్లందరూ హతాశులయిపోతూ ఉంటారు.



౧. లారల్, హార్డి
హాస్యరసాభినయమున పేరుగన్న సినీమానటకులు.



౨. పాలెట్‌గాడర్డు. చార్లీచాప్లిన్
ప్రపంచ ప్రఖ్యాతుడయిన హాస్యగాడు చార్లీ.
పాలెట్‌గాడర్డు అతనిభార్య




## శరీరస్థ రోగములను నిరూపించు విద్యుద్యంత్రము

మార్గాంతరాల ద్వారా నిరూపించడానికి అయ్యే కాలంకంటే ఎంతోముందుగా వంటిలోకి సంక్రమించిన రోగాలను విద్యుద్యంత్రంద్వారా నిరూపించవచ్చును.



ఈ యంత్రానికి 'వాక్యూం ట్యూబ్ మైక్రో వోల్టుమీటరు'(Vacuum Tube micro-voltmeter) అని పేరు. యేల్ యూనివర్సిటీ వైజ్ఞానిక పరిశోధకులు మనిషివంటిలో కలిగే మార్పులను గుర్తించడానికని దీన్ని కనిపెట్టారు. జీవశాస్త్ర సంబంధమయిన పరిశోధనలు, పరీక్షలు చేయడంలో ఇది సూక్ష్మవస్తుదర్శక యంత్రాన్ని తలదన్నవచ్చు ననుకొంటున్నారు. ఈ యంత్రాన్ని వంటికి అంటబెడితే ఇది *ఒక వోల్టులో సూక్ష్మాతి సూక్ష్మాంశమయిన పరిమాణంగల విద్యుత్తరంగాలను కనుక్కోగలుగునట. ఎన్నో జంతువులను ఈ యంత్రంతో పరీక్షించారు. ప్రతీజంతువూ ఏదోకొంత పరిమితి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేస్తుందనీ, ప్రతిజాతి జంతువులో ఉత్పత్తిఅయ్యే ఆ విద్యుచ్ఛక్తి కూడ ఒక ప్రత్యేకగుణాన్ని కలిగిఉంటుందనీ, వాటి వాటి జీవన క్రమాన్ని బట్టి యీ ప్రత్యేకగుణం ఏర్పడుతూ ఉంటుందనీ పరిశోధనలవల్ల సూచింపబడుతూ ఉంది. ఎలుకలను పరీక్షిస్తే ఇంకా ఎప్పుడో పైకి తేలబోయే వ్రణం యొక్క సూచనలు ఎంతోముందుగానే కనుపడ్డాయట. ఇలాగవంటిలోని విద్యుత్తరంగాలను గుర్తించడంవల్ల సూక్ష్మకణాలు నిరంతరం పరివర్తనాన్ని పొందుతూ ఉన్నాకూడా జీవకోట్లు తమపోలికను ఎలా కోలుపోకుండా ఉన్నవో వైజ్ఞానికులు నిరూపించ గలుగుతారనుకోవచ్చును.

---

## ద్విముఖ హృదయస్పంద పరీక్షణి

ఈ నూతనోపకరణాన్ని కాలిఫోర్నియా (అమెరికా) వైద్యులు నలుగురుకలిసి తయారుచేశారు. దీనిసాయంతో హృదయరోగ నిదానం ఎంతో సుకరం అవుతుంది. హృదయాదులయందలి స్పందనాన్ని ఇందలి ముఖద్వయంతోను పరీక్షించవచ్చును. ఒకముఖాన్ని నిశ్చలంగా ఒక్కచోటనే ఉంచి, రెండవదాన్ని అటూ ఇటూ కదుపుతూ అంతటా పరీక్షించవచ్చు. ఇందువల్ల రోగకారణమూ, తద్వ్యాప్తీ ఏకకాలంలో అవగతం



---

* 5 One-millionths of a volt.

అవుతుంది. రోగమూలకమయిన హృదయాది స్పందన వైలక్షణ్యం ఎంతమేరకలదో కూడ గుర్తించవచ్చు.

---

## నూతనరక్షక ప్లవము

సముద్ర ప్రయాణాలలో సంభవించే ఆకస్మిక జల ప్రమాదాలను తప్పుకోడానికి మరొకొత్త సాధనం వాడుకకు వచ్చింది. అది స్నానపు తొట్టిలా గుంటుంది. ఇరవై అయిదు మందికి దాంట్లో చోటుంటుంది. చుట్టూ రెండుబొద్దూ, నడమ తాటివలఊయాలా ఉంటుంది. ఊయాల అడుగున క ర్ర బ ల్ల లు అమర్చబడిఉంటవి. పెద్దతుపానులో కూడ నీటిలో పడిపోకుండ నిలువునా నిలుచుకోవచ్చు. బొద్దుచుట్టూర వెలపలివైపున రెండు దిమ్మలతాడు కట్టబడిఉంటుంది. నీటిలోపడ్డమనిషి తేలుతూఉండే రెండుదిమ్మలను అందుకొని పట్టుకుంటే లోపలికి వాణ్ణి చేదుకోవచ్చు.



౧. కర్రబల్లలు అమర్చిన వలఊయాల

౨. ఆపాయ సమయంలో రక్షకప్లవాన్ని ఉపయోగించే క్రమము.

---

## చలవకంటిజోడును అద్దంగాకూడ వాడుకోవచ్చు

కొత్తమాదిరి చలవకంటిజోళ్లు తయారయి ఇటీవల వాడుకలోకి వచ్చాయి. అవి కండ్లకు చల్లదనాన్ని ఇవ్వడమే కాకుండా ముఖంచూచుకోడానికి పనికివస్తాయి. గాజుబిళ్లలకు లోవైపున రసం పలాచగా పూయబడివుంటుంది. తీవ్రమయిన ఎండ చాలవట్టుకు వాటిమీద



ప్రతిఫలించిపోతుంది కాబట్టి వాటిగుండా నీలిరంగువెలుగు బయలుదేరి కండ్లకు చల్లదనాన్ని ఇస్తుంది. ముందువైపున వెలుగు ప్రతిఫలించడం మూలాన్ని స్త్రీలు ఆవైపును ముఖంచూచుకోవడానికి ఉపయోగించుకోవచ్చును. ఈ రెండు ఉపయోగాలూ చిత్రంలో మాడవచ్చును.

---

## ప్రయోగనాళికలను వేడిచేయడానికి కొత్త విద్యుద్యంత్రము

ప్రయోగనాళికలకు సత్వరంగానూ, నిరపాయంగానూ, వేడెక్కించడానికి చిత్రంలో కనపడేమాదిరి యంత్రం ఒకటి తయారయింది. గుర్రపులాడంలాటి ప్రత్యేక ఉపకరణంలో, ద్రావకంతో నింపిన ప్రయోగనాళికను ఉంచితే ముప్పయి సెకనులలో ద్రావకంకాగి ఉడికిపోతుంది. నిప్పంటుకునే ద్రావకాల విషయంలోకూడ మంటమీద కాచేటప్పుడంతగాభయపడవలసింది లేదు.



---

## రేడియముచికిత్స

కాన్సరు రోగులకు విద్యుద్యంత్ర సహాయమున రేడియముచికిత్స చేయుట కేర్పాట్లు చేయబడినవి. ప్రక్కనున్న డాక్టరుకుగాని, నర్సుకుగాని అపాయము కలుగకుండ విద్యుద్యంత్రము దూరమునుండియే నడుపబడుటకు సౌకర్యము చేయబడినది. గదిలోకప్పుకు త్రాసుదండమువలె నొకదండము వ్రేలాడుచుండును.

ఆదండమునుండి కప్పీలమీదుగా తీగలు వ్రేలదీయబడి యుండును. యంత్రము నడచునప్పుడు దండము ఊప



చుండును గావున నీతీగలును తదనుగుణముగా తిరుగుచుం డును. అప్పుడీతీగలు రోగిపడక దగ్గరగా నుండు రేడి యమునిలువజాడీనుండి నీసపు రేడియము బరిణెను పైకెత్తును. తర్వాత దండము ఈతీగలను ఊపుచు చక్రము వలె గిర్రున ఇటువైపుకు త్రిప్పి రోగికి కట్టిపెట్టియుండు రేడియముగ్రాహక పేటికలోనికి దింపును. దేహస్పర్శ యేమాత్రమును లేకయే అన్ని ప్రక్రియలును జరిగిపోవు చుండుటవలన రోగికిగాని, డాక్టరు మొదలగువారికిగాని అపాయము సంభవించుటకు వీలులేదు.

---

### టీసెట్టుతూకం ఒకఔన్సుకూడా లేదు

రషియను నగలవర్తకు డొకడు చిన్న టీసెట్టును తయారుచేశాడు. పక్కనఉండే మామూలు మంచినీళ్ల



గ్లాసుతో పోల్చిచూస్తే ఈసెట్టు ఎంతచిన్నదో తెలిసి పోతుంది. కప్పులు, సాసరులు, నీరుమరగబెట్టడానికీ వేడినీరు నిలవచేయడానికీ పాత్రలు, పంచదారగిన్నె అన్నీ సెట్టు పూర్తిగా ఉంది. సెట్టంతా కలిపినా ఒక ఔన్సు బరువు నిండుగాలేదు. సెట్టంతాకూడా జర్మను వెండి టీటేబిలుమీద పెట్టిఉంది. టేబిలున్నూ చాలా అందంగా చేయబడిఉంది.

---

### నూలుబండిలోనేఉంటుంది నూలుతెంచేసాధనం



చిన్ననూలుబండికి ఒక వేపు చక్రం అంచున ఒక గంటు ఉంటుంది దానికి అడ్డంగా ఒకకత్తి చక్రానికి బిగించబడి ఉంటుంది. చిత్రంలో కనుపడుతూ ఉన్నమాదిరిగా నూలు తెంచుకోవాలి.

---

### చేతిలో పట్టుకొనిపోవుట కనుకూలమైన వేషధారణ పరికరముల పెట్టె



దినమున కొకయూరు చొప్పున తిరుగుచు నాటకములలో వేషములు వేయు నటీనటులకు ఈపెట్టె యొక అమూల్యమైన వస్తువు. వేషధారణ కవసరమైన పరికరము లన్నియు నిందమర్చబడియుండును. దీనికిని తకమకోవలసిన యవసరము లేకయే దీనిసాయమున వేషములు వేసుకొనవచ్చును. పెట్టె తెరవగానే మూత లోపలివైపున నొక అద్దముండును. దానికి రెండు దీపములుకూడ జోడింపబడియుండును. విద్యుచ్ఛక్తి తీగను వానికి తగిలించినచో నవి వెలిగి ముఖమునకు కావలసిన వెలుతురును ఇచ్చును. పెట్టెలోపల బల్లవంటి భాగమున రంగులు, కుంచెలు మొదలైన పరికరము లన్నియు నుండును. ఇది దగ్గరనుండినచో ప్రతియొకడును ఎక్కడికి పోయినను మరియొకని యవసరములేక, చివరకు దీపమునకు గూడ యోచించక వేషధారణ కుపక్రమించవచ్చును.

---

## కండరములను బలపరచు వ్యాయామపు బల్ల

ఈబల్ల సహాయముతో కడుపులోను, వీపులోను ఉండు కండరములను బలపరచవచ్చును. ఈబల్లలో ఒకరోలరు ఉండును. దానిమీదుగా బల్లమీద ఒక తివాసీ వంటి చాపపరచబడియుండును. ఈరకపు వ్యాయామము నభ్యసించు వ్యక్తి ఆచాపమీద బోర్లగిల పండుకొనును. అప్పుడు బల్లలోని ఒకయంత్రము ఆడుట కారంభించును. వెంటనే బల్లకప్పుకూడ ముందుకును, వెనుకకును ఆడనారంభించును. దానితో రోలరుకూడ దొర్లుచుండును గావున దాని నానియుండు కండరములకు సంవాహన మేర్పడి అవి బలపడుటకవకాశ మేర్పడుచున్నది.



ఎత్తునకు తగినట్లు రోలరును సరిదిద్దుకొనవచ్చును. బల్లకప్పు ఊపునుకూడ ఇష్టమువచ్చినప్పుడాపుకొనవచ్చును.

---

## గాలిలోని ధూళికణములను పరీక్షించుసాధనము

దీనిమూలమున గాలిలోని ప్రమాదకరమైన ధూళికణములను మనము కనిపెట్టవచ్చును. దీనిలోనే ఒక గాలియరయు, ఒక సూక్ష్మదర్శని యంత్రమును ఉండును. ఆ గాలియరలో చెమ్మ అరయింకొకటి యుండును. గోళము వంటి యొక గాలిగొట్టముగుండా చెమ్మ అరలోనికి గాలిని కొట్టినయెడల ఆ గాలిలోని ధూళికణము లన్నియు అందలి గుండ్రని గాజు పలకమీదచేరి నిలిచిపోవును. ఆ తర్వాత ఈ సాధనము



నొక దీపపుపెట్టె మీదపెట్టి ఇందలి ధూళికణములను సూక్ష్మదర్శనిమూలముగా పరీక్షింతురు. సూక్ష్మదర్శనికి ప్రత్యేకముగ నొక నేత్రకటకము అమర్పబడియుండును. అందులో గళ్లుగళ్లుగా గీతలు గీయబడియుండును. పరిశోధకుడు ఆ గళ్లయందలి కణములను లెక్కించి వానిని ౧౦౦౦౦౦ తో గుణించి ఒక ఘనపుటడుగు గాలిలో నుండుకణముల సంఖ్యను నిర్ణయించును. ప్రమాదకరమైన ధూళికణముల బారినుండి రోగులను తప్పించుటకును, నీరోగులనుకూడ వానిబారిని పడకుండ కాపాడుటకును ఈ సాధనము మిక్కిలి యుపయోగపడగలదు. గనులలోను, సారంగములలోను, పరిశ్రమాగారములందును పనిచేయు కార్మికుల సౌకర్యార్థము ఆయాప్రదేశములందలి గాలిని దీనితో పరీక్షించి, ఆ గాలిలో ధూళి యెక్కువగా నిండియుండినచో దానిని నివారించు నుపాయములను వెతకి కార్మికులలో శ్వాసాశయరోగములు ప్రబలనీయకుండ చేయుచున్నారు.



---

## విద్యార్థుల నిర్మాణశక్తి

చదువుకొన్న చదువును సార్థకపరచవలెనను సంకల్పముతో ఈ విద్యార్థులు ఒక వేధశాలను, ఒక ఎనిమిదంగుళముల ప్రతిఫలనదూరదర్శినిని తయారుచేసినారు. తాము నేర్చిన గణితశాస్త్రమును భౌతికశాస్త్రమును వినియోగించి తమపాఠశాలరసాయనశాలలందు కూర్చొని దూరదర్శిని భాగముల నొక్కొక్కటిని వేరువేరుగ సొంతముగ తయారుచేసినారు. వేధశాలయొక్క



ఆవరణను, సంప్రాసిగోడలను నిర్మించుటకు దినముల కొలది పాటుపడి కృతార్థులయినారు. ఓడలగోడలలోని కంతలకు మూసియుండు గాజుపలకలనుకోసి ప్రతిఫలనపుటద్దమును తీర్చినారు. దానిమందము ౧ అంగుళము; వ్యాసము ౮ అంగుళములు. సుమారు ౨౦౦౦ పౌనులు తూగు ఈ గుమ్మటమును ౨౪ వంకరచెక్కలతో కూర్చినారు. వానిపైన కొయ్యతోను, పలుచని రాగిరేకుతోను కవచమును తొడిగినారు. గుమ్మటపుపను లన్నియు పాఠశాల కర్మాగారమందే ముగించుకొని సిద్ధమైన గుమ్మటమును వేధశాలఆవరణకు కొనిపోయినారు. దూరదర్శినిగొట్టమును దూర్చుటకు గుమ్మటములో తొలిచియుండు కంతకు జారుడుమూతనుకూడ ఏర్పాటుచేసియున్నారు. దూరదర్శిని యంత్రమంతయు సరియైన లెక్కలప్రకారము శాస్త్రీయముగ నిర్మింపబడినది.

——

## మోటారుయాత్రికులకు క్రొత్త సౌకర్యము

మోటారులలో దూరప్రయాణము చేయువారు రాత్రివేళలందు నిద్రించుటకు తావు వెతకుకోవలసిన యవసర మింతతో తప్పిపోయినది. ఈ క్రొత్తరకపు డేరాలను మోటారుల కప్పులపైననే వేసుకొనవచ్చును. మడచియుంచినప్పుడు వీని యెత్తు సుమారు ౧ అడుగు యుండును. డేరాచట్టము ఉక్కుతో చేయబడి పటిలముగా నుండును. దీనిని మోటారుకప్పుపైన బిగించుకొని పోవుట యాత్రికులకు పరమసౌఖ్యము. దీనిని తెరచి యుంచినచో నిశ్చింతగ స్వేచ్ఛగ ఇరువురు ఇందులో



నిద్రింపవచ్చును. డేరాను తెరచినప్పుడు మందకు పొడుచుకొనివచ్చు ఉక్కుచట్టము డేరాలోని కెక్క



టకు నిచ్చెనగాకూడ నుపయోగించును. ముందువైపు డేరాగుడ్డలో గుడ్డతోనే ఒకకిటికీ, మూత అమర్పబడి యుండును. కావున గాలికిగూడ యోచింపవలసిన యవసరములేదు. ఈ డేరాల సహాయమున ప్రయాణికులు మోటారుబండ్లు పయనించుచుండగానేకూడ నిర్విచారముగ నిద్రపోవ ననుకూల మేర్పడినది.

---

## కొయ్య ఇండ్లను మేకులులేకయే నిర్మించ వచ్చును



ఎప్పటికప్పుడు విడదీసుకొని స్థానములు మార్చుటకనుకూలముగ ఇటీవల కొయ్యఇండ్లు తయారుచేయబడుచున్నవి. ఈవిశేషమునకు తోడు మరియొక విశేషమేమన ఆయిండ్లను పొందికగా నమర్చుటకు మేకులే అవసరములేదట. ఒకవిధమైన జిగురే అంతకంటె భద్రముగా చట్టమును బిగింపగలుగునట. విడివిడిగా గోడలు, తలుపులు, కిటికీలు, కప్పు మొదలైనవి తయారుచేసి యాజిగురుతో అన్నిటిని యథాక్రమముగ అతికింతురట. ఈజిగురు అతుకులలోనికి చెమ్మను చేరనీయదట. కొయ్యను తొలుచు పురుగులను రానీదట. ఇక మేకుల కవసరమే లేకపోవునేమో!

---

## శ్రవణశక్తిని పరీక్షించు పరికరము

సూక్ష్మతమశబ్దములను గ్రహించు సామర్థ్యమును కనిపెట్టి తన్మూలముగా శ్రవణేంద్రియ శక్తిని



పరీక్షించుటకీ పరికరమును ప్రయోగించుచున్నారు. ఈశ్రవణశక్తిమాపకయంత్రము నొక చిన్నపెట్టెలో భద్రపరచియుంచి, దానినుండి కొన్ని తీగలను ఏర్పాటుచేసియుందురు. పరీక్షించువారు ఒక తీగను, పరీక్షింపబడువారు తక్కిన తీగలను చెరియొకటిగను చెవులకు తగిలించుకొందురు. యంత్రమును నడవనిచ్చినంతనే అందులోనుండి సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ శబ్దములు బయలుదేరును. అభ్యర్థులు వానిని గ్రహించి నిరూపించు విధమును బట్టి వారి శబ్దగ్రహణ శక్తిసామర్థ్యములు నిర్ణయింపబడును. ఇంకొక విధముగా కూడ దీనితో పరీక్షింప వీలగుచున్నది. శబ్దకంపనములను గ్రహించు నొక యుపకరణమును ఒక చెవిమీద పెట్టెదరు. శబ్దము లోపలికి జొరకుండునట్లు మరియొక చెవికి మూతతగిలించి యుంతురు. పరీక్షకుడేవో కొన్ని శబ్దముల నుచ్చరించును. యంత్రము ఆశబ్దముల కంపనములను మొదటి చెవికి తీగలద్వారా గొంపోవును. ఆచెవి తన శక్తిసామర్థ్యముల కనుగుణముగా నా శబ్దములను గ్రహించును. ఇదేవిధముగనే రెండవ చెవినిగూడ పరీక్షింతురు.

---

## రంగునుబట్టి పాలతరగతులను నిర్ణయించు సాధనము

ఈ సాధనమునకు కొలోరిమీటరు అని పేరు. పరీక్షింపవలసిన పాలను దీనిలో పోసి వెలుతురుకిరణమును దానిగుండా పోనిత్తురు. అట్లు చొచ్చిపోయిన వెలుతురు ప్రమాణమునుబట్టి పాలతరగతిని నిర్ణయింతురు. రంగు ఎక్కువగానుండు పాలగుండా చొచ్చుకొనిపోవు వెలుతురు ప్రమాణమున చాల తక్కువగానుండునట. రంగు తక్కువగానుండు పాలగుండా వెలుతురు ఎక్కువగా చొచ్చుకొని పోవునట.





# విమర్శనము

## ప్రతి విమర్శనము

భారతి ఫిబ్రవరి సంచికలో నా 'గృహలక్ష్మి కంఠాభరణము'పై శ్రీ సు. శాస్త్రిగారొకతీవ్రతమ విమర్శనము వ్రాసినారు. దానికిది సమాధానము.

గ్రంథమందు చిత్రము లపూర్వములని యెవ్వరు ననలేదు. అవి 'గృహలక్ష్మి'లో నప్పుడప్పుడు వెలువడి యున్నవే యని తత్సంపాదకులే ప్రకటించుచున్నారు; కాఁబట్టి దీనిఁగూర్చి శాస్త్రిగారి రిమార్కు ననవసరము.

ఇఁక వాటి గుణాగుణములఁ జర్చించి శాస్త్రిగారు వాటి నధమాధమము లనుచున్నారు; కాని యే తచ్చిత్రకారులను శ్రీయుత రామారావుగారు, శ్రీమతి కుమారీ కమలాబాయమ్మగారు మొదలైనవారు తమ చిత్రముల నితరసంచికలలోఁ గూడఁ బ్రచురించుచున్నారు: ప్రజామోదము నొందియున్నారు. వారి చిత్రములఁగూర్చి నాకు సదభిప్రాయము కలదు. ఏల యనఁగా నేను చిత్రకళలయం దుత్తమపరీక్షలనిచ్చి నా జీవితారంభమున దాదాపు పదేండ్లు చిత్రలేఖనోపాధ్యాయ వృత్తిలో నుంటిని; కాఁబట్టి చిత్రలేఖకుల కష్టసుఖములఁగూర్చి చాలవరకు ధైర్యముతోఁ జెప్పఁగలను. శాస్త్రిగారికిఁ గల చిత్రకళాపరిజ్ఞాన మెంతయో నే నెరుఁగను. కాని వారొసఁగిన యభిప్రాయమే సిద్ధాంతమగునెడల నొక్క 'గృహలక్ష్మి'యందే కాక మరే యితర సంచికలోనైన వెలువడుచున్న త్రివర్ణచిత్రములలో నూటికి తొంబదితొమ్మిది అధమాధమ తరగతిలోఁ జేరవలసినవే.

ఇఁకఁ దచ్చిత్రముల ననుసరించి వ్రాయఁబడిన వ్యాసములును 'గృహలక్ష్మి'లో నితఃపూర్వ మప్పుడప్పుడు ప్రచురింపఁబడి యుండినవియే, యిప్పు డొక్కచోట 'సుడికుచ్చు'రని శాస్త్రిగా రనుచున్నారు! ఇది వట్టి యబద్ధము. ప్రబుద్ధాంధ్రులలో నగ్రగణ్యులగు శాస్త్రిగారు 'గృహలక్ష్మి' పత్రికను సరిగాఁ జదువరనుట కీమాటయే సాక్ష్యము. నేను 'గృహలక్ష్మి'కిఁ బనిసేయుచుండిన సమయమందు సేకరించి ప్రచురించియుండిన కొందరు సతీమణుల చరిత్రములు గూడ నీ 'కంఠాభరణము'నఁ గేవల భిన్నరూపములఁ దాల్చియున్నవి. అందవి కేవల చరిత్రాత్మకములు: ఇందట్లు కాదు: ఆయా చరిత్రము లిందాదర్శములుగాఁ గొని దేశసేవ, లలితకళానైపుణి మొదలగు విషయములఁగూర్చి వ్రాసియున్నాను. ఈ కంఠాభరణ వ్యాసములన్నియును బరమాపూర్వములు!

ఆమీద నా భాషనుగూర్చి శాస్త్రిగారిచ్చిన యభిప్రాయమును పరమసంకుచితము. వ్యావహారిక భాషా విషయమున 'ఎవడి యిష్టము వారిది' యన్న శ్రీయుత గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి మాటకును "కృష్ణమూర్తిగారికి వ్యావహారిక భాష అందలేదు; దాని తత్వం వారికందలే" దనుచున్న శాస్త్రిగారి మాటకునుగల తారతమ్య మెంతయో నిర్ణయించుట యీ యుభయుల నెరింగియున్న విద్వాంసులపని. వ్యావహారిక భాషా విషయమున మేమే ప్రామాణికులమని నిలువఁబడుటకు సాహసించినవా రింతవర కెవరును గానరారు; కాని "కృష్ణమూర్తిగారు ఈ గ్రంథంలో వాడిందే వ్యావహారి



౧ పోడుగాలి

—యస్. కే. కోవరకర్.

కాంధ్రమైతే యిక వ్యావహారిక భాషావాదం వదలు కోవడం మంచిది." యను శాస్త్రిగారి మాటబట్టి చూడఁగా వారు తాము ప్రామాణికుల మనుకొను చున్నట్లు తోఁచుచున్నది. కాని యీ మాటకు వ్యావహారికభాషా పక్షమునను న్న కవికుమారులందరు నేకగ్రీవముగ నొప్పికొందురా? కల్ల! ఒకరిచెప్పులతో వేరొక్కఁగు నడచుట యసంభవము. "మాఅమ్మ అక్కయ్య నన్నే భాషలో.........అదేభాష" అను నామాటయే వారును అనవలెను గాని నైజవిరోధముగా వ్రాయలేరు. అట్లొకప్పుడు వ్రాసినను బాగుండ దది. కాఁబట్టి యీ వ్యావహారికభాషా ప్రపంచమున స్వభావానుసరణమే శరణ్యము.

ఇఁక శాస్త్రిగారు నాగ్రంథ మంతయుఁగాకున్న మానె చివర కొక్క వ్యాసమైనను బూర్తిగాఁ జదువలేదు; చూడండి "చెప్పరానిది" అనే నా వ్యాసంలో (౯౫ వ పుట)'వాడఃవీధిలోకే రాకూడ'దన్న వాక్యము మొదలుకొని ఆపేరా చివరవరకును జదువండి: అందు నాయభిప్రాయము నెంత విస్పష్టపరచియున్నానో చిత్తగించండి: దానియందు'స్వవచనవ్యాఘాత' మెచ్చటదగిలినదో చూపండి. "కళావిలాసం"అను వ్యాసమునఁగూడ నిట్లే యెచ్చటనో యేవో రెండుమూడు వాక్యములు చదివి యంతటితో విమర్శించుట పెద్దలకు ధర్మమా ? అంతే కాదు. ౬౫ వ పుటలో ౨౧ వ పంక్తి మొదలుకొన్న "అంతేకాదు లోకమనోభిరాముఁడూ.........ఉండకపోవచ్చు." నన్న యీ వాక్యము శాస్త్రిగారి కర్థము కాదట! 'ఏమిటి దీనికర్థ'మని యడుగుచున్నారు. ఎట్టి సామాన్యాక్షరజ్ఞానముగల యిల్లాలైనను ఒక్కతూరి చదువఁగనే యర్థముకాఁగల యీ వాక్యము వారి కర్థము కాదట! దాని కెవరేమిచేయఁ గలరు? ఒకప్పుడు 'లోకమనోభిరామతా' అను మందురేమో!!

పైగా 'ఏమిటి' 'మనమే' అనునిట్టి మాటలను 'ఏంవిఁట్' 'మనంవేఁ' అని నేను వ్రాయుట శాస్త్రిగారి కపభ్రంశముగాఁ దోఁచినది కాని పంతులుగా రావిషయమునఁ దమపీఠిక (౪ వ పుట)లో వ్రాసినది చూడుడు. ఐతే, నావంటివృద్ధుడు వ్యావహారికభాషనంగీకరించడమే ప్రధానమని పంతులుగా రనుకొనుచున్నట్లు శాస్త్రిగారి దివ్యదృష్టికి గోచరించుచున్నదఁట!! నేను చైతన్యపూర్ణతగల వ్యావహారికాంధ్రభాష వాడితినని వ్రాసిన బ్రహ్మశ్రీ ఆదినారాయణ శాస్త్రిలుగారు ఈ విమర్శకుల బుద్ధికి సాహసులుగాఁ దోఁచుచున్నారు.

అయ్యా, యింతేల "రొట్టెరుచి తింటేనే తెలుస్తుంది. బాగాఉంటుంది తినండి అని మాత్రము తిన్నవాడు చెప్పఁగలడు. అట్లే యీ గ్రంథము చదవదగినది. చదివిచూడండి అని నేను చదివిచెప్పతున్నాను" అని పంతులుగారు తామువ్రాసిన పీఠికద్వారా పాఠకలోకమును గోరుచున్నారు. ఒకవేళ నాయందు లేకున్నను శ్రీమంతులగు నా పండితరాజులయం దైనఁ దమకుఁగల గౌరవప్రేమ విశ్వాసముల చేతనైనను గ్రంథమును బూర్తిగఁ జదువుదురుగాక! ప్రతిసామాన్య గృహలక్ష్మియు నీగ్రంథమును జదువవలెనన్న మహదాశయమేగల్గి యెంతడబ్బైనను సరే వెనుదీయక సెలవుసేసి దివ్యసుందరముగా గ్రంథమును ముద్రించిన శ్రీ కేసరిగారి కోర్కె నెరవేర్తురుగాక! ఆవెనుక "నిస్సారం, నిరుపయోగం, పైగా బుద్ధిని తికమకలుపెట్టేదీ, దీనివల్ల తెలుగు గృహలక్ష్ముల కుపకారంకలగడం అసంభవం" అని శాస్త్రిగారు వ్రాసిన యీ రిమార్కులు సత్యము నెదుటనుంచుకొని నా గ్రంథమునకో, లేక శాస్త్రిగారి విమర్శనకో తగిలించి కృతార్థు లగుదురు గాక! కీర్తికొరకుఁగాని డబ్బుకొరకుఁగాని యాశించి నేనిది వ్రాయలేదు. దయచేసి నాపీఠిక చదవండి. తదుపరి సత్యాసత్యములను నిర్ణయించి లోకకల్యాణము కొరకు సహాయపడండి. ఇదియే నా ప్రార్థన.

పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి

---

## విశ్వరూపం

కా. కొండయ్య, ఎమ్. ఎస్ సి. వాల్తేరు, ౧౯౩౬, నెలర్పు. ౨.

ప్రకృతి శాస్త్రమభివృద్ధి జెందిన కొలదిని విజ్ఞానార్జనగూడ కష్టతరమగుచున్నది. ప్రాచీన హైందవు

లకుగాని, గ్రీసుదేశస్థులకుగాని సర్వశాస్త్ర పారంగతులగుటకును, సకల విజ్ఞానకోవిదులగుటకును అసాధ్యము గాలేదు. సుమారు ఐదారు నూరేండ్లకు పూర్వముగూడ పండితులును విద్యాధికులును తాము సర్వజ్ఞులమని చెప్పకొనుటకు సంశయింపరైరి. కాని నేడెవరైనను తాను సర్వజ్ఞుడని నమ్మినచో వానిని తప్పకుండ పిచ్చియాసుపత్రిలో వేయవలసినదే. ప్రతిశాస్త్రమునందును పుస్తకములసంఖ్య అంతకంతకు పెరిగిపోవుచునేయున్నది. నాటినన్నిటిని చదువుట యటుండ కడకు ఒక్కవిజ్ఞాన విభాగమునకు సంబంధించిన పుస్తకముల పేర్లయినను జ్ఞాపక ముంచుకొనుటకు నేడు సాధ్యముగాదు.

ఇట్టి స్థితిలో ఒక్కొక్క గ్రంథమునందలి ముఖ్యాంశములను సంగ్రహముగను, సామాన్యజనులకు గూడ నర్థమగునట్లును వ్రాయుట అత్యంతము ఉపయోగకరమైన కార్యము. ఈ విషయమున పాశ్చాత్యుల ప్రయత్నము లెంతయు ప్రశంసనీయములు. ఎట్టి దుర్గ్రాహ్యమగు విషయమునైనను వారు సర్వజన సుబోధ్యముగ నుండునట్లు వ్రాయుచున్నారు. కొమ్ములుదిరిగిన పండితులుగూడ వారిలో పామరజనులకు విజ్ఞానవిషయములను దెల్పుటకు ఉత్సాహముతో పూనుకొని శ్రద్ధతో పనిచేయుదురు. బెర్ట్రాండ్ రస్సల్ (Bertrand Russel), సర్ ఆలివర్ లాడ్జ్ (Sir Oliver Lodge), సర్ ఆర్థర్ ఎడ్డింగ్టన్ (Sir Arthur Eddington), ఎఫ్. జె. బి. ఎస్. హాల్డేన్ (F. B. S. Haldane), జ్యూలియన్ హక్స్లీ (Julian Huxely), ఆర్థర్ థామ్సన్ (Arthur Thomson), జె. జె. థామ్సన్ (J. J. Thomson), సర్ జేమ్సు జీన్సు (Sir James Jeans), మొదలగువారందరు తమతమ విజ్ఞానవిభాగములలో ఆరితేరినపండితులు; తమ యభిమతశాస్త్రాభివృద్ధికై జీవితమును ధారపోసినవారు. కాని వీరిలో ప్రతియొక్కరును తాము కనిపెట్టిన దురవగాహములగు విషయములను సర్వజనులకును అర్థమగునట్లుగ చర్చించి విశదీకరించియున్నారు. అట్టి పుస్తకములలో నొకటియగు జీన్సుదొరగారి 'ది యూనివర్స్ అరౌండ్ అస్' (The Universe around Us) అను పుస్తకసారాంశమే శ్రీ కొండయ్యగారి "విశ్వరూపం."

కొండయ్యగారు విశ్వవిద్యాలయాధ్యాపకులు. ప్రకృతిశాస్త్రమునందే కృషిసల్పి ఎమ్. ఎస్ సి. డిగ్రీని పొందినవారు. సులభముగను ఆకర్షకరముగను ఉండునట్లు తెనుగున వ్రాయ నేర్చినవారు. అట్టివారు ప్రపంచవిఖ్యాతిగాంచిన యొక ఆంగ్ల పుస్తకమును తెనుగున వ్రాయబూనినచో అది ఎంత యుపయోగకరమైన యంశమో మనమే యూహించుకొనవచ్చును. అందున కొండయ్యగారు బహుశ్రద్ధతో అత్యంతోపయోగకరముగనుండునట్లు ఈపుస్తకమును వ్రాసియున్నారు. మూలమునయున్న దురవగాహములగు విషయములనెన్నిటినో ఇందు సంగ్రహపరచియున్నారు. కొన్ని విషయములను పూర్తిగ వదలివైచినారు. విశదముగ నుండుటకై కొన్ని యంశములను స్వతంత్రముగ చర్చించియున్నారు. కొన్నినూతన విషయములను సమయానుగుణముగ మూలమునందు లేకపోయినను ఇందు జొప్పించియున్నారు.

ఆంగ్లగ్రంథముల ననువాదము చేయువారికి ఈగ్రంథము ఆదర్శప్రాయ మనవచ్చును. తెనుగున ప్రకృతిశాస్త్రపుస్తకములను ప్రచురింప బూనుకొనువారికి ఈగ్రంథమున గమనింపవలసిన విషయము లెన్నియో కలవు. విషయప్రాధాన్య మొక్కటే గాక మొత్తముగ జూచినను గూడ ఈపుస్తక మాకర్షకముగ నున్నది. పేరెన్నికగన్న శాస్త్రజ్ఞులు కనిపెట్టిన విశేష విషయములు, వారి జీవితమునందలి ముఖ్యాంశములు, పుస్తకాంతమునయున్న పారిభాషికపదములపట్టిక, ఇక నొక చక్కని యుపోద్ఘాతమే యుండినయెడల ఈపుస్తకమునకు కొదవయేలేదని చెప్పదగియుండును. ఇట్టిపుస్తకములు తెలుగున ప్రచురించుట చాలయపురూపముగాన ఇంగ్లీషురాని తెలుగువారికి ఇందలివిషయమెట్టిదో మునుముందు తెల్పుటకు ఒకచిన్న ఉపోద్ఘాతముండిన చాలబాగుగనుండెడిది. సంగ్రహముగనైన ఒక అకారాదిసూచిక ఈపుస్తకమున కేల తయారుచేయలేదో. పారిభాషికపదములందు అచ్చుటచ్చుట భేదాభిప్రాయమునకు కొంత తావుండవచ్చును. కాని ప్రకృతి

శాస్త్రగ్రంథ ప్రచుర ప్రారంభదశలో ఇట్టి లోపము అనివార్యము. గ్రంథమునందు పారిభాషికపదములను తెనుగుననేగాక ప్రక్కన ఇంగ్లీషునందుగూడ ఇచ్చి యుండిన చాల ఉపయోగకరముగ నుండెడిది.

పుస్తకమునందలి విషయమునుగూర్చి ఒక చిన్న యంశమును మాత్రము చెప్పి తీరవలయును. కొండయ్య గారు భౌతికశాస్త్ర విశేషములను విశదీకరించుటయే గాక అప్పుడప్పుడు ఈ శాస్త్రవిషయములకును ప్రాచీన హైందవ ఋషుల మనోభిప్రాయములకును ఎంత యధిక సామ్యమున్నదో వక్కాణించుచున్నారు. ఇది కొంత వరకును ప్రమాదజనకము. ఆర్ష సూక్తముల నిదివరకును ఎందరో విజ్ఞానవేత్తలు చర్చించి విశదీకరించియున్నారు. వ్యాఖ్యానకారుని శక్తికొలదిని వీనియందు క్రొత్త విషయములు బయలుదేరి యున్నను హైందవ వేదాంత సారమున కొక ప్రత్యేక వ్యక్తిత్వము గలదనుట స్పష్టము. శతాబ్దములు గడచినను ఈ వ్యక్తిత్వమునం దంతగా మార్పులు గానవచ్చుటలేదు. ఇక ప్రకృతిశాస్త్ర మన్ననో, నేడున్న మూలసూత్రములు రేపు తప్పిదము లని నిర్ధారింపబడుచున్నవి. భౌతికశాస్త్రజ్ఞుడు నేడు అణువు అను అగాధసముద్రమునబడి మునుగుచు తేలుచు నున్నాడు. ఇదివరకును పట్టుకొనుటకు గూడ భద్రమైన దేదియు చేతికి చిక్కలేదు. 'అదిగో గట్టు', 'యిదిగోతీరము' అని పలుమారు తోచుచున్నది. కాని ఇంతమాత్రముననే తోచినదెల్ల యథార్థము, మనకు దెలిసిన జ్ఞానలేశమునకును ఆర్ష సూక్తములకును ముడివెట్టువము అనుట సమంజసము గాదు. ఎవరెరుగుదురు! నేడు కొండయ్యగారు ఆర్ష సూక్తములతో సమన్వయముచేయబూనిన భౌతిక శాస్త్రసిద్ధాంతములన్నియు కొంతకాలములోనే మార్పు చెంది పోవచ్చును. అప్పు డీసమన్వయమును వదలి మరల వేరు విధముగ సమన్వయము చేయుటకు బూనుకొన వలెనా? ఎడ్డింగ్టన్ చెప్పినట్లు చాలమంది తమ నూతనసిద్ధాంతములు ఇతర విజ్ఞాన విభాగములందలి విషయములతో ఎంతవరకును అంగీకరించుచున్నవో, ఏమేమి మార్పులకు ఆస్పదమొసగుచున్నవో యను విషయము నేమాత్రమును తలంపరు. అట్లు తలంపకుండుటయే క్షేమము.

భౌతికశాస్త్ర పరిశోధనల మూలమున పరమార్థ తత్త్వమరయ సాధ్యమగునా యను అంశము ఈచిన్న విమర్శనయందు చర్చించుటకు సాధ్యముగాదు.[1] ఈ విషయమునుగూర్చి జీన్సుదొరగా రీక్రింది విధమున వ్రాయుచున్నారు.

"The question at issue is ultimately one for philosophic discussion, but before the philosophers have a right to speak, science ought first to be asked to tell all she can as to ascsertained facts and provisional hypothesis.

(ఈసమస్యనుచర్చించి విశదీకరించు భారము నిజముగ పరమార్థతత్త్వశాస్త్రమునకు సంబంధించినదే. కాని తత్త్వశాస్త్రజ్ఞులు వాక్యార్థము చేయుటకు ముందు ప్రకృతిశాస్త్రమేమేమి చెప్పగలదో — ఏయే యంశములందలి వాస్తవము సుప్రసిద్ధమైనదో, ఏయే యంశములు ఇంకను చర్చనీయములుగ నున్నవో—కనుగొనవలెను.)

కొండయ్యగారు ఆర్ష సూక్తముల చర్చవదలి పైవిధముగ భౌతికశాస్త్ర విషయములను మాత్రము దెల్పి అంతటితో సంతృప్తులై యుండినచో ఈ పుస్తకము సర్వజనామూల్యమని చెప్పదగియుండును. అట్లుగాక ఇందు వేదాంతవిచారముగూడ అందందు ఉండుటవలన ప్రకృతిశాస్త్ర మెరుగనివా రెవరైన ఈపుస్తకమును చదివినయెడల "ఇందుదెల్పిన శాస్త్ర సిద్ధాంతములకు వేదప్రమాణమును, ఆర్షప్రమాణమును గలదుగాన ఈసిద్ధాంతములు నిశ్చయములు." అని నమ్మి ఇకముందెట్టి మార్పులుకలిగినను అవి తప్పిదములనియు, కేవలము భ్రాంతియనియు తలంచుట కాస్పదముండును. పామరజన పాఠ్యములగు పుస్తకములను వ్రాయువారి బాధ్యత

౧. ఈ విషయము ఇదేసంచికయందలి "భౌతికశాస్త్రము, తత్వజిజ్ఞాస" యను నా వ్యాసమున కొంతవరకును చర్చించియున్నాను.

అత్యధికము. అప్పుడప్పుడు ప్రమాదజనకము గూడ. ఏకొంచెము తప్పిదము చేసినను తత్ఫలితముగవచ్చు హానిమెండు. జ్ఞానబోధ చేయునపుడు పామరుని బాలకునిగ నెంచవలెను. చిన్ననాడేర్పడిన ఇష్టానిష్టములు మనము పెద్దవారైనపిదపగూడ ఎంతతీవ్రముగ మనమన సులను కలతబెట్టునో మనమందర మెరింగిన యంశమే. అట్లే పామరులకు బోధించునపుడుగూడ 'ఫలానా అభి ప్రాయమే సత్యము, నిత్యము. ఇందున కొన్ని ప్రమాణ మున్న'దని నమ్మకము పుట్టించినయెడల ఇక వా రాయభి ప్రాయమునకే దాసులై ప్రకృతి శాస్త్రజ్ఞానాభివృద్ధికే పరాఙ్ముఖులయ్యెదరు. ప్రకృతి శాస్త్రగ్రంథములను దేశభాషలందు వ్రాయువారు ఈ విషయమును గమనిం చుట యత్యావశ్యకము.

ఇంతమాత్రముననే శ్రీకొండయ్యగారి గ్రంథము దోషయుత మని తలపరాదు. 'భౌతికశాస్త్ర సిద్ధాం తములు నిత్యములుగావు; అప్పుడప్ప డవి మారవచ్చును' అను నొక్క విషయము స్పష్టముగ జ్ఞాపకముంచుకొన్న జాలును, చదువరి ఎట్టి పొరబాటునకును లోనుగాక ఈ గ్రంథమునుండి అనేకవిజ్ఞానాంశములను దెలిసికొనును. కాన ఈగ్రంథ మెంతయు ప్రశంసార్హము. గ్రంథక ర్త యగు శ్రీకొండయ్యగారును, ఈగ్రంథము నచ్చొత్తించి ప్రకటించిన యాంధ్రవిశ్వకలాపరిషత్పాలకులును ఆంధ్ర లోకమునకెంతయు కృతజ్ఞతాపాత్రులు.

పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు,
(ఎమ్. ఏ., పి హెచ్. డి.)

---

(౧) మహర్షియును తత్సందేశమును
(౨) శ్రీమ దరుణాచలాష్టకము

ఇది క్రౌనుసైజున పు. ౧౩౬ పుస్తకము. ఇందు మొద టిది 'పాల్ బ్రంటన్ గారి యింగ్లీషునకు తెలుగు'; రెండవది 'శ్రీ రమణమహర్షుల వారి యరవమునకు తెలుగు' అనువాదకుడు : దోమా వేంకటస్వామిగుప్త మొదటిది వచనము; రెండవది పద్యములు, వాని తాత్ప ర్యమును.

పాల్ బ్రంటన్ 'A search in secret India' అను గ్రంథము నొకదానిని ఇంగ్లీషున రచించి ప్రక టించినారు. ఆ గ్రంథమునందలి ౯, ౧౬, ౧౭ అధ్యా యములు పాల్ బ్రంటన్ గారికి 'అంతగా తమ్ముమవశపఱచు కొన్న శ్రీమహర్షులవారితో ఏర్పడిన పరిచయమును, వారినిగూర్చి కల్గిన యభిప్రాయములను, వారితోఁగల్గిన యనుబంధమును' వారిసందేశమును వివరించును. ఇందలి వచనభాగ మా యధ్యాయముల యనువాదమే. శ్రీరమణ మహర్షులవారి మహత్త్వమును పలువు రెఱుగుదురు. వారి కనేకులు పరమభక్తులు. ఆ మహనీయుల విషయ మెద్ది యైన తద్భక్తులకు పరమానందసంధాయకము కాక తప్పదు.

అనువాదము - గద్యమును, పద్యమును - రచనమున ఆనువాదమే యనిపించుకొనుచున్నది.

గ్రంథప్రకాశకులు : శ్రీ నిరంజనానందస్వామి, సర్వాధికారి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామల.

---

మాలతీ మాధవము

ప్రకరణము - మహాకవి భవభూతి విరచిత సంస్కృతమునుండి కైలాసవాసి జనమంచి వేంకట రామయ్య ఆంధ్రీకరించినది. డెమ్మీ ౧౮౨ పుటలు. వెల రూపాయపావలా. ప్రకాశకులు జనమంచివారు, రాజమహేంద్రవరము.

ప్రాచీన సంస్కృతదృశ్యకావ్యరచయితలలో భవ భూతి మిక్కిలి ప్రసిద్ధుడు. ఇతని దృశ్యత్రయములోను ఉత్తరరామచరిత్ర పేరెన్నిక గన్నది. 'మాలతీమాధవ' ప్రకరణము ఆతని రచనలలో రెండవది; ప్రాశస్త్యము నను రెండవదియే. 'మహావీరచరితము' రచనమున తొల్లిటిదయ్యును కడపటిదే. భవభూతి నాటకము లన్నియును దీర్ఘసమాస బహుళములు. రచన ప్రౌఢము. గద్యభాగముకంటె పద్యభాగమే ఎక్కువ రసావహము; హృదయంగమము. వర్ణనలు స్వాభావికములు; వివిధ భావాలంకార విశిష్టములు.

'కైలాసవాసి' శ్రీ జనమంచి వెంకటరామయ్య గారు కవి; పండితుడు. వీరి ఖండకావ్యములు ఆంధ్రుల ఆదరణకు పాత్రములైనవి. వీ రీ మాలతీమాధవమును ఇప్పటికి రమారమి నలువదినాలుగు ఏండ్లక్రిందట తెనిగింప నారంభించి అప్పుడప్పుడు కొంత కొంత రచించుచు ౧౯౦౧ వ జూనులో ముగించిరి. ౧౯౦౨ వ డిసెంబరులో ప్రకటించిరి.

అనువాదకులు 'ఈ నాటకమును సాధ్యమయినంతవఱకు మూలానుసారముగానే తెనిఁగించినా'రు. 'ప్రస్తావనమాత్రము మూలమునకుఁ గొంచెము భిన్నముగా నుండును.' అయినను కొన్నియెడల సౌకర్యముకొఱకు మూలములోని పద్యములకు ముందు, వెనుకల నున్న గద్యభాగములు పద్యమునందే చేర్చబడినవి; మూలములోని పద్యమునకు ఒకదానికి అనువాదమున రెండు వ్రాయబడినవి. వ్యాఖ్యానాంశములు కొలదిచోట్ల అనువాదమున చేర్చబడినవి. మొత్తముపయి అనువాదము సరియైనను కొన్ని భాగములు అననుకూలములు. మచ్చునకు కొన్ని.

మూలము: 'కామందకీ - అపి నామ కల్యాణినో ర్భూరివసు, దేవరాతాపత్యయో రనయో ర్మాలతీ మాధవయో రభిమతం పాణిగ్రహమంగళం స్యాత్.'

అనువాదము: 'కామం-కల్యాణవంతులును, భూరివసు, దేవరాతుల సంతానమును నగు మాలతీమాధవుల సర్వాభీష్టమైన పాణిగ్రహణ మహోత్సవము జరుగవలసియున్నది.' (అం. ౧. పు. ౭.)

అభిమతమగు మాలతీమాధవుల వివాహమహోత్సవము జరుగునా.' అను వితర్కము మూలాభిప్రేతము. కాన 'జరుగవలసియున్నది' అనునది 'అపినామ స్యాత్' అను దానికి సరియగునది కాదు. అనువాదమున 'సర్వ'పద మధికము.

మూలము:

'మనోరోగస్తీవ్రో విషమివ
విసర్ప త్యవిరతం
ప్రమాథీ నిర్ధూమం జ్వలతి
విధుతః పావక ఇవ,
హినస్తి ప్రత్యంగం జ్వర ఇవ
గరీయా నిత ఇతో
న మాం త్రాతుం తాతః ప్రభవతి
న చాంబా న భవతీ.'

అనువాదము: ఉత్సాహ—

'విరతిలేక విసమువోలె విరియబారి తీవ్రమై
కెరలి ధూమరహితమైన కీలిబోలి మండుచున్
జ్వరమువోలె నవయవములఁ బరిమథించునీవ్యథం
దరమె తొలఁచి నన్నుఁ బ్రోవ తల్లియేని దండ్రియేన్.'
(పు. ౨౯)

తన యభిమతము నెరవేర దని విరక్తి చెందిన మాలతి చెలికత్తెయగు లవంగికతో ననువిషయ మిది.

అనువాదమున మూలములోని 'ప్రమాథీ, నిర్ధూమం' అనునవియు, జ్వరవిశేషణమగు 'గరీయాన్' అనునదియు, 'ఇతఇతః' యు, లవంగికనుగూర్చి చెప్పవలసిన 'న భవతీ' అనునదియు విడువబడినవి. 'మనోరోగః' అనుటకు "వ్యథ" అనియు, "ప్రత్యంగం" అనుటకు "అవయవముల" అనియు ఆంధ్రీకరించుట సరసముకాదు. ఉత్సాహవృత్తము కరుణరసమున కననుగుణము; హాస్యమున కనుగుణము. రసానుకూలములగు వృత్తము లీయనువాదమున చాల కలవు. వృత్తములకును రసవ్యంజకత్వ మాలంకారికసమ్మతము. మూలము: "మాల — కథం మహాకుల ప్రసూతః స మహాభాగః?" అను: "మాల— ఆమహానుభావుఁ డెంత గొప్పకులమునఁ బుట్టినాఁడు?" (పు. ౩౬)

"ఏమి? ఆమహానుభావుడు గొప్పవంశమున పుట్టిన వాఁడా?' అనునది మూలాభిప్రేతమగు అర్థము.

మూ: "యది తద్విషయోఽనురాగబంధః
స్ఫుట మేతద్ధి ఫలం గుణజ్ఞతాయాః"

అను: 'ఆ. అతనివిషయమైన దగునేని యనురాగ
మది గుణజ్ఞురాలి యందమగద.' (పు. ౪౬)

"గుణజ్ఞతకు అదియే ఫల"మనుట మూలాభిప్రాయము.

మూలము : "ఇతరాః—హా ధిక్! కిమిదానీ మత్ర ప్రేక్షితవ్య మస్మాభిః?"

అను : "ఇతరులు — అయ్యో! యిప్పుడిక్కడ నేమున్నదని తీసికొనిరాము ?" (పు. ౨౦)

అచటి ఘోరావస్థను చూచి తక్కిన స్త్రీలు 'ఎంతఘోరమును చూడవలసివచ్చినది?' అని అనుకొను సందర్భ మిది.

మూ : 'కామందకీ - (ఉభౌ కమండలూదకేన సిక్త్వా) నను భవత్యోః పటాంచలై ర్వీజయతస్వమ్.'

అను: 'కామం-మీరిద్దఱు నీ కమండలూదకమును మీఁదఁజల్లి పైఁటచెఱఁగులతో విసరుఁడు.' (పు. ౨౦.)

కామందకి తానే కమండలూదకమును మాధవ మకరందులపై చల్లి విసరవలెనని మాత్రము మాలతీమద యంతికలతో చెప్పినది.

మూలమున మాధవుడు మాలతింగూర్చియు, అఘోరఘంటుడు కపాలకుండలం గూర్చియు ఒకే సమయమున ఒకే పద్యమును చెప్పినట్లు గలదు. అనువాదమున వేర్వేరు పద్యములు ఒకరితరువాత నింకొకరు చెప్పినట్లు కలదు. ఈ మార్పు రసమున కననుగుణము.

మూలము :

'మాధవః—వయస్య ! మకరంద !
మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సంతర్పణాని సకలేంద్రియమోహనాని,
ఆనందనాని, హృదయైకరసాయనాని
దిష్ట్యా మయాప్యధిగతాని వచోఽమృతాని.'

అనువాదమున మీది వచనభాగము, పాత్రనామ నిర్దేశము లేవు. కాన మాలతియే ఆపద్యమును పలికినట్లు అపార్థము కలుగుచున్నది. పద్యముమాత్రము

'చ. చెదరిన సౌష్ఠవంబు గల
జీవసుమంబును దేర్చునట్టివై
సదమలభూరి నిర్వృతికి
సాధనమై, ఘనతృప్తిహేతువై
హృదయరసాయనంబులయి
యింద్రియమోహనమంత్ర జాలమై
యిదె వచనామృతంబు లిపు
డేమి యదృష్టమొ గల్గె నాకునుః.'
(పు. ౭౯.)

ఇట 'మ్లానస్య'కు 'చెదరిన సౌష్ఠవంబుగల' అనియు, 'వికాసనాని' అనుటకు 'తేర్చునట్టివై' అనియు, 'దిష్ట్యామయాప్యధిగతాని' అనుటకు 'ఏమి యదృష్టమొ గల్గె నాకునున్' అనియు చెప్పుట అహృద్యము; అననుగుణము. ఇందు అనావశ్యకములగు పదములు కలవు.

మూలము: 'మక—లవంగికే! అపినామ బుద్ధరక్షితా సంక్రాంతా భగవతీ నీతి ర్వ్యజేష్యతే?'

అను: "మక—లవంగికా ! బుద్ధరక్షిత వచ్చెనా భగవతియొక్క తంత్రము విజయము నొందినట్లే."
(పు. ౮౮.)

'కామందకి బుద్ధరక్షిత కుపదేశించిన తంత్రము ఫలించునా?' అనునది మూలాభిప్రేతము.

మూలము: "మద—సఖి లవంగికే, జ్ఞాయతే ప్రసుప్తా తే ప్రియసఖీతి."

అను: "మక—చెలీ లవంగికా ! మీప్రియసఖి నిదురించుచున్నదా? మెలకువగా నున్నదా?"
(పు. ౮౮ )

మూలము: "కపాలకుండలా — ఆః పాపే! తిష్ఠ తిష్ఠ.

మాలతీ—(సత్రాసం) హా! ఆర్యపుత్ర!
(ఇతి వాక్ స్తంభం నాటయతి.)
కపాలకుండలా— (సక్రోధహాసం)
నన్వాక్రంద ఆక్రంద."

అనువాదము—"కపాలకుండలా- ఆఃపాపాత్మురాలా! కూర్చుండుము కూర్చుండుము. (నెఱపించుచు క్రోధహాసములతో) ఏడువు మేడువుము.' (పు. ౧౦౪)

'తిష్ఠ'కు 'కూర్చుండుము' సరికాదు; అది రసమునకును అననుగుణము. అనువాదమున మాలతీవచనము విడువబడినది. మూలమున కపాలకుండల విభిన్నకాలము

లలో మాలతిమాటలు విని పల్కు మాటలు వ్యవధి లేకుండునట్లు కూర్పబడినవి.

కొన్నియెడల మూలాభిప్రాయమున కవిరుద్ధములగు ననువాదములును కలవు. మచ్చున కొకటి-

మూ.—'ఆజన్మన: సహనివాసితయా మయైవ
మాతుః పయోధరపయో౽పి సమం నిపీయ,
త్వం పుండరీకముఖ బంధుతయా నిరస్త
మేకో నివాపసలిలం పిబసీత్యయుక్తమ్.'

అను.—'తే. జననమాదిగ నాదుపొత్తున నె పెరిగి
తల్లి చనుబాలు సమముగాఁ ద్రావి యిప్డు
డొకఁడవును బంధులిచ్చు తిలోదకంబు
నాకు లేకుండఁ ద్రావుట న్యాయమగునె!'
(పు. ౧౨౫)

ఈ గ్రంథమున పద్యముల కుదురుపాటునకయి అక్కడక్కడ అక్కరలేని పదములు కూర్పబడినవి. ముద్రణస్ఖాలిత్యము లిందు చాల కలవు. అచ్చటచ్చట వచనములు విడువబడుట అచ్చుపొరపాటైన కావచ్చును.

సామాన్యముగ ఒకభాషయందు కూర్పబడిన గ్రంథమును వేరొక భాషలోనికి అనువదించుట కష్టసాధ్యము. అట్లొనర్పదలచిన భాషాంతరీకర్తకు ఉభయభాషలయందును విశిష్టపాండిత్యమును, అసర్గళధారాశుద్ధియు ఆవశ్యకములు. ఇందేది కొరవడినను భాషాంతరీకృతి ప్రశస్తము కాజాలదు. అందును దృశ్యకావ్యముల ననువదించుపట్ల జాగరూకత ఎక్కువ కావలసియున్నది. కాని మనవారు తగిన శ్రద్ధ వహించినట్లు గోచరింపదు. కావుననే ఆంధ్రీకృతములగు రూపకములలో బహుసంఖ్యాకములు మూలాభిప్రాయములను, సారస్యములను అలవరచుకొనలేకున్నవి.

సంస్కృత సాహిత్యమునకును, కవితాశిల్పమునకును దృశ్యకావ్యము పరమావధి. కావుననే 'నాటకాంతం సాహిత్య'మ్మను ప్రతీతి కలిగినది. ఆంధ్రమున ఆ పద్ధతి తారుమారయినది. కాని పండితులగువారు అనువదించినవానిలో కొలదిలోపము లున్నను గుణములును ఉన్నవి. అన్యుల గ్రంథములలో అరుదు. ఇప్పుడు వెలువడుచున్న చాల నాటకములకంటె శ్రీ వెంకటరామయ్యగారి ఈ అనువాదము మేలు. శ్రీవారి పుత్రులు నవ్యవాఙ్మయప్రియులు; నవ్యభావవిలసితులు; సంస్కరణాభిలాషులు. వారు ముప్పదియైదేండ్లక్రిందట ప్రకటింపబడిన ఈ అనువాదమును పునర్ముద్రణమునకు తెచ్చునపుడు తగినట్లు సంస్కరించి యుండవలసినది. అట్లొనరించినచో ఇది ఇంకను నిర్దుష్టమయి వన్నెకెక్కియుండెడిది.

బు. వేం. ర.

---

## కవికోకిల గ్రంథావళి

### ౪. సారస్వత వ్యాసములు

కర్త: శ్రీ దువ్వూరి రామిరెడ్డి, క్రౌను ౧౮౩ పుటలు, వెల రు. ౦-౧౨-౦.

'కవికోకిల' బిరుదాంచితులగు శ్రీరెడ్డిగారి స్వకీయ గ్రంథసంపుటములలో ఇది నాలుగవది. ఇందు 'కవిత్వతత్త్వనిరూపణము, మర్మకవిత్వము, నాటకకళాసంస్కరణము, అల్లసాని పెద్దన, నాటకము: చరిత్రము' అను ఐదువ్యాసములు ప్రధానములు. కవి, కవిత్వావతరణము మొదలగు ఎనిమిది (విషయసూచికలో ఈయబడినవి) మొదటివ్యాసపు అంగములు. పయివాని క్రమము రచనాక్రమము ననుసరించినది.

శ్రీ రామిరెడ్డిగారు సరసకవులుగ తెలుగుదేశమున ప్రసిద్ధికెక్కియున్నారు. ఈ 'సారస్వతవ్యాసములు' వారి బహుజ్ఞతను, పాండిత్యమును, విమర్శనపుణ్యమును విశదపరచుచున్నవి. శ్రీరెడ్డిగారు సంస్కృతాంధ్రాంగ్ల పారశీకభాషలయందు మంచి ప్రవేశము కలవారు. స్వప్రతిభావిశేషమునను, స్వయంకృషివలనను వీరు సర్వతోముఖమగు విజ్ఞానమును సంపాదించినారు. కావుననే వీరి వ్యాసములు ఒకే పద్ధతికి సంబంధించక ప్రాక్పాశ్చాత్య-ప్రాచీన, నవీన సంప్రదాయముల ననుసరించుచున్నవి. వీరు సామాన్యముగ స్వతంత్రాభిప్రాయములపై నాధారపడియుందురు. వీరి అభిప్రాయములు చాలవరకు యుక్తిసహములు.

'కవిత్వతత్త్వనిరూపణము' న కవిసృష్టివైచిత్ర్యములు, కవిత్వావిష్కరణమునకు, కవితాశక్తి సంకుచితమగుటకు గల కారణములు, కవిత్వతత్త్వము, చక్కగ వివరింపబడినవి; అనుభవసాక్షికమును, ఇంద్రియగోచరము నగు సౌందర్యస్ఫురణము కావ్యాత్మయనియు, అంగాంగిసంయోగిత, అనురూపత, వస్తువునందలి సర్వజనీనస్వభావము, కవి వ్యక్తిత్వము అనునవి సామాన్యాంశములనియు వివరింపబడినది. తిర్యగ్గతమగు రసము ఆభాసము కాజాలదని సమర్థింపబడినది. కావ్యమునకు ప్రధాన ప్రయోజనము విగళితవేద్యాంతరమగు ఆనందమనియు, కావ్య మెంతమాత్రమును నీతిబాహ్యము కాగూడదనియు సోపపత్తికముగ నిరూపింపబడినది.

పయివిషయములకు జాలవరకు సంస్కృత సాహిత్యలక్షణగ్రంథము లాధారములు. వ్యాసకర్త పాశ్చాత్యలాక్షణిక భావములనుకూడ పయివానితో మేళవించి చక్కగ సమన్వయించినాడు. ఆలంకారికులు కావ్యజీవిత నిర్వచనమున విభిన్నాభిప్రాయులయ్యును రసము ప్రధానమగు విషయమున ఎవ్వరును ఏమరియుండలేదు. శ్రీ రెడ్డిగారు ఆలంకారికుల మతములను చర్చించుచు, రీతి- వక్రోక్తి-ఔచిత్యము-ధ్వని-రసము అనువానిలో నేదియు కావ్యాత్మకాజాలదని నిశ్చయించిరి. ధ్వని-రసములగూర్చి వారిచ్చిన యుక్తులత్యంతము దుర్బలములు.

వీరు 'అట్లయిన నింక కావ్యాత్మయెట్టిది? ఆత్మ అంతస్సారభూతమయినది. ఇదమిత్థమని వర్ణించుటకు నలవిగానిది......కావ్యాత్మ...సౌందర్యస్ఫురణము.' అని చెప్పి మరల 'కావ్యమునకు కవిప్రతిభయె జీవితము' అని నిర్వచించియున్నారు.

'మర్మకవిత్వము'న భావప్రధానమయి సామాన్యమానవుల కగోచరమగు కవిత్వముయొక్క యాథార్థ్యము, పాశ్చాత్యమర్మకవిత్వము, హైందవుల ఆధ్యాత్మిక కవిత్వము, రవీంద్రకవీంద్రుడు మొదలగువారి భావప్రధాన కవిత్వము మొదలగు విషయములు నిరూపింపబడినవి. మొత్తముపయి ఇది 'భావకవిత్వ' మగునని తేలుచున్నది. ప్రస్తుతము వెలువడు తెలుగువారి 'భావకవిత్వము' పసితనమున నున్నదనియు, పదాడంబరత, భావప్రకటనాసమర్థత ఇందు గోచరించుచున్నవనియు చెప్పబడినది.

'నాటకకళా సంస్కరణము'న ప్రస్తుతకాలమున ప్రదర్శింపబడు నాటకములలోని అనౌచిత్యములు లెస్సగ ప్రదర్శింపబడినవి; నాటకకవి, నటులు, నాటకశాల, ప్రేక్షకమండలి యెట్లుండవలెనో వ్యతిరేకోదాహరణములతో గూడ సూచింపబడినది. నాటకములందు పాత్రోచితమగు భావ ప్రధానమనియు, పాటలను, పద్యములను, అక్కరలేని పెంపును కూర్చుటకంటె భావప్రకటనము చేయుటయందే కవి ఎక్కువ పరిశ్రమింపవలెననియు, నాటకశాల స్వాభావికమయి, కృత్రిమములు కాని రంగము లున్నట్లుండవలెననియు, ప్రేక్షకులు సహృదయులయి ఉండవలెననియు నిట్లే చాల విషయములు వివరింపబడినవి.

'అల్లసాని పెద్దన' అనువ్యాసమున పెద్దనకవి తన సమకాలీన భావములను ఎట్లు ప్రదర్శించినదియు 'మనుచరిత్రము'లోని 'వరూధినీ, ప్రవర' పాత్రలనుబట్టి సరసముగ వివరింపబడినది.

'నాటకము — చరిత్రము' అను వ్యాసమునకు బీజము శ్రీత్రిపురనేని రామస్వామి చౌదరిగారు శ్రీవేంకటరాయ శాస్త్రులుగారి 'ప్రతాపరుద్రీయ' నాటకముపయి వ్రాసిన గేయరూపమగు విమర్శనము. అందలికథ చారిత్రకము కాదని శ్రీచౌదరిగారి ఆక్షేపణ. నాటకకర్త చరిత్రమును తన యిచ్చవచ్చినట్లు మార్చుకొనవచ్చుననియు, హృదయాహ్లాదనము, మానవసంఘోద్ధరణమున కగు సదుపదేశముమాత్ర మందు ప్రధానములనియు శ్రీరెడ్డిగారీ వ్యాసమున వివరించిరి. 'కళ ప్రయోజన నిరపేక్షముగ నుండవలె' ననువాద మీవ్యాసమున సయుక్తికముగ ఖండింపబడినది.

శ్రీరెడ్డిగారి కవిత్వము వలెనే విమర్శనముకూడ సరసము. బహుళసదుపదేశ ప్రతిపాదకము. కేవల పాశ్చాత్యభాషావేత్తలకు, కేవల ప్రాచ్యపండితులకు అందుబాటులో లేని విషయములు ఈ 'సారస్వతవ్యాసము'లలో చాల కలవు. ఇది విశ్వవిద్యాలయ విద్యార్థుల సారస్వతజ్ఞానాభివృద్ధి కనువగు గ్రంథము. పుస్తకనిర్ణాయకసభ్యులు, సారస్వతాభిమానులు దీనిని ఆదరింపవలసియున్నది.

———— బు. వేం. ర.

## ఆఖిలభారత ఛాయాచిత్ర ప్రదర్శనం
## రెండోది-మదరాసు

రెండో అఖిలభారత ఛాయాచిత్రప్రదర్శనం మొన్న మద్రాసులో జరిగింది. మద్రాసు అమెట్యూర్ ఫొటోగ్రఫిక్ సొసయిటీవారు ఏర్పాటుచేశారు దాన్ని. ప్రదర్శింపబడ్డ ఫోటోచిత్రాల్లో ౨౨౨ కళాత్మకాలూ, ౨౧ విజ్ఞానాత్మకాలూను. సబ్జెక్టు నిర్ణయమూ, కాంపోజిషనూ, టెక్నిక్కూ, అన్నిట్లోను చక్కగా అమరిఉండడంవల్ల అన్నిచిత్రాలూ ఆకర్షిస్తూ ఉన్నాయి. ఖులాసాకు ఫోటోలు తీయడం నేర్చుకున్నవాళ్లే అయినా బాగా చెయ్యితిరిగినవాళ్లే ననిపించుకుంటారు చిత్రాలు తయారుచేశినవాళ్లందరూనూ. సహజంగా అందచందాలు లేకపోయినా తయారుచేశినవాళ్ల కళాదృష్టివల్లా, పనితనంవల్లా సబ్జెక్టుకు అందమూచందమూ ఎంతో పొందికగా కుదిరింది కొన్నింటిలో. ఈప్రదర్శనంలో చిత్రాలనుబట్టి భారతదేశం ఫొటోగ్రఫిలో ఎంతో అభివృద్ధిపొందిందని నొక్కి చెప్పవచ్చును. ఇట్లాటి ప్రదర్శనాన్ని ఏర్పాటుచేసిన సొసైటీని ఎంతయినా అభినందించవలసిందే.

ఈ ప్రదర్శనంలో చిత్రాలకు కొన్నింటికి ప్రైజులు వచ్చాయి; కొన్నింటికి సర్టిఫికేట్లు వచ్చాయి. అంతవరకూ చాలా బాగానే ఉంది. అయితే, లోకంలో అన్నింటివలెనే 'గతానుగతికోలోక' అనేన్యాయాన్ని అనుసరించే ఈ ప్రైజులిచ్చే పద్ధతికూడ జరుగుతూంది. ఒక్కచిత్రమే ఎన్నోప్రదర్శనాల్లో ప్రైజులు తెచ్చుకునేందుకు అవకాశం ఏర్పడుతూంది యీ పద్ధతివల్ల. ఆచిత్రంముందు తక్కినవి తీసిపోతవి కాబట్టి దానికి ప్రైజురానడం యుక్తమే. అది లేకుంటే తక్కినవాటిల్లో ఒక మంచిదానికి దేనికయినా రాక తప్పదు ప్రైజు కాని అలా జరగడంలేదు. ప్రైజుతెచ్చుకున్నదే మళ్లా మళ్లా ప్రదర్శనాలకు రావడంవల్ల ఇది జరుగుతుంది.

ఈ ప్రదర్శనంలో 'పోడుగాలి' (ఈ సంచికలో ప్రకటించిన అయిదు చిత్రాల్లో ఒకటోది) అనే చిత్రానికి మొదటిప్రైజువచ్చింది. అది ఇదివరకే రెండు మూడు ప్రైజులు రెండు మూడుచోట్ల సంపాదించుకుంది. ఇలా ఎందుకు కావాలి - అంటే "ప్రైజులు నిర్ణయించడానికని నియమించబడ్డవాళ్లకు ఆ చిత్రానికి వెనక ప్రైజువచ్చిన సంగతి తెలియదు. కేవలం దాంట్లో ఉండే విశేష లక్షణాలను చూచే, దాని యోగ్యతను గుర్తించి, దానికి వాళ్లు ప్రైజు నిర్ణయిస్తారు. ఇతర స్థలాల్లో ప్రైజు తెచ్చుకున్నవి వాళ్ల దృష్టిలో పనికిమాలినవీ అయిపోతూ ఉంటవి ఒక్కొక్కప్పుడు. కాబట్టి ఎన్ని ప్రదర్శ

నాలకయినా చిత్రాలను పంపి ఎన్ని ప్రైజు లయినా తెచ్చుకోవడంలో తప్పేమీలేదు" అనవచ్చు. కాని కొంచెం ఆలోచిస్తే ఆమాట సయుక్తికం కాదని తెలియకపోదు.

ఒకఫొటోకు ఎన్నికాపీలు తీసినా అన్నింట్లోనూ సబ్జెక్టులో కానీ, కాంపోజిషన్‌లోకానీ, టెక్నిక్కులోకానీ ఏమీ తేడా ఉండడానికి వీలులేదు. కాకుంటే తయారుచేయడంలో ఈషద్భేదం ఏర్పడితే ఏర్పడవచ్చు, అంతే. అది చిత్రకారుడి ఒరిజినాలిటీ వల్ల ఏర్పడేదికాదు. ఆమాత్రం భేదం ప్రైజునిర్ణయానికేమీ అడ్డురాగలదు. కాని కొంద రొకదాన్ని మెచ్చుకొని ప్రైజుయివ్వడమేమి, కొందరు దాన్నే తోసిరాజు చెప్పడమేమి? దీనికి కారణం ఒక్కటే చెప్పాలి: ప్రైజునిర్ణయించేవారి సామర్థ్యాసామర్థ్యాలని. ఆమెచ్చుకున్నవాళ్లో, ఈ త్రోసిరాజుచెప్పినవాళ్లో ఎవళ్లో ఒకళ్లు చేతకానివాళ్లు కావాలి. అయితే, వాళ్ల చేతకానితనం నిజంగా చిత్రకారులకు అపకరిస్తుంది.

మరిన్నీ, ఈ పద్ధతివల్ల, ఒకే ప్రదర్శనంలో నిర్ణయింపబడ్డ ప్రైజులన్నీ వెనక ప్రైజు పొందిన చిత్రాలకే రావచ్చు. అలా జరిగిందంటే మాత్రం అంతకంటే అన్యాయం వేరొకటుండదు ఆ ప్రదర్శనానికి చిత్రాలను పంపిన ఇతర చిత్రకారుల విషయంలో.

కాబట్టి, ఇలా జరగకుండా ఉండడానికీ, అనేకులకు ప్రోత్సాహం కలిగి ఫోటోగ్రఫీ వృద్ధిపొందడానికీ ఉండే మార్గం ఒక్కటే. ఒకమారు ప్రైజుతెచ్చుకున్న వాటికి మరిప్రైజు ఇవ్వకుండా ఉండడమే. కాని, అలాటివాటిని తప్పకుండా ప్రదర్శించవలసిందే. అందువల్ల ప్రదర్శనానికి గౌరవం హెచ్చుతుంది. వాటిని అమ్మిపెట్టనూ వచ్చు. అందువల్ల చిత్రకారుడికీ లాభంకలుగుతుంది, ఒరిజినాలిటీ ఉండే ఇతర చిత్రకారులకూ ప్రోత్సాహమూ కలుగుతుంది. ఒకమారు ప్రైజువచ్చినవాటికి మళ్లా ప్రైజుయిచ్చేమాట ఉండదని ప్రదర్శననిర్వాహకులు స్పష్టంగా చిత్రకారులకు తెలపాలి మొట్టమొదటనే.

ప్రకృత ప్రదర్శనంలో ప్రైజుపొందిన వాటికంటే ఎక్కువ ఆకర్షించే చిత్రాలు లేకపోలేదు. వాటి కెందుకు ప్రైజురాలేదు? తగిన కారణం కనబడదు. అయితే రుచిభేదం అనాలి. అది యేమాత్రమూ పనికిరాదుగా మరి, కొన్ని నియమాలకు లోబడి జరుగవలసిన నిర్ణయం విషయంలో!

దీనివల్ల కూడా ఫోటోచిత్రాలకుప్రైజును తెచ్చేది ఉత్త అందమూ, అభిరుచీ కాదనీ, ఇతర విశేష లక్షణాలనీ స్పష్టం అవుతూ ఉంది. —సం. భారతి.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

# విషయసూచిక



త్రివర్ణచిత్రములు—స్నానానంతరము, శివభక్తమాహాత్మ్యమునందు కృషీవలోపాఖ్యానమున నొకానొకరంగము.

సాధారణ చిత్రములు, ఇతర చిత్రములును.




సంపు. ౧౮ ఈశ్వర సంవత్సరము, చైత్రమాసము ( ఏప్రిల్ ౧౯౩౭ ) సంఖ్య ౪

# హైదరాబాదు-ఆంధ్రులు ౨

మల్లంపల్లి సోమశేఖరశర్మ

హైదరాబాదురాజ్యం వైశాల్యంలో చాలా గొప్ప దేశీయసంస్థానమయినా అనేక విషయాల అది బ్రిటీషుహిందూరాజ్యానికంటె వెనకబడిఉన్నదనే చెప్పాలి మ. ఘ. వ. నిజాంప్రభువుగారు దీనిని గ్రహింపకపోలేదు. అందువల్లనే తమరాజ్యాన్ని సర్వవిధాలా బ్రిటీషురాజ్యముమట్టానికి తీసుకురావాలని, వీలయితే దానిని మించేటట్టుకూడా చేయాలని చాలా ప్రయత్నాలు చేస్తున్నారు. ఎంత చేసినా దేశం బీదదేశం అవడంవల్ల, రైతులు పేదలవడంవల్ల ఇంకా వారిప్రయత్నాలు అంత మెక్కువగా రాణించడం లేదు.

రాజ్యంలోని ప్రజలకు వ్యవసాయమే ప్రధానవృత్తి. ౧౯౩౧ జనాభాలెక్కలనుబట్టి చూస్తే ఈ వృత్తియందున్నవారిసంఖ్య కడచిన 'దశాబ్దం'లోకంటె ఈ 'దశాబ్దం'లో పడిపోయింది. అప్పుడు వీరిసంఖ్య నూటి ౬౬ చొప్పునఉంటే ఇప్పుడు నూటికి ౨౪ అయినది. కాపులు, కురమలు, మరాఠాలు ఈవ్యవసాయకులలో ముఖ్యులు. ఇందులోనూ తెలంగాణావారిస్థితి అంత ఉత్సాహకరంగా లేదు. వ్యవసాయాధులకు పెట్టుబడిపెట్టేవారు, అప్పులిచ్చేవారునయితం నూటికి ౭౧ రు చొప్పున మహారాష్ట్రవిభాగంలో ఉన్నారు కాని తెలంగాణంలో లేరు. అప్పు తీసుకొనేటందుకుగాని, తీసుకొన్న అప్పును సరిగా తీర్చుకొనేటందుకుగాని తెలంగాణావారికి సత్తువ లేదు గనుకనే అప్పులిచ్చేవారందరు మహా

రాష్ట్రవిభాగంలో ఉండడం తటస్థించింది. పట్టణాలలో భాగ్యవంతు లెక్కువగానే ఉన్నా రని కొంద రనవచ్చుకాని మన దేశానికి వెనుకటినుంచీ కొలబద్ద పల్లెటూరుకాని పట్టణం కాదు. పల్లెటూళ్లలోని ప్రజల స్థితి గతులనుబట్టే మనం దేశసౌభాగ్యమూ, ఆర్థికస్థితీ గమనించాలి. దానినిబట్టి చూస్తే మన తెలంగాణంవారి దారిద్ర్యస్థితిని తెలుప డానికి పైని వివరించిన విషయం ఒక్కటి చాలదూ? ఇందుకు కారణమేమిటి? దేశంలో సహజసంపద తక్కువ అందమన్న అట్టి దానికి కొదవలేదు; కష్టించి పాటుపడు వారు లేరందమా, తెలంగాణంరైతుకంటె ఒళ్లువంచి పాటుపడేవాడు లేడు. తన జీవం నిలుపుకోవడానికి, తన భార్యా బిడ్డలను పోషించుకోవడానికి అతను కష్టపడి ఒళ్లువంచి కూలో నాలో చేసు కొంటేనే కాని వీలులేదు; తప్పనిసరి. అందువల్ల ఇదిసీన్న కారణం కాదు. మరేమిటి కారణం? ఇతరకారణా లెన్నయినా ఉండ వచ్చుకాని ప్రధానమయినది విద్యాలోపం. ఎవరికయినా తనశక్తి తాను తెలిసికోవడా నికికాని, తనస్థితి తాను తెలిసికోవడానికిగాని, తన కొక విధమయిన ఆత్మవిశ్వాసమూ, 'మ నోనిబ్బరమూ' ఇవ్వడానికికాని కావలసింది విద్యే. ఆవిద్య నిజాంరాజ్యంప్రజలలో బాగా వ్యాపింపక పోవడంవల్లనే వారిస్థితి ఇంత దీనమూ, దయనీయమూగా ఉన్నది. హైద రాబాదురాజ్యాన్నికూడా తీసుకొని, కొన్ని దేశీయసంస్థానాలు, రాజధానులు ముఖ్యమ యినవాటిలో విద్యవచ్చినవారిసంఖ్య ఎట్లు న్నదో ఈ దిగువ చూపుతున్నాను[౧].

వేయిమందిలో చదువువచ్చినవారు

| దేశము | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| తిరువాన్కూరు | ౪౧౮ | ౧౬౮ |
| కొచ్చిను | ౨౮౦ | ౧౧౬ |
| బరోడా | ౩౩౧ | ౭౯ |
| మైసూరు | ౧౨౪ | ౩౩ |
| హైదరాబాదు | ౮౫ | ౧౨ |
| గ్వాలియరు | ౬౦ | ౭ |
| కాశ్మీరు | ౫౯ | ౫ |

నూటికి చదువువచ్చినవారు

| | సగటున పురుషులు, స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| వంగదేశం | ౧౧.౧ | ౧౮.౨ | 3.3 |
| మద్రాసు | ౧౦.౮ | ౧౮.౮ | 3.1 |

---

౧. నిజాంరాష్ట్ర పరిపాలన మనేపేర శ్రీ సుర వరం ప్రతాపరెడ్డిగారు ఒక పుస్తకం ప్రకటించారు. ఇదిచాలా అమూల్యమయిన గ్రంథం. ఆంధ్రులకెక్కువ ఉపయోగకర మయినది. ఇందులో హైదరాబాదు సంస్థానంలో రాజ్యతంత్రం ఎల్లా సాగుతున్నదీ విశదం గానూ స్పష్టంగానూ వర్ణితమయినవి.

* * * *

౧౯౩౧-వ సంవత్సరపు హైదరాబాదు సంస్థా నం జనాభానివేదిక (Census reports) సంపుటాల ననుసరించి, తెలంగాణానికి సంబంధించిన లెక్కలను విడదీసి తెలుగువారికి తెలియాలనే ఉద్దేశంలో శ్రీకొమ్మవరపుసుబ్బారావుగారు ఒకపుస్తకంవ్రాశారు. 'మర్దుం షుమారి' అనే పేరుతో హైదరాబాదు ఆంధ్ర జన కేంద్రసంఘంవారు దానిని ప్రకటించారు.

ఈ వ్యాసంలో ఇచ్చిన అంకెలు ఈ రెండు గ్రం థాలలోనుంచి తీసినవి.

| | | | |
|---|---|---|---|
| బొంబాయి | ౧౦.౫ | ౧౭.౬ | ౩.౧ |
| బరోడా | ౨౦.౯ | ౩౩.౧ | ౭.౯ |
| హైద్రాబాదు | ౫.౦ | ౮.౫ | ౧.౨ |
| కాశ్మీరము, జమ్ము | ౪.౦ | ౭.౦ | ౦.౬ |

ఈ విషయంలో తెలగాణం చాలా హీనస్థితిలో ఉన్నది కానయితే నిజాం రాజ్యంలో ఏ భాష మాటాడేవారికంటెనూ ఆంధ్రం మాటాడేవారిసంఖ్య చాలా ఎక్కువే. వారు నూటికి ౪౮.౩ మంది చొప్పున ఉన్నారు. మహారాష్ట్రం మాటాడేవారు నూటికి ౨౬.౨ రు చొప్పునను, కన్నడం మాటాడేవారు నూటికి ౧౧.౧ రు చొప్పునను, ఉరుదుమాటాడేవారు నూటికి౧౦.౪రు చొప్పునను ఉన్నారు. ఆఖరుకు జనసంఖ్యను బట్టిచూచినా, వైశాల్యాన్నిబట్టి చూచినా మహారాష్ట్ర, తెలంగానా విభాగాలు రెంటిలో తెలంగాణానిదే ప్రథమస్థానం. చూడండి:

| | చ. మైళ్ళవైశాల్యం | జనసంఖ్య |
|---|---|---|
| తెలంగాణం | ౪౧,౫౭౨ | ౯౫,౫౯,౫౯౮ |
| మహారాష్ట్రం | ౪౧,౧౯౬ | ౭౮,౮౧,౫౫౦ |

విద్యవచ్చినవారిసంఖ్య ఈ దశాబ్దంలో తెలంగాణంలో - మరాట్వాడావిషయం నేనెత్తుకోవడం లేదు; అక్కడకూడా ఇట్లానే ఉంటేఉండవచ్చు లేదా ఇంచుకంత భిన్నంగా ఉండవచ్చు — ఎంతతక్కువగా ఉన్నదో జిల్లాలవారీగా ఎత్తుకొంటే బాగా తెలుస్తుంది.

| | | నూటికి చదువువచ్చినవారు |
|---|---|---|
| అత్రప్-ఇ-బల్దాజిల్లా | | ౫.౫ |
| వరంగల్లు | ,, | ౫.౦ |
| మహబూబునగరు | ,, | ౩.౮ |
| మెదకు | ,, | ౩.౭ |
| నిజామాబాదు | ,, | ౩.౬ |
| నల్లగొండ | ,, | ౩.౨ |
| ఆదిలాబాదు | ,, | ౨.౯ |
| కరీమ్‌నగరం | ,, | ౨.౬ |

అసలు రాజ్యము మొత్తముమీదనే విద్యవచ్చినవారు ప్రతీవందమందికీ అయిదుగురు[2]. ఇక జిల్లాసంఖ్యలుచూస్తే అట్లున్నవి.

---

౨. హైదారాబాదునందలి విద్యాస్థితిని గురించి పు తి. రా. అనువారు "బాంబే సెంటినల్" అను పత్రికకొకవ్యాసం వ్రాశారు. దాని అనువాదం ధాత సంవత్సర మాఘమాస భారతిలో పడింది. ఈ క్రింది పంక్తు లందులోనివి:

"హైదరాబాదు సమ వేశమునందు అధ్యక్షత వహించిన కాశీనాథ వైద్యాగారు గడచిన పది, ఇరువది సంవత్సరములలో జరిగిన అల్పవిద్యావ్యాప్తిని గూర్చి వక్కాణించిరి. బ్రిటీషు ఇండియాయందే నూటికి ఎనిమిదిమంది చదివినవారుండ హైదరాబాదునందు నూటికి ౪.౮ మంది మాత్రమే చదువెరిగినవారు. సర్ అక్బర్ హైదరీగారు, రాష్ట్రపు బొక్కసము వృద్ధియగుచున్నదనియు, తమ రాష్ట్రము ఉత్తమమయినదనియు, అందన్నియు ఉత్తమస్థితిలో నున్నవనియు ప్రపంచమునకు చాటించుచున్నారు కాని విద్యావిషయమునందు మాత్రము తమ రాష్ట్రము ఇంతటి హీనస్థితియందుండుట తమకుగాని, తమ దేశమునకుగాని గౌరవమేనా? ఇక ఆరాష్ట్రమునందలి స్త్రీ విద్య విషయమై చెప్ప నవసరమే లేదు. రాష్ట్రము నందలి స్త్రీలలో నూటికి ౧.౨ మంది మాత్రమే అక్షరజ్ఞులు. రాష్ట్రమునందలి స్త్రీలు సతతము అజ్ఞానాంధకారములో మునిగియున్నారు."

౧౯౩౧-వ జనాభాలెక్కల ప్రకారం చూస్తే హైదరాబాదు రాజ్యంలో చదువువచ్చినవారు నూటికి ౪.౮ గురు కారు; అయిదుగురు.

మరాట్వాడామాట మనకెందుకు, తెలంగాణంప్రజలు ఆర్థికంగానూ, తదితర విషయకంగానూకూడా వెనుకబడిఉన్నారంటే ఉండరూ. మరి ?

అయితే మ. ఘ. వ. నిజాంప్రభువుగారికి తెలియని విషయంకాదు తమ రాజ్యంలో విద్య ఎంత వెనుకబడి ఉన్నదో. అందువల్లనే వారు విద్యాశాఖ నిమిత్తం ధనం అమితంగా వ్యయం చేస్తున్నారు. ౧౩౪౨-వ ఫసలీ (౧౯౩౩) లో విద్యకోసం కోటి, లక్షరూపాయలు వ్యయపరిచినారు; ఇప్పటికి ప్రతి సంవత్సరమూ కోటిరూపాయలుపైగా ఖర్చుపెడుతున్నారు. అంతెందుకు ఇప్పుడు నిర్మాణంలో ఉన్న విశ్వవిద్యాలయ కళాశాలాది భవనాలకే అవుతున్నది ఎంత డబ్బయినా. ప్రభువుగారెంత ఖర్చుపెట్టినప్పటికీ విద్య ఇంతటి హీనస్థితిలో ఉండడం చాలా విచారకరం.

ఏదేశంలో నయినా విద్యావిషయం ఒక్క ప్రభుత్వంవారే నెత్తిమీద పెట్టుకొంటే అయ్యే పనికాదు. ఉదారులయిన భాగ్యవంతులూ, విద్యాధికులూ కూడా నడుంకట్టుకొని ఈ విషయంలో కృషిచేయవలసిన బాధ్యత ఉంది. అయితే ఇక్కడ అట్టి కృషి సాగడానికి వీలులేదు. ఈ సందర్భంలో ఈ క్రింది పంక్తులు గమనింపవలసినవే:

"ఇతర దేశములలో ప్రభుత్వమువారే కాక ప్రజలును, ప్రజాపక్షమున పాఠశాలలు నెలకొల్పి ప్రభుత్వమునకు తోడ్పడుచుందురు. మనరాష్ట్రము (తెలంగాణము) లో ౧౩౩౪-వ ఫసలీ (౧౯౨౫) లో ఖాస్గీపాఠశాలల గస్తీ యొకటి కావింపబడెను. దాని మూలమున ప్రజలు సర్కారువారి సెలవు లేనిది (ఖాస్గీ) బళ్లను నడపకూడదనియు, అట్లు నడపిన పోలీసువారిద్వారా మూయింపబడుననియు ఆజ్ఞయయ్యెను. ఖాస్గీ బళ్లీగస్తీ వచ్చిన తరువాత వేలకొలది ప్రైవేటు బళ్లు మూయబడెను."[3]

| | బళ్లు | విద్యార్థులు |
|---|---|---|
| ౧౩౩౩-వ ఫసలీలో గస్తీకి పూర్వము | ౪,౦౫౩ | ౭౬,౬౫౮ |
| ౧౩౪౨-వ ఫసలీలో ఎన్మిదేండ్ల అనంతరం | ౭౬ | ౨౭,౫౦౬ |

ప్రయివేటుబళ్లు పెట్టడానికిప్పుడుప్రజలకధికారం లేదన్న మాట. ఇది విషాదకరమయిన వృత్తాంతమే. ఆయితే ప్రయివేటు బళ్లు మూసివేసినందుకు పరిహారముగా కావచ్చును ప్రభుత్వమువారు "లోకలు ఫండులద్వారా అనేక గ్రామములలో పాఠశాలలు నెలకొల్పి మరికొన్నిటికి (ఇమ్దాద్) సహాయము చేయుచున్నారు."

ఉస్మానియా విద్యాపీఠము నెలకొల్పిన తరువాత నిజాంరాజ్యంలో ఉన్నత విద్యా

3. నిజాంరాష్ట్రపరిపాలనము, పుటలు, ౫౭-౫౮.

విశాసాని కెక్కువ అవకాశాలు ఏర్పడుతు న్నవి. ఈ విద్యాపీఠం స్థాపన అయినతరు వాత ఉర్దూవిద్యకెక్కడలేని ప్రాముఖ్యమూ వచ్చింది. అంతవరకు నిజాంరాజ్యంలోకూడా కళాశాలలలో ఇంగ్లీషుదే ప్రధానస్థానం. దేశభాషలు దానితరువాతివే. విద్య అంతా ఇంగ్లీషులోనే బోధించేవారు. అటువంటి దిప్పుడంతా తారుమారయింది. ఉస్మానియా విద్యాపీఠంవా రంగీకరించిన ప్రధానభాష ఉర్దూ. అదివరకు ఇంగ్లీషుకుండే గౌరవాన్నం తనూ ఇప్పుడు ఉర్దూ కట్టుకొన్నది. అక్కడ ఉర్దూ రాజ్యమేలుతున్నది. అయితే కళాశా లవిద్యకు పనికివచ్చే (Advanced) పాఠ్యపుస్త కాలు ఉర్దూలో లేకపోయినవి. దీనికిగాను ప్రభువువారు ఇంగ్లీషులోనుంచి అన్ని శాస్త్రాలూ ఉర్దూభాషలో కనుపదించవలసిం దని ఫర్మానాయిచ్చారు; హిందూదేశంలో కుంఫిణీప్రభుత్వం ఏర్పడిన కొత్తలో దేశీయు లకు విద్యగరపడం విషయం ఆలోచనకు వచ్చినప్పుడు ౧౮౩౫లో హెచ్.టి. ప్రిన్సెప్, విల్సన్ మొదలయినవారు విలియం బెంటింకు ప్రభువుకు ఇచ్చినసలహా సరిగా ఇదే— ఇంగ్లీషుశాస్త్ర, సాహిత్యవిజ్ఞానాన్ని దేశ భాషలలోకి అనువాదంచేసి కళాశాలలలో దేశీయులకు బోధింపవలసిందని. ప్రభువువారి ఆజ్ఞ ననుసరించి అనేక పాశ్చాత్యభౌతికాది శాస్త్రగ్రంథాలకు ఉర్దూఅనువాదాలు వెలి శాయి; ఇంకను వెలుస్తున్నవి. ఈ యను వాదపద్ధతిని గురించి మనవారు తెలుసు కోవడం మంచిది. ఇప్పుడు — బీజగణితము, రేఖాగణితము, క్షేత్రగణితము, రసాయన శాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము — ఒక టేమిటి అన్ని శాస్త్రాలూ ఎమ్. ఏ వరకూ ఉస్మానియా విద్యాపీఠంలో నేర్పేది ఉర్దూ భాషలోనే. ప్రభువువా రిచ్చిన ప్రోత్సాహం వల్ల ఉర్దూ దినదినమూ ఉరకలువేస్తూ వృద్ధి పొందుతున్నది. భౌతికశాస్త్ర విజ్ఞానం ఇంగ్లీషులోనే కాని దేశభాషలలో బోధించ డానికిగాని, దేశభాషలలోనికి తీసుకురావ డానికిగాని వీలుపడదనే మన దేశంలోని కొందరు విద్యాధికుల సందేహాలకు ఉస్మా నియావిద్యాపీఠమే జవాబు. విద్య దేశభాష లలోనే నేర్పాలి అనేసత్యాన్ని గమనించి ఇటీవల మంత్రులయిన సర్ అక్బరుహైదరి గారు ౧౯౧౭ లో ఇట్లు వ్రాసినారు [4]:

"పరభాషలోని బోధవలన ఈలోపము కలుగును. విద్యార్థులమెదడుపై అధికమును అనవసరమును నగు భార మగును. విషయ లోపము కలిగించి పరభాషలోని చిక్కులను స్వాధీనపరుచుకొనుటలో స్వతంత్రబుద్ధిని చంపును. విద్యాధికులు తమమాతృభాషలో తమ దేశజనులకు విద్యాబోధ చేయజాల కుందురు......"

హైదరిగా రీవిధంగా చేసిన విజ్ఞాపనం అనంతరమే ప్రభువువారు విద్య ఉర్దూలో బోధించాలి అని ఫర్మానాచేసి ఉస్మానియా విద్యాపీఠాన్ని నెలకొల్పినది. అయితే హైద

4. నిజాంరాష్ట్రపరిపాలనము, పుటలు, ౫౭-౫౮

జాబాదు రాజ్యం మొత్తముమీద ప్రధాన భాష తెలుగుకదా, విద్య ప్రజలకు ప్రధాన దేశభాషలయిన తెలుగులో నేర్పక ఉర్దూలో ఎందుకు నేర్పాలి అనేదానికి హైదరీగారి సమాధాన మిది [5]:

"ఉర్దూ మాతృభాషగాకలవారు అల్ప సంఖ్యాకులనుట నిజమే. అయినను ఉర్దూ భాష రాష్ట్రిముయొక్క విజ్ఞానసంబంధమగు భాషయు కచ్చేరిభాషయు శిష్టసంఘము యొక్కయు భాషయు నైయున్నది."

ఈ విద్యాపీఠంలో ఉర్దూ కెంతటి ప్రాముఖ్యం ఇచ్చినా అధికారులు, ఆ రాజ్యం లో సగభాగం తెలుగుదేశమే అవడంవల్ల తెలుగుకూడా అక్కడ కాస్త చోటుచేసు కొన్నది. ఆధునికాంధ్ర సాహిత్యానికి రూపురేఖలు తీర్చిన ప్రాథమిక శిల్పులలో ఒక్కరయిన శ్రీరాయప్రోలు సుబ్బారావు గారి నెరుగనివారెవరు తెలుగుదేశంలో. డెబ్బయిలక్షులఆంధ్రులకు ప్రతినిధి—ఆయన ఆ విద్యాపీఠంలో ఆంధ్రసాహిత్యాచార్యు లయి తెనుగు ననుశాసిస్తున్నారు. వారికృషి వల్ల ఆధునికాంధ్ర కవితావల్లరి అక్కడకూడా పాదుకొని, మారాకువేసి మొగ్గతొడుగు తున్నది.

ఆ రాజ్యంలో పెద్ద ఉద్యోగాలు కావల సినా, చిన్నఉద్యోగాలు కావలసినా ఉర్దూ వచ్చితీరాలి. న్యాయస్థానాలలో ప్రాక్టీసు చేయవలసివచ్చినా ఉర్దూ కావాలి; వర్తక వ్యాపారాలకైనా ఉర్దూ కావాలి. అంతా ఉర్దూ భాషే. ఇక అక్కడ తెలుగెవరికి కావాలి? కావలసినా దాని ఉపయోగ మేమిటి? ప్రయోజనమేమిటి? తెలుగు కావలసినదల్లా తమ దాక ప్రత్యేకజాతి; తెలుగుజాతి అని చెప్పుకొనేటందుకే; తమ తెలుగుజాతీయత నిలుపుకొనేటందుకే. కాని యిట్టి ఉన్నతభావం, ఇట్టి ఉన్నతలక్ష్యం ఎంతమంది కుంటుంది జనసామాన్యంలో? అందులోను ఆంధ్రులది చెడిపోయినజాతి. దారిద్ర్యము హెచ్చు; జీవించుటకే మొదలు కృషి చేయవలసివస్తున్నది — అటుతరువాత కదా లక్ష్యాలు. ఆలక్ష్యాలు, ఆ యున్నతా శయాలయినా విద్యాసంస్కారం తగినంత లేనిదే ఎట్లావస్తవి జాతికి?

ఇది శతాబ్దాలనుండి పరాధీనతకింద బడి నలిగిపోతున్న జాతి—నిజాం రాజ్యంలో అయి తేనేమి, బ్రిటీషు హిందూ రాజ్యంలో అయితే నేమి. ఆత్మగౌరవమన్నది కోలుపోయి, పరిభవ మన్నది మరచిపోయి, ఆత్మవిశ్వాసమన్నది మెరుగక కడుపే కైలాసము చేసుకొని జీవిం చుక వస్తున్నారు ఆంధ్రులు చాలాభాగం. కొన్ని కొన్ని చోట్ల వారికి ఆఖరుకు అపత్స మయంలోనయినా, ఆత్మగౌరవానికి భంగం

---

5. నిజాంరాష్ట్రపరిపాలనము, పు. ౫౯-౬౦
"Although it is true that those whose mother tongue is Urdu are in a minority, yet, Urdu is the cultural and official language of the state and of polite society."

కలిగేటప్పుడయినా కాదు కూడదని నిబ్బరించి జవాబుచెప్పడానికికూడా జీవలేదు; వంగి వంగి సేవచేయడం, కుంగి కుంగి లొంగి ఉండడం అనేది వారి స్వభావంలో స్వభావమయిపోయింది. తాము తక్కువవారం, ఏమీ : చేతకానివారం, ఏమీ చేయలేని వారం అనేభావం ప్రబలిపోయింది వారిలో. ఇటువంటి భావాలు తొలగిపోయే చాలా చోట్ల లేని పరువూ, లేని ప్రతిష్ఠా (false dignity), అతిశయమూ హెచ్చుతున్నవి. కలసి పనిచేయడము కాని, పట్టుదలతో పనిచేసి సమర్థత చూపడము కాని నేర్చుకోవలసిన స్థితికి వచ్చారు ఆంధ్రులు——

బుద్ధికుశలతలో హిందూదేశంలోని ఇతరజాతుల కేవిధంగానూ తీసిపోరు ఆంధ్రులన్నమాట నిజమే. వారికి ప్రతిభలోను, ప్రజ్ఞలోనుకూడా తక్కువలేదు. ఉత్సాహానికీ, ఆవేశానికీ వారిని చెప్పి తరువాత ఇతరులను చెప్పాలి. కొత్తఅంటేసరి ముందంజ వారిదే —— అపాయానికికూడా జంకని సాహసం! పదకాలు వన్నడంలో కూడా వారి బుద్ధి పాదరసంలా ప్రవహిస్తుంది —— నిజమే. అన్ని సుగుణాలూ వున్నవి కాని కార్యం కొనసాగేదాకా ఏకాగ్రతతో పనిచేయగల దీక్ష, ఆపట్టుదల లేదు వారికి. పాటుపడడానికి కూడా అలసులయిపోతున్నారు. ఉన్నతమైన లక్ష్యం లేదు; ఐకమత్యం లేదు బహునాయకత్వమే కాని. ఎవడిమట్టుకు వాడికి తనమాట సాగా లన్నంతదీక్ష. తాము కలసి తలపెట్టినపని సాగించి కృతార్థత పొందడంలో లేదు; తనకు పేరుతెచ్చుకోవాలనే కోరికలో వున్న ఆవేదన పనిచేసి చూపడం విషయంలో లేదు. కలసివచ్చేవారు తక్కువ; విడిపోయేవా రెక్కువ. ఏ విషయంలో నయినా కష్టం గ్రహించి సానుభూతి చూపేవారు తక్కువ; నిరసించి ఆక్షేపించేవా రెక్కువ. ఇదంతా వారిబుద్ధీ, వారిప్రజ్ఞా పనిచేయడానికి తగిన పరిస్థితులూ, అవకాశాలూ లేకపోవడంవల్ల వచ్చిన అనర్థం. అసలు ఏ మహాదారంభం చేయడానికైనా జంకే; నెగ్గుతుందో లేదో అని సంశయము తోనే మొదలది; నెగ్గించి తీరుతాము, నెగ్గించి తీరాలనే ఆత్మప్రత్యయమూ లేదు; ఆత్మనిశ్చయమూ లేదు. అటు నిజాంపరిపాలన కింద ఉంటే ఏమిటి? ఇటు బ్రిటీషుపరిపాలన కింద ఉంటే ఏమిటి? బ్రిటీషుప్రభువు లత్యంత ఉదారులు కావచ్చును; నిజాం ప్రభువులు అత్యంత దయామయులు కావచ్చును. వారు వారి కేకొరతా రాకుండా కాపాడగలరు; వారి సౌఖ్యాని కేభంగమూ వాటిల్లకుండా చేయగలరు కాని వారిలో ఆత్మవిశ్వాసము నెట్లా కల్పించగలరు? సంఘీభావము నెట్లా సృష్టింపగలరు? ఆత్మగౌరవము నెట్లా మొలకెత్తింపగలరు? ఇవి ప్రజలు తమకు తామయి చేసుకోవలసినపనులు; తమజాతి అభ్యుదయమునూ, శ్రేయస్సునూ కోరి తమకు తామై చేసుకోవలసిన ప్రయత్నాలు. వీటి విషయంలో ప్రభుత్వం తోడ్పడనూలేదు;

తోడ్పడి ప్రయోజనమూ లేదు. ఈ యర్థసిద్ధికే జాతి ఇక్కడలాగే తెలంగాణంలోనూ కృషి సల్పుతున్నది. బ్రిటీషు రాజ్యంలోనే ఆంధ్రులలో దేశమంటే తగినంత అభిమానమూ, భాష అంటే తగినంత గౌరవమూ కలిగించడం కష్టంగా ఉన్నప్పుడు తెలంగాణంలో ఇది మరీ కష్టమవుతున్నదంటే ఆశ్చర్యమేమిటి?

బ్రిటీషురాజ్యంలోలాగే తెలంగాణంలో కూడా ఆంధ్రవిద్యాధికుల వేషానికీ, భాషకూ సాంకర్యం తగిలింది. ఇక్కడి వారు తెలుగు ఇంగ్లీషుముక్క పడకుండా మాట్లాడలేనట్టు అక్కడివారు ఉర్దూమాట పడకుండా మాటాడలేరు — అనగా ఉర్దూ అంత పరిపాటయిపోయింది. ఆంధ్రులు ఇక్కడి పాలకజాతి వేషం ఇక్కడ అనుకరిస్తూవుంటే అక్కడి పాలకజాతివేషం అక్కడ అవలంబిస్తున్నారు. ఇక్కడయినా సరే, అక్కడయినా సరే ఇది విపరీతపరిస్థితి అయినప్పటికీ సహజంగా పరిస్థితులనుబట్టి యేర్పడినదే. ఇక్కడ ఏవిధంగా ఈ వ్యామోహం తొలగించుకొన ప్రయత్నిస్తున్నామో అట్లాగే అచ్చటి నాయకులు కూడా తెలుగువానికి తెలుగువేషము దిద్ది, తెలుగుమాట నేర్ప ప్రయత్నిస్తున్నారు. తెలంగాణంలో కూడా తెలుగు జాతి తాను గోల్పోయిన జాతీయాత్మను పునగ స్వాధీనం చేసుకొన ప్రయత్నం చేస్తున్నది; చెడిపోయిన తన దృష్టిని సంస్కరించుకొన ప్రయత్నిస్తున్నది. ఇక్కడ మనం చేసే ప్రయత్నాలకూ, అక్కడ వారు చేసే ప్రయత్నాలకూ, తర, తమభేదంతప్ప అంతకువేరేమీ లేదు. ఈ ప్రయత్నాలకిక్కడి పరిస్థితులెక్కువ తోడ్పడుతూవుంటే అక్కడి వంతగా తోడ్పడటం లేదు. ఇందుకు కారణాలనేకాలు. మొత్తంమీద ప్రధాన కారణం ఇది. అక్కడిరాజ్యంలో ప్రజ లెక్కువమంది హిందువులు; పాలించేప్రభువు మహమ్మదీయప్రభువు. ఆయనకూడా సర్వతంత్ర స్వతంత్రుడు కాడు; బ్రిటీషువారికొకవిధంగా జవాబుచెప్పుకొంటూ ఉండవలసినవాడే ప్రధానవిషయాలలో. తనరాజ్యం తాను శాంతంగా ఉండేటట్టు, సుఖంగా ఉండేటట్టు చేస్తేచాలు బ్రిటీషువారికి. అంత ప్రస్ఫుటంగా కాకపోయినా ఈవిధంగా అచ్చటి దొకద్వంద్వప్రభుత్వం. హిందువులు, మహమ్మదీయులు — వీరు, వారేమిటి ఎవరి మట్టుకువారే మతమలాభాలకోసం పాటుపడడం సహజం. ఇటువంటి క్లిష్టపరిస్థితులలో తనరాజ్యం శాంతంగా ఉండేటట్టు చూడాలి ప్రభువు; బ్రిటీషువారి మన్ననలను పోగొట్టుకోకూడదు; మహమ్మదీయుల శ్రేయస్సుకు భంగంకలుగకూడదు; వారిమనస్సుకు నొప్పి తగలకూడదు; హిందువులలో అసంతుష్టి రేకెత్తకూడదు; సంస్థానాభ్యుదయానికి విఘ్నం సంభవింపగూడదు; హిందూమహమ్మదీయ ఐకమత్యానికి చేటు కాదు, పొరపులున్నా అంకురింపకూడదు. అందువల్లనే ఏ కొత్తప్రయత్నం తలపెట్టితే అక్కడ

ఎవరి కేవిధమయిన యిబ్బంది కలుగుతుందో, వాటిని సాగనిస్తే ఏమివస్తుందో అని ప్రభువు భయం. ఈ కారణంచేతనే ఆఖరుకు హిందువులు అస్మనారిగుడి మరమ్మతుచేయించుకోవాలన్నా, ఏదైనా ఒకసభ సమావేశం చేసుకోవాలన్నా అ దొరకవింతే— ప్రభుత్వంశలవు కావలసిందే. కాబామరి? ప్రజలలో ఎవరి కెట్టి కష్ట, నష్టాలు కలుగుతవో? అందువల్ల ప్రభుత్వంవా రెప్పుడూ త్రాసూ తక్కెడ్ దగ్గరపెట్టుకు కూర్చుంటారు—పక్షపాతం కనిపెట్టుతూ. న్యాయమే ఇది. మరి తమ జాతీయాత్మ కాపాడుకోకపోతే ఎట్లా అని ప్రజానాయకులు. ఇదీ న్యాయమే మరి; ఇట్లా నిజాంరాజ్యంలో ఎటుచూచినా ఇబ్బందులే. త్రాసు కించిత్తు ఒరగకూడదు. అథవా పెరగకూడదు. ఇటువంటి పరిస్థితులలో మన ఆంధ్రనాయకు లక్కడ పాటుపడుతున్నారంటే అది చాలా గొప్పవిషయం.

అక్కడ వారు చేస్తున్న ప్రయత్నాలు కాలక్రమాన్ని కొన్ని సంస్థలుగా రూపుకట్టుకొన్నవి. వాటిలో గ్రంథాలయస్థాపనమూ, పత్రికా ప్రకటనమూ, మహాసభాసంస్థాపనమూ ముఖ్యముగ ఎన్నవలసినవి.

కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయమనే పేర హైదరాబాదు నగరంలో ఆంధ్రుల కృషికి ఫలితంగా ఒక గ్రంథాలయం ౧౯౦౧ లో వెలసింది. మునగాల సంస్థానాధీశులగు శ్రీ శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహద్దరుగారు, వారి మంత్రి పుంగవులగు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు, కీ. శే. రావిచెట్టు రంగారావుగారు, ఆదిపూడి సోమనాథరావుగారు, కీ. శే. మైలవరపు నరసింహశాస్త్రిగారు— "ఈ యయిదుగురు మహాశయుల భావనా ఫలితమే యీ శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయపు జన్మము" ఈ నిలయానకు పలువురు దానశౌండుల యౌదార్యంవల్ల ౧౯౨౧ లో స్వతంత్రభవనం లభించింది. అప్పటినుంచి యిది క్రమంగా దినదినాభివృద్ధి పొందుతూ ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుతున్నది. ౧౯౨౬-౧౯౨౭ లో దీనికి రజతోత్సవం జరిపినారు.

ఆ సందర్భంలో నిలయంపక్షాన చక్కని భాషావిషయకాదివ్యాసాలతో వి రా జి ల్లే రెండు సంచికలు ప్రకటించారు. ౧౯౩౪-౧౯౩౫ వార్షికనివేదిక ననుసరించి చూస్తే ఇందున్న మొత్తం గ్రంథాలు ౮,౩౭౨. వీటిలో ఆంధ్రగ్రంథాలు ౩,౮౪౦; ఇంగ్లీషువి ౪౯౭. సంస్కృతపువి ౪౦౨. ఆ సంవత్సరంలో చదువబడ్డ పుస్తకాలు ౪,౯౬౮. కొంచె మించుమించుగా తెలుగుదేశంలో ప్రకటన అవుతూవున్న ప్రతిపత్రికా నిలయానికి వస్తున్నది. నిలయం ఆర్థికస్థితికూడా బాగా ఉన్నది. జయంతులూ, వర్ధంతులూ, కవిసమ్మేళనములూ, కథకులసమ్మేళనములూ — వీటిద్వారా ఈ నిలయం ఆంధ్రభాషాభిమానాన్నీ, విజ్ఞానజ్యోతినీ ప్రజ్వరిల్లజేస్తూ

ఉండడం ప్రశంసింపదగిన విషయం. ఈని లయం ఏమి చేస్తున్నదో ౧౯౩౫-౩౬ నివే దికలోని ఈ క్రిందివాక్యాలే తెలుపుతవి:

"ఆధునిక ఆంధ్రసారస్వతం జీవితపు ప్రతిఅంశాన్ని స్పర్శిస్తోవున్న రోజుల్లో కాక తీయసీమయొక్క సారస్వత సేవకులనేకాక, జనసామాన్యాన్నికూడా యితర తెనుగు సీమల సారస్వత నూతన వికాసాలతో సంబంధం కల్గిస్తోవున్న సరస్వతీనిలయం శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషానిలయమే నని సగర్వంగా చెప్పవచ్చును."

ఈ నిలయంకార్యనిర్వాహకుల యీ ఆదర్శము మరీ మెచ్చుకోదగినది:

"నవ్యసాహిత్యోత్సుకల యువతీ, యువ కులు సారస్వత వ్యాపనంలో కార్యభారాన్ని ఆహ్వానించీ, స్వీకరించీ, నెరవేర్చడానికి మేమంటే మేమని ముందుకురూకవలసిన అవసరానికి — నవయుగపు ఆవేదనకి — కార్యరూపం కలిగించడమే మొట్టమొదటి కర్తవ్యం. ఈ ఆదర్శానికి మనహృదయాలు ప్రతిస్పందించిననాడే మనము ధన్యులం."

తెలంగాణంలో ఉండే ఆంధ్రుల ప్రబోధానికి విసువూ అసువూ లేకుండా పాటుపడు తున్నది గోలకొండపత్రిక; పదకొండేళ్లయి స్థాపితమయినది. ఈపత్రిక సంచికలు తిరగ వేస్తే నిజాంరాజ్యంలోని ఆంధ్రుల కష్ట ములూ, సుఖములూ, ఆవేదనా బోధపడు తవి. ఆర్థికంగా, సాంఘికంగా, మతవిష యకంగా, విద్యావిషయకంగా, నైతికంగా ఆంధ్రప్రజ యభివృద్ధి కిది ఎంతటి దీక్షలో పాటుపడుతున్నదో ఈ పత్రికలోని వ్యాసాలు విశదీకరిస్తవి. ఈ పత్రిక చేసిన ప్రబోధాని కనుగుణంగా ఆంధ్రు లెంతటి వికాసం పొందినారో మొదటి సంచికల లోని వ్రాతలలోనూ, ఇప్పటి సంచికలలోని వ్రాతలలోనూ గల సర్వ వ్యత్యాసమే తెలు పుతుంది. నిలయం వచ్చి హైదరాబాదు ఆంధ్రులకు నైతికబలమూ, విద్యాబలమూ ఇస్తే ఈ పత్రిక తెలంగాణంప్రజలకు నోరిస్తు న్నది. అదివరదాకా నిరుద్ధమయి పోయిన కంఠాలిపుడు గొంతు సవరించుకొని పెదవులు మెదల్పి గుండెల్లో గుబగుబలాడే భావాలను కొంతవరకు వెల్లడింపగలుగుతున్నవి. ఈపత్రిక సంవత్సరాదికొకతడవ విడిగా వార్షికసంచిక ఒకటి ప్రకటిస్తూ ఉంటుంది. ఇట్టివి పదకొండు వచ్చిన విప్పటికి. పత్రికాసంపాదకులు శ్రీ కే. బాలకృష్ణారెడ్డిగారు.

ఈ పత్రిక కొకవిధంగా అంగరక్ష శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, వకీలు. వీరిది ప్రసన్నమయిన వదనం; నవనీతంవంటి హృదయం. సరసమయిన కవిత్వం చెప్ప తారు; చక్కనిశైలి వ్రాస్తారు. చిత్రకళ అంటే విపరీతమయిన అభిమానం. వీరు ప్రాచీన ఆలేఖ్యాలు (Paintings) చాలా సేకరించారు. వాటినన్నిటినీ నేను పూర్తిగా చూడడానికే అవకాశం లేకపోయింది. రెడ్డి విద్యార్థివసతిగృహంలో వీరు సేకరించి ఉంచిన

రామాయణం అనుకొంటాను, చూడడం కలిగింది. అందులో మధ్య మధ్య బొమ్మలు (Illustrations),వివరణంతో సహా ఉన్నవి. అవన్నీ చిన్నసైజు చిత్తరువులే(Miniatures). ఎంత అందంగానూ, ఎంత ముచ్చటగానూ ఉన్న వవి! పూర్వకాలంనుంచీ బౌద్ధులూ, జైనులూ తమ మతగ్రంథాలలో ఇట్టి లఘు ఆలేఖ్యాలు (Miniatures)చిత్రిస్తూవచ్చారు. యతులకూ, భిక్షుకులకూ ఇదొక పుణ్యప్రద మైనపని — గ్రంథం వ్రాయడమూ, అందులో నీవర్ణచిత్రాలు చిత్రించడమూను. ఎంతటి సర్వసంగపరిత్యాగు లయినప్పటికీ సౌందర్యాన్నీ కళనూ ఆరాధించకుండా, అభిమానించకుండా ఉండలేదు వారు. గ్రంథం వ్రాతప్రతి తయారుచేయడం ఒకవిద్యా, ఒక కళా అయినది. ఈ పద్ధతినే అవలంబిస్తూ వచ్చారు తరువాత హిందువులు. అందువల్ల సంస్కృత రామాయణ మహాభారత, భాగ వతాలలో కూడా ఇట్టి చిత్తరువులుచూస్తాము. పూర్వపు కత్తులు, కటారులు, డాళ్లు మొద లయినవి కూడా వీరు సేకరించినవి ఉన్నవి. వీరిది సంస్కృతమయిన చక్కని అభిరుచి. నాటకములూ మొదలయినవి వ్రాసి పేరు గన్నవారు వీరు హితభాషీ, మితభాషీకూ డాను. — చూడగానే అనిపిస్తుంది నిండు కుండ అని. తెలంగాణానికి వీ రొక ఆసరా.

తెలంగాణంలోని ఆంధ్రుల సర్వతో ముఖాభివృద్ధికి పాటుపడ సంకల్పించుకొని పుట్టుక గాంచినది ఆంధ్రమహాసభ. దీనిని స్థాపించిన మాననీయులు శ్రీయుత మాడ పాటి హనుమంతరావుగారు. చేసేది వకీలు వృత్తి అయినప్పటికీ వారిజీవిత మహర్నిశ ములు ఈమహాసభా కార్యాలకే అంకిత మయి పోయింది. ఇదే ప్రధానవృత్తీ, ఇదే సకల వృత్తులూను. తెలంగాణంలో మొలకెత్తే ఏ పౌరహితోద్యమాలలో, సంస్థల లో చూచినా హనుమంతరావుగారి చేయీ, ఆలోచనా పొడగట్టకుండా ఉండవు. అన్ని ఉద్యమాలకూ వారు జీవగర్ర. కార్యశూ రులు; నిగర్వులు.

కడచిన మార్గశిరమాసంలో అను కొంటా అయిదవ ఆంధ్రమహాసభ పాదున గరు (మహబూబునగరుజిల్లా ?)లో సమా వేశమయినది. ఆదిమహాసభా వృత్తాం తాలూ, ఈ సభావృత్తాంతమూ పరికిస్తే చాలు, అక్కడ జాతీయత కెట్లా పునాదిపడు తున్నదీ తెలుస్తుంది. మహాసభాసమావేశా నికి ఆంధ్రు లొకయేటికంటె ఒకయేడు ఎక్కువగా వస్తున్నారు. తమమంచిచెడ్డలు తాము చెప్పకొంటున్నారు. ఆయాతీర్మాన ములను గురించి నిర్మొగమాటముగా తమ అభిప్రాయాలు తాము చెప్ప కొంటున్నారు; చర్చలు చేస్తున్నారు. ఈ విధంగా ఆంధ్రమహాసభ ఏర్పడి ఆంధ్ర జాతీయహృదయాన్ని మేల్కొల్పి దానికి కార్యవ్యగ్రత బోధిస్తున్నది. ఆంధ్రహృదయం జాగృతమవుతున్నది. వీరు ప్రజాప్రబోధం సభలద్వారానే కాకుండ కరపత్ర,పుస్తకాది

ప్రకటనములద్వారాకూడా చేస్తున్నారు. గ్రంథాలయములు; వర్తక స్వాతంత్ర్యం; నిజాం రాష్ట్రాంధ్రులు; వెట్టిచాకిరి; రైతుల ఋణబాధానివారణ; న్యాయస్థానములు— దేశభాషలు; మన వాక్స్వాతంత్ర్యము—విజ్ఞప్తి; వ్యవసాయకులకు కొన్ని సూచనలు — ఈ మొదయిన పుస్తకాలు (Booklets) చాలా ప్రకటించారు. అక్కడి ఆంధ్రులు పట్టుదలతో ఏవిధంగా, ఎంతటి పనిచేస్తున్నారో పై విషయాలే తెలుపుతవి. పైని పేర్కొన్న పుస్తకాలలో వివరించిన, చర్చించిన విషయాలన్నీ నిజాంరాజ్యానికి ప్రస్తుత మనువర్తించే సమస్యలే.

ఈ విధమయిన పౌరహితోద్యమాలలో శ్రీ హనుమంతరావుగారితోసమంగా పాటుపడుతున్నవారు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు, వకీలు. వీరు చాలా సౌమ్యులు; ఉత్సాహశీలురు. వీరు పత్రికలలో వ్రాస్తూవచ్చిన వ్యాసాలనుబట్టి ఇదివరకే వారికి ప్రసిద్ధి కలిగింది. వారంటే ఆంధ్రాభిమానులనీ, దేశభక్తులనీ అభిప్రాయం కలిగింది నాకు. నిలయం వర్ధంతి సందర్భంలో వారు చేసిన ప్రసంగాన్ని బట్టి ఆంధ్రవాఙ్మయం బాగా తరచిన పండితులూ, సారస్వతవిమర్శకులూ అని కూడా తేలింది. మొహమ్మదు కాసిం అనేవారి తాళపత్ర గ్రంథాలయం సందర్శింప వెళ్లిన సందర్భంలో వారు పార్షీ విద్వాంసులనీ, తెలుగులో లాగే అందులో కూడా కవిత్వం చెప్పగలరనీ కూడా తెలిసింది. వారికి అరబ్బీకూడా వచ్చుననే నమ్మకం. ఇంతటి వారవునా, ఏమీ తొణకరు; బెణకరు. సహృదయులు, సారస్వతగోష్ఠీప్రియులు

శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి నిజాంరాష్ట్రాంధ్రజన కేంద్రసంఘానికి మొదట అనుబంధంగా ఏర్పడి ఇప్పుడు విడిగా పనిచేస్తున్నది. దీనికి కార్యదర్శులుగా ఉండి పనిచేస్తున్నవారు శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారు. వీరిని తలచుకొంటే ౧౯౧౩-౧౪నాటి విజ్ఞానచంద్రికా మండలి జ్ఞాపకం వస్తుంది. అప్పుడా కార్యాలయంలో పనిచేస్తూవచ్చారు. అప్పుడే శ్రీలక్ష్మణరావుగారి సమక్షాన వీరితో పరిచయంఏర్పడింది. మొత్తంమీద ఆయనకు కూడా లక్ష్మణరావుగారికి ప్రియతమమయిన చరిత్ర పరిశోధనతో ఏదో విధంగా సంబంధం కలగడం విచిత్రమే. ఉత్సాహపరుడూ, అమితభాషాభిమానీ అయిన వీరు పరిశోధక మండలికి అండ. ఇదివరలో ప్రకటితమయిన తెలంగానాశాసనములను పునః సంస్కరించి ముద్రింపబోతున్నారు. ఇది సంతోషించవలసిన విషయం. ఇప్పటికీ మండలివారు సేకరించిన నూతన శాసన ప్రతిబింబాలు చాలా ఉన్నవి. ఈ శాసనము లింకా ప్రకటింపబడలేదు. మంచిపని నిరాడంబరంగా సాగిస్తున్నందుకు వారు అభినందనార్హులు.

ఇక్కడ పేర్కొనవలసినవి ఇంకొక రెండు గ్రంథభాండాగారా లున్నవి: (౧) మొహమ్మదుకాసిం పుస్తకభాండాగారము; (౨) శైవభారతీభవనగ్రంథాగారము.

మొహమ్మదుకాసింగారనే ఆయన విజాపురంవజీర్లసంతతిలోవారనీ, ఈ గ్రంథభాండాగారము హిందూప్రభువులయొద్దనుండి విజాపురంవారు సంగ్రహించినబాపతనీ చెపుతారు. ఆయనయింటనే ఉన్నవి ఈ గ్రంథాలు. ఆయనను గురించి వినవచ్చుచరిత్ర మాత్రం చాలా చిత్రమయినదే. ధననిక్షేపా లెక్కడెక్కడ ఉంటవో తెలిపేగ్రంథాలు ఈ గ్రంథసముదాయంలో ఉన్నవనీ, వీటి నాధారం చేసికొని విజయనగర (హంపీ) ప్రాంతానను, మరికొన్నిచోట్లను కొందరి సహకారం తీసుకొని ఈయన ఆ నిక్షేపాల కోస తవ్వింప ప్రయత్నించాడనీ, ఇంతలో స్థానికులయినవారాటంకాలు కల్పించడం వల్లను, ఆర్థికపు చిక్కులవల్లను త్రవ్వ పని నిలిచిపోయిందనీ చెపుతారు. ఆయనయింట సంస్కృతం, కన్నడం, తెలుగు, ఫార్సీ, అరబ్బీ, మోడి, మహారాష్ట్రీ గ్రంథాలు ఎన్నిఉన్నవో లెక్కాలేదు; వాటి కొక పట్టికా లేదు. అదొక మహాగని. ఆగనిలో సరిగా వెదకితే ఎంతటి అమూల్యములయిన రత్నాలు దొరకుతవో. షాజహాన్, జహాంగీరు, దారాలసంతకాలతో ఉన్న ఫారసీ గ్రంథాలున్నవి. ఫారసీ, అరబ్బీ గ్రంథాలెంత ఎక్కువగా ఉన్నవో సంస్కృతాది దేశభాషాగ్రంథాలూ అంత ఎక్కువగానే ఉన్నవి. కాని ఏమికార్యం? అసలున్న పుస్తకాలే ఏమిటో తెలియదమ్మో. అవి తెలిస్తేకదా ఏవి కొత్తవో, ఏవి పాతవో నిరూపించుకోవడానికి? శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంవారుకాని, అక్కడి ఆంధ్రులుకాని శ్రద్ధవహించి ఆగ్రంథాల కొక పట్టికయినా తయారుచేయిస్తే మేలు.

శైవ భారతీభవనం నడుపుతున్నవారు తెలుగుపాఠకులకు పరిచితులయిన పండిత శ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మగారు. వీరు కాశీనివాసం వదలి యిప్పుడు హైదరాబాదులో ఉండి శిష్యబృందానికి విద్య చెప్పుతూ కాలక్షేపం చేస్తున్నారు. కేవలం విజ్ఞానసముపార్జనమూ, విద్యాప్రదానమూ లక్ష్యంగా పెట్టుకొని బ్రహ్మచర్య వ్రతం పాలిస్తున్న శైవగురువులు. వీరు తమ భారతీభవనంలో గొప్పగొప్ప పుస్తకాలెన్నిటినో సేకరించారు. ఒక్కరెక్కమీద వారు అంతటిగొప్ప గ్రంథసంగ్రహం జాగ్రతపెట్టగలిగినందుకు నా కాశ్చర్యము కలిగింది. వారి మతాభినివేశాని కేమాత్రమూ తీసిపోనిది వారి భాషావిద్యాభిమానం. గొప్పసంస్కృతపండితులూ, శాస్త్రజ్ఞులూ మాత్రమే కాకుండా ఆయన శాసనపరిశోధకుడయి శాసనాలు సంపాదించడంకూడా చాలా విచిత్రం.

హైదరాబాదునుగురించి వ్రాసేటప్పుడు తప్పకుండా చెప్పి తీరవలసిన మరొక ఆంధ్రసంస్థ బాలికల ఉన్నత పాఠశాల. తొమ్మిదేళ్ల కిందట స్థాపించారు దీన్ని. జాతి మతభేదాలతో కాని, పేదసాద భేదాలతో

కాని నిమిత్తంలేకుండా అందరికీ సమంగా ఉచితంగా విద్య నేర్పుతున్నారు. ఈ పాఠశాలఆదర్శ మిది :"స్త్రీయొక్క వివిధ కర్తవ్యములకు గృహమే ముఖ్యావరణము. అచ్చటనే ఆమెయొక్క యోగ్యత, సౌశీల్యము సఫలములు కావలసియున్నవి. కనుక ఆమెను ఉత్తమగృహిణిగను, ఉత్తమమాతగను, సంఘమున కుపకారిగను చేయుటయే స్త్రీ విద్యయొక్క యాదర్శము. ఇట్టి యాదర్శమును దృష్టినం దుంచియే ఈ సంస్థ పనిచేయుచున్నది." దీనిని కేవలము ప్రజాప్రముఖులూ, ఉదారులూ నిర్వహిస్తున్నారు. ఇది బొంబాయి మహిళా విశ్వవిద్యాలయానికి అనుబంధించి ఉన్నది. ఇందు వివాహితలు, అవివాహితలు, వితంతువులు కూడా చదువుతున్నారు. అంతా కలిసి ౨౬౦ మంది వరకు ఉన్నారు విద్యార్థినులు. ఇక్కడి చదువయిన తరువాత ఇంకా చదవాలంటే పైని చెప్పిన విశ్వవిద్యాలయ కలాశాల పరీక్షలకు చదవుతారు. ఆయేటికాయేడు ప్రజలకు దీని ఉపయోగం తెలిసి రావడంవల్ల విద్యార్థినుల సంఖ్య హెచ్చుతున్నది. జిల్లాలనుంచి వచ్చే వారి సంఖ్యకూడా క్రమాభివృద్ధి పొందుతున్నది. ఇక్కడ కుట్టుపని, సంగీతము, ప్రథమ చికిత్స, రోగుల కుపచారము — ఇటువంటివికూడా నేర్పుతున్నారు. వీటికి ప్రత్యేకతరగతు లున్నవి. ఇంతటి ఉపయోగకరమయిన సంస్థకు స్వంతభవనం లేదు. భవనం కట్టించడానికి కొంత ప్రయత్నం జరుగుతున్నది. ఆంధ్రులలో సంపన్నులయినవారు దీనికి తోడ్పడం ధర్మం. ఈ పాఠశాలలో చదివే రెడ్డిబాలికల కొకవసతిగృహ ముంది. అందిప్పు డిరవైమందిదాకా ఉన్నారు 'బోర్డరులు'.

ఈ సంస్థ రెండువిధాల చాలా ముఖ్యమైనది : (౧) మెట్రిక్ వరకూ విద్యయిక్కడ తెలుగులోనే బోధిస్తారు. అట్లని ఇంగ్లీషు చెప్పడం మానరు. అది నిర్బంధంగా నేర్పుతారు తెలుగులో చెప్పేపద్ధతి ఒక్కయిక్కడతప్ప ఆంధ్రదేశంలోని ఏ ఉన్నత విద్యాలయంలోనూకూడా ఉన్నట్టు ఎరుగను. చెన్నరాజధానిలో మన దేశంలో మహిళా విశ్వవిద్యాలయాని కనుబంధించి ప్రజలు స్వతంగా నడిపే పాఠశాలలూ లేవు; విద్యను మాతృభాషద్వారా నేర్పేవీ లేవు. నిజంగా ఈ విషయంలో తెలంగాణం మిగతా ఆంధ్రదేశానికి ఆదర్శప్రాయంగా ఉండదగ్గదే; (౨) ఈ పాఠశాల లో చదివే విద్యార్థినులలో లేఖనోత్సాహం వృద్ధిచేయాలని కొంతకాలంనుంచి 'మాతృభారతి' అనేపేర ఒక లిఖిత మాసపత్రిక పెట్టి నడపుతున్నారు. వ్రాసేవారు చాలాభాగం — అంతానేమోకూడాను — విద్యార్థినులే. సంవత్సరాం ఆఖరున వాటిలోనుంచి మంచివ్యాసాలేరి ఒక సంచికక్రింద అచ్చువేయించి ప్రకటిస్తారు. ఇట్టివి మాతృభారతీ సంచికలిప్పటికి రెండు వచ్చినవి. ఆ రెండుసంచికలూ విద్యార్థినులలో ఉదయించే లేఖనోత్సా

హానికీ, బుద్ధి వికాసానికీ నిదర్శనంగాఉన్నవి. కేవలం విద్యార్థినులుగా ఉన్నవారే రకరకాల కథలూ, చిన్న చిన్న నాటికలూ, పౌరాణికవృత్తాలూ మొదలైన అనేక విషయాలకు సంబంధించిన వ్యాసాలూ, పద్యాలూ వ్రాయడంచూస్తే అచిరకాలంలోనే ఈ విద్యాలయంలో చదువుకొన్న విద్యార్థినులలోనుంచి మంచి కవిత్వం చెప్పేవారూ, మంచి వ్యాసాలు వ్రాసేవారు బయలుదేరి తెలంగాణానికి గొప్ప పేరు ప్రతిష్ఠల నార్జిస్తారనీ, అక్కడి వారిని శక్తివంతమయినజాతిగా ఉద్ధగలరనీ నా నమ్మకం. నూతనాభిప్రాయాలతో, నూతన లక్ష్యాలతో, నూతన విజ్ఞానంతో స్త్రీ ముందు కడుగుపెట్టిందంటే దేశంలో ఇంక చీకటెక్కడ? తన బిడ్డలను తన లక్ష్యాని కనుగుణంగా దిద్దితే ఇంక జాతికి దార్ఢ్య మెక్కడ? సర్వథా ఈ సంస్థ అభివృద్ధిపొందాలి.

ఇక శ్రీ ఇల్లిందల సీతారామారావుగారిని గురించి చెప్పితే నేటి తెలంగాణంలోని యువజన హృదయాన్ని వ్యక్తీకరించినట్లే. చిత్రం — ఆయనదగ్గర చేరినది ఎంత మాత్రమూ చనవులేని పరదేశిలా తొట్రుపాటులో; తుద కాయనను విడిచివచ్చినది విడవలేక అప్తబంధువును విడిచివచ్చే పరితాపభరంతో! మరి ఆ హృదయంలో ఏమి నిధు లున్నవో, ఎంతటి ఆకర్షణ ఉన్నదో! సరసహృదయు డాయన. ఆయన మాటలలోకాని, చేతలలోకాని ఒకరిని నొప్పింపనూ లేదు; ఒడిదొడుకన్నదీ లేదు. తెలుగుభాష అంటేను, తెలుగుదేశమంటేనూ చాలా అభిమానం. ఆ యౌవనహృదయంలో ఎప్పుడూ కెరటంవేస్తూ ఉంటుంది ఉత్సాహం — అది క్రియారూపంగా పరిణమించడానికిమాత్రమే. దగ్గరకు చేరినకొద్దీ చేరాలనిపిస్తుంది ఆయన మనస్సుదగ్గరకు. అట్టిది ఆయన ప్రకృతి. ఇదే అక్కడి యువజనహృదయానికి నిదానం. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, ఎల్. వి. కృష్ణమాచారిగారు, భాస్కరభట్ల కృష్ణరావుగారు, మందుములసోదరులు, వెల్దుర్తి మాణిక్యారావుగారు మొదలయినవారు, నాకు తెలియనివారుఎందరో ఉన్నారు ఉత్సాహపూరితులు నయువకులు;నిర్భయముగాతమ అభిప్రాయాలు చాటిచెప్పి స్త్రీలకుసంబంధించిన విషయాలనుగురించి చక్కగా చర్చించి స్త్రీలోకానికి తగవ్రూ ధర్మమూ దిద్దగల శ్రీమతి యెల్లాప్రెగడ సీతాకుమారిగారివంటి యువతులున్నారు — పేరుపేరున చెప్పడమెందుకు ఇటువంటివా రెందరో ఉంటే ?

తెలంగాణంలోని ఆంధ్రులలో నేడొక సంచలనం కలిగింది; ఒక ఆవేదన పుట్టింది. తమ జాతీయాత్మను సందర్శింపవలెనని వారి కుత్కటమయిన ఆకాంక్ష కలిగింది. హైదరాబాదులో ఆంధ్రాభ్యుదయంకోసం త్రికరణశుద్ధిగా పనిచేస్తున్న మాననీయులు ఎందరో ఉన్నారు—పిన్నలూ, పెద్దలూను; ఎన్నో ఉన్నవి సంస్థలు. పెద్దలకంటెనూ ఉడుకు రక్తముతో పనిచేస్తున్నారు పిన్న లక్కడ.

నేటియువకులూ, యువతులూ గొప్ప ఆశ కట్టి పనిచేస్తున్నారు. వారి అభీష్టార్థం సిద్ధించేయాలూ, గొప్పలక్ష్యాలూ సంతరించుకొని టందుకు మనంకూడా వారి నాశీర్వదించి దేశభాషాభ్యుదయాలకోసం దీక్షాకంకణం మంగళాక్షతలు చల్లుదాం.

---



రామదాసు బందిఖానా, గోలకొండ

—M. V. R.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు

బంగారయ్యగారి

# భారతోపన్యాసములు

ఒంగోలు వేంకటరంగయ్య

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు తనధర్మమును ప్రశస్తపథమున నిర్వహించుకొనుచుండుట ఆంధ్రులకు ప్రమోదోత్సాహజనకము. ఆంధ్ర దేశమున విజ్ఞానమును వ్యాపింపజేయుటకీ మహాపీఠమువారపుడపుడు నిపుణులచే మహోపన్యాసము లిప్పించుచున్నారు.

నెల్లూరిలో కడచిన జనేవరి ౨౫,౨౬,౨౭ తేదీలందు రాజమహేంద్రవరవాస్తవ్యులగు శ్రీమంతులు నందూరి బంగారయ్యపంతులు (బి. యె., బి. యల్.) గారిచే తిక్కనపాత్రీకరణ ప్రాశస్త్యమునుగూర్చి యుదాత్తములగు నుపన్యాసముల నిప్పించిరి. పంతులుగారు వృత్తిచే వకీలుగా నున్నను ఆంధ్రభాషలో నపారకృషి సలిపి అదియే పరమార్థసాధనముగ నుపయోగించుచున్నారని తోచెడిని. వారు తిక్కనపాత్రీకరణప్రాశస్త్యమును నిర్ణయించుటకు తిక్కనను షేక్స్పియరుతో పోల్చి ఎన్నియో అపూర్వసారస్వతరహస్యములను, నూతనసిద్ధాంతములను వెల్లడించి తమయుపజ్ఞను ప్రకాశింపజేసిరి.

మొదటియుపన్యాసము ఇంచుమించుగ నుపక్రమణికను. ఈ యుపన్యాసమున వీరు తిక్కనపాత్రీకరణమును షేక్స్పియరుపాత్రీకరణముతో పోల్చుటయందలి యౌచిత్యమును చర్చించిరి. ఇతిహాసమయిన భారతమును తీసికొనపోయి షేక్స్పియరునాటకవాఙ్మయముతో సరిపోల్చుట యనుచితముగ నెవ్వరి కయినను ప్రథమమున తోచితీరును. కాని పంతులుగారిచ్చిన సమాధానమును వినిన వెనుక నట్టిసంశయమున కేమాత్రము నవకాశము గానరాదు. సంస్కృతభారతము పూర్ణముగ ఇతిహాసమే కావచ్చునుగాని తిక్కనభారతమున నాటకీయకళకూడ ప్రధానముగ ప్రత్యక్షమగుచున్నది గావున ఈ రెంటిని సరిపోల్చుట సముచితమని వీరిసిద్ధాంతము. ఇదిగాక ప్రపంచమునందలి పాత్రీకరణప్రజ్ఞను వీరు ఆదర్శీకరణము (Idealisation), జాతిలక్షణనిరూపణము (Typification), యథార్థప్రదర్శనము (Objective presentation) అని మూడు తరగతులుగ విభజించుచు కాళిదాసుని పాత్రీకరణము మొదటితరగతికిని, షేక్స్పియరుపాత్రీకరణము మూడవతరగతికిని చెందును కావున వాని నొండొంటితో పోల్పరాదనిరి. భారతపాత్రీకరణము షేక్స్పియరు పాత్రీకరణముకూడ ఒకేతరగతికి, అనగా మూడవతరగతికి చెందును గావున యీ రెంటిని సరిపోల్చుటవలన విమర్శకులకు సాహిత్యరసానందమును, నవకవులకు కావ్యనిర్మాణవైదగ్ధ్యమును ఇనుమడించు నని వీరియాశయము. అయితే ఆంధ్రమహాభారతమున గనవచ్చు పాత్రీకరణప్రజ్ఞ ఎంతవరకు వ్యాసునిది? ఎంతవరకు తిక్కనది? అనువిషయముతో మనము జోక్యము కలిగించుకొన్నచో ఉపన్యాసము లతివిస్తృతి వహించును గావున అది మన కప్రస్తుత మనిరి. అందలి మాహాత్మ్యమంతయు వ్యాసునిదే యయినను సంతోషమే. 'తిక్కన' అనుపదమునకు తిక్కనకృతాంధ్రమహాభారత మని వాఙ్మయపరార్థము చెప్పకొనవలసినదేగాని వ్యక్తిగతార్థము చెప్పకొన నక్కర లేదనియు, సారస్వతమున సత్యాన్వేషణమే తమ ప్రధానాశయ మనియు నొక్కివక్కాణించిరి.

తదుపరి పాత్రీకరణ ఉపకరణములనుగూర్చి ముచ్చటించుచు ఇవి షేక్స్పియరుకు, తిక్కనకు సామాన్యములే యని నుడివిరి. ఈ పాత్రీకరణసాధనములలో వీరు ప్రతిపాదించిన సిద్ధాంతములలో నాదృష్టి నాకర్షించినవి ముఖ్యముగ రెండు. అందు మొదటిది వీరి పాత్రీక

రణ చైతన్యసిద్ధాంతము. మనలో నే గ్రంథమునయిన గయికొని దాని పాత్రీకరణ మన్వేషించు నలవాటు హెచ్చుగ నున్నదనియు, ఒక గ్రంథమున పాత్రీకరణము నన్వేషించుటకు పూర్వము కావ్యమునకు పాత్రీకరణ చైతన్య మున్నదా యనుప్రశ్న వైచుకొనవలసియుండు ననియు వీరు ప్రతిపాదించిరి. కొన్ని కావ్యములలో కథాచమత్కృతిమాత్రమే యుండును. మరికొన్ని కావ్యములకు అలంకారబాహుళ్యమే యాశయ మయి యుండును. ఇంకను కొన్నిటికి శైలిమాత్రమే పరమ ప్రయోజనము కావచ్చును. అట్టికావ్యములనెల్ల గైకొని వానిలో పాత్రీకరణ మరయుట కుమ్మరావములో ఇత్తడి ముంతలు వెదకుటవంటిది. పాత్రీకరణ ముద్దిష్టము కానంతమాత్రమున ఒకకావ్య మప్రశస్త మనికాదు. కావ్యమునకు ప్రాశస్త్యమును సమకూర్పజాలిన మహో గుణములలో పాత్రీకరణ మొకటి. అది లేకున్న కావ్య ములుకూడ మనోహరములుగ నుండవచ్చును. కాని ఒక కావ్యమున పాత్రీకరణమును గూర్చి ముచ్చటించుటకు పూర్వము ఆ కావ్యమునకు పాత్రీకరణచైతన్య మున్న దా యని ప్రశ్నించుకొనవలసియుండును. ఈ సిద్ధాంత మెంతవరకు సారవంతమో భావివిమర్శకులు నిశ్చయిం పవలసియున్నది.

సంవాదము, వివాదము, స్వగతము, స్వత్యాపనిరూ పణము మున్నగు నుపకరణములనుగూర్చి సోదాహరణ ముగ ముచ్చటించుచో స్వగతమునుగూర్చి వీరు సలిపిన చర్చ నవీన నాటకకర్తలకు చాల ఉపయోగకరముగ నుండు నని నా యాశయము. షేక్స్పియరులో దీర్ఘము లగు స్వగతము లున్నవనియు, అది యెల్ల నొకకల యనియు, "నాటకములలో స్వగతములే నికిరావు. అవి మిక్కిలి యసహజము" లని వాదించు కొందరు నవీన కవుల వాదన వేపోకతలనియు, ఈరెంటిని విమర్శిం చుచో స్వగతములు అసహజము లనుటకు వీలులే దనియు, పాత్రములు ఇతరులెవ్వరితోడను వ్యక్తీకరించు టకు వీలులేని యాంతరంగికభావములను తమ యాత్మలో తలపోసికొనుట అత్యంతసహజ మనియు, వానిని వ్యక్తీకరించుటకు స్వగతమును ప్రకాశముగ

నుచ్చరింపజేయుట కవిసమయ మనియు, ఇది యెంతయు నాదరణీయ మనియు, కాని ఇవి నాతిదీర్ఘములుగ నుండ కున్నచో కళాప్రవీణతకు భంగకరములనియు వక్కా ణించిరి. షేక్స్పియరుస్వగతములు మనోహరము లయ్యు అత్యంతదీర్ఘము లగుటచే అట్టివి నేటిరచన లలో పరిహార్యము లనిరి. భారతమున రెండుతరగతుల స్వగతములు నున్నవి. ఈ రెండింటిలో రససాంద్రతకు లఘుస్వగతములే ఎక్కుడుగ తోడ్పడుటచే వాని నవ లంబించుట భావికవులకు కర్తవ్య మనిరి.

"తే. రాగరసమున్న డయ్యె సైరంధ్రిజాది
యకట చేన నింకేమియుపాయమగునొ
వలదు తగదన్న నుడిగెడివాడె వీకు
మాయదైవము యే నేమిసేయుదాన?"

అను సుదేష్ణస్వగతమును ఈ జాతిస్వగతముల కొకయుదాహరణముగ నిచ్చిరి. సాధ్యమగునంతవరకు స్వగతములలో జెప్పనెంచిన వృత్తాంతమునుగూడ స్వగతే తరసంభాషణములో సూచించుటయే కళకు పోషకము. స్వగతము అనివార్యమయినపు డిట్టి లఘుస్వగతముల నుపయోగించుట మంచిది.

రెండవ యుపన్యాసము ఎవరెస్టు పర్వతారోహ ణమువలె వీరి కత్యంతశ్రమ కల్పించియుండవచ్చునని యూహింపదగియున్నది. బహుక్లిష్టములు, ఆధ్యాత్మి కాశ్రయములు నగు విషయములను జనసామాన్యమునకు సుబోధకము గావింపవలసియుండెను. ఇందుకు వీరెం తో శ్రమ తీసికొనియుండక తప్పదు. కాని వీరిశ్రమ సఫలమయి యీ యుపన్యాసమునందలి యపూర్వరామ ణీయకత ఎల్లరకు విస్పష్టముగ గోచరించినది. ఈ యుపన్యాసమున ప్రతిపాదించిన సిద్ధాంతములన్నియు క్రొత్తివేయని చెప్పనొప్పును.

మొదటి సిద్ధాంతము పాత్రవిభాగజ్ఞత్వమును గూర్చినది. షేక్స్పియరు పాత్రములలోనున్న వైవిధ్యము భారతపాత్రములలో లేదనువాదనను వీరు ఖండించిరి. పాత్రములను రాజు, మంత్రి, దేశభక్తుడు, దేశద్రోహి, సేవకుడు అని ఇత్యాదిగ చేయుస్థూలవిభజనము అప్ర శస్తమనిరి. రసాయన శాస్త్రజ్ఞుడు విశ్వమనంతయు మూల

ద్రవ్యముల (elements) క్రిందను, పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞుడు విశ్వమునంతను శక్తుల (energies) క్రిందను విభజించునట్లే పాత్రముల యాంతరంగిక స్వభావమునుబట్టి తరగతివిభజన ముండవలెననిరి. ఇందులకు సాంఖ్యులు చేసిన సూత్రయు విభాగమే ప్రశస్తమనిరి. జీవులనెల్ల గుణబద్ధులనియు గుణాతీతులనియు రెండుపెద్దతరగతులుగ విభజింపవచ్చుననియు ఈరెండుతరగతులనుమరల సాత్త్విక, రాజసిక, తామసిక భావములనుబట్టి ఎన్నో తరగతులుగ విభజింపవచ్చుననియు నిరూపించిరి. ఇందు గుణాతీతులు షేక్స్పియరు వాఙ్మయమున లేనేలేరనిరి సృష్టిలో దివ్యత్వమును, అతిలోకసౌందర్యమును ప్రదర్శించుటకు గుణాతీతులు తోడ్పడినట్లు గుణబద్ధులు తోడ్పడరనిరి. ఈ విభజన మెల్ల నిదివరలో మనలో నున్నదే కాని దీనిని కావ్యవిమర్శనములో ప్రవేశపెట్టుటలోను, దాని యావశ్యకత నెంతో నిపుణముగ నిరూపించుటలోను వీరిప్రజ్ఞ గానవచ్చుచున్నది.

రెండవ సిద్ధాంతము షేక్స్పియరు పాత్రీకరణము వ్యక్తిత్వప్రతిపాదనము (individualisation)తో నాగిపోయినదనిరి. ఆవ్యక్తిత్వప్రతిపాదనమునుగూడ షేక్స్పియరు అసంపూర్ణముగ నిర్వహించినాడనిరి. ప్రతి వ్యక్తిలోను విశ్వత్వమువరకు పెంపొందజాలిన బీజములను ప్రతిపాదించినపుడే వ్యక్తిత్వప్రతిపాదనము సాకల్యమగుననిరి. అట్టిది షేక్స్పియరులో కానరాదు. భారతము వ్యక్తిత్వములో విశ్వత్వమును బీజప్రాయముగ ప్రతిపాదించినది. అంతియేకాక విశ్వత్వమును పూర్ణముగ వహించిన శ్రీకృష్ణుడు, భీష్ముడు ఇత్యాదిపాత్రములు కొన్ని భారతమున నున్నవి. వానివిశ్వత్వమువలన పాఠకులకనులు మిరుమిట్లుగొనకుండ వానిమానవత్వమునకు పోషకముగ నుండుటకయి వానిలో కవి వ్యక్తిత్వలక్షణములను ప్రతిపాదించినాడు. అనగా - భారతకారుడు వ్యక్తిత్వములో విశ్వత్వము, విశ్వత్వములో వ్యక్తిత్వము ప్రతిపాదించినాడు. దీనినిబట్టి ఆతడు షేక్స్పియరు కెన్నియంతస్తులు పైనున్నాడో తెలిసికొనుట సుకరమనిరి. నాకుదెలిసినంతవరకు ఈ సిద్ధాంతమును ప్రతిపాదించినవారు ఇంగ్లీషువిమర్శకులలోగాని, ప్రాచీనాలంకారికులలోగాని ఎవ్వరును కానరారు ఇట్టియపూర్వసిద్ధాంతమును ప్రతిపాదించినందులకు, దానిని సమర్థించినందులకు వీరు ప్రశంసార్హులు.

ఇక మూడవది అంతర్గమనసిద్ధాంతము. ఇది కూడ మిగుల నపూర్వమే. షేక్స్పియరుపాత్రములకు అంతర్గమనము లేదని వీరిసిద్ధాంతము. పాత్రమునకు బహిర్గమనమని, అంతర్గమనమని రెండుగమనము లుండునట. బహిర్గమనమనగా పాత్రము కథలోనితుదియాదంతమువైపు నడచుట "లియర్"(Lear) నాటకములోతుదియాదంతము ముఖ్యపాత్రములఘోరమరణము. జీవి జన్మించినది మొదలు |యముడుమృత్యుపాశముతో నీడ్చుచున్నట్లు ఈతుదియాద్యంతమువైపు పాత్రమును కవి మొదటినుండియు నడిపించుచునేయున్నాడు. ఈబహిర్గమనము భారతమునకు షేక్స్పియరుకు సామాన్యమే. కాని భూమికేనచుట్టుతాను తిరుగుచు సూర్యునిచుట్టుతిరుగునటులనే పాత్రములు బాహ్యోద్యంతము వైపు మాత్రమేగాక ఆంతరంగిక పరిపూర్ణత్వము వైపుకూడ ప్రవహించుచుండుట సహజము. ప్రతిజీవికిని ఆరోహణగతియనియు, అవరోహణగతి యనియు రెండుగతు లున్నవి. పశుత్వమునుండి బ్రహ్మత్వము నొందబోవు గతి ఆరోహణ గతి యనియు, బ్రహ్మత్వమునుండి పశుత్వమునకు బోవుగతి అవరోహణగతి యనియు నిర్ణయించుకొనవచ్చును. ఈ రెండును అంతర్గమనమునకు చెందినవే. ఈ రెండింటెని కాని, రెండింటిలో నొక్కదానిని గాని పూర్ణముగ చిత్రింపవలసిన బాధ్యత కవికిలేదు. కాని జీవియొక్కయే యవస్థ గైకొన్నను యీరెండుగతులలో నేదో యొకటి సూచిత మగుచునేయుండును. ఆసూచన లేకపోవు ఎ పాత్రీకరణములో లోపమే. ఈసూచన షేక్స్పియరులో లేదు. ఈసూచనమాత్రమే గాక ఈగతుల సపూర్ణ స్వరూపముకూడ భారతమున నిరూపితమయినది.

పాత్రీకరణములోని ఆకృతివైభవము (design) నుగూర్చి సాకల్యతనుగూర్చి వీరు చేసినసిద్ధాంతములింకను కొన్నియున్నవి గాని ఆకృతివైభవమును గూర్చిన సిద్ధాంతము నింకను తామే స్థిరపరుప జాల

మనిరి. తక్కిన వానినిగూడ గ్రంథవిస్తర భీతిచే నిట నుదాహరించుట లేదు.

మూడవ యుపన్యాసమున భారతకారుని ప్రౌఢ పాత్ర నిర్వహణమును గూర్చియు, పాత్రీకరణమునం దలి లాఘవమును గూర్చియు నుపన్యసించి మొత్తము మీద షేక్స్పియరు పాత్రీకరణమువలన జనించు రసానందమును భారతపాత్రీకరణమువలన జనించు రసానందముతో సరిపోల్చిరి.

ప్రౌఢపాత్ర నిర్వహణ మనగా ప్రౌఢస్వభావము గల పాత్రములను (Complex characters) నిర్వహించుట. రామాయణములో నున్న పాత్రలన్నియు నించుమించుగ సరళపాత్రములే (Simple characters) కాని షేక్స్పియరులోను, భారతములోను మాత్రము ప్రౌఢపాత్రములకు ప్రాధాన్య మీయబడినది. పైకధర్మమువలె గనవచ్చి లోపల నత్యంతధర్మవిరుద్ధము లైన కృత్యములను మాటలను బల్కుటవలనను పాత్రము సమరేఖ (straight line) వలె బోక మానవస్వభావమునను మానవజీవితములోను సిద్ధించువివిధపరిస్థితులను బురస్కరించుకొని వంకరటింకరలుగ బోవుట ఈ ప్రౌఢత్వమునకు ముఖ్యలక్షణ మనిరి. ఈ ప్రౌఢత్వప్రతిపాదనము యథార్థప్రదర్శనమునకు జీవగర్ర. ఇది కవికి కత్తిసామువలె మిగుల కష్టసాధ్యము. షేక్స్పియరు వాఙ్మయమున అత్యంతప్రౌఢము లనుకొనదగిన హ్యామ్లెట్టు, హెన్రీ (V), ఇయాగో, ఇమోజన్ మున్నగుపాత్రములు భారతకారుని ప్రౌఢపాత్రములలో రెండవతరగతికి చెందిన ధర్మరాజు, ధృతరాష్ట్రుడు, ద్రౌపది మున్నగుపాత్రములతోనైనను సరితూగలేవని వీరు సోదాహరణముగ చర్చించిరి. ఇక శ్రీకృష్ణునివంటి ప్రౌఢతమపాత్రనిర్వహణము షేక్స్పియరుకు అసాధ్యమనిరి.

భారతమునందలి పాత్రీకరణప్రావీణ్యము నంతను వీరు మూడుతరగతులుగ విభజించిరి. అందు విరాటపర్వములోనిది మొదటితరగతి. ఉద్యోగపర్వములోనిది రెండవతరగతి. అశ్వమేధపంచకమునందలియు, యుద్ధపంచకమునందలియు పాత్రీకరణము మూడవతరగతి. ఇవి ఉత్తరోత్తరముగ ప్రాశస్త్యమున నాధిక్యము వహించుచున్నవి. "Art lies in concealing art" అని ఇంగ్లీషులో నొకసిద్ధాంత మున్నది. చమత్కృతిని సాధించుటకయి కవి శ్రమపడుచున్నాడనుట కావ్యములో గోచరింపగూడదు. దీనిని నేనము లాఘవమని పేర్కొనవచ్చును. షేక్స్పియరు లాఘవము భారతకారుడు విరాటపర్వములో చూపిన లాఘవమును మించదు. పాత్రీకరణమునకయి ప్రత్యేకము కొంతయవకాశమును గైకొనుచున్నట్లును, ప్రత్యేకము కృషి జరుగుచున్నట్లును ఆతనిలో గోచరింపని తీరును. భారతమున నుత్తమప్రదేశములలో కవి పాత్రీకరణ మొనర్చుచున్నట్లే గోచరింపక రసప్రవాహమున నది లీనమై పోవుచున్నది.

మొత్తముమీద చూచినచో దైవము, పౌరుషము అనురెండు శక్తులను వ్యక్తులజీవితములలో ప్రదర్శించుటలో షేక్స్పియరుకంటె భారతము యథార్థమున కత్యంత సన్నిహితముగ బోయినది. షేక్స్పియరు పాత్రపరిణామమును దిలకించునపుడు ఒక విధమయిన చిత్తావసాదము (depession) తప్పదు. కసాయికత్తికి బలియయిమొండెమును వీడిగిజగిజ కొట్టుకొను శిరోభాగములతో నున్న జీవులవలె షేక్స్పియరు విషాదనాటకమునందలి పాత్రములు గోచరించును. కష్టములకు, అపజయములకు, మరణమునకు అతీతములయి భారతపాత్రములు కానవచ్చును. ఉపశాంతి (Repose) అను అనుభవము కళకు పరమప్రయోజనమని ప్రాచ్యపాశ్చాత్య విమర్శకులేకగ్రీవముగ నంగీకరించుచో నది భారతపాత్రములవలననే ఎక్కుడుగ సిద్ధించుచున్నది.

శ్రీ బంగారయ్యగారి సిద్ధాంతము లన్నియు పరమ ప్రామాణికములని గాని, నిర్దుష్టములనిగాని నేను వాదింపను, వారును వాదింపరు. వారొకస్వతంత్రమార్గము నవలంబించి సాహిత్య సత్యాన్వేషణ మొనరించిరి. వాని సత్యాసత్యములను పరిష్కరించుట నిర్ణయింపవలసియున్నది. కాని వారు తమ సిద్ధాంతములను ప్రతిపాదించిన విధానము మాత్రము మిక్కిలి ప్రశంసార్హమని యందరు నొప్పుకొందురు. ప్రాయికముగా విశ్వకళాపరిషదుపన్యాసములు చదువుట యల

వాటయినను వారాసువుగ వాడుక భాషలో నుపన్యసించి పండితపామరులకు తమసిద్ధాంతములను సుబోధపరచిరి. అట్లని వాక్యసాంగత్యమునగాని, విషయవిభాగమునగాని అప్రస్తుత ప్రశంసకు తావీయక చక్కని స్వరూప సౌష్ఠవమును గానబరచిరి. నడుమనడుమ ఇంగ్లీషుమాటలను చిలుకరించుట మూలముననను, ఇతరవిధములను హాస్యరసమును యథోచితముగ బ్రయోగించి సభ్యుల కుల్లాసము పుట్టించిరి.

వీరు వాచా చెప్పినదానికంటె వ్రాసియుంచిన దెంతో యెక్కుడుగ నుండునని తోచుచున్నది. ఏలయన పలుమారు కాలాతిక్రమణభీతిచే కొంత భాగమును వదలుచున్నామని వీరు సభ్యులను హెచ్చరించుచువచ్చిరి. ఈయుపన్యాసము లచ్చుపడగ చూడవలెనను కుతూహలము నేకులకు గలదు. అట్లయినచో వీరిసిద్ధాంతముల నింతకంటె సావధానముగ బరిశీలించి విమర్శించుట కవకాశ మేర్పడును.

బంగారయ్యగారిలో మెచ్చుకొనదగినగుణములలో వారి నిష్పాక్షికస్వభావము, సత్యప్రియత్వమును పేర్కొనదగినయున్నవి. భారతమును బ్రశంసించు నుత్సాహములో వారు షేక్స్పియరునుగూర్చి ఎక్కడను లఘువుగ మాట్లాడలేదు. షేక్స్పియరుపట్ల వీరికిగల యఖండగౌరవము వీరియుపన్యాసములను విన్నవారికెల్ల సువ్యక్తమగుచునేయుండును.

బంగారయ్యగారు విమర్శనమున నొక నవీనమార్గమును ద్రొక్కి భారతమును భాషాంతరవాఙ్మయముతో స్పర్థింపజేసి విజయులయిరి. సంస్కృతాంధ్రపండితులకు సాధారణముగ భాషాంతరవాఙ్మయప్రవేశముండదు. వారు తమతమ భాషలలో మాత్రము శారదావిగ్రహములైయుందురు. అట్టివారికి దేశాంతరభాషాంతరములందలి ప్రౌఢవాఙ్మయమాహాత్మ్యము దెలియుటకిట్టియుపన్యాసగోష్ఠులు మహోపకారకములుగ నుండగలవు.

ఇట్టి యుత్కృష్టపద్ధతినే భారతమునందలి ప్రత్యవయవ విమర్శ వెలువడినబాగుండును. ఒక్కషేక్స్పియరుతో మాత్రమేగాక మిల్టన్, డాంటి, హోమరుమున్నగు పాశ్చాత్యకవుల కావ్యములతో భారతమును పరిపోల్చు నుద్యమముకూడ బయలుదేరదగినదే. ఇట్టి యుద్యమములను సత్యారాధనబుద్ధితో నిర్వహించుటకు శ్రీ బంగారయ్యపంతులుగారు సమర్థులుగ గనవచ్చుచున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాపీఠాధికారులు వీరిని ప్రోత్సహించి ఇతోధికములగు విమర్శనములకు, వ్యాఖ్యానములకు వీరిని బ్రేరేపించుట ఆంధ్రభాషకు మహోపకారము.

---

# జడ ప్రకృతి

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

ప్రకృతిపురుషుల సమ్మేళనమువలన ఈ విశ్వమంతయు సృష్టియైన దని సాంఖ్యులు వాదించుచున్నారు. సాంఖ్యు లేల, వేదాంతవేత్తలు గూడ చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అను నీ మూటినుండియే సర్వమును ఉద్భవించిన దని చెప్పుచున్నారు. ఈ వాదములును, చర్చలును సతతము జరుగుచునేయున్నను సామాన్యుల కర్థమగుట చాల కష్టము.

కాని ముఖ్యాంశము లందరికిని తెలిసినవే. ప్రపంచమునయున్న వస్తుసముదాయము నంతటిని (౧) జీవము కలవి (౨) జీవములేనివి అని రెండుతెగలుగ విభజింపవచ్చునని అందరికిని తెలిసినవిషయమే. చీమ, దోమల నుండి గజ, గండభేరుండములవరకును అన్నియు జీవరాసులు. మొన్న మొన్నటివరకును పాశ్చాత్యులు వృక్షములకు జీవములేనట్లు భావించుచుండిరి. కాని ప్రకృతిశాస్త్రమహామహుడగు జగదీశచంద్రబోసు వృక్షములకు జీవమున్నదనియు, అవియు ఇతర జీవరాసులవలెనే జరామరణములకు లోనైనవనియు పరిశోధనాపూర్వకముగ నిర్ధరించియున్నాడు. ఇక రాళ్లు, రప్పలు, లోహములు మొదలగునవియన్నియు అజీవములు. ఈ రెంటికిని ఉన్న భేదమంతయు జీవమునందే. ఇక జీవములను, అజీవములను గూడ సృష్టించిన కర్త యొకటియో, ఒకడో ఉండవలయును గదా. ఈశ్వరుడే సృష్టికర్తయని కొందరు వాదించుచున్నారు. కర్తయే అవశ్యకములేదు. విశ్వమునందు ఉన్నదంతయు జీవములు, అజీవములు అను ఈరెండు మాత్రమే యని నాస్తికులు వాదించుచున్నారు. ప్రకృతము మనము నిరీశ్వరవాదమునుగూర్చి చర్చింప నవసరములేదు. ప్రత్యక్షముగ మనకంటికి కనబడుచున్న వస్తువులనే మన మర్థముచేసుకొనలేనప్పుడు ఇక పరోక్షమునుగూర్చి చర్చించుటకు సాధ్యమగునా? ప్రత్యక్షమునే ఇంకను కొంత పరిశీలింతము.

ప్రాణ మనునది ఎట్టిదో ఎవరును చెప్పలేరు. ప్రాణము పోయినవెంటనే ఏ జంతువైనను చలనశక్తి నంతటిని గోల్పోయి నేల గూలును. ఒక జంతువునందు ప్రాణ మున్నదా లేదా యని సందేహమువచ్చినపుడు ఆ జంతువు చలించుచున్నదా, లేదా యని జాగ్రత్తగా పరీక్షించెదము. చాలకాలము చలించక నేయుండినయెడల అది చనిపోయియున్న దని నిశ్చయింతుము. అయితే "ప్రాణము" అనునొక్కయంశమును మాత్రము వదలివైచినచో విశ్వమునందున్న దంతయు నొక్కటేనా అని యడిగిన ఔనని మనము దృఢముగ జెప్పలేము. మనము రబ్బరుబూట్సుల నుపయోగింతుము. చర్మముతో చేసిన బూట్సులనుగూడ ఉపయోగింతుము కాని రబ్బరును చర్మమును ఒకటేరకపుపదార్థములని చెప్పలేము. ఒక్కొక్కమారు దంతముతో చేసిన చిన్న పెట్టెనో, భరిణినో తాకిచూచినయెడల ఏలోహముతోనో చేసినదానివలె తోచును. కాని దంతముదంతమే, లోహము లోహమే. ఎంతటి భద్రమైన కలపతో చేసిన పెట్టెయైనను లోహముతో చేసినదానివలె నుండదు. ప్రాణిజములైన పదార్థములకును లోహాది ఇతరపదార్థములకును చూచుట కెంతయో భేద మగపడుచున్నది.

ఈ భేదము నాధారముచేసియే రసాయనశాస్త్రజ్ఞులు ఇటీవలివరకును ప్రకృతియందున్న పదార్థముల నన్నిటిని ప్రాణిజము (Organic) లనియు అప్రాణిజము (Inorganic) లనియు రెండుతెగలుగ విభజించిరి. ప్రాణికోటినుండి వచ్చిన వన్నియు ప్రాణిజములే. తేనె మధుకరములచే పువ్వులనుండి తయారుచేయబడినది. కాన తేనె ప్రాణిజమే. కలప ప్రాణిజము. దంతము మొదలగునవి యన్నియు ప్రాణిజములు. వీనిని పరిశోధనాలయములందు తయారుచేయ సాధ్యముగాదని మొదట ననుకొనిరి. కాని ఇట్టిపదార్థములను గూడ కొన్నిటిని

ప్రాణిసహాయము లేకనే మానవుడు సృష్టించుటకు నేర్చుకొనెను. ఉదాహరణముగ నీలిరంగు ఉత్పత్తినిగూర్చి పరిశీలింతము. ఇటీవల కొన్నిసంవత్సరముల వరకును హిందూదేశమున నీలిపంట యధికముగ నుండెను. ఇతర దేశములకు నీలి యధికముగ ఎగుమతి యగుచుండినందున ఎటుచూచినను నీలి తయారగుచుండెను. నేటికిని పల్లెలలో శిథిలములైన నీలితొట్లు విశేషముగా గాన్పించుచున్నవి. నీలి ప్రాణిజము. పాశ్చాత్యదేశములలో నీలి పండించుటకు సాధ్యము గాదు. కాన వారు తమ నీలిరంగునకై హిందూదేశముపై సంపూర్ణముగ నాధారపడియుండిరి. ఇది సహింపజాలక పంటమూలమున గాకపోయినను ఇంకేవిధముగనైనను తామే నీలిని తయారుచేయ సాధ్యమగునాయని పాశ్చాత్యరసాయనశాస్త్రజ్ఞులు పరిశోధించి పరిశోధించి తుదకు క్రీ. శ. ౧౮౯౭వ సంవత్సరమునందు తారు (Tar) నుండి నీలిని తయారుచేయుటకు నేర్చుకొనిరి. తారు నేలబొగ్గునుండి తయారగును. పాశ్చాత్యదేశములందు నేలబొగ్గు అధికముగ దొరకుచున్నందున పాశ్చాత్యులు ఇందుండి నీలిని అధికముగ తయారుచేసి మనకన్న చాల సరసమగు ధరలకు అమ్మి మననీలిపంటనే నాశనముచేయగలిగిరి. 'ప్రాణిజము' అనుకొన్న వస్తువును అప్రాణిజములగు ఖనిజములనుండి తయారుచేయ సాధ్యమయ్యెను. ఇక ప్రాణిజములు, అప్రాణిజములు అన్న ప్రత్యేకతకు ఆధారమేమి?

కాన ఆధునికరసాయనశాస్త్రజ్ఞులు ఈవిభజనము, ఈలక్షణమును వదలి వేరులక్షణముల నేర్పరచిరి. జీవరాసులన్నిటియందును అంగారపదార్థము ఉన్నది గాన అంగారపదార్థయుతములైనవన్నియు ఆర్గానిక్ (Organic) విభాగమునకు జెందినవనియు, తదితరములు ఇనార్గానిక్ (Inorganic) విభాగమునకు జెందినవనియు ఇప్పుడు నిశ్చయించియున్నారు.

అంగారము జంతువులలో నున్నది, మనలో నున్నది; గాని పెన్సిలునందును, వజ్రమునందును కూడ ఉన్నది. కాన జీవజంతువులును పెన్సిలు ఇత్యాది, నిర్జీవములును ఒకటేనా? జీవజంతువులకు స్వతస్సిద్ధమైన చలనశక్తి యున్నది కాన ఇవి పెన్సిలు మొదలగు వానికంటె భిన్నము అని చెప్పవలదా? అనుప్రశ్న బయలుదేరును.

ఈ యంశముకూడ సందేహాస్పదమైనదే. మనము సాధారణముగ పాంచభౌతికమైన ద్రవ్యమును జడమని యందుము. ఒకరాయికాని, ఇనుపముక్కకాని తనంతనదే ఒకస్థలమునుండి మరియొకస్థలమునకు చలింపజాలదు; తనయాకారమును మార్చుకొనజాలదు. అది చలింపవలెనన్న కొంతశక్తిని దానిపై ప్రసరింపజేయవలెను. కాని ఒకముద్ద బంగారమును,మరియొకముద్ద సీసమును రెంటిని గట్టిగా అదిమి పెట్టినయెడల కొంతకాలమునకు సీసముముద్దలో కొంతబంగారమును,బంగారముముద్దలో కొంత సీసమును చేరియుండును. చాలకాల మట్లే యుంచినయెడల నిమ్మళముగను నీళ్లును కలిసిపోయినట్లే బంగారమును సీసమును కూడ-అవి గట్టి లోహపుముద్దలైనను-కలిసిపోవును. సీసమును బంగారమును ఖనిజములు. వానియందు ప్రాణములేదు. ఈకారణమున వీనియందు స్వతస్సిద్ధమగు చలనశక్తి ఏమాత్రమును లేదనినచో ఇక ఇవి ఒకదానిలో నొకటి చేరిపోవుట కెట్లు సాధ్యమగును?

ఒక ఆవులమందకు సమీపముననే ఒక ఎద్దులమందనుగూడవదలి పసులకాపరు లందరును అన్నముతినుటకు కొంతదూరము పోయి రనుకొందము. ఒకగంట రెండుగంటలకు పిమ్మట వచ్చిచూచినయెడల ఆమందలు అవిధముగనే యుండునా? రెండుమందలును బాగుగ కలిసిపోయి ఇంచుమించుగ ఒకటేమంద యైయుండును. ఆవులును ఎద్దులును ఏమాత్రమును చలింపకనేయుండినయెడల ఈవిధముగ మందలు కలిసిపోవుటకు సాధ్యమగునా? అట్లే ఈ లోహములందలి కణములు (particles) ఏమాత్రమును చలింపక యుండినయెడల ఈవిధముగ కలసిపోవుట కెట్లు సాధ్యమగును?

గట్టిగానున్న లోహముముద్దలే వానియందున్న కణముల చలనమువలన ఈ విధముగ కలిసిపోవుటకు సాధ్యమైనయెడల ఇక ద్రవపదార్థములనుగూర్చి చెప్పవలెనా? వీనియందలి కణములు సతతము అధికముగ చలించుచునే యుండును. కాని ఈ కణములు అతి

సూక్ష్మములుగ నున్నందున వానిచలనమును ఎట్టి సూక్ష్మదర్శనియంత్రముతో నైనను చూచుటకు సాధ్యము గాదు. కాని వానియందు చిన్న రవలు పడినయెడల ఈ చలనము దృగ్గోచరమగును. బ్రౌన్ (Brown) అను వృక్షశాస్త్రజ్ఞుడు వృక్షములందుండు ద్రవమును సూక్ష్మదర్శినితో పరీక్షించుచు దానియందున్న అణువులవంటి చిన్నచిన్న ముక్కలు ఒకసమూహమునబడి త్రోపులాడుచున్నట్లు అధికముగ చలించుచుండుటను జూచెను. ఈ విశేషమునకు అతనిపేరనే బ్రౌనియన్ చలన(Brownian movement)మని పేరుపెట్టిరి. కాని ఇందున కేమికారణమో చాలరోజులు తెలియు నేలేదు. ద్రవమునందలి కణముల సంచలనమే ఇందుకు కారణ మని ఇప్పుడు స్పష్టమయినది. వేగముగ నీజలకణములు చలించునపుడు వానితో నీరవలు ఢీకొని, మహాసముద్రజలతరంగముల నడుమ చిన్నచిన్న తెప్పలవలె ముందునకును వెనుకకును చలించుచునేయుండును. ఈ విధముగ మనకు ఈ చిన్నిముక్కల చలనమునుండి ఈ విషయము వ్యక్తమైనది.

ద్రవపదార్థములు ఇమిరిపోవుటకుగూడ నిదియే కారణము. ఒకతట్టలో నీళ్లు పోసి పైన ఏలాటి మూతనువేయక వదలిపెట్టినయెడల కొంతకాలమునకు నీరంతయు ఆవిరిగ మారిపోయి తట్టలో నేమియు నగపడదు. ఇది ఎట్లు జరుగును? నీటికణములు సతతము వేవేగముగ చలించుచుండుటవలన అప్పుడప్పుడు వానిలో కొన్ని పైకెగిరి గాలిలో చేరిపోవును. సముద్రతరంగములు చాలపెద్దవిగ నున్నప్పుడు తరంగశిఖరములందలి జలము చాల అల్లకల్లోలమునకు పాలై ఫేనరూపముగ మారి చూపరుల కచ్చెరువు గలిగించుట యందరెరిగిన యంశమే. ఒకొక్కసారి నీటితుంపరలు పైకెగిరినపుడు సూర్యరశ్మి కెదురుగ మనము నిలుచుకొనియున్నచో మన కొక చిన్న ఇంద్రధనుస్సు కనబడును. గాలిలో నీటికణములు చేరిపోయిన వనియు కాననే మనకీ చిన్న ఇంద్రధనుస్సు కనబడుచున్నదనియు ఇందుండి స్పష్టమగుచున్నది. అట్లే చిన్నగిన్నెలోని నీరుగూడ అంతకంతకు కొంచెము కొంచెముగా ఆవిరియగుచు తరిగిపోవుచుండును. ఇప్పుడా నీటిక్రింద మంటవేసి నీటిని కాచినచో జలకణముల సంచలనము నత్యధికము చేసినందువలన అధికకణములు పైకెగిరి గాలిలో చేరిపోవుట కాస్పద మున్నది. కొంతకాలమునకు నీరంతయు ఆవిరిగ మారిపోవును. నీటిపైన గట్టిగా ఊదినను గూడ నీరు ఇమిరిపోవుటకు ఆస్పద మెక్కువగును. ఇందునకుగూడ కణచలన మధికమగుటయే కారణము. కాననే శీతకాలమునందు సూర్యరశ్మి యధికముగ లేకపోయినను తడిబట్టలను గాలిలో నారవేసినయెడల త్వరగ నెండిపోవును. ద్రవపదార్థములలో కొన్ని మిగతవానికన్న త్వరగా ఇమిరిపోవును. మోటారుబండ్ల కుపయోగించు పెట్రోలియమ్‌నూనె గల యొకడబ్బాను మూత దీసినైచి కొంతసే పుంచినయెడల పెట్రోలియము వాసన గదియంతయు వ్యాపించును. పెట్రోలియము గాలిలో చేరిపోయినది. ఇప్పు డెవరైన అజాగ్రత్తగ ఆగదిలో నొకయగ్గిపుల్ల గీచినయెడల గాలిలోనున్న పెట్రోలియమునకు నిప్పంటుకొనును. అందుకే పెట్రోలియము నుంచు ప్రదేశములందు పొగసీల్చరా దను నిబంధన కలదు.

ఘన ద్రవపదార్థములయందే కణముల కీవిధముగ నధికసంచలన మున్నప్పుడు వాయుపదార్థము విషయమున చెప్పనక్కరయేలేదు. వాయుపదార్థమున కణములు పైకి, క్రిందకి, ముందుకు, వెనుకకు నానావిధములుగ, నొక్కొక్కప్పుడు అధికోద్వేగముతో చలించుచునే యుండును. "నేడు గాలియే లేదు. నిశ్చలనముగ నున్నది. ఆకైనను ఆడకున్నది." అని మనము పరితపించు వేసవిరాత్రులందు గూడ గాలియందు అధికసంచలనముండియేతీరును. అనుదినమును, నిమిష నిమిషమును వాయుకణములు మన మొగముమీద తుపాకిగుండ్ల వేగముతో పడుచునేయుండును. నిజముగ నివి తుపాకిగుండ్ల పరిమాణములో సగము పరిమాణము గలవైనను మన మీపృథివియందు బ్రతుకజాలము.

ఇట్టి పదార్థములను "జడ"మనుటలో నర్థ మేమి? ప్రాణముకలవానికిని, లేనివానికిని ఉన్న భేదమంతయు మొదటిరకమువానికి స్వతఃసిద్ధముగగల చలన

శక్తియే యని మునుముందు తలచితిమి. కాని ప్రాణము లేని పదార్థమునకు గూడ స్వతఃసిద్ధముగనే యధిక చలన శక్తి గలదని ఇప్పుడు తెలిసినది. కాన మనకును పృథివ్యాది ద్రవ్యములకును ఏమైన భేదము కలదా యను సందేహము ఇప్పుడు బలవత్తరమైనది.

మానవదేహ మెట్టిపదార్థముతో చేయబడినదో జాగ్రత్తగ పరిశీలించినయెడల మనకును జడప్రకృతికిని గల సంబంధము విశదమగును. ఇదివఱకును పృథివ్యాది ద్రవ్యముల గుణములను పరిశీలించి వాని కేదైన ప్రత్యేకత యున్నదేమో యని పరీక్షించితిమి. కాని జీవరాసుల కున్న ముఖ్యగుణమగు చలనశక్తి పృథివ్యాదిద్రవ్యముల కుగూడ కలదని కనుగొంటిమి ఇందువలన ఈరెంటికిని గాన్పించు కొద్దిపాటి భేదముగూడ నశించినది. అట్లయిన ప్రాణిదేహనిర్మాణద్రవ్యమునకును, పృథివ్యాదిద్రవ్యము నకును భేదమే లేదా? తత్వవేత్తలు చెప్పినట్లు మనదేహము నిజముగ పృథివ్యప్తేజోవాయ్వాకాశములనెడు పంచభూతములతో చేయబడినదేనా? అట్లనుట కెట్టిఆధారములు గలవు? మొదలగుప్రశ్నలు ఇపుడు చర్చనీయములు.

పసిపాపలు సాధారణముగ పుట్టినపుడు ౧౨ నేర్లబరు వుందురు. క్రమక్రమముగ పెరిగి సుమారు ౨౫ సంవత్సరముల ప్రాయమున అంతకన్న ౨౩ లేక ౨౪ రెట్లు అధికముగ బరువుందురు. మనము తినునాహారము నుండి ఇంతభారముగల మనదేహము నిర్మితమైనది. కాన మనయాహారపదార్థము లెట్టివో పరిశీలించినయెడల మనదేహ మెట్టిపదార్థములతో నిర్మింపబడినదో విశదమగును. సాధారణముగ హిందువుల భోజనమునందు చాలభాగము శాకాహారమే. కొందరు అప్పుడప్పుడు కొంత మాంసమును తినెదరు. పాలు, పెరుగు, నెయ్యి గూడ మన మెక్కువగా వాడుదుము. ఎవరును లోహములనుగాని, ఇతరఖనిజములగాని భక్షింపజాలరు. పాలును, పెరుగును, మాంసమును జంతువులనుండి వచ్చును. కాని ఆవులు, గేదెలు, మేకలు మొదలగు జంతువులు పచ్చిక పైననో, చొప్పపైననో యాధారపడియుండుటవలనసూక్ష్మముగ పరిశీలించినచో మనయాహారపదార్థములన్నియు-మనము శాకాహారులైననేమి, మాంసాహారులైననేమి- వృక్షలోకముపై నాధారపడిన వని యనవచ్చును. కాని వృక్షలోకము సూర్యరశ్మి, గాలి, భూమియందున్న ఖనిజములు- వీనిపై నాధారపడియున్నందున ప్రాణికోటికంతటికిని మూలాధారము ఖనిజసంపదయే యని తేలినది. ఈ క్రింది యుదాహరణమున ఈ విషయము ఇంకను విశదమగును. అన్నిటికన్నను ఆవుపాలు అత్యుత్తమమైన యాహారమనియు, మానవునికి కావలసినఆహారపదార్థములన్నియు అందున్న వనియు మన మెరుగుదుము. అందువలననే రోగులకును, పసిపిల్లలకును పాలుతప్ప మరిఏమియు నొసగరు. పాలు మనకు ఆవునుండి వచ్చును. ఆవు చొప్పను మేసియో, పచ్చిగడ్డినితినియో పాలను తయారుచేయును. పచ్చిగడ్డి మొలిచి బాగుగా పెరుగుటకు సూర్యరశ్మి, గాలి, భూమియందున్న ఖనిజములు, నీరు ఆధారము. దీనిని బట్టి జంతులోకమునకు వృక్షలోక మాధారమనియు, వృక్షలోకమునకు ఖనిజము లాధారమనియు తెలియుచున్నది. మూలాధారము ఖనిజములు. మనదేహవిభాగములగు మెదడు, ఎముకలు, రక్తము, కండరములు, చర్మము, వెంట్రుకలు మొదలగువానిని దీసికొని పరీక్షించినచో అవన్నియు పృథివియందున్న ఖనిజములలో నేవో కొన్ని చేరి నిర్మితములైనవే యని బోధపడును.

శాస్త్రీయముగ మనదేహమునందలి ప్రతిపదార్థమును పరీక్షింప ప్రయత్నింతము. తిర్యగ్జంతువులదేహములుగూడ చాలవరకు మానవదేహమువలెనే యున్నందున, మానవదేహము నొక్కదానిని సరిగా పరీక్షించిన యెడల జంతులోకనిర్మాణము చాలవరకు బోధపడినట్లే. శాస్త్రీయముగ పరీక్షింపవలెనన్న మనము రసాయన శాస్త్రపద్ధతుల నవలంబించియే తీరవలెను. ఒక రసాయన శాస్త్రజ్ఞునికి ఒక సీమసున్నపు ముక్కనిచ్చి "ఇది ఏమి? దీనిని పరిశోధింపుము." అని చెప్పినయెడల వాడు ఏమిచేయును? ఆసీమసున్నపు ముక్కను గైకొని దానినిపిండిచేసి కాచియో, లేక దానిపై ఆసిడ్లను (Acids) ఆమ్లద్రవములను పోసియో, మరి ఇంకే

విధముగనైననో ఆపదార్థమును "విభజించుటకు" (Analyse) ప్రయత్నించును. ఈవిధముగ పరిశోధనకు గడగి రసాయనశాస్త్రజ్ఞుడు సీమసున్నపురుక్కను ప్రథమమున సున్నము (Lime), బొగ్గుపులుసువాయువు (Carbon-dioxide) అను రెండు ప్రత్యేకద్రవ్యము లుగ విడదీయును. పిమ్మట వీని నొక్కొక్కటిని 'విభజించి' సున్నమును ఖటిక (calcium), ప్రాణవాయువు (Oxygen)లగను, బొగ్గుపులుసువాయువును బొగ్గ (Carbon), ప్రాణవాయువు (Oxygen) లగను విడదీయును. ఇప్పుడు 'సీమసున్నము' అను నొక్క పదార్థము (i) ఖటికము (ii) బొగ్గ (iii) ప్రాణవాయువు అనుమూడు పదార్థములుగ విభజింపబడినది. ఈపదార్థముల నొక్కొక్కదానిని ఇంకను విభజించుటకు సాధ్యముగాదు ఇట్టివానిని సాధారణముగ మూలద్రవ్యము లందురు.

ఉదాహరణముగ మరియొక పదార్థమును గైకొందము. స్వచ్ఛమైన నీటిని గైకొని రసాయనశాస్త్రరీత్యా విభజించుటకు ప్రయత్నించినయెడల ఉదజని (Hydrogen), ప్రాణవాయువు (Oxygen) అను రెండు వాయువులు బయలుదేరును. ఇవి సమ్మేళనము జెందియే నీ రేర్పడినది. ఇందొట్టి మర్మమును లేదు. ఎవరైనను సరే, ఒకగిన్నెనీటిని గైకొని నీటి గుండా విద్యుచ్ఛక్తి ప్రవహించునట్లు చేసినయెడల వెంటనే నీరు మాయమై గిన్నెలో ఉదజనివాయువును, ప్రాణవాయువును ఏర్పడును. ఇంకను సందేహమున్నయెడల ఈవాయువులను రెంటిని గిన్నెలోనే యుంచి విద్యుచ్ఛక్తిని మెరుపువలె ప్రసరింపజేసినచో (Electric spark) మరల ఈ రెండువాయువులును సమ్మేళనముచెంది నీరుగ మారును. ఈవిధముగ రసాయనశాస్త్రజ్ఞుడు పదార్థములను మూలద్రవ్యములుగ విభజింపగలడు. మూలద్రవ్యములను గైకొని సమాహృతద్రవ్యములుగ (Compounds) జేయగలడు.

నీటియందు ఒకపాలు ప్రాణవాయువును, రెండుపాళ్లు ఉదజనియు గలవు. రసాయనశాస్త్రజ్ఞుడు ప్రాణవాయువు నింకను అధికముగ గైకొని రెండుపాళ్లు ప్రాణవాయువును, రెండుపాళ్లు ఉదజనియు ఉపయోగించినయెడల నీటికిబదులు ఉదజనిప్లుకిదము (Hydrogen per Oxide) అను ద్రవపదార్థ మొకటి తయారగును. మనకు చెవిలో పుండులేచినను, పండ్లనొప్పి యధికముగ నున్నను ఈ పదార్థమును మనము సాధారణముగ వాడెదము. పుండ్లను కడుగుటకుగూడ వైద్యులు దీనిని సాధారణముగ నుపయోగింతురు.

ఒకభాగము బొగ్గను, ఒకభాగము ప్రాణవాయువును జేర్చినయెడల అది యొకప్రాణాంతకమగు విషవాయువుగ (Carbon monoxide) పరిణమించును. ఒకటికిబదులు రెండుపాళ్లు ప్రాణవాయువు నుపయోగించినయెడల బొగ్గుపులుసువాయువు (Carbon dioxide) గ తయారగును. ఇది మనము సామాన్యముగ పీల్చువాయువునం దెంతయో యున్నది. నిర్మాణమునందంత స్వల్పభేదమున్నను స్వభావమునం దీరెంటికిని ఎంత భేద మున్నదో చూచితిరా?

ఈవిధముగ రసాయనశాస్త్రజ్ఞుడు ప్రపంచమునందున్న పదార్థముల నెన్నిటినో పరీక్షించి వాని నన్నిటిని పది, పండ్రెండు మూల ద్రవ్యములుగ విభజింపగలడు. ఆ మూలద్రవ్యములను గైకొని మరల ఆ పదార్థములను సృజింపగలడు. ఏబది, ఏబదియైదు అక్షరములతో నానావిధములైన పదములను, వాక్యములను, పుస్తకములను రచింపగలిగినట్లు రెండుమూడు మూలద్రవ్యముల (Elements) నొసగినను రసాయనశాస్త్రజ్ఞుడు ఎన్నియోపదార్థములను నిర్మింపగలడు.

పదార్థముల నిర్మాణమునందు ఎంత భేద మున్నదో పైనుడివిన ఒకటిరెండు ఉదాహరణముల నుండియే విశదమైనది. నీరు మొదలగు పదార్థముల నిర్మాణము సుకరము. ఇందు రెండు మూలద్రవ్యములు మాత్రమే గలవు. కాని కొన్నికొన్ని సమాహృతద్రవ్యము (Compounds) లందెన్నెన్నియో మూలపదార్థము లుండును. ఇవన్నియు ఒకదానిలోనొకటి ఏవిధముగ సమ్మేళనము చెందగలవో శాస్త్రజ్ఞు లింకను గనిపెట్ట

లేదు. కాన అట్టివానిని నిర్మించుట కెట్టిరసాయన శాస్త్రజ్ఞునికిని సాధ్యముగాదు. ఉదాహరణముగ జీవకణమును గైకొందము. అత్యల్పప్రమాణమునకు సాధారణముగ కణము (Molecule) అని యందురు. సీసుసున్నపు కణము అనికాని, జలకణము అనికాని యనిన యత్యల్ప ప్రమాణముగల సీసుసున్నమనియు, జలమనియు అర్థము. కాని ప్రాణముగల పదార్థములనుగూర్చి మాటలాడునపుడు కణ మనుటకుబదులు ప్రోటోప్లాసమ్ (Protoplasm) అని యందురు. ఈ గ్రీకుపదమునకు "ప్రథమ నిర్మాణము" అని యర్థము. నీటియందుండు అతిసూక్ష్మమైన అమీబా (Amoeba) యను క్రిములనుండి గజేంద్రములవరకును జీవరాసులన్నియు ఈ ప్రోటోప్లాసమ్ నుండి నిర్మితములైనవే. కాని ఈ ప్రోటోప్లాసమును నిర్మించుటకుమాత్రము శాస్త్రవేత్తలకింకను సాధ్యముగాలేదు. దీనియందు ఒకటిరెండు మాత్రముగాక ౬ ప్రత్యేక ద్రవ్యములు గలవు.

| | | |
|---|---|---|
| ౪౦౦ | పాళ్లు | బొగ్గు (Carbon) |
| ౧౨౦ | ,, | ప్రాణవాయువు (Oxygen) |
| ౩౧౦ | ,, | ఉదజని (Hydrogen) |
| ౫౦ | ,, | నత్రజని వాయువు (Nitrogen) |
| ౨ | ,, | గంధకము (Sulphur) |
| ౨ | ,, | భాస్వరము (Phosphorus) |

ఇవన్నియు ఒక ప్రత్యేకపద్ధతి ననుసరించి సమ్మేళనమును జెంది ప్రోటోప్లాసమ్ (Protoplasm) తయారగును. ఇంత క్లిష్టనిర్మాణముగలది గాననే ఈ పదార్థమును నిర్మించుటకు శాస్త్రజ్ఞులకింకను సాధ్యము గాలేదు. మానవుని కింతవరకును తెలిసిన శాస్త్రజ్ఞానమత్యల్పమే. ఈ యల్పజ్ఞానముచే నింతవరకును శాస్త్రజ్ఞులు కొన్నికొన్ని సుకరములను పదార్థములనే చేయగలిగియున్నారు. కాని ప్రోటోప్లాసము (Protoplasm) వంటి క్లిష్టనిర్మాణముగల పదార్థముల నేమాత్రమును చేయలేరు.

ఈవిషయము నటుండనిచ్చి మానవదేహమును విభజించి పరీక్షింతము. చూచుటకు గట్టిగా ఘనపదార్థమువలె గాన్పించుచున్నను మనదేహములో చాల భాగము ద్రవపదార్థమే యని మనకందరికిని దెలియును. కాని పృథ్వియందు భూమి యొక్క పాలునా, నీళ్లు మూడు పాళ్లును ఉన్నట్లే మన దేహమునందుగూడ మూడుపాళ్లు నీళ్లును, ఒకపాలుమాత్రమే ఘనపదార్థమును గలవని చాలమందికి దెలియదు. అందువలననే మనకు ఆహారముకన్న నీళ్లే చాల ప్రాముఖ్యము. ఆహారములేకుండ మానవుడు 3 వారములైనను జీవించగలడు. కాని నీళ్లు లేకుండ పోయినయెడల కొద్దిరోజులలోనే మరణించగలడు. జంతురాసులన్నియు జలచరావస్థనుండి పరిణామము చెందినవే యనుటకు ఇంతకన్న విశదమగు ప్రమాణము కావలయునా? ఆదిమావస్థయందు సముద్రపు ఉప్పునీటికి అలవాటుపడినందుననే నేటికిని ఉప్పులేకపోయిన యెడల మానవుడు చాలకాలము బ్రతుకలేడు. పరిణామసిద్ధాంతము ప్రకారము మనము జలచరదశవదిలి ఎన్నియో వేలసంవత్సరములైయున్నను ఇంకను నాటి పరిసరముల ప్రభావము మనజీవితమునందు గాన్పించుచున్నది. జలమనునది ప్రాణవాయు, (Oxygen) ఉదజని (Hydrogen) వాయునిర్మితము; గాన మనదేహము ముప్పాతికభాగము ఈరెండువాయువులతో నిర్మింపబడినదని చెప్పవచ్చును.

ఈరెండువాయువులేకాక ఇతర వాయువులు గూడ మనదేహమునందున్నవని మనయందరికిని దెలియును. మనము నిమిషనిమిషమునకును సుమారు పదునెనిమిదిమార్లు ఊపిరిపీల్చెదము. కాన సతతము ప్రాణవాయువును, నత్రజని వాయువును మనదేహములను ప్రవేశించుచునేయుండును. ప్రాణవాయువు రక్తమును శుద్ధిపరచి బొగ్గుపులుసువాయువుగ మారి నిశ్వాసరూపముగ బయలువెడలును. నత్రజనివాయువు మనరక్తముతో కలసిపోవును. ముత్యములకొరకుగాని ఇంకేకారణమునైననగాని అగాధసముద్రమున మునిగి తేలువారు ఒకొకతూరి నత్రజనివాయువును అధికముగపీల్చి బాధపడెదరు. వారు నీటిలో మునిగియున్నంతకాలమును వారికి ఊపిరిపీల్చుటకు పైనుండి గాలిని గొట్టములగుండ పంపుతోగొట్టి అంపెదరు. సాధారణముగ మనము పీల్చుగాలియందున్నదానికంటె ఇందు అధికముగ నత్రజని

వాయువుండుటవలన ఇట్టిగాలినిపీల్చినకొలదిని వారిరక్తమున నత్రజని అంతకంతకు అధికమై కడకు దుర్భరమగును. అట్టిసమయమున వారిని హఠాత్తుగా నీటిపైకి దెచ్చినయెడల రక్తమునందు అధికముగనున్న నత్రజని వాయువు బుగ్గలుబుగ్గలుగ శరీరమునందంతయును ఉబికి దుర్భరముగనొప్పిచేయును. అట్టివారి నెప్పుడును మెలమెల్ల పైకిలాగుదురు. అట్లు సావధానముగ పైకివచ్చినయెడల దేహమునం దధికముగ నున్న నత్రజనివాయు వంతయు క్రమక్రమముగ దేహమునుండి యుబికి బహిర్గతమై పోవును.

ఇక మనదేహమునందలి ఘనపదార్థములపరిశోధనకు వత్తము. వీనిలో నధికభాగము ఎముకలే. ఖటికము (Calcium), భాస్వరము (Phosphorus), ప్రాణవాయువు (Oxygen) ఈమూడును కలిసి ఎముకలు తయారగును. ఇక మాంసపుకండలు, హృదయము, జీర్ణకోశము, యకృతము, చర్మము మొదలగు మనదేహభాగములను విభజించి పరీక్షించుట చాలకష్టము. కాని ఎందరో వైద్యులును రసాయనశాస్త్రజ్ఞులును తమజీవితములను ధారపోసి పరిశోధనలనుజేసి మనదేహనిర్మాణమును చాలవరకును కనుగొనినారు. కాని ఎంతజాగ్రత్తగ పరిశోధన చేసిననేమి!? మనదేహమునందున్న ముఖ్యపదార్థములు సర్వసామాన్యములైన పదార్థములేకాని ఎంతమాత్రమును కొత్తవిగావు. వీనినన్నిటిని ఈక్రిందివిధముగా నొక పట్టికక్రింద తయారుచేయవచ్చును.

అధికముగానున్న పదార్థములు:—

(1) బొగ్గు (Carbon)
(2) ప్రాణవాయువు (Oxygen)
(3) ఉదజని (Hydrogen)
(౪) నత్రజనివాయువు (Nitrogen)
(౫) స్ఫురము (Phosphorus)
(౬) గంధకము (Sulphur)

కొంచెముగానున్న పదార్థములు:

(౧) సోడియము (Sodium)
(౨) క్లోరిన్ (Chlorine)
} ఈ రెంటిని గలిపిన యెడల ఉప్పు తయారగును.

(౩) పొటాషియము (Potassium)
(౪) ఫుల్లవర్ణము (Fluorine)
(౫) ఇనుము (Iron)
} రక్తము ఎరుపుగనుండుటకీ మూడు వస్తువులే కారణము.

(౬) మెగ్నీషియము (Magnesium)
(౭) అయోడిన్ (Iodine)
(౮) లిథియమ్ (Lithium)
(౯) సిలికాన్ (Silicon)

అత్యల్పముగనున్న పదార్థములు

(౧) సీసము (Lead)
(౨) రాగి (Copper)
(౩) మాంగనీసులోహము (Manganese)

రసాయనశాస్త్రరీత్యా విశ్వమంతయు ౯౨ మూలద్రవ్యములతో చేయబడినది. ఈ తొంబది రెండు మూలద్రవ్యములలో నే పదునెనిమిదియో చేరి మన దేహము తయారైనది. ఇవియు సాధారణముగ సర్వత్ర దొరకు పదార్థములే గాని అపురూపములైనవి గావు. “మానవదేహము పంచభూతముల సమ్మేళనమున నేర్పడినది” అనునంశము రసాయనశాస్త్రరీత్యా పరిశోధించి ఋజువుచేయ సాధ్యమగుమాత్రమేకాని కేవలము జుగుప్సాబుద్ధితో వేదాంతివేత్తలు నుడివినవాక్యములు గావు. ఆలివర్ వెండల్ హోమ్సు (Oliver Cendell Holmes) అను అమెరికాదేశీయుడు మానవదేహమును గూర్చి ఈక్రిందివిధముగ జెప్పియున్నాడు. “కొన్నిబిందెలనీళ్లు, కొన్ని శేర్ల బొగ్గు, సున్నము, కొంతగాలి, నాలుగు లేక ఐదుతులముల స్ఫురము, కొన్నిగురిగింజల తూకము ఇనుము, కొంచెము ఉప్పు, ఒకచిటకా గంధకము, మరికొన్ని పదార్థములు (అప్రధానములైనవి) ఒకటిరెండుచిటకాలు ఈమాత్రమువేసిన చాలును. మానవుడు తయారగును!” ఎవరైనను సరే! ఎట్టి మేధాశాలి

యైనను ఎట్టి అసమానకార్యములను చేయువాడైనను ఇట్టి సాధారణపదార్థములతో నిర్మింపఁబడినాడు.

కడకు తేలిన సిద్ధాంతమేమన, సజీవముగాని, నిర్జీవముగాని జగత్తంతయు ఒకటేరకపు పదార్థముతో నిర్మిత మైనది.

పంచభూతముల సమ్మేళనముననే ఈ జగత్తంతయు నిర్మితమైనదని ప్రాచీనహైందవులు సిద్ధాంతీకరించిరి. కాని ఈ పంచభూతములలో నేదియు విభజనాతీతమైన మూలద్రవ్యముగాదని ఇదివరకే చూచితిమి. నీటిని ఉదజని, ప్రాణవాయువులుగ విభజింపవచ్చును. కాన నీరు మూలద్రవ్యము గాదు. అట్లనే నత్రజని ఉదజని, ప్రాణవాయువు, బొగ్గుపులుసువాయువు చేరి "వాయువు" అను చతుర్థభూత మేర్పడినది. ఇక పృథివీభూతమున ఇంచుమించుగా అన్ని మూలద్రవ్యములును కలసినవని శాస్త్రరీత్యా చూపవచ్చును.

హైందవపద్ధతిని వదలి రసాయనశాస్త్రరీత్యా పరీక్షించినచో విశ్వమంతయు ౯౨ విధములైన మూలద్రవ్యములతో నిర్మితమైనదని విశదమగును. ఇవిమాత్రము విభజనాతీతములైన ప్రత్యేకద్రవ్యములా? వీనిలో నొకదానితో నొకటి కేలాటిసంబంధముకాని, కడకు రూపమునం దొక పోలికయైనను కనబడదా? వీనిలో నొక్కొక్కటియు ప్రత్యేకవ్యక్తిత్వముగల స్వతంత్రద్రవ్యములా? అని యడుగవచ్చును. కాని వీనిలో నొకొకదాని కొక ప్రత్యేకధర్మమును, కొన్ని ప్రత్యేకలక్షణములును గనపడుచున్నను వీనికి పరస్పరసంబంధ మొకింతయు లేదనియు, ఇవి యొకదానివలెనొకటి ఎంతమాత్రమును లేవనియు చెప్పుటకు సాధ్యముగాదు.

ఈవిషయము ఈక్రిందిపట్టిక (పు. ౮౯౯-పట్టిక ౧) జూచినచో కొంతమట్టుకుబోధపడును. ఈపట్టికలో నున్న ౯౨ ద్రవ్యములలో ౮౮ ద్రవ్యముల పేర్లమాత్రమే ఇవ్వబడినవి. కాని ఇతరద్రవ్యము లన్నిటినిగూడ జేర్చి ఇట్టి పట్టికను తయారుచేయవచ్చును.

ఇందలి విశేష మేమన పట్టికలో నిచ్చినట్లు ఈ ౮౮ మూలద్రవ్యములను ౮ తరగతులుగ చేర్చినయెడల ప్రతితరగతియందును 3 ద్రవ్యము లుండును. ఈ మూటికిని స్వరూపమునం దేమి, గుణములయం దేమి యధిక సామ్యము గాన్పించుచున్నది. మొదటితరగతిని గైకొనిన యెడల ఇందున్న హీలియమ్, నియోన్, ఆర్గన్‌లకు పరస్పరము సామ్య మధికముగనున్నది. ఇవి ఇతరద్రవ్యములతో జేరి సమాహృతములు గావు. ఈ సామ్యములను, సమానధర్మములను విపులముగ చర్చించుటకు ఈ వ్యాసమున సాధ్యముగాదు. కాని ప్రధానవిషయమున నెట్టి సందేహమును లేదు. ఒకొకతరగతియందలి ద్రవ్యములకును పరస్పరసంబంధము విస్పష్టముగ నున్నందున, ఏ తరగతియందైనను సరే, ఒకటి రెంటిని పేర్కొనిన యెడల మూడవది ఏదో, అది ఎట్లుండునో నిస్సంశయముగ జెప్పవచ్చును. మెండలీఫ్ (Mendeleef) అను రష్యాదేశపు శాస్త్రజ్ఞుడు ఈ యంశమును గనిపెట్టి ఈ తరగతుల నేర్పరచినపుడు చాలతరగతులలో నొకటి రెండు ద్రవ్యములుమాత్రమే లోకమునకు తెలిసియుండెను కాని మెండలీఫ్‌మహాశయుడు ఈ సామ్యమును బట్టి ఆయాతరగతులకు జెందిన అజ్ఞాతద్రవ్యములు ఫలానావిధముగ నుండునని తీర్మానించెను. క్రమక్రమముగ చాలసంవత్సరములకుపిదప శాస్త్రజ్ఞులు ఈమూలద్రవ్యములను కనిపెట్టి పరీక్షింపగా మెండలీఫ్ చెప్పిన విషయము లన్నియు సరియని విశదమాయెను. మన పట్టికలో నాలుగవతరగతికి జెందిన స్కాండియమ్ (Scandium) ఇట్టివానిలో నొకటి.

పరిశోధన లధికమై, విజ్ఞానమభివృద్ధిజెందినకొలదియు ఈ ౯౨ మూలద్రవ్యములును ఒకటేవంశమునకు జెందినవని తెలిసెను. స్వరూపభేదము లెన్నియో యున్నను కుక్కలు, నక్కలు, గుంటనక్కలు అన్నియు నొకజాతికి జెందినవనియు, పులులు, సింహములు, కోతులు, మానవులు మొదలగునవి స్తన్యజాతి యను నొకజాతికి జెందినవనియు జీవసంతతియం దొకక్రమపరిణామము గలదనియు డార్విన్ (Darwin) పరిణామసూత్రములనుండి సిద్ధాంతమైనట్లే స్వరూపభేదము లెన్ని యున్నను ౯౨ మూలద్రవ్యములును ఒకటేకుటుంబమునకు జెందినవని స్పష్టమాయెను. ఇంతేకాక వీనిలో కొన్ని

పట్టిక ౧

| లోహము పేరు | అణు భారము | లోహము పేరు | అణు భారము | లోహము పేరు | అణు భారము |
|---|---|---|---|---|---|
| హీలియమ్ Helium | 4 | నియోన్ Neon | 20 | ఆర్గన్ Argon | 40 |
| లిథియమ్ Lithium | 7 | సోడియమ్ Sodium | 23 | పొటాషియమ్ Potassium | 39 |
| బెరిల్లియమ్ Beryllium | 9 | మగ్నీషియమ్ Magnesium | 24 | ఖటికము (సున్నము) Calcium | 40 |
| బోరన్ Boron | 11 | అల్యూమినియమ్ Aluminium | 27 | స్కాండియమ్ Scandium | 44 |
| కర్బనము (బొగ్గు) Carbon | 12 | సిలికాన్ Silicon | 28 | టైటానియమ్ Titanium | 48 |
| నత్రజని Nitrogen | 14 | స్ఫురము (భాస్వరము) Phosphorus | 31 | వనడియమ్ Vanadium | 51 |
| ప్రాణవాయువు Oxygen | 16 | గంధకము Sulphur | 32 | క్రోమియమ్ Chromium | 52 |
| ఫ్లుల్లవర్ణము Fluorine | 19 | క్లోరిన్ Chlorine | 35 | మాంగనీస్ Manganese | 54 |

మూలద్రవ్యములు కాలక్రమముగ మారి మరికొన్ని మూల ద్రవ్యములుగ పరిణమించుననికూడ దెలిసెను. యురేని యమ్ (Uranium) అనునది ౯౨ మూలద్రవ్యములలో నొకటి; రేడియమ్ (Radium) అనునది మరొక మూల ద్రవ్యము. కాని యురేనియమ్ కాలక్రమముగ మారి పోయి రేడియము (Radium) గ పరిణమించును. ఇక ఈ రెండు ద్రవ్యములకును ఉన్న ప్రత్యేకత ఏమి? స్వతం త్రత ఏమి? ఈమూల ద్రవ్యములవిషయమున ఈమార్పు స్వతఃసిద్ధముగ, ఎట్టిపరిస్థితులందైనను ఒక్కటేవిధముగ జరుగుచున్నది; ఇతర మూలద్రవ్యముల విషయమున ఇట్టి మార్పు గాన్పించుటలేదు. కాని కొన్ని కొన్ని సందర్భము లందు ఇవియు మారి ఒకటి ఇంకొకటిగ పరిణమింప జాలదని దృఢముగ జెప్ప నెట్లుసాధ్యమగును? ఉన్న ౯౨ మూలద్రవ్యములలో కొన్ని ఈవిధముగ పరి ణామము చెందుచున్నయెడల మిగతవి మాత్రము ఈవిధ ముగ మారవని ఎట్లు వాదింపనగును? బంగారము బంగారమే, ఇత్తడి ఇత్తడే; అని మనమందుము: కాని పైవిధముగ కొన్ని ద్రవ్యములు మారుచున్నపుడు బంగా

రముగూడ కొన్ని స్థితిగతులలో ఇత్తడిగ మారగూడదా? ఇత్తడిని బంగారముచేయు సాధ్యముగాదా?

వినను యురేనియమ్ (Uranium), రేడియమ్ (Radium) లకు ఎందులకిట్టిమార్పు సంభవించుచున్నది? ఈమూల ద్రవ్యముల గుణములెవ్వి? ఇట్టిగుణము లితర ద్రవ్యములకు గలవా? అనునంశములను శాస్త్రజ్ఞులు పరిశోధింపజొచ్చిరి. మూలద్రవ్యములన్నియు వివిధాణువులచే నిర్మితములైనవనియు, అణువుల వైశేష్యమును బట్టి వానినుండి నిర్మితములైన మూలద్రవ్యముల స్వరూపగుణము లేర్పడుననియు ఈపరిశోధనల ఫలితముగ దేలెను. ఇక శాస్త్రజ్ఞులు అణువునందలి వైచిత్ర్యమును పరిశోధింప ప్రారంభించిరి. ఒకమూలద్రవ్యము (Element) నందలి అణువులకును ఇంకొకమూల 'మూలద్రవ్యము'నందలి అణువులకును మధ్య నున్న భేదమేమి? మూలద్రవ్యములం దున్నట్లే వీనియందును ఏదైన సామ్యము గాన్పించుచున్నదా? ఇత్యాది సమస్యల పరిశోధనలును, చర్చలును ప్రారంభమాయెను. వీనిఫలితముగ అణువుగూడ విభజనాతీతమైనది గాదనియు, అణువనునది కేవలము విద్యుచ్ఛక్తి రూపాంతరమే యనియు, విద్యుదృణపరమాణువులును (Electrons) విద్యుద్ధనపరమాణువులును (Protons) సంయోగము చెంది అణువుగ నేర్పడుననియు ఈవివిధ పరమాణువుల సంఖ్యనుబట్టి వివిధములగు అణువులు ఏర్పడుననియు సిద్ధాంతమాయెను.*

కొన్ని అణువులు తేలికగనున్నవి: మరికొన్ని అణువులు బరువుగనున్నవి. కొన్ని యొకవిధముగ ప్రవర్తింపును. మరికొన్ని వేరొకవిధముగ ప్రవర్తించును. ఈభేదములకన్నిటికిని కారణము ఈ వివిధ రకముల అణువులందుండు విద్యుదృణ, ధనపరమాణువుల సంఖ్యయే. ఉదజని (Hydrogen) అణువునందు ఒక విద్యుద్ధనపరమాణువును (Proton), ఒకవిద్యుదృణ పరమాణువును (Electron) గలవు కాననే ఇది తేలికైనది. ఇంతకన్న తేలికైన పదార్థమే లేదు. యురేనియమ్ అణువులో ౯౨ ధనపరమాణువులును, ౯౨ ఋణ పరమాణువులును గలవు. కాననే ఇది ఉదజనికంటె ౯౨ రెట్లు బరువధికము. సీసము, బంగారము మొదలగు పదార్థముల అణువులన్నిటిలోను ఒకనియతసంఖ్య ననుసరించి విద్యుదృణ, ధన పరమాణువు లుండును.

ఈ విధముగ విశ్వనిర్మాణవస్తువైన వివిధపరమాణువుల సంఖ్యనుబట్టి అణువిభిన్నత ఏర్పడుచుండునే కాని ఇంకెట్టి ఇతర భేదమును లేదు. సుమారు ౨౬ విద్యుద్ధన పరమాణువులును, ౨౬ విద్యుదృణ పరమాణువులును సంయోగము చెందినయెడల ఇనుము అణువు ఒకటి ఏర్పడును. పొరపాటున ఇంకను రా విద్యుద్ధనపరమాణువులును, రా విద్యుదృణపరమాణువులును అధికముగ గలిసిన యెడల ఇనుముఅణువునకు బదులు రాగియణువు లేయారగును. ఇంకేమి? రాగియణువునకును బంగారముఅణువునకును గల భేదమంతయు సుమారు ౧౩౨ విద్యుద్ధన పరమాణువులును, ౧౩౨ విద్యుదృణపరమాణువులును మాత్రమే కదా! కొన్ని రాగిఅణువులను దెచ్చి అణువునకు ౧౩౨ విద్యుద్ధనపరమాణువులు ౧౩౨ విద్యుదృణ పరమాణువులచొప్పున అందు జేర్చినయెడల బంగారము తయారగునుగదా యని తలపవచ్చును. కావలసినవస్తువులు దొరకినయెడల రాగిని బంగారముగ మార్పవచ్చునను నంశము నిజమే. రాగిఅణువులను సులభముగ తెచ్చుకొనన సాధ్యమగును. ఒకతులము రాగిలో కోట్లకు కోట్లకు మించిన యనిర్వచనీయసంఖ్యాకములైన యణువులు గలవు. రాగివెలయు సరసమే. తులమురాగిని ఎట్టి బీదలును కొనగలరు. కాని విద్యుద్ధనపరమాణువులను విద్యుదృణపరమాణువులను వేరు వేరుగ సంపాదించుటెట్లు? అట్లు సంపాదించితిమిపో వీని నన్నిటిని సంయోజనము చేయుట ఎట్లు? అన్నియు కుప్పగపోసి సుత్తితో గొట్టవలెనా, లేక ఇనుపపాత్రలో బోసి కాచవలెనా? ఏమిచేయవలెను?

---

* ఈవిషయమును "రేడియము" "ఎక్స్‌కిరణములు" అను వ్యాసములందు విపులముగ చర్చించియున్నాను. భారతి యువ సంవత్సర మార్గశీర్ష, మాఘమాసముల పత్రికలు చూడనగును.

సరిగా ఇచ్చుటనే మనశాస్త్రజ్ఞుల కందరికిని అజ్ఞానము గప్పుకొన్నది. విద్యుద్ధన పరమాణువులును (Protons) విద్యుదృణ పరమాణువులును(Electrons) అన్యోన్యాశ్రయములేక ఎప్పటికిని ఉండజాలవు. ఒక పదార్థమునందలి అణువులన్నిటిని విభజించి ధనపరమాణువులను ఋణపరమాణువులను విడదీసి వేర్వేరు కుప్పలుగ బోయుట కెన్నటికిని సాధ్యముగాదు. వేర్వేరుకుప్పలుగ బోయుట యటుండ ఆపసమూహమునుండి కొన్ని విద్యుద్ధనపరమాణువులను విడదీయుటకుగూడ సాధ్యముగాదు. సమష్టిమీద కొద్దిపాటిమార్పును జేయవచ్చును. కష్టపడి ఒకపదార్థమునందున్న ఋణపరమాణువుల మొత్తము సంఖ్యను కొంత ఎక్కువచేయవచ్చును; లేక తక్కువ కూడ జేయవచ్చును. ప్రపంచమునందున్న భౌతికశాస్త్ర మహామహులలో ఏ నలుగురైదుగురో కోట్లకొలది రూప్యములధనము వ్యయముచేసి తయారుచేసిన ఏమూడు నాల్గు పరిశోధనాలయములందో ఈపని చేయగల్గినారు. దీనినిబట్టి ఒకపదార్థమునందలి విద్యుదృణపరమాణువులను తక్కువచేయవలెనన్న ఎంతకష్టమో బోధపడగలదు.

విద్యుద్ధనపరమాణువులు (Protons) విద్యుదృణపరమాణువులు (Electrons) అను పదములను రెంటిని మనము ఈ చర్చయందు వాడుచున్నాము. కాని వాస్తవముగ జూడ ఇవి విద్యుచ్ఛక్తికి సంబంధించినవని మాత్రము ఇంతవరకును గమనింపనైతిమి. విద్యుద్ధన ఋణపరమాణువులు నిజముగ విద్యుచ్ఛక్తి రూపాంతరములే. విద్యుచ్ఛక్తి ధనశక్తి, ఋణశక్తి యను ద్వివిధశక్తివికారమనియు, ఈ రెంటిలో మొదటిది పాసిటివ్ (Positive), రెండవది నెగెటివ్ (Negative) అనియు సాధారణముగ నందరికిని దెలిసినదే. పాసిటివ్ శక్తినే విద్యుదృణపరమాణువులనియు (Protons), నెగిటివ్ శక్తినే విద్యుదృణపరమాణువులనియు అందురు (Electrons) ఈశక్తులు రెండును ప్రతి వస్తువునందును సాధారణముగ సమస్థితియందుండును. అట్లుగాక రెండుపదార్థములలో నొకదానియందు పాసిటివ్‌శక్తి (అనగా విద్యుద్ధనపరమాణువులు-Protons) అధికముగను, ఇంకొకదానియందు ఋణశక్తి (అనగా విద్యుదృణపరమాణువులు (Electrons) అధికముగను ఉండి, ఈ రెంటికిని ఒక లోహపు తీగెతో సంబంధము కలిపినయెడల, ఋణశక్తియధికముగనున్న పదార్థమునుండి రెండవపదార్థమునకు ఋణపరమాణువులు ప్రవహించి, రెంటియందున్న ధన, ఋణశక్తులు సమస్థితినొందును. విద్యుద్ధన పరమాణువులు (Protons) అణువునందు దప్పకుండ కేంద్రమునందుండును ఇవి అణువును వదలి రావు. కాన ఏ పదార్థమునందైనను ధనశక్తి ఎక్కువగుటకును, ఋణశక్తి ఎక్కువగుటకును విద్యుదృణపరమాణువుల చలనమే కారణము. ధనపరమాణువులు బయటనుండి రాకున్నను ఒకపదార్థమునందున్న ఋణపరమాణువులు తగ్గినయెడల ఆపదార్థమునందలి ధనశక్తి యధికమైనట్లే. కాన విద్యుత్ప్రవాహము (Electric current) అనిన విద్యుదృణ పరమాణువుల (Electrons) ప్రవాహమనియే యర్థము.

విద్యుదృణపరమాణువులు (Electrons) ఒక వస్తువున నితరభాగములకంటె నధికమైనపుడు అందుండి సులభముగనే బహిర్గతమగును. కాని విద్యుద్ధన ఋణపరమాణువులసంఖ్య సరిగానుండి, ఆ పదార్థము విద్యుత్సమస్థితియందు ఉండినయెడల అందుండి విద్యుదృణపరమాణువులను విడదీయుట చాలకష్టము.

పరిణామమున దేలిన సిద్ధాంతమేమి? "సర్వం విద్యుచ్ఛక్తిమయం జగత్" అను నంశమే. కాని విద్యుచ్ఛక్తి అననేమి? అని యడిగినయెడల ఎవరును జవాబుచెప్పలేరు. విద్యుచ్ఛక్తిని కొలచి దానిపరిమాణమును గని పెట్టవచ్చును. అది ఏమేమిపని చేయగలదో నిస్సంశయముగ జెప్పవచ్చును. ఏయే సందర్భములందది ఎట్లు ప్రవర్తించునో చెప్పవచ్చును. కడకు అది ఎన్ని రూపములుగనున్నదో కూడ చాలవరకును నిశ్చయింపవచ్చును. కాని అది ఏమియో మాత్రము ఎవరును చెప్పలేరు.

"విద్యుచ్ఛక్తి యననేమి?" అని ఉపాధ్యాయుడొక విద్యార్థిని నోటిపరీక్షయందు ప్రశ్నించెనట. విద్యార్థి ఒకింత తడబడినవానివలె నటించి, "తెలుసునండీ, మాస్టరు

గారూ, కాని చప్పున నోటికిరాకున్నది. ఇంతకుముందే ఆవిషయమును తలచుచుంటిని. ఇప్పుడే మరచిపోయినాను" అని జవాబుచెప్పెనట. అందుపైన ఉపాధ్యాయుడు, "అయ్యయ్యో, ఎంత అన్యాయము! విద్యుచ్ఛక్తిఅంటే ఏమి అనువిషయము ప్రపంచమంతటిలో ఈతనికి ఒక్కనికిమాత్రమే తెలిసియుండెను. అది ఇతడు మరచిపోయినాడు, ఇంకెట్లగతి" అని నుడివెనట.

ఏమైననేమి? విద్యుచ్ఛక్తి యొకవిధమైనశక్తి. ఈశక్తి ఒకవిధమైన స్థితియందున్నపుడు ద్రవ్యము అనియందుము. వేరొకస్థితియందున్నపుడు శక్తి యని అందుము. అవస్థాభేద మొక్కటియేకాని శక్తియు, ద్రవ్యమును రెండును ఒక్కటే. విశ్వమంతయు ఒకే పదార్థముతో చేయబడినది. ఇందులో కొంత జడముగనున్నందున జడప్రకృతి యనియందుము. మరికొంత వేరొకరూపమున నున్నది. ఇది అజడము. దీనినే జీవలోకము అని చెప్పుదుము.

దీని మర్మమేమి? శక్తి వివిధరూపములుగ వ్యక్తమగుటకు కారణమేమి? విశ్వసృష్టికి కారణమేమి? అసలు సృష్టి, స్థితి, లయములు అవస్థాభేదమునకు మాత్రమే సంబంధించినవైనయెడల సృష్టిలయాతీతాంతరార్థ మేమి?

మన కీచర్చతో సంబంధములేదు. మన కిందు ప్రవేశముగూడ లేదు. మనపరిశోధనలకును, చర్చలకును సంబంధించిన విషయమొక్కటే—అదియే జడప్రకృతి.

---

# పూర్ణ

వాసిష్ఠ గణపతిముని

అనువృత్తము

## పదియవ ప్రకరణము

కవిత్వపరీక్ష

రాజకాళి—(మహారాజ్ఞిని జూచి) దేవీ! ఈ సభ యెందులకుఁ గూడినది? ఆ ప్రక్కనుండు పెద్దమనుష్యులకు మనరాజధానిలోని రత్నములను ప్రదర్శించుటకా?

లీలావతి— నారీకవుల కవిత్వపరీక్ష కీ సభ కూడినది. నీవు గొప్ప నారీకవి వని ప్రసిద్ధి. అందువలన పరీక్ష చూచునిమిత్తము నిన్నుఁ గూడ పిలిపించితిని.

రాజ—గొప్పమాటయే.

లీలా—సభాకార్యక్రమమునకుముందు నీ వేదైన మంగళాచరణము చేసిన బాగుండును.

రాజ — తప్పక మంగళాచరణము సేయవలసినదే. తేపు మంగళవారము మంగళాచరణమునకు మంచిరోజు గాని యొక దినమునకు ముందే కర్తవ్యము ముగించుటలో దోష మేమియును లేదు.

(లేచి చేతులు జోడించి)

పెద్దదా ధవలాక్షి పేరుకు జయము
ముద్దయిన పద్మాక్షి మోముకు జయము
అకలంక శుభ్రాంగియాత్మకు జయము
సుకుమారి మధువాణిశోభకు జయము
సభమెచ్చు రథినమ్మచదువుకు జయము
శుభగాత్రి కుముదాక్షి చూపుకు జయము
పగలేని ఫలినమ్మనగవుకు జయము
వగలాడి కాంతమ్మవగలకు జయము
సత్యమా పూర్ణమ్మశక్తికి జయము
నిత్యమా మణిమాలనీతికి జయము
మన భానుమతిబోధమహిమకు జయము
ఘనకేశి ధరణమ్మకవితకు జయము
చెన్నైన కనకమ్మవన్నెకు జయము
చిన్నివిలాసమ్మచేష్టకు జయము
వనజాక్షి పర్ణినివాణికి జయము
జననాథు సుందరిజన్మకు జయము.

రూపచంద్రుఁడు—మహాకవీశ్వరీ! జయవాద మంతయు నా ప్రక్కకే కాని యీప్రక్కకు దానిలో భాగ మేమైన లేదా ?

రాజ—లేకేమి? కావలసినంత యున్నది. (తర్జనితో నిర్దేశించి చూపుచు)

"ఇల భారమును మ్రోయు నెద్దుకు జయము
దళముల నడిపించు దంతికి జయము
వరనీతి తెలిసిన వరడుకు జయము
పరిపుష్టి నొందిన పందికి జయము
నలుదిక్కులను జూచు నక్కకు జయము
కులమున గొప్పదా కుక్కకు జయము
మేదినిఁ దిరిగెడు మేఁకకు జయము
బూదిలోఁ బొర్లిన పోతుకు జయము
చినజంతువులమేటి చిఱుతకు జయము
కొనకొమ్మఁ గూర్చుండు కోఁతికి జయము

పెదపేరు ధరియించు పిల్లికి జయము
పెదజాతిసింగంపుకొదమకు జయము
కాలము మీఱిన కాకికి జయము
గాలికి లొంగని గ్రద్దకు జయము
అందఱు మెచ్చెడు హంసకు జయము
కొందఱు పొగడెడు కొంగకు జయము
ఘోరనఖం బగు కోడికి జయము
స్ఫారమహా మారాజుపంక్తికి జయము.

(మహారాజ సుచంద్రుఁ డెద్దు. సేనాపతి రణంధరుఁడు దంతి. మహామంత్రి సునందుఁడు వరడు. రాష్ట్రియ వీరనందుఁడు పంది. సచివ రూపచంద్రుఁడు నక్క. కోశాధ్యక్ష గుణాకరుఁడు కుక్క. మహాసమాహర్త హేమచంద్రుఁడు మేఁక. దండనాయక చండసేనుఁడు పోతు. కుమార భోగనాథుఁడు చిఱుత. ఆచార్యభవనంది కోఁతి. దండనాయకరణేశ్వరుఁడు పిల్లి. కుమారశక్తిధరుఁడు సింగంపు కొదమ. పురోహిత వాణీధరుఁడు కాకి. మహాప్రాడ్వివాక సత్యవ్రతుఁడు గ్రద్ద. బ్రహ్మకులపరిషత్పతి ధర్మపాలుఁడు హంస. దూతసామంత విశాలాక్షుఁడు కొంగ. ఆచార్య విషమసిద్ధి కోడి. రాజకాళియొక్క తర్జనీనిర్దేశముచే సభ తెలుసుకొనిన రూపకము లివి.)

రాజకాళిపాటలు విని స్త్రీలందఱు నొక్కపెట్టున నవ్విరి. ఉపమానస్వారస్యముచే భోగనాథ శక్తిధరుల న్యూనాధికత చెప్పఁబడుట లీలావతీదేవికి కంటకమయ్యెను. రణేశ్వరుఁడు పిల్లిగా చెప్పఁబడుట యామెకు మఱింత కష్టము కలుగఁజేసినది. ఆ విషయమును మహారాజు గమనించినవాఁడయ్యెను.

శుభ్రాంగి — (మహారాజ్ఞిని జూచి) ఇఁక పరీక్ష నారంభింపవచ్చునా ?

లీలా— కానిండు.

శుభ్రా— నా శిష్య లార్వురు కవిత్వములో నిప్పుడు పరీక్షింపఁబడుదురు.

రాజ— భగవాన్ జటాముని శిష్యురాలగు నన్నుగూడ పరీక్ష చేసినఁగాని నే నంగీకరింపను.

శుభ్రా— అట్లే కానిమ్ము. నీతో వాదించి జయింపనెవరితరము? ఒక్కొక్కరు పరనారీపరామర్శ మును ప్రత్యక్షముగాఁగాని, తాత్పర్యద్వారా గాని నిషేధించుచు రెండేసి ద్విపదలను రచింపవలెను. పూర్ణ, మణిమాల, ధరణి, మధువాణి, ఫలిని, రథినీకుమారి, రాజకాళి— వీరు వరుసగా తమ తమ పద్యములను చెప్పవలెను.

రాజ— నా ద్విపదలు రెండును నేను ముందు చెప్పి వెళ్లిపోయెదను. నాకు చాల పని యున్నది.

లీలా— "అది యేమి పని రాజకాళమ్మా! పిల్లల నోదార్పవలయునా? మగనికి సేవ చేయవలెనా ?

రాజ— నాకు పనిలేకేమి ?

మనుజులతోఁగూడ మాట్లాడవలయు
వనజంతువులతోడ వాదింపవలయు
ఉద్ధతపుత్రుల నోదార్పవలయు
సిద్ధుల నతిథుల సేవింపవలయు
తక్కువగానట్టి తరుణవీరులకు
చక్కనికన్యల సమకూర్చవలయు

ప్రజలకష్టంబులు పరికింపవలయు
సుజనుల సౌఖ్యంబు చూడంగవలయు
రాజకాళికి లేని రాజకార్యములు
రాజులకే లేవు రాకేందువదన.

లీలా—పతిలేని నీకు పుత్రు లెచ్చట నుండి వచ్చిరి ?

రాజ—నాకు కావలసినందఱుపతు లున్నారు.

లీలా—కావలసినందఱా? ఎందఱు?

రాజ—పదుగురు.

లీలా—వారి పేర్లుమేమువినవచ్చునా?

రాజ—వినుఁడు, పాపములు పోవును.

వజ్రము ధరియించువాఁడు నామగఁడు
వజ్రరూపిణి చండవనిత నాసవతి.
ఆహుతులు వహించునయ్య నామగఁడు
స్వాహాసరోజాతవదన నాసవతి.
గగనపాంథుఁడగు గాలి నామగఁడు
భగణచాలిక శక్తిభామ నాసవతి.
భువనము వెలిఁగించు బూత నామగఁడు
భవము మ్రొక్కెడు సంధ్యభామ నాసవతి.
చక్కని కల్వలసామి నామగఁడు
చుక్కలలో మేటిచుక్క నాసవతి.
పాపులదండించు పాశి నామగఁడు
తాపహారిణి రాత్రితరుణి నాసవతి.
పలుజీవుల సృజించు నలువ నామగఁడు
పలుకులరాణియౌ వాణి నాసవతి.
మినుమున్నుగొల్చిన మేటి నామగఁడు
తినఁ గట్ట నిచ్చెడుదేవి నాసవతి.

కాలునికాలుఁడు శూలి నామగఁడు
కాలాభ్రనిభకేశి కాళి నాసవతి.
నా రాజు నరసూళి నాచిన్నిమగఁడు
నారాణి లీలమ్మ నాముద్దుసవతి.
పదిరూపులు ధరించుపరముఁ డొక్కరుఁడె
పదినామముల నాకు భర్తయై వెలసె.
మగువలలో మేటిమగువ యానాకు
మగవారిలో మేటిమగవాఁడు మగఁడు.
సవతికి నానాథు శయ్య నర్పించి
భువి తిరుగాడెడు పురుషిని నేను.
పురుషుల మించిన పురుషిని నేను
తరుణుల మించిన తరుణిని నేను.
మగనినామమె నాకు మధుమధురంబు
మగనిరూపము నాకు మది నున్నఁజాలు.

దేవతల శ్రేణిలో తనపేరు చేర్చుట సుచంద్రునకు సంతోషదాయకముగా నుండెను. లీలావతికిమాత్రము తన కొక భయంకరసపత్ని వచ్చినట్లే యైనది. ఆమెహృదయములో నొక కంపము పుట్టినది. పిచ్చిదానిపాటలకు నే నింత భయపడవలయునా యని యామె తిరిగియు ధైర్యము తెచ్చుకొని రాజకాళి నిట్లడిగినది.—

"ఈ పదినామములలో నీవు మిక్కిలి ప్రీతితో భజించునామ మెద్ది?"

రాజకాళి—

కోమలాంగీ! నీకు గుట్టు చెప్పెదను
నామానసము మెచ్చు నామ మింద్రుండు.
సామలుపాడెడు నామధేయమది
నామగని పవిత్రనామధేయ మది.

కామములిచ్చెడు నామధేయమది
క్షేమము నొనగూర్చు నామధేయమది.
జయమును సమకూర్చు చారునామమది
భయమునుబోఁగొట్టు భవ్యనామ మది.
శక్తుల వితరించు శక్తనామమది
ముక్తినొసంగెడు ముఖ్యనామమది.
జీవులరక్షించు చిత్రనామమది
దేవతలు జపించు దివ్యనామమది.
పాడెద దానిని వాడలలోను
నాడెదనంతట హర్షంబుతోడ.

లీలా—ఆ భగవంతు నెప్పుడైనను నీవు చూచితివా ?

రాజ—నాలుగు పదార్థములలో నతని దివ్యరూపమును నేను దర్శించుచున్నాను.

లీలా—ఎవ్వి యానాలుగు పదార్థములు ?

రాజకాళి—
అనలునం దక్షియం దర్కునియందు
జనపతియందును జగదీశుఁ జూతు.
అగ్నిలోఁ బరమేశు నాలోకనమున
భగ్నంబులై పోవు పాపంబులన్ని.
మఱువక కంటిలో మానాథుఁజూడ
గుఱి చక్కగా నిల్చుగుట్టు చెప్పితిని.
రవికిరణంబుల రాణువ చూడ
దివినేలు భూపాలు దీప్తి బోధపడు.
అఘవర్జితుండగు నాంధ్రేశుఁ జూడ
మఘవంతుని శరీరమాధురి తెలియు.

ఈ పాటలు పినినపిమ్మట నరపతిభావము రాజకాళిపై మఱింత ప్రసన్నమైనది. అతఁడా కవీశ్వరిని జూచి యిట్లనెను—

“సిద్ధకవీశ్వరీ ! కవిత్వపరీక్ష ముగించు వఱకు సభలోనుండి సభ జయప్రదముగా జరుగునట్లు సభకు తోడ్పడుము. అట్లు సేయునెడల నీ యాంధ్రేశ్వరుని మనస్సు మిక్కిలి సంతోషించును.”

రాజ—అనలునైన గ్రసింతునవలీలనేను
జననాథునాజ్ఞను జవదాఁటలేను.
మనఱేని మాటకు మాఱాడలేను
మనచక్రవర్తిని మన్నింతు నేను.

సుచంద్రుఁడు—“సిద్ధకవీశ్వరి మాకిచ్చిన చక్రవర్తిబిరుదము సార్థకమగును గాక.

రాజ — (పూర్ణను జూచి) పూర్ణా! భగవతిశుభ్రాంగి యాజ్ఞప్రకారము నీ వారంభింపుము.

పూర్ణలేచి—
చలపరనారీపిశాచికిఁదనదు
వెలగల హృదయము బలియీయవలదు.
పరివిధములఁ బోవుభావముచేత
పరిణీతమిాఱిన ప్రణయ మురోఁత.

మణిమాల లేచి—
నరరంభయైనను బరనారివలదు
తరుణసోదరులార దైవంబుగలదు.
నీకాంత విడుచుట నీచమైన పని
పైకాంతఁ బట్టుట పాపములగని.

ధరణి లేచి—
నరునకుఁ బరనారి నాశనమాత్ర
స్థిర కళంకము దెచ్చు జీవితయాత్ర.
పరసుందరీలోల పురుషుఁడు సేయు
వరపుణ్య కర్మము ల్వరుసగా మాయు.

మధువాణి లేచి—

ఎగ్గుచేష్టపరుని యిల్లాలి పాల
తగ్గును మర్యాద దానిచేఁ జాల.
నరు లెంగిలి భుజింప నగుదురు వాడ
పరనారి యెంగిలి పఠికించి చూడ.

ఫలిని లేచి—

చోరత యొక్కని శుభములఁ బాపు
జారతపాపును జాతుల యేపు.
పరపద్మలోచనా భజనము తప్పు
పురుషుఁ డాదానిచేఁ బొసగును ముప్పు.

రథిని లేచి—

పరనారి సద్ధర్మనభశాలసుమ్ము
వరమతీ పెద్దలవాక్యంబు నమ్ము.
పిల్లరా చిన్నది పెఱభామ నీకు
తల్లిరా పెద్దది తలవంపు లేకు.

రాజకాళి—

పరనారిసోకించు పాపంబు పండి
స్మరుఁడీశనయనాగ్నిఁ జచ్చెను మండి.
పైనారివంచించి పట్టిన కామి
స్నానాలు జపములు సలిపిన నేమి.

శుభ్రాంగి — పరనారీ పరాఙ్ముఖుని స్తుతించుచు నొక్కొక్క రొక్కొక్కద్విపద రచింపవలెను.

పూర్ణ—చలుఁజేయఁజాలదు స్వైరిణియెవని
విలసిల్లు నాతఁడే వీరుఁడై యవని.
మణి—అన్యకాంతలపట్ల నచలుఁడే హాని
ధన్యుఁడు ముదముతో ధరమోయువాని.
ధరణి—తనుగాత్రి నన్యను దలఁపనివాఁడు
జనధాత్రి సద్వ్రతశాలులతేఁట.
మధు—పరభుక్తమగుచుండు పలలపిండంబు
విరసముగాఁ జూచు నరుఁడు రత్నంబు.
ఫలిని—లలితాన్యసతులపై లౌల్యమువిడిచి
పలితుఁడైన సుకృతిఃదపద్మము శుచి.
రథిని—ధర నెందఱో ధర్మధారులకన్న
తరుణు లన్యలయెడ దాంతుఁడు మిన్న.
రాజ—కల్లుద్రావినఁ గూడఁ గలుషిగాఁ డతఁడు
చెల్లెలిఁగా నన్యచెలిఁ జూచు నెవఁడు.

శుభ్రా — ఒక్కొక్క కవీశ్వరియు తనకు శ్రేష్ఠమని తోఁచిన ధర్మమును బోధించుచు నొక్కొక్క ద్విపద రచింపవలెను.

పూర్ణ—మూడిన విపదను ముందుండి ప్రోలి
నాడు కున్నతి సేత నరుల ధర్మంబు.
మణి—తూచాలు తప్పక తొలిపల్కు చెప్పు
నాచారమున నిష్ఠ యమలధర్మంబు
ధరణి—సభలోను జాటెద సర్వజీవులకు
నభయప్రదానమే యధికధర్మంబు.
మధు—సత్యమే జగమున నిత్యధర్మ మని
యత్యంత మెఱిఁగిన యార్యుల పలుకు.
ఫలిని—సర్వభూతంబుల సమబుద్ధితోడ
గర్వంబు వర్జించి కనుట ధర్మంబు.
రథిని—తనువులోపలనుండు తనయందునిల్చి
తనువును మఱచుట తల్లిధర్మంబు.
రాజ—ఆలును బిడ్డల నత్యాదరమున
పాలించుచుండుట పరమధర్మంబు.

శుభ్రా—ఎవరికి తోఁచినవిధమున వారొక్కొక్కద్విపదతో రెండేసి పదార్థములకు జయగానము సేయువలెను.

పూర్ణ—కార్యము సాధించుశక్తికి జయము
నుర్యాదదాఁటని మాటకు జయము.
మణి—నిరతముపనిసేయు నేతకు జయము
నరులు సుఖించెడు నాడుకు జయము.
ధరణి—చిత్తముమెచ్చిన చేతకు జయము
సత్త్వగల్గిన శాంతికి జయము.
మధు—గెలిచినవీరుని కీర్తికి జయము
నిలిచిన నరపతినీతికి జయము.
ఫలిని—కామముమించిన ప్రేమకు జయము
సామకుమూలపహా సమతకు జయము.
రథిని—అఖిలమునందుండు నాత్మకు జయము
నిఖిలము మఱచిన నిష్ఠకు జయము.
రాజ—అని గెలిపించెడునాటకు జయము
పని నడిపించెడు పాటకు జయము.

లీలా—"అని గెలిపించెడు నాట"యనఁగా నేమి ?

విషమసిద్ధి—మండలప్రచారము.

శుభ్రా—(రాణిని జూచి) మహారాజ్ఞి యేమైన నడుగవచ్చును.

లీలా— అనురక్తరమణి నధికరించి యొక్కొక్క రొక్కొక్క ద్విపద రచియింపవలెను.

పూర్ణ—సన్నుతరతిభావసౌమ్య రమ్యాంగి
కన్నులపంపు వెన్నెలభంగి.
మణి—అనురక్తచిత్తకు నక్షిసన్మణికి
జనులార సుఖకోటి సాటియే సతికి.
ధరణి—నగుమోముగలచాన నల్లనిదైన
మగనికి లోకాన మరుపాలవాన.
మధు—ప్రేమప్రసన్నమౌ ప్రేయసిముఖము
శ్యామచిహ్నములేని చంద్రమండలము.
ఫలిని—ప్రేమ మనంబునఁ బెరిగినఁ జాలు
కామినికన్నులు కమలపిళాలు.
రథిని—ఘుమఘుమలాడని రమణిముఖంబు
ఘుమఘుమలాడెడు కనకాంబుజంబు.
రాజ—పిలిచిన వెంటనే ప్రీతితోఁ బలుకు
నలినదళాక్షియే నాకంబు తనకు.

లీలా—(భర్తను జూచి) శ్రీవారేమైన నడుగవచ్చును.

సుచ—ఇప్పుడు దేశమున కేమి కావలెనో యొక్కొక్క రొక్కొక్క ద్విపదతో నిర్దేశించి చెప్పవలెను.

పూర్ణ—ధనువున దొంగల దాడన నేసి
ధనమును నిలఁబెట్టు ధన్వి గావలెను.
మణి—జనపీడకుల దొంగజాడలు గనుచు
జనపతికి వచించు జనుఁడు గావలెను.
ధరణి—అందఱి మతమున నైక్యముగూర్చు
మందును గనిపెట్టు పూని గావలెను.
మధు—అహింభయమార్పఁగ నధ్వనుజూపి
మహిపతి నడిపించుమంత్రి గావలెను.
ఫలిని—మగవారి నెచ్చించి మాటలచేత
పగవారి గెలిపించు పడతి గావలెను.
రథిని—మెఱిసెడులోపలి మెఱుపుపై నరిగ
గుఱిచూపఁగల్గిన గురువు గావలెను.
రాజ—ఆడుచుఁ బాడుచు నందఱిలోని
వేడిని జల్లార్చు వేశ్య గావలెను.

శుభ్రా—ఇంక నొక్కొక్కరొక్కొక్క ద్విపదతో మంగళగానము చేసి సభను ముగింపుఁడు.

పూర్ణ—అమరులనాథుఁ డౌ హరికి మంగ
సమరమహాశక్తి శచికి మంగళము. [ళము

మణి—పతిదేవు నర్చించుసతికి మంగళము
సతి నాదరించెడుపతికి మంగళము.

ధరణి—మనలను బాలించుమహికి మంగ
జనసమృద్ధంబైనసభకు మంగళము.[ళము

మధు— మనుజులలోనుండు మతికిమంగళము
కనదాంధ్రసాహిత్యకళకు మంగళము.

ఫలిని—పరకష్టహారి భూపతికి మంగళము
సరసవిలాస తత్సతికి మంగళము.

రథిని—దివి నుదయించెడురవికి మంగళము
భువి నుదయించెడుకవికి మంగళము.

రాజ—లోకాన జీవించుమీకు మంగళము
శ్లోకాలు రచియించు మాకు మంగళము.

ఆచార్య భవనంది యందటి కవిత్వమును బాగున్నది యని శ్లాఘించెను. లీలావతీదేవి కన్యాకవు లార్వురకు నాలు రత్నపథకముల నిచ్చి బహూకరించినది. ఆమె రాజకాళి కేమి బహుమతి నీయవలెనో తన మాననీయ సఖి యగు ధవలాక్షిని ప్రశ్నించినది.

రాజ—(మహారాజ్ఞిని జూచి) మీగుసగుసలు నాకర్థము కాలేదనుకొనుచున్నారు. మీ పక్షమున నెవరైన రచించి ద్విపదల దండ యర్పించినమాత్రము నేను తీసుకొనెదను. అంతకంటె వేఱుబహుమతి నా కేదియు నక్కఱలేదు.

సుచం—(రథినిని జూచి) కుమారీ! మన ప్రాసాదములోని మహాసభకు సన్నిహిత మైన మహాకవీశ్వరిని మనమే యర్చించుట విధి. అందువలన నీవే ద్విపదలదండను గూర్చి యామెకు సమర్పింపుము.

రథిని—పరమముని దెలిసిన పడతికి జయము
వరమునిసదృశికి వామకు జయము
స్థిరతరచిత్తకు శ్రోత్రికి జయము
గురుతరభక్తికి గుణినికి జయము
మధుమయవచనకు మహిళకు జయము
మధుకరచికురకు మగువకు జయము
దిక్కులు తిరిగెడు దేవికి జయము
వాక్కులు గురిసెడు వంద్యకు జయము
సారసనయనకు సరళకు జయము
సార మెఱింగిన సాధ్వికి జయము
సురపతిరూపము నరపతియందు
తిరముగఁ జూచెడు ధీరకు జయము
వరనయబోధక వాణికి జయము
నరులను మించిన నారికి జయము
ఆశుకవీశ్వరి కార్యకు జయము
పాశవిముక్తకు భామకు జయము.

రాజ—కుమారీ! నీవుగూర్చిన దండ మిక్కిలి బాగున్నది. దానిలోని యింద్రనీల మణు లెక్కుతక్కువ లేక యన్నియు నొక్కరకముగానున్నవి. నీకును, నీతండ్రికిని, నీసోదరులకును మంగళమగుఁగాక.

సుచం—మహాకవీశ్వరీ! మీతండ్రిగారి పేరేమి?

రాజ—అతఁడు పేరువిడిచి పేరొందిన పెద్దమనిషి. సంసారము విడిచి సంతానము గనిన సాధువు. జాతివిడిచి జాతినలంకరించిన జంగముఁడు. తనువువిడిచి తనలో వెలుంగు స్థావరుఁడు. నన్ను కనుటకుముందే యతని యసలుపే రంతరించిపోయినది. మఱియొక

పేరు వచ్చినది. అదిగూడ నేను పుట్టిన పిమ్మట తుడుచుకొనిపోయినది. ఇంకొకపేరు వచ్చినది. అదియును చాలకాలము నిలువ లేదు. కొసకు జనులు తా మతనికి మఱి యొకపేరు పెట్టిరి. ఆకథలకేమి? నారాజు ప్రశ్నించినదానికి నేను బదులుచెప్పవలసి యున్నది. నాతండ్రి సంపూర్ణనామముకగచజబాబు.

రాజకాళిమాటలలోనుండి జటాముని యామె తండ్రి యని చాలమంది పోల్చుకొనిరి. జనులు పెట్టిన యతని నాల్గవపేరు జటాముని యని వారి కర్థమైనది. కగచజబాబులో జకారము నాల్గవనామముయొక్క యాద్యాక్షరమని వారికి తోఁచినది. తక్కిన మూఁడుపేరుల యాద్యాక్షరములు కగచలని వారు సులభముగా గ్రహించిరి. ఆ వర్ణముల నాధారము చేసుకొని యతని తక్కిన మూఁడుపేరులుపూర్ణముగా తెలుసుకొనుటకు బుద్ధిమంతులు ప్రయత్నింప నారంభించిరి.

ఈ గడబిడలో రాజకాళి యాసనము విడిచి వసినడిగా పరిక్రమించుచు కొన్ని పాటలు పాడుకొనుచు నాసభను దాఁటి పోయినది.

"రాజును లాలించు రమణి లీలమ్మ
రాజును ప్రేమించు రామ రాజమ్మ
భర్తకుఁ బ్రియమైన భామ లీలమ్మ
భర్తకుహితమైన భార్య రాజమ్మ
నాథునిబంధించు నాతి లీలమ్మ
నాథునిధ్యానించు నారి రాజమ్మ
వల్లభునేలెడు వామ లీలమ్మ
వల్లభుఁగొలిచెడు వనిత రాజమ్మ."

ఆపాటలు మహారాజసుచంద్రునిశ్రోత్రములలో ప్రత్యుప్తములైనట్లు నిలిచిపోయినవి.

## పదునొకండవ ప్రకరణము

### కవిత్వ పరీక్షానంతరము

ఆనాఁడు సాయంకాలము కుమారభోగనాథుని యేకాంతశాలలో రసిక యువకుల గోష్ఠి యొకటి జరిగినది. అందులో పాల్గొనిన వారు నలుగురు — కుమార భోగనాథుఁడు, దండనాయకరణేశ్వరుఁడు, దండనాయకరుద్రసేనుఁడు, సహస్రపతి వీరసింహుఁడును.

భోగనాథుఁడు శస్త్రములందును శాస్త్రములందును సాధారణముగా శిక్షితుఁడు. నీతిశాస్త్ర మతని కభిమానవిద్య అతని దృష్టిలో నర్థసంపాదకుఁడొక్కరుఁడే ప్రయోజకుఁడు. ఇష్ట విషయోపభోగ మొక్కటియే సంసారలక్ష్యము. అతని రూపము స్త్రీ జనాకర్షకము. మాటలు సర్వజనాకర్షకములు. చేతలుమాత్ర మిప్పటికి ప్రజలు హర్షింపఁ దగినవి యెవ్వియును లేవు.

దండనాయకరణేశ్వరుఁడు చిత్రకూట మహామండలేశ్వరునికుమారుఁ డని పాఠకులిదివఱకే తెలుసుకొనియున్నారు. అతఁడు భోగనాథునకు సవయస్కుఁడు. చిత్రకూటమునందే శస్త్రవిద్య నేర్చుకొనినాఁడఁట. సాధారణ రూపవంతుఁడు. ఆచరణాలసుఁడైనను ధర్మము నతఁడు శ్లాఘించును. తన యమితవ్యయశీలత నతఁడు ధర్మముక్రింద లెక్కవేసుకొనుచుండును. అతని వ్యయములో నూటికి పది ధర్మముక్రింద నగు నని యతని యాయవ్యయ నిరీక్షకుఁడు చెప్పును. ఆపదిగూడ స్తోత్రపాఠకుల కిచ్చినవే. ఇతని

సామర్థ్య మెట్లుండినను తనచేతిక్రింది యధికారులను పీడించుటలో నితఁడు మహామహుఁడు. ఇతనికి తెలిసిన నీతిశాస్త్రమంతయు నచ్చుగుద్దిన ట్లబద్ధమాడుట.

దండనాయకరుద్రసేనుఁడు మహామంత్రి సునందుని పౌత్రుఁడు. ఇతని తండ్రి నందివర్ధనుఁ డితని శైశవములోనే గతించెను. మేనత్తలకును పినతండ్రికిని తాతకునునితనిపై మిక్కిలి యభిమానము. పితామహి కితఁడు ముద్దుమనుమఁడు. తల్లి కేకప్రియపుత్రుఁడు. వీరపరీక్షలో మొదటిశ్రేణిలో నుత్తీర్ణుఁ డైన వాఁడు. మంచిరూపవంతుఁడు - గొప్పవ్యుత్పన్నుఁడు. భోగనాథుని శిర స్సాంధ్రసామ్రాజ్యాభిషేకార్థమైన తక్షణమే యితని శిరస్సు సైనాపత్యాభిషేకార్థమగునని వీరసింహాదుల విశ్వాసము. ఆలస్య మనిన నితనికిఁ గిట్టదు. లీలావతీదేవి నరపతియొద్ద ప్రతిదిన మొకసారియైన నీయువకుని పొగడుచుండును. రథినీకుమారి నితని కిప్పించుటకు చేయుయత్నములలో నది యొకటి. ఇతఁడు మాటిమాటికి రథినీదర్శనార్థము సేనాపతిగారింటికి పోవుటయు,సందర్భము తటస్థించినపుడెల్ల యథోచితముగా నామెతో ప్రసంగించుచుండుటయును గలదు.

సహస్రపతి వీరసింహుఁడు మా పాఠకులకు పరిచితుఁ డేయగును. అతనిగాయమునకు పూర్ణవేసినమందుగాక యక్షోభ్యముని వేఱుగా మందువేసి కట్టుకట్టియుండెను. అతఁ డాగాయ మితరులకు కనిపింపకుండ వస్త్ర మొకటి కప్పుకొనియున్నాఁడు. అక్షోభ్యుని మందుప్రభావమువలన నా గాయపు పీడ యీ దినము ప్రాతఃకాలముననే పూర్తిగా తగ్గిపోయినది. రుద్రసేన వీరసింహులు సాక్షరనారీసభకు వచ్చియుండిరి. వారు వెనుకపంక్తులలో కూర్చుండినందున మనరాజకాళమ్మ జయగానమునుండి తప్పించుకొనిరి.

ఈ నలువురును పరస్పరబంధువులే గాక స్నేహితులుఁగూడ నగుదురు. రణేశ్వరుఁడు తక్కిన ముగ్వురి సరసగోష్ఠులలో పాల్గొనుచుండినను వ్యభిచార మనిన నతనికి కిట్టదు. వ్యభిచారము దోషమే గాదని వాదించు వారిలో వీరసింహుఁడు ప్రథముఁడు. భోగనాథుఁడు రణేశ్వర వీరసింహులకు మధ్యవర్తివలె నటించుచుండినను మనస్సుచేనతఁడు వీరసింహునే సమర్థించుచుండెను. రుద్రసేనుఁడు వ్యభిచారము దోషము గాకపోయినను దానిని వర్జించుట గొప్ప పుణ్యమనువారిలో నొకఁడు. ఆ చతుష్టయములో సంభాషణ మారంభించినది.

వీర—ఈ నాఁడు నారీసభలో నా యున్మత్తురాలు మిక్కిలి విజృంభించినది. కొనకు మహారాజ్ఞిని గుఱించి జయగానము లేకుండుట యటుండ నా యున్మత్తురాలు జయగానముచే గౌరవింపఁబడినది. దాని యున్మాదము వేషమనియు, సేనాపతిపక్షమున నామె యొక ప్రచారకురా లనియు నాయనుమానము. నిండుసభలో మహారాజు తన భర్తయని వాగినది. దాని ననువా రెవ్వరును లేకపోయిరి. అదిపాడిన కొనపాటలలోవిషము నిండియున్నది.

రణే—పురు ను గుఱించి యామె చేసిన జయగానములో మనపక్షస్థులు కావలెనని మిక్కిలి యవమానింపఁబడినారు,

మాచిత్రకూటములోనే యిట్టి యసభ్యపు కూతలు కూసియుండు నెడల తక్షణమే బుద్ధి చెప్పఁబడి యుండును. ఇచ్చట దండించు నాథుఁడే లేఁడు. పెద్దనాన్నగారు మిక్కిలి శాంతులుగా నున్నందున నంతయు చెల్లి పోయినది.

రుద్ర—నీవు నా భావనాభర్త వని చెప్పి ముందుగా నామె మామయ్యనోరుకట్టి వేసినది. పిమ్మట నెమలి పురివిప్పి యాడినట్లాడినది.

భోగ—ఇట్టి నాకాయ నూకాయ దుష్ప్రచారములకు మనము భయపడ నక్కఱలేదు. ఆమె జయ వాదములో మహాబుద్ధి మంతులలో నగ్రేసరుఁడగు భార్గవ విశాలాక్షుని కొంగనుగా కీర్తించుట మేలయ్యెను ఆ యాపమ్య మతనిమనస్సును వేధించె నని నేను కనిపెట్టితిని. అంగులకు తగిన ప్రతీకారము నతఁడు చేసి తీరును. మన విశాలాక్షుఁడు చేసిన నీతిశాస్త్ర మిప్పుడు పాటలీపుత్రములో చదువఁబడుచున్నది యఁట. మగధసామ్రాజ్య మహామంత్రి రాక్షసుఁడు దానిని మిక్కిలి పొగడి యున్నాఁడఁట. ఆ యున్మత్తురాలు మనల నెంత దూషించినను చింతలేదు. మన యదృష్టవశముచే నామె విశాలాక్షుని దూషించినది. అందులకు మనము సంతోషింపఁదగినది.

వీర—(ప్రసంగాంతరమునకుదాఁటుచు) కన్యాకవులార్వురి కవిత్వములో నెవరిది బాగున్నది?

రణ—బావ రుద్రసేనుఁడే దీనికి బదులు చెప్పవలెను. ఇతనికి సాహిత్యమర్మములన్నియును చక్కగా తెలుసునని సాహిత్యవిద్యావిశారదుఁడు కాణ్వాసకనాసుఁడు పొగడుట గలదు.

రుద్ర—(అభిజ్ఞతను నటించుచు) అందఱి కవిత్వము గూడ రమణీయముగానే యున్నది. వాటిలో ధరణికవిత్వము రమణీయతమము. 'చిత్తము మెచ్చిన చేత, సత్త్వగల్గిన శాంతి'—ఈ ప్రయోగము ధ్వ తములు. ఆమె వర్ణించిన నగుమోము గల చాన యామెయే యగును. ఆ ద్విపదలో నామె తాను మూర్తీభవించి కూర్చుండినట్లున్నది. జీవముగల కవిత్వ మనఁగా నట్టిదే యగును. 'అందఱిమతమున నైక్యముగూర్చ-మంచను గనిపెట్టు మానిగావలెను' ఎంత చక్కగానున్నదో యీ భావము, చూడుఁడు.

వీర—ఆ నల్లని నాయిక కెవఁడు తపస్సు సేయుచున్నాఁడో?

వీర—నీవు తెల్లని నాయికకొఱకు చేయు తపస్సులో నూఱవవంతు చేసినను నీ కామె లభించును. ధారావతిఅత్తయ్య వంటి బుద్ధిహీనురాలు వారియింట లేదు.

వీర—ఫలినీ ధరణుల విషయములో తెలుపు నలుపులుమాత్రమే వ్యత్యాస మగు నెడల నే నంతగా లక్ష్యపెట్టను. ఫలిని పెండ్లి యాడినవానికి మహాసంపదనిచ్చు భాగ్యదేవతగా నున్నది. ధరణి తా నేమియు నీయఁజాలదు సరియే గదా, పదివేలకు తక్కువగాకుండ కొంత సొమ్ము మన మామెకొఱకు ఖర్చు పెట్టవలసియుండును. ఆమె పినతల్లి భర్త పతంగావధాని తనపెట్టె నిండినఁగాని ధరణి నిచ్చుట కంగీకరింపఁడు. ఇప్పు డతఁడే

యామె విషయములో సర్వాధికారిగా నున్నాఁడు.

గిరి — అతఁడు కన్యాశుల్కము పుచ్చుకొనునా ?

వీర — అది కన్యాశుల్కము నన యతఁడంగీకరింపఁడు. అది సంరక్షకదక్షిణ యని పించుకొనును పతంగానభావిగారి దృష్టిలో.

భోగ — పది వేలకు ధరణియే లభించు నెడల నది మిక్కిలి చౌకయనియే చెప్ప వచ్చును.

వీర — శ్రీవారికొఱకు బేరము చేయుటకు సెలవా? (అని నవ్వెను.)

భోగ — (గంభీరముగా) నేను నా వ్యక్తి సౌఖ్యముకొఱకు మాత్రము పెండ్లియాడుట నీతిగాదు. నాపెండ్లి నా భావిరాజ్యాధికారమునకు లాభదాయకముగా నుండవలెను. అది ముందు గమనింపఁదగిన విషయము. అనంతరము గమనింపఁదగినవి విజ్ఞానసౌందర్యములు.

రణే — కవీశ్వరీపక్షములో నిద్దఱు చెల్లెండ్రగుచున్నారు. తక్కిన నలువురిలో నెవరును భావిరాజ్యాధికారమునకు లాభదాయిక యని యెంచను. అందువలన మా అన్నయ్యకు నారీకవిరత్నములలో నొకటి సిద్ధింపకపోవలసివచ్చును. అది యంగీకరింపఁదగినది గాదు. వివాహమునకును రాజకీయ లాభములకును ముడివేయఁగూడదనియే నా మతము.

భోగ — నారీకవులలో పూర్ణను బెండ్లి యాడిన నా భావి రాజ్యాధికారమునకా యువతి లాభదాయికగా నుండుననని నానమ్మకము. ఆమె సుశిక్షితురాలైన వీరురాలు. మహావీరుఁడగు మల్లికార్జునుఁ డామె పెత్తల్లి కొడుకు. అతఁ డామెను స్వంతసోదరికంటె నెక్కువగా ప్రేమించుచున్నాఁడు. మహావీరుఁడగు కాలనాథుఁ డామెకు ధర్మసోదరుఁడని వినికరి. మహావీరుఁడగు ఘనేంద్రుఁ డామె తండ్రికి మేనత్తకొడుకు. ఆమెను బెండ్లి యాడిన స్వయముగా మూర్తీభవించిన శక్తివలె నామె రాష్ట్రమునకు రక్షకురాలుగా నుండును. నేనుదాహరించిన మువ్వురు మహావీరులును మనపక్షము నవలంబించితీరెదరు.

భోగనాథుఁడు పూర్ణను పొగడుట వీరసింహున కసహ్యముగా నుండెను. ఆమెపొడిచిన పోటింకను తన కారలేదు. ఆమె భావి మహారాజ్ఞి యగు ననిన వాఁడు మిక్కిలి యసూయ చెందినవాఁడయ్యెను. అసూయ మాత్రమేకాదు. అపరిమిత భయముగూడఁ బొందినవాఁడయ్యెను. ఆమెయే యధికారమునకు వచ్చిన తనయభివృద్ధికి సున్నచుట్టివేయు నని యతని యనుమానము. తన ప్రభువుయొక్క యుపన్యాసమునకు వ్యతిరేకముగా నతఁ డిట్లు పలికెను—

"పూర్ణ నా శ్రీవారు పెండ్లియాడుట? ఆమెయందు ప్రవహించునది బ్రాహ్మణ రక్తము కాదని నేను నిశ్చయముగా చెప్పఁగలను. ఈ దినముననే నాకు కాణ్వాశుకనాసుఁ డామెజన్మరహస్యమును గుఱించి చెప్పినాఁడు. కాళికసులోచనుఁడు విధవ యగు కాత్యాయనియందు కనినపిల్ల యామె. కాలనాథుఁడు కాళిక సులోచనుని పిల్లఁడే యని న్యాయస్థానములో నిప్పుడు ఋజువైనది. తీర్పు మాత్రము బాకీ. కాలనాథున కామె ధర్మసోదరి గాదు. సొంతసోదరియే

యగును. ఆ గుప్తసంబంధము వారికి ముందే తెలిసియుండవలెను. శ్రీవారు నాగకన్యను పెండ్లియాడుటకు మే మెవ్వరము నిష్టపడఁజాలము."

భోగ—అపవిద్ధులు పెంచినవారి జాతిని పొందెద రని స్పష్టమగు శాసనము గలదు. ఆమె విధవాపుత్రియే యగునెడల నామెను తన పుత్రికనుగా ప్రకటింపవలెనని సులోచనుఁ డెన్నడును న్యాయస్థానమెక్కఁజాలఁడు. విధవను సజాతీయుఁడు పెండ్లిచేసుకొనుట యాపద్ధర్మముగా నంగీకరింపఁబడినను విజాతీయుఁడు గుప్తముగా చెఱుపుట మహాపరాధము. శిశువు నడవిలో పాఱవేయుట యంతకంటెను మహాపరాధము. అందువలన సులోచనుఁడుగాని, కాత్యాయనిగాని బయలుపడఁజాలరు. వారు బయలుపడనపుడు పూర్ణను బ్రాహ్మణ కన్య గాదని చెప్పుట కెవరికి నధికారము లేదు. అందువలన నామె యెవరికన్యయైననుసరియే మన కాగొడవతో ప్రసక్తి లేదు. అందువలన పూర్ణ పరిగ్రాహ్య యనియే నామతము. అపవిద్ధులకు పెంచినవారి జాతి రా దనిన మన వీరేశ్వరబాబుగారి విషయములో చిక్కువచ్చును. మా పిన్నిని వీరేశ్వరబాబుగారి కిచ్చునపుడు తాతయ్యయీ శాస్త్రసందేహమును కులపరిషత్తులో తీర్చుకొనియే కార్యము చేసినారఁట.

రణే— సీతామహాదేవి యపవిద్ధయే కదా! వేదవతి యను బ్రాహ్మణ కన్యను రాక్షసరాజు రావణుఁడు బలాత్కరించి సీతను పుట్టించెనఁట. వేదవతి పుట్టిన శిశువును జనకుని యజ్ఞభూమిలో పాఱవేసినదియఁట. ఆమె నందఱును జానకియని చెప్పిరే కాని రావణపుత్రియని యెవ్వరైనఁ జెప్పిరా? పూర్ణ జన్మయు నట్లే యగును. ఆమె పరిగ్రాహ్య యనియే నా మతము.

రుద్ర— "స్త్రీరత్నం దుష్కులాదపి" యన్నాఁడు శాస్త్రకారుఁడు. నాకీసంబంధము సమ్మతమే. కాలనాథునకు చిన్నబాబు (శక్తిధరుఁడు) మిక్కిలి స్నేహితుఁడు. అతఁడు తన ధర్మసోదరిని చిన్నబాబుకు కుదుర్చుటకు యత్నింపవచ్చును. అందువలన మనము ముందే ప్రయత్నింపవలెను.

భోగ—అట్లే ప్రయత్నించెదను.

వీర—(తనలో) మీరు ప్రయత్నము సేయుఁడు. నేను విఘ్నము సేసెదను. ఎవరు గెలిచెదరో చూతముగాక. (ప్రకాశముగా) ఆ సంబంధ మొకవేళ కుదరనియెడల మనము వేఱే యెచ్చట యత్నింపవలెను?

భోగ— అప్పు డాలోచించుకొన వచ్చును.

## పండ్రెండవ ప్రకరణము

### దుష్టులు కల్పించిన దీవార్త

వీరసింహుఁడుపూర్ణజన్మమునుగుఱించిన యపవాదమును ముందుగా తన చెల్లెలు విలాసవతి చెవిలో నూదినాఁడు. ఆమె తనప్రాణస్నేహితురాలగుకనకవల్లికి చెప్పినది. కనకవల్లి తనప్రియజనకుఁడగు హిరణ్యనాభునకు తెలియఁజేసినది. హిరణ్యనాభుఁడు తనమిత్రకోటిలో ముఖ్యుఁడగు శుకనాసునకు వెల్లడించెను. సోమవారమునాఁడు పూర్వాహ్ణమే యాసప్రాణవార్తాపత్రికకీ నూతనవార్త ముట్టినది. ఆ యాంధ్రనారదుఁ డా సాయంకాలములోపుగ నందఱకు తక్కువకాని స్త్రీ

పురుషుల కావార్త నందఁజేసెను. వారు తమ కుఁదెలిసినవారికి నివేదంచిరి. సోమవారము నాఁడు సూర్యాస్తమయమునకుఁ బిమ్మట స్త్రీ గోష్ఠులలోను, పురుషగోష్ఠుఁలోను ప్రాయికముగా నీవార్త దొర్లుచుండెను. రాజ దంపతులవఱకుఁగూడ నీ వార్త యెగఁబ్రాఁకి నది. ఎవరు కనిపెట్టిరి, ఏనిధముగాఁ గనిపె ట్టిరి యని యడుగువా రెవ్వరును లేకపో యిరి. కాత్యాయనీసులోచనులకుఁ గూడ నీ వార్త తెలియకపోలేదు. వారి కాశ్చర్యము కలిగెను.

ఈ నీలివార్త విని రథినీకుమారి కంపిం చినది. ఆమెకు పూర్ణ ప్రాణస్నేహితురాలు. అందువలన నీ వార్తయొక్క సత్యాత్యాసత్య త్వములను కనిపెట్టుట కామె తత్క్షణమే పూనుకొనెను.

రథిని కాత్యాయనిని పిలిపించినది. రాజకుమారియాహ్వానమును మన్నించి యామె సేనాపతిభవనమునకు రాత్రి పూర్వ యామమునందు వచ్చినది. ఏకాంతశాలలో వారిరువురును సంధించిరి.

రథినిసౌందర్యమునుగుఱించి వీరసింహ రూపచంద్రులు సంక్షిప్తముగా వర్ణన చేసి యుండిరి. అది యతిశయోక్తి గాదని మేము చెప్పఁగలము. ఆమెకవితను మా పాఠకులు వినియున్నారు. ఆమెచదువును గుఱించి రాజకాళినోటినుండి జయవాదము పుట్టినది. ఆ సిద్ధకవీశ్వరిమాటలలో నసత్యమే లేదు. ఆమె యుభయభాషలలో వ్యుత్పన్నురాలు మాత్రమేకాదు. అనేకతంత్రములం దామె స్వతంత్రురాలు. ఔపనిషదయోగమార్గ ముతోఁగూడ షట్చక్రసముల్లాసవిధి గూడ నామెకు తెలుసును. ఇన్నాళ్లవఱకు శాస్త్ర వ్యాసంగములో నుండిన యామె యిప్పుడు తన సవతితల్లి విజృంభణము నరికట్టుటకు కొలఁదిరోజులనుండి రాజకీయరంగమునకు దిగి నది. ఆమెమంత్రాంగబలమువలననే నరపతి మనస్సు పక్వమై గజవీర శాంతిసేనల జాబు లకు ద్రవించి నిన్నరాత్రి మహామంత్రికి ప్రతి కూలమయ్యెను.

కాత్యాయని నలువది సంవత్సరములు నిండిన స్త్రీ. ఇప్పటికి నామె గాత్రపటిమ యేమియును చెక్కుచెదరలేదు. ఆమె కిరు వదిసంవత్సరములక్రిందటనే వైధవ్యము వచ్చి నది. తన యేకపుత్రి కామసేనతో నామె తాను వైద్యవృత్తిచే సంపాదించుకొనిన యింట నున్నది. పరోక్షమున నామెను స్వైరిణి యని యందఱును నిందించినను ప్రత్యక్ష ములో నామెకు లొంగనివా రెవ్వరును లేరు. ఆమె దొక క్రొత్తమతము. ఆమెసిద్ధాంత ముల నంగీకరించువారు కొలఁదిమందియే యైనను ఖండింప శక్తిగలవారు మాత్ర మరుదు. కామశాస్త్రమునం దామె యా చార్య పీఠమని ముందే తెలియఁబఱచితిమి. ఆమె యసాధారణసుందరి; గొప్ప జనాకర్షక ముఖరుచి గలది. ఆమె కీర్తిశేషభర్త కా శ్యపధ్రువకీర్తి. నాగపురోహితుఁడు కాశ్యప దేవకీర్తి యామెబావగారు. ధ్రువకీర్తి ప్రసిద్ధ కాలికుఁడుగా నుండెనఁట.

ప్రకృతము ననుసరించెదము. రథినీకు మారి సంభాషణ మారంభించినది—

"పిన్నీ! ఒక సంశయము తీర్చుకొనుటకు నిన్ను పిలిపించితిని. అడుగుట కుత్తరు విచ్చె దవా?"

దేవకీర్తి ధ్రువకీర్తులు సేనాపతికి మేనల్లుళ్లు. అందువలన రథినీకుమారికి కాత్యాయని పిన్ని వరుస.

కాత్యా—కన్నతల్లీ! నన్ను తమరుత్తరు వడుగవలెనా? ఎట్టి సమాచారమునైనను తల్లినుండి పిల్లకు తెలుసుకొనుట కధికార మున్నది.

రథి—ఆ చనువువలననే నేను సాహసించుచున్నాను. నేనడుగునది నా స్నేహితురాలి కొఱకు. నా ప్రియమైన పిన్నీ! అట్టి ప్రశ్న యింకొక స్త్రీకి బాణాఘాతమువలె నుండును గాని మీవంటి స్వతంత్ర నిర్భయవనిత నది బాధింపదని నా సమ్మకము.

కాత్యా—స్వాతంత్ర్యమును, నిర్భయత్వమును నాయొద్ద గలవని నే నంగీకరింపజాలను. ఈ మాటవలన స్వాతంత్ర్యనిర్భయత్వములను మన స్త్రీలపట్ల నేను దూపించుచున్నా నని తమ రనుకొనవలదు. అవి నాయందు చాలినంత లేవనియే నేను విచారపడుచున్నాను. దానిసంగతి య ట్లుంపనిండు. ఎట్టి విషయమునైనను తమ రడుగవచ్చును. ఎట్టి ప్రశ్నలకుంగూడ నా మనస్సు నొవ్వదని తమరు నమ్మవచ్చును.

రథి—శ్రీకాకుల నగర కన్యలలోనే కాక మానవకన్యలలోనే యుత్తమురాలును, రాజకుమారులు కోరినను దుర్లభమగు పాణి గలదియు, నా ప్రాణస్నేహితురాలు నగు చంపావతిగారిపూర్ణ నీ సృష్టి యని యొక వార్త వింటిని. ఆ సంగతి సత్యమా?

కాత్యా—కుమారీ! దుష్టులు కల్పించిన దీవార్త. నేనుగూడ నీ సాయంకాలమే విన్నాను. పూర్ణవంటి శిశువే నాకు జన్మించియుండునెడల నేను పాఱవేతునా? నాచర్య కొంతగుప్తమని నే నంగీకరించెదనుగాని నేను పాపమని నమ్మినదానిని గుప్తముగా చేయంజాలను. అనాథశిశువును పాఱవేయుట మహాపాపమని నే నెంచెదను. స్నేహితురాలి తల్లి తెలిసిపోయినది యని తమరు నిర్ణయించుకొనవలదు. ఆమెతల్లిదండ్రు లెవరో యింకను తెలియలేదు.

రథి—ఎవరు కల్పించియుందు రీవార్త? ఎందుకు కల్పించియుందురు?

కాత్యా—హేమచంద్ర హిరణ్యనాభ విశాలాక్షులలో నొకరు కల్పించియుందురు. వారు ముగ్గురియొద్దను ముగ్గురు చక్కని కన్యలున్నారు. వారు ముగ్గురను తమ పెద్దన్నగారికి పిల్ల నీయ యత్నించుచున్నారు. పూర్ణను పెండ్లియాడ పెద్దబాబు నిర్ణయించుకొనియుండవచ్చును. అందులకు విఘ్నము సేయుటకే యీ కథాకల్పనము. నా పిల్లయని మాత్రమేకాదు; విజాతీయునకుం బుట్టినది యని కూడ కల్పించియున్నారు. ఈ వార్త విశ్వసించునెడల భట్టారకులవారాసంబంధమును గుఱించి యంగీకరింతురా?

రథి—ఇప్పుడు తెలిసినది తత్త్వము.

కాత్యా — ఇంతియేనా? కుమారి యింకేమైన నడుగనున్నారా?

కాత్యాయనియొక్క యీ ప్రశ్న రథినికి కుతూహలము కలిగించినది. కాత్యాయని యొక్క నూతనమతమును గుఱించి చర్చించుటకు రథినికి సంకల్పము కలిగెను.

## పదుమూఁడవ ప్రకరణము

### స్త్రీధర్మచర్చ

రథి - పిన్నీ! నీ ప్రసంగముల ననేకు లనేకాభిప్రాయములతో వ్యాఖ్యానము సేయుచుందురు. నీవు వ్యభిచారము స్త్రీలకు దోషమే కాదని వాదింతువఁట నిజమేనా?

కాత్యా—అది దోషమే యని నే నంగీకరింతునుగాని మీర లనుకొనువిధమున నది దోషము గాదు.

రథి — కొంచెము వివరించి చెప్పినఁగాని నాకు తెలియదు.

కాత్యా—వ్యభిచరించిన స్త్రీని యమధర్మరాజు నరకములో దండించు ననియు, నిహలోకమునఁగూడ నది చిత్తశుద్ధికిఁ బ్రతికూల మనియు మీ రందఱును నమ్ముచున్నారు. నా కట్టివిశ్వాసము లేదు. అది సంఘ నిబంధనాతిక్రమణదోషముమాత్రమే యగును.

రథి—ఈ సిద్ధాంతమును సాధించుటకు మా పిన్ని చెప్పు యుక్తి యేమి?

కాత్యా—స్త్రీ పురుషులు సమాన స్వాతంత్ర్యముతో సమయము చేసుకొని వివాహ మాడియుండలేదు. పురుషుఁడు స్త్రీని వశపఱుచుకొని యేలుటయే వివాహముయొక్క ఫలితముగా నున్నది. అందువలన తన స్త్రీ వ్యభిచరింపకుండ నయమువలననో భయమువలననో కాపాడుకొనుచుండుట పురుషుని కర్తవ్యముగా నుండవచ్చును గాని వ్యభిచరింపకుండ నుండు బాధ్యత స్త్రీకి లేదు. ఆక్రమింపఁబడినవ్యక్తి దాస్యశృంఖల లోనుండి తప్పించుకొనుటకు యత్నించుట సహజమేకదా! భర్తయందు ప్రేమవలన భార్య వ్యభిచరింపకుండుట వేఱువిషయము. ప్రేమించినఁ బ్రేమించునుగాక. ప్రేమింపవలసిన బాధ్యత యామెకు లేదని నే ననుచున్నాను.

రథి—పిన్నీ! నీ వాదప్రౌఢిమకు నేను సంతోషించితినిగాని నీ సిద్ధాంతములో కొన్ని లోపము లున్నవి సుమా!

కాత్యా— చూపుఁడు. సంతోషించెదను. రాజకాళమ్మ శ్లాఘించిన భర్తృదారిక యొక్క చదువు ప్రతాపమును నాకుఁగూడ పరీక్షింపవలెనని యున్నది.

రథి—పురుషు లందఱును స్త్రీని వశపఱచుకొని యేలవలెననియే చూతురు. ఆ విషయములో పత్యుపపతులకు వ్యత్యాసమే లేదు. ఒకని యధీనతలోనుండి దొంగతనముగా తప్పించుకొని యింకొకని యధీనురాలగుటలో స్త్రీకిఁగల లాభ మేమి? పురుష సుఖమే స్త్రీకి కావలయునెడల స్థిరముగా నొకనిని ప్రేమించి వాని కధీనురాలుగా నుండుటయే క్షేమముగాదా? బహుదాసి కంటె నొకనికిమాత్రమే దాసి ధన్యురాలు గాదా? ఒకరి కధీనురాలుగా నుండుట కిష్టపడని స్త్రీ నిత్యకన్యకగా నుండవలసి యున్నది. అంతకంటె గత్యంతరము లేదు. నిత్యకన్యకగూడ పురుషప్రేష్యత లేక యుండఁగలదా? తండ్రియో అన్నయో తమ్ముఁడో యెవరో యొక రామెను రోధించుచునే యుందురు.

కాత్యా—(తనలో) అందఱిదగ్గఱవలె నీమెదగ్గఱ బుకాయించి కొట్టుకొనిపోవుటకు వీలులేదు. ఈమె ప్రతియుక్తులు మిక్కిలి యద్భుతములుగా నున్నవి. (ప్రకాశముగా) తన యిష్ట

మువలన తా నధీనురా లగుట వేఱు. తనను నిర్బంధించి యధీనురాలినిగాఁ జేసుకొనుట వేఱు. కుమారి యాభేదమును గమనింప లేదు. గమనించియుండునెడల నాసిద్ధాంతము యొక్క యవిచాల్యత కుమారికి చక్కఁగా బోధపడియుండును.

రథి — రాక్షస పైశాచముల సంగతి విడువుము. అవి ధర్మ్యవివాహము లని నేను గూడ నంగీకరింపను. తక్కిన వివాహము లలో గాంధర్వ ప్రాజాపత్యము లుభయుల యిష్టము ననుసరించి నడచునవిగా నున్నవి. వాటిలో నిర్బంధమువలన నధీనురాలగు పద్ధతియే లేదే?

కాత్యా — కుమారి యుదాహరించిన యా రెండు వివాహములు నిప్పుడు పుస్తకములలోమాత్రము చూడఁదగినవిగా నున్నవి. ఆచరణలో నేవీ యవి? ప్రాయికముగా నాచరణలో కన్పట్టు వివాహములు రెండే-ఒకటి బ్రాహ్మము, రెండవది యాసురము. చిన్న నిమిత్తభేదమువలన నామభేదముగాని దైవార్షము లీ రెంటిలో నంతర్భూతములు కాఁదగినవే. ఒక అయ్యకు పుట్టింటివా రిచ్చివేయుదురు, లేక అమ్మివేయుదురు. దానినే వివాహ మని సంఘము తలంచుచున్నది. అది నిర్బంధదాస్యముగాక మఱియేమగును? బ్రతికినవానికేకాక చచ్చినమగనికిఁగూడ మనము భక్తలముగా నుండవలెనఁట. సహజబలకల్పిత ధర్మశాస్త్రబలములుగాక ధనబలముగూడ పురుషులపక్షముననే యున్నది. ప్రాయికముగా మనకాస్తిలో హక్కులేదుగదా! మీకు మే మింత ముద్ద పెట్టుచున్నాము గనుక మీరు మాకు నౌకరులయి పడియుండవలెనని పురుషులు మనలను బెదరించుచుందురు. వాస్తవమైన స్త్రీధర్మము మూలఁబడినది. పురుషులు చూపినదే మనకు ధర్మమయ్యెను. అది పురుషారాధనమే కాని భగవదారాధన మెంతమాత్రము కానేరదు. తన్ను తానుద్ధరించుకొనఁజాలని పురుషుఁడు మనల నుద్ధరింపఁగలఁడా?

రథి — స్త్రీ కొకమగవాఁడు స్వాభావిక వాంఛ తీర్చుట కావశ్యకుఁడు గనుక పుట్టింటివారు తమపిల్ల నింకొకఅయ్య కంటఁగట్టియే తీరవలసియున్నది. అది కన్యకయొక్క యావశ్యకతకొరకేకాని తిండిపెట్టఁజాలక యింకొకనియొద్ద నౌకరీచేసుకొని బ్రతుకుమని చెప్పి కాదు. ఈ విషయములో పిన్నిది ప్రౌఢివాదమే యగును. పెండ్లియాడిన మగవాని తాపత్రయము చూచునపుడు భార్యదాస్యము దానికంటె నెంతయో మేలనిపించును. ఒకయింట భార్య భర్తకుమాత్రమే దాసియగును. భర్త కుటుంబమున కంతటికిని దాసుఁడు. పిన్నీ! పరస్పర సాహాయ్యకమే దాస్యమగునెడల సంసారములో దాసులుగానివా రెవ్వరు? సంఘనిబంధనము సర్వేశ్వరుఁడు ప్రసాదించిన ధర్మము గాకపోవచ్చును. అయినను సంఘరక్షణకొఱకది యవసరముగాదా? పతియందు భక్తిగల స్త్రీని పతి రక్షింపఁజాలఁడని నేనుగూడ నంగీకరించెదను. ఆలయములందు ప్రతిష్ఠితమగు విగ్రహమునందు భక్తిగలవారిని శిల రక్షించు నని యెవరైనఁ జెప్పుదురా? శిలయందు భావింపఁబడిన భగవంతుఁడే వారిని రక్షించును గదా! అట్లే పతియందు భావింపఁబడిన భగవంతుఁడే స్త్రీని రక్షించును. పతి బ్రతికియుండినపుడు పతి

యందు భగవంతుని భావించిన స్త్రీ యభ్యాస బలమువలన పతి గతించినపిమ్మటఁ గూడ స్మృతిస్థాపితపతిరూపమునందు భగవంతుని భావింపఁగలదు. పతియందు భగవంతుని భావింపఁజాలని స్త్రీ పాపాత్మురా లని మెచ్చటను చెప్పఁబడియుండలేదు. ఆమె తరించుటకు వేఱుధర్మములు గల వని నే నంగీకరించెదను. పతివ్రతలు మాత్రము పురుషకల్పిత ధర్మశాస్త్ర వంచితలే కాని ప్రయోజనము పొందఁజాల రని నే నంగీకరింపను.

కాత్యా—కుమారీ! తమ ప్రతియుక్తికి నేను మెచ్చుకొంటిని. ఒక్క సంగతి నేను కుమారి నడుగవచ్చునా?

రథి—నీ కభ్యంతర మేమి? అడుగుము.

కాత్యా—జారపురుషునియందు భావింపఁబడిన భగవంతుఁడు స్త్రీని తరింపఁజేయఁజాలఁడా?

రథి—పవిత్రముగా ప్రతిష్ఠింపఁబడిన శివలింగమునందు భగవంతుని భావింపఁజాలక శిలాసామ్యముచే చాకిబండయందు భగవంతుని భావింతునా యని యడిగినట్లే యున్నది మీ ప్రశ్న. శివలింగారాధకునకు తన భావనయే కాక యితరుల భావనాబలముగూడ కార్యసిద్ధికి తోడ్పడును. అట్లే పతివ్రతకు తనభావనయే కాక సంఘభావనగూడ తరించుటకు తోడ్పడును. భావించుటకు తగిన స్వతంత్రశక్తి యుండునెడల నెచ్చట భగవంతుని భావించినను ఫలము కలుగునని నేనంగీకరించెదనుగాని తనయారాధన సంఘమునందు విప్లవము కలిగించునదిగా నుండఁగూడ దని నామతము. కార్యసిద్ధిమాత్రమే ధర్మలక్ష్యము గాదు. అది లోకసంగ్రహార్థముగాఁ గూడ నుండవలెను. దానివలన సంఘముగూడ నభివృద్ధి చెందవలెను. అధమపక్షము సంఘమునకు హానియైన కలుగకుండ నుండవలెను.

రథినీకాత్యాయను లిట్లు మాట్లాడుకొనుచుండ సేనాపతి పిలుచుచున్నా రని రథినికి కబురు వచ్చినది. అంతటితో నా సంవాద మాఁగిపోయినది. మఱియొకనాఁడు తిరిగియు కలుసుకొనెద నని చెప్పి రథిని కాత్యాయనిని పంపించివేసి తన మాతామహుని శాలకు వెళ్లినదియయ్యెను.

## పదునాల్గవ ప్రకరణము

### పరంతప సంఘనాయకుల సభ

ఆ సోమవారమునాఁడు రాత్రియే చంద్రసేన నాగేంద్రుని యింట పరంతపసంఘనాయకుల సభ కూడినది. నిశంభు నాగేంద్రుఁడు సభకగ్రాసనాధిపత్యము వహించెను.

నిశంభుఁడు పాతికయేండ్లు వయస్సుగలవాఁడు. మేఘనాదుని మించిన పరాక్రమవంతుఁడు. కుంభకర్ణుని మించిన బలవంతుఁడు. రావణుని మించిన ప్రభావవంతుఁడు. కాలనేమిని మించిన మాయావి. శత్రుభయంకరుఁడయినను సర్వాకర్షకముఖశ్రీ గలవాఁడు. తాంత్రికుఁడయినను వైదికరహస్యముల నెఱింగినవాఁడు. క్రూరస్వభావుఁడైనను మాటతప్పని మనిషి. ఉచ్ఛృంఖలుఁడైనను పరనారీసోదరుఁడు. దయారహితుఁడయినను వదాన్యుఁడు. గర్వితుఁడైనను పరబలవేత్త. మహాకాయుఁడయినను నిరుపమాన లాఘవుఁడు. ఆంధ్ర సామ్రాజ్యమునందలి నాగుల కకిరీటనరపతి. ఆ సభలోని సభ్యులు తక్క నతనిని నిశంభునిగా నెవ్వరు నెఱుం

గరు. ఇతరులదృష్టిలో నతఁడు నీలుఁడను సాధారణనాగుఁడు. నిశంభుని నామమే నాగులలో నధికారము చెలాయించుచున్నది. అతని రూపము తెలిసినవారు పరంతపుల కార్యనిర్వాహకసంఘమువారు మాత్రమే. ఇతఁడు మందనాథపుత్రుఁడగు కుంజనాథునకు సుముఖియను బ్రహ్మరాక్షసియందు పుట్టినవాఁడు. బ్రాహ్మణునకు రాక్షసస్త్రీయందు పుట్టినవారు బ్రహ్మరాక్షసు లనంబడుదురు. కాపాలికులగు ననార్యజాతివారే రాక్షసులు. నిశంభునియందు తండ్రివంక నాగరక్తమును, తల్లివంక బ్రాహ్మణ రాక్షసజాతి రక్తములును ప్రవహించుచుండినవి. అతఁడు జనుల దృష్టిలో కౌళిక సులోచనుని దత్తపుత్రుఁడు. కార్కోటకుఁడు కుళికునియింటఁ బెరిగినాఁ డన్నమాట. జనులకంట్లు కప్పుట కతఁడు రాజకీయసేనలో దళపతిగా పనిసేయుచున్నాఁడు.

నిశంభుని కుడిపార్శ్వమునందు కర్ణిసుతుఁడు భీమనాథుఁడు కూర్చుండెను. నీలభీమనాథు లాబాల్యస్నేహితులు. ఘనేంద్రకాలనాథ మల్లికార్జునులతోఁ గూడ భీమనాథునకు స్నేహ మున్నదిగాని నీలునితో నితని స్నేహ మధికము. నీల భీమనాథులకు మఱియొక యాధ్యాత్మికబాంధవ్యము గలదు. వీరిద్దఱును ధవళాక్షికి యోగవిద్యాశిష్యులు. భీమనాథుని వయ స్సిరువదిరెండు సంవత్సరములు. ఇతనికి శక్తిధరునిపై భ్రాతృప్రీతియు, రథినిపై భగినీప్రీతియును గలదు. కారణమేమి? వారిద్దఱు నతనితోఁగూడ నతని తల్లి పాలు పంచుకొనినవారు. కర్ణి శక్తిధర రథినులకు దాదిగా నుండె నన్నమాట. ఇతనికి భోగనాథునిపై ద్వేషము మెండు. లీలావతీదేవి యనిన నితని కేమియును గిట్టదు. భార్యావశంవదుఁ డనుకారణముచే రాజుపై నితనికి మిక్కిలి యసంతృప్తి. ఇతఁడు దరిద్రప్రజాపక్షపాతి. ఎక్కువపన్నులు భరింపలేని ప్రజల మొఱలు గమనించి ప్రభుత్వముపై క్రోధము వహించి తన ప్రియస్నేహితుని సంఘములోఁ జేరియున్నాఁడు. మాయావిద్య యొక్కటి తక్క తక్కిన యన్నివిద్యలలోను నిశంభునకు సమానుఁడు. కొన్నింటిలో నిశంభుని మించినవాఁడు గూడ నగును. పరంతప సంఘమువారితనిని చోరపరమేశ్వరుఁడను బిరుదనామముతో వ్యవహరింతురు. పరంతపసంఘముచేతిక్రింద నుండు దొంగల గుంపున కితఁడు నాయకుఁడు. ఈ తస్కరాణాంపతి తన బిరుదనామమునకు తగినట్లు చరిత్రప్రసిద్ధుఁడగు దొంగగా నుండెను. చోరపరమేశ్వర నామము సామాన్యప్రజలలోఁ గూడ ప్రసిద్ధమే. అది శ్రీమంతులకు భయోత్పాతజనకము. దరిద్రులకు తారకమంత్రము. అతఁడు దొంగిలించినసొత్తులో సగము పరంతపసంఘమున కిచ్చివేయును. సగము దరిద్రులకు దానముసేయును. తాను బ్రతుకునది తనతల్లి యుపకారవేతనమువలన. ఇతని దగ్గఱ నిశంభువు నాలుగుషరతు లొప్పుకొని యితనిని తనసంఘములోఁ జేర్చుకొనఁగలిగెను. జయించినపిమ్మట ప్రజల పన్నులను యథాపూర్వస్థితికి తీసుకొనివచ్చి యాంధ్రరాష్ట్రమును తిరిగియు కుండినునకే యిచ్చివేయవలెను. పట్టమహిషీపుత్రుఁడు శక్తిధరుఁడు సింహాసన మభిలషించునెడల నతని నభిషేకించుటకే నాగు లందఱును తోడ్పడ

వలెను. చిత్రకూటపార్వతీయరాష్ట్రములను మాత్రమే తానును ఇరావతియు స్వతంత్రముగా పుచ్చుకొనవలెను. శ్రీశైల మహామండలేశ్వరుని యధికారము జోలికి తాము పోఁగూడదు. సంగ్రామ మక్కఱలేకయే సంధి కుదురుపక్షమున శక్తిధరాభిషేకబాధ్యతను నిశంభువు తాను వహింప నక్కఱలేదని భీమనాథుఁ డంగీకరించెను. పిమ్మట జటాముని సందేశము ననుసరించి తన గురువగు ధవలాక్షితో నాలోచించి మే మీభాగముయొక్క యైదవప్రకరణములోని జాబునందు చూపిన సంధిషరతులను నరపతి కందఁజేసెను. అస్వతంత్రముగా పార్వతీయ ప్రాంతముమాత్ర మిచ్చెదమని సంధిషరతును నరపతి ధవలాక్షిద్వారా వీరి కందఁజేసినవిధము పాఠకులకు తెలిసియేయున్నది.

శతపతి శివకీర్తి నిశంభుని వామపార్శ్వమునఁ గూర్చున్నాఁడు. అతఁడు కాశ్యప దేవకీర్తికొడుకు. అతఁడు గడ్డముమీసములు పెంచుకొని భీకరముఖుఁడుగా కన్పట్టుచుండినను అతని శ్మశ్రుపటలాంధకార మధ్యములో చిన్న చంద్రకిరణమువలె నొక మందహాసము నిత్యము గోచరించుచుండును. అతఁడు నిశంభునకు సమానుఁడగు వీరుఁడు. విశాలాక్షునకు సమానుఁడగు నీతివేత్త. వైదికాచారసంరక్షకుఁడువలె సభలలో ప్రసంగించువక్త. ఋషికుమారుఁడువలె జితేంద్రియత్వమును నటించు గుప్తవిటుఁడు. పాదశతవయస్కుఁడైనను పలితశిరస్కులగు పండితులను మించిన లోకానుభవముగలవాఁడు. నిశంభువునకు విశ్వసనీయమంత్రి.

నిశంభున కెదురుగా నర్ధచంద్రాకారముగా నైదుగురు కూర్చుండిరి.

వారిలో మొదటివాఁడు దండనాయకుఁ డాశ్వసేన పింగాక్షుఁడు. ఇతఁడు తనను నిశంభభీమనాథ శివకీర్తులతో సమానునిగా నెంచును. ఇతని తండ్రి యాంధ్రేశ్వరుని సేనలో విఖ్యాతిగణించిన దండనాయకుఁడుగా నుండినందున నతనియనంతర మతఃపదవిని శస్త్రవిద్యాగురుకులమునందు సుశిక్షితుఁడైన యితనికి రాజుగా రిచ్చినవారయిరి. ఇతఁడు నాగులలో నతివాది. రహస్యసభలలో నెప్పుడును కుండినులతో సంధికి తనసమ్మతి నీయలేదు. కుండినులయందు పక్షపాతముగల భీమనాథుని తమసంఘములో చేర్చుకొనుట యితని కిష్టములేదు గాని నాయకుని పట్టుదలవలన నితఁ డంగీకరించినాఁడు.

రెండవవాఁడు నిశంభుని పెంపకపు తండ్రి సులోచనుఁడు. ఇతనినే పూర్ణతండ్రినిగా నపవాదము కల్పించినాఁడు వీరసింహుఁడు. కులయోగినియగు కాత్యాయని నారాధించు శాక్తులలో నితఁ డొకఁడని వాదు. కుళికుఁడను నాగేంద్రుని వంశస్థుఁ డగుటచే నితనికి కౌళిక సులోచనుఁ డని పేరువచ్చినది. ఇతఁడు రాజకీయసేనలో నొక శతపతిగా పనిచేయుచున్నాఁడు.

మూఁడవవాఁడు జంభుఁడను కాపాలికుఁడు; చించాక్షితమ్ముఁడు; దొంగలగుంపున కుపాధ్యక్షుఁడు. వీనికి చోరరాక్షసుఁడని సంఘములో బిరుదు. గదాయుద్ధ మల్లయుద్ధములయం దత్యంత నిపుణుఁడు; గొప్ప బలశాలి.

నాల్గవవాఁడు చంద్రసేనుఁడు. నాగులలో గొప్ప శ్రీమంతుఁడు. హిరణ్యనాభునకుఁ బిమ్మట నితఁడే రాజధానిలో నాధ్యుఁడు. జంభ పింగాక్షులు యువకులు. సులోచన చంద్రసేనులు నడివయస్సు గలవారు.

ఐదవది చంద్రసేనునిపుత్రి పర్ణిని. ఆమె వీరసింహుఁడు పొగడిన నక్షత్రము; రూపచంద్రుఁడు శ్లాఘించిన యచ్చర; అక్షోభ్యముని ప్రస్తావించిన నిష్కరుణ వీరురాలు. సంగీతసాహిత్యములందు దక్షురాలు. కాకుల దౌహిత్రి యిరావతి యున్నది యని నిశంభుఁడు చెప్పుటయేకాని చూపియుండలేదు. పర్ణినియే యిరావతి యని పింగాక్ష శివకీర్తి భీమనాథుల యనుమానము. కీర్తిశేషురాలు చంద్రసేనుని ప్రథమభార్య పర్ణినితల్లి రేవతియే కాకులుని కొమారితె శరావతి యని వీరియూహ. వీరి యనుమానమును చంద్రసేనుఁడుగాని, నిశంభుఁడుగాని యెన్నడును ధ్రువపఱచియుండలేదు.

ఆ సభలో సంభాషణ మారంభించినది.

నిశంభువు— పార్వతీయ ప్రాంతమును సామంతరాజ్యమునుగా మాకిచ్చెదనని రాజు కబురంపెను. సంధి మనము చేసుకొనవచ్చునా?

పింగాక్షుఁడు—ముందు మనమడిగినదే మిక్కిలి తక్కువ. దానికంటె నొక లేశము తగ్గించినను మన మంగీకరింపఁగూడదు. ఇప్పుడు రాజు పంపించిన షరతు నాగులలో నత్యంత మితవాదిని గూడ తృప్తిపఱుపదు.

సులోచనుఁడు—అది స్వతంత్రముగా నిచ్చిన మన మంగీకరింపవచ్చునని నామతము. అచ్చుట మనము సాధులమై పిమ్మట స్వరాజ్యము జయింపవచ్చును. ఇప్పుడేమియనుచేత లేక విప్లవము సేయ సిద్ధులమై యున్నారము. ఒక చిన్నప్రాంతమునైనను కొంతప్రదేశము మనచేత నుంచుకొని తరువాత విప్లవ మేల చేయఁగూడదు?

నిశ—అది రాజనీతికి సరిపోవునుగాని ధర్మమునకు విరుద్ధము. ఒకరిని నమ్మించి గొంతుకకోయుట మహాపాపము.

సులో—మన కాపాటి కాలూనిన కలింగులను జయించియైన మనరాజ్యమును వృద్ధి పఱచుకొనవచ్చును.

శివకీర్తి—కలింగవిజయమున కది తగినంత ప్రదేశము గాదు. ఆంధ్రేశ్వరునితో మనము సంధిగావించుకొనిన నీదేశపునాగులు మనకు రణసహాయులగుట దుర్ఘటము. ఒక లక్షకు తక్కువగాని జన మిప్పుడు మన చేతిలో నున్నది. మనము పార్వతీయప్రాంతమునకుఁ బోయిన వీరి నందఱిని విడిచి వెళ్లవలసినదేకదా! ముందు మన మాలోచించుకొని సూచించిన షరతులకంటె నొకయంగుళమైనను క్రిందికి దిగఁగూడదు.

చంద్రసేనుఁడు—నాకుఁగూడ షరతులను తగ్గించుకొనుట కిష్టములేదు.

భీమనాథుఁడు—సులోచన నాగేంద్రుని మాట బొత్తిగా త్రోసివేయుట నామతము గాదు. స్వతంత్రముగా పార్వతీయప్రాంతమును మనకిచ్చి ప్రజల పన్నులను మనము కోరినవిధమున తగ్గించినచో మనము సంధి చేసికొనవచ్చును.

శివ—పార్వతీయప్రాంతమును నిశంభనాగేంద్రున కిచ్చినచో నిరావతీకుమారిమాట యేమగును?

భీమ—ఆమె యింకను కన్యకగా నున్నది యనియే వినుచున్నారము. ఆమె మననాయకుని బెండ్లియాడిన నాటికి విడిపోవును.

శివ—ఆమె యిష్టపడకపోవునెడల?

భీమ—అంత యవివేకురాలుగా నామె యుండ దని నా నమ్మకము. ఒక నాగకన్య యింతకంటె నధికుని మగనిగా సంపాదింపఁగలదా?

పర్ణి—(నవ్వుచు) మిమ్ములను దూతగా బంపునెడల మీ రామెను మననాయకునకు సాధింపఁగలరా?

భీమ—అట్టికార్యమునకు దూతలు పనికిరారు; దూతిక కావలెను. నాపై నాకార్యభారము పడునెడల నిన్నే గూఢకార్యము సాధించుటకు దూతికనుగా వరించెదను. పట్టిన కార్యములో నీవు విఫలురాల వగుదు వని నేను నమ్మను.

శివ—ఒకవేళ నిరావతీ నిశంభువులు దంపతులైనను పార్వతీయప్రాంతము చాలదు. పన్నులను తగ్గించుపరతునైన మనము విడుచుకొనవచ్చును గాని చిత్రకూటరాష్ట్రమును విడువఁగూడదు.

భీమ—(ఉద్రేకముతో) రెండురాష్ట్రములనుగూడ మనము విడిచివేయవచ్చును గాని పన్నులను తగ్గించుపరతును మనము విడువఁగూడదు.

నిశ—(పర్ణినిని జూచి) నాగమణీ! నీ వేమనియెదవు?

పర్ణినికి నాగమణి యని నామాంతరము.

పర్ణిని—మనకు సర్వ మనుకూలముగానే యున్నదిగాని మన భీమనాథబాబు భయస్థుఁడగు సులోచన మామయ్యను సమర్థించుటయే కష్టముగా నున్నది. అతఁ డిష్టపడునెడల రాజుగారిసూచనను తిరస్కరించివేయుటయే నాకు సమ్మతము.

సులో—నన్ను భయస్థుఁడని మానాగమణి యనినను నాకు చింత లేదు. స్వపక్షపరపక్షబలముల రెంటిని మనము సరిగా పరీక్షింపవలెను. సేనాపతి రణంధరుఁడును, ఆచార్య విషమసిద్ధియును ముసలివారైనను మహాప్రతాపులు. విశేషించి రణనీతి తెలిసినవారు. రాజు స్వయముగా నపారపరాక్రముఁడు. ఘనేంద్ర కాలనాథ మల్లికార్జునులు మఱి ముగ్గురు మహావీరులు క్రొత్తగా బయలుదేఱినారు. వారి వీరచర్య లద్భుతములుగా నున్నవి. సైన్యమంతయు సుశిక్షితము. కళింగదేశమును జయించిననాటికంటె నిప్పుడు బలవత్తరముగా నున్నది. మన మింకను కొన్ని సంవత్సరములు వృద్ధిపొందినఁ గాని రాజుగారి సైన్యమును ప్రత్యక్షముగా డీకొనఁజాలము. ఈలోపుగా వారు మన సంఘమును బ్రద్దలుకొట్టకుండ మనము కాపాడుకొనుచుండవలెను. ఇది యంతయు నాలోచించియే నేను పార్వతీయప్రాంతమునైనను స్వతంత్రముగా పుచ్చుకొని సంధిచేసుకొనుట మంచిది యని చెప్పితిని.

శివ—శ్రీశైలప్రాంతము పోయినది మొదలుకొని కుంతలేశ్వరుఁడు కుండినులపై పగపూనియున్నాఁడు. అతని నష్టప్రదేశ మతని కిచ్చుటకు మన మంగీకరించినఁ జాలును. అతఁడు మనకు తప్పక సహాయుఁ డగును. అతని సాహాయ్యకము మనకు లభించిన

నిప్పుడే మనము కుండినులను డీకొనఁగలుగుదుము.

నిశంభుఁడు భీమనాథునిప్రక్కచూచెను.

భీమ—కొత్స సత్యకర్మయొక్క పరిపాలనము మిక్కిలి ప్రజాహితముగా నున్నదియని వినికిరి. కుంతలేశ్వరుని పరిపాలన మేమియును బాగుండలేదు. మనము స్వార్థము కొఱకు మంచిప్రభుత్వమును గూలఁద్రోసి దానిస్థానే క్రూరప్రభుత్వమును స్థాపించుట నా కెంతమాత్రము నభిమతము గాదు. అట్టి యకార్యమునకు నేను నా శస్త్రము నెప్పుడును వినియోగింపఁజాలను.

భీమనాథుని వచనోపన్యాసము శివకీర్తి కసహ్యమయ్యెను; నిశంభున కుత్సాహభంగము కలిగించెను. శ్రీశైల రాష్ట్రవిషయములో నంతగా భీమనాథుఁడు పట్టుదలచూపఁడేమో యని వా రనుకొనిరి. పన్నుల తగ్గించుటలో నతనికుండు శ్రద్ధ రాష్ట్రాక్రమణములో లేదని వారిద్దఱు నీరాత్రి స్పష్టముగా గ్రహించిరి. భీమనాథుని తృప్తిపఱచుటకును ప్రజలను తమప్రక్క త్రిప్పుకొనుటకును వా రిద్దఱు నాషరతును సంధిసూచనలో కలిపిరిగాని వారికి దానివిషయములో నంతగా పట్టుదల లేదు. వారికి కావలసినది విశాలరాజ్యము. భీమనాథునివంటి మిత్రుని వారు పోఁగొట్టుకొనఁజాలరు; అతనిమాటను పాటింపనుజాలరు. ఇప్పుడు వారు గొప్పచిక్కులోపడిరి. కొనకు నిశంభుఁ డిట్లు పలికెను—

"ఇప్పుడుమనకు కుంతలేశ్వరుని సహాయమవసరము లేదు. నామిత్రుఁడు భీమనాథబాబు నాకు కోటికుంతలేశ్వరులతో సమానుఁడు అతని కనభిమతమైన కార్యమును నేను చేయఁజాలను. అతనితోడను, పూజ్యురాలు ధవలాక్షీదేవితోడను, నా కులగురు పుత్రుఁడు శివకీర్తిబాబుతోడను నేను దీర్ఘముగా నాలోచించి పంపిన సంధిషరతులను మాత్రము నేను తగ్గింపఁజాలను. రాజుగారు సూచించిన సంధిషరతు అంగీకారయోగ్యముగా నుండ లేదని ధవలాక్షీదేవికి తెలియఁబఱచుటకు చంద్రసేన నాగేంద్రుల కధికారమీయఁబడినది."

ఇంతవఱకు మౌనముగా నుండిన జంభాసురుఁడు నోరు తెఱచి యిట్లు పలికెను—

"మంచిమాట చెప్పితివి బాబూ! మన మిప్పుడు సూచించిన షరతులకే వారు బ్రతిమాలుకొనునట్లు మన శస్త్రములు పనిసేయఁగలవు."

---

# నా మహారాష్ట్ర యాత్ర

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

హిమగిరియందలి కైలాసశిఖరమును వీక్షించినపుడు ఈశ్వర భ్రూలతికలను, ఈశ్వరశిరమును పోలు దృశ్యములుంట తెలియును. మంచుకొండ మహేశ్వర ధామమైన వెండి కొండవలెనే యుండునుగదా! వెనుక నాదృశ్యములను విలోకించినట్లే, నేను నాపుణ్యభాగమునున్న దృశ్యములనుగూడ గౌరవభావముతో పరికించితిని. కాని, వీనిని గురించిన ఉదంతమును నేనెన్నడు ఉన్నదాని నున్నట్లుగా గ్రహించితినిగాను. గిరిశిఖరములు రాళ్లప్రోవులు మాత్రము కావనియు, వానియందాత్మను తనుపు అనంతభావములు ఉద్భవించుననియు తెలుపుట మన ప్రాచీనుల ఆశయము.

ఎట్టి మహత్తరభావమైనను, సాధారణ వ్యక్తీకరణముకతన సామాన్యప్రజల మనసుల బ్రవేశింపదుకదా! రూపుజూపని భావము, గట్టిమెసడనకే లొంగుభావము, తీవ్రతార్కికకరణమును బురికొలుపుభావము, కఠినతాత్త్విక సమాలోచనమునకే పనికివచ్చుభావము అవమానితుడైన అతిథివలె నిట్టిమనసులనుండి తరలిపోవలసినదే! మనుష్యమనసము బాలకునివంటిదని తెలుపుదును. బాలకుడు పరుగులెత్తుచునే యుండునుగదా! తనదృష్టి నాకర్షించిన బొమ్మనే అతడు పట్టి ప్రాకులాడును. పొంతనుండి గట్టిపండితుడు నడచుచుండినను వాని నీతడు పరికింపడు. మనసు స్వేచ్ఛాకామి, ఆనందకామి. గుమాస్తావలె నది పనిచేయదు. ఒకరిచ్చు పరిశ్రమకు తలనొగ్గుటకది యిచ్చగింపదు. ప్రమోదమే దీని పరమావధి. పరిశ్రమను కాంక్షించు కొన్ని మనసులుండుటకు కారణమీ పరిశ్రమ స్వయం నిర్ణయమై, ప్రమోదసంభరితమైనదగుటయే! తపసులందు తెలియుదుము. రేబవళ్లు పఠనమున, గ్రంథరచనమున, గభీరయోచనమున నిమగ్నులైన వారందు తెలియుదుము. ఇవి కష్టభూయిష్ఠములని, మనసును నొప్పించునవనివీరు యోజించియుండుచో వీనినుండి తక్షణమే—తక్షణమే కాకున్నను అచిరములో తొలగిపోదురు. జయపతాక మెత్తలేక వీరు వ్యర్థజీవులగుదురు ఈ యంశమును దృష్టియందిడికొనియే, రవీంద్రుడు "Strenuousness is the open foe of attainment" అని తెలిపియుండును. (Vide: Tagores-"Letters to a Friend" page 43) తపసి, జిజ్ఞాసువు, విద్యార్థి, కవి, యాత్రీకుడు, ప్రజాసేవకుడు తమ క్రియలందు చెమటబొట్లులనుగాక అమృతబిందువులను గాంచి మురియుదురు. "అబ్బా!" అనుకొనువారు, దుఃఖపడువారు, కర్మక్షేత్రమున నానందఝురులను విలోకింపక అస్సురుస్సురనుకొనువారు సోమరులై, ఎందుకట్టెలై నేడో రేపో తమ బ్రదుకును బూడిద ప్రోగు జేసికొందురు. కాలక్రమమునగాని, క్రమనిష్ఠకతనగాని మానవుడు తపసికాడు. కావున తపసియందు ప్రమోదము కాలముకడచుకొలది మనసునందూటవలె నధికమగుచుండును. ఈ పరితోషము అమృతకలశము వంటిదని వచింపవచ్చును. తపస్వి అమరుడనవచ్చును. అమరునకాహార మమృతమే కదా! తపస్వి క్రోలు పానీయము ఆనందము; ఈతని కృషి ఆనందపూరితమైన కలశము. ఈకలశమును నేలబడగొట్టితిరేని అతడును నేలబడి, నెత్తికొట్టుకొని యేడ్చును. చూచితిరా?—సామాన్యుడు వలదని యేడ్చినదానికై తపసి కావలెనని యేడ్చుచుంట బరికించితిరా? తపసి ఘనభావములకై, యాత్రీకు డుత్తుంగ శిఖరములకై పోగులును. గురుగంభీర దృశ్యముల నన్వేషించుచు, తుచ్ఛసుఖములను పడదన్ని ఇతడు ముందంజవేయును. తపసికాని మానవుని, ఈతడును పరితోషకామియే కావున, గురుగంభీరదృశ్యము లన్వేషించుచు పోవలెను. కన్నుగుట్టు నీ దృశ్యములను గాంచి తన పరుగునుండి తరలి, ఈతడు సంతసమందును. చోద్యము జూచుటకెండ తెండలో పోవుదురేల? అది ప్రమోద సంభరిత

మఱుటచేగదా! కవులును, ఋషులును కన్నతల్లులు బోలువారందురు. ఘనతాత్వికాంశములను హృదయంగమ మొనరించుకొనినవారే యయ్యు, బిడ్డలుపోలు సామాన్య ప్రజల మనసుల కివి కడుంగడు కర్కశములై యుండునని యెఱింగి, వానికి రూపులిచ్చి, వానిని గన్నుగుట్టు దృశ్యములను గావించి, కథలని కావ్యములని వానికి పేరులిడి వీరు జనాళి కొసగుదురు. మన కావ్యముల చుట్టుగల కెంబట్టు పుట్టముల దొలగించి చూడుడు. అందు నుపనిషత్తుల నవలోకింతురు! వజ్రములుపోలు గట్టి తలపు లందుంట గాంతురు. మన ఋషికవులెంత విశాల హృదయులో కనుగొనుడు! గ్రంథములందు, అక్కరముల వెనుక సుందరదృశ్యములను చిత్రించి వారు మిన్నకొనియుండలేదు. తమ శిల్పకౌశలమందలి సుధాధారల గ్రోలుటకై, తమ కావ్యములనే కొందఱు మాత్రమే తెఱచిచూతురని వారెఱుగుదురు. కావున తమ భావములను - ఆనందసుధాసంసిక్తము లైన తమ భావములను బాహ్యదృష్టి నాకర్షించు దృశ్యములందు విరబోసి, వానిని బహుళసంఖ్యాకుల కప్పన మనిరి. మిఠాయిని చూచి పాపాయిలు పరుగులెత్తుమరారా? మన కావ్యములందును, యాత్ర స్థలములందలి దృశ్యములందును ఎంతో భావమృష్టాన్నమున్నదని తెలుపుట నాయాశయము. పండితులును, పథికులును వీనికై పరుగులెత్తుచుందురు. మన మతమందలి యుద్దేశములను, మన రచనలందలి భావములను గ్రహింపనేరక, భావపఠనము నంతగా నెఱుగని పాశ్చాత్యులు మనము మూఢులమని, మనమతము, మన యాచారములు మౌఢ్యగర్భితములని మాటలు విసురుచుందురు. ప్రతి మానవునిగూడ మహావిజ్ఞానిగను, నిర్మల చారిత్రునిగను గావింప నుద్దేశించి భావగ్రహణమునకు తోడ్పడు దృశ్యపరికరములను సమకూర్చుటయే కాక భావానుష్ఠానమునకు మనుజుని పురికొలుపుటకై మన ఋషులు చక్కని యాచారముల నేర్పఱిచిరి. కర్మకాండయన బిచ్చిపనియా? మిషనువలె జేయుక్రియయా? కండ్లుమూసికొని, ఒకనిమ్రోల బానిసయై నిలిచిచేయవలసిన కర్జమా? బాహ్యదృష్టినుండియు, అంతరంగ దృష్టినుండియు మనసున జేరుకొనిన మహితభావములను ఆత్మజీవములందు చొప్పించి, వానిని దేవగర్భితములైన మహామందిరములట్లు మహిమోపేతములు జేయుటకై మన ప్రాచీన విజ్ఞానులు నిర్ణయించిన మహదాశయమంశితకర్తవ్యము కావా? మన విజ్ఞానమేమో మన మెఱుగము కావున. మన కర్మకాండ యెట్టిదో, నిత్యభావానుష్ఠాన మెట్టిదో యెఱుగక మనమతమును జూచి, మన యాచారములను జూచి కిచకిచలాడుచు పండ్లికిలించుచున్నాము. ఈ మతమునకును, ఈ యాచారములకును ముప్పుదెచ్చు నిరక్షరకుక్షులను, దుర్మతులను నిక్కంపుపూజారులని, నిక్కంపు పురోహితులని నమ్మి వీరి దుష్క్రియలకతన వానిని వక్రదృష్టితో, జుగుప్సాగర్భిత నేత్రములతో విలోకించుచున్నాము. మన విద్యావిధానమున మార్పులు తోచినగాని మన మనసులు క్రమపంథయందు పనిచేయవు; మన గ్రంథములందు, మన పుణ్యభూములందలి దృశ్యములందు, మన తీర్థములందు, మన విహిత కర్మలందు గల గంభీరోద్దేశముల నవి గ్రహింపనేరవు. హిమగిరియందు దీర్ఘయాత్ర సలిపినపుడచటి రాళ్లయందును, రప్పలయందును దివ్యాక్షరముల గాంచితిని. ఈ యక్కరములందు భావభువనములను విలోకించి, *

* భావపఠనమందు, అంతర్దృష్టినుండి కావించిన పఠనమందు మనమందు ఆనందమనూనమైనది కళోపాసకులందు గూడ నిట్టి పఠనము నలవఱచుకొనువారి సంఖ్య అత్యల్పమైయుండును. ఇట్టివారిలో, ఆధునికులలో, భారతీయులలో ప్రధానుడు రవీంద్రుడు. ఈ పఠనము తన కెంతో పరితోషమొసగునని ఈతడు తెలుపుకొనుచుండును. (" I cannot tell you the great joy of seeing everything through the sight which comes from within" (Vide: page 41 Tagore's "Letters to a Friend") హృదయముతో సలుపు యోచన మిట్టి పఠనమునకుదారి దీయును. అపర ఆంగ్ల విద్వాంసులిట్టి యోచనమును మిగుల నగ్గడించిరి. ఈ యోచనాశక్తి వంగీయునకు కలదని అరవిందుడు తెలుపుకొనుచుండును. ("Tht Bengalee has the invaluable gift of thinking with the heart" Vide: page 4, "The Brain of India" By-Sri Aurobindo Ghose") హృదయముద్వేగమున కాటపట్టు. ఉద్వేగభరితమైన యోచనము అద్భుత ప్రభావముకలదై దివ్యరచనమును గనును. ఇట్టి రచనమే పాఠకుని యాత్మచే తన్మయనృత్యము జేయించును.

వీనినన్వేషించియే నిలింపు లీపుణ్యభూమియం దవతరించి ఈ కర్మక్షేత్రమున ధర్మక్షేత్రమును విలోకించి, ఇందుండియే ముక్తి నందుకొనిరని గ్రహించి ఉత్తమాళయ విలసిత నృత్తిపై మసలు భాగ్యము నాకలవడినందులకెంతో మురిసితిని. అందు నే గాంచిన భావభువనముల నెప్పటికైనను పాఠకమహాశయుల చిత్తముల కందీయగలనని ఆశపడుచున్నాను. తుషారాద్రిని పరికించి, అందలి దివ్యదృశ్యములందలి "గంగా మాహాత్మ్యము"ను పఠించి పరితోష మందినట్లు నేను బ్రహ్మగిరిపై నిలిచి, మహారాష్ట్రసేవకుడు చూపిన దృశ్యమునగల "పుణ్యగోదావరీ చరిత్ర"ను పఠించి ఆనందించితిని. మహితభావనకు నిమిత్తమైన వస్తువు పూజనీయమైనదని నా యుద్దేశము. దీని నిట్టి నిమిత్తముచేసిన మునిమానసమునకు జోహారంటిని. జడములైన రాళ్లయందును ఇట్టి యాధ్యాత్మిక సృష్టి జూపజాలుట భారతకవిబుధులకే సాధ్యమైనది. వీరికనుకొనుడు, భావభరితమైన గోదావరీచరిత్రకు నను కొనుచు, శైలతలమందలి గభీరతత్త్వమహత్త్వముగనుడు సాగిలపడితిని. నాశిరము సలిలసంసిక్తమయ్యెను. మనసు భావప్లావితమైనది. కూడనున్న సేవకుడును నావలెనే అందు సాష్టాంగపడినాడు. వీని విశ్వాసమే విమలతరంగిణియై వీనిని పునీతు జేయుచున్నది. నాచేతిలోని మర చెంబును గైకొని సేవకుడచటి పవిత్రోదకమున బుడుంగున ముంచినాడు. నాచెంబుకూడ యాత్రీకుడే యంటినిగదా! మునిగినంతనే దాని యంతరంగము నవ భావపూరముచే నిండిపోయెను. భావబ్రహ్మాండమును మోచుకొని యమునాసరిత్తీరమున మసలిన వసుదేవుని వలె, భావభారమును వహించి గోదాఝరీధారలందు జరించితిని. ఆ భావబ్రహ్మాండము ముద్దుకృష్ణునందుండెను; ఈ భావభారము నాముద్దుకలశమున నుండెను.

అనుచరసహితుడనై ప్రదక్షిణముచేయుచు, గిరిశిఖరమునుండి అల్లన దిగదొడగితిని. క్లిష్టమైనను మార్గమంత యధ్వాన్నము గలేదు. కడచిన సాయంసమయమున నన్నెదుర్కొనిన కడగండ్లు నేడు లేపలేదు. త్రోవతప్పి అట్టిపాట్లలో (ఇవి పడరానివని నే డెఱుపను) పడిపోతిని.

కొండమట్టు అందందు జలధారలు రాలుచున్నవి. కొంతదూరము దిగినమీదట ఇవి రాలుచోటులందు ఏదో బొమ్మను ముందిడికొని దాని కింత కుంకుమపులిమి ఒక్కొక్క అవ్వ కూర్చుండును. ఒకే గ్రేడుకోని అవ్వలు ఎట్లు సెలెక్టు ఆయి ఇందు జేరుకొనిరో! అమలాపురపు కరిడీలకును ఈ యవ్వలకును నిండు చుట్టరికమున్నప్పటికిని వీరు మహారాష్ట్రపు అవ్వలగుటచే గట్టిసరుకులనుట తథ్యము. ఈసరుకును డోలీలిందు జేర్చియుండును. కుంకుమయగాక ముందున్న రాళ్లకు, బొమ్మలకు వీరు చక్కని భస్మమును పట్టించియుండవలసినది. గోదావరీ జన్మస్థలమని తెలుపుచు, "ఉదంబరేర్ మాళే" అను సంస్కృతపదమునకు పెక్కుమహారాష్ట్ర శబ్దములను జోడించుచు, ఆవేశపూరితులై ప్రసంగించుచు "యాత్రను జయప్రదముగ ముగించుకొని పోతున్నారు. దయచేయండి" అని ఇంత బిల్వపత్రిని, కుంకుమను, హారతికర్పూరమును, ఇన్ని పూలను, అగరువత్తులను, ఒకటి రెండు కదళీలనో, ఒక కొబ్బరికాయనో వీరు చేతికిత్తురు. వీరి పూజ ముగిసినవెనుక చేతనైనంతవఱకు దక్షిణనులాగి, అప్పటికిని యాత్రీకుని వదలక "మఱొక్కదేవుని చూతురుగాని రండు" అని వెనుకతట్టున నున్న బిలములోనికి గొనిపోయి అంగురాలు నీటిబొట్టుల దిగుచున్న బొమ్మరాతినిజూపి "దక్షిణాధోడో!" అని పలుకుచుందురు. ఈవృద్ధనారులు పాపము కడుపేదలు. ఆప్రదేశము భయంకరమైనదయ్యు ఎట్లో నాలుగు డబ్బులు దొరకునను ఆసతో అందుజేరుకొని, చీకటి పడకముందు వన్యపశువుల బారిబడక దిగవచ్చు బోవుచుందురు. వీరి మాటలు నవ్వు పుట్టించిననేమి, వీరి యవస్థ కనికరమును కలిగింపకమానదు. కావున వీరికి సాయము సలుపుటకు సంశయింపము. కాని తెరువున అందందు పసపుపూసినరాళ్లనో, ఎన్నోచేతులు గల బొమ్మలనో, వింత వింత విగ్రహములనో నిలిపి వానిని గుఱించి అబద్ధపు గాథల నేకరువుబెట్టుచు, చిత్తము వచ్చిన దక్షిణనందుటకై ఎన్నెన్నో పోకిళ్లకు పోవుచు తమ యాటలు చెల్లనపుడు మాటలు మిగులు పూజారులను చూచినపుడు కోపమురాకమానదు. క్రమక్రమముగ

క్రింది కరుసుకొలది త్రోవలో ఇందును అందును అబద్ధపు బైరాగులూ, నిక్కంపుయోగులూ, భిక్షకై పొంచియుండు అభ్యాసులూ, కోతిమూకలూ, సెంగలమ్మువారూ, దమ్మిడీల చిల్లరనిచ్చువారూ తోచుచుందురు. అందందు యాత్రీకులూ ప్రత్యక్షమగుచుందురు.

పర్వత పార్శ్వమున అచ్చటచట తోచు కొన్ని కట్టడములు మిగుల పురాతనమైనవి. అందందు పాడుపడిన సాలలున్నవి. వానిలో నెవ్వరు లేకున్నను, పోయి లోపల ప్రవేశించిన నూతనాంశ మేదేని కనులబడునని ఆశపడి, అందు జొరబడి నలుతట్టులను పరికించువాడను. "చూచేందుకు అక్కడ వింత ఏమీ ఉండదండి. పాములు మాత్రము ఉంటాయి. రండి పోదాము." అని సేవకు డనుచుండువాడు. "పట్టపగలు అడలనేల? నీ చేతిలో బలమైన కఱ్ఱ కలదు కదా!" అని ఆశ్రమములను విలోకించునట్లే జిజ్ఞాసువునై శిథిలాలయములను వీక్షించువాడను. పీఠాలకు ముందునుండి అవి యున్నవని కొందఱనుచుండువారు. వానిలోని దుమ్ములో చరిత్రకును, పురాణమునకును సంబంధించిన నిదర్శనము లెవ్వియైన గోచరించునని మక్కువపడువాడను, కొన్ని కొన్నిచోటులు నాకంతో ప్రీతి గొలిపినవి. మఱికొన్నిట గొందలు జోను లగపడువారు. ఒకానొక పాముకొంపలో నేవో ప్రాతగుడ్డ లగపడినవి. వాని వెనుక నేవో మెదలుచున్నట్లు తోచినది. "పాము పా"మని కఱ్ఱతో సహితముగ ఒక్కదుముకుతో సేవకు డీవల బడినాడు. ఇకేమి చేతును? వీరప్రవరునితో నవ్వులికి లంఘింపక తప్పినదికాదు.

కొండనుండి చాలభాగము దిగినపిదప వీరప్రవరుడు మఱొక త్రోవనుండా మరల పర్వతమెక్క సాగినాడు. కొండయొక్క మఱొక్కతట్టున నెత్తయిన చోటున కొన్ని విగ్రహము లున్నవనియు, వానిని చూడవలెననియు మావాడు సెలవిచ్చినాడు. అందున్నవి కేవలము విగ్రహములే యగుచో వానిని చూచుటకై కొండమీదికి నెగిరెగిరి పడరా దనుకొంటిని. కాని, ఆయెత్తు చోటున చక్కని దృశ్యములును, మనసునకువచ్చు చిత్రములును, గంభీరభావ వికసితములైన మఱెట్టి పదార్థము లేని యున్నవేమోయను నాశ నాహృదయమునతలయెత్తి సాగినది. మరల నెత్తుకొండ నెక్కుట కష్టమైనపనియే యయ్యు వీరప్రవరుడు మార్గదర్శకుడై యున్నాడు కావున, క్రమపంథనుండి కదలిపోజాలదనియు, మరలమరల బ్రహ్మగిరి నెక్క నవకాశము కలుగదేమో యనియు యోచించి నడుముగట్టి కాలు సాగించితిని. కొంతసేపటి కా చోటు జేరుకొంటిని. జలధార, సామాన్యమూర్తులు తక్క అందు నూతనవస్తు వెద్దియు గోచరింపలేదు. ఉన్నతస్థానమునుండి నలువలంకులను పరికించి, చూడిక్కవలనుండి పర్వతదృశ్యమును అంతరంగములోనికి లాగుకొని తృప్తినంది దిగువకు తరలితిని. ఈ తీఱున బ్రహ్మగిరియొక్క నాలుగుతట్టులనుండి కొండొక తెన్నునుండి కొంతదిగి మఱొండు తెరువునుండి మీదికి నెక్కి విస్తృతశైల సామ్రాజ్యమును కడుకౌతుకమున పరిశీలించితిని. కడచిన సాయంసమయమున కండ్లబడిన భయంకరగుహాగాని, దురంతయాతన మొసవించిన గొందిమిట్టగాని ఈ విచరణమున మఱొక్కమాఱు సాక్షాత్కరించునేమో యని యూహించితిని. వీరప్రవరుని తోడ్పాటుకతన నీపర్యాయము మనుష్యసంచారముచే కొంత నలిగిన దారులం బే నడచుటచే వెనుకటి భయంకరదృశ్యములు మరల దృగ్గోచరము కాలేదు.

అప్పటికి పగలు పదునొకండు గంటలు కడచెను. దివంగతయైన అమ్మకు నేను కొంత ప్రసాద మర్పింపవలెను గదా! ఇక కొండ నేలయుం దాలసింపరాదు. నేటి పవిత్రకార్యమును గుఱించి డైమానురాజుతో ముందే తెలిపియుంటిని. యాత్రస్థలమున సాధారణముగ నెఱుపవలసిన తీర్థవిధిని నేను జరిపితీఱుదునని ఆత డెఱుగును. కావున పితృకార్యమునకై చేయవలసిన సన్నాహమునంతను అతడు జరపియుండునను దృఢ విశ్వాసము నాకు కలదు. పైగా నిట్టి కార్యములం దాతడు సిద్ధహస్తుడుకదా! ఇవి వాని నిత్యకృత్యములు. జరుగవలసిన యత్నము జరిగియుండకపోయినను నిముసములో నాతడు నెఱుపగలడనుట అతిశయోక్తికాదు. ౧౯౩౦ లో నాఅవమాఱు (శారద సహితముగ) కాశీపోయి

నపుడు, చల్లా సుబ్బారావుగారు పదునొకండు గంట లప్పుడు 'ఓ' అని కేకవేసినంతన నార్గురు బ్రాహ్మణులు మోలవ్రాలిరి. గంటలో వంటముగిసినది. డైమాక్రా జీవర్గములోనివాడే! ఇక నాలసింపరాదనియు, నీ పర్వతభూమిపై మసలుటకు మఱునాడు మరలరావచ్చుననియు దలపోసి "నిక నూరిలోనికి దారిదీయు"మని వీరప్రవరునితో నొక్కి చెప్పితిని.

మఱికొంతసేపటికి కొండదిగువకు వచ్చితిమి. చెట్లగుంపులో ప్రవేశించితిమి. ఊరినుండి మెల్లగ నడచి వచ్చుచు, వరంగలుమిత్రులు నా కందు నెదురైరి. నన్ను పలుకరించుచు, "అయ్యవారూ! ఏమైపోయారు నిన్న? చీకట్లో ఎక్కడో పడిపోయారని దిగులుపడ్డాము" అని వారు దేవులాడిరి. ఈ యమాయికుల వాక్కులు అనురాగపూరితములై యుండెను. చదువు సంధ్య లెఱుగరని, నాగరకతకు దూరమందున్నారని మనము ములకనచేయు వారి హృదయములు కరుణాప్లావితము లనుట కెన్నేని దృష్టాంతములను స్వానుభవమునుండి పేర్కొనగలను; మహాపీఠాధిపులని నేను కీర్తించు వారిలో పలువుర హృదయములనుండి అనుకంపయు అదృశ్యమయ్యెననుటకును ఎన్నేని దృష్టాంతముల నీయగలను. రాజస్థానమున హనుమాన్‌గడ్ అనుచోటున చాన్‌జీయను నిరుపేద నన్నెట్లు సత్కరించెనో, భటిండాకడ దుబేజీ ప్రభృతులు నాయెడల జూపిన ఆదరానురాగము లెట్టివియో నా "కాశ్మీరమజిలీ"లను పరికించిన పాఠకు లెఱుగుదురు. వరంగలు తెలుగు సైదోడులు నాకేమియు సాయముచేయలేదు. వారిసాహాయ్యమందు తరుణము నాకు లభించలేదు. కాని ఆతురపాటుతో నిండిన వారిమాటలు నాకు పదివేల మూటలకంటె వెలగలవై నా మనసున కెంతేని యానందమును గూర్చినవి. ఆహా! సద్భావమును, సద్వాక్కును ఆత్మకు నమృతంపు గ్రుక్కలనుకదా! వీనిని గూడిన సత్క్రియ మధుమయమైనదగును. వీనినెఱుగని క్రియ—ఒక్కొకపుడు దొడ్డదియయ్యు—మానసమునకు ప్రీతిగాక బాధనే కలిగించును. తిట్టిపోసి యొకడు పాయసమొడ్డించుచో, మన జిహ్వ కది చేదును, చిత్తమునకు రోతను బుట్టించును. అనురాగగర్భితమైన పలుకెద్దియో, నాటకమునకును బూటకమునకును సంబంధించినమాట ఎద్దియో అనుభవముకతన గుర్తింపకపోము. తియ్యని మాటలచే సంతోషపెట్టి, శక్తిసంపన్నులయ్యు ఆచరణ సమయమున గాళ్లు ముడుచువారును, ఎగ్గుచేయువారును గూడ గలరు. ఇట్టివారి జీవనము యమలోకమునకు కూడ డోసుపుట్టించును. ఎంతోసేవజేయ, నెంతోసాయము సలుప గాంక్షించి, కృతకృత్యులు కానివారు కన్నీరోడ్చుచు, చల్లనిమాట చెప్పువారును గలరు. ఆలివర్ గోల్డ్ స్మిత్ ప్రభృతు లిట్టివారు (Vide: "The Citizen of the world "Theor City Night's Peace"). వీరిమాటలును వారిమాటలును చల్లనివే యయ్యు వీరియంతరంగములందు వ్యత్యాసము లుండును గదా! వీనిని గుర్తించుట కెన్నేని వెరవు లున్నవి.

భావము కేవలము వచనమునుండియే వ్యక్తము కాదు. ఇది నీటియందలి మంచుకొండను పోలునదని తెలుపవచ్చును. ఈ కొండయందలి తొమ్మిదవంతు లుదకమున మునిగియుండును. ఒకవంతుమాత్రము జలముపై తేలును. (vide: Freud's Book on Psychology) ఇంతకంటె నధికముగ నది యాత్మప్రకాశము గావించుకొనజాలదు. అంతరంగ మహార్ణవమందలి భావము ప్రసంగమునందు కొంతదనుకమాత్రము ఆత్మప్రకాశ మొనరించుకొనగలదు. కాని భావము జడముకాక జీవానల సందీప్తమైనది కావున కొండవలె నడగిమణగి యుండ నేరదు. మాటలందుగాకమానె, కన్నీళ్లందును, నవ్వునందును, అంగాంగ భంగిమమందును, ఉద్వేగపూరితమైన చేష్టలందును అది వెలువడును. కొండొకవడి సంయమి భావము నంతరంగమున బంధించియుంచినను, ద్విగుణీకృత శక్తితో కాలక్రమమున నేరూపమందైన నది విజృంభించి తీఱును. లతలందును, రెమ్మలందును నెలలకొలది నిదురించియుండు భావము వసంతసమయ

* త్రివేణీకుంభమేళ మహోత్సవానంతరము ప్రయాగనుండి కదలిపోయి వారణాసి నావేళకు చేరుకొంటిమి.

మున మొగ్గలందును, పూవులందును, కాయలందును, పండ్లయందును హసన్ముఖియై ఆత్మప్రకాశ మొనరించుకొనదా? కమ్మతావియందు తన చరిత్ర ఇట్టిదని ప్రకటించి బహుళాత్మల నలరింపదా? మనుష్య మానసమున పొడసూపిన భావము బహుజన్మలందు గూడ నవతరించి వివిధ క్రియలందు ప్రస్ఫుటించునని హైందవతాత్వికు లెఱుగుదురు. భావము సత్యముకావున, ఆత్మకు దగ్గఱిచుట్టము కావున నెన్నడు మృత్యువు నెఱుగదు.

అభినయమం దావిర్భవించునది అసత్యమే కదా! ఎరువునగలు దాలిచి సత్యమని తోచు లీల భామవలె నిది నటించును. నేడు కాకున్న రేపైన నీనగలు రాలి తీఱును. ఇపుడు కాకున్న ఓదపనైనను మోముమీది పూత యంతరించి తీఱును. చక్కని చుక్కవలె కొండొకవడి తోచిన నేమి, అనృతము నిజగర్భమున మృత్యువును ధరించియే యుండును. నిండుకడుపున నిప్పునెరసుల నిడికొనిన కొండ ఏదేని మహూర్తమున పెటిల్లుమనక మానునా? కాలక్షయత్తైలమున సత్యము చిరసందీప్తమైయుండ, నసత్యము తాద్రవ్వుకొనిన గోతిలోబడి చచ్చి కంపుగొట్టదా?

చిఱుతప్రాయమునందే గృహమువీడి, విశాల భూభాగములందు మసలి, వివిధ ప్రకృతులను పఠించు తరుణములు నాకెన్నో లభించుటచేతను, క్లిష్టమైన జీవనమార్గములందు ప్రతికూలపరిస్థితులందు నడచుచు, బహుళ గుణదోషములను గాంచి సర్వవిధ మనుష్య చరిత్రల నెఱుగవలసిన యక్కఱ నాకు పలుమాఱు కలుగుటచేతను, దైనికజీవనమున నే గలియు వ్యక్తుల అంతరంగికశక్తు లెట్టివో, వారి హృదయములం దెట్టి భావములు సంచరించుచున్నవో, వివిధ సమయములందు వారి మానసికగ్రథన మెట్లు పరిణమించుచుండునో అవలీలగ గ్రహింపగలనను ఆత్మవిశ్వాసము నాకు కలదు. క్రమగతి నైహికయాత్ర సలిపి, విభిన్న జీవనసమస్యలను ధృతి నైపుణ్యములతో నెదుర్కొనుటకై జీవన రహస్యములను గుఱించిన పరిజ్ఞాన మెంతో అవసరము కదా! ఆర్థికముగను, నైతికముగను పల్వురు నేడు పతితులై యుండుటచే, మతమహత్త్వముపై, ధర్మనిరతిపై, ఘన చరిత్రపై, సుందరభావముపై, సదాశపై నల్లాఱవృష్టి నేడు మిక్కుటముగ గురియుచుండుటచే తఱచుగ నహితులనే, ప్రవంచకులనే, ద్రోహులనే, దుర్మతులనే మనము విలోకించుచుందుము. అడుగువేసిన కొలది బొప్పి గట్టించుకొనుచుందుము. నేకను ఇట్టిగాయములు నాకు లభించుచున్నవి. దెబ్బతిని దెబ్బకొట్టిన నాధ్యాత్మికనియమమునకు భంగము వాటిల్లుటటుండ, తీవ్ర సంఘర్షణము పిశాచమును లేపుననియు, ఆత్మశాంతిని దునుమాడుననియు, పరస్పర విధ్వంసము తలసూపుట తథ్యమనియు నెఱుగుదును. ప్రతికూల ప్రకృతులనుండి సంఘర్షణమును గాక సఖ్యమునే సృష్టించుటకును, విష బిందువులను గాక అమృతకణములను లాతివారి నడవడియందు చిందింపచేయుటకును, తెరలుతెరలై ఎనుటి జీవనమునుండి దుర్గంధము మీదికి పొరలి రానున్నతఱి సుగంధపూరమునకు దానిని గంగోత్తరి గావించుటకును, చీకటికోణమైన మనసున దివ్యజ్యోతిని నిలుపుటకును, ప్రకోపమును పాలియించి ప్రణయమునకు పట్టుగట్టుటకును, కలుషమును కడతేర్చి ఉత్తమాశయములకు విజయధ్వజము నందించుటకును, హాహాకారములను తఱిమికొట్టి జయమంగళ మాలాపించుటకును, మనుష్యహృదయమున పెరుగుచున్న డొంకలను తెగగొట్టి మరల నందు మందార పారిజాతములను కుసుమింపజేసి నందనశోభ నందు పునరుద్ధరించుటకును నేటి మానవుడు మాటలకందని ఆంతరంగిక శక్తి నలవఱచుకొనవలెను. ఆత్మసంయమ మనుడు, నిశితబుద్ధి యనుడు, దూరదృష్టి యనుడు, అద్భుతకౌశల మనుడు ఈ శక్తి లోనివే! దీనినందిన మహూర్తమందే మహత్తర జీవకళ నలవఱచుకొంటిమని తలపవచ్చును. వడగండ్లవలె కడగండ్లు పైబడుచున్నను, విండ్లను ముండ్లను నిముసనిముసము మార్కొనుచున్నను, నా మహత్తర మహూర్తమున పండువెన్నెలను జాల్చు రథాంగములవలె, సుధాబిందువులను గుటకవేయు తేటిసుంపులట్లు, పూలపానుపున గలియు దంపతులచందమున, భావాంబరమునుండి రాలు చల్లని తలపులకు మనసులొగ్గు కవిచాతకముల చాడ్పున ననంతానందమునంది, ఎంతేని మురియుదుము,

మధురరాగాలాపమునకు, మంజులధ్వని సృష్టికి సంగీత మూర్ఛనమందలి ఆరోహణావరోహణము లవసరమగు లాగున, మధురమంజుల జీవనగీతికాసృష్టికి భావమూర్ఛనమును, క్రియాకౌశల్యమును అక్కఱైనవి. వివిధ గుణ సూచకములగు మన హృద్వీణా తంత్రులను సప్తస్వరముల సమన్వయము తేటపడు వగువున నేరిమిమెయి మీటజాలినపుడు మన జీవనముల నమరులకు కూడ పాటకచేరుల గావింపగలము. ఈ సామర్థ్యము నందుట కెంతో సాధన మవసరము. ఇంట నుండి గ్రంథములచుట్టుయుంచు పద్మాసనము వేసికొని రుద్రాక్షులను త్రిప్పునట్లు గ్రంథాక్షరములను మనన మొనరించిన నిట్టిసాధనము కానేరదు. ఈ సాధనమును, పైన నుల్లేఖింపబడిన పరిజ్ఞానమును స్వీయపరిశోధనము వలన, స్వయంకృషికతన, గంభీరపరిశీలనమువలన, హృదయపరీక్షమూలమున, ఆత్మసంయమముకతన, నిశితబుద్ధి వలన, నూతనశక్తిసంపాదనముకతన నలవడును. పాడుచుండ, నాడుచుండ నెల్లరవములను, ఎల్లరూపములను ఆకర్షించుకొని, మనమ్రోల ప్రదర్శించు టాకీజంత్రములట్లు ప్రకృతి జీవనమందును, మనుష్యజీవనమందును బహుళచలనదృశ్యములను దాగైకొని, సాహితి దాని నాత్మహృది ప్రత్యక్షమొనరించును గావున, నాదర్శ జీవన నిర్వహణమునకేకాక, ఆదర్శసాహిత్య సృష్టికిని గూడ నట్టిసాధనమును, అట్టి పరిజ్ఞానమును అనివార్యమైనవి.

సాహితీవసుమతియందును, ప్రత్యక్ష ప్రపంచమందును పూర్ణాదర్శములను నిండుపండ్లనట్లు పుడికితీఱవలెనని కాంక్షించువాడను కావున నీపరిజ్ఞాన సాధనలందు క్రమవృద్ధినంద నాతురపడుచునేయున్నాను.

వరంగలుమిత్రులతోకలసి నే నెంతకాలమో మసలకున్నను, వారిలో దీర్ఘప్రసంగము సలుపకున్నను వారి హృదయము లెట్టివో, వారి చరిత్ర లెట్టివో, వారి జీవనవిధానము లెట్టివో గ్రహించుటకు నాకు నిముసము నేపు కంటె నాలస్యముపట్టలేదు. అభినయమునకుగాని, నాటకమునకుగాని వారి జీవనములందు చోటులేదని గ్రహించి, ఆయామాయికుల నిష్కళంకచిత్తములకు జోహారంటిని. కంటిమాపు చల్లగనున్నంతకాలము, మానసికదృష్టి వాడియై యున్నంతకాలము (ఈ చూపుక్కల నెదుటివారు చూడనితెలుగున సారించినను సారించుచు)ఏది సత్యంపు వ్యక్తీకరణమో, ఎయ్యది యసత్యపువిజృంభణమో గ్రహింపజాలుదును.

కడచిన రాత్రి నా కెట్టి యవస్థ ప్రాపించెనో యని వరంగలుసైదోడు లెంతో వందురియుందు రని గ్రహించి, పరార్థచింతకు తావొసగిన వారి పవిత్ర హృదయములకు ధన్యవాదము లొసగితిని. నిరపాయముగ నేను బయటబడినందులకు వా రెంతో యానందించిరి. సమీపమున నేదేని దేవాలయ ముండియుండునని యూహించి దానిని చూచుటకై పయనమైతిమని వారనిరి. మతావేశముతోకాంబోలు, వారితోనున్న అబల తాటిపంతుగాడిని చంకబెట్టికొని ఎంతో చురుకుగ నడచుచున్నది. తనముందొక యెత్తుకొండ కలదని పాపమామె యెఱుగదు. ఎఱిగినను ఆవేశభరిత హృదయయై యున్నంతదనుక ఆమె వెనుకంజవేయదు. ఆహా! మతావేశ మెంత మహత్తరమైనది! అది యొసగు శక్తి ఎంత యద్భుతమైనది! మనుజునకు రక్తమాంసములిచ్చు బలమెంత? భావోద్వేగమును, మతావేశమును అదృశ్య దివ్యశక్తులై యంతరంగమున విరాజిల్లుచుండ నంగుష్ఠమాత్రశరీరులుకూడ ధైర్య హేమాచలు లగుదురు; అసాధ్యములను సాధించితీఱుదురు. గిరీంద్రములును, కరీంద్రములును వీరి కరుణకై దోసిల్లొగ్గి వీరి మ్రోల నిలుచును.

తెలుగు సైదోడులనుండి కదలిపోయి, సేవకుని గూడి మఱికొంతదూర మరిగితిని. తరుబృందమున ప్రవేశించుచు, గజాసురుడు నా కెదురై "నమస్తే బాబూ సాబ్! అభీతక్ జంగల్ మే హవా ఖాతేహై క్యా? పహాడ్ పర్—("అయ్యా! వందనము. ఇప్పటివఱకు వనములో వాతూలము నారగించుచున్నారా? కొండపై—") అని చిఱునవ్వులో వ్యంగ్యస్వరమున నాతడేమేమో ప్రశ్నించుటగాంచి, "నమస్తే" యని మాత్రము పలికి, వానితో ప్రసంగింపక, అప్పటికే చాల ప్రొద్దెక్కుటచే వడివడిగ నడచిపోతిని.

కష్టభూయిష్ఠమైన ప్రయాణమున గజాసురుడు నాకెంతో తోడుపడునని ఆశపడితిని. ఉత్తరహిందూస్థానమున నేను సలిపిన దీర్ఘయాత్రలో నాపొట్టిపిచికి నాకెంతో పరిచర్యసలిపి, నాకు ప్రాణాధికుడైనాడు. పిచుకవలెనున్న వాని గుండెయందు మేరువుబోలిన యౌదార్య ముండెను! సృష్టికర్త నియుడు వాని యంతరంగము వియత్తలముకంటె విశాలమై యుండెను. మహత్తర సేవాధర్మమునకై పురికొలుపు దివ్యభావము పరంజ్యోతివలె వాని హృదయగహ్వరమున తేజరిల్లినది! తాను చేయునది మహత్కార్యమని ఆతడెన్నడు నెఱుగడు. అతడాడును, పాడును, అంతియే! కోపించినపుడు తనలోతాను నవ్వుకొనువాడు; వానిమనసునకు నెరులు కలిగెనని యూహించినపుడే నొచ్చువాడు. వాని యెడంద కుసుమాదపి కోమలము. అని బాలకుని గుండె కనయైనది; మంచుకంటె శుభ్రమైనది. కఠినమైన ప్రణాళికను నిర్దిష్టమొనరించుకొని, క్లిష్టమైన పయనము సలుపుచు, నిష్ఠురుడనై నే ప్రవర్తించినపుడెంచుకైన గనలక, విసుగుజెందక, దిగులుపడక, తనకష్టమును కష్టమనెంచక, నేబడుపాట్లకు దుఃఖించుచు, తన నిద్రాహారములను పాటింపక, నా నిద్రాహారములకై వింతవింత వ్యవస్థలు సలుపుచు, తన మాటలచే, నాటపాటలచే నాకెంతో సంతసముగూర్చుచు, నాకు తోడై నా నీడయై మసలిన వాని నెన్నడును మఱువజాలను. ఆతడు మహాత్ముండని గుర్తించియే, ఆతడెఱుగనితీరున తఱచుగ వాని హృదయమహత్త్వమునకు సాగిలపడువాడను. మరల వానిని గలిసికొని, వానిగూడి మాటిమాటికి హిమగిరియాత్ర సలుపవలెనని మక్కువపడుచుందును. ఈతని జూడవలెనని అనవరత మాతురపడుచుందును. గజాసురుని దాపుననున్నపుడు Law of Contrast ననుసరించి నా పొట్టిపిచికి తలపునకురా, నిరువురందు గోచరించిన వ్యత్యాసము దలచి అబ్బురపడిపోతిని. శారీరకోన్నతియందు గజాసురుడు బ్రహ్మగిరి తలదాటినాడు. హిమాచలమున కుబ్జీకాగలవాడు. ఉన్నత శరీరమునకును, ఉన్నతభావమునకును దగ్గఱిచుట్టఱిక ముండునని తలపజెల్లదని ఈతని దృష్టాంతము ధ్రువపఱచినది. పొట్టిపిచికిపరిమాణము గజాసురుని చిటికెనవ్రేలియంత దరపాలైన నుండదు. పరమాణువునందు కొండంతభావమును గాంచి, కొండంతకాయమున పరమాణువంత మహత్త్వమును గాంచక, ఇదేటి సృష్టిచిత్రమని యచ్చెరువొందితిని.

పుంఖానుపుంఖముగ పరిశీలించితిమేని, సృష్టియందెన్నెని చిత్రములను విలోకింతుము. ఒక్కొక్క చిత్రమున నొక్కొక Epigram ను గాంతుము. పరస్పర ప్రతికూలములట్లు తోచు రెండుభావముల కలయికలో నద్భుతసత్యమును ప్రదర్శించునదే Epigram కదా! మృత్యువునుండి జీవన మాత్మవిజయమందుటయు, దుఃఖమునకు సుఖము హేతువగుటయు నట్టి సత్యములే! అనంతమైన బ్రహ్మము హద్దుగల నిజసృష్టియందాత్మప్రకాశ మొనరించుకొనుట నిట్టిసత్యమే! నెరులనుండి సుఖ ముద్భవించుటయు యిట్టిసత్యమే! కమలముఖమున దోచు కన్నీటిబిందువు ప్రభాతసమయమున చక్కని రతనమట్లు కాంతిలదా? నిజేశునకు సరోజిని యొసగు రత్నాంకితహారము బాష్పసముద్భవమైనదే కదా!

మానవ్యచరిత్రయందు తోచు చిత్రములనుండి చిత్రములను సృష్టించుట అసాధ్యము కాదు. ఈ చరిత్ర జీవసంచారము గలది కావున చలనయుతమైనది; పరివర్తన మందజాలునది. మనవ్యదృష్టి గాంచజాలునది పరిపూర్ణత్వము (Perfection) కావున దీని దెస సాగిపోవుట మానవుని సహజగుణము. దీనికతన సుశ్రితంపు చరిత్రలు కొన్ని ఆంతరంగిక పరివర్తన మందుట గాంతుము. ఈ పరివర్తనమునే తాత్త్వికులు Resurrectino అనియు, Inward renewal అనియు దెలుపుచుందురు. హైందవసారస్వతము దీనిమహత్త్వమును వేనోళుల బ్రకటించినది. గెటే టాల్‌స్టాయి ప్రభృతు లీ యాధ్యాత్మిక గుణమును బహుభంగుల నగ్గించిరి (Vide: Leo Tolstoy's famous novel 'Resurrection'). క్రైస్తవమత చరిత్రయందిది ఎంతేని ప్రాముఖ్యము నందినది. అంధకార బంధురములై యుండిన *అగస్టయిను

* అగస్టయిను ఘోరవ్యభిచారియైయుండినాడు. ఈతని దుశ్చరిత్ర వీనితల్లి కెంతో సంతాపము గలిగించెను. పదపడి ఆంతరంగికపరివర్తన మంది, ఈతడు యోగీంద్రుడై రోమునుండి గ్రెగరీ యనుపోపుచే పుత్తెంపింపబడి

పాల్ ప్రభృతుల జీవనములు దీనికతనసే ఆలోకితములై సౌందర్యసందీప్తములు కాజాలినవి.

గజాసురుడు పొట్టపిదికివలె మహాత్ముడు కాడు. నిష్ఠురునివలె దోచినాడు. కరుణాశరధి కాగలడని నా దృఢవిశ్వాసము. కొంతకాల మీతనితో మసలి ఈతని చరిత్రయందుదయించు నూతనశోభను గాంచవలెనని యాశపడితిని.

నడచుచు నడచుచు నేవడు డేమేమో పలికినాడు. నా మనసు వేఱుగ పనిచేయుచుండుటచే వాని నుడువులు వాని "స్వగత"ముందే నిలిచిపోయినవి! వాడు గంభీరవదనుడై పోయినాడు. ఇంతలో మిరపపండుగాడు, పండ్లీవల బాలుడై వచ్చి, ప్రత్యక్షుమైనాడు. నా యాగమనమును తెలుపుటకై కాబోలు పరుగుపరుగున వెన్కకు పోయినాడు. వీరప్రవరునిగూడి అల్పసమయములో డైమాక్ రాజుదివ్యభవనమును జేరుకొంటిని.

తీర్థయాత్రలను చేయించుటందును, తిథులను పెట్టించుటందును డైమాక్ రాజు అందెవేసినచేయి. ఈ వృత్తులలో వానిబుద్ధి పరిణతినందినది; తలపండినది. తాతముత్తాతలనుండి అవతరించుచు వచ్చిన క్రియాకలాపమును ఉగ్గుబాలనాటినుండి చేపట్టి సాధించుచున్న ఘటము అందులో నింతటివాడగుటలో అక్కజమేమున్నది? నిన్నటిదినము నేననిన నాతల్లి తద్దినము మాట ఆతనిచెవి బడి ఊరకొనలేదు. వానిమనసున ప్రవేశించి, మంచి మందుకణికవలె పనిచేసినది. మరల దానిని గతించి వానికి జ్ఞాపకముచేయవలసిన అక్కర లేకపోయినది. అతడు బ్రహ్మగిరివృత్తాంతము నెఱుగనివాడు కాడు. కొండకొన జేరుదునని పోయిన వ్యక్తి ఇంతలో తిరిగిరాడని నాపలుకు వినినపుడే గ్రహించినాడు. గిరిశిఖరము నెక్కినను ఎక్కజాలకపోయినను, ఆర్థికము కనుక దొరలినదైనను, తనమేడపై పడితీఱుదునని ఆ బుద్ధిమంతు డూహించినాడు. ప్రాణపతి చిత్తమును కనిపెట్టి ఆతని యడుగుజాడలననుసరించు దొడ్డయిల్లాలైనను కాకపోయినను కాపురమునకు వచ్చినప్పటినుండి ఆతని యుద్యోగమున పాల్గొనుచు విశేషానుభవమును సంపాదించిన దగుటచే మదామ నేటి వంటకై వలసిన సన్నాహమును నేను మరలిరాకమున్నే చేసికొనినది. * నేను వచ్చినంతనే కబురు తెలుపుమని తనయున కాదేశ మొసగి ఎవరిచేతనో అమావాస్యతర్పణమును విడిపించుటకై కాబోలు డైమాక్ రాజు కుశావర్తమున కరిగినాడు. చేతినిండా కావలసినంత ప్రాక్టీసుగల అదృష్టవంతుడు!

మిరపపండు తూరీగవలె ఎగిరిపోయినాడు! అచిరములో డైమాక్ చక్రవర్తి హాజరైనాడు. వెంట నలుగురు మహాశయులున్నారు. నలువురును డైమాక్ వర్గములోనివారే! శరీరములపై బుక్కా చల్లుకొనిరేమో అని యూహించితిని. ఒక్కడు మాత్రము లంకగుమ్మడిపండును బురుడించు బొజ్జతో నలరారుచున్నాడు. నలుగురును పెద్దమీసములు గలవారే! తక్కుంగలవారి ముఖభాగములును, తలకాయలును నున్నవై యున్నవి. గడ్డిపరకలవలె పుంజిడు వెండ్రుకలు ఒక్కొక్కని నడినెత్తిపై శోభిలుచు మందమారుతమున నూగాడుచున్నవి. కొంతదూరమున నిలుచువారికివి గోచరింపవు. నాలుగు మెడలపై నాలుగప్పడాల పిండిముద్దలు రంగారి యున్నవని చూపఱులు గ్రహింపకపోరు. గుమ్మడిపండును చూపి "ఇతడు మంత్రము

---

క్రీ. శ. ౫౯౭ లో కెంటున గాలిడి ఆంగ్లావనియందు క్రైస్తవమతమును ప్రచారమొనరించిన ప్రథమాచార్యుడైనాడు. తెరువుదాపున వెలుగునుగాంచిన మహూర్తమందే పాల్ మహాత్ముడైనాడు.

* ఈరీతి అక్కరలు అకస్మికముగ పొడసూపినను, జంకుగొంకులు లేక వాని నెదుర్కొనజాలు శక్తి పండాల కుండును. ప్రయాగనుండి పగలు పదునొకండుగంటలకు కుటుంబసహితుడనై ఏడేండ్లకుమున్న నేగాశి జేరినపుడు చల్లా సుబ్బారావుగారు "శో" అనినంతనే ప్రమథగణమువలె పలువురు ప్రత్యక్షమై నాటి సన్నాహమును నిమిషములో నెఱపిరి.

చెప్పను. తక్కిన ముప్పురు భోక్తలు. ఉత్తములైన బ్రాహ్మణులు" అని డైమార్క్‌రా జనినాడు. "నిజము చెప్పితిరి" అని వారిని తేఱిచూచితిని. "పదునేనుదినముల నుండి నాసిక స్టేషనులో మీకై ఎదురుచూచుచుంటిమి బాబుజీ! ఎప్పుడు దయచేసినారు?" అని గుమ్మడిపండు గౌరవ పూర్వకముగా నన్ను ప్రశ్నించినాడు. ముసలి ఘటం రసికుడని, గట్టిఘటమని గ్రహించుటకు నా కాలస్యము పట్టలేదు. ఇట్టి వృద్ధులను చూచినపుడు ఎంతో సంతోసమందుచుందును. ఈ ప్రశ్నను వృద్ధుడు కాక యువకుడు ప్రశ్నించియుండిన కోపించియుందును. పదునేనుదినములకు మున్ను అమృతసరమం దుంటిని. నాకై ఈతడు నాసికలో ఎదురుచూచుచున్నాడట! తొలుకటి పర్యాయము(౧౯౧౨ లో) కాశీపోయినపుడు చల్లా సుబ్బారావుగారి ఏజంటు "అబ్బాయీ! నీకై మొగల్‌సరాయి స్టేషనులో ఎదురుచూచితిని" అనినాడు. ఈవచనము పండాబాపలందఱి నాల్కలపై తేలియాడుచుండునేమో! "పదునేనుదినములకు మున్ను రాత్రివేళ జలియన్‌వాలాబాగ్‌లో మీవంటిరూపమే గోచరించినది. మీయన్వేషణ మచ్చటివఱకు ప్రాకియుండును." అని గుమ్మడిపండుతో పలికితిని. "ఇత డపుడపుడు భూత మగుచుండును. బాగ్‌లో మీకు గోచరించినవా డీతడే!" అని ఒకభోక్త పలికినాడు. గుమ్మడిపండు కను లెఱ్ఱజేసి ఒకమాఱు నాలుక నీవల బాఱవేసినాడు. ఇక నాలసింపక నాటిక్రియకై గడంగవలెనని వారిని హెచ్చరించి, స్నానమునకై వారితో కుశావర్తమున కరిగితిని.

పితృకార్యములందు ఆంధ్రులకు మహారాష్ట్ర భోక్తలు (వారును పంచద్రావిడులలోనివారే కావున) పనికివత్తురని మనపెద్ద లనుచుందురు. కాశీప్రయాగలందు పిండప్రదానసమయములందు వీరు విరివిగా చెల్లుబడి యగుచుందురు కాని తెలుగుతిండికి వీ రలవాటు పడలేదు. *

కన్నతల్లి తద్దినము. ఈపవిత్ర సాంవత్సరిక కర్తవ్యమును నేనిపు డంతగా విమర్శింప బూనుకొనను. తర్కశాస్త్రము తెలుపు ప్రత్యక్షప్రమాణమువలనగాని, అనుమానమువలనగాని దీనిని గ్రహించుట సాధ్యముకాదు. ఆప్తవచనముకూడ నొక ప్రమాణమేకదా! వేదవచనమే హిందువులకు ప్రధానమైన ఆప్తవచనము. దీనిమహత్త్వ మచింత్యమని విందుము. ఇది సనాతనమైనది. మనుష్య వివేకమునుండి కాక ఈశ్వరముఖమునుండి వెడలినదని విందుము. ఈ యంశములను తూచాతప్పక విశ్వసింపకున్నను, మనుష్యమానసము దివ్య భావోద్వేగముచే చలించినపుడే అందుండి వేదవాక్కు వెడలెనని నమ్మజెల్లును. ఆధునిక తాత్త్వికులం దగ్రగణ్యుడైన రాధాకృష్ణుని పల్కు లాలింపుడు! "The Veda is

* కడపటిమాఱు ప్రయాగలో తీర్థవిధి పెట్టినపుడు ఇరువురు మహారాష్ట్ర భోక్తలు తప్పిరికారు. తెలుగు ముద్దలు కంఠములో చొరబడినంతనే (ఇంజనునుండి గుప్పుగుప్పున స్టీము ఉబుకునట్లు) వానిపవరు భోక్తలనరంధ్రములనుండి వెడలినది. సెగలుపొగలు అధికమైనకొలది వారికన్నులనుండి నీరు జొటజొటరాలినది. పురుషులు, అందును మహారాష్ట్రజాతియం దుద్భవించినవారు, మహావీరులు, ఆడువారివలె నేల బేలలగుచుండిరో నాకు తెల్లముకాలేదు, ఆశ్చర్యాన్వితుడనై "ఆస్తే, ఆస్తే, — ధీరేధీరేపాయియే ("మెల్ల మెల్లగా ఆరగింపుడు") అని నేనంటిని. "హం రోతే-రోతేక్యా—" "మేము ఏడుస్తూ ఏడుస్తూ ఏమి—") అని ఇక వారుమాటలాడజాలకపోయిరి. "అసలైన సరుకు, అనగా ఆవకాయ, గోంగూరపచ్చడి వగైరాలు సుదూర ఆంధ్రవసుంధరలోనే యున్నవి. ఈరీతి భోజనములందు అవి నిషేధములేయైనను, కొంత Concession కు చోటిచ్చివాని నెట్లయిన తెప్పించి వీరికి వడ్డించినయెడల చప్పున వీరు నా పితృదేవతలను చేరుకొనగలరు. హాహాకారాదుల మోల ఆంధ్రప్రజ్ఞను గణించి మహోపన్యాసము లీయగలరు. నేడు వీరు విలపించుచు ముద్దలు మ్రింగిననేమి? నా పితృదేవతలు కారణమున కలవడిన ఆంధ్రవీరులే కనుక, తమరుచికి సరిపడిన పదార్థములు లభించుచున్నవని భోక్తలేడ్చినకొలది తాము సంతసించుచునే యుందురు." అని యూహించుకొని ప్రకాశముగా నేమేమో పలికి వారిదుఃఖము నుపశమింపజేసితిని.

called 'Sruti' or the rhythm of the infinite heard by the soul. The words *drsti* and *sruti* which are the Vedic expressions point out how the Vedic Knowledge is not a matter of logical demonstration, but an intuitive insight The poet's soul hears or has revealed to it the truth in its inspired condition, when the mind is lifted above the narrow plane of the discursiveconscious ness. According to the Vedic seers the contents of the hymns are inspired and revelatory only in this sense'' (Vide: page 128 chapter on "Transition to the Upanishads'' RadhaKrishuan's celebrated work " Indian Philosophy," Volume 1.)

వేదవిజ్ఞాన మనంతమైనది. ఈ విజ్ఞానమహోదధిని మథించి క్రొంగ్రొత్తదగు భావామృతమును వెడలించు శక్తి మహామేధావులకే సాధ్యము. శంకర రామానుజాదు లిట్టివారు. కాలపథమున బహుశతాబ్దులు కడచుతఱి కొండొక మంగళముహూర్తమున వీరు జనించి, యుగమర్యాదకు సరిపడుపంథగుండా జనసమూహమును దోడ్కొనిపోదురు. స్వతంత్రగమనిక మహత్తరమైనదే! కాని విజ్ఞానముపై, ప్రజ్ఞపై, ప్రతిభపై నాధారపడిన స్వాతంత్ర్యమే సురుగంభీరమైన ఫలములను చేకూర్చును. విజ్ఞానరహితుని స్వాతంత్ర్యము విచ్చలవిడ వడిరైు, తీఱనికెలుపు దెచ్చిపెట్టును. సంస్కృతాక్షరము లెఱుగనివారు, తత్త్వశాస్త్రమును మందునకైన గాంచనివారు, మతమహత్త్వమున గ్రుంకులిడజాలనివారు, భౌతికశాస్త్రదృష్టితోడనే ఆధ్యాత్మికాంశములను గూడ పరికించువారలు వేదములను నిరసించి, అందుల్లేఖింపబడిన కర్మకలాపమును గర్హించి, ఆధునిక దృష్టియందైనను అందలి గభీరతత్త్వార్థమును గననేరక, హిందువులమని తెలుపుకొనుచున్నను, హిందూధర్మ విరుద్ధముగ జీవనములు గడపుచు, స్వతంత్రపథమున నగ్రసరుల మగుచుంటిమని యెంచువారు తమ జీవనరంగముల నిట్టిచెఱుపునకు క్రీడాంగణములను గావించుకొందురు. వీరిగణమందు చేరుటకంటె, తెలియరాని భౌతికమైన రుజువుల కందరాని ఆధ్యాత్మిక విషయములకు దూరస్థులమై సంశయాత్ములమై మానసిక యాతనము నందుటకంటె, విశ్వాసము నాధారము జేసికొని, విహితకార్యము లొనరించి, * ధర్మపథమున పదస్ఖలనమెఱుగక చరించుచు ఆత్మశాంతి నందుట మేలుకాదా?

ఆత్మ మృత్యువు నెఱుగదని ప్రధాన మతములన్నియు నంగీకరించుచున్నవి. ఒకశరీరము చప్పినను తనకర్మను నెఱపుకొనుటకై ఆత్మ మఱొండుకాయమున ప్రవేశించునని శాంతిదేవి కథనమున కన్గొంటిని. ఈ ప్రత్యక్ష దృష్టాంతమందలి మహత్త్వమును లోకమునకు దెలిపితిని. ఒక యగారమునుండి వేఱొక యగారమున ప్రవేశించు తెఱగున నొక భవమునుండి మఱొకజన్మమున జొచ్చి కాలక్రమమున కర్మబంధమును త్రెంచుకొని ఆత్మ ముక్తినందును. చినిగిన వలువలు వదలి మానవుడు నూతనాంబరముల నెట్లు దాల్చునో, జీర్ణదేహములను వీడి ఆత్మ నూతన శరీరములను గ్రహించుచున్నదని కదా భగవద్గీత తెలుపుచున్నది:

> "వాసాంసి జీర్ణాని యథా విహాయ
> నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
> తథా శరీరాణి విహాయ జీర్ణా
> న్యన్యాని సంయాతి నవాని దేహీ."

నాయమ్మయాత్మ అమృతజీవి. ఈ యమృతజీవి నారాధించినపుడు హృదయమున కెంతో సాంత్వనము, ఎంతో పరితోషము చేకుఱును. భావము కైదీయై యుండజాలదు. ఆత్మప్రకాశమందే అది యానందమునందును. అందును, ప్రేమభావము అద్భుతశక్తిగలది. విశ్వసృష్టియందాత్మప్రకాశము గావించుకొని జగదీశుడు కులుకునట్లు దీని వ్యక్తీకరణమున మనుష్యహృదయము సంతసమందును. ఆరాధన మిట్టి వ్యక్తీకరణమే!

---

* "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ, జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి."—శ్రీ భగవద్గీత.

అమ్మకును, అయ్యకును జోహారనలేనివాడు, అర్ధాంగి నాత్మహృది జేర్చుకొనలేనివాడు, తోడిమానవులయెడల సద్భావము జూపజాలనివాడు, సౌందర్యమునకు ప్రణమిల్లలేనివాడు ఇట్టియానందమునకు బహుయోజనముల దూరమున నుండును. ఈతనిజీవనమే ఈతనిగోరీయై యుండును; ఇందే ఈత డడగిమడగియుండును; పురుగులట్లు దుశ్చింత లీతని బీడించి పీడించి, తుదకు తమ పొట్ట బెట్టికొనును.

నాయమ్మ పసితనమందే నన్నుబాయక, నేడును నాప్రోలనుండిన, సచ్చిదానందములు నాజీవనాంగణమున పాడియావులై యుండెడివి.

నిభృతమున హృదయమును విప్పి "అమ్మా!" యని ఆతురపాటున కంఠమెత్తి పిలచినపుడు గుండెనుండి దుఃఖపూరము పొంగిపొరలును. కరుణామయికై ఆక్రందనమొనరించినపుడు అంతరంగమందలియాతనము పంజరమునుండి విడివడినపిట్టవలె అంతర్ధానమగును. కనిపెంచిన ఆనందమయి, ఇంచుకకనలిన సంతప్తహృదయయై, ఇంచుకసంతసించిన పరమానందభరితయై నెగులు చూచి పొగిలి వేయివిధముల దల్లడిల్లి వేయినెరసులను క్రీగంటనైన పరికింపక నిరంతరప్రేమదానమున ననంతానంద మందుచు, ఆటలందును పాటలందును పాఠములు గఱపుచు, నినుగునకు నెట్టులైన మోదమును, శాంతమును గూర్చుటకై ఆత్మార్పణ మొనరింప నాతురంపడు కన్నతల్లి చిఱుతప్రాయమందే కఱవైనపుడు, వడగండ్లవలె పైబడు కడగండ్లకు గొడుగైనయెడద అకాలమున నెందో యెగసిపోయినపుడు, అంధకారమందును, పరసీమయందును, ఘోరాతపమందును దురంత దుర్దాంతబాధల నోర్వజాలక దగ్ధహృదయ యెదను చేతబట్టి కనుగాయ "అమ్మా! అమ్మా!! పలుకవేమి?" అని యఱచినపుడు, రెక్కలు కట్టుకొనియైన వచ్చి అక్కున జేర్చుకొననెంచు తల్లిప్రాణమును మృత్యువు తనపిడికిట నొక్కపట్టినపుడు గుండె గుండయై నేలరాలదా? అమ్మఅయ్యల ఆత్మలు తీర్థస్థానములందు పక్షిదంపతులై తానమాడుచుంట గాంచి ఆంతరంగిక సాంత్వనము నందవలెనని యెంచి పసితనమున నొంటరినై పరిభ్రమణము మొదలిడి తొలుత వారణాసి పోతిని. నాటి నామాటల కాదరపూర్వకముగ వీనులొగ్గి, నా యుద్దేశమును గ్రహించి, అది సిద్ధించుటకై తోడ్పడిన శ్రీ చల్లా సుబ్బారావుగారు నేడును సుఖులై యున్నారు. కన్నవారియాత్మల నావాహన మొనరించుకొని మహాక్షేత్రములందు వాని నాత్మహృది గాంచి, లోనియలజడి నపనయించుకొని చిత్తశాంతినందుటకై యే నేను తీర్థవిధులను పెట్టుచుందును. ఈ విశ్వాస బీజమును చిఱుతప్రాయమున నా హృదయమున నెవరు నాటిరో నే నెఱుగను. ఇది తొలుతటి పుట్టువులోని పంటగింజయేమో! ఈ బీజమును చితుకకొట్టదలపడు ఆంగ్లవిద్య నాకు తప్పనిదైనను, దీనిని తాకనీయక దాని ధాటిని హద్దులో నుంచుటకై యత్నించుచునే యుందును.

బాల్యావస్థ కడచినంతన, అమ్మ నుద్దేశించి వెడలిన ఆర్తనాదము ఆంతరంగిక సాంత్వన మొసగుటకు కారణ మది భావగర్భిత మైనదగుట యని స్ఫురింతుము. ఈ దీనారవమును పంథగావించుకొని అందుండి అమ్మయాశీస్సు గాంగనిర్ఝరమట్లు హృదయమున స్రవించి అందలి యగ్నికుండమును చల్లార్చును. అమ్మకై పొగులగలశక్తి అంతరంగమున నెగ గంటనంతదనుక, ప్రణయప్రసన్నతకై, భావోన్నతికై తల్లడిల్లజాలు సామర్థ్యము హృదయమున మడియనంతవఱకు ఎన్నియిక్కట్టులు తలపైబడినను, గోళీలట్లు పిడుగు లెన్ని తలపై డుల్లిపడినను మానవుడు నిట్టూర్పులు వీడనక్కఱలేదని నొక్కిచెప్పెదను.

కాని, మానవమానస మనవరతము బేలయై యుండదు. వ్యక్తీకరింపదగు ముహూర్త మాసన్న మగునంతవఱకు భావోద్వేగము నది నిలిపియుంచగలదు. అద్భుతమగు మానసికశక్తి నలవఱుచుకొనినవానికే ఇట్టి సంయమ సామర్థ్యము సాధ్యమగును. మేఘగర్భమున నెన్నో నెలలు తడసియుండి, అందు పెరిగి పెంపొంది మృగశిర ప్రవేశసమయమున కువలయమున లంఘించు వారిధారయే చల్లనై, అవిరళమై, ఆనందగీతిక నాలాపించుచు శ్యామలసస్యములకు, పైడిపైరులకు కన్నతల్లి

యగులీల, ఐహుబుతువులు కడచువఅరు లతాహృదయ మున తడసియుండి, వసంతసమయము పొడసూపినంతన కుట్మలములందును, కుసుమములందును, లలితములైన చిగుళ్లందును శృంగారమున రంగారియుండు పండ్ల యందును నాత్మప్రకాశమొనరించుకొను సౌందర్యము చందమున, జననిగర్భమున తొమ్మిదినెలలు తడసి, తడయుకటి వృద్ధినంది తల్లియొక్క శారీరక, మానసిక, ఆధ్యాత్మిక గుణములను తనవి గావించు కొని యుదయించు శిశువు సర్వాంగ లావణ్యమున రాజిలుచొప్పన, నిశియంతయు నెంతో తపసుచేసి శక్తి సంచిత మొనరించుకొని పదంపడి అద్భుత ప్రభలను పృథ్విపై పుత్తెంచు రవిచాడ్పున, కృష్ణపక్షమున నిభృతతపసు గావించి పిదప నాత్మవ్యక్తీకరణ మొనరించుకొను సుధాంశువు వెన్నెలవానయందు తన ప్రతిభను గాంచి మురియుకైవడి మానసప్రసూతిగృహ మున నీశ్వరసంపర్కముకతన నుదయించిన- భావడింభకము కొంతసమయము తడసి మనన నిదిధ్యాసనముల పరిచర్యవలన పెరిగి పెంపొంది ఉచితకాలమున, మంగళ ముహూర్తమున నవ్వలియవని నాత్మప్రకాశ మందెనేని మన్మథునివలె (అతనుడు జగదీశునిబిడ్డయేకాడా?) సౌందర్యసందీప్తమై యుండును.

సహాసంయమములందును, నిభృతని స్తబ్ధతలందును, మానశాంతములందును, ఏకాగ్రదృష్టిధ్యానములందుడు పూర్ణవృద్ధి నందిన ప్రతిభ పూర్ణప్రకాశమునే కాంక్షించును. తడసి, తనుముహూర్తమున నాత్మవ్యక్తీకరణము గావించుకొనినపుడే తనజన్మ సార్థకమైనదని ఇది మురియును. సముచితవ్యక్తీకరణావకాశమును, తనను గుఱుతించుకన్నులను గానక ప్రతిఘటించు ప్రతికూలపరిస్థితులు ప్రత్యక్షమగుట వీక్షించినచో ప్రతిభపడు బాధ దురంతమై, దుస్సహమై యుండును. రవి సుధాంశువులును, పూవుపండ్లును ఆత్మప్రకాశము నెఱుగజాలవేని తమకన్నీళ్లచే ముల్లోకములను ముంచివేయును. విశ్వసృష్టియం దాత్మవ్యక్తీకరణ మొనరించుకొనని నాడు జగదీశుడందు పరితాపము అనిర్వాచ్యమై యుండును.

మనుష్యాంతరంగమున ప్రతిభ కడపు జీవనమును పరిశీలించితిమేని అది విశేషముగ వేదనముతోను, పరిశ్రమతోను నిండినదనియే గ్రహింతుము. ఈ యాంతరంగిక యాతనము నందు శక్తి మనుష్యలోకమున నే కొలదిమందికోకాని యుండదు. రక్తపూరముపోలు కాంతియందే బంగారువన్నెగల బాలభాను డుదయించులీల, అంగలార్చు చైతన్యాని కన్నీటియందే ముద్దుకృష్ణుడు మురళివాయించుచు ప్రత్యక్షమగుచాడ్పున హృదయఖేదమందే పండువంటి ప్రతిభ యుద్భవించును. ప్రతివ్యక్తియు ప్రతిభావంతు డేలకానేరడో చదువరులు గ్రహించియే యుందురు. కూడుగుడ్డలే బ్రదుకని యెంచువారి సంఖ్యయే పెద్దది. అశనవసనముల నంది, భోగభాగ్యములు పడసి సంతసమంది, సుఖముగాంచి వీనియందే వీరు చత్తురు.

---

# తప్పటడుగులు

వెంపటి నాగభూషణం

అ

ఘ

తే...

ఎందుకూ...ఇంతకోపం?'

'ఎవరికి...'

'మరెవరికి...?'

'పంతమా?'

'ఏమో......'

'బాగానేఉంది. ఏంవగలుపోతారండీ!'

'కాదే...'

'అదిగో, ఆమాటే అనవద్దు అన్నది. ఎన్నిసారులు చెప్పాను? ఒసే...ఏమే... ఓయ్... ఓహో... ఆఁ... ఎవరక్కడ... ఇదిగో—ఎందుకు ఈ వెర్రివేషాలు? భార్యను మర్యాదగా పిలవడమనేది తెలియనేతెలియదా? ఇక, ఈలాటి ఛాందసపు సంబోధనలు మానేయకపోతే, నేను మీతో సావాసం కొట్టివేయాలిసి వస్తుంది....'

'మరి...ఏమనమంటావు?'

'వేరేచెప్పాలా?ఏం...పేరుపెట్టిపిలవడం చేతకాదా? ఓ వేళ,మీశాస్త్రులు అలా ఒప్పుకోవంటే...పోనీ, చప్పట్లు కొట్టండి! కాదంటారా, ఎదురుగుండా కనబడుతూ నేఉంటాను కాదూ...ఇంకా పిలుపు ఎందుకు?...ఊళ్లో అందరికీ తెలియాలా...మీ ఘనకార్యం?

'నీకవిత్వం......'

'అయ్యో, మీరు ఉన్నచోటికి ఆమడదూరంలో ఎటుచూసినా...ఆధోరణి కనబడటమే! "దూరాత్ సంకుచితైవ గచ్ఛతి యథా చణ్డాలతశ్శ్వాఖద్దసాత్"— అని చెప్పారుట, నిజమేనా?'

—పాపం ... మానవుడు చిన్నబుచ్చుకుని...మొగం యింతచేసుకుని ... కిక్కురుమనకుండా ఊరుకున్నాడు.

అంతా, అపసవ్యముగానే ఉన్నది—వైదికారణ్యంలో సింహావిక్రమం చలాయించడానికి నడుముకట్టుకున్న సనాతనమూర్తికి... ఏరికోరి, చుక్కకన్నెలతో పంతాలువేసుకుని వాదులాడుతూ మురిసిపోయే వయ్యారి...ఇల్లాలు కావడం...

పొత్తు, ఇక ఏలా కుదురుతుంది...?

'ఏం...మాటాడరేం? మీదగ్గరఉన్న ఇదే అంత! జవాబుచెప్పకుండా...మూగనోము ముత్తైదువులాగ కూర్చుంటే...ఊరుకుంటా ననుకున్నారా ఏం? ఇదిగో... వస్తున్నా ముట్టుకోడానికి...'

'ఉండు, నీపుణ్యమాయెను! ఇంకా.. అర్ఘ్యవిధికాలేదు...మైలపడేయమాక...'

'పడితే...మళ్లా ఓమారు స్నానం...'

'నేను...చేయలేను'

'చేయలేక తీపెల్లిందేం? ముక్కుపట్టుకు కూర్చుంటే కూర్చున్నారు కాని...ముసలితనం అభినయించమోకండి...వళ్లు మండుకు వస్తుంది!'

—చంద్రకళలో...సూర్య కాంతుల జీరలు మెరసిపోయినవి. కాని, ఆ మనోహర రామణీయకాన్ని...ఆనందాంకితము చేసుకుని లోబరచుకునే రసికమర్యాద...శివావధానిలో కనబడలేదు. ఆ అమ్మాయి మీద మీదకు రాబోతూన్న కొద్దీ...అతడు, చిత్రాసనం మీద కుదించుకు పోవడం మొదలుపెట్టాడు.

'ముద్దొస్తున్నారండి...!'—అని, గిలిగింతగా పలుకరించి హేళన చేయబోయింది-మనసు మార్చుకుని...జోహార్ అంటాడేమోనని.



"ఉండు, నీపుణ్యమాయెను! ఇంకా... అర్ఘ్యవిధి కాలేదు...మైలపడేయమాక..."

'...నోచ్ఛిష్ట మధరం కురు...'- అని, నవ్వుతూ గీర్వాణం వెలిగించబోయినాడు! ఆమె, బెదరిపోయిన దానిలాగా...ఎత్తిన పాదం నేలను మోపకుండా-

'మరి, చెవి కసుక్కు మనిపించాలా ఏం? ఈ మాత్రం సంస్కృతం నేర్పకుండా... నన్ను మీ యింటికి పంపలేదు మా వాళ్లు. తలతిక్క వేషాలు వేయమోకండి...'

'ఏం ... మాటలు మరీ పెరిగిపోతున్నాయ్?'

'వాటికికూడా... మొగం వాయవలసి వస్తే...సరే, కానీయండి!'

- సరే, కానీయండి! ...ఈ ముక్కలతో వాళ్ల ప్రణయజీవనపు దోహదోపచారములు...కట్టుబడిపోయినవి. అన్న మాటలో అంత అర్థములేదు. కాని, చంద్రకళ...అవధాని సాన్నిధ్యానికి అంతటితో స్వస్తి చెప్పింది....

కోపంతో... నిస్పృహతో... ఆమె యిల్లువదలి బయటకు వచ్చేసింది. అవధాని మీద ఆమెకు ఆగ్రహంలేదు. అసలు... ఆతని తలపే లేదు!

రోజ్లు పగలకపోయినా...రోహిణిలోగా ఎండ మండిపోవడం మొదలుపెట్టింది. కపాలం చుర్రుమన్నది. దానికితోడు, లోపల ఉక్రోశం...రోషం....

తల్లిదండ్రులు...తనకు ఎందుకు ఇలా అన్యాయం చేయాలి? చక్కగా చదువూ అదీ చెప్పించి...చక్కని చూపులతో లోకం లోని అందం గమనించి...అనుభవించాలనే కోరికల మెలకువలు తెలియజెప్పే ఉపజ్ఞ అలవరించి...చివరకు, ఎందుకూ నోచుకోనని ఈ అరసికునికి...ఎందుకు అంటగట్టాలి?...కన్నవారు చేయవలసిన వంచన యేనా...ఇది?

ఎన్నివిధాల ఆతనిమనస్సు మెప్పించాలని...ఎన్నిమారులు ప్రయత్నంచేసింది? ఎంత వలచింది...ఉవ్విళ్లూరింది! కాని, కఠిన మనసు...ఏలా కరుగుతుంది...?

అది, ఆయనలోపము కాదేమో ... ప్రకృతే అంతేనేమో? ఉహుఁ...ఏమీ తెలియని పసిపాపా? అంత, భార్యకు దూరంగా మడిలో...జీవితమంతా గడపదలచినవాడు ... పెళ్లి చేసుకోకుండా ఉండలేకపోయినాడా? పోనీ.. పొరబాటున...ఏగ్రహచారవశాన్నో చేసుకున్నా ...కాపురములేని ఈ కాపురము చేయడానికి...తగుదునమ్మా అని ఎందుకు తయారుకావాలీ...?

...ఎదుటివారిచేత వ్రేలు వంపించుకోకుండా...లక్షణంగా కాపురంచేసి ఉభయ కులాలకు ప్రతిష్ఠ తీసుకురమ్మని...దీవెనలిచ్చి సాగనంపారు పుట్టింటినుంచి...పెద్దముత్తైదువు లందరూను! కలకాలం, తలవంచుకుని... లోపల కుమిలిపోతూ...శుష్కజీవనం గడపడంకన్న...వంచిన వ్రేళ్లు అంచెలుగా ఆవేశపదానికి ఎగిసిపోయి...తరువాత ఏమైపోతే మాత్రం...విచారం ఏమున్నదీ...?

—ఆలోచనలు...ఇలా దోవా తెన్నూ లేకుండా సాగిపోయినవి...నిలుచున్న చోటనే. కాని, ఆ రసికాపతంసికి...అనుభవించడం ఏలాగో, ఏలా ఉపక్రమించాలో...తెలిస్తే కాదూ...?

తూలుతూ...వాడిపోతూన్న పూతీగె లాగా...తిరిగి మెట్లు ఎక్కి...తలుపుతోసుకుని, సద్దుచేయకుండా యింట్లోకి వచ్చి... 'దేవతార్చన గృహంలో'కి తొంగిచూసింది-

శివావధాని,పరమశివ-నిశ్చలదీక్షలో... బాహ్యదృష్టి పూర్ణంగా ఉపసంహరించేసి... చలనం లేకుండా కూర్చుని ఉన్నాడు!

—చూసి, శోకం పొరలివచ్చి...గదిలోకి పరుగెత్తుకుని వెళ్లి...క్రింద పడిపోయి, చాలాసేపు వెక్కి వెక్కి రోదనంచేసింది...

అవధాని బయట మెసులుతూనే ఉన్నాడు. పెద్దగా సూక్తములు పఠిస్తూనేఉన్నాడు. కాని, ఆ అమ్మాయి ఉన్న గది చాయలకైనా పోలేదు! కొంత సేపటికి మాత్రం— 'ఇంకా మడికట్టుకోలేదేం...ప్రొద్దెక్కడము లేదూ ?'-అని పొలికేక పెట్టాడు.

చంద్రకళకు వెర్రి ఎత్తుకు వచ్చి... ఆవేశంతో...మంచం కోడును ఫెడేలున తన్నింది. వంట చేయాలి!...అందుకోసం, ఆవేళకు తన అజ వచ్చింది ఆతనికి! ఏంచేస్తే పాపం ఉన్నది ? అయినా...కసి తీర్చుకునేందుకు ఆ ముచ్చటకూడా చెల్లించడం మంచిది...ఇక శేపటినుంచీ...

లేచి, పసుపు రాచుకుని స్నానంచేసి... వంటచేసి భోజనం పెట్టింది-అవధానికి. ఆసమయాన...నిత్యమౌనమే ఆతనివ్రతముకాబట్టి ఉభయులూ పలుకరించుకోవలసిన అవసరం కలుగలేదు. భోజనానంతరం...పగటిపూట తాంబూలచర్వణం చేయని నైష్ఠికుడికి... భార్యను పిలువవలసిన అగత్యం ఏమి ఉన్నది....?

లాంఛనానికి...ఎంగిలిపడిలేచింది, చంద్రకళ. శేషించిన పనులన్నీ తీర్చి...ఎక్కడివక్కడ అమర్చి...వీథితలుపు దగ్గరగాలాగి, బయలుదేరింది—ఎక్కడికో! అవధాని, అప్పటికప్పుడే...చేయితడి ఆరకుండానే... భాష్యశ్రవణమునకు వెళ్లిపోయినాడు....

నడచిపోతూన్నది ... మల్లుతూన్న ఎండలో. దుమ్ముకొట్టుకోకుండా...రోడ్డుకు కొంచెంపక్కగా...అలా...ఎన్నో ఆలోచనలతో, ఊహాలమీద ఊహాలతో...తేలిపోతూన్నది.

—కారు...విసురుగా ముందుకువెళ్లిపోయి...బ్రేకుల బలవంతంమీాద ఆగింది. డ్రైవరుసీటులోంచి...ఒకవయసుమళ్లిన పెద్దమనిషి...ఈ వంటరికత్తెను... ఆశ్చర్యంతో నిదానించి చూస్తున్నాడు. చూ...స్తూ...న్నా...డు!

ఆవాహనమునుగానివ్యక్తినిగాని అంతగా గమనించకుండానే...పరధ్యానంలో నడచిపోతూ...సమీాపించింది, చంద్రకళ.

'ఎక్కడికి...?'

—గరిమీసాల గుబురులోనుంచి... అదిరిపడేటట్టుగా పలుకరించి, పిలిచాడు అతడు. ఆ అమ్మాయి వినిపించుకోలేదు.

హారన్...గబగబా మ్రోగింది. కొంచెం ముందుకు వెళ్లినదల్లా, బెదిరి...తప్పుకొనేలాగ...ఓరగా వెనుదిరిగి చూసింది.

'ఎక్కడికి...ఒంటరిగా...?'— అంటూ రెట్టించాడు. ఎక్కడికో...ఆమెకు మాత్రం ఏమి తెలుసును? తాను ఎక్కడికో... ఆ రోడ్డు ఎక్కడికి వెళుతుందో...ఏమీ సమాధానం చెప్పలేకపోయింది. మళ్లీ, చెప్పకపోవడం బాగుండదేమో పెద్ద మనిషి అడుగుతూన్నప్పుడు...అని - 'ఇక్కడికే...మా ఊరు...'-అంటూ, తుదీ మొదలూ అందకుండా...జవాబిచ్చింది.

'నేనూ అటే పోతున్నాను. దించేస్తాను ...రా అమ్మా...ఫరవాలేదు...'- బలవంతంచేసి, కారు ఎక్కించి తన సరసనుకూర్చొపెట్టుకున్నాడు.

సాగిపోతూన్నది...శరవేగంతో. అతను మధ్య మధ్య ఎన్నో ప్రశ్నలు వేశాడు. దేనికీ ప్రత్యుత్తరమీయలేదు...చంద్రకళ. ఒకటే పరాకు. ఒకమారు మాత్రం... అతని మోచేయి తనకు తగిలినట్లు తోచి...ఉలికిపడి ప్రక్కకు ఒదిగింది.

...ఎంతసేపు ప్రయాణంచేశారో... చల్లని వెన్నెలలో...హాయిగా...మీదనుంచి



"మనిషి...ఈ వంటరికత్తెను...ఆశ్చర్యంతో నిదానించి చూస్తున్నాడు. చూ...స్తూ...న్నా...డు!"



4. 10 ౧౮౩

తేలిపోతూన్న గాలిలో...మనసు మరచి పోయి...చెప్పలేనిపారవశ్యం అనుభవించిది.

'కొండపల్లి ... వచ్చాం ... '— అని ఆయన హెచ్చరించాడు. అంతటితో... చంద్రకళకు మెలకువ వచ్చింది. ఎక్కడనైతే నేం...అసలు గమ్యస్థానమే లేనప్పుడు... ఇక దిగిపోవడం మంచిది అనుకుని—

'నేను...దిగుతాను...'...అన్నది.

ఆపెద్దమనిషి ... ముఖంలో ఒక వింత వెలుగును సృష్టించుకుంటూ...కొంచెం చను వుగా—

'మీాయిల్లు...ఎక్కడ?'...అని, దగ్గరకు జరిగి...అడిగాడు. జవాబులేదు. మాటాడు తుందేమోనని ఒకనిమిషం ప్రతీక్షించి... ఆయన, ఆపిన కారును పోనిచ్చి...మెలికల కొండదారులగుండా తిప్పి తీసుకువెళ్లి...ఒక బంగళాదగ్గర ఆపి, దిగి...గేటు తెరిచి... కారు లోపల ప్రవేశపెట్టి,ఇంజన్ ఆపికేసి...

'దిగు...'-అని కొంచెం గదమాయిం పుతో...అన్నాడు.

చంద్రకళకు ... ఒకమాదిరిగా ... తల దిమ్మ మనిపోయింది. ఏమిటి తాను చేసిన పని?...ఎవరాయన?...అక్కడకువచ్చింది ఎందుకు?...ఏమి కానున్నది?...ఇక...

భయంతోదిగి...కారుఆవలివైపున నిలు చుని...... 'నేను... తెలియక వచ్చాను. నన్ను...యింటిదగ్గర దింపండి, బెజవాడలో. ఏమో...నాకు మనసుచెడిపోయింది... '

ఇంకా...ఏమి చెపుదామనుకున్నదో, అమితభయంతో...ఏం చెపుతూన్నదో తెలి యకుండా....ఆతడు దగ్గరకు సాభిప్రా యంగా...రావడం పొడగట్టగానే హఠా త్తుగా స్మృతితప్పిపోయింది.

మధ్యమధ్య... స్మృతి వస్తూన్నా... కనులు తెరిపిన బడినపుడల్లా...పిడుగుపడిన ట్టుగా...మరీ నిలువునా... నీరై క్రుంగి పోయి నరకయాతనలో మునిగిపోతూన్నది. జరుగుతూన్న దుర్వృత్తం ఛాయారూపం లీలగా అవగతమైపోయినా... ఇంతవిపర్యయ మునకు సన్నద్ధురాలు ఎన్నడూ కాలేని అభి జాత్యం...ఆమెకు పరమశత్రువై...ప్రాణాను మొదలంట నరికివేసింది. ఎదురించి... తనను, తన సర్వస్వాన్ని రక్షించుకోవలసిన పరీక్షా సమయం...జీవితంలో...ఆజీవితంలో...ఇక ఎన్నడూ రాదు...అని తెలుసునుకాని,... ఏంచేయుగలదు...ఝంఝా ప్రళయంలో... ఒక లేతలతకూన?

ఒంటరిగా...అవశమై...ఆతడు కారు లోనుంచి దించేవ్యవధానం లేకుండానే..కుప్ప కూలిపోయింది...నిలువలేక.కారు,ఆతను... సాగిపోయినారు...గంభీరంగా...ఏమీా తెలి యనట్టుగా...

గంధగజ పాదోపహతమైన మృణాలిని కొన తంతువులతో...విరిసిన రేకలతో... ఇనకర స్పర్శభాగ్యా నంతరం మలగి... ప్రవాహంలో కలసిపోయే నిరీహయత్నంతో ... మనోబలంతో ...లేది ... తూలకుండా

నిలిచి...అనాలోకితముగా గుప్పెటలో ఇమిడి పోయిఉన్న పాపమూల్యాన్ని...కాలాహిని లాగా చీదరించుకుని విసిరివేసి ... తాను మొదట కారు ఎక్కిన చోటునుంచి...(ఆ పుణ్యాత్ముడు ఆ ఉపకారంమాత్రం చేసిపోయి నాడు)...ఇంటి ముఖమైంది.

ఇంత జరిగిన తరువాత...ఇక తల ఎత్తు కుని మళ్లా ఆయన ఎదుట తిరగాలని కాదు... కాపురము, ఏమీ ఎరుగనట్లు చేయాలనీ కాదు...

అవధానికి కనుపించకుండా...కడసారి ఒక్కసారి చూచి...!...

ఇంటికి వెళ్లింది. కాని, ఆ అభాగ్య రాలికి...విధి...ఆ రవంత జీవితావకాశము లోనూ...సుముఖుకయే యోగ్యత ... లభిం చకపోయింది

ఆమె...రౌరవ యాతన అనుభవించిన వెన్నెలవేళనే...కృష్ణాతటిని...శివావధానిని తరగమాలికలతో... స్వయంగ్రాహముచేసు కుని...రసికురాలైనది...!



క్రికెట్టు యోధుడు

S. S. S.

---

# కాకతీయ రాజు లెవరు?

## దుర్జయసంతతివారగు కమ్మ, వెలమ, రాచవారల పూర్వీకులా?

కొత్త భావయ్య చౌదరి

స్పష్టమైన శాసనాధారములను నమ్మి చరిత్రాధారములను నిశ్చయింపక ఏవో మాగమూలల గాథలను, అభిమానపాత్రల గ్రంథములను మాత్రమే నమ్మి చారిత్రక విషయములను పక్షపాతబుద్ధితో ప్రకటించు చరిత్రజ్ఞులీ కాలమున గలరు. కాకతీయు లెవ రను విషయమున నిట్టి వారి మాటలను దలయూపక, సహృదయులగు చరిత్రకారు లీక్రిందివిషయములను సావధానముగ జదివి కాకతీయులు నే డేవంశమువారి పూర్వీకులో నిర్ణయింతురుగాక!

(౧) కాకతీయులలో రెండవ ప్రోలరాజు వ్రాసిన ఖాజీపేట శాసనములో తనతండ్రి బేతరాజు దుర్జయకులాబ్ధిచంద్రుడని స్పష్టముగ వ్రాసియుండుట.

(౨) రెండవ బేతరాజు వ్రాసిన శాసనములో తనతాతయగు మొదటి బేతరాజు దుర్జయవంశీకు డనియే వ్రాయించుట.

(3) గణపతిదేవ చక్రవర్తి యాజ్ఞానుసారము వారిసేనానులలో ముఖ్యులగు ఇమ్మడిదేవ రడ్డీంద్రుడు వ్రాయించిన పాకాలశాసనములోను, సామన్తభోజుడు వ్రాయించిన కాంచీనగరములో ఏకామ్రనాధుని దేవాలయ శాసనములోను సూర్యవంశములోని దుర్జయునినుండియే కాకతీయవంశ ముత్పత్తియైనట్లు వ్రాయించుట.

(౪) గణపతిదేవ చక్రవర్తి మంత్రులలో నొకరగు గేవరాజుయొక్క ద్వితీయ పుత్రుడు తిక్కచమూపతి వ్రాయించిన గారపాడు శాసనములోగూడ (క్రీ. శ. ౧౨౬౦) గణపతిదేవునివంశము దుర్జయవంశ మనియే వ్రాయించుచు, నట్లప్పటిప్రజలు చెప్పకొనుచున్నారని గూడ వ్రాయించియుండుట.

దుర్జయు డేవంశస్థు డైనను పైవానినిబట్టి కాకతీయులు దుర్జయవంశీకులని యొప్పకొనక తీరదు.

౬, ౭ శతాబ్దములలోని బుద్ధవర్మాదులుగూడ దుర్జయసంతతివార మని చెప్పకున్నందున వారు కాకతీయుల పూర్వీకులేయైయుందురు. దుర్జయసంతతిలోని వీరు చతుర్థాన్వయులమన్నను, తర్వాతవారు కొందరు క్షత్రియులుగాను, మల్యాలగుండయవంటివారు మరల చతుర్థుల మనియు జెప్పకొన్నను మూలపురుషు డగు దుర్జయుడు మారలే దనవచ్చును. ఇక దుర్జయసంతతిలో నేయేప్రభువు లున్నదియు, వారి గోత్రములు, వారిసంబంధములను తెలిసికొందము.

(౧) గుడిమెట్టసీమలో పాలించిన సామ్రప్రభువులు తాము దుర్జయ కులజులమనియు మనుమకుల సంభూతులమనియు (అనగా సూర్యవంశజులమనియు) విప్పర్ల గోత్రజులమనియు వ్రాయించిరి (అనుమంచిపల్లె శాసనము, అనుబంధము II చూడుడు).

(౨) ప్రాచీనమైన గూడూరుశాసనములో విరియాలవారు దుర్జయవంశీకు లనియే వ్రాయబడెను. (అనుబంధము I చూడుడు.)

(3) విరియాలవారు వెలమవారిలో మాత్రమే యుండి విప్పర్లగోత్రీకులుగా నున్నారు.

(౪) కొండపడమటి సీమప్రభువైన బుద్ధరాజును, వానివంశీకులును తాము చతుర్థాభిజనులమనియు, దుర్జయవంశీకుల మనియు నాదెండ్ల, చేబ్రోలుశాసనములలో వ్రాయించిరి.

(౫) నతవాటిసీమప్రభువగు రుద్రరాజు చతుర్థాన్వయు డనియు, దుర్జయవంశస్థు డనియు త్రిపురాంతక శాసనమువల్ల తెలియుచున్నది. సూర్యవంశమర్యాదనను

సరించిరే కాకతీయులు ఈ దుర్జయసంతతిలోనే పరస్పరవివాహము లొనరించిరి. దీనికి తార్కాణములు;

(౧) గణపతిదేవచక్రవర్తిసోదరి మైలమ్మను పైన నుడివిన రుద్రరాజు వివాహమాడియుండుట;

(౨) రుద్రరాజుకుమార్తె బయ్యలదేవిని ధనంజయగోత్రీకు డగు ౩-వ కేతరాజు వివాహమాడుట;

(౩) గణపతిదేవచక్రవర్తి రెండవకుమార్తె గణపాంబ కోటకేతరాజుకుమారుడు రుద్రరాజును వివాహమాడుట;

(౪) గణపతిదేవచక్రవర్తి పిన్నచోడునికుమార్తెలగు నారాంబ, పేరాంబలను వివాహమాడుట. ఇట్లింకను గలవు.

కాకతీయులు చోడులతోను, దుర్జయవంశస్థులతోనుమాత్రమే సంబంధములొనర్చిరి. రుద్రమదేవికాలమునుండి చాళుక్యులతోగూడ చేసినట్లు కన్పడుచున్నది. చోడులు, చాళుక్యులునుగూడ సూర్యవంశములోనివాడనబడు కరికాలచోడుడు మున్నగువారి సంతతియగుటవల్లనే వారితోగూడ కాకతీయులు సంబంధములొనర్చినట్లు కన్పడును. కాకతీయుల పూర్వీకు డగు దుర్జయవంశములో బుద్ధవర్మాదు లెట్లు చతుర్థాన్వయులనిచెప్పుకొనిరో, చళుక్యవంశముగూడ మొదటచతుర్థవంశమనియు, వారిశౌర్యపాలనములవల్లనే క్షత్రియవంశమైనట్లు సూచించుచు కీర్తిశేషులగు కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు తమతుదివ్యాసములో వ్రాయించిరి. పైవిషయములు గమనించినకొలదిని కాకతీయ రాజులు తమ వంశీకులతోడను, తమతో తుల్యములగువంశములవారితోను సంబంధములొనర్చిరని తేలునుగాని తక్కువజాతిస్త్రీలను వివాహమాడినట్లు కన్పడదు. ఈ దుర్జయవంశము గూడూరిశాసనము నాటికే పెక్కువిధములుగా వృద్ధినొందెననుట స్పష్టము. ౯, ౧౦ శతాబ్దములనుండి వరుసగా వచ్చు నీవంశ మట్లు వృద్ధియైనదనుటలో నాశ్చర్యములేదు. గూడూరుశాసనములో వివరింపబడినవిధముగా నిప్పటి వెలమవారిలోని విరియాలవంశీకులపూర్వీకులలో నొక్కరగు కామమసాని కాకతీయవంశమును నిల్పెననుసూచనగూడ కాకతీయులు తనవంశస్థులగుటవల్లనే యట్లుచేసియుండునని ముఖ్యముగ గ్రహింపవలెను. ఇక దుర్జయవంశస్థులు నేడు కమ్మవారిలోను, వెలమవారిలోను, క్షత్రియులనబడువారిలోను ఉన్నారనుటకు ఈ క్రింది విషయములు గమనింపవలెను.

(౧) దుర్జయవంశములోని సాగివారే వత్సవాయవారుగా మారిరని ఏనుగ లక్ష్మణకవిరచితమైన రామవిలాసములో నుండుట.

(౨) దుర్జయవంశీకులమనియే యిప్పటి క్షత్రియులొప్పుకొనుచు వారివద్ద వరుసగా పెద్దవంశవృక్షము గూడ కలదని చెప్పుట. (భారతీసంపుటం ౧౦, సంచిక ౨ లో పండితపెనుమెచ్చ సత్యనారాయణ రాజుగారు వ్రాసిన వ్యాసము జదువుడు. పెద్దాపుర సంస్థాన చరిత్రముగూడ జూడుడు.)

(౩) దుర్జయవంశీకులమని చెప్పుకున్న సాగివారి శాసనములలో వారిగోత్ర మిప్పుడు కమ్మ, వెలమవారిలో గల విప్పర్లగోత్రమేయగుట (మన్మచాగి గణపతిరాజు అనుమంచిపల్లె శాసనము జదువుడు. అనుబంధము II.)

(౪) సాగివారిగోత్రము విప్పర్లయేయని సాగిబైచనపేరగల చాటూక్తులలోగూడ నుండుట.

(౫) దుర్జయవంశీకులని గూడూరుశాసనములో జెప్పబడిన (వెలమవారిలోని) విరియాలవారిదిగూడ విప్పర్ల గోత్రమే యగుట.

(౬) దుర్జయవంశీకులును, రుద్రమదేవికి తంత్రపాలురు, అంగరక్షకులుగానుండిన ప్రోలరౌతు, ఈతని కుమాళ్లు ఎక్కినాయడు, రుద్రినాయడు, పినరుద్రినాయడు, పోతినాయడు వీనికుమారులు మున్నగువారిది వలవుర్ల (యిప్పుడు వల్లుట్లగా నుచ్చారణలో మారినది.) గోత్రమని ౧౯౧౬ సం॥ ఎపిగ్రాఫికా రిపోర్టు ౧౩౫ పేజీనిబట్టి తెలియుట. ఈవల్లుట్లగోత్రీకు లిప్పుడు కమ్మవారిలో వాసిరెడ్డివారు మున్నగువా రుండుట.

(౭) సాగివారిలోని ముప్పరాజు, దోరపరాజు, రామరాజు మున్నగువారిపేర్లతోనే గాజోలు నేటికిని

కమ్మవారిలో ముప్పానేనివారు, దోరపనేనివారు, రామనేనివారు మున్నగు ఇంటిపేర్లవారుండుట.

(౮) సాగి గన్నమనాయుడు పేరిటనే గాబోలు గన్నమనేనివారు నేటికిని కమ్మవారిలోను, సాగి బైచన పేరున బైచరాజువారు క్షత్రియులలోను ఉండుట. బైచరాజు వెంకటనాథకవి యొకడు ౧౫,౧౬ శతాబ్దములలోనుండి పంచతంత్రము పద్యకావ్యమురచించెను. (శ్రీ వీరేశలింగంపంతులవారి కవులచరిత్ర రెండవభాగము జూడుడు.) ఈబైచరాజువారిప్పటికిని క్షత్రియులలో నున్నారో లేదో తెలియదు.

(౯) సాగివారిప్పటికిని క్షత్రియులలోను, కమ్మవారిలోను ఉండుట. (శ్రీ చి. వీరభద్రరావు పంతులు గారి కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము ౬౦ పేజీ చూడుడు.)

(౧౦) దుర్జయవంశస్థుడగు మల్యాల గుండయ దండనాథుడు నేడు కమ్మవారిలోగల మల్లెలవారి వంశములోనివాడని యూహింప నవకాశ ముండుట. పైకారణములే నేటి క్షత్రియులును, కమ్మవెలమవారును ఒకే దుర్జయవంశస్థులనుటకు చాలియున్నను, కమ్మ వెలమవారొకేజాతియనుటకు మఱికొన్ని నిదర్శనములు గూడ గలవు, చూడుడు.

(౧) ముమ్మలనేనివారు, మేకావారు, రేచెర్ల గోత్రీకులు, విప్పర్లగోత్రీకులు, చాగంటిగోత్రీకులు మున్నగువారు కమ్మవారిలోను, వెలమవారిలోను గలరు.

(౨) పల్నాటియుద్ధవీరులు వెలమలనిగదా సాధారణముగ జెప్పవది. వారిలో దొడ్డనాయని పేరిట దొడ్డపనేనివారు, బ్రహ్మనాయని పేరిట బొమ్మినేనివారు, సూర్నీడు పేరిట సూరనేనివారు, మల్లనీడు పేరిట మల్లినేనివారు, పేర్నీడు పేరిట పేరినేనివారు నేటికిని కమ్మవారిలో నుండుట. (గృహనామము లాశతాబ్దములోనే విరివిగా పెట్టబడెననుట వివాదాంశముగాదు.)

పైగూడూరు, అను మంచిపల్లెశాసనదృష్టాంతము లకు పైయూహలు సరిపడుచున్నవిగదా. ఇట్లెన్ని గలవో! ఇదిగాక మరియొక్కటి వినుడు.

దుర్జయవంశీకుడే యగు ప్రతాపరుద్రుని సహపంక్తిభోజనము వెలమవారేలకోరిరని ప్రశ్నించవచ్చును. ఇదిగూడ ముఖ్యమైనదియే. ఏకారణముచే వెలమ, కమ్మ క్షత్రియశాఖలు వేరుపడి, బంధుత్వములనుసైతము త్రెంపుకొనెనో, ఆకారణమే వెలమవారిచే తిరిగి ప్రతాపరుద్రుని సహపంక్తి నేర్పరుప గోరబడెనని నమ్మకతప్పదు. ఆ కారణ మీ క్రిందివిధముగా నూహింపవచ్చును. కేవల మిది యూహామాత్రమే గాక పల్నాటి చరిత్రమున నచ్చటచ్చట వివరించబడిన చాపకూడులు, వీరవైష్ణవ, శైవమతములను బట్టి గ్రహించవచ్చును.

దేశమున రగుల్కొనిన మహమ్మదీయయుద్ధములకుతోడు, జైన, బౌద్ధ, శైవ, వీరశైవ, వైష్ణవ, వీరవైష్ణవాది మతయుద్ధములు ప్రబలినప్పుడు మొదట జైనులుగా నున్న దుర్జయాన్వయులందరు (చాలవరకు) శైవమతములో జేరిరి. జైనులుగాను, శైవులుగాను ఉన్న కాలములో పరస్పరసంబంధ బాంధవ్యములుండెను. వీరశైవ, వీరవైష్ణవమతములు ప్రబలినకాలమందని దుర్జయకులములోని పలువంశీయులు కొందరొకమతమును, కొందరు వేరొకమతమును గైకొనియుందురు. ఆయా మతముల కట్టుబాట్లనుబట్టియే వారు తమ కులస్థులతో గూడ వేరుపడియుందురు. కమ్మవారినుండి వెలమవారు వేరగుటకు ముఖ్యముగ నిదియే కారణము. క్షత్రియులన బడు శాఖలవారు సాధారణశైవ, వైష్ణవ మతములలోనే యుండి గణపతిదేవరాజాదులనుండి నేర్చుకొన్న యుద్దేశ్యముల ననుసరించి తాము రాజులుగనే వ్యవహరించుటకు గట్టికృషిచేసియుండవచ్చును. ఈ కాలము తర్వాత నెప్పుడో వారు ఋషిగోత్రములు ధరించియుండవలెను. లేనియెడల దుర్జయవంశీకులలోని పూర్వీకులలో నెవ్వరికిని లేని ఋషిగోత్రములు వీరికి వచ్చుటకు గారణ మేమి? గుడిమెట్టసాగివారి వంశవృక్షము పూర్ణముగా తమవద్దనున్నట్లు కన్పరచిన "పెద్దాపురసంస్థాన చరిత్ర" గ్రంథకర్త దీనికేమనును? వారిగోత్రములు మారెననునా? లేక వారు గుడిమెట్టసాగివారు కాదనునా?

ఒకవేళ ఈ క్షత్రియులు ఆదినుండియు, నేయన్యమతములోనికి జొరకపోవుటచే వారిగోత్రములు

పారంపర్యముగా ఋషిగోత్రములుగా నున్నవని సమర్థింప వీలులేదు. దుర్జయవంశీయులైన బుద్ధవర్మాదులు ౬,౭ శతాబ్దములలో బౌద్ధమతస్థులుగనుండి యార్యమతమున జేరినట్లు తెలియుచున్నది. తర్వాత కాకతీయులపూర్వీకులు జైనమతస్థులని స్పష్టపడినది. వారిలోనే తర్వాత వచ్చినవారు శైవులగుట తటస్థించినది. క్రమక్రమముగా వీరవైష్ణవ, వీరశైవము లీజాతులలోతగ్గి, శైవ, వైష్ణవములే అమలునకువచ్చి ప్రతివంశములోను ఈ రెండును నిలబడియుండుటకు హేతువైనది. బుద్ధవర్మాదులు తాము చతుర్థుల మని వ్రాయుటకుగూడ కారణము బౌద్ధమతమునుండి యార్యమతమునకు జేరుటయే యనవలెను. కాకతీయులుగూడ మొదట చతుర్థులనుకొనుటకుగూడ జైనమతమునుండి నూతన శైవమతము గైకొనుట వల్లనేయని తెలియవలెను. ఏమతమునగాని నూతనప్రవేశమున కట్టియవ్యర్థతయే యుండుననుట సామాన్యము. క్షాత్రవంశీయులగు వీరు క్రమముగాను, పూర్వపుదుర్జయ రాజుననుసరించియు క్షత్రియవంశజుల మని వ్రాసుకొనుటలో దప్పులేదు. ఏకాలములోనైన నిట్లే వ్రాసుకొనిరని చరిత్రము దెలుపుచున్నది.

క్షత్రియులలో జందెములు ధరించుట మున్నగు పూర్వాచారములుండి, కమ్మ, వెలమవారలలో నవి యేల లేకుండెనని మీరు సంకోచించవచ్చును. పరమతములలో జేరినప్పుడీకులస్థులు వానిని తీసివేసియుండవచ్చును. మరల ధరించుటకు వారి కంతగా యిష్టములేక యుండవచ్చును. ఇది యిచ్ఛామాత్రమే జరిగియుండును. కమ్మ, వెలమవారివివాహములలోను, పితృకర్మలలోను జందెములిప్పటికిని ధరించుచునేయున్నారు కమ్మ, వెలమ, క్షత్రియజాతులను పొగడు భట్రాజులకు జందెములున్నవి గదా. ఆజందెములు గలవారే వీరందరియిండ్లలో నేటికిని భుజించుటయు, వారికి రాజశబ్దము వచ్చుటయుగూడ వీరి కట్టిచిగలవనుటకు దృష్టాంతము. కమ్మవారికి జందెములున్నవా లేవా యనువిషయ మత్యల్పము. కమ్మవారు జందెములువేసి, బ్రాహ్మణులై పోయిరనికూడ చాళుక్య రెండవ అమ్మరాజవిజయాదిత్యుని కురువాడశాసనము వల్లను, అయిదవ పశ్చిమచాళుక్య విక్రమాదిత్యుని ఆలూరుశాసనమువల్లను తెలియగలదు. (అనుబంధము IIII చూడుడు) ఆశాసనములలోని శ్లోకములకు బ్రాహ్మణులే కమ్మశబ్దముతో వ్యవహరించిరని యర్థమని కొందరు వాదింతురు. అది సమంజసము గాదు. ఏలన నాలూరు శాసనములో వ్రాయబడిన ధీతగోత్రము బ్రాహ్మణులలో లేదు. దైతాయను గ్రామమునుబట్టి యుత్పత్తియైనట్లు కన్పడు నీగోత్రజులు కమ్మవారేయనుటకు సందియము లేదు. కమ్మవారివి చాలవరకు గ్రామగోత్రములేయైయున్నవి. బ్రాహ్మణులలో నెప్పుడు నితరులు కలియలేదా యను ప్రశ్నకు తప్పక కలిసిరనియే చెప్పవలెను. పురాణములలో భార్గవుడు కొన్ని కులములవారిని కలిపెననునది యటుండనిచ్చి క్రీ. శ. ౬౭౩ సం॥లోని సర్వలోకాశ్రయుని శాసనములో బోయవాండ్లుగూడ బ్రాహ్మణులైరని వ్రాయబడినది. ఇట్లే కమ్మవారు బ్రాహ్మణులైరనియు, క్షత్రియులైరనియు వేరుగ చెప్ప నక్కరలేదు.

పర్యవసాన మేమన, నేటి క్షత్రియులును, కమ్మ వెలమవారును పూర్వమొకే దుర్జయమహారాజసంతతి యనియు, మతభేదములలో మునింగి వేరుపడిరనియు, నందుచే నిప్పుడొకరికన్న మరియొకరు కులమున హెచ్చు అని భ్రమించక గుణములచే ప్రకాశించెదరనియు దెలియగోరెదను. చరిత్రకారు లీ విషయములు గుర్తింపవలెను.

ఈ వ్యాసమును విమర్శించువారు నాకు వారి విమర్శనము బంపినయెడల జవాబిచ్చుటకు వీలుండదు.

(కొత్తభావయ్య చౌదరి, సంగం జాగర్లమూడి పోస్టు (గుంటూరు జిల్లా)

అనుబంధము I

గూడూరుశాసనభాగము.

అనుపమదుర్జయాన్వయను
ధాత్రి ననేకులు రాజనందనుల్
గనిన(బిఋుంద వెన్న(డును
సంభవు(డయ్యె నతిప్రసిద్ధు(డై
వినుతవిరోధిమండలికి వెన్నడు
వెన్నడవోలె వానికిన్

ఘనుఁడగు నెఱ్ఱిభూపతి జ
గద్వినుతుండుదయించె గీర్తితోన్.
భావితకీర్తినాతనికి
పాండవమధ్యమ భీముఁడోయనం
గా విరియాలభీమనృప
ఘనమ్మరుఁడై యుదయించెవానికిన్.

*   *   *   *

అరుదగునట్టి ఎఱ్ఱనృపునంగన గామమసాని యాకమే
ల్గరదరిబేతభూవిభుని గాకతివల్లభునేసి వానితా
బరగగ జేతబెట్టె ఘనుబల్లవిరాయనియాగిజొచ్చె భా
స్కరవిభుచక్రవర్తిగని, కాకతినిల్పుటగోటిసేయదే.

అనుబంధము II

ము. మన్మచాగిగణపతిరాజు అనుమంచిపల్లె శాసనభా
తత్రాస్తిబాహుజకులాభరణంతపోభి
ర్విప్పులవంశఇతివిప్రకరోపమానాత్.

Ins. no ౨౭3 of ౧౯౨౮

అనుబంధము III

అయిదవ పశ్చిమచాళుక్యవిక్రమాదిత్యుని ఆలూరు శాసనభాగము.

"విప్రకులకమలభాస్కరం పార్వరోల్గండం సప్త గ్రామాగ్రగణ్యాం, కమ్మకులోద్భవం, ధీతగోత్రం, దిండపండితపుత్రం చాత్రకమిత్రం పండితమండనం వెణ్ణియభట్టు"

(ఎపిగ్రాఫికా ఇండికా ౧౬ సంపుటము ౧ వ భాగము)

ఈ వ్యాసములోని గొన్నియంశములును, శాసనముల నకళ్లును బ్రహ్మశ్రీ చి. వీరభద్రరావుపంతులుగారి కాకతీయాంధ్రరాజయుగ చరిత్రమునుండియు, సూ. రాఘవయ్య చౌదరిగారి "వర్ణాశ్రమదర్పణము" నుండియు గ్రహింపబడినందున వారికి కృతజ్ఞుడను—కొ. భా.

---




శివభక్తమాహాత్మ్యమునందు కృషీవలోపాఖ్యానమున నొకానొకరంగము
(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్ర సంగ్రహమునుండి)

# స్వేచ్ఛ

బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం

నాలుగైదు నెలలక్రిందట ఒకనాడురాత్రి నా స్నేహితుడు శ్రీనివాసరావు ఎంతో హడావిడిగా వచ్చాడు నాగదికి. "నీతో చాలా అవసరంగా మాట్లాడాలి, రామం" అన్నాడు.

నాబల్లమీద కచ్చేరీకాగితాలకట్టలు మూడంతస్థుల మేడలాగ పడున్నాయి. అప్పుడే పైకట్టతీసి విప్పబోతున్నాను. ఈ రాత్రికూర్చుని ఈ కాగితాలన్నీ చక్కబెట్టుకోకపోతే నాగుమాస్తాఉద్యోగం కాస్తా ఊడుకుందేమో అన్నంతదురవస్థలో ఉన్నాను. 'అన్నీ బకాయిలే' అంటూ, నా పైఉద్యోగి నన్ను ముప్పతిప్పలూ పెట్టున్నాడు. ఇటువంటి సమయంలో పొద్దున్న మా మామగారిదగ్గరనుంచి తనకూతురికి పదహారేళ్లు నిండిపోయాయనీ, ఇంకా నేను పెళ్లాన్ని కాపురానికి తెచ్చుకోకపోవడం అంతతెలివైన పనికాదనీ ఒకచిన్న ఉత్తరం! పొగలంతా కచ్చేరీలో ఆ ఉత్తరం గురించే ఆలోచిస్తూ కూర్చున్నాను. సరే, రాత్రి కచ్చేరీ పని చేసుకుందామనుకునేసరికి శ్రీనివాసరావు సిద్ధం.

"ఏమిటి, శీనూ?"

"రామం, చాలాచెప్పాలి ...... తొందరసనా ఇదంతా?"

"ఇదా? తొందర పనే అని నేను జవాబుచెప్తే నువ్వు వెళ్లిపోతావా?"

"అంతకంటెకూడా నాపని ముఖ్యం, రామం... ఈ ఊళ్లో నాకు చాలామంది స్నేహితులే ఉన్నారు. కాని నీఒక్కడి దగ్గరకే రావాలని తోచింది నాకు."

"శీనూ, నాదగ్గర డబ్బులేదుసుమా. నువ్వు కిందటినెల పట్టుకువెళ్లిన పదిరూపాయిలూ ఇవ్వలేదింకా నాకు."

శ్రీనివాసరావు జేబులో చెయ్యిపెట్టేడు. ఆబదులుసంగతి జ్ఞాపకం చేసినందుకు నాకే సిగ్గేసింది. నాలుగురూపాయిలూ కొంతచిల్లరా పైకితీసి చూపించాడతను. "కావలిస్తే ఈడబ్బు తీసుకో, రామం. నే నిప్పుడు రావడం ఇంకా బదులు చెయ్యాలనికాదు. నాకు ఏమీ తోచడం లేదు. మతిపోయినట్టుంది. ఈ నిముషం నీ బల్లమీద తలవాల్చి ఏడ్చేస్థితిలో ఉన్నాను."

కాగితాలకట్ట మళ్లీ పక్కకి తోసేసేను.

"ఊరికా అన్నాను, శీనూ! తొందరలేదు. జేబులో పెట్టుకో. ఏమిటి జరిగింది?...అదేమిటి?... ఎందు కలా ఏడుస్తావు?...ఛా! ఛా!"......

ఇంతకుపూర్వం శ్రీనివాసరావు ఏడవడంచూసి పన్నెండేళ్లో పదమూడేళ్లో అయింది. మా ఇద్దరి చిన్నతనంలో పాఠశాలలో ఉపాధ్యాయుడొకడు పక్కవాడు చేసిన అల్లరి శ్రీనివాసరావే చేసేడనుకుని అతన్ని బల్లమీద నుంచోమన్నాడు. త నాఅల్లరి చెయ్యలేదన్న మాట చెప్పక బల్లమీద ఆగంటంతా ఏడుస్తూనే నుంచున్నాడు శ్రీనివాసరావు. నిజంగా అల్లరిచేసిన కుర్రాడు నవ్వుతూ పక్కని కూర్చున్నాడు......

కాసేపయాక శ్రీనివాసరావు తలఎత్తి జేబురుమాలుతో కళ్లుతుడుచుకున్నాడు.

"ఏడిస్తే ఎలా, శీనూ? ఏమిటి జరిగిందో చెప్పు."

అప్పుడు సర్దుకుని, నావైపు చూడడానికి సిగ్గుపడి గోడవైపు పరధ్యాన్నంగా చూస్తున్నవాడిలా చూస్తూ చెప్పేడు:

"కామేశ్వరి నన్ను వదలి వెళ్లిపోయింది."

"ఎప్పుడు?"

"సాయంత్రం నే నింట్లో లేనప్పుడు."

"ఆవిడ నీకేదైనా ఉత్తరం వ్రాసి ఇంట్లో ఉంచారా?"

"లేదు."

"ఎక్కడికి వెళ్లేరో, ఎవరితో వెళ్లేరో నీ కేమీ తెలియదన్నమాట?"

"ఎక్కడికి వెళ్లిందో తెలియదు. ఎవరితో వెళ్లిందో తెలుసును."

"ఎవరితో?"

"రమణయ్యతో."

"ఎవరుచెప్పేరు నీకు?"

"మా నౌకరు వెంకటసామి...వాళ్లిద్దరూ కలిసి వెళ్లేరట. వెళ్తూ కామేశ్వరి నౌకరుతో నేను ఇంటికి వచ్చేవరకూ ఇల్లు కాపలాకాస్తూ కూర్చోమందట."

"మళ్లీ రాకుండా ఉండే ఉద్దేశ్యంమీద వెళ్లినట్లు నిర్ధారణ ఏమిటి?"

"నిన్నరాత్రి పోట్లాడుకున్నాం. ఇరవై నాలుగు గంటలలో నా ఇల్లువిడిచి పోతున్నానంది. నా భయాలన్నీ అందువల్ల ...... ఎంత సేపట్లో తను ఇంటికి వచ్చెయ్యదలచుకున్నదీ నా నౌకరుతో చెప్పలేదు. తొమ్మిది గంటలవరకూ వస్తుందేమోనని చూసి ఆఖరికి ఇలావచ్చాను."

"ఆవిడ బట్టలు కాని, సామాన్లుకాని ఏమీ తీసుకు వెళ్లిపోలేదుకాదూ?"

"తీసుకువెళ్లలే దనుకుంటాను. తన తాళాలు మట్టుకు ఇంట్లో లేవు."

"అంత బెంగ పెట్టుకోవలసిన కారణం లేదనుకుంటాను, శీనూ."

"ఎన్నడూ ఇలాజరగలేదు. ఇదే మొదలు."

"రమణయ్యగది నీకు తెలుసునుకాదూ?"

"తెలుసును."

"అత నీమధ్య గదిమార్చేడని విన్నానులే."

"అవును."

"కనుక్కునేందుకు అక్కడకి ముందు వెళ్లలేదేమీ నువ్వు?"

ఆప్రశ్నకి సిగ్గుపడుతూ నాకేసి చూసేడు.

"ఏముఖం పెట్టుకొని వెళ్లను, రామం, నేను?"

"నన్ను వెళ్లి కనుక్కోమంటావా?"

"నీ ఇష్టం."

"అతనిగదెక్కడ?"

"దేవాలయం వీథిలోంచి బోడపాటివారివీథిలోకి తిరిగితే కుడివైపున నాలుగోయిల్లు. మేడమీదగది. వీథిలోకి కిటికీ ఉంటుంది. ఇంటి ఎదురుగుండానే మునిసిపల్ దీపం ఉంటుంది."

"వెళ్లనా అయితే? నేను వచ్చేవరకూ ఇక్కడే కూర్చో నువ్వు."

అన్నట్టు రామం,...సరేలే...వెళ్లి కనుక్కొ ముందు."

ఉత్తరీయం వేసుకుని బయలుదేరేను—
తోవలో శ్రీనివాసరావు దుస్థితిగురించి అన్ని అంశాలూ ఆలోచించాను.

ఊళ్లో అనేకమంది శ్రీనివాసరావు భార్యకీ రమణయ్యకీ ఉన్న స్నేహం విషయమై మాట్లాడుకోడం విన్నాను. రమణయ్య శ్రీనివాసరావుకి చాలా స్నేహితుడై యుండడంవల్ల ఆ మాత్రంలో ఏమీ తప్పలేదని నేను వాదిస్తూ ఉండేవాడిని. శ్రీనివాసరావు అంటే నా ఉద్దేశ్యం ఎప్పుడూ అతనొకవిచిత్రమైన మనిషనే. అయిదారు సంవత్సరాలక్రిందట అతను కొత్తగా భార్యతో కాపురం పెట్టినప్పుడు నేను తనతో ఎంతచనువుగా ఉంటానో తనభార్యతోకూడా అంత చనువుగానూ ఉండాలని బలవంత పెట్టేవాడు. కొన్నికొన్ని సమయాలలో అత నావిధంగా మాట్లాడుతుంటే నే నెక్కువసిగ్గుపడేవాడినో, అతనిభార్య ఎక్కువ సిగ్గుపడేదో చెప్పడానికి వీ లుండేదికాదు. నాకు చిన్నతనంనుంచీ మా అమ్మకోసం మా నాయనమ్మకోసం పరాయి ఆడవాళ్లు ఇంటికివస్తే నా గదిలోకిపోయి తలు

పువేసుకోడం అలవాటు. ఇతర ఆడవాళ్లంటే పట్టరాని సిగ్గు అటువంటిది, తనభార్యని చూసిన రెండవనాటే నేను పేరుపెట్టి 'కామేశ్వరీ' అని పిలవాలని శ్రీనివాసరావు అనేసరికి అతని తెలివితక్కువచేష్టలు నాకొక వెర్రికోపం కలుగజేసేయి. మొదటినుంచీ ఆవిడని నేను 'ఏమండీ' అనే పలు రిస్తుంటే నేనేదో అది అమర్యాదచేస్తున్నట్టుగా భావించుకునేవాడు శ్రీనివాసరావు. ఈ విషయంలో అతన్ని నేనెన్నడూ సరిగ్గా బోధపరచుకోలేకపోయాను.

చిన్నతనంలోనే శ్రీనివాసరావుకి తల్లితండ్రులిద్దరూ పోయారు. పెంచి పెద్దవాడినిచేసిన నాయనమ్మ కూడా అతనికి పెళ్లయిన రెండవసంవత్సరంలో చచ్చిపోయింది. అతని పంతొమ్మిదవ ఏట భార్య కాపురానికివచ్చింది. అప్పటి కావిడకి పదమూడేళ్లు. పల్లెటూరులో పెరిగినపిల్ల. అందమయినదేకాని మొదట చూసినప్పుడు ముఖం కొంతమోటతనంగా కనబడింది. విస్తళ్లు కుట్టడం, వంటవండడం, తెలుగులో కాస్తచదవడం వ్రాయడం తప్ప అప్పట్లో ఆవిడకి మరేమీ తెలియవు. వచ్చినకొన్నాళ్లలోనే శ్రీనివాసరావు ఆవిడకి ఇంగ్లీషు భాష నేర్పడం మొదలెట్టేడు. ఆవిడ కిప్పటికైనా ఆ భాష అంతపట్టుబడిందని చెప్పలేను కాని, రాను రాను కొన్ని ఇంగ్లీషు ముక్కలు సందర్భానుసారంగానూ, అసందర్భంగానూ కూడా ప్రయోగిస్తూవచ్చేది.

శ్రీనివాసరావూ నేనూ కళాశాలలలో కూడా ఒకేతరగతిలో ఉండేవాళ్లం. శ్రీనివాసరావుకి ఇంగ్లీషుభాషన్నా ఇంగ్లీషు వాఙ్మయమన్నా చాలా అభిమానం. మిగిలిన విషయాలలో తోటివిద్యార్థులందరూ తనపైవారయినా ఇంగ్లీషులో ఎప్పుడూ అతనే మొదటివాడు. ఎంతచిన్నతనంలో నేర్చుకోడం ప్రారంభించినా విదేశపుభాష విదేశపుదే కనుక మిగిలినవాళ్లం అందరం ఆంగ్లేయ కవిత్వం సమంగా బోధపరచుకోలేక పోయేవాళ్లం. శ్రీనివాసరావు అనేకమంది ఆంగ్లేయకవుల వ్రాతలు చదివి మాకందరికీ బోధపరుస్తూ ఉండేవాడు. ఆ కవులందరిలోనూ షెల్లీ అంటే అతనికి అతిప్రీతి. షెల్లీజీవితచరిత్రం అతనికి కంఠోపాఠంగా వచ్చును. స్త్రీలని షెల్లీ ఎలా ఆదరించేవాడో. ఎలా ఆరాధించేవాడో చెప్తూ తన్మయుడైపోయేవాడు. పెళ్లిళ్లయిన తర్వాత కూడా భార్యాభర్తలు ఏవిషయంలోనూ ఒకరిస్వేచ్ఛనొకరు నిర్బంధించకూడదనీ, ఇంకా ఆలోచిస్తే పెళ్లిఅనే సంస్కారమే మానవస్వేచ్ఛకి ఆటంకపడుతుంది కనుక పెళ్లిళ్లే ఉండకూడదనీ షెల్లీవ్రాసిన పద్యాలు శ్రీనివాసరావు మాకు చదివి వినిపించి, షెల్లీ ఉద్దేశ్యాలతో మేమందరం ఏకీభవిస్తున్నామని ఒప్పుకునేవరకూ మమ్మల్నందరినీ బాధపెట్టేవాడు. మొదటిలో శ్రీనివాసరావుఉద్దేశ్యాలన్నీ సరదాగా వింటూవున్నప్పటికీ రానురాను షెల్లీకవిత్వంలో ఉన్న స్వేచ్ఛకీ మనహిందూసంఘ పరిస్థితులకీ ఏవిధంగా లంకె కుదరగలదో నాకు బోధపడేదికాదు. కాని మాతోటేచదువుకుంటున్న వెంకటచలమూ, రమణయ్యా అనే ఇద్దరు కుర్రవాళ్లు శ్రీనివాసరావు షెల్లీ నెలాపూజించేవాడో శ్రీనివాసరావుని అలాపూజించేవారు. నా కిదంతా నచ్చేదికాదు. శ్రీనివాసరావొకతమాషామనిషి అనుకుని ఊరుకునేవాడిని. ఈవిషయం శ్రీనివాసరావుకూడా కనిపెట్టేడు. తనతో పూర్వపుటంత సరదాగా నేను మాట్లాడడం లేదని తప్పపట్టేడు. తనకి మిగిలినస్నేహితులంటే ఒట్టి స్నేహభావమేకాని, నేనంటే తనకి చాలామర్యాద కూడా ఉందని చెప్పేడు. అతనంటే నాకు స్నేహభావంలో ఏమీమార్పురాలేదని బోధపరిచాను. "వెంకటచలంతోనూ, రమణయ్యతోనూ నేను స్నేహంగా ఉండడం నీకు నచ్చలేదా?" అని నన్నొకసారి అడిగేడు. ఆ విషయంలో తనస్వేచ్ఛ తనదే అని నవ్వుతూ జవాబుచెప్పేను. వెంకటచలాన్నికాని, రమణయ్యనికాని ఎప్పుడు కలుసుకున్నా ఆగి వాళ్లతో మాట్లాడేవాడినికాని ఎన్నడూ వాళ్లకి నేను చనువివ్వలేదు. వాళ్లకికూడా నేనంటే లోలోపల కక్షగానే ఉండేది.

ఇంకకొన్ని నెలలకి పదిహేడేళ్లు నిండుతాయనగా శ్రీనివాసరావుకి పెళ్లయింది. నేను తనపెళ్లికి వస్తేనేకాని వీలులేదన్నాడు. వెళ్లేను, రమణయ్యా వెంకటచలమూ పెళ్లికి రాలేదు.

మరికొన్ని నెలలకి వెంకటచలం పెళ్లిచేసు కున్నాడు. మరొక రెండుమూడు సంవత్సరాలలో శ్రీని వాసరావూ, వెంకటచలమూకూడా పెళ్లాలని కాపురా లకి తెచ్చుకున్నారు. వెంకటచలం పెళ్లిచేసుకున్న రోజునుంచీ రమణయ్యతోనూ, శ్రీనివాసరావుతోనూ అంతచనువుగా తిరగడం మానేసేడు. అదిచూసి చాలా మంది వెంకటచలమూ, రమణయ్యా ఎందుకో పోట్లాడు కున్నారని అనుకుంటూ ఉండేవారు. నిజానికి మట్టుకు వాళ్లిద్దరూ ఎన్నడూ పోట్లాడుకోలేదు.

రమణయ్య పెళ్లిచేసుకోలేదు. ఇప్పటికింకా అతను బ్రహ్మచారే. రానురాను శ్రీనివాసరావుకి అత నొక్కడే చాలా ఆప్యాయమైన స్నేహితుడుగా మిగిలి పోయాడు. శ్రీనివాసరావూ భార్యా ఎక్కడికివెళ్లినా అతనుకూడా వాళ్లతో వెళ్లేవాడు. ప్రతిసాయంత్రమూ వాళ్లు ముగ్గురూ కలిసి షికారుకి వెళ్లేవారు. ఎప్పుడైనా శనివారంకాని, ఆదివారంకాని నేను శ్రీనివాసరావు ఇంటికి వెళ్లినప్పుడు రమణయ్య తప్పనిసరిగా అక్క డుంటూ ఉండేవాడు. శ్రీనివాసరావు భార్యని రమ ణయ్యకూడా ఊరికా పేరుపెట్టే పిలిచేవాడు. నేను వాళ్లింట్లో ఉన్నంతసేపూమట్టుకు శ్రీనివాసరావుభార్య మరీచనువుగా మా అందరితోనూ వచ్చి కూర్చునేదికాదు. మొదటిలో భర్త ప్రేరేపణవల్ల నాతో చాలాస్నేహంగా ఉండేందుకు ప్రయత్నించేసే దావిడ. ఆఖరాఖరికి నేను సిగ్గుపోతుననీ, కుంతననీ, కనిపెట్టి లోలోపల ఆవిడ నన్ను తృణీకరించేదనే నా అభిప్రాయం.

రెండేళ్లకిందట నేను పెళ్లిచేసుకున్నప్పుడు శ్రీని వాసరావునీ, శ్రీనివాసరావు భార్యనీ తప్పకుండా పెళ్లికి రమ్మని పిలిచాను. ఆవిడ రాలేదు సరిగదా, ఆఖరి నిముషాన్ని భర్తనికూడారాకుండా చేసింది. ఈనియమం అతి రహస్యంగా శ్రీనివాసరావే తర్వాత బోధపరి చాడు. నే నేమీ మారుమాట్లాడలేదు.

మూడేళ్లకిందట నేను కలెక్టరు కచ్చేరీలో గుమా స్తాగా ప్రవేశించాను. అప్పుడే శ్రీనివాసరావు మా ఊరి పెద్దపాఠశాలలో ఉపాధ్యాయుడుగా ప్రవేశించాడు. వెంకటచలం అంతకిముందరే బళ్లారిదగ్గర ఎక్కడో తాలూకాబోర్డులో ఉద్యోగం సంపాదించి వెళ్లిపో యాడు. రమణయ్యకి ఇప్పటికింకా ఎక్కడా ఉద్యో గం దొరకలేదు. పోలీసుశాఖలో ఆ మధ్య రమారమి ఒక ఏడాది పనిచేసేడు కాని మళ్లీ వాళ్లు తీసుకోలేదు. తెలుగులోనూ ఇంగ్లీషులోనూకథలూ పద్యాలూ వ్రాస్తూ కాలం గడుపుతున్నాడు. అప్పుడప్పుడు అతనివ్రాతలు పెద్దపెద్ద పత్రికలలో ప్రకటింప బడుతున్నాయి కూడాను.

కొన్నికొన్నిసార్లు శ్రీనివాసరావుని చూడడా నికి అతనింటికి నేను వెళ్లినప్పుడు అతనుండేవాడు కాదు. అయినా రమణయ్యమాత్రం ఇంట్లో కనబడేవాడు. భార్యతో రమణయ్యని ఒంటరిగా ఉంచి శ్రీనివాస రావు బయటికివెళ్లడం నాకు వింతగా తోచేది కాని, 'పీటిజోలి నాకెందుకు ?' అనుకుని ఊరుకునేవాడిని. శ్రీనివాసరావు నాతో ఈ రాత్రివరకూ రమణయ్య గురించి ప్రత్యేకంగా ఎప్పుడూ మాట్లాడలేదు. రమణయ్య గురించి అతనితో నేను అంతకంటే మాట్లాడలేదు.

రమణయ్య ఉండేయిల్లు జేరుకున్నాను. మ్యుని సిపల్ దీపం కింద నుంచుని "రమణయ్యగారూ, రమణ య్యగారూ" అని గట్టిగా పిలిచాను. "ఎవరది ?" అని గంభీరంగా మేడమీదనుంచి కేకవేస్తూ వీధి కిటికీలోంచి నన్నుచూసి, "మీరా ? రండి, మేడమీదకి రండి" అని పిలిచాడు.

"మీరే దిగివస్తే సంతోషిస్తాను." అన్నాను. దిగివచ్చాడు.

"అలా కాస్తమాగంవెళ్లి మాట్లాడుదాం, రండి" అన్నాను.

నడుస్తుంటే అతనితో ఏమనిచెప్పడమో నాకు తెలియలేదు. అతన్ని ఏమని అడగడమో బోధపడలేదు. ఆఖరికి, "మన......శ్రీనివాసరావుభార్యని మీరు చూసేరా ఈవాళ? " అని అడిగేను.

"చూసేనండీ. ఆవిడా నేనూ ఈ సాయంత్రం పిఠాపురం వెళ్లేతోవలోవున్న నాభివారితోటకి వెళ్లేము. అక్కడికి తీసుకువెళ్లమం దావిడ. వెళ్లడం నడిచివెళ్లేము

కాని, ఆవిడ అలిసిపోయింది. వచ్చేందుకు వేళకిబస్సు దొరకలేదు. అందుకే వచ్చేసరికి కొంత ఆలస్యం అయింది. ఇప్పుడిప్పుడే ఆవిడని ఇంట్లోదిగబెట్టి గదికి వచ్చాను......శ్రీనివాసరావు ఆవిడకోసం వెతుక్కుంటున్నాడా?"

నాకు ఒళ్ళుమండుకొచ్చింది. కాని కోపం ఆపుకున్నాను. "వెతుక్కోడం అంటే......ఇప్పుడిప్పుడే మా ఇంటికి వచ్చాడులెండి, నాకేమైనా తెలుసునేమో కనుక్కునేందుకు. నే నిలావచ్చాను. అతను......వేరే చోట్ల వెతుకుతున్నాడతను."

"అయ్యొయ్యో! మేము వెళ్తున్నట్టు శ్రీనివాసరావుకి తెలుసుననుకున్నాను. నాతో కామేశ్వరి.... కామేశ్వరి నాతోచెప్పడం శ్రీనివాసరావుతో చెప్పేనని చెప్పినట్టు జ్ఞాపకం."

"పరవాలేదులెండి. అతనుకూడా బెంగపెట్టుకోలేదు. ఏమైపోతారు మనుష్యులు? వెళ్తాను."

"అనవసరంగా మీకుకూడా శ్రమకలగజేసేం, క్షమించాలి."

ఇల్లుచేరుకుని శ్రీనివాసరావుతో చెప్పవలసినదంతా చెప్పేను.

"ఈవాళ అక్కడికి వెళ్తానని కామేశ్వరి నాతో చెప్పనే లేదు"అని విసుక్కున్నాడతను.

అతను లేచి వెళ్ళిపోతుంటే ఆఖరిక్షణాన్ని "శీనూ, రేపుసాయంత్రం ఆరుగంటలకి ఇలావస్తావా? నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాను. "సరే, అన్నాడు శ్రీనివాసరావు, ఆశ్చర్యపోయిచూస్తూ.

మొన్నాడు అతనితో అతనికుటుంబ విషయమై యావత్తూ ధైర్యంచేసి మాట్లాడాలని నిశ్చయించుకున్నాను.

మొన్నాడు కలసుకున్నప్పుడు అతని ప్రశంస నేను ఏమీ ఎత్తకుండానే అతను కొన్ని సంగతులు చెప్పడం ప్రారంభించాడు.

"నిన్నరాత్రి నాకూ కామేశ్వరికీ ఒకఘోర యుద్ధం జరిగింది, రామం. నాకు ఎన్నడూరానికోపం వచ్చింది. ఆ వెర్రికోపంలో కామేశ్వరిని నానా మాటలూ అన్నాను సఖంవంశతూ ఉన్నవంట మాని ఏడుస్తూవచ్చి పడుకుంది. ఇద్దరం తిండితినలేదు. ఆలా ఉండగా పదిగంటలకో పదిన్నరకో రమణయ్యవచ్చాడు. నేనూ కామేశ్వరీ కూడా మౌనంగా ఉండడంచూసి నా క్షమార్పణకోరి వెళ్ళిపోయాడు.........నిన్న అతన్నిచూస్తుంటే నాకు అరికాలిమంట నెత్తికొచ్చింది."

"శీనూ, ఇంతవరకూవచ్చింది కనుక ధైర్యంచేసి అడుగుతున్నాను. రమణయ్యని నీ ఇంటికి అంతచనువుగా ఎందుకు రానిస్తావు నువ్వు? దానికి అతను అర్థంలేని మనిషి...."

"ఇంట్లో చనువుమాట నేను చెప్పడంలేదు రామం. అది వేరేసంగతి. రాత్రి అంత ఆలస్యంగా వచ్చేటప్పుడు నాతో చెప్పనక్కరలేదూ? అదీ నాకు పట్టుకున్న కోపం. ఊరంతా వెతుక్కోనా నేను?... చనువు కేముంది?..."

"మాటవరసకి చెప్పేను సుమా, శీనూ. నువ్వేమీ అనుకోవద్దు."

తనకుటుంబ వ్యవహారాలు నాతో నిర్మొహమాటంగా చెప్పేందుకు శ్రీనివాసరావు ఇష్టపడడంలేదని గ్రహించాను. ఇంకానాకు తెలియకుండా దాచేందుకు ప్రయత్నంచేస్తున్నాడతను. నే నీవిధంగా అతనివిషయంలో అనవసరంగా కలుగజేసుకున్నాను కదా అని విచారించాను ఇప్పటికికూడా అతను ఇంత తెలివితక్కువగా ఉండేటట్టయితే అతని దురదృష్టం అతనిదే అనుకుని ఊరుకున్నాను.

అటుతర్వాత ఒక నెలరోజులలోపున నాకుటుంబ పరిస్థితులలో చాలామార్పులు జరిగేయి. మా మామగారి ఊరువెళ్ళి మా ఆవిడని కాపురానికి తెచ్చుకున్నాను. పూర్వం నేనుంటున్న గది వదిలేసి ఒకచిన్న ఇల్లు అద్దెకి పుచ్చుకున్నాను. అన్నిటికంటే ముఖ్యమయినమార్పు హోటలుతిండి బదులు మా ఆవిడవంట. ఆహోటల్ తిండివల్ల నేనుపడ్డబాధలు దేవుడికే తెలుసును.

ఆ నెలరోజులలో శ్రీనివాసరావుని నేను అస్సలు చూడలేదు. తర్వాత ఒకసాయంత్రం అతనూ భార్యా మా ఇంటికి వచ్చారు. మా ఆవిడచేసిన కాఫీ చాలాబాగుందని అతను మెచ్చుకున్నాడు. మా ఇద్దరినీ ఒకసారి తనింటికి రమ్మన్నాడు. శ్రీనివాసరావుభార్య కూడా మా ఆవిడని రమ్మని చాలాసార్లు అడిగింది.

వాళ్లు వచ్చివెళ్లినరాత్రి మాఆవిడ తామలపాకులు చుట్టూ "మీ స్నేహితుడిపెళ్లాం నాకు నచ్చలేదుసుమండీ" అంది. ఎందువల్ల నచ్చలేదని అడిగితే, "ఆవిడ షోకులూ, ఆవిడవెకిలితనాలూ చూస్తే అసహ్యం వేసింది. ఆ చేతులులేని జాకెట్లూ ఆ ముసిముసినవ్వులూ ఎందుకొచ్చినవని ? అటుపైని, నిముషనిముషానికీ, నాతో మాట్లాడుతూకూడా మీవైపు చూడడం ఎందుకూ ?" అని జవాబిచ్చింది

వారంపదిరోజులలో మేమిద్దరం శ్రీనివాసరావు ఇంటికి భోజనానికి వెళ్లేం. రమణయ్యకూడా అక్కడ తయారయాడు. శ్రీనివాసరావుభార్య ఆరోజు కొకవంటమనిషిని కుదిర్చి అందరం ఒకేసారి ఒకే పంక్తిలో భోజనంచేసేటట్టు ఏర్పాటుచేస్తే, తీరా భోజనానికి లేచేవేళకి మా ఆవిడ మొగవాళ్లతో పంక్తిలోకూర్చుని భోజనంచెయ్యనంది. మే మందరం ఎంతచెప్పినా వినలేదు. ఆఖరికి శ్రీనివాసరావు నవ్వుతూ, "మరేమీపరవాలేదు. మొగవాళ్లం ముందర లేద్దాం" అన్నాడు. నాకు సిగ్గేసింది. మా ఆవిడ తనపంతం నిలబెట్టుకుంది. శ్రీనివాసరావు భార్యా తనూ మేములేచేక భోజనానికి వెళ్లేరు. ఈ మార్పుకి శ్రీనివాసరావుభార్య చాలా అసహ్యించుకుందని నేను కనిపెట్టేను.

అందరిభోజనాలూ అయాక మా ఆవిడచర్యకి మనస్సులో దుఃఖపడుతూ నేను మౌనంగా కూర్చున్నాను. శ్రీనివాసరావుకూడా మరేకారణంవల్లనో చాలామౌనంగా ఉన్నాడు. రమణయ్యమట్టుకు చాలా ఉత్సాహంగా ఉన్నట్టు నటిస్తూ దానిగురించీ దీనిగురించీ అనేకవిషయాలు మాట్లాడడం మొదలుపెట్టేడు. అతను చెప్తున్నమాటలు కొన్ని నేను వినదలిచినా వినలేదు. అంతసేపూ కూడా అతను ఏవిధంగానైనా శ్రీనివాసరావుని సరదాగా కబుర్లలో పెట్టడానికి ప్రయత్నిస్తున్నట్టు నాకు తోచింది. శ్రీనివాసరావు రమణయ్య మాటలు వింటున్నట్లు అప్పుడప్పుడు నటించినా ఏదో విషయమై అతను చాలా బాధపడుతున్నట్టు నాకు కనిపించాడు. కుటుంబవిషయమే అయి ఉంటుందనుకున్నాను. శ్రీనివాసరావు భార్యకూడా వేరే మా ఆవిడతో పక్కగదిలో కూర్చున్నా ప్రతి అయిదునిముషాలకీ ఒకసారివచ్చి మాతోకూర్చుని శ్రీనివాసరావుతో ఏదో ఒకసంభాషణ మొదలుపెట్టబోయేది. ఇలా, నాలుగైదుసార్లు అతను వద్దంటున్నాకూడా "ఇంకా తామలపాకులు కావాలా ?" అని ఆవిడ అడిగితే ఆఖరిసారి విసుక్కుంటూ అతను "ఎన్నడూలేనిది ఈవాళ నన్నింత ఆప్యాయంగా ఇన్నిసార్లడుగుతున్నావేమిటి ? నా కేమీవద్దు." అన్నాడు. ఆవిడ చిన్నబుచ్చుకుంటూ, "మీకనికాదు. మీస్నేహితులకి కావాలేమోనని అడిగేను." అని సమాధానంచెప్తే, "కొత్తగా ఈ సిగ్గులన్నీ ఎందుకు ? వాళ్లని నువ్వే అడుగు" అని సణిగేడు. చటుక్కున లేచి వెళ్లిపోయి ఆవిడ మళ్లీ మా దగ్గరికి రాలేదు.

ఆరోజున వెళ్లిపోతూ శ్రీనివాసరావునీ భార్యనీ ఎప్పుడైనా మా ఇంటికి వస్తూ ఉండమని కోరేను. రమణయ్యనిమాత్రం పిలవలేదు. మా ఆవిడ శ్రీనివాసరావు భార్య తనకి బొట్టుపెట్టున్నప్పుడుకూడా ఆవిడతో 'వెళ్తున్నాం' అన్నముక్క అనలేదు.

తర్వాత సరిగ్గా రెండువారాలకి ఒకసాయంత్రం శ్రీనివాసరావు నాకు బాకీఉన్న పదిరూపాయిలూ ఇచ్చెయ్యడానికి వచ్చాడు. కాసేపు కూర్చుని కాఫీలగి వెళ్లమన్నాను. కాఫీతాగుతూ నెమ్మదిగా, "రామం, ఒకవేళ నేను అకస్మాత్తుగా చచ్చిపోతే నా ఆస్తిసంగతీ కామేశ్వరిసంగతీ నువ్వే చూసుకోవాలిసుమా." అన్నాడు. నాగుండె గుభాలుమంది.

"నువ్వు అకస్మాత్తుగా చచ్చిపోవడం ఏమిటి శీనూ ? ఎందుకు నీ కా ఉద్దేశ్యం కలగాలి ?"

"ఉద్దేశ్యానికేముంది ? అది ఎవరికయినా జరగొచ్చునుకా....కామేశ్వరికి దగ్గరచుట్టా లెవరూలేరు.

మేనమామ పెంచేడు. పిల్లలులేకుండా పోయాడాయన. ఆ మేనమామపెళ్లానికి కామేశ్వరికీ పడదు."

"అదిసరేలే...నిన్ను మనస్సులో ఏదో చాలా బాధిస్తోంది, శీనూ. అదేమిటో నాకుచెప్పాలి."

"నీకు తెలుసును."

"నా కెలాతెలుస్తుంది, శీనూ ?"

"నీకు తెలుసును."

"అయితే, రమణయ్యేనా ?"

"అవును."

"రమణయ్యని మీ ఇంటికి రావద్దని చెప్పకూడదూ నువ్వు ?"

"ఇప్పుడు చెప్పినా లాభంలేదు."

"ఎప్పుడైతే ఏమిటి ?"

"అంతా అయిపోయాక..."

"అంటే ?"

"రామం, మీ ఆవిడ వింటుందేమో ?"

"ఇక్కడిమాటలు వంటగదిలోకి వినపడవు."

"మీ ఆవిడతో నువ్వు ఎన్నడూ చెప్పనని నాస్తానం చెయ్యి."

"ఎన్నడూ చెప్పను, శీనూ."

"కామేశ్వరికి రమణయ్యతో చనవు ఎంతదూరం వెళ్లడానికి వీలుందో అంతదూరమూ వెళ్లిపోయింది."

"నిజంగా ?"

"తనే ఒప్పుకుంది. రమణయ్యకూడా ఒప్పుకున్నాడు....ఒకరాత్రి కామేశ్వరి ఇంట్లోలేదని నిన్ను నీగదిలో చూడడానికి రాలేదూ నేను—ఆ రాత్రే."

ఇంతకఠోరమైనవార్త శాంతంగా, తడుముకోకుండా శ్రీనివాసరావు నాకు చెప్తుంటే నాకు ఆశ్చర్యంవేసింది. నాకుమట్టుకు నాకే రమణయ్య అంటే ఎక్కడలేనికోపం పుట్టుకొచ్చింది. ఆ ఆవేశంలో ఆక్షణం రమణయ్య నా ఎదురుగుండా ఉండుంటే నేనేమి చేసుందునో చెప్పలేను.

"అయితే, ఇప్పు డేమిటిచేస్తావు, శీనూ ?"

"ఏమిటిచేసేది ?... మొన్నాడుకూడా నిన్ను చూడడానికి వచ్చాను, జ్ఞాపకం ఉందా ? అప్పటికప్పుడే నా కంతాతెలుసును. అప్పుడే నీకంతాచెప్పేద్దామనుకున్నాను. మళ్లీ, చెప్పడానికి బుద్ధిపుట్టలేదు.... నా స్థితిలో నువ్వుంటే నువ్వేమిటి చేస్తావు, రామం?"

"ఆవిడని పుట్టింటికి పంపించేస్తాను. ఎన్నడూ ఏలవని చెప్పేస్తాను."

"కామేశ్వరికి మేనమామపెళ్లాంతప్ప మరెవరూ లేరు. ఆవిడకి కామేశ్వరి నచ్చదు."

"ఆవిడతోనే ఉండాలన్నమాటేమిటి? ఎక్కడైనాఉండొచ్చును డబ్బిచ్చి పొమ్మను."

"నా కంతడబ్బుకూడా లేదు."

"నువ్వు డబ్బుమట్టుకు ఎందుకివ్వాలి? రమణయ్యనే పోషించుకోమను కావలిస్తే."

"మనహిందూసంఘంలో తనిప్పుడు నేనుబతికుండగా రమణయ్యని పెళ్లిచేసుకునేందుకు వీలులేదుకా."

"వాడితో పెళ్లిచేసుకునే ఉండాలన్న మాటేమిటి?"

"పెళ్లిచేసుకోకుండా రమణయ్యతో తను కాపురంచెయ్యడం నాకిష్టంలేదు."

"నిన్ను మోసపుచ్చి నిన్ను వదలిపెట్టిపోయాక కూడా తనఘోష నీకెందుకు, శీనూ?"

"అకస్మాత్తుగా నేను చచ్చిపోతే రమణయ్యని తను పెళ్లిచేసుకోవచ్చును."

"నీ కేమైనా పిచ్చెత్తిందేమిటి,శీనూ? ఆత్మహత్య చేసుకోవాలని చూస్తున్నావా?"

"అబ్బెబ్బే!"

"మరేమిటి నీమాటల ధోరణి ?"

"రామం, ఇటువంటి సందర్భమే పాశ్చాత్య సంఘంలో తటస్థిస్తే వాళ్లు ఎంతసునాయాసంగా సద్దుకుంటారో ఆలోచించు. విడాకులిచ్చాక భార్య మళ్లీ పెళ్లి చేసుకోవచ్చు."

సామాన్య మానవస్వభావానికి ఇంత వ్యతిరిక్తంగా తన స్వంత దురవస్థ మరచిపోయి, మొగజన్మ ఎత్తినందుకు ప్రబలంగా ఉండవలసిన అసూయకూడా ఏకోశాన్నీ లేకుండా, ఇంత నిర్మలంగా సంఘపరిస్థితుల గురించి చర్చిస్తున్న శ్రీనివాసరావుని చూస్తే నిజానికి నాకు అసహ్యంవేసింది. 'ఇతనొకపిచ్చివాడు. ఇతనికేమీ పౌరుషం లేదు. చిన్నప్పటినుంచీ ఇతను అర్థంలేని కవుల ప్రపంచంలోనే మెలిగేడుకాని, ఈ మానవ ప్రపంచం ఏమిటో, మానవులసుగుణా లేమిటో దుర్గుణా లేమిటో ఇతని కేమీ తెలియవు. ఇతనొక లోకవిరుద్ధమైన అప్రయోజకుడు." అని నాలో నేను ఎన్నోసార్లు అనుకున్నాను. ఆఖరికి ఊరుకోలేకపోయాను.

"శీనూ, మీ ఆవిడగురించి ఆమాటవిన్నప్పుడు నీకు పిచ్చెత్తలేదూ? ఒళ్లు మండుకుపోలేదూ? రమణయ్యని చంపెయ్యాలన్నంత కోపం రాలేదూ?"

"అన్నీ జరిగేయి, రామం. పిచ్చెత్తింది. ఒళ్లు మండుకు పోయింది. రమణయ్యని చంపేద్దామన్నంత కోపమూవచ్చింది. కాని, శాంతంగా ఆలోచించకుండా మనంకూడా హఠాత్తుగా ఏదో వెర్రిపని చేసేటట్టయితే మనకీ అడవిప్రజకీ భేదంఏమిటి? మనకీ మిగిలినజంతువులకీ భేదంఏమిటి?......ఆ రాత్రే నాకు వాళ్లిద్దరి గురించీ అనుమానం కలిగింది. కామేశ్వరిని నిజంచెప్పమని చంపేసేను. ఆ రాత్రిమట్టుకు నా కోపమూ నా అసూయా నేను వర్ణించలేను. చాలాసేపు ఏమీ జరగలేదని వాదించడం మొదలుపెట్టింది. నేను నమ్మనన్నాను. కొంతసేపటికి నా పోరుపడలేక ఒక్కసారి మట్టుకు రమణయ్య తన పెదవులు ముద్దుపెట్టుకున్నాడని ఒప్పుకుంది. రమణయ్యని తను మళ్లీ చూడనని వాగ్దానం చేస్తూ, క్షమించమని నన్ను బతిమాలుకుంటూ ఏడవడం ప్రారంభించింది. ఇంకా తను నాతో పూర్తిగా నిజం చెప్పడంలేదని నాకు తెలుసునన్నాను. నన్ను తిట్టింది. రాత్రికిరాత్రే తను లేచివెళ్లిపోతానంది. అప్పుడు వీధి తలుపు తాళంవేసితాళం దగ్గరపెట్టుకుని కూర్చున్నాను. ఏడ్చిఏడ్చి, ఆఖరికి నిజం అంతా చెప్పేసింది. నే నేమి చేసినా తను భరిస్తానంది. తను అగాధంలో పడి కొట్టుకుంటున్నానంది. రమణయ్యఅంటే తనకి గాఢమైనప్రేమ అనిచెప్పి ఏడ్చింది. అంతవరకూ అసూయతోనూ పౌరుషంతోనూ గర్వంతోనూ బాధపడుతున్న నాకు ఎక్కడలేనిదుఃఖం వచ్చింది. చంటిపిల్లవాడిలా ఏడ్చేసేను. ఒకఅరగంటైనా గుక్కతిప్పకుండా అలా ఏడ్చుంటాను. ఆ అరగంటా కామేశ్వరి ఏమిటిచేస్తోందో కూడా నా కప్పుడు తెలియదు. కాని ఆఖరికి తన కొక వాగ్దానం చేసేను. తనజీవితప్రవాహానికి నేను ఎన్నడూ అడ్డుపడనన్నాను. తనస్వేచ్ఛకి నేను ఎన్నడూ భంగం కలుగచెయ్య నన్నాను. ఇప్పటికీ నా ఉద్దేశ్యం అదే. తనస్వేచ్ఛకి నేను అడ్డురాను."

స్వేచ్ఛ! స్వేచ్ఛ!

"ఏమిటి, శీనూ, ఈపిచ్చిఊహలూ నువ్వూనూ?"

శ్రీనివాసరావు లేచి నుంచున్నాడు. జవాబు చెప్పలేదు.

"పోనీ, ఏమిటి చెయ్యదలచుకున్నావు, శీనూ, నువ్వు?"

"నువ్వేదైనా సలహా చెప్తావేమో అనుకుంటే నాసహాయానికి నువ్వు రాలేదు."

"ఆవిడని పారదోలి నీ బతుకు నువ్వు బతుకు."

"ఏదో ఒకటి చేస్తాను.... నీ పదిరూపాయిలూ నీ కిచ్చేసేనుకాదూ?"

"ఇచ్చేసేవు...శీనూ, ఆత్మహత్యమట్టుకు తలపెట్టకుసుమా. ఎందుచేత అంటున్నానంటే, నీ సంగతి నా కేమీ బోధపడడంలేదు.... తెలివితక్కువపని మట్టుకు చెయ్యకు."

"ఆత్మహత్య చేసుకుంటాననే నీ ఉద్దేశ్యం?"

"ఏమో, నువ్వు మళ్లీ రేపిక్కడికిరా. సాయంత్రం రా. మనిద్దరం మళ్లీ దీనివిషయమయి మాట్లాడుదాం. ఈ రాత్రంతా నీ గురించే ఆలోచిస్తూ వుంటాను. వస్తావా రేపు?"

"వస్తాను."

మొన్నాడు శ్రీనివాసరావు రాలేదు. సాయంత్రం ఆరుగంటలకి అతనినౌకరు వచ్చి అతను ఆత్మహత్య చేసుకున్నట్టూ, పోలీసువాళ్లువచ్చి నన్ను పిలుచుకురమ్మన్నట్టూ కబురు చెప్పేడు. నేను భయపడుతున్నట్టే అయింది. మా ఆవిడ కబురువినగానే కూలబడిపోయింది.

ఉన్నవాడిని ఉన్నట్టుగానే శ్రీనివాసరావుఇంటికి పరుగెత్తేను. ఇంటిచుట్టూ ప్రజ మూగిఉన్నారు. గుమ్మం దాటగానే రమణయ్య కనబడ్డాడు. అతనికేసి సమంగా మొహమైనా చూడలేదు నేను. లోపలికి వెళ్లేను. ఒక పోలీసుఉద్యోగీ ఇద్దరు పోలీసువాళ్లూ శ్రీనివాసరావు పడకగదిలో ఉన్నారు. ఒకపోలీసువాడు నన్ను పైకి తోసెయ్యబోయాడు. శ్రీనివాసరావుశవం మంచం మీదుంది. నేను శ్రీనివాసరావు స్నేహితుడినని బోధపరిచాను. ఆ ఉద్యోగి నావైపు తిరిగి "రామలింగం గారంటే మీరేనా" అని అడిగేడు. ఆత్మహత్యచేసుకునేముందు శ్రీనివాసరావు నాకొక ఉత్తరం వ్రాసేడని చెప్తూ ఆ ఉత్తరం నాకిచ్చాడా ఉద్యోగి. ఆ ఉత్తరంలో ఉన్నవిషయం ఇదీ:

"రామం, నాకు మరొకమార్గం కనబడలేదు. నువ్వేమనుకుంటావో నాకు తెలుసును—నేను పౌరుషం లేనివాడినని! అది నిజమేనేమో. కాని కామేశ్వరిని నేను చాలాప్రేమించాను. నా జీవితం అంతా తనమీద ఆధారపెట్టుకున్నాను. తమ జీవితం మరొకరిమీద ఆధారపెట్టుకునేవాళ్లగతి ఎప్పుడూ అన్యాయమే. నేను చెయ్యగలిగినది మరేమీ నాకు తోచలేదు.

పోలీసువాళ్లకికూడా ఒక ఉత్తరం వ్రాసిఉంచాను. విషంతెచ్చుకుతాగినది నాతప్పే. మరెవరితప్పూ కాదు. ముఖ్యంగా రమణయ్యనీ కామేశ్వరినీ పోలీసువాళ్లు బాధపెట్టకూడదని నాప్రార్థన. ఈవిషయమై నువ్వు జాగ్రత్తగా చూడాలి.

నా పెద్దలభూములూ ఆస్తీ కామేశ్వరి మళ్లీ పెళ్లిచేసుకుంటే కామేశ్వరి అనుభవించడానికి వీలుండదు. కాని ఇంపీరియల్ బ్యాంకిలో నాస్వంతడబ్బు రెండువేలపైచిల్లర వేరేఉంది. అది కామేశ్వరికే. ఒక వేళ రమణయ్య కామేశ్వరిని పెళ్లిచేసుకోకపోయేటట్టయితే ఆడబ్బుతో కామేశ్వరి చదువుకుని వృద్ధిలోకి రావాలని నా ఆశ. రమణయ్య తనని పెళ్లిచేసుకున్నా కూడా ఆడబ్బు తనదే.

నీకు కామేశ్వరి అంటే అభిమానం లేదని నాకు తెలుసును. కాని, నాకోసం, నన్ను జ్ఞాపకంఉంచుకుని, తనమంచిచెడ్డలు నువ్వుచూసుకోవాలని నాప్రార్థన. రమణయ్య పెళ్లిచేసుకునేవరకూ అయినా నువ్వు చూసుకోవాలి.

ఇదే నా ఆఖరి ఉత్తరం.

నాకేమీ చింతలేదు. రైలుప్రయాణానికి వెళ్తున్నట్టుంది- ఒక వూరు విడిచి మరొకవూరికి. నిజానికి, మళ్లీ, మరొక ఊరు జేరుతానన్న ఆశా లేదు, మరొక ఊరు జేరాలన్నకోరికా లేదు. మనకాళ్లకిందపడి చచ్చిపోతున్న ప్రతిచీమా మరొకవూరు జేరుకుంటోందా? మరొక ఊరు జేరుకుని ఇక్కడికంటె సుఖపడుతోందా?...ఏదీ ఉండదు.

ఇంతే,

శీను"

ఉత్తరం చదువుకుంటూ నేను ఏడుస్తుంటే పోలీసుద్యోగి శవాన్ని తీసుకుపోయి కోయించి పరీక్ష చెయ్యవలసి ఉంటుందన్నాడు. మొన్నాడు పొద్దున్న పరీక్షఅయిపోయాక దహనకృత్యాలకి శవాన్ని ఇచ్చేస్తారన్నాడు. మొన్నాడు ఇది ఆత్మహత్యఅని స్థిరపడే వరకూ శ్రీనివాసరావు నాకువ్రాసిన ఉత్తరంకూడా తన దగ్గరే ఉంటే మంచిదన్నాడు. శ్రీనివాసరావు వ్రాసిన రెండు ఉత్తరాలూ ఉన్నాయికనుక అతనిభార్యతో కను ప్రత్యేకంగా మాట్లాడవలసిన అవసరం లేదనే తన ఉద్దేశ్యం అన్నాడు.

పోలీసువాళ్లు శవాన్ని తీసుకువెళ్లిపోయారు. నేను మా ఇంటికి వెళ్లి మా ఆవిడని శ్రీనివాసరావుఇంటికి తీసుకువచ్చాను. మొదట రమ్మంటే రానని పట్టు పట్టి ది. ఆఖగ్గసమయంలో నాలుగుతిట్లు తిట్టేసరికి కిక్కురుమనకుండా నా వెంట వచ్చింది. మే మిద్దరం శ్రీనివాసరావుఇంట్లోకి వెళ్లేసరికి రమణయ్య శ్రీనివాస రావుభార్యపక్కని కూర్చుని ఓదారుస్తున్నాడు. మమ్మల్ని చూసి లేచినుంచున్నాడు. అంతవరకూ అత నితో నే నేమీ మాట్లాడలేను. నాతో అతనూ ఏమీ మాట్లాడలేదు. అతన్ని చూస్తూంటే నాకు అరికాలిమంట నెత్తికొచ్చింది. "మీరు వెళ్లండి. ఇం కిక్కడక్కర లేదు." అన్నాను. "వెళ్తున్నాను." అని సమాధానం చెప్పేడు. శ్రీనివాసరావుభార్యకేసిచూస్తూ, "మళ్లీ వస్తాను, కామేశ్వరీ" అన్నాడు. నేను చూస్తూ నుంచు న్నాను. అతను వీథిసుమ్మం దాటుతుంటే నా కొక ఉద్దేశ్యం కలిగింది. వెంటవెళ్లి "రమణయ్యగారూ, మరొకమాటచెప్పాలి." అని పిలిచాను. అతను "ఏమిటి?" అంటూ వెనక్కి తిరిగేడు. ఆ దుఃఖంలోనూ, ఆ కోపం లోనూ ఒళ్లు తెలియక అతన్ని సాగదీసి లెంపకాయ కొట్టేను. నాకేసి తెల్లపోతూ చూసే డతను. "ఇదే చెప్పదలచుకున్న మాట" అన్నాను. మారు మాటాడ కుండా వెళ్లిపోయాడు.

ఆరాత్రి ఎవరూ ఎవరితోనూ మాట్లాడలేదు. తెల్లవారేవరకూ శ్రీనివాసరావుభార్యఏడుపు నాకు వినిపిస్తూనే ఉంది.

ఆరాత్రే తంతికొట్టే మొన్నాడు శ్రీనివాస రావుచుట్టాలు కొందరు వచ్చారు. అందులో శ్రీనివాస రావు పినతండ్రికొడుకొకడు శ్రీనివాసరావుభార్యని పడతిట్లుతిట్టుంటే వెళ్లి బలవంతంగా అతన్ని ఆపవలసి వచ్చింది.

దహనం అంతా అయాక శ్రీనివాసరావుచుట్టా లతో అతని ఆస్తివిషయం మాట్లాడి అతను నాకు ఆఖరిని వ్రాసిన ఉత్తరం చూపించాను.

ఒకరాత్రి మాత్రమే ఉండి వాళ్లంతా వెళ్లి పోయారు.

మూడవరోజున మా ఆవిడ నన్ను, "ఈ రెండు రోజులలోనూ చాలా గ్రహించానుకాని, ఆయన ఎందుకు ఆత్మహత్య చేసుకున్నారో నిజంగా అంతా చెప్పరూ?" అని అడిగింది. అంతా పూర్తిగా బోధపరి చాను.

"ఈవి డిటువంటిదని చూసిన మొదటినాడే నాకు తట్టింది సుమండీ" అంది.

ఆ మధ్యాహ్నం రమణయ్యవచ్చి శ్రీనివాసరావు భార్యతో ఏదోమాట్లాడి వెళ్లిపోయాడు. మళ్లీ నా కతను కనబడలేదు.

నాల్గవరోజున ఆ ఇల్లు వదిలేసి శ్రీనివాసరావు భార్యని వెంటబెట్టుకొని సామాన్లన్నిటితో మా ఇంటికి వచ్చేసేను.

శ్రీనివాసరావుపోయిన పదిహేనురోజులకి అతని భార్య చెన్నపట్నం వెళ్లిపోయి చదువుకుంటానని చెప్పి చెన్నపట్నంలో సదుపాయాలన్నీ చేసిపెట్టమంది. సదుపాయాలన్నీ చేసి ఆవిడ నక్కడ దిగబెట్టి, ప్రతి నెలా డబ్బు పంపిస్తానని చెప్పి, ఇంటికి వచ్చేసేను.

"మీరు నాకు చాలా సహాయపడ్డారు. మీ దయ నే నెప్పటికీ మరిచిపోలేను." అం దావిడ, నేను వచ్చే స్తుంటే.

"మీకు చేస్తున్నదంతా నేను మీ మీద అభి మానంకొలదీ చెయ్యడంలేదు." అని సమాధానం చెప్పేను.

"ఆవిషయం నాకుకూడా తెలుసును." అం దావిడ. ఇల్లు చేరుకున్నాక నన్ను మా ఆవిడ శ్రీనివాస రావుభార్యగురించి అనేకప్రశ్నలు వేసింది.

ఆఖరికి "చెన్నపట్నంలో రమణయ్య మీకు కనబడ్డాడా?" అని అడిగింది.

"కనబడలేదు" అన్నాను.

"మీరు చూస్తూఉండండి. వాడు చెన్నపట్నం లోనే ఉన్నాడు," అంది.

ఈ సంభాషణజరిగిన రెండురోజులకే శ్రీనివాసరావుభార్యదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. రమణయ్య చెన్నపట్నం వచ్చాడనీ, రమణయ్యని తను పెళ్లిచేసుకుంటున్నాననీ శ్రీనివాసరావుఆస్తి తనకేమీ అక్కరలేదనీ మూడేనూడు పంక్తులు వ్రాసింది.

వెంటనే శ్రీనివాసరావుఆస్తిగురించి వివరాలు తెలియపరస్తూ ఆవిడికి చెన్నపట్నానికి నేను ఉత్తరం వ్రాస్తే, ఆవిడ ఎక్కడున్నదీ తెలియలేదని టపావాళ్లు నాఉత్తరం నాకు తిరక్కొట్టేసేరు.

"రెండువేల రూపాయి లిలా ఆమనిషి తోసిపారేస్తుందనుకోలేదు సుమండీ" అంది మా ఆవిడ.

రమణయ్యకి ఉద్యోగంలేదన్నమాట ఆలోచిస్తూ రూపాయిలవిషయమై నేనూ ఆశ్చర్యడ్డాను.

---

# అలనాటి కోరిక

## సీతమ్మ

నేను మా ఊరు ఎలిమెంటరీ స్కూల్లో చదువుకొంటూ వుండేదాన్ని. నాకప్పుడు సుమారు ఏడు సంవత్సరాల వయస్సుండవచ్చు. మా అయ్యవారమ్మ శిక్షణమాహాత్మ్యమో, లేక పూర్వజన్మవాసనేనో ఏదో మాత్రం చెప్పలేను గాని ఆ లేతవయస్సులోనే నా చిన్న మెదడులోనూ, హృదయంలోనూగూడా నేనూ ఒక కథకురాల్ని కావలెననే కోరిక అంకురించింది. కథలు వ్రాయడమంటే మాటలా? నలుగురూ తలలూచేటట్లు వ్రాయడం మహా మహావాళ్లకే సందర్భపడకపోతూవుంటే నేనెంత, నా యోగ్యతయెంత-నేను కథలు వ్రాయడమేమిటని సంకోచంకూడా ఆ తోడుతనే పొటమరించింది. పొటమరించినట్టుగానే పొటమరించి ఆ సంకోచం నీటిబుడగవలె క్షణంలో మాయమైపోయింది. చూదాం, ప్రయత్నించి చూదాం. సరదాకు సరదాగానూ ఉంటుంది, అలవాటుకు అలవాటూ అవుతుంది. ఇప్పుడు వ్రాస్తూండేవాళ్లు మాత్రం ఒకటేసారి ఆకాశంనుంచి ఊడిపడినారాయేం? యత్నించి చూడడంలో తప్పేముంది గనక? అన్నీ కలిసివచ్చి, సందర్భాలు అనుకూలపడి వ్రాసినవి నా మనస్సుకు తృప్తికరంగావుండి ఫరవాలేదన్న ధైర్యంగలిగి పుస్తకరూపంగా అచ్చుపడినాయంటే నా కోరిక సఫలమూ అవుతుంది; ఏ నాలుగు కాసులకో ఎట్లాగో ప్రాప్తీ కలుగుతుంది. పుస్తకరూపంగా కాకపోయినా ఏ పత్రికలోనైనా ప్రకటించి నాలుగు కాసులు సంపాయించుకోవచ్చు. విజ్ఞానం మాట యెట్లావున్నా నీడపట్టునే ఇంట్లోనే కూర్చొని భర్తగారి సంపాదనకు మరికొంత జమా కలపవచ్చును. స్త్రీలు ఈ నూతన పరిశ్రమను ఎందువల్ల అవలంబించ గూడదు? హిందూయువతుల ధర్మానికేం వ్యతిరేకమా? అన్న యోచనలు ఒకటిపై ఒకటి తోస్తూ వచ్చి ఊరట చెందినాను. నా సంకల్పమే గనక కొనసాగే టట్లయితే నేను ప్రతి నిత్యమూ పొద్దస్తమానం చూస్తూవచ్చిన అమాయకపు పల్లెటూరుజనాన్ని, పల్లెటూరు జీవనాన్ని గురించిన కథలే వ్రాయవలెనని కూడా నిర్ణయం చేసుకొన్నాను.

రోజులు దాటిపోతున్నాయి. నేను ఏదో క్లాసు ప్యాసయినాను. ఆవూరి చదువంతో అయిపోయింది. ఏ పట్నవాసమో చేరుకొని ఇంకా పైపైన చదువుదామని నాకేమో అప్పుడుండింది గాని బీదతనంచేతనూ 'ఎందుకామాల చదువంకా! ఇంత చాలు మనకు. ఏం భారీ ఉద్యోగాలు చేయబోవాలి! కావలిస్తే ఇంట్లోనే అదీ యిదీ తెలుగు పుస్తకాలు చదువుకోవచ్చులే.' అన్న ఉదాసీనం చేతనూ మా అమ్మా, మా నాయనా కూడా అం

దుకు సమ్మతించలేదు. నాకేమో రాత్రీ పగలూ అదే కలవరింత. అయితే మాత్రం నేనేం చెయ్యగలను ?

మొదట్లో వాళ్లమీదనాకు పట్టరానంత ఆగ్రహం వచ్చింది కాని అదీ ఒకందుకు మంచికే యేర్పడ్డదని యిప్పుడిప్పుడే గ్రహించ గలిగినాను ఇంకా పైచదువులు చదివి ఉండినానంటే ఆదర్శాలకు, షోకులకు, నాగరికతలకు అలవాటు పడిపోయి నా ప్రాణపదమైన, ఆనందస్వరూపమైనగ్రామజీవితంమీద అసహ్యమే కలిగివుండేది.

మా దేమంత భారీకుటుంబంకాకపోవడం చేత ఇంటిపనులన్నీ మేమే చక్కబెట్టుకోవలసివచ్చేది. అటువంటి విషయాల్లో మా అమ్మకు నా సహాయం ఎంతైనా అవసరముండేది. నాకూ పనిపాటలు చేసుకోవడమంటే చాలా సరదా. చదువుమీది అభిలాషకొద్దీ విరామం దొరికినప్పుడల్లా వృథాపుచ్చకుండా చదువుకొంటూ వుండేదాన్ని; బాల్య సంకల్పానికి దోహదాలు చేసుకొంటూవుండేదాన్ని. ఇరుగింటిబిడ్డలూ పొరుగింటి బిడ్డలూ వచ్చి 'అత్తా, అత్తా నాకు లత-తల-వలలు నేర్పవూ'అంటూ తొందరచేసేవాళ్లు. విసుగు లేకుండా బహుసంతోషంతో నేర్పుతూవుండేదాన్ని.

యుక్తవయస్సురాగానే నాకు వివాహం చేశారు. మా అత్తవారిదీ పల్లెటూరే. నాభర్త ఉన్ననాలుగెకరాల మాగాణీ సొంత సేద్యంచేసుకొంటూ సుఖంగా కాలక్షేపం చేస్తూండేవారు. ధర్మేచ, అర్థేచ, కామేచ అతిచరించనంటూ మెలగే హిందూయువతిని కాబట్టి నాకూ ఆయనతోడిదే లోకం అయిపోయింది. ఆయనకష్టసుఖాలలో నేనూ భాగం వహించేదాన్ని. చిలకాగోరింకల్లాగు ఎంతో ముచ్చటగా వుండేవాళ్లం మేమిద్దరమూను.

కాని యీ సందడిలో నావ్యాసంగమంతగా సాగడం తప్పిపోయింది. అయితేనేమి, పనులన్నీ ముగించుకొని, రాత్రి అందరూ నిద్రపోయినతరువాతనన్నా సాధ్యమైనంతమట్టుకుతప్పకుండాచదువుకొంటూ వుండేదాన్ని. ధర్మలోప భయం లేకుండా మెలగుతూవుండడాన్నిబట్టి నాభర్తగారు నా చదువుకేమీ ఆక్షేపణ చెప్పలేదు. అప్పుడప్పుడు ఏవో పిచ్చికథలు తోచినట్లు వ్రాసుకొంటూ అసంతృప్తిగా నేనే చించి పారవేస్తూవుండేదాన్ని. అప్పటికి సాధించిందేమీ లేకపోయినా వ్రాత అలవాటవుతూవుండేది. ఈ ప్రయత్నమేమీ కావ్యసృష్టికి కాదుగనుక త్వరలోనే సంకల్పం సిద్ధించే లక్షణాలు తోచాయి.

మా యింటికిదగ్గరగానే ఒకతోట వేసుకొన్నాం. కూరగాయలూ, పూలమొక్కలూ అందులో వేసుకొన్నాం. ఇంట్లో పాడిపశువులు, గొడ్డుగోదములు. ఈ అన్నీ చక్కబెట్టుకోవడంతో ఉదయం నాలుగ్గంటలు మొదలు రాత్రి పదింటిదాకా నా కొకేపనిగా వుండేది. అన్ని కష్టాల్లోకూడా నే నానందమే అనుభవించేదాన్ని. నా భర్తగారు కూడా

తమపను లన్నీ సర్దుకొని నాకూ సహాయప డుతూవుండేవారు. ఉన్నమట్టుకు ఇల్లూ, ఇం టిలోని వస్తువ్రులూ మట్టసంగా పెట్టుకొని అనుకూలాలు చేసుకొంటూవుండేదాన్ని.

ఈవిధంగా ఒకటి రెండేండ్లు గడచిపో యినాయి ఏవిధమైన విచారమూ లేకుండా సంసారం చక్కబెట్టుకొంటూవచ్చాను. ఇది యిలా వుండగా మా యింట్లో ఒక చిన్న పాప అవతరించడానికి ఉపక్రమించుకొన్నది.

బిడ్డలంటే నా భర్తగారికి కెంతో ప్రీతి. ఆయన విచారించేదల్లా నా ఆరోగ్యాన్ని గురించే. ఈ కొత్తపరిస్థితికి ఆయన పరమా నందపడినారు.

అన్నవస్త్రాలకు లోటులేదు. వ్యసనాలు లేవు. అభిమానంగల భర్త. అన్నీ అనుకూ లపడి నాజీవితం బ్రహ్మానందంగా పరిణమిం చింది. కమలపుట్టి దాన్ని మరింత వృద్ధి చేసింది.

ధాన్యంభరలు బాగనే ఉన్నాయి. మాకు పంటకూడా బాగానేపండింది. అప్పు డప్పుడు చేస్తూవచ్చిన బాకీలు తీర్చుకొన్నాం. అందరికీ ఆరోగ్యం సలక్షణంగా ఉంది. చిన్న కూన కమలకూడా అల్లారుముద్దుగా ఆడు కొంటూవుంది. అన్నీ బాగానే ఉన్నాయి.

ఉన్నదున్నట్టు కాలం వక్రించిపోయింది. కానిరోజులు వచ్చి పడినాయి. పంటయేమో ఇంకా బాగానే వచ్చిందిగాని ధరలే సగానికి సగం పడిపోయినాయి. ఇంటిబాకీలు బాకీలు గానే నిలిచిపోయినాయి. శిస్తులకు, కూలీలకే సమ్మసరిపోయింది రాబడి. అన్నవస్త్రాలకు తృణంగూడా మిగలలేదు. గుడ్డలేమో పాత వాటినే చిరుగులు కుట్టుకొని సర్దుకొన్నాం.

అంతలో మరింత చురుకుపుట్టింది. ఇబ్బ డిగా శ్రమించడానికి పూనుకొన్నాం. ఇంటి పనులు, తోటపనులలోనే ఉన్నదాన్ని వ్యవ సాయపు పనుల్లోకూడ భర్తగారికి తోడుపో తూవచ్చాను. ఈ సారయినా ముందటియేడు లోటు భర్తీచేయవలెనని సకలప్రయత్నాలు చేస్తూన్నాం. పంటైనా రెండింతలుగా వస్తే అన్నీసర్దుకొని పోవచ్చునని ఆశ. అన్నిసూ ఖ్యాలూ వదలుకొని ఒకే ధాటిగా పాటుప డడానికి పూనుకొన్నాను.

అటువంటి పరిస్థితులలోని కష్టాలు అను భవించినవారికేగాని తెలియవు. కాని నా కొక్కర్తెకే కాదు; ఇరుగుపొరుగువారి కందరికీ గూడా ఇదే అనుభవం.

వేకువజామున లేవడం, పశువులకు నీరు పెట్టడం, పాలు పిండుకోవడం, మజ్జిగ చిల కడం, ఇంటి కసవూడ్చుకోవడం, పాచి పనులు చేసుకోవడం, స్నానంచేసి వంట వార్చడం, భోజనం చేయడం, తోటా పొలాలూ చూచుకొనివచ్చి గుడ్డలు ఉతికి ఆరవేసుకొని నీళ్లు తోడిపెట్టుకోవడం, వంట సామగ్రి చక్కబెట్టుకోవడం, తోటలో కాయగూరలు-పూలు కోసుకొని రావడం, సందెకసవు ఊడ్చడం, పశువులను కట్టివేసి మేతా నీళ్లూ పెట్టడం, పాలు పిండుకోవడం,

మళ్లా వంటకుపక్రమించి భోజనం చేయడం, మరుసటి నాటికి కావలసినవన్నీ సర్దుకోవడం, పడకలు వేయడం, ఈ మధ్య మధ్య బిడ్డను ఆడించుకోవడం మొదలైన పనులతో క్షణం విరామంలేకుండా కార్యక్రమం సాగిపోతూ వుండేది. రాత్రిపూట ఏ అయిదారుగంటలో తప్ప విశ్రాంతే దొరికేదికాదు. అప్పుడూ కొంత సేపు చదువు.

ఇంత అవస్థపడినా జీవనం సక్రమంగా జరిగే ఉపాయం కనుపించలేదు. పంటల మాట యెట్లావున్నా ధరలు మాత్రం పడిపోయినవి పడిపోయినట్టుగానే ఉన్నాయి. రోజులు గడవడం బహు దుర్భరమైపోయింది. అయినా మేము లెక్కచేయలేదు.

మేమున్నా ఎంతో మేలు, సగం కడుపు కన్నా తినగలుగుతున్నాం; ఇల్లూ వాకిలీ ఉన్నది అంతమాత్రానికీ నోచుకొని చుట్టుపక్కలవాండ్లను చూస్తూవుంటే వారి అవస్థలముందు మావి అవస్థలే అనిపించేవికావు.

ఇట్టి స్థితిలోకూడా, దైవబలం కాకపోతే మరేమి, బాకీదార్లు తొందరచేయడం లేదు. ఇచ్చిన తృణమోపణమో పుచ్చుకొని తర్వాతనే ఆమెలెండిలంటూ సమాధానంగా పోయేవారు.

ఎన్నిరోజులన్నా యిలాగే గడుస్తూవుండేటప్పటికి కొంచెం కష్టం తోచిన ట్టయింది. ఇల్లు మరమ్మతు చేసుకోవడంకూడా సౌకర్యపడలేదు. వ్యవసాయపు పనిముట్లు పాతపడి. చివికిపోయినాయిగాని కొత్తవాటిని కొనుక్కోవడానికి సందర్భపడలేదు. అన్నట్టు చెప్పమరిచినాను, రెండవ సంతతికూడా కలిగింది. ఆ బిడ్డలకు కావలసిన వస్తువులకు కూడా మార్గం లేదు. ఖర్చులేమో రోజుకు రోజుకు బలిసిపోతున్నాయి.

పోనీ, చిల్లరపనులేమన్నా చేసుకొని అదనపు ఆదాయానికి మార్గంచూతామంటే అటువంటి వేమీ స్ఫురించలేదు. పూలూ, కాయగూరలూ అమ్ముకొంటే మాత్రం ఎంత వస్తుంది? కూలిపెట్టి సమీపంలో వుండే సంతలకు పంపితేమట్టుకు బండిబాడుగలు, కూలీలు సర్దుకొనిపోయేటట్లు రాబడి వస్తేనే బ్రహ్మప్రళయ మైపోయేది.

* * * *

కాలచక్రం గిర్రున తిరుగుతూ వుంటుంది కాబోలు, మళ్లా మంచిరోజులు వచ్చినాయి. కష్టాలు కాపురం ఉండ వంటారు, ఇదే కాబోలు! ధరలు మామూలు స్థితికి వచ్చినాయి. ఊరందరితోపాటు మేమూ అమితంగా సంతోషించినాము. ఇలువేల్పుకు మొక్కులు సహా చెల్లించాము. తిరిగీ మొదటి సుఖజీవనంలో పడినాము. పసికూనలకు కావలసినన్ని వస్తువులు సమకూర్చినాము; మేమూ సమకూర్చుకొన్నాము. ఇల్లు మరమ్మతు చేసుకొని అందంగా తీర్చుకొన్నాము. బాకీలు తీర్చుకొన్నాము.

కష్టములంటే యేమిటో, సంసారంలో యేర్పడే చిక్కులేమిటో, ధనం లేకపోతే

వచ్చే యిబ్బంది లెట్టివో నా అనుభవాన్ని బట్టి చక్కగా గ్రహించగలిగినాను. కాని. రోజులు అనుభవించినాను గాబట్టి జీవన సౌందర్యాన్ని అప్పుడే అనుభవింపగలిగి నాను. కష్టసుఖాల తారతమ్యం తెలిసి వచ్చింది. అనుభవపాఠాలు నేర్చుకొన్నాను.

మళ్లా నా జీవితంలో ఒకటిరెండుసార్లు ఇటువంటి ఎగుడుదిగుడులే సంభవించినాయి. అప్పటికి నాకు మరియిద్దరు సంతానం కలిగి యుండడం మూలాన్న మొదటిసారికన్న పెక్కింతలు ఆజీవితం కష్టంగా అగుపించింది. గాని ఒకసారి అనుభవించినదాన్ని గావున సమాళించుకొంటూవచ్చాను. నా భర్తగారు కూడపిల్లలమీదనుండే ఎనలేని మమతతో కన్న కష్టాలుపడుతూ వాండ్లసౌఖ్యానికై ప్రయత్నపడుతూవుండేవారు.

ఇన్నికష్టాలలోకూడా ఆనందాన్ని, హాయినిగూర్చిన నాపల్లెటూరు జీవనాన్ని గురించి, ఆ సౌందర్యాన్ని గురించి తరుచు మిత్రురాండ్రతో ప్రసంగం చేసుకొంటూ మురుస్తూవుంటాను. ఆసంభాషణల సారాంశమే యీ కథ. నాచిరవాంఛితం యిప్పటికైనా యీ రీతిగానైనా తీర్చుకోగలిగితిని గదా యని అమిత సంతోషమవుతూంది.

ఇదేం గొప్పకథ అని గాదు ప్రకటించు కోవడం. నేను గడపిన సామాన్య జీవనాన్ని, అందు లోని అందాన్ని ప్రపంచంలో నావంటివారు పడే అవస్థలను వ్యక్తము చేయడానికీ, నా చిన్ననాటి సరదాను ఎలా పోషించుకొంటూవచ్చి కృతకృత్యురాల్ని అయ్యానో తెలుపడానికీ మాత్రమే యిది వ్రాశాను. నాచదువుకులాగానే ఈవ్రాతకుగూడా రాత్రిపూటే విశ్రాంతిదొరికి వ్రాసినాను చదువరులు ఈకథకు సంతోషించినా సంతోషించకపోయినా ఆనాటికోరికను నెగ్గించుకోగలిగితిని గదా అని లోలోపలే మురిసిపోతున్నాను. ఇలాంటివే యింకా వ్రాస్తూవుంటే ఇప్పుడు గాకపోయినా మరొకప్పుడైనా నా కథలూ జాతిరత్నాలే అవుతాయి. చూస్తూవుండండి.

---

# వాఙ్మయమన నేమి?

దివాకర్ల వేంకటావధాని

సామాన్యముగా నచ్చు నెల్లరును బుస్తకముగా ముద్రింపఁబడిన సర్వమును వాఙ్మయాంతర్భాగమే యని తలంతురు. ఈ నిర్వచనము నన్యథాకరించుట కంత తర్కముతోఁ బనిలేదు. కేవల మపండితులకైనను సర్వసామాన్యమానవజీవితముతో సంబంధించి యుండుట వాఙ్మయమున కపరిహార్యమైన ముఖ్యలక్షణములలో నొకటి యని సుఖముగా బోధింపవచ్చును. అందుచే నొకవ్యక్తియొక్క కాని, సంస్థయొక్క కాని, వృత్తియొక్క కాని జీవితాభ్యుదయములతో మాత్రమే సంబంధించియుండుదానిని బుస్తకాకార ముద్రితమే యయ్యును నిజమైన వాఙ్మయభాగ మనఁ జెల్లదు. ఇట్లగుటచేఁ బైనిర్వచనమునందలి యతివ్యాప్తిదోషము పరిస్ఫుటమైనదికాని యవ్యాప్తిదోషముకొంతవఱకుఁగలుగుచున్నది. ఏలయన గ్రంథస్థమైనదెల్లను నిజమైన వాఙ్మయమెట్లు కాదో వాఙ్మయశబ్దవాచ్య మట్లే గ్రంథస్థము కానిదెంతో యున్నది. జనసామాన్యమును మందలించి సమర్థించి సుఖితము కావించి భయపెట్టి తచ్చిత్తముల సర్వతోముఖముగా సంస్కరించు మతాచార్యుల ధర్మోపన్యాస వాఙ్మయమున నధమము వేయవవంతునకైన గ్రంథభాండారములఁ గానిపించుపుణ్యము లేదు. ఆంగ్ల నాటకసార్వభౌముఁ డనఁదగిన షేక్స్పియరుయొక్క నాటకములును, గ్రీకువారి యుత్తమవిషాదనాటకములును దొలుదొల్త జనసామాన్య చిత్తముల సారస్వతత్వము నొంది పఠనయోగ్యములైన వస్తువులుగా ముద్రింపఁబడుటకు మున్న తత్ప్రదర్శనదిదృక్షాగతులైన సామాజికసంఘములమూలముననే నిజముగాఁ బ్రచురింపఁబడియుండెను. ముద్రణలేఖనవ్యయ మతిమాత్రమైన యా దినములలో నీప్రదర్శనాఖ్య ప్రచరణము పుస్తకములుగాఁ బ్రచురింపఁబడు నెప్పటికంటె నెక్కువ సంస్కారమునే కలిగించియుండెను.

అందుచేఁ 'బుస్తకము' లనుపదము వాఙ్మయపదమంత విస్తృతార్థము కలదికాని, తదభిన్నమైన పర్యాయపదము కాని కాఁజాలదు. ప్రదర్శనసమయప్రేక్ష్యమును, వాగ్వివాద్యమును, నీతిగర్భమును నగు నుపన్యాసముల వంటి యథార్థవాఙ్మయము పుస్తకపదవాచ్య మెన్నఁడును గాకుండుటయుఁ బుస్తకపదవాచ్య మెంతో పెక్కుచోట్ల సారస్వతధర్మవియుక్తమై యుండుటయు దీనికిఁ గారణములు. వాఙ్మయపదమునకు యుక్తతరమైన నిర్వచనాంతరమునకై ప్రయత్నించుటకంటెఁ దన్నిష్పాదితమగు ప్రయోజన ద్వితయమునందలి తారతమ్యమును నిశితముగా గమనించినచో గ్రంథాకృతిఁదాల్చిన దెల్ల వాఙ్మయమే యను తప్పటూహ కొంతవఱకు సవరింపఁబడును. మనము వాఙ్మయమను సమాహారాభిఖ్య నొసంగు నీమహత్తరమైన సాంఘిక సాధనమునఁ బ్రత్యేకములైన రెండుప్రయోజనములు పృథక్కరింపఁ బడవచ్చును. ఈ రెండు నొండొంటితోఁ దఱుచు కలయికఁగాంచునవకాశమున్నను స్పష్టముగా వేఱుపడుటకును నైసర్గికముగా నన్యోన్యవైరుద్ధ్యమును గాంచుటకును నర్హములై యున్నవి. అందు మొదటిది వైజ్ఞానిక వాఙ్మయము; రెండవది శక్తిమద్వాఙ్మయము. బోధించుట మొదటిదానిపని; హృదయమును జలింపఁజేయుట రెండవదానిపని. మొదటిది పడవచుక్కానివంటిది; రెండవది తచ్చాలకమగు తెడ్డు తెరచాపలవంటిది. మొదటిది కేవల తార్కికబుద్ధికే రంజకముగా నుండును. రెండవది సంతోష సానుభూత్యనుభావములద్వారా వివేకమనఁబడియెడు విశుద్ధవిజ్ఞానమును రంజింపఁజేయును. అది చివరికమలమైన శుద్ధవిజ్ఞానమునే చేరఁగల్గినను మొట్టమొదట మానవకామరాగోల్లాస భావములచే నాచ్ఛాదితమైన సామాన్యజ్ఞానమునకుఁగూడఁ జలనముఁ గలుగఁజేయును. అట్లుకానిచో నది శక్తిమంతమే కాకపోవును. సారస్వతముయొక్క యున్నతప్రయోజనములఁగూర్చి

పెక్కుకు బాగుగా నాలోచింపకపోవుటచేఁ గేవలవ్యుత్పత్తివర్ధకత్వము వాఙ్మయముయొక్క యప్రధాన ప్రయోజనమని చెప్పుట వారికసత్యాభాసమువలెఁ గానిపించును. సాధారణముగా జ్ఞానసంపాదనమునుగూర్చి మనము మాట్లాడునప్పు డేవో క్రొత్తదనముతోఁగూడిన పదముల నేర్చుకొను టనియే యనుకొందుము. కాని యల్పబుద్ధులకుసైత మెన్నఁడును సరిక్రొత్త కాకుండుటయే మానవప్రవృత్తులలో నున్నతస్థాన మాక్రమించు మహాసత్యముయొక్క యాధిక్యము. అల్పులలోఁగాని యధికులలోఁగాని యది శాశ్వతముగా బీజప్రాయముగానైన నుండితీరును. అది తతో౽ధికోన్మేషము నాశంసించుచుండునే కాని యెన్నఁడును నంకురార్పణము నాసించుస్థితిలో నుండదు. ఒకచోటినుండి తీసి యింకొకచోట నాటుట కర్హమై యుండుట నీచతరగతికిఁ జెందిన సత్యముయొక్క లక్షణము. ఇదిగాక సత్యముకంటె నరుదైన 'శక్తి' అనఁబడు సత్యమందలి సానుభూతి యింకొకటి కలదు. ఉదాహరణమునకు సంఘముపై శిశువులకుఁగల ప్రభావమెట్టిదో పరికింతము. వారియసహాయతతోడను, అమాయికతతోడను, అతిసారళ్యముతోడను సంబంధించియుండు దయాలాలిత్యప్రీతులచే మనలోని ప్రధానానుభావములు ప్రబలీకరింపఁబడి క్రమక్రమముగాఁ గొనసాగింపఁబడుటయేకాక సహానాకర్షకమైన యసహాయత, దివ్యతాసూచకమైన అమాయికత, లౌకికదూరగమైన సారళ్యము మొదలగులక్షణములు-స్వర్గదృష్టితోఁ జూడఁ బ్రియతమములైనవి- శాశ్వతస్మృతియం దుంపఁబడి తదాదర్శములు నిరంతరముగాఁ బునరుద్ధరింపఁబడును. ఉన్నతజాతికిఁజెందిన శక్తిమద్వాఙ్మయముచే నిట్టిదే యొకప్రయోజనము సాధింపఁబడును.

పరమపవిత్రమైన రామాయణమును బఠించుటవలన మనము నేర్చుకొనున దేమి? ఏమియును లేదు. కాని పాకశాస్త్రమునందలి ప్రతివాక్యమునుండియు నజ్ఞాతపూర్వములైన యభినవాంశముల నెన్నిటినో నేర్చుకొనఁగలము. ఈకారణముచే మహత్తరమైన యీ దివ్యకావ్యముకంటె నల్పమైన యీ పాకశాస్త్రమే యున్నతతరగతికిఁ జెందు ననవచ్చునా? రామాయణ పఠనమువలన మనము బడయఁగల్గునది అధిగమించిన కొలంది నైహికమాత్రోన్నతిని గల్గించునట్టి కేవలవ్యుత్పత్తిమత్త్వము కాదు. దానివలన మన మలవరించుకొనునది 'శక్తి' అనఁగా మనలో గూఢమైయున్న యనంతపదార్థముతోడి సానుభూతి సామర్థ్యమునకు సంధుక్షణము కలిగించి విస్తరింపఁ జేయుటయే. అట్టియెడఁ బ్రతిరక్తనాళ చలనమును, అంతఃప్రవిష్టమైన ప్రత్యక్షరార్థమును సోపానపరంపరల సాహాయ్యమునవలె నతిలోకమైన యత్యున్నతపదముల నొక్కొక్క యడుగిడుచుండుటయే యగును. పాకశాస్త్ర పఠనమువలన పలువిధములైన ప్రవృత్తి యిహలోకముననే క్రమోన్నతమైన స్థానమును గలిగింపఁగలదు. కాని సామాన్య ప్రపంచపుఁబొలిమేరనుండి యొక్కపదమైనఁ బైఁబెట్టనీయదు. కాని 'శక్తి' సంపాదనానంతరము వేయు మొట్టమొదటిపదమే యైహికప్రపంచ విస్మారకమైన ప్రపంచాంతర పరిసరములకుఁ బ్రయాణారంభమై యుండును.

శైలక్షణములతోఁగూడిన శైశవావస్థ సందర్శించుటచేతఁగాని, యవకాశ వ్యత్యాసములతోఁగూడియుండు యథార్థజీవితముచేతఁగాని, కావ్యాద్యనుకరణములలో నేకదంశద్వితయమును మిశ్రీకరించు వాఙ్మయముచేతఁగాని మానవమనః ప్రవృత్తులు సంధుక్షితములై నిరంతరోన్మేషితములు కానిచో నవి యనుపయుక్తమైన యంత్రశక్తివలెఁగాని, కండరశక్తివలెఁగాని క్రమక్రమముగా క్షీణించి నశించిపోవును. వైజ్ఞానిక వాఙ్మయముతోఁ బ్రతియోజితమైనప్పుడు శక్తిమద్వాఙ్మయము మానవుని యీ నైతికశక్తులఁ బురస్కరించుకొనియే సజీవమై కార్యక్షేత్రమును గలిగియుండును. అది మానవునిలో నత్యున్నతమైనదానితో సంబంధించి యుండును. ఏలయన మతగ్రంథములు నైతము ప్రత్యక్షముగాఁగాని, యప్రత్యక్షముగాఁగాని కేవలలౌకిక బుద్ధినిగూర్చి యెన్నఁడును జెప్పియుండలేదు. మానవుని వైజ్ఞానిక శక్తినిగూర్చి చెప్పవచ్చు డవి కేవలబుద్ధినిగూర్చికాక సర్వబోధకమైన హృదయమును (Un-

derstanding heart) గూర్చియే చెప్పుచుండును. చూచినంతమాత్రమున సర్వమును గ్రహింపఁగల 'హృదయ' మిచ్చట ననంతసత్యముతోడి సానుభూతికల మానవునికిఁ బర్యాయముగాఁ జెప్పఁబడినది. విషాదనాటకముకాని, చిత్రకథకాని, యితిహాసముకాని, న్యాయముయొక్కయు, ఆశయొక్కయు, సత్యముయొక్కయు, దయయొక్కయు, దండనముయొక్కయు నాదర్శములను మానవస్మృతిపథమున నచ్చొత్తించును. అట్లుగాక యథార్థమైన నిత్యజీవితముపైమాత్రమే యాధారపడియుండుచో నవి యర్థ్వమైన యుదాహరణాభావముచేఁ గ్రమక్రమముగా క్షీణించి పోవలసివచ్చును. ఉదాహరణమునకై యిటఁ గావ్యన్యాయమును దీసికొందము. ఈ కావ్యన్యాయమునకును సాధారణ లోకన్యాయమునకును నుద్దేశములలో నెట్టి వ్యత్యాసమును లేదు. అట్లుండుచో నది మిక్కిలిచెడ్డ రకమునకుఁ జెందిన న్యాయ మనవలసివచ్చును. నిజమునకు సామాన్య లోకన్యాయమునకును దీనికిని గలభేద మవి సాధించునుద్దేశముల పరిమాణమం దుండును. అది లొంగనిప్రాపంచిక జీవితతత్త్వములతోఁగాక, స్వకల్పితములైన తత్త్వములతోడను, బరిశుద్ధములైన తన పూర్వకల్పనల కనుగుణముగా మాఱుచుండువస్తువులతోడనుమాత్రమే సంబంధించియుండుటచే స్వోద్దేశసాధనమున నెక్కువదక్షమైయుండును. శక్తిమద్వాఙ్మయమే లేనిచో నీయాదర్శములు శుష్కమైనయూహారూపములుగా మాత్రమే యుండిపోవును. కాని యవి వాఙ్మయ ప్రదర్శితమైన మానవసృజనశక్తిచే నవనవమైన సారస్యమును బొంది సారవంతమైన సంచాలకగుణములుగాఁ బరిణమించును. అతిసామాన్యమైన నవలయైనను మానవాశా సంత్రాసములతోడను, సదసత్ప్రవృత్తులతోడను గలసి సాగుచుండును గావున యాభావములను సముద్ధరించి సంధుక్షితములఁ గావించును. అది వానిని గ్రియోన్ముఖములు గావించి యాలస్యమునుండి పరిరక్షించును. కేవలబోధకమైన వాఙ్మయమునకంటె నధమమైనదైనను మనశ్చాలకమైనట్టియు, బోధించినను గూఢముగాఁ జలింపఁజేయునట్టియు వాఙ్మయమున కాధిక్యము చెప్పఁబడుట యిందుచేతనే. వైజ్ఞానికవాఙ్మయమం దెంత యుత్తమగ్రంథమైనను గేవలము తాత్కాలికమైనదే. స్థిరత్వము లేమిచే నది యెప్పటికప్పుడే మాఱుచుండును అందలి విషయములు పాక్షికముగాఁ బరిష్కరింపఁబడినను విస్తరింపఁబడినను, ఉదాత్తతరమైన యాకృతి యొసంగఁబడినను బూర్తిగా రద్దుచేయఁబడినదన్నమాటే. శక్తిమద్వాఙ్మయమునం దధమాధమమైన కావ్యమైనను సుసంపూర్ణమై మానవులలో మార్పరానిదిగా నుండును. ఉదాహరణమునకు శాకటాయనుని వ్యాకరణముఁ దీసికొందము. అది మున్మొదట విషయమునుగూర్చియుఁ దరువాత దానిసేర్పరించి సుస్వరూపము నొసంగుటను గూర్చియుఁ బ్రతిపదమునందును బరమప్రయాస పడవలసియుండెను. పాణిన్యాచార్యుఁ డరుదెంచి యందలి మూలసూత్రముల ననుసరించియే తనయుత్తమవ్యాకరణమును వ్రాయుటచే నిది మూలఁబడవలసివచ్చెను. అనఁగా శాకటాయనునినుండి గ్రహించిన సాధనములతోడనే పాణిని యాతనిగ్రంథమును మూలఁబడవైచి విస్మృతము కావించెనన్నమాట. అందుచే శాకటాయనునినామము మబ్బులోపలి చంద్రునివలె మఱుగుపడియున్నది. కాని సత్యసూత్రసమన్వితము, సజీవము నగుటచే నాతనిగ్రంథ మష్టాధ్యాయిలో నాకారాంతరమును గాంచిన దనవచ్చును. భారతము, భాగవతము, శాకుంతలము, ఉత్తర రామచరిత్రము మొదలగున వట్లుకాక తామువ్రాయఁబడినభాష ధరణిలో నున్నంతకాలము సందిగ్ధములుకాక శాశ్వతసమున్నేమము కలవైయుండును. అవి పైవ్యాకరణమువలె రూపాంతరము నెన్నఁడును బడయలేవు. వానిని గ్రొత్తరూపముల వెలయించుటకాని, పాక్షికముగా నైన సవరించి పుస్తకాంతరముగాఁ బ్రకటించుటకాని గ్రంథచౌర్యమే యగును. ఒకమంచి యావిరియంత్రమునకు బదులుగా నంతకంటె మంచిదైన మఱియొకయంత్రమును నెలకొల్పవచ్చును. కాని రమ్యమైన యొకపచ్చికబయలును మఱియొక పచ్చికబయలుచేఁగాని, రవివర్మచిత్రమును 'మైకలాంజిలో' చిత్రముచేఁగాని రద్దుచేయుట మిక్కిలి దుర్ఘటము. ఈ వస్తువు లొకవిధముగాఁ బృథక్కృతములగుట

సామ్యసాధ్యతచేతనేకాని సామ్యాభావముచేఁ గాదు. అవి జాతిచే భిన్నములైనను ఒకటే ప్రమాణమును బట్టి యీ సమము లని యనుకొనరాదు; అవి యింకొక విధముగా సమములైనచో భిన్న ప్రమాణములనుబట్టియే శాశ్వతసౌందర్యముగల మానవకార్యము లన్నియుఁ బ్రకృతివస్తువు లొకరీతిగను సమానపరిస్థితిలోనే యుండును. అవి యెన్నఁడు నొండొంటికిఁ బౌనరుక్త్యములు కావు. భేదము లేనంతగా సాన్నిహిత్యమును గూడ నెన్నఁడును బొందవు. ఉత్తమాధమములుగాఁగాని, యెక్కువతక్కువలుగాఁగాని యవి యెప్పుడును భేదిల్లవు. వాని పరస్పర భేదములు దుర్జ్ఞేయములును, అన్యదుర్వచములును నైనవి. వాని ననుకరించుటకుఁగాని, నకలుటద్దములలోఁ బ్రతిబింబించుటకుఁగాని వీలులేదు. నీచములైన యుపమానపరిమాణములలో వానినిఁగూర్చి యూహించుటయే యశక్యము.

(డీక్విన్సీ ననుసరించి.)



మకరందము —తోట.

# సప్తఋషులు

గొబ్బూరు వెంకటానంద రాఘవరావు

"యత్రా సప్త ఋషీన్ పర ఏకమాహుః"
—ఋగ్వేదము. X-82-3.

"Seek Him that maketh the Seven Stars". -Bible Amos. 5-8.

సప్తఋషుల ప్రశంస వేదములలో కలదు; శాస్త్రములలో కలదు; పురాణములలో కలదు; క్రైస్తవులవేద మనదగు బైబిలులో కలదు. యూరపుఖండవాసులు ఈ యేడుచుక్కలుగల తారాగణమును 'పెద్దఎలుగు' (Great Bear)అనుచున్నారు. ఈ చుక్కలకే ఛార్లెస్ వెయిన్ (Charles Wain) అనికూడ పేరున్నది. అమెరికాఖండస్థు లీ చుక్కలను డిప్పర్ (Dipper) అనిచెప్పుదురు. పెద్దయెలుగు, చిన్నఎలుగు అని యర్థమిచ్చుబృహదృక్షు, లఘుఋక్షుపదము లీ చుక్కలకును, వీనిలోపల ధ్రువుని సమీపమునగల చుక్కలకును భాగవతము లోనను పురాణములలో వాడబడియున్నవి.

కొందరు పౌరాణికులును, వివాహములు చేయించుపురోహితులును, "కశ్యపోఽత్రి ర్భరద్వాజో విశ్వామిత్రోఽథ గౌతమః, వసిష్ఠో జమదగ్నిశ్చ సప్తైతే ఋషయ స్తథా" అను శ్లోకమును చదివి ఆవరుసనే ఖగోళపుటుత్తరదిశనున్న ఏడుచుక్కలను చూపుచున్నారు. అది సరికాదనియు, బృహదృక్షు సప్తఋషులలో కశ్యప, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్నులనుఋషులు లేరనియు నేను ఆరుసంవత్సరములక్రిందట మాకవితాసమితివారు ప్రకటించిన వైశాఖిసంచికలో "నక్షత్రములు" అనువ్యాసమున ౭౯ పుటలో విన్నవించుకొనియున్నాను. అందుకు ప్రమాణముగా వరాహమిహిరాచార్యులవారు బృహత్సంహితలో, సప్తఋషిచారమను నధ్యాయములో వ్రాసిన ౫-౬ శ్లోకములను, భాగవతపు ద్వాదశస్కంధము, ద్వితీయాధ్యాయము ౨౭ శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు శ్రీధరాచార్యులవారు సప్తఋషులెవరో, వారి నేలాగున పోల్చుకోవలెనో స్పష్టముగా తెలిపిన విషయములను వివరించియున్నాను.

మఱియును భారతియందు నేను ప్రకటించుచున్న నక్షత్రమండలవ్యాసములలో అవసర మగునపుడెల్ల సప్తఋషులప్రశంస చేయుచు చిత్రము లిచ్చుచున్నాను.

యువసంవత్సరాదిసంచికలో బ్రహ్మశ్రీ చివుకుల వెంకటరమణశాస్త్రిగారును, బ్రహ్మశ్రీ అరిపిరాల వెంకటనారాయణసిద్ధాంతిగారును సప్తర్షిమండలమును గూర్చి ౧౯౪ మొదలు ౧౯౭ వఱకు కలపుటలలో ఒక వ్యాసమును వ్రాసియున్నారు. పైని స్మరింపబడిన బృహత్సంహితలోని సప్తఋషిచారమునందలి శ్లోకమునేగాక సిద్ధాంతదర్పణములోని త్రిప్రశ్నాధికారమునందలి భగ్రహయోగవర్ణనలో ౪౧ శ్లోకమునుకూడ వారు వివరించినారు:—

"పూర్వాగ్రం శకటాకార ముదక్స్థ ముడుసప్తకమ్, సప్తర్షిమండలం ప్రోక్తం వ్యక్తం విశ్వనమస్కృతమ్; తత్పూర్వోన్నతరేఖాగ్రే మరీచిః పశ్చిమే తతః, వశిష్ఠోఽరుంధతీయుక్త స్తత్పశ్చాదంగిరా స్థితః, తత్పశ్చాచ్చతురస్రస్య శంభుదిశ్యత్రిరస్యతు, పులస్త్యో దక్షిణే తస్య పశ్చిమే పులహ స్థితః, క్రతు స్తదుత్తరస్థానే"

"దీనినిబట్టి పైబృహత్సంహితాగ్రంథములో చెప్పబడిన సప్తర్షులపేర్లను రూఢిపరచుటయే కాక వారలలోని అనాంతరస్థానములును ఈక్రిందివిధముగా నన్నట్లు



విదితమగుచున్నది." అని మీద వ్రాసిన చిత్రమును ఆవ్యాసపు ౧౯౩ పుటలో వారు ఇచ్చినారు.

[చూ. యువసంవత్సరాది సంచిక ౧౯౫ పుట] నేను ఇచ్చుచున్న సప్తఋషుల నామములతో పటము ఈ దిగువ చూడనగును.




1. ఆల్ఫా. 2. బీటా. 3. గామా. 4. డెల్టా. ఎప్సిలాన్. 6. జీటా. 7. ఈటా. అనునివి ఈరిక్కలకు గల పాశ్చాత్యగ్రీకు అక్షర సంజ్ఞలు

ఈ రెండు పటములను పరిశీలించిన మిత్రులు కొందరు నన్ను ఇట్లు ప్రశ్నించినారు.:– "ఏమండీ! చివుకులవారి సప్తఋషులు వేరు, గొబ్బూరువారి సప్త ఋషులువేరునా? కశ్యపభరద్వాజాదులు సప్తఋషులు కారని మీరు ఉభయులును ఒప్పుకొన్నారే? అంగీరస, వశిష్ఠ, మరీచులను గూర్చికూడ మీరు ఏకాభిప్రాయము కలిగియున్నారు. కాని మీ క్రతువు వారిపులహుడు; వారిపులహుడు మీ క్రతువు; వారి అత్రి మీపులస్త్యుడు; మీ పులస్త్యుడు వారిఅత్రి; ఇట్లు తారుమారైనారేమి? ఎవరిది తప్పు? ఎవరిది ఒప్పు? ఏదినిజము?" అందుపైని నేను వారివ్యాసమును జాగ్రతగా చదివిచూచితిని. వారి వ్యాసముయొక్క ౧౯౪ పుటలో గ్రీకుఅక్షరసంజ్ఞలును, నేనువ్రాసిన గ్రీకుఅక్షరసంజ్ఞలును నక్షత్రములకు సరిపోయియున్నవి. "మరి తేడా ఎక్కడ ఉన్నది" అని ప్రశ్న.

తూర్పునగల మరీచి, వశిష్ఠ, అంగీరస నక్షత్రములనుగూర్చి అభిప్రాయభేదము లేదు. పడమటివైపున గల చతుష్కోణమునందలి (Quadrilateral) చుక్కలను గూర్చియే భేదము కలిగినది. వారిచ్చిన ప్రమాణమును నేను శిరసావహింతును:— "తత్పశ్చాచ్చతురస్రస్య శంభుదిశ్యత్రి" అంగీరసునకు పశ్చిమముననున్న చతురస్రములో శంభుదిశను అత్రి ఉన్నాడు. దీనినే శ్రీధరాచార్యులవారిట్లువ్రాసినారు: "తతః పశ్చాచ్చతురశ్రతారాచతుష్కే ఐశాన్యేఅత్రిః; తతో దక్షిణాకః పులస్త్యః; పులస్త్యాత్పశ్చిమతః పులహః; తతఉత్తరతః క్రతుః."

శంభుదిశయే ఈశాన్యభాగము. ఉత్తరమునకును తూర్పునకును మధ్యదిశ ఈశాన్యము. క్రతు, పులహ, పులస్త్య, అత్రి– ఈ తారాచతురస్రముయొక్క ఈశాన్యదిశను అత్రి ఉన్నాడు. ఇది సర్వాంగీకృతము: చివుకులవారును తమపటములో ఈశాన్యముననే అత్రిని ఉంచుటకు యత్నించినారు. సాధారణముగా మనము చదువుపుస్తకములలోను, వ్రాయు కాగితములలోను, దిక్కులు ప్రత్యేకముగా సూచింపబడనప్పుడు మీదిభాగము ఉత్తరమును, క్రిందిభాగము దక్షిణమును, కుడితట్టు తూర్పును, ఎడమతట్టు పశ్చిమమును సూచించును. చివుకులవారి నక్షత్రపటములో సప్తఋషులను నా రాయభిప్రాయముతోనే చిత్రించినారు. కాని అందు ధ్రువుడు క్రిందిభాగమున నుండుట వారు గమనించలేదు.

మనము చూచునపుడు సప్తఋషుల దిగువను ధ్రువుడగపడునేగాని ఎగువను ధ్రువుడగపడడు. దిగువ భాగము ఉత్తరమును, ఎగువభాగము దక్షిణమును అగును. ఆకాశమునందును, వారిపటమునందునుకూడ దిగువ భాగము ఉత్తరమగును. అపుడు చతురస్రపు నాలుగు చుక్కలలో వారు పులస్త్యుడని వ్రాసిన చుక్క అత్రి యగును; అత్రియని చూపినచుక్క పులస్త్యుడగును;

ఆలాగుననే క్రతువు పులహుడనును, పులహుడు క్రతువును ననుదురు. వారివ్యాసముయొక్క ౧౯౭ పుటలో ఇచ్చిన గ్రీకు అక్షరసంజ్ఞలవలన కూడ నేను పైని మనవిచేసినదే సరియని స్పష్టముకాగలదు. సప్తఋషులను గూర్చి స్పష్టముకాగలదు. సప్తఋషులను గూర్చి స్పష్టముగా తెలిసికొనుట చాల అవసరము. అనగా ఏ స్థానమున నున్న ఏచుక్క ఏ ఋషియో సరిగా తెలిసికొనుట చాల ముఖ్యము. కనుక ఈ క్రిందిపట్టిక వ్రాయుచున్నాను.

| ఋషి పేరు | గ్రీకుఅక్షర సంజ్ఞతో పేరు | | పాశ్చాత్య నామము |
|---|---|---|---|
| క్రతువు | ఆల్ఫా | Ursa Major | Dubhe |
| పులహుడు | బీటా | ,, | Merak |
| పులస్త్యుడు | గామా | ,, | Pheeda or Phad |
| అత్రి | డెల్టా | ,, | Megrez |
| ఆంగీరసుడు | ఎప్సిలాన్ | ,, | Alioth |
| వశిష్ఠుడు | జీటా | ,, | Mizar |
| అరుంధతి | 80 | ,, | Alcor |
| మరీచి | ఈటా | ,, | Benetnasch |

ఈఖగోళ సప్తఋషి నక్షత్రములను సరిగా గుర్తింపగలిగిన పక్షమున వీని సాయముచేత ఆకాశము నందలి ముఖ్య నక్షత్రముల కొన్నింటినో గుర్తింపగలము.

(౧) పులహక్రతు నక్షత్రముల మీదుగా నొక ఋజురేఖ గీచినపుడారేఖ సరిగా ధ్రువుని చూపును. సప్తఋషు లను చుక్కలు ఆకాశమున నెప్పుడే స్థానము నందున్నను ధ్రువునిచుట్టును తిరుగుచున్నట్లే మన కగపడును. కనుక బీటా - ఆల్ఫా - పులహక్రతురేఖ ధ్రువ సూచకము. ధ్రువుడున్నది ఉత్తరదిశ. ఉత్తరము తెలిసినపుడు తక్కినదిశలును సులభముగా తెలిసిపోవును. ధ్రువుని చూపునవి కనుక పులహ - క్రతు నక్షత్రములు ధ్రువసూచకములు- Pointers, పాయింటర్స్- ధ్రువుని చూపునవి అని పాశ్చాత్యులు చెప్పెదరు.

(౨) అత్రి, పులస్త్యనక్షత్రముల మీదుగా గీయబడిన ఋజురేఖ మఘనక్షత్రమును చూపును. అనగా డెల్టా - గామా రేఖ (Regulus రెగ్యులస్) మఘ నక్షత్రమును చూపును.

(3) అత్రి - క్రతురేఖ డెల్టా - ఆల్ఫా రేఖ ఇంచుమించుగా బ్రహ్మహృదయము (Capella in Auriga) ను చూపును.

(౪) అత్రి - పులహరేఖ (డెల్టా - బీటా రేఖ) పునర్వసులోని Castor & Pollux మిథునము - సాంబమూర్తి చుక్కలను చూపును.

(౫) వశిష్ఠ - మరీచిరేఖ జీటా - ఈటారేఖ ఇంచుమించుగా స్వాతిని చూపును.

(౬) క్రతు పులస్త్యరేఖ-ఆల్ఫాగామారేఖ స్వల్ప వక్రతతో చిత్ర (Spica) ను సూచించును.

ఇట్లే సప్తఋషి నక్షత్రముల విజ్ఞానము ఎంతో ప్రయోజనకారి యగుటచేతను, మిత్రుల ప్రశ్నకు ఉత్తరముచెప్పి యథార్థము తెలుపుట అవసరమగుటచేతను ఈ వ్యాసము వ్రాయవలసివచ్చినదని విన్నవించుచున్నాను.



టైరోన్ పవర్ - వర్జినియా ఫీల్డు

టైరోన్ పవర్ (జూనియర్) అమెరికా రంగస్థలంలో మిక్కిలి ప్రఖ్యాతిగన్న నటకుల్లో ఒకానొకరి కొడుకు. వర్జినియా ఫీల్డు ఇంగ్లీషుయువతి. ఈమె పయిని హాలీవుడ్డులో విజయవాదాలు కురిసిపోతూ ఉన్నవి. యౌవనమూ, సౌందర్యమూ తొనుకులాడుతూ ఉండే ఈ యువతీ యువకులు 'లాయిడ్సు ఆఫ్ లండను' అనేఫిలిములో నటిస్తూ ఉన్నారు.



రాకెల్ హడ్సన్ - మైకేల్ వేలెన్

సుందరులైన యీ యువతీ యువకులు 'పిచ్ ఎడివర్డ్' అనేఫిలిములో నటించుచూ ఉన్నారు. ఇద్దరుకూడా చాలా నిపుణులయినారు. నటించడమే జీవనోపాయంగా తాము చేసుకోవాలని చిన్నప్పుడే అనుకున్నారు. ఎన్నో ఒడుదొడుకులు వచ్చినా వెనుక్కు తగ్గకుండా వెతుక్కొని తిరిగి ఫిలిముల్లో నటించి సినిమాప్రపంచంలో తిన్నగా పైకివచ్చారు. ఇతర వైద్యాది వృత్తుల్లోలాగే సినీమానటనంలో కూడ కష్టపడి పైకిరావచ్చునన్న సంగతిని లోకానికి ప్రకటించిన వీళ్లకు ఎప్పుడూకూడా విజయం కలుగుతూ ఉండవలెనని ఆశింపతగును.

# కీ. శే. డాక్టరు వింటర్నిజు

డాక్టరు వింటర్నిజు భారతీయ సారస్వతానికి తన జీవితాన్ని అర్పించిన మహాపురుషుడు. ఆయనకు భారతీయ సారస్వతమంటే అపారమయిన ప్రీతి. ఆయన దాంట్లో అఖండమయిన పాండిత్యం సంపాదించుకున్నాడు.

వింటర్నిజు దిగువఆస్ట్రియాలో ౧౮౬౩ సంవత్సరం డిసంబరు ౨౩ తేదినాడు పుట్టాడు. పదిహేడేండ్ల వయస్సప్పుడు వియన్నా విశ్వ



డాక్టరు వింటర్నిజు

విద్యాలయంలో తత్త్వశాస్త్రాన్నీ, భాషా తత్త్వశాస్త్రాన్నీ చదువుకోడానికి మొదలుపెట్టాడు.

ఆయనకు ఆకాలంలోనే డాక్టరు బూలరు పండితుడితో పరిచయంకలిగింది. ఆయనకు మానవజాతుల తత్వాన్ని పరిశీలించాలన్న కుతూహలం ఆ మందటనే కలిగింది. ౧౮౮౬ సంవత్సరంలో ఆయన డాక్టరు బిరుదాన్ని సంపాదించుకున్నాడు. ఆయన వ్రాశినపుస్తకాల్లో మొట్టమొదటిది "ఆపస్తంబీయ గృహ్యాసూత్రం." ఆయన పాండిత్యాన్ని ఈ గ్రంథం లోకానికి బాగా మెరుకపరిచింది.

ఆ ప్రాంతాల్లోనే మాక్సుమూలరు పండితుడు ఋగ్వేదాన్ని రెండోమారు ముద్రించడానికి తలపెట్టి ఉన్నాడు. ఆపనిలో ఆయన తనకు సాయంగా ఉండడానికి సమర్థుడైన ఒక పండితుడికోసం వెతుక్కుంటూ ఉన్నాడు. వింటర్నిజుసామర్థ్యం విని ఆయన్ను తనకు సాయంగా పిలిపించుకున్నాడు. ఇరవయి అయిదేండ్ల ప్రాయంలో ఉండే వింటర్నిజుకు భారతీయ సారస్వతంలో లభించిన అఖండ పాండిత్యం చక్కగాపరిష్కరింపబడి అచ్చుపడిన ఆ పుస్తకంవల్ల లోకానికి వెల్లడయింది. దాంతో ఆయనకు ప్రపంచంలో పేరుమోసిన భారతీయ సాహిత్యవేత్తలలో పద్దుపడింది.

మానవజాతితత్త్వపరిశీలనమందు ఎక్కువ ఆసక్తి ఉన్నవాడుకావడం మూలాన 'వేదకాలంలో వివాహక్రమము' ఆయనదృష్టిని ఆకర్షించింది. కొన్నాళ్లకు ఆయన 'ఆపస్తంబమంత్రపాఠం' అనే గ్రంథాన్ని వ్రాశి ప్రకటించాడు.

ఆక్సుఫర్డులో బాడ్లీను లైబ్రరీలో ఉండే వైదిక గ్రంథాలకూ, గ్రేటుబ్రిటను, ఐర్లెండు- లైబ్రరీలలో ఉండే దక్షిణభారతీయ సం

స్కృత లిఖితగ్రంథాలకూ అకారాది పట్టి కను వ్రాయడానికి వింటర్నిజు పూనుకున్నాడు. ఇటువంటి నీరసకార్యాన్ని చేయడానికి పూను కున్నాడంటే చాలును ఆయనకు భారతీయ సారస్వతంమీద ఉండే ప్రీతివిశ్వాసాలను నిరూపించడానికి. మరివేరే నిదర్శనం పనిలేదు.

ఈ పట్టికను తయారుచేస్తూ ఉన్నప్పుడు మహాభారతాన్ని చక్కగా శోధించి సరి చూచి అచ్చువేయడం చాలా అవసరం అని ఆయన తెలుసుకున్నాడు. మరీ, అప్పుడే 'బ్రాహ్మణ సారస్వతంలో స్త్రీల స్థానం' (Position of women in Brahminical Literature) అనే గ్రంథాన్ని వ్రాశి ప్రక టించాడు. ఇదంతాకూడా ఆయనకు మానవ జాతి తత్త్వ పరిశీలనంలో ఉండే అధికమయిన ఆసక్తికి ఫలమే. ఇందుకోసమనే ఆయనకు మహాయాన బౌద్ధమతతత్త్వాన్ని అవగతం చేసుకోవలసివచ్చింది

ఆయనఖ్యాతిని శాశ్వతంగా నిలబెట్ట గలిగింది ఆయన రచించిన 'భారతీయ సార స్వత చరిత్ర' (History of Indian Literature). ఆ మహా గ్రంథాన్ని ఆయన జర్మను భాషలో వ్రాశాడు. ౧౯౨౨ సం॥లో అది పూర్తి అయింది.

ఆ వెంటనే ఆయన భారత దేశానికి వచ్చాడు. ఇక్కడ అనేక విశ్వవిద్యాల యాల్లో అనేకపర్యాయాలు ఉపన్యసించాడు. అనేకగ్రంథాలు వ్రాశాడు. ఆయన ఉత్సా హమూ, గ్రంథరచనా కారణంగా రెండుసార స్వతపత్రికలు అవతరించినవికూడ. అందుచేత ఆయనరచనలే ఆయనకు స్మృతిచిహ్న లుగా నిలిచినవి.

ఆయన పూనాలో మహాభార తాన్ని పరిశోధించి, సంప్రతించి, ప్రక టించడానికి పూనుకొనిఉన్న భండారుకరు సంస్థలో కొంతకాలం ఉన్నాడు. భారతేతి హాసాన్ని అసంఖ్యాలయిన మాతృకలతో సరిచూచి, చక్కగా పరిష్కరించి (పాఠభే దాలతోకూడ) అచ్చువేయవలసిన ఆవశ్యక తను కార్యకర్తలకు బోధించాడు. ఆయనకుండే నిశితమైన విమర్శన శక్తీ, సారస్వతంమీద గాఢంగా ఉండే ఆసక్తీ ఏకమయి రూపుకట్టు కున్న క్రమమే ఇది

ఆయనభారతీయ సారస్వతాధ్యయనం సచేతనమయింది. భారతదేశంతో కలిగిన నూతనసంబంధానికి బహుముఖవ్యాపి ని అయిన ఆయనప్రతిభకు అమూల్యమయిన దోహదం అయింది. నూతన దృక్పథాలెన్నో ఆయనమెదడులో మొలకెత్తినవి.

ఈ విధంగా అంతా కావలసిన సామగ్రిని సేకరించుకొని ఆయన జర్మను 'భారతీయ సారస్వతచరిత్ర'ను ఇంగ్లీషులో వ్రాయడా నికి మొదలుపెట్టాడు. ౧౯౩౩ సం॥ లో రెండో సంపుటం పూర్తిఅయింది. మూడవ సంపుటంపని సాగుతూ ఉండగా పెద్దజబ్బులో పడిపోయినాడు ఆయన. జీవిస్తాడా అనిపిం చిందికూడ. అయితే త్వరలోనే ఆరోగ్యం కలిగింది. ఆగిపోయినపని మళ్లాకొనసాగింది. అది కేవలమూ అనువాదంకాదు. అది ఒక నూతనసృష్టి. అందులోఆయనపాండిత్యమూ, అనుభవమూ, పరిణతమయిన జ్ఞానమూ నిండి నిమిడీకృతాలయినవి.

ఆయన నిగర్విచూడామణి; మృదుస్వభా వం గలవాడు. ఆయనవాక్కు మధురమైంది. భారతీయ సారస్వత తత్త్వజిజ్ఞాసే ఆసార

స్వతంమీాద ఆయనకుండే ఆదరవిశ్వాసాలకు అన్యథాకరింపరాని నిదర్శనం. ఆయన అధ్యయన పద్ధతిని, అపూర్వవిమర్శనశక్తిని ఆయన చేశినపనినిబట్టి తెలుసుకోవలశిందే కాని ఆయన ఏ మాత్రమూ ప్రకటించుకోడు. అంతనిగర్వి ఆయన. ఆయనకుండే విమర్శన సామర్థ్యానికీ, మనసారస్వతంమీాద ఆయనకుండే పరమప్రీతికీ ఆయనలో భవ్యమయిన ఐక్యం కుదిరిపోయింది. అందుచేతనే ఆయన అధ్యయనవిధానం అనుత్తమం అయింది.

యూారపియనుని పాండిత్యం ఎంత విస్తారమయినా సరే, ఎంత గాఢమయినా సరే భారతీయ సారస్వతంలో అంతర్నిహితమైన సౌందర్యాన్నీ, సారాన్నీ కనుక్కో గలడా అనేది ఒక చిన్న సంశయం. ఆ సంశయం కాస్తా వింటర్నిజువల్ల అపాస్తం అయిపోయింది. ఆయన స్వయంగా గొప్పవాడు. కాబట్టి మన సారస్వతంలో గొప్పతనాన్ని కనుక్కో కలిగాడు; అర్థం చేసుకోగలిగాడు దాన్ని. కాకుంటే అది అసాధ్యమే.

ఒకని జీవితంలో ఉండే ఆంతర్యాన్ని తెలుసుకోవడమే ఎంతో కష్టం. ఇంక ఒక జాతి జాతియొక్క జీవితంలోని ఆంతర్యాన్ని తెలుసుకోవడ మంటే ఎంతకష్టమో చెప్పవలెనా? డాక్టరు దగ్గర ఈశక్తి అపరిమితంగా ఉంది. కాబట్టే ఆయన బుద్ధుని ఉపదేశాలను తన జీవితంలో ప్రత్యక్షానుభవానికి తెచ్చుకున్నాడు.

ఆయనకు భారతదేశంలో ఉండగా తంత్ర, యోగ సారస్వతంతోను, యోగవాసిష్ఠంతోను ప్రథమ పరిచయం కలిగింది. యూారపులో ఉన్నంతకాలమూ ఆయన కిది సాధ్యమయింది కాదు. వీటిని అధిగమించడంలో ఉండే ప్రతిబంధకాల నన్నింటినీ సత్యాన్వేషణాసక్తిబలంచేత పోబెట్టుకో కలిగాడాయన. ఆయన చెప్పేవాడు : "భారతదేశానికి వేలకొలదిమైళ్లదూరంలో ఉండే విదేశపండితుడికి భారతదేశ సారస్వతంలోని సత్యమూ, గొప్పతనమూ భావనామాత్రజన్యమంటే క్షమించవచ్చును. అయితే భారతదేశంలోనే ఉండి, ఆసారస్వతాన్ని అధ్యయనంచేసి, అక్కడనే ఆసారస్వతాన్ని పరిష్కరించి ప్రకటించేవారు అందలి తత్వం సరిగా ప్రత్యక్షం అయ్యేటట్టు సచేతనంగా తమరచనాన్ని నిర్మించడం మిక్కిలీ ఆవశ్యకం" అని.

తాంత్రిక సంబంధాలగు రహస్యాలను ఆయన ఆశ్చర్యం కలిగేటట్లు వివరించేవాడు.

ఆయన పాండిత్యం ప్రపంచమంతా ప్రఖ్యాతమయినా మానవసంఘం మీాద ఆయనకుండే ప్రేమ సారాన్ని తెలిసినవాళ్లు చాలా కొంచెమందే.

కొన్నాళ్లకిందట ఆయనకు భార్యావియోగం కలిగింది. అది ఆయనహృదయానికి ఒకపెద్దదెబ్బ అయింది. ఆయనకూడ ఇప్పుడు మనకండ్లకు కనపడడు.* కాని మనస్సులో ఎప్పుడూ ప్రత్యక్షం అవుతూనే ఉంటాడు. మన హృదయాల్లో ఆయనకు శాశ్వతమయిన స్థానం ఏర్పడింది.

[మార్చి మాడరన్ రివ్యూలో క్షితి మోహన సేనుగారి రచనాన్ని అనుసరించి.]

---

* డాక్టరు వింటర్నిజుగారు మొన్న జనవరిలో జెకోస్లోవాకియాలో ప్రేగునగరంలో చనిపోయాడు.

# ఆంధ్రనాటకకళాపరిషత్తు, ఆరవసమావేశము—బెజవాడ

(౨౮-3-'3౮)

ఈ సమావేశమునకు అధ్యక్షులు శ్రీయుతులు పింగళిలక్ష్మీకాంతముగారు. వారి అధ్యక్షోపన్యాసమున నాట్యకళాభ్యుదయమున కభ్యంతరములను కలిగించుచున్న విషయముల నేకములు చర్చింపబడినవి. వాని నివారణమునకయి సప్రమాణములు, సయుక్తికములు, సముచితములునగు నుపదేశములా యుపన్యాసమున గలవు. నాట్యకళారాధకుల కవి యథాశక్తి నాచరణార్హములు. అందువలన నానాటికి మననాట కృశించిపోవుచున్న నాట్యకళ పుష్టినొందుట కవకాశ మేర్పడగలదు. ఆయుపదేశ విషయము లీక్రింద నుద్ధరింపబడినవి.

## నృత్త, నృత్య, నాట్యభేదములు

నృత్తము, నృత్యము, నాట్యము, అనెడి మూడు పదములను సాధారణముగా లోకము సమానార్థములుగానే వాడుచుండును. అది పొరపాటు. ఈ మూడును పర్యాయపదములు కావు. ఇవినిరూపించెడి యర్థములయందు సామ్యముకంటె భేదభావమే యెక్కువ కలదు. అయినను ఈ భిన్నార్థములు నాటకప్రదర్శనమున మిశ్రీభూతమై ప్రయోగింపబడుట ప్రాచీనమైన యాచారము. వీనిలో నృత్తము తక్కిన రెండింటికంటె ముందు పుట్టినది. తరువాతి నృత్యనాట్యములు వెలసినవి.

శరీరావయవవిక్షేపమును లయాన్వితము చేయనెంచిన ప్రాక్తనమానవుడు మొట్టమొదట సృష్టించుకొన్న కళ నృత్తము. ఏపటహవాద్యమో నెరపుచు తత్తాళమునకు ననుగుణముగా లయశుద్ధియొప్పునట్లు ఆతడుచూపినపాదన్యాసమే నృత్తమునకు ప్రారంభదశ. క్రమముగా దానిని అన్ని తాళములకును అన్ని కాలములకును అనురూపముగా ప్రపంచించి పెంపుచేయవలెనని యాతడు యత్నించెను. ఎంత యత్నించినను పాదన్యాసము తాళమును తుదముట్ట ననుగమింపలేదు. హస్తనాడులకుగల లాఘవము పాదనాడులకు నుండదు గనుక హస్తముతో వేయు తాళగతుల నన్నిటిని పాదముతో చేయు నృత్తగతులన్నియు ననుసరింపలేవు. కనుక నృత్తవిద్య తాళముతో కొంతదూరమే నడచినది. నృత్తము చేయునపుడు పూర్వాపరకాయములకు సమత కుదురుటకై పేఅోకదశలో పాదవిక్షేపమునకు హస్తవిక్షేపము తోడైనది. ప్రారంభదశలోగాని యీదశలోగాని నృత్తమునకు శబ్దముతోడి సంబంధ మించుకయు లేదు. అనగా నృత్తముచేయునప్పుడు తాళమే యపేక్షింపబడునుగాని గీత మపేక్షింపబడదు.

ఈగాత్రవిక్షేపవిద్య తాళలయాన్వితముగా నుండుటయేకాక శబ్దార్థక సూచకముగా కూడ నుండవలెననెడి యాశతో మానవుడు కల్పించిన ప్రక్రియాంతరము నృత్యము. నోటితో గీతము పాడుచు అందలి శబ్దములయర్థమును చేతితో ప్రదర్శించుట దాని ప్రధానాశయము. ఆపాడెడి గీతము తాళబద్ధముగా నుండునుగనుక తాళమునకు తగినట్లు కాలితో నృత్తముచేయుట దానికొక యంగము. కావుననే నృత్యమునందు అర్థసూచకమైన హస్తన్యాసమేకాక యొక్కొక్కయెడ తాళాశ్రయమైన నృత్తముకూడ ప్రకటితమగుచున్నది. కృష్ణలీలాతరంగ నృత్యమును చూచినపుడు మన కిది తెలియగలదు. నృత్యము, నృత్తముకంటె గుణాధికమై, శాస్త్రనిబద్ధమైనది. అందుచేతనే దానిని మార్గయనియు, నృత్తమును దేశి యనియు ఆలంకారికులు పేర్కొనిరి. గీతి పాడకయే యర్థవంతముగా నృత్యము సల్పుట తరువాత క్రమముగాకలిగిన పెంపులలో నొకవిశేషము. భారతీయ నృత్య

మునకు విజయపతాకగా నేడు ఖండాంతరముల సంచరించుచున్న ఉదయశంకరుని నృత్యమే ఈ వాక్యమునకు దృష్టాంతము. మిశ్రకళలలోని యంగకళలకు నెంతసామరస్యమున్నదో, యంత స్పర్ధయున్నది. సంగీతమునకు శబ్దసాహచర్యము లేకున్నను లోటులేదని చూపుటకే జంత్ర గానము పుట్టినది. అట్లే కవివాక్యరచన లేకున్నను నాట్యము నిల్వగలదని చూపుటకే కథకళివంటి మూకాభినయము యత్నించినది.

మఱికొంత కాలమునకు నృత్యము నశబ్దార్థము నేకాక భావాశ్రయమైన వాక్యార్థమునుసయితము ప్రదర్శింపవలెనని మానవుడింకొక సంస్కారము చేసెను. తత్ఫలముగా గాత్రవిక్షేపవిద్య కొంత యవస్థానుకృతియై, అభినయమను పేరు తాల్చినది. క్షేత్రయపదములు, జావళీలులోనగునవి ప్రదర్శితము లగునప్పుడు దానిస్వరూపమును ప్రత్యక్షముగా జూడగలము.

ఈ యభినయమునకు మీదిమెట్టే నాట్యము. రెండిటికిని గల సన్నిహితత్వమును బట్టియే అభినయశబ్దము నాట్యపరముగాసయిత ముపయోగింపబడినది. వ్యస్తములైన పదములను, జావళీలను మాత్రమేకాక నిబద్ధకావ్యములయిన నాటకములనుగూడ ప్రదర్శించుటవలన అభినయము నాట్యమైనది. కాగా, భావగీతము వంటిది పదముల యభినయము; ప్రబంధము వంటిది నాట్యము.

కూచిపూడివారి నాటకప్రదర్శనమున నవనాగరకులు సహింపని చిందులు త్రొక్కుటలు, నాట్యవిద్యా పరిణితిలోని యీ భిన్నభిన్న దశలను చూపుటకును, నృత్త నృత్య నాట్యమిశ్రీకరణమువలన ప్రదర్శనమునకు లభించు సమగ్రలయసిద్ధిని చూపుటకును ఉద్దేశింపబడినవి. కాన యక్షగాననాట్యము నృత్త నృత్యానుప్రాణితమని గ్రహింపవలెను. పూర్వకాలమున సంస్కృత నాటక ప్రదర్శనములందును, నృత్తనృత్యములకు యథాభావరసావస్థముగా స్థాన మొసగబడినది, ఇప్పటి మార్గనాటకప్రదర్శనమునందు కొంచెము నృత్యము (పదార్థాభినయము) మాత్రము నిల్చియున్నది. తక్కిన దంతయు నాట్యమే (అవస్థానుకృతి).

*　　　*　　　*

ఆంధ్రనట పితామహుడుగా లోకముచే నెన్నబడిన రంగజ్యోతి హరిప్రసాదరావుగారు. కృష్ణమాచార్యులుగారు నాటకమును ప్రతిష్ఠింపగా ప్రసాదరావుగారు నాట్యమున పద్యపఠనమును ప్రతిష్ఠించెనని చెప్పుదురు. ఏపద్యమునకు నేరసమున కేరాగ మెంతవర కుచితమో యారాగ మంతవరకే పాడి, పద్యసారస్యమును, రాగరక్తిని, పదము చెడకుండ పాకముచేసి దానిసాయమున నాట్యము ప్రతిపదరసనిష్యంది యగునట్లు అభినయించునేర్పు నే నెరిగినంతవరకు ప్రసాదరావుగారికివలె నింకొకరికి నలవడలేదు. ఆంధ్రనట ప్రపంచమునకు ఆయన నిజముగా పితామహుడు అనగా నటబ్రహ్మ - వారి యభిజన స్థానము కూచిపూడి యగ్రహారము. ఆగర్భ నాట్యరససిద్ధులైన యాభాగవతుల తేజోలేశములే ప్రసాదరావుగారి వెల్గునకు మూలప్రకృతి.

*　　　*　　　*　　　*

ఈనాల్గవదశలో జరిగిన యొక సంస్కారము స్త్రీలుపాత్రధారణముచేయుట. ఆ సంస్కారమువలన చెప్పకొన దగినంతఫలము కల్గలేదు. సురభి కంపెనీవారి కిది చిరకాలాగతమైన యాచారము. ఆసమాజములోని స్త్రీ పురుషులు ఏకకుటుంబమునకు చెందినవారగుటచేత, ఆ పద్ధతి నవలంబించుట వారికి సుకర మయ్యెను. తక్కిన చోట్ల నది దుష్కరము. ఈ ప్రయత్నము కడ మట్టునా యని సందేహము కొల్పుచున్నది. కొనసాగునా సంతోషమే. సాగనప్పుడు పురుషుడు స్త్రీ వేషమువేయుటలో దోసగేమియు లేదు. పురుషుడు స్త్రీపాత్రము నభినయింపరాదనికాని, యభినయింపలేడనికాని యనుకొనరాదు. ముప్పిడిజగ్గరాజుగారిని, స్థానం నరసింహరావుగారిని కనులార చూచియును ఆ వాదము చేయుట యవివేకము. అట్లే స్త్రీలు పురుషవేషములకు తగరనియు భావింపరాదు. అర్హతానర్హతలు వారివారి యాకార రేఖలను బట్టియు, తద్భావభావనను బట్టియు కల్గుచుండును. రేఖ, భావన—ఈ రెండే యొకవ్యక్తికి రంగప్రవేశార్హత

యిచ్చునవి. అవి లేనివాడు స్త్రీ నటియు కాజాలదు; పురుషుడు నటుడును కాజాలడు.

"స్వభావమాత్మనస్తత్వా
తద్భావగమనాదిహ
స్త్రీ పుంసః ప్రకృతిం కుర్యాత్
స్త్రీభావం పురుషోపివా."

* * * *

మరియు నాటకమున మనము చేయనెంచు సంస్కారములన్నియు నొక్కమారుగా ప్రవేశపెట్టుదుమేని ప్రాతపద్ధతి కలవాటుపడిన ప్రేక్షకజనము వెంటనే యామోదింపదు. జనామోదము లేని వృత్తిసంఘములు బ్రతుకజాలవు. కావున సంస్కారపూర్వక ప్రదర్శనములు వినోదసంఘములు మొదలిడవలెను. వారి ప్రదర్శనములు క్రమముగా జనామోదమును పడసినపిమ్మట, వృత్తిసంఘములును ఆదారినే నడచివచ్చును. కాని వినోదార్థమేర్పడిన కంపెనీలకు నాటకమునందాళయేకాని యభిమానము సున్న. ఏదో ప్రొద్దుపోకకుచేయు వినోదవ్యాపారములలో నొకటిగా భావింతురే కాని విద్యాపక్షపాతముచే సేవింపరు. వారి చిత్తవృత్తిలో పరివర్తనము కలిగి శ్రద్ధాళులై నాటకమును చేపట్టుదురేని యిప్పుడున్న లోపములన్నియు క్రమముగా తీర్పగలరు. లేదా యీపరిషత్తున కొక యంగముగా నాట్యశాఖను కల్పించి దానిద్వారా క్రొత్తదారులు త్రొక్కవలెను. ఒకప్పుడు తెనాలి రామవిలాస సభకు నిట్టి యోగ్యత కల్గునని యాశించితిమి. దానికిని బాలారిష్టమే కొట్టినది.

* * * *

## పరిషత్తు ధర్మము

ఈ పరిస్థితులనుబట్టియే యీ నాల్గవ దళకూడ కొలసుచున్నదని భావించితిని. ఈ పరిషత్తు చూపెడి యుత్సాహమున నంతఃశుద్ధియే యున్నచో రాబోవుదళ మంచిచే కాదగును. లేకున్న నీ సభాముఖమున జరుగు మహాకార్య పరంపర యంతయు నూరక పోవలసివచ్చును. ఈ కార్యకలాపమువలన నింతవరకు సాధించినదేమియు లేకున్నను, ఈ మథనమంతయు రిత్త పోవునాయని యాశ పొడమ నున్నది. ప్రాణి జడమై పడియుండుటకన్న బాధవలన నావేదన పడుటయైనను మంచిదేకదా!

ఈ పరిషన్ముఖమున పరిష్కారము చేయనెంచి మీరు ప్రతిపాదించిన సమస్యలెన్నో యున్నవి. ఈ యుపన్యాసభాగమున వానిలో కొన్నిటినిగూర్చి కొంతముచ్చటించి నా కుచితములని తోచిన సలహాలను సూచించెదను. వాని యోగ్యతాయోగ్యతలను చక్కగా వివేచించి తగినవానికి కార్యరూపము కల్పింతురుగాక.

మనభాషలో ఉత్తమనాటకములు లేవనియు ఏవొకటి రెండో యున్నను అవి పౌరాణికములే కాని సాంఘికములు కావనియు నెంచి యుత్తమ సాంఘిక నాటకమును వ్రాయించి కవిని బహూకరింపవలెనని యెంతో యుత్సుకత్వముతో మీ రొక పోటీపరీక్ష పెట్టితిరి. అంతే కాక యుత్తమత్వసిద్ధికి పద్యములను స్వగతములును అంకెరాటము కల్గించునన్న యూహతో నాటకమున వీని నుంచరాదని కవికి నాదేశించితిరి.

తెల్గున నుత్తమనాటకములు చాల తక్కువగా నున్నమాట నిజమే. నాటక రచనోచితమైన సమగ్రశక్తి ఆంధ్రకవులలో నెవరియందును అఖండముగా నావిర్భవింపలేదు. ఉత్తమములని మనము భావించుచున్నవానిలో నైనను గుణసాకల్యము లేదు. కొన్నిట కవిత్వము రమణీయముగా నున్నది. కొన్నిట సంవాదము చతురముగా నున్నది. కొన్నిట పాత్రోన్మీలము స్ఫుటముగా నున్నది. కొన్నిట కథాసన్నివేశము నిబిడముగా నున్నది. నాటకమూర్తికి అంగప్రత్యంగభూతములైన యీ యంశములలో నొక్కొక్కకవికి నొక్కొక్క ప్రజ్ఞమాత్రమే యుండుటచేత నిట్టి యేకదేశసిద్ధి మాత్రమే లభించినది. సర్వగుణసంపన్నములైన నాటకముల యభావముచే వీనినే యుత్తమములుగా కొనియాడుచున్నాము. అసలు, కాళిదాసు చెప్పినట్లు పరిపూర్ణత బ్రహ్మసృష్టిలోనే లేదు కాబోలు.

"ప్రాయేణ సామగ్ర్య విధౌ గుణానాం
పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః"

ఇది యిట్లుండుగాక.

## పోటీ పరీక్షలఫల మల్పము

పోటీపరీక్షలవలన అనుకొన్నఫల మదితీరునన్న నమ్మకము నాకు లేదు. ఏమనపోటీకినిల

బడుట, పేరుపణముపెట్టి పాచికలాడుట. పెద్ద పేరుగలవా రెవ్వరును సాధారణముగా, ఈజూదమునకు దిగరు. అపజయము లభించినచో పేరు పోవుటేకాక పరాభవము కూడవచ్చునని వారి భయము. వారి శంక సహేతుకమే కాని నిష్కారణముకాదు. మొదలు పోదగినపేరు లేదుగదాయనెడి నిబ్బరముతో కొందరు; పరీక్షాధికారులు నన్ను త్రోసిపుచ్చగలరా యనెడి యహంభావముతో కొందరు; బహుమతిమాట భగవంతుడెరుగును, మనపేరుకూడ జాబితాలో అచ్చుపడునవెడి కీర్త్యాశతో కొందరు; లాటరీ వలె మనకే బహుమానము రాగూడదాయనెడి ధనలోభముతో కొందరు నడుములుకట్టి మల్ల చరచి పోటీలలో దిగుదురు. వీరి సాములన్నియు జూచి పరీక్షాధికారులు నిరుత్సాహముతో ఒండొరుల మొగములు చూచుకొనుచు గుసగుసలు పోదురు. తుదకు కన్నులు మూసికొని లాటరీ లాగి యెవరిపేరు పండునో వానిచేతిలో గుట్టు చప్పుడుగాకుండ సంభావనపెట్టి పంపెదరు. గుట్టు చప్పుడుకాకుండ తనచేతపెట్టినయాముల్లెను గుట్టు చప్పుడు కాకుండగనే గ్రహించియూరకుండక ఆయదృష్టశాలి తనప్రయోజకత్వమును తనప్రజ్ఞను తానే కొండాడుకొనుచు నితరుల నధిక్షేపించును. స్వయంవరమున వధువుచే నిరాకృతులైన రాజకుమారులవలె ఆశాభంగముచే మొదలేడిందుపడియున్న తక్కిన పోటీదారులు వానియధిక్షేపములకు మరింత కనలి వానిజయగర్వము నణచవలెనని పత్రికలకును రచ్చలకును ఎక్కి, యుపన్యాసాస్త్రములు, వ్యాసశస్త్రములు ప్రయోగింతురు. అవి సత్కరించినవానికిని, సత్కారము పొందినవారికిని మాత్రమేకాక పౌరోహిత్యము జరిపినవానికిగూడ తగులును. పోటీపరీక్ష లింత ముచ్చటగా ముగియును. ఇట్లు జరిగినకొన్ని పోటీలు నాయనుభవములో నున్నవి. కనుక వానియందు నాకు విశ్వాసము లేదు. నేను చెప్పినది లోకసామాన్యమైన విషయమేకాని, మీరు పెట్టిన నాటకపరీక్షకు సంబంధించినదికాదు. అది యెట్లుజరిగినదో, ఎంత వట్టు సఫలమైనదో నేనెరుగను. కాని న్యాయముగ చేయదగిన దేమనగా, మీకు నచ్చిన యొక కవిని చేరదీసి, మీయాశయము లాతనితో చర్చించి, ఆతనికిని మీకును చర్చాసామరస్యము కలిగిన పిమ్మట, తదనుగుణముగా నాటకము వ్రాయించిసత్కరించుట.

## ఉత్తమ నాటకమంటే?

ఉత్తమనాటక మనగా నెట్టిది? నాటకము కావ్యభేదములలో నొకటిగనుక, అది మొదట కావ్యముగానే పరిగణింపబడవలెను. కావ్యమే కాక రూపకముకూడ నైయున్నది గనుక, నాట్యవస్తువుగా తరువాత స్వీకరింపబడవలెను. అందుచేతనే దానిని దృశ్యకావ్య మనిరి. అది కావ్యము కావలెను; దృశ్యము కావలెను. కాన కావ్యగౌరవమును, ప్రయోగానుకూల్యమును గలనాటకమే ఉత్తమనాటకము. ఈ రెండు ప్రయోజనములలో నేది లోపించినను దానిపరిపూర్ణత చెడినట్లే యెంచవలెను. ఉత్తమకావ్యమైయుండి ప్రయోగానుకూలముకానిచో దాని కావ్యతాగౌరవము లోపింపదు. కావ్యతాగౌరవము లోపించి ప్రయోగానుకూల్య మున్నచో వాఙ్మయమున దానియునికి స్థిరముకాజాలదు. కవిత్వమునెడనే దృష్టినిల్పి దానిని రచించును. ఆకావ్యత్వసిద్ధియైనను తేలికగా లభించునదికాదు. రసపరిపాలనము, పాత్రోన్మీలనము, కథాసంధానము, శబ్దవిన్యాసము లోనగు కావ్యాంగము లన్నియు చక్కగా కుదిరినప్పుడే అనవద్యమైన సిద్ధిగల్గును. అంగభూతములైన యీ యంశములలో నేది కొఱవడినను అది యుత్తమకావ్యము కాజాలదు. అందును వస్తుసన్నివేశమున వెలితి యున్నప్పు డది శిల్పమే యనిపించుకొనదు. అట్టి వెలితి రాకుండ కాపాడుకొనుటకైయే మనయాలంకారికులు నాటకలక్షణమున పంచసంధులను నిర్దేశించిరి. సంధులు చెడిన నాటకము కీళ్లుసడలినబొమ్మ. వర్ణము బాగుగానుండుగాక, ముఖము సొగసుగా నుండుగాక, మరియే వన్నెచిన్నెలైన నుండుగాక, యావికృతపుబొమ్మను చూడ నిచ్చగింపము. అట్లే సంధులు పొందుపడక కథాసంధానముచెడిన నాటకమున పాత్రపోషణాది గుణము లున్నను మెచ్చుకొల్పవు. కావుననే అరిస్టాటలు పండితుడు "Beginners

succeed in character and diction but not in structure" అన్నాడు. సర్వకావ్య గుణములకల్మి నాటకము వాఙ్మయాలంకారమై రంగోపయోగి కాకున్నను కవికృతార్థుడైనట్లే యెంచుకొనవలెను. అంతతో సంతసింపక, తన నాటక ముత్తమదృశ్య మగుననియు నాతడాశ పడుచో పరిహాసపాత్రుడుకాక తప్పడు. దాని నాడిన నటులును నగుబాటుపాలే యగుదురు.

ఈ రెండు ప్రయోజనములను సాధించిన నాటకసంఖ్య బహుస్వల్పము. సంస్కృతాంగ్ల భాషలలో గొప్ప నాటకములుగా మనము కొని యాడువానిలో ననేకములు కావ్యములేకాని, రూపకములు కావు. వానిని శ్రవ్యనాటకము లన వలెను. దృశ్యకావ్యములనరాదు. సంస్కృతమున ఉత్తరరామచరిత్ర, బాలరామాయణము మొదలగు నవియట్టివి. ఆంగ్లమున షేక్స్పియరు వ్రాసినవి "టెంపెస్టు" "కింగులీయరు" మొదలగునవి యటు వంటివి. ఆతని ట్రాజెడీలు ప్రదర్శనమున నుప యోగపడవని కాల్రెడ్జీ పూర్వపక్షములేని సిద్ధాంతము చేసినాడు. అంతమాత్రమున "కింగులీయరు" యొక్కయు ఉత్తరరామచరిత్ర యొక్కయు కావ్యప్రతిష్ఠ పోదు. అవి సరస్వతీకంఠాభరణాయమానములై వెలుగొందుచునే యున్నవి. అయినను సాహితీపరులకే కాని నాట్యపరులకు నక్కరకు రాకపోవుటచే నవి రంగమునకు దూరస్థము లైనవి. అయినను, వానిలోని రసవత్తను, కళాసౌష్ఠవమును చూచి విడనాడలేక, యెట్లో సరిపెట్టుకొని కొందరు ప్రదర్శించు చుందురు. అది వస్తుగౌరవముచే నొనర్చెడిపని. నాట్యపరులను, సాహితీపరులను సంతోషపెట్టగల నాటకములు సార్వజనీనములు; అవి యుత్తమనాటకములు. అట్టివానిని చూచికొని నటులు ప్రదర్శనమునకు గైకొనవలెను. అటుగాక సాహితీగుణమును లోపింపజేసి ప్రయోగాస్పత మాత్రమే యుండునట్లు వ్రాయుమని మనము నిర్దేశింప కవిశబ్దవాచ్యు డెవ్వడును వ్రాయడు.

అదిగాక సాంఘికేతివృత్తమునెడ నంత పక్షపాతమును పౌరాణిక గాథలయెడ నంత యనాదరమును మీకేల కలుగవలెనో నాకు బోధపడలేదు. పౌరాణిక గాథలలోమాత్రము ఒకనాటి సాంఘికప్రవృత్తి నిరూపకములు లేవా? కథంతలా వృత్తాంతము పురాణేతిహాసములందు నదాహరింపబడి యుండుటచేతనే పౌరాణికమైనది గాని నిజమున కది సాంఘికవృత్తము కాదా! సంఘమున రాజవంశ మున్నతపదస్థమై యుండును. కనుక రాజసంబంధి యగు ఆకథ యితిహాసోదాహృతమై ప్రసిద్ధవస్తువైనది. అట్లే నేటి సాంఘికవృత్తములలో నేదేని రాజవంశసంబంధియై ఉదాత్తమైయుండినచో రేపటి కది చరిత్రగతమై యితిహాసప్రసిద్ధమైన వస్తువుగా మారును. కాలము గడచినకొలది మూలకథకు వన్నెలు చిన్నెలు కల్పింపబడును. ఆకల్పనలవలన దాని రూపము అసంభావ్యముగా తోచి, మీరు తృణీకరించుచున్నా రనుకొనెదను. అటుగాక నేటి సంఘమునందలి సామాన్యుల నడవడినే నాటకేతివృత్తముగానిబంధించవలెననిమీయాశయమేమో? దాన దోషమేమియులేదు. రమణీయతాభ్రంశము జరగకుండవలెను గాని యితివృత్తము నేనిని గైకొన్నను విప్రతిపత్తి లేదు. మాలతీమాధవము, మృచ్ఛకటికాదు లటువంటి నాటకములే! ఈ యాచారము మనకు క్రొత్తకాదు. ఆచారమే కాక మనకు శాస్త్రవిధియు నున్నది.

"దేవతానాం ఋషీణాం చ
రాజ్ఞా మథ కుటుంబినాం
కృతానుకరణం లోకే
నాట్య మిత్యభిధీయతే"

ఆచారమునను శాస్త్రమునను ఆధారము లున్నవి గనుక చూపితినిగాని, యవి లేకపోయినను క్రొత్త ప్రక్రియలు కల్పించుకొనరా దని నా యభిప్రాయముకాదు. క్రొత్తకల్పనలవలన వాఙ్మయమునకు పుష్టికల్గునే కాని నష్టిరాదు. మనపూర్వులు పౌరాణికగాథలకును సాంఘిక గాథలకును సమానప్రతిపత్తినే యిచ్చిరి. ఒకదానిని మన్నించి రెండవదానిని క్రిందు పర్చలేదు. అసలు వస్తువునెడ వారికి తిరస్కార పురస్కార భావములులేవు. ఆవస్తు వేదైనను కవిచే భావ్యమానము కావలెననియే వారికోర్కి:—

"రమ్యం జుగుప్సిత ముదారమథాపి నీచం
ఉగ్రం ప్రసాది విక్రుతం గహనం చ వస్తు
యద్వాప్య వస్తు కవిభావుక భావ్యమానం
తన్నాస్తి యన్నరసభావ ముపైతి లోకే."

కాని తత్కాల లోకవృత్తాంశమును గైకొనుచో నొకయెడ మాత్రము మిగుల న్రపమ యుండవలెను. అట్టి రచనలు తాత్కాలికములైన యే సాంఘిక సంస్కార ధర్మములనో ప్రచారము చేయునవిగా నుండరాదు. ప్రచారార్థము వ్రాసిన రచనలన్నియును ఆ కార్యము కడముట్టినవెంటనే విస్మృతములై పోవునుగాని నిల్చియుండవు. కావ్యమన్నదో త్రికాలాబాధితమై యుండవలసిన రచన. దానికి నజరామరత్వమునిచ్చునది రమణీయతాస్ఫూర్తి. దానినే రసవత్తయనియు చెప్పవచ్చును. కాన ప్రచారార్థమైకాక కావ్యకళాసిద్ధికై సాంఘికేతివృత్తములను గైకొని యుదాత్తతయు రామణీయకము నెలకొనునట్లు నాటకములు వ్రాయింతురేని లోకమునకు మీ రొక మహోపకారము చేసినవారగుదురు. ముప్పది సంవత్సరములనుండి యొకేతీరు నాటకములు చూచి విసివియున్న ఆంధ్రలోకము క్రొంగ్రొత్త నాటకములకు స్వాగతాంజలులు పట్టుననుటకు సందియములేదు. అట్లుగాక ప్రజలకు విజ్ఞానము కల్గించుటకై తేలిక నాటకములు వ్రాయించి యాడెదమందురా, రంగపీఠమును ఉపన్యాసవేదికగా మార్చెదరన్నమాట. అంతకంటె నింకొక పతనహేతు వుండదు. ఆ తలంపునకును "కళారాధనము" "కళోపాసనము" "కళాభివృద్ధి" యనెడి యీ మంత్రజపములకును చాలదవ్వు. ఈ రెండును ఏకహృదయముననే పుట్టుట యసంభవము. విజ్ఞానాధాయకత్వమే నాటకమునకు ఫలమన్నవారికి ధనంజయు డిచ్చిన సమాధానము చూడుడు.

> ఆనంద నిష్యందిషు రూపకేషు
> వ్యుత్పత్తి మాత్రం ఫల మల్పబుద్ధిః
> యోఽపీతిహాసాదివ దాహ సాధుః
> తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ."

ఒకవేళ నటువంటి ప్రయోజనము నాటకముల వలన నున్నదనుకొన్నను, దానిని సినీమాలకు వదలివేయుట మంచిది. అవి వీనికంటె నెక్కువ వేగముగా నెక్కువ సులభముగా నటువంటి పనులను నెరవేర్పగలవు.

పురాణగాథలయందువలెనే పద్యములయందును మీకు మిక్కిలి నిరసనభావ మున్నట్లు పొడకట్టుచున్నది. పద్యములు స్వాభావికములనియు, పద్యపఠనవ్యాజమున నాట్యము సంగీతప్రాయమగుచున్న దనియు మీరు వాదింతురు. నిజ మారసినచో పద్యములును, సంగీతమును నాట్యమునకు నుపకారకములేకాని, ప్రతిబంధకములుకావు. నాట్యము మిశ్రకళ. దాని కంగభూతములైన కళలలో సంగీత మొకటి. ఆ సంగీతము సముచితముగా ప్రయోగింపబడి యథాస్థానమున నున్నంతవరకు, దానివలన కలుగు కీడేమియులేదు. రసోచితమైన రాగమును పాడవలసిన మితిని ఎరుగని నటునివలన నాట్యము చెడిపోవుచున్నదిగాని పద్యములయునికివలన కాదు. సంగీతమువలెనే కవిత్వము నాట్యమున కింకొక యంగము. పద్యము కవిత్వసారము. రసోచితమైన వృత్తమును వ్రాయవలసినచోటును ఎఱుగని కవివలన నాటకము చెడిపోవుచున్నది. కాన నెచ్చట పద్యము వ్రాయవలెనో ఏఛందోవిశేషము వాడవలెనో తెలిసికొని కవి వ్రాయుటయు, ఏరసమున కేపద్యమున కేరాగ మెంతవఱకు తగునో తెలిసికొని నటుడు పాడుటయు జరగవలెనుగాని పద్యములనే తుడిచివేయుట వాంఛనీయమైన సంస్కారము కాదు. రసానుగుణములైన ఛందోవిశేషము లున్నవా యని ప్రశ్నింతురేమో? ఒక కాలమున నున్నవి. కాలక్రమమున వానిసార్థకతలుప్తమైనది. కాళిదాసుని కుమారసంభవములోని రతివిలాసమనెడి నాల్గవసర్గ వియోగినీవృత్తమున వ్రాయబడినది. ఆ వృత్తము వియోగభావమున కెంత పొందుపడియున్నదో దానిని చదివిచూచిన రసికులకు నేను చెప్పనక్కరలేదు.

ఛందశ్శాస్త్రములో చెప్పియున్న వృత్తములు రసానుగుణముగా లేవని తోచినచో, ఉపజ్ఞాశాలి యగు కవి క్రొత్తవి కల్పించుకొనవచ్చును. అట్లే రసానుగుణమైన రాగములును ఉన్నవని యెల్ల రెరిగినదే. మేఘరంజనీ రాగ మాలాపింపబడుచో వర్షము కురియునని చెప్పుదురు ఒకప్పు డట్లు జరిగినదేమో? లేదా దాని చల్లదనమునే యీ విధముగా నుత్ప్రేక్షించిరో? దాని సంగతి యటుంచి మన మెరిగిన యొకదృష్టాంతము చెప్పెదను. పెండ్లి యైదవనాటి తెల్లవారుజామున పిల్ల నప్పగించెడివేళ పాడెడి యప్పగింతలపాట శంకరాభరణమున పాడుదురు. అటుగాక వేరొక రాగము పాడుదురేని కన్నె నప్పగించునప్పటి

యీషద్విషాద శబలిత మైన యనురాగమునకు ననురూపముగా నుండదు. కాన నాట్యకళ సర్వాంగవమవశోభిగా నుండవలెనన్న శాస్త్రీయ ములైన పరిశోధనలు జరిగి యీరహస్యము లన్నియు పునఃప్రయుక్తములుకావలెను. ప్రస్తుత నాట్యమునందలి సంగీత మేవమః కొల్పుటకు నింకొక హేతు వున్నది. నటుల గాత్రములు సుశిక్షితములుకావు. సాంప్రదాయిక మైన గాన సాధన వారికి లేదు. సాధనలేని గాలిపాట స్వాధీనముకాని గొంతుతో పాడుచుండగా రసోచితత్వ మెట్లు కల్గును? ఆ శిక్షణమే మొదలిడుదురేని హార్మోనియమును మున్ముందే విసర్జింపవలెను. సుశిక్షితమైన గాత్రము పద్యములు చదువుటకే కాక వచనమును చెప్పుటకును ఆవశ్యకమే. ఇట్టి యభ్యాసముల చేయుటకు మనస్సుగాని చేయ దగినయోపికగాని లేక తోచినట్లు నాటకములాడు లోపము నటులయందుండగా పద్యములను సంగీతమును శపించుటవలన నేమిలాభము?

## పద్య, గద్య నాటకములు

పద్య మస్వాభావికమని కదా మీవాదము? కళ యనుమాటకే అలౌకికమైన రచనా చమ త్కారమని యర్థమైనప్పుడు పద్య మస్వాభావి కము గాక మరేమగును? వాస్తవికమత మనియు కాల్పనికమత మనియు కళావిషయకములైన రెండు భిన్నమతములు ప్రపంచమున నున్నమాట నిజము. ఈ రెంటిలో మొదటిమతమువారు శిల్ప రచనకును ప్రత్యక్షప్రపంచమునకును బింబప్రతి బింబసామ్య ముండవలెనని గట్టిగా వాదింతురు. అందుచే ప్రకృతివిరుద్ధములైన రేయంశములను కళలయందు వా రంగీకరింపరు. రెండవ మతము వారు కళ ప్రకృతికి ప్రతిబింబము కాదనియు ప్రకృతి నిలయాత్మక మైన ప్రాణిగా రమణీయ మూర్తిగా ప్రదర్శించుట కేర్పడిన సృష్టివిశేష మనియు, ఈ ప్రదర్శనము ప్రస్ఫుట మగుటకు వలయు నాలంకారిక సాధనములన్నియు శిల్పి యథేచ్ఛముగా వాడవచ్చుననియు సమాధానము చెప్పుదురు. ఈవాదములలోతును తరచిచూచుట కిది యదను కాదు. కాని నునకు సంబం ధించినంతవరకు నొకరహస్యము మాత్రముమరవ రాదు. ప్రత్యక్షప్రపంచమునకును, నాటకము నకును ఈవ్యత్యాసమేది యుండరాదందు మేని ఆరియమ మెంతమూరముపాలింపగలము? రంగ మున పాత్ర లుచ్చరించుమాటలు లోకమున అసు కార్యులు మాటలాడినవేనా? కావనియు అవి కవికల్పితము లనియు కదా సమాధానము? అనుచో, నొకచో నంగీకరించిన కృత్రిమత్వము వేరొకచోట నేలయంగీకరింపరాదు? లోకధర్మ మును తలపించుచుండుటయే కళాధర్మముగాని లోకధర్మమే కళాధర్మము కాదు. కళారచన మెప్పుడును, లోకమునకు కొంచెము దూరముగా నున్నతముగానుండును. లోకస్వభావము చక్కగా ప్రతిఫలించుకొరకే యది లోకమునకు కొంచెము దూరముగా నుండవలెను. అద్దమున తన ముఖసౌందర్యము చూచుకొను విలాసిని ఆ యద్దమును తన ముఖమునకు కొంచెము దూర ముగా నుంచుకొనునట్లే కళాదర్శమున తనవిలాస మును చూచుకొను ప్రకృతిదేవత యాయాదర్శ మును తనకించుక నెడముగానే నిల్పుకొనును. కనుక స్వభావవాదమును పురస్కరించుకొని కళల మూలధర్మములను భేదింప ప్రయత్నింప రాదు. పద్యరచన కావ్యమున నుపాదేయమేకాని రూపకమున కాదందురా? రూపక మనగా కావ్య త్వములేని నాటకమని వింతనిర్వచనము చేసినవా రగుదురు. అది హర్షింపదగినవాదముకాదు. లేదా వైవిధ్యముకోసము నిర్వచనప్రబంధములవలె శుద్ధ గద్య నాటకము లుండవచ్చును వానివలన నే కీడునురాదు. పద్యము లుండరాదని వాదించువారి వలె గద్యనాటకము లుండరాదని నేను వాదింపను.

## ముఖ్య సంస్కారములు

నాటకములను వ్రాయించుటకంటె నెక్కువ యావశ్యకములైన సంస్కారములు చాల కలవు. మనుముందు వానికి పూనుకొనుట చాలమంచిది. ప్రస్తుతకాలమున రంగాలంకృతియు వేషధారణ మును రసావస్థానుగుణముగా నుండకపోవుటయే కాక మీదుమిక్కిలి రసభంజకములుగా నున్నవి. నాట్యశాస్త్రకర్త యేరసమున కేవర్ణ ముచితమో యేపాత్ర కెట్టియాహార్యము తగునో చక్కగా వివరించినాడు. మనకాశాస్త్రపరిజ్ఞానము బొత్తుగా లేకపోబట్టి యంధప్రాయముగా ప్రవ

త్రించుచున్నాము. మఱియు నాట్య మెంత లోకావస్థానుకృతి యైనను ఆయనుకరణమునందు ను పొందవలసి శిక్ష యెంతో కలదు. కేవల వివేక జన్యమైన యనుసుణముకంటె వ్యుత్పత్తిపూర్వక మైనది గంభీరతరముగ భావితముగా నుండుననుటకు సందేహములేదు కాన నాట్యశాస్త్రము ప్రస్తుతోపయోగియగునట్లు సంగ్రహముగా సచిత్రముగా వ్రాయించి యీనిర్దేశములు ప్రస్తుత దేశ కాలపాత్రలకు పనికివచ్చు నంతవరకు ననుష్ఠించుట మిక్కిలి శ్రేయము. లేనిసందర్భములగాని, ఉన్నను ప్రస్తుతోపయోగము లేకున్న సందర్భములగాని, లోకపరిస్థితులను బట్టి మనము స్వతంత్రకల్పనలు చేసికొనవచ్చును. అన్నియుగముల వారికిని ఆశాస్త్రమే సర్వదా శరణ్యమని నేననను. ఆమాట శాస్త్రకర్తయు ననలేదు.

"ఏవం నాట్యప్రయోగే బహుబహు విహితం కర్మశాస్త్రప్రణీతం నహోక్తం యచ్చ లోకాదనుకృతికరణం తచ్చ కార్యం విధిజ్ఞైః"

"ఏవ మేతేమయాప్రోక్తా
వాగంగాభినయాః క్రమాత్
నోక్తా యేచ మయా తత్ర
లోకా ద్గ్రాహ్యాస్తు తే బుధైః"

ఇట్లే సంగీత సాహిత్యములను గూడ కొంత కాలము గురుముఖమున నభ్యసింపవలెను. నాట్యాంగములైన యీవిద్యలు నేర్చి యీపరిజ్ఞానమునకు వివేకము జతపరిచినప్పుడు ప్రదర్శనములు సర్వాంగసుందరముగా నుండునని యూహించుచున్నాను. ఏకళకైనను ప్రజ్ఞబీజము. తత్కళా సంబంధియగు శాస్త్రజ్ఞానము ప్రజ్ఞ నున్మీలితము చేయుదోహదము. గాయకులు, కవులు లోనగు శిల్పులెల్లరు తమతమ సహజశక్తికి వ్యుత్పత్తిచే వన్నె పెట్టుచుండినటులు మాత్రమే కేవల ప్రజ్ఞనే నమ్ముకొని యుండుట యేమిన్యాయము? మనతరము వారికి ఈవయస్సున నక్షరాభ్యాసము చేయుట బొత్తుగా పొసగదు గాన నీవిద్యాశిక్ష రాబోవు తరమువారికైనను ఇప్పించుటకై తగిన ప్రయత్నము చేయవలెను. ఒకనాట్య విద్యాలయమును స్థాపించి తగినగురువులచే విద్యార్థులకు సంగీత సాహిత్యనాట్యవిద్యా ప్రదానము చేయింతురుగాక. ఈపరిషత్తే ఆ విద్యాలయమునకు మూలకందమగుగాక.

* * * *

---

# శ్రీ భ గ వ ద్గీ త

## (సంస్కృతము— తెలుగులిపి)

శ్రీ బెల్లంకొండ రామారావుగారి భాష్యార్క ప్రకాశవ్యాఖ్యానముతో, నాలుగుసంపుటములు, దాదాపు 1420 పుటలు, రాయలుసైజు, చక్కని కాగితములు, ముచ్చటలుగొల్పు అచ్చు, అందమైన అట్టబైండు. వెల సంపుటము ౧-కి రు. ౧-౮-౦.

గుంటూరుమండలములోని బమిడిపాడు గ్రామవాసులు శ్రీయుతులు కీ. శే. బెల్లంకొండ రామారావుగారీభాష్యార్క ప్రకాశమను వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఈభాష్యార్క ప్రకాశము శంకరభాష్యమునకు మెరుగు పెట్టునదై యున్నది. వీరు, శంకరాచార్యులు వ్యాఖ్యానము చేయక వదలివేసిన భాగమునకు వ్యాఖ్యానమును, వారు వ్యాఖ్యానముచేసిన భాగమునకు పదాన్వయమును గావించిరి. సంస్కృతమున కొంచెము ప్రవేశముగలవారు గూడ సులభముగ నర్థముచేసికొనదగినంత సులభశైలిలో నీవ్యాఖ్యానము వ్రాయబడియున్నది. అందరును ఈ గ్రంథమును జదివి గీతల పరమార్థమును దెలిసికొని యానందింతురుగాక!

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల, 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.

# ఆంధ్రవిశ్వ విద్యాలయము
# కళాప్రపూర్ణ బిరుదములు

ఈ మాసమున ఆంధ్రవిశ్వవిద్యాలయము, ఆంధ్ర దేశమున పేరుప్రతిష్ఠలతో వెలసిన నలుగురుపండితులను



౧. మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, (విజయనగరము)

'కళాప్రపూర్ణ' బిరుదముల నర్పించి గౌరవించినది. ఆపండితులు.

ఈ నలువురు విద్వాంసులలో తొలి యిరువుర పాండిత్యవిశేషములను భారతి యిదివరకే పేర్కొని



౨. మహామహోపాధ్యాయ శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారు, (రాజమహేంద్రవరము)

నది. తక్కినవారిలో జనమంచి శేషాద్రిశర్మగారు సంస్కృతాంధ్ర భాషలయందు సమానపాండిత్యము

గలవారు; ప్రవాహమును బోలిన కవితాధోరణి కలవారు. బ్రహ్మాండాది పురాణములను రామాయణాది కావ్యములను అనువదించినారు. రామ, కృష్ణ, అవతారముల తత్త్వములను విపులముగ గద్యరచనమున వివరించినారు.



౩. జనమంచి శేషాద్రిశర్మగారు, (కడప)

వీరిరచనములు పండితపామరజన సమాదరమునకు పాత్రములయినవి. గ్రంథములను శర్మగారివలె నతిమాత్రముగ నాంధ్రమున వెలయించినవా రాంధ్రులలో మరొకరు కానరారు. ఇక, నాలవవారగు కపిస్థలము దేశికాచార్యులుగారు అఖండపండితులు. తర్క వేదాంత శాస్త్రముల పారమును గన్న మహామహులు. విశిష్టాద్వైతులయ్యును ద్వైతాద్వైతములయెడ ద్వేషభావములేని సమదర్శనులు. మతత్రయమువారికిని ఆచార్యులుగారి యుపదేశములు ప్రమాణములు.




౪. మహామహోపాధ్యాయ కపిస్థలం దేశికాచార్యులుగారు, (తిరుపతి)

ఇట్టి పండితులను సముచితరీతిని గౌరవించిన ఆంధ్రవిశ్వవిద్యాలయ మభినందనార్హము.

# కలగూరగంప

## ఆతపస్నానము

ఆరోగ్య సూత్రాలను అనుసరించడానికీ, ఆరోగ్యానికి అవసరమైన అనేకవిషయాలలో పరిశోధన చేయడానికీ యీరోజుల్లో అనేక ప్రయత్నాలు జరుగుతున్నవి. ఆపరిశోధనలలో ఆతపస్నానం ఒకటి; అంటే ఎండలో నిలుచుండటము. సూర్యకిరణాలకు రోగాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని చంపి, శరీరంలోని జీవశక్తికీ, విద్యుచ్ఛక్తికీ ఉత్తేజాన్ని కలిగించేశక్తి వున్నదని శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. పాశ్చాత్యశాస్త్రజ్ఞులు ఇటీవలనే కనుక్కున్నారుకాని, హిందూమహాఋషులు ఈ విషయాన్ని కొన్నివేల యేండ్లకుపూర్వమే కనుక్కున్నారు.

ఈ ఆతపస్నానము చెయ్యడం చాలామందికి ఇటీవల సరదా అయిపోయింది. మరీ పాశ్చాత్యదేశాల్లో వేలంవెర్రికింద పరిణమించింది. కాని, వారిలో చాలామంది, ఎండలో నిలుచునేటప్పుడు అనుసరించవలసిన విధానాన్ని అనుసరించడం లేదు. ఈ ఆతపస్నానాలు చెయ్యవలసిన పద్ధతిలో జాగ్రత్తగా చెయ్యకపోతే శరీరానికి మేలు కలగడానికి మారుగా హాని కలుగుతుంది.

ఆతపస్నానం చెయ్యటంటే ముఖ్యంగా వస్త్రహీనంగా ఎండలో నిలుచోవడం ఒకటి. శరీరంమీద వస్త్రాలువుండగా మనం ఎండలో ఎంతసేపునిలుచున్నా సూర్యకిరణాలశక్తి మనమీద పనిచెయ్యదు. ఎందుచేతనంటే — సూర్యకిరణాల ఏడురంగులలోనూ ఒకటైన ఊదారంగును మనశరీరంమీదవున్న వస్త్రాలు హరించివేస్తాయి. ఏవొక్కరంగు తక్కువైనా సూర్యకిరణాలలోని మహత్తరశక్తికి లోపమే. అందుచేత ఆతపస్నానం పూర్తిగా దిగంబరులై చెయ్యవలసినదే.

తరువాత ఎండవైపు—అంటే సూర్యునివైపు—ఎప్పుడూ మన శరీరంలోని ఒకపార్శ్వమే, ఉంచకూడదు. కొంతసేపు ఒకపార్శ్వమూ, ఆ పార్శ్వము చిమచిమలాడి వేడి ఎక్కుతూవున్నప్పుడు రెండోభాగమూ సూర్యునివైపు త్రిప్పి నిలుచుంటే శరీరమంతటికీ సూర్యకిరణాలు సరిగా సోకుతాయి.

ఎక్కువసేపు — శరీరం మంటపుట్టేదాకా ఎప్పుడూ ఎండలో నిలుచోకూడదు. ఏమంటే, సూర్యకిరణాలలో సూక్ష్మాణువులను నశింపచేసేశక్తి ఉంది. ఆ శక్తి మనశరీరంమీద వుండే జీవకణాల్ని మాడ్చివేస్తుంది.

ఎండలో నిలుచున్నపుడు, గాలివచ్చేబయలులో నిలుచోవాలి. వుత్త ఎండవలన శరీరానికి శోషకూడా వస్తుంది.

ఈ ఆతపస్నానాలు ఎక్కడచేస్తేమంచిది అనే విషయంలో చాలాపరిశోధనలు జరిగాయి. చివరకు తేలినవిషయము యేమిటంటే, ఇసుకా, నీరూ సూర్యకిరణాలను ప్రతిఫలింపచేస్తాయికనక, సముద్రపువొడ్డు ఆతపస్నానానికి చాల యోగ్యమైన ప్రదేశం అని. ఆతపస్నానం చేసేవారి శరీరములోవున్న చెడునీరు త్వరగా బయటికి పోతూవుంటుంది. అంచేత వారు ఎక్కువగా మంచినీరు త్రాగుతూవుండాలి.

చాలామంది శరీరానికి నూనెరాచుకొని ఆతపస్నానం చెయ్యబోతారు కాని యిందువల్ల వుపయోగం చాలాతక్కువ. ఏమంటే, సూర్యకిరణాలలోని ఊదా

రంగుకిరణాలు యీ నూనెలో మిళితమైపోయి శరీరానికి తాకవు.

ఆతపస్నానం చేసేటప్పుడు, కొంచెం చలిచలిగా వున్నట్టయితే, దుస్తులు ధరించి, ఎండలో నుంచి వెళ్లిపోవాలి; ఎండకు శరీరమంతా కాగి మంటలు పుట్టినట్టయితే నీడలోకి వెళ్లాలి.

సరియైన విధానాన్ని తెలుసుకోకుండా చెయ్యడంకంటే అసలు చెయ్యకుండా వుండటమే మేలు.

'చక్రవర్తి'

---

## యుద్ధసామగ్రి - ప్రపంచవ్యయము

౧౯౧౪ సంవత్సరంలో కంటే యుద్ధపరికరాలను తయారుచేయడానికి ప్రపంచం నేడు ఎక్కువ సొమ్ము వెచ్చిస్తూఉండడం వాస్తవం. మన కావిషయం కొన్నాళ్లనుండి తెలుసు. అయినా, తుపాకులకూ, విమానాలకూ, యుద్ధనౌకలకూ ఇప్పుడు ఎంతఅధికంగా వ్యయమవుతూఉందో తెలిశినవాళ్లు మనలో చాలా కొందరే ఉంటారు. దాని వాస్తవం తెలిసిందంటే చాలమందికి ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. వారిగుండెలు బద్దలయిపోతుంది కూడా. 'డెయిలీ హెరాల్డు' పత్రికా సంపాదకుల్లో ఒకరయిన ఫ్రాన్సిస్ విల్లియమ్సు అనే ఆయన ఈ విషయాన్ని గురించిన లెక్కలు సంపాదించి ప్రకటించారు.

ఆయనలెక్కలప్రకారం యునైటెడ్ స్టేట్సు (అమెరికా), బ్రిటను, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, జపాను, రషియా అన్నీ కలిసి ౧౯౧౪ లో యుద్ధపరికరాలకోసం ౨,౨౦౦,౦౦౦,౦౦౦ డాలర్లను వెచ్చించినవి. నేడు అన్నిదేశాలూ కలిసి వెచ్చించేమొత్తం ౧౧,౦౦౦,౦౦౦,౦౦౦ డాలర్లకు బాగామించుతుందని అంచనాకట్టాడాయన. ఇందులో జర్మనీ వ్యయమే ఎక్కువగా పెరిగింది—౧౯౧౪ లో ౪౮౦,౦౦౦,౦౦౦ డాలర్లు ౧౯౩౬ లో డా. ౪,౮౦౦,౦౦౦,౦౦౦ దాకా వెళ్లింది. అనగా నూటికి వెయ్యిలెక్కన పెరిగిందన్నమాట. దానికి తరవాతది రష్యా. ౧౯౧౪ లో దానివ్యయం డా. ౪౫౦,౦౦౦,౦౦౦. ౧౯౩౬ లోనో డా. ౨,౯౫౦,౦౦౦,౦౦౦. దీంట్లో మూడోస్థానం నిరుడు యునైటెడ్ స్టేట్సుది. దాని మొత్తం డా. ౧,౦౦౦,౦౦౦,౦౦౦ దాటింది. ప్రపంచమహాయుద్ధం మొదలుపెట్టిన ఏడాదిలో దానిఖర్చు డా. ౨౫౦,౦౦౦,౦౦౦ మాత్రమే. ౧౯౧౪ లో ఫ్రాన్సు డా. ౩౫౦,౦౦౦,౦౦౦ ఖర్చుపెట్టింది. ౧౯౩౮ లో డా. ౯౦౦,౦౦౦,౦౦౦ కంటె అధికంగా వ్యయపెట్టడానికి ఎత్తువేశిఉంది. బ్రిటను హాలుసాలువ్యయం డా. ౭౦౦,౦౦౦,౦౦౦. ఆవ్యయం ౧౯౧౪ లో డా. ౩౭౦,౦౦౦,౦౦౦. ఇటలీ యుద్ధసామగ్రి వ్యయాన్ని డా. ౧౭౦,౦౦౦,౦౦౦ నుండి డా. ౮౫౦,౦౦౦,౦౦౦ కి పెంచుకుంది. ఇంక జపాను ఒక్కదూకుతో డా. ౯౫,౦౦౦,౦౦౦ నుండి డా. ౩౦౦,౦౦౦,౦౦౦ కు వెళ్లిపోయింది. రషియా, జర్మనీల మొత్తాలు, మారకంవల్ల ఏర్పడే బాధలనుబట్టి, ఆదేశాల కొనుగోలుశక్తికి, వాస్తవంగా అయినదానికంటె కొంత అధికమనే అనిపిస్తుంది. జపాను జీవిత పద్ధతుల ప్రమాణం చాల తక్కువకాబట్టి వాళ్లమొత్తం చాలాతక్కువ అనిపిస్తుంది.

ఆయాదేశాల జనసంఖ్యనుబట్టి ఆయాదేశాలు యుద్ధసామగ్రికోసం ఖర్చుపెట్టిన సొమ్మును పరిశీలిస్తే జర్మనీ అపరిమితంగా యుద్ధసామగ్రిని సేకరించుకుందనీ, రషియాకు, మొత్తం ఎంతపెద్దదయినా తాను కాచుకోవలసిన ప్రదేశాలనుబట్టి, సేకరించుకున్న యుద్ధసామగ్రి చాలాతక్కువనీ తేలుతుంది.

ఈ యేడు రాజ్యాల మొత్తంజనసంఖ్యలో నూట ౧౧.౩ పాళ్లు మాత్రమే జర్మనీ జనసంఖ్య. కాని యుద్ధసామగ్రికి వెచ్చించిన టోకుమొత్తంలో జర్మనీదే నూట ౪౧ పాళ్లు. రషియాజనసంఖ్య ౨౯.౩ పాళ్లున్నా యుద్ధసామగ్రివ్యయం ౨౬ పాళ్లు మాత్రమే, యునైటెడ్ స్టేట్సు జనసంఖ్య ౨౨.౫ పాళ్లు; యుద్ధసామగ్రి వ్యయం ౭.౭ పాళ్లే. జనసంఖ్య ౧౨.౩

పాళ్లున్న జపానుకు యుద్ధసామగ్రివ్యయం ౨.౬ పాళ్లు; బ్రిటను జనసంఖ్య ౮.౩ పాళ్లు; యుద్ధసామగ్రికోసం దానివ్యయం ౭ పాళ్లు. ఫ్రాన్సు జనసంఖ్య ౭.౪ పాళ్లు; యుద్ధసామగ్రివ్యయం ౮.౧ పాళ్లు. ఇటలీ జనసంఖ్య ౭.౩ పాళ్లు; యుద్ధసామగ్రి వ్యయంలో దానివ్యయం ౬.౬ పాళ్లు.

[ఫిబ్రవరి ౧౯౩౭, 'లివింగ్ ఏజ్' సంపాదకీయం నుండి]

---

## ఐరోపాదేశస్థుల చలికాలపు వ్యాయామక్రీడలు

మనదేశములో అనేకమందికి తెలియనటువంటివియు, విననటువంటివియు నైన ఆటలు ఐరోపాదేశములలో అనేకములు మరియు చిత్రముగాను, బహుకష్టముగాను తోచునట్టివి కలవు. ఈఆటలు ఆడువారు, మగవారు, పిల్లలు కూడ ఆడుదురు.

ఆదేశమందు - అందు ముఖ్యముగా స్విజర్లెండు దేశమందు - అమితమైన చలివల్ల, ఎల్లప్పుడును మంచు కురియుచునేయుండుటవల్ల చుట్టునుగల ఆల్ప్సుకొండలమీద మంచు దట్టముగా నుండును. మంచు గట్టిగా రాతివలెకాక ఇసుకవలె సాధారణముగా కురియుచుండును. మంచుకురియుచున్నప్పుడు పెద్దపెద్దవడగళ్లు పడుచున్నట్లు ఉండును. అట్లు పడినప్పుడే ఆటలాడువారికి మిక్కిలిసౌకర్యముగాఉండును. వీరు ఆటలకొరకు కొండమీదికి వెళ్లునప్పుడు చలి నాపుటకు మంచిబలువైన ఉన్నిదుస్తులను ధరించి వెళ్లుదురు. స్త్రీలును పురుషులును కూడ ఆటలాడుటకు వీలుగా నుండుటకు ఒకేవిధమైనదుస్తులను ధరింతురు. ఈదిగువ చెప్పబడిన ఆటలు వీరిట్లు ఆడుటవల్ల అవి వారికి దేహపరిశ్రమగాను,ఖులాసాగాను కూడ ఉండును. వీరిట్లు ఆడు ఆటలలో మొదటిది స్కైఇంగ్ అని అందురు.

(౧) స్కైఇంగ్కు స్త్రీలును, పురుషులును, పిల్లలును కూడ బాగుగ మంచు కురిసి ఎత్తుపల్లములు గానుండుకొండలమీదకే సాధారణముగా వెళ్లుదురు. వారు మిక్కిలిమందముగాను, బలువుగాను ప్రత్యేకమీఆటలకొరకే చేయబడిన కాలిజోళ్లను,చలి నాపగలిగినంత వెచ్చని పొడవైనమేజోళ్లను వేసికొందురు.

స్కైఇంగ్ అనిన ఎత్తుమీదనుండి అందరును వంతులువేసుకుని క్రిందకు మంచుమీద జారుట. అట్లు జారుటకు కాళ్లకు(పాదములకు) సన్నగాను, పొడవుగాను ఉండు పాదమంతవెడల్పుగల రెండు కర్రలను కట్టుకొందురు. ఆకర్రలు షుమారు ౨ లేక ౨½ గజముల పొడవు గలవై ముందుభాగమున కొంచెము పైకి వంగియుండును. వీరిచేతులలో రెండుకర్రలనుగూడ పట్టుకొం



ఈ దేశపువారు వేసవికాలములో (Winter spor(s) లేనప్పుడు ఈ విధముగా ఎత్తుగాను, ఎక్కుటకు బహుదుష్కరముగాను ఉండు కొండలను తమాషాకు త్రాటిసహాయమున మనవారు త్రాటిచెట్ల నెక్కునట్లు ఎక్కిదిగుదురు.

దురు. ఆకర్రలను పట్టుకొనుటకు వీలుగా.ఉండునట్లు పైభాగమున తోలుతో .బెల్టు వలె చేయబడియుండు టవల్ల అందు వారిచేతులను దూర్చి కర్రను పట్టుకొం దురు. అట్లు చేయుటవల్ల వారిచేతిపట్టు వదలిపోయి నప్పటికిని వారిచేతినుండి కర్ర పడుటకు అవకాశము లేదు. ఆకర్రలకు అడుగుభాగమున ఎటుప్రక్కకుత్రిప్పిన అటుతిరుగు చిన్న చక్రమొకటి యుండును. ఆచక్రము చుట్టును రబ్బరు వేయబడియుండును. అట్లు రబ్బరు



స్కేటింగు చేయుచున్నస్త్రీలు

వేసియుండుటవల్ల వారు Balance తప్పి క్రిందపడి నప్పటికిని అకర్ర గ్రుచ్చుకొని గాయములుకాకుండ కాపాడును. ఆకర్రలు పట్టుకొన్నందున వారు ఎచ్చట ఆగవలెనన్న అచ్చట ఆగగలరు. వారు క్రిందకు జారి తిరిగి పైకి ఎక్కవలసినప్పుడు చేతపట్టుకొన్నకర్రలను గట్టిగా మంచులోనికి నొక్కుకొనుచు వెళ్లెదరు.

వారు కాలికి కట్టుకొనుకర్రలకు రెండడుగులనిడు పును వేలివెడల్పును గల సుంట చేయబడియుండుట వల్ల వారు పైకియెక్కునపుడు మంచు ఆసుంటలో చిక్కు కొని వారు జారిపడకుండ కాపాడును. అయినప్పటికిని అనేకులు-అందు ముఖ్యముగా క్రొత్తగా ఈఆటలలో చేరినవారు-పడుచును, లేచుచును ఉందురు. మంచు ఇసుక వలెగాక గట్టిగా పడినప్పుడు వారు అట్లు ఎక్కుట చాలకష్టము కావున ఎక్కవలసినప్పుడు కొందరు కాలికి కట్టుకొన్నవితీసి భుజములమీద పెట్టుకొని వెళ్లుదురు. అట్లుకూడ ఎక్కలేనివారికి కొంచక్రిందనుండి పైవరకును ఒకత్రాడు (Electric rope) ఉండును. దానిని వారు ఒకరితరువాత ఒకరు వరుసగా పుచ్చుకొన్న యెడల ఆ త్రాడే వీరిని పైకి యంత్ర మూలమున ఈడ్చుకొని పోగలదు. మరికొన్నికొండలమీద ఇట్లు తాళ్లుగాక ఎంత ఎత్తుకొండలమీదకైనను తీగలమీద విద్యుచ్ఛక్తి మూలముననే వెళ్లు పెట్టెలుండును. వానిని వారు Teliferick అనిఅందురు. అందు ఒక్కొక్కదానిలో ౨౦ మందికి స్థలముండును. ఇటువంటివి మిక్కిలి ఎత్తుగాను, ఎక్కుటకు కష్టముగాను ఉండు కొండలమీద మాత్రమే ఉండును.

ఆదేశమున బాగుగా సూర్యరశ్మిగలదినములు అరుదయినందున ఎన్నడైన సూర్యుడు బాగుగా ప్రకాశించినరోజున ఇండ్లలో ఎవరును ఉండక అందరును బయటకు వెళ్లుదురు. అందు ఎక్కువమంది స్కైఇంగ్ కే వెళ్లుదురు. అట్లు ఎండగాఉన్నరోజులలో

దినమంతయు కొండలమీదనే గడపి రాత్రికి ఇల్లు చేరుకొందురు. అట్లు వెళ్లునపుడు వారువీపులమీద పెద్దసంచులు కట్టుకొని అందు వారికి కావలసిన ఆహారములను తీసుకొనివెళ్లి ఆకలివేసినప్పుడు ఆకొండమీదనే కూర్చుని తిందురు.

భూమియందు పూర్తిగా నీరునింపి అట్లే 3, ౪. దినములు ఉంచెదరు. అట్లు ఉంచుటవలన చలికి ఆనీరంతయు గడ్డకట్టుకొని గట్టిగా రాతివలె అగును దానిమీద వారు ఆడుదురు.



స్కైఇంగు కొండపైనుండి క్రిందకుజారుట

ఈ యాటకుకూడ నొకవిధమైన కాలిజోళ్లు ఉండును. మామూలుజోళ్లవలెనే మరికొంచెము లావుగా ఉండి క్రిందభాగమున ఒకరేకువలె ఉండి దానికి ఒకకత్తిమాదిరిగా మరికొంచెముమందముగా జోళ్లపొడుగునను అంగుళముఎత్తున ఇనుములో చేయబడియుండును. దానితో కాలు అడుగు ఎత్తికేయకుండ మంచుమీద జార్చుచునే పడకుండ Balance నిలుపుకొనుచు పరుగులెత్తుట మొదలగు చిత్రములైన Feats చేయుదురు. అట్లు మంచుమీద స్త్రీలుకొందరు నాట్యము కూడ చేయుదురు. అది చూచువారికి మిగుల సొగసుగా నుండును.

ఇట్లు తమతో భోజనము తీసుకొనివెళ్లనివారికిని భాగ్యవంతులైవారికిని అచ్చటనే భోజనశాలలు గలవు. అందు వారివారికి కావలసినఆహారములను భుజించి తిరిగి యథాప్రకారముగ మంచుగో ఆడుకొందురు. ఈ స్కైఇంగ్ (Skiing) విషయమై ఇందుగల చిత్రములవల్ల చదవరులకు కొంత బోధపడగలదు.

(౨) స్కేటింగ్ (Skating) అని మరియొకఆట గలదు. అది ఎత్తు పల్లములులేక చదునుగా ఉండు భూమియందుమాత్రమే ఆడవలసినది. ఈఆట నాడుటకు మంచు ఇసుకవలె కాక గట్టిగా రాతివలె నుండవలెను. అందుకు వారు సాధారణముగా మంచిచలిదినములయందు చదునుగాను. నలుచదరముగాను ఉండు



స్కైఇంగుకు బయలుదేరుచున్నవారు



టెలిఫెరిక్

మన ఊళ్లలో Tennis' matches వలెనే అచ్చట చలికాలములో స్కేటింగ్ పందెములు (Skating competitions) జరుగుచుండును. అందు మిక్కిలి తెలివిగాను, బాగుగాను స్కేట్ చేసినవారికి బహుమానములు కూడ ఇవ్వబడును. ఇటువంటి పందెము లకు దేశ దేశములనుండియు స్కేట్ చేయగలవారు వచ్చి బహుమానములు పొంది వెళ్లుచుందురు.



ఒంటికాలిమీద చేయుచున్నఫీటు

ఒక్కొక్కప్పుడు ఇద్దరుకలిసిస్కేట్ చేసెదరు. ఇరువురుకలిసిచేయుట మిక్కిలి కష్టము. అట్లు చేయుచునే మధ్యమధ్య గిర్రునతిరిగి మరల మామూలుగా నిలుచుందురు.

స్కైఇంగ్ చేయు లేనివారికి చూచుటకు మిక్కిలి విసుగుగా ఉండునుగాని స్కేటింగ్ తెలిసినవారికి చూచుటకు మిక్కిలిబాగుగాను, ఇంపుగాను ఉండును.

(3) ఇదేవిధముగా వారు చదునుగా నుండునేలమీదనే గట్టిగా ఉండు మంచు మీద గోల్ఫ (Golf) ఆడుదురు. అది మామూలుగోల్ఫ ఆటమాదిరిగానే ఉండును.

ఇంకను వీరు మంచుమీద ఆడు ఆటలలో టోబోబూగింగ్ (Toboboogíng) అనియు, కర్లింగ్ (Curling) అనియు అనేకవిధములైన ఆటలు గలవు కాని అన్నిటిలోకి స్కైఇంగ్, స్కేటింగ్ మాత్రమే ముఖ్యమైనవి.

వంగల వాణీబాయి

---

## బ్రిటిషురాజుల రాజలాంఛనాలు
## పట్టాభిషేకాలంకారాలు

బ్రిటిషురాజులు పట్టాభిషేక మహోత్సవ సమయంలో ఉపయోగించే రాజలాంఛనాలు ఎన్నో ఉన్నవి. వాటిలో కిరీటాలు మూడు. అందులో ముఖ్యమయింది ౧. ఇంగ్లాండు కిరీటం దీనిని సింహాసనం ఎక్కినప్పుడు పెట్టుకుంటారు. దీని అసలుపేరు "సెయింటుఎడ్వర్డు కిరీటం" అని. రెండవచార్లస్ రాజు తన



౧

పట్టాభిషేకంకోసం ౧౬౬౨ సంవత్సరంలో చేయించుకొన్నాడు దీన్ని. అంతకుపూర్వం ఇంగ్లాండు రాజులు ఆనవాయితీగా పెట్టుకుంటూవచ్చిన కిరీటాన్ని క్రాంవెల్లు చెడగొట్టించి అమ్మివేశాడు. అందువల్ల ఆనవూ నాగానే చార్లస్ దీన్ని చేయించాడు. వెలగల వజ్రాలూ, కెంపులూ, పచ్చలూ, నీలాలూ దీని నిండుకూ చెక్కించాడు.

౨. రెండోకిరీటంపేరు 'ఇంపీరియల్ స్టేటు కిరీటం'. దీన్ని విక్టోరియారాణి తన పట్టాభిషేకంకోసం ౧౮౩౮ సంవత్సరంలో చేయించుకుంది. ప్రపంచ



౨

ప్రఖ్యాతాలయిన రత్నాలు దీనిలో చెక్కబడ్డవి, ఎలిజబెతురాణి ముత్యాలలోలకులూ, ౧౧ శతాబ్ది ప్రారంభంలో ఉన్న 'ఎడ్వర్డు ది కన్ఫెసరు' వేలిఉంగరంలో నీలమూ ఇందులో ఉన్నవి. దీనంత వెలగలకిరీటం మరే రాజ్యంలోనూ లేదట.

[illegible]

3. మూడోది ఇండియా కిరీటం. ఢిల్లీలో అయిదోజార్జి చక్రవర్తి పట్టాభిషేకంకోసం ౧౯౧౧ సంవత్సరంలో ఇది చేయబడింది. ఇంగ్లాండు కిరీటం ఇంగ్లాండు దాటి రాగూడదట. అని శాసనం. అందుకోసమని ప్రత్యేకంగా దీన్ని చేయించుకోవలసివచ్చిందట' దీనినడుంగా ఉండే కుచ్చులో ఒక శ్రేష్ఠమయిన,



3

అందమయిన పచ్చ ఉంది. అది ఇండియాలోది. దీనిలో పొదిగిన వజ్రాలు ఆరువేల కధికంగా ఉంటవి. దీనివెల అరవయివేల పౌనులు.

౪. రాజు చేతపట్టుకునే బంగారుచెండు. ఇదికూడ రెండవజార్జిగారి పట్టాభిషేకం కోసమే చేయబడింది. రాజు గద్దెయెక్కి కిరీటం పెట్టుకున్నప్పుడు దీన్ని ఎడమచేత పట్టుకుంటాడు దీనిమీద నిలువున



౪

ఉండే శిలువ క్రీస్తుమతంయొక్క ఆధిక్యాన్ని సూచిస్తుంది. ఇది రత్నఖచితమయింది; అమూల్యం అయిందిన్నీ.

౫. సెయింటు ఎడ్వర్డు రాజదండం. ఇది బంగారుది. రత్నాలు చెక్కబడిఉంది. 'దక్షిణ-ఆఫ్రికా యూనియన్'వారు ఏడవఎడ్వర్డు చక్రవర్తికి కానుకగా



౫

ఇచ్చిన 'గ్రేట్‌స్టార్ ఆఫ్ ఆఫ్రికా' అనే పెద్దవజ్రం దీనిలో చెక్కబడిఉంది. దీనిపొడుగు మూడడుగులు.

౬. బంగారు రాజకంకణాలు, సెయింటు జార్జి కంటకాలు. ఇవి ప్రాచీనకాలంనాటివి. కంకణాలమీద ముఖమల్ బుటేదారీపని చేయబడిఉంది. కంటకంఅంటే గుర్రంమీద సవారిచేశేటప్పుడు గుర్రం పక్కల్లో పొడిచి నడపడానికని రౌతు కాళ్లకు కట్టుకునే ముల్లు. దీన్ని ఇనుముతో చేయడం మామూలు. ఈ రాజకంటకాలు మాత్రం బంగారపు గట్టిచేతవి.

౭. (ఎ. బి.) అభిషేకపాత్రలు: కాంటర్బరీ ఆర్చిబిషప్పు (రాజపురోహితుడు) గద్దలాగు బంగారం



౭ ఎ



౬

తో చేసిన పాత్ర (ఏ) లోనుండిముక్కు గుండా
అభిషేకార్థమయిన పవిత్ర తైలాన్ని బంగారు చెంచా



౨ (బి)

(బి) లోకి వంచుకొని రాజుకు అభిషేకంచేస్తారు. ఇవి క్రాంవెల్లుదురంతంలో రూపుమాసిపోకుండా మిగిలిన ప్రాచీనపాత్రలు.

౩. రాజఖడ్గాలు: ఇవి మూడు. ఎడమనుండి: ౧. ఇది ప్రధానమయిన రాజఖడ్గం. దీనివాదర మొక్కగా ఉంది. ఇది దయాసూచకమట. దీన్ని రాజు పట్టాభిషేకానంతరం దట్టీకి తగిలించి వ్రేలవేసుకుంటాడు. ౨. రెండోరాజఖడ్గం వరమీద ఇంగ్లాండు, స్కాట్లాండు,

ఐర్లాండు రాజ్యలాంఛనాలు చిత్రింపబడిఉన్నవి. ౩. మూడోదాని పిడి బంగారంతో చేసింది.



౩

ఇవికాక రాణిపెట్టుకునే కిరీటం ఒకటి ప్రత్యేకంగా ఉంది. ఇది ఎలిజబెతురాణికోసం చేయబడింది. దీనికిన్నీ రత్నాలు చాలాచెక్కబడినవి. ఇందులో చెక్కబడినవజ్రాల్లో చాలమట్టుకు మేరీరాణి ఇచ్చినవే నట. ఇంకా రాజదండాలు, ఉంగరాలూ మొదలయినవి కొన్ని కలవు. రేపు మే నెల ౧౨ తేదీని ఇంగ్లాండులో జరగబోయే ఆరవజార్జిరాజు పట్టాభిషేకమప్పుడు వీట న్నింటినీ ఉపయోగిస్తారట.

—టైమ్సు ఆఫ్ ఇండియా వీక్లీ

---



భారతీయ సాహిత్య పరిషత్సమావేశము త్యాగరాజనగరు, చెన్నపురి. (27-3-37)
అధ్యక్షుడు మహాత్మగాంధి. సమావేశ ప్రారంభకులు, కాకాసాహేబ్ కాలేల్కరుగారు ఉపన్యసించుచున్నారు.



సి. వి. రామను సతి

ఆహ్వాన సంఘాధ్యక్షురాలు, (భారతీయ సాహిత్య పరిషత్సమావేశము.)



శ్రీ కమ్మిలమాణిక్యం, ఏలూరు.

కడచిన సెలలో కాకినాడయందు జరిగిన వ్యాయామ సంఘ వార్షికోత్సవమున మల్లవిద్యాపోటిలో గెలిచి వెండిగదను బహుమానముగా పొందిన యువకుడు.

## సులోచన



'భారతీయ-ఫిలిం' ప్రపంచంలో ప్రజాహృదయాన్ని ఎక్కువగా ఆకర్షించిన ఫిలిం తారలలో ఒకత్తె సులోచన. సలోచన అసలుపేరు 'రూబి మేయరు.' మూకచిత్రాల నాటి పాత కాలంలో రంగం ఎక్కింది. మొట్టమొదట సులోచన నటించిన చిత్రం 'వీరబాల.' తరవాత 'మేవారురత్నం' 'అనార్కలి', 'మేజిక్ ఫ్లూట్' అనే సుప్రసిద్ధాలయిన ఫిలిమ్ముల్లో నటించి మంచి పేరు తెచ్చుకుంది. చివరిఫిలిము ఇంగ్లాండులో ప్రదర్శించినప్పుడు సులోచనమీద మెప్పులు చాల జోరుగా కుమ్మరిల్లిపోయినవి.

ఇంతలో టాకీలు వచ్చాయి. దూరదృష్టిలు కానివాళ్లు 'ఇంక సులోచనపని అయిపోయిన' దన్నారు. కానికొన్నాళ్లపాటు సులోచన ఏమారుమూలో ఉండిపోయి దేశభాషలను చక్కగా నేర్చుకుని మళ్లా రంగానికెక్కి టాకీలో నటించింది. సులోచన మొదట నటించిన టాకీ 'మాధురి.' అందులోతన పేరును నిలుపుకుంది. ఆ తర్వాత 'ప్రైడ్ ఆఫ్ఇండియా', 'డాకూకీ లడ్కీ' అనేటాకీల్లోనటించి పేరుమోసిన హిందూస్థానంతారల్లో చోటు చేసుకుంది.

ఇంకముందు 'జంగిల్ క్వీను' టాకీలో కురంగి (నాయిక) పాత్ర నటిస్తుందట. అందులో డి. బిల్లిమోరియా కమలకుమార (నాయక) పాత్రను నటిస్తాడట విషాదఘట్టాలతో నిండినకథ ఇది. సులోచనకు భారతీయతారల్లో అగ్రస్థానం లభించే అవకాశం ఇందులో ఉంటుందని తలపబడుచున్నది. సొక్కమందు చల్లేచూపులతో సొగసులుకురిపించే కన్నులమూలాన్ని సులోచన పేరు సర్వథా సార్థకం అయింది.

టైమ్సు ఆఫ్ ఇండియా వీక్లీ.




## చిన్నరేడియో సెట్టు

ప్రపంచములో నెల్ల చిన్నదగు రేడియో సెట్టును ఒక న్యూయార్కు వాస్తవ్యుడు కనిపెట్టెను. ధ్వనిని విద్యుత్తరంగముల రూపమున వ్యాపింపచేయు ట్రాన్సుమిటర్ సెట్టుకొలత 3 × 3 × ౧౪ అం. దీనిబరువు ౧౬ అవున్సులు. ఆకాశమునుండి విద్యుత్తరంగములను గ్రహించి





మరల ధ్వనిరూపమున మార్చెడు రిసీవర్ చిత్రమునందలి వ్యక్తిచేత నున్నది. ౧౬ అంగుళముల పొడవుగల రెండు అంటెనాలు ( స్పర్శశృంగములు ) కలవు. ఒకపౌను బరువుగల జేబుబాటరీని ఉపయోగించి అరమయిలు దూరమున నుండువానితో టెలిఫోనులోవలె మాటాడవచ్చును. రేడియో సెట్టులో ఒకమీటను నొక్కినంత, ట్రాన్స్మిటరు రిసీవరగును; రిసీవరు ట్రాన్స్మిటరగును. కొంచెము ఎక్కువ శక్తిగల బాటరీల నుపయోగించి, కొలది మార్పులనుచేసినయెడల ఈసెట్టునుండి పుట్టు ధ్వని అయిదుమయిళ్ల దూరమువరకు వినిపించును.

---

## కార్బనుకాగితము లేకయే టైపుయంత్రమున కాపీలు



ఒక క్రొత్తసాధనము మామూలు టైపుయంత్రమునకు అమర్చబడియుండుటవలన, కార్బనుకాగితముల అవసరము లేక ఒకేమారు ఒక ఉత్తరమునకు నాలుగు కాపీలు తీయవచ్చును. టైపుయంత్రమున నాలుగు కాగితములు చొప్పించవలెను. అపుడు క్రొత్త ఏర్పాటుకలవ నాలుగురిబ్బనులు నాలుగు కాగితములకు అమరును. ఇట్లు టైపుచేసిన కాపీలు నాలుగును ప్రత్యేకము టైపుచేయబడినవానివలెనే యుండును. అవి మసి మొదలగునవంటుకొనక శుభ్రముగ నుండును.

---

## అలంకారపు జేబుపెట్టె, బాటరీలైటు సహా





సిగరెట్లపెట్టెయంత ఈ చిన్నపెట్టెలో ముఖమును దిద్ది అలంకరించుకొనుటకవసరమగు యిన పదివస్తువులుండును. అద్దము, మొగమునకు బుగ్గలకు రాచుకొను పౌడరులు, పెదవులకురంగు, చిన్న పట్టుకారు, సిగరెట్లు, అగ్గిపుల్లలు, పెన్సిలు, కాగి

తము, ఒకబాటరీలైటు—ఇవి అందులో ఉండేపదివస్తువులు. బాటరీలైటు వెలుగున మొగమును దిద్దుకొనవచ్చును. ఈపెట్టెను ప్రత్యేకము బాటరీదీపముగా కూడ మార్చి వాడుకొనవచ్చును.

---

## బ్రహ్మాండమయిన వ్రాతపుస్తకము



ప్రొ. ఆర్. హెచ్. వీలర్ అను మనస్తత్త్వశాస్త్రపండితుడు మనస్తత్త్వశాస్త్రసంబంధులగు పరిశోధనల ఫలములు, వానియొక్క పరస్పర సంబంధములు మొదలయిన విషయములు సులువుగా తెలియుటకయి ఒక బ్రహ్మాండమయిన సంపుటమును వ్రాసియుంచుచున్నాడు. ఆ సంపుటమునందలి పుటపొడవు నాలుగడుగులు; వెడలుపు [illegible] అంగుళములు. పూర్తి అయిన దానిబరువు నూటపదిపౌనులుండునట.

---

## కాంక్రీటు ఎండియుండుటను తెలుపుయంత్రము



నేలపయిని క్రొత్తగా కాంక్రీటువేసినపుడు దాని మీద బల్లలుఅమర్చుటకు పూర్వము, అది చక్కగా ఎండినదో లేదో తెలిసికొనుటకు కొందరు నిపుణులు ఒకయంత్రమును తయారుచేసిరి. అది చెమ్మనుపీల్చుకొనని ఒక గుండ్రని డాలులో అమర్చబడియుండును. ఆడాలును కాంక్రీటుమీద, చిత్రమునగలట్లు, ఉంచినచో ఆవిరినిబట్టి కాంక్రీటులోని చెమ్మను అది తెలుపును. కాంక్రీటు బాగుగా ఎండినతరువాత బల్లలు పరిచినట్లయిన మెరకపల్లములు లేక తలము చదునుగా నుండును.

---

## వేళకు పనిలోనికి రాని పనివారిని పట్టియిచ్చే ఘటికాయంత్రము



ఇట్టి ఘటికాయంత్రము లి[illegible] కార్ఖానాలలోను, కచేరీలలోను ఉపయోగింపబడుచున్నవి. పనివాడు వచ్చి యంత్రమునగల మీటను నొక్కవలెను. వెంటనే ఆనాటితేది, అప్పటివేళ-గంటలు, నిమిషములు-లోపలనున్న కాగితపు టేపుమీద అచ్చుపడును. ఆవల వాని సంతకమునకయి యంత్రముమీదిపైపున నున్న కన్నమునకు సరిగా వచ్చి ఆటేపు ఆగును. ఆటేపుమీద అక్కడ మీటనొక్కినవాడు సంతకము చేయవలెను. ఆలస్యముగా వచ్చినవారు త్వరగా వచ్చినట్లు తప్పువేళను సుర్తించుట కింక ఏమాత్రమును అవకాశము లేదు. చిత్రమున ఒక ఉద్యోగి మీటనునొక్కి, టేపుమీద సంతకముచేయుచుండుట కానవగును.

---

## బ్యాంకి చెక్కులను తూచి లెక్కపెట్టవచ్చును

లాస్ఆంజలీస్ (కాలిఫోర్నియా) బ్యాంకులలో ప్రతిమాసాంతమునను కోట్లకొలది చెక్కులను లెక్కపెట్టవలసియుండును. ఆ పనికి ఎంతయుకాలము వ్యయ



ము నగును; శ్రమకూడ అధిక మే. దానినంతయు పోబెట్టుటకయి ౨౨ చెక్కలు రమారమి ఒక ఆవున్సు, మరి, ౩౫౦ ఒకపౌను బరువు ఉండునని తూచి కనుగొని, ఆలెక్కల ననుసరించి కట్టలుకోలది చెక్కలను తూచి సులువుగ లెక్కకట్టుచున్నారు.

---

## చెడిపోయిన నారింజపండ్లను తెలుసుకొనుటకు యంత్రము



ఇది ఒక 'ఎక్సు రే' యంత్రము. కాలిఫోర్నియా లేబరేటరీలో తయారయినది. ఈయంత్రము సాయమున పుచ్చిన, ఎండిన పండ్లను తెలిసికొనవచ్చును. ఇద్దరు మనుష్యులు గంటకు ౨౨,౫౦౦ పండ్లను పరీక్షింపగలరు. రెండు గాజుతెరలమీద వారియెదుర ఒకదాని వెనుక నొకటిగా జరగిపోవుచున్న నారింజపండ్లయొక్క నీడ పడును. ఆనీడలో పండ్లలోపలి మంచిచెబ్బరలు తెలియును. పండులో దోషము కనుపడినతోడనే ఎదుటి వ్యక్తి ఒక మీటను నొక్కును. వెంటనే దోషముగల పండు ఆవల పడిపోవును. ఈవిధముగా పరీక్షించి మంచి నారింజపండ్లనే అక్కడివారు ఎగుమతిచేయుదురు.

---

## పెద్ద ఫోటోలను కడుగుటకు పెద్దతొట్లు

గోడల నలంకరించుటకోసము తయారుచేయు పెద్దపెద్ద ఫోటోచిత్రములను కడుగుటకయి పెద్దతొట్లు



చికాగోలో తయారుచేయబడినవి. వానియందు ౮౨ అం. వెడలుపు, ౨౫ అ. పొడుపు గల ఫోటోలను కడుగవచ్చును. ౧౧౮ గాలనుల నీరుపట్టు ఆతొట్లలో వడబోసిననీరు నిరంతరము పారుచుండును. శ్రేష్ఠమయిన ఉక్కుతో చేయబడినవి కావున రసాయనపదార్థముల మిశ్రణము కారణముగా అవి ఏమాత్రము పాడుకావు. ఫోటోలును చాల శుభ్రముగానుండును.

---

## వేగపరీక్షలో మనిషి గుఱ్ఱమును ఓడగొట్టెను



జెస్సీ ఓవెన్సు అను నీగ్రోయువకుడు ఇటీవలి ఒలింపిక్ పందెములలో మిక్కిలి వడిగాపోవు ఒక గుఱ్ఱముతో పోటీచేసి దానిని ఓడించెను. క్యూబా ట్రాపికల్ పార్కులో పదిసెకనులకంటె తక్కువ కాలమున ౧౦౦ గజములదూరము పరువిడి ఇరువదిగ

ములపూర్తిగా ముందుకుమించి తనకిచ్చిన ౪౦ గజములవార అధికమని అతడు రుజువుపరచినాడు.

---

## కాగితములను తనంత గ్రహించు టైపుయంత్రము



ఇది క్రొత్తమాదిరి ఎలెక్ట్రిక్కు టైపుయంత్రము. యంత్రము ముందుభాగమున నుండుతొట్టెలో తెల్లకాగితములను, కార్బను కాగితములను పేర్చిఉంచినయెడల టైపుచేయ మొదలుపెట్టునప్పుడు, తెల్ల కాగితమును, కార్బనుకాగితమును సరిగా తిన్నగా మరలోకి తమంత వెళ్లుచుండును. ఇందువలన కాగితములను ఎగుడుదిగుడు లేకుండ ఎక్కించవలసినశ్రమ, ఆలస్యము మొదలయిన తొందరలన్ని తప్పిపోయినవి. కాగితాలు నలుగకుండ టైపుసిలుకాపీలు కావలసినన్ని తీసుకోవచ్చుననియు యంత్రనిర్మాత చెప్పుచున్నాడు. టైపుచేయునతడు యంత్రమునందలి తొట్టిలో కాగితములను పేర్చుచుండుట చిత్రమున కానవగును.

---

## జంత్రపు పావురము



హార్వర్డు ఎంజినీరింగ్ కళాశాలలో రెండు కట్టడములలోనివారు ఉత్తర ప్రత్యుత్తరముల రాకపోకలను సాగించుటకు 'జంత్రపుపావురం' మొకటి నిర్మింపబడియున్నది. ఇది రెండుకట్టడములను కట్టబడిన తీగల వెంబ నడచును ఇది 'సిలిండరు' ఆకారమున నుండును; మోటారుశక్తితో నడచును. తనంతట నదియే పోయి తీగయొక్క రెండు చివరలను ఆగిపోవును. దీనిలో ఉత్తరముండినయెడల, ఎఱ్ఱనిరంగుదీపము వెలుగుచుండును.

---

## క్రొత్తరకపు నిప్పునార్పు యంత్రము




ఇది యుటీవలనే యమలునకు వచ్చినది. దీనిలోని విశేషమేమనగా, నిప్పురగుల్కొన్న ప్రాంతములకు నీటిసరఫరా కనుకూలమైన జలాశయాదులకును నడుమ చివర కొకటిన్నరమైలుదూర మున్నను సరే దీనిసాయముతో అనాయాసముగనిప్పునార్పు కార్యమును నెరవేర్చవచ్చును. ఇందులో ఒకటిన్నరమైలు పొడుగుగల పట్టగొట్టము లమర్పబడియుండును. ఈ యంత్రము సాధారణముగ గంటకు ౧౫ మైళ్లదూరము పోగలిగియుండును గావున దూరజలాశయాదులకు గొట్టములను తగిలించుటకు గూడ సుమారు ౬ నిమిషములకన్న నెక్కువ వ్యవధి పట్టదు. నీటి సరఫరా ఎక్కువగా కావలసిన సందర్భములం దనుకూలముగ నుండగలందులకై ఒకతేమారు రెండుగొట్టములను అమర్చుటకుగూడ నిందులో సౌకర్యములు చేయబడియున్నవి.

---

## క్యామెరాలలో మరియొక అభివృద్ధి




ఏయే సమయములందు ఏయేచిత్రములకు ఎంతెంత వెలుతురునిచ్చి బింబములను తీయవచ్చునో చూచినట్లు

చెప్పుటగాని, నిర్ణయించుటగాని దుర్ఘటమైనపని. సూర్యుని తేజము ప్రతికాలమునకు, ప్రతి స్థానమునకును వ్యత్యాసపడుచుండు ననునంశము మనము గమనించుచునే యున్నాము. అయినను చక్కగా గ్రహించి బింబములకు ప్రతిబింబములను సలక్షణముగా తీయుటలోనే ఛాయాచిత్రకారుని నేర్పు వ్యక్తమగుచుండును. అది యొకరి బోధనతో వచ్చునదికాదు. ఒక్కొక్కడును కష్టపడి, లోటుపాట్లు అనుభవించి, వానిని సవరించుకొనుచువచ్చి ఆపరినిష్ఠితస్థితికి రావలసినదే. అది యెంత వ్యయ, ప్రయాససాధ్యమో ఛాయాచిత్రకారు లెరుగుదురు. అటువంటి వ్యయప్రయాసలను తప్పించుటకై యీరకపు క్యామెరాలు క్రొత్తగ నిర్మింపబడుచున్నవి. చిత్రకారుని ప్రజ్ఞజోలి అక్కరలేకయే యీ యంత్రములు సమయసందర్భముల కనుకూలముగ స్వయముగనే కావలసినంత వెలుతురును ప్రతిబింబఫలకములకు సమకూర్చి చక్కని ప్రతిబింబములను తీయగలుగుచున్నవి. వీనిలో వెలుతురు మొట్టమొదట సహాయకకటకము (Auxiliary lens) న ప్రవేశించి ఆప్రాంతముననుండు ఫోటో ఎలెక్ట్రిక్ సెల్లును తాకును. వెంటనే యంత్రములోపలి వడబోతతెర (Screen filter) చలింప నారంభించును. ఆ తెరలోని పారదర్శకత భిన్నభిన్నముగ నుండి చిత్రఫలకములకు అనుగుణమైన వెలుతురును తూచినట్లు ప్రవేశపెట్టుచుండును. పరిమితమైన వెలుతురు ప్రవేశింపగానే మూత మూసుకొనిపోవును.

---

## కార్యాలయములయందు 'బోయీ' లవసరములేదు

మేనేజరు గుమాస్తాలకుగాని, గుమాస్తాలు మేనేజరుకుగాని, గుమాస్తాలలోనే ఒకరు మరియొకరికిగాని కాగితములు వగైరాలు పంపవలసినప్పుడు వానిని తీసికొనిపోవుటకు 'బోయీ'లు ఇంతవరకు నియమింపబడుచున్నారు. ఆ ఖర్చును తగ్గించుటకై యీ క్రొత్త పద్ధతి యాచరణలోనికి వచ్చినది. ఉద్యోగుల పీఠముల మార్గముగా అంతరాళమున తగుమాత్రపు యెత్తున



నొక తీగెలయినుపదారి స్తంభములమీదుగా సమర్పబడియుండును. ఆ యినుపదారి మీద ఆటరైలుబండి ఆ కొననుండి యీకొనకు పరుగెత్తుచుండును. ఏ పీఠమువద్దకు వెళ్లవలయునో ఆ దూరమునకు పోగలుగునంత బిసతిప్పి ఆ బండిమీద పంపవలసినకాగితములను పెట్టి విడిచెదరు. అది నిర్ణీతదూరమునకు వెళ్లి టక్కుమని యాగిపోవును. ఈ పద్ధతిమూలముగా కార్యాలయములకు 'బోయీల' జీతముల ఖర్చు తగ్గింపబడినది.

---

## చలికాలమునకు విద్యుచ్ఛక్తి దుప్పట్లు



చలికాలములందు తలుపులు బిగించుకొని దుప్పట్లు, శాలువలు కప్పుకొని పరుండుట మామూలు. ధ్రువప్రాంతములందును, పర్వతప్రాంతములందును, తదితర శీతలప్రదేశములందును ఎన్నిప్రయత్నములు చేసినను

చలికాగుకొనుట కష్టముగనుండును. అట్టి పరిస్థితుల యందు సౌకర్యముగనుండుటకై యీదుప్పట్లు క్రొత్తగ తయారుచేయబడినవి. ఇవి సన్నని, మెత్తని నిరోధపు తీగలతో అల్లబడియుండును. వీనిని నీటిలో తడుపవచ్చును; ఉతుకవచ్చును. వీనికి ఒకకమ్మి అమర్పబడి యుండును. ఆకమ్మిని ఇంటిలోని ఏవిద్యుచ్ఛక్తిపేటికకైనను తగిలించి ఈ దుప్పటికప్పుకొని పండుకొన్నచో బయట ఎంతచలిగనున్నను సరియే, వెచ్చగ హాయిగ నుండును. దుప్పటిఅల్లిన తీగలు నిరోధపుతత్త్వముగలవి గావున వ్యక్తులకు విద్యుచ్ఛక్తిఘాత యేర్పడుసంభవముండదు. దేశకాలములనుబట్టి వెచ్చదనమును హెచ్చించుకొనుటకును, తగ్గించుకొనుటకును ఉపాయములుకూడ అందులోనే ఏర్పాటు చేయబడియున్నవి.

---

## వేటకాండ్ర లక్ష్యవిద్యను నేర్చుకొనుటకు క్యామెరా తుపాకి



వేటాకుతూహలమున లక్ష్యజ్ఞానములేనివారును అంతఃకు పూనుకొని వెళ్లి ప్రమాదకరములైన మృగములను గురిపెట్టి తుపాకులను ప్రేల్చుటయు, గురితప్పిపోయి యామృగములు కోపావేశమున వారిపై దుమికబోవుటయు, ఆ ప్రమాదమునుండి తప్పుకొనుటకు కన్నతంటాలుపడుటయు మనము వినుచున్నాము. ఈ యవస్థలను స్వయముగ నెరిగినయొక రీ నూతనపద్ధతి నవలంబించినారు. తుపాకిముందలి తోటాలగొట్టము నూడదీసి దానిస్థానమున సూక్ష్మమయిన యొక క్యామెరాను, దూరదర్శినితాలూకు కటకమును అమర్చుకొన్నాడు. కటకపుమూతకును,తుపాకి నొక్కుమీటరును ఒకటిరును తీగను తగిలించినాడు. దీనితో నతడు తన పెంపుడు మృగములను గురిచూచి మీటనొక్కును. వెంటనే క్యామెరామూత తెరుచుకొని మూసుకొనుటవలన ఫిలిముమీద నామృగముచిత్ర మేర్పడును. అంత దానిని కడిగి పరిశీలించును. దానిలోని బింబపు సన్నివేశమునుబట్టి నిజముగ తుపాకికాల్చియున్నచో ఆమృగము ఆహుతి యయ్యెడిదో కాదో నిర్ణయించుకొనును. ఇట్లే అతడు దినక్రమముగ నభ్యాసముచేయుచు లక్ష్యభేదనమున గలుగు లోటుపాట్లను సవరించుకొనుచువచ్చి పరిస్థితి ప్రజ్ఞను సంపాదించినాడట. గురువే అవసరములేదు; క్షేమయిన విధానమే!

---

## మోటారు ఇంజనులకు వానకాలపు డేరాలు



వాన కురియుచుండగా నడుమ రెక్కడనయినను ఇంజనులను మరామత్తుచేయవలసివచ్చినప్పుడు వైర్లకు వానలో తడియుదుమే యన్న భయమును, ఇంజనులోపల నీరుచొచ్చి యంత్రభాగములు తడియునే యన్న యాలోచనయు లేకుండ ఇంజనులకు పైన తెరచుకొనినిలుచునట్లు కారు పైకప్పులకు జోడించి డేరాలు అమర్పబడుచున్నవి. అవసరము వచ్చినప్పుడు వానిని తెరచి ఇంజనుముందుకొనలో నుండు ‘ట్రోపేలను తగిలించవలయును.

---

## మోటారుకారు కప్పలను తెరచుటకును, మూయుటకును సులభోపాయము

మోటారుయంత్రములోనే యొకభాగమున నొక పేటికలో గాలి నింపబడి భద్రపరుపబడియుండును. ఎడమచిత్రమునందు చూపబడినట్లు మీటను లాగినంతనే ఆపేటికలోని గాలి యొకగొట్టమునుండా విసవిస పోయి కారు పైకప్పు నెగదన్నును. కప్పు తెరచుకొని సక్రమముగ నిలుచును. మరల ముడిచివేయవలసివచ్చినప్పుడు



కప్పులోపలిభాగమునందుండు మరియొక మీటను కుడి చిత్రమునందువలె ఒత్తినచో ఆ చట్టములోని గాలి ఒత్తిడి మరల యథాస్థానమునకు పోవునుగావున కప్పు ముడుచుకొని పడిపోవును. గాలిపేటికలో నొకసారి గాలినింపుకొన్నచో ధారాళముగా ౧౫ మార్లు కప్పును తెరచి మడుచుటకు చాలును. ఆ తర్వాత మరల గాలిని నింపుకొనవలసియుండును.

---

## సోఫాలు మొదలగువాని మెత్తలను శుభ్రముచేయు పరికరము



సోఫాలు మొదలగువాని మెత్తలు, దిండ్లు మొదలగునవి మురికిపట్టినప్పుడు వాని గుడ్డలను కుట్లు విప్పి యతుకుట సాధ్యముకాదు. నీటిలో తడుపకనే వానిని శుభ్రము చేయవలయును ఈ క్రొత్తయంత్ర మాపనికి మిక్కిలి యుపకరించును. ఈ యంత్రమునకు రెండు గొట్టములమర్పబడి యుండును. ఒకగొట్టముకొనకు ఒక తూలిక తగిలింపబడియుండును. యంత్రములో నుండి యాగొట్టముగుండా సబ్బునురుగువంటి యొకపదార్థము చిమ్మబడును. అది రసాయన వస్తువులతో కలిసియుండును ఆపదార్థమును మెత్తలు మొదలయినవానిమీద చిమ్మమ నాతూలిక ఆవస్తువులను చక్కగా మర్దనముచేయుచు శుభ్రముచేయును. వస్తువులయందలి మురికియంతయు విడిపోయి నురుగులో కలిసిపోవును. తరువాత నామురికి నురుగునంతను రెండవగొట్టము కొననుండు సాధనము పీల్చివేసి అందుకై ప్రత్యేకించియుంచిన మురికిడబ్బాలోనికి చేర్చును. మెత్తలు, పరుపులు ఈ విధానముతో బాగుగా శుభ్రమగును. దిగువ చిత్రమున నురుగును చిమ్ముటయు, ఎగువచిత్రమున మురికినురుగును పీల్చివేయుటయు గాంచనగును.

---

## కోణములను కొలుచుటకు అడుగుబద్ద




[illegible] యే యా అడుగు బద్దతో కోణములను ఏ పరిమాణముతోనయినను నిర్మింపవచ్చును; ఏ కోణమునయినను కొలవవచ్చును. ఈ బద్ద నిడుపున రెండుభాగములుండి, నడుమను విభజింపబడి కీలుతో కూర్పబడియుండును. రెండు భాగములందును ప్రత్యేకపు కొలతగుర్తులు గీయబడియుండును. ౭౦ డిగ్రీల కోణమును నిర్మించవలెననుకొనుడు. ఒక విభాజని ఈ కొలతబద్దయొక్క ఒకభుజముమీదనుండు కొలత గుర్తులమీద పెట్టి ౭౦ యానిట్ల కొలతకరకు వచ్చువరకు విభాజనిని తెరవవలయును. ఆ తర్వాత విభాజని రెండుకొనలను అడుగుబద్దమీది గుర్తుమీద నిలుచునట్లు భుజములను చాచి నిలిపినచో గీయదలచుకొన్న ౭౦° కోణము తనంతట ఏర్పడుచున్నది. ఇదే విధానమును తలక్రిందులు చేసినచో నెటువంటి కోణమునయినను క్షణములో కొలిచి దాని పరిమాణమును తెలుపవచ్చును.

---

## ఇంకొక నిప్పునార్పుయంత్రము

మరియొక జలాశయమునుండి నీటిని తెచ్చుకొనవలసిన యవసరము దీనికి లేదు. ఇందులోనే ఒకజల



'తటాకము'ండును. అందులో సుమారు ౧౨౦౦ గాలన్ల నీరు పట్టును. ఆ తటాకమునుండి నీటిని నలుప్రక్కలకును ఎగజిమ్ముటకు చిమ్మనగొట్టము లుండును. ఆ గొట్టములు ఇష్టమువచ్చినరీతిని సర్దుకొనుట కనుకూలముగ నిర్మింపబడియుండును. తటాకములోనినీరు చెల్లిపోయినప్పుడు పంకివచ్చునను నూహతో కొళాయిపట్టీలుకూడ యీ యంత్రములో సిద్ధముగ నుంచబడియుండును. నిప్పంటుకొన్న కట్టడములవద్దకు ఈ యంత్రపుబండిని తీసుకొనిపోయి, కట్టడములకు వీపుచేసి నిలిపి యంత్రమును నడవనిచ్చినచో నీరుగోడలవలె నేకధారగ చిమ్మ నారంభించును. తటాకపుబండిని కట్టడముల లోనైపునకు ద్వారములగుండా పోనిచ్చి, నీరు చిమ్మనిచ్చినచో కట్టడము నాలుగువైపులకును నీరు చిమ్మి స్వల్పకాలములో నిప్పంతటిని శాంతపరుపవచ్చును. నిప్పునార్పుపనులు లేనప్పుడుకూడ ఈ యంత్రశకటమునకు ప్రయోజనము లేకపోలేదు. చిమ్మనగొట్టములను తటాకమునడుగున నమర్చియుంచినచో వీథులకు నీళ్లుచల్లుట కీయంత్రము నుపయోగించుకొనవచ్చును. యుద్ధసమయములందు శత్రువులు విషవాయువులను ప్రయోగించునవకాశము లేర్పడినప్పుడు ఆవాయువులశక్తిని స్తంభింపజేయుటకై యీ యంత్రముతో వీథులకును, ఇండ్లకును విషఘ్నములగు రసాయనద్రావకములను చిమ్మి కాపాడుకొనవచ్చును.

---

## ఆహారవస్తువు లెందుకు పులియుచున్నవి?

ఆహారవస్తువులలో ఎంజైములనబడు సేంద్రియ పదార్థములు కొన్ని యుండునట. విఘట్టనము కలిగినపుడు ఆహారవస్తువు పులియుననియు, ఆహారవస్తులకట్టి విఘట్టనమును కలుగజేయుటలో ఆ ఎంజైములే ప్రధానకారణము లగుచున్నవనియు నొక వాదముగలదు. దాని నీశాస్త్రవేత్త యీ క్రొత్తయంత్రముతో సిద్ధాంతీకరించినాడు. దీనికి ప్రకాశవిద్యుత్పరికరము అనిపేరు. శీఘ్రగతికములగు ఎంజైముల చలన ప్రతిచలనము లన్నియు నిందులోని ప్రకాశవిస్ఫోటము మూలముగా కంటికగపడునట్లు గోచరించినవి. అవి ఒక రేడియోగొట్టముతో విస్తరింపజేయబడినవి. ఎప్పటికప్పుడు ఆ చలనమును అప్రయత్నముగ లెక్కకెక్కించుటకును ఇందులో మరియొక సాధన మమర్పబడియున్నది.



---

# నక్షత్రమండలము

(ఈశ్వర సంవత్సర చైత్ర మాసము)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

ఉత్తరము

తూర్పు




పడమర

దక్షిణము

ఈపటము తలమీదుగా ఆయాదిక్కులు చూపునట్లు సరిగా పట్టుకొని చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రములు.

ఏప్రెలు 8 తేదీని రాత్రి గం. 8-55 ఏప్రెలు 29 తేదీని రాత్రి గం. 7-32

,, 15 ,, ,, ,, 8-28 మే 7 ,, ,, ,, 7-0 కనబడును.)

You gaze at a star for two reasons:—
Because it is luminous; and because it
is impenetrable
Have you sweeter radiance and greater
mystery anywhere else?
Glance at the sky glittering with stars;
Observe the serenity which crushes
Human sorrow under a lugubrious and
eternal joy. -Victor Hugo.

నక్షత్రమును పరికించి చూచుటకు కారణములు రెండుకలవు: (౧) నక్షత్రము తేజోమూర్తియై కనులకు పండువుచేయును. (౨) నక్షత్రతత్త్వము నిరూపింపరాక అభేద్యము, అగ్రాహ్యము నై యలరుచున్నది. ఇంతటి మాధుర్యముతో కూడిన రుచియు, ఇంత ఆనంద హేతువైన నిగూఢత్వమును, మరెందును కానరావు. ఇట్టి విశేష విశిష్టతలుగల నక్షత్ర కోటులతో మెఱయు నాకాశరంగమును తిలకింపుము. ప్రశాంతశీలమైన ఆదిత్య దృశ్య ప్రభావముచేత నిత్యమును నిన్ను పీడించుచున్న కష్టపరంపరలను, మనోవ్యాకుల కారణములను మఱచి పొమ్ము. శాశ్వతము, అనిర్వాచ్యము, నిర్మలమునైన మహదానందము నొందుము.

ఈ యేప్రిల్ నెల ౨ వ తేదీమొదలు మేనెల ౨ తేదీ వఱకును రాత్రి తొలిజామున నగపడు నక్షత్రాది ఖగోళదృశ్యముల నవయూదము.

## పాలవెల్లి
## Milky way

నిశాంగన కొప్పున చూపట్టు తెల్లనిపూదండవలె ఈ ఖగోళదృశ్యము పశ్చిమ దిక్చక్రమునకు ఎదురుగా ధనురాకారముతో దక్షిణసమీపపు టాగ్నేయదిశనుండి ఉత్తరసమీపపు వాయవ్యమునకు రమ్యముగా వ్యాపించియున్నది. కొసలను విరివిగా నన్నను మధ్య నొకచో సన్నగిలుచు మరొకచోట విరివిగనుచు మిన్నేఱు వింత శోభతో వెలయుచున్నది. వినీలమైన ఆకాశసీమను, ఫేనభంగాదులతో కూడుకొని స్థైర్యములేని ధవళతేజముతో నేత్రపర్వముచేయు నీ దివ్యదృశ్యమును వివిధదేశములకవు లనేకవిధముల వర్ణించియున్నారు. ఒక ఆంగ్లకవిరాజు, "How the waters of heaven outshine them all!" (ఆకాశగంగా ప్రవాహ మెంత తేజోధికమై ప్రకాశించుచున్నది?) అని ప్రశంసించుచు తన ఆనందాశ్చర్యములను ప్రకటించుచున్నాడు ఈ యమునతటిని ఈమాసపు తొలిజామున నాగ్నేయమున త్రిశంకుమండలము (Crux, the Southern Cross) కడ నారంభమయి, దక్షిణమున నౌకామండలమును గడచి, మందరగిరిని చుట్టుకొనిన వాసుకిని దాటి పునర్వసు మిథునము ప్రక్క బడి, సారథిం దనిపి, భార్గవుల పరితుష్టుల గావించి వాయవ్యమున జలక్రీడాసక్తలై తేలుచు మునుగుచు దృశ్యాదృశ్య రూపములతో నాడు దేవాంగనలతో క్రీడించుచు నదృశ్య మగుచున్నది.

## ఉత్తరమున

ధ్రువక్షితిమధ్య, చిన్న ఎలుగుతోక చివరను ధ్రువుడు మెఱయుచున్నాడు. తోకమూల నగ్నియు, ఆవల తోకలో మహేంద్ర కశ్యపులును మెఱయుచున్నారు. ఈ చుక్కలకావల చిన్న ఎలుగుదేహమునందు చిన్న చతుష్కోణములో (small quadrilateral) తూర్పునకు ప్రాలి, ధాతవిధాతలును, వారికెదురుగా మిత్రాగ్నులును కలరు. ధ్రువక్షితిలో నిత్యము పరిభ్రమించు నీచుక్కలకు ఉదయాస్తమయములు లేవు. ఈ లఘుఋక్షపు చుక్కల కెదురుగా ధ్రువక్షితిలో ఊర్ధ్వశిచుక్కలు కొన్నిమాత్రము కనబడుచున్నవి. ధ్రువక్షితికి ఎగువ సప్తఋషులు కలరు. సప్తఋషుల దిగువను, ధ్రువక్షితికి వెలుపలను, ఘోరసర్పాకారముతో నరకాసురుడు భయంకరుడై మెఱయుచున్నాడు.

సప్తఋషులలో క్రతుపులహులకు పడమట విఘ్నేశ్వరుడు లంబోదరముతోడను, ఏనుగుతొండముతోడను చక్కగా మెఱయుచున్నాడు. మూషకమాతనిదిగువ చూడనగుచున్నది. మనపంచాంగకర్తలు చైత్రశుద్ధచవుతినాడు "గణేశపూజ" అనుచున్నారు. ఇది గమనింపవలసిన విషయము. భాద్రపదశుద్ధ చవుతి

నాడు సూర్యోదయాత్పూర్వము తొలిసారి కనబడుట చేతను, "ప్రాతర్యావాణా ప్రథమాయజధ్వం" అని శ్రుతి యుండుటచేతను ఆనాడు దేశమంతటను విఘ్నేశ్వర పూజలు వెలయుచున్నవి మరి ఆరుమాసముల పిమ్మట- అనగా చైత్రశుద్ధ చవుతినాడు విఘ్నేశ్వరుడు సూర్యు డస్తమించినపిదప తూర్పుఆకాశమున కానరాగలడు. అదికూడ నాడు పూజావ్రాత కొకముఖ్యకారణమే. ఏల యనగా "నోతనసాయమస్తి దేవయా అజుష్టం." (ఋగ్వేదము V-౭౭-౧-౨) అను శ్రుతిప్రమాణమును చిత్తగింపుడు. కావున భాద్రపద చైత్రమాసములందు శుద్ధచవుతిదినముల విఘ్నేశ్వరునికి ప్రత్యేకపూజలు అవసరమని తేలుచున్నది.

పశ్చిమాకాశమున

"వెలుగుతొడగిన వెన్నముద్దవలె" సూర్యాస్తమయానంతరము పడమటిదిక్కున దివ్యతేజముతో మెఱయుచుండిన శుక్రుడు అస్తమించుటచేత ఆదిక్కు చిన్నవోయి శోభాహీనముగా నుండవలసినదే; కాని పడమటి దిక్చక్రమునకును పాలవెల్లికిని మధ్య, వృషభ రాశిలో ఎద్దుకన్నువలె నెత్తురుకాంతితో రోహిణియు, ఒరయన్ చతుష్కోణములో ఆర్ద్ర, రిజెల్ (Regel) చుక్కలును, దిగువ దక్షిణదిశను మృగవ్యాధ అగస్త్యులును మొత్తము అయిదుచుక్కలు- తేజోవిషయమున నగ్రగణ్యమైన నక్షత్రము లైదు - ఒండొంటి కనతిదూరమున తేజరిల్లుచుండుటచేత, పశ్చిమాకాశపు శోభ బొత్తిగా చెడిపోలేదు. మఱియు గగనమధ్య రేఖకును, పాలవెల్లికిని మధ్య, ఉత్తరదిశనున్న సారథిమండలము లోని బ్రహ్మహృదయమును మిథునరాశిలోని సాంబ, పూర్వశ్వానములును (Pollux and Procyon) ఈశోభను హెచ్చించుచున్నవి.

వాయవ్యమున "తొలకాడు మిన్నేటి" లో నోలలాడు సురాంగనలు దృశ్యాదృశ్యములుగనుండుట మన మీవఱకే గమనించితిమి. అగ్నిదైవత్యమైన కృత్తికచుక్కలు ఇక త్వరలో నస్తమింపనైయున్నవి. ఈచుక్కలలో ఈమధ్య నొకక్రొత్తచుక్క బయల్పడి, కొంతకాలము మెఱసి అదృశ్యమైన వృత్తాంతము డాక్టరు పరమేశ్వరనుగారు ప్రకటించినారు. ఆచుక్కవృత్తాంతమును సావకాశముగా నరయుదము. అగ్నిదేవతారాధనాశీలురైన భార్గవులు కృత్తికనుండి అప్సరసలవఱకు ఉత్తరదిశను వ్యాపించియున్నారు. పులోమరక్కసుడు మాత్రము గ్రుడ్లు మిటకరించుకొనుచు అస్తమింపనైయున్నాడు.

ఒరయన్ చతుష్కోణమునందలి ముఖ్యనక్షత్రములైన ఆర్ద్ర, రిజెల్ చుక్కలనుగూర్చి ఈవఱకు ప్రశంసించితిమి. అందు పడమట పరివృత్తియు, మధ్య పటకాచుక్కలును, వానిదిగువ ఖడ్గమును, గమనింపతగియున్నవి. రిజెల్ సమీపమున నుదయించినట్లగపడుయమునయొక్క వంకతిరుగుడు లొకటి రెండుమాత్ర మిపుడగపడుచున్నవి. ఆదిగువ పిఱికిచూపులతో శశకము కాననగుచున్నది.

ఆదిగువ క్షీరసాగరమథనకథ పరిస్ఫుటమగుచున్నది. మందరగిరి పాలమున్నీటిలో తేలియాడుచున్నది. ఆకవ్వముచుట్టును కట్టిన త్రాడు వాసుకి. శ్రీనాథమహాకవి ఆవాసుకి నిట్లు చక్కగా వర్ణించినాడు:—

సీ॥ కద్రూమహాదేవి గారాపుసంతతి.........
కాలకంఠుని యంఘ్రిగంపపెండేరంబు......
కేతకీపుష్పవాసనా కృత్రిమాసి
పర్వతేంద్రంబు తత్త్రాడు పాపఱేడు.

ఇట్లు మథింపబడిన పాలసంద్రమున మొదట పుట్టిన హాలాహలమును మృగవ్యాధరుద్రుడు

"ఘనగంభీరరవంబుతో—లోకద్రోహి-హుం-పోకు రమ్మని కెంగేల దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలంబని సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్."- భాగ ౮-౨౪౨

ఈవృత్తాంతము మనకనులయెదుట ప్రత్యక్షముగా గోచరించుచున్నది-నేటి పశ్చిమాకాశమున.

## దక్షిణమున

పరమశైవుడైన అగస్త్యుడు మృగవ్యాధు ననుసరించి దేవనౌకయొక్క అమరభాగమున దక్షిణాకాశమున మెఱయుచున్నాడు. ఆనావయొక్క స్తంభము (Mast), చాపలు (Vela), దిగువభాగము (Keel) ఇపుడు బాగుగా చూడనగును. ఆగ్నేయాకాశమున అశ్వతరమండలము (Centaurus) నందు కొన్నిచుక్కలు కనబడుచున్నవి. ఆ ప్రక్కనే విశ్వామిత్రసహితుడైన త్రిశంకు డున్నాడు.

## తూర్పున

కుమ్మరిసారెవలె గుండ్రనై, ఇంద్రాగ్నిదైవత్యమైన విశాఖ తూర్పున నుదయించినది. ఎగువను చిత్రాది నక్షత్రములున్నవి. ౩/౪ ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర౧/౨. ఇవి కన్యారాశిలోనివి. అగ్నికుండసముద్భవ-అయోనిజ-యైనకన్యయొక్క ఉత్పత్తి ఇపుడాకాశమున చక్కగా గుర్తింపనగుచున్నది. ఈ కన్యను బడయుటకై అర్జునుడు (ఉత్తరఫల్గుని) ఆకాశమున గిరగిరతిరుగు మత్స్యయంత్రమును (మీనరాశిని) తెగనేసినాడు. మీన మస్తమించి అదృశ్యమైపోయినది. కాని పంచపర్వతముల నడుమనున్న నదివలె ఈ కన్య పాండవుల కైదుగురకును పత్ని కావలసివచ్చెను; చిత్తగింపుడు. పితృదేవతాకమైన మఘ ధర్మజుడు; ఉత్తరఫల్గుని అర్జునుడు; స్వాతి వాయుదైవత్యమైన భీముడు. దిగువ అశ్వతర వాహనులైన అశ్వినుల అంశమున నకులసహదేవులు. ఇట్లు భారతకథ ఈ మాసమున నాకాశమున పరిస్ఫుటమైనట్లు మరొక మాసమున కాజాలదు. తూర్పున శేషమండలమున కొంత కనబడుచున్నది. ఎగువ భూతేశమండలమున స్వాతి పగడమువలె ఎఱ్ఱగా మెఱయుచున్నది. దిగువ చిత్ర ముత్యమువలె మెఱయుచున్నది. ఈ రెండును తోరణస్తంభములవలె ఈ తొలిజామున మన కగుపడుచు శ్రీనాథుని వర్ణనమును జ్ఞప్తికి తెచ్చుచున్నవి.

## మధ్యను

మఘనక్షత్రము ఇంచుమించుగా గగనమధ్యరేఖను చేరినది. మఘ, చిత్ర, స్వాతి ఈ మూడును ఒక త్రిభుజమువలె నుండి తూర్పుదెసను మెఱయుచు శోభగూర్చుచున్నవి; కాని పడమటిదెస కానవచ్చు తేజస్సంపదలో ఒకమూడవపాలైనను ఇపుడు తూర్పుదెసను కానరాకున్నది. కర్కాటక మిథునరాసులు పడమటకు వ్రాలిపోయినవి. సింహరాశి గగనమధ్యమున తేజరిల్లుచున్నది. దానికి తూర్పుదెసను వేణీమండల సహితముగా క్షీరోద ఉత్తరధ్రువమునుండి కన్యకలదు. పొట్లపువ్వువంటి పుష్యమికి దిగువ సర్పదైవత్యమైన ఆశ్రేష కలదు; అది దిగువకు వ్యాపించి అహిమండలముగాను, ఇంకను తూర్పునకు వ్యాపించి నహుషమండలముగాను వ్యవహరింపబడుచున్నది ఇదంతయు నొక్క అహిమండలముగా ఋగ్వేదము గ్రహించుచున్నది. పడమటిదేశస్థులీ దీర్ఘనక్షత్రసమూహమును అహి (Hydra) యనియే వ్యవహరించుచున్నారు.

పడమట శుక్రుడస్తమించినను ఈ మాసమున పదునొకండు మేలినక్షత్రము లిపుడు కనబడుచుండుటచేత నభోరంగ మిపుడు శోభాయమానముగానే కనబడుచున్నది.

అహిమండలమునకుత్తరముగా వార్తికపుపక్షియు, చమసమును కలవు. దేవతలు అమృతపానము చేసిన పాత్రయీ చమసమేయని వేదము తెలుపుచున్నది.

ఈ మాసములో రాత్రి తొలిజామున మననక్షత్రపటములో చూపబడినవేళలకు గ్రహము లొక్కటియైనను మనకు కానరాకున్నవి.



# విమర్శనము

### జవహరలాల్ నెహ్రూ ఆత్మకథ

(కర్ణాటకానువాదము)

ప్రకాశకులు: సి. అశ్వత్థనారాయణరావు, బెంగుళూరు.

భారతీయ స్వాతంత్ర్య స్థాపనోద్యమమందు వికాసాత్మక జీవనమును బలిగావించిన మహాపురుషులలో జవహర్లాల్ నెహ్రూగారు రుచ్చస్థానము నలంకరింతురు. ఈ మహాపురుషుని జీవితము ఈ పుస్తకము మూలముగా కర్ణాటకులకు తమ భాషయందు లభించుట కడు ప్రశంసనీయము. గాంధీగారి జీవితచరిత్ర అనువాదమయిన పిదప ఇదియే యీ భాషయందు రెండవ జీవితచరిత్ర. ఈ గ్రంథము నవలోకించినయెడల పాఠకుల మనసులయం దొక విధమైన పరిణామముగలిగి, జీవితములో ఉద్దేశసాధకులయందు గాఢమైన గౌరవము గలుగగలదు; ధ్యేయములేని తమ జీవితములకు ఒక ధ్యేయముగూడ గోచరింపగలదు. ఈ జీవితచరిత్రను సాహిత్యకళాదృష్టితో చూడవలసినది సాహిత్యకళారాధకులకు అనివార్యమైన కర్తవ్యము. విమర్శాత్మకదృష్టి సాహితి కొక జీవకళయేకాక ఉత్తమసాహిత్యరచనకు ప్రబలకారణము గూడ.

నెహ్రూగారు తమ గ్రంథమున నుపోద్ఘాతము వ్రాయుచు "ఈ యాత్మకథ లఘుచిత్రము" అని వ్రాసియున్నారు. తమ జీవితమును తాము వ్రాయునపుడు ఏ విషయ మవసరము, ఏవిషయ మనవసరము అను సమస్య కడుకఠినమైనది. అది వారి యుద్దేశము ననుసరించిపోవును. గ్రంథకర్తకే యిట్టి కఠిన ప్రసంగము గలిగియుండినపుడు, అనువాదకులు, నెహ్రూగారు వ్రాసిన లఘుచిత్రమును ఇంకను లఘువుచేయుటయం దేజిజ్ఞాస యుపయోగించియుండురో అనువాదకులకే యెరుక. ఇది సంపూర్ణానువాదమనుటకు గ్రంథమం దేసూచనయు నగుపడదు. పీఠికలు గ్రంథమునుండి విడమరచి ఒక సరసమైన ధోరణితో గ్రంథము సాగునట్లు సమకూర్చుటలో లోప మగుపడుచున్నది. సక్రమముగా అనువదించియుండినయెడల చాల బాగుగ నుండియుండును. వాచకులు కేవలము స్థూలముగా పరికించినను, ఇది తెలియగలదు.

ఇక ఈ అనువాదము ఒకరిచే చేయబడలేదు. ఒక గుంపు అని 'విన్నప'మందు తెలిపినారు. శైలిని బట్టి వస్తునిరూపణ సరసముగ, అడ్డులేక ముందుకు సాగుటలో చాల అననుకూలము లున్నట్లు తోచుచున్నది. కావ్యములలోనన్న, అనేక కావ్యతీర్థులు వేరువేరు విచారములను వేరువేరు దృష్టికోణములతో వ్రాయుట యుచితమే మోగాని ఒకే దృష్టిని చూపు జీవితచరిత్ర నిట్లు అనేకులు చేరి వ్రాయుటకు యత్నించిన లాభముండదు. ఒకవ్యక్తి పర్వత మెక్కునపుడు ఆయాసముచే బడలి అక్కడక్కడ నిలిచి ఆయాసపరిహారమైనపిదప మరల దుర్గావరోహణమునకు ప్రయత్నించు విధాన పాఠకుడు శైలివ్యత్యాసముచే బాధను పొందకపోడు.

ఇక శైలిని గురించి యొకమాట: కర్ణాటకవాఙ్మయమున నూతన సంశోధనలచేతను, ప్రయోగములచేతను పెక్కుశైలులు, నడకలు సాహిత్యమునకే ఒక నూతన

తేజస్సు తెచ్చిపెట్టిన మాట వాస్తవము. ఇది శ్లాఘనీయమైన పరిణామముకూడ. కాని ఆంగ్ల భాషనుండి ద్రావిడభాషలకు గ్రంథముల ననువదించునపుడు పడవలసిన కష్టములు చెప్పనలవి కాదు. అట్టికష్టపరిస్థితులందు గ్రంథములు జన్మించినందులకే సంతోషింపవలయును. భాషా సంప్రదాయములు వేరుగా నుండుటవలన ఆంగ్లమున మూర్తీభవించిన భావావేశములను తద్రూపముగ కన్నడమందే కాదు, మరియే యితర భాషలలందు తెచ్చుటకూడ సాధ్యముగాని ప్రసంగము. ఆంగ్ల భాషకు జీవములవలె నుండునని రూపకములు (Metaphors), జాతీయములు (Idioms), అతిసూక్ష్మ మనోభావములను వ్యక్తము చేయుటకు తగిన మరియు కొన్ని పదజాలములు. ఇట్టివిపుల శబ్దభాండారము మన ద్రావిడ భాషలకు లేదు. వాస్తవమే. కాని యీ గ్రంథానువాదకులు కేవల మెల్లరకు తెలియునట్లు వాడుకలోనుండు పదములను వదలి కృత్రిమపదజాలమును కల్పించి ఆంగ్ల భాషాపదములకు సరితూగునట్లుండవలెనని చాల శ్రమపడినట్లు తెలియుచున్నది. రాష్ట్రీయతావాది, ఐశ్వర్యద భాళికె, అనుభవక్క హూరణగళు తోరిదవు, బౌద్ధిక దిగంత, గుడుగాడినరు, లింగవిజ్ఞాన, నైతికరాష్ట్రీయతె, మూర్తరూప, అక్రమకూటస్థరు మున్నగు పదములిందున్నవి. పథ్యంతమైన పదములను పరంపరగా పెక్కుచోటులం దుపయోగించినందువలన శైలి కృతకముగా నగుపడుచున్నది. "నీతిరహితరాగిద్ద, హింసె బిద్దిద్ద, మరిదు బిద్దిద్దజనగళు" (౧౦౭ పుట) అనునటువంటి వాక్యములనేకములుగలవు. Back to Villages అనుదానిని 'హళ్లిగళిగె మరళి' అని అనువదించుట విచిత్రముగా నున్నది.

ఈ గ్రంథమందు సుగుణములును పెక్కులున్నవి. ౯౭ పుట అయిన తరువాత భాష ఏకధారగా నడచినది. 'అసహకార' అను ప్రకరణము కన్నడక భాషాశైలి యొక్క అంతిమస్థానమును బొందినది. 'అహింస' ప్రకరణములం దగపడు వ్యాప్తమైన Reicence భాషాపరిపక్వస్థితిని ప్రదర్శించుచున్నది. ఇది చదివినప్పుడు గొప్ప సాహితి Haldane గారిశైలి జ్ఞాపకము వచ్చును. 'సత్యాగ్రహ మత్తు అమృతసర' అను ప్రకరణమొక నూతన శైలిలోనున్నది.

గ్రంథబాహ్యస్వరూపము చాలమనోహరముగ నున్నది. కర్ణాటక ముద్రితగ్రంథములం దుత్తమస్వరూపము నిది ప్రదర్శించుచున్నది. నెహ్రూదంపతుల యొక్కయు, మోతీలాల్ నెహ్రూగారియొక్కయు చిత్రములు ఇందుచేర్చబడియున్నవి కాని వాటిని గ్రంథమునం దుచితమైన స్థలములలో నిమిడ్చియుండిన బాగుండెడిది. పైఅట్టమీద నెహ్రూగారి ఆనందభవన మందిర చిత్రముండిన బాగుగ నుండెడిదేమో!

ఈ లోట్లను రాబోవు ముద్రణములందు సరిపుచ్చుకొందురను ఆశయముతో ఇంతవిపులముగా వ్రాయవలసి వచ్చినది.

టి. వి. నాథముని అయ్యంగారు

---

# గ్రంథ స్వీకారము

---

### భజగోవిందం

చిన్నసైజు పుస్తకము, పు. ౭౦, వెల ౦ ౮-౦ మూలము, ఆంగ్లానువాదము. అనువాదకుడు : విద్వాన్ పి. కృష్ణమూర్తి. ఉపాధ్యాయుడు, వెస్లి గరల్సు నార్మల్ స్కూలు, సెకండరాబాదు (డక్కను)

---

### ఆత్మకథ - తొలిపాలు

(పద్యకావ్యము) క్రౌను ౧/౮ వ, పు. ౨౩౨, వెల రు ౧-౦-౦. గ్రంథకర్త: ఉ. భా. ప్ర. తుమ్మల సీతారామమూర్తి చౌదరి, బోర్డు హైస్కూలు పండితుడు, బాపట్ల.

---

### ౧ సౌందర్యలహరి

డెమ్మి ౧/౮, పు ౨౦, వెల రు ౦-౪-౦.

### ౨ శివానందలహరి

డెమ్మి ౧/౮, పు. ౨౧, వెల రు ౦-౬-౦ అనువాదకుడు: సోమంచి వాసుదేవరావు, తెక్కలి, గంజాం జిల్లా.

---

### రాధికా సాంత్వనము, సప్తపదులు

డెమి ౧/౮ సైజు, పు. రా. సాం. ౧౪ + ౧౪౮; స. ప. ౩౯. వెల ౦-౮-౦; రచయిత్రి: ముద్దుపళని.

ప్రకాశకులు:—శృంగార కావ్య గ్రంథమండలి, మచిలీపట్టణము.

కొన్ని నియమములకు లోనయినవారికే యిది యియ్యబడును.

---

### ముత్యాలశాల–కథల సంపుటి

డెమి ౧/౮ సైజు. పు. ౧౪౭, వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త:—వెంపటి నాగభూషణ.

ప్రకటనస్థానము:—పద్మావళీ పరిషత్, మచిలీపట్టణము.

---

### కారుణ్యం (కథలసంపుటి)

క్రౌను ౧/౮ పు ౯౬, వెల రు. ౦-౪-౦.

గ్రంథకర్త:—కొడవటిగంటి కుటుంబరావు

ప్రకటనస్థానము:—యువకార్యాలయం, పాతపేట, తెనాలి.

---

### Man (మనిషి)

డెమ్మి ౧/౮ సైజు. పు. ౬౧ వెల రు. ౧-౦-౦.

గ్రంథకర్త:—రవీంద్రనాథ టాగూరు.

ప్రకటనస్థానము. ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు.

---

### హాస్య కుముదాకరము

డెమ్మి ౧ ౮, పు. ౭౪. వెల రు ౦-౬-౦

గ్రంథకర్త: కీ. శే. మహోపాధ్యాయ కల్లూరి వెంకటరామశాస్త్రి.

ప్రకటనస్థానము : ఇతిహాసతరంగిణీ గ్రంథమాల, కొవ్వూరు.

---



౧. తిరుత్తని కొండమీద గుడి.



౨. తిరుత్తని కొండక్రింద కొలను

—D. A. R.




గత మాసమునందు ఢిల్లీ నగరమునందు సమావేశమైన రాజకీయసభలు, సభా వ్యవహారములు వేలయేండ్లకు పూర్వము సంప్రాప్తమైన భారతేతిహాసమును సంస్మరింపజేయుచున్నవి. హస్తినాపురము శాశ్వత బ్రహ్మకల్పమని నమ్మిన దుర్యోధనుని దురభిమానమే న్యూఢిల్లీ సింహాసనాధిష్ఠితులను పీడించుచున్న విధమును ప్రభుత్వ నిరంకుశ వ్యవహారములు విశదము చేయుచున్నవి. భారత ప్రభుత్వాధికారు లవలంబించిన రాజ్యాంగార్థిక వ్యవహారములు దురభిమాన నిరంకుశత్వమునకు వలెను, వివేక సానుభూతికి నిదర్శనములు కావు. చక్కెరమీదను క్రొత్తగా వేసిన ఎక్సైసుపన్ను నూతనవికాసమును పొందుచున్న చక్కెర పరిశ్రమ కనర్థదాయకమని దేశమంతయును ఘోషించినను, భారతశాసనసభయందు ప్రభుత్వము పరాజయమును పొందినను, సర్ జేమ్సు గ్రిగ్గుగారి నిరాకరణము ప్రభుత్వమునకు ప్రజాభిప్రాయముపట్లను, దేశక్షేమము పట్లను గల నిర్లక్ష్యమును చెప్పక చెప్పుచున్నవి ౩౫ కోట్ల ప్రజలు దరిద్రమువలనను చక్కెరను చాలినంత వాడుటలేదు. కాని ఎప్పటికిని చక్కెరను నధికముగాను తయారు చేయుట యసంభవము. సంభవమైనను తగిన ప్రతిక్రియలను క్రొత్తపన్యాములను అధికమైనపుడు యోచించవచ్చును. బలహీనములైన చక్కెర పరిశ్రమాలయములను నాశనముచేయుటకు సంకల్పించుట యహంభావము కాని వివేకముకాదు. క్రొత్తగా పరిశ్రమాలయములు పుట్టునపుడు బలహీనములైన పరిశ్రమాలయములు సహజముగను కొన్ని ఏర్పడును. క్రొత్తగా నేర్పడిన పరిశ్రమాలయములు కాలక్రమమునను వర్ధిల్లి ప్రబలములు కాగలవు. క్రొత్తపరిశ్రమలను, పరిశ్రమాలయములను పోషించుట, రక్షించుట ప్రభుత్వమునకు పరమార్థము

ఈయనాలోచిత కార్యము వలనను చెరుకును పండించు వ్యవసాయదారులకును, శర్కరయంత్రాలయములకును, శర్కరపరిశ్రమకును, దేశక్షేమమునకును నష్టము గలుగుట యథార్థమైనను గ్రిగ్గుగారికి కావలసినవి రివిన్యూయును, ప్రభుత్వప్రతిష్ఠ రక్షణమును మాత్రమే అయియున్నవి. అన్నిటికంటెను మించినది వారి సర్వజ్ఞత్వ సంరక్షణము. గ్రిగ్గుగారివలెనే శ్వేతముఖులందరును సర్వజ్ఞశిఖామణులు; భారతీయులు కార్యదక్షత, వివేకము లేని పామరులు.

భారతశాసనసభయందు భూలాబాయి దేశాయిగారి ప్రసంగములను, ఇతర జాతీయవాదుల ప్రసంగములను చదివి వారి పరిశ్రమఫలమును సందర్శించినవారలకు ఢిల్లీసమా

వేశఫలము "కొండన్నుత్రవ్వి ఎలుకను పట్టిన" సామెతను స్మరింపజేయుచున్నది. అయినను ధర్మవిజయము కాంగ్రెసునకు గలిగిన విధమును నిరంతర ప్రభుత్వపరాజయములు, ప్రజ్ఞావాదములు, కుంఠిత ఖండనమండనములు విశదము చేయుచున్నవి. ప్రత్యక్షముగను ధర్మోపదేశమును జేయుచున్న హస్తినాపుర జీర్ణమందిరములు, అశోక శిలాస్తంభము పరమమూర్ఖులకును జ్ఞానోపదేశమును జేయుటకు దగియున్నవి. ప్రాచీనకాలమునందు దుర్యోధనునివలెను వర్తమానకాలమునందు బ్రిటిషు ప్రభుత్వమును భారతీయాశయములను నిరాకరించి పరమానర్థములకు హేతుభూతమగుచున్నది. ప్రజాలక్ష్యమును అసెంబ్లీ వైస్రాయిలనుండి క్వీన్సుగార్డెన్సు కింగ్సువేలకు మరలినపుడు ధర్మప్రభావము, ధర్మవిజయము స్ఫురించుచున్నవి.

* * * *

కన్వెన్షను – ధర్మవిజయము

ప్రజానాయకులు గాంధి నెహ్రూల సందర్శనార్థము తీర్థయాత్రలకువలెను గుంపులు గుంపులుగాను వెడలిన దృశ్యములు ప్రజలకు కాంగ్రెసుపట్లను, స్వాతంత్ర్యము పట్లను గల గాఢానురాగమును విశదము చేసినవి. గాంధికి జై, నెహ్రూకి జై, కాంగ్రెసుకు-జై జయఘోషలు ఢిల్లీయందు ప్రతిధ్వనిల్లినవి. శాసనములు, శాసనసభలు, రాజ్యాంగములు, సైన్యములు, విమానములు భౌతికవిజయమున్నను సాధనములైనను ధర్మవిజయమునకు నిరర్థకములు. ఢిల్లీయందు సమావేశమైన కన్వెన్షను ధర్మప్రభావమును ప్రత్యక్షము చేసినది. నిరంకుశ ప్రభుత్వమవలంబించెడి నిర్బంధవిధానములు దేహేంద్రియాది బాహ్యవ్యాపారములను నిరోధించినను ఆత్మస్వాతంత్ర్యాభిలాషను నిర్బంధింపజాలవు. భారతప్రజా హృదయమునందు దినదిన ప్రవర్ధమానంబగుచున్న స్వాతంత్ర్యాభిలాషను కన్వెన్షను వ్యవహారములు, నాయకుల ప్రతిజ్ఞ విశదము చేసినవి. కాంగ్రెసు అధ్యక్షులు పండిత జవాహిర్లాలు నెహ్రూ, బాబు రాజేంద్రప్రసాదు, వల్లభాయిపటేలు, భూలాభాయిదేశాయి, అబ్దులుకలాంఆజాదు, సరోజనీదేవి, రాజగోపాలాచార్యులు మొదలగు ప్రముఖులు, అఖిలభారత కాంగ్రెసు స్థాయిసంఘ సభ్యులు, భారత శాసనసభా సభ్యులు, రాష్ట్రీయ శాసనసభా సభ్యులు నిలువబడి దివ్యగంభీరస్వనములతో ఢిల్లీనగరమునందు జేసిన స్వాతంత్ర్య దేశారాధన ప్రతిజ్ఞ భావికాలమునందు సువర్ణాక్షరములతో లిఖింపబడగలదు.

"అఖిలభారత కన్వెన్షను సభ్యుడనగు నేను శాసనసభలయందును, బయటను, భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యము కొరకు, భారతీయుల భాగ్యమును చూరగొను యత్నముల నెదుర్కొని ప్రజల దారిద్ర్యమును అంతరింపజేయుటకు ప్రయత్నింతునని ప్రమాణము చేయుచున్నాను. భారతదేశము స్వాతంత్ర్యము బడసి, కోట్లకొలది భారతీయు లిపు డనుభవించుచున్న బాధలు తొలగుటకు కాంగ్రెసు ఆదర్శముల ప్రకారము కాంగ్రెసు శిక్షణకు లోబడి పనిచేయుటకు బాస చేయుచున్నాను". . . .

ప్రజల తరణోపాయము వారి హస్తము లందే కలదు. స్వాతంత్ర్యప్రతిజ్ఞ విషయమై నెహ్రూగారు చేసిన యుత్సాహోద్రేక పూరితమైన వ్యాఖ్యానము శ్రోతలకును, నితరులకును పరమార్థమును వ్యక్తము చేసినది. కన్వెన్షనునందు నాయకులు చేసిన ప్రతిజ్ఞను త్రికరణశుద్ధిగను పాలించుటకు భగవంతుడు శక్తిసామర్థ్యములను ప్రసాదించుగాత! కాంగ్రెసుపట్ల ప్రజలకు గల గౌరవాభిమానములను రాష్ట్రీయ సభల ఎన్నికలు రుజువుచేసినవి.

* * * *

### రాష్ట్రీయస్వపరిపాలనము-కాంగ్రెసు

నూతన రాజ్యాంగములు నిరర్థకములనియును, బాధ్యతకు బదులు బంధనమునకు సాధనము లనియును, వాటిని నిర్మూలము చేయుటయే ప్రజల కర్తవ్య మనియును కాంగ్రెసు నిర్ణయించినది. ఆ నిర్ణయములోని పరమార్థమును ఎన్నికల ఫలితము, తదనంతరము నిరంకుశాధికారుల నిరంకుశాధికార నిర్వహణము నవీన రాజ్యాంగములందు బాధ్యతయును, స్వాతంత్ర్యమును పూజ్యములని విశదము చేసినవి. రెండవ రౌండు టేబిలు కాన్ఫరెన్సునుండి గాంధిజి చేయుచున్న ప్రతిపాదనము యథార్థమైనది. రాజ్యాంగ నిర్మాణమునందే బాధ్యత లేకుండ నిర్మించినవిధము బహిరంగ రహస్యము, దాన భేదదండనోపాయములతో రాజ్యాంగములను నిర్వహించుటయందు బ్రిటీషు అధికారులు మహాదక్షులు. కాని ఎంత దక్షునికైనను విధివిహితధర్మము నూహించుటయును ప్రతిఘటించుటయును దుర్లభము. తలవని తలంపుగను ౭ రాష్ట్రములం దెన్నికలయందు కాంగ్రెసునకఖండ విజయము సమకూడినది. కాంగ్రెసునకు సమకూడిన విజయమును నిరుపయోగము చేయుటయే ప్రభుత్వమునకు పరమార్థము. ఆ పరమార్థమును సాధించుట కేసందుచిక్కినను ధర్మాధర్మములతో ప్రమేయములేకను నవలంబించుటకు స్టేటు సెక్రటరి, గవర్నరు జనరలు, గవర్నరులు, కార్యదర్శులు సిద్ధముగ నేర్పడిరి. పేరునకు రాజ్యాంగములందు స్వాతంత్ర్య బాధ్యతయున్నను వ్యవహారములందు రాజ్యాంగములందు సకల నిబంధనలందును నిర్బంధము ప్రత్యక్షముగ నున్నది. ఈ సంకుచిత నిర్బంధావరణములందైనను మంత్రులకు స్వతంత్రాచరణమున కవకాశములు లేవు అధికారులకు, గవర్నరులకు, బ్రిటీషుప్రజలకు, సామ్రాజ్యప్రజలకు, తెల్లజాతులకు రక్షణములు పేరను శేషించిన అధికార మేమియుండునో రాజ్యాంగశాసననిర్మాతలే గ్రహించుటకు సమర్థులు. శేషించిన స్వల్పాధికారమునందైనను పరిపాలన బాధ్యత మంత్రులకు సంక్రమించుటకు బదులు గవర్నరులే కలిగియున్నారు. భారతీయుల నెంత హేయముగ నధికారులు చూచెదరో స్వానుభవైకవేద్యమైన విషయము. షౌకతాలీ

గారు హోంమెంబరు సర్ హెన్రీ క్రెయికు గారి ప్రవర్తనమును భారతశాసనసభయందు వర్ణించియున్నారు. సామాన్యుల విషయమై చెప్పనవసరము లేదు. మంత్రి బొమ్మలను పెట్టి రాజ్యాంగనాటకముల నాడించుటకు రాజ్యాంగశాసనము కల్పింపబడినది. రహస్యము నెరిగిన గాంధిమహాత్ముడు కాంగ్రెసు నాయకులను ప్రజలును నీట్టి మహోపద్రవమునందు చిక్కుకొనకుండ ప్రభుత్వమునుండి రాజ్యాంగశాసనావరణములందే రక్షణమును కోరి నిరంకుశాధికారుల హృదయమును, రాజ్యాంగముల నిరుపయోగమును విశదము చేసెను. విఘ్నేశ్వరపూజనమైనను చేయకపూర్వమే రాజ్యాంగ శాసనము ధ్వంసమైనది.

*       *       *       *

కాంగ్రెసు విజయము - మంత్రిపదవులు

కాంగ్రెసు అభ్యర్థులు ఏడు రాష్ట్రములందు పూర్ణవిజయమును బడసిరి. ప్రాతపక్షము లన్నియును గాలి కెగరకొట్టుకొని పోయినటు లెగిరిపోయినవి. రాజులు, మంత్రులు, జమీందారులు, నాయకులు ఎన్నికలం దోడిపోయిన విధము కాంగ్రెసు బల ప్రతిష్ఠలకును, ప్రజల స్వాతంత్ర్యాభిలాషకును ప్రత్యక్ష ప్రమాణముగ నున్నది. చెన్న రాష్ట్రమునందు పిఠాపురము, బొబ్బిలి, వెంకటగిరి రాజాగారులు, రాజన్, పాత్రో, కుమారస్వామిరెడ్డి, రామచంద్రారెడ్డి, కుప్పుస్వామి చౌదరిగారులు మొదలగు సుప్రసిద్ధ నాయకులు పూర్ణపరాజయమును పొందిరి. కాంగ్రెసు అభ్యర్థులందు ౭౩ యందు ౮, జస్టిసు అభ్యర్థులందు ౧౨౦ యందు ౨౧, ప్రజాపక్షాభ్యర్థులందు ౫౩ యందు ౨౩, స్వతంత్రపక్షాభ్యర్థులందు ౧౨౩ యందు ౩౮ మంది ధరావతును గోల్పోయిరి. కాంగ్రెసునకు అస్సెంబ్లియందు ౧౭౮, కౌన్సిలునందు ౨౮ స్థానములు సమకూడినవి. వోట్ల తేడాకు కారణము కుట్రము లెట్టివు వోటింగు అధికార ప్రమేయము పోలింగుస్టేషనులు కారణము లని బాలిశులకును తెలిసిన విషయము. ఢిల్లీయందు అఖిలభారత కాంగ్రెసుస్థాయి సంఘము మంత్రిపదవీస్వీకారమును కొన్ని నియమములతో నంగీకరించినది. ఆ నియమములతోనే శ్రీయుత రాజగోపాలాచార్యులు, గోవిందవల్లభపంతు, శ్రీకృష్ణసింహా, ఖరే, విశ్వనాథదాసుగారులు మొదలగువారు మంత్రిపదవులను స్వీకరింపనటులు గవర్నరులకు తెలిపిరి. గవర్నరులు శాసనసభలను సమావేశము చేయకనే యథేచ్ఛగను మంత్రుల నేర్పాటుచేసిరి. చెన్నరాష్ట్రమునందు సర్ కూర్మారెడ్డిగారు మంత్రివర్గము నేర్పాటుచేయుట మాత్రము క్షంతవ్యము గాదు. స్వార్థారాధనమునకును మితిమేరలు కలవు. పాపము, రెడ్డినాయుడుగారు మంత్రివర్గము నేర్పాటుచేయుట బ్రిటీషుసామ్రాజ్యము నిలుచుట కట! తీతువుపిట్ట విశ్వమంతయును తన రెండుకాళ్లమీదను నిలుచుచున్నదని యానందించిన రీతిని నాయుడుగారి సమా

ధానమున్నది. ఎన్నికలం దెప్పుడో ఓడిపోయి తిరిగి ఎన్నుకొనబడని నాయుడుగారిని ఎర్స్కిన్ ప్రభువు నాయకునిగను నంగీకరించుటయును, వారు శిరసావహించుటయును రాజ్యాంగశాసనమునందలి రహస్యమును బహిర్గతము చేయుచున్నవి. సుప్రసిద్ధ రాజ్యాంగ పండితుడు శాసనసభా సమావేశమును చేయకుండ మంత్రివర్గము నేర్పాటు చేయుట పార్లమెంటరి బాధ్యతనే నిర్మూలము చేసినదని వ్యక్తముచేసిరి. నిరంకుశప్రభుత్వము శాసనసభాసమావేశమును చేయకుండ వారి కనుకూలమైన మంత్రివర్గము నేర్పాటుచేయుట వోటర్లకు, అభ్యర్థులకు, ప్రజలకు, బాధ్యతాయుత పరిపాలనమునకు, ప్రజాస్వామ్యత్వమునకు పరమద్రోహముగ నున్నది. శ్రీయుత రాజగోపాలాచార్యులు ప్రభృతు లీ విషయమయి చేసిన వ్యాఖ్యాన విమర్శనలు నిరంకుశాధికార వర్గమునకు జ్ఞానోదయమును గలుగజేయవలసియున్నది. రాజుగారి పట్టాభిషేక మహోత్సవమునకు పూర్వము గవర్నరులు వారు చేసిన తప్పును దిద్దుకొనుటకన్ని రాష్ట్రములందును శాసనసభలను సమావేశము చేసి పరిమితమైన రాజ్యాంగములందైనను యథార్థమైన స్వాతంత్ర్యాచరణమున కవకాశములను గలుగజేయుదురుగాత! శ్రీయుత రాజగోపాలాచార్యులుగారు, ప్రకాశముగారు మొదలగు నాయకు లాంధ్రదేశమునందు చేయుచున్న తీవ్రప్రచారమునకు ప్రజలు పరమోత్సాహముతో స్వాగతము నొసగి స్వధర్మనిర్వహణమును చేయుటకు సంసిద్ధులుగ నుందురుగాత! గాంధి మహాత్ముని నాయకత్వముక్రిందను సత్యాగ్రహప్రస్థానము పొందనున్న పరిణామము నారాధించుటకు సకల జనులకును ధర్మబలము సమకూడి సత్యాగ్రహమూర్తి సంకల్పము హిందూస్థానమునకును, లోకమునకును కల్యాణమును ననుగ్రహించుగాత!

—

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

# విషయ సూచిక



## చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—మృత్యువిజయము; శివభక్త మాహాత్మ్యమున నౌకానౌక రంగము

సాధారణ చిత్రములు—బెంగుళూరు చిత్రములు; బేలూరు దేవాలయ చిత్రములు; ఇతరచిత్రములును.



మృత్యుంజయము —సుబ్రహ్మణ్యం.



సంపు. ౧౮ ఈశ్వర సంవత్సరము, వైశాఖమాసము ( మే ౧౯౩౭ ) సంఖ్య ౫

# శిశిర ఋతువు

విశ్వనాథ సత్యనారాయణ

శిశిరమ్ము వచ్చె పారశవధారాక్రంతనమునోని ఛిన్నాధరములదాఁక
ఆజ్యధారాలేపనాభిరామ నవాధరములతో మృదుశిశిరమ్ము వచ్చె
నేతెంచె శిశిరమ్ము సాతంక పాణి పాదాంగులీ కర్ణనాసాంతములకు
హేమాంచలోర్ణాయులోమోత్తరీయాత్తధృతులుగా శిశిర మేతెంచె మృదువు
శిశిర మేగుదెంచెఁ జెఱఁకుల నాల్గింటఁ - దెలుఁగునాట సుమవతీలతాస
తీసుమ ఝరీగతిధురీణ కాంతా ప్ర - కాశమాన కైశికములదాఁక.

పసిపెండ్లి కూతురు పతి మేజువాణిలోఁ జాదుగందపుఁబూత జలదరించె
కుడితితొట్టియపైఁ దవుడు నాలుక లాగి ముట్టెముంచదు చూలు మొదటిమొవు
వ్యాజమ్ము కనిపెట్టె పరిరంభరుచికినై మూకు నిద్దురలలో ముద్దరాలు
ప్రక్కకై యిడిన దుప్పటికూడ నిదురలోఁ గొని కప్పుకొనియెఁబో కుఱ్ఱవాడు.
ముడుచుకొని మునిగాళ్ళలో ముట్టె చొనిపి - చిన్నియాఁడుదూడ రేయి ప్రాఁగన్న వెట్టె
చలికి బెదరినదనుటలో సౌఖ్యమందు - నంతయింత భాగస్వామియయ్యె జగము.

పచ్చి యారకమున్న పసిదూడకొసకాలిగిట్టలు మెలపుతో గల్లుకొనఁగ
ప్రత్తివిత్తులు ప్రాతవడ్లుఁ జేటనుబోసి మిసిమి బాలెంతావు మేపుకొనఁగ
మావి మెప్పుడు వేయునో వేసి తినకుండగా వేయికనులతోఁ గాచుకొనఁగ
తనదూడను హరింతురని బుస్సుకొట్టుచుఁ గుమ్మెడు నావునకుం దొలంగ
పాడియా వీనగా నొక్క పంటకాపు - కాపు పెండ్లాము సుఖజాగరము చేసి
యుత్తరీయము పయ్యెద యొడ్డుకొనుచు - నడు శిశిరకాలమున నొక్కనాఁటి రాత్రి.

వలిఁ బేరుకొనిన కొబ్బరినూనె కుదుపలే సీమంతములయందు జెక్కుకొనుచు
కంగులలో జల్లగానున్న మడతలే కఠిన స్తనశ్రోణిఁ గ్రుచ్చుకొనుచు
చలిరాజు ముద్దుచెల్లెలు గంధపూతయే కంఠదేశములందుఁ గ్రమ్ముకొనుచు
తతలోహమయత శీతలభూషణమ్ములే సంధిబంధములందుఁ జాదకొనుచు
తమ ధరించిన వస్తువుల్ తమ యొడల్ల - వేడిమిని గొంతకొంతగా వెచ్చగిలఁగ
స్మరమహాసత్రయాగాగ్ని సమిధలైన - భీతహరిణాక్షులకుఁ జలి బెదరిపోయె.

పల్లకీబొంగుతోపాటు వంగెను గమ్మవారి పెండ్లికుమార్తె వదనసీమ
ప్రత్తికాయవిధానఁ బగిలిన పెదవితోఁ గొమరారె ప్రత్తేరు కూలిపడుచు
చెదరిన తెల్లుపూచెలువొప్పె జనుములో మునిగిమేసెడు గిత్తమూపురంబు
ఆకూడ్చి చిగురించు మోకగాఁ బరికిణీల్ వదలి చీరలుకట్టెఁ బ్రథమయువతి.
చీమ యిల్లాలు కరివేపచెట్టు మొదట - గ్రుడ్లిడి చిటారుపండ్లవి కులికిపోయె
కొన్ని ప్రాణుల ధర్మముల్ కూడఁ జలికి - గూడి యన్యధర్మము లానుకొన్నవనఁగ

పాడి బఱ్ఱియచనుల్ పగిలి తాఁకఁగ బాలుతీయుచో నడ్డమ్ము తిరిగి తన్నె
ముంజేత నార్మడిపోయెఁగాఁ దొలిదుక్కి కనువతె దక్కెటె గద్దుపగిలి
వేరు వెట్టియును బాలేరు పెండ్లిండ్లఁ జిక్కిరి గింజలేక పాతరనుదీయ
ములగచెట్టునకుఁ గంబలిపుర్వు బలిసి యుల్లాకి కూరాకులు నాకిపోయె
చిలుపజల్లువడి పొగాకు చెడియె పసుపు - మేఁతకమ్యోను బెసరయు మినుమును జెడి
రైతు లొక్కొక్క డొక్కొక్క రాపు నొందె - చెప్ప నొకరీతిగాసి శైశిరమువలన.

చల్లపోసికొనంగఁ జలివేసె జిహ్వకు మంచినీళ్లులు ద్రావ మణగె నాల్క
కంచాలఁ జేతులు కడిగిరి పిల్లలు కడుగక కాళ్లులు తుడుచుకొనిరి
చల్లారకయ యున్న చప్పరించిరి పాల బెల్లముంచిన వేడివేడి జున్ను
తలు పింత యోరవాకిలి తీయనీయరు నహుహుంచు గొంతుకూర్చుండి తిండ్రు

తిని యలుకకుండఁ బసపు చిందెదరు నీళ్లు - చలి కెదరు తడిచేత రాచెదరు పైని
చిఱుచలికి గూడ వెనుబీతు చెందె జనము - కడి పరిహరించుటకె మేలుఁబడియెఁ జతుకు.

అద్దమ్ములోఁ జూచినట్లు నీపాళపుఁగాయలో దగు చలికంత మరసి
ఎప్పటియట్లరయో యిప్పుడే పగయట్టు లర కాళ్లు చలికాచు చటచటించి
సగమునిద్దుర లేపి జనని యన్నముపెట్టు నెరుగక కాకలియని యేడ్చి యేడ్చి
దుమ్ముకొట్టుక తలదువ్వించుకొనకుండ నూరేగుటను దిస్సయొడలు పగిలి
పట్టుకొని తల్లి సంజల జుట్టుదువ్వి - యొడల నూనియ రాచి మైగడిగినంత
నావులించుచుఁ జేతులయందె తూలి - చిన్నబిడ్డలు నిదురింత్రు శిశిరవేళ.

ఉరముగందముతోడ నుదికినపాగతో వేంచేసె సీటుగాఁ బెండ్లిపెద్ద
గుమ్ముతప్పెటలతో కొమ్ముబూరాలతో నెలగోలు మేళమ్ము లేఁదెంచె
గొడుగునీడలతోడ గుచ్చుచెప్పులతోడ నడచివచ్చెరి పెండ్లికొడుకు మడతి
ముంత కొప్పులతోడ వింతగందములతో వెలిరి నవ్వులపేరటాండ్రు.
పిన్నపాలెగాని పెండ్లి యూరేగింపు - సాగుదెంచె రెండుజాములపుడు
అరుగుపైని నిడిన యాకువక్కలు గొంచు - వీథి యెల్ల నొద్దు విరిగిపోయె

వృషభరాజ విషాణకషణాంకితాకాశమున వంకజాబిల్లి యనవసరము
భూభృత్సుతాతనూ శోభాపరీవాహగతి పిండుమిన్నేరుగరుజు లేదు
భృంగిరిటీశకల్పిత విభూతి విలేపమున వెండిమలవెల్గు పనికిరాదు
చతుశ్శ్రవశ్శిరశ్ఛవిమన్మణిచ్ఛవిచ్ఛట తుమ్మిపూల ప్రసక్తి లేదు
చలి పరిహరించుట ప్రపత్తి గలుగఁజేయ - కలుగఁజేసెదు స్వామి లోకముల వాంఛ
చలి యుషోవేళ నిర్భయస్నాతలకును - చలి బెదరి గుండియలు జారి చదికిలఁబడె.

---

# కథలు

పూడిపెద్ది వెంకటరమణయ్య

అమ్మమ్మో నాయనమ్మో అలవాటుచేసింది కథలుచెప్పడం. అల్లరిమానేసి ఆలకించే వాళ్లం చిన్నప్పుడు కథలు. చిన్నవో పెద్దవో, చిత్రమయినవో, ఊహాప్రపంచంలో ఇమిడేవో ఇమడనివో ఏవో రకంకథలు అలవాటుగా ప్రతిరాత్రీ నిద్రపోయేముందుగా ఒకటో రెండో విని పరీక్షించుకోవాలి. కొన్ని కథలు మంత్రాలవలె కంఠతా వచ్చేదాకా ఆలకించి అలవరుచుకున్నాంకూడా. కథలాలకించడం మనకుసనాతనంగావచ్చే అలవాటూ, ఆచారమూకూడా అయింది. ఏదయినాకథ మన మాలకించేటప్పుడు కథాంశము మనకు హృదయస్థమై మనస్వభావాదులకు నచ్చిన వస్తువే అయితే దానితో మన మైక్యమయిపోయి మరీ ఆలకిస్తాం ఆకథను. ఇలాటిచోట్ల కథ చెప్పేవాని చేతకానితనంకూడా నేర్పుగానే పరిణమిస్తుంది. ఆకథకు ఆలకించేవాడు వన్నెయిస్తాడు. కథ మంచిది అంటే శ్రోత మంచివాడే అన్నమాట.

పూర్వమొకప్పుడు, యశోద శ్రీకృష్ణుని నిద్రపుచ్చుటకుగాను, ఊయలలో వేసిఊస్తూ "రాముడనే రాజుండేవాడురా, కృష్ణా" అంది. ఊఁ! అని ఊఁకొట్టేడు కృష్ణుడు. "వానికి సీత అనే భార్యగలదు." ఊఁ అన్నాడు మొదటిమాటుకంటె కాస్త శ్రద్ధగా. "ఆ రాముడు తండ్రి ఆజ్ఞ ననుసరించి భార్యతో కూడా అడవికిపోయాడు." ఊఁ అన్నాడు మరింత గట్టిగా. "ఆ అడవిలో వారుండగా రాముని భార్యను రావణుడెత్తుకొనిపోయినాడు." ఈ మాటు ఊఁకొట్టుటకు మారుగా "లక్ష్మణా! విల్లు బాణము తీసుకురా. ఆ పాపాత్ముణ్ణి కొట్టేస్తా" నన్నాడట చిన్నికృష్ణుడు. ఇందలి అంతరార్థ మేదో మన కక్కరలేకపోతే యశోదమ్మ చెప్పిన ఆ పొడిముక్కలే చిన్నికృష్ణుని హృదయాన్ని కదలించ గలిగేయి. అలాటి పాఠకులు దొరుకుతారు అదృష్టవంతుడయిన కథకునికి. కథకు నిరచనాచాకచక్యం పాఠకునిభావనాశక్తిలో ఉంటుంది.

క్రమక్రమంగా కథలు చెప్పడం, ఆలకించడం ఒక విశేషమయిన సంప్రదాయంగా ఏర్పడి, విద్యాబుద్ధులు, నీతి, భక్తి మొదలయినగుణాలలవరచడానికి కథలే సాధనాలుగా గ్రహింపబడ్డాయి అదినుండీ. మనకెక్కడ చూచినా కథే, ఇతిహాసమే. మన చదువే అది అయి సాంఘికజీవనమే అది అయింది. శ్రోతలుకూడా వారికి కథ లాలకించే ఉత్సాహం నానాట హెచ్చుచేసుకుంటున్నారుగాని వెనుకబడలేదు.

కొలది సంవత్సరాలనుండీ మనకు కథలాలకించే విధానంలో మార్పు కావలసి

వచ్చింది. ఇందుకోసం, ఆంగ్లవిద్యాసంపర్కం ఉండడంవల్లా, మనం ఫ్రెంచిదేశపుకథలూ, రష్యాదేశపు కథలూ, ఇంగ్లీషుదేశపుకథలూ, ఇంగ్లీషుభాషలో చదవడమేకాకుండా, ఇప్పటి విదేశీయరచయితల క్రొత్తకథలూ, అవి చెప్పే విధానమూ మున్నగునవి ఆంగ్ల పత్రికలలో చదివి - తెలుగులో, మనకు అందుబాటులోనున్న లక్షణాలనే ఏరికొని లక్ష్యాలుగా మనవాళ్లూ కథలు ఆంధ్రంలో వ్రాయడం మొదలెట్టిరి. ముందు ముందు లక్ష్యాలు బయల్దేరుతున్నాయి, వడి వడిగా వేడి వేడిగానో సెల్లాగు. వీనినిబట్టి లక్షణా లేర్పడాలి. ఇదివరకే లక్షణలక్ష్యాలతో సమృద్ధము లయిన ఆంగ్లభాషలోని చిన్నకథలు మన కన్నిటా ఆదర్శాలుగా ఉండాలంటే కుదరదు. అయితే ఆరచనావిధానంలో ఉత్కృష్టపద్ధతులనుమాత్రము మనము స్వీకరించవచ్చును.

ఇంతకూ మనతెలుగులో చిన్నకథలు చిన్నచిన్నపూవులలా విడుతున్నాయి, యీ రోజుల్లోనే లక్షణాలుగుర్తించి కూర్చడాని కవకాశం చాలదేమో. చిన్నకథలు అనేక విధాల వ్యాప్తంకావాలి. అవి రచించడానికీ చదువడానికీకూడా మనము బాగా అలవాటుపడాలి. అప్పుడు చిన్నకథలకు సర్వజనాంగీకృతము లయిన లక్షణసూత్రా లేర్పడాలి. ఇప్పుడే లక్షణచర్చకు దారకొనుట నాటిన విత్తనము మొలకెత్తినదేమో చూచుటకుగా దానిని పెకలించుటవంటిది. దానికి తగినకాలము విడిచి ఆ గ్రంథము బహుళముగా పెరుగనిచ్చి దేశాభిరుచినీ, కాలమర్యాదనూ అనుసరించి లక్షణాలు నిర్ణయింపవలెను గదా.

అయితే ఇప్పటి కొకరకంగా మీద మీదను చిన్నకథల లక్షణాలు మనము కొలదిగా గుర్తించవచ్చును. ఇవి కాలప్రవాహంలో కొట్టుకొనిపోవచ్చును, లేదా దాని రాపిడిలో సానదీరనూ వచ్చును.

చిన్నకథలరచన మన మనుకున్నంత సులభమయినది కాదు. దాని రచనకూ విశేష చాకచక్యం కావాలి. తీయని పలుకులలో పొదివి చల్లనిరసము చిమ్మే భావసంపదతో, ఏదో ఒక మానవస్వభావ సంఘట్టనమును చిన్ని చిన్ని ఉదంతములతో వాకొనడం కథారచనగదా!

చిన్నకథల రచన గుజ్జనగూడు వంట వంటిది. దానిలో, వయోభేదం లేకుండా రుచి కలిగించడమే ఒకకళ పిట్టచిన్నదయినా కూత ఘనమే. చిన్నం కావాలి చింతాకు కావాలి, మేలిమి కావాలి మెడ తిరగాలి, నగ ఏదయినా సరే, గ్రహించేవానికి తాత్కాలిక హృదయవికాసం కలిగించడమే కాకుండా, పై మెత్తుటూహలు పల్లవించాలి. ఇట్టి సందర్భ సన్నివేశాలలో నేను కూడ ఇట్టే చేసియుందునని చదువరి ఊహించు నంతటి సహజంగా ఉండాలి కథా గమనం. కథాంశము మనుష్య సహజబుద్ధి నట్టింకి చూపవలెనేకాని, నాటకాదులలోని ఇతివృత్తంలాగు, స్వభావవైపరీత్యాన్ని ప్రస్తరించరాదు. ఇందు సమయోచిత వర్ణనలేశం తప్ప విశేషవర్ణనలతో విసువు జనింపచేసే ధోరణి మంచిదికాదు. చిన్నకథలు ఏసంస్కరణనుగాని సాగించే ప్రచారసందేశాలను నడిపే సాధనాలు కాకూడదు. అట్లయిన మనం, ఇతిహాసలక్షణంతో పురాణ

కాలానికి పోతాం. నీతికోసం, ప్రీతికోసం కథకు కాళ్లూ చేతులూ కల్పించకూడదు. సహజంగా దానికుండవలసిన కాల్సేతులను కట్టి పడవేయనూ కూడదు.

చిన్నకథలలోనిభాష సరళమై బహుజ నాంగీకృతమయిన ప్రయోగసరళితో నడి పించవలెనేకాని క్లిష్టనిర్మాణం పనికిరాదు. సంభాషణాదులు సహజంగా పాత్రనోట మొలచిన ట్టుండవలెను.

ఇట్టి వెన్నోని సామాన్య లక్షణములు మనము పేర్కొనవచ్చును. కాని చిన్నకథకు, ఆంధ్రసంప్రదాయమున కనువయిన లక్షణ ములు సూత్రప్రాయములుగ వెలువడే తరు ణ మింకా రాలే దనుకుంటాను; కొలదిలో రాగలదు.

చిన్నకథలలో శృంగారాదిరసపోషణ మటుండ నిటీవల హాస్యముకూడ తలయెత్తు చున్నది. హాస్యము తలచూపి తొలగినపుడే హృదయంగమ మయి ఉంటుంది గాని నిలు వరించిన నది నీరసమే. అందుకు చిన్నకథయే కడుంగడు తగియున్నది. ఇప్పు డాంగ్లపత్రికల లోనికథలు హాస్యరసప్రధానములుగానే నడి చినవి ఎక్కువగా పాఠకలోకం ఆదరిస్తూంది. మన ఆంధ్రంలోకూ అవి విపులంగా తల చూపుతున్నాయి.

అన్నిరచనలలోనూ హాస్యమును చిన్న మతాబావెలుగువలె రచించి విడుచుటకు చిన్నికథలు మంచిసాధనాలుగా ఉన్నాయి.

సరే. ఈ గుజ్జనగూడువంట సాగిస్తు న్నారు మన ఆంధ్రరచయితలు. ఏదోఅని, వారి ప్రయత్నం మాట్లకేంద సల్లక్ష్యాంశక వయోభేదం లేకుండా పాఠకలోకం పంక్తులు సాగించి కూర్చుంటున్నారు విందు లారగించ డానికి. శ్రీరామునంతటిరాజుంటే ఆంజనేయు నంతటిబంటూ ఉంటాడుగా! తయారవుతు న్నాయి చిన్నకథలు. దినపత్రిక మొదలు వార్షికసంచికవరకూగల అన్నిపత్రికలలోనూ, చిన్నకథ ఉండితీరా లనిపిస్తూంది; ఉంటూంది. పత్రికందుకొని ముందుగా చిన్నకథకే దేవు లాడేపాఠకు లెందరో ఉన్నారు. హిందూ పత్రికలో S. V. V. కథకోసం ఎదురుచూచే వారెందరో. Strand లో Wodehouse కథ రావాలి. కథ కావాలి. అదీకథ!

ఇట్లు పంక్తులు సాగించిన పాఠకలోకం, ఈచిన్నిరచనలో ప్రయత్నించాలదనీ, స్వైరైస సరిగా అందలేదనీ, కడుపు భేరీలాగు నిండ లేదనీ రసజ్ఞులయినవారి గొణగరుగా. ఇందు రుచే ప్రధానం. మొగంమొత్తేదాకా మేపడం చిన్నకథపని కాదు.

రచయితలు బయల్దేరుతున్నారు. ప్రచు రణకర్తలు సిద్ధమవుతున్నారు. పత్రికలూ అభి వృద్ధి నందుతున్నాయి. కొలది కాలంలో చిన్న కథలు విపులంగా విరిసే వసంతసాభాగ్యం ఆంధ్రవాఙ్మయోద్యానానికి పట్టగలదని వ్యక్త మౌతూంది. దీనికి పాఠకలోకంలో అను భవజ్ఞులే బాధ్యులు.

ఇంకొక్కమాట చెప్పవలసిఉంది ఈసం దర్భంలో. చిన్నకథలోని ముఖ్యాంశమును స్ఫురింపజేసేబొమ్మ లెంతైనా తోడ్పడతాయి కథను పాఠకునిహృదయాని కెక్కించడానికి. ఇక్కడ చిత్రశిల్పానికి, వాక్శిల్పానికీ గలసన్ని హితత్వం వ్యక్తమౌతూంది. అవి అన్యోన్యం పొందే తోడ్పాటు ప్రస్ఫుటమౌతూంది.

# బేలూరు దేవాలయము: వాస్తు, శిల్పవైభవము

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

హిందూదేశచరిత్రమున ౧౧, ౧౨ శతాబ్దములందు ఒక నూతనయుగ మారంభమాయెను. ఈయుగమున ఉత్తరహిందూస్థానమంతకంతకు మహమ్మదీయుల పాలనకు లోనయి హైందవవ్యక్తిత్వమునే పోగొట్టుకొనుచుండెను. దక్షిణాపథమునమాత్రము హిందూమతము విజృంభించి, హైందవేతరములగు జైన, బౌద్ధమతముల నణగద్రొక్కుటయేకాక, హైందవవ్యక్తిత్వమున కొక ప్రాధాన్యమును, ఒక అపూర్వశక్తిని ఒసంగినది. హైందవధర్మసంరక్షణార్థము అసువులనైనగోల్పోవుటకు జంకక, అసమానపౌరుషముతో తురుష్కధాటి నెదుర్కొని విజయము గాంచిన దక్షిణాపథవీరులు ఈ నూతనమత విప్లవప్రభావమున జన్మించినవారే.

ఆకాలమున దక్షిణహిందూస్థానమున విలసిల్లినఉత్తమసామ్రాజ్యములలో హొయిసలసామ్రాజ్యముగూడ నొకటి. పశ్చిమ చాళుక్యులకు సామంతరాజులుగ నున్న హొయిసలులు క్రమముగ ప్రబలించి, పశ్చిమ చాళుక్యరాజ్యము క్షీణదశకు వచ్చినపిదప స్వాతంత్ర్యమును ప్రకటించి, రమారమి క్రీస్తుశకము పండ్రెండవశతాబ్దారంభమునుండి పదునాల్గవశతాబ్ది మధ్యమువరకును సుమారు ౩౩౫ సంవత్సరములు మహావైభవముతో రాజ్యమేలిరి. వీరిరాజ్యము ప్రథమమున నేటి మైసూరురాష్ట్రములో కొంతభాగమేమైనను, చోళపాండ్యాది దక్షిణాపథరాజ్యములు క్షీణస్థితియందుండినందున త్వరలో వానిని జయించి ఇంచుమించుగా దక్షిణదేశమునంతటిని ఆక్రమించిరి.

ఇట్టి సామ్రాజ్యమును నెలకొల్పినమహాశయుడే హొయిసల విష్ణువర్ధన మహారాజు. ఇత డొక అపూర్వసామర్థ్యశాలి; రసజ్ఞుడు; దైవభక్తిసంపన్నుడు; రామానుజీయవైష్ణవమును తావలంబకుడును. ఇట్టివా డొక దండయాత్రయందు తనకు చేకూరిన విజయమునకు అమితానందభరితుడై, దేవునియందు భక్తిప్రేమ లతిశయింప కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించి దేవుని కేదేని యొక

కానుక సమర్పింప నెంచినయెడల ఇట్టి లోకోత్తర దేవాలయము నెలకొనుట ఏమి యాశ్చర్యము? తన యభీష్టసిద్ధికి దైవమే అన్నివిధములను సహాయ మొనరించి నట్లు ఈతనికాలముననే జకణాచారియను లోకోత్తరశిల్పి యొక డుండెను ఈ శిల్పి సహాయమున విష్ణువర్ధనుడు బేలూరునం దీకేశవాలయమును సొంపుగ గట్టించుటయే కాక ఇచ్చటికి సుమారు ౮, ౧౦ మైళ్ల దూరముననున్న ద్వారసముద్రము (హళేబీడు) నందును, ఇతర ప్రదేశములందును మనోహర దేవాలయములను కట్టించెను.

బేలూరునందున్న ప్రధాన దేవాలయము కేశవాలయమైనను, విష్ణువర్ధనుని రాణియు, ఇతరులును ఈ యాలయమునకు చుట్టును మరికొన్ని దేవతలనుగూడ ప్రతిష్ఠచేసినందున నేడు బేలూరునం దయిదారు దేవాలయములు గాన్పించుచున్నవి. వీనిలో విష్ణువర్ధనుడు గట్టించిన కేశవాలయమును, ఇతని రాణి శాంతలదేవి గట్టించిన కప్పెచెన్నగిరాయ దేవాలయమును, రెండవ వీరబల్లాలుడు గట్టించిన వీరనారాయణదేవాలయమును ముఖ్యములు.

నేడు మనము కేశవాలయమనునది నిజముగ విజయనారాయణదేవాలయ మనియు, ఇందు నెలకొలుపబడిన విగ్రహము విజయనారాయణమూర్తియనియు, దీనిని విష్ణువర్ధనుడు క్రీ. శ. ౧౧౧౭ లో కట్టించెననియు శాసనములవలన ఇటీవల దెలియవచ్చినది. ఈ దేవాలయముకూడ ఆదిన విష్ణువర్ధనుడు కట్టించినపుడు ఈ విధముగ నుండలేదు. గర్భగృహము, దాని నానుకొని సుఖనాసి, ఆ సుఖనాసిని చేరియే యున్న నవరంగమంటపము-ఈ మూడును దప్ప దేవాలయమునకు ప్రాకారముగాని, వంటగది కాని, ఉగ్రాణపు గది కాని, కొలనుగాని, వేరెట్టి నిర్మాణములును లేవు. నవరంగమంటపమున కూడ కుడివైపు (అనగా సుఖనాసిని ఆనుకొనియుండు వైపు) తప్ప మిగత యన్నివైపులను గోడలు లేనందున సూర్యకాంతి యథేష్టముగ లోన ప్రవేశించి అసమానశిల్ప విరాజితము లగు శిలాస్తంభములనే కాక సుఖనాసియందలి శిల్పమును, గర్భగృహముననున్న మూల విగ్రహమునుగూడ ప్రకాశింపజేయుచుండెను. ఈ నవరంగమంటపమునకు మూడు నిష్క్రమణమార్గము లుండెను. ఈ మార్గముల మధ్య భక్తులు విశ్రమించుటకు గాబోలు ఏటవాలుగా నున్న రాతిఅరుగులును, వాని నానుకొని వెలుపలివైపున కటకటాలును ఉండెను. వీరబల్లాలుడు ఈ దేవాలయమున కొక ప్రాకారమును గట్టించుటయేకాక, నవరంగమంటపముచుట్టును, అరుగులమీద సరంధ్రములగు శిలాఫలకముల నన్నివైపుల నమర్చి నిష్క్రమణమార్గములందుమాత్రము ద్వారము లుంచెను. మరియు, ఈ శిలాఫలకములు మనోహరశిల్ప సంపన్నము లయి యుండుటవలన దేవాలయమున ఆకర్షకము లగు కొన్ని నూతనవిశేషము లేర్పడెను.

కప్పె చెన్నగిరాయాలయమును, వీరనారాయణాలయమును ప్రధానాలయము వలెనే ఉండును. సాధారణముగ దక్షిణదేశమున కంచి, మధుర, కుంభకోణం, చోట్లగల దేవాలయములకును ఈ దేవాలయములకును

స్వరూపమునందు చాల భేద మున్నది. హొయిసలరాజులు కట్టించిన దేవాలయము లందున్న కొన్నికొన్ని విశేషములు ఇంక నేయితర దేవాలయములందును లేకున్నందున వాస్తుశాస్త్రరీత్యా ఇవి యొక ప్రత్యేకపద్ధతికి చేరిన వని నిర్ధారింప బడినవి. ఈ పద్ధతికి "హొయిసలపద్ధతి" యనుపే రేర్పడినది. పశ్చిమచాళుక్యులు కట్టించిన దేవాలయము లకును, వీనికిని కొంత పోలికయున్నందునను, హొయిసలులు ఆదిని పశ్చిమచాళుక్యుల సామంతులై యుండినందునను, ఫెర్గూసన్ (Fergusson) మొదలగువారు ఈ దేవాలయము లన్నిటిని "చాళుక్యపద్ధతి" దేవాలయము లనిరి. కాని భారతీయవాస్తుశాస్త్రమును పరిశోధించినకొలదియు అందలి విశేషము లన్నియు క్రమముగ బోధపడి బాహ్య స్వరూపమునందుమాత్రమే కాక శిల్పకళా విన్యాసమునందును, హొయిసలదేవాలయములకును చాళుక్య దేవాలయములకును విశేషభేదము కలదని స్పష్టమాయెను.

హొయిసల దేవాలయములు చతురస్రముగగాక నక్షత్రాకృతి నుండును. ఇందువలన దేవాలయమునకు నాలుగు పక్షములు మాత్రమేకాక అనేకపక్షము లేర్పడును. ౭ వ పటమున ఈ పక్షములు కొంతవరకును గానవగును. చతురస్రముగ నున్న ఒక సౌధము నాలుగువైపులను ఒక వసారాను గట్టించితి మనుకొందము. సౌధమునకుఏవైపునను ఈ వసారా ఈ కొననుండి ఆ కొనవరకును ఉండక మధ్య కొంతభాగమువరకు మాత్రమే యుండి, ఈ వసారాముందట మోటారుబండ్లు నిల్పుటకు మెట్ల కీవైపునను ఆ వైపునను, కొంత దూరమువరకు నుండు నట్లు పోర్టికో (Portico) అను వసారాయొక చిన్న వసారాను నాల్గువైపులను గట్టించినచో ఎట్లుండునో ఈ దేవాలయమును ఇంచుమించుగా నట్లే ఉండును. కాని పోర్టికో వసారాకు ఇరువైపులను ద్వారములుండే, ఈ దేవాలయమున మాత్రము ఎదుటనే ఒక్క ద్వారము గలదు.

ఈ దేవాలయమును నేలమట్టమునుండి నిర్మించలేదు. ౫, ౬ అడుగుల ఎత్తుగ విశాలమైన దిన్నెను మొదట తయారు చేయించి దీనియందు చుట్టును కొంతభాగము వదలి మధ్యప్రదేశమున నీదేవాలయమును గట్టిరి. ౨ వ పటమున ఈ దిన్నె గాన్పించుచున్నది. ఇది కూడ నక్షత్రాకృతినేయున్నందున దీనిపక్షములును,మూలలును పైనున్న దేవాలయ పక్షములకును మూలలకును సరిగా సరిపోవుచున్నవి.

ఈవిధముగ దేవాలయముచుట్టును ఈ దిన్నె యుండుటవలన భక్తబృంద మిట కూర్చొని సేదదీర్చుకొనుటయే కాక దీనిపై నెక్కి దేవాలయమునకు ప్రదక్షిణము చేయుటకును, చుట్టును గోడలపైనున్న శిల్పమును జాగ్రత్తగ పరీక్షించుటకును ఆస్పదమున్నది. పైగా అడుగుభాగమున ఈవిశాలమైన దిబ్బ యుండుటవలన దూరమునుండి చూచునపుడు ఈ దేవాలయ మంత ఎత్తుగనున్నట్లుకానరాదు. దేవాలయమునకు అనేకపక్షము లున్నందునను, కుడ్యములపైన, గోపురములను నిల్చుకొనియున్న మూర్తులను, స్తంభములను చిత్రించి యున్నందునను దూరమునుండి చూచుటకు దేవాలయమున నిలువుగీత లధిక

ముగ నున్నట్లు కాన్పించుచున్నది. కాని దేవాలయము చుట్టును అనుగున దిన్నెయు, పైన ఏటవాలుగ నున్న చిన్న వారపాకును ఉండి, శిల్పమంతయు కొన్ని ప్రత్యేకపంక్తు లుగనుండి, ఈపంక్తులు సమతలముగ నునుండక ఒకదానికంటె నొకటి కొంచెము ముందరికి వచ్చియో, లేక వెనుకకు జరిగియో భిన్న తలముల నేర్పరచియున్నందున దూరము నుండి చూచుట కివి అడ్డగీతలవలె గాన్పిం చుచు పైన జెప్పిననిలువుగీతల తీక్ష్ణతను కొంత వరకు తగ్గించును. ఈ అడ్డగీతలును, నిలువు గీతలును మనోహరముగ సమ్మేళనము జెంది నందువలననే ఇశరపద్ధతి దేవాలయముల దు కానరాని అప్రతిమాన సౌందర్య మీదేవాల యమున గలదు.

నక్షత్రాకృతివలన దేవాలయమున కనేకపక్షము లేర్పడినందున కుడ్యముల యుపరితలమంతయు శిల్పితమైనను ఈశిల్పము ఒకచోట ప్రోగుచేయబడినట్లుండక వేర్వేరు భాగములుగ నున్నట్లున్నది. ఒకపక్షమున నొకటి రెండుమూర్తులే యున్నందున మనము ఒక్కొకదానిని సావధానముగను, అనన్యమన స్కులుగను పరీక్షింపగలము. ఒక పక్షమును జూచి మరియొక పక్షమునకు బోవునంతలో మధ్య కొంత విరామమున్నందున ఎన్ని మూర్తులను చూచినను, ఎంత యధికముగ శిల్పమును పరీక్షించినను విసుగుపుట్టదు. ఈ విధమునగాక ఈ మూర్తులన్నిటిని తిన్ననిగోడపైన వరుసగ చిత్రించినచో ఇవియే అంత ఆకర్షకములుగ గన్పడవు.

౭-వ పటమున దేవాలయద్వారమున కిరువైపులనున్న మనోహరశిల్పము గాన వచ్చుచున్నది. ద్వారమునకు ముందు రెండు వరుసలు మెట్లున్నవి. మొదటివరుస మెట్ల నెక్కినవెంటనే దేవాలయము చుట్టును ఉన్న దిన్నెపైకి వత్తుము. ద్వారముక్రిందనే ఆనుకొనియున్న మెట్లవరుస నెక్కి ద్వార మును ప్రవేశించుటకు పూర్వము ఈ దిన్నె మీద ఒకక్షణమాగుటకు అవకాశమున్నం దున, మెట్లసంఖ్య తక్కువయయినట్లుగాన్పిం చుటయేకాక ద్వారమున కిరుపార్శ్వముల నున్న ఉత్తమశిల్పమును కొంచెము జాగ్ర త్తగా పరీక్షించుట కాస్పదమున్నది.

ఈ దేవాలయముచుట్టునున్న మూర్తు లలో కొన్ని ౧౩ వ పటమునందు గాన్పించు చున్నవి.

కుడివైపున శంఖ చక్ర గదా పద్మధారి యగు శ్రీవిష్ణుమూర్తిని శిల్పి రెండుమార్లు చిత్రించినాడు. చతుర్వింశతివిష్ణుమూర్తులలో నివి ఏవో యీ చిత్రమునుండి విశదముగాకు న్నది.దీనికివిరుద్ధమవైపున నొకవిగ్రహము అస్ప ష్టముగా గాన్పించుచున్నది. ఇదియు నేదో తెలియుటలేదు. కాని దీనిప్రక్కన నున్న మూర్తిమాత్రము పరశురాము డని చేత నున్న గండ్రగొడ్డలినిబట్టి తెలియుచున్నది. పరశురామునికి ప్రక్కన ఒకవ్యక్తి ఒకకుంభ మును చేతబట్టుకొని ఒకవామనమూర్తితో మాటలాడు చున్నట్లు గన్పడుచున్నది. బహుశః ఇది వామనావతార వృత్తమేమో! శిల్పి దశావతారముల నిచ్చట చిత్రించి నాడేమో?

ఇచ్చటి ప్రతిమాశిల్ప మెంతయుత్త మముగ నున్నదో ౧౪,౧౫,౧౬ సంఖ్యలుగల

## బేలూరు శిల్ప చిత్రములు

[K. P. S.]



౧. చెన్నకేశవస్వామి దేవాలయము (ప్రాకారములోపల)



౨. ఆలయము దక్షిణపు వైపు (ప్రాకారము లోదృశ్యము)



౩. కుడివైపు: గజాసురమర్దనుడు. ఎడమవైపు: నాగదంపతులు



౪. పై ప్రతిమలకు ఉత్తరమునున్న సుందర శిల్పప్రతిమలు



౬. శివపార్వతులు



౭. శ్రీ నరసింహుడు. హిరణ్యకశిపువధ

౭. దేవాలయప్రధాన (తూర్పు) ద్వారము. దీనికి రెండుప్రక్కల రెండేసి మంటపములుండుట కానవగును. తక్కిన ద్వారములకడను మంటపము లిట్లే కలవు.



౮. ప్రాకారమందు నిరృతిదిశయందున్న మరియొక ఆలయపు ముందరిమంటపము. స్తంభరచనయందలి వైవిధ్యము ఇందు కానవగును.

ఈమూడుచిత్రములను జూచిన బోధపడును. ఇందు ౧౽ వ సంఖ్యగల చిత్రము వాసుదేవ మూర్తి. కుడిచేతులు రెంటియందును శంఖ, గదలను, ఎడమచేతులందు చక్రపద్మములను, శిరమున కరండమకుటమును ధరించిన ఈమూర్తి—పొట్టకొంచెములావుగనున్నట్లున్నను—శిల్పి యసమాన కౌశలమును చాటి చెప్పుచున్నది. కంకణకేయూరములను, నూపురములను చిత్రించిన వైఖరిని జూచినచో నగిషీ పనియం దీశిల్పి ఎంత నేర్పరియో బోధపడును. ఈనేర్పరితనమే ౧౮-వ చిత్రమున విగ్రహము చుట్టును ఉన్న ప్రభామండలమున ఇంకను విశదముగ గాన్పించుచున్నది. ముక్కు—మొగము శిథిలమైనదిగాని ఈమూర్తి ఇంకను మనోహరముగ నున్నది. శంఖ, చక్రముల క్రమమునుబట్టి ఈమూర్తి శ్రీధరమూర్తియేమోయని తోచుచున్నది. కాని రూపరేఖా విన్యాసమున నీమూర్తి దేనికిని తీసిపోదు.

భావగాంభీర్యము: ధైర్యస్థైర్యాద్యనేక గుణాతిశయమును సువ్యక్తముజేయుచున్న ఈమూర్తులను వదలి ౧౯-వ సంఖ్యగల స్త్రీ చిత్రమును జూతము. ఈలాలిత్యమును, ఈ లావణ్యమును ముద్దులుకురియుచున్న ఈ త్రిభంగిచిత్రమున గాన్పించునట్లు పాశ్చాత్య పురాతనశిల్పములం దెచ్చటను గానరాదు. గగనసదృశమైన తనుమధ్యమును, కుచగౌరవమును ఈస్త్రీవ్యక్తియం దెంతయు రాణించుచున్నవి. ఈమూర్తి రతిదేవియట. కుడిచేత నున్నది ఏమిటో మాత్రము విశదముగ దెలియుటలేదు. కాని చుట్టునున్న ప్రభావళి యందలి వంపులు గూడ లతా గుల్మముల ఒయ్యారము ననుకరించుచు మూర్తిసౌకుమార్యమున కొక ఉత్తమ పృష్ఠభూమిక (Back-ground) వలె నేర్పడుచున్నది. ఈ సౌకుమార్యమే ౨౦-వ పటమునందు కుడివైపుననున్న రెండు స్త్రీమూర్తులయందును గాన్పించుచున్నది. కాని ప్రదర్శితభావమున ఈ రెంటికిని ఎంతయోభేదమున్నది. చేతితో గదాయుధమును బట్టుకొనువైఖరికిని పిల్లవానిని చేరదీయు వైఖరికిని ఉన్న భేదమునంతయు అట్లే శిల్పి ఈమూర్తులహస్తములను తీర్చి దిద్దుటలో సువ్యక్తము చేసినాడు. వీనికి ప్రక్కననే యున్న పురుషోత్తమ భైరవమూర్తులను జూసినయెడల స్త్రీ, పురుష దేహసౌందర్యమునయున్న విభిన్నత స్పష్టమగును. ఈ పురుషవ్యక్తిద్వయము నందుగూడ ఖండిత శిరమును ఖడ్గము మొదలగు వానిని ధరించిన భైరవునిరూపమునకును, శంఖ, చక్రాదిధారియగు పురుషోత్తముని రూపమునకును అంగవైఖరియందు గాకపోయినను భావప్రదర్శనమునమాత్రము అధికభేదమగుపడుచున్నది.

అంగసౌష్ఠవమున కన్న భావౌన్నత్యమును ప్రదర్శించుట శిల్పమునందు కష్టము. కాని భావప్రదర్శనమునందు మాత్రము ప్రాచీనహైందవశిల్పి ఎవరికిని దీసిపోడు. లోకోత్తరవిఖ్యాతి గాంచిన యవనశిల్పమున అంగసౌష్ఠవమును (అదియు పురుషరూపమునందు మాత్రమే) అత్యుత్కృష్టముగ గాన్పించుచున్నది. యవనకళతో బోల్చి చూచినచో మన శిల్పము వివిధాంగ ప్రదర్శనమున ఉత్ప్రేక్షాతిశయోక్తులకు కొంతవరకు పాల్పడినదేమో యని కూడ తోచవచ్చును.

కాని భావప్రదర్శనమున మాత్రము యవన
శిల్పి మనవారల సామర్థ్యమును మించుట
యటుండ కొన్ని యంశములందు సాటియైన
రాజాలడు. ౫, 3 సంఖ్యలు గల నరసింహ,
గజాసుర దమన చిత్రములను జూడుడు.
ఈ రెండును పరిపూర్ణ భావగర్భితములే.
కాని హిరణ్యకశిపుని పొట్టచీల్చి ప్రేగులు
మెడకు హారముగ వైచుకొని ప్రహ్లాదుని
ప్రార్థనల నాలకింపక తన దారుణకర్మమందే
నిమగ్నుడైన నరసింహచిత్రము గజాసురుని
పై తాండవము చేయుచున్న గజసంహారి
చిత్రమువలె గాన్పింపదు. ఇందున్న రౌద్రము
గజసంహారిచిత్రమునందు గాన్పింపదు.
హిరణ్యకశిపుని శిర మొకచేత బట్టి, కాలు
వేరొకచేత బట్టి, మరి రెండుచేతుల గోళ్లతో
ఆ దానవుని పొట్ట చీల్చుచున్న నరసింహ
మూర్తియం దెంత ఉత్తమకళానైపుణ్యమును
శిల్పి చూపగల్గినాడో అంతకంటె నధికముగ
గజాసురసంహారుని తాండవమునందు ప్రద
ర్శించియున్నాడు. గజాసురుని చర్మమును
ప్రభావళివలె పైకెత్తిపట్టి గజాసురుని తలపై
నొకకాలుంచి వేరొకకాలు పైకెత్తి యక్షాది
గణములు సంస్తుతింపుచు గానము చేయు
చుండ తన్మయుడై తాండవము చేయుచున్న
ఈశ్వరుని విచిత్రనృత్తమునకు సర్వమును
ప్రకంపితమైపోవునట్లున్నది. ఈ యఖండ
లయ సర్వమును వ్యాపించిపోవుచున్నట్లగ
పడుచున్నది. ఈ చిత్రము దక్షిణదేశమునం
దలి యేఉత్తమ నటరాజ విగ్రహములకైనను
పనితనమున తీసిపోవునది కాదు.

౬వ సంఖ్యగల చిత్రమున నొక సమగ్ర
ప్రశాంతభావము వ్యక్తీకృతమైనది. ఇందు
పార్వతీపరమేశ్వరుల త్రిభంగి రూపములను
రెంటిని శిల్పి చిత్రించియున్నాడు. డమరు,
త్రిశూల, అక్షమాలాధారియై శంకరు డొక
చేత ఉపదేశముద్రను బట్టి, వేరొకచేతిని
పార్వతిభుజముపై వైచి మనోహరముగ
గన్పడుచున్నాడు. ముఖమును జాగ్రత్తగ
పరీక్షించినచో, ఈ మూర్తిని చిత్రించిన
శిల్పియే గజసంహారమూర్తినిగూడ చిత్రించె
నని నిస్సంశయముగ జెప్పవచ్చును. ఈ
మూర్తులు రెండును ఒక్క దేవతకు సంబం
ధించినవే; ఒక్క శిల్పి నిర్మాణములే. ఐనను
భావమునం దీరెంటికిని ఏ తరమో భేదము
గాన్పించుచున్నది.

హొయిసల కాలమునాటి శిల్పి సామా
న్యుడుగాడు. ఎట్టి హావ, భావ, విలాసముల
నైనను ఏ సినిమాచిత్రమునందు కంటెను
అవలీలగ తన శిల్పమున జూపగలడు. ఈదేవా
లయమునుగూర్చియే ఫెర్గూసన్ అను పాశ్చా
త్యపండితు డీవిధముగ జెప్పియున్నాడు.

"సుందరమగు నా రేఖాసమ్మేళనము,
ఆకృతిచిత్రణము, అలంకరణానైపుణి గోథిక్
(Gothic) శిల్పప్రపంచమున నప్రతిమానము.
ఇట్టి సౌందర్యసమావేశము మధ్యయుగమం
దలి శిల్పకళాభిజ్ఞుల కేరికి సాధింపరానిదానిని
బేలూరునగరమునందు ప్రదర్శింపగలిగినది."

కేవలము ఫోటోచిత్రములను మాత్రమే
చూచి ఈ యసమాన శిల్పసౌందర్యముయొ
క్క పరిమితిని నిర్ణయించుట సాధ్యముగాదు.
హొయిసలరాజులు కట్టించిన దేవాలయ
మేదైననుసరే కళాభిజ్ఞుల కొక అపూర్వశిల్ప
రత్న ఖనియగుచున్నది. అందునను బేలూరు

దేవాలయము ఉత్తమతరగతికి జెందినది. ఈ దేవాలయమునందలి శిల్పముల నొక్కొక్క దానిని పరీక్షించుచు గూర్చునిచో ఆకలి దప్పులు గూడ కళావేత్తల నంటవు. ఇట్టి శిల్పమును ప్రోత్సహించి ఇట్టి దేవాలయములను గట్టించిన హొయిసలరాజు లెంతటి కళారసికులో! నేడు మన మట్టిరసజ్ఞులు గాక పోయినను ఈలోకోత్తరవాస్తు, శిల్పసంపదను జూచియైన మన వ్యర్థజీవితములను రసవంతములుగ జేసికొనుట ఎంతయు ఆవశ్యకము.

---

# గ్రీకు నాటకరంగము ప్రాచీనము



౧. యు ఫిడస్ - ఇప్పొలిటోకు అమర్చబడినది



౨ సోఫికిల్స్ ఓడిపస్‌కు అమర్చబడినది

# హైందవ తత్త్వశాస్త్రము

## నూతన దృక్పథము

డాక్టరు పి. టి. రాజు

౧ హిందూదేశము రాజకీయముగా నెన్నెన్నో సంకటావస్థలకు పాల్పడి కొంతవరకు మారుచు వచ్చినది. రాజకీయవ్యవస్థలలో మార్పు కలిగినపు డెల్ల భారతీయుల నాగరకతలో కూడ మార్పు లగపడుచుండెను. పరిపాలనా వ్యవస్థలందును, నైతికమానముల యందును, యోచనామార్గములందును నూతన భావములు బయల్పడి భరతభూమిని మార్కొనినపుడు ఆత్మవినాశము నొందకుండ భారతీయుల మూలతత్త్వము వ్యాకోచశీలమై సందర్భానుసారముగా పెరిగి నూత్న భావాదులను పీల్చుకొని తనలో చక్కగా విలీనము గావించుకొని పెక్కు విధముల పెంపుగనుచు నూతన వైఖరులను దాల్చుచు విలయమెరుగని వృద్ధితో వెలయుచుండిన విధానము మిక్కిలిగమనింపతగి అద్భుతావహమై యున్నది. హిందూమతధర్మమునకు భిన్నమైన క్రొత్త మతధర్మ మొకటి పొడచూపినపుడు, అందువలన నుపద్రవ మేమియు సంభవింపకుండ, ముందే మేల్కొని, ఆ క్రొత్తధర్మములను తనలో కలుపుకొని పట్టియుంచుకొని ప్రాతధర్మములను విస్తరింపచేసికొనుచు అవసరమైన మార్పులతో పెరిగి వృద్ధిగనుచుండెనేకాని అసలు మాత్రము ఎన్నడును చెడిపోలేదు. హిందూమత ధర్మమునకు అందువలన నెన్నడును ఏహానియు కలుగలేదు. చూడు డొక ఉదాహరణము: ఒకప్పుడు ఆసేతుహిమాచలపర్యంతము భరతవర్షమున అద్భుతవ్యాప్తిగనిన బౌద్ధమతముయొక్క ముఖ్యధర్మములను విడువకుండ హిందూమతము తనలో చక్కగా చేర్చి కలుపుకొని బాగుగా వృద్ధిపొంది బౌద్ధమతమునకు ఒకవిశిష్టత లేకుండ చేసి చల్లగా కబళించివైచినది. అందలి ముఖ్యాంశములు హిందూమతధర్మములలో నేర్పుగ మిళితము చేసికొని తాను వృద్ధిపొంది బౌద్ధమతమును ఈ దేశమున నామమాత్రావశిష్టము చేసి హిందూమతధర్మము విలసిల్లినది.

౨. మన ప్రాచీన గ్రంథములలో తత్త్వయోచనా పద్ధతులనుండి నైతిక, రాజకీయచర్చలు ప్రత్యేకింపబడినవి. (మనువు మొదలైన ధర్మశాస్త్రవేత్తల స్మృతులు తత్త్వవివేక మూలములైనవే యని కొంద రనుచున్నారు. కాని ఆస్మృతులు తత్త్వవిషయకము (philosophical) లనుటకంటె మతవిషయకములే (religious) అనుట ఒప్పియుండును. ఏలయనగా ఆస్మృతులలో ధర్మజిజ్ఞాసయే కాని తత్త్వజిజ్ఞాస, వేదాంతచర్చాదులు (Metaphysics) అగపడవు. హెగెల్ (Hegel), ప్లేటో (Plato) లోనగు పాశ్చాత్యతత్త్వవేత్తల గ్రంథములలో నగపడు తత్త్వవిషయములు మనుస్మృతిలో కానరావు. మను ధర్మశాస్త్రములనుగురించి డాక్టరు భగవాన్‌దాసు గారు చేసిన అర్థవ్యాఖ్యానములలో కూడ అందు అట్టి తత్త్వజిజ్ఞాస ఉన్నట్లు ఎక్కడను సూచించలేదు. మను ధర్మశాస్త్రమును అద్వైతప్రతిపాదకులగు శంకరాచార్యులవారును, విశిష్టాద్వైతప్రతిపాదకులగు రామానుజాదులును, బహుత్వ ప్రతిపాదకులైన నైయాయికులును కూడ ఒక్కరీతినే గ్రహించినారు. కాబట్టి మనుస్మృతికి వేదాంతజిజ్ఞాసలో ప్రత్యేకత ఉన్నట్లు భావించు

కొనుట సరికాదు. మనువు, పరాశరుడు చెప్పినదే ధర్మ నిశ్చయము. దాని నాక్షేపించుటకును మార్చుటకును ఎవ్వరును అంగీకరింపకుండిరి. ప్రపంచ భావమునకు మూలాధారములైన ముఖ్య విషయములందైనను తత్త్వ నియమములతో స్మృతులకును ధర్మశాస్త్రమునకును ఎట్టి సంబంధము లేకుండెను. అలాగుననే రాజకీయ వాదములతో కూడ తత్వజిజ్ఞాసకు సంబంధములేకుండెను. ఆనాటి జీవితపరమార్థములై అప్పటికి కావలసిన అపరోక్షానుభవ, బ్రహ్మజ్ఞానసిద్ధులకు నైతికరాజకీయ వ్యవస్థలు అడ్డురాకుండిన చాలును; ఆవ్యవస్థ లెట్లున్నను తత్వజిజ్ఞాసువులకు సమ్మతమై నిశ్చింతగా నుండెను.

3. కేవల-ఆముష్మికచింత తప్ప అనుదినజీవనమున నందరకు నత్యవసరమైన సాంఘిక, నైతిక, రాజకీయాదివిషయములందును వాని విజ్ఞాన పరిశీలనమునందును ఏ చింతయు, చీకును లేక "ఘోరనిర్లక్ష్య భావమూనుట" అనునది మనపూర్వులగు భారతీయుల తత్త్వవివేచన పద్ధతిలో గట్టిగా నాక్షేపింపదగిన పెద్ద లోపమై యున్నది.

४. ఆముష్మికచింత, విశ్వభావనాది చర్చలు వీటితోనే సరిపెట్టుకోక, తత్త్వజిజ్ఞాస, మనమానవ జీవితమునకు అవసరమైన సౌఖ్యోన్నతుల నొసగి, సర్వవిధముల మనల సంతృప్తులను జేయుటకు మనసాంఘిక జీవసంభవములైన సమస్యలను విప్పజాలిన విజ్ఞానవృద్ధి కొరకుగూడ ప్రయత్నించుట అత్యవసరము. విశ్వ నిర్మాణవివేకమును, ఆ విశ్వమును సంగ్రహముగా నవలోకించుటకు తగుభావములును అను ఈ రెండే తత్త్వ జిజ్ఞాసువులయొక్క పరమావధులు కాకూడదనుట నిశ్చయమే. అట్టి భావమునుండి విడివడి పైకిలేచుటకు వలయుసామర్థ్యము పాశ్చాత్యులకు లేదు. వారి తత్వ జిజ్ఞాసపద్ధతులలో విశ్వరచనములందలి విచిత్రములేవో తెలిసికోవలెనను నభిలాషయేకాని, మన జీవసమస్యల భేదించవలెనను గాఢసంకల్పములతో వారు పరిశోధనల గావించుచున్నట్లు కానరాకున్నది. నైతిక, రాజకీయ విషయములుకూడ అనుదినము మనల డీకొనుచున్న జీవ సమస్యలే నని మనము మరువకూడదు, ప్రపంచప్రకృతిని బోధించువిషయములతో నైతిక, రాజకీయములకుకూడ సంబంధ ముండకతప్పదు. హైందవతత్త్వదృష్టి అభ్యాస ప్రధాన మనియు హిందువులకు తత్త్వజిజ్ఞాస జీవిత క్రమమేకాని యోచనామాత్ర మార్గము కాదనియు చాలమంది చెప్పుచున్నారు. తత్త్వజిజ్ఞాస జీవితక్రమ మగుట వాస్తవమే అయినను అది చింతామయజీవిత క్రమముగాని క్రిమికీటకములవలె అచింతా బహిర్భూతము కాదు. సంఘతత్వము, పరిపాలనాసందర్భములు, నైతికవిచారములు అనునవి చైతన్యయుక్తములైన మన జీవితాంశములు; వాటినిగూర్చి ఆలోచించకుండ వాటితో సంబంధము కలిగించుకోకుండ మనము జీవించజాలము. పరస్పరసంబంధములేని ప్రత్యేకవిభాగముల క్రింద మానవజీవితమును ప్రత్యేకింపజాలము. విశ్వతత్త్వవిచారముతో సాంఘికశాస్త్రములకు సంబంధ మేమియు లేదని వక్కాణింపజాలము. జీవనము అనేకకళలతో కూడుకొనియున్న సంపూర్ణవ్యవస్థ. ఏకరూపియైన జీవితముయొక్క వివిధకళల పరస్పరసంబంధమును తెగగోసి విడదీసి ప్రత్యేకభావనలు చేయుచుండజాలము.

డ్యూయీ పండితుడు తత్వజిజ్ఞాసయొక్క ప్రయోజనము నీ క్రిందివిధమున నిర్వచించినాడు. "తత్వజిజ్ఞాసువులు కూడ ప్రపంచచరిత్రతో సంబంధము కలిగి అందొకభాగముగా నేర్పడియున్నారు. చలించుచుపోవు చరిత్రాంశములకు చిక్కి వీరును చరిత్రతో నడువవలసినవారలే. వారు ప్రాదుర్భవించినది చరిత్రలోనే; కాబట్టి వారు గతకాలచరిత్రసంభవు లనుట నిశ్చయమే. భవిష్యత్ చరిత్రనిర్మాణము కూడ కొంతవరకైన వారివలన కావచ్చును." ఈ సందర్భములను బట్టిచూడగా తత్వజిజ్ఞాసయొక్క ధర్మము, అనగా అందువలన కావలసినపని యెట్టిదో నిర్ణయించుకొనుటకు సూత్రమొకటి నిర్వచించుకోవలసి యుండును: "మనుష్యుని మనస్సునందు నిజముగ చేరి, ఆ మనస్సుయొక్క నిర్మాణకారణములని చెప్పదగిన అనుభవసంభవములైన గాథాపరంపరకు నూత్నవిజ్ఞాన విషయాంశ పరిగ్రహణమునందును రాజకీయ పరమావధులయందును

ఉన్ముఖత కలిగించి, ఆవరకు అంగీకృతములై అవలంబింపబడియున్న భావములకు విభిన్నములైన నూత్నభావములు బయల్పడినపుడు వాని నుచితరీతిని సంగ్రహించి స్వప్రయోజనార్థమై ఉపయోగించుకొను విషయమున దేశకాలానుసారముగ ఎప్పటికి తగినట్లు అప్పటికి కాలోచితముగా నిరంతర నూత్న కార్యనిశ్చయము గావించుకొనుటకై తగు ప్రయత్నములు చేయుటయే తత్త్వవివేచనయొక్క పరమార్థ మని నిర్ణయింపతగి యున్నది. (చూ. ష్వ్యాయిా పండితుని Philosophy and Civilisation) కాని గతకాలమునందు మనతత్త్వజిజ్ఞాసువులు మన రాజకీయ పరమావధులను గూర్చి చెప్పవలసిన దేమియులేకుండెను. ఆ విషయమై మనకు స్వంతముగా క్రొత్తభావములు లేవు. ఇపుడు మన కత్యవసరమై గత్యంతరములేక విదేశ రాజకీయ భావములను మనము దిగుమతి చేసికొని స్వీకరించుకోవలసి వచ్చెను. అందు మనవారు కొందరు "రూసో" మతమును, కొందరు "మార్క్సు, రసెల్" పండితుల మతములను, మరి కొందరు హెగెల్ పండితుని మతమును, వేరొక కొందరు "క్రొచెజంటిలె" పండితుల మతములను అనుసరించుచున్నారు.

అయితే ఆ తత్త్వవేత్తల భావములు విదేశములలో భిన్నపరిస్థితులలో ప్రాదుర్భావము పొందుటచేత అవి మనఉద్దేశములకు సరిగా సరిపడనేరవు. అక్కడ నొకటి, ఇక్కడ నొకటిగా అచ్చటచ్చట ఏరుకొంటిమేని కొన్ని అంశములుమాత్రము మన పరిస్థితులకు చక్కగా సరిపడి స్వీకారార్హములుగా నగపడవచ్చును. ఈవిధముగ ఆమూల నొకటి, ఈమూల నొకటి, ఒక్కొక్కటిగ ఏరి దిగుమతిచేసుకొనిన తత్త్వవిషయములవలన కలుగు ప్రయోజనములకంటె అనర్థములే అత్యధికములగుటచేత అట్టి దిగుమతిపద్ధతి ప్రోత్సహింపతగదు.

సృష్టిక్రమమును గూర్చి మనకు స్వకీయములు, స్వతంత్రములు నైనభావములు బహుకాలమునుండి కలవు. దిగుమతికాబడిన విదేశీయభావములకును, మన స్వకీయభావములకును సరిపడకపోయినప్పుడు క్రొత్త దిగుమతులు మన ప్రాతభావములను చీకాకుపెట్టి మన జీవితములకు అపారనష్టమును తెచ్చిపెట్టకమానవు.

కాబట్టి మన స్వకీయ వ్యక్తిగతభావములను ఆధారముచేసికొని, మన జీవితములను మార్కొనుచున్న క్రొత్తసమస్యల నెదుర్కొని సాధించుటకు క్రొత్త సాధనలను అన్వేషించుట మనకు అత్యంతావసరమైన కర్తవ్యము.

మన ప్రాచీనతత్త్వవేత్తల అభిప్రాయములయందు మనకు దినదినము అనాదరము అధికమగుచున్నది. ఇందుకు ముఖ్యకారణమేమనగా:—నేటి మన విజ్ఞానమునకును, సంఘపరిస్థితులకును, ప్రాచీనుల భావములకును యెంతమాత్రమును కుదరకపోవుటయే. వీటి ప్రయోజనమేమియును వాటికి లేకపోగా నిష్ప్రయోజనము లని వీటిని గర్హించి పరిత్యజించవలసి వచ్చుచున్నది. ఈనాటి మనదేశపు తత్త్వవేత్తలు ప్రాచీనుల తత్త్వపద్ధతులను చదువుచున్నారు. ఏదృష్టితో చదువుచున్నారు? వెనుకటివారు ఎట్లుండిరో? ఏమనిరో? ఆ చరిత్ర వింత చూతమను వినోదబుద్ధితో వాటిని చదువుచున్నారు కాని నేడు మనదేశమును, మనసంఘమును ఎదిర్చి మార్కొని పైబడుచున్న సమస్యలను సాధించుటకు మార్గముల నన్వేషింపవలెనను సంకల్పముతోను, లక్ష్యముతోను కాదు. ప్రాచీనులతాత్త్వికభావములు మనప్రస్తుత జీవనప్రకారములతో సంబంధించినవి కావు; అవి జీవరహితములైన ప్రాచీనశల్యములు; అవి ఒకప్పుడు ఇట్లుండెడివని ప్రాచీన వస్తుచరిత్రదృష్టితో చూచుకొనుటకు తప్ప అవి మన వర్తమానజీవపరిస్థితుల మేలునకు ఉపయోగింపజాలవని మనకు స్పష్టమగుచున్నది. ప్రాణముపోయిన పిమ్మట పీనుగను పట్టుకొని దేవులాడునట్లు మనము తేజమెడలిన ప్రాచీనతత్త్వ విషయములను వదలనేరక గట్టిగా పట్టుకొని ప్రాకులాడుచున్నామని అనుకోకతప్పదు.

బహుకాలముక్రిందట, హిందూదేశమునకు ఇతర ప్రపంచములో సన్నిహితసంబంధము అంతగా లేనప్పుడు, అనేకవేల సంవత్సరముల క్రితము, ప్రాచీన హిందువుల తత్త్వవివేచనము ఆనాటివారికి సంతృప్తికరమై సరిపడియుండెనని అంగీకరింతము; కాని నాటి పరిస్థితులు నేడులేవే! పూర్తిగా మారిపోయినవే! ఈ

కాలమున మనసంఘమును, దేశమును మార్కొని మీద కురుకుచున్న క్లిష్టసమస్యలను సాధించుటకు మనపెద్ద లెవరును పూనుకొనకున్నారు. అందువలన నాటి తాత్త్వికసిద్ధాంతములు నేడు ఎందుకును మారక కొర గాక పడియున్నవనుట స్పష్టమగుచున్నది. లోక మాన్యతిలక్, మహాత్మాగాంధీ లోనగు మహామహులు భగవద్గీతకు క్రొత్తఅర్థములు చెప్పి విశేషవ్యాఖ్యాన ములు వ్రాసి గ్రంథములు ప్రకటింపవచ్చును; రాధా కృష్ణునివంటి పండితులు ప్రాచీనజంతుశల్యము లనదగు పురాతన హైందవ తాత్త్వికభావములకు కొంత చైతన్యమిచ్చి క్రొత్తవెలుగులో జూపవచ్చును. కాని అంతమాత్రముచేత మన పూర్వాచారపరాయణులు సంతోషించలేదు; సంతోషించరు. సరేకదా! ప్రాచీన తత్త్వగ్రంథములకు స్వప్రయోజనార్థము వీరలు అర్థ ములు కల్పించి దుర్వ్యాఖ్యానములు చేయుచున్నారని నిరాదరభావముతో దూషించుచున్నారు. ఎవరియిష్టము వచ్చినట్టు వారు సాగదీసి అర్థముచెప్పుకోనీ; మన కేమి పోయినది? మా భావములను పెంచుకొన్నప్పుడు ఈ యర్థమువచ్చునని వారు చూపించినప్పటిమాట చూచుకో వచ్చును" అని మన పండితులనేకులు ఆ వ్యాఖ్యానముల యందును ఉపన్యాసములందును గౌరవాదరములు లేక యున్నారు క్రొత్తసమస్యలు బయల్పడుచున్నవి. వాటిని సాధించుటకు తత్వవేత్త లెవరైన నూతనమార్గ ములు చూపదలచినపక్షమున అవి స్వకీయ తత్వవాదము లకు తార్కాణముగా నున్నవని ఋజువుచేసినపుడే జీవయాత్రలో మన కవి ప్రయోజనకారులు కాగలవు. అట్టి ఘనకార్యమునకు తత్వవేత్తలైన నేటిపెద్దలు పూను కొనవలసిన అవసరము చాలాకాలము క్రిందటనే కలిగినది. ఇప్పుడు మరియు అవసరమగుచున్నది. బహుదశకముల నుండి తాత్వికగ్రంథ భాషాంతరీకరణ, వ్యాఖ్యాన, అర్థవివరణ, ఉపన్యాసాదులు జరుగుచున్నవి. పాశ్చా త్యపండితులు ఇంతవరకు చేసిన అపరిమితమైనపని అటుండ మన భారతీయపండితులుకూడ కొందరు తత్వ జిజ్ఞాసావ్యాప్తికై ఈమధ్య చాలచురుకుగా పనిచేయు చున్నారు. అందు కొందరు పండితులు చేసినపనిని గూర్చి సంగ్రహముగా ప్రశంసింతము. డాక్టర్ గంగా నాథ్ఝాగారు హైందవ తత్వగ్రంథములలో అనువాద యోగ్యములైన గ్రంథములన్నిటిని ఇంగ్లీషుభాషలోనికి పరివర్తించివేసినారు. డాక్టరు సర్ రాధాకృష్ణన్‌గారు వివిధదేశీయుల తాత్వికసిద్ధాంతములందలి తారతమ్య ములను నిరూపింపవలెనను లక్ష్యముతో సూక్ష్మముగా పరిశీలించి విశేషముల విస్పష్టముచేసినారు. చెప్పవలసిన విషయమేమియు విడిచిపెట్టక వారు తలపెట్టినపని చక్కగా నిర్వహించినారు. ఆయనయిచ్చిన ఉపన్యాస ములలోను, వ్రాసిన గ్రంథములలోను, మన తత్వవేత్తలు నేడవలంబించుకొని క్రొత్తమార్గములలో పెంపొందించ వలసిన విషయములు అనేకము చెప్పియున్నారు. ఆ యంశములు వారి గ్రంథములలో అచ్చటచ్చట చెదరి యున్నవి. విశేషించి ఆయన వ్రాసిన Idealist veiw of life అను గ్రంథములో నూతన నిర్మాణములకు మార్గ ములను కూడ సూచించినారు. దాస్‌గుప్త పండితులు హిందూ తత్వవిద్యావ్యాప్తికై రెండు సంపుటములు ఈ వరకు ప్రచురించినారు. ఇంకను ౩ సంపుటములు ప్రక టింపనైయున్నారు. అదియుగాక పూనా నగరమందు ప్రతిష్ఠింపబడిన తత్వమతసభవారు (Academy of Philosophy and Religion) హైందవతత్వజిజ్ఞాసా సర్వస్వమును ప్రకటింపయత్నించుచున్నారు. వారీపనులు పూర్తిచేయుటయెడల మనతత్వశాస్త్రముయొక్క అర్థవ్యా ఖ్యాన వివరణాది కార్యములయందు చేయవలసినపని మిగిలియుండకూడదు. అట్టి కార్యము లింకను చేయ వలసిన అవసర మంతగా కనబడక వాటియందు ఉత్సా హము మందగించిన సూచన లగపడుచున్నవి. మహో పాధ్యాయులైన తత్వవేత్తల పరిసరస్థానము లటుండ మననాటి జీవపరిస్థితులను బట్టియు మన సంఘస్థితిని బట్టియు మన యోచనాపద్ధతులందు కూడ ముఖ్యముగా మార్పు అవసరమగుచున్నది. ఈనాటి సందర్భము లెట్లు న్నవో చిత్తగింపుడు. ప్రాచీన తత్వవిధాన ప్రవాహము నకు నవజీవన నూతన భావ ప్రవాహము ఎదురు పారు చున్నది. రెండును డీకొనుచున్నవి. అంజేదియు ముం దునకు సాగిపోజాలకున్నది. రెండును ఆగి నిల్చిపోయి నవి. ఇవి సజీవములై ప్రవహించుట మనభవిష్యదభివృద్ధికి

చాల అవసరము. ఈ రెండును కలసి ఏమార్గమునే పోవలెను? అని ప్రశ్న. ఆమార్గమును సూచింపగల నూతన నిర్మాణక్రమము నొకదానిని యేర్పరచుకొని మనము పని సాగించుకోవలెను. యుగయుగంపరగా బహు కాలమునుండి వచ్చుచున్న ప్రాతభావములను నూత్న భావములను పరస్పరము పొలిసిపోకుండ నిలుచునట్లును, మన తాత్త్విక నాగరికజీవనములకు భంగమురాకుండ మాచి కాచుకొని, క్రొత్తభక్కిని అవలంబించుట ఇప్పటికర్తవ్యము. తత్వవివేచనములేని నాగరకత యెట్టిదో హెగెల్ పండితుడు తన తర్కశాస్త్రము ౩౮-వ పుటలో ఇట్లు చక్కగా చెప్పినాడు. "తత్త్వవివేచనములేని నాగరకత నవరత్నాభరణభూషితమయ్యు పవిత్రాతిపవిత్రమైన పరమాత్ముని విగ్రహము లేని దేవాలయము వంటిది." కనుక మన నాగరికతయు అట్టిదే యగును. కాబట్టి నేటి మన తత్వజిజ్ఞాసువుల ముఖ్యకర్తవ్యమేమనగా —బహు పురాతనకాలమునుండి అమలులో నున్న ఆచార వ్యవహారములకు అప్రయత్నముగా మనము లోబడిపోయి చేయుచున్న కార్యములకును, ఈ నాడు ప్రపంచమంతటను బహుముఖముల వ్యాపించి కలంచుచున్న నూతన భావములకును ముఖాముఖిగా జరుగుచున్న ఘోర ద్వంద్వయుద్ధ సందర్భములలో మనము లెస్సగా గ్రహింపగలిగిన పూర్వాంశములను, పొంగి పొరలివచ్చుచున్న నవీనభావపరంపరలను సరియైనతావు చూచి, చక్కని సంధి చేసి, తత్వవివేచన పద్ధతులయందు ఇప్పటికి తగిన క్రొత్తపక్కి నవలంబించుటే. అదితప్ప మనకు పనికివచ్చునది ఇపుడు చేయ తగినది మరొక కార్యమేదియు లేదు. "వివిధయుగములలో బయల్పడి వెడలిన తత్వవివేచన పద్ధతులే నిరంతర గతిగల పెద్దతరహా జిజ్ఞాసాక్రమములను నిర్వచింపగలవు. అవే సంధిపొసగించు సామర్థ్యము కలిగియున్నవి. కదలము, వదలమని గట్టిగా పట్టుపట్టుకొని మొండికిబండలై కూరుచునియున్న గతకాలపరిస్థితులకును, క్రొత్తగా పొడచూపి లోకమంతయు కబళించి ఆక్రమించకమానమని గట్టి నిశ్చయములో ఆగక త్రోసుకొని పరతెంచుచున్న భవిష్యత్ పరిస్థితులకును మధ్య వర్తమానతత్వవిచారము అవసరసంధి పొసగించి క్షేమములుగా శాంతిస్థైర్యములను చేకూర్చగలదు." అని విన్డ్యంయా పండితుడు తన "తత్త్వవివేచనము, నాగరికతలు అను గ్రంథముయొక్క ౭ వ పుటలో చేసిన మహోపదేశము మనవారెల్లరు శ్రద్ధగా గ్రహింపదగినయున్నది. అందు తెలుపబడిన కార్యము చక్కగా నిర్వహించుకొనుటవలన హిందూతత్వపద్ధతులు ఆత్మరక్షణము బడయగలవు. మన నాగరకత నాశము గాకుండ తలయెత్తి నిలుచుటకు అవకాశము యేర్పడగలదు.

అది మాటలతో జరుగునది కాదు. నూతన నిర్మాణక్రమములను గూర్చి గాఢప్రయత్నములు జరిగినపుడే అది నెరవేరును. కాబట్టి నేటితత్వజిజ్ఞాసువు భావికాలమున జరుగవలసిన కార్యక్రమమును గూర్చిన యోచనలకు క్రొత్తరూపముల నిచ్చి పనిచేయుటవలన తన సంఘమునకు నిజమైనసేవ చేయగలడు. ఇపుడు బహుముఖముల జరుగుచున్న కార్యవిధానములకు ఉత్తమాదర్శముల నేర్పరచి వానిని అనుసరించు సంఘమును సరియైన మార్గముల నడిపించి గమ్యస్థానము చేర్చుటకు ముఖ్యముగా కావలసిన దొకటియున్నది. అదేమనగా మన సంఘసమస్యలను సాధించుటకు అనువైన ప్రపంచ నిర్మాణభావమును గూర్చిన విజ్ఞానము. అట్టి విజ్ఞానము లేనప్పుడు పై విధమున ఆదర్శము లేర్పరచుట సాధ్యము కాదు. ఆపని జరుగుటకు మన తత్త్వవివేచనపద్ధతులను నూతనదృష్టితో పరిశీలించుట అవసరము. కావున మన తత్త్వజిజ్ఞాస ప్రాతపు తలను విడిచి పూర్వదృష్టులకు మార్చుకొని క్రొత్త పుంతలను త్రొక్కి క్రొత్తదృష్టులను బడసి ముందునకు సాగిపోవునట్లు చూచుకోవలెను. ప్రాతపద్ధతులు ఎంత గొప్పవయినను మన తత్వశాస్త్రములు ఈ నాడు మనకు పనికివచ్చునట్టి సక్రమనిర్మాణములో నున్నవని మనము దంభములు పలుకజాలము. మనతత్వపద్ధతులలో తార్కిక, మానసికములను, మత, వేదాంతములను గూర్చిన చర్చలు కనబడుచున్నవి. జీవయాత్ర గడుపుటకు కొన్ని నియమములుకూడ అందు లేకపోలేదు. కాని అవియు మతైకవిషయములేకాని నైతికధర్మములు కావు; ఉన్నవియైనను చక్కగా విభజింపబడక సరియైన క్రమమున నేర్పరింపబడక కలగాపులగముగా కలిసిపోయియున్నవి. వాటిని విడదీసి శాఖోపశాఖలుగా

విభజించి సరియైనక్రమమున నుంచుకోవలెను. ఈవిభజనపద్ధతులు సక్రమ నిర్వహణపద్ధతులు మనము నేర్చుకొని మనతత్త్వములలో ప్రవేశపెట్టుకోవలెను. అట్టి సక్రమవిభజనము లేకపోవుటచేతనేగదా మనము రాజకీయముగా పరాజితులమై స్వాతంత్ర్యమును గోల్పోతిమి! మన తత్త్వశాస్త్రములనుగూడ ఆలోపముచేతనే అధోగతి పట్టవచ్చును. దానియందుగల అభిరుచి పూర్తిగా నశించిపోవచ్చును

నానావిధములైన మన అనుభవములను వర్గీకరణముచేసి సక్రమమార్గమున బెట్టుకొనుట ఒక్కటే తత్త్వజిజ్ఞాసయొక్క ఏకోద్దేశము కాకున్నను అట్టి విభజన అందలి ప్రధానాంశములలో నొక్కటై తీరవలయును. మన తార్కిక, నైతిక, సాంఘిక, రాజకీయ సిద్ధాంతముల కన్నింటికిని (Metaphysics) తత్త్వవివేచనమే పునాదిగానుంచి పునర్నిర్మాణము గావించుకొనవలయును. మనసాంఘిక, రాజకీయోద్దేశములను సరియైనమార్గమున నడుపగల తార్కికసిద్ధాంతములు అందునుండి జనింపచేసికోవలెను. అప్పుడే ఆతత్త్వపద్ధతి మనజీవితములను ప్రత్యక్షముగా స్పృశించునది, సజీవమైనది అని చెప్పతగియుండును.

వెనుక అనగా క్రీస్తుపూర్వము ౪వ శతాబ్దమున గ్రీసుదేశమున ప్లేటో (Plato) అను తత్త్వవేత్త స్వసంఘ స్వరాజ్యవ్యవస్థలయందు తాత్త్వికవిషయముల నాలంబనము గావించుటకై యెట్టి గాఢప్రయత్నములు చేసెనో చూచినారా? యూరపుఖండమునందలి మధ్యదేశములలో పాండిత్యకుదిరి ఏకముఖమునకు తెచ్చుటకు హేగెల్ పండితుని బ్రహ్మస్వభావవిషయకచర్చ యెంత పనిచేసినదో గమనించినారా? ఈ తత్త్వజ్ఞులపద్ధతులే మన మవలంబించి మనము మక్కికిమక్కి తయారుచేయ నక్కరలేదు. కాని మన విజ్ఞానముయొక్క బహువిధ శాఖలు ఏకమూలసంబంధము కలవని గ్రహించి భిన్నముగా నగపడుశాఖల నేకముఖమునకు తెచ్చుట అత్యవసరమని ఒప్పుకోకతీరదు.

ఇట్లనుటచే ఇంతవరకు జరుగుచున్న అర్థవివరణ వ్యాఖ్యానకరణాదులైన తత్త్వవిమర్శ పద్ధతులను ఒక్కసారి మానివేయుమని చెప్పుట మాయుద్దేశము కాదు. మన వేదాంతభావములను వెనుకటిచూపుతో చూచుట చాలించి దృగ్విధానము మార్చి క్రొత్తపుంత త్రొక్కి నూతనదృష్టితో పరికింపుడని మేము విన్నవించుచున్నాము. ఈమార్పు అవసరమని యెంచి యిందుమునుపు మనవా రెవ్వరును తీవ్రముగా యోచింపి పనిచేయలేదని సూచించేయుచున్నాము. ఇటులైన హిందూదేశములో తత్త్వవిధానము ఒక్కటే ఉండవలెనని చెప్పుటకూడ మా అభిప్రాయముకాదు. ఒకజాతి ఒక్క తత్త్వమునే అవలంబించుకొనియున్న పక్షమున ఆజాతిని బుద్ధిమాంద్య మావహించెనని యయిన చెప్పవలసి యుండును; లేదా ఆజాతియొక్క బుద్ధివికాసములకు కాపట్యము ఆవహించెనని యైన చెప్పవలసియుండును. లోకములో ఏదేని ఒక్కతత్త్వసిద్ధాంతము అందరి మనస్సులకును నచ్చి అందరిమనస్సుల నాకర్షించి లోబర్చుకొని అందరి యభిలాషలను తీర్పజాలియుండదు. ఏదేశచరిత్ర చూచినను, ఏజాతిచరిత్ర పరిశీలించినను యోచనాప్రవాహములు భిన్నములై బహుముఖముల వ్యాపించినట్లు స్పష్టమగును కాని ఒక్కగతినే పోయినట్లు కనబడదు.

తత్త్వజిజ్ఞాసలో ఒక్కొక్క భేదభావమును ఒక్కొక్క తత్త్వసరణి (System) గా పెంపొందింప జేయవచ్చును. కాని అట్టి ప్రతిసరణియు విజ్ఞానముయొక్క వివిధశాఖలకు సంబంధము కూర్చుచు సక్రమముగా వాటిని ఏకముఖమునకు తెచ్చుసంస్థయై యుండవలెను. అట్టిసంస్థలు నిర్మించుట యెప్పుడు సాధ్యమగును అని ప్రశ్న. వేదాంతభావములకు ఈ విశిష్టతతో ప్రత్యేక నిర్వచనము సాధ్యమైనపుడే అట్టిసంస్థలు నిర్మించుట సాధ్యమగును అని జవాబు. అట్టిది లేకపోవుటయే మన తత్త్వ విషయములలో గొప్పలోపము. ఇప్పటి మన ఐహికజీవనము ఒకదారిని పోవుచున్నది. దీనితో సంబంధము లేక వెనుకటివేదాంతము ఆముష్మికమైన శూన్యత్వమునకై గుట్టలను, మెట్టలను బట్టి పోవుచు మెట్టవేదాంతమని అపహాస్యముపాలగుచున్నది. ఆమెట్ట వేదాంతములు ఈనాటి మన సాంఘిక, రాజకీయ, నైతికపరిస్థితులకు పనికిరావు. కనుక ఆలోపము దీర్చుటకు మత తత్త్వవేత్తలు ప్రాతవేదాంతములకు క్రొత్త భావములకు మధ్య సామరస్యము గూర్చి, వేదాంతము సౌఖ్యావహమైన జీవయాత్రగడుపుటకు సాధనభూతమైతోడ్పడునట్లు నూతనదృష్టితో చూచి సంస్కరించి, తత్త్వజ్ఞానువులు వ్యక్తికిని సంఘమునకును దేశమునకును లోకమునకును సౌఖ్యోల్లాసముల గల్పించునట్లు నేటి జీవసమస్యల భేదించి కృతకృత్యులు కావలెనని విన్నవించుచున్నాము.

---

# 'శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు'*

[ప్రథమ సంపుటము]

బులుసు వేంకటరమణయ్య

'తెలుఁగుభాషను వాఙ్మయమును అభివృద్ధి నొందించుటయు, ఆ విషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు' ప్రయోజనములుగా నాంధ్రసాహిత్య పరిషత్తు చెన్నపురియందు క్రీ. శ. ౧౯౧౧-వ సంవత్సరమందుఁ బ్రతిష్ఠింపఁబడినది. ఏతత్పరిషత్ప్రయోజనముల నెఱవేర్చు మార్గములలో 'తెలుఁగు భాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకషమగు నిఘంటు వొకటి రచించి ప్రకటించుట' ప్రథమమార్గముగా నిరూపింపఁబడినది.

పరిషదుద్దిష్ట కార్యములలో ప్రధానమగు నిఘంటునిర్మితి వాఙ్మయోద్ధారకులు, మహోదారులు నగు శ్రీ పిఠాపురము మహారాజావారి పోషణమున 'శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు'వను పేరిలో — పరిషత్తేర్పడిన కొలది కాలములోనే ప్రారంభింపబడినది; ఇప్పటికి నిఘంటువులోని ఏకదేశమగు అజాది పదసంపుటము వెలువడినది. నిఘంటువు పూర్తియగుట కెన్నియేడులు పట్టునో! ఎన్ని సంపుటములు కావలయునో!

నిఘంటుముఖపత్రమున అది 'పండిత సాహాయ్యమున జయంతి రామయ్యపంతులు, బి. ఏ., బి. ఎల్. గారిచే రచింపఁబడి'న దని (సంపాదింపబడినదనిఆశయమేమో?†) కలదు. నిఘంటుగ్రథనమున శ్రీపంతులుగారే పండితుల సాహాయ్యమును స్వీకరించిరో యిందు వివరింపబడలేదు.

---

* ('అ' నుండి 'ఔ' వఱకు) పండిత సాహాయ్యమున జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. ఎల్. గారిచే రచింపఁబడి, కాకినాడ 'ఆంధ్రసాహిత్య పరిషత్తు'వారిచేఁ బ్రకటింపఁబడినది. రాయలు ౧/౪ సైజు, ౯౯౨ పుటలు వెల రు. ౫ లు.

† నిఘంటువు శ్రీపిఠాపురము మహారాజావారికి సమర్పింపబడు సందర్భమున శ్రీపంతులుగారు చదివిన నివేదికనుబట్టి పంతులుగారు నిఘంటువునకు సంపాదకులనిమాత్రమే తెలియుచున్నది.

వాఙ్మయపోషకులు, ఉదారులు నగు మహారాజావారు ధనమిచ్చుటచే నిఘంటువు తన్నామాంకిత మయినది; రచయితలగుటచే శ్రీరామయ్య పంతులుగారి పేరు నిఘంటువున కెక్కినది. ఎవరి ప్రతిభా, పాండిత్యములు, విశేషపరిశ్రమ ఈ నిఘంటుస్వరూపమును దాల్చినవో ఆ పండితుల నామములు విస్మృతము లయినవి; విడువబడినవి. కార్యాలయమువారు వారి కొసగు నెలజీతములు శ్రమకు ప్రతిఫలము; పాండిత్యమున కెంత మాత్రము కాదు. ఇది నిఘంటువునకు తీరని కొరత; పండితతిరస్కారము; అన్యాయము.*

శ్రీ రామయ్యపంతులుగారు 'పీఠిక'లో గ్రంథ నిర్మాణపద్ధతిని వివరించుచు క్రింది యంశములను తెలిపిరి:

౧. "తెలుఁగులోఁ బృథక్ప్రయోగార్హములు గాకున్నను సమాసములలో నుపయోగింపఁబడును గనుక ఉపసర్గ, శత్రంతాదిశబ్దములు గూడ నిందు గ్రహింపఁబడినవి. ఈ నిఘంటువునందున్న సంస్కృతపదజాలము శబ్దరత్నాకరమునం దున్నదాని కంటెఁ బెక్కుమడుంగు లధికము. ఈ విషయములో నీ నిఘంటువు సంస్కృత విద్యార్థులకుఁ గూడ మిక్కిలి యుపకరించునని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును."

౨. "దేశ్య, వైకృతవిభాగము శబ్దరత్నాకరమందుఁ జేయఁబడినది. కాని పెక్కుతావులం దీ నిర్ణయము తప్పిపోయినదని పండితుల యభిప్రాయము.......... వర్తమానకాలమం దీ విభాగము చేయుట సాహసముగా నుండునను భీతిచేత మానివేయుట యైనది. కాని...... — పెక్కుశబ్దములకు.........సజాతీయ పదములను సాధ్యమయినంతవఱకుఁ జూపియున్నాము. ఈ సామగ్రినిబట్టి మూలశబ్దము లేవియో, జన్యశబ్దము లేవియో పండితులు నిర్ణయింతురుగాక!"

ఇది ఆంధ్రనిఘంటువు; దీని నుపయోగించుకొనువారు ఆంధ్ర విద్యార్థులు, ఆంధ్ర వాఙ్మయజిజ్ఞాసువులును. కాన ఇం దాంధ్ర

---

* నిఘంటుసమర్పణసభాసమయమున శ్రీ రామయ్యపంతులుగారు చదివిన నివేదికనుబట్టి ఆ పండితులెవ్వరో స్పష్టమగుచున్నది. నిఘంటువునకు తొలిసంపాదకులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు. సంస్కృతశబ్దోద్ధారకులు శ్రీ తిం. శేషప్పెరుమాళ్లయ్యగారు. సంపాదకులకు సహాయులు శ్రీ ఓ. సి. దొరస్వామయ్యగారు. కార్యస్థానము పిఠాపురమునకు మార్చబడినపిదప నిఘంటుసంపాదకులు శ్రీరామయ్యపంతులుగారు. వారికి సహాయులు శ్రీ శేషప్పెరుమాళ్లయ్యగారు, శ్రీపురాణపండ మల్లయ్యశాస్త్రిలుగారు, శ్రీ వేరి పేరయ్యశాస్త్రిలుగారు, శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిలుగారు, శ్రీ శ్రీపాద పాపయ్యశాస్త్రిలుగారు, శ్రీ కూచి నరసింహముగారు, శ్రీ చర్ల నారాయణశాస్త్రిలుగారు, శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిలుగారు, శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిలుగారు, శ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రిలుగారును. నిఘంటువు ప్రథమసంపుటము ప్రకటింపబడునాటికి పనిచేయుచున్నవారు చివరి ముగురుమాత్రమే. మొదటి యిద్దరు కీర్తిశేషులు; తరువాతివారు పనిచేయుట మానుకొనిరి.

పదములే ఎక్కువ ఉండవలెను. సంస్కృత విద్యార్థులు సౌకర్యముకొరకు శబ్దరత్నాకర మందున్నవానికంటె పెక్కుమడుంగుల సంస్కృతపదముల నిందు చేర్చుట అనావశ్యకము. వారి కావశ్యకములగు సంస్కృత నిఘంటువులు - సమగ్రములు లెక్కలేనన్ని ఉండనే యున్నవి. మరియు నీ సంస్కృతపదములలో చాల ప్రత్యేకప్రయోగార్హత లేని ఉపసర్గ, శత్రంతాదిశబ్దములు! ఇట్టి పదముల వలన ఆంధ్రవిద్యార్థులకు ప్రయోజనములేదు. సంస్కృతభాషాప్రవేశము, సంస్కృత వ్యాకరణజ్ఞత కలవారికే వీని తత్త్వము, ప్రయోగవిధానమును తెలియనగును. సంస్కృతాభిజ్ఞులకు దీనికంటె సంస్కృతనిఘంటువులే బహూపకారకములు. 'ముహుర్ముహుస్లుఠదభంగ...' అనుచోట 'ముహుర్ముహుః, లుఠత్, అభంగ' అను పదవిభాగ మొనరింపగలవారు కేవలాంధ్రభాషాజ్ఞానము కలవారిలో చాల తక్కువ. 'అధస్'—కు ఇందున్న 'అధఃపతితము, అధోగామి, అధోముఖము, అధోంకుశము, అధఃఖననము, అధస్థితుఁడు' అను చోట్ల తప్ప 'తక్కినచోట్ల 'అధస్' అని యెట్లు వారికి తెలియును? శత్రంతము లచ్చుపర మగునపుడు* 'దాంతము'లైనను, హల్లులు పరమగునపుడు లెక్కలేనన్ని మార్పులు పొందునే! (ఉ. లుఠత్కమల, లుఠచ్ఛీతల, లుఠజ్జాల, లుఠట్టీకా, లుఠన్మాల, మొ.) వాని నాంధ్రవిద్యార్థులెట్లు గుర్తెరుగగలరు? కాన వీనివలన వారికేమి ప్రయోజనము? పోనిండు. ఇందా వ్యవస్థయయినను సరిగాలేదు.

కొన్నిటివివరణమున 'దీనికి వ్యస్తప్రయోగములు కానబడవు' అని వ్రాసి మరికొన్నిచోటులను విడిచినచో అవి ప్రత్యేకప్రయోగార్హములు కావని ఎట్లు అనుకొనవలెను?† కావున 'ఈ నిఘంటువునందున్న సంస్కృతపదజాలము శబ్దరత్నాకరమునందున్నదానికంటెఁ బెక్కుమడుంగు లధిక' మయినను ప్రయోజనములేదు. ఆంధ్ర నిఘంటువున ఆంధ్రపదము లెక్కువ ఉండిననే తగిన ప్రయోజన ముండును.

ఇక రెండవ యంశము—ఇప్పటివరకును తెలుగున గల సమగ్రనిఘంటువు శబ్దరత్నాకర మొక్కటియే. దానిని పెక్కేండ్లక్రిందట ఏకాకియగు పండితుడు కూర్చినాడు. అప్పుడిప్పటివలె ముద్రితగ్రంథము లెక్కువగ లేవు. తప్పులతడికలగు తాటియాకుపుస్తకములను తదేకదీక్షతో పరిశీలించి వీలగునంత త్వరలో దానిని వెలువరచినాడు. అతనికి ధనసాహాయ్యము లేదు. ఒక పాఠశాలలో

---

* ఇందు శత్రంతములకు ప్రయోగము లీయబడలేదు.

† అవ్యయములు కొన్ని వివరింపబడునప్పుడు ఇందు 'దీనికి ప్రత్యేకప్రయోగము కానఁబడదు' అని వ్రాయబడినను శత్రంతములకు అట్టి వివృతి కానరాదు.

పండితోద్యోగమును సాగించుచు తీరిక కలిగి నపుడెల్ల అతడు నిఘంటువ్యాకరణాదినిర్మాణ ము నొనర్చెడివాడు. కావున అందలి వైకృత, దేశ్యవిభాగము సరికాకపోవచ్చును; అది యే కాదు - దానిలో ఇంకను ఎన్నియేని లోపము లుండవచ్చును. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు వట్టిదికాదు. శ్రీ పీఠికాపుర ప్రభువులు దీనికయి లెక్కలేని ధనమును వెచ్చించుచున్నారు. దీనికి సమర్థులగు కార్య నిర్వాహకు లున్నారు. దిగ్దంతులవంటి పండితులు ఇరువదియేండ్లనుండియు ప్రత్యేకముగ నీ నిఘంటుగ్రథనకార్యమునందే నిమగ్ను లయియున్నారు. నిఘంటుగ్రథనమార్గమును చూపు ముద్రితనిఘంటువుల సాయము ఉన్నది. (తత్సమపదములకు సంస్కృత, ప్రాకృతనిఘంటువు లున్నవి. తత్సమేతరపదములకు లక్ష్మీనారాయణీయ మున్నది. రెండువిధముల పదములకును (దీనికి మూలాధారముగా) శబ్దరత్నాకర మున్నది.) పరిశోధించుటకు, ప్రమాణీకరించుటకును ముద్రితాంధ్రగ్రంథములు అసంఖ్యాకము లున్నవి. ఇట్టి సౌకర్యము లుండుటచే నిందు తప్పక శబ్దరత్నాకరమునందలి లోపములు సవరింపబడవలసియున్నవి. కాని అందలి నిర్ణయము తప్పిపోయినదని అనుకొని, 'వర్తమానకాలమం దీ విభాగముచేయుట సాహసమని భీతి' జెంది, తుదకు తన్నిర్ణయభారమును పండితులపై వైచి, బాధ్యతను పోబెట్టుకొనుట నిఘంటునిర్మాతలు చేయదగ్గకార్యము కాదు. అట్లయిన నీ నిఘంటువులో గల విశేషమేమి? విశేషములేని దీనివలన నయ్యెడి ప్రయోజనమేమి?

ఇంత వ్యయముతో నిందరు పండితులో రంతప్రొద్దు నింతకాలము పనిచేసి ఇట్టి నిఘంటువును సమకూర్చుట కొండను త్రవ్వి యెలుకను పట్టుటవంటిదనిన సాహస మేమాత్రమును కాదు.

ఈ నిఘంటువున తత్సమపదము లసంఖ్యాకములు; తదితరము లత్యల్పసంఖ్యాకములు. ఈ యాంధ్రనిఘంటువు యథార్థమగు నాంధ్రనిఘంటువు కావలెనన్న ఇందు తత్సమేతరములే - దేశ్యములే - ఎక్కువగ ఉండవలెను. తత్సమపదము లాంధ్రపదములు కావా అని వాదించువారి కొక జోహారు!

ఆ పదములుకూడ అన్నియు జనసామాన్యమున కుపయోగించునవి కావు. అందు కొన్ని సంజ్ఞావిశేష్యములు; కొన్ని పారిభాషికపదములు; కొన్ని అప్రస్తుత విషయములు. అవియు నిం దసమగ్రముగనే ఈయబడినవి. ఇట్టివి విజ్ఞాన సర్వస్వమున చేర్పదగినవి.

వానికి కొలది ఉదాహరణములు—

౧. సంజ్ఞావిశేష్యములు—

అంబరీషుడు, ఆముక్తమాల్యద, ఉగ్రశ్రవసుడు, ఉగ్రసేన, ఉజ్జయిని, ఋతుపర్ణుడు, ఋష్యశృంగుడు మొదలగునవి.

౨. పారిభాషికపదములు—

అధికము; అన్యథాసిద్ధి; అన్వాచయము; అన్వాదేశము; అన్వితాభిధానవాదము; అభిహితాన్వయవాదము; అనుష్టుభము మొదలగునవి.

పయి సంజ్ఞావిశేష్యములు, పారిభాషిక పదములు అసంఖ్యాకము లగుటచే నిఘంటువున అన్నింటిని చేర్చుట అసాధ్యము. నిఘంటువున గల పయి పదములు వానికి గల ప్రసిద్ధార్థమును గాక వేఱేమయిన విశేషార్థమును తెలియజేసినచో అవి యిచట అత్యంతావశ్యకములే; కాని ఇవి యేవియు విశేషార్థబోధకములు కావు.

3. అప్రస్తుతపు విషయములు—

'అష్టాదశ' అను పదముక్రింద అష్టాదశ పురాణములు, ఉపపురాణములు, ధాన్యములు, విద్యలు, వర్ణనలు, జాతులు, స్మృతులు వివరింపబడినవి. ఇట్టివిశేషము లున్నను 'ఏకాదశ' మొదలగుచోట్ల వివృతి లేదు.

ఈ నిఘంటువులో గల పదములు చాలవరకు రూఢములుకాని సమస్తపదములు; యోగార్థమాత్రప్రధానకములు. అట్టివి నిఘంటువుపుటలు పెరుగుటకుమాత్ర ముపయోగించును.

ఉ. అనాత్మజ్ఞుఁడు; అనాత్మవేది; ఆసన్నమృత్యువు; అరణ్యకుక్కుటము; అబ్జబాంధవుఁడు; ఆరుమోములవేల్పు; ఉప్పుఁగడలి; ఇహాముత్రఫలము; ఏనుఁగులగొంగ; ఏనుఁగులరాకాసి గొంగ; ఏనుఁగులనూఁడు; ఎనచచ్చు; ఎనసేయు; ఎనవాయు; ఎనవోలు; ఎనిమిదికాళ్లరిక్క నెల మొదలగునవి.

పయివానియం దొక్కటియయినను విశేషార్థప్రతిపాదకము కాదు. ఇట్టి ప్రత్యేకపదములనే యంగీకరించినచో నిఘంటువు ఎన్ని సంపుటములయినను పెరుగును; ఎంత కాలమైనను పట్టును.

కొన్ని సంఖ్యావాచకములు కూడ నిందు పయిరీతినే కలవు. ఉదా-ఏకషష్టి; ఏకసప్తతి; ఏకశతము; ఏకశతతమము మొ.

ఇందు 'ఏగాని'—అను పదమునకు 'కానిలో సగము విలువగల రాగినాణెము' అని వివరణము కలదు. రెండు దమ్మిడీలు ఏగాని; (⅓ కాని. ⅓ కాదు.) ఇది ప్రత్యేకముగ నాణెమును కాదు.

ఇట్లు ఈ నిఘంటువునందలి పదముల అర్థవివరణము చాలవరకు పుటలను పెంచుటకే ఉపయోగించుచున్నది. ఏదేని పదమునకు అర్థము లోకప్రసిద్ధమై యున్నపుడు దానిని సాధించుటకు వేరుగ ప్రమాణములను జూపనక్కఱలేదు. కాని యిందు అట్టి సందర్భములందును ప్రమాపకప్రయోగము లీయబడినవి; కావలసిన భాగముకాక పద్యమంతయు కొన్నిచోట్ల ఉద్ధృతమయినది; కొన్నిటికి రెండు, మూడు ప్రయోగము లీయబడినవి; కొన్ని సందిగ్ధములుగ నున్నవి; ఇచ్చిన ప్రయోగములే సమగ్రముగ మరికొన్ని చోట్ల ఈయబడినవి. కొన్ని సరియగుప్రమా

ణములు కాకున్నవి; కొన్నిపదములక్రింద సంస్కృత శ్లోకములు, వాని కాంధ్రవివృతియు నీయబడినవి. మచ్చునకు కొన్ని—

౧. ప్రసిద్ధములకు—

ఆలు—౨ స. ఔ. (త. ఆలు. క. ఆలు.) ఐదు నొకటి.

క. తురగముల నాలుగిటను, త్తరునాఱిట...

[భార. విరా. ౫-౧౦౩.]

ఆయత్తపడు—౨ అ. క్రి. (ఆయత్తము + పడు) సిద్ధపడు.

'ద్వి... ... ...మీారులంబెల్ల, బాయక రోషాగ్ని భస్మీకరింతు, నాయత్తపడియుండు మనిన నీ విపుడు, పోయెదవో నిను బోనీను గాని, పుడమి శత్రుఘ్నుండు పుట్టినవాఁడు, కడిఁదివీరుఁడవై!గాక నేఁడగుదె!"

[రం. రా. ఉ. ౧౮౫. పౌ. ౨౩. పం.]

'ద్వి. కాయంబు కడఁజేసి కన్నులుమూసి యాయత్తపడియుండె నా రాజసుతుఁడు.

[ద్వి. శ. సా. ౮౨. పౌ. ౬ పం.]

పయి రెండర్థములును ప్రసిద్ధములు. వానిని ప్రమాణీకరించు ప్రయోగము లిట అనావశ్యకములు.

'ఆయత్తపడు' అనుదాని కిచ్చినను రెండింటిలో నొక్కటి చాలును.

౨. సంపూర్ణపదోద్ధరణమునకు—

అర్థి. సం. వి. ౩. ఆసక్తి—

గీ. అనఘ! ధర్మార్థకామంబులందు నొకట,
నర్థిఁ దగిలిన మానవుం డధముఁ డొకటి,
మాని వర్తించునాతఁడు మధ్యముండు,
నడపు నన్నింటి నుత్తమనాయకుండు.

[భార. శాం. ౩. ౪౬౧.]

ఆనందించు - ౨. అభినందించు, కొనియాడు, స్తుతించు.*

'మ. హరిమై సాదిశిరంబు సాదిమెయి జా
త్యశ్వోత్తమాంగంబు గూ
డ రణోర్విన్ రఘునాథశౌరి యసిఁ జెం
డన్ దివ్యమందారవృ
ష్టి రహిం బ్రాణయుతంబులై గగనవా
టిం బర్వ గంధర్వ కి
న్నరరూపంబులు దాల్చి సారె కవి యా
నందించుఁ దచ్ఛౌర్యమున్.'

[వసు ౧. ౭౦.]

ఇందు మొదటి యుదాహరణము 'నొకట నర్థిఁ దగిలినమానవుం డధముఁడు' అని, రెండవ ఉదాహరణము 'సారె కవి యానందించుఁ దచ్ఛౌర్యమున్' అనియు నుండిన జాలును. అర్థము సందిగ్ధమగుచో పద్యము సమగ్రముగ నుదాహరింపబడినను

---

* 'కామా' (,) చే విభజింపఁబడిన పదములు సమానార్థకము లనియు, 'సెమికోలను' (;) చే విభజింపఁబడినపదముల కీమదర్థభేదము కలదనియు నూహించునది' అని అర్థనిర్ణయవిషయమున పీఠికలో చెప్పబడినది. కాని పయి మూడర్థములు సమానములు కావు. 'అభినందించు'టకు 'సంతోషించు, సంతోషపెట్టు' అను నర్థములే ఈ నిఘంటువున ఈయబడినవి.

ప్రయోజనము లేదు; సుస్పష్ట మగునెడ ఏక దేశమే పర్యాప్తము.

3. ఎక్కువగ ప్రయోగము లిచ్చుటకు—

'ఈదు.[1] స. క్రి. (కాలు సేతులసాహాయ్యముచే నద్యాదులను) తరించు, దాటు.'

దీనికి 'ఏచి ముస్సిరు సేయీత నీద' ........ననీ ముంసి ముస్వకాలంబున సుతశోకసాగరం బెబ్బంగి నీదఁగలదానవు, ........గడవ, నీఁదవశమె నాపుత్రులకు' ఎవ్విధంబున నీ వల పీఁదనేర్తు' అని నాల్గు ప్రయోగము లీయఁబడినవి.

అర్థాంతరస్ఫూర్తిని తొలఁగించి ప్రస్తుతార్థస్ఫూర్తిని కలుగజేయుటకు ఎక్కువ ప్రయోగము లీయబడినట్లు పీఠికయందు చెప్పబడినది. పయి నాల్గు ప్రయోగములలో మొదటి రెండిటిలో నేదో యొకటియుండిన జాలును. ఆ రెండును స్పష్టముగ నున్నవి. చివరిరెండును అస్పష్టముగ నన్నవి. అవి అనావశ్యకములు కూడ.

౪. సందిగ్ధమునకు—

ఈఁదు.3. చల్లఁదనము, తసి.*

'శా. తారాప్రోష్ఠులఁ గాలసూతుఁడు వియ
ద్వారాశి వేఁటాడి ప్రా
హ్ణారంభంబను బుట్టఁ బెట్టి నులివా
యం గుంజి యీఁదాఱఁ జె
న్నారఁ వైచిన......[కాశ. ౪. ౯౬.]

('ఈఁద + ఆరన్' అనియు విడఁదీయవచ్చును)' అని నిఘంటువునందే యున్నది. ఈ పదమే- ఈయర్థమున సందిగ్ధముగ నున్నది.

౫. ఇచ్చినదే మరల యిచ్చుటకు—

ఆమని-క్రి. విశే. అధికముగా, తృప్తికరముగా-

ఇచట నీయబడిన ప్రయోగమే మరల 'ఆముకొను'లో ఈయబడినది. రెండవసారి గ్రంథనామము, పద్యసంఖ్య ఇచ్చినచాలును.

౬. తగిన ప్రమాణములు కానివానికి—

అర=అఱ (౧, ౨. అర్థము బుసగము; కొంచెము.)

రెండవ యర్థమునకు క్రింది ప్రమాణము లీయబడినవి—

'క. అరమోడ్చిన కన్నులు సు
స్థిరమగు నాసనము'
[హరి. ఉ. ౫-౨౧౩.]

'క. 'అరమేసి.' కు. సం. ౪-౪౯౬.

పయిచోట్ల 'సగము మోడ్చిన, సగము మేసి' అను అర్థమును గ్రహించుటయే ఉచితము. (చూ. 'దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా' అభిజ్ఞాన శాకుంతలమ్. ౧]

౭. సంస్కృతమూలముతోడి ఆంధ్రవివృతికి.

అష్టద్రవ్యములు, అష్టాంగములు, ఆసవము, ఉత్తరపాదము మొ. పయిచోట్ల సం

---

* ఈ రెండును సమానార్థకములు కావు.

స్కృతశ్లోకములు, వానికి తెలుగువివృతియు ఉన్నవి. తెలుఁగువివృతి యుండిన చాలును.

ఈ తొలిసంపుటపు వెల రు ౫ లు. గ్రంథ ప్రమాణమునుబట్టి ఇది ఎక్కువ వెల కాదు. కాని నిఘంటువు పూర్తియగుట కెన్ని సంపుటములు కావలెనో! ఎంత వెల యుండునో! నిఘంటువు జనసామాన్యమున కందుబాటులో నుండవలెనన్న కొలది సంపుటములలో నది పూర్తికావలెను. అప్పుడు దాని వెలయు తగ్గవలెను.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు వెలువడి తెలుగులో ఉత్తమనిఘంటువు లేని కొరత తీర్చి వాఙ్మయమున కెనలేని సేవ చేయునని ఆంధ్రలోకము గంపెడాశతో నుండినది. ఈ తొలిసంపుటమే ఆ యాశ నిరాశయగునట్లు చేయుచున్నది. నిఘంటు కార్యాలయమువారు తగురీతిని పరిశోధింప జేసి అనావశ్యకపదములను విసర్జించి మారుమూలలబడి మాటుమణిగియున్న తెలుగు పదముల నెక్కువగ సేకరించి, ముందు సంపుటములనైనను సంస్కరించి నిఘంటువును సమగ్రముగ ప్రకటించినచో దేశ, భాషా, వాఙ్మయములకు సాటిలేని సేవచేసినవారగుదురు.

---

# మొక్కుబడి

"కరుణకుమార"

ఆ చుట్టుపక్కల ఇరవై, ముప్ఫయిమైళ్ల దూరం లోగల అన్ని గ్రామాలకూ అంకమ్మతిరునాళ్లు ఒక్కటే గొప్పతిరునాళ్లు. ప్రతిసంవత్సరమూ జ్యేష్ఠశుద్ధ పంచమి లగాయతు మూడురోజులు అంకమ్మజాతర బహువేడుకగా జరుగుతుంది. ఆ తల్లి ప్రత్యక్షదేవత అని ప్రతీతి. ఆ అమ్మవారి తిరునాళ్ల వైభవం కళ్లతో చూడవలసిందే కాని వర్ణించడానికి శక్యంకానిపని. అమ్మవారి దేవళం గ్రామానికి తూర్పుగా ఒక ముప్పాతిక మైలు దూరంలో ఉన్నది. అది ఒక చిన్న దేవళం. అమ్మవారి కా దేవళం అత్తవారిల్లు. ప్రతీయేటా జాతర మూడురోజు లుందనంగా అమ్మణ్ణిని అత్తవారింటినుండి గ్రామంలోనికి (పుట్టింటికి) తీసుకొనివచ్చి గ్రామంలో నాలుగువీథులూ కలిసేచోట ఒక చిన్న తాటాకులగుడిసె వేసి దానిలో ప్రవేశపెట్టే మామూలు. అమ్మణ్ణికి లాంఛనాలూ, మర్యాదలూ జరపడానికై ఆ గ్రామకరణంగారిల్లు అమ్మకు పుట్టిల్లూ, మునసబుగారిల్లు అత్తవారిల్లూగా అనాది నుండి ఏర్పాటు అయిఉన్నవి. అందువల్ల గ్రామంలో వేయబడిన గుడిసెలో వేంచేపు చేసేముందు అమ్మవారిని ముందుగా కరణంగారింటికి తీసుకొనివచ్చి కొత్తచీరలు కట్టబెట్టి పసుపూ కుంకుమా పెట్టి, ఒడిబియ్యం మూట గట్టి, వడపప్పూ పానకం చలిబిండిముద్దలూ పంజారం చేసి, పాద్యముందు రెండుబిందెలనీళ్లు వారుపోసి అమ్మను పుట్టింటిగుడిసెలో ప్రవేశపెట్టే ఆచారం. జాతరనాడు అమ్మవారు పయనమైపొయ్యేముందు గ్రామమునసబుగారింటికిపోయి, వారివల్లకూడా తగు సత్కారాలు పొంది, జాతరకు బయలుదేరి ఊరుకు తూర్పుగా ఉన్న దేవళంలో చేరుతుంది. అది లగాయతు మూడురోజులు జాతరవైభవం అంతా దేవళందగ్గరనే జరుగుతుంది. మూడురోజులూ జాతర అయినతరువాత అమ్మవారి గరగలను దేవళంలోనుండి లేవదీసి వంతు చాకలి వాడిఇంట్లో అటకమీద భద్రపరుస్తూ ఉంటాడు. ప్రతిగరగకూ లావూ, పొడుగూ, ఎత్తూ వగైరా కొలతలు తీసుకొని, కాగితంమీద వ్రాసి, గరగలెన్నో లెఖ్ఖపెట్టుకొని కరణంగారు వంతుచాకలివాడిదగ్గర రసీదుతీసి దగ్గర పెట్టుకొంటాడు.

ఆ సంవత్సరం పంచమినాడు జాతర అనంగా, పాడ్యమినాడే వంతుచాకళ్లు గరగలను అటకమీది నుండి దించి, అరవీసెడు చింతపండు పట్టించి, ఊరు బయట దొరువుకాడ ఇసకాబూడిదాపట్టించి ఒక్కపూట అంతా చేతులు మంటపుట్టేటట్టు — నల్లగా చెక్కపేడులాగ ఉండిన ఇత్తడి గరగలు తెల్లగా బంగారు ఛాయ వచ్చేటట్టుగా — రుద్ది శుభ్రంచేశారు. సంవత్సరం నుండి పాడుపడి, గాడిదలూ, పందులూ, కుక్కలూ పొర్లాడే దేవళాన్ని అర్చకులుగా ఉండే పూజగొల్లలు చిమ్మి బాగుచేసి లోపట్టూ వెలిపట్టూ కూడా సున్నం కొట్టి, వాకిటిముందు దొక తాటాకుపందిరి వేసి, వేపమండల తోరణాలు కట్టి అలంకరించారు. మామూలు ప్రకారం అమ్మవారిని విదియనాడు ఉదయాన్నే దేవళం దగ్గరనుండి లేవదీసి పోతురాజుతోసహా గ్రామంలోనికి తీసుకొనివచ్చి మామూలు మర్యాదలు జరిగిన తర్వాత వీథిలో వేసిన గుడిసెలో ప్రవేశపెట్టారు.

పంచమినాడు జాతర ఆరంభం. ఆవుదయాన్నే అర్చకులు గుడిసెవాకిట చిమ్మి, అలికి, ముగ్గులు పెట్టి,

పోతురాజు కొయ్యకు కొత్త పసుపూ, కుంకుమా పూసి వేపమండలు కట్టి అలంకరించి బయట గుడిసెకు ఆనించి యుంచారు. గుడిసెవాకిలి తెరచి ఉన్నది. అమ్మవారి గరగలు పసుపుకుంకుమాలంకారాలతో విరాజిల్లుతున్నవి. మట్టికుండలోని అగ్నిహోత్రంలో వేల్చిన సాంబ్రాణిపొగ చుట్టుప్రక్కల వందగజాల వరకు వ్యాపించి ఆ వాతావరణాన్నంతా పవిత్రం చేస్తున్నది. రెండు సన్నాయి మేళాలూ, రెండుడోళ్లూ, రెండు వీరణాలూ, రెండు తాషాలూ, ఒక రండోలూ, ఆరు డప్పులూ గల మేళం గుడిసెముందు మోగుతూ మిన్నుముట్టే ధ్వనిచేస్తున్నది. అప్పుడప్పుడు కొందరు పూజగొల్లలు వలయాకారం గల బూరగొమ్ములు ఊదుతూ అంత ధ్వనిగల మేళవాయిద్యంలోనూ ఒక వింత ధ్వని కల్పిస్తున్నారు. అప్పటికప్పుడే అమ్మవారి గుడిసెకాడ జనం గుంపులుకూడి ఉన్నారు. మేళం ఆరంభం కాగానే చాకలివాడొకడు ఒక కోడిని తెచ్చి అమ్మవారి వాకిట తెగ్గోసి గరగలచుట్టూ తిప్పి పారవేశాడు బయట నిలబడియున్న మరొకచాకలి వాడు దాన్ని తీసుకొని భద్రపరుచుకొన్నాడు

అమ్మవారి సమక్షంలో — అనగా ఆమె దృష్టికి ఎదురుగ్గా—ఒక ఏభయిగజాలదూరంలో వీథికి నట్ట నడుమను ఒక చిన్నగొయ్యి తీసి, ఆగోతిలో ఒకచిన్న పందిపిల్లను (బ్రతికినదాన్ని) కాళ్లూ పొట్టా భూమిలోకి దింపి పీకెవరకూ మట్టితో పూడ్చి, మూతీ, కళ్లూ, తలా మాత్రం పైన ఉండేటట్టు మట్టికూరి గట్టిచేశారు. దూరాన్నుండి చూస్తే ఆ పందిపిల్ల తలకాయ సుమారు అయిదారంగుళాల ఎత్తున ఒక కొయ్యను భూమిలో నాటినట్టుగా కనపడుతుంది. ఆ పందిపిల్ల పీకెవరకు భూమిలో ఉండి, ఎటూకదలడానికి వీల్లేకుండా, ఊపిరి తిరగని స్థితిలో ఉండినప్పటికీ ఇంకా బ్రదికి బయట పడి జీవించాలన్న అడియాసతో కాబోలు, ఎప్పుడూ కీచుకీచుమని అరుస్తున్నది. అంతట గ్రామంలోని రైతు లందరూ వారివారి పశువులనూ, ఎద్దులనూ, ఆవులనూ, ఆవుదూడలనూ, బర్రెలనూ, బర్రెదూడలనూ ఒక్కొక్కరే మందలుమందలుగా పడమటినుండి తోలుకొని వచ్చి, పందిపిల్ల తలను పశువులచేత తొక్కించి తూర్పుగా తోలుకొనిపోతున్నారు. పశువుల డెక్కలు తన మూతిమీద పడినపుడల్లా, ఆ పందిపిల్ల కీచుకీచుమని రోదనచేస్తూనే ఉన్నది. దీని ఏడుపు విని కొన్ని కొన్ని పశువులు బెదురుకొని, చెవులు నిక్క బెట్టి, గ్రుడ్లు పెద్దవిచేసి బిత్తరుచూపులు చూస్తూ, తోకలెత్తి భూమి నొకమారు మూచూచి, ఆటూ లున నాలుగుకాళ్లూ ఎత్తి ఎగిరి ఒక్కగంతువేసి ముందుకు పారిపోతున్నవి. ఇంతాకష్టపడి తోలుకొని వచ్చిన పసరాలు పందిపిల్లను తొక్కకుండా పోతే ప్రయోజనం లేదని, అట్టిపశువుల ఖామందులు వాటిని మెడపలుపులు పట్టుకొని, బెదరకుండా చోయ్, చోయ్ అని మెడమీదా, వంటిమీదా చేత్తో నిమురుతూ మెమ్మదిగా పందిపిల్లదగ్గరకు తెచ్చి, నాలుగు కాళ్లల్లో ఒక్కకాలితోనయినా పందిపిల్లను తొక్కించి మరీ తీసుకొనిపోతున్నారు. కొన్ని పశువులు పరధ్యానంగా పోతూ పోతూ, కాలికింద పందిపిల్ల పడి కీచుకీచుమనేవరకు హఠాత్తుగా బెదరి ఎటుపోవడానికీ తోచక అక్కడనే కటికుక్కవ నిలబడి నాలుగు కాళ్లతోనూ గబగబ గుర్రము కదంతొక్కినట్లు పందిపిల్లను తొక్కుతూ వికటనృత్యం చేస్తున్నవి. ఇంతలో వెనకనుండి కొన్నిపశువులు తోసుకొనివచ్చి ముందు పశువులను కొమ్ములతో కుమ్ముతూ తరువాత వాటివంతు తీర్చుకొంటున్నవి. ఈ ప్రకారం జాముపొద్దెక్కేవరకు గ్రామంలోని పశువులు, పిన్నా పెద్దా సుమారు నాలుగైదు వందలు, డెక్కలతో పందిపిల్లపై విహారం సలిపే వరకు, పాపం, ఆపందిపిల్లకు పొడుగాటి మూతిచివర మెత్తనిస్థలం కొట్టుకొనిపోయి, చర్మంలేచి, చితికి ముద్దయి, ఎర్రగా పుండుపడి నెత్తురు ప్రవహిస్తున్నది. ఇంకా పందిపిల్ల అరుస్తూనే ఉన్నది — దాని దెంత మొండిప్రాణమో! ఇంతలో ఒకకాపువాళ్ల పిల్లవాడు-పన్నెండేళ్లవాడు - తనఇంట పుట్టిన పడమటి ఆవు కోడెదూడను తాను స్వయంగా తోలుకొనివచ్చి, తన కోడె బెదరి సరిగా తొక్కుతుందో తొక్కదో అని, తానుకూడా ఉండి, పందిపిల్లదగ్గర కూర్చొని, దూడ

ముందుకాలు చేత్తోపట్టుకొని, రక్తప్రవాహంతో ఎర్ర బాలు పొందిన పందిపిల్లమూతిమాంసంకండమీద డెక్కతో పదిసార్లు తన తనివితీర తొక్కించి, చూచే వాళ్లు నవ్వుతూ కేరింతాలు కొట్టుతుండగా కోడెను ఇంటికి తోలుకొనిపోయినాడు. అప్పటికప్పడే పది, పదకొండు గంటలైనది. గ్రామంలో ఇక రావలసిన పశువులు లేవంటే లేవని అనుకొన్నారు. రాత్రిళ్లు పొలంలో కట్టివేసే పశువులుకూడా వచ్చిపోయినవని కొందరన్నారు. చాకలివాడొకడు వచ్చి, పూడ్చి ఉంచిన పందిపిల్లనుబయటికితీశాడు. దాని కింకాప్రాణం పోలేదు. గోతిలోఉండంగనే ప్రాణంపోతేనే తిప్ప లేనియెడల గ్రామపసరానికి చీడ తగులుతుందంటారు మరి! అందువల్ల అట్టిపందిపిల్ల బ్రతికి మళ్లాగ్రామంలో తిరిగితే గ్రామానికంతకూ కీడు రాగలదన్న భయంతో, ఆ చాకలివాడు మూడుగజాలపొడుగూ, బొటనవ్రేలి లావూ గల ఒక ఇనపకడ్డీ తెచ్చి, సన్నంగా గూచివలె పదును చేసిన దానిమొనను పందిపిల్లపొట్టలోగుండా అడుగునుండి వీపునడిభాగంలోకి వచ్చేటట్లు, కసుక్కున దాని లేతకడుపులో గుచ్చి, కడ్డీమొన వీపుపై ఒకజెత్తెడు ఎత్తుకు వచ్చినతరువాత, పందిపిల్ల ప్రజలకందరికీ కనపడేటాగున, ధ్వజంఎత్తినట్లు, కడ్డీ పైకిఎత్తి పట్టుకొన్నాడు. అప్పటికి పందిపిల్లకు బాధ నివారణమై ఏడుపు చాలించింది. దానికడుపులోని లేతనెత్తురు ఇనపకడ్డీమీదుగా చాకలివాడి చేతిమీదికి ప్రవహిస్తూ, నల్లని ఇనపకడ్డీని ఎర్రగా మార్చివేసింది. అటుపిమ్మట అమ్మవారిని గుడిసెనుండి వెడలదీసి ఉత్సవంతోసహా గ్రామమునసబుగారింటికి తీసుకొనివెళ్లి అక్కడ మర్యాదలు జరిగిన తరువాత మేళతాళములతో మధ్యాహ్నం ఒంటిగంటకు ఊరిబయట దేవళంలో ప్రవేశపెట్టించారు.

౨

ఆరోజే జాతర ఆరంభం. మూడురోజులు మహా వైభవంతో జరుగుతుంది. ఓ! జనం ఊరూరనుండీ విరగబడిపోతున్నారు. దేవళం, ఊరికి ఒక మూప్పాతిక మైలు దూరంలో ఒక విశాలమైనప్రదేశంలో ఉన్నది. ఆరోజులగాయతు జరగవలసిన వైభవంఅంతా దేవళం దగ్గరనే జరుగుతుంది. దేవళానికెదురుగ్గా పెద్దమైదానం. మైదానంలో చింతచెట్లూ, వేపచెట్లూ, తాటిచెట్లూను. ఆప్రదేశం ఇరవై, ముప్ఫై ఎకరాల విస్తీర్ణం ఉంటుంది. అక్కడ ప్రతిసంవత్సరమూ గొప్పతిరునాళ్లు జరుగుతుంది కాబట్టి వేలకువేలు ప్రజలు దిగడానికీ, వేడుకలు చేసుకోడానికీ అనువుగా ఉండేటట్లు, ముప్ఫయిఏండ్ల క్రిందట జరిగిన రీసెటిల్మెంటులో సర్కారువారు ఆప్రదేశాన్నంతా ప్రత్యేకంగా ఒక సర్వేనెంబరుగా సర్వేచేయించి, దానిలో ఇతరులెవ్వరూ ప్రయివేటు ఉపయోగానికై ప్రవేశించకుండా, సెటిల్మెంటు రిజస్టరులో ఆ నెంబరును అంకమ్మదేవళం పోరంబోకుగా రిజస్టరుచేసి పుణ్యంకట్టుకొన్నారు. అ - : యతు [illegible]కడు కలు జరుపుకోడానికి కావలసినంత విశాలమైన[illegible], మండు వేసవిలో రో[illegible] [illegible]త్రిలో జరిగేజాతర కాబట్టి ప్రజలకు చల్లగా నీడ నివ్వడానికి ఎన్నోచెట్లు వేయించారు — దేవళం అర్చకులు. మంచినీళ్లకు కొందరు పుణ్యాత్ములు చలివేంద్రలు పెట్టించి నీళ్లు సప్లయి చేస్తుండే ఆచారం కలదు. ఆమధ్య తాలూకాబోర్డువారు కూడా కనికరించి, ఒక ప్రత్యేకమీటింగులో వెయ్యి రూపాయలు శాంక్షన్ చేయించి, అక్కడ ఒక చేదుడు బావి త్రవ్వించి, గచ్చుతో బొడ్డుగోడా, పళ్లెమూ, గిలకా, బొక్కెనా వగైరాలన్నీ ఏర్పాటుచేయించారు. కాని - బావిని త్రవ్వించడానికి కంట్రాక్టు తీసుకొన్న తురకసాహెబుచేతి చలవకాబోలు—ఇంత కర్చుపెట్టి త్రవ్వించిన బావిలో మంచినీళ్లు పడకుండా నీళ్లు జవ్వలుగా తేలినై. అయినప్పటికీ ఎండాకాలంలో ఆ చెవిగాడ్పు ఈచెరికి కొన్నేరోజులు కాబట్టి, ఆవురావురుమని పీకె ఆర్చుకొనిపొయ్యే దాహానికి ప్రజలు ఆనీటితోనే గొంతుకు తడుపుకొంటున్నారు.

తెల్లవారితే జాతరఅనంగా మైదానంయావత్తూ చిల్లరఅంగళ్లతో నిండిపోయినది. మిఠాయిఅంగళ్లూ, మామిడిపళ్ల అంగళ్లూ, ఇత్తడిసామాను అంగళ్లూ, కొయ్యసామాను అంగళ్లూ, పందిరిపట్టెమంచాల అంగళ్లూ,

లక్కబొమ్మల అంగళ్లూ, పిల్లలాడుకొనే ఆటవస్తువుల అంగళ్లూ — ఒకరకమేమిటి, రకరకాల అంగళ్లతో నిండిపోయినది. ఒకతట్టు రంకులరాట్నం తిరుగుతోంది. ఇంకొకతట్టు గారడీజరుగుతోంది. మరొకతట్టు యానాది వాళ్లు పగటివేషాలువేసి ఆడుకొంటున్నారు. ఇంకో తట్టు కాటమరాజుకథ, మరోమూల చిన్నపరెడ్డిపాట, వేరొకచోట ఆరెమరాటీలకథ, ఇంకోదిక్కున దేసింగ రాజుకథ వగైరాలు జరుగుతున్నవి. అంతమందిజనం చేరినపుడు ఏకలరాఅయినా అంటుకొంటే తుడిచిపారేస్తుందన్న భయంచేత, అట్టిజాడ్యాలు రాకుండా కాపాడేదేవత అయిన అంకమ్మతల్లి సముఖంలోనే ఉన్నప్పటికీ—ఆ చల్లనితల్లిమీద విశ్వాసంలేని సర్కారువారు ఇద్దరు హెల్తు ఇన్‌స్పెక్టర్లనూ, నలుగురు వ్యాక్సినేటర్లనూ తిరునాళ్లడ్యూటీకై డెప్యూటుచేసి పంపారు. వారొక విశాలమైన పందిరి నిర్మించి, ప్రజలకు ఆరోగ్యవిషయకమైన విషయాలు బోధించే బొమ్మలపటాలను గోడలకు తగిలించి ప్రదర్శిస్తున్నారు మరొకవంక తహశీల్ దారుగారికీ, సబుమేజస్ట్రీటువారికీ, పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరుగారికీ విడిదినిమిత్తం పాకలు వేయబడిఉన్నవి. జాతర మొదటిరోజు అంతగా వేడుక ఉండదు. రెండో రోజు సాయంత్రం ఆరుగంటలకు అమ్మవారికి గావు సమయం. అదే జాతరకంతకీ రసవత్తమయిన ఘట్టం. అప్పటికిగాని జనం ముమ్మరంగా అందుకోరు.

తెల్లవారింది; రెండోరోజు. ఉదయం ఏడు గంటల లగాయతు జనం చీమలబారులాగ రోడ్లవెంబడి బడి మూలమూలలనుండి వస్తున్నారు. ఇంటికాడ జరుగుబాటుగల ఆసాములు, వారివారి తాహతుకు తగినట్లు కుంకంబండ్లు కట్టుకొని, వాటికి పైన రంగురంగుల చీరలుకట్టి, ఎద్దులకు మెడలో మువ్వలపట్టెడా, గంటలూ, మొఖాన్న చికుమోర, తలవెంట్రుకల తాడూ, కొమ్ములకు పింగాణీపూసల దండా వగైరాలు కట్టి, శృంగారించి తోలుకొని వస్తున్నారు. ఇంకో జరుగుబాటు గలిగి కాస్తకలిగిన సంపన్నగృహస్థులు ఒకటికి మూడూ, నాలుగూకూడా కుంకంబండ్లు కట్టుకొని రావడమేకాకుండా, తలా ఒకప్రభా కట్టించి, బండిమీద ఎక్కించి తీసుకొని వస్తున్నారు. ఆసాముల ఐశ్వర్యంలోగల ఔన్నత్యంకొద్దీ ప్రభలుకూడా ఉన్నతంగా మింటికి ఎగప్రాకుతున్నవి. ప్రభఎంతపెద్దదిగా ఉంటే, ఖామందుకు అంతగౌరవమూ, గొప్పదనమూను. ప్రభలకు రోడ్లమీది చెట్లు అడ్డుతగలకుండా రైతులు ముందుగానే లోకల్ ఫండుడిపార్టుమెంటువారికి అర్జీలు యిచ్చుకోగా, వారు అడ్డుతగిలే చెట్లకొమ్మలు నరికించి ప్రభల రాకపోకలకు ఇమ్మ చేసియుంచారు. ఆక్కడక్కడ టెలిగ్రాపు తీగెలుకూడా అడ్డుతగిలేవరకు, ఆడిపార్టుమెంటువారికి అయిదేసి రూపాయలు అపరాధంకట్టి తీగలను క్రిందికి దింపుకొని ప్రభలను తోలుకొని తెచ్చుకొంటున్నారు ఆసాములు. ఎట్టి ఆటంకము లున్నా, ఆమూడు రోజులూ తిరునాళ్ల ప్రజలకు ఇబ్బంది కలుగకుండా వాటినన్నిటినీ నివారించడానికి సర్కారువారు కటికరించి తయారుగాఉన్నారు.

ఓ! వందలకొద్దీ ప్రభలు తిరునాళ్లకు చేరుతున్నవి. కొందరురెడ్లు ప్రభలతోకూడా మేళమూ, తాళమూ, డప్పులూ వగైరావైభవాలతో కూడావస్తున్నారు. వారిలో ఇంకా గొప్పగొప్ప రెడ్లు పసుపు టంగీ, నెత్తికి ఎర్రపాగా, మొలకు ఉత్తరీయం, చేతకైజారూ, మొఖాన్న కుంకంబొట్టూ ధరించి, పగటిదివ్వె, హనుమంతుచీర, పెడకొమ్ము, కలికితురాయి, ఉమ్మయిపిట్ట, వేటకత్తి, కంచుకాగడావగైరా లాంఛనాలతోసహా తిరునాళ్లకు వేంచేపు చేస్తున్నారు.

ఆ రోజు సాయంత్రం అయిదుగంట లయ్యేసరికి ఎక్కడా ఇసకవేస్తే కిందికి రాలన ట్టున్నారు జనం. పిల్లలు, పెద్దలు, ముసలివాళ్లు, ఆడవాళ్లు, మొగవాళ్లు— రకరకాలమనుష్యులు రకరకాల శృంగారవిజృంభణములతో తిరునాళ్లకు చేరుకొంటున్నారు. ఆ ప్రదేశమంతా ఆనందం పొంగి పొర్లెత్తుతూవుంది. వెంకురెడ్డీ భార్యాకూడా కొడుకు బాలయ్యను తీసుకొని తిరునాళ్లకు వచ్చారు.

## ౩

బాలయ్యకు జబ్బుచేసినపుడు మొక్కుకొన్న మొక్కుబడి వెంకురెడ్డికి అతనిభార్యకూ మరపునకు

రాలేము. ఎట్లా మరుస్తారు వాళ్లు?— వాళ్లకు బాలయ్య ఒక్కడే కొడుకయ్యె. అదీగాక, బాలయ్య పుట్టినతరు వాత ఈ పదిసంవత్సరాలుగా తల్లికి మళ్లా కాన్పులేనందున అతనిమీదే పంచప్రాణాలూ పెట్టుకొని ఆదంపతు లతన్ని కంటికి రెప్పలా కాపాడుకొంటున్నారు. అందులోనూ అతను లేక లేక కలిగినసంతానం.

భార్య కాపురానికి వచ్చిన పదిపదకొండేళ్ల వరకూ వెంకురెడ్డికి సంతానంలేక భార్యాభర్త లిద్దరూ బిడ్డలకోసం ఆరాటించి, అనేకదేవుళ్లకూ, రాళ్లకూ, రప్పలకూ మొక్కుకోగా లేక లేక ఆనలుసు— బాలయ్య పుట్టాడు. బాలింతరాలి పురిటిస్నానంరోజున వాళ్లు గ్రామం యావన్మందికీ పసుపూ, కుంకుమా, నూనే, సున్నిపిండీ, కుంకుడుకాయలూ పంచిపెట్టుకొన్నారు. గ్రామస్థులుకూడా వెంకురెడ్డిభార్య ఇంతకాలానికి మొగపిల్లవాణ్ని కన్నదికదా అని పదకొండోరోజు పురిటిస్నానంనాడు సంసార్లందరూ తలా ఒకబిందెడు వేణ్నీళ్లూ భుజానపెట్టుకు మోసుకువచ్చి బాలింతరాలికి నెత్తిన దిమ్మరించిపోయారు. పదకొండోరోజునే బిడ్డకు భారసాల చేసుకొని, బాలయ్య అని తాతగారిపేరు పెట్టుకొని ఇరవైయొకటోరోజున పిల్లవాణ్ని తొట్టిలో పెట్టుకొని, ఆరోజు సాయంత్రం నలుగురు పేరంటాండ్రనూ పిలుచుకొని, గ్రామానికి తూర్పుగమిడిలో వున్న మంచినీళ్ల బావిలో బాలింతరాలిచేత చేదవేయించారు. ఈ ప్రకారం అవకాశాలు ఉన్నవి కొన్నీ, లేనివి కొన్నీ కల్పించుకొని ఆదంపతు లెన్ని వేడుకలో చేసుకొని ఆనందిస్తూ వచ్చారు.

భగవదనుగ్రహంవల్ల బాలయ్య ఏకసగండ్లూ లేకుండా ఆరోజుకారోజు క్షేమంగానే పెరుగుతూ, రోజులూ, నెలలూ, సంవత్సరాలూ గడచి పెద్దవాడయినాడు. బాలయ్యకు తొమ్మిదోయేడు దాటి పదోయేడు రాంగనే, మామూలు ప్రకారం ఆ సంవత్సరంకూడా తలిదండ్రులు బిడ్డకు పుట్టినరోజుపండుగ చేసుకోవాలని ఆశపడి, ఉదయాన్నే పిల్లవాడికి తలంటి నీళ్లు పోసి, కొత్తగుడ్డలు కట్టి, ఆవుపాలు పొంగించి, ఇంత పప్పూ పరమాన్నమూ చేసుకొని మినపవడలూ, నిప్పట్లూ కాల్చుకొని, కావలసిన బంధువులను నలుగురినీ భోజనానికి పిలుచుకొన్నారు. మరి ఆరోజున చేసుకొన్న పిండివంటలు తిన్నందువల్లనో, పిల్లవాడి కారోజు నీళ్లుపోసి శృంగారించగా ఏ పాపిష్ఠికళ్లయినా పడి దృష్టిదోషం తగిలినందువల్లనో గాని పండుగ చేసుకొన్న సాయంత్రానికి బాలయ్యకు పొట్ట ఉబ్బరించి తెల్లగా కడుపులాగ నాలుగయిదు విరేచనాలయి, వొళ్లు కొంచెం వెచ్చబడింది. దానితో తండ్రికీ, తల్లికీ గుండె గుభెల్లుమంది. దీనికి తగినట్టుగా — ఆగ్రామంలో ఎక్కడా అలికిడి కనబడలేదు కాని!— ఆచుట్టుపక్కల అయిదారుమైళ్లదూరంలో అక్కడక్కడ ఒకటి రెండు గ్రామాలలో అమ్మవారి జాడ్యాలవల్ల బాగాఉండనట్లు ఆనోటా ఆనోటా వెంకురెడ్డికీ, అతనిభార్యకూ అదివరకే చెవికివచ్చింది. ఆపుకారు లేచిందిలగాయతు అప్పటికప్పుడే వారంరోజులుగా హంసాయిగ్రామాలవాండ్లను ఈ గ్రామానికి రాకుండా, ఈ గ్రామం వాండ్లను పొలిమేర దాటి పాయకారీగ్రామాలకు పోకుండా వెంకురెడ్డీ వగైరా రైతులు గ్రామంనాలుగుమిళ్లలోనూ, పొలిమేరలలోనూ మనుష్యులనుపెట్టి కాపుదారీ చేయిస్తూనే ఉన్నారు. కాని ఎన్నికట్టుదిట్టాలు చేసినా ఆరోజున బాలయ్యకు వెంటవెంటనే నాలుగుసార్లు కడుపువెళ్లేవరకు తలిదండ్రులకు బంగారుపుట్టి వెయ్యి దేవుళ్లకూ, దేవతలకూ మొక్కుకొన్నారు. పిల్లవాడికి ఏ ఆపదా లేకుండా తెల్లవారేవరకు సుఖువుగా లేచి తిరిగినట్టయితే అంకమ్మతల్లికి గావుసమయంలో కుంభంపోయించి మేకపిల్లను కోసుకొంటామని మొక్కుకొని పసుపుగుడ్డకు చిన్నడబ్బు మీదుకట్టుకొన్నారు. ఆతలిదండ్రుల అదృష్టంకొద్దీ—భూమిమీద నూకలుండబట్టి—రాత్రి భోజనంలేకుండా పండుకొన్న బాలయ్య తెల్లవారి నిద్రలేచేవరకు కడుపుబ్బరం తీసి, విరేచనాలు కట్టి, అతనికి రెపరెపలాడుతూ ఆకలి బయలుదేరింది. అతను నిద్రమంచంమీదనుంచి లేవంగానే చీపురుకట్ట చమురులో ముంచి, నిప్పుపుల్ల ముట్టించి, ఆమంట బాలయ్యచుట్టూ మూడుసార్లు దిగదుడుపుగా తిప్పి

దిష్టితీసివేసింది తల్లి. ఆరోజు మొదలు పిల్లవాడు ఆరోగ్యం కలిగి మళ్లీ సుఖంగా తిరుగుతూ ఆడుకొంటున్నాడు.

బాలయ్యకు జబ్బుచేసి నెమ్మదించిన మూడు నెలలకే అంకమ్మజాతర సమీపించింది. ఆరోజున ఉదయాన్నే బాలయ్యకు తలంటి నీళ్లుపోసి కొత్తసడ్డలు కట్టి అతన్ని శృంగారించారు. తలిదండ్రులుకూడా ఆ రోజున తలకు స్నానంచేసి ఇంట్లో అమ్మవారికి చలిబిండి, పానకం నైవేద్యంచేసుకొని, ఉదయం పదీ, పదకొండుగంటలకల్లా పెందలాడే భోజనంచేసుకొని వాళ్లకుతగినట్టుగా ఒక కుంకంబండి కట్టుకొని వెంకురెడ్డీ, భార్యా, బాలయ్యా తిరునాళ్లకు తయారవుతున్నారు.

"నాయనా! ఎక్కడికే మనంపోయేదీ?" అని బాలయ్య తండ్రి నడిగాడు.

"అంకమ్మతల్లి తిరునాళ్లకు తండ్రీ!" అన్నాడు వెంకురెడ్డి. వెంకురెడ్డీ, భార్యా బాలయ్య పుట్టినతరువాత మొదటి రెండుమూడేళ్లు అంకమ్మతిరునాళ్లకు వెళ్లారు కాని తరువాత తమకుటుంబవ్యవహారాలవల్లా, ఇతర కష్టాలవల్లా, పైగా వెంకురెడ్డికి ఒంట్లో బాగుండకా వాళ్లు ఆరేడేళ్లనుంచి ఏ తిరునాళ్లకూ తీర్థాలకూ వెళ్లడం మానేశారు. బాలయ్య కొంచెం జ్ఞానమెరిగినతరువాత ఇదే వెళ్లడం అంకమ్మ తిరునాళ్లకు.

"అక్కడ ఏంచేస్తారు" అన్నాడు బాలయ్య.

"అబ్బో! ఎంతోమంది జనం వచ్చి వేడుకలు చేసుకొని అంకమ్మ తల్లికి మొక్కుబళ్లు చెల్లించుకొని పోతారు నాయనా!"

"అంకమ్మ తల్లంటే ఎవరు?"

"ఏజబ్బూ, ఏ ఆపదా రాకుండా మనలనందరినీ కాపాడే తల్లి. నీకు జబ్బుచేసినప్పుడు ఆయమ్మవారికి మొక్కుకొన్నాం."

"నాయనా! నా మేకపిల్లనుకూడా తెచ్చుకొంటాన్లే" అని పిచ్చిబాలయ్య అమాయకంగా అడిగాడు.

"అట్లాగే నాయనా! మేకపిల్లను తీసుకుపోకుంటే ఎట్లాబాబూ! నీకు మొక్కుబడి చెల్లించుకోవద్దూ?" అన్నాడు వెంకురెడ్డి.

బాలయ్యకు మేకపిల్లలంటే ఎంతోమక్కువ. అందులో ఆ మేకపిల్లంటే మరీ ప్రాణం. మొదటినుంచీ బాలయ్య మేకపిల్లలతోపాటు సమానంగా పెరిగి వాటితోనే ఆడుకొంటూ వచ్చాడు. తండ్రి వెంకురెడ్డికి ఎప్పుడూ ఒకటో రెండో మేకలను పెంచే అలవాటు. ఎప్పుడూ అతనియింట్లో అధమం ఒక మేకపోతూ, ఒక ఆడమేకా ఉండేవి. ఆడమేక ప్రతియేటా ఒకటో రెండో పిల్లలను పెడుతూఉండేది. ఆపిల్లలు కాస్త పెద్దవి కావడంతోనే వెంకురెడ్డి వాటిని ఎవరికైనా అమ్మివేసి పెద్దమేకలనుమాత్రం ఇంట్లో పెట్టుకొనే మామూలు కద్దు. బాలయ్య కయిదారేళ్లువచ్చినదిలగాయతు అతను ఈ రెండుమేకలతోనూ అస్తమానూ తిరిగి ఆడుకొంటూ ఉండేవాడు. ఆమేకలు మేతకోసం బయటికిపోయినప్పుడు తప్ప అవి తిరిగి ఇంటికి చేరినది లగాయతు అతను వాటిని క్షణం విడిచిపెట్టకుండా ఉండేవాడు. బాలయ్యఏడోయేట ఆడమేక రెండుపిల్లలను ఈనింది. అందులో ఒకటి మొగదీ, రెండోది ఆడదీని. ఆపిల్లలు కాస్తపెద్దవై తల్లిపాలు విడిచి మేతమేసే యీడుకు వచ్చేవరకు వాటితల్లి అప్పటికే ఏడెనిమిది ఈతలు ఈని ముసలిదయినందుకల్ల వెంకురెడ్డి దాన్నీ, దానితోపాటు మేకపోతునూ — రెంటినీకూడా ఒక తురకసాహెబుకు రెండు వరాల మాడాచవలానికి అమ్మివేసి, వాటిపిల్లలను రెంటినీ మట్టుకు తాను నిలుపుకొన్నాడు. ఈ రెండుపిల్లలూ ఇంట్లో బాలయ్యకు తోడుగా ముద్దుగా పెరుగుతూ పెద్దవవుతూ ఉన్నందువల్ల వెంకురెడ్డి మళ్లా పెద్దమేకలను కొని తీసుకురాలేదు. కాని, తల్లిమేక నమ్మివేసిన రెండునెలలకు వాయుగుణం కనిపించి, ఈ రెండుపిల్లలలోనూ ఆడపిల్ల నాలుగోనాటికి హఠాత్తుగా నాలుక బయటవేసి చచ్చిపోయింది. అదిలగాయతు మొగపిల్ల ఒక్కటే బాలయ్యదగ్గర బాగా మాలిమయింది. బాలయ్య ఆవొక్క మేకపిల్లనూ తన ప్రాణంతో

సమానంగా పెంచుకొంటున్నాడు, దానితల్లి ఉండే టప్పుడు ఆపిల్లతోపాటు తానుకూడా తల్లిమేకపొదుగులో తల దూర్చి, రెండోచన్ను నోట్లోపెట్టుకొని చప్పరిస్తూ, పాలుచేపినతరువాత పీల్చితాగుతూ మేకపిల్లతో సమానంగా తానుకూడా కడుపునింపుకొని ఆకలి తీర్చుకొంటూ ఉండేవాడు. బాలయ్యకు ఎనిమిదోయేడు వచ్చిందిలగాయతు మొలకు గోఁణం కట్టుకొని ఆమేకపిల్లను తానే స్వయంగా పొలం తోలుకొనిపోయి తల్లీతండ్రీ పొలంలో ఏకలుపో తీసుకొంటూవుంటే అతను మేకపిల్ల మెడకు పొడుగాటి తాడుకట్టి పట్టుకొని చెరువుగట్టుమీది పొదలలో చెడిబుడీ ఆకు మేపుతూ ఉండేవాడు. పొద్దుగూకులూ ఆమేకను మేపినంతసేపూ మేపి సాయంత్రం దానికి చెరువులో నీళ్లు తాపించి, రాత్రి ఇంటికాడ మళ్లీతినడానికై ఏ జువ్విమండలో, ఏ రాగిమండలో నాలుగు—లేతవిగాచూచి—తండ్రి చేతనే కోయించి, వాటిని మోయనుగా ఒక చిన్నకట్ట కట్టించి, తానే నెత్తిన పెట్టుకొని మేకను తోలుకొంటూ ఇంటికి తెస్తూ ఉండేవాడు. రాత్రిళ్లుకూడా బాలయ్య మేకను తానుపండుకొనే మంచాని కానించి గుంజకుకట్టి, తాను అన్నంతిని పండుకోబోయే సమయంలో, సాయంత్రం తెచ్చిన మండలు దానిముందు వేసి మరీ పండుకొనేవాడు.

మేకపిల్లకుకూడా బాలయ్యదగ్గర బాగా మాలిమయి, అతను ఒక్కగడియ అనుపడకుండా వుంటే దిగులుపడి మేతా నీళ్లూ ముట్టకుండా చెవులునిక్కబెట్టి, నలుదిక్కులా పారజూస్తూ మే, మే, మే అని అరుస్తూవుండేది. బాలయ్యవద్ద అలవాటయినప్పటినుంచీ తనతల్లి మారమైన దిగులు ఆమేకపిల్ల మరచిపోయింది. ఒక్కొక్కప్పుడు ఆ మేకపిల్ల నిద్రపోతూవున్న బాలయ్య పక్కలోకి పోయి ఆమంచం మీదనే తాను కూడా కాళ్లు ముడుచుకొని పండుకొని, నెమరువేస్తూ, అప్పుడప్పుడు తనతల బాలయ్యఒడిలో పెట్టుకొని నిద్రపోయేది. మెలకువ వచ్చినపుడు బాలయ్య ఆపిల్లను దగ్గరగా తీసుకొని చేత్తో దువ్వి ముద్దు పెట్టుకొని చలివేయకుండా తాను కప్పుకొన్న దుప్పటీ సగం దానికి కప్పి, మీద చెయ్యివేసి పండుకొనేవాడు. ఈ విధంగా బాలయ్యా, మేకపిల్లా పశునరజన్మలభేదం పాటించకుండా ఏకగర్భవాసాన్న పుట్టిన బిడ్డలవలె పెరుగుతూ ఒకరి నొకరు అన్యోన్యమూ ప్రేమించుకొంటూ జీవిస్తూవున్నరోజు లవి. బాలయ్యకు పదోయేడు ప్రవేశించినప్పటికి మేకపిల్లకు మూడోయేడు ప్రవేశించింది. బాలయ్య మేకపిల్లకు ముస్తీబుచేశాడు.

అంకమ్మతల్లి జాతరకు వెంకురెడ్డీ, భార్యా బాలయ్యనూ, అతని మేకపిల్లనూ తీసికొని బండెక్కినారు. తండ్రి చెప్పిన మాటలు బాలయ్యకు అర్థంకాలేదు; తానూ తన మేకపిల్లా తిరునాళ్లకు వెడుతున్నామన్న సంబరంలో అతను వాటినిగూర్చి యింక ఆలోచన కూడా చేయలేదు. బండెక్కి కూర్చుని బాలయ్య మేకపోతును దగ్గరకు తీసుకొన్నాడు. మేకపోతు బాలయ్యఒడిలో తలపెట్టుకొని నెమరవేస్తూ పండుకొన్నది. బాలయ్య పుట్టిన గ్రామానికీ, అంకమ్మజాతర జరిగే గ్రామానికీ సుమారు పదిమైళ్లదూరంపైగా ఉంటుంది. దారిపొడుగునా వెంకురెడ్డీ, భార్యా అంకమ్మతల్లికి దణ్ణాలుపెట్టుకొంటూ మధ్యాహ్నం మూడునాలుగు గంటలకు అంకమ్మదేవళంవద్దకు చేరుకొన్నారు. బండిని ఎడంగా వేపచెట్టుకింద విప్పి వెంకురెడ్డీ, భార్యా, బాలయ్యా తిరునాళ్లు చూడడానికి బయలుదేరారు. బాలయ్య మేకపిల్లను విడిచిపెట్టకుండా దాని తాడు చేత్తో పట్టుకొని కూడాతిప్పుకొంటున్నాడు.

౪

మండిమండువేసవి. పడమటి గాడ్పు చేటలతో నిప్పులు చెరుగుతున్నది. జనానికి నాలుక తడారిపోతున్నది. ఎన్నినీళ్లు తాగినా పొట్ట ఉబ్బడమేకాని దాహశాంతి కావడంలేదు. జనం కిటకిటలాడుతూ ఉన్నారు. దేవళందగ్గరి తిరునాళ్లఘోష బయట మైలుదూరంలో గలవారికి కూడా వినపడుతున్నది. బాలయ్య అదివరకెన్నడూ అమ్మవారిజాతర చూచినవాడూ కాడు; విన్నవాడూ

కాదు. అంతా మహావింతగా ఉన్న దతనికి. అంతమంది జనం ఒక్కచోట చేరగా తా నెన్నడూ చూడలేదు. మిఠాయిఅంగడికి తీసుకొనివెళ్లి తండ్రి ఒకయేబులం మిఠాయిబొమ్మలూ, జీడిపప్పూ కొని బాలయ్యచేతిలో పెట్టాడు. నాలుగుబొమ్మలు తాను తిని నాలుగు మేకపిల్ల నోటి కందిచ్చాడు బాలయ్య. కాని ఆ జనసమ్మర్దంలో మేకపిల్ల పసికట్టిందో యేమో, దానికి గుండెలు అదుర్దాగా ఉండి, నోటి కేమీ హితవుకానందున కాబోలు, బాలయ్య అందిచ్చిన బొమ్మలు అది అందు కోకుండా, నెమరుఅయినా వేయడంచాలించి, అత నితోకూడా తిరుగుతున్నది.

సాయంత్రం అయిదు గంటలు కాగానే అమ్మ వారి దేవళందగ్గర జనం తోసుకొంటున్నారు. దేవళం వద్దకు పోవడానికి వీల్లేకుండా ఉన్నది. గావుసమయం సమీపించింది. అయిదూ అయిమున్నరగంటల లగా యతు మొక్కుబళ్లు చెల్లుబడికావాలె. గావుఅంటే ఏమిటో, ఎట్లాఉంటుందో కళ్లారా చూడడానికై తహశీల్దారుగారు, మేజస్ట్రేటుగారు, పోలీసు సర్కిల్ ఇనస్పెక్టరుగారు దేవళంవాకిట విడిగా ఒకప్రక్క తలాఒకకుర్చీ వేయించుకొని కూర్చున్నారు. సబిన స్పెక్టర్లూ, పోలీసు జవానులూ జనాన్ని ఆతట్టుకూ, ఈతట్టుకూ లాఠీకర్రలతో నెట్టి మొక్కుబడి చెల్లించ వలసినవాండ్లు దేవళంకాడికి రావడానికి దారితీస్తు న్నారు. అక్కడ ఏమిజరుగుతోందో బాగాకనపడాలని, జనం ఒకరిభుజాలమీద మరొకరు తలలు పెట్టి పాదాలు ఎత్తి బొటనవేళ్లమీద నిలబడి, ముఖం అంతా కళ్లు చేసుకొని చూస్తున్నారు. చిన్నపిల్లల్ని కొంతమంది భుజాలమీద కూర్చోపెట్టుకొని, దేవళం వాకిటజరిగే వైభవాన్ని చూపుతున్నారు. ఈత్రొక్కు ల్లాటలో మోచేతిపోటులకు, మోకాలి త్రోపులకు అవస్థపడలేక కొంతమంది సమీపంలో గల చింత చెట్లూ, వేపచెట్లూ ఎక్కి, కొమ్మలసందున కూర్చుని చూస్తున్నారు. దేవళానికి ఉత్తరపుతట్టు సుగిమాను తిరుగుతున్నది. దేవళంచుట్టూ కుంకంబళ్లు తిరగడానికి కట్టబడిన దారిలో బళ్లు తిరుగుతున్నవి. అమ్మవారిగర గలు దేవళంలో అలంకరింపబడి శోభిల్లుతూఉన్నవి గణాచారులలో ఒకడు, మూతిమీది మీసాన్నయినా తీయించకుండా చీర కట్టుకొని, రవికె తొడుక్కొని. ఆడవేషం వేసుకొని, ఒంటికీ, ముఖానికీ పసుపూ కుంకుమా అలముకొని, ముక్కుకి నత్తుపెట్టుకొని, చేత వేపమండలుపట్టుకొని దేవళంగడపలో, ఎడంకాలు కిందికిముడిచి, కుడికాలు పైకి వంచి, మోకాలిపై చేయి పెట్టుకొని కూర్చున్నాడు. ఇతడే అమ్మవారి అపరావ తారం. ఇత డారోజున ఎవరితోనూ మాట్లాడడు. మౌన ముద్రవహించి ఉంటాడు. మనిషి మన స్మారకంలోనే ఉండడని అంటారు కొందరు. అప్పుడప్పుడు చిరునవ్వు మాత్రం నవ్వుతూ ఉంటాడు. మరొకగణాచారి చేత్తో పురదాడు పట్టుకొని ఒళ్లుతెలియకుండా గంతులువేస్తు న్నాడు. ఇతనికికూడా ఆరోజు స్మారకం ఉండదనే ప్రతీతి దేవళంవాకిటకు దక్షిణపుతట్టు డప్పులు వగై రాల మేళం చెవులు చిల్లులుపడేటట్టు ఎవరిమాట వారికే వినపడకుండా ధ్వనిచేస్తున్నది. గణాచారిప్రక్కన కుందిలో సాంబ్రాణిపొగ పొరలు పొరలుగా, తెరలు తెరలుగా పైకిలేచి మేఘంలా వ్యాపిస్తూఉన్నది. దాన్ని ఆఘ్రాణించేవరకు గణాచార్లకే కాకుండా, చూపరులకుకూడా ఒకవిధమైన ఆవేశం కలుగుతున్నది. మొక్కుబళ్లవారు కలా ఒక మేకపోతునో, పొట్టేలునో, కోడినో తెచ్చి, దగ్గరపెట్టుకొని నిలబడియున్నారు. వారివెంట వచ్చిన ఆసన్నజీవాలు చేసే ఆక్రందనధ్వని సముద్రంలో పడ్డ వానచినుకులాగ, ఎవరికీ వినపడ కుండా ఆరోదలో లీనమైపోతున్నది. వెంకురెడ్డీ, భార్యా, బాలయ్యాకూడా దేవళంకాడికి వచ్చి ఒక తట్టుగా ఒదిగి నిలబడి యున్నారు.

ఇంతలో ఒక పూజగొల్ల హాడు ఒక నిండుకల్లు కుండ భుజానపెట్టుకొని, దేవళం గడపలో కూర్చున్న ఆడవేషధారి అయిన గణాచారిని సమీపించి, కుండలో కల్లు తాను నోట్లో పోసుకొని, పుక్కిలించి, ఒక్కొ క్కపుక్కిలే గణాచారి ముఖాన్న తుపుక్కున ఉమ్మి వేస్తున్నాడు. ఆ ప్రకారం కుండలో కల్లుయావత్తూ పూర్తిఅయ్యేదాకా అతడు పుక్కిలించి, గణాచారిని

నఖశిఖపర్యంతమూ స్నానంచేయించాడు. గణాచారి చిరునవ్వు నవ్వుతూనే ఉన్నది. ఇంతలో మరిద్దరు మనుష్యులు వచ్చి గణాచారిని నోటపట్టరాని బండబూతులు, తిట్టినబూతు తిట్టకుండా, నుక్క తిరగకుండా ఒకరి తర్వాత మరొకరు చొప్పున ఒకపావుగంటసేపు బూతులదండకం చదివి ప్రక్కకు ఒదిగారు. గణాచారి ప్రసన్న సూచకంగా చిరునవ్వు నవ్వింది. ఈ ప్రకారం తిట్టితే అమ్మవారికి బ్రహ్మానందమట! ఆ తరువాత ఒక ఆసాదివాడు నోట్లో పెడకొమ్ము పెట్టుకొని, గణాచారిముఖందగ్గర పెట్టి ఊది వికృతశబ్దం చేశాడు. ఆతరువాత మరిద్దరు మనుష్యులు ఒకమేకపిల్లను తెచ్చి, ముందుకాళ్లురెండూ ఒకడున్నూ, వెనకకాళ్లు రెండూ మరొకడున్నూ పట్టుకొని, మేకకడుపు అడుగుభాగం పైకి వచ్చేటట్టు వెల్లకిలా త్రిప్పి, ఎత్తిపట్టుకొని నిలబడ్డారు. మరొకడు వచ్చి మేకనోరూ, ముక్కు రంధ్రాలూ చేతులతో గట్టిగా మూసిపట్టుకొన్నాడు. మళ్లా మేకమీద ఒకడు పెడకొమ్ము పెట్టి ఊదాడు. అప్పటికప్పుడే మేకపిల్లకడుపు వీరణంలాగ ఉబ్బి పొట్ట పైకి లేచింది. దేవళంవాకిట గణాచార్లు సివంఎత్తి శరీరం తెలియకుండా చిందులు తొక్కుతూ వెర్రికేకలు వేస్తున్నారు. వారిలో ఇద్దరు గణాచారులు మేకకు ఇరుప్రక్కలా చెరొకరూ నిలబడి, చేతిలోఉండిన వురదాడుతో (అనగా మొదట లావుగాఉండి చివరకు పొయ్యేవరకు సన్నగిల్లే బారెడు పొడుగుతాడు) వరుసవరుసగా, ఒకరితర్వాత మరొకరుచొప్పున మేకపిల్ల కడుపుమీద పెటీ, పెటీ మని ఇరవై దెబ్బలు కొట్టారు. వాకిట గణాచారి చిరునవ్వు నవ్వింది. ఇంతకంటె నన్ను మీ రేంచేయగలరు - ఇంతేనా అన్నట్టుగా, ఎన్ని దెబ్బలుకొట్టినా మేకపిల్ల కిక్కురు మనకుండా నోరుమూసుకొని ఊరుకొంది. అంతట గణాచార్లలో ఒకడు ఆమేకపిల్లను చేతులతో ఎత్తుకొని తనమూతివద్ద మేకపిల్లమూతి పెట్టుకొని దాని అడుగు దవడ, పైదవడచివరఉండే చర్మాన్ని తన మునిపళ్లతో ముక్కలు ముక్కలుగా కొరికి మాంసపు కండలను కిందకుమిమ్మేస్తూ గంతులువేస్తున్నాడు. అప్పటికి జనంలో విపరీతావేశమూ, అహహాకారాలూ జాస్తిఅయినవి. గణాచారి చిరునవ్వు నవ్వుతూనే ఉన్నది. ఈ వినోదాన్నంతా చూస్తూ సర్కారుఅధికార్లు ఆనందిస్తున్నారు.

బాలయ్య కిదేమీ అర్థంకావడం లేదు. అతనికి గుండెలు రైలుఇంజనులాగ దడదడ కొట్టుకొంటున్నవి. అతని తల్లిదండ్రులు అమ్మవారికి చేతులెత్తి మొక్కుకొంటున్నారు. చేతులోపట్టుకొన్న మేకపిల్ల మే, మే అని తెగఅరుస్తున్నది. బాలయ్యకు మేకపిల్లమీద వెర్రి మమకారం బయలుదేరింది. దాన్ని తనప్రక్కకు దగ్గరగా లాక్కొని చేత్తోదువ్వుతున్నాడు.

ఇంతలో మొక్కుబళ్లు అని కేక వినబడింది. ఒక్కొక్కరే ముందుకు సాగారు. వేటలకు ముఖాన్న పసుపూ, కుంకుమా పూసి, మెడలో వేపాకు కట్టి, ముందుకు తీసుకొనివస్తున్నారు. ఒక గణాచారి అర్ధమణుగు బరువుగల ఒక ఆయుధాన్ని భుజంమీద పెట్టుకొని నిలబడియున్నాడు. ఒక్కొక్కరే వేటపోతును గణాచారిసమక్షంలోనికి తీసుకొనిపోయి, ముందుకు వంగి దణ్ణాలుపెట్టుతున్నారు. గణాచారి చిరునవ్వునవ్వుతూనే ఉన్నది. ఆయుధపాణిఅయిన మనిషి పూర్తిగా కైపెక్కి ఉన్నాడు. అతనికళ్లు ఎర్రగా చింతనిప్పులలాగా కణకణలాడుతున్నవి. ఆ ప్రదేశం అంతా కల్లుకంపుతో ముక్కుబద్దలైపోతున్నది. పైన ఆకాశంమీద గద్దలు గుంపులు గుంపులుగా వలయాలు చుట్టుతున్నవి. కొన్ని రాబందులు సమీపంలోఉన్న తాటిచెట్లమీద కూర్చున్నవి. ఆయుధపాణి ఒక్కొక్క వేటనే మెడమీద ఆయుధంతో ఒక్కపెట్టుపెట్టి, త్రుటికాలంలో దాని మొండెం,తలకూ మొండెమునకూ సంబంధం విడదీస్తున్నాడు. క్రిందపడిన తలలూ, మొండెములూ ఒకటి రెండు నిముషాలు గిలగిలకొట్టుకొంటూ వరదలై ప్రవహించేరక్తాన్ని నలువైపులా చిమ్ముతూ కొంతసేపటికి చలనంతగ్గి ఊరుకొంటున్నవి. ఇట్లా ఒకచోట కాదు, రెండుచోట్ల కాదు; నాలుగైదుచోట్ల వేటలు

జరుగుతున్నవి; సన్నజీవాలు లెక్కలేకుండా తెగిపోతున్నవి. చిందిన నెత్తురు చుక్కలు చుట్టూ నిలబడివున్న జనం గుడ్డలమీదనూ, మొఖాలమీదనూ చిందుతున్నవి. పొద్దుకూకి సంజచీకటి పడేవరకు వేటలు వందలు వందలుగా తెగిపోతున్నవి. తెగిన తలకాయలుమాత్రం— మేకతలకాయలు ఒకగుట్టగానూ, గొర్రెతలకాయలు ఒక గుట్టగానూ, కోడితలలు ఒకగుట్టగానూ,— గొల్లవాళ్లొకచోట విడివిడిగా పోగులు పెట్టుతున్నారు. కళేబరాలనుమాత్రం స్వంతదార్లు తీసుకొనిపోతున్నారు. నెత్తురుతో తడిసిన కాలిక్రింది మట్టి ఎర్రగా అడుసు కట్టి బురదబురదగా కాలువేస్తే జర్రున జారుతున్నది. ఆయుధధారిఅయిన గణాచారి కత్తి మార్చి మరొక కత్తి తీసుకొన్నాడు. పాతకత్తిని మరొకడు రక్తం తుడిచి రాతిమీద పదును పెడుతున్నాడు. అంతా మహా కోలాహలంగా ఉంది; జనసమ్మర్దం ఎక్కువైనది.

ఇంతలో వెంకురెడ్డీ, భార్యా ముందుకు రెండడుగులు వేశారు. బాలయ్యా మేకను దగ్గరగా తీసుకొని వెనుకకు నాలుగడుగులు వేశాడు. తనకళ్లఎదుట లెఖ్ఖలేని సన్నజీవాలు తెగిపోతున్నవి. సృష్టికర్తచే సృజింపబడ్డ నోరులేని ఆ సన్నజీవాలతలకాయలను కనురెప్పపాటులో శరీరంనుండి వేరుచేయగలవారేగాని విడిపోయినతల నొక్కదానిని కూడా తిరిగీ అతికించగల మొనగాడు అతనికళ్ల కొక్కడుకూడా కనిపించడం లేదు. బాలయ్యకు గాబరాపుట్టింది. శరీరం చిరుచెమ్మటపోసింది. కాళ్లు భూమిమీద నిలవడం లేదు. త్రోపు ఎక్కువయినది; నలిగిపోతున్నాడు. అతనికి కళ్లు చీకట్లు కమ్ముతున్నవి. ఆ త్రొక్కిడిలో గాలి సరిగా రాక అతనికి ఊపిరాడడంలేదు. దాహం పీకె ఆర్చుకొనిపోతున్నది. గుండె దడదడమని కొట్టుకొంటున్నది. తన మేకపిల్ల ఏమవుతుందో అని అతనికి భయంవేసింది. తనపిల్లకు కూడా మొఖాన్న పసుపూ, మెడలో వేపమండలూ ఉన్నవి. ఇంతవిపరీతమైన జీవహింస చూచేసరికి ఆబాలుడికి ఒళ్లు కంపరమెత్తిపోయింది. ఎందుకు నరుకుతున్నారో అతనికి అర్థంకావడం లేదు. ఇటువంటిచోటికి తనతల్లిదండ్రులు తీసుకొని వస్తారని అతనికి తెలియదు. మేకపిల్లె తన ప్రక్కన వున్నదో లేదో అని అతడు పదేపదే చూసుకొంటున్నాడు.

"అబ్బాయీ! రా" అని ముందుకు జరిగిన తండ్రి పిలిచాడు. బాలయ్య కదలలేదు. తండ్రి వెనక్కి వచ్చి మేకపిల్లను బాలయ్యచేతిలోనుంచి లాక్కొన్నాడు. బాలయ్య కెవ్వుమని కేకవేసి ఏడుపు ఆరంభించాడు.

"నాయనా! తప్పు! ఏడవకూడదు. అదుగో చూడు! అంకమ్మతల్లి. భయపడకు. దణ్ణం పెట్టుకో" అని తల్లిదండ్రులు గణాచారిని చూపించారు. "నా మేకపిల్లని నాకిచ్చివేయవే నాయనా! నేను రానే" అని బాలయ్య ఏడుస్తున్నాడు. "అట్లా అనకూడదు తండ్రీ! నీకు జబ్బు చేసినపుడు మేకపోతు నిస్తామని మొక్కుకొన్నాం. దీన్ని అమ్మవారి కిచ్చివేయి. నీ కింకొకటి మంచిది కొని పెడతాలే" అని తండ్రి బుజ్జగిస్తున్నాడు. ఇంతలో పిల్లవాణ్ని ఎందుకు తీసుకువచ్చావయ్యా! వెనక్కి తీయవయ్యా" అని గణాచార్లు అరుస్తున్నారు. బాలయ్య మేక తెగఅరుస్తూ నిలబడిఉన్నది. వెంకురెడ్డి మేకపిల్లను గణాచారిచేతి కందిచ్చాడు. బాలయ్య గొల్లున గోల పెడుతూ ముందుకు దూకుతున్నాడు. తల్లి వెనక్కి తీస్తోం దతన్ని.

ఒక గణాచారి మేకపిల్లను సమ్మెంలోకూర్చున్న ఆడవేషధారి అయిన గణాచారివద్దకు తీసుకొనివెళ్లాడు. ఆమె చిరునవ్వు నవ్వింది. సంజచీకటి- సాంబ్రాణిధూపం పొగలు. అంతా మసకమసకగా ఉంది. జనసమ్మర్దం జాస్తి ఆయినది. పక్కజనంలో వేటభాగాలకోసం చాకళ్లలో చాకళ్లకు తగవులుపడ్డవి. తప్పతాగిఉన్నారేమో వాళ్లు అది పెద్ద దెబ్బలాటయి గలభా ముదిరింది. త్రోపు ఎక్కువయింది. జనం కనిష్టీబులనుకూడా తోసుకొని అధికారులమీద పడుతున్నారు. అక్కడ కూర్చుండడం వారికే కష్టమయింది. బయటకు వెడదామంటే దారీతెన్నూ కనబడడం లేదు; లేచి నుంచున్నారు. అంతా ఒకచేటలోపుడు. ఇంత సమ్మర్దంలోను, ఇంత తోపుడులోను బాలయ్యకు కనబడుతున్నదల్లా అతని మేకపిల్లే. దానిమీదే ఉంది అతనిదృష్టి. మేకపిల్లకూ

అంతే. మేకపిల్ల బాలయ్యవైపు తిరిగి కన్నీరుకారుస్తూ ఒకసారి అరుస్తోంది. బాలయ్యకు హృదయం ద్రవించిపోతోంది. అతనిమనస్సు మనస్సులోలేదు. కేకలు హెచ్చుతున్నవి. ఎవరి సందడిలో వారున్నారు. ఇంతరొదలోనూ ఏకాగ్రచిత్తంతో "అంకమ్మతల్లీ! నీదయ చల్లంగా ఉండాలమ్మా" అని బాలయ్య తల్లిదండ్రులు అమ్మవారికి చేతులెత్తి మొక్కుకొంటున్నారు. ఆయుధపాణి మేకపిల్ల మెడకు కత్తి గురిచేసి పై కెత్తాడు. బాలయ్యకు ఒళ్లు తెలియలేదు. "చచ్చిపోతోంది బాబోయి నా మేకపిల్ల" అంటూ ముందుకు దూకినాడు. ఆగలభా జనంత్రోపులలో ఎట్లాజరిగిందో మరి, మేకపిల్లమీద వచ్చిపడ్డాడు బాలయ్య. ఆతోపుకి మేక జరగింది. పైకెత్తిన గణాచారికత్తి బాలయ్య ప్రాణాలు తీసింది, అతనితలా, మొండెమూ నేలమీద పడి గిలగిల కొట్టుకొంటున్నవి. మే, మే అని అరుస్తూ మేకపిల్ల బాలయ్యచుట్టూ తిరుగుతున్నది. బాలయ్యకళ్లు మేకను చూసుకొని నవ్వి మూసుకుపోయినవి.

అంతా నిశ్శబ్దమయిపోయింది క్షణకాలం. బాలయ్యతలిదండ్రుల యేడుపే వినబడ్డవల్లా అప్పుడు. "బాలయ్యో! బాబో!" అంటూ నేలమీద కుప్ప గూలిపోయారు వారు. "ఖూనీ, ఖూనీ, పకడ్ లే" వంటూ అదివరకే లేచి నుంచున్న పోలీసుసర్కిల్ ఇనస్పెక్టరు ముందుకు తోసుకవచ్చాడు. ఆయుధపాణి నిద్దరు పోలీసుజవానులు అరెస్టు చేసేవరకు అతని సివం తగ్గి ఒంటిమీద స్మారకం కలిగింది. గుమ్మంలో కూర్చున్న గణాచారికి ఈ సారిమాత్రం ముఖంమీద చిరునవ్వు లేదు; తెల్ల మొఖంవేసింది. కూర్చున్నమనిషి లేచి నిలబడ్డాడు.

---

౯. ఆలయప్రధాన ద్వారమునకు దక్షిణమున నొకమూలయందు గల సుందర శిల్పరచన. స్తంభాగ్రముమీద మంజూరు మోచియున్నట్లు సుందర స్త్రీ ప్రతిమలు చెక్కబడియున్నవి. ఇట్టివి ఆలయముచుట్టునున్న స్తంభాగ్రములపయి నున్నవి.



౦. ఆలయ ప్రధానద్వారమునకు దక్షిణముగ గోడక్రింది భాగమున గల శిల్పరచనా విశేషము.





౧౧ దేవాలయ ప్రధానద్వారమున కుత్తరముగ నున్న మంటపము (ముందు వైపు.) (ఇట్టి మంటపములు దేవాలయ ద్వారములు మూడింటికి రెండువైపుల, వైపుకు రెండేసిచొప్పున నున్నవి.)



౧౨. మరియొకద్వారమున కొకవైపున నున్న మీదవేర్కొన్నమాదిరి మంటపము యొక్క ప్రక్కవైపు.



౧౩. ఆలయముయొక్క ఉత్తరపువెపు గోడయందలి శిల్పరచన. ఎగువభాగమున విష్ణుమూర్తుల ప్రతిమలున్నవి.



౧౪. విష్ణుమూర్తి



౧౫. సుందర స్త్రీ విగ్రహము



౧౬. విష్ణుమూర్తి

# పూర్ణ

[అనువృత్తము]

వాసిష్ఠ గణపతిముని

## పదునైదవ ప్రకరణము

### రాజకాళి ప్రతిజ్ఞ

ఇంతట 'నాగమణీ! నాగమణీ!' అని యెవరో తలుపుతట్టిరి. ఆ కంఠధ్వని నందఱును పోల్చుకొనిరి. అది రాజకాళిది. ఆ సభలో చాలమందికి రాజకాళిపై పూజ్యభావము గలదు. కేలుని యుత్తరువు ననుసరించి జంభుఁడు వెళ్లి తలుపుతీసెను. రాజకాళి లోపలఁ బ్రవేశించెను. తలుపుగడియ తిరిగియు వేసుకొనఁబడినది. పర్ణినిచే సమర్పఁబడిన ప్రత్యేకాసనముపై రాజకాళి కూర్చుండినది. పర్ణినీజంభులుగూడ తమ యాసనములపై కూర్చుండిరి. అనంతరము రాజకాళి ఛందోబద్ధవాణితో నాకూటము నిట్లు ప్రశ్నించినది—

రాణి లీలావతి రాజ్యము సేయ
కోణమునం దేమి కూయుచున్నారు?
మనపక్షపురథంబు మహిమతో భువిని
చనునట్లుగా నేమి సలుపనున్నారు?

శివ—అమ్మా! ఆయుపాయమును మీరే యుపదేశింపవలెను.

రాజకాళి—

భూజనులహితంబు బుద్ధిచేఁ గోరి
రాజమ్మ యోచించె రాజకీయముల
వాటిగా నున్నవి బాటలు నాల్గు
సూటిగా నున్నదిసుమ్ము నా బాట
మీ బాట నున్నది మితిలేని మబ్బు
మా బాట నున్నది మఱి జాఱుబురద
మీ బాట మితిలేక మింటికి నెగయు
మా బాట మితిలేక మంటిలోఁ గలయు.

శివ—అమ్మా! సూటిగానుండు మీ బాట యేదియో మాకు బోధపడుట లేదు.

రాజకాళి—

సామమే నేఁ జెప్పు సరియైన బాట
ప్రేమమే దానిలో విలసిల్లు బురద
చంద్రబింబమునుండి చక్కఁగనుండి
చంద్రాస్యనగవుల చాయలనుండి
చిన్నపిల్లల ముద్దుచేష్టలనుండి

కన్నతల్లుల వింతకౌఁగిళ్ల నుండి
గతి మందమైయుండు గాలులనుండి
యతినిర్మలంబైన యంభస్సునుండి
సుఖవారి మగ్నుల చూపులనుండి
మఖవాటిఁ బాడెడు మంత్రాలనుండి
సామరహస్యము చదివితి నేను
కోమలయుక్తి గన్గొంటిని నేను.

శివ—నాస్తికుఁడగు భోగనాథుని దగ్గఱ సామోపాయమా? అది మాకు సాధ్యము గాని పని.

రాజకాళి—నాభావము నీకుఁ దెలిసినదిగాదు. భోగనాథుఁడు యావద్రాజ్యమునం దభిషేకింపఁబడు నని మీరు భయపడవలదు.

కాలకంఠుని నెత్తికంటిపై నాన
పాలించు భూదేవిపంటపై నాన
తెల్లని సురదంతితెలుపుపై నాన
నల్లని ధవలాక్షినలుపుపై నాన
పూజ్యబృహస్పతిబుద్ధిపై నాన
ప్రాజ్యదేవేంద్రుని బలముపై నాన
పురుషుఁడౌనీలునిభుజముపై నాన
పరుషుఁడౌ కాలుని పండ్లపై నాన
యోధుఁడౌ శివకీర్తి యుక్తిపై నాన
సాధు జటాముని శక్తిపై నాన
నేతయౌ మల్లయ్య నీతిపై నాన
త్రాతయౌ ఘనబాబుధనువుపై నాన
కాలనాథుని వాఁడి కత్తిపై నాన
కోలనాథుని యొంటికోటపై నాన
పాకశాసను రాణి కేకపై నాన
మాకర్ణికొమరుని మహిమపై నాన
ప్రతిలేని గజవీరు బాకుపై నాన
యతి పుణ్యమౌ రామయశముపై నాన
దేశభక్తుల తీవ్రదీక్షపై నాన
మాశక్తిగరబాబు మాటపై నాన
పర్ణిని పాడెడుపాటపై నాన
పూర్ణిమ వెన్నెలపూఁతపై నాన
హితవక్త్రి రథినమ్మ యెత్తుపై నాన
శితశస్త్ర పూర్ణమ్మచేతపై నాన
దివ్యమౌ సూర్యుని దీప్తిపై నాన
భవ్యమౌ భైరవిపదముపై నాన
కాచిన కొబ్బరికాయపై నాన
పూచినమల్లియపూవుపైనాన
అంహోయుతుండగు నాభోగనాథు
సింహాసనముప్రక్కఁ జేరరానీను.

ఈ పాటలుపాడి రాజకాళి యాసనము నుండి లేచినది.

శివకీర్తి—(లేచి) అమ్మా! మఱియెవరితో సంధి?

రాజ—మహారాజసుచంద్రునితో.

సరియైనమాటయని భీమనాథుఁడు తల యూఁచెను. రాజకాళి నిష్క్రమించెను. నిశంభువుమాత్రము రాజకాళిమాటవలన మాఱలేదు. సుచంద్రుని సంధిసూచనను తిరస్కరించుటకే మఱియొకసారి యాజ్ఞాపించెను.

## పదునాఱవ ప్రకరణము

“కితవునకే దక్కు కిరణాలభామ”

భారద్వాజ భవనంది సర్వశాస్త్రములం దాచార్యపురుషుఁడని యింతకుముందే తెలిపియుంటిమి. అతనివయస్సిప్పుడు డెబ్బదిసంవత్సరములు. అతఁడు పండితుఁడే గాక లోకానుభవముగల వ్యవహారనిపుణుఁడు. స్వార్థపరుఁడైనను పాపభీరువు. లోభియైనను పర

ద్రవ్యాశావర్జితుఁడు. రూపవంతుఁడుగా నుండియు పరదారాభిలాషవర్జితుఁడై తనపూర్వవయస్సంతయును గడపిన సచ్చరిత్రుఁడు. అమితభాషియైనను సత్యవంతుఁడు. నిత్యాగ్నిహోత్రియగు కర్మఠుఁడు. ఇప్పటికిని చెడని శ్రోత్రనేత్రదంతపాటవము గలవాఁడు.

సోమవారమునాఁడు రాత్రియే భోజనానంతరము భవనంది శయనశాలలో నతిథియు, బంధువు నగు కాశ్యపసుమిత్రునితోఁగూడ చాపపైఁ గూర్చుండెను. పరిశుద్ధమగు నతని యంతరాత్మవలె దీపము వెలుఁగుచుండినది.

సుమిత్రుఁడు కనకపురవాస్తవ్యుఁడు. భవనందికి మేనత్తకొడుకు. కనకపుర దుర్గపాలకుఁడగు సామంత విజయసేనుని పురోహితుఁడు. తన యజమానుని పనిపై రాజధానికి వచ్చియున్నాఁడు. పాండిత్య చాతుర్యములందు భవనందికి సమానుఁడు. సుమారేఁబదియైదు సంవత్సరములు వయస్సు గలవాఁడు.

భవనంది జంబీరఫలచ్ఛాయుఁడు. సుమిత్రుఁడు జంబూఫలవర్ణుఁడు. భవనందిముఖము ప్రసన్నము. సుమిత్రుని ముఖము గంభీరము.

భవనంది—బావా! నీయాగమనమునకేదియో గొప్ప కారణ ముండవలెను. దానిలో నీకు నే నేమియైన సహాయము సేయఁగలుగుదునని నీవు నమ్మునెడల నాతో సంగతినంతటిని చెప్పుము. నిరర్థకముగా స్వకీయ కార్యరహస్యముల నింకొకరితోఁ జెప్ప నలవాటు నాకు లేదు గాన నేనుగూడ పరుల నట్లు సేయుటకు కోరువాఁడనుగాను.

సుమిత్రుఁడు—ఈ రాజధానిలో నీసాహాయ్యము లేక నే నే కార్యము సేయఁగలను? ముందుగా నీ వొక విషయము తెలుసుకొనఁగోరెదను. నేను వచ్చిన పని నా స్వకీయము గాదు. నా యజమానుఁడు నన్నొక కార్యము నిమిత్తము పంపియున్నాఁడు. నేను కార్యము సాధించుకొని వెళ్లఁగలుగు నెడలయజమానుని సన్నిధిలో నా గౌరవ మతిశయించుటయే గాక దానివలన నాకు కొంత యర్థలాభము గూడ కలుగవచ్చును.

భవ—నా బాంధవునకు గౌరవార్థలాభములు సమకూర్చు కార్యములో సహాయపడుట నా కెంతయు సంతోషదాయకముగా నుండును.

సుమి—కొలఁది మాసముల క్రిందట నా యజమానుని ధర్మపత్ని కాలధర్మమొందినది. ఇప్పు డతని వయస్సు ముప్పది సంవత్సరములకు మించియుండదు. మహావీరుఁడు. రూపసి. దుర్వ్యసనవర్జితుఁడు. అతను మహాసంపద గుఱించి నీకు నేను వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. ఈ యుత్తరాయణము దాఁటకముందే ద్వితీయవివాహము చేసుకొనవలెనని యతని యుద్దేశము. రాజధానిలో తగిన కన్య దొరకునని యతని ప్రత్యాశ.

భవ—తగిన కన్య నెన్ను భారము నీకే విడిచిపెట్టఁబడినదా?

సుమి—ప్రాయికముగా నాకే విడిచిపెట్టఁబడెను. పిల్ల మంచి రూపవతిగా నుండవలెను. విద్యావతిగా నుండవలెను. అతనికి కావలసిన దింతియే.

భవ—కోటలో ముందుగా యత్నింపవలెనని యతఁడు చెప్పలేదా?

సుమి—వేలుమనుష్యుల ద్వారా యత్నించి విఫలుఁడయ్యెను. రాజుగారు కడిగినకాళ్లు కడగనన్నారఁట. అంతియేగాక కుండినులకు కుశికులతో సంబంధ మచ్చదన్నారఁట. వీ రుభయులును వసిష్ఠ విశ్వామిత్రుల సంతతివారుగదా! చండసేనపుత్రీ ఫలినివిషయములో గోత్రైక్యము ప్రతిబంధకమయ్యెను. అందువలన పైకే సంబంధము చూడవలసియున్నది. అందులో నీవు పిల్లనిచ్చిన రాజసంబంధము లభించినట్లే యతఁడు సంతోషించును.

సుమిత్రునివాక్యము ముగించినదో లేదో యాకిటికి సందునుండి కొన్నిపాటలు స్పష్టముగా వారికిఁ వురికిని వినిపించినవి.

వీరునకే డక్కు— వీరయూ యువతి
చోరునకే డక్కు— భీరువౌ సుదతి
ధీరునకే డక్కు— దిట్టయౌ నారి
మారునకే డక్కు— మాయలమారి.
భద్రునకే డక్కు— బంగారులతిక
రుద్రునకే డక్కు— రోగాలకణిక.
రంగనికే డక్కు— రంగైనపక్షి
సంగనికే డక్కు— చించాదలాక్షి.
బలశాలికే డక్కు— వరరత్నమాల
ఖలనేతకే డక్కు— గానాలబాల.
కనరునకే డక్కు— కాముని సేన
మనుజునకే డక్కు— మహనీయచాన.
చతురునకే డక్కు— శ్యామాంగిరామ
కితవునకే డక్కు— కిరణాలభామ.
బంగారుపురమేలు భాగ్యవంతునకు
శృంగారరసమేలు చిన్నదే డక్కు.

పాటలు ముగించువఱకు నిద్దఱును నిశ్శబ్దముగా నుండిరి.

సుమి—బావా! ఎవ రీపాటలుపాడు వ్యక్తి? శ్రీకంఠమువలె నున్నది. ఇవి యాశురచిత ద్విపదలువలె కన్పట్టుచున్నవి.

భవ—ఈమె పేరు రాజకాళి. ఉన్మత్తయైనను తప్పులులేని యాశుకవితాధార గలది. అప్పుడప్పుడు రాత్రివేళలందు మాయరుఁగుపై వచ్చి పండుకొనుచుండును పగలెల్ల వీథుల వెంబడి తిరుగును. ఈమె మహాయోగీశ్వరి యని నమ్మువా రనేకు లీపట్టణమున నున్నారు.

సుమి—ఈమె మహాకవీశ్వరి యనియే చెప్పవచ్చును. ఈమెపాటలో గూఢార్థమున్నది. కేవలోన్మత్తప్రలాపములు గావివి. ఈమె మహాయోగీశ్వరియగునో గాదో గాని యున్మత్తగాదని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈమె మన మాటుకొనుమాటలు విని ప్రకరణోచితముగా నీపాటలు రచించి పాడినది. బంగారుపురమేలు భాగ్యవంతుఁడనిన మా యజమానుఁడే యగును. ఈమెదృష్టిలో శృంగారరసమేలు చిన్నది యెవరో?

భవ — ప్రతికన్యకయు శృంగారరసమేలు చిన్నదే యగును. ఇట్టిపాటల కర్థమునెట్లు తీసిననట్లు వచ్చును. (తనలో) ఈమె మా భానుమతిని కిరణాలభామయను పదముచే నుదాహరించినదియని తోఁచుచున్నది. దీనిభావములో కితవుఁ డెవఁడో? కౌండిన్య

నగధరుఁ డేమో? వాఁడు చక్కఁగానే చదివి నాఁడు. ఆయుధవిద్యలందుఁగూడ సుశిక్షితుఁ డైనాఁడు. ప్రయోజన మేమి? దుస్సహ వాసమువలన చెడిపోయినాఁడు. పిత్ర్యమైన యఖండమగు నాస్తిని పాడుచేసివేసినాఁడు. దినవెచ్చమునకుఁగూడ వాఁడు కష్టపడవల సినకాలము వచ్చినది. ఇప్పటికిని ద్యూతము మానఁడు. ద్యూతము మానినట్లు తెలిసినఁ గాని వాని కెట్టి యుద్యోగముగూడ నీయఁ గూడదని రాజుగారు శాసించియున్నారు. వాఁ డీయున్మత్తకవీశ్వరి నాశ్రయించు చుండు ను. వానికి నాకూఁతు నీయవలెనని యీయామె భావినిర్ణయ వ్యాజముచే సూచించుచున్నది. అది యెట్లు సాధ్యమగును?

సుమి—ఈమె యే కులస్థురాలు?

భవ—వర్చస్సు చూచిన బ్రహ్మజాతీ యురాలనియే తెలియును. జటాముని తన తండ్రి యని వ్యంగ్యమగునట్లీమె యీదిన ముస జరిగిన సాక్షరనారీసభలో వచించినది. అదియే వాస్తవ మగునెడల నా కీమె భావ కూఁతురగును. మాస్యాలకుఁడు కంకోలుఁడే జటాముని యని నే ననేకానుమానములను బట్టి నిర్ధారించితిని.

సుమి— బావా! శృంగారరస మేలు చిన్నది యెవరో యీయామెనే యడిగి చూచె దను. ఏమి చెప్పునో?

భవ—మఱి నాలుగు పాటలల్లి నిన్ను మఱింత యంధకారములో ముంచును. అయి నను అడిగి చూడుము.

సుమి—(కిటికి దగ్గఱకు వెళ్లి) రాజ కాళమ్మా! ఎవ రా శృంగారరసమేలు చిన్నది?

రాజకాళి—బాబయ్యా! వినుము.

ముగ్ధాంగి నవ్విన ముత్యాలు వ్రాలు
  దగ్గఁజొ మదనుఁడు తనువుతో. లేచు.
జలజాక్షి చూచిన జనులకు విందు
  జలజాతబాణుని జయభేరి మ్రోఁగు
సుమకోమలి వచింప సుధవానకురియు
  శ్రమలెల్లఁదీరును శ్రవణవంతులకు
వరనారి నడిచిన వసుధయుప్పొంగు
  స్మరుఁడు నడుచు వెన్క సామంతుఁడగుచు
బంగారుబొమ్మయే ప్రాణాలతోడ
  శృంగారరసమేలు చిన్నదై వెలసె.

భవనంది చెప్పినట్లే యయ్యెను. సుమి త్రున కేమియును విశేషము తెలియలేదు. కిటికిసందులోనుండి యా యున్మత్త కవీశ్వ రిని జూచినాఁడు. ఇదియే యతనికి తెలిసిన విశేషము. చంద్రసేనునియింటినుండి యిప్పుడే యీయామె యిచ్చటికి వచ్చినది. సుమిత్రుఁడు తిరిగియు వచ్చి తన బావదగ్గఱ కూర్చుం డెను.

భవ—ఏమినైన నామెయుద్దేశము తెలిసినదా?

సుమి—తన రమణీయ కవితను మన దగ్గఱ ప్రదర్శించుటయే యీయామెయుద్దేశము. అది యట్లుండనిమ్ము. మనసుభ్రాంగి గురు కులములో సుశిక్షితలైన సుందరకన్య లెంద రున్నారు?

భవ—చాలమంది యున్నారు. వారిలో ముఖ్యమైనవారిని కీర్తించెదను. లెక్కపెట్టుకొనుము. రాజకుమారి రథిని, రాజ్ఞీభగిని పద్మావతికూఁతురు ఫలిని, గౌతమహిరణ్యనాభుని కొమారితె కనకవల్లి, సాలంకాయన సముద్రదత్తుని కొమార్తె మధువాణి, నా పుత్రి భానుమతి, మా మామయ్య కంకోలుని మనుమరాండ్రు పూర్ణామణిమాలలు, మార్గల్యహేమచంద్రుని తనయ విలాసవతి, కాశ్యపసుదర్శనుని దుహిత ధరణి, కాశ్యప ధ్రువకీర్తికన్యక కామసేనయును. భార్గవ విశాలాక్షుని పుత్రిక కుముదాక్షి వీరితో సమానురాలు. ఆపిల్ల తనతండ్రియొద్దనే చదివినది. చదువు లేకపోయినను హారీత వీరభద్రావధానిపిల్ల పద్మాక్షి మంచిచక్కని కన్యకలలో జమ.

సుమి—రథినీఫలినులకు తరువాత మన భానుమతియే తక్కినవారికంటె శ్రేష్ఠ యని నాకు తోఁచుచున్నది. ఆపిల్ల మహాసుందరి యనుటలో నాకండ్లే ప్రమాణము. శాస్త్రములలో గొప్ప విద్వాంసురాలు. ఎన్నఁదగిన మహాకులమునందు పుట్టినది. ఇంకేమి కావలెను? నీ వంగీకరించినఁ జాలును. నేను మా యజమానుని బోధపఱచెదను.

భవ—కుటుంబస్థుల మందఱ మొక సారి యాలోచించుకొని రేపు సాయంకాలము నీకు బదులుచెప్పెదను.

సుమి—అట్లే కానిమ్ము.

ఇంతటితో వారిమాటలు ముగించినవి. అనంతరము వా రిద్దఱును పండుకొనుటకు లేచిరి. తనబాంధవునకు గొప్పసంబంధము కుదురుచున్నదని సుమిత్రునితృప్తి. భవనంది దృష్టిలో నాసంబంధము నాల్గవ రకముగా నున్నది. సింహాసనోత్తరాధికారియగు రాజుగారి జ్యేష్ఠపుత్రుఁడు భోగనాథుఁ డతని దృష్టిలో మొదటిరకము. రెండవ పుత్రుఁడు శక్తిధరుఁడు రెండవ రకము. ఆచార్యవిషమ సిద్ధి కుమారుఁడు ధనంజయుఁడు మూఁడవ రకము. ఆమూఁడు సంబంధములలో నొకటి లభింపనపుడు కనకపురీశ్వరుని సంబంధము నంగీకరింపవచ్చునని భవనంది తలంపు.

## పదునేడవ ప్రకరణము

"చంద్రబింబమునుండి విషోద్గారమా?"

సుచంద్రభట్టారకుని తాత కమలేశ్వరుని తమ్ముఁడు కుముదేశ్వరుఁడు. రాజ్యస్థాపనానంతరము పర్వతస్వామి భట్టారకుఁడు తన పినతండ్రి కవిభాజ్యమును, జ్యేష్ఠపరంపరాయత్తము నగు నొక సంస్థాన మిచ్చి గౌరవించెను.

కుముదేశ్వరున కిద్దఱుకుమారులు. పెద్దవాఁడు సర్వసిద్ధి. రెండవవాఁడు శాంతినాథుఁడు. సర్వసిద్ధికుమారుఁడే సుప్రసిద్ధుఁ డగు నాచార్యవిషమసిద్ధి. అతఁ డిప్పుడు తన పూర్వుల సంస్థానము ననుభవించుచున్నాఁడు. అతనికుమారుఁడు ధనంజయుఁడు వీర యువకుల ప్రథమశ్రేణిలో వెలుంగుచున్నాఁడు. శాంతినాథునికొడుకు శుచింధరుఁడు. శుచింధరుని కొడుకే జూదరినగధరుఁడు. శాంతినాథునివంశమునకు నతఁ డొక్కఁడే యిప్పుడు కన్పట్టుచున్నాఁడు.

నగధరునియొద్ద జనులందఱును తెలిసికొనిన దుర్గుణము జూదరితనము. అది యతఁ

రులకు బాధకము గాకపోయినను గొప్పది యగు తన కుటుంబాస్తికి ధ్వంసకమైనది. ఇతరులకు బాధకమగు మఱియొక దుర్గుణ మతని యొద్దఁ గలదు. అది ప్రచండమగు దొంగతనము. చాలమందికా విషయము తెలియదు.

పరంతప సంఘములో దొంగతనము సేయు సంపంతయు చేరి నూఱుమంది. ఆ నూర్వురి కధ్యక్షుఁడు భీమనాథుఁడు. ఉపాధ్యక్షుఁడు జంభుఁడు నూర్వురిలోనివాఁడే యగును. తక్కిన తొంబది తొమ్మండ్రుగురు తొమ్మిది వర్గములుగా విభజింపఁబడిరి. ఒక్కొక్కవర్గములో పదుగురేసి భటులు, నొకవర్గపతియు నుండిరి. అట్టి పరంతపసంఘ చోర వర్గపతులలో మన నగధరుఁ డొకఁడు. సంఘమువారు వర్గపతికి నెలకు ముప్పదేసికార్షాపణములు (రూప్యములు) జీతమిత్తురు. ఆ ముప్పదికార్షాపణములలోఁగూడ నగధరుఁడు గృహనిర్వహణార్థము పదునైదు కార్షాపణములుమాత్రమే తల్లిచేతి కిచ్చుచుండును. తక్కినవి ద్యూతశాలకు ధార. పోయిన సంపద యంతయు ద్యూతమువలననే తిరిగి యు సంపాదింపఁగలనని యతని యాశ. అతనిది యొక చిన్న వ్యాయామశిక్షణశాల గలదు. బ్రాహ్మణ బాలకులును నాగబాలకులును గూడ నాశాలలో వ్యాయామము నేర్చుకొనుచుందురు. నాగబాలకులు మాత్రము జీతమిచ్చుకొనుచుందురని యతఁడు జనులకు చెప్పుమాట. అది సర్వాబద్ధము. తన ధన సంపాదన శుద్ధమైనదియే యని జనులకండ్లు కప్పుట కతఁ డవలంబించిన త్రోవ యది. ఆ యసత్యములో నాగబాలకుల సంరక్షకు లతనికి తోడ్పడుచుండిరి. అత్యంత దరిద్రస్థితిలో తన కుద్యోగమీయ నిరాకరించినందున రాజుగారిపై నతనికి ద్వేషము కలిగినది. అదియే యతఁడు పరంతప సంఘములో చేరుటకు హేతువయ్యెను.

నగధరునకు భీమనాథునిపై నపారభక్తి. శివకీర్తితో ప్రాణస్నేహము. అజ్ఞాతరూపుఁడగు నిశంభుని నామముపై నధికగౌరవము. రాజకాళీ పూర్ణాపర్ణిను లతనిదృష్టిలో మహాలక్ష్మీ మహాసరస్వతులు. భానుమతి మానవీరూపధారిణియగు రతి. అతఁడామెను ప్రాణములకంటె నెక్కువగా ప్రేమించుచున్నాఁడు. అతఁడు భవనంది గురుకులములో చదివినంత కాలము తనదృష్టులచే భానుమతి నర్చించుచుండెడివాఁడు. తన ప్రియోక్తులచే నామె నారాధించుచుండెడివాఁడు ఆమె యేదియైన చిన్నపని చెప్పిన మహాప్రసాద మని భావించి చేయుచుండెడివాఁడు. ఆమె 'బావా' యని పిలిచిన దేవత వరమిచ్చినట్లు సంతోషించుచుండెడివాఁడు. ఆకాలము గడచిపోయినది. ఇప్పుడాచార్యుని యింటికి తాను వెళ్లుటకు సందర్భములు తక్కువ. అయినను తాను ప్రేమించినకన్య నతఁడు తన హృదయపీఠములో నుంచుకొని పూజించుచునేయున్నాఁడు. అతని కాయుత్కృష్ట కన్యారత్నమును పొందవలెనని గాఢమగు కోరికగలదు. ఇప్పుడతఁడు దానిని బయట నుచ్చరించుటకుఁగూడ తగినస్థితిలో లేఁడు. అట్లయ్యు నతఁడు తనకోరిక నుపహరించుకొనలేదు. అతని ప్రాణస్నేహితుఁడును, మేనమామకుమారుఁడు నగు శివకీర్తి యతనితో నిట్లు చెప్పుట గలదు.—"బావా! ఉన్మాదలక్షణ

ములు రెండు నీయందు కలవు. వాటిలో ద్యూతమువలన నష్టైశ్వర్యమును తిరిగియు సంపాదింపఁగల ననునాశ మొదటిది. ఆచార్య భవనందికూఁతురు భానుమతిని పెండ్లాడెద నను మనోరథము రెండవది. ఈ రెండును నీ వెప్పుడు విడిచిన నప్పుడు నీకు మనశ్శాంతి కలుగును." ఆమిత్రుని యుపదేశమునకు నగ ధరుఁ డిట్లు బదులుచెప్పెను—"ఆ రెండే నా ప్రాణములను నిలిపియున్నవి. వాటిని నే నెట్లు విడువఁగలను ?"

సోమవారమునాఁడు రాత్రి నగధరునకు భానుమతికి పెండ్లిమాటలు జరుగుచున్నవి యని తెలిసిపోయినది. ఆసంగతి నతని చెవిలో వేసినవాఁడు శుకనాసుఁడు. కనక పురేశ్వరునకు భానుమతి దగ్గఱ దగ్గఱ నిశ్చ యింపఁబడినట్లే యెంచవచ్చునని శుకనాసుఁడు చెప్పెను. "అభాగ్యుడా! నీవు ప్రేమించిన పిల్ల దాఁటిపోవుచున్నదిరా" అని శుక నాసుఁడు చెప్పినమాటకు తాత్పర్యార్థముగా నుండెను. నగధరుఁ డావతిన్న పసరమువలె నేమియుతోఁచక తనప్రాణమిత్రుఁడు, నాప్త బంధువు నగు శివకీర్తితో నాలోచించుటకు మేనమామ దేవకీర్తిగారింటికి వెళ్లెను. అచ్చట తనమేనబావ కన్పట్టుటలేదు. పిమ్మట నతఁడు భీమనాథుని కలుసుకొనుటకు కర్ణియింటికి వెళ్లెను. అచ్చట భీమనాథుఁడు కనిపించ లేదు. అతఁ డున్మత్తుఁడువలె భవనందిగారి యింటివాకిటికి వచ్చెను. భానుమతి కనిపిం చిన దీనముగా నామెను యాచింపవలె నని యతని యుద్దేశము. అది సంభవమా? అప్ప టికి సుమిత్ర భవనందుల సంవాదము ముగిం చినది. ఇంటిలోపల భానుమతితక్క తక్కిన వా రందఱును నిద్రపోవుచున్నారు. అరుఁగు మీఁద రాజకాళి కూర్చుండి యున్నది. రిత్తగా కూర్చుండలేదు. శివోపస్థాన మిట్లు చేసుకొనుచుండినది —

రంగుమీఱఁగవచ్చి రమకౌగిలింప
బంగరుపుంఖపు ప్రభకైతవముచె
కాలంబువచ్చు నాఁకలిదీరునంచు
గాలినెయ్యుండు ముఖంబునడాఁగ
తూణీరరూప పాథోరాశియందు
బాణరూపంబునఁ బవళించుహరిని
గారవమున లేపి కరమున నంది
స్ఫారసునీరు చాపంబునఁగూర్చి
చికురరూపంబగు జేజేల దారి
శకటరూపంబగు క్షమయును గదల
శకటాంగవేషభృచ్చంద్రార్కరుచుల
ప్రకటాట్టహాసప్రభలు మించి పర్వ
హుంకారబోధిత మునునభోవాటి
నోంకారపటునాద ముగ్రమై వెలయ
ధనురాయ మన చండధాటికి నదరి
మినుకులు గుట్టాలు మేనులు వంప
జయము నీకగుఁగాక శంకరయనుచు
హయుచోదకుఁడు బ్రహ్మయాశీర్వదింప
ఒక్కయేటున మూటి నుగ్రపురముల
ద్రుక్కడఁగించిన ముక్కంటిఁ గొలతు.

రాజకాళిని చూడఁగానే నగధరునకు కొంచెము ప్రాణము వచ్చినట్లయినది. అతఁడు మెల్లగా నామెను సమీపించి వినయముతో నిట్లు ప్రశ్నించెను!

"అమ్మా! పాట పాడుకొనుచున్నారా?"

రాజ—పాడక నేనేమి చేయునది?

ఊసుపోవంగ బాట యుబ్బంగఁబాట
కాసుగూర్చంగఁ బాట కలియంగఁబాట
పాములాడఁగఁ బాట పనిసేయఁబాట
భామ నోర్వఁగఁబాట పతిఁగొల్వఁ బాట
దారి దాటఁగఁబాట దరిఁజేరఁబాట
నారి మెచ్చఁగఁబాట నరునాఁపబాట
పాటయే లేనిచోఁ బాడౌను జగము
పాటయే లేనిచో బ్రతుకేది మనకు
పాటచే నింద్రుఁడు పాలించు జగము
పాటచే జీవుఁడు పాలించు తనుపు
పాటచే సిద్ధించు భగవంతు భజన
పాటయే శరణము పాపతప్తునకు
గతిలేనివారికి గానమే దిక్కు
మతిలేనివారికి మాటలే టక్కు.

నగ—అమ్మా! అట్టి పాటచే మహా పత్తులో మునిఁగియున్న న న్నుద్ధరింపుము.

రాజ—దుక్కలా గున్నావు. నీకు వచ్చిన మహాపత్తేమి?

నగ—(లజ్జవిడిచి) నాప్రాణేశ్వరి నింకొక రపహరించుచున్నారు. అంతకంటె నాపద యేది?

రాజ—నీకు పెండ్లి జరిగిపోయినదా? నా కింక నాసంగతి తెలియు లేదు.

నగ—భావనాప్రపంచములో నాపెండ్లి ముగించిపోయినది.

రాజ—హృదయములో దాఁగియుండిన నీ భావనాప్రాణేశ్వరి నెవ రపహరింపఁగలరు? అబద్ధమాడుచున్నావు.

నగ—అసలు ప్రాణేశ్వరి యపహరింపఁ బడుచుండఁ భావనాప్రాణేశ్వరి నాహృదయ ములో నుండి నన్ను మఱింత దహించును.

రాజ—అప్పుడు నీవు తగులఁబడకుండ రాజకాళి వచ్చి నాలుగుకుండలునీరు నీగుండె లపై పోయఁగలదు. నీకు భయములేదు. ఇంటికివెళ్లి నిద్రపొమ్ము.

నగ—ఆమె యపహరింపఁబడినపిమ్మట మీరు నూఱుకుండలు నీరు నా గుండెలపైఁ బోసినను ప్రయోజనముండదు. అపహరింపఁ బడకుండ నన్ననుగ్రహింపఁగోరెదను.

రాజ—అనుగ్రహించుటకు నే నేమి దేవతనా? పచ్చిమనిషిని. రక్తమాంసము లతో నుండు మనిషిని. రెండుచేతుల మని షిని. రెడుకండ్ల మనిషిని.

నగ—మహాశక్తియే రెండు చేతుల మహిళగా నవతరించెనని నిన్నెఱిగినవారు చెప్పెదరు. అనుగ్రహించినఁగాని తమ పాద సన్నిధిని నేను విడువను.

రాజ—నేనుగా నున్మత్తను. నావంటి యున్మత్తను దేవతనుగా నమ్ము నీ వంటి యవి వేకులే యున్మత్తులు. అయినను నీవనుగ్ర హింపుమని చెప్పుచున్నావు గనుక నేను నిన్ను ప్రశ్నించెదను. నీవు ప్రేమించిన కన్య దేవతయా? మానవియా? పశువా?

నగ — నాకు తమప్రశ్నల తాత్పర్య మేమియును బోధపడుట లేదు. కన్నతల్లి కంటె నధికురాలగు నాయిష్టదేవతయొద్ద నాకు రహస్యమేల? భవనంద కూఁతురు భానుమతిని నేను ప్రేమించితిని. ఇంటివా

రామెను కనకపురేశ్వరున కీయ నిశ్చయించుకొని యున్నారఁట. అది యట్లు జరుగునెడల నే నాత్మహత్య చేసుకొనవలసిన దే.

నగధరుని వాక్యము పూర్తియైనపిమ్మట హఠాత్తుగా తలుపుతీసుకొని భానుమతి యరుఁగుమీఁదికివచ్చి యుద్రేకముతో నిట్లు పలికినది.—

"అది యట్లు జరుగుట సంశయమే యైనను నీ వాత్మహత్య చేసుకొను నెడల చింతించువా రెవ్వరు నుండరు. అంతటితో ఘనత చెందిన కుండినుల రాజవంశముయొక్క మచ్చ తుడుచుకొనిపోవును. పదిలక్షులవరాలకు తక్కువకాని పిత్ర్యమైన యాస్తిని ధ్వంసము చేసితివి. తల్లియొక్క బోలెకు నగలను మంటిలోఁ గలిపితివి. పూజ్యులగు పెత్తండ్రి యాచార్యవిషమసిద్ధి కండ్లకు కన్పట్టకుండ దొంగవలె తిరుగుచున్నావు. ద్యూతవ్యసనము మానిన నుద్యోగమిచ్చెదనని పెత్తండ్రి మహారాజు చెప్పినను వినక నాగులజీతపురాళ్లతో ద్యూతము నింకను సాగించుచున్నావు. నీతల్లికి కడుపునిండ తిండి లేదు. కంటినిండ నిద్రలేదు. ఇట్టి నీకు భవనంది కూఁతురను కోరుటకు లజ్జలేదా? సిద్ధకపీశ్వరి నోటినుండి యనుకూలమగు మాట తెప్పించుటకు దుష్ప్రయత్నము సేయుచున్నావు." (రాజకాళినిజూచి) "వదినా! నీ వీ దుర్వ్యసనాంధు నాశీర్వదింపవలదు. నే నెంతమాత్రము వీనిని పెండ్లియాడను. వీఁడే యాత్మహత్య చేసుకొను నెడల నాలుగు కన్నీటి బిందువులచే నాదుఃఖమును కడిగి వేసికొనెదను."

ఆ మాటలు విని రాజకాళి తెలిసియు తెలియనట్లు లేచి యచ్చటినుండి వెళ్లిపోయినది. "చంద్రబింబమునుండి విషోద్గారమా?" యనుచు నగధరుఁడు బిక్కసొచ్చిపోయినాఁడు.

భానుమతి తన తండ్రికి సుమిత్రునితోనైన సంవాదమునుగాని యప్పుడు రాజకాళి పాడిన పాటలుగాని వినియుండలేదు గాని సుమిత్రుఁడు పెండ్లిమాటలకే వచ్చియున్నాఁడని మాత్రము తెలుసుకొన్నది. ఆమెకు కనకపురసంబంధ మంతగా నిష్టములేదు. అందువలన పడకపై పండుకొనినను ఆమెకు నిద్రపట్టలేదు. ఆ సందర్భములో నామెకు రాజకాళిని చూచి మాట్లాడవలెనని బుద్ధి పుట్టినది. రాజకాళి తను యరుఁగుపై పండుకొనుటకు వచ్చెనని మాత్ర మామెకు తెలిసినది. వీథితలుపు గడియపెట్టుటకు వచ్చినపుడామె చూచినది. ఆమె లేచి నడవలోనికి వచ్చుసరికి రాజకాళీ నగధరుల సంవాదధ్వని వినఁబడెను. నగధరుని ప్రార్థన వినినపిమ్మట రాజకాళినోటినుండి యనుకూలాశీర్వచనము వచ్చునేమో యను భయముచే నామె హఠాత్తుగా ప్రవేశించి యిట్లు పలికినది. రాజకాళి వాక్సిద్ధురాలని యామెకు తెలుసును. ఆమెయాశీర్వచనము ముందే నగధరునకనుకూలముగా వెలువడియుండెనని భానుమతికి తెలియదు. రాజకాళి వెళ్లిపోయిన పిమ్మట భానుమతి యావిశాలస్థలములో నగధరునితో కలిసియుండనొల్లక తలుపు వేసుకొని లోపలకు వెళ్లిపోయినది. నగధరుఁడు కొన్నిక్షణము లంధకారమధ్యమునఁ గూలఁబడియుండెను.

## పదునెనిమిదియవ ప్రకరణము

### రాజకాళి దీవన

కొన్ని క్షణములకుఁ బిమ్మట దెబ్బ తినిన మనిషివలె నాయాసముతో మెల్లగా నగధరుఁ డరుఁగుమీఁదినుండి లేచి భవనంది యిల్లు విడిచినవాఁడయ్యెను. ప్రాయికముగా నతనియాశ యస్తమించినను చిన్న యొక కిరణము మాత్రము మందముగాఁ గన్పట్టు చుండెను. "వీఁడే యాత్మహత్య చేసుకొను నెడల నాలుగు కన్నీటి బిందువులచే నా దుఃఖమును కడిగివేసికొనెదను." అని భానుమతి పలికిన యుపసంహారవాక్యమే యా కిరణమును నిలిపినది. తనయందు ప్రేమయే లేని యెడల తాను చచ్చిన నశ్రుబిందువులు రాల్చుట యెందుఁకు?

నగధరుఁ డింటికి వెళ్లలేదు. రాజకాళిని సంధించి తిరిగియు వేడుకొనవలెననియే యతనికి సంకల్పము పుట్టెను. రాజకాళి రాత్రులందు నిద్రించు స్థలములు నాలుగు. ఒకటి ఆచార్యభవనందిగారి యరుఁగు. ఇంకొకటి చంపావతిగారి యరుఁగు. మఱియొకటి కర్ణిగారి యరుఁగు. వేఱొకటి సేనాపతిగారి సావడి.

ఇప్పుడు నగధరుఁడు చంపావతిగారింటికి వెళ్లెను. వారి వీథియరుఁగుపై రాజకాళి కన్పట్టుటలేదు గాని దేదీప్యమానమూర్తి యగు పూర్ణ కన్పట్టినది. పూర్ణ గూడ నగధరుని చూచెను. నగధరునితల్లి వసుంధర పూర్ణతండ్రి సత్యరథునకు పినతల్లికూఁతురు. అందువలన నగధరుఁడు పూర్ణ కొక వేలు విడిచిన మేనబావ. ఆవేళయందు నగధరుఁడు వచ్చుట పూర్ణ కాశ్చర్యము కలిగించెను అప్పటికి సుమారు పదునాలుగు గడియల రాత్రియైనది. నగధరుఁ డరుఁగుదగ్గఱకువచ్చి నిలువఁబడియుండెను.

పూర్ణ—బావా! కూర్చుండుము.

నగ—ఈ యభాగ్యుని నీవు కూర్చుండు మనుచున్నావా? నేను నీయొద్దఁ గూర్చుండుటకు తగినవాఁడనుగాను.

పూర్ణ—ఏమి యంత దుఃఖముగా నున్నావు? అమ్మ నిమ్మళముగా నున్నదా?

నగ—ఆమె ప్రాణములతోడనే యున్నది. మఱఁదలా, నా యాస్తియంతయును పోయినది. దానికి నేను చింతింపలేదు. రాజుగారు నా యుద్యోగ మీయ నిరాకరించిరి. దానికిని నేను చింతింపలేదు. నాసోదరులు భోగనాథశక్తిధరధనంజయులు నన్ను కుక్కకంటె నన్యాయముగా చూచుచున్నారు. దానికిని నేను చింతింపలేదు. నేను మహైశ్వర్యముతో నుండుకాలమున ప్రతిదినము నాయింట భోజనముసేయు బ్రాహ్మణులు పాఱవేసిన పదార్థముపాటి సంవత్సరాదాయము గలవారు నన్ను జూచి యిప్పుడు పరిహసించుచున్నారు. దానికిని నేను చింతింపలేదు. నేను ప్రాణములకంటె నధికముగా ప్రేమించినకన్య—నాహృదయములో నిత్య మారాధింపఁబడుచుండిన కన్య—తప్పక నా గృహేశ్వరి యగునని నేను సర్వకాలములందు నమ్మినకన్య నన్ను పరుషోక్తులతో తూలనాడి తిరస్కరించినది. నేను జూదరినే యగుదునుగాక. అంతమాత్రమున పట్టణమంతయు నన్ను బహిష్కరింపవలెనా? ద్యూతములో

గెలుచుచు తమసంపద నభివృద్ధిపఱచినవారు సంఘములో పూజింపఁబడుచునేయున్నారు. నాసంపద పోయినందున నేను సంఘముచే తిరస్కరింపఁబడితిని. రాజుచే తిరస్కరింపఁబడితిని. సోదరులచే తిరస్కరింపఁబడితిని నేను ప్రేమించిన నాయికచే తిరస్కరింపఁబడితిని. నా దుర్గుణము దారిద్ర్యమేగాని జూదరితనముగాదు. నాయైశ్వర్యసమయములో నేను ఔదార్యాంధుఁడనై చేసిన దానధర్మముల నెవరైన గణించిరా? అప్పుడు నన్నపరకర్ణుఁడని పొగడిరి. ఇప్పుడు శవమునువలె జుగుప్సతో చూచుచున్నారు. నీ వాత్మహత్య చేసుకొనను చింతించువా రెవ్వరు నుండరని నా హృదయేశ్వరి యనినది ఆమా, విని నప్పటినుండియు నాప్రాణములు నాకు బరువై పోయినవి. భగవతి రాజకాళమ్మ నొకసారి చూచిపోవలెనని వచ్చితిని. ఆమె యాశీర్వచనమే నా కీరాత్రి దొరకనియెడల రేపు సూర్యోదయమును నేను చూడఁదలఁచు కొనలేను.

పూర్ణ—కూర్చుండుము భావా! నల యుధిష్ఠిరులు జూదమాడి రాజ్యము పోఁగొట్టుకొనలేదా? మాయింట మాత్రము నీపే రెప్పుడును నీచపఱుపఁబడలేదు. నీవు చేసిన దానధర్మములను గుఱించి మే మెప్పుడును చెప్పుకొనుచునే యుందుము. శక్తిధర ధనంజయులను నీవు నిందింపకుము. వా రిద్దఱును తండ్రిచాటు పిల్లలు. వారె తండ్రులు సాధారణులు గారు. గోదావరీతీరపు మధ్యప్రదేశములో నెదురులేని మాటగలవారు. ఒకఁడు రాష్ట్రమున కంతటికి ధర్మకర్త. మఱియొకఁడు శస్త్రముపట్టినవారి కెల్ల నాచార్యపురుషుఁడు. వా రుభయులును నీకు హితముచెప్పి విఫలులైరి. వారి యాజ్ఞ మన్నించుటకైనను నీవు ద్యూతము మానవలసియుండెను. అట్లు నీవు చేయఁజాలక పోతివి. అందువలన వారికి కోపము కలుగుట సహజము. తమతండ్రులను ధిక్కరించినవారితో స్నేహముసేయు సాహసము శక్తిధర ధనంజయులకు లేకపోయినది. ఆ సంగతుల కేమి? నీవు కూర్చుండుము. ప్రకృతము గుఱించి మాట్లాడవచ్చును.

నగధరుఁ డరుఁగెక్కి కూర్చుండెను.

పూర్ణ జరిగిన సంగతి నడిగినది. నగధరుఁడు దాపఱికమేమియు లేక యంతయును చెప్పెను. పూర్ణ యంతయును విని—

"బావా! ఆశగలదు. నీ వాత్మహత్య చేసుకొనవలసినంత యావశ్యకత తటస్థింపలేదు."

నగ—(కొంచెము సేదదేఱి) "ఆశగల దనుటకు గుఱు తేమి యున్నది?

పూర్ణ—రాజకాళమ్మ భానుమతి వేడికోలుతో సహానుభూతి చూపలేదు. నిన్నాశీర్వదింపవలదని భానుమతి వేడినది. ఆమెకు బదులుచెప్పకుండ యోగీశ్వరి యచ్చటినుండి వెళ్లిపోవుట భానుమతి వేడికోలు నామహాత్మురాలు తిరస్కరించినట్లే యగును. తన కిష్టము లేనపుడు రాజకాళమ్మ యట్లుసేయుట యలవాటు. కోపాంధతవలన భానుమతి తనకు జరిగిన యా యవమానమును గమనింపలేదు.

నగ—నాయందు యోగీశ్వరికి కరుణ యుండవచ్చును. అంతమాత్రములో కార్య సిద్ధి యగునా? ఆమెవాక్కు వెడలినఁగాని నాకు నమ్మకము కలుగదు.

వీరిట్లు మాట్లాడుకొనుచుండఁగా తల వని తలంపుగా రాజకాళివచ్చి యచ్చట ప్రత్యక్షురా లయ్యెను. ఇద్దఱును ప్రత్యుత్థా నముచేసి యామెను రాఁబట్టుకొనిరి. ఆమె యరుఁగుమీఁద కూర్చుండినపిమ్మట వా రామెదగ్గఱ భక్తితో కూర్చుండిరి.

రాజ—పూర్ణా! వైజయంతి అత్తయ్య గారి యరుఁగుపై పండుకొనుటకు వెళ్లితిని. మఱఁదలు భానుమతి యచ్చటినుండి నన్ను గంటివేసినది. సేనాపతిగారింటికి వెళ్లితిని. సావడిలో నెవ్వరును పఱుపువేసి యుంచలేదు. రథినీకుమారి తాతతో నేమియో రాజకార్య ములు మాట్లాడుచున్నట్లున్నది. అందువలన నేను మా వదినెగారింటికి వచ్చివేసితిని.

పూర్ణ — అత్తయ్యా! మాయింట పఱుపువేసెద మన్నను వేసుకొనవు. సేనా పతిగారింట పఱుపు వేయలేదని వచ్చివేసితివి. నీవిచిత్రచర్య యాశ్చర్యకరముగా నున్నది.

రాజ—ఇది నా పుట్టిల్లు. మా అన్న య్య సత్యరథబాబు వేయించిన చల్లనియరుఁ గు నాకు వెయిపఱుపులతో సమానము.

పూర్ణ—ఈ రోజున నేను నిన్నొక మాట యడుగవలెనని యున్నాను. స్పష్ట భాషతో నాకు బదులు చెప్పవలెను.

రాజ—అది స్పష్టమో అస్పష్టమో నాకు తెలియదు. నాకు వచ్చిన భాషతో నేను మాట్లాడెదను.

పూర్ణ—సరి. అట్లే కానిమ్ము. మీ తండ్రి కగచజబాబు ఎవరు ?

రాజ—మన వసుంధరగారి అబ్బాయి కార్యమేదియో చూచి మనము ముందు పంపించివేయుదుము. తరువాత మనము మాట్లాడుకొనవచ్చును.

పూర్ణ—ఇతని కార్యమేదియో యత్త య్యకు తెలిసినదా ?

రాజ—నాకు తెలియకపోలేదు.నాలుగు కాళ్లమనిషిగా మాఱవలెనని కోరు చున్నాఁడు.

పూర్ణ—(నవ్వుచు) మాఱునా ?

రాజ—ఇప్పుడు రెండుకాళ్ల పశువుగా నున్నాఁడు. ఆ పశుత్వము పోయినఁగాని నాలుగుకాళ్ల మనిషి కానేరఁడు.

పూర్ణ—ఇతఁడు రెండుకాళ్ల పశువా? అది యెట్లు ?

రాజ—వివేకము లేనివాఁడు పశువు గాక మనిషియగునా? వినుము వీని చర్యలు.

పెట్టెను తిండిని పెనుభూతములకు
తిట్టుచునున్నారు తినినవారిపుడు.
కట్టెను మేడను కంసాలు లుబ్బ
మట్టుట కెవ్వరు మనుషులు లేరు.
వీగెడు వేళలో విత్తములొడ్డె
నాగులకొంపలు నగరిలో నిండె.
ఆడుచునున్నాఁడు పాడుయాటింక
మాడుచునున్నది మహనీయ తల్లి.
ఠాణువచేరఁడు రాజు చెప్పినను
బాణాలతో విల్లుపడె నొకమూల.
మ్రొక్కుచునున్నాఁడు మూఢమానవుల

నెక్కువగానుండి హీనుఁడైనాఁడు.
స్రుక్కుచునున్నాఁడు సొత్తేమిలేక
త్రొక్కుచునున్నాఁడుదూష్యపూత్రోవ.

పూర్ణ—(తనలో) ఇతఁడు పరంతప సంఘములో చేరినాఁడా యేమి? దూష్యపూ త్రోవ త్రొక్కుచునున్నాఁ డనుచున్నది. (ప్రకాశముగా) ఇతనిని బాగుసేయ బాధ్యత యత్తయ్యది. (ఛందోబద్ధవాణి నాశ్రయించి)

మేఘమువలె నిచ్చి మెఱిసినవాఁడు
మోఘేతరంబుగ మ్రోగినవాఁడు.
నిండుపంక్తులలోను హండాలతోడ
పిండివంటలుచేసి పెట్టినవాఁడు.
పరధనంబెఱుఁగని పరిశుద్ధతముఁడు
పరనారిముట్టని పావనతముఁడు.
మాయమెఱుంగని మానేస్తకాఁడు
కాయవాక్చిత్తము ల్గలిసినవాఁడు.
వాలుఁగన్నులవాఁడు వాడలోనీఁడు
నాలుగుకాళ్లతో నడుచు నేనాఁడు.

నగ—(గద్గదకంఠుఁడై) అయ్యో! మఱఁదలా! అభాగ్యుఁడగు నన్ను నీ వట్లు పొగడి నీవాక్కును మలినపఱచుకొనవలదు. నే నిప్పుడు కాయముకొఱకు మాయ నేర్చుకొనుచున్నాను.

పూర్ణ—ఇట్లంగీకరించుట మాయలేమి గాదా? (రాజకాళిని జూచి) అత్తయ్యా! దీవింపు మీ దీనుని.

రాజ—నాప్రియమైన పూర్ణా! నీమాట కెదురాడుదునా?

మోసెడుకాళ్లకు మ్రోగెడుకాళ్లు
వేసెడుకాళ్లకు వెలిఁగెడుకాళ్లు.
సాగెడుకాళ్లకు చక్కనికాళ్లు
బాగైనకాళ్లకు బంగారుకాళ్లు.
ధావించుకాళ్లకు దన్నైనకాళ్లు
భావించుకాళ్లకు బలమైనకాళ్లు.
సేవించుకాళ్లకు సిరియైనకాళ్లు
కావించుకాళ్లకుఁ గామించుకాళ్లు.
పండించుకాళ్లకు వండెడుకాళ్లు
దండించుకాళ్లకు దడిసెడుకాళ్లు.
సాధించుకాళ్లకుఁ జల్లనికాళ్లు
రాధించుకాళ్లకు రంగైనకాళ్లు.
మేలైనకాళ్లకు మెత్తనికాళ్లు
లాలించుకాళ్లకు లాభించుకాళ్లు.
శ్రమమొందుకాళ్లకు శ్రమదీర్చుకాళ్లు
భ్రమియించుకాళ్లకు బంధించుకాళ్లు.
అడిగినకాళ్లకు నమరినకాళ్లు
కడిగినకాళ్లకు కళగలకాళ్లు.
ఆడెడుకాళ్లకుఁ బాడెడుకాళ్లు
తోడౌను కష్టాలు దూరంబులగును.

పూర్ణ—బావా! ఇంక నీకార్యము సిద్ధించినట్లే. నీవు వెళ్లి నిశ్చింతగా నిద్ర పొమ్ము.

నగధరుఁడు రాజకాళికి నమస్కరించి యతిసంతోషముతో నిష్క్రమించెను.

### పందొమ్మిదియవ ప్రకరణము

"కనుపాపలో నుండు కగచజబాబు"

పూర్ణ—అత్తయ్యా! నగధరుఁడు వెళ్లి పోయెను. కగచజబాబు గుఱించి యిప్పుడు చెప్పెదవా?

రాజ—కకారుఁడు గకారుఁడు చకారుఁడు జకారుఁడు వీరు నలువురును కలిసిన యొకసమష్టికి కగచజబాబని పేరు.

పూర్ణ—(నవ్వుచు) అట్లగునెడల మీ యమ్మకు నలుపురు భర్తలా ?

రాజ—మా అమ్మభర్త యొక్కఁడే. వానిపేరు గకారుఁడు. కకారుఁడు మీ నాయనమ్మ సిద్ధేశ్వరి పెనిమిటి. చకారుఁడక్షోభ్యముని తల్లికి మగఁడు. జకారుఁడు కర్ణికి రమణుఁడు. ఈనలువురికిని నామభేదమే గాని వ్యక్తిభేదము లేదుసుమా !

పూర్ణ—అక్షోభ్య భీమనాథులు నాపినతండ్రులా? ఆశ్చర్యములను వినుచున్నాను.

రాజ — మఱియొక యాశ్చర్యమును వినుము. శాంతిసేనభర్త యాంగిరసవిమలుఁడును నేను నొకతల్లి పిల్లలము. అతఁడు గకారుని కొడుకు. అతఁడు నీకు మఱియొక పినతండ్రి. ఇట్లు సత్యరథ విమలులు నా అన్నలు. అక్షోభ్య భీమనాథులు నాతమ్ములు.

విమలుని గుఱించి పూర్ణ కెన్నియో సంగతులు తెలుసును. అట్లయ్యు నతఁడు తనను పెంచిన తండ్రియగు సత్యరథునితమ్ముఁడని తెలియదు. విమలుఁ డామెకు మిక్కిలి పరిచితుఁడు. అతఁ డామె కెప్పుడు నీరహస్యమును వెల్లడించియుండలేదు. తనతల్లికిఁగూడ విమలుని పరిచయ మెక్కువగా నున్నది. ఆమెకుఁగూడ నీరహస్యమును విమలుఁడు చెప్పియుండలేదు గాఁబోలును. చెప్పియుండిన తన కామె చెప్పదా ? ఇప్పు డారహస్యమును రాజకాళి యుద్ఘాటించినది. పూర్ణ యాశ్చర్య సంభ్రమములతో నిట్లు పలికినది.—

“అత్తయ్యా ! మీ తండ్రి గకారుఁ డాంగిరస గణదాసా? చిత్రకూటరాష్ట్రము నందలి నందాపురమునందు సుప్రసిద్ధుఁడై వెలసిన గణదాసాగకారుఁడు ? మా తాత కంకోలుని యపరవేషమా గణదాసు ? మేఘస్వామి భట్టారకుని యల్లుఁడగు విమలుఁడు నీకు సాక్షాత్సోదరుఁడా ?

రాజ—ఔను. కంకోలుఁడే గణదాసు. విమలుఁడు నా సాక్షాత్సోదరుఁడే.

పూర్ణ—గణదాసుకు వేఱుసంతానము గలదా ?

రాజ—గణదాసుయొక్క మొదటిబిడ్డ విమలుఁడు. రెండవబిడ్డ నిర్మల. ఆ పిల్లను చిన్నతనములోనే కిరాతు లెత్తుకొనిపోయిరి. మా తండ్రియు మా తల్లి వనదుర్గయు తమ పిల్ల నష్టురాలయ్యెననియే నిశ్చయించుకొనిరి. అభాగ్యురాలగు మాతల్లి తన జీవితకాలములో నా పిల్లను తిరిగియు చూడలేదు. మా అన్న విమలుఁడు గూడ నిదివఱకు తన చెల్లెలిని కనిపెట్టియుండలేదు. విజాతీయుల గృహమున నజ్ఞానాంధకారమున మునిఁగియుండిన యా పిల్లను కొసకు జటాముని కనిపెట్టి వెలుతురులో వేసెను. ఆవిడయే నీయెదుట నిప్పుడు మాట్లాడుచున్నది.

పూర్ణ—(ఆశ్చర్యముతో) అత్తయ్యా ! మా కుటుంబమున కీ దినమున గొప్ప నష్టద్రవ్యలాభము కలిగినది. ఈ సంగతిని మా అమ్మతో నేను చెప్పుట కనుజ్ఞనిమ్ము.

రాజ—చెప్పకొనుము. అభ్యంతరము లేదు.

పూర్ణ—విమలబాబు కనిపించిన నీసంగతి నేను చెప్పవచ్చునా?

రాజ—చెప్పవచ్చును.

పూర్ణ కంకోలుఁడే జటాముని యని ముందే గ్రహించియుండెను. స్పష్టార్థమై తిరిగియు రాజకాళి నిట్లు ప్రశ్నించినది—

"అత్తయ్యా! జటాముని యెవరు?"

రాజ—జటామునియే జకారుఁడు. అతఁడు నీతాత. నా తండ్రి. దక్షిణాపథములోని యోగిబృందమున కంతటికిని గురువు.

పూర్ణ—నే నిప్పుడు రథినీకుమారికంటె గొప్పదాననని గర్వించుచున్నాను. భగవాన్ జటాముని నా తాతయా?

రాజ—ఔను. సాక్షాత్తుగా నీతాత.

పూర్ణ—అత్తయ్యా! చకారుఁ డెవఁడు?

రాజ— సంస్కృతశ్లోక పాదములను పూరించువాఁడు. ప్రాత పుస్తకములలో నిరర్థకుఁడేగాని యీ కాలపు కవులు వానిని సముచ్చయార్థమునందు తఱుచుగా నుపయోగించుచున్నారు.

పూర్ణ—భాషలోని చకారుని నే నడుగలేదు. కగచజడబులోని చకారుని నే నడుగుచున్నాను.

రాజ——అక్షోభ్యముని తన తండ్రిని గుఱించి నీ కెప్పుడును చెప్పియుండలేదా?

పూర్ణ—తన యసలు పేరు సోమదత్తుఁడనియు, భగవాన్ జటాముని తన గురువనియు చెప్పియుండెను. అంతకంటె నధికమేమియును చెప్పియుండలేదు.

రాజ——అతని తండ్రిపేరు వైరూపచక్రధరుఁడు. రాధీశరకంకోలుఁడే తన భార్య గతించిన పిమ్మట నాంగిరస గణదాసుగా మాఱెను. ఆంగిరస గణదాసే తన రమణి యస్తమించిన పిమ్మట వైరూపచక్రధరుఁడుగా మాఱెను. వైరూపచక్రధరుఁడే తన ప్రేయసి మరణించిన పిమ్మట పేరులన్నియు విడిచిన పెనుజడదారిస్వామైనాఁడు. అతనినే జటాముని యని జనులు వ్యవహరించిరి. అతని యేకరాత్రి కళత్రము కర్ణి. ఒకసారి యామహాపురుషునకు శరీరమర్పించిన కర్ణి మఱి యెప్పుడు నెప్పటనుగూడ నెంగిలిపడలేదు. లోకాపవాదమును లక్ష్యపెట్టక ఋషిసేవాఫలితమగు తన గర్భమును దాఁచక లోకోత్తర పరాక్రమఁడగు భీమనాథుని గనినది. తండ్రి యామెను బహిష్కరించెను స్వసంఘబహిష్కృతురాలగు నానాగాంగనకు కరుణావతియగు చారుమతీమహాదేవి యాశ్రయ మిచ్చి కాపాడినది. మా తల్లులు నలువురిలో నామెయే యిప్పుడు మిగిలియుండిన తల్లి. ఇప్పు డా తల్లి కొడుకును నాగులు నెత్తిపై పెట్టుకొని పూజించుచున్నారు. ఆమెపై ప్రయోగించి యుండిన బహిష్కారాస్త్రము నా సంఘము నా రిప్పు డుపసంహరించుకొనిన ను ఆమె మాత్రము సంఘముతో నంటకయే యున్నది.

పూర్ణ—ఆమె తన నొకరాత్రి యను గ్రహించిన మహాపురుషుఁడు జటామునియే యని తెలుసుకొనినదా?

రాజ—ఆమెకు తెలుసును. అయినను ఆసంగతి నాకు యెవ్వరిదగ్గఱను వెల్లడించి యుండలేదు. వెల్లడించిన నా మహాపురుషున కపకీర్తి వచ్చునని యామెభయమఁట. ఈ విషయమును నాకు మాతండ్రి స్వయముగా చెప్పిరి.

పూర్ణ — చక్రధరునకు వేఱు పిల్లలు గలరా?

రాజ— కల రిద్ద ఱాడపిల్లలు. పెద్దది సుముఖి. రెండవది యపరాజిత. సుముఖి బ్రాహ్మణవేషధారియగు నొక నాగునిచే వంచింపఁబడినది. లోకముయొక్క యక్షేమమునకు దాని కొకకొడుకు పుట్టినాఁడు. వాఁడే యిప్పుడు పరంతపసంఘమును నడిపించుచున్నాఁడు.

ఈవార్త పూర్ణను కంపింపఁజేసినది. కొన్నిక్షణము లామె కేమియును తోఁచలేదు. తిరిగియు మనస్సు పర్యవస్థాపన చేసుకొని యిట్లు ప్రశ్నించినది.—"అపరాజిత వృత్తాంత మేమి?"

రాజ—ఆమె యొకతాఁపసి యయ్యెను. చాలకాలము కాశీలో నుండి యిప్పుడు చిదంబరమునకు వచ్చి వసించుచున్నదియఁట. ఇది మాతండ్రి చెప్పినమాట.

పూర్ణ—అత్తయ్యా! రాథీతరుఁడగు మీతండ్రి ఆంగిరసుఁ డనియు, వైరూపుఁ డనియు రెండుసారులు గోత్రనామములను గూడ మార్చుకొన్నాఁడు. అంతగోప్య మతని కెందులకో?

రాజ—ఒక గొప్పయింటి విధవాంగనను గుప్తముగా నాపద్ధర్మము ననుసరించి వివాహముచేసుకొని యీ రాజధాని నతఁడు విడిచెను ఆరహస్యమును రక్షించుట కామెయు తానునుగూడ పేరులు మార్చుకొనవలసివచ్చినది. పేరు మార్చుకొనునపుడు గోత్రనామముగూడ మార్చుకొనినాఁడు. రథీతరులుగూడ నంగిరోగణములోనివారే గనుక సామాన్యముగా నాంగిరసనామము రాథీతరు వకుఁగూడ నొప్పును. మాతల్లి పోయినపిమ్మట నైన నతఁడు తన పూర్వనామమునే ధరింపవలసియుండెడిది. మఱియొక చెడ్డలంపటము తటస్థించినందున వేఱు గోత్రనామములను పెట్టుకొనవలసినవాఁ డయ్యెను. అతని మూఁడవభార్య యీకాలములో బ్రాహ్మణులు పెండ్లియాడఁదగినజాతిలోఁ బుట్టలేదు. ఈ దక్షిణాపథమునందు కాపాలికు లను క్రూరజాతివా రచ్చటచ్చట విరళముగాఁ గలరు. వారినే మనపూర్వులు రాక్షసులని చెప్పుచుండెడివారు. వారు మా మూఁడవతల్లి పుట్టింటివారు. ఆవిడపేరు భైరవి ఆ రాక్షసకన్యతో కాఁపురము సేయుకాలములో మా తండ్రి పూర్వనామములతో నుండనొల్లక వైరూపచక్రధరుఁ డయ్యెను. రథీతరు లని నను, విరూపు లనను ఏకవంశస్థులే యగుదురు. విరూపఋషియే గదా రథీతరులకు మూలపురుషుఁడు.

పూర్ణ—(సంభ్రమముతో) అక్షోభ్యముని బ్రహ్మరాక్షసుఁడా?

రాజ—భయపడకుము. అతఁడు బ్రహ్మరాక్షసుఁడేమైనను కాపాలికుల క్రూరగుణములు లేనివాఁడు.

అనంతరము వనదుర్గ పూర్వనామమేదియో, నిర్మలాఽపరాజితలకు పెండ్లిమైనదో లేదో, వారికి పిల్లలున్నారో లేరో యడుగుటకు పూర్ణ తలంచినది గాని రాజకాళి యంతలో పాటలు పాడనారంభించినది—

అండంబులో నుండు నచ్చుదయ్యంబు
పిండంబులో నుండు పిచ్చి పుల్లయ్య

కుండంబులో నుండు కుంభోదరుండు
కాండంబులో నుండు కామేశ్వరమ్మ
శ్లోకంబులో నుండు లోకాలయన్న
శోకంబులో నుండు శుభదేవియక్క
వర్షంబులో నుండు వజ్రాలదేవి
హర్షంబులో నుండు నంభోజహస్త
మనచూపులో నుండు మకరధ్వజుండు
కనుపాపలో నుండు కగచజబాబు.

## ఇరువదియవ ప్రకరణము

### లోకాభిరామాయణము

పాటలు ముగించిన పిమ్మట కొన్ని క్షణములు లారంగస్థలము నిశ్శబ్దముగా నుండెను.

తిరిగియు రాజకాళి ప్రసంగ మారంభించినది.

"ఆచార్యవిషమసిద్ధికి జయలక్ష్మి యను నొక విధవమేనత్త యుండెను. అందువలన నగధరుడు మామేనబావకొడుకు."

పూర్ణ—(తనలో) బాగున్నది కార్య కారణ సంబంధము. ఆ జయలక్ష్మియే తమ తల్లి వనదుర్గయని యీ ప్రసంగముయొక్క తాత్పర్యముగా నుండవచ్చును.

రాజకాళి యింకను చెప్పుచున్నది—"ఆమె పితామహుడు గిరిధర భట్టాచార్యుడొక గుడిచేటికి సర్వస్వము ధారవోసె నని వినికిరి. అతని పేరింటిగాడు నగధరుడు. వీడు కాముకుడు గాకపోయినను ఆస్తిని పాడుసేయుటలో తనకూటస్థునకు సమానుడే యగును. గిరిధరుని కుమారులు తిండి కవస్థపడుచుండిరట. ఇప్పుడా గిరిధరుని మునిమనుమడు దక్షిణాపథములోని మహారాజులలోనెల్ల నగ్రగణ్యుడై వెలుగుచున్నాడు.

పూర్ణ—వారిలో పర్వతస్వామి భట్టారకుడవతారపురుషుడు పుట్టెను. అతని వలన నావంశమునకు వెలుతురు వచ్చినది.

రాజ—దానికేమిగాని వసుంధర యెంతయో కష్టపడు నీసమయములో అన్న దేవకీర్తి యెంత యుపేక్ష వహించుచున్నాడో చూడుము. బాటాబాటిగా తిండికిమాత్రము జరుగు సంసారి తనచెల్లెలింటి సొత్తెంతయో యపహరించి లక్షాధికారి యైనాడు. ఏమియైన వానికి కృతజ్ఞత యున్నదా?

పూర్ణ—స్వంత చెల్లెలికే సంవత్సరమున కొక పంచల చాపైన నీయని లోభి సవతి చెల్లెలిని చూచునా? అదృష్టమువలన వసుంధర తల్లిని సవతి కొడుకు క్రూరహస్తము నుండి తప్పించి భగవంతుడు మీదికి తీసుకొనిపోయినాడు. వాని కొడుకు శివకీర్తి నిప్పుడు నగధరుడు ప్రాణమిత్రునిగా నమ్ముచున్నాడు. వానివి శుష్కప్రియములు, శూన్యహస్తములు.

రాజ - దేవకీర్తి స్వంత చెల్లెలు వీరభద్రావధాని భార్య మనోహారిణి పడు కష్టములకు మితిలేదు. ప్రతిదిన మొకసారి యవధానిగారి క్రోధాగ్ని రవిలి మండుచుండును. భర్త ప్రథమ కోపి. గంపెడు పిల్లల సంసారము. ఆపై లేమి. పుట్టింటి సహాయము మృగ్యము. అవధాని యిప్పుడు తన పిల్ల పద్మాక్షి నమ్ముటకు యత్నించుచున్నాడట. మనోహారిణి కది మఱియొక కష్టము.

పూర్ణ—పతంగావధానికంటె వీరభద్రావధాని మేలు. ఇతని కోపము తిట్లతో చల్లారును. అతని కోపము ప్రహారములవఱకు ధావించును. అతని యిల్లాలు నీలకేశి దెబ్బలు తినని దినమే లేదు. కూఁతురు సుశీలకుఁగూడ నప్పుడప్పుడు ముట్టుచుండును. వదినెగారి కూఁతురు ధరణిని మాత్రము కొన్నాళ్లనుండి కొట్టుట మానినాఁడు. వీరభద్రావధాని తన కూఁతురు నమ్మఁదలంచినట్లే పతంగావధాని తన వదినెగారి కూఁతురు నమ్మఁదలంచియున్నాఁడు.

రాజ—ఒక విషయములో మాత్రము వీరభద్రునికంటె పతంగుఁడు మేలు. ఆతఁడు తన కొమారితెను చదివింపక గొప్పపుణ్యము చేసినట్లు సంతసించుచున్నాఁడు. ఇతఁడు తన వదినెగారి కూఁతురును, తన కూఁతురును శుభ్రాంగీగురుకులమున వేసి వారి విద్యాభివృద్ధికి తోడ్పడినాఁడు.

పూర్ణ—తాను విక్రయింపఁబోవు వస్తువులవెల హెచ్చుసేయుటకే యీ యజుర్వేదావధాని యీ త్రోవ త్రొక్కినాఁడు. ఆ ఋగ్వేదావధాని కాపాటి బుద్ధి లేకపోయినది.

రాజ—ఇతనికి తన యజుర్వేదములో నూటి కొకముక్కయైన నర్థమగును. అతనికి తన ఋగ్వేదములో నంతయును గోడయే. ఇదియే వీరి బుద్ధివ్యత్యాసమునకు కారణము.

పూర్ణ—ఏమియును చదువనివారి కంటెఁగూడ నర్థజ్ఞానములేని స్వాధ్యాయాధ్యేతలే మూర్ఖులై కన్పట్టుచున్నారు. కారణమేమియో?

రాజ—చదువనివారి కహంకారముండదు. అందువలన వారు తమకు తోఁచకపోయినను ఒకరు చెప్పిన వినుదురు. స్వాధ్యాయాధ్యేతలకు జ్ఞానము లేకపోయినను గొప్పగా చదివినామను నహంకారము మెండు. అందువలన వారికి తమకు తోఁచదు; దురహంకారమువలన నొకరు చెప్పినను వినరు. ఇట్లు వారి యర్థజ్ఞానములేని చదువనర్థదాయక మగుచున్నది.

పూర్ణ—మూర్ఖులు కిరాతులతో సమానులు. మనసంఘములో నట్టివారి కగ్రస్థానమిచ్చుచుండుట చింతాకరము.

రాజ—కిరాతులలో నెందఱో మంచివా రున్నారు. నన్ను పెంచిన వల్లికావీరకు లెంతయో మంచివారు. నందాపురదుర్గపాలకుఁడు కిరాతాధిపతి వీరసేనుఁ డెంతయో మంచివాఁడు

పూర్ణ—కిరాతులలో మంచివారే పుట్టరని నాభావము గాదు. నాది ప్రాయికోక్తి.

రాజ—ఈమాటల కేమిగాని రాజుగారి సైనికాధికారులలో నెవరిసామర్థ్య మెట్టిదో నీకు తెలిసినంతవఱకు చెప్పుము. ఒకప్రక్కలో నశ్మకేశ్వరుఁ డగు వీరబాహువును, ఇఁకొకప్రక్కలో కలింగేశ్వరుఁడు శ్రుతసేనుఁడును, మఱియొకప్రక్కలో కుంతలేశ్వరుఁ డగు ననంతసేనుఁడును, లోపల నందఱిని మించిన నిశంభువును కౌండిన్యునకు శత్రువులై యున్నారు. ఇందఱిని జీకొనఁ గలుగు బలము మనమహీపతి కున్నదో లేదో యదే నాకు సదాచింత.

పూర్ణ—సైన్యముయొక్క పునాదులు బాగున్నవి. యోధులును దళపతులును శతపతులును మంచి సమర్థులుగా నున్నారు.

శతపతివఱకు నియమించు నధికారము సేనా పతిదేగాన నంతవఱకు స్వాతంత్ర్యమేమియు చెడలేదు. వీరులను పరీక్షించి సంగ్రహించు టలో సేనాపతి యద్వితీయుఁడు. సహస్రపతు లలో ప్రాంతవారు సమర్థులేగాని క్రొత్త వారిలో బలభద్ర ద్రుమసేన పద్మాక్షుల విడిచిన తక్కినవారిలో సామర్థ్య మంతగాఁ గానము. ప్రాంతవారిలోఁగూడ కామపాలుఁడు మిక్కిలి సమర్థుఁడు. దండనాయకులలో శక్తి ధర ధనంజయులు గొప్పపని సేయ శక్తులు. పింగాక్షరుద్రసేనులు సమర్థులేగాని సమయ మునకు పనికిరారు పింగాక్షునకు రాజభక్తి చాలదు. నిశంభునిపై గూఢప్రీతిగూడ వానికిఁ గలదని మా యనుమానము. రుద్రసేనునకు స్వశరీర ప్రీతి యధికము. అట్టివారు సమ యమునందు తెగించి పోరాడలేరు. చండ సేనుఁడు వట్టి యార్భాటమేగాని క్రియ సున్న. రణేశ్వర భుజంగులు దశపతి పదవికిఁ గూడ పనికి రానివారు దండనాయకులుగా నున్నారు. ఒకఁడు రాణిగారి చెల్లెలికొడుకు. మఱియొకఁడు రాణిగారి పినతల్లి కొడుకు. ఇవియే వారికిఁగల యోగ్యతలు. వీరనాథ చిత్రసేన బలవర్ధనులు సాధారణ సమర్థు లైనను రాజభక్తితో ప్రాణములను లక్ష్య పెట్టక పనిసేయఁగల ప్రాంతదండనాయకులు.

రాజ—పువాదులు బాగున్నవి యన్నా వు. అదియే నాకు ధైర్యము. అయినను శత్రువులందఱు నొకసారి తలపడిన మాత్రము కొంత కష్టమే.

పూర్ణ—పరరాజుల దాడికంటె లోపల నిశంభుని విప్లవమే భయంకరము. అతని మహిమల ననేకు లనేకవిధముగా పొగడు చున్నారు. చోర పరమేశ్వర చోరరాక్షసు లతని చక్రరక్షకులంట. ఘనేంద్రబాబు నగర పాలుఁడుగా నియమింపఁబడుట కొంత శుభ సూచకమేగాని రాష్ట్రియుఁడు వీరనందుఁ డతని పనికి పానకములో పుడకవలె నడ్డు వచ్చుచుండునని వినికిరి.

రాజ—లీలావతీదేవి మాట సాగునంత వఱకు రాష్ట్రమునకు విముక్తిలేదు. వీరనం దుఁడు రాష్ట్రియుఁడుగా నుండుటకు తగిన యోగ్యత యామెతమ్ముఁడుగా నుండుటయే గాక మఱి యేమున్నది? ఆదర్శవికారుఁడు విశ్రాంతి తీసుకొనినఁగాని రక్షిదళము బాగు పడదు.

పూర్ణ—లీలావతిపలుకుబడి తగ్గుట కారంభించినది యని వినికిరి. రథినీకుమారి ప్రయత్నము ఫలవంతమగుచున్నదియంట.

రాజ—క్రొత్త గుడిచేటి కోమలాంగి యాటయు నాగకన్యపర్ణిని పాటయు రాజ కుమారి రథిని మాటయు నమోఘములు. వాటి యాకర్షణశక్తికి తిరుగులేదు.

పూర్ణ—నిజమే కోమలాంగియాటయు పర్ణిని పాటయు తత్కాల మాత్రాకర్షక ములు. రథిని మాటలు మనుష్యుల జీవితము లనే మార్చును.

రాజ—ఆవిడ యిప్పుడు లోకసంస్కర ణార్థ మవతరించిన మహానుభావురాలని చెప్పవచ్చును. నాయాశలన్నియు మీయిద్ద ఱిపై నాధారపడియున్నవి.

పూర్ణ—అత్తయ్యా! ఒక సంగతి విమల బాబయ్య చెప్పఁగా వింటిని. ఇంద్రావతియను నొక స్త్రీగర్భమున విష్ణు వవతరించి పుట్టినాఁ

డఁట. అతఁడు దుష్టుల గుంపు నడంచి ధర్మ మర్యాదాస్థాపకుఁడగునఁట. భగవాజ్జటాముని తన కిట్లు చెప్పిరని బాబయ్యకథనము. ఆ పిల్లవాని పేరుగూడ విష్ణువేయఁట.

రాజ—ఔను, నాకుఁగూడ మా నాయన యొకసారి యట్లు చెప్పియుండిరి.

పూర్ణ—విష్ణుశర్మ యను బ్రాహ్మణకుమారుఁడొకఁడు భవనంది విషమసిద్ధులదగ్గఱ శాస్త్రశస్త్రములయందు శిక్షితుఁడై రాజకీయసేనలో శతపతిగాఁజేరి పనిసేయుచున్నాఁడు. అతనియొద్ద మంచియభివృద్ధి లక్షణములు కన్పట్టుచున్నవి యని మా అన్నయ్య మల్లికార్జునబాబు నాతో చెప్పెను. అతని తల్లిపే రింద్రవతియనియు, తండ్రిపేరు రణకుంభుఁడనియు తెలియుచున్నది. అతఁడే తాతయ్య చెప్పిన యవతారపురుషుఁడేమో?

రాజ—దేవరహస్యము లెవ్వరికిని కార్యమునకు ముందుగా తెలియవు. ఒక్కటి మాత్రము మనము నిశ్చయముగా నమ్మవచ్చును. అనేకదేవతల యంశములు భూమికి దిగినసమయ మిది.

పూర్ణ—నాకును అట్లే తోఁచుచున్నది, ఒకసంగతి గుఱించి తాతయ్య నీకెప్పుడైన చెప్పెనా?

రాజ—దేనినిగుఱించి?

పూర్ణ—మా దొడ్డమ్మ జ్ఞానేశ్వరిభర్త యాంగిరస యజ్ఞమిత్రబాబు ప్రవాసమును గుఱించి. అతఁ డెప్పుడైన తనకు కనిపించెనా?

రాజ—అతనినిగుఱించి చెప్పలేదుగాని కౌత్ససుకర్మను గుఱించి తానుచూచితినని చెప్పెను. అతఁడు కీర్తిశేషుఁడైన శ్రీశైల మహామండలేశ్వరునకు పెద్దకుమారుఁడు. తండ్రి యొక నేరము విషయములో దండించుటకు సిద్ధముగా నుండిన సమయములో తప్పించుకొని పరారియైనాఁడు. ఇప్పటి మహామండలేశ్వరులు సత్యకర్మ యతని తమ్ముఁడు.

పూర్ణ—ఇప్పుడు కౌత్ససుకర్మ బ్రతికియే యున్నాఁడా?

రాజ—ఉక్కుగుండులా గున్నాఁడఁట.

పూర్ణ—ప్రాసాదసింహద్వారపాలుఁడు ఘోరకుఁడు రాత్రివేళలం దేదియో యొక భూతము కోటయెదుట నప్పుడప్పుడు కన్పట్టునని చెప్పెను. దానిని గుఱించి యత్తయ్యకేమియైనం దెలుసునా?

రాజ—భూతవేషధారియగు నిశంభుని మనుష్యులలో నొకఁడుగా నుండవచ్చును. ఒకనాఁడు ఘోరకుఁడు లేని సమయము చూచుకొని యా భూతము కోటలో ప్రవేశింపఁబోయి యతనికుమారుఁడు ప్రమథనాథుని జూచి దడుసుకొని పాఱిపోయినదియని వినికిరి.

పూర్ణ నవ్వెను.

రాజ—ఇప్పుడు న్యాయస్థానములో కాశ్యపప్రమతిపై కాలనాథుని తన కొప్పగింపవలెనని కాళిక సులోచనుఁడు చేసిన వ్యాజ్యములో విచారణ ముగించినను ప్రాడ్వివాకుఁడు శివదత్తుఁ డింకను తీర్పు చెప్పలేదు.

మహా ప్రాడ్వివాకుఁడుగాని ప్రాడ్వివాకులు సువ్రతధర్మవర్ధనులుగాని యింత యాలస్యము చేయరు. ఇతడు నసుగుమనిషి. శ్యామలా సులోచనుల పుత్రుఁడో కాఁడో కాలనాథుఁడా విషయము ముందు నిర్ధారణ సేయవలసియున్నది. అగునెడల నతఁడు పెంచిన కాలకేశీ సుదర్శనుల పుత్రుఁడో కనిన శ్యామలా సులోచనుల పుత్రుఁడో నిర్ధారణ సేయవలసియున్నది.

పూర్ణ—ముందు సత్యముకనిపెట్టవలెను. పిమ్మట పెంచినవారిది బలమో కనినవారిది బలమో నిర్ణయింపవలసియున్నది.

రాజ—ఔను.

ఇంతటితో వారి లోకాభిరామాయణము ముగిసినది. రాజకాళి యింత సరళముగా నెప్పుడు నెవ్వరితోడను పిచ్చిచేష్టయేమియు లేక మాట్లాడలేదు, అందులకు పూర్ణ మిక్కిలి యాశ్చర్యపడినది.

మొదటిభాగము సమాప్తము.

---

# నా మహారాష్ట్ర యాత్ర

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

వాడియైన నాగలితో ధరిత్రీగర్భమును చీల్చినగాని, అండలిసారము సార్థకముకాక మట్టికడుపులోనే క్షీణియై మటుమాయమగుమాదిరి అంతరంగమును చీల్చు హలమువలనగాని అండలిసారము బైటపడక లోపలనే కుమిలికుమిలి చచ్చును. జిజ్ఞాసాసహితమైన వేదనమే ఈ హలమందును. ఇది ఎంత యధికమైయుండునో, ఆత్మకావించు తపసును, తపఃఫలమైన ప్రతిభావృద్ధియును, ప్రజ్ఞాప్రకాశమును అంత యధికమైయుండును. వీనికితోడు అదృష్టముండవలెను. కట్టెదుట గానుపింపక, మఱుగుననుండి ప్రసన్నభావమును ప్రసాదించు ఈశ్వరశక్తియే అదృష్టమని వచింతును. ఈరీతి సదుపాయములందినవారిసంఖ్య అల్పసంఖ్యాకులైన ప్రతిభావంతులలోనే మిగుల స్వల్పమైనది. వ్యాసవాల్మీకులు, హోమరుడాంటేలు, కాళిదాసు షేక్స్పియరులు పోలు కవులను, రామకృష్ణులపగిది గురుగుణసంశోభితులను, మహాపురుషులను ఇట్టివారు. వీరి సంయమనమెట్టిదో వీరితప సెట్టిదో, వీరి భావఫలసాయమెట్టిదో (దీనినందిన వగుడు) సకలలోకములును, సర్వకాలములును ఎఱుగును గదా!

"కోరికను పరిత్యజింపుము. లేనిచో దుఃఖపడెదవు" అని బుద్ధుడనినాడు. ఐహికసుఖమునకును, స్వార్థవృద్ధికిని సంబంధించిన కోరికపట్ల శాక్యముని పలుకులు చెల్లును. మహద్గుణములవృద్ధికై, ఉత్తమాశయసిద్ధికై ఆత్మపడు వేదనము పవిత్రమై, ఆధ్యాత్మికమైన కోరికయే! ఇది బలయుతమైనది కావున దీనిబాధ అధికమైయుండును. గర్హింపదగినది గాక అపేక్షణీయమైన ఈ బాధ కాలక్రమమున మనుష్యత్వమును దేవత్వముగావించి వదలును. అతనిచే "సోహమ్" అనిపించును. దీని నెఱుగని మర్త్యుడు మృగమే యగును.

వయసువలననేమి, విజ్ఞానానుభవములకతననేమి, మనసు గంభీరతనందును. ఉత్తమాదర్శములకై అపుడును అది ఆర్తనాదమొ 'రించునుగాని, అది బాలుని ఆక్రందనమువలె బాహ్యజగతియందు శ్రుతిగోచరము కాదు. శేగంటవలె నంతరంగగర్భాలయమున నది ప్రతిధ్వనించును. ఆత్మకావించు ఈ యాంతరంగికాక్రందనమునే వేదనమని పైన పేర్కొంటిని. తపసనుము, దీక్షయనుము, ఉపాసనమనుము ఇందుండియే జనించును.

ఈ వేదనమునకును తపసునకును గల సంబంధము మిగుల చిత్రమైనది. ఈ యాతనమునుండి, —తీతికగొననీయని ఈ యాంతరంగికప్రోత్సాహమునుండి మానసము తపసునజొచ్చినంతన, అగ్నికుండమునుండి జారి పన్నీటిసరస్సున పడినవానివలె నెంతో పరితోషమును (ప్రసవవేదనము పడిపడి, పండువంటి బిడ్డను గని మఱిమఱి మురియుకన్నతల్లిని దలపించుచు) వడయును. ఈపన్నీటిచెరువున గ్రుంకులిడ గాంక్షించునాతఁడాయగ్నికుండమున దొలుత నిలిచితీఱవలెను. కఠోరమైన ఆంతరంగికపరీక్షను పీఠికగాగల మనుష్యచరిత్రయే ఆనందప్లావితమైయుండజాలును. అనలకీలలను సోపానముల గావించుకొనిన ప్రాణియే దివ్యత్వప్రకము నధిష్ఠింపజాలెనుగదా!

తపసునజొచ్చుటయన, పరితోషమను పన్నీట గ్రుంకులిడుటయన ధ్యానమున మగ్నమైయుండుటే!

పుష్పహృదయమున పొంగిపొరలు మరందమట్లును, గగనహృదయం దుప్పొంగు నీలిమమువలె ధ్యానమున భావోద్వేగము తొలుకాడును. సద్బ్రాహ్మణుని పుడిసిటగల ఆపోశనోదకము చందమున, అగస్త్యుని గుండెలోని జడధివలె, నిలింపుల జవరాండ్రు జలకమాడునాకకాసారముకైవడి, చతుర్ముఖుని గనిన కరుణాపూరిత నళినగర్భముభంగి, మరాళమును నిజాంతరంగముననిడికొనిన మానససరోవరముపోలువున ధ్యానము దివ్యప్రభావముతో దొలక్కాడును. ఇందు మునుగుట సచ్చిదానందములందు గ్రుంకులిడుటే!

ప్రసంగముసలుపుటన ధ్యానమున గండివేయుట. నిండుగుండెకు గండిపడినపుడు భావస్రోతము పిల్లకాల్వలై నలుదిక్కుల జెల్లాచెదరగును. ఈ పరుగున మధురాలాపన మదయింపదు. గుండెలో చేయివెట్టి కలచివేయక, భావమునకు స్వాతంత్ర్య మొసగితిమేని తుషారహ్రదమునుండి మంజులగీతిక నాలపించుచు జాలువారు సురాపగపగిది మధురనిస్వనమున విశ్వసందేశ మొసగుచు నది వెలారును. నవసమాగమ ప్రణయపరిష్వంగమున (పరమాత్మ జీవాత్మలట్లు) జొక్కియున్న పుణ్యదంపతులను విడదీయుట యెట్టిచెట్టయో, ధ్యాననిరతుని ధ్యానమునుండియు, యోగనిమగ్నుని యోగనిద్రనుండియు తొలగించుట యట్టిదే! అనుభవసమయమున, ఆనందముగ్రోలుతటి నిశ్చలత్వని స్తబ్ధతలుండవలెనుగాని శబ్దము కాదు. గభీరతకు ముప్పు దెచ్చునది వాగుడే! కావున యోచనాపరులు మితభాషులై యుందురు. నలువలకులందు గగనమును చుంబించుచు హిమగిరులు నిలిచియుండ నడుమ నిభృతజీవనము గడపుకొలను తనలో నెట్టిదోయని భావించుచు, బహుళాంశములను మననము చేసికొనుచు, యోగనిద్రలోని మునిమానసమట్లు అనంతశాంతియందు మునిగి, సుందరమైన నిజాత్మను ఈశ్వరహృదికి లగించి ఆత్మవిస్మృతి నందియుండ, గులకరాయియొండు దానిగర్భమున బడిన నదెంత నెగులునందదు? తనయానంద పేటికకు బిల్లిపడెనని సంతపింపదా? సుషుప్తిమగ్నమై యున్న యెడందయం దీటెపోటు చొరబడినపుడు లోని ప్రాణ మెంతకొట్టుకొనదు? ప్రభాతసమయమందును, శారదరాత్రులందును నొయ్యారిభామవలె తోచు ప్రకృతి నవలోకించి, చూడ్కులందు వింతముద్దలను, మనసునందు తళుకుతలపులను నింపుకొనుతటి, వెన్నెముకపై దుర్విధి బలముగ గ్రుద్దినచో నెంతఘోరము జరుగదు? అంతరంగమ దలి శాంతికి దురంతమై అత్యాచారము జరుగదా? సౌందర్యసంగ్రహణమునకును వికృతనినదమునకును, ఏకాగ్రదృష్టికిని అల్లకల్లోలమునకును ఘోరవైరమనుట స్పష్టాంశము. తన్మయానుభవమునకు ప్రతికూలయోచనము భంగపాటు దెచ్చితీరును. వారచూపులు ప్రక్కమార్గములై ధ్యానహ్రదమందలి ఆనందపూరమును ఇందందు పాటించి దుర్వ్యయమొనరించును.

మహత్తరాశయములను మానసికదృష్టియం దిడికొనియే, వానిని పడయనెంచియే, వానికై పరితాపమంది, ఆంతరంగికవేదనమున బొగిలి తపించి, ఏకదృష్టితో ధ్యానించి, తన్మయభావమున మునిగి, శక్తిగని ధన్యులమగుచుందుము. మానవజీవనముపై దివ్యముకుటము నిలుపు నీయాశయములం దెట్టిశక్తి విరాజిల్లుచున్నదో!

ఎదుటివ్యక్తియెడ గాని, ప్రత్యక్షమైన ఎద్దానియెడలగాని యొకడు భక్తిశ్రద్ధలను, ప్రేమభావమును చూపుటకు హేతువు హృదయము నాకర్షించుమహత్త్వమందుండుటచేతనే; మొద్దు నెవ్వడైన "అర్ధాంగీ!" యని కౌగిలించుకొనునా? "దేవదేవా!" యని బొగ్గుల గుట్ట కెవ్వండేని ప్రణమిల్లునా? చీకటిని చూచి "జన్మసార్థకమైన"దని గంతులువేయునా? "ఆహా! ఎట్టిదృశ్య!" మని పెంటప్రోగునకు దీపారాధన గావించునా?

ఉత్తమాశయములు ఎందుండియో వ్రేలాడు కొయ్యముక్కలు కావు కొయ్యపై విడిది సేర్పఱచుకొనునది మృత్యువు. ఆకులంజలి పచ్చందనమందును, పూవులంజలి చక్కందనమందును తోచు ఈశ్వరశక్తికే మానవలోకము చేతులు మొగుచును. ఉన్నతాదర్శములం దిట్టి దివ్యశక్తి కలదు. వీనిమహత్త్వ మెట్టిదో సుందరసృష్టిదృశ్యములను విలోకించినపుడు కొంత తెల్ల

మగును. ఈ దృశ్యము లివి ధరించు శరీరములు. ఈ దృశ్యముల ముఖకాంతి నవలోకించితిమేని వీని యంతరంగములందు తేజరిల్లు భాస్వదాశయజ్యోతిర్లీల యెట్టిదో గ్రహింతుము. వ్రజయువతీ యుతుడై బృందావన విపినమున రాసక్రీడల దేలు మురళీధరుని చందమున తారకాంగనాసహితుడై గగనకుంజమున సయ్యాటలాడు చందురునందును, స్వయంవరాంగణ మండలి సౌందర్యతిలక పోలుపున రమ్యోద్యానమున రాజిలు గులాబియందును, కవికుమారుని యెడందలోని భావముక్తికమట్లు శిశిరకణమందు శోభిలు ప్రభాతకిరణ శాబకమందును, అర్ధాంగీహృదయమువలె కాంతిలు రాగ రంజిత సంధ్యాకాశమందును మినుకులీనునవి దివ్యశక్తి సమన్వితములైన ఆశయములే! వీని నీశ్వర భావములని వచించితిమేని ప్రకృతిదృశ్యము లీశ్వరవాక్కులని మానవులు గ్రహింపకపోరు. జీవ మెందున్నదో, చలన మెందున్నదో, కాంతి ఎందుకలదో, సౌందర్యసౌరభ మాధుర్యము లెందుకలవో, సచ్చరిత్ర ఎందున్నదో ఈశ్వరలిఖితాక్షరములు - క్షరముగాని సదాశయములు అందే యొప్పుచుండును.

ఇవి తమ యందచందములతో సంతసంపడి అంత రింపవు. ఈశ్వరుడు మృత్యుంజయుడుకదా! ఈశ్వర హృదయసముద్భవభావములు మిత్తిగొంగలనుట నిస్సంశ యము కాదా? అనంతకాల మివి కాంతిలుటకు కారణము అనంతప్రాణుల యాత్మలను తనుపుటకే! వీనిని గాంచిన కన్నులు, వీనిని గ్రహించిన మనసులు, వీనిని ధ్యానిం చిన ఆత్మలు ఈశ్వరసంయోగమున దనియు గోపికల వలె పరమపరితోషమందును.

మహోత్తరాశయములకు త్రోసిరాజను మానవులు కొందఱుండుట నిక్కమే! అన్యచింతలు పుఱుగులవలె వీరి చిత్తములపై ప్రాలుటచే ఉన్నతాదర్శములదెస వీరు చూడ్కుల బుత్తెంపరు. కాని యీ చింతలు వీరి చిత్తములను చిరకులాయముల గావించుకొననేరవు. మానవ హృదయము మట్టితోగాక దివ్యసామగ్రితో తయారైనది. రంగారు బంగారుపై మలినముచేరినను అది దానిని తిని వేయజాలదు. ఎట్టికలుషమైనను మనుష్యహృదయమును కబళింప లేదు. నేడు కాఱున్న రేపైన మేఘముక్తన భమువలె నది నిర్మలము కాగలదు. పండువెన్నెలను పాయసమట్లు జుఱ్ఱి నభోమానిని ముదమందులీల సదా శయాలోకమును గ్రోలి మానవహృది మఱిమఱి మురి యును.

విశాలవారాశిలో నొక్క కెరటము చలించినం తన తక్కిన యలలన్నియు జలించులాగున విశ్వమం దలి ఒకదొడ్డ హృదయము తనసురాశయముకతన కదలిక నందినంతన అసంఖ్యాకములైనయెడందలు కదలికీఱును. కడలియం దెన్నో కర ఖ్ఖండును; వీని యన్నింటికి కన్నతల్లి కడలియే కావున సమీరస్పర్శచే నొక్క వీచికలేచినతోడనే సింధుకుటుంబమందలి తరంగసంతా నమంతయు తలయెత్తును. ఎట్టి పేగుసంబంధమో! బహు శాశయరూపములం దీశ్వరశక్తి సృష్టియందంతటను గాంతిఁనని తెలిపియుంటినికదా! సృష్టిలోనిప్రాణులన్ని టికి నీశక్తి కన్నతల్లి. మాతృప్రేమ ఒకేడింభకుని హృదయమును సోకియుండదు. అనురాగస్పర్శ, సద్భా వస్పర్శ, సదాశయస్పర్శ సృష్టిస్థితప్రాణుల నన్నిటిని జలింపజేసి యూరించును.

సౌరభాస్వాదనమందును, సౌందర్యానుభవ మందును, రసానుభూతియందును, మధురగుణ మనన మందును ఆనందమున్నదని హృదయ మేది?

అనంతవిశ్వమున గాంతిలుభాస్వదాశయము లన్ని యు ఒక్క జనయిత్రియందు వెలయును. ఈమె హృదయము నీలాకాశమువలె నిర్మలమైనది. ఈమెమాన సము రత్నాకరముభంగి సుగుణమణిపూరితమై గభీరమైనది, ఈమెకన్నులందు సూర్యచంద్రులు తేజరిల్లుచుందురు, ఈమెనుడువులు జలజలరాలునుడురాశి కెనయైయుండును, ఈమెభావములు సౌందర్యసందీప్తములు. ఈమె ఇలు వేల్పు సత్యము. "శివమ్మగునర్మపథమ్ము" నందే ఈమె మసలుచుండును. సచ్చిదానందము లీమెడెందమున త్రివేణీక్షేత్రమును సృష్టించును. భూమిజనులను తనుపు టకై మేఘుడు తనసుందెను చీల్చుకొని, శీతలవారిధారలై

జాలువారు నిజాసుల నర్పించులీల, ఆర్తుల నసేకుల దనుప నమ్మ తన ప్రాణముల ధారవోయును. ఆరుణా లోకమున లంఘించు పిట్టవలె, తామరలందు(వాలు అంచవలె కన్నబిడ్డకై తల్లి అగ్నికుండమున లంఘించును.

ఈ ప్రాణి ఎట్టిదని వర్ణింపగలము? అమ్మచరిత్రను వర్ణించుట కెరికి సాధ్యము? కవులును, భక్తులును ఈమెను వేర్వేఱు తెఱగుల బ్రస్తుతించిరి. "పెరుగును, వంటకంబు, వడపిందియులం గొనితెచ్చి పెట్టు దుగ్ధాకరకరుణాధురీణ యగు ప్రాణముప్రాణము" అని తల్లి నుద్దేశించి శ్రీనాధు డనినాడు.

"Thy constant flow of love, that knew no fall, Ne'er roughen'd by those cataracts and breaks, That humour interposed too often makes;"

అని కౌపరుకవి పలికినాడు. "Cariolanus" లో షేక్స్పియరును, "చంద్రగుప్త"లో ద్విజేంద్రుడును కడుకౌశలమున మాతృప్రణయమును చిత్రించిరి

"On woman it is not only the lover, but the mother also, that is awakened by love" (Vide: page 188 "Annette and Sylvie" by Romain Rolland.) అని నేటి సుప్రసిద్ధ ఫ్రెంచిగ్రంథకర్త తెలిపినాడు. చిన్ననాటి తల్లి ముద్దులను వర్డ్స్వర్త్కవీంద్రుడు తలపోసెను. ("Sallies of mother's Kisses "Vide: Wordsworth's code on "Intimations of immortality from recollections of early childhood") "The spirit of sacrifice in the parents is the touch of the Infinite" అని నిన్నకాక మొన్న రవీంద్రు డనినాడు Vide: Dr. Tagore's Presidential address delivered on the third day at the Parliament of Religions, Calcutta 2-3-37). ప్రపంచసారస్వతమును పరికించితిమేని తల్లినిగుఱించిన సంస్తుతి ఎంతేని గోచరించును. కవులును తాత్త్వికులును ప్రకృతిని జనయిత్రి యందురు. యాత్రీకులు గంగను "అమ్మ!" యందురు. గోదావరినిగూడ నట్లే పిలతురు. దేశభక్తులు స్వదేశమును "జనని" యందురు. రామకృష్ణాదులు భగవతిని "మాతా!" యని సంబోధించువారు. "మర్గమా యమ్మ యిచ్చుత మహత్వకవిత్వపటుత్వ సంపదల్" అని పోతరా జనినాడు. తల్లిచరిత్ర ఎందఱెందఱు వ్యక్తులకు మేలుబంతియైనదో!

కాని, మాటలవలన మాతృదేవిమహత్త్వమును సంపూర్ణముగ నెవ్వరైన వ్యక్తీకరింపజాలుదురని తలప జెల్లదు. సృష్టిలోని జ్యోతులన్నియు, సుందరదృశ్యము లన్నియు నొక్కమాటు పురోభాగమున నిలిచి, తమ ప్రభావమును మనసామ్మతా గావించినపు డేమియనగలము? పిడికిలికంటె పెద్దదికాని గుండెయందు భావమహోదధు లుప్పొంగ, నెట్టి కథనమునకైన నది కడంగగలదా?

దేనినిగాని ఇష్టుటకంటె గైకొనుట సులభమని పలువురు తలంతురు. ఇది సరికాదని నాతలంపు. మన వ్యహృదయగ్రథన మెట్టిదో కాని అం దొకప్రేమ బిందువు రాలినంతన ననురాగసింధు వుప్పొంగును. ఒక్కసద్భావ మందు విత్తనమై పడినంతన నిలింపుల నందతిరి తనుపజాలు భావఫలపాయము దానిలో నుదయించును. లలితహృదయములం దిట్టి నోద్యమములు మెండుగా నుండును. ఏ మహా పురుషుడో, ఏ సుందరదృశ్యమో, ఏ మహత్తరసంఘటనమో మనసున నొకమహితభావమును రాల్చినంతన మృదుహృదయుడు — ఈతనినే కవియందుము — నిజాంతరంగమున బహుళభావములను గని తన పాటలందును, పద్యములందును, తన ఆటలందును, మధురంపు మాటలందును వానిని వెడలించును. ఈతనికడుపు చేపు వచ్చిన ఆవుపాదుసువంటిది. క్షీరము వెడలకున్న "అంబా!" యని గగ్గోలుపడక ధేను పూరకొనగలదా? పద్యములు వ్రాసినను వ్రాయకున్నను, గ్రంథములు లిఖించినను లిఖింపకున్నను, భావప్రకటనమునకై పొగులువారందఱు కవులేయని వచింతును. జిజ్ఞాసు లోకము వత్సమై, తమ్ము జేరినపుడు వీరి యానందమునకు మేర యుండదు. సౌందర్యపిపాసువైన కవి "భిక్షాందేహి" అని తనగుండెను ప్రకృతిమాతముందు నిలిపి, సౌందర్య

దానమంది, భావనావేశము కతన దన్నుదాను మఱచి, లోనుదికిన సౌందర్యపూరమును వేయివిధముల వ్యక్తీకరించును. కన్నతల్లికిని, ప్రకృతిమాతకును ఎంతో పోలిక కలదనికదా వచించితిని. కన్నతల్లి కదలిరాగల, ప్రసంగింపగల, ఊడిగముచేయుగల ప్రత్యక్షభావమున నను కంపజూపగల, వెతకి వెతకి అనురాగము ప్రసాదింపగల దేవి. ఒక్క ప్రేమబిందువునుగాదు, ఒక్క సద్భావమును గాదు ప్రేమార్ణవమును, భావబ్రహ్మాండమును నీమె మన యెడందలందు వడ్డించును. ఇవి మన యంతరంగములందు పెక్కుమయుండవలెనని నను సంశయమును మఱువకుడు జుడీ! ఇవి హృదయమున కుమిలికుమిలి ఎంతకాలముండును? ప్రేమకణము నందినసుండె భక్తి-సింధువు నొసగనువ్విళ్లూరును. వాణిజ్యవీథి యందువినబడు "వినిమయము" (Exchange, barter, or interchange) ప్రేమసామ్రాజ్యమున శ్రుతిగోచరము కాదు. ఒకరేమో ఇచ్చిరని మరల దానినో మఱొకదానినో విధిలేకనో, తప్పనిసరిగనో ఇచ్చుట కాదు. అర్థితుడు కాక అంబుధరుడు జలమిచ్చుచొప్పున, కుముదహర్షంబుగావించు నమృతసూతికైవడి, పద్మాకరమును వికచముగజేయు ద్యుమణికరణి పరహితాచరణమతియైన మాత ప్రణయదానము చేయునట్లే, అర్థితుడు కాకనే తనయుడు అమ్మకు భక్తిజూప గాంక్షించును. ఈభక్తి ప్రత్యుపకృతికంటె కృతజ్ఞతావ్యక్తీకరణముకంటె కోటిమడుంగులు ఘనతరమైనది. పూజామందిరమున, దేవీసమ్ముఖమున "కృతజ్ఞత" "ప్రత్యుపకృతి" భావగంభీరములనిపించుకొనవు. నిస్వార్థప్రేమనందిన హృదయము వేయివిధముల నాత్మభావప్రకాశము గావించుకొనును. తల్లిపదములు పుడికియో, ఆమెమ్రోల నతజానువయి యంజలిఘటించియో "అమ్మా! అమ్మా!" యని యావేగభరితహృదయుడై ఆమెను సంబోధించియో, బహుభంగుల నామెనుకీర్తించియో, పూజాపీఠమున నామె నాసీనజేసి తనివార పూజించియో, ఆమెదివ్యమూర్తిపై దృష్టినిలిపి హృత్ప్రీతి నామెకు చిరస్థాన మొసగి మధురధ్యానమున మునింగియో తృప్తిమెయి ఆమెకు సేవసలిపియో, ఆమెచరణసరోజములపై నిజోత్తమాంగమిడి నిదురించియో, కవికుమారునివలె పలవించియో తనూభవుడు గుండెలోని ఉత్తాలభావతరంగములను ప్రసమ్మరించును.

తా దల్లికావలెనని దుర్గయే తపించియుండ సామాన్యమానవి తపింపదా? తల్లికానిచో స్త్రీమహత్త్వము సంపూర్ణముగ వ్యక్తముకాదని, స్త్రీజన్మయే సార్థకముకాదని ఈమె తల్లడిల్లునేమో! తనయులకు తల్లియయ్యు, తనయునకుగూడ తల్లికావలెనని స్త్రీ తపించును. అపుడుకాని తనహృదయము పూర్ణప్రకాశముకెదిగాదని ఈమె తలపోయునేమో!

కొడుకునకై నాతల్లి తల్లడిల్లినదట. నన్ను కని పరమానందభరితయైనదట. తలనొప్పివగర్పులచే తఱచుగ బాధపడునదయ్యు, అనవరతము నన్ను తనగుండెమీదనే నిలుపుకొనినదట. అమ్మగుండె దివ్యమందిరమని నాడు గుర్తింపక అందు చిందులుత్రొక్కి అపచారమున కొడిగట్టియుందును. అమ్మచెప్పిన జాబిలిపాట నా స్మృతిపథమున చిరాంకితమైయున్నది. కాని ఆమె ప్రబోధించిన పాఠము ముగియకమున్నే, తల్లికడుపులోని చలువను తనివార బడయకమున్నే, మాతృదేవి హృద్వీణకు చెవియొగ్గి అనంతప్రణయ గీతికామాధురిని సంపూర్ణముగ మానసాంజలి జేర్చుకొనకమున్నే, తల్లి మాటలోని గభీరసాహితీ రత్నాకరమును గాంచి మనసునకువచ్చినలీల అందు మునక లేయకమున్నే దుర్విధి నన్ను గుభాలున క్రిందికి గూలద్రోసి పిచ్చుకపిల్లను చివాలున నెగదన్నుకొనిపోవు గ్రద్దవలె నా కన్నతల్లిని నాకన్నులనుండి ఎందో గొంపోయెను. తల్లిపటమును చూచుకొని కొఱఁకవి కొంతసాంత్వనమందువాడను. అమ్మచిత్ర మొక్కటైన నాకు లేదు. ఐదేండ్లవఱకు ఆమెమోమును చూడజాలితిని గావున నాదేవి పవిత్రరూపమును హృదయయవనికపై జిత్రించుకొని బాష్పాకులలోచనుడనై దానికి ప్రణమిల్లుచుందును. నా హృదయమున నామె ధారవోసిన ప్రేమబిందువులు క్రమాభివృద్ధి నందినవి. గుండెయందు తొలుకాడు భక్తిభావమును మాతృదేవిమ్రోల ప్రకాశము గావించుకొనజాలు భాగ్యము నాకు కలుగలేదు. కాని

ఆమె సుందరమూర్తి నాహృత్సింహాసనముపై విరాజిల్లుచునేయున్నది. బాలకుడనై ఒంటరినై దూరసీమలందు చరించుకతటి ఆమెకై ఆర్తనాదము * సలిపితిని. పదంపడి యైనను ఈ యాక్రందనము గుండెనుండి యంతర్హితము గాక అందు గట్టువడి జిజ్ఞాసయైనది. అమ్మకై పోగులనపుడే ఉత్తిమాళియములకై అంతరంగమున పోగులజొచ్చితిని. అవిచలితచిత్తుడనై అమ్మను ధ్యానించినపుడే ఉన్నతాదర్శములను ధ్యానింప దొడగితిని. నా హృదయము దురంతమైన యాతనమునకు గుఱియైనముహూర్తము లున్నవి. ధ్యానమగ్నుడనై కాపరుకవి తెలిపిన **Elysian reverie** లోని పరమానందమునందిన ముహూర్తములును ఉన్నవి. దివ్యదృశ్యములను విలోకించినపుడును, మహత్తరక్రియలు కనులబడినపుడును, భాస్వదాశయ.స్తులు హృదయాకాశమున తళ్కొత్తినపుడును, పుణ్యతీర్థములను సేవించినపుడును, తిథిదినములు ప్రత్యక్షమైనపుడును స్మృతిపీఠమున రాజనయిత్రి గ్వగుణీకృత సౌందర్యమున దేజరిల్లును. ఈమెను తలచి ఈమె పవిత్రాత్మకు భక్తికుసుమాంజలి నర్పించినపుడు, నాహృదయము శాంతినికేతనమై, ఆనందధామమై తనరును. అదృశ్యయై అమ్మపుత్తెంచు ఆశీర్వాదము దేవదేవుని మూపున నిడికొనిన ఖగపతివలె వైకుంఠమునుండి అవతరించి నా హృదయమందిరమును జేరుకొనును. దానితో నిలింపుఁబపోలు భావములు అంతరిక్షమునుండి పరుగెత్తుచువచ్చి అందు విడిది నేర్పఱచుకొనును. చిత్తమత్తటి దివ్యాలోకప్రదీప్త మగును. మాతృదేవినుండి మాటలకందని యిట్టి మానసికవిభవమునందు నవకాశమిచ్చ

* అక్కరైన పైకము సంపాదించుకొనుచు కలకత్తాలో చదువుకొంటిని. కాని ఆనగరముతో పూర్ణపరిచయము కలుగునంతదనుక దుష్టకష్టపరంపరలకు కాలిబంతినై పోతిని. కొన్నిదినములు ఈడెన్ గార్డెన్ (Eden Garden) లో నుంటిని. ఎందైన పార్ట్ హేండ్ టైపిస్ట్ పని (దినమంతలోగాని కొంతసమయమున గాని—Wholetime or part-time—చేయుటకు) దొరకునేమో యని మధ్యాహ్నములందు ఫర్ములకు పోవువాడను. తక్కుంగల వేళలందును, మనసుపూర్తిగ దుఃఖానలమున దగ్ధమగుదినములందును తోటలోనే పడియుండువాడను. అది వర్షాకాలము. తోటలోని ఒక చెట్టుక్రింద పడియుండువాడను. లోనివేడిమి చల్లారు నని ఆశపడితిని. పదునేనులక్షుల జనసంఖ్యగలమహాసౌధముల మహానగరమని పేరందిన కలకత్తాలో అత్తటి నన్ను పలుకరించువారుగాని, నీడనిచ్చువారుగాని లేరైరి. వెనుకవైపున గంగాభవాని హోరని విలపించినది. వెలికిలబడుండి చెట్టుకొమ్మలనుండి మేఘావృతమైన అంతరిక్షమును చూచువాడను. ఆ చక్కనజని, దివిగల అమ్మను చేరుకొనవలెనని నాప్రాణము లాతురపడినవి. ఆకులనుండి వానచినుకులు నాపై రాలునవి. అది స్వర్గోద్యానము (Eden Garden) కదా! అమ్మస్వర్గమందేకదా వసించుచున్నది! నా కన్నతల్లి నాటి నాదుస్థితి గాంచి అదృశ్యయై ఆకుమూకలనుండి నాకై కన్నీరొద్చుచున్నదని యూహించితిని. వృక్షమందు అమ్మను విలోకించితిని. నాకన్నతండ్రి నీటిబుగ్గవంటి తన గుండెను నా కిచ్చిపోయెను. వెలుపలివర్షముతో సహకరించుటకై లోనుండి దుఃఖపూరము పొంగిపొరలినది. సంవరణశక్తినిగోలుపోయి, ఏ దిక్కులేని బాలుడనై "అమ్మా!" అని పెద్దపెట్టున నేడ్చితిని. మూడునాళ్లట్లే పొగిలితిని. పదంపడి జీడిగుంట వెంకటసూర్యనారాయణ యను తెలుగుసైదోడుకన్నులబడితిని. ఈయనస్వస్థలము శ్రీకాకుళము. కలకత్తాలో డబ్లియు. లెస్లీ కంపెనీ (W. Leslie & Co., Chouranghee)లో పార్టు హేండ్ టైపిస్టుగా నుండువాడు. కుటుంబముతో కిదరుపురములో నుండువాడు. స్వర్గమునుహృదయము గావించుకొనినాడు. తోటనుండి నన్ను తనయింటికి గొనిపోయినాడు; ఆతనితల్లి ఎంతో ఆదరించినది. తల్లిప్రాణము! ఒకపూట ఈ నెచ్చెలియింటనుంటిని. నాకై అశ్రుధారలు వీడిన వృక్షమాత నేనుగతించినను పెక్కుడులు మనియుండును. ఈ తల్లిని—నాటి నాదిక్కును చూచినపుడు నా హృదయమునభక్తిభావము వెల్లివిరియును. నాకు మిసలగూర్చు కలకత్తాకు పోవువేళలందు తప్పక చెట్టుతల్లిని మాచి దానిచెంతగూర్చుని అప్పటిదినములను ఆత్మగతమున నెమరు వేసికొనుచుందును.

మంగళమయవార్షికోత్సవమే ఆర్ద్రికమని నాయభిప్రాయము.

స్నానానంతరము భోక్తలగూడి కుశావర్తమునుండి డైమార్ రాజుసౌధమునకు మరలితిని. విధ్యుక్తముగ తల్లితద్దినమును నెఱపితిని. తోడ్తోడనే మహాక్షేత్రములందు జరుపవలయు తీర్థవిధినిగూడ నిర్వహించితిని. పితృదేవతల నుద్దేశించి కుశావర్త క్షేత్రమున పిండములు వీడితిని. "అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ" అని జగదీశుడే (గీతయందు) వచించుటచే నేను నేనుజపిన విధ్యుక్తకర్తవ్య మీశ్వరునకు ప్రీతికరమగునని విశ్వసించితిని.

ఈ పితృదేవతలలో ముఖ్యులు నా తండ్రిగారు. అమ్మ దివంగతయైన అనంతరము అమ్మయు అయ్యయు నామెరయైరి. ఆధునికులదృష్టిలో మిన్నయైయున్న ఆంగ్లవిద్యను వీరెఱుగరు. ఆంగ్లాక్షరములు మాయూరి పొలిమేరలో జొరబడజాలకపోయెను. కావున వీనిని పరికించునవకాశము వీరికి కలుగనేలేదు. సంస్కృతాంధ్రములనైన వీ రంతగా పరిశీలించిరికారు. మా తాతగారు గొప్ప భూస్వామి; లక్ష్మీప్రసన్నులకు సరస్వతీసేవ అక్కఱకు మాలినదనియో, అనుచితమైనదనియో యోచించియుందురు. గ్రామమున లౌకికజీవన నిర్వహణమునకు వలసినచదువే తమవంశీయులకు చాలునని తలపోసియుందురు.

గ్రంథపఠనమే విద్యార్జనమని తలపజెల్లదు. విద్యాదర్శసిద్ధికి అక్కఱరైన నిమిత్తములలో గ్రంథపఠన మొక్కటి కావచ్చు, అది ప్రధానమైనదని యూహింపరాదు. మహామేధావులును, ప్రతిభావంతులును ప్రకృతి పుస్తకమునే పఠించిరి; చెదపురుగులై గ్రంథములను మ్రింగక, విహంగములై విశ్వదృశ్యములను కన్నులజొనుపుకొని, మిగులనేరి భావవిభూతి నందిరి. హృదయపరిశీలనమువలన సహజప్రజ్ఞను కన్గొని, నైసర్గికమానసిక విభవమును గుర్తించి, ఆత్మవిశ్వాసమును బలపఱుచుకొని, ఈశ్వరారాధనమున జిజ్ఞాసను తనిపి, * మహిమోపేతమైన స్వతంత్రసృష్టి గావించి, బహుభువనములకు భావభిక్ష బెట్టి, ప్రభాకలితజీవులయిరి. ప్రకృతియొడిలోపున జనించుటచే నా కన్నతండ్రి, గోరుముద్దలట్లు ప్రకృతిమాతయొసగిన మధురాశయముల మనసార నారగించెను. ఇట్టి మృష్టాన్నమే కదా ఆత్మకు దనువును! పవిత్రసంప్రదాయము నిర్దేశించిన పథమందే వారు నడచిరి కావున వారి యంతరంగము కరుణాతరంగిణులకు జన్మస్థలమైనది; వారి హృదయము ప్రేమకలశాంబుధి యైనది; వారిమనస్సు నందనోద్యానమునకు అందచందములు తెలిపినది; వారియాత్మ పరంజ్యోతికి ప్రతిరూపమైనది.

తామున్న యున్న అరువదేండ్లలో నెన్నడును గోదావరీక్షేత్రమునుండి కదలిపోయి వారు మఱెందును వసింపలేదు. లంకలను కొలుచునలవాటుగలవారు కావున గోదావరీదీవులను తమ మనికిపట్టుల గావించుకొనినారు. అమ్మ తరువాత అక్కలిరువురు దివంగతలగుటచే, కొంతకాలము నన్ను మఱెందును విడువక పచ్చపట్టులట్టులుండు నీమనికిపట్టులకు కూడ గొంపోవువారు. కావుననే గోదావరీహృదిపై రంగారియుండు దీవులు నాశైశవక్రీడాంగణము లైనవి. శాంతిసౌందర్యములు నాబాల్యము నెత్తిముద్దాడిన దాదులగుట నా భాగ్యము. గోదావరీ కల్యాణవేదికలందు పెండ్లికూతురట్లు శోభిలునది స్వర్గమే! ఈ ననమోహముచెల్వ యుచ్చరించిన మంగళాశీస్సు దివ్యసుమమట్లు నాశైశవశీర్షమున రాలియుండకుండునా? "Heaven lies about us in our infancy" అని మహాకవి వర్డ్స్‌వర్త్ పలికినను నుడువు సత్యదూరము కాదని పలుతెఱగుల ఋజువుచేయగలను.

"By Contemplation's help, not sought in vain, I seem to have lived my childhood o'er again"

---

* "చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో౽ర్జున, ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ"
(శ్రీ భగవద్గీత, విజ్ఞానయోగః)

అని కౌపర్ కవి వచించినాడు. అవును! అంతరంగవీథి నుండి పుఖుసపుఖుగున వెన్కకు తరలినపుడు దివినుండి బాలశివముపై రాలు తుషారబిందువులవలె నానందకణములు హృదయమున రాలును! "స్వర్గసంపర్కమునుండి కడచి ఎన్నోయడుగులు వేయలేదుకావున బాల్యమున నింకను దివ్యద్యుతులు తళ్కొత్తుచునేయుండు" నను భావమునుకదా మహాపురుషుడు 'మజ్జినీ' సూచించినాడు! బాల్యమందలి స్వర్గప్రాభవమును కన్గొనికదా "ఈశ్వరసామ్రాజ్యమున ప్రవేశింప నాశించునాతడు శిశువట్లుండవలె"నని ఏసుక్రీస్తు పలికినాడు!

ఇంగ్లీషుచదువునకై రాజమండ్రిలో ప్రవేశించినంతనే ఈ స్వర్గసౌఖ్యమునుండి దూరమైపోతిని. ప్రకృతిసౌందర్యముతోగాక తెచ్చిపెట్టుకొనిన అందముతో వెలయు కలకత్తాలో వాసము మొదలిడినంతన నాకవాసనలకు మఱింత దూరమైతిని. నా తండ్రిగారో! శైశవమును కడపిన సుందరాంగణములందే తమ యావజ్జీవనమును గడపిరి. నల్గయిదుమాఱులుమాత్రము వీరు రైలెక్కియుందురు. ఇటు నిడదవోలును అటు అనపర్తిని వారు దాటిపోలేదు. నా పెండ్లికిమాత్రము సింహాచలమువఱకు నరిగిరి. నిత్యకల్యాణమునకు, పచ్చతోరణమునకు పట్టుగొమ్మలైన చేలనుండి కదలుటకు వారి మనసొప్పెడిదికాదు. హలమును చేబట్టియు, నొరులచేతులకు హలమొసగియు, భారతభాగ్యమునకై తోడ్పడి వారు పుణ్యాత్ములైరి. గోదావరీక్రోడతలమున నుదయించి, ఆలోకపావని యాఱువండే యస్తమించి ధన్యులైరి. పూతగోదావరీ పులినతలమునుండి కదలిపోక, నేగలమును కాక హలమునే చేపట్టియుండినచో, నగరమం దల్లాడు నాజీవనమున నేడు దుమ్ము రేగకుండెడిది. కలమునకు ప్రాపించు దౌర్భాగ్యముగాక హలమునను లభించు సౌభాగ్యము నేడు నా సొమ్మయ్యెడిది. కనకవసన సుందరియైన ప్రకృతిమోల నిత్యానందమున నాజీవనమీదులాడుచుండెడిది.

విశ్వవిద్యాలయములందును, కళాపరిషత్తులందును నాయయ్య ఎట్టి సర్టిఫికేటులను పడయకున్ననేమి? నిర్మలమైన వారిహృదయపత్రమున అనంత విశ్వవిద్యాలయాధ్యక్షుడైన ఈశ్వరుడు స్వర్ణమయాక్షరములతో దివ్యగుణపత్రమును (Divine certificate) లిఖించినాడు. ఉద్యోగములకై, సద్యోగములకై, బానిసతనమునకై, దాస్యమునకై పనికివచ్చు దరఖాస్తు ఇదికాదు. శాస్వచ్ఛరిత్రచే కనులపండు వొనరించుకొన గాంక్షించు భావోపాసకులమోల నిది సదాళయసందీప్తపత్రమై తోచినది. ఈ యాధ్యాత్మికగుణపత్రముకతననే ముక్కోటి యేకాదశినాడు పరంజ్యోతిఃప్రదీప్తస్వర్గద్వారములందు నాకన్నతండ్రి కద్భుతస్వాగతము చేకుఱినది బహువిధగానయంత్రములు చేబూని, దివ్యసంకీర్తనమొనరించుచు, నృత్యము గావించుచు, నిలింపులీ పవిత్రహృదయపత్రమునకు జోహారనిరి. ఈ మహోత్సవమును గాంచి, అహిపీఠినుండి శ్రీనాథుడు చివాలున దిగి, ముదమార దానిని చేగొని, పదిలముగ నాత్మహృత్పేటిక నిడికొనెను. చదివిచదివి పసదనములతో సర్టిఫికేట్ల దస్తరములను పడసి, భారత విశ్వవిద్యాలయములందు తలమిన్న యనిపించుకొనిన విశ్వకళాపరిషత్తు శిఖరమున గగనచుంబియై తేజరిల్లు డిగ్రీలసుత్తి నవలీలగ త్రుంపి నిజమాళి ధరాయిగావించుకొని, నేడు అభాగులైన భారతయువకులం దగ్రగణ్యుడనైన నేను నాజన్మదాత పొందిన మహోన్నతస్థానము నెట్లందజాలుదును? దానిసౌందర్య మిట్టిదని యూహింపనైన నూహింపగలనా?

తల్లికడుపుగల నాతండ్రి నన్ను ప్రాణాధికముగ ప్రేమించి, కడుగారాబమున బెనిచి, ఓటుకప్రాయమునందే నాచే శారదకు ముడిపెట్టించి, మాయిర్వురను చూచి మతిమతి మురిసి, ఈ బొమ్మలపెండిలినుండి వెడలిన మంగళగీతిక మలయపవన పథమున నల్లన నెగసి గగనగవాక్షములందు ప్రవేశింపకమున్నే తమయర్ధాంగలక్ష్మిని గలసికొనుటకై విమానారూఢులై వెడలిపోయిరి.

ఇహజగతినుండి తరలిపోవలెనని కొలదిదినములకు మున్ను తాము గ్రహించిలేచికాబోలు నన్ను ప్రక్కలోనికి జేరదీసికొని కన్నుల నీరునించుచు "తండ్రీ! ఇక

నీ కేదిక్కును ఉండదు కాబోలు. పక్షినై ప్రపంచమున అల్లాడుదువేమో! దేశదేశములం దెన్నిపాట్లుపడెదవో నాయనా!" అని గద్గదస్వరమున పలికిరి. ఈ మాటలు వినినంతన నాగుండె క్రుంగిపోయినది. ప్రాణములు కొట్టుకొనినవి. దుర్విధి తలపై నధిష్ఠింప దొరకొనెనని యూహించితిని. "ఇక నీబ్రతుకు వేయి యిడుమలకు కబళమగు"నని ఎవరో యంతరంగమున నఱచినట్లయినది. కడుపులో కల్లోలము పుట్టినది. నా యారాటమును గాంచి నాతండ్రి "భయములే"దని యూరడించిరి. వైద్యుడును పలుమాఱు నాకు ధైర్యము జెప్పి, బడికి పోయి మర్నాడురమ్మని నన్ను రాజమండ్రి పంపెను. నేబోయిననాటిరాత్రియే నాకై తల్లడిల్లుచు నాకన్నతండ్రి ప్రాణములు వదలిరట! మరుచటిదినమున నా బావమఱది నన్ను రాజమండ్రిలో కలిసికొని, మరణవార్త దెలుపక నన్ను దోడ్కొనిపోయెను. నాగుండెలో గగ్గోలుపుట్టెను. "అంతయు ముగిసినది" అని విషాదాక్తమైన అతనిముఖము తెరువున నాకు తెలిపినది. ఎట్లో పోతిని. నాకు నా అయ్య కానుపించలేదు. ఝరీతీరమున బూడిద తోచినది! ఈ బూడిద నా కన్నతండ్రియా? శ్మశానవాటికనుండి వేయియాబె లొక్కమాఱుగా నెగసివచ్చి నాగుండెలో గ్రుచ్చుకొనినవి! గృహాంగణమునకు బదులు ప్రత్యక్షమగునది శ్మశానభూమియా? ఇక నన్ను పోషింపనున్నది బూడిదప్రోగా? నన్ను కని, నన్ను పెంచి, నన్ను కడుపున బెట్టుకొని నాకై దుఃఖించిననాయయ్యను ఇట్లు బూడిదజేసినవారెవరు? "ఇదియే నీదిక్కు. దీని నిక- చేతులనెత్తి పోయుము" అని నిష్ఠురపరిహాసము సలుపుచు దుర్విధి నన్నాబూడిదప్రోగుపై దొరలించినది ఈ తీటున నా మనసునకు చిచ్చుపెట్టుటకంటె నది చివాలున నన్నుగూడ బూడిదజేసి రెండుప్రోవుల నొకేమాఱు ఝరీమతల్లికి నంజుకొనపెట్టిన బాగుండెడిది. ఈ దుర్విధికి నే జేసిన యపకారమేమో?

మృత్యువు! నిదురించునట్లు పడియుండుటను మృత్యువనిన, మన సెట్లు కుదుటబడును?

"ఇంద్రియాణి పరా ణ్యాహు
రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి
ర్యో బుద్ధేః పరతస్తు సః"

అని గీతాచార్యుడనినాడు. ఆత్మ, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, స్థూలదేహములందు తుదిదానికే తుది చోటు నిర్ణయింపబడినది. ఆత్మ కగ్రస్థానమును శరీరమునకు కనిష్ఠస్థానమును నిర్దిష్టమైనను మనము చూచునది శరీరమే! అనురాగాదులు చూపు అంతరంగమున కిది నిమిత్తమే! ప్రత్యక్షమగుడు ఇది నిక్కము కాదని ఇది యంతర్ధానమైనపుడుగాని విశ్వసింపము. "అవు"నని పించునది కనబడునది. కాబోలు ననిపించునది ఊహ! ప్రత్యక్షమైనదానియెడల మనకు నమ్మకయును మక్కువయును కలిగితీఱును.

మాటవలనగాని, క్రియవలనగాని ఎట్టిభావవ్యక్తీకరణము గావింపని వస్తువునెడల పరిచితము సంపర్కము కలన ప్రీతిగలిగియుందుము. మరికిపట్టు వీడిపోవుటకు మనకు మనసొప్పదు. "Sweet Auburn" అని తన యూరును దలచి గోల్డ్‌స్మిత్ వాపోయినాడుగదా! "నిజదేశము జూచినంతన నెవ్వనిహృదయ ముప్పొంగదు?" అని స్కాట్ మహాశయుడు వాకొనుట పలువు రెఱుగుదురు. జడవస్తువైనను (అందు మనముకాంచు భావముకతన) మనసు నాకర్షించితీఱును. జడముగాని శరీరము, దశేంద్రియములకు ప్రాపైనశరీరము, మనసునకు మనికిపట్టయినశరీరము, బుద్ధికి నిధానమైనశరీరము, ఆత్మకు ఆలయమైనశరీరము సర్వతోముఖ జీవననిర్వహణమున నెంతప్రాముఖ్యము గలిగినదో యూహింపుడు.

భావము గంభీరమైనదయ్యు కొండొకనిమిత్తము నాధారముజేసికొనియే అది హృత్ప్రీతి నాసీనయగును. భావమునకు నిమిత్తము దిక్కు; నిమిత్తమునకు భావము దిక్కు. నిమిత్తములేకున్న భావ మాత్మవ్యక్తీకరణము నందదు. భావములేకున్న నిమిత్తము సజీవముకాదు.

వట్టియక్కరములగుంపులోను, రాళ్లగుట్టయందును భావముండదు. అక్కరములందు భావము ప్రవే

శించినంతన నది వచనమగును, రచనమగును. రాళ్లఁబో ఫున భావముచొచ్చినతోడన నది తాజమహలగును, రంగమహలగును. శిల్పమందును, కళయందును నగుమోము భావము తళ్కొత్తును. కాని శిలాగ్రథనములేకున్న, నక్షరగ్రథనములేకున్న శిల్పమును, గళయును నెందు సాక్షాత్కరించును? శరీరగ్రథనమున సృష్టిశిల్పము ప్రత్యక్షమగును. జీవకళ దృగ్గోచరమగును. శరీరమును ద్రోసి రాజన జెల్లునా?

నిర్జనప్రదేశమున కనులు మూసికొని సామాన్యులు భావస్పర్శ యెట్టిదో, ప్రణయస్పర్శ యెట్టిదో అనుభవింపజాలరు. ప్రేమించినవ్యక్తిని చూచినపుడును, ఆతని పలుకులకు వీను లొగ్గినపుడును, ఆతనితో ప్రసంగించినపుడును, ఆతని గవుంగిలించుకొనినపుడును, ప్రేమస్పర్శ యెట్టిదో ప్రణయప్రకాశ మెట్టిదో వీరు గ్రహింతురు.

భావమునకు నిమిత్తమైన శరీరము వెన్క నిలిచినను దేహమునకు ప్రతినిధియైన వేఱొకనిమిత్తమును ముందు నిలిపికొని ఒకయింద్రియకవాటమును గాకున్న వేఱొకయింద్రియద్వారమును తట్టి భావ మెదుటిమనసున బ్రవేశించును. ప్రేమించువ్యక్తిని చూచియు, నాలింగనమాచరించుకొనియు సంతసంపదుదుము గాని కాని ఆతడు ప్రత్యక్షము కానితఱి ఆతని మాటను టెలిఫోనులోనో, గ్రామఫోనులోనో విని కొంతదనుక తృప్తినందెదము. భావమునకు బలాదూరనినపుడే ఇంద్రియములకు దిగదుడు పన జెల్లును. * ఆత్మ కగ్రస్థాన మిచ్చిన గీతాచార్యుడు ఆత్మవృద్ధికై, ఆత్మోద్ధేశసిద్ధికై శరీరమును, ఇంద్రియములను, మనసును, బుద్ధియును నేవసలిపి తమమను గడ గడపవలెనని యుద్దేశించియుండును. ప్రత్యక్షమను ప్రధాననిమిత్తము బూడిదప్రోగైనచో శరీరముబుగ్గియైనచో ప్రత్యక్షానుభవమునే యెఱిగిన సామాన్యుడు, సామాన్యులందలి బాలకుడు సర్వనాశనమైనదని దుఃఖింపడా?

ప్రత్యక్షానుభవావకాశము కడతేఱినపుడు అంతర్ధానమైన వ్యక్తి యాత్మతో ప్రార్థనవలన, ధ్యానము మూలమున, యోగయుక్తిలన కలసిమెలసి వర్తించి ఆత్మానంద మందవచ్చును. కాని మనుష్యాత్మ అత్యద్భుతశక్తి నందినపుడే యిట్టియానందమందుట సాధ్యమగును. విశేషతపసువలన గాని, దీర్ఘమైన అభ్యాసమువలన గాని మానవుడు యోగీశ్వరుడు కాజాలడు,“భావాంబరవీథి విశ్రుతవిహారి” కాలేడు.

సామాన్యు డనవరతము తాత్త్వికవీథులందు పరిభ్రమణ మొనరింప జాలడు; ప్రత్యక్షప్రపంచమునుండి చని అదృశ్యవసుంధరలందు, ఊహాజగతులందు వాసమేర్పఱచుకొనలేడు. రక్తమాంసములందలి ఉష్ణము చెప్పచేతలందు నిలువనంతదనుక, దళదిశల నడాయించు దశేంద్రియములు వెనుదిరుగుట నేర్వనంతవఱకు, ఆత్మారాముని మోల మానసము మరులి కానంతదనుక మనుష్యు డాత్మసామ్రాజ్యమున పట్టాభిషిక్తుడుకానంతవఱకు ధ్యానమార్గమున భావభువనమున ప్రాతకాపై యుండజాలడు.

భావభువనమున ప్రాతకాపులై యుండజాలువారిసంఖ్య మానవకోటిలో మిక్కిలితక్కువ. లోగల ఈశ్వర తేజమును వృద్ధిగావించుకొనువాడే,— ఆత్మశక్తి నధికమొనరించుకొనినవాడే ఇట్టికాపు కాగలడు. ఇది

---

* ఈ సందర్భమున నేదెలిపిన ‘భావము’ ప్రత్యక్షప్రమాణసముద్భవముజుమీ. దీనితరువాత పాటింపవలసినది అనుమానమని తార్కికు లందురు. అతీంద్రియమును, అనాదియు నైన బ్రహ్మపదార్థమును గ్రహించుటకు ప్రత్యక్షానుమానప్రమాణములు చాలవు. కావున “ఆత్మవాక్యము” లేక శబ్దప్రమాణ మక్కరైనది. ఆంగ్ల తాత్త్వికులు “Authority” “Intuition” ల (Vide: Sources of knowledge) దెలుపుదురు. ప్రమాణము లన్నిటివలన గాని పూర్ణజ్ఞానము లభించదు.



"బిగిల్ మెట్ట". టిప్పుసుల్తాన్ దీనిపైకెక్కి బిగిల్ ఊది, సైన్యాన్ని దండయాత్రకు ఆయత్తం చేసేవాడట.



తాతా సైన్సు పరిశోధనాలయము

సామాన్యక్రియ కాదు. హృదయగర్భాలయమున నీశ్వరు డుంట నిక్కమే! మానసప్రాంగణమున పశువుకూడ కలదు. ఇది లొంగినగాని ఆధ్యాత్మికశక్తి వృద్ధికాదు. ఒకపరి పశుప్రవృత్తిని చెలరేగనిచ్చినచో అది చులకనగా లొంగదు. విచ్చలవిడిగా ప్రవర్తించు ఇంద్రియములు దీనికి వలసినంతమేత నొసగును. దీనిని తలయెత్తనీయక లోగల రెండవశక్తిని—దివ్యశక్తిని—క్రమశఃను కతన వృద్ధిజేయించుటకే ప్రాచీనులు తమడింభకులను బ్రహ్మచర్యమున ప్రవేశపెట్టిరి. పశుప్రవృత్తిని కట్టిపెట్టుటన నాత్మసంయమము నందుట. ఇది యలవడిన ముహూర్తమున చిత్తము చిత్తమువచ్చినతెఱగున పరుగులెత్తక, అధోగతియందు కూలబడక, ఎగిరెగిరి కొండకొనను చేరు పిట్టవలె ఉన్నతాశయముదెస జనును. ఏకాగ్ర దృష్టియందే ఈగమనపంథ కలదు.

దివ్యశక్తి లోగల ఓజస్సున గలదు. ఇది ప్రాణభరితము. అద్భుతసృష్టి ఇందుండియే వెడలును. దుర్వ్యయ మొనరింపక దీనిని నిలుపుకొనువాని కసాధ్య మెద్దియునుండదు. చంద్రతారార్కులు చావనంతవఱకు సజీవములైయుండు రచనలను గను ప్రతిభయనుకు, సర్వకాలములందు విజయపాణింధమమును ప్రయోగింపగల ప్రజ్ఞయనుడు, మానవునిచే "సోహమ్" అనిపించి, అతని దేవుని పట్టమహిషిగావింపగల మహాద్భుతశక్తియనుడు ఇందుండియే యుద్భవించును. బ్రహ్మచర్యమువలనగాని ఇది సంచితము కాదు. నియమబద్ధజీవులు, వివాహితు లైనను, బ్రహ్మచర్యము నెఱపువారగుదురు. పదునాఱు వేల యెనమండుగురకు పతియైన శ్రీకృష్ణుడు నిత్య బ్రహ్మచర్యమున నాటిఁజేటినాడు; బ్రహ్మచర్యవ్రతము ననుష్ఠించువారు తనదెస దృష్టినిలిపియుంచవలెనని తెలిపినాడు.

"ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్తఆసీత మత్పరః."

దివ్యసుందరమూర్తిని మనశ్చక్షుస్సమక్షమున నిలుపుకొనిననాడే బ్రహ్మచర్యము నెగ్గును. మనసు చెదిరిన ముహూర్తమున దీనికి భంగమువాటిల్లును.

లోనున్న ఎద్దు రంకెలువేయుచు, కుమ్మికుమ్మి మానవుని లోతుగోతిలో పడద్రోయును. మదించిన ఎద్దుతో కుస్తీపట్టు లెవరితరము? దీనిదెస జూడనినాడు ఇది కృశించును; క్రుంగిపోవును. చిత్తవృత్తి దిగువకైన బోవును, ఎగువకైన బోవును. అది కట్టువలెగాని, రాయివలెగాని ఉండదు. అది గోతినైనగూలును, కొండనైన నెక్కును. మంచినభ్యసింపనివాడు ఎద్దుకాలిక్రింద పడితీరును. ఇతడు చెడ్డవాడగుట నిక్కము. ఉత్తమ భావములను మనసున నిండించుకొని, వాని నాత్మజీవనమున నింకింపజేయుటే ఈ యభ్యాసము; ఇదియే బ్రహ్మచర్యానుష్ఠానము. బ్రహ్మచర్యమును కొంతదనుకైనను అభ్యసింపనివాని చరిత్రనుగూర్చి శంకించుటనుచితముకాదు. ఈ యభ్యాసము కడుంగడుకష్టమైనది. క్రమనిష్ఠకలనగాని ఇది యలవడదు. దుశ్చింత మనసును మరల్చునవేళ అవధానమును (Attention) మార్చవలెనని మనశ్శాస్త్రము (Psychology) తెలుపుచున్నది. ఇట్లు మార్చుట మొదలిడిననాడే మానవుడు క్రమనిష్ఠలో ముందంజ వేసినవాడగును. మననదిధ్యాసనములవలన నీ నిష్ఠ బలవత్తర మగును. ప్రబోధమువలన విశేషాభ్యుదయము కలుగునని యయాతిప్రభృతుల చరిత్రలు తెలుపుచుండుట లేదా? క్రమనిష్ఠయందు, బ్రహ్మచర్యమున విజయుడైనవాడే పూర్ణత్వ (Perfection) సిద్ధినందినవాడగును. ఈశ్వరుడే యగును. ఇట్టివానికే ఎద్దు పూర్తిగ లొంగియుండును, ఈశ్వరుడు ఎద్దునెక్కువాడందురు; లోని యెద్దును లొంగదీసినవాడని మన మూహించుటకే ఇట్లందురని నాయభిప్రాయము. మహేశుని దృష్టి విష్ణువుపై నుండునందురు. ఈతని యేకాగ్రదృష్టియే ఈతని నంతవానిజేసినది.

ఈదృష్టి ఎట్లలవడును? ఇట్టిశక్తి మనుష్యహృదయమందే కలదు. ఇది సత్యమును వలచునది, సౌందర్యమునభిలషించునది. కావున నందంపుదృశ్యముపై కన్ను నిలుప మక్కువపడెదము. సౌందర్యసందీప్తరూపమును ముందిడికొనినముహూర్తమున నేకాగ్రదృష్టి తనంతదాను వృద్ధియగును. మరలుమనినను చూడ్కి మరలదు.

జగన్మోహిని జూచి ఆత్మవిస్మృతుడై ఈశ్వరుడు పరుగు లెత్తలేదా? సదాళక్తై, సుందరాళయమునకై పరుగు లెత్తువారు ఈశ్వరునిబోలు భక్తులు. ఆయతనయనార విందములను శ్యామసుందరుని నగుమోమున కప్పగించి వ్రజవీథులందు పరుగులెత్తినగోపిక లిట్టిబ్రహ్మచారిణు లగ్రి, ఇట్టి భక్తురాండ్రని కంఠమెత్తి వచింతును. మహనీయతేజులై, క్రేపులమేపు మోహనమూర్తిని ప్రేమించినవారందఱు ఆతని యిల్లాండ్రే. బృందావనమున భక్తబృందపరివృతుడై యుండిన గోస్వామి మీరా బాయి నుద్దేశించి "నీవు శ్రీకృష్ణుని యిల్లాలవుకదా! మేము మీ చెల్లెండ్రము" అని పలుకలేదా? "నాథా! నాథా!" యని శ్రీచైతన్యుడు శ్యామసుందరు నుద్దేశించి పలికి తన్మయనృత్య మొనరించువాడుకాడా? ఈతని దృష్టిలోగల దివ్యసుందరమూర్తిని, భావనాసృష్టియందాటిలేనివారు శిలయందు నిర్మించి తమదృష్టిని దానిపై నిలుపుచుందురు. గౌడీయమతప్రచారకులును, వంగవైష్ణవులును తెలుపు పౌత్తలికారాధన మిట్టిక్రియయే! చైతన్యప్రభృతు లావాహనము గావించుకొనజాలిన సుందర సత్యస్వరూపములను మనము దృష్టిప్రోల నిడి కొందుము. ఈ యంశమున కవగతులు గానివారే 'Idol-worshippers' మనయని మాటలు మిగులు చుందురు.

సుందరభావము దెసను, సుందరమూర్తి దెసను దృష్టిపాఱుతటి అత్యద్భుతదివ్యభావ మొండు హృదయ ప్రాంతమున పొంగిపొరలును. శశికిరణము వెన్క నెంత యమృతముండదు? నగుమోము నిశి ఇందు మక్కువేయు వెలుగమా? పూవురేకుల యంచులనుండి కమ్మతావి వెడలుతటి పువ్వుకడుపున సుధాసింధువు తరంగసంకులము కాదా? రెప్పదెబ్బ తినని చూడ్కిలో నను రాగాంబురాశి తెరలుతెరలై పొంగిపొరలును. గాఢమైనభక్తియే ప్రేమ; గాఢప్రణయమే భక్తి. ప్రేమకును ఏకాగ్ర దృష్టికిని గలసంబంధము వృక్షమునకును విత్తనమునకు గల సంబంధమువంటిది. ఏకాగ్రదృష్టివలన గలుగునది ప్రేమ; ప్రేమసముద్భవ మేకాగ్రదృష్టి.

సౌందర్యము సృష్టిగర్భితము. సుందరసూర్య కిరణమును పరికింపుడు. అందు సప్తరాగములు తళ్కొత్తుట గాంతురు. ఛవి కిరణడింభకము లేకదా! అంతియ కాదు. రవిమయూఖము ముద్దిడికొనిన చోటులం దెట్టి యద్భుతసృష్టి గోచరించుటలేదు? మొగ్గమోము నివి చుంబించి, దానియంగప్రత్యంగములను మక్కువమెయి కవుంగిలి జేర్చుకొనినపుడేకదా పూవు పులకలందు భావ భువనములు పుట్టును! నగుమోమునన సౌందర్యప్రసవినియై కవిహృదయమును అల్లని గావించుకొని కులుకునుగదా! దినమణిద్యుతి కల్హారహృదయమును స్పృశించినంతన బిలబిలలేచు కలహంసలబోలు తెక్కులెన్నెన్ని తేలి కెరటాలకొనలం దుదయింపవు? తూగుటుయ్యాలలం దూగు రాచముద్దియలవలె నయ్యాలలపై నూగాడుపువ్వుల ముద్దుమోములపై దళుకొత్తు నవ్వులం దెట్టియద్భుత సృష్టి గోచరింపదు?

---

# తెలుగుటాకీ వ్యాపారము: రానున్న విపత్తు

ఎ. వి. సీతారామయ్య

మిక్కుటముగా ధనార్జనము చేయవలెనను కోరిక సాధారణపు చూపునకు పేరాసగా కనబడుతుంది. కాని అది అపేక్షించదగిన ఒక భారీసుగుణము. ముఖ్యంగా వ్యాపారంలో అది ఉండటం చాలా అవసరం. విపరీతంగా ఆర్జించవలెననే కోరిక లేకపోతే పెద్ద పెద్దపనులు చేయవలెననే సంకల్పం, అందుకు తగిన ఉత్సాహం కలగవు. అందువలన ధనార్జనయందలి కోరిక నిందించతగినదికాదు; మెచ్చుకొనదగినది.

కాని వ్యాపారములో అనుభవము, దూరదృష్టి ఉండి సమయానుకూలంగా ప్రవర్తిస్తే తప్ప కేవలం ఆర్జించవలెననే కోరికఉండి లాభంలేదు. పైగా అపారమైన నష్టంకూడా కలుగుతుంది. గుడ్డిఎద్దు చేలోపడినట్లు వ్యాపారం సాగిస్తే హఠాత్తుగా గోతిలో పడిపోతుంది వ్యాపారం. అందువలన ఎప్పటికప్పుడు మార్చుకుంటూ–వ్యాపారధోరణిని – నడిపించుకుంటూ వస్తేతప్ప లాభం రాదు.

టాకీవ్యాపారంలో మిక్కుటమైన లాభాలు వున్నాయని దేశంలోని వర్తక ప్రముఖులు గ్రహించారు. కొంచెం ఆలస్యంగానైనా మన తెలుగువారు కూడా గ్రహించి ఫిలింవ్యాపారంలో జొరబడినారు. అంతవరకు మంచిదే. చాలా ఫిలిములను కూడా తయారు చేశారు. వీరు అన్యరాష్ట్రపు పెట్టుబడిదారులవలన తయారుచేయబడిన ఫిలిములను, వాటికివచ్చిన లాభములను చూచి తామకూడా ఫిలిములను తీశారేగాని వాటికి వచ్చిన లాభములుమాత్రం వీరికిరాలేదు. కారణం ఫిలిము వ్యాపార పద్ధతులు వారికి ఆకళింపు అయినట్లు మనవారికి కాలేదని మాత్రం ఖండితంగా చెప్పవచ్చు. ఫిలిము తీసే పద్ధతులలో, వాటిని డిస్ట్రిబ్యూటు చేసే పద్ధతులలో, వాటిని ప్రచురించే విధములలో, వాటిని ప్రదర్శించటానికి తగు స్థలములను ఎన్నుకొనే విషయములో, మరి తదితర విషయములలో తెలుగుఫిలింపారిశ్రామికులకు ఈషణ్మాత్రమైన జ్ఞానమున్నట్లు కనబడటంలేదు. ఈపరిస్థితులలో అనుభవంమాత్రం ఏ విధంగా వుంటుంది! ఉదాహరణ- ఈస్టిండియా కంపెనీవారి 'లవకుశ'కు లక్ష లొచ్చిపడినాయని బజారుకో ఫిలిం కంపెనీ లేవదీశారేకాని ఆ కంపెనీవారి ఫిలిములు ప్రదర్శించడానికి ఎన్నిథియేటర్లు వారిస్వాధీనంలో నున్నాయో, ఎన్ని టూరింగుసినిమాలు వారిచేతికింద నడుస్తున్నాయో ఆలోచించిన తెలుగుఫిలింవర్తకుడు ఒకడూ వున్నట్లు కనబడడు.

ఇప్పటికే చాలా ఉపోద్ఘాతం అయినట్లున్నది. కాని అవసరం.

ప్రస్తుతం మన తెలుగుసినిమా వ్యాపారాన్ని ఒక గొప్పవిపత్తు ఎదుర్కొబోతూంది కొందరుకలకత్తా, బొంబాయి, బెంగుళూరు పట్టణముల ఫిలింవ్యాపారప్రముఖులు తెలుగుదేశంలోనున్న సినిమాప్రదర్శనశాలలను నెమ్మదిగా గుత్తకు తీసుకుంటున్నారు. ముఖ్యమైన సెంటర్లు అన్యరాష్ట్రీయులచేతిలో పడిపోతున్నాయి. మారుమూలలనున్న గ్రామాదులలోని థియేటర్లు సైతం వారివశమై పోతున్నాయి. విస్తీర్ణమైన నగరములలో ఆకర్షణీయ

ములైన థియేటర్లను వారు నిర్మిస్తున్నారు. ప్రదర్శనానికి కావలసిన మెషీన్లు విక్రయించేది, అద్దెకు యిచ్చేది వారు. థియేటర్లు వారివి. టూరింగు సినిమాలు వారివి. క్రొత్తగా తెరువబడుతున్న సినీమాలు వారివి. వారే తెలుగుఫిలిములుకూడా తయారుచేస్తున్నారు. ఈ పరిస్థితులలో మనవారు లక్షలు తగలేసుకొని చచ్చుఫిలిములను తయారుచేసి మురుస్తున్నారు. ఈ ఫిలిములుఎక్కడప్రదర్శించడానికి? ఒకమారైనా ఈవిషయం వారికి తట్టిందా? ఫిలిములు తయారైన తరువాత వారి ఆజ్ఞకు బద్ధులై వారుకోరినషరతులకు వారి థియేటర్లను దేబిరించి ప్రదర్శించుకొని నష్టపడాల్సిందే యిక మీద తెలుగుఫిలిములు తీశేవారు. కలకత్తాలో మెట్రో గోల్డ్విన్ కంపెనీవారు హిందూదేశంలోకల్లా గొప్పదైన సినిమాథియేటరును దాదాపు ఇరవై లక్షలు ఖర్చుచేసి కట్టించారు. అది కట్టిస్తారని తెలియగానే బెంగాలీ వారు చేసిన ఆందోళన యింతంత కాదు. కారణం దానివలన వారి పరిశ్రమకు అంత నష్టంకనక. మన తెలుగుదేశానికి ముఖ్యనగరాలలో ఏ మహారాష్ట్రుడో, ఏ మార్వాడీయో వచ్చి ప్రదర్శనశాలలను కట్టించి తన ఫిలిములు ప్రదర్శించుకుంటూ మన వ్యాపారాన్ని ధ్వంసం చేస్తుంటే మనవాళ్లు కళ్లప్పగించుకుని ఒకరికొకరు పోటీలు పడుతూ - కథలుగూడా కనబడక-ఎందుకూ పనికిరాని ఫిలిములను తయారుచేస్తున్నారు, అన్యరాష్ట్రపు స్టూడియోలలో.

అందువలన ఈ తెలుగుఫిలిం వర్తకులు-ముఖ్యంగా అద్దెస్టూడియోలలో తయారుచేయుచున్న స్వతంత్ర ప్రొడ్యూసర్లు-కొంతకాలం ఈ ఫిలిములను తీయడం ఆపివేసి మన దేశంలో సన్న థియేటర్లను భద్రపరచుకోవడం, నూతనంగా మంచి థియేటర్లు కట్టించడం వగైరా ప్రదర్శనావకాశాల్ని వృద్ధిచేసుకుంటే తప్ప తెలుగు ఫిలిం వ్యాపారానికి గతిలేదు. కాని మనవాళ్లు వెంటనే ఆపనికి పూనుకుంటారా? లేక ఆలస్యమైపోయిన తరువాత నిష్ప్రయోజనంగా బజారుకొక థియేటరు ఇంకా నాలుగైదు సంవత్సరాలైనాక పోటీలుపడి కట్టించడం చేస్తారా?

---

# తెలుగు పంచాంగం క్యాలండరు

## దిన, వార, మాసపత్రికల చందాదారుల కుచితము

ఆయా స్థలములందున్న యేజంట్లచే వైక్యాలండరులు దిన, వార, మాసపత్రికల చందాదారులకు ఉచితముగా పంచిపెట్టబడును. ఏజంట్లకు క్యాలండరులు పంపబడినవి. వారు పంచిపెట్టుటలో ఆలస్యము జరుగునని తోచిన చందాదారులు నేరుగ వారినికలసికొని సేకరించగోరెదము.

వ్యవస్థాపకుడు.

# కర్నల్ కాలిన్ మెకెంజి

బులుసు వెంకటరమణయ్య

దక్షిణ హిందూదేశపు స్థానికచరిత్రల సంపుటాల్ని చూసినవారికీ, అథవా వాటినిగురించి విన్నవారికీ కర్నల్ మెకెంజీ కొత్తవాడు కాదు. అతను వైదేశికుడు అయినప్పటికీ భారతదేశ చరిత్రాంశాలని పరిశోధించి అందుకుగాను పల్లెపల్లెకూ తిరిగి స్థానికవిమర్శకులికి తెలియని విశేషాల్ని విరివిగా సంగ్రహించి లోకల్ రికార్డ్స (స్థానికచరిత్ర)లను తయారుచేశాడు. అతను కేవలం విమర్శకుడే కాదు, అప్రతిమాన మేధాసంపత్తిగల ఇంజినీయరు; గొప్ప యుద్ధవీరుడు; ఇండియా కంతకూ సర్వేయర్ జనరలు; ప్రాచ్యవిద్వాంసులను పోషించిన ప్రభువు. కనుకనే కర్నల్ మెకెంజీ ప్రతిభ సర్వతోముఖంగా వెల్గినది. మెకెంజీ యింగ్లాండు దేశంలో వున్న లూవిస్ ద్వీపంలో ౧౭౫౩ వ సంవత్సరంలో పుట్టాడు. అతడు పుట్టినది సామాన్యపు కుటుంబంలో; పేరుగడించింది పెద్దవాడయాక. అంచేత అతని తల్లిదండ్రుల్ని గురించికాని, బాల్యాన్ని గురించిగాని యేమిన్నీ తెలియలేదు.

ఆకాలంలో - అంటే - మెకెంజీకి నిండు వయస్సు వచ్చిన సమయంలో - ఇంగ్లాండులో వుండిన లార్డ్ నేపియర్ ఫ్రాన్సిస్ ప్రభువు తనవంశంలో పూర్వీకుడూ, గణితశాస్త్రవేత్తలలో అఖండుడూ అయిన 'జాన్ నేపియర్' జీవితచరిత్రాన్ని వ్రాయడానికి పూనుకున్నాడు. అందుకోసరం ఆయన భారతీయ గణిత శాస్త్రాన్ని పరిశోధించవలసి వచ్చింది. ఆ విజ్ఞాన విషయాల్ని ఏర్చి కూర్చడానికి అతనికి సహకారులలో వుండి, మొదట్నుంచీ హిందూదేశ ప్రాచ్యవిజ్ఞాన పరిశోధనానికి ఉబలాటంతోనూ, ఉత్సాహంతోనూ వున్న మెకెంజీ కుడిభుజమై తన ప్రతిభాశక్తుల్ని ప్రకటించాడు. ఆసమయంలోనే మెకెంజీకి సీఫోర్త్ ప్రభువుతోకూడా పరిచయభాగ్యం కలిగింది.

తలపెట్టిన పని పూర్తికాకుండానే ఫ్రాన్సిస్ ప్రభువు గతించాడు. మహోత్సాహంతో తాను చేస్తున్న పనికి ఆటంకం కలిగినా మెకెంజీకి ఉత్సాహం తగ్గలేదు. ఆ ఉత్సాహమే- ప్రాచ్యవిజ్ఞాన పరిశోధనోత్సాహమే అతన్ని భారతదేశానికి ప్రయాణం కట్టించినది.

మెకెంజీకి పరిచితుడైన సీఫోర్త్‌ప్రభువుకి ఈస్టిండియా కంపెనీలో చాలా పలుకుబడి వుండేది. ఆపలుకుబడే దొరచేత తన ఆశ్రితునికి కంపెనీవారి మద్రాసు శాఖలో ఇంజినీరింగు డిపార్టుమెంటులో ఒక ఉద్యోగాన్ని యిప్పించింది.

మెకెంజీ ౧౭౮౩ వ సంవత్సరంలో ఇండియాకు వచ్చేడు. ఆ వచ్చేటప్పుడు అతను మద్రాసు గవర్నరు లార్డ్ మెకార్ట్నీకీ, మధురలో పెద్ద ఉద్యోగంలో ఉన్న మిస్టర్ జాన్‌స్టన్‌కీ సిఫారసు ఉత్తరాలు తెచ్చుకున్నాడు.

జాన్‌స్టన్ భార్య వెనుక మెకెంజీని పోషించిన నేపియర్ ప్రభువుకు కుమార్తె. ఆమె మంచి విద్వాంసురాలు. తన తండ్రి తలపెట్టిన కార్యాన్ని పూర్తిచేయాలని . చాలా పట్టుదల కలిగి ' మధురకి చుట్టుపట్లవున్న గణితశాస్త్రపండితుల్నీ, జ్యోతిశ్శాస్త్ర పండితుల్నీ తనగద్ద ఉద్యోగానికి ఆమె కుదుర్చుకున్నది. పరిచితుడైన మెకెంజీ మద్రాసుకు వచ్చాడని తెలిసి ఉత్సాహంతో ఆమె ఆకాళం

అందుకుంది. వెంటనే మెకెంజీకి మధురకు వచ్చి తమని కలుసుకోవలసినదని ఆహ్వానం–జాన్‌స్టన్ దంపతులు పంపించారు. వెంటనే మెకెంజీ మధురకి వెళ్లి అచిరకాలంలోనే జాన్‌స్టన్ సతివద్ద పనిచేస్తూ వున్న పండితులతోటీ, తదితర పండితులతోటీ ఎక్కువపరిచయం కలుగచేసుకున్నాడు. అతడు వారితో తరుచుగా సంభాషిస్తూ, ఆ సంభాషించినప్పుడల్లా హిందూదేశచరిత్రకి సంబంధించిన చాలా భోగట్టాను తెలుసుకున్నాడు. అల్లాంటివాళ్ల సహాయంతో 'లోకల్ రికార్డ్సు' లని కూర్చాలనే అభిప్రాయం మెకెంజీకి అప్పుడే కలిగింది. అదిమొదలు అతడు జీవించివున్న ౩౮ సంవత్సరాల కాలంలోనూ, ఎప్పుడూకూడా మనస్సులో ఆ అభిప్రాయమే వుండేది.

అతనికి ఆ కోరిక వున్నా అతను ఇండియాకు వచ్చిన పద్నాలుగు పదిహేనేళ్లదాకా దానికి తగిన అవకాశమూ తీరుబడీ లేకపోయినవి. ఉద్యోగానికి వచ్చినదిమొదలు రమారమి పదిహేనేళ్ల దాకా తన వుద్యోగపు పనులలోనూ, యుద్ధాల్లోనూ అతను మునుగుతూ తేలుతూవుండేవాడు. దేశంలో అశాంతి ప్రబలివుండిన రోజులవి. ప్రతిదినమూ యెక్కడో వకచోట యుద్ధం జరుగుతూనే వుండే దప్పుడు. పైగా కరువు దేశాన్ని మలమల మాడ్చి వదలిపెట్టేది!

మెకెంజి ౧౭౮౩ వ సం. లో మద్రాసుశాఖ ఇంజినీరింగు డిపార్టుమెంటులో ఉద్యోగిగా ప్రవేశించి, ఆ పని మీదనే ఆ సంవత్సరంలోనే కోయంబత్తూరు, దిండిగల్లు, గుంటూరు, నెల్లూరు మొదలైన ప్రదేశాలకి తిరగవలసి వచ్చింది. ఆ పనుల్లో మునిగివున్నా అతను తీరిక వుండేటప్పుడల్లా ఆర్కియాలజీకీ, హిస్టరీకీ సంబంధించే విజ్ఞానాన్ని ఆర్జించేవాడు.

౧౭౯౦–౯౨ ప్రాంతాల్లో ఆంగ్లేయులకీ, కర్ణాట నవాబయిన టిప్పుసుల్తానుకీ ఘోరమైన యుద్ధాలు జరిగేయి. మూడవ మైసూరుయుద్ధంలో మెకెంజీ పాల్గొన్నాడు. యుద్ధసేనల్లో వుండే నలుగురు ఇంజనీర్లలోనూ ఇతనొకడు. ఆసేనకి అధిపతి వారన్ వాలిన్. ఆముట్టడిలో మెకెంజీ సాహసించి కొద్దిమంది సైనికుల సహాయంతో కందకాన్ని దాటి నిచ్చెనలువేసుకుని కోటగోడ ఎక్కి శత్రువీరులతో దొమ్మికయ్యానికి డీకొని కోటని స్వాధీనపరచుకున్నాడు. ఆ విజయానికి ఫలితంగా మెకెంజీ చీఫ్ ఇంజినీయరయ్యాడు.

తర్వాత ఆంగ్లేయులు నందిదుర్గంకోటని ముట్టడించారు. అది సముద్రమట్టానికి రెండువేలఅడుగుల ఎత్తునవున్న – మూడుమైళ్ల చుట్టుకొలతగల దుర్భేద్యమైన దుర్గం! దానికి ఒక్కదారే వున్నది. దాన్ని మొదట హైదరాలీ స్వాధీనపరుచుకోడానికి మూడేళ్లు ఘోరమైన యుద్ధం చేయవలసివచ్చింది. అటువంటికోట ఆంగ్లేయులకి మూడు వారాల్లోనే స్వాధీనమైంది. ఆ సమయంలో మెకెంజీ చూపిన ధైర్యసాహసాలని ముఖ్యసేనాధిపతి హెచ్చుగా మెచ్చుకున్నాడట!

కారన్‌వాలిన్ ౧౭౯౨ లో మైసూరుని ముట్టడించాడు. ఆ సందర్భంలో శ్రీరంగపట్టణంలో జరిగిన యుద్ధంలో చీఫ్ యింజినీరుగా వుండిన 'పాట్రిక్ రాస్'కు మెకెంజీ కుడిభుజంగా ఉన్నాడు.

౧౭౯౩ లో పుదుచ్చేరిలో జరిగిన ముట్టడిలో మెకెంజీ పాల్గొన్నాడు.

౧౭౯౫ లో యూరప్‌ఖండంలో ఇంగ్లీషు వారికీ డచ్చివారికీ యుద్ధం జరిగింది. అంచేత ఇచ్చట వున్న ఆంగ్లేయులు కూడా సింహళద్వీపంలో వున్న డచ్చివలసలపై దాడి వెడలినారు. ఆదాడికి జేమ్సు స్టూఅర్టు నాయకుడు. ఆసేనలతో వెళ్లిన ఆర్గురు ఇంజినీర్లలో మెకెంజీ వకడు. ఆంగ్లేయులు డచ్చివారి నుండి ట్రిన్‌కోమలి లాక్కున్నారు. తర్వాత కొలంబో మీదికి యుద్ధానికి వెళ్లేటప్పుడు మెకెంజీ చీఫ్ ఇంజినీయరు! ఆ ముట్టడిసమయంలో ఒకనాడు ఇంగ్లీషు వారికి వంటచెరకు దొరకలేదు! అప్పుడు మెకెంజీ తాను ప్రాణపదంగా దాచుకున్న సుందరమైన పేదరి బుట్టల్నీ, వంపులూ, సొంపులూ తీర్చి చిత్రీకపట్టి తయారుచేసి జాగ్రత్తపరచుకున్న కర్రదిండ్లనీ వంటచెరకుగా ఇచ్చివేశినాడట! ఎంతో ప్రయత్నంమీద సంపాదిం

చిన ఆ అపూర్వవస్తు సామగ్రిని అగ్నికి ఆహుతివ్వడానికి అతని మన స్సెంత చికాకుపడిందో!

అయితేనేం? వీరి ప్రయత్నం సఫలమైనది గనుక ఆనష్టానికి అతను ఎక్కువ విచారించలేదు. ౧౭౯౬ జనవరి పదిహేన్లో తేదీని కొలంబో ఆంగ్లేయులకి దఖలుపడ్డాది.

౧౭౯౭ లో జనరల్ క్రెయిగ్ యాజమాన్యాన్ని ఆంగ్లేయులు ఫిలిప్పైన్ దీవుల్లోని మానిల్లామైకి వెళ్లేరు. అప్పుడు ౩౦౦ పయనీర్లమైని మెకెంజీ ఛీఫ్ ఇంజినీరుగా ఉండి పని నెరవేర్చి తిరిగి మద్రాసుకు వచ్చాడు.

ఆయేడులోనే ఆంగ్లేయులు నిజాం సేనలో వున్న ఫ్రెంచిసైనికుల్ని ఓడించే సందర్భంలో మెకెంజీ హైదరాబాదులో వుండినాడు. ౧౭౯౯ లో జరిగిన నాల్గవ మైసూరుయుద్ధంలో మెకెంజీ పాల్గొని శ్రీరంగపట్టణాన్ని వశపరచుకోవడంలో ఆంగ్లేయులకి చాలా సాయపడ్డాడు. ఆసమయంలోనే అతను అక్కడి ప్రాచీనవస్తువులనీ, నాణేలనీ సంగ్రహించాడు.

ఆతర్వాత కుంఫిణీవారు మైసూరు రాజ్యాన్నంతనీ సర్వే చేయడానికి మెకెంజీని నియమించారు. మైసూరు ౭౦ వేల చదరపుమైళ్ల విస్తీర్ణం గల విశాల రాజ్యం! ఆ సర్వే ౧౮౦౭ దాకా సాగింది. ఆ సమయంలోనే ఇతడు పురాతనవస్తువుల్ని సంగ్రహించడానికీ, చరిత్రవిషయాల్ని సేకరించడానికీ వీలుపడింది. మెకెంజీ కార్యదక్షతని మెచ్చుకొని ప్రభుత్వంవారు ౧౮౧౦ లో అతన్ని మద్రాసురాష్ట్రానికి సర్వేయరు జనరలుగా నియమించారు. ఆ వుద్యోగంలోనే వుంటే అతనికి ఓరియంటల్ రిసెర్చికి మంచి అవకాశం చిక్కేదే! కాని ప్రభుత్వంవారతన్ని చాలాకాలం ఆపనిలో వుంచలేదు.

౧౮౧౧ వ సం. లో ఆంగ్లేయులకి జావాలోని డచ్చివారితో యుద్ధం చేయవలసివచ్చింది. ఆ యుద్ధపు సైన్యానికి మెకెంజీయే ఛీఫ్ ఇంజినీరు! ౧౮౧౧, జూలై ౧౮ వ తేదీని మెకెంజీ లెఫ్టెనెంటు జాన్ బ్లాకిస్టన్ తోనూ, మరికొందరు నావికులతోనూ బటేవియా సముద్రతీరాన్ని దిగి తమ సేనలు బసచేయడానికి అనుకూలమైన ప్రదేశాన్ని వెతక సాగారు. మెకెంజీ, జాన్‌బ్లాకిస్టనూ మారువేషాలతో బయలుదేరారు. దారిలో చూసే ఒక చీనావాడూ, నలుగురు నావికులూ వారికున్న సహాయం! వీరొక పల్లెచేరారు. అంతకుముందే అక్కడ బసచేసివున్న ఫ్రెంచివారు వీరు ఇంగ్లీషువారని గుర్తించి తుపాకులు పేల్చడానికి ఆరంభించారు. వనవాళ్లు అప్పుడు చేసేది లేక కాళ్లకి బుద్ధిచెప్పవలసివచ్చింది. వెంటతరుముతున్న ఫ్రెంచివాళ్లని తప్పించుకుని వీరు నావల్ని చేరి లంగర్లెత్తి సముద్రంమధ్య ప్రవేశించారు. ఆ సమయంలో మెకెంజీకి కొలదిపాట్లో అపాయం తప్పిపోయింది. ఎలాగయితేనేం చివరికి జావా ఇంగ్లీషువారికి స్వాధీనమైంది. ౧౮౧౫ మార్చిదాకా-అంటే రమారమి నాలుగేళ్లపాటు మెకెంజీ జావాలోనే వుండిపోయాడు. అప్పుడతను జావాకు సంబంధించిన భూగోళవిషయాలనీ, పాడిపంటల్నీ, పూర్వపు డచ్చిప్రభుత్వవిధానాన్నీ, మిలిటరీ రిపోర్టులనీ, పురాతత్త్వ విషయాలనీ, చారిత్రక విషయాలనీ చాలావరకూ సంగ్రహించాడు. అంతకి పూర్వం తనకి శత్రుకోటిలో వారైన బటేవియావారు అతనికి ప్రాణస్నేహితులైపోయారు! బటేవియన్ సొసైటీవారు ప్రకటించే జర్నలుకి మెకెంజీ వ్యాసాలు ఎన్నో వ్రాశాడు !!

౧౮౧౫ సం. లో ఇతను ఇండియాకి తిరిగి వచ్చాడు. అప్పుడు ప్రభుత్వంవారితన్ని 'కంపేనియన్ ఆఫ్ ది బాత్' అనే బిరుదుతో గౌరవించారు. అంతే కాకుండా ఆమరుసటి సంవత్సరంలోనే ఇతనికి ఇండియాదేశపు సర్వేయర్ జనరల్ వుద్యోగం యిచ్చారు.

ఇండియా సర్వేయర్ జనరల్ ఉండవలసిన చోటు కలకత్తా. కాబట్టి మెకెంజీ దక్షిణహిందూస్థానం విడవవలసి వచ్చింది. తాను సంపాదించిన వస్తువులతోనూ, గ్రంథాలతోనూ అతడు ప్రయాణమయ్యాడు. అంతకుముందే అతని పోషణలో వుండి రిసెర్చిపనులు

చేస్తూవున్న దక్షిణదేశ పండితులు అతన్ని వదలలేక కలకత్తాకు ప్రయాణమయ్యారు. వారి సాయంతో తాను సంపాదించిన వస్తువులకీ, పుస్తకాలకీ పూర్తి అయిన కేటలాగు తయారు చేయవచ్చనీ, తనకు తెలిసిన విషయాలని ప్రకటించవచ్చనీ మెకెంజీకి గంపెడాశ కలిగింది. కాని అతనితో వెళ్లిన పండితులకి చాలామందికి కలకత్తాలో ఆరోగ్యం చెడింది. కొందరు కాలం చేశారు అంతతో మెకెంజీ ప్రయత్నానికి తీరని విఘ్నం కలిగింది. అతని ధైర్యం జిగజారింది. తాను తన వుద్యోగ ధర్మాల్ని నెరవేరుస్తూ పరిశోధనలు చెయ్యలేడనే నిశ్చయం అతనికి కలిగింది. వెంటనే అతడు తనకి జీతం నష్టం లేకుండా మూడేళ్లపాటు సెలవిప్పిస్తే యింగ్లాండుకు వచ్చి ఆ విరామసమయంలో అక్కడి ప్రాచ్యభాషాపండితుల సాయాన్ని తనవద్దవున్న హిస్టారికల్ రికార్డులని ప్రకటిస్తానని ఈస్టిండియా కంపెనీవారి కోర్టు ఆఫ్ డెరెక్టర్లతో చెప్పవలసిందని తన మిత్రుడు సర్ అలెగ్జాండరు జాన్స్టన్‌కు ఉత్తరం రాశాడు. కాని లాభం లేకపోయింది. దానికి కంపెనీవారు ఒప్పుకోలేదు.

తన వృత్తిపనులూ, తలచుకున్న పనులూ—రెండూ చేరి తలమునకలయి మెకెంజీకి తీరని శ్రమకలిగించి తుదకి అతన్ని కబళించివేశాయి. తన ఆశయాలు నెరవేరకుండానే అతడు ౧౮౨౧ మే ౮ తేదీని కలకత్తా సమీపంలో ఇహలోకాన్ని విడిచాడు.

తన కోరికని పూర్తిగా నెగ్గించుకోలేకపోయినా మెకెంజీ జీవించి ఉన్నంతకాలంలో ఎక్కువపనే చేశాడు. అతడు కృష్ణకి దక్షిణంగావున్న ప్రతీప్రదేశాన్నీ—అంటే—పురాతత్వవిషయ పరిశోధనకి తగిన దాన్ని—పరిశోధించాడు. ప్రాచీనశిలాలకు రెండువేలకుపైగా చిత్రాల్ని తయారుచేశాడు. శాసనాలకి నూటికిపైగా ప్రతిబింబాలని తీశాడు. ఎనిమిదివేల శాసనాలకి నకళ్లు వ్రాశాడు. ౭౭ స్థానిక చారిత్రకసంపుటాల్ని కూర్చాడు. మైసూరు చరిత్రరచనలో మార్కు విల్కిన్సుకు చేదోడూ, వాదోడూ అయినాడు. అతని కార్యదీక్ష అనన్యసాధారణమైనది. హిందూదేశచరిత్రకి సంబంధించిన ఇంత రికార్డును సంపాదించినవారు మెకెంజీని మించినవారు మరెవ్వరూ లేరు.

గవర్నమెంటు అతని ఖర్చుల్నీ, పండితుల జీతాల్నీ మాత్రం భరించేది. వస్తువులకీ, పుస్తకాలకీ అతను స్వంత డబ్బే ఖర్చుచేశేవాడు. అతడు ౧౫ వేల పౌనులు దీనికై వ్యయంచేశాడు. తన సర్వస్వాన్ని—ధనాన్నీ, ప్రాణాన్నీ కూడా పరిశోధనకే సమర్పించాడు.

ఇంత స్వయంప్రయాసలతోనూ అతను సేకరించిన వస్తువుల్నీ పుస్తకాలనీ గవర్నమెంటువారు అతని భార్యదగ్గర ౧౦ వేల పౌనులకే తీసుకున్నారు.

మెకెంజీ తలపెట్టిన కేటలాగుపనిని విలియం టెయిలర్ అనే ఆయన నిర్వర్తించాడు. అందులో అతని వస్తువుల్ని గురించీ పుస్తకాల్ని గురించీ వివరంగా వ్రాయబడ్డది. కేటలాగే ఐదువందల డెబ్బైపుటల పెద్ద గ్రంథంగా తయారయింది!

(ఆంధ్రభూమి- ఫిబ్రవరి ౧౯౩౪- లోని వ్యాసాన్ని అనుసరించి)

---




శివభక్తమాహాత్మ్యమునందలి వైశ్యమూర్తి నాథాఖ్యానమున నొకానొకరంగము
(శ్రీకాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్ర సంగ్రహమునుండి)

# తేనీటి సేవ

పండ్రింగి రాజేశ్వరరావు

తేయాకు మొక్క హిందూ దేశమునకు సుమారు నూరు సంవత్సరముల క్రితము వచ్చెను. అప్పటి నుండియు ఈ పరిశ్రమ ముఖ్యముగా అస్సాము రాష్ట్రమందు చాల అభివృద్ధిగాంచెను. ముఖ్యముగా ఎగుమతి కొరకే తేయాకు పండింపబడుచున్నది ఇండియన్ 'టీ' ప్రశస్తమైన దగుటచే పాశ్చాత్య దేశములందు మంచి పేరు సంపాదించినది. ఇటీవల ఆర్థికదుస్థితివలన నీ పరిశ్రమకు తీరనినష్టము గల్గినది. ఈ ఆపదనుండి మేనేజింగు ఏజంట్లు దీనిని రక్షించిరి. ముందువెన కాడక ద్రవ్యమును వెచ్చించి మిగ పెదపల్లి పరిశ్రమను నిలబెట్టిరి. మేనేజింగు ఏజన్సీ పద్ధతి స్వతహా లోపభూయిష్ఠమై యున్నను ఈ సందర్భమున సాటిలేనిసేవ చేసినది. తరువాత ఒట్టావా ఒడంబడిక (Ottawa Agreement) చేయూత నిచ్చినది. సామ్రాజ్యదేశములు (Empire Countries) ఇండియన్ 'టీ' యెడ పక్షపాతము (ప్రియత్వము ?) (Preference) చూపించుచున్నను ప్రక్కను సిలోను 'టీ' కూడ ఉండుటచే అట్టి లాభము కలుగలేదు. తత్రాపి యింతవరకు సామ్రాజ్యేతర దేశములందుగల అమ్మకము (Non Empire Market) సన్నగిలినది. ఇందుకు సాయము కాఫీ, కోకో మొదలగు పానీయముల పోటీ కూడ హెచ్చుగనున్నది. తుదకు 'టీ' పండించువారందరు కలిసి 'టీ' పైరు పరిమాణమును కూడ తగ్గించివైచిరి. ఇన్ని చేసినను పరిశ్రమ మాత్రము తృప్తికరమైన స్థితికి రాలేదు. రెండు సంవత్సరముల క్రితమువరకు పరిస్థితు లిట్లుండెను. అపుడు ఇండియన్ 'టీ' సెస్ సంఘమువారు (Indian Tea Cess Committee) మన దేశమందలి వివిధ రాష్ట్రములలో తీవ్ర ప్రచారము సాగింప మొదలిడిరి.

ఈ రెండుసంవత్సరములలోను వివిధ ప్రాంతములందు ప్రచురణాధికారులు (Propaganda Inspectors) ఏర్పరుపబడిరి. వారు ప్రతిచోటను 'టీ' తయారుచేయు పద్ధతిని ప్రదర్శించుటయేకాక జనసామాన్యమునకు 'నమోనా' (Sample)గా తేనీరు ఉచితముగా నిచ్చుచున్నారు. తేనీరు త్రాగుటవలన కలిగెడు మంచిని గురించి వారిచ్చెడి కరపత్రోపన్యాసముల కంతులేదు. ఇంగ్లీషు, దేశభాషల పత్రికలందు ఆకర్షణీయము ప్రకటనలకుతోడు అధికార, అనధికార ప్రముఖులయొక్క సహాయ సానుభూతులకొరకై ప్రయత్నించుచున్నారు. సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు తాత్కాలికపు గవర్నరుగా నున్నప్పుడు తాము తేనీటికి బాగా అలవాటుపడియుండుటచే ఈ యుద్యమము జయప్రదమగుగాత యని దీవించిరి (As a confirmed "tea-drinker" I wish the campaign every success.). హైదరాబాదు సంస్థానమందు గవర్నమెంటు సానుభూతిని అచటి ఉన్నతన్యాయస్థానపు ప్రధానన్యాయమూర్తులైన నవాబ్ మిర్జా యార్ జంగు బహదూరుగారు అధ్యక్షుడుగాగల 'మితపాన ప్రచారసంఘము' (Temperance Committee) వారు త్రాగుడుకు మారుగా తేనీటిని సేవించుడని ప్రజలకు సలహా నిచ్చిరి.

ఇంతవరకు జనసామాన్య మీవిషయమై కనపరచుచున్న అశ్రద్ధ గర్హ్యమైనది. సంవత్సరమాక్రితమే ఆచార్య ప్రఫుల్లచంద్రరాయిగారు ఈవిషయమున తమ తీవ్రమగుఅసమ్మతిని వెల్లడిచేసిరి. ఈ దురలవాటువలన కలిగెడునష్టములను శాస్త్రయుక్తముగా వివరించిరి. దూరదృష్టితో చూచిన, 'తేనీరు' కూడ ఇతర మత్తుపదార్థములవంటిదేయని ఒప్పుకొనకతప్పదు. మహాత్మ గాంధిగారుకూడ తమ అసమ్మతిని "హరిజన" పత్రికయందు ప్రచురించిరి. కాని తగునంతఅలజడి జరుగలేదు. ముందుకూడ పరిస్థితు లిటులనే యున్నయెడల అమాయ

వులగు పామరజను లీయలవాటుకు దాసులగుట తథ్యము. సుస్యకరగతివారినిగురించి వేరుగ వ్రాయనవసరము లేదు. వీరిలో మూడుముప్పాతిక యిందు కలవడినవారే. ఇక శ్రీమంతులగుపైతరగతులవా రేలయూరుకొందురు?

'తేనీటి'యొక్క మంచిచెడ్డలనుగురించి యొకింత ఆలోచింతము. ఈజాతీయపరిశ్రమ(National Industry) ను దేశీయులెల్లరు పోషింపవలయు ననెడువాదము కలదు. కాని దీనిని జాతీయపరిశ్రమగా పరిగణించుట కేవలము పొరపాటు. ఈపరిశ్రమయొక్క మూలధనము, ఆధ్వర్యము (Capital and Management) యూరపియనులచేతులం దున్నవి. అస్సాము 'తేయాకు' తోటలందు హైందవకార్మికు లెట్లు పరిగణింపబడుచున్న సంగతి మనకు పూర్తిగా తెలియును. ఇటీవలవరకు కేవలము బానిసమాత్రులుగ నుండిరి. ఈమధ్య కొన్ని సౌకర్యములు జరిగినను మొత్తముమీద తృప్తికరముగ లేదనియే చెప్పవలసియున్నది. దూరదృష్టితో చూచినయెడల 'తేనీరు' కూడ విదేశీయపానీయ మనుటయందతిశయోక్తి లేదు. దీనిని "స్వదేశీ" పానీయమనుట అవమానకరముగ నెంచవలసియున్నది.

'తేనీరు' ఉత్సాహమునిచ్చు పానీయ (Cup of cheer) మనిచెప్పెదరు. ఇం దెంతమాత్రము నిజము లేదు. ఇందుగల ముఖ్యవస్తువైన 'ట్యానిక్ ఆసిడ్' (Tanic acid) ఉద్రేకము కలిగించుగుణము కలిగియున్నది ఎక్కువగా తీసుకొన్నపుడు మత్తు (Intoxication) కూడ కల్గును. ముఖ్యముగ నిద్రను లేకుండ (Insomnia) చేయును. కాలము గడచినపిదప కొంది పాటి విషము (Slow poison) గ పరిణమించును. మామూలుగ నుండెడి ఆకలిని (Appetite) తగ్గించును. ఈ దురలవాటు నాగరికతాలక్షణమనెడి భావముకూడ వృద్ధియగుచున్నది. తాము త్రాగుటయేకాక చూడవచ్చువారందరకు వేళపాళలతో నిమిత్తము లేకుండ 'తేనీరు' నిచ్చుట ఆచారమైపోయినది. ఇందులకగు ఖర్చుకూడ మితిమీరిపోవుచున్నది. ఇపుడైనను అనర్థదాయకమగు ఈ 'తేనీటి'ని విసర్జించి సకలవిధంబుల పుష్టికరమైన 'పాలను' త్రాగుట మంచిది. ప్రస్తుతపు రాజప్రతినిధిగారైన లిన్‌లిత్‌గో ప్రభువుకూడ 'క్షీరము'యొక్క శ్రేష్ఠతను గురించి నొక్కివక్కాణించుటయే కాక దీనిని అనుచరణలోనికి తీసుకువచ్చుటకు కూడ ప్రయత్నించుచున్నారు. ఈ విషయమై పెద్దలందరు కూడ [illegible] వాంఛనీయము.

---

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి, ఏ., బి. యల్.,

ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంతవిధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములవైఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ-ఏకవర్ణచిత్రములు నలుబది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్ర కళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము.

వెల. రు. ౧-౧-౦.

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల, నెం. ౭, తంబుచెట్టివీధి, మదరాసు.

# మా ట వ ర స

భమిడిపాటి కామేశ్వరరావు

౧. బస్తీరోడ్లు

బస్తీరోడ్డుకేసి చూస్తే జీవితం అంటే పెద్ద పోటీపందెం అనిపిస్తుంది. ఈ పందెంలో ఎవడిబాధ వాడిది అని తెలుస్తుంది. సకల మానవసమత్వం తెలిసి నమ్మినప్పటికీ, ప్రతీ వాడూ మరోణ్ణి దిగదొక్కి ముందుకి తను పెందరాళే వెళ్లాలని చేసేప్రయత్నం ప్రత్యక్షం అవుతుంది. పెందరాళే వెళ్లాలంటే వేగం ఎక్కువుండాలి. ధనవ్యయం చేస్తేగాని వేగం సిద్ధించదు. అందుచేత ధనవంతుడు బయల్దేరి, అనవసరంగా, తాత్కాలికంగా తనంతట తను తనకి ఆరోపించుగున్న అధికారాన్ని ప్రపంచంమీద చలాయిస్తాడు. ఆ చలాయింపుకూడా మనం చూడచ్చు. మనిషిని తప్పాగోమని బళ్లవాళ్లు. అందులో రెండెడ్ల బండివాణ్ణి ఒంటెద్దుబండీవాడు, వీళ్లిద్దర్నీ జట్కామనిషి, వీళ్లముగ్గుర్నీ రెండుగుఱ్ఱాల కోచివాళ్లు, వీళ్ల నలుగుర్నీ సైకిల్ వాళ్లు. పాపం, రెండెడ్లబండివాడు మనుష్యుల్ని తప్ప మఱెవర్నీ తప్పాగోమని తిట్టడానికి లేదనుకున్నాను. కాని, ఒకచోట ఒక రెండెడ్ల బండివాడు ముందున్న ఒకబండిని తప్పాగోమంటున్నాడు. తీరా ఏమిరా అని చూస్తే, ఆ ముందుది పోతులబండి. సరి, ఇదాఖరు. వీడు మరి తప్పాగోమని తిట్టడానికి ఏవాహనం లేదనుకున్నాను. కాని, మరొకసందర్భంలో ఒకపోతులబండివాడు ముందున్న బండివాణ్ణి 'తప్పించు, కళ్లాపట్లా?' అని మోటుగా తిడుతున్నాడు. ఏంచెప్మా అని చూసేసరికి – ఆ ముందుబండికి కట్టింది ఒకయెద్దూ ఒక పోతూను! పెత్తనం ఇచ్చేదా తెవడేనా ఉండాలిగాని, పెత్తనం ఇచ్చి నెత్తియెక్కించుగునేసరికి, వేనుకూడా తలంతా కొరికెయ్యగలదు. వీళ్లందరికీ పైవాడు సైకిలిస్టు. ఇతను నోరు విప్పకుండానే, గంట గిలగిలలాడించి అథార్టీ చేస్తాడు. వీళ్లందరికీ పై వాడు మోటారుసైకిల్ గారు. ఆయన కేవలం జనం వగైరాల్ని హారెత్తగొట్టి డబడబలాడించి దారి పుచ్చుగుంటాడు. అతనిధోరణిలో కొంత లయ ఉందని గానశాస్త్రజ్ఞులు దెబ్బలాడితే ఆడచ్చుగాని, పామరులప్రాణానికి అది ప్రళయంగా ఉంటుంది. దుమ్ము రేకొట్టడంలో అతడు ప్రథముడు. బస్సు వీరికి పైమాట. మహాబస్తీల్లో తప్ప కడంచోట్ల వీలయినంతమందికి నోట మట్టికొడితేగాని దానికి తోచదు. ఒక వ్యక్తితాలూకు స్వంతకారు వచ్చేసరికి వీరంతా దారివదలాలి. డ్రైవరు యొక్క ఔన్నత్యం, చక్రత్వం గమనించడానికి ప్రస్తుతం సావకాశం చాల్దు. "బతకవురా! సావాలనుందా! నూకల్లేవురా! కళ్లు లేవురా! చెవ్వుడా! బుద్ధిలేదురా! మెదవా!" అనే మార్దవంగాఉండే మందలింపుల్తోనూ,

అవాచ్యాలైన మరి యితరమాటల్లోనూ, ఎంత గొప్పవాడైన పాదచారైనా సరే సాధారణంగా ఉత్తపుణ్యానికి డ్రైవర్లుకొందరు సరదాగా, అలవాటుచొప్పన హెచ్చరిస్తారు. అందుచేత ఎంతహడావిడీ అల్లరీచేసి, ఎంతదుమ్ము రేగకొడ్తే రోడ్డుమీద అంత గొప్పవాడు కదా అని మనికితెలుస్తుంది. ఒక స్వంతవ్యక్తిది కాకుండా, ఒక సంఘం తాలూకు కారైతే, ఆడ్రైవరికి భూమిమీద ఎవ్వరూ అడ్డు ఉండకుండా తప్పుగోవలిసిందే. కాని ఈశ్వరవేరు ఉండితీరుతుంది. రావణుడికి మైరావణు డుంటాడు. అల్లానే ఎంతకొమ్ములుతిరిగిన కారుడ్రైవరుకీ కూడా అప్పీలుంది. గట్టిపదార్థాలు చెప్పమంటే ఓ కుర్రాడు 'ఇనుము' అని చెప్పాడట. ఇంకా గట్టిది 'ఉక్కు' అని చెప్పాడట. ఇంకా గట్టిపదార్థం ఏది అని అడిగినప్పుడు 'దున్నపోతు' అన్నాట్ట. మేష్టరు, 'అదేమిరా, దున్నపోతా ఉక్కుకంటేగట్టి?' అని కోపపడ్డాట్ట. అప్పుడు కుర్రాడు, 'అవునండి, ఉక్కుతో చేసిన కార్ని దున్నపోతు ఆపేస్తుందండి' అన్నాట్ట. అల్లాగ్గా, దున్నపోతుగారుగాని, లేక వారి తాలూకు పట్టమహిషిగాని, ఎంత కారువారు ఎంత హోరుచేసినా లక్ష్యపెట్టక చెక్కుచెదరకుండా కార్ని ఖణాయించి ఆపేసి, అవలీలగా ప్రైజు పుచ్చుగుంటుంది. ఇక్కణ్ణించి మనం దుమ్ముఘట్టంలో ప్రవేశిస్తాం. అందుచేత, ప్రస్తుతం బస్తీరోడ్లమీద మనికి కనిపించే యితరదృశ్యాల్ని వొదిలేసెయ్యాలి. అవి ఏవి అనగా, సైడుకాలవలు: సైడుకాలవల్లో ఉన్నన్ని వర్ణభేదాలు ఎక్కడాలేవు. అవి ఓపక్కగా ఏకవంద్రగా అంటే అల్లా ఏడవక, స్థితి పాడుచేసుగుని, రోడ్డుకి అడ్డంగా నడుస్తాయి భయభక్తులేకుండా! వాటిలోనీరు: దానికి, రామరామ, బొత్తిగా సిగ్గు లేదు. పాతనీరు ఎండమంటే ఎండదు, ఆయిలు చిలికినా మండమంటే మండదు, పోనీ కంపులేకుండా ఉండమంటే ఉండదు. తననిగురించి అడ్డమైనవాడూ తలోమాటా అని తలో తిట్టూ తిడుతున్నారని అది లోపల్లోపల తెగి కుళ్లి కుళ్లీపోతూంటుంది. 'నిజం దేవు డెరుగును, నీరు పల్లం ఎరుగును' అని శాస్త్రం. మనం నిజాన్నీ దేవుణ్ణీకూడా ఎరగం గనక, నిజం దేవు డెరుగు నని నమ్మితే నమ్మచ్చు. కాని ఈ సైడుకాలవలకేసి చూస్తే 'నీరు పల్లం ఎరుగును'డం'సందేహించవలి సొస్తోంది. వాటిల్లో నీరు 'నీరు' అనే శబ్దానికికూడా అప్రతిష్ఠ తెస్తోంది, ప్రతిష్ఠతో ఉంటున్నా ననుకుని. దానికి పల్లం ఏవేపో తెలియకపోతేచస్తామా మరీ! పొద్దున్న తూర్పుకి వెడుతూంటుంది. మనం ఎదేనా పని చూసుగుని కాస్సేపట్లో చక్కావచ్చి మళ్లీ చూసేసరికి పడమటగా పోవాలని తంటాలు పడుతూంటుంది, దిక్కుమాలి తంటాలుపడడం ఇదీనూ! ఇవిగాక, పైపులు: అక్కడ స్నాన, పాన, శోషణ, గ్రహణ, క్రీడ వగైరా ఉద్దేశాలతో అనేక జనం పోగవడం: ఒక్కొక్కప్పుడు కుంభ

మేలా: ఘటవాయిద్యం: మాతృభాషలో ఉపన్యాసపు పోటీలు: అక్కడే యుద్ధాలు–జిహ్వాస్త్రప్రయోగాలు. ఆ పైపులపక్క బస్సు జంతువులు: అనేకదూరం, శ్రమపడి, తొందరగా తిరిగిరావడంవల్ల అనేకరకాల మాలిన్యం పొట్టనెట్టుగుని స్వగ్రామం వేం చేసిన అంచీబస్సులు. వాటిని పరిశుభ్రంగా, పైచెప్పిన మాలిన్యం యావత్తూ అక్కడా అక్కడా పడిపోకుండా, మంచినీళ్లు తీసుగునే చోట పరిచి ఉంచితే, యథాశక్తిగా జనం ఆరగిస్తారు, ఎక్కడికక్కడికే ఆయిరి, అని పైపుపక్కనే, పల్లెటూరిచెర్లో గేదెల్ని కడిగి నట్టు, ఈ బస్సుల్ని కడగడం. ఇంక రకరకాల కంపులూ; వాటికి ఆటపట్టులూ: వగైరా వగైరా ఉన్నాయి. అవన్నీ వొదిలి దుమ్ము గురించిమాత్రం కొంచెం ముక్కుపట్టుకుందాం.

దుమ్ము హైరోడ్డుమీద ఎక్కువ ఎత్తుగా లేస్తుంది. ఆల్లా పైకి లేచిపోడంలో దానికి దురుద్దేశం ఎంతమాత్రం లేదు. సరిగదా, దానిగోలంతా ఏమని అంటే, 'హైరోడ్డు' అనేదాల్లో 'హై' అనేది సార్థకం చెయ్యాలనే. అందుకనే కోచిబల్లమీద కూర్చుని, అశ్వాల్ని తోలేవాళ్లూ వాళ్లు కూడా 'హై' అనడం. పైగా ఆదుమ్ముని ఏంజెయ్యమన్నారు?

అల్పులు ఎగిరిపడతారనిన్నీ, నీచస్థితిలోవాళ్లని కదిపితే, ఇల్లానే, కదపినవాడిమీదే కాకుండా దారేపోయేవాళ్ల నెత్తినీమీదకూడా ఛైటాయిస్తారు అని కూడా ఋజువు చెయ్యాలని అది బయల్దేరింది. బస్తీ దుమ్ము బాగా మరిగి కొందరు పొడుం పీల్చడం మానేశారు. అందుకని నస్యవర్తకులు కొందరు పొడుంకొట్లు ఎత్తేసి, దాంతో ఐ.పి. పెట్టేశారు. కొందరు, పొడుంచేసుగోడానికి గాని, కొట్టుదాకా వెళ్లడానికిగాని బద్ధకించిన వాళ్లు, హైరోడ్డుమొగలో మాటలెట్టుగుని, గుక్కఅయిపోనిచ్చి, తమరి తాతగారి సొమ్ములాగ, ఒక్కొక్కపీలుపుకి మూడేసిగజాల దుమ్ము పీలుస్తూంటారు. ఏదోవిధంగా, సలుగురూ, జాతిమత వివక్షతలేకుండా, బస్తీ దుమ్ముమూలాన్ని ముక్కుమూసుగుని నడిచి పోతూ, (తిట్టుగోడానికే వీల్లేకుండా అంతకు ముందే నోరుమూసుగుని) సనాతన ధర్మం నిలబెడుతూ, యోగసాధన విషయంలో ప్రథమప్రయత్నాలు బలవంతం మీాద చేస్తున్నారు. ఈ దుమ్మువల్ల ఉఫ్అంటే ఎగిరిపోయే జనంకూడా కొంచెం గురుత్వం, భారీతనం సంపాదిస్తున్నారు. బస్తీదుమ్మువల్ల హైరోడ్డుపక్కల గోడలకి మందం పెరిగిపోడాన్ని చూసి, గోడలికికూడా పెరగడం ఉంటోంది గనక, చెట్లలాగ ఏదో ఒకరకం జీవం వీటికికూడా ఉండితీరాలని ఏ ధురంధరుడో కనిపెట్టకపోతాడా, అపూర్వ వ్యాసాలు ప్రకటించి పట్టాపుచ్చుగోక పోతాడా అని, కొన్ని పరిషత్తుల్లో తన్ని మిత్తం పట్టాలుచేయించి, మెరుగెట్టించి, 'రడీ'లో ఉంచారు. 'దుస్థితి' అంటే దుమ్ము

వల్ల కలిగేస్థితి అనేవిగ్రహం చెయించాలని కొందరు అన్నారు. సృష్టి, స్థితి, లయాలు దుమ్ములోనే నని మనికి బస్తీదుమ్మువల్లే తెలిసొస్తుంది. దుమ్ముకేసి చూస్తే, అన్నిం దాలా మానవుణ్ణే తను కనిపెడుతూంటే, మానవుడు కనికరంలేకుండా తనని ఉపయో గించినందుకు, మరి ఓర్చుకోడం దుర్భరమై భూమి మానవుణ్ణే దుమ్మెత్తిపోస్తోందా అని పిస్తుంది. ఇప్పటిదాకా కొందరు జనం 'కళ్ల జోణ్ణి' పట్టుగుని 'ముక్కద్దా'లనీ, 'ముక్కు జో'డనీ కూడా వాడేస్తున్నారు. ఇక అల్లాంటి వాళ్ల ఆటలు సాగవు. బస్తీదుమ్ముధర్మమా అని ముక్కురాష్ట్రానికి ప్రత్యేకపుజోడు ఏర్పాటు కావచ్చు. కాళ్లకి రకరకాల జోళ్లు ఉన్నాయనీ (అంటే బంగారంవీ, వెండివీ, ఇనపవీ, కర్రవీ)—చేతులికి జోళ్లున్నాయనీ, కళ్లకి జోళ్లు సరే సరి అనీ,—చివరికి కర్మ దశ చెవలకి గుడా జోళ్లుండడం ఏమిటి, మాకు లేకపోవడం ఏమిటి అని ముక్కు రం ధ్రాలు చిరకాలం భగవంతుణ్ణిగురించి వాయు భక్షణమాత్రం చేస్తూ తపస్సుచేశాయిట. "క్రమేపీ చుట్టుపక్కలవాళ్లందరికీ రాష్ట్రాలు ఏర్పడనీండి. ఆ పని జరిగిపోయిం తరవాత మిగిలిపోయింది దానంతట అదే మన స్వంత రాష్ట్రంగా ఏర్పడుతుంది. ఇంకోర్ని అడగా అక్కర్లేదు, వాళ్లు ఇవ్వా అక్కర్లేదు, మనం దానం పట్టా అక్కర్లేదు." అని ఆంధ్ర జన వేదాంతుల్లాగ ఊరుకోక అవి తపస్సుచేసే సరికి, "మీకు తొలగిన అన్యాయం కారు యుగం రానీండి తొలగిస్తాను" అని ఆయన అన్నాట్ట. కారుయుగం అంటే కారేజి. అదే ఇంగ్లీషులో గారేజి అనిఅంటున్నారు—అరవ సాంప్రదాయంలో 'క' కారాలు 'గ' కారా లుగా మారతాయి గనక. ఎంత గొప్పవా ళ్లైతే, పట్టపగలు అశేషజనానికీ, కళ్లల్లో దుమ్ముచల్లగలవారంటారుగదా అని రోడ్డు మీదే తెలుస్తుంది. అటువంటప్పుడు, ఇక రాత్రివేళ అడిగారూ కథ! సాయంత్రం పడ్డ తరవాత కార్లు, ఇంటిముహం పట్టిన మెడ్ల లాగ మరీ జోరుగా నడుస్తాయి. ఎంచేతంటే, పగలైతే వినపడడం కోసం కుయ్యాలి. రాత్రి కనపడితే చాలు. వెలుగుయొక్క వేగం శబ్దం వేగానికి లక్షరెట్లు, మళ్లా మాట్లాడితే పది లక్షలరెట్లు. అందుకని రాత్రివేళ కారు చాలా దూరంలో ఉండగానే ఆధూళిమండ లంలో కారుదీపోదయం అయి, మనికీ వచ్చే కారుకీ మధ్యనుండే జన జంతు శకటాదులు అన్నీ ధూళితెరమీద ఆడుతూన్న నవీన యుగపు తోలుబొమ్మల్లాగ, తెల్లకాగితం మీద సిరాబొమ్మల్లాగ మిక్కిలి శోభగా ఉంటాయి. అందరికీ ఏకరంగు ప్రసాదించడం వల్ల వర్ణభేదం నశించడానికిన్నీ, మధ్య జాగాలో ఉండే వీర్నీ వార్నీకుడా ఏకకాల మందే అది తాకుతూఉండడంవల్ల అస్పృ శ్యతా దోషానిన్నీ తొలగించడానికి బస్తీ దుమ్ముకిందామీదా తెలియకుండాపనిచేస్తోం దని చెప్పచ్చు. బస్తీహైరోడ్డుమీద, రాత్రివేళ, జట్కాలో వెడుతూ, మాస్నేహితు డొకా

యన,— అతడు ప్రబంధకవిత్వం తప్ప మెచ్చడు — 'స్మరశిలీముఖ కుసుమ కేసర పరాగధూళి'— అనేది జ్ఞాపకం తెచ్చుగుని, అప్రస్తుతం అని తెలిసినా శ్రీనాథుణ్ణి పొగిడి, మెచ్చి అంతటితో ఆగక, ఆదుమ్ము మీద కవిత్వం యత్నించి, బస్తీ శృంగార వ్యవహార ప్రారంభోత్సవం సూచించడానికి బయల్దేరిన పుష్పబాణ విలాసఫలితం అన్నాడు. కొన్నిచోట్ల వీథిదీపాలు తామే చీకటికి భయపడి కళ్లు మూసుగున్నట్టు కనిపిస్తాయి. ఒక్కొక్కప్పుడు మూడు నాలుగు కార్లు ఇటూ అటూ ఒకేక్షణంలోనే వెళ్లడం గనక తటస్థిస్తే, వీథిదీపాలు ఎక్కడుంటాయో చెప్పగోడానికి ఇతరదీపాలు పట్రావాలి. ఏమైనా చెప్పడం గగనం. రాత్రిభాగంలో వెలుగుకిరణాలకి దుమ్మనేది ఒక వైభవం తేవడంవల్ల, వెలుగులూ అడ్డూ నీడలూ గమనించి, గ్రహణాల కారణాలూ, రకాలూ, ముక్కు మూసుగుని నేర్చుగోవచ్చు నని భూగోళధూళిశాస్త్రప్రియులు చెబుతున్నారు. ధూళి లేనిపక్షానికి వర్షాలు నశించుతాయి గనక, ఇది మానవులకి అత్యంతోపయోగం అని కొందరిమతం.

౨. పదిరూపాయల టిక్కెట్టు

హద్దూ పద్దూ లేకుండా తిరగడాన్ని గురించి చెప్పేటప్పుడు తెలుగువాళ్లు, కాలు గాలినపిల్లిలా తిరగడం, మారని డబ్బులా తిరగడం, తడిమన్ను పొడిమన్ను అయేటట్టు తిరగడం, ఆసుకండిలా తిరగడం, అరువు సైకిల్‌లాగ తిరగడం అని అంటూంటారు. రైలు కంపెనీవారి ధర్మమా అని ఇటీవల 'పదిరూపాయల టిక్కెట్టువాడులాగ తిరగడం' అంటున్నారు. తిరగడానికి నియమించినకాలం వెనక నెల ఉండేది. ఇటీవల అది చిక్కి సగం అయింది. ఆ రోజుల్లో జనం కొత్తవాళ్ని కలుసుకోగానే, 'ఎప్పుడు రావడం?' అని హెచ్చరించి, 'నేను ఈమధ్య పదిరూపాయలు' అని అవతలవారు అనగానే, ఇంకా ఏం దస్తరం విప్పుతారోఅని, 'అల్లానా? నాకు పనుంది సెలవు' అని చెప్పేసి బలవంతపుసెలవు పుచ్చుగుని పోతూండడం జరిగింది. ఈ రీతిగా తెలుగుభాషలో చరితార్థులైనవాళ్లని అందర్నీ అభినందించవలసిందే. రైలువాళ్లు మంచిపని చేశారని కొందరన్నారు. తెలుగువాళ్ల ప్రథమావేశం, వేలంవెఱ్ఱీ, డబ్బుఖర్చు వేదాంతం ఎగసందోసి సొమ్ముచేసుకున్నారని కొందరన్నారు. "ఉన్నపన్లన్నీ దబ్బున చూసుగోవచ్చు, రండయ్యా!" అని రైలువాళ్లు పిలుస్తూంటే రాం అని పట్టుపట్టడం భావ్యంకాదని, పన్లున్నవాళ్లూ, పన్లు ఉన్నాయి అనుకున్నవాళ్లూ, పనిలేనివాళ్లూ, ఏదోపని ఏర్పాటు కాకపోతుందా అనుకున్నవాళ్లూ, 'ముందు టిక్కెట్టు కొనేసి ఓమూల్నించి సర్కీటు ప్రారంభిస్తే ఏ ఊళ్లోదిగినా అక్కడ ఏ ఎరుగున్నవాడో, వాడులాంటివాడో దొరక్కపోతాడా, ఎక్కడో ఎల్లానో మకాం వెయ్యలేకపోతామా, కానీ! దేవుడున్నాడు!' అను

కున్న వాళ్లూ, ఇంకా చాలామంది ఇతరులూ కుడా ఆతరుణం ఉపయోగించుకున్నారు. టిక్కెట్టు పదిరూపాయలైనా, వందలకొద్దీ జనం చిన్న పెట్టిస్టేషన్లకిగుడా ఎగడి, వేల కొలది టిక్కెట్లు కొనుక్కోగా, రైలువారి కొచ్చిన డబ్బు లక్షలమీదా, బయల్దేరి తిరిగినజనం సంకల్పించుగున్న పన్లు కోట్ల మీదా, ఈజనమూ వీరియొక్క దర్శన, సమావేశ, పరిచయ, ఆతిథ్యభాగ్యం పొందగలిగిన ఇతరజనమూ పడినకష్టాలు శతకోట్ల మీదా ఉంటాయని మాస్నేహితుడు ఒకాయన మదింపువేశాడు. వీరిలో చాలామందికి నెరవేరిన పన్లు లెక్కకి అందవు. కొందరికి పన్లు ఒకట్లమీద అయినాయి. కొందరికి ఒకటేపని నెరవేరింది——ఇంటికి చేరుకోడం— చాలామంచి పని అయిపోయింది - కాలం అయిపోయి ఇల్లుచేరేసరికి. కొందరికి ౧౫ రోజులపాటు నిరుద్యోగసమస్య తెగిపోయింది. అందరికీ నిష్పక్షపాతంగా ‘దశ’ మారిపోయింది. రైలువారు జనానికి, ఇటువంటివే నూతనదశలు త్వరత్వరగా ఇప్పిస్తారనిన్నీ, వందరూపాయల టిక్కెట్టుమీద సంవత్సరమున్నూ, వెయ్యిరూపాయల టిక్కెట్టుమీద యావజ్జీవితమున్నూ తిరిగి పనులుచూసుగోవచ్చును అని అంటారనిన్నీ, అప్పుడు బ్రతికున్న తెలుగువాళ్లంతాకుడా రైళ్లెక్కి ఇటో అటో ఎటో తమకే తెలియని స్టేషన్కి వెడుతూంటారనిన్నీ, అప్పుడు బస్తీల్లో దుమ్ము తగ్గి, కంపుపోయి, జనం ఉండరు గనక ఆరోగ్యం హెచ్చి, ఇళ్లుచౌకై ఇంకాబోలెడు సదుపాయాలు వాటంతట అవే సిద్ధిస్తాయనిన్నీ, ఎల్లానో అల్లా ఆ క్లైములోనే కొత్త ఎన్నికలు పడేటట్టుచేసి కొన్నికక్షులవారు ఒకటి మెజారిటీతోటేనా నెగ్గాలని చూస్తున్నారనిన్నీ పామరులు అనుకుంటున్నారు. ఈరీతిగానే ౧౦౦౦ రూపాయలకి ఓకమీద భూలోకయాత్రా టిక్కట్టున్నూ, మరికొంతకాలానికి ఓలక్షరూపాయలకి విమానంమీద సంపూర్ణగ్రహచారపు టిక్కెట్టున్నూ దొరుకుతాయనిన్నీ, అప్పుడు జీవరాసులు సశరీరంగా ఈరేడులోకాలూ పర్యటనం చెయ్యవచ్చుననిన్నీ శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు.

---

# వార్తాపత్రికలు

పి. టి. రామాచార్యులు

వార్తాపత్రికల నెరుగనివా రుండరు. "వార్తాపత్రికలు" అనుపేరును బట్టియే వానిలో నెట్టి యంశము లుండునో తెలియుచున్నది. కబుర్లు, విశేషములు, ఆశ్చర్యకరమైన వృత్తాంతములు, అభిప్రాయములు, ఉపన్యాసములు, పిట్టకథలు, నానావిషయములును వార్తాపత్రికలనుండి మనకు తెలియుచున్నవి. మన దేశమునందలి విషయములైననేమి, దూరదేశములందలి విషయములైననేమి, ప్రపంచమునందు జరుగుచున్న నానా విచిత్రవిషయములను తెలియజేయునదియె వార్తాపత్రిక.

వార్తాపత్రికలు ప్రచురించువారికి క్రొత్తసంగతులెట్లు తెలియును అనువిషయమున మనలో చాలమందికి కొంత సందేహముండవచ్చును ఏ స్పెయిన్ దేశములోనో ఒకమూల యుద్ధము జరుగుచుండినయెడల, ప్రతిదినమును ఏ మేమిజరిగినది, ఏపక్షమువారిశక్తి తగ్గుచున్నది మొదలగు వృత్తాంతములు మన ఆంధ్రపత్రికకు ఎట్లు తెలియును? ఇతరపత్రికలను జూచి వ్రాసికొందురా? అట్లయినచో ఆ ఇతరపత్రికలకు మాత్రము ఈవిషయము లెట్లు తెలియును? ఈపత్రికలకు ఈవిషయములను తెల్పుటకు అచ్చట ఎవరైనను ఉన్నారా? అను సందేహములు మనకు కలుగవచ్చును.

ప్రపంచమునందున్న ప్రతిముఖ్యపట్టణమునందును వార్తలకొరకై తమవారి నొకరిని నియమించుట ఎట్టి గొప్పవార్తాపత్రికకైనను సాధ్యముగానిపని. కాన పత్రికల కన్నిటికిని నానాదేశములందలి వృత్తాంతములను తెల్పు సంఘ మొకటి కలదు. దీనిని రూటరు (Reuter) సంఘము అని అందురు. రూటరుసంఘమువారు ప్రపంచమునందలి ముఖ్యస్థలము లన్నిటియందును కలరు. ఏ దేశమునం దెచ్చట నొకముఖ్యవిషయమో, విచిత్రవిషయమోకాని జరిగినను వెంటనే వీరు తమ ప్రధాన కార్యాలయమునకు తంతిద్వారానో, లేక రేడియోమూలముగనో అట్టివిషయములను తెలియజేతురు. అచ్చటనున్నవారు ఈ విషయములను నానాదేశముల పత్రికలకును రేడియోమూలముగనో, తంతిమూలముగనో తెలియజేతురు. ఇట్లు దినదినమును నానావృత్తాంతములను వీరు తమకు తెలియజేయవలెనన్న పత్రికాధిపతులు వీరికి ప్రతినెలయు కొంతధనము చెల్లించవలెను.

రూటరు కంపెనీ నానాదేశములందును జరుగు ముఖ్యవార్తలను మాత్రమే తెల్పును. ఇతర దేశములందలి సామాన్యవిషయములు మనకంతగా కాబట్టవు. ఫ్రాంస్ దేశ మెట్టి యుద్ధసన్నాహములను జేయుచున్నదో తెలిసికొనుటకు మనకు కౌతూహల ముండును. కాని లూవర్ నగర పురపాలకసంఘమువారు ఒక క్రొత్త ఆస్పత్రి నిర్మించుటకు తీర్మానించిరనునంశము మనకు కాబట్టదు. కాని అదేవిషయము బొంబాయిలోనో, కలకత్తాలోనో జరిగినయెడల మనకు కొంతయుత్సాహముండియే తీరును. కాన ఇట్టి విషయములను గూడ తెలిసికొని వ్యాపింపజేయుటకు ఒకొక్క దేశమునందును ఒక ప్రత్యేకసంఘ ముండును. హిందూదేశమునందును అట్టి సంఘమొకటి కలదు. దీనిని అస్సోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా (Associated Press of India) అని అందురు. వీరి ప్రతినిధులు మనదేశమునందలి నానాదేశములందును గలరు. ఐనను మనతెలుగుదేశమునందున్న ప్రతిజిల్లా వృత్తాంతములను, ప్రతి ఆంధ్రనాయకుని చర్యలను ఆంధ్రపత్రికకు దెల్పుటకు ఈ సంఘమునకు సాధ్యము గాదు. కాన ఆంధ్రపత్రికా విలేఖరులు (Reporters) మన తెలుగుదేశములో చాలచోట్ల గలరు. వీరు తెల్పు విషయములు ఒక్క తెలుగువారికే ఆవశ్యకములుగాన ఈవిషయములు సాధారణముగా తెలుగుపత్రికలలోతప్ప ఇతరత్ర ప్రచురింపబడవు.

ఈవిధముగ పత్రికాకార్యాలయమునకు మూడు మర్గములనుండి వృత్తాంతములు వచ్చుచుండును. ఉదా

హారణముగ- ఆంధ్రపత్రికను గైకొనినయెడల ఒకవైపు ఆంధ్రపత్రికావిలేఖరులు తెలుగుదేశమునందలి నాల్గు మూలలనుండి తమతమ జిల్లాలలో నేమేమి జరుగుచున్నదో, ఎట్టి విచిత్రములు గలవో తెల్పుచుందురు. ఇంకొకవైపు ఎ. పి. వారును (Associated Press of India), రూటరువారును హిందూదేశమునందలి వృత్తాంతములను అన్యదేశీయ ముఖ్యవృత్తాంతములను దెల్పుచుందురు. చాలవిషయములు సంగ్రహముగ తంతి వార్తద్వారా తెలియుచుండును. తపాలా ఖర్చులను తగ్గించుటకు ఒకమారు చాల సంకేతపదములనుగూడ వృత్తాంతములనంపువారు ఉపయోగింతురు. అట్టి వానిని సరిగా వ్రాసి చదువువారల కర్థమగునట్లు విపులీకరించుటయే పత్రికాకార్యాలయమువారి పని. ఇందుకుతోడు పత్రిక జనరంజకముగ నుండుటకై చిన్నచిన్న కథలను అపూర్వవిజ్ఞాన విషయములను, ఫోటోచిత్రములను, బజారుధరలను, నానావిషయములను పత్రికలందు జొప్పింతురు. ఇవన్నియు కాక ప్రతిపత్రికయందును రెండుమూడు సంపాదకీయవ్యాసము లుండియేతీరును. ఈవ్యాసములందు సంపాదకులు ముఖ్యవిషయములపై తమ యభిప్రాయములను దెల్పుదురు.

దీనినిబట్టి చూడ పత్రికలప్రాముఖ్యము విలేఖరులపైన ఎంతమట్టుకు ఆధారపడియున్నదో విశదమగును. రూటరుకంపెనీ కేంద్రస్థానమునకు వార్తల తెలియజేయు విలేఖరిగాని, ఎ. పి. పక్షమున పనిచేయుచున్న విలేఖరిగాని, కడకు ఏదుగ్రామమునకో ఆంధ్రపత్రిక పక్షమున ప్రయాణముచేసిన విలేఖరికాని విశేషములను విశదముగ తెలిసికొని శీఘ్రముగ తెలియజేసినగాని ప్రయోజనములేదు. పత్రికా కార్యాలయమునందలివారు ఎంత శక్తిమంతులైనను, బుద్ధిమంతులైనను విలేఖరులు వృత్తాంతములను సరిగాపంపకపోయినచో ఏమియుజేయలేరు కనుక వార్తాపత్రికలు బాగుగానుండవలయునన్న విలేఖరులు శక్తిమంతులుగ నుండవలయును. క్రొత్త సంగతులన్నియు త్వరలోకనుగొని, వాటిని విపులముగను రంజకముగను వ్రాసి పత్రికాధిపతులకు శీఘ్రముగ నందజేయవలెను.

ఊరిలోనున్న విశేషములను అతిశీఘ్రముగ కనుగొను శక్తి విలేఖరికి అత్యావశ్యకము. జనసామాన్యమునకు అయిదు ఇంద్రియములు మాత్రమేయుండిన విలేఖరికి ఆరుఇంద్రియము లుండవలయునని చెప్పుదురు. క్రొత్తసంగతులు, వార్తలు ఎక్కడికివెళ్లిన దొరకును, ఊరిలో ఎవరినిపట్టిన ఫలానా విషయము వ్యక్తమగును అని ముందుగనే అతిచాతుర్యముతో ఆ క్రొత్తసంగతులను పసిపట్టి తెలుసుకొనుటకు సతతము ప్రయత్నము చేయుటయే విలేఖరి ఆరవఇంద్రియము యొక్క కార్యము. చిన్నఊరియందుండు విలేఖరి పని సులభము. ఊరిలోనున్న వారందరిని అత డెరుగును. ప్రొద్దున నొకసారి ఊరంతయు చుట్టివచ్చినయెడల విషయములన్నియు తెలిసిపోవును. ఊరిలోనున్నవారందరు ఇతనికి కబుర్లుచెప్పుచునేయుందురు. వారిలోనే అనేక విశేషములు తెలిసిపోవును.

నేర్పరియైనవిలేఖరి సతతము కొన్నిముఖ్యవిషయములను గమనించవలెను. ఏవిషయమును గురించియైనను సరే, కొంతవృత్తాంతము తనచెవిని బడినదనిన, ఉత్తమతరగతికి జెందిన విలేఖరి వెంటనే ఆవిషయమునుగూర్చి అన్ని సంగతులను తెలిసికొనుటకు పూనుకొనును. అసంపూర్ణవార్తలు ప్రమాదకరములు. తెలిసీతెలియనిజ్ఞానము ఎందులోనైనా అపాయకరమే. ఇందుకొక ఉదాహరణము: అగ్నిప్రమాదమువలన ఒకయూరిలో నొకఇల్లంటుకొని కొంతమందికి అపాయము కలిగినదనుకొందము. కాలిపోయినఇల్లు ఎవరిదో, ఎవరికి అపాయముకలిగినదో ఈ విషయములు విశదముగ కనుగొనక, విలేఖరి ఈవార్తను అసంపూర్ణముగా తెల్పి అనిపత్రికయందు అట్లే ప్రచురింపబడినయెడల, దూరదేశములందున్న వా రీవార్తనుచదివి, తమబంధువులెవరైన ఆయూరియందుండిన యెడల వారికే ఈ యపాయము తటస్థించినదేమో అని భయపడుదురు. కాన విలేఖరి ఊరివారిని బాగుగా ప్రశ్నించి వర్తమానమును సంపూర్ణముగా తెలుసుకొనిన పిమ్మటనే పత్రికకు తెలియజేయవలెను.

ఏ విషయమును గూర్చియైనను సరే పూర్తిగా తెలుసుకోవలయునన్న ఆరు చిన్న ప్రశ్నలకు సమా

ధానము బడయవలెను. (౧) ఏమి? (౨) ఎవరు? (3) ఎక్కడ? (౪) ఎప్పుడు? (౫) ఎట్లు? (౬) ఎందుకు? ఏవిషయమును గూర్చియైననుసరే ఈ ఆరు ప్రశ్నలకును సరియైన జవాబు ఉన్న యెడల ఇక ఆవిషయమునుగురించి మనకు సంపూర్ణముగా తెలిసినట్లే. ఏ పత్రికలోనైనా ఒక వృత్తాంతము సరిగా ప్రచురింపబడినదనిన ఈ ఆరుప్రశ్నలకు అందుండి సరియైన సమాధానము వచ్చునని యర్థము.

ఈ ఆరు అంశములలో ఏ అంశమును ముందు వ్రాయవలెను అని సందేహము కలుగవచ్చును. ఏ అంశమును ముందువ్రాయవలెనునదియు మనము వ్రాయు విషయ ప్రాధాన్యమునుబట్టి యుండును. వ్రాయు వృత్తాంతము చాల ప్రాముఖ్యమైన మనుజునికి సంబంధించినయెడల అందు 'ఎవరు' అనే అంశము ముందు వ్రాయవలయును ఒక పెద్దబ్యాంకును కొల్లగొట్టినారనిన అచ్చట కొల్లగొట్టిన విషయమే ప్రధానము గనుక అందు ఏమి అను అంశము ప్రధానము. ఈవిధముగ వ్రాయు విషయమునుబట్టి దానిలోని అంశములన్నిటిని వాటి ప్రాముఖ్యత ననుసరించి క్రమముగ ఒకటివెనుక నొకటి చేర్పవలెను.

రామాయణమునందు హనుమత్సందేశాన్ని 'దృష్టా సీతా మయా రామ' అనే మాటలతో ప్రారంభించినాడు శ్రీవాల్మీకిమహర్షి. సీతమ్మను వెదుకబోయిన వారలలో ఆమెను మొట్టమొదట దర్శించు భాగ్యము హనుమంతునికే కలిగినది. పరమానందభరితుడై ఆవృత్తాంతమును రామునకు వెంటనే తెలియజేయవలెనని హనుమంతుడు రాముని కడకు అతివేగమున వచ్చెను. ఇక రాము డన్ననో సీతావృత్తాంతమునకై అత్యౌత్సుక్యముతో నెదురుచూచుచున్నాడు. మేఘమును జూచు చాతకము వలె హనుమంతుని చూడగనే రాముని హృదయము పరిస్పందించినది. ఇట్టి స్థితియందు హనుమంతుని నోటినుండి వెడలు ప్రతిపదమునకును ఒక విశేషప్రాధాన్యము గలదు. వృత్తాంత మంతయు సావధానముగ వినుటకు అట్టిసమయమున సాధ్యముగాదు. ఒకపదము నుచ్చరించి రెండవ పదము నుచ్చరించునంతలోనే అనేకతలంపులు రామునిమనస్సును పీడించును. వ్యర్థపదములతోను, గౌరవవాచకములతోను కాలహరణము చేయుటకు అప్పుడు సమయముగాదు. చెప్పబోవు వృత్తాంతమున ముఖ్యాంశము సీతమ్మ దర్శనమె. ఆ పదముతోనే ప్రారంభించినాడు ఆవృత్తాంతమును. వేయిచెప్పనేల? ఆ వాక్యమునందలి పదముల వరుస ఇంకెట్టి విధముగ నుండినను సౌష్ఠవము చెడును. దీని ననుసరించియే కాబోలు కాళిదాసమహాకవి తన మేఘసందేశమునందు ఈ విధముగ వ్రాసియున్నాడు.

'భర్తు ర్మిత్రం ప్రియ మవిధవే విద్ధి మా మంబువాహం' అనే వాక్యముతో తన సందేశమును ప్రారంభింపుమని యక్షుడు మేఘునకు చెప్పెనట. భర్త వియోగదుఃఖమున మైమరచియున్న యక్షునిభార్యను ఇంకే విధముగ పలుకరించినను ప్రయోజనము లేదు. ఆమె వినిపించుకొనదు. కాని భర్త యనినచాలు, వెంటనే యామె సకలేంద్రియములును తనపై కేంద్రీకృతములయియుండును. కాననే యీ మేఘుడు ఈపదక్రమము ననుసరింపవలెనన్నాడు. పత్రికల విషయముగూడ నిట్టిదే. ఉన్న విశేషమేదో చదువరికి శీఘ్రముగ దెలుపక ఉపోద్ఘాతములతోను, సంబోధనములతోను కాలహరణము చేసిన విసుగు జనించును.

కొందరు ఉన్న విషయములను ముందు వ్రాయక పట్టివర్ణనలతో ప్రారంభింతురు. "రాత్రి పండ్రెండు గంటలు, చిమ్మచీకటి; పారావాడు ఒంటరిగా పారా వేస్తూ ఉన్నాడు. అంతయు నిశ్శబ్దం. కొంతసేపటికి పటపటమని శబ్దము వినవచ్చినది. ఇల్లు విడిచి కొంతదూరము పోగా కొంచెము పొగ కనిపించినది. అటుపిదప పొగ చాల యధికమై కొంచెముమంట గూడ కానవచ్చినది. ఆపైపుననే మరికొంతదూరము నడచి చూడ ఒక ఇల్లునకు నిప్పు అంటుకొనిన దని తెలిసినది......" ఈవిధముగ వ్రాసినయెడల, చదువరి విసిగి "ఏమయిందో విషయం త్వరగా ఏడవరాదూ" అని కేకవేయకమానడు.

మరికొందరు ప్రమాణవచనములతోనో, నీతివాక్యములతోనో, లేక సాధారణముగ అందరికిని తెలిసిన

లోకోక్తులతోనో తమ వృత్తాంతములను ప్రారంభింతురు. ఇట్లు చేసిన, వ్రాయబోవు వృత్తాంతమున కిది యొక ప్రచండ- ఉపోద్ఘాతమువలె నేర్పడి, ముందురాబోవువృత్తాంతమును చదువకుండనుండునట్లు చదువరిని చెదరించివేయును. అతినైపుణ్యముగల విలేఖకుడు తప్ప మిగతవారు ఇట్టి ఆరంభమును జేసి సమర్థించుకొనలేరు.

వ్రాయబోవు విషయము నంతయు స్ఫురింపజేయు నొక చక్కని శీర్షికను (Heading) ఆలోచించి, మొదట వ్రాయవలెను. పత్రికయందలి పుటలను ఔదాసీన్యముతో తిరగవేయుచున్న వారిని గూడ చక్కనిశీర్షిక ఆకర్షించగలదు. శీర్షికను చదివినతోడనే చదువరికి ఉత్సాహముకలిగి వ్యాసములో నేమున్నదో తెలుసుకొనగోరి చదువనారంభించును. ఈశీర్షికలను పెద్ద యక్షరములతో ముద్రింతురు. శీర్షిక క్రింద చర్చించబోవు విషయమునందలి ముఖ్యాంశములను సంగ్రహముగ కొన్ని వాక్యములలోనే తెల్పవలెను. ఇందెట్టి వర్ణనలును ఉండకూడదు. దీనిని లీడు (Lead) అందురు. ఒకొకసారి వార్తలధికముగ వచ్చి అన్నింటిని ప్రచురించుటకు వీలులేనియెడల 'లీడును' మాత్రము ముద్రింతురు. ఈ భాగమును గూడ పెద్ద యక్షరములతో ముద్రింతురు. 'లీడు' వాక్యములను తుదివరకు జూచిన చదువరికి చర్చింపబడిన విషయము కొంతవరకు బోధపడి ఉత్సాహ మింకను అధికమగును. అటుపిదప వ్యాసమును చదువక తీరదు. మొదటిపేరాయందు ముఖ్యాంశమును విపులముగ వ్రాయవలెను. పిదప ఒకపేరావెనుక నింకొకటి చదువవలెనని చదువరికి ఎక్కువ కుతూహలము కలుగునట్లు అతనిదృష్టిని ఆకర్షించుచు విషయమునంతటిని సంపూర్ణముగ వ్రాయవలెను.

శీర్షిక నాలోచించుట, వ్రాయుక్రమము నిర్ధరించుట మొదలగు విషయములు వ్రాయుటకు ముందే జరిగియుండవలెను.

ఏ భావమయందైనను సరే, ఒక విషయమును ఎన్నియోవిధములుగ వ్రాయవచ్చును. కావ్యముల శైలి యొకరీతి, నాటకముల ఫక్కి మరియొకటి. ఇక నవలలను, వ్యాసములను, కథలను వ్రాయువారు గూడ ఒకొక ప్రత్యేకశైలి ననుసరింతురు. ఇట్లే వార్తాపత్రికలకు వ్రాయుటయందుగూడ నొక ప్రత్యేక విధానము గలదు. ప్రౌఢశైలి వార్తాపత్రికలకు తగదు. సాధారణముగా వార్తాపత్రికలను చదివేవా రందరును సామాన్యులేగాని విద్యాధికులుగారు. అదియుగాక వార్తాపత్రికను చదువునపుడు చదువరి ఎట్టి స్థితియందుండునో కొంత గమనింతము. దినమంతయు ఏ కచేరీయందో, లేక ఏపొలమునందో కష్టపడి పనిచేసి, సాయంత్రము విసుగుతో ఇంటికి వచ్చునపుడో, లేక ప్రొద్దున పనికి పోవుటకు ఆతురపడుచున్నపుడో వార్తాపత్రిక పుటలను చదువరి ఒకమారు తిరగవేయును. అంత యాతురముతోనో, విసుగుతోనో ఉన్నవారికి నిదానముగా పత్రికలోనున్నదంతయు విపులముగ చదివి, అందులో నున్న కఠినపదములకు అర్థము కనుగొని విషయమను గ్రహించుటకు వీలుండదు. కనుక పత్రికలకు వ్రాయు విషయములన్నియు సులభముగ అర్థమగునట్లు సరళశైలియందుండవలెను.

వ్రాయు విషయమునందలి ప్రతియంశమును వేరువేరు పేరాలయందు వ్రాయవలెను. ప్రతి పేరాయందలి మొదటివాక్యమును ఆపేరాలోని ముఖ్యాంశమును దెల్పవలెను. పేరాలు అతిదీర్ఘముగ నుండకూడదు. సామాన్యభాషలో చిన్నచిన్న పదములతో ముచ్చటగ వాక్యములను కూర్చవలెను. వాక్యములుగూడ అతి దీర్ఘముగ నుండరాదు. దీర్ఘసమాసములు గాని, కఠినపదములుగాని, అపూర్వప్రయోగములుగాని ఉపయోగపరచరాదు. అవి చదువరులను చెదరించి వ్రాసినవిషయమునే చదువనియ్యవు. మనము వ్రాయునది సామాన్యజనమునకే గాని పండితులకు గాదని వ్రాయునపుడు ముఖ్యముగ మనస్సునం దుంచుకొనవలయును. నారింజపండు ఒలిచి, తొనలను వేరుచేసి, అందుండు నారను విత్తులను విడదీసి సుళువుగ పసిపిల్లల నోటికి అందించునట్లు, జ్ఞానమునందు బాల్యదశయందున్న సామాన్య జనమునకు వ్రాయు విషయములు సులభముగ అర్థమయి మనస్సునకెక్కునట్లు చేయవలెను. ఎంతయజాగ్రత్తగా చదువువారికైనను

వ్యాసమునందలి విషయము అర్థమై అందలి ముఖ్యాంశములు మనస్సున నాటవలెను.

వార్తాపత్రికలకు వ్రాయువారెల్లరును రెండు ప్రధాన విషయములనైన ముఖ్యముగ గమనింపవలెను. అందు మొదటిది సత్యము. ఏవార్తనుగాని, ఏవిషయమునుగాని వ్రాయునపుడు సత్యమునుదప్ప ఎట్టిఊహా కల్పితములగు నభిప్రాయములను జేర్పరాదు. రాజకీయ విషయములను వ్రాయునపుడుగాని, వివాదాంశములకు సంబంధించిన ఉపన్యాసములను ప్రచురించునపుడుగాని విలేఖరులు ఉన్నవిషయములను ఉన్నదున్నట్లుగ పక్షపాతబుద్ధిలేక తెలియజేయవలెనుకాని తమ యభిప్రాయానుసారముగ మార్చగూడదు. కావలయునన్న వారి యభిప్రాయములను, ఊహలను ఏ ప్రత్యేకవ్యాసమునందో (independent article) వ్రాసుకొనవలెను; కాని ఉన్నసంగతులకు రంగుపూసి, అందులో కొన్ని యంశములను వదలివైచి, మరికొన్ని యంశములను ఎక్కువచేసి, విషయమునంతయు తారుమారుజేసి పక్షపాతబుద్ధితో వ్రాయగూడదు. అంతకన్న గొప్ప దేశద్రోహముండదు. కొన్నిపార్టీపత్రికలు ఈ విషయమును గమనింపనందున అమాయకులైన చదువరు లనేకులకు ఎన్నియో దురభిప్రాయములు ప్రబలినవి. ఇట్టిపత్రికలు జనసామాన్యమునకు అపాయకరములు.

వార్తాపత్రికలకు వ్రాయునపుడు గమనింపవలసిన రెండవముఖ్యాంశము, మనము వ్రాయు వృత్తాంతములు సర్వజనాకర్షకములుగ నుండవలెను. వార్తాపత్రికలచర్చ యం దెట్టివిషయములను నిజముగ వృత్తాంతము లనవచ్చునో అయోవా విశ్వవిద్యాలయమునందు జర్నలిసమ్ ప్రొఫెసర్‌గానున్న ఫ్రెడరిక్ జె. లాజీల్‌గారు ఈ విధముగ విపులీకరించినారు. 'News is sometimes defined as the immediate, accurate, and unbiased record of that which interests any group of the paper-readers, and the best news as that which interests all the paper-readers.' జనులందరికిని ఇష్టములైన విషయములు, తెలిసినవెంటనే, పక్షపాతబుద్ధిలేక ఉన్నదున్నట్లుగ తెలియజేసిన అదియే మంచివృత్తాంతమట. వార్తాపత్రికలు బాగుగానుండవలెనన్న వానియందలి వార్తలు చదువరులకు ఆకర్షకముగను, హృద్యముగను నుండవలెను. లేనిచో సామాన్యజనులు పత్రికలను చదువరు. కనుక వార్తాపత్రికలకు వ్రాయువారు సర్వజనులకును ఇష్టములగు క్రొత్తవిషయములను వ్రాయవలెను. చదువరులకు అభిరుచిగకలిగించు విషయము లెట్టివి అనునది మరియొకక్లిష్టసమస్య. చదువరుల ఆచారవ్యవహారములను బట్టియు, అభిప్రాయవిశేషములను బట్టియు, చిత్తవృత్తులనుబట్టియు ఈ విషయమును గ్రహింపవలసియుండును. కాని సాధారణముగ జనసామాన్యమునకు ఇష్టములయిన విషయములు ఈ క్రింది మూడింటిలో నొకటిగా నుండునని చెప్పవచ్చును. (౧) అర్థశాస్త్ర విషయములు (Economics); (౨) మానవచిత్తవృత్తికి సంబంధించినవిషయములు, లేక మనోభావములు (Emotions) (౩) మానవభోగములకు సంబంధించిన విషయములు (Enjoyments). ఈ త్రివిధవిషయములందును ఇష్టములేని మనుజుడు చాల అరుదు. వాణిజ్యమునకును, సంఘప్రయత్నములకును, వ్యక్తిప్రయత్నములకును వీనియందుండివచ్చు అనుకూలప్రతికూలములకును సంబంధించిన విషయములు అర్థశాస్త్రాదిభాగమునకు జెందును. ప్రేమ, దయ, ఔదార్యము, ధైర్యము మున్నగుభావములనుండి పుట్టు మనుజునిచర్యలు రెండవభాగముక్రింద వచ్చును. వినాశములు, ఆకస్మికాపాయములు, నేరములు మున్నగునవిగూడ ఈ భాగముక్రిందనే వచ్చును. ఏలన అవి మనమనోభావములను మార్చి,దయ, ఆశ్చర్యము, కోపము మున్నగుభావములను జనింపజేయును. ప్రపంచమునందలి అందమైనవస్తువులు, జ్ఞానము, కళలు, అందున లలితకళలు, ఆటలుమున్నగునవి మూడవభాగమునకు జెందినవి. ఈత్రివిధసమూహమునకు జెందిన యంశములనుగూర్చి పత్రికలకు వ్రాసినయెడల జనులందరును ఉత్సాహముతో చదివి యానందింతురు.

వార్తాపత్రికలకు వ్రాయుట నిజముగ నొక అపూర్వకళయె. చిత్రకారుడు ఒకసీసపుముక్కతో

చక్కని గీతలను గీచి అందు తనభావము నిమిడించును; లేదా అద్భుతములైన రంగులవికాసమును తనకుంచెతో నమర్చి, తనమనోభావమందు ఉన్మీలనమైన ప్రతిమను ఆహ్లాదకరముగ వ్రాయును; నటకుడు మూకాభినయముచేతనే చిత్తవృత్తులయుద్వేగమును అతినిపుణముగ తెలియజేయును; వ్రాయువాడు సత్యమును, సౌందర్యమును పదసౌష్ఠవముచేతను, సరళశైలిచేతను వ్యక్తపరచును.

పత్రికలకు బాగుగ వ్రాయవలయునన్న అదియొక దినములో నేర్వ సాధ్యము గాదు. ఉత్సాహముతో చాల కాలము కృషిచేయవలెను. ప్రపంచమునందు బాగుగ వ్రాయగలరని పేరుపొందినవా రందరును మొదట పల్లెటూరివార్తాపత్రికలకు వ్రాసి క్రమముగ తరిఫీను అయినవారే. పుట్టుకతోనే బాగుగ వ్రాయుశక్తి వారికి వచ్చినదని మన మనుకొనవచ్చును కాని, నిజముగ వారు కీర్తిగడించుటకు ముందు ఎన్ని పత్రికలకు ఎన్నివేల మారులు వ్రాసిరో గమనించిన, వారివ్రాతయందు అంత ప్రభావ ముండుట ఆశ్చర్యకరముగ దోపదు. వ్రాసిన దానిని దిద్ది మరల దానినే వ్రాసి మరల దిద్ది ఇట్లెన్నియోమారులు చేసినగాని వ్యాసము సర్వోత్తమముగ నుండదు. నేటి పత్రికామహామహులుగూడ ఇట్లే ఎన్నియోసంవత్సరములు కృషిచేసి శ్రమపడినపిమ్మటనే సులభముగ వ్రాయుశక్తిని సంపాదించిరి. కాననే Genius is made, not created అను చాటూక్తి ఎంతయు సత్యము. 'అనగ నగ రాగ మతిశయిల్లుచునుండు...... సాధనమున బనులు సమకూరు ధరలోన ......" అను వేమనరత్నమును పత్రికలకు వ్రాయగోరువారు మరువగూడదు. నిరంతరాభ్యాసమున నెట్టి ఘనకార్యమునైనను జేయవచ్చును. సౌకర్యము లేమాత్రమును లేని పల్లెటూరివారుకూడ బాగుగ వ్రాయుటకు నేర్చుకొనవచ్చును. శ్రద్ధయుండినయెడల దేనిని చేయవలెనన్నను విరామావకాశము లేర్పడును. విరామసమయములందును, రాత్రులందును కాలమును వ్యర్థపరపక ఏదైనను వ్రాయుచుండవలెను. వ్రాసినవిషయమునే మరల మరల వ్రాయుచునుండిన, ఒక్కొకసారి వ్రాసినపుడును కొన్నికొన్ని యంశములు విశదముగను, ఆకర్షకముగను అగుచుండును. ఇట్లు వ్రాయుచు వచ్చిన తుదకు వ్రాసినవిషయమునందు ఏభాగమును మార్చవలెనన్నను, అందలి మాధుర్యమునకు భంగమువాటిల్లునట్లేర్పడును. లింకను మహాశయుడు చాల పట్టుదలతో తన ఉపన్యాసము లన్నియు వ్రాసెను కాననే ఆ వ్యాసములు అంతయమూల్యములుగ నున్నవి. లాంగుఫెలో కవియు గూడ నిదే చెప్పుచున్నాడు ఈ క్రిందిపద్యమున.

'The heights by great men reached
and kept,
Were not attained by sudden flight;
But they while their companions
slept,
Were toiling upward in the night'

---

# వారములు

ఐ. వి. యల్. నరసింహాచారి

గ్రహములపేర్లే వారములపేర్లని మనకు తెలియును. ఆదివారము, లేక ఆదిత్య వారమునకు సూర్యుడు అధిపతి. సోమవార మునకు చంద్రుడు అధిపతి. మంగళ, లేక భౌమవారమునకు కుజుడు అధిపతి. బుధ, గురు, శుక్ర, శనివారములకు వరుసగా బుధ, గురు, శుక్ర, శనులు అధిపతులు.

కాని గ్రహములవరుస వేరు, వారముల వరుస వేరు. భూమికి మిక్కిలి దూరముగా నున్న గ్రహము మొదలు మిక్కిలి సమీప ముగానున్న గ్రహమువరకు లెక్కించినచో గ్రహములవరుస ఇట్లున్నది.

శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్రులు.

దినమునకు ౨౪ గంటలు. శనివారము మొదటిఘంటకు శని అధిపతి, రెండవగంటకు గురుడు, మూడవఘంటకు కుజుడు. ఈ విధ ముగా ఆధిపత్యములు లెక్కపెట్టగా, శనివా రము ౨౫ వ గంటకు అనగా మరునాడు మొదటిగంటకు అధిపతి (౨౫=౭ × 3 + ౪) శనినుండి నాలుగవగ్రహము అగుచున్నది. శనినుండి నాలుగవగ్రహము రవి గనుక శని వారమునకు మరునాడు రవి అధిపతిగాన అది ఆదిత్యవార మయినది. ఆదిత్యవారము నకు మరునాడు రవినుండి నాలుగవగ్రహము, అనగా చంద్రుడు అధిపతి కాన అది సోమ వారమయినది. సోమవారమునాటికి మరు నాడు చంద్రునినుండి నాలుగవ గ్రహము, అనగా కుజుడు అధిపతి. ఈ విధముగా ఆయావారములకు ఆయాగ్రహముల ఆధిప త్యము లిట్లువచ్చినవనినిర్ణయింపబడుచున్నది.

వారముల ప్రకారము గ్రహములవరుస, సహజమైన గ్రహముల వరుసనుండి ఎట్లు వచ్చినది పైని చెప్పబడియున్నది. దినమునకు ౨౪ ఘంటల మానమునుండి పైనిర్ణయము తేలినది. మనము దినమును ౬౦ గడియల క్రింద భాగించుచున్నాము. కాని ౨౪ ఘం టలక్రింద భాగించుటలేదు. కాన పాశ్చాత్య పండితులు వారముల పేర్లు మనవారు ఇతర దేశస్థులవలన గ్రహించిరని ఊహించు చున్నారు.

౬౦ గడియల దినమునుండి కూడ ఈ వారముల ప్రకారము వచ్చే గ్రహముల వరుస సాధించవచ్చును. అది యెట్లన: మనము ముందుగా గ్రహములను భూమికి మిక్కిలి దగ్గరగా ఉన్న గ్రహము మొదలు మిక్కిలి దూరముగా ఉండే గ్రహమువరకు లెక్క పెట్టుట ఉచితము. అట్లు లెక్కించినయెడల గ్రహముల వరుస ఈ విధముగా నుండును- చంద్రుడు, బుధుడు, శుక్రుడు, రవి, కుజుడు, గురుడు, శని.

సోమవారము మొదటి గడియకు చంద్రుడు అధిపతి, రెండవ గడియకు బుధుడు అధిపతి, మూడవ గడియకు శుక్రుడు అధిపతి. ఈ విధముగా లెక్కపెట్టినయెడల సోమవారము ౬౧ గడియకు, అనగా మరునాడు మొదటి గడియకు (౬౧=౭×౮+౫) చంద్రునినుండి ఐదవగ్రహము అధిపతి యగును. చంద్రునకు ఐదవగ్రహము కుజుడు గనుక సోమవారమునకు మరునాడు మంగళ, లేక భౌమవారము. బుధవారమునకు అధిపతి కుజునకు ఐదవగ్రహమైన బుధుడు. ఈ విధముగా వారములకు గ్రహముల యొక్క ఆధిపత్యము మన ౬౦ గడియల దినమునుబట్టి సులభముగా సాధించవచ్చును. ఇట్టి సాధన ఇదివరకు ఎవరును చేసియుండలేదని నమ్ముచున్నాను.



ము ర ళి —తోట.

# రక్తి బికారీ

కవికొండల వెంకటరావు

"ఆమెకౌగింటిలో నాకోర్కె పండిస్తి,
ఆమెకందోయిలో నావేడ్క నిర్మిస్తి,
ఏనాటనైనా నేను గన్నారుట్రా?
నాచేడెజాడ తెలిసుంటె చెప్పర్ర!
పెను పెద్దవీథుల్ల పిలిచి విసికాను,
ఇసుకతిన్నెల నీలవేసి యలిసాను,
మసకసంజలా సందియంగ బ్రమిశాను,
కొసకు గాదని తెలిసి కడలిడాశాను."

అనుచు విరహ విహ్వాలుడై బికారీ వొకడు వెన్నెట్లో విశాఖపట్నపు సముద్రతీరాన్న "స్కాండల్ పాయింటు" దగ్గఱనుంచి పాడుకుంటూ, "ఏంకర్ పాయింటు" ప్రాంతానికి జేరుకున్నాడు. అప్పు డక్కడ జనం పెద్దవాళ్లెవళ్లూ లేరు. పల్లెపిల్లలు కూళ్లుతిని వెన్నెల్లో ఆడుకుంటూ వున్నారు. ఓ పడిపోయిన కొబ్బరిచెట్టుయొక్క మోడు మోచేతి నిక్కుగా అమరివుంటే దాని చివ ర్నెక్కి ఊగుతూ వున్నారు.

కుఱ్ఱవాళ్లా పాటట్టుకుని "ఆమె కౌగింటిలో - ఆమె కౌగింటిలో" అని ఊగడం మఱీ ఎక్కువచేసికొంటూ సముద్రంకేసి చూచినారు. వాళ్ల కెవరూ కనిపించలేదు. మఱి పాట వినిపించనూ లేదు. ఎక్కణ్ణుంచి వచ్చి, ఆపాటక్క డాగిపోయిందో తెలిసికొందామని ఆ పిల్లకాయ లందఱూ మూకుమ్మడిగా సముద్రపువొడ్డుకు వెన్నెట్లో పఱుగెత్తినారు గాని, నీటిపందరు జేరే అంతలో, చంద్రుణ్ణి వోమేఘం కప్పి పుచ్చడంచేత, చీకటికి జడిసినవారై, తమ నెమకుడువృద్యమాన్ని మానుకొని, ఆటలు కూడా కట్టిపెట్టి, తమతమ గుడిసెలకు మళ్లి పోయి ముణుచుకు తొంగుడుండిపోయినారు.

క్రమశగి తెల్లాఱొచ్చి, సూర్యోదయం కూడా అయింది. సముద్రమ్మీద తెల్లాఱి సూర్యోదయం అయిందీ అంటే, సముద్ర మ్మీదివాళ్లమాట నేను చెప్పలేను గాని భూమ్మీదవాళ్లకు మాత్రం మిక్కిలీ సంతోషం.

"ఉదయించవయ్యా! ముదముగనవయ్యా!
ఉదధిపై దరిలేని తొలితోయముల దోగి
యుదయించవయ్యా! ముదముగనవయ్యా!
బాలార్కదేవా! ప్రభచిల్కవయ్యా!
ప్రచరింపవయ్యా! కుదిగొల్పవయ్యా!

గుండ్రన్ని గోళంబు గుండెలందోళంగ
ఎఱుపెక్కవయ్యా! ఒఱపుగనవయ్యా!"

అని ఆ వుదయం యక్షులనుంచి పక్షులవఱకూ పాడుతూ ఆహ్వానిస్తూవుంటే అతిశయించిపోయినాడా అన్నట్టు సూర్యుడుదయించాడు సముద్రతీరపు తూరుపువొంక. సూర్యబింబం అలా జాజువాఱుతూ తడిపొడి నెగసిపోతూ వుంటే ఏకాడి కాకాడికే అందంఅనిపించింది. ఎక్కడి కక్కడే ప్రకృతి అనే నిండుచూలాలి కడుపుపండి తరించిందా అన్నట్టుంది. ఆబాల సూర్యుణ్ణి ప్రస్ఫుట ప్రభ నెత్తిపట్టి యింకను తనివిసనక సముద్రుడు తన నీలిసేటి నూగుచు, ఆ బింబముయొక్క అడుగుభాగపు టరుణ రేఖను లేచి లేచి ముద్దుగొనే క్రొంగ్రొత్త ఘడియల్నీ, మొగంవాచినట్లు తనలో ప్రతిబింబించుకునే లేలేతభావాల్నీ ఏమనగలం? కాలం అని అనగలమా? అవకాశం అని అనగలమా? — నల్లనిమేఘం మందేహం లాగు అదెందు కక్కడ? ఆసమయమప్పుడు దాని కేంపని? దానిలోనికి రవికిశోరుడు ప్రవేశించి, అందులోనుంచి పైకి విజృంభించుకుంటూ రంగులు విసురుతూవుంటే క్రింద దిఙ్మండలం మఱింత మెఱ్ఱనై నిజంగా కెంపు రజంతో పునాదికట్టుకట్టినట్టు విలసిల్లిపోయింది. ఆశాంతాన్ని మెలకువగొని లేచివస్తూ వున్న ప్రతీకరదుయొక్క కొనమీదనూ తెలుస్తూనే వుంది అరుణోదయశోభ. మఱిన్నీ అలధట్టిన చెలియలికట్టయొక్క ఏటవాలు తెన్నే జిగిబిగిగా యిసకతో సమేలమై విరాజిల్లింది దినమణియొక్క పురిటింటికళ. అంతేనా? నిరాధారంగా వారకొచ్చి పడ్డ కోడెకెరటంయొక్క అకాలవైరాగ్యము సా విరియు తెల్లని నురువుల మల్లెచెండ నెడనెడ లోకబాంధవ్యమను రోజాపువ్వులు కలగలిపి గ్రుచ్చుపోలిక తొంగరెక్కించి ఇక్కడ నక్కడ నెక్కడ చూచిన "ఈ కెరటమే నీరక్తిబికారీ! ఈకెరటమే నీరక్తిబికారీ!" అని అందఱికీ చూపించినట్టయింది ఆనాటి చిటిపొటి పొద్దుపొడుపు.

* * *

వాళ్ల అసలుపేర్లు మనకు తెలియవుగాని వైద్యకళాశాలలో చదువుకోడానికి ప్రవేశించినప్పటినుంచీ "ఏమే కనకాంబరం!" అంటే "ఏమే నీలాంబరం!" అని అనుకుంటూ అన్యోన్యం బస్తీ జోస్తీగా నేస్తం గలిగివున్న విద్యార్థినులిద్దఱు విశాఖపట్నంలో వున్నారు. వాళ్లిద్దఱూ పై వుదయమప్పుడు రోడ్డే మోటారుకారెక్కి వచ్చినవాళ్లై కారు రోడ్డుమీద నిలిపి తాముమాత్రం సరిగ్గా సముద్రపు వొడ్డుకు వెళ్లిపోయి, అదురూ బెదురూ లేకుండా నవనవప్రభాతపవమానప్లవమానలై విహరిస్తూ వున్నారు. హార్బరు వచ్చింతరువాత "డేంజర్ పాయింటు" అంటూ వొకటి కుదిరిందికాని, అనాదిప్రసిద్ధమైంది యిదే యీ "స్కాండల్ పాయింటే"ను అని వాళ్లల్లో వాళ్లనుకుంటూ వున్నారు. సముద్రంకేసి చూస్తూ వున్నారు. — జనసామాన్యం అనుకోవడమేగాని నేనెప్పుడూ ఇక్కడ

వొక్క "స్కాండలూ" చూడలేదు అంది కనకాంబరం. అసలు "స్కాండల్" అంటూ వొకటీ ప్రపంచంలో వుందా అంది నీలాంబరం.

సూర్యుడు ఎఱుపుడౌలు విడిచిపెట్టి తెలుపుతీక్ష్ణతలోపడి నీళ్లమీద మిఱుమిట్లు గొల్పుతున్నాడు తీర్థాలరాళ్లసరసని పల్లె పడుచులు కొబ్బరిపీచు చితక్కొడుతూ వున్నారు. పల్లెవాళ్లు కొందఱు తాళ్లు పెనేసుకుంటూ వున్నారు. లోకానికి కాస్తో కూస్తో అప్పుడే వేడెక్కిందన్నట్టు ఓ యురేపియన్ యువకుడు ఓ యురేపియన్ యువతిని సైకిలుమీద కూర్చోపెట్టుకొని తాను తొక్కుకుంటూ ఆమెమీదకు వొరుగుతూ దీపస్తంభంకేసి వెళ్లిపోతూవున్నాడు. ఏదో వోచోటను వూళ్లోనుంచి రోడ్డుదిగి, సముద్రపు టెక్కు వేగం రెట్టించి ప్రియురాలి చెక్కిలి వొంగొంగి ముద్దుపెట్టుకుంటూ — వెళ్లిపోతూ వున్నాడు.—అటువంటి మహాభోగ తరుణంలో ఎవడు చూచాడో మనం చెప్పలేంగాని, ఎవడో చూచాడు సముద్రం మీద ఓశవం తేలి వొడ్డుకు కొట్టుకొస్తూ వుండడం — మధ్య మధ్య కెరటాల్లోపలికి పోతూ మళ్లీ వొడ్డునపడి మళ్లీ నీళ్లల్లోకి పోతూవుండడం ఎవడో కనిపెట్టాడు. కొందఱు కఱ్ఱేమో అన్నారు. కొందఱు ఏదీ కాదు కెరటమే నన్నారు. మనిషేమిటి, మనవాళ్లంతో యిక్కణ్ణే వున్నారు అన్నారు కూడాను. తుద కెలాగైతేం మనిషీ అని పల్లెపాలెంవాళ్లంతా నిర్ధారణచేసి వారివారికి చెవినివేసికొంటూ చేపచుట్టూ చేరినట్టు చేరుకున్నారు. అలా చూస్తూవుండగానే ఆశవం తీర్థాలరాళ్లదగ్గఱ వొడ్డుకు జేరుకుంటుందని అనుకున్నదల్లా మఱి రెండు ఫర్లాంగులు అటువైపుగా, కనకాంబరం నీలాంబరం అనేవారిద్దఱూ పచారుచేస్తూవున్న రేవుకేసి చేరుకొంది.

ప్రజల కోలాహలం అంతకంత కెక్కువయింది. ఆకోలాహలం అట్టాఅట్టా విద్యార్థినుల చెవుల్లో కెక్కింది. కనకాంబరం అంది "అక్కడేదో జనం మూగుతూ వున్నట్టుగా వున్నారు, చూసిపోదామా?" అని. నీలాంబరం "కారు రోడ్డుమీద దిగబెట్టామే?" అంది. కనకాంబరం "ఫరవాలేదు. ఇప్పుడు తిరిగిరాం?" అంది. బయల్దేరారు.

షాఫూర్ లేకుండా కారేసుకుని కనకాంబరం, నీలాంబరం అన్న ఆపిల్లలిద్దఱూ ఠీన్నగా సముద్రపొడ్డుకు వచ్చేశారూ అంటే ఆపిల్లలకున్న ముందంజెయొక్క భాగ్యరేఖ వేఱే వర్ణించాలా?

* * * *

ప్రజలమధ్య నున్నదేమా అని తల్లెత్తి చూచినవారై, కనకాంబరం, నీలాంబరం కూడా పరస్పరం దృక్కులు సవరించుకున్నారు. కనకాంబరం "ఇంకా ప్రాణం వున్నట్టు వుంది ఆబొందిలో" నంది. నీలాంబరం జనాన్ని వొత్తిగించివేసి "కట్టెకు బాగా గాలీ ఎండా

తగల్నివ్వండి" అంది. కనకాంబరం ఆ యుల్లోలకల్లోలునియొక్క యుడుపులు వదులుచేసి, కొంతయిసుక ప్రోవుచేసి, తలా డగా వాని తలక్రిందకు జొప్పించి, నాలిక పైకి లాగిపట్టి, బోర్లాపరుండబెట్టి వెన్నెముక భాగాన్ని నొక్కినీ, తిరిగి వెల్లకితలా త్రిప్పి ముక్కూ మూతీ తుడిచినీ, నీళ్లు కక్కించి, నీలాంబరంకేసి సంజ్ఞగా చూచింది. నీలాంబరం తనమెడలో కాసులపేరుమాదిరిగా వేసి కొన్న గుండెరొదకొలగొట్టం కనకాంబరాని కందిచ్చింది. కనకాంబరం బొందిని పరీక్షించి, 'హార్టు' 'లంగ్సు' సరిగ్గానే వున్నాయి, తెల తెలవారుతూంటే ఈరోజునే సీటిలో పడి వుండాలి యీపురుషుడు అంది. చేయవలసిన ప్రథమచికిత్సాసాహాయ్యము మఱికొంత ఒక అరగంట ముప్పావుగంటవఱకూ అక్కణ్ణే గావిస్తూ, నిప్పూ ఉప్పూ తెప్పించి, కాచి వీచి, చేతు లెగసాచి, దిగమోచి,ఎలాగైతేం, ఆప్రాణిచేత "అమ్మా!" అని అనిపించారు. కాని మనిషి కింకా మంచి వైద్యవిశారదుల సాహాయ్యం అవసరం అన్నట్టు, వా రిద్దఱూ కూడా దిక్కులు కలయజూచి, పల్లెవాళ్లల్లో ఇద్దఱ్ని "నాయనలారా! ఈ మనిషిని ఎత్తి తీసికొనిపోయి ఆకనబడే కారులో పెట్టగల రా? అందులో పండుకోపెట్టారా అంటే పదినిమిషాల్లో పెద్దఆసుపత్రికి మేం తీసికొని పోయి మంచివైద్యం చేయించగలం"అన్నారు. పల్లెవాళ్లు మోసుకుపోవాలంటే ఆలాంటి మనిషినన్నమాటేమిటి? తాటిదుంగనే అమాంతంగా బుజమ్మీద వొక్కొక్క డొక్కొక్క దుంగను మోశేశాస్తారు. కాని అక్కడా మనిషిని మోయడం అనే సందర్భం లోమాత్రం వాళ్లందఱకూ ఎక్కళ్లేని నాను పుడూ కలిగింది.—మోసే కాసంతలోనే గుటుక్కుమంటే! వాళ్లంతా కూడి చంపా రంటారేమో. అప్పు డీ అమ్మాయి లక్క డుంటారా? కాలెక్కి వుడాయిస్తారుగాని-- ఇలాగ్గా వెరుబాటున మొగమొగాలా మొగాళ్లు చూచుకోసాగారు. జాగుచేస్తే కాళ్లు మళ్లీ చల్లబడిపోయేటంత అపాయ స్థితిలోవుంది దరిబడ్డ ఆ అభాగుని కాలపరి మితి. వెంటనే నీలాంబరం కనకాంబరంతో అంది. "ఆలా నీచెయ్యి మెడకిందనుంచి రానియ్యి! నాచెయ్యి ఇలా నడుంక్రిందకు పోనిస్తాను. ఇద్దఱం గంజీకావడిలా మోసుకు పోదాం" అంది. కనకాంబరం సరే అని నీలాంబరానికి తోడ్పాటై యిద్దఱూ ఆలాతి మనుష్యుని ఎత్తి తమకారుదగ్గఱకు కొని పోయినారు. చెంతనున్న పల్లెపెద్దలు మఱి అటు చూడలేదు. కాని దూరాన్నున్న కొంచ మెదిగిన పిల్లకాయలుమాత్రం "ఆమె కౌగింటిలో - ఆమెకౌగింటిలో - నని రాత్రి పాడింది వాడేనేమో నట్రా! ఆలాపాడుతూ కెరటాల కౌగిలి అందుకున్నాడు కమోసు పాపం! ఏమొచ్చిందో ఖర్మం!" అని సానుతాపపూర్వకమైన సంభాషణ ఓక్షణం సాగించి మఱీ నిష్క్రమించారు.

* * * *

నీలాంబరం, కనకాంబరంకూడా సముద్రంలోంచి యివ్వలబడ్డవాడు తమకుకాని శరీరి అని యెంతమాత్రమున్నూ ఏవగించుకోకుండా, జాతిరత్నం అన్నంత జాగరూకతతో మోసికొని తమ కారుదగ్గరకు తెచ్చిడించారు. కారులో లోపలి మెత్త ఏకంగా పరుపు గలిగివుంటుంది కాబట్టి అందులో పడుకోపెట్టి గొంపోవచ్చునని వారి ఆశ. ఆ ఆశకొద్దీ కారుతలుపుతెరచి, దుమ్ముదులపడానికని నీలాంబరం చెయ్యి యిలా అంది. గాలిలోనే చెయ్యి యింకావుంది — కారులో ఆసీటులో ఓ శిశువు కందగడ్డలాంటి ముఖంతో పసుప్పచ్చని పొత్తిలోంచి తొంగిచూస్తూ అడ్డుపడింది. నీలాంబరం "ఏమిటీ వింత? కనకాంబరం!" అని కేకేసింది. కనకాంబరం ఆ సమయాన్ని ఏం చూస్తూవుందంటే — చిత్తడి జీవియొక్క నాడి పరీక్షిస్తూవుంది. కొంచెం బ్రాందీవుంటే బాగుండిపోయేని అని అనుకుంటూవుంది— నీలాంబరం వేసిన కేక కులిక్కిపడింది. తాను కూడా కారుదగ్గరసాపోయి రెండోప్రక్క ద్వారం గుండా తొంగిచూచింది. "కూచి! కన్న కూచి! ఎంచక్కా దోబూచు లాడుతూందో! ఛీ! ఛీ!" అంది. నీలాంబరం "ఏమిటే కనకాంబరం! ఆ ఆట? ఇదిచాలా విషమసంధిగా పరిణమించేటట్టుందేవ్! ఈ పొద్దున్న మన కేం శకునం అయిందోగాని? ఏమిటే ఆ ఆటా నవ్వూను!" అంది. కనకాంబరం "వైద్యశాస్త్ర ప్రవీణలంగా విజృంభింపబోయే మనకు ఈ అనుభవం భగవంతుని దయవల్ల లభించిందని సంతోషించక, "విషమసంధి! విషమసంధి!" అని వెనక్కుపోతున్నా వేమిటి? నీలాంబరం మనకు చావెట్టిదో పుట్టువూ అట్టిదే. అక్కడా మనిషి చావుబదుకులతో వున్నాడూ అంటే ఏం చేశాం? విచారించి వలసిన సాయం చేశాం! ముందు చేయబోతున్నాం. ఆలాగ్గానే యిక్కడీ చంటి కనబడిందీ అంటే ఏం చెయ్యాలి? సంతోషించాలి. మనం తగినసాయం ఈ చంటికి చెయ్యాలి. ఈ చంటిని తిన్నగా మనం ఆసుపత్రికి తీసుకొనివెళ్లి "కానుపుల కాను"లో పోషిద్దాం. అంతకంటె మనం చేయదగ్గ సేవ యీలోకంలో మరేముంది? నే నీపిల్ల నిల్లావాళ్లోకి తీసికొని, ముందుసీటులో కూర్చుంటాను. నీ వామనిషిని ఎలా గెత్తి లోపలి సీటులో జాగ్రత్తగా పరుండబెడతావో పరుండబెట్టి, వానికాళ్లమీద, గుండెలమీద కారు ముసుగుడు నీలపుగుడ్డ కప్పి నీవు తలుపులువేసి యివలకు వచ్చి కారునడుపు. నేను తేలికపని పుచ్చుకుని నీకు బరువుపని చెప్పాను అని అనుకోకు" అంది. నీలాంబరం "ఆడవాళ్లకు బరువుపని అంటూ వొకటి వుందా ఏమిటే? చతుర్దశభువనాలూ బొజ్జనిడుకొన్న శ్రీకృష్ణుణ్ణి అమాంతంగా తన కుచాగ్రాలమీద లేవనెత్తిన రామామణి రుక్మిణి చెందినట్టి పద్మినీజాతి కోవలోవాళ్లం మనం! మనకు బరువు అనేపదార్థం వుందా లోకంలో?"

అంటూ రోడ్డుమీద మనిషిని అపురూపంగా లేవనెత్తి అప్రమత్తత్తో మెత్తని వెనుకసీటు మీద పరుండబెట్టింది నీలాంబరం వొక్క_త్తేని. పరుండబెట్టి ఆమె చేతు లలా తీసికొంటూ వుంది. ప్రమాదావస్థనున్న ఆ పురుషుడు కను రెప్ప లెత్తి నీలాంబరంమోము చూచి తిరిగి కళ్లుమూసికొన్నాడు. నీలాంబరం కనకాంబరంతో "ఫరవా లేదు, మన మగవాడి కింక" అంది. కనకాంబరం "మనమగవాడేమిటి ?" నీలాంబరం "మనకు దొరకిన యీమగవాడన్నమాట" అని చిరు నవ్వునవ్వుతూ కార్ బ్రుంయిమనిపించింది. బంగారుగాజు లెగద్రోసికుంది. వాలుజడ ముందు కేసుకుంది. "ఆలావచ్చి కూచో కనకాంబరం" అంది. కనకాంబరం పట్టాగొలుసు కాళ్లసల్లించుకుంటూ తమ కానాడు దొరకిన రెండోవింతను అడ్డాల్లో పెట్టుకుని అదివూరికే అనునాసికాక్షర స్ఫుటమైన కెవ్వు గ్రుక్కలతో కేక మన "లేదోయి! లేదోయి!" అని లాలిస్తూ ముందుసీటులో కూర్చుంది. సముద్రపురోడ్డు నిర్మానుష్యం నిస్తేజం ఇఖ న్నట్టు మోటారుకారు వారందరితోనూ మలుపుతిరిగి మటుమాయమైంది.

* * * *

ఆమోటారు అలామలుపు తిరిగేదాకా తదేకధ్యానంగా చూస్తూ మలుపు తిరిగే అంతలో మూర్ఛల్లినవ్యక్తి లెవరైనా ఆ ప్రదేశంలో వుండీ వున్నారేమో చూచి చెప్పండి అని ఇప్పుడు నేను నా పాఠకుల్ని అడుగుతూవున్నాను. చూచి చెప్పండి!

ఒకానొకవ్యక్తి, ఆపసికూనను కన్నటువంటి వ్యక్తి, ఆపసికూనను కని పారేయలేక, వేతే తలదాచుకోవడానికి తనకు జాగాలేక, దైవికంగా ఖాళీగా కనబడ్డ ఆ కారులో పరుండబెట్టి ఆవలగా చన్నటువంటి వ్యక్తి ఆపసికూనయొక్క మాతృదేవత అదిగో! అదిగో! తనయొక్క పురిటి నెత్తుటి గుడ్డ పేలికల నన్నింటిని ఇసకలో ననతిదూరాన్నే కప్పెట్టి, తాను జుత్తుముడేసుకుని, జఘన భాగాన్ని ఎట్టనిబొంత సక్కలాళ్లలాగు చుట్టబెట్టుకుని, పై నోపటకా బిగించుకొని, అదేమీ యితరుల క్కనబడకుండా, చుట్టూ, పసుప్పచ్చంచులుగల సన్నజరీకోక తుంపుడు వొహటి కట్టబెట్టుకొని, మామోలు మదవతి లాగు సముద్రపు టొడ్డుయొక్క అఖాతదిశా భాగమందు నిలబడి, రోడ్డుమీద ఆలా పోతూవున్న కారుదమ్ముకేసి చూచి అనుకుంటూ వుంది. "ఓ దయామయూ! నీదయ వల్లనుగదా బిడ్డకు ఆకారులో తావు దొరికింది. ఇక నాబ్రదుకు కెలా అయినాసరే! నాకు చింత లేదు. నేను ధన్యనే" అని తసను కకావికలుగ జేసి పాఱవేయుచున్న లోని వికారాన్ని ఎఱుక్కుండా, కారు, మలుపు తిరిగే దాకా చూచిచూచి కారు మలుపుతిరగడం లో తలతిరిగి అక్కడే ఆ యిసకమీదనే పడిపోయింది ఆతల్లి.

ఊటగడ్డ ఆ ప్రాంతాన్ని వెయ్యినొక్క కుక్క అయినా యీపాటికి ఈని తమపిల్లల్తో సుఖంగా సంచరించి వుండాలి, లతు సరీసృపా లైనా గ్రుడ్లుపెట్టి పొదిగి పొందిగ్గా తమ కూనల్తో ప్రాకులాడి వుండాలి, కోటిపక్షు లైనా చెట్లముర్వల్లో క్రొవ్వి కేరింతా లాడి ఈ కెలు రాని తమనిసుగుల్ని సాక్కుంటూ సంగీతాలు తీసివుండాలి. అక్కడే ఒకా నొక ఆడమనిషి, బిడ్డను కని, మనవలె నంటే, ఎందు కంత బీభత్సమైపోవాలి ఇహ లోకము? ఎందు కంత విపరీతమని అను కోవాలి ఆముష్మికనాకము? ఎందుకంతగా వెల్లడికాకుండా ఉంచాలని ప్రయత్నించి వుండాలి ఆ మాతే? ఆమాతే?—ఇది మహాసమస్యకాదా సంఘానికీ, సౌఖ్యానికీ, జాతికీ, నీతికీ? ప్రతీమాతృస్వరూపిణికీ? ఆబాలెంతరాలి యొక్క తొల్లింటి పరిహాస పాత్రమైన నిర్బంధ ప్రారబ్ధము, ఆమె యొక్కయు ఆమెను ప్రేమించినవాని యొక్కయు అన్యోన్యవియోగ ఖండకావ్యా మృతముయొక్క ఆద్యంత రహితనిశ్శబ్దము, ఆమె యునికీ మనికీ, వాని సిరీ సంపదా, వాటి నన్నింటినీ యీసడించిన రచ్చపట్టుల యొక్క కుత్సిత సాంప్రదాయలుబ్ధత్వమూ, ఇవన్నీ ఎంతమాత్రమూ కథకు పోషక్కులు గాకపోయినా పవిత్రపు బుక్కుల్లాగ నిక్క పుటూపుల నెప్పటికేని వెల్లడిగాకమానవు.

* * * *

ఎప్పుడైతే కనకాంబరం నీలాంబరం అన్న ఆపిల్లలిద్దఱూ తమకు దొఱికిన ఆనాటి విశేషప్రాణుల రెండింటిని ఆసుపత్రికి దీసి కొనిపోయి పురుషుని జెనరల్ వార్డుకు, శిశు వుని మెటర్నిటీవార్డుకు అప్పజెప్పినారో అప్పుడే ఆవార్త పుకారుగా పట్నాన్నంత నూ రేగ్గోకింది. "టి. పి." ల కేమిటి "ఆర్. పి." ల కేమిటి, "జి. డి." లకేమిటి, "సి. ఐ. డి" లకేమిటి ఎక్కడెక్కడవున్న పోలీసులకు పని కల్పనైంది. ఆ పిల్లను కని పారేసిన తల్లి యెవ్వర్తె యని ఆచోకీ తీస్తూవున్నారు. దం డిస్తామంటూ వున్నారు. దానికి మగాడెవ డన్నా వున్నాడా, వుంటే వాని చహరా చెప్పమంటూవున్నారు.

అదంతా లౌక్యము! పరమలౌక్యము!— ఆసుపత్రిలోవాళ్ల కా లౌక్యంతో ఎట్టిసంబం ధమున్నూ లేదు. ఆసుపత్రిలోని ప్రతీవై ద్యుని కృషీ ఆనాడు ఆ రెండు ప్రాణాల్నీ ఎలా సంరక్షించడం అనే విశ్వప్రయ త్నంలో లీనమైపోవడమే! వారికి పేర్లతో సంబంధంలేదు. భాగ్యంతో తగులాటంలేదు, కులంతో నిమిత్తంలేదు, బొందిలో ప్రాణం నిలిపి జీవి ననామయంగా జేసిచూపడమే వారి మహదాశయం.

ఇనకొండమీద సుప్రతిష్ఠితమైయున్న ఆ మహాభిషక్స్థానను ఇక్కడ కొంచెమైనా వర్ణించకపోతే కథకు విశ్రాంతి మఱిదొఱక దేమో?—ఊరికంతకూ ఎత్తయినస్థలం అది.

ఓతట్టుచూస్తే అపారమైన నీలనీలాంబుధి తేలియాడుతూవుంటుంది. ఓతట్టుచూస్తే ఏరాడకొండ కతిపయోత్తుంగ తాళపాదపశిఖాగ్రాల్తో ప్రత్యక్షమైవుంటుంది. ఓతట్టు పెద్ద హార్బరు గొప్పగొప్ప పొగయోడలతో కనిపిస్తూవుంటుంది. నాలుగోతట్టు తిన్నగా తిలకిస్తే "సీతమ్మధార" నాబడే లోయయొక్క పచ్చని చిక్కని చాయ తనచల్లనిచూపుల్ని ప్రసరిస్తూ వుంటుంది.

* * * *

ప్రాణాలు పోవడం అనేదివస్తే ఎవరికో గాని మధ్యాహ్నంపోవు: సర్వసాధారణంగా చాలామందికి సాయంకాలపు చల్లపొద్దులోన్ని తెల్లవారగట్లనో పోతూవుంటాయి. డాక్టర్లకూడా అదేభయం. "ఈ రాత్రి గడిస్తే బ్రతికినట్టే రోగి" అని వాళ్లు అనడం తఱుచు వింటాం. ఆసుపత్రికి పొవ్యేమార్గాన్ని ఎండతాకుడు పడమటితట్టునుంచి కొట్టడం ప్రారంభించింది. క్రమంగా ఎండతీక్ష్ణత తగ్గింది. సూర్యుడు కొండవెనక్కిపోలి ఏరాడ జనపద ప్రాంతాన్నా అన్నట్టు క్రుంకిపోతూవున్నాడు.

ఆ సూర్యాస్తమయ ఘడియలు పూర్తి కాకుండా రూల్సుప్రకారంగా పోలీసులు వొక చచ్చిపోయిన ఆడమనిషిని పోస్టుమార్టెమ్‌కు గాను ఆసుపత్రికి తీసికొని వస్తూవున్నారు. తీసికొనివస్తూ దారంట అంటూ వున్నారు. "ఈమె మిక్కిలీ నిర్భాగ్యురాలు తన్ను ప్రేమించినవానికైనా తాను పురుడు పోసుకోవడం తెలిస్తే తనకు తలవంపు లనే విచింతనంకొద్దీ ప్రియునితోకూడా చెప్పకుండా, ప్రియు డెఱక్కుండా తలుపీవల తాళంవేసికొని నిన్న సాయంకాలం లేచిపోయిందట. లేచిపోయినందుకు అనుభవించింది! దిక్కులేనిచావు చచ్చింది. పోనీ కన్నపిల్లమీద అపేక్షకొద్దీ దైవికంగా కారుదొరికింది అని ఆకారులో ఆపిల్లను పరుండబెట్టిన మనిషి తాను తిన్నగా యింటికిపోయి విస్తారో తాంచేటిచెరో వేసుకోక, సముద్రపునీటి బాహాటపుగాల్లో, చవిటిపఱ్ఱ నట్టాడుతూ వాతం కమ్ముకుపోవడం ఏం తెలివితేటలు" పూర్వకృతకర్మపరిపాకం కాకపోతేను? అని పోలీసు సబుఇన్సపెక్టరు తమ్మయ్య రోడ్డుమీద నిలబడి నిర్వచిస్తూన్నాడు. "పాపం! చంటిబిడ్డన్నా బ్రతికి-దో లేదో? తత్సంబంధమైన ఋణానుబంధం పచ్చనిపసిటి కొంగుపేకరూపకంగా తీరించనుకోవాలి మనం" అని పంచాయితీ రిపోర్టువ్రాసిన విలేఖరి బ్రహ్మయ్య క్రిందప్రక్కబాటనే గొంతుకూకుని అంటూ వున్నాడు.

స్త్రీయొక్క శవం ఇసక్కొండ మీదకు తేబడుతూ మెల్లమెల్లగా వైద్యవిద్యాలయపు "ఎనాటమీ" తరగతి కట్టడములకేసి వాహకుల బుజాలమీద ముఖమాత్రంగా దర్శనీయమౌతూ చలిస్తూవుంది. ఆదృశ్యం చూచిన ప్రతీవ్యక్తీ తక్రీనుండి చమారీదాకా "పొడుగైన పోక, సన్నని శలాక, చక్కని చుక్క, తొలికానుపై యుండాలి, తలకట్టెంతుందో, అహో! చెవుల దిగుచాయకంటా

చెపల్ని చెప్ప శక్యంగాని ఎవరికీ లేని నీలి నీలి చిటిపాటి కురుంయొక్క ముటి ముటి యిరుల కళ! ఆ కళింకా ఆలాగే నిలిచి వుంది." అని నివ్వెఱపడి చూస్తూ విషాద భరితు లైన వారే.

ఆలా ఆస్త్రీవ్యక్తియొక్క కట్టె ఆసుపత్రిక త్తికోతగ్గాను తీసికొనిరాబడుతూవున్న పరిక్లిష్ట సమయంలో నీలాంబరం కనకాంబరం ఏంచేస్తూ వున్నారు? కనకాంభరం కానుపుల కాను కటకటాలగుండా చూస్తూ వుంది, ఎనాటమిా కట్టడంకు గొనిపోబడుతూ వున్న కొత్తశవంకేసి. నీలాంబరం జెనరల్ వార్డులో పరుండబెట్టబడ్డ కాలకూట మూలజ్ఞునియొక్క శరీరోష్ణిమగాజుపుల్లనే గమనిస్తూ చూస్తూవుంది తనూ ఆశవంకేసే.

* * * *

కనకాంబరందగ్గఱకు దాది వొక్కర్తె వచ్చి "మిా రుదయం తీసికొనివచ్చినచంటిపిల్ల బ్రతకలేదు. దాన్ని కన్నతండ్రి సవాయితవాయిగాడైయుండాలిసుమండీ!" అంది. కనకాంబరం తనకు లోలోపుట్టుకొచ్చే దుఃఖం ఆపుకుంటూ గద్గదికతో అంది "ఆలా అనుకోవడం ఎందుకు మనం?—పుట్టీపుట్టనప్పట్నుంచీ కనపడని దారిద్ర్యపు హోరుగాలి జల్లుకూ, కనబడిన్నీ తియ్యందన మెఱుగని కడలి నిలవపడియల తేమపొర్లుకూ, పసిపిల్ల కొయ్యబారి చనిపోయిందని ఏల అనుకోరాదు?" అంది. అంటూ నీలాంబరాని కా సంగతి చెబుదామని బయలుదేరి ఆమెవున్న వార్డు దరిసింది. నీలాంబరం గుమ్మందగ్గఱే ఎదురై "ఇఖ ప్రయోజనంలేదు. ఆ కొత్తగా ఆలా తీసికొనిపోబడుతూవున్న తనప్రియురాలి శవంకేసి చూస్తూ రక్తశూన్యుడై ప్రొద్దుటి సముద్రపు మనిషి "ఆమె కౌగింటిలో" అని ఓపాట పాడుతూ తనహంసకు స్వస్తిచెప్పాడు. నీముఖవైఖరిచూస్తే చంటిపిల్లా జీవించినట్లులేదు. మనమిరువురం ప్రస్తుత మింక చేసేకర్తవ్య మిా ఆసుపత్రిలో మరే ముంది కనుక—కనకాంబరం! రా! అటు చూడకింక! ఆ కానుపులకాను కేసి చూడకు. సముద్రపుమనిషి కడసారి పాడిన పాట విను.

"ఆమెకౌగిటిలో నా కోర్కెపండిస్తి
ఆమెకందోయిలో నా మేడనిర్మిస్తి
ఏవాడనైనాను గన్నారటర్రా
నాచేడెజాడ తెలిసుంటె చెప్పర!
పెదపెద్దవీథుల్ల పిలిచి విసికాను
యిసుకతిన్నెల నీలవేసి యలిసాను
మసకసంజలా సందియంగ బ్రమిశాను
కొసకు గాదని తెలిసి కదలిడాశాను."

అని పాడింది.

కనకాంబరం తననేస్తం నీలాంబరంపాడిన కొత్తపాట ఆలా వింటూ ఇసక్కొండ దిగుతూ, నీలాంబగాన్ని సింహాచలం దిక్కుగా జూడమంది. సీతమ్మ గడ్డయొక్క సన్నటి ధారనే ఒకటి, రెండు, మూడు కునుకుకిరణాలు సూర్యునివి ప్రతిబింబించినవి. ఏతత్ప్రతిబింబితకిరణత్రయమే నాటిరేయి మహాదాశ్వాసము!

# కందుకూరి వీరేశలింగము పంతులుగారి కొన్నిలేఖలు

అడవి శంకరరావు

కందుకూరి వీరేశలింగము పంతు లితరులకు వ్రాసిన లేఖలను నేను సేకరించినవానిలోఁ గొన్నింటి నీక్రిందఁ బ్రచురించుచున్నాను. ఈ లేఖలను బ్రచురణార్థమై యొసంగిన పెద్దాడ సుందరశివరావు బి. యె., బి. యల్., పాలెపు సుబ్బారావు బి. యే., బి. యల్., దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావు బి. యె., కందూరి వేంకటరత్నము, కనుపర్తి శ్రీరాములు, రాయసము వేంకటశివుఁడు యమ్. యే., గార్లకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈ లేఖలలో వీరేశలింగముపంతుల నిరంతర కృషియు, కార్యదీక్షయుఁ బ్రస్ఫుటితములగుచుండును. ఎవరిపేర లేఖ వ్రాయఁబడినది లేఖపైన కుండలీకరణములో గుర్తింపఁబడినది.

## ౧

(రాయసం వేంకటశివుడుగారు, ఎం. యె.,
గుంటూరు.)

రాజ్యలక్ష్మీనిలాసము,
౨౦ నెల్లాలవీధి, పలశువాకము, చెన్నపురి,
3 మార్చి ౧౯౦౨.

ప్రియమిత్రమా,

మన్నవ బుచ్చయ్యపంతులుగారి మరణమువలన సుహృదయుఁడైన నిజమగు స్నేహితు నొకనిని మనము గోల్పోయితిమి. ఆతనినిబట్టి కాని లేనియెడల నే నిచ్చట నిల్లు నొకదానినిఁ గొనియుండను.

మీ జనానాపత్రిక ఫిబ్రవరిసంచిక ఆలస్యముగాఁ బ్రచురింపఁబడినందుకు నేను మిక్కిలి విచారించుచున్నాను ఆర్థికపరిస్థితులకు ఈ ఆలస్యముతో నేమియు సంబంధము లేదు. మొదటికారణము, పత్రికకు వ్యాసము లాలస్యముగఁ బంపఁబడినవి. రెండవది, నేను జబ్బుపడుటచే ప్రూఫులను సకాలమున దిద్దలేకపోయినాను. మూడవది, ఆఖరుఫారము మచ్చున కిచ్చునప్పటికి, మూడునాళ్లు పేజీలకు తగిన వ్యాసములేక లోటుగ నుండెను. ఎట్లయినను, మాసాంతమునకు పత్రిక చందాదారులకుఁ బంపఁబడుటకుఁ దయారయ్యెను. మీ చిరునామాకుఁ బంపఁబడిన ప్రతులు మీకు చేరినవని నేను నమ్ముచున్నాను.

ఫిబ్రవరి మాసారంభమున నొక వారముదినముల వరకు నేను జబ్బుపడినాను. ఈ జ్వరమువలన నాకు నిస్సత్తుగ, తీవ్రమైన దగ్గు దాపురించినవి. మన స్నేహితుని మరణసమయమున నేనును అనారోగ్యముగానేయుంటిని. దైవానుగ్రహమున నా కిప్పుడు చాల నయముగనున్నది. దగ్గుమాత్రము నన్నింకను బీడించుచున్నది. డాక్టరు సి. బి. రామారావుగారే నా కింకను వైద్యము చేయుచున్నారు. నాకు జబ్బుగానుండుటచే సత్యసంవర్ధని (The voice cf progress) కి కూడ నేను వ్రాయుటలేదు. సత్యసంవర్ధనియొక్క జనవరి సంచిక ఇంకనుఁ బ్రచురింపఁబడనిసంగతి మీకుఁ దెలిసియేయున్నది. పత్రికకు మీ వ్యాసములను గ్రమము దప్పకుండఁ బంపుచుండవలెనని నేను కోరుచున్నాను. ఒక వ్యాసము సాధ్యమైనంత త్వ

రలోఁ బంపకపోయెదను. జనానాపత్రిక యొక్క మార్చిసంచికకు వ్యాసములఁ బంపవలెను. నెల్లూరినుండి నాకు సొమ్మురాఁగానే బుచ్చయ్యపంతులు గారి భార్యకు ౫౦ రూపాయలనిచ్చెదను.

మీ సుహృదుఁడు,
కం. వీరేశలింగము.

౨

(రాయసం వేంకటశివుడుగారు
యెమ్. యె., యెల్. టి.,
గుంటూరు,)

రాజ్యలక్ష్మీవిలాసము, ౨౦ వెల్లాలవీధి,
పరశువాకము, చెన్నపురి, ౨౯
మెయి, ౧౯౦౨.

ప్రియమైన అయ్యా,

సాంఘికసభ (౧౯౦౨ జూన్ గల తేదిని కాకినాడలో జరిగిన చెన్నరాజధానీ దేశీయసాంఘిక మహాసభ?) కు అగ్రాసనాధిపత్యము వహించుటకు మొదట నేను సందేహించి తరువాత ఈ గౌరవమును నేను నిరాకరించితిని. ఇష్టము లేకున్నను మిత్రుల నిర్బంధముచేతను, ప్రోత్సాహముచేతను చివరకీ గౌరవమునకు నే నంగీకరించుచున్నాను. ఈ గౌరవమునకు నే నర్హుఁడను గాననియు, నసమర్థుఁడననియు నిప్పటికిని నేననుకొనుచున్నాను. దేశమును మరల నన్నతస్థితికిఁ దెచ్చుటకు గాఢముగాఁ బ్రయత్నించుచున్న మీమీఁదనే ఈ సభయొక్క విజయము పూర్తిగా నాధారపడియున్నది. మన స్నేహితులు చాలమంది వచ్చెదరని నేనాశించుచున్నాను. సంఘసంస్కారిణి (Social reformer) లో ఆంగ్లమున నాజీవితమును బ్రచురించెదమని మీరు ప్రకటనచేయుచున్నారు. తగినంత సామగ్రి మీవద్దనున్నదా? నా స్వీయచరిత్రను రెండుప్రకరణములను నేను వ్రాసినాను. ఇది సుమారు నలువది

పంతులుగారి ఇంగ్లీషు దస్తూరికి మచ్చు

"RAJAYA LAKSHMI VILAS"
20, Vellala Street, Parasuwakam,
Madras, 10/10/ 1902

Dear Sir,

Myself and wife are just leaving this place for Guntur where a widow marriage will be celebrated tomorrow. We will leave Guntur for Rajahmundry on Monday and reach Raj. that very night (at 1 Am). We have arranged to have a widow marriage celebrated at Rajahmundry on Tuesday. We will leave Rajahmundry that very night for Madras. Please don't fail to meet me at Rajahmundry on Tuesday morning and to make necessary arrangements for the marriage. I earnestly request you to comply with my request. More in person.

Hoping that this will reach you in good health,

in haste

I remain, yours truly
K Veeresalingam



కందుకూరి వీరేశలింగము పంతులు, వారి భార్య రాజ్యలక్ష్మమ్మ
(ముప్పాతిక వయస్సున)

పుటలైనది. ఈరెండు ప్రకరణములను మీకుఁ బంపనా? మీకళాశాల సెప్పుడు దెరిచెదరు?

మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము.

---



కందుకూరి వీరేశలింగము పంతులుగారు
(నడువయస్సున)

## 3

(రెబ్బాప్రగ్గడ పాపయ్యగారు
రాజమహేంద్రవరము,)

రాజ్యలక్ష్మీవిలాసము,

౨౦ వెల్లాలవీధి, పరశువాకము, చెన్నపురి,

౧౦-౧౦-౧౯౦౨.

ఆర్యా,

నేనును, నాభార్యయు నిప్పుడీ పట్టణమువదలి గుంటూరుకు వెడలుచున్నాము. రేపు గుంటూరులో స్త్రీపునర్వివాహమొకటి జరుపఁబడును. సోమవారము గుంటూరువదలి ఆరాత్రి ౧ గంటకు రాజమహేంద్రవరము చేరుచున్నాము. రాజమహేంద్రవరములో మంగళవార మొక స్త్రీ పునర్వివాహము జరుపుటకై మేమేర్పాటుగావించియున్నాము. ఆరాత్రియే రాజమహేంద్రవరము వదలి మేము చెన్నపురికి వెడలిపోదుము. మంగళవారముదయము నన్నుఁగలిసికొనుటకును, వలయు నేర్పాటుఁజేయుటలోను మీరుపేక్షఁజేయవలదు. నా కోరిక నెరవేర్పవలయునని నేను మిక్కిలికోరుచున్నాను. మనము కలిసికొనినతరువాత తక్కిన విషయములను గురించి మాట్లాడుకొనవచ్చును. ఈ లేఖ యందునప్పటికి మీ సంపూర్ణారోగ్యమును నేనభిలషించుచున్నాను. ఈ లేఖను తొందరలో వ్రాసినాను.

మీహితుఁడు,

కం. వీరేశలింగము.

## ౪

(కాళ్లకూరి నరసింహముగారు, బొండాడ)

రాజ్యలక్ష్మీవిలాసము,

౨౦ వెల్లాలవీధి, పురశువాకము, చెన్నపురి,

౧౭ వ జూన్ ౧౯౦౪.

ఆర్యా,

మీరు వ్రాసినకార్డు చదివి సంతోషించినాను. అక్కడ మనవారందఱును సుఖముగా నున్నారని వినుటకు సంతోషమైనది. మా క్రొత్తయింటిపని వేగముగా జరగనందుకు విచారించుచున్నాను. అది కాఁగానే యిక్కడనుండి బైలుదేరి వచ్చుచున్నాను. మీరందఱును నాకు సహాయము చేసెడుపక్షమున నేను రాజమహేంద్రవరములోనే యెక్కువకాల ముండెదను. నాయునికివలన లాభముండునో లేదో నేను చెప్పఁజాలను. అయినను మీరందఱు నన్ను వెనుకనుంచుకొని పనిచేసి నాయునికి సార్థకముచేయవలెను. ఇఁక నాజీవితశేషమును సాధ్యమైనయెడల పుస్తకముల వ్రాయుటలోఁ గడపవలెననియున్నది ముఖ్యముగా స్త్రీలకుపయోగించుపుస్తకములను, మతపుస్తకములను వ్రాయఁదలఁచియు

న్నాఁడను. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో యట్లు జరుగును. వితంతుగృహముపని జరుగుచున్నది. పెంకు వేయుచున్నారు. ఇరువది దినములలో ముగియవచ్చును. మీరు శీఘ్రముగా రాజమహేంద్రవరమువచ్చి జనానాసంఘాభివృద్ధికి తోడుపడవలెను. అనేక నమస్కారములు.

మీ హితుఁడు,

కం. వీరేశలింగము

౫

(రాయసం వేంకటశివుడుగారు, ఎమ్. ఏ., గుంటూరు.)

చెన్నపురి, ౧౭ జూలై, ౧౯౦౩.

ప్రియమిత్రమా,

మీ రడ్వాన్సుగాఁ బదిరూపాయ లంపినందులకుఁ బెక్కువందనములు. డబ్బు నాకు చాల అవసరముగా నున్న సమయమున ఈ సొమ్ము దైవికముగా నాకు చేరినది. నాకుఁగల స్వల్పధనమును నే నిచ్చుటి వితంతు శరణాలయమునకై వెచ్చించుచుంటినని మీకు బహుశః తెలిసియే యుండును. నెలకు ౧౫ రూపాయ లద్దె వచ్చు గృహమును నే నీ వితంతు శరణాలయమున కిచ్చినాను. ఈ యద్దెవలన వచ్చురాబడి శరణాలయమందలి బాలికలకై వెచ్చింపఁబడుచున్నది. ఈ బాలిక లిప్పుడు నాగృహముననే యున్నారు. ఇప్పటి యేర్పాటునుఁబట్టి ఇది నాకును వారికినిఁగూడ సదుపాయముగ లేదు. అందువలనఁ బ్రక్కవీధిలో అర్ధయకరము స్థలమును అందులో వితంతుశరణాలయమును గట్టించుటకై నేను కొని, ఆస్థలమునకు నాలుగువైపుల నిటుకతో ప్రహరీగోడఁ బెట్టించితిని. వితంతువు లచ్చట నివాసముగా నుండుటకై ఈ క్రొత్తగాకొన్న స్థలములో వంటగదులను గొన్నింటిని గట్టించినాను. దీనికొరకై ఇప్పటికరకు నేను రూ. ౨౦౦౦ వ్యయపరచినాను. మరియొక రూ. ౨౦౦౦ వెచ్చించి మధ్యను హాలు కట్టించవలెనని యున్నది. చెన్నపురికి నే నొసంగు కానుకలలో బహుశః ఇది కడపటిదికావచ్చును. ఇందులకై నేను రూ. ౮౦౦ ఋణము చేసినాను. పనిచేయుచున్న కూలివాండ్రు ఏదినముకూలి ఆ దినమే అడుగుచున్నారు. సంవత్సరము తరువాత సంవత్సరము నా ఆరోగ్యము పాడైపోవుచున్నది. రాఁబోవు ఏప్రియల్ నుండి నేనుద్యోగమునుండి విరమింప నభిలషించుచున్నాను. పరిపూర్ణదయాస్వరూపుఁడగు సర్వేశ్వరుఁడు నా కాయుర్దాయము నారోగ్యము ననుగ్రహించినయెడల నే నుద్యోగమునుండి విరమించినతరువాత



మన్నవ బుచ్చన్న పంతులుగారు

నా దేశమునకుఁ గొంత సేవఁ జేయఁగల్గుదునని యాశించుచున్నాను. నాకు మునపటి సత్తువలేదు. ఏమాత్రము పనిచేసినను నా కాయాసము కొంతకాలమునకే కలుగుచున్నది.

కడచిన కృష్ణామండల సాంఘికసభాధ్యక్షపదవి (౧౯౦౨) నే నేమియు నుపన్యసింప నక్కరలేదను షరతుమీదనే నేనంగీకరించితిని. కాని నా యుపన్యాసమును వినుటకై చాలమంది ఆనాడు సమావేశమగుట

చూచి నా దృఢసంకల్పమునకు వ్యతిరేకముగా నొక గంటకుపైగా నేనుపన్యసించితిని.

మీ పత్రిక బైండింగు చేయఁబడుచున్నది. బహుశః సోమవారము మీకు పంపఁబడును. మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము

రని నేననుకొన్నాను. భీమవరమున ౨౪వ తారీఖున చేరియుండవలసిన నా లేఖ మీకెందుకు చేరలేదో నాకు తెలియదు. ఆలేఖను మీకుఁ బంపవలయునని మీ సోదరునకు వ్రాయండి. ఆ లేఖలోని సంగతుల సారాంశ మీ దిగువను వ్రాయుచున్నాను.



మూడవ వితంతువివాహము-1886

౬

(రాయసం వెంకటశివుడుగారు ఎం. ఏ., గుంటూరు)

రాజ్యలక్ష్మీవిలాసము,
౨౦ వెల్లాలవీధి,
పరశువాకము,
౨౮ జూన్ ౧౯౦౪, చెన్నపురి.

ప్రియమైన అయ్యా,

మరియొక ముద్రణాలయమున మీ జనానాపత్రిక నచ్చొత్తించుటకు మీ రీవరకే యేర్పాటు చేసియుందు

"జనానాపత్రిక విషయమై మనము చేసికొనిన యేర్పాటు దురదృష్టవశమున భగ్నమైనప్పటినుండి నా కిప్పుడు నెలకు వచ్చుచున్న రూ. ౧౧-౮-౦ ల కొరకై నెలకు రూ. ౪౦-౦-౦ ఖర్చుపడుచున్న ముద్రణాలయమును సాగించు వివేకము విషయమై నేను తీవ్రముగా నాలోచించుచున్నాను. ముద్రాయంత్రము నెప్పుడైనను నే నమ్మివేయవచ్చును. ఇదమిత్థమని నేనేమియు నిప్పటికి నిశ్చయింపలేదు. రాఁబోవు జూలై నెలలో నేను రాజమహేంద్రవరమునకు వెళ్లునప్పుడచ్చటి మిత్రులతో నాలోచించి యేదియో యొక

నిర్ధారణకు వచ్చెదను. నేను ముద్రాయంత్రము నమ్మి వేయనియెడల దానిని రాజమహేంద్రవరమునకు మార్చెదను. మీపత్రికను మరియొక ముద్రాయంత్రమున నచ్చొత్తించుట కేర్పాటుచేయవలెను. రాఁబోవు జూలై నుండి జనానాపత్రికలో మీ స్నేహితునిచే ప్రకటింపఁబడు శారీరశాస్త్రము (Physiology) లో నాబ్లాకు ఉపయోగించుకొనుట కివ్వలేనందుకు నేను విచారించుచున్నాను. క్రొత్తసంపుటము జూలై సంచికతో ప్రారంభమగును. కావున నూతన సంపుటము ప్రారంభమునుండి మరియొక ముద్రణాలయమున మీజనానా నాపత్రిక వేరొకచోట ముద్రించునేర్పాటుఁజేయఁగోరెదను........పండిత శివనాథశాస్త్రి విక్టోరియా హాలులో ౭ వ తేదిని ఉపన్యసించినతరువాత నేను కె. సీతారామయ్య బి. ఎ., గారిని కలిసికొని ఈ విషయమై వారితో బ్రస్తావించితిని. పయికీలిని మీపేర వ్రాసితినని వారితో జెప్పితిని. చందా 2 రూ. చేయవలయునని తాను మీకు సలహానివ్వలేదనియు, నాతో నాలోచింపకుండ ఉన్న యేర్పాటు మార్చవద్దనికూడ దాను మిమ్ము హెచ్చరించితిననియు ఆతడు నాతో జెప్పెను. పోనీయండి జరిగినదేదో జరిగినది. మనము



వితంతువివాహము చేసుకొన్నవారు, వీరేశలింగముదంపతులు-1908

పత్రికను ముద్రించిన బాగుండును. నేను ప్రచురింప నెంచు పుస్తకములు (భౌతికభూగోళశాస్త్రము మొదలగునవి) మాసపత్రికలోఁ బ్రచురించుటకంటె ప్రత్యేక పుస్తకములుగాఁ బ్రచురించుట మంచిదని నేనెంచుచున్నాను."

ఇప్పటికైనను నానిర్ణయమును మార్చుకొనవలసిన కారణమేదియు నాకు గోచరించుటలేదు. మీజనా గాఢముగా నాలోచించిచేసిన సంప్రతింపులు, ఏర్పాటులు మీరు హేలగా నాలోచించినారు. వ్యవహారము సరిజేయుట కిప్పుడదను తప్పినది. జనానాపత్రికవిషయములో—కొంతకాలమువరకు నన్ను వదలివేయండి, ప్రస్తుత మాపత్రికతో నాకేమియు సంబంధము వలదు. మీలేఖలలో నొకదానిలో మీరు వ్రాసినట్లు ఈ విషయము స్వల్పమైనదేయైనను, అది మన అన్యోన్యసంబంధ

మున కెక్కువ విఘాతము గల్గించినది. మీరు డబ్బు విషయమై మాత్రమే యెక్కువ జాగరూకతవహింతు రనియు, (మీ దేశసేవయు) పరోపకారమును మీకు దవ్యనష్టము రానంతవరకే సాగింతురనియు నాకు దృఢమైన నమ్మకము కల్గినది. ఇతరులవద్దనుండి నేను చాల ఆశించుచుందును. మీపద్ధతియే బాగున్నది నేనే పూర్తిగా తప్పత్రోవనున్నాను. నే నింతస్పష్టముగ వ్రాయుచున్నందులకు నన్ను క్షమింపవలెను. నే నెట్లభిప్రాయము పడినది అరమరలేక మీకు దెలియఁజేసినాను. ఇక ముందైనను మనోవేదన లేకుండనుండగలనని నేనాశించుచున్నాను. సంగతిసందర్భముల సరిగా నాలోచించుటకు వీలులేనంతగా నేను వృద్ధుఁడను, దుర్బలుఁడనైతిని. అందుచే నాయభిప్రాయములు క్షంతవ్యములు. పైన పేర్కొనబడిన లేఖలలో నేను వ్రాసినట్లే ఆదవాని కొప్పరప్పగారికిని మరి ఇరువురకును నేను ప్రత్యుత్తరము వ్రాయుచు నాకును జనానాపత్రికకేమియు సంబంధము లేదని తెలియఁజేసినాను. ఆంధ్రప్రకాశిక మున్నగు పత్రికలలో చేయఁబడుచున్న ప్రకటనము ప్రజలలో అపోహల గల్గించును కావున, నే నీవరకు వ్రాసిన లేఖలో కోరినరీతిని నాకు జనానాపత్రికతో ప్రస్తుత మేమియు సంబంధము లేదని మీరు సంగ్రహముగా వ్రాసి ప్రచురించవలెను. మీరు కోరినయెడల జూలై సంచికను నేనే ముద్రించెద(?)ను. తిరుగు టపాలో జవాబు వ్రాయఁగోరెదను.



ప్రార్థనసమాజము, రాజమహేంద్రవరము-1902 కందుకూరి వీరేశలింగముపంతులు మున్నగువారు

మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము.

౭

(దేశిరాజు పెదబాపయ్యగారు, బి. ఏ.,
రాజమహేంద్రవరము.)

రాజ్యలక్ష్మీవిలాసము, ౨౦ వెల్లాలవీధి,
పరశువాకము. చెన్నపురి, ౧౫-౧౦-౧౯౦౪

ఆర్యా,

మీరు దయతో కార్డు వ్రాసినందుల కనేకవందనములు. ఈయుత్తరము మీ కందునప్పటికి గౌకన్య (Miss Gow) అక్కడ యుండునని నేననుకొనుచున్నాను. నే నింకను ఎక్కువ దగ్గుతో బాధపడుచునే యున్నాను. భజేకర్ గారు (Mr. Bhajekar) నా పేర కూడ వ్రాసినారు. డాక్టరు రామారావుగారిని ఒకటి రెండు రోజులలో కలిసికొనియెదను. మీకు కొంచెము నయముగ నున్నందుకు నాకు సంతోషముగ నున్నది. కార్లీలియను (Carlylean) లో ప్రకటనచేయుటకు రేట్లు ఎట్లున్నవి? మన పాఠశాల కుపాధ్యాయినిలుకావలయునని ఆ పత్రికయొక్క రెండు మూడు సంచికలలో మనము ప్రకటనఁ జేయవచ్చును. మన రాజధానిలో జరిగిన స్త్రీపునర్వివాహముల పట్టికను సమగ్రమైనదానిని నే నివ్వలేనందుకు విచారించుచున్నాను. ఈలేఖ రెండవవైపున నాకు తోచిన రీతిని ఈ వివాహముల పట్టికనొకదానిని వ్రాసి మీకు పంపుచున్నాను. ఇక్కడ నాకాలము వృథాగా గడచుచున్నది. ......

మీ సుహృదుఁడు,
కం. వీరేశలింగము

పట్టిక

గోగులపాటి శ్రీరాములు-గవరమ్మ
రాచర్ల రామచంద్రరావు-రత్నమ్మ
తాడూరి రామారావు-సీతమ్మ
పులవర్తి శేషయ్య-శేషమ్మ.
ముంజులూరి గోపాలము-సూరమ్మ.
చేబోలు వెంకయ్య-వెంకమ్మ
బోడా శ్రీరాములు-రత్నమ్మ.
తణుకు వెంకటచలపతిరావు-కోటమ్మ.
పలాది రామయ్య-రత్నమ్మ.
నల్లదండ కోదండరామయ్య-సుబ్బమ్మ.
చిట్టూరి సుబ్బారావు (బెళ్లారి)
జటప్రోలు రామారావు (బెళ్లారి)
పటానేని వెంకయ్య-సుబ్బమ్మ
కొమ్మరాజు గోపాలము-పూర్ణమ్మ.



దేశిరాజు పెదబాపయ్య, వీరేశలింగముపంతులు మున్నగువారు
ప్రార్థనసమాజము, రాజమహేంద్రవరము-1904

నల్ల దండ కోదండరామయ్య-మంగమ్మ.
పటానేని వెంకయ్య-కామేశ్వరమ్మ.
జి. వెంకటరెడ్డి (వైశ్యులు)
తణుకు నరసింహము-వెంకటలక్ష్మమ్మ
మానూరి పురుషోత్తముపంతులు-సీతమ్మ
ఆదిపూడి సోమనాథరావు-సీతమ్మ.
గని సుబ్బారావు-లక్ష్మీనరసమ్మ.

ద్రోణంరాజు శేషగిరిరావు-కులీశమ్మ
కోపల్లి శేషగిరిరావు-రంగనాయకమ్మ.
నాళ్ల చెరువు కృష్ణారావు-పార్వతమ్మ.
టి. రామారావు-వరలక్ష్మి.
పుల్లాభొట్ల గవరయ్యశాస్త్రి-పార్వతమ్మ
కె. గోపాలము-సన్నమ్మ
నండూల గోపాలస్వామయ్య-శేషమ్మ.
ఆనిపూడి గోపాలరావు-బంగారమ్మ.
న్యాపతి శేషగిరిరావు-మహాలక్ష్మమ్మ
యల్. వీరభద్రయ్య-సీతమ్మ.
పి. గవరయ్యశాస్త్రి-కౌసల్య
కోకా వెంకటసుబ్బారావునాయుడు-చిరంజీవమ్మ.
వి. లక్ష్మీనారాయణ-మహాలక్ష్మి.
శేషయ్యంగారు-చొక్కమ్మ
వెంకటవరదయ్యంగారు-కృష్ణమ్మ.
బాజీరావు-అభిరామమ్మ.
పటానేని వెంకయ్య (మూడవవివాహము)
ముంజులూరి గోపాలము (రెండవవివాహము)
చిట్టూరి సుబ్బారావు (రెండవవివాహము)
జి. సుబ్రహ్మణ్యేరుకూతురు (౧౮౭౮ సం. లో)
తిరువేంకటాచారి (సేలములో)
శేషయ్యంగారి కూతురు (నాగర్కోయిలలో)
రామచంద్రరావు-రమణమ్మ(రాజమహేంద్రవరములో)
బి. యస్. ప్రకాశరావు-వేంకటరమణమ్మ (గుంటూరు)
తిరుమెల్ల వెంకటసుబ్బారావు-వేంకటలక్ష్మి.
భట్టిప్రోలు శరభయ్య-రాజేశ్వరమ్మ.
ధేరం వేంకటేశ్వరులు-శేషమ్మ.
కె. నమశ్శివాయ-అన్నపూర్ణమ్మ.
సి. యన్. శ్రీనివాసాచారి-లక్ష్మీదేవమ్మ.
ఉప్పలూరి సుబ్బారావు-సీతారామమ్మ
కస్తూరి సుబ్బారావు-సీతారామమ్మ (గుంటూరు)
పి. కృష్ణమూర్తి-వెంకుబాయమ్మ (గుంటూరు)
ఉప్పలూరి సుబ్బారావు-నాగరత్నము (గుంటూరు)
ఈమధ్యను గుంటూరులో జరిగిన తెనాలికన్యవివాహము
అయ్యప్ప (కరణం-కోలారుజిల్లా-మైనూరు) ౧౯౦౦
లో వితంతువైన తనకోమార్తెకు వివాహముచేసెను.
సాతానికులమున రెండు స్త్రీపునర్వివాహములు.

ఒకటి, రెండువివాహము లింకను జరిగియుండ వచ్చును.

## ౭

(రాయసం వేంకటశివుడుగారు ఎం. ఏ.,)

రాజమహేంద్రవరము, ౨౬ ఏప్రియల్ ౧౯౦౫.

ఆర్యా,

దయతో మీరు కార్డు వ్రాసినందుకు వందనములు. చాలకాలమునుండి నేనూరక యుండుటకు హేతువు ప్రయోజనకరమైనపని దేనిని నేను చేయుచుండుటవలన కాదు. మూడువారములనుండి నేనొక కురుపుతో బాధపడుచు ఇల్లు కదలలేకున్నాను. దైవానుగ్రహమువలన ఆకురుపు పూర్తిగా నిమ్మళించినది. కడచినవారము నేను సభలలో నిమగ్నుడనై యుంటిని. సభలు జయప్రదముగనే జరిగినవని యనుకొనుచున్నారు. నాకు మించిన పనిని నేనిచ్చట చేయుచుండుటయు వాస్తవమే. జనానాపత్రికకు కొంత వ్రాసిపంపండి. ఏప్రియల్, మే పత్రికలను గలిపి ప్రచురించెదను. తిగినంతయారోగ్యమున్నప్పుడే కొంత యుపయోగకరమైన పని చేయవలెనని యున్నది. వాల్తేరు చల్లని ప్రదేశమేనా?

మీ సుహృదుడు,
కం. వీరేశలింగము

## ౮

(దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, బి. యె., కాకినాడ.)

రాజమహేంద్రవరము, ౧౫-౮-౧౦.

ప్రియమిత్రమా,

దయతో మీరు లేఖవ్రాసినందుకు వందనములు. మీ కద్దనుండి ఈవరకే యుత్తరము వచ్చునని యనుకొంటిని. నేను మీ కుటుంబములో నివాడనేయని మీరు భావించుచున్నారని నేనెఱుంగుదును. ఈ కష్టము

నోర్చుకొనుటకు దేవుడు నాకు దగినబలము నొసఁగి నన్నన్నివిధముల సంరక్షించుచున్నాడు. ఇంతకంటె మీకు నేనెక్కువ వ్రాయలేను. నాయుడుగారికి నేడు నేను వ్రాసిన యుత్తరముఁ జదువఁగోరెదను. ఆ యుత్తరమువలన నా ప్రస్తుతస్థితి మీకు దెలియఁగలదు. మీరు శ్రమపడి నన్నుఁజూచుటకై యిక్కడకు రావద్దు. నేనే అక్కడకువచ్చి కొన్నిరోజులు మీ యందరిమధ్యను గాలము గడపెదను. ముందు వివరముగా వ్రాసెదను.

మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము



జనానాపాఠశాల, రాజమహేంద్రవరము
కందుకూరి రాజ్యలక్ష్మమ్మ మున్నగువారు

౧౦

(కుందూరి వెంకటరత్నముగారు,
రాజమహేంద్రవరము.)

బెంగుళూరు, ౨౧-౪-౧౨.

ప్రియమిత్రమా,

మీరు లేఖవ్రాసినందుకు వందనములు. మీరును గంగన్నగారును వితంతుశరణాలయ వ్యవహారములలో శ్రమదీసికొనినందులకు వందనములు. వీలైనన్ని

పర్యాయములు మీరు తోటలోనికి వెళ్లుచు అక్కడ వితంతుశరణాలయ వ్యవహారములను గురించి తెలిసికొనుచుండవలెను. గంగన్నగారు నమ్మకముగఁ బనిచేయువారని, మనపాఠశాలయెడల చాలశ్రద్ధ వహించువారని నాకు తెలియును. వారిని పైకిదీసికొని వచ్చుటకు నాకు వీలయినంతవరకు నేను ప్రయత్నించెదను. ఈలేఖ తొందరగా వ్రాసినాను.

మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము

౧౧

(రెబ్బాప్రగ్గడ పాపయ్యగారు,
రాజమహేంద్రవరము)

బెంగుళూరు ౧౫-౬-౧౨

ఆర్యా,

మీరు దయతో లేఖవ్రాసినందుకు వందనములు. సీతారామారావుగారితో ఆలోచించి మీ కవసర మని తోచిన రీతిని మనపాఠశాలాభవనము యొక్క మేడవరాఁడాలలో నేల మరమ్మత్తు చేయించవలెను. పాలాకర్షు లక్ష్మీనారాయణగారి విషయమై మన మిత్రులయిన కనుపర్తి శ్రీరాములుగారితో ఆలోచించవలెను. నేను ౨౨ వ తారీఖున ఈ నగరము (బెంగుళూరు) వదలి చెన్నపురికి బయలుదేరుచున్నాను. ౨౫ ఉదయమున నేను రాజమహేంద్రవరములో నుండెదను. మనము కలిసికొనినప్పుడు తక్కినసంగతులు మాట్లాడుకొనవచ్చును.

మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము

౧౨

(మోచర్ల రామచంద్రరావు పంతులుగారు,
ఏలూరు)

రాజమహేంద్రవరము, ఆనందాశ్రమము ౧ ౧౦ ౧౩

ఆర్యా,

టంగుటూరి శ్రీరాములుగారిచే నాపై తేబడిన అభియోగము కొట్టివేయఁబడినదనియు, స్థానిక సంయుక్త దండనాధికారి నన్ను నిర్దోషిగ నెంచెననియు మీ కీసరికి దెలిసియేయుండును. నే నెప్పుడును సర్వేశ్వరునే నమ్మియున్నాను. ఆయన న న్నెప్పుడును రక్షింపకుండ నుండలేదు. సర్వేశ్వరునకు వందనములు. నిన్న లేఖ వ్రాయలేనందుకు విచారించుచున్నాను.

మీ సుహృదుఁడు
కం. వీరేశలింగము

(కుందూరి వెంకటరత్నముగారు, రాజమహేంద్రవరము.) ౧౧-౮-౧౩.
చామరాజపేట, బెంగుళూరు.

ఆర్యా,

నే నీరోజున నిచ్చటకు వచ్చినాను. ఇచ్చటిశీతోష్ణస్థితినాకు గొంత మేలుఁ చేయునని నేనాశించుచున్నాను. ...మీరందరు క్షేమముగనున్నారని అనుకొనుచున్నాను. నాకు జలుబుచేసినది. దీర్ఘప్రయాణమువలన నాకు గొంత బడలికగ నున్నది మీ రప్పుడప్పుడు ఆనందాశ్రమము (Ananda gardens) లోనికి వెల్లి వితంతు శరణాలయములోనివారి యోగక్షేమముల తెలిసికొనుచున్నారని నేను నమ్ముచున్నాను. తక్కిన వ్యవహారము లెట్లు నడచుచున్నవి? అవసర సమయములందు స్వార్థపరాయణులైన మిత్రులు నన్ను వీడవచ్చును. కాని సర్వేశ్వరుఁడు నన్ను వీడడని నానమ్మకము.

మీ సుహృదుఁడు,
కం. వీరేశలింగము

౧౪

(కుందూరి వెంకటరత్నంగారు, రాజమహేంద్రవరము.)
౧౫-౮-౧౩, బెంగుళూరు.

ఆర్యా,

...నే నెల్లసమయములందును సర్వేశ్వరు నొక్కనినే దృఢముగా నమ్మియున్నందున నామనస్సులో నేవిధమైన ఆందోళనము గల్గుటలేదు. నాకు పరమమిత్రులని యెంచఁబడినవా రేనిమిషమందైన నన్ను వదలివేయవచ్చును. కాని సర్వేశ్వరుఁడు నన్నెప్పుడును విడువడు... రాజమహేంద్రవరసమాచారములు మీరు నాకు దెలియఁజేయుదురని నే నాశించుచున్నాను.

మీ సుహృదుఁడు,
కం. వీరేశలింగము

(కుందూరి వెంకటరత్నముగారు,
రాజమహేంద్రవరము)

చామరాజపేట, బెంగుళూరు. ౨౨-౮-౧౩

ఆర్యా,

.........ఈ రోజున నాకు కొంచెము నయముగనున్నది. నాదగ్గుబాధ తగ్గుచున్నది.—నాకు రుచిగ నుండునట్లు వంటచేయు వారు లేరు. నాకు గత్యంతరములేదు. క్రమముగ ఈ వంటకు నే నలవాటుపడియెదను.

నేను వ్రాసిన లేఖలో "నా ఆప్తమిత్రులుకూడ నన్ను వదలివేయవచ్చును కాని ఈశ్వరుఁడు నన్ను విడువడ"ని వ్రాసినప్పుడు నేను ప్రత్యేకముగా నెవరి నుద్దేశించి వ్రాయలేదు. ఈ ప్రపంచమున నే నేకాకిగనుంటిననియు, ప్రాపంచికధోరణికల్గిన మన స్నేహితులు నన్ను వదలివేసిరనియు నే నప్పుడప్పు డనుకొనుచుందును. నా వృద్ధాప్యములో, ఇప్పటి నా అసహాయస్థితిలో సర్వేశ్వరుఁడు నాకు శాంతి (Comfort) నొసంగుచున్నాడు. ఈ విపత్తుల, అపవాదములనడుమ నాకు మనశ్శాంతి నీశ్వరుఁ డొసఁగియున్నాడు.......
ఈ ప్రపంచమున నేను చేయవలసినపని ముఖ్యాతికముగ్విసము ముగిసినదని నే నెంచుచున్నాను. త్వరలో జగత్పితయు, శ్రేష్ఠమిత్రుఁడు (Heavenly Friend and Father) నగు సర్వేశ్వరుని నేను కలిసికొనవలసియున్నది....... నేనెప్పుడును ఈశ్వరునిపై ఆధారపడియున్నాను. ఈశ్వర పాలితమైన ఈ ప్రపంచమున సత్యమే జయించితీరును. మనయుద్యమము ధర్మముపైనను, సత్యముపైనను ఆధారపడియున్నది. ఆంధ్రసాహిత్య పరిషత్సమావేశముయొక్క కార్యక్రమము

ఈ సరికి (నేను ౫ గంటలకు) చాలవరకు ముగిసియుండును. వారి రెండవవార్షికసభ సంపూర్ణముగ జయప్రదమైనదని నేనాశించుచున్నాను. పిఠాపురము రాజాగారీ సభకు వచ్చినారా ? మీ సుహృదుఁడు

కం. వీరేశలింగము

౧౬

(కుందూరి వెంకటరత్నముగారు,
రాజమహేంద్రవరము)

బెంగుళూరు, 3-౫-౧3.

ఆర్యా,

............మన పాఠశాలయొక్క పరీక్షాఫలితములు మొత్తముమీద బాగుగనే యున్నవనుకొనియెదను. ఇంతమంది బాలికలు పై తరగతులలోనికి పరీక్షలో కృతార్థులై వచ్చినందులకు నాకు సంతోషముగనున్నది. .........దైవానుగ్రహమున నా ఆరోగ్యము బాగుపడుచున్నది. ఏసుక్రీస్తుయొక్క జీవితము మిగిలిన భాగమును నేను వ్రాయ నారంభించినాను. ఈ నెలాఖరు లోపున నేనీపనిని పూర్తిచేయఁగలనని ఆశించుచున్నాను. .......

మీ సుహృదుఁడు,
కం. వీరేశలింగము.

౧౭

(కుందూరి వెంకటరత్నముగారు —
రాజమహేంద్రవరము.)

బెంగుళూరు, ౧౦-౫-౧3

ఆర్యా,

.........నేను ఏసుక్రీస్తుజీవితమును వ్రాయుట ముగించినాను.......... మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము.

౧౮

(కుందూరి వెంకటరత్నముగారు—
రాజమహేంద్రవరము.)

బెంగుళూరు, ౧౨-౫-౧3.

ఆర్యా,

ఆ పత్రికయొక్క మూడుసంచికలు నే నిక్కడకు వచ్చినతరువాత నాకు చేరినవి. అటువంటి......వ్రాతలను లెక్కచేయుట తెలివితక్కువ. కుక్కలు మనలనుఁ జూచి మొరిగిన మొరగనీయండి. మనజీవితాంతమువరకు భూషణదూషణములఁ బరిగణింపక మన విధ్యుక్తధర్మమును చేయుదము. సర్వేశ్వరుఁడొక్కఁడే మంచిచెడ్డల నిర్ణయింపఁగలడు. మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము

౧౯

(కుందూరి వెంకటరత్నముగారు,
రాజమహేంద్రవరము.)

బెంగుళూరు, ౧౫-౫-౧3.

ఆర్యా,

దయతో మీరు వ్రాసిన లేఖ ఇప్పుడే చేరినది. భగవంతుఁడెప్పుడును ధర్మపక్షమునను, న్యాయపక్షమునను నుండును. సర్వేశ్వరునిఁ త్రికరణశుద్ధిగాగొలిచి ధర్మబద్ధమైన యుద్యమమున ఆతని మెప్పించుటకై పనిచేయుటమాత్రము మనవిధియైయున్నది. మనజీవితకాలమున మనకృషియొక్క ఫలితములను మనము చూడలేకపోవచ్చును. భారమంతయు దేవునిపైనుంచి స్నేహితులవద్దనుండి కాని విరోధులవద్దనుండికాని కలుగు ప్రతిఘటనము, అపవాదములు లెక్కసేయక మనము కష్టపడి కృషిచేయవలసియున్నది. ఆర్తులమైనచో సర్వేశ్వరుఁడు మనకు దోడ్పడునుగాక! మీరు తరుచు ఆనందాశ్రమము (Ananda gardens) లోనికి వెళ్లుచున్నారని తెలిసికొని సంతోషించినాను. మీ సుహృదుఁడు,

కం. వీరేశలింగము

౨౦

(కుందూరి వెంకటరత్నముగారు,
రాజమహేంద్రవరము.)

బెంగుళూరు, ౧౯-౬-౧3.

ఆర్యా,

...కొంతకాలమునుండి నాకు బలహీనముగనున్నది. అంతయెక్కువగ కాకపోయినను దగ్గు నన్నింకను బాధిం

చుచునేయున్నది. ఇవన్నియు నిట్లున్నను నేనిక్కడ గొంతవరకు బనిచేయఁగలుగుచున్నాను. ప్రతిదినము నేను నాలుగైదు ఉత్తరములు వ్రాయుచున్నాను. క్రమము తప్పకుండ నిత్యము ఉదయముననూ, సాయంత్రమునను రెండువేళల నేను షికారుకు వెడలుచున్నాను. ఏసు క్రీస్తు జీవిత మేబదిపుటలవరకును, నాస్వీయచరిత్రములో రెండవభాగమున వందపుటలును వ్రాయఁగలిగినాను.



దుగ్గిరాల సూర్యప్రకాశరావు, కందుకూరి వీరేశలింగముపంతులు, రఘుపతి వెంకటరత్నము నాయుడు మున్నగువారు, కాకినాడ-1905.

నాస్వీయచరిత్రము చాలవరకుగాని పూర్తిగాగాని వ్రాయుటకు వీలగునట్లు ఈ మాసాంతమువరకు నే నిచ్చటనే యుండఁదలచినాను.

భగవంతుఁడు తప్పక నాపక్షమున నున్నాడు. నిస్సంశయముగ నా కాతడు సాయముచేయుచున్నాడు. సర్వేశ్వరునకు నేను మిక్కిలి వందనములాచరించుచున్నాను. ఈశ్వరుఁడు నాకు సాయముచేయుచున్నాడనుటకు మీ కొక నిదర్శనమును దెలియఁజేయుచున్నాను. అల్ప విషయమయినను నా కీనిదర్శనము మనస్సున కూరట గల్గించుటయే కాక ఉత్సాహమును గలిగించినది. నాకు బలహీనముగ నుండుటచే బలమిచ్చు ఔషధము కొరకు నేను కలకత్తాకు వ్రాయగా ఆ ఔషధము నిన్న సాయంత్రము నాకుచేరెను. పెట్టెనుదెరచి మందుపుచ్చుకొనుట ప్రారంభించుటకయి సీసాను నేను తీయగా ఆ సీసాయొక్క కార్కుమూత గట్టిగా మూయఁబడి మైనముతో బిగింపఁబడియుండుట కనుఁగొంటిని. ఆ సీసాను దెరువలేక నేను వ్రాసికొను బల్లవద్ద గిటికీలో నుంచితిని. కార్కుమూత దెరుచుటకు నావద్ద సాధనము (Screw) లేదు. అట్టిసాధనము నొకదానిని గొనుటకు గాని, ఆ సీసాను దెరిపించుటకుగాని నేటిసాయంత్రము బజారుకు వెళ్లవలయునని నే నాలోచించుచుంటిని. నేటి

యుదయము నాపనిని చూచుకొని ఇంటికి వచ్చినతరువాత నాబల్లవద్ద కూర్చుని నేను కొంతగ్రంథము వ్రాయుచుంటిని. అప్పుడు (ఉదయము ౯ గంటలకు) ఆకస్మికముగా నొకధ్వని నాచెవిని బడినది. పైనుండి నా యొడిలో నేదియో పడినది. ఎవరో యొకతాయిని ఇంటికప్పుమీదవిసరగా ఏవికిగిన పెంకుముక్కైనను నాబల్లలో పడినదేమో యని నేననుకొంటిని. పైకి చూడగా ఇంటికప్పులో విశేషమేమియు నాకు కనబడలేదు. నాబట్ట తడుముకొని చూడగా అందులో నొకకార్కు ఉండుటజూచి నేనత్యాశ్చర్యపడితిని కిటికీలోనున్న సీసావైపు చూడగా ఆ సీసా తెరువబడి కార్కులేక యుండెను. ఈ సంఘటనము జరుగునప్పటికి వాతావరణము మిక్కిలి చల్లగనే యుండెను ఇది దైవసంఘటనమే యని నేను దృఢముగా నమ్మి ఆ పరమేశ్వరునకు నమస్కరించితిని.

ఈ స్వల్పవిషయమును గురించి ఇంతగా వ్రాసి మీకు శ్రమ గలుగజేసినందులకు క్షమింపవలయును. ఎక్కువవేడిగానున్నప్పుడు ౮౭ డిగ్రీలును మిక్కిలిచల్లగానున్నప్పుడు ౬౬ డిగ్రీలును ఇచ్చట శీతోష్ణస్థితిగా నున్నది.

మీ సుహృదుడు
కం. వీరేశలింగము

## ౨౧

(దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, కాకినాడ.)
రాజమహేంద్రవరము, ఆనందాశ్రమము, ౨౮-౭-౧౩.

ఆర్యా,

నే నిచ్చటకు ౨౧ తేదిని వచ్చినాను. కాకినాడను వదలిపెట్టుటకు పూర్వము మిమ్ము కలిసికొనలేక పోయినాను. ......అబద్ధపుసాక్ష్యము నిలువనేరదు. సత్యము జయించితీరును. నేను వృద్ధుడనైనాను. నే నొకవిధముగ విశ్రాంతిజీవనము నడుపుచున్నాను. అందువలన ఈపట్టణములోని ఇప్పటితరమువారితో నాకు బరిచయము లేదు. నాకు శత్రువులుకూడ నున్నారు. ఇచ్చట నాకు నమ్మకమైన స్నేహితులు చాల తక్కువగా నున్నారు. అందువలన వారివద్దనుండి యెక్కువ లాభము గల్గునని నే నాశపడుటలేదు. నా పూర్వపు విద్యార్థులు స్నేహితులు నను మీవంటివారిపై నేను సాయముకొరకాధారపడవలసియున్నది. మీరు నాయందు నిజమైన శ్రద్ధదీసికొని మీశక్తికొలది నాకు సాయపడవలెను. ఇంతకంటె ఎక్కువగా మీకు వ్రాయ నక్కరలేదు.

మీ సుహృదుడు,
కం. వీరేశలింగము

(మోచర్ల రామచంద్రరావుగారు, ఏలూరు.)
రాజమహేంద్రవరము, ఆనందాశ్రమము, ౨౨-౧౦-౧౮.

ఆర్యా,

మీరు దయతో నంపిన ఆహ్వానమునకు మీకు వందనములు. మీ మండలసభకు నేను రాలేనని విచారించుచున్నాను......ఈ సంవత్సరసభ జయప్రదముగా జరుగును గాక! సర్వేశ్వరుడు సభ నాశీర్వదించును గాక!

మీ సుహృదుడు,
కం. వీరేశలింగము

## ౨౩

(రెబ్బాప్రగడ పాపయ్యగారు,
రాజమహేంద్రవరము.)
బెంగుళూరు, ౧౯-౮-౧౫.

ఆర్యా,

నేను వెంకయ్యతో ఇచ్చటకు సురక్షితముగ చేరినాను. కాలమాన మాకస్మికముగ మారుటచేతను నిన్నరాత్రి రయిలుబండిలో గాలివల్లను, నా ఆరోగ్యము కొంతవరకు చెడినది. త్వరలోనే ఆరోగ్యమును బడయుదునని నే నాశించుచున్నాను. ప్రతిదినము మీరు తోటలోనికి వెళ్లి వ్యవహారములు శాంతముగ నడుచునట్లు చూచుచుండవలయును. కుందూరి వెంకటరత్నముగారిని కూడ అప్పుడప్పుడు తోటలోనికి వెళ్లుచుండవలయునని కోరవలెను. ......అన్నివిధముల మీరు నాకు చేయుచున్న సాయమునకు దగినరీతిని నేను వందనము లర్పింపలేకున్నాను. .........

మీ సుహృదుడు,
కం. వీరేశలింగము



"అలాగే నిలిపింది ఉతకటం"

# సు వ ర్ణ

'జ్యోత్స్న'

"ఇయం గేహే లక్ష్మీరియమమృతవర్తిర్నయనయోః,
...................."

అలాగే నిలిపింది వుతకటం.

విశాలమైన కళ్లను మరింత గొప్పవి చేసుకొని వింటూన్నది సువర్ణ. ప్రశాంతప్రకృతి. కుత్సితులయిన వదినెమరదండ్రు, వెక్కరించు తోడిచెలియలు, భయంకరుడైన భర్త, తృణీకరించు మరది గానరారు. చిన్ననాటి నేస్తకాడు, ప్రియజనకుని ప్రియశిష్యుడు, మరి పెంపు సోదరుని ముఖ్యమిత్రము అయిన పురుషోత్తముని గంభీరకంఠము! పాడుతుండేది తన కత్యంత ప్రీతికరమైన శ్లోకం—ప్రేమనిలయుడైన భర్త ప్రేయసిని కొనియాడడం! నిజమా? అల్లాను జరుగునా, పతులు పత్నుల నంతగా ప్రేమిస్తారా? కథలోనిమాట లని సొద్దెపడేది వేల............

బావిగట్టున వచ్చి నిలిచాడు శాస్త్రి. క్రింద మోహనమూర్తివలె నిలుచున్న సువర్ణనుచూచి నివ్వెరపడాడు. సాంధ్యకృత్యములు దీర్చుకొనివచ్చినవాడు—పైరుపంటల పచ్చదనానికి, పిల్లతెమ్మెర్ల చల్లదనానికి హాయి ననుభవిస్తూ అనాలోచితంగానే రాగంలో పడ్డాడు. ప్రేమామృతాన్ని వర్షించేభవభూతికవిశ్లోకాలు ఒకటికిరువాయి నొకటిగా పాడుకుంటూ తన్మయుడైయుండిన సమయంలో ఆశ్లోకాన వర్ణించిన సాధ్వీమణివలె తలవనితలపుగా సువర్ణ నక్కడ చూచింది... ఎల్లాగో అయింది శాస్త్రికి. గడిబిడి నడచుకొన్నాడు.

"ఏమమ్మా బావికి ఒంటరిగావచ్చావే, మీ రంగినైనా తోడుకు తీసుకొరాకూడదా? అబ్బో! ఎన్ని గుడ్డలు—ఒక్కర్తవే వుతుకుతున్నావే!"

హఠాత్తుగా శాస్త్రిని చూడడం, వెనువెంటనే అతని ఆత్మాదరపూరితవాక్యాలు వినడం—సువర్ణకు చెప్పరాని వుద్వేగాన్ని పుట్టించేయి. ఆమె కెరుకలేకనే కన్నీరు మున్నీరుగా కారుతోంది. కన్నీ రతని కవుపడనియ్యరాదని మరింత వంగింది చీరగుంజడానికి. అతని పలుకులు అందరూ ఆడేటివేయైనా ఆ సమయాన ఆమెకవి వెలలేనివిగా తోచేయి. తన తమ్ముడు తప్ప తుదకు తలిదండ్రులుకూడా ఇంత అనురాగ పూర్వకంగా పలుకరింపరు. వారికి గుండె ఏదీ! వ్రాలుగోడ. ఆదరించి అనుతాపంచూపితే యేమనర్థం కలుగుతుందో! ఈ అత్తింటికాపురం నావల్లకాదని వెన్నంటుతుందేమో! అబ్బో అపనింద! ...........
..................మౌనం ... సువర్ణ తుద కందుకున్నది మాట - భయసంభ్రమానందాల్తో వణుకుతోంది కంఠం "అన్నా, ఆడజన్మామెత్తి పనిపాట్లకు జంకితే

ఎట్లు......పోనిత్తురుగాని, వూరినుండివచ్చారా? బావ వచ్చాడటనే? లలిత క్షేమమా? నన్నునుకుంటుందా! సుఖజీవులు మరచిపోతారు మాలాంటివారిని. ...... మావుపేంద్రం శెలవుల్లో రాలేదే- చూచారా అతన్ని?" దైన్యవాక్యాలు. కలతపడింది పురుషోత్తం చిత్తము. అంగవస్త్రంతో ముఖం తుడుచుకొంటూ అట్లేయోచిస్తున్నాడు. ఆమెప్రశ్నల కుత్తర మిచ్చుటకూ్కడా మరచాడు. సువర్ణను జడిపించిం దతనిమౌనం. భీతకురంగి మల్లె చూచింది తలయెత్తి. ఇరువురిచూపులూ కలిశాయి ..................

"ఏమిటీ! చింతిస్తున్నారేం? అందరూ బాగున్నారుకదా?" ఆమెకుబదు లుత్తరమివ్వక ఆలోచనాయుత్తమైన తనబుద్ధిని నిందించుకున్నాడు శాస్త్రి.

"ఆఁ- అందరూ బాగున్నారమ్మ. ఉపేంద్రం రావాల్సనుకున్నా డీలోపుగానే. కాని శెలవులు దొరకలేదట. వేసవి శెలవుల్లో తప్పక వస్తాడు. ఇంగ్లీషు చదువులు సులభాలు కావు. అవి చదివేవారికి వలసినంత స్వాతంత్ర్య లుండవు."

అందరిక్షేమవార్తలూ తెలిసింది సువర్ణ కెంతో వుల్లాసమైంది. పురుషోత్తంతో మాట్లాడుతూ, ఆట్లాడుతున్న కాలంవలెనే తోచింది మనస్సుకు. అట్టే గుడ్డ లుతుకుతూనే బెదరులేని మధురస్వనంతో "పురుషోత్తం, అయిన ఇంగ్లీషు చదువు లంతకష్టమా చదవడం?" అనింది.

"అన్నిచదువులూ కష్టమేగాని నేర్చేరీతిలో వ్యత్యాసముంది. మన చదువులైతే ఒకటితరువాయినొకటి నేర్చుకొందుము. ఆంగ్లవిద్య అట్లుగాక, ఏడుయెనిమిదిశాస్త్రాలొకేసారిచదువాలి —ఒక్కొక్కటీ కలాతోకా తెలియనివిగా నుంటుంది.అదోవిధమైన కష్టం."

"నీ వెందుకు చదివావుకా వన్నయ్యా ఈ ఇంగ్లీషుచదువు? మీరిరువురూ చిన్నతనంలో నాన్నవద్ద చదువుతూన్నదినాలెట్లుండె! అట్లే, ఇప్పటికీ ఉపేంద్రుపహాధ్యాయిగానే వుండియుంటే బాగుండె... ఉపేంద్ర మెప్పుడనుకునేవాడు."

ఆ ముగ్ధవాక్యాల కలరిపోయాడు పురుషోత్తం. ప్రియభాషిణి ... ఎదుటివారి కావంతేని నొప్పించని మాటలు.........

"చదివుంటే బాగుండేది. చదువలేదు"......

"ఆ పద్యం మరల చెప్పలేవా అన్నయ్యా? నాకా ఐదారు శ్లోకాలూ ఎంతోయిష్టం వినడానికి. నాన్న ఉపేంద్రుకు చెప్పిస్తున్నప్పుడు కోటికొస్తుండేది వినివినీ."

శాస్త్రి చెప్పాడా నాలుగైదున్నూ ఎంతో రమ్యంగా. వింటూపరవశఅయింది సువర్ణ

* * *

"సువర్ణా, నీవూ నాన్నగారివద్ద ఈ గ్రంథములన్నీ చదవడం నేర్చియుండిన యెంతబాగుండేది! ఉత్తరరామచరిత్రవంటి రసవన్నాటకా లెన్నియున్నవనుకొన్నావు సంస్కృతంలో! ఒకొ్కక్కటి చదివినా తన్మయంగా నుంటుంది..............ఏమి, గంప ఎత్తనా? ఒకతే ఎత్తుకొంటున్నావే, భారముకాదూ!" మెట్లుదిగి లోనికివచ్చేడు పురుషోత్తముశాస్త్రి —"అక్కర్లేదు. వద్దు అన్నయ్యా వద్దు. నే నెత్తుకుంటాను. నీ వేమీపట్టవలసింది లే దన్నయ్యా. రోజూ ఎత్తుకోలేదా ఒక్కర్తెనే..." ఎంతవారించినా ఆగాడుకాడు పురుషోత్తం. గంపను తానూ పట్టుకొని సువర్ణనెత్తిన బెట్టాడు. అదెవరు తొంగిచూచింది పైనుండి! సువర్ణ వదినెమరదలు సావిత్రి...

* * *

"దాన్నొకర్తెనే బావి కెందుకంపారే? సావిత్రిని వెంట పంపకపోయినారా?"

"దానికక్కరదా ఆ అక్కరగుండాలె, ప్రాయమాడుది ఒంటరిగాపోరాదని. పిలవరాదేం ఎవర్నయినా, ఇంతమందున్నామే గుండ్రాళ్లలా? గర్వం పొంగిపోతుంటే! ఇంతకు వేల్పులవారింటి పిల్లగాదా దాని కేంభయం, కత్తులకవచంతోనే అవతరించింది — మహా పతివ్రత, మావలెనా, మానమర్యాదలు లేనివారం."

"ఎందు కిన్ని మాటలు? మాటకు పదిమాట్లాడడం ఒక గొప్పపని, పాడుగోల. పోనీ పంపెవర్నయినా మొదులు."

"అవునవును. ముసలిముప్పులో కట్టుకున్నావు వయ్యారిని. ఏంచేస్తుంది? ఏలావుందనైనా విచారించు కోవు. మా మాటలు నీ కింతవిసుగు. సావిత్రిని పంపాను లే. నీకన్నా నా కెక్కువగా వున్నదన్నయ్యా కుటుంబ మర్యాద కాపాడుకోవాల్నని. ఇంతకు నీభార్య కేమి తక్కువలే - శాస్త్రులవారింటివారందరికీ - ముఖ్యంగా చిన్నశాస్త్రికి దానిమీద చాలాదయ. ఎప్పుడూ తోడు నీడగా వుంటాడు"

నరసయ్య కోపానలంతో ఉడికిపొయ్యాడు అసలే వృద్ధభర్త కనుమాన మెక్కువ. అందులో కారణమూ దొరికితే చెప్పడమేం? నాగమ్మ నరసయ్య పెద్ద చెల్లె. విస్తర్లు కుట్టుతున్నది. తాను రగిలించిన నిప్పు చక్కగానే అంటుకుంటోన్నదన్న సంతోషం పైకి కసబడనీకుండటానికి ముఖం ముడుచుకొని మరీ జాగ్రతగా కుట్టుకున్నది విస్తరి. కదురులో జంధ్యాలు తొలుస్తున్నాడు నరసయ్య. చెల్లిమాటలకు మనసు విసిగిందేమో, గూట్లోకి పారవేశాడుకదురు. అంతలోవచ్చింది సావిత్రి, నరసయ్య కడగొట్టుచెల్లి, వితంతు. "అదేది?" ఏకగ్రీవంగా అడిగారిద్దరునూ. "వస్తూంది వెనుకాల. చిన్నశాస్త్రి వెంబడేవున్నాడు."

"..............ఏమీ? ఏమిటీ?........."

సావిత్రి వేచియుండినదినం వచ్చింది. కోరినకోర్కె నెరవేరింది. లోనిసంతోషాన్ని అణచుకొంటూ "వస్తున్న దన్నయ్యా! పురుషోత్తమశాస్త్రి న్నాడంటినే వెనుకాలే"

"నీవెందుకు పొయ్యావుగావే దానివెంబడీ?"

"నన్నది పిలిచిందీ తోడుకురమ్మని? ముసలివాడవు, దానిసంగతి నీకేంతెలుసు మద్యాహ్నమే వెళ్లింది బావికి ఒకతేను. నే నందే కూర్చున్నా పిలుస్తుందేమోనని-ఎందుకు పిలుస్తుందీ......సంధ్యకావచ్చె రాలేదు. పోయి చూచిరమ్మంది అక్క. పోయి చూచేసరికి... ఇంకేముంది శాస్త్రిలో సరసాలాడుతుండె. ఆతగాడే గంపకూడా ఎత్తి నెత్తిమీ దుంచాడు. అట్టివారంతా తోడుండ - నేనేమి లెక్క నీసహధర్మిణికి!"

తల గిఱ్ఱున తిరిగింది నరసయ్యకు.

"ఏమేమీ శాస్త్రి బావివద్దకు వచ్చాడా?"

సావిత్రి మూతి మూరెడుచేసి "ఊఁ. మరేమి, నన్ను నిందిస్తుంది సువర్ణవదినె. పరాయిమగవాళ్లతో మాటాడుతానని తప్పులు పట్టుతుంది. తాచెడ్డచేష్టకు మందేలేదు."

"విన్నావా అన్నోయి సంగతులెల్లా వుందో! ఇప్పుడైనాచెప్పు బుద్ధి."

అంతలో వచ్చింది సువర్ణ బెదరినలేడిపిల్లలాగు. నెత్తిన మోయలేనంతమోత. చూపులన్నీ కేంద్రీకరించాయి ఆమెపైన వివిధాలగా......

"అల్లా దింపుకుంటారు వదినా గంపను......" అరకాలిమంట నెత్తికెక్కింది నాగమ్మకు. "మధ్యాహ్నమీవినయ మెక్కడపోయిందో పతివ్రతాశిరోమణికి! శాస్త్రినే పిలుచుకొని రాకపోయేవా గంపదించుకోను. అంతకన్న పని యేమతనికి."

చిమ్మచీకట్లు క్రమ్మించి సువర్ణకు - వొళ్లు వణకిపోయింది. అబ్బ, కథ ఎంత కొచ్చింది!! నిష్కల్మష విషయమున ఎంత దుష్టకల్పన, ఏం భయానకమైన కథకట్టారరక్షణంలో! బాబోయి, ఆవృద్ధు డేమట్లురుముతున్నాడు! సావిత్రేమిట్లు ముసిముసినవ్వులు నవ్వుతున్నది! ఈ వదినెగారిమాట లేమి! మాటలాయివి! నిశితబాణాలపోట్లుగావా! ఆతోడిపడుచేమి అంతనిశ్చింతగా ఇల్లంతా తానేయై పారాడుతున్నది! ఏమి, ఏమి, ఎవరిపైన వీరికంతా యింత కోపం - చక్రగాలిలో దూసిపోయే చివురాకు కంటే చులగ్గా వడవడవడకుతూ, నెత్తిమీదిబరువు నేల దింపింది. నిలుచోలేకపోయింది. అట్లే గోడ నానుకుంది సువర్ణ..............................

"ఏమిటే, ఆ శాస్త్రితో నీకేంపనే? వాణ్ణెందుకు తీసుకొపోయ్యావే నూతికి? గొప్పవారింటి పిల్లవు గుణం గానుంటావని మాటాడించక మర్యాదచేస్తుంటే—ఇదా నీనడత! ఛా, ఛా."

సువర్ణకు చెప్పరాని దుఃఖం, కోపం పొంగుకొచ్చింది. "నానడతలో ఏం కొదువైనది? అనడానికే ముంది అపరాధం? నేనేమి, శాస్త్రిని తోడ్కొని పోవడమేమి! ఏంమాటలివి! సంధ్యవార్చను వచ్చాడట. ఇంతకు అత నెంతటియోగ్యుడు! మీ రిల్లాంటిమాటలంటుంటే నేపడ........." వెక్కి వెక్కి ఏడుస్తోంది. అనుకున్నంతమాట అడకముందే దుఃఖం కట్టతెంపుకొనొచ్చింది.

"ఈకల్లబొల్లి చేష్టలకే నాకొ్కంది. మాటకు మునుపే ఏడుపు. భద్రం. బావికి ఇకముందు ఒంటరిగా పోబోయ్యేవు. ఆడది దారితప్పితే వంశాల క ప్రతిష్ఠ - మహాఅప్రతిష్ఠ" అరచాడు ముసలాయన.

"మరిమరి అల్లా అనకండి. ఇందులోదాపెతప్పడమేమి." అంతలో అడ్డొచ్చింది సావిత్రి. "అదేం వదినా, పరాయి మగవాడు, అతగానిచేత గంప తలపైని కత్తించుకున్నావు? నేనందే కూర్చున్నానే రవిక కుట్టుకుంటూ. బావికి పోవునప్పుడు నన్ను రమ్మని పిలిచేంత తాళిమి లేకపోయిందే నీకు? చెప్పేనీతులకు మాత్రం అంతేలేదు." తనదుఃఖాల పంట నేడు ఫలితాని కొచ్చినట్లు తోచింది సువర్ణకు. తన దుర్విధికి దిఘాలుపడింది. "రోజూ నిరసించినా సరకుగొనక, తప్పక పిలుస్తుండిన సావిత్రిని నేడేల పిలువకపోతిని! ఆసమయాన ఎన్నడూరాని పురుషోత్తం నేడెందుకు రావాలి నూతికి? వచ్చినవా డల్లేపోక నిలచాడెందుకు? ఎంత వలదన్నా నాకేల సాయమొచ్చాడు? నే కోరానా...... ఆసమయానికే దుర్దేవత ప్రత్యక్షం కావాల్నా...అయ్యో విధీ! నోట మాటరాక డిల్లపడిపోయింది సువర్ణ. రగులుతున్న కోపం ధగధగమన్నది నరసయ్యకు. లేచి పండ్లుకొరుకుతూ మూలనున్న చేతికట్టె పుచ్చుకొన్నాడు. దబదబా వేశాడు దెబ్బలు సుందర సుకుమార శరీరముమీద. అనటివలె వ్రాలింది నేలను సువర్ణ......

"ఇయం గేహే లక్ష్మి......అయ్యో—నొప్పి. వో, ఇదేమిజీవితము. కాస్తేని ప్రయోజనంకాన. మెప్పించలేను లోకాన్ని. అయ్యో లోకమంటున్నానేమి? మావదినెల్లో ఒకామెను మెప్పించగలనా? అబ్బా తల యెంతగా నొస్తున్నదోయి భగవంత! ఇంతకంటే పరాభవమా! దుడ్డుకట్టతో పశువును మల్లె బాదడమా, నిలాపనిందలా! ఈపాడుబ్రతు కెందుకో! మొండికత్తి బ్రతికి యేంసాధింపను! లోకమా లోకమ! నీకం త్లెంత గ్రుడ్డివి! సత్యమెరుగవే! నావదినెలు తమ ముక్కుకు తిన్నగా చూస్తున్నారు. ఏంలాభము సంపాదింపనో తములాంటి అబలపై, ఏసుఖమెరుగని నిర్భాగ్యవనితపై... అబ్బా ఏం నింద...ఎంతమాటలు...ఏం పశుత్వము... ఇక దుర్భరము—జీవితమే దుర్భరము—నాలాటికొరతలుండేవారికి తావులేదు భూమిమీద బాబూ...... ఉపేంద్రం ఇంక నిన్ను చూడను...? పురుషో...ఆ; ఇక నే నతనిపేరైన యెత్తుకోను. ఇదివరకు మాత్రమేమిచేశాను! చిన్ననాటి నేస్తకాడను మచ్చికతో చూచినప్పుడు అదీ అతనే పలుకరిస్తే మాటాడేదాన్ని. నామనస్సాక్షికి నేవిరోధి నెట్లయ్యేది! అదేమి, పురుషోత్తమాన్ని చూస్తే మనస్సుకు యెంతో సంతోష మౌతుండేది! నాన్నా! నాన్న చెప్పతుండిరే 'కాయేనవాచామనసా' కాయేన వాచా, నే నేపాపాలనూచేసియెరుగను... మనసా? అదియే నన్నూరక భయపెట్టుతుందే! అబ్బా-తలనొప్పి...సుంతేనిదయలేక మోదాడే భర్త...నా భర్త...పురుషోత్తం నీవెంత దయానిధివి. నీపై యున్న... అబ్బో నే నే మిట్లైపోతున్నా...భర్తవున్న మరోపురుషుని తలచుటా - పరమపాపము కాదా. కాయేన వాచా శుద్ధురాలను—మనసానూ శుద్ధురాలనే. నాతల్లితండ్రులు ఏమని నన్నీవృద్ధునికి కట్టబెట్టారు! ఏయాస త్రోశా రిక్కడికి! నా ఈశరీరమే తనిదట...అందుకే ...బాదాడు...అబ్బా యెంతటి స్వతంత్రం! నా మనస్సు? మనస్సతనిదికాదు—మనసుకద్దేది? నీతి ఒకటే దాన్నడ్డగించేది. నీతి......అందుకే నూయి...

...సావిత్రీ! ఎంతపనిచేసింది సావిత్రి! తెలివిమాలిన పిల్లా, నాలో దోసాలుకల్పించి నీదుర్న్యయాలను మరుగు చేస్తున్నావా! నిర్భాగ్యురాలా నిన్నని యేంప్రయో జనం......అయ్యో నేనేల నిన్ను తోడుకు పిలువక పోతినీ??......నాన్నా............ఉ షేం..."

పాయ్యాడు వాసుదేవయ్య భార్య పలుకులు విని. ఆమె పాతివ్రత్యానికి మురిసిపోయ్యాడు...

"ఏది, సుందరం......మంచిపిల్లవు. పోయిపనస పండు పట్టుకురా కోతాము. లోనలద్దుకోడానికి నిన్న కాచిన ఆవునెయ్యి తెస్తూ?"

ఒకటే జ్వరం. ఒళ్లు దగదగా కాగిపోతూన్నది సువర్ణకు. ధాన్యపుకొట్టులో తలుపుచాటున పడుకుంది చీరచెరగు పరచుకొని. పల వరింపులు.........కన్నీటి కాల్వలు......మధ్యమధ్యన యెదుటిగదిలోని సరసాలు వినపడుతోంది.

నిదితలుపు వేసున్నది. "పలకవేం, కోపమా నేను కొన్నాకాని? పండుగకు పట్టించుకోక కొనిపెడతా లే. ఏదీ, ఈలా చూడు. నవ్వు మరీ. అదుగో... అదుగో... అదు గో వచ్చింది నవ్వు."



ధాన్యపు కొట్టులో.........చెరగును పరచుకొని

"చాల్లేండి నేనేమిపసిపిల్లనా ఆలా ఆడించను?"

"పసిపిల్లలు లేరుగదా, నిన్నే ఆడించి ఆముద్దు తీర్చుకుందామని."

"ఎందుకీలా ఆడుతారో, నాకు సిగ్గువేస్తుంది. పోనిత్తురూ, నేపోవాలి."

"నే నల్లాపోనిచ్చేవాడను గాను సుమా. పోనిస్తే ఎందుపొయ్యేవో మీ అక్కలాగే కన్న వాళ్లతో సరసా లాడడానికి. అన్నయ్య కేం తెలియదు. ఆడుదాన్ని చేతిక్రింద నుంచుకోలేనివాడు. ఆమె పొయ్యిందే దోవైంది. సుందరం! నీవల్లాబయటగియట పోబొయ్యేవు సుమా, జాగ్రత్త."

"ఛీ, నన్నెందుకు దాంతో సరిపోలుస్తారుగాని. నాకేం గ్రహచారం కన్నవాళ్లతో సరసాలాడడానికి పోవాలని దేవుడిలా మీరుండగా? ఆడదానికి మొగుడే దైవం. ఇల్లే వైకుంఠం. బయటేం పనీ?" పొంగి

మగని ఆదరణకు మైమరచింది సుందరం. త్రిలో కాలొకటైనా తనతోసమానం కాదనుకొంది. అట్లే కులికిపోతూ వాలునడకతో పోయింది ధాన్యపుకొట్టు లోనికి — పనసపండు తేను. అందు సువర్ణ పడుకుంది. పోయిన ఇక విచారించాలె. దాన్నేమి విచారించడం. సావిత్రిని పంపితెప్పింతామని దొడ్లోకిపోయింది. అదేమి దానిమ్మచెట్టు చాటున...... ఎవరో గుసగుసలు! అట్లే తలుపుచాటు చేరింది సుందరం విందామని. ఒకస్త్రీ, ఒక పురుషుడు. మరేమున్నది! స్త్రీ సావిత్రి. పురుషుడు ఆవూరివైద్యుడు వెంకటప్ప.

"ఏమింతి అపరూపమయ్యావు?"

"ఏంచేయను అక్కగార్లిరువురూ వచ్చియున్నారా. మా పెద్దవదినె నీకే తెలుసును — నాపై ఒకకన్నామెకు."

"సరిసరి. ఆమెకేం భయపడడం? ముసలయ్య పెళ్లాం. నీకన్నా కడయని యెంచు. కానీగానీ శెలవుకు

లేదు. ఏంచేయను. ఈ మధ్యా వెనక్కు తీసుకున్నావు ధర్మంచెయ్యిని."

"నావద్దవుంటేగా నీకివ్వడం. వున్న ఆకాస్త పూసాబొట్టు యెటోపోయిందని వదినమీదా, వారిమీదా వీరిమీదా బెట్టి నీకేయిచ్చానే. మరేంలేదు నావద్ద."

"ఏమో చూడు, నీసుట్టు నాచేతనుంది. పాపం యేమో తెలియుందని పూరుకున్నా. యెన్నిమార్లు మందులు చేశిచ్చేనో! నీఃదంతా మరచేపోయింది. లేకున్న నిన్నీపాటికి కులభ్రష్టను చేసియుండరూ. ఇవన్నీ రూనోన్న చూడు. నీ మానం మర్యాదలు నాచేతిలోనివి."

సావిత్రిస్థితి వర్ణనాతీతం! వీఃతో విరోధమాడితే నలువురిలో మానంతీయడం వేరేచెప్ప నక్కరలేదు. ఏమైనాకానిమ్మన్న పెద్దన్నదే భయం. తెలిసిన రేపే మడి యిప్పిస్తాడు. ఇంతకువచ్చిందానికేం భయపడడమంటే, ఈ మెత్తని బారెడు వెంట్రుకల... నిర్మూలించుకోవాల్నే...!"అట్టేఃన్నిటిని జారనియ్యక "ఏంచెయ్యమన్నావు అయితే?" అన్నది. కోరనవ్వునవ్వాడు వెంకటప్ప. "మరేమంటాను, ఖర్చుకేమన్నా తెమ్మన్నాను." సావిత్రి అటుఇటు చూచి, వడిలోనుండి ఏదో తీసిచ్చింది వైద్యునికి. నవ్వుతూ బుగ్గనులిమి వెళ్లిపోయ్యేడు. సావిత్రి దొడ్లోకెళ్లింది.

సుందరం నిర్వెరపోయింది. అమ్మో ఏంసంగతి? ఇంట్లోఅందరన్నివిధాలగా వున్నారే! అదేంచెప్మా సావిత్రి వానికిచ్చింది వడిలోనుండి!

లోనుండి "సుందరం, సుందరం, ఏంవెళ్లేపొయ్యావన్నట్లే—"

"వస్తున్నా."

*   *   *   *   *

రాత్రి యెనిమిదిగంటల సమయం. నాగమ్మ కూతురిది నాగరము పోయింది ఒకటేగోల యింట్లో. వెదకి వేసారిపోయింది. సొమ్ము దొరకలేదు. కోపావేగాన నోటికివచ్చినంతా మాట. "ఎట్టిపనులైనా చేసుకోనీ నాకేం. నాబిడ్డసొమ్మే దొంగిలించాల్నా, దీనిల్లు గుల్లకాను. దొంగిలించకపోతే ఎట్లూ-వి.........ను సంతోషపెట్టడం?"

మరదీ చెల్లీ చేసినమర్యాదలూ, ఇప్పటివదినెగారి దీవనలు, సాయంత్రం భర్తగారిచ్చిన బహుమతులు...

......కత్తితో మోదిన గాయాల్లో నెత్తురుకారుతోన్నది. హృదయంలో పోట్లు పొడుస్తున్నవి. వాతపై కోత – నొప్పిమీదనొప్పి.

*   *   *   *   *

మసక వెలుతురు. నరసయ్య ప్రాతఃకృత్యాలకని పాపయ్యబావికి వచ్చాడు. ఎప్పటివలె గోస్తుతిగాని, గజేంద్రమోక్షంగాని చెప్పతుండలేదు. ముందు నాటి అనాహుతం...అనుకోని కుందుతున్నాడేమో. పడుచుపెళ్లాంపోకడలు తన కనుమానదాయకాలు, తన నడవడు లామె కనిష్టం. చూచి వెక్కిరించను లోకమొకటి ఇంతకన్నా చింత లేమికావాలె "ఉస్సు, రామచంద్ర." మెల్లిగా దిగుతున్నాడు మెట్లు. ఏమిటదీ! బావిలో నల్లవస్తువేదో తేల్తున్నది.........పాములూ గీబలూ మాట్లాడకూడదే ఈ బావిలో! అదిగో చట్రాతిపై నేదో మెరుస్తున్నది తెల్లగా! సమీపానికెళ్లాడు. వెండివడ్డాణం! సువర్ణది.........



ఏమిటదీ! భావిలో తేల్తున్నది.........



పల్లెటూరి కోనేరు

(త్రివర్ణ చిత్రమునుండి)

—చామకూర.







# విక్టోరియాకాలపు

దీనిని నానుకి యనుచు, జనవాద మనుడు-నాగరకతలేని, ఆధునికభావముల కలవాటుపడని వారిని 'విక్టోరియాకాలపుమనుష్యు' లని చులకనచేసి మాటలాడుట నేటికాలమున పరిపాటి యయినది. మనుష్యులకే కాదు వస్తువులకును, గుణములకు కూడ నీ 'విక్టోరియాకాలపు' విశేషణమును తగిలించి తగవుమాలినతనమును వ్యక్తీకరించుట సంప్రదాయ మయిపోయినది. బల్లలు మొదలగు సామగ్రికీ విశేషణమును జతకూర్చుట వానిని వికారవస్తువులక్రింద జమకట్టుట; స్త్రీల కన్వయించుట వారి కమాయికత నంటగట్టుట; కళకు జోడించుట మోటుదనమును దెలుపుట; దుస్తులకు తోడుచేయుట వానికి నాణ్యములేమిని నిరూపించుట; నడతకు సంబంధపరచుట బిడియమును వ్యక్తీకరించుట; నీతికి జతచేయుట దానికి కఠోరతను, శృంఖలాబద్ధతను, వంచకతను ఆపాదించుట.

ఈ ఆధునికాపాదనలు కొంతవరకు నిజము; కొంతవరకు కేవలకల్పితములు. విక్టోరియాపరిపాలన చాలఏండ్లు సాగినది. ఆకాలములో ఎన్నెన్నోమార్పులు సంభవించియుండనోపును. ఒక దశకమునం దుండునది మరియొకదశకమునం దుండుట అసంభవము. విక్టోరియారాణి ఆరుదశకములకుపైగా రాజ్యమేలినది.

ఆకాలములో రోజుకురోజుకు ఇంగ్లండు మారిపోవుచుండెను. జార్జి నాటికి లండను పరిసరక్షేత్రములన్నియు నెత్తురియిటుకల యిండ్లుగా మారిపోయెను. ఉత్తర, మధ్యదేశములు పచ్చగా నుండినవి బూడిదరంగునకును, ఆపిదప నల్లరంగునకును పరిణామము చెందినవి. పరిశ్రమాగారములందలి ధూమసంతతికిది ప్రతిఫలము. కాపురములు చేయుయిండ్లు, ఇండ్లయందలి సామగ్రియునునిరా

---

రాల్ఫ డి. బ్లూమెన్ఫీల్డు
సర్ జాన్ మార్టిన్ హార్వే
ఆల్బర్ట్, బెయిలీ

# ఇంగ్లండుదేశము



సంబరములయి యుండినవి ఆడంబరములతో ప్రబలి పోయినవి.

విక్టోరియా కాలములో స్త్రీలవేషములు పది పండ్రెండు రకములైనను మారియుండును. చేతుల జాకెట్లు చేతులు పోగొట్టుకొనెను. మడిమ లంటుచుండిన పావడలు మోకాళ్లదాక ప్రాకిపోయెను. నిండుగుండీల కంచుకములు V మెడ కంచుకములకు మార్గమునొసంగెను. ఈరీతిగ మరెన్నియో మార్పులు!



ఇటువంటి పరిణామదశలో నుండిన విక్టోరియా కాలమును మనబాల్యమునే సరిగా గుర్తెరుగలేని మనము ఏమని నిరూపించుకొనగలము? విశ్రాంతి, భద్రము, ఉన్నతి, ఆత్మగౌరవము, ఉత్తమనీతులు, మేలుపద్ధతులును గలదనియా? తాము నమ్మిన విషయములను గ్రహించి, వానికై పోరాడుటకు జంకని పురుషసింహుల యుగమనియా? శాంతి విశ్రాంతులను, సాంసారిక జీవనమును మనసార ప్రేమించి, అర్థముచేసికొనిన శకమనియా? వీరులు, సాహసికులు, ధీరులును పెల్లుబికిపోయిన విక్రమ యుగమనియా?—లేక, వంచనలు, కపటతంత్రములు గలిగి, దయాదాక్షిణ్యములు లేక బీదలకు కష్టపరంపరలను, ధనవంతులకు భోగసంపదను సమకూర్చిన శకమనియా? సహజదాంపత్యసుఖ మెరుగక యువకులు క్రుంగిపోయిన కాలమనియా? జీవితమంతయు మానసికములైన వేదనలతోనిండి అంధకారమయమైన దశయనియా? ఏది నిజము-తేజోదశయా, అంధకార దశయా? ఆ కాలమునందుండియుండిన మన మదృష్టవంతుల మయియుందుమా, లేక ఇప్పుడే మనము బాగుగ నున్నామా? ఏమి నిర్ణయించుటకును సాధ్యముగాదు. ఈ కాలముగాదు, ఆ కాలముగాదు, ఏ కాలముగాదు



బిండర్ బ్లడ్

జార్జి బెర్నార్డుషా

వెస్టా టిల్లి

అన్నిట చీకటివెలుగులు కలిసియేయుండును; ఉన్నతి-అవనతులు జతగానే యుండును; సంకోచవికాసములు కూడియే యుండును. అది కాలధర్మము!

ఆ కాలమువారింకను కొందరు నేడు జీవించియున్నారు. కడచిన శతాబ్దపు ౪, ౫ దశకముల సంగతులుకూడ వారివలన మనము తెలిసికొనవచ్చును. మరి కొన్నిరోజులలో వారుకూడ మనకు స్మృతిపథమునందు మాత్రమే మిగిలియుందురు. మన కొడుకులు పెరిగి పెద్దవారయినప్పుడు 'గ్లాడ్‌స్టనునెరుగుదువా?-స్ఫటికప్రాసాదము జ్ఞాపకమున్నదా?' అను ప్రశ్నలువేయుచో 'ఎరుగుదును-జ్ఞాపకమున్నది' యని జవాబుచెప్పువారే లభ్యముకారు. మన యదృష్టము! ఆకాలపు సంగతులు తెలిసికొనుటకు వీరయినను మనకు మిగిలియున్నారు. ఆకాలపు బాగోగులను ఈ కాలపు బాగోగులతో పరిశీలించి తెలుపుటకు వీరేతగినవారు. అప్పటి వివిధ పరిణామములను మనము గ్రహింపవలసియున్నది గావున వివిధకక్ష్యలవారి యభిప్రాయములను గమనింపవలెను. వారెవరు? వారి యభిప్రాయము లేవి?

లేడీ ట్రీ



పురోహితుడు: ఆల్బర్ట్ బెయిలీ

"మా కాలములో మేము సురక్షితముగానున్నామను నిశ్చితజ్ఞానమును కలిగియుంటిమి. అది మీకు లేదు. అంతనిశ్చితముగ నుండుట మంచిదనముగాని అదియే మా జీవితములకు సౌఖ్యమును ప్రసాదించినది. సహేతుకమై సక్రమమైన పద్ధతులలో మేము పెరిగితిమి. ఉద్యోగమును నిర్ణయించుకొని పాటుపడి పనిచేయుటయేమాకు కర్తవ్యముగా నుండెనుగాని జయమనుసరించి మాకు ఆలోచనయే యుండలేదు. జయము నిశ్చయమనియే మా విశ్వాసము. 'ఏదియు నిశ్చయముకా'దనియు, 'ఏదియో యొక విఘ్నము వచ్చిపడుచుండు'ననియు మీకుగల భావము మా కేనాడును ఉండలేదు. భవిష్యత్తులోనేమి జరుగనున్నదో మాకు తెలుసునని మేము నమ్మచుంటిమి. ఆ ప్రకారమే మెలగుచుంటిమి.

"మతమువిషయములో మాత్రము మీ కున్నంత జిజ్ఞాస, మీ కున్నంత పరిజ్ఞానము మాకు లేదాయెను. మా తల్లితండ్రులు, మా తాతముత్తాతలును పరిస్ఫుటము, నిశ్చలము, శిక్షితము నగు విశ్వాసమును గలిగియుండిరి. మా కాలమునకు వచ్చునప్పటి కది సంప్రదాయసిద్ధముగ నంగీకరింపవలసిన దయినది. అది యెందు కని ప్రశ్నించు సాహసమునకుగాని, అది మాకు కల్లకానిపని యని తప్పించుకొనుటకుగాని మేము పూనుకొనలేకపోయితిమి. మాలో చాలమందిమి మతమునెడల సౌముఖ్యమును సంపాదించితిమి కాని ఆకాలమున మతావేశము రవంత స్తంభితమయియే యుండెను. ప్రస్తుతము చక్రము తిరిగి పోయినది. నూతనయుగమే ప్రారంభమయినది.

"విక్టోరియాశక మంతరించినపిమ్మట మీరు సంపాదించినదానికంటె మేము కోల్పోయిన దెక్కువ. వ్యక్తిగతమైన జీవనము ఆనందమయముగ నుండెను. స్నేహితులతో కలసిమెలసి వినోదముగ కాలక్షేపము చేయుటకు మాకోపినంత విరామముండెను. తరచు మిత్రుల రాకపోకలచేతను, కూడిమెలగి దినములకు దినములు గడపుటచేతను మాలో మాకు ప్రేమానుబంధములు పబలిపోయి చిరప్రతిష్ఠ గాంచుటకువీలయ్యెను. మోటార

౬

లోను, విమానములలోను గడియారమును చూచుకొనుచు చుట్టిగచ్చు మీ కీ యవకాశమెక్కడిది? దూరప్రయాణ మానందలి యందమును మీరు చవిమాడలేకపోవుచున్నారు. అట్టి ప్రయాణములు చేయవలసివచ్చినప్పుడు మేము గుఱ్ఱపుబండ్లలో చుట్టుప్రక్కల ప్రకృతిసౌభాగ్యము తిలకించి యానందించుచు నెమ్మదిగా వెళ్లుచుంటిమి.

"మాకు తరగతివిభేదములు లేవు. హెచ్చుతగ్గులంతకంటెను లేవు. దీని ఫలితముగ జనములో సామరస్యమును, ఐకమత్యమును పాదుకొనిపోయినవి.

"ఆనాటి స్త్రీలుకూడ మహోన్నతదశలోనుండిరి. ఆదశ యిప్పటివారికి లేనేలేదు. ఒక్కొక్క పరగణాపను అప్పుడొక నియంత్రి విధవయుండెను. భర్తనుండి సంక్రమించిన యాస్తితో నామె యొకరాణివలె తేజరిల్లుచుండెను. సాంఘికవిషయములందామెయే అధికారిణి. అవివాహితలైన యువతులానాడును నిశ్చేతనమయిన, సుఖవిహీనమయిన జీవితమును గడపుచుండిరికాని వివాహితలుమాత్రము సర్వాధికారములను గలిగియుండిరి.

"స్త్రీలకు వివాహమనునది అధికారమునకు రహదారిచీటివంటిది. దానినసేరు లుపయోగించుకొనిరి. వివాహితయయి, ప్రతిష్ఠగలిగిన ప్రతిస్త్రీయు ప్రతివిషయమునందును- రాజకీయముగాను, సాంఘికముగాదు, సాంసారికముకాదు, అన్నిటియందును- పలుకుబడిని, అధికారమును గలిగియుండెను. ఇప్పుడున్నవా ఆ హక్కులు?

"అందులో ప్రథమగణ్యురాలు విశిష్టాధికారముతో సర్వమునుఏలుబడిచేయుచుండిన వ్యక్తివిక్టోరియా. అద్భుతమైన వ్యక్తి! రాచరిక మామెలో పొంగి పొరలుచుండెను. అంతటివ్యక్తి అదివరకు లేదు; ఆపిదపను లేదు."

## సుందరీమణి: వయులెట్

ఏబదియైదేండ్లనాటిమాట. అప్పటికి వయులెట్ లిండ్సేకు - రట్లాండ్‌ప్రభువు పత్ని- పదునేడేండ్లు. గారాబముగా పెరిగిన పిల్లకాబట్టి ఈమె ఇతరులతో మాటలాడుటకుగూడ బిడియపడెడిది. ఈవిడను విక్టోరియా ఒకసారి తనయింటికి రెండువారములపాటు రప్పించుకొనెను. ఈపిల్ల సౌందర్యమునకా స్వల్పకాలముననే విక్టోరియా ముగ్ధయైపోయెను. ఆ నిర్మాణము, ఆ అంగప్రత్యంగ రామణీయకత విక్టోరియాను చకితనుచేసినవి. ఈ రూపసంపదయే ఆనాటి విఖ్యాతచిత్రకారులను ఈమెచిత్రమును గీయుటకై తారట్లాడించినది.

ఒకవైపు ప్రభుత్వము; ఇంకొకవైపు వైధవ్యము. ఈసందులో ప్రతి ఆదివారమును ఉదయము రెండుగంటలసేపు తనయిష్టమువచ్చినట్లు గడపుటకు విక్టోరియా నిర్ణయించుకొన్నది. కాన ఆ రెండు ఆదివారములనురూపచిత్రము నొసగుటకై వయులెటును కూర్చుండగోరినది; నీటిరంగులతో నామెచిత్రము నా రెండువాళ్లలోను

55 ఏండ్లకు పూర్వము విక్టోరియా
రాణి చిత్రించిన వయులెటు రూపచిత్రము



ముగించినది. ఈ సంభవమే తరువాత వయసేటులకు చిత్రకళావ్యామోహమును గలిగించుటకు కారణమైనది. తుదకు ఒకప్పుడు విక్టోరియారాణిచిత్రము ఈమెచేతులలో తయారైనది.

తన సౌందర్యము నీమె యెరుగనేయెరుగదు చెలిమికాండ్రతో చెలిమి వ్యర్థకాలయాపన యని యీమెకలంపు. ఈమె కాలక్షేపమంతయు-పియానో మీద పాడుకొనుట; క్రొత్తపుస్తకములను తీసికొని బిగ్గరగ చదువుట; చక్కని వ్రాత కుదురుటకు ఇటలీ లిపిని పలుమరు వ్రాయుచుండుట; బిగ్గరగ చదువుకొనునప్పుడు యోచనలకును, భావనలకును అనుకూలముగ నుండగలందులకై నేలమీద వెల్లకిల పరుండుట మొదలుగా.

"నా కీకాలపు బాలికలను జూచినప్పుడు జాలి వేయును. ఆ అంతుపంతులేని స్నేహితులేమి? ఆవ్యర్థ ప్రసంగములేమి? పల్లమాలిన ఆచదువులేమి? ఎందుకు వచ్చినట్లు? తమ తల్లులకు వారేవిధముగనైన తోడ్పడ గలుగుచున్నారా? తామెక్కడెక్కడ తిరిగివచ్చుచున్నారో తల్లిదండ్రులకు చెప్పుటలేదు; తమకార్యక్రమమేదో తెలుపుటలేదు ఈకాలపు తల్లులకు సౌఖ్యమనునదిలేదు. కూతుండ్ర కంటకంబెను లేదనియే చెప్పగలను. నేను పుట్టినది లగాయతు ఆమెచనిపోవుదాక మాతల్లిని నేను వీడియుండినదిలేదు. ఇంటిపనులు చక్కబెట్టుటకు ఆమె పనిపిలిచి కుదుర్చుకొనినదిలేదు. నన్ను బడికంపినదియులేదు. ఇంటియద్దనేయుండి నేనెన్నియో విషయములను నేర్చుకొంటిని.

"మే మనుభవించిన జీవితసౌఖ్య మీకాలపువారికి స్వప్నవృత్తాంతము వీరికి వినోదములులేవు; వేడుకలు లేవు. ఉన్నదంతయు స్నేహితులతో విచ్చలవిడి తిరుగుట, పాడునవలలను చదువుకొనుట. నాకు నేను పదునేడేండ్లు వచ్చువరకు రెండవబాలికను పరిచయము చేసుకొనలేదు.

"ఇక నీకాలపు చిత్రకళయా? వీనికి గీయుట యననేమో తెలియదు. వీరి చిత్రములు నాకు దుర్బోధములైన స్వప్నములు. ప్రదర్శనశాలలకు పోవుటకే నాకు మనసుపుట్టదు. వట్టి చిత్రకారులు, పిచ్చిచిత్రములు!"

**వైద్యుడు: జార్జ్ స్టర్ అబ్రహాం**

తొమ్మిదవ దశకపు తన వైద్యవిద్యార్థిదశను తలపోయుచు నితడిప్పుడే బాగున్నదనుచున్నాడు.

"ఏ వైద్యునినయినను తరచి, ఏకాంతముగ నడుగుడు. ఈ విద్య అప్పుడే బాగుండెనో, ఇప్పుడే బాగున్నదో! ఆనాటి స్థితిగతులకు కొంకుపడకమానడు. ప్రముఖములయిన చికిత్సలన్నియు ఇటీవలనే - నలువది యేండ్లకిటీవలనే- కనిపెట్టబడినవి. అప్పుడేముండినది?

"శస్త్రవైద్య మింకను బాల్యమునందే యుండెను. యెక్సురేచికిత్సలు పేరుకుగూడ లేవు. క్షయరోగము విజృంభించిపోవుచుండెనుగాని చికిత్సలు మాత్రము లేశమాత్రమును తెలియలేదు. ప్రతిబాలికయు దాదాపు రక్తక్షయముతోను, పాండరోగముతోను అవస్థపడుచుండెను. వ్యాయామము లేదు. అనువైన దుస్తులు వాడుకలో లేవు. ఉత్తమమైన ఇప్పటి యారోగ్యమప్పుడు లేనేలేదు. బిడ్డలనుగని ఎందరో తల్లులు మరణించుచుండిరి. ఆ సంఖ్యకును ఇప్పటిసంఖ్యకును హస్తిమశకాంతరము. మాతృమరణములు, శిశుమరణములును ఆనాడు లెక్కకు మీరియుండెను. ఆదశకములో సుఖరోగములు ప్రబలముగనుండెను. ఏదవదశకమున ఆస్పత్రులకు వచ్చుచుండిన రోగులలో నూటికి పదియైదుమంది కొరుకురోగముతో కృశించినవారే. ఆస్పత్రులకు రాక ఎంతమందియో రోగమును కప్పిపుచ్చుకొనుచుండిరి. ఆ దాపరికమే మన తండ్రితాతలయందలి అనారోగ్యమునకు మూలమయినది. సంధివాతము, వాతరక్తముగూడ నాకాలమున హెచ్చుగనే యుండెను. ఎనిమిది తొమ్మిదిమువ దశకములలో మాంసాహారులపరిమితముగనుండిరి. శాకాహారముకు తలచినవారలే అరుదు. ఇక త్రాగుడా? నలువదియేబది యేండ్లకు ముందున్న త్రాగుడు దృష్టితో చూచినచో ఇది త్రాగుడే యనిపించదు.

"ఆ కాలమునందలి విశ్రాంతి విరామములు స్థితిపరులకు స్పృహణీయములుగా నుండినమాట వాస్తవమే. కాని నడితరగతివారి కవి యేమిస్పృహణీయము లగును? కర్మాగారములయందును, విక్రయశాలలందును పనికి కుదురుకొన్నవారు గంటలతరబడి సంకట పరిస్థితులతో పనిచేయవలసి యుండెను. తిన తిండి, కట్ట గుడ్డ చాలక వారు నానాపాట్లు పడుచుండిరి. కూలి గూడ చాల తక్కువ. సెలవులు లేవు. ఇతరసదుపాయములు లేవు. విక్రయశాలలందు పనిచేయు నీనాటియువతీ యువక బృందముతో నానాటివారిని పోల్చిచూడుడు; విక్టోరియాశకమునందలి విశ్రాంతి, విరామము, సంస్కృతి మొదలయిన వెట్లుండెనో తెలియగలవు."

సంగీతవిశారద : వెస్టా టిల్లీ

డెబ్బదియేండ్లు పైకొన్నవికాని యింకను ఉత్సాహము, ఆవేగమును తగ్గలేదు. అరువదియేడేండ్లకు పూర్వమే – అనగా తన మూడవయేటనే – ఈమె సంపాదన కుపక్రమించినది. ఆశాలలో ఈశాలలో కచేరీలు చేసి ఆ చిరుతవయస్సునందే యీమె వారమునకు అయిదుపౌనులకు తక్కువగాని సంపాదన గలిగియుండెను.

"అప్పటి సంగీతశాలల నిక మనము చూడబోము. నా చిరుతవయస్సులో నేను కచేరీలు చేయునప్పుడు సంగీతశాలలకు కమ్మల కటకటాలే కాని గోడలు లేవు. ఆ శాలలలోను రంపపుపొడి పరచిన నేలలు, పొడుగాటిమేజాలు వాని నలంకరించుచుండెను. శ్రోతలలో స్త్రీ లరుదుగ నుండెడివారు. అధ్యక్షుడు నడుమ నొకమేజాపైన రంగస్థలమునకు వీపుచేసి కూర్చొని అప్పుడప్పుడు వలసిన ప్రకటనలను చేయుచుండెను; సద్దు అణచుటకు మేజాను గుద్దుచుండెను. గాయకుల స్థితిగతుల చెప్పనలవికాదు. ఒక్కొక్కప్పుడు తడవకు మూడు ప్రదర్శనముల నొసగవలసివచ్చుచుండెను. కాని తగినసౌకర్యములు మాత్రము సున్న. నేపథ్యశాలలందు వాలుడుకుర్చీలుగాని, చేతులకుర్చీలుకాని యుండలేదు; వేడినీళ్లుగాని, చిరరకు ముఖముకడుగుకొనుటకు పరికరములుగాని యుండలేదు. శ్రోతల కప్పుడు రాజభక్తి-దేశభక్తి గీతములును, కరుణగీతములును పరమానందకరములు.

"నేటి శ్రోతల రుచులు వేరు; అప్పటిశ్రోతల రుచులు వేరు. ఇప్పటివారికి గాయకులు ఏడునిమిషములకన్న నెక్కువగ రంగముపై నిలుచుట సహించరు. నాకాలములో నేను తడవకు గంటసేపు ఏడెనిమిది గీతములను ఒక్కొక్కదానికిని వేషములు మార్చుకొనుచు పాడుచుండెడిదానను. ఈవిధముగ అప్పుడు శ్రోతలకును గాయకులకును ప్రీత్యనుబంధము లేర్పడుటకవకాశముండెను. అది యిప్పుడులేదు"

సైనికుడు: బిందర్ బ్లడ్

అయిదేండ్ల కొరవతో ఇతనికి నూరేండ్లు నిండినవి. ౧౮౪౩ నవంబరులో నితని జననము. అప్పటికి విక్టోరియాకు ఇరువదిమూడేండ్ల వయస్సు. అప్పటికే ఆమె గద్దెనెక్కి అయిదేండ్లయియుండెను. ఆతర్వాత కొన్నియేండ్లకే యితడామెసేనలో ప్రవేశించి ముప్పదియేండ్లిండియాలో నుండి పోయినాడు. అరడజను యుద్ధములలో పాల్గొనియు నితడు చెక్కుచెదరలేదు; ఎన్నియో హత్యాప్రయత్నములకు గురియయ్యు చిక్కుపడలేదు. ఇప్పటికిని ఇతనికి దృష్టిపాటవము తగ్గలేదు; శ్రోత్రపాటవము చెదరలేదు.

"యుద్ధములు చేయుటయందు మేమనుభవించుచుండిన యానంద మిప్పుడు శూన్యమైనది. నిరాయుధముగా ముష్టీముష్టి పోరుడుట యెంతో సంతోషదాయకమైయుండెను. సామాన్యముగా అప్పుడు సైనికులలో చాలమంది నిరక్షరులుగానే యుండిరి. చదువు సంధ్యలు వా రెరుగరు. క్రొత్తసుతుమాత్రము విపరీతముగానే యుండెను. కాని వారు యుద్ధవిద్యయందు ఆరితేరి యుండిరి.

"ఆనాడు యువకులకు సేన పరమాలంబనీయముగ తలపబడుచుండెను. ప్రతివాడును సేనలో చేరుట కుత్సహించుచుండెను."

విక్టోరియాతో నితనికి గాఢమైన పరిచయము గలదు.

"దేశీయసేనలు తనయందు భక్తిగలిగియున్నవో లేదో తెలిసికొనుటకామె కతూహలపడుచుండెను. సైనికులలో పలువురు ఆమెను చూచియేయెరుగరు. వారి భక్తిని నేను ప్రశంసించినప్పుడు ఆమె తృప్తిపడెడిది."

ఎప్పుడో ఒకసారి భారతదేశమునుండి అపహరించిన యొక ఖురానువ్రాతప్రతి నితడు విక్టోరియాకు బహుమతిచేసెను. దాని నామె విండ్సరుకాజిల్ గ్రంథాలయములో నుంచెను; ప్రతిబహుమానముగా నితనికి తన రూపచిత్రము నొసగెను.

పత్రికావిలేఖకుడు : రాల్ఫ్ డి. బ్లూమెన్ ఫీల్డు

ఇరువదిమూడేండ్ల వయసులో నీ అమెరికను విలేఖకుడు ౧౮౮౭ లో లండను ప్రవేశించి యక్కడ ఏబది యేండ్లు వాసముచేసినాడు. ముప్పది యేండ్లు 'డెయిలీ ఎక్స్ప్రెస్సు' సంపాదకుడుగా విఖ్యాతిగాంచినాడు.

"మాకాలములో సర్వమును సావధానముగా జరుగుచుండెను. తొందరపాటు, తత్తరపాటును మా కాలమువారి కెరుకలేదు. మా పత్రికాకార్యాలయము సంగతి చెప్పెదను: మాకు కడపటివార్తలనగా రాత్రి పదునొకండున్నరగంటలకు తరువాతి వచ్చునవి. అంతవరకును పత్రిక పనిచేయచు నేయుండెను. పత్రికలలో అప్పుడు వ్యాసకర్తలపేర్లు వేయు సంప్రదాయములేదు. సామాన్యముగ నప్పటి పత్రికలవ్రాతలు అంత ఉత్తమములుగా నుండలేదు. రిపోర్టర్లు కేవలము షార్టుహేండు గుమాస్తాలేకావున వారు చెప్పినదిచెప్పినట్టుగా వ్రాయ గలిగియుండిరేకాని ఆవ్రాతకు చక్కనిరూపమును కల్పించుటకు వారు చాలకపోయిరి. పత్రికలకార్యాలయములుకూడ నాజూకుగలేక కలగాపులగముగ నుండెడివి, బల్లలు మొదలగు పరికరములుకూడ సరియయినవి ఉండలేదు.

"లండనుపట్టణము ఇప్పుడెంతో అభివృద్ధిగాంచియున్నది. నాటి పోలికలే నేడు లేవు. కాని ఆయుత్సాహమమాత్రము నేడు లేదు. ద్రవ్యసంపాదనదృష్టియే కాని యిప్పుడు మరివేరదృష్టి లేదు. అప్పు డిట్లుకాదు. ఇతరసదాశయములు అనేకము ప్రజలదృష్టిలో మెలగుచుండెడివి."

నటీమణి : లేడీ ట్రీ

ఈమె కిప్పుడు డెబ్బదిమూడేండ్లు. ఈమె అసలు పేరు మాడ్ హోల్ట్. ఈమెభర్త హెర్బర్టు బీర్ భోమ్ కూడ ఒక సుప్రసిద్ధనటకుడు. వీరిద్దరిని ఒకప్పుడు విక్టోరియా తన సన్నిధానమునకు పిలిపించి వీరికళాకౌశలమును ప్రదర్శింపగోరెను; వీరి ప్రదర్శనమునుగాంచి సంతసించి యుచితరీతిని సత్కరించి పంపెను.

"నాట్యరంగమున నానాటికిని ఈనాటికిని ఏమంత వ్యత్యాసము కనబడదు. ప్రోత్సాహకులు అప్పుడును ఉండిరి; ఇప్పుడునున్నారు. కాని అప్పటివారు చక్కని నడతగలిగియుండిరి. మంచినడతయే మాకు చిన్నప్పటి నుండి పూజాస్థానముగ నుండెను.

"మాదుస్తులే వేరు. వాని తరహాలే వేరు; వాని తయారే వేరు. వాని నిప్పుడు చూతమన్నను లేవు. అవి వయలెటు చిత్రించిన క్టోరియారూప చిత్రము



ఆకాలముతోనే తీరిపోయినవి. అప్పటి వింతవింత దుస్తుల మోజు ఇప్పటివారికి లేదు."

నటుడు: జాక్ మార్టిన్ హార్వీ

డెబ్బదియారేండ్లమనిషి. ఇతడు ఇప్పటికిని నాటకములందు పాల్గొనుచునేయున్నాడు. ఆరేండ్ల వయస్సులో నితడీవృత్తికి దిగినాడు.

"మానాడు నాట్యరంగము వ్యాపారసరళిలో నడువలేదు. నిర్వాహకుల యాస్తుల నాదరువుచేసికొనియే ప్రదర్శనములు ప్రారంభింపబడుచుండెను. నటుల కిప్పటివలె జీతభత్యములుకూడ ఉండలేదు.

"కాని యిప్పుడు నాట్యరంగమున నొక వికాసము కనబడుచున్నది. క్రొత్తగా అందులో చేరువారి కిప్పుడు మంచి యవకాశములు గలవు. నాట్యకళను నేర్చుకొనుటకును ఇప్పుడు సదుపాయములు మెండుగా నున్నవి. అప్పుడు పెద్దనటకుల పంచల నాశ్రయించి వారి యడుగులకు మడుగులొత్తుచు కాలజెప్పిన పనిని చేతజేయుచు నిరీక్షించుకొన్నగాని నాట్యరంగమున చోటు అబ్బెడిదికాదు. కాని అప్పటివిశేష మేమన- నాట్యరంగ మొక పూజామందిరముగ భావింపబడుచుండెను. నాట్యరంగమను ప్రవేశించుట ఒక గొప్ప కార్యముగను, గొప్ప విశేషముగను తలపబడుచుండెను."

నాటకకర్త: జార్జి బెర్నార్డ్ షా

"నాటికి నేటికి చాల విషయములు మారిపోయియున్నవి. అందులో గొప్పగ చెప్పుకొనదగిన మార్పేదియనగా- ధనవంతులయొక్కయు, నడిమితరగతివారియొక్కయు బాలికలు వారి కభిమతమగునెడల తమ సంపాదన తాము చేసికొనుటకు మార్గ మేర్పడినది. తల్లిదండ్రులు ఈ మార్పునకు సమ్మతించినారు. విక్టోరియాకాలములో స్త్రీలకీ హక్కుండలేదు. ఇది అసహజమైనట్టియు, అసంభవమైనట్టియు సంస్కారమని అప్పుడు వారితలంపు. క్రొత్తగా స్త్రీలీసంస్కారమునకు మార్గమద్రొక్కి కార్యమున కుపక్రమించినప్పుడు వారిని, వారికుటుంబములను నైతికముగా తృణీకరించుటకును అప్పటివారు జంకలేదు."

విక్టోరియాకాలమునాటి వివిధపరిస్థితులను వీరందరును స్వయముగ నిట్లు టూకీగా తెలిపినారు. ఆపరిస్థితులలో ఉండి, అనుభవించి, బాగోగులను గ్రహించిన యీ పెద్దలవాక్కులకంటెను ఆనాటిపరిస్థితులను యథాతథముగ తెలిసికొనుటకు ప్రమాణములేవి గలవు? ఈ పెద్దల సుద్దులనుబట్టి 'విక్టోరియాకాలము' ఈ నవయుగముకంటెను తరుగో మెరుగో పాఠకులే యూహింపవచ్చును.

'ఆచార్య'

[స్టేట్స్‌మేగజన్ - మార్చిసంచిక ననుసరించి]

# కలగూరగంప

## జపానులో విద్య

'ఎలిజబెర్త్ గ్రయిస్' అనేఆయన 'లైఫ్ అండ్ లెటర్సు టుడే' అని ఒకవ్యాసం వ్రాశారు. ఈక్రింది అంశములు దానినుండి సంగ్రహింపబడినవి:

ఏదేశంగాని విద్యవల్ల అధికంగా లాభంపొందకోరడం లేదు. అందుకు సరిఅయిన కారణంకూడ లేకపోలేదు. విద్య జపానును తయారుచేసింది. జపానును ఇతరములయిన పెద్దదేశాలతో సరిసమానంగా చేసింది విద్య. ముందు శతాబ్దిలో వాటిని మించిపోయేటట్లు కూడా చేయవచ్చును. అజ్ఞాతాలయినా, అసంభవాలు కాని భావికాలపు విజయపరంపరల కన్నింటికీ విద్య విశేషంగా ఆవశ్యకం అవుతుంది. అందుచేత జపాను వారు అతిసత్వంతోను, అత్యుత్సాహంతోను విశేషంగా విద్యార్జనం చేస్తున్నారు. వారి విద్యార్జనకార్య ప్రణాళిక బ్రహ్మాండమయింది. సకల ప్రపంచవిజ్ఞాన సంకలనానికి ఉద్దేశపూర్వకంగా ప్రారంభించినమొట్టమొదటి దేశం జపానే. ప్రాచీప్రపంచ విజ్ఞానాన్నీ, ప్రతీచీ ప్రపంచ విజ్ఞానాన్నీ సంపూర్ణంగా స్వాధీనం చేసుకోవడానికి జపాను సంకల్పించింది. జపాను ప్రాచీప్రతీచీ ప్రపంచముల మధ్య ద్విభాషిస్థానంలో నిలుస్తుంది. అది ప్రాచ్య రాజ్యంకాదు, పాశ్చాత్యరాజ్యమూ కాదు. ప్రపంచ రాజ్యం కాబోతుంది.

బడికిపోయేయీడుకుర్రవాండ్లలో నూటికి తొంభైతొమ్మిది పాళ్లమంది బళ్లల్లో చదువుతూఉంటారు. ప్రపంచంలో మరేపెద్దదేశంలోనూకూడా జపానులో అంతమందిచదువు కున్నవాళ్లు లేరు. జనసంఖ్యనూ, సంపదనూ అనుసరించి ప్రపంచంలో మరేదేశంకూడా విద్యకోసమని ఇంత సొమ్ము వ్యయపెట్టడం లేదు. అంత తొందరగా వెనుకటిశతాబ్దాల విద్యాబోధలను, అన్యవిజ్ఞానసంపదను స్వాధీనంచేసుకొన్న దేశంకూడా మరేదీ లేదు.

జపానువారు అనుకరించే స్వభావం కలవాళ్లు కారు. అంతా తమలో ఐక్యం చేసుకుంటారు. ఉన్నదాన్ని ఉన్నట్టుగా దేన్నీ గ్రహించరు. ప్రతిదీకూడా విపరీతమయిన మార్పును పొందుతుంది. చాలా విలువకలదీ, విచిత్రమయిందీ అయిపోతుంది. ముఖ్యంగా జపాను సొంతమే అయిపోతుంది. జపాను వారి అభిరుచికి సరిపోయేటట్లుగానే తయారవుతుంది.

ఏదీకూడా అంతసులభసాధ్యం అయింది కాదు. వారాని కారురోజులు బడి ఉంటుంది. ఏడాదిలో ౨౨౦ మొదలు ౨౪౦ దినాలవరకు బడికి పోవాలి. అదే యూరపు, అమెరికా దేశాల్లో ఇంచుమించు ౧౫౦ దినాలుమాత్రమే. వేసవిసెలవులు నాలుగు మొదలు ఆరు వారాలకు మించవు. ప్రైమరీస్కూళ్లచదువు ౬ ఏండ్లు, మిడిల్ స్కూళ్లచదువు ౫ ఏండ్లు, హైస్కూళ్లచదువు 3 ఏండ్లు, యూనివర్సిటీచదువు 3 ఏండ్లు, మొత్తం ౧౭ ఏండ్లు చదవాలి. పరీక్షలు చాలాకఠినం. ఈపదిహేడేండ్లలోను చదువు పూర్తి చేయగలిగినవాడుంటే వాడు గొప్పమొనగాడు. క్రిందిబడిలోనుంచి పైబడిలోకి ప్రమోషను కావడానికిముందు చాలమంది విద్యార్థులు కనీసం నాలుగైదేండ్లయినా పరీక్షలలో బోల్తాకొడుతూ ఉంటారు. చాలమందికి చివరదాకా చదవడమే పడదు. చివరదాకా వెళ్లిన ఏకొంచెంమందో కూడా ౨౫, 30 ఏండ్లమధ్యవయస్సులో ఉన్నవాళ్లే.

ప్రైమరీవిద్యమాత్రం నిర్బంధమయింది. ఆతరువాతవిద్య ఇచ్ఛాధీనం. ప్రైమరీస్కూళ్లవిద్యార్థుల్లో నూటికి పదిమందిమాత్రమే మిడిల్ స్కూళ్లముఖం చూస్తారు.

వాళ్లల్లో పధ్నాలుగుమందికి ఒక్కడు చొప్పున హైస్కూళ్లకు పోవాలని కఠినపరీక్షలపా లవుతారు. హైస్కూళ్లల్లో కృతార్థులయినవాళ్లలో మూడోవంతు విద్యార్థులు యూనివర్సిటీ పరీక్షల్లో కృతార్థులవుతారు.

జపాను విద్యార్థికి మాతృభాష నేర్చుకోవడ మనేది ప్రాణంమీదికి వచ్చే పని. ఆ భాషకు సహజంగా ఉండే ఉపద్రవాలతోపాటు చీనాభాష తొందర ఒకటి కొత్తజపానుభాషలో ౫౦ వేలకుపైగా చీనా అక్షరాలు కలిసిపోయినవి. ప్రైమరీస్కూలు విద్యార్థి వారానికి బళ్లో ౭ గంటలసేపూ, ఇంట్లో ౭ గంటలసేపూ మాతృభాష అభ్యసిస్తాడు. ఇలాగ ౬ ఏండ్లు కృషిచేస్తే అప్పటికి మూడువేల చీనాఅక్షరాలు గుర్తుపడడం కష్టం; ఈ అక్షరాల్లో ఒక్కొక్కదానికి అయిదారు వేరువేరర్థాలు ఉంటవి. అక్కడికి ఏవో వార్తాపత్రికలు చదవడానికే సాధ్యం అవుతుంది. అంతే. చాలా వ్యావహారికభాషలో వ్రాసిఉంటేనేతప్ప గ్రంథాలుగాని, మాసపత్రికలుకాని చదవడానికి తడుముకోవలసిందే వారికి.

విదేశభాషలు నేర్చుకోవడం జపానువారికి చాలకష్టం. తమభాషకూ వాటికీ ఏలాటి సంబంధమూ ఉండదు. అయినా ఆభాషలను నేర్చుకోవడం వారికి అవసరం. వాటిలోనయినా చాలవాటికి వ్యవహారమాత్ర జ్ఞానమే వారికి లభిస్తుంది. పాండిత్యంమాట సున్నే. పారిశ్రామిక ప్రవృత్తికి పారిశ్రామికభాష తెలియడం అవసరం. విదేశవర్తకమంతా విదేశపు కాతాదారులతో మాట్లాడడానికీ, వ్యవహారంసాగించడానికీ తెలిసిన వారికే. ఇతరులకు లేదు.

ప్రపంచంలో అన్నివిధాలా మించిపోవాలన్న ప్రయత్నానికి ఫలం ఆరోగ్యహాని, నరాలదౌర్బల్యం, భయంకరమయిన క్షయరోగం, ఆత్మహత్యలు. పరీక్షలో కృతార్థుడుకానంతమాత్రాన ఆంగ్లవిద్యార్థి ఆత్మహత్య చేసుకోడు. జపానువిద్యార్థివిషయం వేరు. వాడికి సర్వస్వమూ చదువే. జపానువిద్యార్థివిద్యార్జనకోసం కుటుంబమంతా తిండికయినాలేకుండా అల్లాడవలెను — కాబోలు! అక్కడ విద్యార్థివేతనాలు లేవు. మాటిమాటికి పరీక్షలో తప్పిపోతూవుంటే ఆ అవమానాన్ని జపానువిద్యార్థి భరించలేడు. ఆత్మహత్యల సంఖ్య ఏడాదికి మూడువేలకు మించుపుగానే ఉంటుంది. చదవడంవల్ల ఆరోగ్యం చెడకపోయిందా, యింక వాడు గొప్పప్రయోజకుడు అయితీరుతాడు. విద్యావంతుడయిన జపానువ్యక్తియొక్క హృదయం కచ్చితమయిన యంత్రం వంటిది. ఎంతచిక్కు సమస్యవయినా గట్టిపట్టుదలతో పరిష్కరించగలదది. ఏమాత్రమూ శ్రమలేకుండా అలా సాగిపోతూ ఉండగలదు. ఆవిధంగా శిక్ష పొందిందది.

శారీరకశిక్షణముకూడా చాల కఠినమయిందే. వాళ్ల జీవితం సన్న్యాసిజీవితంలాంటిది. ఈమిడిగదులు. అరకడుపుతిండి. ఎంత సంపన్నులయినాసరే విద్యార్థులు ఉపాధ్యాయులతోపాటుపేదబతుకు బతకవలసిందే. జపానుఉపాధ్యాయుల జీతం నెలకు ౬౦.౮౦ ఎన్నులు. అంటే ౨౦ డాలర్లకంటె తక్కువ అన్నమాట.

శరీరవ్యాయామం నిప్పను స్కూళ్లల్లో చాలా కఠినంగా ఉంటుంది. కడచిన ముప్పయి యేండ్లలో ఒక అంగుళం పొడుగు ఎదిగేటట్లు చేయగలిగిందన్న ప్రసిద్ధిని పొందింది. మంచూరియాలో చలినీ, ఉష్ణదేశాల్లో వేడిని సహించేటట్టుగా తయారవుతవి జపానువారి శరీరాలు. టోకియోలో జుజుట్సుబడిని చలికాలంలో వేకోజామున నాలుగుగంటలకు, వేసవికాలంలో మధ్యాహ్నమప్పుడు ప్రారంభిస్తారు.

అన్నిబళ్లల్లోను సైనికశిక్షణం నిర్బంధం. అమెరికాలో ఉపాధ్యాయబృందంలో అయిదింట నాలుగుపాళ్లు స్త్రీలయితే జపానులో మగవాళ్లు. వీళ్లందరూ సైనికశిక్షపొందినవాళ్లే- సైనికులే.

అక్కడ ట్రెయినింగ్ స్కూల్ ఆఫీసర్ల ట్రెయినింగ్ క్యాపువంటిది. అందువల్ల సేనలో రెండేళ్లు తర్ఫీతు కావలసిన అవసరం లేదు, ఒకఏడు తర్ఫీతుఅయితే చాలు. మంచిసైనికు డవుతాడు. ఇలాగా తయారయి వచ్చిన ఉపాధ్యాయులు తరుణ శిష్యబృందానికి సైనికతత్వాన్ని ఉపదేశిస్తూ ఉంటారు.

ఇన్నింటికీ ముఖ్యమయిన ప్రయోజనం కేవలం శరీరబలముకాదు. ఎట్టి అభ్యంతరాలనయినా తప్పించుకొనగల నైతికబలం, నిరాడంబరమయిన జీవనం, కఠినమయిన విద్యార్జనవిధానం, వంకపెట్టరానివిధేయత, ఆచశీలం, దేశాభిమానం,చావుపర్యంతం లొంగని గట్టితనం- ఇన్నీ ఏకమయి అసౌఖ్యం అనేమాట తెలియనివాళ్లుగా తయారుకావడమే. వాళ్లకు ఆకలిదప్పులూ, చలి ఎండలు శ్రమా అంటే ఏమిటో తెలిసేటట్టులేదు. యుద్ధంలో వాళ్లకు ఉపయోగపడే గుణాలన్నీ ప్రకృతం వ్యాప్తిలోఉండే క్లిష్టపారిశ్రామిక పరిస్థితుల్లోను ఉపయోగానికి వస్తవి. పరిశ్రమ సైనికసంబంధము కలది. సైనికులే పరిశ్రమలను నడిపేవారు. సైనికులంటే జపానులో ప్రత్యేకం ఒకతెగవారు కారని గుర్తుంచుకోవాలి. సైనికులే జపాను. ప్రతివృద్ధకాయుడూ సైనికుడే. సంజ్ఞచేస్తే సేనలోకిరావాలి. అంతవరకు వాడు పారిశ్రామికసైన్యంలోవాడు. జపానుఆర్థికగమనము క్రమశిక్షితులూ, కష్టసహులూ అయిన సైనికులమీదనే నిలిచి ఉంది.

(ఏప్రిల్ మాడరన్ రివ్యూ)

---

## యుగోస్లావియా బాలరాజు దినచర్య

యుగోస్లావియా రాజకుమారుడు రెండవపీటరు యొక్క చరిత్రను పారిస్ పత్రిక 'పూ' అనేదానిలో 'రోగర్ క్రొకెట్'వర్ణించాడు. దానిఇంగ్లీషుఅనువాదం 'లివింగ్ ఏజ్'లో ప్రకటింపబడింది. దానినుండి యీ క్రిందిభాగాలు ఉద్ధరింపబడినవి.

"రాజ్యాధికారం బాధ్యతలు అతనికింకా పూర్తిగా మీదికి రాకున్నా, తాను గొప్పదనంతో బాలోత్సాహంతో ప్రభుత్వం వహించిన తనదేశంలోని ప్రజల జీవితంతో సన్నిహిత పరిచయం ఏర్పడింది. అతని దినచర్య గట్టి కట్టుదిట్టాలతో నడుస్తూఉంటుంది. ఏడుగంటలకు అతడు నిద్రలేస్తాడు. దైవప్రార్థన చేసి తండ్రితోను తమ్ములతోను ప్రొద్దుటిభోజనంచేసి కాలినడకతో కొంచెందూరం విహరించడానికి పోతాడు. అవతల తొమ్మిదిగంటలకు చదువుకోవడానికి మొదలుపెడతాడు. అతనికోసం నలుగురు ఉపాధ్యాయులు వచ్చి కనిపెట్టుకొని ఉంటారు. నాలుగుపాఠాలు చదువుతాడు అతడు. ఒక్కొక్కపాఠము నలభయ్యేసి నిమిషాలు పడుతుంది. పండ్రెండుమ్ముక్కాలుకు మధ్యాహ్నభోజనం. ఆతర్వాత కొంతసేపువిశ్రాంతి. మూడు గంటలదాకా మళ్లా చదువుకుంటాడు. సాయంవేళంతా వ్యాయామం- గుర్రపుస్వారీ మొదలయినవీ, ఏవో ఇతరవినోదాలు కూడా.

కుటుంబంతో కలిసి నాలుగున్నరకు టీ పుచ్చుకుంటాడు: ఏడున్నరగంటలకు రాత్రిభోజనం. దాంతో అతని దినచర్య పరిసమాప్తి. వాళ్ల అమ్మతోకూడ కొంతసేపు వుంటాడావల. తొమ్మిదిగంటలు దాటకుండా పండుకోవలసిందే ఎలా అయినా.

అతనికి ఎప్పుడూ బయటకూర్చుని చదువుకోవడం ఇష్టం. కాలమానం బాగాలేనప్పుడుమాత్రం ఇంట్లో కూర్చుని చదువుకుంటాడు.

అమ్మ తనసెలవుకు చాలినంతసొమ్ము ఇచ్చేది లేదని నిరుడు తన సావాసగాండ్రతో చెప్పుకుంటూ ఉండేవాడట. వాళ్లమ్మ మేరీరాణికి తన కొడుక్కు మితవ్యయం నేర్పాలని కోరిక. అందుకని కొంచెంగా సొమ్మిచ్చేది కొడుక్కు. ఒకనాడు పీటరు "అమ్మా, కాలం ఎప్పుడూ ఒకేమోస్తరుగా సాగుతూ ఉండదు. నాకు వ్యయానికి కావలసినంతసొమ్ము నీవు ఇవ్వడం లేదు. నే నేదయినావర్తకంచేసి సంపాదించుకుంటాను" అని అమ్మతో అన్నాడు.

'మంచిపనే అబ్బాయీ' అందిట మేరీరాణి. అతనికోసం నగళ్లపక్కనే వడ్రంగంకార్ఖానా ఒకటికట్టించారు. వడ్రంగం నేర్పడానికని ఒకణ్ణిఏర్పాటుచేశారు. ఈకొత్త ఉపాధ్యాయుణ్ణి చూచి పీటరు 'అయ్యా నాకు సొమ్ముకావాలి. ఈకరువుకాలంలో కూడా బాగా అమ్ముడుపోయే వస్తువులను చేయడానికి నాకు నేర్పడం మీ పూచీ' అన్నాడు. వడ్రంగిసాయంతో పీటరుచేసిన వస్తువులన్నీ ఎక్కువ వెలకు అమ్ముడుపోయినవని చెప్పడం అవసరంలేదు.

ఇప్పుడు పీటరుకు పద్నాలుగో ఏట వచ్చింది. ప్రజలందరూ అతనికోసం ఎదురుచూస్తూ ఉన్నారు. అతని చిన్నకార్యాలను వాత్సల్యంతోను, ప్రీతితోను అనుకరిస్తూ ఉంటారు. అతడు పెరిగి పెద్దవాడు ఎప్పుడ వుతాడా అని కనిపెట్టుకొని ఉన్నారు.

అలెగ్జాండరు దేశంకోసం సైనికుడులాగా పోరాడాడు. దాన్ని సంపూర్ణతను కాపాడుతానని శపథం చేశాడు. ఆపరిపూర్ణతను కాపాడడానికి పీటరు ఎక్కువ జాగ్రత్తతీసుకుంటాడు. దాన్ని అతడు పవిత్రమయిన పిత్రార్జితంగా భావిస్తాడు. అతడు సుప్రసిద్ధులయిన వీరుల వంశంలోవాడు. ఆవీరులు దక్షిణపు - స్లావుల రాజ్యాన్ని ఏకముఖం చేసినవారు.

(ఏప్రిల్ మాడరన్ రివ్యూ)

---

## విదురనీతి

శ్లో. ఏకయా ద్వే వినిశ్చిత్య
త్రీం శ్చతుర్భి ర్వశే కురు,
పఞ్చ జిత్వా విదిత్వా షట్
సప్త హిత్వా సుఖీ భవ.

(సంస్కృత మహాభారతము ఉద్యోగపర్వమున ప్రజాగరపర్వము, 33 వ అధ్యాయము, ౫౧ వ శ్లోకము.)

తే. ఒకటఁగొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి
మూఁటినాల్గింటఁ గడువశ్యములుగఁ జేసి,
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

(ఆంధ్రమహాభారతము, ఉద్యోగపర్వము, ద్వితీయాశ్వాసము, 32 వ పద్యము.)

ఏకయా బుద్ధ్యా, ద్వే కార్యాకార్యే, వినిశ్చిత్య సమ్యగవధార్య, త్రీన్ మిత్రోదాసీనశత్రూన్, చతుర్భిః సామదానభేదదండైః మిత్రం సామ్నైవ దానభేదాభ్యాముదాసీనం సర్వైః శత్రుం వశీకురు.

పఞ్చ ఇంద్రియాణి జిత్వా, షడ్విదిత్వా సంధివిగ్రహాదీన్ జ్ఞాత్వా, సప్త హిత్వా 'స్త్రీమోఽక్ష మృగయా పానం వాక్పారుష్యంచ పఞ్చమం, మహచ్చ దండపారుష్య మర్థదూషణమేవచే' తిసప్త హేయాని త్యక్త్వా సుఖీభవ.

ఒకటఁగొని = ఒకబుద్ధిచే, రెంటి = కార్యాకార్యముల, నిశ్చలయుక్తిఁజేర్చి = బాగుగా నిశ్చయించి, మూఁటి = మిత్రోదాసీనశత్రువులను, నాల్గింటన్ = సామదానభేదదండములచే మిత్రుని సామము చేతను, ఉదాసీనుని దానభేదములచేతను, శత్రువును సామదానభేద దండములచేతను - కడువశ్యములుగఁ జేసి = మిక్కిలి వశమగునటులఁజేసికొని, ఏనిటిని = పంచేంద్రియములను 'శ్రోత్రంత్వక్ చక్షుర్ జిహ్వా నాసికాచైవపంచమీ' గెల్చి=జయించి, ఆఱింటిన్ = సంధి, విగ్రహ, యాన, స్థాన, సంశ్రయ, ద్వైధీభావములను, ఎఱిఁగి = తెలిసికొని, ఏడు = 'వెలదిజూదంబు పానంబు వేట పలుకుప్రల్లదంబును దండంబు బరుసదనముసొమ్ము నిష్ప్రయోజనముగరయ్యనేత' యనెడు సప్తవ్యసనముల, విడిచి = విడిచిపెట్టి, వర్తించువాఁడు = సంచరించువాడు, వివేకధనుఁడు = వివేకముగలవాఁడు.

మద్దూరి గణేశ్వరం.

---

## పుట్టెడుప్రత్తి: పట్టెడుఅన్నము

పుట్టెడుప్రత్తిలో పట్టెకు అన్న మెంతయో కనుగొనవలెను. పుట్టెడు ప్రత్తిఖరీదు ౪౦, ౪౨ రూపాయలు. దానిలోనిగింజలు తీయుటకు షుమారు ౪ రూపాయలగును. ఆ గింజలు ౧౫ మణుగులగును. మిగిలిన ౫ మణుగులు దూది. దానిని చక్కగా, వృత్తివంతులగు దూదేకులవారిచేతగాక, స్వావలంబులచేత ఏకించి, ఏకులు తయారుచేయుటకు ౧౨, ౧౫ రూపాయలగును. ఆ యేకులను నూలుగా వడుకుటకు ౧౧౦, ౧౧౫ రూపాయలగును. దానితో ఖాదీసుడ్డ నేయుటకు ౭౫ రూపాయలగును. అనగా ప్రత్తి ఖద్దరు అగునప్పటికి ౨౦౯ రూపాయలు మజూరిక్రింద వ్యయమగును.

పుట్టెడు వడ్లు దంపించుటకు ౫ రూపాయలు మాత్రమగును. కాన పుట్టెడువడ్లు పండించువానికన్న పుట్టెడు ప్రత్తి పండించువాడు కార్మికునకు కాయకష్టము చేయ నేర్చినవానికి హెచ్చుపనిని కలిగించును; హెచ్చుకాలము వృత్తినిచ్చును; హెచ్చుద్రవ్యమిచ్చును; హెచ్చు అన్నమిడును.

పుట్టెడువడ్లు దంచుటకు ఇద్దరు మనుష్యులకు ౧౩ రోజులు పట్టును. రోజుకు తలకొక ౦-౩-౦ గిట్టును.

ప్రత్తిని పరిణమించుటకు ఇద్దరికి ౮౬౬ రోజులు పట్టును. గింజలుతీసినవారికి రోజుకు ౧-౩-౦ లున్ను, ఏకినవానికి ౦-౩-౦ లున్ను, వడికినవారికి ౦-౨-౬ యున్ను, నేసినవానికి ౦-౧౨-౬ యున్ను గిట్టును. రెండుప్రత్తిరాటాలకు ౧౦ రోజుల కాలము ౨ చిన్న కమానులకు ౮౦ రోజులును ౨ చర్ఖాలకు ౩౬౭ రోజులును ౨ మగ్గాలకు ౮౭ రోజులును పనికలుగుచున్నది. ఎవ్వరికైనను రోజుకు ౮ గంటలు పనిచేసినచో తిండికి లోటుండదు.

దేశములో పండెడి ప్రత్తికి కొదువలేదు. తిండిలేక పనికై ప్రాకులాడు జనమునకు కొరవలేదు. అట్టిచోట ప్రత్తినిగాని లేక దూదినిగాని ఎగుమతి చేయుట దేశారిష్టము. బట్టలమరలలో స్వదేశములో దీనిని పరిణతి పొందించుటకు విదేశ ఎగుమతికన్న తక్కువగానైనను ఉపద్రవకరమే. బీదల పొట్టలపై దెబ్బ అది.

౨౫ మంది యుక్తవయస్కులుగల సంస్థలో ౬౫ పుట్ల ప్రత్తిని ఖద్దరుగా ఏడాదిలో తయారు చేయవచ్చును. ౩౧౨౦౦ గజాల గుడ్డ అగును. సగటున ౨౮౦౧ జనమునకు సరిపోవును.

ఎంత హాయియైనపని ఇది! ఎంత లాభదాయకము! ఆంధ్రమహాజనులు యోచింతురుగాక!!

గొల్లపూడి సీతారామశాస్త్రి.

(గ్రంథాలయ సర్వస్వమునుండి)

---

## కీ. శే. వల్లూరి సూర్యనారాయణరావుగారు



కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాలయమునకు కార్యదర్శిగా పెక్కువత్సరముల నుండి పనిచేయుచున్న వల్లూరి సూర్యనారాయణరావు పంతులు బి. ఏ. బి. ఎల్. గారు 70-వ యేట 27 తేదీ రాత్రి మూడుగంటలకు విషపడిసెను (న్యుమోనియా) వలన మృతినొందిరి. వీరు 40 ఏండ్లనుండి ఆంధ్ర దేశమునకు సేవచేయుచుండిరి.

---




## గిల్టువేయుపద్ధతి (Electro-plating)

గొల్లకోట సోమసుందరం

చవుకరకపులోహముతో దేనితోనైనను తయారు చేయబడిన ఏవస్తువునకైనను విలువగల లోహముతో పూతనిచ్చుటకే గిల్టువేయుట అని పేరు. పూర్వము విలువగల పలుచని లోహపురేకును విలువతక్కువగల లోహపురేకుపై నుంచి యంత్రములలో రోలర్లచే నొక్కించి రెండురేకులు అదుకుకొనునట్లు చేయుచుండిరి.

కాని రానురాను, విద్యుచ్ఛక్తి (Electricity) యొక్క యుపయోగములు మానవునిచే విస్తరింపబడుట చేత ప్రస్తుతము గిల్టువేయుట విద్యుచ్ఛక్తివల్ల జరుగుచున్నది. ఈ నవీనపద్ధతి అన్నివిధములుగాను పైజెప్పిన పురాతనపుపద్ధతికంటె చాల శ్రేష్ఠమును, చౌకయునై యున్నది. విద్యుచ్ఛక్తిచేత వస్తువులకు గిల్టువేయుటకే ఎలెక్ట్రోప్లేటింగ్ (Electro-plating) అని చెప్పుదురు.

గిల్టువేయుటకు సాధారణముగా నుపయోగించు లోహములలో ముఖ్యమైనవి- బంగారము, వెండి, రాగి, నికిల్, జింకు, ఇనుము. సర్వసాధారణముగా గిల్టువేయుట కుపయోగించునవి బంగారము, వెండి.

బంగారుగిల్టు : గిల్టువేయువలసినవస్తువులను శుభ్రముగా, నిర్మలముగా నుంచవలెను. దీనికై ఒకగాజుపాత్రలో కాస్టిక్‌సోడా అనుపదార్థమును నీటిలో కరగించిపోసి, దానిలో గిల్టువేయవలసిన వస్తువును కొంతసేపుంచి తిరిగి శుభ్రమైన నీటితో కడుగవలెను. తరువాత ఆవస్తువును నైట్రిక్‌ఆసిడ్ (Nitrie Acid) అను ఆమ్లములో కొంతసేపుంచి తిరిగీ మంచినీటితో కడగవలెను. తరువాత పాదరసముగల రసాయనమును దేనినైనను కొద్దిగా నీటిలో కరగించి దానిలో నొక్కసారి వస్తువును ముంచవలెను. ఇందువలన పలుచని పాదరసపుపొర గిల్టువేయువలసిన వస్తువునకంతకును అంటుకొనును. ఈ పొరపైననే బంగారు విద్యుచ్ఛక్తివలన అంటుకొనునట్లు చేయబడును.

ఒక పెద్ద గాజుతొట్టిని తీసికొని దానిలో శుభ్రమైననీటిని పోసి దానిలో బంగారముపొటాసియము లోహములయొక్క సయనైడ్ (Double cyanide of gold and potassium) అను రసాయనమును కరగించవలెను. ఈ రసాయనములో నూటికి ౧౦ పాళ్లు సయనైడును, ౧ పాలు బంగారమును ఉండును. పై తొట్టిలోని ద్రావకములో మునుగునట్లు, గిల్టువేయువలసినపాత్ర నొకచివరను రాగితీగతో వ్రేలాడగట్టవలెను. తొట్టిలో రెండవచివరను కల్తీలేనిబంగారురేకును చిన్నదానినొకటి తీసుకొని రాగితీగతో (తొట్టిలోని ద్రవములో పూర్తిగా మునుగునట్లు) వ్రేలాడగట్టవలెను.

తరువాత, విద్యుత్తునిచ్చెడి బేటరీ నొకదానిని తీసికొని దానిపాజిటివ్‌కొనను అసలు బంగారురేకును వ్రేలాడదీసినతీగకు తగిలించవలెను. బేటరీయొక్క నెగటివ్‌కొనను గిల్టువేయవలసిన వస్తువును వ్రేలాడదీసినతీగకు తగిలించవలెను. ఇందువలన బేటరీనుండి విద్యుత్తు బయలుదేరి నిర్మలమైన బంగారురేకునుండి గాజుతొట్టిలోని ద్రవముగుండా ప్రవహించి గిల్టుచేయువలసిన పాత్రగుండా పోయి తిరిగి బేటరీలో చేరును, మరల యిదేపనిగ తిరుగుచుండును. ఇందువలన విద్యుత్తుబంగారు

లేకుండా ప్రవహించునపుడు, బహుసూక్ష్మమైన అణువులను దానినుండి వేరుచేసి, వాటిని ద్రవముగుండా పోయి పాత్రకంతకును అంటుకొనునట్లు చేయును. ఈ విధముగా కొంతసేపటికి పాత్రపైనంతటను నొక పొర పూర్తిగా తయారయి పాత్రపూర్తిగా బంగారుతో చేయబడ్డట్లు కానిపించును.

వెండిగిల్టు: వెండిగిల్టు చేయుటకూడ పైవిధముగానే జరుగవలెను. కాని, గాజుతొట్టిలో మాత్రము శుభ్రమైన నీటిలో వెండి పొటాసియము లోహములయొక్క సయనైడ్ అను రసాయనమును కరగించిపోయవలెను. ఇచ్చట గాజుతొట్టిలో పోసిన ద్రవమునకు కొంచెము కార్బన్ డైసల్ ఫైడ్ (Carbon di. sulphide) అను ద్రవమును చేర్చవలెను. అట్లుచేయుటచేత వెండిపూత ప్రకాశవంతముగా మెరయుచుండును. లేనిచో కాంతి హీనముగా నుండును.

---

## నడకతీరును గనివెట్టుటకొక విద్యుద్యంత్రము

మానవుల నడక తీరులను పరిశీలించుటకు పూను కొన్న శాస్త్రవేత్తల పరిశ్రమఫలిత మీయంత్రము.



యంత్రమున కతుకగట్టియుండు తీగలను నడిపించి పరిశీలించ దలచుకొన్న వ్యక్తియొక్క మడిమలకు, నడుమునకు తగిలించి, ఆవ్యక్తిని లోహపు అట్టలుగల పాద రక్షలతో నొకలోహపు తివాసీమీద నడవనిత్తురు. నడచునప్పుడు నడుమునందేర్పడు ఒక్కొక్క కదలికను, తివాసీకిని పాదరక్షలకును గలుగుచుండు నొక్కొక తాకిడిని యంత్రము చిత్రాలోనికి ఎక్కించి గుర్తించు చుండును. మరియొక విధానముతో పాదవిన్యాసములను కాలపరిమితినిగూడా పరిశీలించుచున్నారు. ఎట్లన, వ్యక్తులను లోప్రక్క చిత్రమునందు జూపినట్లు ఒక త్రొక్కుడుబల్లపై నడచునట్లుచేసి వరుసగ ఫోటోలు తీయుదురు. మనుష్యుల నడకతీరుల కనుగుణమైన పాద రక్షలను నిర్మించుట కీపరిశీలనలు చాల ఉపకరించు చున్నవట.

---

## బొద్దీకల హృదయస్పందనములను నిరూపించుయంత్రము







బొద్దీకలు ఎంతసూక్ష్మకీటకములో వాని హృదయస్పందనము లెంత సూక్ష్మముగ నుండునో అంద

రును గ్రహించిన విషయము. ఆస్పందనములు కూడ ఈ మెకానో కార్డియోగ్రాఫు' యంత్రముచేత స్పష్టముగా నిరూపింపబడుచున్నవి. ఈ యంత్రము సాయముతో శాస్త్రజ్ఞులు బొద్దింకలపైన నికోటిన్ అనబడు కీటకవిషమును ప్రయోగించి తత్ఫలితములను పరీక్షించుచున్నారు. సదరు కీటకములకు స్పర్శజ్ఞానమునుపోగొట్టి, మైనపుముద్దకు వానిని గ్రుచ్చిపెట్టెదరు. అంతట చిన్నశస్త్రచికిత్సచేసి ఆకీటకముల హృదయములను బయటపెట్టెదరు. పిదప ఆసూక్ష్మావయవములను మనిషి వెండ్రుకలతో సన్నని గాజుసూదులకు కట్టిపెట్టెదరు. ఆసూదులకు నల్లనిఅగ్రము లుండును. ఆ అగ్రముల గుండా వెలుతురును వేగముగా వ్యాపింపజేసినచో, ఆకీటకహృదయములు ముందుకును వెనుకకును ఊగినట్లెల్ల వానిఛాయలు కదలుచు దగ్గరనున్న సూక్ష్మదర్శిని కటకములో ప్రతిఫలించును. ఆఛాయలను మిక్కిలి పెద్దవిచేసి చూచినచో హృదయ స్పందనములు బింబగ్రాహకపు కాగితములపైన విశదముగా కనుపడును. కాగితముల మీది ఆచిత్రములు అలలవంటి రేఖలతో హృదయ స్పందన విశేషములను తెలుపును. వానినిబట్టి విషములను ప్రయోగించుటకు పూర్వముండిన పరిస్థితులను, విషమును ప్రయోగించిన తరువాత మారిపోయిన పరిస్థితులను చక్కగా గ్రహణమునకు రాగలవు. కీటకవిషముల గుణస్వభావములను పరిశీలించుటకు ఈ యంత్రము మిక్కిలి యుపయోగపడగలదు.

---

## చీమలకు గాజుటిండ్లు

చీమలజీవితక్రమమును, వానిపనిపాటలకౌశలమును పరిశీలింప గొందరికి మనసుపుట్టినది. వానిని పదిలపరచియుంచి కాపాడుటకు గాజుటిండ్ల నేర్పాటుచేసినారు. వానిలో చీమల కనువయిన మంటిని శుభ్రముచేసివేసి, ఆహారమునకు యోగ్యమైన తుంగముస్తెలు మొదలయిన వానిని కలిపి చెమ్మకేర్పాటు చేసియుంచినారు. చిన్న చిన్న గరిటెలతో చీమల నేరుకొనివచ్చి వానిలో వేసి



యుంతురు. అప్పుడప్పుడు బిందుస్యందినాళికలతో నీటిని ఆగాజుటిండ్లలోనికి పోయుచుందురు. అలంకరణార్థము ఆ గాజుటిండ్లలో ఆట్టలతోను, చెక్కలతోను కట్టడములను, ఇండ్లను చెక్కిపెట్టియున్నారు. మామూలు నేలలోవలెనే యీ యిండ్లలోకూడ చీమలు తమ జీవితములను యథాప్రకారముగ సాగించుచుండును. ఈ గాజుటిండ్లు అంచులలో తప్ప అంతట గాజుపలకలే గనుక వానిగుండా లోన నడచుచుండు కార్యకలాపమంతయు కండ్లకు గట్టినట్లు కనబడుచుండును. బొరియలు, కన్నములు త్రవ్వుట, ఆరలు నిర్మించుకొనుట, ఆహారమును నేకరించుకొనుట, పిల్లచీమలను పోషణచేయుట, తగాయిదాలు వచ్చినప్పుడు శత్రువులతో పోరాడుట, చచ్చిన చీమలను బూడ్చిపెట్టుట మొదలైన చీమలకార్యకలాపము చూడవేడుకగనుండును. ప్రకృతిచిత్రపరిశీలన చేయువారి కిటువంటి వ్యామోహములు మెండు.

---

## మైళ్లకొలది దూరము గాసును తీసికొనిపోగల గొట్టములు





ఇండ్లలోనే తయారుచేసుకొన్న గాసుకు సహజముగా వేడిమి తక్కువగానేయుండును. పైగా గాసును ప్రత్యేకముగా తయారుచేసుకొనవలెనన్న విశేష ధన వ్యయమగును. కావున యిటీవల ఈ క్రొత్తపద్ధతి అమలులో పెట్టబడినది. ఎన్ని మైళ్ల దూరమునుండి యైనను పరియే ఈ గొట్టములగుండా ప్రకృతి సిద్ధమైన గాసును తీసుకొని రావచ్చును. గాసు నుపయోగించవలసిన పరికరములు గలవారి కిది మంచి సదుపాయము. ఈ గొట్టములనుండి వచ్చు గాసును హెచ్చించుటకును, తగ్గించుటకును రెండవ చిత్రములోని చక్రకవాటము ఉపకరించుచున్నది.

## ఒత్తిడిగడియారముగల స్క్రూడ్రైవర్లు



యంత్రభాగములందు సామాన్యముగ ఒక్కొక్క దానియందును పెక్కు మరచీల లుండును. వాటిని బిగించవలసి వచ్చినప్పుడు అన్నిటిని ఒకేఒత్తిడి నుపయోగించి బిగించవలసియుండును. అట్లుకాక హెచ్చు తగ్గులైనచో మరలు విరిగిపోవుటయో, లేక ఆ యంత్రభాగము అంతట సరిగా నమరక యంత్రము పనిచేయక పోవుటయో జరుగును. మరలు తిరుగక నిలిచిపోవునంతవరకు త్రిప్పుచుండినచో ఆ గట్టిఒత్తిడికి మరలు విరిగియే పోవచ్చును. ఎందుల కీ లేనిపోని తంటా? ఈ స్క్రూడ్రైవర్ల నుపయోగించినచో, ఒత్తిడిని లెక్కపెట్టు గడియారములు వీనికి బిగింపబడియుండును గాబట్టి, కొలతప్రకారము హెచ్చుతగ్గులు లేకుండ మరలను బిగించవచ్చును. అన్నిటికి ఒకేఒత్తిడి యుపయోగింపబడును గాబట్టి యంత్రము అంతట సరిగా కుదించినట్లు అమరిపోవును.

## పాలబుడ్డిని పట్టుకొనుటకు పండ్ల ఉంగరము



పిల్లల తల్లులు భోజనము మొదలగు పనులకు బోయినప్పుడు పిల్లలు పాలకు మారాము చేయకుండ పాలబుడ్డీలను ఈ యుంగరములకు తగిలించి పిల్లలనోటి కందించి విడిచి పెట్టిపోవచ్చును. ఈ యుంగరము ఊయాలల కడ్డముగ కట్టబడియుండి పాలబుడ్డీని సరియైన సన్నివేశమునందుండునట్లు పట్టుకొని యుండును. ఇతర సమయములందీ యుంగరమును దంతపంక్తిని చక్కదిద్దుటకును, దంతపు కుదుళ్లను సరితీర్చుటకును ఉపయోగింపవచ్చును.

## సంభాషణలోపములను చక్కదిద్దుకొనుటకుపాయము



మనము మాటలాడు మాటలు ఎదుటివారికి మనకంటెను గట్టిగా వినబడును. ఇది పరీక్షించి నిర్ధరించిన విషయము. ఆ మాటలాడుటలో సంభవించు పలువిధములైన లోపములు ఎదుటివారు స్పష్టముగా గ్రహింపగలరు. అట్టిలోపములం

డుట ఉపన్యాసకులకు సిగ్గులచేటు. స్వరభంగము నందు హెచ్చుతగ్గు లుండవచ్చును; వర్ణక్రమమునందు ఎగుడుదిగుడు లుండవచ్చును; ఉచ్చారణమున తడ బాటు తోచవచ్చును. ఇవి నిజముగ వక్తలకు కించ పాటు తేగలిగినవి. కావున సంభాషణలలోని యిటువంటి లోటుపాట్లను స్వయముగ గ్రహించి వానిని యథాక్రమముగ చక్కదిద్దుకొనుటకు శాస్త్ర వేత్త లీ పద్ధతిని అవలంబింపగోరుచున్నారు. ప్రతి వ్యక్తియు తన మామూలుపలుకులను ధ్వనిలేఖన ఫలకము (Phonograph Disks) లందు ప్రతిష్ఠింపజేసి, ఆఫల కములను గ్రామఫోనులందు పెట్టి త్రిప్పి, మరల మరల విని లోటుపాట్లను యథాక్రమముగ చక్కదిద్దుకొనుటకు ఈ పద్ధతి మిక్కిలి యవకాశము నొసగుచున్నది. ఒక విద్యార్థిని తన పలుకులను ధ్వనిలేఖన ఫలకమునందు ప్రతి ష్ఠింపజేయుచుండుట యీచిత్రమునందు కాననగును.

—— ——

## సముద్రపు అడుగునేలలో నేమున్నది?



సముద్రపు అడుగునేలలో ఏయే వస్తువులు చేరుకొనియున్నవో, వాని గుణస్వభావము లెట్టివో పరిశీలించుటకు శాస్త్రజ్ఞులు ఈ క్రొత్త పరికరమును సృష్టించినారు. ఇది యించుమించుగ నొక



పొడుగాటి తుపాకి యని చెప్పవచ్చును. దీని చివర లంబవర్తులాకారమైన యొక ఉక్కుతుపాకి యుండును. దానిపొడుగు ౨౦ అంగుళములు; వ్యాసము ౧౦ అంగుళములు. దానిలో తుపాకిమందు కూరబడియుండును. ఈ తుపాకిలోనికి పది యడుగుల పొడుగుగల ఒక ఉక్కుగొట్టము చొనుపబడియుండును. తుపాకిలోని మందు ప్రేలగానే యీ గొట్టము భూమియడుగునకు గ్రుచ్చుకొనిపోవును. మరల దీనిని పైకి లేవదీసినయెడల, దీనియంచులకు అమర్పబడియుండు ఇత్తడిబద్దలకు సముద్రపునేలలోపలి మంటిచేవ బద్దలు బద్దలుగా అతుకుకొనివచ్చియుండుట గోచరించును. దీనిని అట్లే బద్దలుబద్దలుగానే తీసి జాగ్రత పరచి పరిశోధనశాలలకు గొంపోవుదురు. అక్కడ దీనిని పొడుగుగా రెండుగా చీల్చి, ఒకచీలికను పదిల పరచి యుంచి, మరియొకచీలికను పరిశోధనకై కొందురు. ఈ క్రొత్త పరికరమును సముద్రము నీటిలోపల ౭౫౦౦ అడుగుల దాక దింపవచ్చును. సముద్రపుఅడుగు మంటిసారమును, దాని గుణములను పరిశీలించుట కిది యుపయోగింపబడుచున్నది. ఈ చిత్రములందు ఈ పరికరమును నీటిలోపల దింపుట, ప్రేల్చుటకు సన్నాహ పరుపబడి యుండునప్పటి దీని స్వరూపము, అడుగు మంటిసారము ఇత్తడిబద్దల కంటుకొనివచ్చునప్పటి ఆకారములు కనబడుచున్నవి.

——

# నక్షత్రమండలము

(ఈశ్వరసంవత్సర వైశాఖమాసము)

గొబ్బూరి వేంకటానంద రాఘవరావు

ఉత్తరము




దక్షిణము

నక్షత్రవేధచేయువారు ఈపటమును తమ తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు చూచిపట్టుకొని పరిశీలించవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు మేనెల 7 తేది 8 57 గంటకు మేనెల 15 తేదీని 8-29 గంటకు. మేనెల 22 తేది 8-2 గంటకు ,, 29 ,, 7-34 ,, జూన్ నెల 1 ,, 7-23 ,, కనబడును. అంగారకుడు మేషాంతమున కనబడుస్థానము చూపబడినది.

"There are two things that ever fill me with new and growing admiration—The Moral Law with in me and the Starry Heavens above me." Kant.

"ఎప్పటికప్పుడే నాకు క్రొత్త ఆనందమును ఆశ్చర్యమును గూర్చుచు, నిరంతర ప్రవర్ధమానమగు నా ప్రశంసకు పాత్రములైనవి రెండే; నైతికధర్మోపదేశము చేయు నా హృదయాంతర్యామి యొకటి; ఆకాశమున ననంత కోటి నక్షత్రములతో మెఱయు నభోరంగమొకటి.—"

కాంట్.

"The stars have been my friends, though we have lost some of the need of their everyday friendship known to the ancients." Wood ward.

"మన పూర్వులు తమ నిత్యకృత్యనిర్వహణమునందు ఈ నక్షత్రములతో కలుపుకొనిన గాఢ స్నేహావశ్యకత కొంత ఈ నాడు లోపించినది. అయినను ఈ నక్షత్రములు నాకు పరమమిత్రులై యొప్పుచున్నవి."

వుడ్వర్డు.

ఈ యీశ్వర సంవత్సర చైత్ర బహుళ త్రయోదశి తే ౮-౫ ౩౭ ది మొదలు, వైశాఖ బహుళ అమావాస్య తే ౮ ౬-౩౭ వరకును, రాత్రి తొలిజామున నగపడు గ్రహనక్షత్రాది ఖగోళ సంచారుల నకయుదము.

పాలవెల్లి (The Milky way)

ఈ మాసములో పాలవెల్లి, వాయవ్యము మొదలు ఈశాన్యమువరకును గల దిక్చక్రమును అంటుచు, ఒకొక్కచో ఎడమగుచు చంద్రవంకనుబోలు రమ్యమైన వక్రాకారముతో దిక్చక్రము నావరించి కడు మనోజ్ఞమై లయొయున్నది. ఈ యమరతటిని "విష్ణుపాదోద్భవి" యనుటయు, "భోగికంకణు తల పూలదండ" యనుటయు నీ సమయమున మిక్కిలి చక్కగా స్ఫురించుచున్నది. ఈశాన్యమున నిపుడే పూర్తిగా ఉదయమైన శ్రీ మహావిష్ణుని పాదమున గంగ సముద్భవించి, దిక్చక్రపుటాయనే వృశ్చిక, శృక, అశ్వతర, త్రిశంకు, నౌకామండలముల గడచి, పశ్చిమమున మృగవ్యాధరుద్రుని శిరము నలంకరించుచు, వాయవ్యము వరకును వ్యాపించియున్నది. ఈ దివిజగంగ విష్ణుపాదమున ప్రభవించుట యను విశేషము ఈ మాసమున సూర్యాస్తమయానంతరము స్ఫురించినంత స్పష్టముగా మరొకప్పుడు కాజాలదు. కావుననే మన పంచాంగ కర్తలు ఈ మెయినెల ౧౬ తేదీని అనగా వైశాఖ శుద్ధషష్ఠి ఆదివారము నాడు "గంగోత్పత్తి" అని తెలియపర్చియున్నారు. మనపూర్వులు ఖగోళవేధచేసి ఆయా దేవతల గమన వైఖరులను పరిశీలించి పుణ్యదినము లేర్పరచినారనుటకు ఇదియొక ప్రబల నిదర్శనము.

(First Magnitude Stars.)

తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రములు

తేజోవిషయమున నగ్రగణ్యములైన ఇరువది నక్షత్రములలో ఈ మాసమునందు రాత్రి తొలిజామున ౧౩–౧౪ చుక్కలు కనబడుచున్నవి.

౧. పడమట సారథిమండలములో బ్రహ్మహృదయము (Capella in Auriga)

౨. ,, శ్వానములో మృగవ్యాధ (Sirius in Canis Major)

3. ,, మిథునరాశిలో సాంబమూర్తి (Pollux in Gemini)

౪. ,, పునర్వసులో పూర్వశ్వానము (Procyonin Canis Minor)

౫. మధ్య ఆకాశమున మఘ (Regulus)

౬. ,, చిత్ర (Spica)

౭. ,, స్వాతి (Arcturus)

౮. తూర్పున బ్రహ్మ (Vega)

౯. ,, జ్యేష్ఠ (Antares)

౧౦. దక్షిణమున అశ్వినులు ఆల్ఫా Aelpha Cen-

౧౧ ,, 3 వ స్థానము బీటా Beta [taurus

౧౨. ,, విశ్వామిత్ర (Beta Crux)
౧౩. ,, త్రిశంకు (Alpha)
౧౪. ,, అగస్త్య (Canopus)

ఈనక్షత్రము 'మే' మాసాంతమువరకు నైరృతి దిశను సూర్యాస్తమయానంతరము కనబడును. పిమ్మట అస్తమించును. కావున సరిహద్దున దిక్చక్రముకడ చూపినాను.

## గ్రహములు

ఈ తొలిజామున కుజుడొక్కడుమాత్రము వృశ్చికరాశిలో కానవచ్చుచున్నాడు. కాలినఉక్కుగుండువలె ఎఱ్ఱగనుండు అంగారకుని తేజము ఆ సమీపముననే గల జ్యేష్ఠానక్షత్రముయొక్క ఎఱ్ఱనికాంతితో పోల్చదగియుండుట గమనింపవలయును. జ్యేష్ఠానక్షత్రమునకు పాశ్చాత్యులు పెట్టిన పేరు ఎంటారిస్ (Antares). ఆ శబ్దమున కర్థము—తేజోవిషయమున అంగారక గ్రహముయొక్క ప్రతిస్పర్థి అని.

## ఉత్తరాకాశమున ధ్రువక్షితి

Round and round the frozen pole
Glideth the lean White Bear"—Buchianan·

"బక్కపలుచని దేహముతో తెల్లయెలుగు ఘనీభవించిన ఉత్తరధ్రువముచుట్టును నిశ్శబ్దముగా ప్రదక్షిణముసాగించుచున్నది. (బుకనన్)

ఉత్తరమున ధ్రువక్షితిలో ధ్రువుడు చలనములేనట్లు స్థిరముగా నున్నాడు. ధ్రువునిచుట్టును తెల్లయెలుగు గానుగఎద్దువలె తిరుగుచున్నది. ఇపుడు ఆ యెలుగు శరీరము తూర్పుదెసకు జోగినట్లు కనబడుచున్నది. అందున్నవి. ౧ ధాత, ౨ విధాత, ౩ మిత్ర, ౪ అగ్ని నక్షత్రములు; ఎలుగుతోకమూలను అగ్నియు, తోకలో మహేంద్ర, కశ్యపులును, తోకచివరను ధ్రువుడును కలరు. ఈ చుక్కలకు ఉదయాస్తమానములులేవు. ధ్రువునిదిగువ, ఉత్తర దిక్చక్రసమీపమున ఊర్ధ్వశిలోని కొన్ని చుక్కలుమాత్ర మిపుడగపడుచున్నవి. ధ్రువక్షితికి ఎగువ నరకాసురుడు మహాసర్పాకారముతో ఈశాన్యమునకు వ్యాపించినాడు.

ధ్రువక్షితికిని, నరకునికిని ఎగువ ఇంచుమించుగా గగనమధ్యమున బృహదృక్షమండల మున్నది. అనగా పెద్దయెలుగుచుక్కలున్నవి. ఈయెలుగుశరీరమున క్రతు, పులహ, పులస్త్య, అత్రిఋషులున్నారు. ఈచుక్కలు నాలుగను ఒక చతుష్కోణము (Quadrilateral) ఆకారమును గలిగియున్నవి. అందు పులహ- క్రతురేఖ ధ్రువుని సూచించును. క్రతు- పులహరేఖ మఘనక్షత్రమును చూపును. అంగీరస, వశిష్ఠ, మరీచి ఋషులు ఎలుగుతోకలో నున్నారు. ఈయెలుగుయొక్క దేహముకంటె తోకనిడు పెక్కువయైనట్లు కనబడుచున్నది. ఈతోక యింతపొడుగుగా నుండుటనుగూర్చి చర్చించుచు నాలుగువందల యేండ్ల క్రిందనుండిన తామస్ హూడ్ (ThomasHood) అను గ్రంథకర్త యీదిగువ వ్రాసిన గురుశిష్య సంవాదమును రచించినాడు.

శిష్యుడు:—"మరి, ఈపెద్దయెలుగుతోక ఇంత పెద్దదిగా నుండుటకు కారణము ఏమైయుండును?

గురువు:—ఎలుగుబంటి మంచి సత్తువ కలది; క్రూరమైనది. దానికన్నులు, పండ్లు చూచువరికి దేవతలకుకూడ భయమే. ఎదురుగా వచ్చినపక్షమున కరవక మానదనియు, దుష్టజంతువుపండ్లకు దూరముగా నుండుటయే మంచి దనియు నిశ్చయించి, జ్యూపిటర్ (Jupiter) దేవుడువెనుకనుండివచ్చి, దానితోకంగట్టిగా బట్టుకొని బరబర స్వర్గలోకానకు ఈడ్చుకొనిపోయినాడు. భారమైన జంతువగుటచేత ఈ లోకమునుండి ఆలోకమునకు ఈడ్చుకొనిపోవుసరికి దానితోక తెగ సాగినది. అందుచేతనే దానితోక అంత పొడుగైనదని నా అభిప్రాయము. మరొక కారణ మేమైన కలదేమో నాకు తెలియదు."

పాఠకుల వినోదార్థము పై సంభాషణ మిందు వ్రాసినాడను. ఈ చుక్కలను గూర్చి వివిధదేశముల జనులు ఆయాయుగములలో నెట్టి భావములను కలిగియుండిరో మనకు విశదమగుట ముఖ్యము. ఈ యేడు

చుక్కలును క్షణమునకు పదునేడుమైళ్ల త్వరతో ఆకాశమున పరువులెత్తి పోవుచున్నవి. ఇందు అయిదు ఒక దిక్కునను, రెండు వేరొక దిక్కునను పోవుచున్నవి. కొంతకాలమునకు ఈ చుక్కలు ఇప్పటియాకారముతో కనబడవు.

క్రతుపులహులకుపశ్చిమమున నేమకుతొండమును, లంబోదరమును, మూషకవాహనమును గల విఘ్నేశ్వరుడు పార్వతీ పరమేశ్వర మిథునమున కనతిదూరములో మెఱయుచున్నాడు.

పశ్చిమమున సారథిమండల మస్తమించుచున్నది. బ్రహ్మ హృదయమును అజశాబకములును త్వరలో అస్తమింపనై యున్నవి. మహామీనమువంటి యాకారముతో పునర్వసు ఆకాశగంగాసమీపమున పడమటకు వ్రాలియున్నది. నైరృతిదిశను మృగవ్యాధుడును అగస్త్యుడును అస్తమింపబోవుచున్నారు. మందరిగిరికి వాసుకి మంథానమై క్షీరసాగర మథన వృత్తాంతమును స్ఫురింప చేయుచున్నాడు.

దక్షిణమున

నౌకామండలము చాపలు, స్తంభము, అడుగుభాగము, అమరము నను భాగములతో ఇపుడు బాగుగా కానవచ్చుచున్నది. ఈ యోడ చుక్కానికడనున్న అగస్త్యుడు 'మే' మాసాంతమునకు అస్తమించును. నౌకామండలమున కీవల పాశ్చాత్యులచే Crux or Southern cross దక్షిణపు శిలువయని వ్యవహరింపబడుచున్న చుక్కలను మనవారు త్రిశంకుడని చెప్పుదురు. గురుశాపతప్తుడై చండాలుడైన త్రిశంకుడు విశ్వామిత్రుని తపోబలముచే స్వర్గమునుచేరి, అటనుండి ఇంద్రుడు త్రోయించివేయుగా తలక్రిందుగా పడుచుండెను. విశ్వామిత్రుడు వానిని "ఉండుము. ఉండుము" అనియాపి, అంతరాళ 'త్రిశంకు' స్వర్గమున నిలుపుట ఈ చుక్కలవలన ద్యోతకము కాగలదు. గాలిపటము వంటి ఆకారముగల ఈత్రిశంకు మండలముప్రక్క, ఆగ్నేయదిశను అశ్వతరమండలమును, వృకమండలమును కలవు. వార్తికపుపక్షిని పొట్టను పెట్టుకొను తలంపుతో దానిపై బడనుంకించు చున్న వేదగాథ ఇందు పరిస్ఫుట మగుచున్నది.

తూర్పున

శ్రీ మహావిష్ణువు శేషశాయియై బాగుగా ఉదయించినాడు. అతని నాభీకమల సంజాతుడైన బ్రహ్మ కూడ చక్కగా మెఱయుచున్నాడు. అతని ముఖమున గల సరస్వతి వీణాపాణియై యామండలమున నలరారుచున్నది. ఆగ్నేయమూలను అనూరాధయు, జ్యేష్ఠయు బాగుగా ఉదయమైనవి. కుజుడును, జ్యేష్ఠయు ఒండొరులకు ప్రతిస్పర్థులై యున్నారు. కుజుడు ఈమాసములో కొన్నిదినములు అనూరాధకు తూర్పునుండి క్రమముగా పడమటకు వెడలుచున్నాడు. వక్రగతుడై కుజుడు ఈ మాసాంతమున అనూరాధను గడచి విశాఖ దెస నడచుచున్నాడు. ఆస్థానమే పటములో చూడనగును.

మధ్యను

పునర్వసు చుక్కలకు తూర్పుగా పొల్లపూవువంటి పుష్యమి చుక్కలు గలవు. ఇటునటు రెండు చిన్నచుక్కలును మధ్యను మబ్బువంటి తెలుపును పుష్యమిచుక్కలలో చూడనగును. మధ్య తెలుపు వండికంచమనియు, ప్రక్కచుక్కలు గాడిదలనియు చెప్పుదురు. ఈ చుక్కలు స్వర్గద్వారములని చాల్డియనులు (Chaldeans) భావించుకొనెడివారు. మనుష్యుల జీవాత్మలు స్వర్గమునుండి యీ ద్వారముద్వారా వెడలి మానవదేహములలో ప్రవేశించునని వారియభిప్రాయము. గ్రహములన్నియు కర్కటకమున ప్రవేశించినపుడు ప్రళయము సంభవించునని ప్రాతగాథలున్నవి. పుష్యమిదిగువ ఆశ్రేషకలదు. దానికిపైని కొడవలివంటి మఘచుక్కలున్నవి. వానికెగువ నగా తూర్పుగా పుబ్బ, ఉత్తర, నక్షత్రములు రెండు రెండు కనులవలె - నాలుగును చిన్న మంచపుకోళ్లవలె ఉన్నవి. ఉత్తరఫల్గుని చుక్కలలో దక్షిణభాగమునకల చుక్క కాంతివంతమైనది. సుమారు వేయి సంవత్సరముల క్రిందట ఈ చుక్క ఇంకను కాంతివంతమై, అగ్రగణ్య తారావర్గమునచేరియుండెను.

ఇటీవల దీనికాంతి తరిగినది. దీనికి తూర్పుగా హస్తయు, హస్తకు ఉత్తరభాగమున పగడమువలె ఎఱ్ఱగా మెఱయు స్వాతియు, దక్షిణభాగమున ముత్యమువలె మెఱయు చిత్రయు కలవు. చిత్ర, అనూరాధనక్షత్రముల మధ్య విశాఖ అగ్నికుండమువలె గుండ్రనై యున్నది. హస్తకు ఉత్తరమునను స్వాతికి పడమటను వేణీమండలముకలదు. క్షీరోదముయొక్క ఉత్తరధ్రువము ఆసమీపముననే కలదు.

పాశ్చాత్యులచే హైడ్రా (Hydra) అనిపిలువబడు సర్పాకారనక్షత్రములలో ఆశ్రేష, అహి, నహుషములు మూడును చేరినవి. ఆశ్రేషయోగతార; అహిమండలము ఐతరేయ బ్రాహ్మణ ప్రసిద్ధము. నహుషుడు భారత ప్రసిద్ధుడు. నూరు యజ్ఞములుచేసి, ఇంద్రపదవినంది, కామాంధుడై తపోధనుల కారించి సర్పమైపడి భీముని పట్టిన అజగరరూపు డీనహుషుడే.

చమసము అమృత పాత్రము. కన్యాహస్తగతము నక్షత్రములు మానవునకు నేర్పుపాఠము వినయమే. అనంత వ్యాప్తిగల విశ్వవైశాల్య భావమును గూర్చి యోజించుచు, మహనీయ తేజోవిరాజమానము లైన నక్షత్రకోటులతో ప్రకాశించు నభోవైభవము తిలకించినపుడు మనకు విశదమగు విశ్వకర్తయొక్క శక్తిసామర్థ్యములకు మనము వినయ వినమిత శిరస్కులమై, అంజలిఘటించి, జోహారొనరించితీరవలెను.

---

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల (1937 సం. మేనెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తియగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో 1937 సం. జూన్ 10-వ తేదిని రూ॥ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయందభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొనప్రార్థితులు. ఒకవేళ తమ కీపత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 5, 6. B 1, 11. C 2. G 2. H 17, 48. J 4. M 4. N 7, 8.
P 6, 7, 8, 9, 10. R 10, 11, 12, 36, 38, 39, 41, 42, 43, 44, 45, 48.
V 1, 11, 12, 13, 14.



# ఆంధ్రాభ్యుదయము

శ్రీ డాక్టరు అప్పాద్వేదుల లక్ష్మీనారాయణగారు
ఎం. ఏ, డి. ఎస్ సి., ఎఫ్. ఐ. పి,




కొడైకెనాలునందలి నక్షత్ర పరిశోధనశాలకు డాక్టరు టి. రాయిడ్సు దొరగారిస్థానే డైరెక్టరుగా నియమింపబడిరి. ఈపదవి నాక్రమించుటకు వీరే ప్రథమ భారతీయులు శ్రీ లక్ష్మీనారాయణగారు శాస్త్రవిజ్ఞాన ప్రపంచానికి చిరపరిచయులే. విజయనగరం మహారాజా వారి కళాశాలయందు భౌతికశాస్త్రములో ప్రధానోపాధ్యాయులుగా చాలకాలము పనిజేసి పేరుబొంది, 1928 వ సం॥లో కొడైకెనాల్ పరిశోధనశాలకు అసిస్టెంటు డైరెక్టరుగా నియోగింపబడిరి. ఆంధ్రవిశ్వవిద్యాలయము స్థాపింపబడినది మొదలు, షుమారు 10 సంవత్సరములుగా ప్రత్యేంగమున పాల్గొని ఆంధ్రులకు, ఆంధ్రవిజ్ఞానమునకు మంచిసేవచేయుచున్నారు. ఆంధ్ర, భారతీయాభిమాని.

---




శ్రీమతి జనస్వామి సామ్రాజ్యలక్ష్మి



ఈమె బారిస్టరు కోట వెంకటసుబ్బరావు కూతురు. నర్సరావుపేటలో గౌరవ న్యాయాధికారి పదమున నియమింపబడినది.

# కవితా సందేశము

ఉమర్ ఆలీషా

ఈప్రణవగీత మెందుండి యేగుదెంచు
ఈయమృతకంఠ మేవ్యక్తి నెనసివచ్చు
ఆరసాత్మకాక్షరసమాధ్యాయమెందు.
నణఁగియున్నది యెవరిదాస్యమునఁగలదు
దాస్యశృంఖలబద్ధ విద్యావధూటి
కేది యీరీతి స్వాతంత్ర్యమేది సొగసు.
విహ్వాలనిషిద్ధ దైన్యజీవితమునందు.
విషసమారూఢ దగ్ధజీవితమునందు

*　　*　　*　　*

ఇది యవాఙ్మానసంబు నతీంద్రియంబు
ఇదిమహాశూన్యగళదణుపదరవంబు
నేను వాకొనుగీతంబు నేఁదలంచు
భావ మీజరద శరీరవాణిపాడి
పాడ్ప్రకటించు ప్రకృతినీవాళియొసఁగ
ఇంక నాకు స్వతంత్ర మింతేని కలదె ?
ఇంక నాకుఁ గర్తవ్యమేదేనిగలదె ?
మెఱపుతీవలు రత్నాలుమేళవించి
మిణుగురులు వెన్నె లొకవంక ననున్నపరచి
ప్రేమరసవాహినులఁదేలు వీచికలను
అలప్రభాతనిశాత నాట్యానుబద్ధ
శర్వరీకాంత మోహనస్వరవిలాస
మాధురీమార్గణంబుల మాటునందు.
మసలు జీవిత పాషాణమండలంబు

మండిమెగయు బూడిదపయినుండి రాలి
వ్రాయుచున్నది యీపాట పాంథకోటి
చదువుకొనునట్లు కోవిదుల్ చదువునట్లు
ఇంక నీపాట నాదనిపించు టెట్లు ?
ఇంక నీగీతి నాదని బొంకు టెట్లు

*　　*　　*　　*

ప్రణయనిస్సాణ మదె మ్రోయఁబయనమైన
యువకపథికుల వాగమృతోపవృష్టి
అదె ప్రవాహవిధంబున నరుగుదెంచి
వీచికలచేత ఈగీతి వెల్లివిరియ.
ప్రతిలతాగుల్మములయందు ప్రతిఫలించి
ప్రతిజలాశయమం దభివ్యక్తినొంది
ప్రతినదీగర్భమందుండి బయలుదేరి
మ్రోయుచున్నది దిశలుమార్మ్రోయునట్లు
పాడుచున్నది జగము సొంపారునట్లు
ఇంక నీపాట నాదనిపించు టెట్లు
ఇంక నీగీతి నాదనిపించు టెట్లు ?
ప్రాంతపాతాలువల్లించి ప్రాంతకథల
శాటియీనాటి కవితావధూటిగట్టి
ప్రాంతతొడవుల ముస్తాబు పరిధవిల్ల
వెదకి పాశ్చాత్యఫేసుబూడిదనుపూసి (?)
పులిమి తలదువ్వి బిచ్చపువెలఁదిచేతి
బొమ్మనాడించి నవ్వించి బుగ్గి చేసి

ఏడ్చికన్నీళ్లుదుడిచి మీ కిందయనుచు
నేను మీముందు పెట్టి మెప్పించలేను
నేను మీప్రోలపాడి వంచించలేను.
నేనుకవిని నాకల మీజగాన నొక్క
మాటు ఖడ్గంబుకైవడి మాఱఁగలదు
ఒక్కమారుసంస్కర్తగా నోపఁగలదు
గానకవితను నూత్నమార్గములఁద్రొక్కి
క్రొత్తవన్నెల జగము రేకెత్తునట్లు
చేసి చక్కెరతో నింపివేసి నాస్వ
శక్తి యీశ్వరశక్తిగాఁ జాటలేనె?
దివిని దివిజుల నేలకుదింపలేనె?

* * * *

మొగ్గగాలేచి పూచి సౌమోవిలాస
పూరపూరిత కాంతులు పొంగిపొరలు
నట్టినానావికీర్ణ పుష్పాసవముల
ద్రావి మైకొన విరహానిద్రాణమైన
రమణీపదరాగముల నైక్యరమగడించి
ఆమెపారాణి మైనిండ నలమికొనఁగ
ఆమెప్రేమసామ్రాజ్యంబు నాచికొనఁగ
ఆమెదృక్పథసర్వస్వ మందుకొనఁగ
వెడలి గేదంగి పూల పుప్పొడుల ప్రమ్మి
మాసిరి మ్మొత్తిపోయి హతాశమైన
భ్రమర మీగీతి మెలుగెత్తిపాడుచుండ
నేటి యీపాట నాదని తెలుపుచుండ?
ఇంక ఈపాట నాదనిపించు టెటుల?
ఇంక ఈగీతి నాదని బొంకు టెటుల?

* * * *

పంచమస్వరాళికిని విపంచికలకు
విరహులకు రాగరసముద్వేలమైన
పాఠశాలనుపెట్టి సొంపారునట్టి
కోకిలముచంచుపుటమున లోకమునకు
పాడివినిపించునిది తొలిపాఠమనుచు.
చదివివినిపించునిది తొలిచదువుగాఁగ.
ఇంక నీపాట నాదనిపించు టెట్లు?
ఇంక నీగీతి నాదని బొంకు టెట్లు?

* * * *

మనసుమనసునుగలిపి యేమాటకైన
మరపురాకుండుటకు తనవరునిమనసు
కొంగులోపల ముడివేసుకొన్నయట్టి
ప్రేమకామిని హృదయారవిందమందు
రేకురేకు నీపాట చిత్రించియుండ
స్వరముస్వరమున నీపాటవచ్చుచుండ
పలుకుపలుకున నీపాటపాడుచుండ?
ఇంక నీపాట నాదనిపించు టెట్లు?
ఇంక నీగీతి నాదనిబొంకు టెట్లు?

* * * *

కవులభాండార మిట్లు లోకము గ్రహింప
కవులసర్వస్వ మిట్లువ్రక్కలయిపోవ
ఇంకశూన్యభాండముల లెక్కేమిగలదు?
ఇంకముక్తకంఠముల జోలేమిగలదు?
గానకవి విశ్వరూపంబు గాంచవలయు
ఇంక కవి విశ్వమై వినిపించవలయు.



# విమర్శనము

### ఆంధ్రపత్రిక ఈశ్వర సంవత్సరాది సంచిక

డెమ్మీ ౧/౮ సైజు, ౨౨౫ పుటలు; సచిత్రము. వెల-ఆంధ్రపత్రిక, భారతి చందాదారులకు రు. ౧. ఇతరులకు రు. ౨. పోస్టేజి వేరు. ప్రకాశకులు-ఆంధ్రపత్రికా కార్యాలయమువారు, ౭. తంబుసెట్టివీథి, మదరాసు.

వెనుకటి సంచికలవలెనే ఈ సంచికయు వివిధములగు చిత్రములతోను, విద్వత్ప్రకాండులు వ్రాసిన గద్య, పద్యవ్యాసములతోను ముచ్చటగ కూర్చబడి హృదయాకర్షకముగ నున్నది. విశేషమేమన, ఈ సంచిక కూర్పు చాల మార్పునొంది అన్నివిధములను నవ్యతను, ప్రత్యేకతను ఆర్జించుకొన్నది. ఇది యెంతయు మెచ్చుకొన తగినది.

ఇందు ౫ త్రివర్ణచిత్రములును, ౮ సాధారణ చిత్రములును, ౩౮౦ ఛాయాచిత్రములును, రమారమి ౮౦ వ్యంగ్యాది చిత్రములును కలవు. త్రివర్ణ, ఏకవర్ణ చిత్రములు సంఖ్యయందు తక్కువయినను కళయందద్వితీయములై యున్నవి.

ఛాయాచిత్రములలో 'హళేబీడు' శిల్పచిత్రములు, కృష్ణరాజసాగర చిత్రములు, శృంగారచిత్రములు మిగుల రమణీయములు; తక్కినవి చాలవరకు పేరుపడిన పెద్దల చిత్రములు. ముఖచిత్రము నిరాడంబర గ్రామోత్సవమును తెల్పుచు చాల ఆకర్షణీయముగ నున్నది.

ఇందు రాజకీయ, మత, సాంఘిక, సారస్వత, చరిత్ర, శాస్త్రాదివిషయములకు సంబంధించినవి, కథలు, నాటికలు మొదలగు రచనలు ౮౭ కలవు. అవి అన్నియు సుప్రసిద్ధాంధ్ర కవిశేఖరులు, విద్వాంసులు రచించినవి. అందు తమ ప్రత్యేకతను నిలుపుకొని, క్రొత్తదనము నలవరచుకొని దేశ, భాషా, వాఙ్మయముల కుపకరించు వ్యాసములు చాలవరకు గలవు. పద్యములు హృద్యములు.

దీనితో ఆంధ్రపత్రిక ఇరువదెనిమిది వార్షిక సంచికలను ప్రకటించినది. ఏతత్ప్రకటనమున కగుచున్న వ్యయప్రయాసము లమూల్యములు. వానికి తగిన ప్రతిఫలము--అధిపతులకు కాదు--దేశమునకు--కలుగుట లేదు. ఈ యంశము 'కాని సంకల్పములందుగల మహదాశయములు నిర్వహణమునందు రిక్తమనోరథముల వలె గోచరమగుచున్నవి. నిర్వాహకులకు గల సంకల్పోత్సాహములు ప్రజాహృదయమునందు ప్రతిబింబితము లయినపుడే అవి సఫలము లగుచున్నవి.' అను ప్రస్తావనాలేశముననే స్పష్టపరుపబడినది

దేశభాషాపత్రికా నిర్వాహకు లెవ్వరును నెరవేర్పలేని యీరీతి ఉత్తమ వార్షికసంచికలను ప్రకటించి వాని నల్పమూల్యమునకు ఇచ్చు మహోదారులు, శ్రీ విశ్వదాత, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు యావదాంధ్రులకును అత్యంతము ప్రశంసార్హులు.

బు. వేం. ర.

---

### కవికోకిల గ్రంథావళి

#### ౨. ఖండకావ్యములు

కర్త: దువ్వూరి రామిరెడ్డి, క్రౌను ౩౨౦ పుటలు. చక్కని యచ్చు. వెల రు. ౨ లు.

'కవికోకిల' బిరుదాంచితులగు శ్రీ రామిరెడ్డిగారు ౧౯౧౬ మొదలు ౧౯౩౩ వరకు రచించిన ఖండకావ్యములన్నియు ఈ సంపుటమున సమకూర్పబడినవి.

ఇందు ౯౭ ఖండకావ్యములు కలవు: అన్నియు 'నక్షత్రమాల, నైవేద్యము, భగ్నహృదయము, పరిశిష్టము, ప్రథమకవిత్వము' అను నైదు తరగతులుగ విభజింపబడినవి. ఇందు కొన్ని అనువాదములు; కొలది కథారూపములు; కొన్ని మర్మకవిత్వములు; కొన్ని పద్యములు; మరికొన్ని గేయములు. పద్యములు ప్రాంథిక భాషానిబద్ధములు; గేయములు వ్యావహారిక, గ్రాంథిక ఉభయాత్మకములు.

కోకిలగానమువలె ఈ కవికోకిల కవితాగానము శ్రోత్రపేయము; ఆ మాధుర్యమునకు ప్రాథమిక, ప్రౌఢ భేదముతోడను, ఖండాఖండ భేదముతోడను పని లేదు. శ్రీ రెడ్డిగారి ప్రథమకవిత్వము కూడ భావాంచితము, రసోత్తేజకము నయి యున్నది.

కావ్యరచనకంటె ఖండకావ్యరచన కొంత సులభము. కావ్యములందు కథాసంవిధానము, పాత్రౌచిత్య పరిశీలనము, అంగాంగిరస భావప్రతిపాదనము, వస్త్వైక్యము మొదలగుపట్టుల మిక్కిలి శ్రమపడవలసియున్నది. ఖండకావ్యములు పరిమాణమున అత్యల్పములు; గ్రహించిన విషయము ఏదో ఒక భావమునకు సంబంధించియు, రసమునకు సంబంధించియు నుండును. ఇందలి ప్రతి పద్యమునకును ప్రత్యేకత కలదు. కావుననే కావ్యములకంటె ఖండకావ్యములు రసవంతము లగుట కవకాశము కలదు. శ్రీ రెడ్డిగారట్టి సదవకాశమును సద్వినియోగ మొనర్చి ఈ రసవత్ఖండకావ్య సంపుటిని కూర్చినారు.

నేటి మర్మ (భావ) కవులలో పలువురి కవిత్వమునకు ప్రతిభకంటెను, పరిమిత పాండిత్యముకంటెను ఉత్సాహమే ప్రకృష్టకారణము. కావుననే అట్టి కావ్యములు చాలవరకు అనువాదములో, అనుకరణములో అగుచున్నవి. అందలి భావముకూడ ఆకాశకుసుమ ప్రాయము. 'కవికోకిల' ఖండకావ్యావళియందీ దుర్లక్షణములు సమన్వయింపవు.

శ్రీ రెడ్డిగారు ప్రతిభావంతులు; సరసకవులు; స్వయముగ సర్వవిషయములందును పరిశ్రమించిన పండితులు. మర్మకవిత్వమున వీ రింకొకరి ననుకరించినట్లు నే నెరుగను; వీరి ననుకరించినవారిని మాత్రము కొందరిని నే నెరుగుదును.

నేటికాలపు మర్మకవుల అశక్తత కవిత్వమునకొక చెడ్డపేరు తెచ్చినది; మర్మకవిత్వముపట్ల జనుల కాదరమును తగ్గించుచున్నది. ఈ ఖండకావ్యసంపుటి ఆ చెడ్డపేరిని పోగొట్టి గౌరవము నాపాదించి మర్మకవిత్వ మర్మములను వెల్లడింపజాలియున్నది.

ఖా. వెం. ర.

---

## ఆంధ్రతేజము

గ్రంథకర్త: ఉభయభాషాప్రవీణ బోడేపూడి వేంకటరావు, బోర్డుహైస్కూలు, పండితుఁడు బాపట్ల. వెల నాలుగణాలు.

"కీర్తిశేషులగు వంగూరి సుబ్బారావుగారి 'మణిమేఖల'లోని 'శిరశక్తి'కిది రూపాంతరము. మూలమునకిందుఁ గొన్ని కూర్పులు, మార్పులుఁ జేయఁబడినవి."

ఇందలి ముఖ్యవస్తువు: అళియరామరాయలకు బీజపురము, నైజాము, అహమ్మదు, బీరారు నవాబులతోఁ దటస్థించిన సమరమున 'కేశవు'ని వీరవిహారము, అందునకుత్తేజకములగు 'ప్రేమలత' పలుకులు, కడకతఁడు వీరస్వర్గము జూఱఁగొన్న నామె సహగమన మొనర్చుట. తెనుఁగుమొనగాని తెగువయు, తెనుఁగు తెఱవమనసును దెలుపు నీకృతి వస్తుగౌరవమును నాఁచి కొన్నది. కథాప్రక్రమ విస్తారములఁ గొంత క్రొత్తదారిఁ ద్రొక్కినది.

హృదయేశుఁడు కదనమున కరిగినతఱి 'ప్రేమలత' 'వనవాటి' 'సౌతాంతిన్నియ' పై నాసీనయైనది. ఆమె 'యేమూలఁ జూచినఁ గనులముందట నిల్చినయట్లు దోఁచు' నాథునిగూర్చి తలపోయుచున్నది. ఇప్పట్టున 'నాకటిలాలకయు, దృష్టమదనావేశ గరిమ దారొక్కని హృదయం, బటమటము నేయఁగా నుత్కటముగ

కన్నీటం జెప్పక కడుపును' నంతటమాత్ర ముచితముగ లేదా మెరు. వలపులదొర కలన వెన్నిచ్చెనని తలంచినంత వీరావేశమున 'పండయైపోయెనే నేటికాంధ్రజాతి' యను వీరనారి మగండు యుద్ధమునను౦డ మదనావేశ మూనునా ?

తొలిప్రకరణమున 'జయముపై నాసనిడి' కేశవుడు నాతినిం జూడవచ్చినట్లున్నది. కాని మూఁడవ ప్రకరణమున నున్న యుద్ధోద్గ్రమున నిట్టి సన్నివేశమునకుం దగు తావు లేదు. రాయలహత్యవలకు ఆంధ్రవీరులకు జయసూచనలే. వెనువెంటనే 'కేశవు'ని రాక. రాయల హత్యానంతర మతండింటికేగుటయుం బొసగదు.

ఇందలి కవిత చక్కని ధారాశుద్ధికలది. ఎందును ఎగుడుదిగుడు వడక ప్రసాదగుణభూయిష్ఠమై తీర సాగుచున్నది.

మచ్చునకొక పద్యము—

'అలితొంగి కోమల హృ
దంతరమం దపు డొక్కరీతి భా
వాలు జనింపసాగ నిజ
వల్లభు శౌర్యవిలాసమూర్తి యే
మూలలఁ జూచినన్ గనుల
ముందట నిల్చినయట్లు దోఁచె నా
గోల యెఱుఁగగా గ దొ
కో ప్రకృతి ప్రణయానుబంధముల్.

సత్యభావముల కిందుఁగావలసినంత తావుతక్కువ. కల్పనలు ప్రపంచపుఁబోకడల ప్రత్యక్షము సేయుచున్నవి. ఇందున్న యనుకరణము లంబట్టి కవిగారికిం బ్రబంధములపైఁగల గాఢాభిమానము గనఁబడును.

"గ్రీష్మకాలసహస్ర కిరణదీధితులలో
దీప్తిజాలంబెల్ల దగిచి తెచ్చి
బడబానలోజ్జ్వల జ్వాలికా మాలలోఁ
దీక్ష్ణతాగుణ మెల్లఁ దీసి తెచ్చి"

......... (౨౬ పేజీ) మొదలగు నవెన్నియో కలవు.

'ఆంధ్ర విభుం డరివెట్టునోలు దీ
నుని గతిం బందవోలెఁగుజ.'

నుంబలె (౨౩ పేజీ) ఇందు 'భుజనంబలె' యను నుపమాన మసంబద్ధమయ్యె యతి సంబద్ధమగుట నాదృతమయ్యెనేమో?

'ఎనుబదియేండ్లు నిండెనను
చే యెఱుఁగం డినుమంత యేని జ
వ్వనలోకలక్షమందియును
బాటియుటంచనరానిమాట...' (౨౮ పేజీ)

ఇందు 'యువతు' లను నర్థమున రూఢముగు 'జవ్వను' లనుపదము 'యువకు'లనునర్థమునఁ బ్రయుక్తమగుట క్రొత్త.

'యువను మూఁకలు' 'తనుమాలపథము' 'పునిక్ష్యపాకే చైవ' 'అరివీరుఁకుసైనశిరము లల్లాడించు - 'రాజనగళ్ళు' మొదలగునవి చింత్యములు.

ఇట్టి సొబగు లటనటనున్నను ముత్తముపై మల్లెపూలసందివలె చక్కని రచనగల యీకృతి రసికజన కంఠముల నలంకరించుఁగాక. 'విశ్వం'

---

## ఆత్మకథ

కర్త: తుమ్మల సీతారామమూర్తి చౌదరి బోర్డు హైస్కూల్ పండిట్, బాపట్ల వెల ౧-౭-౦.

నరుల నడవడులకు మహాత్ముల వర్తనలు మేల్బంతులు. ఆదర్శప్రాయము లగు వారి జీవితానుభవముల ననేకకఠినతరసమస్యలు సులువుగ విడిపోవును. జగ మెఱిగిన మనగాంధీజీని గూర్చి పలుకఁదొడంగుట పలుకుల విలువ తెలియమియె యగును.

అమ్మహాత్ముని 'ఆత్మకథ'కిది పద్యపుఁదెలుఁగుసేత. దీనిని శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి కవిగారు బ్రహ్మశ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారి వచనపు 'ఆత్మకథ' ననుసరించి రసవంతముగ వ్రాసిరి.

వచనమున నున్న దానికి మరల పద్యముల వ్రాయనేల యనుటకు కవిగారే సమాధాన మొసగిరి. చూడుడు.

'ఎల్లరు గద్యమే చదువ నిచ్చవహింపరు పద్యమన్న సంతసిల్లును వేడ్క పెక్కురకు తెల్గుకవిత్వ

చరిత్రం జూచినన్, దొల్లిటినుండి పద్యపుం గృతుల్ ప్రజలం దనియించి గౌరవా, భ్యల్లసితంబులై నెలయుచున్న విధం బది తెల్లమయ్యెకేన్.'

'పద్యంబు సర్వకవితల
కాద్యంబై గానబద్ధమై శ్రుతిహితమై
హృద్యంబై నియతం బన
వద్యంబై లెస్స తోడుపడు ధారణకున్ !'

ఇంతుచే 'శివరామశాస్త్రి విద్వత్కవిసింహము దీని మధురగద్యాకృతిలో, సవరించెంగదా యిప్పని కవసర మేమీ యటంచు నాడకుం' డనుచున్నాడు. ఈ సమాధాన మంత తృప్తికరము కాదనుకొనెదము. 'ఇంతకు వ్రాసినది బాగుగా ఉన్నదా? లేదా ? అని చూడనగుంగాని ఇచ్చట వచ్చినది వ్రాయునపుడు ఎవరినిగాని వరవెడ్డంగలరు ?'

కవిత ప్రసాదగుణమహిత. తెలుగుపలుకుబడి విలువ గుఱుతెఱిగిన కలము. 'ఇందు తిక్కననుడికారంపు ప్రౌఢతనంబునౌ, పెద్దన్న అల్లికజిగిబిగియునౌ, నంది తిమ్మన్న ముద్దుపలుకులునుజేరి' ఒండొంటితో వియ్యమందినవి. అను రామచంద్రశాస్త్రిగారి వాక్యమున తునకైకి కించిత్తయినలేదు.

ఇందు తెలుగుకావ్యములందువలె వచనములే కాక 'మంజరు'లనుగూడ వాడినారు. వచనమునసున్న పాత్తమును 'అతి హృద్య'మని పద్యమున వ్రాయుచు మరల వచనముల నెడనెడ నుపయోగించుటేల ? అవియైన పద్యములకన్న వాడుకకు గడుదూరముగ (వాక్యాంతమునంగూడ సంధులులేకుండ ప్రాచీనకావ్యముల పద్ధతితో పూర్ణానుస్వారములు 'ంబు' లు 'పుం' లతో) నున్నవి అందులో పద్యముల వ్రాసిన నర్థమగుట కష్టమగు 'తేదీలు' మొదలగునవి వ్రాసిన బాగుండెడిది. అట్లుకాక ఎంతయో వచనమున వ్రాసి తేదీదగ్గర పద్యము వ్రాసిరి. మచ్చునకు ౧౨వ ప్రకరణము కడపట దాదాపు పదునాల్గు పంక్తులవచనము వ్రాసి, మఱల. (పుట ౧౮౨) 'వసుగజైశ్వర్యకుమూదినీబంధుసంఖ్య (౧౭౭) వసుధ నెసంగుకై ) స్తవశకవత్స రమున నవమమాస తురీయదినమ్మునందు బయలువెడలితి నేను బొంబాయి విడిచి.'అని లిఖించిరి. వచనమున సులువుగ తెలిపిన కుండలీకరణమున లిఖించు క్రమలేపుండెడిది.

ఈపాత్తమునకు తెలుగునుడి తొలికొలువరి తొలి పలుకు టారయిక గీటు చెలువము గూర్చు విలువ గట్టుచున్నది. వారిమాటల సున్నితము, (పచ్చి) తెనుగుపోకడలు పరాకాష్ఠ నందినవేకదా. అచ్చతెనుగే వాడుట అతిరమణీయమనుటలో విప్రతిపత్తిలేదు కాని సంస్కృతమే వాడకూడదను అభినివేశముతో 'వ్రాగమి' వంటి పదములసృష్టిచేయుటలో గల గట్టిపట్టుదలబిట్టువదలుటయ మేలు. వ్యవహారమున నున్న పదములే- సంస్కృతములో ఇతరములో- మనోహరము లనుటకు సందియముండదు.

ఇట్టికావ్యము నాంధ్రమాత కలంకారముగ నర్పించిన చౌదరిగారెంతయు వందనీయులు. ఇట్టి వీనిని విశ్వవిద్యాలయములవారు గమనించుచో - తెలుగన్న తీవరమైన తాత్సార్యముగల చదువరులయెదల తెనుగు తీయందనము మొల్కలెత్తించినవారగుదురు. పలుకునేర్చుకొనుటకేకాక తలపు దిద్దుటకుగూడ వలసినంత సాయము గల్పించినవారగుదురు. 'విశ్వం'

---

## i సౌందర్యలహరి

## ii శివానందలహరి

అనువాదకుడు : సోమంచి వాసుదేవరావు

వెల ౦-౮-౦, ౦-౬-౦.

మేధామహిమచే మిన్నయని యెన్నికగన్న శంకరాచార్యులవారి మృదుమధుర గంభీరకవితాస్రవంతీకల్యాప్రాయము లీకృతులు. ఒకటి దేవీస్తుతి, మఱొకటి శివస్తుతి. ఇవి పేరునకు స్తోత్రములేకాని ఖండకావ్యములో, లేక కావ్యములో అనుటకు చాలినవి. కడు రసవంతములగు పద్య రత్నము లిందు పవవినందినవి. పలుమారుచదివినను తనివిడీఱని యనువున రసస్రవంతికి యూటబుగ్గ లనిపించుకొనదగినవి.

ఇట్టి సంస్కృతకృతులకివి తెలుగున ననువాదములు. ఇంతకుమున్నే యివి పలువురచే ననూదితములైనవి.

మూలముననున్న మధురిమ రప్పింపవలెనన్న నది యసాధారణకృత్యము. కావున నద్దానిగూర్చి విస్తరము వ్రాయనేల?

ఇందు పాదపూరణకై యనేక వ్యర్థపదములు ('లలి' ఇత్యాదులు) పదేపదే ప్రతిష్ఠనందినవి. ఒకొక పద్యము ఐదారు పాదములవఱకు బోడవుగొన్నది. ఇది మనోహరముకాదు. సాధ్యమైనంత నాల్గుపాదములలో మూలభావమును ముగించవలెను. లేకున్న వేఱొక వృత్తమును చేకొనవచ్చును. కాని సారెసారెకు పాదముల మాలికలుగట్టుట కొంత విసుగు గల్పింపకుండునా? ఐనను ధారాశుద్ధిగల పద్యము లిందు లేకపోలేదు. మచ్చుకొకొక్కటి.

'ధనువు సుమాళి, నారి యళి
తండము, బాణములైదు, మాధవుం
డును సచివుండు. గంధవహుఁ
డుగ్ రథముయ్యెత, మన్మథుండొకం
డు నిఖిలలోకజాలము గ
డుగ్ గడుఁగెల్చెభవత్కృపావిలో
కనమ హిమాస్పదుండగుట
గాదెహిమాచల కన్యకామణీ.
(సౌందర్యలహరి ౮.)

'వటుసేన్ బోయెడువాఁడు తీర ముఖముగ్
బాంథుండు నీరగ్ భయం
కర వర్షాచకితుండు గేహమును వీఁ
కగ్ సత్ప్రభు న్నిర్ధనుం
డరయం జీకటిఁ గుందు మానవుఁడు న
త్యంతంబు దీపంబు నే
పరణిం గోరునొ యట్లు గోరెద మహే
శ శ్రీపదాంభోజముల్.'
(శివానందలహరి; ౬౦)

వీనియందు అచ్చుతప్పులు లెక్కకు మిక్కిలియై ఎచటబట్టిన నట ప్రత్యక్షమగుచుండును. విరామచిహ్నము లత్యవసరములగు పట్టులగూడ లేకుండుట కడునసమంజసము. రెండవకూర్పున నైన చక్కజేసుకొందురు గాక.

మొత్తముపై గ్రంథకర్తగారు 'భక్తజనముల కత్యంతోపయుక్తమగుటచే దీని నిప్పటి కయినను బ్రకటించి ధన్యు' లయిరనుటకు సందియములేదు.

'విశ్వం'

---

## మల్లికామాధవము

గ్రంథకర్త: కీ. శే. మంగళపల్లి నాగేశ్వరరావు,
ప్రకాశకులు: "సాహిత్యలత" చీరాల.

ఇది ఐదంకముల తెలుగునాటకము. "సాహిత్యలత" గ్రంథమాలా సంపాదకులు కర్లపాలెం కృష్ణారావుగారు తమ సంపాదకీయములో నీ నాటకమును కీర్తిశేషుడగు కర్త అసంపూర్తిగ ముప్పదిసంవత్సరములకు పూర్వము రచించె ననియు, వీలున్నంతవరకు దిద్ది, సందర్భమునెఱిగి కొఱవభాగమును పూర్తిచేసితి మనియు, కర్త ప్రాతమర్యాదల ననుసరించినప్పటికిని కావ్యము రసవంతమగుట స్వీకరించి ప్రచురింప సమకట్టితి మనియు వ్రాసినారు.

గ్రంథనామము సూచింపుచున్నట్లు మల్లిక- మాధవుడు-వీరల ప్రణయగాథ యీ దృశ్యప్రబంధమునకు ఇతివృత్తము. కథాంశములు స్వకపోలకల్పితములు కావు. సరియైన యనువాదమును గాదు. ఈకథకు మాతృక షేక్స్పియర్ మహాకవి కృతమగు "రోమియో అండు జూలియట్" అను సుప్రసిద్ధ దృశ్యప్రబంధము. ఇది యా మహానాటకమునకు భాషాంతరీకరణమును కాదు. కేవలమగు అనుకరణము. ఈ గ్రంథకర్తకు ఆంగ్లమునసున్న షేక్సుపియరు కృతనాటకమును, అందలి యౌన్నత్యమును, భావగాంభీర్యమును గ్రహించి సర్వస్వతంత్రమగు ప్రత్యేక స్వరూపము నొసఁగఁగలిగిన ఆంగ్ల భాషా వైదుష్య ముండెనో లేదో యీ "మల్లికా మాధవము"ను బట్టి నిర్ణయింపజాలము. మాతృకయందలి మూలకథాంశములను మాత్రమే సేకరించి రచింపఁ

బడిన యీ నాటకమువలని ప్రయోజన మంతగ కన్పింపదు.

కథాంశములు, సర్వసాధారణములు. పాత్రల స్వరూప స్వభావాదులు, పాశ్చాత్యములు. భాష యా, తెలుఁగు. ఇందలి వ్యక్తులకును మనకును సహస్ర యోజనముల దూరము.

ఇలాంటి సందర్భములలో ప్రచారక మహాశయుల పరమోద్దేశము గోచరింపదు. యథాతథముగ "రోమియో - జూలియట్" కథను తెనిగింపఁ జేసినను వినోదప్రదము; ప్రయోజన సహితము. ఇందు ప్రయోగింపబడిన భాష, గ్రాంధికము. భావములు — కథయే పేలవముగ నున్నది. పద్యములు మాత్రము కొన్ని రసవంతములు.

పో. రామబ్రహ్మం

---

## అశ్విన్
### ప్రథమభాగము

రచయిత: శ్రీమాన్ శ్రీమదళహర తిరుమల మాడభూషి గోడవర్తి వెంకటనరసింహాచార్యులు.

డెమ్మిసైజు, చక్కని గ్లేజుకాగితము, షుమారు ౪౨౦ పేజీలు, వెల ప్రతి ౧-కి రు. ౨-౮-౦ లు.

ఏదేశమునకు చెందినదైనను సరే వైద్యశాస్త్రము బహు అగాధమైనది. హిందూదేశమున నీశాస్త్రము కేవలము 'బ్రహ్మణ వాచ' యేర్పడినట్లు తగిన సిద్ధాంతము లుండుటచేత నియ్యది దుర్గమమగు సంస్కృతమున నుండి సామాన్య మానవున కేమాత్రము అలవిగాకున్నది. ఆర్యావర్తము పరరాజుల వశము గావలసినంత దుర్గతి పట్టునంతవరకు నిచట ఆయుర్వేదమే బహుళ వ్యాపకమున నుండియుండెను. ఈదేశము కాలక్రమేణ ముసల్మానులకు, ఆంగ్లేయులకు వశమైన సందర్భములందు అంతవరకు ప్రబలముగ నున్న ఆయుర్వేదము క్షీణదశ నొంది యునాని, ఆంగ్లేయవైద్యములు ప్రధానము కాజొచ్చినవి. ఇరువదవ శతాబ్దారంభమువరకు నిచ్చట ఆంగ్లేయ, యునానివైద్యములే హెచ్చగు ఆదరమును పొందుచున్నవి. కిమ్మటు కొందరు మహామహుల నిరంతర కృషివలన ఆయుర్వేదము తలయెత్తినది. అటుపైని హోమియోపతి, బయోకెమిస్ట్రి, క్రోమోపతి మొదలగు వైద్య విధానములుగూడ వాటికితోడై యెట్టి వైద్య పద్ధతి ప్రశస్తమైనదో తెలియక వైద్యకోటియందు సహితము మనస్పర్థ లేర్పడుటకు తగినంత కలవరమును పెంచుచున్నవి.

ఈశాస్త్రము కేవలము పారిభాషిక సంబంధమైనదగుట సామాన్యులకు దుర్గ్రాహ్యము. సంస్కృతమున నున్న ఆయుర్వేదగ్రంథము లింతవరకు కొన్ని ఆంధ్రీకరింపబడి యున్నవి. కాని అవెల్ల మక్కికిమక్కిగ నున్న కారణమున వైద్యశాస్త్రాభ్యాసకులకు తప్ప తదితరులకు సాధ్యపడకున్నవి. ఈ నాటి కాలమానపరిస్థితులు సనాతనపద్ధతిని కొంత సడలింప ప్రేరేపించుచున్నవి. దీని ననుసరించియైన కళలు, శాస్త్రములకు సంబంధించిన కొన్ని విశేషాంశములు నూతన శక్కిని వెలువడజేయు టావశ్యకము.

శ్రీమాన్ నరసింహాచార్యులుగారు "అశ్విన్" అను నీ వైద్యగ్రంథమును పండిత పామరులకు సులభసాధ్యమగునట్లు రచించుటలో నూతన శక్కిని త్రొక్కిరని అంగీకరింపక తప్పదు. స్త్రీ పురుషులకు సులభగ్రాహ్యమగునట్లు ఆంగ్ల, ఆయుర్వేద, హోమియోపతి, బయోకెమిస్ట్రి, క్రోమోపతీల వైద్యవిధానముల గూర్చి అతివిపులముగ నీ గ్రంథమున నుదాహరించిరి. వైద్య సందర్భములు తెలియనివారికి సహితము ఈ గ్రంథము ఒకపాటి పరిజ్ఞానమును ప్రసాదించు ననుటలో ఏ మాత్రము సందేహము లేదు.

వైద్యవిద్యకు మొట్టమొదటి మెట్టు రోగనిదానము. రోగియొక్క జాడ్యచరిత్రను ముందుగ కూలంకషముగ గ్రహింపగలిగిననేగాని ఔషధ ప్రయోగము చేయ జనదు. రోగచరిత్ర నవగాహన చేసికొనదగు విధములు అనేకములు. నాడీచలనము, హృదయచలనము, నాడీభేదములు, ఊపిరి, శరీరోష్ణము, జ్వరమానము, చర్మము, ముఖము, నాలుక, నేత్రములు, మూత్రము, మలము మొదలగువాటికి సంబంధించిన వివిధలక్షణములు

గుర్తించిననేగాని సాధ్యముకాదు. ఆచార్యులవారు పై వాటినన్నిటిని వివిధ శాస్త్రపద్ధతుల ననుసరించి గుర్తించుట యెట్లో తేటతెలుగున విపులపరచిరి.

ఇంతేగాక చికిత్సా ప్రకరణమునందు సుమారు ౧౧౮ వ్యాధులకు సంబంధించి ప్రతిదానికి కారణములు, లక్షణములు, ఆంగ్ల, ఆయుర్వేద, హోమియోపతి, బయోకెమిస్ట్రియున్నగు వివిధ వైద్యవిధానముల ననుసరించి చేయుతగిన చికిత్సాపద్ధతులు, ఆహారనియమములు, సలహాలు చక్కగ వివరించిరి. ఆయుర్వేదమునకు సంబంధించిన కొన్ని చిటకాలమాదిరి చికిత్సలు కేవలము అనుభవము మీద రచించినట్లు స్పష్టపడుచుండుటచే సామాన్యులకు సహితము ఈగ్రంథము ఉపయోగకారిగ నుండగలదు.

పై ౧౧౮ కి తోడు పాండు, భగందరము, ఉన్మాదము, కుష్ఠు, బొల్లి, బోదజ్వరము, తలలో చుండు, వెంట్రుకలూడుట, మొదలగునవి, నేడతి ప్రబలముగనున్న కొన్ని శిశువ్యాధులనుగూర్చి గూడ రచయిత మరికొంత శ్రమవహించి యీ గ్రంథమునందు చేర్చియుండవలసినది. రెండవముద్రణమునందైన పైవాటిని చేర్చెదరుగాక.

ఒక శాస్త్రియునే స్వాధీనపరచుకొనుట సాధ్యముకాని యీ దినములలో నాలుగురకముల వైద్యవిధానముల నవగాహనచేసికొని యేకగ్రంథమునం దిమిడ్చిన ఆచార్యులవారి సమర్థతను, కృషిని, లోకోపకారకబుద్ధిని కొనియాడకలసియున్నది. 'అశ్విన్' గ్రంథము ఆంధ్రదేశమున ప్రతియింట నుండతగినది. సచిత్రముగ వీరి "అశ్విన్" రెండవ భాగము గూడ త్వరలో వెలువడగలదని వినుట కెంతేని సంతసించుచున్నాము.

గ్రంథములు డాక్టరు జి. వి. నరసింహాచార్యులు, చేబ్రోలు, పశ్చిమ గోదావరిజిల్లా అని వ్రాసికొనిన బడయగలరు.

వ. కుటుంబరావు.

---

## సందేశ తరంగిణి
## (శ్రీ వివేకానంద ప్రవచనము)
### (ద్వితీయభాగము)

డెమ్మీసైజున ౨౧౭ పుటలు.

మదరాసు శ్రీరామకృష్ణ మఠమువారిచే ప్రచురితము. వెల రు. ౧-౦-౦.

భారతదేశము నేడు హీనస్థితియం దున్నది. పూర్వ మీదేశము బహుఔన్నత్యదశ ననుభవించియున్నదనుటకు లక్షలాది దృష్టాంతములు మనకు నేటికిని ఋజువులుగ నున్నవి. ప్రతిభారతీయుడును తన దేశము తిరిగి తేజోమయముగను, మాననీయముగను, మహిమాఢ్యముగను వెలయునట్లుల జేసికొనువరకు యీ జాతి సభ్యజాతిగ పరిగణింపబడజాలదు. భారతదేశ సమస్యలు బహుళములు. సంఘము, మతము, భాష, పరిపాలనము మొదలగు నన్నియు నీ దేశమున అనేక హేతువుల నాధారముగ చేసికొని నేడు వక్రమార్గమున నడచుచున్నవి. భిన్నమతములు, భిన్నభాషలు, భిన్నఆచారములు, పరరాజ్యము మనసంతతిలో పొరపులు కల్పించి ఐకమత్యమును నశింపచేసినవి. భారతదేశము పునరుద్ధరణ చెందవలెనన్న మున్ముందు ఐకమత్యమును బోధించవలెను. సంఘబలమన నెట్టిదో స్రుతపరుపబడవలెను. నేడీదేశమున అట్టిదానిని బోధించుచున్న మహాసంస్థ కాంగ్రెసు ఒక్కటే. కాంగ్రెసు యొక్క లక్ష్యముఒక్క రాజకీయములందేగాదు జాతీయవికాసమునకు తోడ్పడనెంచు ప్రతియొక్కనికి కాంగ్రెసు కరచాలన మొసర్చును. దేశీయు లింతశ్రమపడుచున్నను దేశాభ్యుదయ మంతకంతకు దూరమగుచుండుటకు హేతువు భిన్నలక్ష్యములతో, భిన్నసంఘము లేర్పడి భిన్నమార్గము నవలంబించి పనిచేయుచుండుటే.

జాతీయాభివృద్ధికి మతమే ప్రధానమనియు తక్కిన రాజకీయ సాంఘిక విషయములు కేవలము ఆనుషంగికములనియు శ్రీవివేకానందుని నమ్మకము. మతమునకు సంబంధించిన ఆధ్యాత్మిక జ్ఞానమెల్ల దుర్గమమగు

సంస్కృత భాషయం దిమికియున్నది. అందుగల యు త్కృష్ట భావరాశినెల్ల వెకలించి తన్మూలమున జాతి నంతను సంస్కృత పండితుల చేయవలెనని వీరితలంపు. రామానుజులు, చైతన్యుఁడు, కబీరువంటి మహిమా ధ్యులు వారివారి ప్రయత్నములందు విఫలు లగుటకు కారణము సంస్కృతభాషను వ్యాపింపజేయుటయందు శక్తిని వినియోగింపకుండుటయేనని వీరియూహ. లక్ష్య మునకనుగుణముగవీరు కొన్నిమతగ్రంథములప్రచురించిరి.

శ్రీవివేకానంద స్వాములవారు ౧౮౯౩ సంవత్స రమున అమెరికాయందు జరిగిన అఖిలప్రపంచ మహామతసభలో వేదాంత మతోపన్యాసముల నొసగి అసదృశ దిగ్విజయముగాంచి భారతదేశమునకు మరలి వచ్చినపిమ్మట ప్రథమముగ భారతసోదరులం గూర్చి కొలంబో మొదలు హిమవద్గిరియందలి ఆల్మోరావరకు అందందు సలిపిన యుద్బోధనల సంపుటీకరణమే యీ "సందేశతరంగిణి". ఆంగ్లేయ భాషయందు గల ఆ దివ్య ప్రబోధమును తేటతెలుగున శ్రీతత్వానందస్వాములవా రనువదించిరి.

శ్రీ వివేకానందులవారు తమ యుపన్యాసముల యందు భారతదేశ భావిభాగ్యోదయము, భారతదేశ బహుళసమస్యలు, భారతీయ జీవనరహస్యము, కుల సమస్య, సంస్కృతవిద్య, స్త్రీల ఆధికమత్యము, ఇతర మతనిమయొక్క సమస్యలు మొదలగు ననేకాంశ ములగూర్చి విపులపరచిరి. జాతీయవికాసమును గోరు చున్న ప్రతియొక్కరు గమనింపవలసిన వివిధ విషయ ములు అనేకములుగలవు. నేడిట్టి యుద్బోధనల కెంతేని అగత్యము గలదు. వీరిప్రయత్నము రామానుజులు, కబీరుల ప్రయత్నములవలె విఫలమగునో, సఫలత చెందునో నేడు మనము చెప్పలేకున్నను జాతీయ వికా సమే లక్ష్యముగాగలిగిన వీరుగూడ కాంగ్రెసునందు దేశీ భవించి యేకముఖమున ఐకమత్యముతో కృషిసలిపినచో భారతజాత్యుద్ధరణము త్వరలో సంభవించగలదు.

వ. కుటుంబరావు

——

## నందనార్

పద్యకావ్యము. గ్రంథకర్త: బాలకవి శ్రీ అల్ల మరాజు నారాయణరావు. క్రౌను ౬౭ పుటలు. వెల ౧ అణాలు. ప్రకటనకర్తలు ఆంధ్రవాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

పరమశివభక్తుడును, ఆదిద్రావిడుడు నగు నంద నారు చిదంబరక్షేత్రమున లింగైక్యము చెందిన కథ యిందు వర్ణితము దీనికి మూలము శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహముగారి 'నందచరిత్రము'

నందనారుచరిత్ర మినివరకే తెలుగున గద్య, పద్య, నాటకాద్యాత్మకముగ పలువురిచే వ్రాయబడి నది. కాని యవి అన్నియును మూలమునందలి చరిత్ర మును అనుసరింపక స్వతంత్రమార్గముల మెట్టినవి ఇది యును నానిరీతినే యున్నది. మూలములగు ద్రావిడగ్రంథ ములను చదివి- లేదా- చదివించి అందలి కథనే తెలు గున కూర్చినచో దీనికి కొంత ప్రత్యేకత అబ్బియుండె డిది. మూలము ననుసరింపమిచే కలుగు లోపము లిం దును కన్పట్టుచున్నవి.

నందనారుస్వామి 'ఇల నాలుగునూరు వత్సరముల క్రిందటివాడని ఇందు వ్రాయబడినది. అతడు క్రీ. శ. ౧ వ శతాబ్దికంటె ప్రాచీనుడు, ఇప్పటికి ౧౩ నూరుల యేండ్లక్రిందటివాడు. అతని నివాసస్థలము 'ఆదనూరు' గాని ఇందున్నట్లు 'ఆధనూరు' కాదు. నంది కదలిన దేవస్థలము 'తిరుప్పుంగూరు' కాని ఇందు చెప్పబడినట్లు 'చిదంబరము' కాదు.

ఈ గ్రంథమున కవితాధార అనర్గళమయినను శుద్ధి తక్కువ. కుదిరికకయి ఇందలి పద్యములు చాలవ రకు నియమితములగువానికంటె ఎక్కువపాదములతో నడచినవి. ఇందొక్కచో అకాలపుబ్రాహ్మణులు మితిమీరి నిందింపబడియు, వేరొకచో మితిమీరి కొనియాడబడి నారు. పద్యములు రసవంతములు కావు.

ఇందు 'రవిసంద్రము, చంద్రార్కము', (ఆరవి చంద్రము, ఆచంద్రార్కము అనుటకు) సేవకాలతతి, (సేవకతతి అనుటకు) పట్టనిర్మాణ సభికులు, మకుటరా హిత్యుడు, (నాటిమాలల దుఃస్థితి) నీచభూయిష్ఠము, కోసేరునొందు, కులగుర్వు, (కులగురువనుటకు) శక్తిరా హిత్యుండు, దీక్షితాగులు, దీక్షితాగు (దీక్షితులనుటకు) మొదలగు అప్రప్రయోగములును, 'ఉన్నత, రోహితా శ్వంబు, పిలచి మొ. అచ్చుతప్పులును కలవు. గ్రంథకర్త

గారి కవిత ఇంకను బాల్యదశయందున్నది. వీరు సత్కవులు కావలెనన్న సారస్వత, లక్షణములయందు ఎక్కువ కృషి ఒనరింపవలెను. ర.

---

## శ్రీ విజయవాడ కనకదుర్గా కంఠమాల

పద్యములు; సదండకము. గ్రంథకర్తలు: శ్రీ వేంకట నారాయణకవులు. (కుందుర్తి వేంకటశాస్త్రి, అల్లమరాజు నారాయణరావుగార్లు) క్రౌను ౧౧ పుటలు. వెల అరణా.

ఇందు ౩౨ పద్యములలో బెజవాడలోని కనకదుర్గ స్తుతింపబడినది. ఇందలి రచన బాగుగ సాగినను రసము మృగ్యము. అచ్చటచ్చట సందర్భము లేకున్నను ఇప్పటివారల నడవడి పరామర్శింపబడినది. దీనిలో 'నమోపార్వతీ' వంటి అచ్చుతప్పులును, 'సద్గుణామణి, కవితంబు' లవంటి అపప్రయోగములును ఉన్నవి. ఈజంటకవు లింకను పరిశ్రమించి తగినపాండితిని సంపాదించిన పిదప గ్రంథరచనకు కడంగుట శ్రేయము. —ర.

---

## మోహలేఖ

పద్యములు. క్రౌను ౧౨ పుటలు. గ్రంథకర్త: బాలకవి అల్లమరాజు నారాయణరావు. వెల అరణా.

మోహోన్మత్తుడొకడు తాను వలచిన మోహనాంగికి వ్రాసిన జాబిది. నాయికకుమాత్ర మాతనిపై వలపున్నట్లు కనబడదు. నాయకమాత్రగత మగుటచే నిందలి ప్రణయ మాభాసమాత్ర మగును. వలపుపిచ్చి బాగుగ తలకెక్కుటచే గాబోలు నాయకుడు కొన్నియెడల తన్ను ఉత్తమోత్తమునిగను, కొన్నిచోట్ల నీచాతినీచునిగను వర్ణించుకొనినాడు. అతని దైన్యము, హృదయదౌర్బల్యము నిందు ప్రతిపద్యమునను సువ్యక్తములు. గ్రంథకర్తకవిత బాల్యదశయం దుండుటచే నిందు పద్యముల గమనిక బాగుగ సాగినను పరిణతిని పొందలేదు. పద్యములు రసవ్యంజకములు కాక అసభ్యవర్ణనములతో వెలయుచున్నవి. భావసమాప్తి కొరకు వాక్యము పూర్తియగుటకు నిందలి పద్యము లెక్కువ పాదములను కూర్పబడినవి పెక్కుగలవు. 'జ్యోతిషోత్తములు' 'ఇలు నత్యంతరయంబె' (ఇంటి నత్యంతరయంబో అనుటకు) 'ద్రోహులకు' ను. అపప్రయోగము లింక కలవు. కవి తనకుగల భూగోళశాస్త్రజ్ఞానమును 'పునహా, యూరపు, ఫ్రాన్సు, కెల్జియములన్, బొంబాయి, బెంగాలు, జర్మను, రష్యా, యిటలీ, జపాను, మొదలౌ రాష్ట్రింబులన్ జూచితిన్' అని విశదపరచుచున్నాడు.

ఈ 'బాలకవి'కి శారద 'సరసమృదూక్త సంకలిత సత్కవితారచనా ప్రభావమున్, గురుకరుణార్ద్రచిత్తమునం గూర్చెద వీవెది వ్రాయంబూనినన్' అని వరము నొసగెనట.

తగిన కృషి సల్పి పాండిత్యమును సంపాదించి కవిత చెప్పినచో మున్ముందీ బాలకవి మంచికవి కావచ్చును. ర.

---

## శ్రీ కన్యకా పరమేశ్వరీస్తవము

గీతమాలిక. దండకసహితము. క్రౌను ౧౫ పుటలు. గ్రంథకర్త: బాలకవి అల్లమరాజు, నారాయణరావు. ప్రచురణకర్తలు: యడవల్లి సుందరరామయ్య, కుందుర్తి వేంకటశాస్త్రి, బెజవాడ. వెల ౨ అణాలు.

వైశ్యుల కిలువేల్పగు కన్యకాదేవిచరిత్ర మిందు గీతమాలికగా కూర్పబడినది. కథ ఛందోబద్ధమగుటయే యిందలి విశేషము. వెల మిక్కిలి ఎక్కువ. —ర.

---

## శ్రీ సీతానగరాంజనేయ కంఠమాల

పద్యము. సదండకము. గ్రంథకర్త బాలకవి అల్లమరాజు నారాయణరావు. క్రౌను ౮ పుటలు. వెల ఒక అణా. ప్రకటనకర్తలు వేమూరి కోటయ్య, శనగపల్లి సత్యనారాయణ, కూరపాటి సత్యనారాయణ, కొల్లిపర కోటేశ్వరరావు, బెజవాడ.

బెజవాడకు చేరువ గల సీతానగరమునందలి ఆంజనేయస్వామి యిందు ౩౨ పద్యములచే స్తుతింపబడినాడు. రచన హృదయంగమముగా లేదు. ఇందలి అక్షణికప్రయోగములు కొన్నికలవు. వెల అధికము. —ర.



# సాభిప్రాయ విశేషములు



ఈశ్వరసంవత్సరము; ఉత్తరాయణము; వసంతము; చైత్రమాసము. విశ్వమంతయు ఆనందమయము. తరులతాగుల్మములకు నవపల్లవములు నూతనశోభను ప్రత్యక్షము చేయుచున్నవి. నవపల్లవములు సూర్యకాంతి విలసితములైన సప్తవర్ణములను ప్రతిబింబించుచున్నవి. నవపల్లవ ప్రతిబింబితములైన చిత్రవిచిత్రకాంతులు ప్రపంచాధారమైన విశ్వానురాగమును స్మరింపజేయుచున్నవి. శీతలప్రదేశములకు సాధ్యముకాని ప్రకృతిసౌందర్యానురాగము ఉష్ణప్రదేశములందు వసంతమునందు పల్లవములు, పుష్పములు, ఫలములు జడులకును జీవితపరమార్థమైనవిశ్వేశ్వరయోగమునుబోధించుచున్నవి. విశ్వచిత్రకారుని మహిమను చరాచరప్రపంచమంతయును వసంతరూపముననను సువ్యక్తము చేయుచున్నది. ఎండిన ఆకులు రాలిపోయి, రసవంతములైన నవాంకురములు నూతనాశా విలసితములై జడమయమైన మానవప్రవృత్తికి విశ్వరహస్యమును విశదము చేయుచున్నవి.

సప్తవర్ణముల వలె సప్తస్వరములును విశ్వానురాగమును గానముచేయుచున్నవి. కోకిల మధురారావములు, పిట్టలపాటలు దశదిశలందును మారుమ్రోగుచు విశ్వహృదయానందమును స్మరింపజేయుచున్నవి. ప్రకృతి జీర్ణవాసవలను విసర్జించి నవవిలాసవిలసితమై ఆనందతాండవముచేయుచున్నను మానవుల అభిమానాహంకారములు ప్రకృతిసిద్ధమైన ఆనందానుభవమునకు ప్రతిబంధకములుగ నున్నవి.

*   *   *   *

అభిమానాహంకారములు

వ్యక్తులు, సంఘములు, జాతులు స్వాభిమానాహంకారావేశపరవశులై చేయుచున్న ప్రళయతాండవ ప్రయత్నములు భయంకరముగ నున్నవి. స్పెయినునందు నిరపరాధులైన స్త్రీలు, పిల్లలు, వృద్ధులును ననుభవించుచున్న బాంబుల బాధ ప్రపంచమనుభవించ నున్న దుఃఖానుభవమునకు సామాన్య దృష్టాంతము. స్పెయినునందు స్వదేశీయులు పూనిన పరస్పర ద్వేషము ప్రపంచ వ్యాప్తమైన ద్వేషానల ప్రభావమునకు నిదర్శనము. స్వోత్కర్ష పరాయణమైన ప్రపంచమునం దభిమానాహంకారముల ప్రతిష్ఠ అప్రమేయము. హిట్లరు, ముస్సలోని, బాల్డువిను, ఫ్రాంకోగారులు మొదలగునాయకులు భిన్నరూపములను ప్రపంచము నావరించిన దురహంకార దురభిమానములనె చాటుచున్నారు. హిట్లరుగ్గారి స్వోత్కర్ష వలెను బాల్డువినుగారి స్వోత్కర్షయును మానవధర్మారాధనమును దుర్లభము చేయుచున్నది. ఒకరిని స్వోత్కర్షాభిమానమును, ఇంకొకరిని సామ్రాజ్యాభిమానమును, వేరొకరిని స్వదేశ స్వజాతీయాభిమానములును పీడించుచు స్వధర్మారాధనమును దుర్లభము చేయుచున్నవి. వేదాంతము వలెను యూరపు రాజ్యాంగ వ్యవహార సిద్ధాంతములు పరమ

గృహ్యములు. యూరపు రాజ్యాక్రమణము నందున్న దేశములందును ఈ రాజ్యతంత్రమే పరిపాటి అయినది. హిందుస్థాన రాజ్యాంగములందు సంభవమైన విషాదావస్థ విషయమై స్వదేశీ విదేశీమంత్రులు చేయుచున్న ధర్మవ్యాఖ్యానములు దురభిమాన, దురహంకారములను ప్రత్యక్షము చేయుచున్నవి. మాయమంత్రుల వ్యాఖ్యానములు, ప్రగల్భములు విస్మయమును గలుగజేయుచున్నవి.

*　　*　　*　　*

కాంగ్రెసు - మంత్రులు

ఎన్నికలు జరిగి యొకమాసము గతించినది. ఎన్నికలందు ప్రజలు స్వాతంత్ర్యాభిలాషను, కాంగ్రెసుపట్ల విశ్వాసమును సువ్యక్తము చేసిరి. రాష్ట్రీయస్వాతంత్ర్యము రాజ్యాంగశాసనమునందు శూన్యమని స్పష్టమైనది. మంత్రులు ప్రజలకు బాధ్యతలేకుండ కార్యదర్శులకు, గవర్నరులకు, బ్రిటీషు రాజ్యాధికారులకు బాధ్యతను వహించుచున్నారు. గతించిన రాజ్యాంగసంస్కరణశాసనములవలెను కాలయాపనలేకనే గాంధిమహాత్ముడు తనకుగలఆత్మవిశ్వాసమూలమునను వర్తమానశాసనమునుసువ్యక్తము చేసెను. గాంధీమహాత్ముడు కోరినఅభయముశాసనసమ్మత మనియును, శాసనవిరుద్ధము కాదనియును రాజ్యాంగవేత్తలు, నాయకులు గతమాసమునందు చేసిన ప్రసంగములు, వ్యాఖ్యానములు వేయినోళ్లను చాటుచున్నవి. మహాత్ముడు కోరిన అభయము సశాస్త్రీయమైనదియును, అశాస్త్రీయ మైనదియును నిర్ణయించుటకు మధ్యవర్తులను నియమింపమని గాంధీగారు కోరిరి. కాని జట్లాండు ప్రభువు, బట్లరుగారు, గవర్నరు జనరల్లు, గవర్నర్లు ససేమిరా అనుచున్నారు. ఈ విషాదావస్థను తొలగించవలసిన భారము బ్రిటీషు రాజ్యాధికారులమీద కలదనుట నిర్వివాదాంశము. కాని వారి హృదయములందు సంచలనము కలుగకుండుట సంతాపకరము. పట్టాభిషేక మహోత్సవమునకు గ్రేటుబ్రిటనునందును, హిందూస్థానమునందును ప్రయత్నములు మామూలుగానే జరుగుచున్నవి. కాంగ్రెసు మహోత్సవమును బహిష్కరించుటకు నిర్ణయించినది. ఈ12-వ తేదిని ప్రజానాయకులు ప్రశాంతముగను కాంగ్రెసు కార్యవిధానమును నిర్వహింతురుగాత!

*　　*　　*　　*

గాంధీమహాత్ముడు - కాంగ్రెసు

గాంధీమహాత్ముడు గతించిన రెండేండ్లనుండియును కాంగ్రెసు రాజ్యాంగ వ్యవహారములనుండి విరమించినను కాంగ్రెసు వ్యవహారములు వారి ఆలోచనమీదనే నడుచుచున్న విధమును వార్ధా, ఢిల్లీ, ప్రయాగ సమావేశములు విశదము చేయుచున్నవి. కాంగ్రెసు పార్లమెంటరీ విధానమును అవలంబించుటకును సత్యాగ్రహమును విరమించుటకును నిర్ణయించి, ఎన్నికలందు పాల్గొని అఖండవిజయమును బడసినది. బ్రిటీషు ప్రభుత్వాధికారులు కాంగ్రెసువిజయమును నిరర్థకముచేయుటకు చేసిన ప్రయత్నములు తాత్కాలికముగ సఫలములైనను బ్రిటీషు ప్రభుత్వ ధర్మప్రతిష్ఠలను నాశనము చేసినవి. గాంధీమహాత్ముని ధర్మసిద్ధాంతముప్రపంచమునందంతటను ప్రతిధ్వనించినది. బ్రిటీషు

రాజ్యాధికారులు గాంధీమహాత్ముని ధర్మ సిద్ధాంతములను నిరాకరించుటకుగాని, ఆదరించుటకుగాని సందేహించుచున్న విధమును వారి సంభాషణలు విశదము చేయుచున్నవి. బ్రిటీషు రాజ్యాధికారుల నిరంకుశత్వము, ధర్మవిముఖత్వము ప్రజాశక్తిని విజృంభింపజేయు చున్నవి. ప్రజాహృదయమునందు అపూర్వమైన సంచలనము బయలుదేరినది. గవర్నరులు శాసన సభలను సమావేశము చేయకుండ, మాయమంత్రులద్వారా చేయుచున్న పరిపాలనము పరమాసహ్యముగ నున్నది. ఈదుష్పరిపాలనము త్వరలో నంతము నొందుట సహజము. క్రొత్త ఎన్నికలు జరిగినను, గవర్నరులు రాజ్యాధికారమును స్వీకరించినను ఇండియా ఆక్టు మృతాతుర మైనదనుట నిర్వివాదాంశము. ధర్మాత్ముడైన గాంధీమహాత్మునకు కుతంత్రము నారోపించుటయవివేకము. సత్యాగ్రహమూర్తి అయిన గాంధీ మహాత్ముని పవిత్రహృదయము నందు తంత్రములు స్ఫురింపవు. జవహర్లాలు నెహ్రూ, రాజేంద్రప్రసాదు, రాజగోపాలాచార్లు, వల్లభాయిపటేలుగార్లు మొదలగు నాయకులు దిగంతములందు స్వాతంత్ర్యశంఖారావమును పూరించుచు ప్రజాశక్తిని విజృంభింపజేయుచున్నారు. గాంధీమహాత్ముని ధర్మ సిద్ధాంతమును విమర్శించుటకును, ఆలోకించుటకును, ఆచరించుటకును శక్తిప్రయత్నములను చేయుట బ్రిటీషు సామ్రాజ్యమునకును, హిందూస్థాన యోగక్షేమములకును, ప్రపంచ శాంతికిని పరమార్థము.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.

# విషయసూచిక




సంపు. ౧౪ ఈశ్వర సంవత్సరము, జ్యేష్ఠమాసము ( జూన్ ౧౯౩౭ ) సంఖ్య ౬

# చకోరాశ్వాసనము

మేడవరపు రామబ్రహ్మశాస్త్రి

క్రమముగాఁ బున్నెములె మూటగట్టినావె?
కోటిజన్మల నోయిచకోరకంబ!
మబ్బుతెరనిండు నెల కనుమూసినంత
నులికెదవు చిన్నవోదు వాకులతఁ గొనెదు.

కవ్వపుంగొండరాయిడిఁ గలఁగి వెల్లి
విరియు మున్నీటిపెన్నీట వెలలి, నీదు
పెన్నిధానంబు వేలుపుఁబెద్దకేనిఁ
జేపడనినాఁడు నవసుధాసీధుచంద్రి
కాప్రపూరంబపాంనిధి కలింభంగ
సంగతికిఁ బాఁపి రాయంచసరణిఁ దోఁప
గొరలి తొలిబువ్వముగ నారగింపలేదా!

నవనవోద్యత చంద్రికానళిననాళ
పారణ తనంత నబ్బి యప్పట్ల నెంత
చవులఁ దేలించెనో యెట్టితవుల మొదవఁ
జేనోసె? యెట్టు లానందసింధునిభృత
మానసాంభోజమును జేసి మప్పికొనెనో?
దైవమ యెఱుంగుఁబో! నీదుతనువుగునువు.
కాలగతి చెట్టమై తలకడచి నడువఁ
గడువఁగొలఁదియె? యిఱుమనిపిడుగుమ్రాడ్కిఁ

గాలకూటంబుతోఁబుట్టి యాకంఠముగను
గ్రోలి గట్టునఁ ద్రేచిన ఘోరమూర్తి
పునుక పేరులు దాల్చిన బూచి, పాఁప
జందెముల నందగించిన సాహసికుఁడు
వింతక్రేగంట మరుఁ గాల్చువెగటు, వలచు
వెలఁది కర్ధాంగ మొసఁగిన వేలి, యంత
కాంతకుఁడు నాఁగ నొక్క మహానటుండు
ప్రాగ్భవార్జిత తావకప్రచురసుకృత
సారసంభూత నీబాలచంద్రరేఖ
నొడిసి పెడకేల నీదునోరడఁచి నిజశి
రోగృహాంతర కారావరుద్ధఁ జేసి
యలము కెంజడపిండు కావలి యొనర్చి
సిలుఁగులం బెట్ట వలవంతఁ జెందలేదా?

పద్మజాండకటాహ గర్భంబునిండి
నిబిడ మయి కారుచీఁకట్లు నింగిఁ బ్రాఁకి
కడలు దిగమ్రింగి తొల్లి నీకన్ను వాడుచు
నాఁడు కడలేని వేదన గోడు గుడిచి
పలపలని సంజచిగురుజొంపములు నిక్కి
మొగ్గదొడిగిన క్రొన్నెలఁ మొనలు చిట్లు
కన్నెవెన్నెలరేకులఁ గమిచికమిచి
మేతు నేయంచుఁ గ్రుక్కిళుల్ మ్రింగలేదా?

అమ్మహానటు సాంధ్యనాట్యాంతమూర్ఛ
నాకులజటావిటంకపర్యస్త యగుచు
నాకసం బంటి పూర్ణకలాకలాప
ముల్లసిల నేఁడు జాబిల్లి యుదయమంది
కనులపండువుగాఁగ సాక్షాత్కరించి
చిలుపచిలుపని నవసుధల్ చినికి మినుకు
మినుకునం గ్రొత్తరుచి మేరమీఱఁ దొనుకు
కుల్కుబెళ్కుల వెన్నెలల్ గురిసి నీదు
చిత్త మెత్తెలఁ గొని తమిఁ జిక్కఁబట్టి
నిరుపమానందరసఝరీనిర్నిరోధ-
మజ్జనోన్మజ్జనముల మైమఱపుఁ గూర్పఁ
దమక ముడివోక తద్రుచుల్ తవిలితవిలి
నేను గోరినకొండల వాన గురిసె
మొఱప ఆనేల బలువింత మొలక లెత్తె
ననలుఁ గొమ్మలునై కోర్కె కొనలుసాగె.

మూఁడు పూలాఱుకాయలై మొఱడుకొఱడు
లేక మూలంబుముట్ట ఫలించె; సాటి
పులుఁగు మొత్తంబులను నేనె పుణ్యమూర్తి
ననుచు నెనలేనితనివి నీ వెలయలేదె?

క్రమముగాఁ బున్నములె మూటగట్టినావె?
కోటిజన్మల నోయీ చకోరకంబ!
మబ్బుతెర నిండు నెల కనుమూసినంత
నులికెదవు చిన్నవోదు వాకులతఁ గొనెదు.

—

# FOR PERFECT RECEPTION OF BROADCASTING IN

*Coronation year*






*Use a British made Receiver*

# "HIS MASTER'S VOICE"

శ్రీ జార్జి ప్రభుని పరిపాలనారంభసమునకు

“హిస్ మాస్టర్స్ వాయ్స్” రేడియో రిసీవర్లు!

మాడెల్ 473 ACIDC రూ 325/- మాడల్ 49 AC రూ 280/- మాడల్ 481 AC రూ 350/-

నేడే మాకై “హిస్‌మాస్టర్స్ వాయ్స్” రేడియో రిసీవరును కొనుడు!

ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్, బెంగుళూరు.

# పూర్ణ

[అనువృత్తము]

## ౨

వాసిష్ఠగణపతిముని

### మొదటి ప్రకరణము

కుటుంబసభ

జ్యేష్ఠశుద్ధసప్తమీ మంగళవారమునాఁడు మధ్యాహ్నభోజనానంతరము భవనందిగారింట కుటుంబసభ జరిగినది.

భవనందికుటుంబము మిక్కిలి పెద్దది. ఇద్దఱు కుమారులు నేడుగురు కొమారితెలును కలిపి తొమ్మండ్రుగురు భవనంది సంతానము. పెద్దకుమారుఁడు, కోశాధ్యక్షు గుణాకరుఁడు. చిన్నకుమారుఁడు నగరపాలఘునేంద్రుఁడు. కొమారితెలలో జ్యేష్ఠురాలు పరివ్రాజికశుభ్రాంగి. సర్వకనిష్ఠురాలు భానుమతికన్య. తక్కిన యైదుగురు కొమారితెలు తమ యత్తవారిండ్ల కాఁపురము సేయుచున్నారు. విశాలాక్ష ప్రమతి ధర్మవర్ధన బలవర్ధన వీరనాథు లతని యల్లుళ్లు. అన్నియు మంచిసంబంధములే.

ప్రకృతము ననుసరించెదము. భవనందియు, భార్య వైజయంతియు, పుత్రులు గుణాకరఘునేంద్రులును, కన్య భానుమతియు నాలోచించుట కొకచోటఁ గూడిరి. విరక్తయగుటచే శుభ్రాంగియు స్వస్వగృహకార్యవ్యాపృతలగుటచే నితర వివాహితపుత్రికలు నాలోచనమున కాహ్వానింపఁబడలేదు. తమ పంచకనుయొక్క యాలోచనమే సరిపోవు నని భవనంది తలంచెను.

భవనందినిగుఱించి యింతకు ముందే మా పాఠకులకు పరిచయము గలిగించితిమి. అతనిభార్య వైజయంతి గుణములందు భర్తకనురూపురాలు. గృహకార్యదక్ష యగు గృహిణి. పతిభక్తయగు నిల్లాలు. ఆమె భర్తకంటె నాలుగేండ్లు చిన్నది.

గుణాకరుఁడు తండ్రిని మించిన విద్వాంసుఁడు. నయవేత్తలలో నగ్రగణ్యుఁడు. సాధారణ రూపశాలియే యైనను విజ్ఞానకళచే జనుల నాకర్షించు ముఖశ్రీ గలవాఁడు. స్వపక్షస్థాపనచతురుఁ డగు వక్త. నలువది సంవత్సరములు వయస్సు గలవాఁడు. వత్సలుఁడగు పిల్లలతండ్రి. ఏకపత్నీవ్రతుఁడగు గృహస్థుఁడు. రాజభక్తుఁడగు పెద్ద యుద్యోగస్థుఁడు.

ఘనేంద్రుఁ డసాధారణ పురుషుఁడు. భవనందిగుణాకరుల విద్య శిక్షాలబ్ధము. ఘనేంద్రుని విద్య ప్రకృతిసిద్ధము. శిక్ష దానిని వికసింపఁజేసినది. ఎంత చక్కని మానవుని రూపములోనైన నేదియో లోప ముండును. అతనిరూపములో లోప మేదియును లేదు. అతనిరూపము పార్థివమే యైనను దివ్యముగా కన్పట్టుచుండును. ఒక విశేషముమాత్రము గలదు. అది యనిమేషము. ఇది సనిమేషము. ఆ విప్రయువకుఁడు శాస్త్రవిద్యలతో తృప్తినొందక శస్త్రవిద్యలనుగూడ నాచార్యవిషమసిద్ధియొద్ద నభ్యసించియాంధ్రరాష్ట్రము నందేకాక భూప్రపంచమునందే మేటివీరుఁడయ్యెను. రాజధానియందలి శిక్షితయువకుల కితఁడు నాయకుఁడుగా నున్నాఁడు. కుమారశక్తిధరునితో నితనికి మంచి మైత్రి గలదు. కాలనాథ మల్లికార్జును లితనికి ప్రాణస్నేహితులు. ఇతనివయస్సు సుమారు పాతికయేండ్లు.

భానుమతి వీరసింహుఁడు పొగడిన నిత్యప్రసన్నముఖి. రూపచంద్రుఁడు పొగడిన పవిత్రమూర్తి. రాజకాళి పొగడిన బోధమహిమగలది. దోషజ్ఞుఁడగు సుమిత్రుని కండ్లుగూడ నామెను మహాసుందరినిగా నిర్ణయించినవి. అతని నిర్ణయములో పొరపాటుండదు. శరీరచ్ఛాయయం దామె తొలకరి మెఱుపు. పదునెనిమిదిసంవత్సరము లామెకు నిండినవి.

భవనంది సుమిత్రుఁడు సూచించిన సంబంధమును గుఱించి యా కుటుంబసభలోఁ జెప్పి యిట్లు పలికెను—

"దీనిని గుఱించి యంగీకరించుటకుఁ గాని తిరస్కరించుటకుఁ గాని కొంత యధికారము భానుమతికే యుండవలెను. ఆమె యేదియో నిర్ణయించుకొనుటకు ముందు మనము తమ తమ యభిప్రాయము నామె దగ్గఱ చెప్పవలెను." (వైజయంతిని జూచి) "నీ వేమనియెదవు?"

వైజ—దూర మను దోషము తప్ప తక్కిన దంతయు బాగున్నది. మన యాడపిల్ల లందఱును నగరిలోనే యున్నారు. కడసారపుపిల్ల యొక్కరితె మాత్రము దూరము వెళ్లిపోవు ననిన నా మనస్సు వెనుకఁబడుచున్నది. రాజకుమారులలో నొకండు గాని దండనాయక ధనంజయుఁడుగాని మనకు లభింపనపుడు దూరమైనను వచ్చిన సంబంధము నుపోగొట్టుకొనఁగూడ దనియే నా మతము.

భవ— (గుణాకరుని జూచి) పెద్దబ్బాయీ! నీ యభిప్రాయ మేమి?

గుణా—ఒకవంక కోటీశ్వరుఁడు హిరణ్యనాభుఁడును, మఱియొకవంక ప్రాసాదమునందు గొప్ప పలుకుబడిగల భృంగారికయు, నింకొకవంక మన విశాలాక్షబావయు కుమారభోగనాథునిగుఱించి యత్నించుచున్నారు. స్వయముగా నతఁడు మన సత్యార్థబావగారి పెంపకపుకూఁతురు పూర్ణను గుఱించి యత్నించుచున్నాఁడని యీ ప్రాతఃకాలము ననే యొక కబురు వింటిని. కవిత్వాపేక్ష కనంతర మతని కొక కవీశ్వరిని పరిగ్రహింప బుద్ధి పుట్టినది గాఁబోలును. ఇట్టి కోలాహలములో మనము యత్నించిన ననుకూల మగునో

కాదో ? తన కుముదాక్షిపై మనము పోటీ వచ్చితి మని బావ విశాలాక్షునకు కోపము వచ్చునేమో ? ఇంక శక్తిధరునివిషయములో రాజుగారు మహామండలేశ్వర సత్యకర్మ కౌమారి తె రత్నప్రభను చేసుకొని యతనిని శ్రీశైల మహామండలమునకు భాగ్యప్రభు వునుగా నిర్ణయించి తన కౌమారితె రథినికి మాతామహుని సంస్థానము వచ్చున ట్లే ర్పాటు సేయ నున్నారని వింటిని. ఇక మిగిలినవాడు ధనంజయుడు.

ఘనే.—అతడు గూడ మిగిలియుండ లేదు. ఈదినము ప్రాతఃకాలముననే సముద్ర దత్తుడు ఆచార్యునియొద్దకు పెండ్లిమాటల నిమిత్తము మన ప్రమతిబావను పంపెను. తన యాస్తిలో చతుర్థాంశమును సముద్ర దత్తుడు కట్నమిచ్చునట. పిల్ల గొప్ప సుందరియు, వ్యుత్పన్నురాలును, కవీశ్వరియు నైనందున సంపత్పూర్ణ మగు నామెశ్లాఘ నీయహస్తము నాచార్యులు తిరస్కరింప రనియే చెప్పవచ్చును. ఈ సాయంకాల మేదియో మాట చెప్పుటకు వాయిదా వేసి రట.

వీ రిట్లు మాట్లాడుకొనుచుండగా లోప లకు కాశ్యపప్రమతి వచ్చి ప్రవేశించెను. ఇతడు భవనందిజామాతలలో నొకడు. గొప్ప వక్త. రాజుగారివలన పౌరసామంత పదవిలో నియుక్తుడై పనిసేయుచున్నాడు. ఈకాలపు మేయర్ పదవివంటిదించుమించు గా నాకాలపు పౌరసామంతపదవి. కాలనా థుని పెంచిన కాశ్యపసుదర్శనున కితడు పినతండ్రికొడుకు. సుదర్శనదంపతుల మరణానంతర మితడే కాలనాథుని పెంచి పెద్ద వానినిగా జేసియున్నాడు. కీర్తిశేషురాలగు మధువాణితల్లి యితని పెత్తండ్రికౌమారితె. సుదర్శనుని సాక్షాత్సోదరి యన్నమాట. కుమారభోగనాథున కితం డంతరంగగురువు. లీలావతీపక్షమునకు దన్నైన పౌరప్రము ఖుడు. వ్యవహారనిపుణులలో నగ్రగణ్యుడు. కార్యసాధకు లో పెట్టినపేరు. శాస్త్రవాక్యా ర్థము సేయువారిలో దిట్టమైన చెయ్యి. కార్యాంతరమున నమరావతికి వెల్లి నిన్న సాయంకాలమే శ్రీకాకుళము చేరియున్నాడు.

భవనంది వచ్చిన తనయల్లుని కూర్చుండు మనెను. ప్రమతి కూర్చుండి యా యాలోచనసభ కాఅధ్యక్షు డైనాడు.

భవ—తండ్రీ ! మామేనగోడలు మధు వాణి ధనంజయునకు నిశ్చయింపబడినది యట నిజమేనా ?

ప్రమ—ఆత డంగీకరింపడని నేను ముందే సముద్రదత్తునకు చెప్పియుంటిని. మహామంత్రి యెంతయో బలముతో తన దౌహిత్రి ఫలినిని ధనంజయున కీయ ప్రయ త్నించి విఫలు డైనాడు. ఆప్రయత్నములో ఫలిని తల్లిదండ్రులు ధారావతీచండసేనులును రాణి లీలావతీదేవియుగూడ పాల్గొనినారు. కుశికు తో కుండినులకు సంబంధ మచ్చదను నొక కారణముచే నాచార్యవిషమసిద్ధి మహా మంత్రి వేడికోలును తిరస్కరించినాడు. సాలంకాయనులతోడనుగూడ కుండినులకు సంబంధ మచ్చదని చెప్పుచు కొన్నిక్షణముల క్రిందట నన్ను పిలిచి సముద్రదత్తుని యాచ నను ప్రత్యాఖ్యానము చేసినాడు. సాలంకా యనులుగూడ విశ్వామిత్రగణములోనివారే

కదా! ఆచార్యుఁడే తిరస్కరించినపుడు రాజు గారు తిరస్కరింపరా? అందువలన మా అక్కయ్యగారి మధువాణికి రాజకుటుంబ ముతో సంబంధ మసంభవ మన్నమాటయే.

భవ—మన భానుమతిని ధనంజయున కీయవచ్చునా?

ప్రమ—ఇప్పు డాంధ్రరాష్ట్రములోని వరులలోనే ధనంజయుఁడు శ్రేష్ఠుఁ డని గణింపవచ్చును, రాజపుత్రులకు తరువాత.

భవ—కుమార భోగనాథుని గుఱించి మనము యత్నించిన సఫల మగునా?

ప్రమ—అందును గుఱించి మాట్లాడు టకే నే నిప్పుడు వచ్చితిని. ప్రాతఃకాలము నందు నే నాచార్యునితో సముద్రదత్తుని సం దేశము చెప్పి భర్తృదారక భోగనాథుని దర్శనముకొఱకు కోటకు వెళ్లితిని. అప్పుడు భర్తృదారకుఁడు నాకు దర్శనమిచ్చి నాతో చాలసేపు మాట్లాడెను. "మీ మఱఁదలు భానుమతికి సంబంధ మెచ్చట నిశ్చయించి నారు?" అని యొకప్రశ్న నన్నతఁ డడిగెను. నేను మీ యుత్తరువు తీసుకొనకయే సాహ సించి—"ఆ పిల్లను శ్రీ కుమారుని చేతిలో పడవేయవలె ననియే మా మామగారు తలం చుచున్నారు." అని నేను బదులు చెప్పితిని. పిమ్మట నతఁడు నాతో నంతరంగముగా తనను గుఱించి వచ్చిన సంబంధముల యన్నింటి గుణదోషములనుచర్చించి కొనకు మన భానుమతిని పెండ్లియాడుట కంగీకరిం చెను. ఆ విషయములో తన తల్లిదండ్రులను బోధపఱచుబాధ్యత తానే వహించెద నని కూడ చెప్పెను.

భవ—(తెలియనట్లు) అతనినిగుఱించి వచ్చిన సంబంధము లెవ్వి?

ప్రమ—హేమచంద్రుని పిల్ల విలాసవతి, హిరణ్యనాభుని పిల్ల కనకవల్లి, మన కుము దాక్షి, చంపాపతిగారి పూర్ణయును.

గుణా—విలాసవతి తన ప్రియమిత్రుని చెల్లెలు. కనకవల్లి కోటీశ్వరుని యేకపుత్రి. కుముదాక్షి తన మాతామహుఁడు పట్టుపట్టిన కన్య. పూర్ణ కవీశ్వరియు వీరురాలును. వీరి నుల్లంఘించి యతఁడు మన భానుమతిని వరించుటలో నతనియభిప్రాయ మేమి? అంతరంగగురు వగు నీ బోధనప్రతాపమా యది?

ప్రమ—కొన్నిదినములనుండి భర్తృ దారకుని స్థితి మాఱినది. ఇప్పుడు తన యుత్త రాధికారిత్వమును గుఱించి తన తమ్ముఁ డాక్షే పించుచు రాజధర్మాసనసన్నిధిలో వ్యాజ్యము తేవచ్చునని యతనికి శంకవొడమినది. జ్యేష్ఠుని కంటె పట్టమహిషీపుత్రుఁడే యుత్తరాధికా రిత్వములో బలవత్తరుఁ డని యొకవాదమును ప్రతిపక్షులు లేవఁదీసిరని యతనికి విశ్వసనీయ మగు వార్త చెవి ముట్టినది. హేమచం ద్రుఁడు రాజాశ్రితులలో నగ్రగణ్యుఁడే కాని పురములో పలుకుబడిగలవాఁడు గాఁడు. అతని సంబంధమువలన భర్తృదారకునకు ధనలాభముగూడ నేమియును కలుగదు. అందువలన నా సంబంధము నన్నింటికంటెను ముందుగా నతఁడు ప్రత్యాఖ్యానము చేసి నాఁడు. విశాలాక్షుబాబును రణేశ్వరుని సం బంధము చూపి తృప్తిపఱుపవచ్చునని యతని యుద్దేశము. కనకవల్లిసంబంధము ధనలాభ

కరమైనను జనబలము లేనిది. అదియునుగాక హిరణ్యనాభుఁడు గొప్ప సంపన్నుఁడుగా నుండియు లోభిగా నున్నందున నతనిపై పౌరులకు ముక్కలి యసహ్యము. తన యుత్తరాధికారిత్వస్థాపనమున కా సంబంధ మెంత మాత్రమును తోడ్పడదు. అందువలన దానిని గూడ నతఁడు త్రోసివేసెను. పూర్ణ స్వయముగా జనప్రియురాలుగా నుండుటవలనను, ఘనేంద్ర మల్లికార్జునులకు బంధువుగా నుండుటవలనను ఆమెను పెండ్లియాడినచో పురములో తనబలమధికమగునని యతనియుద్దేశముగా నుండినది ఘనేంద్రమల్లికార్జునులకు పురయువకులపైని, పూర్ణకు పౌరస్త్రీవర్గముపైని అధికమగు ఆకర్షణశక్తితోఁ గూడ పలుకుబడి గలదని యతనినమ్మకము. నేను ఆ విషయమును ఖండించితిని. ఆమె యపవిద్ధగా నుండుటవలన నామెకు గొప్ప పదవి వచ్చునెడల జనుల కసూయకలుగునని నేను చెప్పితిని. ఘనేంద్రమల్లికార్జునులకామెతోఁ గల బంధుత్వము భావనాసిద్ధమేకాని రక్తసంబంధసిద్ధము గాకపోవుటవలన దాని నంతగా విశ్వసింపఁగూడ దని యతనికి బోధపఱచితిని. భానుమతిసంబంధమువలన నతని భార్యాబంధుబల మెంతపురములో నతిశయించునో యా సంగతి నతనికి నచ్చఁజెప్పితిని. ఘనేంద్రుఁడు సాక్షాత్సోదరుఁడే యగును. మల్లికార్జునున కీమె గురుపుత్రి. కొనకు నావాద మతఁ డంగీకరించి తనపక్షబల మభివృద్ధి చేసుకొనుటకు మన భానుమతిని పెండ్లియాడ నంగీకరించెను. శక్తిధరుఁడు తగా యిదా చేసినను నిలువదు. అయినను సంశయముచే భర్తృదారకునకు భయ మంకురించినది. స్వకార్యసాధనార్థము నేను దానిని తొలఁగింపఁజూనకొనలేదు.

ఘనే — ధనంజయునకే మధువాణి సంబంధము స్థిరము కానియెడల నేనతని తోడను, ఆచార్యునితోడనుగూడ చెప్పి యా సంబంధమును కుదర్చఁగలను

ఘనేంద్రునిమాటయొక్క తాత్పర్యము ప్రమతి కవగత మైనది. అతఁడు శక్తిధర పక్షీయుఁడు గనుక భోగనాథ సంబంధము నంగీకరింపకున్నాఁడని యనుకొనినాఁడు.

ప్రమ—కుదిరిన సర్వోత్కృష్టసంబంధము విడుచుకొని మనకు వేఱు ప్రయత్నమేల? ఆచార్యునియొద్దను, ధనంజయుని యొద్దను నీపలుకుబడిని వినియోగించి మనకుముదాక్షిని వారు చేసుకొనునట్లు సేయుము. విశాలాక్షబాబుమనస్సు తృప్తి చెందును. అతఁడు అపవిద్ధునికుమారుఁడగు రణేశ్వరుని సంబంధ మంగీకరింపఁడేమో? గొప్ప సంబంధము దొరకక యతఁడు చిక్కుపడునట్లు సేయుట మనకు న్యాయ్యము గాదు.

భవ— (ఘనేంద్రునిఁజూచి) నీవు ధనంజయునితో మాత్రము మాట్లాడి శీఘ్రముగా మన భానుమతిని చేసుకొనుట కిష్టమున్నదో లేదో తెలుసుకొనుము. మాట యీయవలదు. నీ కిష్టము కుదునెడల నేను మా నాన్నగారితో చెప్పెద ననుము. వారి యిల్లు దగ్గఱనే యున్నది గాన నీ వొక గడియలో రావచ్చును. అన్ని సంగతులును స్పష్టముగా తెలుసుకొని పిమ్మట మనము నిర్ణయింపవచ్చును.

వల్లెయని ఘనేంద్రుఁడు ధనంజయునితో మాట్లాడుటకుఁగాను నిష్క్రమించెను.

## రెండవ ప్రకరణము

"ఇది కులపుత్రి యనవలసినమాట"

ఘనేంద్రుఁడు ద్వారముదాఁటి యాచార్యునియింటికి పోవునపుడు రాజకాళి యచ్చటఁ బ్రత్యక్షురాలై యతనివెంటఁ బడినది. మౌనముతో నడువలేదు. కొన్ని పాటలు పాడుకొనుచు నడుచుచున్నది.

శృంగారరసపూర్ణ మంగజమూర్తి
బంగారుకలశము నెంగిలిచేసె
అది వివాహముగాదు హోయియానాట
యదిముహూర్తముగాదుపాతకపుఁపూట
మనభానుమతి యేడ ఘనభోగి యేడ
కనుచూపుమేరలోఁ గలియికలేదు
అచ్చనిటున కేల యగ్నిహోత్రంబు
పచ్చిసంసారికిఁ బరవిద్య యేల
వానరమున కేల వరపుష్పమాల
కోనారిబిడ్డకుఁ గోశ మెందులకు
గుణము వలదు మీకు గొప్పగావలెను
గుణహీనపుఁ గొప్ప కొంపలు తీయు.

ఘనేంద్రునిభావమే రాజకాళిపాటలలో ప్రతిధ్వనించినది. భోగనాథునితో సంబంధమునకు సర్వవిధముల విఘ్నము సేయవలెనని ఘనేంద్రుఁ డెంచెను. పాటలు ముగించిన పిమ్మట రాజకాళి వేఱుమార్గము పట్టి పోయినది.

ఘనేంద్ర ధనంజయులు ధనంజయుని యింట వివిక్తస్థలములో సంధించిరి. ఘనేంద్రుఁడు స్వర్ణకమలకల్పం బగు భానుమతి హస్తమును ధనంజయునకు నివేదించెను. ధనంజయుఁడు సతనితండ్రియు నింతకుముందు రహస్యసంగములలో దేనిని దుర్లభముగా నెంచిరో యది యిప్పుడు సులభముగా దగ్గఱకు వచ్చుచుండ నతఁడు కా దనునా ? అది గొప్ప కులపుత్రిహస్తము. అది శాస్త్రవాదములో పరులను జయింపఁగల హస్తము. సౌందర్యములో మన్మథుని నైదుబాణములలో నొకబాణమైన హస్తము. సౌకుమార్యములో మందారపల్లవమును మించిన హస్తము. పట్టిన నెందఱో పెద్దమనుష్యులను బంధువులనుఁ జేయు హస్తము. ధర్మాచరణములో పోమరితనములేని హస్తము. బహుజ్ఞుఁడగు ధనంజయుఁడు దానిని ప్రత్యాఖ్యానము సేయఁగలుగునా ?

ధనంజయుఁ డంగీకరించెను. నాయనగారితో మాట్లాడి నిశ్చయము చెప్పెద నని పలికి ఘనేంద్రుఁడు తన యింటికి మరలెను. మరలునపుడు తిరిగియు రాజకాళి సంధించినది. తిరిగియు పాటలు పాడినది.

పెద్దకన్నులవాని పెద్దకన్యకను
పెద్దబాబు వరించి పేరొందఁగలఁడు
విద్దెలనిధి పట్టు విజయసేనుండు
విద్దెలేని వరాంగి ముద్దుహస్తమును.

ఘనేంద్రుఁడు—— (తనలో) వీరిద్దఱును మన భానుమతికి కా రన్నమాట.

రాజకాళి——

ఆయుధాచార్యునియాత్మజాతుండు
మాయమర్మములేని మహిఁబొందఁగలఁడు.

ఘనేంద్రుఁడు—(తనలో) మా భానుమతికి ధనంజయుఁడు లభింపఁడా? ధరణి నతఁడు పొందఁడా?

రాజకాళి—

ద్యూతసంగము వీడి ద్యోతించువాఁడు
జ్యోతులరాణికి జోడు గాఁగలఁడు
పెట్టెడునరునకు పెదచెయ్యి నారి
కట్టిన నరునకు కళమైన నారి
వీఁడిపోనరునకు విదపియా నారి
సారహీనరునకు సరసయా నారి
రాగియా నరునకు రంజిల్లు నారి
బంగైన నరునకు బంగారు నారి
వల దని యెందఱు పట్టు పట్టినను
నలతుల్యునకుఁ జిక్కు నవదమయంతి.

ఘనేంద్రుఁడు—ఈ విశేషణములు నగధరునకు చెల్లును. అతఁడు ద్యూతసంగము వీడునా? బాగుపడునా? అతనికి మా భానుమతి చిక్కునా? భానుమతి నగధరునకే లభించునెడల నది యొక యద్భుతము. రాజకాళమ్మవాక్కునకెక్కడ తిరుగులేదన్నమాట ఈ సంగతి బాగుగా శోధించి చూడవలెను. నేను నా మనస్సాక్షికి విరుద్ధములేకుండ ధనంజయునిపక్షమున నే పనిచేసెదను.

*　　*　　*　　*

ఘనేంద్రుఁడు తన యింటఁ బ్రవేశించి సభను తిరిగియు పూర్తిచేసెను. అతఁ డిల్లు ప్రవేశింపకయుండే రాజకాళి నిష్క్రమించినది. ప్రమతి ఘనేంద్రుఁడు వచ్చులోపుగా నూరకయుండలేదు. వైజయంతీ భవనంది గుణాకరుల మనస్సును తన శిష్యుఁ డగు భోగనాథునిప్రక్కకు త్రిప్పియుంచెను. ఘనేంద్రుఁడు రాఁగానే ధనంజయుఁ డంగీకరించె నని చెప్పినవాఁ డయ్యెను.

భవ—(వైజయంతిని జూచి) మనకు మూఁడు సంబంధము లున్నవి. ఏది మనకు గ్రాహ్యము?

వైజ—మనపిల్ల భావిరాజ్ఞి యగుటకు తగిన భాగ్యము కలిగివచ్చినపుడు దానిని మనము తిరస్కరింపఁగూడ దని నామతము.

భవ—(గుణాకరుని జూచి) నీ యభిప్రాయ మేమి?

గుణా— నిజముగా రాజసంబంధము దొరకునెడల నది తిరస్కార్యము గాదుగాని భోగనాథబాబు తన మాటలో స్థిరముగా నిలచునా యనునదియే ప్రశ్న. అతఁడు పట్టుపట్టిన తల్లిదండ్రు లభ్యంతరపెట్టరుగాని యతఁడు మిక్కిలి యస్థిరుఁ డైనందున నాకు సంశయముగా నున్నది.

ప్రమ—అతనిని స్థిరముగా తన మాటపై నుంచుబాధ్యత నాది.

గుణా—అట్లగునెడల రాజసంబంధమునకే నా సమ్మతి నిచ్చెదను.

భవ—(ఘనేంద్రుని జూచి) చిన్నబ్బాయీ, నీ యభిప్రాయ మేమి?

ఘనే—ఆసంబంధము నా కెంతమాత్రము సమ్మతముగాదు. నామతమునందు మన భానుమతికి తగినవరుఁడు ధనంజయుఁడు. భోగనాథ ధనంజయుల కెంతయో తారతమ్య మున్నది. భోగనాథబాబు బ్రహ్మచర్య మనేక రమణీయ తరుణీజన ప్రపూర్ణ

మగు నగరమునందు కంపించుచు దీనావస్థ యం దున్నది. ధనంజయుని బ్రహ్మచర్య మిదివఱకు నిష్కలంకము. భోగనాథబాబు సహవాసస్థులు మిక్కిలి యయోగ్యులు. అతని ప్రాణస్నేహితుఁడు వీరసింహుఁడు వ్యభిచారమును పుణ్యముగా వాదించు మహాపురుషుఁడు. అతని పరమాప్తబంధువు రుద్రసేనుఁడుగూడ కొంచెమెక్కువతక్కువ యామచ్చులోనివాఁడే. అతఁడు సింహాసనోత్తరాధికారి యగుటకూడ సంశయగ్రస్తమగు విషయము. ధనంజయుని సహవాసస్థులు మిక్కిలి యోగ్యులు. అతఁడు గొప్ప సంస్థానమునకు వారసు; మహావీరుఁడు; ఉత్తమవంశితుఁడు.

ప్రేమ — భోగనాథబాబు తాను పరిగ్రహించుట కెవతె తగినది యని పరీక్షించుట కనేకకన్యలను చూచుచుండుట వాస్తవమే యైనను అతనిచరిత్ర చెడిపోయినది యని చెప్పుట సాహసము. మన భానుమతి వివాహమే యైనపక్షమున నతని సన్నిధి నుండి వీరసింహు నెగురఁగొట్టుట గడియలలో జరుగవలసినపని. వాస్తవముగా నతనికి ప్రాణస్నేహితు లెవ్వరును లేరు. రాజనీతి ననుసరించి యతఁడు తనదగ్గఱకు వచ్చిన వారితో మంచిమాటలాడుచుండును. గిరిధరునివంశస్థులు పెండ్లామనిన నెత్తిపైని పెట్టుకొను స్వభావము గలవారు. పెండ్లియైన యుత్తరక్షణము మొదలుకొని పండితురాలగు మామఱఁదలిచేతిలో నతఁ డాడు నను మాట వాస్తవము. మూఁడువంతుల ముప్పాతిక యుత్తరాధికారి జ్యేష్ఠుఁడే యగును. ఒకవేళ రాజధర్మాసనము పట్టమహిషీపుత్రునిపక్షమున తీర్పిచ్చినను ధనంజయుని సంస్థానముకంటె నెన్నియో మడుంగులు పెద్దసంస్థానమును రాజుగారు తన జ్యేష్ఠపుత్రుని కీయకుండ నుందురా? ఎంత యాలోచించినను రాజసంబంధమే మంచిదని నాకు తోఁచుచున్నది.

గుణా—(ధననందిని జూచి) నాయనా! మీ యభిప్రాయ మేమి?

ధన—వచ్చిన కనకపురేశ్వరుని సంబంధమును తిరుగఁగొట్టివేయవలె ననియే నా మతము. ధనంజయునితోమాత్ర మింక నేదియు నిశ్చయము చెప్పఁగూడదు. ఈ శుద్ధ దశమీ శుక్రవారము నాఁడు ప్రొద్దున్న వృషభలగ్నమున హస్తానక్షత్రమునం దొక ముహూర్తమున్నది. ఆ ముహూర్తమునందే మన భానుమతికి వివాహము సేయ నేను నిశ్చయించుకొన్నాను. ఆ ముహూర్తమునకు భోగనాథబాబు తనతల్లిదండ్రులతోఁ జెప్పి సిద్ధపడఁగలుగునెడల నతనికే యిచ్చివేయుటకును, లేనియెడల నా ముహూర్తమునందే ధనంజయున కిచ్చివేయుటకును నే నభిప్రాయపడుచున్నాను. పిల్ల యంగీకారమే యింక నే నెదురుచూడవలసినది.

వైజ—(భానుమతిని జూచి) పిల్లా! ఇంక నీ యభిప్రాయము చెప్పుము.

ఇప్పుడు భానుమతినెత్తిపై భారము పడినది. ఘనేంద్రునకు భోగనాథునితో సంబంధ మెంతమాత్ర మిష్టము లేకపోయినను అతనికి తిరిగియు మాట్లాడునవకాశమే లేకపోయినది. అతనికి "గుణహీనవహా గొప్పకొంపలుతీయు" అను రాజకాళి మాట

జ్ఞప్తికి వచ్చినది. "ద్యూతసంగము వీడి ద్యోతించువాఁడు, జ్యోతులరాణికి జోడు గాఁగలఁడు." అను రాజశాళి ద్రుపదగూఢ జ్ఞాపకమునకు రాకపోలేదు. చేయునది యేమియు లేక యతఁడు దైవముపై భారము విడిచి యూరకున్నాఁడు.

భానుమతికి తన బావ ప్రమతిమాటల వలన రాణి గాఁగలనన్న యాశ కొంచె మంకురించినది. అది యంకురస్థితిలో నున్నను అది యామె హృదయమును తండ్రి యభిప్రాయముప్రక్కకు త్రిప్పఁగలిగినది. అది భోగనాథుని ప్రేమింపకపోయినను అతని పద విని ప్రేమించినది యని చెప్పవచ్చును. అప్పుడామె మెల్లగా నిట్లనినది—

"నాతల్లిదండ్రు లియిష్టమే నాకు ప్రమాణము. ఘనత చెందిన నాతండ్రి యిదివఱకాఱు కన్యాదానములను బ్రాహ్మవిధి ననుసరించి చేసెను ఏడవ కన్యాదానములో మాత్రము గాంధర్వసంకర మెందులకు? ఒక బీదబ్రాహ్మణయువకున కైనను మా తండ్రి యిచ్చికొనినచో నేను సంతోషముతో నంగీకరించెదను."

ప్రమ—ఇది కులపుత్రి యనవలసిన మాట.

## మూఁడవ ప్రకరణము

### ప్రమతియెత్తునకుఁ బైయెత్తు

ప్రమతి తనను విడిచివెళ్లిన పిమ్మట భోగనాథబాబు తనదర్శనమునకు వచ్చిన విశాలాక్షుని సంధించెను. విశాలాక్షుని నీతివేత్తృతామహిమ భోగనాథునకు చక్కఁగా తెలుసును. అతనికి విరుద్ధముగా నేపని చేసినను తన కది క్షేమము గాదని భోగనాథుని నమ్మకము.

విశాలాక్షుఁడు భవనంది రెండవయల్లుఁడని యింతకుముందే తెలిపియుంటిమి. అతఁడు భోగనాథుఁడు తలంచినట్లే మహానీతివేత్త. స్వార్థము సాధించుటయే నీతియొక్క పరమఫలితము గాన నావిషయములో నతఁ డెప్పుడును నిర్లక్ష్యముగా నుండలేదు. బంధుత్వముగాని, స్నేహముగాని, కారుణ్యముగాని యతనిని స్వార్థమునుండి మరల్పఁజాలవు. ఆ రెండుకండ్ల శకునిమెదుట భోగనాథబాబు భానుమతీ సంబంధ నిశ్చయమును నిట్లు తెలియఁజేసినవాఁడయ్యెను.

"ఆర్య! ఆచార్యులవారు ప్రమతిబాబు ద్వారా భానుమతీకన్య నిచ్చెదమని నాకు సందేశ మంపిరి. ఆమహానుభావుని ప్రార్థనను త్రోసివేయఁజాలక మా తల్లిదండ్రులతో నా విషయము ననుకూలభావముతో నివేదించెద నని ప్రమతిబాబుదగ్గఱ చెప్పితిని. విఖ్యాతు లగు విశాలాక్షబాబు నా కన్నగారగుదురని యీ సంబంధముయొక్క విలువ నాదృష్టిలో మఱింతయెక్కువయగుచున్నది."

విశా — (తనలో) ప్రమతికి నేను యత్నించుచున్నా నని తెలిసినను ఈ కుఱ్ఱవాని నతఁడు తన వలలో వేసుకొన్నాఁడు. నా యత్న మంతయు బుగ్గిలో కలిపివేయుటకు పూనుకొన్నాఁడు. ఘనేంద్రుని సాహాయ్యక మెరచూపి యతఁ డితనిని వశపఱచుకొనియుండవచ్చును. అవతల సూర్యుఁ డివతల ఉదయించినను ఘనేంద్రుఁడు శక్తిధరుని

విడువఁజాలఁడు. అందువలన నీ సంబంధమును కొట్టివేయుట నిమిషములలోని పని. (ప్రకాశముగా) మన కందఱికి పూజ్య లాచార్యుల వారు. వారికోరికను మన మందఱమును చెల్లింపవలసినదే.

భోగ—(తనలో) బ్రతికితిమి దేవుఁడా! ఇతఁ డేదియో సొడ్డుపెట్టు ననుకొన్నాను.

విశాలాక్షుఁ డింకను చెప్పుచున్నాఁడు. "కాని ఈ సంబంధమువలన మనము పొందఁబోవు లాభమును పూర్తిగా పొందవలెను. అదియే నా మనవి."

భోగ—నా కర్థముకాలేదు తమమాట.

విశా—ఈ సంబంధములో ననేక స్పృహణీయాంశము లున్నను ఘనేంద్రుని మన ప్రక్కకు త్రిప్పుకొనుట యన్నిటిలోను ముఖ్యము. అతఁడు శ్రీకాకుళనగర పౌర యువకులకు నాయకుఁ డనిన నతిశయోక్తి కానేరదు. అతఁడు మనపక్షమున పనిచేసినచో శక్తిధరుని బలము పూర్తిగా సన్నగిల్లును. వ్యాజ్యమే వచ్చునెడల రాజధర్మాసనము వారు పౌరుల యభిప్రాయమును గూడ తీసుకొనవచ్చును. అది యట్లుండనిండు. శివంకర సంఘమువారు, పరంతపసంఘమువారుగూడ చిన్నబాబుకు దన్నైయున్నా రని నమ్మకమైన వార్తలు తెలియుచున్నవి. వారిని నిర్మూలించుటకు సైనికులయు, రక్షకజనులయు సాహాయ్యకముకంటెఁ గూడ సాధారణ పౌర యువకుల సాహాయ్యకము మన కత్యంతావసరము. వివాహమునకు ముందు మనము ఘనేంద్రునివలన మనకు సర్వానుకూలముగా పని సేయునట్లు వాక్కు తీసుకొనవలెను.

విశాలాక్షుని సూచన భోగనాథునకు యుక్తముగానే తోఁచెను. ఇంకేమున్నది? ప్రమతి వేసిన సంమోహనాస్త్రమును విశాలాక్షుఁడు సర్వాస్త్ర విధ్వంసినిచే నెగురఁగొట్టివేసెను. అయిపోయినది యనిన సంబంధము నిలిచిపోవుటకు తగిన సంభవ మేర్పడినది.

భోగనాథుఁడు తత్క్షణమే ఘనేంద్రుని పిలిపించెను. విశాలాక్షుఁడు తన పని ముగించుకొని నిష్క్రమించినవాఁడయ్యెను. అతని వెనుకఁబడి రాజకాళి యొక పాట పాడినది.

'విద్దె నేర్చినవాఁడు విఘ్నము చేసె
పెద్దకన్నులవాఁడు పెద్దెద్దు పనికి.'

ఆ పాట రాజకాళి వాక్కుయొక్క యలౌకికసత్యదర్శన మని విశాలాక్షుఁడు నమ్మలేదు. అది శక్తిధరుని పక్షము నందు పనిసేయువారి చారుల యాశుకారిత్వ మని యతఁ డెంచెను. రాజకాళి శక్తిధరుని పక్షము నందలి గొప్ప ప్రచారకురా లని యతని యనుమానము. ఆపాట నతఁడు వినియువినని వానివలె నడిచిపోవుచుండెను. ఆమె విడువక వెన్నంటి మఱికొన్ని పాట లతని చెవిలో నాటునట్లు పాడినది—

నిందించె నొకచోట నిధివోలె మూట
పండించె నొకచోట బరువైన పంట
శోధించె నొకచోట సొగసైన ముఖము
బోధించె నొకచోటఁ బూర్ణమౌ సుఖము
సాధించె నొకచోట సౌవర్ణఘటము
రోధించె నొకచోట ద్రుతమైన పటము
అట్టి నరశ్రేష్ఠు నద్భుతకథల
పొట్టివాక్కులచేతఁ బొగడంగ వశమె?

"ఎంత దుష్ప్రచారము సేయుచున్నదిరా యీ భిక్షుకురాలు." అని యనుకొనుచు విశాలాక్షుఁడు లక్ష్యము సేయనివానివలె తనదారిఁ బట్టి పోయెను.

## నాల్గవ ప్రకరణము

### ఘనేంద్రుని స్థైర్యము

కుమార భోగనాథుని యెదుట ఘనేంద్రుఁడు ప్రత్యక్షుఁ డయ్యెను. ఉచితాసనమున నతఁడు కూర్చుండినపిమ్మట సంభాషణ మారంభించినది.—

భోగ—ప్రమతిబాబు మీ చెల్లెలు భానుమతిని పరిగ్రహింప మీ కుటుంబపక్షమున నన్ను వేఁడెను. నాయెదుట మీ రొక విషయములో వాక్కిచ్చునెడల తప్పక మీ చెల్లెలిని పరిగ్రహింపఁ గలను.

ఘనే—ఏమని? ఏవిషయములో?

భోగ—నాపక్షమున మీరు సర్వాను కూలతతో నుండినఁ జాలును.

తప్పక ఘనేంద్రుఁ డీవలలోఁ జిక్కుకొను నని భోగనాథుఁడు తలంచెను. దూరదర్శియగు విశాలాక్షున కట్టిభ్రమ లేనందు ననే భానుమతీసంబంధము నిలిచిపోయె నని ధైర్యముతో నిష్కర్షించె నతఁడు.

ఘనే—కుమారశక్తిధరబాబుకు విరుద్ధముగా పనిసేయవలెననియా దీనిభావము?

భోగ—చిన్నబాబు నాకు విరుద్ధముగా పనిసేయునెడల నతనికి విరుద్ధముగా గూడ పనిసేయవలసివచ్చును.

ఘనే—ఈపరతును శ్రీవారు మా ప్రమతిబాబుదగ్గఱ చెప్పియుండిరా?

భోగ—నేను చెప్పకముందే యతఁడుద్ఘాటించి భానుమతిసంబంధములో నాకుఁ గల లాభములలో మీసాహాయ్యకము నొకదానినిగా పరిగణించియుండెను.

ఘనే—ప్రభో! తమ యన్నదమ్ములకు కలహమే తటస్థించునెడల నది న్యాయస్థానములో పరిష్కరింపఁబడవలసినదిగా నుండును గాని కత్తులచే పరిష్కరింపఁబడవలసినదిగా నుండదు. న్యాయస్థానమువారు తనకు విరుద్ధముగా తీర్పిచ్చునెడల కుమారశక్తిధరబాబు దానికి తలయొగ్గునేకాని తమకు విరుద్ధముగా నెన్నడును కత్తికట్టరని నేను నిశ్చయముగా చెప్పఁగలను. దురదృష్టవశమున నట్లు జరుగుటయే తటస్థించునెడల నతనిపక్షమున నేను పనిసేయుదు ననుమాట కల్ల. వారిని నిగ్రహింపవలె నని నాకు రాజాజ్ఞ యగునెడల నేను దానిని నెఱవేర్చుటకు వెనుదీయను. శ్రీవారికి న్యాయస్థానము ప్రతికూల మగునపుడు శ్రీవారుగూడ న్యాయస్థానపు తీర్పును గౌరవింతు రనియే నా నమ్మకము. అట్లు తమరు గౌరవింపక విప్లవమునకు దిగునెడల మా భానుమతిని తమరు పరిగ్రహించినను నేను తమపక్షమున కత్తిపట్టుదు నని తమరు నమ్మవలదు.

భోగ—ఒకసంగతి స్పష్టమయ్యెను. ఈ విషయములో మఱియొకమాట యడుగవలసియున్నది. న్యాయస్థానమువారు ప్రజలసౌఖ్యము కోరునెడల నందుల కనుకూలముగా మీరు నాపక్షము నవలంబించి భాను

మతీపరిగ్రహణమునకు ప్రతిఫలముగా పుర మునందు ప్రచారము సేయఁగలరా?

ఘనే.—నే నట్లు చేయఁజాలను. అది నా మనస్సాక్షికి విరుద్ధమైన పని. చిన్నవాఁడైనను ప్రథమభార్యాపుత్రుఁడే సింహాసనోత్తరాధికారి యని నా యభిప్రాయము. చిన్నబాబుతో నాకుఁగల స్నేహమే ఈ యభిప్రాయమునకు కారణమని యెవ్వరైనఁ దలఁచిన నది పొరపాటు. ఒకభార్య యుండఁగా తిరిగియు వివాహ మాడుటవలన నా భార్య పొందవలసిన లాభములకు బాధకముగా నుండఁగూడదని నా స్వతంత్రాభిప్రాయము.

భోగ.—(క్రోధముతో) అట్లగునెడల మీభానుమతిని నేను వివాహమాడఁజాలను. ప్రమతిబాబు మీతత్త్వము తెలియక పొరపాటుగా నాదగ్గఱ భానుమతీ సంబంధపు గొప్పను పొగడినారు. మీరు మీ నాయన గారియొద్ద నన్నుగుఱించి యాశపెట్టుకొనవలదని మనవి సేయవలెను.

ఘనే.—ఎవరిదగ్గఱ శ్రీవారు సంబంధము గుఱించి యంగీకరించిరో వారినే ఈ విషయములో దూతగా పంపఁ గోరెదను. నేను మా నాయనగారియొద్ద తమ ప్రత్యాఖ్యానమును చెప్పుట భావ్యముగా నుండదు.

భోగ.—అట్లే కానిండు. మీరు శ్రమపడ నక్కఱలేదు.

అనంతరము ఘనేంద్రుఁడు రాజకుమారునిచే ననుజ్ఞాతుఁడై నిష్క్రమించెను.

## ఐదవ ప్రకరణము

"జూదరిభావిలో జ్యోతి చూచితిని"

భవనంది సుమిత్రునకు తన పిల్లను దూరమిచ్చుట కంగీకరింపలేదని చెప్పివేసెను. కొన్ని గడియలవఱకును భవనందిగారియిల్లు రాజుగారి వియ్యంకుని గృహ మగుదు నని యాశలో నుండినది. ప్రమతి శీఘ్రవివాహ సూచనాభిలాషతో కుమార భోగనాథుని దగ్గఱకు వెళ్లి యశనిపాతమువంటి ప్రతికూలవార్త వినినవాఁడయ్యెను. భోగనాథుని క్రుద్ధముఖము చూచినపు డతనిని బోధపఱచు నవకాశముగూడ లేకపోయినది. గుణాకరుని యనుమానము సత్యమే యయ్యెను.

ప్రమతి మ్లానముఖముతో మామగారి దగ్గఱకు వచ్చి జరిగిన సంగతిని వివరించి చెప్పినవాఁడయ్యెను. నేర మంతయు ఘనేంద్రునిపై త్రోసివేసినాఁడు. భవనంది ఘనేంద్రు నేమియు ననఁజాలక భానుమతికి రాణి యగు యోగము లేదని విషణ్ణతతో ననెను. ధనంజయుని సంబంధమైనను మించిపోకుండ చూచు మనిమాత్రము ఘనేంద్రుని పిలిచి దృఢస్వరముతో పలికినవాఁడయ్యెను.

ఘనేంద్ర ధనంజయులు మఱియొకసారి కలుసుకొనిరి. నాయనగా రంగీకరించి రని ఘనేంద్రుఁడు ధనంజయునితో నివేదించెను. అతఁ డాలస్యము సేయక తండ్రికి తెలియపఱచెను. ఆచార్య విషమసిద్ధి మిక్కిలి సంతోషముతో నా సంబంధమునకు స్వాగత మొసంగెను. సప్తమినాఁడు సూర్యాస్తమయమునకు ముందే యుభయ కుటుంబస్థులకే కాక యనేక పౌరప్రముఖులకుఁ గూడ

ఈ శుభవార్త తెలిసినది. దశమినాఁడే ముహూర్తమనికూడ యనేకులకు విదితమైనది. క్రొత్త బావమఱఁదులు కాంభోవు ఘనేంద్ర ధనంజయులును వారి మిత్రులు శక్తిధర కాలనాథ మల్లికార్జును లభినందించిరి. భోగినాథుని పక్షమువా రసూయ చెందిరి. పూర్ణా నగధరులు రాజకాళమ్మ దీవన వ్యర్థ మగునేమో యని భయపడిరి. ఘనేంద్రుఁడు కార్య మగువఱకు నమ్మకుండెను. ఆ రాత్రి పూర్ణయెదుట రాజకాళి యీ సంబంధము కాదని సూచించుచు నీ క్రింది పాటలను పాడినది—

మేఘంబుపట్టెను మేదురం బగుచు
మోఘునే యగునమ్మ ముహూర్త మమ్మ
అన్యనిమిత్తాన నచిరకాలమున
ధన్యుఁడు పానీయధరుఁడు వర్షించు
తడియుదు భవనందితాతయి ల్లిపుడు
సుడిగాలి యేతెంచి స్రుతి కడ్డుపడును
జూదరిభాషలో జ్యోతి చూచితిని
కాదని యెవ్వరు గలరు చెప్పంగ.

## ఆఱవ ప్రకరణము

### వివాహధర్మచర్చ

కాత్యాయని శ్రీకాకుళనగరియందు ప్రసిద్ధిగల వైద్యురాలు. సర్వరోగములందు చికిత్స యామెకు తెలిసినను వ్రణవైద్యమునం దామెనైపుణ్య మత్యధికము. రథినీకుమారితో సంవాదమునం దామెధర్మశాస్త్రప్రావీణ్యమును మాపాఠకులు గమనించియున్నారు.

సప్తమినాఁడు రాత్రి కాత్యాయని భోజనము ముగించుకొని నట్టింటికి వచ్చినది. ఆమెకొమారితె కామసేన ముందే రెండు మెతుకులు నోటవేసుకొని సముద్రదత్తునిగారింటికి పండుకొనుటకు వెళ్లిపోయినది. సముద్రదత్తునికూఁతురు మధువాణిని విడిచి యామె యుండుట కొన్ని సమయములందు మాత్రమే. మధువాణి కామె ప్రాణస్నేహితురాలు.

వరుసగా వంటగది నట్టిల్లు పడకగదియు వీథిగడప కిరుప్రక్కల రెండరుఁగులును పెరటిగడప కిరుప్రక్కల రెండరుఁగులును కాత్యాయనియింటి సర్వాంగచిత్రము. అది సంవత్సరమున కొకసారి నేయించుకొను పూరిల్లు. అప్పటి కెనిమిది గడియల రాత్రియైనది. వీథితలుపు తీసియే యున్నది. కాత్యాయని యిప్పుడు వీథితలుపు వేసుకొని పడకగది చేరుటకు సిద్ధురాలుగా నుండెను. ఇంతట లోపల కొక క్రొత్తయువతి ప్రవేశించినది. ఎట్టి సుందరినిగూడ చూచి యాశ్చర్యపడని కాత్యాయని కనుల కామె యాశ్చర్యము కలిగించినది. ఆమెవయస్సు ముప్పదియైదుకు మించదు. ఆమెశరీరము తప్తస్వర్ణగౌరము.

కాత్యాయని యామె యొక యాగంతుకాంగన యని గ్రహించినది. అందుకుఁ దగిన వాక్యోపచారములు నడిచినవి. అవి యా నూతనవధూటి మార్గాయాసమును చాలవఱకు పోఁగొట్టినవి యని చెప్పవచ్చును. పిమ్మట కాత్యాయని యామె కూర్చుండుట కొక చాప యిచ్చి తాను వేఱు చాపపైఁ గూర్చుండినది. నూతన యువతి గూడ నాసీనురా లయ్యెను. అనంతర మీ క్రింది సంభాషణము వా రిరువురికిని జరిగినది.

కాత్యా—అమ్మాయీ! మీది యే యూరు? ఏజాతి? నీపే రేమి?

క్రొత్తస్త్రీ—అమ్మా! మాది చంద్ర పల్లియను గ్రామము. మేము బ్రాహ్మణులము. నాపే రింద్రవతి.

కాత్యా—నీ భర్త సుఖముగా నున్నాఁడా?

ఇంద్ర — సుఖముగా నున్నా రనియే తలంచెదను. వారి సుఖమున కేమియు లోపముండఁగూడదు.

కాత్యా—అతఁ డెక్కడ నున్నాఁడు?

ఇంద్ర—అదియే నాకు తెలియకున్నది. నేను నాభర్తను వెతకుచున్నాను. నా సంచారమున కదియే కారణము.

కాత్యా—విషయ మిప్పటికి కొంత బోధపడినది. అతఁడు నిర్దయుఁ డగు కిరాతుఁడు. నీవు మోసగింపఁబడిన బేలవు. దాని కేమి? నీవు నాయింటి కతిథివి. నేను వండిపెట్టెదను. ఒకగడియ చాలు వంటకు. భోజనము ముగించినపిమ్మట మాట్లాడుకొన వచ్చును.

అని లేవఁబోవును.

ఇంద్ర—అమ్మా! మీరు శ్రమపడ నక్కఱలేదు. నే నేకభుక్తవ్రత మవలంబించి యున్నాను. భర్తను చూచినఁగాని రెండవ పూట భోజనముసేయ నని నా ప్రతిజ్ఞ.

కాత్యా—తనను విడిచి పాఱిపోయిన భర్తను వెతకుటయే యున్మాదము. దానిలో నిది మఱియొక యున్మాదము. ఇంతకును ఎవరిపిచ్చి వారి కానందము. ఆనందము మాత్రమే కాదు, ధర్మముగాఁగూడ భాసించును.

కాత్యాయని తనభర్తను నిర్దయుఁ డగు కిరాతుఁ డని తిట్టుటయు, పిమ్మట పతివ్రతాధర్మమునకు విరుద్ధముగా నుపన్యసించుటయు నింద్రవతికి కిట్టలేదు. అందువలన నా యతిథి గృహస్వామినికి కొంచెము ప్రతికూలముగా నిట్లు మాట్లాడినది. —

“అమ్మా! పతివ్రతగా నుండుటయే పిచ్చియని మీ రనుచున్న ట్లున్నది. మీవంటి పెద్దలతో వాదించుటకు నాకు శక్తి చాలదు గాని మన యార్యగోష్ఠులలో నేను వినినంత వఱకు స్త్రీలకు పతిభక్తికంటె మించిన ధర్మము లేదను ముఖ్యసూత్ర మెన్నడును ఖండింపఁబడియుండ లేదు.”

కాత్యా—స్త్రీలను బానిసలవలె నేలనెంచు పురుషుల గోష్ఠులలో నిట్టి కపట ధర్మసూత్రము ఖండింపఁబడకుండుట వింత గాదు.

ఇంద్ర—అమ్మా! సాధారణ మనుష్యులు స్వార్థప్రేరితులు గావచ్చును గాని శాస్త్రకారులు స్వార్థప్రేరితు లనుట సాహసము. శాస్త్రము పతివ్రతను శ్లాఘించుచున్నది. మూలశాస్త్ర గ్రంథములు నాకు రాకపోయినను మా గురువుగారు జటాముని రచించిన ధర్మమంజరి నాకు కంఠస్థముగా వచ్చును. దానిలోని యొక్కొక్క ద్విపదయు మూలవచనాధారము గలిగియే యుండును. దానిలోనుండి యొక ద్విపదను చదివెదను, వినుఁడు.

పతిఁగొల్చు నిల్లాలు పాపము ద్రుంచి
పతితోడ దివి కేగు నతికీర్తి మించి.

కాత్యా—(నవ్వుచు) శాస్త్రకర్తలు గూడ సాధారణమనుష్యులే కాని దేవలోకమునుండి దిగిరాలేదని తెలుసుకొనుము. ఒకస్త్రీ రచించిన ధర్మశాస్త్రములో నుండి యొక ద్విపద చదివెదను. అది యెట్లు చెప్పుచున్నదో చూడుము.

భార్య నారాధించు భర్త తరించు
భార్యయే భర్తకుఁ బరము చూపించు.

ఇంద్ర—(కొంచెము సపరిహాసముగా) ఈ ధర్మశాస్త్రము రచించిన మహాత్మురాలెవరో?

కాత్యా—నీవు చదివిన నీతివచనపు మూలశాస్త్రము రచించిన మహాపురుషుఁడు వలె నామెయు నొక మనిషియే. ఆమె మహాత్మురా లగుటకుమాత్ర మామె రచించిన ధర్మశాస్త్ర మింకను ప్రాతపడలేదు. ఎంత పాడునీతి యైనను ప్రాతవడినపిమ్మట పావన మగు సనాతనధర్మముగా మాఱును. అప్పుడు శాస్త్రకర్త యెంత వంచకుఁ డైనను ఋషిగా గౌరవింపఁబడును.

ఇంద్ర—శాస్త్రోక్తు లన్నియు వంచకోక్తులే యనెదరా?

కాత్యా—కొన్ని హితోక్తు లుండవచ్చును. అంతమాత్రమున గ్రంథ మంతయు గ్రాహ్య మని తలంచుట పొరపాటు. ఉదాహరణార్థముగా కొన్నిస్థలములు చూపెదను. అప్పుడు నీకు శాస్త్రములవైఖరి బోధపడును. తండ్రికి డబ్బిచ్చి కాని, గో విచ్చికాని కొనుక్కొనినవాఁడును స్త్రీలకు భర్తయే. పుట్టింటివారిని చావఁగొట్టి తా నేత్తుచుండ నపహరించినవాఁడును భర్తయే. నిద్రలోఁగాని, మత్తతలోఁగాని చెఱిచినవాఁడుగూడ భర్తయే. వింటివా శాస్త్రములరహస్యము. ఇట్టిపతుల నారాధించుటయే స్త్రీలకు పరమధర్మమఁట. నోరులేని మనజాతి నడంచుటకు పురుషు లెన్ని యుపాయముల నైనఁ బన్ని యున్నారు. మన మబలలము. వారికి బలము గలదు. బలమే శాస్త్రము.

ఇంద్రవతికి కాత్యాయని వాదనైపుణ్యము బోధపడినది. వాచము పెంచుట యామెకిష్టము లేదు. అందువలన నామె ప్రకృతము ననుసరించి వాదము నుపసంహరింపఁ దలంచుచు ని ట్లనినది.—

"అమ్మా! నాపతి నన్ను డబ్బిచ్చి కాని, గోవు నిచ్చి కాని కొనలేదు. నా పుట్టింటి వారిని గొట్టి యపహరింపలేదు. నన్ను నిద్రలోఁగాని, మత్తతలోఁగాని మోసగింపలేదు. మాతండ్రిగారు నన్ను పవిత్రవివాహవేదికపై నగ్నిసాక్షికముగా దానము చేసి యుండిరి. అందువలన నాభర్తకు నేను ధర్మపాశబద్ధయగు భార్యనైతిని."

కాత్యా—(నవ్వుచు) వెఱ్ఱిదానా! మనశాస్త్రములలోని మఱియొకవింత యిది. తండ్రి కన్యను దానము సేయునెడల తండ్రికున్నధికారమే ప్రతిగ్రహీతకు సంక్రమించును. తండ్రికి తనపిల్ల ననుభవించు నధికార మెంతమాత్రమును లేదుగదా! ఆ యధికారము ప్రతిగ్రహించినవాని కెట్లు వచ్చును? అతఁడు స్వీకరింపఁబడిన పిల్లకు పెంపకపుతండ్రి కావచ్చును. అమ్మాయీ! ఇది కన్యాదానపుసొగసు.

కాత్యాయని వాదనైపుణ్యము ఇంద్రవతికి మఱింత బోధపడినది.

## ఏడవ ప్రకరణము

"పీరపతివ్రత యనఁగా నచ్చశానిస"

కాత్యా—అమ్మాయీ! ఈవాదముల కేమిగాని నీచరిత్ర నాకు తెలుసుకొనవలెనని యున్నది. నీ కుపకారము సేయుటకు నా కేమిన్లైన నవకాశము చిక్కి నెడల సంతోషించెదను. నీచరిత్ర పూర్తిగా తెలిసిన పిమ్మట నా కట్టి యవకాశ మున్నదో లేదో బోధపడును.

ఇంద్ర—అమ్మా! ఈ ప్రశ్న నాకు సంతోషకరముగా నున్నది. అడుగకముందే నాకథ యంతయు మీయొద్ద చెప్పవలె నని యనుకొన్నాను. వినుఁడు. ఈ యూరే నా పుట్టిల్లు. సుప్రసిద్ధుఁ డగు గౌతమ పతంగావధాని మా సవతియన్న.—

కాత్యా—(ఆశ్చర్యముతో) చిన్నమ్మాయీ! నీవా? ఆశ్చర్యముగా నున్నది. పోల్చుకో లేకపోయినాను. చిన్నతనములో మేము నిన్ను చిన్నమ్మాయి యను పేరుతో నేపిలుచుచుండెడివారము మీతండ్రిగారు నీకు నామకరణము చేసిన యింద్రవతి యను పేరు మాకు తెలియనేతెలియదు. ఎంత కాలమునకు చూచితినమ్మా నిన్ను. నీమగని పేరు రణకుంభుఁడు కాదూ?

ఇంద్ర—ఔను. నా పెండ్లి అయిన కొన్నాళ్లలో నా తల్లిదండ్రులు చనిపోయిన సంగతి మీకు తెలిసియేయుండును.

కాత్యా—తెలుసును. అల్లునిది గొప్ప పాద మని మే మందఱము నవ్వు డనుకొని నారము.

ఇంద్ర—నే నత్తవారింటికి కనకపురము వెళ్లిపోతిని. ఆరోజు మొదలుకొని యిదివఱకు నేను పుట్టిల్లు మొగ మెఱుఁగను. నా భర్తకు కనకపురములో సామంతుని సేనలో నుద్యోగ ముండెడిది. తన మీఁది యధికారితో తాను దెబ్బలాడి పని పోఁగొట్టుకొనినారు. పెద్ద లార్జించినసొత్తు రెండువేలు కార్షాపణముల వఱ కుండినది. దానిని పెట్టి చంద్రపల్లిలో భూమికొని వ్యవసాయ మారంభించినారు. పట్టణములోఁబుట్టి పట్టణములోఁ బడి కొనకు గ్రామవాసిని నైతిని. రెండేండ్లు చక్కఁగానే కడచినవి. పిమ్మట శ్రీకాకుళము వెళ్లి యుద్యోగమునకు ప్రయత్నించెద నని చెప్పి తా నిల్లు విడిచిరి. విడిచినవా రిప్పటివఱకును పికరులేదు. మా అన్నయ్యకు నే నెన్నియో సారులు రాజధానికి వచ్చువారి ద్వారా కబుర్లు పెట్టితిని. నీభర్త యిచ్చటికి రాలే దని మ్మాత్రమే యతఁడు వారిద్వారా ప్రత్యుత్తర మిచ్చి తృప్తిచెందెను. చెల్లె లేమి యిబ్బంది పడుచున్నదో కనుగొనుట కొకసారి యైనను రాఁడయ్యెను. తనవదినెగారి కూఁతురు నింద్రతీర్థమునకు వచ్చి తీసికొనివెళ్లి పెంచిన వానికి చెల్లెలిసంగతి జ్ఞప్తికి రాలేదు అంద ఱికిని భార్యాబంధువు లాత్మబంధువులు!

కాత్యా—మీ యన్నయ్య తన వదినెగారి కూఁతురు నెంతయో నిస్స్వార్థబుద్ధితో లేక భార్యాప్రీతివలన పెంచుచున్నాఁ డని నీవు భ్రమపడవలదు. ఆపిల్లబోలెఁడుఆస్తితో వచ్చినది. ఆసొత్తువడ్డీ యాపిల్లవంటివారిని నలుగురు వ్యక్తులను పోషించుటకు సరిపోవును. దానికేమి గాని, నీకు పిల్లలా?

ఇంద్ర — ఒకకొడుకు, ఒకకూతురును. పదియేండ్ల వయస్సు మించియు మించకుండునపుడే కొడుకు మేనమామగారింటికి వెళ్లి యచటనే యుండి చదువుకొనెదనని శ్రీకాకుళమునకే వచ్చివేసెను. మామయా పిల్లవానిని తనయింటికి చేరనీయక ధర్మశాలలో బస చూపించి వారాలు కుదిర్చినాడట. వాడు చదువు ముగించి రాజుగారి సేనలో మంచి యుద్యోగములో ప్రవేశించినాడని విన్నాను. వాడు కబురు పెట్టలేదు సుమండీ! పైవాళ్లు చెప్పినసంగతి.

కాత్యా—ఆడపిల్ల యెచ్చట నున్నది?

ఇంద్ర — పిల్ల నీ రాజధానిలోనే యుండు నొక సైనికోద్యోగస్థున కిచ్చివేసితిని. అతడు రెండవపెండ్లివాడే యైనను అతని స్థితిగతులు బాగుండుటచే నిచ్చితిని.

కాత్యా—కౌశికకామపాలునకా? అతడీమధ్య చంద్రపల్లి వెళ్లి యొక పిల్లను కొనుక్కొని వచ్చె నని జను లనుకొన్నారు.

ఇంద్ర — కౌశికకామపాలునకే యిచ్చితిని. అమ్మితి నన్నమాటమాత్రము సర్వాబద్ధము. పెండ్లిఖర్చులుమాత్ర మతడు పెట్టుకొన్నాడు. అతని స్థితిగతులను గురించి నేను గొప్పగా వింటిని. వాస్తవమేనా నేను విన్నది?

కాత్యా—సుమారు లక్ష కార్షాపణము లతనికి పిత్రార్జితమైన సొత్తు గలదు. రాజకీయసేనలో నతడు సహస్రపతిగా నున్నాడు. సహస్రపతికి వెయికార్షాపణములు నెలకు జీతముదొరకును. శీఘ్రకాలములో నతడు దండనాయకుడగుటకు సంభవమున్నది. అప్పుడు జీతము చతుర్గుణమగును. వెయివరాలు జీతము దొరకు నన్నమాట. నీ కూతు రిప్పుడు రాణిగారియొద్ద ప్రధాన చేటిక లిద్దఱిలో నొకతెగా నున్నది. చేటీజనాధ్యక్షురాలికి పిమ్మట ప్రధాన చేటికోద్యోగమే యంతఃపురమున గొప్పది. ఆమెకు నూఱుకార్షాపణములు జీతము ప్రత్యేకముగా దొరకును. ఆపిల్ల పేరు హేమాంగియే కాదూ?

తన కూతురుయొక్క యైశ్వర్యమును విని యింద్రవతిభుజము లుప్పొంగినవి. ఆమె సంతోషముతో ని ట్లనినది. — ఔను. నాపిల్లపేరు హేమాంగియే.

కాత్యా—నీకొడుకుపేరేమి ?

ఇంద్ర—విష్ణుశర్మ.

కాత్యా—విష్ణుశర్మయా ? నీవు రెండు రత్నములను కనియున్నావు నీ కొడుకు శ్రీకాకుల వీరయువకులలో మేటియై వెలుగుచున్నాడు. ఎత్తగానే సేనాపతి వానికి శతపతిపదవి నిచ్చియున్నాడు వాని కిప్పుడు రెండువందల కార్షాపణములు నెలకు జీతము.

ఇంద్రవతిసంతోషము ద్విగుణించినది. అయినను ఆమెమనస్సులో నొక కొఱంత బాధించెను. అది యేది? ఇంతపదవికి వచ్చిన కొడుకు తనప్రక్కకు వంగివాల లేదు సరియే కదా యొక కబురైనను పంపలేదు. అల్లుడు పంపకుండుట కతడు పరాయివాడు. కొడుకు పంపకుండుటయే యామెకు కష్టముగా తోచినది. కొసకు వాడు బాగుండిన నాకు చాలు నని యామె యనుకొనినది. కొడు

కెంత యుపేక్షించినను తల్లిప్రేమ చెక్కుచెదరదుగదా!

కాత్యాయని మఱియు నిట్లు ప్రశ్నించినది.—"చిన్నమ్మాయీ! నీ విల్లుబయలు దేఱి యెన్నాళ్లయినది?"

ఇంద్ర—నెలరోజు లైనది. భగవాన్ జటామునిని నీవు ప్రయత్నించి వెతకిన నీభర్త నీకు తప్పక లభించు నని నా కారూఢము చూచి చెప్పినారు. అందువలన వెతకుటకు బయలు దేఱితిని. చంద్రపల్లి మొదలుకొని రాజధానివఱకుఁగల గ్రామము లన్నియును వెతకితిని. ఎచ్చటను కన్పట్టుటలేదు. రాజధానికి వచ్చి పిల్లల నొకసారి చూచుకొని పోవచ్చుననియు, నిచ్చటఁగూడ వారిని వెతక వచ్చుననియు నీలాగున వచ్చితిని. ఈ రాత్రి యిచ్చట తలదాఁచుకొని ఱేపు నాకూఁతురు గారింటికి వెళ్లెదను.

కాత్యా—అట్లే కానిమ్ము. అటుకు లున్నవి. ఫలహారము చేసెదవా?

ఇంద్ర—అక్కఱలేదు.

కాత్యా—నీ మగఁడిల్లు విడుచుట కుద్యోగకాంక్షయేనా హేతువు? వేఱు కారణ మేదియైనఁ గలదా?

ఇంద్ర—వారు చెప్పిన కారణ మది యొక్కటియే. వారు బయలుదేఱుటకు ముందు జటాముని శిష్యుఁడు విమలుఁ డను బ్రాహ్మణుఁడు మాయింటికి వచ్చి పదిరోజు లుండెను. నేనా బ్రాహ్మణుని మిక్కిలి గౌరవముతో చూచుకొంటిని. అది నాభర్త కసూయ జనింపఁజేసెనేమో యని నాయనుమానము. అతఁ డుండినంతకాలము నాభర్త ముఖము ప్రసన్నముగా నుండలేదు.

కాత్యా—నిశ్చయముగా నసూయవలననే నీభర్త యిల్లు విడిచి పరారి యయ్యెను. నీవు గొప్ప పతివ్రతవుగదా! ఏల భర్తయిష్టమునకు వ్యతిరేకముగా నతిథి నంత గొప్పగా గౌరవించితివి?

ఇంద్ర—కట్టుఁబాటుగల యిల్లాల నగుదునేకాని నే నంత వీర పతివ్రతను గాను.

ఇంద్రవతిమాటకు చమత్కారముగా కాత్యాయని యిట్లు శ్లాఘించి పలికినది—

"నీవు జితేంద్రియురాలవేకాని యొకరికి బానిసవు కావన్న మాట. వీరపతివ్రతయనఁగా నచ్చబానిస."

## ఎనిమిదియవ ప్రకరణము

### సుడిగాలి

ధనంజయునకు ఘనేంద్రకాలనాథ మల్లికార్జునులు గొప్పస్నేహితులే యైనను వారికంటె నంతరంగస్నేహితుఁడు మఱియొకఁడున్నాఁడు. మనయింద్రవతి కుమారుఁడు విష్ణుశర్మయే యతఁడు. చాలబీదవాఁడుగా నుండి కష్టపడి చదివి ముందుకు వచ్చినందున నా యువకునిపై నాచార్యునకు నాచార్యపుత్రునకుఁగూడ మిక్కిలి యభిమానము.

విష్ణుశర్మ యిరువది సంవత్సరములు వయస్సు గలవాఁడు. ఇంద్రవతి వీనిని తన పదునైదవ సంవత్సరమున కనినది. ఇంద్రావతి విష్ణువను కుమారుని లోకరక్షకుని కనునను జటాముని దీర్ఘదర్శనవార్త నితఁడు తన

తల్లితండ్రులు తనచిన్నతనములో చెప్పుకొనుచుండఁగా వినియున్నాఁడు. అది మొదలుకొని యితఁడు తానే యారక్షకపురుషుఁడనని యభిమానించుచుండును. ఇంద్రవతి యే ఇంద్రావతియని వానిదృష్టి. హ్రస్వదీర్ఘభేదమంతగా పాటింప నక్కఱలేదని వాఁడనుకొనుచుండెడివాఁడు.

విష్ణుశర్మ బాల్యమునుండి మిక్కిలి చురుకుదనము గలవాఁడు. ఏకసంతగ్రాహి. అద్వితీయమేధాశాలి. మంచి శారీరబలము గలవాఁడు. ఇప్పు డతఁడు శస్త్రపరీక్షలో నద్భుతముగా గుణములను తెచ్చుకొనినాఁడు. బాల్యమునుండి యతనియందు డాఁగియుండిన యభిమాన మిప్పుడు విజృంభించినది. అచౌర్యము అవ్యభిచారము అహింస జిహ్వానిగ్రహణము మిథ్యాప్రలాపవర్జనము అశ్లీలప్రలాపవర్జనము అద్రోహబుద్ధి — ఈ సప్తమర్యాదల నతఁడు మిక్కిలి పొగడుచుండును. భోగనాథకూటముపై నతని కపారద్వేషము. జూదరు లనిన నతనికి తలనొప్పి. కౌళికు లనిన నతని కత్యంతజుగుప్స, కాత్యాయని యుచ్ఛృంఖల వ్యభిచారిణి యని యతనిభావము.

అతని యుద్దేశములను పరీక్షించునెడల నతఁడు చెడ్డవాఁడని యెవ్వరు ననఁజాలరు. సూక్ష్మదృష్టి గలవారు మాత్రము కనిపెట్టఁదగిన రెండుమహాదోషము లతనియొద్ద నుండినవి. ఒకటి యాలోచింపకుండ తాత్కాలికాభిప్రాయవాత్యానుసారముగా నొకరిని గుఱించి తీర్పిచ్చుట; ఇంకొకటి దురహంకారము.

ఇంద్రవతి కాత్యాయనితో మాట్లాడు సమయముననే విష్ణుశర్మ ధనంజయునితో నొక ముఖ్యవిషయమును గుఱించి ప్రసంగించినాఁడు. వారిసంవాదము నంతటి నిచ్చట వెల్లడించుట యనావశ్యకము. సారాంశమును చెప్పెదము.

సోమవారమునాఁడు రాత్రి రాజకాళి వెళ్లిపోయినపిమ్మట భవనందిగారి వీథి యరుఁగుపై నొకక్షణకాలము నగధరుఁడును భానుమతియు నుండుట తటస్థించిన సంగతి మాపాఠకులకు తెలుసును. ఆసందర్భములో విష్ణుశర్మ వీథిలోనుండి పోవుచున్నాఁడు. దురదృష్టవశమున వాని దృష్టిభవనంది యరుఁగుపై ప్రసరించినది. భానుమతీనగధరు లొక యరుఁగుపై నన్యోన్య సన్నికృష్టులయి యుండుట యతనికి గోచరించినది. అంతియేగాదు. తనను జూచిన తత్క్షణమే భానుమతి త్వరితగతిలో లోపలకుఁ బోయి తలుపువేసుకొనుట గూడ నతనికి కన్పట్టినది. భానుమతి తన యావేశములో లోపలకు పోవునపుడు వీథిలోని విష్ణుశర్మను గమనించియుండకపోయినను అతఁడు మాత్రము తనను జూచియే యామె యపక్రమించెనని భ్రమపడినాఁడు. తత్క్షణమే యతని దృష్టిలో భానుమతి కన్యాత్వము సురక్షితముగా నుండలేదను నపోహ కలిగినది. తాను ప్రాణముకంటె నధికముగాఁ బ్రేమించు తన గురుపుత్రున కొక యపవిత్ర కన్య తటస్థించుట యతనికి కిట్టలేదు. అతఁడు తాను చూచిన సంగతి నంతటిని వివరించి భానుమతీవివాహము తన కిష్టము లేదని ధనంజయునితో పర్యవసానము తేల్చినాఁడు. ధనంజయుని బుద్ధి విఱిగిపోయినది. విష్ణుశర్మ

యబద్ధమాడఁడని యతని విశ్వాసము. వాస్తవముగా నతఁడబద్ధము గూడ నాడలేదు. సందర్భము తెలియక యతఁడపోహపడినాఁడు. ఏమియు విమర్శింపక ధనంజయుఁడు తన యంధస్నేహితు ననుసరించిన యంధుఁడైనాఁడు.

మఱి యేమున్నది? ఆరాత్రియే విష్ణు ధనంజయులిద్దఱును ఆచార్యునియొద్ద నీ విషయమును దాపఱికములేక నివేదించినారు. అతఁడీ యిద్దఱి ననుసరించిన మూఁడవ యంధుఁడయ్యెను. దరిద్రుఁడగు తన పినతండ్రి మనుమఁడు ప్రేమించినపుడు తా మా పిల్లను చేసుకొనుట యన్యాయ్యమని గూడ నతనికి తోఁచినది. పిల్లను స్వాధీనపఱచుకొనియుండిన నగధరు నుల్లంఘించి తాను భానుమతిని కోడలినిగా చేసుకొనుట యా యవసన్న బాంధవునకు శాశ్వతాపకారము చేసినట్లగునని యతఁడెంచెను.

ఇంకేమున్నది? మఱునాఁడు సూర్యోదయమగుటయే తరవాయి. ఆచార్య విషమసిద్ధి గణపొంతనము కుదురలేదను వ్యాజముచే నాచార్యభవనందితో తన ప్రత్యాఖ్యాన వార్తను తెలియఁజేసినవాఁడయ్యెను. పూర్ణానగధర ఘనేంద్రు లాసమాచారము తెలుసుకొని రాజకాళి వాఙ్మహిమ యిది యని యాశ్చర్యపడిరి. రాజకాళి యుదహరించిన సుడిగాలి యీ విధముగా వీచినది.

## తొమ్మిదియవ ప్రకరణము

### పుత్రుని పారవశ్యము

బుధవారమునాఁడు ప్రాతఃకాలమున నింద్రవతి తనయల్లునియింటికి చేరినది. అల్లుఁడత్తగారిని మిక్కిలి గౌరవముతో రాఁబట్టుకొనెను. కూఁతురు తల్లి కతిప్రీతితో స్వాగతమిచ్చినది. కామపాలునకు ప్రథమభార్యయందు పిల్లలు లేరు. ద్వితీయభార్య హేమాంగి కొలఁదిమాసముల క్రిందటనే యింటికివచ్చినది. అందువలన నాయింటి కుటుంబ మంతయు నాదంపతు లిద్దఱే. కామపాలుఁడు నలువదియైదు సంవత్సరములు గడచినవాఁడైనను దృఢకాయుఁడుగా నున్నందున వార్ధకప్రారంభచిహ్నము లేమియు నతనియందు కన్పట్టవు. హేమాంగి పదునెనిమిదియవ సంవత్సరము ప్రారంభించిన యువతి. ఆయోధప్రశ్రేష్ఠున కామె యనుంగు నాయిక. ఆసంపన్నగృహస్థున కామె ముద్దు భార్య. ఆ కామతంత్రవిశారదున కామె ప్రియశిష్యురాలు. ఆప్రౌఢనరసున కామె లీలాసఖి. ఆహాస్యరసప్రియున కామె యంతరంగ విదూషకురాలు.

ఇంటిదగ్గఱ హేమాంగి కేపనియును లేదు. భోజనము సేయఁగానే కోటకు వెళ్లి సాయంకాలము వఱకు రాణిదగ్గఱనుండి యామె వచ్చుచుండును. ఇంటిపనులు నెఱవేర్చుటకు దాసీదాసాదు లున్నారు. తాను రాణికి చేటిగా నుండుట గడియకకాదు. అది యొక గౌరవము. భావిలో తన భర్తయధికార విజృంభణమున కది యనుకూలింపఁగలదని యాశ.

అల్లుఁడును, కూఁతురును చేసిన గౌరవమువలనను, వారిమృదూక్తులవలనను వారు తనపై నింతకుముం దనాదరము చూపుచున్నారేమో యనుభ్రమ వీడిపోయినది.

పిమ్మట వారిచే నభ్యనుజ్ఞాతమై యొక గుఱ్ఱపుబండిపై తన కుమారుని బసకు వెళ్లినది. నౌకరు లోపలకువెళ్లి విష్ణుశర్మతో మీ అమ్మగారు వచ్చిరని తెలియఁజేసెను. ఆ మాట వినఁగానే యతఁడెంతో యానందముతో నెంతయో ప్రీతితో చిరకాలమునకు తన దగ్గఱకు వచ్చిన తల్లి నెదుర్కొనవలసి యుండెను. అతఁడట్లు సేయక నిరాదరస్వరములో లోపలకు రమ్మనుమని యొకమాట చెప్పెను. అతఁడప్పుడు వండుకొనుచున్నాఁడు.

బండివానిని పంపివేసి యింద్రవతి లోపలకు ప్రవేశించినది. వంటింటివఱకు నిరాఘాటముగా వెళ్లినది. లోపలకు వెళ్లి వంట సేయు కుమారుని చూచినది. ఆమెకండ్ల కతఁ డద్భుతరేఖతో కన్పట్టినాఁడు. నాగర్భమునందు పుట్టినవాఁ డిట్టి యుత్తమచ్ఛాయతో వెలుఁగుచున్నాఁడా యని యామె యుప్పొంగినది. అయ్యో! దిక్కులేనివాఁడువలె తనవంట తానే చేసుకొనుచున్నాఁడా యని ఖేదించినది.

తల్లినిచూచిన పిల్లవాఁడు లేచి పాదములపైఁ బడవలసియుండెను. అతఁ డట్లు సేయలేదు. మంచిమాటలచే స్వాగతమైన సేయవలసియుండెను. అది గూడఁ జేయలేదు. కొసకు కుశలప్రశ్నమైనఁ జేయవలసియుండెను. అదిగూడ నతఁడు చేయలేదు. ఆలోకరక్షణోత్సుకుఁడు ఆధర్మాభిమాని తనకన్న తల్లినట్లు నిర్లక్ష్యము సేయఁ గారణమేమి? ఆమె హేమాంగిని వృద్ధుఁడగు కామపాలునకు శుల్కము పుచ్చుకొని యమ్మివేసెనను భావమతని మనస్సులో పడియుండెను. అందువలన నతని దృష్టిలో తన తల్లి మాంసమమ్ముకొను కటికదానివలె కన్పట్టినది. ఇంక నతనికి గౌరవమెట్లుండును?

“నాయనా! బాగున్నావా?” అని తల్లియే ముందుగా కుశలప్రశ్న చేసినది.

“ఏమి బాగు? నీవు చేసిన పనికి తల వంచుకొని నగరిలో తిరుగుచున్నాను. కటికవానికైన దయ యుండునుగాని నీకు దయ లేకపోయినది. రత్నమువంటి పిల్లను వేలకు విలువైన పిల్లను సామంతకుమారులు కోరఁదగిన పిల్లను ఒక వృద్ధున కమ్మివేసితివి. ఒక పొట్టకు నీకు ధన మంత కావలసియుండెనా? నేను చచ్చిపోతి ననుకొంటివా? నిన్ను నేను పోషింపలే ననుకొంటివా?”

మంచిస్థితికి వచ్చియున్నాఁ డనుకొన్న కొడుకువలన తల్లి వినినమాట లివి. ఆమె నిలువున నీరైపోయినది. కూర్చుండు మనియైనఁ జెప్పక యతఁడు చిరకాలమునకుఁ జూచిన తల్లిని చావఁ జీవాట్లు పెట్టుచున్నాఁడు.

ఇంద్ర — ఏమి యీ అన్యాయపు మాటలు? నేను పిల్ల నమ్ముకొన్నానా? ఆ పిల్ల యొకజడవస్తువుగాదు. అడిగి కనుక్కొనుమాపిల్లను. మా మ్మాఱు తా నిష్టపడినందున నే నా వివాహము చేసితినో లేక యమ్మివేసితినో నీకు బోధపడును. ఇంతకును నా ప్రారబ్ధ మిట్లున్నది. ఇల్లువిడిచిన భర్త యిది వఱకు రాలేదు. కడుపున కనుక్కొనిన కొడుకు ముందువెనుక లేమియు నాలోచింపక తూలనాడ నారంభించినాఁడు. అన్న ముందే విడిచిపెట్టివేసినాఁడు. భగవాన్ జటా

ముని చెప్పినట్లు — ఎవరి త్రోవ వారే చూచుకొనవలెను. నీవు నాకు తిండిపెట్ట నక్కఱలేదు నీవు బాగుం'న నదియే నాకు చాలును. కటికిదానికంటె నిర్దయురాలగు తల్లిసహవాసమువలన నీవు చెడ నక్కఱ లేదు. నేను పోయివచ్చెదను.

ఇప్పుడైనను విష్ణుశర్మకు తల్లికాళ్ల పైఁబడి యామెను సమాధానపఱచుట కవకాశ మున్నది. అతఁడు తన తెలివితక్కువ నంగీకరించు స్వభావము గలవాఁడు కాఁడు. అందువలన నతఁ డాయవకాశమును జాఱ విడిచి యుత్తరప్రసంగమువలన స్థితిని మఱింత పాడుచేసెను.

"నలువదియైదు సంవత్సరముల ముసలి వానికి శుల్కము లేక నీ విచ్చినమాత్రమున న దోషమునుండి తప్పించుకొనఁగలవా? చిన్న పిల్లల కేమితెలుసును? నాలుగు నగలుపెట్టిన తత్కాలసంతోషమువలనవారూరకుందురు. ఆపెండ్లాడిన యెద్దయిన నాపిల్లను మర్యాదగా నుంచినాఁడా? కోటకు చేటిగా నానోరులేని పిల్లను కుదిర్చినాఁడు. అది తన భావి కభివృద్ధికరమఁట. అంతకంటె గుడిచేటినిగా చేసిన కొంతమేలు. నీ యనాలోచితక్రియవలన నా తండ్రికి చేటీపిత యనియు నాకు చేటీభ్రాత యనియు మచ్చలు వచ్చినవి. భోగనాథ బాబు హాస్యప్రసంగములకు తలలాడించుటయే రాణిగారి ప్రధానచేటికల ముఖ్యోద్యోగము. ఎంత యవివేకకార్యములు చేసిన తల్లియైనను ఆమెను పోషించుట కొడుకువిధి గాన నీకు నాయింట పోషణకు లోపముండదు గాని నీవు నాయింట దిగక కూఁతురుగారి యింట దిగి గుఱ్ఱపుబండి యెక్కి యవమానగ్రస్తుఁడగు కొడుకును పరామర్శించుటకు వచ్చియున్నావు.

ఇంద్ర—ఇప్పుడు నీతో వాదించి ప్రయోజనము లేదు. ఇంత పరుషమైన చీవాట్లు నా భర్తవలనఁగూడ నేను తినలేదు. ఉద్యోగమయినది మొదలుకొని యిదివఱకు తల్లిని తొంగిచూచి వంగివాలని నీవు గొప్ప ధర్మశాస్త్రవేత్తవలె నుపన్యసించుచున్నావు. భగవాన్ జటాధర నిశిష్యురా లీ కసుకుకాయల వలన నుపదేశములను విన నవసరము లేదు. చీవాట్లలోఁ గూడిన నీ తిండికొఱ కిచ్చటికి నేను రాలేదు. నా కూఁతురింట కాళ్లుదాఁచుకొని తినుటకుఁగూడ నేను గాలేదు. నా భర్తను వెతకుటకు నేను వచ్చితిని. మీ యిద్దఱిని చూచి వెళ్లిపోవలె నని యిచ్చట నొకసారి దిగితిని.

విష్ణు—ఇంక నది యొక్కటి బాకీ. నా తండ్రిని నేను వెతకి కనిపెట్టి నీ కొప్పగించెదను. నీ కెందు కూరూరఁ దిరుగుట? ఒక స్త్రీ యొంటరిగా తిరుగుట యెంత యవిచారిత కృత్యమో నీకు తెలియకున్నది.

ఇంద్ర—నా కది గుర్వాజ్ఞ.

విష్ణు—నిన్ను గురువు ఊరూరఁ దిరుగు మన్నాఁడా?

ఇంద్ర—నీ పతిని నీవు వెతకుమని నన్ను గురు వాజ్ఞాపించెను.

విష్ణు—(ఒకమెట్టు దిగి) నమ్మకమైన యొకమనిషిని సహాయ మిచ్చెదను. నీ వొంటరిగా తిరుగుటను నేను పేక్షింపఁజాలను.

ఇంద్ర—నీ విచ్చిన చీవాట్లే నాకుఁ జాలును. మఱియేమియు నీయనక్కఱలేదు.

విష్ణు — యథార్థవాదీ బంధువిరోధీ యన్నాఁడు నీతిశాస్త్రకారుఁడు

ఇంద్రవతి యింక నచ్చట నిలువనోల్లక త్వరితగతితో నిష్క్రమించినది. ఇట్టి కష్టము లామెకు పరిచితములే. పుత్రుని పాపపృయము వలన నామె వైరాగ్యము మఱింత హెచ్చినది. చిన్నగా నామె కౌమారితెయింటికే వెళ్లెను. అచ్చట తన పరాభవము నామె వెల్లడించుకొనక గంభీరురాలుగానే యుండినది.

ఇచ్చట విష్ణుశర్మ ఖిన్నుఁడైనను తనను తాను సమర్థించుకొనుచున్నాఁడు. తల్లి చేసినది తప్పే యని యతని యభిచాల్యదృష్టి. తప్పే కావచ్చును గాని నీవు తల్లిని పరాభవించుటమాత్ర మకాలోచిత మని యతని మనస్సాక్షి మెల్లగా సణిగెను. మనస్సుమాత్ర మా సణుగుడు లక్ష్యపెట్టక తన కృత్యము నుచ్ఛధ్వనితో సమర్థించుచున్నది.

---

# వేలూరు కోటలోని
# జలకంఠేశ్వరాలయ శిల్పచిత్రములు

S. S. S.



౧. దేవాలయ సింహద్వారము

ఆలయములోని కల్యాణమంటపము



3. కల్యాణమంటపముకప్పునగల శిల్పము (౧)



౪. కల్యాణమంటపముకప్పునగల శిల్పము (౨)







౫. కల్యాణ మంటపమునందలి స్తంభములమీఁది శిల్పరచన

# లక్షణాలని గురించి

బులుసు వెంకటరమణయ్య



'ఆ అమ్మాయి లక్షణంగా ఉన్నాది' అని ఒకరు ఒక అమ్మాయినిగురించి అన్నారంటే ఆమె అవయవ సౌష్ఠవం కలిగి అందంగా వున్నాదని అభిప్రాయపడుతున్నారని మనం అనుకుంటున్నాం. తక్కిన భాషల సంగతి యెలా వున్నా తెలుగువాడుకలోమాత్రం 'లక్షణం' అనే మాటకి 'అందం' అనే అర్థం అలవాటు పడిపోయింది.

నిజాన్ని బట్టి చూస్తే యీ అభిప్రాయాన్ని కొట్టి పారెయ్యడానికి వీల్లేదు. ఏ భాషలోనన్నా సరే; లక్షణమనేది చెల్లాచెదిరివున్న లక్ష్యావయవాల్ని ఒక చోటికి పోగుచేసి తెచ్చి సంపూర్ణస్వరూపాన్ని వివరించి, దానికి ప్రత్యేకతని తీసుకువస్తుంది. అలా చెయ్యలేనప్పుడు అది నిజమైన లక్షణమే కాదు.

లక్షణాల్లో కొన్ని ప్రకృతిసిద్ధాలు; కొన్ని మనుష్యులు కల్పించినవి. ప్రకృతిసిద్ధాలయినవాటి లక్షణం మార్చడానికి మానవుడికి సాధ్యంకాదు. ఎంత గొప్ప సైంటిస్టు అయినా పదార్థాల స్వభావాన్ని మార్చలేడు. వాటికీ వాటికీ వుండే సంబంధంవల్ల కలిగే మార్పులే అతడు కనుగొనేవి. ఇక మానవకల్పితా లయిన వాటి లక్షణాన్ని మార్చవచ్చు; వాటివాటి స్వభావాల్ని తారుమారు చెయ్యావచ్చు. అలా మానవుడు కల్పించడానికీ, తార్మారు చెయ్యడానికీ కారణం యేమిటీ? అందచందాల్ని కూర్చడం వక్కటే.

మనుష్యుల ఊహలకు అంతు వుండదు. దాన్ని బట్టే లక్షణాలు మారుతూ వింతవింత పద్ధతులతో అందచందాల్ని కలుగచేసుకుని ఆనందాన్ని కలుగచేస్తాయి. అటువంటి పరిణామాలకి అవకాశం లేకపోవడం వల్ల ప్రకృతిసిద్ధాల లక్షణాలు మార్పుచెందక పాతపద్ధతుల్నే పాటులాడతాయి.

వాఙ్మయానికి - అంటే - కావ్య వాఙ్మయానికి ప్రధానంగా వుండే లక్షణాలు మూడు. అవి ఛందస్సూ, వ్యాకరణమూ, అలంకారమూను. అందులో ఛందస్సు కొన్ని గణనియమాలనీ, అక్షరనియమాలనీ ఏర్పరచుకుంటూ పరిశ్రమిస్తూ అన్నివిధాలా కావ్యపు అందానికీ, మానవుడి ఆనందానికీ ప్రయత్నిస్తూ వుంటుంది. వ్యాకరణం "వాడడానికి తగినపదా లివీ, తగనిపదార్థాలివీ, యీ వాక్యం యిలా వుండాలి, అది అలావుండాలి"అని శాసిస్తూ ప్రయోజనంలో ఛందస్సుతోటే ఏకీభవిస్తూ వుంటుంది. ఇక అలంకారలక్షణమో, "ఇలా వుంటే రసానికి అనుగుణంగా వుంటుంది; ఇలా వుంటేవుండదు" అని ప్రధానంగా రసాన్నే ఆశ్రయించుకొని కావ్యానికి అందచందాల్నీ, చదివేవాళ్ల నేవాళ్లకీ కీ వివిగళితవేద్యాంతరమైన ఆనందాన్నీ కలిగిస్తుంది. ఏతావతా ఏం తేలిందీ! మనం కల్పించుకున్న లక్షణాలికల్లా ప్రధానలక్ష్యం అందమూ, తద్వారా ఆనందమూ అని. దేశ, కాల, పాత్రల పరిస్థితులని బట్టి అభిరుచులు మారుతాయి; అందాలూ మారుతాయి. వాటినిబట్టి లక్షణాలూ మారుతాయి. అలా లక్షణాలుమాత్రం మారకపోతే వాటి వల్ల ప్రయోజనమూ స్వల్పమే!

అయితే! ఒకసంగతి. "యీ లక్షణా లెప్పుడూ మారుతూనే వుంటవిగనక వీటికి స్థిరత్వం అనేది లేదే;

అలాటప్పుడు పూర్తిగా లక్షణా లక్కర్లేదని తోసిరాజుచేస్తే ఏం మునిగిపోయింది?" అని అడగవచ్చు. కాని అభిరుచినీ, అందాన్నీ అనుసరించి లక్షణం మారుతుందే గాని లక్షణం ఉండితీరా లనే అభిప్రాయంలో భేదం ఏమాత్రమూ లేదు. ఓ దారీ, తెన్నూ లేదుకాబట్టే యిప్పటి నవ్యకవిత్వమూ, వ్యావహారికభాషా యిచ్చవచ్చినరీతిగా నానాముఖాలా పరుగులెత్తుతూ అందరి ఆమోదాన్నీ పొందలేకుండా వున్నాయి. వాటికి కూడా ఓ నియమం అనేదివుంటే మరి చిక్కే లేదు.

ఛందో, వ్యాకరణా లంకారాలనే మూడురకాల లక్షణాల్లోనూ అలంకారానికే రసంతో సాక్షాత్సంబంధం వుంది; తక్కినవాటికి రసంతో వున్నది పరంపరాసంబంధం. రసానికి అడ్డంకిని కలిగించేదే దోషం. శబ్దార్థాలవల్ల రసం కలుగుతున్నాది కాబట్టి పరంపరగా శబ్దార్థదోషాలుకూడా వచ్చాయి. * ఆ శబ్దగతదోషాల్లోనే చ్యుతసంస్కృతి (వ్యాకరణవిరుద్ధం) ఛందోభంగం దోషాలుగా చెప్పబడ్డాయి. రసం బాగా పోషించబడి వున్నప్పుడు ఛందస్సు తప్పినా, వ్యాకరణం అతిక్రమింపబడినా బాధలేదు. రసం లేకుండా యీ కట్టుదిట్టాలుమాత్రం వుంటేకూడా ప్రయోజనమూ లేదు. అంచేత అలంకారమే అన్నిలక్షణాల్లోనూ ప్రధానమన్న మాట.

రససంసిద్ధిని పొందిన మహాకవులు పయి ఛందోవ్యాకరణాదుల్ని అతిక్రమించడం కనబడుతున్నాది. ఇంతెందుకూ? కాళిదాసురచనల్లోనే కనబడతాయి ఆ పద్ధతులు! 'త్రియంబకం సంయమినం దదర్శ' అనేచోట అతడు 'త్ర్యంబకం' అనేదానికి బదులుగా 'త్రియంబకం' అనేదాన్ని చెప్పి వ్యాకరణాన్ని అతిక్రమించాడు. 'ఉమారూపేణ తే యూయం' అనే శ్లోకంలో 'శంభోర్యతిధ్వమాక్రష్టుమయస్కాంతేన లోహవత్' అని వ్రాస్తూ 'లోహమివ లోహవత్' అని వ్యాకరణం విధించని ద్వితీయా విభక్తిమీద వతిప్రత్యయాన్ని విధించేడు. 'వపుర్విరూపాక్ష మలక్ష్యజన్మతా' అనేచోట 'విధేయప్రాధాన్యాన్ని విమర్శించకుండా 'అలక్ష్యజన్మతా' అంటూ సమస్తంగా కొట్టేశాడు. 'గాహంతాం మహిషా నిపానసలిలం శృంగైర్ముహుస్తాడితం' ఉపక్రమించి 'విస్రబ్ధం క్రియతాం వరాహతతిభిర్ముస్తాక్షతిః పల్వలే' అని ప్రక్రమాన్ని మార్చి కర్మణిప్రయోగాన్ని చేశాడు. ఇక తక్కినవాళ్ల సంగతి చెప్పనక్కర లేదు. తెలుగువారిలోనూ వ్యాకరణాది లక్షణాలని అతిక్రమించిన మహాకవులు ప్రాచీనులే చాలామంది వున్నారు. చిల్లరకవుల సంగతి చెప్పేదేమిటి?

మహాకవుల రచనల్లో ఇలాంటి లక్షణాతిక్రమణా లున్నా రసాని కెంతమాత్రమూ భంగం కలగకపోవడంచేత వ్రాసిన కవులకీ, చదివే పాఠకులకీ, వినే సహృదయులకీ యేమిన్నీ లోపం కనబడడం లేదు. ఇది లక్షణానుసారి అవునా కాదా అని తర్కించి బాగా విమర్శించితే తప్ప పయి లక్షణాతిక్రమణాలు తెలియవు. ఆ స్వల్పలోపాలని మహా ప్రతిభావంతులైన మహాకవులు కవిత్వ సామర్థ్యంచేత కప్పిపుచ్చగలరు. ఈ విషయాన్నే ధ్వనికారుడు†సమర్థుడైన కవి అవ్యుత్పత్తివల్ల చేసిన దోషం కనిపించదనీ, అసమర్థుడు చేసినది వెంటనే తెలిసిపోతుందనీ వివరిస్తూ ఉదాహరణంగా కాళిదాసు చేసిన పార్వతీపరమేశ్వరుల దాంపత్యనర్మవర్ణనాన్ని చూపేడు.

రసాన్నీ, చమత్కారాన్నీ, లోకవ్యవహారాన్నీ బట్టి లక్షణా లుండాలి; గాని లక్షణాలని అనుసరించి

---

†ముఖ్యార్థహతిర్దోషో రసస్తు ముఖ్యస్తదాశ్రయాద్వాచ్యః, ఉభయోపయోగినః స్యుః శబ్దాద్యాస్తేన తేష్వపి చ సః. (కావ్యప్రకాశః- దోషప్ర)

* అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః, యస్త్వశక్తికృతో దోషః స ఝటిత్యవభాసతే. [ధ్వన్యాలోకః పు ౧౩౭]

అవి ఉండవు. లక్షణాలు ఎంత బందోబస్తుచేసి శాసించినా కొన్ని విషయాల్లో ఉపేక్ష వహించక తప్పింది కాదు. 'శ్రుతికటుత్వం' అనేది దోషాల్లో ఒకటి. అలా అయినప్పటికీ రౌద్రాదిరసాల్లో అది గుణమే అవుతుంది. దోషం కాదు. కాబట్టే అది అనిత్యదోషాల పద్దుకి ఎక్కింది. నిష్ఠ్యూత, ఉద్గీర్ణ, వాంతాది శబ్దాలు ముఖ్యార్థాన్ని విడిచిపెట్టి గౌణార్థాని గ్రహించినప్పుడు చాలా సుందరంగా ఉంటాయనీ 'ఉమ్మట, కక్కట, వాంతి చేసుకొనుట మొదలైన అర్థాన్ని (ప్రధానార్థాలని) చెప్పినప్పుడు గ్రామ్యాలవుతాయనీ, 'భగిని, భగవతి' మొదలైన శబ్దాలు విమర్శించి చూస్తే అసభ్యార్థాన్ని చెప్పతున్నా పండితవ్యవహారంలో వుండడంచేత అవి అసభ్యాలు కావనీ దండ్యాచార్యులు కావ్యాదర్శంలో చెప్పాడు.* సంస్కృత వైయాకరణులు "జయించడానికి యోగ్యుడు కానివాడు" అనేఅర్థాన్ని నియమించిన 'అజేయు' శబ్దాన్ని తెలుసువారు—అంటే - నన్నయ్యభట్టు మొదలుకొని నేటిదాకా వున్నవారంతా 'జయించడానికి శక్యము కానివాడు' అనే అర్థంలోనే ప్రయోగించడం అందరూ ఎరిగిందే! సంస్కృతంలో మాత్రం యీ రెండో అర్థంలో 'అజయ్య' పదాన్నే వాడాలి.† పయివిషయాలనిబట్టి చూస్తే ఒకప్పుడు విరుద్ధమైన పదాలే క్రమక్రమంగా పెద్దల వాడుకలోకివచ్చి గ్రంథాలకి ఎక్కుతున్నాయనీ, అలా ఎక్కినంత మాత్రాన కావ్యాలకీ, అందులో ప్రధానమైన రసానికీ భంగమేమీ కలగటం లేదనీ తేలుతున్నాది. ఇలాగ శబ్దార్థాలూ, వాటి ప్రయోగాలూ మారుతూవున్నప్పుడు లక్షణాలు మాత్రం ఒకే పద్ధతిని ఎందుకుండాలీ?.

రసం చమత్కారాలమీద ఆధారపడి వుంది. ఆ చమత్కారాలు అంతం లేని మాటలతీరులమీద ఆధారపడి ఉన్నాయి. కాబట్టి వాటి ననుసరించి లక్షణాలన్నా మారుతూనే వుండాలి. ఆలంకారికులు ఆ తత్వాన్ని గ్రహించే తలాకదారీ తీశారు. ఒకరనుసరించిన పద్ధతిని మరొకరు అనుసరించకా, ఒకరు చెప్పిన కావ్యలక్షణాన్ని మరొకరు చెప్పకా చర్చల్లోకి దిగేవారు. ఇదంతా ఎందుకోసం? రసాన్ని సాధించడానికే.

అలా అయినప్పటికీ సంస్కృతాలంకారికులు నాటకాల విషయంలో ఒకటే నియమం పెట్టుకుని భీష్మించుకు కూచున్నారు. వాటికి పంచసంధులూ వుండాలి; వాటి అంగాల్లో కొన్నయినా తప్పక వుండాలి. వీర, శృంగారాల్లో ఒక్కటే ప్రధానరసంగా ఉండాలి. విష్కంభ, ప్రవేశక, చూళికాదు లుండాలి; చివర అద్భుతం ఉండాలి; ఇన్నంకాలకీ తక్కువా కాక, ఇన్నంకాలకి ఎక్కువా కాక వుండాలి. ఇలా నియమాలున్నా ఇప్పటి సంస్కృతాభిమానులుకూడా నాటకరచనంలో పయి నియమాల్ని లెక్కచేయలేదు; పెద్దపెద్ద పరిషత్తులేలెక్కచెయ్యనక్కర్లేదంటున్నాయి. ఒక్క సంస్కృతభాషాంతరీకరణాలలో తప్ప తెలుగువారు పయి నియమాలని లక్ష్యమే చెయ్యలేదు. క్రమక్రమంగా ప్రస్తావనకూడా పటాపంచ లయింది. దేశ, కాల, పరిస్థితులనిబట్టి మార్పు లేకపోతే ప్రాచ్యనియమ శృంఖలాబద్ధాలయిన నాటకాలు ఎవరి ఆదరానికి పాత్రమవతాయి? అసలిప్పుడు నాటకాలమీద మోజు తగ్గింది ప్రజకి. ఇది టాకీలయుగం! ఈ స్థితిలో నాటకాలు జనాదరణకి పాత్రాలయే పద్ధతిని లేకపోతే కొద్దికాలంలో నాటకాలు నామావశిష్టాలు కావలసివస్తుంది.

---

* 'నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది గౌణవృత్తివ్యపాశ్రయాత్. అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే' భగినీ భగవత్యాది సర్వత్రైవానుమన్యతే.'

† క్షయ్యజయ్యౌ శక్యార్థే-- యాన్తాదేశ నిపాతనార్థ మిదంసూత్రమ్. క్షేతుం శక్యం క్షయ్యమ్; జేతుం శక్యం జయ్యమ్; శక్యార్థే కిం? క్షేతుం జేతుంయోగ్యం క్షేయం జేయమ్."

ప్రాచీనలక్షణకర్తలు వారివారి కాలాన్ని అనుసరించి లక్షణాలు రాశారు. ఇప్పటి అభిరుచుల్నీ పరిణామాలనీ పురస్కరించుకొని అవి బాగులేవని అనుకోవడంకంటె అప్పటివాటిని అనాలోచితంగా అనుసరించడం మనవాళ్లదే తప్పని అనుకోవడం ఉత్తమం. ఆలక్షణాల్లోనీ కొన్నిమాత్రమే ఇప్పుడు సంస్కారార్హాలు. ప్రధానమయినవి ఎప్పటికీ వుండి తీరవలసినవే.

ఇప్పుడు ఆంధ్రదేశంలో బయలుదేరు తూన్న విమర్శకుల్లో కొందరు అలంకార లక్షణాలు తెలుగు వాఙ్మయాన్ని పాడుచేస్తున్నాయనీ, వాటిని అనుసరించడంచేతనే తెలుగు ప్రబంధాలు సందర్భంవున్నా లేకపోయినా తద్దినాల్లాగ అష్టాదశ వర్ణనలనీ నిర్బంధంగా వర్ణిస్తూ రసాన్ని కుంటుపరచాయనీ అని చెప్పుతున్నారు. దానికి ప్రధానకారణం 'మహాకావ్యం అంటే అష్టాదశ వర్ణనలూ వుండి తీరా' లనే మహాకావ్య లక్షణం! కాని కావ్యానికి ప్రధానమైంది రసం గాని, వర్ణనలు కావు. మరిన్నీ అష్టాదశ వర్ణనలూ కావ్యంలో–మహాకావ్యంలో ఉండాలని నియమించినవారు దాక్షిణాత్యాలంకారికు లైన దండి, విద్యానాథాదులు. అయినా వారు పద్దెనిమిది వర్ణనలూ వుండి తీరాలని చెప్పక కొన్ని లేకపోయినా బాధలే దన్నారు.* తెలుగులాక్షణికుల్లో కొందరు పద్ధెనిమిదీ చాలక మరి కొన్ని చేర్చారు. ప్రామాణికు లయిన ప్రాచీనాలంకారికులూ, నవీనాలంకారికులూ పయిరీతినికాక రసాల (లేక వ్యంగ్యాల) ప్రాధాన్యా ప్రాధాన్యవివక్షనుబట్టే కావ్య భేదాల్ని లెక్కించారు. కాబట్టి మనవాళ్లు సంస్కృతాలంకారికులే కావ్యపద్ధతుల్ని పాడుచేశారని భ్రమించడం వట్టి పొరపాటు. కావ్యంలో రసం ప్రధానమని యెరిగిన మనవాళ్లు ఒకరిద్దరు చెప్పిన కావ్యలక్షణాన్ని–అష్టాదశవర్ణనలూ ఉండాలనేదాన్ని—తోసిరాజు చేసి తదితరల లక్షణాన్నే ఎందుకు గ్రహించకూడదూ అంటాను. తెలుగులో ప్రబంధవాఙ్మయం బయలుదేరడానికి ముందే సంస్కృతంలో చక్కని లక్షణాలు వెలువడున్నా యే!

ఇప్పటి తెలుగుకవుల్లో చాలామంది భాషా వాఙ్మయాల విషయంలో తగినంత పరిశ్రమ చేయక కవనం చెప్పడానికి సిద్ధపడి, యతిప్రాసలకోసం, తది తరాలైన కుదిరికలకోసం రసానికి ఎంతమాత్రమూ సంబంధించని పదాల్ని యిచ్చకు వచ్చినట్లల్లా వాడుతున్నారు. అలావాడడం బాగులేదని ఎవరన్నా అన్నారంటే 'నన్నయ్య వాడలేదా? తిక్కన్న వాడలేదా? ఎర్రన్న వాడలేదా' అంటూ కర్రుచ్చుకుంటారు. 'నన్నయ్య మొదలైనవారు వాడింది రసానుగుణంగా వుంది; కాకపోతే రసభంజకం కాలేదు. మనం రసాన్ని మనస్సులో పెట్టుకోక కేవలం ప్రయోగసామ్యాన్నే ముడికడుతున్నాం' అనే ఆలోచన వారికి వుండదు. బాగా లేకున్నా వారి కవిత్వం చాలాబాగా వున్నాదని మెచ్చుకునే వాళ్లని చూస్తేనే వారికి పరమ గౌరవం!

మునుపటికాలంలో అలాకాదు. తనది తప్పయితే వొప్పుకొని కవి లేనిపోని సమర్థనాలకి చొరకోక పైవాళ్లు చెప్పేది గ్రహించేవాడు భవభూతి వంటివాడిని ఒక విమర్శకుడు 'రాత్రిరేవం' తీసి పారేసి 'రాత్రిరేవ' వాడమంటే 'మహాప్రసాదం' అంటూ దిద్దుకున్నాడని ప్రతీతి. తిమ్మకవిస్తుతిరూపమైన పద్యంలో 'కూప నటద్భేకములకు గగనధునీ శీకరముల చిమ్మ' అనేచోట 'భేకములకు నాకధునీశీకరముల చిమ్మ' అని దిద్దిన కృష్ణరాయుణ్ణి కవి పరమానంద భరితుడై బహుమానంయిస్తూ గౌరవించాడు. ఇలాగ అప్పటివారు ఏమాత్రమూ అసంతుష్టిని చూపలేదు

కావ్యం సహృదయాహ్లాదకంగా వుండాలంటే అందులో రసం ప్రధానంగా పోషింపబడాలి; రసానికి విరుద్ధంగా వున్నప్పుడు దాన్ని – పోషించలేనప్పుడు అవసరమైతే లక్షణాలని అతిక్రమించవచ్చును. కాని పెద్దలు వాడారని ఎందుకూ పనికిరాని ప్రయోగాల్ని మూటకట్టుకుని ఇష్టం వచ్చినట్లు చొప్పిస్తే మాత్రం యేమీ ప్రయోజనం లేదు.

---

*ఏషామష్టాదశానాం మధ్యే కైశ్చిదూనమపీష్యతే.

# చిత్రకవనములు

వి. కే. రాజగోపాలాచార్యులు



కళాజ్ఞానముయొక్క ఆవశ్యకతను గూర్చి వేనోళ్ల కీర్తించియు పూర్వులు పెద్దలు తనియరైరి.

> సంగీత సాహిత్యకళావిహీనః
> సాక్షాత్ పశుః పుచ్ఛవిషాణహీనః.

(సంగీతము సాహిత్యము (మున్నగు) కళలు లేనివానికి తోఁకయు కొమ్ములును కూడ లేవనియే కాని, వాఁడు సాక్షాత్తుగా పశువే) అను అభియుక్తోక్తి సార్వలౌకికము. ఇందువలన మానవునికి పశువులకన్నను విశేషము సిద్ధింపవలయునేని, కళల మెలుకువ తప్పక సంపాదింపవలసినదే యని చక్కఁగా నేర్పడుచున్నది. వాత్స్యాయనుఁడును ఎచ్చరించినాఁడు: "గృహీతవిద్యులై గృహస్థులైన పురుషులును స్త్రీలును తిర్యగ్ జంతువులవలె గ్రామీణులై యుండరాదు; నాగరికులై యుండవలెను. ఆ నాగరికత అఱువది నాలుగు కళలయొక్క విజ్ఞానముచేతనే కలుగుచున్నది" అని. అనుభవకవి భర్తృహరియు ఇట్లే సిద్ధాంతీకరించినాఁడు:

> యే చైవం పురుషాః కళాసు కుశలా
> స్తే ష్వేవ లోకస్థితిః.
> [వరుసఁ గళాప్రవీణులగువారలయంద
> వసించు లోకముల్ (లక్ష్మణకవి)]

అని. కాని చతుష్షష్టికళలను ఒకఁడు నేర్చుట ఈ కాలమున కానిపని. కాఁబట్టి కళల నన్నింటిని నేర్వ నుద్యమింపక, కొన్నింటి యందేని సమగ్ర కౌశలమును పొందుట సముచితము. కవి-తార్కిక కంఠీరవుఁడు వేంకటనాథుఁడును ఆదేశించినాఁడు:

> ఏకయాఽపి కళయా విశుద్ధయా
> యోఽపి కోఽపి భజతే గిరీశతామ్
> భూయసీ రపి కళాః కళంకితాః
> ప్రాప్య కశ్చి దపచీయతే శనైః.

"విస్మృత్యాది దోషములు లేని, ఒకే కళను గలవాఁడును వాక్పతియో పార్వతీపతియో అగును. కళలను పెక్కింటిని దోషభూయిష్ఠముగా నేర్చినవాఁడు, షోడశకళాపూర్ణుఁడయ్యు సకళంకుఁడగు చంద్రునివలె క్రమముగా క్షీణించును." అని. కాఁగా కళలలో నొకదానినో, లేక కొన్నింటినో పర్చికొనవలయును.

కళలు అఱువదినాలుగింటిలో ఏయొక్క-దానినో (లేక కొన్నింటినో) కడమవానికన్న ఎక్కువ ఉపయోగపడుదానినిగా (లేక ఉపయోగపడువానినిగా) నిర్ధరించుట పొసఁగదని తోఁచుచున్నది. కళలన్నియు ఒకపాటి ప్రయోజనకారులే యనియు పలువురు వలుకుదురు. ఇఁక కళల యంతస్సారముం జూపి తారతమ్యము నేర్పఱచు సిద్ధాంత మెట్లు ఏకాంతము కాఁగలదు? కానందుచేత ఈ మార్గమునకన్నను 'రుచి'స వరణసూత్రము (The principle of selection) గా కొనుట మేలగును. 'భిన్నరుచిర్హి లోకః' అను న్యాయముప్రకారము ఒక్కొక్కనికి ఒక్కొక్కటి రుచించును. కావున ఎవనికి దేనియందు, కాదా వేనియందు అభిరుచియో వాఁడు దానినే, కాదా వానినే యంగీకరించి అభ్యసించి నేర్చిమిని గడింపఁదగును. అట్లు మన దేశమున చిరకాలమునుండి సహృదయుల మనసులను రంజింపుచు వచ్చినవి చిత్రమును, కవనమును.

చిత్ర మనఁగా కుడ్యపటాదులయందు వర్ణములచేతను, దారుశిలాదులయందు ఉలిచేతను చేయఁబడు త్రైలోక్యవస్తువుల ప్రతికృతి. అట్లే విష్ణుధర్ముఁడు నిర్వచించినాఁడు:

జంగమా వా స్థావరా వా
యే సన్తి భువనత్రయే,
తత్త త్స్వభావత స్తేషాం
కరణం చిత్ర ముచ్యతే.

'కదలునవియో కదలనివియో ఈ మూఁడులోకములందును ఏవి కలవో, ఆయా స్వధర్మానుసారము వానిని చేయుట చిత్ర మనఁబడును' అని. మఱి కవన మన్ననో యావదర్థకములగు పదములచే రమణీయార్థములను ప్రతిపాదించుట. ఈ 'చిత్రకవనములు' మానవులు తప్పక నేర్చుకొనవలసిన లేఖన గణన పఠనములలోఁ ప్రధానములు. వీని నభ్యసించుటలో అభ్యాసకులకు అభిరుచియు, ఉత్సాహమును ఎక్కువగా పెరుఁగును. కావున ఇవి లలితకళలును అగుచున్నవి.

ఇవి పలువిషయములలో పరస్పర సాదృశ్యమును పొందియున్నవి; ఎట్లనఁగా:

(a) అహో భారతవర్షే ఒస్మిన్
దుర్లభం జన్మ మానుషమ్,
వినా ప్రాచీన సుకృతం
కవనం తత్ర దుర్లభమ్.

"ప్రాచీనసుకృతము లేక ఈ భారతవర్షమున మానుషజన్మమును అందును కవనమును దుర్లభములు" అను ప్రమాణముచే కవనము విశిష్టపురుషునియందు స్వరసముగా కలుగును. అట్లే చిత్రమును ప్రాక్తనపుణ్యముచేతనే ఎవనికో తనయంతనే కలుగు ననుటయు అనుభవసాక్షికమే.

(b) న విద్యతే య ద్యపి పూర్వవాసనా
గుణానుబంధి ప్రతిభాన మద్భుతమ్,
శ్రుతేన యత్నేన చ వా గుపాసితా
ధ్రువం కరో త్యేవ క మ ప్యనుగ్రహమ్.

"ఒకవేళ పూర్వవాసనయు గుణము తోడి ప్రతిభయు లేకపోయినను, శాస్త్రములఁ జదువుటచేతను, అమందప్రయత్నము

చేతను కవనము ఒక కొంత సంపాదింప శక్య మగును." అను దండ్యాచార్యుని వాక్యము బడి కవనము అమందాభియోగముచే కొంత వరకు సాధ్య మని ప్రసిద్ధము. అట్లే చిత్ర మును అభ్యాసాధిక్యముచే నొకింత నిష్పాద్య మనుటయు అనుభవసాక్షికమును, ప్రమాణ ప్రచితమును.

(c) ఆవాపోద్ధారణే తావ
　　ద్యావ ద్దోలాయతే మనః,
పదానాం స్థాపితే స్థైర్యే
　　హన్త! సిద్ధా సరస్వతీ.

అనఁగా మన సెంతవఱకు డోలాయ మానముగా నుండునో అంతవరకును పద ముల ఆవాపోద్వాపములు చేయవలెను; పదముల స్థైర్యము స్థాపింపఁబడి వినిమయా సహిష్ణుత్వము కలుగఁగా అప్పటికి కవిత సిద్ధ మైనట్లు. అట్లే

యద్య త్నాసు న చిత్రే స్యాత్
　　క్రియతే త త్త దన్యథా.
[చిత్తరువున నేది చెందదో సాధుత
　　దిద్ది దిద్ది వానిఁ దీర్తు రందు.
　　　　(ఆదికళాప్రపూర్ణులు)]

(d) 'అనాంతర్య మే వైతయో రాం తర్యమ్' అను న్యాయము ప్రకారము నామ రూపాత్మకములైన బ్రహ్మముయొక్క స్వరూప ద్వయమున ఈ రెంట నొక్కొక్కదానికిని ఒక్కొక్కదానియందు అంతర్భావము. ఇదే అన్యాదృశ మగు సాదృశ్యము.

వీటి యుత్పత్తింగూర్చిన నిర్ణయము ఇరు దెఱంగులు : (౧) కవనము వేదముల కును పూర్వము, మానవులకు శబ్దరూప వ్యవహార సాధనము ఎప్పుడు కలిగినదో అప్పుడు అనఁగా క్రీస్తుకు పది శతాబ్దులు పూర్వము పుట్టువందినది యని చెప్పఁదగును. చిత్రమును వేదకాలమున ఆలేఖ్యసాధనము లనుత్పన్నములు కావున అనుత్పన్నమై 'చిత్ర చిత్రీకరణే ఆలేఖ్యకరణే' అని ధాతు వును పఠించిన పాణినికి పూర్వము అనఁగా క్రీస్తుకు ఆఱుశతాబ్దులు ముందు ఉత్పన్న మైనది అని నిర్ధారణసేయఁ బోలును. (౨) కాదా కాళిదాసుఁడు చతుర్ముఖ బ్రహ్మను 'పురాణకవి' యనుటచేతను,

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం; యోవై
వేదాం శ్చ ప్రదదాతి తస్మై; యస్య నిశ్వసితం వేదాః"

"ఎవఁడు ముందు బ్రహ్మను సృష్టించి, అతనికి వేదముల నిచ్చెనో, ఎవనికి వేదములు నిశ్వాసములో" అను నిత్యాపౌరుషేయ మైన వేదరూప ప్రమాణముచేతను కవనము ఆసంసారముగా అనువర్తించుచున్నది. అనియు; అట్లే చిత్రవిశేషరూప మైన అలం కారము, చిత్రశబ్దము, వర్ణవాచకశబ్దము లును వేదములలో ఉన్నవి కావున చిత్ర మును ఆసంసారము అనువర్తించునదే అనియు చెప్పఁదగును.

చిత్రకవనముల విభాగ విషయముం గూర్చిన నిర్ణయమును రెండు విధములు : (౧) కవనము ప్రాచ్య మనియు, పాశ్చాత్య మనియు విడఁదీయఁదగియున్నది. ఋగ్వేద రామాయణాది గ్రంథములలో శ్లేషాది

కృత్రిమాలంకారములు ఎక్కువగా అగపడుటవలనను, పాశ్చాత్య సారస్వతమున స్వభావోక్తి మొదలగు స్వాభావికాలంకారములు ఎక్కువగా అగపడుటవలనను, ప్రాయికముగా ప్రతిభావికల్పముల ననుసరించిన కవనము ప్రాచ్యమనియు, ప్రకృత్యనుసారి కవనము పాశ్చాత్య మనియు ఏర్పడుచున్నది. అట్లే పాశ్చాత్యుల చిత్రమును చాలవఱకు ప్రకృతిసంబద్ధమే; ప్రాచ్యుల చిత్ర మన్ననో ముగ్గు, బొట్టు మొదలగువాని రూపమున చిరకాలముగా అనువర్తించుచున్నదైనను-ఎక్కువగా ప్రకృత్యతీతముగాను ప్రతిభావికల్పానుగామిగాను ఉండును. (౨) కాని ప్రాచ్యత్వ పాశ్చాత్యత్వ విభాగమునకు ప్రకృత్యనుసరణ తదననుసరణములే కారణములు కాఁజాలవు. ఏల యనఁగా అట్టి నియమము లేక పోవుటయ కాక తద్వ్యతిరేకముసైతము క్వాచిత్కంబుగఁ గానవచ్చుటవలన. ఐనను చిత్రకవనములను ప్రకృత్యనుసారి ప్రతిభావికల్పానుసారి తెగలుగా విడఁదీసి మఱి పరిశీలించుట పలువురకు రుచించిన మార్గము.

చిత్రకవనములు కొంతకాలమునకుఁ బూర్వము మన దేశమునందంతటను ఎక్కుడు వ్యాప్తిం జెందియుండినవి; పాశ్చాత్యదేశములలో నేఁటికిని వ్యాప్తిం బొందుచున్నవి. మన దేశమున ఇప్పుడు వీటి వ్యాప్తి విచ్ఛిన్నముపోలె అగపడుచున్నది. మొదటి రెండవ మూఁడవ తరగతులకుం బాహ్యములుగా నిర్ణయింపఁదగిన ఆంధ్రీకృత ద్రవిడీకృత కవనములే ఇప్పుడు ప్రాయికముగా వ్యాపించుచున్నవి. చిత్రమును మొదటి రెండవ మూఁడవ తరగతుల బాలురు కుందేలు, నక్క, కుక్క, మొదలగువానిని వ్రాయుటలోనే విశ్రాంతమై యున్నది. స్వాతంత్ర్యము నవలంబించి దేనినేని నిర్మించుట యను కథ అస్తమించినట్లున్నది. అద్యతన కథను వదలి, ప్రాక్తన వృత్తాంతముం బరికింతుమేని వీటి చరిత్రముం దెలుపు గ్రంథములు బహుళముగా అగపడకపోయినను, తొల్లి ఇవి ఈ దేశమున మిక్కిలి వ్యాపించి యుండిన వను అనుమానమునకు సాధకములైన ప్రమాణము లెన్నియేని లేకపోలేదు. అప్పటి కవనవ్యాప్తి పెక్కు గ్రంథముల చేతను, చిత్రముయొక్క వ్యాప్తి అనేక దేవాలయములు రాజగృహములు మున్నగువానిచేతను ఊహింపఁ దగియున్నవి. గ్రంథజాలముం బరిశీలించిన పూర్వము చిత్రమునకీ దేశమున చిత్రశాలలు ఆలేఖ్యగృహములు శయ్యాగృహములు దేవగృహములు క్రీడాగృహములు అను నియతములైన సాధనములు ఉండినట్లు తెలియుచున్నది. వాటిచేతనే చిత్రమునకుఁ గలిగియుండిన యుత్కర్ష విశద మగుచున్నది. ఈ క్రిందివి కావ్యోదాహరణములు:—

౧ లతాగృహాణి రమ్యాణి చిత్రశాలాగృహాణి చ,
క్రీడాగృహాణి చాన్యాని దారుపర్వతకానపి.
దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే.
—రామా. సుంద ౬-వ సర్గ

చ. కరిరథ వాజిశాలలు ప్ర
కాశశిలీముఖ చాపశాలలున్
సురుచిర వాద్యశాలలు మ
నోహర నూతన చంద్రశాల లం
బరతలచుంబి దివ్యమణి
మండితకాంచన నాట్యశాలలున్
సురుచిర చిత్రశాలలును
జూచె సమీరకుమారుఁ డయ్యెడన్.
—గో. వెంకయ్య పుట ౨౪.

౨"యేన ప్రాణాశ్చ రాజ్యంచ స్త్రీశుల్కార్థే విసర్జితాః,
ఇమాం దశరథస్య త్వం ప్రతిమాం కిం న పృచ్ఛసి?
—భాసుని 'ప్రతిమా' నాటకము

"ఎవని చేత యుసుఱులును దొరతనమును (దొరతనమునకు లోఁబడిన దేశమును) ఆఁడుదానికి రోయిగా విడువఁబడినవో (అట్టి) దశరథుని ఈ ప్రతిమను గూర్చి నీవు ఏల యడుగవు?"

3 ప్రవివేశ చ ద్వారపక్ష లిఖిత రతిప్రీతి దైవతం"
—అశ్వఘోషుని బుద్ధచరితము

"వాకిండ్ల ప్రక్కలలో వ్రాయఁబడిన మన్మథుని గలదానిని ప్రవేశించెను."

౪. చిత్రద్విపాః పద్మవనావతీర్ణాః
కరేణుభి ర్దత్తమృణాళభంగాః,
నఖాంకుశాఘాతవిభిన్నకుంభా
స్సంరబ్ధ సింహప్రహృతం వహన్తి॥
—కాళిదాసుని 'రఘువు' XVI-16.

సరసి దిగి తూండ్లతునకలు కరిణు లిడినఁ
బడయుచున్నట్టు చిత్రింపఁబడిన కరులు
కుంభముల నంకుసమువంటి గోళ్లఁజీల్చు
కుపిత హరుల ప్రహారంబు లిపుడు గాంచె.
—ఆదిపూడి సోమనాథరాయనింగారు

౫. స్తంభేషు యోషిత్ప్రతియాతనానాం
ఉత్క్రాన్తవర్ణక్రమ ధూసరాణాం,
స్తనోత్తరీయాణి భవంతి సంగా
న్నిర్మోకపట్టాః ఫణిభి ర్విసృష్టాః.
—కాళిదాసుని 'రఘువు' XVI-17.

వీటి కంబాల వెలఁదుల విగ్రహముల
వన్నె మాసిన కుచములపైని గప్పఁ
బడిన పయ్యెద లనఁగఁ గన్పట్టు నచట
సర్పములు వీడియున్నట్టి కుప్పసములు."
ఆదిపూడి సోమనాథరాయనింగారు.

౬.. "లక్ష్మణః—ఆర్య! అర్జునేన చిత్రకారేణ అస్మదుపదిష్టం ఆర్యస్యచరితం అస్యాం వీథ్యాం లిఖితం; త త్పశ్య త్వార్యః.

లక్ష్మణుఁడు—"ఆర్యా! ఆముచ్చి అర్జునుఁడు మనము నియమించిన ప్రకారము అన్నయ్య చరిత్రమును ఈవీథిలోఁ జిత్రించినాఁడు. దానిని అన్నయ్య వచ్చి చూడవలెను."

—ఆదికళాప్రపూర్ణుల తెలుఁగు 'ఉ. రా. చ.'

౭. చిక్రంసయా కృత్రిమపత్త్రిపఙ్క్తేః
కపోతపాలీషు నికేతనానామ్,
మార్జార మప్యాయత నిశ్చలాంగం
యస్యాం జనః కృత్రిమ మేవ మేనే.
—మాఘము III-౫౮.

ఉ. శ్రీఁ జెలంగు వీటిగృహ
సీమలయందుఁ గపోతపాళులన్
జాలుగ నించినట్టి విల
సద్బహుకృత్రిమపత్త్రిపఙ్క్తులం
బోలఁగఁజూచి తద్గ్రసన
బుద్ధిఁజలింపక పొంచియున్న మా
ర్జాలములన్ జనంబులు ద
లంచిరి కృత్రిమ మంచు నెమ్మదిన్."
— గో. వేం. పుట ౪౭. I-౨౫౫.

ఇంతియకాక మాలతీమాధవ సాగరికో దయన వాసవదత్తా యక్షులు—ప్రాయిక ముగా శృంగారనాయికానాయకు లెల్లరు-విరహావినోదముకొఱకు చిత్రము నాదరించి రనియు ప్రబంధములలోఁ జెప్పఁబడియున్నది. ఇవి కవిప్రపంచంబున కాల్పనికంబు లైనను ఇట్టి కల్పనలకు కొంతకు కొంత మాతృకలు ఉండియుండవలెను. కాఁబట్టి పూర్వకాలములో చిత్రము మన దేశములో ఎక్కువ వ్యాప్తిని పొందియుండినదని చెప్పవచ్చును.

ఇఁక ఈ చిత్రకవనముల నభ్యసించు వారికి దానఁ గలుగు ప్రయోజనముల నొకింత విచారింతము:-

ధ్యాయతో విషయాన్ పుంస
స్సంగ స్తే షూపజాయతే,
సంగా త్సంజాయతే కామః......

"విషయములను చింతించుచున్న పురుషునకు ఆ విషయములయందు సంసర్గము అధికముగా కలుగును; విషయ సంయోగము వలన ఇచ్ఛ పుట్టుచున్నది" అను శ్రీ గీతాచార్యులు చెప్పిన న్యాయము ప్రకారము ఈ చిత్రకవనముల నభ్యసించువారు ప్రథమమున ప్రాపంచిక పదార్థములను పరిశీలించి, చిత్తస్థైర్యముం బడసి, వానియందు సంగము పొంది, వానివిషయమున ప్రేమం జెందినవారగుదురు. అంతట వారు ఆ ప్రేమాతిరేకము చేత, రక్తాదివర్ణములచేతను అకారాదివర్ణములచేతను వాని ననుకరించుటకు మొదలిడెదరు. కావున వారికి పరీక్షాశక్తియు (The Faculty of keen observation) చిత్త స్థైర్యమును (The faculty of concentration), వస్తుప్రళయం దవ్యాజప్రేమయు (Attachment to the objects of the world), వీటివలన అనుకరణశక్తియు (The faculty of imitation) క్రమక్రమముగా వృద్ధిపొందును. వీటివలన వీరి ఉద్యమమును వర్ధిల్లును. ఇంతియ కాక వీరికి నరములయు మనస్సుయొక్కయు శక్తి పెరుఁగును. ఇట్టి వారు పలువు రగుదురేని దేశమున పరస్పర సౌహార్దమును, ఉద్యమమును, అహింసా ధర్మమును పెంపొందును ఇట్లు ప్రాపంచిక వస్తు పరిశీలనానుకరణ నిపుణులైన వీరు ఒక్కొక్క పదార్థమును వర్ణించుటయందును చిత్రించుటయందును తమకు గలుగు క్లేశముంబట్టి ఈ దృశ్య లోకరూప చిత్రకారుఁడగు ఈశ్వరుని సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులను ఆలోచించి,

కత్యోషధీః ? కతి తరూన్ ?
కతి వా మహీధ్రాన్ ?
కత్యంబుధీన్ ? కతి నదీః ? కతి
పుంస ఏతాన్ ?
కత్యంగనా స్త్వ మసృజః ? కతి న థ!
దేశాన్ ?
మన్యే తవైవ మహిమా న హి
మాతి బుద్ధౌ!

"ఓ ఈశ్వరా! ఎన్ని మందుచెట్లను, ఎన్ని వృక్షములను, ఎన్ని కొండలను, ఎన్ని సముద్రములను, ఎన్ని ఏళ్లను, ఎందఱి నీ పురుషులను, స్త్రీలను, ఎన్ని దేశములను నీవు

సృష్టించితివి! నీ ఈ మహిమ నా బుద్ధిలో నిముడుటలేదని తలంచుచున్నాను" అని భక్తితో స్తుతించి ఐహికాముష్మిక ఫలముల నందుదురు.

ఇట్లు బహుఫలములైన ఈ చిత్రకవనముల నేఁటి పరిస్థితి మన దేశమున శోచనీయముగను దేశాంతరములలో స్పృహణీయముగను ఉన్నదని ముందే చెప్పఁబడెను. ఇట్టి వీని ఉపచయాపచయములచేఁనే పాశ్చాత్య ప్రాచ్య దేశములకు ఉత్కర్షాపకర్షములు కలిగిన వని అన్వయవ్యతిరేకములచే తేలుచున్నది. పరమార్థముగా ఇవి ప్రాచీనకాలంబున నీ దేశంబునను అభివృద్ధములే, కాని యంతట నిరుద్ధప్రసరములైనవి. ఎట్లనఁగా పూర్వము ఈ దేశమున కొన్ని అవస్థలును కథాభాగములును ఏకబుద్ధి విషయీభావమునకుం దగినవిమై వర్ణింపఁబడి చిత్రింపఁబడినవి. అట్టి యవస్థలు,

శబ్దోపహితరూపాంస్తు
　బుద్ధేర్విషయతాం గతాన్,
ప్రత్యక్ష మివ కంసాదీన్
　సాధనత్వేన మన్యతే.

"(శ్రోతలు (వక్త్ర) శబ్దసమర్పిత రూపులై బుద్ధివిషయగతులగు కంసాదులను ప్రత్యక్షముంబలె (తద్వ్యాక్రియలకు) కర్తలఁగను, కర్మలుగను తెలిసికొందురు" అనినట్లును,

ప్రమాణప్రత్యయాదత్ర
　కల్పితా న్యపికల్పతః
అపి భూతాని భావీని
　భవన్తీవ భవంతి నః.

ఎలమి ప్రకృతులఁ గల నమ్మిక
బలిమి నిఁట వ్రాయఁబడిన పలురూపుల గాఁ
గలయవియు నైనయవియును
చెలఁగ జరుగునట్లు నిర్విశేషము గాఁగన్.

అనినట్లును లోకంబునకుం బ్రత్యక్షసామ్యముం జెందినవే కాని ప్రత్యక్షములే కాలేదు. అందును కుమారసంభవమున శివతపఃప్రస్తావమున వర్ణింపఁబడు మన్మథాదుల చేష్టలకును, కోకిలాదుల శబ్దమునకును చిత్రమున విషయీకరణము లేనందున అట్టి ప్రత్యక్షసామ్యమును దూరవిప్రకృష్టమే నది. ఇది ఆకాలమున ఇతర దేశంబులయందును తుల్యయోగక్షేమమే. ఐనను తరువాతికాలమున చేష్టలకును, శబ్దములకునుంగూడ చిత్రములో విషయీకరణము కలుగునట్లు పాశ్చాత్యులు దానిని క్రమముగా వృద్ధిఁజేసిరి. దీని నుపేక్షించుటవలన మన దేశీయులకు అనుకరణశక్త్యాదులు క్షయించినవి. ఉద్యమమును అనుకరణశక్తియు లేని దేశమునకు సుభిక్షమును, స్వాతంత్ర్యమును ఎట్లు స్థిరపడియుండును? కాని ఇప్పటికిని ఈ దేశమునకు స్వాతంత్ర్యసుభిక్షాదులం గలిగించుటలో శ్రద్ధాళువులు గలరు. అట్టివారి దేశభక్తి మార్జాలభక్తిగాక అక్రూరుని భక్తి వంటిదై దేశతత్సంబద్ధవస్తువులయందుఁ దగిలి దేశంబునకు ఉత్కర్షం గూర్చునుగాక!

ఇఁక చిత్రకవనముల వైశిష్ట్యములం గూర్చి ఇంచుక ప్రస్తావింతము. దేనికిఁ గాని దానివలన లోకంబునకుఁ గలుగు ఉపకారా

ప్రకారముల ననుసరించియే ఉత్కర్షాపకర్షములు కలుగును. ఈ రెండు కళలవలనను వీటి నభ్యసించువారికిఁ గలుగు ప్రయోజన మింతకు పూర్వమే చెప్పఁబడినది. ఇప్పుడు వీటివలన లోకమునకుఁ గలుగు ప్రయోజనమును చెప్పి వీటి యుత్కర్షను కొంత ప్రకాశపరిచెదము.—

(౧) లోకమునకు తొలఁగింపరాని విషాదకరమగు ఒకానొక న్యూనతను ఇవి కొంతవఱకు పోఁగొట్టుచున్నవి. ఎట్లనఁగా.— లోకమున ఈశ్వరునిచే స్వకర్మానుగుణముగా సృష్టింపఁబడిన జీవరాసులకు పలువిధములగు జ్ఞానమును, పలువిధములగు ఇచ్ఛయు, అనేక ప్రయత్నములును అగపడుచున్నవి. సుఖ దుఃఖములు మాత్రము అందఱకును కలుగుచున్నవి. జీవుఁడు సుఖమునందానందమును దుఃఖమునందు విషాదంబును అనుభవించుచున్నాఁడు. ఇట్లు సుఖమును దుఃఖమును రెండును ఏల కలుగవలెను? ఆత్యంతికసుఖము ఏల కలుగరాదు? అట్లైన నవి అన్నియు ఆనంద మందునుగదా! ఒకవేళ,

> యుదే వోపనతం దుఃఖా
> త్సుఖం తద్రసవత్తరమ్
> నిర్వాణాయ తరుచ్ఛాయా
> తప్తస్య హి విశేషతః!

> ఎట్టకేలకుఁ గృచ్ఛ్రాన నెనసినట్టి
> సుఖమె రసవత్తరం బయి శోభఁ జెందు
> వడకు సోకినతఁని నిర్వాణ మొసఁగుఁ
> జెట్టునీడ నరునకు విశేషముగను.

అను మనస్తత్త్వవిదుల న్యాయముబడి సుఖస్వరూప తదతిశయ జ్ఞానముకొఱకు దుఃఖమును వలసినదే యనిన, ముక్తియందు ముక్తులకు నిత్యసుఖము ఎట్లు? ఇట్లంతయు యోచించి విచారించి 'ఈ లోకమున ప్రాణులకు వారి కర్మానుసారముగ తొలఁగింపరాని కొన్ని న్యూనతలు ఉండుటచే వారికి దుఃఖము తప్పనిదే' అని పెద్దలు నిర్ణయించినారు. అట్టి న్యూనతలలోఁ బ్రధానమైనది యన లోకము ప్రతిక్షణమును క్షయించుటయే! కొంచెము కొంచెముగా క్షయించుచు, లోకము క్రమముగా నాశమునే గదా పొందుచున్నది! దీనిని భావించియే కాళిదాసుఁడు,

> త్యజత మాన; మలం బత! విగ్రహైః
> న పున రేతి గతం చతురం వయః.

"కోపము వదలుము; అయ్యో! జగడము లేల? గతించిన చతురవయస్సు మఱల రాదు" అని దుఃఖించినాఁడు. రాముడును

> న మే దుఃఖం ప్రియా దూరే
> న మే దుఃఖం హృతేతి సా,
> ఏత దే వానుశోచామి
> వయో ఽస్యా హ్యతివర్తతే.
>
> —రామా. యుద్ధ V-౫.

> తే. ఆళినికుర దూరమున నున్న, దనియుఁ గాదు
> దనుజవల్లభహృత యయ్యెనని యుఁ గాదు
> సర్వసుఖసాధనంబైన జవ్వనం బ
> తీత మగుటకు వగచెద నీతిశీల!
>
> —గో. వెంకయ్య VI పేజీ ౨౨౫.

అని పలవించినాఁడు. ఇట్లు అతిక్రాంతదశను మఱల పొందరామి యను విషాదమునకుఁ

ప్రథమకారణ మగు న్యూనతను ఈ చిత్ర కవనములు కొంత తొలఁగించుచున్నవి. ఎన్నఁడో గతించిన రామకృష్ణాదిమహాపురుషులను వీటి సాహాయ్యముననేకదా ఇప్పటికిని ప్రత్యక్షమునందు వలె అనుభవించుచున్నాము. విరహపు లెండలతో దుఃఖకాలంబున తమప్రియుల ప్రతికృతిం దాల్చి ఒకింత యాశ్వాసిల్లుట ప్రత్యక్షసిద్ధమే.

(౨) ఈ కళలచేతనే లోకము రసవంతముగాఁ దోఁచుచున్నది. ఎట్లనఁగా: నిపుణముగా విమర్శింతుమేని ఈ లోకము ఱాయివలెను, మట్టివలెను నీరసముగా కనుపట్టును. ఇట్టి ఈలోకము సమర్థుఁ డగు కవియొక్క, లేక శిల్పియొక్క మనోదర్పణంబునం బ్రతిఫలించి వర్ణరూపముగా వెలువడి రసికులచే బాహ్యలోకముతోఁ బోల్చి విమర్శింపఁబడుచు సారస్యముం బొందుచున్నది. అటుపిమ్మటనే ఇది రసికుల అనుభవప్రత్యయములచే నెల్లరకును రుచించుచున్నది. ఒక పిల్లియొక్క కంఠధ్వని ఎవనిని గాని స్వతః ఆకర్షించి ఆనందపఱచుట లేదు కదా! అదే యొక నేర్పరిచేత అనుకరింపఁబడునపుడు అనుకార్యముతోటి సామ్యము ఎక్కుడగుకొలఁదియు ఎల్లవారిని ఎక్కుడుగా ఆనందింపఁజేయుచున్నది. అటుపిమ్మటనే వాస్తవ బిడాలశబ్దమును లోకమునకు రుచింపుచున్నది. దీనినే పెద్ద లిట్లు తడవిరి: "జగద్గ్రావప్రఖ్యం నిజరసభరాత్స్వాదయతి యత్" (ఏది తనరసముచే ఱాయితో సమానమగు జగత్తును రుచింపఁజేయుచున్నదో) అని.

(3) ఈ చిత్రకవనములచే లోకంబునకు బ్రహ్మానందానుభవము కలుగును. ఆనందఘనుఁడును రసఘనుఁడును అగు భగవంతుని చిత్రించి కవనములచే స్తుతించువాఁడు ముక్తుఁడై బ్రహ్మానందము ననుభవించునుగదా! అపుడు "అహగ్గ్ శ్లోకకృదహగ్గ్ శ్లోకకృత్" (నేను శ్లోకమును చేసినవాఁడను; నేను శ్లోకమును చేసినవాఁడను) అని యాతఁడానందించునఁట!

వీటి యన్నింటిచేతను చిత్రముయొక్కయు, కవనముయొక్కయు ఉత్కర్ష వాగ్గోచర మగుట చెప్పకయ తెలియును. చిత్రకవనములం గూర్చిన గ్రంథము లీదేశమున నెన్నియో కల వందురు. పాఠకమహాశయులుందురేని మనదేశమున గ్రంథములకా కఱవు? మన పూర్వీకులు పెద్దలు ఘనులు తాము ఎక్కుడుశ్రమతోఁ గనిపట్టిన విషయములను మనకొఱకు వ్రాసియుంచినారు. మనము ఈ కళల నభ్యసింతుమేని పశువ్యావృత్తి కలుగుటయుకాక, మన పెద్దల ఋణముం దీర్చి, దేశంబునకు క్షేమంబు నొడఁగూర్చి కృతకృత్యు లగుదుము.

---

# కలభాషిణీ - సుగాత్రి

భారతుల పున్నయ్యశాస్త్రి



పింగళి సూరనార్యకృత కళాపూర్ణోదయమునందలి కలభాషిణీ సుగాత్రుల యనురాగ ప్రవృత్తులలోని తారతమ్యముల నొండొంటితోఁ బోల్చి యందలి విశేషముల నే నీవ్యాసమున వివరించెదను

కలభాషిణి పుట్టుకచే వారకాంతగాన జాతి నిష్ఠమైన యపవిత్రత కొంతవరకుఁ గాకున్న కొంతవరకైన నున్నదని యంగీకరించకఁ తప్పదు. జాతినిష్ఠమైన యీ యపవిత్రత వ్యక్తిగతముగాఁ గల భాషిణియందణుమాత్రమున మనశ్చాంచల్య రూపమున మన కగపడుచున్నది. కలభాషిణి కళాకోవిదురాలు. ఆమెకు జాతిసహజమగు ప్రాగల్భ్యము గలదు. కవిత్వము చెప్పఁ గలదో లేదో గ్రంథమునుబట్టి తెలియవచ్చుట లేదుగాని యెట్టిదానినైన నేకసంతగ్రహించి పఠించఁగల దిట్టయని మాత్రము స్పష్టమగుచున్నది. బ్రహ్మమానసపుత్రుఁడైన నారదమహర్షి యంతటివానితో సహాధ్యాయిత్వము గాదుగాని, యంతగాఁ బ్రవర్తించి పరంధాముఁడైన శ్రీకృష్ణునిచేతను, యాతని ప్రధాన పట్టమహిషీమణులచేతను ప్రియశిష్య నిర్విశేషముగఁ జూడఁబడి సంగీతవిద్యను సంపూర్ణముగ నేర్చినది. వీణవాయించు నేర్పు గలదు. కవిత్వము, గానము - ఈ రెంటితోఁ బాటామెకు శిలాశాసనములఁ జదువఁగల సామర్థ్యముగూడ గలదు. అట్టి యీమె గానము జన్మహక్కుగాఁ గల గంధర్వజాతికిఁ జెంది నారదానుచరుఁడై సంగీతవిద్యావిశేషాభిలాషను శిష్యత్వము నుపచరింపుచున్న మణికంధరునియందు మనంబు నిలిపినది. ఇదియే యీపె మొదటి ప్రణయప్రవృత్తి. ప్రణయము రేకెత్తకముందు నుండియు, కలభాషిణీ మణికంధరులకు స్నేహము గలదు. స్నేహము కుదురుటకు సైతము వారికిఁ జక్కని యవకాశము గలదు. ఏమన, కలభాషిణి రంభానలకూబరులఁ గాంచకముందు నారదుఁడు గానశిక్షకై యంతిపురంబును బ్రవేశించినపిమ్మట మణికంధరుఁడును గలభాషిణియు స్వపరభూరికథాప్రసంగంబులను, అద్దేవదేవుని ప్రాసాదవనవిశేషావలోకంబులను గలసి మెలసి గాలక్షేపము చేయుచుండెడివారు. ఈవిధముగా నారంభమైన స్నేహము ప్రణయముగా మారినది. మణికంధరుఁడేమిటఁ దక్కువ? చక్కని రూపసంపద; జాతికి గంధర్వుఁడు; సహజ గానసంపదకుం దోడు నారదమహర్షి

యంతటివానికి శిష్యుండు. కలభాషిణికిం గూడ సంగీతమునం దభిమాన మంటయు, పరస్పరము లోఁగడ స్నేహ మంటయు, అయ్యది ప్రణయముగా మారిపోవు టెంతయు సహజము. భిన్నభిన్నమైన వృత్తులు గలవారి కొకరిపై నొకరి కభిమాన మున్నను ఆదర ముండదు. ఏకవృత్తి గలవారి కన్యోన్యము, ఆదరము మెండుగా నుండును. కనుకనే సంగీతమే అభిమానమును, వృత్తియునుగాఁ గల కలభాషిణీ మణికంధరుల కన్యోన్యాదరములు ప్రణయముగా మారినవి. ప్రణయము మోహసమ్మిళితము. కావుననే రంభామనోహరుం జూచినంత కలభాషిణి యనురాగ మాతనిమీఁదకుఁ బారినది. మోహము వివేకశూన్యమైనది. కలభాషిణి కళోపాసకురాలు అందును సౌందర్యోపాసిని. సౌభాగ్యకాంక్ష మిక్కుటము. త్రిలోకైకసుందరుఁడైన నలకూబరునంతటివానిని రంభ తన రూపరేఖావిలాసాదులఁ గైవస మొనర్చుకొనినదన సహించలేకపోయినది. తా నేల యా సౌభాగ్యమును బొందరాదు? రంభకన్న తా నేమిటఁ దక్కువ? ఇదియే యామెలోని గర్వము. నలకూబరుని రూపసంపద యంతగా నామెను మోహపరుపలే దనుకొన్నను రంభ సౌభాగ్యము మాత్రము ఆమెకుఁ గన్నుకుట్టించినదని మాత్రము చెప్పక తప్పదు. ఆమెకు సవతిని గావలెనను సంకల్పముతోనే నలకూబరునియందు మనంబు నిలిపినది. ఇయ్యది యీమె రెండవ ప్రణయప్రవృత్తి. నిజమున కీరెండవది సహజముగాఁగాక కృత్రిమముగా నున్నదని స్పష్టమగుచునేయున్నది. ఇది వారకాంతా సహజమగు చాంచల్యము గూడ గాదు. స్త్రీ సహజమగు సపత్నీ మాత్సర్యము, లేక సౌభాగ్యకాంక్ష. కలభాషిణి మణికంధరుని స్వయముగ వరించినది. ఈపని కామె పెద్దల యామోదమును బడయలేదు. ఆమె కింకను బెద్ద లెవరు? అవునన్నను, గాదన్నను అన్నింటికిని బైచేయి యామెదియే. ఆమె స్వతంత్రురాలు. కలభాషిణిది ప్రణయము. అది యెత్తయిన కొండనుండి క్రిందికి దిగు నిర్ఝరిణివలె చూచుటకు మనోహరముగ నుండును.

ఇఁక సుగాత్రి యనురాగప్రవృత్తి విశేషముల నరయుదము :

సుగాత్రి పుట్టుకచేత నర్చకబ్రాహ్మణ సంతతికిఁ జెందినది. బ్రాహ్మణజాతికే స్వతస్సిద్ధముగ దైవభక్తి మెండు. అందును అర్చకులసంగతి యిఁకఁ జెప్పనది యేమి? కాన జాతిచేతనే సుగాత్రికిఁ బ్రాగల్భ్యము సున్న. మీఁదు మిక్కిలి యామె పెద్దలచే శాలీనున కగ్నిహోత్రసాక్షిగ నుద్వాహ మొనర్పఁబడిన కన్యాలలామ. ఆమెకు లోన నెంత యుబలాట మున్నను - అయ్యది యర్హమైన దైనను సరియే పెద్దల యామోదమును బడయనిది చేయుటకు వెనుకాడును. మరియు నామెకుఁగల జ్ఞానమంతయు వినికిడిదేగాని శిక్షితమైనది గాదు. ఆమెకుఁ గళలయందుఁ బ్రవేశము లేదు. కావుననే భర్తమా వృత్తిని ఎంతో కాలమునకుఁ గాని కనుంగొని తదనుకూలముగ ప్రవర్తించలేకపోయినది. ఆమెకుఁ బ్రాచీనపుపద్ధతులయం దభిమానాదరములు మెండు. కావుననే భర్తకు నాయుష్యాభివృద్ధి యగునని సొమ్ముల

నేమఱకెం దాల్చసాగినది. భర్త తనవిషయ మునం బరాకుగ నుండుటంగని కారణ మరయలేక ఎంతో పరితాపపడినది. కావలయు నన్న తన నెవరికైన నమ్మకొనవచ్చునని కూడ నుడివినది. ఆమెకు సర్వమును భర్తయే. భర్తలేకున్న ప్రపంచమే లేదు. ఆమె సర్వధర్మముల నెఱింగినదైనను భర్తకు సమ్మతముగానిచో ధర్మమును సైతము విడచును; అధర్మమును సైతము స్వీకరించును. పలుమాటలేల? భర్తకై యామె తన ప్రాణముల నర్పించుటకు సైతము వెనుకాడదు. ఆమెది ప్రేమ. ప్రేమకు త్యాగమే లక్షణము. మఱియు నది నిగ్రహసమన్వితము. అది ప్రణయమువలె మోహసమ్మిళితమునుగాదు; ప్రణయమువలె ప్రేమచంచల మైనదియుం గాదు. అయ్యది సుస్థిరము. ఎంతకాలమున కైన నయ్యది మార్పు జెందదు. తోటలోం దన సహాయమునకై తోలదరలాడెడి సుగాత్రి సౌందర్యము శాలీనుని మనంబు హరించుట సహజమైన మానవకామము. అప్పుడు ధర్మ విరుద్ధమని సుగాత్రి పెనగులాడకుండుటయు ఆపె మానవత్వమునకుం దార్కాణముగ నున్నది. పెనగులాడి యంగీకరించిన కళా ప్రదర్శనమగునేమో? అది యామెకుం దెలి యని రహస్యములలో నొకటి. సహాయము నకై వచ్చిన యాపెతో వనంబున విహరించుట కళావిలాసముగాక పోంగా అనాగరికము. కలభాషిణి ప్రియులైన మణికంధరనలకూబరులనువలె సుగాత్రి శాలీనునియందలి కళా ధర్మమునుగాంచి ప్రేమించియుండలేదు. ఆమె యతనియందలి భర్తృత్వమునే ప్రేమించెను. కలభాషిణి ప్రణయమునందుకన్న సుగాత్రి ప్రేమయందు దనోన్నత్యత యెక్కుడుగనున్నది. సుగాత్రిప్రేమ నదీపతియైన సముద్రునింగవయంగోరి పరువులెత్తు గంగానదివలె పవిత్రమైనది. ప్రణయము మధురము మనోహరము. ప్రేమ పవిత్రము, హృదయంగమము. ప్రణయము మనసు నిర్మించును. ప్రేమ మనసునం బుట్టును. కలభాషిణి తన నేర్పుచే మనసును రంజింపంజేయును. సుగాత్రి తన గుణములచే హృదయమును వైవసమొనర్చుకొనును. కలభాషిణిది మాటలపసందు. సుగాత్రిది గుణములపసందు. ఒకరు మనసును రంజింపంజేసి తననుండి పాఠకుని మనసును తొలంగిపోనివ్వకుండ చూచుకొనుచుందురు. ఇంకొకరు గుణములచే హృదయమును వైవసమొనర్చుకొని తనను దప్ప మిగిలిన ప్రపంచమును మరపింపంజేయుదురు.



రేపటి కూడు —మూర్తి.

# అహదనకర శాసనము

కాళ్లకూరి సూర్యనారాయణ

## పూర్వ చరిత్ర[1]



ఈ రాగిశాసనము సర్ వాల్టర్ ఇలియట్ గారు సంపాదించినది; అహదనకర మనుగ్రామమున దొరికినదట. ఇది ఇప్పుడు బ్రిటిషు మ్యూజియములో ఉన్నది. దీని ప్రతిబింబములు ఎపిగ్రాఫియా ఇండికాలోను, ఒగ్గెనుగారు సంపాదించిన "తమిళ సంస్కృత శాసనములు" అనే గ్రంథమునందును ఉన్నట్లున్నా, దానిని సంపూర్ణ వివరములతో ప్రచురించినవారు తెలుగు భాగము తెలియక విడిచి పెట్టినారనిన్నీ శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మగారు శ్రీ రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో తాము వ్రాసిన "ప్రాచీనాంధ్ర భాషాస్వరూపము" అనే వ్యాసమునందు మనకు తెలిపియున్నారు. దీనిని సాధించవలెనన్న తలంపుతో, కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, కుందూరి ఈశ్వరదత్తుగారు మొదలైనవారు చాలా కృషిచేసినట్లు కనిపిస్తుంది. ఈ శాసనము మూడవ విష్ణువర్ధనుని కాలమునాటిదని (క్రీ. శ. ౭౧౮-౭౫౧) శర్మగారి అభిప్రాయము; కాదు, అయిదవ విష్ణువర్ధనుని కాలమునాటిదని (క్రీ. శ. ౮౪౭) శాస్త్రిగారి అభిప్రాయము. మూడవ విష్ణువర్ధనుని కాలమునకు పూర్వము 'ఆంధ్రభాషాశాసనములు కొన్ని ఉన్నవటకాని వాటిలోభాష ఈ శాసనములో గల భాషకన్న ఎన్నోరెట్లు సులభముగా బోధపడునట. ఇంత బొత్తిగా అర్థము కాకుండా ఉన్న శాసనము వేరొకటి తెనుగు వ్రాతలో తెనుగుభాషలో వ్రాసినది లేదట. మీద చెప్పిన విష్ణువర్ధనుల కాలమున తెలుగు భాషకు గౌరవము సంస్కృతమునకన్న తక్కువ అగుటచేత, ఆనాటి దానపట్టాలన్నీ, సరిహద్దులు సహా, సంస్కృతంలోనే వ్రాసేవాడుక. సరిహద్దులు మాత్రము తెలుగుభాషలో వ్రాసి మిగిలిన శాసనమంతా సంస్కృత భాషలో వ్రాయడం పదకొండవ శతాబ్దము దగ్గరనుండిన్నీ. పదోశతాబ్దమునకు ముందు శాసనభాగము కూడా తెలుగు భాషలో వ్రాసినది ఇది ఒక్కటే. ఇట్టి సందర్భములలో, రాగిమీద చెక్కియుండుట, శాసనభాగము తెనుగుభాషలోను తెనుగువ్రాతలోను వ్రాసియుండుట, అక్షరాల స్వరూపమునుబట్టి మూడో, నాలుగో, అయిదో విష్ణువర్ధనుల కా[illegible]యుండవలసి వచ్చుట, ఆకాలమునాటి మిగిలిన తామ్రశాసనములలోని తెలుగుభాషవలెగాక ఇందలి భాష అర్థము కాకుండుట యోచించి కాబోలు ఫ్లీటుదొరగారు ఇది

---

1. ఈ చరిత్రయందు వివరించిన విషయములు మ. రా. రా. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాసిన "ప్రాచీనాంధ్రభాషా స్వరూపము" (శ్రీరాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక) "అహదనకర శాసనము" (భారతి, విభవశ్రావణమాసం) అన్న వ్యాసములనుండి ఎత్తివ్రాసినవి.

నమ్మదగిన శాసనము కాదని అభిప్రాయపడినట్లుగా శర్మగారు వ్రాసియున్నారు. "ఒకవేళ చరిత్ర విషయ కముగ నిది పరిదైన శాసనము కాదని త్రోసివేసినను ఇందలి పదజాలమునకు సరియైన స్వరూప మేర్పడి అర్థ వివరణమే పడిరినచో నిది యాంధ్రభాషా కమూల్యా లక్షణమనుటకు సందియము లేదు" అని వ్రాసిన శర్మ గారి ఈ వాక్యమునందలి కోరిక సఫలమైనందుకు నాకు చాలా సంతోషము. సహృదయులు, అట్టివారి సదుద్దేశము వ్యర్థంకాదు.

దీనిని తిరిగి పరిశీలించుటకు కారణము

రావుసాహెబు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి వద్ద శుశ్రూష చేసిన చిన్ననాటినుండి ఆయనఅనుగ్రహమువల్ల నాకు భాషాతత్వ విచారణ యందు కొంచెము అభిరుచి కలిగినది. దొరికిన దానిని వదలకూడదన్న తలంపుతో ఇన్నిసంవత్సరములై దానికి తగిన దోహదము చేస్తూనేవస్తున్నాను. నేను చేసిన కృషిలో ఒక్కవిషయము నాకు చాలా విడ్డూరముగా కనబడ్డది. పాణినిమతమును అనుసరించి భాషాతత్వమును పరిశీలన చేయవలెనంటే "ధాతువులు" అనేవి ప్రతిభా షకున్నూ ఉన్నవనిన్నీ, వాటికి 'ప్రత్యయములు' మొద ట్లనో, నడుమనో, కొననో చేర్చుటచేత ఆయాధాతువు లకు చేరిన మాటలన్నీ ఏర్పడుచున్నవనిన్నీ నేను ఒప్పు కోవలసి వచ్చినది. ఈ అభిప్రాయమును అనుసరించే మొన్న మొన్నటి వరకున్నూ భాషాతత్వ విచారణ జరుగుతూవస్తే. ఈ మార్గం నాకు నచ్చలేదు. భాషా తత్వ విచారకులలో కొందరికి "ధాతువు"లనేవి ఏభాష లోనూ ఎప్పుడూ ఉండలేదనిన్నీ, వాటి మూలాన భాషాతత్వవిచారణ చేయుట వాస్తవము కాదనిన్నీ తోచి అట్టి విచారణ వదలవలెనని మరీమరీ చెప్పినారు. ఈ విచారకుల మతప్రకారము వేరేమార్గము లేకపో వుటచేత పాణినిమతమును అనుసరించ వలసి వస్తున్నదనిన్నీ, అట్టిమార్గము దొరికినవెంటనే పాణిని మతమును విడిచిపెట్టవలసినదనిన్నీ వారి నిర్ణయము. ఇట్టి నిర్ధారణను అనుసరించి వీరిలో కొందరు "హెలో ఫ్రాస్టిక్ థియొరీ" అన్న కొత్త సిద్ధాంతమును కల్పించినారు. దీనిప్రకారం ఎల్లప్పుడునూ మనుష్యుడు నిండు వాక్యములలోనే ఆలోచించగలుగునుగాని మాటలలో కాని ధాతువులలోకాని కాదనిన్నీ, భాషాతత్వ విచా రణకు పునాదు విండువాక్యము ధాతువు కాదనిన్నీ, కాబట్టి ఆట్టివిచారణ ఉక్కొత్తఫక్కిని ఆనుసరించ వలసిన దనిన్నీ నిర్ణయమైనది. "ధాతువు" లను అనుసరించిన విచారణ కృతకము, కల్పితము. "హెలో ఫ్రేజు"ను అనుసరించినది స్వాభావికమైన మార్గము. కాబట్టి ఈ నూతనమార్గము ఎంతవరకు వాస్త వమో తెలుసుకోవలెనని నాకు బుద్ధిపుట్టినది. ద్రావిడ భాషలన్నిటికిన్నీ మాతృకఅయిన "పురాతన ద్రావిడం" లో ఇట్టి హెలోఫ్రేజులు ఉన్నవా, ఉంటే వాటిలో కొన్నిటినైనా కనుకొనవచ్చునా అని ప్రశ్నించు కొని, తెలుగుభాషను ఈకంటితో చూస్తూ తిరిగీ పరి శోధించినాను. దీనితో సహా కొంచెం అరవము, ఇంగ్లీషు, కొంచెం సంస్కృతము కూడా చదివినాను. ఈ పరిశోధనలో తేలిన ముఖ్యవిషయములను క్రింద వివరిస్తున్నాను:

(౧) మనుష్యుడు ఏర్పరచిన భాషలన్నిటిలోనూ ఉన్న మాటలకుగాని వాక్యములకుగాని మాతృక "ఓం". ఏభాష కానీ, ఏకాలము నాటిది కానీ దానిలోని మాట లలో ప్రతిఒకటిన్నీ తుట్టతుదకు ఉచ్చారణలో ఈ "ఓం" అనే మాతృకనుండే పుట్టియుండవలెను.

(౨) మనుష్యుడు మాటాడుటకు నేర్చినవెంటనే వ్రాయుటకుకూడా నేర్చియుండవలెను. మాటాడుటకు, వ్రాయుటకుకూడా ఇంచుమించుగా ఒక్కేమారు మను ష్యుడు మొదలుపెట్టియుండవలెను. ఒకవేళ ఈ రెంటి టిలో ఏదైనా ఒకటి రెండవదానికన్న ముందుది అని అనవలసివస్తే వ్రాతే ముందు అని చెప్పవలెను. నోటను వెలువడ్డమాట, దానిలో ఇమిడియున్న అభిప్రాయము, పురాతనపుమనుష్యులందరికీ ఎలాగున ఒకటే అయి ఉన్నవో అట్టిమాటను తెలియజేసే వ్రాతకూడా అందరి పురాతనపు మనుష్యులకూ ఒక్కటే. వాక్కునకు మాతృక 'ఓం' అయినట్లు వ్రాతకు మాతృకశిరస్సున్నూ, ముఖాని భాగములున్నూ.

(౩) మీద వివరించిన కారణములచేత, అన్ని జాతుల మనుష్యులకున్నూ, పురాతనకాలమందు వ్రాత, మాట, మతము ఒక్కటే అయిఉండవలెను.

మీదచెప్పిన విషయములే వాస్తవమైనట్టయితే వాటి సహాయమువలనమొహెంజొదారో-హరప్పాలిపిని, సకారణముగా నేను పోల్చుకొనగలుగవలయును అని యోచించి, దాని పరిశోధనను ప్రారంభించినాను. అదృష్టవశాత్తు ఆలిపి నాకు స్వాధీనమైనది. సుమారు ౩౦౦-౩౫౦ మాటలను చదివి వాటికి అర్థములు సకారణముగా చెప్పగలిగినాను. ఈవిషయమై నాకు ఉన్న అభిప్రాయములను వెల్లడిపరుస్తూ సుమారు మూడు వందల పేజీల గ్రంథం తయారుచేసి వారి అభిప్రాయం ఇవ్వవలసినదని కోరుతూ ఒకకాపీ ఇప్పుడు లండనులో నున్న సర్ జాన్ మార్షల్ గారికిన్నీ ఇంకొకటి ఫ్రాన్సులో జూల్స్ బ్లాక్ గారికిన్నీ పంపించియున్నాను. వారికి ఈ కాపీలు చేరి సుమారు ౪, ౫ రోజులు అయి ఉంటుంది. యోసికవేక దానిలో మంచిచెడ్డలు వారు నిర్ణయించి నాకు సుమారు ఒకమాసంలో వారి అభిప్రాయం పంపగలరని యోచిస్తున్నాను.

ఇంతకుముందు ఎవరికిన్నీ స్వాధీనముగాని లిపి నేను పరిఅయినదని యోచించిన తియొరీకి లొంగినది కాబట్టి నేను నిర్ణయించిన భాషాతత్వవిచారణ పక్కిలో చాలావరకు వాస్తవము ఉండవలెనని అనుకొంటున్నాను. మహెంజొదారోలిపి పరిశీలించగా తేలిన మాటలనుబట్టిన్నీ, వాటి అర్థములనుబట్టిన్నీ, అక్షర స్వరూపములనుబట్టిన్నీ ఈ క్రింది విషయములు ముఖ్యమైనవి తేలినవి :

(౧) మహెంజొదారో... హరప్పలిపి పరిశోధకులు, ప్రపంచంలో నేటివరకు పుట్టిన అన్నిజాతుల మనుష్యుల మాటలు (భాష), నేటివరకు పుట్టిన అన్నిజాతుల మనుష్యుల వ్రాతలు, నేటివరకు పుట్టిన అన్నిజాతుల మనుష్యుల మతములు, వాటి వ్యుత్పత్తి, పెరుగుదల, మార్పులు వాటికిగల పరస్పర సంబంధములు మొదలైన వానిని పరిశోధనచేస్తున్నారన్నమాట.

(౨) ఈలిపికి కారకులు ఆంధ్రులు. అనాది నుండిన్నీ వీరి వృత్తి మానవుని మాటను (భాషను), వ్రాతను, మతమును పరిశోధనచేయుటయే; పరిశోధన చేసి, వానిని సంగ్రహముగా, సూత్రముల సహాయమున జ్ఞాపకము ఉంచుకొని తరతరములుగా ఉపయోగించుటయే. వీరే అక్షరతత్వము, భాషాతత్వము తెలిసికొని ప్రపంచకంలో మిగిలినవారికి ఈ విషయములను మప్పిన వారు.

పైదను వివరించిన రెండు విషయములున్నూ వాస్తవములైనట్టయితే, మహెంజొదారో - హరప్పలిపి భాండాగారమును తెరచినతాళముతోనే అపాదనకర శాసనమునుకూడా నేను తెరువగలుగవలెను. ఇది ఇటుండగా, ఈ "అపాదనకరం" అన్నమాటకు మాతృక మహెంజొదారో-హరప్పలిపిలో నాకు కనబడి, దానిని విపులముగా చర్చచేసినాను. 'ఆంధ్ర' అన్నదికూడా కనపడినది. మహెంజొదారో - హరప్పలిపిని వాడిన ఆంధ్రుల ఈనాటి సంతతివారు తెలుగువారిలో కొందరు మహారాష్ట్రులు, కన్నడులలో కొందరు; తమిళులలో కొందరు, మళయాళదేశమునందలివారిలో కొందరును. ఇప్పుడు ఏవర్ణమునకు చెందియున్నా, ఏభాష మాట్లాడుతున్నా, జందెమువేసుకొని గాయత్రిని చెప్పగలిగిన హిందువులందరును ఆంధ్రులే. మహెంజొదారో-హరప్ప భాషలో తెలుగు పేర్లు, మాటలు, మహారాష్ట్రపు పేర్లు మొదలైనవి నాకు కనబడినవి. అందుననే ఆభాష ఆంధ్రము అని చెప్పుటకు నాకు ఆధారము కలిగినది. ఈ కారణములచేత దురవగాహముగాఉన్న ఈశాసనమునందలి తెలుగుభాషాభాగమును పరిశోధించవలెనని నాకు తోచినది.

## శాసనమును బోధపరచుకొనుటకు ముందు చదువరులకు తెలియవలసిన విషయములు

(౧) మనుష్యులు భాషానిమిత్తమై ఉచ్చరించే ధ్వనులు రెండువిధములు: సంతోషమును తెలియజేసేవి, దుఃఖమును తెలియజేసేవి. ఈ వ్యాసమునందు మొదటి

జాతి ధ్వనులకు "సత్ ధ్వనులు" అనిన్నీ, రెండవజాతిధ్వనులకు "దుర్ ధ్వనులు" అనిన్నీ పేర్లుపెట్టివాటినే ఉపయోగిస్తాను. అ, ఆ. ఉ, ఊ, ఒ, ఓ, ఔలతో చేరినవి మొదటిజాతివి; ఇఈ ఎఏ ఐలతో కూడినవి రెండవ జాతివి. ఇది సాధారణసూత్రము. పెదవులు సాధారణ స్థితిలో ఉన్నప్పుడుగాని, ముందుకు తోసికొనివచ్చినప్పుడుగాని మొదటిజాతిధ్వనులు కలుగును; పెదవుల మూలలు దూరముగా పోవుటచేత పెదవుల మధ్య భాగము రవ్వంత లోనికి ఈడ్చుకొనును; ఇట్టి స్థితిలో పుట్టే ధ్వనులు రెండవజాతివి.

(౨) మరియొక సందర్భమునుబట్టి భాషయందలి ధ్వనులు రెండువిధములు: నాదసహితములు, నాదరహితములు. గ్, ఘ్, జ్, ఝ్, డ్, ఢ్, ద్, ధ్, బ్, భ్ మొదలయినవి నాదసహితములు; క్, ఖ్, చ్, ఛ్, ట్, ఠ్, త్, థ్, ప్, ఫ్ మొదలయినవి నాదరహితములు.

(3) ఙ, ఞ, ణ, న, మ : ఇవి ముక్కుధ్వనులు. వీటి ఉచ్చారణకు, నాదసహితమైనఊపిరి నోరుతమామూ మూసిఉండుటచేత ఆమార్గముగా పోలేక ముక్కురంధ్రములలోనుండి వెలుపలికి పోవును. ఒక్కొక్కప్పుడు నాదసహితమైన ఊపిరి నోటిలోను చి కొంతవరకున్నూ, మిగత ముక్కులలోనుంచిన్నీ పైకి పోవును. ఇట్టిజాతి ధ్వనులకు ముక్కు-నోటిధ్వనులని పేరు పెట్టవచ్చును. "చందమావ" లో "వ" ముక్కు-నోటిధ్వని. దిగువవ్రాసిన గీత లేకపోతే "వ" అనే ధ్వని పూర్ణంగా నోటిధ్వనే అని యోచించవలెను.

(౪) ఇంకొక సందర్భమునుబట్టి భాషాధ్వనులు అచ్చులు, హల్లులు అని రెండుజాతులు. భాషకు ఉపచరించే ధ్వని ఏదైనా నోటిలోపుట్టవలెనంటే నోటిలో అధమపక్షం ఒకస్థలమందైనా సన్నని ఇరకుద్వారము ఏర్పడవలెను. గొంతుకలో నాదతంతువుల నడుమను ఇరుకుద్వారము ఏర్పడుటచేత ఊపిరికి నాదము కలుగుతుంది. ఇవి ఎడముగా ఉన్నప్పుడు నాదము ఉండదు.

ఇట్టి ఇరుకుద్వారము, మీదచెప్పినది గాక నోటిలో సామాన్యముగా మూడుస్థలములందు ఏర్పడగలదు: మెత్తనిఅంగుడు నాలుక వెనుకభాగమునకు దగ్గరగా దిగుటచేత ఒకటి; నాలుకకొనభాగము గట్టి అంగుడుకు దగ్గరగా మీదికి లేచుటచేత రెండవది; పెదవులు దగ్గరగా వచ్చుటచేత మూడవఇరుకుద్వారమున్నూ ఏర్పడగలవు. ఊపిరి ఈ ద్వారములలోనుండి పోవునప్పుడు సామాన్యముగా మూడుజాతుల ధ్వనులు కలుగును. మెత్తనిఅంగుడు క్రిందికి దిగుటవల్ల కలిగినవి అంగుడుధ్వనులు; నాలుక మీదికి లేచుటచేత కలిగినవి నాలుకధ్వనులు; పెదవులవల్ల కలిగినవి పెదవిధ్వనులు. అంగుడు క్రిందకుదిగుట, నాలుక మీదికిలేచుట, పెదవులు దగ్గరగాచేరుట అనే మూడుప్రయత్నములలో ప్రతిఒకటిన్నీ మిగిలిన రెంటింటితో సంబంధములేకయే జరుగగలదు; అనగా ఈ మూడుద్వారములును నోటియందు ఒకేసారిగా ఏర్పడగలవు. నాదసహితమైన ఊపిరి వీటిద్వారా వెడలినప్పుడు మీదను వివరించిన మూడుజాతుల ధ్వనులకున్నూ ఉన్న లక్షణములు గలిగిన ఒకేధ్వని ఏర్పడును. న్యాయముచేత ఒకజాతి లక్షణములు మరియొకదానికి ఉండవుకాని. ఈ త్రిద్వారధ్వనిలో ఇవి అన్నీ ఇమిడియున్నవి. ఇదే "ఓం". వ్రాతలో ఒక్కఅక్షరముగా కనబడినను ఉచ్చారణలో దీనియందు మూడుభాగములు ఉన్నవి: మొదటిది అంగుడుద్వారమునకు చెందినది; రెండవది నాలుకద్వారమునకు చెందినది; మూడవది పెదవులద్వారమునకు చెందినది. ఈధ్వనే పశువులకు, పురాతన మానవునకు సామాన్యముగా నున్నది. ఈ ధ్వనినుండే ప్రపంచకమందు వాడుకలో ఉన్న భాషలన్నీ పుట్టినవి. అందుచేతనే ఈ "ఓం" యొక్క ప్రాముఖ్యత. దీని స్వభావము పూర్ణముగా తెలిసే నిమిత్తము దీనిని "ఓం" అని వ్రాయుటకు మారుగా |గ| |ల| |ప| వ్రాస్తే చాలా ఉపచరిస్తుంది. ఇదిసత్ ధ్వని. దీనికిసరియైనదుర్ ధ్వని |య్| |ల్| |వ్|. ఈ అక్షరములకు రెండుప్రక్కలను వ్రాసిన గీతలయొక్కయు, అడుగునవ్రాసిన గీతయొక్కయు అర్థము తరువాత వివరిస్తాను.

కాలము గడవనుగడవను ఈ త్రిద్వారధ్వనినుండే క| |ల|, |ల| |వ|, క| |వ|, |వ| |ల|, |వ| |క|, |ల| |క అనే ద్విద్వారధ్వనులు పుట్టియుండవలెను. వీనినుండి క| |ల| |వ| అనే ఏకద్వారధ్వనులును, వీనినుండి పుట్టిన ఈనాటి పలుభాషలలో గల ఇతరధ్వనులును ఏర్పడియున్నట్టు కనబడుతున్నది. ఇవిగాక వీటికి సంబంధించిన దుర్ధ్వనులుకూడా ఇదేరీతిని ఏర్పడియుండవలెను.

పరిశోధననిమిత్తము అంగుడుధ్వనులను మూడు భాగములుగా విభజించవచ్చును: వెనుకవి, నడిమివి, ముందువి. వెనుక వాటికి అరబ్బీల 'ఖ', తెలుగు వారి 'హ' అనేధ్వనులు చెందియుంటవి; క, గ, జ మొదలైనవి నడిమివి; సంస్కృతములోని చ, జ, శ, య, మొదలైనవి ముందువి. ఇదేరీతిని నాలుకధ్వనులుకూడా మూడువిధములు: వెనుకవి ట ఠ డ ఢ ణ మొదలైనవి; నడిమివి ఇంగ్లీషు t (ట), d (డ) నలు; ముందువి త, థ, ద, ధ, మళయాళపు 'న' మొదలైనవి. పెదవిధ్వనులు వెనుకవి: దుర్ధ్వనిగా పలికిన ప, ఫ, బ, భ, మలు. నడిమివి, ప, ఫ, బ, భ, మ; ముందువి. ఈషత్ధ్వనిగా పలికిన ప, ఫ, బ, భ మ లు. పరిశోధనకొరకు నోటిని, వెనుక నుండి ముందుకు, తొమ్మిదిభాగములుగా విభజించి యున్నాము. వీనికి సంఖ్యలమూలమున పేర్లు పెట్టవచ్చును.

| అంగుడుధ్వనులు | నాలుకధ్వనులు | పెదవిధ్వనులు |
|---|---|---|
| ౧. వెనుకవి | ౪. వెనకవి | ౭. వెనుకవి |
| ౨. నడిమివి | ౫. నడిమివి | ౮. నడిమివి |
| ౩. ముందువి | ౬. ముందువి | ౯. ముందువి |

ద్వారముయొక్క పరిమాణమును అనుసరించి నోటినుండి పైకి వెడలే ధ్వనుల గుణము మారుతూవస్తుంది. ద్వారపరిమాణమును అనుసరించి అచ్చులు, హల్లులు ఏర్పడుతవి. ఈ రెంటికిని వ్యత్యాసమును కలిగించునది ద్వారపరిమాణమే. ఈ ద్వారము ఉండవలసినంత పెద్దదిగా ఉన్నప్పుడు అచ్చులు పుట్టును. అ, ఇ లు అచ్చులు. నాలుకను, మెత్తని అంగుడును ఇందుకు కావలసినంతకన్న రవంత దగ్గరగా తెచ్చినయెడల రాపిడిలేని హల్లులు పుట్టును. ఇంగ్లీషుడబ్లియు, తెలుగు 'య' మొదలైనవి రాపిడిలేని హల్లులు. రాపిడిలేని హల్లులకును రాపిడిగల హల్లులకును ద్వారమే, ఎంతచిన్నదైనా, తెరచికొని యుండవలెను. ద్వారమును ఇంతకు చిన్నదిగా చేసినప్పుడు రాపిడిగల హల్లులు ఏర్పడును. స, శ, వ మొదలైనవిరాపిడిగల హల్లులు. ద్వారము ఇంతకన్న చిన్నదైనప్పుడు ట్రిల్లులుపుట్టును. ర, ఱ మొదలైనవి ట్రిల్లులు. ఇంతకుదగ్గరగా నాలుకను అంగుడుకిగాని, పెదవులకిగాని తెచ్చినయెడల ఆద్వారము క్రమముగా మూసికొనిపోవును. ఇట్టి సందర్భములో పైకి వెడలవలసిన ఊపిరి అయిదు విధాలుగా పోవచ్చును. (౧) ముక్కులో నుండి: ఇప్పుడు ముక్కుధ్వనులు కలుగుతవి. ఙ, ఞ, ణ, మ, న, ఇవి ముక్కుధ్వనులు. (౨) నాలుకకు ప్రక్కల నుండి: వీనికి ప్రక్కధ్వనులు అని పేరుపెట్టవచ్చును. ల, ళలు ప్రక్కధ్వనులు. (౩) ఎట్లుపోయినదో మాటాడేవానికిగాని వినేవానికి గాని తెలియకనే ఊపిరి చల్లగా నోటిలోనుంచో, ముక్కులోనుంచో పోవును. వీటికి పేలుడులేని ధ్వనులు అని పేరు. (౪) ఊపిరి పేలి ముందుగా నోటిమార్గమున పోవును. ఇవి పేలుడుధ్వనులు. ఇంగ్లీషు 'T' (ట) పేలుడుధ్వని. ఈనాటి తెలుగులో పేలుడుధ్వనులు లేవు. (౫) ఊపిరి ఒత్తిడిగా పేలి నోటిద్వారా పైకి పోవును. వీటికి ఒత్తిడిధ్వనులని పేరు. ఈ అయిదు జాతుల ధ్వనులకున్నూ అడ్డుధ్వనులని పేరుపెట్టవచ్చును.

పెదవులు రవంత తెరచియుంచి నాలుకన్నూ అంగుడును వాటియథాస్థానములో ఉంచి నాదసహితమైన ధ్వనిని చేసినయెడల రాపిడిలేని హల్లులు కలుగును: ఇంతకు కొంచెము హెచ్చుగా నోరు తెరిచి నాదసహితమైన ధ్వని చేసినయెడల అచ్చులు పుట్టుచున్నవి.

ఈ జాతిధ్వనుల తరగతులకు ఇదివరకువలెనే సంఖ్యల మూలముగా పేర్లు పెట్టవచ్చును.

| | |
|---|---|
| రాపిడిలేని హల్లులు | ౧ |
| రాపిడిగల హల్లులు | ౨ |
| ట్రిల్లులు | ౩ |

అడ్డుధ్వనులు:—

| | |
|---|---|
| ముక్కుధ్వనులు | ౪ |
| ప్రక్కధ్వనులు | ౫ |
| పేలుడులేని ధ్వనులు | ౬ |
| పేలుడుధ్వనులు | ౭ |
| ఒత్తిడిధ్వనులు | ౮ |

అచ్చులు ౯

ఈ విభజనల ప్రకారము ఇక్కడ ఇచ్చిన పట్టీలో ౬ వ జాతి పేలుడులేని ధ్వనులున్నూ, పురాతనభాష లోని నాలుకధ్వనులున్నూ అతి హెచ్చు అల్లరిధ్వనులు. కలుగజేయవలసిన మార్పులను కలుగజేసి ఆవితమ స్థానమున ఉండక మాయమైపోయినవి. మాటలలో మార్పులను హెచ్చుగా కలుగజేసినవి ఇవే. ఇందుకు ఒక ఉదాహరణము పేలుడులేని "ఏ" కారము. దీనిని ఉచ్చరించినప్పుడు వినేవాడికి ఇది న్ద్త్, న్త్ద్, న్ద్, న్త్, త్ద్, త్, ద్, ద్త్ అనే ధ్వనులలో ఏదో ఒకటిగా వినబడును. ఒక్కడికే ఒకప్పుడు ఒకలాగున, మరియొకప్పుడు మరియొకలాగున వినబడుటచేత ఒక మాటనుండి ఒకేభాషలో రెండు క్రొత్తమాటలు ఏర్పడుతవి. వాటి అర్థం మొదటిమాటదే. ఇదేరీతిని పేలుడులేని జ, ఝ, ణ, మ, మొదలైనవి.

పేలుడులేని జ: జ్గ్క్, జ్క్గ్, జ్గ్, జ్క్, గ్, క్, గ్క్, క్గ్.

పేలుడులేని ఝ: ఝ్జ్చ్, ఝ్చ్జ్, ఝ్జ్, ఝ్చ్, జ్, చ్, జ్చ్, చ్జ్.

పేలుడులేని ణ: ణ్డ్ట్, ణ్ట్డ్, ణ్డ్, ణ్ట్, డ్, ట్, డ్ట్, ట్డ్.

పేలుడులేని మ: మ్బ్ప్, మ్ప్బ్, మ్బ్, మ్ప్, బ్, ప్, బ్ప్, ప్బ్.

ఇంతవరకున్నూ వివరించిన విభజనల ప్రకారము అన్నిజాతుల ధ్వనులన్నూ ఒకపట్టీలో ఇమిడ్చి దానిని ఎపెండిక్సులో ఇచ్చియున్నాను. దానిని బట్టి ఈ వ్యాసమునందలి పురాతనపు మాటలను ఉచ్చారణలను తెలిసికొనవలసి ఉంటుంది. ఇందును సందర్భించినట్టియు ఇక్కడవివరించనట్టియు విషయములను అన్నిటినీ పొందుపరిచి అచ్చటనే వ్రాసియున్నాను. కాబట్టి చదువరులు ఆపట్టీనుండే ఆట్టివిషయములను గ్రహించవలసి ఉంటుంది.

(౫) పురాతనపుభాషయందలి ధ్వనులు అన్నీ త్రిద్వారలో, ద్విద్వారలో; ఏకద్వారము గలవి ఈనాటి భాషలలోనివి. ఇట్టి గుణము వీటికి ఉండుట చేత ధ్వనులు కొబ్బరిముక్క విరిగినట్లు స్పష్టముగా ఉండవు అనగా ఒకేధ్వని ఒకరికి ఒకలాగునను, మరియొకరికి మరియొకలాగునను వినబడును. ఉచ్చరించే వాడికి మాట ఒకటే అయినా వినేవారికి వేరువేరుగా ఉండును. అందుచేతనే పురాతనపుభాష ప్రపంచకములోని ఆనాటి ప్రజలకందరకీ ఒకటే అయినా, ఈనాటికి ఆభాషే పలువిధములైన భాషలక్రింద అల్లుకొనుట. ఈనాటి భాషలను పరీక్షించేవాడికి ఈ వేరువేరు భాషలయందు పరస్పరసామ్యము లేకుండా ఉన్నట్టు కనబడినా వాటితాత, ముత్తవతాతలైన భాషలలో ఎక్కువసామ్యము కనబడకతప్పదు; వాస్తవముగా కనబడుతున్నది కూడాను.

పురాతనభాషయందు అచ్చులులేవు. ఆనాటి ధ్వనులు మొట్టమొదటివి రాపిడిలేని హల్లులు; తరువాతివి రాపిడిగలిగిన హల్లులు ట్రిల్లులు, అడ్డుధ్వనులు, అచ్చులు ఇటీవల ఏర్పడినవి. ఈ మూడుజాతుల ధ్వనులున్నూ ఏ భాషలోనైనా ఏర్పడిననాటినుండీ దానికి పురాతనత్వము పోయినదని మనము నిస్సందేహంగా నమ్మవచ్చును. అచ్చులు వాడకుండా మనకు ఒక్క నిమిషమైనా వేగదే, పురాతనపుమనుష్యులు ఎట్లు తమ తమ భాషాధ్వనులను ఉచ్చరించేవారు, ఎట్లు మాటాడగలిగేవారు, ఎట్లు తమ భావములను ఇతరులకు తెలిపేవారు అన్న పెద్దసందేహం ఈనాటి భాషాతత్వవిచారకులకు కలిగినది. ఈ ప్రశ్నకు సబబైనజవాబు ఎవరున్నూ నేటివరకూ ఇవ్వలేదు. కాని నాకు తోచినవరకు నేను ఈ ప్రశ్నకు జవాబు ఇస్తున్నాను. చిత్తగించండి. ఇందుకు కారణము మధ్యగద్వారముయొక్క ఆకార

మున్ను, ధ్వనులను కలుగజేయు దాని భాగముల అమరికయున్న. గహ్వరము ఇంచుమించుగా అడకత్తెరఆకారముగా ఉన్నది. మీదిదౌడ నిలకడగా అతికియున్నది; అది కదలజాలదు. క్రిందిదౌడ మీదికినీ క్రిందికిని ఆడగలదు. మీదిదౌడఅడుగుభాగము ముఖగహ్వరమునకు మీదికప్పు. దీనిలో వెనుకభాగము మెత్తనిఅంగుడు. ఇది క్రిందికినీ మీదికిని ఎక్కి దిగగలదు; ముందుభాగమునకు ఎట్టి చలనమున్నూ లేదు. ఇకను, నాలుక పలసరి రబ్బరుత్రాడువంటిది. దీని క్రిందిభాగములో వెనకసగము నోటి అడుగుభాగమునకు గట్టిగా అతికియున్నది. కాబట్టి ఈ భాగమునకు చలనము అతితక్కువ. నాలుకముందు భాగమును ఇష్టమువచ్చినట్టు క్రిందకును మీదికిని మనము ఆడించవచ్చును. పెదవులకు రెండింటికిని ఇంచుమించుగా ఒక్కేమట్టుకు చలనమున్నది.

అంగుడుధ్వనులను కలుగచేయగలిగిన భాగములు: మెత్తనిఅంగుడు, నాలుక వెనుకభాగము; వీటిలో స్వేచ్ఛాచలనము ఈఅంగుడుకే ఉన్నది; నాలుకకు అతితక్కువ. నాలుకధ్వనులను కలుగజేయునవి: గట్టి అంగుడు, నాలుకముందుభాగము. వీటిలో స్వేచ్ఛాచలనము నాలుకకే; అంగుడికి లేనేలేదు. మెత్తనిఅంగుడు నాలుకముందుభాగముయొక్క సహాయములేకుండానే క్రిందికిన్నీ మీదికిన్నీ ఆడగలదు; ఇట్లే మెత్తనిఅంగుడు సహాయము లేకుండానే నాలుక క్రిందికీ మీదికీ ఆడగలదు. కాబట్టి పరస్పర సంబంధం లేకుండా, మెత్తనిఅంగుడు క్రిందికి దిగుటవల్ల నోటికి వెనకభాగమున ఒకద్వారమున్నూ, నాలుకముందు భాగము మీదికి లేచుటవల్ల నోటికి మధ్యభాగమున ఒక ద్వారమున్నూ, ఒక్కేకాలమందు ఏర్పడగలవు. వీటికి తోడు, ఈ మీద వివరించిన రెండుజతల అవయవములతో సంబంధములేకుండానే పెదవులు రెండును దగ్గరగా వచ్చుటచేత నోటికి ముందుభాగమున ఇంకొక ద్వారము వాటితోసహా ఒక్కేకాలమందు ఏర్పడగలదు. ఈమూడు ద్వారములున్నూ ఒక్కమారుగా ఏర్పడిఉండగా పైకి వెడలే నాదసహితమైన ఊపిరి |గ| |ల| |వ| (ఓం) అనేధ్వనిని చేయును. అవసరమైనప్పుడు మూడుద్వారములను చేయుటకు మారుగా రెండింటినే చేయవచ్చును. అప్పుడు |గ| |ల|, |గ| |వ|, |ల| |వ|, |వ| |ల|, |వ| |గ|, |ల| |గ| అన్న ద్విద్వారధ్వనులు ఏర్పడగలవు. మీదను వివరించిన త్రిద్వారధ్వనిలో అయితేనేమి, ద్విద్వారధ్వనులలో నైతేనేమి ఏదో ఒకద్వారమువద్ద పుట్టిన ధ్వనిభాగమునే ఊది పలుకగలిగేవారు. కాబట్టి వాస్తవమున |గ| |ల| |వ| అని వ్రాసినది మూడు వేరువేరు మాటలు:

|గ| |ల| |వ|, |గ| |ల| |వ|, |గ| |ల| |వ|

మొదటిదానిలో ఊదిపలికిన భాగము |గ|; రెండవదానిలో |ల|; మూడవదానియందు |వ|. కాబట్టి మిగిలిన రెండు భాగములును ముఖ్యభాగమునకు ఊతలుగా ఏర్పడుచున్నవి. ఈ మూడు ద్వారములవద్ద పుట్టిన ధ్వనులున్న హల్లులే. ఇందులో ఒకహల్లు మరి ఒకదానికి ఊత; అనగా మొదటిహల్లునకు అచ్చు ఉన్న ఎడల అది ఎట్లు సహాయపడవలెనో అట్లే రెండు, మూడు ద్వారములవద్ద పుట్టిన హల్లులు దానికి సహాయపడి, అచ్చులవలె ఊతలుగా ఉన్నవి. |గ| అనేభాగమునకు |ల|, |వ| లు ఊతలు; |ల| అనేదానికి |గ| |వ| లు ఊతలు; |వ| అన్నదానికి |గ| |ల| లు ఊతలు. ఇట్లే ద్విద్వార ధ్వనులకు కూడాను. |గ| |ల| ఒకటేధ్వని; దీనికి రెండు అంతర్ భాగములు: |గ| ఒకటి, |ల| ఒకటి. ఈరెండు ద్వారములవద్ద ఏర్పడిన అంతర్ధ్వనులున్నూ రాపిడి ఉంటేనేమి, లేకుంటేనేమి, హల్లులే. ఒకదానికి ఒకటి ఊత. |గ| కు |ల| అనుకోవచ్చును; లేదా |ల| కు |గ| అనుకోవచ్చును. |గ| కు |ల| ఊత అని యోచించేవారు |గ| ప్రధానధ్వని అని తలచి దానిని ఊది పలుకుదురు. |ల| ప్రధానధ్వని అని తలచేవారు దీనిని ఊది పలికియుందురు. నేటి ఏకద్వారధ్వనులు పురాతనపు ద్విద్వారధ్వనులనుంచిన్నీ, ఇవి త్రిద్వార ధ్వనులనుంచిన్నీ ఏర్పడియున్న వనుటకు తగిన ఆధారములున్నవి. ఈనాటి తెలుగు 'గ' పురాతనపు |గ| |ల|; ఈనాటి తెలుగు 'ల' పురాతనపు |ల| |వ| నుంచి పుట్టినది. ఇట్లే ఈనాటి 'వ'.

పురాతన భాషయందు త్రిద్వారధ్వనులున్నూ ద్విద్వారధ్వనులున్నూ మాత్రమే ఉండుటకున్నూ ఏక ద్వారధ్వనులు లేకుండా ఉండడానికిన్నీ ఇటుపైని కారణమును వివరిస్తాను. బాగుగా తెరిచియుంచినప్పుడు ముఖగహ్వరము ఇంచుమించుగా కొంచెము తెరచిన అడకత్తెరవలె ఉండును. దాని లోపలికొన పెదవులవద్ద కన్న ఇరుకు. అడకత్తెరకున్నూ దీనికిన్నీ ఒక వ్యత్యాసము ఉన్నది. అడకత్తెరదౌడల లోపలిఅంచులు తిన్నగా ఉన్నవి; కాని నోటిదౌడలలో అంచులు అట్లు కాదు. మీదిదౌడలో అంచు పల్లకీవాటముగా ఉన్నది; దిగువదౌడలో అంచు ఏటవాలుగా ఉన్నది. మీదిదానికి చలనము లేదు; దిగువదానికి అడకత్తెరదౌడకువలె చలనము ఉన్నది. ఈ కారణములచేత, దిగువదౌడ మీది దానికి రవంత దగ్గరగా వచ్చినప్పుడు ఏకకాలమందు ఇంచుమించుగా మెత్తనిఅంగుడువద్ద ఒకటిన్నీ, పెదవుల దగ్గర ఒకటిన్నీ మొత్తమున రెండుద్వారములు ఏర్పడును. వీటిమార్గమున నాదసహితమైన ఊపిరి పైకి వెళ్లినప్పుడు ఇంగ్లీషు డబ్లియు (ద్విధ్వని) పుట్టును. ఇది పురాతన భాషలో ముఖ్యమైన ధ్వని; మొదటిది. దిగువదౌడను ఈస్థితిలో ఉంచి, నాలుకకొనను రవంత మీదకి ఎత్తిన యెడల నోటికినడుమ ద్వారము ఏర్పడును. ఈమూడు ద్వారములలోనుండి నాదసహితమయిన ఊపిరి కొంత వరకు ముక్కులోనుండిన్నీ మిగిలినది నోటినుండిన్నీ పోయినయెడల త్రిద్వారధ్వని, |గ| |ల| |వ| అనేది పుట్టును. ఇదే "ఓం". నాలుక మీదకు ఎత్తకుంటే ద్విద్వారధ్వనే పుట్టుతున్నది. ఈ ఇంగ్లీషు డబ్లియు అనేధ్వనిని మనము |గ| |వ| అని వ్రాయవచ్చును. దీనిని ఉచ్చరించుటకు పైకిపోయే ఊపిరిలో కొంత ముక్కులోనుంచికూడా పోతే ఈధ్వని |గ| |వ| అవుతుంది. ఈ ఇంగ్లీషుడబ్లియు (|గ| |వ|) వినేవారికి ఒకప్పుడు |గ| గా వినబడుతుంది; ఇంకొకప్పుడు |వ|గా వినబడుతుంది. కాబట్టి నేను పరీక్షచేసిన అన్నిభాషల లోనూ 'గ' కు మారుగా 'వ' ఉండడం, లేకుంటే రెండింటికి మారుగా డబ్లియు ఉండడం, లేకపోతే 'వ' కు బదులు 'గ' రావడం తటస్థించినది. ఇవి నోటి— ముక్కుధ్వనులైతే |గ| కు మారుగా |వ| గాని 'మ' గాని రావడం, 'మ' కు మారుగా 'బ' రావడంకూడా అతిసామాన్యమైన విషయము. ఈ ఇంగ్లీషుడబ్లియు అనే ధ్వనే కొందరికి |గ| |వ| అన్నట్టు తట్టుతుంది; మరి కొందరికి |వ| |గ| అన్నట్టు తట్టుతుంది. ఈ ఒక్క పురాతనధ్వనే, ఈనాటి భాషలలో కొన్నిచోట్ల 'గవ' అనిన్నీ, మరికొన్నిచోట్ల "వగ" అనిన్నీ కనబడుతున్నది. ఈ రెండింటికీ మధ్యను |ల| కూడా ఉంటే, ఒకే త్రిద్వారధ్వని రెండింటిక్రింద మారగలదు.

(౧) |గ| |ల| |వ| |వ| |ల| |గ| (౨)

|గ| కున్నూ, |వ| కున్నూ పురాతనభాషలో వ్యత్యాసము లేదుకాబట్టి పురాతనపు ద్విద్వారధ్వనిని ముందునుంచి వెనుకకుగాని, వెనుకనుంచి ముందుకుగాని చదివినా, ఉచ్చారణలో ఏమీ వ్యత్యాసం లేకుండా ఒక్కరీతిగానే వినబడుతుంది. ఈ కారణంచేత కొంత మంది ఈ త్రిద్వారధ్వనిని వ్రాసి ఆ వ్రాసినదానిని చదివినప్పుడు కుడినుంచి ఎడమకున్నూ, మరికొంతమంది ఎడమచేతినుంచి కుడివైపునకున్నూ చదవడం ప్రారంభించినారు. క్రమక్రమాను ఈ వ్రాతపోస్తరులు రూఢమై పోయినవి. అరబిక్, ఉర్దూ మొదలయినవి ఒకరీతిగా వ్రాస్తే తెలుగు, అరవము, ఇంగ్లీషు దానికి వ్యతిరేకముగా వ్రాస్తాము.

ఇంగ్లీషు డబ్లియువంటి ధ్వని పూర్వం ఆంధ్రులకు కూడా ఉండేది. ఇది ఒక్కటేధ్వని అనిన్నీ, రెండుద్వారములు కలదనిన్నీ తెలియజేయుటకు ఒక వింత అయినపన్నాగమువారు పన్నినారు. రెండు ద్వారములలో ఒకటి మెత్తని అంగుడుదగ్గరది; కాబట్టి ఈ డబ్లియును వ్రాయుటలో అక్కడి అక్షరమును (గ) ఉపయోగించినారు. రెండవద్వారము పెదవుల దగ్గరది కాబట్టి దీనికి అనుగుణ్యమైన అక్షరమును కూడా ఉపయోగించినారు. రెండింటిని ప్రక్క ప్రక్కగా వ్రాస్తే రెండు వేరువేరు ధ్వనులన్న అభిప్రాయము కలుగుతుందేమో అన్నభయముచేత ఒకదానిక్రింద ఒకదానిని వ్రాసినారు. గ్వ అంటే ఎంతో వ్గ అన్నా అదేగా భావించవలెనని వారి తాత్పర్యము. |గ|, |వ| లకు

ఉచ్చారణలో భేదము లేదుగదా! అందుచేత 'గ్వ' అని వ్రాసినదానిని క్రిందనుంచి మీదికి చదివి దానిని డబ్లియుగా ఉచ్చరించేవారు; మరికొందరు దానినే మీదనుండి క్రిందికి చదివి దానికిన్నీ అదే ఉచ్చారణను కల్పించారు. అందుననే క్రిందనుంచి మీదికి వ్రాసే వ్రాతలు కొన్ని, మీదనుండి క్రిందికి వ్రాసేవి కొన్ని ఈనాటికిన్ని మనము చూస్తున్నాము. ఈనాటి తెనుగులో మనము "స్వ" అని వ్రాస్తే ఇదే పురాతన భాషలో |స్| |వ్| అనే ద్విధ్వనిగా పలికేవారు.

మీదను వివరించిన విషయములన్నీ సరియని రుజువుచేయుటకు మహెంజొదారొ - హరప్పలిపి నుండి విస్తారముగా ఉదాహరణము లివ్వగలను. ఇట్టి వింత వ్రాతలను ననుసరించే ఆవ్రాత ఆంధ్రులదని నిర్ణయించి యున్నాను. నేను ఆలిపి చదివిన పిమ్మట దానిని గురించిన కొన్ని అభిప్రాయములను వెల్లడించియున్నాను. అదృష్టవశాత్తూ మీది నా అభిప్రాయములన్నిటినీ అహదనకరశాసనము దృఢపరస్తున్నది. తప్పుదోవ తొక్కటంలేదని నాకు సూచన.

(౬) నా చిన్నతనంలో మాతండ్రి నాకు ఒక పద్యం చెప్పినారు. అది అందరికీ తెలిసినదే. 'త్ర్బుక్వట బాబా' అన్నది. ఇది చక్కని తెలుగులో చెప్పియున్నది ఈ చాటుపద్యముయొక్క పూర్వచరిత్ర, అర్థము మొదలయినవి కూడా అందరికీ తెలిసినవే. అందుచేత నేను ఇక్కడ వ్రాయను. ఈ పద్యమునకు విపరీతార్థము ఒకటి ఉన్నట్టు నాకు కనిపిస్తుంది. ఇప్పటికి అప్రస్తుతం కాబట్టి అదిన్నీ వ్రాయదలచుకోలేదు. కాని ఆపద్యంలో రెండు వింతధ్వనులు ఉన్నవి - మొదటిది త్ర్బు; రెండవది డ్డబ డ్డబ అన్నదిన్నీ.

మొదట ఈ 'త్ర్బు'అన్న దేమిటో వివరిస్తాను. మనుష్యుడు ఎవడైనా తుమ్మవలసి వచ్చినప్పుడు నోరు బాగుగా తెరచి, గాలిని తొందరగా లోనికి పీల్చుకొని, పూనించి, దానిని ఒక్కసారిగా బలంతో పైకి వెళ్లగొట్టును. ఈ వెళ్లగొట్టే కాలమందు అడకత్తెర మూసుకొన్నట్టు క్రమంగా నోరు వెనుకనుంచి ముందుకు మూసికొనివచ్చును. ఈరీతిని మూసుకొంటూ వచ్చే నోటిలోనుంచి తొందరగా ఊపిరి బయటకు వెడలుతూ ఉన్నది కాబట్టి ఒకదాని తరువాత ఒకటి తొందర తొందరగా ఈదిగువ నుదాహరించిన ధ్వనులు కలుగుచున్నవి: వీనిలో మొదటిది: త్ర. గాని దీనికి సరియైన దుధ్వనిగాని; తరువాత వరుసగా ఒకదాని తరువాత ఒకటి వెంటనే వచ్చే ధ్వనులు: |ర| |క| |న| |త|; ఇటుపైని ఏర్పడే ధ్వని ఒక విడ్డూరమైన ధ్వని. ఇది ఒక ట్రిల్. ఈ ట్రిల్లును ఉచ్చరించేటప్పుడు కొంత ఊపిరి ముక్కులోనుంచిన్నీ మరికొంత నోటిలోనుంచిన్నీ పోవుటచేత దీనిని ముక్కు-నోటి ధ్వనిగా ఎంచవలెను. ఇది ఎట్లు ఏర్పడుతున్నదో ఇటుపైని వివరిస్తాను: బాణాకారముగా ఉన్న నాలుకయొక్క అంచుభాగము రెండుపెదవులమధ్యను ఉంచి, దీనికి బొత్తిగా వెనుకనున్న భాగమును మీదిపండ్ల మీది భాగమునకు తగిలియున్న గట్టిఅంగుడికి ఎగదన్ని బలంగా ఊపిరిని వెళ్లగొట్టవలెను. అప్పుడు మొదట |త| యొక్క పుట్టుగస్థానమునకు అనుగుణ్యమైన ట్రిల్ వినబడును. వెంటనే మీది పెదవి, దానికి అంటియున్న నాలుక మధ్యనుండి ఈ ఊపిరి పోవునుకాబట్టి ఆస్థానమునకు అనుగుణ్యమగు ట్రిల్ ఇంకొక్కటి ఏర్పడును. ఇది నాలుక మీది పెదవి అతితొందరగా చలించుటవల్ల కలిగినది; ఈవెనుక చెప్పిన ట్రిల్ పలుకుతూ ఉండగానే, నాలుక, మీదపెదవులు చలనమువల్ల, క్రిందిపెదవి కూడా చలించసారంభించును. రెండు పెదవులు చలించుటచేత ఏర్పడవలసిన ట్రిల్ ఇంకొకటి వినబడును. మీదచెప్పిన మూడు ట్రిల్లులున్నూ ఇంచుమించుగా ఒక్కేసారి పలుకును. ఇది ఇట్లుండగా ఈ ఊపిరిలో కొంతభాగము ముక్కులోనుంచి పోవునుకాబట్టి ఈ ట్రిల్లుల మిశ్రమమైన ధ్వనికి అనునాసికత్వముకూడా అంటుతుంది. ఒక్కేసారిగా పలికే ఈమూడు ట్రిల్లులను తెలుగు సంప్రదాయంప్రకారం వ్రాయవలెనంటే ఈ రీతిగా ఒకదానిక్రింద ఒకటి వ్రాయవలెను.

త్ ౯

త్ బ్ ౯

బ్ ౯

ఇందులో ప్రతిఒక్క ధ్వనిన్నీ ఈనాటి తెలుగు వారికి వింతే. మొదటి "త" అనే పలకడానిధ్వనినికి

నాలుకను అమర్చి, ఊపిరిని బలంగా పైకి వెళ్లనివ్వ వలెను. అప్పుడు ఈట్రిల్ ఏర్పడును. దానితరువాతి ధ్వని ఇంకా హెచ్చు వింతైనది. నాలుక విల్లువ టి కొనను రెండుపెదవులమధ్యను ఉంచి మీదిపెదవికి ఎగ దన్ని అక్కడ "అడ్డుధ్వని" పలుకవలెను. ఇది నాద సహితమైనది అయితే 'బ్ద' అన్నట్టున్నూ, నాదరహిత మైతే "ప్త" అన్నట్టున్నూ వినబడును. ఈధ్వనే ప్తాలమీ, కాప్తు, చంద్రగుప్త అన్నమాటలలో ఉన్నది. రానురాను ఈ బ్ద, ప్త అనేధ్వనులు బ, ద, ప, త అన్నధ్వనులక్రింద విరిగినవి. బ్ద, ప్త అన్నధ్వనులను ఉచ్చరించుటకు నాలుకను పెదవిని అమర్చి, ఊపిరిని బలంగా వెడలిస్తే ఈట్రిల్ ఏర్పడును. ఇది ఒక్కటే ధ్వని; వేరుమార్గం లేక త్ బ్ అని రెండు అక్షరము లుగా వ్రాసియున్నాను. కడవటిది రెండుపెదవులవల్లను కలిగిన ట్రిల్. ఈ మూడున్నూ ట్రిల్లులు అని తెలియ జేయడానికి, 'ε' అనే గుర్తు వాడినాను.

ఒకదానిక్రింద ఒకటి మూడు వరుసలుగా అక్షర ములు అచ్చువేయుటకుగాని, వ్రాయుటకుగాని సౌక ర్యము లేనందున వీనిని ఈ దిగువను కనబరచినట్లు ఇటు పైని వ్రాస్తాను. అలాగున వ్రాసినా ఇవి అన్నీ చేరి ఒక్కేధ్వని అని చదువరులు జ్ఞాపకము ఉంచుకొన వలెను. అడుగున గీసినగీత ముక్కుధ్వని అని తెలియ జేయుటకు గురుతు.

### త్ε త్ బ్ε బ్ε

ఇప్పుడు మొదటినుంచి పుట్టిన ధ్వను లన్నిటినీ వరుసగా వ్రాస్తాను.

### అ |x| |క| |న| |త| త్ε త్ బ్ε బ్ε

మీదను వ్రాసినది కొంతమంది ఊహించినట్లు. మరికొంతమంది మీదిదానిలో ఉన్న |న|, |త| తరు వాత వచ్చినట్లు యోచించడంచేతనున్నూ కడపటి మిశ్ర ధ్వని కొంతవరకు ముక్కుధ్వనిగా ఉండుటచేతను దీనిని రవంత మార్పుతో వ్రాస్తారు. అది ఈదిగువను వివరిస్తు న్నాను.

### అ |x| |క| |త| |న| త్ε త్ బ్ε బ్ε

ఈ రెండువిధములైన ధ్వనులు ప్రజల నోళ్లలో ఎన్నివేలసంవత్సరములైయ్యో వాడుకలో ఉండిఉండి అవి మార్పులుచెందినవి. ఆ మార్పులను నేను ఇటుపైని వివరిస్తాను.

ఏ అక్షరమునకైనా రెండుప్రక్కలనూ గీతలు గీసియున్నట్టయితే దానిని అడ్డుధ్వనిగా పలుకకూడదు. దాని ఉచ్చారణనిమిత్తము నోటిలో ఏర్పడిన ద్వారము తెరిచేఉంచవలెను గాని తమామూ మూయకూడదు. ఇట్టి సందర్భంలో రాపిడి లేనట్టిగాని, రాపిడి గలట్టి గాని హల్లు ఏర్పడును. |x| అని వ్రాస్తే "వాడిమొగ్గాం" అన్నప్పుడు "x" ఎలాగు వినిపిస్తుందో ఆలాగు పలుక వలెను. ఇట్లే |క| మొదలైనవి. కాండ్రగించునప్పుడు వినబడే ధ్వని ఇంచుమించుగా |క| అవుతుంది.

|x| |క| అనేధ్వనులు తమకూడికవల్ల గ, క, హ అనే ధ్వనులక్రింద మారినవి. త్ε త్ బ్ε అనే ధ్వనులు తమకూడికవల్ల, త్ త్ బ్ε అని మారినవి. త్ త్ బ్ ε బ్ε అనే ధ్వనులు తమ కూడికవల్ల త్ త్ బ్ బ్ε గా మారినవి. |బ| కున్నూ, |వ| కున్నూ ఉచ్చార ణలో భేదము లేకపోవుటచేత |బ| కు బదులు |వ| వచ్చినది; దీనికి బదులు |x| గాని, |క| కాని కూడా రావచ్చును. 'బ్ε' అనే ట్రిల్ ఈనాటి తెలుగులో లేదు కాబట్టి బ్ε అనే ధ్వని బ్ర్, వ్ర్, గ్ర్, క్ర్, ప్ర్ అన్న ధ్వనులక్రింద మారినది. అ |x| అన్నే ధ్వనుల సముదాయము |x| గా గాని, |వ| గా గాని మారినది. మొదటనున్న |అ| మీద వివరించినట్లు ఏవ్యై మైపోవుట వింతకాదు. |క|, |త| అనేధ్వని |క| క్రిం దగాని, |త| క్రిందగాని మారును. మిగిలిన మార్పులను అవసరం కలిగినప్పుడు వివరిస్తాను. ఇట్టి మార్పులను సూచించుటకు ఉదాహరణలు ఇస్తాను.

### A

### అ |x| |క| |న| |త| త్ε త్ బ్ε బ్ε

అ |క| |త| ర ము = అక్షరము. అహ్ నంతపు రము = అనంతపురం. అహ్నంతవర్మ = అనంతవరం.

అనాతారం. అహ్ద్ర్వం = ఆదివరాహం. ఆహ్న్ద్ర్వం = ఆంధ్రము. అకనదిర్వమ్హ = అకనదిరజు (౫౮). అహ్ద్వ్లం = ఆదివెలమ. మ్హద్వ్లం = |ఫ| ద్వ్లం=పద్మవెలమ. ఆహ్న్డ్ర్వం=ఆండవరు. ఆహ్ద్ర్వాం=ఆదివారం. మ్హనత్బ్ల = మహనత్బిల్ = మహనబిల్ (౫౭) కన్త్వళ్ = కొన్త్గళ్ = కొంగుగళ్ (౭౯) కత్ర్వహ్న్=కనదిరజుళ్.

B

అ |x| |క| |ఠ| |న| త్లత్బ్లబల

అహాదనగరము(అహాదనకరము). ఆహ్దాన్ర్వం= అహ్ద్దాస్న్ం=అధ్దాన్నం, ఉద్దానం. |వ| హ్దనపూర్|.| =బద్దనపూడి. దీనికి సరిఅయిన దుధ్వని జద్రవెర్యే లేక బద్రవెరెయు. |వ| హ్న్ద |త| ర్వాం = మహేంద్రం మహేంద్రవరం, మహేంజదరో. అహ్క్త్ల ర్వ = అక్షర అనేదానికి సరిఅయిన దుధ్వనిగా దీనిని పలుకవలెను. ఇదే రానురాను అ |త| |క| వ్ల'.|గా మారి కడవరికి అచ్చుకట్టు (78) అయినది. |వ| హ్న్ద్ |త| ర్వాం = పానికనదిఖము (౯6) |వ| హ్ద్వ్ల |.| = మద్దకంచ్ (96).
మీదను ఇచ్చిన మాటలలో ముఖ్యము లైనవి.

౧. అక్షరము, అచ్చుకరము-మొదటిది సద్ధ్వని, రెండవది దుధ్వని. రెండింటికినీ వ్యుత్పత్తి ఒకటే. ఆల్ఫ, బీట అనే అక్షరములు మొదలుగాగల గ్రీకు అక్షరసముదాయమునకు "ఆల్ఫబెట్" అనిపేరు ఏరీతిని వచ్చినదో అదేరీతిని, అక్త్ర్వ అనే ధ్వనుల సముదాయమునకు అక్షరము అని పేరు వచ్చినది. అక్షరము అనే మాటకు వాస్తవమైన ఉత్పత్తి ఇది. "నాశనము" లేనిది "అక్షరము" అని చెప్పుట సమంజసమా అని అనుమానం పుట్టుతున్నది ఇప్పుడు. ఈమాటకు మీద చెప్పిన రెండవ వర్ణక్రమము మహేంజోదారోసీళ్లలో మూడునాలుగు స్థలాలలో చూచి ఈ మాటను విపులంగా ఆగ్రంథంలో చర్చచేసినాను. అక్కడ వర్ణక్రమము ఈరీతిని ఉన్నది అక్త్శ్ర్వం=అక్షుశ్రం. ఈసీళ్లలో వ్రాసిన మాట వేదభాష మాట్లాడేవారి దైతే 'శ్'అనే ధ్వని ఈమాటలలో అక్కడ ఉండకూడదు. వేదభాష "ళ" వర్ణంఅయితే అక్శ్త్ర్వం అని ఉండవలెను. వేదభాష వారి "ళ"-3-వ స్థానమునకు చేరినది. ఆంధ్రులది ౬-వ స్థానమునకు చెందినది; అనగా వేదభాషలో "క,ళ" అనేవర్ణములకు దగ్గరసంబంధమున్నూ, ఆంధ్రులలో "త,ళ"లకు దగ్గరసంబంధమున్నూ గలదని భావము. ఈ కారణమునుబట్టి మహేంజోదారోసీళ్లలో వ్రాత ఆంధ్రులదిగాని వేదభాషవారిది కాదని నిర్ణయించినాను. అక్షరాలవారు, అనగా వ్రాతవారు ఆంధ్రులు వాక్కువారు వేదభాషవారు. వ్రాయుటకు సౌకర్యములు అనేకములు ఆకాలమునాడు ఉన్నా వేదములను వ్రాయక పఠిస్తూనేవచ్చుటకు కారణము ఇదే. వ్రాతా, మాటా ముఖ్యము? అన్నప్రశ్నకు వ్రాత అని జవాబు ఇచ్చినవారు ఆంధ్రులు. మాట అన్నవారు వేదభాష వారు. అందుకే వారికి పరస్పరవైరము.

౨. అకనదిరజు(అహ్ంద్ర్వయ్మ్హ) = ఆంధ్రము, ఆంధ్రుల భాష. ఆహాదనకర (అకనదిరజు) శాసనంలోని భాష ఆంధ్రము. వ్రాత తెనుగు. సంస్కృతపు మాటలు ఇంగ్లీషులో వ్రాసినట్లు, ఎవరో, ఎప్పుడో ఆంధ్రంమాటలను తెనుగులిపిలో వ్రాసినారు.

3. అధ్దాన్నం, బద్దనపూడి: అన్నమాటలు మన తెలుగువారు ఇప్పటికు తరుచుగా వాడుకచేస్తారు. 'అగమ్య అగోచరం, ఏమీ తెలియదు' అని అర్థం అనుకుంటాను. "అర్ధాన్న పు అడివి" = చొరరాని అడివి. దీనిలోనుంచే "ఉద్యాన" అన్నమాట వచ్చినట్టు కనిపిస్తుంది. "ఉద్దానం" గ్రామంపేరు; 'అహాదనకరము' అన్నట్టే, కొందరు "అర్ధాన్నం" అనుకొని "కడుపునిండని కూడు" అని అర్థంచెప్పడం నేను విన్నాను. అదే సరిఅయితే 'బద్దనపూడి' ఏమిటి? జవాబు దొరకదు. ఈ రెండు మాటలూకూడా అక్త్లవ్ర్ అన్నమాటయొక్క వికారస్వరూపములే. ఈ రెండింటికిని గల పరస్పర సంబంధం గురువులవద్ద శిష్యులు నేర్చుకొని, బోధపడక, తిట్లు తిని ఈ "అర్ధాన్నం, బద్దనపూడి" అన్న సామె

తను కల్పించియుందురు. అది రానురాను లోకోక్తి అయిపోయినది. ఆల్జీబ్రా అన్నది లెక్కలలో ఒకభాగమనినీ, కొంతమందికి నేర్చుకొనుటకు కష్టమనీన్నీ అందరకు తెలుసును. వీరు ఈ ఆల్జీబ్రాను ఎట్లు వర్ణించినారో అందరకు తెలుసును! ఇంచుమించుగా తెలుగు దేశంలో ఆల్జీబ్రా నేర్చుకొనే ప్రతిపిల్లకాయకును ఇది విదితమే.

౪. మహేంద్రం. అ|x|అన్నది |వ|కు సమానం; |క| అన్నది 'హ'కు సమానం. కాబట్టి A మోస్తరు వర్ణక్రమము గల మాట |వ|| హె|| స|| ద్ర| వ్రం అన్నమాటగా మారుతుంది. ఈమాటే మరొకమోస్తరుగా మారి మహెంజ్‌దారో అయినది. ఈనాడు ఈ మాటకు "చచ్చినవాళ్ల దిబ్బ" అని అర్థము చెప్పినారు. సర్ జాన్ మార్షలుగారు వ్రాసిన గ్రంథములో ఈ అర్థము ఇచ్చియున్నారు. మహెంజొదారొకి వ్యుత్పత్తి దొరికినదికాబట్టి, 'హరప్ప' అన్నమాటకు వ్యుత్పత్తి వివరిస్తాను: వ్ర |హ| మ |.| = వ్ర వ్రప్ అని మారినది. 'వరాహం' అన్నది ఆదిమాటగా తలుచుకుంటే దానిలోనుంచి వ్రాహమ్ అన్నది కలిగినది. కడవరి'మ'ను పెలుడులేని అర్ధధ్వనిగా పలకడం వాడుకలోనికి వచ్చినట్లు కనిపిస్తుంది. పెలుడుఅర్ధధ్వని అని తెలియచేయడానికి 'మ|.|' వ్రాసినాను, రెండవ అక్షరమైన "హ"కారముయొక్క నాదరహితము 'వ'లో ముందుభాగమునకు రాబట్టి వ్ర |హ| అన్నది |ప| వ్ర అయినది. ఈ మార్పులన్నీ కూడితే హ్రప్ప, లేక హరప్ప అయినది. కడవరి "మ" అనే ధ్వనిని దుధ్వనిగా పలికేవాళ్ల నోళ్లలో అది |మె| గామారి, |యె| అయి తుదకు "జె"గా పరిణమించినది. ఈ కారణంచేతనే వెంకన్నవరాహం (అనగా వెంకన్న బ్రాహ్మం)వెంకవ|.| వ్రాజు అయి తుదకు వెంకటరాజుగామారి ఈనాటి తెలుగులో కనిపిస్తున్నది. ఈ సంగతి నేను మహెంజొదారోలిపిలో వ్రాసిన మాటలలో చదివినాను. కాబట్టి మహెంజొదారోలిపి ఆంధ్రులదని నిర్ణయించినాను; మహారాష్ట్రులదికూడాను. కన్నడులుకూడా ఈలిపి మాదని చెప్పకోవచ్చును. వీరందరూ ఆంధ్రులే.

ఇప్పుడు ఈ హరప్ప, మహెంజొదారో అన్న మాటలను రెండింటిని చేర్చి మీద వివరించిన మార్పులతో వాటిని పలికితే రాజమహేంద్రవరము, రాజమహేంద్రపురము అన్నది అవుతుంది. అనగా దీని అర్థం ఏమిటంటే హరప్ప మహెంజొదారో ప్రజలు, మొదట పంజాబు, తరువాత సింధు ఇప్పుడు నైజాముదాష్ట్రము మీదుగా గోదావరివెంట వచ్చి రాజమహేంద్రవరమును స్థాపించినారని. ఓఢ్రులు వచ్చినదికూడా ఇంచుమించుగా ఇదేదారి. వీరు ఒ క్ ద్ త్ ౯ తబ౯ బ౯ (అక్షర) అనేమాటను ఒక్ధర్‌రా, ఓఢ్రజని పలికేవారు. అసలు మాటలో ఉన్న "న" కారమునకు అను నాసికత్వము పోయిఅది 'ద'గా మారినది. 'క' రెండవస్థానపు హల్లు; 'ద' ౬ వ స్థానమునకు చేరినది. ఈ రెండున్నూ ఒక్క మాత్రాకాలంలో పలకవలసివచ్చినందున రెండింటికిని నడుమగా నన్న 'డ'కారము ఏర్పడినది.

ఇట్లే, రాంబభ్రపురము అడివివరం, అగనంపూడి, అద్దంకి, గార్లదిన్నె, లకండిడ్డి, పెదపరియ, పెదపూడి మొదలగు విడ్డూరపు పేర్లకు చక్కని వ్యుత్పత్తులు, సకారణంగా ఇవ్వవచ్చును. మీదను చేసిన చర్చనుబట్టి 'పురము,' 'వరము' 'నగరము' పూడి, ఔట్లుమొదలైన గ్రామనామముల తోకలు ఎట్లు ఏర్పడ్డవో స్పష్టమై ఉండవలెను. ఇవి ఆంధ్రులవి; సంస్కృతంవారు తమ భాషలోకి చక్కగా ఇముడ్చుకొన్నారు.

ఇంతెందుకు! గొడ్డె గాని ఆవుగాని తుమ్మినప్పుడు ద్ త్ ౯ తే బ్ ౯ బ్ ౯ అన్న శబ్దము వినిపిస్తుంది. అందుచేతనే 'త్ర్బవ' అంటే పశువు అని అర్థం వచ్చినది. తెలుగుచంటిబిడ్డలు ఇప్పటికీ పశువులను

1. Algebra is a Zebra which makes the letudents 'gabhra'.

త్రుబ్బవ్వ లంటారు. బండిని తోలేవాళ్లు, అరకలను కట్టే వాళ్లు త్రుబ్బవ, త్రుబ్బవ అని తమ పశువులను ఎక్తారీ చేస్తారు. ఈ త్రుబ్బవ అన్నమాట ఎన్నివేలు, ఎన్నిపది వేలసంవత్సరముల క్రిందటనుంచీ వాడుకలో ఉన్నదో నిర్ణయించుటకు తగిన ఆధారములు దొరకలేదు గాని ఒక్కసంగతిమాత్రం చెప్పగలను. ఈజిప్టుదేశంలో ఇది ౫౦౦౦ (సుమారు) సంవత్సరములక్రిందట వాడుకలో ఉండెను అనడానికి తగిన ఆధారము ఉన్నది. ఆనాటి ఈజిప్టుప్రజలకు ఇది మామాట అని చెప్పుకోవడానికి ఎంత అధికారం ఉన్నదో ఆంధ్రులకు, ద్రావిడులకు కూడా ఆమాట తమదన్నీ అని చెప్పుకోడానికి అంత అధికారము కలదు అని చెప్పవచ్చును. పూర్వపు ఈజిప్టు వారు ఈధ్వనిని గ్రహించి, ఇది పశువులలోనూ, మనుష్యులలోనూ కూడా కనపడుతున్నది కాబట్టి ఈ సంగతి వెల్లడి చేయడానికి ఒక వింత ప్రాణిని కల్పించినారు. దీనికి గొర్రెతల మనిషిదేహము. అందుకే "త్రుబ్బవ్వట! బాబాతల" అన్న పద్యము. బాబా అని అరచేది గొర్రె. 'బాబాతల' అంటే "గొఱ్ఱెతల" అని అర్థం చెప్పవలసి ఉంటుంది ఈ రీతిని ఈ పద్యానికి అంతనూ విపరీతార్థం ఉన్నది. ఈ ప్రాణిని ఈజిప్టువారు దేవుడుగా భావించి పూజ చేసేవారు. ఈ దేవుడి పేరు ఖెన్‌ము. పశువు - మనిషి దేవుడు అని అర్థం చెప్పుకోవాలి. ఈ ఖెన్‌మ్ అన్న దానిని ఖెమన్ అనడంకూడా కద్దు. పర్లాకిమెడిపూర్వం పర్లాఖిమొండి. ఖెమన్ అన్నదే ఖిమొండి అయినది. మనమున్నూ తమిళులతో సహా "కనుము" నాడు (ఖెన్‌మ్) పశువులను పూజచేస్తున్నాము. ఈ మాటలో నుంచే "ఆవు" "గేద" దేవుడు మొదలైన మాటలన్నీ ఏర్పడ్డవి. ఇంగ్లీషు, మిగిలిన ఇతరభాషలలోను దీనినుండి ఏర్పడిన మాటలుకూడా ఉన్నవి. ఇంగ్లీషు కాఫ్, కౌ, కూ, బఫెలో (ఖేమన్‌ల్) క్యామెల్ గాడ్ సంస్కృతం కామధేనువు (ఖాన్‌మ్, ఖ్ |తే| న్‌మ్) గో, గాగు మొదలైనవి.

మహెంజోదారో భాషకున్నూ ఆంధ్రభాషకున్ను గల సంబంధం కొంచెము చూపించినాను. పురాతన ఈజిప్టు భాషకున్నూ ఆంధ్రమునకున్నూ కూడా సామాన్యత ఒక్కరవంత చూపించినాను. ఇట్టివి ఎన్నో సామ్యములు చూపించవచ్చును. ఇదివరకు మహెంజోదారోలిపిమీద నేను వ్రాసిన గ్రంథంలో వీటిని చాలా వరకు కనబరచినాను. ఇట్టి సందర్భంలో ఆంధ్ర భాషకు పదియవ శతాబ్దమునకు ముందు చరిత్ర లేనేలేదు అనే మహనీయుల మాటను ఎంత వరకు విశ్వసించవలసి ఉంటుందో చదువరులే గ్రహించగలరు. ఆంధ్రులకు లిపి ఇంతకుముందు ఉన్నదనడానికి మహెంజోదారోలిపి రుజువు. వారికి భాషా విషయకమైన ఉద్దేశములు, అభిప్రాయములు చాలా ప్రాచీనములైనవి ఉన్నవనడానికి ఈజిప్టుభాష రుజువు.

అక్ప్రమము (అకౢరం) అన్నమాట ఆంధ్రులది. అక్షరము ను అనుసరించి భాషను నేర్చుకొని, మాటలకు వ్యుత్పత్తిని కల్పించినవారు ఆంధ్రులు. భాషావిషయకమైన పరిశీలన ఇతరులకు నేర్పినవారు ఆంధ్రులు. ఈ అ |గ· |క| |త| |న! త్ ౬ త్ బ్ ౬ బ్ ౬ (అక్షుర అక్షరం) అన్నమాటే అగస్త్యర్; అగస్త్య మహాముని! ఈయనట తమిళులకు భాష నిచ్చి, వారికి, భాషను నేర్పినాడట! కాబట్టి ఆంధ్రులభాషకన్న తమిళుల భాషకు ఎక్కువ ప్రాచీనత లేదని ఇందువల్ల నిర్ణయము అవుతున్నది.

త్రుబ్బ అన్నధ్వనిని గురించి చెప్పవలసినంత మట్టుకు చెప్పియున్నాను గనుక ఇటుపైని ఇంకొక ధ్వనిని గూర్చి వివరిస్తాను. ఇదిన్నీ త్రుబ్బవ్వట బాబా పద్యంలో ఉన్నదే. లృబ్ళ లృబ్ళ అని దీనిని వ్రాయవలసి వస్తుంది. ఒక దానిక్రింద మరియొకటి వరుసగా వ్రాయడంగాని అచ్చొత్తించడంగాని చికాకుగా ఉంటుంది గనుక దీనిని ల్‌బ్‌ళ్ అనివ్రాస్తాను. ఇటుపైని దీని ఉచ్చారణ: నాలుకను బిరుసుగా చేసి పెదవులవద్ద ఏర్పడిన ద్వారమున, మధ్యంలో కండెవలె దానిని తొందరగా ఇటున్నూ, అటున్నూ ఆడించవలెను. ఒకమూలనుండి మరియొకమూలకు నాలుకను తిప్పేసరికి ఒక ల్‌బ్‌ళ్ అన్నధ్వని కలుగును. దీనికి అర్థం తెలియకుండా ఉన్న

వారున్నూ, ధ్వనిని వర్ణించలేని వారున్నూ, పలకలేని వారున్నూ దీనిని 'లోడబిడ' అంటారు. ఈ తెలుగు మాటకు వ్యుత్పత్తి ఇది. ఈ రాజధానికి కడుఉత్తర మున ఉన్న ఓఢ్రుల ఆడవాళ్లు దేవుని పూజ చేసేసమయంలో అందరూ చేరి ఈరీతిని ల్‌బ్‌ళ్ ల్‌బ్‌ళ్ అని ఉలాలు పోస్తారు. ఇదేరీతిగా తిరువాన్కూరు జిల్లాలో ఉన్న స్త్రీలుకూడా గర్భాధాన మహోత్సవమప్పుడున్నూ, మిగిలిన శుభకార్యములప్పుడును ఉలాలు పోస్తారు అని నామిత్రులు ఆదేశపువారు నాతో చెప్పియున్నారు. ఈ ధ్వనికి అనాదిని గూఢార్థం ఉన్నదని నా అనుమానం. పుట్టుగ, దానితో సంబంధించిన దైవములను ఆరాధనను చేయుచున్నప్పుడు వాడుక చేసేవారు అని అనుకుంటాను. ఇంగ్లీషులో దీనికి "ఫ్యాలిక్" అన్నమాట వాడుతారు. శాసనమును బోధపరచుకోవడమునకు తగినంత వివరణను ముందు ఇచ్చియున్నాను కాబట్టి ఇటుపైని శాసనమునకు అర్థం వివరిస్తాను. విదితమస్తు = తెలియుగాక !

వః + అస్మాభిః అని చెప్పవచ్చును.

౧. స్వస్తి, (స్వస్త.) దీనికి అర్థంసు + అస్తిఅని విరిచిచెప్పుతారు. కాని ఇది |స| |వ| |న| న|.| మామూలు గుర్తులలో దీనిని వ్రాయవలెనంటే సంవ్ న్ స్ త్ అని అవుతుంది. ఇది రానురాను ఆంధ్రంలో అయితేనేమి, సంస్కృతంలో అయితేనేమి అజంతంగా ఏర్పడినది. కడవరి అచ్చు ఇ, అ, ఉగా ఉన్నమాటలు అనేకములైనవి దీనినుండి ఏర్పడ్డవి. వానిలో కొన్ని ఇక్కడ ఇస్తాను: స్వస్తి, సమస్త, సామంత, శ్రీరస్తు మొదలైనవి. ప్రస్తుతం కడవరి అచ్చు ఏమైనా శ్రీరస్తు అని అర్థం చెప్పవలసి ఉంటుంది.

౨, 3. ప్రిథీవి (ప్రిథివి) పల్లవపట్టనబున. ప్రి అనేదానిని ప్ ర్ అనిగాని |ప| |న| అనిగాని పలకవలసి ఉంటుంది. రాపిడిలేని హల్లులుగా ఉన్నప్పుడు |ర| ను గాని |న| ను గాని ఉచ్చారణలో వ్యత్యాసం ఏమిన్నీ లేదు. ఈధ్వనే ముక్కు – నోటిధ్వనిగా ఉచ్చరిస్తే తెలుగువారి అర్ధానుస్వార అవుతుంది. |ప| |న| అని వ్రాయుటకు మారుగా |ప|ఁ అని వ్రాయవచ్చును గాని అట్లు వ్రాస్తే ఈగుర్తు అంగుడు ధ్వనులకున్నూ, పెదవి ధ్వనులకున్నూ వర్తించదని యోచించి, అన్నిటికీ వర్తించే గుర్తు (అక్షరానికి రెండుప్రక్కలను గీతలు) ఉపయోగించినాను.

కడవరి "వి" అనేధ్వనిని |వ| అని నోటి-ముక్కు ధ్వనిగా పలుకవలెను. రాపిడిలేని హల్లుకాబట్టి దీనిని సగందీర్ఘంగా పలుకవలెను. దీనికి ముందుగా ఉన్న అచ్చుకూడా, అసలు హ్రస్వమైనా, సగందీర్ఘం అబ్బుతుంది. ప్రిధీవిఅని వ్రాసినా ప్రిథివి అని వ్రాసినా మధ్య ఇకారం సగం దీర్ఘంగా పలుకవలెను.

పల్లవ. దీనిని |ప| |న| |వ| అని పలుకవలెను; ఇంచుమించుగా ఫల్‌న్ం – మొదటి 'ఫ' ఇంగ్లీషు 'ఎఫ్' వలె పలకవలెను.

ప్రిధీవి (ప్రిదివి) పల్లవ = |ప| |న| దే |ప| |న| |వ| = పర్ న్ దే |ప| లం = పరదేవలం. భూదేవలం, బృందావనం అని ఈనాటి తెనుగున్వనులతో చదువవలెను. దేవలం, దేవళం అంటే దేవాలయముగదా 'పర' ఏమిటి అని ప్రశ్న- చూడండి త్యాగరాయకృతి: అంబపరదేవతే, పేరిందేవి, భూదేవి. ఈ |ప| |న| అన్నదానిలోనుంచే, పరదేవతలో పర పేరిందేవిలో పేరిం, భూదేవిలో భూ, పార్వతిలో మొదటి పార్ అన్నవి పుట్టినవి. అన్నిటికీ పార్వతి అనిగాని, అంబ అనిగాని, భూమి అనిగాని అర్థంచెప్పవచ్చును. పృథివి వ్యుత్పత్తి ఇదే. బృందావనం అన్నమాట మనకు అందరకు తెలిసినదే.

అయితే 'ప్రిదివి పల్లవ' లేక పర్ దేఫలం అన్నమాటలలో ఒకచిత్రం ఉన్నది. ఆంధ్రలిపిలో దీనిని మొదట వ్రాసినప్పుడు పర్ అన్నదానికి ఒక్క అక్షరమున్నూ, దేఫలం అన్నదానికి అంతటకీ ఒక్క అక్షరమున్నూ వ్రాసియుండియుందురు. మహెంజొదారోలిపిలో ఇదేసంప్రదాయము. ఈ వ్రాతవ్రాయవలసివచ్చినప్పుడు కుడినుంచి ఎడమకు వ్రాయడం పురాతన ఆచారం; ఇది అన్ని వ్రాయగల భావలకున్నూ

సామాన్యమే. ఇటీవల మార్పుజరిగి ఎడమనుంచి కుడి వైపునకు వ్రాయడం ఆరీతినే చదవడం వాడుకలోనికి వచ్చినది చాలాభాషలలో. ఈ శాసనం వ్రాసినవానికే గాక మహెంజొదారోహరప్పలిపి కాలంనాటికే ఎటు నుంచి ఎటుచదవడం అన్న సందర్భం కలిగినట్టు కనిపిస్తుంది. ఇదిగాక వ్యతిరేకభావాలను వ్యతిరేకంగా ఉన్నధ్వనులచేత వెల్లడిచేయడం, ఈ రెండు వ్యతిరేకపు ధ్వనులను ఒక్కొ వ్రాతగా వ్రాయడం, కుడినుండి ఎడమ వైపుకు చదివితే ఒకభావము అయి ఎడమనుండి కుడి వైపునకు చదివితే వ్యతిరేకభావము స్ఫురించడం వాడుకలోనికి వచ్చినది, అన్ని భాషలలోనున్నూ. ఈ రీతిని మహెంజొదారోలిపిలో వ్రాసిన మాటలను నేను చాలా చూపించినాను.

కాబట్టి ఈ శాసనం వ్రాసినవానికి ఈ విషయం పూర్ణంగా తెలుసునని నా నమ్మకం. ఈ మీద వివరించిన అలవాటును అనుసరించి రెండు అక్షరములలో వ్రాసియున్న ఈ ప్రిథివిపల్లవ అన్న మాటను, ఇదివరకు చదివిన దిక్కునకు వ్యతిరేకంగా చదివితే అది దే|ప|ల |క|న అని చదువవలెను. దీని ఉచ్చారణ ఇంచుమించుగా దెఫలెం ఫ (ప్వ) ర్ అని ఉంటుంది. ఇదే ఈనాటి ధవళేశ్వరం. ధవళేశ్వరం అంటే తెల్లని శివుడు; రుద్రుడు ఎర్రగా ఉంటాడు. . చెన్నపట్నంలోను దక్షిణాది లోను బూడిదెగుమ్మడికాయకు గౌరవము. ఆకారం శివుని ఆకారం, తెల్లగా ఉంటుంది. ఈ తెల్లని శివుడు పుట్టుగదేవుడు; ఫ్యాలిక్ అర్థం ఇవ్వవలసివస్తుందని నా అనుమానం.

ఇంకొక చిత్రం. ఈ వ్రాతను ఒకవేపునుంచి చదివితే పార్వతిపరమైనట్టిగాని భూదేవిపరమైనట్టిగాని అర్థం స్ఫురించినది. అటునుంచి ఇటు చదివితే ఈశ్వర పరమైన అర్థమైనది. ఈశ్వరుడ్ని ఒకవేపునుంచి చూస్తే పార్వతి, రెండవప్రక్కనుంచి చూస్తే శివుడు. ఇది అర్ధనారీశ్వరం అన్న అభిప్రాయము ఈ వ్రాతలో ఇమిడియున్నది.

పట్టనబున ఈ శాసనకాలం నాటికి 'బు' అనే అక్షరమును మ|.| అని పలికియుండవలెను. ఏభాషలో నైనా 'మ' ముందర పుట్టినది; 'బ' తరువాత. మ|.| అంటే పేలుడులేని అడ్డుధ్వని. దీనిని ంబ్ప్ అనిగాని ంబ్ అనిగాని లేదా ంప్ అనిగాని పలికియుండవలెను. ఇట్టివి మహెంజొదారోలిపిలో ఎన్నో ఉన్నవి. ఇక్కడ 'బు' అన్నదానిని '.బు' అనిగాని 'ంము' అనిగాని పఠకవలెను. పట్టనబున=పట్టనంబున, పట్టన మ్మన అని ఈ నాటి వ్రాత, దానిని చదువుట.

|ప| ర్ అన్నదానిలో కడవరి 'ర' ను ర|.|గా పలికితే అది పర్ట్, అనిగాని |ప| ట్ట్ అనిగాని వినబడుతుంది. దే|ప| లం అన్నదానిలో కడవరి ధ్వనిని (అనగా ఇక్కడ సున్నగా వ్రాసిన |వ| ను వ|.|గా పలికితే, దే|ప| ల బ్ లేక దే|ప| నబ్ అని వినబడు తుంది. |ప|ర్ + దే|ప|లం అని ఈ రెంటినీ కలిపితే |ప|ట్ దే|ప|లబ్ అని మారుతుంది. దే|ఫ|లంలో |ప| అన్నది రాపిడి గలిగి, తెరిచియున్న హల్లు కాబట్టి రానురాను అది అచ్చుక్రింద మారిపోయినట్టు కనిపిస్తుంది. అందువల్ల ఈమాట పట్ దేలబ్ లేక పట్ దేనబ్ అని ఏర్పడ్డది. ఈ మాటనే ఈనాడు మనము పట్టనము, పట్టణము అని ఉచ్చరిస్తున్నాము. పట్టనము పత్తనము అన్నమాటలు ఆంధ్రంగాని సంస్కృతంకాదు. ఇట్లే వరము, పురము, నగరము, పూడి మొదలైనవి. ప్రిథివిపల్లవ అన్నదానిని వెనకనుంచి చదివితే ధవళేశ్వరం అన్నమాట అయినట్లు |ప|ట్ దె |ప|లబ్ అన్నదానిని కూడా తలక్రిందులా చదివితే దే |ప|లబ్ |ప|ట్ అవుతుంది. ఇది ఈనాటి తెలుగులో దేవ లపు పెట్టె అవుతుంది. దీనికి అర్థం దేవుడుపెట్టె అని గాని దేవతార్చనపెట్టె అనిగాని చెప్పవలెను. ఒకవేపు చదివితే ఆంధ్రంమాట, దానికి వ్యతిరేకంగా చదివితే తెలుగుమాట కావడం మహెంజొదారోలిపిలో కొన్ని చూచినాను. ఆంధ్రులు అ|గ||క||న||త|ల్ ఎ త్ బ్ ఎ బ్ ఎ వారు అయితే తెలుగువారు |త|ల్ ఎ త్ బ్ ఎ బ్ ఎ |న| |క||గ|అ అనేవారు. అందుచేతనే వారు త్ బ్ ఎ న్ గ్ అ లేక తెనుగువారు లేక తమిళ్ తుర్క్ ద్రవిడ మొదలైన వారు.ఆంధ్రులకు తెలుగువారికిగల సంబంధం ఇది. ఆంధ్రము, తెనుగు, తమిళము, తుర్కిష్‌భాషలు ఒకదానిని పోలి

మరియొకటి ఉన్నది. ప్రిధీవిపల్లవపట్టనంబున = బృందావనపట్టనంబున, లేక భూదేవిపట్టనంబున అని తీసుకుంటే సరిపోతుంది. రెండువాడల వూరు, ప్రిథివి ఒక వాడ, పల్లంపట్నం ఇంకొకటి.

౮. ఊరివారు. ఈ మాటలో మొదటిధ్వని |ꭗ|గా పలకవలెను. ఈ శాసనకాలంనాటికి ఈ "ఊ"అనే అక్షరం |ꭗ| అనిన్నీ "ఉ" అనిన్నీకూడా పలికేటట్లు కనిపిస్తుంది. ఈదీర్ఘం నిండుదీర్ఘం కాదు; సగందీర్ఘం. ఊరివారుఅంటే గుడివారు అని అర్థంలాగు కనిపిస్తుంది. ఈ'ఊరి'తో సంబంధించిన మాటలు కొన్ని: గూడు, ఊరు; తమిళం. వీడు (వూడు, ఇల్లు) విడిది, గుడి మొదలైనవి. ఊరు అంటే ఇండ్ల సముదాయము. మొదట బహువచనము వూరు అని ఉండేది, దీనికి ఏకవచనం 'వూడు'. ఊరివారు ఇంకొక అర్థం. |ꭗ||న|వా|రు. ఇదే అన్మ్‌వారు లేక అమ్మోరు, అమ్మవారు లేక అమ్మన్ గ్రామదేవత అని అర్థం. మూడవఅర్థం: కూర్మన్. దీనిలోనుంచే కరిగళ్ అన్నమాట వచ్చినది. తాబేలుకు చిన్నకళ్లు, నడక అతి మెల్లన. ఏనుగుకుకూడాను. ఈమాట కూర్మన్ అన్నరూపంలో ఉన్నప్పుడు, తాబేలుఅనిన్నీ కరిగళ్ అన్న రూపంలో ఉన్నప్పుడు ఏనుగఅనిన్నీ రూఢమైనవి. (చూ. గునవన)

౯ కరిగళ్లవడవరికి. ఇక్కడ 'వ' ఇదివరకు వలెనే |వ|గా పలుకవలెను. |వ|కు బదులుగా ం వ్రాస్తే ఇంచుమించుగా అదేధ్వని అవుతుంది. కరిగళ్లవడవరికి = కరిగళ్లంవ్ డంవ్‌రికి = కరిగళ్ల ఆండోళికి లేక గరిగళ్ల ఆండవరికి.

ఆనడవరికి అంటే అర్థం తేల్చినాను. కరిగళ్ అంటే ఏమిటి అని ప్రశ్న. ఏనుగవారు, ఏనుగగారు, లేకుంటే వినాయకుడు కావచ్చును. ఏనుగ అంటేనే బాగుంటుందని నా అభిప్రాయము. సర్ జాన్ మార్షలు గారు వ్రాసిన గ్రంథంలో మూహెవదర్వామునందుగల కొన్ని పేజీలనిండా ఏనుగుబొమ్మలే. ఏనుగు దైవం. అందుచేత అది పవిత్రమైనది. కాబట్టి దైవసమానులైన రాజులవద్ద, స్వాములవారివద్ద, కోవెలలోను ఉంటుంది ఈ ఏనుగు. కరిగళ్ అన్నమాటలో గళ్ అన్నది ద్రావిడ బహువచన ప్రత్యయము; గౌరవార్థం ఇక్కడ ఉపయోగించినారు. కరిగళ్ అనే మాటతో సంబంధించిన మాటలు: కరికాలచోడుడు, కారికల్ (గ్రామనామము). కరివళంవందనల్లూరు (దక్షిణాదలో గ్రామనామము) వెయిగళ్లతల్లి. గరగలు అమ్మవారు. గరగలు (అమ్మవారుగుళ్లో వ డుతారు). కరివళంవందనల్లూరు-కరిగళ్ + ంవ్ -ంద్ న్ + అల్లూరు = కరిగళ్ ఆంద్ ర్ + అల్లూరు.

కరిగళ్ ఆంద్ ర్ అన్నది కరిగళ్ ఆండోర్. కరిగళ్ అన్నది పురాతనపు భాషలో|–గే | న్ర | గళ్ అయి ఉండవలెను. ఏనుగ ఘీంపెట్టును, ఘీంకారము చేయును అని మనకు తెలుసును. ఘీం అనిగాని ఘేం అనిగానిశబ్దముచేసే జంతువుకు తెలుగుపేరు | గే || ని | (ఘేం). |గే| అనేది రాపిడిలేక ద్వారము తెరిచియున్న హల్లు. కాబట్టి అచ్చుగామారితే 'ఏ' అవుతుంది; హల్లుగా మారితే 'గే' అవుతుంది. గేద అరుపుకూడా ఇంచుమించుగా ఇల్లే ఉంటుంది కాబట్టి దీనిని గేద అన్నారు దానిని ఏనుగు అన్నారు. అరవం: ఆనై. తెలుగులో ఏనుగకు పురాతనపుపేరు | గే | ని | ఈ రెండు అక్షరములతో సంబంధించిన అచ్చులున్నూ దుర్ధ్వనులే గనుక రాను రాను ఇది 'వేయి' అయినది. గళ్ అన్నది కళ్లక్రింద మార్చి చూచుటకు నిర్ణయించిన ఇంద్రియములు అని అర్థం చెప్పినారు. కాబట్టి | గే || ని | గళ్ అన్నది ఒకమార్గంగా కరిగళ్ అనిన్నీ, ఇంకొకమార్గంగా వేయికళ్లు అనిన్నీ అయినది. కరిగళ్ అనేది అమ్మవారు అయితే అమ్మవారు వేయిగళ్లతల్లి అవుతుంది. అమ్మవారు వేయిగళ్లతల్లి అనిన్నీ ప్రజలనందరినీ తన వేయికన్నులతోనూ చూచి కాస్తుందనీ తెలుగువారి నమ్మకం.

ఆండవర్-అన్నదానితో సంబంధించిన మాట: ఆడవారు, ఆడవాళ్లు. అసలు ఆండవర్ అంటే "ఆదివారు" అని అర్థం. అందుకే స్త్రీ ఆదిశక్తి. ఆదిశక్తి మొదటిది అనుటకు కారణము.

ఊరివారు కరిగళ్లవడవరికి = అమ్మోరు కరిగళ్ ఆండవరికి అని అర్థం చెపితే సరిపోతుంది.

౬. ఊరిస్వామిల్. ఊరి యజమానులు పెద్ద తనం చేసేవారు. కడివరి 'ళ్' గౌరవసూచకమైన బహు వచన ప్రత్యయము. 'స్వామి' అన్నది పురాతనంగా |శి||న||వ| అని ఉండేది. దీనికి 'శిర' అని అర్థం. స్వాములు అంటే తలవారు, పెద్దలు, యజమానులు అని భావం.

౭. ఇచ్చిన

౮. స్తితి. ఆయన స్తితిపరుడేనా అని అడుగు తాము. అస్తి ఉన్నదా అని అర్థము.

౯, ౧౦. రెండు (రెణ్డు) వాడల పట్టనావురకు.

వాడలు = ఓరలు. ఈనాటి తెలుగులో వారలు. రోడ్డుకు రెండు వారలను ఉన్న ఇండ్లలోనివారు.

పట్టనావురకు = పట్టనంవంరకు = పట్టనంవారికి

౧౧. అరియుడగు = అరియుడు (కృదంతము) + అగు = తెలుపుడు అయ్యే

౧౨. తెఱెయు. ఈమాటలోని అచ్చులన్నీ దుర్ధ్వనులు. కాబట్టి తెరగు అనేమాటలోని కడవరి 'గు', దుర్ధ్వనితో కూడడంవల్ల 'యు' గా మారినట్లు కనిపిస్తుంది. ఇదే సరి అయితే తెఱెయు అంటే తెరగు అని అర్థం చెప్పవలెను

౧౩. సిద్ధాయబు = సిద్దాయంబు = సిద్ధంబు. ద్విరుక్తధకారముమీద ఉన్న "ఆ" కారమున్నూ తరు వాత వ్రాసిన "యు" కారమున్నూ ఒక్కటిగా పలుక వలెను. తాటాకులో మధ్య అకారము, శెమ్మలో కడపటి అకారము ఎట్లు పలుకవలెనో అట్లే ఈ'అయ' ని పలుకవలెను. ఇట్లే 'తామస మ్యలనే' అని వ్రాస్తే, 'అ' క్రింద గూవడి వ్రాసినట్లు; ఈ రెండు చేరితే, 'ఎ' కాకుండా 'ఆ' కాకుండా పలుకవలెనని తెలియజేస్తుంది. ఇది ఒక వ్రాతసౌకర్యము. ఈ 'సిద్దా యంబు' అన్నదానిని సిద్ధ్యంబు అని వ్రాసినట్లు.

ఈ 'సిద్ధంబు' ఏమిటి? తెలుగు శాసనములలో స్వస్తి అని మొదలుపెడితే, బౌద్ధశాసనములు సిద్ధ అన్న మాటతో మొదలుపెట్టుతవి. ఈ సిద్ధ అన్నదానిలో ధ ౬ వ స్థానమునకు అనుగుణ్యమైన "ర" కారము. శిధ అని వ్రాసి చదివితే ఏలాగున వినిపిస్తుందో ఇంచుమిం చుగా దానిని అలాగున పలుకవలెను. 'శిర' అన్న మాటనే ఒకజాతివారు శిధ్ర అని పలికేవారు.

శిరస్సు, దానియందలి భాగములున్నూ ప్రతిభా వములోనున్న అక్షరముల ఉత్పత్తికి కారణభూతములు అయినవి కాబట్టి వ్రాసిన శాసనమునకు ముందు శిరస్సు, శ్రీరస్తు, స్వస్తి అని వ్రాయడం శుభసూచకంగా ఏర్ప డ్డది. శిరస్సు అన్నమాటకు సమానమైన పురాతనపు మాట శి|న|వ|ళ్| (శిరః) దీనినుండే సం, సుం, శివ, శిర, శిగ, సిగ, శిల, శిత, సిద్ధ అన్న ప్రత్యయ ములు, మాటలు ఏర్పడ్డవి. సంస్కృతంలో సంః అన్నది ఇదే. ప్రతిభావములోను వందలకొలది మాటలు దీనిలో నుంచి పుట్టినవి ఉంటవి. ఓనమాలలోని సిద్ధం కూడా ఇదే. స్వస్తికి సిద్ధకు అర్థంలో హెచ్చుతగ్గు లేదు. ఉచ్చారణలో మాత్రమే ఉన్నది.

౧౪. దస్తు (దణ్డు) = దస్తుగ = పన్ను

౧౫. దసపరాధబును = దశ అపరాధంబును. పండినపంటలో పదియవవంతు ఏలికకు ఇవ్వుట.

౧౬. సవ్వ బాదపరియారువు = సర్వబాధ పరిహారం చ్ =సర్వబాధపరిహారంగానున్నూ అనిఅర్థం. యా = హ్యా = హ్ అ్య అని పలకవలెను.

౧౭, ౧౮, ౧౯. ఊరు దాయసెసి ఇచ్చి = ఊరు దయచేసి ఇచ్చి = ఊరు దయచేసి ఇచ్చిరి. ఇచ్చి అనే శాసనంలో ఉంటే, 'చ్చి' అనేదానిని సిద్ధ అన్నమాటలో 'ధ' ను ధ్ర అన్నట్లు ఎట్లు పలుక వలెనో అట్లే 'చ్చి' అన్నదానిని 'చ్చ్రి' గా పలకవ లెను. ధ, ధ, చ, అనేధ్వనులు మూడున్నూ ౬ వ స్థాన మునకు చేరిన ధ్వనులు; ఇప్పుడు అడ్డుధ్వనులు- శాసన కాలమునాటికిన్ని అంతకుముందున్నూ అవి త్రిల్లులు.

అందుచేత 'చ్చి'ని 'ఱ్చ్చి' క్రింద చదువవలెను. అ | గ ॥ క ॥ న ॥ త ॥ త్ ఱ త్ ట్ ఱ ట్ ఱ అన్న దానిలో |క| త్ ఱ అని ఉన్నది చిత్తగించండి. అందుచేత అస్థానంలో ఉన్న హల్లులను ఱ్ఱిల్లులుగా పలికేవారు అని చెప్పటకు నాకు అవకాశం కలిగినది.

దాయసెసి. దయన్ + చేసి=దయను పట్టి అని అర్థం కావాలి. అయితే ఈ అర్థం "ద" కారముమీద ఆకారము ఎందుకు ఉండవలెనో చెప్పలేదు. దీనికి రెండు కారణములు ఉండవచ్చును. పురాతన శాసనలలో రాపిడిలేకగాని రాపిడిగలిగిగాని ఉన్న తెరచినహల్లులు ఎప్పుడున్ను సగముదీర్ఘములు. ఇట్టివి రెండు ఒకదాని వెంట ఒకటి రాగానే రెండు సగముదీర్ఘములు ఒక నిండుదీర్ఘముగా వినబడును. 'దాయ' అన్నమాటలో 'య' పురాతనంగా రాపిడిలేని హల్లు. కాబట్టి 'ద' మీద హల్లు, దీర్ఘంగా మారినట్టు కనిపిస్తుంది పురాతనంగా ఈ మాట |ద| |న| |వ| అని ఉండవలెను. ఈ ధ్వనులను దుర్ధ్వనులుగా పలికినప్పుడు, దాయెం దాయ అవుతుంది. | వ | గాని | వు | గాని 'యు'గా మారుట ఇదివరకు మనకు ౧౨ వ మాటలో కనబడ్డది. తెరెయు—తెరగు. కాబట్టి 'దాయ' అన్నది "దానము" అన్న సద్ధ్వనుల మాటకు సరియైన దుర్ధ్వనుల పదము. దాయ = దఙ్య నఙ్య. దాయసేసి అంటే దానంచేసి అని అర్థం చెప్పితే బాగుంటుంది. రానురాను ఈ అర్థమును మరిచిపోయి 'దయచేసినారు' ఇచ్చినారు అనిన్నీ, వచ్చినారు అనిన్నీ అర్థములు తేలినవి.

౨౦. దినికి-ఈ ఈనికి. కడపటి 'కి'ని ఊదిపలకవలెను. దినికి + ఎ = దినికి. ఇకారమును కొంచెంగా 'ఎ' వలె పలకవలెను.

౨౧. వక్రబుం (వక్రంబు) వక్రబుం=వక్రంబుం. 'బు' అన్నది 'ంబు'గా చదువవలెనని చెప్పియున్నాను (చూ. పట్టనబున). దినికి వ్రకంబుంలేదు. అనగా దీనికి ఏ వక్రమున్నూ (అడ్డున్నూ) లేదు అని అర్థము.

౨౨. లేదు = ఇల్ల్ అదు = లేనిది అయినది. జమిలి లకారధ్వని ఇక్కడ 'ళ'గా మారినది. దీని మీది అచ్చు సగందీర్ఘం.

౨౩. వచ్చినవారు. దీనిని వ్రచ్చినవారు అని పలుకవలెను (చూ. ఇచ్చి. ౧౯) వక్ర నామవాచకము. వ్రకు క్రియ. ఇదే వ్రచ్చి అని మారినది. వ్రచ్చినవారు- అడ్డుపెట్టినవారు.

౨౪. గళరెని = గలరేని.

౨౫, ౨౬, ౨౭ ఉరి (ఊరి) స్థితివప్పినవారు. ఉరి = జీవుడు, ప్రాణము. తెనుగు. ఉసురు, తమిళం. ఉయిర్. తెనుగు. ఊపిరి (ఊ |ప్రి| రి) పురాతనులకు ఊపిరే ప్రాణం. అది లేనివాడు "చచ్చినవాడు" అని అర్థం. "ఉరి' అన్నపాఠంకంటె 'ఊరి' అంటే బాగుంటుంది. ఊరిస్తితిదప్పినవారు = ప్రాణములు పోయినవారు. ఇదిశాపము. ఉరితీయు = ప్రాణంతీయు

౨౮, ౨౯, ౩౦, ౩౧. దినికి వక్రబుం (వక్రంబు) వచ్చినగచ్చురు = దీనికి ఏ వక్రంబు వ్రచ్చినా, దీనికి ఎట్టివక్రమును చేసినా వారు, గచ్చు. చూ (ఇచ్చి ౧౯) వచ్చిన అన్నది 'వ్రచ్చినా' అని అర్థంచెప్పినాము. కాబట్టి అది 'వచ్చిన' గచ్చురు = వచ్చినన్ + కచ్చు అని విడదీయవలెను. ఇది |క| చ్చు అన్నమాటనే ఈ లాగున వ్రాసినారనుకొంటాను |క| అన్నది దుర్ధ్వనిగా పలికితే చచ్చు, చస్తుగు, చత్తుగు అవుతుంది, ఇదీ శాపమే. తెనుగుజిల్లాలలో రాజులు మాంసమును ఈ పేరుపెట్టి పిలతురు. వారు అనేకులు, అనేకసార్లు దీనిని 'గాదరు' అనడం విన్నాను. గాదరు అనగా చచ్చిన జంతువుయొక్క మాంసము. (కెత్)

౩౪. ఎలెమువరు (ఎలెవురగు) = ఏలేవారు. ఇది ఎలెంబరు = ఏలేవారు; రెండువాడలను ఏలేవారు, గ్రామపెత్తనదారులు.

౩౫. లెముల = లేములను. ఇది కలిమికి వ్యతిరేకమైన మాటగాకనిపిస్తుంది. ఒకరికి ఆస్తి ఇస్తే వారికి కలిమి అయినట్లు, ఉన్న ఆస్తిని తీసుకుంటే వారికి లేమి

అవుతుంది. కాబట్టి లేములు, అంటే జరిమానా అని గాని ఆస్తిని లాగుకోవడం అనిగాని అర్థం చెప్పవచ్చును.

౩౬. వెసినదియుం = వేసినదిన్నీ, వేయడమున్నూ.

౩౭. చన్నా = చనును.

అట్టివారికి రెండువాడల పెత్తనదారులున్నూ చేరి జరిమానాలను గాని శిక్షలనుగాని వేయడమున్నూ కూడును.

౩౮. విరిపయి = వీరిపైని.

౩౯. నాదువరు గల్గిన, నాదుంరు = నాదారు = హీనము. తెనుగు. నాదారు బక్కాలు = తక్కువ స్థితి పశువులు. నాదువరు గల్గిన = హీనమైన.

౪౦, ౪౧. ఎలెమలు (ఎళెముళ్) చెసిన = ఏలెములను, ఏలికలను, ఏలుబడులను చేసినను.

౪౨. సెయుడుసను = చేయుట (చేయడం) చనును = కూడును.

౪౩. మహానబియుళ్ = మహనమ్బ్యిళు = మహానంబులు (బి = ంబి) పురాతనంగా ఈ'నంబి' అన్న మాట నత్ బ్ (చూ. అక్షరము). నత్ బ్ క్ = నమ్ త్ బ్ క్. దీనిలోనుంచే నంబూద్రి అన్నమాట వచ్చినది. ఇది మళయాళ దేశంలో బ్రాహ్మణులకు పేరు. తెలుగు దేశంలో 'నంబి' అనిన్నీ 'నంది' అనిన్నీ రెండుమాటలు ఏర్పడ్డవి. నంబి, నంది ఈశ్వరునికి గల సంబంధం అందరికీ తెలుసును.

౪౪. నరాళోక. = నర + అళ్ + లోక = నరవాళ్ల లోక = నరలోక.

౪౫. మహాసద్దవుళ్ = మహాసత్త్వులు (సత్తవుళ్)

౪౬. విరాపవ = ంవరా |ప|ం = వరాహం అంగాని వృషభం అనిగాని అర్థం చెప్పవచ్చును. ఈ రెండింటికి గల సంబంధం విపులంగా మహెంజోదారో-హరప్పలిపిమీద నేను వ్రాసిన గ్రంథంలో చర్చించినాను. ఇక్కడ వీరు నంబులుకాబట్టి వృషభం అని అర్థంచెపితే బాగుంటుంది. వరాహం అన్నమాటను కొందరు వెలమ, వరమ అని పలికేవారు వీరే. వెలమలు వీరికే వర్మఅన్న బిరుదు.

౪౭. మహానబియుళ్ = మహానంబులును. ౪౬= ౪౭ = వృషభమహానంబులను.

౪౮. గజ్నబు (గఙ్ఞబు), వ్రాస్ని = వ్రాసిన, రవ్నా = రవానా, స్వ = సం అన్నట్టు జ్న = జన్, ఙ్ఞ = జఙ్. గజ్నబు = గజంబు (ఏనుగ) గఙ్ఞబు = గజెంబు (ఇది దుర్ధ్వనిగా పలికితే వచ్చేమాట). ఇది వరకు ఏనుగ ఘీంకరించేది గనుక పురాతన భాషలో దానికి |గె| |న్| అని పేరు ఉంటుంది అని చెప్పినాను. జీ |వ| |వ| అనగా జీవ్ అని అర్థము. ఈ రెండింటినీ చేరిస్తే |గె| |నె| |జీ| |వ||వ|అవుతుంది. ఈమాటనే మనము ఇప్పుడు గజం, గెజెం అని పలుకుతున్నాము. అనగా గీం అని పలికే జీవుడు అన్న అర్థం. జీ |వ| |వ| అన్న దానిలోనుంచిజీవ, జన్మ, శివ, శిగ, శిర, చీమ మొదలైనవి ఎన్నోవందలు మాటలు పుట్టినవి. అప్పొజీ, ఇదర్ ఆవ్ జీ, డియర్ సర్ అనే వాట్లలో జీ, సర్ అన్నవాట్లకు జీవ అనే అర్థం, లేకుంటే 'శిర' అర్థం. జీవుడు శిరస్సులో ఉందని పురాతనపు మనుష్యుల నమ్మకం.

౪౯. సెఱ ([సె] ఱ్ల) = ఱ్ల అన్నది ఉంటుందని నానమ్మకం. చూ (౮౧. పూట) దీనిని పలకడం మాత్రం ఒక స్థానం ట్రిల్లుగా పలకవలెను. (చూ. ౩౦) అది ఇంచుమించుగా సెఝ్ర్ల అని చదువవలెను. సెఱ్ల = సెంతను (చెంతను) చేరువను అని అర్థం.

౫౦. నదుపుళ్ (నడుపుళ్) న|.|ద్బుళ్ నంద్బుళ్ = నంబులు. ౫౧, ౫౨, ౫౩, ౫౪, ౫౫ కమస్త భువన శ్రీశ్రీ యకనసరజు బద్రపెరెయ. సమస్త 'స' అనడానికి బదులు 'క' వ్రాసినారు (చూ. ౧. ) భువన; శ్రీశ్రీ. అకనది = అఖండ, రజు = రాజ, బద్రపెరెయ= మెంద్రపురము లేక వరమ. పెరెయ అన్నదాని ధ్వనులన్నీ దుర్ధ్వనులు. అకనది రజు బద్రపెరెయ = అఖండ రాజమెంద్రవెరము (చూ. ౧౧, ౧౨ పే) అఖండ

గోదావరి అన్నమాటకు వాస్తవమైన అర్థం ఇందులో తేలినది. ఇది ఆంధ్రంమాట. సంస్కృతంకాదు. పెరెయ అన్నదానిలో నుంచే పల్లెయ, పల్లె అన్నమాటలు వచ్చినవి. (చూ. ౪) పెద్దపరియ (గ్రామనామం)

౫౯. ఊరిపని |గ| గూర్మని = కూర్మని ఇది ఇంటిపేరులాగు కనిపిస్తుంది.

౫౭. న్రవసివరవయ్యోతి = నరసింహంయ్యోతి = నరసింహరామయతి. 'య్యోతి'లో యను నాదరహితంగా పలికేవారు కొంతమంది, కడవరి 'తి' ని త్ ఇ అని పలికేవారు కొందరు ఉండేవారు. 'య'ను నాదరహితంగా చేస్తే శ, అని గాని, స అని గాని వినిపిస్తుంది. య్యోతి = శెత్తి (శెట్టి, సెటి) అవుతుంది. వీరే చెట్టివారు. య్యోతి = శెత్తిరి (చూ. ౧౯) అని చదివేవారు శ్రెతి, ఛెత్రి, క్షత్రియు లవుతారు.

య్యోతి = సుత్ ద్ ర్ అని పలికేవారు శూద్రులవుతారు. వరాహం అన్నమాటను |బ్రా| హ్ |వ| అని పలికేవారు బ్రాహ్మలు. (చూ. ౪౬)

౪౩ - ౫౭. వరకూ అర్థం. మహానంబులు, నరలోక మహాసత్వులు, వృషభ (బ్రాహ్మ, మహానంబులు, గజంబు (కరిగళ్) చేరువునున్న సాధువులు, సమస్త భువన శ్రీశ్రీ అఖండ రాజమహేంద్రవరం కూర్మని నరసింహారాంయ్యోతి (యతి, ఛెత్రి, చెట్టి, సూద్ర). నంబులు కాబట్టి బ్రాహ్మలు అని అనుకుంటే ఈ మాటను 'యతి' అని చదువవలెను.

౫౮. మాహనబిళ్ (మాహనబిళ్) వయ్యోతి = మోహనంబిలంయతి.

౫౯. మహాభిళ్ పనికొలుచె = మొహంబిళ్ |వ| |హన్| త్ర్ = మోహన్ బ్ ళ్ మహన్ త్. = మోహనంబిళ్ మహంతు.

౬౦, ౬౧ నెరకపఞ్చి = నెర |క| పఞ్ త్ర్ = నెరసపంత్ = నరసపంత్.

౬౨. న్రవసి వయ్యోతి = నరసింయ్యోతి = నరసింహయతి.

౬౩, ౬౪, ౬౫, ౬౬, ౬౭, ౬౮, ౬౯, ౭౦, ౭౧, ౭౨, ౭౩, ౭౪. మహనబి (భి) యుళ్, సకల కొన్థు (స్త్రు) కళ్, సవ్వలోక్శ్రియ మహాసద్ద (ద్ధ) వళ్ పెద్దళ్, నెరవద్యమహాసద్ధ (ద్ధ) వళ్ పసిండిముధ్లు వెటన్ దల చరువయ్య (య్యా) విష్ణువర్ద్ధన = మహానంబియులు సకల ఆంధ్రులు, సర్వలోకాశ్రయులు, మహాసత్వులు, పెద్దలు, నిరవద్య, మహాసత్రివాళ్లు (ఛత్రివాళ్లు, క్షత్రియులు) పండుకృద్ధులు, వేందుల సరవయ్య విష్ణువర్ధన. కొన్థుకళ్ (కొన్త్రుకళ్). ఇందులో 'కొ'ను ఇక్కడ |క| గా పలుకవలెను. ఇది మొదట హగాను, తరువాత అగాను మారినది. రెండవ అక్షరములోని 'థ' ను ధ్ర అని పలకవలెను (చూ ౯,౧౩.) ఇప్పుడు ఆమాట హన్ధ్రిగళ్ లేక ఆంధ్రులు అని మారును. మొదటి 'క' మీద ఒకారము ఇప్పటి అకారము. సవ్వ = సంవ = సర్వ = సర్వఅని చదువవలెను. లొక్శ్రియ = లోకాశ్రయ. (చూ. రవ్నా, వ్రాస్నె) పెద్దళ్ అన్నమాట నిజంగా పెర్|.|ళ్ = పెర్ దళ్. ఇచ్చటి రకారము పేలుడు లేని అర్ధధ్వని. కాబట్టి అది ర్ ద్ అనిగాని ద్ ద్ అనిగాని వినబడును. కాబట్టి పెర్ దళ్.

నెరవద్య. శాసనకాలం నాటికిన్నీ అంతకుముందున్నూ ఇకార ఎకారములకు ఉచ్చారణలో వ్యత్యాసం చాలా తక్కువ. అందుకే ఒకదానికి మారుగా ఒకటి వ్రాయడం (చూ. ౯౧)

పసిండి=ఫలం అనేమాటకు దుర్ ధ్వనులు కలిగినది పెఞ్ంలేక ప. ఞ్ం = పసిన్|.| = పసిండి. పండుముసలి. పండినపండు పచ్చగా ఉండునుకాబట్టి పిసిండి అంటే బంగారునకు పేరుకూడాను. ముధ్లు=(తమిళం) ముత్తులు (ముదరవి) ముదురు. (తెనుగు) ముదుసలి, ముసలి పండు ముద్ద మొుదలైనవి.

వెటన్దల : వెన్|.|దల=వెటందల, వేందుల. ఇట్లే వ్రేన్|.|లు=రెట్ డ్ లు=ండ్లు. దీనినే రెట్లడ్లు, రట్లడ్లు అని చదివినారు. కొన్ని శాసనాలలో, మొదట వ్రేన్ డ్

లు (రేడు=రాజు); తరువాత రెడ్లు అయినారు. రాజు లయితేనేమి, రెడ్లయితేనేమి 'వ్రాం' (వరాహం) అన్న మాటను వ్రేణ్|.| అని పలికేవారు. అందుచేతనే వారికి ఈ పేర్లు చరువయ్యా=సరవయ్యా, లేకచలమయ్యా. ఈతడు ఛత్రియుడు (క్షత్రియుడు) గనుక విష్ణువర్ధన అన్న పేరు ఇతనికి ఉన్నది:

౭౫, ౭౬, ౭౭, ౭౮, ౭౯, ౮౦, ౮౧, ౮౨, ౮౩, ౮౪, ౮౫, ౮౬, ౮౭, ౮౮. మహాసద్ధ (ర్థ) వళ్ పసుత్శెవుల కొన్థుకళ్, అచ్చుకుట్టవనియు, కొన్థుకళ్. గజబుం (గజంబు) సెద్రల (సెగ్లల) నదుపుళ్, ప్రిథిమి. మహద్ధ్ఞవళ్ (మహాసర్థ్ఞవళ్), వెటండళ్, పోని కనదిఅము (పోనికన్టిఅము) కొళనదుపు (నడుపు) విష్ణు వర్ధ్ఞన = మహాసత్వులు, పసుచెవుల (గోకర్ణ) అనే గ్రామంయొక్క ఆంధ్రులున్ను. అచ్చుకుట్టవనియొక్కయు ఆంధ్రులును గజంబుచేటను (చెంతను) నంద్బులు (నంబులు) ప్రిథివిఅనే వాడయొక్క మహాచత్రివాళ్లు (క్షత్రియులు) వేందుల వొంకట్రాంగళ్ నంబు విష్ణువర్ధన.

అచ్చుకట్టు = అ |గ| |క| |న| |త| త్ఞత్బ్ఞ బ్ఞ = అత్కట్ = అచ్చుకట్టు.

సెద్రల (చూ ౪౯).

నదుపుళ్ (చూ. ౫౦)

మహాసర్థ్ఞవళ్ అన్న పాఠాంతరము సరిఅయినది అని నాకు తోస్తున్నది.

వెటన్దళ్. (చూ. ౭౨)

పోనిక నధిఅముకొళ: దీనికి సరిఅయిన పురాతనపు మాట మహెంజొదారోలిపిలో వ్రాసియున్నది. |ప్రా| |ని| |క| న|.| వ్రామ్. |ప్రా| |ని|=వొన్; |క| న|.|=కన్‌ట్ వ్రామ్ = వరాహమ్. వొంకెన్‌ట్‌వరాహం = వెంకట్ వ్రామ్=వెంకట్రావు. పోనికనధిఅముకొళ=వొంకట్రాంవుగళ్. నదుపు (నడుపు) (చూ ౫౦)

౮౯, ౯౦, ౯౧, ౯౨, ౯౩, మహాసద్ధ (ర్థ) వల కొంగుకలు (కొన్టుకలు) నిరవద్య ప్రిథివికనదిరజుళ్= మహాసత్వులు, ఆంధ్రులు, నిరవద్య (అడ్డులేని) ప్రిథివి కన|.|రాజులు:—ప్రిథివి కనజుల్=ఇందులో మూడవ అక్షరమైన 'వి' |వ్రి|గా పలకవలెను. ఇది ముక్కునోటి ధ్వని. అందుచేతనే ఒకప్పుడు ప్రిథిమి అనిన్నీ వ్రాయడం (చూ. ౨). కాబట్టి ఈ సమాసమును అంతటినీ ప్రిథివిం కనదిరజుళ్ అని తిప్పి వ్రాయవచ్చును. ఆనాటికి ఇకారమునకున్నూ, ఎకారమునకున్నూ ఉచ్చారణలో వ్యత్యాసము లేదని చెప్పియున్నాను. దీనిని ప్రిదివెంకన|.|రాజుళ్=ప్రిదివి ఎంకట్రాజులు అని చదువవలెను.

౯౪, ౯౫, ౯౬, ౯౭ గునవన మహానభి (వి) యుళ్, ముద్దకఇప్పికొళ్ రమిస్వరా=కూర్మ మహానంబియులు, ముక్కంటి రమేశ్వ్రాం (రామేశ్వరరావు).

గునవన=చూ. ౫౬. ఊరిపని=కూర్మని. |గు| |న| వ| |న| అని చదువవలెను; అయితే అప్పుడు కూర్మన అని అర్థం అవుతుంది. ముద్దకఇప్పికొళ్=ముద్‌కంత్పిగళ్=ముక్కంటిగళ్ రమిస్వరా=కడవని 'రా' ను 'రాం' అని పలుకవలెను. దీనిని రామేశ్వరరావు అనిగాని రామసాంరావు అనిగాని చదువవచ్చును.

౯౮, ౯౯; ౧౦౦ ప్రిథివి మహాసర్ధ్ఞ (ర్థ్ఞ) వళ్ అపయజనువ=ప్రిథివి మహాసత్వులు అప్పయ్యాజీ. లేకుంటే మహాక్షత్రియులు అని కూడా చెప్పవచ్చును. ప్రిథివి అనేమాట ఒక్కటే, ౮౩, ౯౨, ౯౮, ౧౦౪, ౧౧౨ స్థలములలో వచ్చినది. ఇది రెండువాడలు కలిగిన ప్రిథివి పల్లవపట్టణంబున ప్రిథివి ఒక్కవాడ అయితే పల్లవపట్టణము రెండవాడ కావలెను. ఇదే సరి అయితే పల్లవపట్టణము పల్లపుపట్టణం అవుతుంది. ప్రిథివి మెరకవాడ, పల్లంపట్నం పల్లపూరు లేక పల్లపువాడ కావలెను. ఈ రెండింటిలోను పెద్దవాళ్లు ప్రిథివిలోనే ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తుంది. పల్లపూళ్లో ఉన్నవాళ్లు నాదార్లు కావలెను. మెరక ఊరినుంచి (గొప్పవారిది) పల్లపూరికి (పేదవారిది) నీరు పారుతుంది.

జనువ = జెనువ = జీవ (చూ. పేజీ ౨౧) = జీ. ఇప్పుడు గౌరవసూచకము మాటగా ఏర్పడ్డది.

౧౦౧, ౧౦౨, ౧౦౩. కాలకొన్డు (ణ్డు) కళ్ కొరిన్ధికొళ్, కరిగల = గోలకొండవారును, గాయత్రివా

దును (అను) కరిగల (నామము) (చూ. కరికాలచోడుడు) కాంకొన్డకళ్ = |గ్ధ| గాలకొండ = |క| గోలకొండవారు.

కొరిన్ధికొల్. ఇందులో రెండవ అక్షరము |రి| గానున్నా మూడవదానిలో 'ధ' అనే దానిని ధ్ర (ట వ స్థానవుట్రిల్) అనిన్నీ పలకవలెను. గో యెన్|.| త్రిగళ్ = గాయత్రివారు. ఈ గాయత్రివారే ఆంధ్రులని ఇదివరకు నేను నిర్ణయించి వ్రాసియున్నాను. కాబట్టి కొరిన్ధికొళ్ అంటే ఆంధ్రులు అని అర్థం చెప్పకోవచ్చును.

౧౦౪, ౧౦౫, ౧౦౬, ౧౦౭, ౧౦౮, ౧౦౯, ౧౧౦, ౧౧౧, ప్రిధివి, మహాసద్ధ (త్థ) వళ (ల) కొను గళ్ (కొన్టుకల్), నన్ది, మహానవిల నదుపు (నడుపు) శ్రీ మహాసద్ధవళ (సత్థవళ) సకాలొక్కెయ్య (సకలొకళయ్య) = ప్రిధివి మహాసత్వులు, ఆంధ్రులు, నంబి, మహానంబులనంబు, శ్రీ మహాసత్వులు 'సకలలోకేశ్వరయ్య' సకల లోకేశ్వరయ్య = సకల్లోకేశ్వరయ్య = సకాలొకేశ్వరయ్య. ఈ చెప్పిన పాఠమే సరి అయినది. నన్ది: న్ది అన్నది. న్ద్ది (చూ. ౫౦) ఈ విషయం ఇదివరకే వివరించియున్నాను.

౧౧౨, ౧౧౩, ౧౧౪, ౧౧౫. ప్రిధివి మహాసద్ధ (త్థ) వళ (ల) దివకరయ్య (దివకరయ్య) పఞ్చకొళ్ = ప్రిధివి మహాసత్వులు (లేక చత్రిర్లు =క్షత్రియులు) దివాకరయ్య (లేక దినకరయ్య) పంత్ |క| ళ్ (పంతులు) దివాకరయ్యపంతులు అని ఉన్నది కాబట్టి మహాక్షత్రియులు అనుటకు మారుగా మహాసత్వులు అంటే బాగుంటుది. ఈ కాలంనాటికి బ్రాహ్మణులు, క్షత్రియులు, చెట్టివాళ్లు, శూద్రులు అన్నవి మాటలు ఉచ్చారణను బట్టి వచ్చియున్నవనిన్నీ, అంతగా ఈ నాటి కులములకు ఉన్నంత పట్టుదల అప్పుడు లేనట్టున్నూ కనిపిస్తుంది.

౧౧౬, ౧౧౭, ౧౧౮, ౧౧౯. శ్రీ జప్టి పెద్దట్టజి గన్దాన్దు (గన్డాన్దు) = శ్రీ జప్|.| |పె| న|.|టజ ఆన్ధ్రుండు. లేకుంటే గండండు. (చూ. మురురాయరగండండు) గండండు అన్నమాట గన్దాన్దు అన్నదానిలో నుంచే వచ్చినది. శ్రీ జెప్ వెంకత్ ఆంధ్రుండు. వెంకట్రావు, వెంకట్రాజు, వెంకన్న వరాహం జెప్ వంతర్, దేశ్‌పాండెర్ పక్టల్ అన్నమాటలు అన్నీ మహెంజొదారోలిపిలో వ్రాసియున్నవి. అక్త్చత్ర అక్షర అన్నవి కూడా వ్రాసియున్నవని ఇదివరకే చెప్పియున్నాను. మహెంజొదారోలిపి, ఆభావ, గాయత్రి వారైనట్టిన్నీ అక్షరాలవారైనట్టిన్నీ ఆంధ్రులదంటే ఎవరు కాదనగలరు? పెన్దట్టజి = పండిత్ర్.

## శాసనమునకు అర్థం

మీకు తెలియుగాక మాకల్ల స్వస్తి. ప్రిధివి పల్లం పట్టణం అని రెండువాడలుగాగల ఊరిలో అమ్మవారు కరిగల్లాండవరికి (వేయిగల్లతల్లికి, వెయిగాళ్లతల్లికి) ఊరి అధిపతులు ఇచ్చిన స్థితి. రెండువాడల పట్నంవారికిన్నీ (ఇది) తెలుసునన్నమాట సిద్ధం. దండుగ- దళపరాధము- సర్వభాధపరిహారమున్నూ ఊరు దానం చేసి ఇచ్చిరి. దీనికి ఏవక్రంలేదు. వక్రం తెచ్చినవారు ఉంటే ప్రాణం లేనివారు అవుతారు. దీనికి వ్రక్రం తెస్తే చస్తురు. రెండువాడలను ఏలేవారున్నూ వారికి జరిమానా వేసినా వేయవచ్చును. వీరికి నీచమైన శిక్షలు వేసినా వేయవచ్చును.

(ఇందులో దస్కతులు చేసినవారు గాబోలు)

౧. మహానంబులు, నరలోక మహాసత్వులు, వృషభమహానంబులు, గజంబు చేరువన నంబులు, సమస్త భువన శ్రీ శ్రీ అఖండరాజమెంద్రవరం కూర్మని నరసింహరాంయెతి.

౨. మోహనంబిలం యెతి.

౩. మోహనంబిల్ మహంతు నరసపంత్ నరసింహయెతి.

౪. మహానంబియులు, సకల ఆంధ్రులు, సర్వలోకాశ్రయులు, మహాసత్వులు, పెద్దలు, అడ్డులేని మహాక్షత్రియులు, పండు ముసలివారు వేందల సరవయ్య విష్ణువర్ధన

౫. మహాసత్వులు, పసుచెవుల అనే గ్రామమున ఉన్నూ, అచ్చపట్టణనికిన్నీ ఆంధ్రులు (అనగా చదువు చెప్పేవారు, గాయత్రి చెప్పేవారు, మంత్రాలు చెప్పేవారు) గజంబు చెంతను నంబులు, ప్రిధివి మహాక్షత్రియులు వేందుల వెంకట్రాంగళ్ నంబి విష్ణువర్ధన.

౬. మహాసత్వులు, ఆంధ్రులు, అడ్డులేని ప్రిధివి వెంకట్రాజులు.

౭. కూర్మన మహానంబులు, ముక్కంటిగళ్ రామేశ్వరాం.

౮. ప్రిధివి మహాక్షత్రియులు (లేక చెట్టివాళ్లు) అప్పయజీ.

౯. గోలకొండవాసు, గాయత్రివారు (అసు) కరిగళ్ (నామము)

౧౦. ప్రిధివి మహాసత్వులు ఆంధ్రులు, నంబి, మహానంబులనంబి శ్రీ మహాసత్వుల సకలలోకేశ్వరయ్య.

౧౧ మహాక్షత్రియులు (లేక మహాసత్వులు) దివాకరయ్యపంతులు.

౧౨. శ్రీ జెస్వెంతర్ ఆంధ్రుండు (లేక గండండు)

ఈ డజను మందినీ ఊరి పెత్తనదార్లుగా ఉన్నట్లు కనిపిస్తుంది.

శాసనకాలము మొదలైనవి

వ్రాసినవాడు ఆంధ్రుడు. భాష ఆంధ్రము-లిపి తెలుగు. గురువుదగ్గర నేర్చుకొంటున్నట్లు కనిపిస్తుంది. శాసనం రాగిరేకుమీద చెక్కడం, శాసనం వ్రాయడం ఖర్చు మొదలైనవి చెక్కినవాడైనా మహాపండితుడు అయి ఉండవలెను లేకుంటే అతని గురువు. భాషాజ్ఞానం అమోఘంగా ఉంటేనేగాని ఇది వ్రాయడం కష్టం అని నాకు తోస్తుంది. ఇంకా తరిచి తరిచి దీనిని చదివితే చాలా భాషాసంబంధమైన విషయాలు ఇందులోనుంచి దొరుకుతవి. చారిత్రక విషయములుకూడా దొరుకును- అన్నమాట నేను ఇందులో కనపరచినాను. ఇది కొందరన్నట్లు అసంపూర్ణశాసనంకాదు పూర్ణంగా ఉన్నది. ఇదే రాగిరేకుమీద కాకుండా బంకమట్టిపలక మీద వ్రాసియున్నదైతే తక్షణం మహెంజొదారో హరప్పాకాలమునాటిది అని చెప్పియుందును. రాగిరేకు మీద చెక్కియుండుటచేత ఇటీవలది అని నిశ్చయం. దీని భాష అతిప్రాచీనంగా ఉండబట్టిన్నీ, దీనిలో మనకు చరిత్ర సంబంధమైన విషయములనుబట్టిన్నీ చూస్తే ఇప్పుడు మనం ఎరిగిన రాగి శాసనములన్నిటికన్నా ఇది పూర్వపుది అని చెప్పవలసివస్తుందేమో. ఈకాలం నాటికి వర్ణాలు ఇంకా ఖచితంగా ఏర్పడినట్లు కనపడడంలేదు. ఇదే నిజమైతే ఈ శాసనం చాలా ప్రాచీనమైనది అని చెప్పడానికి ఈ ఒక్క కారణం చాలును. ఇది మహెంజోదారోలిపిలో లాగున ఆంధ్రులు తెలుగువారు, కన్నడులు, మహారాష్ట్రులు ఒక గుదివారు అని సూచిస్తున్నది.

(A) విదితమస్తు వోస్మాభిః స్వస్తి (స్వస్త) ౧. శ్రీధీవి (శ్రీధివి) ౩. పల్లవపట్టనబున ౪. ఊరి

(B) వారు ౫. కరిగల్లవడవరికి ౬. ఊరిస్వామల్ ౭. ఇచ్చిన ౮. స్థితి ౯. రెండు (రెణ్డు)వాడల ౧౦. పట్టనావురకు

(C) ౧౧. అరియుడగు ౧౨. తెఱెయు ౧౩. సిద్దాయబు (సిద్ధాయంబు) ౧౪. దన్డు (దణ్డు) ౧౫. దసపాధబును ౧౬, సర్వ్వబాదప

(D) రిహారవు ౧౭. ఊరు ౧౮. దాయసెసి ౧౯. ఇచ్చి ౨౦. దినికి ౨౧ వక్రబుం (వక్రంబు) 22. లెదు 23. వచ్చినవారు 24. గళరెని 25. ఉరి (ఊరి) 26. స్థితి

(E) 27. జప్పినవారు 28. దినికి 29. వక్రబుం (వక్రంబు) 30. వచ్చిన 31. గచ్చురు 32. రెన్డు (రెణ్డు) 33. వసల 34 ఎలెమువరు (ఎలెవుగరు) 35. లెముల 36. ల (వె)

(F) సినదియు 37. చన్ను 38. విరిపయి 39. నాదు (నాడు) వరగల్గిన 40. ఎలెముల (ఎళెముల) 41. చెసిన 42. సెయుడుసను

(G) 43. మహనబియుల్ 44. నరాళోక (నరాళోక) 45. మహాసద్ధవుళ్ (మహాసత్థవుళ్) 46. విరాపవ 47. మహనబియుళ్ 48. గజ్నబు (గజ్ఞబు) 49. సె ([సె])

(H) ఒ (ళ్ల) 50. నదుపుళ్ (నడుపుళ్) 51. సమస్త 52. భువన 53. శ్రీ శ్రీ 54. యకనదరజు (యకనడిరజు) 55. బ్రదపెరెయ 56. ఊరిపని 57. స్రవసివర

(I) వర్యోతి (వర్యోతి) 58. మాహనబిళ్ (మాహనభిళ్) వర్యోతి (వర్యోతి) 59. మహాభిల్ పనికొఱుచె 60. సెరక 61 పఙ్చి 62 స్రవసి

(J) వర్యోతి 63. మహనబియుల్ (మహనభియుల్) 64. సకల 65. కొన్ధకల్ (కొన్ఠకల్) 66. సవ్వలొక్రశ్రయ 67. మహాసద్ధవల్ (మహాసత్థవల్)

(K) 68. పెద్దఱల్ 69. సెరవద్య 70. మహాసద్ధఱకల్ (మహాసత్థఱకల్) 71. పసిండి మన్లు (పసిణ్డి) 72. సెటన్దల 73. చరువయ్య (చరువయ్యఱ) 74. విష్ణువద్ధఱ (ధ) న 75. మ

(L) హసద్ధవల్ (హాసత్థకల్) 76. పసుక్నవుల 77. కొన్ధకల్ (కొన్ఠకల్) 78. అచ్చుకట్టివనియు (అచ్చుకట్టివనియు) 79. కొన్ధకల్ (కొన్ఠకల్ 80. గజబుం (గజంబు) 81. సెగ్రల (సెద్లల)

(M) 82. నదుపుల్ (నడుపుల్) 83. ప్రిధిమి 84 మహద్ధఱకల్ (మహాసత్థఱకల్) 85 వెటండల్ (వెటన్దల్) 86. పానికసధిఅము (పానికస్థిఅము) కొళ 87. నదుపు (నడుపు) 88. విష్ణుకద్ధఱన

(N) 89. మహాసద్ధ (త్థ) వల 90. కొంధుకలు (కొన్ఠకలు) 91. నిరశద్య 92. ప్రిధివి 93. కకదిరజుళ్ (కినడిరజుల్) 94. గునవన 95. మహనభియుళ్ (మహానవియుల్)

(O) 96. ముద్దకఙ్చికొళ్ 97. రమిస్వరా 98. ప్రిధివి 99. మహాసద్ధఱపళ (మహాసత్థఱవళ) 100. అపయజనుచ 101. కాల కొన్డు (ణ్డు) కల్ 102 కొఱిన్ధికొల్

(P) 103. కరిగల 104. ప్రిధివి 105. మహాసద్ధవళ (మహాసత్థవల) 106 కొన్ధగళ్ (కొన్ఠకళ్) 107. సన్ది 108. మహానవిల 109. నదుపు (నడుపు) 110 శ్రీ మహ

(Q) సద్ధవళ శ్రీమహా (సత్థవళ) 111. సకాలొక్రశ్రయ్య (సకలొకశ్రయ్య) 112. ప్రిధివి 113. మహాసద్ధఱవళ (మహాసత్థఱవల) 114. దివక (టివక) ద్రయ 115. పఙ్చ

(R) కొళ్ 116. శ్రీ 117. జప్టి 118. కెన్ధటఱ 119. గన్ధాన్ద (గన్ఠాన్ఠ)

బర్గెసుగారి "తమిళ, సంస్కృత శాసనములు" అనే గ్రంథంలో ఉన్న ప్రతిప్రకారము వాయుచున్నాను అని చెప్పి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు "ప్రాచీనాంధ్రభాషాస్వరూపము" అన్న తమవ్యాసములో (రాజ రాజనరేంద్రసంచికయందు) ఇచ్చినట్టుగా నేను కాపీచేసినాను. వీరే "అహాదన |కరశాసనము" అన్న శీర్షిక క్రింద ఇదేశాసనమును వ్రాస్తూ అచ్చటచ్చట కొంచెం మార్పులను కనబరచినారు. అట్టిమార్పులు ఉన్నచోట వాట్టినికూడా బ్రాకెట్లలో ఇమిడ్చి వాటివాటికి నిర్ణయమైన స్థలములలో వ్రాసియున్నాను.

వాడుక చేసిన గుర్తులు, వాటి అర్థము: [ః] అని వ్రాస్తే దానిని అడ్డుధ్వనిగా పలకక రాపిడికలిగినట్టిన్నీ ద్వారము తెరిచియున్నట్టిన్నీ ధ్వనిగా పలుకవలెను.

అక్షరం క్రింద గీతగీస్తే అది ముక్కు ధ్వనిగా పలుకవలెనని సూచన. ఆ ముక్కుధ్వని, 'అ' కాదు.

న అని వ్రాస్తే 'ఽ' అన్నదానిని పేలుడులేకుండా పలకవలెను.

## శాసనముదలి మాటలను పట్టీగా ఏర్పరచిన జాపియ

(1) స్వస్త (51) శమ్నస (53), (110), (115) శ్రీ, 53 శ్రీ, (2) ప్రిదీవి, (2) (92) (93) (104) (112) ప్రిధివి, (84) ప్రిథివి. III (3) పల్లవపట్టనబున (10) పట్టనావురకు. (4) ఊరివారు (6) ఊరిస్వాముళ్ (17) ఊరు (25) ఉరి (ఊరి) (56) ఊరిపని (94) గునవన, (5) కరిగళ్లవడవరికి, (103) కరిగల. (7) ఇచ్చిన (19) ఇచ్చి (8) (26) స్తితి. (9) రెండు (రెణ్డు) వాడల (32) (33) రెణ్డు (రెణ్డు) వడల (11) అరియుడను (12) తెలెయు (13) సిద్ధాయబు (సిద్ధాయంబు) (14) దణ్డు (డణ్డు) (15) దసపరాధబును. (16) సర్వబాధ పరిహారవు. (18) దాయసెసి (41) చెసిన (37) చన్ను (42) సెయుమనను. (20) (28) దనికి (21) (29) వక్రబు, వక్రంబు (23) వచ్చినవారు, (30) వచ్చిన. (22) లెదు. (24) గలరెని (39) నాదువరుగల్గిన, నాడువరుగల్గిన. (27) డప్పినవారు (31) గచ్చురు. (34) ఎలెమువరు (ఎలెవువరు) (40) ఎలెముల (ఎళెముళ) (35) లెములు. (36) లెసినదియు (లసినదియు) (38) విరిపయి (39) నాదువరుగల్గి, నాడువరుగల్గిన. (43) (47) (63) మహానబియుల్ (63) (95) మహానభియుల్ (58) మహానబిల్ వయ్యెతి (తి) (95) మహానవియుల్ (108) మహానవిల (44) నరాలోక, నరాలోక (48) గజ్నబు (గజ్ఞబు) (80) గజబుం (గజంబు) (46) విర పవ (49) సెటి (సెట్ల) (81) సెగ్రల (సెద్దల) (50) (82) నదుపుళ్ (నదుపుళ్) (87) (109) నదుపు (నడుపు) (52) భువన (54) అకనదిరజు (అకనడిరజు) (78) అచ్చుకు జ్జీవనియు (అచ్చుకుజ్జీవనియు) (86) పొనికనధియము కొళ (పొనికన్తియముకొళ) (93) కనదిరజుల్ (కనడిరజుల్) (55) బద్రపెరెయు (57) (62) స్వవసివరవయ్యెతి (స్వవసివరవయెటి) (58) మహానబిల్ వయ్యెతి (మహానభిల్ వయ్యెతి) (మహానబిళ్ వయ్యెటి) మహానభిళ్ వయ్యెటి. (59) మహాభిళ్ పనికొలుచె. (60) నెరక. (61) పఞ్చి (115) పఞ్చకొళ్ (64) సకల (111) సకాలోక్రమయ్య (సకలాకశ్రయ్య) (65) (77) (79) కొన్డకళ్ (కొన్టకళ్) (59) మహాబిళ్ పనికొలుచె (90) కొంపుకలు (కొన్టకలు) (101) కొన్డుకళ్ (కొణ్డుకళ్) (102) కొరిత్తికొళ్ (103) కొంధుగళ్ (కొన్టకళ్) (66) సర్వలోక్రమయ (111) సకాలోక్రమయ్య (సకలోకశ్రయ్య) (67) మహాసద్ధవళ్ (మకాసత్థవళ్); (45) (75) మహాసద్ధవుళ్ (మహాసత్థవుళ్) (88) మహాసద్ధవల (మహానత్థవల) (110) (113) (మహాసద్ధవళ మహాసత్థగళ మమహాసత్థవల) (70) మహాసద్ధణవళ్ (మహాసత్థణవళ్) (99) (113) మహాసద్ధణవళ (మహాసత్థణవళ) (84) మహాద్ధణవళ్ (మహాసత్థణవళ్). (68) సెద్దణళ్ (69) సెరవద్య (91) నిరవద్య (71) పసిండిముఘ్లు (పసిణ్డిముఘ్లు) (72) సెటన్దల (85) వెటందళ్ (సెటన్దళ్) (73) చరువయ్య (చరువయ్యణ) (74) (88) విష్ణువద్ధణన (విష్ణువర్ధణన) (76) పసు క్షివుల (96) మద్దకఞ్చికొల్. (97) రమిస్వరా (100) అపజయనవ (107) నద్ది. (114) దిక్కరయ్య (జివకయ్య) (116) జప్పి. (117) పెద్దటుబి. (118) గద్దాద్దు (గద్దాద్దు)

చెన్నరాజధానియందు 1935-వ సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఇతిహాసములు

శ్రీమదాంధ్ర మహాభారతము, భా ౨— (ప్ర) ఆంధ్ర గ్రంథమండలి లిమిటెడ్, తెనాలి.

### కథలు-ఇతిహాసములు, పౌరాణికములు

అహల్యచరిత్ర—పి. సూర్యనారాయణమూర్తి.

కుచేలోపాఖ్యానము— కే. సత్యనారాయణరావు.

జయద్రథవధ—యల్. సాంబశివరాయకవి.

ధ్రువచరిత్రము—యస్. ఆంజనేయులు.

పురూరవచక్రవర్తికథ— (ప్ర) యన్. వి. గోపాల్ అండుకో. మదరాసు.

భరతుడు—వి. రంగస్వామి అయ్యంగారు.

భీష్మప్రతిజ్ఞ—బి. వెంకటనాంచారయ్య.

శ్రీభరతచరిత్రము—యస్. ఆంజనేయులు.

### —కల్పితములు

కాశీమజిలీకథలు, భా. ౧౦—యం. సుబ్బన్న దీక్షితకవి.

పద్యకథలు—జె. వెంకటనృసింహ చౌదరి.

బాలకథావళి—బి. శాంతకమలమ్మ.

భేతాళకథలు—యం. శ్రీరామమూర్తి.

సిందుబాదుకథలు—యం. సంజీవరావు.

### —చారిత్రకములు

ఆంధ్రదేశ కథలు—టి. సుబ్బరావు.

గౌతమబుద్ధచరిత్రము—యస్. ఆంజనేయులు.

రామదాసు చరిత్రము—యస్. ఆంజనేయులు.

### కల్పము

త్రిమూర్తుల వ్రతకల్పము—(ప్ర) వి. వీరారెడ్డి.

శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము— (ప్ర) చ. రాజగోపాలరావు

పల్నాటి వీరచరిత్ర—శ్రీనాథ.

బాలనాగమ్మ కథ—(ప్ర) జి. జగన్నాథంఅండ్ సన్స్, రాజమహేంద్రవరము.

## కావ్యములు

ఆంధ్రసేతుబంధకావ్యము— (ప్ర). యం. వెంకటరమణాచార్యులు.

గయోపాఖ్యానము—రామనామాత్య.

చంద్రహాసవిలాపము—కె. కృష్ణశాస్త్రి.

సరస్వతీ రామాయణము—సి. సరస్వతీదేవి.

సీతారామరామాయణము—టి. సీతారామదాస్.

## గణితశాస్త్రము

గణితసూత్రములు—జె. వి. సుబ్బారావు.

గోపాల ఎక్కాలపుస్తకము— (ప్ర) బి. జి. పాల్ అండ్ కో., మదరాసు.

బాలురగణితము, బుక్ ర—యం యస్. సుందరేశ్వరం

## గేయములు

కీరపాండురంగభజనకీర్తనలు—ఎ. కామరాజు.

కీరపాండురంగ భజనకీర్తనలు— (ప్ర) ఎ. కృష్ణరావు గుప్త, తెనాలి.

కుశలవ—(ప్ర) సరస్వతీస్టోర్సు, మదరాసు.

కుశలవుల యుద్ధము—జి. నరసింహం.

కేశవనామాలు, మేలుకొలుపులు— (ప్ర) సి. ఆదిమూర్తి శెట్టి, నెల్లూరు.

గానామృత భజనకీర్తనలు, భా. 3,౪— (ప్ర) అప్పల నరసింహ గుప్త అండ్ బ్రదర్స్, పోట్నూరు.

తరణోపాయము—(ప్ర) శ్రీసీతారామ నామసంకీర్తన మందిరము, గుంటూరు.

నూతన గ్రామఫోను పాటలు—(ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో., మదరాస్.

పరతత్వార్థ సారసంగ్రహంబను అప్పదాసు చరిత్రము—వి. అప్పదాను.

బ్రహ్మభజన కీర్తనలు—ఎ. మణుమ్ముఖశాస్త్రి.

భక్తిరసమంజరి—యస్. నరసింహదాస్.

భజనకీర్తనలు—పి. సూరమాంబ.

---

* ఈపట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు ప. పద్యము. ప్ర—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం. సంపాదకులు, సటీ.—సటీకము.

భక్తి తత్వజ్ఞానామృతము—కె. వెంకటదాసు.
మద్యపాన నిషేధకీర్తనలు—యన్. వెంకయ్య.
మాకొద్దు ఈకల్లుసార కీర్తనలు—యన్.చినవెంకయ్య.
వసంతగీత—రామచంద్ర అప్పారావు.
వేదాంతబ్రహ్మజ్ఞానతత్వములు—యం హుస్సేన్‌దాసు
వైతాళికులు—(ప్ర) ముద్దుకృష్ణ, బెజవాడ.
శివనక్షత్రమాలికకీర్తనలు—ఎ.చంద్రశేఖరయ్య.
శ్రీ కృష్ణలీల—(ప్ర) హాట్‌ఛన్స్ అండ్ కో.మదరాసు.
శ్రీ పాండురంగ బృందావన సంకీర్తనలు—ఎ. నారాయణదాస్.
శ్రీ పాండురంగ భక్తిరసభజనకీర్తనలు — (ప్ర) సి. రాములు గుప్త, సి. సుబ్బరావు గుప్త, తెనాలి.
శ్రీ పాండురంగభజనకీర్తనలు—వి. శంకరశర్మ
శ్రీ పాండురంగ శివస్తోత్ర నక్షత్రమాలిక—బి వీరాస్వామిదాసు.
శ్రీ పాండురంగసంకీర్తనలు— ఏ. నారాయణదాసు.
శ్రీ భగవన్నామసంకీర్తనలు—(ప్ర)యన్. వి.గోపాల్ అండ్ కో., మదరాసు.
శ్రీ రాజయోగానుభవార్థ తత్వములు— టి. పేరెడ్డి.
శ్రీ వెంకటేశ్వర మేలుకొలుపులు— కె. చంగయ్య.
శ్రీసీతారామాంజనేయ భజనకీర్తనలు—కె. కేశవదాసు.
శ్రీ హరినామామృత సంకీర్తనలు— కె. కొండయ్య.
శ్రీ హరిభక్తామృతభజనకీర్తనలు — యస్. బుల్లి సత్తిరెడ్డి, టి. లక్ష్మీనరసింహం.
సీతాకల్యాణము—(ప్ర) హచ్చిన్స్అండ్ కో.,మద్రాసు
హరిజనకీర్తనలు — యన్. చినవెంకయ్య.

## చరిత్రము

ఆంగ్లదేశచరిత్ర, ఫారం ౪—యస్.యస్.ప్రకాశదరావు.
ఆంగ్రమహాసామ్రాజ్యము, భా.౧ —యన్. జగన్నాధరావు.
కమలాహిందూదేశచరిత్రము, ఫారం ౨, 3— (ప్ర) కమలకుటీర్, నర్సపూరు.
నవీన హిందూదేశచరిత్రము, తరగతులు ౪, ౫, ౬, ౭,— డి. అప్పారావు.
న్యూమాడల్ హిస్టరి, బుక్. ౧, ౨, 3— యం. నరసింహారావు
భారతదేశము, ప్రాచీనౌన్నత్యము — కే. బి. సుబ్బరాయుడు.
రామా హిందూదేశచరిత్ర, ఫారం ౧, ౨, 3,—జి. వి. సీతాపతి.
హిందూదేశచరిత్రము, బుక్ ౨—వై. వెంకటాద్రిరావు.
హిందూదేశచరిత్ర, భా.౨, 3—యం.కామేశ్వరరావు.
హిందూదేశచరిత్ర—కె. జగన్నాధం.

## చట్టము

గ్రామోద్యోగస్థులయు, ప్రొప్రైటర్లయు, చట్టములు-(ప్ర) బి. లక్ష్మీనరసింహం అండ్ సన్స్, గుంటూరు.

## జీవితములు

కారల్‌మార్క్స్—లాలా హరిదయాల్.
కీర్తిశేషులైన వెంపలి సుబ్బయ్యగారు-కె. హనుమంతరావు.
నాదూరు వేంకటశాస్త్రులవారి జీవిత చరిత్రము—(ప్ర.) కె. శ్రీనివాసరావు, విజయనగరము.
బొల్లిని మునిస్వామినాయుడుగారి జీవితము-బి. రామానుజులురెడ్డి, పి. శ్రీరాములురెడ్డి.
మహాపురుషులు—యల్. సాంబశివ రాయకవి.
శ్రీపంచమజార్జి చక్రవర్తి జీవితము — జె. వెంకటనృసింహచౌదరి.

## జ్యోతిష శాస్త్రము

కాలామృతము—(ప్ర) కె.వీరవెంకయ్య, రాజమహేంద్రవరము.
జ్యోతిష ప్రభావము—డి. స్వామిగుప్తసిద్ధాంతి.

## దండకములు

పైడికల్లి అమ్మవారి దండకము—కె. రామదాస్‌కవి.
రాజాం శ్రీపైడికల్లి అమ్మవారి దండకము- కె. సత్యనారాయణకవి.
శనిదండకము—యన్. సత్యనారాయణశాస్త్రి.
శ్రీమజ్జీవాంజనేయాష్టోత్తరశత కంద పద్యాంజనేయ సరస్వతి ముత్యాలమ్మదండకరామాయణమూర్ణిక— జి. పద్మనాభకవి.

## నవలలు

ఉదంకుడు—యం. పార్వతీశ్వరశాస్త్రి.
గ్రిసెల్డా—రామతీర్థస్వామి.
నావికుడు—టి. జోగారావు.
నీకే జయము, భా ౨—కే. సుబ్బరామయ్య.
పద్మినీభాయి—వి. వెంకటనరసింహరావు.
ప్రేయసి—యం. శ్రీరామచంద్రశాస్త్రి.
మాయారణ్యము—బి. వీరనారాయణదేవ్.
వేశ్యారత్నము—యస్. రామనాథశర్మ.

## నాటకములు

ఆశోకం—ముద్దుకృష్ణ.
గయోపాఖ్యాన నాటకము--యన్. వి. గోపాల్ అండ్ కో., మద్రాస్.
మట్టిపంట శశిరేఖాపరిణయ నాటకము—(ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో., మదరాస్.
ప్రద్యుమ్న విజయము — ఎ. వెంకటనరసింహాచార్యులు.
వివేకవిజయము—యం. వెరుమాళ్లాచార్యులు.
వివేకానంద—కె. కృష్ణరావు.
వేనరాజు—వి. సత్యనారాయణ.
శ్రీ తాటివర్లవారి విజయవిలాస నాటకము—టి. నారాయణకవి.
శ్రీయాళనాటకము—(ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో., మదరాస్.
సీతాపహరణము—డి. రాజశేఖర శతావధాని.

## నీతి

నీతికథలు, భా. ౧, ౨, ౩—జి. శ్రీరామశాస్త్రి.
నీతిమార్గదర్శిని, భా. ౧, ౨—బి. కే. రావు.
సుభాషితరత్నమాల—వి. వెంకటకృష్ణ శర్మ.

## పరిశిష్టము

ఆంధ్రకుమార వాచకము, తరగతి. ౧, ౨, ౩, ౪ ౫—పి. సుబ్బారెడ్డి, జె. వెంకట నృసింహచౌదరి,
ఆంధ్రభారతీవాచకము, నెం. ౧, ౨, ౩, ౪, ౫—వి. వెంకటాద్రిశర్మ, యన్. పేరరాజు, యన్. వీర రాజకవి.
ఆంధ్రవాఙ్మయ సంగ్రహము, భా. ౧—(ప్ర). కె. పి. పిళ్లె అండ్ కో, మద్రాసు.
ఆంధ్రసాహిత్యవాచకము, బుక్, ౧, ౨, ౩, ౪—(ప్ర) టీచర్స్ పబ్లిషింగ్ హౌస్; మదరాస్.
ఆర్యవాచకము, తరగతులు, ౧, ౨, ౫, ౬, ౭, ౮—సి. భీమశంకరం, యం. వెంకటరత్నం.
కాశీయాత్ర—వి. రామ సుబ్బారాయుడు, వెంకట నారాయణ.
కులాంగన—వి. వెంకటరత్నం.
ఖండకావ్యములు—ఒ. వెంకటరామశాస్త్రి.
గ్రామమునసబుల పరీక్షాదర్శిని—బి. లక్ష్మీనరసింహం.
తెనుగుసంబంధవాచకము, నెం. ౩.—(ప్ర) టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్స్, మదరాసు.
దేవీవాచకము, తరగతి. ౨, ౩—డి. సూర్య నారాయణమూర్తి, ఏ. శేషాద్రిశాస్త్రి, టి. తిరుమల రావునాయుడు.
దేశీయవాచక పుస్తకము, తరగతి. ౧, ౨—కె. నారాయణమూర్తి.
నివేదిక—(ప్ర) డి. సీతారామయ్య, సోంపేట.
పద్యకథాసుధ—(ప్ర) కె. కృష్ణమాచార్యులు, గూడూరు.
పద్యగద్యసంగ్రహము, ౧, ౨—(ప్ర). జె. తులసమ్మ, పీఠాపురము.
పాలతరగలు—యన్. కృష్ణరావు.
బాలసరస్వతీ వాచకము నెం. ౨—సి. వెంకటరమణ శాస్త్రి, సి. వెంకటకృష్ణ శర్మ.
బాలసూర్యవాచకము, తరగతి, ౧, ౨, ౩, ౪, ౫—వెంకట పార్వతీశ్వరకవులు, యన్. వీరరాజకవి.
బాలబ్రహ్మానంద [illegible]ములు, భా. ౧—కే. బాల బ్రహ్మానందదాసు.
భీవనారాయణచరిత్ర—యం. నందిపతి.
భీమగ్రత్న సమ్మానము—(ప్ర) వి. వెంకటరామశాస్త్రి, పిఠాపురము.
మల్లెపూలు—కె. కృష్ణరావు.
మార్కాపురంతాలూకా రైతుల నాలుగవమహాసభ—(ప్ర) జె. వెంకటరెడ్డి, మార్కాపూర్.
రత్నార్పణము—పి వెంకటరత్నం.
రాజా. యం. సుదర్శనాచార్యులు.
రాయలసీమ క్షామనివారణ ప్రబోధము — (ప్ర)జి. వెంకటరామరావు, తెల్లదేవరపల్లి.
రాధాకృష్ణస్మృతి—యన్. లక్ష్మీకాంతశాస్త్రి.
వచనరచనాదర్శిని—పి యన్. రామశర్మ.
వినోదసరణి పుస్తకములు, నెం. ౭, ౮—(ప్ర) క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
వ్యవహారజ్ఞానము—(ప్ర) భక్త అండ్ కో., చోడవరము.
లయోలా తెలుగు విలాసిని—(ప్ర) ఎ. పరబ్రహ్మ శాస్త్రి, మదరాసు.
లోకజ్ఞానము—(ప్ర) టీచర్స్ పబ్లిషింగ్ హౌస్, మదరాసు.
శృంగారపద్యములు—(ప్ర) కె. సుబ్బరావు.
శ్రీమద్వేంకటర్యజపాగాయత్రి క్యాలెండరు—పి. సుబ్బయ్య.
శ్రీరాజామ రంజనాదులు — ఒ. వెంకటరామశాస్త్రి.

శ్రీరాయలసీమకథా వాచకములు, బుక్ ౧, ౨, ౩—యస్. ఆంజనేయులు.
సరళవాచకము, తరగతి, ౧—జె. రామకోటయ్య.
సరస్వతీవాచకపుస్తకము, తరగతి ౧—పి. రాఘవేంద్రరావు.
సాక్షి—పి. లక్ష్మీనరసింహరావు.
సులభవాచకము, తరగతి ౨—కె. కృష్ణమాచార్యులు.
స్వప్నకథ—జి. జాషువాకవి.
స్వప్నానుభూతి—కె. రామమూర్తి.

## పారిశ్రామికము

దేశీయపరిశ్రమలు—(ప్ర) సెక్రెటరి అఖిలభారతఖాది స్వదేశిప్రదర్శనము, కాకినాడ.

## పురాణము

గజేంద్రమోక్షము—పోతన.
పాతాళగంగపురాణము—(ప్ర) యస్. కృష్ణాజిరావు, ఆత్మకూరు.
శ్రీ కుచేలోపాఖ్యానము—డి. లక్ష్మీనరసమ్మ

## ప్రకృతిశాస్త్రము

మారుతిశాస్త్రవాచకము, ఫారం ౧—పి. శ్రీరాములు, బి. సుబ్రహ్మణ్యం.
విజ్ఞానశాస్త్రవాచకము, ఫారం. ౧-౭. యల్. నారాయణ. యం. సూర్యరావు.
సాధారణముగా నేర్చుకొనవలసిన ప్రకృతిశాస్త్రవిషయములు, ఫారం ౧, ౨, ౩. జి. వెంకటరామయ్య.

## భూగోళశాస్త్రము

గుంటూరుజిల్లా భూగోళము—వి. సీతారామకృష్ణయ్య.
నూతన గన్నవరం తాలూకా భూగోళశాస్త్రము—వై. గోపాలకృష్ణయ్య చౌదరి.

## మాహాత్మ్యములు

నాగేంద్రుని మాహాత్మ్యము—యం. నారాయణరాజు.
శ్రీ మహానంది క్షేత్రమహిమ—రామకృష్ణసీతారామ సోదరకవులు.
శ్రీ మహానందిక్షేత్రమాహాత్మ్యము—హెచ్. నాగోజిరావు, నంద్యాల్.
శ్రీశైలమాహాత్మ్యము—(ప్ర) యస్. కృష్ణాజిరావు, ఆత్మకూరు.
శ్రీశైలమహిమ—పి. ఈశ్వరయ్య.

## మతము—హిందు

ఆర్యవైశ్య సంధ్యావందనము—(ప్ర) వి. శంకరశర్మ, పత్తికొండ.
నిత్యకర్మానుష్ఠానపూజావిధానము—(ప్ర) యం. తిమ్మయ్యశెట్టి, మదరాసు.
భక్తిప్రసూనమంజరి—(ప్ర) కె. రామచంద్రరావు, బయ్యన్నగూడెం.
భగవన్నామప్రభావము—(ప్ర) శ్రీ సీతారామనామ సంకీర్తనమందిరం, గుంటూరు.
బ్రహ్మోత్తరఖండము—వి. విశ్వనాథము.
శ్రీ చైతన్య శిక్షామృతము—ఠాకూరు భక్తివినోద్.
శ్రీ రామావతారతత్త్వము, భా. ౨—జె. శేషాద్రిశర్మ.

## —ఇతరములు

క్రైస్తవయత్న సమాజపాఠములు—(ప్ర) రవిఆఫీసు, కాకినాడ.
జనవిధిజయము—యఫ్. రూదర్ఫోర్డు.
బాలామృతము—(రెవ ఫాదర్) జి. జె. మార్క్
తెలుగు బాప్టిస్టుసంఘముల ఉత్తర సమాజముయొక్క ౭౦ సంవత్సరముల క్లుప్తచరిత్ర—వి. (రెవ్) జార్జి.
శ్రీ సద్గురుధ్యానం—ఖాదర్ మొయియుదీన్ ఖాద్రి.
సిలువధ్యానమాలిక—కె. పి. కృపానందం.
సువార్తపాట—జి. శామ్యూల్.

## రాజకీయములు

కమ్యూనిస్టు ప్రణాళిక-కారల్ మార్క్స్ ఏంజిల్స్.
సామ్యవాదసిద్ధాంతాలు—ఫ్రెడరిక్ ఎంజిల్స్.
సామ్రాజ్యవాదము—లెనిన్.

## వేదాంతము

అష్టాదశాధ్యాయి గీతామృతము—(ప్ర) యం. తిమ్మయ్యశెట్టి, మదరాస్.
ఆత్మబోధము—శ్రీ శంకరాచార్య.
ఆత్మప్రబోధము—తత్త్వానంద.
ఆనందసామ్రాజ్యము—రామతీర్థస్వామి
గీతాసారసంగ్రహము—సత్యధ్యానతీర్థస్వామి.
భగవద్గీత—(ప్ర) హిందూసేవాసంఘము, కర్నూలు.
సద్గుణనిర్గుణ తత్త్వకంఠార్థదరువులు—(ప్ర) యన్. వి. గోపాల్ అండ్ కో., మదరాస్.
శ్రీ తికట్ల రామస్వామి తత్త్వసురశిష్య బోధామృత చరిత్రము—కే. నారాయణగారి.

శ్రీమదాంధ్ర భగవద్గీతా సంగ్రహము—(ప్ర) యం. సీతమాంబ, అప్పికట్ల.
సంయమనీపురం హైకోర్టు వేదాంతవిచారణ, సివిల్ కేసు 3 వ, ४ వ ఇష్యూలు—శ్రీ సత్యధ్యానతీర్థస్వామి.

వైద్యశాస్త్రము

ఆర్థరీయము—ఎ. ఆర్థరు.
చరకస్థాన మట్కాము—(ప్ర) యస్. కృష్ణమూర్తి శాస్త్రి, బెజవాడ.
సర్వవైద్యవిజ్ఞానము-ఎ. జె. సోమయాజిశాస్త్రి.

వ్యాకరణ శాస్త్రము

బాలసరస్వతీ వ్యాకరణము — ఏ. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, యం. పరబ్రహ్మశాస్త్రి.

శ త క ము లు

అచ్యుతానంత గోవింద శతకములు — తిరువెంగడతాత దేశికాచార్యులు.
కృష్ణశతకము—(ప్ర) ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెని, తెనాలి.
శతకభారతము—పి. సోమయ్య.
శ్రీ భక్తమందార శతకము—కె. జగ్గకవి.
శ్రీ రంగశతకము—టి. డి. నారాయణరెడ్డి.
శ్రీ రామశతకము—డి. డి. బాలాత్రిపురసుందరాంబ.
సత్యేశ్వర శతకము—యస్. చినవెంకటాచారి.
సుమతిశతకము—(ప్ర) ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెని, తెనాలి.

శి ల్ప ము

వినోదశిల్పము, భా.౧ — కె. నాగేశ్వరరావు, మదరాసు.

సంగీత శాస్త్రము

సంగీతము, తాళలక్షణము-వి. వరాహ నరసింహాచార్యులు.

సాముద్రిక శాస్త్రము

సాముద్రిక శాస్త్రము—వి. వెంకటరామయ్య.

స్తో త్ర ము లు

శ్యామా స్తవము—యం. వెంకట నాగభూషణం.
శ్రీ కృష్ణస్తోత్రము—ఎ. వీరబ్రహ్మచార్యులు.
శ్రీ అంతర్వేది నారసింహస్తోత్ర పద్యావళి— సి. వీరభద్రయ్యకవి.
హనుమన్నుతి—(ప్ర) బి. యల్. నరసింహం, గుడివాడ.

హ రి క థ లు.

మార్కండేయ శివకథ—యం. సత్యనారాయణ.
వీరాచార్యకల్యాణము—యం. శ్రీరామమూర్తి.
శివచరిత్ర—యం. రాజారావుదాస్.

---

# నా మహారాష్ట్ర యాత్ర

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి



రవికిరణ మట్టి చిత్రవిచిత్రసృష్టికి కన్నతండ్రి కౌగలించినపుడు సూర్యుని సృజించిన జగదీశుని సృష్టిశక్తి ఎంత యద్భుతమైనదో యూహింపుడు. ఒక్క సూర్యునిగాక పెక్కు సూర్యులను, ఒకేలోకమునుగాక అశేషలోకములను సృజించిన శక్తిని దలచినపుడు, భావనాశక్తిచే కోటి కోటి దివ్యచక్షులను సంపాదించి అనంతావకాశమున, ననంతకాలమున నిండియుండు తేజమును గొంత కాంచినపుడు, శరీరపంజరమున కట్టువడియున్నను, మనుష్యాత్మ కొంత దేవశక్తి నందితీఱును. వియత్తలమున నెగసినకొలది, విహంగము నూతన దృశ్యములను గాంచు లీల, ఊహాశక్తి యధికమైన కొలది బ్రహ్మాండమందలి అత్యద్భుతదృశ్యములు హృద్గతమగును. బ్రహ్మచర్యముకతన నియమబద్ధ జీవనమువలన, తేజస్సుతో నిండిన ఓజస్సును మనస్సున నిలుపుకొనినందున మునిముఖ్యులీశ్వరశక్తిని కొంత నంది అనూనమైన సృష్టిశక్తిని జూపజాలిరి. సాగరతీరమున శారద యామిని నొంటరియై మానవుడు నలువలంకుల విలోకించినపుడు దివ్యదీప్తుల జిందుచు దిగ్వలయము చుట్టు జూపట్టును. దిగ్వలయము పెద్దగిన్నె యంచువలె నందును. గిన్నెలో వెన్నెల, తొణుకుచుండును. వెన్నెల కెరుల్లలోన లందు బుడగలవలె చుక్కలు తేలును. మరందమున నీదులాడు తుమ్మెదలవలె వెన్నెలందు మునిగిమునుగని కొండలు తోచును. పాలపైపడిన పచ్చని పొడిపగిడి, మంచుపై రాలిన ఆకుపూకలవలె, గామదీవీచికలపై నా యర్ధశర్వరీ ముహూర్తమున బుడమిగల యడవులు గోచరింపవా? పాలవెల్లిపై తేలియాడు విష్ణుదేవుని చందమున సౌందర్య సముద్భాసిత ప్రకృతి యత్తఱి వెన్నెలవెల్లిపై దేలియాడును. ఈ గిన్నెలోని సౌందర్యము వర్ణింపగల మానవమాత్రుడు డేడీ? తపసుచేసిన హృదయము మీ గిన్నెబోలునదని వచింతును. తన నుండి నిట్టిగిన్నె గావించుకొనిన తపశ్శాలి తన శక్తిని తానే వర్ణింపజాలడు. కాని, లోగలగిన్నెలోని యనిర్వచనీయ సృష్టిని తన కలమునుండి, తనరసనమునుండి వ్యక్తీకరించి, తానెఱుగని, తానూహింపజాలని సౌందర్యము తన రచనయందెట్లు విరాజిల్లుచున్నదో యని మిక్కిలి యక్కజంపడి తన యెడల బ్రసన్నుడై తన రచనమును బ్రహ్మాండముజేసికొని అందు కాపురమున్న జగదీశునకు బ్రణమిల్లడా?

ఎట్టిచిత్రమో యోజింపుడు—కనులుమూసి అంతరంగమును పరిశీలించినపుడును, కనులు తెఱచి ఆత్మరచనమును పరికించినపుడును ఈత డొకే తెఱగు దివ్యదృశ్యమును పొడగాంచును. మానసనేత్రము బ్రోలనిట్టి దృశ్యమును బ్రదర్శించు రచనమును విలోకించినపుడు దానికర్త తపశ్శాలియని తప్పక స్మరింతుము. పొదుపుకొండ చెంత నిలిచిన గాజుకుప్పెలో వసంతకాంతులు విడిచి నేర్పఱచుకొనలీల, నీశ్వరపదాబ్జమున నిలిచిన ఈతని హృదయమున ననంతశక్తులు వెలుంచెనని గ్రహింతుము. భ్రమరముపై కన్నిడిన కీటకము భ్రమరమేయగులీల, బ్రహ్మాండముపై దృష్టినిలిపిన వీనినుండె బ్రహ్మాండమయినదని స్మరింతుము. ఈతనిమనము భవ

మాలి వంశీరవమున నవు నెచ్చెలియై ఎల్లకడలందు విహరించినదని, పోయిపోయి చుక్కతలుపులను తట్టి లోపల జొచ్చి అందలి వింతలను చూచి మురిసినదని, శ్రావణమేఘములను పిండి అందలి శీతలబిందువులను మెఱుపులను గుటకలువేసినదని, ప్రకృతి సంసర్గముకతన పండు తలపులను కనినదని, నందనవనమందలి నవప్రోవులను తనవళ్ళెము వరించుకొనినదని, కల్పకమందలి సౌందర్యలక్ష్మికి జాగిమ్రొక్కి అవిరళవరముల నందినదని, దేవనర్తకీ బృందమున మసలిమసలి దివ్యగీతికాకళల నాలాపింప నేర్చినదని, భృంగియై, రమాపతి చరణకమల మరందమును తనివార గ్రోలినదని, భావనము కని యిచ్చిన సౌందర్యతిలకము తనదాని గావించుకొని, కవుంగిలిని జేర్చుకొని, సుకుమార ముద్దాడి, చిర్నగవుచిందు ఆమె కన్నులనుండి, చక్కని చెక్కుల గాంతిలు చెక్కిళుల నుండి, చంద్రవంకకు వంకలుచెప్పనొసలునుండి, మధురోక్తికి మార్గమిచ్చు నధరోష్ఠములనుండి, మక్కువతో గూడిన సిగ్గును చూపు మూక్కిగములనుండి, బాల చికురపిహిత ఫాలకలమునుండి యెనలేని కవితావిభూతిని కైకొనినదని, విందుగూర్చు మంగళముహూర్తములందు భావభువనములను బూరెలదొంతరలనట్లు దిగ మ్రింగినదని గ్రహింతుము. వ్రతమునకు, ఏకాగ్రదృష్టికి, ధ్యానమునకు, తపమునకు అసాధ్యమైన దద్ది? ఇవెట్టి సుందరదృశ్యములను, ఎట్టి దివ్యమూర్తులను సృష్టించుకొనలేవు? ఒకరూపము నూహించుటకు వీనిమ్రోల నొక విగ్రహము నిలుపనక్కరలేదు. దేహధారి యొక్కడు ప్రత్యక్షము కానక్కరలేదు. నిమిత్తమెద్దియు పురోభాగమున నిలువనక్కరలేదు.

"అది" యని, "బ్రహ్మ" అని, "సర్వాంతర్యామి" యని జగదీశు నుద్దేశించి శ్రీ శంకరుడు వచించినాడు. కాని సామాన్యులకే "అది" యెద్దియో బోధపడలేదు. పామరులయెడల ననురక్తుడైయుండిన మహాత్ముడు రామానుజాచార్యులు. జనసామాన్యమున కద్వైతముకాక విశిష్టాద్వైతమే సబోధకము కదా! సగుణబ్రహ్మను రూపసహితుని రామానుజుడు నిర్దేశించినాడు. "ఇందుగలడందులేడని సందేహము వలదు"దని చక్రిగూర్చి ప్రహ్లాదుడు పలికి శంకర సిద్ధాంతమునకు దారిజూపినాడు. భాగవత రచయితయే బ్రహ్మసూత్రములను రచించి శంకరాదుల భాష్యములకు నవకాశమిచ్చినాడు కదా! "ఎందెందు వెదకి చూచిన నందందే కల"డని తనయుడనినపుడు హిరణ్యకశిపునకు చక్రియస్తిత్వమున గూర్చి సందేహమే యుండెను. కాని స్తంభమునుండి రూపసహితుడై జగదీశుడు గోచరించినపుడు దానవాగ్రణికంతయు బోధపడినది. ఆ ముహూర్తమందలి ప్రత్యక్ష తీవ్రానుభవముకతన ప్రహ్లాదప్రబోధమందలి సత్యమెట్టిదో మఱింత బాగుగ గ్రహించినాడు. భాగవతమందలి ఈ కథను విమర్శకదృష్టితో పరిశీలించితిమేని శంకర రామానుజ సిద్ధాంతముల ప్రత్యేక ప్రాముఖ్యమును గుర్తింతుము.

సాహిత్యమును, తత్త్వశాస్త్రమును, మతశాస్త్రమును సైదోడులని తెలుపుచుండును. నక్షత్రముల దోసిటగొని జగదీశుడు విశాలనీలాకాశమున వెదచల్లునట్లే శాస్త్రములు భాస్వదాశయములను ఉత్కృష్ట సత్యములను సాహితీవియత్తలమున వెదచల్లును గనుక సైదోడులే! భావవ్యక్తీకరణమున కనక్కరైన ఇంద్రియముల నివి మూలద్రోయుచో, సాహితికి పనికిరావని వచింతును పంచాస్యములలో నింద్రియములను చిటచిటలాడించుకొనువరిం జూచి కళోపాసకుడు కనులెఱ్ఱజేయును. "శ్రీదయితవదనకమల మధుపానమును నిజనేత్రాంబుజములు గ్రోలి"రని కదా పోతనామాత్యుడు శ్రీకృష్ణుని విలోకించిన భక్తప్రవరులను గుఱించి తెలిపినాడు! దివ్యనేత్రము లొసగి కదా విశ్వరూపసందర్శన భాగ్యము జగదీశుడు గుడ్డిరాజున కొసగినాడు! మానవుని కన్నులు మూతలువడిన ముహూర్తమున జగతియందలి సౌందర్యలక్ష్మి నిర్వాసితయై భాగినివలె పోగులును. మనుజుల చెవులు మూతలుపడిననాడు సంగీతము చచ్చి స్వర్గమును చేరుకొనుచున్నది. ఒక్కొక లలితకళ కొక్కొక ఇంద్రియము ప్రాపనుకంశమును పాఠకులు మఱువరాదు. బాహ్యేంద్రియములకు వెన్కనే అంతరంగేంద్రియములు కలవు. అంతరంగమున జనించి, పెరిగి, పెంపొందిన భావము బాహ్యేంద్రియ కవాటమును

డియే ఆత్మప్రకాశము గావించుకొనును; రసనము తెగి పడిననాడు సగము చచ్చితినని గోలపెట్టి, ఇది కలమును చేబట్టును. కాని నాల్కనాడింపగల ప్రతివ్యక్తి కలమును పట్టగలడని తలంచుట తప్పు. భావగ్రహణమును, భావప్రకాశమును కర్తవ్యములుగాగల సాహిత్యోపాసకుడు తన ఇంద్రియములకు సీల్లువేసికొననొల్లడు. వివిధానుభవములను తానంది తన పఠితలను తనవలెనే యనుభవింపజేయును. తాను కులుకును; వారిని కులికించును. తా నేడ్చును; వారి నేడ్పించును. తాను కోపించును; వారిని కోపింపజేయును. ఈ విద్యయం దాఱితేఱినవాడే తన రచనమున నవరసములను కురిపించును. ఈ విద్య నెఱుగనివాడు రసరహితుడు. తనరచనలందు రసప్రవంతుల నెట్లుప్పతిలజేయగలడు? ఈతని రచనము సుజల సుఫల సస్యశ్యామల సుందరసుశోభిత మహోద్యానమువలె నుండదు. అది రాళ్లగుట్టవలె, నిటుకలయామవలె, పెంకుల ప్రోగువలె, కట్టెలమోపువలె, బొగ్గులగుంపువలె కచికల ప్రోవువలె నుండును. ఈ రకపు సరుకులకు కావ్యజగతియందు చోటులేదు. రసరహిత పదార్థమునకు, సౌందర్యసందీప్తముగాని వస్తువునకు కావ్యజగతిలో తా వుండదు. లలితహృదయులకే పైన దెలిపిన విద్య యవలీలగ నలవడును. భావప్రకాశ మక్కరలేక, సంఘసంపర్క మక్కరలేక ఏమూలనో ముక్కుమూసికొనియుంకువాని నటుంచుడు. ఈతడు మానియగుచో నమస్కరింతును. మాని సంయమి; తన గుండెను పిడికిట బట్టినవాడు. కఠినుడు వేఱు. రాతిగుండెవాడు, ఎట్టి యనుభవమునకు హృదయమునొడ్డక, ఎద్దువలె తిని మొద్దువలె పడియుండువాడు, మోడునకు అన్నగారనిపించుకొనువాడు కలమునుగాని, కుంచెనుగాని పట్టుట కర్హుడు కాడు. ఈ రకపు మనిషిని నమ్మరాదని నొక్కి వక్కాణింతును. "అత డించుకైన కోపమెఱుగడు. చాల మంచివా"డని ఒక్కొకమానవుని గుఱించి కొందఱు కొందఱు వచింతురు. తోడన నిది వేదవాక్కని నేను గ్రహింపను. వెంటనే యావ్యక్తిని బోనులోనిలిపి తీక్ష్ణవిమర్శకు గుఱిజేతును. సంయమియో, దుర్మతులందు దుర్మతియో అని యెఱుగనంతదనుక ఒరుల యభిప్రాయములకు "భళాభళి" యనను. సూక్ష్మదృష్టిని, తీవ్ర విమర్శనమును ఎఱుగనివారు "కోపించువారిలో మంచివారధికులైయుందురు; కోపమెఱుగనివారిలో చెడ్డవారధికసంఖ్యాకులయి యుందురు" అను నంశమును జ్ఞప్తియం దుంచుకొనవలెనని నా మనవి. పాషండులందఱు శాంతమంతులే! వీరు మనుష్యరూపులందు గోచరించు పాషాణములు. "అయ్యో!" అని యనవలసిన సమయమున మాటుగాదని వీర లూరకొందురు. "జాలి" యనుపదమును వీరు తమ నిఘంటువులనుండి తుడిచి పారవేసియుందురు. వీరికి కరుణరస మెక్కడిది? శోకరస మేది? వీరు నవ్వరు, త్రుళ్లరు. వీరికి హాస్యరస మెక్కడిది? ఇట్టి యయ్యలు కావ్యములు రచింతురా? రసపూరిత కావ్యమహత్త్వమును గ్రహింతురా?

చక్కని కావ్యమునుచూచి (ఆ కావ్యము తన శత్రువు రచించినదైననేమి) మెచ్చువాడు మహనీయుడని, దానిని దుర్విమర్శకు గుఱి గావించువాతడు అజ్ఞానియో, దుర్మతియో యని గ్రహించు టొప్పు. సహృదయుని సహజగుణము ప్రశంస; క్షుద్రహృదయుని సహజగుణము దూషణము. ఎట్లయిన మంచిగొనము కనుగొనవలెనని మంచిమాట యాడవలెనని మొదటివా డాతురంపడును. రెండవవానిది ప్రతికూలపంథ. ప్రశంసింపగలవాడే ప్రశంసనందును; దూషింపజాలువాడే దూషణమును కట్నముగా పడయును. ప్రశంస సదాశకు సంబంధించినది. కావ్యమందలి జఠరము సదాశ. నిరాశనుండి, నిట్టూర్పునుండి, నిద్దురనుండి, అజ్ఞానాంధకారమునుండి మానవు నుద్ధరించునది ఇదియే! మానవసముద్ధరణమునకు, లోకకల్యాణమునకు హేతువగు కళను సృష్టించుటకు వలసిన శక్తి నందుటకు, తనరచనమును భావభాస్వన్మరీచికలచే తళ్కొత్తించుటకు సదాశను తన పూజాపీఠమందలి దీపిక గావించుకొని మొదటి వ్యక్తి దానికి జేజేలుపాడును; ప్రార్థనసలుపును. ప్రార్థనాపంథనుండియే ఆరాధ్య దైవతము (అది సత్యమనుడు, సౌందర్యమనుడు, శివమ్మనుడు) మనుష్యహృదయమున ప్రవేశించి అందు నిత్యశృంగారమును నిలుపును; పచ్చ

తోరణమును గట్టును. ఈ దివ్యశోభ కావ్యమున ప్రతిఫలించి, అందపూర్వసృష్టిని ప్రదర్శించును. ప్రార్థనవలన జేకుఱు అభ్యుదయము ఊహాతీతము. కావుననే టెన్నిసన్ మహాకవి "For, more things are wrought by prayer than this world dreams of" అని వచించినాడు. పైన నే దెలిపిన ప్రశంస ప్రార్థనమునకు సైదోడు. ఈమహద్గుణముల నలవరచుకొనువాడే కావ్యసామ్రాజ్యమున పట్టాభిషిక్తుడై, పరార్థజీవియై తనరునని, వీనినెఱుగని వ్యక్తి అందుండి నిర్వాసితుడగుట కర్హుడని తెలుపుట నాయాశయము.

గుణమణి హారముచే నాత్మజీవనము నలంకరింపజేసికొనువాడే పట్టాభిషిక్తుడగుట కర్హుడని వచించితిని. ఈశ్వర చరిత్రయను అనంత గుణఖనినుండి ఈత డీమణులను సంగ్రహించును. కావున భారతీయు లీత డీశ్వరాంశసంభూతుడని వచింతురు. * అంతియకాదు. ఈత డీశ్వరావతారమని వేనోళుల జాటి, ఈతని నారాధింతురు. కావ్యకర్త లీతని కావ్యవీరుగా గావించిరి. ఇట్టివీరుని సృష్టించిన కావ్యకర్తను ప్రజలు సమ్రాట్టని, ఇలువేలుపని ప్రస్తుతించిరి. ఈశ్వరగుణమైన ప్రతిభను తనరచనమున నీతడు ప్రదర్శింపగలుటచే, ఈశ్వరాంశ సంభూతుడని, పరార్థజీవియని లోకము లెఱుగు తీఱున నీతడు ప్రవర్తించుటచే, నిట్టిదివ్యపదవి నందినాడు. పాశ్చాత్యులందు హోమ రిట్టివాడు. డాంటే, వర్జిల్, గెటే, షేక్స్పియరు లిట్టివారు. భారతీయులందు వ్యాసవాల్మీకి ప్రభృతు లిట్టివారు.

ఒరులకై పొగిలి, పొరి, ఒరులతో నానందించి, నిజజీవనములం దద్భుతగుణములను కోటివత్తులు గావించుకొనినవారియందు భారతీయు లీశ్వరాంశమును గాంచిరనుటకు బహుళ తార్కాణములను పేర్కొననక్కఱలేదు. అట్టి మహనీయులను వీరు సూర్యదేవుని సంతతివారని, చంద్రవంశజులని వచించిరి. చెప్పనేల, వారు దేవసములని దృష్టాంతీకరించుటకే స్వర్గములోనికి వారికి రాజమార్గముల నేర్పఱచిరి. దేవపతి సింహాసనము నధిష్ఠించి, ప్రత్యక్షముగ నీశ్వరుని కడనుండి వరములు గైకొని పరమార్థమును చేపట్టి ధనంజయుడై, మహాయాత్రీకుడై విజయుడైన వ్యక్తి వీరిదృష్టియం దెట్లు వృద్ధినందినాడో యెఱుగమా? కావ్యకర్త వీరి ప్రతినిధి జూడీ!

తానెఱుగని ప్రతిభను ఒకడుమఱొకని కాపాడింపనేరడు. కావ్యకర్త తొలుత తాను విజయుడై, తాను ధనంజయుడై మఱొకవిజయుని, ధనంజయుని సృష్టింపజాలునను ముఖ్యాంశమును చదువరులు మఱువరాదు. అర్జునుడెవ్వరో, కృష్ణుడెవ్వరో, రాముడెవ్వరో ఎఱుగగోరువారు ఈ మహావీరులను కావ్యప్రపంచమున సృష్టిం

---

* ఇట్టి విశ్వాస మాంగ్లేయులందు గూడ నుండెడిది. ఈ విశ్వాసముతోడనే స్టూవర్టురాజులు సింహాసనము నధిష్ఠించిరి. కాని ఆత్మచరిత్రలందు వీ రీశ్వరగుణములను ప్రదర్శించిరి కారు. నిరంకుశత్వమును విజృంభింపజేసి తగు ఫలము ననుభవించిరి. క్రీ. శ. 1603 లో సింహాసనము నధిష్ఠించిన జేమ్స్ "Divine right of Kings" అను వాక్కు నుచ్చరించుచు, చిత్తము వచ్చినట్లు ప్రవర్తించి "The wisest fool or enlightened idiot in Christendom" అనిపించుకొనినాడు. ఈతని వెనుక "భళాభళి" యనిన మొదటి ఛార్లెస్ దేశమున సమర సంక్షోభమును జనింపజేసి, 1649, జనవరి 30-వ తేదిని తనకుత్తుకను తన ప్రజల కర్పించినాడు. ఈ తెరువునుండి తరలనేరక, ప్రజలందు దురంతమైన యసంతృప్తిని బుట్టించి, కనకంతము నెట్టి ముసలము చేబట్టునో యని యడలి రెండవ జేమ్సు చల్లగ నింగ్లాండునుండి పరారియైనాడు. 1649 లోని Blcody Revolution, 1688 లోని Glorious Revolution, 1689 లోని Bill of Rights స్టూవర్టుల నిరంకుశత్వమునుండి జనించినవి. "ఈశ్వరస్వత్వము" నివి సున్నజేసినవి. వీనికతన ప్రజలే రాజులైరి. 1882, 1867, 1884 లందలి రిఫారమ్ఆక్టులు వీరికి మఱింతబలము నొసగినవి.

చిన మహావ్యక్తి ఎవ్వరో తొలుత కనుగొనవలెను. నాటకకర్త తన పాత్రలందు దూరడని, ఆతనికిని ఆతడు సృష్టించిన పాత్రలకును నెట్టి సంబంధము నుండదని, ప్రకృతిమ్రోల ముకురమును నిలిపి సత్యసందీప్తమైన దృష్టితో మనుష్యచరిత్రను చిత్రించు టాతని కర్తవ్యమని వచింతుము. నిక్కమే! రంగస్థలి ప్రదర్శించుట కక్కఱైన కావ్యమున వేర్వేఱు పాత్రల వ్యక్తిగత ప్రాముఖ్యమును వ్యక్తపఱచుట కిట్టి సిద్ధాంతము అనివార్యమైనది. ప్రబోధ మాచార్యుని పనిగాని నాటకకర్తది కాదు. జగదీశునివలె నీతడు నెక్కనుండవలెను. కాని, జగదీశుడు తాను సృష్టించిన మానవులందుఁగూడ కలడు. God is both immanent and transcendent అని తత్త్వశాస్త్రము వచించుచున్నది కదా! కావ్యకర్తకూడ నిట్టివాడే! ఈతని యుత్కృష్టపాత్రలం దీతని కనుగొనవచ్చును. వీని మానసకైలాసమున నుద యించిన భావగంగాధార వీని యుత్కృష్టరచనలందు పాయపాయలై ప్రవహించి, అద్భుత సౌందర్యసృష్టిని పాఠకలోకము కన్నులకు కట్టును. వీని హృదయదిగ్వలయమున తళుక్కుత్తిన సదాశ ఈతడు సృష్టించిన ఉత్కృష్టపాత్రల చరిత్రలందు మినుకులీనుట నిస్సంశయము. సృష్టి చిత్రములందు సృష్టికర్తను కనుగొనిన కన్నులులేవా? షేక్స్పియరును ప్రాస్పెరో, హేమ్లెట్, ఫాల్స్టేఫ్లతో పోల్చిన ఆంగ్లవిమర్శకులు లేరా? నన్నడిగితిరా, రామకృష్ణులందు, అర్జున యుధిష్ఠిరులందు వాల్మీకివ్యాసు లున్నారని తెలిపి, అట్లని ఋజువుజేయుటకై రామాయణభారత భాగవతములనుండి బహుళదృష్టాంతములను పేర్కొనగలను. చూడుడు: వ్యాసుడు శ్రీ విష్ణువుయొక్క అవతారమని మనగ్రంథములే తెలుపుచున్నవి. రాముడును, కృష్ణుడును అవతారపురుషులేకదా! వ్యాసుడు శ్రీ విష్ణువుకావున కృష్ణునందు శ్రీ విష్ణువును జూపజాలె నని నొక్కి వచింతును. కిరాతుడేయయ్యు తపసుకతన శంకరునకు ముందే "సోహమ్" అని పలికి, భగవానుడేయై వాల్మీకి రామచంద్రభగవానుని కావ్యజగతియందు ప్రత్యక్షమొనరించినాడు. తాను సాహితీ సమ్రాట్టు కావున ముల్లోకములకు సమ్రాట్టు కాజాలిన మహాపాత్రము కడుంగడు చక్కగ సృష్టించినాడు.

విధిసృష్టికి కవిసృష్టి తీసిపోదు. కావున కవికి బ్రహ్మయను నామాంతరము కలదు. కవిబ్రహ్మ కాళిదాసువాక్కుల నాలింపుడు:

"చెలువుగవ్రాసిదిద్ది విధి
    చిత్తము రంజిల జీవమిచ్చెనో?
పొలుపులఁగూర్చి మానసవి
    భూతిని గౌతుకియై రచించెనో
మెలఁతుక మేనిఁజూడఁ బర
    మేష్ఠి ప్రభావము నెంచిచూడ నా
కెలఁతుకదోఁచు నొండుతరు
    ణీ-మణి సృష్టి యటంచు నామదిన్."

("అభిజ్ఞానశాకుంతలము" వేంకటరాయశాస్త్రి గారి అనువాదము.)

సజీవమైన దృశ్యమునే ఇవ్వలిచూడ్కి ప్రోవునో, ఆంతరంగికదృష్టి సమక్షమందో నిలుపులే సృష్టికౌశలము. నామరూపములందు సృష్టి ప్రకాశమగును. కావ్యవీథులందు నడుకనేర్చిన మనసు ఎన్నెన్ని దృశ్యములనో, ఎందఱెందఱు వ్యక్తులనో కాంచును. దైనికానుభవమున కలుగు సంబంధములును, సంపర్కములును కావ్యవసుమతియందును గోచరించును. అందివి మఱింత గాఢముగ నున్నట్లుండును. గుణయుతులును, రూపసహితులును, వివిధానురాగ సూత్రములచే (ఆలుమగలట్లు, తండ్రికొడుకులట్లు) బంధింపబడినవారును అందు మసలుదురు. "ఇది" యను నిర్గుణబ్రహ్మకాక కమలభవకర్త నుడు కావ్యరంగస్థలి ప్రత్యక్షమగును. రక్తమాంసములందు 'బ్రహ్మన్' రామకృష్ణులట్లు దృగ్గోచరమైనపుడే అష్టాదశపురాణములును, మహాకావ్యములును ఉత్పన్నమైనవి.

శుభాశుభ సంఘటనములు కలిగినపుడు సంతోష దుఃఖములను వ్యక్తీకరింప మానవులందఱు కాంక్షింతురు. మానవానుభవములను తామనుభవించి, ఆత్మానుభవములను కావ్యకర్తలు స్వీయకృతులందు ప్రదర్శింతురు

కావున మానవప్రకృతులు, మానవవికృతులు తమకేల యని వీరనలేరు. అందులేని వీరు తామే యుండు పుడమిలో, తమకై నిర్దేశింపబడిన గ్రంథములనే వ్రాసికొనవలెను. సంతసింపవలసి వచ్చినపుడు సంతసింపక, సంతసింపవలసివచ్చినపుడు సంతసింపక అంతయు మిథ్య, సర్వము మాయ అని కిక్కురుమనక కూర్చుండునాతడు సన్న్యాసులందు నూటికినూఱు మార్కులను దెచ్చుకొని మఠాధిపతి కావచ్చును; ఒరులజోలి తనకేలని కదలని మెదలని రాయి కావచ్చును. బండరాతికి కావ్యమున చోటులేదు. కావ్యకర్త దానిపై ఆకులను, పూవులను ప్రాకించును. తన లేఖినీసంజీవిచే స్పృశించి దానిని చక్కనిచుక్క జేయును. ప్రతిభాస్పర్శచే (స్వార్థరహితుడు కావున తాను చేసినదానిని తన పాత్రచేసెనంచు తెలుపుచు) కటికిరాతినుండి ఏ యహల్యనో లేపి పరస్పర భావప్రకాశమునకు నక్కరైన చక్కని సంఘటనములను సృష్టించును. అంతియకాదు, కావ్యావనియందు మసలునంతకాలము తన ప్రత్యేక వ్యక్తిత్వమునణచియుంచి, తనగుండెలను కావ్యపాత్రల కాటపందిళ్లొనరించును. తానే ఒక్కొక్క పాత్రయై కావ్యరంగస్థలి దోచును. వాల్మీకివ్యాసకాళిదాసు లేమికావించిరో, కావ్యజగతియం దెట్లు తోచిరో యెఱుగరా? జడదారులయ్యు, ప్రాపంచికానుభవములను దమ హృద్వీణల మీటనిచ్చిరి కారా? తాము గోలపెట్టగలవారగుటచే సీతమ్మ, ద్రౌపది, శకుంతలాదులచే గోలపెట్టించిరి. తాము కోపింపజాలుటచే భీమాదులను రెచ్చగొట్టింప జాలిరి. తాము భక్తులగుటచే హనుమదాదులచే తన్మయ నృత్యము జేయింపగలిగిరి; తాము కులికిరి. ఒరులను కులికించిరి. శుభాశుభములు, సుఖదుఃఖములు తమకేలయని తమ గుండియలపై గోరీలను నిర్మించిరికారు. చింతిలి, కులికి, కనలి కావ్యజగతియందు రసస్రవంతుల బాఱింప జేసిరి.

నన్నడిగితిరా కావ్యకర్తమనసును, బాలకుని మనసును ఒకేవిధమైన వందును. నూఱేండ్లబూచి కొకరిగొడవ యక్కరలేదు. ఈతని కేడ్పురాదు; నవ్వురాదు. సంఘజీవనమునుండి ఈతడు 'విడాకులు'గైకొని, ఏమూలనో ముక్కుమూసికొని, స్వంతముక్తికి సంబంధించిన దీర్ఘయోచనమందు బుడుంగున మునింగియుండును. కావ్యకర్తవలె బాలకుడు రూపగుణముల నెఱుగును. రూపరహితమైన దద్దియు నీతనిచూడ్కి నాకర్షింపదు. ప్రత్యక్షగుణ ప్రదర్శన మొనరింపని వ్యక్తి ఈతని హృదయమును స్పృశింపలేదు. తండ్రిరూపమందే ఈతడు తండ్రిగొనములను, తండ్రిని వీక్షించును. రూపమునుండి తండ్రి నిష్క్రమించి, "అది" యని పేర్కొనబడు "బ్రహ్మన్"లో గలిసినంతన బాలకుడు తల్లడిల్లును. జనకునిరూపము కాక ఆతని బాడిద ప్రత్యక్షమైనపుడు ఈతని మన సెట్లుండునో యూహింపుడు. తండ్రిరొమ్మునుండి తన్నెవరో దూరముగ గిరవాటువేసిరని, తన్నొంటరి జేయుటకై ఎవరో, గ్రద్దవలె తనతండ్రిని తనపాలినుండి యెగదన్నుకొని పోయిరని (ఏమియు నూహింపజాలని పసివాడుకాడు కానందున) యూహించి ఈతడంగలార్చును. సుఖదుఃఖ ప్రకాశమునకు, పరస్పర భావవ్యక్తీకరణమునకు భంగము వాటిలినపుడు బ్రదుకు తెల్లవారెనని బాలురును, సామాన్యులును ఊహింపరా? ఘోరవిపత్తు బాలకుని గుండెపై బడినపుడు, పిడుగుదెబ్బవలన పిండియై,- పిండియేయగుటకాదు-కాలి బూడదయై, వాతూలమున నదృశ్యమగు గింజవలె, నది బొగ్గును బుగ్గియును గాదా? ఈబొగ్గులోను, బుగ్గిలోను నెరసుండునని వర్తమానవిషాదవాతూలమున నుండియు మిక్కుటముగ చలించినను భావికాలమున నా నెరసు ప్రజ్వరిల్లి భావిజీవనమున నవజీవన ద్యుతులను జలజల రాల్చునని మనము తెలుపవచ్చును. జ్ఞాన ప్రదీపకళికనుండి ప్రసరించు నీ భావచ్ఛటను కసుగాయమనసు గుర్తింపజాలునా?

కావ్యకర్తను సృష్టికర్తను పోల్చితిమి. ఈ పోలికలోని సృష్టికర్త సగుణబ్రహ్మగాని నిర్గుణబ్రహ్మకాదుసుడీ! కావ్యకర్త నిర్గుణబ్రహ్మవలె తనగ్రంథములను వ్రాయడు. జగదీశుని సృష్టిశక్తినే ఈతడలవఱుచుకొనినాడు కాని తక్కుంగల ఆతని యనంతగుణములకు బహుయోజనములదూరమందేయున్నాడు. కొన్నియంశములందు బాలకునకు సమీపమందున్నాడు. బాల

కుడును, కావ్యకర్తయును, ఈశ్వరుడును గొన్నికొన్ని ముఖ్యాంశములందే పోలికలు కలిగియుండిరి.

జగదీశుడు త్రికాలవేది. ప్రస్తుతకాలముట్లే భావికాలమును ఆతనికి దోచును. కావ్యకర్తదృష్టి ప్రతిభాసముజ్జ్వలమయ్యు, దివ్యమయ్యు, కావ్యపాత్రయై ఆత్మరచనమున గోచరించుటాతని కర్జమగుడు, జరుగనున్నదేమో యెఱుగని తెఱగున నాతడు ప్రవర్తించును. "కావలసిన కారణాంతము లనంబును తప్పను." అని యాతడనునుగాని "కారణాంత మిట్టి"దని తెలుపకు. వర్తమానము కడవకుండ, గాలదిగ్వలయమున కవ్వల గల యంశములు తలలెత్తుచు కనులబడుచో వర్తమానమును (The Present) వీక్షించువారెవరు? కావ్యము జోస్యముకాదు. అది భావికాలమును గుఱించిన గాథ కాదు; వర్తమాన సమయమునకు, ప్రత్యక్షకాలమునకు సంబంధించినది. గతాంశములను దెలుపుటటే, గతమును దెచ్చి దాని నది దృష్టిసమక్షమున నిలుపును. కావ్యమున కవ్వల, రచనా కళలుండు జోస్యముచెప్పినను, కావ్యమందు తాను నిమగ్నుడైయుండు నవసరమున తనకర్తవ్య లక్షణమెద్దియో గుర్తించియే తనక్రియను నెఱపును.

రేపు జరుగు సంఘటనము లెవ్వియో నేడే తెలిసిపోయిన, కావ్యమందు తెలుపుటకు కథన మేముండును? భావికాల మనుకూలమయినదని తెలిసికొనినపుడే మానవుడు తనపనికి పూనుకొనును. కాలవిమర్తలమున ననుకూలాంశములే గోచరింపవు. ప్రతికూలాంశములు కూడనందు దోచినగాని సత్యము పూర్ణప్రకాశము నందజాలదు. కావ్యమున నీసత్య మాత్మప్రతిబింబమును గాంచును. రేబవళ్లులేకున్న దినమేలేదు. సుఖదుఃఖములును, ఆలోకాంధకారములును, అనుకూల ప్రతికూలాంశములును గలిసియే పూర్ణజీవనసామగ్రి యగును. కావ్యగ్రథనమున నక్కరైన దీ సామగ్రియే!

కొండొకవడి దివ్యదృష్టినందిన యర్జునుడు విశ్వరూపసందర్శనమున కౌరవవిధ్వంసమును గాంచినాడు.* తాను విజయుడగుట ముందే యెఱిగి, కృష్ణప్రేరితుడై గాండీవము నెక్కువెట్టినాడు. కర్తవ్యాంగణమున లంఘించినాడు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని ధర్మక్షేత్రమున, కురుక్షేత్రమున బుగిలొలుపు శక్తిని సామాన్యులు గుర్తింపరు. సమ్ముఖమందలి సారథిని వీరెఱుగరు. కావున తమ భావికాలమెట్లుండునో వీరెఱుగరు. దానంజేసియే అనుకూలాంశముల సఖ్యమును, ప్రతికూలాంశముల సంఘర్షణమును జవిచూచి, కావ్యావనియందు తగుపాత్రలయ్యెదరు.

దాశరథుని చేతిలో తనకు చావుకలదని దశకంఠుడు ముందే గ్రహించియుండినచో, లోకమాతపై మోహంపు దృష్టిని పారింపకనే యుండువాడు. కలుషముతమైన తన వాడిచూడ్కి వాడి యడిగిమైవెనుదిరిగి తననుండే యుండు గ్రుచ్చుకొనునని, రామకోదండము నది తనమీదికి పురికొలుపునని ఈతడు ముందే గ్రహించి యుండినచో, భావిసంఘటనములకును, రామాయణ మహాకావ్య సృష్టికిని అవకాశ మొసగకుండువాడు. దూరదృష్టిగలవారును, త్రికాలవేదులును రావణులు కారు. కొన్ని

---

* "అమీచ త్వాం ధృతరాష్ట్రస్యపుత్రాః సర్వేసహైవావనిపాలసంఘైః,
భీష్మద్రోణస్సూతపుత్రస్తథాఽసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః.
వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః.
యథా నదీనాం బహవోఽంబువేగాస్సముద్రమేవాభిముఖాద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి.
యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకాస్తవాపివక్త్రాణి సమృద్ధవేగాః"

కొన్ని సందర్భములందు, కావ్యసృష్టియం దొకా
నొక మూలమందిరమున వీరు గురువులై తోచెదరు. పర
స్పర సంఘర్షణమునకు డీకొను ప్రధాన పాత్రములో
వీరికి (వీరు సంఘర్షణాతీతులగుటచే) స్థానముండదు.

జగదీశుడు రాముడై యవతరించినపుడును, కృష్ణుడై యవతరించినపుడును ఎట్టి వ్యత్యాసమును జూపెనో గ్రహించితిరా? భాగోసుల సంఘర్షణమున నొకవైపున నాయకుడు నిలుచును. మరొక ముఖ్యపాత్ర ఈతనికి ప్రతిద్వంద్వియైయుండును. "ఇది నాది. ఈ క్రియను జరిపి, నన్ను మార్కొనిన కీడును దునుమాడెదను. ఈ మేలునందెదను" అని నాయకుడు తలచియే కదనమునకు కడగును. భారత కావ్యకర్త సంఘర్షణానంతరమున నీతని చేతికి జయపతాక మొసగును. సుగుణముచే విజయడిండిమమును మ్రోగింపజేయుటయు, దుర్గుణమును గూల్చుటయు నీతని యాశయము. ఎదుటి శత్రువునకును, నాయకునకును ఈత డుజ్జీజూచియే పోరుపొసంగించును. రాముని గాక, నిర్గుణబ్రహ్మనో, శ్రీ మహావిష్ణువునో వాల్మీకి రావణుని కెదుట నిలుపదొరకొనినాడా? గుణాగుణ సంఘర్షణమునకు నాటపట్టయిన కావ్యమున నిర్గుణ బ్రహ్మ మేం చేసెని? విష్ణుమూర్తి త్రికాలము లెఱుగును. లక్ష్మి నెవ్వడు దొంగిలిపోయెనో యెఱిగి, పర్ణశాలనుండియే సుదర్శనచక్రమును ప్రయోగించి, వాయుపథమందే దైత్యస్వామి మస్తక ముత్తరించి, తోడన దన యర్ధాంగలక్ష్మిని జేకొనియుండును. రామ విలాపమునకుగాని, వారధి నిర్మాణమునకుగాని, తదుపరి యుద్ధమునకుగాని అవకాశ ముండెడిదికాదు. జరుగనున్న దెఱిగియుండినచో, రాముడు పర్ణశాలనుండి కదలకనే యుండువాడు. వేయేల కావ్యమే యుండెడిదికాదు. పరిపూర్ణత్వము (Perfection) ను ప్రదర్శింపని మానవుడైన రాముడే సంఘర్షణమున పాల్గొనిన పాత్రయైనాడు. కృష్ణుడు కాలేదు. మానవుల నీతడు సంఘర్షణమున బ్రవేశపెట్టినాడు; వారిని సమరమునకు పురికొలిపినాడు. శ్రీ కృష్ణుని మధ్యవర్తియనుడు, Umpire అనుడు, సారథియనుడు, గీతాచార్యుడనుడు, గీతాలాపన మొనరించిన దివ్యగాయకుడనుడు, పోరుసలిపిన మనుష్యుడనకుడు. అవతారములందు క్రమవృద్ధి కలదు. మీనముకంటె కూర్మము, కమఠముకంటె వరాహము, అద్దానికంటె మానవుడు, మానవునికంటె బూర్ణత్వము ప్రదర్శించు జగదీశుడు మిన్నయను భావము క్రమగతిబోచిన అవతార పరంపరయందు గాంతుము. బైబిలుభావము ప్రయోగించితి మేని, రాముడు Son of man అని, కృష్ణుడు Son of god అని తెలుపవచ్చును. గిరిధారి కావించిన క్రియలన్నియు ఆతడు జగదీశుడని తెలుపు ప్రమాణములే! 'నిర్గుణబ్రహ్మము' సుఖింపదు, దుఃఖింపదు, కోపింపదు. దేవదేవుడు మానవులట్లు ప్రవర్తింపడు. ఒక పర్యాయము మాత్రము శ్రీ కృష్ణుడు అర్జునుని రెచ్చగొట్టుటకై క్రోధవిజృంభణ మొనరించి, "కుండలముల కాంతి గగనభాగంబెల్ల గప్పికొనగ" తేరునుండి "కుప్పించి యెగసి" చక్రముబూని, భీష్ముని జంప నుంకించినాడు. అమ్ములు నేలరాల్చి, రొమ్మునొడ్డి, చేతులుమొగిచి, భక్తిపరవశుడై భీష్మాచార్యులు జగదీశుని ప్రస్తుతించినాడు. ఉజ్జీ లేనిదే కావ్యాంగణమున కదనమే లేదంటినిగాదా? ఎదుటివానిని గుఱించిగాని, భావికాలమును గుఱించిగాని పరిజ్ఞానముగలవాడు ఈ సంఘర్షణమున పాల్గొనడని కదా తెలిపియుంటిని! ఈ పరిజ్ఞానము భీష్మునకుగలదు; కావున నాతడు జగదీశుని మ్రోల ప్రాంజలియై నిలిచి కాళ్లబేరమునకు వచ్చినాడు. సమరము తనకు కాదని యెఱిగిన కృష్ణభగవానుడు వెనుకకు తరలినాడు. మానవులిద్దఱు పోరుకొనిరి.

కావ్యస్థపాత్రలజీవనము మానవమాత్రులమున జీవ యొక్క ప్రతిబింబము ప్రతిబింబమున విశేషసౌందర్యముండును. అందుకవితాశోభకళ్లొత్తును. కావ్యపాత్రలు భావనమున తానమాడినవారు; వార విశేషభావోద్వేగమును వ్యక్తీకరింతురు. ఉద్వేగపూరిత సంఘటనమున జిక్కిన బాలుడు కావ్యపాత్రవంటివాడు; కావ్యకర్త*

* కావ్యాంగణమున నీతడు ఘనభావములను, గంభీరసత్యములను వెదజల్లునని, ప్రబోధధోరణి బ్రవేశింపడని, కానన్న దెద్దియో యెఱిగియు నీత డెఱుగనట్లే యుండి యంజవేయునని మనము మఱువరాదు.

(తాను కావ్యపాత్రయై కావ్యకర్త నటించువాడు కావున) బోలువాడు. ముగ్గినపండువంటి తాత్త్వికునివలె, బుగ్గిలో నున్న నెరసు భాసమానభావిజీవనమునకు జనకుడు కాజాలునని ఈ బాలకు డెట్లూహించును? బుగ్గి బుగ్గియనియే ఈత డెఱుగును. ఘోరవిపత్తును గాఁడియాకను చూచు తత్త్వవేత్త కాక అందు భీమణభిత్తికను విలోకించు పామరు డీతడు. గతసంబంధము ననుసరించియేకదా ఎదుటి సంఘటనముయొక్క కొద్దిగొప్ప లుండును. సన్నిహితసంబంధమున గాఢప్రణయ ముండును, గభీరభావ ముండును. ప్రత్యక్షసంబంధమును తొలగించు ఘోరారిష్టము హృదయమును గభీరదుఃఖాంబుధిని గావింపదా? తండ్రినిగాక, తండ్రికిబదులు తండ్రిబూడిదను చూచి ఆభాసుడైన బాలకునికడుపున నిట్టికడలి నిండుకొనదా?

*          *          *          *

ఆకులముఱుగునుండి తోచు పండువలె, కారుమొగులులో కాంతిలు కెంపుకాంతికరణి, సన్నని మేలిముసుగున గన్పట్టు నగుమోము పట్టమహిషి యట్టులు, పవడపురశిలో దాగిన నవభర్మశలాకపోలుపున, సుదూరశూన్యమగు నీలంపువలువలో మిణుకుమిణుకుమను తారకవలె తామరలందు దాగిలిమూతలాడు రాయంచచందమున, బుడగకడుపులోని కెంపు తిలపులీల సుందరనీలాలకలందు వజ్రపుపాళ్లతో నొప్పు పైడినగకైవడి, పచ్చపందిరిలో నవ్వులురాల్చు మల్లికలవలె, సరోజినీసంశ్లేషమున దాగిన భ్రమరవల్లభుని భంగి, మేఘడోలికలం దగయు క్రొక్కారుమెఱుంగు తెఱంగున, వాల్జెడనుండి వాలుచూపులు నిగిడించుచు హసన్ముఖులయి తోచు గులాబులచొప్పున, కాచపాత్రమున సౌదామినీసృష్టిచేయు దీపకళికవలె, సాంద్రపర్ణములందు లంఘించిన కిరణశావకముల కరణి ముంగురులందు దోచు ముద్దుమోమువలె, అల్లన నాలాపన మొనరించుచు గభీరవనమున గన్పట్టు శరన్నదివలె, ప్రభాతశిశిరబిందుహృదయములందు మునిగితేలు సప్తరాగములట్లు, హంసతూలికాతల్పమున నొయ్యారముగ శయనించిన సౌందర్యతిలకపోలుపున, అమ్మరొమ్మున నడగిన పసిపాపపగిది, భూతిరేఖలందలి త్రిచూర్ణతిలకమువలె, ఫేనమందలి కనకరశ్మిచాడ్పున, ముత్తెమునందు వెలయు రతనముకరణి, తీవయిల్లాలిచేతులందలి పువ్వుబిడ్డపోలుపున, బంగారువన్నెగల గొల్లమిన్నలందు నవ్వులాడు శ్యామసుందరుని కైవడి, కీలికీలలందు చలింపని జానయట్లు, ఘనవీథిలో జారిపడిన దేవాంగనవేనిమీది ధవళాంబరమువలె తోచు పండువెన్నెలడంబున, ప్రభాతకాలమున గగనలక్ష్మిగళమునకు జగదీశుడు కట్టిన మంగళసూత్రముమాడ్కి దోచు దినమణి భాతి, ముకుటమందలి కోహినూరుమణిమాడ్కి, నల్లనిగుండియమీది కౌస్తుభమణి భంగి, నందనందనుని మౌళిపైగల శమంతకమణి కరణి వర్ణమాలయందు కావ్యలక్ష్మి కాంతిలును. ఈలక్ష్మిజననము ఏసుపుట్టుక వంటిది. ఈశ్వరకరుణ కతన మేరీ కడుపున నేసు జనించెనని క్రైస్తవు లందురు. అనుభవసముద్భవమైన పరిజ్ఞానమునకు ప్రతిభాసంపర్కమునందున కావ్యరమ కూతురై పుట్టుచుండును. మనవ్యహృదయమున నవతరించిన ఈశ్వరతేజస్సనే ప్రతిభ యని నేను వాకొందును. నీటితుంపురును వెన్నెలవాక కలిసినపుడు తళుక్కు లుదయించునట్లే, అక్షరహృదయమునందు కవిహృదినుండి చేరిన ప్రతిభాపూరమును అనుభవజనితజ్ఞానము కలియుతఱి మనశ్చక్షువునకు మిఱుమిట్లుగొలుపు మినుకు లుదయించును.

స్వీయపరిశీలనమునుండి, స్వీయయోచనమునుండి, స్వీయభావనమునుండి, స్వీయానుభవమునుండి భావసామగ్రి గొని తేజఃపూరితమైన హృదయమున దానిని రంగరించి, కలముకొనకు పుత్తెంచి రచయిత కావ్యసృష్టి గావించును. పరకీయపరికరము లీసృష్టికి పనికిరావు. అంగప్రత్యంగములు కూర్చి మనుష్యసృష్టి గావింపగలమా? గులాబిసృష్టి గులాబిగుండెయందే తలసూపినది. రేకులూడిన, నవ్వలినుండి కొన్నిదళములు కొనితెచ్చి కొమ్మకడుపున గోయిదీసి వానినందు ప్రాతిపెట్టినయెడల పువ్వుసృష్టి యగునా? ఇంద్రధనువు వియత్తలమున దోచు స్వయంభువు. ఎవ్వరేని క్రిందినుండి మీదికి పిచికారీగొట్టములతో

రంగురంగుల నీటిని గొట్టిన నింద్ర ధనుస్సు నిర్మింపబడునా? ఈచెయువునకు కడంగిన వారి మొగములపై నారంగునీరు రాలి, వారికి కోతిరూపులు ప్రసాదింపదా? ప్రజ్ఞాధురీణులైన కావ్యకర్తలకు ప్రణమిల్లి, వారి దృష్టాంతముల కతన నాంతరంగికోద్వేగమునంది, ఈ యుద్వేగమున తలసూపిన శక్తులను పురస్కరించుకొని సహజమై, స్వతంత్రమైన కావ్యసృష్టికి మనము దొరకొను టొప్పు.

అవ్వలినుండి కైకొనబడిన ఉపకరణములనుండి (అవి యనుభవజనితము లైనను, అన్వేషణమున దోచినను) కావ్యసృష్టి కానేర దనునంశమును బహుళదృష్టాంతములనుండి చదువరులు గ్రహింపగలరు. పెక్కురాళ్లు నొక్కచో జేర్చినయెడల పెద్దదిబ్బ తయారగును గాని తాజమహలు సృష్టియగునా? యవనికపై నేడు రంగులను రాల్చినంతన, రోతపుట్టించు పులుముడు గోచరించునుగాని ప్రతిమ ప్రత్యక్షమగునా? సరిగమలను వరుసగ వడివడిగ పలుమారు వాగినతోడన, వెఱ్ఱిధోరణి వినబడునుగాని, మంజులాలాపనము శ్రుతిగోచరమగునా? తెయ్యిమనినపుడు తోచునది నృత్యముకాక పిచ్చిగంతు కాదా? పెద్దబాలశిక్షలోని అక్షరపంక్తిని కాపీపాత్తములం దెక్కించినపుడు, అర్థములేని చెత్త యగపడును గాని సర్వాంగసుందరి యైన కావ్యలక్ష్మి సాక్షాత్కరించునా? దిబ్బలోను, పులుముడులోను, వెఱ్ఱిధోరణిలోను, పిచ్చిగంతులోను, చెత్తలోను రూపులేదు; పొందు హుళిక్కి; లయ నాస్తి; సమన్వయముసున్న; భావము శుద్ధపూజ్యము; ప్రాణము పూర్ణానుస్వారము. రూపును, పొందును, లయను, అంగాంగసమన్వయమును, భావమును, ప్రాణమును సృష్టించుశక్తి నేర్పిన నలవడునది కాదు. అది నైసర్గిక మైనది. ఈశ్వరస్పర్శకతన నేవస్తువైనను ప్రాణసహిత మగులీల, పైననుల్లేఖింపబడిన ఉపకరణములను నైసర్గికహృదయశక్తి సోకినంతన నవప్రాణసంచారమునంది, లలితకళలనబరగి మానసికనయనములకు పండువును, ఆంతరంగికకర్ణములకు విందును గావించి ఆత్మ నలరించును. దండిప్రభృతు లీశక్తిని ప్రతిభ యని పేర్కొనిరి. ఇది రచనాకౌశలమందును, శిల్పనైపుణ్యమందును, ఆలాపనమందలి నేరిమియందును, భావబంధురనృత్యభంగిమమందును ప్రకాశమగును. కళోపాసకుడు తన్మయభావమున మునిగి, ఆత్మవిస్మృతుడై యున్న మహూర్తమున, హృదయసింహాసనమున నాసీనుడైయున్న భగవానుడు "నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్" అని వాని నుద్దేశించి పలికి, వానిరసనముపై దివ్యవాక్కుల దేలించి, ఆతని లేఖినీముఖమునుండి భావభువనములను దొరలించును. కావ్యజగతియం దావాక్కులు వంశీరవమట్లు వినంబడును; ఈ భువనములు సుందర సృష్టిని దృష్టిసమక్షమున జూపును. కావున కావ్యజగతికి దివ్యబృందావనము రూపాంతర మని వచింతును.

నిర్మాణసూత్రములను దృష్టినిడికొని, అంగప్రత్యంగములను తయారొనరించి, వానిలో నాయువు వోసి విధి మనుష్యుని సృష్టించులీల, నియమబద్ధ విషయసంయోగమున, వాక్యగ్రథనమున వరప్రసాదియైన రచయిత భావము వోసి కావ్యమును సృష్టించును.

తన కీశ్వరు డిచ్చిన శక్తిని కళోపాసకుడు తనకలమున బూరించును. మంత్రకాని చేతియందలి బెత్తము వలె నది దివ్యమంత్రశక్తి గలిగియుండును. కృష్ణప్రజ్ఞ సుదర్శన చక్రమున ప్రవేశించిన తెఱగున, కళోపాసకునిప్రజ్ఞ ఆతనికలమున బ్రవేశించును. నిర్మాణనియమములను సహకారుల గావించుకొని, మానసనేత్రము ముందు భావనము నిలిపిన దృశ్యమునకు సమాధి నున్నతటి హృత్పీఠి బ్రత్యక్షమైన దివ్యసుందర రూపమునకు ప్రభావ కలితమైన తనకలముచే నీతడు ప్రతిరూపమును ప్రతి దృశ్యమును చిత్రించునపుడే అం దాయువు ప్రవేశించును. పుష్పసృష్టి యగుట ఒకప్పుడు, అందు సౌరభము ప్రవేశించుటవేరొకప్పుడునగునా? సృష్టియనుడు, ప్రాణప్రతిష్ఠయనుడు, జీవప్రదీప్త సౌందర్య మనుడు, భావబంధుర సౌష్ఠవ మనుడు, రచనానైపుణ్య మనుడు, కళాకౌశల్య మనుడు ఈ చిత్రలేఖనమున జేరియుండును.

జిజ్ఞాసగల దృష్టితో, జగదీశుడు ప్రసాదించిన హృదయముతో భ్రమణ-మొనరించుచు, ఆంతరంగిక

ప్రోత్సాహము కతన జంకుగొంకులకు చోటీయక, వివిధానుభవములకు ఆత్మజీవనమున చోటొసగుచు, హృదయస్థశక్తిని వీనిలోని కావాహన మొనరించుచు, నేనీరచనమునకు గడంగితిని. గుండెలో నాధ్యాత్మికమైన పరుసవేదికలదని నాదృఢ విశ్వాసము కావున దీని స్పర్శ నందినంతన వివిధానుభవములు దివ్యగుణసమన్వితము లగునని హృదయపూర్వకముగ నమ్ముచుంటిని గనుక, ఇట్టి యనుభవములే కావ్యసామగ్రి యగునని పూర్ణముగ విశ్వసింతును గావున, నీశ్వరు నుద్దేశించి చేతులు మొగిచి ఈ రచనమున కావ్యవిభవము తోచునేమో యని ఆశపడుచున్నాను; ఇందు సహజసృష్టి, స్వతంత్రసృష్టి, ఆత్మను తనువుసృష్టి కన్పట్టునేమో యని మక్కువపడుచున్నాను; నాయారాధ్యదేవి సాహిత్యలక్ష్మి నాయెడల ప్రసన్నయై నా రచనమును కమలాలయము కావించునేమో యని మిక్కిలి యాశించుచున్నాను. నాయాశ ఫలించునేని, నాయుద్దేశము సిద్ధించునేని నాజన్మ ధన్యమైనదని యానందింతును.

నాయాశయ మెద్దియో వినీతభావమున చదువరుల మ్రోల విన్నవించుచు, నా జీవయాత్రలోని ఈ మహారాష్ట్రీయాత్రయందు నాకు చేకుఱినఅనుభవములనుగుఱించినకథమాత్రము చెప్పియూరకొనక, అందుండి నేను సంగ్రహించిన భావసామగ్రిని, సాహితీ సూత్రములను, కావ్యపరికరములను సందర్భోచితముగ నిందును నందును వ్యక్తపఱచుచుంటిని. వింతను, విడ్డూరమునే చూపునది కావ్యము కాదని నా యభిప్రాయము. వింతకై, విడ్డూరమునకై మాత్రము పొత్తములు తెఱచి, వానికే పారితోషికము లిచ్చుపాఠకులు కొందఱుండుట నే నెఱుగుదును. నా రచనలు వీరికై గాని, వీరిపసదనములకై గాని తలనూపుటలేదు. సత్యసందీప్తములై, సౌందర్యసముద్భాసితములై పఠితహృదయము నాకర్షించినవియైన చిత్రములను తెలుపుచు, నంతమాత్రమున తృప్తి నందక, పఠితప్రతిభను తనిపి, పఠితయాత్మ నలరించు భావసామగ్రిని ఆయా సందర్భములందు మనసున పొడసూపిన కావ్యమునుండి కైకొని నేనీ గ్రంథపీఠమున జేరవేయుచుంటిని. జరిగిన సంగతుల జాబితాను వివరించుట నా యుద్దేశము కాదు. సాహిత్యము జాబితా కాదు; కావ్యము చిట్టా కాదు. నాయాశయము లెవ్వియో, నా రచనోద్దేశము లెవ్వియో గ్రహించి పాఠకమహాశయులు నా యత్నములను విశాలదృష్టితోను, విజ్ఞానదృష్టితోను విలోకింతురని ఆశపడుచున్నాను.

అమ్మ దివంగతయైన నిముసమున జడివానవలె నార్తి నాతేబాయమును మూగ్కొనినది. నిర్మలమైన అయ్యగుండియ శ్వేతాతపత్రమై వడిగల ఆ జడినుండి నన్ను కాచినది. దుర్విధి ఎదురై ఆ పవిత్రచ్ఛత్రమును వమ్ముజేసి, నా బ్రదుకుపై దుమ్ము బోసినది. దురంత దురితోత్కటపరిస్థితులు గదలుపూని నాపైదుమికి, నా గుండెలను గుండజేయదలపడినవి. ఒకచేత గుండియలను బట్టితిని; నాకై మిగిలిన అయ్యచితిలోని విభూతిని రెండవకేల గైకొంటిని. నాకు కలదానిని కావలసిన వారు కబళించుటచే, నిక నావియనుకొనదగినవి రెండు చేతులగల ఈ సొమ్ములే. కొండొకవడి మిసులమాన్పిల్లినను, కడుంగడు పవిత్రమైన ఆ వమ్మునుండి ఆత్మనుదనపుసొమ్మును సృష్టించుకొన నిశ్చయించి ఆ ముహూర్తమందే అందుండి పయనమును ప్రారంభించితిని. నాటి శ్మశానఘట్ట మీయాత్రలోని ప్రథమఘట్టమై నేటి కావ్యఘట్టమైనది.

---

# నేపాళదేశము

౧౯౩౫ సం. ఉత్తరార్ధంలో సారనాథం మూల గంధకుటీ విహారపు వార్షికోత్సవం చూడడానికి వెళ్లితే అక్కడ భదంత రాహులసాంకృత్యాయనులను కలుకోడం సంభవించింది. మాటలధోరణిలో "కొన్నాళ్ల నుంచీ నా వొళ్లు బాగాలేదు. నేను లంకా నివాసిని. ఈ కాశీసీళ్లమా నాకు పడటంలేదు." అని అంటే వారు "శివరాత్రికి నేను నేపాలుకు వెళ్లుతాను. ఆఖరు న్యాయపరీక్ష ముగిసింతరువాత మీరుకూడా రండి. అక్కడ కొన్నాళ్లుంటే మీశరీరం బాగుపడుతుంది. తరువాత నాతోగూడా తిబెత్తుకువస్తురుగాని" అని



పగ్గపుదారి (Rope-way) స్టేషను

అన్నారు. అప్పటి కంతటితో సరిపోయింది. ౧౯౩౬ సం. ఫిబ్రవరినెలలో రాహులుగారిని కలుసుకొనగా మళ్లీ నేపాలు, తిబెట్టు ప్రయాణాలనుగూర్చి ఎత్తారు. నేనూ కొంచెం తటపటాయిస్తూ వెనుకాముందాడుతూ "మీరు పదండి, నేనూవస్తాను" అని అన్నాను.

చాలామంది స్నేహితులుకూడా కలిసి నన్ను వెళ్లమని ప్రోద్బలంచేయడం మొదలుపెట్టారు. అంతలో రాహులుగారు నేపాలంజేరి అక్కణ్ణుంచి ఒక పెద్ద వుత్తరం వ్రాస్తూ కాట్మండు చేరడానికి గల వీల్లన్నింటినీ విశదంగా తెలియపరచారు. అంతమనస్సును గట్టిపరచుకొని ౧౯౩౬ సం. మార్చి ౧౧ తారీఖున బెనారస్ కంటోన్మెంటు స్టేషన్నుంచి బయులుదేరాను. నన్ను సాగనంపడానికి రైలుదగ్గరికివచ్చిన మిత్రులందరూ "త్రివిష్టపం స్వర్గం గత్వా" అనే మహాభారత వాక్యాన్ని స్మరిస్తూ "మీరు స్వర్గానికి వెళ్లుతున్నారే" అని సాగనంపారు. ముజప్ఫర్‌పూర్, సుగౌలీలలో బండ్లను మార్చుకొంటూ రక్సౌల్ మీదుగా ౧౭ తేదీ తెల్లవారి ౮ గంటలకు వీరగంజ్ చేరాను. రాహులుగారి సూచనను అనుసరించి నేను సాహుధర్మరత్న గారి ఇంటికి వెళ్లవలసివుంది. నేపాలుకు ప్యాస్‌పోర్టు ఇప్పించడానికి వారే ప్రయత్నించాలి. కొంచెంముందుకు వెళ్లానోలేదో నేపాలు పోలీసు జవానొకడు నోటుబుక్కు పెన్సలు చేతబట్టుకొని నా దగ్గిరకువచ్చి ప్రశ్నలువేసి నోటుబుక్కు నింపడం ఆరంభించాడు. ఎవరు నీవు? ఎక్కణ్ణుంచివచ్చావు? ఎక్కడికి వెళ్లుతావు? ఎందుకు వెళుతున్నావ్? అని ఈలాటిప్రశ్నలన్నీ వేసి చిట్టచివరకు "నీకు నేపాలుకు వెళ్లడానికి అనుమతి దొరకదు." అంటూనే వెళ్లిపోయాడు. సరే అని నేనూ ధర్మరత్నగారి ఇంటికి వెళ్లాను. మరునాడు సాహుగారు ప్యాస్‌పోర్టుకోసం ప్రయత్నం చేశారు కాని సఫలంకాలేదు. అందుమీద నేను కాట్మండుకు రాహులుగారికి టెలిఫోనుచేయించాను. అంత ౧౪ తేదీనాటికి కాట్మండులోని ఉన్నతాధికారులు నా ప్యాస్‌పోర్టుకు స్వీకరించినట్లు వీరగంజియందలి తమయధికార్లకు టెలిఫోనుద్వారా తెలియపరచారు. ఇక నన్ను అడ్డగించగలిగేదెవరు? కాని ఆనాడు శనివారం. నేపాలుసర్కారుకు శనివారమే ఆదివారం. ఆనాడు కచేరీలన్నింటికి సెలవు. కాబట్టి ఇంకోరోజు అక్కడే ఆగవలసివచ్చింది. మర్నాడు ప్రొద్దున్నే నా సామానుతోపాటు స్టేషనుకు వెళ్లడానికి పూనుకుందొరికింది. అక్కడ వక నేపాలీఆఫీసరుగారు వచ్చి నన్ను కలుసికొని ఒకటిరెండు ప్రశ్నలడిగి అతని వెంటనున్న జవానుకు ఉంగరం తీసియిచ్చాడు. జవాను ఆ వుంగరం

తో మొహరువేసి ప్యాస్‌పోర్టును నాచేతికిచ్చాడు. అటు పిమ్మట నేను నేపాలువారి కిల్లరైలులో ఎక్కికూర్చు న్నాను.

రైలుబండి వీరగంజినుంచి ౧-౩౦ కు బయలుదేరింది. ఆదివరకు ఎద్దుబండ్లు నడిచే పాతరోడ్డు వెంటవెంటనే రైల్వేలైను పోవడం చూస్తే ఆధియాఖం డాన్ని వెంటబెట్టుకొని యూరోపు ముందుకు సాగిపోతూవున్నదో అనిపించింది. కొన్ని మైళ్లుపోయిన పిదప పాతరోడ్డు దూరమైపోయి ఇకకన్పించలేదు. ౨౯ మైళ్ల దూరంనడిచి ఇంచుమించుగా ఒంటిగంట అయ్యేసరికి రైలుబండి ఆమ్‌లేఖగంజికి పోయిచేరింది. ఇక్కడితో రైలుదారికూడ సమాప్తం. రాబోయే మకాం భీమఫేది. అంతవరకూ మోటారులారీలు వెళ్లుతాయి. కాని ఇవి ధాన్యపు బస్తాలను, సామాన్లను మోసుకొనిపోయే లారీలు. ప్రయాణీకులను గూడా వాటితోపాటే ఎక్కిస్తూ ఉంటారు. ఒక్క రూపాయకు ఒకసీటు. ఉప్పుబస్తాలతోపాటు నేనూ ఒకలారీలో ఎక్కికూచున్నాను. అక్కణ్ణుంచిఎక్కుడు మొదలైంది. లారీ పాతది. నడక మందం. పాస్‌పోర్టు తనిఖీకనీ, నీటికనీ అక్కడక్కడనిలుస్తూ సాయంకాలానికి భీమఫేదీకి పోయి చేరింది మా లారీ.

భీమఫేదీ ఒక చిన్న గ్రామం. అదీరెండుగా విభక్తమై ఒకభాగం సరిగ్గా కొండ అడుగునవుంది. ఈరెండు భాగాల్లోని ఇళ్లన్నీకలిపి పాతికకంటే ఎక్కువవుండవు. గ్రామస్థులలో అధికసంఖ్య నేవారుజాతివారు. ఆమ్‌లేఖగంజినుంచి ఇక్కడకు ౨౨ మైళ్లు. మోటారు లారీలు నడవడం ఇక్కడివరకే. ఇకమీద స్వయంగా నడిచో, లేక గుర్రాలమీదనో ప్రయాణం సాగించాలి.



కాట్మండు కనుమ

ఇక్కడినుంచి కాట్మండువరకు ౧౪ మైళ్ల పొడవున పగ్గపుదారి (Rope-way) వుంది. దానిద్వారా సామాన్లు కాట్మండుకు రవానా అవుతూవుంటాయి. లారీనుంచి దిగంగానే కూలీవాళ్లు అనేకులు వచ్చి నన్ను చుట్టవేసుకొన్నారు. కొంచెంసేపు వాద వివాదాలు జరిగినమీదట రూపాయపావలాకు ఒకకూలీ దొరికాడు నన్ను కాట్మండువరకూ తీసుకొని వెళ్లడానికి. తరువాత ఉదరపూర్తి గావించుకొని ఒక అంగట్లో

పడుకొని రాత్రి గడిపాను. తెల్లవారు జామున నాలుగు గంటలకే కూలీవచ్చి తలుపుగొట్టి లేపాడు. ప్రయాణం సాగించాం. కొండమీదికి ఎక్కడం ఆరంభం. కూలి వాడికి అలవాటు, సరాసరి ఎక్కిపోతున్నాడు. కాని నాకు చీకట్లో దారే సరిగ్గా కన్పించడంలేదు. ఏదో ప్రకారం నడిచిపోతున్నాం. తెల్లవారింది. ఇంకా ఎక్కడమే. ౭-౩౦ కు కొండశిఖరంమీదికి చేరాం. అక్కడ నేపాలువారిపోలీసులు ఉన్నారు. యాత్రీకులను మూలమట్టుగా శోధిస్తారు. అక్కడితో ప్యాస్‌పోర్టు తంటా ముగిసిపోతుంది.

తప్ప ఇతర విదేశీయులకు నేపాలులో కాలు పెట్టడ మంటే దుర్లభమే. ౧౮౮౧ మొదలుకొని ౧౯౩౫ వరకు గల ౫౪ సంవత్సరముల దీర్ఘకాలంలో కేవలం ౧౫౩ గురు యూరోపియనులు ఖాట్మండు ప్రవేశింప గలిగారు. వారిలో చాలమంది సర్కారు పనిమీద వెళ్లినవాళ్లే. ౫౫ గురు ఖాస్ నేపాల్ మహారాజుకు అతిథులుగ వెళ్లినవారు.

అనంతరం దిగుడు ఆరంభమైంది. ౯-౩౦ కు కులీఖానా అనే మకాం చేరాం. మధ్యాహ్నపు భోజనం అక్కడే. ఇది సాధారణంగా ప్రయాణీకులు



పశుపతి నాథమందిరము

నేపాలు వెళ్లడానికి పరదేశీయులకే గాదు, నేపా లీలకు సైతంప్యాస్‌పోర్టు ఉండితీరాలి. సంవత్సర మంత టిలోనుఒక్క సందర్భంలోమాత్రం ఈప్యాస్‌పోర్టునిర్బంధంవుండదు. శివరాత్రికి పశుపతి నాథమహాదేవుని దర్శించడానికి వెళ్లే తీర్థయాత్రికులకు ప్యాస్‌పోర్టు తీసుకోవలసిన తంటా ఏమీవుండదు. ఇక భారతీయులకు

దిగి అన్నపానాలు చేసుకొని, భుజించి కొంచెం విశ్రాంతితీసుకొనే స్థలం. పదిపన్నెండు అంగళ్లు, సస్య శ్యామలమైన మనోహర ప్రదేశం - ప్రాకృతిక దృశ్యం మహాసుందరంగా ఉంది. సమీపంలోనే జల జలమని ఒక నిర్ఝరిణి పారుతూవుంది. దీనిని చూడగానే మాజన్మ భూమి లంకలోని "మనకేలియా" జ్ఞాపకానికి వచ్చింది.

భోజనాదులు చేసుకొని మళ్లీ ప్రయాణం సాగించాం. ఆటు ఎండ తీక్షణమైనకొలదీ మా నడకకూడా తీవ్రతను దాల్చింది. మొదటికొండ దిగడంతోటే వేరొక చిన్న కొండ ఎదురుగావస్తే దాన్నీ ఎక్కిదిగాం. మూడో కొండ ఎక్కడం సాగించాం. ఇది అన్నిటికంటే కఠిన మైన ఎక్కడు. కావడానికి నా వెంటవున్నకూలి కొండ మనిషే. ఇంతవరకూ బాగానే ఎక్కివచ్చాడు. ఇప్పుడు ఈకొండ నెక్కడంలో అతడూ వెనుకపడడం మొదలు పెట్టాడు. అతనువచ్చి కలుసుకోడానికి మధ్యమధ్య ఆగుతూ, అలసట తీర్చుకొంటూ, రొజుకొంటూ

భీమఫేదీనుంచి థాక్కోటకు ౧౫ మైళ్లు. మహా కఠినమయిన మార్గం. అందులో మూడు కొండలు ఎక్కి దిగడం. నడిమికొండ సులభమైనదేకాని ఇటూ ఆటూ వున్న కొండలు మహావికటమైనవి. బండ్లమార్గం నిర్మించ డానికి వీలులేనంత నిలువున గోడలులాగు నిలుచొని ఉన్నాయి. ఈ రెండుకొండలను దాటవలసిన కనుమ దార్లు- శిశగిరి, చంద్రగిరి అనేవి భారతవర్షపు మైదా నానికి ౬౦౦౦ అడుగులు ఎత్తున వున్నాయి.

థాక్కోటలో ఏడెనిమిది ఇళ్లకంటే ఎక్కువ లేవు. నేపాలుమార్గంలో సాధారణంగా ప్రతివూరులో



పాటనులోని రాజదర్బారు స్థలము

రొప్పుకొంటూ సాయంకాలానికి పర్వత శిఖరం మీదికి చేరాం. అక్కణ్ణుంచి దిగుడు ఆరంభమైందిగాని ఇది వరకటి ఎక్కుడుకంటె ఎక్కువ కఠినమైన, గుండెలు హడలగొట్టే దిగుడు. చివరకు ౬-౩౦ గంటలకు "థాక్కోట" అనే ప్రదేశంచేరి రాత్రికి మకాం వేశాం.

ప్రయాణీకుల విశ్రాంతి నిమిత్తం చోటూ, వంటవండు కోడానికి పాత్రలూ, కావలసిన సామాన్లూ అన్నీ దొరుకుతాయి. ప్రత్యేకం అద్దె ఏమీ ఇవ్వనక్కరలేదు. దుకానదారువద్ద మనకు కావలసిన సామానులను కొను క్కొంటేచాలు.

థాన్‌కోటలో నా కొక నేపాలీకుటుంబం వారు కాట్మాండునుంచి తిరిగివస్తూ కలిశారు. వారేదో వ్యాజ్యం



పాటనులోని అశోకస్తూపము

సంబంధంలో అక్కడికి వెళ్లారట. వ్యాజ్యం తీర్మానమైనతరువాత రెండురోజులకంటే ఎక్కువ వారికి కాట్మాండులో నిలవడానికి వీలుకాలేదు. ఆతత్క్షణం థాన్‌కోటకు బయలుదేరారు. ఇందువల్ల నేపాలు సర్కారువారు నేపాలీయులైనప్పటికీ వారిమీద ఎంత కఠినంగా వ్యవహరిస్తున్నదీ విదిత మవుతుంది.

భోజనంచేసి పడుకొన్నాను కాని నిద్రపట్టలేదు బాగా. తెల్లవారకముందే లేచి కాలకృత్యాలను తీర్చుకొని ప్రయాణం సాగించాం. ఒక్క ఫర్లాంగుదూరం దిగంగానే సరాసరి కాట్మాండుకుపోయే బండ్లదారి దొరికింది. రోడ్డుకు రెండువైపులా పచ్చిక బయళ్లూ పొలాలూ. మధ్యమధ్య ప్రయాణీకుల రక్షణకి పోలీసు ఠాణాలు. థాన్‌కోటనుంచి కాట్మాండుకు ఏడేమైళ్లు. దారి సరళమైనది కాబట్టి ౯-౩౦ గంటలకల్లా కాట్మాండు ప్రవేశించాం. రాహులుగారు నా కోసం చాలా ఆతుర్దాతో కనిపెట్టుకొని వున్నారు. ఆనాడు నేనచటికి చేరకపోయినట్లయితే మర్నాడు నాకోసం బీరగంజికి టెలిఫోను చేసేవారట.



పశుపతినాథమందిరశ్రేణి

వెళ్ళిపొమ్మని పోలీసు అధికారులు ఆజ్ఞాపించారట. పాపం భోజనమైనా చేయకుండానే కాట్మాండునుంచి

కాట్మాండు ఒక సమతలమైన లోయలో వుంది. చుట్టూ మహోన్నతాలయిన పర్వతాలు గోడలులాగు

నిలుచోని వున్నాయి. నాలుగువేపులా చూసినట్లయితే ప్రకృతి కొండలనే గోడలతో నైసర్గికదుర్గం నిర్మించిందా అనిపిస్తుంది.

రాహులుగారికి ప్రూఫులు మొదలగునవి పరిజూచి పంపవలసి వచ్చుటచే మేము ఏర్పరుచుకొన్న కార్యక్రమం అనుసరించి తిబెతుయాత్రకు ఇంకా వకనెల అవకాశముఉంది. కాబట్టి ఈ మధ్యకాలంలో నేపాలమందలి ఐతిహాసిక, దర్శనీయ స్థలాలను చూడవలెనని సంకల్పించాను. అదిగాక తిబ్బెతు వెళ్లడానికి ముందే అక్కడి భాషా శబ్దాలు కొన్నింటిని నేర్చుకోవాలి ఆదేశంలో మాకు తోడుపడడానికి. అందుచే మార్గాయాసాన్ని సైతం లెక్కచేయకుండా వెంటనే కర్తవ్యాచరణానికి పూనుకొన్నాను.



స్వయంభూనాథు, వజ్రప్రతీకము

కాట్మండు చేరినమరునాడే రాజగురువు హేమరాజు శర్మగారిని చూడడానికి వెళ్లాను. చాలా సేపటివరకూ మాయిద్దరికీ వార్తాలాపాలు జరిగాయి. ఆయన మంచిపండితులు. ఆయననోటివెంట వచ్చే ప్రతిమాటలోనూ ఆయన విద్వత్త ప్రకటమవుతూ వచ్చింది. సంస్కృతం, హిందీ, బంగళా, ప్రాకృతం, ఇతిహాసం, పురాతత్వము మొదలైనవాట్లో వీరికిగల జ్ఞానము మహావిస్తృతమైనది. సుప్రసిద్ధ బౌద్ధ దార్శనికుడైన ధర్మ

చదువుకని నాకు సలహానిచ్చారు. మరియు ప్రాచీన తాళపత్రములందలి కుటిలా, మాగధీ, రంజనా మున్నగు లిపులను చదివి తెలుసుకొనగలుగునట్లు అభ్యాసము చేయిస్తానని కూడా చెప్పారు. హేమరాజు శర్మగారు ప్రాచీనపద్ధతి ననుసరించి కాశీధామంలో సంస్కృత వ్యాకరణం, దర్శనాదులను అభ్యసించినవారే. ఇక



కాట్మండులోని సింహదర్బారు,
మహారాజు మహలు

వీరిప్పుడు వుండేది నవీనవిచారాలు ప్రవేశించడానికి ఏ లేశమాత్రమూ లేని దుర్గమ పర్వతప్రదేశాలమధ్య. అయినప్పటికీ ప్రపంచమందలి ఆధునిక విషయములను సైతమూ బాగుగ అవగాహనంచేసికొని వున్నారనుట చాలా ఆశ్చర్యంగొలిపేసంగతి. వారీ వృద్ధదశయందునూ మిగుల పరిశ్రమతో పఠన పాఠనాదులలో నిమగ్నులయి క్షణక్షణమునకూ మారిపోతూవుండే నవీనయుగపు విచారములందు సైతమూ అప్-టు-డేట్ పరిజ్ఞానము కలిగియుండుట మిగుల హర్షింపదగినది. వారివంటి బహుశ్రుత, కార్యక్షములైన విద్వాంసులు నేపాలులో ఒకరిద్దరికంటె ఎక్కువ వుండరనుకొంటాను.

౧౯౩౭ సం. మార్చి ౩౧ వ తేది ప్రొద్దున సైకిలుమీద ఒక నేపాలీ పెద్దమనిషి శ్రీమాన్ దాసు గారిని వెంటబెట్టుకొని ఇచటి పుణ్యప్రదేశాలను చూడటానికి బయలుదేరాను. మొదలు బోధాస్తూపం వైపునకు వెళ్లాం. తిబెత్, చీనాలవరకూ పేరుమోగిన గొప్ప

కీర్తి వ్రాసిన ప్రమాణవార్తిక మను గ్రంథమును బా గావా టిలో బోధాస్తూపంగూడా వకటి. నేవారి భాషలో

దీనిపేరు "ఖస్త్రీః" తిబ్బెతు భాషలో "జరూఖాసర్." చీనా నేపాలుదేశాలకు సర్కారీ సంబంధంవుండిన దినాల్లో చీనాదేశపు రాజదూత ఇక్కడే వుంటూవుండే వాడనుకొంటాను. ఇప్పుడు కూడా బోధాయందలి వ్యవస్థ



కాట్మండులోని ఒక చతుర్దిక్-బుద్ధమూర్తి

ఒక చీనాదేశపు లామాయధీనమందే ఉన్నది. స్తూపము సువర్ణమయము. చుట్టూ ఇండ్లవరుసలున్నాయి. మంచి రక్షితదశలో ఉంది. కాట్మండునుంచి ఇక్కడకు మూడు మైళ్లు-మధ్యరోడ్డు. రోడ్డుకు రెండువేపులా జీర్ణ దేవాలయాలు, శిథిలములైన స్తూపాలు ఎన్నో కనిపించాయి. మొన్నవచ్చిన బీహారపు భూకంపము ఈ కట్టడాలన్నింటినీ నేలమట్టం చేసిపోయింది. మిగిలినవాటిని ఎండలూ, వానలూ తింటున్నాయి. నేపాళదేశపు సిద్ధహస్తులయిన కళాకుశలులు నిర్మించిన ఉత్కృష్టవిగ్రహాలు నేడు మీాదికప్పులన్నీ కూలి పడిపోవడంచేత బట్టబయలై కన్పిస్తున్నాయి. పట్టణానికి ఒక మైలుదూరంలో "అమరసింహ" అని వేరొకడు విహారం. సుప్రసిద్ధ అమరకోశకారుడు అక్కడే వుండేవాడని ప్రతీతి.

బోధాస్తూపానికి ఎదురుగావున్న క్షేత్రానికి అడ్డంపడి మధ్యగుండా ఒకమైలు వెళ్లినపిమ్మట కుడిచేతివైపు గుహ్యేశ్వరీదేవాలయం వస్తుంది. ఇది మహాచిత్తాకర్షకమైన స్థానం. నాలుగువేపులా పూలు చెక్కిన వెండిపలకల కూర్పుతో, మధ్య సువర్ణశిఖర కిరీటాన్ని ధరించిన ఈ మందిరం చూడడానికి అతి మనోహరంగా వుంటుంది. నాలుగు మూలలందు పడగలెత్తుకొని నాలుగు రజతనిర్మితసర్పాలు నిలుచొని వున్నాయి. వీటివల్ల దేవాలయపు శోభ ఇనుమడించింది. దేవళంలోపలవున్నది ఒకజల. ఎల్లప్పుడు వెండిమూతతో మూసివుంచుతారు. లోపల నాల్గువైపులా తాజేళ్లమూర్తులున్నాయి. నేపాలుదేశపు దేవాలయాలన్నింటిలో హిందువులూ, బౌద్ధులూ రెండు జాతులవారు గలసి దేవతాపూజలను చేస్తూవుంటారు. దేవతయొక్క పేరుమాత్రం వేరువేరు. అటులే ఇచటికి కూడా హిందువులు, బౌద్ధులు వస్తూఉంటారు ఉపాసనా నిమిత్తం. ఇక్కడ వాగ్మతీయనేనది పారుతూవుంది. భిక్షుకులు నీళ్లుత్రాగడానికని కర్కశచంద్ అను కొండదగ్గరనుంచి బుద్ధభగవానుడీ నదిని తీసుకొని వచ్చాడని చెబుతారు. దీనితీరం వెంటవెంట కొంతదూరం వెళ్లినయెడల పశుపతినాథుని దేవాలయం వస్తుంది. ఇది నేపాలులో ప్రఖ్యాతికెక్కిన హిందూతీర్థస్థానం. దీని



కాట్మండులోని నేపాలమహారాజు మహలు

దర్శనానికి ప్రతిసంవత్సరమూ భారతవర్షమునుంచి కూడా వేలకొలది తీర్థయాత్రికులు శివరాత్రికి వస్తూవుంటారు. దేవాలయంలోపల నలువైపుల నాలుగు మొగాలు కల స్తంభం వొకటివుంది. ఎరగనివాళ్లు దాన్ని

చూచి బ్రహ్మయని భ్రమపడుతుంటారు. అడుగున నేలంతా రూపాయలతో జోడించివుంది. ప్రసిద్ధ క్షేత్రమవడంచేత ఇక్కడ ధనసంపత్తికేమీ కొదువయనేమాట లేదు.

పశుపతి నాథంనుంచి ఒక మామూలు రోడ్డు మీదుగ రెండుమైళ్లునడచి వెళ్లితే పాటన్ అనే స్థానమును చూడవచ్చు. మధ్య ఒక సుందరమైన వంతెన మీదుగా వాగ్మతీనదిని దాటాలి. ఈ ప్రదేశం పేరు సంఖుసుగాల్. దీనిని ఉత్తరప్రయాగ అనికూడ వ్యవహ-



నేపాలుదేశపు నడిమితరగతి మహిళ

రిస్తారు దగ్గరే రెండునదుల సంగమం ఉండటంచేత. పాటన్‌లో ప్రవేశించగానే కుడిచేతివైపు చారుమతీ చైత్యమని ఒకస్తూపం కనుబడుతుంది. పాటన్ నాలుగు కోణాలల్లో నాలుగు ఇటువంటి స్తూపాలే. మొదటి స్తూపానికి నలుప్రక్కలా నాలుగు సుందరమూర్తులున్నాయి. నేవారి భాషలో శ్రీ ౫ రాజరాజేంద్ర మహీపతీంద్రుని పేరుగల ఒకశిలాశేఖ ఉంది.

పాటన్ ఒకపురాతన స్థానం. మౌర్యులకాలంలో నేపాలుకూడా అశోక చక్రవర్తి సామ్రాజ్యంలో వుండేది. క్రీ. పూ. ౨౫౦ వ సంవత్సరములో అశోకుడు నేపాలుకు పోయి ప్రాచీన రాజధాని యయిన మంజు పాటన్‌కు బదులుగా లలితపాటన్, లేక లలితాపురమనే పేరుతో నొకక్రొత్త పట్నాన్ని నెలకొల్పాడు. ఆమంజు పాటన్, లేక లలితాపాటనే ఇప్పటిపాటన్. అశోకుడు దీనిని పవిత్రస్థానముగనెంచి నాలుగు ప్రక్కల నాలుగుస్తూపాలనూ, మధ్య నొకస్తూపాన్నీ కట్టించాడు. అప్పుడాయనవెంట ఆయనకూతురు చారుమతికూడా వచ్చివుండింది. అనంతరమామె భిక్షుకయై ధర్మప్రచారం కొరకు ఇక్కడే నిలచిపోయింది. పాటన్‌లోని మొదటి స్తూపానికి ఆమెపేరునుబట్టే చారుమతీ స్తూపమనుపేర కలిగింది. నగరములోని స్తూపం పాడైపోయినప్పటికి కోణాలందున్నవి ఇప్పటికినీ మంచిస్థితిలో నేఉన్నాయి.

పాటన్ యావత్తూ దేవాలయాలమయం. దానికింతటి మహత్తురావడానికి ఇవే కారణాలు. వానిలో నాగవహల్ అనేబౌద్ధ విహారంవకటి. అందు బుద్ధ భగవానుని విగ్రహమును దానిరెండు ప్రక్కలా సారిపుత్ర మౌద్గల్యాయనుల మూర్తులును గలవు. ఇప్పుడిచట ప్రయివేటు ప్రయిమరీ స్కూలు ఒకటి సాగుతూవుంది.

నాగవహాలుకు పడమట సరస్వతీనది వేరొక పవిత్రస్థలం. ఇక్కడా వెండిబంగారాలకూ రత్నాలకూ తక్కువలేదు. బుద్ధ భగవానునకు కిరీటంపెట్టి హారాలువేసే ఆచారం బహుశా మహాయాన దేశాలన్నింటిలో ఉండవచ్చు. ఇక్కడి విహారపు బంగారుకప్పు ఆకాశాన్నుంచి క్రిందికి దిగే గరుడుని విచ్చుకొన్న రెక్కలలాగుంటుంది. ఆకప్పు క్రింది నుంచి నేలవరకూ వ్రేలాడుతూవుండే నానావిధహారాలు ఒక వింతయైన దృశ్యాన్ని కల్పిస్తూ ఉంటాయి.

మహాబోధ విహారపు ఆకారం, బుద్ధగయలోని దేవాలయపు ఆకారం వక్కటే. స్తంభాలు తప్ప మందిరం యావత్తూ ఇటుకలతో గట్టారు. భూకంపంవల్ల దీనికి నష్టం కలిగింది. కాని సర్కారువారు మరమ్మతు

చేయిస్తున్నారు. విహారపురచన మహా సుందరమైనది. నేపాలుకువచ్చే యూరోపియను లందరూ దీన్ని చూడాలని మహామక్కువ పడుతూ వుంటారు.

తరువాత మేము స్వయంభూచైత్యం చూడడానికి వెళ్లాం. పట్నం వెలుపల మైలు దూరంలో ఒక కొండ మీద దీని ఉనికి. కాని కొన్ని చిన్నస్తూపాలూ, కొన్ని శిలావిగ్రహాలూ కొండయడుగునుంచి చైత్యం వరకూ గల మార్గాన్ని ప్రదర్శిస్తూ ఉంటాయి. మెట్లు చాలా ఎక్కాలి. ఈ పర్వతం చూస్తే నాకు సింహాళంలోని మహిందగిరి జ్ఞాపకానికి వచ్చింది.



బోధాస్తూపము

లోపల ప్రవేశించడంతోటే యిరు ప్రక్కలా బుద్ధగయామందిరాలను బోలిన ఆకృతి గల రెండు విహారాలూ, ఎదురుగుండా స్వయంభూ చైత్యమూ కన్పించాయి. చైత్యంవేపు వీపులుండేలాగు అనేకసుందర మూర్తులు నాలుగు వైపులా ఆసీనమై ఉన్నాయి. స్తూప నిర్మాణ విధానం మహా సుందరంగా వుంది. అడుగున స్వల్పభాగం వదలి తక్కిన మందిరం యావత్తు ధాతునిర్మితమైన రేకుతాపడం కలిగివుంది. ఈ తాపడపు పరిమాణం ౫౦ అడుగు లుండవచ్చు. దానిమీద నంతటా బంగారునీరు పోశారు. ప్రధానస్తూపానికి దగ్గరగనే ప్రక్కలందు చిన్నస్తూపాలుకొన్ని వున్నాయి. వీటిచుట్టూ సుమారు రెండునూర్ల మంది జనులు కాపురాలు చేస్తున్నారు. ఇది ఇతిహాసప్రసిద్ధమైన క్షేత్రం. స్వయంభూపురాణమున దీని విషయమై కలదు. ఈ చైత్యోపాసన నిమిత్తం ప్రతిరోజూ యాత్రికు లనేకులు వస్తూ ఉంటారు. టిబ్బెత్తువరకు గూడ దీని ఖ్యాతి వ్యాపించివుంది. అక్కడివారికి కాశీ అంటే తెలియదు. కాని ఈ చైత్యంపేరు చెబితే అందరికీ తెలుసు. ఇక్కడ నీళ్ల యిద్దడి. యాత్రీకులు నీళ్లకొరకు కష్టాలు పడుతుంటారు. సర్కారువారు ఈ ఇబ్బంది తొలగింప గలిగిన యెడల ఎంతో మేలవుతుంది.

స్వయంభువు నానుకొని దాని వెనుకగా ఇంకో కొండవున్నది. దానిమీద యాత్రికులు దిగటానికి ధర్మశాలలు గట్టించారు. ఇదీ వక తీర్థస్థానమే. కొండమీద ఇనుపరేకులపందిలి క్రింద వినాయక, మంజుశ్రీలవిగ్రహా లున్నాయి. బౌద్ధుల్లో మంజుశ్రీ అంటే విద్యాధిదేవత, హిందువులలో సరస్వతిలాగు. సరస్వతి దేవీ, మంజుశ్రీ దేవుడూ-ఇంతే భేదం.

మరిరెండు రోజులు గడచిన పిమ్మట నేపాలులోని చిత్రవస్తు ప్రదర్శనశాల చూడడానికి అవకాశం దొరికింది. ఇది స్వయంభువుకు సమీపంగా ఒక మైదానంమీద వున్నది. ఈ మ్యూజియానికి ఎవళ్లు బడితే వాళ్లు ఇష్టము వచ్చినపుడల్లా పోవడానికి వీల్లేదు. శ్రీ కాశీప్రసాద్ జాయసవాల్ గారి కొరకు సర్కారు హుకుంమీద దాన్ని తెరిచారు. అందువల్ల నాకు గూడా దానిని చూసే భాగ్యం కలిగింది. ఇందులో కత్తులూ, కటార్లూ, ఆయుధాలూ తప్ప ఇంకేమీ లేవు. అవీ పురాతనకాలపు నాటివి. కాని వాటి నక్కడ అలంకరించి పెట్టడంలో మహానైపుణ్యం కనుబరచారు. ఆయుధాలతోపాటు ఇక్కడ ఒక ఘటికాయంత్రం గూడా వుంది. మెషీన్ గడియారాలు రాక పూర్వం ఈ ఘటికాయంత్రాలే గడియారాల్లాగు ఉపయోగపడుతూ వుండేవి. ఒక ఇసుకతోనిండిన పాత్ర, దానియడుగున సన్నని బెజ్జం. పాత్రలోని ఇసుక ఆ

బెజ్జంగుండా జారి దానిక్రింద వున్న మరోపాత్రలో పడుతూవుంటుంది. పైపాత్రలోని ఇసుక యావత్తూ కారిపోవడానికి పట్టేకాలం ఒకహోర అని లెక్క. తర్వాత అక్కడి సంగృహీత పదార్థాల్లో రాతిగుండ్లు కొన్ని కన్పించాయి. అక్కడి కాపలామనిషి వాటిని ఫిరంగుల్లో పెట్టి వదులుతూ ఉండేవారని చెప్పాడు. ఫిరంగులనోళ్లనుంచి ఇవి యథారూపంతో బయటపడేవో లేక చూర్ణంక్రింద మారివచ్చేవో తెలియదు. తోలుతో చేసిన మరోచిన్న ఫిరంగీకన్పించింది. ఏదో యుద్ధంలో నేపాలువాళ్లు తిబ్బెతువాళ్లనుండి ఈతోలు ఫిరంగీని లాక్కొన్నట్లు తోస్తుంది. ఎందుకంటే భోటుల్లో (టిబ్బెటువాసులు) తోలుకు చాలా వాడుక. అక్కడ నౌకలు గూడా తోలువే.



స్వయంభూనాథులో బుద్ధుని విరాణ్మూర్తి

ఏప్రిల్ ౬ తారీఖున మానదాసుగారితో కలిసి బాలాజీ చూడటానికి వెళ్లాను. ఆనాడు హనుమజ్జయంతి. బాలాజీ అనేది ఒక రమణీయస్థానం. కొండల మధ్య లోయలో వుంది. చుట్టూచెట్లు. ఎన్నో జలలు. ఆనీటిని ఆపడానికి కట్టించినకుండ్లు. వాటిలో నేమైన పడవేసినయెడల దానిని పట్టుకొనవలెనని వందలకొలది చేపలు పరుగెత్తుకొని వస్తూ ఉంటాయి. ఇవ్వాళ ఇక్కడేదో గొప్ప ఉత్సవం. తెల్లవారినది మొదలుకొని పట్నంనుంచి జనులు గుంపులుగుంపులై వస్తూన్నారు. పట్నం (కాట్మండు) ఖాలీ అయిపోయింది ఒకమాదిరిగా. వచ్చిన వాళ్లందరూ విూదవచించిన కుండాల్లో స్నానాలుచేస్తారు. వాటికి ప్రక్కగా ఒక పెద్దవిగ్రహంవున్నది. హనుమంతుని విగ్రహంకావచ్చు. ఇక్కడ ఒకజలధారనుపట్టుకొని ౨౨ ధారలక్రింద విభాగించారు.



స్వయంభూనాథు లోపలిదృశ్యము

ఇవి నైనీటాలు (Nainital) లో పంచధారలు లాగున్నాయి. అక్కడిధారలకంటే ఇవి చాల పెద్దవి. బౌద్ధులిక్కడికి స్నానంచేయాలనేఉద్దేశంతో రారు. కందరాల సౌందర్యం చూడాలనీ, కొండమీద ఉన్నసిఖీతథాగతస్తూపానికి నమస్కరించాలనీ వస్తూవుంటారు.

ఈ పర్వతంయావత్తూ సర్కారువారి నిరీక్షణలోవుంది. మామూలుగా జనులు అన్నివేళలా దీనిమీదికి రావడానికి వీల్లేదు. సంవత్సరానికి ఒక్కనాడు (నేడే) అందరికీ అడ్డంకి లేకుండారావచ్చు. పర్వతమంతా చిరుతపులులమయం. వాటినిపట్టుకోడానికి పెక్కుచోట్ల బోనులమర్చారు. వాట్లల్లో ఏగొర్రెనో, మేకనో కట్టి బోనుతలుపులను తెరచివుంచుతారు. చిరుతపులి భోజనాని కాశపడి బోనులోదూరి మేకమీద దూకపోతే బోనువాకిలి దానంతటదే మూసుకొంటుంది. బోనులో చిక్కిన ఎలుకలాగవుతుంది చిరుతపులి. మేమిద్దరం అడవిలో ఇటూ అటూ తిరుగుతూ చాలాదూరం వెళ్లాం. అటువేపునుంచి కొందరు నేపాలీ యువకులు చేతిలో కెమెరా వూగించుకొంటూ ఎదురుగా వచ్చి "ముందుకు వెళ్లవద్దు. ఆముందుపొదలో చిరుతపులివుంది. దాని నుర్రువిని మేము వెనుకకు తిరిగి వస్తున్నాం." అన్నారు.

(విశాలభారతనుండి)

# బొమ్మల కొలువు

వై. సాంబశివరావు



నాన్నా బొమ్మలు తెచ్చేవా ?

లేదమ్మా ! రేపు తెస్తాను తల్లీ.

ఎప్పుడూ అలాగే అంటావు కానీ. రోజూ రేపు రేపంటావు.

రేపు తప్పకుండా తెస్తాను కాదూ.

అందరూ బొమ్మలు పెట్టుకుంటున్నారూ - నాకో బొమ్మైనాలేదు. నాకు కృష్ణుడిబొమ్మలూ, రైలుబొమ్మ,లూ, మారి, మోటారుకారులూ, ఇంకా ఏంటే అమ్మా, అదోలాగ వుంటుంది, ఇంత వుంటుంది, కడుపునొక్కితే కీచుమంటుంది, వాళ్లింటో చూసేం.

అమ్మ—దొరసాని పిల్లబొమ్మా ! కొని తెస్తారులే.

బిడ్డ—ఆ ! అది. ఇంకా - అన్నీ తే నాన్న - ఎంచక్క చిన్నకొలువు పెడతాను. పేరంటాళ్లని పిలుస్తాను.

నాన్న—అమ్మా! ఇలారా! ఓ చిన్న ముద్దియ్యి. వెర్రితల్లి. వాళ్లింటోలాంటి బొమ్మలు మనకెలా వస్తాయి? వాళ్లు గొప్ప వాళ్లు. మనం......

అమ్మ—అబ్బా ఊరుకుందురూ. దానిక్కూడా చెప్పడం ఎందుకు మనగొడవలు. సరేనమ్మా అంటే తీరిపోయె. దాన్నైనా సంతోషంగా వుండనీండి.

బిడ్డ — మనంకూడా గొప్పవాళ్లమే నాన్నా. మరి నువ్వు బొమ్మలు తెత్తావు కాదు.

నాన్న—తెస్తానమ్మా. పోయి ఆడుకో (ముద్దుపెట్టుకుని పంపించేస్తాడు.)

భార్యాభర్తలు వెర్రిమొగాలతో నొకరి నొకరు చూచుకుంటూనే కళ్లంట నీళ్లు కారుస్తారు. ఒకళ్లకళ్లు ఒకళ్లుతుడుచుకుని ఓదార్చుకుంటారు. అతను బి. ఏ. నిరుద్యోగి - ఆస్తి సున్న. బంధువులు చేరనియ్యరు. రోజులెలా గడుస్తున్నాయో పెరుమాళ్లు కెరుక. వారు తిన్నా మానినా, వాళ్ల బిడ్డలకిమాత్రం నేటివరకూ పస్తుమాత్రం లేదు. పిల్లలు భోంచేస్తేనే వాళ్లకి కడుపునిండేది. ఒకరి

పొట్టలో ఒకరు ఇరుక్కు పడుక్కుని ఆకలి మృచ్చిలి కెడ మాయకుండా కాలక్షేపం చేస్తూవుంటారు. "శ్యామా! ఇలా ఎన్నాళ్లు" అంటా డాయన. వేడినిట్టూర్పే సమాధానం.

"ఇంత విశాలమైన భూమిలో మనకి తావులేదంటావా? భూమి సన్నగిలిపోయిం దంటావా?"

"మనలాంటివా ళ్లెందరో" అంది శ్యామ.

"ఏమైనాసరే, మనప్రేమ మరొకరికి ఉండదేమో."

"మనకి ఉన్నది. అదే నా సౌభా గ్యం. ఒకాళ్లమాట నా కెందుకు" అంది శ్యామ.

పండుగ. ప్రపంచ మంతా కలకల్లాడు తోంది. శ్యామలరావుఇల్లూ కళగానే వుంది. తప్పేలామాత్రం కాళీ. అయినా కల కలకి కారణం? వాంబిడ్డల కలకలనవ్వే. అంతా ముచ్చటగా పంచభక్ష్యపరమాన్నా లూ భుజిస్తారు. శ్యామలరావుగా రింట్లో వస్తు - పిల్లాది వస్తు - ప్రపంచం అంతా బొమ్మలకొలువులో నిండివుంది. శ్యామల రావుగా రింట్లో - మహలక్ష్మిపీట - మట్టి ప్రమితి - నూనెదీపం- అంతే.

"యీ వేళ మాటేమిటి?" అన్నాడు శ్యామలరావు.

"పరమేశ్వరుడే శరణ్యం" అంది శ్యామల.

"వీథిలోకి వెళ్లివస్తాను. వేగిరం వస్తాను. వీలైతే. మార్వాడీదగ్గర ఖాతాలు వ్రాసి ఒకరూపాయేనా తెస్తాను" అంటూ వెళ్లేడు శ్యామలరావు.

"నాన్నా బొమ్మలు. బొమ్మలు నాన్నోయ్" అంది కూతురు.

"మరచిపోలేదమ్మా" అన్నా డాయన.

మార్వాడీ పండుగ చేసుకుంటున్నాడు. రూపాయలకి పూజ కొట్టుకట్టేసేడు. శ్యామల రావు ఆశ అడుగంటింది. ఊరల్లా తిరిగేడు. పండుగపూట రూపాయలు మార్చమన్నారు. దీనుడై ఇంటికి రాబోతున్నాడు. "నాన్నా బొమ్మలు" అన్నమాటలు వినిపించేయి. బిడ్డ మీదప్రేమ ఉరకలువేస్తోంది. రివ్వున బజా రుకు మళ్లేడు. చిల్లిగవ్వైనాలేదు జేబులో. కుమిలిపోయినాడు. వ్యర్థంగా ఏడ్చేడు. కఠినుడైనాడు. తప్పొఒప్పులు తోచలేదు. యీవెధవప్రపంచానికీ, ధర్మానికీ బలాదూర్ అన్నాడు. బిడ్డకి ఒక్కబొమ్మైనా ఇయ్య లేని యీసన్యాసిది వ్యర్థపుబ్రతుకు కను కున్నాడు. "నేడే నాప్రథమతప్పిదం ప్రారం భం - నేడే అది ఆఖరుతప్పిదం" అన్నాడు. కండువాచిరుగు మడతల్లోకప్పి, కండువాతో పర్సుచిరుగుకప్పి, డాబుగా బొమ్మలదుకాణాల దగ్గరకివెళ్లి, మహా కొనేవాడిమల్లేనే బేరం చేస్తూ సమయంకనిపెట్టి దుకాణాని కో బొమ్మ చొప్పున సంగ్రహించేడు. ఆరుబొమ్మలు దొరికేయి. చాలని తిరిగివస్తున్నాడు. "మా

తల్లి సంతోషిస్తుంది, ఆడుకుంటుంది, చిన్న చిన్న చేతుల్తో కొలువుపెడుతుంది. మాకు ఆకలిపోతుంది, ఇదే మాపండుగ" అని అను కుంటూ రాబోతుంటే——

"ఆగు బద్మాష్ - చోరీ చేసేవా?" అన్నాడు బీటుకనిస్టేబు. శ్యామలరావు నిశ్చేష్టుడైనాడు. మాట్లాడకుండా ఆబొమ్మలు కనిస్టేబు చేతుల్లో పోసేడు. అతను శ్యామల రావును లాకప్ (Lock-up)లో వుంచేడు.

ఇన్స్పెక్టరు పార్థసారథి విచారణచేసి శ్యామలరావుకి ౪ రోజులు విడిఖైదు వేసేడు.

"ప్రథమతప్పిదం, క్షమించండి". అన్నా డు శ్యామలరావు.

ఇన్స్పె — ౪ రోజులు చుఃకనఖైదు వేసేను, అనుభవించు.

శ్యా—బిడ్డమీద ప్రేమచేత చేసేను. భార్య, బిడ్డలు తల్లడిల్లుతూంటారు. ఇంట్లో బియ్యం లేవు. కనికరించి విడిచిపెట్టండి.

ఇన్స్పె—నీవంటిబిడ్డలతండ్రులు చాలా మంది వున్నారు. ఇంట్లో బియ్యం లేనప్పుడు ఇంటికి వెళ్లి ఏమి అఘోరిస్తావు? పండుగైతే మాత్రం ? పస్తేకాదూ. హాయిగా ఇక్కడే బాగుంటుంది. యీ నాల్గురోజులూ చక్ర వర్తిగారి అతిథివైనావు.

శ్యామ—ఆలు, బిడ్డలతో పడిన పస్తు నాకు పెద్దవిందుగా వుంటుంది. ఇల్లాలు నా కోసం పరితాపంపొందుతూ ఉంటుంది. రక్షిం చండి. ఎన్నడూ చెయ్యను.

పార్థసారథికి యీమాట లెంతో ఆశ్చ ర్యం కలిగించేయి. వారంత అన్యోన్యమైన దంపతులేనా అని అతని ఆలోచన. శ్యామల రావుమాట లతనిహృదయానికి శూలాల లాగ తగిలి, వెనక తాను హింసపెడితే, తన పోరుపడలేక లేచిపోయిన తనభార్య రుద్రమ్మ మాట జ్ఞాపకం వచ్చి, "నీకు ఖైదులోవిందు; నాకు ఖైదుకంటె అర్థాన్నమైన హోటల్లో విందు. మనం ఇద్దరం ఒక్కలాగే ఉన్నాం లే, పడివుండు" అని వెళ్లిపోయేడు.

శ్యామలరావుని నిలువెల్ల అగ్నిముట్టి దహిస్తోంది. ఆలుబిడ్డలు కలలోలాగ కను పించుతున్నారు. "హా! శివా! శరణు! శరణు భవా" అని అప్రయత్నంగా తననోటివెంట దీనాలాపాలు వచ్చేయి. కొయ్యలాగవుండి తెప్పరిల్లి చూసేసరికి - శ్యామా, బిడ్డలు వచ్చివున్నారు అక్కడికి జరిగిన సంగతంతా తెలుసుకుని. శ్యామ ఏడుస్తోంది. శ్యామల రావు దుఃఖం ఆపుకున్నాడు. బిడ్డ అమాయి కంగా "నాన్నా! బొమ్మలు తెస్తానని చెప్పి ఇక్కడ కూచున్నావా? ఛీ! పోసిలే. బొమ్మ లూ లేవూ, కొలువూ లేదు" అంది. యీ మాటలకి భార్యాభర్తల గుండెల్లో బల్లేలు పొడుచుకుపోయేయి. శ్యామలరావు భార్యకి జరిగిన వృత్తాంతం చెప్పేడు. నాలుగురోజుల్లో వస్తాను, ఇంటికి వెళ్లండి. పస్తుపడుతూ బ్రతికి

వుంటే మిమ్మల్ని చూస్తాను. లేకపోతే మీతోపాటే నాకు దారి" అన్నాడు. కనిస్టేబు తొందరపెడుతున్నాడు. శ్యామ కదలనంటుంది. ఖైదుతలుపుల్లోంచి బిడ్డని అందుకుని చేతులుమాత్రం ముద్దుపెట్టుకుని "ఇంటికి వెళ్లు తల్లీ, వస్తాను" అన్నాడు శ్యామలరావు. "ఇప్పుడు రా" అంది. "అప్పుడే రాను, పనిచూసుకు వస్తా" నన్నాడు. "నువ్వురాక పోతే నేను వెళ్ల" నని గుమ్మంలో కూచుని కూనిరాగాలు తీసింది బిడ్డ. శ్యామలరావు, శ్యామ ఆపిల్ల నిష్కళంకమైన ప్రేమ, అమాయికత్వం చూచి, ఏమిచేయాలో తెలియక పెద్దపెట్న ఏడ్చారు. కనిస్టేబు కళ్లు తుడుచుకున్నాడు. వాళ్లని కదలమని మళ్లీ చెప్పలేదు.

పార్థసారథి హోటల్లో విందారగిస్తున్నాడు. ఖైదీగొడవ తన కేల? పాయసం! వెర్మిసిల్లీ (సేమియా) పాయసం - కప్పులో పోసేడు అయ్యరు. నోటి కెత్తి త్రాగబొయ్యేడు ఇన్‌స్పెక్టరు. పాయసంలా కనిపించలేదు. వానపాములతుట్టలావుందిఅంతా. పక్కవాడికి గిన్నె చూపేడు. నిక్షేపంగా వుంది. త్రాగలేక వదలివేసేడు. జిలేబీ విరవబొయ్యేడు. వానాకాలంలో రోకలిబండలు ఒకదాన్నొకటి చుట్టుకుని వున్నట్లుంది. అదీ తినలేకపోయేడు. "ఏమి" అంటే "ఏమి" అని అంతా అడిగేరతన్ని. కారణం చెప్పలేకపోయేడు. మనుష్యులంతా శ్యామలరావులా కనిపిస్తూ వచ్చి "ప్రథమతప్పు క్షమించండి" అంటూ ప్రార్థిస్తున్నట్టున్నారు. ఇన్‌స్పెక్టరు గ్రహించేడు. "ప్రథమతప్పు- స్వల్పవిషయం- కన్నకూతురిమీద ప్రేమ. నాకాభాగ్యంలేదు - ఇల్లాలితో పస్తు విందుట —— నేనంత అదృష్టవంతుడను కాను - పాపం, కఠినశిక్ష వేసేను" అన్నాడు. కచేరీ చేరేడు. శ్యామ, శ్యామలరావు, చిన్నబిడ్డలు అక్కడే వున్నారు. జవాను గజగజ లాడేడు. శ్యామ వెలవెలబోయింది. బిడ్డ భయపడి ఏడ్చింది. శ్యామలరావు బిడ్డని బుజ్జగించేడు. ఈ దృశ్యం పార్థసారథి మనసును కలచివేసింది. అమరజ్యోతి తనహృదయంలో అంకురార్పణం అప్పుడేచేసింది. జైలు తలుపులు విప్పేడు. బిడ్డలు తండ్రిని కావలించుకున్నారు. శ్యామ భర్తని ఆలింగనం చేసుకోబోయి వెనక్కి జంకింది. శ్యామలరావు శ్యామను దగ్గరగా లాక్కుని పార్థసారథికి నమస్కారాలు చేస్తూ "కృతార్థులం. భగవంతుడు మిమ్మల్ని రక్షిస్తాడు" అంటూ వెళ్లిపొయ్యేరు. దారిలో ఓకనిస్టేబు ఒకబుట్టనిండా బొమ్మలు తెచ్చి వాళ్లకిచ్చేడు.

శ్యామలరావుగారిప్పుడు డిప్యూటీసూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు అయినారు. బిడ్డకి ఇంటినిండా బొమ్మలే. నౌకర్ల ఇళ్లనిండా బొమ్మలే. శ్యామల కింకోకొడుకు పుట్టేడు. పేరు పార్థసారథి.

---

# రెడ్డివాచకు లెవరు?

## కమ్మ, వెలమ, రెడ్డి, రాచవారల పూర్వీకు లొకే సంఘమువారా ?

కొత్త భావయ్య చౌదరి



"కాకతీయు లెవరు?" అను వ్యాసమున కమ్మ, వెలమ, రాచవారలు ౧౩ వ శతాబ్దమునకుపూర్వ మొకే జాతివారని నిర్ణయించితిమి. ఇక రెడ్డివాచకులకు వీరికి గల సంబంధమును దెలుసుకొందము.

(౧) క్రీస్తుశకము ౧౨౦౨ సం.పు పిల్లలమర్రి లోని నామిరెడ్డిశాసనములో తనపూర్వీకులలో మంజ రాజు, కాటరాజు, కామరాజు లనువారని పేర్కొని తనపేరు నామిరెడ్డియని తెలుపుకొనెను. మరియు నీ శాసనములో నామిరెడ్డి తాను మనుమకులాదిత్యుడనని వ్రాసుకొనెను.

(౨) క్రీ. శ. ౧౨౮౭ సం. యెల్లక్కశాసనములో పై పేర్లన్నిటిని వ్రాయుచు నామిరెడ్డికి బదులు బేతి రెడ్డిని దెల్పుచు నాతనికుమారుడు మల్లారెడ్డి యని వ్రాయించినది. బేతిరెడ్డికిగూడ మనుమకులాదిత్య బిరుదము వ్రాయబడెను.

ఈ రెడ్డివాచకుల సంతతియే యిప్పటి వెంకటగిరి సంస్థానాధీశులగు వెలుగోటివారని వారివంశచరిత్రలో గలదు. దీనినిబట్టి వెలమవారిలో రెడ్డి, రాజుపదములు పూర్వమునుండి వాడుకలోనున్నవి. అనపోతనాయడు, మాదానాయడు, ప్రసాదాదిత్యనాయడు, బ్రహ్మ నాయడు, ఈతనితమ్ములు పేర్నీడు, నూర్నీడు, మల్లనీడు ఈ పేర్లనుబట్టి వెలమవారిలో నాయడు నీడుపదములుగూడ వాడుకలో నున్నట్లు తేలుచున్నది.

(౩) చేజెర్లశాసనము (కపోతేశ్వరాలయములో నిది) క్రీ. శ. ౧౧౬౩ (శా. శ. ౧౦౮౫) సం.పు. దానిలో మనుమకులవంశీకుడు కేతిరెడ్డి దీపదాన మొనర్చెనని వ్రాయబడినది. (E. R. No. 153 of 1899) దీనిని బట్టి రెడ్డివాచకులు సూర్యవంశీకులుగనే యాకాలమున వ్యవహరించిరి.

(౪) శా. శ. ౧౧౩౧ లో జగదేకభూషణవీడ సోమేశ్వరుని భార్య గంగాదేవి వ్రాసిన శాసనములో గడ్డపు ఈరపరెడ్డి, సోమినాయకు డను పేర్లు కనుపడు చున్నవి.

(౫) ప్రతాపరుద్రచక్రవర్తికుమారుడు జుట్టయ లంక గొంకారెడ్డినని క్రీ. శ. ౧౩౧౩ సం. చెందూరు శాసనములో వ్రాయించెను.

(౬) దుర్జయవంశీకుడు మల్యాలగుండయ దండ నాథుడు గోన బుద్ధారెడ్డికుమార్తెను వివాహమాడినట్లు బూదపూరు శాసనములోను, ఇతరశాసనములవల్లను తెలియుచున్నది.

పైవానినిబట్టి కాకతీయరాజులకు రెడ్డివాచకులకు సంబంధము లున్నట్లు తేలుచున్నది.

(౭) పల్నాటి అనుగురాజు తన మంత్రియగు బ్రహ్మనాయుని అన్న బాదన్నను పెంచుకొన్నట్లు పల్నాటిచరిత్రమున నున్నది.

దీనినిబట్టి కాకతీయరాజులు రెడ్డివాచకుల సంబంధములు చేసినట్లే పల్నాటిరాజులు, నాయడు శబ్దవాచ్యుల సంబంధములు చేసి రాజు, నాయడు శబ్దములు వాడుకొన్నట్లు తేలుచున్నది.

(౮) కమ్మవారిలోగూడ పూర్వమునుండియు రెడ్డి, నాయడు, నాయకుడు, నీడు, రాజు పదములు




శివభక్త మాహాత్మ్యమున పశుపతినామక బ్రాహ్మణ పంచమోపాఖ్యానమున నొకరంగము

(శ్రీ కాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్రసంగ్రహమునుండి)

వాడుకలో నున్నవి. చూడుడు: కొమ్మారెడ్డి, వాసిరెడ్డి మున్నగు గృహనామములు, పోసరాజు, బైచరాజు మున్నగునవి. పెమ్మసాని తిమ్మానాయుడు, చినతిమ్మ నాయడు (వీరు ప్రౌఢదేవరాయల, కృష్ణదేవరాయల సమకాలికులు), పెదతిమ్మరాజు, చినతిమ్మరాజు (వీరు శ్రీ రంగరాయల, వెంకటపతిరాయల సమకాలికులు), ముప్పిడినాయకుడు, సాగి గన్నమనాయడు, బైచరాజు (వీరందరు కమ్మవారే).

(౯) గోనగన్నారెడ్డి మనుమకులమార్తాండుడని క్రీ. శ. ౧౨౭౮ సం. నాటి రాచూరుదుర్గము గోడమీది శాసనములో గానవచ్చుట.

ఇక రెడ్డివాచకు లేయే పదము లుపయోగించిరో చూతము.

(౧) కామినేని రెడ్లవంశవృక్షములో వారి మూల పురుషుడు కామినేనిచౌదరి యని వ్రాయబడెను. చౌదరి పేరు చౌత్ పన్ను వసూలుచేసిన పేరుగా నుండినందున దాని నటుంచినను, నీడుశబ్దవిశేషణముగా కామినేని పదము నేటికిని రెడ్లలో నుపయోగింపబడు చున్నది. ఈ నేనిపదము విస్తారముగ కమ్మ, వెలమవారలలోగూడ నున్నది. రమారమి ౮౦ యిండ్లవారు కమ్మవారిలో నేని శబ్దవాచ్యులుగ నున్నారు.

(౨) కోరుకొండ రాజధానిగాపాలించిన రెడ్లలో ముమ్మడినాయకుడు, ఇతనితమ్ములు సింగమనాయకుడు, గన్నయనాయకు డనువారు గలరు. ఇందు ముమ్మడి నాయకుని కుమాళ్లు మరల రెడ్డిపదమునే వాడిరి. కూనారెడ్డి, అన్నారెడ్డి, కాటమరెడ్డి మున్నగువారు. ఇది పదునాల్గవశతాబ్ది విషయము (ఆర్యవటము, ముమ్మడి సింగవరము శాసనముల జూడుడు). పైవానినిబట్టి రెడ్లను వారిలో రెడ్డి, నాయడు, నాయకుడు, నీడు శబ్దములు వాడుకలోనుండి సూర్యవంశీకులని చెప్పకొను చున్నట్లు, అట్లు చెప్పకున్నవారితో బంధుత్వములు చేసినట్లును కనబడుచున్నది. ఆ సూర్యవంశీక నామ ధారులును, వీరును కొన్ని సమయములలో చతుర్థాన్వయులమనికూడ చెప్పకొనియుండిరి.

ఇక కాకతీయవంశమునకు జ్ఞాతులగు దుర్జయాన్వయు లెట్లుపయోగించిరో చూతము. కాకతీయులలో పూర్వపురాజులు రాజులనియు, చతుర్థాన్వయులనియు గొందఱు సూర్యవంశీకులమనియు వ్రాసికొనుచుండిరి. వీరిలో రెడ్డిశబ్దము వాడుకలో నున్నట్లును, రెడ్డిశబ్ద వాచ్యులతో సంబంధములు చేయుటయు పైన వ్రాసితిమి. ఇక నాయడు, నాయకు డనుపదములు వీ రెంతవరకు వాడిరో గమనింతము.

(౧) దుర్జయవంశరాజులలోనివారగు గన్నమ నాయడు (ప్రతాపరుద్రుని మంత్రులలో నొకరు), మేచయనాయకుడు, ఎల్లయనాయకుడు వీరు నాయడు నాయకాదిపదముల ధరించిరి (మారనకవికృత మార్కండేయపురాణము జూడుడు.)

(౨) దుర్జయవంశస్థులును, వలపుట్ల (వల్లుట్ల) గోత్రీకులగువారిలో ఎక్కినాయడు, రుద్రినాయడు, పోతినాయడు, వల్లయనాయకుడు, పోతినాయకుడు, సూరపనాయకుడు అనువారు రుద్రమదేవిచక్రవర్తిని కంగరక్షకులుగను, తంత్రపాలురుగను ఉన్నట్లు ౧౯౧౬, & ౧౯౨౧ సం. ఎపిగ్రాఫికారిపోర్టులనుబట్టి తెలియు చున్నది.

దీనినిబట్టి దుర్జయవంశరాజులలో నాయడు, నాయకుడు శబ్దములుగూడ వాడుకలో నున్నట్లు తేలు చున్నది.

(౩) దుర్జయవంశస్థులే యైనట్టియు, విప్పర్ల గోత్రీకు లైనట్టియు, మనుకులసంభూతులమని, బాహుజ కులాభరణులమని వ్రాసుకొన్న సాగివారి శాసనములలో గూడ రాజుపదము వాడుకొనిరి (వీరు కమ్మవారేనని వారిగోత్రమునుబట్టియు, గృహనామమునుబట్టియు కాకతీయు లెవరను వ్యాసమున వ్రాసియుంటిమి.) వీరిలో పోతరాజు, దోరపరాజు, మాచరాజు, రామరాజు, ముప్పరాజు మున్నగువారు కలరు. పల్నాటిచరిత్రలో శ్రీనాథుడుగూడ "సాగిపోతమరాజు సత్యాఖ్యప్రెగడ" అని వ్రాసియున్నాడు. వీరివంశమే తమవంశమని నేటి క్షత్రియులు వాదించుచున్నారు. కాని వీరిగోత్రము కమ్మవారి దని తెలియక చేసినవాదము (అను మంచిపల్లె శాసనము చదువుడు.)

పై యన్నిటి సారాంశము క్లుప్తముగ నిట్లున్నది.

(౧) కాకతీయరాజులును, దుర్జయసంతతిలోని యితరప్రముఖులును, రెడ్డి, రాజు, నాయడు, నాయకు డనుపదములు గౌరవపదములుగను, పర్యాయపదములుగను వాడుకొనిరి.

(౨) రెడ్డి, రాజు, నాయడు, నీడు, నాయకు డనుపదములు వెలమ, కమ్మ, రెడ్డి వారలని నేడనబడు వారి పూర్వీకులందరును పర్యాయపదములుగనే వాడిరి.

(౩) రెడ్డిశబ్ద మందుచే యొకశాఖకు సంబంధించి నదిగా తలంపరాదు. అట్లే తక్కినశబ్దవాచ్యులును వేరు వేరు తెగలుకాదు.

దీనినిబట్టి తేలిన దేమన:

ప్రతాపరుద్రచక్రవర్తి కాలమువరకును రెడ్డి, రాజు, నాయడు, నాయకుడు శబ్దవాచ్యులందరును ఒకే కులముగానుండిరనియును, ఒండొరులతో సంబంధ బాంధవ్యము లొనర్చిరనియును, వారందరీ పదములు సమానగౌరవపర్యాయపదములుగా వాడుకొనిరనియు, ఆ కాలములో ప్రబలిన వీరశైవ, వీరవైష్ణవాది మతముల వల్ల వీరిలో వీరు కలహించుకొని తలకొకదారి బట్టిరనియు, నట్లుపోయినవారిలో కొందఱు అద్దంకి, కొండవీటి సీమాదులకును, కొందరు గోదావరీప్రాంతములకును, కొందరు నెల్లూరు మున్నగుచోట్లకును బోయిరనియు, నట్లు పోయినవారిలో ఒకశాఖ రెడ్లనియు, ఒకశాఖ రాజులనియు వ్యవహరించిరనియు తెలియుచున్నది. ఈ రెడ్లలోనే పాకనాటిరెడ్లు, భూమంచిరెడ్లు, ఓరుగంటి రెడ్లు, పంటరెడ్లు, కామంచిరెడ్లు, పెడకంటిరెడ్లు మున్నగువా రుండుటకు గూడ నిదే కారణమైయుండును. వేరుగాబోయినవారిలో ననేకప్రాంతములవా రుండి యుందురు. రెడ్డి, నాయడు, నాయకుడు, రాజు, వర్మ, నీడు పదములు క్షాత్రవంశీకుల గౌరవపర్యాయపదములుగా వాడుచుండి రనియు, ౬, ౭ శతాబ్దములలోని రాజు లెట్లు వర్మ, రాజుశబ్దములు వాడిరో, యట్లే ౧౨ వ శతాబ్దమునాటి కీశబ్దములన్నియు పైశాఖలన్నియు వాడుకొనిరనియు, పై శాఖలన్నియు నొకే వంశముగా నుండి సంబంధబాంధవ్యములు పరస్పర మొనరించు కాలమున గూడ రెడ్డి, నాయడు, నాయకుడు, రాజు పదములు వాడుకలో బర్యాయపదములుగా నుండె ననియు గ్రహింపగలరు. చౌదరిశబ్దము తరువాత మొగలాయిప్రభుత్వములో నున్న చౌత్ పన్ను వసూలుజేయు నధికారమువల్ల వచ్చినదనుటవల్లను, ఈ బిరుదము మహమ్మదీయులలోను, బెంగాలుప్రాంతములో నన్ని జాతులలోను నుండుటవల్లను ఇది కమ్మవారి ప్రత్యేక బిరుదము కాదని తేలునుకాని తెలుగుదేశములో కమ్మవారే దానిని రాజ్యాధికారమువల్ల హెచ్చుగా సంపాదించుకొనినట్లు కనుపడును. కాబట్టి రెడ్డివాచకులును, నాయడు, నాయకుడు, రాజువాచకు లందరును జైన, బౌద్ధములనుండి నూతనముగా శైవ, వైష్ణవాది మతములలో జేరినకాలమున ఒకేశాఖగానుండి, క్రమముగా జ్ఞాతి విరోధములును, మతభేదములును బలపరుపగా వేర్వేరు చోట్ల కేగి వేర్వేరునామములతో విలసిల్లిరని తేలుచున్నది. ప్రతాపరుద్రుడే రెడ్డి కాడనుటకుగాని, మల్యాలగుండయ దండనాథుడు మేచయనాయకుడు మున్నగువారు దుర్జయవంశస్థులు కాదనిగాని యెవ్వరు నిరూపింపజాలరు. కమ్మవారి కధికారప్రాబల్యమున కల్గిన చౌదరిబిరుదమువల్ల నదివరలో నున్న రెడ్డి, రాజు పదములవాడుక తగ్గించినట్లు కనుపడును. దుర్జయ వంశస్థులమని చెప్పుకున్నవారితో బంధుత్వము నెరపినట్టియు, కాకతీయులవలెనే చతుర్థవంశమనియు, సూర్య వంశమనియు చెప్పకొన్నట్టియు నీ రెడ్డి, నాయడు, నాయకుడు, రాజుశబ్దవాచ్యులగువారి పిల్లల నుంపుడుగత్తెలుగా నితరుల కిచ్చిరని చరిత్రకారులు భ్రమింపరాదు. వారందరును సమానగౌరవ వంశస్థులగుటయే కారణము. చతుర్థాన్వయులనియు, దుర్జయవంశీకులనియు చెప్పకున్న నతవాటిసీమ వంశమునుగురించి తెల్పుచు నావంశములోని రుద్రరాజుభార్యయు, కాకతీయ గణపతిదేవచక్రవర్తి చెల్లెలు నగు కుందాంబ క్రీ. శ. ౧౨౨౦ సం.లో వ్రాయించిన శాసనములో "శ్రీ కాకతీశవంశేన తదేవ విమలం కులం" అని నతవాటివంశము కాకతీశవంశమువలె విమలమైనదని వ్రాయించినది. అందుచే దుర్జయవంశీకుల బంధువులగు రెడ్డివాచ్యులును పూర్వమునుండియు దుర్జయవంశరాజులతో తుల్యులేయని గ్రహింపవలెను. దుర్జయవంశరాజులే నేటి కమ్మ, వెలమ, రాచవారలని "కాకతీయరాజులెవరు?" అను వ్యాసమున నిరూపించితిని. వారి ముఖ్యబంధువులే రెడ్లని యిప్పుడు తేలినది.

# స్వరూపసందర్శనము

ఆర్. రంగనాథశాస్త్రి

ఆదంపతు లిర్వురును ముస్తాబై చెరియొకగదినుండియు సావడిలోనికి వచ్చిరి. అప్పుడు భార్యను చూచి భర్త యిట్లనెను:

ఎక్కడికి మీరు?

భార్య : మీరెక్కడికి ?

భర్త : నేను టెన్నీసుకు.

భార్య : నేను బాడ్‌మింటనుకు.

భర్త : అయితే యీ రాత్రికి భోజనం-

భార్య : నావంతు కాదే - మీవంతు.

భర్త : నిజమే. నేను బాగా వంటచేయజాలను. ఒకస్నేహితుని భోజనమునకు పిలిచినాను. ఈపూట నీవు వంట చేస్తే బాగుంటుంది. నేను ఎల్లుండి, ఆవలెల్లుండి మధ్యాహ్నముకూడ వంట చేస్తాను.

భార్య : నాకేంపనీ? ఆతడు మీస్నేహితుడు గాని నా స్నేహితుడుగాడు. నాప్రోగ్రాము మారుటకు వీలు లేదు.

భర్త: నాప్రోగ్రా మంతకంటెను మారదు. కాని, పెద్దమనిషిని భోజనానికి పిలిచి ఇద్దరము తలుపు తాళంవేసి వెళ్లితే బాగుండదు.

భార్య : అవును. అందుకనే మిమ్మ వంటచెయ్యమన్నది. కాదంటారా, హోటలుకు పోయి భోజనము పట్టించుకురండి (అనుచు బయలుదేరును )

భర్త : ఆను. ముందీసమస్యతేల్చి మరీ వెళ్లు.

భార్య : తేల్చడానికేమున్నది? మీ యిష్టం
మీది; నా యిష్టం నాది ఏమైనాసరే-ఈపూట భోజనభంగము లేనివిధమున రాజీ కుదరదా ?

విషయమున నా కణుమాత్రమైనను జోక్యములేదు. నేను క్లబ్బుకు పోకతీరదు. నాస్వేచ్ఛను నేను చంపుకోను. నాస్వేచ్ఛను అరికట్టచూచుట మీకును మంచిదికాదు.

భర్త : నిజమే. నీవు చెప్పినమాటలు నిజము. క్లబ్బుకు పోయి త్వరగా రా.

భార్య : ఎనిమిదిగంటలు కొట్టేకొట్టకముందే తిరిగివస్తా; కాని యీరాత్రికి కనీసము రెండువేపుడు కూర లుండవలె సుమా! లేకుంటే నాకు ముద్ద గొంతు దిగదు. (చిరునవ్వు)

భర్త : వేయించడం గీయించడం నాచేతగాదు. ఏదో చేతనైనట్లు చేస్తా. కూర లున్నవా ?

భార్య : నన్నడుగుతా రేమిటి ? మధ్యాహ్నము వంటచేసింది మీరేగా, చూడండీ - లేకపోతే బజారుకు పోయి తీసుకురండి (అనుచు బయలుదేరును.)

భర్త : కాదు - నీవు ఇంట్లోఉండి వంటచెయ్యి. నేను వెచ్చాలు పట్టికొని వస్తా; నేను క్లబ్బుకుపోను నాప్రోగ్రామును మార్చుకున్నా. యోచించు. నీవు కూడ మార్చుకో.

భార్య : యోచనాలేదు, గీచనాలేదు. నాప్రోగ్రాము మార వీలులేదు, మార్చుకోను. తర్వాత మీయిష్టం.

భర్త : ఇంత, పెంకెతనమా ?

భార్య : ఇంత మొండిపట్టా ?

భర్త : మనఇద్దర సమానప్రతిపత్తి! స్వేచ్ఛకు

భార్య: కుదరకేమి? కాని మనఇరువురస్వేచ్ఛా నిరతికి భంగము కలుగకూడదు.

భర్త: అయితే విను. మనమిద్దరము క్లబ్బు ప్రయాణం మానుకుందాము. నీవు వెచ్చాలకు చీటి వ్రాసి ఇవ్వు. దానిప్రకారం నేను వెచ్చాలు తీసికొని వస్తాను. నీవు వంటవండు, నేను పైపనులు చేస్తా.

భార్య: కాదు. కాదు. నేను పైపనులుచూస్తా. మీరు వంటచెయ్యండి.

భర్త: సరే. కాగితము దీసుకో. కావలసిన వస్తువులపేర్లు వ్రాయి.

భార్య: (కాగితము పెన్సలు దీసికొని) చెప్పండి వ్రాస్తా.

భర్త: ముందు నీవు పద్దులువ్రాస్తే నేను లోటు పాట్లు చెప్పుతా.

భార్య: (కావలసిన వస్తువులు చీటిమీద వ్రాసి) వ్రాశానండీ వెచ్చాలు. వారమురోజులకు సరిపోవును. మీ ఇష్టమువచ్చిన కూరలు రెండు కొనుక్కొని రండి. ఎంతఖరీదైనా సరే కాకరకాయలుంటే తీసుకురండి.

భర్త: సరే. ఇంక ప్రోగ్రాము వ్రాయండి. అన్నం వండడము నేను. పైపనులు చేయడం మీరు. పొయి ముట్టించడము కూడ మీరేసుమా!

భార్య: కాదు కాదు, అన్నంవండువాళ్లే పొయి ముట్టించడము.

భర్త: కాదండీ; పైపనులు చేసేవాళ్లే పొయి ముట్టిస్తారు. కాబట్టి ఆపని మీవంతు.

భార్య: ఏమండోయి, బాగున్నదే పొగ నాకంట్లలోకా? వంట వండడము మీరా? రాజీకు-దు-ర-దు, కుదుర వీలులేదు.

భర్త: సరే. నేనే ముట్టిస్తా; మీ కంగీకారమేనా?

భార్య: ఆఁ. అంగీకారమే.

భర్త: సాపాట్లో భోజనము. విస్తళ్లు, పీటలు వేయడం మీవంతు. అన్నము మొదలగునవి పెట్టుట నావంతు. కాని ఒక్కమాట. మేమిద్దరము గూర్చుంటే మీరు నెయ్యిమొదలగునవి వేయవలయు సుమా? మేము లేచీలేవకముందే మీరు తినవచ్చు.

భార్య: నేను వంటకత్తెనా యేమి?

భర్త: అయితే నేను వంటవాడినా?

భార్య: మీరూకాదు, నేనూకాదు. అందుకనే ముగ్గుర మొక్కమారు తిందాం. అంతేకాని నేను వెనుక భోజనము చేయను. తర్వాత మీయిష్టం.

భర్త: అయితే నేను చెప్పినట్లుచెయ్యి స్నేహితునకు కాళ్లుకడుక్కోటానికి నీళ్లుఇవ్వడం మీవంతు. కాళ్లుచేతులు తుడుచుకోటానికి తొల్లాగుడ్డ యివ్వడం నావంతు. తర్వాత మూడువిస్తళ్లు ముక్కోణాకారముగవేసి అన్నముమొదలగునవి పెట్టి స్నేహితుని కూర్చోమంటాను. తర్వాత నేనుకూర్చుంటాను. ఆతను కూర్చోమంటే మీరు కూర్చోండి. లేదా? మాకు నెయ్యివేసి మీరు కూర్చోవచ్చు. సరిగా యున్నదా?

భార్య: సరీలేదు చేసీలేదు నేను ముందుగూర్చుంటా. తర్వాత మీ స్నేహితుడు మిమ్ము కూర్చోమంటాడు. ఇది సరియగుపద్ధతి.

భర్త: ముగ్గురమొక్కమారు గూర్చుండిన బాగుండదే. ఆతడు భోజనమున కుపక్రమించినతర్వాత మనమిద్దరము కూర్చుంటే?

భార్య: అది మరీబాగుండదు.

భర్త: అయితే మార్గం?

భార్య: మార్గ మేమిటి? ఏమైనాసరే. ఇక రాజీ కుదురదు. నాస్వేచ్ఛను, సమాన ప్రతిపత్తిని నేను గోల్పోను.

భర్త: మీరు గోల్పోవద్దు నే నంతకంటెను గోల్పోను. అతిథిసత్కారము గృహస్థధర్మము కాదా? కాపాడవద్దా?

భార్య : నే నన్నానా, తప్పక కాపాడవలసి నదే. కాని నేను వంటమనిషిలాగ మీకు వడ్డించి చివ రకు భుజింపను. రాజీమార్గము సూచిస్తా వినండి. ముగ్గురి మధ్యను వంటపదార్థములు పెట్టుకొని ముగ్గురము గూర్చుండి యెవరికి కావలసినవి వాళ్లు వేసుకుందాం. అంగీకారమేనా ? సరిగా యున్నదా ?

భర్త : సరే. అంగీకారమే. కాని, అప్పుడు మనము స్వేచ్ఛాతర్కమున తగులొన్కొనగూడదు సుమా! ముందు మీరిద్దరు కూర్చొండి. నేనువడ్డించి నిలుచుంటే అతిడే నన్ను కూర్చోమంటాడు. అంతటితోటి యీ సమస్య పరిష్కారమౌతుంది.

భార్య : బాగున్నది. ముందుగానే స్వేచ్ఛానిర తుల మని యాయనకు జెప్పిన మన కేవిధమగు చిక్కుం డదు.

భర్త : సరే. మంచియుపాయమే. నీవుచెప్పు.

భార్య : నన్ను పరిచయం చేస్తే ముందుగా నేనే చెబుతా.

భర్త : ఇక యిబ్బందిలేదు. ఈమె నాభార్య యం. ఏ. యల్. టి. అని పరిచయముచేస్తా.

భార్య : ఛీ ఛీ. ఛీ. (చెవులు మూసికొని) ఏం మాట లవి?

భర్త : ఛా-ఛా-ఏమంటావు? నే నేమన్నాను?

భార్య : (మండిపడుచు) ఏమిటి మీరన్నది ? భార్య! దుర్భరము. ఛీ. భరించువాడు—అట్లు పరిచ యముచేయుట నాస్వేచ్ఛానిరతికి భంగము. నాకు వ్యక్తిత్వము లేదన్నమాట. మీకు దాసురాలనన్నమాట. కర్ణకఠోరము. నేను మీకుదాసినా? కాదు. ముమ్మాటికి కాదు. ఇప్పటినుండి సరీగ్గా తెలిసికొని మాట్లాడండి. మీరు నాకు భర్తకాదు. నేనుమీకుభార్యనుగాను.

భర్త : ఏమంటావు ? మనలో మామూలుగా భార్యాభర్తలంటారుగనుక అన్నా. అంతే. యోచించి యన్నది కాదు. క్షమించు. కోపమెందుకు?

భార్య : కోపమా — ఎందుకా— క్షమాలేదు గిమాలేదు. చాల్పాలు. మీస్వేచ్ఛా సాధన—

భర్త : అయితే, మార్గం? నాకేమీ తోచలేదు. చెప్పండి. మీరు చెప్పినట్లే చెప్పి పరిచయంచేస్తా.

భార్య : ఫ్రెండని చెప్పండి. స్నేహితులలో ఎచ్చుతగ్గులు లేవు. సర్వవిషయముల సమానులు. ఇప్పటి కైనా మీకు తెలిసిందా ?

భర్త : ఆ, తెలిసింది. ఆటులనే పరిచయంచేస్తా. మీబుద్ధి యద్వితీయం. నేచ్ఛానిరతి నిరుపమానం కావు ననే ఒక్క మహాసత్యము మీకు స్ఫురించినది. నాకు చక్కని రాజమార్గమును చూపించితిరి. ఒక్క మాట. కలయందైనను మీ స్వేచ్ఛానిరతికి భంగము గలిగింపనని నమ్మిన పంతిసింతును. మన మిద్దరము ఫ్రెండ్సు (స్నేహితులము) కాని భార్యాభర్తలముకాము. జయము, స్వేచ్ఛావాదమునకు జయము.

*  *  *

సరిగ ఎనిమిది గంటలకు శ్యామరావు వచ్చెను. శివరా వాతని సమ్ముముకడ సెదుర్కొని గదిలోనికి దీసి కొనిపోయి కుర్చీమీద గూర్చుండబెట్టి మరియొక కుర్చీ మీద తాను గూర్చుండెను. పరస్పర కుశలప్రశ్నల అనంతరము శివరావు మరియొక గదిలోని కరిగి, మహా లక్ష్మిని వెంటనిడుకొని వచ్చెను. ఆమె శ్యామరావునకు నమస్కరింప, ఆతడును లేచి ప్రతినమస్కార మొన ర్చెను. ఇద్దరును వేరె యొక యాసనము నలంకరించిరి. అప్పుడు శివరావు శ్యామరావుకేసి చూచి "ఈమె నా ఫ్రెండు. పేరు మహాలక్ష్మి. యం. ఏ. యల్. టి." అని చెప్పి, మహాలక్ష్మివైపు తిరిగి, "ఈతడు నాబాల్య స్నేహితుడు. పేరు శ్యామరావు. బి. ఏ. బి. యల్. బొంబాయియందు నివాసము. ఒక్కవత్సరము సెలవు మీద ఇటకు వచ్చినాడు. పరశువాకమందు మకాము." అని భార్యకు చెప్పి మరియొక కుర్చీదెచ్చుకుని వారిసమ్ము ఖమందు గూర్చుండెను.

శ్యామరావు : మహాలక్ష్మిగారూ! మీ రెక్కడ చదువుకున్నారు ?

మహాలక్ష్మి: మహారాజా కాలేజి, మైసూరు.

శ్యామరావు: మీపరిచయ భాగ్యము వలననే నీదినమును సుదినముగ భావించుచున్నాను. స్త్రీలు సర్వవిధముల నున్నతిని గాంచిన గాని మనదేశ మభివృద్ధికి రాదు.

అని నుడువుచు శివరావును గాంచి యిట్లనియెను: "నీ భార్య యిచ్చట లేదా?"

శివరావు: (ముసిముసినగవున) ఈమెయే నా భార్య.

ఆమాట చెవి దూరినంతనే మహాలక్ష్మి చివ్వున లేచి నిలుచుండి తోకత్రొక్కిన త్రాచునుబోలి మండిపడుచు, శరీరము కంపింప తీవ్రదృక్కులను శివరావుమీద బరపుచు ఇట్లనియెను: "నే నెవ్వనికిని భార్యను గాను. నా కెవ్వడును భర్త లేడు."

అనుచు గదినివీడుటకు ప్రయత్నించుచుండ, శ్యామరావు డంగుబోవుచు, యామెను చూచుచు, మృదుమధుర వినయస్వరమున నిట్లనియెను. "మహాలక్ష్మిగారు, క్షమింపుడు. కూర్చొండి." అని పలువిధముల బతిమాలగా, ఆమె తిరిగి కూర్చుండెను.

శివరావు: ఎందుకు ఇంతకోపము? మన స్వేచ్ఛాసాధన ఆతనికి తెలియదు. అందువలన నాతని కర్థమగు భాషలో చెప్పితిని. అందు కింతకోపమా?

మహాలక్ష్మి: కోపమా? ముందు-ఆయనకు మేమిద్దరము ప్రేమిక్షున్నమని చెప్పండి. తర్వాత.

శ్యామరావు: మహాలక్ష్మిగారు, తిరిగి క్షమాపణ గోరుచున్నా. క్షమించండి. ఆతడు మీపరిచయము నాకు సరీగా చేసెను. కాని నేను పూర్వకాలపుమనిషిని. అందువలన నాకు గ్రాహ్యముకాలేదు. అపు డాతడు నాకు తెలియు భాషలో చెప్పవలసివచ్చింది. అంతే కాని యిం దెవరిదోషము లేదు. మరియొకమారు నాపక్షమునను వానిపక్షమునను మన్నింపగోరుచున్నాను—మిమ్ము శివరావు భార్యయని యన్నందుకు, విన్నందుకు.

* * * *

శ్యామరావు మిక్కిలి నేర్పరి, సూక్ష్మగ్రాహి, సదయహృదయుడు, సచ్చరిత్రుడు, మితభాషి, మృదుభాషి. అందువలన నీదంపతుల మనస్తత్వములను గ్రహించి, తర్కవితర్కముల కవకాశమును గలుగనీయక లోకాభిరామాయణమునకు గడంగెను. తదనంతరము భోజనము గూడ నేవిధమగు వాగ్యుద్ధమును లేక ముగిసెను. శ్యామరావు భోజనానంతరము తాంబూలచర్వణ మొనర్చుచు "ఈసంసార మెట్లు కుదుటపడునా" యని యోచించుచు, కారుమీద స్వగృహమున కరిగెను.

౨

ఈదంపతులిరువురును మేష్టర్లు. మహాలక్ష్మికి రు. ౭౫ జీతము. శివరావునకు రు. ౧౨౫ రూపాయల జీతము. ఇరువురును గ్రంథావలోకనమందు దిట్టలు-తర్కవితర్కములయం దత్యంతనిపుణులు. నిష్కల్మష వర్తనులు, సత్యవాదులు, స్వేచ్ఛాప్రియులు. ఋషులు గార్హస్థ్యధర్మములను నిర్వర్తించుచు మానవమండలికి లక్ష్యమై యలరారుచుండు విధముననే ఈదంపతులు గూడ మానవమండలి కాదర్శప్రాయమగు స్వేచ్ఛాజీవితమున కాలము గడుపనెంచుచుండిరి. నరనారులు సర్వస్వతంత్రులనియు, ఇం దొకరి కొకరు దాసులుగారనియు, వివాహమన బంధనము దాస్యము దాస్యశృంఖలమనియు నమ్ముచుండిరి. మానవసంఘమందు పరిపూర్ణస్వేచ్ఛను స్థాపించుటకే తాము భూమండలమం దవతరించితిమని మిత్రులతోగూడ జెప్పుచుండిరి. స్వగృహమందు వీరు పులులవలె నివసించుచుండినను, వీథియం దడుగిడిన అత్యంతవినయ వినమ్రతలతోగూడిన మితభాషిత్వముల మెలంగజొచ్చిరి.

ఇప్పటికి వీరివివాహమై దాదాపుగ మూడువత్సరములాయెను. ప్రతిదినమును గృహమందడుగిడగనే యిరువురును తర్కఖడ్గములను చేత ధరించి వాగ్యుద్ధమునకు గడంగుచుండిరి. ఆయుద్ధ మపుడపుడు రాత్రింబవళ్లను భేదమును బరిగణింపక అత్యంతతీవ్రముగ నడుచుచుండెను. అందువలన వా రుపవసింపవలసివచ్చిన దినములు, పూటకూటింట భుజించిన రోజులు రెండు వత్సరముల కతిశ

యించి యుండుననుట యథార్థమే. స్వేచ్ఛాయుద్ధమందు మునింగి తేలుచుండినను ఉపాధ్యాయ వృత్తికి అణుమాత్రమైనను భంగము గలుగనీయకుండిరి. క్రమము తప్పక పాఠశాలకు బోవుచుండిరి. స్వేచ్ఛామతస్థాపనమున కాదిదంపతులమను కీర్తి ప్రతిష్ఠలు త్వరలో తమ్మాశ్రయింపనున్నవని యువ్విళ్లూరుచుండిరి.

ఒకదినమున మహాలక్ష్మి స్వీయరచిత స్వేచ్ఛాసాధనభావగీతములను బాడుచు వీణను వాయించుచుండెను. శివరావు గదినుండి సావడిలోనికి వచ్చి యిట్లనియెను. "మహాలక్ష్మిగారు, మీరు వీణను వాయించవద్దు. భావగీతములను బాడవద్దు. నాచదువునకు భంగమగులుచున్నది. మన స్వేచ్ఛావాదమును రేపు గోఖలేహాలునందు విద్వన్మండలికి వినుపింపదలచితిని."

భార్య: శివరావుగారు, మీరు చేయదలచినది మహోత్కృష్టకార్యము. అది మీనిర్ణయము. కాని నేనిపుడు వీణావాద్యమున భావగీతములను బాడకతప్పదు. ఇది నానిర్ణయము. 24 గంటలవరకు. ఏమయినా సరే.

భర్త: మహాలక్ష్మిగారు, నా నిర్ణయము కూడ నంతయే. 24 వరకు చదువుకొనకతీరదు. సంగీతము వలన నాచదువు సాగుటలేదు. మంచియవకాశమే రేపు. మన స్వేచ్ఛావాదమునకు మహోదయమే. మన నామములు భూమండలమందు చిరస్థాయినొందు నుము హూర్తము రేపేనే. కర్తవ్యము ?

భార్య: శివరావుగారు, నిజము- ముమ్మాటికి సత్యము. మనస్వేచ్ఛావాదము సిద్ధించినది. కాని నానిర్ణయమును నేను మార్చుకోను; మార్చుకొనవీలును లేదు. మీ యభ్యంతరమువలన నా గృహకొంటినా నాస్వేచ్ఛ మంట కలిసినట్లే. నాతపోభంగమునకు నేనంగీకరింపను.

భర్త: మహాలక్ష్మి, నా నిర్ణయమును నే నెట్లు మార్చుకొందును ? నాస్వేచ్ఛకు సమాన ప్రతిపత్తికి భంగముకాదా ?

భార్య: శివరావ్, ఇంతయెందుకు? మీచదువు మీది. నాసంగీతమునాది. ఇందేదియు ఆపవీలులేదు.

భర్త: చదువుసాగదే. రాజీమార్గము లేదా ?

భార్య: రాజీకుదరదనియా ? కుదరకేమి ? ఒక్క రకు నా సంగీతము. ఒక్కి వరకు మీచదువు.

భర్త: సరే బాగుంది. నేను ముందు చదువుకుంటా. తర్వాత నీ సంగీతము.

భార్య: కాదు కాదు. ముందు నా సంగీతము. తర్వాత మీచదువు. ఈ నిర్ణయము తిరుగదు. తిరుగుట అసంభవము. స్వేచ్ఛాభంగము.

భర్త: అంతకంటె అసంభవము. స్వేచ్ఛానాశనము.

భార్య: అయితే ?

భర్త: అయితేలేదు- గియితేలేదు.

భార్య: ఇక మనకర్తవ్యము?

భర్త: అదే యోచన.

భార్య: నేను సంగీతము మానుకుంటాను. మీరు చదువుట మానండి. మీకొరకు నేను, నా కొరకు మీరు. బాగున్నదా ?

భర్త: బాగుండ కేమి? ఇం దొకరికొకరు లోబడుటలేదు. కాని యొకరి కొక రడ్డ మగుచున్నాము. అట్టిచో స్వేచ్ఛాసిద్ధి కలుగు టెట్లు ? సాధారణముగ దంపతులయందు పురుషుడు చెప్పినటుల స్త్రీయో, స్త్రీ చెప్పినటుల పురుషుడో వింటారు. అప్పుడు సంసారములు శాంతముగ నడచును. కాని అశాంతము దాస్యము. దాస్యజీవితము - ఛీ !

భార్య: యథార్థము. ఆపేనుగశాంతము నాకు సరిపడదు. నాచెవి జోరనిత్యము. స్వేచ్ఛ, స్వేచ్ఛ, నేను కోరునది స్వేచ్ఛ. నాకు కావలసినది స్వేచ్ఛాజీవితము. అదియే నాతపము; ఉపాసన; సాధన.

భర్త: మీరు చెప్పినమూక్కలు అక్షరాల సత్యము. కాని ఈ అశాంతి?

భార్య: నావల్లనా ?

భర్త : నీవల్లనని నేనన్నానా? మన ఇశ్వరతపమునం దవతరించిన జ్వాలాయుతిమను విమమే ఈ యశాంతి దీనిని మింగగలమూ,అమృతమను ద్రావగలము.

భార్య : భేష్ ! నిజము. (సంతసించును)

భర్త : అయితే, ఈ రాకాసిని సంహరించుటెట్లు? నీకేదయిన మార్గము గోచరించుచున్నదా ?

భార్య: ఆ. గోచరించుచున్నది. చెపుతావినండి. మన స్నేహబంధములను తెగద్రెంచుకొని కొంతకాలము సాధనచేసినగాని మనకు స్వేచ్ఛ సిద్ధింపదు. మనకు లభించు స్వేచ్ఛాసిద్ధియే జగద్రక్షణకు ముఖ్యపీఠమగును. అప్పుడు మననామములు జగత్తునందు చిరస్థాయియగును.

భర్త : శెబాష్. సరిగజెప్పితివి. సంతోషము. కాని నీసలహాను నేను వినను-వినగూడదు. అట్లొనర్చుట నాస్వేచ్ఛకు భంగము. అయినను స్నేహబంధన విచ్ఛేదనతలంపు నీకు కలిగినప్పుడే నాకును కలిగినది. కావున మన ఇశ్వర స్వేచ్ఛాసిద్ధాంతమునకు భంగములేదు. ఈబంధనములను తెగద్రెంచుకొనుటకు నాకంగీకారమే.

భార్య : అంగీకారమే - బాగున్నది. ఈయశాంతిని తలదన్నినట్లే.

భర్త : మొదలెవరు ? నేను—

భార్య : కాదు— నేను—

భర్త : కాదు కాదు. నేను—

భార్య: నేనొకపద్ధతిని చెపుతావినండి. నేను తలవంచుతా - మీరుకూడా తలవంచండి. నేను మీజంధ్యమును, మీరు నాపుస్తెలను పరస్పరము పట్టుకొని యొక్కమారు పుటుక్కున తెంచుదాం. అంతటితోడ మనపీడ వదులుతుంది. ఏమంటారు? నాయోచన సరీగ్గా యున్నదా ?

భర్త : భేష్ ! బాగున్నది. ఈయోచన నీతోబాటు నాకునుదోచినది.

భార్య : ఆలస్యమెందుకు ?

భర్త : అవును,ఒక్క సెకండయినను ఆలసించుట తగదు. త-గ-దూ.

ఇర్వురు తలలువంచుదురు. మంగళసూత్రమును శివరావుపట్టుకొనును. శివరావు మెడయందలి జంధ్యమును మహలక్ష్మి పట్టుకొనును. ఇర్వురు "రడీ-రెడీ" అని యని ఒక్కమారుగాలాగ రెండును పుటుక్కున తెగి నేలబడును.

చివ్వున ఇర్వురును తలలెత్తుదురు. "స్వేచ్ఛ, స్వేచ్ఛ" అని నుడువుచు, ఒకరు పశ్చిమముఖులును, రెండవవారు తూర్పు ముఖులుగను నడుదురు.

## 3

మరుసటి దినము దయముననే బయలుదేరి శివరావు బంధువులు స్నేహితులు మొదలగువారున్న కృష్ణాగోదావరీ తీరముల కరుగక బెంగుళూరు మొదలగు ప్రదేశముల కరిగి ఆయాస్థలములయం దారేడు మాసములు గడపి బెంగుళూరు మెయిలునందు ఉదయము ౫-30 గంటలకు సెంట్రలు స్టేషనునందు దిగెను. కాని యచ్చటనే శూన్యహృదయమున ఇటునటు చూచుచు తిరుగుచుండెను. స్నేహితులు గూడ నాతని గుర్తింపజాలకుండిరి. శుష్కించి పాలిపోయిన శరీరము, గుంటలుపడిన కండ్లు, మాసినగడ్డము, మలినవస్త్రములు గూడిన శివరావును గాంచిన వారలు పిచ్చివాడనుకొనుటయం దాశ్చర్యమేమున్నది ?

శివరావు ౮ గంటలవరకు స్టేషనునందే యిటునటు తిరుగుచు బస్సునెక్కి చింతాద్రిపేట యందలి స్వగృహమును జేరెను. తలుపుదీసి లోనికరిగి సావడియందొక కుర్చీమీద కూలబడి నిట్టూర్పు విడిచెను. ఒకరిద్దరు స్నేహితులువచ్చి పలకరించిరి. సరియగు ప్రత్యుత్తరములేకుండెను. అందువలన వారెంతయు విచారింపజొచ్చిరి. భోజనమున కాహ్వానించిరి. కాని యాతడందుల కంగీకరింపకుండెను. వెర్రినవ్వులతో అసందర్భముగ ప్రసంగింపజొచ్చెను. "స్వేచ్ఛ, స్వేచ్ఛ, స్వేచ్ఛాసిద్ధి" యని యనుకొనుచుండెను. ఇక వారేమి చేయగలరు? అందొక స్నేహితుడు కాఫీ, ఉపమా మొదలగువానిని బంపించెను. కాని శివరావు వానిని కన్నెత్తియైనను చూడకుండెను.

కొంతవడి కా కుర్చీనుండి లేచి యింటియందిటు నటుదిరుగుచు గదిలోనికరిగెను. అటనుండి వంటయింటి లోనికి బోయి తిరిగి మరియొకగదిలోని కరిగెను. అచట గోడకు తగిలించియున్న ఫోటోగ్రాఫుల ఫ్రేమునందు మహాలక్ష్మి ప్రతిబింబమును గాంచి "జయము. స్వేచ్ఛా వాదమునకు జయము" అని యనునంత ఆతని కన్నీటి బిందువులు నేల రాలెను. కాని యావిషయ మాతనికి తెలియదు. అటనుండి సావడిలోనికి వచ్చి పడకకుర్చి యందు కూలబడెను. కన్నులు మూయుచు తెరచు చుండెను

దాదాపుగ పండ్రెండుగంటల వేళ ఘోషా ఆస్పత్రినుండి జవానువచ్చి 'శివరావుగారు' అని పిలిచెను. లోనికరిగి యొకయుత్తరమును ఆతనిచేతికిచ్చి చేతులు కట్టుకొని బహుమతికొరకు వేచియుండెను. ఆయుత్తరమును చదువుకొనినంతనే శివరావుమోము ఒకింత విప్పారెను. జవానున కొక రూప్యమిచ్చి తిరిగియుత్తరమును చదువుకొనెను. ఆయుత్తరమును చేతిపెట్టెయందు దుబెట్టి గుమ్మముకడకువచ్చి తిరిగి రివ్వున మరియొక కుర్చీమీద గూర్చుండును. చేపెట్టెనుండి యాయుత్తరమును దీసికొని తిరిగిచదువుకొనెను. దానిని భద్రముగ కోటుజేబునందిడి, అతిత్వరితముగ స్నానమొనర్చి బీరువాయందలి బట్టలనుదీసికొని వానినిధరించి వీధివాకిలి కడవరకు జని తిరిగివచ్చి కూర్చుండెను. ఒకటిరెండు నిముసములు యోచించి యేవిధమగు నిర్ణయమునకు రాజాలకుండెను. ఒకింతవడికి అటనుండిలేచి గదిలోని కరిగి బీరువానుదెరచి యందొక రుమాలునుదీసి జేబునందు బెట్టుకొనెను. ఆతని శరీరమందంతటను ఏదియో యపూర్వశక్తి వ్యాపించెను; నేత్రములు వారిపూరితములాయెను. అప్పుడాతని హృదయాగ్ని యొకింత యుపశమిల్లెను. కాని పాదములు తూలిపోవుచుండుటవలన కూలబడెను.

ఒక్కనిముసము గూర్చుండి చివ్వునలేచి వీథిలోని కరిగి రిక్షామీద నెక్కి హాస్పిటలునకు బయలుదేరెను. మార్గమందు గాన్పించిన మిత్రులప్రశ్నలకు ప్రత్యుత్తర మీయక రిక్షా లాగువానిని త్వరితముగ బొమ్మని తొందరించుచు హాస్పిటలును జేరెను. లోని కరిగి జనరలువార్డునందు ఇటునటు తిరిగెను. మేడపైకి బోయెను. అచ్చటనుండి క్రిందికివచ్చి స్పెషలు వార్డులలోనికి బోవుచుండ మహాలక్ష్మిని గాంచెను. ఆమె చేసంజ్ఞలతో శివరావును ఆహ్వానింపగా శివరావు గబగబ ఆ గదిలోని కరిగెను.

అచ్చట ఇనుపమంచము మీద పరచిన తెల్లని ప్రక్కమధ్య శయనించి దైవదృష్టిని మరపింపజేయు చూపుల రెప్పవాల్చక చూచుచున్న ఇరువదియైదు దినముల శిశువును గాంచెను. మంచమును సమీపించెను. తదేకదృష్టిని బాలుని చూడజొచ్చెను. అనిర్వచనీయమగు ఆకర్షణవలన నాతనిదృక్కులు బాలుని దివ్యదృష్టియందు మిళితమాయెను. రోమాంచితుడై ఆనందాశ్రువులు జొటజొట రాలుచుండ తలవంచి కుడిహస్తమున బాలుని బుగ్గలను స్పృశింప, ఆశిశువుబోసినోటినుండి పండువెన్నెలలు బహిర్గతమాయెను. సునిర్మలముకురమందు- సుస్వచ్ఛతటాకజలములయందు- కృష్ణాప్రవంతియలలయందు- స్వీయరూపరేఖావిలాసములను దిలకించినటుల, ఆశయనమందలి శిశువునందు స్వీయరూపమును నిశ్చంచలచిత్తమున సునిర్మలహృదయమున చూచుచుండ తనివిదీర గ్రోలుచుండ, ఆసుకోమలరూపమాధురిని నేత్రయుగళమున జుర్రుచుండ మహాలక్ష్మి యాచూపున చూపు గలిపి అనిర్వచనీయమగు ఆనందము ననుభవించుచుండ, వారిర్వురి నేత్రయుగళమునుండి ఆనందాశ్రువులు బాలునిపైబడ జాలజొచ్చెను. అప్పుడామె అప్రయత్నముగ, యోచనారహితముగ బాలునెత్తి భర్తకరకమలములయందిడెను. శివరావు బాలుని ముద్దాడజొచ్చెను.

మహాలక్ష్మి ప్రక్కసర్ది పొత్తిలిగుడ్డలను సరిగలాగి భర్తచేతియందలి శిశువును పరుండబెట్టెను. అప్పుడు బాలుడు చేతులుకాళ్లు కదలించుచు శరచ్చంద్రచంద్రికల ధిక్కరించుచిరునగవులు బరపుచుండ శివరావు బాలుని శిరముమీద చేయిడి "స్వతంత్రరావు" అని ముమ్మారు పిలచి తలయెత్తెను. భార్యను చూచెను. ఒకరి దృష్టియందు మరియొకరిదృష్టిని విలీనమొనర్చుకొనిరి. ఇర్వురును బాలునిచూచుచు నొక్కస్వరమున "స్వతంత్ర

రావు" అని పిలచుచు చిరునగవుల నాబాలుని యాశీర్వదించిరి; దీర్ఘాయువును గోరిరి.

అప్పుడు మహాలక్ష్మి భర్తపాదములమీద వ్రాలి యిట్లనియెను. "నాథా! క్షమింపుడు." అని యనుచుండ శివరా వామెను లేవదీసి కూర్చుండబెట్టి చేలాంచలమున నామె కన్నీరు దుడిచి "ప్రేయసీ, నీయందేమి లోపమున్నది? క్షమించుటకు నీవు నిర్దోషివి. నిష్కల్మషహృదయవు. నిర్దుష్టచరిత్రవు. నేనో క్షమార్హుడను. క్షమింపుము. నేను కుతర్కజాలమందు బంధింపబడితిని. నిన్ను బంధించితిని. అందువలన పలుబాములకు లోనైతిని. నూతన మతస్థాపనమున కవతరించితినను నాయజ్ఞానము-తర్కభ్రమ - విచిత్రతృష్ణ - అసహనము - ఈర్ష్య మొదలగువానివలన దగ్ధమగుచు, నిన్ను దగ్ధమొనర్చితిని. వేయివృశ్చికదంశనములవలన బొందుబాధను అనుభవించితిని. నేటికి జ్ఞానమూర్తియగు భగవానునకు హృదయమర్పింపగలిగితిని. ఆంధ్రుల జీవనము, జీవనాధారుడగు ఆత్మారాముడు స్వతంత్రరావును సర్వవిధముల సంరక్షించుగాత." అని యామెహస్తద్వయమును బట్టుకొనెను.

మహాలక్ష్మి చేతులు జోడించుకొని గద్గదస్వరమున నిట్లనియెను. "నాథా! నాబుద్ధి నిరంతరము కీటకము బోలె గ్రంథములయందు దిరుగుచుండెను. లోకజ్ఞానము కలుగవలయునని నాతలిదండ్రు లొనర్చిన ప్రయత్నములు నన్ను కల్పితజగత్తు, కుతర్కజాలమునుండి తప్పింపజాలకుండెను. విద్వాంసురాలనను అహంకారము మిన్నుముట్ట జొచ్చెను. అతిభయము - సిగ్గు - అత్యంత ధైర్యము - నిరుపమానమగు పిరికితనము - అశక్తత - మొదలగువానియందు దగుల్కొని మీకత్యంత దుఃఖమును గలిగించితిని. నే నధఃపతితనైతిని. త్రిలోకశరణ్యము, త్రిలోకవరేణ్యము అగు గృహస్థాశ్రమరూపమును, పవిత్రతను గ్రహింపలేకుంటిని. గృహస్థాశ్రమమే మానవమండలికి స్వభావసిద్ధమగు ఆశ్రమమనిగాని, రక్షణాభివృద్ధులకు ఆధారమనిగాని యెరుంగజాలక మిమ్మనేకవిధముల బాధించితిని. నేనత్యంత తీవ్రమనోవ్యథకు గురియైతిని. క్షమింపుడు." అనుచు కాళ్లమీద బడబోవు మహాలక్ష్మిని గూర్చుండబెట్టి శివరావు ఇట్లనియెను. "మన మిర్వరము సర్వవిషయముల సమానులము. ఇందెచ్చుతగ్గులుండినచో ఇంతటి దుఃఖము ననుభవించి యుండము. మనమనస్తత్వములు - కుతర్కవీచికలుగూడ సమానములు. నాయుపదేశములవలన అనేకమందికొంపలు కూలినవి. అంతియే కాదు. ఒకరిద్దరాత్మహత్య యొనర్చుకొనిరి. ఆవిషయములు నన్ను నిరంతరము దగ్ధమొనర్చుచున్నవి. అట్టి నేను క్షమార్హుడను. కాని నీవుకాదు. క్షమించు. త్రికరణశుద్ధిగ క్షమించు మహాలక్ష్మీ! మనల నావరించిన యజ్ఞానాంధతమోరాశియందీ బాలచంద్రోదయమైనది. వెంటనే జ్ఞానము కలిగినది. తమస్సు పటాపంచలైనది. నిన్ను నేను క్షమించుచున్నాను. హృదయపూర్వకముగ నన్ను క్షమించుము." అనుచుండ నామె సుందరముఖారవిందము విప్పారెను. చిరునగవుల శివరావును మంచి లేవనెత్తెను.

అంత నొకనైపున ముసిముసి నగవుల చూచుచు నిలుచుండిన శ్యామరావును, సుశాంతభావమున గూర్చుండియుండిన నర్సును గాంచి శివరావు ఒకింత సిగ్గుపడెను. 'ఎపుడువచ్చితివి' అని యడుగ శ్యామరావు "నీవు నన్ను చూడలేదు. నీకంటె ముందుగ నేనిటకు వచ్చితిని." అని ప్రత్యుత్తరమొసగి జంధ్యముల జతను మహాలక్ష్మిచేతి కొసగెను. ఆమె యాజంధ్యములకు పసుపు వ్రాయుచుండ, శివరావు చేతిరుమాలును శ్యామరావుకిచ్చెను. అందు ముడివైచియుండిన మంగళసూత్రమునుగాంచి పరమానందభరితుడై శ్యామరావు తిరిగి శివరావుచేతి కొసగెను. శివరావు దానిని మహాలక్ష్మికంఠమున గట్టెను. మహాలక్ష్మినేత్రములు విప్పారమనముప్పొంగ శివరావుమెడయందు జంధ్యమును తగిలించెను.

అంత వారిర్వురును చిరునగవులు వెలిగ్రక్కుచు ఆశీర్వాద దృక్కుల చూచుచున్న శ్యామరావుకు నమస్కరించిరి. ఆతడు వీరిర్వరను దీవించెను.

భర్తచేయిబట్టుకొని మహాలక్ష్మి యిట్లనియెను. "ఈతడు పురుషోత్తముడు. నన్ను సర్వవిధముల గాపాడిన యుదారహృదయుడు. పరమపవిత్రుడగు నీసోదరుని ఋణమును నే నీజన్మయందు దీర్చుకొనజాలను. దీర్చుకొనుట అసంభవము. ఈమెను నర్సుగ భావింపకుడు. నే నటుల భావించను. ఈమె నాతల్లి. శ్యామరావు నాతండ్రి"

అంత శ్యామరావుకారు వచ్చెను. దానియందు నల్వురునుగూర్చుండి శ్యామరావుఇంటి కరిగిరి.

" ఆత్మావై పుత్రనామాసి, "

# రాజ్యాంగ ప్రతిష్టంభనం

"రావుజీ"



మద్రాసు, బొంబాయి, సి. పి, యు. పి, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలో ఏర్పడ్డ రాజ్యాంగప్రతిష్టంభనాన్ని గురించి జరిగిన...జరుగుతూవున్న...వాదోపవాదాలు ఇన్నన్ని కావు. స్వదేశ విదేశవార్తాపత్రికల వారు, అనేక రాజకీయపక్ష నాయకులు, సుప్రసిద్ధులూ, అప్రసిద్ధులూ అయిన న్యాయవాదులు, అధికారులు, అనధికారులు, మంత్రులు, ఉపమంత్రులు, మాజీమంత్రులు,—ఇలాగే మరెందరో ఈ సమస్యను వివిధదృక్పథాలనుంచి చర్చించారు; చర్చిస్తున్నారు. ఇంతగా చర్చించబడిన...చర్చింపబడుతూవున్న... ఈసమస్యను గురించి ఇక్కడ ఇంకోసారి క్రొత్తగా చర్చజరుపడం అనవసరం. పోతే, ఈ వ్యాసం ఎందుకంటే,— ఈ చర్చలన్నిటినీ సింహావలోకనం చెయ్యడానికీ, వాటిసారాంశాన్ని సమగ్రంగా చెప్పడానికీ.

అసలు ఈ రాజ్యాంగ ప్రతిష్టంభనం ఉత్పన్నమైన విధం ఇది:

నూతన రాజ్యాంగవిధానంక్రింద మొన్నటి ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలకు చాలా పూర్వంనుంచీ కూడా కాంగ్రెసువారు మంత్రిపదవుల్ని స్వీకరించవచ్చునా, కూడదా అని చర్చ జరిగింది. కాంగ్రెసుపక్షంలోని అతివాదులు...ముఖ్యంగా సోషలిస్టులు...స్వీకరించగూడదంటూ వాదించారు. పోతే, కాంగ్రెసుపక్షంలోని మితవాదులు...ముఖ్యంగా పూర్వపు దాసు-నెహ్రూల స్వరాజ్య పార్టీవారు...స్వీకరించవలసిందే నని పట్టు పట్టారు.

మంత్రిపదవుల్ని స్వీకరించరాదని వాదిస్తూ, అతివాదులు చెప్పిన కారణాలు ఇవి:

(౧) భారతదేశం వాంఛిస్తున్న స్వరాజ్యాన్ని ఇవ్వకపోవడమే కాకుండా, ఇప్పుడున్న స్వల్పస్వాతంత్ర్యాన్ని కూడా హరిస్తున్న నూతనరాజ్యాంగవిధానాన్ని బహిష్కరించవలసినదని కాంగ్రెసు ఇదివరకే తీర్మానించింది. ఇలాంటి సందర్భంలో ఆ రాజ్యాంగవిధానం క్రింద మంత్రిపదవుల్ని స్వీకరించడం దానితో సహకారం చెయ్యడమే అవుతుంది.

(౨) మంత్రులకు నామమాత్రంగానే స్వాతంత్ర్యాన్ని ఇచ్చే ఈ రాజ్యాంగవిధానంక్రింద పదవుల్ని స్వీకరిస్తే ప్రజోపయోగకరమైన కార్యాల్ని వేటినీ సాధించలేకపోవడమే కాకుండా అలంకార పదవుల్ని అనుసరించివుండే పరస్పర వ్యక్తిగత విద్వేషాల వల్లనూ, అంతఃకలహాలవల్లనూ ఇప్పుడున్న ప్రజావిశ్వాసాన్ని పోగొట్టుకోవలసివస్తుంది.

(3) ప్రస్తుత పరిస్థితులలో పదవుల్ని స్వీకరిస్తే, స్వాతంత్ర్యేచ్ఛ చచ్చిపోయి, స్వల్పసంస్కరణాలతో సంతృప్తిపడే మితవాద వైఖరి ప్రబలుతుంది.

కాంగ్రెసు సోషలిస్టుల ఈ వాదనను కాంగ్రెసు అధ్యక్షుడైన జవ్హారిలాల్ నెహ్రూకూడా పూర్తిగా సమర్థించాడు.

అయితే, కాంగ్రెసునాయకులలో మితవాదులని చెప్పదగినవారంతా ఈ వాదనను అంగీకరించలేదు.

ప్రస్తుత రాజ్యాంగవిధానంలో ప్రజామంత్రులకున్న స్వాతంత్ర్యం చాలా స్వల్పమని వారుకూడా ఒప్పుకున్నారు. కాని, ఈ స్వల్పస్వాతంత్ర్యాన్నే కాంగ్రెసు సంస్థను బలపరచే నిమిత్తం ఉపయోగించడానికీ, తద్వారా నూతనరాజ్యాంగవిధానాన్ని భగ్నంచెయ్యడానికీ కాంగ్రెసువారు మంత్రిపదవుల్ని స్వీకరించవలసిందేనని వారు పట్టుపట్టారు. పైగా, కాంగ్రెసువారు మడికట్టుకుని, ఇతరుల్ని మంత్రిపదవుల్ని ఆక్రమించనిస్తే, వారు ప్రభుత్వంవారిచేతులో కీలుబొమ్మలై జాతీయోద్యమవ్యాప్తికీ, కాంగ్రెసుసంస్థ అభివృద్ధికీ ప్రతిబంధకాల్ని కల్పిస్తారనికూడా వాదించారు.

కాంగ్రెసుపక్షంలో అతివాదులకూ, మితవాదులకూ మంత్రిపదవీస్వీకారవిషయంలో ఏర్పడ్డ ఈ తీవ్రమతభేదాలవల్ల కాంగ్రెసు సంస్థలో చీలిక వస్తుందేమో నని అనుమానం తోచింది. కాని, ఈ విషయమై ఒక నిర్ణయాన్ని చెయ్యడానికంటూ మార్చినెల మూడోవారంలో ఢిల్లీలో సమావేశమైన ఆల్ ఇండియా కాంగ్రెస్‌కమిటీ...మహాత్ముని సలహా ననుసరించి... ఒక రాజీపద్ధతిని సూచించగలిగింది. ఆ రాజీపద్ధతి ఇది:

ఇతరపక్షాల సహాయంతో నిమిత్తంలేకుండా కాంగ్రెసువారు కేవలం తమ బలంతో తామే మంత్రివర్గాల్ని ఏర్పరచగల రాష్ట్రాలలో మాత్రమే పదవుల్ని స్వీకరించాలి. ఇలాంటి రాష్ట్రాలలోనైనా, పదవీ స్వీకారానికి ముందు గవర్నరుదగ్గరనుంచి ఒక హామీ కోరాలి. ఈ హామీ ఏమిటంటే,—రాజ్యాంగవిధానానికి లోబడివుండే కాంగ్రెసుమంత్రుల కార్యకలాపాలకు తన ప్రత్యేకాధికారాల్ని వినియోగించిగాని, మంత్రుల సలహాను త్రోసిపుచ్చిగాని గవర్నరు ప్రతిబంధకాలను కల్పించగూడదు. ఈ హామీ ఇవ్వబడ్డట్టు నిదర్శనం ఏమిటంటే— అసెంబ్లీ కాంగ్రెసుపక్ష నాయకుడు గవర్నరు తనకు ఇలాంటి హామీ ఇచ్చాడంటూ పబ్లిక్‌గా ప్రకటన చెయ్యగలిగివుండడమే.

మంత్రిపదవీ స్వీకారవిషయంలో కాంగ్రెసు పక్షంలో కలిగిన మతభేదాలను తీర్చడానికి గాంధిమహాత్ముడు సూచించిన ఈ రాజీపద్ధతి చాలా రాజనీతి చతురతాపూర్వకంగా వున్నదనే చెప్పాలి. గవర్నర్లు తాము తమప్రత్యేకాధికారాల్ని వినియోగించమనీ, కాంగ్రెసు మంత్రుల సలహాను త్రోసిపుచ్చమనీ హామీఇస్తే కాంగ్రెసువారు ప్రస్తుతరాజ్యాంగవిధానం ప్రసాదించే స్వల్పస్వాతంత్ర్యాన్నికూడా ప్రజోపయోగానికీ, కాంగ్రెసు సంస్థను బలపరచడానికీ ఉపయోగించ గలుగుతారు. అప్పుడు పదవీస్వీకరణం కూడదంటూ సోషలిస్టులు చెప్పే ఒక పెద్ద అభ్యంతరం తొలగిపోతుంది కూడా! ఇంతే కాకుండా, గవర్నరు ఇవ్వవలసినహామీ లిఖితపూర్వకంగా వుండాలని కోరకపోవడంవల్ల, అలాంటి హామీని ఇవ్వడానికి అభ్యంతరం ఏమీ వుండడానికి వీలులేదు. పైగా, కేవలం రాజ్యాంగవిధానానికి లోబడివుండే కార్యకలాపాలలోనే జోక్యంవుండదని హామీకోరుతూ వున్నందువల్ల ప్రస్తుతరాజ్యాంగవిధానంలో (పార్లమెంటుతో నిమిత్తం లేకుండా, గవర్నర్లద్వారానే) మార్పు తేవడానికి ప్రయత్నిస్తున్నారని వాదించడానికైనా అవకాశం దొరకదు.

కాంగ్రెసు తీర్మానంలో గవర్నర్లు హామీనివ్వడానికి చట్టసంబంధమైన అభ్యంతరాలు ఏవీ లేనందువల్ల, వారు తప్పకుండా కాంగ్రెసు కోరి హామీని ఇస్తారనీ, కాంగ్రెసుపక్షానికి మెజారిటీవున్న మద్రాసు, బొంబాయి, సి. పి., యు. పి, బీహార్, ఒరిస్సా రాష్ట్రాలు ఆరింటిలోనూ కాంగ్రెసు మంత్రివర్గాలు విధిగా ఏర్పడతాయనీ అందరూ అనుకున్నారు. కాని, తెరవెనక ఏమి తతంగం జరిగిందో గాని, పై ఆరురాష్ట్రాలలోకూడా గవర్నర్లు కాంగ్రెసువారు కోరిన హామీని ఇవ్వ నిరాకరించారు. ఇంతేకాకుండా, మెజారిటీ పక్షమైన కాంగ్రెసును వదిలివేసి, మైనారిటీపక్షాలవారిచేత మంత్రివర్గాల్ని ఏర్పాటుచేయించారు. ఈ మంత్రివర్గాలకు "ఇన్‌టరిం మినిస్ట్రీలు" అని నామకరణం చేశారు. వీటిని తెలుగులో "నడమంత్రం మంత్రివర్గాలు" అని అంటున్నారు.

తమకు తమ ప్రత్యేకాధికారాలను పార్లమెంటరీ చట్టం ప్రసాదించిందనీ, వాటిని ఉపయోగించే అధికా

రాన్ని తాము విధ్యుక్తంగా వుంచుకోవాలనీ, తాము కోరినప్పటికీ వాటిని వదులుకునే హక్కు తమకు లేదనీ కాంగ్రెసువారు కోరిన హామీనివ్వ నిరాకరిస్తూ గవర్నర్లు చెప్పారు. మద్రాసు, బొంబాయి, సి. పి., యు. పి., బీహార్, ఒరిస్సారాష్ట్రాల గవర్నర్లు ఆరుగురూ ఈ విధంగా ఒకేఫక్కీని జవాబుచెప్పడంవల్ల గవర్నర్ జనరల్ వద్దనుంచో, ఇండియా సెక్రటరీవద్దనుంచో వచ్చిన తాఖీదు ప్రకారం వారు నడుచుకున్నారని అనుకోవలసివస్తుంది.

గవర్నర్లు హామీనివ్వ నిరాకరించడానికి చట్టం అడ్డువచ్చినదని అనుకోడం కేవలం పొరపాటు. ఎంచేతనంటే,—ఏ ప్రభుత్వంవారైనా తమకు ఇష్టంలేని పనిని కాదనడానికి "అచ్ఛే! దీనిని చట్టం అంగీకరించదు" అని సులభంగా అనివేస్తారు. వారే తమకు అవసరమైనప్పుడు మాత్రం చట్టంమాటనే పూర్తిగా మరిచిపోతారు. అంచేత హామీనివ్వ నిరాకరించడానికి చట్టం గిట్టంకాకుండా ఇతరమైన అభ్యంతరాలు ఏవోవుండి వుండాలి ఈ అభ్యంతరాలను గురించి చాలామంది చాలా వూహల్ని ప్రకటించారు. వాటిలో సబబైనవి ఇవి:

(౧) ఏప్రిల్ మొదటి తేదీనాడు నూతనరాజ్యాంగ విధానాన్ని నిరసించడానికిగాను హరతాళ్ జరపాలని ఫైజ్‌పూర్ కాంగ్రెసు తీర్మానించింది. అంచేత ఆలోపుగానే కాంగ్రెసుమంత్రివర్గాలు ఏర్పడ్డట్టయితే, ఆనాడు ప్రభుత్వకార్యాలయాలన్నింటినీ మూసివెయ్యాలని కాంగ్రెసుమంత్రులు ఉత్తరువు చేస్తారు. ఈ విధంగా నూతన రాజ్యాంగం ప్రసాదించే హక్కులే ఆ రాజ్యాంగ నిరసనానికి తోడ్పడతాయి. అంచేత, కాంగ్రెసువారికి మంత్రిపదవుల్ని కట్టబెట్టి ఏప్రిల్ ౧ వ తేదీ హరతాళాన్ని జయప్రదం చెయ్యడం తెలివితక్కువ పని అవుతుంది.

(౨) ఆరవజార్జి చక్రవర్తి పట్టాభిషేకం సమీపంలోనే వుంది. (అంటే ఇది ఏప్రిల్‌నాటి మాట) ఈ మహోత్సవాన్ని ఇటీవల వివిధకారణాలవల్ల కళావిహీనమైవున్న బ్రిటిష్ సామ్రాజ్యప్రతిష్ఠను పునరుద్దీపింప చెయ్యడానికి వినియోగించాలని అనుకుంటున్నారు. కాని, కాంగ్రెసువారు మాత్రం ఈ మహోత్సవంపట్ల మూకీభావంవహించాలని నిశ్చయించుకున్నారు. ఇలాంటి సందర్భంలో కాంగ్రెసువారు మంత్రిపదవులలో వుంటే పట్టాభిషేక మహోత్సవం వైభవంగా జరగడానికి ప్రతిబంధకం ఏర్పడుతుంది. అంచేత కాంగ్రెసువారికి (కనీసం ఇంతే") మంత్రిపదవుల్ని ఇవ్వగూడదు.

[కాంగ్రెసుపక్షం చేతిలోవున్న మద్రాసు, కలకత్తా కార్పొరేషన్లలోనూ, మరికొన్ని మునిసిపాలిటీలలోనూ పట్టాభిషేకం వేడుకలలో పాల్గొనరాదని తీర్మానించి, అలాగే నడుచుకున్నారు. దీన్నిబట్టి ఈవిషయంలో ప్రభుత్వంవారి ఆలోచన...వారి దృక్పథన్నుంచి...సక్రమమైనదనే అంగీకరించాలి]

(౩) కాంగ్రెసువారు తమ మంత్రిపదవుల్ని కాంగ్రెసు సంస్థను బలపరచడానికి వుపయోగిస్తామని స్పష్టంగా చెబుతున్నారు. గవర్నర్లు కాంగ్రెసువారు కోరుతున్న హామీని ఇస్తే, కాంగ్రెసు తప్పకుండా ఇంకా చాలాశక్తిని చేకూర్చుకుంటుంది. ఇప్పటికే కాంగ్రెసుసంస్థ కంటకప్రాయంగా వుంది. దానికి ఇంకా బలంచేకూరితే, అది భారతదేశంలో బ్రిటిషు ప్రాబల్యానికే చేటుతెస్తుంది. అంచేత కాంగ్రెసువారు మంత్రిపదవులకు రాకుండా చెయ్యడమే మంచిది.

(౪) పదవుల్ని స్వీకరిస్తారనీ, తమకు ఏవేవో సౌకర్యాలను చేస్తారనీ నమ్మి, ప్రజలు మొన్నటి ఎన్నికలలో కాంగ్రెసువారికి అఖండవిజయాన్ని చేకూర్చినట్టున్నారు. ఇప్పుడు ప్రభుత్వంవారు ఆహ్వానించినాకూడా కాంగ్రెసువారు మంత్రిపదవుల్ని స్వీకరించకుండా, హామీ గీమీ అంటూ అభ్యంతరాలుచెప్పుతూ వున్నారుకనుక, ప్రజలకు కాంగ్రెసుపైన అసంతృప్తికలగవచ్చును. ఇదేనిజమైతే, ఏ ఆరుమాసాలతర్వాతనో తిరిగి ఎన్నికలను జరిపితే, కాంగ్రెసువారు వోడిపోవడం తథ్యం.

(౫) ప్రస్తుతచట్టంలోని ౬౨ వ సెక్షన్ 3 వ సబ్ సెక్షన్ ప్రకారం ఎన్నికలు జరిగినతర్వాత ఆరు నెలలవరకూ అసెంబ్లీ సమావేశాన్ని జరపకుండా తప్పించడానికి గవర్నరుకు అవకాశంవుంది. ఈ అవకాశాన్ని వినియోగించుకొని, అసెంబ్లీ సమావేశాన్ని ఆరుమాసాల వరకు జరపకుండావుంటే, ఈలోపుగా నడమంత్రం మంత్రివర్గాలవారు పదవుల్ని ఆశపెట్టీ, ఇంకా ఇతర ప్రలోభాల్ని కల్పించీ, కొందరు కాంగ్రెసుసభ్యులను తమలో కలుపుకోవచ్చును. ఇలా జరిగితే, ఇప్పటి మైనారిటీ పక్షాలు మెజారిటీపక్షాలు అయితే కావచ్చును. పైగా, పదవులంటే ప్రలోభంగల కాంగ్రెస్ అసెంబ్లీ సభ్యులు తమంతట తామే తిరగబడవచ్చును కూడా. ఏకొద్దిమంది కాంగ్రెసుసభ్యులు ఇలా తిరగబడినప్పటికీ కాంగ్రెసు ప్రతిష్ఠకు భంగంవస్తుంది. అంచేత పరిస్థితులు ఎలా తిరుగుతాయో చూడ్డానికి ఆరుమాసాలపాటు వేచివుండడమే తెలివిగల పని.

[మద్రాసు నడమంత్రం మంత్రివర్గంలో ఒకడైన పాలెట్ చేసిన ప్రచారాన్ని గురించి ఇటీవల బయటపడ్డ రహస్యాల్ని బట్టి చూస్తే, ప్రభుత్వం పైన చెప్పిన ఊహ నిజంగా చేసినట్టు తోస్తుంది.]

(౬) తమకున్న జీవితపరిమాణం ఆరుమాసాలలోనూ నడమంత్రం మంత్రివర్గంవారు నూతనరాజ్యాంగం ప్రసాదించే స్వల్పస్వాతంత్ర్యాన్ని పురస్కరించుకొని, ప్రజలకు చిన్నచిన్న సహాయాలనుచేస్తే, ఈ సారి ఎన్నికలలో ఈ మంత్రివర్గాలవారు ప్రజామోదాన్ని పొందవచ్చును.

[మద్రాసు నడమంత్రం మంత్రివర్గంవారు కోటి రూపాయల్ని అప్పుచేసి, ఆ మొత్తాన్ని రైతులకు ఋణాలక్రింద ఇస్తామనడమూ, బొంబాయి మంత్రివర్గంవారు నిర్బంధ ప్రాథమికవిద్యను ప్రవేశపెడతామనడమూ, తక్కిన రాష్ట్రాలవారుకూడా ఇలాంటి కార్యక్రమాలనే ప్రకటించడమూ చూస్తే ఈ ఊహ సత్యమయినదన్నట్టే తోస్తుంది.]

(౭) తక్కిన లాభనష్టాలమాట ఎలా వున్నా కాంగ్రెసువారు కోరిన హామీని ఇవ్వడం ప్రభుత్వ ప్రతిష్ఠకు కళంకం. కాంగ్రెసుకు మెజారిటీలేని బెంగాలు, అస్సామ్, పంజాబ్, సింధు, సరిహద్దు రాష్ట్రాలలో ఏ హామీనీ కోరకుండా ఇతర పక్షాలవారు మంత్రివర్గాల్ని ఏర్పరచగాలేనిది, ఒక్క కాంగ్రెసుపక్షంవారే హామీని కోరడము, దాన్ని తాము ఇవ్వడమూ—ఎంత సిగ్గుచేటుపని! ఇలా హామీని ఇస్తే, ఆ అయిదు రాష్ట్రాలలోని కాంగ్రెసు భిన్నపక్షాలకు తలవంపులు కూడా కావూ? అసలు పూర్వం గాంధీ - ఇర్విన్ ఒడంబడిక జరగడంవల్లనే తమప్రతిష్ఠకు కొంతకళంకం వచ్చింది. వెల్లింగ్డన్ ప్రభువు పుణ్యాన ఆ కళంకం కొంతవరకు తీరిపోయిందని అనుకుంటూవుండగా, ఇంతలో మళ్లీ హామీలనూ గీమీలనూ ఇచ్చి అప్రతిష్ఠపాలవడమా?

ఈ పైన పేర్కొన్న వూహలలో ఏది ఎంతవరకుసత్యమైనదో చెప్పలేముగాని, అసలు విషయం ఏమిటంటే,- గవర్నర్లు కాంగ్రెసువారు కోరిన హామీని ఇవ్వమన్నారు. ఇలా హామీని ఇవ్వమని కాంగ్రెసువారు కోరడమూ, తాము ఇవ్వడమూకూడా చట్టవిరుద్ధమన్నారు ఇండియాకార్యదర్శి జెట్లెండ్ ప్రభువు, సహాయకార్యదర్శి బట్లర్,- వీరుభయులూ కూడా "ఔను, నిజమే! చట్టవిరుద్ధం!" అని ప్రకటించారు.

నిజంగా చట్టమే తమకు అభ్యంతరంగా వున్నదని ప్రభుత్వంవారు నమ్ముతూ వున్నట్టయితే, వారు గాంధీజీ చేసిన మధ్యవర్తిసంఘ నియామక సూచనకు అంగీకరించవలసింది. కాంగ్రెసువారు కోరిన హామీ చట్టసమ్మతమైనదా, కాదా అనే విషయాన్ని నిర్ణయించడానికి ఒక మధ్యవర్తుల సంఘాన్ని నియమించండని గాంధీజీ సూచించాడు. ఈ మధ్యవర్తుల సంఘంలో ముగ్గురు జడ్జీలు వుండవచ్చుననీ, ఈ ముగ్గురిలో ఒకరిని కాంగ్రెసు ఎన్నుకుంటుందనీ, రెండోవారిని ప్రభుత్వం ఎన్నుకుంటుందనీ, వారుభయులూ చేరి తమకు ఇష్టమైన మూడో జడ్జీని ఎన్నుకోవచ్చుననీ, ఈ ముగ్గురు జడ్జీల మధ్యవర్తిసంఘంవారి తీర్పుకు కాంగ్రెసువారు బద్ధులై ఉంటారనీ గాంధీజీ అన్నాడు. ఇలామధ్యవర్తి సంఘాలను నియమించడం కొత్తకాదంటూ, ౧౯౦౭ వ సంవత్సరపు ట్రాన్సువాల్ మూడో చట్టాన్నిగురించిన తగవు

పరిష్కారానికి బ్రిటిష్, ట్రాన్స్‌వాల్ ప్రభుత్వాలవారుభయులుచేరి, ఆరెంజ్ ఫ్రీస్టేట్ ఛీఫ్ జడ్జీని మధ్యవర్తిగా ఎన్నుకున్న నిదర్శనాన్నికూడా చూపించాడు. కాని, ఈ సూచనను ప్రభుత్వంవారు ఆమోదించలేదు.

కాంగ్రెసువారు కోరిన హామీ చట్టవిరుద్ధమైనదని చెబుతూ ఇండియా కార్యదర్శి చెప్పిన ఒక కారణం ఇది:

గవర్నర్ల ప్రత్యేకాధికారాలు మైనారిటీల హక్కుల్ని రక్షించడానికి ఏర్పడ్డాయట. భారతదేశంలో ఏ మైనారిటీ సంఘంవారుకూడా తమ సమస్త హక్కుల్ని, తమ యోగక్షేమాల్ని మెజారిటీ పక్షమైన కాంగ్రెసువారికి అప్పగించడానికి వొప్పుకోరట. అంచేత గవర్నర్లు కాంగ్రెసువారు కోరిన హామీని ఇవ్వలేరట.

హామీగీమీ మాట యెలావున్నా "కాంగ్రెసువారి అధికారానికి మేము లోబడి వుండము" అని ప్రకటించవలసిందిగా మైనారిటీ సంఘాలవారికి ఇదొక ఆహ్వానమనే చెప్పాలి. అయినా, ఇంతవరకు ఒక్క మైనారిటీసంఘంవారైనా కాంగ్రెసువారికి హామీని ఇవ్వడం తమ క్షేమానికి భంగమని ప్రకటించలేదు సరిగదా, పైపెచ్చు ఆమధ్యను మద్రాసురాష్ట్రీ క్రైస్తవ సమావేశంలో వారు తమ హక్కులను కాపాడే విషయంలో తమకు గవర్నరుపైన యెంతనమ్మకముందో మెజారిటీ పార్టీవారైన కాంగ్రెసువారిమీదకూడా అంతే నమ్మకమున్నదని తీర్మానించారు. అన్నట్టు, అక్కడక్కడ కొన్ని యూరపియన్ వర్తక సంఘములవారు కాంగ్రెసువారు కోరిన హామీ అశాస్త్రీయమైనదనీ, దాన్ని ఇవ్వడం మైనారిటీ సంఘాల హక్కులకు ప్రమాదకరమనీ తీర్మానించారు. అయితే శ్రీయుత రాజగోపాలాచారిగారు చెప్పినట్టు భారతీయులు తమ స్వరాజ్యంకోసం యూరపియన్ వర్తక సంఘాలవారి ఇష్టానిష్టాలపైన ఆధారపడవలసివస్తే, కలకాలం వారికి బానిసత్వం తప్పదన్నమాటే!

పైన ఇదివరకే రెండుమూడుసార్లు నొక్కి చెప్పినట్టు గవర్నర్లు కాంగ్రెసువారు కోరిన హామీని ఇవ్వడాన్ని చట్టం అంగీకరించదని అనడమూ ... అనుకోవడమూ... కేవలం పొరపాటు. రాజ్యాంగ శాస్త్రంలో అప్రతిమానుడని ప్రఖ్యాతిగడించుకున్న ప్రొఫెసర్ కీత్ అంతటివారు కాంగ్రెసువారుకోరిన హామీని ఇవ్వడానికి చట్టం అడ్డురాదనీ ... రాగూడదనీ ... నిష్కర్షగా చెప్పాడు. అంతటివాడు "ఔ"నని అంటూ ఉండగా ప్రభుత్వంవారు "కా"దని సాకు పెడుతూ ఉంటే ఈ సాకును యెవరు నమ్ముతారు?

... ఈ సందర్భంలో ప్రొఫెసర్ కీత్ వ్రాసిన మాటలు ఇవి:

"బ్రిటిష్‌మంత్రులవలెనే భారతమంత్రులుకూడా నిర్వర్తించవలసిన బాధ్యతలు కొన్నివున్నాయి. అయితే, బ్రిటిష్‌మంత్రుల బాధ్యతలు సాంప్రదాయంవల్ల ఏర్పడ్డాయి; భారతమంత్రుల బాధ్యతలను ఇండియా చట్టము విధిస్తున్నది. చట్టంప్రకారం భారత మంత్రులు శాంతి భద్రతలను కాపాడాలి. మైనారిటీసంఘాలవారిని హింసపెట్టరాదు. సివిల్ సర్వీసుకు అన్యాయం చెయ్యగూడదు; న్యాయపరిపాలనను కళంకితము చేయరాదు; జాతి, మత, కుల విచక్షణలనుచేసి, బ్రిటిష్ పౌరులలో ఎవ్వరికిని చిన్నచూపు చూడరాదు; ఇరుగు పొరుగు సంస్థానముల క్షేమానికి భంగం కలగ జెయ్యరాదు. లార్డ్ జెట్లెండ్ అందరి గవర్నర్లకు ఒకేమాదిరి తాఖీదును పంపివుండకపోతే, వారిలో కనీసం ఒకరిద్దరైనా కాంగ్రెసు నాయకులను పిలిచి, మీరు పైనచెప్పిన చట్టవిహితమైన బాధ్యతలను అతిక్రమించమని అంగీకరిస్తే, మేము మీ పరిపాలనలో జోక్యము కలుగజేసుకోమని హామీ ఇవ్వడానికి వీలుండేదనే నా అభిప్రాయం. అజాగ్రత్తగా వున్నట్టయితే టోకరా కొట్టిద్దామని గాంధిజీ ఈ ఉచ్చు పన్నాడని లార్డ్ జెట్లెండు వాదాన్ని సమర్థిస్తున్న కొందరు చెబుతున్నారు. ఇదే నిజమైతే, గాంధిజీ ఇండియా సెక్రటరీని చక్కగా బోల్తాకొట్టించాడనే చెప్పాలి. ౧౯౧౯ నాటి చట్టంలో వున్నట్టుగానే ఈ క్రొత్తచట్టం క్రిందకూడా గవర్నరు తన మంత్రులకు ఏ విధమైన బాధ్యతను ఇవ్వకుండా, వారిని

కేవలం తన సలహాదార్లుగా మాత్రమే ఉపయోగించుకుంటూ నిజమైన బాధ్యతను తన చేతిలోనే ఉంచుకోవాలని ఏర్పాటైనదని అంశేమాత్రం, సర్ తేజ్ బహదూర్ సప్రూ ప్రభుత్వ వైఖరిని సమర్థిస్తూ చేసిన ప్రకటనకు కొంత అర్థం కనబడుతుంది. కాని, కొత్త చట్టం ఉద్దేశం ఇదే అయితేమాత్రం దీన్నిగురించి పార్లమెంటులో చాలా అపార్థానికి యెకమిచ్చే ప్రకటనలు జరిగాయని చెప్పవలసి వస్తుంది."

ఇంత ఖండితంగా......ఇంతనిష్కర్షగా.... ప్రొఫెసర్ కీత్ అంతటివాడు కాంగ్రెసు వైఖరిని సమర్థించిన తర్వాత, ఇంకా చట్టంగిట్టం అని ప్రభుత్వం చెబుతున్న సాకుల్ని ఎలానమ్మడం?

పైగా, ప్రభుత్వంవారికి చట్టం అంటే అంత గౌరవంవుంటే, దానికి విరుద్ధంగా నడమంత్రం మంత్రివర్గాల్ని ఏర్పాటుచెయ్యడం దేనికి? అసెంబ్లీ సమావేశాలను జరపకుండా, నడమంత్రం మంత్రివర్గాల జీవితాన్ని పొడిగించడం దేనికి? చట్టంలోని ౫౩ వ సెక్షన్ ప్రకారం అసెంబ్లీలో మెజారిటీ సభ్యుల విశ్వాసాన్ని కలిగివున్న వారినే మంత్రులుగా నియమించడానికి గవర్నరు శాయశక్తులా ప్రయత్నించాలి. ఇప్పుడు ఈ నడమంత్రం మంత్రివర్గాలవారిని సమర్థించేవారు నూటికి పదిమంది కూడా లేరు[illegible]రి వారిని మంత్రులుగా యెలా నియమించారు? పై[illegible] మెజారిటీ పక్షమైన కాంగ్రెసు వారికి మంత్రి పదవుల్ని [illegible]డానికి గవర్నరు చేసిన పెద్దప్రయత్నం ఏముంది [illegible]రి ఆహ్వానించడమూ, హామీ అనేసరికి "వీలులే[illegible] పో"మ్మనడమూ! ఇంతేగా! ఇది మరి చట్టవిరుద్ధం కాదూ! ఇంతేకాకుండా ఎన్నికలైన తర్వాత సాధ్యమైనంత త్వరలోనే అసెంబ్లీ సమావేశాల్ని జరిపి, అసెంబ్లీ అధ్యక్షుణ్ణి, ఉపాధ్యక్షుణ్ణి ఎన్నుకోడానికి ఏర్పాటుచెయ్యవలసిన బాధ్యత గవర్నరుమీద వుంది ఇలాంటి సందర్భంలో అసెంబ్లీ సమావేశాల్ని ఆరుమాసాలపాటు వాయిదా వెయ్యడం చట్టాన్ని గౌరవించడమే అవుతుందా?

పైగా జాయింట్ పార్లమెంటరీ కమిటీ యెదట సాక్ష్యాన్ని ఇస్తూ, శాంతిభద్రతలను కాపాడ్డానికి ఒక నామినేటెడ్ మంత్రిని వుంచకూడదా అని లార్డ్ సాలిస్‌బరీ ప్రశ్నించినప్పుడు, అప్పటి ఇండియా కార్యదర్శి సర్ శామ్యూల్ హోర్ రాష్ట్రీయ ప్రభుత్వాలలో భారత మంత్రులకు నిజమైన బాధ్యతను ఇవ్వటం తమ ఆశయ మనీ, అందుచేత నామినేటెడ్ మంత్రిని వెయ్యడం కూడదనీ చెప్పాడు. ఈ జవాబును బట్టి చూస్తే, ఒక్కమంత్రినే కాకుండా అందరు మంత్రులను నామినేట్ చెయ్యడం తప్పకాదూ?

ఇలా ఏవిధంగా చూచినా ప్రభుత్వంవారి చర్య చట్టవిరుద్ధంగా వున్నదనడంలో సందేహంలేదు. అయితే, ఇక్కడ చట్టవిరుద్ధంగా వెళ్లడం వారికి అవసరం. అంచేత చట్టం అనేది ఒకటి వున్నదనే విషయంకూడా మరిచిపోతున్నారు. కాని కాంగ్రెసుకు హామీ ఇవ్వవలసివచ్చేటప్పటికి మాత్రం "అమ్మో! చట్టాన్ని అతిక్రమించడమే!" అని ధర్మపన్నాగాలు చెబుతున్నారు!

గాంధీజీ కాంగ్రెసువారు కోరిన హామీ వుద్దేశాన్ని వివరిస్తూ, చట్టాన్ని ఈ హామీద్వారా మార్పాలనే తలంపు లేదనీ, గవర్నర్లు కాంగ్రెసు మంత్రుల అనుదినచర్యలలో కూడా అనవసరంగా జోక్యం కలుగజేసుకొని, సక్రమమైన బాధ్యతాయుత పరిపాలనం కొనసాగకుండా అభ్యంతరాలు కల్పించకుండా వుండడానికి గాను ఈ హామీ కోరడమైనదనీ, కాంగ్రెసు మంత్రుల కార్యక్రమం తనకు నచ్చకపోతే, వారిని ఉద్యోగంనుంచి తొలగించగల అధికారం గవర్నర్లకు వున్నదిగదా అనీ, ఏదైనా ఒక సమస్యనుగురించి మతభేదాలు వచ్చి కాంగ్రెసుమంత్రులను పదవులనుంచి తొలగించినప్పుడు, ఆసమస్యనే ప్రాతిపదికగా చేసుకొని ఎన్నికలను జరిపి, ప్రజాభిప్రాయాన్ని తెలుసుకో వచ్చునుగదా అనీ చెప్పాడు.

ఇందుకు ప్రభుత్వంవారు చెప్పిన.........చెబుతున్న......జవాబు ఆకును అందకుండా, పోకను పొందకుండా వుంది. కాంగ్రెసు మంత్రుల అనుదిన పరిపాలనాకార్యకలాపాలలో గవర్నర్లు జోక్యం కలుగజేసుకోరట! అలా జోక్యం కలుగజేసుకోవడం చట్టం

వుద్దేశంకూడా కాదట. ఒకవేళ గవర్నరు అనవసరంగా జోక్యం కలుగజేసుకుంటున్నాడని కాంగ్రెసు మంత్రులు తమంతట తామే రాజీనామా ఇవ్వవచ్చునట! మూలదృష్టితో చూస్తే గవర్నరు మంత్రులతో భిన్నాభిప్రాయుడై వారిని బర్తరఫ్ చెయ్యడంలోను, గవర్నరు జోక్యం కలుగజేసుకున్నందుకు కినిసి కాంగ్రెసు మంత్రులు తమంతటతాము రాజీనామా ఇవ్వడంలోనూ హస్తిమశకాంతరభేదం వుంది. గవర్నరు స్వయంగా కాంగ్రెసు మంత్రులను బర్తరఫ్ చేస్తే అందుకు సంపూర్ణ బాధ్యతను అతడే వహించాలి. అలా కాకుండా కాంగ్రెసు మంత్రులు తమంతటతాము రాజీనామా ఇస్తే ఫలానాకారణాలవల్ల మేము రాజీనామా పెట్టవలసి వచ్చిందని సంజాయిషీ చెప్పుకుంటూ, అందుకుగల బాధ్యతలను కాంగ్రెసు మంత్రులే వహించాలి. ఈరెండో సందర్భంలో గవర్నర్ "నేను వద్దు మొర్రో అంటున్నా, కాంగ్రెసు మంత్రులు రాజీనామా పెట్టిపోయా"రని వారిమీద నెపం వెయ్యడానికి వీలుంటుంది. ఇందులోవున్న రాజకీయ రహస్యం ఇదే! పైగా, గవర్నరు జోక్యం కలుగజేసుకున్నప్పుడల్లా కాంగ్రెసు మంత్రులు రాజీనామా పెట్టి, తిరిగి తిరిగి ఎన్నికలను పెట్టిస్తూవుంటే, త్వరలోనే వారు ప్రజాభిమానాన్ని కోల్పోతారు కూడా!

మద్రాసు, బొంబాయి, సి. పి., యు. పి., బీహార్, ఒరిస్సా రాష్ట్రాలలో ఏర్పడ్డ రాజ్యాంగ ప్రతిష్టంభనం ప్రస్తుతం ఈ స్థితిలో వుంది. ఇకముందు ఏమి జరగనున్నదో జోస్యం చెప్పడం కష్టం. ఎన్నికలై ఆరుమాసాలు త్వరలో కావస్తుంది. జులై ఆఖరు వారంలోగాని, ఆగస్టు మొదటివారంలోగాని అసెంబ్లీ సమావేశాలను జరపాలి. అప్పుడు నకమంత్రి మంత్రి వర్గాలపై తప్పకుండా విశ్వాసరాహిత్య తీర్మానాలు ప్యాసవుతాయి; దానితో వారు రాజీనామా ఇవ్వవలసి వస్తుంది. ఆ తర్వాత ఇప్పటి అసెంబ్లీలను రద్దుచేసి, తిరిగి ఎన్నికలను జరుపుతారా? లేక చట్ట సమ్మతమైన ప్రభుత్వం మంత్రులద్వారా సాగించడం దుర్ఘటమైనదనిచెప్పి, రాజ్యాంగ విధానాన్ని సస్పెండు చేసి, డిప్యూటీ గవర్నర్లతో పరిపాలనను సాగిస్తారా? తిరిగి ఎన్నికలను జరిపితే మాత్రం కాంగ్రెసు పక్షానికి ఇప్పటికంటె పెద్ద మెజారిటీలు రావడం నిజం.

భవిష్యత్తు అంతా అయోమయంగా వుంది. ముందు ఏమి జరుగుతుందో చివరకు ప్రభుత్వంవారికైనా స్పష్టంగా తెలియదేమో!

---

# ప్రతిజ్ఞ

శ్రీరంగం శ్రీనివాసరావు



పొలాల నన్నీ
హలాల దున్నీ
ఇలాతలంలో హేమం పిండగ,
జగాని కంతా సౌఖ్యం నిండగ-
విరామ మెరుగక పరిశ్రమించే,
బలం ధరిత్రికి బలి కావించే
కర్షకవీరుల కాయంనిండా
కాలువకట్టే ఘర్మజలానికి,
ఘర్మజలానికి,
ధర్మజలానికి,
ఘర్మజలానికి ఖరీదు లేదోయ్.

నరాల బిగువూ,
కరాల సత్తువ
వరాలవర్షం కురిపించాలని,
ప్రపంచభాగ్యం వర్ధిల్లాలని
గనిలో, వనిలో, కార్ఖానాలో
పరిక్లమిస్తూ,
పరిప్లవిస్తూ
ధనికస్వామికి దాస్యంచేసే,
యంత్రభూతముల కోరలుతోమే
కార్మికధీరుల కన్నులనిండా
కణకణ మండే,
గలగల తొణకే
విలాపాగ్నులకు, విషాదాశ్రులకు
ఖరీదుకట్టే షరాబు లేడోయ్.

నిరపరాధులై దురదృష్టంచే
చెరసాలలలో చిక్కేవాళ్ళూ,
లోహరాక్షసుల పదఘట్టనచే
కొనప్రాణంతో కసలేవాళ్ళూ,
కష్టం చాలక కడుపుమంటచే
తెగించి సమ్మెలు కట్టేవాళ్ళూ,
శ్రమ నిష్ఫలమై
జని నిష్ఠురమై
నూతిని గోతిని వెదకేవాళ్ళూ-
అనేకు లింకా అభాగ్యు లంతా,
అనాథు లంతా, అశాంతు లంతా
దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో
విప్లవశంఖం వినిపిస్తారోయ్.

కావున లోకపుటన్యాయాలూ,
కాల్చే ఆకలి, కూల్చే వేదన,
దారిద్ర్యాలూ, దౌర్జన్యాలూ
పరిష్కరించే, బహిష్కరించే
బాటలు తీస్తూ,
పాటలు వ్రాస్తూ
నాలో కదలే నవ్యకవిత్వం
కార్మికలోకపుకల్యాణానికి,
శ్రామికలోకపుసౌభాగ్యానికి
సమర్పణంగా,
సమర్చనంగా-
త్రిలోకాలలో,
త్రికాలాలలో
శ్రమైకజీవన సౌందర్యానికి
సమాన మైనది లేనేలే దని
కష్టజీవులకు,
కర్మవీరులకు
నిత్యమంగళం నిర్దేశిస్తూ,
స్వస్తివాక్యములు సంధానిస్తూ,
స్వర్ణవాద్యములు సంరావిస్తూ
వ్యథాస్తజీవిత యథార్థదృశ్యం
పునాదిగా నిక జనించబోయే
భావివేదముల
జీవనాదములు
జగత్తు కంతా చవులిస్తానోయ్.

కమ్మరి కొలిమీ,
కుమ్మరి చక్రం-
జాలరి పగ్గం,
సాలెల మగ్గం-
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్రవృత్తుల సమస్తచిహ్నాలు
నా వినుతించే,
నా విరుతించే,
నా వినిపించే నవీనగీతికి,
నా విరచించే నవీనరీతికి
భావం! భాగ్యం! ప్రాణం! ప్రణవం!

# ఆరవ జార్జి సార్వభౌముడు



కార్యశూరుడు, ప్రజారంజకుడు నగు రాజు

౧౮౯౯-వ సంవత్సరము డిసెంబరునెల ౧౪-వ తేదీనాడు ఒకవృద్ధురాలు ఏకాంతమున గూర్చొని ౩౮ ఏండ్లనాటి యొక విషాదగాథను తలచుకొని విచారపడుచుండెను. ఆమె రాణి, చక్రవర్తిని. కాని యాకాలమంతయును ఆమె విచారపరంపరలతోనే కాలము గడపినది. మాయమైన యామహనీయవ్యక్తియే ఆమెను, ఆమెసంతానమును, ఆ సంతానముసంతానమును కాపాడుచువచ్చినది. నాలుగవతరము ప్రారంభింపబోవుచున్నను ఆమెకు తన మృతభర్తయే ధ్యేయమై, ఆధ్యాసయే చైతన్యమై జీవనాధార మగుచుండెను. ఆదే చింతతోనే యామె ప్రొద్దుపుచ్చుచుండెను. ఆ దేవతయే జీవించియుండినచో తననుండి యేసేవల నపేక్షించియుండునో యూహించుకొనియూహించుకొని వాని నాతని యాత్మకు సమర్పించుకొనుచుండెను. ప్రతి ఆబ్దికము నాడును ఆమె మహారాధనలు చేయుచుండెను.



ఆల్బర్టు రాకొమరుడు: నెలలబిడ్డడు

ఆనాడు ౩౮-వ ఆబ్దికము. ౧౮౬౧ డిసెంబరు ౧౪-వ తేదీ ఉదయమునగూడ తన పతిదేవత తన కింకను దక్కు ననియే పాప మాయమాయకురాలు ఆశించియుండెను. కాని ప్రొద్దెక్కను ఎక్కను అతనిజబ్బు విజృంభించిపోయెను. సాయంత్రమునకు ఆ దేవతజీవితజ్యోతి యారిపోయెను.

ఆ యేడవతేతిథినాడు అదేధ్యాసతోనే యుండగా నామె కొకమూలనుండి పాత్తిలిబిడ్డని యేడుపు చెవులబడెను. ప్రజ లందరును ఆ వర్తమానమును విని ఆవృత్తిగ జయఘోషలతో సంతృప్తిపడుచుండ నక్కడ విక్టోరియాచిత్తము కలగిపోయెను. ఆమెమృతభర్తస్మారకదిన మది. ఆనాడు మరియొకప్రవృత్తికి చోటుండ



శైశవములో

వచ్చునా? అందులోను సంతోష ప్రవృత్తికి! విషాదమున సంతోషమా? - నిజముగ విక్టోరియాకు సాముద్రికమే గనుక, జోస్యమే గనుక తెలిసియుండినచో నా మునిమనుమనియం దామె తన మనోనాథుని లక్షణముల నుపలక్షించియుండెడిది. అచ్చము అవే గుణములు, అదే మనః ప్రవృత్తి! ఆ పోలిక యావంశమున మరియొకని కబ్బలేదు. ఆ నైనము నాడు విక్టోరియాకు బోధపడలేదు.

కాని ఈ చిన్న యాల్బర్టు పెరిగిన పరిస్థితులే వేరు. బాల్య మంతయు నితని కమితసంతోషముగానే

గడచిపోయెను. ఇంటిలో కావలసినన్ని సదుపాయములు; అవ్యాజమైన తల్లి ప్రేమ వాత్సల్యములు; తండ్రియను రాగము పుష్కలముగా నుండెను. మఱ్ఱాత ఆల్బర్టు తండ్రి? ఒక అభాగ్యసంసారి. తల్లి? బిడ్డపాపలనుండి దూరమై ప్రవాసమునకు ప్రయాణమైనది. అన్నింటి కంటెను ముఖ్యమైనది: ఇతడు ఇంగ్లీషు పద్ధతులలో, ఇంగ్లీషు సంప్రదాయములలో పెరిగినాడు. ఇంగ్లీషు హృదయములను చూరగొన్నాడు.



ఆయిదేండ్లప్రాయమున

చిన్నప్పుడితడు శాండ్రింగ్‌హాములో పల్లెటూరి పిల్లలతో బాటు కాలిబంతియాట ఆడుచుండువాడు. ప్రజలతో కలసిమెలసి సర్వసాధారణముగా ప్రవర్తించుట కది మొదలు. ఆతరువాత నితడు ఆస్బర్న్, డార్టు మౌతులకు నౌకాశిక్షణకు వెడలుటతో నా సంగతి స్థిర పడినది. రాజకుమారు డని యితనికి ప్రత్యేక సౌకర్యము లేవియు నుండరాదనియు, తక్కిన యందరితో బాటుగ నిత డొక్కడుగ జూడబడవలయుననియు, వారి కుండు క్రమశిక్షణయే యితనికి నుండవలయు ననియు రాజు గారు సుగ్రీవాజ్ఞ చేసిరి. మానవత్వము మొదటిది; తరు వాతనే రాజకుమారత్వ మని యితనికిని తెలియును.

నావికవిద్య నితడు సమగ్రముగా నభ్యసించెను. డార్టుమౌతు వదలివచ్చునప్పటికే యితడు స్వతంత్రించి యోడలను నడుపగలిగియుండెను. ఈ విద్యలో నితడు సమకాలీనులనందరిని మించిపోయెను. యంత్రతంత్రముల నితడు బాగుగ గ్రహించెను. నిరంతర మదేపనిగ నితడు చదువు సంధ్యలందును, వ్యాయామక్రీడలయందును మునిగి తేలుచుండెను. ఇంతలో యూరపుఖండాకాశమున గొప్పకుపాను చెలరేగెను; అంధకారము అలముకొనెను. ఇంకను తరఫీదు పూర్తికాలేదు. అయినను నితడు



పదియేండ్లప్పుడు

ఆయవకాశమున హెచ్.యం.యస్. కంబర్లాండులో జేరి పడమటి యిండియాదీవులు, కనడాలమీదుగా అట్లాం టిక్ సముద్రమును దాటెను ౧౯౧౩ ఆగస్టులో హెచ్. యం. యస్. కాలింగ్‌వుడ్డులో నుద్యోగిగానే ప్రవేశించె ను. తరువాత నొక నౌకాయుద్ధమునందే పాల్గొని యితడు వీరసంతతి విక్రమకీర్తిని గడించెను.

౧౯౧౮ చివరలో నితడు నావికప్రవృత్తినుండి వైమానికప్రవృత్తికి లంఘించి త్వరలోనే యాకాశము

నందుకొనెను. రాజవైమానికబలమునం దితడు చాలకాలము పనిచేసెను. వైమానికవిద్యలను బాగుగ నభ్యసించి యోగ్యతాపత్రములనుకూడ సంపాదించెను.

సాంఘిక, ఆర్థికసమస్యలను పరిష్కరింపవలయు నని యితని కెంతో ఆశ. కేంబ్రిడ్జికి బోయి ట్రినిటీ కాలేజిలో జేరి యితడు అర్థశాస్త్రము, చరిత్ర, ప్రభుత్వశాస్త్రము మొదలైనవి నేర్చుకొని వచ్చెను. భౌతికశాస్త్రమందలి సిద్ధాంతభాగమును, యంత్రశాస్త్రమందలి తంత్రమర్మములను గూడ ఇత డభ్యసించెను. ౧౯౨౦ లో ఇతడు 'డ్యూక్ ఆఫ్ యార్కు' పదవికి నియమింపబడెను. ఆవెంటనే క్రొత్తగా నేర్పడిన పారి



విద్యార్థి

శ్రామిక శ్రేయోభిలాషి సంఘమునకు అధ్యక్షుడుగా నుండుట కితడనుమతించెను. పారిశ్రామికశ్రేయస్సును గోరువారిలో నితడు ప్రథమగణ్యుడు.

పనివాండ్ర యుద్యోగముల విషయమున గాని, వారి యితర సౌకర్యముల విషయమునగాని యేసలహా వచ్చినను ఇతడు ప్రత్యేకశ్రద్ధ గైకొని వానిని పరిశీలించువాడు. ఉపకారవేతన ప్రణాళికలు, ప్రమాదరక్షణలు, వైద్యసహాయములు మొదలైన వెన్నో వారికి కలుగజేయవలయు నని యితనికి మహాసంకల్పము. ఇతని నాయకత్వమున నాయుద్యమము మూలమూలలకును ప్రాకుకొనిపోయెను. అనేక కర్మాగారములయందు, అనేక పరిశ్రమశాలలందు యజమానులు పనివాండ్ర సౌఖ్యమునకు సదుపాయములు గల్పింప సంబరపడిరి. యజమానులకును, భృత్యులకును నడుమ సామరస్యము ప్రబలిపోయెను. ఒకరికష్టసుఖము లొకరు గ్రహించిరి. పరస్పరసహకారమునకు పద్ధతి యేర్పడెను.



వైమానికవేషమున

ఇటువంటి యుద్యమము లనేకములు ఇతని నాయకత్వమున బయలుదేరెను. నామకార్థపు నాయకుడుగా నుండక ఇతడు ప్రతి విషయమునందును ప్రత్యేక జాగరూకత వహించి తానై పూనుకొని పనిచేయుచుండుట వలన ప్రతియొకటియు ప్రజల యాదరాభిమానములకు పాత్రమయ్యెను.

నైర్లెసుయంత్రము వచ్చిన క్రొత్తలో తాను నందులో కొంత పరిజ్ఞానము సంపాదింపవలయు నని యొక కర్మాగారమున గూర్చొని యితడు ఆ యంత్ర భాగములను విడదీయుచు మరల నమర్చుచు క్రొత్త యంత్రములను పరిశీలించుచు నానావిధములైన ప్రయోగములను చేసి చూచెను. తూర్పు ఆఫ్రికాలో వేటాడ బోయినప్పుడు, ఒక ముండ్లకంచెలోపల రాత్రిళ్లు కూర్చొని కంచెకు వెలుపట నొక ఎఱను గట్టిపెట్టి పొంచియుండి 'పెద్దపిల్లు' లెప్పుడు వచ్చునోయని కండ్లకు కలికము బెట్టుకొని నిరీక్షించుచు అవి వచ్చినప్పుడు చాటునుండి చంపు సులభోపాయము నెవరో మనవిచేయగా నితడు కస్సుమని యతనిని కసురుకొనెను. పట్టపగలు అనావృతమైన ప్రదేశమునందు నిలిచి ఎరలుపెట్టిమోసపుచ్చుపద్ధతికి బోక నిటారున ఎదురుగ నిలుచుకొనియే యితడు రెండు మృగరాజులను బరిమార్చగలిగెను. విక్రమసింహుడు కాడా మరి?

పారిశ్రామికశ్రేయోభిలాషిసంఘమునకు నాయకుడుగా నుండికూడ నితడు కేవలము నివేదికలతోను ఉపన్యాసములతోను సంతృప్తి చెందుచుండ లేదు. దేశమంతటను తిరిగి ప్రతి కర్మాగారమును ప్రతి పరిశ్రమశాలలను ఇతడు పరిశీలించెను. ఆ పరిశీలన కేవలము సంప్రదాయబద్ధమైనది కాదు. తరచితరచి దానినిగురించి దీనినిగురించి అక్కడివారిని అడుగుచు, తన విషయజ్ఞతకు వారి నాశ్చర్యముగ్ధులను జేయుచుండెను.

ఒకప్పుడితడొకవజ్రపు(బంక)కార్ఖానాను తనిఖీ చేయబోయెను. అక్కడియుద్యోగులితడు లోపలికిబోవుటకు సమ్మతింపనట్లు కనుపించిరి. వట్టి బాహ్యపరిశీలనతోనే సంతృప్తిపడిపోవుటకు యార్కుప్రభువు ఇష్టపడలేదు. పట్టుదలతో లోపలికి పోబోయెను. అప్పటికిని ఆయుద్యోగులేదో మంతనములాడుకొని "దేవరా, మీరు లోనికిబోవుటకు మేమభ్యంతరపెట్టగలవారమా? కాని–వజ్రము కాగుచున్నప్పుడు దుర్భరముగా కంపుగొట్టును. అది మీకు కష్టముగలిగించునేమో అనియే మాభయము. మీ ముక్కులు ఆ పాడుకంపును తాళుకొనగలవా?" అని యితనిని వంచింపబోయిరి. ఇతడా వంచింపబడువాడు! నా తండ్రిగారిప్రజలు అటువంటి కంపులోనే మునుగుచు తేలుచు పని చేయుచుండగా నేను లోపలికి బోవుటకే తాళుకొనలేనా? ఫరవాలేదని వారినోళ్లను బంధించివైచి లోపలికి బోయెను.



పోలో ఆటగాడు

ఈ రీతిగ నితడు ప్రజలకు ప్రీతిపాత్రుడై ప్రజాహృదయముల నవలీలగ చూరగొనెను. ప్రజారంజనమే యితని పరమార్థము.

ఇతడు ౧౯౨౩-వ సంవత్సరము ఏప్రెల్ నెల ౨౬ వ తేదీనాడు ఎలిజబెతుసతిని వివాహమాడెను. వివాహము వెస్టుమినిస్టరు అబ్బేలో బహువైభవముగా జరిగెను. ఎలిజబెతుసతి ఆల్బర్టురాకుమారునికి బాల్యస్నేహితురాలు.

చిన్ననాటి యా స్నేహమే కాలాంతరమున నిర్మల ప్రేమగా పరిణమించి పరిణయమందు లీనమయినది.

ప్రజాహితకార్యములు యారుక్క ప్రభువుకు హెచ్చాయెను. మాటలాడవలసిన సందర్భములు పెరిగి పోయెను. గొంతులోని కండరములలో నేదో లోప ముండికాబోలు మాటలలో తడబాటు గలుగుచుండెను. ఇది యితనికి బాల్యమునుండియు నున్నదే కాని యిప్పుడు దాని యభ్యంతరము స్పష్టముగ తెలియవచ్చెను. అప్పు డేదో సరిపెట్టుకొనుచువచ్చెను. ఉపన్యాసము లిచ్చు ధోరణి యితని కీ రీతిగా నలవడకపోయెను. ఏమిచేయ గలడు? కాని మానవప్రయత్నమునకు లొంగని దని యొకటి కలదా? ప్రతినిత్యము ప్రాణాయామమువంటి శ్వాసవ్యాయామమును చేయజొచ్చెను; వాచికమును వాడుక చేయుచువచ్చెను; మాటల తడబాటును మాపు కొనుచువచ్చెను. చివర కాయుద్యమములోను నతడు విజయము గాంచెను. అన్నాళ్లను అతని నంత అభ్యంతర పెట్టుచువచ్చిన కొరత యేమయిపోయెనో కాని ౧౯౨౭లో క్యాన్బరాలో న్యూ ఆస్ట్రేలియన్ ఫెడరల్ పార్లమెంటును తెరచునాటికి దాని చిహ్నములైనను గోచరింపలేదు.

ఇతని హృదయము చాల విశాలమైనది. సంకుచితప్రకృతి యితని కేకోశమునందును లేదు. "ఉచ్చ నీచ భేదములు పెట్టుకొనవలదు; ధనస్వామ్య కార్మికత్వ విభేదములను దూరముగ ద్రోయుడు. సేవకసేవ్యులకు సామరస్యము గలుగజేయుడు. పల్లెటూళ్లు పట్టణములు నని తారతమ్యము లెంచకుడు. మనమందరమును ఒకే కుటుంబము వారము. ఒకరితోడు మరియొకరికి కావలసినదే." అను విశ్వప్రేమసిద్ధాంత మీయన మతము. ఆరంభశూరత్వముగాక కార్యశూరత్వ మీయనలక్ష్యము.

ఈయనయే ఆరవ జార్జినామముతో బ్రిటిష్ సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించి ప్రస్తుతము మనలను పాలించుచున్నాడు.

['స్ట్రాండ్ మేగజిన్' నుండి]



రెండు మార్గాలు —R. N. R.

# ఆరవజార్జిరాజు పట్టాభిషేక చిత్రములు




రాజదంపతుల పట్టాభిషేకానంతర మహోత్సవయానము



రాజు కిరీటధారణ మహోత్సవము




రాజదంపతుల పట్టాభిషేకానంతర మహోత్సవయానము



గ్లామిస్ కాజిల్ — ఎలిజబెతురాణి మాతృగృహము

# ఆదర్శగృహిణి : ఎలిజబెతురాణి

'ఆచార్య'



ఒద్దుపొందుగ లొద్దికగా కలిసియున్నమూర్తి, కోలమొగము, నిడుపుముక్కు, మసకగోధుమరంగును మందలించు కేశపాశము, నీలాలకన్నులు.

అవి యేమికన్ను లనుకొన్నారు! కలకలలాడు కన్నులు; చిర్నగవులు చిందుచుండు కన్నులు; నిత్యజాగరూకములై దయారసమును, జ్ఞానతేజమును వెల్లివిరియు కన్నులు!

నిడుదలగు వెండ్రుకలను కత్తిరించుకొన దలపు గలిగియు మామగారిమాటకు మారాడనోపక ఆయుద్యమమును మానుకొన్న మానినీమణి.

తన యిల్లన్న నల్లన నుబికిపోవు మేలియిల్లాలు. గార్హస్థ్యజీవనపు ఇంపుసొంపులను ప్రేమికొన్న సౌహార్దవతి.

ఎవ రది? మన రారాణి ఎలిజబెతురాణి.

మన రాణి నవ్వులరాణి. ఆ ప్రసన్న ముఖకమలము నుండి యుబికివచ్చు నవ్వునకు విలువగట్టుటకు బ్రహ్మకైన దరముగాదు. తెచ్చికోలునవ్వుకా దామెది. మందస్మిత మయ్యును చెంపలుదాటుకొని చెవులను జేరబోవు పూనిక ఆనవ్వులో నగపడుచుండును. భావాల కన్నులు ఆచిర్నవ్వుల పసందుకు తాళమువేయుచు పరిఢవిల్లుచుండును. మాయమర్మము లెరుగని చెలిమి ఆ రెంటికిని లెస్స బలిసిపోయినది.

౧౯౦౦ సంవత్సరము ఆగస్టునెలలో నామె జన్మోత్సవము.

ఎలిజబెతు బోవస్‌లయను మనరాణి సంపూర్ణ నామధేయము. భాగధేయము బాగుండబట్టి యామె

చక్రవర్తిని జేపట్టినది. నామధేయము మోహ పెట్ట నారవ జార్జి సమ్రాట్టు ఆమెను జేపట్టినాడు. వీరిరువురి దాంపత్యము అనుకూలమై సలువురికి నాదర్శప్రాయమై యొప్పినది. 'చిలకాగోరింకల' దాంపత్య మది!

ఎలిజబెతురాణి మంచి చదువరి. చదువు ఆమెకు పరమానందప్రదము. ఈ సాహిత్యమునకు కూర్మిసెచ్చెలి యగు సంగీతమునయిత మామెను వలచినది. ఎలిజబెతు రాణి సంగీతసాహిత్యకళాభిజ్ఞురాలగు చదువులరాణి.

హాస్యరస మామెకు పుట్టుకతో నలవడిన గట్టి గుణము. నవ్వి నవ్వించుటయం దామె దిట్ట.

ఈ సజీవప్రకృతికి దోడు అనువయిన సందర్భ ములయందు గాంభీర్యౌన్నత్యములుగూడ ఆమెయందు గానుపించుచుండును. అతిథి-అభ్యాగతులను పరామ ర్శించుటలోను, వారి నుపచరించుటయందును ఆమె కలవిగాని యంశ మండదు.

స్వారిచేయుటయందు దిట్టయైనను ఆమెకు దాని యం దంత యభినివేశము లేదు. ఉన్న యభినివేశ మంత యునుచేపలుపట్టుటయందు కేంద్రీకరించుకొనిపోయినది. ఇతరక్రీడావినోదము లామెకు పట్టువడలేదు గాని టెన్నిసు, గోల్ఫు ఆటలయం దామె పాటవమును సం పాదించుకొన్నది.

ఆమె స్కాట్లండుయువతి . యని యొకప్రవా దము. నిజమే, ఆమెతలిదండ్రులు స్కాట్లండుదేశీ యులే. కాని ఎలిజబెతురాణి సెంట్‌పాల్-వాల్డన్‌బరీ లోని తన తలిదండ్రుల హెర్ట్‌ఫోర్డుషైరునందే పుట్టువు గాంచినది. ఆ ప్రదేశము వెల్విను కు సమీపమున లండను పరిసరములందే యున్నది. ఆమె తన మాతృదేశ మగు స్కాట్లండుకు కుటుంబముతోపాటుగ నప్పుడప్పుడు పోవుచు వచ్చుచుండినను నామెబాల్య మంతయు చాల మట్టుకు ఇంగ్లండులోనే కడచిపోయినది. స్ట్రాత్‌మో ర్ప్రభుదంపతుల యీ మూడవ ముద్దులకూతురు స్కా ట్లండులో నున్నప్పుడు గ్లామిస్ కాజిల్ ఆమె నివాస భవనమయి యలరుచుండెను. అది యామెజననీజనకుల స్కాట్లండు నివాసము.

బడిచదువు నామె యెరుగదు. ఇంటివద్దనే అధ్యాపకురాండ్రను బెట్టుకొని కావలసినది సకలము నామె నేర్చుకొన్నది. బడివాతావరణము గాక గృహ వాతావరణ మామెకు సుగుణములను గూర్చిపెట్టినది.

బాల్యమును మధ్యపెట్టు మధురప్రకృతితోను, సుందర తరులతాగుల్మములతోను, రమణీయక్షేత్రముల తోను విలసిల్లుచుండు వాల్డన్‌బరీలోనే ఎలిజబెతురాణి శైశవమును గడపినది. తాము లండనుకు బోవునప్పుడం తయు స్ట్రాత్‌మోర్ప్రభుదంపతు లామెను వెంటబె ట్టుకొని పోవుచుండిరి.



ఆరేండ్లప్పుడు

పాదరసమువంటి బుద్ధి ఎలిజబెతురాణిది. ఏ పాఠముగాని యామెకు కష్టముగగాని, కఠినముగ గాని తోచుచుండలేదు. లండనులో నుండుచువచ్చినసందర్భ ములందు గూడ నామె ప్రత్యేకపుటుపాధ్యాయులవద్ద సంగీతమును, ఫ్రెంచిభాషను నభ్యసించుచుండెను. నేను ఎలిజబెతురాణి ఫ్రెంచి భాషను ధారాళముగమాటలాడ గలదు.

ఆయాదేశములందు కొంతకాలముపా టయినను నివసించిననే కాని ఆయా భాషల యుచ్చారణ సరిగ పట్టువడ దనువారికి ఎలిజబెతురాణిదృష్టాంతము ప్రత్యు త్తర మొసగగలదు. పెద్దదయి ఫ్రెంచిభాషను సమగ్ర

ముగా, చక్కగా నభ్యసించినతరువాతగాని యామె ఫ్రాన్సునకు బోయినదిలేదు.

బాలికల విద్యావిధానమునకు కుట్టుపని, అల్లిక పని, చిత్రలేఖనము మొదలయినవి ప్రధానాంగములుగా ననాదిగ పరిగణింపబడుచువచ్చుచున్నవి. తల్లిప్రాపున వీనినిగూడ ఎలిజబెతురాణి అభ్యసించినది. ఇన్నింటికినితోడు వంటచేయుట, రొట్టెలు కాల్చుట మొదలగునవికూడ ఆమె నేర్చిన విద్యలలో ముఖ్యస్థానమును వహించుచున్నవి.

అంతతో నాగలేదు. ఆనాటి యితర బాలికలవలె నామెయు చిరుతవయస్సులోనే యుద్ధవిద్యనుగూడ నాకళించుకొన్నది. అప్పడే యాదృచ్ఛికముగ గ్లామిస్ కాజిల్ ఆస్పత్రిగా మారిపోవుటకూడ తటస్థించినది.



తొమ్మిదేండ్లప్పుడు

యుద్ధములందు బాధితులైనవారికి పరిచర్యలు చేయుటకామెవయస్సయినను నెంత? అయినను ఉత్సాహమినుమడింపగా నామె యనేకవిధములుగా బాధితులకుపచారములు చేయుటయందును, నర్సులకు సహాయపడుటయందును పాటుపడజొచ్చెను. ఇంటిలో తల్లిదండ్రులకు ముద్దులకూన! బయట సేవారంగములో సాటిలేని పరిచారిక!



ఇటీవలిరూపము

౧౯౨౦ లో కాబోలు, ఆమె ఆస్కాటుకు పోయినసందర్భములో నొకవిశేషము జరిగినది. ఒక స్నేహితురాలితో గలిసి ఎలిజబెతుసతి వీథిలో బోవుచుండినది. అప్పుడు హఠాత్తుగా నొక యెరుకత యెదురుపడి యామెచేయి పట్టుకొని, సోదెచెప్పుట కనుమతి కోరినది. ఉబలాటము కొలది ఎలిజబెతుసతి యంగీకరించినది. ఆముదుసలిది చెప్పిన గద్దె యేమని? ఎలిజబెతుసతికి రాణికాగలదశ యున్నదనియు, నామెకు పుట్టబోవు కూతురునకు సైతము రాజ్యాధికారము రాబోవుచున్నదనియును. ఎరుకత మొరటుజోస్యము ఫలించినది కాదా?

ఆ సుందరి మూడుమార్లడిగించుకొని కాని యార్కుప్రభువగు ఆల్బర్టును పరిణయమాడుటకు పరిష్కారము చేసుకొనలేదు. ౧౯౨౧ డిసంబరులో నత

డామెకు విన్నపము చేసుకొన్నాడు: నా ప్రణయసామ్రాజ్యమా, నన్ను పరిణయమాడవా యని. ఆమె బిఱ్ఱబిగుసుకొన్నది. నా కిష్టములే దన్నది. సాకేమి? 'ఎందుకు వచ్చినబాధ! ఒకవేళ నేను రాణినే అగుదునేమో! ఆ వల్లమాలినభారము నే నెక్కడ భరించగలను?' అని చాటున



సేవారంగమున దిగి సేవచేయు వేషమున

మాటున చాటుకొన్నది. యార్కుప్రభువు నిరాశచెందలేదు. మరియొకసారి ప్రయత్నముచేసిచూతము, కాలాంతరముననైన బుద్ధి మారదా యనుకొన్నాడు. ౧౯౨౨ లో తిరిగి ఆమెను బతిమాలినాడు. 'ఇదివరకే చెప్పలేదా నాయభిప్రాయము' నని తల త్రిప్పుకొన్నది. యార్కుప్రభు వింతతో నెక్కడకూలిపోవునో యని కొంత చింతచెంది మేరీరాణి కుమారుని జేరదీసి 'నాయనా, నైరాశ్యము వహించవలదు. ముచ్చటగ మూడవమారు ప్రయత్నించి చూడు' మని నెమ్మదిగ నచ్చజెప్పినది. ౧౯౨౩ ఆరంభములో మరియొకమారావిషయమై ఎలిజబెతుసతిని హెచ్చరించినాడు. తల్లి యాశీర్వాదబలమో, లేక ప్రయత్నపాటవమో ఎలిజబెతుసతి యీమా రంగీకరించినది. వరుని తల్లిదండ్రులీవరణమునకు సమ్మతించిరి.

ఆల్బర్టు ఎలిజబెతుల పరిచయ మీనాటిది గాదు. బాల్యముమొదలు వా రొకరి నొక రెఱుగుదురు. లండనులోను, గ్లామిస్‌లోను అప్పుడప్పుడు జరుగుచువచ్చిన బాలబాలికల సమావేశములందు పాల్గొనుచుండిన కతమున ఒకరిపరిచయ మింకొకరికి బాగుగ నేర్పడినది. ఒకప్పుడు ఆల్బర్టురాకుమారుడు సోదరి మేరీ రాకుమారిని వెంటదీసికొని గ్లామిస్‌కు పోయెను. అదియే సమయమునకు సరిగ స్ట్రాత్‌మోరుసతి విపరీతమయిన వ్యాధికి గురియై శస్త్రచికిత్సకు శిరమొగ్గవలసినసంభవ మేర్పడినందున నాకుటుంబ మంతయు గందరగోళములోనుండెను. అయినప్పటికిని ఎలిజబెతుసతి ఆ సంతాపమును హృదయకూపమునందే దాచుకొని వచ్చిన యతిథులను చక్కగ నాదరించినది. ఈ విధముగ రాజకుటుంబమునందరితోను నప్పుడప్పుడు ఎలిజబెతుసతికి సన్నిహితసంబంధము సంభవించుచునేయుండెను. ఆల్బర్టువలెనే మేరీ రాకుమారియు నెలిజబెతుతో బాల్యమునుండియు సఖ్యముతో నుండుచువచ్చెను. మేరీరాణికూడ నొకప్పుడు గ్లామిస్‌కు పోయి స్ట్రాత్‌మోరుదంపతుల యతిథిగానుండినందున నెలిజబెతును బాగుగా నెరుగును. ఇక నెరుగనిదంతయు నొక్క పంచమజార్జి రాజుమాత్రమే.

బోవస్‌లయనునది ఏమంత కుబేరసంపదగల కుటుంబము గాదు. కాని ఎలిజబెతు వట్టిచేతులతో నత్తగారియిల్లు మెట్టలేదు. అరణ మేరాళముగ జేరివచ్చినది.

వివాహసంవిధానములు చక్కగా చేయబడినవి. ౧౯౨౩ ఏప్రెలు నెలలో పెద్దలు నిశ్చయించిన ఆ శుభముహూర్తముకూడ వచ్చినది. పెద్దల యెదుట, గురు

సమక్షమున, బాంధవజనము కండ్లపండువుగా, దైవసాక్షికముగా నాల్బర్టు ఎలిజబెతుల వివాహమహోత్సవము వైభవముగా జరిగిపోయెను. ఆ నిర్మలప్రేమబంధమునకు ప్రజలు హర్షించిరి.

వివాహపు తంతును విధివిహితముగా ముగించుకొని నూతన దంపతులు ప్రణయ విహారమునకై పోలెస్డెన్‌లాసీకి పయనమైరి. ఆ సుందర మందిరావరణమున వారు వేడుకగను, ముచ్చటగను కాలము గడపుచువచ్చిరి. ఇష్టాహార విహారములతో సంతుష్టిగ ప్రణయవిహారము గావించిరి.



ప్రజాహిత కార్యములందు పాల్గొనుచున్నప్పటి యొక దృశ్యము

అక్కడనుండి పయనమై వారు గ్లామిస్‌కుబోయి మూడు వారములు ముద్దు ముచ్చటలతో మురిపెముగ గడపిన తరువాత రిచ్మండు పార్కులోని వైట్‌లాడ్జి చేరుకొనిరి. కొన్నాళ్లపాటక్కడ కోరికలందీర గాలక్షేప మాయెను.

అంతలో నెలిజబెతుసతికి - యార్కుప్రభ్వికి ఆహ్వానములమీద నాహ్వానములు కురియజొచ్చినవి. ప్రతిసమావేశమునకు, ప్రతిసభకు, ప్రతియుత్సవమునకును ఆహ్వానమే! వీలు లేదన్నను తప్పించుకొనుటకు వీలు లేదు. ౧౯౨౩ గ్రీష్మము - కొంతగ్లామిస్‌లోను, కొంత బాల్మొరల్‌లోను ఏమి గడచిపోయినదో అంతియే. అటుతరువాత యార్కు ప్రభ్వికి విశ్రాంతికి క్షణమయినను అవకాశము చిక్కుట కష్టమాయెను.

ఈ పరిస్థితులలో ప్రజలకొక ధర్మసంకటము పట్టుకొన్నది. ఆమెను రాజమర్యాదలతో గౌరవించుటయా, మానుటయా? గౌరవించుటకు — ఆమె రాచకూతురు కాకపోయెను. మానుట పాసగదు: ఆమె రాకుమారుని ధర్మపత్ని. చివరకు, సిద్ధాంత రాద్ధాంతము లయినతరువాత ఆమెను గౌరవించుటకే సంకల్పించుకొనిరి. జన్మతః ఆమె రాచకూతురు కాకపోయినను రాకుమారుని,యార్కు ప్రభువును చేపట్టిన హేతువుచేత ఆయనకు చెందు గౌరవముల కన్నింటికిని ఆమెయు పాత్రురాలే యని నిర్ణయించుకొనిరి.

ఆ ప్రభుదంపతులు లా తర్వాత అధికారవ్యవహారములపైనను, అనధికారవ్యవహారములపైనను నెప్పిలా, అయిర్లండు, స్కాట్లండు, తూర్పు ఆఫ్రికా మొదలగు దేశములకు వెళ్లివచ్చిరి. అచ్చటచ్చటి ప్రజల యాదరానురాగములనుచూరగొనిరి.

ఆ దంపతులకు ౧౯౨౬ వ సంవత్సరమున నొక ఆడుశిశువు జనించెను. ఆ తొలికాన్పు ఉభయుల సమ్మతిపైనను ఎలిజబెతుపుట్టింటనేజరిగెను. పుత్రికోదయమున మాతాపితలు మహానందమున మునిగి తేలిరి.

తన వివాహమయిన మూడవయేటనే ఎలిజబెతు (యార్కుప్రభ్వి) తన విధిని గ్రహించినది. రాజుగారి రెండవకుమారుని భార్యయైయుండుట యన ఆత్మత్యాగమని తెలుసుకొనగలిగినది.

ముద్దులమూటు రింకను ప్రాకులాడుటకు ప్రారంభించుచుండెనో లేదో, అప్పుడే రాచదంపతులకు ఆస్ట్రేలియా ప్రయాణము పడినది. కాంబెరా నూతనరాజధానిలో నూతనముగ తొలిపార్లమెంటు ప్రారంభోత్సవమును జరుపుట వారిపాల బడెను. అప్పటికి ఎలిజబెతు రాకుమారికి సరిగా సెనిమిదిమాసములు. ఆ పసికూనను వదలిపోవుటకు వత్సలయగు నా తల్లికి మనసొప్పలేదు. కాని యేమి చేయగలదు? ధర్మనిర్వహణమునకు నెనుకాడనగునా? ప్రతిస్త్రీయు నప్పటి యామెస్థితికి జాలిపడుటయే! ఏమిచేసిననేమి? యార్కుప్రభ్వికి సమ్మతింపక తప్పినదికాదు.



స్నేహితురాలితో ఇష్టాగోష్టి

అత్తగారగు మేరీరాణి కోడలిని, కుమారుని ఓదార్చినది. "మీరు దగ్గరలేరన్న భావము బిడ్డకు గలుగకుండ చూచుకొనుభారము నాది. నా మనుమరాలిని నే నామాత్రము సాకలేనా? నేనేమి పరాయిదాననా?" యని నచ్చబలికినది. ఆ ప్రకారముగనే యామె ఆ పసికూనను ప్రేముడితో పెంచుచుండెను. బిడ్డకూడ తల్లి వద్దవలెనే అవ్వవద్దకూడ మచ్చికతో మెలగుచుండెను.

అక్కడ ఆస్ట్రేలియాలో యార్కుప్రభ్వి ఉన్న కొలదికాలములోనే మంచి పేరుప్రతిష్ఠల నార్జించుకొనెను. ప్రతివ్యక్తియు నామెను కీర్తించుటయే. ఈ యాత్రలోనే యార్కుప్రభ్వి చిన్న చిన్న యుపన్యాసములు చేయుటకు అలవాటుపడజొచ్చెను. స్పష్టమైన యుచ్చారణ, విశదమయిన భావప్రదర్శనము నామెకు సహజముగ లభించియుండెను.

చివరకు యార్కుప్రభుదంపతులా దీర్ఘయాత్రను ముగించుకొని లండనుకు మరలిపోయిరి. అప్పటికి ఎలిజబెతురాకుమారికి తల్లిదండ్రులను పోల్చుకొనగల వయసు పడియుండెను. జార్జిరాజును, మేరీరాణియు కొడుకు కోడండ్రను పిలుచుకొని పోవుటకు విక్టోరియా స్టేషనుకు బోయిరి. స్ట్రాత్ మోరు దంపతులుకూడ కూడ వెళ్లిరి. మేరీరాణియు, స్ట్రాత్ మోరు సతియు మనుమరాలిని గురించిన యుదంతముల నన్నిటిని తల్లికి తెలియబరచిరి బాలపాపపోషణలో స్ట్రాత్ మోరుసతి సయితము మేరీరాణికి సాయపడుచుండెను.

అంతట యార్కుప్రభుదంపతులు పిక్కాడిల్లీ ౧౪౫ భవంతిలో కాపురము బెట్టిరి. ఆ భవంతి చుట్టుపట్టునను సాధారణభవంతులవలెనే యుండెను గాని రాజభవనమని నిరూపించుటకు తగిన విశేషమేదియు నందులో గానుపించలేదు. కాని ప్రజలందరును అందులో రాజకుమారదంపతులు కాపురముండుట నెట్లో పసిపట్టిరి. దారినబోవు ప్రతివాడును ఆయింటిని సమీపించుసరికి ఆ యింటి మొగసాలపైపై దృష్టి సారించుచు బోవుచుండెను. మొగసాలలో వారెవరయినను గనుపడుదురేమో యని వారి తహతహ! ప్రజలకు వారియందంత యనురాగము!

పువ్వులన్న నెలిజబెతుకు మిక్కిలిమక్కువ. తాను నివసించుచువచ్చిన భవనములందన్నింటను అనువయిన భాగముల నన్నింటిని పుష్పాలంకరణములతో

నింపుచుండెను. అది యామెకు ఆనందము. ప్రకృతి సౌందర్యపిపాస ఆమెకు నిత్యాభ్యాస.

ఆమెకు మాతృవాత్సల్య ముగ్గుపాలతో పెట్టిన గుణము. శైశవమునుండియే యామె మాతృవాత్సల్యమును గృహిణీత్వమును గోముగ బెంచుకొన్నది. చదువుకొనునాడే యామె వానిని స్థిరపరచుకొన్నది. గ్లామిస్ కాజిల్ ఆస్పత్రిగా మారినప్పుడవి యామెయందు మరింత దృఢముగ నాటుకొనిపోయినవి. తల్లి జబ్బుపడినప్పుడు ఇంకింత దిటవుగ బలిసిపోయినవి. వాత్సల్యమే మూర్తీభవించి యామెయాకారమును దాల్చినది!

ఎలిజబెతు రాకుమారికి నాలుగేండ్లు పట్టినవి. యార్కుప్రభ్వి రెండవకాన్పుకు గ్లామిసుకు బయనమాయెను. అది యొక యద్భుతపరివర్తనము! ఏమందురా? అదివరకు శతాబ్దముల తరబడిగా రాజకుటుంబమువా రెవరును ట్వీడును దాటి యుత్తరముగవెళ్లి యెరుగరు. కావుననే స్కాట్లండువారి కది యొక మహాద్భుతవిషయ మాయెను.

శుభముహూర్తమున యార్కుప్రభ్వి మరియొక స్త్రీశిశువును ప్రసవించెను. నామకరణము నాడాపాపకు మార్గరెట్ రోజ్ అను చక్కనిపేరు పెట్టబడెను. దినదినమునకు నాపాప శుక్లపక్ష చంద్రునివలె ముద్దుగ నెదుగజొచ్చెను. అది మొదలు నేటివరకు ఆపసియక్కచెల్లెండ్రు అమితానురాగముతో నాటపాటల దేలుచు సుఖముగ ప్రొద్దుపుచ్చుచువచ్చిరి.

లోకులనోరు మూయుటకు మూకుడు లేదు కాబోలు! వారికి వివేకవిచారముల ప్రసక్తి శూన్యము కాబోలు! మార్గరెటురోజురాకుమారి మూగదనియు, చెవిటిదనియు, నిక నేవేవియో లేనిలోపములు ఆకారణముగా చాటుచు వచ్చిరి. ఇందులో సత్యాంశమావంతయినను కంచుకాగడా కయినను దొరకదు. ఇటువంటి తప్పుడు వదంతులవలన నాతల్లిదండ్రుల మనస్సు లెంత నొచ్చియుండునో పాపము!

రాకుమార్తె లిరువురును చక్కని చుక్కలు. లేతవయస్సునందే వారి మనస్సులు సంగీత నాట్యములయందు లగ్నమయినవి. గ్రహణధారణ పాటవ మాబాలికలకు జన్మాంతర సుకృత సిద్ధమయిన వరప్రసాదము. మూగజంతువులయందు వారికి మమత ప్రబలము. చెలిమికత్తెలతో చెలిమిగలిగి మెలగుట వారియందుగల లోభనీయమయిన గుణము.

తల్లివలెనే వారును బడిచదువులకు పోక ఇంటివద్దనే యుపాధ్యాయులను పెట్టుకొని రాజకుమారికలకుచితము లయిన విద్యలను ఏకసంథాగ్రహణముతో నభ్యసించుచువచ్చిరి. అన్ని చదువులును వారికి అనాయాసముగ పట్టువడెను. తల్లిదండ్రు లీ ముద్దుపాపలను మురిపెముతో జూచుకొనుచు ముచ్చటపడుచుందురు. తొలి జేసిన పూజాఫలముగ రత్నములవంటి బిడ్డలకు ఎలిజబెతుసతి నోచుకొనెను. ఆమెది చల్లనికడుపు. ఆమె భాగ్యము పండినది.



ఎలిజబెతు రాకుమారి : మేరీరాణి

రాజకుటుంబమువారికి వారిగృహకృత్యము లెట్లు నిర్వహింపబడుచున్నవో ఏమియు తెలియదనియు, వాని స్వరూపజ్ఞానముసంగతికే పోగూడదని వారికి నిర్బంధము లున్నవనియును సామాన్యముగా నమకొనుచుందురు. అవును, నిజమే. నిత్యకృత్యముల జోలి వారినెత్తిన బడకూడదు. వారికి చేయదగినవి, ఉపేక్షింపరానివి మరియెన్నో పను లుండును.

కాని—ఎలిజబెతురాణిది విభిన్నప్రకృతి. తనయిల్లు తాను చక్క బెట్టుకొనవలయునను తరహాలోని దాగృహిణి. స్కాట్లండులో స్వగృహమునందు అలవరచుకొన్న శిక్షణవలననో, స్వభావసిద్ధముగనో దేనివలన

పట్టుపడినదో కాని ఆసుణము—ఎలిజబెతురాణియార్కు ప్రభ్విగానున్నప్పుడు ప్రతిదినమును వంటయింటికిపోయి తనిఖీచేయుచు, వంటవారితో నానాడు వండవలసిన వంటకములనుగురించి మాటలాడుచుండెడిది. అటువంటివి, ఇంకను ఆరకమువి పనులను చూచుకొనుటకు ప్రత్యేకముగ నొకమనిషి రాజగృహములం దుండనే యుండును. కాని ఎలిజబెతురాణికి స్వయముగ వానిని పరిశీలింపనిది తృప్తి కలుగదు.

ఇప్పుడుమట్టు కిప్పుడు రాజుగారి యారోగ్యము బాగుగనున్నది కాని చిన్నప్పుడు, యార్కుప్రభువుగా నున్నప్పుడును అతని యారోగ్యమున గొంత కొరత యుండెడిది. ఆహారమువిషయమున నాతడు జాగ్రత్త వహించవలసియుండెడిది. అందువలననే రాణిగారి కావిషయమై అంత పట్టుదల, అంతపరిశీలన! ఆతరువాత ముద్దుబిడ్డల ఆహారపరిశీలన ఆమెను మరింత పట్టుపట్టింపజేసినది.



ఎలిజబెతురాణి తల్లి

తీరిక దొరకినప్పుడు ఆ ఆదర్శమాత బిడ్డలను జేరదీసి వంటయింటిలో గూర్చుని రొట్టెలు కాల్చువిధము-వంటకములు వండువిధము చూపి బోధపరచుచు ప్రొద్దుపుచ్చుచుండెను. ఆపనులయం దామె దంచవేసినచేయి.

విందు లేర్పాటుచేసినప్పుడును, పండుగపర్వముల వేళలను ఇంటిసర్దుబాటంతయు నామెయే చేయుచుండెను. ఇల్లు చక్కబరచుట, సామగ్రిని సర్దుబాటు చేయుట మొదలగు చేతలన్నియు నామెయే చేసి తృప్తి పడవలయును. ఆడంబరములు, హెచ్చుతక్కువల పరిజ్ఞానము లేని సాధుశీల ఎలిజబెతురాణి.

ఎలిజబెతురాణి మాతృహృదయముగల తల్లి. వ్యవహారవిషయములందు తప్ప తదితరసమయములందు తానెక్కడకు బోయినను ఇరువురుసుతలను ఇరుకెలంకుల బట్టుకొని తిరుగుట యామెకు వేడుక. వారితో కలసిమెలసి తిరుగుట యామెకు ఊరట. వారి శ్రేయస్సే ఆమెచరితార్థత!

ఇంతగా నాకర్షణగలిగి సౌందర్యరాశియై వెలయు మనరాణి యేదుస్తులు ధరించుచున్నదో, ఏచొప్పున వానిని ధరించుచున్నదో, ఎప్పుడెప్పుడు వేనిని ధరించుచున్నదో అన్నింటిమీదను అందరికిని కన్నుపోవుటలో నాశ్చర్యమేమి? అందరును ఆమెపద్ధతులను త్రొక్కువారే. ఆమెవేషమే ప్రతిసుందరికిని ఒరవడియైపోయెను. ఆమె ఒకతరహాటోపు క్రొత్తగా నలవాటు చేసినదన్నచో నికనందరికిని అదియే హాటన్నమాట.

ఇక నామెనగలమోజు—తన వివాహమునాడామెమెడలో రెండు పోరుల ముత్యాలహారము వేసుకొన్నది. ముత్యము లామెకు మోజునగ. సామాన్యముగ నెప్పుడుచూచినను ఆమెమెడలో ప్రధానముగ ముత్యాలహార మొక్కటే యుండును.

వివాహమునాటి చదివింపులలో నామెకు లెక్కలేనన్ని యమూల్యాభరణములు వచ్చిపడినవి. మామగారు వజ్రములు వైడూర్యములు పొదిగిన యొక శిరోలంకారమును, ఒకతురాయిని, ఒక లోలకులజతను, ఒక కంఠహారమును చదివించిరి. అత్తగారును అట్లే రవలు నీలములు పొదిగిన నగలను చదివించెను. హృదయేశ్వరుడు యార్కుప్రభువు రవలు ముత్యములు జోడించిన కంఠహారమును కానుకపెట్టెను. తండ్రి రవల శిరోలంకారము నొకదానిని పెట్టి యాశీర్వదించెను.

చాలనాళ్లు ఆమెచెవుల నేమియునలంకరించుకొనలేదు. ఇటీవలనే యామె ముత్యముల బావిలీల నలంకరించుకొన మొదలిడినది. అవి యామెముఖమునకు కళాకాంతులను కలుగజేయుచుండును. ముత్యముల తరువాత నామెకు ప్రీతిగూర్చు నలంకారములు పుష్పములు. మన కేమి కొదువ యని యొడలిని నగలతో నింపివేయు ప్రకృతి యామెకు లేదు. కొలదితోనే యామె తృప్తిపడుచుండును.

ఎలిజబెతుసతి ఆదర్శ గృహిణి. ఆమెకుటుంబ మాదర్శకుటుంబము.

['టైమ్స్ ఆఫ్ ఇండియా వీక్లీ' నుండి]

# నక్షత్రమండలము

(ఈశ్వరసంవత్సర జ్యేష్ఠమాసము)

గొబ్బూరి వేంకటానంద రాఘవరావు

ఉత్తరము

తూర్పు

పడమర

దక్షిణము

నక్షత్రవేధచేయువారు ఈపటమును తమ తలమీదుగా ఆయాదిక్కులు సరిపడునట్లు చూచిపట్టుకొని పరిశీలించవలెను. ఇందున్నట్లు గ్రహ నక్షత్రాదులు జూన్ నెల 8 తేది 8 55 గంటకు 15 తేదీని 8-27 గంటకు
జూన్ నెల 22 తేది 8-0 గంటకు ,, 30 ,, 7-28 ,, జూలై నెల 7 ,, 7-0 ,,
కనబడును.

14 6- 17 ౯౦3

"Quiring on myriad worlds
Through Heaven's immense expanse
While the worlds, they tremble and tremble
Reel and tremble,
Reel and tremble,
Tremble to Your Unison."

—Brajendra Nath Seal.

అపారాకాశగర్భితము లైన బ్రహ్మాండకోట్లను గూర్చి యొకమూల జిజ్ఞాస జరుగుచునేయున్నది; విశ్వ రచనాధురీణుడవై, గాయకశిఖామణివైన నీదివ్యగానపు స్రుతితో ఆత్మీయశ్రుతి మేళవించుతలంపుతో నాయా లోకము లటు నిటు నూగుచు, తూలుచు, కంపించుచు, ధ్వనించుచు నద్భుత పరిభ్రమణ శీలములై మరొకమూల పరిస్పందనము గావించుచునేయున్నవి.

౧౯౩౭ వ సంవత్సరము జూన్ నెల ౮ వ తేదీ మొదలు జూలై ౮ వ తేదీ వఱకు గల ఈ జ్యేష్ఠమాస ములో రాత్రి తొలిజామున నగపడు గ్రహనక్షత్రాది ఖగోళసంచారులను పరిశీలింతము.

## పాలవెల్లి

## (The Milky way)

ఈ మాసములో పాలవెల్లి ఉత్తర సమీపపు ఈశాన్యదిశనుండి, దక్షిణసమీపపు నైరృతి దిశవఱకు చంద్రవంకవలె తూర్పువైపు దిక్చక్రము నంటుచు, ఎడ మగుచు చక్కగా వ్యాపించియున్నది. ఈ ధవళ దృశ్యపు టీశాన్యభాగమున నల్లనల్లగ తోచు చిన్న దీవులు రెండున్నవి. అవే- శ్యా[1]- శ్యా[2]- గురుతులుగల శ్యామ సీమలు (Coal Sacks). ఆ శ్యామ సీమల ప్రక్క, నదిమధ్యమున నిడుపాటి ద్వీపమువలె, ఛాయా పథము, ఈశాన్యమునుండి ఆగ్నేయమునకు వ్యాపించి యున్నది. ఈ ఛాయాపథమును క్రమ్ముకొని రెండు పాయలై తోచు నీ మిన్నేఱు ఉత్తరమున నూర్వశీ మండలమునుండి, తూర్పున శ్రవణ ధనూరాశులను, రెండవప్రక్కను వీణ, విష్ణు, శేషమండలములను అంటు చున్నది. ఆగ్నేయమున తేలుకొండెవలె తోచు మూల చుక్కల కీవల నీమిన్నేటి పాయలు మరల ఏకమై, వృశ్చికమును స్పృశించుచు, వేదికను గడచి యయాతిం దడిపి, అశ్వతరవాహనులై తృతీయస్థానమున నిల్చి యద్భుతముగా మెఱయుచున్న అశ్వినుల కాహ్లాద మొసంగుచు, ఆవల తలక్రిందుగ వ్రేలు త్రిశంకుని తొలగి పోవుచున్నట్లు ఆ సమీపమున నదృశ్య మగుచున్నది.

## తేజోవిషయమున నగ్రగణ్యములైన నక్షత్రములు, గ్రహములు

## (First Magnitude Stars and Planets.)

ఈ మాసములో రాత్రి తొలిజామున నగపడు ముఖ్య నక్షత్రములు—

౧. పడమట నస్తమించుచున్న మిథునరాశిలో సాంబమూర్తి-Pollux in Gemini

౨. సింహరాశిలో మఘ — Regulus in Leo

౩. యామ్యోత్తర రేఖకు మధ్యభాగమునతూర్పుగా స్వాతి—Arcturus in Bootes

౪. ,, ,, ,, పడమటకు వ్రాలిచిత్త—Spica in Virgo

౫. దక్షిణమున విశ్వామిత్రుడు } ఆల్ఫా-బీటా
౬. ,, త్రిశంకు } Alpha and Beta Crux

౭. ,, } అశ్వినులు { Alpha & Beta
౮. ,, } { Centaurus

౯. పాలవెల్లితీరమున నుత్తరదిశను బ్రహ్మ—Vega in Lyra

౧౦. ,, దక్షిణ ,, జ్యేష్ఠ—Antares in Scorpio

౧౧. పాలవెల్లి తూర్పుటొడ్డున శ్రవణము—Altair in Aguila

ఇట్లు మేలుచుక్కలు ఇరువదింటిలో సగమునకు పైగా ఇపుడగపడుచున్నవి. గ్రహములు వీనితేజము నతిశయింపజేయుచున్నవి. కుజుడు విశాఖ, అనురాధ చుక్కలమధ్యనే ఈ నెలలో నున్నాడు. ఎఱ్ఱగా కాలిన ఉక్కుగుండువలె ఈ గ్రహము సూర్యాస్తమయము కాగానే తూర్పుదిక్కున తోచుచు ఎల్లరదృష్టి నాక

ర్షించుచున్నది. ఈ మాసపు తొలిదినములలో మనము వ్రాసినవేళలకు పిమ్మట నుదయించినను గురుడు క్రమము తప్పక ముందుముందుగా తూర్పున నుదయించుచు ఆకాశశోభకు వన్నెగూర్చుచున్నాడు. క్రాంతిరేఖ సమీపమున పడమటనుండి తూర్పున కిపుడు వరుసగా పునర్వసుచుక్కలలోని సాంబమూర్తి, మఘ, చిత్ర, విశాఖ, జ్యేష్ఠ, పిమ్మట గురుడును, ఆకాశమున వ్రేల గట్టిన దీపమాలికవలె ప్రకాశించుచు విస్మయమొనవించు చున్నారు. [శుక్రుడు, కాలమను సర్పముయొక్క ఫణములో మెఱయు మాణిక్యమువలె సూర్యోదయాత్పూర్వము తూర్పున చూడనగుచున్నాడు.]

## ఉత్తరదిశానక్షత్రములు

ఊర్వశీ పురూరవసు లిప్రుడు ఉత్తర క్షితిజమునకు కొంచె మెడముగా సమాంతరముగా ధ్రువక్షితి నుండి పాలవెల్లిలోనికి వ్యాపించియున్నారు. చిన్న ఎలుగు దేహము ఈశాన్యదిశకు పొడుచుకొని యున్నట్లు కనబడుచున్నది. అందున్న ధాత, విధాత, మిత్ర, అగ్ని తారలకును, తోకలోని మహేంద్ర, కశ్యప నక్షత్రములకును, తోకచివర ధ్రువునికిని ఉదయాస్తమయములు లేవు ధ్రువుడు కదలక, ఉత్తరమున కొట్టిన మేకుపడగవలె స్థిరుడైనట్లు తోచునుకాని నిజముగా ధ్రువునకును చలనము కలదు. ధ్రువస్థానముచుట్టు నేడు ౧ డిగ్రీ ౭ మినిట్లు దూరమున ధ్రువుడు చక్రగతితో తిరుగుచున్నాడు. ఇక ౧౫౦ సంవత్సరములకు, అనగా క్రీ. శ. ౨౧౦౫ సంవత్సరమునాటికి ధ్రువుడు ఆస్థానమునకు అతి సమీపమున నుండగలడు. ధ్రువుడు మన చర్మచక్షువులకు ఒక చుక్కవలె తోచునుగాని నిజముగా అందు చుక్కలజత కలదు. ధ్రువుడు మనకు ౬౫ తేజోవత్సరముల దూరమునం దున్నాడు. అనగా నేమో స్పష్టముగా తెలిసికొందము. చంద్రబింబము నుండి వెడలిన వెలుగు రెండుసెకండ్లలో మనలను చేరుచున్నది. సూర్యబింబమునుండి వెడలిన వెలుగు సుమారు ఎనిమిది నిముసములలో మనలను చేరుచున్నది. మన కతి సమీపముననున్న ఆల్ఫా సెంటారీ చుక్కనుండి వెలుగు మనలను చేరుసరికి ౪ సంవత్సరములు ౪ మాసములు ౩ దినము లగును. ధ్రువుడను చుక్కనుండి వెడలినవెలుగు మనలను చేరుసరికి ౬౫సంవత్సరము లగును. ౬౫ సంవత్సరముల క్రిందట— క్రీ. శ. ౧౮౭౩ లో ధ్రువతారనుండి వెడలినవెలుగుతో మన మీనాడు ధ్రువుని చూచుచున్నాము.

ధ్రువక్షితిని చుట్టుకొని నరకు డొకమహాసర్పమువలె నున్నాడు. నరకునికావల సప్తఋషులు గగనమధ్యరేఖను గడచి పడమటకు వ్రాలియున్నారు. సప్తఋషుల కావల వాయవ్యమున విఘ్నేశ్వరుడు మూషకవాహనుడై లంబోదరముతో కాననగుచున్నాడు.

## పడమట

పునర్వసుమహామీనము చాలవఱకు అస్తమించినది. శిరోభాగమున Pollux - సాంబశివమూర్తిమాత్ర మగపడుచున్నాడు. ఈ చుక్కలును త్వరలో అస్తమింపనై యున్నవి. వచ్చునది ఆషాఢమాసము కదా? మిథునరూపమున నున్న శివుని గెల్చి మన్మథుడు విజృంభించు దినములు సమీపించుచున్నవి. పునర్వసున కెగువ పొట్లపూవువంటి పుష్యమిగలదు. ఆప్రక్క ఆశ్లేషయు, దానికెగువ మఘచుక్కలును గలవు.

## దక్షిణమున

నాకామండలము చాలవర కస్తమించినది. పై స్తంభము (Mast), తెరచాపలు (Sails) ననదగు చుక్కలు మాత్రము మూడునాలు గగపడుచున్నవి. వానికి ప్రక్కగా - దక్షిణ క్షితిజమునకును గగనమధ్యరేఖకును మధ్య శిలువ (Cross) వంటి ఆకారముతో త్రిశంకుడు నాకభ్రష్టుడై తలక్రిందుగ వేలుచున్నాడు. త్రిశంకుడు నేలగూలకుండ "తిష్ఠ తిష్ఠ" అని నిలుపుచున్న విశ్వామిత్రుడను చుక్క (ఆల్ఫా Crux) నుండి వెలుగు మనకు చేరుసరికి ౬౫ సంవత్సరములు పట్టును. త్రిశంకు చుక్కల కెగువను ప్రక్కను అశ్వతరమండలము కలదు. దిక్కుమాలిన వార్తికపుపక్షిని కబళింప నేతెంచు మాయావృకమును అశ్వినులు పట్టి ఈటెతో పొడిచి ప్రుక్కించుచున్నారు. ఈ రూపమును ఆరేటస్ (Aratus) అను సిద్ధాంతి - కవి ఇట్లు చక్కగా వర్ణించినాడు.

"His right hand he ever seems to stretch
Before the Altar's circle; The hand grasps
Another creature very firmly cluthed
The wild beast,so the men of old named it."

"ఆతని కుడిచేయి అతడెల్లప్పుడును వేదికామండలము నెదుటచాచిన ట్లగపడుచున్నది. ఆచేతితో నతడు మరొక భీకరమృగమును గట్టిగాపట్టి పొడుచుచున్నాడు. పూర్వీకులు దానిని వన్యమృగ మనిరి. (దీనినే వేదకాలము-నాడు వృకమనిరి) వేదిక సమీపమున యయాతి ప్రముఖు లున్నారు.

## తూ ర్పు న

గరుడమండల మిపుడే ఉదయించినది. అందు శ్రవణము తెల్లగ మహతాబువలె వెలుగుచున్నది. రెండవప్రక్క ఆషాఢానక్షత్రము లుదయించినవి. ఆగ్నేయమున తేలుకొండెవలె నున్న మూలచుక్కల నీ వలకు వీక్షించితిమి.

## మ ధ్య ను

గగనమధ్యరేఖకును పాలవెల్లికిని మధ్య శ్రీ మహావిష్ణువు త్రివిక్రమరూపముతో మెఱయుచున్నాడు. అతని పాదాబ్జ సంభూతయగు దివిజగంగ దిక్చక్రమునంటి కెరలి పారుచున్నది. శేషుడు మడతలుగల పాన్పువై ఆతని తలమీద ఫణములు విప్పిపట్టియున్నాడు. అతని నాభీకమలసంజాతుడు, బ్రహ్మ ముఖమున సరస్వతి నిడుకొని మెఱయుచున్నాడు; సరస్వతి చేతి వీణనుండియే ఆచుక్కల గుంపునకు వీణా మండలమని సార్థకనామ మేర్పడినది. విష్ణువునకు పడమటగా భూతేశమండలములో వాయు దైవత్యమైన స్వాతి కలదు; తూర్పున పాదములకడ గరుడు డున్నాడు. దిగువ, ననగా దక్షిణమున ఇంద్ర దైవత్యమైన జ్యేష్ఠ నక్షత్రము కలదు. శ్రీ మహావిష్ణు డిపుడు పుత్ర-మిత్ర-పరివారసమేతుడై కానవచ్చుచున్నాడు:—బ్రహ్మ, మన్మథుడు, (ఆషాఢనక్షత్రములు) అతనిపుత్రులు; ఇంద్రుడు; మిత్రుడు; భక్తుడు; హనుమంత గరుత్మంతులు భృత్యకోటిలో ముఖ్యులు - రాక్షసుడైనను విష్ణువునకు భూపుత్రుడైన నరకు డుత్తరమున నున్నాడు.

మఘకును గగనమధ్యరేఖకును మధ్య ఫల్గునీ నక్షత్రములున్నవి; వానికిని గగనమధ్య రేఖకును మధ్య హస్త మిణుకుమిణుకుమని మెఱయుచున్నది. హస్తకును గగనమధ్యరేఖకును మధ్య చిత్ర నుత్యమువలె మెఱయుచున్నది. ఆకాశమధ్యమున తెల్లగను, ఎఱ్ఱగను, మెఱయు నీతెండుచుక్కలును మిక్కిలి దర్శనీయములై యొప్పుచున్నవి. అగ్నికుండమువంటి విశాఖకు నీవల కుజుడును, జ్యేష్ఠయు ప్రతిస్పర్థులై ఎఱ్ఱకాంతులతో తేజరిల్లుచున్నారు. ఉత్తరమున స్వాతి వీనికి ప్రబలప్రతిస్పర్థి.

క్రాంతిరేఖకుదిగువ ఆశ్రేష పడమటకు వ్యాపింపగా నేర్పడిన అహిమండలము (Hydra)కు నహుషుడను గలడు. నహుషు డిపుడు సరిగా యామ్యోత్తరరేఖపై నున్నాడు. ఈనహికిని, క్రాంతిరేఖకును మధ్య వార్తికపుపక్షియు, చషకమును గలవు. నక్షత్ర సరిచయభాగ్యమును పొందిన ఒక ఆంగ్లకవిసత్తముకు అదృష్టదేవత నిట్లు పలుకరించుచున్నాడు:

I care not Fortune, what you may deny;
You cannot rob me of Free Nature's grace,
You cannot shut the windows of the sky,
Through which she shows her brightening face."

అమ్మా! అదృష్టదేవతా! నీవు నాకు ఏమి ఇయ్యకున్నను ఏమి లేకుండ చేసినను సరియే—నాకేమియు చింతలేదు. సహజౌదార్యముతో ప్రకృతిమాత మా కనుగ్రహించిన నభోరాజ్యమును నీ వపహరింపజాలవే! ఆకాశగవాక్షములను నీవు మూసివేయజాలవు! దివ్యతేజోవిరాజమానమైన ఆమెముఖవికాసము చూచి యానందింపకుండ నీవు అడ్డురాజాలవు!

# వేలూరుకోట:
# కోటలోనిదేవాలయము: శిల్పసంపద



వేలూరుకోట ఉత్తర - ఆర్కాడు జిల్లాలో పాలారునదిఒడ్డున నున్నది. దక్షిణ హిందూస్థానమునందలి కోటలన్నింటిలోను ఇది మంచి సన్నివేశము, బందోబస్తు కలది. దీని లోపల శిల్పసంపదతో వెలయు (జలకంఠేశ్వర) దేవాలయము కలదు. అందలి కల్యాణమంటపము మధుర దేవాలయమందలి కల్యాణమంటపమున కుద్ది యయినది.

పదుమూడవ శతాబ్దమున బొమ్మిరెడ్డి అను నతడు ఈ దేవాలయమును కట్టించినాడు. బొమ్మిరెడ్డి భద్రాచలపు సరదారులలో ఒకడు. చవతితల్లి కుమారుడు అతని ప్రాణములు తీయ సమకట్టుటను తెలిసికొని అతడు దక్షిణప్రాంతములకు పారిపోయి వచ్చినాడు. వేలూరు ప్రాంతదేశమంతయు రమణీయముగను, వాసయోగ్యముగను చూపట్టుటచే అత డక్కడ స్థావర మేర్ప

రుచుకొనెను. అతడు ఆవుల మందలను పెంచు కొనుచు అచిరకాలమున అఖండైశ్వర్య సంపన్ను డయి నాడు. అతని ఆవులలో నొకదాని కయిదు చన్నులుండెను. అది ప్రతిదినము ఆ చేరువనున్న ఒక పుట్ట యొద్దకుపోయి దానిలోనున్న అయిదు తలల నాగు పాముకకు పాలిచ్చుచుండెడిదట. ఒకప్పు డది చూచి నాడు బొమ్మిరెడ్డి. ఆ నాటిరాత్రి అతని స్వప్నములో శివుడు కనుపడి 'నేను పామురూపముతోనున్న శివుడను. నా కొక ఆలయమును నీవు కట్టించవలెను. అందుకు పట్టెడు ధనము ఒకచోట ఉన్నది' అని ధనమున్న ఆచోటు గుర్తు చెప్పినాడట. తరువాత బొమ్మిరెడ్డి కుక్కలను కుందేలొకటి అంటబెట్టి మండలాకారాన తరిమినదట. ఈ వింతను చూచుచున్న రెడ్డికి 'కుక్కలు పరువిడిన ఈ మండలాకార ప్రదేశమే దేవాలయ ప్రాకార నిర్మాణయోగ్య స్థాన'మని ఒక అశరీరవాక్కు వినబడెనట. అంతట బొమ్మిరెడ్డి నిధిని సంపాదించుకొని ఆ ధనముతో శా. శ. ౧౧౯౫ సం॥కు (౧౨౭౪ క్రీ. శ.) సరియగు శుక్లసంవత్సరము పంగుని ౧౯-వ తేదినాడు ఆలయమును కట్టింప మొదలు పెట్టినాడు. తరువాత తొమ్మిదేండ్లకది పూర్తి అయినది. ఆలయమును నిర్మించుట కాతడు శిల్పిని బదరికాశ్రమముననుండి రప్పించినాడు. ఆశిల్పికుమారుడు తండ్రివార్త చిరకాలము తెలియ రాకపోవుటచే అతనిపోబడి కనుగొనుటకయి వెదకుకొనుచు వేలూరునకు వచ్చి అచట తన తండ్రి నిర్మించిన దేవాలయమును గని అందలి శిల్పమునకు ఆశ్చర్య చకితుడయ్యెను. కాని, అతడు దాని నిర్మాణము శుభలగ్నమున నారంభింపకపోవుటచే దానికి మంచియోగము లేదనియు, నది పాడుపడిపోవుననియు చెప్పెను.

తరువాత, కుమారుడు మంచిలగ్నమున నారంభించి దేవాలయముచుట్టు కోటకట్టెను. బురుజులు, ప్రాకారాదులు కట్టుటకు రాతిబండలను అక్కడకు పదుమూడు మైళ్లదూరమున నున్న పల్లికొండ నుండి తెప్పించిరి. కోటకట్టినదే తడవుగ, శివుని ఆజ్ఞానుసారము, బొమ్మిరెడ్డి దానిని డెంకణకోట వెంకటదేవ మహారాయలకు (క్రీ. శ. ౧౨౯౫ వ సంవత్సరమున) స్వాధీన పఱచెను.

ఆకోట పదునేడవ శతాబ్ది మధ్యకాలము వఱకు విజయనగర రాజుల వశమున నుండెను. అనంతర మది బీజపూరు సుల్తానునకు వశమయినది. ఆకాలమున దేవాలయము పూజాపురస్కారాదులు లేక పాడుపడిపోయినది.

క్రీ. శ. ౧౬౭౬ లో మహారాష్ట్ర నాయకుడు తుకోజిరావు వేలూరి సమీపమున సర్వయాగమును చేసెను. ఆకారణమున కోటయంతయు పాములపుట్ట అయిపోయెను ఆపాములకుభయపడి, అప్పుడు కోటలో నుండిన మహమ్మదీయ-గవర్నరు కోటనువదలిపెట్టి అదగ్గరనే మరొకచోట నివాసము నేర్పరుచుకొనెను. అబ్దుల్లాపురమను పేర నేడు నది నిలయుచున్నది.

వెంటనే కోట మహారాష్ట్రుల వశమయినది. ఆలయమున పూజాపురస్కారాదులు మరల ప్రారంభింపబడినవి. కాని అది ముప్పది దినములు మాత్రమే జరిగినది. అంతలోనే జుల్ఫికర్ ఖానుడు కోటను స్వాధీనము చేసుకొన్నాడు. నాటినుండియు బ్రిటిషు వారి యధీనములోనికి వచ్చువఱకు అది మహమ్మదీయుల వశముననే యుండెను.

క్రీ. శ. ౧౭౯౯ వ సంవత్సరమున శ్రీరంగపట్టణము చివరముట్టడిలో టిప్పు హతుడయిన తరువాత బ్రిటిషువారు అతని పండ్రెండుగురు కూతుండ్రను, ఆఱుగురు కుమారులను బందీలనుగా కొనివచ్చి వేలూరి కోటలో నుంచిరి ౧౮౦౬ వ సం. లో వేలూరి కోటలో సిపాయీలు తిరుగబడి చాలమంది బ్రిటిషు అధికారుల ప్రాణములను దీసినారు. తోడనే బ్రిటిషు వారు తిరుగుబాటును రూపుమాపి ౮౦౦ సిపాయీలను పట్టుకొని చిత్రవధ చేయించినారు. వారిలో కొందఱిని ఉరితీసి, కొందఱిని తుపాకులతో కాల్చి, మఱికొందరిని ఫిరంగులవాత గట్టి పేల్చి చంపినారు. చివరపద్ధతి మాత్రము హృదయ విదారకముగ నుండెనట. దానిని కనిన యొకానొకడు ఇట్లు వర్ణించి యున్నాడు: "చిత్రవధ జరుగుచున్న ప్రదేశమునకు గ్రద్దలు గుంపులుగట్టి రెక్కలను టటటట

తట్టుకొనుచు, గట్టిగ నార్చుచు తమకు లభింపనున్న నర మాంస శోణితముల విందు నెఱింగినవానివలె నెగిరివచ్చి ఆకాశమున కనుపెట్టుకొని తిరుగుచుండిన వట. ఫిరంగుల వాతులనుండి మీదికి, నలువైపులకు నెగురుచున్న మానవ మాంస శకలములను, పైపయిని ముక్కులతోను, గోళ్లతోను పట్టుకొని తినుచుండినవి. ఈ చిత్రవధచేయ నియమింపబడిన దేశీయ సైనికులు, అక్కడచేరిన ప్రజా సమూహము ఈ ఘోరదృశ్యమును చూచి, హాహాకారములు చేయుచు నాక్రోశించిరి.” దీనికి ‘వేలూరు తిరుగుబాటు’ అను పేరు వచ్చినది.

వేలూరు నగరము కొండలక్రింద నున్నది. దాని చుట్టుపట్టుల పూలతోటలు, పండ్లతోటలు దండిగా నున్నవి. కోట నగరమునకు పడమట నున్నది. అది విషమ చతురస్రాకారమున నున్నది. దుర్గ ప్రాకారమున నక్కడ నక్కడ వలయాకృతులగు బురుజులున్నవి. వాని యంతరముల చదునయినవియు నున్నవి. ఈ ప్రాకారమునకు దిగువగా వెలివైపున రాతిగోడ యున్నది. దానిలో నక్కడక్కడ మీదినుండి క్రింద కోట నాక్రమించియుండు శత్రువులమీద రాలుగుండ్లు విసరుటకును, తుపాకులు, ఫిరంగులు పేల్చుటకును అనుకూలముగ నుండునట్టి కంతలు, అక్కడక్కడ చిన్నచిన్న బురుజులు నున్నవి. దుర్గముచుట్టును విశాలము, అగాధము నగు కందకమున్నది. దానివైశాల్య మొక్కొక్క యెడ నొక్కొక్క పరిమాణమున నున్నది. క్రిందిబరుస గోడ చక్కగా మలచిన నల్లరాతి పెను బండలతోను సున్నపు గచ్చుతోను కట్టబడినది. మీదిపిట్ట గోడ ఇసుక, గచ్చులతో కట్టబడినది. ఆగోడ మీది భాగమున నర్ధ వలయాకారమున చెక్కబడిన బండలు గోపురపంక్తివలె నమర్పబడియున్నవి. ఈశాన్యమున అసలు కట్టడములకంటె ఉన్నతములయిన గోపురములు రెండున్నవి. తూర్పు బురుజునొద్ద ప్రాచీన దుర్గ ప్రవేశమార్గము తిరుగుడుతో నుండెను. అందు నాలుగు వాకిళ్లుండినవి. అచ్చట నొక త్రోపుడు వంతెన యుండెను. ఇటీవల ప్రాకారమును పడగొట్టి ఆమార్గమును తిన్నగా ఏర్పరిచిరి. దక్షిణమునగూడ కాలి త్రోవ యొకటి కందకమున కడ్డుగా రాలతో కట్టిన కట్టుమీదుగా గలదు. కోటఅగడ్తలోనికి నీరు సూర్యగుంట అను పేరుగల జలాశయమునుండి భూగర్భమార్గమున ప్రవహించును. ఆ ప్రక్కలనున్న కొండలపై కురిసెడు వాననీరంతయు దిగజారి జలాశయమును నింపును.

ఇట్లు వేలూరికి పడుమట కోటయుండ తూరుపు దిశను మూడు కొండ లున్నవి. ఆ కొండకొమ్ములను కోటలున్నవి. వీనిలో దక్షిణపు వైపున నున్నది పెద్దది. ప్రకృత మివి మూడును శిథిలములయిపోయినవి.

కోటలోపల కట్టడము లనేకములున్నవి. అవి వెనుక టిప్పు కుటుంబమునకు నివాసములగనుండినవగును. నేడు వానియందు దొరతనపువారి కార్యాలయములు మొదలగునవి నెలకొనినవి.

కోటలో ఈశాన్యభాగమున జలకంఠేశ్వర దేవాలయమున్నది. ఆలయము రెండు ప్రాకారములది. మధ్య భాగమున గర్భగృహమున్నది. ప్రధానద్వారము దక్షిణపు దిశను గలదు. దానిపయి గోపురము మిగులనున్నతము. ద్వారబంధనాదుల శిల్పము మనోహరమయినది. రెండవ ప్రాకారముయొక్క ద్వారముమీది గోపురము చిన్నది. ఈ ద్వారమున శాసనశిలా ఫలక మొకటి కాన్పించుచున్నది. అది వెనుక, లోపలగల బావిపయిన మూయబడియుండెడిదట. అందలి లేఖనము వేయేండ్లకు పూర్వపుది కావచ్చును. రెండవ ప్రాకారములోపల నైరృతి భాగమున అపూర్వశిల్ప సౌందర్య సమంచితమగు కల్యాణమంటపమొకటి యున్నది. ఇందలి శిల్పరచన ప్రత్యేక పరిశీలనయోగ్యము. తొలుదొలుత నీ మంటపమును గనిన ఆంగ్లేయులు, శిల్పవిశిష్టతకు ముగ్ధులయి, దీని నూడదీసి ఇంగ్లాండునకు కొనిపోయి అచ్చట మరల జోడించుకొనదలచిరట. కాని వారి దురదృష్టము (మన అదృష్టము) కారణముగా, మంటపభాగములను తీసికొనిపోవ వచ్చుచుండినయోడ మార్గమున సముద్రములో మునిగిపోయెను. అంతటితో నాప్రయత్న మాగిపోయినది.

మంటపమున వెలివరుస స్తంభములమీద వాహనారూఢుల ప్రతిమలు చక్కగా చెక్కబడినవి. మంజూరు

నందలిశిల్పము నిరుపమానము. తీర్చిదిద్దినట్లు చెక్కబడిన పక్షులమీద ఒకటి రెండడుగుల ఎత్తుగల ప్రతిమలు చెక్కబడినవి. సొగసులు గురియుచున్నట్లున్న వానిఅవయవ సన్నివేశము, చక్కగా ఉబుకుచున్నట్లున్న శిల్పరచన వానికి అపూర్వరామణీయకమును సమకూర్చినవి.

ఈ మంటపముకప్పున లోవైపు చక్కని శిల్పముతో నొప్పుచున్న చౌకపు పలుకరాలు రెండున్నవి. వానిపయి నట్టనడుమ కమలము చెక్కబడియున్నది. ఆ కమలమునందలి యొక్కొక్క రేకును ముక్కున కరచి పట్టుకొని చిలుకలు తలక్రిందుగ వ్రేలుచున్నవి. పెద్దదాని చుట్టును కమలముచుట్టును నాట్యముచేయుచున్నట్లు ప్రతిమలు చెక్కబడియున్నవి. నాలుగు మూలలను రెండుకొక్కెములు తాపిన రాతిగొలుసులు వ్రేలుచున్నవి. దీనికి నాలుగువైపుల నాలుగుపక్షములు తీర్చిన దూలము లమర్పబడియున్నవి. వీనిపయి విస్తారముగ శిల్పపు జిలుగుపనికలదు. దీని నానుకొని నెలుపల నలువైపుల అందములయిన ప్రతిమ లనేకములు మలచబడియున్నవి. అష్టదిగ్రేఖల నష్టదిక్పాల విగ్రహములు సపరివారములుగ చెక్కబడియున్నవి.

లోపలి ప్రాకారమున నొక నూయి యున్నది. అందు దేవాలయధనము దాచబడియున్నదట. వెనుక నొక కటికికరవున నందలి నీరంతయు వట్టిపోవ, ఒకానొక దొరతనపుటుద్యోగి దానిలోనికిదిగి యచట పాలాఱునదికి గొంపోవు సురంగమార్గమును గనుగొనెనట.

గర్భగృహము గాఢాంధకార బంధురము. పట్టపగటను సైతము అధికప్రకాశము గల దీపముల వెలుగునగాని మూలవిగ్రహము కానరాదు.

దక్షిణ హిందూదేశమున మరెక్కడను, ఇంత పెద్దదియు, ఇంత శిల్పసంపదగలదియు, ఇట్లు సురక్షితముగనున్నదియు నగు దేవాలయము ఇంకొక్కటి కానరాదు. ఇట్టి ఆలయము పూజాపురస్కారములులేక, తన వైభవమును కోలుపోయి పాడుపడిపోయినది. ఇట్టి దుర్గతికి పాలయిపోయిన యాలయములు, ఉత్తమశిల్ప కళానిలయములు ఎన్నియో మన దేశమున నున్నవికావా?



కీ. శే. జాన్ రాక ఫెలర్

అమెరికను కోటీశ్వరుడు ఇతడు. విశ్వమానవాభ్యుదయమునకయి కోట్లకొలది ధనమును దానము చేసినాడు. ఇంతధనికుడు, ఇట్టిదాత ప్రపంచమున నింకెవ్వడును లేడు.

# వేలూరు కోట చిత్రములు

S. S. S.



౧. కోట, కందకము, లోపలి గోపురములదృశ్యము (ఈశాన్యమునసుండి)

౪. కోట - దక్షిణపు వైపు



౫. కోట
ఆగ్నేయపు వైపు; జెండా స్తంభము



౬. కందకము—ఎడమవైపు బాట, కుడివైపు కోట. ఎదుట దూరమున మూడు కొండకోటలు

# కలగూరగంప

## వి ట వి న లు

మందులననుసరించిన అడ్వర్టయిజు మెంట్లలోనూ, వైద్యులుచెప్పే సలహాలలోనూ, విటమిన్లనుసరించి ప్రసక్తిరాని అంశము యీనాడు మనము వినటంలేదు.

ఈ విటమినులు ఏమిటి? ఇవి యెందుకు పనికి వస్తాయి?

విటమినులు అయిదు రకాలు. ఇవి ప్రతిమానవుడికీ, శరీరనిర్మాణానికి-అంటే ఆరోగ్యపోషణకు అవసరం.

ఈ విటమినులు యేయే పదార్థాలలో వుంటాయో, యే విటమిను యెందుకు పనికివొస్తుందో శాస్త్రజ్ఞుల పరిశోధనలవలన తేలింది.

కాని, విటమినులలోని భాగాలు యేమిటో, వాటి రసాయన మిశ్రమము యేమిటోమాత్రం యింకా తేలలేదు. అయినా, విటమినుల వుపయోగాన్ని గ్రహించడానికి యీ విషయం యే విధంగానూ అడ్డురాదు.

విటమినులు ఆరోగ్యసంరక్షణకు ఆయుధాలలాంటివి. అపాయకరమైన పెద్దపెద్దవ్యాధుల్నికూడా విటమినులు రాకుండాచేస్తాయి. అలాగని కావలసినంత యెక్కువగా విటమినులను తిందామంటే దొరికేవిగావు. ప్రతి ఆహారపదార్థంలోనూ కొద్దిగా - బహుకొద్దిగా వుంటాయి.

అందుచేతనే, విటమినులను యెక్కువగా తయారుచెయ్యటము యెలాగా, బీదవాళ్లందరి అందుబాటులోనూ వుండే తక్కువధరకి అమ్మడము యెలాగా అనే విషయాన్ని పరిశోధకులు చాలాతీవ్రంగా ఆలోచిస్తున్నారు. విటమినులు ఎక్కువగావున్న ఆహారపదార్థాలు ఫలానివి అనీ,విటమినులు ఫలానివిధంగా ఉపయోగకరమనీ సాధారణప్రజ లందరికీ బోధించడానికికూడా శాస్త్రజ్ఞులు ప్రయత్నాలు చేస్తున్నారు.

అయిదురకాల విటమినులనూ ఏ. బి. సి. డి. ఇ. విటమినులనే పేరుతో ప్రత్యేకించారు. వీటిలో చాలా ముఖ్యమైనది డి. విటమిను. ఇది సాధారణంగా నెయ్యి, పెరుగు, వెన్న మొదలయిన మాంసకృత్తులలో వుంటుంది. ఎముకలను వృద్ధిచెయ్యడానికి యిది పనికివస్తుంది. పిల్లలకు చిన్నప్పుడు యీ విటమిను యెంత ఎక్కువగా పెడితే వాళ్లు అంత బలిష్ఠులుగా తయారు అవుతారు. ఎముకవల్లనేకదా చక్కనిరూపం తయారయేది! కోడిగ్రుడ్లలోనూ, పాలలోనూ కూడా యీ డి. విటమిను బాగానే వుంటుంది. అయితే, పచ్చిగడ్డితినే ఆవుపాలలోనే వుంటుంది.

తరువాత, ఏ. విటమిను. ఇది రోగాల్ని రాకుండా రక్షిస్తుంది. అంటే రోగక్రిముల్ని నశింపజేసే ధాతువుల్ని శరీరంలో పెంపొందింప చెయ్యడానికి ఏ. విటమిను చాలాముఖ్యం.తరువాత, జీర్ణశక్తిని వృద్ధిచెయ్యడము కూడా ఏ. విటమినుపనే. ఇది ఆకుకూరలలోనూ, చేపలలోనూ వుంటుంది.

విటమిను డి, విటమిను ఏ ల తరువాత ముఖ్యమైనది విటమిను ఇ. ఇది ముఖ్యంగా స్త్రీలకు ఉపయోగమైనది. గర్భవతులుగా ఉన్న స్త్రీలకు బలహీనతవల్ల కలిగేగర్భస్రావాలను ఆపి, శిశుజననాన్ని బాధలేకుండా చెయ్యడంలో యీ ఇ. విటమిను చాలా ప్రయోజన

కారి. ఇ. విటమిను మాంసకృత్తులలోనూ, గోధుమల లోనూ వుంటుంది.

విటమిను బి. రెండు విధాల వుపయోగకారి. దానిలో రెండురకాలుకూడా వున్నాయి. బి ౧, బి ౨ అని దానిని శాస్త్రజ్ఞులు విభజనకూడా చేశారు.

బి ౧, విటమిను లేకపోయినట్లయితే మానవుడి శరీరంలోని నరాలు పట్టుతప్పిపోతాయి. నరాల పటుత్వాన్ని రక్షించుకోడానికీ, ఒడ్డూ పొడుగూ వుండేటట్టు శరీరాన్ని పెంచుకోడానికీ విటమిను బి౧ ముఖ్యం. ఇదిలేకుండా ఆహారపదార్థాలను తిన్నట్లయితే వొళ్లంతా వుబ్బి 'కామెర్లు' అనే జబ్బువస్తుంది. ఈ బి. ౧ విటమిను బియ్యంలో వుంటుంది. కాని దంపుడు బియ్యంలో వున్నంత యెక్కువగా మరబియ్యంలో వుండదు. మరలలో పాయ్యాషమువల్ల బియ్యముమీద వుండే పొట్టు పూర్తిగా పోతుంది. ఈ విటమిను వుండేదే ఆ పొట్టులో. అందుచేత మరబియ్యం ఆరోగ్యానికి యెంత మాత్రమూ లాభకారిగాదు. మన ఆకలినిపోగొట్టి సత్తువను యిచ్చేది బి ౧ విటమినే.

బి ౨ విటమినుకు పైగుణాలన్నీకాక, ఆహారాన్ని జీర్ణింపచెయ్యడమూ, చర్మరోగాల్ని రాకుండాచెయ్యడమూ ప్రత్యేకలక్షణాలు.

మొత్తంమీద బి విటమిను బియ్యంలోనూ, పాలలోనూ, కోడిగ్రుడ్లలోనూ, బటాణీగింజల లోనూ, చిక్కుడుగింజలలోనూ, తాజాపళ్లలోనూ వుంటుంది.

విటమినుసి. ప్రతిరోజూ మనము తినే ఆహారంలో వుండితీరాలి. ఈ విటమిను లేకపోయినట్లయితే రక్తము వృద్ధికాదు. తిన్నతిండి వంటపట్టదు. ఇదికూడా ముఖ్యంగా పాలు, కూరగాయలు మొదలైనవాటిలో వుంటుంది.

అందుచేత ప్రతివారూ, శ్రద్ధతో విటమినుల ఉపయోగాన్ని గ్రహించి, ఆహార పదార్థాలను సేకరించేటప్పుడు ఆయా విటమినులు వున్నవాటినే యేరుకోవడము మంచిది.

'చక్రవర్తి'

## చె మ ట

చాలాకాలం నుంచీ, వైద్యులేకాక సాధారణ ప్రజలుకూడా, చెమట పట్టినట్లయితే చాలావరకు జబ్బులు నయమౌతాయి అని నమ్ముతూ వుండేవారు. ఈ విషయం నిజమేనని, డాక్టరు ఆర్చిబాల్డ్ రీడ్ ఇటీవలచేసిన పరిశోధనవల్ల తేలింది.

న్యూమోనియాతో బాధపడే ఒకరోగి శరీరంనుంచి ఆ న్యూమోనియావిషం తీసివెయ్యడానికి ప్రయత్నించి, ఆ రోగి శరీరమంతా చెమటపట్టేటట్టు చేశాడు. చెమట ద్వారా న్యూమోనియావిషం అంతా వెలుపలికి వచ్చేసింది.

ఈ పరిశోధనవలన స్వేదగ్రంథుల (Sweat glands) ద్వారా, శరీరంలో వుండే, రోగానికి కారణమైన మురికి అంతా వెలుపలికిపోతుంది అని తెలుస్తోంది.

డాక్టరు రీడ్ పరిశోధనల తరువాత సెంటు థామస్ హాస్పిటల్‌లోనూ, యూనివర్సిటీ హాస్పిటల్‌లోనూ యింకా పరిశోధనలు జరిగాయి దానివల్ల దద్దు (Measles), జ్వరము మొదలైన యితరరోగాలను కూడా రోగికి చెమట పట్టించడమువల్ల పోగొట్ట వచ్చునని తేలింది.

అన్నిరకాల జ్వరాలూ, రక్తంలో మురికి ఎక్కువగా కూడుకోవడంచేత వస్తాయనీ, రక్తంలోని మురికిని చెమటరూపంగా బయటికి వెళ్లగొట్టేస్తే జ్వరాలు పోతాయనీ యీ పరిశోధనల ఫలితంగా తెలుస్తోంది.

ఇంక, రోగికి చెమటపట్టించడము ఎలాగా అనేది ప్రశ్న.

ఈ విషయం మన పూర్వీకులకు బాగా తెలుసును. అందుచేతనే తలభారంగావున్నా, జ్వరం వచ్చినా ఆవిరి పట్టుకోవడం మనపల్లెటూళ్లలో యిప్పటికీ ఆచారం.

ఆవిరి స్నానంవల్లనూ, నాలుగైదు ఔన్సుల వేన్నీళ్లు త్రాగడంవల్లనూ చెమట బాగా పడుతుంది. వేన్నీళ్లు త్రాగడంవలన కేవలం చెమటపట్టడమే కాకుండా మలబద్ధకం కూడా పోతుంది. అంటే, రక్తంలోని మురికినీ, కడుపులోని మురికినీ వేన్నీళ్లుత్రాగడమువలన పోగొట్టవచ్చు నన్నమాట.

'చక్రవర్తి'



# విమర్శనము

### మానవుడు

గ్రంథకర్త: రవీంద్రనాథ టాగూర్. ఆంధ్రవిశ్వ కళాపరిషద్గ్రంథమాల ౧౬ వ ప్రచురణము, వాల్తేరు. వెల రు. ౧. పుటలు ౬౧

రవీంద్రు నెరుగని విద్యావంతులు హిందూదేశమున నుండరు. ఇప్పటికి సుమారు పాతికసంవత్సరములకు పూర్వమే అతనికి నోబెల్ బహుమతియు, తదనుగుణముగ పాశ్చాత్యుల ప్రశంసయుకూడ వచ్చినది. నాటినుండియు అతనిప్రతిభ పాశ్చాత్యదేశములలో నానాటికి అంతకంతకు పెరిగిపోవుచునేయున్నది. జర్మనుయుద్ధమువలన పాశ్చాత్యదేశములందు అశాంతియు, మనోవ్యాకులతయు అధికముగ ప్రబలినందున, ఈ హైందవమహర్షి తమ కెట్టి మహదుపదేశము చేయునో, ఏ అపూర్వ ఆధ్యాత్మికసూత్రముల ప్రభావముచే ప్రపంచము నుద్ధరింపబోవునో అనునాశ పాశ్చాత్యులలో చాలమందికి దృఢముగ గలదు.

రవీంద్రుని మనోభిప్రాయములు అతని నవలలయందును, నాటకములందును, పద్యములందును, పాటలందును, చిన్నకథలందునుకూడ విశదముగ తెలియుచునేయుండును. కాని క్రీ. శ. ౧౯౧౩ నందు ప్రచురితమయిన "సాధన" యను పుస్తకమునందు అతని ఆధ్యాత్మికభావములు ప్రథమమున రూపుకట్టుకొనినవి. ఈ మూలాభిప్రాయములే కొలది సంవత్సరములక్రితము ఆక్సుఫర్డువిశ్వవిద్యాలయమున అతడొసగిన ఉపన్యాసములందుకూడ వ్యక్తము లైనవి. ఈ ఉపన్యాసము లిదివరకే "మానవునిమతము" (The Religion of Man) అను పుస్తకమున ప్రచురితములైనవి. ఒకటిరెండు విషయములుదప్ప ఇందలి సారాంశమే ఆంధ్రవిశ్వవిద్యాలయమున రవీంద్రుడొసగిన ఈమూడు ఉపన్యాసములందును గానవచ్చుచున్నది.

రవీంద్రుని తత్వసూత్రములను ఈ క్రిందివిధముగ సంగ్రహపరుపవచ్చును:

౧. జగత్తు మిథ్యకాదు. [వేదాంతశాస్త్రము అనాదినుండియు జీవేశ్వరసంబంధ చర్చయందే మునిగి తేలుచు ఈశ్వరసాయుజ్యమే జీవునికి పరమావధియని తెలుపుచున్నను, ఈశ్వరసృష్టియగు జగత్తునకును జీవునికిని మాత్ర మెట్టిసంబంధమును (ఒక్క అభావసంబంధము తప్ప) నిర్ధరించుటకు అవకాశము నివ్వకుండుట ఒక గొప్ప పొరపాటు అని రవీంద్రుని మతము.]

౨. జగత్తు మిథ్యకాదని నిర్ధరించుటకు గూడ మనస్సే ప్రమాణము.

3. జీవితమునందును, సృష్టియందును, ఉత్కృష్టానందము ననుభవించుటయే మానవుని గుణము. ఇందుకు వ్యతిరేకముగ చరించుట — అనగా సర్వసంగ పరిత్యాగము చేయుట- రవీంద్రునిమతమున గొప్ప యవివేకము. తన పుస్తకములందు పలుతావుల రవీంద్రుడు సన్యాసులను పరుషవాక్యములతో నిందించియున్నాడు.

౪. కేవలము స్వానుభవమునందే లగ్నమయిన మనస్సుగలవాడై స్వాభిమతకార్యములనే చేయుటతో తృప్తి నొందక విశ్వాత్మకనుగుణముగ ప్రవర్తించి విశ్వసృష్టి నుత్కృష్టము జేయుటకు చేయూత నొసగుటయే

మానవునికి పరమావధి. మానవు డధమస్థితియందున్న గాని ఇంమన కవలంబింపవలసిన మార్గము స్వతఃసిద్ధముగనే మానవునికి బోధపడగలదు.

(సాధన అ. ౫. పుట ౧౧౨)

ఇవియే రవీంద్రుని తత్వసిద్ధాంతమునందలి ముఖ్యాంశములు. ఇవి ఆర్షములనియు, వైదికములనియు, వీనిలో తన స్వతంత్రాభిప్రాయము లేవియు లేవనియు రవీంద్రుని వాదము. కాని రవీంద్రుడు వేదాంత శాస్త్రాధారములను అందరివలె వ్యాఖ్యానము చేయడు. అతని మతమే వేరు; అతని వ్యాఖ్యాన ధోరణియే వేరు. ఎట్టి నూతనాభిప్రాయ మయినను సరే శాస్త్రాధారములతో ఏవిధముగనైన సరిపుచ్చిన జాలును, అది శాస్త్రసమ్మతమే యని రవీంద్రుడు వాదించును. కాని నిజముగ సూత్రాక్షరములను నిష్పక్షపాతముగ పరిశీలించినచో ఇట్టియర్థ మేర్పడునా యని తలంపడు. తలంచుట యటుండ అట్టి ప్రయత్నమే వ్యర్థమనియు, కాలహరణ మనియు వాదించును. (సాధన అ. ౮ పుట ౭౨)

పైనదెల్పిన యభిప్రాయము లెంతవరకు వేదాంత శాస్త్రముపై నాధారపడి యున్నవి? ఎంతవరకు పాశ్చాత్యులు వక్కాణించినట్లు షాఫ్ట్స్ బరీ, (Shaftesburg) కాంట్, (Kant) ఫిక్ట్ (Fichte) మొదలగు పాశ్చాత్య తత్వవేత్తల యభిప్రాయముల ప్రభావమునకు లోనైనవి, ఎంతవరకు రవీంద్రుని స్వతంత్రాభిప్రాయములు అను విషయముల నిట చర్చింప సాధ్యముగాదు. ఈ విషయ మెట్లున్నను రవీంద్రుడు నేటి తత్వోపదేశకులలో ముఖ్యుడనుట నిస్సంశయము. యవనతత్వ సిద్ధాంతములను గాని, ప్రాచీన హైందవ తత్వ సిద్ధాంతములనుగాని, ఇంకే ఇతర తత్వ సిద్ధాంతములను గాని ఉన్నవి యున్నట్లే నేడు మనము వానిని అవగాహన చేసికొని మన జీవితములందు అనుభవమునకు తెచ్చుకొనుటకు సాధ్యముకాదు. జీవితాంతరార్థ మెన్నటికిని మారదు; ముఖ్యసూత్రములు కూడ మారజాలవు. కాని ఒకొక శతాబ్దియందును ఒకొకతరమునందును ఈ యంతరార్థమును, ఈ మూలసూత్రములను ఆయాకాలపు ప్రత్యేకపరిస్థితులనుబట్టి వేరువేరు విధములుగ తెలియజెప్పినగాని పామరజనమునకు బోధపడదు. ఇరువది యవశతాబ్ది భారతీయ వివేకమున (Renaissance) సర్వోత్కృష్టముగ పాల్గొనినవారిలో రవీంద్రుడు ముఖ్యుడు. ఇట్టి అసమాన మేధాశాలియొక్క ఉత్కృష్టాభిప్రాయములను అతని గంభీరోపన్యాస రూపముగ వినుట కాస్పద మేర్పరచిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తు యొక్క గుణజ్ఞత ఎంతయు ప్రశంసనీయము. ఇట్టి అమూల్యోపన్యాసములను ప్రచురించినందులకు ఈ పరిషత్తునకు ఆంధ్రలోకమేకాక మానవకోటియంతయు గూడ కృతజ్ఞతాపూర్వక వందనము లర్పింపవలసినదే.

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు.

---

## వైయాకరణ పారిజాతము

ఆంధ్రవిశ్వకళాపరిషద్ గ్రంథమాల ౧౫వ ప్రచురణము - ఆంధ్ర విశ్వకళాశాలా పండిత శ్రీవఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి విరచితము. రాయల్ ౫౬౧ పుటలు. వెల రు. 3 లు.

"శ్రీ సీతారామపండితీయ" మను నామాంతరము గల ఈగ్రంథము 'నన్నయాథర్వణీయ' మను మూలగ్రంథమునకు విపుల మగు వ్యాఖ్యానము. ఆంధ్ర శబ్దచింతామణి, దానికి శేషగ్రంథమగు వికృతివివేకము (ఆథర్వణకారికావళి) పయివ్యాఖ్యకు మూలములు. గ్రంథకర్తలనుబట్టి ఈ విశిష్టమూలమునకు వ్యాఖ్యాతలు "నన్నయాథర్వణీయ" మని పేరిడిరి. మూలమున పయి గ్రంథద్వయమే కాక వానియందు లేని విశేషవిషయములు వివిధ సంస్కృతాంధ్రవ్యాకరణ గ్రంథములనుండి గ్రహింపబడినవి. కొన్నివ్యాఖ్యాతృకృతసూత్రములును మూలమున చేరినవి. అట్లయినను ఇదు ప్రధానమూలము నన్నయాథర్వణ గ్రంథములే అగుటచే నామానాధిక్యమునకు అవకాశమే మియు లేదు. ముద్రితగ్రంథభాగమున మూల, వ్యాఖ్యా

నములు సంజ్ఞాపరిచ్ఛేదములోని మొదటిభాగమునకు మాత్రమే ఉన్నవి. ఈప్రథమభాగము గ్రంథాది సమర్థన, తద్భవ, అక్షర, అనుస్వార, అంతస్థ, దంత్యతాలవ్యచజ ప్రకరణము లను పేర ఆరుప్రకరణములుగ విభజింప బడినది.

“నన్నయాథర్వణీయము.” నకు “ఇతరాంధ్ర లక్షణగ్రంథప్రపంచ పరిశీలనపూర్వకముగను, వైదిక లౌకిక సంస్కృతభాషావ్యాకరణసంబంధ పరిశీలన పూర్వకముగను, ప్రాచీనమహాకవిప్రయోగ ప్రపంచ ప్రదర్శనపరిశీలనపూర్వకముగను, నితరద్రావిడ భాషా సంబంధవిశేషవిమర్శనార్థక తొల్కాప్య, కర్ణాటభాషా భూషణాది ద్రావిడవ్యాకరణవిషయ ప్రదర్శనపరిశీలన పూర్వకముగను విపులముగ వ్యాఖ్యానము చేయుట యీ తద్గ్రంథ పరమోద్దేశము. ఆంధ్రభాషావాఙ్మయ కూలంకషపాండిత్యసంపత్తికి ‘శాస్త్రముపౌరుష మాద్యం ప్రాయిక నిత్యప్రయోగ లక్ష్మైతత్ దృశ్య’మిత్యాది నన్నయభట్టారకసూక్తి చొప్పున వ్యాకరణసంస్కార సంస్కృతభాషావాఙ్మయపరిజ్ఞానమేకాక యితర ద్రావిడభాషావైదుష్యము ననత్యావశ్యక మనుటలో విప్రతిపత్తి లేదు.”

ఇదివరకు వెలసిన వ్యాకరణగ్రంథములుమాత్రము కేవలము సంస్కృతభాషా, వాఙ్మయముల పైనే ఆధారపడినవి. వానికిని, దీనికిని గల ముఖ్యభేదములలో నిది యొకటి.

ఇదివరకు వెలువడిన వ్యాకరణగ్రంథములు పరిమితగ్రంథవిమర్శనపూర్వకముగ గొన్ని సిద్ధాంతముల నొనరించినవి. ఇప్పటివరకు అవియే అందరికి నుపాదేయములైయున్నవి. ఇందు వైదిక, సంస్కృత, కర్ణాటాంధ్ర, మలయాళాదిభాషావ్యాకరణ విమర్శ పూర్వకముగ సప్రమాణముగ అనేక సిద్ధాంతములు తారుమారు చేయబడినవి; అనేకములగు నూతనాంశములు నిరూపింపబడినవి. అందు ముఖ్యమైనవి కొన్ని యిట నీయబడుచున్నవి.

౧ ఇప్పటి పండితవ్యవహారస్థ మగు భాష గ్రాంథికము కాదగినది; అది వ్యాకరణవిరుద్ధ మైనను గ్రాహ్యము నగ్రామ్యము నగును.

౨. తెలుగువ్యాకరణములలో వాడబడిన ప్రకృతి, వికృతులకు జన్య, జనకభావ మర్థము కాదు; ఆంధ్రమునకు ప్రాకృతప్రకృతికత్వమును చెప్పనక్కర లేదు; తమిళముకూడ తక్కిన ద్రావిడభాషలవలె సంస్కృతానుసారియే యగును.

౩. తాలువన పూర్వభాగము; బుగ్గలలోపలి భాగము కాదు.

౪. “ఱ” అను నక్షరము ద్రావిడభాషలలోనే కాక సంస్కృతమునందును కలదు; అది పాణినీయ శిక్షలో చెప్పబడిన దుఃస్పృష్టము; ‘ఱ’ క్రమముగ సంస్కృతమున ‘ళ’ గా మారిపోయినది.

౫. లౌకికవాఙ్మయమున ప్లుతమునకు వాడుక లేదు; ప్లుతవిధానము చింతామణ్యభిప్రేతము కాదు.

౬. ఆన్ధ్రగ్రమున వర్గయుక్సరళములను ప్రాచీనులు సమ్మతింపలేదు.

౭. చింతామణిలో ఆంధ్రలిపిస్వరూపము వివరింపబడినది; కాని నన్నయలిపి వాడుక కెక్కలేదు.

౮. ఖండానుస్వారమునుండి పూర్ణానుస్వారమేర్పడలేదు; తేల్చి పలుకబడిన పూర్ణమే అర్ధమైనది; ఊదబడిన దల్లే నిలిచినది.

౯. ఖండాఖండప్రాసముగాని, ఖండ, పూర్ణ ప్రాసముగాని నన్నయాభిప్రేతము కాదు; ప్రాచీన శాసనములలో ఖండబిందు వుపేక్షితము.

౧౦. ద్రావిడభాషలలో వేనియందును ‘ర, ఱ’లకు మైత్రి లేదు; నన్నయనాటికే ‘ర, ఱ’ల వైజాత్యము సడల నారంభించినది.

౧౧. భాగవతమున బమ్మెర పోతనామాత్యుడు రచించిన భాగములలో ఎచ్చటను రేఫ, శకటరేఫలకు మైత్రి చెప్పబడలేదు. ఈవిషయమును కూచిమంచి

తిమ్మన ఉదాహరించి పోతనగ్రంథమును ప్రమాణీకరించినాడు.

౧౨. తద్భవములందు అలఘురేఫము లేదు; 'అఱు, పెఱు, కఱకంతుడు' అనునవి అకారయుక్తములగు నపుడు దేశ్యములు.

ఇట్టివిషయము లింకను చాలకలవు. ఇదుకొన్ని యిదివరకు శ్రీశాస్త్రులుగారు రచించిన "చింతామణి విషయ పరిశోధనము" నందును 'బాల సరస్వతీయ' టీకయందును సందర్భానుసారముగ వివరింపబడి యున్నవి. కాని అవి అచట సంగ్రహముగ నున్నవి; ఇచట బహుళప్రమాణపూర్వకముగ విపులీకరింపబడినవి.

శ్రీశాస్త్రులుగారు నన్నయాథర్వణుల గ్రంథములనే ప్రమాణముగ అంగీకరించి వారి హృదయమును చక్కగ నిందు వ్యక్తపరచినారు; పయి గ్రంథద్వయము పయి నాటినుండి నేటివరకును వెలసిన విపరీతపు వ్యాఖ్యానములను, విభిన్నములగు నభిప్రాయములను వీరిందు లెస్సగ చర్చించినారు; కొన్నియెడల వారట్లభిప్రాయపడుటకు గల కారణములను చారిత్రకదృష్టితో వివరించినారు. ఇట్టి పరిశోధనలతో వెలువడుటచే ఇది కేవలము లక్షణగ్రంథమే కాక భాషా, వాఙ్మయ చరిత్రగ్రంథముకూడ కాగల దని చెప్పవచ్చును.

శ్రీశాస్త్రులుగారు పేరుపొందిన విమర్శకులు, కవిశిఖామణులు, లాక్షణికసార్వభౌములు, బహుభాషాతత్త్వవేత్తలు, ఆదినుండియు లక్షణగ్రంథపరిశీలనమున-అందును విశేషముగ వ్యాకరణశాస్త్రపరిశోధనమున వారి కట్టి అభిమానమే లేకుండినచో ఆంధ్రవ్యాకరణమున కిట్టి అమూల్యాలంకారము అబ్బియుండదు.

ముద్రితగ్రంథమును బట్టి చూచిన వెలువడిన భాగమత్యల్పము, శేషించినదే పెక్కుసంపుటములు. శ్రీశాస్త్రులుగారును 'అచిరకాలములో నేతద్గ్రంథశేషమును వెలయించు నుత్సాహముతో నున్నా'రు. అట్లొనర్చినచో శ్రీవా రాంధ్రభాషా, వాఙ్మయములకు మహోపకారము చేసినవా రగుదురు.

ఆంధ్రభాషాభిజ్ఞులు, వాఙ్మయాభిమానులును 'ఈగ్రంథమును జీర్ణతగించి' ఇందలి అమూల్యాంశముల నవగాహ మొనర్చుకొని 'స్వభావసులభమగు సమ్మోదము నందుదురు గాక!'

బు. వేం. ర.

---

## భగవద్గీత - బైబిలు - కొరాను

గ్రంథకర్త: శ్రీ విన్నకోట వెంకటరత్నశర్మ. డెమ్మీ ౧౦౦ పుటలు. క్యాలికోబయిండు. గ్లేజు రు. ౩. లు. రఫ్ ప్రతి రు ౨-౮-౦. పుస్తకములు దొరకు చోటు: లింగంశెట్టి శేషాచలంశెట్టి, కోవూరు, నెల్లూరు జిల్లా.

హైందవుల ఆధ్యాత్మికతత్త్వమును, ముక్తిమార్గమును వివరించు గ్రంథములలో భగవద్గీత ప్రధానమయినది

ఆగమములను బాగుగ నధ్యయనము చేసినను దురవగాహములగు ఆధ్యాత్మికవిషయములు ఆగమాంతములందు వివరింపబడినవి. ఆ యుపనిషత్తుల సారమే భగవద్గీతయందు క్లుప్తపరుపబడినది. విభిన్నములగు హైందవమతము లన్నింటికిని ఇదియే మూలము. ఆయా మతకర్తలు తమతమ మతముల కనుగుణముగ దీనిని వ్యాఖ్యానించి పేరు పెంపునకు పెనగులాడిరి. భగవద్గీత హిందువులకు నిత్యపారాయణగ్రంథము దీనిని పఠించునపుడు మనస్సునకు అంతములేని ఉత్తేజము, అనిర్వచనీయమగు ఆనందమును కలుగును!

భగవద్గీత ప్రపంచమందలి నాగరకభాష లన్నింటిలోనికిని గద్యముగనో, పద్యముగనో తర్జుమా చేయబడియేయున్నది; ఇంకను ఇప్పటివారిచేతను భాషాంతరీకరింపబడుచునేయున్నది. దీనిపయి ప్రాచీనములు నవీనములు అగు వ్యాఖ్యానములును, భాష్యములును అసంఖ్యాకము లున్నవి. శ్రీ విన్నకోట వెంకటరత్నశర్మగారు ఈగ్రంథమున సంస్కృతమూలమును, తెలుగు టీకాతాత్పర్యములను చేర్చియున్నారు. ఇంతియకాదు; ఈ యుత్కృష్టగ్రంథమునకు ఎన్నియేని వ్యాఖ్యలావ

శ్యకములు. ఈయంశముననే శ్రీ వివేకానందస్వామి 'భగవద్గీతను కొన్ని గంటలలోపలనే చదువవచ్చును; దాని నర్థముచేసికొనుటకు అనేకజన్మములు కావలె' నని ప్రశంసించినారు.

మానవప్రకృతులు, భావములు వేఱయినను భావములు అభిన్నములు; మతములు విభిన్నము లయినను ఆశయము లభిన్నములు. మార్గములు వేఱయినను ప్రాప్య మొక్కటియే.

"శ్రీమద్భగవద్గీతాశాస్త్రమునం దన్ని మతములకును, అన్ని సాంప్రదాయములకును చోటున్నది. కావున నిది యందఱు ననుభవింపదగిన ఫలము. ఇందలి యుపదేశములే మహాపురుషుల యనుష్ఠానములం దుండును. కావున శంకర, రామానుజ, మధ్వ ఆచార్యులును, శ్రీకృష్ణ చైతన్య, శ్రీరామకృష్ణపరమహంస, వివేకానంద, రామతీర్థ, నాగమహాశయ, నానక్, కేశబ్ చంద్రసేను, ఆళ్వారులు, యేసుక్రీస్తు, మహమ్మదు, తిలకు, త్యాగయ్య, గాంధీ, రమణమహర్షి, మలయాళస్వాముల వారు, వావిలికొలను సుబ్బారావుగారు, అవధూత పిచ్చెమ్మగారు, కాంతయ్యగారు మొదలైన మహాత్ముల జీవితములలో అనుభవాంశములును ఉపదేశములును, నైష్కర్మ్యసిద్ధి, జ్ఞానవాసిష్ఠము, భాగవతము మొదలగు సుప్రసిద్ధ గ్రంథములలోని విషయములును ఈపుస్తకమునందు సందర్భానుసారముగా ఆయాశ్లోకముల దగ్గఱ చేర్పబడినవి."

ఇందు పయివారి అనుభవములే కాక గ్రంథకర్త గారి యనుభవములును, పలుగ్రంథములలోనివే కాక శివగీత, ఉత్తరగీత, పాండవగీత, పరమార్థ చంద్రిక మొదలగువానిలోని విషయములును, ఆంధ్రానువాదములును, స్వతంత్రపద్యములును చేర్చబడినవి. గీతాతత్త్వమును తెలిసికొనుటకీగ్రంథము చాల ఉపయోగకరము. అచ్చటచ్చట వివరింపబడు విషయములు దురవగాహము లయినను గ్రంథకర్త అనుభవసిద్ధములగు విషయముల నుదాహరించి వాని నెంతయును సుగ్రాహ్యములుగ ఒనర్చుచున్నాడు.

గ్రంథకర్త పండితుడు; భక్తాగ్రేసరుడు; నిష్కామ కర్మయోగి. అనుభవముతో కూడిన ఆతని విజ్ఞత ఎంతయు ప్రశంసార్హము. రచన సరళము, సర్వజన గ్రాహ్యము. ఇట్టి గ్రంథమును వ్రాయుటకు కర్తకు ఐదేండ్లు పట్టిన దనినచో వింత కాదు.

దీని వెల స్వల్పము. కవి జనసామాన్యమున కందుబాటులో నుండునట్లు దీనికి తక్కువవెల నిర్ణయించెను. ఇట్టి తరుణమును పోగొట్టుకొనక హైందవమతాభిమానులగు ఆంధ్రులు గ్రంథకర్త ప్రయత్నమును సఫలము చేయదగును.

బు. వేం. ర.

---

శ్రీ భక్త సుదర్శనుడు

దేవీభాగవతమునందలి ధ్రువసంధ్యోపాఖ్యానమునుదానికి ఆంధ్రానువాదము. గ్రంథకర్త : విద్వాన్, సాహిత్యశిరోమణి పంగనామల బాలకృష్ణమూర్తి-మదనపల్లి కళాశాల. తిరుపతి త్రిలింగ గ్రంథమాలవారు దీనిని ప్రకటించిరి. క్రౌను సైజు గ్రంథము; ౧౦౩ పుటలు. వెల ఎనిమిదణాలు.

---

నవ్యజ్యోతి (సచిత్రమాసపత్రిక)

సంపాదకుడు, ప్రకాశకుడు: కె. బి. కృష్ణమూర్తి, బి ఏ, హిందూపురము. (అనంతపురము జిల్లా)

సాలుచందా రెండురూపాయలు, విడిప్రతి మూడణాలు.

ముఖ్యముగా రాయలసీమవారి వ్రాతచేతలకుగా నేర్పడినప్పటికిని ఇతరులకును ఇందులో తావులేకపోలేదు. ఈ సంచిక ప్రథమప్రయత్నమైనను అభివృద్ధిసూచనలు బాగుగ కనబడుచున్నవి. ఇప్పటికి వెలువడిన ప్రథమసంచికలో జటావల్లభుల పురుషోత్తము గారి దోకవ్యాసము గలదు. మతము, వార్తాపత్రికలు, ప్రసూతితంత్రము, కృష్ణదేవరాయల క్రూరకృత్యము, గ్రంథాలయోద్యమతత్త్వము, కుటుంబారోగ్యము-స్త్రీలబాధ్యత, అస్పృశ్యత మొద

లను చక్కని గద్యవ్యాసములును, కథలును, రసవంతము లైన పద్యములును ఈ మొదటి సంచికలో గలవు. దీనినిబట్టి యీపత్రిక మంచిభవిష్యము సంపాదించు కొనగలదని దృఢముగ జెప్పవచ్చును. రాయలసీమ వాసులు దీనిని చిరస్థాయిగ జేయుటకు పాటుపడుదురుగాక.

---

# గ్రంథస్వీకారము

---

### ఆంధ్రతేజము (పద్యాత్మకము)

క్రౌను ౧/౮ సైజు, పు. ౫౬. వెల నాలుగణాలు.

గ్రంథకర్త: ఉభయభాషాప్రవీణ బోడేపూడి వేంకటరావు, బోర్డుహైస్కూలు పండితుడు, బాపట్ల.

---

### తెలుగు ఇన్కంటాక్సు ఆక్టు

క్రౌను ౧/౮ సైజు, పు ౧౪౦, వెల రు. ౧-౪-౦.

గ్రంథకర్త: కడిమిశెట్టి వీరరాజుశెట్టి, బి. ఏ., బి. ఎల్., వకీలు, బెజవాడ.

---

### మోక్షసాధన సారసంగ్రహము

క్రౌను ౧/౮ సైజు, పు. ౮౫, వెల రు. ౦-౪-౦.

గ్రంథకర్త: కనకపల్లి భాస్కరరావు, గాంధినగరము, కాకినాడ.

---

### నూతన ఇండియా రాజ్యాంగము

క్రౌను ౧/౮ సైజు, పు. ౮౪, వెల మూడణాలు.

ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర రైతు సంఘము, బెజవాడ.

---

### రసికాభిరామమణి (నాటకము) (మొదటిభాగము) కామేశ్వరి

డెమ్మి ౧/౮ సైజు, పు ౨౦౬.

గ్రంథకర్త: వాజపేయయాజుల వేంకట నారాయణ, రాజమహేంద్రవరము.

---

### ముక్తావళి (పదికథలు)

డెమ్మి ౧/౮ సైజు, పు. ౮౦, వెల ఆరణాలు.

గ్రంథకర్త: తాడిమళ్ల బసవరాజు, బి. ఏ., రామారావుపేట, కాకినాడ.

---

### శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర

క్రౌను ౧/౮ సైజు, పు. ౧౫౨, వెల ఎనిమిదణాలు.

ప్రకాశకులు: శ్రీరామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు.

---

### పాపం (కథల సంపుటి)

క్రౌను ౧/౮ సైజు, పు. ౮౪, వెల నాలుగణాలు.

గ్రంథకర్త: గుడిపాటి వెంకటచలం.

---

### రూమ్ టులెట్ (కథల సంపుటి)

క్రౌను ౧/౮ వ సైజు, పు. ౧౦౧, వెల నాలుగణాలు

గ్రంథకర్త: పిల్లలమఱ్ఱి బాలకృష్ణశాస్త్రి.

పై రెండు గ్రంథములు దొరకుచోటు: యువ కార్యాలయం, పాతపేట, తెనాలి.

---

భిక్షావతి (పద్యరచనము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౫౮ వెల అర్ధరూపాయ

గ్రంథకర్త: వజ్ఝల కాళిదాసు, మహారాణిపేట, విజయనగరము.

కాపుబిడ్డ (పద్యాత్మకము)

క్రౌను ౧/౮ సైజు, పు ౬౭, వెల రెండణాలు.

గ్రంథకర్త: గంగుల శాయిరెడ్డి, జీడికల్లు, తా. జన్గాం, నల్లగొండజిల్లా.

లక్కపిడతలు (బాలానందం: ౧)

గ్రంథకర్త: చింతాదీక్షితులు, నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు.

రైతుభజనావళి (అయిదవ ముద్రణము)

సంపాదకులు: ఆచార్యరంగ.

ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర రైతురక్షణసంఘం, నిడుబ్రోలు.

గణేశ్వరాభ్యుదయము

క్రౌను ౧/౮ సైజు, పు. ౫౧, వెల మూడణాలు.

గ్రంథకర్త: శ్రీపాద వెంకటసుబ్బారావు, హరిశ్చంద్రపురము, ప్రియాగ్రహారంపోస్టు, గంజాంజిల్లా.

శ్రుతమధూలిక (ఖండకావ్యముల సంపుటి)

గ్రంథకర్త: మానూరు వెంకటశేషగిరిరావు, బి.ఏ.

---



విండ్సరు ప్రభువు



సింప్సను సతి

౧౯౩౭ సం. జూను నెల ౩-వ తేదీనాడు పారిసులో వివాహము జరిగినది.

# సాభిప్రాయ విశేషములు

## శ్రీ జార్జి పట్టాభిషేకము

ప్రపంచపరిణామమునందు ధర్మరంగములు విషాదానంద పర్వములు. భారతి సంగ్రామేతిహాసము యుగయుగములందును రాజ్యాభిషేకమహోత్సవ సమయములందు జరిగెడి ధర్మమీమాంసకు ప్రమాణము. ధర్మరాజు ధర్మమీమాంసను భీష్మునిముఖమునను వినినతరువాతను దండనీతిధర్మమును గ్రహించి రాజ్యాభిషేకమును స్వీకరించెను. యుగములు గడచినను, పశుబలప్రయోగ సాధ్యమైన దండనీతియే రాజ్యచిహ్నముగ పరిణమించిన విధమును వర్తమానప్రపంచ పరిస్థితులు సహస్రముఖముల విశదముచేయుచున్నవి. దేశమునందు రాజున్నను లేక పోయినను దండనీతిమాత్రము రాజ్యమునకు మూలాధారము. ఆఱవజార్జి పట్టాభిషేక మహోత్సవ సందర్భమున బ్రిటీషురాజ్యాధికారులు లండను నగరమందు సమావేశపఱచిన మహారాజులు, రాజులు, మహారథులు, సైనికులు, వైమానికులు, మంత్రులు మొదలగువారి సమూహములు సామాన్యులకు బ్రిటీషుసామ్రాజ్యమహత్వమును సువ్యక్తము చేసినవి. రాజలాంఛననామములు బ్రిటీషు సామ్రాజ్యమును ఏకపాశబద్ధము చేయుటకు సామ్రాజ్యాభిమానులు చేసిన ప్రయత్నములు సఫలములైనను విఫలములైనను సామ్రాజ్యమహత్వము ప్రపంచలక్ష్యము నావరించినది. లండనునగర పట్టాభిషేక మహోత్సవవార్తలు ప్రపంచమునందంతటను మారుమ్రోగినవి. లండను నగరమునందును, సామ్రాజ్యాంతర్భాగములందును సామ్రాజ్యవిజయ ఘోషలు ప్రతిధ్వనిల్లినవి. రాజులు, ప్రభువులు, మతాధిపతులు, వర్తకశ్రేష్ఠులు స్వోత్కర్షపరాయణులై పరమానంద మనుభవించిరి. సన్నిహితపాశబద్ధముకాని సామ్రాజ్యాంతర్భాగములు, రాజచిహ్నమును బలీయమైన సామ్రాజ్యపాశముగను స్వీకరించి, సంతృప్తిని బొందినవి. పరాధీనస్థితియందున్న సామ్రాజ్యాంతర్భాగములు కొంతవఱకు పట్టాభిషేకోత్సవముల పట్లను విముఖత్వమును చూపినను శ్రీమంతులు, రాజులు, ప్రజలు పట్టాభిషేకోత్సవమును మామూలుగ చూచి ఆనందించిరి. కోట్లరూప్యములు వ్యయము చేసి ఏర్పాటుచేసిన రాజ్యాభిషేక ప్రదర్శనమువల్లను సామ్రాజ్యమునకును, ప్రజలకును ఏమిప్రయోజనము కలిగినదియును భావికాలము నిర్ణయింపగలదు.

కాని ధర్మరాజపట్టాభిషేకమువలెను జార్జిపట్టాభిషేకము దండనీతి ప్రతిష్ఠను, బ్రిటీషుసామ్రాజ్యబలమును లోకమునకు ప్రకటించినది. వర్తమానయుగము ప్రకటనయుగము.

గంభీరములైన పట్టాభిషేకోత్సవ ప్రదర్శన ములు మంత్రులకు యూరపురాజ్యాంగము లందు మంత్రాంగమునకు వినియోగపడ గలవు. పట్టాభిషేకోత్సవము ముగిసినది. ప్రజాప్రతినిధులు స్వస్థలములకు చేరుకొను చున్నారు. కాని జార్జి పట్టాభిషేకము ప్రపంచ వ్యవహారములందు అపూర్వ విషయమును సంస్మరింప చేయగలదు.

* * * *

విండ్సరు ప్రభువు వివాహము

ధర్మరాజునకు విజయానంతరము సంప్రా ప్తమైన వైరాగ్యమునకు రాజ్యత్యాగమును చేయుట సాధ్యము కాలేదు. యుగయుగ ముల నుండియు సంప్రాప్తమగుచున్న ధర్మాధర్మ సంరంభమునందును, ప్రజా రాజ్యాధికార సంరంభమునందును రాజ్యాధి కారమే బలీయముగ నున్నది. ప్రజలు పశుబల చిహ్నమైన ఆయుధ దేవతను రాజరూపముననో శూరరూపముననో, డిక్టే టరు రూపముననో పూజించుట యాచార మైనది. ప్రపంచమునం దన్ని దేశములందును సంగ్రామ దేవత ప్రళయతాండవము చేయు టకు పాతాళ హోమమును చేయుచున్న విధము బహిరంగ రహస్యము. వ్యక్తిస్వాతం త్ర్యము లేని ప్రజాస్వామ్యము గగనకుసు మము. రాజకీయ, సాంఘిక, మతార్థికాది విషయములందు వ్యక్తి స్వాతంత్ర్య సంపాద నార్థము సామాన్యప్రజ లనుభవించిన దుఃఖ పరంపరలు ప్రపంచ పరిణామమునందు విషా దానంద పర్వములు. ధర్మ మనవరతము ప్రపంచమును ధరించుచున్నది. ప్రపంచము నందు ధర్మ పరిణామమునందు తిరోగమన మును సహజము. గతించిన నూటయేబది యేండ్లయందును, వ్యక్తి స్వాతంత్ర్యము నకును, ప్రజా స్వామ్యమునకును ప్రజలు దుఃఖపరంపర లనుభవించి సంపాదించిన స్వాతంత్ర్యము మటుమాయ మగు నను భయము స్వాతంత్ర్య ప్రియులను పీడిం చుచున్నది. కాని మహాప్రళయము లేనిది పునర్నిర్మాణము సాధ్యముకాదు. బ్రిటిషు సామ్రాజ్యమును మహాధర్మ పరివర్తనమును పొందకను సామ్రాజ్య క్షేమమునకును, ప్రజాస్వాతంత్ర్యాభ్యుదయమునకును విని యోగపడజాలదు.

ఎడ్వర్డు రాజ్య పరిత్యాగము ధర్మనిష్ఠ కును, వ్యక్తి స్వాతంత్ర్య ప్రదర్శనమునకును ప్రపంచేతిహాసమునందు గంభీరముగ నున్నది. ఎడ్వర్డు రాజు శ్రీమతి సింప్సనును పెండ్లాడుటకు రాజత్యాగమును తృణప్రాయ ముగను చేసెను. ఎడ్వర్డు వివాహము మాట తెలిసినతోడనే రాజకుటుంబము, ప్రభువులు, మంత్రులు, మతాధిపతులు, ప్రజలు పరిహ సింపబూనిరి. బాల్డువినుమంత్రి తన మంత్రాం గము నంతయును వినియోగించి ఎడ్వర్డును రాజ్యత్యాగమును చేయుటకు సమ్మతింప జేసెను.

ఎడ్వర్డు రాజ్యత్యాగమును, బంధుత్యాగ మును, దేశత్యాగమును, మిత్రత్యాగమును

చేసి విదేశములందు సింప్సనుసతిని పెండ్లాడెను. లండను నగరమునందు జరిగిన పట్టాభిషేకమహోత్సవములను, వియన్నాయందు జరిగిన విండ్సరుప్రభువు, సింప్సనుసతుల వివాహమహోత్సవమును సంస్మరించి ధర్మపరమార్థమును గ్రహించదలచినవారలకు ప్రపంచము నావరించిన మాయాపటాటోప ప్రభావము సువ్యక్తమగుచున్నది. విండ్సరు ప్రభువు వివాహము బ్రిటిషుప్రజాహృదయమునందును, ప్రపంచమునందును మానవ స్వాతంత్ర్య ధర్మాభ్యుదయమునందపూర్వమైన సంచలనమును గలుగజేసినది.

* * * *

బాల్డివిను రామ్సేమాక్డోనాల్డు
మంత్రుల నిర్గమనము

బాల్డివిను మంత్రి బ్రిటీషు సామ్రాజ్యమును రక్షించిన యుగంధరుడుగ పరిగణింపబడుచున్నాడు. గతించిన పదిహేనుఏండ్లయందును, జాతీయ ప్రభుత్వవ్యాజమునను, పరాధీనప్రజలకు వీసు కలుగజేసిన యన్యాయము హిందుస్థానచరిత్రమునందును, ఇతర దేశచరిత్రములందును మహాక్షరములతో లిఖింపబడినది. ఇండియాయాక్టును నిరర్థకము చేసిన మహానుభావులు బ్రిటీషుసామ్రాజ్యాభిమానుల కృతజ్ఞతకును, వారి యనుచరుల కృతజ్ఞతకును పాత్రులగుట సహజము. ఎడ్వర్డురాజ్యత్యాగము, సామ్రాజ్యాంతర్గత సభలు, సామ్రాజ్య సంరక్షణవ్యయము, జార్జిపట్టాభిషేకము బాల్డువినుగారి ప్రతిష్ఠను జాతీయ ప్రభుత్వచరిత్రమునందు స్థిరతరము చేసినవి. బాల్డువినుగారు మంత్రికవచమును చేంబర్లేను గారికి సమర్పించి ప్రజాదరణముతో విశ్రాంతిని తీసికొనుట బాల్డువినుగారి శక్తిసామర్థ్యములకు నిదర్శనము. రామ్సే మాక్డొనాల్డుగారి నిర్గమనము జిజ్ఞాసాపరాయణులకు మననయోగ్యముగ నున్నది. వార్తాపత్రికాహారుడుగా లండనునగరమునందు జీవితమును ప్రారంభించి కార్మికపక్షమునకు నాయకుడై స్వయంసహాయము వల్లను ప్రధానమంత్రియగుట యసామాన్య విషయము. కాని కార్మికపక్షముచ్ఛస్థితియందున్నప్పుడు స్వీయపక్షానుచరులను, కార్మికపక్ష సిద్ధాంతములను విసర్జించి జాతీయపక్షప్రభుత్వమునందు మంత్రిత్వమును స్వీకరించుట మహాపరాధము. మేక్డొనాల్డుగారి ఉద్దేశములు పవిత్రములయినను చిరకాలసంవర్ధితమైన కార్మికపక్షపతనము, బ్రిటీషు రాజ్యాంగమునందును, ప్రపంచవ్యవహారములందును ప్రజాస్వామ్యత్వమునకు ప్రతిఘటనము కలిగినవి. హిందూస్థానమునకు వారు కలుగజేసిన అన్యాయమును క్షంతవ్యము కాదు. ప్రపంచపరిణామమునందు ధర్మరంగమునందు మానవుల ప్రకృతి తలక్రిందులుగాగల విధమును ఎడ్వర్డు, బాల్డువిను రామ్సేమాక్డొనాల్డుగార్ల యుదంతము స్మరింపజేయుచున్నది.

* * * *

కాంగ్రెసు, ప్రభుత్వము

బ్రిటీషుభారతప్రభుత్వములు భారత జాతీయ స్వాతంత్ర్యమునకు చిహ్నమైన కాంగ్రెసునకు జూపుచున్న ప్రతిఘటన నిరాదరణములు పరమార్థదాయకములు. సామ్రాజ్యాభిమానమునకును, స్వార్థపరత్వమునకును, నిరంకుశత్వమునకును మితిమేఱలు కలవు. లండనునగరమునందు జట్లండు ప్రభువు పలికిన పలుకునే గవర్నరులు, వారి అనుచరులు చిలకలవలె పలుకుచున్నారు. పరిపాలనమునకు మూలాధారమైన ప్రజాభిప్రాయమును నిరర్థకముచేసి, శాసనసభలను మృతసంస్థలనుచేసి రాష్ట్రములను పరిపాలించుట రాష్ట్రీయస్వాతంత్ర్యము. గాంధీ మహాత్ముడు జట్లండుప్రభువు వ్యక్తము చేసిన భావములకు చెప్పిన ప్రత్యుత్తరములు మహాత్ముడు శాంతిమార్గమునను రాజకీయ వ్యవహారములను నడుపుట కుద్యుక్తుడైనవిధమును సువ్యక్తము చేయుచున్నవి. 35 కోట్ల ప్రజలు స్వాతంత్ర్యసంరంభమునందు నిమగ్నులైనప్పుడు వ్యవహారములందు సాధ్యముగాక పోయినను, లక్ష్యమును ప్రమాణముగ నుంచుట ధర్మము.

ప్రజలు ప్రతినిధులను శాసన సభలకు వారి ఇష్టానుసారముగ నెన్నుకొనిరి. ప్రతినిధులు ప్రజలకు బాధ్యులుగాని కేవలము సూత్రధారులైన గవర్నరులకు బాధ్యులు గారు. గవర్నరులకు, ప్రజా ప్రతినిధులకు భేదాభిప్రాయము కలిగినప్పుడు మంత్రివర్గము రాజీనామా ఇచ్చుట స్వీయాధికార నిర్వహణమునకు ప్రమాణము. గవర్నర్లు ప్రత్యేకముగా నేర్పాటుచేసిన మంత్రివర్గము తీసివేయ గలరుగాని, ప్రజాపక్షమున స్వతంత్రముగ నేర్పడిన మంత్రివర్గము తీసివేయజాలరు. ప్రజా స్వాతంత్ర్యమునకు ఈధర్మము మూలబీజము. జట్లండు ప్రభువు, రాజప్రతినిధి, గవర్నర్లు ధర్మ సూక్ష్మమును గ్రహించి, శాసనసభలను వెంటనే సమావేశపఱచుట ధర్మము, వివేకము.

శ్రీయుత రాజగోపాలాచార్యులు గారున్ను, గాంధీ మహాత్ముడున్ను ఈసమస్యను సమగ్రముగ చర్చించినట్లు వార్తలు తెలుపుచున్నవి. కాలహరణము, దురహంకారము దురాగ్రహములకు మూలమగుచున్నది. బ్రిటిషు భారతప్రభుత్వములు భారతీయ లక్ష్యమునకు ప్రధాన నాయకుడైన గాంధీ మహాత్ముని ధర్మ హితోపదేశములను గ్రహించి వర్తమాన విషాదావస్థను వెంటనే తొలగించుటకు పనిబూనుట పరమార్థము.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya

